Registered No. M. 1856. 8th JANUARY 1934




సంపు. ౧౧ శ్రీముఖ సం॥ పుష్యము సంఖ్య ౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# S. GANESAN PUBLICATIONS

## 50% Reduction allowed on the Prices.

| | Rs. | As. |
|---|---|---|
| Young India ... ... | 4 | 0 |
| Supplement ... ... | 1 | 8 |
| Indian Home Rule ... (By M. K. Gandhi) | 0 | 8 |
| To the Students ... | 1 | 0 |
| Terence Macswiney ... (By C. F. Andrews) | 0 | 8 |
| The Making of a Re-public (By Kevin R. O'Shiel) | 1 | 8 |
| The Sayings of Kabir ... | 0 | 8 |
| The Sayings of Thulasidas (By Lala Kanno Mal M. A.) | 0 | 8 |
| The Failure of European Civilization ... (By S. E. Stokes) | 1 | 0 |
| Principles of Freedom ... (By Terence Macswiney) | 2 | 0 |
| The Story of My Life ... (By Bhai Paramanand) | 1 | 8 |
| The Future of Indian Fiscal Policy ... ... (By D. V. Divekar) | 0 | 12 |
| The Aims of Labour: An Ideal Commonwealth (By the Rt. Hon. Arthur Henderson) | 1 | 0 |

| | Rs. | As. |
|---|---|---|
| India in England ... (By Miss Helena Normanton) | 2 | 0 |
| Indian Currency and Exchange ... ... (By K. C. Mahindra B. A.) | 3 | 8 |
| History of England (in Tamil) ... (By N. Vasudeva Iyer, M.A. L.T.) | 1 | 0 |
| The National Being: Thoughts on an Irish Policy (By A. E. George Russel) | 1 | 0 |
| The Dawn of a New Age And other Essays ... | 1 | 0 |
| The Duties of Man With Biographical Introduction ... (By W. W. Pearson) | 1 | 0 |
| Need in Nationalism ... (By Aurobinda Ghose) | 0 | 8 |
| Landmarks in Lokamanya's Life ... ... (By N. C. Kelkar) | 1 | 3 |
| The Gospel of Swadeshi (By Prof. Kalelkar) | 0 | 4 |

| | Rs. | As. |
|---|---|---|
| The Philosophy of Art... (By D. Raghurama Acharya) | 0 | 12 |
| Ideals of Non-Co-operation And other Essays ... | 1 | 0 |
| The Man and His Work "Josiah C. Wedgewood" (By Lajpat Rai) | 2 | 0 |
| The Truth of Life ... (By Rabindra Kumar Ghose) | 0 | 8 |
| Ahimsa and World Peace | 1 | 8 |
| The Spiritual basis of Democracy ... (By Wilfred Wellock) | 3 | 0 |
| Letters from Abroad ... (By Rabindranath Tagore) | 2 | 0 |
| Faith and the Future ... | 0 | 12 |
| From the Council to God (By Joseph Mazzini) | 0 | 12 |
| The Revolt of the East ... | 1 | 0 |
| Food, Mind & Health ... | 0 | 8 |
| Menace from the West ... | 0 | 4 |
| The Foreign Policy in India | 0 | 4 |
| Agitate ... ... (By Bernard Houghton) | 0 | 4 |
| Rambles in Vedanta ... (By B. R. Rajam Ayyar) | 2 | 0 |

| | Rs. | As. |
|---|---|---|
| Hindu Culture ... ... (By K. S. Ramaswamy Sastry, B. A., B.L.) | 2 | 0 |
| The Indian Teachers in China ... ... (By Phamindranath Bose) | 2 | 8 |
| Nehal the Musician & other Tales ... (By Snehalata Sen) | 2 | 0 |
| Some Financial Problems of India ... ... | 2 | 0 |
| The West ... ... (By K. Kunhigannan M. A. Ph. D.) | 2 | 0 |
| Labour in Madras ... (By B. P. Wadia) | 2 | 8 |
| Satyagraha in Champaran (By Babu Rajendra Prasad) | 2 | 8 |
| Swaraj Constitution ... (By S. Sreenivasa Iyengar, B.A., B.L.) | 1 | 0 |
| The Aphorisms of Narada (By Lala Kanno Mal, M.A.) | 0 | 8 |
| Women in Hindu Law... (By K. T. Bhashyam Iyengar, B.A., B.L.) | 0 | 8 |

*N. B.*—A commission of two annas & four annas Per Rupee is allowed on purchase of not less Than Rs. 10/- & Rs. 20/- respectively (after allowing 50% reduction) at a time. the purchase shall be one book only of every kind in the list of the Catalogue.

For Book Sellers, Libraries etc., special discount will be given on application.

Packing Charges will be free, and Postage or Railway Freight is to be borne by the purchasers.

25% of the amount of the order is to be sent in advance stating clearly the full address. If the books are to be sent by Railway, the name of the nearest Railway Station in bold Types is to be mentioned.

**Ask for our Detailed Catalogue**

**ANDHRA PATRIKA OFFICE,** No. 7, Thambu Chetty Street, MADRAS.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, భాగము ౧

LIBRARY

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

---

# భారతి—ఏకాదశ సంపుటము—భా. ౧.

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంచితరుణము! ... త్వరపడుడు!!

రంగోన్, సిలోన్ మొదలగు దేశములవరకు

వ్యాప్తిం జెంది ప్రసిద్ధిగాంచిన

చిల్కపాటి వెంకటరామానుజశర్మగారిచే

రచింపబడిన కాళిదాసు మహిమంబులు గల

వినోద కథా కల్పవల్లి రు. 3-0-0

కాళిదాస చరిత ప్రకరణము 1-8-0

పరకీయాభావంబున నార్గురు రాజకన్యల

బరిణయంబాడిన రోచనరాజు కథ గల

చమత్కార కథా కల్లోలిని

I, II భాగములు రు. 1-8-0

పైవారి మేనకోడలగు చి॥ సీతాంబాగారిచే

నూతనముగా రచింపబడిన

పద్మినీ పరిణయము కావ్యము రు. 0-12-0

సముద్ర మథనము, నాటకము 0-14-0

చి. వె. రా. శర్మ అండు సన్సు,

నెం. 16 రు, పెరుమాళ్ కోవిల తోటవీథి,

జి. టి. మద్రాసు.




# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## (రెండవ ముద్రణము) మొదటి సంపుటము

ఇందు చరిత్రలు; ప్రకృతిశాస్త్రములు, జీవితములు, నీతి, మత, సాంఘిక, వైద్య, రాజకీయాది విషయములు, భూగోళము, న్యాయము, శిల్పము, జ్యోతిషము మొదలగు సమస్తవిషయములు చర్చింపబడును.

ఈ సంపుటమున 'అ' నుండి 'అశ్వర్య' వఱకు గల నాలుగువందల పదములకు సంబంధించిన విషయములు చక్కగా వివరింపబడినవి. అందముగ ముద్రితములయిన రంగుల బొమ్మలు ఎనిమిది, సాదాబొమ్మలు ౧౬౫ ఉన్నవి.

డెమ్మి నాలుగుపుటలసైజున ౬౦౦ పుటలు, మేలైనకాగితము. బంగారురేకు చెక్కడపు అచ్చుకట్టు, పేరు మొదలయినవి కల చక్కని స్వదేశపు తోలుబైండు. వెల పది రూపాయలు మాత్రము. తపాలు లేక, రైలు ఖర్చులు ప్రత్యేకము.

తపాలు వ్యయము ఒకటిన్నర రూపాయ. రైలుద్వారా అయిన, ఖర్చు దూరమునుబట్టి ఎచ్చును, తగ్గను వచ్చును. రు. ౧౧-౮-౦. మణిఆర్డరుద్వారా పంపినవారికి పుస్తకము రిజస్టరు తపాలుద్వారా పంపబడును. వి. పి. గా పంపగోరువారు అయిదు రూపాయిలు అడ్వాన్సు పంపవలెను. చిరునామా (అడ్రెసు) స్పష్టముగా వ్రాయవలెను. రైలుద్వారా పంపగోరువారు తమగ్రామమునకు దగ్గరనుండు స్టేషన్ పేరు తెలుపవలెను.

కొలదిప్రతులే నిలువయున్నవి. త్వరపడవలయును. రెండవసంపుటము త్వరలో వెలువడనున్నది.

మేనేజరు, ఆంధ్ర విజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెం. ౭, తంబుసెట్టి వీధి, మదరాసు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



సంపు. ౧౧ శ్రీముఖ సంవత్సరము, పుష్యమాసము (జనవరి ౧౯౩౪) సంఖ్య ౧

# స్వవిషయము

స్వవిషయావలోకనము విచిత్రవిషయము. స్వావరణవిషయావరణముల యథార్థావలోకనము స్వవిషయావలోకనమునకు సాధనము. స్వావరణము స్వభావావరణములందు విషయపరాయణమై స్వాభిమాన పరిణామమును పొందించుచున్నది. స్వాభిమానము స్వస్వభావస్వరూపావరణములందు పరాధీనమై ఆత్మవిస్మరణము గలుగుచున్నది. స్వాభిమానము, మమకారాహంకారావరణములందు విషయారాధనపరాయణమై స్వస్వరూపావలోకనము స్వాభిమాన పరిణామమును పొందుచున్నది. ఆత్మావలోకనము స్వవిషయములందసాధ్యమైనపుడు పరవిషయ[illegible] సాధ్యము గాదు. ఆత్మావలోకనమునందసాధ్యమైన స్వస్వరూపస్వభావావలోకనమును ప్రపంచమునందు బింబప్రతిబింబములందు సందర్శించుచు నానందించుట పండితులకును పరిపాటియైనది. స్వానుభవమునకు సాధ్యము కాని శాంతశివసుందరస్వరూపానుభవమును స్వసంకల్పనిర్మాణములందనుభవింపగోరుట స్వాభిమానావరణనివృత్తికిని ఆత్మావరణప్రాప్తికిని సాధనము. విశ్వజీవయాత్రయందాత్మత్వ మనంతములైన స్వాభిమానావరణముల నతిక్రమించి బ్రహ్మావరణము నధిగమించుట స్వవిషయావలోకనమునకు ప్రయోజనము. అనంతములైన దేశకాలపాత్రావరణములందు స్వవిషయావలోకన[illegible] స్వభావము విచిత్రముగ గను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడును. ఈ విచిత్రాత్మావలోకనము స్వవిషయావలోకమునకు మూలమై ఆత్మసంస్మరణమునకు సాధనముగనున్నది.

ఆత్మజ్ఞానము స్వవిషయావలోకనమునకు పరమార్థము. ప్రవృత్తియందు సర్వత్ర ప్రత్యక్షముగ నున్న శాంతశివసుందర స్వభావస్వరూపములందు బ్రహ్మజ్ఞులు, తత్త్వవేత్తలు, కవులు, కళాకోవిదులు, గాయకులు, నటులు, యోగులు, భక్తులు, వీరులు, ధీరులు, శాస్త్రజ్ఞులు, ధర్మాత్ములు విశ్వసాహిత్యారాధనమును జేయుచు నాత్మానందానుభవమును ప్రత్యక్షముచేయుచున్నారు. గతించిన పదేండ్లయందును సాహిత్యోపాసనసాధనమున నాంధ్రలోక మాత్మోపలబ్ధికి చేసిన ప్రయత్నములందు సహస్రాంశమునైనను ప్రతిబింబించుటకును, నిరూపించుటకును భారతి నిర్వహించిన ప్రయోజనములతిస్వల్పములు. అయినను ఏటేటను నూతన సంపుటారంభమునందు స్వవిషయావలోకనమును జేయుట ఆత్మావలోకనమునకు గాకపోయినను ఆత్మసంస్మరణమునకైనను సాధనమగుచున్నది.

భారతి మొదటిసంపుటము రుధిరోద్గారి పుష్యమాసమున వెలువడినది. శ్రీముఖసంవత్సర పుష్యమాసమునందు ౧౧-వసంపుటము ప్రారంభమగుచున్నది. గతించినపదేండ్లయందును మానవధర్మాభ్యుదయమునకు ప్రపంచమునందు సకలవ్యవస్థలందును సంప్రాప్తమగుచున్న మహాపరివర్తనమును, సింహావలోకనము చేయుటయును దుర్లభము. ప్రపంచ పరిణామమునందు రాజ్యాంగములు వ్యత్యస్తము లగుచున్నవి; సాంఘికవ్యవస్థలు తారుమా రగుచున్నవి; సాహిత్యకళానిర్మాణములు నవీనరూపభావములను దాల్చుచున్నవి; మతాచారములు ధ్వంసము లగుచున్నవి; ఆర్థికసిద్ధాంతనిర్ణయములు భయభ్రాంతులను గలుగజేయుచున్నవి; సాహిత్యకళాశాస్త్ర పరిశోధనలు నవజీవనవిధానమునకు సాధనము లగుచున్నవి. వర్తమాన మహాపరివర్తనావస్థయందు సాంఖ్యయోగములు, కళాశాస్త్రములు, కావ్యసాహిత్యములు, వేదాంతాచారములు, మతధర్మములు మానవధర్మోపలబ్ధికి స్వతంత్రనిర్మాణావసరమును వ్యక్తముచేయుచున్నవి. సాహిత్యోపాసకులు భాషయందును, భావములందును, రూపకల్పనలందును గతించిన పదేండ్లయందును స్వతంత్రరచనావిధానము నారాధించుచున్న విధమును భారతిసంపుటములు విశదము చేయుచున్నవి.

స్వవిషయావలోకనము ఆంధ్రసాహిత్యావలోకనమునకును, విశ్వసాహిత్యావలోకనమునకును నిమిత్తమైనటులు స్వాభిమానమునకు నిమిత్తము కాదు. గతించిన పదేండ్లయందును భారతీనిర్వాహకులు సాహిత్యోపాసనారాధనములకు జేసినపని యత్యల్పము; చేయవలసినపని యనంతము. ఈ సందర్భములందు స్వవిషయావలోకన మానందమునకు బదులు విషాదమును గలుగజేయుచున్నది. గతించిన పదేండ్లయందును భారతీనిర్వహణమునకు దోడ్పడిన ఆంధ్రమహాజనులకు నిర్వాహకులు కృతజ్ఞులు. భావికాలమునందును ఆంధ్రమహాజనులు భారతీనిర్వహణమునకు దోడ్పడి స్వవిషయావలోకనమాత్మావలోకనపరిణామమును బడయ నను గ్రహింతురని ప్రార్థితులము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నిగమశర్మ అక్క*

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

ఈ చల్లనితల్లి పేరేమో తెన్నాలి రామకృష్ణకవి మనకుఁ దెలుపలేదు. అతనికే తెలియదేమో. వాల్మీకి అగస్త్యునికి పేరులేనియన్న నొకనిని సృజించెను. అతనికి పేరొక్కటే కాదు, మఱేదియు లేదు. ఈయమ సృష్టి యట్టిదికాదు. రామకృష్ణుఁ డమృతములో లేఖిని నద్ది తిద్ది తీర్చి యాడించిన పుత్తడిబొమ్మ యిది. కావున పేరులేకున్న నేమి? నిగమశర్మవంటి పెద్దపేరే 'నేతిబీరకాయ' కాలేదా? తెన్నాలివాని నిర్మాణములో పేరుపెంపుగల యే యితరవ్యక్తికిని ఈయనామధేయకుఁగల జీవకళలో, నయనాణ్యములలో పదింట నొకపాలును లేదు.

ఎవఁడో యొక చిత్రకారుని వేళాకోళము చేయుటకై తానును చిత్రింపఁగలఁడని చెప్పి, గోడనిండ తోఁకలు వ్రాసి గుఱ్ఱములా ప్రక్కనున్నవని చెప్పి రాయలవారిని నవ్వించినవాఁడఁట రామకృష్ణుఁడు! వాని కవిత్వమందేమో యీధర్మము చాలఁ గానవచ్చును. అంగసృష్టి అంగిసృష్టికన్న ఎక్కువ. కాని యాయంగములే, ప్రాతఃకాలమున ప్రాకారముమీఁద నిక్కిచూచు లేఁదీగల కొనలవలె, ప్రాణశక్తితో తకతకలాడుచుండును. సంపూర్ణ వస్తునిర్మాణమునకు అతనియందు లేనిది నేర్పుగాదు, ఓర్పు. వేళాకోళపుఁగందువలను పరిహాసపు పట్టులను వెదకుట యతని స్వభావము గావున ఒకవస్తువు నాద్యంతపుష్టిగా పరీక్షించులోపల చూపు వేరొకచోటికి పాఱును. మొదటిదాని యెడ శ్రద్ధ తగ్గును. పరిహాసకుశలత తెలివి చురుకుదనమునకు గుర్తు. అది గలచోట సామాన్యముగ సోమరితనమును, అశ్రద్ధయు నుండును. కథలలోని కొంటెభాగవతపు రామకృష్ణుఁడే కావ్యములందును కొంచెము నాగరకవేషపు నాజూకులతో ప్రతిఫలించుచున్నాఁడనుట రసికులందఱును గమనించిన విషయమే. ఇతని రచనలలోని మాటల పోటు, నిర్లక్ష్యపునడక, భావముల తీండ్ర-అన్నియు దాని పరిణామములే. కాని కొంత శ్రద్ధవహించి పనిచేసెనా ప్రతిమయంగములు అంగాంగములును కళకళలాడునట్లు నిలుపక పట్టిప్రదర్శించు అపూర్వసూత్రధారవిద్య ఇతనికిఁ గలదనుట కీ పేరులేని పేరంటాలే శాశ్వతసాక్షి.

ఈమెతండ్రి సభాపతి. పేరుకుఁ దగినట్లు "వేదముల్ వ్రాసిన గాదె, శాస్త్రములు పుట్టినయిల్లు, కళాకలాపముల్ డాసిన రచ్చ." పీఠికాపురసంస్థానమున పేరెన్నిక

* తెన్నాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము. 3 ఆ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గన్న వైదికాచార్యుఁడు. ఆగర్భ శ్రీమంతుఁడు. రాజాధిరాజుల మ్రొక్కులు దిన్నవాఁడు. ఆహితాగ్ని. ఇంటిలో ముప్పొద్దు భగవదారాధన, అతిథుల సమారాధన, శిష్యుల వేదములసంత, శాస్త్రముల చదువు- వీనికిఁ దోడు వడ్డివ్యాపారము, కుడివారము మేలువారము రెండును గల సేద్యము, దానికి వలయు పశుశిశుదాసదాసీజనములు, 'రాజాలయమునకు రాకపోకలు.'— వీనితో తీరిక గలిగినప్పుడు 'అంగడి'కిఁ బోయి గ్రామకార్యము దీర్పవలసిన ధర్మాధికారము. ఇట్లితఁడు వైదిక లౌకికములు రెంటిని సమానముగా కలిపి మెదిపి కరువుపోసిన దొడ్డవిగ్రహము. చదువు, చనవు, పరువు- మూఁడును సంపాదించిన మూర్తి.

తల్లి 'అతులనిష్ఠ' గల ముసలిముత్తైదువ. అత్తగా రవసానకాలమున నిచ్చిన హరిసుదర్శనపుఁ బేరు అమూల్యపవిత్రాభరణముగా నెంచి పండుగవేళలఁ బెట్టుకొని తీసి దాఁచుచు, తరతరములనుండి కూడఁబెట్టఁగా వచ్చిన 'మూలవిత్తము' రహస్యమును బైలుపడనీక భద్రముగాఁ గాపాడుచు, వయసు ముదిరినను గొడ్డువోక బిడ్డలను కడుపునిండఁ గనుచు, ధర్మార్థములు రెంటిని సమానముగా సంసారమందు నిర్వహింపఁగల్గిన పెద్దయిల్లాలు.

ఇట్టి తలిదండ్రుల కడుపునఁ బుట్టిపెరిగిన పెద్దకూఁతురు మన కథానాయిక. కులాభిమానము, ధర్మార్థములందలి జాగ్రత్త, తెలివితేట, పలుకులనయగారము, శీలనైర్మల్యము, పనిపాటలందలి దిట్టతనము, తీవ్రమైన ప్రయోజనదృష్టి - ఇవన్నియు నామెకు చిన్ననాఁటినుండి చెప్పక చూపక వచ్చినచిట్టలు. వ్రాఁతచదువుల సమాచారము తెలియరాదు. ప్రాయశః ఆమె వానిని నేర్వలేదు. నష్టమును అంతగాలేదు. అత్తవారిల్లు పుట్టినింటికైదామడలదూరము. ఈ సంసారముతో వియ్యమందిన యాసంసారపు పెద్దతన మెట్టిదో మనము కొంత యూహింపఁగలము. తమకంటె గొప్పవారింటికే యాఁడబిడ్డ నిచ్చుట కందఱును ప్రయత్నింతురు. ఇఁక భర్త?—అతఁడు రామకృష్ణకవి పెద్దకుంచె నద్ది గోడపైఁ దీఁడి చిత్రించిన తోఁకలలో నొకటి. భార్య చేతితోఁ దాఁకినచోఁ గదలును. అంతే. ఇరువురికిని 'ఇంతలు అంతలు నగు సంతానము' సమృద్ధి.

తనయింటఁ దాను మర్యాదగా సంసారము చేసికొనుచున్న యామెకు పుట్టినింటినుండి వార్త యొకటి వచ్చి చాల మనసు నొప్పించినది. తమ్ముఁడు నిగమశర్మ పచ్చి పోకిరీయై పోయినాఁడు. ఆస్తియెల్ల నించుమించుగా కరఁగఁ దిన్నాఁడు. ఆచారవ్యవహారము లడుగంటినవి. మానమర్యాదలు, చదువుసంతలు నశింపవచ్చినవి. అభక్ష్యభక్షణము, అపేయపానము, అప్పులు, జూదము, మోసము, దొంగటికము మొదలగువానికి లోఁగి కడపటిలోఁతునకు దిగి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాఁడు. కంచంత కాఁపురము. తలిదండ్రులు ముదుకలు. దిక్కు- విచారించువారు లేరు.

ఇంటి పెద్దకూఁతురు తాను. నిగముఁడు తానెత్తి ముద్దాడిపెంచి పెద్దఁజేసిన తమ్ముఁ గుఱ్ఱ. వానికి బుద్ధిఁజెప్పి త్రోవకుఁ దేలేనా యనుకొన్నది. మగనిని, బిడ్డలను గట్టుకొని యొకనాఁడు బయలుదేఱి పుట్టినింటికి వచ్చినది.

ఇంటిలోఁ జూడఁగా అన్నియు నన్ని త్రోవలై చెడి చెటాకులఁగలసినవి. 'సన్నాహము' అను జీవధర్మమే లేదు. ఎవరును ఏపనికిని పూనుకొనువారు గానరారైరి. తలిదండ్రులు చెఱియొకమూల ప్రాణావశిష్టులై వగల మునిఁగి సుడివడియున్నారు. పెరుమాళ్ల యింటిలో బూజు నిండినది. పాత్రలు ప్రాఁచిపట్టినవి. పెద్దయిల్లు చూచి మధ్యాహ్నమునకు వచ్చు నతిథులు మాటాడించువారు లేక వేఱుగృహముల వెదకఁ బోవుచున్నారు. చిన్నపిల్లలు వేళ కన్నము, నీరు విచారించువారులేక మాసి నలఁగినారు. పాడియావులు బందలుదొడ్లకో, బైటి తెరువులకో పాలయినవి. పనివారు మొగముఁ జూపుట యరుదైనది. వారి జీతబత్తెము లరయువారు లేరు. పుస్తకభాండాగారములోని తాటాకుల గ్రంథములు కొన్ని- దీపారాధనయందలి యసడ్డచేఁగాఁబోలు-నిష్పాలైనవి. కొన్ని దుమ్ము దిని త్రాళ్లు దెగి చెల్లాచెదరైనవి. కొన్నిటిని ఎరవుతీసికొనిపోయినవారు నిగమశర్మ పుణ్యాన మాకే దక్కెనని తామే యుంచుకొన్నారు. శిష్యుల పాత్రప్రవచనములమాట చెప్పనే పనిలేదు. మడి, మట్ర, చేను, చెట్టు- మొదలగునవియెల్ల చేయివేసినవారి సొత్తులైనవి. ఇన్ని యనర్థములకు మూలకారణము. తమ్ముఁ డింటిలో లేఁడు. ఎక్కడ నున్నాఁడో ఎప్పుడు వచ్చునో రానేరాఁడో తెల్పువారు లేరు.

ఇట్టి సన్నివేశమునఁ గాలుపెట్టి యా మగనాలు తానును ఏడ్చువారిజతలో కన్నీరు గార్చుచు నెదచెడి కూర్చుండలేదు. తాను ధైర్యముతో నిలఁబడి యిరువదిచేతులఁ బని చేసి యిరువది కాళ్లతోఁ దిరుగకున్న ఈ యింటికి ముక్తి లేదని యెఱిఁగెను. కాని వచ్చినవెంటనే సవరించు ప్రయత్నములు చేయలేదు. ఆత్రపుదోష మామె యెఱుఁగును. కావున మౌనముతో 'కొన్ని దినములు గడపినది.' ఏల? సన్నివేశము వెనుకముందులు కలయఁజూచుటకు, కళ్లెపుఁద్రాళ్లన్నియు బిగువుగాఁ జేతులఁ బట్టుకొనుటకు. తా నెంతైనను పొరుగూరిది గదా! ఆఁడబిడ్డగదా! ఇంత పెద్దసంసారము చెడినది చక్కఁబెట్టవలయునన్నచో తటాలున తనమాట లెవరు విందురు? ఈతీర్పునకు నేర్పును, ఓర్పును గావలయును. కావుననే మొగము సింద్రించుకొని వారిని వీరిని గసరితిట్టక, యుపదేశముల ఉపన్యాసముల గొడవకుఁ బోక, మొట్టమొదలు మూలస్తంభములవంటి ముసలితలిదండ్రులను దేర్పవలయునని తలఁచినది. 'తీండ్రగల వచనరచనాచమత్కారంబులు' ప్రయోగించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారివంత కొంత దొలఁగించి మొగముల గెలిచి గలిగించినది. వారికి వలయు నుపచారము లెల్లఁ దానే చేసినది. భగవదారాధనకు వలయు నేర్పాటులు చేసి జరిపించినది. తొంగిచూచి పోఁబోవు నతిథులను దయచేయుఁడని పిలిచి యాదరించి యుపచరించినది. తల్లిని రహస్యముగా నడిగి తమ్ముని చేతికిఁ దప్పిన మూలధన మున్నచోటు తెలిసికొని మఱింత భద్రపఱిచినది. నయభయముల చేతను, కలియఁగలపు మాటల చేతను పిల్లలను, పనివాండ్రను లోఁగఁజేసికొన్నది. పసులకొట్టును జక్కఁబెట్టి పాడి వెలయించినది. భర్తను బిలిచి పుస్తకముల భాండాగారమునఁ గూర్చుండఁబెట్టి వాని దుమ్ము దులిపించి, కట్టించి, ఎరవుపోయిన చోటులు దెలిసికొని పంపి బదనామి చేయించి తెప్పించి నిలువరించినది. శిష్యులు మరల వచ్చి చదువుసంతలు జరుపుకొనునట్లు ప్రోత్సాహించినది. పైరుపంటలు రైతులపాలు గానీక తనకొడుకుల నప్పుడప్పుడు పంపి యుస్తువారీ చేయించి స్వాము లున్నా రనిపించి హద్దుకుఁ దెచ్చినది! మెఱుఁగుఁదీగవలె నన్నిటను దానేమై పాఱాడి యిల్లు వెలిఁగించినది!

ఇట్లన్నిటను ఆమెజాణతనము సాఁగినది గాని తన చిన్నమఱఁదలిని జూచినప్పుడేమిచేయవలయునో తోఁపలేదు. వయసు చిన్నది; పొంగివచ్చు యౌవనము; అరుదైన చక్కఁదనము. కాపురమునకు వచ్చిన నాఁటినుండియు మగనిమొగమైనఁ జక్కఁగాఁ జూచినదో లేదో! తనవారు నావారను వారు లేరు. మీఁదుమిక్కిలి తానెంత మనసునొచ్చి 'నలంగియు నత్తమామల చిత్తంబు వచ్చునట్లు భక్తిశక్తులు మెఱసి పాటులంబడు' ధర్మము కర్మముఁ గల యిల్లాలు. ఆ వేదనామూర్తిమెడ తనధైర్యమెందుకును బనికిరాక వదినె, యూరక "వగచి వగచి తెగచి కడుపుచుమ్మలుచుట్టి కన్నీ రుట్టిపడం బొట్టుపొర లగుచుండె"నది! అనివార్య మగు దుఃఖమునకు హార్దమగు సహానుభూతియే ప్రతీకారము. ఇట్టి వదినెను సంపాదించుకొనఁగల పుణ్యవతులు మఱఁదండ్రెందఱు గలరు?

ఇట్లెన్నాళ్లు గడచెనో! ఉన్న దున్నట్టుగా 'చుక్క తెగిపడినవడుపున' ఒక్కనాఁడు తమ్ముఁడు వచ్చి వాలినాఁడు. అప్పులవారివలె ఆఁకలికిని దలదాఁచుకొనుట సాధ్యము గాదుగదా! ఎన్నిపూటలనుండి పస్తుండెనో? మధ్యాహ్నభోజనపంక్తికి తండ్రి మొగము కనఁబడునని భయము. కావున మెల్లఁగ తల్లిని బీడించి 'చద్దివంటకము'దిని చప్పున తప్పించుకొని పోదమని వచ్చినాఁడు. కాలిడినవెంటనే అక్కమొగము కనిపించినది. తప్పించుకొని పోఁగలఁడా? ఆప్రేమమయి చిఱునవ్వు సంకెలలను ద్రెంచుకొని ఆ మహనీయమూర్తిమెడ తనకుఁగల గౌరవభారమును దిగఁద్రోసిపోవుటకు శక్తి యెక్కడిది? వచ్చి నమస్కరించినాఁడు. ఇతరులు పెద్దవారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తన్ను శిక్షింపఁగా 'గడుసువడి సడికోర్చి గడిదేఱి వంకపరకచాటును మాని' రాజారోషుగాఁ దిరుగ మరగినవాఁడు ఆమెయెదుర వంచినతల యెత్త లేఁడయ్యెను.

నమస్కరించిన తమ్ముని గౌఁగిలింపఁ బోయినది. కాని వానిని సమీపించి చూచినప్పుడు తాఁక మనసురాలేదు. ఎక్కడ చూచినను మేనినిండ 'మదోన్మత్తమత్తకాశినీదత్తంబు లగు నఖాంకంబులు' నెత్తురులు చిలుకుచుండెను. మనసునఁగాని, మేనిలోఁగాని యింతయు మైల కెన్నఁడును చోటీయని యామెకు వాని యట్టి శరీరమును గౌఁగిలించుట యామూరి వాడవదినెలఁ గౌఁగిలించుటయే యగునని తోఁచెఁ గాఁబోలు! ఊరక, లోనివెగటెల్ల నడఁచుకొని, 'నీమంతపుఁ బెండ్లికొడుకవు గమ్మని హేతుగర్భితంబుగా' ఆశీర్వదించినది. అతఁడు గుమ్మడికాయలదొంగ. గిలియున్నది. ఆ దీవనలోని భావము కనుఁగొన్నాఁడు. ఉపన్యాసములు ఉపదేశములు చీవాట్లును ఈమెయు నుపక్రమించునేమో! ఇది యెక్కడి గొడవ పోదమని యుంకించినాఁడు. ఆమె వ్రేలును జూపకయే హస్తమునే గాదు మేనెల్లఁ దిగ్గ్రమింగఁగల జాణ. ఆత్రపడి వాని కనహ్యమైన భావమును సూచించి పొరపడితి నని మెఱిఁగినది. వానిది సోఁకోర్వని సుకుమారత్వము. ఈ త్రోవ కాదని నిర్ణయించి 'తరంగితవినయసౌహార్దమార్దవమధురంబు లగు మాటల తేటలం బందిరివెట్టి'నది. ఆపందిరియే వానిపాలికి పంజరమైపోయినది. చాలనందుకు 'నీచిన్న మేనల్లుని జూచితివా? ఇంద' అని యిందుబింబమువంటి తన కడగొట్టుకొడుకును—ఊరకచూపలేదు—చంక కిచ్చినది. వానిమొగమునఁ గానవచ్చిన యాఁకలిసకనకలు చూచి వీనిఁ గట్టివేయు బ్రహ్మాస్త్ర మిదిరా యని 'మీ బావబంతి నారగింతువుగాక. శాకపాకంబులు నిమిషంబులోనం గావింతు' నని ప్రయోగించినది. ఈలోన ముఖ్యమైన వ్యక్తిని మరఁదలిని మఱచునా? ఆమెకు కనుసన్న చేసి వానికాళ్లు గడిగించినది. ఇఁక ఇన్ని బంగారుత్రాళ్లనుండి తప్పించుకొనుట యెట్లు? వాఁడు గ్రుక్కుమిక్కనక తలంటుస్నానము, నూతనవస్త్రధారణము, వెంద్రుకల తడియార్పు, పూలముడుపు, గంధపుమైపూఁత-మొదలగు నన్ని యుపచారములకును మేనొగ్గినాఁడు. అపురూపముగా మగని కీసేవలు చేయఁగల్గి వానియిల్లాలు ధన్యురాల ననుకొన్నది. ఆమెయాశలు మొలచినవి.

ఇంతలో వంట తయారైనది. దేవతలకు బోనాలు పెట్టినంత-సామాన్యముగా మెచ్చుకొను స్వభావములేని పోరాని పెద్దచుట్టమునకు విందులు చేసినంత-శ్రద్ధతో భయముతో అక్క తమ్మునికి పలువగల వంటలు వండినది. కనుగీటినంతలోనె! తలిదండ్రులకును భర్తకును హానమంత్రము వేసినది. తనబిడ్డలతోపాటు వారిపంక్తిలో తమ్మునికి చేయార తానే తృప్తిగా వడ్డించినది. వాఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భుజించినపిదప - ఎంత చెడినను వైదికుల యింటిబిడ్డఁడుగదా - వార్చి యింటితిన్నెపైఁ గూర్చున్నాఁడు. భార్యకు రెండవమాఱు కనుసన్న చేయనక్కఱలేదుగదా! ఆమె వచ్చి అరుగుచెంత నిలుచుకొని తాంబూలము చుట్టియిచ్చుచున్నది. అతని కిప్పుడు పదునాల్గులోకములును చల్లగా సుఖముగా నిండుగడుపుతోఁ గానవచ్చుచున్నవి. చీవాట్లను, తిట్లను చిఱునగవుతో స్వీకరింపఁగల యుదారహృదయముతో నున్నాఁడు.

తానును ఇంతలో భుజించి వంటయింటి పనుల ముగించివచ్చినది. పరగడుపుతో ఈ మహాకార్యము నెఱవేర్చుట తనకును కష్టము గదా. చంట వెంట సందడిసేయు సంతానము. నెమ్మదిగా అరుగుదగ్గఱ నిలిచి, చీరపేల చిట్టడవిగా నున్న వాని తలనుజూచి 'సీ! ఏమిరా యిది!' అని ప్రేమ ప్రస్తావన చేసి, జుట్టుముడివిడిచి విదలించి, ఈళ్లు గ్రుక్కి, అంట్లఁ బాడిచి, గోరుముక్కుల దిగదువ్వి, తూరుపెత్తి, పేలనన్నిటిని దిగిచి ముడివేసినది. వానిమెడకు మన్ను నలఁచినది. పాణిపద్మములు గరగరగాఁ గడుగుకొన్నది. ఆవేళకు సరిగా అదనెఱిఁగిన మరదలు విడెము మడిచి యిచ్చుచుండఁగా దాసి తెచ్చిపెట్టిన 'పీటపైఁ గుడిప్రక్క నించుక మోరగిల్లి కూర్చున్నది. ఎడమప్రక్క బిడ్డఁడు చనుద్రావుచున్నాఁడు. ఈ శీవిని భావించి కవి "పద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలె" నున్నదన్న పోలికలో నతిశయోక్తి యేమైనఁ గలదా? కావుననే యతఁడు ముక్కాలుముప్పాసము ఆ స్త్రీయంతయుఁ గరఁగిపోయిన యాయింటిలోఁ గూడ — నిగమశర్మ తల్లినడిగి కాఁబోలు — దాఁచియుంచిన 'పసిమి పసిఁడివీవన' తెప్పించి మరఁదలిచే నదినెకు విసరించుచున్నాఁడు! వజ్రాలవీవనతో విసరినను ఆదివ్యమూర్తికిఁ దక్కువయేకదా!

చెప్పవలసినమాటలు చెప్పుట కింత కంటె మంచిసమయ మేది? "ఏమినాయనా! ఎన్నాళ్లాయెరా మాయూరికి నీవువచ్చి? ప్రారంభించి యఖండముగా జరుగుచున్న వేదపాఠమునకు విఘ్నమగునని నెఱచితివి కదా!" అని తిన్నగా ఏసమాటలతో నుపక్రమించినది. కాని ద్రౌపదివలెనే యామెయు 'రక్కసతాల్మి'తో మదిలో నణఁచిపెట్టుకొన్న యలుక యీ సన్నసన్నమఱుఁగు మాటలతోఁ దీఱునా? 'సాలగ్రామాల గనిలో గులకరాయివలె సముద్రమువంటి యాతండ్రికడుపున ఇట్టివాఁడ వెట్లురా పుట్టితివి!' అని యొక్కమాటుగాఁ గసరి పల్కినది. బ్రహ్మనుండి తమవఱకు మచ్చపేరెఱుఁగని బ్రాహ్మణవంశమే. తలిదండ్రులు ముసలివారు. తమ్ములు కసుగందులు. తానింటికి పెద్దకొడుకు. వారిగతియేమి? చేసికొన్న యిల్లాలిది క్కేమి? వచ్చిపోవువిద్వాంసుల మన్నించుమాట యెట్లు? ఇంటిమర్యాదల కేమిత్రోవ? తనయొక్కని చెడునడవడిచే ఇంటివారందఱి శీలము పిల్లిశీలమని, చదువులు చిలుకచదువులని తోడివారెల్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవ్వుచున్నారే! 'ఏల యిట్లు బేలవైతివి? అన్నా! ఏల నీకీ గుణము!' అని కడుపోషక కెరలి పల్కినది.

కాని యిది తప్పుదారి. పాపము చేయు వారు తిట్లచే నెప్పుడును తమనడత మానరు. మీఁదుమిక్కిలి తిరుగఁబడుదురు. వెనుక గురుజనము శిక్షించినప్పుడు వారి కదే మర్యాద జరిగినది. వచ్చినపని వానిని దారికిఁ దెచ్చుటకాని తనకడుపుకసికీఱ నాలుగుతిట్లు దిట్టి మరలిపోవుట గాదు. అది యుదాసీనులు అజ్ఞానులును జేయు పని; హితకాంక్షులు చేయునదిగాదు. ఆ 'కుశలాశయ' కిది తెలియకపోవునా? అలుక మగిడించికొన్నది. స్వరము మార్చినది. సామరస్యము వెలిఁబుచ్చినది. 'భారతమునకు కర్ణునివలె నీవే యీయింటి కాధారము. నీవులేనిది కథనడువదు' అని యతని పౌరుషమున కన్వయించి పురికొల్పినది. 'నీవు యజ్ఞము చేయఁగా వేదికను నే నలంకరించి సుమంగలీపూజ లందుదునని గంపెఁడాసతో వేయిమందిలోఁ జెప్పుకొన్నానే! నాయాశలు త్రెంచితివే!' యని సౌభ్రాత్రమును జూపి కన్నీరుపెట్టుకొనఁబోయినది. 'కామవికారము బలమైయుండెనేని రూపగుణకులశీలములుగల్గు బ్రాహ్మణకన్యలను వేయిమంది నైనను పెండ్లాడరాదా! బ్రాహ్మణగృహస్థునికి బహుపత్నీవ్రతము తప్పని యెవరు చెప్పఁగలవారు! ఈపాడువారకాంతలవ్యవహారము నీకెందుకు? వారిదోపిళ్ళకు మన్నీలు, ఆఢ్యులును దట్టుకొనఁజాలరే! ఇఁక బాపనసంసారులము మనగతి యేమి?' అని తీవ్రమైన వ్యావహారికదృష్టితో వాదించినది. 'అదియుఁ బోనీ! చేతనున్న డబ్బుమాత్రము తెలివితో వెచ్చించి యూరకుంటివా! అట్లైయుండిన నా కింతదుఃఖ ముండదే! "ముక్కారుంబండు నఖండసేతువృతముల్ కాశ్మీరఖండంపుఁ గేదారంబుల్ తెగనమ్మి"తివే! "నీకేమి భార్య లేదా? బిడ్డలు పుట్టరా? వెన్నంటిపుట్టిన తమ్ములు లేరా? ఇట్లు కులధ్వంసము చేయు దురా యెవరైన?" అని తనవారి తప్పులను క్షమించి సరిపుచ్చుకోఁగల స్త్రీహృదయమార్దవమును వెలువఱిచి అధర్మము చేసినను అవివేకముగా చేయరాదను సామాన్యన్యాయమును సాటిచెప్పినది. వేశ్యాజనుల వంకరటింకర లన్నియు సూదులతోఁ బొడిచినట్లు వాని గుండెకంట నొత్తిక్రుచ్చి యెత్తి పెట్టినది. కడకు వానిచేతిలో చేయివేసి 'చేయిమీఁదుగా నడచిన పూర్ణకాముఁడవే! నాతమ్ముఁడవే! నీకీ బికారితనమేల ?వలదు నాయనా! ఇంకనైన వదలు తండ్రీ!' యని దీనదీనముగా వేడుకొన్నది. "నీకుఁ గావలసెనా హారికౌస్తుభమైనఁ దెచ్చెద" నని ధీరధీరముగా ప్రతిజ్ఞ చేసినది! తమ్మునికిఁ దెచ్చియీకున్నను ఆమె తానే కౌస్తుభమై తెన్నాలికవిమూలమున తెలుఁగువారి చేతి కబ్బినది!!

ఇంతటి తెలివితెగువలు, నగవుబిగువులు, అందచందములు కరువుపోసి తయారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసిన అపూర్వామృతమూర్తికి రామకృష్ణ కవి దృష్టిచుక్కగా నొక మసిబొట్టు ముక్కుపైఁ బెట్టినాఁడు!

అక్కసద్బుద్ధిమాట లాదరించి నిగమ శర్మ నాల్గునాళ్లింటిలో వివేకము దెచ్చుకొన్న వానివలెనుండి, యొకనాఁటిరాత్రి చేతికిదొరకిన యింటిసొమ్ములనెల్ల హరించి మూటగట్టుకొని పండుకొన్న పడుకకును జెప్పక పాఱిపోయెను. అప్పు డింట నందఱు నేడ్చిరి. వారితోడ నక్కయు నేడ్చినది. ఎందు కను కొన్నారు? తమ్ముఁడు చెడెనే యని కాదు; ఇల్లు మునిఁగెనే యని కాదు; తనప్రయత్నము వ్యర్థమాయెనే యనియును గాదు! మఱి "క్రొత్తగాఁ జేయించుకొన్న ముక్కర" పోయెనే యని దుర్వారమై యడలెనఁట!

పరిహాసము పవిత్రవస్తువునుగూడ గమనింపదేమో!

---



నందివాహనుడు

(పెనుగొండలో దొరకినది) —యస్. వి. యస్. రామరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, సంచిక ౧

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు

త్రివర్ణచిత్రములు : తెనుగుపడుచు; నందిపూజ; జ్యేష్ఠమాసము; ఆషాఢమాసము.

సాధారణచిత్రములు : నందివాహనుడు; బుద్ధుని ఉపదేశము, సిద్ధార్థుని వివాహము; ఎదురెండ; నీడలు; ఒరిగిన శిఖరము; మాయింటికి పసుపుబొట్టు తాంబూలానికిరండి; మహేశమూర్తి; వైఘునది; పిల్లసేద్యకాడు; తిరుచునాపల్లి; నటరాజప్రతిమ; వర్షానంతరము; ధారాయంత్రము; రవీంద్ర రాధాకృష్ణులు; కృష్ణరాజసాగరచిత్రములు 3; కాశ్మీరచిత్రములు ౬; నామకల్లు పర్వతప్రాంతము; సూర్యోదయవేళ; మార్కండేయ సంరక్షణము; వ్యంగ్యచిత్రములు; ఇతరచిత్రములును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. కృష్ణరాజసాగరము



౨. కృష్ణరాజసాగరపుఅనకట్ట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. కృష్ణరాజ సాగరము (ముందువైపు)

—యల్. నారాయణరావు.

# మనము - మన తెలుఁగు

కవికొండల వేంకటరావు

ఏవిషయముపే రేమైనను దానిలో నిమిడి యున్న విశేష మొకటికలదు. "మనము-మన తెలుఁగు" అనియనుకొనుటలో నొకవిధ మగు సంఘీభావమే కాకుండా ఆసంఘీభావము తెలుఁగుబాసకై కొండొకతఱవు వినియోగింపవలసినదిగ సూచించునది.

ఇం దిప్పు డెవ్వరితోడనుఁ దెనుఁగు భాష యార్యులభాషా, యనార్యులభాషా? అది సంస్కృతసహవాసమునఁ జేసి పెంపొందినదా, హూణభాషాసంపర్కంబునం జేసి సాగుచున్నదా - యను మీమాంసలలోనికి దిగువాఁడను గాను.

మనము నేఁడు నిర్వివాదముగ యోజించి చూతము: తట్టునవేమి?

(౧) తెనుఁగు సజీవమైనభాష.

(౨) తెనుఁగు సొంతభాష.

(3) తెనుఁగు సొగసైనభాష.

(౪) తెనుఁగు మాటలాడను, వ్రాయనుఁ, జదువనుఁ, బాడనుఁ, బఠింపను వల నగుభాష.

ఇవి:—

తెనుఁగు సజీవమైనభాష యనఁగా సంస్కృతము, లాటిన్, గ్రీకు, హీబ్రూ భాషలవలెఁ బురాతనమాత్రమైన దేకాక, యధునాతనమైనదికూడ నని నాయూహ. సంస్కృతముమున్నగువానినిగుఱించి మనము చదువునప్పుడవి చరిత్రాత్మకములుగ మనకుఁ దట్టునవే కాని యా భాషలలో నితరులతో ముచ్చటించుట యరుదు. వాని కిఁక నెదుగు పొదుగు లుండునని నే ననుకొనను. అవి చైనావారి పెద్దగోడవలె నిలిచిపోయి వెలుగుగొల్పుచుండును. అంతియే కాని సజీవమైనభాష హిమాలయపర్వతమువలె వెలసి, కరగుచుఁ బెరుఁగుచునుండును. కరగునంతలో స్రవంతులం బ్రవహించి యందఱ కందుబాటులో నుండును. పెరుఁగుచున్నంతలో దూరపుఁజూపు చూపుచుండును. మనుష్యులు దానియందలి యా మార్పును గ్రహించి యెట్లు మారుచున్నదో యని యనుకొనువారు. అందలి జీవకళను గుర్తించుకొనఁగల్గుదురు. మనలో నున్నదే దాని యందుఁ బ్రతినినాద మిచ్చుచుండును. దాని యందున్నదే మనలోఁ బ్రతినినాద మిచ్చుచుండును.

సజీవమైన భాషయొక్క జీవకళను గుర్తించుట కుపయోగించునవి పుస్తకములు కావు; వ్యాకరణములు కావు; అచ్చులు కావు; వ్యాఖ్యానములు కావు. ఆకళ యెప్పటికప్పుడు మానవు లన్యోన్యము మాట్లాడుకొనునప్పుడు, వినునప్పుడు వారి ముఖములమీఁదఁ దాండవించుచుండును.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఘోవోయి" యనునప్పుడు కోప మభిన యింపఁబడినచొప్పు 'పోవోయి' యను మాత్రమునఁ గోప మభినయింపఁబడ నేరదు. అందుచేత "ఘోవోయి", "పోవోయి" అని రెండును నుచ్చరింపఁబడుచున్నవి. ఆయుచ్చరింపుల రెండింటి ప్రయోజనమ్ము లెఱింగినప్పుడే మనకు భాషయొక్క జీవకళ బోధపడుచున్నది. ఈమాటలాడునదే వ్రాయఁగలుగుచున్నా మనుకొనుఁడు. వలసినచోట "ఘోవోయి" అనివ్రాసినఁ దప్పేమి? వ్రాసినదచ్చు వేయించినచోఁ దెలుఁగేల కాదు? ఆలాగున వ్రాయఁబడుట సజీవమైన భాషయొక్క లక్షణము.

ఇక్కడఁ గొందఱి సందేహము మనవి సేయుచున్నాను. మనవిసేయుట లేమి? జరిగినసంగతినే వ్రాయుచున్నాను. "ఆంగ్లేయ భాష నిట్టి విపరీతసంస్కార మున్నదా" యని యడిగినా రొకరు. "మన మాంగ్లేయ భాషను నేర్చుకొని మాటలాడుచున్నారము. దానియం దున్న యన్నివిధములగు నుచ్చరింపు లచ్చొత్తింపఁబడుచున్నవా?" అని అడిగినారలు. దాని కేను జవాబుగ "మనభాష సొంతభాష: దానితో మఱియొకభాషను బోల్చి 'యందున్నదా' యని యడుగవల" దని ప్రార్థించితిని.

దానిపై నప్పుడు రెండవ లక్షణమును గమనించవలసివచ్చినది. సొంతభాష యన నేమి? తెనుఁగువారికొఱకై యేర్పడినభాష; తెనుఁగువారి కర్థమగు భాష.—"తెనుఁగువారన్న తెనుఁగువా రందఱునా? కొందఱా? శిష్టులా? పామరులా? ఎవరుసృజించుకొన్నది?" అని పెద్దగందరగోళములోనకు దింప నుంకించినట్లు ప్రశ్నవైచినారు. "ఆలాగున నే, ఆలాగు నే, ఆలాగే, ఆలా, అలా, అల్లా అని కూడ వ్రాయుచున్నారు. 'చిలుక' అన్న దానికి 'చిలక' అని వ్రాయుచున్నారు. సొంతభాష యన మీయిష్టమునచ్చినట్లు పాడు చేయుదురా?" అన్నారు.

నే నన్నాను- "'అలా - అల్లా' అను రూపాలతో నాఁగిపోయిన దేకాని "ఆవెళ్లినారు, ల్లావెళ్లినారు" అని యెవరు ననలేదు, వ్రాయలేదుగదా: 'చిలక'తో నాఁగినదికాని 'చిలికి' అని చిలుకపదమునకుఁ బ్రత్యామ్నాయముగా నేఁ డెవరునువాడలేదుగదా? ఒకవేళ తెనుఁగువాఁ డెవఁడేని తా నుద్బోధితుఁడై వ్రాసె ననుకొనుఁడు. 'చిలికి' అని 'చిలుక'కు; 'ఆ' అని 'ఆలాగు'నకు. అప్పుడయ్యవి రెండవవాని కర్థముగాక యాపదములు నిరర్థకము లైపోవును. పదిమంది కర్థమై, "'చిలుక' కాదు 'చిలక' కాదు 'చిలికి' అన్నదే కీరార్థమందు ముద్దుగ నున్నది; మే మందఱమును 'చిలికి' అనియే వ్రాతు"మన్న నెవనికి నాఁప శక్యము గాదు. అప్పు డదే తెనుఁగని యనుకొనవలసియుండు" నన్నాను.

ఇద్దఱకూ ముఖా లెఱ్ఱవారిపోయి యొకరినొకళ్లము చూచుకొనినాము. అక్కడప్పుడు మామిత్రుఁ డొకఁ డుండి "ఏ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముపయోగించినప్పటికిని వ్రాయసగాఁడు భాషయొక్క సొగసు చూడకుండఁగ నుప యోగించినవాఁ డగునేని వానిపలు కెవ్వఁడును వినఁడు; వాని పుస్తక మెవ్వఁడును బఠింపఁడు. భాషయొక్క సొగసు చూపించని పదప్రయోగముగాని, వాక్యసముదాయము గాని చెల్లదు. ఎందుకు వచ్చిన వెట్టిమాట లివన్నీ" అనినాఁడు.

దానితో మూఁడవలక్షణ మామిత్రు నితో ప్రతిపాదించినాను. ఏమది? "తెనుఁగు భాష సొగసైనభాష" అని. "దేశభాష లందుఁ దెనుఁగు లెస్స" అని ప్రసిద్ధియేగా. "ఆ భాష యేవిధముగఁ జూచినప్పటికిని సొగసుగనే యుండఁగలదు" అన్నాను. "అసలు భాషాస్వరూపము ముందుఁ జూడ నేర్చుకొమ్ము." అని ఆమిత్రునకు విన్నవించు కొనినాను. మిత్రుఁడు నిమీలితనేత్రుఁడై తిరుగఁ గనులు దెఱచి నావైపు దిలకించి నాఁడు. నే నతనికిఁ బావడిలో డబ్బాలో నుండి వెలువడుచున్న ఒక పురుగును జూపించి "బొద్దీఁకన్ గనుఁగొన్నవాఁడవ సఖా!" అని శార్దూలవృత్తములో నెత్తుగడ మెత్తుకొన్నాఁడను. "బొద్దీఁక" అన్నచోట ప్రశ్న గుర్తు వేసినాఁడు—అంతా గాలిలో. "ఏమి?" అన్నాను. "నేను దానిని 'బొజ్జింక' అందు" నన్నాఁడు. ఇంటినుండి యాయన యిల్లాలు లీవలకువచ్చి "మేము 'గొద్దింక' అనువార" మన్నది. ఆమె భాషాప్రియ. అప్పుడు నే నన్నాను: "మన తెనుఁగు మాట లాడను, వ్రాయను, జదువను, బఠింపను వల నగు సజీవమైన, సొగసైన సొంతభాష. గొద్దింక, బొజ్జింక, బొద్దీఁక—అని మూఁడును వాడుక నున్నచో వ్రాయవచ్చును" అని. మూఁడింటికి నెవరికిఁదోఁచిన తెలుఁగున వా రర్థములు సెప్పికొన్నారము. అంతలో మఱి యొకమిత్రుఁ డొక మాసపత్రిక తీసికొనివచ్చి "ఈమాట ఉర్జీవా, ఉజ్జీవా 'సమానవుజ్జీలము' అని వ్రాసినాడు. ఆమాట 'వుర్జీ' అనుకొందును. ఆదిలో నది హిందూస్థానీ పదముగాదా? దర్జీతోఁ బ్రాసపడునట్టిది." అని అడిగినాఁడు. అతగాఁడు యం. ఏ.—

నేను వెంటనే "అది తెనుఁగుపద మోయి! 'ఉద్ది' అసలు దాని వర్ణక్రమము. జత అని యర్థము. 'ఉద్దించు', 'ఉద్దికాఁడు' అనికూడఁ బ్రయోగా లున్నవి." అన్నాను. "అగుచో నది మన తెనుఁగుమాఁటే! క్రమ క్రమముగ 'నుర్జీ, ఉజ్జీ, వుజ్జీ' అయినది నేఁటికి" అన్నాఁడు చిఱునవ్వు నవ్వుచు.

కాని యాచిఱునవ్వులో నతని "కయ్యో, తెనుఁగువాఁడ నైయుండి తెనుఁగుపదము యొక్క మొదలుతుదిరూపము లెఱుంగ నైతినే" యను విషాదాంకురము లేకపోలేదు. "మన కాదిరూపము దెలిసినచో మార్పులు బోధపడి మనభాషయే యీవిధముగ మారి నది. ఇది మఱియొకభాషగాదు. ఈ మారు చున్నభాష మన తెనుఁగువారు మాటలాడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నదే; మన తెనుఁగువారు వ్రాయునదే; మన తెనుఁగువారు చదువునదే; మన తెనుఁగువారు పాడునదే; మన తెనుఁగువారు ఃశించునదే అని గోచరించెడిని సుమా"యని హెచ్చరించినాను. "అప్పు డెక్క డేమాట యెప్పు డచ్చు గుద్దింపనలయునో నీకే బోధపడును" అని ప్రబోధించినాను.

అదే మనము మన తెలుఁగునుగుఱించి యెక్కడ ఎప్పు డనుకొనవలసినది; ఎప్పుడు నేర్చుకొనవలసినదియును.

---

ఆంధ్రజాతీయకళాశాల చిత్రసంచయమునుండి



బుద్ధుని ఉపదేశము, సిద్ధార్థుని వివాహము
(కృష్ణలో దొరకిన అమరావతి స్తూపము)

—యస్. వి. యస్. రామరావు.

CC-0. Jangamwadi Math Collection: Digitized by eGangotri

# సంస్కృతసంధి

శ్రీపరవస్తు వేంకటరామానుజస్వామి, యం. ఏ.,

౧. సంధినిగూర్చి విమర్శించునప్పుడు 'ఇండో-యూరపియన్' మాతృభాషలో జరిగినదానికిని సంస్కృతభాషలో జరిగినదానికిని భేదమును మనము గమనింపవలసియుండును. మొదటిజాతిసంధి సంస్కృతమునందును, దక్కిన ఇండో-యూరపియన్ భాషలయందును సమానముగా నుండును. మాతృభాషలోనే తచ్ఛబ్దము పదుశబ్దము పరమగునప్పుడు 'తత్' అనియు, దానశబ్దము పరమగునప్పుడు 'తన్' అనియు నుచ్చరింపబడుచుండెనని తలంచుటకు హేతువులు కలవు. ఇట్టి భేదములు 'గ్రీక్' మొదలగు పాశ్చాత్యభాషలలోగూడ గనబడుచున్నవి. కాని సంస్కృతమునందువలె నా భాషలలో నిట్టి యుచ్చారణభేదముల నన్నిటిని లిపిలో జూపుటలేదు. ప్రాచీన 'గ్రీక్' భాషయందు పదాంత నకారమును తత్పరమగువర్ణమునుబట్టి భిన్నముగా నుచ్చరించినను లిపిలోమాత్రము నకారమునే చూపుచుండిరి. ఉ.—ప్రా. గ్రీ. tēn po'in (ఉచ్చారణము tem), ton kosmon (ఉచ్చారణము tong). ఇట్లే 'హై జర్మన్' భాషలో పూర్వము tac—tagesఅనియవసానమునను, పదమధ్యమునను హల్లుయొక్క యుచ్చారణభేదమును లిపియందుగూడ జూపుచుండిరి. కాని యిప్పుడట్టిభేదమును జూపక tag—tages అని రెండుపక్షముల సమానముగనే వ్రాయుచున్నారు. కాన మాతృభాషలోని సంధినియమములను సమగ్రముగా నూహించుటకు మన కవకాశము లేదు. మనకు ప్రస్తుత మది ప్రసక్తముకూడ గాదు.

భాషాంతరములందువలెగాక సంస్కృతమునందు లేఖనమునగూడ సంధివశమున గలుగు వర్ణవిపరిణామములను నియమముగ దెలియజేయు నలవాటు కలదు. ఈభాషకును, వ్యావహారికభాషలకును భేదమధికమైనకొలది నిందు సంధి నిత్యము కాదొడంగెను. వైదికభాషలో సంధి వైకల్పికము. ప్రాకృతభాషలలో గూడనది నిత్యము కాదు. వైదికప్రాకృతభాషలనుబట్టి చూడగా సంస్కృతములోగూడ పూర్వము సంధి నిత్యమైనట్లు తోపదు. 'అవెస్తా' భాషలోగూడ సంధిరహితములగు ప్రయోగము లగపడుచున్నవి. ఉ.—అ. వె. Yukta aspa (లేక Yuktaspa), ava ajhanam. వేదమున గొన్నియెడల మంత్రములలో సంధిచేయబడియున్నను ఛందోభంగము లేకుండుటకు బదములను ప్రత్యేకముగా నుచ్చరింపవలసియుండును. ఇట్లు 'వార్యాణామ్' అనుపదమును 'వారి-అణ-ఆమ్' అనియు, 'స్వశ్వమ్' అనుపదమును 'సు-అశ్వ-అమ్' అనియు నుచ్చరింపవలసియుండును. బ్రాహ్మణములలో బదములలోని వర్ణములను లెక్కించుసందర్భమున 'స్వర్' అనుపదము ద్వ్యక్షరమనియు, 'సత్యమ్' అనునది త్ర్యక్షరమనియు, 'రాజన్య' అనునది చతురక్షరమనియు జెప్పబడియున్నది.

ఈ దిగువను సంస్కృతభాషలోని ముఖ్యములైన సంధికార్యములును, నవకాశమైనంతవరకు వాని యుత్పత్తియును, వేదమునందలి విశేషములును దెలియజేయబడును.

౨. స్వరసంధి.

1. అ. ఇ. ఉ. ఋ. (ౡ) అను అచ్చులకుగాని, వానిదీర్ఘములకుగాని సవర్ణమగునచ్చు పరమగుచో రెంటికిని దీర్ఘాచ్చాదేశముగా వచ్చుచుండును—ఉ. నాస్తి, తత్రాయాతః, గత్వాబ్రవీత్, రాజావదాత్, అస్తీహ, అధీశ్వరః, దేవీయస్, శ్రీరక్షతే, సూక్తమ్, బాహూరు, జుహూపభృత్, మొ. ఋగ్వేదమున ఆకారమున కకారము పరమగునప్పుడు సంధిచేయక పోవుటగూడ గలదు. ఉ.—మనీషా అగ్నిః, మనీషా అభి. మఱియు వేదమున ఉకార-ఊకారములకు సవర్ణాచ్చు పరమగునప్పుడు సంధిచేయకపోవుట కలదు. ఉ.— సు ఊర్ధ్వః, వీలూ ఉత, సు-ఊతయః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ సవర్ణదీర్ఘసంధి వేదమున దఱచుగా జేయ బడినను పఠించునప్పుడుమాత్రము రెండచ్చులును బ్రత్యే కముగా నుచ్చరింపవలసియుండును. లేనియెడల ఛందో భంగము సంభవించును. అట్టియెడల బూర్వపదాంతము నందలియచ్చుదీర్ఘమైనను హ్రస్వముగానుచ్చరింపబడును. ఉత్తరపదాద్యచ్చట్టిస్థలములలో గురువుగా నుండును. ఉ. మాపేః (=మా + ఆపేః) అనునది 'మ ఆపేః' అని యుచ్చరింపవలసియుండును. 'చార్చత, మృళతీదృశే, భవన్తూక్షణః' అనునవి క్రమముగా 'చ అర్చత, మృళతి ఈదృశే, భవన్తు ఉక్షణః' అని యుచ్చరింపవలయును. దీనినిబట్టి చూడగా పదాంతమునందలి యచ్చు దీర్ఘమైనచో బ్రథమమున హ్రస్వమై తరువాత నది యుత్తర పదాద్యచ్చుతో కలియుచుండెనని తెలియుచున్నది.

సవర్ణదీర్ఘసంధి యనేకభాషలలో నగపడుటచే మిక్కిలి ప్రాచీనమైనదనియు, మాతృభాషలోగూడ జేయబడుచుండెడిదనియు నూహింపవలసి యున్నది. మాతృభాషలో దానిరీతి యీక్రిందివిధముగా నుండిన ట్లూహింపవచ్చును:

$\bar{a} + a = \bar{a}$; $\bar{a} + e = \bar{a}$; $\grave{a} + o = \bar{a}$.

$e + e = \bar{e}$; $e + a = \grave{e}$.

$o + a = \bar{o}$; $o + e = \grave{o}$.

2. అకారాకారములకు ఇ, ఉ, ఋ (ౡ) అనునచ్చులుగాని, వానిదీర్ఘములుగాని పరమగుచో రెంటి కిని ఏ, ఓ, అర్ (అల్) అనునవి (గుణము) క్రమముగా నాదేశములుగా వచ్చుచుండును. ఉ. తిగ్మేషూ, భార్యేవ, కేదృశీ, హుతోచ్ఛిష్టమ్, వృకోదరః, సహసోత్థాయ, రమ్భోరు, సప్తర్షయః(సప్తఋషయః), మహర్షభః(మహా ఋషభః. వేదమున మహాఋషభః అనియుండును. (చూ. ౧.)

వేదమున ఋకారము పరమగునప్పుడు నిత్యముగా సంధిజరుగదు. పూర్వపదాంతమునందు అకార మున్న యెడల నది హ్రస్వమగును. కొన్నియెడలమాత్రము ఛందో భంగము లేకుండుట కుచ్చారణమున సంధిచేయవలసి యుండును. ఉ. తథ ఋతుః (తథా ఋతుః). వేదమున నచ్చుపరమగు దీర్ఘాచ్చు హ్రస్వమగుచుండును.

సంస్కృతమున అకారము మాతృభాషలోని a, e, o అనువర్ణములకు బ్రతినిధిగా నున్నది. (చూ. వర్ణసమామ్నాయచరిత, పేరా ౨) వీని కికారోకార ములు చేరునప్పుడు మాతృభాషలో హ్రస్వసంధ్యక్ష రము లేర్పడును. ఇవి సంస్కృతమున ఏకారోకార ములుగా పరిణమించినవి (చూ. వర్ణసమామ్నాయచరిత, పేరాలు ౧౧, ౧౨.).

a, e, o, + i = ai, ei, oi = ఏ.

a, e, o + u = au, eu, ou = ఓ.

సంస్కృతమున దీర్ఘాకారము మాతృభాషలోని '$\bar{a}$ $\bar{e}$ $\bar{o}$' అనువర్ణముల ప్రతినిధి. దీని కికారోకారములు చేరిన మాతృభాషలో దీర్ఘసంధ్యక్షరములు ఫలిం చును. ఇవి సంస్కృతమున ఐకారౌకారములుగా మార వలసియున్నవి. కాని పదాంతమందలియచ్చు ప్రథమ మున హ్రస్వమై తరువాత నుత్తరపదాదియందుండిన యికారోకారములతో గలిసి యిదిగూడ ఏకారోకార ములలోనికే మారినవి. అకారమునకు ఋ (ౡ) కారము పరమైనచో నది రేఫలోనికి మారును. ఇట్లు అర్ (అల్) అనురూప మేర్పడును. ఆకారమునకు పరమై నప్పుడు ఆర్ (ఆల్) అనురూప మేర్పడుటకుసమారుగా ఆకారము హ్రస్వమై పూర్వమువలెనే యిదిగూడ అర్ (అల్) అనువర్ణములుగా బరిణమించును. పదాంతము నందలి దీర్ఘాచ్చు పరమగునప్పుడు హ్రస్వమగుట మాతృభాషలోనే సంభవించెనని యీసంధిరూపముల నుండి మనము గ్రహింపవలసియున్నది.

3. అకారాకారములకు ఏ, ఐ, ఓ, ఔ, అను వర్ణములు పరమైనచో వానికిని, వీనిలో మొదటి రెంటికిని ఐకారమును, వానికిని తుదిరెంటికిని ఔకారమును నాదేశములుగా వచ్చును. ఉ. ఏకైకః, లోకైశ్వర్యమ్. నైవమ్, మహైశ్వర్యమ్, జలౌకః, రూపౌదార్యమ్, మహౌషధిః, యథౌచిత్యమ్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఋగ్వేదమున ఏకారౌకారములకు బూర్వ మకారాకారములు లోపించుటకూడ గలదు. ఏకారమునకు బూర్వమున లోపింపక యనునాసికాకారాకారములుంటకూడ గలదు. ఉ. ఉపేషతు (ఉప + ఏషతు), యథోహిషే (యథా + ఓహిషే), అనిమన్త ఏవైః, ఊపస్థా ఏకా.

సంస్కృతములోని ఏచ్చులకు మాతృభాషలోని సంధ్యక్షరములు మూలముకదా! (మా. వర్ణసమామ్నాయచరిత్ర, పేరాలు. ౧౧, ౧౨, ౧౩.) అకారాకారములకు మూలమగు 'a, e, o; ā, ē, ō' అను వర్ణములతో సంధ్యక్షరములు చేరినపుడు దీర్ఘసంధ్యక్షరములు లభించును. ఇవి సంస్కృతమున ఐకారౌకారములుగా పరిణమించినవి.

a + ai, ei, oi, āi, ēi, ōi = āi = ఐ.
e + ai, ei, oi, āi, ēi, ōi = ēi = ఐ.

ఇట్లే o అనువర్ణమునకు రూపములు గ్రహింపనగును.

a + au, eu, ou, āu, ēu, ōu = āu = ఔ.

ఇట్లే e, o అనువర్ణములకును రూపములు గ్రహింపనగును.

పైరీతిని సంస్కృతసంధిరూపముల యుత్పత్తిని గ్రహించుటకు సంస్కృతవర్ణముల ప్రాచీనావస్థ యెఱుంగవలసియున్నది.

4. ఇ, ఉ, ఋ (ఌ) అనువర్ణములు సవర్ణాచ్చు పరమగునప్పుడు య, వ, ర (ల) అనువర్ణములలోనికి క్రమముగా మారుచుండును. ఉ. ఇత్యుక్త్వా, వస్త్వాహ, మధ్వివ, దుహిత్రర్థే.

వేదములో సంహితాభాగమున బైరీతి నికారోకారములు యకారవకారములుగా వ్రాయబడినను సామాన్యముగా నికారోకారములేయుచ్చరింపవలసియుండును. లేనిచో ఛందోభంగము సంభవించును. ఋగ్వేదమున ఋకారము పదాన్తమున నెచ్చటను కనబడలేదు. ఈ సంధియందుగూడ దీర్ఘేక్కులు ప్రథమమున హ్రస్వములై తరువాతను యణ్ణులలోనికి మారినవని తలంపవలసియున్నది.

మాతృభాషలో ఇక్కులు హల్లుపరమైనచో నచ్చులుగాను, నచ్చుపరమైనచో హల్లులుగాను నుచ్చరింపబడుచుండినవి. ఈరీతి నిక్కులకును యణ్ణులకును వినిమయము సంభవించుచుండెను. ఇక్కుల యిట్టిస్వభావమే పైసంధిరూపములకు కారణము.

5. ఏకారౌకారములకు పరమగు అకారము లోపించును. ఉ: తేऽబ్రువన్, సోऽబ్రవీత్.

పైరీతిని వేదమున యకారము సాధారణముగా లోపించియున్నను, ఛందోభంగము లేకుండుట కెల్లప్పుడును యకారముచ్చరింపవలసియుండును. ఇట్లు ఛందస్సునకవసరమై యుండుటయు, గ్రంథమున లోపించియుండుటయు జూడగా నీయకారలోపము ఋగ్వేదరచనాకాలమున జరుగలేదనియు, గ్రంథస్థపాఠ మేర్పడినకాలమున బ్రారంభమైనదనియు జెప్పవచ్చును. మఱియు 'స్తోతవ అమ్బ్యమ్(స్తోతవే + అమ్బ్యమ్)'అను ఋగ్వేదప్రయోగమునుండి పూర్వ మకారము లోపించుట లేదనియు, అకారము పరమగునప్పుడుకూడ తద్భిన్నాచ్చుపరమగునప్పటి సంధియే జరుగుచుండెడిదనియు కొందఱు భాషాశాస్త్రజ్ఞు లూహించియున్నారు.

6. ఏ, ఐ, ఓ, ఔ అనువర్ణముల కచ్చుపరంబగునప్పుడు క్రమముగా నవి అయ్, ఆయ్, అవ్, ఆవ్, అను వర్ణములక్రింద మారుచుండును. ఇందు యకారవకారము లవర్ణపూర్వము లగునప్పుడు లోపించుటయు,నటుతరువాత సన్నిహితములగు నచ్చులకు తిరుగ సంధి జరుగకపోవుటయు గలదు. ఉ. త ఆగతాః, నగర ఇహ, తస్మా ఆదదాత్, స్త్రియా ఉక్తమ్, విష్ణ ఇహ, లేక, విష్ణవిహ, సురాఉక్తః, లేక, సురావుక్తః, హర ఏహి, లేక హరయేహి, శ్రియా ఉద్యతః లేక శ్రియావుద్యతః.

వేదమున యకారము సార్వత్రికముగా లోపించినను వకార మకారమునకుపూర్వమే లోపించును. యకారవకారములు లోపించినపిదప దిరుగ నచ్చులకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంధి జరుగుటకూడ కలదు. ఉ. సర్తవాఔ (సర్తవై + ఆఔ), వాసౌ (వై + ఆసౌ). యకారవకారములు లోపించినపిదప దిరుగ సంస్కృతమున సంధి జరుగక పోవుటచే వీనిలోపము నవీనమని పాశ్చాత్యు లూహించి యున్నారు.

ఏచ్చులకు మాతృభాషలో సంధ్యక్షరములు మూలము లగుచున్నవి. వీని కచ్చుపరమగునప్పుడు వీని లోని రెండవభాగమగు ఇకారోకారములు యకార వకారములుగా నుచ్చరింపబడుటచే నీసంధి సిద్ధించినది. (చూ. పైని ర పేరా.)

ai, $\bar{a}$i, au, $\bar{a}$u + Vowel = ay, $\bar{a}$y, av, $\bar{a}$v + Vowel. ఇట్లే మిగిలినసంధ్యక్షరములకును రూపములు గ్రహింపనగును.

7. ద్వివచనరూపములచివరనుండు ఈకార-ఊకార-ఏకారముల కచ్చుపరమగునప్పుడు సంధి జరుగదు. ఉ. ఇన్ద్రా ఆసాతే, ఇమా గిరీ ఆరోహతమ్.

వేదమున ఈకారాంతద్వివచనమున ఇకారము పరమైనచో సంధిచేయబడుటకూడ గలదు. ఉ. నృపతీవ (నృపతీ + ఇవ), రోదసీమే (రోదసీ + ఇమే). ఈకారాంతముగానుండు నికారాంతశబ్దముల వైదికసప్తమ్యేకవచనరూపమున కచ్చుపరమగునప్పుడు సంధి జరుగదు. కాని "వేద్యస్యామ్" (వేదీ + అస్యామ్) అను ప్రయోగమునమాత్రము సంధి చేయబడియున్నది.

3. వ్యంజనసంధి

1. వర్గప్రథమవర్ణములు నాదవర్ణములు పరమగునప్పుడు నాదవర్ణము లగుచుండును. ఉ. కీదృగ్వి చేష్టితమ్, రాడ్భాషతే, ఆసీద్రాజా, తాదృగన్నమ్, అథర్వదన్నమ్. అచ్చులును నంతస్థములును బరమగునప్పుడీ మార్పు కలుగుటకు కారణము తెలియకున్నది. పదమధ్యమున నట్టి శ్వాసవర్ణము నాదవర్ణముగా మారుటలేదు.

అనునాసికవర్ణము పరమగునప్పు డనునాసిక వర్ణముక్రిందగూడ మారవచ్చును. ఉ. తన్నమః, లేక, తద్నమః, వాఙ్మే, లేక, వాగ్మే, త్రిష్టుమ్న్యానమ్, లేక, త్రిష్టుబ్న్యానమ్. ఈసంధి పదమధ్యమునకుకూడ కొనిపోబడినది. ఉ. వాఙ్మయ, మృన్మయ, అన్న, విద్యున్మంత్. ప్రాతిశాఖ్యలలో నీసంధి నిత్యమని చెప్పబడియున్నది కాని వికల్పము కాదు.

హకారము పరమగునప్పుడు పూర్వవర్ణము నాదమగుటయేకాక హకారము తత్స్థానీయమగు మహాప్రాణ వర్ణముక్రింద మారుటకూడ కలదు. ఉ. తద్హి, లేక తద్ధి. ఈరెండురూపములకును నుచ్చారణమున విశేషభేదము లేదు. ప్రాతిశాఖ్యలలో హకారము నిత్యముగా మారునని చెప్పబడియున్నది. ఉ. పద్ధోతా, వాగ్ఘుతః.

శవర్ణము పరమైనచో (తకారము పూర్వమందున్నయెడల నది చకారమగుటయేకాక) శవర్ణము ఛకారములోనికి మారవచ్చును. ఉ. వేదవిచ్ఛూరః, తచ్ఛ్రుత్వా.

2. హ్రస్వాచ్చు పూర్వమునగల ఙ, ణ, న అనువర్ణముల కచ్చుపరమగుచో నవి తద్ద్విత్వములగును. ఉ. ప్రత్యఙ్ఙాస్తే, సుగణ్ణీశః, ఉద్యన్నాదిత్యః, అభరన్నిహ. ఛందస్సునుబట్టి చూడగా వేదమున నిది వికల్పమేమో యని తోచుచున్నది

అనునాసికాంతపదములలో గొన్ని సంయోగాంతలోపముచే ననునాసికాంతము లగుచున్నవి. అట్టిపదములు పదాంతరములతో గలిసినప్పుడు వానిచివరనుండు వర్ణము లోపింపక తత్పూర్వమందుండు ననునాసిక వర్ణముక్రింద మారగా ద్విత్వానునాసికవర్ణ మేర్పడును. ఇట్లు ద్విత్వానునాసికము కొన్నియనునాసికాంతపదముల సంధిలో నుద్భవింపగా, మిగిలినయనునాసికాంత పదముల చివరనుండు ననునాసికముకూడ సంధిలో ద్విత్వముగ జేయబడెను. ఇట్లిది సంస్కృతమున నిత్యమైనది. ఈసంధి కొన్నిపదములసంయోగాంతమగు పూర్వావస్థ ననుసరించి బయలుదేరినది. ఈసంధ్యుత్పత్తిని తెలిసికొనుటకు సంస్కృతపదముల పూర్వావస్థ యెఱుంగవలసియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. నకారమునకు చ, ట, త అనువర్ణములు పరములగునప్పుడు శ, ష, స అనునాగమములు క్రమముగా వచ్చుచుండును. నకార మనుస్వారములోనికి మారును. ఉ. దేవాంశ్చ, భవాంశ్ఛిద్యతే. తాంష్టఙ్కాన్, కుమారాంస్త్రీన్, అభరంస్తతః, కస్మింశ్చిత్. వేదమున నీ సకారాగమము నిత్యముకాదు. వైకల్పికత్వముకూడ ప్రతివేదమున భిన్నభిన్నముగా నగపడును.

నకారాంతపదములు చాలవరకు సంయోగాంత సకారము లోపించుటచే నకారాంతము లగుచున్నవి. అట్టిపదములు పదాంతరములతో గలిసినప్పుడు వానిచివర వర్ణము లోపింపక నిలుచుటచే నీసంధి సిద్ధించును ఇట్లు కొన్ని నకారాంతపదములసంధిలో సకార మగపడగా మిగిలిన నకారాంతపదములసంధిలోగూడ సకారము ప్రవేశింపజేసిరి. ఇట్లిది సంస్కృతమున నిత్యమైనది. ఈసంధి కొన్ని నకారాంతపదముల సకారాంత ప్రాచీనావస్థను సూచించుచున్నది. ఈసంధ్యుత్పత్తిని దెలిసికొనుటకుకూడ సంస్కృతపదముల పూర్వావస్థ యెఱుంగవలసియున్నది.

వేదమున దీర్ఘాచ్చునకు పరమందుండు నకారమచ్చుపరమగునప్పు డనునాసికముక్రింద మారును. ఉ. దేవాఁ ఏహి, ఉపబద్ధాఁ ఇహ, మహాఁ అసి, రశ్మీఁరివ, సూనూఁర్యువన్యూఁరత్, నౄఁరభి, స్వతవాఁః పాయుః, నౄఁః పాత్రమ్. ఇచ్చట పదాంతనకారమునకు పరముగానుండు సంయోగాంతసకారము లోపింపక నిలిచియుండుటచే నీసంధి యేర్పడినది.

4. నకారమునకు సకారషకారములు పరమగునప్పుడు తకార మాగమముగా రావచ్చును. ఉ. తాన్త్షట్, లేక తాన్షట్, మహాన్త్సన్, లేక మహాన్సన్. అనేకప్రాతిశాఖ్యలీయాగమము నిత్యమని చెప్పుచున్నవి.

నకార స(ష)కారావ్యవహితోచ్చారణసందర్భమున తకారము జన్మించును. ఇది లిపిలో నిర్దేశింపగా నీసంధి సిద్ధించును. వర్ణద్వయావ్యవహితోచ్చారణమున వర్ణాంతర ముద్భవించుట సహజము. అట్టివర్ణములకు చరవర్ణములని వ్యవహారము కలదు. (చూ. భాషాసంప్రదాయములు, పేరా ౯, వర్ణోత్పత్తి) నకారాంతపదములు కొన్ని సంయోగాంతతకారము లోపించుటచే నకారాంతము లగుటకూడ నీ సంధిలో తకారము స్థిరపడుటకు సహకారియై యుండవచ్చును.

శవర్ణము పరమైనచో నకారము ఞకారమగుటయే కాక శవర్ణము ఛకారములోనికి కూడ మారును. ఉ. స్వపఞ్ఛేతే.

5. సకారమునకు కకారఖకారములును, పకారఫకారములును పరమైనయెడల నది విసర్గ (జిహ్వామూలీయోపధ్మానీయముల) ముగ మారును. వేదమున సమాసముననను, కొన్నియెడల వాక్యమునందునుగూడ సకారము నిలచుచుండెను. ఉ. దివస్పుత్రః, ఇడస్పదే, హిమవతస్పరి, ద్యౌష్పితా, త్రిష్ఫృత్వా, యస్పతిః, సంస్కృతమునగూడ కొన్ని సమస్తపదములలో సకారము నిల్చుచున్నది. ఉ. నమస్కారః, వాచస్పతిః.

6. అకారపూర్వకమగు సకారము అకారభిన్నమగు నచ్చుపరమైనయెడల లోపించును. తరువాత పూర్వపరాచ్చులకు మరల సంధిజరుగదు. అకారముకాని, నాదహల్లుకాని పరమైనచో సకారము తత్పూర్వమందుండునట్టి అకారముతో గూడ నోకారముగా మారును. పరమందలి యకారముమాత్రము లోపించును. ఉ. బృహదశ్వ ఉవాచ, ఆదిత్య ఇవ, హన్తవ్యోఽస్మి; నలో నామ, బ్రహ్మణ్యో వేదవిత్. అకారలోపము వేదమున సంస్కృతమునందువలె నిత్యముకాదు. సకారము లోపించినపిదప పూర్వపరాచ్చులకు మరల సంధి జరుగుటకూడ గలదు. ఉ. తతోవాచ.

ఆకారపూర్వకమగు సకార మచ్చుగాని, నాదహల్లుగాని పరమైనచో లోపించుచుండెను. సకారలోపము జరిగినపిదప పూర్వపరాచ్చులకు మరల సంధి జరుగదు. ఉ. దేవాఇవ, అశ్వావహన్తి.

సకారమునకు నాదయుక్తమగు వ్యంజనము పరమగునప్పు డది నాదవర్ణము (Z) గా మారునని వర్ణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కనాన్యాయుపపత్రమున దెలుపబడినది. (చూ. పేరా ౨౮.) అకారాకారపూర్వకమగు నీనాదసకారము (Z) నకు దకారధకారములు పరములగునప్పు డది లోపించు చేకాక తత్పూర్వమునందునట్టి అకార మోకారముగాను మారును; ఆకారముమాత్రము విపరిణామమును బొందదు. క్రమముగా నీసంధి దకారధకారములే కాక మరే ఘోషనాదవర్ణము పరమైనను నచ్చటికెల్ల గొనిపోబడినది. ఇట్లు హ్రస్వాకారయుక్తసకారమునుండి యోకార మేర్పడినది. అటుతరువాత నకారభిన్నమగు నచ్చు పరమగుస్థలములలో నిది తిరుగ హ్రస్వాకారముక్రింద మారినది. అకారము పరమైన స్థలములలో నాయకారమే లోపించెను. ఈ రీతి నీసంధి యుద్భవించినదని యూహింపబడినది.

పైరీతిని సిద్ధించిన పదాంతసంధికార్యము పదమధ్యమునగూడ ప్రవేశించినది. ఇందులకు సమస్తపదములు కారణమై యుండవచ్చును. 'మనోహారిన్' అను మొదలగు రూపముల ననుసరించి 'మనోభిః' అను మొదలగురూపము లుద్భవించియుండును.

సంస్కృతమందలి మిగిలిన హల్సంధికార్యము లన్నియు వర్ణసమీకరణరూపముగా నున్నవి.



ఎదురెండ

—యస్. వి. యస్. రామారావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రబంధయుగము

పాటిబండ మాధవశర్మ

ఆంధ్ర కవితాచరిత్రమునందు ప్రబంధయుగము చాల ప్రసిద్ధమైనది. ఈ యుగమునకు ప్రధాన పోషకుఁడు శ్రీకృష్ణదేవరాయలు. కర్త అల్లసాని పెద్దన. ఇతని అనుయాయులలో ముఖ్యులు రామరాజ భూషణుఁడు, ముక్కు తిమ్మన, పింగళి సూరన, రామకృష్ణుఁడు, చేమకూర వెంకటకవి మొదలైనవారు.

క్రీ. శ. ౧౩౪౦ ప్రాంతమువాఁడగు ఎఱ్ఱాప్రెగ్గడకు ప్రబంధపరమేశ్వరుఁడని బిరుదు గలదు. దీనినిబట్టి ప్రబంధకవిత్వమునకు మార్గము నేర్పరచినవాఁడు ఎఱ్ఱయయని యొకనమ్మకము గలదు. కాని యథార్థము నరసినచో క్రీ. శ. ౧౧౨౦ ప్రాంతమువాఁడగు నన్నెచోడకవియే ప్రబంధములకు చక్కనిమార్గము నేర్పఱచినట్లు స్పష్టము గాఁగలదు. నన్నెచోడునికుమారసంభవము ప్రబంధము గాక మఱి యేమగును? వర్ణనాప్రధానత్వ మను ప్రబంధముఖ్యలక్షణము కుమారసంభవమునందే కలదు. ప్రబంధపరమేశ్వరబిరుదమునుబట్టియే ఎఱ్ఱయ ప్రబంధములకు మూలపురుషుఁడనుట భ్రమ. ఆంధ్రకవితాపితామహబిరుదముఁబట్టి పెద్దన ఆంధ్రకవిత్వమునకే మూలపురుషుఁడని యెట్లు చెప్పవచ్చును? భావకవిత్వమునకు శ్రీగురుజాడఅప్పారాయకవి మూలపురుషుఁడని ప్రతీతి. కాని భావకవిత్వమనఁగా నేమి? ప్రస్తుత మాంధ్రదేశమున భావికవిత్వమను పేర చలామణియగుచున్న రచనావిశేషము బరిశీలించినచో గానయోగ్యము, ఆత్మనాయకముఁ వ్యంగ్యప్రధానము, ఏకభావాశ్రయము నగు నొకలఘురచన భావకవిత్వ మని తెలియనగుచున్నది. ఈజాతికవిత్వము పూర్వము లేదా? ఉన్నదనియే చెప్పవచ్చును.

నన్నయరచించిన భారతావతారిక యీజాతికి చెందినదే యని నిశ్చితముగా చెప్పవచ్చును. ఈ యవతారిక భారతగాథలో భాగముకాదు. కవి స్వవిషయమును, తత్కాలప్రవృత్తిని వ్యంగ్యప్రధానముగ చక్కనిలఘురచనలో ప్రదర్శించినాఁడు. తిక్కనయు స్వప్నవృత్తాంతమును వ్రాసినాఁడు. తిక్కనకీస్వప్నము నిజముగా వచ్చినదని చెప్పకపోయినను ప్రమాదము లేదు. ఇది వ్యంగ్యప్రధానమైన రచన.

"అని రచనాకౌతుకమున
మనమలరఁగ నీప్రబంధమండలి కధినా
థునిగా నేపురుషుని జే
కొనువాఁడనొ యనుతలంపు గూరిన మదితో.

ఇంచుక నిద్రించుసమయంబున" అని తిక్కనవ్రాసి ఒకానొకమహాదీక్ష వహించి యనిశ్చితచిత్తముతో నిద్రించినప్పుడు ఆవ్యక్తియొక్క మానసికస్థితి యెట్టి యవస్థకు పాలగునో తిక్కన మహోన్నతముగ నిరూపించినాఁడు. మఱియు శ్రీ మహాభారతమువంటి యుత్కృష్టగ్రంథరచననుగూర్చిన నిశ్చయము జాగ్రదవస్థలో చేయుట సంభవము. యోగముచే పరిపక్వమైన చిత్తమునకు పరమేశ్వరుఁడు సాక్షాత్కరించుతెఱంగు తిక్కన నిరూపించినాఁడు. భగవద్దర్శనము జాగ్రదవస్థలో లభింపదుగదా! కనుకనే తిక్కన యించుక నిద్రించినట్లు వ్రాసినాఁడు. కాని యథార్థమున నది నిద్రగాదు; యోగసమాధి. ఇట్టియవస్థలోనే ఋషులు వేదముల దర్శించినారు. వాల్మీకి రామాయణరచనకు పరమేష్ఠిచే ప్రేరితుఁడైనాఁడు. ఈపరమార్థమును తిక్కన అవతారికలో ప్రదర్శించినాఁడు. ఇది భావకవిత్వముగాదా! నాచనసోముఁడు వసంతవిలాసమును గేయకావ్యమును వ్రాసినట్లు తెలియుచున్నది. శ్రీనాథాదుల చాటువులు, శతకములు, ఇవన్నియు భావకవిత్వము గాక మఱేమికాఁగలవు? కాని యింతమాత్రమున వీరిని భావకవులనికాని, వీరు జీవించినయుగములను భావకవితాయుగములనికాని మనము వర్ణించుటలేదు. పురాణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుగమున ప్రబంధములు, భావకవిత్వము గలవు. ప్రబంధ యుగమునఁ బురాణకవిత్వము, భావకవిత్వము గలవు. ఆధునికయుగమునను పురాణములు, ప్రబంధములు గలవు. కాని యీయుగములకు ఈ నామములు "ప్రాధాన్యేన" రూఢము లైనవి.

కనుక ప్రబంధరచనకు మార్గదర్శకుఁడు ౧౧౨౦ నాఁటి నన్నెచోడుఁడుగాడు; ౧౩౮౦ నాఁటి ఎఱ్ఱయయుఁ గాదు. ఈరచనకు పెద్దనయే మార్గదర్శకుఁడు. ఏలన, ఇతనికి పూర్వము ఈరచన యున్నను అది వ్యక్తిగతమే కాని యుగసామాన్యము గాదు. అనఁగా అది పరిణామ సిద్ధమై అప్రతర్క్యముగా పుట్టినది గాదు. ఈస్థితి పెద్దననాఁటికి వచ్చినది. కనుక పెద్దనయే దీనికి కర్త.

శ్రీకృష్ణదేవరాయలు దేశదేశములను జయించినాఁడు; ఆంధ్రదేశమును సుభిక్షము గావించినాఁడు. రాజకీయముగను, సాంఘికముగను దేశమునం దట్టికల్లోలములు లేవు. ఓడిపోయినరాజుల కూఁతుండ్రను జయలక్ష్మీవేషము వైచి క్రీడించినరాయలు రసికప్రభువు. 'యథారాజా తథాప్రజాః' అని రాజుతోపాటు సామంతులు, మంత్రులు, ప్రజలు అందఱును కేవలము విలాసప్రియు లైయుండిరి. ఆనాఁటి విజయనగరములోని వారవనితాజనమే దీనికి ప్రబలసాక్ష్యము. ఇట్టితరుణమున నుద్భవించిన రచనావిశేషము ప్రబంధము. పురాణకవిత్వపునీతులతో విసిగినప్రజలు కవితాపద్ధతిలో మార్పునకై తహతహపడిరి. ఈతృష్ణకు ఫలితముగా పెద్దన్నగారి మనుచరిత్ర పుట్టినది.

ఇట్లు విలాసార్థము పుట్టిన రచనావిశేషమగుటయు, రాజులు, కవులు, ప్రజలు భోగపరాయణులగుటయుఁ గారణములుగా ప్రబంధము శృంగార రస ప్రధానమైనది. పెద్దన్నప్రబంధమునందు శృంగారము అంగియగుటకు కేవలము కాలమహత్వమే కారణమైనను రానురా నది యొకమూఢాచారమై ప్రబంధములన్నియు శృంగారరసప్రధానములే యగుట తటస్థించినది. ఈ శృంగారముగూడ రానురాను సభ్యతను విడిచి మోటు చేరినది.

వేదర్షులు యోగసమాధిలో ఆనందస్వరూపమగు బ్రహ్మమును దర్శించి కవిత్వము చెప్పిరి. అట్టిఋషుల వాక్యములు ప్రేరేచి పురాణకవులు కవిత్వము చెప్పిరి. కాని ప్రబంధకవికి పద్యము రావలయునన్నచో "నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము, ఆత్మకింపయినభోజనము, ఊయ్యెలమంచము" నుండవలయును. ఇంత వ్యయమున కోర్చి రాయలవంటి రసికప్రభువు పోషించుటచేతనే పెద్దన్నవంటి కవి మనుచరిత్రవంటి గ్రంథమును వ్రాసినాఁడు రాయలు రసతృష్ణతో కవులను పోషించినాఁడు. కనుకనే నాటికావ్యములును రసమహితములుగనే యున్నవి. తరువాత ఆస్థానములకు వారకాంతలు, కొజ్జాలు అలంకారములైనట్లే కవులును అలంకారములైనారు. వారిగ్రంథములును అట్టివ యైనవి

నేఁటికవికి తనస్థితియే కావ్యరచనకు ప్రేరకమగుచున్నది. అనఁగా నీతనియభిరుచి, ఆవేశము ఆత్మాశ్రయములేకాని పరప్రేరితములు గావు.

ప్రబంధములు కేవలము బుద్ధిప్రేరితములు—అనగా మెదడునుండి పుట్టినవి. మానవహృదయముతో వానికంతగా సంబంధము లేదు. ఇవి పఠితకు బుద్ధిగ్రాహ్యములే. హృదయమును తాకుశక్తి ప్రబంధములకు లేదు. అనఁగా ప్రబంధములలోని పాత్రములతో పఠితకు సహానుభూతి కలుగుట లేదు. మఱియు నలంకారములలోఁ జాలభాగము ఊహాప్రేరితములు. అట్టి యలంకారప్రధానములగు ప్రబంధములు పఠితకు ఊహాగ్రాహ్యములే యగుచున్నవి. ఉత్ప్రేక్షాద్యలంకారములు, శ్లేషాది పదబంధచాతుర్యములు, యమకాదిశబ్దాలంకారములు ప్రబంధమునకు ముఖ్యలక్షణములు. ఇవన్నియు కవిత్వమునకు బాహ్యరూపమేకాని రానురాను ఇవితప్ప కవిత్వమే లే దనుస్థితి వచ్చినది.

పురాణములలోని వస్తుప్రధానత్వమును వదలించుకొనుటలో ప్రబంధములు కొంతయభివృద్ధిగాంచినట్లే తోఁచినను ప్రకృతిని వ్యాఖ్యానముచేయుటలోఁ గొంత కొఱవడినవనియే చెప్పవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేదములు భగవంతునకు, మానవునకుఁ గల సంబంధమును నిర్ణయించినవి. పురాణములు మానవునకు మానవునకుఁ గల సంబంధమును బోధించినవి. ప్రబంధములు ప్రకృతిని వర్ణించినవి గాని ప్రకృతికిని మానవునకునుగల సంబంధమును నిర్ణయింపఁ జాలకపోయినవి. ఈ యుత్కృష్టవిషయము అధునాతనకవిత్వమున కింకను మిగిలియేయున్నది.

---

సెలవుదినములలో నెవరి యానందము వారిది




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కనకవల్లి

విద్వాన్, కట్టి సాంబమూర్తిశాస్త్రి

చ. వివిధపదార్థజాలముల
  విస్ఫుటరీతి నెఱుంగఁజేయుచున్
నవరసరత్నసంతతు ల
  నారతవృత్తి నెలుంగఁ జేయుచున్
శివకరమై యనర్థములఁ
  జేరఁగనీక తొలంచి బుద్ధివై
భవము నొసంగు కావ్యము న
  వారిగ మ్రొక్కెద నెల్లకాలమున్.

మన ప్రాచీనపండితు లెల్లరును గావ్యమువలనఁ గీర్తియు, ధనమును, వ్యవహారనైపుణియు, ననర్థనివృత్తియు, బరమాహ్లాదంబును లభించుననియు, నీ లాభములు పురాణేతిహాసాదులవలనఁగూడ లభించినను బురాణేతిహాసాదులు పాఠకుని చిత్తవృత్తి నెఱుంగకయే రాజశాసనములవలెఁ బాఠకునకు భయముఁగొల్పుననియుఁ, గావ్యమన్ననో తానువలచిన ప్రేయసి సమయమెఱసి సుకుమారహావభావాది ప్రకటనము గావించుచు మృదుమధురవచనరచనములతో హిత ముపదేశించురీతిని బాఠకునకుఁ జిత్తానందముతోఁబాటు కర్తవ్యము నిర్దేశించుననియుఁ, గావునఁ గావ్య ముపాదేయమనియు నిర్దేశించియున్నారు. అయినను సంస్కృతకవులేమి, యాంధ్రకవులేమి యాలంకారికోక్తకావ్యప్రయోజనములను సమగ్రముగ లక్షింపకయే కేవలానందసంధాయకత్వము మాత్రమే తమకృతులకు ఫలముగా భావించినట్లు తోఁచుచున్నది. ప్రాచీనరచనాపద్ధతి నేవగించెడి యీ కాలముననైతము గావ్యములవలనఁ గలుగవలసిన మేలు స్వల్పముగానే యగపడుట విచార్యము గాకపోదు.

ఈకాలమున ఛందోబద్ధములగు ప్రబంధములకంటె సరళమై సుబోధమైన వచనరచనమునందుఁ గవులకును బాఠకులకును గూడ నభిరుచి విశేషముగ నగపడుచున్నది. ఇరువదవశతాబ్ది మొదటనుదయించిన నవలామండలులకును, నవలలకును లెక్కకానరాదు. ఈనవలలను పేరుగల వచనకావ్యములకు నాంగ్లభాషయందు నావెల్ (novel) అనుపేరు గలదు. ఆంగ్లపదము నుండియే "నవల" యనుపదమును బ్రహ్మశ్రీయుతులు, విమర్శకాగ్రేసరులు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిలువారు తొలుదొల్త వ్యవహరించిరనియు, నదియే లోకవ్యాప్తి నొందెననియు నొకపండితాగ్రణిచే నేను వినియుంటిని. ఈనవలలకును, సంస్కృతభాషలోని యాఖ్యాయికలకును దగ్గఱిపోలిక కలదు. పరశ్శతముగ నవతరించుచున్న యీ నవలలందు విదేశీయములు, విజాతీయములు నగు నపరాధపరిశోధనములో, సంఘసంస్కారములో ప్రధానముగ వర్ణింపఁబడుచుండునే కాని మనయాంధ్రభాషాగ్రంథములందు నాంధ్రుల మతాచారాభిరుచులు ప్రతిఫలింపకుండును. ఇది గొప్పకొఱంతె యనక తీఱదు. కేవలము ఆంధ్రుల యాచారవ్యవహారములును, మతసంప్రదాయములును, సాంఘికస్థితిగతులును బ్రకటించుచు బ్రహ్మశ్రీ క్రొత్తపల్లి సూర్యారావుగారు, వేంకటపార్వతీశ్వరకవులు మొదలగువారు రచించిన యాఖ్యాయికలు కొన్ని కలవు. కాని యింక నట్టిగ్రంథము లనేకములు బయలుదేఱవలసియేయున్నవి. ఆంధ్రుల సాహసౌదార్యసౌశీల్యధార్మికత్వాదిసద్గుణముల రుచిచూపుచుఁ బ్రాచీనమహాపురుషుల చరిత్రముల వర్ణించుచుఁ గథలందును, శాస్త్రములందును నభిరుచిని జనింపఁజేయుచు విజ్ఞానమును సర్వతోముఖముగ నెల్లి విరియించుగ్రంథములే వాఙ్మయమునఁ జారితార్థ్యము నొందఁగలవు. ఇతరములు కాలహరణసాధనములుమాత్రమే.

మ-రా-శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావు (బి. ఏ. గారిచే రచియింపఁబడి, ఆంధ్ర సరస్వతీ గ్రంథమాలయందు తొమ్మిదవగ్రంథముగాఁ బ్రకటింపఁబడి ౧౯౩౩-౩౪ సం. పాఠశాలాంత్యపరీక్షకు నప్రధానపాఠ్యముగా నిర్ణయింపఁబడిన "కనకవల్లి" యను నాఖ్యాయికయుత్తమశ్రేణిలో లెక్కింపఁదగినవానిలో నొక్కటిగా నున్నది.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీనియందలి యితివృత్తము బౌద్ధవైదికమతముల పరస్పర సంఘర్షణము. ఆంధ్రుల శౌర్యసాహసౌదార్యాదిసద్గుణములీచిన్నిపొత్తమున మిక్కిలి చక్కఁగ వర్ణింపఁబడినవి. ప్రాచీనభారతనారీమణుల సాహసము, సౌశీల్యము, విద్యావివేకములు, వివేచనాశక్తియు సరసముగ వర్ణింపఁబడినవి. ఈగ్రంథము రచించుటలోఁ గవి తనకుఁగల యపారవివేచనాశక్తి నెంతయు వినియోగించెననుటలో నతిశయోక్తి కానరాదు. ప్రాచీనాంశములతోఁ పాటుగ నర్వాచీనాంశముల జతపఱిచి పాఠకుల నద్భుతస్వాంతులుగా నొనర్చెను. 'ఆంధ్రజాతి అనార్యజాతులలోని' దను దుర్వాదమును ఖండించుటయుఁ, బ్రాచీనాంధ్రుల నాగరకతావిశేషములు మహోన్నతములనియు, నాంధ్రజాతి యితరద్రావిడజాతులకుఁ గన్న దెలిపినదనియుఁ బ్రతిపాదించుట కవికిఁ గల ముఖ్యోద్దేశ్యమైయున్నది.

ఐతరేయబ్రాహ్మణమునం దాంధ్రజాతి పేర్కొనఁబడినది. విశ్వామిత్రునివలన నాంధ్రజాతి జనించినదని పురాణములవలన విదితమగుచున్నది. ఆపస్తంబ భట్టబాణ సిద్ధ నాగార్జున భాస్కరాచార్యాదు లాంధ్రులని చరిత్రములందుఁ గలదు. మథురానగరమున శ్రీకృష్ణునిచే మడిసిన చాణూరమల్లుఁ డాంధ్రుఁ డని భాగవతమునఁ గలదు. ఈయంశములను విస్పష్టముగాఁ గవి తెలిపియున్నాఁడు. ప్రాచీనకాలమున నుండెడి విద్యావిధానమును, పరీక్షాపద్ధతులును, విద్యాపీఠముల యౌన్నత్యమును బాగుగా వర్ణింపఁబడినవి. బౌద్ధులు మతద్వేషముచే దేశమును గొల్లగొట్టి గ్రామములు దగ్ధముగావించుటచే నాంధ్రరాష్ట్రమునకు దగ్ధరాష్ట్రమని పేరు వచ్చినదని నిరూపింపఁబడినది. ఆంధ్రభాష యితరద్రావిడభాష లన్నిటికంటెఁ బ్రాచీనమైనదని ప్రకటింపఁబడినది. ప్రాచీనాంధ్రులమతము వైదికమతమనియు, నైనను నాంధ్రులు బౌద్ధమతమం దసహనమొందక తద్వ్యాప్తికై మిక్కిలిగ సదుపాయము లొనర్చియుండిరనియుఁ దెలుపఁబడినది. పైవిషయము లాంధ్రుఁడనువాఁడు ప్రతిక్షణమును మననము చేసికొనవలసినవి కాకుండునా ?

ఆంధ్రదేశమున నాగపూజ పూర్వకాలమునుండియు వ్యాపించియున్నది. ఇక్కాలమునఁ గార్తికశుద్ధచతుర్థదివసమున నాగులను బూజింపనియాంధ్రు లుండరు. కాని ఆపూజింపఁబడునాగులు సర్పములు మాత్రమే యని యిప్పటివారి నమ్మకము. కావుననే యానాఁడు పాముపుట్టలలోఁ బాలువోసియు, చలిమిడి చిమ్మిడియుండలను, కోడిగ్రుడ్లను వైచియు పాములకుఁ బ్రీతిగావింతురు. కాని వాస్తవమునఁ బూర్వకాలమున నాగులను నొకజాతివారు దండకారణ్యమున నుండెడివారనియు, వారు మణిమంత్రౌషధములచేఁ బాములను వశమున నుంచికొనెడివారనియు, వారివలననే నాగపూజ యాంధ్రులకు సంక్రమించెననియుఁ జరిత్రములు వక్కాణించుచున్నవి. నాగజాతివారు అనాగరకులుగా నుండి కొంతకాలము నరమాంసభక్షణము సేయుచుండెడివారనియు, బౌద్ధులయు నాంధ్రులయు సంసర్గవిశేషమున వారాదుష్కార్యము మానిరనియు, నాంధ్రులును, నాగులును సన్నిహితప్రదేశవాసులనియు గ్రంథకర్త స్పష్టపఱిచియున్నాఁడు. ఇందు వర్ణింపఁబడిన భట్టబాణాపస్తంబాదిపురుషులెల్లరును సమకాలీనులని నమ్ముట కవకాశములు లేవు. అట్లు నమ్మించుట గ్రంథకర్త కభిమతమనియుఁ దలంప వీలు లేదు. విశేషమేమన భిన్నకాలీనులైనను బ్రఖ్యాతులగు నాంధ్రపురుషుల నామంబులును, బ్రజ్ఞలును మన కెఱింగించుటయే కవి కభిమతము. అట్లేకాకున్న పందొమ్మిదవ శతాబ్దమునకుమున్నెఱుంగని విమానములను, మోటరుత్రొక్కుటలను నాకాలమున వర్ణించుట విరుద్ధము కాకుండునా.

సాధారణముగా నిప్పటిపండితులకుసైతము తెలియని రాజ్యాంగ సంబద్ధములగు కొన్నివిశేషముల నిందుఁ గవి పేర్కొనినాఁడు. ఆపారిభాషికపదములు మనకుఁ దెలియమిచే మన ప్రాచీనరాజ్యాంగపద్ధతి యెట్టిదో మన మెఱుంగఁజాలకున్నారము. పిసునుఁడు, విశాలాక్షుఁడు, భరద్వాజుఁడు అనురాజనీతికర్తలుమనకుఁ గ్రొత్తవారు. (పుట ౩౨) రాజు నిత్యము నాచరింపవలసినవిధులు మన కవశ్యపఠనీయములు (పుట ౫౦)? ఆంగ్లవిద్యాచతురుల జంభక, అంతరచక్ర సంసర్గములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(పుట ౫౨) మన కజ్ఞాతములు. శాస్త్ర, ప్రశాస్త్ర, సమాహర్త్ర, సన్నిధాత, ప్రదేష్ట, వ్యావహారికులు మనకుఁ గ్రొత్తవారు (పుట ౫౨). కాంభోజ సింధు ఆరట్ట వనాయు, బాహ్లీకజ తురంగములు మనకుఁ బూర్వ పరిచితములైనను పాపేయ, సౌవీర, తైతుల తురంగము లజ్ఞాతములు. సాన్నాహ్యకర్మము మన కవశ్యజ్ఞేయము (పుట ౫౫). గజయుద్ధమని యెఱుంగుదుమేకాని తద్భేదములను ఉపస్థాన, సంవర్తన, సంయమ, వధావధ, నాగరాయనముల నెఱుంగము (పుట ౧౧౬). తురంగమముల నెక్కి వయ్యాళి వెడలుదుమేకాని ఔపవేణుకాదివల్గనములు, కపిప్లుతాదిలంఘనములు, మాయూరాది ధోరణములు, భద్రాశ్వకాదినారోష్ట్రములు, శరభప్లుతాది నీచైర్గతములు మన మెఱుంగము. ధారాపంచకము మాత్రము కావ్యపరిజ్ఞాతలకుఁ బరిచితము (పుట ౧౩౬). దండ, భోగ, మండల, అసంహత, ప్రవర, దృఢక, అసహ్య, సంజయ, స్థూలకర్ణ విజయాదిపదాతియుద్ధ ప్రకారము లిప్పటి రక్షకభటుల్ల కవాతునందు, లాఠీచార్జీలందు నున్నవేమో విమర్శింపవలయును. (పు. ౧౧౬) మూలబలము, భృతబలము, శ్రేణులు, సంఘములు ననువాని కిప్పుడు వ్యవహారమేమో యెఱుంగ నగును. సర్వతోభద్రాదిస్థిరయంత్రములు, పాంచాలికాదిచరయంత్రములు, తాళచాపదారుశృంగాదికార్ముకములు, వేణునారాచాదిబాణములు, పరశుపట్టిసాది ధారాయంత్రములును నిప్పటి ప్రదర్శనశాలలం దగపడునేమో యరయవలయును. అభినవాంధ్రపండితుల కపరిచితములగు నిట్టివిషయము లింక నీగ్రంథమున ననేకము లున్నవి. కాని విస్తరభయమున నుదాహరింపఁబడలేదు. *

ఈచిన్నపొత్తమును రచించుటలో గ్రంథకర్తకుఁ బరమోద్దేశ్యము "ఒకప్పు డాంధ్రులీభరతఖండమునకెల్ల నేకచ్ఛత్రాధిపత్యము నెఱపి సార్వభౌమబిరుదమొందిరి" రని పాఠకుల కెఱిఁగించుటయే. ఆయభిప్రాయ మెట్లు నిర్వహింపఁబడినదో తూఁతముగాక! ఈగ్రంథమునఁ బాత్రములలో ముఖ్యమయినవి—౧. శ్రీముఖ సాతవాహనుఁడు, ౨. కనకవల్లి, 3. భట్టబాణుఁడు, ౪. ఆపస్తంబుఁడు, (వీ రాంధ్రులు) ౫. సుశర్మ, ౬. సుబుద్ధి, (వీరు మాగధులు) మిగిలినపాత్రము లంతముఖ్యమయినవి కావు. వీరిలో శ్రీముఖుఁడు కథానాయకుఁడు కనకవల్లి నాయిక. సుశర్మ ప్రతినాయకుఁడు. ఆకాలమున దేశమెల్లెడల బౌద్ధమతము విజృంభించి ప్రజలెల్లరును బౌద్ధమతమునకై ప్రాణములైన నర్పింప సంసిద్ధులైయుండిరి. మగధదేశాధీశ్వరుఁడు సుశర్మ బౌద్ధమతాభిమానియేకాక గొప్పబుద్ధిబలము, బాహుబలము గలవాఁడై భారతవర్షమునకెల్ల నేకచ్ఛత్రాధిపతిగా నుండెను. ఆంధ్రులకు బలముస్వల్పము. ఇరుగుపొరుగురాజులెల్లరును బౌద్ధులగుటచే వైదికులగు నాంధ్రులకు సాహ్యము చేయరైరి. కావున దైవగతి తప్పుటచే శ్రీముఖుఁడు శాత్రవులచేతికిఁ జిక్కిపోయినాఁడు. శత్రువశమందున్న శ్రీముఖునకు దారుణముగ నేనుఁగుకాలి త్రొక్కుడుచే మరణము సుశర్మచే నాజ్ఞప్తమైయుండెను. ఆసమయముననే శ్రీముఖుని బుద్ధివైభవమును, భట్టబాణాపస్తంబుల నీతివైభవమును బ్రకటింపఁబడుట యవసరము. అట్లే చక్కఁగఁ బ్రకటింపఁబడినవి. కారాగారముననున్న శ్రీముఖుఁ డుత్సాహాతిరేకమున శృంఖల లూడఁదీయుటయు, గవాక్షములఁ బెకలించి గంగానదిలో నుఱికి బాణాపస్తంబు లేర్పఱిచిన గుఱుతులఁ దెలిసి సంకేతమునఁ బ్రవేశించుటయేకాక మార్గమున కనకవల్లినిసైతము శత్రువశమునుండి తప్పించినాఁడు. భట్టబాణాపస్తంబులుగూడ రాజును విడిపింప నిశ్చయించి రాత్రివేళఁ దసుపరికరములతో రాజున్న కారాగారమునకు వచ్చి వెదకి రాజుచేసిన సాహసమును దెలిసి యానందించిరి వీరిప్రయత్నమువలననే గంగలో నుఱికిన శ్రీముఖుఁడు రహస్యస్థలమునఁ జేరఁగలిగెను. మొట్టమొదట భట్టబాణుఁడు రాయబారిగా వచ్చి సుశ

---

* ఇందలిపదము లనేకములకు నిఘంటువులం దర్థము కనఁబడలేదు. అర్థరహితములగు సంజ్ఞలవలనఁ బ్రయోజన మంతగాఁ గలుగదు. ఇట్టిపదముల వివరింపకుండుట నిఘంటువులకు గొప్పకొఱంత. దానిని శ్రీ సూర్యారాయాంధ్రనిఘంటువు తీర్చునని విశ్వసించెదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. వడ్లదంపుడు

ర్మను బాసుగా మోసపుచ్చి తననీతిచాతుర్యమును బ్రకటించినాఁడు. ఆపస్తంబుఁడు బౌద్ధపరివ్రాజకవేషమున మగధరాజధానియందే యుండి తనసమ్మోహినీ విద్యాప్రభావమువలన కపటలేఖలు సృష్టించి విజయమును సుసాధ్యము చేసినాఁడు. చంద్రగుప్తునకు చాణక్యుఁడును, భాగురాయణుఁడును, ఇందుశర్మయు నెట్లు సహాయులై విజయము నొందించిరో అట్లే శ్రీముఖునకు భట్టబాణుఁడును, ఆపస్తంబుఁడును, భాస్కరాచార్యుఁడును సహాయులైరి. శ్రీముఖునకు సహజముగా గొప్పనీతిచాతుర్యముగలదు. దానికిఁ దోడు భట్టబాణాదుల మంత్రోపాయములు కామధేనుప్రాయములై తోడ్పడి విజయము నొందించినవి. శ్రీముఖుని పరమతసహన మద్వితీయమైనది. ఆతఁడు దేశమెల్లెడల నూతనముగ బౌద్ధస్తూపములు నిర్మించియుఁ బురాతనమఠముల బాగుచేయించియు, బౌద్ధపరివ్రాజకుల కనేకసౌకర్యము లొనగూర్చియు వైదికమతమునకుఁ బ్రబలవిరోధులగు నాగులుమొదలగువారి మైత్రి నయాచితముగనే సంపాదించి యెల్లరచే మూర్ధాభిషిక్తుఁడు గావింపఁ బడినాఁడు. మహాయుద్ధమునకుముం దాతఁడు గావించినప్రకటనముచేఁ బ్రజలకెల్లరకును భూములు లభించి దేశమునుండి దారిద్ర్యము పలాయితమైనది. శ్రీముఖుని మనస్సు కరుణాపూర్ణమైనది. ఆతనికి బౌద్ధమతమన్నను, నహింసయన్నను నధికప్రియములు. నాగులలోఁ బూర్వమునుండివచ్చుచున్న నరమాంసాశనము నాతఁడుమృదూపదేశముననే రూపుమాపి వారలను నాగరకులఁ గావించినాఁడు. అయినను క్షత్రియోచితమగు యుద్ధమునందును, సురంగమున మందుపఱచి పదివేలమాగధుల నొక్కత్రుటిలో గతాసులఁ గావించుటయు ననివార్యము లయ్యెను.

ఈగ్రంథము పేరివలననే కనకవల్లి కథానాయిక యని తెల్లమగుచున్నది. ఆమె మిగుల విద్యావతి. చిన్నతనమున నాయుధపరిశ్రమము మిక్కిలి గావించినది. మిక్కిలి ధైర్యశాలిని; ఉపాయజ్ఞురాలు. శ్రీముఖుని గుణగణము లాలించి యాతనియెడ ననురక్తయై యున్నది. తండ్రిని సర్పదష్టుని గావించి తన్ను చెఱఁబెట్టిన సుశర్మను వంచించి చెఱవిడివచ్చుటయు, శ్రీముఖునియంతటివాఁడు శత్రువులకుఁ జిక్కిపోఁగా నాతనివిడిపించుటకుఁ దాను యత్నించుటయుఁ, గపటమైత్రేయుఁడు విమానముతోఁ గొనిపోవుచున్నపుడు విమానము దగ్ధముగావించుటయు, యోధుల మడియించుటయు నెవ్వరికైన నాశ్చర్యముఁ గలిగింపకపోవు. పదంపడి యుద్ధమునందు శత్రుసైన్యము లపారముగాఁ జుట్టుకొనుట చూచి శ్రీముఖునంతవాఁ డించుక యధైర్యమొందినతఱి నాతనికి ధైర్యము పురికొల్పి శత్రువులఁ దునుమాడిన యామెపరాక్రమము నరకునితోఁ బోరిన సత్యభామపరాక్రమముకంటె మిన్నయై వన్నెకెక్కినది. రుద్రమదేవివంటి వీరవనితారత్నములంగన్న యాంధ్రజాతికిఁ గనకవల్లి తిలకాయమానయై యొప్పుటలో నాశ్చర్యమేమికలదు?

ప్రతినాయకుఁడగు సుశర్మవిషయ మించుక తడవిచూతము. ఈతఁడును శ్రీముఖునకు నెల్లవిధములఁ దగువీరుఁడే. రాజనీతి చక్కఁగ నెఱింగినవాఁడు. రాజ్యపాలమునందు బహుసమర్థుఁడు; బహుబలాఢ్యుఁడు. భారతరాజ్యలక్ష్మి కేకాలంబనమై యున్నవాఁడు. అతనిసైన్యము లపారములు. దేశమందలి రాజులెల్లరు నాతనియం దనురక్తులై కనుసన్నల మెలంగుచు నాతనికై ప్రాణము లర్పింప సిద్ధముగ నున్నారు. అయినను నాతనికిఁ బరాజయమును, దుర్మరణమును సంభవించినవి. సుశర్మకు మతాభినివేశము మెండు. శాంతముగ జనుల మనములు కరఁగునట్లు బోధించి చేయవలసిన మతప్రచార మాతఁడు గర్వోద్రేకమున బాహుబలముచేఁ జేయ విజృంభించినాఁడు. మతాంతరులనెల్ల నాతఁడు చంపివేయుటకే నిశ్చయించెను. ఆతనిధాటకు నెదురుతిరిగిన దొక్కయాంధ్రరాజ్యము మాత్రమే. మిగిలినరాజ్యము లన్నియు నయముననో, భయముననో వశపడిపోయినవి. అంతటిమతాభినివేశమువలననే యాతనికి నాశము సంభవించిన దనవచ్చును. మఱియు మతోన్మాదముకంటెను నాతనికిఁ బరస్త్రీవాంఛ వేయిమడుంగు లధికముగా నున్నట్లు తోఁచును. ఎన్ని దేశముల జయించినను, నెం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దఱురాజాధిరాజుల జయించినను దనయింద్రియముల జయించి వశమందుంచుకొననివాఁ డవశ్యము నశించు నని సుశర్మప్రవర్తనమువలనఁ జక్కఁగఁ దెలియుచున్నది. ఈతఁడు కనకవల్లిని బలాత్కారమునఁ బరిణయమాడఁ దలంపకున్నచో నాసు లీతనిని విడచి యాంధ్రులకు మ్రొక్కుడివారు కారు. మఱియు బౌద్ధమతప్రచారకులలో ముఖ్యుఁడగు సిద్ధనాగార్జునునివంటివాఁడు వైదికమతస్థులకు సహాయుఁడగుటయు సంభవించియుండదు. మఱియు సుశర్మకడ నొక్కదుర్గుణము ప్రబలముగా నగుపడుచున్నది. పరులు చేయు మాయోపాయముల నెఱుఁగుశక్తి వానికి లేదు. తనసైన్యమునందు, దేశము నందు, రాజధానియందు, తనయాస్థానాంతఃపురములందు సైతము వ్యాపించియున్న శత్రుపురుషుల నీతఁడు కనుగొననేలేకపోయినాఁడు. మంచిమాటలకును, స్తోత్రములకును గడుసులభముగ లొంగిపోవువాఁడు. కావుననే యాతని కంతవేగముగఁ బరాభవము కలిగినది. పాపపుణ్యములను, స్వర్గనరకములను లెక్కింపని మూర్ఖుఁడగుటచే నాతఁడు కలఁగని, నరకయాతన లనుభవించుచున్నవారిని స్వప్నమునఁ జూచి భయభ్రాంతుఁడై గుండెవ్రీలి పరలోకమున కేఁగినాఁడు. సుశర్మవంటి వీరాధివీరుఁడు సమరతలమున శ్రీముఖునిచేతఁ గాకున్నఁ గనకవల్లి చేతనైనఁ బ్రాణములు విడుచుట కొంత బాగుగ నుండునుగాని మతోన్మాదముచే దండకారణ్యమెల్లఁ బీనుగుపెంటతో నింపిన కఱకుమోఱకు బరదారాభిమర్శకుఁడు నగువానికిఁ దా నొనర్చిన పాపములకుఁ బరలోకమున ననుభవింపవలసిన యాతనలఁ దెలిసికొని భయమునఁ గుండెపగిలి చచ్చుటయే యుక్తముగా నున్నది. ఈతనిమంత్రి దండనాథాదులుగూడ నీతిచతురులే యైనను కేవలము బలగర్వితులై నశించి రనుట నిక్కము. శత్రువులు పన్నెడి మాయాతంత్రముల కొక్కఁడైన ప్రతిక్రియఁ గావింపఁజాలకపోయిరి. ఇట్టి జడులగు మంత్రులవలన రాజ్యమునకు నాశము సంభవించుటలో వింత యేముండును?

మొత్తముమీఁద నిండలిపాత్రములన్నియు స్వస్వవ్యాపారానుకూలముగను, మిగుల నుచితముగను పోషింపఁబడినవి. అనర్థకములగుపాత్రము లీకథయందు లేనే లేవని చెప్పవచ్చును. కథారంభమున భాస్కరాచార్యుని భాష్యాధ్యయనము, జ్యోతిశ్శాస్త్రము తొలుదొల్త నాంధ్రులచేతనే కనిపెట్టఁబడినవని తెలుపుటకు నుపయోగించినది. అట్లే సిద్ధనాగార్జునుని ప్రస్తావము కథ కంతగా నుపకరింపకున్నను నాతఁ డాంధ్రుఁ డేయనియు, నాంధ్రులు సమస్తశాస్త్రములందును ప్రసిద్ధులైనట్లు బౌద్ధమతమందుఁగూడ గొప్పగ్రంథములు రచించియుండిరనియుఁ, బూర్వకాలమున నోషధీమహిమముచే సువర్ణము తయారుచేసెడివారనియుఁ దెలుపుట కిందు వర్ణింపఁబడినది. ఆంధ్రజాతీయతాభిమానమున నీతఁడు మహాశైలము నొకదాని నోషధీప్రభావమునఁ గనకశైలముగా మార్చి యుద్ధమున నాణెములు తయారుచేయించుట కొసంగినాఁడు. రసవాదతంత్రములలో సిద్ధనాగార్జునతంత్ర మొకటి ప్రఖ్యాతమైనది కలదని చెప్పుదురు.

ఈనవల చరిత్రాత్మకమయినది కదా! ఈకథాకాల మేది యని పాఠకులకు జిజ్ఞాస కలుగుట సహజము. అయినను నీగ్రంథమందు కథాకాలము దెల్పు నాధారము లేవియును లేవు. ఒక్కకాలమున జరిగిన కథను దెల్పుటయు కవి కభిమతమైయుండదు. పూర్వకాలమున నుండిన యాంధ్రమహాపురుషుల ప్రతిభాతిశయములనుఁ మతసంప్రదాయములను, విద్యావిధానములను ప్రాచీనాంధ్రవనితల విద్యావివేకసాహసౌదార్యాదులును వర్ణించుటయే కవి కిష్టములుగాని కాలమును దెల్పుట కాదు. ఎక్కడిశాతవాహనులు? ఎక్కడి యాపస్తంబుఁడు? ఎక్కడివిశ్వామిత్రకశ్యపాదిమునులు? ఎక్కడిభట్టబాణుఁడు? ఎక్కడినాగార్జునసిద్ధుఁడు? ఎక్కడిఋశ్యశృంగుఁడు? ఎక్కడివిమానములు? ఎక్కడిబాంబులు? ఇవియన్నియు, వీరందఱు నేకకాలమున నుండుట సంభవించునా? కథ కేవలము కల్పితము. పాత్రముల నామములు కల్పించుటకంటె సుప్రసిద్ధులై యాంధ్రులైయున్నవారి నామములే యుపయోగించినఁ బాఠకుల కానందము గలుగునని యోచించియే కవి యిట్లు వ్యవహరించినాఁడు. ఇది గ్రంథసందర్భమున [illegible]కాని దోషము కానేరదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లు విమర్శించిచూడ నీగ్రంథ మెల్లవిధముల నుత్తమముగా నున్నదనియు, దీనిని జక్కఁగాఁ జదివిన యాంధ్రబాలురకు వినయవివేకాదిసద్గుణములును, సాహసౌదార్యములును, బూర్వపురుషచరిత్రపరిజ్ఞానమున నమితాహ్లాదమును లభింపఁగలవని మనవిచేయుచున్నాఁడను. ఇట్టియుత్తేజకములగు గ్రంథము లాంధ్రభాషయం దనేకములు బయలువెడలి యాంధ్రజాతికిఁ దొంటి యౌన్నత్యము నాపాదించుంగాక.

---



నీ డ లు

—సూర్యా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(దృశ్యము)

౧

పైవాడు:

ఇది నేను కొత్తగా కనిపెట్టిందా? ఇప్పటికి జీర్ణావస్థకు రావాలిసిందే; కాని యింకా నవనవలాడుతూవుంది; ఎన్నోసార్లు కిందపడి కూడా మళ్లీ లేస్తుంటుంది: ఈసారి చూడండి! మీాముందే పాడిస్తా: ఒక్కసారి 'కీ' యిచ్చానంటే గిజ్జుగిజ్జున పనిచేస్తుంది; మనోహరంగా పాడుతుంది; వినండి బాబూ!

తారాకళంకితగగనబింబో
ద్ధతి హసించు మెఱుంగులో
వీరాధివీరదిగంతమండల
విభుడు సైచు వెలుంగులో
ఏమో నిరంతరసౌఖ్యముద్రిక
లేకనుంగొనువారలే
తామే యిహైచ్ఛిక భోగవిద్యా
దాతలైయున్నారులే!

ఇదీ, నీకన్నా అర్థంవైందా అని నిలవదీసి అసుగుతా లేమో: మొదటమొదట కాలా—

(పోతాడు.)

*  *  *  *

[ రోగిగది; 'బాబు' రోగి; పక్కన నాన్న బిక్కమొగంతో కూచున్నాడు. ]

బాబు:

నాన్నా!

నాన్న:

బాబు?

బాబు:

ఉడకపోస్తుంది నాన్నా!

నాన్న:

నాతండ్రి! రెండునిమిషాలు పడుకో... బిస్కట్లు తినమ్మా!

బాబు:

నాన్నా! ఆరుబైట చల్లగా గాలికొడుతుంది కాదూ?

నాన్న:

లేదు.

బాబు:

అబ్బే! నువ్వుగూడా యిక్కడే కూచోని పూరికే లేదంటావేం? బైటికెళ్లి చూడూ!

నాన్న:

ఒక్కనిమిషం —

బాబు:

తరవాత?

నాన్న:

డాక్టరొస్తాడు. రాంగానే అడిగి, అవతలికి పోదాం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాబు :

ఆయ న్నడగండే వెళ్లగూడదూ ?

నాన్న :

ఆమందు తింటున్నప్పుడు, ఆయన చెప్పి నట్టల్లా చెయ్యాలి బాబూ !

బాబు :

అట్టయితే యిహనించీ ఆమందేవీ వొద్దు —

నాన్న :

జబ్బు నయం గావొద్దమ్మా !

బాబు :

కాకపోతే యేం ?

నాన్న :

... ... ...

బాబు :

ఏం, నాన్నా ?

నాన్న :

మాట్టాడకుండా పడుకో.

బాబు :

చెప్పు నాన్నా ! ఆమందు వొద్దు నాన్నా !

నాన్న :

ఏడిశావ్ —

బాబు :

వొద్దునాన్నా ; రోగఁవే కావాలి నాన్నా !—ఆమందుకంటే రోగఁవే బాగుంది నాన్నా !

౨

పైవాడు :

మళ్లీ వొచ్చా. నా ' మఱ ' కొన్నాళ్లు తుప్పపట్టింది. అట్టాగే వుంచితే మఱీ పాడవుతుందని ' తాతాకంపెనీ 'వాళ్లు చెప్పారు. అందుకనే మళ్లీ పరిశ్రమ ప్రారంభించాను—పాడమని చెబుతాను ; బారుగా కూచోని వినండి !

లోకసమ్మోహనవి
లోచనవిరోధగణ
లోలమత్స్యప్రభా
లోచితవిధానగతి
లో, తల్లక్రిందులై,
　　లోక మిచ్చిన ప్రేమ
లో తల్లిదండ్రులై,
　　రోగమిచ్చిన మందు
లో పిల్లికండలై
　　లోగొన్న ప్రకృతినా
　　లుగునాలుకలు గొన్న
　　దిగులెఱుంగని బిడ్డ
　　దేశమిది, తేజమిది !

చాలు. నే మళ్లీ వొచ్చిందాకా వొక్కరూ కదలగూడదు, బాగుండకపోయినా సరే. (పోతాడు.)

* * *

[అదేగది. దాసి, కోటి వొస్తుంది.]

కోటి :

బాబుగారు !... వొస్తున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాన్న :

రానీ—ఎవరు ?

కోటి:

డాక్టరువారు.

బాబు :

లే. నాన్నా ! లే. పోదాం, లే !...

నాన్న :

ఆగరా ! లోపలికి రానీ—నిమిషం.

బాబు :

మనంలేచి, ఆయన కెదురుగా బోతే, అరనిమిషమే అవుతుందిగా ! తొందరగా బోవొచ్చుగా ?

నాన్న :

ఎక్కడికిరా ?

బాబు :

అవతలికి—

నాన్న :

చంపుతున్నావే!— కోటీ ! ఆ మంచం పంచలోకి బట్టు.

కోటి :

చలిగాలి కొడుతుందండీ.

బాబు :

నాకు చల్లగాలి కావాలి.

కోటి :

నేను విసిరేదీ ?

బాబు :

పోయిగాదు విసరటానికి—

నాన్న :

నీ వొళ్లుగూడా పోయిలాగే మండుతుంది.

కోటి :

దిక్కుమాలిన జరం — దొరవా రొచ్చారు.

వైద్యుడు :

దిక్కుమాలిన జరం !!? పొద్దూకులూ రోగాల్నీ, వైద్యుల్నీ తిడుతూ కూచుంటారు ? వొళ్లూ పై తెలీకుండా తెచ్చుకున్నే దీనీ—ఇందుకనేగదూ అన్నారు “ అడుకులు తిన్నటులున్నే, కడుపున కుట్టెత్తినపుడు ? ” అని పెద్దలు ?

నాన్న :

పెద్దలరోగాలైతే బాగానే వుండేదండీ ! వీడు పసిబిడ్డామె !—ఆ మొండిరోగం నాకు రాగూడదూ ?

వైద్యుడు :

మొన్న చలపతికి దొరికిన వెయ్యి రూపాయిల కేసూ నాకు దొరగ్గూడదూ ?

బాబు :

ఆ చెట్లకు గొట్టే చల్లగాలంతా నాకు కొట్టగూడదూ ?—ఉడికిపోతుంది నాన్నా !

నాన్న :

డాక్టరుగారు ! అబ్బాయిపక్క ఆవరాం డాలో—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైద్యుడు :

అమ్మమ్మమ్మ! ఆవాసనే పనికిరాదండీ! చలిగాలి తగల్టఁవే? — శాస్త్రాల్లో యేం జెప్పారో విన్నారా—

నాన్న :

అదిసరేగాని,అబ్బాయివొళ్లు చూడండీ!

వైద్యుడు :

వొంటికేఁవండీ, కాకపోతే అంతరుష్ణం కాస్త వుంది. మూడుమాత్రలతో పోదండీ?— పైకి వొళ్లు చల్లగానే వుంటుంది: అసలు, 'మాంద్యూకశ్చ విశేషలావుకగతః పైత్యం జ్వరం వర్తతే' అని సిద్ధాంతఁవామె! అదీగాక—

నాన్న :

నాడి కొంచెం చూడండి—

వైద్యుడు :

నాడికేఁవండీ? భేషుగ్గా వుంది. అయితే, కాస్త కణతలూ అవ్వీ అదురుతూవుంటై. ధన్వంతరివైద్యశాస్త్రంలో—

బాబు :

మీశాస్త్రాల్లో గాలి వుంటుందండీ?

నాన్న :

ఛా, గాడిదా! వూరుకో—

వైద్యుడు :

అడగనీయండీ! పసిబిడ్డని కాస్త మాట్టాణ్ణియ్యాలి. బెంగపడకుండా కులాసాగా కబుర్లుచెప్పాలి—

బాబు :

వొట్టికబు ర్లెందుకండీ? నాక్కావాలిసిన మందు నాకు తెలుసు. గాలి కావాలి, తెప్పించండి!

వైద్యుడు :

అక్కర్లేదు నాయనా!

బాబు :

మీశాస్త్రాల్లో అది వుండదండీ?

వైద్యుడు :

వుండదు, బాబూ!

బాబు!

అది పుస్తకం కాదండీ?

వైద్యుడు :

పుస్తకాల్లో వుండేది గాలికాదు; కలంతో రాసిన అక్షరాలు.

బాబు :

అబద్ధం! ఈపుస్తకం చూడండీ! పేద్ద పొస్తకం! ఇలా కిటికీలోంచి చూడండీ. ఎవ్రరాశారోకాని, దాన్నిండా యెక్కడ చూసినా గాలేనండీ! నాకు దాంటోమందులు గాఁవాలండీ. మీవన్నీ, చిన్నచిన్న —

నాన్న :

అమ్మయ్యో! — ఇదేఁవిటండీ, యిలా మాట్టాడుతాడు నాబిడ్డ?

వైద్యుడు :

భయంలేదు. పైత్యపుజ్వరమని చెప్పలేదండీ? షూడుపూటల్లో తియ్యదూ! కుక్కుటార్కప్రకాశికలో—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాన్న :

గుళ్లప్రకాశిక !— ఈపూట మందు తెచ్చారా ?

వైద్యుడు :

తేనూ మఱి ? మందుమాత్రం ఒహ పూటన్నా నాగా పడగూడదు సుమండీ !— పత్స్యం సరీగా జరుపుతున్నా రా ?

నాన్న :

వెన్నబిస్కట్లు తప్ప మఱేమీ—

వైద్యుడు :

పాలుగూడా యిస్తున్నా రా ? ఆవుపాలు యియ్యొచ్చు.

నాన్న :

మఱీ వేడిగదండీ ?

వైద్యుడు :

అబ్బే ! 'ఉష్ణం ఉష్ణేనశీతలం' అన్నారు గదండీ మఱి ?

బాబు :

అవన్నీ మీపుస్తకాలేనాండీ ?

వైద్యుడు :

బాబో ! మీఅబ్బాయికి చదువు బాగా వొస్తుందండీ !

నాన్న :

బతికి బయట బడనీండి—

వైద్యుడు :

నీకు చదువుకోటానికి పెద్దపెద్ద పుస్తకాలు కొనిపెడతాంలే. నాయనా ! మాట్టా డకుండాపడుకో.—ఇదుగో ! ఈగదిమాత్రం కదలనియ్యొద్దుసుమండీ !

బాబు :

మీపుస్తకాలు బంగారంగాను, నే నాపేద్దపుస్తకంలోకి పోయి చదువుకుంటా నండీ : అందులోవుండే ఆకులూ, పూలూ, తీగెలూ, కాయలూ అన్నీ దిద్దుకుంటానండీ. ఆకిచకిచలూ, గలగలలూ, ఝుంకారాలూ, క్రేంకారాలూ అన్నీ పాడుకుంటానండీ !— ఆగద్దలూ, కాకులూ, కోతులూ, గోరంకులూ, అన్నిటిదగ్గరా డ్రిల్లునేర్చుకుంటా నండీ ! — వొదిలిపెట్టండీ — ఇంకా యీ గదేనా ? వొదిలి—

నాన్న :

ఓరి దేవుడా ! సంధిగాదుగదా కొంప ముంచి ?

వైద్యుడు :

మీ రేం భయపడకండి, ఆకుట్టాడితో యేంవి ?

3

పైవాడు :

నిశ్శబ్దంగా కూచోవాలి. అసలే 'హాలు' చిన్నది. నానాలుకకూడా చిన్నదే. అంతేనా ? నామఱకు పెట్టిన గొంతు కూడా చిన్నదే ! — అయిపో వొచ్చింది ; చిత్తగించండి !...

ఈశ్వరాజ్ఞాబద్ధ మీనాటియాట.
ఐశ్వర్యముగాదు లైనారన్న మాట !

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీనాటిపాటిరా
నేరాద టిపీట!
పోనీ, మఱింత యీ
రాటపడనేల ? నీ
వైనపాటలు మానుటది యెంతలోమాట?

చూడండి : శ్రుతి చెడిపోయింది ; బాగు జేయటం నాచేతిలో లేనట్టుంది ; చూస్తా —
(పోతాడు.)

*    *    *    *

[నాన్న లేడు ; కోటి లొంగిపోతుంది.]

కోటి :
నేను విసిరేది బాబూ ?

బాబు :
నీకంటే నల్లహోవుండే కాకులన్నీ పైన పైన పరిగెత్తుతూ, ఱెక్కలతో టకటకా నాకు విసురుతై. ఆరుబైటికి పోదాం పద.

కోటి :
నాన్న వొస్తాడయ్యా!

బాబు :
వొచ్చేలోపలే పోదాం.

కోటి :
తరవాత మళ్లీ రావాలి.

బాబు :
రాలేం.

*    *    *    *

నాన్న :
నయమవుతుందంటారా ?

డాక్టరు :
ఇదెంతసేపండీ ? ఇటువంటికేసులు లక్ష చూశాం. అబ్బే! — చిటికెలో! కాస్త తెల్లవారిందాకా అవస్థ. హాయిగా నిద్రపోనీండి.

నాన్న :
బాబూ!

డాక్టరు :
పిలవకండి.

నాన్న :
నాయనా!

డాక్టరు :
ఇవతలికి రాండి.

నాన్న :
చిట్టీ!

డాక్టరు :
మిమ్మన్నే —

నాన్న :
పలకడేవండీ ?

డాక్టరు :
నిద్ర—

నాన్న :
నాతండ్రీ! ... ... ...

*    *    *

పైవాడు :
మఱ విరిగిపోయింది. పాటలు వినీ వినీ మీ 'చెవులు చీములు' కట్టలేదూ ? అవి పూడేట్టు ఒక్కసారి నవ్వి పూరుకుంటాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏకశయింటివాఁడో సృజి
యించిన యంత్రవిధానశక్తి మం
దీకృతమయ్యె, నిత్యజగ
తీవలయాధిపమూర్తి యిందు బం
దీకృతుఁడైనవాఁడు నిజ
దేశగతుం డయిపోయినాఁడు; ఉ
ద్రేకుల కింక దీన బని
లేదని చెప్పెద, పోయివచ్చెదన్.

---



ఒరిగిన శిఖరము

—సూర్య.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




కొల్లూరు ధర్మారాయకవి, బి. ఏ.,

( ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు )

౧

"జ్యోతి" జగజ్జ్యోతి. ఆమె నెరుగని వారు లేరు. "ద్వారక" చ్ఛాయానాటకసమితి కామె పంచప్రాణములును. శాంతచిత్తమువలె కంగులుదీరిన యవనికపై నామె యవతరింపని రాత్రి యేనగరమునను లేదు. ఆ కనుబొమల వంపునకు కళాప్రపంచమెల్ల జోహారు. చెవులకమ్మల నరగప్పి విడబారు నావేణీభరము సన్యాసిమనసునకైనను సంకెల. ఆమె యడుగువెట్టినచోట ప్రతిరేణువు నొక యహల్య. కాలవాహిని ఛేదింపజాలని సుడిగుండ మామెప్రాయము. ఇరువదిమూడు దాటినదనిన జగమెవ్వరును నమ్మరు. ఆమె యభూతసృష్టి.

పతిభిక్షకై యముని వెంటాడినప్పటి దీక్షాదృష్టియు, పతిరక్షకై కణ్వాశ్రమము వీడినప్పటి యశ్రువృష్టియు నా కాటుకకన్నులకు నేర్వని విద్య. స్వయంవర సభామధ్యమున నరవాంచినమోముతో, చేటికకై దండగొని, నేల పులకించునట్లామె నడచినప్పుడు మహాకవి తన "దీపశిఖా"శ్లోకమును ద్వితీయముద్రణమున సవరింపగోరును. హృదయేశ్వరుని నీలిపెదవులనుండి మధుమృత్యువు చూరగొనినప్పటి యామెయలౌకికప్రేమతేజము నెదుట నాంగ్లకవిశిఖామణి తన పదసారళ్యమునకు రవంత పదనుపెట్టగోరును.

రంగసీమవెలుపల నామెపేరు జ్యోతిర్మయి; తెరపైమాత్రము హ్రస్వముగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"జ్యోతి." కళాజీవితమే యామెకు ప్రకృతి సిద్ధమైనది. నిజజీవితమం దామె చేతకాని నట్టువశాలు. జగన్నటనావిమర్శకసారీణ మగు సంఘమునందు జ్యోతిర్మయిస్థాన మెట్టిదో యెవరికిని తెలియదు. అది తెలియగోరుట, తాజమహాలుసున్న మెట్టిదో త్రవ్విచూచుట.

౨

ఆనాడు జ్యోతి మొగలాయిరాజ కుమారుని ప్రాణప్రియ, అనార్కాళి. పశ్చిమ ఖండములలో పండబారివచ్చిన గురుచరణ దాస్, బి. ఏ., అందులకు కళాధ్యాపకుడు (Art Director). గురుచరణుడు నటుడేకాక కవియును. ఛాయానాటకకళ ప్రత్యేకవిూగ కృషిసల్పి ఖండాంతరముల వాసిగన్నవాడు. అతని యాజమాన్యమున జ్యోతి యనార్కాళి యగుట, జాతిరతనమును సానపెట్టుట. ఓడ దిగుటతోడనే గురుచరణునకు బొంబాయి నగర మిచ్చిన ప్రథమసమ్మాన మిది.

3

"జ్యోతీ! అరవాల్పు రెప్పలనుండి దృష్టు లేటవాలుగ నాయకుని పాదములపై ప్రసరింపజేయుము. ఇదిగో, ఇట్లు."

Shooting నిమిత్తమై వెలువడనక్కర లేని రంగ మది. ఢిల్లీశ్వరుని శిక్షకై స్టూడియోలో, తలయొగ్గి నిలిచిన జ్యోతి, గురుచరణుని శిక్షణప్రాయమగు చూపువంక చూడ్కి సారించెను. అసదృశమగు నామె చకితదృగంచలముల సమ్మోహనకళను దిద్ది తీర్పబోయిన గురుచరణు డాచూపువెల్లువకు విముగ్ధు డయ్యెను.

"రాత్రిలో రాయిమై నశింపనున్న ప్రేమకు బహిర్దృష్టి భావ్య మెట్లగును?"

ప్రకృతి నటిప్రశ్నమునకు నాట్యవిద్యా గురుని మౌనమే ప్రత్యుత్తరము.

౪

ఆక్షణమునుండి జ్యోతి గురుచరణున కవిముక్తమగు సమస్య. తన ఛాయానటన కళానుభవమున కనూహ్యమగు దృశ్యము (Pose) ప్రదర్శించినది జ్యోతి. విప్పారిన ఱెక్కలతో గగనవీథిని స్తంభించు గరుడుని వలె, గురుచరణుని హృదయ మాచిత్తరువున నిలుకడగాంచెను.

"జ్యోతీ!"

"గురోజీ! నాపేరుపెట్టి పిలవాలి."

"ఔనూ."

"కాదు. అనార్కాళిని నేను."

"ఇప్పటికి. రేపు చంద్రమతివి; నిన్నను సావిత్రివి; అసలేమో జ్యోతివే కదూ?"

"పొరపాటు. నే నెన్నడును జ్యోతిని కాను. ఎప్పుడును నటినే!"

ఖండాంతరముల వెదకిన కళోపాసన రహస్య మీనాటికి గురుచరణున కర్థమైనది.

"సరే.—నటీ!"

"ఇదే, వచ్చితిని. ఆర్యపుత్రు డేడీ?"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ చిరునగవుచిందులాడుచున్న మొగము, సంకోచముగాని కృత్రిమమగు క్రీడగాని లేక కత్తెరతాకని యడవిమల్లెపొదవలె, స్వచ్ఛందముగ వెన్నెల విరిసినది.

*    *    *

లోకమెల్ల మైమరచిన నడిరేయి. ఎదిరి హృదయస్పందనముసైతము విననిచ్చు నిశ్శబ్దము. జగత్కల్యాణుడుమాత్రము పరోక్షత నటించుచు కోటికన్నులతో పరికించుచుండెను.

"నా-జీవితరథ్యకు జ్యోతిని ప్రసాదించిన విధికి కృతజ్ఞుడను."

"గురుచరణదాసిని."

*    *    *

౫

"నాసిక"కు ముప్పదిమైళ్లదూరమున కాననరంగము. విలాసినుల విహారణమున కనువై, తెరనుండి కనుమెదల్పనీయని శృంగారప్రకృతియని తోచి, నటకసమితి యచట విడిసిరి.

నాడు జ్యోతి సూర్యాస్తమయమువరకు తన గుడారము వెలువడలేదు. మబ్బుల రక్తిమ మెండుటాకులను చిగుళ్లుగా భ్రమింప జేయువేళకు, సింగారింపు (Toilet) ముగించి "అనార్కాళి" బయల్వెడలెను. గురుచరణ పారితోషికమగు లినెనుక్లాస్పు (Linen-clasp)ను దారిపొడవున సరిపెట్టుకొనుచు, తనివిసనక, యతని గుడారమును చేరి సరభసముగా అతని ఈజీచైరు (Easy chair) లో కూర్చుండెను.

జ్యో—ఆర్టు డైరక్టరుగారూ, ఈక్లాస్పు ఇలాగుంటే అందంగా వుందా?

గు—క్లాస్పు నావద్ద నున్నప్పటికంటె యిప్పుడే వెయ్యిరెట్లు అందంగావుంది.

జ్యో—అదుగో! కవిత్వం విడిచి మాట్లాడండి.

గు—కవిత్వంకాదు; నటన మొదలే కాదు. నిజం చెప్పేను.

జ్యో—అదేమో! మీ కళాపరిశీలనంలో నాకు నమ్మకం పోతూంది. దిద్దుబాట్లు చెప్పడం బొత్తిగా మానుకున్నారు. ప్రేక్షకలోకమే నిర్ణయించాలి బాగోగులు.

గు—అయితే అనార్కాళివి క్లాస్పు పెట్టుకొంటే హర్షిస్తారా?

జ్యో—బాగుందని యిప్పుడు మెచ్చి తిరిగి ఆక్షేపణా?

గు—అవును. జ్యోతికేగాని అనార్కాళికి కాదు.

జ్యో—మీ మెదుట నే నెప్పుడును జ్యోతినే!

గురుచరణుడు నిట్టూర్పు పుచ్చెను. అతని మొగము వెల్వెలబోయెను.

*    *    *    *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాననరంగమున కనార్కాళి ప్రాప్తము కాలేదు. ఛాయాగ్రాహకుడును జ్యోతి పరిసరమున గ్రమ్మిన మైహికచ్ఛాయ కచ్చెరువుపడి, కారణ మెరుగక యీభాగము మరియొకతూరి తీసిన బాగుండునని శంకిం చెను. ఎన్నిసారులు ప్రయత్నించినను అనార్కాళిమాత్ర మదృశ్య మయ్యెను.

౬

గురుచరణుని జీవితగర్వము శిథిలమైనది. తన ప్రథమకళాసృష్టిలోని ప్రధానపాత్ర మమృత మందజూపి తుదకు విఫలహాట యతనికి నగుబాటుగా తోచెను. వెంటనే కార్యాంతరమున కలకత్తాకు పోవలెనని సమితిప్రభునితో సాకుజెప్పి, యారాత్రియే తిరోహితు డయ్యెను.

పెంపుడుకత్తెను జూచిన పంజరస్థకీరము వలె, పల్లవితమగు హృదయముతో నిద్ర మేల్కాంచిన జ్యోతికి, నిలువుటద్దముచెంత లేఖ యొకటి తారసిల్లెను.

"జ్యోతీ!

నా ఐహికప్రేమచే నీకు జ్యోతిత్వ మాపాదించి, కళాస్వరూపమును నాశన మొనర్చిన పాతకుడను. నన్ను మరచిపొమ్ము.

క్షమింపుము.

గురుచరణుడు."

* * * *

నేడు పూనాయందలి చిత్రభ్రమణచికిత్సాలయమున, మాటిమాటికి లేని లినెను క్లాస్సును సవరించుకొనుచు దిరుగాడు వెడగు వ్యక్తి నానవాలుపట్టువా రెవరు?

* * * *

---

## ఆశా సాఫల్యము

కీ. శే. కొడాలి వెంకటసుబ్బరావు, బి. ఏ.,

కనికరించెను స్వామి; మోక్షమ్మొసంగు
చుండె భక్తులకెల్ల రా రండు లెండు
కోరికలు తీరిపోవు నన్నారు నిద్ర
కలగిపోయిన స్వప్న వైకల్యమందు.
పాత్రుడనో నేను స్వామి కిప్పటికినైన
నాపయి ననుగ్రహము పుట్టునా యటంచు
కలువరింతలలోన శంకావిపాట్య
మాన చేతస్కుడను మూసినాను కనులు.
మోక్షమార్గాలలోన మున్ముందు నీవె
వచ్చినావోయి స్వామికన్నదియు గగన
వాణి—కన్నులు తెరుచులోపలనె నేను
చిన్మయుడ నీపద మ్మధిష్ఠించినాను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆర్యమతము

శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు

పూర్వకాలమునందు హిమాచలము మొదలు వింధ్యాచలమువఱకు వ్యాపించిన భూభాగమునకు నార్యావర్త మని పేరు. ఆభాగమునందు వర్తించుచుండిన జనులార్యులు. వారిమతమునుగూర్చి యీవ్యాసమునఁ జెప్పఁబడుటవలన దీనికి "ఆర్యమత" మనుపే రిడఁబడెను.

మతమనఁగా నభిప్రాయము లేక సమ్మతి. మత మనునది యస్థిరసంజ్ఞ; అనఁగా మార్పుఁజెందుటకు వలనుపడునది. కనుక దాని నార్యులు వ్యవహరింపక "ధర్మ" మని వాడుచుండిరి. ధర్మమనఁగా శ్రుతిస్మృత్యుక్తవిధి. అది మార్పుఁజెందుటకుఁగాని మార్పఁబడుటకుఁగాని వలనుపడనిది. అది కులానుసారముగా బ్రాహ్మణధర్మము, క్షత్త్రియధర్మము, వైశ్యధర్మము, శూద్రధర్మమనియు నాశ్రమానుసారముగా బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసమనియును వాడఁబడుచుండెను. వాని నిట వివరించినచో, నీవ్యాసకళేబరము వృద్ధినొందు నను శంకవలన నట్లొనర్పనైతిని. ఆర్యులకుఁ దత్తద్విధులందు శ్రద్ధ క్రమశః తగ్గినతరువాతనే మతమనుపదము ధర్మమనుపదము యొక్క స్థానము నాక్రమించెను. ధర్మపరాయణులయిన యార్యుల జాతీయతకును ధర్మమునకు లేక మతమునకును భేదము లేదు. వారికి మతమే జాతీయత. కనుకనే వారికెన్ని యిడుములు వాటిల్లిన నెన్నిమతములతోడను సభ్యతలతోడను సంపర్కము గలిగినను వారి జాతీయత మాఱకున్నది. ఇతరదేశజుల జాతీయతలకును మతములకును బ్రభేదము లుండును.

కొంతకాల మయినపిమ్మట భారతదేశమునందు దేశకాలభేదములనుబట్టి వివిధస్మృతు లుద్భవించెను. ఇప్పుడు దాస్యము కొఱకు బ్రాహ్మణాబ్రాహ్మణులకు వైరము గలిగినట్లే యప్పుడు ముక్తికొఱకు బ్రాహ్మణాబ్రాహ్మణులకు వైరము గలిగెను. సన్యసించినంగాని ముక్తి లభింపదనియు బ్రాహ్మణేతరులు సన్యసింపరాదనియు నియమ మేర్పడెను. అంత క్షత్రియకులమునందు బుద్ధదేవుఁడు ప్రభవించి పురుషులుమాత్రమేకాక, స్త్రీలుసైతము సన్యసింపవచ్చుననియు పవిత్రచరితము గల జనులందఱకును నిర్వాణము లభించుననియును బ్రకటించుచు శ్రౌతధర్మమునకుఁ బ్రతిగా బౌద్ధమతమును స్థాపించెను. ఆసమయముననే వైశ్యకులమునందు మహావీరుఁడు జన్మించి, "అహింసా పరమో ధర్మః" అనునీతిని బ్రకటించుచు బౌద్ధమతమునుబోలిన జైనమతము నెలకొల్పెను. ఆగమోక్తము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లగు శాక్తశైవవైష్ణవాదిమతము లదివఱకే పుట్టియుండెను. నిగమాగమవిరుద్ధము లగు లోకాయత చార్వాక పాషండాది మతములు పిమ్మటఁ గలిగెను. అటుతరువాత శంకరాచార్యుఁ డద్వైతమతమును, రామానుజాచార్యుఁడు విశిష్టాద్వైతమతమును, మధ్వాచార్యుఁడు ద్వైతమతమును, వల్లభాచార్యుఁ డొకవిధమగు వైష్ణవమతమును, చైతన్యదేవుఁడు వేఱొకవిధమగు వైష్ణవమతమును గ్రమముగాఁ బ్రతిష్ఠించిరి. గ్రీకులవలనఁ గ్యాథలికుమతమును, దురుష్కులవలన నిస్లాముమతమును, ఆంగ్లేయులవలన బ్రొటస్టెంటుమతమును, పారసీకులవలన జెందవస్థామతమును భారతదేశమునఁ బ్రవేశించెను. అనంతరము రాజారామమోహనరాయఁడు బ్రహ్మసమాజమతమును, స్వామి దయానందసరస్వతి యార్యసమాజమతమును బుట్టించిరి. రాధాస్వామి యనుపేర వేఱొకమతమును బుట్టెను. మేడముబ్లావట్స్కీ బోధించి నిలిపిన దివ్యజ్ఞానసమాజమునందు సకలమతయుతులు నుండుటవలన దానిని బ్రత్యేకమతమనుట యసమంజసము. పైనిబేర్కొనఁబడిన మతములను వివరించుట కీచిన్నివ్యాసము చాలదని తత్ప్రయత్నమును మానితిని. ఇవిగాక యీ దేశమునందు మఱికొన్ని మతములును గలవు.

ఇట్లెన్నిమతము లిక్కడ నల్లిబిల్లిగా నల్లుకొనియున్నను, బెఱరాజుల రాపులు హెచ్చినను, వివిధసభ్యతలు ప్రబలినను, ధర్మమనుపునాదిమీఁద నిర్మింపఁబడిన భారతీయ జాతీయతానగరి సెడకున్నది. ఆర్యు లనుదినమును గరణత్రితయముతోఁ జేయుచుండు ప్రత్యేకకర్మము సాంఘికధర్మ మయియుండుట వలనను, సాంఘికధర్మమే వారిమత మయి యుండుటవలనను, వారిమతసిద్ధాంతప్రకార మైహికవిషయమునకు నాముష్మికవిషయమునకును ఘనిష్ఠ మగు సంబంధ ముండుటవలనను, ఆముష్మికవిషయము ప్రపంచాతీత మయి మార్పుఁజెందని దగుటవలనను, వేదాధారమగు నార్యమత మత్యంతప్రాచీనమును సమగ్రమును; మఱి ధర్మప్రాణులగు నార్యుల జాతీయత యపరివర్తనీయము. పైని బేర్కొనంబడిన మతములును మఱి ప్రపంచమునం గల యితరమతములును సకర్తృకములు. అనఁగా నాయామతాచార్యులు కర్తలుగ నుండి యుద్భవింపఁజేసినవి. ఆర్యమత మకర్తృకము. దాని నెఱుంగని భారతీయుఁ డన్యమతము నవలంబించుట రాజాశ్రితుఁడు రైతు నాశ్రయించుటయె యగును.

కనుక నిహపరసుఖసాధకమగు నార్యమతతత్త్వమును లెస్సగా నెఱుంగుట సమంజసము. భ్రమకరవచనములను విని భ్రమించుట యనుచితము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. శ్రీనగరములో నొక సరస్సు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. కమానువంతెన, శ్రీనగరము

# ఇలాంటివి యెన్నయామో!

కప్పగంతుల సత్యనారాయణ

౧

అవి దసరాపండుగలు. ఆనాడు మహర్నవమి. దసరా వేడుకలకల్లా విజయనగరాన్ని చెప్పి యింకో వూరిపేరు చెప్పాలి. అందులోనూ కృష్ణరాయని ప్రభుత్వం. ఆంధ్రభోజుడుకదూ. కత్తికీ కలానికీకూడా సన్మానం లభించినరోజు లవి. మహర్నవమినాడు పండితుల్నీ, విజయదశమినాడు శూరుల్నీ పరీక్షజేసి వారివారి తాహతుకొద్దీ బహుమానా లిచ్చేవాడు రాయలు. పండగతొమ్మిదిరోజులూ నిరతాన్నదానం జరిగేది. ఆవేడుక మళ్లా ఆంధ్రదేశంలో జరగదు. అలాంటిప్రభువు యేదేశంలోనూ—యేమో. ఆరోజు ఉదయంనించి మధ్యాహ్నంవరకు పండితసన్మానము. సాయంత్రం ఊరేగింపు. వందలకొద్దీవస్తారు పండితులు. అందర్నీ వినటానికి రాయలకి తీరుబడి అవుతుందా? అందువల్ల ఓయేర్పాటు జేశాడు. ఉన్నారుగా అష్టదిగ్గజాలూనూ. వారిని నియమించాడు. మహర్నవమికి ముందు యెనిమిదిరోజులూకూడా వచ్చినవారి నందర్నీ వినవలసిన భారమూ, వారందర్నీ తరగతివారీగా యేర్పరుచు భారమూ అష్టదిగ్గజాలదే. బహుమానాలుమాత్రం మహర్నవమినాడు స్వయంగా యిస్తాడు రాయలు.

తెల్లవారేటప్పటికి రాయలు అభ్యంజనము చేయించుకొని, శుభ్రవస్త్రాలు ధరించి కూచున్నాడు. తిరుమలరాజు దర్శనార్థం వచ్చా డన్నారు పరిచారికలు. లోపలికి రమ్మనమని సెలవైంది. చిరునగవుతో, ఎగురుతున్న గిరజాలజుట్టుతో, సేనానాయకుడి దుస్తులతో లోపలికి వచ్చాడు తిరుమలరాజు. బంగారపు రేకులు చుట్టిన కోళ్లుగల మంచంమీద తనపక్కనే కూచోమన్నాడు రాయలు. తిరుమలరాజు రాయలికి అల్లుడు.

'నీకోసమే చూస్తున్నాను. అందరుప్రభువులూ వచ్చేశా రనుకుంటాను' అన్నాడు రాయలు మెల్లగా.

'అవును. అప్పాజీ మిమ్మల్నను వీలైనంత త్వరలో దయచేయమన్నారు. ఈసంవత్సరం చాలాశోభాయమానంగా వున్నాయి దసరారోజులు' అన్నాడు తిరుమలరాజు.

'వచ్చేదసరాకేనా రాయచూరు మనం గెలిచి, ఆప్రభువు మనసభకి రాకపోతే మనకి తృప్తిలేదు. పూర్వాల్నించీ మనదై మధ్య వాళ్లకిపోయింది. అక్కడకూడా మన జెండా యెగిరితే మనకాలం శాంతంగా గడుపుకోవచ్చు. అందరికీ తగిన విడుదులు—'

'చిత్తం. అందరూ విడుదులలో సంతోషంగానే వున్నారు. అయినా వాళ్లమీద ఓకన్నుంచమనే చెప్పాను వేగువాళ్లకి.'

'ఏది యెలావున్నా సైన్యంమాత్రము యెప్పుడూ సిద్ధంగా వుండాలి. పండగరోజులు మనం యేమరి ఉన్నామని ఆదిల్ శాహ—'

'వాడికి గుండెలు లేవు. మనం వెళ్లి మీదబడితే స్వసంరక్షణ చేసుకోవాలిగాని, ఎదిరివచ్చేంత ధైర్యము యేం జూసుకొని—'

'ఇంక లేద్దాము' అని రాయలు లేచి శిరోవేష్టమును పెట్టుకోగా తిరుమలరాజుకూడా లేచాడు.

సేవకులు గుఱ్ఱాన్ని తీసుకొనివచ్చి ప్రాకారములో పెట్టారు. దర్వాజాదగ్గర అంగరక్షకులు వారి గుఱ్ఱాల కళ్ళాలు చేతబట్టుకొని నిలుచున్నారు. రాయలు వచ్చి గుఱ్ఱాన్ని యెక్కినతరువాత తిరుమలనాయకుడుకూడా యెక్కాడు. వీరిప్రక్కన ఆరుగురు ఆరుగురు అంగరక్షకులు వాళ్ల వాళ్ల గుఱ్ఱాల్ని యెక్కారు. అందరూ సభామంటపానికి బయలుదేరారు. మేడలమీంచి పూలూ, దండలూ విరివిగా రాయలపైన బడుతున్నాయి. నిలిచినవి నిలుస్తున్నాయి, రాలిపోయినవి రాలిపోతున్నాయి. సభామంటపం దగ్గిరకి వెళ్లి గుఱ్ఱందిగి మంటపంలోకి వెళ్ళాడు రాయలు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జయజయధ్వానములు మిన్నుముట్టుతూండగా రత్న సింహాసనముమీద కూర్చున్నాడు. తర్వాత సభికు లంతా కూచున్నారు. సభ కిటకిటలాడుతూవుంది. నానాదేశాల్నించి ప్రభువులూ, పండితులూ వచ్చి ఉచితాసనములపై కూచున్నారు.

పండితసన్మాన మారంభమైంది. సమస్తపండి తులకీ తగురీతిని బహుమానాలు దొరికాయి. అల్లసాని పెద్దన్నగారి వంక తిరిగి రాయలు 'అయిపోయినట్లేకదా' అన్నాడు. పెద్దన్న కూర్చొనియే 'చిత్తం' మన్నాడు. అప్పుడొకయువకుడు లేచి నిలుచుని, రాయలకు వంగి నమస్కరించగా 'ఏమి' అన్నట్లు కనుబొమ లెగుర వైచాడు రాయలు.

'మాది యేలినవారి పాలనలోనే కొండపల్లి. కవి త్వములో కొంచెం ప్రవేశ ముంది. జన్మ క్షత్రియుణ్ని కావడంచేత యుద్ధములోకూడా—'

'పరశురామునికి వ్యతిరేకంగా' అన్నాడు రాయలు మందహాసంతో.

'చిత్తం. ఉదయమే వచ్చాను. పరీక్షించి ప్రభువువారు నాకూ యెన్నిక యివ్వాలి.'

ఆంధ్రకవితాపితామహునికేసి రాయలుచూడగా 'అబ్బాయీ, వసంతకాలాన్నీ, కోయిలనీ వేరువేరుగా వర్ణించు నాయనా' అన్నాడు అల్లసానిపెద్దన్న, రాయలయభిమతాన్ని గురుతించి. రెండేపద్యాలు, ఒకటి చంపకమూ, ఒకటి శార్దూలమూ. పదినిమిషములలో పైకప్పుకేసి చూస్తూ ఆలోచించి చదివాడు. తెనాలి రామలింగడు సెభాస్ అనడంతోటే సభంతా సెభాస్ అన్నారు.

'ప్రభువుగారి వదనము చూడ్డంతోటే నిరక్షుర కుక్షికికూడా కవితామతల్లి యలవడునప్పుడు, నావిషయ మంత ప్రశంసనీయము కాదు' అన్నాడు యువకుడు వినయగర్భితంగా.

'నామధేయము' అని రాయలు అడుగగా 'రామ చంద్రు డంటారండి' అని జవాబు చెప్పాడు.

'రేపు వీరులకు బహుమానము లియ్యబడును. అక్కడికికూడా రావచ్చును.'

'చిత్తము'

'అప్పాజీ, యితనిని విడిదికి పంపుడు.'

యథావిధిగా సభ పూర్తియయింది. అందరూ లేచారు. తిమ్మరుసుఆజ్ఞచే భటుడు రామచంద్రుని విడిదికి తీసికెళ్లాడు.

* * * *

మరునాడు ఆయుధవిద్యాపరీక్షలో రామచం ద్రుడు ప్రథముడగుట రాయ లాతనిని కడుంగడు ప్రశం సించి, తనసేనయం దైదువందల సైనికులపై నాయకత్వ మొసంగుటయు నాదిగాగల వార్తలు పురమంతయు వ్యాపించెను.

౨

రాయలు కొండపల్లిని లోబరుచుకొన్నతరు వాత ఆప్రజలంతా రాయలకి విశ్వసనీయులై ఉన్నారు. చాలామంది రాయలకొలువులోగూడా జేరి, భక్తి తాత్పర్యములతో అతన్ని సేవిస్తున్నారు. కత్తిబట్టడం చేతనైనవాడు రాయలవద్దకి వెళ్లాడంటే నిరుద్యోగియై పోవడం ఎప్పుడూజరగలేదు. అందులో, సాములో అస మానప్రతిభగల రామచంద్రుడు అయిదువందలసేనకి నాయకు డయినాడంటే ఆశ్చర్య మేమీ లేదు.

రామచంద్రుడు కొండపల్లిలో ఒకసామాన్య క్షత్రియకుటుంబానికి చెందినవాడు. అతని తండ్రి గజపతికొలువులోవుండి రాయలమీద కత్తికట్టినవాడే. గజపతిపని అయిపోయినతరువాత, యుద్ధజీవితాన్ని విరమించుకున్నాడు. రామచంద్రుడు చిన్నతనంనించీ అసాధారణమేధావియేకాక మంచి బలశాలికూడాను. గాలికెగిరే గిరజాలజుట్టు, వస్తూవస్తూవున్న నల్లటి మీసాలు, మెలిదేరిన కండలుగలిగిన చేతులు, అడుగున్నర వెడల్పుగల రొమ్ము, తూచినట్లున్న యవయవములు— వీటితో చక్కనిరూపము రామచంద్రునిది. సునిశిత మైన బుద్ధీ, వినయమూ అతనికి మరీ వన్నెదెచ్చాయి.

క్రిస్టోవాడ్డేఫిగండో అనేవాని యాధిపత్యము క్రింద కొంతమంది పోర్చుగీసువాళ్లని రప్పించి వారిచే తన సైన్యానికి క్రమశిక్ష నిప్పించేవాడు రాయలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామచంద్రునికూడా రోజూ వెళ్లి ఒకమాసంరోజులు నేర్చుకోమని సెలవైంది.

ఓరోజు చాలాసేపు కవాతుచెయ్యడంచేత మధ్యాహ్నం భోజనము కాగానే పడుకుని నిద్ర పోయాడు. లేచేప్పటికి సాయంత్రము పొద్దుపోయింది. కొలువుకు పోవటం చాలించి, ఊరు చూద్దామని ఊళ్లోకి వెళ్లాడు. రెండుమూడుబజారులు తిరిగి విసుగు పుట్టి చల్లగాలేనా తగులుతుందని ఊరిబయటనున్న తోటలోకి వెళ్లాడు. అలాంటితోటలు విజయనగరంలో మూడే ఉన్నాయి—ఒకటి ఊళ్లో నట్టనడుమనూ, ఇంకోటి రాయలమందిరంచుట్టూనూ — అందులోకి మాత్రం యెవర్నీ పోనియ్యరు. రామచంద్రుడు వెళ్లిన తోట ఊరిబయటవుంది. సాధారణంగా ఎవరూరారు ఆ తోటకి. తుంగభద్రానది ఆతోటలోంచే ప్రవహిస్తుంది. నదియొడ్డున కూర్చున్నాడు రామచంద్రుడు.

అలలతోటి యేదో లాక్కుపోతూన్నట్టు కొట్టుకుపోతూన్న ప్రవాహాన్నీ, మధ్యమధ్య తళుక్కని మెరుస్తూ యెగిరే చేపల్నీ, వాటిని పట్టుకుందుకు రివ్వున వాలే పిట్టలనీ చూస్తూ కూచున్నాడు, రాయని వైభవాన్ని తలుచుకొంటూ వొక్కడూ నదివొడ్డున.

'అమ్మమ్మో, బాబోయి, పోయెపోయె' అని ఓదానివెంబడి ఓటిచొప్పున రక్షణార్థము కేకలు వినబడ్డాయి. క్షత్రియరక్తము పొంగగా మెరుపుమెరిసినట్టు లేచి నాలుగుదిక్కులూచూశాడు. నదిలో, తనకి వైవాలున నీళ్లల్లో ఒకవ్యక్తి రెండుబుటకలు వేసింది. ఒడ్డున ఒకస్త్రీ అటూయిటూ తిరుగుతూ కేక లేస్తోంది. ఒక్కవుదుటున అక్కడికి పోయి నదిలోదూకి మూడు మునకలలో ఆ జీవిని పట్టుకుని సందిట్లో అదుముకొని ఒక్కచేత్తోటి యీదుతూ ఒడ్డుకు వచ్చాడు. ఇంకా నీళ్లలో రెండుగజాల్లో ఉండగానే ఒడ్డున విలపిస్తూన్న స్త్రీ, మునిగిపోయిన స్త్రీని (బయటికితీసినతరువాత తెలిసింది) పట్టుకొని పైకి తీసికెళ్లింది. రామచంద్రుడా స్త్రీపొట్టనొక్కి నీళ్లన్నీ కక్కించాడు.

'త్వరగా యింటికి తీసికెళ్లి పొడిగుడ్డలు కట్టాలి. లేకపోతే జబ్బుచేస్తుంది' అన్నాడు.

'అలాగే. తోటబయట మాసేవకుడూ, బండివాడూ ఉన్నారు. నేను పోయి పిలుచుకుని వస్తాను. మీరు చూస్తూవుండండి' అని ఆస్త్రీ వెళ్లిపోయింది. రామచంద్రుడు క్రింద కూచుని తన తొడమీద ఆస్త్రీతల బెట్టి, మొహంమీద పడిన వెంట్రుకలన్నీ తోసేసి, బుగ్గలు నిమురుతూ ఆమెసౌందర్యాన్ని చూస్తున్నాడు. గుండెలకి వెచ్చతనం కలుగుతుందని తనచేతుల్ని గుండెలమీద పెట్టాడు. ఇంతలోకే ఆమెకి కొంచెం తెలివివచ్చి మెల్లగా కళ్లుతెరిచి, తనకేసి చూస్తూన్న రామచంద్రుడిని చూసి, సిగ్గుతో, చనిపోయిన తనకి యిలా జరుగుతోందేమోనని, లేవబోయి నీరసంతో వెనక్కి పడిపోయింది.

'ఫరవాలేదు. అలా కొంచెంసేపు పడుకుంటే సత్తువ వస్తుంది' అన్నాడు రామచంద్రుడు. తడిసిపోయిన తన గుడ్డల్నీ, తానున్న తోటనీ చూచి, తన నిజస్థితి గ్రహించుకొని, తన్ను మరణమునుండికాపాడిన యువకునకు మానసికనమస్కారము లర్పించి 'వసంత యెక్కడ' అని సిగ్గుతో, నీరసంగా, చలిచే వణకుతూ అడిగింది.

'మీబండివాడిని తీసుకురావడానికి వెళ్లింది. వస్తూంటారు యీపాటికి' అన్నాడు బుగ్గలు నిమురుతూ. ఆస్పర్శకి శరీరమంతా పులకించి,ఆనందంతో కళ్లుమూసేసింది. ఇంతట్లోకి యిరువురు మనుష్యులతో వసంత వచ్చి రామచంద్రుని జూచి 'తెలివిరాలేదా' అని అడిగింది. ఆమాటకు జవాబియ్యకుండానే, రామచంద్రుడు ఆమె శిరస్సు కిందనుంచి, తను లేచి నిలుచున్నాడు. 'అమ్మ ముక్తాంబా, యిటు జూడు తల్లీ' అని వసంత యామెను పలకరించగా ముక్తాంబ కళ్లుతెరిచి చూసింది. రెండు చుక్కలు కళ్ల వెంబటి కారాయి. 'ఎందుకుతల్లీ' అని ఆమెతలను తన తొడలమీద బెట్టుకొని, రామచంద్రుని వైపు తిరిగి 'అయ్యా, యివ్వాళ మీరు మాకు చేసిన వుపకారము విలువలేనిది. ప్రాణదాత లగు తమ నామము మాముక్తాంబతో నేమని చెప్పుదును?' అని కృతజ్ఞతాపూర్వకంగా అడిగింది వసంత.

'రామచంద్రు డంటారు నన్ను. రాయలవారి కొలువులో ఉన్నాను.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'కొండపల్లినుంచివచ్చినది మీరేనా?'

'అవును. మీరుకూడా ఎవరో చెప్పితే—'



"ప్రాణదాతలకు తమనామమును.....అని కృతజ్ఞతా పూర్వకంగా అడిగింది వసంత."

'ఈమె యీపట్టణాధికారి గోపాలరాజుగారి కుమార్తె. నేనామెచెలిని.'

'ఒంటరిగా యిలా రావడంచాలాసాహసం. నదిలోదిగటంమరీని—'

'దాహము త్రాగుచు కాలుజారిపడిపోయినది. కాని మీరు చేసిన సహాయము మాత్రము.'

'పదిసార్లు అలాఅంటే నాకు సిగ్గగావుంది. ఇంక యింటికివెళ్లండి.'

ఇంతసేపూ రామచంద్రునివైపు రెప్ప వెయ్యకుండా చూస్తూన్న ముక్తాంబ కనులు మూసింది. రామచంద్రుడు వెళ్లిపోయాడు. వసంతను ఆనుకొని ముక్తాంబనడిచి, సేవకులిద్దరూ వెనకాల వస్తూండగా, బండిదగ్గరకి వెళ్లి లోపలికి ఎక్కింది. వసంతకూడా ఎక్కగా బండి తోలుకొని వాళ్లు యింటికి తీసికొని పోయినారు.

3

రెండురోజులు గడిచాయి. రామచంద్రుడికి మనస్సు ఎలా స్తిమితంగా లేదో, ముక్తాంబకికూడాఅలాగేవుంది. ఇద్దరి హృదయాల్లోనూ భయమూ, సిగ్గూ, ఎలా కలుసుకుందామా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనే ఆతురతా నెలకొనిఉన్నాయి. రామచంద్రుడు రోజూ తోటకివెళ్లటము మొదలుపెట్టాడు. పదిరోజులు గడిచిపోయాయి యిలాగే. వాళ్లుమాత్రం తోటలో అత నికి మళ్లీ కనపడలేదు.

పదకొండోనాడు మధ్యాహ్నం భోజనంచేసి కూచున్నాడు. ఎవరో స్త్రీ వచ్చిందని నేవకుడు చెప్పగా లోపలికి రానియ్యమన్నాడు. కొంచెంసేపటికి ముక్తాంబన్నేహితురాలు వసంత వచ్చింది లోపలికి.

'ఏం విశేషం?' అన్నాడు.

'ఆరోజునుంచీ మళ్లా మీదర్శనం కాలేదు.'

'నేనూ అలాగే అనుకుంటున్నాను. తోట లోకి వస్తారేమోనని—'

'నదిలో పడ్డప్పటినించీ, ఆతోటకి వెళ్లవద్దని వాళ్ల నాన్నగారు కోప్పడ్డారు. మీనివాసం కను క్కోడం దుర్ఘటమైంది.'

'....................'

'మీతో ఒకసారి మాట్లాడవలెనని మాముక్త—'

'నాకూ అలాగే వుంది. వీలు ?'

'నేను కలుగజేస్తాను.'

'నే నీయూరికి క్రొత్తవాడను. రాజానుగ్రహము కోరివచ్చినవాడను. బయటపడిందంటే ఏమవుతుందో ఆలోచించావా ?'

'అన్నిటికీ నే నున్నాను. మీకు ఏవిధమైన యిబ్బంది కలిగినా నాప్రాణం తీసెయ్యండి.'

'....................'

'రేపు మాయింటిప్రక్కన వున్న యింటికి రండి, ప్రొద్దుగూకవేళకి.'

'సరే.'

తనయింటిగుర్తులు చెప్పి తప్పకుండా రావాలి అని బాసచేయించుకొని వసంత వెళ్లిపోయింది.

*     *     *     *

'మిమ్మల్ని చూసినప్పటినుంచీ—'

'నాకూ అలాగే వుంది.' ..........

'నాప్రాణాన్ని మీరు రక్షించారు.'

'పదేపదే ఆమాట—'

'పొరబడ్డకాను. నన్ను చెప్పనియ్యండి.'

'సరే, చెప్పు.'

'మీరు నాప్రాణాన్ని రక్షించారు. కనక మీరు నాప్రాణదాతలు. మీరురక్షించినది మీరేఅనుభవించాలి. నేను మీకు కృతజ్ఞత ఎలా తెలియజెయ్యాలో—'

'నీప్రాణాన్ని నాకిచ్చెయ్యడమే!'

'అంతకన్న యింకేమీ నేను యివ్వలేను కాని—'

'ఏమిటి కాని?'

'పుచ్చుకోటంలో మీరు మనస్పూర్తిగా—'

'ఎంత వెఱ్ఱిదానవు. ఇవ్వడం పుచ్చుకోడం నీనాచేతులలోనే వుందనుకొంటున్నావు. నీతలిదండ్రు లున్నారు. నాతలిదండ్రులు నామాటకి, నాకోర్కెకి అడ్డుచెప్పరుకాని—'

'నాతండ్రి యడ్డుచెప్పినను భయము లేదు.'

'అంతధైర్యము—అపాయకరము.'

'ఆయనమాట సాగదు. చిన్నాదేవి మహారాణికి నామీద చాలప్రేమ, స్నేహము. ఆమెకాళ్లమీద పడ తాను. ఆమెమాట రాయలువారు జవదాటరు. రాయల వారి మాట వినసంతశక్తి మాతండ్రికి లేదు.'

'పెద్దమెత్తే. అయినా నాకు సందేహంగానే వుందికాని మనస్సుమాత్రం నీమీదపూర్తిగా—!

'నాకు అస్తమానమూ మీపూనే'

'ఏదీ ఒక్కసారి'

'ఇప్పుడొద్దు. అంతా సరిపడాలి.'

'ఏం సరిపడాలి? నీమనసూ, నామనసూ సరి పడనేపడ్డాయి.'

'అబ్బా!'

'....................'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'...............'

'ఇంక వెళ్లనా?'

'మళ్లా యెప్పుడు?'

'మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు. శరీరమే నాదికాని, మనస్సు మీదే.'

'శరీరముకూడా నాదే.'

౪

రాయ లమితాగ్రహపరవశుడై యుండెను. త్రిమ్మరుసు మంత్రికొరకు కబురు పంపబడెను. ఆయన వచ్చుసరికి రాయలు ఇరువదిసారులు ఛీత్కార మొనరించుటయు, ఊర్పులు నిసుడించుటయు, రెండు మూడుపర్యాయములు మీసముల మెలివైచుటయు, నాలుగైదుసారులు కత్తిపైకి చెయ్యి పోనిచ్చుటయు కూడ జరిగియుండెను. త్రిమ్మరుసు వచ్చి యుచితాసనమున గూర్చుండి, రాయలవైఖరి యంతయు గని పెట్టి 'ఎప్పుడూ లేదు. చివరికి గజపతితనయ మిమ్మలను చంప బ్రయత్నించినప్పుడుకూడా—' అంటూండగానే 'చూడండి. ఎంత గర్వమో' అని యొక ఉత్తరాన్ని త్రిమ్మరుసుకు యిచ్చాడు రాయలు.

'ఎంత గర్వము! జవాబువ్రాయుపద్ధతి యిదియేనా!' అని త్రిమ్మరుసు ఉత్తరం చదవకమునుపే మళ్లా అన్నాడు రాయలు. ఉత్తరమును చదువుట ముగించి 'ఏమున్నది? సైన్యమును సిద్ధముకావింతము' అన్నాడు త్రిమ్మరుసు.

'ఎన్నిరోజు లవుతుంది.?'

'ఆలస్యమునకు కారణము లేదు. అన్నీ సిద్ధముగానే ఉన్నాయి. సామంతులకు వార్తనంపుటయే యాలస్యము.'

'ఆదిలుశాహా నీతడవ పాదాక్రాంతునిచెయ్యాలి. గుఱ్ఱముల నమ్మువానికోస మింత—'

'రహస్య మదిగాదు. వానికిగూడ మనతో డీకొని, ఒకచెయ్యి చూడాలనని ఉంది. సయ్యాన్ మర్కా రొకకారణము. అంతే.'

'ఏక క్రియా ద్వ్యర్థకరీ — రాయచూరు లాక్కోడానికి మనకి యిదొకకారణము కదా.'

'చిత్తము. సామంతు లందరికీ ఫర్మానాలు పంపుదునా?'

'అవశ్యము.'

సెలవుదీసికొని త్రిమ్మరుసు వెళ్లిపోయాడు. ఆదినమున రాయలు స్వయంగా విజయనగరములో వున్న సైన్యాన్ని పరీక్షించాడు.

రాయల ప్రయాణవార్త అంతఃపురంలోకి వ్యాపించింది. రాయలకి చిన్నాదేవి ముద్దులభార్య. ఆమె చెప్పినమాట రాయ లెన్నడూ త్రోసివేయ లేదు. అలాగని ఆమె యెన్నడూ అనవసరపుప్రసంగాలు రాయల వద్ద యెత్త లేదు. ఆమె యిప్పుడు గర్భిణి. ఎప్పుడూ లేని సంగతి—ఆమెకూడా రాయలతోయుద్ధానికి బయలు దేర్తానని పట్టుపట్టింది.

'ఉత్తప్పుడుఅయితే భయం లేదు. కడుపులో పిండంజాగ్రత్తకోసమేనా యింట్లో వుండు' అన్నాడు రాయలు.

'రాయలవారి భార్య అంతపిరికిదనా మీఅభిప్రాయం? నేను భయపడితేకదా పిండం అదరటానికి—అదిగాక యిలాటియుద్ధాలు చూస్తేకాని వీరమాతను కావడ మెలాగ? మీతల్లిచలవన వీరపత్నిని అయినానుగాని—' అంది చలించకుండా చిన్నాదేవి. నిజమే, ఆమె చిన్నతనంలో తండ్రితోటి ప్రతివండ యాత్రలోనూ బయలుదేరేది. కడుపులో ఉన్న బిడ్డ యొక్క తేజంగూడా కలవగా ప్రజ్వరిల్లుతున్న ఆకళ్లనీ, పాలుగారుతున్న ఆచెక్కిళ్లనీ, హృదయాన్ని నొక్కిపట్టే ఆపలుకులనీ చూసి రాయలు ఆమెమాటకి కాదనలేకపోయాడు. చిన్నమదేవి రాయలతో బయలుదేరు ననువార్త విజయనగరమంతా పాకింది. ఎవరికి తోచినట్లు వాళ్లు తలోమాటా అన్నారు. లోకాన్ని ఎవరు ఆజ్ఞాపించగలరు! అప్పాజీని పిలిపించి రాయలు 'ఏమంటార'ని అడుగగా 'ఆమె కంతయభిలాష యుండగా వలదననేల' అన్నాడు అప్పాజీ. దాంతోటి దారి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిష్కంటక మైంది. ప్రొద్దుగూకేవేళ చిన్నాదేవియంతః పురమువద్ద నొకబండి ఆగింది. ముక్తాంబవసంతలిద్దరూ దిగి లోపలికివెళ్లారు. ముక్తాంబకంటె చిన్నాదేవి రెండేండ్లు పెద్ద. కాపురమునకు వచ్చినదిమొదలు చిన్నాదేవి ముక్తాంబతో స్నేహము మొదలిడింది. ఇద్దరి స్నేహమూ బాగా వృద్ధి అయింది.

'మీరుకూడా ఆదిల్‌శాహీమీదికి యుద్ధానికి వెడతారని—' అని ముక్తాంబ నవ్వుతూ అంటూండగానే 'అవును' సత్యభామవలె' అని చిన్నాదేవి పకాలున నవ్వింది.

'సరిసరి. పేర్లు సరిపోయాయి. ఆయన శ్రీకృష్ణుడే' అని ముక్తాంబ అంది.

'అమ్మ' మా ముక్తాంబకికూడా వొకఅర్జునుణ్ణో, అనిరుద్ధుడినో చూడండమ్మ' అని వసంత పలికింది.

'వసంతా' నీకు బొత్తిగా భయము లేకుండబోయింది' అని ముక్తాంబ లేనికోపము తెచ్చుకొని అనగా 'అవునవును. యుద్ధానికి వెళ్లివచ్చినతరువాత రాయలవారితో చెప్పి ఆలోచించాలి యీవిషయం'అని చిన్నాదేవి పలికి ముక్తాంబను చూసి 'ముక్తా, ఎవరినైనా ఏర్పాటుచేసుకున్నావా యేమిటి చెప్పు.' అంది.

'మీరుగూడా అలాగే అంటున్నారా? మా వసంతకి భయంలేదు.'

'నాకూ భయంలేదు.'

'ఎంతమాట? నేనుకూడా మీతోటి రావాలని వుంది యుద్ధానికి.'

'అవును. అలా అనుకుంటూనే ఉన్నాను. మీతండ్రి యేమనునో?'

'మీరు అడిగితే యింక అడ్డు ఉండదు.'

'చూద్దాం.'

ఇకనేమి? రాయలవారి దేవి యడుగుటయు, లేదని మాట వచ్చుటయునా! ముక్తాంబకూడా సిద్ధమైంది. ముక్తాంబప్రయాణంసంగతిమాత్రం రహస్యంగా ఉంచారు.

౫

వాళ్లు మళ్లా కలిసికొన్నారు. రామచంద్రుడు తాను రాయచూరుయుద్ధానికి బోతున్నట్టు తెలియజేశాడు. ముక్తాంబ తన ప్రయాణంమాట చెప్పలేదు. మూడోనాడే ప్రయాణం. ఇద్దరూ వొకరినొకరు చల్లగా నోటివెంట మాటలేకుండా చూచుకున్నారు. రామచంద్రుడు లేచి తన రెండుచేతులతో నాతెలను బట్టుకొని వెనుకకు వంచి పెదవులపై ముద్దుపెట్టుకున్నాడు.

'యుద్ధానికి వెళ్లుతున్నాను. మళ్లా మనయిద్దరమూ—యేమో'

'అలాంటిమాటలు ఎందుకూ, శుభమా అని?'

'ఇలా చూడు.'

'ఏమిటి?'

'.....................'

ఒకటి, రెండు, మూడు,............వంద—

ఒకరినొకరు కౌగిలించుకున్నారు.

ఆనందాశ్రువులతో, ఆలింగనములతో, పరస్పరక్షేమాభిలాషలతో విడువలేక విడువలేక, యిదియే కడసారియా అన్నట్టు ఒకరినొకరు వీడ్కొన్నారు.

౬

ప్రచండసేనావాహినిలో బయలుదేరాడు రాయలు. విజయనగరమంతా కంపించిపోయింది రణభేరీలతో. ఇంటింటా వీరాలాపములు మారుమ్రోగుతున్నాయి. విజయనగరములో ఓమూల కాపురమున్న కొద్ది మహమ్మదీయులు తహతహలాడిపోతున్నారు, తమమీద ఏం విరుచుకుపడుతుందో అని. గోపాలరాజునకు రాయలు తగువిషయములను చెప్పి 'జాగ్రత్త' అన్నాడు. ఆమహమ్మదీయుల పేటచుట్టూ ఒపెద్దసేన కాపు ఉంచబడింది. పురవాసులంతా 'రాయలకు జయ మగుగాక' అని కేకలేస్తున్నారు. ఎక్కడజూసినా సందడే. ఊరుదాటినదాకా ప్రతివారికీ యేదో ఒకఆజ్ఞని ప్రసాదిస్తూ, ఎక్కడజూసినా తనే యైయున్నాడు త్రిమ్మరుసు మంత్రి. రాయలు భద్రగజము నెక్కాడు. ప్రక్కన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పల్లకీలలో చిన్నాదేవి, ముక్తాంబ మొదలగు స్త్రీజనమంతా బయలుదేరారు. ఒక్కగడియలో నగరమంతా వానకురిసి వెలిసినట్టయింది.

కృష్ణానది యొడ్డున విడిసి రాయచూరు సరిక్షేత్రము మీద లోబరుచుకొన్నారు. ఆదిల్ శాహా యెత్తివచ్చుచున్నాడన్న వార్త రాయలచెవి సోకింది. సైన్యమంతా అతిజాగ్రత్తగా వుంది. తెలతెలవారుచుండెను. పక్షులకలకలంతో, సైనికులుగూడ కలకలలాడుచు మేల్కొనిరి.

'వచ్చె వచ్చె' అను కేకలతో అందరూ సిద్ధమయారు. అరగడియలో ఒకసైన్యము వచ్చి వారిని తలపడింది. ఆదిల్ శాహాయే! నెత్తురు చుక్కలు చుక్కలుగా పడుతోంది భూమిమీద. ఆచుక్కలతోటి నేలంతా తడిసింది; మడుగు గట్టింది. ఓమడుగుకు యింకోమడుగు కలసి కాలువ గట్టింది. కృష్ణానదిలో రక్తపు కాలువలుగూడ కలుస్తున్నాయి.

రామచంద్రుడు విసుగులేకుండా పోరుతున్నాడు. పది,— యిరువది,— సాయెబులు పడుతున్నారు. ఇదంతా చూశాడు ఒకడు ప్రక్కనించి. ఒక్కరామచంద్రుడు తమసేనలోనివారిని యింతమందిని—వాడికి కడుపుమండిపోయింది. వెనకనించి వచ్చి, యింకొకడితో పోరుతున్న సమయాన, రామచంద్రుని మెడమీద కత్తితో కొట్టాడు. రామచంద్రుడు క్రిందబడ్డాడు. అతనితోటిపాటే ఆతురక క్రిందబడ్డాడు. వెంటనే రామచంద్రునితోటి పోరుతున్నవాడు క్రిందపడ్డాడు.

రామచంద్రునితలతనతొడపైబెట్టుకొని ముక్తాంబ కూచునివుంది. మెడలోని రక్తనాళము తెగిపోయింది. రక్తముతో ముక్తాంబతొడంతా తడిసిపోతోంది.

రామచంద్రుడు కన్నులొకసారి విప్పి, ఆశ్చర్యాయాసములతో 'ఏ—లా—వ-చ్చా-వ్—' అన్నాడు. 'మీరు నన్ను బ్రతికించారుకాని నేను మిమ్ములను బ్రతికించుకోలేకపోయాను' ముక్తాంబకి దుఃఖ మాగలేదు. కనులు మూసి మరల తెరిచి, మెడ రెండుసారులటునిటు తిప్పి మరల కన్నులు మూశాడు రామచంద్రుడు. అంతే.

ప్రక్కనున్న కత్తితీసుకొని, రెండుసారులు రామచంద్రుని ముద్దాడి, రొమ్ముల్లో పొడుచుకుంది ముక్తాంబ.

ఇలాంటివి యెన్నియామో ఆంధ్రదేశంలో!





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నంది పూజ

—పానుగంటి బ్రహ్మం.

# క్రొత్తరష్యా—ప్రాతరష్యా

దిగవల్లి వేంకటశివరావు

రష్యాదేశమునందు కలిగిన మార్పులలో రైతుల స్థితి యత్యద్భుతమైనది. ఐరోపా సంగ్రామ పూర్వము రష్యాదేశము, "జారు" అనబడు చక్రవర్తి పరిపాలనమున నుండెను. యుద్ధములో దేశమునందు కలిగిన విప్లవమువలన చక్రవర్తిపరిపాలన పోయి ప్రజలసంఘుస్వామ్యము స్థాపింపబడినది. పూర్వము నాటిరైతులు సగము చచ్చి, ఒక భూస్వామితరువాత నింకొకభూస్వామిని గొలుచుచు ప్రతిభూమిఖామందుకు, ప్రతి అధికారికి, ప్రతి విదేశీయునికిగూడ దాసానుదాసులై సాష్టాంగపడుచు చాల దీనావస్థలోనుండిరి. నేటిరైతు పరిపూర్ణమగు ఆత్మగౌరవము, పౌరహక్కులు గలిగి తన కొకదేశము కలదనియు, దాని క్షేమలాభములే తనక్షేమలాభములనియు, తననిరాశక్తియొక్క ఫలితమే యగు నొకప్రభుత్వముగూడ తనకున్నదనియు జ్ఞానము కలిగి, దేశముయొక్క గౌరవమును, ప్రభుత్వముయొక్క అధికారమునుగూడ కాపాడుట తనవిధియనియు ఎల్లవేళల నప్రమత్తుడై మెలగుచున్నాడు.

పూర్వపు రష్యాదేశపురైతుల స్థితిగతులనుగూర్చి సాల్టికోఫ్ అను సుప్రసిద్ధగ్రంథకర్త యిట్లు వ్రాసినాడు:

"మన రైతులు (తక్కిన దేశములవారివలె) చర్మపు పాదరక్షలుగాక బెరడుజోళ్ల నేల ధరించుచున్నారు? దేశమునం దింతటిగాఢమగు అవిద్యాంధకార మేల గ్రమ్ముకొనియున్నది? మనకర్షకు డేల మాంసమునుగాని, వెన్ననుగాని, తుదకు కొవ్వుగల పదార్థములనుగాని భుజింపడు? ఏల పరుపులపైన పండుకొనడు? రష్యాదేశకర్షకుల ప్రవర్తనమునం దేలయొకవిధమగు వైపరీత్యము, వికారము, నిర్జీవత్వము గానవచ్చుచున్నవి. ?...ఇంతయేల? మనకృషీవలు లేల క్రిమికీటకాదులవలె పుట్టి చచ్చుచున్నారు? రష్యాదేశీయు లెన్నో బాధ లనుభవించుచున్నారు. కాని చిత్రమేమన, ఈబాధలు సహించుచున్నామను స్ఫురణయే వారికి లేదు! ఈజ్ఞానమే వారిలో నశించినది. ఇది యొకవిధమగు పాపకర్మమనియు, దీనిగూర్చి యోజింప బనిలేదనియు, శక్తియున్నవరకు దీని ననుభవింపవలయుననియు వారు తలంతురు. ఆకలిదీర్చుకొన ప్రయత్నింపక ఆకటికి మాడుటయు, "ఎక్కడ డున్నావు గొంగళీ" యనగా "వేసినచోటనే" యనుటయు, ఊబిలోదిగబడి మునిగిపోవుట, కంఠరములు తెగువరకు కష్టించుట నుదుట వ్రాయలేదనియు, బాగుపడవచ్చుననియు హానికి చెప్పి చూడుము; కర్షకులు తెల్లబోవుదురు. ఈవిషాదాశ్చర్యము లున్నన్నాళ్లు వీరు బాగుపడజాల రనుట నిశ్చయమేకదా!"

"రష్యా(మూషికుడు)రైతు సాగుచేయుచుడివంటి భూమిలోనే డెన్మార్కురైతుసాగుచేయుచు, ఏకరెట్లు హెచ్చుగోధుమలు పండించుచున్నాడు. ఒకవేళ డెన్మార్కుభూమి అధికసారవంతమేమో యని నేనను కొంటినిగాని ఎంతమాత్రము గాదు. ఆభూమికూడ ఇటువంటిదే. అచ్చటిశీతోష్ణస్థితిలో నేమైన కలదా? అదియునుగాదు. రష్యాలోని వివిధప్రాంతములందలి శీతోష్ణస్థితియే అచ్చటను గలదు. విశేషము తేడా లేదు. డెన్మార్కురైతు అధికమేధావియు,మనరైతు మంటితలకాయవాడు నా? రష్యారైతుయొక్క శక్తిసామర్థ్యములు డెన్మార్కువారి కేవిధముగను దీసిపోవు" అనిటిమిరాఫ్ పలికి రష్యాదేశము వెనుకబడియుండుటకు గలకారణము మాదేశపు పాఠశాలలందే యున్నదని సూచించినాడు. రష్యాదేశములో ప్రాథమికవ్యవసాయపాఠశాలలకన్న డెన్మార్కులోనివి చాలా శ్రేష్ఠమైనవిగా నున్నవి. డెన్మార్కురైతు లాపాఠశాలలం దుత్తీర్ణులగుచున్నారు. "సమష్టి కృషివలన భూమిని సాగుచేయు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi

పద్ధతులను సంస్కరించుట మూలముగానే రష్యాదేశ స్థితిని బాగుచేయవచ్చును. ఈవిషయమై యోజించువారీకార్యము పాఠశాలలందే ప్రారంభింపబడవలయునను దృఢనిశ్చయమునకు వచ్చి తీరెదరు” అని అభినవ రష్యాదేశనాయకుడగు లెనిన్ మహాశయుడు పలికినాడు.

“రష్యాదేశపురైతులకు మూషికు లనిపేరు. ఇరువదవశతాబ్దిలోని రష్యారైతులు ఏడెనిమిదివందల యేండ్లనాటి బ్రిటిషు ఫ్రెంచిరైతులవలెనే కనబడుచుండిరి. ఈరైతులకు భూములలో హక్కులు లేవు. భూమినిమాత్రము ఓపికతో దున్నుచుందురు. భూమి గ్రామసంఘములందే. అందువలన సొంతగానికుండుఆసక్తి ఈ రైతులకు లేదు. ఐరోపాసంగ్రామ (౧౯౧౪) పూర్వమునాటిరష్యాలోని పదునేడుకోట్లప్రజలలో నూటికి ౧౨.౮ మంది నగరవాసులు, ౮౭.౨ మంది గ్రామవాసులు. వీరిలో నూటికి ౭౮.౨ మంది కర్షకులే. దేశపుమొత్తముజనసంఖ్యలో నూటికి ౬౭.౨ మంది భూమిని దున్నుటవలన జీవింతురు. నాటిభూమిఖామందులకు దామాషాగా తలఒకటికి ఐదువేలయెకరముల భూమి యుండెను. రైతుకుటుంబము ఒకటింటికి దామాషాగా పదునైదు ఎకరములమాత్రమే యుండెను.

గాఢమగు అవిద్యాంధకారము, పూర్వకాలము నాటిమూఢవిశ్వాసములు, జడత్వము నుపదేశించు కర్మ వైరాగ్యసిద్ధాంతము, దుబారాతనము, సోమరితనము రష్యాదేశపు రైతులయందు వ్యాపించియున్న దుర్గుణములు. ఈగుణములు వారిని దారిద్ర్యమున ముంచివైచుచున్నవి. రైతులలో త్రాగుడు ప్రబలియున్నది. వారు తమబట్టలు దుస్తులుకూడ మద్యముకొరకు విక్రయించి వేయుచుండిరి. భూములయందు వారికి హక్కు లేయున్నచో వానినిగూడా అమ్మకొందురనుటకు సందియము లే”దని ఓబ్రాజ్ స్టాఫ్ (Obrazstoff) వచించినాడు.

“రైతుల కేపనిచేయుటయన్నను గిట్టదు. పని చేయకుండ తప్పించుకొనుటలో వారు ఘనులు. వారికెంతవేతన మిచ్చినను గూడ పనిచేయరు. సాలుపొడుగునను కలిపి ఒకటిరెండు నెలలకంటె వీరు పనిచేయ”రని ఏ. జే. శానెంకో అనునాతడు వ్రాసినాడు.

ఈ సోమరితనముయొక్క ఫలితము వైరాగ్యము, నిందాత్మక, లోకద్వేషబుద్ధి. వారికి లలితకళాభిరుచులు లేవుసరికదా, సర్వసాధారణస్వాభావిక వాంఛలుసైతము లేకున్నవి. వారు కేవలము ఊరపందులు, కుక్కలువలె జీవించుచుండిరి. వారికి తమజాతితోను, ప్రభుత్వముతోను కొంచెమైన సంబంధ మున్నదను జ్ఞానము వారికి లేదు. రైతులేకాదు, పట్టణములందలిపనివారు, ప్రభుత్వపు నౌకరులు, రైళ్లపనివారు కూడ సోమరితనము మరగినారు. ఇట్టిపరిస్థితులలో రష్యాదేశదారిద్ర్య మత్యధికమై యుండుటలో వింత లేదు. ఐరోపాలోని ఏదేశమునందునుగూడ ప్రజ లింతదారిద్ర్యము ననుభవించుచుండుటలేదు. రైతు లుండునది యొకగుడిసె. అది మంటితోగాని, కొయ్యచెక్కలతోగాని నిర్మింపబడి, పశువుల కొట్టమువలె నుండెను. స్త్రీపురుషు లనువివక్షత లేకుండా జనులును, పశువులునుగూడ చిన్నచిన్నకంపుగొట్టుగదులలో నుందురు. పండుకొనుటకు పడక యనునదిగూడ చాలమందికి లేకుండెను. అప్పుడప్పుడు పదేండ్లకో ఇరువదేండ్లకో యొకమారు గ్రామము తగులబడిపోవుట కలదు గనుక ఈ అనారోగ్యనిలయము లంతయొందుచుండునుగాని లేనిచో రష్యాదేశము పుచ్చిపురుగులు కారియుండునని కొందరు ఆరోగ్యశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

రైతుల ఆహారముకూడా పుష్టికరమైనది కాదు. రొట్టె, బంగాళాదుంపలు తప్ప వారికి తినుటకు వేరే పదార్థములు లేవు. మూరగాయలు, కాబేజీ, ఉల్లిపాయలు, దోసకాయలు సైతము చాలమంది రైతుకుటుంబములకు కరవైపోయినవి.

౧౯౦౪-వ సంవత్సరము పొడుగున కలిపి అమెరికారైతు ౨౮.3 పూడులధాన్యము నాహారముక్రింద నుపయోగించినట్లు లెక్కవేయబడినది.

పూడు అనగా ౧౨ వీసెలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | |
|---|---|---|
| జర్మను రైతు | పూడులు. | ౨౮ |
| ఆస్ట్రియా రైతు | ,, | ౨౩.౩ |
| ఫ్రెంచి రైతు | ,, | ౨౩.౩ |
| బ్రిటీషు రైతు | ,, | ౨౩.౦ |
| రష్యా రైతు | ,, | ౧౫.౩ |

ఆహారముక్రింద నుపయోగించినట్లు లెక్కవేయబడినది. ఇట్లని, రష్యాలో మాంసాహారమునకు వలసిన జంతుసంపద, చేపలు తక్కినదేశములకన్న తక్కువగ నున్నవని చెప్ప వీలులేదు. ఈ జంతుమత్స్య సంపద నభివృద్ధిచేయుట కెన్నో అవకాశము లుండెను. రష్యా దేశములో కఱవులవలన, ప్లేగువలన నివారింపవీలుగల జాడ్యములవలన వేనకువేలు మరణించుచుండిరి.

రష్యాదేశపరిపాలన వ్యయము, రైతులస్థితికి తగినట్టిది కాదు. అది నానాటికి హెచ్చుచుండెను. పన్నులభారము వారిపైన అత్యధికముగా పడెను. ఇంకొక అన్యాయ మేమన: ప్రభుత్వము, పన్నులను సెప్టెంబరునెలలో వసూలు చేయుచుండును. అందువలన రైతులు అప్పుడే పండించి నూర్చిన ధాన్యము నేకాడికైన తెగనమ్మి శిస్తు చెల్లించవలసివచ్చుచుండెను. అప్పటికి పంట తయారుకానట్టిపోగాకు మొదలగు పంటలపైనసైతము పన్నుల నప్పుడే గ్రహించుచుండిరి. పన్ను నిచ్చుకొనుటకు చేత రొక్కము లేని రైతుల సామానులు జప్తు చేయబడుచుండెను. దేశముయొక్క అర్థపద్ధతికి విదేశవు ఎగుమతి వ్యాపారమే ఆధారముగా నుండెను. హిందూదేశము వలెనే రష్యాలోకూడ, ముడిపదార్థములు, అందు ముఖ్యముగా అపరదినుసులు (Cereals) విదేశఋణము యొక్క వడ్డీలను తీర్చుటకొరకు ఎగుమతి చేయవలసి వచ్చుచుండెను. ఇందుకొరకు దిగుమతులకన్న ఎగుమతు లధికముగనుండి తీరవలెనుగదా! ఋణగ్రస్తత యొక్క ఫలితములలో నిది యొక్కటి. రష్యాదేశము తనపంట తన కెంత యావశ్యకమైననుగూడ దానిలో చాలభాగము ఇరుగుపొరుగుదేశముల కమ్ముకొనవలసివచ్చుచుండెను. ౧౯౦౮ లో ఆహారధాన్యముల ఎగుమతి చాలా తగ్గిపోగా ఆర్థికముగా దేశమునకు చాలాదిక్కుకలిగెను. విదేశీయుల పెట్టుబళ్లసాహాయ్యమున రష్యాదేశమున పరిశ్రమలు కొన్ని నెలకొల్పబడెను.

పారిశ్రామికాభివృద్ధికొరకు వ్యయము చేయుటకొరకు ప్రభుత్వకోశములో ధనము లేకుండెను. రష్యాదేశపురైళ్లు ఇతరదేశపురైళ్లవలె దేశమునకు అర్థలాభము చేకూర్పజాలవయ్యెను. అనేకమోసములవలనగూడ వానిలాభములు పోవుచుండెను. ప్రతియేట లక్షలకొలది జనులు టిక్కెట్లు లేకుండ ప్రయాణము చేయుచుండిరి. ఈభారమెల్ల రైతులపైనను కార్మికులపైనను బడుచుండెను. రష్యాప్రభుత్వపు గనుల పరిశ్రమయు, మత్స్యపరిశ్రమయు గూడ లాభకరముగ లేకుండెను. ప్రభుత్వపు బ్యాంకువలనగూడ గొప్పలాభము లేకుండెను. ఇట్లు దేశముయొక్క ఆర్థికాభివృద్ధికి అనేకావకాశము లుండినను, అవి సార్థకముగాకుండెను. ఇందువలన దేశముయొక్క ఋణగ్రస్తత అత్యధికముగా పెరిగిపోవసాగెను. ప్రభుత్వాదాయములో నాలుగవవంతు సొమ్ము ఋణముల వడ్డీలు తీరుచుటకొరకే వినియోగింపబడుచుండెను. ౧౯౦౨ నాటి కీఋణము ౬౬౬౪౦౦౦,౦౦౦ రూబులు లుండెను. ౧౯౦౯ నాటి కిది ౯,౧౭౪,౦౦౭,౬౦౦ రూబులు లయ్యెను. (ఒకరూబులు విలువ రమారమి రు. ౧-౯-౩). ప్రభుత్వాదాయములో నూటికి ౨౮ వంతులు ప్రభుత్వమువారి అబ్కారీ "వాడ్కా" సారాయముల యిజారావలననే వచ్చుచుండెను. ఈ త్రాగుడువ్యసనము సామాన్యరైతులందు మాత్రమేగాక వర్తకులందు, మతబోధకులందు, ప్రభుత్వోద్యోగులందు విద్యార్థులందుగూడ బాగుగ వ్యాపించియుండెను. ఇందువలన అనారోగ్యము, నేరములు, పెరిగిపోవుచుండెను.

దేశముయొక్క విద్యాభివృద్ధి బాగులేక పోవుటయట్లుండగా, పాఠశాలలందు శిక్షణముగాని, ఋజువర్తనముగాని, విద్యాబోధనముగాని తిన్నగా లేకుండెను. విద్యార్థులందు స్వేచ్ఛావిహారము, దుర్మార్గము, దుర్వ్యస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నములు నధికములయ్యెను. తుదకు పాఠశాలల మదిరా గృహములుగ, ద్యూతమందిరములుగ నుపయోగింపసాగెరి. ధనికులపిల్లలు ఉపాధ్యాయులపై నలిగి సమ్మెలు కట్టుచుండిరి. నీతిధర్మములుగూడ అడుగంటెను. చౌర్యము, సాహసము, హత్యయుగూడ దుర్మార్గములుగా నెంచబడకుండు దినములు వచ్చెను. విప్లవప్రబోధకాభిప్రాయములు మంచికి గారణములు గాక చెడ్డకే కారణములు కాసాగెను ముద్రణ ప్రకటనములపై నుండిన అదుపు, ఆజ్ఞ తీసివేయబడగనే మతమునకు, నీతికి సంఘమునకుగూడ విరుద్ధములగు నభిప్రాయములు వెద చల్లబడసాగెను. కాని ఉత్తమసారస్వతప్రకటనమునకుగాని, ఉత్కృష్టాశయముల ప్రకటనమునకుగాని తోడ్పడ వయ్యెను. మతమునందుగాని, రాజకీయములందుగాని పూర్వాచారపరాయణులుగ నుండినవా రెవ్వరైననుసరే ఎట్టి బంధుత్వముగాని, స్నేహముగాని లెక్కచేయకుండ దూషణలకు పాత్రులగుచుండిరి.

ఇంటర్మీడియటు పాఠశాలయందు 'ఫ్రీలా' అనబడు విచ్చలవిడికాముకత్వ ముపదేశింపబడసాగెను. "ఫ్రీలా లీగులు" బయలుదేరి వింతలగు సంఘనిబంధనలుచేసి చాలమంది యువకులను, యువతులను పాడుచేసెను. ఎట్టకేల కీదుర న్యాయములను గూర్చి వార్తాపత్రికలు విమర్శించెనుగాని దీని నొక్కసారిగా అణచుటకు వీలు లేకపోయెను. ఆనాటి గొప్పగ్రంథకర్తలగు మాక్సింగోర్కీ, టాల్‌స్టాయి, మున్నగువారి గ్రంథములుగాక, నేడు మనదేశములో రైళ్లలో అమ్మబడు అవినీతికరములైన పుస్తకములకన్న నూరురెట్లధిక దుష్టములగు నీచగ్రంథములు వెలువడి, ప్రజలమనస్సులందు విషబీజములను వెదచల్లసాగెను. ఇట్టి పరిస్థితులు రష్యాదేశ జాతీయతకు వేరుపురుగులగుటలో వింత లేదు. ఒకరష్యాదేశభక్తుడు నేడు రష్యాజాతియనునదియే లేదని వగచినాడు.

రష్యాదేశపురైతులను స్వతంత్రులను జేసి వారికి విజ్ఞానవికాసము గలిగించుటయే "బోల్షివిజం" విప్లవోద్యమము సాధించిన మహాత్కార్యము.

జారుచక్రవర్తి యేలుబడికాలములోని రైతులు చాలా నేర్పుగలవారు మంచివారు ననుమాట నిజమే కాని వారు అబద్ధములాడుదురు; దొంగతనములు చేయుదురు; జిత్తులమారులు. వారు హిందూదేశములోని ఒడ్డెరులు, ఆఫ్రికా దేశములో కాంగో నదీ తీరమున జీవించుబంగాశాలు వంటిమొరటుజాతివారని చెప్పవచ్చును. బలవంతముగా విద్య యణచివేయబడెను. నాటిగ్రామజీవనముయొక్క దుర్గతి వర్ణనాతీతము. బానిసవ్యాపారులు కూలీమేస్త్రీలు చాలమంది వ్యవసాయపు కూలీలను గొడ్లనువలె అడవులకు తోలుకొనిపోయి అడవులను ఛేదించి, గొడ్లమేత కనువుగా చేయించుచుండిరి. నదీతీరములకు వీరిని తోలుకొనిపోయి వీరిచే పడవలను లాగించుచుండిరి. ఎడ్లు, గుఱ్ఱములు చేయు పనులను వీరిచేత చేయించుచుండిరి. తా మిచ్చిన క్రయధనమునకు రెండుమూడురెట్లధికముగ వెల పుచ్చుకొని వీరిని ఫ్యాక్టరీయజమానుల కమ్ముచుండిరి. కొందరు బానిసవ్యాపారులు గ్రామములవెంట తిరిగి చిన్నపిల్లలను దరిద్రులవద్ద స్వల్పపువెలలకు కొనివేయుచుండిరి. పాతికమందినో, ఏబదిమందినో ఇట్లుకొని, పశువుల వర్తకులు దూడల నంపినట్లు లీపిల్లలను సెంట్‌పీటర్సుబర్గు(నేటి లెనిన్‌గ్రాడ్ నగరము)నకు రవాణా చేయుచుండిరి.

ఈపరిస్థితులవలన జనసామాన్యముయొక్క పిల్లల చిత్తవృత్తులందు ధర్మము, న్యాయముకూడ నశింపసాగెను. దిగ్భ్రమ, అసహాయ్యస్థితి తోపాటు తీవ్రమగుద్వేషము ప్రబలసాగెను. ఈస్థితిగతులలో సదా త్రాగుడువలని మైకముతో, వికృతాకృతితో, దొంగచూపులతో, చింపిరిగుడ్డలతో, సగము మచ్చికచేయబడిన అడవిమృగములవలె తిరుగు స్త్రీపురుషులజన కంటకజాతియొకటి బయలుదేరి పెరుగసాగెను. వీరిలోని క్రూరస్వభావము విపరీతము. గ్రామస్థులకు, అధికారులకుగూడ వీరు భయకారులుగా నుండిరి. తండ్రులను బాధించుపిల్లలు, ఉన్నదెల్ల త్రాగుటకు వెచ్చించి ఆలుబిడ్డలను దిక్కులేకుండ విడనాడుపురుషులు నుండిరి. ఈ దిక్కుమాలిన అడవిమనుష్యులవంటివారిలో ఆత్మలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్తిగా నశింపకుండ ఉద్ధరించి మానవసంఘమునం దొకభాగముగా జేయుటయే బోల్షివికువాదులు చేయ బూనుకొన్నపని.

"నేటిరైతు పూర్తిగా కన్నులుతెరచినాడు. పౌరసత్వబాధ్యతలను జాగ్రత్తగా నిర్వర్తించుటలో నాతని కనేక అవకాశములు, పనులుకల్పింపబడినవి. సంగీత, సాహిత్య, వ్యాయామ, నాట్యసంఘములలో నతడు సభ్యుడుగాచేయబడినాడు. క్లబ్బులలో నతడు సభ్యుడు. లక్షోపలక్షలను వార్తాపత్రికల నిర్వాహకవర్గమునందు గూడ ప్రాయశః అతడు నియమింపబడియేయుండును. అతడు తనగ్రామమునకు, లేదా పెక్కుగ్రామములకు ప్రతినిధియై సర్వసమాన సంఘస్వామ్యవాదులకమ్యూనిస్టు ప్రముఖులలో నొక్కడు కావలెనన్న ఆశయమునుగూడ కలిగియుండవచ్చును. అతనికి దున్నుకొనుటకు కావలసినంతభూమి కలదు. నిజముగా రష్యా రైతును, తేజోవంతములగు నతనినయనములను, ఉత్కృష్టమగు నతనిజీవిత విధానమును, స్వయముగా చూడనివా డెవ్వడు నతనినిజస్థితిని గ్రహింపజాలడు" అని డాక్టరు డిల్లన్ వ్రాసినాడు.

ఇరువదేండ్లక్రిందటివరకు రష్యారైతులకు స్వతంత్రమానవస్వత్వములుగూడ పూర్తిగా లేవని చెప్పవచ్చును ఒక ఉన్నతపాఠశాలలోగాని, ఇంటర్మీడియటు పాఠశాలలోగాని ఒకరైతుచేరదలచిన గాని, లేదా, ఏదైననొకచిన్నవ్యాపారము చేసికొందలచినగాని, ముందుగా నతడు రైతుసంఘములో తనకుగలహక్కులు వదలుకొనవలసియుండెను. భూమిని పొందుటకుగల హక్కులనుగూడ వదలుకొనవలసియుండెను. ఈశాసనవిధివలన, తెలివితేటలుగలవారికెల్లగకు గ్రామాంతరవాసమే విధింపబడినట్లు లయ్యెను. ఒకరైతు తనగ్రామము విడిచి, మంచికూలిదొరుకుపట్టణమునకు పోవదలచినచో తనకుటుంబయజమానియొక్క అనుజ్ఞను గాని రైతుసంఘముయొక్క పెత్తనదారు అనుజ్ఞను గాని పొందవలసియుండెను. ఇందుకొరకతడెన్నాళ్లు వేచియుండవలెనో, ఎంతమంది నాశ్రయించవలెనో, ఎన్నిలంచముల నొసగవలెనో, ఒక్కొకప్పుడు న్యాయాధికారులతో నెన్నిచిక్కులు పడవలెనో దేవునకెఱుక.

ఇక పారిశ్రామికపద్ధతులందన్ననో, ఒకకూలివాడు తనయజమానునిఅనుజ్ఞ లేకుండ పనిలోకి రాకమానినచో క్రిమినలుశిక్షకును, జుల్మానాకును పాత్రుడగుచుండెను. కోర్టులందలిన్యాయముకూడ దీని కనుగుణముగ నుండి మనుష్యునిహోదానుబట్టి శిక్షలు విధింపబడుచుండెను. కొరడాదెబ్బల శిక్ష యున్నందున వ్యవసాయపుకూలీలస్థితి బానిసలవలెనే యుండెను.

సోవియటుప్రభుత్వముచేసినపనులలో కాయకష్టముచేయువారికిని. కష్టపడకుండ ధనమార్జించువారికిని గలహక్కులకు గొప్పతారతమ్యము కలిగించుటయొక్కటి. "కూళకు" అనగా కూలివారిచేత పనిచేయించుకొను యజమానులు పెద్దరైతులు వీరికిగల ఆదాయములనుబట్టి పన్నులు విధింపబడుచున్నవి. గ్రామజీవనమునందు, సంఘస్వామ్యమునందు నీకూళకులకు వోటుహక్కుగాని, సివిలుహక్కులుగాని లేకుండ చేయబడినవి. ఈ కూళకులు తక్కినపారిశ్రామిక రైతులవలెనే నటించి అనేకమోసములు జేయుచు హక్కులు సంపాదింప బ్రయత్నించుచుందురు. ఈ మోసములు కనిపెట్టుటకు ప్రభుత్వ మనేకగూఢచారులను నియమించి వీరిని శిక్షించుచుండును. వీరి భూములను స్వాధీనపరచుకొనుచుండును. సోవియటు రాజ్యములోని వ్యవహారములు మార్చ వీలులేనట్లు స్థిరముగా నినుపచట్రములలో బిగియింపబడవు. ఏశాఖలోనైననేదైన లోపము కనబడినచో నది వెంటనే సవరింపబడును. ప్రతికార్యాలయములోను లోటుపాటులు వ్రాయగలందులకు ఫిర్యాదులు వ్రాయగలందులకు ఒక బోర్డుబల్ల యుంచబడును. దానిపైన నెవ రేమివ్రాసినను జాగ్రత్తగా విచారింపబడి నిజమున్నచో తగుచర్య గైకొనబడును. సోవియటు పాఠశాలోపాధ్యాయులు సైతము అప్పుడప్పుడు పరీక్షింపబడి వారి శక్తియందు లోపములు కనబడినచో వారు తీసివేయబడుదురు.

సోవియటు రాజ్యములోనివిద్య యనేక మార్గముల నభివృద్ధిని గాంచుచున్నది. సినీమాద్వారమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రజలసాంఘికాచార జీవనములు, దుస్తులు, పండుగలు, శరీరశాస్త్రము; ఖగోళశాస్త్రము, మున్నగు ప్రకృతి శాస్త్రవిషయములు; శిశుసంరక్షణము; ప్రసవవైద్యము జన్మనిరోధము, ప్రజారోగ్యము మున్నగు విషయము లెల్ల చక్కగా ప్రజలకు బోధింపబడును. ఉపాధ్యాయులు, ఉపన్యాసకులు నూర్వుర దరిని తమ తమ శాస్త్ర జ్ఞానమును ప్రజలకు బోధించు చుందురు. అనేక వస్తుప్రదర్శనములు, పారిశ్రామిక ప్రదర్శనములు జరుపబడుచుండును. చిత్రవస్తు ప్రదర్శనాలయములు, గ్రంథాలయములు విరివిగా స్థాపింపబడినవి. రేడియో దూరశ్రవణయంత్రముల ద్వారావిద్యాప్రచారము గావింపబడుచున్నది. యుద్ధపూర్వము నూటికి తొంబదిమంది నిరక్షరులుగానున్న రష్యాలో నిప్పుడు నూటి కెనుబదిమంది విద్యావంతులుగా నున్నారు.

ఇంకొక విశేష మేమన ప్రతిపట్టణములోను, ఒక ధర్మపుక్లబ్బు, పఠనమందిరము నెలకొల్పబడినవి. దాని నంటి యొకవిచారణమందిర ముండును. అచ్చట బాలుర వృద్ధులు, రైతులు, కార్మికులు, వీరువా రనువివక్ష లేకుండ, ఎల్లరును తమకు గావలసిన సమస్తవిషయము లనుగూర్చి యడిగి తెలిసికొనవచ్చును. టైము ఎంత? రైలు ఎన్నిగంటలకు బయలుదేరు ననుప్రశ్నలు మొదలు ప్రపంచవార్తలు, శాస్త్రవిషయములు పైతము అడిగిన వారికి చెప్పవలసినదే!

పైనచెప్పబడిన విషయములం దెల్ల పురుషులతో పాటు స్త్రీలును సమానాధికారము, అవకాశములు కలిగి అభివృద్ధి గాంచుచున్నారు.

వ్యవసాయవృత్తియందు పడి, ధనికులలాభముకొరకు కష్టించుగోజులుపోయి రష్యాదేశపురైతులు సోవియటు సార్వజనికప్రభుత్వాధికారు లైనారు. ప్రభుత్వోద్యోగుల నెన్నుకొనుటలో రైతులకు పలుకుబడి, వోటు కూడ కలదు. గ్రామములందు, పట్టణములందు నున్న పారిశ్రామికుల క్షేమలాభములకొరకే అన్నిపనులు నిర్వహింపబడుచున్నవి. పొరబాటు లప్పుడప్పుడు జరుగు చున్నను మొత్తమువిూద జనసామాన్యముయొక్క సమష్టి క్షేమలాభములకొరకే సర్వకార్యములు నిర్వహింపబడు చున్నవి. చిరకాలమునుండి జనులుపడియున్న అధోగతి నుండి; వారిని పైకిదీసి, ఉద్ధరించుకొరకు; ఆధునికజ్ఞానమునందు వారినిగూడ భాగస్వాములుగా జేయుటకు ప్రయత్నములు జరిగినవనుటకు సందియము లేదు. పుస్తకములు, కరపత్రములు, వార్తాపత్రికలు వారికొరకు ఏటేటను లెక్కలేనన్ని ప్రకటింపబడి పంచిపెట్టబడుచున్నవి వారిపిల్లలకు చదువుచెప్పుటకు పాఠశాలలును,యువకులకుసాంకేతికవిద్య, వృత్తివిద్య నేర్పుపాఠశాలలును, నెలకొల్పబడినవి. దేశమందంతటను ఉపన్యాసములొసగబడుచున్నవి. విజ్ఞానము నలుగడల వ్యాపించుచున్నది. అవిద్య తొలగిపోవుచున్నది. పైతరమువారుకూడా విద్యావంతు లగుటకొరకు వయోజనవిద్య స్థాపింపబడినవి. స్త్రీలుకూడ పురుషులతోపాటు తుల్యులుగా నెంచబడుచు దేశనాగరకతయందు సభ్యత కలిగి యున్నారు. దేశములోనిఅన్ని పరిపాలనశాఖలయందును స్త్రీలు నియమింపబడి, దేశముయొక్క రాజకీయసాంఘికఆర్థికపురోభివృద్ధికి తోడ్పడుచున్నారు.

సోవియటుప్రభుత్వము పశుజాతిని పక్షిజాతిని ప్రశస్తతరముగా జేసినది. శాస్త్రపరిశోధనలను ప్రయోగములను జనసామాన్యమునకు తెలియజెప్పుటకు లెక్కలేనంతద్రవ్యము కర్చుపెట్టుచున్నందున పన్ను లొకభారముగా లేవు. ప్రజారోగ్యమును కాపాడుటకు ఆసుపత్రులును విరివిగా స్థాపించబడినవి.

౧౯౧౭-వ సంవత్సరపువిప్లవమువలన అంతకు పూర్వము ధనికులవశమున నుండిన ౧౫ కోట్ల యెకరములభూమి రైతులకొరకు సాగుచేయబడుచున్నది. దేశములో సంఘ స్వామ్యపద్ధతి స్థాపింపబడి, వివిధ కుటుంబములు కలిసి చేయుసమష్టి కృషి, ట్రాక్టరు యంత్రకృషిపద్ధతియు స్థాపింపబడినది. ఇతర దేశములందు వాణిజ్యవ్యవసాయ పారిశ్రామికవృత్తులం దుపయోగింపబడు సహకారపద్ధతు లెల్ల పరిపూర్ణముగా సంస్కరింపబడి రాజకీయార్థికవిషయములు సమన్వయము చేయబడిన సర్వసమానకర్మకర సహకార సంఘస్వామ్యము స్థాపింపబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నివేదనము!*

కవిసింహ, డి. రాజశేఖర శతావధాని

అవనీభారము హెచ్చి ధర్మములు వ్యత్యస్తంబు లైపోవఁ, బూ
ర్వవికాసం బడరింప నీశ్వరుఁడు సర్వజ్ఞుండు మీవంటిమా
నవమూర్ధన్యుల రూప మొంది యిల జన్మంబెత్తు; నీదర్శనా
దివిశేషంబులు లోకమంతటికి సంధించుఁ మహాశ్రేయముల్.

ఒకమెత్తు నీవు వేఱొకమెత్తుగా దైవకోటి నిల్చిన, నిన్నె కోరుకొందు;
స్వామి, నీయీపదద్వయి విశ్వపూజ్యంబు; నడుమఁ ద్రోవను నీవు నడచునప్పు
డడుగుసోఁకిన ధూళి యణుమాత్రమంటిన నఖిలలోకముఁ గాల్చు హాలహలము
చేదంతయును దగ్గి శీతమై తీయనై నిమిషమ్ములో నమృతముగ మాఱుఁ;
ద్వత్పదము లెంతకొలిచినఁ దనివిలేదు; - నీయనఘనామ మెంత ధ్యానించుచున్న
విసుగు గనుపింప; దింకను విడక కొలువ-ధ్యాన మొనరింపఁగాఁ గోర్కి యగునుగాని.

ధర్మసంస్థాపనార్థము ధాత్రి మెలఁగు దేవా! యేకలింగాపరావతార!
పదినాఱులేండ్లు యావననృపుల్ భరతఖండమునకుఁ గూర్చు బన్నములు, వాని
వారింపఁగాఁ బూర్వవీరుల త్యాగంబు ప్రస్తుతకార్యకర్తవ్యములును
నెఱిఁగించుచో, నీదు మృదులాతిమృదులభావం బెంతనొచ్చె దైవమ యెఱుంగు;
వినుకొలఁది చిచ్చు దరికొన్న విధము తోఁచె;- సైన్యబల మల్పమనెకాని చాలియున్నఁ
దలను బూ వాడ కింట నిన్నిలిపి నేనె - రిపుల సర్వనాశన మాచరించియుందు.

భువనపావన, నీవు పూనిన కృతి జగద్వంద్య మందఱము తోడ్పడఁగఁగలము;
రణమహోత్సాహ వర్ధనమైన సుముహూర్త మెంచి సూర్యధ్వజం బెత్తి నిలుపు;
కలికి బంగరుచిఱుగజ్జెలమ్రోఁత మోగలులు యామ్యమహిషకంఠకాంస్య
ఘంటానినాదంబుగా వినెదరుగాక; ధ్వజముచుట్టుందుము బలిసి కొలిచి
పులులఁబోలిన చరణదాసులము మేము; - కడకు మేవాడ నొకచిన్నకత్తిపట్టు
మగనిసువు గ్గ నది రాల కెగురుఁగాత;-యమరులు నుతింత్రుగాక నీవిమలయశము.

ప్రాభవం బిత్తు, రాష్ట్రము నిత్తు, ధన మిత్తు, రాణాను విడనాడి రమ్మటంచు,
ఢిల్లీపురంబునుండి దినంబు వచ్చు లేఖల నొక్కకొట్టంబు గప్పవచ్చుఁ;
ద్యాగైకమూర్తి, ధర్మావతారా, నీముఖము నొక్కమాఱు దూరముననుండి
కనువిందు గాఁగఁ జూచినవాఁ డెవండైన, నీనీచతరమార్గ మెట్లు సొచ్చుఁ
బ్రాణములతోడ నిన్నెడఁబాయఁగలుగు-వాఁ డొకఁడు లేఁడు నీదు సేవకులలోనఁ;
జెంతఁ జింతామణిని వీడి చిల్లిగవ్వ-కెగుబుజము చూప నెవ్వాఁడు మొగమువాచు?

* మత్కృత "రాణాప్రతాపసింహచరిత్ర" యముద్రితమునుండి యుద్ధృతము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హేరావళీభూధరావతంసప్రాంతసానుభాగము యజ్ఞశాలగాఁగఁ
భావనాత్ముఁడు చంద్రభట్టారకు కవిత్వధారలు వేదమంత్రములు గాఁగ
నలసలుంబ్రాకిరాతాధీశుల సమానవిక్రమక్రములు ఋత్విజులుగాఁగ
శార్ఙ్గసన్నిభబలస్థౌల్యశోభితము నీపటుమహాధనువు యూపంబు గాఁగఁ
ప్రబలయవనసేనలు పశుప్రతతి గాఁగ,-యాయజూకుఁడవై దీక్ష నవధరించి
సవనమును దీర్చి లోకమును నిర్యవనముగను-జేసి త్రైలోక్యనుతుల రంజిల్లవయ్యా.

ఔరా! శాత్రవకోటిపాలిఁటికిఁ బశ్యత్కాలమూర్తుల్ గదా
యీరాఠోణ్మణులంచుఁ జిత్తురురణంబు దండ జెన్నర్, రవి
ద్వారంబుదునఁ జేసె శాత్రవకులధ్వంసంబు మాతండ్రి; యా
వీరాగ్రేసరచక్రవర్తి యడుగుల్ వేయేండ్లు నేఁగొల్చెదన్.

పదివేల్వీరుల బాహుశౌర్యయుతుఁ డీబాలుం డటం చెన్నఁగాఁ
గదనం బెచ్చట భీమహా నచటఁ జక్కన్ వ్రాలి, దుర్దాంత శ
త్రుచ్ఛేదము చేసి నిన్ను జయయుక్తున్ జేయ యత్నింతు; నీ
బదనూర్ సింహము తేజసింహము నుడుల్ వ్యర్థంబు గాకుండుతన్.

నిత్యకల్యాణమందిరము చిత్తూరుమండలము వివాహమండపముగాఁగ
రంగుగుల్కు ననేకరాజపుత్రస్యందనమ్ములై రేనికుండలునుగాఁగఁ
గృష్ణసింహాదివీరేశ్వరదోః ప్రతాపస్ఫూర్తి రత్నదీపతతిగాఁగ
యవనభూధవకిరీటాళినిర్గతమణుల్ వజ్రరంజితరంగవల్లిగాఁగ
దస్యుగళరక్తముల వసంతమ్ములాడి, - నీదు కరవాల మెచటఁ దానై తనర్చి
సకలమును దీర్చు నాగపసానిగాఁగ, - విజయలక్ష్మి వరించి నిన్ బెండ్లియాడు.

నింగిన్ముట్టెడు కోటకొమ్మగుములున్ దేవాలయమ్ముల్ జయో
త్తుంగస్తంభము లొప్ప, స్త్రీపురుషు లెందున్ బుత్రపౌత్రాప్తి నొం
దంగా, మాద్నశభూపతుల్ కొలువునన్ ద్వత్పాదముల్ మోయఁగా
సింగారించిన తేరియ ట్లలరు మాచిత్తూర్పురిన్ గాంతునే!

పదివేలేన్గులయంత దార్ఢ్యమున మద్భావంబు నీపాదముల్
గదియున్; నిక్కము దేవదానవులు లాగన్ జూచినన్ సుంతయున్
గదలన్బో; దనిలోన శత్రువుల మ్రగ్గన్ జేతుఁ; గాదేని నీ
పదపద్మంబులమ్రోల వ్రాలి విడుతున్ బ్రాణంబు లోయీశ్వరా!

" రాఠోడ్-తేజసింగ్."

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౬. సక్-మాంగ్ మార్గమున —వి. ఆర్. చిత్ర.



మెట్టూరివద్ద కావేరీనది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri.

—[illegible] కె. రంగస్వామి అయ్యంగారు.



సూర్యోదయవేళ　　—యం. కె. రంగస్వామి అయ్యంగారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నామకల్లు పర్వతప్రాంతము —యం. కె. రంగస్వామి అయ్యంగారు.

# జాతీయ ఆర్థిక స్వయంశక్తి—దానికి మార్గములు

చావలి వేంకట హనుమంతరావు

౧

ప్రపంచమందంతటను ఆర్థికవిషయములలో గొప్పమార్పు కల్గుచున్నది. పూర్వకాలపు ఆర్థికసిద్ధాంతములన్నియు ప్రస్తుతపరిస్థితులలో ఆచరణయోగ్యములు కావని తేలుచున్నది. 'క్రొత్త ఆర్థికపద్ధతి ఎట్లుండవలెను?' అనువిషయము పూర్తిగ స్థిరపడలే దనుమాట నిజమే. దూరదృష్టికలవారందరును ప్రపంచమంతటను ఆవరించియుండు ఆర్థికపుకట్టుబాటు ఏర్పాటుచేయుటయే క్రొత్తసిద్ధాంతములోని మూలవిషయమని గ్రహించుచున్నారు. కాని నిజముగ ఏర్పాటు కాబడుచున్న సిద్ధాంత మేమనిన ఏదేశమునకాదేశము తన ఆర్థికవిధానమును చక్కబెట్టుకోవలెననునదియే. ఈసిద్ధాంతముప్రకారమే రష్యాలో సమష్టివాదపద్ధతి ఏర్పాటుకాబడినది. ఇటలీ, జర్మనీ మొదలగు దేశములలో అది ఇతరరూపముల దాల్చినది. అమెరికాసంయుక్తరాష్ట్రములందుకూడ ఈ సిద్ధాంతమే కొంతవరకు ఆచరణలోనికి తీసుకొని రాబడుచున్నది. ఇతరదేశములలో పద్ధతి వేరయినప్పటికిని ఈ మూల ద్ధాంతము ననుసరించి మార్పు కల్గుననుట కవకాశములు చాలకలవు.

౨

పందొమ్మిదవశతాబ్దము అంతమగుసరికి ప్రపంచార్థికపరిస్థితులలో ఒక ముఖ్యమగు లోపము కనిపెట్టబడెను. ప్రపంచమందలి కొన్ని దేశములు, ముఖ్యముగ పడమటి యూరపియనుదేశములు,అమెరికా మొదలైనవి, తమ పరిశ్రమలను చాల ఎక్కువగ అభివృద్ధి చేసికొనియుండెను. ప్రపంచమందలి మరికొన్ని ఇతరదేశములు పరిశ్రమలలో ఎట్టి ప్రవేశమును లేక వ్యవసాయమే ప్రధాన పరిశ్రమగా కల్గి యుండెను. ఈ దేశములనుండి పారిశ్రామిక దేశములకు పరిశ్రమలకు కావలసినవస్తువు లెగుమతియగుటయు, వాటికిబదులుగ పారిశ్రామిక దేశములందు తయారైనవస్తువు లీదేశముల వారు కొనుటయు వాడుకగా నుండెడిది. ఇంగ్లండు పారిశ్రామికదేశములన్నింటియందును ప్రధానస్థాన మాక్రమించుటయేకాక, దానికిసంబంధించిన బ్యాంకింగు, ఓడలను సప్లయిచేయుట, విదేశమారకముల నేర్పాటు చేయుట మొదలగుపనులందుకూడ చాలప్రాధాన్యమును బడసియుండెడిది. ఈపనులవలన చేకూరిన అపారలాభము వలన పశ్చిమ-యూరపియన్ దేశములలో సంపద ఎక్కువయై, ప్రజలు చాలసుఖజీవితముల గడపుచుండిరి.

ఇట్లు యూరపియన్ దేశముల జాతీయజీవిత మభివృద్ధిపొందుచుండగా, ప్రపంచమందలి ఇతరదేశముల ఆర్థికస్థితియం దెట్టి అభివృద్ధియు లేకుండనుండెను. వర్తకవ్యాపారవిషయములలో ఈ రెండవపక్షమునకు చెందినదేశములకు మొదటిపక్షముదేశములతో సరిపోల్చి చూచిన చాలతక్కువలాభము వచ్చుటయే. సర్ జోషయాస్టాంపువంటి ఆర్థికవేత్త అభిప్రాయములో "ప్రపంచమునందలి ప్రజలు జీవయాత్రకు సరిపోవనట్టి ఖర్చుపై ా యిననూరుసంవత్సరములనుండియు జీవయాత్రగడుపుచుండిరి."

వ్యవసాయముకూడ పరిశ్రమలవలనే ఎక్కువ పెట్టుబడితోను, పెద్దపద్ధతిపైనను జరుపబడుచుండిన దేశములలో వాటి ఆర్థికస్థితియందు కొంత అభివృద్ధి కాన్పించినమాట నిజమే కాని చైనా, ఇండియా మొదలగు తూర్పుదేశములలో పూర్వమునుండియు నుండిన పరిస్థితులలో ఎట్టిమార్పును లేకపోవుటచే, మొన్నమొన్నటివరకు వాటి ఆర్థికస్థితియం దెట్టిమార్పును చెప్పదగినది లేదనియే చెప్పవలసియున్నది. హిందూదేశమునందలి వ్యవసాయదారునియొక్క సంవత్స

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాదాయము, ధరలు చాల ఎక్కువగ నుండిన ౧౯౨౨-౨౩-వ సంవత్సరమునందు కూడ ౪౩౯ రూపాయల కంటెఎక్కువ లేదు. ఆసంవత్సరమే ఆమెరికాలోని వ్యవసాయదారుని సంవత్సరపుసగటు-ఆదాయము ౯౭౦ రూపాయలు, పరిశ్రమలందు పనిచేయువాని సగటు ఆదాయము సుమారు ౨౩౦౦ రూపాయలు నుండెనని అంచనావేయబడినది.

ఈపరిస్థితులవలన ఫలితమేమి? ఒకప్రక్క పారిశ్రామికదేశములగు ఇంగ్లండు, అమెరికామొదలగు దేశములందు అనేకములైన్న లవస్తువులుతయారగుచుండెను. ఇంకొకప్రక్క ఇండియా, చైనా, ఆఫ్రికాదేశము లలో అధికసంఖ్యాకులగుప్రజలు ఆవస్తువులను కొనుటకు తగుశక్తి లేకుండనున్నారు. ఇరువదవశతాబ్దము ప్రవేశించినతరువాత పశ్చిమదేశములలో వస్తువులను తయారుచేయుశక్తి ఇదివరకుకన్న చాలరెట్లు హెచ్చయినది. దానికి కావలసినసాధనములు ఇదివరకుకన్న చాలపెరిగిపోయినవి. ఇప్పుడు ముఖ్యముగ కావలసినది, పెంపొందింపవలసినది వస్తువులను తయారుచేయుట కాదు, తయారయినవస్తువులను అమ్ముటకు తగుసాధనముల నాలోచించుట. ప్రస్తుతకాలమునందు వస్తువులను కొనుశక్తి చాలతక్కువగ నున్నది. దీనివలన కాల క్రమేణ వస్తువులను తయారుచేయుశక్తికిగూడ అంతరాయములు వచ్చుట కవకాశములు కలవు. ప్రపంచమందలి ఆర్థికపారిశ్రామికపద్ధతులవలన ఈక్లిష్టదశ మరింత హెచ్చినది. పరిశ్రమలను బాగుగ అభివృద్ధి చేసుకొనినదేశములలో ధనము అమితముగ చేరుటచే ఆ దేశస్థులు పలురకములగు సున్నితపువస్తువులను చాలఎక్కువగ తయారుచేయుటకు శక్తి సంపాదించిరి. కాని జనబాహుళ్యముకల్గిన వ్యవసాయ ప్రదేశములలో ఆవస్తువులఖరీదు చాలసరసముగ నున్నను కొనుటకు సొమ్ము లేకుండపోయెను. పారిశ్రామిక దేశములు తమసౌభాగ్యము వ్యవసాయప్రదేశములపై నాధారపడియున్నదని గ్రహించుటకు చాలకాలము పట్టెను. అట్లు ఆదేశములు గ్రహింపనంతకాలము ఇతరవిషయములనుసరించి ఆలోచించిన దేశములు వస్తువులను తయారుచేయుపద్ధతులను బాగుగ అభివృద్ధిచేసికొనుటయందే నిమగ్నములయి యుండెను. దూరదృష్టి కలవారు పరిస్థితులవలన ఎప్పటికైనను నష్టము వచ్చుననియు, వ్యవసాయప్రదేశముల కభివృద్ధి లేకుండ తాముమాత్రము ముందడుగువైచుటకు ప్రయత్నించుట పారిశ్రామికదేశముల కెప్పటికైనను ముప్పేయనియు గ్రహించకపోలేదు.

## 3

ఆముప్పు ఇప్పుడు ప్రపంచమునంతను ఆవరించుకొనియున్నదని మన మొప్పుకోవలెను. ప్రపంచమందు ప్రతివస్తువునకును ధర పడిపోయినది. కాని వ్యవసాయమువలన తయారుకాబడిన వస్తువులధరలు పరిశ్రమల వలన తయారుకాబడిన వస్తువులకంటె హెచ్చుగ పడిపోయినవని మనకెల్లరకును తెలియును. అమెరికా సంయుక్తరాష్ట్రములలో చూచినవ్యవసాయవస్తువులు నూటికి ౬౦ చొప్పున తగ్గిపోగా పరిశ్రమలవలన తయారగువస్తువుల ఖరీదు నూటికి ౨౮ వంతుమాత్రమే పడిపోయినవి. వర్తకమాంద్యము ప్రవేశించకముందు కూడ వ్యవసాయదేశములందలిప్రజలఆదాయము, వారి వస్తువుల కొనుశక్తియు చాలతక్కువగనే యుండెడివి. దానికితోడు వర్తకమాంద్యము ప్రవేశించగనే ఆశక్తి ఇదివరకుదానికన్న సగమునకుపైగా తగ్గిపోయెను. అనగా వ్యవసాయదారుని ఆదాయము ఆతడీయవలసిన పన్నులు, వడ్డి, మొదలగు తప్పనిసరియగు ఖర్చులకు మాత్రము సరిపోవుచుండెడిది. అట్టిసమయములో ఇతర వస్తువులను కొనుటకు వానిచేతిలో సొమ్ముండుట చాలకష్టము. వర్తకమాంద్యమున కొకముఖ్యకారణము వస్తువుల నతివిస్తారముగ తయారుచేయుట; కాని ఆవస్తువుల నెక్కువగ తయారుచేయుట యను విషయము ప్రపంచములో ముక్కాలువంతుప్రజలు తినుటకు తిండి, కట్టుటకు గుడ్డ లేకుండ నున్నారను విషయముతో కలిపిచూచిన తేలు విషయమేమన వర్తకమాంద్యమునకు నిజమగుకారణము ప్రజల కొనుశక్తి తగ్గిపోయిన దనుటయే. ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిస్థితులను మార్చుటకు సాధనము వస్తువులను తయారు చేయుట, తగ్గించుట కాదు. బ్రిటిష్ ఆర్థికమంత్రియగు నెవిల్ ఛాంబర్ లేనుగారు చెప్పినట్లు వస్తువులను కొను శక్తి నభివృద్ధి చేయుటయే దానికి మార్గము. ప్రపంచ మండలి వివిధదేశముల ఆదాయములలో ఇంతవ్యత్యాస మున్నప్పుడు, ఆవ్యత్యాసమును తగ్గించినగాని ఆశక్తి నభివృద్ధిచేయుట కష్టము.

ఇట్లు ప్రస్తుతకాలములో ప్రపంచ-ఆర్థిక-అభివృద్ధియందు ఒకక్లిష్టదశలోనికి మనమువచ్చియున్నాము. పరిశ్రమలకు కావలసినవస్తువులను తయారుచేయు దేశములకును, పరిశ్రమల నభివృద్ధిచేసికొనినదేశములకును కలభేదములపై నాధారపడియున్న ప్రపంచ-ఆర్థికపుఏర్పాటువలన అనేకనష్టము లున్నవని మన కిప్పుడిప్పుడే విశదమగుచున్నది. వ్యవసాయదారులు పడుకష్ట మెక్కువ. వారికి దానివలన వచ్చు ఆదాయము తక్కువ. వర్తకము పరిశ్రమలు లాభములోని ఎక్కువభాగమును పొందుచు చాలకాలము అనుభవించెనుకాని, ఆయనుభవము ఎల్లకాలమును జరుగునని తలంచుటకు వీలులేదు. ఇదివరకు ఆర్థికపుఏర్పాటు ఎంతలాభముగ నుండెనో ఇప్పుడంతకుపదిరెట్లు ఎక్కువయగు నష్టకరమైనది. వర్తక, పరిశ్రమలయు, వ్యవసాయములయు మధ్య ఒకవిధమగు సంయోగ మేర్పాటైనగాని ఈక్లిష్టపరిస్థితులనుండి బయటబడుట కల్ల. యంత్రసహాయమువలననడుపబడు పరిశ్రమల ఫలితములు చాలవిచిత్రమైనవి మనముచూచియున్నాముకాని ఆఫలితము లికముందు వచ్చునని తలంచుట కవకాశము లేదు. ఈకాలములో మనుష్యుడు ఆతనికి అవసరమగువస్తువుల నన్నింటిని కొద్దిఖరీదుతో తయారు చేయుట నేర్చుకొనెను. కాని మనుష్యునిశక్తితోపాటు ఆశక్తిని సరియగు పద్ధతులపై ఉపయోగపరుచుట, ఎక్కువమందికి లాభకరమగువిధమున ఉపయోగపరచుట తెలిసికొనలేదు. ఈ నేర్పు, నేర్పునకనుముం దట్లు చేయవలె ననెడు అభిప్రాయము ఆచరణలోనికి రావలెననిన ప్రపంచ-ఆర్థికపరిస్థితులను పద్ధతిప్రకారము ఏర్పాటుచేయుటయే ముఖ్యమగు మార్గము.— అనగా ప్రపంచమునందుండినధనము, దానివలన వచ్చు ఆదాయము ఇదివరకుకన్న నీతిపథము లగునట్టియు, న్యాయసమ్మతమైనట్టియు పద్ధతులపై విభజించుటయే దానికి మార్గము.

## ౪

ఈకాలములో సుంకములకట్టుబాట్లు, దిగుమతుల తగ్గింపులు, మారకపు ఇబ్బందులు మొదలగు అనేకములగు అడ్డంకులు వర్తకమునకున్నవి. ఇవన్నియు చాల కష్టతరములగు అడ్డంకులు; కాని ప్రతిదేశమును తనయొక్క జాతీయపరిశ్రమలను రక్షించుకొనునిమిత్తము, విదేశములనుండి దిగుమతుల నడ్డునిమిత్తము వాటినన్నిటిని ఏర్పాటు చేసికొనవలసిన అవసరము వచ్చుచున్నది 'రక్షణసుంకముల' విధించి, యూరప్ ఏషియాఖండములలోని క్రొత్తదేశములు తమ ప్రధాన పరిశ్రమల పెంపొందించుకొనుటకు ప్రయత్నించుట మొదలిడినవి. యుద్ధమునకు ముందుకూడ 'సుంకముల గోడలు' ఉండెను. కాని యుద్ధానంతరము పూర్వము కన్న చాలరెట్లు పెరిగిపోయినవి. సుంకములకు తోడు ఇతర-అడ్డంకులుకూడ అనేకము లిటీవల బయలుదేరి వర్తకము సరళీగా జరుగుట కడ్డంకులయిపోయినవి. యుద్ధానంతరము యూరప్ఖండములో ఏర్పాటయిన క్రొత్తదేశములలో 'ఆర్థిక జాతీయత' సిద్ధాంతము ప్రబలి దేశమునకు దేశమునకు మధ్య నిరాటంకవర్తక వ్యాపారమునకు తీరనినష్టము తెచ్చిపెట్టెను. మొట్ట మొదట ఈసుంకములు పూర్తిగ తయారైన వస్తువుల దిగుమతిపైనమాత్రము విధింపబడుచుండెను; రానురాను పరిశ్రమలకు ముఖ్యావశ్యకములగు వస్తువులపై కూడ విధింప మొదలుపెట్టబడెను. ఈపరిస్థితులు అనేకదేశములలో ౧౯౩౧-వ సంవత్సరమున బంగారుప్రమాణమును తొలగించుటతో మరింత దుర్భరము లాయెను. బంగారు ప్రమాణము తొలగింపబడుటతోనే సుంకములు హెచ్చుచేయబడుట, విదేశవర్తకము నరికట్టుటకు మార్గము లేర్పాటగుట మొదలగునవన్నియు జరిగెను. దానితో అంతర్జాతీయ వర్తకము పూర్తిగ తగ్గిపోయెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుంకములవిధించుటయనునది పరిశ్రమలను రక్షించుట కంతసుకరమగు మార్గము కాదని గ్రహింపవలసియున్నది. వాటివలన వస్తువులను కొనువారికి చాల నష్టము కలదు. తరువాత ఏపరిశ్రమలకు రక్షణ ఈయబడుచున్నదో వారు స్వంతలాభము చూచుకొని ప్రజలకు నష్టము కల్గింపవచ్చును. ఒకసారి సుంకములను విధించినతరువాత మరల వాటిని తొలగించుటకాని, తగ్గించుటకాని చాలకష్టమగుపని. వ్యవసాయమే ముఖ్యవృత్తిగా కల ఇండియావంటి దేశములో సుంకముల విధించుటవలన పరిశ్రమల కెక్కువ లాభము చేకూర్చుటయే కాక వ్యవసాయదారులకు నష్టము వాటిల్ల జేయుటకు కూడ అవకాశము లున్నవి.

ॐ

పైనచెప్పబడినసంగతులు నిజముకావని ఎవ్వరు ననలేరు. కాని సుంకములతగ్గించుటకు ప్రయత్నము చేయుట ఒకరాతిగోడకు తలకాయ కొట్టుకొనుటయే యగును. సుంకములను విధించుటకు ముఖ్యోద్దేశ్యము పరిశ్రమలకు రక్షణ విచ్చుటయే. అదికాక మనదేశము సంగతి చూచినహిందూ దేశప్రభుత్వాదాయములో చాల భాగము ఎగుమతి సుంకములవలన వచ్చుచున్నది. ఆపరిస్థితులలో మనప్రభుత్వమువారు ఇతరాదాయమార్గము లేవియు అన్వేషింపబడకపూర్వమె ఆసుంకములను తగ్గించుట తటస్థించుట కష్టము. బంగారుప్రమాణమునుండి తొలగినదేశములందలి నాణ్యములప్రమాణములు స్థిరమైనయెడల రక్షణసుంకములు కొంతవరకు తగ్గించుటకు వీలగును. కాని ఈవిధముగ తగ్గించినను కూడ తమతమక్రొత్తపరిశ్రమల రక్షించుటకు విధించుకొనిన పన్నులను పూర్తిగ తొలగించుట కేదేశమువారును కూడ అంగీకరించరు. అట్టిరక్షణపద్ధతి అనేకవాదనలచేత బలపరుపవచ్చును; వానికి వ్యతిరేకముగ వాదన లుండినప్పటికిని అవి ప్రభుత్వముల కంగీకార్యమగుట కష్టము. కెయిన్సువంటి ఆంగ్లేయార్థికవేత్త పదిసంవత్సరములకు ముందు అడ్డంకులు లేని వర్తకపుపద్ధతిని ఆమోదించుచుండెడివాడు. ఇప్పుడు రక్షణసుంకముల పద్ధతిలో కొన్నిలాభములు లేకపోలేదని అంగీకరింపవలసివచ్చినది. కాన అంతర్జాతీయవర్తకపు టభివృద్ధి దృక్పథము నుండి సుంకములపద్ధతిలో చాలలోటుండినప్పటికిని వాటిని పూర్తిగ తొలగించుటయందు కొన్నినష్టములు కలవని గ్రహింపవలసియున్నది.

౧౯౨౭నను, ౧౯౩౩నను సమావేశమైన ప్రపంచార్థికసభలలో సుంకములను తీవ్రముగ ఖండించు ప్రతిదేశప్రతినిధుల అంగీకారముతో తీర్మానము లామోదింపబడెను. కాని నట్టి తీర్మానముల నెగ్గ చేయుటమాత్రమే ఇంతవరకును జరుగుచున్నవి. కాని ఆతీర్మానముల నాచరణయందుంచుటకు తగుప్రయత్నమింతవరకు చేయబడియుండలేదు. సుంకములు తగ్గింపవలెననియను, తీసివేయబడవలెననియను (౧) ప్రతిదేశమందును ప్రభుత్వపుఖర్చు తగ్గింపబడవలెను; (౨) నాణెముల ప్రమాణము స్థిరపరుపబడవలెను; (౩) ప్రతిదేశము పారిశ్రామికముగ ఇతరదేశములపై ఆధారపడియుండక తన స్వశక్తిపైననే ఆధారపడియుండునట్లు చేయవలెను. చివర చెప్పబడిన షరతు అన్నిటిలో ముఖ్యమైనదియు, ఆచరణలోనికివచ్చుట కెక్కువ కష్టమైనదియు నైయున్నది. ఎందువల్లనన కొన్ని దేశములు తాము పారిశ్రామికముగ ఇతరదేశములపై నాధారపడియుంటె మను నభిప్రాయమున్నంతకాలము, అవి తమపరిశ్రమల నభివృద్ధిచేసికొనుటకు రక్షణ సుంకములను విధించుట మానవు. హిందూదేశమునకు కావలసిన బట్టలను సప్లయిచేయుటకు లంకాషైరు, జపాను, ఇండియా-నూను దేశములుకూడ ప్రయత్నములు చేయుచున్నవి. ఈపోటీ ఇట్లుజరుగుచున్నంతకాలమును, హిందూదేశము తనబట్టలమిల్లుపరిశ్రమను పెంపొందించుకొనుటకై ఇతరదేశములనుండి దిగుమతియగుసరకులపై దిగుమతిసుంకములు విధింపక తప్పదు. దిగుమతిసుంకముల విధించకుండ ఇతరమార్గములవలన కూడ ఈపోటీని తగ్గించుట కవకాశములు కలవు. ఈ విధముగానే ఇతరదేశములవారుకూడ ఏవిధముగా ఎట్టి విధానము నవలంబించిన * ఏదేశమునకుగాని ఎక్కువ

* ఈవ్యాసము వ్రాయబడుచున్న సమయములో హిందూదేశము లంకాషైరు, జపానుదేశముల ప్రతినిధుల కేవిధముగా ఈపోటీ తగ్గింపవచ్చు ననువిషయమునుగురించి రాయబారములు జరుగుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇబ్బంది లేకుండ ఈ వర్తకపుపోటీ తగ్గించుటకు వీలగునో ఆలోచింపవలసియున్నది. అట్లాలోచించి దానికి తగువిధానము నేర్పాటుచేసి ప్రస్తుతపు ఆర్థికపద్ధతిని మార్చుటకు ప్రయత్నము చేయవలసియున్నది. అనగా ఏయేదేశములో ఏయేపరిశ్రమ నేర్పాటుచేయవలెనో, ఏయే దేశపువస్తువు లేయే దేశమునకు ఎగుమతిచేయుటకు వీలుండునో ఈ విషయములన్నియు ఆలోచించి ఒక పద్ధతి నేర్పాటుచేయవలసియున్నది. ఈ పద్ధతివలన మాత్రమే ప్రపంచమును ఇప్పుడున్న దురవస్థనుండి తొలగించుటకు వీలగును. ఈ పద్ధతివలననే ఇప్పుడు ప్రపంచమందు ఒక దేశమునకు ఇంకొక దేశమునకు మధ్యనున్న హెచ్చుతగ్గులు సవరించుటకు అవకాశము కలుగును.

ఈమధ్యను జరిగిన ప్రపంచ-ఆర్థికసమావేశము పైన వ్రాయబడినవిషయమునుసరించి ఎంతమాత్రము సరియగు విధానము నేర్పాటుచేసియుండలేదు. సుంకములను తగ్గించుట, నాణెముల ప్రమాణమును స్థిరపరుచుట, కొన్ని వస్తువులను కొన్ని దేశములుమాత్రమే తయారు చేయుటను గురించిఅంతర్జాతీయపుకట్టుబాట్లుఏర్పాటుచేయుట మొదలగువిషయములనుసరించి చర్చమాత్రము ఆసమావేశమునందుజరిగెను. వీటిలో ఒకదానిపైనొకటి ఆధారపడియుండుటచే, ఒకపని జరుగుటకై తక్కినవికూడ దానితోనే చేయవలసియుండును. కాని అటుజరుగుటకు అడ్డంకులు చాల ఉన్నవి; ఆ అడ్డంకులే ప్రపంచ ఆర్థికసమావేశము భగ్నమగుటకు కారణము. కాన ఇప్పుడు జరుగునది ప్రపంచమం దేదేశమున కాదేశము తన ఆర్థిక, పారిశ్రామికస్థితిని బాగుచేసికొనుటకు ప్రయత్నమో, ఏవో కొన్ని దేశములు ఒకసంఘముగ చేరి తమ ఆర్థిక దుస్థితిని తొలగించుకొనుటకు మార్గముల నన్వేషించుటమో యైయున్నది. త్వరలో ఏదో యొక అనుకూల మగు ఏర్పాటు చేసుకోబడునని తలంచుటకవకాశములు చాల తక్కువగ నున్నవి. కాని ఈ దుర్భరస్థితి చాలకాలమిట్లేయుండునని తలంచుటకుకూడ వీలు లేదు.

## ౬

ఆర్థికవిషయములలో జాతీయభావములు ౧౯-వ శతాబ్దము చివరనుండి బయలుదేరి కాలక్రమేణ పెంపొంది చివరకు ఐరోపామహాయుద్ధములో పరిణమించినవి. ౧౯౩౦ వరకు పరిశ్రమలవిషయములో ఇంగ్లండు ప్రధానస్థాన మాక్రమించుచుండెడిది; కాని దరిమిల్లాను జర్మనీ, ఫ్రాంసు, సంయుక్తరాష్ట్రములు కూడ తమ పరిశ్రమల నభివృద్ధిచేసుకొని, బ్రిటన్‌కన్న కూడ ముందంజ వైచుటకు మొదలిడెను. వర్తకములోను క్రొత్తబజారులను సంపాదించుటవలన ఇంగ్లండుకు ముఖ్యమగు పోటీదారు జర్మనీ. ఇంకొక అనుకూలమగు విషయ మేమన బ్రిటను పూర్తిగ పరిశ్రమలపైనేన ఆధారపడియుండుచుండగా, జర్మనీ, ఫ్రాంసు, అమెరికాదేశములు పరిశ్రమల నభివృద్ధి చేసుకొనుటతో పాటు, తమవ్యవసాయము నభివృద్ధిచేసుకొనుట, పరిశ్రమలకు కావలసియుండు వస్తువులను పండించుటకూడ ప్రక్కనే జరుపుకొనుచుండుట. ఈపద్ధతిని అనుసరించుటవలననే ఆదేశములు ఇతర దేశములపై ఆధారపడియుండ నవసరము లేక తమస్వశక్తిపైననే అన్నిటికిని ఆధారపడియుండగల్గుటకు వీలాయెను. రష్యాయందు ఆదేశపునాయకు లేర్పాటు చేసిన ౫ సంవత్సరముల ప్లానుకూడ ఈఉద్దేశ్యముతో ఏర్పాటు చేయబడినదే. ఇటలీ, జర్మనీలుకూడ అట్టి "ప్లాను"లు వేసుకొనియే తమపారిశ్రామికాభివృద్ధికి అనువగుమార్గము లేర్పాటు చేసుకొనుచున్నవి.

జాతీయపారిశ్రామికస్వశక్తి సూత్రము ఆచరణలోనికి వచ్చుటకు అనేకములగు అనుకూలపరిస్థితులు ప్రస్తుతకాలమం దున్నవి. ఒకప్రక్కను ఇదివరకు వ్యవసాయమే ముఖ్యవృత్తిగా కల్గినదేశము లన్నియు ఇప్పుడు తమతమపరిశ్రమల నభివృద్ధి చేసుకొనుటకు, వాటికి రక్షణము లేర్పాటుచేసుకొనుటకు ప్రయత్నించుచున్నవి. ఇంకొకప్రక్క పారిశ్రామికదేశములు తమపరిశ్రమలకు కావలసినవస్తువులకై ఇతరదేశములపై నాధారపడియుండ నక్కర లేకుండ ఆవస్తువులను తామే పండించుకొనుటకు ప్రయత్నములు చేయుచున్నవి. మొదటితరగతి దేశములలో యంత్రపరిశ్రమ లభివృద్ధి చెందినకొలదిని అవి రెండవరకపు దేశములలో తయారగు పారిశ్రామికవస్తువులను కొనుట తగ్గించుకొనును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౯౩౭-వ సంవత్సరపు "ప్రపంచ ఆర్థికపరిస్థితు" లను గ్రంథములో ఈవిషయమై ఇట్లు వ్రాయబడియున్నది: "క్రొత్తదేశములలో పారిశ్రామిక-అంగములు ఎక్కువ వ్యాప్తి చెందుటయు, వాటినిగురించినజ్ఞాన మభివృద్ధి చెందుటయు, ఇదివరకే పారిశ్రామికముగ ఎక్కువ అభివృద్ధిచెందినదేశములు ఇతరదేశములనుండి తమకు కావలసినవస్తువులను తెప్పించుకొనుట మాని తామే ఆ వస్తువులను పండించుకొనుటకు ప్రయత్నించుటయు ప్రపంచములో వ్యవసాయదేశములలో పండిన వస్తువులు అచ్చటనే నిల్వయుండిపోవుటకును, పారిశ్రామికవస్తువులు అమ్ముడువోకపోవుటకును ప్రధాన కారణము లగుచున్నవి."

పాశ్చాత్యదేశములలో జనాభా హెచ్చుతగ్గులు లేక యుండుటచేతను, ఆదేశస్థులు వ్యవసాయమునందు శాస్త్రీయపద్ధతులను ప్రవేశపెట్టి భూమిపంట హెచ్చునట్లు చేసుకొనుటచేతను, ఇతరదేశములవ్యవసాయవస్తువులకై వారు ప్రాకులాడుట తగ్గిపోయినది. దీనివలన ఇకముందు దేశదేశములమధ్య వర్తకవ్యాపారము ఇదివరకుకన్న తగ్గిపోవునని తలంచుట కవకాశము కలదు.

౭

అనేకవిధములుగ ఆలోచించిన ఇంగ్లండుదేశము ఆర్థికవిషయములలో ఇతరదేశములతో సంబంధము లేకుండ నుండుట కష్టమని స్పష్టమగును. ఆదేశపుపారిశ్రామికపద్ధతి చాలఎక్కువగ అభివృద్ధిగాంచిన దగుటచే ఆదేశపుఔన్నత్యమును ఇతరదేశములకు తన వస్తువుల నమ్ముటయందును, ఇతరదేశములవస్తువుల నా దేశము కొనుటయందును ఆధారపడియున్నది. ఇట్టి దేశముకూడ ప్రస్తుతపరిస్థితులలో తనపరిశ్రమలకు రక్షణనిచ్చుటకును, ఇతరదేశముల దిగుమతులు దేశములోనికి రాకుండునట్లు చేయుటకును అవసరమైనది. అడ్డంకులు లేనివర్తకము (Free Trade) ఇంగ్లండువిషయములో కూడ తిరుగ ప్రవేశపెట్టబడుట కష్టమే. ఆపద్ధతివలన లాభములు లేకపోలేదు. కాని ఆర్థికజాతీయత ప్రబలుచున్న ఈరోజులలో, ఏదేశముకాని పూర్తియగు "ఫ్రీట్రేడు" పద్ధతి ననుసరించుట జరుగదు.

అడ్డంకులులేనివర్తకమును ఇదివరలో ఆమోదించిన ఆర్థికశాస్త్రవేత్తలు అన్నిదేశములకును ఏదోకొన్ని వస్తువులను తయారుచేయుటలో ప్రత్యేకావకాశము లుండుననియు, కాన వర్తకమున కేయడ్డంకులు లేని పరిస్థితు లుండిన అన్నిదేశములకును లాభదాయకమే యనియు తలంచి దాని నామోదించిరి. కొంతవరకు ఈ అభిప్రాయము ఇప్పుడుకూడ నిజమే. ద్రాక్షసారాయమును తయారుచేయుటలో ఫ్రాంసునకున్న ప్రత్యేకావకాశము లెప్పుడు నట్లేయుండును. సిలోనునకు తేయాకును తయారుచేయుటలో అట్లే ప్రత్యేకావకాశములు ఎల్లప్పుడు నుండును. అయినను ప్రస్తుతకాలములో అన్ని వస్తువులను తయారుచేయుట కన్నిదేశములకు కొంత కాకపోయిన కొంతయైనను అవకాశ ముండుననుటలో అనుమాన మేమియులేదు. ఈమధ్యను కైన్సుదొర వ్రాసినట్లు అనుభవమువల్ల బయల్పడునదేమన అన్నిదేశములకును అన్నివస్తువులను తయారుచేయుటయందును కొంచెముహెచ్చుతగ్గుగా సమానమగు అవకాశములే యున్నవనువిషయము. దీనికి కారణము ప్రపంచములో పారిశ్రామికముగ అన్నిదేశములందును అభివృద్ధికల్గుటయే. దీనికి తార్కాణముగ ఒక విషయము తెల్పవచ్చును. ఇదివరలో క్యూబాద్వీపములో చక్కర తయారుచేయుటకు అవకాశములు చాల ఎక్కువగా నుండెడివి. కాని ఇప్పుడు హిందూదేశమునందుకూడ చక్కర తయారగుటకు మంచిఅవకాశము లున్నవని ఈమధ్య చక్కెరపరిశ్రమయొక్క అభివృద్ధినిబట్టి తేలుచున్నది. దీనివలన తెలుసుకోవలసినవిషయమేమన ప్రపంచవర్తకము అభివృద్ధిపొందవలె ననిన, అంతర్జాతీయఆర్థికసంబంధములు బాగుపడవలెననిన అన్నిదేశములకును వీలైనంతవరకు తమతమపరిశ్రమల నభివృద్ధిచేసుకొనుట కట్టియడ్డంకులు నుండకూడదనునది.

౮

ప్రస్తుతకాలములో ఒకదేశమునకును ఇంకొకదేశమునకును మధ్య ఆర్థికవిభేదములు హెచ్చుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రపంచఆర్థికసమావేశము విచ్ఛిన్నమగుటతో ఆవిభేదము లింకను ఎక్కువయగుననియే తలంపవచ్చును. ఏదేశమున కాదేశము తనయొక్క ఆర్థికవిధానము నొకపద్ధతిపై ఏర్పాటుచేసుకొనుటవలన మొత్తముమీద ప్రపంచములో ఇప్పుడున్న హెచ్చుతగ్గులు తగ్గిపోవుననుట కవకాశము కలదు. కాని ఎన్ని దేశము లిట్లు తమ స్వంతశక్తిపై పూర్తిగా ఆధారపడియుండగల్గినవి కలవు అనునది చాల క్లిష్టసమస్యయే. ౧౯౩౩ లో జరిగిన ప్రపంచఆర్థికసమావేశములో జాతీయస్వయంసహాయ సూత్రమునకు కొంతవరకు ప్రోత్సాహ మీయబడినది. కాని అప్పుడుకూడ వివిధ దేశముల విస్తీర్ణము, జనసంఖ్య, పరిశ్రమాభివృద్ధికిగల అనుకూలపరిస్థితులు మొదలగువాటిపై ఇది ఆధారపడియుండవలెననికూడ చెప్పబడెను. ఈవసతులన్నియు కల్గియున్నట్టి దేశములు యూరప్‌ఖండమందే చాల తక్కువగ నున్నవి. ఇతరఖండములలో అమెరికా సంయుక్తరాష్ట్రములు, రష్యాదేశము మాత్రము ఇట్టి జాతీయ స్వయంశక్తిపద్ధతి నమలులోనుంచుటకు తగు పరిస్థితులయందున్నవి. రష్యాలో ఈసూత్ర మిదివరకే ఆచరణయందుంచబడుచున్నది; అమెరికాసంయుక్తరాష్ట్రములలో దానినాచరణలోనికి తెచ్చుట కిప్పుడిప్పుడే ప్రయత్నములు జరుగుచున్నవి.

ఇండియా, చైనాదేశములు ఈ విషయములో చాల ఇతరదేశములకన్న అనుకూలపరిస్థితులు కలిగియున్నవి. కాని విదేశవర్తకమును విడనాడుటకు ప్రస్తుతస్థితిగతులలో వాటికి వీలులేదు. ఎందువల్లననగా విదేశవర్తకముతగ్గిపోయినయెడల హిందూదేశమునకువిదేశములలో చెల్లింపవలసినబాకీ లుండిపోయి వాటిని చెల్లించుటకు బంగారు నెగుమతిచేయవలసియుండును.

కాన పూర్తియగుస్వయంసహాయ సూత్రము ఏర్పాటుచేయుట చాలదేశములవిషయములలో కష్టమైనప్పటికిని వీలైనంతవర కట్టిప్రయత్నముచేయుట అందరకును లాభదాయకమే. ఎప్పుడు ప్రపంచమందలి దేశములన్నియు ఆర్థికముగ స్వయంశక్తిపై ఆధారపడియుండునట్టిస్థితి ఏర్పడునో అప్పుడుమాత్రమే ప్రపంచమందలి ఆర్థికస్థితి పూర్తిగ బాగుపడుట కవకాశ ముండును. అప్పుడు దేశదేశములమధ్య సహకారమున కడ్డుగానున్న ఆర్థికపు టడ్డంకులుపోయి అంతర్జాతీయభావము లేర్పడుట కనుకూలస్థితిగతు లేర్పడును.

౬

పూర్వకాలపు టార్థిక కాంతర్జాతీయభావములు ప్రస్తుతకాలమందు ఆచరణయోగ్యములు కావు. వాటి స్థానమున నూతనాంతర్జాతీయభావములు బయలుదేరవలెను. వీటియందు ప్రధానవిషయముగ ప్రపంచమందు ప్రబలియున్న ఆర్థికపులోటుపాటులు తగ్గించుటకు ప్రయత్నము జరుగవలసియున్నది. క్రొత్తదేశములు పారిశ్రామిక వ్యవహారములలో చాల ముందడుగు వైచుచున్నవి. కాని ఆపారిశ్రామికాభివృద్ధిఫలితముగ తయారైనవస్తువుల అమ్మకమునకు తగుమార్గము లుండినగాని ఆఅభివృద్ధి పూర్తిగ లాభకరమని చెప్పుటకు వీలులేదు. అమెరికాదేశములో గొప్పమోటారుపరిశ్రమాధికారి యగు హెన్రీఫోర్డుగారిని ఈమధ్య ఒకరు ప్రపంచ ఆర్థికదుస్థితిని తొలగించుటకు మార్గ మేమి యని ప్రశ్నింపగా తనపెన్సిలుతో బల్లపై ౧౬౦,౩౦౦,౪౦౦ అను అంకెలుమాత్రము వేసెనట. ఆతనిఅభిప్రాయమేమనగా ప్రపంచఆర్థికదుస్థితి తొలగవలెనని రష్యా, ఇండియా, చైనాలలో గల ౮౦౦ మిలియన్లప్రజల యొక్క ఆర్థికస్థితి బాగుపడుటయే యని.

కాని ఏదృక్పథమునుండి ఈసమస్యను మనము పరిశీలించినను తేలున దేమనగా ప్రపంచపు భావ్యార్థిక పరిణామము హిందూదేశపుస్థితిగతులపై ఆధారపడియున్న దనునది. హిందూదేశపుఆర్థికస్థితి బాగుపడుటకుమార్గము ఆర్థికవిధానము నొకపద్ధతిపై నేర్పాటు చేయుటయే. అట్టి ప్రయత్నమును చేయుటయందే మన దేశస్థులు తమదృష్టిని కేంద్రీకరింపవలసి యున్నారు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## తిక్కన

**వేము లక్ష్మీకాంతమ్మ**

ఎంతశక్తియుతుండవో యెఱుగలేము
గుత్తగొంటి విశ్వప్రేమ; కోవిదుడవు,
విమలపదమున నిల్చితి వేడ్కమీఱ
హరిహరునిచెంత మధురవాక్యామృతంబు
విందుగొల్పుచు సరసత వెల్లివిరియ
దనియజేయుచు దిక్కనా దాగినావె?
కాదుకా దటులైన ప్రకామవృత్తి.

నాంధ్రభాషను మదికి నాహ్లాదమిడగ
వన్నెమీరుచు నలరుల తిన్నెపోలె
కయితతావుల నిల జల్లగల్గు టెట్లు?
కూర్మితనయుడు ముద్దుగా గోరి పిలువ,
వత్సలత జెంతకును దల్లి వచ్చుభంగి
నీదుమోమున వెల్వడు స్వాదుపదము
సొబగుపగిదిని తనుబిల్వ సుతుడవనుచు
నాంధ్రభాషామతల్లియు నలరి రాగ
గారవంబున మురియుచు ఘనులు మెచ్చ
నంకతలమున ముద్దుగ నాడుచుండు
తిక్కనా, నీదుకావ్యంబు నేనెట్ల
కోర్కెదీరంగ బలుమారు గ్రోలుచుండు.

లలితపదసుమసౌరభం బలరు నీదు
వాక్యమాల నాఘ్రాణించి వాడిపోని
సరసకావ్యంబు నూతనస్రజమువోలె
నెల్లవేళల మనసు రంజిల్ల జేయు,
శ్రమమువాయ బథికునకు జల్లగాలి
మాడ్కి సంసృతిశ్రమమును మడియజేసి
కవనవాయువుల్ నిత్యసుఖంబు నొసగు,
నీదు కావ్యయశోలక్ష్మి మోదమలర
అరయ మనమున నానంద మంకురించి
పదముపదమున కుత్సాహవాంఛ పొదల
పరగ జెంద మాకర్ణించి ప్రకృతిమరచి
ఎలమిగాంచుచు మేడమెట్లెక్కినట్లు
కౌతుకంబున. సుకుమారకంఠమెత్తి
కవనసుఖపారవశ్యాన కనుల బాష్ప
కణము లురులంగ పులకితగాత్ర నగుచు
తృష్ణగొనువారి రీతిని తృప్తిసనక
మరియుమరియును జదువుచు మనసుహెచ్చ
బుద్బుదంబగు నిస్సారభువిని విడచి
నిర్మలానందరసనిధిం దేలుచుండు.

మహిమనలరంగ కవిరాజమధురరసము
భావగాంభీర్యరమ్యాపహా పదముకూర్పు
చదువునపుడెల్ల గ్రొంగ్రొత్త చవులు జిమ్మి
పరువములు కమ్మతావులు బరపుచుండు.

ఆంధ్రభాషామతల్లి ప్రేమార్ద్రియగుచు
సంతతము నీదు నుడువుల చాయ కలర
సులభమున గాజుకుప్పెలో జలముభంగి
తేటపడజేయు నీనేర్పు దెలుపదరమె.

మధురరసయుక్తఫలములమాడ్కి సౌర
భముల జిమ్ము లేబూమాలపగిది నమరి
వాడిపోవక తావుల బ్రబ్బుచుండ
మనసు మోదింప నీకావ్యమారుతంబు
కాలనిర్ణయమును లేక ఘనతగాంచు!

పూర్ణకళ లూర రేరాజు భూమియందు
కాంతివ్యాపించి నిండినకరణి నాంధ్ర
భాషయందు క్షయములేక ప్రబలుడగుచు
కళల బరగించి నుతికెక్కి కలియుగమున
బ్రదికియుంటివి కవిరాజ ప్రాభవమున.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సంతాననిరోధసిద్ధాంతము: హిందూదేశము

చతుర్వేదుల శ్రీరామ నరసింహం, యమ్. ఏ.,

సంఖ్యాభివృద్ధి పశు, వృక్షజాతులందువలెగాక మానవజాతియందు కొంతవరకు, వ్యక్తుల ఆర్థికోపపత్తినిబట్టియు, మత, సాంఘిక, రాజకీయములగు కట్టుబాటులనుబట్టియు ఆధారపడియుండునని ప్రొఫెసరు మార్షలు చెప్పియున్నాడు. ప్రజాభివృద్ధిసమస్య యీకాలమునకు సంబంధించినదేకాక, ఏదోరూపమున ప్రతియుగమునందును, ఆలోచనాపరులచే చర్చ చేయబడియే యున్నది. ప్లేటోనాటి గ్రీసునందు అధినివేశనము లధికముగ నుండుటచేతనో, యుద్ధావసరమునకో జనాభివృద్ధి సాంఘికబలమున కాధారమని గ్రహింపబడినది. కాని, అరిస్టాటిల్ మొదలగువారు, తలిదండ్రుల బాధ్యతలబరువు తగ్గవలెననిన, సంఖ్యాభివృద్ధి నిశేషముగ చూడవలెనని చెప్పిరి.

"రాస్చర్" పండితుడు తెల్పినటుల, గడచిన కాలములో, ఈసమస్యనుగూర్చి అభిప్రాయమున ఆటుపోటులు గలవు. "కరీ", "వేక్ఫీల్డు" పండితులు ప్రజాభివృద్ధివలన కలుగు మేళ్లను వేనోళ్ల పొగడిరి. "ప్రజాక్షీణత దేశదౌర్భాగ్య" మని "చైల్డు" గారి వాదము.

"ఫ్రెంచిఫిజియోక్రాటులు" జీవనపరికరముల పరిమితిని అతిక్రమించకుండ, సంఖ్య అభివృద్ధిచెందునని సిద్ధాంతము చేసిరి. వీరిసిద్ధాంతమును "ఆడామ్ స్మిత్" మార్పుచేయుచు, జీవనసామగ్రి అచలము కాదనియు, దేశకాలములబట్టి మార్పుచెందుననియు నుడివెను. ఆవేశనకర్తలు (Factory employers) మాత్రము ప్రజవృద్ధికావలయుననియే కోరుచుండిరి.

పదునెనిమదవశతాబ్దముఅంత్యదశయందు, దూరదృష్టిగలప్రముఖులుకొందరు "సంఖ్య హద్దుపద్దులు లేక వృద్ధియగుట క్షేమమా?" అనుసమస్యను తీవ్రముగ చర్చింపసాగిరి. వీరిలో "మాల్థస్" ముఖ్యుడు. ఈ సమస్యకు సంబంధించిన గ్రంథమును (Essay on principles of Population) ౧౭౯౮-వ సం. "మాల్థస్" ప్రచురణచేసెను. వీనివాదమును మూడు భాగములుగ విభజింపవచ్చును:

౧. తినుబండారములు హ్రస్వమగుట, జాడ్యములు, యుద్ధములు, శిశుహత్యలు, సంతాననిరోధము మొదలగు అడ్డంకులు లేకుండిన, ప్రజలవిషయప్రమత్తతనుబట్టి మారిన ప్రతిదేశమందును, సంఖ్య విపరీతముగ అభివృద్ధిచెందియుండెడిదని చరిత్ర తెల్పుచున్నది.

౨. మానవునిపరిశ్రమకు, ప్రకృతి ఇచ్చు ఫలితము, ప్రజావృద్ధికి పరిమితిగా భావింపబడవలయును. కాని ప్రజాభివృద్ధి ననుసరించి జీవితసామగ్రి వృద్ధి చెందలేదు.

3. భూతకాలమున ఎట్లో, భవిష్యత్తునను అట్లే, సంతాననిరోధసిద్ధాంతమును అవలంబింపకుండిన, దారిద్ర్యమువలననో, జాడ్యమువలననో ప్రజ క్షీణించుట నిశ్చయము. ప్రతిమానవుడును నైతికముగనే జీవితమును గడుపుచు, బాల్యవివాహములను తిరస్కరింపవలయును.

"డాక్టరుఓగిల్" ౧౮౯౦ సం. Royal statistical society యందుపన్యసించుచు, స్త్రీల వివాహపుసకటువయస్సును, ఉన్నదానికంటె ఐదేండ్లెక్కువచేసిన వివాహఫలితముగ ప్రాప్తించుపిల్లల సకటుసంఖ్య ౪.౨ నుండి 3.౧కు వచ్చుననిరి.

తినుబండారములకంటె వడిగ జనాభా హెచ్చును. తినుబండారములు ౧:౨: 3:౪ క్రమమున (Arithmetical Progression) హెచ్చుచుండ, జనాభా ౧:3: ౯:౨౭ రేషియోలో వృద్ధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యను (Geo metrical Progression) నని మాల్ థస్ నుడివెను.

ఆధునికార్థశాస్త్రజ్ఞులు ఈక్రిందివిధముగ "మాల్ థస్" సూత్రమును విమర్శించిరి. ఆహారసామగ్రుల ఉత్పత్తి అంత్యవేళయందు హీనప్రతిఫలన్యాయబద్ధమైనను (Law of diminishing returns) సేవ్యముచేయు భూమివైశాల్యమును వృద్ధిచేయుట వ్యవసాయపద్ధతులలో గలుగు పరివర్తనములనుబట్టిచూడ జనాభాకంటె తినుబండారముల ఉత్పత్తి ఎంత కాలమువరకైనను వృద్ధిగావచ్చునని తోచుచున్నది. అట్లే పాశ్చాత్యదేశములలోని అనుభవములు చాటుచున్నవి. జనాభానుగూర్చినసమస్య కేవలము సంఖ్యకు సంబంధించినదే కాక, పదార్థముల ఉత్పత్తియందలి నేర్పరితనమువిూదను, ఆదాయవిభజన (Distribution) యందలి న్యాయమువిూదను ఆధారపడియుండును.

విమర్శనము ఇట్లున్నను ఈకాలమున Neo-Malthusian సంఘములు ప్రపంచమందంతటను విచ్చలవిడిగ నున్నవి. సంతాననిరోధమును గూర్చి 'Eugenics' అను గొప్పశాస్త్రము తయారైనది. ఇది ఇంగ్లండులో మతప్రముఖుడగు "డియన్ ఇంగ్" గారికి అభిమానవిషయము. దేశములో బుద్ధిమంతులు, స్థితిమంతులే జీవోత్పత్తి చేయవలయు ననియు, నిశానిదారులు, దరిద్రనారాయణులు నిరోధించవలయు ననియు ఈశాస్త్రములోని ముఖ్యోద్దేశము.

ప్రపంచమందంతటను బోధింపబడుచు, అన్ని దేశములలోను "నాగరికు" లనబడువారిచే ఆమోదింపబడి, కొందరిచే అమలులో పెట్టబడిన ఈసంతాన నిరోధమునకు మార్గములు కేవలము కృత్రిమములు. వైద్యశిఖామణులచే ఈ విషయమై చేయబడుచున్న పరిశోధనలు ఆశ్చర్యజనకములు.

మన ఆర్థికశాస్త్రజ్ఞులు కొందరు సంతాననిరోధము హిందూదేశమున కవసరమని చెప్పుచున్నారు. ఖుషాల్. టి. షాగారు Wealth and Taxable Capacity of India అను గ్రంథములో ౩౮౧-వ పుటయందు ఇట్లు చెప్పిరి : "సంఘములో మెలుకువ గాంచి, వివేకవంతులగువారిచే కనుగొనబడు ప్రతి మార్గమునను, హిందూదేశములో ప్రజావృద్ధిని నిరోధించుటకు నిశ్చయజ్ఞాన మవసరము."

అంతవిపులముగ కాకపోయినను, ప్రొఫెసరు కాళె తనవాదమున, ఆఖరునకు, అట్టిపర్యవసానమునకే వచ్చెను. నైతికముగనే కాక ఆర్థికముగగూడ ఇట్టి వాదము నిరాధారమని షాగారిచ్చిన అంచనానే మనము ఆధారముగా గైకొని చెప్పవచ్చును.

## ఆర్థికవాదము

౧. "హిందూదేశములో జనసంఖ్య ఇంక వృద్ధిచెందుటలో సమ్మతింపకుండుటకు రాజకీయ హేతువుకంటె బలిష్ఠము కాకపోయినను, దానితో సరిసమానమగు ఆర్థికహేతువులు గలవు. ౮౫౫౦ కోట్ల రూపాయల కిమ్మతుగల సంఘాదాయమునకు ఇంక ౨౦౦ కోట్లరూప్యములు కలిపి, ౨౪ కోట్ల ప్రజలకు పంచిచూచిన, సకటునమనిషికి ౧౪౫ రూ.ల వంతున వచ్చును. స్వదేశసంస్థానముల ప్రజలను, ఆదాయమును కలిపి చూచిన, సకటున, సాలుకు, మనిషికి, కనీసము ౧౫౦ రూ. లే (?) వచ్చును." అని షాగారనిరి. సకటున ౬౫రూ. నుండి ౪౫ రూ. సంవత్సరాదాయమునే అనుభవించుచున్న ప్రజలకు షాగా రిచ్చిన మొత్తము దొడ్డదిగ కానుపించును. కాని, షాగారు, ౧౪౫ రూ. సంవత్సరాదాయము మనకు సంతృప్తికరమగు సుఖజీవనము నివ్వదా? అనిన, అది వేరు ప్రశ్నగ భావింతురు. ఇట్టి ఆధారములవిూద సంతాననిరోధము హిందూదేశమున కవసరమని ఘోషించిరి. కొద్దిగ ఆలోచించి చూచినయెడల, తానుహర్పుండిన కొమ్మను తానే నరుకుకొనునట్లు షాగా రిచ్చిన Data వారినే ఖండించునని తోచకమానదు. షాగారు చెప్పినటుల మన సంఘాదాయము విభజనచేసి చూచిన నెలకు ౧౫ రూ. వంతున వచ్చును. ౫ గురు మెంబర్లు గల కుటుంబమునకు నెలకు ౪౫ రూ. లేక సంవత్సరమునకు ౪౫ × ౧౨ = ౯౦౦ రూ. వచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ Data ను బట్టి సంతాననిరోధావశ్యకతనుఎవరు, ఎట్లు నిశ్చయించగలరు ?

౨. ప్రొఫెసరు షాగారు, ఈఆదాయము, సకటునవచ్చునది కాని, యథార్థముగ ప్రతివానికి విభజనలో (Distribution) ఇంతే వచ్చునని కాదనిరి. దీనినిబట్టి తేలునది, అర్థవిభజనలోనిదోషముగాని, సంఘాదాయము తక్కువనియు, అందువలన సంతాననిరోధము అవసరమనియు కాదు. విభజనలో సంస్కరణ అవసరముగాని సంతాననిరోధముగాదు.

౩. షాగారిఆర్థికవాదము, వారిగ్రంథములో, వారే, మరొకచోట ఇచ్చిన Data నుబట్టి చూచిన ఇంకను అర్థరహితమని తోచును. ౩౧౦-౧౧ పుటలో, ప్రస్తుతము సేద్యము చేయుచున్న భూమివైశాల్యము ద్విగుణీకృతము చేయవచ్చు ననిరి. ౩౧౪-వ పుటలో, వ్యవసాయమునకు సంబంధించిన అంతర్జాతీయములగు లెక్కలను (statistics) ఎత్తివ్రాయుచు "ఈక్రిందివాటిని బట్టిచూచిన హిందూదేశములో వ్యవసాయమువలన వచ్చుప్రతిఫలము అభివృద్ధిచేయుటకు అవకాశము కల" దనిరి. సంయుక్తరాష్ట్రములతర్వాత, గోధుమక్రింద, ఎక్కువభూమి మనదేశమున కలదు. కాని హెక్టారు (౨½ ఎకరములు) పండుపంట, ఆవర్జావేసిన, హిందూదేశము ప్రపంచములో కనిష్ఠస్థానము నాక్రమించినది. హిందూదేశములో ఒకకోటి ఏబదివేల హెక్టారులభూమి గోధుమక్రింద ఉన్నది. పంట ౭౦౦ లక్షలహండ్రెడువైటులు.

ఫ్రాన్సుదేశములో ౫౫ లక్షలహెక్టారులభూమి గోధుమక్రింద ఉన్నది. పంట ౮౦౦ లక్షల హం. వైట్లు. వరిపంటక్రింద, ఇతరదేశములకంటె హిందూదేశమున ఎక్కువ. కాని హెక్టారుపండుపంట స్వల్పమే. హెక్టారు ౧౫ హం. వైట్లు. స్పెయినుదేశములో ౫౭ హం. వైట్లు.

వీటినిబట్టిచూడ, మనదేశములోని దారిద్ర్యము ప్రజాధిక్యమువలన కాదు, ఉత్పత్తిచేయు పంట స్వల్పమగుటవలన.

౪. ప్రొఫెసరు కాళిగారి వాదము మొత్తమువిూద చాల అసంతృప్తికరము. వారు ప్రజావృద్ధిని తగ్గించవలయునని తేల్చిచెప్పిరి. దానికి అనుకూలముగ, ప్రౌఢావివాహమును (Late Marriage), సంతాననిరోధమును సూచించుచు, అవి కొంతమందికి అంత అసహ్యకరమైనమార్గములుగ తోచవని Malthusianism విషయమై వారిట్లు నుడువుట చూడ విచిత్రముగ నున్నది. ఇది, మత, నైతిక, రాజకీయ విషయకముగ దూషింపబడుచున్నది. దానిలో అంతర్గతమైయున్న నింద్య వ్యక్తివాదము, స్వార్థపరత సాంఘికవిరుద్ధముగను, పవిత్రమైనకుటుంబమును అంతమొందించునదిగను, రాజకీయసంస్థాస్థితికి (State, not Government) భంగకరముగను పరిగణింపబడుచున్నది.

ఇంకను "దేశక్షేమమునకు కాకుండినను పిల్లలక్షేమమునకైనను సంతాననిరోధావలంబనము నిస్సందేహముగ ఆవశ్యకము. వంశమును నిలబెట్టుట ప్రతిమానవుని పవిత్రధర్మముగ పరిగణింపబడుచుండ, సంతాననిరోధము సామాన్యహిందువునకు అసహ్యముగను, మతవిరుద్ధముగను తోచకమానదు" అనిముగించిన ప్రొఫెసరు కాళిగారివాదమున బల మెంతయో పాఠకులె గమనింతురుగాక !

## నైతికవాదము

నైతికవిరుద్ధమైనకార్యమును, ఆర్థిక, రాజకీయ, సాంఘిక,తదితరైహికకారణములలో నేదియైనను సమర్థింప జాలదు. జితేంద్రియతవలనగాక, కృత్రిమపద్ధతులవిూద ఆధారపడినసంతాననిరోధము నైతికవిరుద్ధము; దూష్యమును. పైన దీనివిషయమైన ఆర్థికవాదము, హిందూదేశములో అధికజనాభానుగాక, స్వల్పోత్పత్తిని తేల్చిచెప్పుచున్నదని చూచితిమి. దారిద్ర్యమునకు కారణము అధికజనాభాయైనను (కొన్నిప్రదేశములందు అదియును నిజమే) Neo-malthusian సంఘములు బోధించు "సంతాననిరోధము" ఏవిధముగనైనను సమర్థింప వీలులేదు. కొన్ని అమానుషాచారములనుగూర్చి ఖండన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనవసరము. అధికజనాభా "జాడ్యము" వలన బాధపడు ప్రదేశములకు మందు, ఇంద్రియనిగ్రహమేగాక వలసపంపుట మరియొకటి గలదు. ఇది రెండువిధములు– (౧) ఒకదేశములోనే ఒకప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు (౨) ఒకదేశమునుండి మరియొకదేశమునకు (భ.గీ. అధ్యాయము ౨).

జనాభానుగూర్చినసమస్య కేవలము ఆర్థికము గాదు, స్థూలము గాదు. కేవలము మానవసంబంధమైనదే కాదు. మానవాతీతమైన శక్తిలో సంబంధించిన సమస్య ఇది. యుక్తక్రమమున, స్త్రీపురుష విభేదముగ జనసంఖ్యను విభజనము చేయుపని మానవాతీతమైన మహోన్నతకార్యము. ఇందువిషయమై, మానవుని విరుద్ధాచరణము పరిత్యాజ్యమును, అశుభమును. ఆధునికశాస్త్రీయమని సమర్థించుట వెఱ్ఱితనము. శాస్త్రము విషవాయువులను (Poisonous gases), బాంబులను కనిపెట్టినదికాన ఆత్మహత్యగాని, పరహత్యగాని శాస్త్రీయమని చెప్పరాదు. ప్రకృతిశాస్త్రము కొన్నిపనులు చేసినప్పుడు సంభవించుహానులను చెప్పునేగాని, ఇది నింద్యము, అది అనింద్యము అని చెప్పదు. నైతికముగ ముఖ్యముగ సంతాననిరోధమును శాస్త్రము అనవద్యము అనజాలదు.

సిద్ధిసాధనమును ఎప్పుడును సమర్థింపజాలము. మంచిరాగలదని చెడ్డ యెన్నడును చేయరాదు; చేయజాలము.

సంతాననిరోధము, తిండిపోతుతనము త్రాగుడు మొదలి తప్పేమైనచో, సాంఘికశ్రేయస్సుగోరి దానిని సాధనముగ పరిగ్రహింపవచ్చును. వ్యభిచారము, హాని యెందున హేయములో అందుననే సంతాననిరోధము హేయము. జనాభివృద్ధిని అరికట్టవలెనన్న గౌరవనీయమై యుక్తమైనది, కృత్రిమమగు సంతాననిరోధము గాదు; బ్రహ్మచర్యము, వివాహితులు అవివాహితులుగ నుండుటయే. "మాల్థస్" చెప్పినట్టుల బాల్యవివాహములను మానవలయును. ఈసమస్యకు మూలపురుషుడగు మాల్థస్ నైతికజీవితమునకు విరుద్ధములగుమార్గములను సూచించలేదు. "neo-malthusians" కృత్రిమములగుపద్ధతులను ప్రచారముచేయుటలో గౌరవనీయుడగు మాల్థస్‌ను అగౌరవపరచుచున్నారు.

ఫ్రెంచిఆర్థికశాస్త్రజ్ఞులు తమదేశములో జనాభా క్షీణించుచున్నదని వాపోవుచున్నారు.

అమెరికనుశాస్త్రజ్ఞు డొకడు తనదేశములో ఆహారము ఎంపరికైనను కలదనియు, సంతాననిరోధము నిర్హేతుకమనియు వ్రాసెను. అమెరికనుశాస్త్రజ్ఞుడు చెప్పినదే మనదేశమునకుగూడ వర్తించును. జనసంఖ్య హెచ్చుని నిలపించుట అనవసరము. జాడ్యము అది కాదు. సోమరితనము నశించవలయును.

కర్మయోగముయొక్క గౌరవమును ప్రతివాడును గ్రహింపవలయును. పదార్థముల ఉత్పత్తియందు నూతనపద్ధతులను అవలంబింపవలయును.

ఇంగ్లండులో జనసంఖ్య భయంకరముగ క్షీణించుచున్నదని మొన్న, మిస్. ఎలినోర్, రాథెబోన్ (పార్లమెంటు మెంబరు) ఘోషించుచు More babies crusade కావలయు ననిచెప్పెను. కడచినవర్షము ఇంగ్లండుకువేల్సులలో, జననములకన్న మరణములు ౨౧,౩౨౬ ఎక్కువఅని తెల్పెను. ఫ్రాన్సు నందుకంటె మూడురెట్లు త్వరితముగ ఇంగ్లండులో జనసంఖ్య తగ్గుచున్నదట.

| | | జనసంఖ్య |
|---|---|---|
| ౧౯౨౦ | వెయ్యికి | ౨౫.౫ |
| ౧౯౩౨ | ,, | ౧౫.౩ |

కడచిన శతాబ్దములోని ఇద్దరుశిశువులకు ఒక శిశువుగా ఇప్పుడు కలుగుచున్నారు. కుటుంబముల వృద్ధిని ప్రోత్సహించుటకై పారితోషికముల నివ్వవలయునని వ్రాక్రుచ్చెను.

వీటినిబట్టిచూడ, ఫ్రాన్సు, అమెరికా, ఇంగ్లండు, దేశములయందు విశేషులు Malthusianism ను ఇప్పుడు నిరసించుచున్నట్లు గ్రాహ్యము.

సోవియటురషియాయందు గర్భస్రావములు న్యాయసమ్మతములు. మాస్కోనగరమున, ఆసుపత్రు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలో సంవత్సరమునకు ౭౦,౦౦౦ గర్భస్రావములు జరుగుచుండెను. జననములు ౬౦ వేలు. తొలుమారు గర్భమును స్రావముచేయుటకు, సామాన్యముగ స్త్రీ బలవంతముచేయనిదే, శస్త్రచికిత్సనుచేయ వైద్యులు అంగీకరించరు. భర్త సైన్యములోనుండినను, పూర్వము సంతుఉండినను, పుట్టుపిల్ల, లేక పిల్లదు పనికి ఆటంకము కలుగజేయునని తోచినప్పటికిని, గర్భస్రావమునకు బహుసూక్ష్మమైన శస్త్రచికిత్స (క్లోరోఫారమ్ మొదలగుమత్తుమందులు లేకుండగనే) చేయుదురు.

ఇట్టిగర్భస్రావములు నైతికవిరుద్ధములు. వీటిని ప్రభుత్వన్యాయసమ్మతముచేయుట మరీవిరుద్ధము. సోవియటుప్రభుత్వమువారు కొలదికాలమునకే దీనిని నిరసించిరని తలచెదము.

ఈసమస్య మన సామ్రాజ్యశాసనసభలో నొకరు, గర్భస్రావములను న్యాయసమ్మతము చేయు బిల్లును ఉపపాదించిరి. దీనిని సభవారు చర్చించరనియే తోచుచున్నది.

కాని మనదేశములో జర్మనుఛాంసెలరు హెర్. హిట్లరుగారి ఉత్పత్త్యుత్పాదనశాసనము (Law of Sterilization) కొద్దిమార్పులతో అవసరమైయున్నది. జర్మనుదేశములో నూతనముగ వైద్యులచే పరిశోధింపబడిన ఈ Sterilization విధానము ఒక సూక్ష్మమైన శస్త్రచికిత్స. ఈచికిత్స పొందినవారు, నిష్ఫలవంతులగుదురేగాని ఇంద్రియసౌఖ్యములకు దూరులుగారు. ఈశాసనమును ప్రవేశపెట్టుటలో హిట్లరుగారి అభిప్రాయము జర్మనీలో రాబోవు సంతతులను బలిష్ఠముచేయుటయే. ఇట్టిశాసనమునే హంగరీలో ప్రవేశపెట్టెదరనియు, వివాహమును రిజిష్టరుచేయుటకుముందు వధూవరులను పరీక్షచేసి, వ్యాధిపీడితులుగ అనుమానింపబడినచో ఈచికిత్స చేసెదరనియు తెలియుచున్నది.

మనదేశమునగూడ కుష్ఠుమొదలగు రోగములు గలవారు వివాహము చేసికొనునెడ ఇట్టి శస్త్రచికిత్సను పొందుట శ్రేయోదాయకము. కాని దీనినైనను సత్సంతాననిరోధపద్ధతిగా నంగీకరింపజాలము.

ప్రపంచమందంతటను నైతికజీవితమునం దగ్రస్థానమును వహించిన భరతమాతగౌరవము కాపాడవలయునన్న కృత్రిమసంతాననిరోధమును దలపెట్టరాదు.

---

## సాకీ!

బొడ్డు బాపిరాజు

పూచిన గున్నమావి నలవోకఁగఁ జుట్టిన యీలతాకుమా
రీచరణమ్ము లంటి యలరించిన తెల్లని గడ్డిపూలలో
దాఁచెను దేవుఁడే మధువు తద్రసలబ్ధులకోస మింక సా
కీ, చషకమ్ము నిండఁగొని యీఁగదె కెంపులుగ్రక్కు మోవికిన్.

ఆసలు నిండునవ్వుల నొయారముగా నడిమింటికిన్ సుధా
వాసితమూర్తి చేరెఁ, జలువల్ దిగమ్రింగిన పైరుగాలి నా
కోసమె వీచు; జాలమునకున్ సమయ మ్మిది కాదుసుమ్ము; ద్రా
క్షాసవపాత్ర వేగ సకియా, కొనిరమ్ము మఱొక్కసారికిన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిక్కువ మీసమస్తధరణీవలయమ్మున నింక దేనిపైఁ
జిక్కదు లేశ మీమెడఁద చిక్కని ద్రాక్షరసాయనమ్మునం
జక్కఁదనమ్మునన్ వయసుసంపద లెన్నిక గొన్న నీయెడం
దక్కిన నోసుధామధురదర్శని, నీచరణమ్ములాన సూ!

వలువాతం జలిగాడ్పుల న్నిదుర విప్పారంగఁ బుప్పొళ్లతోఁ
గరుడుల్ గట్టిన క్రొత్తతేనియల సింగారించుకొంచుఞ్ లతాం
తరసౌధమ్ములఁ గుల్కు పూలచెలులఞ్ సంచారముల్ పుచ్చుబం
భరుఁడున్, వీఁడె మెఱుంగి రింతకుఁ జెలీ, మాధ్వీరసౌచిత్యముల్.

కోరికదీర మద్యమును గ్రోలి సమస్తము విస్మరించి యె
వ్వారల కందరాని యనవద్యసమాధి మునింగి నీయెడం
గూరుకు నందువేళ బ్రదుకుం దొఱఁగంగఁ దలంపు పుట్టెనే
తీరనిపున్నెపుం గలిమిఁదీరు మనోరథ మోసుహృద్వతీ!

భూములనెల్ల నేలిన విభుల్ శయనించిరి మంటిలోన నే
దీ మహి శాశ్వత మ్మనుచు దించుక? మోడులునుం దలిర్చు నీ
యామనిఁ జేతులార విడునట్టివి వ్యర్థపుజీవనాలు సా
కీ, మధుపాత్రఁ దెమ్మిదిగొ కేల్ మన కన్యులతోఁ బనేమిటన్?

ముదిరినకొద్దియుఞ్ వెగటుపుట్టుచునున్నది యీజగమ్ము నే
బ్రదికినయన్నినాళ్లె యెటువంటి విచారములేక హాయి నీ
వదనము చూచుచుఞ్ మధువు వారకఁ గ్రోలెద నంచు మొన్న నే
వదలని బాసఁ జేసికొనివచ్చితి నో చలదభ్రకైశికా!

పడయదు శాంతి యీమధుపిపాస యొకింత, రవంత యేనియున్,
బడలికపోక పాత్రపయిఁ బాత్రగఁ జేతికి నందనిమ్మ యొ
క్కడనయి చూఱఁగొందును సుఖ మ్మది; నేఋుణ ముంచుకోను నీ
యడుగుల దుమ్ము రాల్తు సకియా, వెలితీయని తీయనూర్పులన్.

జనవరరక్షితమ్మచలసంభ్రమదాయక మీసుధానికే
తనము పయోధి నీవు జనతాప్రియమోహనమూర్తి వీవు మో
హినివి వినింద్యవర్తనుల మేము సుధాంధుల మింక నేలఁ బ్రా
తనువడి సన్నగిల్లిన కథల్ స్మరియింపఁ గురంగలోచనా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మననాగలి (మడక) చరిత్ర సంగ్రహము

రావుబహదూర్ దువ్వూరి బాలకృష్ణమూర్తి

హిందూదేశ చరిత్రకారులెల్లరు, మన పూర్వులు ఆసియాఖండపు మధ్య భాగములనుండి యితరులతో చీలి విడివచ్చి సింధునదీ పరిసర ప్రాంతములకు ప్రథమమున చేరినట్లు వ్రాసియున్నారు. అప్పుడు వారితో వ్యవసాయపు పనిముట్లు నేమియు తీసికొని రానట్లు ఋగ్వేదపు మొదటిభాగములలో వాటి ఉదాహరణము లేకపోవుటయే తార్కాణము. వారీ సింధునది సమీపమున కొంతకాలము నివసించి యుండవలసివచ్చినది. అప్పుడు వారికి వలయు భోజనపదార్థములను, సులువుగా ఏవిధమైన శ్రమలతో పనిలేకయే సింధునది వరదలు తీసినతరువాత ప్రక్కలనుండు మృదువైన ఒండుభూముల మీద విత్తనములను చల్లి కృషితో నవసరము లేకుండగనే పండించుచు కాలక్షేపము చేసిరి.

క్రమక్రమముగా ఆ వచ్చినవారిలో జన బాహుళ్య మధికమైనకొలదిని తిరిగి కొంతమంది మాతృభూమినుండి వలస వచ్చుటచే గలిగిన ఒత్తిడిచేతను మొదట వచ్చినతెగల వారు సింధునదిని దాటవలసిన అగత్య మేర్పడినది. వారు సింధునది సమీపమున నున్నంతకాల మెట్టి వ్యవసాయపుపనిముట్లతో నవసరములేకనే సారవంతమైన మెత్తని ఒండునేలలమీద ఎట్టిపాటుతో నవసరము లేకుండ పంటలను పండించగలిగియుండిరి.

ఈవిధముగా పండిన ధాన్యములే నీవారధాన్యము లనియు, అవి బహు పవిత్రములనియు ఇప్పటికిని వ్రతాదులలో నీవారధాన్యముల కెక్కువప్రాముఖ్యము నిచ్చుచున్నారు. తరువాత పంటలను పండించు పద్ధతులలో మార్పులు చెందుచువచ్చిన కొలది ధాన్యాదులను ఆరణ్యకము లని, గ్రామ్యము లని రెండువిధములుగా విభాగించినట్లు తరువాతి వేదముల (చమకము) లో కనుపించుచున్నది.

ఆర్యులు సింధునదిని దాటి కొంత దూరము ఉత్తరహిందూస్థానము చేరుసరికి సులభసాధ్య మైనట్టియు, సారముగలవియు నగు మెత్తని సింధుభూములు దొరకమిచే గట్టి నేలలమీదనే పంటలను పండించవలసిన అగత్య మేర్పడినది. అట్టి తరుణమున నెవరికుటుంబమునకు కావలసిన ప్రదేశమును వారు కదలగొట్టి బీజావాపమునకు యోగ్యమైన స్థితిలోనికి తీసికొనిరావలసిన అవసర మేర్పడినది. ఇందుకుగాను మొట్టమొదట మొనగల మేకులవంటి కర్రగసికలతో నేలను త్రవ్వ నారంభించిరి.



కర్రగసిక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రానురాను హెచ్చు విస్తీర్ణములో విత్తులు చల్లవలసివచ్చినప్పుడు చిన్న నిక్కరకు బదులుగా పలవగల కొమ్మను సేకరించి అందులో కురచకొమ్మను కూచిగా చెక్కి పొడుగుకొమ్మను చేతులతో లాగి నేలను గీచి గుల్లగా చేయుచు వచ్చిరి. ఇట్టి చేతిపనిముట్టింకను పోల్లుకొట్టి పంటలను పండించు అరణ్యప్రాంతములలో కోయలు, సవరలు మొదలగు అడవిజాతులవారు విశాఖపట్టణం, గంజాం జిల్లాలలో ఏజన్సీప్రాంతములలో నిప్పుడు కూడ నుపయోగించుచునేయున్నారు.



పలవగలకొమ్మ



తరువాత బుద్ధికుశలత హెచ్చినకొలది పైకొమ్మలోని పొడుగుకొమ్మకు అడ్డముగా నొక చిన్న కర్రను కట్టి చేతితో లాగుటకు బదులు మనుష్యులచే నీడ్పించసాగిరి. ఈలాగున ఈడ్చినపుడు వెనుకభాగము తేలిపోవుచు వచ్చుట కని పెట్టి నేలను లోతుగా పెకల్చుటకు వెనుక భాగము నణచిపట్టుట కొకపిడి నమర్చవలసిన అగత్య మేర్పడినది. ఈ రీతి నేర్పరిచిన వంకర కొమ్మలు చాలకాలము మన్నక పోవుట చేతను, నేలను చీల్చే భాగము త్వరలో అరిగిపోయి మొద్దబారుచుండుట చేతను దానికొన కొక యినుప ముక్కను తగిలించ మొదలిడిరి. ఇదే యిప్పుడు "కఱ్ఱు" అయినది. వెనుకకు తగిలించిన పిడి "మేడి" గాను, ముందు అడ్డముగా కట్టబడిన కర్ర "కాడి" గాను మారినవి. వంకరకర్రలోని పొడుగు కొమ్మ "ఏటికర్ర" గాను, చిన్న కొమ్మ "నాగలిదుంప" గాను అయినవి. ఇది యే మన దేశపునాగలికి ప్రథమావస్థ. కాలము జరిగినకొలది మనుష్యులకు బదులుగా గొడ్డను కట్టి అందుకు తగిన మార్పులను





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయుచువచ్చిరి. ఈనాగలినే మనదేశము లో నిప్పటికిని విశేషము మార్పు లేమియు లేకయే వాడుచున్నారు. మెట్టప్రదేశముల వారు కొన్నికొన్నిచోట్ల పెద్ద మడకలనియు, మెట్టనాగళ్లనియు, దంపనాగళ్లనియు, వేరు వేరు రకము లున్నను వాటి ఆకారములలో నెట్టి భేదము కనుపించదు.

మనదేశపు నాగలిలో నెట్టిమార్పు లేకుండ అనాదినుండి ఒకేవిధముగా నుండుట కును, అన్నిరకపు దుక్కుల కొక్కనాగలే పనిముట్టుగా నుండుటకును కారణము తేట తెల్లమే. మనదేశములో జీవనోపాధికి కావలసినంతమట్టుకు అభివృద్ధిలోనికి తీసికొనుచు వచ్చి విద్యాధికులైనవారు ఆధ్యాత్మికచింతచే ముక్కులు మూసుకుని వ్యవసాయమును విద్యావిహీనులైన కడుబీదలచేతులలో విడువ బట్టి మనదేశపు కర్రనాగలిలో ఎట్టిమార్పులు లేకయే ప్రప్రథమమునుండి ఒకేరీతిగా నుంటున్నది.

ఇతరదేశములలో, ముఖ్యముగా పాశ్చాత్యదేశములలో నాగళ్లను ఎక్కువ అభివృద్ధి లోనికి తీసికొనుచువచ్చిరి. దుక్కి దున్ను పద్ధతులలోకూడ చాల మార్పులు చెందుచు వచ్చినవి. ప్రారంభదశలో నాగళ్లను ఆడవారిచే లాగించినట్టును, తరువాత దున్నపోతులు, ఒంటెలు, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు జంతువులచే లాగించి తరువాత తగుమార్పులతో ఆవిరియంత్రములచేతను, ఇప్పుడు మోటార్లతోను తక్కువఖర్చుతో ఎక్కువప్రదేశమును లోతుగ దుక్కి దున్నగలుగుచున్నారు. ఈ దేశములలో వ్యవసాయము విద్యాధికులై ధనసంపన్నులైన నిపుణులచేతిలో నుండుటచే సేద్యపుపనిముట్లలో అనేకముగ అభివృద్ధులు జరిగి వేరువేరు పనులకు ప్రత్యేకములైన దుక్కిపనిము ట్లేర్పడినవి.

---

## ప్రౌఢ

శిరోమణి, సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

శ్రీలతాంగి కటాక్షతంత్రికలపైనిఁ
　బనుచువార్తావళి గభీరభావములకు
శ్లిష్టమగు చాటుసంభాషణలకుఁగాని
వ్యాఖ్యవ్రాయంగ మదనుండె పండితుండు.

తాల్చు క్రొంగ్రొత్తరచనల వేసమందుఁ
బాఠభేదంబుగాఁ బాడు పాటలందుఁ
గల నిగూఢార్థములను డీకలులిఖించి
శుకపికంబులె విప్పిచెప్పంగ నేర్చు.

నిలిచినం గూరుచున్నను బండుకొన్నఁ
బనులు సేయుచునున్న నా పువ్వుఁబోఁడి
ఆచరించు నెమ్మేని యొయ్యారములకు
భాష్యమురచింప రతియే సమర్థురాలు.

పనిమిషను దారి నరిగట్టు పాండితికిని
జెఱఁగుఁ దాఁకుల నొప్పించు చాతురికిని
జంకెచూపులఁ బరికించు చాకచకికి
దీపికను వ్రాయ నాజాణమాత్ర చాలు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విషం

ఏలేశ్వరపు కృష్ణమూర్తి, బి. ఏ., బి.యల్.

మ్రింగెడువాడు విభుండని, మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగు మనె సర్వ మంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో.

సర్వమంగళ యిది చూపినది మూఢభక్తా? వెర్రి నమ్మకమా? భర్త ప్రేమా? ప్రజాసేవా? ఏదైనా ఆమెకు చెల్లింది. అదే మర్త్యలోకం అయితేనా హాలాహలం గొంతుకలో యిముడుస్తామని ఎవరూ ముందుకు రారు. వచ్చినా వెనక్కి లాగేవారు వుండక పోరు. హఠయోగం మాట వేరే సంగతి. పరహితం ప్రధమకర్మం అంటే మనం వుపపాదించగలం. పరహితానికి ఎదురు లేదంటే తలలూపగలం. కాని విషం గ్రోలడంలో పరహితంవుందంటే శివుకి నెత్తినైనా అక్షింత గింజలు రాల్చకమానం. లోకం అంతా విషమయం అనే విరాగులకుకూడా జీవితం అంటే మరీ వెర్రి తీపి.

మర్త్య లోకంలో విషం మోతాదు మీరితే పరలోకం చూపిస్తుంది. పరలోకం వుందా అంటే లోకంతోపాటు పరలోకం వుంది. విషం స్వరూపం, స్వభావం, మోతాదు డాక్టర్లు గడగడ ఒప్పజెపుతారు. వారి గడగడ చూసి మనం గడగడలాడతాం, మన ప్రాణాలు వీరి చేతులలో యిరుక్కున్నాయి కాబోలు రా దేవుడా అని. విషం వైద్యుల చేతులలో అమోఘంగా పని చేస్తుంది, మంచికీ చెడ్డకీ. కాని చెట్టంత డాక్టరున్నా ప్రాణాలు పిడికిట్లో వుంటాయి, పాపం, ఈ రోజు ఎల్లా గడుస్తుందో అనే చింతతో. లోకంలో తుమ్మడమనీ దగ్గడమనీ, రోగం అనీ చావనీ లేకపోతే మేము నిస్సహాయులం, మాకు మరో రాత పట్టేది అని ఓ పెద్ద డాక్టరుగారు పది చేతులలో పెడితే లోపాయికారీని యీమధ్య ఒకరికి సెలవిచ్చారుట. మంగలి పాత అనే పూర్వుల భావాన్నిబట్టి—వైద్యుడు పాత—అనుకుంటే మనకు మందు పట్టిస్తుంది. వైద్యునికి మొహమాటం వుంటుంది. యముడుగూడా నిర్ఘాంత పడి అసింటా నిలబడతాడు.

జీవహింస పాపం పాపం అని ఒకే పెట్టున మతాలన్నీ ఘోష పెట్టుతూనే వున్నాయి. ఆ నీతి ఉపదేశమాత్ర మైపోయింది. జీవహింస ఆచరణలోది: జీవహింస చేయరాదనడం ఆదర్శంలోది. పాపం పుణ్యం దేవుడెరుగును కాని, పార్టీ అన్నట్టు—లా ఏమంటుంది? చంపడం అనేది ఒక క్రియ అంటుంది. ఆపనికి పూనుకున్నవారికీ, ఆపని చేసినవారికీ, రుజువైతే శిక్షవేస్తుంది. తన్ను తను చంపుకోవడం ఆత్మహత్య అంటాం. ఆత్మహత్య నేరంకాదు; కాని ఆత్మహత్యకు యత్నించడమే గొప్ప నేరం. ఇతరులను చంపడం పరహత్య. ఇదో నేరం. పరులంటే నరులని అర్థం చేసుకోవాలి. ఈ రెండు గొప్ప నేరాలే. గోహత్య జరిగిందంటే లా ఏమంటుంది? 'గో ఎవే' అనదు. కాని పూర్వంలాగ పాపం లేదు, ప్రాయశ్చిత్తం లేదు. ఆత్మహత్యకి నేరస్థులు చాలా మార్గాలు కనిపెడుతూనేవున్నారు. పెద్ద చాంతాడుతో వురెట్టుకోవడం, ఏ ఏట్లోనో లోతుగా చూచుకు దిగడం, పదునైన దాంతో పీక తెగేసుకోవడం, ఏ నుండో గభాలున పేల్చుకు చావడం, లేక చచ్చేటంత విషం పుచ్చుకోవడం వీరిమార్గాలు. కొందరు కొండరగింజంత జీవుడు ఎగిరిపోయేందుకు ఏఆకాశంమీదనుంచో అమాంతంగా వురుకుతారు. కొందరు బాగా ఆలోచించి ప్రమాదమైన పనులు కనుక్కొని పనిచేస్తారు. ఏ పెద్ద పులినోట్లోనో తలదూర్చుతారు. టైము చూసుకొని రైలుపట్టాలకడ్డంగా సాష్టాంగపడతారు. లేదంటే అగ్నిప్రవేశం చేస్తారు. అగ్నిగిట్టకపోతే, ఎలెక్ట్రిక్ తీగని వెతికి పట్టుకుంటారు. ఇవన్నీ ప్రమాదమైన పనులే. ఆత్మహత్యలో హంత, హతుడు ఒకేవ్యక్తి. ప్రయోగం—తన మీదికే. ఉద్దేశం—ఇంటిదగ్గర నుంచి పదిరూపాయిలు రాలేదనో, పెళ్లి యిష్టం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేకనో, తను పోషిస్తున్న ముండ తనకు ఎదురుతిరిగిందనో, ఋణాలు బలుస్తేనో, పరీక్ష ప్యాసవలేదని పౌరుషం చేతో, పరువుపోయిందనో, కడకు ఈశ్వర సాన్నిధ్యము చేరుదామనో అనేక రకాలగా వుంటుంది. ప్రయోజనం—ఏమి లేదు. వారు జీవితం నిష్ప్రయోజనం అనుకోవడమే. ఇంతకు ఆత్మహత్యకు విరివిగా వాడబడే సాధనాలలో విషం ఒకటి. K C N. ఇల్లాటిదే.

నేరగాడు పరహత్య చేయడానికి చల్లగా పూనుకున్నప్పుడు చాలా మార్గాలున్నాయి. అయినా వీటిలో విషప్రయోగం దివ్యంగా పనిచేస్తుంది. దినచర్య జరుగుతున్నట్టే వుంటుంది. హతుడు సుటుక్కు మంటాడు. నేరం తేలదు. అప్పుడు నేరం కనుక్కోడం పరిశోధకుని పాలవుతుంది. ఎదుర్కోవలసిన ప్రశ్నలు చాలా వుంటాయి. కొన్నిటికి జవాబులు దొరకవు. జవాబులు దొరికినా కొంత నిజంవుండదు. అయినా హత్య జరిగిన సమయం, హత్య జరగడానికి సాధనం, పూర్వోత్తర సందర్భాలు, హంత వుపయోగించిన పరికరం, హంత వుద్దేశం, ఊహ, హతుని నైజం, దేహస్థితి, కృత్యం జరిగిన రంగస్థలం బాగా శోధించాలి. కృత్యులెవరో ఆకట్టాలి. హంత నేరం కాగానే సాధారణంగా వుడాయిస్తాడు. ముసుకేసుకొని ఏమారుమూలో దూర్చుంటాడు. లేకుంటే లేనిగడ్డం పెంచుతాడు. మారువేషం వేస్తాడు. ఇంతకూ మనిషి పరహత్య ఎందుకు చేస్తాడంటే విషం హృదయంలో బాగా పాతుకొని వుంది కనుక అనవచ్చును. ఏమన్నా సరే, హత్యలకు కొన్నిటికి విషం ఆధారం. విషం వాడారని అనుమానం తగిలేసరికి డాక్టర్లకి పని తగులుతుంది. కత్తులు తీస్తారు. కోష్ఠ పరీక్షకి నమ్మకంగా పూనుకుంటారు. అటుపైన వారు విషం అంటే విషం; విషం కాదు అంటే విషం కాదు. ప్రత్యక్షంగా చూస్తారు కాబట్టి వారి మాటకు యీ విలువ. ఈ సమయాల్లో పరిశోధకుడు తెలివితేటలు వుపయోగించాలి. ఈ మాట ఎందుకంటే సాక్షులకున్న జబ్బే డాక్టర్లకీ అంటుతుంది, ఇంతో అంతో. నిజమూ అబద్ధమూ ఒకలాగే కనబడడం, కళ్లు మిరుమిట్లుగొల్పినట్టవడం, బోనెక్కినవారికి లక్షణాలు.

ఇక విషం అంటే మామూలువాడుకలో రుచింపనిదని, గిట్టనిదని అంటాం. నాలుకమీద వేసుకుంటే కాకరకాయకూర చేదు విషం అంటాం. కూర చేదైనా విషంమాత్రం కాదు. అమృతంలాంటి వస్తువైనా ఆలస్యంతోటి విషతుల్యం అయిపోతుందని పెద్దలంటారు. పైగా యీకాలంలో పిల్లకి తల్లి విషం. పెళ్లానికి మగడు, మగనికి పెళ్లాం విషం. విద్యార్థికి—క్షమించాలి—విద్యార్థి గారికి పరీక్షంటే విషం. పై వుద్యోగికి క్రింద వుద్యోగి విషం. లంజకి పెళ్లి విషం. బోధకుడికి ఆచరణ విషం. అరవపాటగానికి పదోచ్చారణ విషం. ఓ పేరొందిన పార్టీకి ద్విజులంటే విషం. మూర్ఖుడికి జ్ఞానం విషం. రోగికి మందు విషం. ఇల్లా గిట్టకపోతూంటాయి కాలమహిమని బట్టి! మన పూర్వులకి అనుభవం వ్రాసుకునే శక్తి గొప్పగా వుండేది. విషాన్ని గురించి వారూ పెద్దముక్క లన్నారు. ఒకటి స్మరిద్దాం.

'అనభ్యాసే విషం శాస్త్ర
మజీర్ణే భోజనం విషమ్,
విషం సభా దరిద్రస్య
వృద్ధస్య తరుణీ విషమ్.'

అన్నారు. ఇన్ని సూక్తులు నుడివినవారు ఏమూలైనా ధనం అనేది విషం బాబూ అన్నారా? ధనం ముమ్మాటికి విషంఅని వారు అనలేదు. వారనకపోయినా విషం కాదు కూడాను. కాబట్టే ఒకరిచేతులోది ఒకరు లాక్కుంటున్నారు, నవ్వుతూ, సరసంగా. అల్లాటప్పుడు నవ్వులోను విషం వుంది సుమా అనిపించుతుంది. ధనము విషం అన్నడల్లా ఒక్క విశాసులే. కాని 'నిర్ధనం విషం' అంటే వారూ డబ్బు యివ్వక్కరలేకుండా ఓటు యిస్తారు. లోకంలో విషం అని తెలిస్తే తగిన చికిత్స వెంటనే జరుగుతోందని ఒక కవికూడా విషంలో బుర్ర దోపాడు. కూతకు శృంగారం అబ్బింది.

"మధు తిష్ఠతి వాచి యోషితాం
హృది హాలాహలమేవ కేవలమ్,
అత ఏవ నిపీయతేఒధరో
హృదయం ముష్టిభిరేవ తాడ్యతే."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని. ఏదైనా విషం అవునా కాదా అంటే కనుక్కునేందుకు ముందుగా లోకజ్ఞానం వుండాలి. తర్వాత డాక్టర్లు వుండనే వున్నారు. ఇంతకు ఓరు దేహం చాలించారనడంతోటే వారు ఏమొచ్చిపోయారం డనే ప్రశ్న ఒక్కమాటుగా అన్ని మూలలనించి వస్తుంది. కాలమృత్యువే నండి అని అంటే ఉండేం చెయ్యాలి ధన్యుడని, చాలా కాలమే బ్రతికినట్టు కనబడుతోందని, మాచారు దైవేచ్ఛ, మనలో ఏమీ లేదని ఆర్పేటే ఏడవరు. ఏడ్చినా సరిపెట్టుకుంటారు. ఆగంతుకమరణాన్ని అడ్డలేకపోతే లోకంలో నల్ల రాళ్లు యిట్టే బ్రద్దలవుతున్నా యంటారు. అల్లాటప్పుడు దుఃఖానికి మితిలేదు. ఆగంతుక మృత్యువుని కసిరి అవతలకి పొమ్మనేది ఔషధం, జపం, హోమం అన్నారు వృద్ధులు. ఔషధం యిస్తేను, జపం హోమం చేస్తేను యీమరణం తప్పుతుందనే నమ్మకం వెనక బాగా పాతుకునివుండేది. ఇప్పుడు దైవచింత కేవలం మానసికం అవడంబట్టి, కొన్ని చోట్ల ఏహ్యమై నాస్తికంగా మారడంబట్టి, కొందరు దీన్నే బకధ్యాన్నంక్రింద పోలుస్తూ రాబట్టి, పైకి మిగిలినది ఔషధం ఒకటి. అదేనా పేరుకి మిగిలింది. ఆ పేరుకున్న ఔషధం ఎల్లాంటిది? కళ్లుమూసుకొని కోటిమందికి కటికి మంచినీళ్లు కలిపి యివ్వడం లాంటిది. రోగి, పాపం, సీసాకేసీ, మూలాలకేసీ చూచి ఏకమొర పెట్టుకునేంటిది. ఈమాత్రంతో రోగి చచ్చిపోడులెండి. చావుబతుకులు కానంగా తిరుగుతూ వుంటాడు. ఇంతదేశంలో నిక్షేపమల్లే యిన్ని మూలికలు ఓషధులు వున్నా ఇంగ్లాండు పరమావధి అనా, ఎమెరికా భూతలస్వర్గం అనా యీ వేషగాళ్లు అక్కడికి జేరుకోవడం అని ఒక ముసలాయనకు గొప్ప ధర్మసందేహం కలిగింది. "డిగ్రీ—డిగ్రీ" కోసం అని ఒక నేర్పరి ఘట్టిగా జవాబిచ్చాడు. అప్పుడాయన నా నెత్తిలాగే వుంధోంది "గ్రీడి—గ్రీడి" అని వైద్యాన్ని తల్లక్రిందులుచేసి ఏడవం డన్నాడు. కాని నేర్పరి 'నాకు ఏడుపు రాదండోయ్' అనేసరికి ముసలాయన 'ఏమంఛాడూ, పోనీ, నేనే మీ తరఫునకూడా వకాల్తా పుచ్చుకున్నవాడి కంటె ఎక్కువగా ఏడిచి పెడతాను' అన్నాడు. అనడం తడువుగా యితని ఏడుపు, నేర్పరినవ్వు ఒక్కసారిగా బయటపడ్డాయి. ఇప్పుడు పర్‌గేటివ్ అంటే పాతాముదం కాదురా నాయనా, పావలాడబ్బులోయ్ తండ్రీ అనీ, పరుగెత్తితే పేటెంటుమందురోయ్ దేవుడా అనీ, మాటకి ముందు యింజక్షనురా భగవాన్లూ అనీ, నోరు తెరుస్తే దవడ వూడగొట్టి పన్నుకీకి పన్ను కట్టడమే సూతురా అనీ, వీటన్నిటినీ దిగమింగేది విజిటింగ్ ఫీరా బాబోయ్ అంటూ ముసలాయన వరుసలు పెట్టి వెళ్లబోసుకున్నాడు. ఈ కాలంలో లోపలేడుస్తే పనిజరుగ దండోయ్, పైకేడవండని ఎవరో ప్రక్కనున్న తెలివిమంతులు ముసలాయన్ని ఓదార్చారు. 'పైకెళ్లిన కొద్దీ చూపు పైకెళ్లు తుందండోయ్, యింత సేపు నేను పైకేడవ లేదంటారా ఏమిటి మీరు కొంపతీసి' అన్నాడు ముదుసలి. పైగా 'వైద్యుడు కాడుటండీ ప్రాణం పోసేది లోకంలో. అందుకని ఏడ్చాను. మరేమీ అనుకోకం'డని ముదుసలి కుదుటపడ్డాడు. 'మీరు కాదంటే ఏడుస్తా' అని ఎవరో సముదాయించారు. ముసలాయనమాటలెల్లాగున్నా, వైద్యుడు దాహం చాలావరకు మాని ఆదర్శప్రాయుడుగా వుండాలి. ఈతంతు అంతా ఆగంతుక మరణం తప్పడానికి, ప్రాణం నిలవడానికి. డాక్టరుగారు దాహం పెరగనిస్తే బీదరోగికి ప్రాణాపహరణం. ఈ ముక్కలు గట్టిగా అంటే వైద్యునికి విషం.

ప్రాత వైద్యులు విషాన్ని రెండు చేశారు. ఒకటి అకృత్రిమ మని, వేరొకటి కృత్రిమ మని అన్నారు. అకృత్రిమ విషాన్ని మళ్లీ స్థావర విషం క్రింద, జంగమ విషం క్రింద విభజించారు. రెండుముక్కల్లో స్థావర విషం మూలపత్రాదివిషం. జంగమవిషం సర్పాది విషం.

స్థావర విషం చెట్లల్లో వుంటుంది. వేళ్లు, ఆకులు, ఫలాలు, పుష్పాలు, పాలు, బంక, చేవ, ధాతువులు, కందములు—వీటిని ఆశ్రయించి వుంటుంది యీ విషం. గన్నేరుకి వేళ్లలో విషం; విషపత్రానికి ఆకులో విషం; దేవతాళమునకు ఫలంలో; వేముచెట్టుకి పుష్పంలో; ప్రియకమునకు (Nanclea Cadamba)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పట్టలోను, చేవలోను, బంకలోను విషం ; తాళకానికి (Yellow Orpiment) ధాతు విషం; వసనాభికి కంద విషం. ఇల్లా వివరించింది వృద్ధులు. ఇంతేకాకుండా విష మొక్కొక్కంటికి గుణం తెలిపారు మూలవిషంతో మోహం, భ్రమ కలుగుతుంది. పత్ర విషంతో వణుకు, ఆయాసం బయలుదేరుతుంది. పుష్ప విషంతో వాంతి, కడుపుబ్బు ప్రారంభం. క్షీర విషంతో నోట నురగ వస్తుంది. ఫలవిషంతో తాపం. చేవవిషంతో కాఠిన్యం. ధాతువిషంతో మూర్ఛ. కందవిషంతో క్షణంలో మరణం ప్రాప్తమవుతాయన్నారు. ఈ విషం దిగకపోతే పెదవులు నల్లబడడం, కళ్లెర్రబడడం, దేహంచల్లబడడంలాంటి చిహ్నాలు వుంటాయి. ఈ విషయాలు అపరాధ పరిశోధకులు గమనించి ఒంట్లో యిముడ్చుకోవాలి. జిల్లేడా, కోలజెముడా, ఉమ్మెత్తా, నాగేటిగడ్డా, గన్నేరా, నేపాళమా, పాషాణమా, భాస్వరమా, అభినా, వసనాభా, అతివసా, మరోటా, యింకోటా అనే విషం నేరస్థులు హత్యలలో వాడితే దానిని పరిశోధకుడు గుర్తించాలి. విషం వుందో లేదో, కోష్ఠంలో వుంటే ఏం విషంవుందో చెప్పడం డాక్టరు గారి పని. హంతునికి, హంతకి, ఆ విషానికి గల సంబంధం తెలివిగా విమర్శించుకోవడం పరిశోధకుడి పని.

జంగమవిషాన్ని పూర్వులు సర్పాదివిషం అన్నారు. అందులో సర్పాలు రెండు తెగలు: దివ్యములు, భౌమములు. దివ్యసర్పాలకి నమస్కారం చేసేవారు పూర్వీకులు. ఆసర్పాలు అష్టదిక్కులలో అమిరి వున్నాయని వారి నమ్మకం. అనంతుడు, గుళికుడు, వాసుకి, శంఖపాలుడు, తక్షకుడు, మహాపద్మకుడు, కర్కోటకుడు, పద్మకుడు వాటిపేళ్లు. అందులోను 'సర్పాణా మస్మి వాసుకిః' అని భగవానుడే మనతో అన్నాడు. అన్నా కొందరు నాస్తికులు నక్షత్ర మండలంమీదకి వాసుకిని బరబర యీడ్చుకొచ్చాం అన్నారు. ఇక గుళికుడు కేరళదేశంలో జాతకంలోకి బాగా ఎగబ్రాకడం యిప్పటికి మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం. దివ్యసర్పాలు యిల్లా వుంటూంటే, భౌమములు జాతిభేదం కలిగి దర్వీకరసర్పాలని, మండలి సర్పాలని, రాజిమంతసర్పాలని, వైకరంజసర్పాలని, నిర్విషసర్పాలని ఐదు తెగలై బుసలు కొట్టుతున్నాయట భూమిమీద. పూర్వులు పాములని చూడగానే గుర్తించేందుకు పేర్లు వాడారు. వారు విషంరుచులు చెప్పారు కొండచెలమవిషం కారం అని, తుట్టెపాము విషం పులుపని, కట్లపాముివిషం తీపి అంటూ రుచులు తెలిపారు. కోరలలో విషంగల పాములు ౮౦ జాతులట; విషములేనివి ౨౨ జాతులట. పాముకి పరమాయువు వెయ్యేళ్లని నిరూపించారు. పాము గ్రుడ్లుపెడుతుందన్నారు అనుభవజ్ఞుడైన ఓవృద్ధుడిని కొంటెతనానికి పాము ఎందుకు కరుస్తుందని ఎవరో అడగడం తటస్థించింది. దాని కతడు వెంటనే జవాబిచ్చాడు. ఆహారంనిమిత్తమో, భయంచేతో, త్రొక్కితేనో, విషం పొంగడంచేతో, కోపంచేతో, మరీ క్రూర స్వభావం కలిగిందైతేనో, పగపడితేనో పాము కరుస్తుందన్నాడు. కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచించి శాపంచేతో, కాలగతిచేతో కూడా పాము కరుస్తుందని పూరుకున్నాడు. మామూలుగా పాముకాటుకి విషం వుంటే నొప్పి, దురద, వాపు, కరచినచోట మంట వుంటుంది. విషంలేని కాటుకి దద్దురులు, చర్మం నల్లపడడం, ఏక కునికిపాట్లు వస్తాయి. నోట చొంగ కారితే అది కోరగుణం అని, నోట నురగ గమ్మితే విషగుణం అని పూర్వుల మతం. వారి మతంలో మహాత్మ్యమేమిటోగాని గౌరీపంచాంగంలో కూడా విషమే.

ఒక్క పాములో కాకుండా కీటములలో కూడా వుంది విషం. కీటాలల్లో—టాకీలల్లోకాదు—కందుకకీటములనీ, మశకములనీ, బల్లులనీ, చీమలనీ, ఈగలనీ, కప్పలనీ, సాలెపురుగులనీ పూర్వులు పేర్కొన్నారు. ఎలుకలోనూ వుంది విషం. వృశ్చికంలో?—విషముంది. ప్రకృతి శాస్త్రంలో రెండు ముక్కలు పరిశోధకుడికి అంటుతే బాగా పనికొస్తాడు. నక్కలు, ఎలుగుగొడ్లు, పందులు, పులులు, తోడేళ్లు, కోరలున్న యితర జంతువులు కరుస్తే విషవ్రణాలు వస్తాయి. కుక్క కాటుకి కూనూరు మరిచిపోకండి. పశువులలోను, మనుష్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలోను నఖ దంతములలో విషంవుంది. మనిషికాటుకి మందు లేదన్న ఆర్యోక్తి నిజం. ఇంతతో అకృత్రిమ విషం చాలిద్దాం.

కృత్రిమ విషం ఎల్లాటి దంటే పెట్టుమందని, నేరాలల్లో వాడబడే స్థావర విషాలని చెప్ప వచ్చును. కృత్రిమ విషం పనిచేయడానికి ఆహారపానీయములు చాలామట్టుకు సహాయపడుతున్నాయి. అందుకనే పూర్వులు అన్నం అదీ చూచుకు తినమన్నారు. విషం పెడితే కనుక్కోడం ఎల్లాగంటే, ఆ అన్నం అగ్నిలో వేస్తే జ్వాల పుట్ట దన్నారు. నెమలికంఠరంగులో పొగలు పైకి వస్తాయన్నారు ఈగలు అన్నంమీద వ్రాలితే తక్షణం చస్తాయన్నారు. కాకి అన్నంచూచి హీనస్వరంగా కూస్తుందిట. పిల్లికి భయం పుడుతుందిట. పావురాయికీ కోకిలకీ ప్రాణం పోతుందిట. కోతి మలం జార్చుతుంటుందిట. చిలుకలు, గోరువంకలు మాచి తెగ కూస్తాయిట. నెమలికి మందదృష్టి కలుగుతుందిట. ఇన్నీ చెప్పి వూరుకోక పూర్వులు అట్టి పదార్థం లోప లికి పుచ్చుకోవద్దన్నారు. తెలిసి ఒకరికి పెట్టద్దన్నారు. వీథులో పారవేయద్దన్నారు—ఇతరులు తింటారని. రోగికి అవస్థ, నాడి, ఔషధం, పథ్యం, దేశం, కాలం, పాత్ర తెలిసి మందియ్యమన్న వారు వెర్రివా రెల్లా అవు తారు? రాహ్వాచ్ఛాఖే సర్వాన్మృతిః—అన్నవారు మందమతులా? చంద్రజ్ఞా వక్షేప్తమేవా విషేణ మృతిః— అన్న శాస్త్రకారుడు జ్ఞానహీనుడా? ఇప్పుడు మనమే టిన్ సరుకులో విషం వుందా లేదా అనుకుంటూ సంశయిస్తూ మీనమేషాలు లెక్క పెడుతూ కూర్చున్నాం. ఆరోగ్యంలోను, అనుభవం లోను, ఆచరణలోను మనది వెనుకపరుగు. మనం ఇంగ్లండువెళ్లినా లోకజ్ఞానం ఎవరు అమ్మ జూపు తారు? ఆయుర్వేదమున నున్నది గొప్ప లోకజ్ఞానం, లోకానుభవం. మహాసభలతో తృప్తిచెందక మనము ముందునకు సాగిపోవలసియున్న దేమో.

కొన్ని గ్రామాలలో పరిశోధకుని చేతులోపడ్డ హంతి, దగ్గిర నున్న పొట్లం మింగి గుటుక్కుమంటు న్నాడు; హంతి తన్ను తను చంపుకోవడం గొప్ప అవలక్షణం. ప్రతి పౌరుడు గుర్తెరగవలసినది నరజన్మ లోని ఔన్నత్యం. ఖలునకు నిలువెల్ల విషము అనేది సుమతి వాక్యం; సాత్యకు బూనుకున్న నరుడు ఖలుడే. విషకన్య చరిత్రలో ప్రసిద్ధిగాంచిన గాంచుగాక!

---


ఆంధ్రగ్రంథమాల. నూతన కుసుమము.

ఆ ల సిం ప క త్వ ర ప డ వ లె ను

# ప్రార్థన గీతావళి

సబర్మతీ ఆశ్రమమునందు నిత్యపారాయణమునకు మహాత్ముడు అనుమోదించిన ప్రార్థనగీతములు తెలుగు తాత్పర్యముతోసహా ఇందు గలవు. ఆధ్యాత్మిక సారమయిన ఈ గీతములను ప్రతివారు నిత్యము పారాయణము చేయుట శ్రేయోజ్ఞానదాయకము.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧

వెన్నెలల దిక్కులోఁ బెనఁగులాడెడు [పూలు
మెడలోన నల్లపూసల చేరులు
ముంగొంగు కోడిలోన గులకఱాలు
ముంగిట నిలచిన పేదముత్తైదు వామె :—
"పవన నిట్టూర్చు
వేణువు పాడు
శరము విహరించు
మబ్బు పులకించు
మానికము మందహాసముసేయు,
నీకుటీరమ్ము వాకిలిఁ దెఱువవేల ?"
త్రుళ్లిపడి మూఁగకుత్తుక విచ్చి నేను :—
"మూఁతవెట్టిన కనుగొనల
ముత్తెములు నిలచినవి,
ఊర్పుమడతలఁ బదము
లొసరిల్లినవి,
పొదిగిట దూర్వాంకురములె
మయిమఱచినవి
నిదురగీత మ్మాలపించితి
నిముసమయినను నడువలేదె !
తలుపుఁదట్టకుము నీకు వందనము తల్లి !"

౨

నినుఁ గేలఁ గీలించి,
వినువీథిఁ దామరలు విరియింతునేమొ !
పటములో జీవమ్ముఁ బ్రాఁకింతునేమొ!
చలిగాలి ముంగురుల
సవరించి జడవైచి, నిశ్శబ్దసమయపరి
రంభణములోన నేకాంతములుసెప్ప
పెదవిఁ దడిపితిని -
కనుదారకలు పెంజీఁకటిత్రోవలో
నప్సరసలై నాట్యమాడి వలపించెడిని -
ఎగయువేళను బట్టూడిజారెడు
పులుఁగుటెఱక యీమేను -
గగనతలాన నారదుని చేతి విపంచి -
పద్మదళాల భారతీగానమాధురి -
జాలిగా నీగళము సవరించికొందువు !
నడలలో నొక్కింత తడవాటుఁ జెందుదువు!
వికసించుఁ గనుగొనలఁ గాటుకనీటి చెమ్మతో
కుతుకలోఁ దొట్రువడుఁ గొతుకు నిట్టూర్పు
నీవు వెడలిననాఁటి నీడలో, జాడలో [తో
పాటపడి కనిపించు !
మాటపడి వినిపించు ! [టో !
ఇరువురము కలసికొను నేనాటి ముచ్చ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




—యస్. దుర్గారావు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయచిత్రకళయెడల మన కర్తవ్యము*

తలిశెట్టి రామారావు (కవితాసమితి)

దేశముయొక్క నాగరికత మనోజ్ఞకళలందు ప్రతిబింబిత మగుచుండును. మనోజ్ఞకళలను పోషింపని యుత్తమనాగరికత యుండజాలదు. ప్రజలకష్టసుఖములవలన గలిగెడి యాధ్యాత్మికభావపరివర్తనము కళాసంప్రదాయములకు మూలాధార మగుచుండును. ఈపరివర్తనము తప్పుదారుల ద్రొక్కకుండ జూచుట మనోజ్ఞకళల ముఖ్యమైన యాదేశములలో నొకటి. ఇటు లుపయోగపడని కళలు నిష్ప్రయోజనములు. ప్రజల యున్నతభావములకును కళలకును గల సంబంధము వీడినప్పుడు ప్రజల యున్నతాదర్శములే కాక కళలును క్షీణించుట కలుగును. కొలది కాలముక్రిందటనే మనదేశమున నిట్టి పరిస్థితు లేర్పడినవి కాని యిప్పుడు మరల జాతీయత నన్నిటియందును నెలకొల్పుటకు జరుగుచున్న ప్రయత్నములు కొంత యాశాజనకములుగ నున్నవి.

సర్వసాధారణముగ కాలప్రవాహమున నొకదేశమునకు సంభవించిన కష్టములు మరియొకదేశమునకు కలుగవు. ఈకష్టముల వలన కలుగు సమస్యలను పరిష్కరించుకొనుటయం దొక్కొక్కదేశ మొక్కొక్క మార్గము ననుసరించుచుండవలెను. చైనాయందలి పరిస్థితులు మెక్సికోయందు లేకపోవచ్చును. భారతభూమియందలి సమస్యలవంటివి సైబీరియాయం దుండవు. సైబీరియావారి దైనికజీవితవిధానము హిందువులకు సరిపోదు. చైనావారి యాచారములు మెక్సికోవారికి సరిపోవు. కనుకనే నాగరికత వివిధదేశములందు భిన్నమార్గముల పెరిగి వేరువేరు రూపముల దాల్చియున్నది. ఇతరదేశముల నాగరికతలను జూచి మన మనేకము లగు నూతనవిషయములను నేర్చుకొనవచ్చును కాని మన నాగరికతయెడల నుపేక్ష జూపుటవలన మనజాతీయతసుస్థిరత కొరకు వేలకొలది సంవత్సరముల యనుభవముపై నార్జించుకొనిన విజ్ఞానఫలితమును విడనాడుట యగును. ఇట్టి ప్రత్యేకనాగరికతలలో నపూర్వమైనది భారతీయనాగరికత యనియు, సాంఘికముగను, ఆధ్యాత్మికముగను ప్రపంచమున కంతకును బుద్ధిని గరుపజాలు సామర్థ్యము నిచ్చుట గనగలమనియు బుద్ధిమంతు లిప్పు డొప్పుకొను చున్నారు. ఇట్టి నాగరికత కంగములుగ బెరిగినమనోజ్ఞకళలు మాత్రము తక్కిన దేశముల కళలకు తీసి

* కవితాసమితి వార్షికోత్సవమున ౨౫-౧౦-౧౯౩౩ న విశాఖపట్టణమున చదువబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోవుట యుండదు. మనగానమును విని, నృత్యమును జూచి పాశ్చాత్యులు ముగ్ధు లగుచున్నారు. మనచిత్రములను దర్శించుటకు యాత్రికులు వచ్చుచున్నారు. మన కావ్యములు శ్రేష్ఠమైనవని పేరుగాంచినవి. మన వేదాంతము నితరులు నేర్చుకొని ధన్యులగుచున్నారు. పరిస్థితు లిటులు సుముఖములగుచున్నను భారతీయులే తమజాతీయకళల యెడల నిరసనభావమును జూపుట వింతగనున్నది.

భారతీయుల ప్రత్యేకనాగరికతకుసరిపడునటుల భారతీయచిత్రరచన ప్రత్యేకముగ బెరిగినది కనుక భారతీయచిత్రరచనకును, తక్కిన దేశముల చిత్రరచనకును వ్యత్యాసము కలదు. భారత దేశమున తొలి యుగములందు చిత్రరచన మానవుల యానందమునకుమాత్రము పనికివచ్చునని మతవిషయమున పలుకుబడికలవారు తలచినను, బౌద్ధమతము చిత్రరచనను తొలుత పోషింపకపోయినను, ఇది ప్రజలయామోదమును బడసి తుదకు భారత దేశమున బుట్టిన ప్రతిమతముయొక్క వ్యాప్తికిని తోడ్పడి మతమునకు చిత్రరచన యత్యావశ్యకమని ప్రపంచమునకు చాటగలిగెను. ఇటులు పెరిగినకళను హిందూత్వముగౌరవించువారందరును పోషింపవలసియున్నది. దీని నాదరింపకపోవుట ఆధ్యాత్మికముగ, వైజ్ఞానికముగ నాత్మహత్య చేసుకొనుట యగును.

హిందువుల నాగరికతవలె హిందువుల చిత్రరచనయొక్క పటిమయు హెచ్చు. గ్రీకులు మన దేశమునకు వచ్చినప్పుడు తమ దేశపు శిల్పరచనావిధానమును గాంధారమునందును, పాంచాలమునందును ప్రవేశపెట్టిరి. అశోకుడు బౌద్ధమతప్రచారమునకై యీ శిల్పరచనను పోషించుటచే దీని కిచ్చట కొంత ప్రాబల్యము కలిగి దేశమం దంతటను వ్యాపించెను. ఆంధ్ర దేశమునందలి యమరావతి స్తూపమున నీగాంధారరచన కానవచ్చుట యిందులకు నిదర్శనము. కాని యింత పాదుకొనిన గ్రీకుశిల్పముకూడ కొలదికాలమునకే గాంధారమునగూడ హిందూసంప్రదాయములకు లొంగి హిందూత్వమును స్వీకరించి తొలికూపు తెలియనటులు మారిపోయినది. అక్బరుపాదుషా పర్షియాచిత్రరచనను మన దేశమున బ్రవేశపెట్టి పోషించుటచే అనేకులు చిత్రకారులు మొగలుదర్బారున జేరి చక్కనిచిత్రములను వ్రాయజొచ్చిరి. అనాదినుండియు చిత్రరచన కలవాటుపడిన హిందువులు పర్షియావిధానములందే పర్షియా చిత్రకారులను మించినటులు చిత్రములను వ్రాయగలిగిరి. కాని హిందూచిత్రకారుల హిందూత్వము త్వరలోనే యానూతనచిత్రరచనను హిందూ దేశమునకు సరిపడునటులు మార్పగలిగెను. మొగలుదర్బారు ననుకరించిన రాజపుత్ర, పాంచాలరాజుల దర్బారులం దీ చిత్రరచన యాదరణమునకు వచ్చినప్పటికి పూర్తిగ మారిపోయి హిందూత్వముయొక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికాసమునకు తోడ్పడజొచ్చెను. మొగలు చిత్రకారులకు మహమ్మదీయమతము, మహమ్మదీయుల కులాచారములు కలుగజేసిన ప్రతిబంధకములు వీరికి లేకపోవుటచే ననేక విధముల నభివృద్ధి జెందినది.

దేశమనిన ప్రజలు. పాలకు లెవరైనను, దర్బారులం దేమిజరుగుచుండినను ప్రజలహృదయములందు ప్రతిష్ఠితమైయుండిన హిందూత్వముమాత్రము చలింపకయుండెను. ఎందరెన్నినూతనవిధానములను దేశమున ప్రవేశపెట్టినను అవియన్నియు హిందూత్వమునకు నూతనాలంకారములుగ పరిణమించెనేకాని దానిరూపమును మార్పజాలక పోయినవి. భారతీయచిత్రరచన భారతీయుల యాధ్యాత్మికపరివర్తనమునకు సరిపడక యున్నయెడల ప్రభువులయాదరణమును బడసిన యావిదేశరచనావిధానములకు లొంగి రూపుచెడియుండెడిది.

ఆంగ్లేయులు హిందూదేశమునకు వచ్చుటతో నూతనపరిస్థితు లేర్పడినవి. ఆకాలమున సంభవించిన దేశసంక్షోభమునందు బ్రిటిషుసైనికులకు భారతీయచిత్రములవిలువ తెలియకపోవుటచేత అమూల్యము లగు చిత్రము లనేకములు నశించినవి. మిగిలిన వాటిలో నధికాంశములు పరదేశములు చేరినవి. చిత్రకారులను పోషించువారు లేక నూతనచిత్రరాజములు వెలువడుట యరుదయ్యెను. అంతలో నైరోపాచిత్రరచన దేశమున ప్రవేశపెట్టబడినది. దొరలప్రీతికొరకు హిందూచిత్రకారులు పాశ్చాత్యపద్ధతిని చిత్రించుట ప్రారంభించిరి. వీటి నిప్పుడు "జానుకంపెనీ" చిత్రము లందురు. మోలారాము మొదలైన సుప్రసిద్ధజాతీయచిత్రకారు లచ్చటచ్చట నుండినను రవివర్మ తన చక్కని చిత్రములచే హిందూసంప్రదాయముల నెరుగని ఆంగ్లపాఠశాలలలో చదువుకొనినవారి మెప్పును పొంది పాశ్చాత్యవిధానమును దేశమున స్థాపించుటకు సహాయపడెను. భారతదేశమునందు ప్రవేశపెట్టబడిన ఆంగ్లవిద్యావిధానమునందు మనచిత్రరచనకే కాక ఐరోపాచిత్రరచనకుగూడ తావు లేకపోయినది. చిత్రశిల్పరచనలను పాఠశాలలలో గరపునటులు చేయుటకు కొందరు చిత్రకళాభిలాషులు ప్రయత్నించిరి కాని లాభము లేకపోయెను. చిత్రవిద్యను నేర్పు పాఠశాలలు ఇంజనీరింగుడిపార్టుమెంటువారి యధికారమున నుంచబడినవి. మనలో చదువుకొనినవారికి భారతీయపురాతనసంస్థలపై దృష్టి లేకపోయినది. కనుకనే యిప్పుడే దేని భారతీయరచనావిధానము ననుసరించి వ్రాయబడిన చిత్రమును చూచినప్పుడు ఐరోపాచిత్రముల కట్టుబాట్లప్రకారము దానిని విమర్శించి బాగుగలేదని చెప్పుట కలుగుచున్నది.

ఇన్నాళ్లకు భారతదేశమున చిత్రకళకును ప్రజల యాధ్యాత్మికజీవనమునకును సంబంధము వీడిపోయినది. మన చిత్రరచనయందలి హిందూత్వము చలించుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని మనజీవితములో నీ హిందూత్వమునే పట్టుకొని యీాదులాడుచున్నాము. అట్టి యెడ మన పురాతనచిత్రరచనావిధానము విడనాడినయెడల మననాగరికతను బోషించు చుండిన యాధారములలో నొకదానిని త్యజించుచున్నాము.

మారుచున్న పరిస్థితులలో సనాతన చిత్రరచనావిధానము మనకు పనికివచ్చునా, రాదా యను సందేహముతో మనకు పని లేదు. మనము భారతీయులమని యనిపించు కొనునంతవరకు మన చిత్రరచనయే మనకు తగినది. మన మిట్టి సందేహములకు లోనై, కళలయందును, తదితరవిషయములందును హిందూత్వమును విడనాడినయెడల ఆత్మ గౌరవమును విడనాడినవారమై రిక్తహస్తము లతో ప్రపంచపుదృష్టియందు నిలువబడ వలసివచ్చును.

భారతీయచిత్రరచన శ్రేష్ఠమైన దని యనేకు లుపన్యాసముల నిచ్చుట మీా రెరు గుదురు. ఈ విషయము నిచ్చట విపులపర చుట యలవికానిపని. తక్కినవిధానము లును మంచివే యన్నవారితో నాకు వివా దము లేదు. ఏదేశమునకు తగినటు లా దేశీయులు ప్రత్యేకరచన ననుకరించు చున్నారు. భారతీయులు చిత్రించునటులు ఐరోపావా రేల చిత్రింపలే దన్న ప్రశ్న కాయాదేశముల చరిత్రలే ప్రత్యుత్తరమీాయ గలవు. కొంచెము విచారించి చూచినయెడల నీ విషయము స్పష్టపడగలదు.

సుప్రసిద్ధచిత్రములకు దేశవిభాగముల తోను, కాలభేదముతోను పనిలేదన్న నుడి యందు సత్యము కలదు. కాని యాచిత్ర ములును కొన్ని కట్టుబాట్ల ననుసరించి దేశ కాలభేదములను సూచించునవిగ నుండును. హిందూదేశమున ప్రతికళయొక్క ముఖ్యో ద్దేశమును భక్తిని వెల్లడిచేయుటయే. ఈ భక్తియేహిందూత్వమునకు మూలాధారము. కావుననే మతమున కంగములుగ మనదేశ మున మనోజ్ఞకళలు పెరిగినవి. గానము దేవుని కొనియాడుటకును, కవిత్వ మీాశ్వరుని లీలలను వర్ణించుటకును, చిత్రరచన భగవం తుని రూపమును లిఖించుటకును ఉపయోగ పడినవి. చిత్రకారుడు హిందువుడైనను, బౌద్ధుడైనను భక్తుడుగను, సదాచారపరుడు గను, యజ్ఞోపవీతధారిగను, ఏకపత్నీ వ్రతుడుగను, శాస్త్రములందు నమ్మకము కలవాడుగను, ఇంద్రియనిగ్రహముగలవాడు గను ఉండవలె నని మన శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి. చిత్రకారుడు యోగిగ నుండ వలెను. కనుక నీసద్గుణము లన్నియు నాతని యం దుండుట యవసరము. చిత్రకారుడు తాను చిత్రింప దలచుకొనిన విషయములో నిమగ్నుడైపోవలెను. ప్రతిమను నిర్మింపక పూర్వము శిల్పి యాసనశుద్ధిని, తనయిష్టదేవ తను బూజించి మనశ్శుద్ధిని సమకూర్చుకొని, తానుకల్పింపదలచిన దేవత కనుగుణమగు బీజమంత్రముల నుచ్చరించి ధ్యానమంత్రము నాపిమ్మట జపింపవలెను. అప్పుడు తన కా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవత ప్రత్యక్షము కాగా నారూపమును మనంబున లిఖించి, శిల్పశాస్త్రముల సహాయమున విగ్రహము నేకాంతప్రదేశమున తదేకదృష్టితో మలచవలెను. చిత్రకారుని మానసికప్రతిమనే శిలాప్రతిమగ మార్చుట కలుగును. కనుక నిట్టి ప్రతిమల సొగసు మొదలగునవి చిత్రకారుని యాధ్యాత్మికస్థితినిబట్టి యుండును. కొన్ని దేవాలయముల గోడల మీద ప్రధాన దేవతావిగ్రహము పెద్దదిగను, చుట్టు నున్న దేవతలు చిన్నవిగను ఉండుట ఎల్లరకు తెలిసినవిషయము. ఆధ్యాత్మికముగ ప్రధానదేవత తక్కినవానికంటె పెద్దది. స్థూలప్రపంచపు పరిమాణము లిట్టివిషయమున లెక్కకు రావు. చిత్రముయొక్క యేర్పాటును చిత్రకారు డీ ప్రపంచమున మనంబున లిఖించుటయే లేదు. శిలపైననో, గోడమీదనో లిఖింపయత్నించుటకు పూర్వమే యాచిత్రరచన మనఃఫలకముపై పూర్తిగ చిత్రితమైయుండును. ఇప్పుడు ఐరోపా, అమెరికా దేశములం దాదరణమునకు వచ్చుచున్న ఫ్యూచరిజము (Futurism), క్యూబిజము (Cubism), పోస్టు ఇంప్రెషనిజము (Post-Impressionism) మొదలైన నూతన చిత్రరచనావిధానముల నానాడే మనచిత్రకారులీ యుత్తమరీతిని సాధింపజాలిరి. ఇట్టి యాదేశములుకల చిత్రరచనా విధానమునకును పాశ్చాత్యవిధానమునకును చాలవ్యత్యాసముకలదు. ఐరోపావారియొక్కయు, మనయొక్కయు దృక్పథములే వేరగునప్పు డెన్నియేనియు భేదములుండును. ఆధ్యాత్మికచింతయే ప్రధానముగ గణించుభారతజాతికి పైన బేర్కొనిన యాశయములు కలరచనయే తగనియెడల మరియెట్టిది తగునో తెలియకున్నది.

రవివర్మయొక్క చిత్రములు పాశ్చాత్య విధానమున మిక్కిలి చక్కనివైనను హిందూ దృక్పథమునకు సరిపడునటులు లేవు. మన సనాతనసంస్థలపై ప్రజలదృష్టి లేని యాకాలమున రవివర్మవంటి చిత్రకారు డుద్భవించుట సహజము. అతడు చిత్రములను పరదేశములకు బంపి భారతదేశముయొక్క కీర్తిని వెదచల్లిన మహానుభావులలో నొకడు. కాని జాతీయత యనున దొకటి కలదు. వీరి చిత్రములు చరిత్రకు దూరములగుటవలనను, భారతీయుల సంప్రదాయములను వీరు పాటింపకపోవుటవలనను, పూర్వపు విధానములను పునరుజ్జీవితములుగ జేసి జాతీయతకు అగ్రస్థానము నొసగుటకు ప్రయత్నములు ప్రబలమగుటచేతను రవివర్మరచనయెడల నాదరము కొంత తగ్గుచున్నది.

ఇటులు జాతీయతను పునరుద్ధరించుటకు పూనుకొనినవారిలో ముఖ్యులు అవనీంద్రనాథ ఠాకురు, గగనేంద్రనాథఠాకురుగారులు. అనేకులు సుప్రసిద్ధచిత్రకారు లీ యుద్యమమునకు తోడ్పడి దేశమునకు కీర్తినిచేకూర్చుచున్నారు. ఫోటోగ్రాఫువలె చిత్రములను వ్రాయుటకు బదులు, ఆత్మవిమర్శనము జేసి లోనున్న యాధ్యాత్మికభావములకు రూపములను గల్పించి, దృశ్యప్రపంచమున మరుగుపడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్న దేవునిలీలలను వెల్లడిచేయుట వీరి యాశయములలో ముఖ్యమైనది. ఇదియే మన సనాతనచిత్రకారుల యాశయము.

ఈ యాశయములతోను, వీటినే కొంత మార్చియు నాంధ్రదేశమున కొందరు చిత్రకారులు చిత్రించుట మనము గమనించి హర్షింపవలసిన విషయము.

కాని మనపరిస్థితు లిప్పటికిని బాగుగ లేవు. మనదేశమున మనకు మన చిత్రరచనయే మంచిదని చెప్పుకొనవలసివచ్చుచుండుట చాల విచారకరము. మనచిత్రకారులు వ్రాయుచున్న చిత్రములను మనమే బోధపరచుకొనుటకు యత్నింపకున్నాము. ప్రజలలో వీటియెడల నభిమానము లేకపోవుటచే చిత్రకారులకు తగినపోషణ లేకయున్నది. బజారునం దేవో పనికిమాలిన బొమ్మలమ్ముడుపోవుచున్నవి కాని జాతీయచిత్రములు మచ్చునకైన కానవచ్చుట లేదు. జాతీయ చిత్రకారులమని కొంద రేవోకొన్ని యర్థములేని చిత్రములను వ్రాసి ప్రదర్శించుచున్నారు. వీరికి చిత్రరచన తెలిసినటులు లేదు. ఇట్టివే జాతీయచిత్రము లని యనేకులను కొనుటవలన శుభప్రదముగ ప్రారంభమైన యుద్యమమునకు కష్టములు కలుగుచున్నవి. పత్రికాధిపతులును మంచిచిత్రముల నెంచి ప్రచురించుట లేదు.

కాని నిరాశ జెందుట కవసరము లేదు. దేశమునందు మంచి ప్రచారము జరిగినయెడల పరిస్థితులుబాగుపడగలవు. ఈపనిని జేయుటకు విశాఖపట్టణమునంటి స్థలమున నొకసంస్థను నెలకొల్పవలసియుండును. మంచి చిత్రముల నెంచి అచ్చువేయించి యమ్మినయెడల పైకము చేకూరగలదు. గుమాస్తాలయు, కార్యదర్శులయు వేతనములను మినహాయించి, చిత్రముల నిచ్చిన చిత్రకారులకు కొంత భాగము లాభము నిచ్చి మిగిలిన పైకముతో ప్రదర్శనముల నచ్చటచ్చట ఏర్పరుపవచ్చును. చిత్రకళను గూర్చిన గ్రంథముల వెల సామాన్యముగ కొనలేనంత హెచ్చుగ నున్నది. కనుక నొకపుస్తకభాండాగారము నేర్పరచినయెడల చిత్రకారులకు, చిత్రకళావిమర్శకులకు, చిత్రకళాభిమానులకు చాల పనికివచ్చును. సుప్రసిద్ధ కళావిమర్శకులను, కళాభిమానులను రప్పించి భారతీయచిత్రకళను గూర్చి యుపన్యాసముల నిప్పించవచ్చును. ప్రచారముమూలమున కళాశాలలలో చిత్రకళవిషయమై నేర్పునటులు విశ్వవిద్యాలయమువారిని కోరి వారి సహాయమును బొందవచ్చును.

ఏవో చిత్రములను చూచి జాతీయచిత్రములు మంచివి కావని యనుట భావ్యము కాదు. కొంచెము దూరదృష్టితో జూచినయెడల మన పూర్వవిధానములందు నమ్మకము, విశ్వాసము, ప్రేమయు గలుగుట నిశ్చయము. తరువాత ఉత్సాహము కలుగక తప్పదు. పలుకుబడికలవార లీ విషయమై యికనైనను శ్రద్ధ వహింపగలందులకు నా వినయపూర్వక మగు ప్రార్థనము. భారతీయచిత్రరచన మరల తన యున్నతస్థానము నధిష్ఠించుగాక !

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విరిసెజ్జ

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

[God is Love: and he that dwelleth in Love dwelleth in God, and God in him. —The Holy Bible]

చిత్కలానందకలికా ప్రేమరూపా ప్రియంకరీ
ప్రాణేశ్వరీ
—లలితాసహస్రనామస్తోత్రము

* * * *

అమ్మ కారుణ్యాని కంతంబు లేదు

* * * *

* * * *

మాతోఁటలో నొక్క మందారచెట్టు—
ఆ చెట్టుచెంత నే యమృతంపు బావి,
అడవిమల్లియతీవ యాబావిక్రేవ;
ఆమల్లెతీవతో నాడుకొంచుంటి.

* * * *

జిలుఁగుఁబూవులబుటాల్ సెలువారుచున్న
యాకుఁబచ్చనిచీర హాసుమైఁ దాల్చి;
నెమ్మేనివాసనల్ నిండఁజేయుచును,
జిగురుఁజేతులతోడఁ జేరఁగాఁబిల్చి,
తీఁగబుజాలతోఁ గాఁగిటం జేర్చి,
తేఁటిపాటలఁ బాడి, తీపులం గొల్పి,
దినమున కొకక్రొత్తతీరుగాఁ దోఁచి,
యడవిమల్లియతీఁగె యానంద మిచ్చె.

* * * *

మందారవృక్షంబుక్రిందఁ గూర్చుండి,
యడవిమల్లియఁ గూడి యాటాడుకొంచు,
ననునేనెమఱచి యానందంపుఁగడలి
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచునుంటి.
ఇనుఁ డస్తమించుట యెఱుఁగనియట్లు
దినములు రేలును జనియె నెన్నెన్నొ.

* * * *

* * * *

ఒకనాఁటి తొలుసంజ నుత్సాహ మొప్ప
నడవిమల్లియఁ గూడి యాడుకొంచుండ
వింతవింతలపాట వినవచ్చె నొకటి.
పాటవినంబడు ప్రక్కకుఁ దిరిగి,
మనసారఁగా దాని వినుచు నే నుండ,
క్రొంగ్రొత్త వింతరంగులు కనంబడియె.
ఆపాట లారంగు లటులాగె మనసు;
మనసు మెల్లఁగ లాగికొనిపోయె నన్ను.
అడవిమల్లియ వీడి యటుపోవుచుంటి.
మందారవృక్షంబు మఱచిపోయితిని
అమృతంపుబావి దవ్వయ్యెను నాకు;
తోఁటను దాఁటితిఁ; ... ...
... ... ... బాటలేదయ్యె;
పాటలు, రంగులు ప్రక్కనే చెలఁగె;
దరిఁజేరఁగాఁ బోవ, దవ్వయ్యెఁ బాట;
దరిఁజేరఁగాఁ బోన, దవ్వయ్యె రంగు;
దరిదరిగాఁ బోవ, దవ్వుదవ్వగుచుఁ
బాటలు రంగులు పాఱిపోసాగె;
పాటలు రంగులు పాఱుచునుండ,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెంబడించుచు నేను వెడలసాగితిని.
వీనుల కింపుగా వినుచుంటిఁ బాట,
కన్నుల కింపుగాఁ గనుచుంటి రంగు;
పాటలు రంగులు పట్టెను మనసు,
మనసులాగుచు నన్ను మఱిమఱి యీడ్చె;
మాతోఁట విడనాడి, మఱిమఱి పోయి,
మఱిపోయి, మఱిపోయి, మఱిపోయిపోయి,
వెఱ్ఱిమెత్తినరీతి వెడలసాగితిని.
తోఁట కన్పడలేదు; దూరమైపోయె;
పాట విన్పడలేదు, పాటె నెయ్యెడకొ—
తొలుత నేరంగులు తెలియరావయ్యె;
లేవయ్యె రంగులు, లేదయ్యె పాట,
బాట లేదయ్యె, మా తోఁటలేదయ్యె.
ఎందు నే నుంటినో యెఱుఁగలేనైతి,
ఏమి చేయఁగనౌనొ యెఱుకలేదయ్యె,
వెనుకకుఁ బోలేను, కనరాదు బాట,
ముందుకుఁ బోలేను, మునుము కన్పడదు.
మనసునిల్పఁగలేక, మఱి నిల్వలేక,
పోవుచునుంటిని—పోవుచునుంటి.
ఎటు పోవుచుంటినో యెఱుఁగను నేను,
వెనుకకో ముందుకో వివరింపలేను,
పోవుచునుంటిని—పోవుచునుంటి.

* * * *

* * * *

మలుసంజవచ్చెఁ గ్రమ్మఁగఁ జొచ్చె నిరులు,
కాఱుచీఁకట్లు నల్లడఁ జిందుచుండె,
గండ్లలో ముండ్లలోఁ గదలలేకుంటి,
నడవిలోపల నొంటి నడలుచునుంటి—
కేల్గలమెకములు గీపెట్టునట్టు
ఉఱుముచునుండె నబ్బురపు మొయిళ్లు;
వాన తొండాలతోఁ బైఁబడుచుండె;
గడగడలాడించి, గాలులు వీఁచె;
అడవిచెట్టులు మీఁదఁబడునట్టు లుండె.
దయ్యంపు పెత్తికో ల్దాఁకెను దుదిని.
తుదిదాఁకె ధైర్యంపుఁ దునుక వెలుంగు;
నడలు ధైర్యంబుతో నడలునఁ గుంది,
యలసిపోయితి ముందు కడుగిడలేక.
అలసిపోయితినయ్యొ యలసిపోయితిని.
యేమేమొ యనుకొంటి - ఏడ్వసాగితిని.
అలసిపోయితిని—
అలసిపోయితినయ్యొ, అలసిపోయితిని,
కటకటా నీకింత కాఠిన్య మేల?

* * * *

అలసిపోయితినయ్యొ, అలసిపోయితిని.

* * * *

తిరిగితిఁ దిరిగితిఁ దెరవు లన్నియును,
వెదకితి వెదకితి వేసారిపోతి;
ఏమూల నుంటివో యీ చలం బేల,
మొదఁదాఁగుంటివో, యేల కన్పడవు?
అలసిపోయితినయ్యొ, అలసిపోయితిని,
కటకటా నీకింత కాఠిన్య మేల?

* * * *

గట్టుపైఁ బుట్టపైఁ గాల్జారిజారి,
పడుచులేచుచు, ముండ్లబాట లన్నియును,
వెదకితి, వెదకితి, విసివిపోయితిని,
తిరిగితిఁ దిరిగితిఁ దెరవు లన్నియును,
అలసిపోయితి నయ్యొ, అలసిపోయితిని,
కటకటా నీ కింత కాఠిన్య మేల?

* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అర్ధనారీశ్వరుడు

శిల్పి : కె. వెంకటప్ప.



మధుర దేవళమున నొకకంబముపై చెక్కిన ఈశ్వర ప్రతిమ

—యస్. శంకర సుబ్రహ్మణ్యం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అచ్చరచాన

—అసిత్ కుమార్ హాల్దార్.



సామురై గుఱ్ఱపుస్వారి
(జపానీయ చిత్రము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకసంబున మబ్బు లలముకొన్నపుడు,
చీఁకటి యంతటం జెదరియున్నపుడు,
వర్షంబు బోరనఁ బడుచున్నయపుడు,
తిరిగితిఁ దిరిగితిఁ దెరవుదప్పితిని,
అలసిపోయితినయ్యో, అలసిపోయితిని,
కటకటా, నీ కింత కాఠిన్య మేల ?

* * * *

గాలి వీఁచుచు భీతిగలిగించువేళ,
చెట్టుకొమ్మలు మీఁద నట్టాడువేళ,
ఊపిరాడక చిత్త ముస్సురన్వేళ,
వెదకితి, వెదకితి, వేసారిపోతి,
అలసిపోయితినయ్యో, అలసిపోయితిని.
కటకటా, నీ కింత కాఠిన్య మేల ?

* * * *
* * * *

ఏమనుకొంటినో, మెఱుఁగను నేను.
ఏమి కావలయునో, మెఱుఁగలేనైతి,
అలసిపోయితి నంచు నఱచుచునుంటి.
మింటఁ దళుక్కున మెఱ పొండు మెఱసె.
మెఱపువెల్గునఁ గనుల్ మిఱుమిట్లుగొల్పి,
యెదుటఁ గన్పడెఁ బదియేఁడుల బాల.
పదియేండ్లబాల నాయెదుటఁ గన్పడియె,
ముసిముసినగవుల ముదమిచ్చె బాల;
లోలోనఁ దనిసితి బాలవైఖరికి.
చేసాఁచి, కౌఁగిటఁ జేర్చె నన్ బాల;
కరఁగి నాలోపలఁ గలసెను బాల,
గరఁగించి, లో నన్నుఁ గలపెను బాల;
నాలోన బాలయు, బాలలో నేను,
కరఁగి, యొండొరులోనఁ గలసిపోయితిమి.

ఏమయియుంటినో యెఱుఁగను నేను,
నే ననుమాటయే పూనకయుంటి.
ఎంత సే పుంటినో యెఱుఁగ నిమ్మాడ్కి..

* * * *
* * * *
* * * *

తెలివివచ్చెను ; చుట్టుఁ దేరిచూచితిని,
ఒక్కయుద్యానమం దుంటిని నేను.
వింతవింతల చెట్లు, విలసిల్లు చెట్లు,
రంగురంగుల పూలు, రాణించు పూలు,
వింతల పండ్లును, వింతలం గొల్పె.
వింతలఁ జూచుచు, వింతలఁ గొనుచు,
వింతముదంబున వెడలుచునుంటి.
పూవుటీరంబునఁ బూలుకోయుచును
బాల కన్పడె
　　　　నాద్రమోల నొక్కెడను,
బాలగా దిప్పుడు, ప్రౌఢయుఁ గాదు;
లసితనిర్మలమంజులమనోజ్ఞ మైన
లలితరూపము దాల్చి యలరారుచుండె.
ఆలలితాకార మరయుచునుంటి,
నానందమునఁ దేలియాడుచునుంటి,
ననుఁ జూచి, తరుణి యానందంబు నొందె,
ఆనందమునఁ జెంత కరుదెంచెఁ దరుణి.
ప్రేమ చూపులలోన వెల్లయుచునుండఁ
జల్లనిచేతులు చాఁపి, కౌఁగింట,
ననుఁ జేర్చి, తనివార నను ముద్దులాడె.
ముద్దాడు తరుణిని ముద్దాడుచుంటి
ముద్దాడుచుంటిని, ముద్దిడుచుంటి

* * * *
* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తరుణుండనై నేను, తరుణినై తరుణి,
ప్రేమస్వరూపాల, వేఱెఱుంగకయ,
సారూప్యమును బొంది సంతసించితిమి.
సారూప్యమును బొంది, సంతసంబొప్ప
సతితోడ నేనును, సతియు నాతోడ,
నాటపాటల మున్గి యలరసాగితిమి.

* * * *
* * * *
* * * *
* * * *

అభిరామనవపల్లవారామకుంజవా
టికలఁ గీరముల నాడించుకొనుచుఁ,
బద్మాలయోదరప్రౌఢసారసవీథి
నంచల వేడబం బరసికొనుచు,
గాంగేయధామశృంగవిటంకముల నీల
కంధరోజ్జ్వలగతుల్ గాంచికొనుచు,
విమలసింధుద్వీపవేదిక నరుణాప్త
ఖగవిహారప్రౌఢిఁ బాగడికొనుచు,
రతియుఁ జేతోభవుండు, భారతియు నజుఁడు,
శచియు నమరాధినాథుండు, జలధిసుతయు,
నబ్జనాభుండు (నయి) మించి, యఖిలసమయ
సముచితక్రీడ సలిపితి (సతిని గూడి).
(వసుచరిత్రము - ఇంచుకమార్పుతో)

* * * *
* * * *

ఆటపాటలలోన ననఁగిపెనంగి,
యేనును దరుణియు నింపొందుచుండ,
దినము లొక్కొక్కటి చనుచు నేయుండె.
క్రొత్తక్రొత్తముదంబుఁ గూర్చుచునుండి,
దినదినంబును మార్పుఁ గనుచుండెఁ దరుణి
తరుణరూపంబునఁ దరుణితోఁ దొల్త
సారూప్యభావ మొప్పారంగ నుంటి.
సారూప్యభావంబు సడలఁగాసాగె;
ప్రేమగౌరవ పూచుఁ బెంపొందసాగె.
ప్రేమలో గౌరవప్రీతి కన్పట్టె.
గౌరవంబున నేను గనుచుంటిఁ గాంతఁ
బ్రేమతో నను గాంత వీక్షించుచుండె.
విరిసెజ్జపైఁ గాంత నరసినవేళ,
సింహాసనేశ్వరిచెలువున నుండె.
మోహగౌరవములు మొనయుచునుండ,
శ్రీమహారాజ్ఞిఁ గాంచినరీతిగాఁగ
సంతసించుచునుంటిఁ గాంతఁ గన్గొనుచు
కనుట కింపగు పూవు కొన్నితెచ్చియిచ్చి,
తినుట కింపగు పండు కొన్నితెచ్చియిచ్చి,
కాంతకుఁ బరిచర్య గావించుచుంటి,
నాపరిచర్య సంతస మిచ్చె సతికి,
సతిని సేవించి నే సంతసించితిని.
ఆసేవ తోఁచె బ్రహ్మానందమట్లు.
మఱచితి నామాట, మఱచితి నన్ను,
కాంతను గొల్చుటే కార్యమైయుంటి.
ఏకచిత్తంబున నీరీతిఁ గాంత
గొలుచుచుంటిని దినమ్ములు సాగుచుండె.
పరిపూర్ణమౌ ప్రేమ పరగించి కాంత
నన్నుమాత్రమె చూచుచున్న దటంచు
ననుకొంచు, సేవించుకొనుచుంటిఁగాని,
ప్రేమలో వేఱొక్కవిధము కన్పట్టె.
పూవు లాకులు వైచి పూజించుచెట్లఁ
బ్రేమతో నాయింతి వీక్షించుచుండె;

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముద్దుగాఁ బల్కెడు ముద్దుఁజిల్కలను
ప్రేమతో నాయింతి వీక్షించుచుండె.
పాటపాడెడు తేఁటి నాటాడు నెమలిఁ
బ్రేమతో నాయింతి వీక్షించుచుండె.
ఇంతిప్రేమయె నాకు నెందుఁ గన్పట్టె.
ననుఁబోలె, లోకమంతయు నింతిప్రేమఁ
గనుచుండె నన్నట్లు కన్పట్టె నపుడు.
మూఁడులోకంబుల మోహింపఁజేసి,
మోహినీరూపంబుఁ బూని యాయింతి.
ననుఁజూచి ముసిముసి నగవున నొప్పె.
ముసిముసినగవులో మునిఁగిపోయితిని,
మఱచితి లోకంబు, మఱచితి నన్ను,
ముసిముసినగవులో మునిఁగిపోయితిని.
తెలివివచ్చెను; చుట్టుఁ దేరిచూచితిని.
అడవిమల్లియతోడ నాడుచునుంటి;
విరిరాలె మందార వృక్షంబునుండి;
పిల్లతెమ్మెర మెల్లమెల్లఁగా వీఁచె.
అడవిమల్లియ వింతయగుచుఁ గన్పట్టె.
బాలరూపమునఁ గన్పడినట్టి కాంత,
లలితరూపమునఁ జెలఁగిన కాంత,
శ్రీమహారాజ్ఞియై చెలఁగిన కాంత,
యడవిమల్లియలోన నలరారుచుండె.
మూఁడురూపంబుల మొనసికన్పట్టె,
మూఁడులోకంబుల మోహింపఁజేసి,
ప్రేమస్వరూపమై ప్రీతి నింపుచును,
మూఁడుమూర్తులకును మూలమైనట్టి
యాయమ్మ యొకతెయే యడవిమల్లియను
నాకుఁ గన్పడుచుండి, నను జూచుచుండ,
నబ్బురపాటుతో ననుకొంటి నిట్లు:
"అమ్మ నీప్రేమకు నంతంబు కలదె?
నాతప్పులను బాపి నను బ్రోచినావు;
తప్పుత్రోవను నిల్చి తలఁకొందనేల?
అమ్మను నమ్మిన నగపడుఁ ద్రోవ;
అమ్మకారుణ్యాని కంతంబు లేదు."
అనుచు నీరీతిగా ననుకొనుచుండ
అమ్మరూపంబున నలరారుచున్న
యడవిమల్లియఁ గూడి యాడుకొంచుంటి;
అమృతంపుబావిలో నమృతంబు గ్రోలి,
మందారవృక్షంబుక్రిందఁ గూర్చుండి,
యడవిమల్లియతోడ నాటాడుకొందు;
అడవిమల్లియతోడ నమ్మలోఁ గరఁగి,
యమృతంపుబావిలో నణఁగిపోవుదును,
*　*　*　*
అమ్మకారుణ్యాని కంతంబు గలదె?
*　*　*　*
*　*　*　*
*　*　*　*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## బొమ్మలకు చట్టములను వేయుట

కొ. నరసింహాచారి

చిన్నబొమ్మలకు కొయ్యచట్టములను వేయుటకు ఎక్కువ ఖర్చు అగును. అట్లుగాక "ప్యాసి పార్టాటు" (Passe partout) అను కాగితమును చుట్టును నతికించి చట్టములను బిగించవచ్చును. ఇది మిక్కిలి చౌకగ లభించుటయే కాక బాలురుసయితము స్వయముగా చేయదగియుండును.

చట్టములను వేయుటకుపూర్వము ఈ క్రిందివిషయములను ముఖ్యముగ గమనింపవలసియున్నది:

౧. చిత్రము చిన్నదైనను దానిని మరియొక పెద్దకాగితముపై నదికించి చట్టము పెద్దదగునట్లు చేయుట. అడుగున నదికించు పెద్దకాగితమును మౌంటు (Mount) అందురు. ఇది లేత పచ్చ, బూడిద, నీలము, లేక గోధుమవర్ణము గలిగియుండిన బాగుండును.

౨. అడుగుకాగితముపై చిత్ర ముండవలసినస్థానము. సాధారణముగా చిత్రమును అడుగుకాగితము (Mount) యొక్క మధ్యభాగమున నమర్చుట వాడుక (చిత్రము 3). ఇట్లుకాక చిత్రమును మౌంటునందు ఏదేని యొకమూలకు సమీపముగా నమర్చుటగూడ అందముగ నుండును (చిత్రములు ౪, ౬).

a. b. c. d అనుచిత్రమునందు a d: c b అనువ్యాసములు (Diagonals) కలవు (చిత్రము ౧). మౌంటునందు (చిత్రము ౨) p s q r అనువ్యాసములు కలవు. చిత్రమును అమర్చునపుడు దాని వ్యాసములలో నొకదానిని మౌంటుయొక్క వ్యాసములలో నొకదానికి పైనవచ్చునట్లుంచి, అనగా a d అను చిత్రముయొక్క వ్యాసమును (చిత్రము ౪) p s అనుమౌంటుయొక్క వ్యాసముపై నుంచి, p మూలకు కొంతసమీపముగ ద్రోసి యతికించవలెను. అడ్డముగ నుండు (చిత్రము ౧) చిత్రమును చిత్రము ౪ నందలి విధముగను, నిలువుగ నుండు (చిత్రము ౫) చిత్రమును చిత్రము ౬ నందలివిధముగను అమర్చవలెను.

పిమ్మట ప్రతిచిత్రమునకు గల మౌంటు పరిమాణమునకు సరియగు నొకయద్దమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒక అట్టయు కావలెను. అట్టయందు చిత్రము ౭ నందలివిధముగ x, y అనుచోట్ల కత్తితో చిన్న సందులను కోయవలెను. పిమ్మట చిత్రము ౮ యందు గలట్టి యుంగరములను రెంటిని దీసికొని, ఆరంధ్రములలో m, n అను రేకుకొనలను దూర్చి అట్ట వెనుకప్రక్క m, n లను చిత్రము ౯ విధముగ వెనుకకు వంచుకొనవలెను (చిత్రము ౧౦). అప్పుడు ఉంగరములు అట్టకు వెనుకప్రక్క నుండును. పిమ్మట నట్టపై (m, n అనుకొనలుండుప్రక్క) మొదట పటమును, దానిపై నద్దమును సరిగా నుంచుకొనవలెను.

చిత్రము ౧౧ నందుగలది ప్యాసిపార్టౌటు (Passe Partout) కాగితపుచుట్ట. దీనియందు ఒక ప్రక్క వెలుపలికి రాదగినదిగను, రెండవ ప్రక్క లోపల నుండ దగినదిగను ఉండును. దీనినుండి పటపు నిడివికొలత గల రెండుతునుకలను, అడ్డకొలత గల రెండుతునుకలను తీసికొనవలెను. నిడివి తునుకలకు పేస్టురాచి అట్ట, పఠాంటు, అద్దము-ఈమూటిని చేర్చి పట్టుకొని వాటి రెండునిడివి ప్రక్కలకును అతికించవలెను. ప్యాసి పార్టౌటు (Passe Partout)




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెడల్పులో సగము పటముముందుప్రక్క కును, సగము వెనుకప్రక్కకును ఉండ వలెను. తర్వాత అడ్డకొలతకు సరిగా కత్తి రించబడిన తక్కిన రెండుతునుకలను తీసి కొని, వాటి కొనలందు చిత్రము ౧౩ నందలి విధముగ మూలలను కత్తిరించివేయవలెను. ఈతునుకలను పటముయొక్క వెడల్పు ప్రక్కలకు అతికించవలెను. పిమ్మట అట్టవెనుకగల ఉంగరములకు దారమును కట్టిన, పటము వ్రేలాడ గట్టదగియుండును (చిత్రము ౧౪). ఉంగరములకు దారమును కట్టురీతి చిత్రము ౧౫ నుండి విశదమగును. ప్యాసిపార్టౌటునకు బదులుగా నే యితర విధమగు రంగుకాగితమునైనను ఉపయో గించవచ్చును. అట్టికాగితములను ఒకయం గుళము వెడల్పుగల తునుకలుగా కత్తిరించిన అనుకూలముగ నుండును.

(All rights Reserved)

---

## 'పొంగలి'

తుమ్మలపల్లి వేంకటరత్నముపంతులు

ద్రాగుత్తుంగతరంగరింగణగణోద్యద్యానమద్భారతీ
భాగీరథ్యమలాంబుగర్భముపయిన్ బంగారునీరూదుచున్
భూగోళం బది, నైజతైజసకళాపుంజంబునం దబ్బమై
రాగిల్లన్ 'రథసప్తమీ' దినముఖార్కప్రాభవం బొప్పెడిన్.

తెలిమంచుమేల్ముసుం గల నల్లఁ బోఁజోపి 'ప్రకృతి' చిర్నగుమోము బైటఁబెట్ట
తన పైఁడిగిన్నెలో గొనబుఁదేనియలూని బిసినీకుమారి నైవేద్య మిడఁగ
'తళతళ' లాడు ముత్యాల జాకాలతోఁ గుస్తుంబరియు నెదుర్కోలు తెలుప
వివృతఫణామణీవిమలాంశురింఛోళి వ్యాళకన్యకలు నివాళిమెత్త
నున్మఖీభూతమై తల యూఁచి మెచ్చి - 'ప్రొద్దుతిరుగుడుమొగ్గ' సొంపులు వెలార్ప
పదుగ్గురుత్తాల రథముపై నెక్కి వెడలె - సూర్యదేవుండు త్రిభువనీశోభనముగ.

ముక్తిస్త్రీకబరీపరీణతజపాపుష్పోత్కరంబై మదో
ద్రిక్తావ్యక్తజగద్భయంకరణమం దేహోరుదేహోద్గళ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్రక్తాసిక్తవపుఃప్రపూజితనభోరత్నంబు రాజిల్లెడిన్
ప్రాక్తాటంకవతీమణీమకుటమై వై యత్కకూష్మాండమై.

కమలినీలోల కోమలార్కప్రవాళ - మండితావయవుండనై మాఘమాడి,
తులసిచెంగట పాలపొంగలి ఘటించి - కాన్కవెట్టితి: చిక్కుడుకాయరథము.

మిన్నులు డిగ్గి, మాగృహముమీఁదుగ సన్నిధిసేసి కొంచె మీ
చిన్నిరథంబుపై నిలిచి, సేవలొనర్పఁగ వేచియున్న యీ
న న్నొకకంటఁ జూడు; కరుణావరుణాలయ, నీదుపాదముల్
కన్నుల కద్దికొందును త్రికాలనియామక, ద్వాదశాత్మకా!

శ్రీగలయింటి కృష్ణతులసీపదమూలమునందుఁ గ్రాగుచున్
గ్రాగుచునున్న పాలు; ప్రొయిరాజిన దిప్పుడె పాత్రలోపలన్
మ్రోఁగఁగసాగె; తండులపు మొగ్గ లివే విరియంగనయ్యె; నే
లాగుననైనఁ బాయసములన్ సమకూర్తు నొకింత సైఁచినన్.

పొంగినపొంగుతో దొరలిపోవు పయస్సున నగ్గికిన్ సెగల్
గ్రుంగునొ యంచు కాచికొని కొండొకశీతజలాభిషేచనన్
బొం గడఁగించి యెట్లొ రుచిపొందు ఘటిల్ల రచించినాఁడ నీ
పొంగలి నారగించి మఱి బొమ్ము: నమస్కృతి లోకబాంధవా!

అగ్నిదేవుండు సప్తజిహ్వలును జాఁచి - యెవ్వని కరామృతమునకై యిచ్చగించు
నట్టి ప్రాభాతసూర్యనారాయణుండు - అవయవంబుల కమృతమయత్వ మొసఁగు.
నిర్మలంబైన సద్వస్తునిచయమందుఁ - బ్రతిఫలించుచునుండు నెవ్వాని మూర్తి,
అట్టిదేవుండు మత్కవితానతాంగి - చెక్కుటద్దాలఁ బ్రతిఫలించెడినిగాత.

జంతుకోటికి పరిణామశక్తులొసఁగు-భూరిచైతన్య లక్ష్మివిభుండు: మాదు
సూర్యభగవానుఁ డతిలోకశుద్ధుఁ డట్టి-శ్రీకరాకారు నక్షిలక్షీకరింతు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



మహేశ్వరమూర్తి

ఇది బొంబాయిసమీపమున 'పేరెల్' గ్రామమునుండి 'సేరి' గ్రామమునకు బాట వేయుచుండగా నచ్చట దొరకిన శిలావిగ్రహము. విగ్రహము పూర్తిగా చెక్కబడనిది. ఇందు మధ్య, వరుసగానుండు మూడు విగ్రహములును త్రిగుణములని యూహింపబడుచున్నది.

—కొ. నరసింహాచారి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హరిజనులు హిందువులు కారా? మహాత్ముఁడు హిందువు కాఁడా?

చిలుకూరి వీరభద్రరావు

"ఆత్మవిజ్ఞానము దమంబు నాత్మగౌర
వంబు నీ గుణత్రితయంబ ప్రాణికోటి
దివ్య సామ్రాజ్యపదవి నందించుఁ గానఁ
గడనసేయంగఁ దగు వానిఁ గార్యమతులు."
(చి. వీ.)

విప్రుఁడ నున్నవాఁడ నప
విత్రనిషాది మదీయభార్య కీ
త్రిప్రియ దీనిఁ బెట్టి చను
టెంచుట ధర్మమె నాకు? (నావుడున్)
విప్రులఁ బొందియున్న యప
విత్రులుఁ బూజ్యులు కారె? కావునన్
విప్రకులుండ వెల్వడుము
వేగమ నీవును నీనిషాదియున్."
(భార. ఆ. ద్వి. ఆ. ప. ౭౮)

ఆలనాఁడు ద్వాపరయుగాంతమున అహింసాసత్యవ్రతములకుఁ గట్టువడని పార్థసారథియగు శ్రీకృష్ణుఁడు కౌరవపాండవసేనామధ్యమున రథము నిలిపి పాంచజన్యారావమును బూరించినాఁడని యీకాలమువారు మహాభారతమునఁ జదువుటయేకాని ప్రత్యక్షముగాఁ జూచినవారు కారు. నేటికాలమున అహింసాసత్యవ్రతములకుఁ గట్టువడిన గాంధిమహాత్ముఁడు కారాగారనిర్బంధమునునుండియు హిందూమతసంఘసంరక్షణార్థము దశదిశ లల్లాడునట్లుగాఁ బాంచజన్యారావమును బూరించుచుండఁగాఁ జెవులు దిమ్మెత్తిపోవునట్లారావమును వినుటయేకాక ప్రజలు 'ప్రసిద్ధసాంఘికసంస్కర్త' యని యమ్మహాత్ముని బహువిధములుగాఁ బ్రశంసించుచున్నారు. ఎట్టి ప్రసిద్ధసాంఘికసంస్కర్తకైనను అపనిందలు, అపవాదులు పైఁబడి యుండక పోలేదు. మానవుఁడీవిశ్వమునందు, ముఖ్యముగా హిందూదేశమునందు విశ్వమును వీక్షించినదినమాదిగా నేటివఱకును 'సోఽయంధర్మస్సనాతనః' యని గర్జించు సనాతనధర్మవాదులకును, ప్రసిద్ధ సాంఘిక సంస్కర్తలకును నెడతెగని పోరాటము జరుగుచునే యున్నది. సంస్కర్తలు సంఘసంరక్షణార్థ మేసంస్కారమును బ్రవేశపెట్టినను వారిని సంఘబాహ్యులనుగాను, దేశబాహ్యులనుగాను బరిగణించి వారిని వేఁప్పులనువలె వెలివెట్టి, వారి మహత్కార్యములకుఁ బానకములోనిపుడకలై, సైంధవులై, శుక్రాచార్యులై యడ్డుపడి విఘ్నము లాపాదింపఁదివురుట వారిసంప్రదాయప్రతిభయేకాని నేఁడు క్రొత్తగా నలవఱచుకొన్న విద్యాప్రతిభ కాదు.

ఇప్పటికి నాలుగువేల సంవత్సరముల క్రిందట ప్రసిద్ధసాంఘికసంస్కర్తయగు నగస్త్యమహర్షి కురుపాంచాలభూములందు నివసించుచు, ఆకాలమునాఁటి వ్రాత్యులను వైదికులను గావించుటకై యప్పటి పరిస్థితుల ననుసరించి వైదికులలో 'షోడశస్తోమ' మను కర్మ నొకదానిఁ బ్రవేశపెట్టి వైదికుల నార్యధర్మప్రవర్తకులనుగాఁ జేయుచుండఁగా నాసురవిజ్ఞానసంపత్తిచే మిట్టిపడుచుండెడి సనాతనగురువు లామహర్షిని కురుపాంచాలురకు బాహ్యునిగాఁ దలంచి వానిపట్ల యట్లే ప్రవర్తించిరి. (తదుహావాగస్త్యః... సవీతం షోడశం స్తోమ మపశ్యాత్...అనుచరఇ వైవ స్తోమానామ్ యత్ షోడశ స్తస్మా ద్వాగస్త్యో బహిర్దేవకురుపాంచాలేభ్యో బహిర్దేవ హ్యేవీవ స్తోమేభ్యో యత్ షోడశః-జైమినీబ్రాహ్మణము.) అగస్త్యుఁడు సామాన్యుఁడు గాఁడు. మహర్షి యను గౌరవబిరుదముగలవాఁడు. అనేకమంత్రములను రచించినవాఁడు. అందులోఁ గొన్ని యజ్ఞములలోఁ బఠింపఁబడుచున్న ఆప్రీమంత్రములుగా నున్నవి. (ఋ. వే. మం. ౧, ౧౭౦) వాని భార్య భవిష్యద్వ్యయములను దెల్పునట్టియోటుక గలది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానికోడలు (కుమారుని భార్య) యుద్ధనై పుణ్యముగల రాణి. వీనినిగూర్చి వశిష్ఠునికొమాళ్లు గౌరవముతోఁ బ్రశంసించిరి. (ఋ. మం. ౧-౧౭౯, ఋ. మం. ౭-౩౩) అతఁడు అలక్ష్యభావముతోఁ జూడఁదగినవాఁడుకాఁడు; బహిష్కరింపఁదగినవాఁడు కాఁడు. ధర్మశాస్త్రీను చరులాతఁడు గల్పనచేసిన కర్మ నంగీకరించి యాదరించినవారు. అతఁడు సామాన్యముగాను, ఒకప్పుడు ఇంద్రునకుఁ బ్రత్యామ్నాయముగాను మరుద్దేవతలను గొనియాడుచుండెను. (ఋ. మం. ౧-౧౬౫.)

ఈకారణముచేతనే యాతఁ డుత్తరాపథమును విడిచి దక్షిణాపథమునకు విచ్చేసి యార్యధర్మమును విస్తరింపఁజేసినవాఁడు. ఇమ్మహర్షి నిగూర్చి వ్రాయఁదగినది, నేర్చుకొనఁదగినది చాలగలదు. వానిఁ దెలుపుట కిందు తావులేదు.

కురుపాంచాలదేశమునందలి గురుకులమువారివలెనే తమిళదేశమునందలి గురుకులమువారు నేఁడు హరిజనులపక్షము నవలంబించి వారిహక్కులకొఱకు, హిందూమతసంఘసంరక్షణముకొఱకు సంస్కారములపేక్షించి పాటుపడుచున్న మహాత్మునిగూర్చి యప్రశస్తములును, ఉపద్రవకరములును, సత్యవిరుద్ధములును నైనవాక్యములను, అనఁగా హరిజనులు హిందువులు గారనియు, స్మృతులను శంకించువారు హిందువులుగా రనియు, గాంధీమహాత్ముఁడు స్మృతులను శంకించుచున్నవాఁడుగావున నీయర్థమునం దాతఁడు హిందువు గాఁడనియుఁ బల్కుచు హిందూసంఘమున కలజడి కలిగించుటయేకాక భవిష్యత్కాలమునందు బ్రాహ్మణుని బ్రదుకు దుర్భరమగునట్లుగాఁ జేయుటకుఁ గారణభూతులగుచుండుట మిక్కిలి శోచనీయము. ఇట్టియపవాదులను వేయువారు సామాన్యవ్యక్తులతోఁ బోల్పఁదగినవారు కారు; అలక్ష్యభావముతో నుపేక్షింపఁదగినవారును గారు. వారు స్థానికులయిన విద్యాధికులు; పూర్వాచారపరాయణులలోఁ బలుకుఁబడి గలవారు; ఒకప్పు డున్నతస్థానము లధిష్ఠించి కీర్తిఁగన్నవారు; ప్రస్తుతము మద్రాసులో న్యాయవాదులుగఁ బ్రఖ్యాతిఁ గాంచుచున్నవారు. ఒకాయన స్మార్తుఁడగు నద్వైతి; మఱొకాయన వైష్ణవుఁడగు విశిష్టాద్వైతి. ఇంకఁ జెప్పఁదగిన దేమున్నది? మొదటివారు బ్రహ్మశ్రీ టి. ఆర్. రామచంద్రయ్యరుగారని, రెండవవారు శ్రీమాన్ వి. వి. శ్రీనివాస అయ్యంగారని తెలిసి కొన్నప్పు డెట్టివారికిని నాశ్చర్యకరముగాఁ గనుపట్టక మానదు.

వీరిలో రెండవవారయిన అయ్యంగారు స్మృతులను శంకించుటయే హిందూత్వమునకు భంగకరముగాఁ దలంచుచున్నారు.

స్మృతికర్తలయిన విష్ణువును, ఆశ్వలాయనుఁడును, "శంఖచక్రాద్యంకనంచ గీతనృత్యాదికం తథా, ఏకజాతే రయం ధర్మో న జాతు స్యా ద్ద్విజన్మనః" అని చెప్పిరి. అనఁగా శంఖచక్రాదిచిహ్నములు ధరించుట, గీతనృత్యాదులు నేర్చుట- ఇయ్యవి శూద్రుని ధర్మములుగాని ద్విజునకుఁ గూడవని చెప్పియున్నారు. ఈస్మృతికర్తలవాక్యములను, శంఖచక్రాంకితచిహ్నులే అయియున్నయెడల అయ్యంగారు శంకింపకుండఁ గలరా? వీరు శంకించినయెడల వీరి నేమనవలయును? వీరివలెనే మనము సాహసించి వీరిని హిందువులు గారని చెప్పఁగలమా? వీరు శంఖచక్రాంకితులుగారని యనుకొందమన్నను శంఖచక్రాంకితచిహ్నులగు వైష్ణవులెల్లరును శంకింపకుందురా? వారినెల్లరను హిందువులుగారని సాహసించి మన మనఁగలమా? గీతనృత్యాదికములను నేర్చినద్విజు లెల్లరును పైస్మృతివాక్యములను శంకింపకుందురా? అట్లు శంకించిన ద్విజులనెల్లరను మనము హిందువులుగారని పరిహసింపఁగలమా? అయ్యంగారు గాంధీమహాత్ముని వెక్కిరింపఁబోయి వెల్లకిలఁబడినారు.

ఇంక అయ్యరుగారు ప్రతిదినము సంధ్యావందనకాలమునఁ గేశవనామములను స్మరించునపుడు చివర "హరే శ్రీకృష్ణాయ నమః" అని పఠించుచుందురుగదా! హరి హిందూజనుల దేవుఁడై యున్నపుడు హరిజనులు మాత్రము హిందువులుగారా? తమిళదేశమునందును, తెలుఁగుదేశమునందును 'పెరుమాళ్' శబ్దము విష్ణువునకుఁ బర్యాయపదముగ వాడఁబడుచున్నది. పెరు

CC-0.Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాళ్లు అనఁగా నొక విష్ణువునకే యర్థమగునుగాని యితర దేవుళ్లకు వర్తింపదు. గార్గిసంహిత యను తమిళ గ్రంథమునందు 'మాళ్' శబ్దము విష్ణుశబ్దమునకుఁ బర్యాయపదముగ వాడఁబడియున్నది. సుప్రసిద్ధాంధ్ర కవియగు శ్రీనాథభట్టసుకవీంద్రుఁడు తన పల్నాటివీర చరిత్రమున మాలశబ్దమును విష్ణుశబ్దమునకుఁ బర్యాయ పదముగా బ్రవచించియున్నాఁడు. ఋగ్వేదము ప్రథమ మండలములోనే విష్ణువును అంధజాతులవారు కొండ దేవునిగఁ బూజించుచున్నట్లు దెలుపఁబడియున్నది. 'అంధకవిష్ణు' శబ్దము సంస్కృతమున 'ఆంధ్రవిష్ణు' వగుచున్నది. హరిజనులను హిందువులు కారనుట భ్రమప్రమాదజనితమైన వాక్కునుగా మనము గ్రహింప వలయును. 'ప్రమాదో ధీమతామపి' యని యెటువంటి ధీమంతులయినను ఒక్కొకప్పుడు భ్రమప్రమాదముల పాలగుట సంభవింపఁగలదు. అట్లే అయ్యరుగారు భ్రమ ప్రమాదముపాలయి చరిత్రను సరిగాఁ దెలియకుండుట చేత హరిజనులు హిందువులు గారని వచించినారు. వర్ణవ్యవస్థకుఁ జేరనివారిని అవర్ణులని మనగ్రంథములలో వ్యవహరించినారు. అవర్ణులనఁగా రంగులేనివారని, సవర్ణులనఁగా రంగుగలవారని యర్థము చేయరాదు. గుణకర్మలనుబట్టి సంఘమును నాలుగుభాగములుగా విభాగించిన వ్యవస్థను వర్ణవ్యవస్థ యనియు, వానికిఁ జేరినవారిని సవర్ణులనియుఁ, జేరనివారిని అవర్ణులనియు వ్యవహరించుట కలిగినది. సవర్ణులే హిందువులనియు, అవర్ణులు హిందువులుగారనియు ననుకొనుటకంటె దురభిప్రాయము మఱి యొకటియుండఁబోదు. విష్ణుపురాణమునందు పురూరవశ్చక్రవర్తికిఁ బదునేఁడవతరమువాఁడగు భార్గభూమికాలమున వర్ణవ్యవస్థ భారతవర్షమునస్థిరపడినదనియు, ఏఁడవ తరమువాఁడగు శౌనకుని కాలమునఁ బ్రారంభమైనదనియు, విశ్వామిత్రుఁడు పండ్రెండవతరమువాఁడనియుఁ దెలుపఁబడినది (విష్ణుపురాణము, చతుర్థాంశము, అష్టమాధ్యాయము). దీనినిబట్టి వర్ణవ్యవస్థ సనాతనమని తలంప రాదు. వర్ణవ్యవస్థతో అవర్ణసవర్ణభేదములు గలిగినవి గాని యంతకుఁబూర్వ మందఱు సవర్ణులే యైయుండ వలయునుగదా! అప్పుడు అవర్ణులనుండి సవర్ణులు పరిణామము గాంచినవారని యొప్పుకొనక తప్పదుగదా! అప్పుడు సవర్ణులుమాత్రమే హిందువులై, అవర్ణులు హిందువులు గాకుండుట యెట్లు? వారిని హిందువులనుగా గ్రహింపకున్న మఱియెవ్వరినిగా గ్రహింపవలయునో అయ్యరుగారుగాని, అయ్యంగారుగాని సెలవిచ్చెదరా? హిందూసంఘము జన్మచేతనే యేజాతిని గాని, యేకులమునుగాని తక్కువగఁ దలంచియుండ లేదు. హిందూమతముయొక్కగాని, హిందూసంఘముయొక్కగాని పరిణామతత్త్వచరిత్ర మింతవఱకు మన అయ్యరులకు, అయ్యంగారులకు బోధపడియున్నట్టు కానంబడదు. వారికి తెలిసినవి మంత్రతంత్రములుగాని సత్యధర్మములు గావు. "సత్యంవద, ధర్మంచర" అని వేదము పల్కుచున్నది. ఇది సనాతనధర్మముకాదా! దీనిం బాటింపనివారు సనాతనధర్మవాదు లెట్లగుదురు? "నన్నుముట్టుకోకు నామాలకాకి" యనువారు బ్రాహ్మణులును గారు; విప్రులునుగారు. అపవిత్రులను పవిత్రులను గావించువారు జ్ఞానులు, గురువులు నైయున్నారు. వారినే బ్రాహ్మణులనియు, విప్రులనియు సంజ్ఞానామకరణముఁ జేసియున్నారు. ఆసురవిజ్ఞానసంపత్తి గల గురువులను బ్రాహ్మణులనియు, దైవవిజ్ఞానసంపత్తిగల గురువులను విప్రులనియు మొదట వ్యవహరించిరి. అంతియ కాని బ్రాహ్మణకులమును, విప్రకులమును మొదట కేటాయింపఁబడియుండలేదు. అసురబ్రాహ్మణ విజ్ఞానమును సంస్కరించి విస్తరింపఁజేసినవారు విప్రులు; వేల్పవై జాతివారే వేల్పులు; వేల్పులలోని జ్ఞానులను విప్రులనిరి. "విడ్ పవై, విట్ పవై, విల్ పవై, విప్పవై, విప్రః" అని పరిణామమునుగాంచిన విప్పవైశబ్దమె విప్రశబ్దముగా సంస్కరింపఁబడినది. భూమియందుండెడి పవై జాతివారు భూమ్యాకాశములమధ్య నివసించెడివారిని వేల్పవైజాతి యని వ్యవహరించియుండఁబోలు. ఈదివ్యజ్ఞానులయొక్క విఘ్యక్తధర్మము అపవిత్రులగువారిని పవిత్రులను గావించుటగాని, యాకల్పాంతము నెవ్వరిని గాని యపవిత్రులనుగా నిల్పుట వారికృత్యము కాదు. కనుకనే నాందీముఖశ్రాద్ధానంతరము శూద్రుఁడగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాఁడు చేయవలసినవిధులలో నొకటిగా విధింపఁబడిన బ్రాహ్మణుల గూర్చిన స్తోత్రములో

"బ్రాహ్మణా జంగమం తీర్థం త్రిషు లోకేషువిశ్రుతం,
యేషాం వాక్యోదకేనైవ శుద్ధ్యంతి మలినా జనాః.
పావనాస్సర్వవర్ణానాం బ్రాహ్మణాబ్రహ్మరూపిణః"

అనువాక్యములు గలవు. అనఁగా బ్రాహ్మణులు మనుష్యాకారము ధరించిన గంగాదిపుణ్యతీర్థములు. కనుకనే వారి వాక్యమను జలముఁ బ్రోక్షించినమాత్రముననే మా వంటిమలినులు శుద్ధులగుచున్నారు. ఇట్లు సర్వవర్ణులను పవిత్రులనుగాఁ జేయువారగుటచేతనే వారు బ్రహ్మరూపులనఁబడుచున్నారని తాత్పర్యము. అపవిత్రులుగా నుండువారికి మొదట శూద్రసంజ్ఞ వాడఁబడినది. శతపథబ్రాహ్మణములోఁ జెప్పఁబడినట్లు "పద్యు హవా ఏత చ్ఛ్మశానం యచ్ఛూద్రః" అనగా పాదములతోఁగూడుకొనిన (మనుష్యాకారమైన) శ్మశానము వంటివాఁడు. అనఁగా నేమి—అపవిత్రుఁడనుమాట. గంగాది పుణ్యతీర్థములు శ్మశానములలోఁ బ్రవహించినయ్యవి యెట్లు పవిత్రములగుచున్నవో, శూద్రులు బ్రాహ్మణసంపర్కమును గోరి శుశ్రూషగావించినచోఁ ద్వరలోనే యపవిత్రతను బోఁగొట్టుకొని పవిత్రులగుట నిశ్చయము గనుక వారికి ద్విజశుశ్రూష వృత్తముగా నేర్పఱచియుందురుగాని శూద్రులని ప్రత్యేకముగా నొకజాతిని నిలిపి యాకల్పాంతమిట్లే యుండుఁడని వారు శాసించియుండలేదు. అప్పటిభావములే వేఱు; అప్పటిస్థితిగతులే వేఱు; ఇప్పటిభావములు వేఱు; ఇప్పటిస్థితిగతులు వేఱు. ప్రాచీనకాలమున విప్రులు పంచమజాతిస్త్రీలను వివాహమాడుచుండెడివారని పంచమవేదమైన మహాభారతము వేనోళ్లఁ జాటుచున్నది. ఈవ్యాసశీర్షిక క్రిందను మకుటముగాఁ బెట్టినపద్యమును, వాని లోనిభావమును వీక్షింపుఁడు.

"విప్రుఁడనున్నవాఁడ నపవిత్ర నిషాది మదీయభార్య కీ
ర్తిప్రియ దీనిఁబెట్టి చనుదెంచుట నాకు ధర్మమో?—"

అని యొకవిప్రుఁడు తన్నుఁ, దనభార్యనిషాదితోఁగూడ గరుత్మంతుఁడు మ్రింగినప్పుడు వానికంఠమునం దను లోఁగాని క్రిందకును బైకికిని బోవక యడ్డుపడి బాధకలిగించుచుండఁగాఁ దల్లిమాట జ్ఞప్తికిఁ దెచ్చుకొని బ్రాహ్మణుని కంఠమునుండి బయల్వెడలి రమ్మని కోరినప్పు డా విప్రుఁడు పల్కినపల్కు లివి. అపవిత్రయైన నిషాది కీర్తిప్రియ గావున, అనఁగాఁ దాను పవిత్రురాలన్న కీర్తిని బడయఁగోరునట్టిది గావునఁ దన్నుఁ బెండ్లిచేసికొని భార్యగాఁ బరిగణింపఁబడుచుండఁగా దానిని విడిచిపెట్టి తనప్రాణరక్షణార్థము తానుమాత్రము బయల్వెడలివచ్చుట ధర్మమా యని గరుడుని ప్రశ్నించుచున్నాఁడు. ఈవిప్రుఁ డిచ్చట మంత్రతంత్రములను విడిచిపెట్టి సత్యధర్మములను దెలిపి అపవిత్రమైన నిషాదకులముపట్ల విప్రకులమున కుండవలసిన సమత్వభావమును నిరూపించును ధర్మముకొఱకు తనప్రాణమునైన బలియొసంగఁ గోరి నిశ్చయబుద్ధితోఁ బల్కినపల్కులుగాని సామాన్యపుం బల్కులుగావు. గరుత్మంతుడు నిజమైన వైష్ణవుఁడు. (బాహ్యచిహ్నములుమాత్రము ధరించిన దొంగకాఁడు.) కనుకనే

"విప్రులఁ బొంచియున్న యప
విత్రులు బూజ్యులు కారె? కావునన్
విప్రకులంబె వెల్వడుము
వేగము నీవును నీనిషాదియున్."

అనిపలికి విప్రునితోఁగూడ నిషాదిని వెల్వరించి రక్షించినాఁడు. అస్పృశ్యులు పంచములు గారు, పంచములస్పృశ్యులుగారు. అవర్ణులుమాత్రమె పంచములు గారు. సవర్ణులలోఁగూడ పంచములున్నారు. నిషాదులు పంచములు గారు. నిషాదులు పంచములను దుర్భ్రమ సాయణాదిభాష్యకర్తలవలనఁ బొడమినది. వేదములలో పంచమానవులని, పంచజనులని, పంచకృష్టులని, పంచకృష్టులని పేర్కొనంబడియుండుటచే సాయణాచార్యులవారు పదునాలుగవశతాబ్దిలోనివారును చరిత్ర మెఱుఁగనివారును నగుటచేత బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు నాలుగుజాతులని, నిషాదులు పంచమజాతియని యర్థము చేసికొన్నారు. ఇయ్యది కేవలము దుర్భ్రమగాని మఱియొండు కాదు. అమరనిఘంటువు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నంను పంచమానవశబ్దము మానవశబ్దమునకుఁ బర్యాయపదముగాఁ జెప్పఁబడినది. పంచమానవశబ్దమును బట్టియె పంచము లనుమాట వ్యవహారములోనికి వచ్చి అయ్యది ప్రత్యేకముగా అస్పృశ్యులుగాఁ బరిగణింపఁబడెడు తెగలకుమాత్రమె వ్యవహరింపఁబడుచున్నది. శబ్దములో దూష్యార్థము లేకపోయినను దానిని లోకము దుర్వినియోగపఱచినందువలనఁ నేఁడాశబ్దము దూష్యమై పోయినది. లోకవ్యవహారమున గ్రంథకర్త, గీర్వాణము మొదలగుశబ్దముల కపార్థములు కలుగుచున్నట్లే పంచముశబ్దమునకుఁ గూడ నపార్థము వాటిల్లుచున్నది. నేఁడు పంచజనపంచమానవశబ్దములు పండితులచే జనసామాన్యమునకును, మానవసామాన్యమునకును బ్రవర్తింపఁజేయుచున్నందున నియ్యది వ్యంగ్యముగాఁ గన్పట్టుచుండ లేదు. కీర్తిశేషులయిన కళాప్రపూర్ణబిరుదాంచితులగు వేదము వేంకటరాయశాస్త్రిలవారు శ్రీకృష్ణదేవరాయప్రణీతమగు నాముక్తమాల్యదకుఁ దాము వ్రాసిన సంజీవనీనామకవ్యాఖ్యలో పంచజనశబ్దమునకు జనసామాన్యపరముగానే యర్థము చెప్పియున్నారు. శబ్దసిద్ధి లోకంబువలననే దెలిసికొనఁదగునని చెప్పిన దిందుకొఱకే కాఁబోలు. శాస్త్రిలుగారు తమగ్రంథములో మఱియొక సందర్భమున "శ్రీకృష్ణునకు పంచజనుఁడను దైత్యుఁడొకశత్రువుగా నుండెననియు, నతఁడు వానిని సంహరించి యాతనిబొమికతో నొకశంఖమును గావించుకొనెననియు, దానికే పాంచజన్యమని పేరుపెట్టఁబడిన" దనియు నొకపౌరాణికకల్పితగాథను దడవియున్నారు. అందువలన పంచజనులను దైత్యులుగాఁ దలంచినట్టు గన్పట్టఁగలదు. అసలు పంచజనులు దైత్యులాయనుసంశయము కలుగుచున్నది. మనపురాణములనుబట్టి దితియొక్క సంతానము దైత్యులని వ్యవహరింపఁబడినట్లుగాఁ దెలియుచున్నది. వీరినే పాశ్చాత్యులు టిటాన్సు (Titans) అని వ్యవహరించిరి. వీరినే తెలుఁగుభాషలో తీతాణ్ణులని వ్యవహరింపవచ్చును. ప్రాచీనకాలమున రెండుతెగలనామములను గలుపునప్పుడు మొదటితెగవారి నామముయొక్క మొదటియక్షరమును మాత్రము రెండవతెగవారినామముమొదట నిలిపి కలిపి పలుకుట యొకపద్ధతిగా నున్నట్లు గన్పట్టుచున్నది. ఎట్లనఁగా, తిఅణ్ణులు తాఅణ్ణులతోఁ గలిసినప్పుడు వారిని 'తితాణ్ణు' లని వ్యవహరించుట గలదు. తిఅణ్ణులు లేక తీఅణ్ణులనే యిపుడు కేరళదేశమునందు తియూలని, లేక తీయూలని వ్యవహరించుచున్నారు. తి + ఆ తియా యనియు, తీ + ఆ=తీయా యనియు నగుచున్నది వీరు అరయణ్ణులతోడ (ఆఱవము) సమ్మేళనముఁ జెందిన వెనుక తీయరులై, తిరైయణ్ణులుగాను, తిరైయారులుగను బరిణామమును జెందిరి. వీరిలోని జ్ఞానులను తిరులనినారు. పరమజ్ఞానులను 'పాట్‌పాట్, తార్‌తార్' అన్నట్లు "తిర్, తిర్" అని వ్యవహరించినారు. వీరినే పౌరాణికులు తిత్తిరిమహర్షు లన్నారు. తీతువుపిట్టలను సంస్కృతమునఁ బౌరాణికులు తిత్తిరిపక్షు లన్నారు. 'ఆర్యవాయజో' అను ప్రదేశమున (పామీరుపీఠభూమి) వాజసనేయశాఖాబ్రాహ్మణునురునివలన వేదాధ్యయనము గావించిన యాజ్ఞవల్క్యమహర్షి సర్వాజ్ఞను ధిక్కరించి శప్తుఁడై వేదములను గ్రక్కివేయఁగా పైల వైశంపాయనాదులు తిత్తిరిపక్షులై యావేదములను మ్రింగి తైత్తిరీయసంహితాభాగమును వెల్వరించినారఁట. అదియే కృష్ణయజుర్వేద మనఁబడుచున్నది. మొదటిది శుక్లయజుర్వేద మనంబడుచున్నది. ఈతిత్తిరులు హిందువులయినప్పుడు తీఅణ్ణులు (తీయాలు), తీఅఱులు (తీయరులు), తిరైయనులు, తిరైయారులు హిందువులు కావందురా? 'తిరై అణ్' శబ్దమును దిరుగవేసిన 'అన్దిరై' యగుచున్నది. రామచంద్రయ్యరుగారు ప్రత్యుత్తరము చెప్పవలసియున్నారు. అఱవభాషలో తితిని దితి యందురు. తియశబ్దమే గ్రీకుభాషలో తియోస్ (Theos), దియోస్ (Deos) అని యుచ్చరింపఁబడినది. ఇదియె సంస్కృతమున దేవశబ్దమైనది. దివ్‌ధాతువువలన నిష్పన్నమైనది దేవశబ్దమని సాంస్కృతికులు వ్యుత్పత్తిని గల్పించినారు. తివి దివి కావచ్చును. తి + అ=అనునక్షరములను గలుపునపుడు 'తియ' యనిమాత్రమెకాక 'తివ' యనిగూడ నుచ్చరింపఁబడును. ఇట్లే "తేఅణ్ణు" శబ్దములో 'తే + అ' కలిపినయెడ తేవయగుచున్నది. తేవకు అణ్‌ప్రత్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమునుగాని, అణ్ ప్రత్యయమునుగాని, అళ్ ప్రత్యయమునుగాని, అర్ ప్రత్యయమునుగాని చేర్చినయెడల తేవణ్ణ్, తేవణ్, తేవళ్, తేవర్ అని యేర్పడఁగలవు. వీరిలో తేవర్ తెగవారి గీతములనే తెలుఁగులోను, తమిళభాషలోను తేవారము లందురు. ఈశబ్దములే దేవభాషలో దేవన్, దేవళ్, దేవర్ శబ్దములై, దేవన్, దేవతాశబ్దములు సంస్కృతభాషయందును వ్యవహరింపఁబడుచున్నవి. దేవసంబంధమైనది దైవయని భావింపఁబడుచున్నను "దేవఏవ దైవః" అని స్వార్థిక తద్ధితాంతముగ సాయణుఁడు చెప్పియున్నాఁడు. వాసవులు, రుద్రులు, మారుతులు, విశ్వేదేవులను 'వ్రాత్యా దేవాః' అని వ్రాత్యదేవులుగఁ జెప్పియున్నారు. (పంచవింశ బ్రాహ్మణము, లేక తాండ్యబ్రాహ్మణము చూడుఁడు) దేవణ్ణశబ్దమె దేవతయైనది. ('దేవణ్ణ, దేవద్ద, దేవత్త, దేవత' అని పరిణామము) దితి దక్షునికూఁతురఁట. దక్షుఁడెవ్వఁడు? ఇతఁ డొకప్రజాపతిగఁ బురాణములందు వక్కాణింపఁబడినవాఁడు. తక్షులను ప్రజలకుఁ బతి గావున దక్షప్రజాపతియై నవబ్రహ్మలలో నొక్కఁడై నాఁడు. ప్రాచీనకాలమున తణ్ణఘాతజాతివారిని అసురవిజ్ఞానసంపత్తిగలవారిని తజ్జులనియు, తస్సులనియు, తచ్చులనియు, తఖ్ఖులనియు, తక్కులనియు, తట్టులనియు వేర్వేఱుప్రదేశములందు వేర్వేఱు తెగల యుచ్చారణములలో వ్యవహరింపుచువచ్చిరి. వీరెల్లరు నొకేతెగవారు. ఆసియాఖండములో నుత్తరసముద్రతీరము మొదలుకొని దక్షిణసముద్రతీరమువఱకు వ్యాప్తినిగాంచియున్నవారు. 'తస్సు' శబ్దమును 'దస్యుః' అని సాంస్కృతికులు సంస్కరించినారు. దస్సులనఁగఁ బ్రజలనియె రెండువేల యేనూఱు సంవత్సరములకుఁ బూర్వమె దఱియవసు (Darius) పహ్లవశాసనములలో వ్యవహరింపఁబడియుండెను గాని 'దస్యుః' శబ్దమునకు సాంస్కృతికులు దొంగలని, శత్రువులని యర్థము వ్రాసిరి. ఈతెగలవారిలోని జ్ఞానులను, పండితులను 'ఠాకుర్', 'తాకుర్' అని వ్యవహరింతురు. దేవాసురదైత్యదానవాదులను మాతృసంఘముగ నేర్పడియున్న యీజాతివారి నెల్లరను దొంగలనియు, శత్రువులనియు ననుట సంభావ్యము గాదు. దొంగయనునర్థమిచ్చు తస్సుశబ్దమును తమనామములచివరఁ జేర్చుకొందురా? ఇప్పటికిని మధ్యాసియాఖండమునందు తష్ఖండ (Tash-khand), తైమూర్ తష్ (Timoor Tash) అనియు, కేంద్రదేశమునందు 'కుమారఏఝుతస్సన్' అను పేర్లుగలవారు మనకుఁ గన్పట్టుచుందురు. అట్టి నామములను తఱచుగా వినుచున్నాము. ఈతఖ్ఖులు వచ్చినమార్గమునే మనవారు తఖ్ఖణాపథము, లేక దక్షిణాపథ మని వ్యవహరించుచున్నారు. ఇంకొకవిషయముకూడ నొక్కి వక్కాణింపవలసియున్నది. దస్యుల ననార్యులని పాశ్చాత్యపరిశోధకులు కొందఱు వ్రాసినారు. దాని యాథార్థ్యమును గ్రహింపకయె మనపట్టభద్రులుగూడ దస్యులనార్యులని వక్కాణించుచుందురు. ఇంతకంటె విపరీతసిద్ధాంతము మఱియొకటి యుండఁబోదు. ఠాకురులు, తాకురులు నార్యులుగారా? ఈ యార్యానార్యవాదము నేఁడు పరిష్కార మగునది కాదు. ఈవాద మటుండనిచ్చి తక్కిన విషయములనుమాత్రమె గ్రహింతము. పూర్వకాలమున నీతస్సులకును 'కాస్సిపి' యను తెగలకును సంబంధబాంధవ్యములు నడచినవి. 'కాస్సిపి' యనుపేరుకూడ మిడియాదేశమున నుత్తరభాగమునను, కాక్ససుపర్వతప్రాంతము లందును నివసించెడిప్రజలకు పేరుగా నున్నట్లు దెలియవచ్చుచున్నది. వీరు ప్రాచీన కాల్డియాదేశమునందలి ప్రజలని నేనూహించెదను. వీరినే మనువు ఖశులని వ్యవహరించినాఁడు. ఈఖశాణులనే ఎన్సైక్లోపిడియా బ్రిటానికాగ్రంథము మిడియానుగుఱించి వ్రాసినభాగములో ననార్యసంఘమని వ్రాయఁబడిన 'కాస్సిపి' యనుప్రజలేయని నే నభిప్రాయపడుచున్నాను. ఈ కాస్సిపి ప్రజలయొక్క పతి గావున 'కశ్యపప్రజాపతి' యని, 'కశ్యపబ్రహ్మ' యని మనవారు వ్యవహరించిరి. ఈకస్సిపి, లేక కాస్సిపిశబ్దములే సంస్కృతమునందు కశ్యప, కాశ్యప శబ్దములుగ సంస్కరింపఁబడినవి. కండ్, కాండ్ శబ్దములు కజ్జ్, కాజ్జ్ శబ్దములుగను, ఖండ్, ఖాండ్ శబ్దములు ఖిజ్జ్, ఖాజ్జ్శబ్దములుగను నుచ్చరింపఁబడి ఖిజ్జ్, ఖిన్ గా మారినది. ఈ ప్రజలచే మొదట కనుగొనఁబడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పైరుపెట్టఁబడినవగుటచేతనే నల్లమందుచేయు గింజలకు 'కష్కష్' (Cus-Cus) గసగసాలని పేరు వచ్చియుండును. వీనితోనే నల్లమందు తయారగుచున్నది. ఇండియా దేశమునకు ప్రాచీనకాల్డియా దేశమునకు నెక్కువ సంబంధము గలదు. కాల్డియా దేశములోని కాండు తెగవారును, ఇండియాలోని కాండు తెగవారును గలిసి కాక్కాండు తెగవారుగాఁ బరిణామము గాంచినారు. కొండ + కొండ = కొక్కొండ యైనట్లుగా కాండు + కాండు = కాక్కాం డగుచున్నది. కాక్కాండు లఱయణ్ణులతోఁ గలసినవెనుక కాక్కాండారులను తెగవారయినారు. కాక్కాండారు తెగవారే కాకాంద్రులనంబడుచున్నారు. ఆంధ్రులలో నొకశాఖవారు కాకాంద్రులు. మనపురాణములలో వీరు దేవయోనులుగఁ బరిగణింపఁబడినట్లు దెలియుచున్నది. కాకాసురుఁడు దేవయోనిజాతివాఁడు. ఇతఁడు తనజాతిరూపమును డించి కాకస్వరూపము ధరించి, అనఁగా కాకియై శ్రీ రామచంద్రుడు నిద్రపోయియున్నప్పుడు తన ముట్టెతో సీత స్తనములను బొడిచినందుకు నామహాప్రభువున కాగ్రహముకలిగి వానిని సంహరించుటకై దివ్యాస్త్రము నెక్కుపెట్టఁగా నాతఁడు భయపడి శరణార్థియై క్షమాపణముఁ జెప్పుకొని తన్నుఁ గాపాడుమని వేఁడుకొనఁగా నాయన కరుణించి విడిచిపెట్టెననియు, అప్పటినుండి యాతఁడు విష్ణుభక్తుఁ డయ్యెననియుఁ జెప్పెడి పురాణగాథలను చదువరులు వినియేయుందురు. ఇప్పటికిని ఉత్తరహిందూదేశమునందు 'కాకా'లను వైష్ణవశాఖవారు కలరు తెలుఁగుకన్నడభాషలలో కక్క, కక్కయ్య అనుశబ్దములు బంధుత్వమును దెలుపునవియై యున్నవి. వీరికి ప్రీతిగనుండుటచేతనో, వీరిచే మొదటఁ గనిపెట్టఁబడినదగుటచేతనో తెలుఁగులో నొకవిధమైన కూరగాయకు కాకరకాయ యని పేరు గలిగినది. ఉత్తర హిందూస్థానమునందును, మహారాష్ట్ర ఘూర్జర దేశములందును 'కాక్కర్' శబ్దము నామములచివర ధరింపఁబడుచున్నది. ఈశబ్దనామమును ధరించిన గ్రామము లసంఖ్యాకములుగ నాసేతుహిమాచలము హిందూదేశమునఁ గలవు. కాకండ్ శబ్దము హిందూస్థానిలో కాగజ్ (కాగజ్) గా మాఱుచున్నది. దానికి తెలుఁగుభాషలో కాగితమని యర్థమగుచున్నది. కాగితము కాకితము యొక్క రూపాంతరమె. కాకితమ్మపురాణము తెలుఁగు వారికిఁ బరిచయమై యుండును. దీనికి మాతపురాణమని నామాంతరము గలదు. 'కాకితమ్మకు సైదోడు ఏకవీర' యని క్రీడాభిరామమున వర్ణింపఁబడినది. కాకతీయాంధ్రరాజధానియగు నేకశిలానగరమున నీమెకు నాలయముగూడఁ గట్టఁబడియుండెను కాకతీయాంధ్ర రాజవంశమునకు నీమె కులదేవతగాఁ జెప్పఁబడినది. "కాకండి-కాకంది-కాకంతి-కాకతి" అని శబ్దపరిణామము. కనుక కాకండి కాకాండారు తెగవారి మహాశక్తియని తెలుపుటలో నబద్ధమేమున్నది? ఇటీవల కాకతియనునది దుర్గకు నామాంతరమైనది. దుర్ కాండి దుర్గాండియై దుర్గయైనది. గురవాండి గొరవాండియై గౌరాండియై గౌరియైనది. ఇట్లే కటియాండి కాత్యాయని యైనది. ఇట్లు చెప్పఁబూనుకొన్నచో నేండ్లును పూండ్లును బట్టును. ఈమె యొకమహాశక్తిగా గొల్వఁబడుచుండుటచేతనే రెండువేల యేనూఱుసంవత్సరముల నాఁడే మహారాణులుసహితము నీమెపేరునే తాము ధరింపుచువచ్చిరి. బోధిసత్త్వుఁడు కాశీదేశపురాజగు బ్రహ్మదత్తునికుమారుఁడుగ నవతరించెనఁట! అతనిరాణి పేరు కాకాతి. (కాకాండి, కాకాంది, కాకాంతి, కాకాతి అని శబ్దపరిణామము.) కాకాండారు లను తెగవారు ప్రాచీన భరతఖండమున వ్యాప్తిఁగాంచియున్నారను విషయము నిరూపించుటకు బౌద్ధజైన వాఙ్మయముల నుండియు, పౌరాణిక వాఙ్మయమునుండియుఁ బెక్కు దృష్టాంతములను జూపి నిరూపింపవచ్చును. లిచ్ఛవీలకు నాటపట్టగు వైశాలి (Vesale) నగరమునకు పూర్వనామము కాకటము. కాకండ కాకటమగును. కడపటిజినపతియగు మహావీరాచార్యుని నిర్యాణానంతరము డెబ్బదిసంవత్సరములకుఁ బిమ్మట రత్నప్రభాసూరియొక్క ఉపకేశగచ్ఛమునకు సంబంధించిన గురుపరంపరలో వానికి ౮, ౧౩, ౧౯, ౨౪, ౨౯, ౩౪, ౩౭, ౪౦, ౪౩, ౪౬, ౪౯, ౫౨, ౫౫, ౫౮, ౬౧, ౬౪, ౬౭ తరముల గురువులెల్లరును కాక్క



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నూరులను నామములు గలవారే. వీరెల్లరును కాకాండారు తెగకు సంబంధించి వారిపరిణామమునందు జైనమత మవలంబించి సుకుపీఠము నధిష్ఠించినవారని తలంపవలెను. జైనతీర్థంకరులలో తొమ్మిదవవాఁడగు సువిధినాథుఁడు, లేక పుష్పదంతుఁడు అనుతీర్థంకరునకు జన్మస్థానము లేక దీక్షాస్థానము కాకండీనగర మని తెలియుచున్నది. కడపటి అనఁగా ఇరువదినాలుగవ తీర్థంకరుఁడయిన శ్రీమహావీరవర్ధమానతీర్థంకరునకు ౧౫ తరములకుఁ బూర్వపువాఁడై నందున నేఁటికి కించుమించుగా మూడువేలసంవత్సరములకుఁ బూర్వమే కాకండీనగర మున్నట్లుగా విదితమగుచున్నది. స్థవిరులలో ఋషిగుప్త కాకండకుఁ డనునాతఁడు, కాశ్యపీయా, గౌతమీయా, వాసిష్ఠీయా, సౌరాష్ట్రిక- అను నాలుగుశాఖలును, ఋషిగుప్తిక, ఋషిదత్తిక, అభిగసస అను మూఁడుకులములును గల మానవగణమును స్థాపించినవాఁడు వశిష్ఠగోత్రుఁ డని వక్కాణింపఁబడెను. కాతికయనువంశనామమును ధరించిన సుస్థితుఁడును, కాకండక యనువంశనామమును ధరించిన సుప్రతిబుద్ధుఁడును వ్యాఘ్రాపత్యగోత్రముగలవారు. కాతికగణము వ (౧) ఉచ్చనగరి, (౨) విద్యాధరి, (3) వాగ్రి, (౪) మాధ్యమిక యను నాల్గుశాఖలుగ విభాగించిరి. భారద్వాజగోత్రుఁడయిన భద్రయశస్సనునాతఁడుకని పెట్టిన ఉదెమాతికగణములో నాల్గుశాఖలలో 'కాకండిక' యనుశాఖ గలదు. బుద్ధుని మరణానంతరము నూఱుసంవత్సరములకు బౌద్ధసిద్ధాంతములోఁ బంద్రెండు శాస్త్రార్థవిషయములనుగూర్చి వైశాలినగరములోని భిక్షువులలో వివాదము పొసఁగినప్పుడు నచ్చటికి కాకండకుని పుత్త్రుఁడగు యశుఁ డనువాఁడు విచ్చేసి మహావనములోని కూటాగార మను కొండపై నివసించెనని చెప్పఁబడియున్నది. గుంటూరు మండలములోని 'కాకాని' యను నామములుగల గ్రామములకుఁ బూర్వము కృష్ణదేవరాయల కాలమువఱకు 'కాకాండి' యను నామమె వ్యవహరింపఁబడుచున్నట్లు గన్పట్టుచున్నది. కృష్ణరాయనికాలమున రెంటూరిచిట్టమంత్రి ౧౫౧౭-వ సంవత్సరములో కాకాండిపురమునవీరభద్రుని దేవాలయమును గట్టించి యొకశాసనము వ్రాయించినాఁడు. అందిట్లున్నది—

"కాకాండీపుర వీరభద్రనగర ప్రాకారసన్మంటప
ద్వారశ్రీకరగోపురప్రవిలసత్కల్యాణివేదాఢ్యయః"

ఈశాసనమున కాకాని రాజకాకాండిపుర మనికూడ వక్కాణింపఁబడినది. కావున కాకాండారు లనువారున్నారనియు, ఈతెగవారవర్ణులుగానున్నప్పుడు శాక్తేయులుగను, తరువాత సవర్ణులై జైనబౌద్ధమతములను మాత్రమెకాక బ్రాహ్మణమతమునుకూడ నవలంబించినవారు గలరనియు తెలిసికొనఁగలము. కాకుండ, కాకుద్ధ, కాకుస్థ-యొకేశబ్దముయొక్క పరిణామములనుగా మనము తలంపవలయును. మొదటిరెండుశబ్దములు బౌద్ధజైన వాఙ్మయములం గనుపట్టును. కాకుస్థులనునది పౌరాణికవాఙ్మయమునఁ గనుపట్టు. కాకుస్థులు క్షత్రియులుగ వ్యవహరింపఁబడిరి. దీనింగూర్చి మఱియొకమాఱు దెలుపవలసియున్నది. ఇచ్చట సాధ్యపడదు. కాకుస్థులును కాశ్యపగోత్రులె.

దేవాసురదైత్యదానవమానవులెల్లరును కశ్యపుని సంతానముగనే పురాణములెల్లను చాటుచున్నవి. అవర్ణసవర్ణాదిభేదము లేకుండ గోత్రములేనివారెల్లరును కాశ్యపగోత్రము చెప్పుకొనఁ జెల్లునని శతపథబ్రాహ్మణ మనుజ్ఞ నిచ్చుచున్నది. "తస్మా దాహుస్సర్వాః ప్రజాః కాశ్యప్యః" అని శతపథశ్రుతివలన సర్వప్రజలు కశ్యపసంతతి యగుటచే కాశ్యపు లనంబడుదురని స్పష్టమగుచున్నది. మఱియు "గోత్రనాశేతు కాశ్యపః" అని గోత్ర మెఱుఁగనిచోఁ గాశ్యపగోత్ర ముచ్చరింపవలెనని హేమాద్రిలో వ్యాఘ్రపాదవచన ముదాహరింపఁబడినది. ఈప్రమాణములన్నియుఁ బైనుడివిన నాయూహల నన్నిటిని బలపఱచుచున్నవి. నవబ్రహ్మలలో మొదటివాఁడు కశ్యపుఁడు. సప్తఋషులలో మొదటివాఁడు కశ్యపఋషి. ఈభూమికి కాశ్యపి యను పేరు గలదు (సశేషము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




జపాను దేశపు సాలెత

(జపానీయ చిత్రము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



16-వ శతకపు రేజా అబ్బాసీచిత్రము



మసీదులోపల

(17-వ శతకపు పర్షియన్ చిత్రము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## 3

ఈవిషయమయి ప్రమోదూత సంవత్సర చైత్ర మాసపు భారతియందును, తత్పూర్వపు సంచిక యందును రెండువ్యాసములు వ్రాయబడెను. అందు ఆహారవిషయమయి గమనింపదగిన ముఖ్యసూత్రములను గురించి చర్చింపబడెను. ఇందు గడచిన 5,6 సంవత్సరము లలో నాచే పరీక్షింపబడిన కొన్ని యాహారద్రవ్యములను గూర్చిన స్వానుభవమును, ఇతరుల పరిశోధనఫలితమును జేర్చి ఆహారసంస్కరణమునం దభిలాషగలవారి కుప యుక్తముగ నుండునని దోచిన కొన్ని విషయములు వ్రాయబడును.

### ౧. బియ్యము (Rice)

ప్రాచ్యదేశములందు వరియన్నము మిగుల ప్రాచీన కాలమునుండియు మానవాహారముగ నుపయోగింపబడు చుండెను. ఇపుడు ప్రపంచమందలి జనులలో సగము మందికి వరియన్నమే ముఖ్యాహారముగ నున్నది.

సగటున వరిబియ్యమున నితరతృణధాన్యములందు కంటె కర్బనోదజనితములపరిమితి యెక్కువ. కాని మాంసకృత్తులును, చమురును తక్కువ. క్రిందిపట్టిక చూడుడు. అయినను కొన్నిరకములబియ్యము మాంస కృత్తులపరిమాణమున గోధుమలకుగూడ దీసిపోవు. ఉ. పూంబాళె, గరికసన్నవరి, స్వర్ణాలు. గోధుమలలో మాంసకృత్తులు (తేమను మినహాయించి లెక్కగట్టినచో) 11. 24% ఉండగా, 43 రకముల బియ్యపు సగటు, 8. 50% ను, పూంబాళెలో 12. 85% ను, స్వర్ణాలలో 11.65% ను, గరికసన్నవరిలో 11. 38% ను ఉండెను. మాంసకృత్తులు మిగులతక్కువగ నున్నరకము యెలవ డము. ఇందు 6. 32%మాత్రమే యుండెను.

### కొన్నిరకముల బియ్యపుసంఘట్టనమును గోధుమలు మొదలగు నితర తృణధాన్యములతో పోల్చి చూపుపట్టిక*

( తేమను మినహాయించి లెక్కగట్టగా వచ్చిన ప్రమాణములు )

| రకము. | బూడిద | మొత్తపు మాంసకృత్తులు | నార పదార్థము | చమురు | కర్బనోద జనిదములు | వ.రా. |
|---|---|---|---|---|---|---|
| | % | % | % | % | % | |
| 1. ఆట్రగడా | 1.05 | 8.74 | 0.33 | 1.10 | 88.77 | |
| 2. కొణామణి (పిఠాపురం) | 0.79 | 7.77 | 0.37 | 0.66 | 90.53 | భోజనమున కను కూలమని యెంచబడు పెద్ద వరి రకములు. |
| 3. ,, (చామర్లకోట) | 1.37 | 9.65 | 0.46 | 1.44 | 87.09 | |
| 4. రత్నసుడి | 1.17 | 9.10 | 0.26 | 1.29 | 88.28 | |
| 5. నల్లబుడమ | 1.43 | 8.62 | 0.25 | 1.00 | 88.69 | మెట్టపంట. |
| 6. యెలవడం | 0.77 | 6.32 | 0.17 | 1.08 | 92.77 | ,, పల్లపునేలలో పెరుగునది. |
| 7. పూంబాళె (తిరునల్వేలి) | 1.49 | 12.85 | 0.27 | 0.49 | 84.75 | పెద్ద వరి రకము. |

* ఇందలియంకెలు చాలవరకు చెన్నపురి వ్యవసాయరసాయనశాస్త్రజ్ఞునిచే నపుడపుడు చేయబడిన పృథ క్కరణలనుబట్టి గుణింపబడినవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 8. స్వర్ణాలు | 1.45 | 11.65 | 0.65 | 2.52 | 83.66 | తేలికవరులు. |
| 9. గరికసన్నవరి | 0.92 | 11.38 | 0.13 | 1.23 | 86.33 | |
| 10. నలుబదిమూడు రకములసగటు | 1.11 | 8.50 | 0.37 | 1.12 | 88.87 | |
| 11. గోధుమలు | 3.44 | 11 24 | 2.42 | 2.03 | 80.87 | |
| 12. జొన్నలు | 1.72 | 10.88 | 2.29 | 4.13 | 80.98 | |
| 13. చోళ్లు | 8.63 | 19.64 | 7.39 | 5.56 | 67.78 | |

బియ్యమునందలి మాంసకృత్తులు మొక్కజొన్న, గోధుమ మొదలగువానియందలి మాంసకృత్తులకంటె మానవ శరీరమునందలి మాంసకృత్తులకు దగ్గర పోలిక గలిగి యుండుటచే వరియన్నమే యీవిషయమున మానవుని కెక్కువ యాహారయోగ్యమని యెంచబడు చున్నది.* మానవశరీరమున సమీకరణమగుటను చిట్టిగోధుమలందలి మాంసకృత్తులవిలువ 40 అయి యుండ వరిబియ్యము నందలి మాంసకృత్తులవిలువ 80 గ పరిగణింపవచ్చునని Dr. H. C. Menkel వ్రాసిరి.†

ఆయావరిరకములందలి మాంసకృత్తుల పరిమితి యందు చాలతారతమ్యములు గలవని పైపట్టికవలన దెలియును. బహుశః వానిస్వభావమునందును భేదము లుండ వచ్చును. మిగులహెచ్చుగ మాంసకృత్తులు గలిగిన గరిక సన్నవరియు, స్వర్ణాలును ప్రజలచే నారోగ్యవంతముగ నెంచబడుట లేదు. ఇవి త్వరలో ఫలించున వగుటచే ననారోగ్యకరములని వారల యభిప్రాయము. ఇది యనుభవము ననుసరించిన యభిప్రాయమో, లేక మూఢవిశ్వాసమో చెప్ప వీలులేదు. వాగ్భటునియష్టాంగహృదయమున 'షష్టికో వ్రీహిషుశ్రేష్ఠః' అని వ్రాయబడియుండుటచే శీఘ్రముగ ఫలించు షష్టికముల (సత్తికాల) కే శ్రేష్ఠత చెప్పబడెను. మాంసకృత్తులు మధ్యమముగ నుండు ఆట్రగడా, కొణామణీ, రత్నసుడి మొదలగు వానిబియ్యమే ఉత్తరసర్కారులలో ఆరోగ్యవంతముగ నెంచబడుచున్నవి. మాంసకృత్తులు మిగుల తక్కువగ నున్నట్లు కనిపెట్టబడిన యెలవడపుబియ్యము బాలింతలకుసహితము పథ్యముగ నెంచబడుచున్నది. పైపట్టిక నుండి గోదావరి కాలువనీటివలన డెల్టాలో పండిన కొణామణిలోకంటె ఏలేటి పారుదలక్రింద పండిన కొణామణిబియ్యమున మాంసకృత్తులు తక్కువగ నున్నట్లూహింపదగియున్నది. సామాన్యముగ డెల్టాలో పండిన బియ్యముకంటె అప్లండులో (ముఖ్యముగ చెరువుల క్రింద) స్వల్పమగు నీటితో పండినబియ్యమే శ్రేష్ఠమని చెప్పుదురు. మరియు, మోటయిన నల్లబుడమ యను మెట్టరకపుబియ్యము దంపరకముల బియ్యముకంటె నారోగ్యవంతమందురు. ఇట్లాయారకముల యొక్కయు, వివిధములగు పరిస్థితులలో పెరిగిన ఒకేరకముయొక్కయు బియ్యపు మంచిచెడ్డలకును, అందలి మాంసకృత్తులు మొదలగువాని పరిమితికిని, వానిస్వభావమునకును సంబంధ మేమైన గలదాయని శాస్త్రజ్ఞులు పరిశోధించుట శ్రేయస్కరము. ఇట్టి పరిశోధనవలన ఆరోగ్యకరములును, హెచ్చుమాంసకృత్తులు గలిగినట్టియు రకము లెంచబడుచో వానినే హెచ్చుగ సాగుచేసి ప్రజలయారోగ్యమును పెంపొందించవచ్చును.

వరిబియ్యమునందు ఇతరతృణధాన్యములందుకంటె మాంసకృత్తులెగాక చమురును తక్కువ. ఒక స్వర్ణాలుబియ్యమునందుమాత్రము చమురు గోధుమలతో సమముగ నున్నది. కాని ఆయాతృణధాన్యములయందలి చమురు ఎంతవరకు మానవశరీరమున సమీకరణ మగునో తెలిసికొనినగాని, యీ చమురుపరిమితి, తారతమ్యములఫలము తేలదు.

* Journal of Biological chemistry, Vol XXII, P. 259, quoted in Bulletin No. 62, Imperial Agricultural Institute, Poona.

† A diet for India, by Dr. H. C. Menkal reviewed by the Hindu on 20-2-1929.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వరిబియ్యమునందు ఖనిజములుగూడ తక్కువ. ఆహారమునం దుండవలసిన ప్రధానఖనిజములగు సున్నమును, స్ఫురమును, ఇనుమును నూరుకాలరీల యింధనశక్తి నిచ్చు చేబియ్యపుటన్నమునందు వరుసగ 0.6, 6.3, 5.5 పరిమాణాంకములు (Units)* ఉండ, అంతే యింధనశక్తి నిచ్చు పొట్టుతీయని గోధుమరొట్టెలో నవి వరుసగ 3.8, 9.1, 9.1 పరిమాణాంకములు (Units) గలవని లెక్కవేయబడెను.† ఈ యంకెలు వరియన్నమున సున్నము మిగుల లోటువడియున్నదని తెలుపును.

ఇట్లు ఖనిజములపరిమితి లోటుగనున్నను,ముఖ్య ఖనిజములకును (సోడియము, ఇనుము, ఖటికము, సున్నము)మాంసకృత్తులకును గలప్రమాణము వరిలో హెచ్చుగ నుండుటచే గోధుమకంటె వరియె యెక్కువ క్షారజనకమనియు,అందువలన ఆరోగ్యకరమనియు Dr. Drews గారు వ్రాసిరి. వారి లెక్కప్రకారము చేబియ్యమునందు పైఖనిజములు 282%,మాంసకృత్తులు 7.85% ను ఉండెను. గోధుమలందు ఖనిజములు 376%ను, మాంసకృత్తులు 13.60%ను ఉండెను. బియ్యమునందలి ఖనిజప్రమాణము 3.7% ఉండ గోధుమలందు 2.8% మాత్రమే యుండెను. ఈ ప్రమాణము 2.5% కు తగ్గినచో నిట్టి ద్రవ్యములు అమ్లజనకములుగ నెంచదగును.§ §

వరిబియ్యమున నారపదార్థముకూడ తక్కువ. ఇందువలన నీయన్నము సులభముగ జీర్ణమగును. కాని యిది విరేచనబద్ధహేతువు. ఆహారమున తగినంత నారపదార్థము కలిసియున్నగాని, మలవిసర్జనము క్రమముగ నుండదని పరిశోధనలవలన తేలెను.‡ మనము తిను ఆహారమున ప్రతినూరుకాలరీలకును అదనము .25 గ్రాము నారపదార్థమయిన నుండవలయును. కాని వరియన్నమున నిందు సుమారు సగముమాత్రమే గలదు.

విటమినులుగూడ వరిబియ్యమున తక్కినధాన్యమునందుకంటె తక్కువ. A. విటమిను మిగుల స్వల్పముగ గలదు. B విటమిను స్వల్పముగ గలదు. C, D విటమినులు శూన్యము.

వరిబియ్యమునందుగల పైని పేర్కొనబడిన లోపములు, వాని నరగదంపుటవలనను, నీటితో గడుగుటవలనను, విస్తారముగ నీటితో నుడికించి గంజిని వార్చివేయుటవలనను మరింత వృద్ధియగుచున్నవి.

ఈక్రిందనాల్గురకముల చేబియ్యముయొక్కయు, అరగదంపిన తెల్లబియ్యముయొక్కయు సంఘట్టనము నందలి తారతమ్యములు చూపబడెను.

| | రసంగి | | కొణామణి | | రత్నచుడి | | బంగారుతీగలు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | చేబియ్యము | తెల్ల బియ్యము | చేబియ్యము | తెల్ల బియ్యము | చేబియ్యము | తెల్ల బియ్యము | చేబియ్యము | తెల్ల బియ్యము |
| 1. బూడిద | 1.33 | 0.88 | 1.59 | 0.79 | 1.27 | 1.17 | 1.56 | 0.96 |
| 2. చమురు | 2.57 | 0 58 | 2.62 | 0.66 | 1.93 | 1.25 | 2.39 | 0.90 |
| 3. మాంసకృత్తులు | 8.21 | 7.72 | 8.49 | 7.65 | 9.33 | 9.14 | 9.46 | 9.07 |
| 4. నారపదార్థము | 0.64 | 0 23 | 0.94 | 0.38 | 0.53 | 0.26 | 0.77 | 0.25 |
| 5. కర్బనోదజనితములు | 87.14 | 90.60 | 88.24 | 90.52 | 86.93 | 88.27 | 85.83 | 88.71 |
| 6. పైబూడిదలోనున్న స్ఫురత్పంచామ్లజనిదము. | 0.80 | 0.32 | 0.73 | 0.36 | 0.72 | 0.45 | 0.84 | 0.54 |

* సుమారు 100 పౌనుల బరువుగల మనుష్యునికి దినమునకు వలయు ఆయాఖనిజములు 100 పరిమాణాంకములు.

† ఈ యంకెలు Food and Nutrition అను American Caped cross text book నందలి పట్టికల లోని యంకెలనుండి లెక్కింపబడెను.

§ § Note on Rice diet - VS. wheat by Yogi Dasa, Mylapore, in The Hindu.

‡ Journal of the Medical Association, 1932—No. 22, p. 1866—75.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పై యంకెలు పిఠాపురం మహారాజా వారి క్షేత్రమునుండి పంపిన చేతితో దంపిన దినుసులకు సంబంధించినవి. ఎఱ్ఱబ్రాలుబియ్యముగల రసంగి కొణామణి రకముల బియ్యమును తెల్లబ్రాలురకములగు రత్నచుడి బంగారుతీగలు నంత అరగదంప నవసరము లేకపోవుటచే వీని తెల్లబియ్యమునకును చేబియ్యమునకును సంఘట్టనమున తక్కువ వ్యత్యాసములుగలవు. అరగదంపుటవలన మాంసకృత్తులందలి తగ్గుదల పైనాల్గు రకములలో సుమారు 2–9% వరకు నుండ బూడిదలో 8–50% వరకును, చమురులో 35–78% వరకును, సారపదార్థమున 8–68%వరకును,స్ఫురత్వంచామ్లజనిదమున 38–60% వరకును నుండెను. దంపుటవలని నష్టము రత్నచుడియందు తక్కువగ నుండెను. ఈ రకపుఆరోగ్యకరత్వమున కిది కారణమై యుండవచ్చును.

తెల్లబియ్యములోనైనను సామాన్యముగ మరబియ్యముకంటె దంపుడుబియ్యము శ్రేష్ఠముగ నెంచబడుచున్నది. బియ్యముపైనుండు యెఱ్ఱని, లేకగోధుమవర్ణపు పొర చేతితో దంపినపుడు మరలో మెరుగుపెట్టినప్పటియంతపూర్తిగ పోకపోవుటయే యిందుకు గారణము.

బియ్యమును దంపునపుడుగాని, మరలో మెరుగుపెట్టునపుడుగాని పైతవుడు పొరయే గాక బియ్యపుగింజల నంటియుండు అంకురములు (ముక్కులు) గూడ పోవును. అరగదంపిన బియ్యపుసారము (ముఖ్యముగ స్ఫురత్వంచామ్లజనిదము) తగ్గుటకు ఇదికూడ కారణము. అంకురములుగాని, తవుడుపొరగాని పోకుండ పై యాకనుమాత్రమే తీసివేయు చేయంత్ర మొకటి ఆప్టె అనునొకయంత్రజ్ఞునిచే కనిపెట్టబడినట్లు తెలియవచ్చుచున్నది. ఇది దినమున కొకబండిధాన్యము నిట్లు నలుపగలదట. నలుగురు ఆడువాండ్రు 8 గంటలు పనిచేసిన చాలునట. *

బియ్యము కడుగుటవలన నందలి ఖనిజములు (ముఖ్యముగస్ఫురము) పోవునని కనుగొనబడెను. కడగని కొణామణిబియ్యమున బూడిద 0.89% ఉండగా కడిగిన బియ్యమునందు 0.25% మాత్రమే యుండెను.† స్ఫురత్వంచామ్లజనిదము కడగని బియ్యమునందు 0.34% ఉండగా కడిగినవానిలో 0.17% మాత్రమే యుండెను. స్ఫురత్వంచామ్లజనిదములోపాటు B విటమినుకూడ తగ్గిపోవునని కనిపెట్టబడెను.‡

అన్నమును వండునపుడు నీటిని హెచ్చుగ పోసి ఉడికినపిమ్మట గంజిని వార్చివేయుటవలనకూడ నందలి సారము కొంత తగ్గిపోవును. కావున వార్చినయన్నముకంటె అత్తెసరన్నమే శ్రేష్ఠము. వార్చుటవలన నెంత సారముపోవునదియు తెలుపు అంకెలు లభింపలేదు. సామాన్యముగ వ్యవసాయదారులును పాటకపు జనులును ఇట్లు గంజినివార్చినను, అన్నముతోపాటు దీనినిగూడ త్రాగుదురు. కాని ధనికు లట్లుచేయకపోవుటచే హెచ్చుగ ననారోగ్యవంతు లగుచున్నారు.

ధాన్యమును దంపుటకుపూర్వము ఉడుకబెట్టి యెండబెట్టినచో పిమ్మట దంపినపుడు అందలితవుడు పొరయు, ముక్కులును ఉడుకబెట్టనిధాన్యమును దంపినప్పటియంత హెచ్చుగ పోవు. అందువలన నుప్పుడు బియ్యము పచ్చి తెల్లబియ్యముకంటె సారవంతము. ఉప్పుడుబియ్యమునకును పచ్చిబియ్యమునకునుగల సంఘట్టనతారతమ్యము లీక్రింద జూపబడును.‡‡

---

* Diet and health by the Secretary, Madras, Vitamin Co-operative stores Ltd; in The Hindu.

† Relationship of rice to Beriberi by Dr. Mc Carrison.

‡ No. 1000, Nutrition abstracts & Reviews, Vol. II, No 2.

‡‡ Relation of rice to Beriberi by Dr. Mc Carrison.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | చేబియ్యము | | తెల్ల బియ్యము | | వరా |
|---|---|---|---|---|---|
| | పచ్చి | ఉప్పుడు | పచ్చి | ఉప్పుడు | |
| 1. బూడిద | 1 28 | 1.47 | 0.54 | 0.82 | |
| 2. చమురు | 1.40 | 2.01 | 0.54 | 0.46 | రకము ఎఱ్ఱసం |
| 3. మొత్తపు మాంసకృత్తులు | 6.21 | 6.89 | 5.71 | 6.33 | చా. మరలో తయార |
| 4. నారపదార్థములు | 0.44 | 0.63 | 0.13 | 0.21 | యిన బియ్యము. |
| 5. కర్బనోదజనితములు | 90.67 | 89.0 | 93.08 | 92.18 | |
| | 100 00 | 100.00 | 100.00 | 100.00 | |
| 1. నికరమైన మాంసకృత్తులు | 5.93 | 6.31 | 5.59 | 6.28 | |
| 2. స్ఫురత్పంచామ్ల జనిదములు | 0.49 | 0.56 | 0.24 | 0.36 | |

పైపట్టికనుబట్టి పచ్చిబియ్యమునకును చేబియ్యమునకును, చేబియ్యమునందుకంటె తెల్లబియ్యమున నెక్కువవ్యత్యాసములు గలవని తెలియును. ముఖ్యముగ స్ఫురత్పంచామ్లజనిదమునందలి భేదమును గమనింపదగును. ప్రజలు ధాన్యపు యంత్రము లుపయోగింపక మానని యీకాలమున పచ్చిబియ్యమునకుబదులు ఉప్పుడు బియ్యమును దిన నలవాటుచేసికొనుట మంచిది. ఉప్పుడు బియ్యము దినునలవాటు తెలుగుజిల్లాలలో దక్షిణాదినున్నంతవిరివిగ లేదు. ఉత్తరసర్కారులలోగూడ నిటీవల ఒరిస్సానుండి వచ్చిన చౌకయగునుప్పుడుబియ్యమును దినుటకు జనసామాన్య మలవాటు పడుచుండుట కొంత మేలు.

వడ్లను నీటిలో నానవేసి మరల వడియగట్టి మొలకవచ్చినపిమ్మట స్వల్పకాలము (౫ నిముషములకు మించకుండ) వేచి అటుకులుగ జేసినచో నందు విటమినులు ముఖ్యముగ 'సి' విటమిను అన్నమునందుకంటె హెచ్చుగ నుండును. ఈయటుకులను మరల నీటిలోగాని, మజ్జిగలోగాని,పాలలోగానినానవేసి తినవచ్చును. జస్టిసు వేపా రామేశం పంతులుగారిట్టి యటుకులను చాలకాలముపయోగించి పరీక్షించియుండిరి. * ఇట్లు అటుకులను దినుటవలన విటమిను సి. చేకూరినను, ఇవి అన్నమంత సులభముగ జీర్ణముకావు. జఠరాగ్ని బాగుగనున్నవారే వీనిని దినదగును.

సామాన్యముగ గోధుమలు, కందులు, పెసలు మొదలగువానివలె వడ్లను మొలకకట్టి తినుటకు వీలు లేదు. దంచినబియ్యము సామాన్యముగ నందలి యంకురములు పోవుటచే మొలవవు. ఈ యంకురము చెడకుండ ధాన్యపు పైయూకను దీయు, పైని ఉదాహరింపబడిన ఆప్టెగారియంత్రమున దీయుచో నట్టిబియ్యమును గోధుమలు మొదలగువానివలె మొలకట్టి తినవచ్చునట.† ఇది సులభసాధ్యమగుచో అపక్వాహారము దినదలచువారికి మిగుల వీలుగనుండును. కాని వరిబియ్యమునందలి పిండిపదార్థమును పైనిచెప్పినట్టు చేసి తినినచో గోధుమలు, పెసలు మొదలగువానియందలి పిండిపదార్థమంత సులువుగ జీర్ణమగునని తోచదు.

ఇంతవరకు వరిబియ్యముయొక్క లోటుపాట్లు వివరింపబడెను. వరియన్నము దినువారు అందలి మాంసకృత్తులలోటును దీర్చుటకు ఏదైన కాయధాన్యపు పప్పును, చమురులోటును, 'ఏ' విటమినులోటును దీర్చుటకు కొంత వెన్నను, లేక నేతిని, లేక నూనెను, నారపదార్థముయొక్కయు, ఖనిజములయొక్కయు లోటును

* ఆంధ్రపత్రిక ౧౯౩౫-వ సం. జూన్ ౨౮-వ తేది సంచికలో ప్రచురింపబడినలేఖ.

† Note in The Hindu, by the Secretary, Madras Vitamin Co-operative Stores Ltd.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీర్చుటకు కూరగాయలను, ఆకుకూరలను, 'సి' విట మినులోపమును దీర్చుట కైదైన పండును, సున్నపు లోటును దీర్చుటకు కొంత మజ్జిగను, లేక పెరుగును, లేకపాలను పుచ్చుకొనవలెను. సామాన్యముగ నాం ధ్రులు తినునాహారమున ననవసరముగ ఊరుగాయలు, పచ్చళ్లు, పులుసు మొదలగు ద్రవ్యములను విసర్జించుచో పైవస్తువులే మిగిలియుండుటచే వాని పరిమితులను కొంచెము సవరించినచో నవి మిగుల ననుకూలముగ నుండునని చెప్పవచ్చును. మనము తిను ప్రతి 10 ఔన్సుల (25 తులములు-సుమారు పావుసేరు) బియ్యపు అన్నముతోను 5 ఔన్సుల పప్పుదినుసులను (పొట్టుతో సహా), 1½ ఔన్సుల కూరగాయలను, ఆకుగూరలను, 2 ఔన్సుల నేతిని లేక నూనెను, 16 ఔన్సుల (మూడరసోలల) పాలనుగాని వానినుండి చేసినమజ్జిగను లేక పెరుగును, రెండరటిపండ్లను లేక యితరపరిడ్లను పుచ్చుకొనవలసియుండును. సామాన్యముగ పైనిచెప్పిన పరిమితి గల యాహారమును, 140 పౌనుల బరువుగలిగి దినమునకు 3-4 గంటల సామాన్యపు వ్యాయామము (నడకవంటిది) గల మనుష్యునికి చాలును. అది సుమారు 70 గ్రాముల మాంసకృత్తులను, 80 గ్రాముల చమురును, 390 గ్రాముల కర్బనోదజనితములను, మొత్తము 2600 కాలరీల యింధనశక్తిని ఇచ్చును. మరియు దీనివలన శరీరమునకు గావలసిన ఖనిజ ద్రవ్యములు పూర్తిగ లభించుటయేగాక, A, B, C, D, విటమినులుగూడ తగినంత సమకూరును.

అన్నముగ వండిలినుటయేగాక వరిబియ్యము, నూక లేక పిండితో, ఇతరవస్తువులను గలిపి పొంగలి, క్షీరాన్నము, పులగము, చిత్రాన్నము, ఉప్పుడుపిండి, యిడ్డెనలు మొదలగు ననేకవంటకములను జేసి తినుట గలదు. కాని అన్నిటికంటె యన్నమే మిగులసులువుగ జీర్ణమగును.

వడ్లనుండియు, బియ్యమునుండియు తయారుచేయబడు నిల్వయుండుదినుసులలో అటుకులు పైని పేర్కొనబడెను. పేలాలు, మొరమొరాలు, పూతచుట్టలు మొదలగు నింకకొన్నిగూడ అచ్చటచ్చట వాడుకలోనున్నవి. ఇవిగూడ అన్నముకంటె ఆలస్యముగ జీర్ణమగునవే.

వరియన్నమునను, వరిబియ్యముతో జేయబడు నితరవంటకములలోను కర్బనోదజనితము లధికముగ నుండుటచే నివి అతిమూత్రవ్యాధిగలవారి కనుకూలములు గావు. ఇందు 'బి' విటమిను స్వల్పముగ నుండుటచే నజ్జువ్యాధి గలవారలకును మంచివి గావు.

---

ఆంధ్రగ్రంథమాల నూతన కుసుమము

# ఆంధ్ర ఋతుసంహారము

(కాళిదాసుకృతికి అనువాదము)

వెల 8 అణాలు.

అనువాదకులు: గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యంగారు, బి. ఏ.,

ఆంధ్రగ్రంథమాల, తపాలాపెట్టె 212, మదరాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రేమకు ప్రేమేలేదా!

తురగా వేంకటరామయ్య (కవితాసమితి)

ఏమే! యమునా!
కృష్ణుడు
ఏడే? కనుపించ డేమి?
పలుకుట కే
భారమ టే
ప్రాణస్నేహితుడంటూ
పదే, పదే పాడుదువే;
బలముమీర పొంగుదువే:
నా వలపుల వెఱ్ఱిజూచి
నవ్వుట తగునా?
యమునా!
పువ్వులు జల్లిన
రాళ్లా?
రువ్వెదవో!
జడురాలా!
ఇపుడే కాదా; కృష్ణుడు
ఇందరిమధ్యా వేణువు
నూదేలేదా; నీవే
కాదనగలవా? బృందా!
మూర్ఛదేరి చూచునంత
ముద్దుకృష్ణు డేమయ్యెను!
దొంగవాడటే?
కాదే?
దొరబిడ్డలు దొంగలటే?
వెన్నెలకాయుచునున్నది
వన్నెల గోవులు నున్నవి
బృందా!
నీయుత్సాహము
బిగిచెడకుండా యున్నది
నల్లనిపచెట్లనీడ
నాకృష్ణుని దాచితివో?
చెప్పెదవా; లేదా; నీ
సిరులకు గర్వించెదవా?
పోనీ-దాస్తేదాచుము
పుణ్యమేమి? లాభమేమి?
అరణ్యాలపడియుండే
నా లీలామోహనుడు?
ఏమే! గోపీ!
నీవూ
ఎకసక్కెము
లాడనేల?
ఎఱుగనట్లు
చూడనేల?
కృష్ణుడు నావాడనేటి
కేరింత లికెన్నాళ్లే
ఒకరికికృష్ణుడా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దా_స్తే
ఉండు కృష్ణుడా ?
ఎంతపిల్లవాడో
మరీ
అంతమాయలాడుసుమీ !
ఎంత అందగాడో
అంత
కంతదొంగవాడుసుమీ !
ఎంత వలపులాడో
దాని
కంత యేడిపించుసుమీ !
గోపీ !
నా కనుభవమే
గోపాలుని కథలన్నీ
ఏమోయీ! గోపాలా!
ఈమాయలు నీకేలా?
దోచుకొన్న
వలపు
లేమిచేసినావు
కాన్పించవు

దొరతనమగునో?
ఇదే
దొంగతనమ్మే అగునో?
ద్రిమ్మరివై లోకాలే
తిరిగేవాడవు; నాకే
దర్శనమిస్తే
పాపము
వాటిలునా?
దర్జా
లోటగునా?
పోనీ - లోకములేలే
పుణ్యాత్ముడవై వర్ధిలు
నాభారము నీకేలా?
నాకేలా
ఈలోకము?
ప్రేమకుప్రేమే
లేదని
ప్రాణమువిడిచెద
కృష్ణా!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పెద్దలు

గోపరాజు రాజన్న

౧

పల్లెటూరికాపురం. పట్నవాసం అని పేరు వినడమేగాని కోశెడుదూరంలో ఉన్న కసింకోటయినా యెరగదు పెద్దమ్మాయి. పాడి, పంట, పిల్లల్నీ సవరించుకోవడంతో పొద్దుపోయేది పెద్దమ్మాయికి. వేమయ్య చెప్పినది వేదవాక్యం అన్నట్టు అత్త యెంతచెబితే అంత. పొద్దల్లా దుక్కి దున్ని, గడ్డి పరకమోపు నెత్తిమీద పెట్టుకొని మగడు గడప యెక్కుతూఉంటే గడగడలాడుతూ, కూర్చునిఉన్న పెద్దమ్మాయి పమిటెసవరించుకొని లేచి నిలవపడేది. ముఖంయెదుట పడి 'నాకీ చీర కావాలి' అనియైనా అడిగియెరుగదు మొగుణ్ణి.

పెద్దమ్మాయిభర్త గోపాలం. అత్త పెద్దమ్మ. నూటనాటికి ఒక్కడే కొడుకుకావడంచేత పెద్దమ్మ గోపాలాన్ని యెంతో గారాబంగా పెంచింది. పెద్దమ్మాయి ఎనిమిదిసంవత్సరాల పిల్లయిఉండగా గోపాలానికి పెళ్లిచేసింది. కొడుకుకార్యం చూచింది. కోడలు కనడం చూచింది. మనుమడిని ముద్దాడింది. పెద్దమ్మకు నూట్రోపడి దగ్గరపడుతున్నాది. కొడుకూ, కోడలూ చల్లగా ఉండగా నాఘటం వెళ్లిపోతే అంతే చాలు అని అనుకున్నది.



"ఇంకా సిగ్గేమిటే బిడ్డతల్లివయినతరువాత ?"

ఆరోజు దసరా దశమి. పుచ్చపువ్వులాగ వెన్నెల కాస్తున్నది. వాకిటిలో చాపలు వేసికొని భోజనానంతరం కుటుంబసహితంగా సభ కావించింది పెద్దమ్మ. గడ్డిమేటుదగ్గర యెడ్లుకూడా పండుగవేడుక తెలియచేస్తూ తలలాడిస్తూ స్వేచ్ఛగా మేస్తూఉన్నవి. పెద్దమ్మాయిమాత్రం శోభనపుపెళ్లికూతురులాగ దూరంగా నిలవపడిఉన్నది. 'పెద్దమ్మాయీ' అని పిలిచి, 'ఇంకా సిగ్గేమిటే, బిడ్డతల్లివయినతర్వాత? ఇలా వొచ్చి కూర్చో' అన్నది పెద్దమ్మ. కొత్తవీణధ్వనివలె జంకుతూజంకుతూ అత్తదగ్గరకువచ్చి కూర్చున్నది కోడలు. 'అమ్మాయీ' అని పెద్దమ్మ యిలా అన్నది: 'నే నెంతోకాలం బతకను తల్లీ. ఇల్లూ, సంసారం నీ నెత్తిమీద వదలివేస్తున్నా. .........పెద్దలులేని యిల్లు వృథావృథా ...కాని...'అని యేమో చెప్పబోతూఉంటే పెద్దమ్మాయి, 'అత్తయ్యా, పెద్దలు లేకపోతే ఏం చెయ్యాలి?' అన్నది.

'పెద్దలు లేకపోతే ఎద్దుబుఱ్ఱయినా తెచ్చిపెట్టుకోవాలి.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౨

'ఒసేవ్, చూసావులే. పెద్దమ్మాయి కొత్తగా దుద్దులు చేయించుకుంది. అత్తపోతే కోడలుకి ఆర్భాటం యెక్కువవుతుంది.'

'అవి దుద్దులుగావు నక్షత్రాలు'.

'అబ్బే! దుద్దులు జబ్బుదుద్దులట. నీకింకా తెలియదుకాబోలు!'

'.......................'

'.......................'

ఈరీతిగా ప్రసంగిస్తూ సూర్యాకాంతం, సత్యవతి యేటిలో జలకమాడుతూ, బిందెపట్టుకువస్తూ ఉన్న పెద్దమ్మాయిమీద ఊసులుపెట్టుకున్నారు. తూర్పుకనుమలద్వారా ప్రవహిస్తూ అనాదినుండీ పెద్దల అగ్రహారానికి సర్వకాలసర్వావస్థలయందూ పసిబిడ్డ బాలాదికీ నీటివసతి కలుగచేసే యేరు. పూర్వకాలం నుంచీ అగ్రహారం పెద్దలఅగ్రహారమనీ, యేరు పెద్దల యేరనీ పిలువబడుతూఉన్నవి. ఏటికి స్నానానికివచ్చి అగ్రహారపు అమ్మలక్కలు చాలాసేపు కబుర్లతో, కథలతో అగ్రహారపుభోగట్టాలతో కాలంపుచ్చి సావకాశంగా యింటికి వెళ్లేవారు.

సూర్యాకాంతం, సత్యవతీ కొత్తకోడళ్లు. పట్నవాసపు పిల్లలు. పెద్దమ్మాయి ఏటిఒడ్డుకు రాగానే పక్కన నవ్వారు. చంకలో ఉన్న పిల్లవాడిని ఒడ్డుని కూర్చుండబెట్టి, పెద్దమ్మాయి పట్టుతివాసీమీద నడచినట్టుగా యేటిలోకి వెళ్లింది. తెరతెరలుగా ప్రవహిస్తూ ఉన్న యేరు ఆముగ్గురు ఇంతులతో గేలిచేస్తూ, చీర కొంగులు లాగికొని పోతూఉంటే, వానిని సవరించుకొంటూ యువతులు ఇచ్ఛావిలాసంగా జలకమాడుతూ ఉన్నారు. ముఖానికి పసుపుపూసి పెద్దమ్మాయి దోసెడునీళ్లు తీసికొని ముఖంమీద జారవిడిచింది. 'పెద్దమ్మాయివదినా' అని సూర్యాకాంతం యేమో చెప్పబోతూ బుడుంగున నీటిలో మునిగి క్షణంలో లేచి యిలా అంది:

'అత్తయ్య మాసికాలు అయిపోయినట్టేనా?'

పెద్ద:—ఆ! నిన్ననే ఆఖరిమాసికం. పెద్దదిక్కుపోయింది. ఇంట్లో ఒక్కత్తిని.

సూర్యాకాంతం:—పోయేటప్పుడు—

కూర్చున్న సత్యవతి ప్రవాహానికి సాగుతూఉన్న తనబిందెను పట్టుకొని బుడుంగున యేటిలో ముంచి, బిందె తీసి భుజంమీద పెట్టుకొని చీరపట్టుకు వెళ్లాడుతూఉన్న యేటిని విదలించుకొని, ఒడ్డెక్కి, 'సూర్యాకాంతం, మీఅన్నయ్య ఇంటికి వచ్చేవేళ అయింది. పోతున్నా' అని సెలవుతీసికొని యింటికి సాగింది. 'అత్తయ్య చనిపోయేముందు యేంచెప్పారు వదినా?'



"అత్తయ్య చనిపోయేముందు....., ప్రశ్నించింది."

అని సూర్యాకాంతం పెద్దమ్మాయిని ప్రశ్నించింది. జారిపోతూఉన్న పమిటె సవరించుకొని 'పెద్దలులేని యిల్లు వృథా, వృథా! పెద్దలు లేకపోతే ఎద్దుబుఱ్ఱయినా తెచ్చిపెట్టుకోవాలి అని' అన్నది పెద్దమ్మాయి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూర్యా:—పెద్దవాళ్లతో ఉన్న చిక్కల్లా యిదే. ప్రపంచకం అంతా వాళ్లతోటే ఉందన్నట్టు మాటాడుతారు. చిన్నవాళ్లు మట్టిగొట్టుకుపోయినా పర వాలేదన్నట్టు.

పెద్ద:—సూర్యాకాంతం, మా అత్తయ్య అలా గనే మనిషికాదు. చిన్నదానినైనా ప్రతీవ్యవహారంలో నామాట పాటిస్తూ ఉండేది.

ఎంతవాళ్లనైనా హేళనచెయ్యడం సూర్యా కాంతపు స్వభావం. పెద్దమ్మాయి అమాయకురాలని, ఆమెను ఆడించవలెనని అనుకుంది. ఎంతో వినయంతో యిలా ప్రారంభించింది:

'ఔను వదినా, పెద్దదిక్కు పోయింది. ఇప్పు డేం చెయ్యదల్చుకున్నావ్?'

*　　*　　*　　*

'ఎద్దుబుజ్జి'

'తెచ్చిపెట్టుకోవాలి' అని పెద్దమ్మాయి భక్తి శ్రద్ధలు స్ఫురించేటట్టు అంది. 'దేవుడుగదిలో మహ లక్ష్మిపేటలో పెట్టి పూజించాలిసుమీ. మనఊరుకి ఎఱు కలవాళ్లు పెద్దల నమ్మ చూపుతారు. వచ్చే యేకాదశి నాడు ఎఱుకలమ్మి వస్తుంది. మీయింటికి పంపు తానులే.'

'ఆపెద్దలు యెద్దుబుజ్జిలేనా?'

'ఆ! ఎద్దుబుజ్జిలే. అవి కొంచెం వికృతంగా కన పడతాయి. చీకటిలో వాటిని చూస్తే పెద్దపులులవలె కనపడతవి.'

'అలైతే ఇద్దరు పెద్దలని కొంటానే.'

## 3

వరిచెన్నులు జీమూతవాయిద్యానికి తలలూపుతూ నిత్యానందంగా ఉన్నాయి. పెద్దయేటికి పడమరగా ఉన్న పొలం క్రొత్తగా చాలుపట్టిఉన్నది. పొలంగట్టు మీద యిద్దరు నారీమణులు కూర్చునిఉన్నారు. పొల ములోని యెఱ్ఱరాగిడిచాలు ప్రేమాంగనయొక్క పెది మెలవలె ఉంది. ఇద్దఱు నారీమణులు ఒకఅరగంట కాలం గుసగుసలాడారు. పిదప అందొక యువతి:

'ఐతే, పెద్దమ్మాయిఇంటికి ప్రయాణం యెప్పుడు సూర్యాకాంతం?'

'వారంరోజులలో. ఎఱుకలమ్మి వస్తుందిఅని చెప్పి ఉంచాను. సత్యవతీ, నీపాత్ర చాకచక్యంగా ధరించాలిసుమా.'

'అయ్యో, అలాగే. ఎంతకైనా తగుదువే సూర్యాకాంతం. మంచిగమ్మత్తే పన్నావు.'

## ౪

శ్రావణశుక్రవారం. ఇల్లలికి, ముగ్గులుపెట్టి, మహాలక్ష్మిపేటను శృంగారించి, పిండివంటల్తోసహా మహాలక్ష్మికి నైవేద్యం సమర్పించింది పెద్దమ్మాయి. భోజనా లయినతర్వాత వంటిల్లు చక్కబెట్టి, వీధి చావడిలోకి వచ్చి నడుంవాల్చింది. క్షణంలో తెలివిలే కుండా నిద్రపోయింది. ముఖం మంచిముత్యాలతో నింపి నట్లుగా ముచ్చెమటలు పోసింది. ఎడపిల్లడు చన్నుకుడ వడానికని తల్లిప్రక్కలోకి వచ్చి, అలాగ్గానే నిద్ర పోయాడు. గాఢనిద్రలో ఉన్న పిల్లవాడు కళ్లువిప్పి, మళ్లీ మూసి, తల్లిప్రక్కలో చొరుచుకుని మరీ నిద్ర పోయాడు. పెద్దమ్మాయి కొంచెం కదలి పిల్లవాడిని మరింతదగ్గరగా తీసికొని చల్లగా వీస్తూఉన్న పిల్ల గాలికి ఆరీఆరని కురులు ముఖంమీద ముత్యాలతో ఆడుకుంటూంటేకూడా లేవలేదు. వాకిట్లో గణగణమని గంటలు మ్రోగిస్తూ, పంటలక్ష్మియొక్క జయభేరీవినం డోయి అన్నట్టు, పాలాల్నించి యెడ్లు దొడ్లల్లో పడు తున్నాయి. గోపాలం గడపెక్కాడు. భార్య యెదు రుగా రాలేదేమని సంకోచిస్తూ సావిట్లోకి వచ్చాడు. నిద్రాసుఖాన్ని అనుభవిస్తూఉన్న తల్లీపిల్లల్ని చూసాడు. తొలకరిలో గడ్డిపరకవలె ఆనందంపొందాడు. 'అమ్మా యీ' అని భార్యను పిలవబోయి, మళ్లీ ఊరుకొని వింటికి యెక్కుబెట్టిన బాణంలాగ నిలుచుండిపోయాడు. పెద్దమ్మాయి కొంచెం వత్తిగిలి 'పెద్దలా! పెద్దలా!' అని కలవరించింది. నిట్టూర్పువిడిచి భార్యచెంత కూర్చు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నాడు గోపాలం. కురులను సవరిస్తూ 'అమ్మడూ' అని భార్యను లేపాడు. 'ఎవరు వారు?' అని ఉలిక్కిపడి లేచి, పెద్దమ్మాయి భర్తను చూచి యేమో చెప్పబోయి, చెయ్యి పట్టుకుని, వాకిట్లో తులసికోటదగ్గరకు తీసుకు వచ్చింది.




"చెయ్యిపట్టుకుని, వాకిట్లో......తీసుకువచ్చింది."

'పాదుకల' అంది పెద్దమ్మాయి.

'ఏమికల?'

'ఘంటసేపటినుంచి పాదుకల ఒకటి నామనసులో చొరుచుకుకొని ఉంది. అంతా చెప్పలేను కాని......పెద్దల నమ్మతెచ్చిందిట యెఱుకలమ్మి. ఆపెద్దల్ని కొని పసుపురాసి బొట్టుపెట్టానట. ఆవాళ రాత్రే దొంగలు పడ్డారట.........ఎంతోభయం వేసిందిసుమండీ! ఒళ్లు ఝల్లుమంటున్నాది.........'

'తర్వాత?'

'భయమేస్తున్నాది......పెద్దలు పెద్దపులు లై పోయారట. గాంద్రుగాంద్రుమని అరచేటప్పటికి దొంగలెక్కడవాళ్లక్కడ పారిపోయారట'

'తర్వాత?'

'పిల్లలూ, నేనూ యేమైపోయామో అని ఊరంతా వెతుకుతారట మీరు.'

'తర్వాత?'

'కాని యెక్కడా కనిపించము...ఇంతట్లో తెల్లవారిపోతుందట...ఊరంతా వెతికి యింటికి వస్తారట...ఇంట్లో పిల్లల్నీ, నన్నూ చూసి పరమానందం పొందుతారట.'

'తర్వాత?'

'ఇంతట్లో మెలకువొచ్చింది.'

'మరేం భయంలేదు అమ్మడూ' అని భార్యను ఊరడించాడు భర్త.

ॐ

సూర్యాకాంతం పదునెనిమిదివత్సరముల యువతి. తెనుగులో పాండిత్యం కొంత సంపాదించింది. తలిదండ్రులు విద్యాభిలాషులుకావడంవల్ల కూతుర్ని ఆంగ్లేయంలోకూడా పొర్లించారు. కాని ఆ అమ్మాయికి ఆంగ్లేయపుముక్క లేమీ అంటలేదు. తెనుగుపుస్తకం అర్థంచేసుకోవడమంటే సూర్యాకాంతానికి మంచినీళ్లు తాగినట్టే. చిన్నప్పటినుంచీ పట్నవాసంలో పెరగడంచేత పల్లెటూరిప్రజలంటే వట్టి యెద్దుమొద్దుస్వరూపాలని ఆ అమ్మాయిఅభిప్రాయం. అత్తారిఊరు పట్నవాసమే కావాలనికూడా చిన్నప్పటినుంచీ భగవంతుడికి మ్రొక్కుతూఉండేది. కాని తా నొకటితలిస్తే దైవమొకటి తలచాడు.

అగ్రహారపు ఆడవాళ్లంటే సూర్యాకాంతానికి పండుగ. ఎందుకు? వేళాకోళంచెయ్యడానికి. సరసం విరసంలోకి మారేది అప్పుడప్పుడు. మగాళ్లు మగాళ్లు కూడా జుత్తులుపట్టుకోవడం సంభవిస్తూఉండేది. ఉడుకున్నవాళ్లని ఉడికించడం మరీ సరదా సూర్యాకాంతానికి. గోపాలాన్ని తప్పించి పెద్దలఅగ్రహారంలో సుందర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపుడు సూర్యాకాంతంభర్త ఒక్కడే. సత్యవతిభర్త చామనచాయగలవాడు.

ఒకనాడు అగ్రహారపు అమ్మలక్కలంతా సూర్యాకాంతంయింట్లో సభకావించారు. నవ్వుతూ, సూర్యాకాంతం అందర్లోనూ నిల్చుని, 'సత్యవతీ, గమ్మత్తు!' అంది. సత్యవతి అప్పుడే గుమ్మం యెక్కుతున్నది. ఆగినది.

'ఏమిటే చెప్పవూ!' అంది సత్యవతి.

'ఆగమ్మత్తు నీకు తెలుసునే.'

'అబ్బ, చెప్పవే!'

'నీకు వక్కర్తికే తెలుసునే. ఇంక యెవ్వరికీ తెలియదు.'

'మరింతేగా సూర్యాకాంతం, చెప్పమంటే!'

'చెప్పనా?'

'ఆ!'

'నీమొగుడు నల్లమసిబొగ్గు!'

సత్యవతికి ఎక్కడలేని కోపం వొచ్చింది. అందరూ పకపకా నవ్వారు.

'నీమొగుడుమట్టుకు మసిబొగ్గుకాడేం?' అంది సత్యవతి.

ఊరుకోక, సూర్యాకాంతం 'నామొగుడు తెల్లసుద్దముక్క' అంది.

సత్యవతిఒళ్లు మండింది. రివ్వున యింటికి వెళ్లింది. సూర్యాకాంతంమీద కసితీర్చుకోవాలని అనుకుంది. మళ్లీ కొంచెం ఆలోచించుకొని, 'వేళాకోళాని కందిగాని......' అని మనసుఊరడించుకుంది. మళ్లీ కొంతసేపటికి తుసానులో పడవవలె మనసు చిందరవందరయింది. 'అందరిలో నామొగుడ్ని మసిబొగ్గంటుందా?' అని పళ్లు పటపటా కొరికింది. మొగుడికి ఫిర్యాదుచేద్దామని అనుకొంది. మొగుడేం చెయ్యగలడు? తన ఉడుకుమోత్తనానికి తనే ఏడ్చింది. వేడియెక్కిన శరీరం కన్నీళ్లకి కొంచెం చల్లబడింది. మరొకక్షణానికి యేమనుకొందోగాని ఏడ్పు మానివేసింది. సూర్యాకాంతంతో మంచిగా ఉంటే మొగుడ్ని మసిబొగ్గుచెయ్యదని శాంతంపొందింది. వైరంవల్ల లాభం లేదని విహితంగా ఉండాలని నిశ్చయించుకుంది.

ఈమోస్తరుగా పరిపరివిధాలుగా పోయిన మనస్సుని కొంతసేపటికి కట్టిపెట్టుకుంది.

అదిమొదలు సూర్యాకాంతానికి 'తందాన తానా' పాట పాడుతూఉండేది. కొన్నాళ్లకి సూర్యాకాంతం, సత్యవతిమీదికి దాడివెడలడం మానుకుంది. 'సంయిఅంటే సంయి' అని ప్రతీపనిలోనూ ఇద్దరూ ఏకమయేవారు. ఇట్టిస్నేహం ప్రారంభించినతర్వాత వారిద్దరూ ముందుచెప్పినట్టు పొలంగట్టుమీద సభచేసినారు. ఎఱుకలవాళ్లవేషం వేసికొని యీక్రిందివిధంగా పాట పాడుతూ గోపాలంయింటి పెరటిగుమ్మందగ్గర సంధ్యచీకటిలో పెద్దల్ని అమ్మడానికి నిశ్చయించుకున్నారు.

పెద్దలమ్మా పెద్దలూ
పెద్దపెద్దపెద్దలూ
పెద్దమ్మాయిపెద్దలూ
పెద్దగ్రహారప్పెద్దలు.

## ౬

పిల్లలకి భోగిపళ్లు పోద్దామని సూర్యాకాంతాన్ని పేరంటానికి పిలవడానికి వెళ్లింది పెద్దమ్మాయి. ఊళ్లో కడయిల్లు కావడంవల్ల సూర్యాకాంతంయింటికి వెళ్లేసరికి కొంచెం పొద్దుపోయింది. సత్యవతికూడా అక్కడే ఉన్నది. పెద్దమ్మాయిని చూసి పకపకా నవ్వింది.

సూర్యా: 'నవ్వుతానేమిటే సత్యవతీ.' సత్యవతిని చాటుకు పిలిచింది, సూర్యాకాంతం. 'నవ్వుతా వేం? పెద్దమ్మాయికి మనం చేసిన గమ్మత్తు తెలియదు' అని కసిరింది. పెద్దమ్మాయిదగ్గరకు వచ్చి, 'పెద్ద లెలాగ ఉన్నారు వదినా? కులాసాగా ఉన్నారా?' అంది. సత్యవతికి నవ్వు ఆగటంలేదు. ప్రక్కగదిలోకి పోయి కడుపుబ్బ నవ్వుతున్నాది గద్దాయిస్తూ, సూర్యాకాంతం, 'ఇంకా చిన్నతనపు చేష్టలు పోలేదు నీకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సత్యవతీ! ఇంటికి వచ్చిన పెద్దమనిషిని మర్యాద చెయ్యడంలేదుగదా, పై పెచ్చు నవ్వులాటకూడానా?' అని పెద్దమ్మాయివైపు తిరిగి, అతివినయంతో 'మాడు వదినా!' అంది.

'మరచిపోక రండేం. పెద్దల్నికూడా చూద్దురు గాని' అని కోకిలధ్వనిచేసి బొట్టుపెట్టి వెళ్లిపోయింది పెద్దమ్మాయి.

ఆయువతులు ముస్తాబై బయల్దేరుటకుపూర్వం, పాలికాపుని సబ్బుబిళ్లు తెమ్మని అగ్రహారపు అంగడికి పంపి, చీరల బీరువా తెరచి, ఏచీర సింగారించడం అని చర్చిస్తున్నారు. మీమాంస యెంతకీ తెగలేదు. గంటసేపయింది. కాని తీర్మానం కుదరలేదు. 'సందడిలో సడేమియ్యా' అన్నట్టు ప్రక్కగదిలో పెట్టె బద్దలగొడుతున్నట్టు చప్పుడు వినవచ్చింది. మరొకక్షణంలో వీథిలోనుంచి 'దొంగలు దొంగలు' అని కేకలు విన వచ్చాయి. ఇంకొక్షణానికి గోపాలంగారి పాలికాపువచ్చి 'సూర్యాకాంతంగోరూ, పెద్దమ్మాయిగారి పెద్దల్ని సూస్తారట......' అని పిలుస్తూఉండగా, నిప్పులు వెదజల్లుకుంటూ, సూర్యాకాంతం వీథిగుమ్మంలోకి వచ్చి, 'ఏడిసినట్టే వుంది. పెద్దలూ లేదు, పేడబొమ్మలూ లేదు......'అని కసిరి, సుడిగాలివలె గదిలోకి వెళ్లింది. అక్కడ ఇనుపపెట్టె బద్దలగొట్టి ఉంది. వీథిగుమ్మంలో సబ్బుబిళ్లతోసహా వాలాడు పాలికాపు. సత్యవతి అప్పుడే ఇంటికి వేంచేస్తున్నాది.


"ఇంకొక్షణానికి గోపాలంగారి......అని పిలుస్తూ."

## ౭

రాత్రి రెండఝాముల వేళ. పిల్లలూ, పెద్దలూ గాఢనిద్రలో ఉన్నారు. పెద్దమ్మాయిపడకగదిలోని ఆముదపుదీపం భయంవేస్తున్నట్టు వణకడం ప్రారంభించింది. గడగోడకూడ వణకింది. యజమానిని లేపవలెనని నేలకు ఒరిగి నేలమీద పడి 'దొంగలు' అని కేకవెయ్యడానికి ఊపిరిలేక మెల్లగా చప్పుడుచేసింది. గదిలో ప్రవేశించిన భయంకరరూపులను గాంచి ఆముదపుదీపము కనులుమూసుకుంది. గడ్డిమేటువద్ద ఎద్దు నిలువబడి దెబ్బలుతిన్నవానివలె అఱచినవి. ఇద్దఱు దొంగలు అనిశీథపు సమయంలో పెద్దమ్మాయిపడకగది చొచ్చారు. ఇల్లూ వాకిలీ యేకటాకీగా రాత్రిపూట సముద్రంమోస్తరుగా ఉంది. ఆఅంధకారపు సముద్రంలో చంద్రబింబమువలె ప్రకాశిస్తున్నద పెద్దమ్మాయి ముఖము. చెవులకు ఉన్న దుద్దులు నక్షత్రములను తోపించుచున్నవి. ప్రక్కలోని యెడపిల్లడు పాలకోసం కాబోలు, 'అమ్మా!' అని నోరు విప్పాడు. దొంగలకి జాలివేసింది. కాని హృదయం రాయిచేసుకున్నారు. పెద్దమ్మాయిమంచందగ్గరగా వచ్చారు. అక్కడనుంచి పదడుగులు వేసి భర్తఉన్న మంచం సమీపించారు. ఇటూ అటూ ఒత్తిగిల్తూఉన్న గోపాలాన్ని చూసారు. మరిపదడుగులువేసి భోషాణపెట్టె ఉన్న గదిలో ప్రవేశించారు. ఇవతలికి వచ్చారు. లోపలికి వెళ్లారు. భోషాణం భళ్లున పగులగొట్టారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గోపాలానికి మెలకువవచ్చింది. దీపం వెలిగించాడు. దొంగలు తలుపు బిడాయించుకున్నారు. బ్రహ్మాండమైన కాగడా వెలిగించి దానివెలుతురులో భోషాణపు అంతరాళంలో ఉన్న నగలపెట్టె తీసారు. గోపాలం వీధిలోకి పరుగెత్తాడు. 'దొంగలొస్తో, దొంగలు' అని గొంతెత్తి అరిచాడు. చీమచిటుక్కుమంటే వినిపించేటంత నిశ్శబ్దంగా ఉంది అగ్రహారం. చెవిదగ్గర గంటమ్రోగించినట్లు, దొంగల చెవులలో 'దొంగలు' అన్న ముక్క ప్రతిధ్వనించింది. దొంగలలో ఒకడు పెరటిసుమ్మంలోకి పరుగెత్తాడు. పెద్దమ్మాయికి మెలకువ వచ్చింది. తలుపులు బార్లా తీసిఉన్నాయి. మంచంమీద గోపాలం కనిపించడం లేదు. దొంగలు పడ్డారనుకుంది. నగలమాట ఆమెమనసుకి తట్టలేదు. పెద్ద వడ్లతట్ట తీసింది. నిద్రపోతూఉన్న చంటికుంకని ప్రక్కతో లేవనెత్తి వడ్లతట్టలో ఉంచింది. నిచ్చెన వేసుకుని అటక యెక్కింది. ఊరగాయలకుండలకు మూలగా తట్టను భద్రపరచింది. గబగబా మహాలక్ష్మి గదిలోకి వెళ్లి, పెద్దల్ని రెండుచేతులతో తీసుకున్నది. 'పెద్దల్లారా, ఇంటిమర్యాద కాపాడండి. కుమారుని కాపాడండి. భర్త చల్లగా ఉండాలి' అనుకుంటూ అటక యెక్కింది. గదిలో సందడి విన్నారు దొంగలు. వారి చెవులు నిక్కపొడిచికొనిఉన్నవి. తలుపు తీసుకుని నగలపెట్టెతోసహా అటకకింఁకి వచ్చాడు ఒకదొంగ. గదిమూలలు నాలుగూ కలియబారా చూచాడు. పెద్దమ్మాయిచేతిలో పెద్దలు వొణికిపోతున్నారు. ఆవొణుకుతో దొంగవాని నెత్తిపై పడ్డారు. దొంగ నిర్ఘాంతపోయి పెట్టె జారవిడిచాడు. ఇంతట్లో వీధిసుమ్మంలో దుడ్డుగఱ్ఱల చప్పుడు వినపడింది. దొంగ దవుడుతీసి, 'పరుగెత్తరోయి బాబో' అంటూ సహాధ్యాయుడుకి పురికొల్పి ఇద్దరూ పెరటిసుమ్మంలోనుంచి పారిపోయారు.

౮

దొంగలు పడ్డప్పటినుంచీ సూర్యాకాంతంమనసు బాగులేదు. నాడు పట్టపగలు నగలుపోయిన రోజు ఆమె మరచిపోదామని ప్రయత్నించినా మరచిపోలేకుండా ఉంది. పూర్వపుధోరణ, మునుపటి హాస్యం, ఆమెవదనంనుంచి తేనెటీగలు విడచిన తేనెపట్టులాగ మాయమయినవి. గోపాలంగారి యింటిలోకూడా దొంగలు పడ్డారన్న ముక్క విన్నది. "నూతనంగా కనుకున్న పిల్లకి బారసాల యెలా చేస్తున్నాదా? పెద్దమ్మాయికి విచారమైనా లేదా?" అని ఆమెమనసు సంకోచించినది. సాదాచీర కట్టుకుని సత్యవతిని వెంటబెట్టుకొని గోపాలంగారి యింటికి సాగింది. ఎంతోశోభతో పెద్దమ్మాయి కూతురుబారసాలవేడుకలో ఉన్నది. పేరంటాళ్లని చూడగానే ఆమెముఖం కలకలమని కలువమొగ్గవలె నవ్వింది. వారిని ఆహ్వానించింది. 'పెద్దమ్మని చూడండి' అని పుత్రికను రెండుచేతులతో తీసుకువచ్చి చూపించింది. తర్వాత 'నగలజాడ యేమైనా కనిపించినదా?' అన్నది. 'పోయిన సొమ్ము మనది కాదు' అన్నది సూర్యాకాంతం. సత్యవతిచెవిలో యేమో చెప్పి, 'వదినా...తప్పు క్షమించు...' అని పెద్దల ముచ్చట పెద్దలయేరునుంచి, పెద్దల నమ్మినవరకూ పూసగ్రుచ్చినట్లు చెప్పింది. చిఱునగవు నవ్వింది పెద్దమ్మాయి పాలుత్రాగుతూ ఉన్న పుత్రికను వడిలో వేసుకుంది. ముద్దాడినది. 'కన్నతల్లీ, పెద్దమ్మా, ఇంటికి పెద్దదిక్కు నీవే' అని గద్గదస్వరంతో అన్నది.

గోపాలం వీధిసుమ్మం యెక్కాడు. యువతీమణులు లేచి నిలబడ్డారు. సెలవుతీసికొని సూర్యాకాంతం, సత్యవతి గృహోన్ముఖు లయినారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సెలవుదినములలో, పోలీసువారు

## (నా యూహా ప్రపంచమున)




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఆషాఢమాసము

(శ్రీ యస్. కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంచయమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెన్నరాజధానియందు ౧౯౩౨-వ సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యము—కె. యస్. కన్నికేశ్వరఅయ్యర్

పిల్లల ఆరోగ్యమార్గము—టి. వి. గణేశన్, పి. పద్మనాభపిళ్ళె

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

పాండవ అజ్ఞాతవాసము—యన్. చలపతిరావు

పాండవవనవాసము—యన్. చలపతిరావు

పాండవారణ్యవాసము—పి. పిచ్చయశాస్త్రి

పురాణనీతికథలు భా. ౪—యం. రాధాకృష్ణమూర్తి

ప్రవృద్ధపాండవము—వి. శ్రీరాములురెడ్డి

భారతేతిహాసములు, భా. ౨—ఓ. తులశమ్మ

భీష్ముడు—కె. నరసింహాచార్యులు

శ్రీకృష్ణుడు—పి. శ్రీరాములు రెడ్డి

సుమతీదేవిచరిత్ర—వి. వెంకటసుబ్బయ్య

## —కల్పితములు

చంద్రాపీడుడు—కె. నరసింహాచార్యులు

ప్రతిబింబములు—యం. నరసింహశాస్త్రి

మంచిచీమ—బి. టి. నరసింహాచార్యులు

శ్రీకలభాషిణీ చరిత్రము—కె. నరసింహాచార్యులు

## కల్పము

క్షీరాబ్ధి ద్వాదశీవ్రతము—(ప్ర) సి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము

## గణితశాస్త్రము

నూతనబాలగణితము—సి. వి. కృష్ణమూర్తిఅయ్యర్

శ్రీకృష్ణజంత్రి—డి. శ్రీకృష్ణమూర్తి

## గేయములు

ఆరోగ్యనగర సంకీర్తనము—పి. రామచంద్రరావు

ఋణప్రాప్తి నిరాకరణభక్తిచింతామణి—ఏ. నరసింహదాసు

కపిలవాయి రామనాథశాస్త్రిగారు పాడినపాటలు, భా ౧-౩—(ప్ర) కె. వరదరాజులుమొదలియారు, మదరాసు

కలికాల శృంగారపాటలు—ఏ. నరసింహదాస్

కలియుగ కలికాలవినోదబింధు—ఏ. నరసింహదాస్

ఖద్దరుపాటలు, భా. ౧, ౨—(ప్ర) కె. చెల్లప్పమొదలి, మదరాసు

గోపికామానసోల్లాసము—ఆర్. రుక్మిణిఅమ్మాళ్

గ్రామఫోనుప్లేటు సంగీత రత్నాకరము—(ప్ర) సి. చిన్నయ్య, మదరాసు

గ్రామఫోనుపాటలున్ను పద్యములున్ను, భా. ౧,౨—(ప్ర) వై. సూర్యప్రకాశరావు, బెజవాడ

—(ప్ర) షేక్ మాలా, తెనాలి

గ్రామఫోనుప్లేట్లలో పాడబడిన ఆనందకీర్తనలు—(ప్ర) పి. పుల్లయ్య, కడప

జవీర్ లాలుపాటలు—(ప్ర) కె. చెల్లప్పమొదలి, మదరాసు

తత్త్వజ్ఞానకీర్తనలు—అప్పలదాసు

నగరసంకీర్తనము—వి. వెంకటరత్నశర్మ

నూతన గ్రామఫోనుపాటలు—(ప్ర) భక్త అండ్ కో., చోడవరం

పాండురంగవిఠల్ భగవాన్ నామమును భజనకీర్తనలు—(ప్ర) టి. రామకృష్ణయ్య, చిలకలపూడి

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప —పద్యము. ప్ర.—ప్రకాశకులు భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భగవత్సింగుపాటలు—(ప్ర) కె. చెల్లప్ప మొదలి, మదరాసు

భారతజండా—కె. అప్పారావు

మోతీలాలుపాటలు—కె. చెల్లప్ప మొదలి, మదరాసు

రామాయణకీర్తనలు—ఏ. వెంకాయమ్మ

వాలివధ—టి. వీరరాఘవరెడ్డి

వేణుగోపాలస్వామిపరిణయము—జి. వెంకటసుబ్బయ్య

శుద్ధనిర్గుణతత్వకందార్థ దరువులు—కృష్ణదాసు భాగవతులు

శృంగార నవరసమంగళహారతులు—యన్. వెంకటమ్మ

శ్రీపాండురంగ బృందావన సంకీర్తనలు—పి. నారాయణదాస్

శ్రీ సంగమేశ్వరస్వామి స్తోత్రగీతములు—(ప్ర) సాధన ముద్రణాలయాధికారి, అనంతపురము

శ్రీశైలమహిమము, పాట—జి. సుబ్బరామకవి

శ్రీ సీతాకల్యాణము—యస్. గ రెడ్డి

సంకీర్తనామృతము—వి. వెంకటరత్నశర్మ

సంగీతకీర్తనలు—(ప్ర). శారదా బుక్ డిపో, ప్రొద్దుటూరు

స్వరాజ్యసోపానము—వి. వెంకటరంగాచారి

## చరిత్రము

కృష్ణామండలచరిత్ర—యం. నరసింహరావు

బ్రహ్మదేశచరిత్రము, భా. ౧—కె. శ్రీరాములు

బ్రిటిష్‌చరిత్ర, భా. ౨—వి. రామయ్య

హిందూదేశచరిత్రము—వి. శ్రీనివాసరావు

## చట్టము

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్—(ప్ర). వి. రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మదరాసు

మద్రాసులోకల్ బోర్డులఆక్టు—జి. సేతుమాధవరావు, గుంటూరు

## జీవితములు

ఉత్తమజీవితములు— బి. వీరనారాయణదేవ్

విశ్వామిత్రుడు—ఏ. పార్వతీశం

శ్రీమహనీయమండలి—యం. వెంకటకృష్ణమాచార్యులు

శ్రీ శివరామఋషి చరిత్రము—గోనుగుంట కోటయాచార్యులు

## జ్యోతిషశాస్త్రము

కాలసాధన కౌముది—(ప్ర) సి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము

## దండకములు

భాషీయదండకము—శ్రీ. నరసింహశాస్త్రి

భూలోకమాత యవతారము, దండకము—(ప్ర) సి. నారాయణరాజు, అలకనారాయణ పురము

## నవలలు

అన్నపూర్ణ భా. ౧—(ప్ర). వి. పార్వతీశం, పిఠాపురము

ఉద్భ్రాంతిస్వప్నము— (ప్ర). రామ అండ్ కో, ఏలూరు

ఏకోదరులు—యం. నరసింహశాస్త్రి

కృష్ణవేణి—మున్నంగి...శర్మ

ప్రేమసుందరి, భా. ౧—హెచ్. దేవదానం

హేమగిరిదుర్గము—(అను) యన్. ఈశ్వరప్ప

## నాటకములు

ఉత్తరరామచరితము—(అను) జయంతిరామయ్య

చంద్రికాపరిణయ నాటకము—శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి

జూలియాననాటకము—జి. బాలశౌరి రెడ్డి

నదీసుందరి—అబ్బూరి రామకృష్ణరావు

ప్రహ్లాద—భళ్లారామరాజు

బభ్రువాహనచరిత్ర నాటకము—పూసపాటి రంగరాజు కవి

భజనసావిత్రి—మంచికంటి వెంకటేశ్వరరావు

విజయవిజయము—పప్పు సూర్యనారాయణ

వివాహవిచ్ఛేదము—మంచికంటి వెంకటేశ్వరరావు

వీరబ్రహ్మేంద్ర విలాసము—గోనుగుంట కోటయాచార్యులు

శివలీల—నిడమర్తి ఈశ్వరప్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీకృష్ణతులాభారము—డి. లక్ష్మీనరసింహం
శ్రీకృష్ణమనశ్శాంతము—మంచకంటివెంకటేశ్వరరావు
శ్రీకృష్ణశైశవము అను కంసవధ—యస్. బసివిరెడ్డి
సహకారవిజయము—మంగిపూడి వెంకటశర్మ
హనుమద్రామ సంగ్రామము—డి. లక్ష్మీనరసింహం

నిఘంటువు

హారావళి—పురుషోత్తమదేవ్

నీతి

నీతినిధి, భా. ౩, ౪—పి. శ్రీరాములురెడ్డి
నీతిలత—కె. నరసింహాచార్యులు
సుజ్ఞానబోధిని, భా. ౪—పి శ్రీరాములురెడ్డి
హితోక్తి రత్నాకరము—వి. సత్యనారాయణశాస్త్రి

పరిశిష్టము

ఉపదేశామృతము, భా. ౧—(ప్ర). పి. ఆర్. దాస్, కాకినాడ
కవిత—డి. రామచంద్రరావు
కష్టజీవి—టి. రామనాథశర్మ
కళాపూర్ణోదయసారము—కె. సత్యనారాయణరావు
కాకినాడ పౌరులకు విన్నపము—డి. కృష్ణమూర్తి
కార్యనివేదిక—(ప్ర) ఆర్. వి. సేతురామశాస్త్రి, మచిలీపట్టణము
గుంటూరుమండల దేవాలయములు, అర్చకులు—డి. హెచ్. వి. రంగాచార్యులు
గృహసరస్వతి—పి. వెంకటస్వామి
జన్మభూమి—యం. విశ్వనాథం
జాతీయశిశు ఆరోగ్యవారము—(ప్ర) బి. సి. వై. నారాయణశర్మ, మమునల
తొలకరి చినుకులు—(ప్ర) కవికుమారసమితి, అనంతపురము
నవరత్నములు—(ప్ర) కె. చెల్లప్పమొదలి, మదరాసు
నాగభూషణతత్త్వరత్నావళి—జె. నాగభూషణదాస్
నూతనపద్ధతి ఆంధ్రవాచకము, ఫారం ౪—ఏ. వి. నరసింహం

పాశ్చాత్యభావప్రపంచము—యం. వి. యస్. సుబ్బరావు
భారత కుటుంబపుగోడుగు—(ప్ర) భారత్ ఇన్ష్యూరెన్స్ కంపెనిలిమిటెడ్, మదరాసు
భృగుసంతతి—భ. వెంకటస్వామి
బ్రహ్మాండార్పణ—చ. వీరనాంబ
మన్మథసామ్రాజ్యము—యం. లక్ష్మీనరసింహశాస్త్రి
మహిమపంచాశతి—(ప్ర) వెంకటరాం అండ్ కో, ఏలూరు
మానసప్రశ్నచింతామణి భా. ౧,౨—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము
మోటారుమాన్యులు—పి. పట్టాభిసీతారామయ్య
యాత్రాస్థలములు—(ప్ర) పూర్ణయాత్రా స్పెషల్ ట్రైన్ సర్వీస్ కంపెని, విశాఖపట్టణము
రెండవ స్వదేశీ ప్రదర్శనము నెం. ౨-౬—, (ప్ర) యువర్ పబ్లిషింగ్ బీరో—విశాఖపట్టణము
వాణీవాచకము, తరగతి, ౧—జె. సర్వభద్రం, యం. వెంకటశాస్త్రి, చింతాదీక్షితులు
వానిల్లవాచకపుస్తకము, తరగతి, ౭—జె. గంగన్న
విజయవాచకము, తరగతి, ౧-౫— జి. నరసింగరావు, పి. నరసింగరావు, పి. శ్రీరాములురెడ్డి
విజ్ఞానవాచకము, తరగతి, ౨,౩—ఏ. శంకరరావు, డి. సోమలింగాచార్యులు, బి. సుబ్బరాయుడు
విభ్రమతరంగిణి—యస్. వీరరాజు
వివేకదర్పణము—పి. పాపరావు, యస్. రామలింగశాస్త్రి
వ్యాసావళి—డి. గోపాలకృష్ణరావు
శాశ్వతవారపంచాంగము—యస్. బలరామరాజు
శ్రీమోక్షమార్గదర్శిని—(ప్ర) చ. శ్రీరామరావు, చిత్రాడ
శ్రీరామమానసపూజ—యస్. కృష్ణానందం
శ్రీ శాలివాహనగాథాసప్తశతీసారము—(అను) ఆర్. అనంతకృష్ణశర్మ
సతీస్మృతి—వి. శేషాచార్యులు
సౌభ్రాత్రరాఘవము—పి. శ్రీరాములురెడ్డి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పాకశాస్త్రము

పర్చత్ పాకశాస్త్రము—తాడిబ్రహ్మానందరావువర్మ

## పురాణము

అభినవభారతము, భా. ౧—యం. మాధవకవి

ధర్మఖండము భా. ౧,౨—ఐ. భవానీశకవి

## ప్రకృతిశాస్త్రము

ప్రకృతి శాస్త్రవాచకము, తరగతి, ౨, ౪—వి. వరాహనరసింహం, టి సూర్యనారాయణమూర్తి

## భూగోళశాస్త్రము

గుత్తితాలూకా భూగోళము—ఆర్. హెచ్. డి. ప్రసాదరావు

మానవ భూగోళశాస్త్రము భా. ౧, ౨—యం. సీతారామారావు

## మతము—హిందు

శ్రీరామావతారతత్వము భా. ౧—జె. శేషాద్రిశర్మ

హిందూమత సిద్ధాంతసారము— పి. వెంకటశాస్త్రి

## —ఇతరములు

ఆంధ్రలూథరన్ క్రైస్తవపండుగ సంభావణలు—వి. సి. హాసస్

కుటుంబారాధనలు— (ప్ర) ఆంధ్రయవాంజిలికల్ లూథరన్‌చర్చి, గుంటూరు

క్రైస్తవభజనకీర్తనలు—యన్. సుబ్రహ్మణ్యం

జీససుసందేశము—(ప్ర) ఆనందనికేతనము, చాగల్లు

ముండ్లకంచెలోని పరదీసు —వై. జి. భాసిల్

రక్షణధ్వని—జేసుదాసుసింగ్

సువార్తపాట—ఇ. శామ్యూల్

## మాహాత్మ్యము

మారికాపురి చెన్నకేశవస్వామి మాహాత్మ్యము—టి. కామాక్షమ్మ

శ్రీ తల్పగిరి మాహాత్మ్యము—కె. వెంకటరామానుజాచార్యులు

## రాజకీయములు

బర్డోలీ విజయము —(అను) యం. జగన్నాథశాస్త్రి

ప్రభుత్వ్వధనము–మనజీవితనము— జె. సి. కుమారప్ప

## వేదాంతము

ఉపదేశసారము—రమణమహర్షి

ఓంకారమే ముక్తిమార్గమనకు అనుమానములు—(ప్ర) యన్. వరదరాజులుశెట్టి, మదరాసు

జ్ఞానామృత కంఠార్థములు—శి. వెంకటసుబ్బయ్య

జ్ఞానసింధువు—(ప్ర) వి. నీలాంబ అమ్మాళ్, మదరాసు

ద్వైతాద్వైత విచారము—(ప్ర) యన్. సుబ్రహ్మణ్య అయ్యర్, మదరాస్

శ్రీ భగవద్గీతామృతసారము—యం. తిమ్మయ్యశెట్టి

స్వానుభవానందబోధిని—శివయోగానందస్వామి

## వైద్యశాస్త్రము

ఆయుర్వేదాంగకౌమార భృత్యము, భా. ౧—(ప్ర) ఆంధ్రవైద్యగ్రంథమాల, బెజవాడ

గోసాయి చిటికెలు—కె. వెంకటరమణశర్మ

త్రిమతమూత్రపరీక్ష—డి. రహంతుల్ల బేగ్ సాహెబ్

బైరాగి చిటికెలు—కె. వెంకటరమణశర్మ

రసరత్నసముచ్చయము—(ప్ర) సి. సత్యనారాయణ శాస్త్రి, నూజివీడు

సుఖరోగచికిత్సలు—డి. సోమలింగాచారి

## వ్యాకరణశాస్త్రము

ఆంధ్రవిజ్ఞాన చంద్రిక, భా. ౧, ౨—ఇ. భాష్యకాచార్యులు

చింతామణి విషయపరిశోధనము—వఝల చిన సీతారామస్వామిశాస్త్రి

త్రిలింగలక్షణము— డి. యగ్గన్న

శారదావ్యాకరణము—టి. రాజగోపాలరావు

## శతకములు

చంద్రశేఖరశతకము—(ప్ర) రామ అండ్ కో, ఏలూరు

భద్రాద్రి సీతారామశతకము—ఏ. పిచ్చయ్యశర్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామశతకము—బి. వెంకటప్పయ్యచౌదరి

వరదరాజశతకము—జి. నరసమ్మ

శ్రీ కృష్ణకీర్తనశతకము—వి. రామమూర్తి

సుగుణశతకము—ఏ. వెంకటశాస్త్రి

### సాంఘికము

సాంఘిక వినోదకలిపయములు—సి. వెంకటరాఘవయ్య

### సారస్వతము

భాషోత్పత్తిక్రమము, భాషాచరితము—కోరాడ రామకృష్ణయ్య

### స్తోత్రములు

ఈశ్వరప్రార్థన, శ్రీ కైవల్యాశ్రమము—(ప్ర) బ్రహ్మానందబాలయోగి, కతెవరము

నామసంకీర్తనము—పి. రామసుబ్బయ్య, ఆర్. ఆంజనేయులు

శ్రీరామకర్ణామృతము—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము

### హరికథలు

బాలాంజనేయము అను శ్రీ సువర్చలాంజనేయకల్యాణము—ఏ. వెంకటచలపతిరావు

శ్రీ వేమనయోగిచరితము—యన్. బసివిరెడ్డి

---

## భోగి - తద్దె

శ్రీమతి కర్లపాలెము అనసూయాదేవి

భోగిపండుగ నేడు ముత్యాలతల్లి
వేగమే గోరింట పెట్టుకోనమ్మ.
అరుణరేఖల మించు నరుణరేఖలను
అరచేతులందున నందముగ దీర్చు.
శ్రీయక్షరం బరచేతులందునను
గోరింటయాకుతో కూర్చెదను నీకు
శ్రీప్రదుం డగుగాక శ్రీకరుడు మనకు.
అంగుళుల నెట్టని యుంగరాల్ దాల్చి
పాదాల గోరింట పారాణి బూసి
నీచెలులలో నెల్ల నీచేతులందె
ఎక్కువ పండెనని నిక్కగావలయు.

*　　*　　*　　*

ఉండ్రాలతద్దెయే ఇవ్వాళ
ఊగవే మాయమ్మ ఉయ్యాల
ఉయ్యాలలో నీవు ఊగకుంటేను
ముసలిమొగు డగు నీకు మురిపములతల్లి.

*　　*　　*　　*

తద్దెపండుగ నేడు ప్రొద్దాయెనమ్మ.
నిద్దురవీడిరా ముద్దులతల్లి
తెల్లవారకముందె మెల్లగా లేచి
చలిదియన్నము తిని చెలియలందఱికి
సొద్దువేయగవలెసుమ్ము నీ విపుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఈ కాలపు మేష్టర్లు

'ఒక మేష్టరు'

మేష్టరులనే బిరుదుగలవాళ్లు అనేకమంది వున్నారు ఈకాలంలో—స్టేషను మేష్టరు, పోస్టు మేష్టరు, పేమాష్టరు, రింగు మేష్టరు......ఇల్లా అనేకమంది వున్నారు. గాని 'మేష్టరు' అంటే చిన్నప్పుడు ఓ, న, మాలు చెప్పిన బడి మేష్టరు అందరికి జ్ఞాపకం వస్తాడు. 'మేష్టా' 'మేష్టా' అంటూ దగ్గర కెళ్లేవాళ్లమే. ఆ మేష్టడి సంగతెల్లా వుందో కొంచెం చూదాం మనం.

ఈ మేష్టరుకే చాలా కాలం క్రిందట అయ్యవారు, పంతులు, బడిపంతులు అని ఇంకా ఏవేవో మారుపేర్లుండేవి. ఇంగ్లీషు జ్ఞానం కొంచెం అబ్బేసరికి అవన్నియు వున్నూళ్ళలు మేష్టరు క్రింద మారేయి. మరీ చిన్న బళ్లలో కాకపోయినా కొంచెం పెద్దబడి అనిపించుకొనే ప్రతీబడిలోను యీ మేష్టర్లలో అనేక రకాలు ఏర్పడుతూవచ్చాయి ఈమధ్యను — హెడ్డు మేష్టరనీ, ఇంగ్లీషు మేష్టరనీ, తెలుగు మేష్టరనీ, లెక్కల మేష్టరనీ, హిష్టరీ మేష్టరనీ, జాగ్రఫీ మేష్టరనీ, సైన్సు మేష్టరనీ, డ్రాయింగు మేష్టరనీ, డ్రిల్లు మేష్టరనీన్నీ. ఇప్పటికి వీళ్లకి పేర్లు భేదం తప్ప మరేమీ భేదం లేదని తేలింది. సర్వసమత్వం ఏర్పడ్డది. చెప్పే పాఠాలనిబట్టి ఒక్కొక్కప్పుడు ఒక మేష్టరుకే రెండు, మూడు పేర్లు కూడా కలుసుకొంటూవుంటాయి.

ఈ మేష్టరు చెయ్యాలసినపని—ప్రతిదినం (శెలవు రోజులలో తప్ప) టైముకు ఒక్కొక్కప్పుడు టైముకు కొన్ని నిముషాలు పూర్వమే బడికి చేరుకోవడమూ, సాయంత్రంవరకూ తన పాఠాలు, శెలవు పుచ్చుకొన్న మేష్టర్ల పాఠాలు కుర్రవాళ్లకు తగురీతిని బోధనా పద్ధతుల ప్రకారం బోధజేసిరావటం. మేష్టరుకి ఇంకొక పని వుంది. ప్రతి మేష్టరుకి దూరదృష్టి వుండాలి. కొద్దో గొప్పో జ్యోతిషం తెలిసివుండాలి. ఎందుకంటే, మర్నాడు ఏపాఠం చెప్పబోతాడో అది చూచుకొని, అది ఎల్లా చెప్పబోతాడో దూరదృష్టివల్లో, దివ్యదృష్టివల్లో కనిపెట్టి ఒక పుస్తకము మీద వ్రాసివుంచుకోవాలి. ఈ దూరదృష్టి అట్టే దూరంగా ప్రసరించకూడదు. మర్నాడువరకే. ఆ తరువాతరోజు ఏంజరగాలో ఆలోచించకూడదు. పుస్తకంమీద వ్రాయకూడదు. ఒక్కొక్కరోజు చొప్పునే వ్రాయాలి. శని, ఆదివారములలో బాలురు వ్రాసిన వ్యాసాలు వగైరా నోటుబుక్కులు తప్పులన్నీ సవరించి దిద్దాలి. ఇదిగాక ఎల్లప్పుడూ తన స్వీయ శక్తులా తన బడిని మంచిస్థితికి తీసుకురావడంకొరకై పాటుపడుతూ, ఇంగ్లీషు సామెతలో చెప్పినట్లు తాను బడికొరకే పుట్టినాననిన్నీ, బడికొరకే ప్రాణములు అర్పిస్తానని అనుకోవాలి. ఇట్లాంటి మేష్టరే మంచివాడుగా ఎంచబడుతాడు.

మేష్టరుకు పైఅధికారి హెడ్మాష్టరు. ఇది అందరకు తెలిసినదే. ఈయనగాక ఇంకా కొంతమంది వున్నారు. స్కూలును మానేజిచేసే ఆయన ఒకడు. కొన్ని స్కూళ్లకు మ్యునిసిపలు చైర్మేను, కొన్నిటికి డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు, కొన్నిటికి కమిటీ ప్రెసిడెంటు, కొన్నిటికి జమీందారు, కొన్నిటికి ఒక వేల సంపన్నుడు......ఇట్లా వుంటారు. వీళ్లిద్దరు గాక ఏజిల్లాలో వుంటే ఆజిల్లా విద్యాశాఖాధికారి. వీళ్లు ముగ్గురు ముఖ్యంగా మేష్టరుకి పైని చెప్పిన గుణాలు వున్నాయా లేవా అని చూస్తూవుంటారు. వీరిలో ముఖ్యంగా ఈ గుణాలుకోసం చూచేవారు మొదటిఆయన, చివరాయన, వీరికి మేష్టరుయొక్క మరేసంగతి అక్కరలేదు. మేష్టర్లచేత పనిచేయించుకొనే పూచీ మొదటిఆయనది. గవర్నమెంటుచే నియమింపబడిన యీ చివరాయన విద్యాశాఖాధికారి, సంవత్సరానికొకరోజు వచ్చి మేష్టర్లు ఎల్లా చెప్తున్నారో చూచి రిమార్కులు వ్రాస్తారు. గవర్నమెంటుకు, ఒక్కొకజిల్లాలో ఎన్నెన్ని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్కూళ్లున్నాయో, ఒక్కొక్కస్కూలులో ఎంతెంత మంది చదువుకుంటున్నారో తెలియపరుస్తూంటాడు ఈయన. ఆసంఖ్యలు కూడుకొని, ఆహా! విద్యాప్రచారము హెచ్చవుతోందిగదా అనుకొని పేపర్లలో 'గత సంవత్సరంకంటే ఈసంవత్సరం మొత్తంమీద ఇన్ని వేలమంది చదువుకొనేవాళ్లు హెచ్చున్నారు' అని ప్రచురిస్తారు. గవర్నమెంటు ప్రతీస్కూలుకు మామూలుగా వాళ్లకర్చులో సగం గ్రాంటు ఇస్తారు. ఏస్కూలు తక్కువగ్రాంటు అడుగుతూ ఎక్కువమంది పిల్లవాళ్లకి చదువుచెప్తుందో అది మంచి స్కూలు. ఏస్కూలుకు గ్రాంటు అసలే అక్కరలేదో అది అన్నిటికంటే మంచిది. గ్రాంటు ఎక్కువఅడిగితే అప్పుడు కోపంవచ్చి ఒకసారి లెక్కలు తనిఖీచేసి 'ఇంతసొమ్ము ఎందుకు ఖర్చుపెట్టుతున్నావు' అని అడుగుతుంది గాని లేకపోతే ఏమీ మాట్లాడదు గవర్నమెంటు. సొమ్మువూనే అక్కరలేదు. మేష్టరు ఒక్కొంటికి రోజుకు బేడా అర్ధణా ఇస్తున్నారో, అణన్నరే ఇస్తున్నారో వూళ్లో కూలిపనిచేసుకొనే ఆడముండకంటే వీడు మంచిస్థితిలో వున్నాడో లేదో, నెల ౧-కి వాడి కిచ్చే ౧౫ రాళ్లు వాడిపొట్టకే చాలకపోతే వాడి పెళ్లాంబిడ్డలకోసం ముష్టిఎత్తుకుందుకు వాడి కిచ్చిన శెలవులు సరిపోతున్నాయో లేదో, ఏమీ అక్కరలేదు. పైపెచ్చు (తిండికి లేకపోయినా) వాడు తలపాగ పెట్టుకోకపోతే తప్పు, నోట్సు వ్రాయకపోతే తప్పు, స్కూలుకు ఆలస్యంఅయితే తప్పు. మేష్టర్లకి జీతాలివ్వకుండా పనిచేయించుకొని ఒకస్కూలు సాగిస్తే నిజంగా గవర్నమెంటుకు బ్రహ్మానందమైపోతుంది. ఎడ్యుకేషనుమినిస్టర్లు, ఎడ్యుకేషనిష్టులు కూర్చొని, 'నిర్బంధవిద్యావిధానం ఏర్పర్చుదాము; విద్యావిధానం తల్లక్రిందుచేదాము; ఎక్కువమంది పిల్లలకి చదువు వచ్చేలా చేద్దా' మని పెద్దప్లానులు వేసేవారేకాని 'యీ అయ్యవారు అడుక్కోకుండా వుండేలా చేస్తేనేగాని మనప్లానులు సాగటానికి వీలులేదు. ప్రతీమేష్టరుకు ఇంత తక్కువ జీతం వుండకూడదు. ఇంట్లోవున్నవాళ్లంతా ఎద్దులచేత పనిచేయించుకుంటే మేతసంగతి చూసేవా డొద్దా?' అని ఒక్కరూ ఆలోచించడం లేదు. ఈ ఎద్దులకి మేతపెట్టేవా డొకడు; పనిచేయించుకొనేవా డొకడు; వాడిసంగతి వీడి కక్కరలేదు. వీడిసంగతి వాడి కక్కరలేదు. ఎంతతక్కువ మేతమీద బ్రతకగలవో యీఎద్దులు చూతామని వాడు, ఎంతహెచ్చుపని చేయించుకోవచ్చునో అని వీడు-ఇట్లా వుంది వీళ్లపని.

ఇట్లా వుండడంవల్లనూ, వందలకొద్దీ బి. ఏ. లు తయారవుతూ నిరుద్యోగం ప్రబలుతూన్నరోజు లయి వుండుటవల్లనూ స్కూళ్ల మేనేజర్లు మేష్టర్లకు బేరాలు బాగా సాగిస్తున్నారు. వాళ్లధర్మమా అని గవర్నమెంటు కుర్రాళ్లు బడికి కట్టే జీతాలు తగ్గించకుండా ఆ రు. ౨-౧౨-౦, ౫-౮-౦ వుంచడంవల్ల రాబడి ఏమీ తగ్గడంలేదు స్కూళ్లవల్ల. ఇంక ఖర్చుమాటా, ఎవరు తక్కువకు వస్తే వాళ్లనే వేసుకోవడం. మిగిలిన డబ్బు అనేకవిధాలుగా ఉపయోగించడం. మళ్లీ సంవత్సరం ఇంకాతక్కువకు ఇంకోమేష్టరు వస్తానంటే, కనికారంలేకుండా వీడిని అవతలకి పంపడమే పద్ధతి. ఇతరవ్యాపారాలల్లోవలె గాకుండా ఈ వ్యాపారంలో experience హెచ్చయినకొద్దీ మేష్టరు చెడిపోతాడు. ఏళ్లు వెళ్లినకొద్దీ పట్టుదల తగ్గిపోతుంది. energetic గా పనిచెయ్యలేడు. పిల్లలు అల్లరి చేస్తుంటారు. కాబట్టి ౫ ఏళ్లు దాటగానే సాగనంపడమే మంచిదని మేనేజర్ల వూహ. అట్లా చెయ్యడంవల్ల స్కూలు బాగుపడడమేకాక, సొమ్ములాభంకూడాను. మళ్లీ ౧౦టి రూపాయలమీద మంచిమేష్టరు వస్తుంటాడు. ఇట్లాంటి అవస్థలో మేష్టరుకి స్కూలుమీద ఎంతప్రేమ వుంటుందో ఆలోచించండి. విద్యాభివృద్ధి చేద్దామంటే మేష్టరుయొక్క status ను బాగుచేస్తేనేగాని లాభం లేదు. ఎన్నాళ్లనుంచి విద్యాభివృద్ధిప్రయత్నాలు చేస్తున్నారో అందరికి తెలుసును. ఇప్పటి ౧౦% మాత్రమే విద్యనేర్చినవా రున్నారన్నమాటకూడ తెలిసేయుండవచ్చును. మేష్టర్ల స్థితి బాగుచేసి, వాళ్లింక ముష్టికి బయలుదేరక్కరలేదని అభయం ఇస్తే ఈవిషయంలో వాళ్లే కృషిచేసి మంచి result వచ్చేలా చేస్తారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గవర్నమెంటువారు బడిపిల్లలు స్కూళ్లకు చెల్లించే జీతములు నిర్ణయముచేసి యుంచినట్లే, మేష్టర్ల జీతాలుకూడా నిర్ణయముచేసి, ఇతరవర్తకాలవలె బడి పెట్టుకోవడముకూడా ఒకవర్తకము కాకుండా కాపాడి నప్పుడే తప్పక వారనుకొనినట్లు విద్యాప్రచారము కాగలదు. ప్రస్తుతము నడపబడుచున్న విద్యావిధానము బాగులేదని, ఏటేట syllabus subjects మార్పు చెయ్యాలని ప్రయత్నించేసేకన్న యీ మేష్టర్ల స్థితి ఎప్పుడైతే బాగుచేస్తారో అప్పుడే అవలీలగా విద్యాప్రబోధము అన్నిరీతులా వృద్ధిపొందగలదు.

---

# కృష్ణమ్మ

మంగిపూడి వేంకటశర్మ

కృష్ణమ్మ కృష్ణమ్మ ఏమికృష్ణమ్మ
నందదంపతుల పుణ్యాల కృష్ణమ్మ
గోవులను కాసేటి గొల్లకృష్ణమ్మ
పాలుపెరుగులు త్రాగు బాలకృష్ణమ్మ
వెన్నమీగడ మెక్కు చిన్నకృష్ణమ్మ
దొంగపనులను చేయు ధూర్తకృష్ణమ్మ
గొల్లపిల్లల గూడు నల్లకృష్ణమ్మ
పొన్నగున్నల నెక్కు మిన్నకృష్ణమ్మ
కోక లెత్తుకపోవు కొంటెకృష్ణమ్మ
పాముపడగల నాడు రామకృష్ణమ్మ
తాయెతుల్ దాల్చు అందాలకృష్ణమ్మ
మద్దికాయలు దాల్చు ముద్దుకృష్ణమ్మ
గజ్జె లందెలు మొరయు బొజ్జికృష్ణమ్మ
వేణుగానము చేయు గాణకృష్ణమ్మ
ముక్కుముత్యము మొరయు ముగ్ధకృష్ణమ్మ
నమిలిపింఛాల చిన్నారికృష్ణమ్మ
గోవర్ధనం బెత్తు గొప్పకృష్ణమ్మ
చుట్టుకైదువు బట్టు దిట్టకృష్ణమ్మ
చదువుసాముల నేర్చు జాణకృష్ణమ్మ
జెట్టీలగెల్చు జగజెట్టికృష్ణమ్మ
రాసకేళిని దేలు రసికకృష్ణమ్మ
గోలోకధామ శ్రీలోలకృష్ణమ్మ
బృందావిహారి గోవిందకృష్ణమ్మ
రాధావినోది యదునాథకృష్ణమ్మ
చిందులను త్రొక్కు ఆనందకృష్ణమ్మ
బిరుసువైరుల త్రుంచు బిరుదుకృష్ణమ్మ
సింగార మొలికించు చిరుతకృష్ణమ్మ
నరుని నెచ్చెలియైన పరుడు కృష్ణమ్మ
నారాయణుండైన నరుడు కృష్ణమ్మ
వేదాంతసీమలో వెలుగు కృష్ణమ్మ
దాసులకు సిరులిచ్చు దాత కృష్ణమ్మ
తప్పులను మరచు మాతండ్రి కృష్ణమ్మ
మాపాల దయజూపు మంచికృష్ణమ్మ.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విశాఖపట్నం హార్బరు

యన్. నరసింహారావు

విశాఖపట్టణము స్టేషనుకు ఎదురుగానున్న చిన్నగుట్ట నొకదానిని హార్బరువారు త్రవ్వు



౧. హార్బరు త్రవ్వునప్పుడు దొరకిన శిలావిగ్రహము

చుండగా సుమారు నాల్గుఅడుగులు ఎత్తుగలిగిన శిలావిగ్రహము ఒకటి దొరికినది. ఆవిగ్రహమును కొందరు భక్తులు, అధికారుల ఉత్తరవునుపొంది ఇసుకకొండపైనున్న శ్రీ సత్యనారాయణదేవాలయమువద్ద చేర్చిరి. దీనిని అనుభవజ్ఞులు పరీక్షించినచో విశాఖపట్టణము పురాతనపట్టణములలో నొకటిగా తేలునేమో అని తోచుచున్నది. ప్రస్తుతము ప్రాశ్చాత్యులు ఈదేశమునకు వచ్చినప్పటినుండి ఈపట్టణముయొక్క చరిత్ర తెలియుచున్నది.

విశాఖపట్టణము చిరకాలమునుండి రేవుస్థలములలో నొకటిగా ఎంచబడుచుండెను. హిందూదేశమునుండి యూరపుదేశమునకు నూలుబట్టలు ఎగుమతి అగురోజులలో ఈరేవునుండి చలువచేయబడినవియును, లేతగులాబీరంగు గలిగినవియును ఎగుమతి అగుచుండెడివి. నేటికిని 'చలవలు' అనబడు విశాలమగు పచ్చికబయళ్లు — చలవబట్టలు ఆరవేయబడెడివి — యూరపియను క్లబ్బువారిచే గోల్ఫుఆటకు ఉపయోగించబడుచున్నవి. నవాబుపేట, కొప్పులపాలెం అను మైలున్నరదూరములో నున్నస్థలములు శ్రీ విజయనగరము జమీందారులచే రంగులువేయుటకు ఇనాంభూములుగా ఇవ్వబడియుండెను. వాటిని ఇటీవల హార్బరువారు తీసుకొనిరి. ఆస్థలములలో విరివిగా చిట్టీవేళ్ల మొక్కలు ఇప్పటికిని అచ్చటచ్చట కనబడుచున్నవి. ఆవేళ్లతో చక్కని లేతగులాబీరంగు నూలుబట్టలకు వేయుచుండెడివారు.

క్రీస్తుశకము ౧౮౫౮ సం. లో ఈస్టు ఇండియా కంపెనీవారిచే విశాఖపట్టణము హార్బరుకట్టుటకు తగినస్థలముగా నిర్ణయించబడెను. అప్పటికి తెరచాపలసహాయముచే సముద్రప్రయాణముచేయు ఓడలు విశాఖపట్టణము రేవునకు, అనగా ఏరాడదర్గా అను రెండుకొండల నడుమనున్న ఉప్పుటేరులోనికి వచ్చి సరకు ఎగుమతి, దిగుమతి చేయుచుండెడివి. ఆకాలమున హిందువులు, మహమ్మదీయులు ఓడవ్యాపారములు విరివిగా చేయుచుండిరి. వారి సొంతఓడలు దూరముననున్న రేవుస్థలములకుకూడ వెళ్లుచుండెడివి. ఉప్పుటేరు సముద్రము కలియుదగ్గర (బారు) మేటవేయుటచే ఓడలు లోనికి రాక సముద్రములోనే నిలువవలసివచ్చెను. అప్పటినుండి రెండున్నరటన్నులబరువు మోయుపడవలమీద సరుకు ఓడలదగ్గరకు పంపబడుచుండెను.

౧౮౯౩ సం. లో గవర్నమెంటువారు ఈస్టుకోస్టురయిల్వేవేయునప్పుడు విశాఖపట్టణములో హార్బరు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కట్టుటవిషయమై ఆలోచించిరి. అప్పుడు తొరోవుడ్, మెకంజీ మొదలగు ప్రముఖులు విశాఖపట్టణములో చెన్నపట్టణములోవలె సముద్రములోనికి హార్బరు కట్టుట మేలని సలహా నిచ్చిరి. ఆసలహాననుసరించియే ఈస్టుకోస్టురయిల్వేవారు రాసుకొండకు కనుమచేసి ఉప్పుటేరుసమీపమున వార్ఫు (Wharf) స్టేషను కట్టిరి. ౧౯౧౮ సం. లో వాల్తేరుస్టేషను బెంగాలు నాగపూరు రయిల్వేకంపెనీవారి స్వాధీనమునకు వచ్చెను. అప్పుడు వారు విశాఖపట్టణమున హార్బరు కట్టుటకయి శాస్త్రజ్ఞులచే పరీక్షచేయించుటకు గవర్నమెంటువారి అనుమతిని బడసిరి. వారు ఇంగ్లాండునుండి అనుభవజ్ఞులగు ఇంజనీర్లను రప్పించిరి. వారు ఉప్పుటేరు త్రవ్వి భూమధ్యమున హార్బరు కట్టుటకు వీలుగా నున్నదని సలహా నిచ్చిరి. ౧౯౨౫ సం. లెజిస్లేటివ్ ఎసంబ్లీవారు రెండున్నరకోట్ల రూపాయలు వెచ్చించి హార్బరు కట్టుటకు అనుజ్ఞ ఇచ్చిరి. అప్పుడే విజయనగరమునుండి రాయపూరునకు ఇనుపదారి వేయుటకు ఆజ్ఞ కాబడెను. ఈమార్గమున మధ్యహిందూదేశము సముద్రమునకు సుమారు మూడువందలమైళ్లదూరముననున్నది. అందు మూలమున వ్యాపారమునకు ఎక్కువ ఉపయోగకరముగ ఈ ఇనుపదారి పనికివచ్చును. ౧౯౩౦ సం. హార్బరు క్వేవాలు (Quay Wall అనగా సామానులు ఎగుమతి దిగుమతులకు ఉపచరించునట్టి కట్టడము. దీనికి ఒకప్రక్క ఓడలు గట్టునకు అంటె నిలువగా సామానులు ఎగుమతికి వీలుఅగునట్లు వీలుగా నుండు చపటాగోడ) పూర్తిఅయి అందు పెద్దగిడ్డంగులు కట్టిరి. అప్పటినుండి అక్కడనుంచి సముద్రములోనికి పోవుపడవలమీద సరుకులు వేయుచుండిరి. సరుకు త్వరగా రవాణా అగుటకు ౮౦ టన్నులు మోయు కాకినాడపడవలమీద సరుకు నింపి, అటువంటివి నాల్గుఅయిదుపడవలను కలిపి ఒక స్టీముటగ్ (Steam tug) సముద్రములో నున్న ఓడల వద్దకు ఈడ్చుకొని పోవుచుండెను. ౧౯౩౩ సం. అక్టోబరు ౭-వ తేదీనుండి ఈ పడవల అవసరము లేకయే స్టీమరులు హార్బరులోనికి వచ్చి క్వేవాలుప్రక్క నిలిచి సరుకు ఎక్కించుకొనుట, దిగుమతిచేయుట జరుపుచున్నవి. ఆవిధమున మొదటి హార్బరులోనికివచ్చినస్టీమరు స్కిండియా స్టీము నావిగేషను కంపెనీవార 'జలదుర్గ' అను రంగూను ప్యాసింజరుస్టీమరు. ౧౯౨౫-వ సంవత్సరమున లెజిస్లేటివ్ అసెంబ్లీవారి ఆజ్ఞ అవుటతోడనే బెంగాలు నాగపూరు రయిల్వేవారు సుమారు పదిచదరపుమైళ్ల భూమిని ప్రజలనుండి తగుపరిహార మిచ్చి పుచ్చుకొనిరి. ఇట్లు తీసుకొన్నస్థలములు లోవతోటయందు దక్షిణ భాగమున అనకాపల్లికి వెళ్లురోడ్డు ఇరుప్రక్కలను, కరాసా ఉప్పుగల్లీ అంతయు, కొప్పులపాలెం నవాబుపేటలో కొంతభాగము, వైజాగ్ మిల్సు, కమ్మర్షియల్ కార్పరేషన్వారి సారాయి తయారుచేయు ఫ్యాక్టరీ, జ్ఞానపురం దక్షిణసరిహద్దు నంటి విశాఖపట్టణంపోవు ఇనుపదారివరకు, అచ్చటనుండి, ఫోర్టు ఆఫీసువరకును ఆక్రమించిఉన్నారు. ఈవైశాల్యముమధ్యనున్న హిందూ దేవాలయములను, కన్యమరియమ్మ క్రైస్తవాలయమును ట్రస్టీలక్రిందనే విడిచిపెట్టబడినవి. ఈస్థలము హార్బరు కట్టుటకు మిగుల ఇమ్ముగుస్థానమున ఉన్నది. మూడుప్రక్కల కొండలును, ఒకప్రక్కను సముద్రమునుండి నడిమి ప్రదేశము త్రవ్వుటకు వీలుగా ఇసుకతో కలసి ఉన్నది.

౧౯౨౫-వ సంవత్సరముననే "విశాఖపట్టణం" అను పేరుగల త్రవ్వుఓడ (Dreadger) ఉప్పుటేరునకు తేబడినది. అప్పటినుండి త్రవ్వుట ప్రారంభమాయెను. ఈఓడ ఎగబీల్పు (Suction) విధానమున కట్టబడి వున్నది. ఇది సుమారు వెయ్యిమొదలు పదిహేనువందల టన్నులవరకు ఇసుకను, రాళ్లను ఒకగంటలో తోడగలదు. అటులు త్రవ్వి చేదిన ఇసుకను, రాళ్లను పెద్ద గొట్టములద్వారా ఒడ్డునకు త్రోసివేయును. అట్లు అవసరము లేనియెడల పెద్దతొట్టిపడవకు నింపి కావలసిన చోటికి తీసుకొనిపోయి యిసుకను, రాళ్లను పారవేయును. ఇసుక, విడిరాళ్లు కాక పెద్దపణుకులు ఉన్న చోట "వాల్తేరు" అను త్రవ్వుఓడ ఉపయోగించుచున్నారు. ఈఓడయందు ఆరుటన్నుల బరువుగలిగి నిక్కల్ ఉక్కుతో చేయబడిన మొనగల గునపము, దానిని ఆరుఅడుగులు మీదికి ఎత్తి విడుచుటకు తగినపరికరములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౮. క్వేవాలుదృశ్యము.



గిడ్డంగులు  స్టీమటగ్గు  కాకినాడ పడవలు



౫. మొదటిఓడజలదుర్గ క్వేవాలుదరిచేరుట



౬. త్రవ్వుఓడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉన్నవి. ఆ సునపమునాటుటవలన రాయిలో మూడు అడుగులలోతు కన్నము పడును. ఇటులు చాలకన్నములు చేసినతర్వాత ఆవిరిసహాయముచే పనిచేయు పారతో ఆ రాళ్లనన్నింటిని తొట్టిపడవలలోనికి పోయగలదు. ఇదిగాక నేలపైనుండి కాలువప్రక్క తీయబడిన ఇనుపపట్టాలపై నడచునట్టి డ్రాగులైను ఒకటి కలదు. అది సుమారు ఏబయిఅడుగులదూరము వరకు నీటిలోనున్న బురదను రాళ్లను మీదికి తీసి ప్రక్కనున్న రయిలుబండ్లలో వేయును. ఆబండ్లు ఆరాళ్లను, మట్టిని దూరముగా పారవేయును. ఇవిగాక పలురకములను చిల్లరపరికరములతో సముద్రముకలియు చోటనుండి కాలువను త్రవ్వ మొదలిడిరి. ఈసమయమున క్వేహాలు తయారుచేయుటకై పెద్దపునాదులను ౧౬౦౦ అడుగులపొడవునను నీటిమట్టమునకు ఏబయి అడుగులలోతున త్రవ్విరి. అటులు తీయబడినగోతిలో నలుబదిఅడుగులుపొడవును ఇరువదిఅడుగుల వెడల్పును గల ముప్పదిలొమ్మిది కాంక్రిట్ సిమ్మెంటుదిమ్మలను దింపిరి. అటుపిమ్మట త్రవ్వుఓడచే ముప్పదిఅడుగుల లోతువరకును త్రవ్విరి. ఇటులు నిర్మాణమైన క్వేవాలు ప్రక్కను సుమారుముప్పదిఅడుగులదూరములో ౪౦౦ అ. పొడుగు, ౨౦౦ అ. వెడల్పు గల గిడ్డంగులను కట్టిరి. ఈ గిడ్డంగులకు ఇరుప్రక్కలను రయిలుపట్టాలను వేసిరి. రయిలుపట్టాలమీదను నిలిచి విద్యుచ్ఛక్తిచే పనిచేయు క్రేనులను ఓడలలోనికి ఎగుమతి సౌకర్యమునకై నిల్పిరి. హార్బరు ఉపయోగమునకై లోవతోటలో నీటిధారను కొండ రెండవప్రక్కకు తెచ్చుటకు కొండనుదొలచి గొట్టములు వేసిరి. దానికయి సుమారు ౧౩౦౦ అడుగులదూరము కొండను దొలచిరి. ఈపని సుమారు మూడు సంవత్సరములు పట్టెను.

హార్బరుముఖద్వారము మొదట అనుకున్నదానికంటె కొన్నిఋతువులయందు ఇసుక మేటవేయుటచే కాలువకు హానికలుగకుండుటకయి రెండు పనికిరానిఓడలను హార్బరువారు చవుకగా కొని వీటి లోభాగమును సిమ్మెంటు కాంక్రీటుతో నింపి ప్రక్కలను సిమ్మెంటుతో గోడలనుకట్టి వీటిని కాలువకు దక్షిణముగా సముద్రమునందు ఇసుకపై దింపి వాటికి ఇరుప్రక్కలను పెద్దరాళ్లను వేసిరి. తరువాత ఆ ఓడలు లోభాగమంతయు చాలామట్టుకు సిమ్మెంటు కాంక్రీటుతో నింపిరి. ఈఓడలు తెచ్చి ముంచుటచే సుమారు నాల్గు ఏండ్లయినా పూర్తికానిపని నాల్గునెలలలో పూర్తి అయినది. అధికారులు అనుకున్నట్లు అవి ఉపయోగపడినవి. ఇవి సముద్రపుకెరటములును ఆపి కాలువను భద్రపరచును ప్రక్కనున్న పెద్దగోతిలోనికి ఇసుక కూడజేయును. ఆయిసుకను త్రవ్వుఓడ ఎక్కడను కావలెనన్న అక్కడకు తీసుకొనిపోవచ్చును.

తగినపరికరములతోను, ధీమంతులగు ఉద్యోగస్థులచేతను ౧౯౨౫-వ సంవత్సరమున ప్రారంభించిన విశాఖపట్టణము హార్బరున ౭-౧౦-౧౯౩౩ నాడు వ్యాపారము ప్రారంభింపబడియెను. మొదటిస్టీమగు "జలదుర్గ" ప్రవేశించినప్పుడు వేలకొలదిజనులు స్టీమరు సురక్షితముగా హార్బరునందు ప్రవేశించుట చూచి సంతోషించిరి. అప్పటినుండి ప్రతిరోజు స్టీమర్లు వచ్చుచు పోవుచున్నవి. ఈహార్బరులో సుమారు ౩౦౦,౦౦౦ టన్నులు ఎగుమతి కాగలదని అంచనా వేయబడుచున్నది. హార్బరు కట్టుటవలన విశాఖపట్టణమునకు ఆధిక్యమును, ప్రాముఖ్యమును సంఘటిల్లినవి.

పట్టణమునకు పడమరగా నున్న పల్లప్రదేశము డ్రెడ్జరులతో త్రవ్వబడినఇసుక, రాళ్లు పోసి పూడిచి నివాసయోగ్యము చేయబడినది. ఇటులు సుమారు పది యెకరముల మేర ఎత్తు చేయబడెను. అందు రోడ్లు వేయబడి ప్రదేశమంతయు ఎలెక్ట్రిక్ దీపములచే శోభిల్లుచున్నది. ఆస్థలమంతయు భాగములక్రింద విడదీసి ఆఫీసులకు, వ్యాపారముచేయువారికి కవులు కీయబడెను. ప్రస్తుతము హార్బరువారి ఆసుపత్రి, వర్కుషాపు అక్కడనున్నవి. వర్తకులుకూడ భవనములు నిర్మించుకున్న, ప్రదేశమంతయు మిగుల అందముగా నుండును. పూర్వము పట్టణముయొక్క మురుగునీళ్లు నిలవలుఉండుటచే దుర్గంధమున నసహ్యముగొల్పు మరుభూమికి నేడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౧౦. క్వేవాలుదృశ్యము
గుర్తుపెట్టినచోట స్టీమర్లు క్వేవాలు వద్దకువచ్చును. గిడ్డంగులు. క్వేవాలు పడమరనుండిచూచిన కనబడుదృశ్యము.



౧౧. లోవతోటలోని నీటిని కొండ యావలప్రక్కకు తీసుకొని పోవుటకయి తొలిచిన బిలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౩. మొదటి స్టీమరు “జలదుర్గ”ను చూడనరుదెంచిన జనులు

వర్తకసంఘములకు ముఖ్యస్థానమయి నిత్యము ధనముచే తులతూగు భాగ్యము పట్టినది ఆ పట్టి పూడ్చి పట్టణముయొక్క మురుగునీరు నిలవ ఉంచక సముద్రములో కలసిపోవుటకు హార్బరువారు ఒక కాలువను త్రవ్విరి. అందుచే పట్టణవాస్తవ్యులకు అనారోగ్యము తప్పినది. ఇంతియేకాక త్రవ్వుఓడలచే గొట్టములద్వారా ఒకమైలువరకు సముద్రప్రఒడ్డును విశాలము చేసిరి. పూర్వము సముద్రము తాకుటచే బీచి రోడ్డునకు అపాయము కలుగుచుండెడిది. ఇప్పుడు అట్టి అపాయము కలుగకపోవుటయే కాక మద్రాసులోవలె బీచిరోడ్డున సరుసుడు మొక్కలను వేయుటకు అవకాశము కలిగినది. మలేరియాజాడ్యమును అరికట్టుటకై హార్బరు



౧౨. కాలువ క్షేమమునకయి ముంచిన స్టీమరులలో నొకటి ఉండవలసినచోటికి తీసుకొని పోవుచున్నారు

వారు డాక్టరుకు తగిన పరికరముల నొసగి పనిచేయించుటచే పట్టణములో మలేరియాజ్వరములు చాలా మట్టుకు తగ్గిపోయినవి. తమకొరకై నెలకొల్పుకొన్న విద్యుచ్ఛక్తియంత్రములనుండి విశాఖపట్టణము ఎలెక్ట్రిక్ సప్లయి కార్పొరేషనువారికి పట్టణములో అయిదుసంవత్సరములవరకు ఉపయోగించుకొనుటకు విద్యుచ్ఛక్తి నిచ్చినారు. విశాఖపట్టణమునుండి అనకాపల్లికి పోవు మార్గమున ఉప్పుటేరుపై నున్న బల్లకట్టును తీసివేసి యంత్రసహాయముచే నడచు నిరపాయకరమగు బల్లకట్టు ఉంచుటచే నది మార్గస్థులకు మిగుల సహాయముగా నున్నది.

పూర్వము కరాసా ఉప్పుగల్లీ ఉన్నచోటున నేడు వాయువిమానశాల నిర్మించిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయ నూతనభవనములు పూర్తికా నున్నవి. వానిలో సైన్సుకళాశాల హాస్టలు పూర్తి అయినది. వైద్యకళాశాలయొక్క అనేక భవనములు కింగు జార్జి వైద్యశాలకు చేరువలో నున్నవి.

ఇట్లు పదిసంవత్సరములక్రింపటి లేని, విశాలమై చూడరింపగు అనేకనూతనభవనములు పట్టణమున వెలసినవి. పదునేడవశతాబ్దమున ఈపట్టణము ఒక ఆంగ్లేయ-ఓడ-దొంగస్థానమయి ఉన్నప్పుడు చిన్న చేపలపల్లెగా నుండెడిదట. ఇప్పుడన్ననో నాగరికతకు ఆటపట్టయి సర్వకళలతో శోభిల్లుచు ఆంధ్రదేశమునకు మకుటమయినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తృతీయాంధ్ర నాటక కళాపరిషత్తు

## అధ్యక్షోపన్యాసము

ఇది నాకొక దుర్భరమగు శ్రమ. ఇట్టివి నాకిది వరకు రెండుసారులు తటస్థించినవి. ఇదియే కడపటిసారియనిగూడ నేనాశించుచున్నాను. ఇట్టి అవసరములలో సత్యములుకావని తెలిసిన విషయములనే సభ్యులకు ఆమోదకరమగురీతిని నాబోటివారు చెప్పవలెనని సభ్యు లాశించుట వాడుకయై యున్నది. ఇది మిక్కిలి కష్టముగుసమస్య. ఏదో యొక విషయమును చెప్పవలెనను ప్రబలతమ మగు ప్రేరణ అంతరాత్మనుండి కలిగిననేకాని ఎవ్వడును ఏమియును చెప్పగూడదనియే నాయభిప్రాయము.

నాటకరంగమును, నాట్యకళనుగూర్చి నేను చెప్పదలచిన కొద్దివిషయములను నేనిదివరకే బహిరంగసభలలో చాలసారులు తెలిపియున్నాను. నాకు దీనిని గూర్చి తెలిసిన దత్యల్పము. మొదట నేనువినోదార్థమే నాటకరంగమున నడుగిడితిని. ఆవలన నాకు నాటక ప్రదర్శనములలో యథాశక్తిని పాల్గొనవలెనను ప్రబోధము గాఢతమముగా కలిగినది. నే నుద్దేశించినది మన చిన్న నాటకరంగముగాని జగన్నాటకసూత్రధారునిచే నాడింపబడుచున్న విశ్వనాటకరంగము కాదు. ఆత్మోపలబ్ధికి నాటకరంగము నుపయోగించుకొనుట కవకాశము కలదని నే నావల తెలిసికొంటిని. ఒకడు మనశ్శాంతిని బడయుటకు నాటక ప్రదర్శనములు ముఖ్యసహాయకములను విషయముగూడ నా కిపు డనుభవమునకు వచ్చినది. లాభకరము, యథార్థము నను పనిని జరుపుటకు నాటకరంగము నుపయోగించుకొనవచ్చునను నమ్మకము నాకు కలిగియుండనిచో ఈ ౧౫ సంవత్సరములనుండియు ప్రతిదినమును నేను వ్యయపరుచుచుండినరీతిని నాధనమును, నాకాలమును వ్యయపరచియుండను. నాటక కళాభివృద్ధిని గూర్చి యిపుడు జరుగుచున్న పనికంటె ప్రగల్భములే అధికముగా నున్నవనియే నేను నమ్ముచున్నాను. సంతాపకరమగు నీ నమ్మకము నా కిపుడు మరింత అధికమైనదని తెలుపవలసివచ్చినందులకు నేను చాల చింతిలుచున్నాను. భారతనాటకరంగమునందుగాని, దాక్షిణాత్య నాటకకళయందుగాని నిజమగు నభివృద్ధి యేమియును కలుగలేదు. నాకు ౩౫ యేండ్ల నుండి రంగస్థలముతో సంబంధము కలదు. ఈ ౩౫ ఏండ్లు స్వల్పకాలముకాదుగాని ప్రథమగణ్యమగు నాటకశాలను నిర్మించుటకు తగినస్థల మిప్పటివరకును నా కెచటనుగూడ కనబడలేదు. ఆంధ్రనాటకములలో నాటకనామమును సార్థకపరుపదగిన నాటకములు అయిదారుకంటె హెచ్చుగా కనబడవు. ఈ పనిలో నాకు పెక్కువందలమంది తోడ్పడిరి గాని వీరిలో చిత్రలేఖనము నభ్యసించినవారును, దానివిషయమున శ్రద్ధబూనినవారును ఇద్దరుముగ్గురుమాత్రమే కనబడిరి. ప్రకృతిసహజముగా రంగస్థలమును ఆయాసందర్భముల కనుగుణముగా సమగ్రరీతిని సరిగా నూహింపగల నాటకసమాజము నాటకములను జీవనాధారముగా చేసికొనిన సంఘములలోను, కళాభిమానముచే ప్రదర్శనములను జరుపు



టి. రాఘవాచార్యులుగారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్న సంఘములలోనుగూడ నాకింతవర కొక్కటి యునుగూడ కనబడలేదని నేను రూఢిగా చెప్పగలను. సరియైనరీతిని కృత్రిమశిరోజాలంకారములను సిద్ధపరచు పద్ధతిని తెలిసికొనినవా రొక్కరునుగూడ నాకు కనబడలేదు. రంగస్థలమునందును, ప్రేక్షకులుండు స్థలమునందును ప్రకాశ మెట్లుండవలె నను విషయమునుగూడ నేసంఘమువారును సరిగా తెలిసికొనియుండలేదు. ౨౦ యేండ్ల క్రిందనున్న స్థితిలో నిపుడు గమనింపదగిన అభివృద్ధి యేమియును కనబడుటలేదు. అనుకూలమగు మార్పు లేశమైనను కలుగలేదు. ౧౯౨౭-వ సంవత్సరమునందు వెనుకటి మోటుతరపు వీధినాటకముల పద్ధతిని విరమించి నవీననాటకరంగములను నిర్మించిరి. అపుడుమాత్రమే నిజమైన మార్పుకలిగినది. అందువలన క్రమక్రమముగా చాల అభివృద్ధి కలుగగలదని ఆశించుట కవకాశ మేర్పడినది. ఇరువదేండ్ల క్రితము నటులును, ప్రేక్షకులునుగూడ తెలుగులో సంవాదరూపమగు వచనమునందు నాటకము లను ప్రదర్శించుటలోగల ప్రాముఖ్యమును బాగుగా గ్రహించియుండిరి. నాటకప్రదర్శనములలో గానమున కట్టి ప్రాముఖ్యమునుగూడ నియ్యకుండుటకు వారు మనఃపూర్వకముగా ప్రయత్నించి కృతార్థులైరి. కాని యిపుడు సంగీతము నాటకరంగమును పూర్తిగా వశపరుచుకొని వచనమును త్రోసిరాజనినది. పదేండ్లక్రితము సంగీతము - ఎట్టిసంగీతము, అధమాధమమగు సంగీతము గాని శ్రోతృజనుల నానందాబ్ధి నోలలాడింపగల శ్రేష్ఠతమమగు శాస్త్రీయగానము కాదు, అట్టినికృష్టసంగీతము-నాటకరాజ్యముపై దాడిప్రారంభించెను. అప్పటినుండియు నష్టకరమగు నీమార్పు ప్రారంభమై దినదినాభివృద్ధినొందుచున్నది.

నాటకరంగస్థితి ౨౦ ఏండ్ల క్రితముకంటె నిపుడు చాల అధ్వాన్నముగా నున్నది. ఇపుడు మరియొక మార్పుకూడ తలచూపినది. ఇది నటులకు బిరుదముల నంటగట్టుట. ఔపకారిక ప్రదర్శనములనుజరుపుట మూడవమార్పు. ఏదోయొక ప్రజోపకారసంస్థయొక్క సహాయార్థ మొక నాటకమును ప్రదర్శించు మిషమీద కొందరు నటులు నాటకకళను, ప్రేక్షకులనుగూడ హతమొనరించుచున్నారు. మనకు శుద్ధవాక్యములను పలుకుటయందు గల అభిలాష, సరియైనరీతిని నాటకకళ నభివృద్ధి నొందించుటయందు లేశమును లేదనియే నిర్ణయింపవలసి వచ్చినదని నేను గట్టిగా నమ్ముచున్నానుగాని యిది పొరపాటని యెవరైన చెప్పగలిగినచో నా అభిప్రాయమును మార్చుకొందును. మన సంఘాభివృద్ధికి నాటకరంగమును, నాటకకళయును ముఖ్యతమము లను దృఢవిశ్వాసము కలవారు మిక్కిలి కొద్దిమందియే యుందురు.

ఈసభ కధ్యక్షతవహింపవలె నని మొదట నన్ను కోరినపుడు నాకది అయిష్టముగానే యుండెను. మొత్తముమీద సభ లనిన నా కొకవిధమగు ప్రతికూల భావమే సహజముగా కలదు. నేను వృత్తివలన న్యాయవాదిని. మీరందరు న్యాయస్థానములో నొకదావాలో వాయిదా వేయబడవలె నని యొక న్యాయవాది కోరదలచినపుడు యీ వివాదను మధ్యవర్తులద్వారా పరిష్కరించుకొనుటకు వాదిప్రతివాదు లంగీకరించిరని కోర్టులో తెలుపుట వాడుకయైయున్నది. ఆ మధ్యవర్తుల పరిష్కారమువలన నెట్టిలాభమును గలుగదని యెరిగియుండియే న్యాయవాదు లిటుల కోరుచుందురు. ఇట్టి సభలలో కొందరు స్వోత్కర్షను వెల్లడించుట కవకాశము లభించుచుండును. లేని సుగుణములును, ఆధిక్యమును తమ కున్నటుల లోకమును భ్రమింపజేయ గోరుట మానవస్వభావము. అందువలన నిట్టి సభలలో నెవరో కొందరు తమచొక్కాలకు గౌరవోద్యోగ చిహ్నములను తగిలించుకొని, నిజముగా చేయునట్టి పని యేదియును లేకపోయినను, దుర్భర కార్యనిమగ్నులైనట్లు నటించుచు నటునిటు కలయదిరుగుచుందురు. ఎటులైన నేమి, మన నాయకుడగు దేశోద్ధారకుని ఆజ్ఞకు బద్ధుడనై యీసభ కధ్యక్షత వహించుటకు సమ్మతించితిని. అందువలన నిపుడు మీసమక్షమున బద్ధాంజలి నై నిలచియున్నాను. ఇపుడు ఈ సభలో ఉన్నదున్నట్లు చెప్పుటకే నేను ప్రయత్నించెదను కాని యీరోజులలో నిజముచెప్పిన నిష్ఠూర మధిక మగును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒక గడ్డిపోచను చూపించి 'యిది గడ్డిపోచ' యని చెప్పినచో 'నేను మనోజ్ఞము లగు కుసుమబాణుని పంచబాణములలో నొకబాణము గాని గడ్డిపోచను గా' నని ఆ కొరగాని గడ్డిపోచగూడ లేచినిలచి నిష్కర్షగా ప్రత్యుత్తరమిచ్చుటకు వెనుదీయదు. నే నిపుడు తెలుపబోవు విషయములలో నేవైన కొన్ని నిరాధారములని మీకు తోచినచో మీరు నన్ను క్షమింప గోరెదను. ఒకవ్యాధిని కుదుర్చవలె ననిన ముందుగా దాని లక్షణమును బాగుగా తెలుసుకొనవలెను. అటులనే నాటకకళయందును, నాటకరంగములందును నిజమైన అభివృద్ధిని కలిగింపవలె ననినపుడు వాటిలో నేర్పడిన లోపములను సరిగా తెలుసుకొనవలెను గాన నందులకే నే నిపుడు నిష్కపటముగా ప్రయత్నించెదను. ఇచట సమావేశ మైన పండితుల కందరికిని ముందుగానే నే నొక క్షమాపణను తెలుపుచున్నాను. "మన ప్రాచీనులు సర్వజ్ఞులు. వారు కనుగొనినదానికిపుడు క్రొత్తగా చేర్పబడవలసిన దేదియును లేదు." అని పండితు లొక్క వాక్యములోనే తెలిపెదరు గాని నే నీ విషయమున ప్రతికూలుడను. మన ప్రాచీనులు సర్వజ్ఞులైనచో మనము వారి సంతతివార మైనందులకు మనము వారికంటెనుగూడ ఘనులము కాగల మని మనము నమ్మిననే మన జన్మ సార్థక మగును. మన జాతీయాభివృద్ధిలో నాటకరంగమును, నాట్యకళయును నొక ప్రధానాంగ మనియే నేను తలచుచున్నాను. అభివృద్ధికి పోరితము ముఖ్యసాధనము. అటుల సమరము సలుపవలె నను భావమును, అందులకు తగిన శక్తియును మనకు కలిగినపుడే మనము కీర్తిశిఖరపరంపరల నధిరోహింప గలుగుదుము. మనము పోరాడవలసినది పరిస్థితులతోమాత్రమేకాని మనుష్యులతో కాదు. మనము మన పౌరుషశక్తిని సరిగా గ్రహింప గలుగుటకు మన కీ సంగ్రామమున సంపూర్ణవిజయము లభింపవలెను. అది సులభముగా లభించినచో చిరస్థాయి యగు ఫలితము కలుగదు గాన మనయందుగల ప్రేమచే సర్వేశ్వరుడు మనకు సులభసాధ్యములుగాని పరిస్థితులనే గలుగజేయుచుండును. అపుడే మనము మనయందుగల దివ్యమానవత్వమునుగూడ తెలుసుకొనగలుగుదుము. కావున పురుషపుంగవులు పరిస్థితులను లోబరుచుకొనుటకు సర్వశక్తులను వినియోగించుచుందురు. అట్టి మానవోత్తము లొనర్చిన ఘనకార్యములవలననే సంఘాభివృద్ధి కలుగుచుండును. మన మెల్లప్పుడును రణరంగముననే యుందుము. లేదా మన మటుల భావింపవలెను. కావున నిటుపైని కళావైభవమునకు ఆధారభూతులుగా నుండదగిన యువజనులు నాటకరంగములందు ప్రవేశించి యశోభాసురులు కావలెనని నేను వారిని కోరుచున్నాను. అందులకు వారికి నిరోధకములుగా నున్న కట్టుబాటులను, మనోదౌర్బల్యమును లోబరుచుకొనుటకు వారు తీవ్రమగు పోరు సలుపవలెను. "గ్రీసుదేశీయులు అతిశయోక్తి లేని సౌందర్యారాధకులు. వారు పౌరుషమును గోల్పోకుండ వివేకమును ప్రేమించుచుందురు." అని నెనకనొక గ్రీకుకవి వ్రాసిన వాక్యము లిటీవలనే బాల్డువినుగా రుదాహరించిరి. ప్రాచీనభారతనాగరకతకుగూడ నిదియే ముఖ్యతత్త్వము. మనము సమరతలమునందున్నాము గాన సకలభోగములను త్యజింపవలెను. మనము విపరీతాభిప్రాయముల నన్నిటిని విడనాడవలెను. స్కంధావారమునందున్నవారి నందరిని సోదరభావముతోనే చూడవలెను. అపుడే మనము ప్రాచీనభారతనాట్యకళావైభవమును గ్రహించుటకు నిశ్చలముగ పురోగమనమును సలుపగలుగుదుము. భిన్నత్వమునందేకత్వమును వెల్లడించునట్టిదియును, మాయాస్వరూపమును వెలిపుచ్చునదియును ప్రపంచవ్యవహారములలో నేకభావమును కలిగింపగలదియును నాటకకళయే యని నేను గురుముఖమున వినియుంటిని. ఇది ఆత్మప్రకాశమును బోధించును. ఆత్మప్రకాశమును ఆత్మవ్యాప్తిక్రింద పరిణమింపజేయును. చివరకు జీవాత్మప్రత్యేకతను పూర్తిగాహత మొనరించి పరమాత్మయగు శ్రీకృష్ణునియందు జీవాత్మ లయమొందునట్లు చేయును. శ్రీకృష్ణుని దివ్యమురళీగానమున నవ్యాత్మమిళితమగునట్లు స్వరసమ్మేళనమును కలిగించును. అంతరంగ, బహిరంగ సౌందర్యమును పెంపొందించుటకుగాను అంతర్గత, బహిర్గత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శక్తులను సమగ్రస్థితిలో నుంచుటకు లలితకళలు తోడ్పడును. మతముగూడ నొక కళయే. మానవులు తమలో నడగియున్న నిర్మాణశక్తులను అనుభవమునకు తెచ్చుకొనుటకును, ఉపయుక్తములను సుందరములుగను, సుందరములను ఉపయుక్తములుగను మార్పగలుగుటకును మతము వారికి బోధించును. మానవ స్వభావమునందు అడగియున్న భావములన్నియును బహిర్గతములగుట కొనరింపబడిన గొప్ప ప్రయత్నమే కళ.

కష్టానుభవమువలన పునీతములై సక్రమముగను, నియమబద్ధముగను చివరకు శ్రీ కృష్ణుని మధురమురళీ గానసుస్వరములను గ్రహింపవలెనను నాశతో నీభావములు జీవాత్మ సంబంధమగు భారమునంతను బహిర్గతమొనరించుచుండును.

ప్రేమను బడయగలుగుసనిమిత్తము హృదయమునందుగల మలినపదార్థమునంతను తొలచివేసి దానిని సమగ్రముగాచేయుట కొనరింపబడిన ఉలిపోటే కళ. హృదయమునందుగల నల్లమచ్చల నన్నిటిని తుడిచివేసి ప్రేమ దేవతారాధనకు అర్హమగునట్లు దానిని పవిత్రమొనరించునట్టి కుంచెయే కళ. హృదయమును మాటలతో గాక ప్రేమతో ప్రపూర్ణము నొనరించునట్టి లేఖినియే కళ. మధురతమమగు దివ్యగానమును విని తదనుగుణముగ నాట్యమొనరింపగల శక్తిని హృదయము బడయగలుగునట్టి దైవశక్తిని హృదయమునకు కలుగజేయు నుపకరణమే కళ. ఇదియే కళలనుగూర్చి మన ప్రాచీనుల భావము. సంతాపకరమగు ప్రేమోదంతమును మరచిపోవుటకే యొకడు చిత్రలేఖనమును ప్రారంభించె నని నే నెచటనో చదివితిని. అతడు ఉత్తమజ్ఞుడు. భౌతిక పదమగు ప్రేమతో తన హృదయమును నింపుట కతడు మొదట ప్రయత్నించి విఫలుడయ్యెను. అంతట తన హృదయమును పరతత్త్వపరమగు ప్రేమతో నతడు నింపబూనెను. కాలక్రమమున అతడు చిత్రలేఖకులలో నగ్రగణ్యు డయ్యుండుననియే నేను నమ్మెదను.

మీరు షిరాజుకథ వినియేయుందురు. అంధుడగునతడు సౌందర్యమును సందర్శించి దానిని మనోహరాకృతితో వెల్లడింపగల శక్తి ప్రేమవలననే కలిగినది.

హృదయవ్యథను మాన్పజాలినది కళ యొక్కటే. ప్రాచీనభారతమున కళాస్వరూపపరిజ్ఞాన మిటులే యుండెను. అభివృద్ధముగను, సమగ్రముగను చేయబడిన నాటకకళావైభవము ఒకజాతియొక్క విజ్ఞానమును వెల్లడించు ననువిషయమున మీరు నాతో నేకీభవించెదరనియే నేను నమ్మెదను. అదియే నిజమైనచో ప్రస్తుతము మనజాతియొక్క స్థితి యెటులున్నది?

నవీనవిజ్ఞానముజన్మవలన అస్పృశ్యతను నెలకొల్పినది. మననాటకకళాభివృద్ధి దారిద్ర్యమును అల్పశక్తిని కలుగజేసినది.

నిజమగు నాటకకళయొక్క శక్తి అజేయము. నిర్మాణశక్తి దారిద్ర్యమునకును, అల్పశక్తికిని ప్రత్యర్థి. అట్టిచో మన కళలును, విజ్ఞానమును ప్రవర్ధితములగుచున్నవని మనము చెప్పగలమా? స్వాతంత్ర్యసిద్ధివలననే అభివృద్ధి కలుగును. పరాధీనదాస్యప్రవృత్తి గమనము నరికట్టిన మనుష్యునియందు గల ప్రవర్ధకశక్తిని దుర్బలముగ జేసి నిరోధించి వానిని పరాధీనస్థితికి పాల్పరచునట్టి దుష్ట వికారగ్రహములు రెండు కలవు.

ఇప్పటి రోజులలో విశ్వవిద్యాలయపట్టములను బడయుట పరిహాసాస్పదము. భౌతిక ప్రయోజనకరమగు కళలలోగాని, అప్రయోజనకరమగు కళలలోగాని విద్యార్థి అర్హతను బడసెనని యాపట్టము ధ్రువపరుచుటలేదు. బాధ్యతలను నెరవేర్చుటకు వెనుదీయుట, హక్కులను కోరుటకు మాత్రము ముందంజవేయుట అధమమగు సూచనయై యున్నది. తమవలన ప్రతిఫలము నపేక్షింపకుండ టిక్కెట్లను ఉచితముగా నియ్యవలెనని నిర్బంధించుటగూడ నొక విధమగు వ్యాధియే. ప్రస్తుతము దాక్షిణాత్యనాటకరంగమున రెండువిధములగు నిరంకుశత్వము కలదు. ఒకటి ఉచితముగా టిక్కెట్లను బడయగోరుట; రెండవది ఔపకారిక ప్రదర్శనములు. ఈ రెంటికినిగూడ విలక్షణమగు వైజ్ఞానికప్రయోజనము కలదు.

విద్యావ్యాపనమునందు నాటకరంగము ప్రధానాంగ మగుటయేకాక ఒక సత్ప్రవర్తనమును పెంపొం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దించుటకుగూడ నాటకరంగము అధికముగా తోడ్పడ గలదు. ఇది ఒక నిర్మాణశక్తికి పరిశోధనాలయము. మనము మన మనస్తత్త్వమును పూర్తిగా శోధింపవలెను. ఒకడు తానే సృష్టికర్త కాగలడను విషయమును గ్రహించుటయే నాటకకళయొక్క ముఖ్యప్రయోజనము. తన ఆత్మస్వరూపమును తాను తెలిసికొని యితరులుగూడ తమ ఆత్మస్వరూపముల నటులు తెలుసుకొనగలుగుటకే సార్థకనాముడగు నటుడు రంగస్థలము నుపయోగించును గాన రంగస్థలము పవిత్రమగు ధ్యానభూమి. అతడచట స్వార్థపరిత్యాగ మొనరించి సంకుచితుడై పరులపై ప్రేమతో మరల విస్తృతుడగును. సామాన్య ధ్యానమునకు నిర్జనస్థలము, స్నానము, ధౌతవస్త్రధారణము మున్నగునవి అవసరము. నటునిధ్యానమునకు రంగస్థలమున సమస్త దేవీదేవతాసహాయమును అవసరము. ఈ ధ్యాన మతనికిమాత్రమే సంబంధించినదికాదు. అది యొక సమష్టి కుటుంబిక ధ్యానము, లేక సార్వజనికధ్యానము. ఈ ధ్యానమున నటుడును, ప్రేక్షకులునుగూడ చేరి యుందురు. ఒకసముదాయమున ధనికులు పేదలు, ఘనులు నీచులు, విద్యాధికులు విద్యావిహీనులు, జ్ఞానధనులు అజ్ఞానులు మున్నగువా రందరు నుందురు. ధ్యానప్రదేశమువలె నాటకరంగముగూడ యేకాగ్రతకు తోడ్పడుటకు మిక్కిలి శుచిగా నుండవలెను. పరిసరములన్నియును ధ్యానవస్తువునకు సంబంధించిన చిత్తరువులతో కూడియుండవలెను. ప్రారంభమున లోహనిర్మితమగు గేంద్రామృగము నెదుట నుంచుకొని యొకడు శ్రీకృష్ణునిపై చిత్తమును నిలుపజాలడు. మదరాసు బీచివీథిలోనున్న బర్మాఆయిలుటాంకు గల జవనిక యెదుట నుండగా సౌందర్యసదనమగు ద్వారకనుగూర్చి ధ్యానింపగోరుట కాఠిన్యమే యగును. జనరలుపోస్టాఫీసువద్దను ఎర్రరంగు పూయబడిన గుండ్రని టపాపెట్టెను శకుంతలక్రీడారంగముతో చేర్చుటవలన మనశ్శాంతికి భంగము కలుగక మానదు.

నాటకకళను మహోన్నతస్థితికి కొనిరావలెనని మన జాతీయాభివృద్ధిలో ఒక ముఖ్యాంగముగా మనము దాని నంగీకరింపవలెను. నేనిదివరకు తెలిపిన రీతిని కొంత నిర్మాణ కార్యక్రమమును, అధికమగు నిర్మూలన కార్యక్రమమునుగూడ నవసరమే యగును. ఇంతవరకు నటులకును, ప్రేక్షకులకును అనుకూలములగు గృహములను మనము నిర్మింప గలిగియుండలేదు. వేషధారణమున నెట్టి ప్రావీణ్యమును బడయలేదు. రాజవేషముల నన్నిటిని బండితోలువారిపద్ధతినే మనము సిద్ధపరచుచుంటిమి. ఈ నాటకరంగపు రాజులకు శిరోవేష్టములును, పాదరక్షలును ఎటనుండి లభించునో తెలిసికొనుట చాల ఆశ్చర్యకరముగానేయున్నది. నాటకరంగమునందలి రాజులను చూచినపుడెల్ల మండలములలో దొరతనమువారు నిర్మించునట్టి తాలూకాకచేరీలపద్ధతి గృహనిర్మాణము నాకు జ్ఞాపకమునకు వచ్చుచుండును. నాటకములలో పాత్రధారులకు కృత్రిమశిరోజముల నమర్చుపద్ధతి మరింత అసహ్యకరముగా నున్నది. నాటకప్రదర్శనముల నేర్పాటు చేయువారు అగ్రభాగమునందలి ఆసనములలో కూర్చుండువారి సౌకర్యములనుమాత్రమే గమనించెదరు. గాన వెనుకప్రక్కను గూర్చుండువారికి నటుల ముఖవైఖరులలో కలుగు మార్పులేవియును గోచరింపవు. ప్రేక్షకులు యావన్మందియును ప్రతినటుని ముఖవైఖరిలోను కలుగు అతిసూక్ష్మములగు మార్పులనుగూడ సమానముగా చూచుటకు వీలగునటులు నిర్మింపబడిన నాటకశాల నిప్పటివరకు నే నెచటను చూచియుండలేదు. ఇపుడు నాటకరంగములందు పాడబడుచున్న సంగీతము శిరోవేదనను కలిగించుటకుమాత్రమే ఉపయోగించుచున్నది. నాటకములలో సంగీత ముండగూడదని నేను చెప్పుటలేదు. సంగీతముతోగూడిన నాటకములను మనము ప్రదర్శించి అందువలన మనము ప్రేక్షకుల కానందమును కలిగింపగలుగుదుము. కావున నిపుడు రంగస్థలములలో మనము వినుచున్న సంగీతము నాటకముల కెంతమాత్రమును పనికిరాదు. ఇపుడు ప్రేక్షకులుగూడ పూర్తిగా సంగీతవ్యామోహమునకు దాసులగుటచే మన నాటకములు పాటకచేరీలుగను, హరికథాకాలక్షేపములుగను మారిపోయినవి. ప్రదర్శింపబడవలసిన నాటకముసంగతిని ప్రేక్షకులు పూర్తిగా మరచిపోయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నటులురంగస్థలమున కూర్చుండి తాము కోరినపాటలనన్నిటిని పాడవలె నని నిర్బంధించునట్టి దుస్థితిగూడ నిపుడు తటస్థించినది. ఇంతకంటె అవమానకరమగు విషయము మరేదియు నుండదు. ఆంధ్రనాటకరంగ మింతటి నీచస్థితికి రాగల దని నే నెన్నడును తలచియుండలేదు. ఆంధ్రనాటకములు అధమాధమము లగు యక్షగానముల స్థితికి వచ్చినది. దీనికి గలకారణ మందరికిని తెలిసినదే. ఇదివరకు ఈపరిషత్తువారు రెండు వార్షికసభలను జరిపిరి. ఇది మూడవది. ఆంధ్రనాటకరంగమునకు సంప్రాప్తమైన ఈ దుస్థితిని తొలగించుటకు మీరేమి చేసితి రని విజ్ఞానధనులగు మిమ్ములను నే నడుగుచున్నాను. ఇందులకు మీరే బాధ్యులు. విద్యాధికులారా, యువజనులారా, విద్యార్థులారా, ఆంధ్రుల ఉదారమగు నాట్యకళను హతమొనరించుచున్న యీ క్రూరపిశాచమును మారణహోమము గావించుటయను ఘనతమ మగు కార్యభారమును మీరు వహింపవలెను. ముందుగా ప్రాత నాటకములను మూలబెట్టి సరియైన పద్ధతిని క్రొత్తనాటకములను వ్రాయించవలెను. యువకులలో గ్రంథకర్తలును, కవులును నడుములు కట్టి మన కళాప్రకాశమును మందీకృత మొనరించుచున్న మూఢవిశ్వాసములను, సంప్రదాయములను తుడిచివేయవలెను. విశ్వామిత్రునకు నూతనసృష్టిని చేయగలుగుటకు సహాయభూతమైన నిర్భయత్వ మను రసాయనమును తనివిదీర మీ రాస్వాదింపవలెను. తనతోపాటు శునకమునుగూడ సురపురికి గొనిపోవలె నని దేవేంద్రుని నిర్బంధించిన యుధిష్ఠిరునకు కలిగిన జీవకారుణ్యమును మీ రలవరచుకొనవలెను. ఇట్టి జీవకారుణ్యమే ఆధునికులలో తుకారాం తన చెంత నున్న ఒక్క రొట్టె ముక్కను హరించిన కుక్కకు ఘృతమునుగూడ నొసంగునట్లు చేసినది. నూరుమంది భార్య లుండినను చాలక నూటయొక్కటవభార్యను పెండ్లియాడ గోరునట్టి పురుషాధములను తమనాటకములలో నాయకులనుగా చేయనట్టి కవులును, నాటకకర్తలును నాకు కావలెను. కణ్వాశ్రమమున నమ్మించి పెండ్లియాడి మరచిపోయిన దుష్యంతునివంటి భర్తలను పాదప్రహారములచే బహూకరించు శకుంతలలను, వితంతుశరణాలయములను సమర్థించునట్టి సావిత్రులను నాయికలనుగా నొనరించు కవులు నాకు కావలెను. ప్రాచీనకాలమునందువలె మరల నాటకరంగమును విద్యాలయముగా చేయగలిగిన కవులు కావలెను. మానవునకును, మానవునకు మానవునకును సృష్టికర్తకునుగల సంబంధమును బాగుగా బోధింపగల విద్యాలయముగా రంగస్థలమునుమార్చునట్టి కవులు కావలెను. జీవిత మెటులున్నదియును ఎటులనుండవలసినదియును రంగస్థలమునందు స్పష్టపరుపబడవలెను. పౌరాణికనాటకములను ప్రదర్శింపదగినకాలము గడచినది. సుబ్రహ్మణ్యునకు పెండ్లియైననేమి, కాకపోయిననేమి? సత్యభామకు రుక్మిణిపైచవతిమచ్ఛరముండిననేమి, లేకపోయిననేమి? ప్రజల నిత్యజీవనమునకు సంబంధించిన విషయములను ప్రదర్శించు టవసరమును, ప్రయోజనకరమును నగును గాని యిట్టి పురాణగాథలను ప్రదర్శించుట నిరుపయోగము. మన నిత్యజీవితమునకు సంబంధించిన సమస్యలు వేలకొలదిగా నున్నవి. మనము కని వినియెరుంగని విషయములను ప్రదర్శించుటమాని మన మనుదినమును కనుచు వినుచుండు విషయములనే ప్రదర్శించు చుండవలెను. మన ప్రాచీనవిజ్ఞానమును, జాతీయధీశక్తిని, విశ్వమానవజీవితమునకు సంబంధించిన సమస్యలను గ్రహించి పరిష్కరింపబూనిన కార్యనిరతిని నాటకములు వెల్లడింపగలిగియుండవలెను. వ్యక్తిజీవనమునందుగల ప్రబలశక్తులనుగూడ వెల్లడించు చుండవలెను. శ్రీ రామచంద్రుడు తనభార్యను హరించిన రాక్షసుని హతమొనరించెనని మనము భావించుటకంటె, అతడు తనదేశమునందలి ప్రజల మేలుగోరి పరిపాలనకు సంబంధించిన సమస్యలను పరిష్కరించిన రీతినిగూర్చి మనము భావించుటవలననే అధికమగు ప్రయోజనము కలుగగలదు. మానవోత్తముల జీవితమే సామాన్యప్రజలకు మతమగుచున్నదని తెలుపబడెను. మనుష్యుడు కార్యసిద్ధిని, విజయమును, సమగ్రతను బడయుటకు చేయునట్టి ప్రయత్నములలో మొదట కలుగునట్టి సంఘర్షణములు, పరాజయములు మున్నగువాటి నెదుర్కొనుట కతడు చూపిన పట్టుదలను పరికించుటయే మిక్కిలి ఆకర్షకముగా నుండగలదని నేను తలచుచున్నాను. మనుష్యునియందుగల దైవత్వమును ప్రకటించుటయే విద్యయొక్క ముఖ్యప్రయోజనము. కళలవలనను, ముఖ్యముగా నాటకప్రవర్శనములవలనను ఆ ప్రయోజనము సిద్ధింపగలదు.

(ఆంధ్రపత్రికనుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కీ. శే. సరోజనీదేవి

శ్రీ టి. రాఘవాచారి




కీ. శే. సరోజనీదేవి

శ్రీరామచంద్రరావుగారి సతీమణి శ్రీమతి సరోజినీ దేవిగారియొక్క ఆకాలమరణమువలన ఆంధ్ర కర్ణాటక నాటకరంగములకు తీరని నష్టము వాటిల్లినది. గతనెల 22-వ తేది బెంగుళూరునందు సుప్రసిద్ధ నటి శ్రీమతి సరోజని నాటకరంగమునే గాక, జగన్నాటక రంగమును సైతము వీడె ననువార్త ఆయమబంధువులకు, మిత్రవర్గమునకే గాక ఆంధ్ర కర్ణాటకరాష్ట్రములందలి నాటకకళాభిమాను లెల్లరకును కడువిషాదమును కలిగింపకమానదు. దక్షిణభారతమున ఔత్సాహిక నాటక సంఘములందు పురుషులతోబాటు రంగస్థలమున పాత్రధారణ గావించిన స్త్రీలలో ప్రప్రథమమురాలుగ సరోజనీదేవి నామము చిరకాలము సుప్రతిష్ఠితమై యుండగలదు.

యూరపుఖండపర్యటనానంతరము నేను స్వదేశమునకు మరలివచ్చి ఆంధ్రనాటకరంగమున స్త్రీలచే స్త్రీపాత్రధారణ చేయించుటకు ఉద్యమించినప్పుడు, నాకు కుడిభుజమై, కళాసేవ చేయుటకు సంసిద్ధురాలయిన సాహసికురాలు శ్రీ సరోజనీదేవి. నాటకళపై ఆమెకు గల యనురాగాభిమానము లసామాన్యమైనవి. పుట్టుకతోడనే ఆమెకు నటనాకౌశల మబ్బియుండవలెను. "స్వతస్సిద్ధముగా స్త్రీయందుగాని పురుషునియందుగాని ఉండినచో తప్ప నటనాప్రాగల్భ్యము కేవలము సాధనచే గఱపబడునదికా" దని సుప్రసిద్ధుడగు సర్ జాన్‌స్టన్ ఫోర్బ్స్ రాబర్ట్‌సన్ నుడివియుండెను. సరోజనియందు నాటకకళ మూర్తిభవించియుండెను.

తొలుదొల్త చెన్నపట్నమున "రాయల్ థియేటరు"లో నాతోబాటు "లీలావతి" పాత్రను ధరించినపుడే "పువ్వు బుట్టినంతనే పరిమళించు" నన్నట్లు తన నాట్యకళాపాటవమును ప్రకటింపజాలెను. నాటి ఆమె అభినయమును జూచి నే నుప్పొంగిపోతిని. నాటకమధ్యమున నామిత్రులనేకులు రంగములోనికరుదెంచి నాచెంత నిలిచియున్న యువతిపై అభినందనముల కురిపింపసాగిరి. కనులనిండుగ ఆనందాశ్రువులతో, సంతోషాధిక్యతచే జనించిన వినమ్రవదనముతో మిత్రుల అభినందనముల నందుకొనెను. ఆమెగాత్రము కోమలస్వనముల బలుకుచుండెడిది. మంజులగానముచే రాలు కరుగజేయుశక్తి ఆమెకమరియుండెను. "ఒకానొకప్పుడు యావద్భారతవర్షమునను నీకీర్తిచంద్రికలు వ్యాపించును. కళాభిమానులు ధనరాసులను నీమ్రోల గుప్పింపవలయును" అని నేనొకతూరి ఆమెతో నంటిని. "ఆర్జించుటకు నాకాసగలదు. ధనోపార్జనకాదు, జ్ఞానోపార్జన" అని ఆమె సమాధాన మిడెను. స్వాతిశయమనునది మచ్చునకైనను లేక నిర్మలమును అవ్యాజమునను కళాపరత్వములుగల మరొక అట్టివ్యక్తిని సహకారిణిగానే పడయజాలుదునని చెప్పగలనా? ఆమెపై నేను కొండంత ఆశలు పెట్టుకొంటిని. ఆమె నాయందనుండిన భారత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాటకరంగమునకు ఘనమగు సేవలను చేయజాలుదును గదా యని యువ్విళ్లూరితిని. తెలుగునాటఁబుట్టి, తెలుగు నేర్చి తెలుగుననే నాటకములాడుచుండినను అచిరకాలములో కన్నడభాషయందుచిత ప్రావీణ్యమలవఱచుకొని (శ్రీ సి. వెంకటరామయ్య, (బెంగుళూరు) గారిచే రచింపబడిన) నాటకమునందు "మండోదరి". పాత్రను ధరించెను. ఆమె "మండోదరి" పాత్ర నా కాశ్చర్య సంభ్రమముల కలుగజేసెను. ఆమె పరిమాణ మల్పమైనను, ఆయమ అభినయ మత్యున్నతము. ఆమె గానము నిసర్గ మనోహరము. ఆమెతో రంగమున పాత్రధారణ వహించుటకు నాకదియే కడతూరి. ఇంతత్వరలో నిట్టి ఎడబాటు కలుగగలదని కలనైన యూహింపనైతిని. సరోజినీదేవి మరణము నాకేగాక ఆంధ్ర కర్ణాటక నాటకరంగములకు గొడ్డలిపెట్టు. ముఖ్యముగా ఆంధ్రులకు తీరనిలోటు. దక్షిణదేశమందలి నాటకరంగమునకు వన్నె దెచ్చినవారు ఆంధ్రసోదరీమణులని నే నెల్లపుడు మురియుచుందును. వారినామముల నిట పేర్కొనుటకు నే తలపెట్టుటలేదు. కాని ఎన్నడైనను ఆంధ్రులు నాటకము యొక్కయు, నాటకరంగముయొక్కయు కళాప్రాశస్త్యమును, విలువను నిర్వచించెడి సమయ మాసన్నమైనపుడు ప్రస్తుతము నాయల్పప్రయత్నములకు తోడ్పడుచున్న సోదరీమణులయొక్క నామములు దక్షిణదేశమున నాట్యకళయందు నవయుగనిర్మాతలుగా సువర్ణాక్షరములతో లిఖింపబడ గలవు. అట్టి యువతీమణులలో కెల్ల సరోజని మణివంటిది. పోయినది. దాటిపోయినది. మరల సరోజనీదేవి తిరిగి మనల జేరబోదు. విధి బలీయము. ఈశ్వరు డోర్వలేనివాడు. నందనవనమందలి పారిజాత మపహరింపబడినది. మనము నిస్సహాయులము నిర్భాగ్యులము. కాని సరోజిని యొక్క ఆత్మకు అనశ్వరము. ఆయమస్మృతియే నాకు బాసటయై నాభావి ప్రయత్నములకు విజయమును చేకూర్చునని విశ్వసించుచున్నాను.

(ఆంధ్రపత్రికనుండి)

---



వైఘనది-మధురవద్ద

—యస్. శంకర సుబ్రహ్మణ్యం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానందరాఘవరావు (కవితాసమితి)

## పుష్య మాఘమాసములు : (జనవరి 1934)

ఉత్తరము




దక్షిణము

[ఈపటము ఆయాదిక్కులు సరిగాచూపునట్లు తలమీదుగాపెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు

| | | | |
|---|---|---|---|
| జనవరి 8 తేదీని రాత్రి 8-51 గంటలకును, | జనవరి 22 తేదీ రాత్రి 7-56 గంటలకును | } కనబడును.] |
| ,, 15 ,, ,, 8-24 ,, | ,, 31 ,, ,, 7-31 ,, | |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౯౩౪-వ సంవత్సరము జనవరి ౮-వ తేదీ నుండి ఫిబ్రవరి ౮-వ తేదీవరకు, అనగా పుష్యబహుళ అష్టమిమొదలు మాఘబహుళఅష్టమిపర్యంతము అను మాసమునందు రాత్రి తొలిజామున నగపడు నక్షత్రాది ఖగోళవిశేషముల వివరము లిందు వ్రాయుచున్నాను.

## క్షీరవాహిని (Milky Way)

ఈమాసమునందు క్షీరవాహిని ఆగ్నేయమునుండి వాయవ్యమూలకు ఒక విల్లువంటి ఆకారములో వ్యాపించి యున్నది. ఆగ్నేయమూలను నౌకామండలముకడ ఆరంభించి, శ్వాన)పూర్వశ్వానములమధ్యను, వృత్ర ఒరయన్) మిథునముల మధ్యను పడి, వృషభరాశి, సారథిమండలము, భృగుపరశుమండలము, అప్సరసమండలము, ఇంద్రమద, ఊర్వశి, పురూరవసులమీదుగా రాజహంసవరకు వ్యాపించియున్నది.

## మిక్కిలి తేజోవంతమైన నక్షత్రములు

మిక్కిలి తేజోవంతమైన నక్షత్రములు (First Magnitude Stars) ఇరువదింటిలో ఈకాలమున సుమారు పదినక్షత్రము లగపడుచున్నవి. అవేవియనగా:

౧. ఇంద్రద్యుమ్న (Fomalhaut).
౨. శంతను (Acherner,.
౩. అగస్త్య (Canopus).
౪. మృగవ్యాధ (Sirius).
౫. రిగెల్ (Rigel)
౬. ఆర్ద్ర (Betelgeaux).
౭. రోహిణి (Aldebaran).
౮. బ్రహ్మహృదయము (Capella Auriga).
౯. పూర్వశ్వానము (Procyon).
౧౦. మఘ (Regulus).

## లఘు ఋక్షము (Ursa Minor)

లఘుఋక్షము ధ్రువనక్షత్రమునకు దిగువనే కనబడుచున్నది. ఊర్వశీపురూరవసులు ఇపుడు నిలువుగా కనబడుటలేదు. అడ్డుగా కనబడుచున్నారు.

## బృహదృక్షము

ఈశాన్యమున ఇందలి సప్తఋషులు ఇపుడిపుడే ఉదయించుచున్నారు. ఈరెండు యెలుగులమధ్యను నరకుడు పొడసూపనై యున్నాడు.

## తూర్పున

మఘ ఉదయించుచున్నది. దిగువ ఆశ్రేష ఉదయించినది ఆశ్రేషకు పైన కర్కాటకరాశిలోనే పొట్లపువ్వువలె పుష్యమి కనబడుచున్నది. దాని కీవల ముత్యాలహారమువలె మిలమిల మెఱయు చుక్కలతో పునర్వసు ఉన్నది. పునర్వసుఉత్తరభాగమందు మిథునము (Gemini) లోని Castor And Pollux చుక్కలు కలవు. దక్షిణమున పూర్వశ్వానము(Procyon) కలదు. మిథునమునకు ఒకింతమీదుగాను, పులహక్రతులకు దిగువను ఏనుగుతొండముతోను, లంబోదరముతోను విఘ్నేశ్వరుడు కాననగును. ఆదిగువనే ఆతని వాహనమైన మూషకము ఉన్నది. దీనిప్రక్కనే సారథి మండలమును (Auriga), అందు తెల్లనికాంతితో తేజరిల్లు బ్రహ్మహృదయ (Capella) నక్షత్రమును చక్కగా మెఱయుచున్నవి. సారథిమండలము నంటుకొని పడమరగా భృగుపరశుమండల మున్నది. ఈ పరశుమండలమునకును, బ్రహ్మహృదయమునకును ఉత్తరభాగమునందు మిణుకుమిణుకుమను చిన్నచుక్కలతో కల్పవృక్ష మున్నది. ఆకల్పవృక్షచ్ఛాయను రంభ, సుజూర్ణీ, హృదేచకుస్, గ్రంథినీ, చరణ్యా మొదలగు అప్సరసలు మెఱయుచున్నారు. భృగుపరశుమండలమునకు దిగువనే గ్రుడ్లుమిటకరించుకొనుచు పులోమరక్కసుడు (Algol-the Blinking Demon) ఉన్నాడు.

## మధ్యను

భృగుపరశుమండలముదిగువ నభోమధ్యరేఖపై పిల్లలకోడియనబడు కృత్తిక తేజరిల్లుచున్నది. కృత్తిక దిగువను పడమరగా భరణియు, భరణికి పడమరగా అశ్వినియును, ఆయశ్వినికి పడమరగా రేవతియును క్రమముగా చూడనగుచున్నవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పడమర

నాళీకజంఘుబకమును, ఇంద్రద్యుమ్నుడును అస్తమింపనైయున్నారు. (అశ్విని + భరణి + కృత్తికల్గ) అగు మేషముదిగువను శింశుమారము (Cetus) ను, దానికి దిగువ క్షీరోదదక్షిణధ్రువమనబడు యుగంధర కమఠమును కలవు. ప్రావారకర్ణఘూకమును ఆక్రిందనే కలదు. పులోమునికి పడమట ఇంద్రమద, చ్యవనుడు ఉన్నారు. వారి కావల, పడమటను ఉత్తరాభాద్ర, పూర్వాభాద్రనక్షత్రములు ఉన్నవి. వాయవ్యమున రాజహంస ఇంచుమించుగా అస్తమించినది.

## దక్షిణమున

ఒరయన్ (Orion) యోధుడనబడు వృత్రుని పాదములలో నొకటియని చెప్పదగియున్న రిగల్ (Rigel) చుక్కకు మీదుగా పుట్టినట్లున్న యమున ఎన్నోవంకలు తిరిగి తుదకు శంతనుని సమీపించినది. యమున కొకప్రక్క అగ్నివంటి తేజముగల ధుంధుడున్నాడు. మృగవ్యాధునికి సరిగా దిగువను అగస్త్యుడు దక్షిణాకాశమున నఖండతేజముతో మెఱయుచున్నాడు. అద్రిక ఆసమీపమునం దున్నది. బకదాల్భ్యుడుకూడ యమునకు అనతిదూరమున నున్నాడు. అగస్త్యుని ప్రక్కనే నౌకామండలము (Argo Navis) ఆగ్నేయ దిగ్భాగమున పొడసూపుచున్నది.

## విశేషవిషయములు

ఈమాసమునందు రాత్రి తొలిజామున ఆకాశము మిక్కిలి తేజోవంతమై మొదటిరకపు నక్షత్రములతో కూడుకొని మిక్కిలి ప్రకాశించుచున్నది.

౧. ఆకాశమునందలి నక్షత్రము లన్నింటిలో మిక్కిలి తేజోవంతమై ప్రకాశించునది మృగవ్యాధుడు. దీనినే పడమటిదేశములవారు Sirius అందురు. క్షణమునకు ఒకలక్షఎనుబదియారువేలమైళ్లచొప్పున వ్యాపింపగల వెలుతురు ఈచుక్కనుండి వెడలి మనలను చేరుసరికి ౮౹౺ సంవత్సరములు పట్టును. అయినను ఇది మనకతి సమీపమునందున్న చుక్కలలో నొకటియని మఱువకూడదు. ఇది కొంచెము నీలిమతోకూడిన తెల్లని తేజముతో ప్రకాశించుచున్నది.

౨. మృగవ్యాధునికి మీదనున్న పూర్వశ్వానము కొంచెము పసుపు పచ్చరంగు కలిసిన తెలుపుతో ప్రకాశించుచున్నది. దీనివెలుగు మనకు చేరుటకు ౧౦ సంవత్సరములు పట్టును.

౩. మిథునములో నున్న పోలక్సు (Pollux) చుక్కనుండి మనకు వెలుగు చేరుసరికి ౪౩ సంవత్సరములు పట్టును.

౪. పొట్లపువ్వువలె నుండునని పైన వర్ణింపబడిన పుష్యమినక్షత్రమే పూర్వీకులకు వాతావరణస్థితులను తెలుపుచుండెడిదట. ఇందలి నక్షత్రములన్నియు స్పష్టముగా కనబడినపుడు గాలి, తుపాను మొదలగునవి లేక వాతావరణస్థితి సమగతిని చక్కగా (Fair Weather) ఉండుననియు, అట్లు ఆచుక్కలు కనబడక పోయినపుడు, మబ్బులు, గాలి, వాన కలుగుచుండుననియు ప్రాచీనులు తెలిపికొనుచుండిరి.

(౫) అగస్త్యుడు మృగవ్యాధునితరువాత ఇంత తేజోవంతమై కనపడు నక్షత్రము మఱియొకటి ఆకాశమున కానరాదు. ఇది మన సూర్యునికంటె సుమారు అరలక్షరెట్లు తేజోధికమైన బ్రహ్మాండగోళము. దీని వెలుగు మనకు చేరుసరికి మూడువందలసంవత్సరములకు పైగా పట్టునని గుణించినారు.

(౬) ఒరయన్ (Orion) అనబడు చుక్కల గుంపు. ఇది నక్షత్రసమూహములన్నింటిలో సుందరమైనది. నాలుగుప్రక్కలను నాలుగు మంచముకోళ్లలాగున ప్రకాశమానమైన నక్షత్రములు ముఖ్యముగా కానవచ్చును. దిగువ రెండింటిలో ఉత్తరమున నున్నది ఆర్ద్ర. ఎగువ రెండింటిలో దక్షిణమున నున్నది రిగల్. నాల్గింటిమధ్య గొల్లకావిడిచుక్కలు. అటనుండి దక్షిణమునకు యోధుని ఖడ్గమువలె వ్రేలు మరిమూడు చుక్కలు. ఈయోధుడు గొప్ప వేటకాడనియు, తుదకు తేలుకుట్టి చచ్చెననియు గ్రీసుపురాణగాథలు. జ్యేష్ఠగల వృశ్చికరాశి ఉదయముకాగానే ఒరయన్ అస్తమించుట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యా గాథకు మూలము. ఈ ఒరయన్ నక్షత్రములనుబట్టి వేదకాలనిర్ణయము చేయుచు లోకమాన్యులు ఒరయన్ అను గొప్పగ్రంథమును రచించుట సుప్రసిద్ధము. ఈ ఒరయన్‌లోని కొన్నినక్కలనుండి వెలుగు మనకు చేరుసరికి సుమారు ౭౦౦-౭౫౦ సంవత్సరము లగునని గుణించిరి. అనగా ఇపుడు మనలను చేరు ఈ చుక్కల వెలుగు మన దేశములో మహమ్మదీయప్రభుత్వారంభదినములలో అట నుండి వెడలినదని తెలిసికోవలెను.

## గ్రహములు

అంగారకుడు జనవరి ౨౫ వరకు మకరమున నుండును. శుక్రుడు ౧౦-౧-౩౮ మొదలు ౧౮ వఱకు కుంభమునుండి, వక్రించి మకరమున ప్రవేశించును. బుధుడును ఆ నాడే మకరస్థుడగును. కాబట్టి ఈ నెలలో మకరములో చతుర్గ్రహ, పంచగ్రహకూటములు జరుగును. కాని అవి గమనించుటకు వీలుగా నుండవు.

శుక్రుడు మహాత్రము డిసెంబరు ౩౧-వ తేదీని అత్యంత తేజోవంతుడై యుండును. నాటినుండి తేజస్సు క్రమముగా క్షీణమగును. మాఘబహుళపాడ్యమి ౩౧-౧-౩౮ తేదీని శుక్రుడు అస్తమించును. కాబట్టి ఈపటములో చూపుటకు వీలుగా లేదు.

## ఉల్కాపాతములు

ఈమాసములో ముఖ్యమైన ఉల్కాపాతము లంతగా లేవు. జనవరి ౧౭-వ తేదీని అస్తమించుచున్న రాజహంసమండలములో స్వల్పముగా ఉల్కలు రాలును.

---



“ పిల్ల సేద్యకాడు ”

—సూర్య.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భయము

ప్రసాద్

భయమనేది ఒకవిధమైన భావము. ఇది ఒక ఆలోచనవల్లగాని, ఒకఉద్దేశంవల్లగాని, ఒకదృశ్యంవల్లగాని కలుగుతుంది. రేపు చచ్చిపోతామనిగానీ, వంతెన కాస్తా విరిగి రైలు కృష్ణలోపడిపోతే ఎట్లా అనే భావాలు కలిగి భయమేస్తుంది. లోభికి తనడబ్బంతా ఎత్తుకొనిపోతారేమో అని భయంవల్ల రాత్రింబగళ్లు సరిగ నిద్రపోడు. ఇవి ఆలోచనలు మనస్సునందు జరిగేవి. ఇక దృశ్యాలు ప్రత్యక్షంగా ఉండేవి– అనగా కళ్లకు కనపడేవి. ఒకపాము కనపడుతుంది. దాన్ని చూడగానే భయమేస్తుంది. రైలుక్రింద మనిషో, ఆవో పడిపోతే ఆదృశ్యాన్ని చూడలేము. కొంతమంది గుండెనిబ్బరము లేనివాళ్లు గనుక సర్కసుకు వెళ్లినపుడు సింహాలు, పెద్దపులులు సర్కసువానికి ఎదురుతిరిగితే వాళ్లకు గుండె దడదడ కొట్టుకుంది. ఇది ఒకభావము.

సాధారణంగా మననడతఅంతా మనభావములను అనుసరించిఉంటుంది. భావమే మనకు శక్తి నిచ్చేది. వ్యక్తిసుణగణములకు భావమే మూలము. అతనికార్యసాధనకు ఉత్సాహమిచ్చేది అదే. ప్రపంచచరిత్రగనుక క్రమంగా చదివితే విప్లవములకు, యుద్ధములకు భావమే కారణమని తేలుతుంది. ఫ్రెంచివిప్లవమునకు మధ్యతరగతివారికి ధనస్వాములయెడగల తిరస్కారభావము కారణం. తాము చెమటోడ్చి ఆర్జించింది తమకు దక్కనీక తమను అన్యాయము చేస్తున్నారని ఉద్రేకము కలిగి దానికి మూలమయిన రాజకీయవిధానమును పడగొట్టివేశారు. రషియయనుల బోల్షివిక్కు విప్లవానికి జార్ నిరంకుశప్రభుత్వంవల్ల వచ్చిననికృష్టభావం మూలం. మనదేశమందును ప్రస్తుతశాసనోల్లంఘమునకు జాతీయభావం మూలం. బ్రిటిషువారు భారతదేశమును స్వలాభంకోసము ఉపయోగించుకొంటున్నారు. యూరోపియనుల కిచ్చినప్రాముఖ్యము, ఉన్నతోద్యోగములు భారతీయుల కివ్వరు. ఇచ్చినా వారికిచ్చే జీతములివ్వరు. ఈ దేశీయులనునీచంగా పరిగణిస్తారు. ఇంగ్లీషువారి రాజ్యంవల్ల భారతదేశం పరిశ్రమలయందయితేనేమి, విద్యావిషయములలోనేమి మిగిలినదేశములకు అనేక రెట్లు వెనుకబడ్డది. ఇవన్నీ చూస్తే భారతీయులకు తమనిలువ తెలిసింది. స్వతంత్రత ఉండవలె ననే భావం ఉదయించింది.

భయభావము మనరాజకీయసమస్యను మరింత కష్టము చేసినది. భారతీయులు స్వరాజ్యంకోసము అనేక సంవత్సరములనుండి పోట్లాడుతున్నారు. ఈ పోరాటము అనేకరూపాలు ధరించింది. వాటన్నిటిని పేర్కొనుట అనవసరం. స్వరాజ్యంగాని, దానికి దగ్గరగా ఉన్నదిగాని ఇంతవరకు రాలేదు. స్వరాజ్యం అంటే భారతీయుల ప్రభుత్వం అన్నమాట. పూర్వకాలంలో చక్రవర్తిత్వం భూమిని పాలించింది. తరువాత ఆలిగార్కి వచ్చింది. తరువాత ప్రజాప్రభుత్వం వచ్చింది. ఇది ఊగులాడుతోంది. ఫేసిజమ్ వచ్చింది. అనేకదేశములలో డిక్టేటరుషిప్పు నాటుకొంటోంది.

ప్రభుత్వం అనేది అధికారంతో కూడుకొన్న ఒక సంస్థ. ఈసంస్థను ఏవిధంగా నిర్మిస్తే బాగుండునూ అనేది ఆధునికసమస్యలలో ఒకటి. ఆవిషయమిచ్చట చర్చించడం అనవసరం. ఈ అధికారమును విభజించితే ఎవరికి ఎంతవెళ్లాలి అనేది మన్ని కలవరపెట్టు సమస్య. జనాభా లెక్కప్రకారము అన్న కొంతమంది ఒప్పుకొనరు. ప్రత్యేకసాంఘికప్రాతినిధ్యము కావలెనంటారు, మరికొందరు. ప్రత్యేక నియోజకవర్గములు అవసరమని మరికొంద రంటారు. ప్రజాప్రభుత్వ ఆశయముల కివన్నీ వ్యతిరిక్తమని ఒకపక్షపు వారి వాదన.

ఈవాదము లన్నిటికి భయమే మూలం. అధికారము మహమ్మదీయులచేతిలో ఉంటే మనను అణచివేస్తారని మహమ్మదీయుల వాదన. మహమ్మదీయులు యూరపియనులతోను, క్రైస్తవులతోను కలిసి తమను అణచివేసెదరని హిందువులంటారు. ఈ అపనమ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కం, భయం సాంఘికసమస్యకు వేరు హరిజనసమస్య కూడా ఇంతే. హరిజనులనుసమానంగా చూడాలనీ, వాళ్లను దేవాలయంలోనికిరానివ్వాలనేవాళ్లు బ్రాహ్మణులయం దనేకమంది ఉన్నారు. కాని తరువాత వెలివేస్తారేమో అనేభయం వెన్నాడుతూఉంటుంది. "తరతరములనుండీ వచ్చేఆచారములను అతిక్రమించవలెనంటే గుండెనిబ్బరం చాలా ముఖ్యం. అది మానవునియందుగల ఉద్రేకాని ఉబకేస్తుంది. స్వతంత్రమనేది తగినవారికి గాని అందరికిగాదు" అన్నాడు షెల్లీ. వెలి అంటే భయపడని వాళ్లు, మన్ని వెలివేస్తేవాళ్లని మనంవెలివేస్తాము అనే గిరీశంతత్వంవాళ్లు ఉండాలి. మానవులందరు మొదట చట్టానికి లోబడక విచ్చలవిడిగా తిరుగుతూఉండేవారు. ఒకరి హక్కులంటే మరొకరికి గౌరవం లేదు. ఒకరకంగా మృగాలని చెప్పవచ్చు. బలంకలవాడిది రాజ్యం. ఈఅల్లకల్లోలంనుంచిరాజ్యం(State)వచ్చింది. ఏవిధంగావచ్చింది అనేవిషయాన్నిగురించి హాబ్సు, లాకీ, రూసో అనువారు ముగ్గురు మూడువిధాలు చెప్పారు. కాని వీరి సిద్ధాంతములు ఆమోదింపబడలేదు.

"చట్టములు అపనమ్మకం, భయం అనేవాటి పుత్రికలు" అన్నాడు ఒక ఫ్రెంచిగ్రంథకర్త. ఒకరంటే ఒకరికి అపనమ్మకం, భయం అనేవి లేకపోతే ప్రస్తుతం ప్రపంచమందున్న క్లిష్టపరిస్థితులు వచ్చేవి కావు. ప్రపంచకంలో ఉన్న బంగారంలో చాలా భాగం అమెరికాలో చిక్కడిపోయింది. అది దేశం దాటితే తిరిగిరాదని, చిన్నమెత్తు బంగారంకూడా బయటికెళ్లికూడ దన్నాడు, ప్రెసిడెంటు రూసువెల్టు. దేశంలో ఉన్న బంగారమంతా ట్రెజరీకి చేర్పమన్నారు. టారిఫులు ఇష్టమొచ్చినట్లుగా పెంచారు. జర్మనీ ఆయుధసమానత్వం కోరుతోంది. నానాజాతిసభనుండి విడిపోయింది. సోవియటు విమానదళాన్ని పెంచుకున్నది; యుద్ధమునకు సిద్ధముగా ఉన్నది. కాబట్టి ఈసందర్భాలలో కావలసింది నిజంపల్కటం ఒకటి. కపటాన్ని తరిమివేయటం రెండు. కాని ఈ రెండుచేసేవాళ్లు అరుదు. అందుకని ప్రపంచకం ఎల్లకాలం ఈవిధంగానే ఉంటుంది.

---



'తిరుచునాపల్లి' కొండపైనుండి

—యస్. శంకర సుబ్రహ్మణ్యం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## పరీక్షలలో పొరపాటులు

మంచికనుడు సెబ్బరకనుడు, నేటి చదువు తెరువున పరీక్షలకు మిక్కిలి విలువ ఏర్పడినది. పరీక్షలయందలి పొరపాటులను పెక్కింటిని ఒక్కరు 'ఎడ్యుకేషన్ రివ్యూ' లో వివరించినారు. వానిలో కొన్ని :

ఉత్తరపత్రములను దిద్దుట కిచ్చినవిద్యార్థి పరీక్షకునకు పరిచితుడయినచో పరీక్షకుని హృదయము, ఉత్తరముల కపటపు నిర్దుష్టతమాటను పొడబెట్టి, విద్యార్థి సామర్థ్యమునుసరించి వెంటనే మార్పును చెందును. ఇందు కొక విచిత్రదృష్టాంతమును బాలగ్గుగా రుల్లేఖించినారు: ఒక ఆంగ్లోపాధ్యాయునివద్ద నిద్దరు విద్యార్థులు చదువువారు. వారిలో నొకడు 'వెల్షు' వాడు; ఇంకొక్క డింగ్లీషు వాడు. ఉపాధ్యాయునికి ఇంగ్లీషువిద్యార్థియెడ పక్షపాత మపరిమితము. కావున వాని ఉత్తరపత్రములపయి 'సెబాసు' అని వ్రాయుటయు, 'వెల్షు' వానిపత్రములపయి 'పాడు' అని వ్రాయుటయు నాతని కలవాటు. ఒకనాడు విద్యార్థు లొకతంత్రమును బన్నినారు. ఆయిరువురపత్రములపయి వారిపేరులుమార్చి వ్రాసి యుపాధ్యాయునికి వానిని దిద్దనిచ్చిరి. ఉపాధ్యాయుడును తన యలవాటువెంట ఇంగ్లీషువానిపేరున్న పత్రములపయి 'బా'గనియు, ఇతరునిపేరున్న వానిపయి 'పా'డనియు వ్రాసెను.

వస్తుతత్త్వమును సరిగా తెలిసికొనుటయం దుపాధ్యాయునికిగల సాలసమునకనాదరమునకు, అసమర్థతకు నిది మిక్కిలియైన నిదర్శనమగుగాక !

తరువాతివిషయ ముత్తరమున కంగములు, వాని పరిమితి. ఈవిషయమున నుపాధ్యాయుల కైకమత్యము కుదురకున్నది. ఉత్తరములయందలి వేరువేరంశములకు విలువ వేరువేరుగా కట్టబడుచున్నది. వ్రాతయందమున నొకరు తృప్తిచెందుదురు. పాకమునబడిన రచనమున కింకొకరు మిన్నందుదురు. విషయవివరణమునకు మూడవవారు ముగ్ధులగుదురు. ఇట్లొక్కొక్క రొక్కొక్కవిషయమును ప్రధానముగా గొందురు. సరియగున యుత్తరమున కంగములగు వేరువేరు విషయముల కలయిక కలగూరగంపయయి యుపాధ్యాయుని కలవరపరచును. ఇట్లయ్యు నాత డన్నిటిని పరికించి వానికి విలువగట్ట ప్రయత్నించును కాని నియతముగా నాతనికొడ్డోట మిదే కలుగుచున్నది. ఉత్తరపత్రములను దిద్దుటయందు వివిధాభిప్రాయము లేగపడుట కిదొక్క కారణము. ఉదాహరణముగ చరిత్ర ప్రశ్నపత్రమును గైకొందము. అందు కాలక్రమము, ఆనుపూర్వి, పదసంపద, శీలపరిగణనము, ప్రమాణవివేకము మొదలగునవి అంగములు. ఇన్నిటి నొక్కత్తున వివేచింపబూనుట యశక్యమే కాదు, అన్యాయ్యమును.

'మాడర్న్ రివ్యూ'


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




జినీవా గోవు

'పదేండ్లనుండి మేత మేయుటే కాని పాలిచ్చుట లేదు.'

'ఆంధ్రపత్రికనుండి'

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రనాటకకళాపరిషత్తు-చిత్రములు




తృతీయాంధ్రనాటక కళాపరిషత్తు
(25-12-1933) మదరాసులో జరిగెను. రాఘవాచారిగారు (అధ్యక్షులు), నాగేశ్వరరావుగారు (ఆ. సం. అధ్యక్షులు),
గా. రామచంద్రారెడ్డిగారు ఆరంభకులు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీమతి పద్మావతీ దేవిగారు

[తృతీయాంధ్రనాటకకళాపరిషద్వ్యాజమాన్యమున ప్రదర్శింపబడిన 'చంద్రగుప్త' యందు 'ఛాయా' పాత్రను నిర్వహించి మించినందున నీ వర్ధిష్ణునటీమణి రజతపాత్రప్రదానమున బహూకరింపబడెను.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీమతి గుళ్లపూడి విశ్వేశ్వరమ్మగారు

[అదే 'చంద్రగుప్త'యందు 'హెలెన్' పాత్రను నేర్పుమెయి నిర్వహించి పారిషదుల ప్రశంసలను బడసినది ]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



కుమారి కాంతమ్మ

[శ్రీ వనారస గోవిందరావుగారి పౌతురు. ఈ బాలిక పరిషత్తువారి 'కృష్ణరాయబార' ప్రదర్శనమున వికర్ణ పాత్రను ధరించి చక్కగ నిర్వహించినది.]



శ్రీ డి. గోవిందరాజులుగారు

(బి. ఏ., బి. యల్.)

[పరిషత్తువారిచే నడుపబడిన 'కన్యాశుల్క' ప్రదర్శనమునందు మధురవాణి పాత్రను చక్కగ, నేర్పుతో, సహజరీతిని నిర్వహించిన పరిషత్సభ్యుఁడు.]




శ్రీ వనారస గోవిందరావుగారు

[శ్రీ సురభి నాట్యమండలీ సంస్థాపక నిర్వాహకులు. ఆంధ్రనాటకకళాపరిషదారంభ మునకు కారకులు. వీరి నాట్యకళాసేవ నాచరించుచు పరిషత్తువారు మొన్నటి తృతీయసమావేశమున వీరి కొక సమ్మానపత్రమును (ఒక వెండి గొట్టము-Barrel-న నుంచి), దుశ్శాలువలను బహూకరించిరి.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తృతీయాంధ్రనాటక కళాపరిషత్తు

## తీర్మానములు

### నవీనగ్రంథరచన - బహుమానము

౧. భావోద్దీపకములును, రసవంతములును, ప్రయోగయోగ్యములును అగు ఆధునిక తెలుగు నాటకముల రచనను ప్రోత్సహించుటకుగాను తగు విధానముల నారయుటకు పరిషత్పక్షమున మువ్వురు సభ్యులతోనొక యుపసంఘమును నియమించుచున్నారు.

### ఉపసంఘ సభ్యులు

౧. శ్రీయుత టి. రాఘవాచార్యులుగారు,
౨. శ్రీయుత శ్రీపాద కామేశ్వరరావుగారు,
౩. శ్రీయుత వేలూరి శివరామశాస్త్రిగారు.

౨. పరిషత్తునకు సమర్పింపబడెడి నాటకములలో నుత్తమగ్రంథమునకు పరిషత్తువారల యార్థిక శక్తి ననుసరించి కనీసము రూ. ౧౧౧౬ లకు తక్కువగాని మొత్తము బహుమాన పురస్సరముగా నొసంగుటకు తీర్మానించుచున్నారు.

౩. పరిషత్తునకుగాను వ్రాయగల నాటకముల యొక్క రచనా విధానమును ఇతివృత్తము లోనగు నిబంధనలను నిర్ణయించుటకును, పరిషత్తున కంపబడిన గ్రంథముల తరతమనిర్ణయము గావించుటకును పైని చెప్పబడిన యుపసంఘమువారే యధికారము గలిగి యుందురు.

౪. దేశ, కాలపాత్రముల ననుసరించి నటకులు స్వేచ్ఛతో కథావస్తువును సైతము రూపుమాపి, నాటక గ్రంథమును క్షతీకరించుట యీ పరిషత్తువారు గర్హించుచు, ప్రస్తుతమాంధ్రదేశమున ఆడబడుచున్న నాటకము లన్నింటికి, అవసరమగుచో ఆయా గ్రంథకర్తల సహాయముతో, రంగస్థలమున కనుకూలపడునట్లు నాటకముల క్షప్తపరచి Stage Editions తయారుచేయుటకు ఈదిగువ నుదాహరింపబడిన యిరువురతోగూడిన యొక యుపసంఘము స్థాపింపబడవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

౧. నెల్లూరు నాగరాజరావుగారు.
౨. తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు.

౫. ఆంధ్రనాటకకళాపరిషత్తున కొక ప్రణాళికను తయారుచేసి, పరిషత్తును వెంటనే 'రిజస్టరు' చేయుటకు స్థాయిసంఘమువారు పూనుకొనవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

౬. ఉత్తర సర్కారులలో ప్రతినాటకసమాజము, తాము ప్రదర్శింపబోవు నాటకప్రదర్శనము లన్నింటికి, ఆయా జిల్లా యధికారుల అనుమతి బడయవలయు నను ప్రభుత్వమువారి ఉత్తరువు నాటకకళావిలాసమునకు, గ్రంథకర్త స్వాతంత్ర్యమునకు తీవ్ర విఘాతము కలిగించుచున్నది కావున ప్రభుత్వమువారు వెంటనే సదరు ఉత్తరువు నుపసంహరింపవలయు నని యీసభవారు కోరుచున్నారు.

౭. ఆధునిక నాగరికతబట్టి నానాటికి పతితమగుచున్న యక్షగాన వీథినాటకముల, చర్మనాటకముల (తోలుబొమ్మలు) పునరుద్ధరించి, ఉత్కృష్ట దశయందు నిల్పి ప్రచారమునకు తీసికొని వచ్చుటకు యీ సభవారు తీర్మానించుచున్నారు.

౮. స్త్రీలనాట్యరంగ ప్రవేశమును ప్రోత్సహించుటకు ఆంధ్రనాటకరంగమునకు వన్నెదెచ్చుచున్న ఒక నటీరత్నమునకు ధనరూపముగా ఏటేట బహుమతి సల్పవలయునని యీపరిషత్తువారు తీర్మానించుచున్నారు.

౯. నిర్ణీతమగుకాలమునకు నాటకప్రదర్శనము ప్రారంభించుటకును, అసంబద్ధము లగు గ్రామఫోను పాటలు వగైరా రంగస్థలమున ప్రేక్షకుల కోర్కెపై చదువకుండుటకును ఈపరిషత్తువారు నటకులను కోరుచున్నారు.

౧౦. పరిషత్తు తరఫున ఒక మూడుమాసముల పత్రికను వెంటనే స్థాపింపవలసినదని యీ సభవారు తీర్మానించుచున్నారు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మనవిమాటలు

## ఆంధ్రనాటకకళాపరిషత్తు తృతీయసమావేశము

ఈపరిషత్తు మొన్న డిసెంబరు నెల ౨౫, ౨౬, ౨౭ తేదులందు శ్రీ బళ్లారి రాఘవాచార్యుల యధ్యక్షతను జయప్రదముగ నిర్వహింపబడినది. పరిషద్యాజమాన్యమున ప్రదర్శింపబడిన నాటకములును పారిషదులకు తృప్తి నొడగూర్చినవి. నిర్వాహకుల కౌశలోత్సాహములును, కళాభిమానుల, నటుల యాదరప్రోత్సాహములును కారణముగా పరిషత్తు చక్కగా కొనసాగినది.

ఈపరిషత్తు మొట్టమొదట ౧౯౨౯లో నారంభ మయినది. ఇది మూడవ సమావేశము. నాటకాభిరుచిగలవారిని, తత్కళాభిమానులను ఒక్కచోట సమావేశపరచి, కళాభివృద్ధికరవిషయములను గూర్చి చర్చించుటకు ప్రజాభిప్రాయమును కేంద్రీకరించుట యీ పరిషత్తుయొక్క ఉద్దేశము. ప్రస్తుతము మన యాంధ్రనాటకరంగమున సంస్కరింపవలసిన విషయము లెన్నియో కలవు. ఆంధ్రనాటకరంగమున నిపుడు కొంతకుకొంత అభివృద్ధి కనుపించుచున్నను, ఇంకను, విడివడదగిన, విడివడని సమస్యలు చాల గలవు. ఈ రోజులలో నాటకరంగము పోవుచున్న పలుపోకడలు, దాని లోపాలోపములు, నూతనోత్తేజము కలుగుటకు దారి తెన్నులును శ్రీ రాఘవాచార్యులుగారు తెలియబలికినారు. ఆచార్యులుగారు దేశీయ, విదేశీయనాటకరంగములందు చక్కని అనుభవపరిచితులు గలవారు; సంస్కృతహృదయులు; నాట్యకళయెడల, దానియభివృద్ధియెడల అనారతదృష్టిగలవారు. వీరి నాయకత్వమున, తదితరకళావేత్తల, అభిమానుల, మహనీయుల యాదరమున నీపరిషత్తు, ఆంధ్ర నాటకరంగము ఇతర దేశీయనాటకరంగముల కన్న ఇతోధికముగ వన్నెమీరి వెలయ జేయగలదని యాసింతుము.

ఈతూరి సమావేశమునందు అభినవ రుచులకు సరిపోవు నాటకముల రచనను ప్రోత్సహించుట కొకతీర్మానము కావింపబడినది. 'మానవజీవితములోని నిత్యనైమిత్తిక విషయములను రసోచితముగ ప్రదర్శించి సాంఘిక, ఆర్థిక, మతవిషయములందు నూతన సంస్కారములను ప్రబోధించుటకు హృదయరంజకము లగు వేర్వేరు కథాంశములను నాటకరూపమున ప్రదర్శింపవలసిన తరుణ' మిది. ఇట్టి నాటకముల ప్రదర్శనమే 'ప్రపంచమం దంతటను ప్రజ్వలిత మగుచున్న నూతన భావములకును, సాంఘికజీవితమునకును అనుగుణముగ నాటకరంగమును సంస్కరించి ప్రజాహృదయమునందు నవీనోత్తేజమును కల్పించుటకు' సరియైన ప్రక్రియ. ఇట్టినాటకముల విరివిగ తయారుచేయుటకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిషత్తు ఉత్సహించినది. దీనిమూలమున నాటకరంగమున కొక అపూర్వమయిన సంస్కృతి యేర్పడగల దనుట నిక్కము. స్త్రీలనాట్యరంగ ప్రవేశమును ప్రోత్సహించుట మరియొక విశేషము. ఇదియొక పెద్ద సమస్యగ ఇప్పుడు ఏర్పడిపోయినది. దీనివిషయమై వాదోపవాదములు పెల్లుగ జరగిపోయినవి, జరుగుచున్నవి. ఈ విషయమై మొదటినుండియు ఎక్కువగ పాటుపడుచుండువారు రాఘవాచార్యులుగారు. వారికిని ఈవిషయమై ఇంకను ఒకనిర్ణయము కుదురలేదు. ఈ వాదోపవాదములందును, నిర్ణయమునందును పురుషులే యెక్కువగ బాధ్యత కలిగియుండుటకన్న విద్యావతులయి, సంస్కృతహృదయముగల కుటుంబినులు సయితము ఈవిషయమున తమ యభిప్రాయముల నొసగి, చర్చలందు పాల్గొని, ఏదో యొకనిర్ణయమును తేజూచుట సమంజసము.

ఇట్టి విషయములను చర్చించుటకును, నాట్యకళాభివృద్ధికిని ఒకపత్రిక అనువయిన మార్గము. పరిషత్తుతరఫున వెలువడ నున్న త్రైమాసికపత్రిక సుసంపాదకత్వమున త్వరలో నారంభింపబడి ఆంధ్రనాటకకళ కొక అపూర్వవికాసమును ప్రసాదించుననని నమ్ముచున్నాము.

పరిషత్తు కొలదిరోజులలోనే 'రిజిస్టరు' చేయబడనున్నది. ఇకనయినను, ఉత్సహించి, వెంటనే స్థాయిసంఘోపసంఘముల తోడ్పాటున పరిషత్తు కార్యరంగమునకు ఉపక్రమింపవలసియున్నది. రానున్న సమావేశమున 'ఇంతవరకు మీరొనర్చిన ఘనకార్యము లేమి?' యన్నప్రశ్నకు ఎడము నీయకుండుట పరిషత్తుకు మిగిలినది.

మరుసమావేశమునందు ఈ పరిషత్తు మహాసభతోపాటు అపూర్వములు, ఉత్తేజకములు నయిన నాటకములను ఎక్కువగ పేరెన్నికగన్న నటనటీమణుల తోడ్పాటున మరింత మేలుగ ప్రదర్శించుటయు, వస్తుప్రదర్శనమును ఇంతకంటె అద్భుతముగ, సమగ్ర పరికరములతో నేర్పాటుచేయుటయు ఆసింపదగియున్నది.

పరిషత్తు వెంటనే కార్యక్రమమునకు గడంగి ఉపక్రమణికకు అర్థవత్త్వము చేకూర్పవలసినది విధి.

---

దక్షిణభారత హిందీప్రచారసభ, చెన్నపురి

ఆనంతమార్గముల హిందీభాషను దినదినాభివృద్ధిగ దేశమున వ్యాపింపజేయుచున్న దక్షిణభారత హిందీప్రచారసభ మూడవ హిందీపట్టప్రదానమహోత్సవమును జరిపినది. ఈయుత్సవమునకు 'హిందీ నిఖిలభారతజాతీయభాష కావలయునని నిర్ణయించి దక్షిణభారతదేశమున దానిప్రచారమునకయి బీజములను నాటిన' పూజ్యశ్రీ గాంధిమహాత్ముఁ డధ్యక్షుఁడు. 'నాటినుండియు తత్ప్రచారకార్యపర్యవేక్షకుముగ నుండి సభతో సంబంధము గలిగియున్న' పండిత శ్రీరామనరేశత్రిపాఠిగారు ఉపన్యాసకుఁడు. ఈ యిరువురసమ్ముఖమున పట్టములను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వీకరించిన పట్టభద్రులు ధన్యులు. ఇట్టిసుసన్నివేశమును కల్పించుకొన్న సభకు ధన్యవాదములు.

గలుగువరకును, హిందీభాష నితరులు మాటలాడినపు డర్థముచేసికొనగలుగువరకును హిందీప్రచారోద్యమము



దక్షిణభారత హిందీప్రచారసభ పట్టప్రదానము, ౧-౩౩.

ఉన్నతాశయసంపన్న మగు నుపన్యాసమున త్రిపాఠిగారు హిందీఉత్పత్తి, స్వరూప, వికాసములను, ప్రాశస్త్యమును వివరించి, ఇతరభారతీయభాషలలో నెల్ల బహుళవ్యాపకము, సుగమము నగుటచే నదియే నిఖిలభారతజాతీయభాషగా నుండదగిన దని పలికిరి; హిందీప్రచారసభ కావించుచున్న అమూల్యప్రచారము నకు మిక్కిలి మెచ్చుకొనిరి. కాని 'కేవలముహిందీరాని మదరాసుప్రాంతములవారికొరకయి జాతీయమహాసభ కార్యక్రమమంతయు నాంగ్లమున నడుపబడుచున్నది. ఈదాక్షిణాత్యులు ఏకగ్రీవముగా నాకార్యక్రమమునంత యును హిందీయందే నడుపవలెనని ముక్తకంఠులయి చెప్ప గలిగిననాటికి ఈసభ హిందీ ప్రచారమునకయిపడుచున్న పరిశ్రమకొంతవరకయిన సఫలమయినదిగ తలపవచ్చు'నని యితోధికప్రచారమునకు పురికొల్పిరి. మహాత్ముడును 'ఈప్రాంతముల ప్రతివారును హిందీభాషను మాటాడ యొక్క ఆదర్శము నెరవేరినటులు కాదు. అంతవర కును సంపూర్ణముగ సంతృప్తి గలుగదు ' అనిరి.

హిందీ వ్యాపించుటవలన నాయాప్రాంతముల వారి మాతృభాష కుపద్రవము కలుగగలదని సంశయించి దానిని ద్వేషించువారు కొందరు గలరు. అది పొరపాటు.

'జాతీయభావవలన రాష్ట్రీయభాషల అభి వృద్ధికి ఆటంకము గలుగవలెనని నే నెన్నడును కోరను. హృదయమునకును, ప్రాణములకును జీవన సంపదను సమకూర్చుశక్తి మాతృభాషయందే కలదు. మాతృభాష అభివృద్ధిచెందనిచో జాతికిని అభివృద్ధి లేదు' అని త్రిపాఠీమహాశయుడును, 'హిందీభాషయందు పాండి త్యము కలుగవలెనని నాయభిప్రాయము కాదు. సాధా రణముగ నొకరితోనొకరు మాటలాడికొనుటకు తగిన భాషాజ్ఞాన మున్న జాలును. మనలోమనము (భారతీయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను) మాటలాడుకొనుటకు విదేశీయభాషపయి నాధారపడవలసివచ్చుట చాల అవమానకరము' అని మహాత్ముడును నుడివిరి. ఈమాటలవలన పైన పేర్కొనినసంశయము దూరమగుటయేకాక హిందీనేర్చుకొనుట కేవలము ఆసేతుశీతనగముకల భిన్నభిన్న భారతదేశముల జనుల పరస్పర వ్యవహారమునకని తెల్లమగుచున్నది. హిందీ ప్రచారోద్యమము తలపెట్టిననాటినుండియు నీవిషయము సుప్రకటితమగుచున్నను కొందరు విచారశూన్యులుద్రేకపూరితులయి మాతృభాషను మాని హిందీనే చదువవలెనని ఘోషించుచున్నారు. ఇట్టి వారాంధ్రులే యన సిగ్గగుచున్నది. వీరు మీద నుద్ధరించిన త్రిపాఠీగారి వాక్యములను పరికించి వివేకవంతులయి తమ మాతృభాషను విశేషాదరాభిమానములతో వృద్ధినొందచేయదగుదురు.

దక్షిణదేశమున విరివిగా సాగుచున్న హిందీ ప్రచారమునకు మహాత్ముడు మిగుల సంతసించుచు 'నేను చూచినంతవరకు, రిపోర్టులమూలమున నాకు తెలిసినంతవరకు హిందీప్రచారమున మిగతరాష్ట్రములకంటె ఆంధ్రదేశమే యెక్కువ యుత్సాహముతో ముందంజ వేయుచున్నది' అనియు, 'అభివృద్ధి తమిళనాడునందుకంటె ఆంధ్రదేశమున విశేషముగ గాన్పించుచున్నది. నే నాప్రాంతములయందు పర్యటన మొనర్చునపుడు స్వయముగ నావిషయమును తెలిసికొంటిని.' అనియు నేయుద్యమమున నయినను మంచిసెబ్బర లరయక, గొఱ్ఱెమందలవలె గుంపులుగుంపులుగ ముందునకురుకు స్వభావముకల యాంధ్రుల నభినందించెను. మహాత్ముని యభినందనమున కాంధ్రులు పాత్రులయినందుకు సంతోషింపవలసినదే కాని హిందీని చదివినవారు మాతృభాషకు కొంత ముప్పు దెచ్చుకొనుచున్నారు. ఆదిని సంస్కృతభాష, తరువాత ముసల్మానులభాష, ఆపిమ్మట నాంగ్లభాష క్రమముగ నాంధ్రమున కిదివరకే చాలినంత యపకరించినవి. ఇటీవలనే ప్రచారమునకువచ్చిన హిందీభాషయు పైమూడు భాషల కింతయైన వెనుదీసినదికాదు. ఈనాల్గుభాషలు కలియుటవలన నాంధ్రవాఙ్మయము నానారూపములను దాల్చినది; దేశీయతను, జాతీయతను కోలుపోయినది. వాఙ్మయమును పరిశీలించినయెడల నిందుకు నెన్నియేని నిదర్శనములు లభింపగలవు. అయిన నీ దోష మాయాభాషలది కాదు. ఆత్మస్వరూపము తెలియని, ఆత్మగౌరవము కాపాడుకొనజాలని, యుక్తాయుక్తవివేచన లేని తెనుగువారిది. ఏభాషను చదివినను, ఏయుద్యమమును ప్రారంభించినను, దాని ప్రయోజనము పరిమితిని నిశ్చయించి అంతవరకే దానితో సంబంధ ముంచుకొనవలయును. స్వీయభాషకును, ఉన్నతికిని దానివలన ఎట్లును హాని కలుగకుండ జాగరూకత వహించవలెను. కావున ప్రయోజనమును గుర్తించి తమతమభాషలకు చెరుపుగలుగకుండ, హిందీ నభ్యసించి ఐకమత్యసంపన్నులయి భారతమాతృసేవ నొనరించి భారతీయులెల్లరు భారతమాత కభ్యున్నతిని చేకూర్ప దగుదురు.

దక్షిణ భారత హిందీప్రచార సభకు కడచిన సంవత్సరమున క్రొత్తగా కొన్నిశాఖలు విస్తరిల్లినవి. ఈసభ నూతనముగ పాఠశాలలను, గ్రంథాలయములను, పఠనమందిరములను పెక్కిటిని స్థాపించినది; మహాసభలను జరిపినది; పుస్తకములను కొన్నిటిని ప్రకటించినది; ప్రచారకులచేత నుపన్యాసముల నిప్పించియు, కాలక్షేపములను చేయించియు, నాటకముల నాడించియు విశేషప్రచారమును కావించినది. మొలకెత్తినది మొదలుకొని సభ హిందీవ్యాప్తికయి చేయుచున్న నిరంతరకృషి వలన దేశమున నసంఖ్యాకులు స్త్రీపురుషులు హిందీభాషను నేర్చిరి. ప్రజాహృదయమున హిందీపయి నాదరాభిమానములు గాఢముగ నాటుకొనినవి. ప్రజాప్రముఖులుపలువు రిందుకుబహుముఖములసహాయపడుచున్నారు. కొన్నిలోకలుబోర్డులు,మునిసిపాలిటీలుపాఠశాలలలో హిందీని ప్రవేశపెట్టి తద్వ్యాప్తికయి చేయూత యొసగుచున్నవి. మైసూరు, తిరువాంకూరు, కొచ్చి సంస్థానములు నత్యధికముగ తోడుపడుచున్నవి. ఐచ్ఛికభాగములలో నొకటిగా ఉన్నతపాఠశాలలో హిందీ ప్రవేశమును గని కొన్నిటియందు ప్రచారము గలిగియున్నది. కొన్నికళాశాలలయందును దానికి ప్రవేశముదొరకినది.

ఈ సంవత్సరమున వారు సభ జరిపిన ప్రాథమిక, మాధ్యమిక, రాష్ట్రభాషా పరీక్షలయందు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరీక్షితులయిన విద్యార్థుల సంఖ్యలు వరుసగా ౫౩౧౯, ౨౩౫౪,౧౩౯౮. రాష్ట్రభాషావిశారదపట్టపరీక్షయందు డెబ్బదిముగ్గురును, ప్రచారకశ్రేణి-ని పరీక్షయందు పదునలుగురును పరీక్షితులయిరి. సభ ౧౯౨౦-౨౧-వ సంవత్సరమున,పరీక్షలను ప్రారంభించినదిమొదలుకొని ఇప్పటివరను మొదటిమూడుపరీక్షలయందును ౩౦౫౬౦ విద్యార్థులు పరీక్షితులయిరి. నాలవదానియందు పరీక్షితులసంఖ్య ౪౫౬. అయిదవదానియందు పరీక్షితులయినవారిసంఖ్య ౧౯౪. ఇంకను హిందీభాషాభివృద్ధిమార్గము లనేకములు త్రొక్కబడుచున్నవి. కార్యనిర్వాహకుల కౌశలము వలన దక్షిణభారతదేశమున హిందీభాషకు బహుళముగ ప్రచారము సాగుచున్నది. ఇక నాలుగయిదేండ్లలోనే మదరాసుప్రాంతములవారు హిందీభాషయందే జాతీయవ్యవహారములను సాగించుచు నౌత్తరాహులను మించగలరను విశ్వాసమున కవకాశము గలదు. ఈ సభ హిందీవాఙ్మయాభివృద్ధికయి గ్రంథరచనప్రకటనముల విషయమున త్రిపాఠిగారి సూచనల ననుసరింపదగును.

'హిందీభాషాప్రచారము తలంపు ప్రథమమున ఇందూరుసమావేశమున గలిగినపుడు అయిదుసంవత్సరములలో హిందీభాష స్వయంపోషకశక్తి కలిగియుండ గల'దని భావించిన మహాత్ముడు '౧౫ సంవత్సరములు గతించినను ఇంతవరకు దీని కట్టిసమర్థత కలుగనందుకు' చింతిల్లుచు 'హిందీప్రచారసభవారి కార్యాలయములు, ప్రెస్సు, కళాశాల మున్నగునవన్నియు బాడుగ ఇండ్లలోనేయున్నవి. వీటికి సొంత యిండ్లు నిర్మించుబాధ్యత మీపయి నున్నది. ఇందుకు ఈదక్షిణభారతముననే ద్రవ్యము వసూలుచేయవలెను. ఈకార్యమును నిర్వహించుటకు మీరు వెంటనే మొదలుపెట్టవలెను' అని ప్రజాప్రముఖులకు మనవిచేయుచున్నాడు. ఆ త్యాగమూర్తిమనవిని ప్రజాప్రముఖులు శ్రద్ధతో పాటించి యథాశక్తి ధనసాహాయ్యమును గావించి హిందీప్రచారసభకు చిరంజీవితను గలిగింపదగుదురు. మరియు హిందీపట్టభద్రులుకూడ తమ చుట్టుపట్టులవారికి హిందీని బోధించి తద్వ్యాప్తికి తోడుపడదగుదురు.

హిందీభాషను నేర్చుటకు జాతీయాభిమానమే కారణము. కావున దానిని నేర్చినవారందరు నింకను నేర్వనివారికి నేర్పుటకు పూనుకొనవలెను. మాతృభాషను జదువనివారు తొలుత దానిని నేర్చి, తరువాత హిందీని నేర్చుకొన ప్రయత్నింపవలెను. కాని, కేవలము హిందీనిగాని, రెండింటి నొకమారుగగాని చదువజనదు.

—

## మ ద్దు క త *

తెనుగువాఙ్మయ మించుమించుగ నేతిబీరకాయను బోలియున్నది. అది యాపేరున చెల్లుబడియగుచున్న సంస్కృతము. కరకుచేద్రాదులవలె కడు నిడుద లగు గడుసుసమాసముల నిలిచిన 'అసలు' రూపమునను, 'డుముపులు' మొదలగు కుళ్లాయీలను దగిలించుకొనిన 'నకలు' రూపమునను, అస్థిసార మగు గంటిన ఎండువారిన వికృతరూపమునను సంస్కృతము తెనుగువాఙ్మయము నాక్రమించుకొనినది. ఈసంస్కృతమును 'మినహా' పెట్టగా నిలిచిన తెనుగున కొంత అంట రానిదయినది. మిగిలినదానిమాత్రమే వాఙ్మయ మంగీకరించినది. అదియే తెనుగుదేశపు తెనుగు; తెనుగువారి తెనుగు; జానయిన దేశితెనుగు. అట్టితెనుగున రచియింపబడిన వాఙ్మయమునకే తెనుగువాఙ్మయ మనుపేరు చెల్లదగును. అట్టిది మృగ్యమయినది.

ఇతరదేశభాషలయందును సంస్కృతమునకు ప్రవేశము కలదు. అది పరిమితము; సముచితము. దాని వలన నవి చవుల మించినవి. తెనుగున నట్లుకాదు. సంస్కృత మపరిమితముగ పైకొనిన నది; దాని తెవులువలె నీరసింపజేసినది. చివరకు సంస్కృతమును ప్రత్యేకముగ జదివినగాని తెనుగువాఙ్మయ మర్థముకానిస్థితికి వచ్చి నిలిచినది. ఇట్టిదుర్గతి యికనేదేశభాషకును పట్టినది కాదు.

---

* మద్దుకత వెల రు. ౦-౮-౦. ప్రకాశకులు : మంగిపూడి వేంకటశర్మ, నిడదవోలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పంద్రెండవశతాబ్దివాఁడగు పాలకురికిసోమనాథుఁ డొక్కఁడు 'ఆరూఢగద్యపద్యాదిప్రబంధ, పూరితసంస్కృతభూయిష్ఠరచన', 'జానుదెనుఁగు' రచన అని తెనుఁగురచనను రెండుగా విఁగడించినాఁడు. అందు మొదటిదానిని 'సర్వసామాన్యంబు' కాదని నిరసించినాఁడు; రెండవదానిని 'ప్రసన్నతకు విశేష' మని బహుమానించినాఁడు; జానుదెనుఁగు నుడికారముల కూరుపున తెనుఁగుకవితకు సొంపును సవదరించి తెనుఁగుకవి యనిపించుకొనినాఁడు. ఆతనికి మున్నుండినవారుకాని, వెనుకనుండినవారుకాని తెనుఁగుతీయదనమును గుర్తించినవారు కారు. కావుననే తమకావ్యములయందు జానుదెనుఁగున కెక్కుడుగ తావు నీయరయిరి.

'దేశభాషలందు తెనుఁగు లెస్స' యని గొంతెత్తిచెప్పిన రసికవతంసముసయితము తానురచియించిన ఆముక్తమాల్యదను సంస్కృతమయము కావించినాఁడు. తెనుఁగువాఙ్మయ మెంత విస్తరిల్లిననేమి? అదియంతయు సంస్కృతమే యయిపోయినది! అందు తెనుఁగుదనము చాల సన్నగిలిపోయినది. పొరుగింటిపుల్లగూరరుచి కబ్బురముతో తబ్బిబ్బుపడు తెనుఁగువారిదగు తెలివి తక్కువయే దీనికి కారణము.

పంద్రెండవశతాబ్దినాటి పాలకురికి సోమనాథునికి తరువాత, నాతనివలె జానుదెనుఁగుప్రసన్నతను తెలిసిన యొక తెనుఁగుకవి మరల నిరువదవ శతాబ్దిని తెనుఁగుమాగాణమున వెలసినాఁడు. ఆయన ఎవ్వఁడో కాఁడు. తెలుఁగువారికి లెస్సగా పరిచితుఁడయిన కవి శ్రీ మంగిపూడి వేంకటశర్మ. జానుదెనుఁగు నుడికారములతో తెనుఁగుకవిత కందమును గూర్చి తెనుఁగుదనము నమరిచిన నేరుపరి ఆయన. ఆయనకవితాలత పెక్కు పూవులను పూచి తావులను కొల్లలుగ విరజిమ్మినది. 'మడ్డుకత' ఆతీవను బుట్టిన క్రొత్తపూవు. దాని కమ్మని తెనుఁగువాసనలను భారతి తెనుఁగువారికి పంచియిడినది. దిద్దితీరిచిన పొంకమున నందలి జానుతెనుఁగు దేశిపదముల కూరుపు చదువరుల నూటలూరించును; ఉప్పొంగజేయును. కథావస్తువును ఒక్కయెత్తున నడపించుచు అందలి పాత్రలను కన్నుల యెదుట మెలఁగజేయగల శక్తి యీయనకవితకు గలదు. ఈయనకవితాధార ఎంత సరళమో అంతమధురముగ నుండును. 'కవులు నిరంకుశులు' అనునుడిని సార్థకము చేయగలిగిన సరసపదప్రయోగకుశలుఁ డీకవి. తెనుఁగునాటికి, తెనుఁగుతల్లికి, తెనుఁగుకవితకు, కొంచె పడిపోయిన తేజును మించజేసిన యీ తెనుఁగుకవి తెనుఁగువారలకు కడుంగడు మాననీయుఁడు.

తెనుఁగును సంస్కృతముననుండి విడదీయవలసినదని ఈ నాఁడు తెనుఁగువారు పట్టుదలతో కోరుచున్నారు. కోరదగిన, కోరవలసిన కోరిక అది. కాని తెనుఁగు జాడతప్పినతనపదములపాటును వడిగా చక్కదీసికొని ఒంటిమెయి నిలువజాలినగాని సంస్కృతము చుట్టరికమునుండి విడివడజాలదు. ఈ గుట్టును మనమున బెట్టుకొని నేటికవికుమారులు వేంకటశర్మకవివలెనే తెనుఁగుదనముతో నొప్పులొలుకు తెనుఁగుపుస్తకములను రచియించి తెనుఁగుతల్లి నలంకరించి యామె 'బానిసతనమును' రూపుమాపవలెను; ఆమె దీవనలను గనవలెను. ఇందుకు కొందరు కవికుమారులు కంకణము కట్టియున్నారు; తెనుఁగుతల్లిని తెనుఁగుత్రోవ నడపించుచున్నారు. కొలఁదియేండ్లలోనే ఆమెకు ప్రాభవము చేకూరగలదు.

తెనుఁగు విశ్వకళాపరిషత్తు ఈ కవికుమారులకు చేయూత యిచ్చి తెనుఁగుతల్లిని పెంపొంద జేయకున్న దానిపుట్టువు వ్యర్థము.

'మడ్డుకత' స్కూలు ఫైనల్ తరగతివారు నియమముగా చదువతగినది. అట్టి అవకాశము దానికి కలుగకపోవునేని అది పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారికి తెనుఁగుపయిఁగల ప్రీతికి, వారి అరసికతకు మాయని నిదర్శనము కాఁగలదు.

---

## స్వదేశసంస్థానాలు *

ప్రాచీనకాలమున భారతదేశమునందు సంస్థానములు లెక్కకుమిక్కిలిగ నుండెడివి. ఆనాట నానాట

---

* ఈ గ్రంథము వెల రు. ౦-౮-౦. పోస్టేజి ప్రత్యేకము, ప్రకాశకులు : నార్లవారు, కవుతరం, కృష్ణాజిల్లా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్ని పుట్టెసిని ; కొన్ని నశించెడివి. వానిలో కొన్ని, రాజ్యములు, సామ్రాజ్యములు నయి వెలసినవి. వానిని పాలించురాజులు విద్యావినయసంపన్నులు ; రాజనీతిజ్ఞులు ; పరాక్రమవంతులు ; పరిపాలనదక్షులు ; ప్రజాహితైకపరాయణులు. వారు సకలవిధముల స్వతంత్రులు. వారును పరస్పరము కలహించుచు నొండొరుల రాజ్యముల నాక్రమించుకొనుచుండెడివారు. అది వీరలక్షణమనియు, దేశక్షేమంకరమనియు తలపబడుచుండెడిది. పురాణములు, ఇతిహాసములు, తరువాతిచరిత్రలు వారియౌన్నత్యోదంతములతో నిండిపోయినవి.

అనంతరము మహమ్మదీయులు భారతదేశము నాక్రమింప తలపడిరి. వారు భారతీయరాజ్యములను పెక్కింటిని రూపుమాపి తమప్రభుత్వమును స్థాపించిరి. వారియనుగ్రహమునకు పాత్రములయి కొన్నిరాజ్యములు స్వాతంత్ర్యమును కోలుపోయి నామమాత్రములుగ శేషించినవి. వానిపాలకులు తమ పూర్వోన్నతికి తిలోదకముల నొసగి మహమ్మదీయాచారవ్యవహారముల నవలంబించి భోగాసక్తులయి జీవితములను గడుపుకొనుచుండిరి. ఈ నాటి మహారాజులయందు మెండుకొనియున్న దురాచారములకు,దుష్ప్రవర్తనమునకు,అవినీతికి ఆనాటి మహమ్మదీయప్రభుత్వమే అంకురార్పణము చేసినది. ఇట్లు మహారాజులు దుర్గుణముల కునికిపట్టులగుచుండగనే తరువాత వర్తకమువెషమున భారతదేశమున కేతెంచిన బ్రిటిషువారు వారిని సులువుగ లోబరచుకొని సామ్రాజ్యమును నెలకొలుపగలిగిరి. నేడు వారు బ్రిటిషువారిచేతి కీలుబొమ్మలు. కాని, ప్రవర్తనమున నిరంకుశులుగ నున్నారు. ఈ కారణమున వారిరాజ్యములప్రజ లనేకవిధము లగుబాధలకు పాలగుచున్నారు. నిరంతరభోగపరాయణులగు నామహారాజులు వారిని పీడించి ప్రోగుచేసినధనము, ఇంచుమించుగ నంతయు, ప్రవాహమువలె విదేశములను జేరుచున్నది. దానికి మార్గము లనంతములు. ఈ వివరముల నన్నిటిని కన్యాలాల్ గాబా, చడ్డర్ మొదలగుప్రముఖులు చక్కగా వర్ణించియున్నారు ; పెక్కుపత్రికలును ప్రకటించినవి. భారతదేశము నిచ్ఛానుసారము శాసించు బ్రిటిషువారు ఈమహారాజులవిశృంఖలప్రవర్తనము నరికట్ట నింతలంతల తలపెట్టకుందురు. 'సంస్థానాంతర్గతపరిపాలనలో జోక్యము కలిగించుకొనుట సమంజసము కా'దని 'సాకు' చెప్పుదురు ; సంస్థానాధీశులరక్షణకయి శాసనములను విధింతురు. ఇందువలన మహారాజులప్రవర్తన మింకను నిరంకుశము కాగలదు. 'భారతదేశమున శాంతిసౌఖ్యముల నెలకొలుపుట తమప్రాచి' యని ప్రకటించు బ్రిటిషువారు సంస్థానములప్రజలవిషయమున నౌదాసీన్యము గలిగియుండుట సమంజసము కాజాలదు.

భారతదేశమున మూడవవంతు ఏవంగుణసంపన్నులగు మహారాజుల పరిపాలనమున నున్నది. అందలి ప్రజలు భారతదేశమునందలి ప్రజలలో నైదవవంతు గలరు. వారి మానప్రాణసంపదల స్థితిలయములు పయిన నుడివినటు లాయా మహారాజుల నిగ్రహానుగ్రహముల ననుసరించియుండును. వారి యిడుమలనుగూర్చి తలపెట్టుటయే మహాపరాధము. కాగా వానిని తొలగింప బూనుట బ్రిటిషుభారతమునప్రజల కెట్లు సాధ్యము కాగలదు !

ఇట్టి రాజ్యముల స్థితిగతులను తెలుగువారికి తెలియజెప్పనుద్దేశముననే 'స్వదేశసంస్థానా' లను పేరనీగ్రంథము వెలువడినది. ఇందు మహారాజుల విద్యార్జనము, వివాహము(లు), విలాసలీలలు, వ్యభిచారము, సొంతఖర్చు, దుర్వ్యయము, శాసనసభలు, ఉద్యోగులు, న్యాయవిచారణ, పన్నులు, బేగారి, (బానిసతనమును బోలినది) వారలు ప్రజలకు సమకూర్చిన విద్యా, వైద్య సౌకర్యములు, వారిప్రజలవాక్స్వాతంత్ర్యము మొదలగు వానియందు గల విచిత్రములు, విపరీతలుము నగు లోపములు సంక్షేపముగా, సప్రమాణముగా వివరింపబడినవి. ఈగ్రంథమును చదివినవారు వెనుకటిమహారాజులకు, నేటిమహారాజులకు గల హస్తిమశకాంతరవిభేదమునకు దుఃఖింపక మానరు. బ్రిటిషు సామ్రాజ్యము భారతదేశమున దిటవుగొనిననాడే భారతీయులు స్వాతంత్ర్యమునుకోలుపోయిరి. వా రింతకంటె నేమి చేయగలరు !

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ గ్రంథమును చిరాయువు నార్ల వేంకటేశ్వరరావు రచియించినాడు. అత్తిపండ్లవలె మేలిమి మెయి గాన్పించుచున్న స్వదేశసంస్థానముల లోపలి సరకును వెలిపుచ్చి వెక్కిరించుట యాతని యుద్దేశము కాదు. ఆతడే తనయుద్దేశమును 'సంస్థానప్రజలయినను, సంస్థానేతరులయినను నేడు భారతీయులకందరి కొకటే ధ్యేయము. అది స్వపరిపాలన***ఈ విషయమును బ్రిటిషుప్రభుత్వమువారును, భారతసంస్థానపతులును సుముఖులయి గుర్తింపగలిగినచో, భారతజాతీయాశయసిద్ధికిని, భారతావనికల్యాణమునకును దోహద మొనర్చినవారగుదురు' అని గ్రంథమున తెలియపరచినాడు. అది సఫలమగునేని భారతదేశము అభ్యున్నతిని బడయగలదు.

వేంకటేశ్వరరావు విషయములను సవిమర్శముగ పరిశీలించి సముచితములగువానిని నిపుణతతో నేరుకొనగలడు. జంకుకొంకులు లేక నిష్పక్షపాతదృష్టితో వానిని చర్చింపగలడు. ఆతనిరచనము సజీవముగను, శైలి సరళముగను నుండును. విషయములను నచ్చచెప్పగలయుపజ్ఞ యాతని లేఖినికి గలదు. వర్ధిష్ణులక్షణము లాతనిరచనములయందు కనుపించుచున్నవి. ఇదియంతయు నాంధ్రలోకమునకు తెలియనిది కాదు. ఆతని ధీశక్తి నవనవోన్మేషితయై ఆంధ్రదేశమునకును, ఆంధ్రవాఙ్మయమునకును గౌరవమును సమకూర్పగలదని విశ్వసింపదగియున్నది. ఆంధ్రమహాజనుల యాశీస్సుల కీయువకు డత్యంతయ్యము నర్హుడు.

---



నటరాజ ప్రతిమ
ఏకశిలానిర్మితము మధురదేవాలయము

—యస్. శంకరసుబ్రహ్మణ్యం.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వర్షానంతరము

—యస్. వి. యన్. రామారావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విమర్శనావళి

## విచిత్రరాఘవము

గ్రంథకర్తలు: శతావధానులు, శ్రీ వేంకట పార్థసారథికవులు, నరసారావుపేట. డెమ్మీ ౯౨ పుటలు, వెల ౧-౦-౦.

సంస్కృతమున శ్రీరామభద్రదీక్షితులు వ్రాసిన "జానకీపరిణయ" మనునాటకమున కిది స్వేచ్ఛాంధ్రీకరణము. మూలమున, నాటక మేడంకములలో నున్నది. ఇం దాఱంకములే కలవు. మూలమునందలి రెండవయంకముకథ యిం దించుమించుగ లోపించినది. అందుఁగల అత్రి, అనసూయ మొదంసువారి ప్రవేశ మిందుఁ గానరాదు. వారి ప్రవేశము లేకున్నను కథ సాగఁగలదని కవులు తలఁచియుండవచ్చును.

శ్రీ వేంకట పార్థసారథికవులు రసోచితముగఁ గొన్నియెడల స్వేచ్ఛ నభిలషించి కొంత సంభావణను తగ్గించి, కొన్ని శ్లోకముల నాంధ్రీకరింపకున్నను, మొత్తముపై నిది 'జానకీపరిణయము'న కనువాదమనియే చెప్పవచ్చును. శ్రీ కవులు చేయు తెనిఁగింపులకును, మూలమునకును గొన్నియెడల నానుగుణ్యము కుదుర కున్నది.

౧. మూలశ్లోకము:

"సంసక్తానివ పాతు మాపనిషద
వ్యాహారమాధ్వీరసా
నున్మార్ష్టుం వ్రజసుందరీకుచతటీ
పాటీరరేణూనివ,
ఉన్మీలన్మురళీనినాద బహుళా
మోదోపసీదద్గవీ
జిహ్వాలీఢ మళీకవల్లవశిశోః
పాదాంబుజం పాతు వః."

తె-అనువుగ నైగమాంతవచ
నాసవ మానఁగనో! వ్రజాంగనా
జనకుచ యుగ్మచందనర
జమ్ముల నూడ్చనో; నాఁగఁ బిల్లగ్రో
విని విని చుట్టుఁగ్రమ్ముకొని
వేనుక నావులు నాకుచుండఁగాఁ
దనరు నళీకబాలకు ప
దమ్ములు మీకు శుభమ్ము లీవుతన్.
[తొలిపద్యము.]

మూలమునఁ బాదములందుఁ బంకజత్వ మారోపింపఁబడినది. అది "ఔపనిషదవ్యాహారమాధ్వీరసాన్" అనుదానికి సాధకము. తెలుఁగున నారూపకము విడువఁబడినది. మఱియు "మాధ్వీరస" పదమునకు బదులుగ 'ఆసవ' పద ముంచుట తగదు. "అళీకవల్లవశిశు" పదమునకు "అళీకబాలకుఁడు" అనునది ప్రతిపదము కాఁజాలదు.

౨. మూలశ్లోకము:

సా కన్యా భువనైకమంగళగుణే
రామేఽనురక్తా స్వయం
శ్రుత్వా తజ్జనకేన చాభ్యుపగతం
వంశప్రతిష్ఠావిదా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కిం చానేన వరోపసంగ్రహవిధా
భీతేన లంకాపతేః
స స్వర్గప్రతిసర్గసాహసనిధి
ర్వ్యాగీకృతో లగ్నకః.
[ప్రథమాంకము, శ్లో. ౨]

తే-అవనిజ రాముని వలచె,
నాజనకుండు దశాస్యభీతిచే
నవుననఁ గాదనం జెదవి
యాడక చల్లఁగ గోడమీఁది పి
ల్లివలె నటించె నంత నవ
లీలఁగ దాఁ బ్రతిసృష్టిచేయు ప్రా
భవముకలట్టి కౌశికుఁడు
వారికిఁ దోడ్పడెఁ బూఁటకాఁపుగన్.

సీత రాముని యెడ ననురక్తయగుట నెఱింగి జనకుఁడు వంశప్రతిష్ఠ నెఱుఁగుటచే రామునికి సీత నీయ మక్కువతోనే యున్నట్లు మూలమునఁ గలదు. ఆంధ్రీకరణమున నీవిషయము లేదు. రామునియెడ జనకున కట్టియభిప్రాయము కలదో తెలియుట కష్టము. మఱియు "సాహసము"నకు "ప్రాభవము" ప్రతిపదము కాదు.

3. మూలశ్లోకము:

యావ న్నయాచతి నిశాచరచక్రవర్తీ
కన్యా మతః ప్రథమమేవ రఘూద్వహాయ,
దేయేయ మిత్యభిమతం కుశికాత్మజో మే
నిర్వర్తయిష్యతి నవేతి చిరాయ దూయే.
(అం. ౪.)

తే-తెలిసినరావణుం డడిగి
తీరును ; రెండవకంటివానికిన్
దెలియకయుండఁ గార్యమును
దీరిచి యెట్టులో యొద్దుకెక్కఁగా
వలయును ; పైనఁ గౌశికుఁడు
పట్టుగ నుండెనుగాని యేలకో
బలితపుభీతి చేరి నను
బట్టి పలార్చుచునున్న దక్కటా !
(తృతీయాంకము)

విశ్వామిత్రుఁడు కార్యము ననుకూలింపఁ జేయునో, లేదో యని జనకుఁడు విచారించుచున్నట్లు మూలమునఁ గలదు. తెనిఁగింపులో మాత్రము విశ్వామిత్రుఁడు కార్యమొనరించుననియు, అట్లయినను భయమేలకో కలుగుచున్నదనియు జనకుఁడు చెప్పినట్లు కలదు. ఇందు భయమునకు హేతువు మృగ్యము.

ఇట్లు కొన్నియెడల నాంధ్రీకృతి చక్కఁగ లేకున్నను, కొన్నియెడల మూలముకంటెను సాభిప్రాయముగఁ గలదు.

అంతర్నాటికయందలి తొలిశ్లోకమున ఈశ్వర ప్రార్థనయందు "వహతి వధూం" అని యేకవచనమే కన్పించుచున్నది. తెనిఁగింపులో "భార్యల భరించు" నని బహువచనము కలదు. శివుఁడు మన్మథుని యలుగుల కాకను సైఁపలేక, ఒక్కభార్యనుకాక, ఇరువురు భార్యలను (పార్వతిని, గంగను) భరించె నను చమత్కారము కలుగుచున్నది కావున నాంధ్రీకరణము సమంజసము.

శ్రీ వేం. పా. కవులు మూలమున లేకున్నను, జాలవఱకు తెనుఁగుజాతీయములను తమ కవిత్వమునఁ జొప్పించి యొకశోభఁ దెచ్చియున్నారు. కాని శ్రీరాముఁడు నుప్పునాతి నెఱుఁగకపూర్వమే దూరమునుండి యామెను సీతకుఁ జూపుచు "చూడు చూడు మొక చింపిరితల చుప్పునాతి వచ్చుచున్నది" (పుట ౫౬) అనుట అయుక్తము. ఇది జాతీయమైనది కావచ్చును. కాని ప్రకృతమునకు విరుద్ధము.

మూలమునందువలె నిందును జానకీవిరహవర్ణనము అనుచితముగఁ గలదు. రాముని కౌఁగిలికోసమే సీత పరితపించుచున్నట్లు పెక్కుసారులు వర్ణింపఁబడియున్నది. అది రసోత్కర్షకము కాఁజాలదు. మూలమును తెనిఁగించుటలో స్వేచ్ఛను స్వీకరించిన శ్రీ వేం. పా. కవులు ఈవిషయమున ఒకమెట్టు దిగి వర్ణించిన నెంతయో బాగుండెడిది.

ఇందలి కవిత్వము కఠినశైలిలోలేక హృదయంగమముగ నున్నది. అందుల కుదాహృతపద్యము


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లనే కనవచ్చును. కాని యచ్చటచ్చటఁ గొలఁదిగ అప ప్రయోగములు కానవచ్చుచున్నవి:

పుట. ౮. "చిత్రలేఖన సంబారములు." 'సంబారము' తెలుఁగుపదము. ఈసమాసము తప్పు.

పు. ౧౯ "కలలోనైనను జాగ్రమందయిన". 'జాగ్రము' తప్పు.

పు. ౨౩. పం. ౩౧. "పింగళవేషియగు కాశ్యపుఁడు". కాశ్యపుఁడు కాఁడు, కరాళుఁడు. ఇట్లే ౨౮-వ పుటయందును కాననగును. ఇది ముద్రణస్ఖాలిత్యము కావచ్చును.

పుట ౨౮. "హృదయమా! ధన్యురాలవు. ధన్యురాలవు." ఇచట ధన్యశబ్దమునకు స్త్రీలింగము బాధితము. ఈశబ్దము హృదయమునకు విశేషణము,

పుట. ౮౬ "నాకాఁగింట బంధించివైతువ?" కాఁగిటఅనుట యుక్తము.

పుట. ౪౯. "వాటెని" ఇది ముద్రణస్ఖాలిత్యమగును.

ఇట్లు పరిశీలించిచూచినచో స్ఖాలిత్యములు కన్పించినవి.

మూలగ్రంథమునకు జానకీపరిణయమని రామభద్రదీక్షితులు పెట్టినపేరు. కాని యందు సమగ్రముగ రామాయణకథ వర్ణింపఁబడియున్నది. కాన ఆనామము సముచితముగ లేదు. శ్రీవేం. పా. కవులు తమ యాంధ్రీకృతికి "విచిత్రరాఘవ" మని పేరిడిరి. ఇందు రామాయణకథయంతయు నిబంధింపఁబడియుండుటం బట్టియు, ప్రతిఅంకమున విచిత్రతయుండుటంబట్టియు ఈనామ మీనాటకమున అన్వర్థమగుచున్నది.

భాషాంతరీకరణము కష్టసాధ్యమగుటచే శ్రీ వేం. పా. కవులు రచించిన యీనాటకమునం గొలఁదిలోపము లుండవచ్చును. అవి సామాన్యముగ సర్వసులభములు. మఱియు నిది మీఁదికవుల కవితాలత తొడిగిన తొలిమొగ్గయగుటచే నవి దోషములని లెక్కించుట పాడిగాదు. తమ ప్రథమప్రయత్నము నీరీతిగ వెల్లడిచేయఁగల్గిన కవులు ఇఁకమీఁద రచింపఁబోవు గ్రంథములు ఇతోధికమధురకవితావిలసితములై పండితపామరజన హృదయంగమములై తెలుఁగుతల్లికిఁ దగిన తొడవులు కాఁగలవని నమ్మెద.

ఆంధ్రసోదరు లీనాటకముఁ జదివి యానందించి శ్రీ. వేం. పా. కవులకుఁ బ్రోత్సాహమొసఁగుదురుగాక!

—బులుసు వేంకటరమణయ్య.

---

# స్వీ కా ర ము

## పోతన్న భక్తివైరాగ్యములు

గ్రంథకర్త: శ్రీమతి వాజపేయయాజుల మహాలక్ష్మిగారు, స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురము, కర్నూలు జిల్లా.

డెమ్మీసైజు ౧౧ పుటలు, వెల రు. ౦-౨-౦ లు.

---

## వేదకాలపు స్త్రీలు

గ్రంథకర్త: జటావల్లభుల పురుషోత్తముగారు, బి. ఏ., ఆంధ్రగీర్వాణవిద్యాపీఠాధ్యక్షుడు, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా.

క్రౌనుసైజు, ౧౮౭ పుటలు, వెల రు. ౦-౧౦-౦ లు.

---

## శ్రీరామకృష్ణాంజలి

గ్రంథకర్త: కె. వి. ముకుందరావుగారు, శ్రీ రామకృష్ణసేవాసమితి, నెల్లూరు.

క్రౌనుసైజు, ౮౦ పుటలు, రు ౦-౧-౬ లు.

---

## స్థానికకూటములు

గ్రంథకర్త: టి. శివశంకరముగారు, పెనుగొండ, అనంతపురము జిల్లా.

క్రౌనుసైజు, ౧౯౭ పుటలు, వెల రు. ౧-౦-౦.

---


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శృంగారచంద్రహాసీయము

(నాటకము)

గ్రంథకర్త: మద్దులపల్లి సుబ్రహ్మ శర్మగారు, నరసారావుపేట, గుంటూరు జిల్లా.

డెమ్మీసైజు, ౮౪ పుటలు, వెల రు. ०-౮-० లు.

---

## శుభోదయము

(చూరంటుకొన్నపుడే అగ్గి యారుపవలయునను బోధించు నొక కథ)

గ్రంథకర్త: ముద్దా విశ్వనాథముగారు, వ్యాస కుటీరము, మేలుపాక (విశాఖపట్టణము జిల్లా).

క్రౌనుసైజు, ౩౯ పుటలు; వెల మూడణాలు.

---

## అలంకారమంజరి

గ్రంథకర్త: యస్. వి. రాఘవ అయ్యంగారు, బి.ఏ., బి.ఇడి., బెజవాడ. క్రౌను సైజు ౩०० పుటలు.

---

## దక్కన్ కేసరి

(సచిత్రాంగ్లాంధ్ర మాసపత్రిక)

సంపాదకులు: యం. రామచంద్రరావు, బి. ఏ., ఎ. వి. దత్తాత్రేయ శర్మగార్లు, సికిందరాబాదు. (దక్కను). ఏడాది చందా ౩ రు. విడిప్రతి ౪ అణాలు.

---

## ప్రబుద్ధాంధ్ర; మాసపత్రిక

౪-వ సంపుటం, ౧-వ సంచిక. సంపాదకుడు: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి; సంవత్సరపు చందా రూపాయి, విడిసంచిక అణా నర; విలాసము: కళాభివర్ధనీ పరిషత్తు, రాజమండ్రి.

---



ధారాయంత్రము-కృష్ణరాజసాగరము

—యల్. నారాయణరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సాభిప్రాయ విశేషములు

క్రిస్తుమసుపండుగలు క్రైస్తవమతస్థులకు వింతలకు, వినోదములకు, క్రైస్తవారాధనలకువలెను హిందూదేశీయులకు మహాసభల వినోదములకు వినియోగపడుచున్నవి. డిసంబరుమాసాంతమునందు హిందూస్థానమునందు సమావేశములైన మహాసభావ్యవహారముల నవలోకించినపుడు సంభ్రమము గలుగుచున్నది. విద్యాదక్షులైన శాస్త్రకళాకోవిదులకు సభావేదికలు ప్రతిష్ఠకుసాధనము లైనను సామాన్యులకు సభావ్యవహారములు దుస్సహములుగ నున్నవి. ప్రారంభోపన్యాసములు, అధ్యక్షోపన్యాసములు, సభావ్యవహారములు, ఉపన్యాసములు పత్రికల కాహారమును సమకూర్చుచున్నను ప్రజలకును, దేశమునకును గలుగజేయుచున్న ప్రయోజనము లత్యల్పములు. ప్రజలకు సభావినోదములును ప్రదర్శనములవినోదములవలెను కాలహరణమునకును, ధనవ్యయమునకును సాధనములుగ నున్నవి. చెన్నపురియందు గూడిన సంగీత సాహిత్యకళాశాస్త్ర మత సాంఘిక రాజకీయార్థికాది సమావేశముల వృత్తాంతమును పర్యాలోచనము చేయునపుడు మానవధర్మాభ్యుదయమునకు జరుగుచున్న భావపరివర్తన మాశాజనకముగనున్నను ప్రయోజన మతి స్వల్పముగ గనుపడుచున్నది. ప్రపంచవ్యవహారములందు సిద్ధాంతోపదేశములకు గల ప్రతిష్ఠ కర్మధర్మయోగములకు గలుగకుండుట సంతాపకరము. ప్రపంచవ్యవహారములందు మానవధర్మాభ్యుదయమునకు సకలాంగములును సాధనములైనను ప్రజాలక్ష్యము వర్తమానకాలమునందు సకల రాజ్యములందును, రాజ్యాంగములందును లగ్నమగుచున్నది. రాజ్యాంగములందు గల మహాసంచలనము సాంఘికార్థికమతాచారములందును గోచరంబగుచున్నది. ప్రపంచవ్యాప్తమైన మహాపరివర్తనము ధర్మాభ్యుదయమునకై వినియోగపడుచున్న విధమును డిసంబరుమాసాంతమునందు దేశమునందంతటను సమావేశమైన మహాసభలు విశదము చేయుచున్నవి. వేదాంతమహాసభ వేదాంతాచారములను సమన్వయము చేయుటకు ప్రయత్నములను చేయుచున్నది. ప్రకృతిశాస్త్రమహాసభ సకల శాస్త్రములను, కళలను సాహిత్యములను నేకాంతము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకు సమన్వయము చేయుటకు ప్రయత్నము చేసినది. గాయక మహాసభ, నాటక పరిషత్తు నిత్యజీవనమునందు కళాప్రయోజనములను సార్థకముచేయుటకు సంకల్పము చేసినవి. ప్రపంచవ్యాప్తమైన విషయారాధనము మానవధర్మాభ్యుదయమునకు వినియోగపడక ధర్మవిప్లవమును కలుగజేయుట ప్రపంచావృతమైన దురదృష్టము. ప్రపంచ వ్యాప్తమైన విషాదావస్థయందు గాంధిమహాత్ముని హరిజనధర్మయాత్ర మానవధర్మాభ్యుదయమున కాశాజనకముగ నున్నది.

---



మార్కండేయ సంరక్షణము
(శిలాశిల్పము) మధుర దేవాలయము
ఎడమవైపున మార్కండేయ ప్రతిమ కలదు.

—యస్. శంకర సుబ్రహ్మణ్యం.

Printed and Published by C. Seshagiri Rao, B. A.: at the Andhra-Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.
Editor: G. Subbaramayya.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, సంచిక ౨

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రివర్ణచిత్రములు : బిచ్చగాడు; శ్రావణమాసము; భాద్రపదమాసము.

సాధారణచిత్రములు—శ్రీరంగచిత్రములు ౫; విశ్వభారతిచిత్రములు ౫; సంక్రాంతి ముగ్గులు; ఇతరచిత్రములును.

---

సవరణ :—గతమాసములో ప్రచురింపబడిన "సంతాననిరోధసిద్ధాంతము; హిందూదేశము" అను నావ్యాసములో "సంతాననిరోధమునుగూర్చి "Eugenics" అను గొప్పశాస్త్రము తయారైనది" అని వ్రాసియుంటిని. అది పొరపాటు.

రెండునూ ప్రజోత్పత్తి సంబంధించినవైనను, వాటికిగలభేదము విస్తారము. సంతాననిరోధసిద్ధాంతము జనసంఖ్యకు సంబంధించినదై, సర్వసామాన్యముగ నిరోధమునే బోధించును. ఇక "Eugenics" అనుశాస్త్రము "జనసంఖ్య"తో సంబంధములేక, జీవోత్పత్తిచేయుటకు, అర్హతానర్హతల సూచించును —చ. శ్రీ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



బి చ్చ గా డు

—మాధవపెద్ది గోపాలకృష్ణగోఖలే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




సంపు. ౧౧ శ్రీముఖ సంవత్సరము, మాఘమాసము (ఫిబ్రవరి ౧౯౩౪) సంఖ్య ౨

## సుప్రభాతము, ౧

కైలాసవాసి (శ్రీ) జనమంచి వేంకటరామయ్య

ఉదయమయ్యెను బాలార్కు - నుదయమయ్యె,-సుదినమయ్యెను గనువిచ్చు సుకృతులకును;
జాలమేల్కని వేఁకువజామునందుఁ - గన్నుమూసినవారికిఁ గాదుగాని,
పుష్పితోద్యానలతలపైఁ బోలె నతని - మృదుకరస్పర్శ ప్రసరించె మెల్లమెల్ల
ముందుగా లేచి స్వాగతం బందియిచ్చు - ౧తనదుపేరిటి దేశపుతరుణులపయి.
ఏమంత్రము జపియించిరో - నీమము నిష్ఠయును మెఱయ నెలఁతలు తా మిం
కేమేమి పూజలిడిరో - యామిత్రు కృపాకటాక్ష మందుట కోహో!
దేవకన్యకలట్లు లా తెఱవ లతని - దివ్యతేజంబుఁ దాల్చిరి భవ్యమతిని;
కాని కుంతీమహాదేవి పూనినట్లు - గర్భములయందుమాత్రమే కాదుసుండీ.
కామసుఁడి యింక సుతుని నొక్కరుని శక్తి-ధరుని గనఁగోరియున్నఁగాదు; తాల్చి రద్ది
నిత్యకల్యాణు లగుచును నెగడుకొఱకె - స్వీయ సకలాంగ రమ్యజీవితములందె.
ఒకయపూర్వశక్తి యొకనూతనోత్సాహ - మొకయపూర్వనాగరకత గలుగ;
నూతనాభిలాష నూత్నభావనములు - సందడింపఁ బొదలి డెందములను;
వీరపత్ను లటంచునున్ బహువీరమాత లటంచునున్
ధీరలంచును శాంతలంచును ధీవిశారద లంచు, శ్స్రం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. జపాను దేశము.

గార శిల్పకళా కలాపవికాసభాసురమూర్తులం
చారా! పేరువహింతు రీ యుదయార్క దేశ వధూమణుల్.
అచ్చరలువోలె నందనోద్యానములను - గుమ్మటములట్టి కేళీగృహమ్ములందుఁ
దల్లులును బిల్లలును వేడ్కలుల్లసిల్ల - మెలఁగుచుందురు తత్సీమ మెఱుఁగుఁబోండ్లు.
కలరే దేవతలంచు నొక్కెడను? స్వర్గంబంచు నెందేని? భూ
తలమే స్వర్గము, మర్త్యులే సురలు, నిత్యక్షేమ సంతోష స
త్ఫల మెద్దాన లభించునో యదియె తత్కల్పద్రుమం; బింకనీ
యిల స్వాతంత్ర్యమొసంగలేని శుభమున్నే మోక్షమే యిచ్చెడున్.
ఏ తేజఃప్రసరంబుచేతఁ గనిరో యీజాతి యీపెంపుసొం
పా తేజోవిసరంబు నడ్డుచు పరుం డర్కోపలంబట్లు, వి
ద్యోతంబౌ నెఱగంట నిప్పుమియ నుద్యోగించి, తీవ్రాగ్నిసం
పాతంబున్ సహియింప కోడి వదలెన్ [౧]భల్లూకపుంబ ట్టొగిన్.
జయభేరుల్ మొఱయించి రంతట మహోత్సాహంబు సంధిల్ల, దు
ర్జయులై శాంతమహాసముద్రమునకున్ సంక్షోభముం జేసిన
ట్టి యరివ్యూహముఁ జించి చెండి యచటం డెక్కెంబు నెక్కొల్పి నూ
త్నయుగస్థాపకులై యపశ్చిములు తద్బాలార్క దేశోద్భవుల్.
ఆడంజొచ్చిరి, పాడఁజొచ్చిరి, యమందానందవారాశి నో
లాడంజొచ్చిరి; తెల్లదీవిదొర లౌరా! యద్భుతం బిద్ది! యే
నాఁడుం జూడము గుండ్లు దేలె నడుగంటన్ బెండులంచున్ మదిం
బ్రోడల్ గావున "మాకుఁ దోడగుచు నిల్వుం" డంచుఁ గేల్వట్టినన్.
మును బ్రహ్మర్షి పదంబు నందుటకునై పుణ్యవ్రతంబుల్ సుని
ష్ఠను గావించి కృతార్థతం గనిన విశ్వామిత్రులుంబోలె, భా
జనులై యీజను లగ్రజాతులయు నీర్ష్యాదృష్టికిన్ మైత్రికిన్
ఘనులై యుండ్రదు స్వారాజ్య మందుఁ గని మోక్ష శ్రీ సుఖానందముల్.
జ్యోతిర్మండల మొందు నూతనముగన్ వ్యోమంబు నీమంబునం
దోతేరన్ విని తద్విశేష మరయం దోడ్తోడ యంత్రంబులం
జేతం దాల్చి పరీక్షకుల్ బలెనె సంసేవింత్రు వైదేశికుల్
ప్రాతస్సూర్యుని ద్వీపమండలముఁ దద్వారాశిమధ్యంబునన్.
చతురంభోధి పరీత భూతల మహాసామ్రాజ్యధౌరేయుఁడై
అమల ప్రాభవవైభవోన్నతజయప్రారంభ సంరంభుఁడై
కృతరాగాతిశయ ప్రజాహృదయ నీరేజాసనాసీనుఁడై
క్షితిఁబాలించును దద్విభుండు మహిత శ్రీ భోగ దేవేంద్రుఁడై.

---

౧. The Russian Bar. రష్యావారి భల్లూకధ్వజులు. ఇచ్చట రష్యాజపాను యుద్ధము సూచితము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సంస్కృతము దేశభాషగనుండినదా ?

ఉభయభాషా-సాహిత్యవిద్యా-ప్రవీణ బులుసు వేంకటరమణయ్య

పై శీర్షికతో శ్రీ ఒంగోలు వేంకట రంగయ్య పంతులుగారు (బి. ఏ., బి. యల్.,) కడచిన భాద్రపదమాస 'భారతి' యందు వ్యాసము నొకదానిని ప్రకటించి యున్నారు. ఆవ్యాసమునుబట్టి సంస్కృతము ఒకపుడు దేశభాషగ నుండినట్లు వారి మత మని తెలియవచ్చుచున్నది.

సంస్కృత మెప్పుడైన వాడుకభాషగ నుండినదా, లేదా అను సందేహము, వాద వివాదములు చాలకాలమునుండియుఁ గలవు. పాశ్చాత్యులే కాక భారతీయులుకూడఁ గొందఱు, ఇరుతెగలకుఁ జెందినవారు కలరు. నిష్పక్షపాతముగ గమనించినచో సంస్కృ తము వాడుకభాషమై యుండెడి దనువారి యుక్తులు దృఢతరములు కానట్లు చెప్పవలసి యున్నది.

సంస్కృతము వ్యవహారమున నుండెడి దని యన్నచో దానియెడ నాదర మున్న ట్లును, లేనిచో లేనట్లును సహృదయులు తలంపకుందురుగాక ! వ్యవహారమున లేనంత మాత్రమున సంస్కృతమునకుఁ గల గౌర వము నశింపదు. ఆభాషయందు రచింపఁ బడిన యమూల్యగ్రంథములు చప్పఁబడి పోవు. భాషాతత్త్వమును గుర్తెఱుఁగఁ దలఁచిన నిష్పాక్షికముగ విమర్శించుట సహృదయులగు విమర్శకులకు కర్తవ్యము.

సంస్కృతము పండితవ్యవహారమున నుండినదనియును, అమూల్యములగు గ్రంథ ము లాభాషయందే రచింపఁబడియున్న వనియు, అందుచేత నది యెన్నఁటికిని కల్పితమగు భాష కాఁజాలదనియును శ్రీ పంతులుగారు వ్రాసియున్నారు. కాని భాష యనునది సర్వమును మనము కల్పించుకొని నదే కాని యనాదిసిద్ధము కాదు.

సంస్కృతము వ్యావహారిక మగునా, కాదా యనువిషయమున మనప్రాచీనులు కంఠోక్తిగ నేమియుఁ జెప్పియుండలేదు. కాని వారి గ్రంథములనుబట్టి కొంతవఱకు వారియభిప్రాయమును మన మూహింప వీలగును.

"సంస్కృతం సంస్కృతం విద్యాత్ ప్రాకృతం ప్రాకృతం మతమ్" అనుదానిం బట్టి సంస్కృతమునకుఁ బ్రాకృతమే మూల మనియు, "ప్రకృతిః సంస్కృతమ్, తత్తో భవం ప్రాకృతమ్" అను ప్రాకృతవ్యా కర్తలసూక్తింబట్టి ప్రాకృతమునకు సంస్కృ తమే మూలమనియుఁ దెలియుచున్నది. కాన నిట్టి దుర్బలప్రమాణములను విడిచి



2- CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సయుక్తికమగు భాషాతత్త్వవేత్తల యభిప్రాయము ననుసరించుటయే శ్రేయము.

సంస్కృతభాషాతత్త్వమును గుర్తించుటకుఁ బరమప్రామాణికుండును, ప్రధాన వైయాకరణుఁడును నగు పతంజలిమహర్షి రచించిన మహాభాష్యము చాలసహకారియై యున్నది. దానింబట్టి సంస్కృతము వ్యవహారమున లేనట్టిభాషయే యని నిశ్చయింపవచ్చునని యిదివఱకు మద్గురువర్యులును, విజయనగర సంస్కృతకళాశాలాధ్యక్షులును అగు శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు (యం. ఏ.,) వివరించియున్నారు. (చూ. "సంస్కృతభాష - ప్రాకృతభాష" విభవ చైత్రమాసభారతి. సంపు. ౫. సం ౮.)

పతంజలిమహర్షి వ్యాకరణప్రయోజనము నుగ్గడింపుచు "బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవై, నాపభాషితవై, మ్లేచ్ఛా మాభూమేత్యధ్యేయం వ్యాకరణమ్." [౧-౧-౧.] అని చెప్పి "హేలయ-గావీ-గోణీ-" అను ప్రాకృతశబ్దములనే యపశబ్దములక్రింద నిచ్చియున్నాఁడు. అతఁ డిట్లే చాలచోట్లఁ బ్రాకృతరూపములనే యిచ్చుటచేత నతనిమతమున నపశబ్దమనఁ బ్రాకృతమనియే యూహింపవలెను. న్యాయమునుబట్టి యతఁడు సంస్కృతాపశబ్దములనే యుదాహరింపవలసియున్నది. సంస్కృతము వ్యవహారమున లేనందున, సంస్కృతాపశబ్దములు లభింపకపోఁగాఁ బతంజలి ప్రాకృతమును గ్రహింపవలసివచ్చినది.

లోకమున వ్యవహారమునందున్న భాష వేఱనియు,శిష్టప్రయుక్తమగు భాష వేఱనియు మహాభాష్యమువలననే తెలియవచ్చుచున్నది. "లోకేహి కృష్యర్థే కపిం ప్రయుంజతే, దృశ్యర్థేచ దిశమ్" (౧—౩—౨) అనురీతి భాగములు మీఁదివిషయమునఁ బ్రమాణములు.

మఱియు వ్యాకరణము నభ్యసింపనిది సంస్కృతము మాటలాడుటకు రాదని పతంజలి చెప్పియున్నాఁడు. "శిష్టజ్ఞానార్థాఽష్టాధ్యాయీ......మానవస్య దైవానుగ్రహస్వభావో వా యోఽయం స చాష్టాధ్యాయీ మధీతే యేనాత్ర విహితాః శబ్దాస్తాంశ్చ ప్రయుఙ్క్తే" (౬—౩—౧౧౯ సూత్రముపైఁగలభాష్యము.) అనుభాష్యమిందుఁ బ్రమాణము. సంస్కృతము వ్యావహారికమే యైనచో వ్యాకరణము నభ్యసింపకయే దానిని వాడవచ్చునుగదా!

శిష్టులుకూడ నెల్లపుడును సంస్కృతము నుపయోగించినట్లు లేదు. యజ్ఞసమయములందే దానిని వాడుటలో వారికిఁ బట్టుదల యున్నట్లు "......యజ్ఞే పునః కర్మణి నాపభాషన్తే" (౧—౧—౧ సూ. భా.) మొదలగువానివలనఁ దెలిసికొనవీలగును. కావున ప్రాకృతమే సర్వసామాన్యముగ వాడుకభాష యైనట్లు నిశ్చయింపనవకాశము కలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రీస్తునకుఁ బూర్వము మన దేశమునకు వచ్చినగ్రీకులు మొ. పాశ్చాత్యులు తమ గ్రంథములందుఁ బేర్కొనిన భారతీయుల నామములు "హిరణ్ణబాహ, చంద్రగొత్త" మొదలగునవి ప్రాకృతరూపములుగనే యున్నవి. కాని హిరణ్యవాహ, చంద్రగుప్త-అను రీతిని సంస్కృతరూపములై యుండలేదు. దానింబట్టి యప్పటికి సంస్కృతము వ్యవహార మున లేదని చెప్పవలెను.

సర్వజనసాధారణముగ వ్యవహారమున నుండెడిభాషకుఁ బరిణామము కలుగుచుం డుట స్వభావము. ప్రస్తుతమున వాడుకభాష లన్నియు నీవిషయమున మనకుఁ బ్రమాణ ములు. వేలకొలఁది సంవత్సరములక్రిందటఁ బుట్టిన సంస్కృతము నాఁటికి నేఁటికి నొక్క రీతిగనే యున్నది. కావున నది వ్యవహార సిద్ధము కాదు.

వ్యవహారమున నున్నభాషకు లిపి యుం డితీరవలెను. సంస్కృతమునకు లిపి లేదు. సంస్కృతవాఙ్మయ మితరలిపులపైనే యాధా రపడియున్నది.

సంస్కృతాలంకారికులు "కురు రుచిమ్" అనుపదద్వయమును మార్చి "రుచిం కురు" అని ప్రయోగించినచో దోషమగునని చెప్పుచున్నారు. పై పదద్వయసంయోగము వలన 'చింకు' అను నర్థప్రతీతి కలుగు ననియు, నది మహారాష్ట్రభాషయం దస భ్యార్థప్రతిపాదకమనియు వారియాశయము. సంస్కృతమునమాత్ర మెట్టియసభ్యతయు లేదు. అట్టియెడల సంస్కృతమునకు లక్ష ణము నియమించు నాలంకారికులు మహా రాష్ట్రభాషావిషయమై చర్చింపఁబూనుకొను టేల? ఒకభాషయందు సులలితమగుపదము వేఱొకభాషయందు దుష్ట మగుచుండును. కావున సర్వభాషాసామాన్యముగ దుష్టాదుష్టపరిగణనము చేయుట దుష్క రము. అట్లయినను మహారాష్ట్రవిషయ విమర్శనంబట్టి మహారాష్ట్రభాష వ్యవహార మున నుండెడిభాషయనియు, సంస్కృత గ్రంథకర్తలు తమవ్యవహారమున నాభాషనే యుపయోగించెడివారనియు, అందుచే 'రుచిం కురు' అనునది యసభ్యమని వారిమత మనియు, సంస్కృతము కేవలము గ్రంథస్థ మగుభాషయే యనియుఁ జెప్పవచ్చును. మహారాష్ట్రభాషయనఁగాఁ బ్రాకృతము. వరరుచి ప్రాకృతమనఁగా మహారాష్ట్రి యనియే చెప్పియున్నాఁడు. దండి "మహా రాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః" అని పైవరరుచిమతమునే యవలం బించెను.

సంస్కృతము వ్యావహారికభాషగ నుం డినదనువారు ఆభాష యెప్పుడు,ఎప్పటినుండి, యెప్పటివఱకు వ్యవహారమున నుండినదో చెప్పవలసియున్నది.

వేదయుగమునం దాభాష వ్యవహార మున నుండినదనుటకు వీలుపడదు. అట్లే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైనచో శిష్టులు, విద్వాంసులు మొదలగువా రుపయోగించు నాభాషయందుఁగాక వైదిక భాషయందు వేదములు రచింపఁబడుట పొసఁగదు. మతాంతరులు సర్వజనవ్యవహారమున నున్న దేశభాష (ప్రాకృతము) లో గ్రంథములను రచించుటచేత, వారియెడఁగల ద్వేషము-అనాదరము భాషయెడఁగూడ నార్యులకుఁ గలిగినది. కావుననే వారు భాషను సంస్కరించి మతగ్రంథములకొఱకు-శిష్టవ్యవహారముకొఱకును భాషాంతరమును గల్పింపవలసివచ్చినది.

అనేకస్థలములయం దొక్కటేభాష వాడుకచేయఁబడునపుడు భాష మాఱిపోవుచు విభిన్నరూపములను గల్గియుండును. కావుననే వ్యవహారమందుండెడి ప్రాకృతము మహారాష్ట్రి-శౌరసేని - మాగధి-పైశాచి - మొదలగువిధములుగ మాఱెను. ప్రస్తుతమునఁగూడ హిందీ-బెంగాలీ-తెలుఁగు- అఱవము-కన్నడము మొదలగుభాషలు అనేకవిధము లగుచున్నవి. కాని సంస్కృతమున నట్టిభేదము కన్పింపదు.

సంస్కృతము వ్యవహారమున నుండెడిదనుటకు శ్రీ వేంకటరంగయ్యపంతులుగారు రామాయణము నుదాహరణముగ నిచ్చినారు. ఇల్వలుఁడు బ్రాహ్మణరూపమును ధరించి సంస్కృతముమాటలాడుట యొక ప్రమాణము. సంస్కృతము సర్వజనవ్యవహారమున నుండనేని యిల్వలుఁడు దానికొఱకు బ్రాహ్మణరూపము ధరింపనేల? సంస్కృతము మాట్లాడుట యొకవిశేషముగఁగవి చెప్పనేల? శ్రీపంతులుగారి ప్రమాణము ప్రతికూలవాదులకే యనుగుణము.

హనుమంతుఁడు సీతతో మాటలాడునపుడు మానుషసంస్కృతము నుపయోగించినట్లును, దానింబట్టి సంస్కృతము సాధారణజనవ్యవహారమునఁగూడ నుండినట్లు నిశ్చయింపవచ్చు ననియు శ్రీపంతులుగారు వ్రాసియున్నారు. రామాయణమున హనుమంతుఁడు మున్ముందు సీతతో నెట్లు ఏ భాషలో మాట్లాడవలెనో తనలోఁ దానే తర్కించుకొనుచున్న సందర్భమునం దీక్రింది శ్లోకములు కలవు.

"అహం హ్యతితనుశ్చైవ వానరశ్చ విశేషతః,
వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్.
యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్,
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి.
అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్,
మయా సాంత్వయితుం శక్యా నాన్యథేయ మనిందితా."
—సుందరకాండము 30 సర్గ. ౧౭-౧౯.

"నేను వానరుఁడను. కాని నేను మనుష్యుల వ్యవహారభాషను, విశేషించి సంస్కృతమున మాటాడెదను. కాని కేవలము ద్విజాతుల (వేదశాస్త్రములఁ బఠించి, వ్యాకరణసంస్కృతమగు భాషను మాట్లాడు వారి) వలె సంస్కృతమును మాట్లాడితినా, ఇది రావణునిమాయయే యనుకొని సీత భయపడును. కావున అర్థవంతమగు మానవ భాషను, నే మాటాడెదను" అని యూంజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేయుఁడు నిశ్చయించుకొనెను. "మానుషీ" శబ్దమునకు మనుష్యుల వ్యవహారసిద్ధమైనదనియు, "సంస్కృత"శబ్దమునకు వ్యాకరణసంస్కృతమైనదనియు నర్థములు వ్యాఖ్యానమునందుఁ గలవు. "వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్" అనుచోట మానుషీ శబ్దము సంస్కృతాశబ్దవిశేషణము కాదు. "మానుషీం వాచ ముదాహరిష్యామి, సంస్కృతాంచ వాచమ్"అనియే సమన్వయముచేయవలెను. కావున పంతులవారనినట్లు విపరీతముగ సమన్వయించి అసలు సంస్కృతముకంటె భిన్నమగు మానుషసంస్కృతము ఒకటికలదనిచెప్పి, సంస్కృతము వ్యవహారమున నుండినదనుటకు దానిని ప్రమాణీకరించుటకు నలనుగాదు.

శ్రీ పంతులుగారు మహాభారతమునుండి యిచ్చిన ప్రమాణముకూడ నట్టిదే. 'హేహతే' మొదలగుపదములు వాడుకలో నున్న వనుటకుఁబ్రమాణము లేదు. 'హదే' మొదలగు ప్రాకృతపదములు సంస్కరింపఁబడి యట్టి సంస్కృతరూపము లేర్పడినవి. భారతము సంస్కృతగ్రంథమగుటచే ప్రాకృతపదములు కాక సంస్కృతపదములే యందుఁ గానవచ్చుచున్నవి.

సంస్కృతము దేశభాషగ నుండనిచో మృచ్ఛకటికమునందలి చారుదత్తాభియోగసంవిధానము కుదురదని పంతులుగారి తలంపు. కాని చారుదత్తాభియోగమంతయు సంస్కృతమున లేదు. ఉత్తమపాత్రలగు న్యాయాధికారి, చారుదత్తుఁడు మొదలగువారికి సంస్కృతము, నీచపాత్రములకు, స్త్రీలకు ప్రాకృతమును ఉపయోగింపఁబడినవి. అభియోగమంతయు సంస్కృతమునందే యున్నప్పుడు పంతులుగారివాదమున కది యుపయోగించును. మీదుమిక్కిలి వారిచ్చినప్రమాణమే ప్రతివాదులకెంతయు నుపకారకము. సంస్కృతము కల్పితమై, చదువుకొనినవారుమాత్రము తెలిసికొనుభాష యగుటచేతనే చదువురానివారికి దృశ్యకావ్యములందుఁ బ్రాకృత ముపయోగింపఁబడెను.

సంస్కృతము సర్వజనవ్యవహారమున నున్నచో ప్రాకృతము నణంగఁద్రొక్క సంకల్పించిన సంస్కృతగ్రంథకర్తలు తమదృశ్యకావ్యములయందుఁ బ్రాకృతమునకుఁ బ్రవేశము నిచ్చియేయుండరు.

దేశభేదములం బట్టి సంస్కృతపదప్రయోగము వేఱయినట్లు తెలియుచున్నదనియు, సంస్కృతము వాడుకలో నున్నప్పుడే యట్టి పదప్రయోగభేదము కుదురుననియు శ్రీ పంతులుగారు వ్రాసిరి. అట్టి పదప్రయోగభేదమును వారు చాలవఱకుఁ జూపించిరి. పదప్రయోగభేదముండుట నంగీకరింప నభ్యంతరములేదు. కాని దానింబట్టి భాషయొక్క తత్త్వమును నిశ్చయించుట కష్టము. ఇప్పుడు సంస్కృతము వ్యవహారమున లేదనుట సర్వజనాంగీకృతమేకదా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని యిప్పుడుకూడ దేశభేదమునుబట్టి పద ప్రయోగములు మాఱుచున్నవి.

"కాలేజీ" యనునర్థమున మనవారు "కళాశాలా" పదమును, కర్ణాటకులు "మహాపాఠశాలా" పదమును, ఔత్తరాహులు "విద్యాలయ" పదమును వాడుచున్నారు. "సెలవు" అనునర్థమున "విరామ" పదమును, "తీరిక" అనునర్థమున "అవకాశ" పదమును మనవాడుకలోఁ గలవు. ఉత్తరదేశీయులు "సెలవు" అనునర్థమున "అవకాశ" పదమునే వాడెదరు. "రీడింగురూము" మన దేశమున "పఠన మందిరము" గనున్నది. ఔత్తరాహులు "వాచనాలయము" గఁ బేర్కొందురు. దీనింబట్టి సంస్కృత మిపుడు దేశభాషయగునా? శ్రీపంతులుగారీసందర్భమున వైయాకరణులను బేర్కొనునపుడు వరరుచిని తొలుతను, పాణిని నాపిదపను నిల్పిరి. పాణినిని మొదటను, వరరుచిని పిదపను చెప్పవలసియున్నది. లేనిచోఁ జరిత్ర పరిశోధకులయు, వైయాకరణులయు సిద్ధాంతములకు భంగమువాటిల్లును.

ఇంతవఱకు నిరూపింపఁబడిన కారణములంబట్టి సంస్కృత మెకప్పుడును దేశభాషగ లేదని చెప్పవలసివచ్చుచున్నది. కాని దేశభాష కానిమాత్రమున దానిగౌరవము నశించునది కాదు. భాష లన్నింటియందును సంస్కృతమే యుత్కృష్టమైనది. అందుఁ గల యమూల్యగ్రంథములు మఱేభాషలోను లేవు. ఇంచుమించుగ భారతదేశమునందలి భాష లన్నింటికి నదియే మూలమైయున్నది.

క్రీస్తుపూర్వమునకంటె నతనివెనుక ఆర్యులనాగరికత యభివృద్ధి నొందినది. అది భాషావిషయమునఁగూడఁ గల్గినది. ఆనాగరకతయే వారిచేఁ బ్రాకృతమును సంస్కరింపఁజేసి మధురమధుర మగు, అమూల్యమగు భాష యుత్పన్నమగుటకుఁ గారణమైనది. ప్రాకృతముకంటె సంస్కృత మెన్నియో మడుంగుల సుకర మనియు, స్పష్టోచ్చారణ కలదనియు, మధురమైనదనియు నందఱు నంగీకరింపవలసియున్నది. కావుననే సంస్కృతమునకుఁ బురోభివృద్ధి కలిగి ప్రాకృత వాఙ్మయ మడుగంటినది.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శాస్త్రకవుల రచనలు

మల్లాది రామకృష్ణశాస్త్రి

[పాండిత్యానికి పరమార్థం-అవధి-తర్కకర్కశ వచోవిధానమే అని ఛాందసుల సిద్ధాంతము. కాని సాహిత్యలోకం దీనికి ఎదురుజవాబు చెప్తూ ఉన్నది. పండితులు-శాస్త్రాచార్యులు కవితాకన్యకు రసికబాంధవులని నిదర్శనములు చాలా కనబడుతూ ఉన్నవి.]

౧. అశ్వఘోషుడు (ప్రసిద్ధబౌద్ధాచార్యుడు)[౧]

నైవాకృతిః ఫలతి నైవ కులం నశీలం
విద్యా సహస్రగుణితా నచ వాగ్విశుద్ధిః,
కర్మాణి పూర్వశుభసంచయసంచితాని
కాలే ఫలంతి పురుషస్య యథైవ వృక్షః.

౨. ఆనందవర్ధనాచార్యుడు (ఆలంకారికుడు - ధ్వన్యాలోకకారుడు)[౨]

ఆక్రందాస్తని తై ర్విలోచనజలా
న్యశ్రాంతధారాంబుభి
స్త్వద్విచ్ఛేదభువస్య శోకశిఖిన
స్తుల్యా స్తడిద్విభ్రమైః,
అంత ర్మే దయితా ముఖంతవ
శశీ వృత్తిః సమా ప్యావయో
స్తత్కిం మా మనిశం సఖే
జలధర, త్వం దగ్ధు మేవోద్యతః.

౩. ఆర్యభట్టు (జ్యోతిష సిద్ధాంతసర్వాధికారి)

ఏకత్ర నాస్య రతి రిత్యవధూయమానః
కోపాదివ శ్వసనకంపవిఘూర్ణితాయాః,
రక్తచ్ఛదం మధు సుగంధి సరోరుహిణ్యా
భృంగ శ్చుచుంబ కమలానన మాదరేణ.

౪. భట్టేందురాజు (అభినవగుప్తాచార్యుని గురువు)[౩]

ఉదస్యోచ్చైః పుచ్ఛం శిరసి నిహితం జీర్ణ జటిలం
యదుచ్ఛావ్యాపన్న ద్విపపిశిత లేశాః కవలితాః,
గుహాగర్తే శూన్యే సుచిర ముషితం జంబుకసఖే
కిమేతస్మి న్కర్మో యదసి నగతః సింహసమతామ్.

౫. ఇంద్రదత్తాచార్యుడు (ఐంద్రవ్యాకరణకారుడు)[౪]

కర్ణికారలతాః పుల్ల
కుసుమాకులషట్పదాః,
సకజ్జలశిఖా రేజు
ర్దీపమాలా ఇవోజ్జ్వలాః.

---

౧. బుద్ధచరితమును రచించిన మహాకవి-ఇత్సింగ్ (౭-వ శతాబ్ది) ఈతనిని దార్శనికుడగు పండితుడని, ప్రాచీనునిగా కీర్తించి యున్నాడు. మాక్సుమూలర్ పండితు డీతనినిగూర్చి అమూల్యమగు పరిశోధన జరిపియున్నాడు.
—India, what can it teach us—p. ౩౧౨.

౨. బూలర్ పండితుడు తోలుదొ్ల ఆలోకమును సంపాదించి ప్రకటించినవాడు—

ధ్వన్యాలోకమునేకాక ధర్మోత్తమ వినిశ్చయటీకకు వివృతిని, విషమబాణలీల అను ప్రాకృతకావ్యమును, అర్జునచరిత, హరివిజయ, మతపరీక్షాదిగ్రంథములనుకూడ రచించినాడని తెలియుచున్నది—(మధుమథనవిజయముకూడ (తృతీయోద్యోతమునం దీగ్రంథమునుండి ఒకపద్య ముదాహరింపబడినది) ఈతనిదేనని పీటర్సన్ అభిప్రాయము.) (బూలర్, కాశ్మీరనివేదిక...౬౫ పే.)

౩. అభినవగుప్తపాదుల గురువు - (కాత్యాయనగోత్రికుడు, ఆచార్యభూతిరాజకుమారుడని భగవద్గీతటీక-అభినవగుప్తునిది-వలన తెలుస్తూ ఉన్నది. ఉద్భటుని అలంకారసంగ్రహమునకు వ్యాఖ్యానమొనరించిన ప్రతీహారేందురా జీతడేనని పీటర్సన్ అభిప్రాయము.)

౪. కథాసరిత్సాగరము ననుసరించి పాణినిగురుపాదులగు ఉపవర్షోపాధ్యాయుని శిష్యుడని తెలియుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౬. ఈశ్వరకృష్ణుడు (వింధ్యవాసి – సాంఖ్యకారికలను రచియించిన మహామతి)

చిరం శీతజలావాస
లక్ష్యసంకోచకంటకాః,
నిషేవితుమి వోత్తస్థు
రాతపం కమలాకరాః.

౭. భట్టోద్భటుడు (ఆలంకారికులలో ప్రథముడు)*

కిం కౌముదీః శశికలాః సకలా విచూర్ణ్య
సంయోజ్య చామృతరసేన పునః ప్రయత్నాత్,
కామస్య ఘోరహరహుంకృతి దగ్ధమూర్తేః
సంజీవనౌషధి రియం విహితా విధాత్రా.

౮. కయ్యటుడు (భాష్యప్రదీపకారుడు)

శూరోఽసి నూన ముదితః పురతో యదారా
న్నారీజనస్య హృదయాంబురుహప్రబోధమ్,
ధత్సే నిశాతతరబాణ ఉదగ్రధన్వా
కామః పదాతి రితి తావక ఏష హంతి.

౯. చంద్రగోమి (సి ?)ని (చంద్రవ్యాకరణ నిబంధనాచార్యుడు)

విషస్య విషయాణాంచ
దూర మత్యంత మంతరమ్,
ఉపభుక్తం విషం హంతి
విషయాః స్మరణాదపి.

౧౦. నగ్నజిత్తు (శిల్పాచార్యుడు – అప్రతిముడని బృహత్సంహితయందు వరహామిహిరుడు ప్రశంసించినాడు.)

సాగసి ప్రియతమే కృతకోపా
యాంఘ్రియుగ్మ పతితేఽపి నతుష్టా,
సైవ మద్య పరిలుప్తవివేకా
తం తథైవ పరితోషయతిస్మ.

౧౧. పాణిని

పాణౌ శోణతలే తనూదరి
దరక్షామా కపోలస్థలీ
విన్యస్తాంజనదిగ్ధలోచనజలైః
కిం మ్లాని మానీయతే,
ముగ్ధే చుంబతునామ చంచల
తయా భృంగః క్వచిత్ కందలీ
మున్మీలన్నవమాలతీపరిమలః
కిం తేన విస్మార్యతే.

౧౨. భామహాచార్యుడు

కిం శుకవ్యపదేశేన
తరు మారుహ్య సర్వతః,
దగ్ధాదగ్ధమరణ్యాన్యాం
పశ్యతీవ విభావసుః.

నేయం విరౌతి భృంగాలీ
మదేన మధురస్వరా,
అయ మాకృష్యమాణస్య
కందర్పధనుషో ధ్వనిః.

౧౩. మమ్మటభట్టు

తన్వంగ్యా గజకుంభపీనకఠినోత్తుంగా వహన్త్యాః స్తనా

---

౫. కాశ్మీరకజయాపీడమహారాజ సభాపతి—దినమునకు లక్షదీనారముల బహూకృతి నందుచుండేవాడు. (రాజతరంగిణి, ౪-౪౯౪)

కుమారసంభవము ఈతనిరచనలలో ఒకటి. (నన్నెచోడుని కావ్యమునకు మాతృకారూపము). లక్ష్యములుగా అలంకారగ్రంథమునందు తన కావ్యములోని శ్లోకములనే ఇచ్చినాడు.

౬. జాంబవతీవిజయకావ్యమునుండి ౩ పద్యములు శరణదేవుడు, "సాయం చిరం ప్రాహ్ణే ప్రగేఽవ్యయే భ్యష్ట్యుట్యులౌ తుట్ చ" (పా. ౪-౩-౨౩). ఈసూత్రవృత్తిలో ఉదాహరించాడు. నమిసాధువు కావ్యాలంకారటీకలోను, రాయముకుటుడు అమరకోశటీకలోనుకూడా పాణినికావ్యములోనుంచి ఉదాహరణము లున్నవి.

[గతేర్ధరాత్రే పరిమందమందం, గర్జంతి యత్ప్రావృషి కాలమేఘాః,
అపశ్యతీ వత్స మివేందుబింబం, తచ్ఛర్వరీ గౌరివ హుంకరోతి. —నమిసాధువు.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మత్స్యః శ్యామతరోఽపి య న్మధుగితి ప్రాప్నోతి [భంగం ద్విధా,
త న్మన్యే నిపుణేన రోమలతికోచ్ఛేదాపదేశా దసౌ
నిఃస్పందాస్ఫుటలోహశృంఖలికయా సందానితో [వేధసా.

౧౮. రుద్రటుడు (ఆలంకారికుడు)౭

ఏకాకినీ యదబలా తరుణీ తథాహ
మస్మద్గృహే గృహపతిశ్చ గతో విదేశమ్,
కం యాచసే తదిహ వాస మియం వరాకీ
శ్వశ్రూ ర్మ మాంధబధిరా నను మూఢ పాంథ.

కమలినీ మలినీకయితంవినా
నసహతే సహ తేన నిషేవితామ్,
త మధునా మధునా నిహితం హృది
స్మరతి సా రతిసార మహర్నిశమ్.

హారా దుత్కంఠంతే
దయితజనసన్నిధౌ తు లజ్జంతే,
త్రస్యంతి కంపమానాః
శయనీయే నవపరిణయాః వధ్వః.

మలయానిలలలనోల్బణ
మదకలకలకంఠకలకలలలామః,
మధురమధునిధురమధుపో
మధురయ మధునా ధినోతి ధరామ్.

హరతి సుచిరగాఢాశ్లేషే యదంగక మాకులా
స్థగయతి తథా యత్పాణిభ్యాం ముఖం పరిచుంబనే,
యదతిబహుశః పృష్టా కించి ద్వద త్యపరిస్ఫుటం
రమయతితరాం తేనై వాసౌ మనో భినవా వధూః.

౧౯. వరరుచి (కాత్యాయనుడు)-(వార్తికాకారుడు)౮

అపి సదివసః కింస్యా ద్యత్ర ప్రియాముఖపంకజే
మధుమధుకరీ వాస్మద్దృష్టి ర్వికాసిని పాస్యతి,
తదను చ మృదుస్నిగ్ధాలాపక్రమాహితనర్మణః
సురతసచివై రంగైః సంగో మమాపి భవిష్యతి.

అస్యా మనోహరాకార
కబరీభారతర్జితాః,
లజ్జయేవ వనేవాసం
చక్రు శ్చమరబర్హిణః.

౨౦. వరహమిహిరుడు

సంమూర్ఛితం సంయుగసంప్రహారైః
పశ్యంతి సుప్తప్రతిబుద్ధతుల్యమ్,
ఆత్మాన మంకేషు సురాంగనానాం
మందాకినీమారుతవీజితాంగాః.

౨౧. వామనుడు౯

కిం కంఠైకరసికేన ఫలద్విషా కిం
వైరస్యసీమని కిము స్థిరకాతుకేన,
ఛాయావిలాసవిముఖేన సతాం కిమంగ
ధాత్రా ఖలేన ఖదిరద్రుమ ఏవ సృష్టః.

[ఈ పద్యములు, ఆఫ్రెట్, కీల్‌హారన్, పీటర్సన్ మొదలగు వైదేశికపండితులు సంగ్రహించినవి.]

---

౭. ఆలంకారికుడేకాదు, ఇండా సరసకవితావిలాసుడని ఆతని గ్రంథం సాక్ష్యమిస్తూఉన్నది. 'కింగౌరిమాం ప్రతిరుషా' మొదలైన పద్యములు సుప్రసిద్ధములు.

౮. సుభాషితావళియందు ౧౭ పద్యములు కనబడుతూన్నవి. ఈతనికావ్యము ప్రశంస మహాభాష్యమునందు కలదు.

[గోల్డుస్టుకర్, పే ౧౮౯: వీబర్, ఇండీచిస్టుడెన్ ౧౩-౪౫౦]

౯. ఉద్భటుని సమకాలికుడు-కాశికావృత్తి-కావ్యాలంకారసూత్రవృత్తిని రచియించినవాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కతిపయసంస్కృత వర్ణవిపరిణామములు

శ్రీ పరవస్తు వేంకట రామానుజస్వామి, యం. ఏ.,

1. వర్ణములకు సంభవించు విపరిణామములు రెండువిధములుగా నుండును—౧ వర్ణాంతరసంసర్గాది నిమిత్తములవలన గలుగునవి. ౨ అట్టి నిమిత్తములు లేక నిర్నిమిత్తముగా గలుగునవి. ఇండో యూరపియన్ మాతృభాషయందలి హ్రస్వములగు నేకారమును నోకారమును (e, o) సంస్కృతమున అకారముక్రింద మారుటయు, స్పర్శలలో తాలవ్యము లూష్మములుగా మారుటయు మొదలగునవి నిర్నిమిత్తకములైనవిపరిణామములు. మాతృభాషయందలి కంఠ్యస్పర్శలు సంస్కృతమున తాలవ్యములక్రింద మారుటయు, దంత్యములు మూర్ధన్యములుగ మారుటయు మొదలగునవి వర్ణాంతరసంసర్గము వలన గలిగిన నైమిత్తికవిపరిణామములు. ఇవి క్రమముగా బరమందుండు యకారతాలవ్యాచ్చుల యొక్కయు, బూర్వమందుండు లకారముయొక్కయు కార్యములని మనకు దెలియును. స్వరవిపరిణామము గూడ నుదాత్తాదిస్వరపరివర్తనమువలన గలిగినదియగుటచే నదియు నిర్నిమిత్తకమైన విపరిణామమని చెప్పుటకు వలనుపడదు.

సంస్కృతభాషయందు వర్ణములకు సంభవించు కొన్ని విపరిణామము లీక్రింద వివరింపబడినవి. వీనిలో ననేకము లేదోయొక నిమిత్తము ననుసరించి సంభవించినవిగా నున్నవి.

2. అచ్చులు:—౧. వేదమున దఱచుగా బదాంతమునం దుండు నచ్చు దీర్ఘ మగుచుండును. ఇట్లు ఛందస్సునకు సంబంధించిన స్థలములలోనేకాక తదితరస్థలములలోగూడ నచ్చులు దీర్ఘము లగుచుండును. ఉదా: అథా, ఏవా, ఇవా, స్మా, అద్యా, అభీ, నూ; ఏనా, తేనా, యేనా, అస్యా, పిబా, శృణుతా, విద్మా, వహస్వా, వేదా, శ్రుధీ, శృణుహీ, జహీ; అభిగూర్యా.

౨. సమస్తపదమున బూర్వపదాంతమందలి యచ్చు దీర్ఘమగుట గలదు. ఉదా: ఋతావసు, శతామఘ, ఏకాదశ, తువీమఘ, పురూవసు.

3. హల్లోపము సంభవించినయపుడు తత్పూర్వమందుండు నచ్చు దీర్ఘమగుట కలదు. ఉదా: పునా రమతే, జ్యోతీరథ, దూరోహణ, లాఢి, నీడ, దూడభ; రూఢ, వోఢుమ్, తృణేఢి, షోడశ, పితా, ధనీ.

౪. ఉదాత్తాదిస్వరవశమున నచ్చులకు సంభవించు మార్పులు స్వరవిపరిణామనిరూపణమున జూపబడినవి.

౫. పదాదిమధ్యాంతములయం దచ్చు నూతనముగా (ఆగమముగా) జేరుట కలదు. ఉదా: వై. ఇరజ్యతి, వై. ఇరధతే, వై. ఇలయ, వై. ఉలోక, సువర్ణ, స్వర్ణ, పృథివీ, పృథ్వీ, క్షమా, క్ష్మా.

వేదమున స్పర్శవర్ణమునకును రేఫానునాసికవర్ణములకును మధ్యను ఛందోభంగము వారించుట కకారము నుచ్చరింపవచ్చును. దీనికి స్వరభక్తియని పేరు కలదు. ఉదా: ఇన్ద్రి + ఇన్దర; యజ్ఞ, యజన.

౬. భాషాంతరములలోని (లా. avis) రూపములనుబట్టి చూడగా సంస్కృతమున 'విః - పక్షి' అను పదమున అకారము లోపించిన ట్లగపడుచున్నది.

౭. రెండభిన్నాక్షరములుగాని, సదృశాక్షరములుగాని వరుసగా నున్నయెడల అందొకటి లోపించుట కలదు. ఉదా: తువీరవవాన్, తువీరవాన్; ఇరదధైర్య, ఇరధైర్య; మఘదుఘ, మధుఘ; శీర్షసక్తి, శీర్షక్తి.

3. హల్లులు:— (౧) పదాంతసంయోగమునందలి మొదటిహల్లు నిలిచి మిగిలినవన్నియును దఱచుగా లోపించుచుండును. ఉదా: తుదన్ (తుదన్త్ + స్),

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదజ్ (ఉదఞ్చ్+స్), అఛాన్ (అ-ఛన్ద్+స్+త్).

(౨) ఆద్యంతములందు మహాప్రాణవర్ణములు కల ప్రాచీనధాతువులలో మొదటిది సంస్కృతమునను, గ్రీకుభాషయందును నల్పప్రాణ మగుచుండును. కాని కారణాంతరమున రెండవదికూడ నల్పప్రాణము కావలసినయెడల మొదటిది తిరుగ మహాప్రాణ మగుచుండును. ఉదా: బన్ధ్ (ఇంగ్లీషు bind) దుహ్ (-ధక్), గ్రహ్ (-జిఘృక్షతి) దభ్ (ధిప్స). ఈ నియమము 'గ్రాస్మన్' అను పాశ్చాత్యపండితునిచే గనుగొనబడుటచే నతని పేరిట వ్యవహరింపబడుచున్నది.

౩. 'తుర్య' (తురీయ) అను పదమున నాదిని కకారము లోపించినది. చూ. చత్వారః (*Ketver), తుర్య (*Ktur).

౪. ఋకారరేఫషకారములకు బరమగు (దంత్య) నకారము (మూర్ధన్య) ణకారములోనికి మారుచుండును. పైవర్ణములు నకారమున కవ్యవహితపూర్వముగ నుండ నవసరములేదు. కాని వానిమధ్యను యకారభిన్నమగు తాలవ్యవర్ణముగాని, దంత్యవర్ణముగాని, మూర్ధన్యవర్ణముగాని యుండరాదు. ఉదా: రుద్రేణ, వారిణీ, దాతౄణి, శృణోమి, క్షుభాణ, రుగ్ణ, ద్రవిణ, కృపమాణ. పరిణామ, ప్రణామ, దుర్ణశ, గ్రామణీ; వై. పరిణః, అగ్నేరవేణ.

౫. ఇకారమునకు బూర్వమందున్న యకారమును, ఉకారమునకు పూర్వమందున్న వకారమును గొన్నియెడల లోపించుచుండును. ఉ. ఇయాజ, ఇయక్ష (యజతి); ఇయస్యతే (యస్యతే); ఊర్ధ్వః (గ్రీ. bortho), ఊర్మిః (ప్రా. హై. జ. walm), ఊర్ణా (గా. wulla).

౬. ధాతుప్రాతిపదికముల చివరనుండు చకారము అమ్భిన్నమగు వర్ణము పరమైనచో దాని పూర్వరూపమగు కకారరూపమును బొందును. ఉదా: వక్తి, వక్ష్యామి, వగ్ధి, వాగ్భిః, వాక్షు, ఉక్త.

౭. ధాతుప్రాతిపదికముచివరనుండు షకారశవర్ణములు సకారము పరమైనచో కకారముగను, తకారథకారములు పరమైనచో షకారముగను, ధకారభకారములును, 'సు' అను సప్తమీబహువచనప్రత్యయమును బరమైనచో టకారముగను మారును. ఉదా: వేక్ష్యామి, వష్టి, దిదిడ్ఢి, విడ్భిః, విట్సు; ద్వేక్ష్యామి, ద్విష్టః, విడ్ఢి, ద్విడ్భిః, ద్విట్సు.

౮. జకారము కొన్నియెడల చకారముక్రిందను, మఱికొన్నియెడల శవర్ణముక్రిందను విపరిణామములను పొందును. ఉదా: అయుక్త, యోక్ష్యామి, అయుగ్ధ్వమ్, యుగ్భిః. కాని స్రక్ష్యామి, మృష్ట, మృడ్ఢి, రాడ్భిః, రాట్సు. ఏస్థలమున నెట్లు మారునో వర్ణసమామ్నాయ చరిత్రమున దెలుపబడినది.

౯. హకారము జకారమువలెనే విపరిణామద్వైవిధ్యమును బొందును. కొన్నియెడల కంఠ్యముగ మారును. ఉ: అధుక్షమ్, దుగ్ధ, అధోక్, ధుక్, దుగ్భిః, ధుక్షు. మఱికొన్నియెడల సకారము పరమైనచో కకారముగను, పదాంతమునను, భకారాదివిభక్తులకును 'సు' అను సప్తమీబహువచనప్రత్యయమునకును పూర్వమునను మూర్ధన్యస్పర్శములుగను మారును. దంత్యవర్ణము పరమైనచో హకారములోపించి దంత్యము ఢకారముగ మారును. ఉదా: రోక్ష్యామి, సక్షీయ, తురాషాట్, తురాషాడ్భిః, తురాషాట్సు, గూఢ, లీఢ, లీఢ్వమ్, ఏస్థలమున నెట్లుమారునో వర్ణసమామ్నాయచరిత్రమున దెలుపబడినది.

౧౦. అకారాకారభిన్నమగు నచ్చునకును, కకారరేఫలకును పరమగు (దంత్య) సకారము (మూర్ధన్య) షకారమగును. ఈ సకారము రేఫపరకమైన పదాంతసకారమైనచో నట్టి మార్పును బొందదు. ఉదా: భవిష్యామి, శుశ్రూషే, శేషే, అనైషమ్, జుహోషి; విక్షు, అకార్షమ్, హవిషా, చక్షుష్మన్త్, మనుష్య, సుష్వాప, సిషాసతి; ప్రతిష్ఠా, యుధిష్ఠిర, అగ్నిషోమ, దుష్టర, ఆవిష్కృత.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౧. స్పర్శమన్యస్థమగు సకారము లోపించును. ఉదా: ఉత్థాతుమ్ (ఉన్ + స్థాతుమ్), అతాప్త (అ-తాప్ + స్ + త), అఖాన్త (అ-ఖాన్డ్ + స్ + త).

౧౨. సకారము సకారము పరమైనచో తకారముగ మారును. ఉదా: వత్స్యామి (వస్ + స్యామి), విద్వత్సు (విద్వస్ + సు).

౧౩. ష కారశవర్ణముల సాన్నిధ్యమున సకారము శవర్ణముగ మారుచుండెను. ఉదా: శ్వసురః (గ్రీ. hekuros), శ్మశ్రు (లిథు. smakru), శుష్కః (అవె. huska), శశః (ప్రా. హై. జ. haso).

4. ఈ క్రిందివర్ణ విపరిణామము లనేకభాషలతో సంబంధించియుండుటచే మాతృభాషలోనే సంభవించినవని యూహింపవలసియున్నది:

౧. నాదవర్ణము శ్వాసవర్ణము పరమగునప్పుడు శ్వాసవర్ణముక్రిందను, శ్వాసవర్ణము నాదవర్ణము పరమగునప్పుడు నాదవర్ణముక్రిందను మారుచుండెను. ఉదా: సం. యుక్తః, గ్రీ. Zeuktos, లా. Junctus, కాని సం. యుగమ్, గ్రీ. Zugon, లా. Jugum; సం. వేత్థ, గ్రీ. Oistha, కాని సం. వేద, గ్రీ. Oida, సం. పత్సు, గ్రీ. Possi, Posi, కాని సం. పాదః, గ్రీ. Podes—సం. ఉపబ్ద, గ్రీ. epi-bda కాని సం. పద్; సం. నీడః, లా ni-dus (ni-zd from ni-sed)

౨. మహాప్రాణవర్ణము, మహాప్రాణవర్ణము పరమైనచో నల్పప్రాణ మగుచుండెను. అల్పప్రాణవర్ణము పరమైనచో నది యల్పప్రాణవర్ణమగుటయే కాక పరమందలి యల్పప్రాణవర్ణముగూడ మహాప్రాణమగుచుండెను. తొలి మహాప్రాణవర్ణము నాదయుక్తమైనచో ఫలించిన సంయుక్తాక్షరమంతయు నాదయుక్తమగుచుండెను. ఉదా: యుద్భిః (యుధ్ + భిః) దృబ్ధ, (దృభ్ + త), లబ్ధ (లభ్ + త), బుద్ధ (బుధ్ + త), ఊఢ (వహ్ + త), లీఢ (లిహ్ + త).

3. వర్గీయప్రథమద్వితీయవర్ణములకును, ప్రథమతృతీయవర్ణములకును, తృతీయచతుర్థవర్ణములకును వినిమయము కలుగుచుండెను. ఉదా: సం. పృథుః, గ్రీ. Platus, సం. పన్థాః, గ్రీ. Patas, సం. దశత్, గ్రీ. dekad, గ్రీ. skapane లా. scabo, సం. అహమ్, గ్రీ. ego, లా. ego; సం హనుః, గ్రీ. genus; సం. మహాన్, గ్రీ. megas.

౪. స్పర్శలకు బూర్వము సకారము లోపించుచుండెను. ఉదా: సం. స్థగ్ (గ్రీ. teg- సం. ఛద్ది), తాయు, తనయిత్ను, పశ్య, తృ (చూ. ఛ్ఛద్ది), స్తాయు, స్తనయిత్ను, స్పశ్, స్తృ).

౫. మకార వకారములకు వినిమయము సంభవించుచుండెను. ఉదా: వై. అమః, అవె. ava, ప్రా. స్లై. ovu; సం. శ్యామః, శ్యావః. ప్రా. స్లై. sivu; వై. దామనే, దావనే, గ్రీ. domenai; dofenai; ద్రవామి, ద్రమామి, గ్రీ. edramon, dedroma.

---

# తన్మయత్వము

కాళ్లకూరి గోపాలరావు

జాగ్రత్స్వప్నములందు నిన్నె కనెదన్ సంతోషలీలాకృతిన్!
వ్యగ్రంబైన సుషుప్తి త్వన్మయతయే యౌఁ; గానిచో నిష్ఠు భా
వగ్రాహ్యం బగు తత్సుఖానుభవ మవ్యక్తంబు గానేర్చునే
వాగ్రూపంబున? నిన్ భజింతు సకలావస్థామనోహారిణీ!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# స్వదేశసంస్థానాలు*

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి
[మాహేశ్వరాశ్రమము]

చద్దరు, కన్నేలాల్ గాబాలపుస్తకాలూ, కర్నల్ పొలెక్, ల్లేక్, లాస్కీ, థక్కర్, రామనారాయణచౌదరి, రంగయ్యర్ మొదలైనవారి రచనలూ, డెయిలీహెరాల్డు, న్యూస్‌క్రానికిల్, బొంబాయిటైమ్సు, ప్రిన్స్లీ ఇండియా, మాడరెన్ రెవ్యూ, చాంద్, మాధురీ మొదలైన పత్రికలూ బాగా పరిశీలించి, స్వయముగా ఉత్తరదేశములో సంచారముచేసి నార్ల వెంకటేశ్వరరావు "స్వదేశసంస్థానాలు" అనే పుస్తకము వ్రాసి ప్రకటించినాడు. మహారాజులు, నవాబులు చిన్నతనమునుంచీ చేసేపనులూ, వారిచుట్టూ ఉండే మనుష్యులూ, ప్రభువులవిలాసాలూ, వ్యభిచారవిధానాలూ, దుర్వ్యయము, సంస్థానోద్యోగులు, శాసనసభలు, న్యాయవిచారణ, పన్నులు, వెట్టిపద్ధతి, విద్యాసౌకర్యాలు, వైద్యసహాయము, వాక్ స్వాతంత్ర్యము మొదలైన శీర్షికలతో సంస్థానాధీశ్వరుల లోకయాత్ర, ప్రజల కష్టనిష్ఠూరాలూ గ్రంథకర్త విపులముగావర్ణించినాడు."నావిష్ణుః పృథివీపతేః" అనే సిద్ధాంతము సంస్థానాధీశ్వరుల నిరంకుశప్రవర్తనలో స్పష్టముగా కనబడుతున్నది. ప్రపంచములో ఇతరదేశాలన్నీ రాజ్యాంగవిధానాలలో మార్పులు చెందుతూఉంటే స్వదేశసంస్థానాలలో ప్రాచీనపద్ధతులు, నిరంకుశత్వము, దౌర్జన్యమూ మారిపోలేదు.

యావద్భారతదేశవైశాల్యములో స్వదేశసంస్థానాల విస్తీర్ణము మూడోవంతు; జనసంఖ్యలోపాలు అయిదోవంతు. ఇంత భూఖండములో నివాసముచేస్తూఉన్నా ప్రజలకు వాక్స్వాతంత్ర్యములేదు. బ్రిటిషు ఇండియాలోనే నూటికి ఎనిమిదిమంది చదువుకొన్నవాళ్లు. ఇదే చాలా తక్కువ అనివిచారిస్తూఉంటే సంస్థానాలలో చదువువచ్చినవాళ్లు నూటికి నలుగురికంటె లేరు! అనేకసంస్థానాలలో ౩౦,౮౦ గ్రామాలకు ఒక్కటే పాఠశాల! వైద్యసహాయము చూతామాఅంటే ౧౭౭ గ్రామాలకు ఒక్కటే వైద్యశాల ఉన్న సంస్థానాలు చాలా కనబడతవి. సంస్థానము మొత్తము మీద వచ్చే అన్నిపన్నులలో సగభాగము స్వంతఖర్చులకు వినియోగించే ప్రభువులు కూడా ఉన్నారు! 'వెట్టి' అనే వెట్టిచాకిరి పద్ధతి ఎన్నో సంస్థానాలలో చలాయింపు అవుతున్నది. బానిసతనానికీ దీనికీ భేదము

---

* గ్రంథకర్త: నార్ల వెంకటేశ్వరరావు, (వెల ౦-౮-౦, పోస్టేజి ప్రత్యేకము) ప్రకాశకులు: నార్లవారు, కవులూరం, కృష్ణాజిల్లా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేదు. ౫౬౩ సంస్థానాలు ఉంటే, అందులో ౫౬ రింటిలో మాత్రము ప్రజాప్రతినిధిసంస్థలు కనబడతవి. అవి అయినా నామకః! పన్నులు విధించడములో నియమమంటూ లేదు. రాజుగారికి కొత్తఖర్చు తగిలిందంటే ప్రజలమీద కొత్తపన్ను తక్షణమే పడ్డదన్న మాట! బాలికావివాహానికి పన్ను, పెండ్లి పెద్దలకు పన్ను, పునర్వివాహానికి పన్ను, కరువుపన్ను, పండ్ల చెట్ల పన్ను, బిచ్చగాళ్ల మీద పన్ను—ఈవిధముగా విచిత్రమైన పన్నులు! న్యాయస్థానాలలో మొరపెట్టుకుంటే న్యాయము అసలే జరగదు. గుడ్డి దర్బారులూ, నవాబుదర్బారులూ అనే మాటలు సార్థక మవుతవి. అక్కడి ఉద్యోగస్థులంతా ప్రజ్ఞవల్ల పైకివచ్చినవాళ్లు కారు. ప్రభుల అనుగ్రహాలకు పాత్రులై పైకివచ్చిన ఘటాలు. ఎవరైనా కాస్త స్వతంత్రిస్తే కారాగారమో, ఉద్వాసనో తప్పదు. ప్రభువులచుట్టూ చేరేవాళ్లు వట్టి గులాములూ, కులుకులాళ్లను కూర్చేవాళ్లూ! ఇక ప్రభువులకు ఆసక్తి కుక్కలమీద, గుర్రాలమీద, మోటారుకార్లమీద, వేటలమీద, వెలయాళ్లమీద, కులస్త్రీలమీద, కుర్రపిల్లలమీద! సాధ్యమైనంతవరకూ కామినీగోష్ఠి! భార్య-కాదు-భార్య లుంటారు పేరుకు. ధర్మశాస్త్రాలు బహుభార్యాత్వము అంగీకరించడమువల్ల వచ్చిన అనర్థము. రాణులని పేరేకాని వాళ్ల అవస్థలు వర్ణనాతీతము. రాజుల ఖర్చులు రకరకాలు. ఢిల్లీలో నరేంద్రమండలికీ, చలువప్రదేశాలలో సౌధాలకూ, ఫ్రాంసుదేశపు విలాసవస్తువులకూ, పొలిటికల్ ఏజంట్ల వేటవినోదాలకూ, ఇటలీలో సంచారాలకూ, లండనులో విందులకూ, స్పెయినులో భోగకన్యకలకూ ఖజానాలో డబ్బు సగముపైగా చెల్లిపోతుంది. రాజప్రతినిధిగాని,యువరాజుగానివస్తే సంస్థాన ధనము నీటిప్రవాహమువలె ప్రవహిస్తుంది!

ప్రభువులు ప్రజలను పెట్టే బాధలు ఊహాతీతము. మరీ శ్రుతిమించి రాగాన పడితే, ఇండియాగవర్నమెంటువారు విధిలేక జోక్యము కలిగించుకొంటారు. తన వ్యవహారాలు విచారణచెయ్యడానికి సంఘాన్ని ఏర్పాటుచేస్తారని తెలిసేసరికి సంస్థానప్రభువు పదవికి రాజీనామా అయినా యిస్తాడు, పలాయన మైనా చేస్తాడు!

భారతభూమి యావత్తూ సందిగ్ధావస్థలో ఉన్నది. రాజకీయ, ఆర్థిక, సాంఘికసమస్యలు అనేకము మనను ఎదుర్కొంటున్నవి. ఇవన్నీ సక్రమముగా పరిష్కరిస్తేనేగాని భారతభూమికి అభ్యుదయము కలగదు. యావద్భారత దేశములో మూడోవంతు విస్తీర్ణము, అయిదోవంతు జనసంఖ్య ఉన్న సంస్థానములందలి ప్రజలకు స్వాతంత్ర్యము, ఆరోగ్యము, విద్య, సంపదలూ సమకూడితేనేగాని దేశానికి అంతకూ మోక్షము లేదు. ఇండియాగవర్నమెంటువారు ప్రతిసంస్థానాన్నీ బలవంతాన బాగుచెయ్యవచ్చు పర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాధికార మున్నట్టు పూర్వము లిట్టన్, సాల్సబరీ, కర్జన్ ప్రభువులు చేసిన ప్రకటన వల్ల స్పష్టమవుతుంది. కాని ప్రజారంజక ముగా పరిపాలన చెయ్యవలసిందని మహా రాజులకూ, నవాబులకూ నొక్కి చెప్పి అమ లులో పెట్టించడము గవర్నమెంటువారి ఆశయము కానట్టు కనబడుతుంది.

సంస్థానప్రజలు ఆందోళన చెయ్యడానికి తగినంత అవకాశములేదు. బ్రిటిషుఇండియా పౌరు లెవరైనా వారికి సహాయము చెయ్యా డానికి వెళితే తక్షణమే వారిని సంస్థాన ప్రభువు తన రాజ్యపు సరిహద్దుబయటికి పంపివేస్తాడు. పత్రికలు తనకు వ్యతిరేక ముగా న్యాయముగ్రాసినా వెంటనే బహిష్క రిస్తాడు. పైగా ఇపుడు "సంస్థానాధీశ్వర సంరక్షణచట్టము" ను బందోబస్తు చేసు కోడానికి ఎసంబ్లీలో కొత్తబిల్లు ప్రవేశ పెట్టించారు ప్రభువులు!

ఈగ్రంథకర్త విషయాలన్నీ వట్టిమాట లతో కాకుండా లెక్కలజాబితాలతో, నిద ర్శనాలతో ఋజువుచేసినాడు. సంస్థానాధి పతుల దురభ్యాసాలూ, దుర్వ్యయాలూ, దుర్మార్గాలూ తెలియపరచడములో గ్రంథ కర్తకు దురుద్దేశము లేదు. సంస్థానప్రభు వులు ప్రాచీననిరంకుశమార్గాలు విడిచి, న్యాయదృష్టితో ధర్మమార్గాన ప్రవర్తిస్తూ, ప్రజాప్రతినిధిసభలద్వారా రాజ్యతంత్రము నడుపుతూ, ప్రజలను రంజింపజేసి భారత భూమికి పేరుతీసుకురావలె నని ఉద్దేశము. ప్రభువులకు ముఖస్తుతిపరాయణులు, చాటు కారులు దొరుకుతారు గాని సత్యము చెప్పే వారు దొరకడము అరుదు. ఎవరిలోపములు వారికి తెలిస్తేనేగాని సన్మార్గములోనికి వెళ్లే టందుకు వీలులేదు. ఇటువంటి గ్రంథాల వల్ల ప్రభువులకూ, ప్రజలకూ ఉపయోగము. ఈ గ్రంథకారుని ప్రయత్నము కొనియాడ దగినది.

---

# స్వ రా లా ప ము

కవిభూషణ, కవిరాజ, శ్రీరాజా వత్సవాయ వేంకటనీలాద్రి రాజు

పుష్పంబుల్ వెదఁజల్లినైచు నమృతాంభోరాశివీచీచ్ఛటా
నిష్పన్నస్ఫుటశీకరస్తబకముల్ నిక్షిప్తముల్ సేయు, న
గ్గీష్పం కేజముఖఘనస్తనయుగక్రీడద్విపంచీమణీ
నిష్పాణింధమ శాసనంబు లిదమున్మీలత్స్వరాలాపముల్.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# అడవిపువ్వులు

పోలూరి వేంకటసుబ్బయ్యశాస్త్రి

ప్రపంచ మతివిచిత్రపరిణామ సమంచితము. ఎప్పటి కేది సంభవించునో యెవరి కెఱుక. కానసేకదా, "ఉత్పత్స్యతేహి మమ కోఽపి సమానధర్మా కాలో హ్యాయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" అని భవభూతి నిట్టూర్పుపుచ్చెను.

పూర్వకాలమున నాదరించు రాజాధిరాజు లున్నపుడు వారి కుల్లాసము గలుగుటకు నీతిసముల్లసితము లగు శ్లోకములనుక విలోకము వాకొనుచుండెడిది. భామినీవిలాస మట్లు పుట్టినదేకదా.

కాకః కృష్ణః పికః కృష్ణః
కో భేదః పికకాకయోః,
వసంతకాలే సంప్రాప్తే
కాకః కాకః పికః పికః.

ఇత్యాది శ్లోకముల లోభికి దాతకుఁ, బామరునకుఁ బండితునకు నిట్లు సందర్భానుసారముగా భావముం గూర్చుకొనవచ్చుం గదా. ఇట్టివి సంస్కృతమున నుండెడివి. పిమ్మట నాంధ్రి నుపలాలించు ప్రభుతిలకముల సన్నిధి నప్పుడప్పుడు ప్రవర్తించు పండితవివాదముఁ బురస్కరించుకొని పరాధిక్షేపార్థ మన్యాపదేశము లుద్భవిల్లఁదొడంగినవి.

తక్కక యేల ముట్టెగొని
త్రవ్వఁగ నేర్తునటంచుఁదాఁకె దీ
వొక్క పెజాతి యంచు మద
మొందకు బుద్ధిని వెట్టిపంది నీ
వెక్కడ నాదిఘోణమన
నెక్కడ యద్రిసముద్రదుర్గభూ
ర్భారక్క తలంబు నొక్కయఱ
పంటనె మింటికి గెంటనేర్తువే?

ఇది గ్రామసూకరముమీఁది పద్యమైనను నొకానొక యన్యార్థము సూచించుచు నెంత మనోహరముగా నున్నదో చూడుఁడు.

భృంగపంచకాదులు నభిప్రాయగర్భితములై జనించినవియే.

తెనుఁగున గ్రంథరూపమున నింతవఱ కిట్టివి లేవు. ఉన్న నే చాటుపద్యరత్నాకరాదులనో యొకటియో రెండో యున్నవి. కాని యవియే భాషాలతాంగికిఁ దృప్తి గొల్పునే? ప్రతిసందర్భమునకుఁ బనికివచ్చు పద్యములు భాసిల్లవలదా? అందులకీ "యడవిపువ్వు" లుపయుక్తము లనుట కెట్టిసందియము లేదు.

పేరువిని-యది యొక భావకవిత్వము కావలయును. అం దేదియో వియోగశృంగార ముండును. లేకున్న సంజ్ఞావాచకశూన్యమై, కర్తృపదాదు లెందుం గోచరింపక, క్రొత్త రకపు నడకతోఁ బదముల కూర్పుమాత్ర ముండును-అనిచప్పరించి యూరకుంటిని. కాని కడచిన సెప్టంబరు గృహలక్ష్మిలోని విమర్శనముం జూచినపిదప నొకకొంత వేడ్క కలిగి యాగ్రంథము చదివితిని. చదివిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొలందిఁ జవ్వులూరుచుండెనుగాని విసువు పుట్టదయ్యె.

ఒకగంగాధరుఁడే నిరాసనము సేయుం జెంతరానీక యం
చకటా వందురనేల! లేరె సుగుణవ్యాలీఘలీధాత్రిఁ గేతకి,
సామంతనృపాలపాళిగతరత్నానర్ఘ్యోత్తమాంగంబులన్,
బ్రకటోత్సాహకులై ధరింతురు మహారాజాధిరాజుల్
[నిసుగ్. (గేదంగి)

అనుపద్యముపైనే ప్రథమదృష్టి ప్రసరించినది. దాని భావమునకు విస్మితుఁడ నైతిని.

శ్రీగురునాథశర్మగారి కవితాధార గంగాప్రవాహమువలె నిరాతంకముగాఁ బ్రవహించుచుండును. పాదపూరణార్థము పడికట్టురాళ్లుండవు.

నిరతము నిద్రలేచి ద్విజు
నిర్మలమంగళగీతికాపరం
పగ, హరిసేవలన్ సలిపి,
వల్లభు పాదము లంటి మ్రొక్కి బం
భరముఖయాచకాళి కతి
మంజులమార్దవమాధురీమరం
దరసము చూఱనిచ్చెదవు
ధన్యవుపో బిసినీప్రసూనమా!
(పద్మము)

అర్థసౌష్ఠవము చెడని యమకమ్మున గమకమ్ములు నందందు రమణీయములుగా నున్నవి.

తలదాఁచుకొని నెలంతల
తలఁదలఁగిన నేమి నీవు తలకొని నీచెం
తలఁ దారులింటికుఱ్ఱఁడె
తలగామై తెల్పె నీకతల గంధఫలీ!
(సంపెంగ)

అరయఁ గర్ణుఁ డవ్యుత్పన్నుఁ డప్పయోజ
కుండు వారివాహుఁడు దేవకుజములు విమ
తహితములు చూడఁగ భవత్సమాను లెవ్వ
రయ్య, చందన, దానపీఠాగ్రగణ్య!
(చందనము)

ఇందలి సభంగశ్లేష మిక్కిలి మనోహరముగా నున్నది.

ఆస్తే విధుః పరమనిర్వృతఏవ మౌళౌ
శంభో స్తతి త్రిజగతీజనచిత్తవృత్తిః,
అంతర్నిగూఢ నయనానలదాహదుఃఖం
జానాతి కః పరమృతే బత శీతరశ్మేః.

ఆంధ్రీకరణము

ఇందుడు ముజ్జగంబుల క
ధీశ్వరుఁడౌ శివుతాఁదలన్ మహా
నందము నొందుగా యని జ
నంబు మదిం దలపోయుచుండు న
క్తందివ ముజ్జ్వలన్నిటల
గాఢతమాగ్నిశిఖాచయంబుచే
నందమువాసి చచ్చి సగ
మౌటవలంప దిదేమి చిత్రమో!
(చందమామ)

పూర్వభాగము రెంట సమంబులుగ నున్నను బద్యోత్తరభాగము శ్లోకోత్తరభాగముకన్న నెంత లోకోత్తరభావసౌందర్యము వెలార్చుచున్నదో రసికులు గ్రహింపఁగలరు. "చచ్చి సగమౌట" అనెడి లోకోక్తి సముచితస్థలంబునం బడి యెంతయు రాణించుచున్నది. అమూలక మగు నక్తందివపదము నౌచిత్యముఁ గాపాడుచున్నది.

అయే వారాంరాశే కులిశకరకోపప్రతిభయా
దయం పక్షచ్ఛేత్తా గిరివరసుత స్త్వా ముపగతః,
త్వదంతర్వా స్తవ్యో యదిపునరయం బాడబశిఖీ
ప్రదీప్తః ప్రత్యంగం గ్లపయతి తతః కోఽస్య శరణమ్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిండినసంద్రమా, పలుక
  నేరను : వజ్రిభయంబుచేత నీ
యండను జేరి డాఁగె హృద
  యంబున నెక్కలమీఁది యాస న
ట్లుండియు "నున్న కర్మ మొక
  యూరికిఁ బోయినఁ దప్ప" దన్నటుల్
కొండల ఱేనిపట్టి కల
  గుండుపడుంగద బాడబాగ్నిచే.
(సముద్రము)

"ఉన్నకర్మ పొరుగూరికి పోయినా తప్పదు" అను లోకోక్తి నిందుఁ జేర్చి కవిగారు శ్లోకమునకు మెఱుఁగువెట్టినారు. మువర్ణలోపమునకు వెఱచి కావలయు "నున్నకర్మ మొక యూరికిఁ బోయిన" నని వ్రాసిరి. అయినను భావము చెడలేదు. "ఏకోఽన్యార్థే ప్రధానేచ ప్రథమే కేవలే తథా" అని కలదుగదా. మఱియు మూలమందలి 'కులిశకర' పదమునకు 'వజ్రి' యనుపద ముపయోగించుట వలనఁ గవిగా రాంధ్రీకరణమున నౌచిత్యముపై నొకకన్నుంచిరనియే చెప్పకతప్పదు. మైనాకశిలోచ్చయము కలగుండువడుచున్న దనుటలో నున్న సారస్యమును సూక్ష్మముగాఁ బరికింపుఁడు. 'తతఃకోఽన్యశ్శరణ' మని యనకున్నను నది గతార్థమే యగుచున్నది. 'త్వాముపగతః' అనుటకు 'నీయండను జేరి డాఁగె హృదయంబున' ననుట యెంతయుఁ జమత్కారముగా నుండలేదా?

యచ్ఛన్ జలమపి జలదో వల్లభతా మేతి సర్వలోకస్య,
నిత్యం ప్రసారితకరః సవితాపి భవ త్యచక్షుష్యః.

ఇచ్చె జలముమాత్రమ్మున్
  వచ్చె జగత్ప్రియత మేఘునకును, సవితయున్
నిచ్చలు కరములు సాఁచుచు
  వచ్చుటఁ గద చూడరానివాఁ డయ్యె భువిన్.

'చూడనలవిగానివాఁడు, చూడఁదగనివాఁడు' ననునర్థముల నిచ్చు 'చూడరానివాఁ' డను పదము 'అచక్షుష్యః' అనుపదమున కెంతయు మిన్నగ నున్నది. చూడరానివాఁడైనపుడిఁక నంటరానివాఁడునని చెప్పవలయునా? 'కరములు సాఁచుచు' నను శ్లేషతంత్రప్రయోగమునను నౌచిత్యము గలదు. 'సవితయున్'-'యున్' పాదపూరణమునకుఁగాక 'సవితాపి' అనుమూలము ననుసరించుచున్నది.

లోకానందనచందనద్రుమసఖే
  నాస్మిన్ వనే స్థీయతాం
దుర్వంశైః పరుషై రసారహృదయై
  రాక్రాంత మేతద్వనమ్,
తే హ్యన్యోన్యనిఘర్ష జాతదహన
  జ్వాలావలీసంకులా
నస్వాన్యేవ కులాని కేవల మిదం
  సర్వం దహేయు ర్వనమ్.

డెందము శూన్య మంగము ప
  టిష్ఠము నైతగు దుష్టవంశముల్
బృందములై పరస్పరని
  విష్టనిఘర్ష సముద్భవాగ్నిచే
నెందు స్వవంశముం దెలుప
  నేల? వనంబునె కాల్చు మనవా
నందన చందనా మలయ
  నందన యీచెలిమిం దొఱంగుమా!

శ్లోకమున కింతయుఁ బద్యము తీసిపోవుట లేదు. మీఁదుమిక్కిలి సాలంకారమై కుడిచేయిగాను వెలుఁగుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లోకములను దు-చ తప్పకుండ నాంధ్రీకరించిన నింతసరసముగాఁ బద్యము లుండెడివికావు. కనుకనే యందందు యథేచ్ఛాపరివర్తనములుం గలవు.

ఇఁక నిందలి స్వతంత్రములు సులభముగామాత్రము గ్రహింపనైతిగాకున్నది. నే నెఱిఁగినంతవఱ కిందలి స్వతంత్రములు శర్మగారి ప్రతిభావిశేషముల వేనోళ్ల వెల్లడింపఁజాలియున్నవి.

వెల్లఁగఁబుచ్చెఁ బ్రాయమును
వేడ్కఁ బ్రఫుల్ల సరోరుహాటవీ
వేల్లితగంధబంధురప
విత్రవిశుద్ధమనస్సరస్సునం
దొల్లి మరాళ మిప్పు డతి
దుర్భరనిస్వన భేకభీకరో
ద్యల్లవపల్వలాంబులఁ గ
టా యెటు కాలము వెల్లఁబుచ్చునో.
(హంస)

ప్రస్తుతము మహిళాలోకమును గలవరపెట్టుచున్న 'విడాకు' చట్టమునుగూర్చి కవిగారిట్లన్యాపదేశముగా నుడువుచున్నారు:

కుముదిని యెన్నియోగతులఁ
గూడి విభుం గళలీనుచుండ ని
త్యము నిది యేమికర్మము మ
హానిరహంబున రేలవేఁగ దో
కమలిని! 'దేశద్రిమ్మరిని'
గాంతుని నమ్మి యెడంద నిట్టి క
ష్టములను బొందలే విఁక 'వి
డాకు' గ్రహింపుము స్వేచ్ఛగల్గెడిన్.

తనను సౌఖ్యాంబుధి నోలలాడింపక నిర్బంధమున బాధించు భర్తతోఁ గలసియుంటకంటె విడిపోయినచో స్వేచ్ఛమాత్రము గల్గును. సౌఖ్యము గలుగునో లేదో అని, యయినను నిదియే యుత్తమపద్ధతి గాదు. ఇం దానందము లేదనుచున్నాఁడు చూడుఁడు:

కాంతుని యింగితాకారమ్ములం దెలి
యఁగ లేక గడగడలాడు సౌరు
'నీకంటె నా ప్రాపు నాకొరు లేరు లే'
రని తదేకత నాథుఁ నరయుదీరు
తలఁపుల సిగ్గడొంతర లఱవిప్పఁగన్
అప్పలాఁగ మొగంబుఁ గప్పుసొబగు
పాలకువపట్టి సమున్నతిఁబొంగుల్ తీర్చు
చడఁగిమడఁగియుండు నాహారంగు
నాపరస్పరనిశ్వాస మాపరహిత
భావ మామిథునైకతాబద్ధసౌఖ్య
మొకపతివ్రతాధర్మమం దె కలదమ్మ
పద్మినీ, 'విడాకుం' గొన్నఁ బడయ లేవు.
(పద్మము)

పద్మినియనఁ దామరతీఁగ, తామరతంపర యనునర్థములు గలవు. విడి + ఆకు=విడాకు. దీనికి భార్యాపరిత్యాగపత్త్రికయనియు, నొంటిగా నుండు నాకనియు నర్థములు గలవు గాన రసికు లిందలి చమత్కారమును గ్రహింతురుగాక.

'మబ్బు' లో ఘోషాపద్ధతిని గూర్చియుఁ దమ యభిప్రాయమును గవిగారు చతురోక్తిని వెల్లడించిరి.

మఱియు నీగ్రంథమునం దొకవిశేషము నాకు గోచరించుచున్నది. శాలివాహనసప్తశత్యాదులవలె నొకపద్యమున కొకపద్యముతో సంబంధములేమి నుద్దిష్టవస్తునామము ప్రతిపద్యమున గ్రథితమగుట నేపద్యముం జదివి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్నను ప్రకరణాపేక్ష లేకుండ భావము సులభముగా నవగత మగుచున్నది. ప్రస్తావ వశంబున నీపద్యములఁ బఠించుట కీపద్ధతి యెంతయు సముచితముగా నున్నది. ఇందు మనకు నిత్యప్రత్యక్షములగు విషయములం గైకొని యెంతయుఁ జమత్కారముగా నొకా నొకనీతిని ధ్వనింపంజేయుట మిక్కిలి యెన్నఁ దగిన విషయము. అట్టివి స్వకపోలకల్పితము లనుటకు సందియముండదు. విస్తరభీతిఁ బద్యముల నుదాహరింపనైతిని.

విమర్శించిచూచినచో నిందు నీరసమైన పద్య మొక్కండేనియుఁ గన్పట్టదు. అట్లుంటకును దావులేదుగదా. భావమును మించ భాషయు, భాషను మించ భావమును బర్వెత్తుచుంటచే నొకటియు వెనుకంజవేయక సముచితరీతి నొప్పారుచు రసికులం దన్పుచున్నవి.

---

# శ్రీకృష్ణగ్రహమాలిక

శ్రీ శ్రీ శ్రీ మహారాజవిక్రమదేవవర్మ

శ్రీకరవిలసద్గుణాకర-కేశవ
నిగమపాళికొఱకు నీరరాశి
మెలఁగితీవు పెద్ద మీనురూపును దాల్చి
విక్రమేశవర్మవినుత కృష్ణ.

శ్రీశ శివమనోనివేశ హృషీకేశ
కూర్మరూపమునను గుధరభరము
మోసి సురల కమృతమును ద్రాగనిచ్చితి
విక్రమేశవర్మవినుత కృష్ణ.

తగదుసుమి పరాకు జగదీశ నాపట్ల
భూమిధర ముకుంద హేమకశిపు
జీవనానిలాహిశిఖికలాపోత్తంస
విక్రమేశవర్మవినుత కృష్ణ.

అజ్ఞ జనులు నిన్ను నరయంగఁ జాలరు
వేదవేద్య సకలవిబుధపూజ్య
జలజజాతతాత బలిగర్వఖండన
విక్రమేశవర్మవినుత కృష్ణ.

వనదనీలవర్ణ భాసుర గురు నాన
నమ్మయసురుఁ డీసినట్టివాఁడ
దోషరహిత దమితదోష రమానాథ
విక్రమేశవర్మవినుత కృష్ణ.

రావణాన్వయవనపావక వికచాంబు
జాత పత్త్రి నేత్రజానకీశ
రఘుకులప్రదీప రాజచూడామణీ
విక్రమేశవర్మవినుత కృష్ణ.

నందమోదద యమునాభేదనా హలీ
యశనిపాణిదర్పహర యనంత
గోత్రధర మురారి గోపరిపాలక
విక్రమేశవర్మవినుత కృష్ణ.

జనమనస్తమో హనన బుద్ధ సర్వజ్ఞ
నిత్య నిర్వికల్ప నిష్కళంక
మదపరాధములను మన్నించి నన్నేలు
విక్రమేశవర్మవినుత కృష్ణ.

మీనకేతుతాత దీనజనత్రాత
పాపరతనిహంత పరమపురుష
ధర్మరోషణకర కర్మప్రవర్తక
విక్రమేశవర్మవినుత కృష్ణ.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్లేష—శబ్దశక్తిమూలధ్వని

వ్యాకరణ విద్యాప్రవీణ, ఆకెళ్ల శేషాద్రి

వాచ్యమనియు, లక్ష్యమనియు, వ్యంగ్య మనియు నర్థములు మూడువిధములు. అందు వాచ్యమనగా శబ్దమున కుండు ముఖ్యమగు నర్థము. దీనినే యభిధేయ మందురు. లక్ష్యమనగా శబ్దమునకు ముఖ్యార్థము చెప్పిన ప్రకృతమునకు బాధక మగుటచే నేతత్ప్రకృతార్థమునకు సంబంధించునట్లు కల్పింప బడు మఱియొక యర్థము. ఇట్టిచోటుల వాచకశబ్దము విడచి లక్షకశబ్దమును గ్రహించుటచే నేదియో ప్రయోజన ముండితీరును. శబ్దముచే వాచ్యలక్ష్యములు కాక సహృదయహృదయంగమమగు మఱియొక యర్థము స్ఫురించుచో నద్దానిని వ్యంగ్య మందురు. వాచ్యలక్ష్యవ్యంగ్యములను బోధించు శబ్దములను వాచకలక్షక వ్యంజకము లందురు. ఈ యర్థత్రితయమును బోధింప గలుగుటకై శబ్దములయం దుండు శక్తులనే క్రమముగా నభిధా, లక్షణా, వ్యంజన లందురు.

ఏకావ్యమున వ్యంగ్యార్థము ప్రధాన మైయుండునో, అనగా వాచ్యార్థముకన్న నధికచమత్కృతి జనకం బగునో అద్దాని నుత్తమకావ్యమనియు, ధ్వని కావ్య మనియు వ్యవహరింతురు చమత్కృత్యాధాయకమగువ్యంగ్యార్థ మున్నను నద్దానికంటె వాచ్యమే యెక్కువచమత్కారమును గలిగించినచో నక్కావ్యమును మధ్యమకావ్యమనియు, గుణీభూతవ్యంగ్యమనియు వ్యవహరింతురు. ఏకావ్యమందు వాచ్యార్థమే చమత్కారముగా నుండి, దూరదూరముగా స్ఫురించు వ్యంగ్యార్థలేశ మున్నను లేనిదానితో సమానమగునో తాదృశకావ్యము నధమకావ్యమనియు, చిత్రకావ్యమనియు జెప్పుదురు. అనగా నుపమాదివాచ్యాలంకారములతో గూడినది చిత్రకావ్యము.

ధ్వని యభిధామూలకమనియు, లక్షణామూలకమనియు రెండువిధములు. వాచ్యార్థము స్ఫురించినతరువాత తన్మూలముగ వ్యంగ్యార్థము స్ఫురించుచో దాని నభిధామూలధ్వని యందురు. లక్ష్యార్థ ముండు స్థలములలో దప్పకుండ నుండవలసిన ప్రయోజనము వ్యంగ్యమైయుండును. అట్టిస్థలములయందలి వ్యంగ్యము లక్షణావశమున భాసించుటచే నద్దానికి లక్షణామూలధ్వని యనిపేరు. అభిధామూలధ్వని యసంలక్ష్యక్రమమనియు, సంలక్ష్యక్రమమనియు రెండువిధములు. రసాదిధ్వని యసంలక్ష్యక్రమము. శబ్దశక్తిమూలమనియు, నర్థశక్తిమూలమనియు సంలక్ష్యక్రమము రెండువిధములు.

ప్రకృతమున నధమకావ్య మనదగు శ్లేషకావ్యమునకును నుత్తమకావ్యమగు శబ్దశక్తిమూలధ్వనికావ్యమునకును వివిక్తవిషయములను జర్చించి, తద్భేద మరయుదము.

అనేకార్థములుగల శబ్దములచే స్ఫురించు నర్థములు కొన్నిచోటుల కేవలప్రకృతములును, మఱికొన్నిపట్టుల కేవలాప్రకృతములును, ప్రకృతాప్రకృతోభయములునుగూడ నైయుండును. ఎచ్చట రెండర్థములునుగూడ కేవలప్రకృతములుగాని, యప్రకృతములుగాని యగునో అచ్చట నా రెండర్థములును నేకజాతీయము లగుటచే వానిని జెప్పుట కభిధయే సమర్థమగును. ఇంక నొకయర్థము ప్రకృతమును, మఱియొకయర్థము ప్రకృతమున కసంబంధియు నైనచోట ప్రకృతార్థమును జెప్పుటచే నభిధయొక్క శక్తి తగ్గుటచే విజాతీయమగు నప్రకృతార్థమును స్ఫురింపజేయజాలదు. అట్టిపట్టుల నప్రకృతార్థబోధనమునకై మఱియొకవృత్తి నంగీకరింపకతప్పదు. అదియే వ్యంజనావృత్తి. అనగా నిట్టిచోట ప్రకృతార్థము వాచ్యమనియు, నప్రకృతార్థము వ్యంగ్యమనియు గొందఱి మతము. చూడుడు మమ్మటుడు తన కావ్యప్రకాశమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

" అనేకార్థస్య శబ్దస్య
వాచకత్వే నియంత్రితే,
సంయోగాద్యై రవాచ్యార్థ
ధీకృద్వ్యాపృతిరంజనమ్.

శబ్ద మనేకార్థములను జెప్పునదైనను సంయోగాదులచే నట్టిశక్తి ప్రకృతమునకు సంబంధించు నొకయర్థము నందు నియమింపబడిపోవుననియు, నందుచే తరువాత స్ఫురించు నప్రకృతార్థమును ప్రకాశింపజేయుట కాశక్తి చాలనందున రెండవశక్తి నంగీకరింపవలెననియు, నద్దానినే వ్యంజనయందురనియు జెప్పినాడు. సాహిత్యదర్పణమునగూడ నిట్టి యభిప్రాయము ప్రకటింపబడినది.

ఇంక కొందరు ద్వితీయార్థమును బ్రకాశింపజేయుటకు వ్యంజనాఖ్య మను వృత్త్యంతరము నంగీకరించుటకంటెసంయోగాదులచే నియంత్రిత మైపోయిన శక్తియే మరల నుల్లసిల్లి యాయప్రకృతార్థమును స్ఫురింపజేయునని యొప్పుకొనుటయే యుక్తమని యభిప్రాయపడియున్నారు. వీరి మతమున ద్వితీయార్థము కూడ వాచ్యమన్నమాట.

కేవలప్రకృతములు :

" సర్వదోమాధవః పాయా త్స యో గంగా మదీధరత్. "—ఇచ్చట ' సర్వదోమాధవః ' అను స్థలమందు 'సర్వదా + ఉమాధవః' యనియు, 'సర్వదః + మాధవః' యనియు విభజించుకొనగా వచ్చు రెండర్థములును ప్రకృతమగు రక్షణమున కుపయోగించుచున్నవి. ఇచట మాధవునిపక్షమున, ' యః, అగం = గోవర్ధన గిరిమ్, గాం=పృథివీమ్, అదీధరత్ ' అనియు, శివుని పక్షమున ' యః,గంగాం, అదీధరత్ ' అనియు చెప్పుకొనవలెను.

కేవలాప్రకృతములు :

" అబ్జేన త్వన్ముఖం తుల్యం హరిణాహితసక్తినా "—ఇచ్చట నబ్జపదముచే స్ఫురించు పద్మము, చంద్రుడు అను రెండర్థములును ప్రకృత మగు ముఖమున కుపమానము లగుటచే రెండును నప్రకృతములు. ఇచ్చట చంద్రుని పక్షమున " హరిణేన = కురంగేణ, ఆహితా = కృతా, సక్తిః = సంగో యస్య తేన "యనియు, పద్మపక్షమున " హరిణా = సూర్యేణ, ఆహిత సక్తినా " యనియు చెప్పుకొనవలెను.

ప్రకృతాప్రకృతములు:

" అలం హిమానీపరిపూర్ణ గాత్రః
సమాపితః ఫాల్గునసంగమేన,
అత్యన్తమాకాంక్షితకృష్ణవర్త్మా
భీష్మో మహాత్మాజని మాఘతుల్యః. "

ఇచ్చట ప్రకృతమగు భీష్మునికి సంబంధించునట్లు ఫాల్గునకృష్ణవర్త్మాది శబ్దములకు అర్జునుడు, కృష్ణుని మార్గము మొదలగు నర్థములు చెప్పవలసియున్నను నప్రకృతమగు మాఘమాసమునకు సంబంధించునట్లుగా ఫాల్గునమాసము, అగ్ని యను నన్యార్థములుకూడ స్ఫురించుచున్నవి.

ఈ పైమూడుస్థలములలోను శ్లేషాలంకారమనియే సిద్ధాంతము. అందు మొదటిదానికి కేవలప్రకృతశ్లేష యనియు, రెండవదాని కప్రకృతశ్లేషయనియు, మూడవదానికి ప్రకృతాప్రకృతశ్లేష యనియు పేర్లు. మొదటి రెండుభేదములలో విశేషణములు శ్లేషింపక తప్పదు. విశేష్యములు శ్లేషించినను, శ్లేషింపకున్నను నిబ్బంది లేదు. ప్రకృతాప్రకృతశ్లేషలో మాత్రము విశేషణములు శ్లేషింపవలెనేకాని విశేష్యములు శ్లేషింపగూడదు. చూడుడు :

" ప్రకృతాప్రకృతోభయగత
ముక్తంచే చ్ఛబ్దమాత్రసాధర్మ్యమ్,
శ్లేషోఽయం, శ్లిష్టత్వం
సర్వత్రాద్యద్వయే, నాంత్యే.

యత్ర కేవల ప్రకృతయోః కేవలాప్రకృతయోశ్చ శ్లేషః కథ్యతే తత్ర ప్రకారద్వయే విశేషణ విశేష్యశ్లిష్టతా. ప్రకృతాప్రకృతవిషయేఽన్త్యభేదేతు విశేషణమాత్రశ్లిష్టతా. విశేష్యయోరపి శ్లిష్టత్వే శబ్దశక్తిమూలధ్వనిప్రసంగాత్. " (ప్రతాపరుద్రీయము)

మఱియు జగన్నాథపండితుడు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అయం శ్లేషః ప్రకృతమాత్రాఽప్రకృతమాత్ర ప్రకృతాప్రకృతోభయాశ్రితత్వేన త్రివిధః. అత్రాద్యే భేదే ద్వితీయేచ విశేష్యస్య శ్లిష్టతాయాం కామ చారః. తృతీయభేదేతు విశేషణవాచకస్యైవ శ్లిష్టత్వం, నవిశేష్యవాచకస్య. తథాత్వేహి శబ్దశక్తిమూలధ్వనే రుచ్ఛేద ఏవ స్యాత్." (రసగంగాధరము) అని చెప్పియున్నాడు. కాన విశేష్యముకూడ శ్లేషించినచో శబ్దశక్తిమూలధ్వని యగును.

ప్రాచీననవీనాలంకారికుల సిద్ధాంత మిట్లు ప్రసిద్ధమైయుండ నప్పయదీక్షితులు తన కువలయానందమున ప్రకృతాప్రకృతశ్లేషకు చంద్రాలోకము ననుసరించి,

"అసా వుదయమారూఢః
కాంతిమాన్ రక్తమండలః,
రాజా హరతి లోకస్య
హృదయం మృదులైః కరైః."

అని యుదాహరించియున్నాడు. ఈ లక్ష్యమందు విశేష్యమగు రాజశబ్దముకూడ శ్లేషించుచున్నది. కాగా నిది ధ్వని కుదాహరణము కావలెను. ఈతడు వ్రాసిన తరువాత సందర్భమునుబట్టి యిట్టిపట్టుల నుపమాలంకారము వ్యంగ్య మగుటచే శబ్దశక్తిమూలధ్వని ప్రసంగ మున్నను ద్వితీయార్థము వాచ్య మగుటచే శ్లేషాలంకారవ్యవహారముకూడ నున్నదని యీతనియాశయమైనట్లు పొడకట్టుచున్నది. ఇది పైయాలంకారికుల మతమునకు విరుద్ధము.

విశేష్యముకూడ శ్లేషించినచో ధ్వనివ్యవహారము కనుకనే ధ్వన్యాలోకమున,

"ఉన్నతః ప్రోల్లసద్ధారః కాలాగురుమలీమసః,
పయోధరభర స్తన్వ్యాః కం నచక్రేఽభిలాషిణమ్."

అని యుదాహరింపబడియున్నది. ఇచ్చట 'ప్రోల్లసత్ + హారః', 'ప్రోల్లసత్ + ధారః' అని విశేషణము శ్లేషించుటయే కాక విశేష్యమగు పయోధరశబ్దముకూడ శ్లేషించి ప్రకృతమగు స్తనరూపార్థమును, నప్రకృత మగు మేఘరూపార్థమును స్ఫురింపజేయుచున్నది. మఱియు నిది స్త్రీవర్ణనప్రకరణమై యుండుటచే ద్వితీయార్థము ప్రకృతమున కసంబంధియగును. అందుచే నట్టి యప్రకృతార్థముతో ప్రకృతమునకు సామ్యము కల్పించుకొనిన ప్రకృతమునకు సంబంధించును. కాగా నిట్టి పట్టుల ననేకార్థకశబ్దసామర్థ్యమువలన నౌపమ్యము వ్యంగ్యమగుటచే శబ్దశక్తిధ్వనియని వ్యవహరింపవలసి యుండును.

ఇచ్చట నౌపమ్యము వ్యంగ్యమగుటచే నుపమాలంకారధ్వని యని కొందరిమతము. ఇట్టితావుల శబ్దసామ్య ముండుటచే శ్లేషయగుననికాబోలు, ధ్వన్యాలోకమున శ్లేష వ్యంగ్యమని చెప్పబడినది. మఱికొంద ఱుపమానోపమేయము లేకశబ్దోపాత్తములగుటచే నభేదమే భాసించునని రూపకాలంకారము వ్యంగ్య మగుననిరి.

ఇంకను మఱికొన్ని శబ్దశక్తిమూలాలంకారధ్వనులు కలవు.

"తిగ్మరుచిరప్రతాపో
విధుర నిశాకృద్విభో మధురలీలః,
మతిమా నతత్త్వవృత్తిః
ప్రతిపదపక్షాగ్రణీ ర్విభాతి భవాన్."

ఇచ్చట "తిగ్మరుచిరప్రతాపః" అనుమొదలగు సమాసపదములను "తిగ్మరుచిః + అప్రతాపః" అని రెండుపదములుగా విభజించినచో సూర్యుడైనను తేజస్సులేనివాడని విరోధాలంకారము ప్రతీయమాన మగును. వాస్తవముగా "తిగ్మరుచిరప్రతాపః" అనున దొక్కటే పద మగుటచే పరిహారము. కాగా నిట్టి పట్టుల శబ్దశక్తిమూలకము విరోధాలంకారధ్వని. ఇట్లే వ్యతిరేకాద్యలంకారములుకూడ శబ్దశక్తిచే వ్యంగ్యములు కావచ్చును.

పైనజెప్పినట్లు శబ్దశక్తిచే నలంకారములు ప్రధానముగా వ్యంగ్యమైనప్పుడే ధ్వనివ్యవహార ముండును. అట్లుకాక వాచ్యమైనచో నచ్చోట శ్లేషాలంకారమనియే వ్యవహరింపవలెను, చూడుడు:

"తస్యా వినాపి హారేణ నిసర్గాదేవ హారిణౌ,
జనయామాసతుః కస్య విస్మయం నపయోధరౌ."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇచ్చట స్తనములకు హారము లేనిదే హారముకలిగి యుండుట విరోధము. మనోహరములని పరిహారము. ఇట 'తిగ్మరుచిరప్రతాపః' అనుచోటవలెగాక విరోధము స్పష్టముగా అభిశబ్దముచే వాచ్యమైనది.

మఱియు నెచ్చట శబ్దశక్తిచే వ్యంగ్యమయిన యలంకారము కవిచే బ్రకటింపబడుటచే వాచ్యమైన దానితో సమానమగునో అచటగూడ శ్లేషాలంకారవ్యవహారమే. చూడుడు:

"దృష్ట్యా కేశవ గోపరాగహృతయా
కించి న్నదృష్టం మయా,
తేనైవ స్ఖలితాస్మి నాథ పతితాం
కింనామ నాలంబసే;
ఏక స్త్వం విషమేషుఖిన్నమనసాం
సర్వాబలానాం గతిః,
గోప్యైవం గదితః సలేశ మవతా
ద్గోష్ఠే హరి ర్వ శ్చిరమ్."

ఇచట నాకు గోవులపరాగముచే దృష్టి కనబడుట లేదనియు, మార్గమందు తొట్రుపడిన నాకు నీ వాలంబనము కావా యనియు నర్థము ప్రకృతముగా స్ఫురించి "గోపరాగ, పతితాం, విషమేషుఖిన్నమనసా" మిత్యాద్యనేకార్థకపదశక్తిచే, ఓకృష్ణా! నీ యందు నాకనురాగము కలదనియు, నాకు భర్తవు కావా? ఇట్టివిషమబాణపీడితులకు నీవే గతియనియు నర్థము ప్రధానముగా వ్యంగ్య మగుచున్నది. కాని కవి యద్దానిని 'సలేశం గదితః' అని ప్రకటించి వాచ్యాయమానము చేసియున్నాడు. అందుచే నిచ్చట శ్లేషాలంకారవ్యవహారమే కాని యుత్తమకావ్యత్వ వ్యవహారము లేదు.

పైనజెప్పిన శబ్దశక్తిమూలకములగు నలంకారధ్వనులేకాక వస్తుధ్వనులుకూడ సంభవించును. అనగా నలంకారశూన్యమగు కేవలమగు నొకయర్థము వ్యంగ్యమగును. వస్తురూపమనియు, నలంకారరూపమనియు శబ్దశక్తిమూలధ్వని కిట్లు ద్వైవిధ్యము కావ్యప్రకాశమున జెప్పబడినది.

"అలంకారోఽథ వస్త్వేవ
శబ్దాద్యత్రావభాసతే,
ప్రధానత్వేన స జ్ఞేయః
శబ్దశక్త్యుద్భవో ద్విధా."

మమ్మటు డిట్లు ద్వైవిధ్యమును జెప్పి యీపద్యాలంకారధ్వనుల నుదాహరించి, వస్తుధ్వనికి,

"పాంథ, నాత్ర సంస్తరోఽస్తి
మనాక్ ప్రస్తరస్థలే గ్రామే,
ఉన్నతపయోధరం వీక్ష్య
పునర్వసని చేద్వస."

అని యుదాహరించియున్నారు. ఇచ్చట నొకకులట, బాటసారితో, 'పాంథా, యీగ్రామమున పండుకొనుటకు మంచితావు లేదు. అయినను మేఘాడంబరమును జూచి యిచ్చటనే యుండిపో నిచ్ఛయున్నచో నుండిపొమ్ము.' అని చెప్పుచున్నది. ఇచ్చట పయోధరాదిశబ్దములచే "నీ యూర నాగరకు లెవరును లేరనియు, మనలనుగూర్చి యనుమానపడువారును లేరనియు, నాయున్నతస్తనములను జూచితివి గదా, మాయూరి యనాగరకులవలెగాక నన్ను తృప్తిపరుప నీకేమైనసామర్థ్య మున్నచో నుండిపొమ్ము" అను సహృదయహృదయావర్జకమగు చమత్కారవస్తువు వ్యంగ్యమగుచున్నది. సాహిత్యదర్పణమునగూడ,

"వస్త్వలంకారరూపత్వా
చ్ఛబ్దశక్త్యుద్భవో ద్విధా"

అని చెప్పి, వస్తురూపశబ్దశక్త్యుద్భవధ్వనికి "పాంథ నాత్ర సంస్తరోఽస్తి" యనుపద్యమే యుదాహరింపబడియున్నది. మఱియు విద్యానాథుడును, జగన్నాథపండితుడునుగూడ శబ్దశక్తిమూలధ్వనిద్వైవిధ్యము సోదాహరణముగా జెప్పియున్నారు.

ఈసందర్భమున గమనింపవలసినవిషయ మొక్కటి కలదు. ఆనందవర్ధనాచార్యుడు శబ్దశక్తిమూలధ్వనికిని శ్లేషకును భేదము చెప్పుటకై శబ్దశక్త్యుద్భవధ్వని నిట్లు నిర్వచించియున్నాడు:

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఆక్షిప్త ఏవాలంకారః
శబ్దశక్త్యా ప్రకాశతే,
యస్మి న్ననుక్తః శబ్దేన
శబ్దశక్త్యుద్భవో హి సః."
(ధ్వన్యాలోకము, ౨ ఉద్ద్యోతము)

ఎచ్చోట శబ్దశక్తిచే నలంకారము ప్రధానముగా వ్యంగ్య మేయగునో యచ్చట శబ్దశక్త్యుద్భవధ్వనియని యు, ఎచట ప్రకృతాప్రకృతార్థద్వయము శబ్దముచే వాచ్యమగునో అచట శ్లేషాలంకార మనియు వృత్తిలో నిట్లు వివరింపబడియున్నది.

"యస్మాదలంకారో న వస్తుమాత్రం యస్మిన్ కావ్యే శబ్దశక్త్యా ప్రకాశతే, స ఏవ శబ్దశక్త్యుద్భవో ధ్వని రి త్యస్మాకం వివక్షితః. వస్తుద్వయే చ శబ్దశక్త్యా ప్రకాశమానే శ్లేషః."

అలంకారము వ్యంగ్యము కావలె ననుటచే

"తస్యా వినాపి హారేణ........పయోధరా"

ఇత్యాదిస్థలములందు విరోధాద్యలంకారములు వాచ్యములై నను ధ్వనివ్యవహార ముండ దని చెప్పియున్నాడు.

మఱియు 'ఆక్షిప్తఏవ' (వ్యంగ్యమే కావలెను) అనుటచే,

"దృష్ట్యా కేశవగోపరాగ...సలేశమవతాత్..."

ఇత్యాదిస్థలములందు వ్యంగ్యమును కవి ప్రకటీకరించుటచే నట్టిచోటుల ధ్వనివ్యవహార ముండదని చెప్పియున్నాడు.

ఇట్లు భేదమును జెప్పి మరికొన్ని యలంకారములుకూడ శబ్దశక్తిమూలధ్వనులు కావచ్చు నని చెప్పియున్నాడు. కాని, శబ్దశక్తిమూలవస్తుధ్వనిని స్మరింపనే లేదు. అలంకారధ్వనియనియు, అలంకారరహితవస్తుధ్వనియనియు శబ్దశక్తిమూలధ్వని రెండువిధము లని మమ్మటభట్టాదులు విభజించిచూపగా నీత డా విషయము నెత్తకపోవుటకు గారణ మేమో తెలియకున్నది.

ఇంతేకాక, "ఆక్షిప్త ఏవాలంకార" అనుకారికకు వ్రాయబడినవృత్తిలో 'నవస్తుమాత్రం' అనియు, 'అస్మాకం వివక్షితః' యనియు జెప్పబడియుండుటచే శబ్దశక్తిమూలధ్వని యనగా నలంకారమే కాని వస్తువుకాదని యానందవర్ధనాభిమతమైయుండునా యని తోచుచున్నది. విశ్వనాథుడును, మమ్మటుడును వస్తుధ్వని కుదాహరణముగా నిచ్చిన 'పాంథ నాత్రసంస్తరోఽస్తి' యనుపద్యములోని చమత్కారవ్యంగ్యము నీతడు లేదనునా? ఇంకను జగన్నాథాదులు వస్తుధ్వని కిచ్చిన యుదాహరణములగతి యేమి?

పోనీ, 'పాంథ నాత్రసంస్తరః' యనుమొదలగు నుదాహరణములలోకూడ స్తనములను మేఘములకును సామ్యమే వ్యంగ్యమనియు, నందుచే నిచటకూడ నుపమాలంకారమే వ్యంగ్యమనియు నందుమా? అట్లు వలనుపడదు. ఇచ్చట 'నా స్తనములయున్నతిని జూచి యుండిన నుండిపొమ్ము' అని స్పష్టముగా జెప్పినచో, నామాట నెవ్వడైన విన్నచో యేమి సంభవించునను భయముచే నాజాణ, వివక్షితార్థమును గప్పిపుచ్చుటకు మాత్రమే పయోధరపదముచే మేఘరూపార్థమును సంగ్రహింపవలసివచ్చినది. అంతేకాని యిచ్చట సామ్యమభిప్రేతమని చెప్పుట కెంతమాత్రమును సాహసింపలేము.

ధ్వన్యాలోకకర్త యభిప్రాయము స్పష్టముగా దెలియకపోవుటచే నీసందేహము నలంకారశాస్త్రప్రవీణులగు పండితులవలన దెలిసికొనుటకై యిట్లు వ్రాసితినని పాఠకమహాశయులకు విన్నవించుకొనుచు నింతటితో విరమించుచున్నాను.

———


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కలలలోఁదప్ప!

ఓలేటి వేంకటరామశాస్త్రి

౧

ప్రతిదినమును కృష్ణమూర్తి- మొగముకడుగుకొను వేళయు, రాధ తలదువ్వుకొనువేళయు నొక్కటే యగుచున్నది. కృష్ణమూర్తి కాఁపురము సేయుచున్న యింటికి దక్షిణభాగమున రమారమి యేఁబది గజముల దూరమునందే రాధ నివసించుచున్న యిల్లున్నది. ఆయింటి యుత్తరపుగదికిటికీ కెదురుగనే యుత్తరముఖముగాఁ దిరిగి ప్రతిదినము నుదయకాలమున రాధ తలదువ్వుకొనుచుండుట యొక వాడుకయైపోయినది. కృష్ణమూర్తిపడుకగది రాధయుండు గది కిటికీ కెదురుగనే దక్షిణమున నున్నది. ఉదయమున నిద్ర నుండి లేవఁగనే కృష్ణమూర్తి తన శయనగృహమునకు దక్షిణమువైపున నున్న యరఁగుమీఁదికి వచ్చి కూరుచుండి దంతధావనకర్మకు మొదలుపెట్టుచుండెడువాఁడు. రాధకుఁ దలదువ్వుకొనుటలో నెంతో చాదస్త ముండెడిది. ఆపిల్ల శిరోజసంస్కారమున కెంతసేపటికిని దెమలుటయనునదే యుండునది కాదు. సూర్యోదయము కాఁగానే కృష్ణమూర్తికి దంతధావన సమయమున రాధాశిరోజసంస్కృతి యొక చలనప్రతిమారంగప్రదర్శన మగుచుండెడిది. తనకెదురుగా నేఁబది గజముల దూరమునఁ బొరుగింటి తరుణవయస్కుఁ డొకఁడు తనవంకఁ దిరిగి యొక్కనాఁడా-కాదు-ప్రతిదినమును దాను తలదువ్వుకొనుచున్నంతసేపును దంతశోధ చేసికొనుచుండఁగాఁ బడుచుపిల్లయైయున్న రాధ యతని కెదురుగాఁ గిటికీయొద్ద నిస్సందేహముగా నిలఁబడి యంతంతసేపు చాదస్తముగాఁ దల దువ్వుకొనుట కెట్లు వెనుదీయకున్నదో — కృష్ణమూర్తి పొరుగింటి యౌవనవతివంకఁ దిరిగి యామె తలదువ్వుకొనుచున్నంతసేపును దంతధావనము చేసికొనుచు సంశయింపకుండ నెట్లు కూరుచుండఁ గలుగుచున్నాఁడో చెప్పవలయుననిన నిప్పు డెవ్వరికి సాధ్యమగును?

౨

కృష్ణమూర్తిభార్య రుక్మిణికూడ మిక్కిలి చక్కనిపిల్లయే. అంతియేకాక, మంచి తెలివితేటలు గలదియు, బాగుగాఁ జదువుకొన్నదియుఁగూడను! పొరుగింటిలో నున్న రాధయుఁ, గృష్ణమూర్తి భార్య రుక్మిణియు నిద్దరు నించుమించుగా నొక్కయీడువారే. ఒడ్డుపొడుగులయందును, సర్వావయవ సౌష్ఠవమందును రాధారుక్మిణులకు విశేష భేదము గనఁబడదు. కొంచె మెచ్చుతగ్గుగా నిద్దరు నొక్కతల్లి బిడ్డలవలెఁ గనుపట్టుచుందురు. ఎటువచ్చినను రుక్మిణి రాధ కంటె నొక్కచాయ తక్కువయేమో. అంతే. అదియు నంతవిశేషముగాఁ జెప్పుటకు వీలులేదు. కృష్ణమూర్తికిఁ దనభార్య రుక్మిణియనిన నెంతో యిష్టము. రుక్మిణి తనకుఁ గృష్ణమూర్తివంటి యనుకూలభర్త లభించినందులకుఁ దన హృదయములో మిక్కిలి గర్వపడుచుండెడిది. ఆ తరుణదంపతు లిరువురు నన్యోన్యప్రేమానురాగములతో బద్ధులైయుండి యపారమైన యానందమహాసముద్రములో మునిఁగి తేలుచుండెడువారు. వారి కిరువురకు నెప్పుడు నేవిధమైన యభిప్రాయభేదములును లేనేలేవు. కాని యటువంటి సంసారసౌఖ్యస్థితిలో నున్నప్పటికిని గృష్ణమూర్తికి, బొరుగింటిరాధరూపరేఖావిలాసములు హృదయఫలకమున నచ్చునఁగొట్టిన ట్లంటుకొనియుండక పోలేదు. రాత్రి తెల్లవాఱుదనుకఁ దన ముద్దుభార్య తనప్రక్కలోనే యుండుచున్నప్పటికిని, సూర్యోదయ మైనతోడనే లేచి పలుదోముపుల్ల నోటఁ బెట్టుకొని బయటికివచ్చి రాధాముఖసందర్శనముఁ జేసికొనినఁగాని కృష్ణమూర్తికి మఱేపనియుఁ దోఁచునదేకాదు!

౩

ఆనాఁటి యుదయమున దక్షిణదిక్కునుండి మెల్లఁగాఁ జల్లని మలయమారుతము వీఁచుచున్నది. అప్పటి కుదయమున నాఱున్నఱగంటల కాల మైనది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాధయున్న యింటికిని గృష్ణమూర్తిపడుకటింటికిని నడుమనున్న పెరటిలోఁ రుక్మిణి పెంచిన పారిజాతపుఁ జెట్టు సంపూర్ణముగాఁ బుష్పించి తన మనోహరపుష్ప సౌరభ్యమును నలువంకల వెదఁజల్లుచుండెను. రాధ గతదినమున ముడిచికొనిన బొడ్డుమల్లెలబంతి తన తల నుండి తీసివైచి గవాక్షములోనుండి బయటకు విసరి వైచి తన దీర్ఘవేణీబంధమును సడలించి జడయంతయుఁ జక్కఁగా విప్పివైచి, నల్లఁగా నిగనిగలాడుచున్న యాతలవెండ్రుకలకు గమగమలాడు కేశరంజనతైల మును రాసి దువ్వుట కారంభించినది. కృష్ణమూర్తి దక్షిణవాయువునకు దిసవగాఁ దన పడుకగదియరఁగుపై యథాపూర్వముగా దంతధావనముఁ జేయ నారంభించి నాఁడు. ఒకప్పుడు పారిజాతపుష్పపరిమళమును, మఱి యొకప్పుడు రాధతలకట్టునకు రాచికొనిన కేశరంజన తైలవాసనయును గప్పుగప్పున వచ్చి కృష్ణమూర్తికి నాసికాపుటతర్పణము చేయుచుండెను. రుక్మిణి వంట యింటివసారాలోఁ "గాఫీ" కాచి సిద్ధముగా నుంచినది. కృష్ణమూర్తి పలుదోముపుడుక నోటిలోఁ బెట్టుకొని పర ధ్యానముగాఁ బండ్లుదోముకొనుచుఁ దనమనస్సులో నేదియో దీర్ఘాలోచన చేయుచుఁ గాఫీమాట మఱచిపోయి రాధవంకకుఁ దిరిగి యట్లే కూర్చుండిపోయినాఁడు. రాధ యెందులకో యొక్కమాఱు చిఱునవ్వు నవ్వినట్లు కృష్ణ మూర్తికనులకుఁ గనుపట్టినది. ఆనాఁడామెచూపులలో నేదియో నూతనవికాస మావిర్భవించినట్లుకూడఁ గృష్ణ మూర్తి భావమునకు గోచరించినది. రాధ, మొట్టమొదట నొకసారి చక్కఁగాఁ దలదువ్వికొని పువ్వులు చుట్టుకొని ముగించి వెడలిపోయి మరలఁ దత్క్షణమే తిరిగివచ్చి చుట్టుకొన్న పూవులు తీసివైచి యల్లుకొన్న జడ విప్పి వైచి మరలఁ దలదువ్వుకొనుట కారంభించినది. రాధా రమణి మఱికొంతసేపు తనకన్నులయెదుటఁ దాండవ మాడిపోవుటకే యట్లు పునశ్శిరోజ సంస్కృతియందుఁ బ్రవర్తిల్లియుండు నని కృష్ణమూర్తి తనహృదయమున భావించుకొని యువ్విళ్లూరుట కింకనేమి యభ్యంతర ముండును? అతనికనుల కప్పుడు రాధాముఖసుధాకర కళాస్వాదనాసక్తియే కాని, జిహ్వకుఁ "గాఫీ" సుధారస ధారాస్వాదనాస్థ యెక్కడనుండి వచ్చును? రుక్మిణి, కాఫీ చల్లఁబడిపోవుచున్నది. భర్త యింకను రాకుండె నని తల్లడిల్లుట స్వభావమేకదా? అనుదినము నించుక యేనిఁ గాలాతిపాతము గానీయక, కాఫీత్రాగుట కలవాటుపడియున్న తనప్రియభర్త యానాఁ డట్టు లాలసించుటకుఁ గారణ మేమో కనుఁగొనవలయునని రుక్మిణికిఁ గుతూహలము గలుగుటయు సహజమే.

## ౪

ఒకనాఁడు మధ్యాహ్నభోజనము లైనతర్వాతఁ గృష్ణమూర్తి వాకిటిలోఁ బడకకుర్చీలోఁ గూరుచుండి భారతీపత్రికఁ జదువుకొనుచున్నాఁడు. రుక్మిణి యత నికి సమీపముననున్న మఱియొకకుర్చీలోఁ గూరుచుండి తమలపాకులకు సున్నమురాచి మడఁచి భర్తనోటి కందించుచుండెను. వీథిలోఁ దలుపుదగ్గఱ "ఏమం డోయి! కృష్ణమూర్తిగారు!" అని యెవ్వరో బిగ్గరగాఁ బిలిచిన ట్లయినది. కృష్ణమూర్తి "ఎవరువా" రనుచు లేవఁబోయినాఁడు. "తపాలాజవానులాగున నున్నాఁడు. ఉత్తరము లేవైన వచ్చినవేమో, నేను వెళ్లి తెచ్చెదను లెండు. మీరు లేవనక్కఱలే"దని చెప్పుచు రుక్మిణి తటాలున లేచివెళ్లి వీథితలుపు తెఱచినది. రుక్మిణి యూహించి పలికినపలుకు యథార్థమే యైనది. తపాలా బంట్రోతు, కృష్ణమూర్తివిలాసముగల యొకసంచి యుత్తరము రుక్మిణిచేతి కిచ్చి "దసరాబరాతము దయచేయింపవలయునని అయ్యగారితో మనవి చేయుండమ్మా" అని చెప్పి వెళ్లిపోయినాఁడు. రుక్మిణి మరల వీథితలుపు మూసివైచి గొళ్లెముపెట్టి యుత్తరము పైవిలాసము పరిశీలించుచుఁ జిఱునవ్వు నవ్వుకొనుచు లోపలికి వచ్చి యాయుత్తరము భర్తచేతి కిచ్చి "అదేమిటి? పైనున్న వ్రాఁత ఆలాగునఁ, జేత కాని యాఁడువాండ్రు వ్రాసినట్లున్న దేమిటి?" అనుచుఁ గూరుచుండెను. కృష్ణమూర్తికిఁగూడ నాజాబుపైనున్న వ్రాఁత పరిచితమైయున్నట్లు కనఁబడలేదు. కొంచె మనుమానించుచు మెల్లఁగా సంచి చింపి లోపలిజాబు నొకించుక మాటుగాఁ దెఱచి చూచి వెంటనే "సరి!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిదా?" యని యలక్ష్యభావముగాఁ దేలఁబలుకుచు మరల నాజాబు సంచిలో నుంచివైచి తనజేబులోఁ బెట్టుకొని యేమియు లేనట్లు యథాప్రకారముగాఁ బుస్తకమువిప్పి చదువ నారంభించెను.

రుక్మిణి—అదేమిటి? "సరి! యిదా?" యని నిర్లక్ష్యముచేసి యాజాబును దిన్నఁగా విప్పి కడలేరఁ జదువనైనఁ జదువకుండ జేబులోఁ బెట్టుకొని యూరకున్నారేమి? అది యెక్కడనుండి వచ్చినదేమిటి?

కృష్ణ—అబ్బే! ఏమియు లేదు. ఆయుత్తరము మన కేమియు సంబంధించినదికాదు.

రుక్మిణి—కాకపోయినఁ గాకపోవచ్చును. కాని, యెక్కడనుండి వచ్చినదో, యెవ్వరు వ్రాసినారో కూడఁ జెప్పఁగూడదు? అంతరహస్యమైనదా యేమిటి? పోనిండు, రహస్యవిషయమైనయెడలఁ జెప్పనక్కఱయే లేదు.

కృష్ణ—అబ్బే! రహస్యమున కేమున్నది? కాకపోయిన—నాకు నీదగ్గఱ రహస్యమేమిటి? ఆజాబు, అమలాపురమున నున్న యొకస్నేహితునియొద్దనుండి వచ్చినది. దానిలోని విషయములు మన కేమియు సంబంధించియుండవు. ఆవీథినున్న అవసరాల సుబ్బారాయుడుగారికి, వారి వ్యవహారములనుగురించి వ్రాసినాఁడు. అంతే దానిలోని విషయములు.

రుక్మిణి—ఇవి యన్నియు వట్టి దొంగమాటలు. మీస్నేహితుఁడు వ్రాసినయెడల నదియేమి? ఆయుత్తరమువీఁది వ్రాఁత యట్లున్నదేమి, చేతఁగాని యాఁడుదాని చేతివ్రాఁతలాగున?—

కృష్ణ—వానివ్రాఁత యెప్పుడు నట్లే యుండును. వాఁ డంతకంటె బాగుగా వ్రాయలేఁడు.

రుక్మిణి—(సాశ్చర్యముగ) అఁహఁ! నిజముగానే? మగవాం డెంత విశేషముగా వ్రాయలేనివారైనను, ఎప్పుడు—నెచ్చట—నెవ్వరు—నింతపాడుగా వ్రాయుట చూడనే లేదు! మిక్కిలి చిత్రముగా నున్నదే! ఏదీ! ఒక్కమా ఱాజాబు నిట్లిండు. చదివి చూచెదను. ఇంకను వ్రాఁతలో నెన్నిచిత్రము లుండునో? నాకటువంటి యుత్తరములు చదువుటయనిన నెంతయో వినోదముగా నుండును జుండీ!

కృష్ణ—(ఏమిచేయుటకును దోఁచక) ఆపాడుజాబు చదువనేమిటికి పోనిమ్ము రుక్మిణీ! భారతిలోనేదియైనఁ జదువుకొనరాదు? నే నీజాబు వారిది వారికిచ్చివేయుదును. దానిలో నేవేవియో వ్యవహారపు గొడవ లన్నియు నుండును. ఆకారణముననే నేనును జదువమానివేసితిని. ఏదీ! నా యుత్తరీయము నిట్లు తెచ్చిపెట్టు. ఇప్పుడే యావీథికిఁ బోయి, వారి యుత్తరము వారి కిచ్చివేసి వచ్చెదను.

రుక్మిణి—ఇప్పుడు మీ రీయెండలో నింత కష్టపడి వెళ్లుట యెందులకు? నే నాయుత్తరము చూడనిండని యడుగను లెండు. ఇంకఁ గొంచెముసే పుండి చల్లఁబాటువేళ వెళ్లి యీయవచ్చును లెండు!

కృష్ణ—అబ్బే! అందులకై కాదు! ఆ వీథినింకను గొంచెము పనికూడ నున్నది. ఎన్నాళ్లనుండినో కంసాలివీరయ్యదగ్గఱ నీకమ్మలజత యట్టే యున్నది. ఎన్నిమాఱు లడిగిన "ఇదిగో, అదిగో" అనుటయే కాని యింతవఱకు నీయనే లేదు. అదికూడ నడిగి పట్టుకొనిరావలసియున్నది.

రుక్మిణి—(నవ్వుచు) పోనిండు! ఇన్నాళ్లకు అవసరాలవారి యుత్తరము పుణ్యమాయని మన యవసరాలుకూడఁ దీఱుట కవకాశము గలిగినది. వెళ్లి రండు. (అని గదిలోని పాగాకొయ్యలమీఁద నున్న యుత్తరీయముఁ దెచ్చియిచ్చుచు) మరల వేగముగా వచ్చెదరా?

కృష్ణ—(రుక్మిణి యిచ్చు కండువా యందుకొనుచు నిట్టే ముందునకు వంగి చటుక్కున నామె బుగ్గపై ముద్దుపెట్టుకొని) అబ్బే! పదినిమిషముల పని. ఇప్పుడే వచ్చివేసెదను!

రుక్మిణి—(తాంబూలపు రంగంటుకొనిన బుగ్గఁ దుడిచికొనుచు) ఈ యిచ్చకపుముద్దుల కేమిలెండు. వెళ్లి త్వరగా రండు. నేనొక్కరితను గూరుచున్న యెడల నా కేమియుఁ దోఁచకుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ—సరి! నాకుమాత్ర మేమితోఁచును? ఇప్పుడే వచ్చివేసెదను. వీథితలుపులు దగ్గఱగాఁ బెట్టియే యుంచుము.

రుక్మిణి—కానిండు! చూతముగాదు! మగవాండ్రు చెప్పున వన్నియు వట్టిదొంగమాటలే.

కృష్ణ—ఔను! ఆఁడువాండ్రే యెప్పుడును సత్యముఁ దప్పనివారు. సరే కదా? (అని నవ్వుచు నిష్క్రమించెను.)

ॐ

ఇంతకుముందు టపాజవాను వచ్చి కృష్ణమూర్తి విలాసముగల యొకసంచియుత్తరమును రుక్మిణిచేతి కిచ్చిపోవుటయును, రుక్మిణి యాజాబు తెచ్చి కృష్ణమూర్తి కిచ్చుటయును, అతఁడు జాబుపైసంచి చింపి లోపలనున్న యుత్తరమును బాగుగాఁ బైకిఁదీయకుండఁగనే మాటుగాఁ గొంచెము చూచి మరల సంచిలోనికిఁ ద్రోసివేసి తనజేబులోఁ బెట్టుకొనుటయును, తరువాత దానిని గుఱించి రుక్మిణీకృష్ణమూర్తులకు జరగిన కొంత సంభాషణమునుమాత్రమే పాఠకులకుఁ దెలియును. కాని, యా జాబుసందర్భము లన్నియుఁ బూర్తిగాఁ దెలిసి యుండలేదు. కావున నిప్పు డాయుత్తరములోని విషయములు పాఠకులకుఁ దెలిసికొనవలయునని యభిలాషము గలిగియుండవచ్చును. ఆసంగతులు కొన్ని మే మిప్పుడు తెలియఁజేయవలసియున్నది.

జాబుమీఁది వ్రాఁత చూడఁగనే కృష్ణమూర్తి తనమనస్సులోఁ గొంచె మనుమానపడినాఁడు. దానికిఁ దోడుగా రుక్మిణి "ఇదేమిటి, చేతగాని యాఁడుదాని చేతివ్రాఁతవలె నున్నది?" అని పలికినది. దానితోఁ గృష్ణమూర్తియనుమానము మఱికొంత బలపడినది. సంచి చింపి లోపలిజాబు కొంచెము పైకిఁ దీసి చూచి నప్పు డాజాబుకడపటనున్న "ఇట్లు,

ప్రతిదినమును మీకనులముందు గనుపట్టుచు
మీకు మనోహరియై మలమల మసలుచున్న
మన్మథోపహత; లేక మదనోపహత."

అనువ్రాలు చూడఁగనే యతని యనుమానమంతయుఁ దీఱిపోయినది. తత్క్షణమే కృష్ణమూర్తిహృదయము తటతటలాడఁజొచ్చెను. అతనిమనస్సులో నేవియేవియో భావపరంపరలు సముద్రతరంగములవలె బయలువెడలి కలఁచివైవఁదొడఁగినవి. అప్పుడు కృష్ణమూర్తి రుక్మిణీ సమక్షమున నుండుటచే నతని కచ్చట నొక భావప్రధానమైన నాటకభాగము బహుకష్టముగ నభినయింపవలసివచ్చినది. అప్పటికప్పు డేదోయొకవిధముగ మిగుల గుట్టుగా నభినయించివచ్చివేసినాఁడు. అంత సందర్భశుద్ధిగా లేకపోయినను గొన్ని యసత్యవిషయము లప్పటికప్పు డాతుకవిత్వము చెప్పి పచ్చిబొంకులు బొంకి యెట్లో రుక్మిణిని వదలించుకొని యీవలఁ బడినాఁడు. తమ వీథి దాఁటి రెండవవీథిమలుపు దిరిగి యావీథికడపటనున్న విఘ్నేశ్వరాలయమునకుఁ బ్రక్కఁగాఁ "దాలూకాబోర్డు"వారు గట్టించిన "లోకలుఫండు" సత్రమునొద్ద జనసంచారము విశేషముగా లేకపోవుటచే నక్కడకుఁ జేరుకొన్నాఁడు. జేబులో నున్న జాబును మెల్లఁగా వణఁకుచున్న చేతితోఁ బైకిఁ దీసి చదువుకొన నారంభించినాఁడు. సభలలో ధారాళముగా నుపన్యసించు నభ్యాసపాటవములేనివా రొక్కొక్కప్పుడు తప్పనిసరియై తమ యుపన్యాసమును గాగితముపై వ్రాసికొని సభామధ్యమున నున్న పీఠముపై నెక్కి గందరగోళము నొందుచు గడగడలాడుచు నుపన్యసించుసమయమున వారిచేతిలోని కాగితమెట్లు కంపించునో యిప్పుడు మన కృష్ణమూర్తిచేతిలో నున్న జాబట్లు కంపింపఁదొడఁగినది. ఎట్లయిననేమి, చదువ నారంభించినాఁడు. ఆయుత్తర మిట్లున్నది:

"నాహృదయనాథుని యంతరంగసన్నిధికి:—

హద్దులేని ముద్దులతో వ్రాసికొన్న యార్తలేఖ. మదీయమనోమానసతిరస్కారా!

చిరకాలమునుండి-[అచిరకాలమే కావచ్చును! కాని, నాహృదయమున కెంతయో చిరకాలముగాఁ దోఁచుచుండుటచే నిట్లు వ్రాసితిని.] ప్రతిదినమును నేను మీకనులముందు సంచరించుచు మీ సుందరవదనార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వింపసందర్శనలాభము నొందుచు నా ప్రణయభావము నంతను జేతనైనంతవఱకు [నోటితోఁగాదు] చేష్టలతో వెల్లడించుచున్నను మీ కింకను నాయెడల ననుగ్రహము రాలేదు. మీ రీరాత్రి పదునొకండుగంటలకు నిర్జన ముగానుండు లోకలుఫండుసత్రము వీథియరుఁగుమీఁద గదిలో నన్నుఁ గలిసికొని రక్షింపనియెడల నేను మరల మీ కన్నుఁడును గనఁబడుదానను గాను. ఇది ముమ్మాటికిని సత్యము. తరువాత మీచిత్తము. ఆశపడి యర్ధరాత్రి వేళఁ దీర నేనక్కడకు వచ్చి మీదర్శనలాభము నొందక హతాశనై యడుగంటిపోవునట్లుమాత్రము చేయకుఁడు. ఇదియే నాముఖ్యప్రార్థన. తమరు దయతో నాసాహసమునకు మన్నించి నాజీవితమును వితజేయక నాముద్దు చెల్లించి నాతప్పు క్షమించి నారహస్యము వెల్లడింపక యనుగ్రహించి యీయుత్తరమును జించి పాఱవేయుఁడు. మీకు నేనుకాక మఱియొక మనోహరి యున్నదని యెఱిఁగియుండియు స్వార్థపరత్వముచే నిట్టిపనికిఁబూనుకొంటిని. క్షమింపుఁడు. ఇవి నాహృదయ దర్పణమున నిర్మలభావరసముతో వ్రాయఁబడిన యక్షరములు. మీకుఁ దిన్నఁగాఁ గనఁబడునో కనఁబడవో, సావధానముగఁ బోల్చి తెలిసికొనుఁడు. నా కింకను నెంతయో వ్రాసికొనవలయునని యున్నది. కాని, మిమ్ములను విసిగించినదాన నగుదునేమోయని విరమించుచున్నాను. దివ్యచిత్తమునకుఁ దేవలయును. ఇట్లు-ప్రతిదినమును మీకనులముందు గనుపట్టుచు మీకు మనోహరియై మలమల మసలుచున్న మన్మథోపహత; లేక మదనోపహత.

పైవిలాసము:— మ-రా-రా-శ్రీ. కె. కృష్ణమూర్తిగారికి బి. యె. గుడివాడ."

ఈ యుత్తరముఁ జదువుకొనునపుడు కృష్ణమూర్తిమన స్సెట్లున్నదో కృష్ణమూర్తికే తెలియవలయునుగాని యితరులకుఁ దెలియ శక్యముకాదని యందఱు నొప్పుకొనవలసినవిషయమేకదా? ఒకవేళ ననుభవజ్ఞానములేని హృదయములతో మనము వర్ణించి వివరింపఁబోయినచోఁ జేతఁగానివాని కవిత్వమువలె నస్వాభావికముగను, అరంజకముగను ఉండుటయేకాని యంతకంటె విశేషముగా నుండదు.

కృష్ణమూర్తి ముందొకసారి యుత్తరమంతయు నీవరినుండి యాదరివఱకుఁ జదివినాఁడు. కాని యతఁడేమి చదివినాఁడో యది యతనికిఁ దెలిసినదికాదు. మనసు మనస్సులో లేనప్పుడు కమ్మనిమీఁదఁ గన్నులు నడచినంతమాత్రమునఁ గార్యమేముండును? ఇది పనిగాదని హృదయమును గొంత గుదురుపడఁజేసికొని మరల రెండవసారి చదువనారంభించినాఁడు. ఈమాఱు కొంతవఱకు లేఖార్థము మనస్సున కెక్కినది. మూఁడవపర్యాయము సావధానముగాఁ బ్రతివాక్యమును విమర్శించుకొనుచుఁ జదివినవాక్యమునందుఁ గల పదచమత్కారము—అర్థగాంభీర్యము — భావప్రకటనము—రసతన్మయత్వము—రచనావైదగ్ధ్యము మొదలైన గుణవిశేషము లన్నియుఁ గనిపెట్టుచుఁ దన మనస్సునఁ బట్టించుకొనుచు రసగ్రహణ మొనర్చుచు మరల నా లేఖనంతయుఁ జదువుకొనినాఁడు. అప్పు డతని కా లేఖయం దొకవిధమైన కవిత్వము, గానము, విద్యాజ్ఞానము మున్నగు నెన్నోగుణములు విస్పష్టముగా నవగతములైనవి. వెంటనే మహానందతన్మయత్వము నొంది యొకించుకసేపు మయిమఱచిపోయినాఁడు కృష్ణమూర్తి. "రాధ—యింత రసికతగల విద్యావతియా?" అనుకొన్నాఁడు. తరువాత నామె ప్రణయసాహసాతిరేకముల కత్యంతాశ్చర్యము నొందినాఁడు. అవి యతని హృదయమును గరఁగించివైచినవి. అప్పు డతని కట్టి యారాధారమణి నిరూఢగాఢానురాగమును నిష్ఫలముగావించి, యామెయాశాలతాకుసుమములను రాల్చివైచి యామెజీవితసర్వస్వమును వీటిబుచ్చి యామెను జిన్నఁబుచ్చుటకంటె మహాపాతకహేతువు వేఱొకటి యుండదుచుమీయని యంతరాత్మ యనేకవిధముల బోధింప మొదలుపెట్టినది. తన కత్యంతానురూపయైన భార్య రుక్మిణియుండఁగాఁ—ద న్నామె యత్యంతగాఢముగాఁ బ్రేమించినదై యుండఁగాఁ—దాను నామెయెడల బద్ధానురాగుఁడై యుండఁగా—నిప్పు డీరాధామనోరథము నీడేర్చుటయును, రాధనుహృదయపూర్వకముగాఁ బ్రేమిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుటయు నుచితమగునా? అని తొలుదొలుతఁ గృష్ణమూర్తియంతరంగమున నొకించుక సందేహపరమాణువు లేఁగినది; కాని, యాయుత్తరక్షణముననే "నేను రాధను ప్రేమించినంతమాత్రమున రుక్మిణి కపచారము చేసినవాఁడ నెట్లగుదును? నారుక్మిణిని నేను యథాపూర్వముగఁ బ్రేమించుచునే యుందును గాదా? పాప మిట్టి రాధ కాశాభంగముఁ జేయవచ్చునా మఱి?—ఎంతమాత్రమును జేయఁగూడదు!" అను నొక పరమధర్మసిద్ధాంతమహావాయువు బయలుదేరి యాసందేహపరమాణువు నామడదూరమున కెగురఁగొట్టివైచినది. రాధ వ్రాసిన రసమయమైన ప్రణయలేఖను జిత్తుకాగితపుముక్కవలెఁ జించిపాఱవైచుటకుఁ జేతులు వచ్చినవి కావు కృష్ణమూర్తికి. కాని, రాధకోరిన కోరికప్రకారము ప్రవర్తింపక తప్పినదికాదు తుదకు.

## ౬

"మీ రీవేళ సాయంకాలము—ప్రతిదినము వలెఁగాక—కొంచెము పెందలకడనే భోజనమునకు రావలయును. ఆవీథిని మాయక్క బద్ధకముగా నున్నట్లు వర్తమానము వచ్చినది. ఆమెకు మాసము లన్నియుఁ బూర్తియైనవి. ఆబద్ధకము బహుశః ప్రసవవేదనకుఁ బ్రారంభావస్థయే యైయుండవచ్చును. మీకు వడ్డించినతోడనే నేనుగూడ భోజనముచేసి చీఁకటిపడకుండ మాయక్కగారింటికి వెళ్లి రావలయును" అని మధ్యాహ్నము మూఁడునాలుగుగంటలనడుమ రుక్మిణి కృష్ణమూర్తితోఁ జెప్పెను. "రాత్రి పదునొకండుగంటలవేళ—యువతియగు తనభార్య నొంటిగా నింట దిగవిడిచి తా నేవంకఁ బెట్టుకొని, రాధాప్రణయలేఖాను సారముగా సంకేతస్థానమునకుఁ బోవుదునా" యని తల క్రిందులుపడుచు నుపాయాన్వేషణమునకై పరితపించుచున్న కృష్ణమూర్తిహృదయమున కప్పు డామాటలు తీయని తేనెతేఁటలవలె వినవచ్చి భావికార్యానుకూల్యమును సూచించు శుభశకునములుగాఁ గనుపట్టినవి. కాని, యతఁ డప్పుడు తన హృదయాంతరాళమునంతను నింపివైచిన మహానందరసము నెంతమాత్రమును బయికిఁ బొనఁకిపోనీయక "నీ వీరాత్రి మీ యక్క దగ్గఱకు వెళ్లి కూరుచున్నయెడల నేను నిన్ను విడిచి యొంటిగా నింటిలో నీరాత్రియంతయు శివరాత్రి చేసికొనియుండఁగలనా రుక్మిణీ!" యని సానురాగాభిలాషముగాఁ దనభార్య నుద్దేశించి పలికెను. ఆమాటలు వినినతోడనే రుక్మిణి కొడలు గగుర్పొడిచి యుండవలయును మఱి. అది యట్లు జరిగినదో లేదో మనము చెప్పఁజాలము. కాని, "ఆహా! యేమి సోద్దెములు? ఏమి సొగసులు? ఏమి విడ్డూరములు? ఏమి విచిత్రానురాగములు?—వెళ్లి—మరల నొక మూడు నాలుగు గంటలలోఁ దిరిగివచ్చువఱకే యొంటిగా నుండలేరు? అంతలోనె రాత్రియంతయు శివరాత్రి యైపోవునా? ఇవి యన్నియు నొకవింతవగలు, నొకవిలాసపు వలపులును. నే నెఱుఁగుదును లెండు." అని రుక్మిణి సవిలాసముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను. "ఇదిగో—నీవు, మీ యక్కగారింటి కీనాఁడు వెళ్లక తప్పనియెడలఁ బెందలకడనే యన్నిపనులును జక్కఁబెట్టుకొని వెళ్లి తిరిగి యే యర్ధరాత్రివేళకో వచ్చినతర్వాత—"ఆ పని యున్నది—యీపనియున్నది" యని యాలస్యముచేసి నన్ను బాధింపకుండ వెంటనే పరుండుటకు వీలుగా నుండునట్లు చూచికొని మఱియు వెళ్లుము. ఎప్పుడో, యేదొంగప్రొద్దునకో వచ్చి యప్పు డదియు నిదియుఁ జక్కఁబెట్టుటకు మొదలిడుదువేమో, అంతవఱకుఁ గంటిమీఁదఁ గునుకులేకుండఁ గాచికొనియుండి యప్పుడైనను సుఖముగాఁ బండుకొనుటకు వీలులేకుండ?—అందులకు నే నెంతమాత్రమును సమ్మతించువాఁడను గానుజుమీ! ఇప్పుడే చెప్పివేయుచున్నాను. తరువాత నీయిష్టము" అని కృష్ణమూర్తి రుక్మిణిని హెచ్చరించినాఁడు. రుక్మిణి తనభర్తప్రియవచనరచనాచాతుర్యమునకు మనుసులో నవ్వుకొనుచు సాయంకాల మయిదుగంట లగునప్పటికే వంటచేసివైచి సర్వమును సంసిద్ధముగా నుంచి తనభర్తకుఁ దృప్తిగా భోజనముపెట్టి తాంబూలమిచ్చి తానుగూడ భోజనముచేసి యిల్లును వాకిలియుఁ జక్కఁబెట్టుకొని పడుకగదిలోని పందిలిపట్టిమంచముమీఁదఁ బరిశుభ్రముగాఁ బ్రక్క పఱచి తక్కిన చిల్లరపనులన్నియుఁ జక్కఁబెట్టు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్నతర్వాతఁ దాను జక్కఁగాఁ దలదువ్వికొని బొట్టును గాటుకయుఁ బెట్టుకొని, పండుగులలోఁ గట్టుకొనుటకు దాఁచికొనిన పలుచని లేఁతమబ్బురంగు కోకయుఁ బొడుమురంగురైకయు ధరించి సముచితమైన స్వాభావికశృంగారవేషముతోఁ దన యక్కగారింటికిఁ బోయివచ్చుటకు సంసిద్ధురాలై, వాఁకిటిలోఁ గుర్చీమీఁదఁ గూరుచుండిన భర్తయొద్దకుఁ బోయి "మఱి నేను వెళ్లివచ్చెదను. మెలఁకువగామాత్రము పరుండియుండుఁడు, పిలిచినవెంటనేపలుకునట్లు. తిరిగిపం(డెండు గంటలకు లోపుగనే రావచ్చును. పురుడువచ్చినవెంటనే మాపెద్దక్కకొడుకును సాయముతీసికొనివచ్చివేసెదను." అని చెప్పుచుఁ దములపాకులవంటి తన మెత్తనిచేతులు రెండింటితోను భర్తచెక్కిలు రెండు నొత్తిపట్టుకొని ముద్దుబెట్టుకొని వెడలిపోఁబోయెను. కృష్ణమూర్తి యామెయావిరహము నెంతమాత్రమును సహింపఁజాలకున్నవానివలె నభినయించుచు నొక్కమాఱు రుక్మిణిని గట్టిగాఁ గౌఁగిలించుకొని యీబుగ్గను, ఆబుగ్గను గఱచి నొక్కి ముద్దుపెట్టుకొని "ఆలస్యముచేయకుచుమీ!" యని చెప్పి సెలవిచ్చెను.

౭

రాత్రి గాఢాంధకారమయముగా నున్నది. దానికిఁదోడు మబ్బుగూడఁ బట్టినది. కన్నునుగన్నుఁ గనఁబడుటలేదు. ఊరంతయు మాటుమణఁగియున్నది. కృష్ణమూర్తి మెల్లఁగా లేచి తలుపులన్నియు జాగ్రత్తగా గొండెములువెట్టి వీథితలుపునకుఁ దాళమువైచి బయలుదేరినాఁడు. రెండవవీథిచివరనున్న లోకలుఫండు సత్రముదగ్గఱఁ బట్టపగలే మనుష్యసంచారము తక్కువ. రాత్రి, అందును రమారమి పదునొకండు గంటలవేళ-వేఱె చెప్పవలసిన దేముండును? సత్రమన్న పేరేకాని యక్కడకు బాటసారు లెవ్వరును దఱచుగా రానే రారు. ఎప్పుడైన నూటనాఁట కెవ్వరైన వచ్చి యొక రాత్రియో, యొకపగలో విశ్రమించిపోవుచుందురు. ఆ సత్రమువీథియరఁగులమీఁద రెండువైపులను రెండు చిన్నగదులు గలవు. వానిలో నొకదానిలో సత్రముకాఁపరియగు నొక ముసలితాత నివసించుచుండును. రెండవదానిలో నెప్పుడైనఁ దప్పిజాఱి యేబాటసారియైన వచ్చినయెడలఁ గొంతతడ వుండిపోవుచుండును. చాలమంది పాంథులు వచ్చినప్పుడుగాని సాధారణముగా లోపలితలుపులు తీయవలసిన యవసరమే యుండదు. సత్రము కట్టినతర్వాత నట్టియవసర మొకటిరెండు సారులకంటె నధికముగా వచ్చియుండదు. ఆ సత్రము తాలూకాబోర్డువారి వ్యయనిర్ణయపట్టికానుసారముగాఁ గట్టఁబడినదేకాని ప్రజోపయోగము ననుసరించి కట్టఁబడినదికాదు. దానివిమర్శనము మన కిప్పు డెందులకు? పోనిండు. ప్రస్తుతము కృష్ణమూర్తి కటికిచీఁకటిలో సత్రముసమీపమునకు వచ్చియున్నాఁడు. అతనికిఁ దన యూరిలోఁ జిరపరిచితమైయున్న మార్గముగావున నట్టి చీఁకటిలో నప్పు డచ్చుటికి రాఁగలిగెనుగాని మఱియొక క్రొత్తబాటసారి కట్టిసమయమున నచ్చుటికి వచ్చుట దుస్సాధ్యమేయగును. ఇదియునుగాక ఆనాఁటి మధ్యాహ్నమే రాధారమణిరహస్యలేఖఁ జదువుకొనుటకుఁ గృష్ణమూర్తి యక్కడకు వచ్చినపుడు చూచికొనిపోయినచోటే యయ్యెను. అతని కిప్పు డెంతచీఁకటిగా నున్న నేమికష్టము? కృష్ణమూర్తి సత్రముసమ్మము నొద్దకుఁ బోవునప్పటి కతనిముందు రెండుబారలదూరమున నొకమనుష్యవ్యక్తి నడచుచున్నట్లు చూచాయగాఁ గనుపట్టినది. అంత నతఁడు వడివడిగాఁ గొన్నియడుగులు నడచి యావ్యక్తినిసమీపించి రహస్యముగా, "అయ్యో! రాధా! ఇంతచీఁకటిలో నాకొఱ కెంతకష్టపడి వచ్చినావోకదా, పాపము!" అనుచు మెల్లఁగా నావ్యక్తిబుజముమీఁదఁ దనచేయి వైచి దగ్గఱగాఁ దీసికొని దానితోఁగూడ సత్రపుసమ్మము మెట్లెక్కినాఁడు. నేను మీకొఱ కేమియుఁ గష్టపడనేలేదు. నేను ప్రార్థించుటయే తడవుగా ననుగ్రహించి మీరు రానేవచ్చినారు. ఇప్పుడు నేఁబడిన కష్టమంతయు నాకొఱకేకాని మీకొఱకుఁగాదు." అని యావ్యక్తి గుసగుసలాడినది. ఆవలియరఁగుమీఁద గడ్డిపఱచుకొని దానిమీఁద ప్రాఁతగోనెగుడ్డ ప్రక్కవేసికొని పండుకొనియున్న ముసలితాత "ఎవరువారు బాబూ?" అన్నాఁడు. పట్టపగలే తిన్నఁగా గన్నులుగనఁబడని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీరంగచిత్రములు

(G .S. A.)



౧. శ్రీరంగము



౨. శ్రీరంగ దేవాలయమునందలి పురాతన మంటపము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. శ్రీ రంగనాథస్వామి తిరుమంగైఆళ్వారుకు మోక్షమిచ్చు నుత్సవము

ముసలితాత కట్టి గాఢాంధకారములో నచ్చటికి వచ్చినవా రెట్లు కనఁబడినారని యొకప్రశ్న వచ్చునేమో! నిజముగా ముసలితాత కప్పు డామనుష్యులు కనఁబడిగాని, వారిమాటలు వినఁబడిగాని వాఁ డిట్లు పలికియుండలేదు. రాత్రులయందు మెలఁకువవచ్చినపు డెల్ల జాగ్రత్తకొఱకు వాఁ డిట్టు లూరకయే యడుగుచుండుట యలవాటు. ఎప్పుడైన నేయధికారులైన వచ్చి కాకతాళన్యాయముగా వినుట తటస్థించినయెడల "వీఁ డింతభద్రముగా నున్నాఁడుగదా!" యని సంతసింతురని వాని యభిప్రాయము. ఈరహస్యము కృష్ణమూర్తికిఁ గాని, యతనితో నున్న వ్యక్తికిఁగాని యేమి తెలియును? ముసలివానిప్రశ్నము తటాలునఁ జెవినిబడిన తోడనే కృష్ణమూర్తిచెంతనున్న వ్యక్తి తబ్బిబ్బుపడి యులికిపడెను. కృష్ణమూర్తియు మొదటఁ గొంచె మదరిపడెను గాని తరువాత నాముసలివాఁడు తమ్మట్టి కటికిచీఁకటిలో నెంతమాత్రము నానవాలుపట్టఁజాలఁడని దృఢవిశ్వాసముగలవాఁడుగావున వెంటనే ధైర్యము వహించి కంఠస్వరము నొకించుక మార్చివేసి "ఏమి తాతా! మేము మార్గస్థులము. ఈరాత్రి కొంచెము సే పిచ్చటఁ బరుండి తెల్లవారకముందే లేచి వెళ్లిపోవుదుము. వెళ్లునప్పుడు నీ కేమైన నిచ్చిపోవుదుములే. మే మిప్పు డిక్కడఁ బరుండుట కేమియు నభ్యంతరము లేదుగదా?" యని యడిగెను. ముసలితాత కన్నులుమూసికొని యంతకుముం దెట్లు పండుకొనియుండెనో యట్లే పండుకొనియుండి "చిత్తము, చిత్తము, దయచేయుండు. మీ కభ్యంతర మేమున్నది? మీవంటివారికొఱకే కాదా, బాబా, సర్కారువా రీసత్రము కట్టించినారు? అదిగో! ఆవలియరుఁగుమీఁద గదిలో ఈఁతాకుల చాప యున్నది. సందకడనే శుభ్రముగా దులిపి తుడిచి బాగుచేసియున్నాను. బాబూ! మహారాజులలాగునఁ బరుండుఁడు. చిత్తము. వెళ్లఁబోవునప్పుడుమాత్రము నా మాట కాసంత మఱచిపోకుండు బాబూ! నల్లమందు కొనివేసికొందును; బీదముండవాఁడను" అన్నాఁడు. "సరిలే; నీ వింకఁ బండుకొనుము." అని చెప్పి కృష్ణమూర్తి తనతోనున్న వ్యక్తితో నాగదిలోఁ బ్రవేశించెను.

౭

కొంతసే పైనతరువాత నాగదిలో జరిగిన సంభాషణములు:

వ్యక్తి—ఆహా! నాథా! యెంతకాలమునకుఁ నేను ధన్యురాల నైతిని? మీకు నాయం దింత యనుగ్రహము, ననురాగము నుండునాయని సంశయించి యింత వఱకు సాహసింపలేనైతిని. (అని కృష్ణమూర్తిని దృఢముగాఁ గౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొనెను.)

కృష్ణ—రాధా, నీవు నాయం దింతగాఢానురాగము గలదానవని తెలిసికొనలేకపోతిని. లేనియెడల—

రాధ—ఇప్పుడు తెలిసినదిగాదా? ఇంక నన్ను విడువకుఁడు. అంతియే చాలు. నే నింక మిమ్ములను విడిచియుండలేను. పదుండు; మీతోఁగూడ వచ్చివేయుదును.

కృష్ణ—(రాధను ముద్దుపెట్టుకొని) ఓసీ! నా ముద్దులరాణీ! ఎక్కడ నేర్చితి వీమాటలు? నీ విప్పుడు నాతోఁగూడ వచ్చివేయుదువేమి? ఎట్లు రాఁగలవు? వచ్చినచో మాయింటిదాఁక రాఁగలవు. అంతే. అంతకు మిక్కిలి వచ్చుట కెట్లు వీలగును? నీతల్లిదండ్రు లూరకుందురా? నీభర్త సహించునా? లోక మోర్వఁగలదా? సరిలే; ఆమాటల కేమి లెమ్ము. రమ్ము, మరల రహస్యముగా నిండ్లకుఁ బోవుదము. (అని, యాలోపునఁ దన భార్య యింటికి వచ్చివేయునేమో యనుశంకతోఁ ద్వరపడుచుండెను.)

రాధ—పదుండు. మీరు నామాటలు విశ్వసించుటలేదు కాఁబోలును. నాకు నాతల్లిదండ్రులతోఁగాని, యాలోకముతోఁగాని పనిలేదు. నేను నాహృదయపూర్వకముగాఁ బ్రేమించుకొన్న మీరే నాభర్తగాని వేఱెవ్వఁడును నాభర్తగాఁడు. నే నీనాఁటితో సర్వమును విడిచిపెట్టితిని. మీరే నాకు సర్వమును. మీ కింకను నాసంగతి పూర్తిగాఁ దెలియలేనట్లున్నది. నేను మిమ్ములను విడుచుదాననుగాను. మీవెంటనే వచ్చివేయుదును. పదుండు. (అని బయలుదేరెను.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ—నీ విప్పుడే యింతతొందరపడెద వేల? నే నిట్లే తఱచుగా వచ్చి నీతోఁ గలిసికొనుచుందును. కొంతకాల మిట్లు పోనిమ్ము. తరువాతఁ జూచికొన వచ్చును.

(అని మెల్ల మెల్లఁగాఁ బలుకుచు రాధచేయిబట్టు కొని సత్రపుసమ్మము మెట్లు దిగెను.)

రాధ—అయ్యో! పాపము! ముసలితాతమాట మఱచితిమి. ఇదిగో, ఈరూపాయి. వాని ప్రక్కమీఁదఁ బడవైచిరండు. ప్రొద్దున లేవఁగానే చూచుకొని సంతోషించును. వాని పుణ్యమున నా కీనాఁడు మీతో మహానందము ననుభవింపఁజేయఁబడినది. (అని పలుకుచుఁ జీరకొంగున నున్నముడివిప్పి యొకరూపాయి కృష్ణమూర్తిచేతి కీయఁబోయెను.)

కృష్ణ—అది నీ వీయనక్కఱలేదు. నే నిచ్చెదనులే. నాయొద్ద నున్నది. (అని తనజేబులోనుండి యొకరూపాయిఁ దీసి తిరిగి వెనుకకు వెళ్లి ముసలితాత ప్రక్కమీఁదఁ బడవైచివచ్చెను.)

రాధ—(కృష్ణమూర్తియెడమచేయి గట్టిగాఁ బట్టుకొని) నే నింక నీచేయి విడువను. వచ్చినదానను రానేవచ్చితిని. నేను మిమ్ములను విడిచి తిరిగిపోవు దాననుగాను. ఏమందురో చెప్పుఁడు మఱి. (అని మెల్లఁగా నడుచుచుఁ జీఁకటిలోఁ గృష్ణమూర్తివెంబడి నడువనారంభించెను.)

కృష్ణ—ఈనాఁటికి నీవు మాయింటికిఁ బొమ్ము. రేపు దీనికిఁ దగిన యుపాయము నాలోచింతము.

రాధ—నే నట్లు పోను. దీని కాలోచింపవలసిన దేమున్నది? మీ రొకవేళ మీభార్యవలన భయపడు చుందురేని, మన మిప్పుడు మాయింటికే పోవలదు. రండు, ఇట్లే యీదారినే యెక్కడకైన లేచిపోవుదము. అంతియే కాని నేనుమాత్రము మిమ్ములను విడిచి పెట్టిపోవను.

కృష్ణ—(సందేహించుచు) మన మిప్పు డెక్కడకేనిఁ బోయినయెడల, మఱి, యింతకుముందు నన్ను నమ్ముకొనియున్న రుక్మిణిమాటయో?

రాధ—మఱి-యిప్పటినుండి, మిమ్ము నమ్ముకొని, మానాభిమానము లమ్ముకొని, సర్వ సంగపరిత్యాగముచేసి, సన్న్యాసినివలె నిల్లువిడిచి యీవలఁ బడిన యీరాధమాటయో?

ఇట్లు రాధయుఁ, గృష్ణమూర్తియుఁ ద్రోవలో మెల్ల మెల్లఁగా గుసగుసలాడుకొనుచుఁ గృష్ణమూర్తి బసదగ్గఱకు వచ్చివేసిరి.

కృష్ణ—నీవు మాయింటిలోనికిఁ బోవువఱకు నే నీ మాసమ్మములో నుందును. త్వరగా మాయింటికిఁ బొమ్ము. చినుకులుగూడఁ బ్రారంభించుచున్న ట్లున్నవి. రేపు మరల నేఁటివలెనే సత్రమునొద్ద—

రాధ—నే నట్లు పోవుటకు రాలేదు. మాయింటి తలుపు తాళముఁ దీయుఁడు. నేను మీతో మీయింటి లోనికి వచ్చివేయుదును! (అని గుమ్మమెక్కెను.)

## ౬

అప్పుడు కృష్ణమూర్తికి రాధవిచిత్రప్రవర్తనము వింతఁగొలుపఁ దొడఁగెను. అతని కప్పు డేమనుటకు, నేమిచేయుటకునుగూడఁ దోఁచకుండెను. తనభార్య రుక్మిణి వచ్చివేయునేమోయని మనసులో దిగులుపడుచుండెను. అట్లారాధతో నర్ధరాత్రివేళ వీథిసమ్మములో నిలఁబడియుండుట యతనికి యుక్తముగాఁ దోఁచలేదు. మెల్లఁగాఁ దాళముఁదీసి తలుపులుదెఱచి "రాధా, నామాట విని, నీ విప్పటి కింటికిఁ బొమ్ము" అనిమరలఁ బలికెను. రాధ లోపలఁ బ్రవేశించి తలుపులు మూసివైచి తడుముకొనుచుఁ గృష్ణమూర్తిగడ్డముక్రిందఁ జేయిపెట్టి "నాథా! న న్నింక నెక్కడకును బొమ్మనవలదు" అని బతిమాలుకొనుచు నతనితోఁగూడ వాకిటిలోనికిఁ బోయెను. అప్పుడు కృష్ణమూర్తికి వెఱ్ఱియెత్తిన ట్లుండెను. ఇంటిలో దీపములేక మఱియు నంధకారమయముగా నుండెను. రాధ కామాంధకారమయమైన హృదయముతోఁ దన్ను విడువకుండెను. రుక్మిణివచ్చు వేళయైపోవుచున్నదని యతని మనస్సు పరిపరివిధములఁ బోవుచుండెను. రుక్మిణి వచ్చునప్పటికి రాధతోఁ జీఁకటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యింట నుండుట మంచిదికాదని కృష్ణమూర్తి కొకవెఱ్ఱి యూహ తోఁచెను. వెంటనే గదిలోనికిఁ బోయి యగ్గిపెట్టె వెదకి దీపమువెలిఁగించి వాకిటిలోనికిఁ దెచ్చెను. అక్కడ నతనికనులకుఁ దనభార్య రుక్మిణి ప్రత్యక్షమయ్యెను.

రుక్మి—అర్ధరాత్రివేళ నింతచీఁకటిలో వీధితలుపు గొళ్లెముపెట్టుకొనకుండ నట్లే యుంచితిరేమి ? నేను వచ్చినట్లే-మీకుఁ దెలియకుండ- ఎవ్వరైన వచ్చి యింటిలో దూరినచో నేమిచేయుదురు ?

కృష్ణ—(విస్మయమొంది,తనలో)రాధ నెట్లయిన బతిమాలి పంపివేయుదమని వీథితలుపు గొళ్లెము పెట్టక వచ్చితిని. అయ్యో! రుక్మిణివచ్చివేసినదే! (ప్రకాశముగా) నీవువచ్చెడువేళయైనదని యిప్పుడే తీసివచ్చితిని. ఇంతలో లోపలిదీపము గాలి కాఱిపోయినది. వెలిఁగించి తెచ్చితిని. ఔనుగాని, ఇంతచీఁకటిలో నీ వొంటరిగా వచ్చివేసితి వేమి, చడియును జప్పుడునుగాకుండ ?

రుక్మి—నే నొంటరిగా రాలేదు. చడియుఁ జప్పుడు నగుటకు నేనేమి మంగళవాద్యములతో వత్తుననుకొన్నారా యేమి ?

(అని హేళనముగాఁ బలికి నవ్వుచు భర్త కెదురుగా వచ్చి నిలఁబడెను.)

కృష్ణ—(అటునిటు నెందులకో కొంచెము పరికించుచు) నీ వొంటరిగా రాలేదంటివిగదా ? నీతో నిప్పు డెవరు వచ్చినారు ?

రుక్మి—(నవ్వుచు) మీరే !—

కృష్ణ—చాలు ! నీపరిహాసములకేమిగాని నీతో నిప్పు డెవ్వరు వచ్చినారో తిన్నఁగాఁ జెప్పుము.

రుక్మి—అయ్యో ! పరిహాసముకాదు ! రామ ! రామ ! నమ్మరేమి నామాట ? ఇప్పుడు నాతో వచ్చిన వారు మీరే ! (అని మరల నవ్వెను.)

కృష్ణ—(తనలో) ఇది యేమిటి ? మాయలాగున నున్నదే ? రుక్మిణి తనకు సాయమువచ్చినవారిని వీథిలో నుండియే వెనుకకుఁ బంపివైచి కొంటెతనముగాఁ జీఁకటిచాటున నింటిలోఁ బ్రవేశించి నాతో వేళాకోళము లాడుచుండిన నుండవచ్చును. కాని—రాధ యేమైనది ? రుక్మిణిని జూడఁగనే చీఁకటిలోఁ దప్పుకొని వెళ్లి పోయినదేమో ! లేక యేమూలనైన దాఁగినదా ? ఇది యొక విచిత్రనాటకమువలె నున్నదే ?

రుక్మి—(నవ్వుచు) ఏమి ప్రాణేశ్వరా, అట్లు నివ్వెఱపడుచు నేదియో యాలోచించుచున్నట్లు కనఁబడుచున్నారు ? నామాటలు మీరింకను నమ్మకుంటిరా యేమి ?

కృష్ణ—రుక్మిణీ, నీమాట లెట్లు నమ్ముదును ? నీవు చాలఁ జమత్కారిణివి. నీ విప్పు డేదియో మోసముచేసి నన్ను వెఱ్ఱివానినాడించినట్లాడింపఁజూచుచున్నావు. నేను నీటక్కరితనమునఁ జిక్కుపడువాఁడను గాను. తిన్నఁగాఁ జెప్పుము. నీ కెవరు సాయము వచ్చినారు ? నిన్ను ముద్దుపెట్టుకొందును. లేనియెడల నేను నీమీఁదఁ గోపగించెదను.

రుక్మి—(సవిలాసముగా భర్తను గౌఁగిలించుకొని యతనిమోమువంకఁ జూచి నవ్వుచు) మీ రింతకు ముందు వీథిలోనుండి వచ్చుచున్నారా, లేదా ? నిజముగాఁ జెప్పుఁడు.

కృష్ణ—ఔను ! వచ్చుచుంటిని. ఇప్పు డిందు నిజముచెప్పక యబద్ధముచెప్పవలసిన పనేమున్నది ? నీ వింతప్రొద్దుపోయినను మీయక్కగారింటినుండి రాలేదేమని నేను నక్కడకు రావలయు ననుతలంపుతో బయలుదేరి వీథిలోఁ గొంచెముదూరము వచ్చి పోనీ యెందుల కింతతొందరయని తిరిగివచ్చివేసితిని. నీవును వచ్చువేళ యైనదిగదాయని తలుపులుగూడ గొండెముపెట్టక దిగ్గఱగా మూసివచ్చితిని. ఆఱిపోయిన దీపమును నేను మరల వెలిఁగించి తెచ్చునంతలో నీ విట్లు దొంగచాటుగా వచ్చియుందువు. ఇంతేనా ?

రుక్మిణి—నాథా, తొందరపడక క్షమించి నే నడిగెడువాని కన్నిటికిని సరిగా సమాధానములు చెప్పవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ—(తనలో) రుక్మిణి నాసంగతులేమైనఁ గనిపెట్టియుండునా యేమి? (ప్రకాశముగా) అడుగుము! నీ విప్పు డడుగుట కేమున్నది? నేను జెప్పుట కేమున్నది?

రుక్మి—ఏమియు లేదు-మీ రింటిలోనికి వచ్చునపుడు మీవెనువెంటనే మీతో నింటిలోనికి వచ్చిన వా రెవరు?

కృష్ణ—(తనలో) రుక్మిణి రాధను జూచినట్లున్నది. ఏమి సాధనము?—అయినను దొందరపడి తేలిపోఁగూడదు. ఇట్లు పలికిచూచెదను. (ప్రకాశముగా) ఎవ్వ రున్నారు? ఎవ్వరును వచ్చియున్నట్లు లేదే? నీవే యొకవేళ రహస్యముగాఁ-జీఁకటిలోఁ గనఁబడకుండ వచ్చియుంటివేమో!

రుక్మి—(భర్తను ముద్దుపెట్టుకొని) నాథా! ఇంక మీనోట నేను విశేషముగా నబద్ధములు పలికింపఁ దలఁచుకొనలేదు. జరగినదంతయు నేనే యథార్థముగాఁ జెప్పివైచెదను. "క్షమించెద"నని యీచేతిలోఁ జేయివేయుఁడు.

కృష్ణ— (లోట్రుపాటుచే రుక్మిణిమాటలు తిన్నగా తెలిసికొననేరక సంశయించుచు) క్షమించుటకిప్పుడు నీతప్పేమియున్నది? జరిగినదంతయు యథార్థముగాఁ జెప్పివైచెదనంటివిగదా? ఏమి జరిగిన దిప్పుడు?

రుక్మి—ఇంక నవి యన్నియు నెందులకు? "క్షమింతు" నని యీ చేతిలోఁ జేయివేయుఁడు, చెప్పుదును.

కృష్ణ—(తనలో) ఇది యేమిటో నాకుఁ దెలియుటలేదు. రుక్మిణి యేమిచెప్పునో చూడవలయును. (ప్రకాశముగా) ఇదిగో! ముమ్మాటికి "నిన్ను క్షమించెద" నని చేతిలోఁ జేయివేయుచున్నాను. ఏమి జరగినదో, నీ వేమి చెప్పెదవో చెప్పుము; చూతము మఱి—(అని గంభీరముగాఁ బలుకుచు రుక్మిణిచేతిలోఁ జేయివేసెను.)

రుక్మి—(ముసిముసినవ్వులు నవ్వుచు) జరగుట కేమున్నది? నాథా! లోకలుఫండుసత్రము వీథిగదిలో నా కిదివఱ కెన్నఁడును జరగియుండని మహానందోత్సవము జరగినది! ఇంతకాలమునకు మిమ్మును ఈదినమున నచ్చట నే నొక్కింతసేపు మహానందసౌఖ్యములలో నోలలాడించి, మీలో నిమిడియున్న ప్రణయానురాగరససర్వస్వమును నే నాస్వల్పకాలముననే చూఱలాడి ధన్యురాలనగుట జరగినది!!

కృష్ణ—(రుక్మిణికౌఁగిటిలో నిశ్చేష్టుఁడై నిలఁబడిపోయెను.)

రుక్మి—నాథా! నేను జేసిన యీ యసాధారణసాహసకృత్యమునకు నన్ను మీరు క్షమింతురని తలఁచితిని. కడచిన మధ్యాహ్నవేళ మనము వాకిటిలోఁ గూరుచున్నప్పుడు "తపాలా జవాను" తెచ్చియిచ్చిన సంచియుత్తరము నేను వ్రాసినదే. ఇదిగో! దానిప్రతి (నకలు) నాయొద్ద నున్నది. చిత్తగింపుఁడు. ఈయుత్తర మిప్పుడు మీరు మరలఁ జదివికొని చూచినచోఁ జాలవఱకు నాకును అన్వయించును. నేను వ్రాసితి నను బుద్ధితో మరలఁ జదివిచూడుఁడు! దీనికి మూల మేమనఁగా కొలఁదిదినములక్రిందట మీరొకనాఁటి యుదయమున మన దక్షిణపుగదియరఁగు మీఁద దంతధావనము చేయుచుఁ బరధ్యానముగాఁ గాఫీ పుచ్చుకొనుటకైనను రాక "చల్లాఱిపోవుచున్నది; త్వరగా రం"డని నేను కేకవైచినను వినిపించుకొనక యాలస్యముచేసితిరి. జ్ఞాపకమునకుఁ దెచ్చికొనుఁడు! అప్పుడు, మీ రేల రాకుంటిరో యని సన్నసన్నగా గదిలోనికి వచ్చి మీకు వెనుకతట్టున నున్న కిటికీలోనుండి యిట్టె తొంగిచూచితిని. మీ కెదురుగాఁ బొరుగింటిగదిలోఁ గిటికీయొద్ద రాధయను సుందరి తలదువ్వుకొనుచుండుటయు, మీ రామెవంకఁ దిలకించుచుఁ బరాయత్తచిత్తులై యుండుటయు నేను గనిపెట్టి వెంటనే వచ్చివేసితిని. రాధానుబద్ధహృదయులై యున్న మిమ్ము, మీ ముచ్చటఁ దీర్చి యానందపెట్టుట యెట్లో యని దీర్ఘముగా నాలోచించితిని. తుదకు నే నాయుత్తరము నెడమచేతితో రహస్యముగా వ్రాసి మంచినీళ్ల నూతికిఁ బోయినపుడు, ఎవ్వరును జూడకుండఁ దపాలాపెట్టెలోఁ బడవైచి వచ్చితిని. తక్కిన వృత్తాంతమం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుత మీ కిప్పు డవగతము కాఁగలదు. ఇట్లు మహా సాహసముతో మిమ్ము వంచించినందులకే నన్నిప్పుడు క్షమింపుఁడని ప్రార్థించితిని.

కృష్ణ—(నిలువున నీరయిపోయి) రుక్మిణీ, నేనుగాను నిన్ను క్షమింపఁదగినవాఁడను! నీవే నన్ను క్షమింపఁదగినదానవు! నేను నీయెడలఁ జేసిన యపరాధములకు - వంచనములకు - అసత్యములకు- హద్దును బద్దును లేదు. నన్నీపాప మెట్లు కట్టికుడుపునో తెలియదు. నీవంటి రూపవతి- నీవంటి వయోవతి- నీవంటి సద్గుణవతి- నీవంటి విద్యావతి- నీవంటి సాహసౌదార్యవతి-నీవంటి యనురాగవతి-నీవంటి మహాపతివ్రత భాగ్యవశమున భార్యయై యుండఁగాఁ దృష్టిలేక- బుద్ధిలేక- పాపభీతిలేక-పరులయింటి పతిపత్నులకై యువ్విళ్లూరిన పాపాత్ముఁడను. ఇప్పటికి నాతప్పు నే నెఱిఁగి పశ్చాత్తప్తుఁడ నగుచున్నాను. నీవు నన్నట్టి పాపవ్యాపారమునఁ బడిపోవకుండ నుద్ధరించి కాపాడిన పరమపతివ్రతవు. మహోపకారిణివి. నీవే నిజమైన గృహలక్ష్మివి. నేనింకముం దెన్నఁడు నిట్లు నిన్నుఁగాదని యేపాపమును జేయఁబూనను- దైవముతోడు - నీతోడు-నీవు నాహృదయమాలిన్య—

రుక్మి—(నవ్వుచు భర్తనోటిని దనచేతితో మూసి) ఏమి టీమహోపన్యాసము? నాథా! దాని కేమిగాని-నన్ను-మీప్రియభార్యనైన నన్ను-మీతోఁ గొంతకాలమునుండి కాఁపురముచేయుచున్న నన్ను-మీ రించుకయైనఁ బోల్చుకొనలేకపోతిరేమి?

కృష్ణ—రుక్మిణీ, ఏమని చెప్పుమందువు? అసలే గాఢాంధకారము. దానికిఁదోడు కామాంధకారము, అన్నిటిని మించినది యజ్ఞానాంధకారము! ఇన్ని యంధకారము లేకమైనప్పుడు నీ యాకారము నెట్లు పోల్చుకొనఁగలుగుదును? భ్రాంతిమయప్రపంచమున సంచరించువానికి బహిఃప్రపంచజ్ఞాన మెక్కడిది వట్టి మూఢత్వముతప్ప?

రుక్మి—అబ్బబ్బా! చెప్పిన నమ్మెదరో నమ్మరోకాని—నే నారెండుగడియలును నామాటలు మీ రెక్కడ నానవాలుపట్టిపోవుదురోయనియును, నావాసన మీరెక్కడఁ బసిపట్టెదరో యనియును, నాచేతులు మీ రెక్కడ గుర్తించిపోవుదురో యనియును నేను బడిన బాధయు, నేను జేసికొన్న మార్పులు నిన్నియన్ని కావు. తుద కవియన్నియు సఫలమైనవి. ఇంక నా ప్రసంగముఁ గట్టిపెట్టి రండు! ప్రొద్దుపోయినది. పరుండుదము.

కృష్ణ—రుక్మిణీ, నీవు నాకుఁ జేసిన మేలునకుఁ బ్రతిగా నీ కీజన్మమునఁగాదుగదా, నూఱుజన్మములయందైనను ఏమియుఁ జేయఁజాలను. కాని నేను నీ కిప్పు డీయఁజాలిన దేదేని యొకటి గోరికొని నన్నుఁ బరితృప్తుని జేయకతప్పదు.

రుక్మి—(మహానందముతో భర్తను గౌఁగలించుకొని) అయితే నాకిప్పు డొక్కటి దీయుఁడు! నా కదిచాలును. (అని భర్తను ముద్దుబెట్టుకొనెను.)

కృష్ణ—అట్లుకాదు. మఱియొకటి కోరుకొనుము.

రుక్మి—నా కేమియు నక్కఱలేదు. కాని, మీయాజ్ఞానుసారముగా నేనేదైనఁ గోరుకొనకతప్పదు కావునఁ గోరుకొనుచుంటిని. వినుఁడు. ఇందాఁక "లోకలుఫండు" సత్రముగదిలో నన్నుఁ జీకటిలో రాధయని భ్రమించి చూపించిన గాఢానందానురాగవిలాసాదులే నాయెడల మీ రెప్పుడును జూపించుచుండుఁడు. నా కంతకంటెఁ గోరికొనఁదగిన వేఱు కోర్కె లేవియు లేవు.

## ౧౦

మన మింతవఱకు నీగ్రంథమునఁ జేర్కొనిన రాధాపాత్రసందర్భ మేమియుఁ దెలుపకుండ నీగ్రంథము నిట్లు ముగించుట యుక్తముగాదు. కావున దానిని గుఱించి యేనియొకొంత సంగ్రహముగానైనఁ జెప్పి వేయకతప్పదు.

రాధ, మొట్టమొదటినుండి కట్టకడవఱకును నిరపరాధయే. ఆమెయెడల నేదోషమును- లేశమైనను-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేదు. ఆమె ప్రతిదినమును దనవాఁకిటచూప్పునఁ దనగది లోఁ దనవారిని దాను దలఁచుకొనుచుండుటయేకాని, యెన్నఁడును గృష్ణమూర్తిమనఃప్రవృత్తులు గమనించి యెఱిఁగినదికాదు! ఎప్పుడైన నొకవేళఁ గృష్ణమూర్తి వంకఁ జూచియుండినను, ఆచూపు హృదయపూర్వక ముగాఁ - దా నాతనిఁ జూడవలయునని - చూచినచూపే కాదు. అయినను నాఁ డామె తనతల్లిదండ్రుల యాదేశాను సారముగాఁ దనభర్తతోఁ గూడి యత్తవారింటికి వెడలి పోయినది. రాధ యొకనాఁడు, ముసిముసి నగవులతో డను, నూతనవికాసదృష్టులతోడను గనుపట్టుచు రెండు మాటలు తనజడ విప్పి మరల వేసికొని శృంగారించు కొనుటలోఁ గొంత యడావుడి చేసియున్నదిగాదా? ఆనాఁడు తన కూరిమిభర్త తన్నుఁ దీసికొనిపోవుటకు వచ్చుచున్నాఁడని తెలిసికొనియే భర్తృభావనావశం వదహృదయయై యన్ని పోకడలు పోయినది. ఆతర్వాత నామె తన యత్తవారింటఁ దన గృహిణీత్వమును దాను జక్కఁగా నిర్వహించుకొన మొదలుపెట్టెను. కృష్ణ మూర్తికంటికి మరల రాధ యెన్నఁడును గనఁబడుట లేదు—కలలలోఁదప్ప!—

---

## మా రు కు*

"మామ"

తిక్కకవిపల్కులోని పొందికయుఁ దెలివి,
పోతనార్యునిగడలోని మురువుబరువు,
షేక్స్పియర్మునిలోని నైశిత్యసరణి,
యమ్మ, నీపల్కులకు లఘువ్యాఖ్యలేమొ!

అరయ నీభాష యేదో! యం దర్థమేదో!
ఏరసము గురియునో! చెప్పనేర నమ్మ!
కవి కవితకును, గాయకు గానమునకుఁ
బ్రాణములు వోయుదీపి నీవాణిఁ గలదు!

కళలు సర్వము కృతకముల్ గావటమ్మ!
ప్రకృతిసిద్ధములయిన నీపలుకు విన్న
వార లెవరేని నినుఁ దనివారఁ జీరి
యొలసి ముచ్చట ముద్దాడకుందురమ్మ!

చదివెడినప్డు పల్కితివ
చల్లగ పొత్తము మూయనేవలెఁ!
కదలెడునప్డు పల్కితివ
కాలుగదల్పక నిల్వనేవలెన్!
పదరినయప్డు పల్కితివ
పక్కున నవ్వి శమింపనేవలెఁ!
ఎదియొ యలౌకికప్రకృతి
యేచి మెలర్చెడు నీదుపల్కులఁ.

కోయిల 'కుహూకృతి'నిఁ గల్గు తీయఁదనము,
సత్కవిత్వమునఁ గల రసప్రశస్తి
గలిగి జగమలరించు నీలలితమధుర
కలరవములకు ముద్దులకాన్కఁ గొనుము.

---

* మేనగోడలు. వయసు ఒకటిన్నర యేఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మా పద్మ

ముక్కపాటి నరసింహశాస్త్రి

[If you have tears prepare to shed them now: Shakespeare]

౧

పద్మావతి నాకూతురు కాదు, నా బంధువుల పిల్లకూడా కాదు, నాస్నేహితుని కూతురు. నేను పెంచుకోనుకూడా లేదు, ఆపిల్లని. అయినా ఎప్పుడూ నేనూ, నాభార్యా కూడా దాన్ని మాపిల్ల అనే భావించుకున్నాము తప్ప పరాయిపిల్లని కలలోకూడా అనుకోలేదు. దాని తల్లితండ్రులుకూడా తమరు కన్నబిడ్డ అయినా, ఆపిల్ల మాదిఅయినట్లు, తమకే ఎరువుఅయినట్లు చూచుకునేవారు.

ఈభూమిమీద పడి మొదటసారి తన విశాలనేత్రములను తెరచి, పురిటింటి నాలుగు గోడలమధ్యనున్న నూత్నప్రపంచమును నాలుగుమూలలా తెలియనితనముతో పరకాయించి చూచి, నామీద దృష్టి నిలిపినప్పుడుమాత్రము చిన్ననవ్వు నవ్వినట్లు తోచింది నాకు. ఆ లోచనాంతరాళముల యందు లోకాంతరప్రతిబింబము లున్నట్లు తోచింది నాకు. ఆ చిన్నశరీరమునకు ఇతర ప్రపంచముల దివ్యసౌరభము లంటియున్నవి.

ఆస్పృష్టిసమయమందు, ప్రాణమునుండి ప్రాణము బయలువెడలునప్పుడు, కొంచెమించుమించుగా నాస్తికుడనైన నేను, అవిశ్వాసముతో కూడుకొన్న పాశ్చాత్యవిద్యావరణముచే కన్నులుమూతవడిన నేనుకూడా భయపడ్డాను. సృష్ట్యాదిని చూస్తున్నా ననుకున్నాను * * * కొంతసేపటికి ఆ శిశువు నాలుగుమూలలా పరికించి నన్ను చూచి మందహాసము చేసినప్పుడు, నా వొడలు జలదరించింది. ఒకవింతఆనందము తోచింది. ఈ అపరిచితప్రపంచములో ఆ గదిలో నే నొక్కడనే ఆశిశువుకు పరిచితుడ ననిపించింది. ఎక్కడో, ఏలోకములోనో, ఎప్పుడో, ఆక్షణమునుంచే నాకు జన్మాంతరమందు, లోకాంతరములందు సంచరించే జీవుడొక్కడేనని, ఈశరీరము నిమిత్తమాత్రమని విశ్వాసము ఏర్పడ్డది. అప్పుడే మా శూన్యగృహమునూ, మాదంపతుల సంతప్తహృదయములను ఆనందపరచడానికి వచ్చిన దివ్యజ్యోతి ఈపిల్ల అని భావించుకున్నాను.

ఆపిల్లతండ్రికీ నాకూ మొట్టమొదట ఇంగ్లాండులో పరిచయము. నేను ఐ. యం. యస్. ప్యాసై, కొన్నాళ్లు ఉద్యోగములో ఉండి, Study leave పైన మళ్లీ ఇంగ్లండు వెళ్లాను. అప్పటికి నారాయణరావు I. C. S. చదువుతున్నాడు. చూచిన వేళావిశేషాన్ని బట్టి మాకిద్దరకూ గాఢమైన మైత్రి ఏర్పడ్డది. అతను బ్రతికివున్నన్నాళ్లూ నామాట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కెప్పుడూ ఎదురుచెప్పలేదు. తండ్రిమాటేనా అంతభయభక్తులతో పాటించాడో లేదో అనుమానమే. అతని పరీక్షా, నాచదువూ అయిపోయి, ఇద్దరమూ స్వదేశము ఒక్కసారే చేరుకున్నాము. తరువాత అతను వివాహము చేసుకున్నాడు. ఇంకో నాలుగు సంవత్సరములపిమ్మట మాపద్మావతి పుట్టింది. పురిటియందు నారాయణరావుభార్యకు చాలాజబ్బు చేసింది. జీవించదని అంతా అనుకున్నారు. రెండు ప్రాణాలలోనూ ఒక టేనా దక్కదేమోననేస్థితిలో నన్ను రమ్మని ఉల్లిగ్రాం వచ్చింది. నాకూ పిల్లలు లేరు. నేను అప్పుడు మధురలో ఉండేవాడిని. అతను బరంపురంలో ఉండేవాడు. నేనూ, నాభార్యాకూడా పరుగెత్తాము. అక్కడ డాక్టరుతోటి మాట్లాడి, కేసు బ్రహ్మాండము మీద నాచేతులలోకి తీసుకుని, నెలరోజులు యమునితో యుద్ధముచేసి నాస్నేహితుని భార్యను బ్రతికించాను. పురిటికికూడా నేనే దగ్గర ఉన్నాను.

౨

క్రమేణా తంటాలుపడి మేమిద్దరము ఒకఊళ్లోనే ఉండేఏర్పాటు చేయించుకొన్నాము. ఇందులో ఎవరికి మార్పుఅయినా రెండోవాళ్లుకూడా నానాతంటాలు పడి మార్పించుకునేవాళ్లము.

పద్మ ఎప్పుడూ మాఇంట్లోనే ఉండేది. దాని ఆటలూ, పాటలూ, ముద్దులూ, ముచ్చటలూ చెప్పనలవికాదు. అవి తలచుకుంటూనే ఈవ్యర్థజీవనము గడుపుకుంటున్నాను. ఈనా ఆఖరురోజులలో ఆస్మరణమే, ఆసంకీర్తనమే నాకు భగవన్నామస్మరణా, సంకీర్తనాను. మధుర, బృందావనము, యమునాతీరారణ్యములూ, గోకులము చూచినప్పుడు వైష్ణవ భక్తుల కెట్టిఆనందము కలుగుతుందో, నాతల్లి తిరిగినచోట్లూ, కూచున్న కుర్చీలూ అవీచూస్తే నాకూ అట్టిఆనందమే కలుగుతుంది. ఆమె వల్లనే నాలో ఉండే నాస్తికత పోయి ఆస్తికత ఏర్పడ్డది. ఆపిల్లతనుకాంతి చూస్తే తప్త కాంచనశబ్దముయొక్క భావము తెలుస్తుంది. ఆమె అర్ధనిమీలితనేత్రములు చూచినతరువాతనే పురాతనరాజపుత్రచిత్రరచనాసౌందర్యము అర్థమైనది. ఆమెపలుకులూ, నడకలూ చూచినపిమ్మటనే, 'శారికాకీరపంక్తికి చదువుచెప్ప, బర్హిసంఘములకు మురిపములు గరపు, మదమరాళంబులకు చూపు మందగతులు'—అనేపంక్తుల భావము పూర్తిగా ద్యోతకమైనది. నేపెంచిన పిల్లఅనే అభిమానముచేత అతిశయోక్తి చెపుతున్నానను కోవద్దు. అన్నికాలములయందూ, అన్నిదేశములయందూ కవులకు గాయకులకూ శిల్పులకు చిత్రలేఖకులకూ స్వప్నములయందు, భావములయందు కనుపించుచున్న దివ్యసౌందర్యమూర్తి యొక్క మూర్తి నాపద్మ. ఇంక నేమి చెప్పగలను? నా తల్లికి పదిసంవత్సరములు పూర్తిగా నిండకుండానే, నారాయణరావు హఠాత్తుగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇన్ఫ్లుయంజా వచ్చి చనిపోయాడు. దానితో మాకు వియోగము ఏర్పడ్డది. నారాయణ రావుభార్య పిల్లలను తీసుకుని వాళ్లస్వగ్రామము చేరింది. పిల్లచదువుకోసమేనా నా దగ్గర ఉంచమన్నాను. 'అన్నయ్యా, నేను మట్టుకు ఇంకను ఏమి చూసుకొని బ్రతకను, అదికూడా కాస్త ఇంట్లో లేకపోతే! తక్కిన వాళ్లిద్దరు బొత్తిగా పసికూనలా యిరి ఎలా గడుస్తుంది' అని విచారించింది. నేను ఏమీ సమాధానము చెప్పలేక, స్తంభితకంఠంతో, పూరితనయనాలతో నాతల్లిని ముద్దాడి పంపించేశాను. తరువాత అప్పుడప్పుడు శలవులలో వస్తూవుండేది మా యింటికి. నెలా రెండు నెలలూ ఉండిపోతుండేది.

ఇట్లా రెండుసంవత్సరములు గడచినాయి. పద్మకు పండ్రెండవసంవత్సరము జరుగుతోంది. త్వరగా వివాహము చెయ్యమని అయినవాళ్లు, కానివాళ్లుకూడా తొందర చేశారు. తల్లి తనభర్త బాగుండగా రజస్వలానంతరవివాహాలు చాలామంచివనీ, అతిబాల్యవివాహాలు చాలా దూష్యములనీ అనేక ఉపన్యాసా లిచ్చింది. అనేకమందిచే తన అధికారబలిమిచేత, వాళ్లపిల్లలకు రజస్వలానంతరవివాహాలు చేయించింది. కాని స్వవిషయము వచ్చేసరికి నాకూతురుజోలి నీ కెందుకనలేకపోయింది, సలహాదార్లను. విద్యాధికులూ, బ్రాహ్మలూ చేసే దార్ఢ్యాలు వేరొకళ్లు చెయ్యలేరు చూశిచూశి. అన్నిటికీ మతమో, సంఘమో మనకు శరణు. ఆలోచిస్తేమట్టుకు మనిషియొక్క పిరికితనము తప్ప మఱొకటి కాదు. ఎక్కడో ఒక అగ్రహారీకుల పిల్లవాని కిచ్చి ఫలానప్పుడు వివాహమని నాకు శుభలేఖ వచ్చింది. అంతకు ముందు నాకేమీ కబురు లేదు. దానితో నిర్ఘాంతపోయి, తిరుగురైలులో వాళ్లఊరు చేరుకున్నాను.

నారాయణరావుకు ఏకోదరులు ఎవ్వరూ లేరుగాని ఒకవేలువిడిచిన అప్పగారు ఒకామె ఉండేది. చాలా తక్కువస్థితిలో ఉండేవాళ్లు పాపం. ఇతను చాలాసహాయంగా ఉండేవాడు. ఆమెకు ముగ్గురు కొడుకులు. సుందరం కడసారం. ఈపిల్లవాని మూడోయేట, తండ్రి, కృష్ణలో స్నానం చేస్తుండగా ఆనకట్టు తలుపు మీద పడి పోయాడు. ఆవార్త విని తల్లి ఆత్మహత్య చేసుకుంది. పెద్దకుర్రవాళ్లిద్దరూ కాస్త జ్ఞానంవచ్చినవాళ్లు. వాళ్లకేదో తగుసహాయంచేసి సుందరాన్నిమట్టుకు తనదగ్గర పెట్టుకుని కొడుకుకంటె ఎక్కువగా పెంచాడు.

సుందరం నిజంగా సుందరమూర్తే. సౌందర్యానికి తగ్గ సుగుణసంపత్తి, ఉదారభావములు, మహదాశయములు. ఏ జమీందారీకుటుంబములోనో పుట్టవలసినవాడు కాని నిరుపేదబ్రాహ్మణ కుటుంబములో పుట్టవలసినవాడు కాదు. కవిత్వమూ, గానమూ అతనికి పుట్టుకతోటే వచ్చినాయి. అతను మాట్లాడుతుంటేనే ఏదోపాట పాడుతున్నట్లుగా ఉండేది. ఆ మార్దవమూ, మాధు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్యమూ, సౌకుమార్యమూ చెప్పనలవికాదు లెండి. ఏడాబామీదనో నిలబడి, ఏకోకిల పాటో వింటూనో, ఏ సూర్యోదయమో చూస్తూనోఉంటే, అతని చెవులకు లోకాతీత మైన ధ్వనులు వినపడుతూ, కన్నులకు దివ్య దర్శనములేవో అవుతూఉండే వనుకుం టాను. ఆసమయాల్లో అతన్ని చూస్తే మట్టుకు కుర్రవాడైనా, నిశ్చలసమాధిలో నున్న మహాయోగివలె నుండేవాడు. చూచి నమస్కరించ బుద్ధి అయేది. మా పద్మకు కూడా, వాని ధ్యానమే, వాని మాటలే, వాని భావములే, ఆకవిత్వమే, ఆగానమే అబ్బింది. విశేషించి నాతల్లికి చిత్రలేఖనము కూడా చక్కగా అబ్బింది. అతను నిద్రలో చూచి వర్ణించిన స్వప్నములనూ, అతని మనోవీథిలో పరుగెత్తే భావములనూ నా తల్లి చిత్రములలో బంధించేది. కొన్నిరోజుల వరకూ వాళ్లు ఆపటములు చూచి ఆనం దించుకునేవారు. ఈ రహస్యానందము వా ళ్లిద్దరిమధ్యనే. రెండోకంటివాళ్లకు తెలిసేది కాదు. వాళ్లు ఎప్పుడూ చెప్పేవారుకారు. చెపుతేమట్టుకు ఇవన్నీ ఎవరికిఅర్థమవుతాయి. ఇదంతా నాపద్మ నన్ని అగాధములో ముంచి పోయిన కొంతకాలమువరకూ నాకూ తెలియ లేదు. కాని, బ్రహ్మ ఎక్కడేనా ఒక మొగవాని కోసము ఒకఆడదాన్ని సృష్టిచేసి ఉంచాడూ అంటే ఆపిల్లవాడికోసము ఈ పిల్లను పుట్టిం చాడు అనుకునేవాళ్లము. ఆటలలోనూ, పాటలలోనూ, మాటలలోనూ వాళ్లిద్దరూ ఒక్కటే. భేదమనేమాట ఎప్పుడూ లేదు. సృష్టిలో ఏ ఇద్దరూ ఇలా ఏకీభవించడము నేను కనివిని ఎరుగను. మీ రేమైనా ఎరుగుదు రేమో నాకు తెలియదు. వాళ్లిద్దరి హృద యాలూ ఎప్పుడూ ఒక్కటిగానే స్పందిస్తూ ఉండే వనుకుంటాను. ఇద్దరి శ్వాసలూకూడా పరిశీలిస్తే ఒక్కమాదిరిగానే ఉండే వను కుంటాను.

ఇంట్లోఉన్న ఇలాంటి పిల్లవాడిని వదలు కుని ముక్కూమొగమూ ఎరుగని పరాయి సంబంధముకోసము పాకులాడేవాళ్లు ఎక్క డేనా ఉంటారా? ముంజేతిమాణిక్యాన్ని వదలుకుని, మూలనున్న గులకరాతికోసం వెతుక్కోడంలో అర్థమేమైనా ఉన్నదా?

అనేకవిధాల ఆవిడతోటి చెప్పాను; వాదించాను. కోప్పడ్డాను. ఏమిచేస్తే ఏమి లాభము? ఆడవాళ్లకు, అందులో ధన వంతులైన వితంతువులకు, వాళ్లకు తోచి నంతేకాని ఇంకొకళ్లు చెపుతే ఎందుకు విం టారు. ఎంత పు చెప్పినా ఆవిడది ఒక్కటే పాట. “ఈపిల్లవాడికి ఏమీలేదు. రెక్కల మీద ఆధారపడవలసిందేను! అవతలవా ళ్లకు బోలెడంత ఉంది. నాపిల్లకూ, పిల్లపిల్ల లకూ ఏమీ లోటు ఉండదు.” ఇదితప్ప వేరుమాట లేదు. ఏమిటి దానికి సమా ధానము? డబ్బు ఎంతపని చేస్తోందో చూశారా! డబ్బు పాపహేతువనీ, దాని వలన వచ్చే సౌఖ్యములన్నీ నిజంగా దుఃఖ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాయకములనీ చెప్పగలిగిన వేదాంతమునకు పుట్టినిల్లయిన మన దేశములో, ధనసమార్జన యందాసక్తిలేకుండా, యాచన చేసుకుంటూ జీవయాత్ర గడపవలసిన బ్రాహ్మణకుటుంబములో పుట్టి, అరుంధతీ, అనసూయాదిమహా పతివ్రతలను ఆదర్శముగా పెట్టుకున్న విద్యావతియైన ఒక్కబ్రాహ్మణస్త్రీ, ఇతరులు ఆస్తివంతులని ఇంట్లో సంబంధము మానుకున్న దంటే ఎంతదారుణము, ఎంతసిగ్గు! బ్రాహ్మణులలో జరిగే ప్రతివివాహములోకూడా డబ్బుదగ్గర పేచీలేనిది ఒక్కటేనా ఉందా! వేలంపాట పెట్టి, పోటీలు పెట్టి, కోడళ్లను కొనుక్కొని, తరువాత వాళ్లను వేచుకుతినే ఈబ్రహ్మరాక్షసులేకాదూ మనకు సనాతన ధర్మమార్గదర్శకులూ, ఉపదేష్టలూను.

పద్మను రహస్యంగా పిలిచి, 'నువ్వు వప్పుకున్నావా అమ్మా' అని అడిగాను. తలవంచుకొని, వినపడీ వినపడకుండా, 'ఏమిచెయ్యగలను' అంది. అని, ఒక్క క్షణము ఊరుకుని, నా మెడకు తన రెండుచేతులూ పెనవేసి ఒక్కమాటు కడుపు చెక్కలయేటట్లు రాగాలెట్టి, 'మామా, నన్నెందుకు విడిచిపెట్టావు నువ్వు? మీ ఇంట్లోనన్ను ఉండనివ్వకపోయినావా? పంపనని మాఅమ్మతో దెబ్బలాడకపోయినావా? నీ కామాత్రము అధికారము లేదూ? నీకూ నామీద ఇంతదయ లేకపోనా! ఇంతకూ నిన్ననవలసినప నేముంది? పరమేశ్వరునికే నామీద కటాక్షము లేనప్పుడు నీకు లేకపోవడములో ఆశ్చర్య మేమున్నది?' అని ఒక్కపరుగున అవతలకు పారిపోయింది. ఆఅన్నమాటలూ, ఆనిలబడ్డ వైఖరీ, ఆ కళ్లలో నిప్పులూ చూచి హడిలిపోయినాను. నేను చచ్చినతరువాత యమధర్మరా జేవన్నా ప్రశ్నలువేస్తే ఎంతభయపడేవాడినో ఇప్పుడూ అంతభయపడ్డాను, నిజంగా. ఆప్రశ్నలు వేసింది దేవుడేకాని, ఆపిల్ల కాదనే ఇప్పటికీ నానమ్మకము. వాటి కేమిసమాధానమున్నది? దోషినే. ముమ్మాటికీ దోషినే. ఈ దోషమంతా తల్లిది కాదు, నాదే. నా మెడకు చుట్టినచేతులు ఉరిత్రాళ్లయి నన్ను చంపినా బాగుండేది అనుకున్నాను. అలా ఎందుకు జరుగుతుంది. జీవచ్ఛవములా బ్రతికి ఈపాపఫలమంతా అనుభవించవద్దూ. నా పాపఫలము నేనుకాకపోతే ఇంకెవ్వ రనుభవిస్తారు? ఈజన్మలో చేసినదాని కీజన్మలోనే అనుభవము కావడముకూడా మంచిదే! అందుకనే అనుభవిస్తున్నాను.

నేను పిల్ల నెత్తుకుపోయి మాట్లాడకుండా సుందరాని కిచ్చి పెళ్లిచేద్దామా అనుకున్నాను. అలా చేసినా బాగుండేదేమో. కాని నాకు ధైర్యం చాలకపోయింది. నా కేమి అధికారమున్నది? ఆపిల్లపైన నాకున్న అవ్యాజానురాగము తప్ప మరేమీ లేదు. అందుచేత యీపని చేశానంటే కోర్టువా రంగీకరించరు. చదువుకున్న సన్న్యాసి కున్నంత పిరికితనం మరెవ్వరికీ ఉండ దనుకుంటాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆప్రయత్నము విరమించుకుని నాఉద్యోగా నికి నేను పోయాను.

పెళ్లికి నేను వెళ్లలేదు. నాభార్యను మట్టుకు పంపించాను. మామూలు తగువుల తోటీ, బిగువులతోటీ అయిదురోజులూ అలా అలా జరిగాయి.

*  *  *  *

3

యౌవనాంకురమైనతరువాత మాపద్మ సౌందర్యము వర్ణించడానికి నాబోటివానికి సాధ్యముకాదు. ఆమె ఎదుటనిలబడితే పెద్ద మెరుపుమెరుస్తే కన్ను చెదిరిపోయినట్లుండేది. ఎవరైనాసరే ఆపిల్లఎదుట నిశ్చేష్టులై శిలా విగ్రహాల్లా అలా నిలబడిపోవలసినదే. ఆసౌం దర్యానికి తగ్గ సుగుణసంపత్తి,వినయవిధేయత, విద్యాభిమానము, సంస్కృతాంధ్రములం దొకపాటి పాండిత్యము, జన్మాంతరసముపా ర్జితమైన గానకళ, చిత్రలేఖనానైపుణ్యము-అబ్బా-ఇటువంటిపిల్ల సృష్టిలో ఇంకొకతె ఎక్కడేనా ఉన్నదండి !

భర్త అయిదవఫారము మూడేళ్లుతప్పి అంతటితో చదువు చాలించి ఇంటిదగ్గర కూచున్నాడు. చూడడానికి ఒకమోస్తరుగా బాగానే ఉంటాడు. కాని అంతే. మరేవిశే షము చూతామన్నా కంచుకాగడావేసి వెతకినా కనుపించదు. మామూలు అగ్ర హారీకపు లక్షణాలన్నీ ఇతనిలోనూ మూర్తీభ వించినాయి. తంత్రగొట్టుతనం, ఇతరులను చూస్తే అసహనం, విపరీతమైన అహం భావము, ధనపరభామినీవాంఛ, కొంచెము జూదము-ఇంక నాసుగుణసంపత్తి ఎరుగనివా రెవరు? నిత్యము మనకళ్లఎదుట, కోర్టులోను, ఆసుపత్రులలోను ఈజాతివారు ప్రత్యక్ష మౌతూనే ఉంటారు. వారివైఖరి చూడ గానే అగ్రహారీకుడురా అని మూడుపంక్తు లాముఖాన్ని వ్రాసిఉంటుంది.

ఇందులో ఏ అంశములోనూ పద్మ మొగుడు ఇంకొకళ్లకు తీసిపోడు. విశేషము మాట్లాడుతే పేచీ ఒకటి. పిల్లను పుట్టింటికి పంపడానికి పేచీ. తీసుకురావడానికి పేచీ. దగ్గ రున్నప్పుడు ఇంక చిత్రవధే. వివరముగా వర్ణించడ మెందుకు? డబ్బున్నదనుకొని అగ్రహారీకులకు పిల్లనిచ్చుకున్న ప్రతితం డ్రికి ఈఅనుభవము తెలిసినదే. తేడా ఏమీ లేదు. అతిశయోక్తి అంతకంటే లేదు. ఒక సారి పండుగలకు వచ్చినప్పుడు నేను చూడ్డా నికి వెళ్లాను. నాతల్లిని ఆనవాలుకట్టలేక పోయాను. అంత, అలా మారిపోయింది. ముఖంలో ఎప్పుడూ తాండవిస్తూఉండే మంద హాసముగాని, కళాకాంతులుగాని ఎక్కడా లేవు. భోజనందగ్గరైనా ఎప్పుడూ పుస్తకం విడువనిది పుస్తకమన్నమాట ముట్టుకోడము మానేసింది. సంగీతమూ, చిత్రలేఖనమూసం గతి చెప్పనే అక్కరలేదు. పిల్ల చూస్తే సగ మైపోయింది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒకరోజు సాయంకాలము దగ్గర కూర్చో పెట్టుకొని, ఆమాటా ఈమాటా చెప్పి, 'ఏమమ్మా, ఇలా అయిపోయినావు? ఓ చదువులేదు, సంగీతము లేదు, మాట లేదు, మంతి లేదు. ఏమీా లేదు. ఏమిటి కారణము తల్లీ, నాతోటి చెప్పవూ' అన్నాను. ఒక్కక్షణం అల్లే ఆకాశంకేశి చూస్తూ ఊరుకుంది. అశ్రువులతో నిండిన తన రెండు కళ్ళూ నక్షత్రకాంతిని ప్రతిఫలిస్తున్నాయి. 'ఏముంది మామా చెప్పడానికి? అగ్రహారపు కోడళ్ల అవస్థలు నీకు తెలియవు గనుకనా! అనుక్షణం అన్నిటికీ రంపపు కోతే. కూచుంటే తప్పూ, నుంచుంటే తప్పూ. శుభ్రమైన బట్ట కట్టుకుంటే తప్పూ. కొత్త వస్తువు పెట్టుకుంటే తప్పూ. ఇం కెలా బ్రతకడము? ఆమహారాజుకు ఏమీా అక్కర్లేదు. ఎక్కడెక్కడికో తిరిగి ఏ రెండో జాము వేళో, మూడోజాములోనో వస్తారు. ఆయన కేమి, మగవాడు. నోరెత్తడానికి వీలులేదు. పగ లెప్పుడేనా ఇంటిదగ్గరుంటే నన్నూ నాతల్లినీ దూషించడముతో సరిపోతుంది. ఇంక నాకు చదువెందుకు, సంగీత మెందుకు? ఎవరు చూచి ఆనందించను? ఆ ఇంట్లో ఎవ్వరికీ లేనప్పుడు నాకుమట్టుకు దానివల్ల కలిగే ఆనంద మేముంటుంది? ఇక్కడంటే సుందరంబావ'—అని యింక మాట్లాడలేకపోయింది. ప్రతిఅక్షరమూా దాని హృదయములోనుంచి చీల్చుకొచ్చింది. ఆహా! ఆపిల్ల ఎంత బాధ పడుతున్నది. అన్నికష్టాలు ఈ పిల్లకే రావలెనా? అన్నీ చూస్తూరా యిలా ఊరుకోవలసినదేనా అని చాలా విచారించాను. ఏమి చెయ్యగలను?

## ౪

మాపద్మకి పదహారేళ్లు పూర్తిగా నిండలేదు. నేను వేలూరులో ఉన్నాను. హఠాత్తుగా ఒకనాడు సాయంకాలము పద్మకు ప్రాణంమిాది కొచ్చినదనీ, నాకోసము బెంగపెట్టుకున్నదనీ, వెంటనే రమ్మనీ, పిడుగువలె జెల్లిగ్రాము వచ్చింది. జబ్బుగా ఉన్నట్లు ఉత్తరమేనా లేదు. ఏమిరా భగవంతుడా అని నేనూ,నాభార్యాకూడా వెంటనే బయలుదేరి వెళ్లాము. పిల్ల ఆసుపత్రిలో ఉందన్నారు. వెంటనే అక్కడి కెళ్లాము.

పిల్ల శల్యావశిష్టముగా ఉన్నది. ప్రాణమంతా కళ్లలో ఉంది. సంధికూడా ప్రవేశించింది. కళ్లు రెండూ జ్యోతుల్లా ప్రకాశిస్తున్నాయి. మొదట నన్ను గుర్తించలేదు. చూపు ఈలోకముమిాద లేదు. నాడు పుట్టిన రోజున చూచినట్లుగానే నూతనప్రపంచాన్ని పరీక్షచేస్తున్నట్లుగా గది నాలుగుమూలలా చూస్తూ నాకేశి చూచి ఒక్కసారి దృష్టి నామిాద నిలిపింది. నన్ను గుర్తించుకుంది. ముఖంలోకి ఎక్కడలేని ఆనందము వచ్చింది. నన్ను దగ్గర కూర్చో మని సంజ్ఞచేసింది. కూర్చున్నాను. ఒకచేతితో నా చెయ్యి పట్టుకుని రెండవచేతితోనాముఖమంతా తడుముతూ 'అమ్మయ్యా, వచ్చావు మామా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంక నాకు ఫరవాలేదన్నమాటే. ఇంక నే బతుకుతాను కాదు మామా. నన్ను బ్రతికిస్తావుకాదూ. ఇన్నాళ్లనుంచి ఎందుకు రాలేదమ్మా! ప్రాణం పోతూంటేకూడా కాస్త చూడపోకూడదా ' అంది.

బల్లిలా మంచాన్ని అంటిపెట్టుకున్న ఆ ఆకారము, గర్భనిర్భేదమైన ఆమాటలూ చూచి, వినేసరికి నాకడుపు తరుక్కుపోయింది. ఎక్కడలేని దుఃఖమూ వచ్చింది. నాజన్మలో మొదటిసారి బావురుమని చిన్నపిల్లవానికిమల్లే ఏడ్చాను. నాతల్లికళ్లుకూడా నిండినాయి. అయినా తనదుఃఖాన్ని ఆపుకొని పెద్దదానికి మల్లే నన్నూరడించడము మొదలుపెట్టింది

.................................

వెంటనే వెళ్లి అక్కడ దొరసానితో మా తల్లిసంగతి మాట్లాడినాను. ఏమిటి జబ్బు అన్నాను... మీరు మందేమిస్తున్నారు? ఇంత వరకూ ఎందుకు ముదరనిచ్చారు? అని గుక్క తిరగకుండా వందప్రశ్నలు వేశాను. ఇన్నిప్రశ్నలు వినగానే ఆమెకు కొంత కోపము వచ్చినది కాని నేను ఫలానా అని చెప్పగానే, నాతో సావధానముగా మాట్లాడింది. మాట్లాడడాని కేమున్నది? "వ్యాధి ఏమో తెలియదు. కారణ మంతకంటే తెలియదు. ఏ పరీక్షకూ, ఏమందుకూ లొంగలేదు. మే మేమీ లోటుచెయ్యలేదు. పిల్ల ఇంకొక్కరోజుకంటె జీవించదు. కాని ఆలోచించగా నా కొక్కటి తోస్తోంది. పిల్లజబ్బు శరీరసంబంధమైనది కాదు. మానసిక మని తోస్తుంది. దుర్భరమైన మనోవ్యథ ఏదో ఈపిల్లని కుంగదీసి, గుండె పాడుచేసి, ఒకవిధమైన క్షయవ్యాధిలోకి దింపింది. ఇంత చిన్నపిల్ల కంత మనోవ్యథ ఉండడానికి తగ్గ కారణము కనుపించదు. తల్లినడుగుతే అటువంటి దేమీ లేదంది ఆమె. అయినా మీరు కూడా యోచించండి" అన్నది దొరసాని. యోచన కేమున్నది? దొరసాని ఊహించినదే వాస్తవము. పిల్లశరీరములో జబ్బేమీ లేదు. ఏవిధమైన దోషమూ లేదు. నవవికసితపుష్పములో మాలిన్య మేముంటుంది? ఆమెవ్యాధి మానసికము. కన్నతల్లికూడా కనిపెట్టలేకపోయింది.

తనకు అవసానము సమీపించినదని పద్మకూడా తెలుసుకున్నది. మధ్యాహ్నము నన్ను దగ్గర కూర్చోపెట్టుకుని, పూసగుచ్చినట్లంతా చెప్పింది. వాళ్లు తన్ను పెట్టిన బాధలు, అన్న మాటలు, చేసిన అవమానములు ఆఖరుకు భర్తకూడా అనుక్షణమూ అవమానించుటే. దానితో ఆపిల్ల గుండె బద్దలై బెంగపెట్టుకుని మంచముపట్టింది. ఇదంతా ప్రపంచాని కేమి తెలుస్తుంది? ప్రపంచము దాకా ఎందుకు? కన్నతల్లికి తెలిసి ఏడిసినది కనుకనా! మాటలు ప్రాణాలుతీస్తాయా అంటారు. అనుభవించేవాళ్లకుకాని తెలియదు. కత్తితో పొడుస్తే నాలుగురోజుల్లో పుండు మానుకొస్తుంది. మాటతోపొడుస్తే ఆజన్మాంతమది బాధిస్తోనే ఉంటుంది. పైగా పద్మ మామూలుపిల్ల కాదు. అతిసున్నితమైన మనస్సు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానిది. ఈలోకపు పిల్ల కాదది. ఆ అతిలోక సౌందర్యముతోపాటు దాని గుణములన్నీ కూడా లోకాతీతములే. దానిఆటలు, పాటలు, భావములు, ఆదర్శములు, ఆనందములు-అన్నీ లోకాతీతములే. అదెవ్వరూ కనిపెట్టలేక పోయారు. శరత్కాలములో సాయంసంధ్య యందు ఆకాశమున చిత్రితమైన రంగులు చూస్తే కొన్నిరోజులవరకూ దానికి తిండి కూడా అక్కరలేకపోయేది. ఒక చక్కని పువ్వు చూస్తే చాలు, ఒకమంచిమాట వింటే చాలు, ఒక ఇంపైనమూర్తి చూస్తేచాలు, ఒళ్లు మరచిపోయేది. ఈలోకంలో పడి మాన వాకృతి దాల్చి ఈమురికిలో తిరుగుతున్నా, ఈమాలిన్య మేమీ దాని కంటలేదు. దాని ఊహలూ, చూపులూ ఏలోకము లోనో సంచరిస్తూఉండేవి. మన అందరివలె జన్మాంతరవాసనలను పూర్తిగా వదలలేక పోయింది ఆపిల్ల. ప్రయాణమధ్యమం దాజీవు డిక్కడ ఒక్కక్షణం విశ్రమించా డన్న మాటేకాని దృష్టిఅంతా ముందు ప్రయాణము మీదనే ఉండిపోయింది. శరీరసౌఖ్యములనేవి శాశ్వతములు కావనీ, బ్రహ్మానందమే శాశ్వ తమనీ, అది కేవలము జ్ఞానలబ్ధమనీ మనకు ప్రతిమునలమ్మా చెపుతుంది. కాని ఎవరేనా శరీరసౌఖ్యము వదలుకొని, ఎప్పుడు మానసి కానందమే అనుభవిస్తున్నవాళ్లను చూచి మనము అర్థముచేసుకోలేమునరిగదా పిచ్చ ముండావాళ్లని, విశాఖపట్నమో, మద్రాసో పంపేఏర్పాటు చేస్తాము.

పద్మకు పెళ్లిచెయ్యక తప్పదనుకున్న నాడు సుందరానికిచ్చిచేస్తే తీరిపోయేది. లేదూ, పెళ్లీ వద్దు, పేటాకులూ వద్దు, మాట్లాడక ఊరుకుని దాని పుస్తకాలతో, దాని సంగీతంతో దాన్ని విడిచినాబాగుం డేది. ఏదీ లేకుండా, తెలిసో తెలియకో, తల్లి చేతులారా పిల్లను హంతకుల చేతుల్లో పెట్టింది. వాళ్లు నిర్భయంగా మూడుసంవత్స రములలో పిల్లను వధించారు. ఇది కోర్టుల్లో రుజువుకాకపోవచ్చుకాని, ముమ్మాటికీ ఇది హత్యకాని వేరొకటి కాదు. 'నేను ఆయ నతో ఏశరీరసౌఖ్యమూ కోరలేదు! మామా, దైవసాక్షిగా నాకక్కరలేదు కూడాను. నాభా వనాప్రపంచములో నన్నెందుకు తిరగనివ్వ కూడదు మామా! దానివల్ల వాళ్ల కేమి లోటు?' అన్నది నాతల్లి.

చిన్నపిల్లలు వాళ్ల కేమి తెలుసునను కుంటాము. వాళ్ల కేమి తెలుసునో తెలుసు కునే తల్లిదండ్రులెంతమంది ఉన్నారు, మన వాళ్లలో. ఆసాయంకాలమే అస్తమిస్తున్న సూర్యుడుతోపాటు నాతల్లికూడా అస్తమిం చింది. పద్మము ముకుళించుకుపోయింది. పళ్లె ములో హారతికర్పూరములా హరించిపో యింది.

నా చేతులతో ఈ పాడులోకములో ప్రవేశపెట్టాను. ఈ పాడుచేతులతో పరలో కానికి సాగనంపాను..................

ఇంక నాఉద్యోగ మెందుకు తగలెయ్యాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాతల్లిని బ్రతికించలేని వైద్య మెందుకు, మానుకున్నా. అన్నీ వదలుకున్నాను. నా తల్లే నాకు పరమేశ్వరునియందు భక్తి కుదుర్చింది. ఆయనపాదములనే నమ్ముకున్నాను, ఎప్పటికైనా నాతల్లిదగ్గరకు తీసుకుపోడా అని.

పగలంతా నాతల్లి కడసారిపలుకులు చెవులలో గంటలుకొట్టినట్లు మోగుతూ ఉంటాయి. రాత్రంతా శ్మశానజ్వాలలో నా తల్లి మొగము...శివశివా...

---

# భావసంకీర్తనము

బాలాంత్రపు వేంకటరావు

౧

శ్లో॥ ధించినకొలంది సొంపు పెంపగుచున్న
దియుఁ, దలఁచిన కొలఁదిని దగులుమి
గులుచున్నదియు, వాడుకొనుకొలఁదిని వన్నె
కెక్కుచున్నదియు, గ్రహించినకొలఁ
దినికలకలఁ గళదేఱుచున్నదియుఁ, గ
దలిచినకొలఁదిని గలుపువలపుఁ
దెలుపుచున్నదియును, నిలిపినకొలఁదిని
నిండుచందురుఁబోలు నిగ్గుజగ్గు
తో వెలయుచున్నదియునగు నావిశుద్ధ
భావసుమము, నాజీవసంజీవసుమము,
మీఁదుఁ గట్టియుంటిని నీవినోదమునకు
ఎపు డనుగ్రహించెదవొ? నీయిష్టముప్రభు!—

౨

ప్రారబ్ధమగు నాసుమాపణమ్మున, వాస
నాకుసుమమ్ము లనేకములుగ
నమ్మివైచితిని. చిత్రమ్ములును, వివిధ
కర్మదోహదములుఁ గౌతుకములు
నైనపుష్పమ్ముల నమ్మివైచితిని. సం
చితములును, రసశోభితములు నగు
మృదులతాంతముల సమ్మదమున నమ్మివై
చితిని. సరమ్ములుఁ, జిత్రకంచు
కములు, నంగీలు, నుష్ణీషకములుఁ జెల్లె;
ఒకపవిత్రహృదబ్జమే యున్నదింక;
విలుచుకొనుమయ్య! దీని నావెలయొసంగి,
వేగ నాయంగడిని నెత్తివేయదుఁ బ్రభు!—

౩

ఈదీనదాసునిపైదయగల్గెనే!
వచ్చితే! దర్శనమిచ్చితె! ప్రభు!
ఆనందబాష్పపాద్యము స్వీకరింపుము!
నామనఃకమలాసనమ్మున నుప
విష్టుఁడవగుము! విశిష్టభక్తిరసప్ర
పూర్ణవాక్సుమములఁ బూజఁగొనుము!
నాపుణ్యఫలముల నైవేద్యముగ్రహింపు;
మంతరంగ శుభనిశాంతమందు,
భావ సుమశయ్యనలపోక పవ్వళింపు;
మాత్మవల్లకీప్రణవనాదామృతము ప్రి
యంబొ? జీవరాగప్రణయామృతము ప్రి
యంబొ? సెలవిమ్ము! నాసేవలందుము ప్రభు!—

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# అభినవాంధ్రకవి పండితసమ్మేళనము

## ద్వితీయసమావేశము, రాజమహేంద్రవరము

(శ్రీముఖనామసంవత్సర శు ౧౨ గురువారము. ౨౮-౧౨-33.)

## అధ్యక్షోపన్యాసము: ఆచార్య రాయప్రోలు సుబ్బరావు

తెనుఁగుందోఁటల భావగీతలను ర
క్తిం బాడుటో, పూలమ
ల్లె నోయారంబుగ దిద్దుటో, యమృతవా
ల్లభ్యం బుపాసించుటో,
ససలం దేనెలు తీయుటో పొదల పొం
తకా గోయిలకా బిల్చుటో
జననీ! వేదికలేల? లేవె యిఁకయు
ష్మత్సేవయం దన్యముల్.

ఇసుకమబ్బుల బొమ్మరిండ్లు తీర్చెద రెవ్వ
రానల్ల చెరువుమైదానమందు
ముత్యాలు తూర్పార పోయుచున్నా రెవ్వ
రాపాలయేటి వాలయిన మడక
లక్షవత్తులనోములను నోముచెవ్వ రా
కంచుదీపాలు వెల్గించినారు
శీతదుగ్ధకణాభిషేకం బొనర్తు రె
వ్వారు పార్థివపూజఁ బచ్చనింట
ఆధనుర్మాస హిమదరహాస సుముఖి
పుట్టిన దినాలపండుగప్రొద్దులందు
లలితకళల బ్రహ్మోత్సవముల నొనర్తు
రభినవాంధ్రపండితకవు లహాహ సుకృతి.

అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితంచ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే.

—గీత. ౧౭. ౧౫.

సభాసీనులయిన సహృదయలోకమునకు సాష్టాంగములు; అమృతవ్యవసాయకులయిన అనుచర కవికులమునకు అభివాదములు.

ఈ కవిపండితసమ్మేళనమునకు నన్ను అధ్యక్షునిగాఁ బిలిచిన మీ స్నేహ గౌరవముల కెంతయుఁ గృతజ్ఞుఁడను. పిలువని పేరంటమునకుఁ బోరాదు; పిలిచిన పేరంటమునకుఁ బోకుండనురాదు. నేను మీ యాహ్వానమును నమ్రశిరస్కుఁడనై యంగీకరించుటకు ఇదియే కారణము. అంతేకాని యీ గౌరవభారమును వహించుటకుఁ దగిన ప్రత్యేకయోగ్యత లేమియును నాయొద్ద లేవు.

మన మిప్పుడొకవిచిత్రకాల పరివర్తనలోఁ జిక్కి నిస్సహాయముగా పరిభ్రమించుచున్నాము. పరిషత్తులు, వార్షికోత్సవములు, గ్రంథాలయసభలు, సారస్వత సమావేశములు, విద్యావాసరములు—ఇట్టివెన్నియో మన నాగరకజీవితమునం దాచారములైనవి. వీనికెల్లను అధ్యక్షులు తప్పనిసరి. తీర్మానములు, సవరణలు, సమ్మతులు—ఇట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దెంతోతంతు జరుపక తప్పదు. ఈ కలాపమంతయును ఇతరరంగములయందు అనివార్యమయిన నగుఁగాక, సాహిత్యసత్త్వాకమందుఁగూడ అవసరమా? గోష్ఠియొక్కటే ఇట్టిసభలవలన వాగ్వ్రాతు లర్థింపఁదగిన పరమప్రయోజనము. అది యెంతఅల్పమయినను పదివేలే.

ఆంధ్రదేశమునందుఁ గేవల సారస్వత కృషికై పలుసంస్థలు ఏర్పడినవి. ఆధునికాంధ్ర కవిపండితసమ్మేళనముగూడ నం దొకటి. ఏతద్ద్వితీయసమావేశము రాజమహేంద్రనగరమున జరుగుట మిగుల నానందదాయకము. ఆంధ్రవాఙ్మయమునకు రాజమహేంద్రవరమే పురుడుపోసెను. ఆంధ్రనాగరకతకు రాజమంఁడ్రియే పెంపుడుతల్లి. ఆంధ్రుల సంస్కారదీక్షకు రాజమహేంద్రమే యజ్ఞశాల. భవభూతి సంస్కృతసరస్వతితో తరంగితమయిన గోదావరీగర్భమందే నన్నయభట్టారకుఁడు భాషాశుక్తి సంతానమును శాసించి తన మహాభారతహారమునకు నీరుగల నిండుముత్యముల నేరికొనెను. ఆంధ్రుల సంస్కారయోగమునకుఁ బ్రమాణముగా వీరేశలింగదీక్షితుఁ డిందే తన యనుష్ఠానమునకుఁ బూర్ణాహుతిఁ గావించెను. అనర్గళధారాచతురయు, ఉదారమృదుచరణయు నగు చిలకమర్తికోకిల మిచటనే తన చైత్రయాత్రను సలిపెను. ఆంధ్రుల యితిహాసపురాణమును విభాగించిన వీరభద్రవ్యాసు లీతీర్థవాటికయందే కాపురముండెను, తెనుగునాటి పంటలను రంగులరాసులుచేసిన దామెర్ల రామహస్త మీచిత్రకూటమందే తన ఉదయార్ఘ్య మర్పించెను. అనేక జాతి వనస్పతులకు ఈ జీవలంకయందే అంట్లు త్రొక్కఁబడినవి. అల్పప్రజ్ఞుఁడ నగు నేనును నిండారఁ బాఱు నఖండగోదావరి యొడిలోనే నా ప్రథమగీతమును బాడితిని. నన్నీ మహాసభకు అధ్యక్షునిగాఁ బిలుచుట కిదియే ప్రధానకారణమై యుండనోపు.

రసికులారా, నాయవస్థ నేఁడు మిగుల క్లిష్టముగ నున్నది. సభ్యులో సర్వతోముఖసాహితీసంపన్నులు. సభాకార్యమో బహుముఖవిశిష్టమయినది. నే నేమి ప్రసంగింపవలెనో నాకే బోధపడుటలేదు.

అయితే మనసు మిణకరించుట లేదు. కంఠము కంపించుట లేదు. ఉల్లాసమే, ఆవేశమే, ప్రబుద్ధప్రకాశమే నన్నలముచున్నది. అంతరాకాశమం దెందో కందలించు శబ్దసంహితను మీకు వినిపింప వేడుకయగుచున్నది. దృగ్వీథియందుఁ దాండవించు రూపకలాపమును ప్రదర్శించు ఔత్సుక్యమును ఉత్కటముగా నున్నది.

ఈతీగెలు అనునిమేషమును తీరుతీరులఁ బుష్పించుచున్నవి. తొలకరితేనెలు ఎడతెగక రాలుచున్నవి. ఎంతపాడినను శకుంతములకు ఎలుఁగు రాయకున్నది. ఈకిలికించిత క్రియాకలాపమంతయును తెనుఁగుతోఁటలో జరుగుచున్న చైతన్యస్వామి శోభనోత్సవము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాదా! ఆధునిక కవికుమారు లందఱును ఈ ఆనందవనమునందు, సౌభాగ్యవీథులలో, ప్రసన్నజీవనసరస్సులచెంత మాధుర్య సహకారచ్ఛాయల నాశ్రయించిన వైఖానసులే. వీరి తన్మయతరంగములే భావగీతములు.

భావకవిత్వమన నేమి?

భావకవిత్వమన నేమో తెలిసికొనుటకు ముందుఁ గవిత్వమన నేమో నాయభిప్రాయమును నివేదింతును. కవియొక్కకర్మయే కావ్యము. అయితే కవులన నెవరు? మంత్రద్రష్టలై ఛందస్సుల నవతరింపఁజేసిన వైదిక ఋషులు కవులు. విజ్ఞానపారంగతులై ఉపనిషత్తుల నుపపాదించిన బ్రహ్మవాదులు కవులు. ఆనందోపాసకులై మానవజీవిత మాధుర్యమును సంకీర్తనము జేసిన కాళిదాసాదులు కవులు. అయితే ఈమహాకవుల కందఱకును ఏకాదర్శమే గోచరింపదు. లక్ష్యలక్షణముల రెంటను అంతరమగపడుచున్నది.

వైదికమహర్షులకు ఋతము లక్ష్యము. ప్రకృతిని, తన్మయమయిన పంచభూతములను, ఏతన్నేపథ్యనిష్ఠితుఁడైన పురుషుని వారన్వేషించిరి. వారిసాధన తపస్సు. వారికి దర్శనమే సిద్ధి. తపస్తప్తమై బృంహితమైన వారి ఆత్మాంబరమందు ఆచ్ఛాదితమైన జ్యోతిర్లేఖనమే వారిఛందస్సు. అందువలననే ఇప్పుడుగూడ ధ్యానధారయందు వారిమంత్రములు జృంభకాస్త్రములవలె నూర్ధ్వశిఖలతో మన కగపడును.

ఉపనిషత్కర్తలు తత్త్వవేత్తలు, బ్రహ్మవాదులు. వీరికి దర్శనసిద్ధికంటె సాధనశుద్ధి యధికము. జిజ్ఞాస, మీమాంస మున్నగు వైజ్ఞానికవీథులు వీరి స్రోతవలు. స్వాధ్యాయప్రవచనములు వీరికి అప్రమాదానుష్ఠానములు. తపఃశక్తిస్థానమును జ్ఞానయోగ మాక్రమించినది.

ఇంతవఱకును వాఙ్మయమునకు ఏ అతీతవిషయదర్శనమో, ఏతత్త్వజిజ్ఞాసయో లక్ష్యముగ నుండెను. మహాకవి వాల్మీకియే తొలుదొల్త నీఛందఃకలశములలో మానవజీవితక్షీరములను బోసెను. 'మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః' అని ఒకకవి కీర్తించినదందువలననే! అనంతరము మహర్షి వాల్మీకి వాచాసంప్రదాయమునే కాళిదాసాదు లనుసరించిరి. ఈబృహత్పరిణామమునందు వాఙ్మయమునకు లక్ష్యమేమైన భేదించినదా? ఔనని నా విధేయవాదము. ఈ భేదమునే మహాకవి భవభూతి ఒక అనుపమసూక్తములోఁ బ్రకటించెను:

లౌకికానాం హి సాధూనా
మర్థం వా గనువర్తతే,
ఋషీణాం పున రాద్యానాం
వాచ మర్థోఽనుధావతి.

అలౌకికమో పారలౌకికమో యై ప్రజ్వలించుచున్న కవిత లౌకికమై, సాధువై ప్రసన్నమయినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నే నీ పరిణామమును సూచించుటకు రెండు కారణములు కలవు. మొదటిది వాఙ్మయవిధాత లయిన కవులకు లక్ష్యభేద ముండెనని చూపుట. రెండవది వాఙ్మయ రూపమైన కవితకుఁగూడ వేఱువేఱులక్ష ణము లేర్పడె నని నిరూపించుట. కవితకు లౌకికప్రతిపత్తి పట్టినతరువాత నే కావ్యాను శాసనములు కొమ్మలుసాగినవి; ధ్వన్యాలోక ములు తలలెత్తినవి; బహుమతములు బయలు దేఱినవి; గుణదోషవిచారము కొనసాగినది; దృష్టిభేదములు స్పష్టపడినది.

నేనిచ్చట కావ్యనిర్వచనములను వర్గీక రింపఁదలఁచలేదు. వాని తారతమ్యములను తర్కించుటకు నాకధికారమును చాలదు. కాని, ఒక్కముక్క చెప్పెదను. కావ్యము నకు రసమే ఆత్మ అను నిరూపణము విశ్వ సించువారిలో నే నొకఁడను. 'ప్లోదైక మయ' మైన కావ్యమువలన నర్థింపఁదగిన పరమప్రయోజనము ఆనందము. ఆఆనందో పాసన గావించువాఁడే భావకవి. ఆకవియొక్క స్వీయభావమే ప్రధానముగాఁగలది భావకవిత. భావమనఁగా కవి యభిప్రాయము.

"భావయతి బోధయతీ కవే రభిప్రాయ మితిభావః"-అని గురుబాలప్రబోధిక. ఇంకఁ గొంచెము విస్తరించిన నా యీ యాశయము తేటపడఁగలదు. కావ్యమునకు వస్తువు కావలెను. వస్తుసంవరణమునందు భావకవికి తన స్వానుభవమె యధికరణము. పూర్వ వాఙ్మయమందు లేదని వదల నక్కఱలేదు. నాయికానాయకులకు ఆలంకారికులలక్షణము లనుకూలించునా, ప్రతికూలించునా యని విచారించ నవసరము లేదు. వర్ణనాదుల యందుఁగూడ నిట్లే.

'దానిమ్మపువ్వువంటి తరుణి కెమ్మోవిపై
మల్లెపువ్వులనవ్వు సుళ్లుదిరుగ'

అని నే నొకచో వాడితిని. ప్రసిద్ధుఁ డగు పండితులొకరు 'ఈ యుపమానము కవిసంప్ర దాయము కాదే' యనిరి. స్థాలీపులాకముగా నిదిచూపితిని.

దృష్టిభేదము :

భావకవులకుఁ బ్రత్యేకములయిన లక్ష్య లక్షణములు కలవు. అందుఁ బ్రధానమైనది స్త్రీవ్యక్తి. మన వాఙ్మయమునందు అధిక ముగా కాముకావరణమందే స్త్రీ ప్రదర్శింపఁ బడినది. ఆమె యౌవనావస్థయె మెక్కువగా వర్ణితము. అంగోపాంగ వర్ణనలయందుఁగూడ అతివ్యాప్తియే పట్టినది. ప్రణయమర్యాద యందును సాధారణముగా 'చ్యుతి' యామెదే.

భావకవిత్వమునందు స్త్రీ మాతృపీఠ మునం దాసీనురాలగును. కవి కాముకునివలెఁ గామింపక తల్లివలె దగ్గఱకుఁ బోవును. యౌవనావస్థయందుఁగూడ ప్రకృతికృపణుఁ డయిన పురుషుని ధూర్తచారమునకు లోనుఁ కక నిందుకుండవలె నిలుచును. అబలాసమ్మి తముగ నాతనికి పుత్రభావము నుపదేశిం చును. భావకవి ప్రకృతి నెల్లప్పుడును పూజ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధితో సమీపించును. స్థూలవస్తుభ్రాంతితోఁ బైఁబడఁడు.

ఆచార్యశంకరులకు దేవీస్తనద్వంద్వమునందు సూర్యచంద్రులు ద్యోతమయినట్లు భావకవికి పాలకుండలో, అమృతకలశములో గోచరించును. ఇట్లంటినని యువకుల ప్రణయ సంభావనము భావకవితయందు నిషిద్ధమని యూహింపరాదు. మిథునానురాగపోషణమందుఁగూడ సంభోగశృంగారమునుగాక ఉపనాగరక సాహచర్యమునే యుత్పాదించును. భవభూతి యాదేశించిన 'సుమానుష ప్రేమ'ను భావకవి ప్రాప్యముగా నారాధించుచున్నాఁడు. కాని భోగ్యముగా నధఃకరించుటలేదు. ఆతని రసోపాసన కధిష్ఠాన దేవతకూడ నాప్రేమయే. చూడుఁడు: పద్మభ్రమరములకు మిథునానురాగము కావ్యసంకేతమే.

ఐనను,

సందెలను దారిదప్పి మిళిందసుతులఁ
దేనెపా లిచ్చి చీఁకట్లఁ దిరుగనీక
ఉదయమగుదాఁక యొడిలోన నిదురఁబుచ్చుఁ
జేరదీసిన మమతకుఁ జిక్కె నలిని.

అని మాతృప్రేమ మాధుర్యమును గానము చేయుటకు వెనుదీయఁడు.

ఈ ప్రచండభావనయందు అతనికి ఆవరణము చాలినది కాదు. అందుచే నతివిశాలమగు ఆత్మదేశమునందు తన యనంతమాతృభావమును మూర్తీభవింపఁజేసెను. దేశమకుటమునందే యావన్మాతృప్రాభవము నావహింపఁజేసెను. ఆమె ముఖమునందే విశ్వేదేవతల దివ్యతేజస్సునంతయు నుపలక్షించెను. ఇట్లంటినని భావకవిని బండవాస్తవికునిఁగాఁగాని నాస్తికునిఁగా గాని భావింపకుఁడు. అతనికి యీశ్వరుడు కలడు. అయితే నిర్వికల్పుడయిన ఆ అనాదిపితతో వికల్పజగన్మయుఁడైన తా నెట్లు మెలఁగవలెనో బోధపడుటలేదు. అందువలన భావకవి ఆ తండ్రిని సాక్షిగానే వదలి తల్లిని ప్రత్యక్షదైవముగా సమీపించుచున్నాఁడు. అనశ్వరదైవాంశలగు భూతపంచకమును ఉపగమ్యద్వారములుగా దరియుచున్నాఁడు. త్రిమూర్తులుగాని, తక్కిన ముక్కోటిదేవతలుగాని ఆతని భావన కధిష్ఠానదేవతలు కారు. ఆతఁడు ఆత్మను స్వస్వశూన్యముగా భావించుపంథకు దూరముగా నిలువఁబడెను.

ఈ ఆత్మావలోకనసాధనయందు అతఁడును పెక్కులవలంబనములను బాటించెను. తాను నాయికయై ప్రాణవిభుని రాకకు నిరీక్షించు వాసకసజ్జికవలె తీయని వాకిండ్ల ముందు నిలువఁబడెను. తాను రాధయై బాలగోపాలుని లీలాసాహచర్యమునకు ఉఱ్ఱూతలూగెను. తాను ఆటకాఁడై సర్వమును విస్మరించి జగత్ప్రాణివీచికలపై తేలియాడు ఆనందహంసమును బిలిచి బ్రతిమాలి దాని కాళ్లుపట్టుకొని నుత్తరలోకమున కెగిరిపోవనుంకించెను. కాని అన్నిటను అతని అపేక్షణ మొక్కటె. తాను ముక్తుఁడైపోవలెనని కాదు. తారవలె తెగిపడి తాను సందర్శిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన మహత్తర సౌంధర్యమును; అనుభవించిన ఆవేశానందములను ఆంధ్రభారతీవీథుల యందుఁ జిత్రింపవలెనని చింత; గానము చేయవలెనని కాంక్ష. అయితే ఈ పితృపక్ష సాధనలయం దన్నిటనుగూడ ఆతనిపిపాస చల్లారినది కాదు. తనకు ఇష్టదేవత దేశము. ఆమెకు ఆప్తపుత్రుఁడు తాను. బ్రహ్మాండమైన ఈ మాతృ ప్రాభవమంతయును తనదే యని యతని విశ్వాసము. దాని నిష్టాపూర్తికై వినియోగించుకొనుటకు ఆతనికి హక్కు గలదు.

అందువలననే అతఁడు గోదావరీ గర్భమందు ఆంధ్రనాగరకతను, తద్విశాల వక్షమునందు నానాదేశములనుండి వరహాలబస్తాలను వేసికొనివచ్చిన ఆంధ్రనౌకలను జూచుచున్నాఁడు. శ్రీహర్షునికంటె శ్రీకృష్ణరాయలె అతనికి అధికాప్తుఁడు. కాళిదాసునకు అలకా ఉజ్జయినీ నగరములవలె భావకవికి అమరావతీ రాజమహేంద్రవరములు సర్వసభ్యవిన్యాసమునకు ఆటపట్టులైనవి. నారదుని భక్తిసంహితలోకంటె త్యాగరాజస్వామి కీర్తనలయందే ఆతనికి బ్రహ్మానందస్తూత్రము లందుచున్నవి. ఈ సాధనయొక్క ఉత్కంఠదశలయం దతఁడు బొగ్గుగనులలో దేశద్రోహుల పాపసమాధుల నరయును. సస్యసంపుల్లము లయిన సుక్షేత్రముల యందుఁ బరోపకార పరిపాకము నందిన సంపన్న గృహస్థుల జీవితసాఫల్యము నాకాంక్షించును. సకలశాస్త్రవిజ్ఞానవిశాలములయిన ప్రకాశవాటికలయందు విస్మృతవిద్వజ్జనవిహారములు వీక్షించును. నిత్యసౌందర్యనిభృతము లయిన పూఁదోఁటలలో ఆంధ్రీమతల్లుల నిర్మలాభిజాత్యపరిమళమును బసిపట్టును. ఉద్రేకవ్యగ్రము లయిన యువజనవాటికలలో ఉత్సాహశక్తియోగము నుపలక్షించును.

సారస్వతపక్షమందుఁ గూడ భావకవికి దృష్టివైలక్షణ్య మున్నది. ఆతనికి ఆంధ్రవాఙ్మయమంతయు భావకవిత్వమే. నన్నయభట్టారకుఁడు వాగనుశాసనుఁడే కాక ఆంధ్రుల యౌవన్మహోదయమునకును స్థాపకాచార్యుఁడు. ఏలయన ఆంధ్రుల తేజోవిన్యాసము మగధసామ్రాజ్యమునాటినుండియు వెలిఁగినది. కాని అంతయు నదృష్టమై పోయినది. వేంగి దేశమందుఁ బుట్టిన పంపనివంటి మహాకవులు కన్నడములోఁ దమప్రతిభను దాఁచుకోవలసివచ్చెను. బౌద్ధులయిన ఆంధ్రు లెందఱో తమవిజ్ఞానదీపములను ఏ ప్రాకృతవిద్యాలయములలోనో వెలిఁగించియుందురు. ఈ జాతీయవిపత్తు నరికట్టిన దిట్ట నన్నయభట్టారకుఁడు. సంస్కృతమైనను ప్రాకృతమైనను మఱి యేదేశ్య మయినను తెనుఁగుదేవికిఁ బుట్టిన తెనుఁగువారికి ఇతరమే యగును. అందువలన భాగ్యవిధాత లాంధ్రులైనను అన్యదేశ్య కోశములందు సుబద్ధమైనందున నది ఇతరులసొత్తే అయినది. ఆంధ్రపండితులు ఆంధ్రభాష నాదరింపమియే యావిపత్తునకుఁ గారణము. ఆంధ్రులజాతీయ సౌభాగ్యమును నిలువరించుటకు ఆదియందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సువర్ణపు ఖజానా గట్టిన అక్షరరమ్యశిల్పి నన్నయభట్టారకుఁడు. సూక్ష్మముగాఁ బరిశీలించిన ఈ ప్రసన్నధారాజీవమె ఆంధ్రకవుల రచనలయందెల్ల ద్యోతమగును.

తిక్కన సోమయాజి దిద్దినద్రౌపది యందు ఆంధ్రసతీస్వరూపస్వభావములు పొడకట్టుచున్నవి. ఆతని రాయబారపుఘట్టములలో తాను స్వయముగా రాయభారియై తీర్చిన సంధిసంధానప్రతిభ లద్దములోవలె బింబించుచున్నవి. పోతనార్యుని మహాభాగవతప్రవాహములో ఆంధ్రుల మాధుర్యోపాసనాతరంగములు వినఁబడుచున్నవి. శ్రీనాథుని వాచారథముమీఁద ఆంధ్రులకళాప్రియకేతనము లెగురుచున్నవి. అల్లసాని పెద్దన యల్లికలలో తెనుఁగుతీఁగెల తీరుతీయములు పొంది పూచి పరిమళించుచున్నవి. పారిజాతాపహరణమందుఁ బ్రతిఫలించు సత్యభామ ఆంధ్రసుందరుల యభిమాన గర్వలక్ష్మిని బ్రదర్శించుచున్నది. స్వర్గలోకములోని పారిజాతమును శ్రీకృష్ణుఁడు సత్యభామదొడ్డిలో పాఁతినట్లే గీర్వాణ నందనములోని సాహిత్య-బదనికలను శ్రీకృష్ణరాయలు చిన్నమ్మదేవి కన్నెతెనుఁగుతోఁటలో నాటించెను. సూరనార్యుని కళాపూర్ణోదయము ఆంధ్రుల జాతీయ కళాపరిపూర్ణోదయమె కాని వేఱుకాదు. ఆభిజాత్యసాలంకారనిష్ఠమైన ఆంధ్రకవితా కామనీయకము తోఁటకాల్వలకు నీళ్లుద్రిప్పు సుగాత్రి సహజ సౌందర్యముగాఁ బరిపక్వ మయినది. ఇది దేశకాలానుగతమైన ఆంధ్రసాహిత్య పరిణామమే యని నా విజ్ఞప్తి.

విద్యానగరమందు విప్పారినవాఙ్మయము ఆనాఁటి ఆంధ్రుల సమస్తజీవిత వైభవమును నాగరకాభిరుచులను కన్నులకుఁ గట్టుచున్నది. లేకపోయినచో అందు ఉపలక్షితములగుచున్న ఒక క్రొత్తరికము, పడుచు గర్వము, రిరంస, రసికవిన్యాసము మొదలగు స్వతంత్రరేఖలు అంతవిలక్షణములుగ నుండియుండవు. ఇంతయేల, ఆంధ్రులకు 'సశరీర స్వర్గసుఖము సమకొనిన' మహోదయకాలమది. ఇఁకఁ గళాపూర్ణోదయ వాతావరణములోఁ దెనుఁగుమీఁటి ఉయ్యాలలూఁగు పడుచులు స్వర్గలోకసుందరులను గాలితోఁ దన్న కేమిచేయుదురు! ఈ యద్భుతదృశ్యమును ధ్వన్యంతరముగాఁ జిత్రించియుంచిన సూరనార్యునకు నమస్కారము.

వాఙ్మయమును భావకవి కేవలశబ్దవ్యాపారమునకే కాక భావసంగ్రహమునకుఁ గూడ సమానప్రపత్తితో నధ్యయనము సేయుచున్నాఁడు. ప్రయోగమునందును అదేదృష్టి నభ్యసించుచున్నాఁడు. భావకవి ఆస్తికుఁడు. ఆతనికి పురాణయుగములును, యుగచరిత్రములును విశ్వాసపాత్రము లయినట్లే వర్తమానయుగవిన్యాసముగూడ నతనికి వాస్తవప్రాయమె. ఇందతనికి మిథ్యామీమాంస లేదు. అందువలన తానున్న జీవితావరణమును యథావబోధముగా నన్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యించుకొని నిరూపించుకొనుచున్నాఁడు. నవ్యసభ్యతను సంపన్నము గావించుచున్న వివిధకళాకలాపమును సానుభూతితో సఖ్యము చేసికొనుచున్నాఁడు; దాని పరమార్థమును ధ్యానించుచున్నాఁడు; తత్సాహచర్యమును అర్ధోన్ముక్తకంఠముతోఁ బాడుచున్నాఁడు. యుగాంతరములనుండి యింతవఱకు రాశీభూతమై జీవించియున్న విజ్ఞానప్రమాణములతో ఆధునికనాగరకాదర్శములను బరిశీలించినప్పుడు అతనికిని గొన్ని సామ్యవైషమ్యములు ఎదురుపడుచున్నవి. ఇప్పట్టుల నతఁడు ఆర్యునివలె 'ఆత్మగతినే ప్రమాణముగా' నంగీకరించుచున్నాఁడు. వసంతమురాక కోకిలకంఠము గానమునకు శ్రుతికాదు. మేఘోదయముగాక నెమిలి నృత్యమునకై పులకితముకాదు. లేఁగ లేక పాడియావుపొదవున పాలు చేఁపవు. అట్లే అంతస్సున రసస్పందముగాక, కవితాదర్శనము కాదని భావకవి విశ్వాసము.

అందుచేత శబ్దప్రయోగమందును, రూపకల్పనయందునుగూడ నతఁడు ఆత్మపరతంత్రుఁడు కాక విధిలేదు. హృదయాకాశమందు విహరించు శబ్దవిహంగము ఈయనుభవవిన్యాసమునే పక్షచాలనమందును, స్వరకల్పనయందును బ్రదర్శించుచున్నది. ఈ సూత్రమునుబట్టియె భావకవి యక్షుని విలాపమందుఁ గాళిదాసకంఠరవమును వినుచున్నాఁడు. సంజయరాయబారమందు తిక్కనమంత్రి ప్రజ్ఞాపాటవమును పరిమాణించుచున్నాఁడు. ప్రవరాఖ్యుని జీవితప్రవృత్తియందు శిష్టరసికాకృతిని గుర్తించుచున్నాఁడు. శాలీనుని యానందనిరూపణమునందు సూరనార్యుని రసోపాసనావిధానమును ఉపలక్షించుచున్నాఁడు. ఇక నతనికి ఆంధ్రవాఙ్మయము భావకవితాప్రబంధము కాదా!

ఆర్యులారా, నా యనుభవమునుబట్టి భావకవి కావ్యాదర్శములను, దృష్టిభేదమును, జీవితసాధనమును, కళాప్రవృత్తిని, దిఙ్మాత్రముగా సూచించితిని. ఇందలి ఉక్తానుక్తదురుక్తములను బరామర్శించుటకు అభినవపండితులే యర్హులు. కాని ఒక్కమనవి: భావకవి నాస్తికుఁడుమాత్రముకాఁడు; భాషాసేవకుఁడుగాని, భాషాద్రోహికాఁడు. ఆద్యుఁడై, యనంతుఁడైన ఈశ్వరుఁ డొక్కఁడే అతనికిఁ బ్రభువు. సర్వసంపన్నమైన దేశ మొక్కటే ఆతనికి మాతృమూర్తి. అనశ్వరకల్యాణమయి యైన సరస్వతి యొక్కటే యాతని కుపాస్యదేవత. తన్మయుఁడై సంకీర్తనము చేయు కవిని బొగడినను తెగడినను ఒక్కటే.

అభినవవాఙ్మయమునందు అపభ్రంశమునే యన్వేషించు పండితులను విడువుఁడు. మార్పున కులికిపడు మహనీయుల నుపేక్షింపుఁడు. మార్పు జగల్లక్షణముగానే తోఁచుచున్నది. గృహనిర్మాణము మాఱినది. వేషములు మాఱినవి. పాకములు, రుచులు మాఱి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. నవరత్నఖచితము లగు రంగనాథస్వామి ఆభరణములు



౯. రంగనాయికాదేవి ఆభరణములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విశ్వభారతి (శాంతినికేతనము) చిత్రములు

(వి. ఆర్. చిత్ర.)



౧. ప్రధానాలయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవి. బుద్ధులు మాఱినవి. పఠనపాఠనవిధానములు మాఱినవి. జీవితాశయములు మాఱినవి. ఇఁక సాహిత్యము మాఱకుండునా? మాఱకుండఁగలదా?

వాఙ్మయమునందుఁ దారతమ్యచర్చ తేలని ప్రశ్న. కాళిదాసమహాకవి వాఙ్మయము సర్వాంగసుందరముగ నున్నది. దాని నతిక్రమించినరచన యింతవఱకును రాలేదు. కాని మిగిలినకవులు మానివేసిరా? అస్తమించిన సూర్యచంద్రులు తిరిగి ఉదయించుచునే యున్నారు. విడిచినరాసులలోనికి నక్షత్రములు తిరిగి వచ్చుచునేయున్నవి. ఏయేటి కాయేడు తొలకరించుచునేయున్నది. ఎండిన తటాకములు మరల నిండుచునేయున్నవి. ఏళ్లలోని ప్రాతనీరు వెళ్లగా క్రొత్తనీరు తటాయించుచున్నది. క్రొత్తబియ్యములో తీపి యెక్కువ. జున్నుపాలలో జిడ్డు లెస్స. క్రొత్తావకాయలో రుచికాంతులు ప్రాతదానిలో లేవు. కావున క్రొత్తయే లేదనుట ఉత్త వితండవాదము.

తెనుఁగుతోటలో నిపు డొక క్రొత్త పూత పూచుచున్నది. దాని కింత యలజడి యేల? సజీవ వనస్పతులు ఋతువు రాగానే పల్లవింపక మానవు. అట్లే సజీవసాహిత్యములును.

ఇది యొక ప్రబలమైన ప్రఘూర్ణనసమయము. దేశకాలపాత్ర పరిజ్ఞానము అపారముగా విస్తరించినది. అన్యదేశజనసంపర్కమధిక మైనది. భిన్నభాషా నాగరకములకు సంగమస్థానములు పెక్కులైనవి. అనేక విజ్ఞానవికాసములకు అన్యోన్యసాహచర్యము కుదిరినది. దేశాంతరవస్తుదర్శనమునకు వాణిజ్యము రహదారులు వేసినది. ఈ సంఘర్షణమందు పాదులు కదులును; రంగులుమారును. ఈ మార్పే భావకవనమందలి స్వరభేదమునకుఁ గారణము; రూపకల్పనకు లక్ష్యము; రచనకు రీతి.

ఆప్తులైన కవిసోదరుల కొకవిజ్ఞప్తి. జీవితము క్లిష్టసమస్యలలో నుక్కిరి బిక్కిరి యగుచున్నది. శాస్త్రవిజ్ఞానముమానవముఖలాలస కెంత యుపకరించెనో దుఃఖబీభత్సమునకును అంతకంటె నధికముగా సహకరించినది. జాతులు అర్థదూషితము లైనవి. ఆత్మవిలాసము పరత్రాసమునకు తావిచ్చినది. మతములు మాత్సర్యమునకు మార్గములు తీసినవి. ధర్మసూత్రములు ధనసంచయరభసమునందు తెగిపోయినవి. బుద్ధికౌశల్యములను యంత్రము లాపోశనముపట్టినవి. ఈ మహాకల్లోలమందు, ఈ విభ్రాంతిలో చైతన్యదీప మాఱిపోకుండ నిలుపవలెను; కర్మయోగము కూలిపోకుండ కాపాడవలెను; విజ్ఞానవీణాతంత్రులు తెగనీయక రక్షింపవలెను. ప్రాణులను పాంచాలికలగా మాఱనీకుఁడు. ఈమహత్కార్యోద్ధరణము ఆనందోపాసనవలననే సాధ్యము. మీరు ఆనందద్రష్టలు. సౌందర్యమన్నను, రసమన్నను, ఆనంద



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మన్నను మనకు ఏకావరణ జన్యములే. మీరు ఆనందగీతమునే పాడుఁడు. ఆనంద సూత్రములనే అల్లుఁడు. ఆనందమూర్తినే చిత్రింపుఁడు. స్వచ్ఛందముగా పాడుఁడు. సుఖముగా నల్లుఁడు. సర్వతోముఖముగా చిత్రింపుఁడు.

---

## ఊహాగానము

శేషాద్రి రమణకవులు

చుక్కలేయున్న మింటికి రివ్వుమనుచు
నెగిరి జలదవిమానంబునెక్కి మృదుల
పవనమున సేదదేరి దిక్పటల మరయ
నుభయసంధ్యావసరముల నభిమతంబు
దీఱ విహరింపనే మాతృదేశమందు.

తుంగభద్రాతరంగవాతూలహతికి
విలయగీతిక శ్రుతిచేయు విజయనగర
దైన్యగతి జూచి లోన సంతాపపడెద.
గౌతమీతీరకాంతారగణమునందు
మాయమైచన్న వేంగిసామ్రాజ్యచిహ్న
లరసి కన్నీరునింపుదు నహరహంబు.
కాలగర్భాంతరితమైన కాకతీయ
రాజపదపద్మచిహ్నితారామములను
బాష్పదుగ్ధంబుతోడఁ దర్పణము లిడెద.
రెడ్డిఱేఁడుల నెత్తుటిజిడ్డు గార
కొనుటచే నెఱ్ఱవారిన కొండవీటి
దుర్గశిఖరంబులందు సంతోషబాష్ప
వారి జడిగొనఁ బాడెదఁ బ్రళయగీతి.
ఆంధ్రతత్త్వంబు నరయుటకై ప్రసన్న
కృష్ణవేణీతరంగరోచిష్ణునీర
బిందుసంసిక్తసానువై పెంపుఁగనిన
శ్రీగిరి ప్రదక్షిణం బొనర్చెదను దొలుత.

పిదప నాగార్జునతపస్వి సదయదృష్టి
కాస్పదంబైన ధరణీధరాంతికమునఁ
గానఁబడుచున్న బౌద్ధవిగ్రహకదంబ
మరసి సంతోషమందుదు ననుపదంబు.

తీరికనుబట్టి యమరావతీపురస్థ
బౌద్ధనిర్మాణకలిత భూభాగమందు
నడఁగి యంతస్థవహ్నిచే నుడుకుచున్న
చిత్రవిగ్రహములచెంతఁ జేరి కొంత
తడవు విలపించి కన్నీటిజడి నొనర్తు
శిథిలవిగ్రహముల కభిషేచనంబు.

అంతతోఁ దృప్తికాదేని యాంధ్రనగర
పావనక్షోణిలో నణుభాగమగుచు
నడఁగియుండెద; సుడిగాలి కవనిఁ దొరఁగి
మింటి కెగరెద; మాతృభూమికిఁ బ్రదక్షి
ణం బొనర్చెద... ... ... ... ... ... ...
... ... ... ... ...తదనంతరంబు నేను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సంగీతపరిషత్తు, చెన్నపురి-ఏడవసమావేశము

## ప్రారంభోపన్యాసము

సర్ సి. వి. రామన్ మహాశయుడు

నేడు మనలను దారసిలు గొప్పవింతలలో సంగీతమునకు మనపయినిగల స్వాధీనత యొకటి యెన్నదగియున్నది. నా మొదటిప్రేయసితోడ నే తగులమి గల దనునింద నాకు గలదు. కాని ఆ వట్టివాదును నే నంగీకరింపను. నా కిరువురు ప్రియురాండ్రు గలరు—కాంతి, ధ్వని. నేను వారి నిరువురను సమానముగ ప్రేమింతును. జీవితము సామాన్యముగ చప్పనిది; అభిరుచి కలిగించునది కాదు. కాని ప్రకృతి మనకొరకు కొన్ని వ్యావృత్తులను గల్పించుచున్నది. వానిలో రాగము, (వన్నె), శబ్దమును మున్ముందు పొడగట్టునవి. వన్నె విషయ మిప్పుడు మనము విపులముచేయ నక్కరలేదు. మీదృక్కుల నటుసారించుడు. వన్నెకు మానవజీవితమున గల పలుకుపడి మీకు దృగ్గోచరము కాగలదు. (నవ్వు)



సర్ సి. వి. రామన్ మహాశయుడు

జీవితము,తనవైశాల్యమును వెల్లడింప వన్నె నొకసాధనముగ గ్రహించుననునది ప్రకృతితత్త్వవేత్త కెఱుక. చెట్లపూలు చూడుడు! ఆకుచిల్కల నాలోకింపుడు! పక్షుల గాఢనైల్యమును పరీక్షింపుడు! మానవుడు మొదలుగాగల యీజంతుజాలముల లేవన్నెల తిలకింపుడు! జీవనమహాకార్యముల నిర్వహింపవలసివచ్చినప్పుడే ప్రకృతి తనయలంకరణముల నీచిత్రప్రజ్ఞను చూపించును. ఇట్లే జీవితపు హెచ్చుతగ్గులుకూడ నాకు గీతరూపమున సువ్యక్తములు కావలెను.

బెంగుళూరులో నాయింటివద్ద, ప్రత్యూషస్సునందును, తమ జీవితానందము నొక్కుమ్మడి గానము సేయు వేనవేలుపక్షుల మధురధ్వనులే నన్ను మేల్కొలుపుచుండును. అవి యుదయించు సూర్యభగవానునకు స్వాగతమొసగును. మరియు కూర్కుచున్న పదార్థవిజ్ఞానవేత్తను మేల్కొలుపును. ఇట్లగును.

### ఆవేగశిక్ష

మనము జీవులము. పక్షు లెట్లు తమగానమును మానజాలవో, అట్లే మనము గీతానుభవాకాంక్ష నతిక్రమింపజాలము. స్వేచ్ఛగ వెడలవిడుచు హృదయావేగమున కాదు, ఆయావేగపరంపరలశిక్షించుటయందు-కళావైభవపు ప్రత్యక్షానందము గలదు. ఏవో అయిదారువన్నెల నేపటముననో నేను స్వేచ్ఛగ, చిందరవందరగ పూయుదునేని అది చిత్రరచన కాజాలదు. ఇట్టిదియు చిత్రరచనయే యని సిద్ధాంతముచేయు సంస్థయు నొకటి గలదని వినుచున్నాను. కాని మనలో బహుళసంఖ్యాకులము, కళకు శిక్ష యావశ్యక మని నమ్మికొన్నవారమే. ఒక గొప్పకళాశిల్పమును రచింపవలె నన్న స్వాధీనమయి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీర్చిదిద్దిన యూహాప్రవాహ మవసరము. మరియు ఊహకంటెను మిన్నయగు ప్రతిభాసంపత్తి కావలయును. సంగీతమునగూడ నిట్లే. ఉద్రిక్తము లయిన హృదయములనుండి కట్టుబాటెరుగక వెడలు కేకలు, హాకలు జీవితవైశాల్యమును వెల్లడింపజాలవు. అట్టి సంగీతమునకే మన మలవాటుపడియున్నాము. సంగీతమునది, తొలుతవశపరచికొని, పిమ్మట దిద్దినమార్గమున వెడలనిడచు నాద మనవలెను. ఆనందము, ఊహాప్రవాహము, శిక్షాక్రమము, అన్నిటికిమిన్నయైన ప్రతిభాసంపదయు కలసి కళయగుచున్నవి.

స్త్రీ పురుషులపయి సంగీతమున కీస్వాధీనత యెట్లుగలుగుచున్నదో నిర్వచించుసమర్థత శాస్త్రమున కింకను అలవడలేదని, శాస్త్రపరిచయముగల వాడనగుటచే చెప్పుచున్నాను. మనలోనినరములను నాళములను కదలించి మనల నెట్లీసంగీతము గిలిగింతపెట్టుచున్నదో చెప్పుటకే యాధారమును శాస్త్రమున లేదు. అది జీవిత విచిత్రములలో నొకటిగ నిలిచినది. కాని యీమహా విచిత్రవిధానముల కొన్నిటినయిన నిర్ధారింప శాస్త్రము సప్రయత్నముగ తోడ్పడగలదు. గొప్పగొప్పశాస్త్రజ్ఞులకు వారివారిప్రయత్నముల నుత్సాహమొసంగి తోడ్పడిన వీరాగ (వన్నె) గీతములే యనుట సత్యము. శాస్త్రముగాని, శాస్త్రజిజ్ఞాసగాని కేవలము తెలివితేటలవలననే కలుగు ననుకొనుట పొరపాటు. సహజోత్సాహమును, శాస్త్రసంబంధమైన యుత్సాహమును వేర్వేర నిర్వచించుట చాలకష్టమని ఈవర కెన్ని సారులో చెప్పితిని.

ఇంతవరకు జేసిన శాస్త్రజిజ్ఞాసాఫలితము లనేకములకు ఈరాగగీతములే మూలములయినవి. పందొమ్మిదవశతాబ్దిలోనివాడను హెర్మన్ వాన్ హెల్మల్ట్సు అను గొప్పప్రతిభావంతుని పేరు మీలో చాలమంది విని యుందురు. ఆయనప్రతిభాసంపత్తిని చాటుచు నాతడు రచించిన "దృగ్విధానము" "శాబ్దికస్పర్శానిరూపణము" అను రెం డుత్కృష్టగ్రంథములు నేటికిని కదలని కట్టడములై నిలచియున్నవి. ఆతడు పూనుకొనినకార్యము, సంగీతవిధానమున సామాన్యలక్షణములందు ముఖ్యమయినవానిని శారీరకముగ నన్వయించి తెలిసికొని నిర్ణయించుట. హెల్మల్ట్సు, రెలే మున్నగు నాకొలదిమందిప్రముఖులవెనుక నీశబ్దశాస్త్రము కొంత కాలగ్రస్తమయినది.

అణువు, రేణువు, కణము మున్నగు వస్తునిర్మాణ విజ్ఞానసాధనములవంక శాస్త్రవేత్తల దృక్కులు మరలుటవలన ఈశబ్దవిషయకజిజ్ఞాస పెడత్రోవంబడినది. ౧౯-౨౧-వ సంవత్సరమున నాకు నేనే వేరొకశాస్త్రజిజ్ఞాసంబడిన నెక్కుడులాభకరమని యెంచి ఈవిషయమును విడచిపెట్టితిని. అయినను వెనుకటిపదిసంవత్సరములలోను ప్రపంచమందంతటను గానవిద్యావ్యాసంగము గొప్పపునరావృత్తిని బడసినది. వింతగనుండును గాని, దీనికి కారణము సంగ్రామసన్నాహమున బడిన యూహాపరతంత్రతయే. అప్పుడు శాస్త్రవేత్తలు తుపాకులచప్పుడును విభజించి క్రోడీకరింపవలసివచ్చినది. అప్పుడది శబ్దవిషయకజిజ్ఞాసను రగుల్కొల్పినది. ఈ నవీనాసక్తియే రేడియో, వైర్లెస్ మున్నగువానిని కనిపెట్టుట కవకాశమొసంగినది. అప్పు డీశబ్దవిషయక శాస్త్రమునకు నూత్నజీవితపరిమాణము గలిగినది. ఇందులకు కారణములో ముఖ్యమయినది (హిందూదేశమున నంతగకాకున్నను) ఇతరదేశములందన్నిటను ప్రజామోదమును బడసి ప్రబలిన (ఆకసమున లీనమయిపోవు దూరశబ్దమును వినిపించు) రేడియోసాధనము. మరియును శబ్దనిరూపణాగారనిర్మాణముగూడ దీనికి కారణమయినది.

ఎన్నిలోపము లాపాదించినను, వెనుకాడక, నిందితమయ్యును నిలచి ముందుకువచ్చి దూరస్థులయిన సంగీతవిద్వాంసులయొక్కయు, సంస్థలయొక్కయు సంగీతమాధుర్యమును, చాకచక్యమును (సంపూర్ణముగ కాకున్నను మేనమామపోలికగనయిన) మనకు వినిపించు గ్రామఫోనుయంత్రము నానాట జనామోదమునుబడయుచున్నది. అది సహజవాణికి దగినప్రతి కాదని నేనెఱుగుదును. నే నొప్పుకొనుచున్నాను (చప్పటులు). ఈవిష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమున మనకు నూతనాసక్తి గలుగుచున్నది. మరియు, దీనికిని మానవునకును శారీరకముగ, మానసికముగగూడ గల సంబంధవిశేషమును నిర్ణయించు శాస్త్రజిజ్ఞాసవిషయమున నిప్పుడిప్పుడు మరియు గట్టి యాసక్తి గలుగుచున్నదని చెప్పమరచితిని.

### చిక్కు సమస్య

హిందూదేశములోని మనము ఈ సంగీతమునకు "నాదబ్రహ్మ"మను పేర (శబ్దదేవత) దేవత్వ మొసంగి మతసంబంధమును గలిగించినారము. దాని యౌచితిని నేనిచట తర్కించనుగాని, సంగీతమున కంతటి వశీకరణసత్వమున్నదనియు, ఆసత్వనిర్వచనమను ఘనసమస్య యొండు మనముందు గలదనుటయు నిర్వివాదాంశములు. గాలితరగలు మనలను తాకి మన యంతర్నాళములను కదలించునని సులభముగ చెప్పవచ్చును. కాని అన్నికదలికలును నానందదాయకములు కావుగద—వానిలో గొన్నిటి నేదో సౌందర్యము, ఏదోసున్నితము, ఏదో వింత గలదు. శారీరకనిర్మాణమునకంటె స్పార్శికవిధానమున విశేషశక్తి గలదని హెల్మ్‌హోల్ట్జుమున్నగువారి యభిప్రాయము. రెండుమూడురంగుల నొకటిగా కలిపినప్పుడు వానికలయికయందలి విధానమును కొందరు నిరూపింపజాలరు. కాని, చెవిమాత్ర మట్లుగాక, కలసి ప్రవహించు, అయిదు, పది, లేక యిరువది శబ్దభేదములనుగూడ నొకదానినుండి యొకదానిని వేరుపఱచి వివరింపగలదు. నేర్పరియైన ధ్వనివేత్త ఒకేశబ్దమును విభజించి, అందు పండ్రెండుకంటె నెక్కువగ స్వరములను విభజించి చూపగలడు. ఈ యద్భుతశక్తికి కారణముగ శ్రవణనాళనిర్మాణమున నిందుల కనువయి రవమును ప్రతిశబ్దించుజవ మున్నదనిగాని, లేదా, చెవిలో ప్రతిశబ్దించు చిన్నయంత్రసాధన మున్నదనిగాని మనము సామాన్యముగ చెప్పికొనవచ్చును. కాని ఇట్టి నిర్వచనము ఆసమస్య వెలియించునుదట్టు కబురే. పిమ్మట నేమగును? ఇట్లుత్పన్నమయిన నాళచలనము ఎట్లు ప్రచారముచేయును? అది శారీరకనిర్మాణమున ముఖ్యస్థానము నెట్లు చేరును? దానివలన మన కానంద మెట్లుగలుగును? శ్రోత దీని నెప్పుడు గుర్తింపగలుగుమన్నాడు! వట్టిశారీరకమైన యుద్రిక్తతకును, గానమువలన గలుగు గంభీరాంతర్నాళికాసంచలనముల సందడులకును చాలవ్యత్యాసము గలదు. ఇక్కడ మనము తెలిసికొనవలసిన శారీరకమానసిక ప్రకృతితత్త్వసమస్య యొకటిగలదు. కడచిన కొలదిసంవత్సరములలోను, వస్తునిర్మాణకారణమయిన యణుతత్త్వమును కనిపెట్ట నుపయోగించిన సాధనములవలననే క్రొత్తమార్గముల క్రొత్తవింతలను కనిపెట్ట నగుచున్నది. బహుశః అనతికాలములోనే, శారీరకశక్తులను మనము పూర్తిగ కనిపెట్టగలభాగ్యము మనకు లభింపవచ్చును. ౨౦, ౨౧-వ శతాబ్దులలోగూడ సంగీతాత్మ, సంగీతతత్త్వము, సంగీతసహజత్వమును గూడ నింకను వెనుకబడియేయున్నవి.

### నిగూఢప్రతిభా సంపత్తి

సంగీతనిగూఢనిర్మాణములను తునాతునకలుగ విభజింపగలుగునా డయినను మనముమాత్రము గానమాధుర్యము ననుభవించి మెచ్చికొనుచునేయుందుము గాక! సామాన్యునకు శుష్కమయి అభిరుచిగలిగింపని వస్తుతత్త్వవిభాగమునకంటె సమ్మేళనమున నెక్కుడు సౌఖ్యము గలదు. దీనివిషయము, హెల్మ్‌హోల్ట్జు తన గ్రంథమున కడపటియధ్యాయమున తెల్లముగ చెప్పియున్నాడు.

ఆతడు సమర్థుడగుట, చేయబూనిన కార్యము యొక్కపరిణతికి లొంగిపోలేదు సరిగదా, ఇతరులకంటె తానెక్కుడుగ మార్గదర్శియై నిలచినాడు. అట్లయ్యును తానుచెప్పనదిగూడ నీసమస్యను మునువ్రేల దాకి విడచుటయే యని యాతడుగ్రహించెను. ఇందలి విశేష మొకటి గలదు. ఈగొప్పగొప్పశిల్పములన్నియు ప్రతిభావంతులే యొనర్పవలెనని తెలిసికొనవలెను. గ్రామఫోనుచేయి త్రిప్పి త్యాగరాజును ప్రత్యక్షునిగ చేయగలరా? అది యింకను మానవశక్తిని మించినకార్యమే. ప్రతిభ యెక్కడనున్నను అనిర్వచనీయమే. ప్రతిభావంతు డెచట ప్రభవించునో మనము కనిపెట్టగలమా? ఉత్కృష్టములయిన చిత్రములను శిల్పములను చూచియు, ఉన్నతము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లయిన గీతరచనలను వినియు, సామాన్యవస్తుసంపద నుండియే గొప్పసృష్టి చేయగల, దైవప్రసాదితమయిన ప్రతిభగలవానిని మనము తెలిసికొనవలయును. ప్రతిభా సంపత్సమస్యను విడదీసినగాని మనము సంగీతతత్త్వ సమస్యను విడదీయలేము. ఏలనన, ఇవిరెండు నొండొకటిని సృష్టించుకొనుచున్నవి. గాయకున కంఠముఖ్యమయినది కాకపోయినను, ఇంతేదనుక నాకభిరుచి మెండుగ గలిగించిన దింకొకయంశము గలదు. అది గానయంత్రములవిషయము. ఈయంశమునుగూర్చి యొక వ్యాసమును వ్రాసి పదార్థవిజ్ఞానసర్వస్వమున కొసంగిన గౌరవమునుగూడ నేనందితిని. అందులో మనహైందవ గానయంత్రముల కొన్నిటి శాస్త్రీయనిర్మాణమును, సౌమ్యతను గూడ చూపింపగలిగితిని. అందులకు నేను సంతసించుచున్నాను. మృదంగమును చూడుడు. అది అద్భుతశబ్దసాధన నిర్మాణము. అసాధ్యముగ గోచరించు నపస్వరజాలముతో కలపి యది వీణవలెను, వేణువువలెను, ఆరోహణస్వరసౌమ్యత నొడగూర్పగలదు. ఈ మూడును గొప్ప గానయంత్రములుగ పరిగణింపబడు చున్నవి. ఏలనన మృదంగమున నపస్వరములు, సవ్యస్వరములును కలయుచున్నవి.

కేవలశాస్త్రజ్ఞునకును, గాయకునకును సామాన్యలక్షణములు కొన్ని గలవు. అందరు కళావేత్తలును అందు ముఖ్యముగ గాయకులు, తమకళకు లొంగిపోవుదురు. అనగా పరవశులయి కళలో కలసిపోవుదురు. శాస్త్రజ్ఞుడు ఏకార్యమునందయినను, అది అత్యల్పముగ నితరులకు గోచరించినను, అతనికిమాత్రము కాలముతోగాని, కష్టముతోగాని నిమిత్తము లేకుండ దానిని నిర్వర్తింపవలసినయావశ్యకత గోచరించును. అదియే సృష్ట్యాత్మ. అదియె ప్రసృష్టసహజజ్ఞానము.

## దాక్షిణాత్యగాయకుల కభినందనము

వెనుక చాలకాలము, గానకళ, గాయకులు కూడను సాంఘికముగ వెనుకబడియుండిరి. గాయకులును, గానయంత్రకళానిపుణులునుగూడ దాసులవలె కనబడుచుండిరి. ఇంకను క్రిందయిపోయిరి. ఇట్లు నారు వెనుకబడుటచే గౌరవవంతు లనుకొను స్త్రీపురుషు లెవ్వరును గానకళాభ్యాసమును చేయనొల్లరైరి. కాని అదృష్టవశమున దాక్షిణాత్యు లీవిషయమున నిప్పుడు కాస్త నయముగ నున్నారు. ఇందులకు బహుశః, మహావైద్యనాథఅయ్యరు, శరభశాస్త్రి మున్నగు గాయకశిఖామణుల స్వార్థరహితగానాభిమానమే కారణమయి యుండును. వీరు, పేదరికమునుగాని, నిరుత్సాహకరములగు పరిస్థితులనుగాని పరిగణింపక తలయెత్తి తమకళను, ప్రేమింపదగినదానిగ, మెచ్చికొనదగినదానిగ, అంతేకాక గౌరవనీయమయినదానిగ నొనర్పగలిగిన ధీరులు. ఈగానసంస్థ గానౌన్నత్యమును వెల్లడించి గాయకులకు తగినస్థానమును సాంఘికముగ నిరూపింపగలుగునేని అది కడుంగడు శ్లాఘనీయము. అదియే చాలును. గానము మానవుని జీవశక్తులలో నొకటియని, అది తమజీవితముల నుద్ధరించుసాధనములలో నొకటియని, అది హృదయనాళముల ప్రేమతో గదలించి జీవితపుటొంటరితనమునుండి పైకెత్తి దైవసామీప్యమును చూపగలదని హైందవులు తెలిసికొనినగాని గానమున కుచితస్థాన మేర్పడదు. గానమును, గాయకులును గూడ తమగౌరవమునకు పాత్రులని వారెఱుంగవలయును. ఈ సంస్థ ఈకళను క్రమపద్ధతుల నడపించుచు సంగీతము నేర్చికొన ననువగుగ్రంథముల ప్రచురించుచు, ఇంక ననేకమార్గముల దీనికి సాయపడుచున్నది. ఈసంస్థచేసిన కార్యములు వారీవిషయమున నొసంగిన చేయూతను ప్రస్ఫుటము చేయుచున్నవి. ఏఁటేట సమావేశమగుచు నీసంస్థ గానసువార్తను ప్రజలకు సువ్యక్తముచేయుచున్నది. దీర్ఘకాల మీసంస్థ ఇట్టియుపకృతుల జేయుచుండునుగాక!

హైందవగానమునట్లే రష్యా, ఇటలీ, ఐరోపా గానములనుగూడ నేను మెచ్చికొన నేర్చినాడను. అట్టులని యాక్రొత్తమెప్పులు నాకుగల దాక్షిణాత్యగానాభిమానమును త్రోసివేయునవి కావు. నిస్సంశయముగ వివిధరసగ్రహణాసక్తియే బ్రతుకుపసందు. ఇతరుల ప్రజ్ఞలను మనము లక్షింపనినాడు మనప్రజ్ఞల నితరులు గుర్తింపలేదని మన మనలేము. ఐరోపాగానమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనము మెచ్చికొనవప్పుడు ఐరోపావారు మనగానమును అవ్యక్తశబ్దజాలముల గడబిడయనిన మనము నొచ్చికొనగూడదు. ఇది యొక్క గానవిషయముననే కాదు-జీవితవిధానమున నన్ని విషయములను ఇతరుల నుండి మనము గ్రహింప సిద్ధపడవలెను. అందు తగినవాని నన్వయించికొని, మానవజీవితమున కనువుగాని తదితరమును పరిత్యజింపవలెను. గానవిషయమున మనము పాశ్చాత్యావేగములను నేర్చుకొనవలెను. వానిని మనము నిరసింపరాదు. ఇతరత్రగూడ నిట్లే మనము విశాల హృదయములలో నితరులలోని మంచిని మెచ్చికొనవలెను.

## అభివృద్ధ్యావశ్యకత

గొప్పదినములు మనకు గడచినవి. మనగానయంత్రములలో ననేకములు ప్రాచ్యదేశములబుట్టినవే. అయినను ౧౮-వ శతాబ్దిలో ఇటలీనుండివచ్చిన ఫిడేలును సగౌరవముగ [illegible] మనము వెనుదీయలేదు. ప్రాతపద్ధతులలో సంతుష్టిపొంది మన మూరకొనగూడదు. ఐరోపాదేశపు "ఫిడేలు" విద్యావంతుల నుండి నేర్చుకొనవలసిన విద్యావిశేషము గలదు. ప్రాతపునాదులమీద మనము క్రొత్తవిద్యను నిర్మింపవలెను. అదియే మానవస్వభావతత్త్వము. అదియే అభివృద్ధికరమును. మన మభివృద్ధి నందవలెను, లేదా అడగిపోవలెను. మనముకాలానుగాములముకాక నిలుతుమేని మనకున్న విద్యకూడ నశించును. అభివృద్ధివలననే మనకున్నదానిని నిలువరించికొనగలము. ఈసంస్థకు నేను చెప్పువార్త యిదియే.

తమ్ముతెలియక, ఎవ్వ రేమనుకొన్నను లక్షింపక పరిశ్రమాభిమానముగలిగి పనిచేయువా రరుదు. ఈ పరిషత్తు అధిపతి చేయుచున్న మహాప్రయత్నములను మనము గుర్తింపవలెను. హైందవవిద్యాసౌభాగ్యమును గొప్పచైతన్యముతో పునరుద్ధరింప సర్వశక్తులధారవోయు నీపరిషత్తును చెన్నరాజ్యము గుర్తింపకుండ జాలదు.

---

# మన యాహారము, ౩—సవరణలు

| పుట. | కలము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౧౦౭ | — | 6 | 19.64 | 10.64 |
| ,, | 1 | 12 | సమీకరణమనుటనుబట్టి | సమీకరణమగు శక్తినిబట్టి |
| ౧౦౯ | 1 | 16 | 282% | .282% |
| ,, | 1 | 17 | 376% | .376% |
| ,, | 2 | 6 | అదనము | అధమము |
| ,, | — | 34 | Caped | Red |
| ౧౧౦ | కడపటిపంక్తి | | Relation | Relationship |
| ౧౧౧ | 1 | 11 | చేబియ్యా | ఉప్పుడుబియ్యా |
| ౧౧౨ | 1 | 12 | $1\frac{1}{2}$ ఔన్సుల | 12 ఔన్సుల |


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శరదాగమము

ఉభయభాషాప్రవీణ, వారణాసి లక్ష్మీనారాయణ

పడమటికొండనుండి వడి బ్రాగ్గిరిచెంతకు నిత్య మెన్నియో
తడవలు యాత్రసల్పుట దదంతరమందు లభించు దిగ్వధూ
కలితరహఃప్రచారముల గ్రాలుట నీరసమొంది వెల్లనై
సుడివడి నిల్కడంగనక సోలెడుమేఘు డనేకభంగులన్.

కమ్మనితెమ్మెరల్ విసరగాదొడగె న్నలుదిక్కులందు జుం
జుమ్మని తేనెటీగలు ప్రసూనరసంబుల గూర్పజొచ్చె స్వ
చ్ఛమ్మగు చంద్రికాకలితస్వైరవిహారముల న్వధూవరుల్
సమ్మతిసౌఖ్యముల్ గనగ శారదరాత్రులు వచ్చె జెచ్చెరన్.

వానలు తగ్గిపోవ వరిపైరులు పచ్చనికంకు లీని పై
పైని సువర్ణకాంతులను భాసిలి కల్గినవార లిట్టు ల
త్యానతశీర్షులై మనుట ధర్మవటంచును బోధసల్పుచం
దాన శిరంబులెల్ల వినతంబులుగా విలసిల్లె ధారుణిన్.

పండినచేల మంచెలను భాసిలు కర్షకబాలబాలికా
మండలి నైజగీతముల మైకొని స్వాగత మిచ్చుచుండ మా
ర్తాండుడు గొంత శాంతిగన ధారుణి సస్యఫలప్రపూర్ణమై
యుండ శరద్వధూమణి సమున్నతిళ్లో జనుదెంచె వేడుకన్.

కూలంబులను దాకి ఘోషంబులను బెట్టి ప్రవహించునదులు స్వల్పంబు లయ్యె
పురివిచ్చి నెఱియాడి ముఱియు మయూరముల్ ముదమిాగి తోకలు ముడిచికొనియె
గాఢాంధకారసంకాశమేఘము లెల్ల తెల్లనిముక్కలై తిరుగజొచ్చె
ఘనగర్జితములతో గ్రాలుసౌదామినుల్ క్షణభంగురంబులై సమసిపోయె
దెసలు తెలుపయ్యె దెమ్మెరల్ తేలికయ్యె - సర్వజనచిత్తములతో దివి స్వచ్ఛమయ్యె
శశికి నక్షత్రములకు తేజంబు హెచ్చె - నవని శరదాగమంబగునవసరమున.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రావణమాసము
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# డిక్టేటర్ ముసోలినీ

నార్ల వెంకటేశ్వరరావు

ఫ్రెంచివిప్లవము ప్రజాస్వామిక సిద్ధాంతము (Democracy)నకు దోహదమొసగెను. ఆవిప్లవానంతరమే స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాత్రము (Liberty, Equality and Fraternity) అను మహాదాదర్శములు ప్రాబల్యములోనికి వచ్చెను. అప్పుడే సింహాసనములు పెల్లగిలెను; కిరీటములు నేలవ్రాలెను. రాజవంశములు రూపుమాసెను. అప్పుడే ప్రజలచే ప్రజలకొరకు నిర్వహింపబడు ప్రజాప్రభుత్వములు (The Governments of the People, for the People, by the People) నెలకొనెను.

ఇట్లు ఫ్రెంచివిప్లవముతో ప్రాబల్యములోనికి వచ్చిన ప్రజాస్వామికసిద్ధాంతమునకు జర్మనీయుద్ధానంతరము పెద్దదెబ్బ తగిలెను. ఆమహాసంగ్రామము ముగిసినంతనే "ప్రజాస్వామికసిద్ధాంతము నిష్ప్రయోజనము."(Democracy is a failure) అను ఘోష బయలుదేరెను. వెంటనే పెక్కుదేశములందు ప్రజాస్వామికప్రభుత్వములు రూపుమాసి, "డిక్టేటరుషిప్పులు"(Dictatorships)తలలెత్తెను. ఇట్టిదేశములలో రష్యా, ఇటలీ, టర్కీ మున్నగునవి ప్రధానములు. మొన్న మొన్ననే జర్మనీలో సహితము నాజీ "డిక్టేటరుషిప్పు" నెలకొల్పబడినది.

నేడు రష్యాకు స్టాలిను, ఇటలీకి ముసోలినీ, టర్కీకి కెమల్ పాషా, జర్మనీకి హిట్లరు డిక్టేటర్లుగా నున్నారు. వీ రందరిలోను ముసోలినీ అగ్రగణ్యుడని చెప్పవచ్చును. అందుచే నతని జీవితచరిత్రను మనమందరమును ముఖ్యముగ తెలిసికొనవలసి యున్నది.

డొవియా అనుగ్రామమున ౧౮౮౩-వ సం. జులై, ౨౯-వ తేదీని అలెగ్జాండరు రోజామాల్టొనీల గర్భమున ముసోలినీ జననమందెను. అలెగ్జాండరు కమ్మరి. రోజామాల్టొని ఉపాధ్యాయిని. ముసోలినీవెనుక వారికి మరొకకొడుకును, కుమార్తెయు కలిగిరి. ఆకొడుకుపేరు ఆర్నాల్డో. కుమార్తెపేరు ఎడ్విజి.

అలెగ్జాండరు నిరక్షరకుక్షి. ౧౬-వ యేటివరకత డొకకమ్మరివద్ద పనిచేసెను. తదుపరి డొవియాలో స్వంతముగ కొలిమిని పెట్టుకొనెను. సాంఘికవాద (Socialism) మనిన అతనికి ప్రేమ. సాంఘికవాద ప్రచారములో నతడొకసారి కొన్ని మాసములపాటు కారాగారవాసము సహిత మనుభవించెను. శిశుకాలము పూర్తియైన క్రొత్తలోనే అతడు రోజామాల్టొనీని పరిణయమాడెను. సాంఘికవాద ప్రచారములో నలెగ్జాండరు మొదట క్లేశముల ననుభవింపవలసివచ్చినను, తదుపరి అతనికి గౌరవము లభించెను. స్థానిక సాంఘికవాదులు ప్రాబల్యములోనికివచ్చినప్పు డతడు కొంతకాలము ప్రెసిడెంటుగా పి యో



అలెగ్జాండరు
(ముసోలినీ తండ్రి)



రోజామాల్టొనీ (ముసోలినీతల్లి)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురపాలకసంఘసభ్యుఁడుగ పనిచేసెను. తదుపరి మఱి కొంతకాలము ఆసంఘమున కధ్యక్షపదవినిఁగూడ నలంకరించెను. అలెగ్జాండరు దయార్ద్రహృదయుఁడు. కాని ప్రబలోద్వేగి. ఉద్వేగములో దౌర్జన్యప్రయోగమునకు సహితము వెనుకాడెడువాడు కాఁడు.

రోజామాల్టొనీ విద్యావతి. ఆమె ప్రాథమిక పాఠశాలోపాధ్యాయిని పరీక్షలో నుత్తీర్ణురాలయ్యెను. వివాహకాలమువర కొకపాఠశాలలో నుపాధ్యాయినిగ పనిచేసెను. వివాహానంతరము స్వగృహములోనే ప్రయివేటుపాఠశాలను పెట్టుకొనెను. ఆమె కడు శాంత స్వభావురాలు. ఎల్లప్పుడును ధర్మమార్గానువర్తురాలై మెలగుచుండెడిది. ముసోలినీ తండ్రియెడ గౌరవమును జూపుచుండెడివాఁడు. కాని తల్లి యనిన అతని కపారమైన భక్తి. ఆమెకోమలహృదయ మెక్కడ నొచ్చిపోవునో యని అతఁడు కడుజాగరూకతతో మెలఁగుచుండెడివాఁడు.

ప్రారంభమున తల్లియే ముసోలినీకి విద్యగఱపెను. ౫-వ వత్సరము వచ్చుసరికే అతఁడు చక్కఁగ చదువను, వ్రాయను నేర్చుకొనెను. ఇటలీలో సాధారణముగ నారవయేట బాలబాలికలను పాఠశాలలో ప్రవేశపెట్టుదురు. అప్పుడే ముసోలినీనిసహితము పాఠశాలలో జేర్చిరి. కాని స్వేచ్ఛాప్రియుఁడగు నాబాలకునికి పాఠశాలనిబంధనలు రుచింపవయ్యెను. అందుచే ముసోలినీ (తన సింహశాబకముతో)



నతఁడు వీలుచిక్కినప్పుడెల్ల గైరుహాజరగుచుండెడివాఁడు. స్నేహితులను వెంటగొని చెట్లను, పుట్టలను బట్టుకొని తిరుగుచుండెడివాఁడు. అతనియల్లరిపనులనుగూర్చి పెక్కుగాథలు గలవు. అత డొకప్పు డెవడో పన్నుకొనిన యుచ్చులోనుండి కొన్నిపక్షులను పట్టుకొనిపోవుచుండెను. ఉచ్చుపన్నుకొనినవాఁ డిదికని పెట్టి వెంటబడెను. ముసోలినీ ముందును, అతఁడు వెనుకను కొంతదూరము పరుగెత్తిరి. ఇంతలో నొకకాలువ వచ్చెను. వెనుకముందు గానకయే ముసోలినీ దానిలో దూకి, ఆవలిగట్టును చేరెను. ఉచ్చుపన్నుకొనినవాఁ డీవలియొడ్డుననే యుండిపోయెను. హఠాతుగ కాల్వను దాటుచున్నను ముసోలినీ చేతిలోని పిట్టలలో నొకదానినైనను పట్టుజారి పోనీయలేదు. ఈపట్టుదల నేటికిని అతనిలో గలదు.

ఇట్టి చిలిపిచేష్టలలో ముసోలినీస్వభావమును చక్కఁగ నిరూపించునట్టిది మఱొకటి గలదు. ఒకనాఁడు కొంతమంది బాలురతో గలసి ముసోలినీ “ఆపిల్సు” దొంగతనమునకై బయలుదేరెను. అప్పుడు వారిలో నొకఁడు చెట్టుపైకెక్కి పండ్లను దులుపుచుండెను. తక్కినవారందరును రాలినపండ్లను ఏరుకొనుచుండిరి. ఇంతలో తోటయజమాని పరుగెత్తుకొనివచ్చెను బాలురందరును కాలికి బుద్ధిచెప్పిరి. తత్తరపాటులో చెట్టుపైనున్న బాలుఁడు క్రిందబడి, కాలు విరుగఁగొట్టుకొనెను. తోటయజమాని యెక్కడ కొట్టిపోవునో యని అతఁడు లబలబ మొత్తుకొనుచుండెను. కాని యతని గతినిగూర్చి విచారించినవాఁడే లేఁడు. ముసోలినీమాత్రము తిరిగివచ్చి, వానిని భుజములపై నెక్కించుకొని, సురక్షితస్థానమునకు పారిపోయెను.

తోటలపై నిట్లు దండెత్తుటే కాక ముసోలినీ చిన్నచిన్నయుద్ధములొనర్చుచుండెడివాఁడు. మాటవచ్చినచో నెంతపెద్దబాలుని కైనను తిరుగబడుచుండెడివాఁడు. ఈ కలహములలో కాలు చేతులు నొప్పిపట్టినను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తల బ్రద్దలైనను లెక్కచేసెడివాడు కాడు. బాల్య యుద్ధముల మచ్చలు కొన్ని నేటికిని ముసోలినీశరీరముపై గలవు. వాని నతడు కడుగర్వముతో జూపుచుండును. తన కున్నను, లేకున్నను, చేతనున్న తినుబండారములను తోడిబాలుర కొసగుచు, స్వార్థత్యాగబుద్ధిని ప్రదర్శించుచుండుటవలన ముసోలినీని వారందరును ప్రేమించుచుండెడివారు.

ఇట్లు ముసోలినీ జీవితములో మూడువత్సరములు గడచెను. అప్పుడతని భవితవ్యతను గూర్చి తల్లిదండ్రులాలోచింపనారంభించిరి. తండ్రి యతనికి కమ్మరిపనిని నేర్పెద ననెను. కాని తల్లి యందులకు బొత్తిగ నంగీకరింపలేదు. ముసోలినీ యల్లరిపిల్లవాడుకావచ్చును. బడి నెగబెట్టి, చెల్లచేమలవెంట తిరుగుచుండవచ్చును. కాని కనబడినపుస్తకమునెల్ల నతడు జదువుచుండెడివాడు. అప్పుడప్పుడు గంభీర స్వరముతో నింటిగోడల కుపన్యసించుచుండెడివాడు. దీనినిగాంచి "నీకేమైన పిచ్చిపట్టినదటరా ?" అని తల్లి ప్రశ్నింప, "అమ్మా! లేదే! మరి, నేనే ఉపన్యాసాలివ్వటం నేర్చుకుంటున్నానే. ఎప్పుడైనా యిటలీకి నాతో పనిపడుతుందేమోనే!" అని ప్రత్యుత్తరించుచుండెడివాడు. అందుచే నతని కున్నత విద్య చెప్పించితీరవలెనని తల్లి పట్టుపట్టెను.

భార్యపట్టుదలమీద, అలెగ్జాండరు ౧౮౯౨-వ సంవత్సరము అక్టోబరుమాసములో కొమరుని ఫెన్‌జాన్‌లోని పాఠశాలలో జేర్చెను. గ్రామాంతరమున కేగి చదువుకొనుట ముసోలినీ కంతగ నచ్చలేదు. పైపెచ్చు పాఠశాల, దాని నిబంధనలు మున్నగువానిని గాంచిన అతనికి మొదటినుండియు తలనొప్పి. కాని, తల్లిమాట కాదనలేక "వల్లె" యనెను. ఆపాఠశాలలో జేరుటకై పోవుటకుముందు వారముదినములు పొలముపుట్రలవెంట మనసార దిరిగెను.

అక్టోబరు ౧౪-వ తేదీని ప్రాతఃకాలమున అలెగ్జాండరు బండి కొకగాడిదను కట్టి, దానిలో కొడుకు నెక్కించుకొని, ఫెన్‌జాను బయలుదేరెను. దురదృష్టవశమున దారిలో నొకసారి బండి బోలా కొట్టెను. ముసోలినీ తలక్రిందుగ పడెను! ఇట్లు గాడిద బండితో నవస్థపడుచు, తుదకు వారెట్లో గమ్యస్థానమును జేరిరి. అక్కడ ముసోలినీని సులభముగనే పాఠశాలలో జేర్చుకొనిరి. పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ముసోలినీని చూచినంతనే "చురుకైనవాడు" అని సంతసించెను. కొమరుని విడిచిపెట్టి వెళ్లునప్పుడు అలెగ్జాండరు కంట తడిపెట్టెను.

ముసోలినీ కొంతకాలము ఆ పాఠశాలలో చదివెను. పూర్వమువలె తక్కినబాలురతో నతడక్కడ కూడ కలహించుచుండెను. కాని విద్యాభ్యాసములో నతడసమానప్రజ్ఞావిశేషములను ప్రదర్శించుచుండుటచే నుపాధ్యాయు లతని దౌష్ట్యముల నంతగ బాటించెడువారు కాదు. ఇట్లుండ నొకనాడతడు సహాధ్యాయునితో గలహించి, చేతనున్న చాకుతో నతనిని పొడిచెను. ముసోలినీకి దానితో నక్కడినుండి యుద్వాసము చెప్పిరి!

తదుపరి ఫెన్‌జాకు సమీపములోనే యున్న "టీచర్సు ట్రెయినింగ్ కాలేజీ" లో నతడు చేరెను. అక్కడకూడ తిరిగి ప్రాతపాటయే. ఒకనాడతడు ముగ్గురు బాలురపై తిరుగబడి, వారినందరిని చావమోదెను. పిమ్మట ఉపాధ్యాయు లెక్కడ శిక్షింతురో యని, పాఠశాలను వదలి పారిపోయెను. అప్పుడలెగ్జాండరు పుత్రుని క్షమించి, తిరిగి పాఠశాలలో జేర్చుకొనుడని కోరెను. "మీవాడు విద్యార్థులలో కెల్ల తెలివిగలవాడు. అందుచే తప్పని సరి వచ్చినది." అని యుపాధ్యాయు లతనికి పునఃప్రవేశ మొసగిరి. తుదకెట్లో ౧౯౦౧-వ సంవత్సరమునందు ముసోలినీ విద్యాభ్యాసము పరిసమాప్తిగావించి, డొవియాకు తిరిగివచ్చెను.

రోజామాల్టోనీయారోగ్యము మొదటినుండియు సరిగనుండెడిదికాదు. ౧౯౦౦-వ సం. ఆమెస్వాస్థ్యము మరింతచెడిపోయెను. అందుచే ముసోలినీ ౧౯౦౩-వ సం. వరకు తల్లికి పరిచర్య గావించుచుండెను. ఇంతలో నాగ్రామములో నొకయుద్యోగము ఖాళీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యయ్యెను. ముసోలినీ దానికి దరఖాస్తు చేసెను. కాని యతని కది లభింపలేదు. అప్పుడు ముసోలినీకి కొంత నిరుత్సాహ మదయించెను. అలెగ్జాండరుమాత్రము లేశ మైనను హతాశుడు కాలేదు. అతడు పుత్రునుద్దేశించి యిట్లు పలికెను: "నాయనా! ఈ కుగ్రామము నీకు తగినది కాదు. దీనిని వదలి విశాలప్రపంచములోనికి పొమ్ము. నేనుగావున్న రేపైనను నీవు దేశోద్ధారకుడవు కాగలవు." ఆసమయమున అలెగ్జాండరుజిహ్వాపై భవిష్యద్వాణి తాండవించుచుండెనోపు!!

ముసోలినీ పునఃప్రయత్న మొనర్చి, పార్మాపరిసరప్రాంతములో నుపాధ్యాయపదవిని సంపాదించెను. అత డక్కడ ४० మందిబాలురకు విద్యగరపుచుండెను. అతనికి ౫౬ లైర్లు (ఇటాలియనునాణెము లు) వేతనము లభించుచుండెను. దానిలో అతడు ४०.లైర్లను అన్నపానీయములు, వసతి మున్నగువాని కుపయోగించుచుండెను. తక్కినవానితో గ్రంథములను కొనుచుండెను. ఆదినములలో నతనికి చాలవిశ్రాంతి లభించుచుండెడిది. దానినంతయు నతడు గ్రంథపఠనమున కుపయోగించుచుండెడివాడు. అప్పుడే యతడు చిత్రకళ, నృత్యగానములు, కత్తిసాము మున్నగువానిని సహితము కొంతవర కభ్యసించెను.

కాని ముసోలినీవంటి స్వాతంత్ర్యప్రేమియు, స్వేచ్ఛావిహారియు నొకకుగ్రామములోని పాఠశాల నంటిపెట్టుకొని బ్రతుకగలడా? అత డచిరకాలములోనే తనయుద్యోగమునకు రాజీనామా నొసగి, విదేశయాత్రకై బయలుదేరెను.

విదేశయాత్ర గావించు నుద్దేశ్యముతో బయలుదేరెనే కాని, ముసోలినీవద్ద నాలుగురూకలైనను లేకుండెను. ఉన్న కొలదిపైకమును బయలుదేరిన రెండవనాడో, మూడవనాడో చెల్లిపోయెను. అప్పుడతడు తల్లికి తంత్రీవార్త నొసగెను. ఆమెయు తంత్రీవార్తద్వారానే ४౫ లైర్లను (షుమారు రు. ౩౦-౦-౦ లు) పంపెను. వానితో నతడు మరికొంత దూరము ప్రయాణము సాగించెను. ఇంతలో నెన్నికల సందర్భమున మరికొందరు సాంఘికవాదులతోపాటు తన తండ్రియు అరెస్టుచేయబడినట్లు వార్తాపత్రికల వలన నతనికి తెలియవచ్చెను. అప్పు డతడు వెనుకకు తిరిగిపోవుటయా, లేక ముందునకు సాగిపోవుటయా అని కొంత తటపటాయించెను. కాని తుదకు ప్రయాణము సాగించుటకే నిశ్చయించెను.



డోనా రాచెలె (ముసోలినీ భార్య)

ఎట్లో ముసోలినీ స్విట్జర్లాండు చేరెను. అక్కడ లాసానీ, జెనీవా మున్నగు నగరములలో కూలి నాలి చేయుచు కొంతకాలము గడపెను. అత డెక్కువగ తాపీపని చేయుచుండెను. ఆపనియైనను అన్నప్పుడెల్ల లభించుచుండెడిదికాదు. అందుచే నత డెన్నోసాగ్లు పస్తు పరుండవలసివచ్చెడిది. అప్పుడప్పుడు తలదాచుకొనుటకైనను చోటు లభించెడి కాదు. గత్యంతరము లేక వంతెనక్రింద నూరియో, ఖాళీపెట్టెలో దిగియో నిద్రించుచుండెడివాడు. ఈ స్థితిలో బిచ్చమెత్తుకొని తినుచున్నా డను నేరముపై నత డొకసారి చెరసాలలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సహితము వేయబడెను, అయినను కష్టపరంపరలను సరకు గొనక, ముసోలినీ విదేశసంచార మొనర్చుచు, నూత్న వినూత్నానుభవములను గడించుచుండెను.

ఇట్లు ముసోలినీ ౧౯౦౫-వ సం వరకు సంచార మొనర్చెను. ఆదినములలో నతడు కేవలము స్విట్జర్లాండులోనేకాక, ఫ్రాన్సు, జర్మనీదేశములలో సహితము కొంతకాలము పర్యటన మొనర్చెను. పెక్కుచోట్ల నతడు కార్మికులలో విప్లవభావప్రచార మొనర్చి, సమ్మెలను కట్టించెను. అప్పు డతనిని అరెస్టుచేయుటకు చాలవారంట్లు పుట్టెను. వానిని తప్పించుకొనుటకై అత డొకచోటినుండి మరియొకచోటికి పలాయితు డగుచుండెను. తుదకు ముసోలినీని స్విట్జర్లాండునుండి బహిష్కరించును ఉత్తరువు గావింపబడెను. ఆయుత్తరువు మొన్న మొన్నటివరకు అమలులో నుండెను. ఇటీవలనే స్విస్ ప్రభుత్వమువారు దానిని రద్దుగావించిరి.

౧౯౦౫-వ సం. విదేశపర్యటనమును ముగించి, ముసోలినీ స్వగృహమును జేరెను. ఆవత్సరములోనే యతని తల్లి పరమపదించెను. అప్పటి కామెవయస్సు ౪౬ సం.లు మాత్రమే. ఈయకాల మాతృమరణము ముసోలినీహృదయమును వేదనాసంక్షుభిత మొనర్చెను. తల్లియనిన అతని కపారమైనభక్తి గలదని పూర్వ మొకసారిచెప్పియుంటిమి గదా! తన దుఃఖమునెడ సానుభూతిని ప్రకటించుచు లేఖవ్రాసిన యొకమిత్రునికి ప్రత్యుత్తర మొసగుచు అత డిట్లు వ్రాసెను: "నాతల్లియుశోభనల ననుసరించుచు, ఆమెను భక్తిపూర్వకముగ స్మరించుకొనుచుండు భాగ్య మొక్కటిమాత్రమే నా కికమిగిలినది."

తదుపరి మాతృవియోగదుఃఖమును విస్మరించుటకు ముసోలినీ స్వజాతికిచెందిన డోనారాచెలె అను నామెను పరిణయమాడెను. అప్పుడే ఫోర్లీలోనున్న కార్మికజనసంఘమునకు కార్యదర్శిగకూడ జేరెను. కార్యదర్శిగ నున్నందుల కతనికి నెలకు ౧౨౫ లైర్లను వేతనముక్రింద నిచ్చుచుండెడివారు. అది భుక్తికే సరిగ సరిపోవుచుండెడిది కాదు. ఆదినములలోనే యతనికి ఎడ్డాఅనుపుత్రిక జనించెను. ఆబాలికార కత డప్పు డొక పాత ఉయ్యాలమంచమును కొనెను.

ఇట్లు దారిద్ర్యము ననుభవించుచున్నను ముసోలినీ లక్ష్యమొనర్చుచుండెడివాడు కాదు. తాను నమ్మిన కార్య మొనర్చుటలో నెన్నికష్టము లెదురొడ్డున్నను జంకుస్వభావ మతనికి మొదటినుండియు లేదు. ఆదినములలో సాంఘికవాది యొక డతనిజీతమును ౪౦౦ లైర్లకు హెచ్చించెద ననెను. కాని ముసోలినీ యధికవేతనమును గైకొనుట కంగీకరింపలేదు. తనయనంగీకారమును దెలుపుచు అతడు ఛలోక్తిగ నిట్లనెను: "ఈ జీతములోనే నేబింగ్సుబ్యాంకు ఎకౌంటు పెట్టుకొనవలెనని నే ననుకొనుచుండ, నా కధికవేతన మేల?"

విదేశపర్యటన మొనర్చుచున్నప్పుడే ముసోలినీ వార్తాపత్రికలకు వ్యాసములను వ్రాయుచుండెడివాడు. తదుపరి వ్యాసరచనపై నతని కభిరుచి మెండయ్యెను. అందుచే నతడు దానినే వృత్తిగా బెట్టుకొనదలచి, ౧౯౧౦-వ సంవత్సరము జనవరి ౧-వ తేదీని ఫోర్లీలో నొకచిన్నవారపత్రిక (La Lotta di Classe) ను ప్రారంభించెను. ఈపత్రిక కార్మికజనోద్యమమునకు సంబంధించినది. సాంఘికాపచారములయెడ దృష్టిని మరల్చి, కార్మికులను విప్లవమునకు పురికొల్పుటయే దీనిముఖ్యోద్దేశము. ఇదిగాక తనజీవితములో ముసోలినీ మరరెండుపత్రికలను స్థాపించెను. వేరొకదానికి సంపాదకుడుగ పనిచేసెను.

ఫోర్లీలో కార్మికసంఘకార్యదర్శిగను, పత్రికాసంపాదకుడుగను పనిచేయుచు ముసోలినీ ఫిడేలును వాయించుటకూడ నేర్చుకొనదొడగెను. అప్పు డతనికి ఫిడేలు నేర్పిన సంగీతవిద్వాంసుడు తనశిష్యునిగూర్చి యిటీవలనే కొన్ని వివరముల నిట్లు తెలిపెను:

"౧౯౦౮-వ సం. అక్టోబరు ౮-వ తేదీని ముసోలినీ నావద్దకు వచ్చి ఫిడేలు నేర్పుమని నన్ను కోరెను. నే నతనికోర్కెను మన్నించుటకు తొలుదొల్త కొంత శంకించితిని. అప్పటి కతని వయస్సు ౨౫ సంవత్సరములు. ఇంతకన్న లేతవయస్సులో నభ్యాసము గావింపదొడగినగాని, సంగీతవిద్యలో ప్రావీణ్యము రాదని నేనంటిని. కాని ముసోలినీ తప్పక నేర్పవలసిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దనుచు పట్టుపట్టెను. అంతయుత్సాహమును జూపు చున్నవానిని కాదనలేక నేను 'వల్లె' యంటిని. అప్పుడు ముసోలినీవద్దనున్న ఫిడేలు మంచిదికాదు. కాని యప్పటికి దానితోనే సరిపెట్టుకొనవలెననియు, నెమ్మదిమీద మంచిదానిని కొందుననియు యతడు చెప్పెను. నావద్ద విద్య నభ్యసింప మొదలిడిన కొలది మాసములకే ముసోలినీ విశేషప్రజ్ఞను ప్రదర్శింప నారంభించెను. కేవలము సంగీతవిద్యలోనేకాక, తదితరవిషయములందుగూడ నతడు సహజప్రజ్ఞాధురంధరుడని నేను త్వరలోనే గ్రహింపగలిగితిని. సారస్వత, రాజకీయములనుగూర్చి మే మాద్యంతముగ జర్చించుచుంటిమి. ఇట్లు కొన్నిమాసములు గడచినపిదప ముసోలినీ పెక్కువారములు నావద్దకు రాలేదు. దీనికి కారణ మేమైయుండునా యని నే నాశ్చర్యపడుచుంటిని. ఇంతలో నొకనా డతడు తిరిగి వచ్చెను. ఆశ్చర్య సంభ్రమములతో "ఇన్నివారము లెచ్చోటికి కేగి యుంటివి?" అని నేనడిగితిని. అతడు కడు ప్రశాంతముగ "జైలునకు! నా పత్రికలో నేను వ్రాసిన కొన్నివ్యాసములకుగాను నాకు మూడువారములు కారాగారవాసశిక్ష విధించిరి" అని చెప్పెను. "ఈ శిక్షను రద్దుగావింపుడని రాజకీయప్రతిపక్షులను నీవు కోరలేదా?" అని నేను తిరిగి ప్రశ్నించితిని. "లేదు. రాజకీయరంగమునకు దిగినవా డెట్టికష్టములు వచ్చినను, వానిని భరించుటకు సంసిద్ధుడై యుండవలెను" అని యతడు గంభీరముగ బ్రత్యుత్తర మొసగెను."



కార్మిక - ముసోలినీ

ఈ సందర్భముననే తన్ను విచారించుచున్న న్యాయాధీశు నుద్దేశించి ముసోలినీ యిట్లు పలికెను: "మీరు నన్ను వదలినచో నది ముదావహము. శిక్షించినచో నది గౌరవప్రదము" ముసోలినీ జైలుజీవితము దుర్భరమని యెన్నడును భావించి యెరుగడు. అతడు తనశిక్షాకాలమును గ్రంథపఠనమున కుపయోగించుచుండెడివాడు. ఫోర్లీ చెరసాలలో నున్నప్పుడే యతడు జాన్‌హూస్ అను బొహీమియన్ దేశభక్తాగ్రగణ్యుని సంగ్రహజీవితచరిత్రను వ్రాసెను.

చెరసాలజీవితమువలన సంగీతవిద్యాభ్యాసమునకిట్లు తాత్కాలికముగ విఘ్నము గలిగినను, ముసోలినీ పూర్వోత్సాహమును గోల్పోవక, తిరిగి ౧౯౧౦ - వ సంవత్సరాంతముదనుక దానిని నేర్చుకొనెను. అప్పటి కతనికి ఫిడేలువాద్యములో నసమానసామర్థ్య మలవడెను. నాటినుండి నేటిదనుక నేకొలది విశ్రాంతి లభించినను, దాని నతడు ఫిడేలు వాయించుకొనునిమిత్తము వినియోగించుట కెంతయు నానందపడుచుండును.

ట్రెంట్‌నగరములోనున్న సాంఘికవాదసంఘమునకు కార్యదర్శిగను, తత్సంఘవార్తాపత్రిక (de Popolo) కు సహాయసంపాదకుడుగను పనిచేయవలసినదనుచు ౧౯౧౦-వసంవత్సరాంతమున ముసోలినీని కోరిరి. నిక్కువముగ నిటలీలో నొకభాగమైనను, ఆదినములలో ట్రెంట్‌నగరము ఆస్ట్రియాప్రభుత్వపుస్వాధీనములో నుండెను. అచ్చట ఇటలీదేశభక్తుల ప్రాణమానగన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముల కెట్టి రక్షణయు లేకుండెను. ఐనను నిస్సంకోచము గను, నిర్భయముగను ముసోలినీ నూత్నపదవిని స్వీకరించెను. నిరపాయకరమైనకృత్యము లొనర్చుటలో నతని కసలు ఆనందమే లేదు. అందుచేతనే నేటికిని ముసోలినీ సింహపుబోనులో నిరాయుధుడుగ బ్రవేశించి సింహకిశోరములతో నాడుకొనుచుండును! విశ్రాంతి కొరకు గంటకు ౮౦, లేక ౯౦ మైళ్లవేగమున మోటారు కారును నడుపుచుండును!!

నూత్నపదవిని స్వీకరించినక్రొత్తలోనే ముసోలినీ ట్రెంట్ మున్నగుప్రాంతములు ఇటలీదేశభాగములనియు, వానిని ఇటలీలోగలుపుకొనవలసియున్నదనియు సూచించుచువ్రాసెను. అందుచే పోలీసువా రతనిపై నొకకన్ను వేసిరి. దీనిని సరకుగొనక ౧౯౧౧-వ సం. అక్టోబరుమాసములో నతడు "ఇటలీ సరిహద్దు అలా కాదు" అని బహిరంగముగనే వ్రాసెను. వెంటనే పోలీసువా రతనిని అరెస్టుచేసి, కొంతకాలము చెరసాలలో నుంచినపిదప ఆస్ట్రియానుండి బహిష్కృతు నొనర్చిరి.

తదుపరి ముసోలినీ "అవంతి" (Avanti= ముందుకుపొమ్ము!) అను తీవ్రసాంఘికవాదపత్రికకు సంపాదకు డయ్యెను. ఆపత్రికలో నతడు నిప్పులు గ్రక్కువ్యాసములను వ్రాయుచుండెను. అతడు సంపాదకత్వము వహించినపిమ్మట పత్రికచందాదారుల సంఖ్య ౧౦,౦౦౦ నుండి ౩౦,౦౦౦ వరకు పెరిగెను. "అవంతి"లో నతడొకప్పుడు "ప్రతిపక్షులు నన్ను చంపెదమని బెదరించినచో వారిని వెంటనే చంపుటకు నీకు హక్కుగలదు" అని వ్రాసెను. ఇట్లు తీవ్రముగ వ్రాసి, విప్లవమును ప్రేరేపించుచున్నాడను నేరముపై ప్రభుత్వమువా రతని నొకసారి అరెస్టుచేసిరి. కాని వెంటనే వదలివేసిరి.

ఇంతలో జర్మనీమహాసంగ్రామము ప్రారంభమయ్యెను. అప్పుడు ఇటలీలో మూడువిభిన్నపక్షములు ప్రబలెను. మొదటిపక్షమువారు ఇటలీ జర్మనీతో చేరవలె ననిరి. రెండవ పక్షమువారు ఇటలీ తటస్థముగ నుండుట శ్రేయస్కర మనిరి. ఇక మూడవపక్షమువారు ఇటలీ మిత్రమండలితో (Allies) నేకముగావలె ననిరి. ముసోలినీ మూడవపక్షమును సమర్థించెను. ఇది యతనిసాంఘికవాదమిత్రుల కెంతమాత్రమును రుచింపలేదు. వారందరును ఇటలీ తటస్థముగ నుండవలె నను కూటమువారు. అందుచే ముసోలినీ ౧౯౧౪-వ సం. సెప్టెంబరు నెలలో "అవంతి" సంపాదకత్వమునకు రాజీనామా నిచ్చెను. దానితో నతని పూర్వమిత్రులందరును ప్రబలశత్రులైరి. అతనిని వారు "ద్రోహి" అని నిందింపగడగిరి.



ముసోలినీ (యుద్ధరంగమున)

పిమ్మట ౧౯౧౪-వ సం. నవంబరు నెలలో సాంఘికవాదపక్షసభ జరిగెను. ఆసభలో ముసోలినీని పక్షము నుండి తొలగింపవలసినదనుచు తీర్మానింపబడెను. అప్పుడు తనప్రవర్తనను సమర్థించుకొనుటకై ముసోలినీ యుపన్యసింపగోరెను. కాని సభికులందరును మాటచొరబడకుండ కేకలు, బొబ్బలు పెట్టసాగిరి. ఈ యల్లరిని నిర్లక్ష్యమొనర్చి ముసోలినీ యొకగంభీరోపన్యాస మొస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గెను. ప్రారంభములో నల్లరిచేసినవారందరును ఉపన్యాసము పూర్తియగుసరికి మంత్రముగ్ధులైరి!

ఇష్టమిత్రులందరును పరమశత్రులైనను ముసోలినీ చలింపలేదు. అతనికి గలిగిన దురదృష్టములకు వగచుచు నొకమిత్రుడు వ్రాసిన లేఖకు ప్రత్యుత్తర మొసగుచు ముసోలినీ యిట్లు వ్రాసెను: "ఇట్లంతయు జరిగినప్పటికిని పరమేశ్వరుడు నన్ను మహత్కార్యముల కుద్దేశించెనను విశ్వాసము నాకుగలదు. ఇట్టి పరమ శ్వాసికి జీవితములో నపజయము గలుగునా!"



బెనిటో ముసోలినీ (ఫాసిస్టుసంఘ నాయకుడు)

తదుపరి ౧౯౧౪-వ సం. నవంబరు ౧౫-వ తేదీని ముసోలినీ "ఇటలీ ప్రజలు" (de Popolo d' Italia) అను పత్రిక నొకదానిని మిలాన్‌నగరములో స్థాపించెను. ఆ పత్రికాకార్యాలయము చాలచిన్నది. క్రిందియంతస్థులో ముద్రణాలయ ముండెను. పైయంతస్థులో సంపాదకీయశాఖ యుండెను. సంపాదకీయ శాఖలో మూడుగదులుమాత్రమే యుండెను. ఆగదులైనను పెద్దవి కావు. వానిలో నొకదానికి తలుపులు లేకుండెను. కాని ద్వారబంధముపై "దయచేసి తలుపులను మూయుడు" అని పెద్ద యక్షరములతో వ్రాసియుండెను.

ఇట్లు సాధనసంపత్తి తక్కువగానున్నను ఉత్సాహము, కార్యదీక్ష, స్వార్థత్యాగము మున్నగువానికి మాత్రము కొఱత లేకుండెను. దేశసేవాతత్పరులైన కొందరు యువకులు ముసోలినీకి సహాయమొనర్చుచుండిరి. డిగ్రీలను, యోగ్యతాపత్రములను జూచి, ముసోలినీ వారిని నియమింపలేదు. కేవలము వారిసామర్థ్యమునే పరిగణించెను. అట్లే వారును ప్రతిఫలము నాశింపలేదు. కేవలము దేశహితార్థము సేవచేయ సంకల్పించిరి. ఇట్టిచో వారు "యజమాని", "సేవకులు" అను నీచ భేదభావములు లేకుండ సోదరులవలె బనిచేయుచుండిరనుటలో నాశ్చర్యము లేదుగదా!

ఇక ముసోలినీసంగతి ప్రత్యేకముగ జెప్పనక్కరలేదు. అతడు కార్యతత్పరతలో నిద్రాహారముల సహితము మరచుచుండెను. సంపాదకీయములను వ్రాయుచున్నప్పు డతడు తన్నుతానే విస్మరించుచుండెడివాడు. అప్పు డెవరైనను తనగదిలో బ్రవేశించి, వ్యాసమునుండి దృష్టిని మరల్చినచో నతనికి విపరీతముగ కోపము వచ్చెడిది. ఈసందర్భములో ఒక చక్కనికథను పేర్కొనవలసియున్నది. ఒకనాడు ముసోలినీ సంపాదకీయమును వ్రాయ నుద్యమించుచు, పత్రికాకార్యాలయపుబాలు నొకనిని పిలిచి "నా కొకకప్పుకాఫీని తెచ్చిపెట్టుము. ఇక్కడి కెవ్వరును రాగూడదు. ఎవడైనను వచ్చినచో కాల్చివైచెదను" అని చెప్పెను. ఒకటి రెండు నిమిషములలో నాబాలుడు తిరిగివచ్చి, భయపడుచు "అయ్యా, కాఫీని తెచ్చితిని" అనియనెను. అప్పుడు ముసోలినీ యుగ్రుడై "కాల్చివైచెదను! జాగ్రత్త!" అని పిస్తోలుపైకితీసెను. ఆపాదమస్తకముకంపించుచు బాలుడు పరుగెత్తెను. ఆకాఫీ చివర కేమయ్యెనో తెలియదు!

ఇట్లు రేయుంబవలు పనిచేయుచు, ముసోలినీ బ్రహ్మాండమగు ప్రచార మొనర్చెను. తత్ఫలితముగ సాంఘికవాదులకనుకూలముగ నున్న మంత్రివర్గముపోయి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రొత్తది వచ్చెను. ఆక్రొత్తమంత్రివర్గమువారు మిత్రమండలివారితో నేకమై ౧౯౧౫-వ సం. మే ౨౪-వ తేదీని యుద్ధమును ప్రకటించిరి. ముసోలినీ వెంటనే తన సంపాదకత్వమును తమ్ముని కొప్పగించి, తాను సామాన్యభటునివలె సైన్యమున జేరుట కేగెను. కారణాంతరములచే మొదట కొంతయాలస్యము జరిగినను ౧౯౧౫-వ సం. ఆగష్టు ౩౧-వ తేదీని ముసోలినీని ౧౧-వ రెజిమెంటులో సైనికభటునిగ జేర్చుకొనిరి.



ముసోలినీ, ప్రెడాపియాలో కార్మికమిత్రులమధ్య

రణస్థలిని ముసోలినీ అశేషధైర్యస్థైర్యములను ప్రదర్శించెను. అపాయకరమగు స్థలములందెల్ల ముందతడే ప్రత్యక్షమగుచుండెను. ఎన్నియోపర్యాయములు బాంబు లతని దగ్గరనే ప్రేలెను. కాని యతడెప్పుడును వెనుకంజ వేయలేదు. ఒకనాడు ఆస్ట్రియనుబాంబు అతనికి ౧౦ అడుగులదూరములోనే ప్రేలెను. దానితో నేల దున్నినట్లయ్యెను. చెట్టొకటి పడిపోయెను. ముసోలినీచేతిలోని తుపాకి విరిగెను. దుస్తులు చినిగిపోయెను. ముఖము మట్టితో కప్పుపడిపోయెను. కాని యతని కిసుమంతయైనను గాయము తగులలేదు. ముసోలినీ కిట్లే కడువిచిత్రముగ పెక్కుగండములు తప్పెను. చరితార్థుడు కానున్నవాని కకాలమరణము కలుగునా!!

యుద్ధభూమిలో ముసోలినీ తనసహజౌదార్యమును, స్వార్థత్యాగప్రవృత్తిని పెక్కుసారులు ప్రదర్శించెను. ఒకనా డిరుపక్షములవారికిని సంకులసమరము జరుగుచుండెను. మరఫిరంగులు దారుణాగ్నివర్షమును కురిపించుచుండెను. అట్టితరి ముసోలినీసోదరసైనికు డొకడు క్షతగాత్రుడై ప్రక్కనే పడియుండుట గాంచెను. వెంటనే వాని నతడు తానున్న సురక్షితస్థానమునకు జేర్చుటయేకాక, వాని నేదదీర్చుటకై ప్రాణాపాయము సైనను సరకుగొనక, మంచినీటిని తెచ్చియిచ్చెను. ఇట్లే నిరుపమానమైన ధైర్యస్థైర్యములకు ప్రదర్శించుచున్నందులకు ముసోలినీకి సార్జెంటు పదవి యొసగబడెను. ఒకపతకముకూడ బహూకరింపబడెను.

౧౯౧౫-వ సం. సెప్టెంబరునుండి ౧౯౧౭-వ సం. ఫిబ్రవరివరకు ౧౭ మాసములకాల మిట్లు ముసోలినీ రణక్షేత్రమున బోరుసల్పుచుండెను. ఈకాలములో ౧౯౧౫-వ సం. డిసెంబరు, ౧౯౧౬-వ సం. నవంబరుమాసములలో మొత్తము రెండుసార్లు మాత్రమే యతడు సెలవు పుచ్చుకొనెను. ఇట్లు ౧౭ మాసములు సర్వవిధాపాయముల నెదుర్కొనుచున్నను ముసోలినీ కొక్కగాయమైనను తగుల లేదు. కాని ౧౯౧౭-వ సం. ఫిబ్రవరి ౨౨-వ తేదీని ఘోరమైనప్రమాదము జరిగెను. ముసోలినీయును, అతనిదళమును శత్రువులపై బాంబులను ప్రయోగించుచుండిరి. ఇంతలో వా రుపయోగించుచున్న "మోర్టారు" ప్రమాదవశమున బ్రద్దలయ్యెను. దానితో కొందరుసైనికులు గాయపడిరి. మరికొందరు మృతినందిరి. అప్పుడు ముసోలినీకికూడ విపరీతముగగాయములు తగిలెను. రక్తము వెల్లువలై స్రవించెను. రక్తస్రావము స్పృహాపూర్తిగ తప్పిపోయెను. రోంచి ఆసుపత్రికి తీసుకొనిపోయినప్పు డతడు బ్రతుకునని యెవ్వరికిని ఆశ లేకుండెను. వైద్యపరీక్ష గావించినప్పు డతని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శరీరమున సుమారు ౪౦ గుండ్లు కాన్పించెను. వానినన్నిటిని శస్త్రచికిత్సయొనర్చి వెలికితీయవలసివచ్చెను. శస్త్రచికిత్సాసమయములలో మత్తుమందును గైకొన నిరాకరించుచున్నందువలన ముసోలినీ చాలబాధపడ వలసివచ్చుచుండెను. కాని ధీరతతో దాని నతడు భరించుచుండెను!

క్షతగాత్రుడై ముసోలినీ వైద్యాలయమున ప్రవేశించినమాసమునకు రణనీతికి విరుద్ధముగ ఆస్ట్రియనులు దానిపై బాంబులను విసరిరి. అప్పుడు క్షతగాత్రుల నందరిని మరొక సురక్షితస్థానమునకు జేర్చిరి. ఒక్క ముసోలినీనిమాత్రము కదల్చుటకు వీలులేకుండెను. అందుచే పరిచర్యకొరకొక వైద్యుని, దాదిని నియమించి, ముసోలినీని అక్కడనే వదలివేసిరి. అప్పు డగ్నిగోళవర్షములోనే ముసోలినీ కొన్నిదినములు గడపెను.

తదుపరి యొకనాడు యిటలీదేశపు ప్రభువగు మూడవ విక్టర్ ఎమాన్యుయెల్ గారు ముసోలినీ ధైర్య సాహసములనుగూర్చి వినియుండుటచే, వైద్యాలయమునకు వచ్చి యతనిని పరామర్శించిరి. పరామర్శించి వెళ్లుచు వారు "ఇతడు ముమ్ముందు పైకిరాగలడు" అని పలికిరి. ఆజోస్యము త్వరలోనే ఫలించెను.

౧౯౧౭-వ సంవత్సరము ఆగష్టు మాసములో ముసోలినీ కొంచెము కోలుకొనెను. అప్పటికైన నతడు కఱ్ఱకోడులేనిదే నడువజాలకుండెను. తదుపరి సెప్టెంబరుమాసములో నతడు తిరిగి తనపత్రికకు సంపాదకత్వ భారమును వహించి, పూర్వమువలె తనరచనావైదగ్ధ్యముచే మాతృదేశమున కసమానమైన సేవ గావింప దొడగెను.

ఇంతలో జర్మనీయుద్ధము ముగిసెను. కాని యిటలీకి శాంతి చేకూరలేదు. ఆదేశమునగల సాంఘికవాదులు, సామ్యవాదులు మున్నగుకార్మికపక్షీయులు సమ్మెలను కట్టించుచు, జాతీయజీవనమును స్తంభింపజేయుచుండిరి. రణరంగమునుండి తిరిగివచ్చిన సైనికులను నడివీధులలో నవమానించుచుండిరి. త్రివర్ణజాతీయపతాకము నూడబెరికి, దానిస్థానమున, రక్తవర్ణధ్వజము (Rd eFlag)ను ప్రతిష్ఠించుచుండిరి. మిలాన్, టూరిన్ మున్నగుప్రదేశములలో కొన్నియంత్రాగారములను బలవంతముగ నాక్రమించుకొనుచుండిరి. పొలములను స్వాధీనపరచుకొను డనుచును, పైర్లను నూర్చుకొను డనుచును ప్రజలను ప్రేరేపించుచుండిరి. ఇట్లు దేశమంతయు నరాజకముగ నుండెను. త్వరలో బోల్షివిక్ విప్లవము వచ్చునట్లుండెను. అట్టివిప్లవము నరికట్టుటకు ముసోలినీ ౧౯౧౯-వ సం. మార్చి ౨౩-వ తేదీని "ఫాసిస్టు" పక్షమును స్థాపించెను.

సాంఘికవాదులు, సామ్యవాదులు మున్నగువారు యెఱ్ఱనిదుస్తులను ధరింతురు. అందుచే ముసోలినీ తనపక్షీయులకు నల్లనిదుస్తుల నేర్పరచెను. (దుస్తుల వర్ణమునుబట్టియే ఫాసిస్టులను సాధారణముగ "బ్లాక్ షర్ట్సు" అని పేర్కొందురు.) ప్రతిపక్షులు ఆయుధపాణులై యుండిరి. ముసోలినీ తనయనుచరులకు గూడ నాయుధముల నొసగెను. ఫాసిస్టులు ప్రాచీనకాలపు రోమను పద్ధతి ననుసరించుచు, కుడిచేతిని ముందున కెత్తి "సాల్యూట్" చేయవలెననికూడ నత డేర్పరిచెను. ప్రారంభములో ప్రతి



ముసోలినీ- పతాకమునకు తలయొగ్గుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పక్షులు ఫాసిస్టుపక్షమునుగూర్చి తమ పత్రికలలో పేర్కొననైనను లేదు. కాని త్వరలోనే వారు దానిని గూర్చి పుటల నన్నిటిని నింపవలసి వచ్చెను.



ముసోలినీ, నల్లదుస్తులతో
రోముదాడి

ముసోలినీ గావించిన ప్రచండప్రచారముకారణముగ నచిరకాలములోనే దేశమందెల్లెడల ఫాసిస్టుపక్షశాఖ లేర్పడెను. పెక్కుమంది దానిలో సభ్యులుగజేర నారంభించిరి. ఇట్లు ఫాసిస్టుపక్షము ప్రాబల్యములోనికి రాదొడగి నంతనే, పలుప్రదేశములలో తత్పక్షీయులకును, ప్రతిపక్షమువారికిని పోరాటములు ప్రారంభమయ్యెను. ఈ పోరాటములలో గొందరికి ప్రాణములు కూడ పోవుచుండెను. ఫాసిస్టులు కార్మికసంఘ కార్యాలయములను విశ్రాంతిగృహములను తగులబెట్టదొడగిరి. ప్రతిపక్షులు ప్రాబల్యములోనున్న పురపాలకసంఘముల నన్నిటిని దౌర్జన్యముగ నాక్రమించుకొన సాగిరి. ఇట్లు ౧౯౨౨-వ సం. అక్టోబరువరకుభయపక్షములకును కలహము జరిగెను. ఈ సమయములో ముసోలినీని రెండుసార్లు అరెస్టుచేసి, ఏలనో వెంటనే వదలివేసిరి.

తుదకు ౧౯౨౨-వ సం. అక్టోబరు ౨౮-వ తేదీని ముసోలినీ చరిత్రప్రసిద్ధమైనట్టి "రోముదాడి" ని (March on Rome) లేవదీసెను. వివిధరాష్ట్రములనుండి మూడులక్షల మంది ఫాసిస్టులు మూడు దళములక్రింద బయలుదేరి, రోమునగరప్రాంతమం విడిసిరి. దాడిని ప్రారంభినపక పూర్వము "ఇటలీదేశాభ్యుదయమే మా ధ్యేయము" అని ముసోలినీ యొక్క ప్రకటన గావించెను. రోమునగర పరిసరముల విడిసినంతనే యప్పుడు ప్రధానమంత్రిగ నున్న ఫాక్టాకు ౨౪ గంటలలో రాజధానీనగరమును వీడిపొమ్మనుచు అత డొకయంత్యాసందేశము నంపెను. ఫాక్టా దానిని నిర్లక్ష్య మొనర్చి యుద్ధసన్నాహ మొనర్పసాగెను. అతడు రెండు సైనికదళములను సిద్ధపరచెను. రోమునగరద్వారములను మూయించెను. పిదప ఇటలీదేశమందంతటను సైనికశాసనము ప్రకటించుటకు అనుజ్ఞ నొసఁగుడనుచు మూడవ ఎమాన్యుయెల్ గారిని కోరెను. కాని రాజుగారు దాని కంగీకరింప లేదు. అప్పుడు సైనిక శాసనమును ప్రకటించిన దేశమంతటను రక్తము వెల్లువలై ప్రవహించును. జాతియంతయు నశించును, ఇటలీ రూపుమాసిపోవును. అందుచే వారు ఫాక్టాను ప్రధానామాత్యపదవినుండి తొలగించి, నూత్నమంత్రి వర్గము నేర్పరుప ముసోలినీని ఆహ్వానించిరి.

ఈయాహ్వానము నంగీకరించి ముసోలినీ అక్టోబరు ౩౧-వ తేదీని తనమంత్రివర్గము నేర్పరచెను. ఆ నాటినుండియే అతడు యిటలీదేశమునకు డిక్టేటరయ్యెను. ఆనాటినుండియే యిటలీ సర్వతోముఖముగ నభివృద్ధినందసాగెను. ఆచరిత్రప్రసిద్ధదినము ఇటలీ దేశస్థులకు నేడు పర్వదినము!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కావ్యకల: ఆశయవైశిష్ట్యములు

కొంపెల్ల జనార్దనరావు

నేడు ప్రజాచిత్తము ననుసరించి వ్రాస్తున్నారట కావ్యములు. పూర్వము ప్రభుచిత్తము ననుసరించి వ్రాసేవా రన్నమాటకు ఒక్కొకయెడ ప్రబంధములే కాక భారతరామాయణాదులుకూడ గుఱికాక తప్పించుకొనవాయెను. కాని ధర్మపరతంత్రములూ, సత్యపరతంత్రములూ అయిన పురాణేతిహాసాదులు (రామాయణముకూడా ఆకట్టలోనే కట్టివేతురు.) ప్రభుచిత్తమునకు తగిలి వంకరలు తిరగడము నింద్యమనే వచనశక్కిలో పరమలక్ష్యములు అపాకృతములు కాక నిల్చినవి. పురాణాదులు ధర్మాదిపరతంత్రము లని అంగీకృత మైనది.

ప్రబంధరచనమున, ప్రభువు వైష్ణవుడాయెనా కవి శివపక్షపాతిఅయ్యు వైష్ణవపారమ్యమునకై తన కావ్యములో మల్లువట్టినవంటి నిదర్శనాలతో ప్రభుప్రీతి ఆకావ్యశక్కిని పట్టి నడపించిన దని అంకించుకొందురు. కాని ప్రబంధాలలో సహా, ఉత్తమచరిత్రములు ఉదాత్తనాయకములుగా నిరూపించడము చూస్తే కవి తనప్రభుని ముఖప్రీతికంటె ఆ ధర్మవిజయమునే—ధర్మప్రవృత్తికి రత్నాకింకరుడైన వీరవతంసుని వృత్తము పదనిడి—గుఱిచూచినట్టు తెలియవస్తుంది. కృతిస్వీకృతి కావించి కవికి మడిమాన్యములూ, జాంబూనదాంబరతాంబూలములూ (ఎప్పుడు ఇస్తే ఏమి) ఇచ్చేరాజు తనకు వినిపించేకావ్యవస్తువున ఎవ్వరో మనుమార్గవర్తియట, ఒకానొకప్రభువు కీర్తితుడు కాగా, తన అల్పతరత్వమునూ, అల్పత్వమునూ బట్టి కాబోలు తా నావస్తువున నిల్వతగనివాడై అట ఉపదేశము ఏరుకోవలసినప్పుడు, ముఖప్రీతికొలతలతో చూస్తే, విముఖత పొందని రాజుకాని, అది అంచించని కవికాని, యిరువురూ కాని మూఢులని మనము గ్రహించవలసిఉంటుంది. ప్రబంధయుగమంతా, అప్పటి లోకమంతా అట్టిదే కావలెను! కాని, అదృష్టము బాగుండి, ఆప్రభువుకూడా తాను ఏ ధర్మపరిరక్షకుగాను పీఠ మధిష్ఠించినట్టు ప్రజలు భావించకమానరో దానికే తత్పరుడై అంత మాత్రపు పదవితో అలరినవాడాయెను. కాని అట్టి కథలు అవి ప్రభున కిష్టమైనవి కనుకనే రచించినకవులు తాము ప్రభుచిత్తము ననుసరించినమాట అంచించినవారే అనవచ్చు. ఆరుచి ప్రభువునకు నేర్పినవా రెవరు? ప్రభువు తన ధర్మపదవికి బద్ధుడై ఉండియే తీరుతున్నప్పుడు ఒకవేళ అతని ప్రీతికై చేసినది ధర్మముప్రీతికై, ప్రజలక్షేమముకై కాకపోదని అంచించినా రని స్వీకరించి, పూర్వకవిత్వము ప్రభుప్రీతికై అనగా ప్రభుప్రీతికై కాదని యెంచవచ్చును. సంఘచిత్తమే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంతటిది ! 'సరే, ప్రజాచిత్తము ప్రభుచిత్తమును అనుసరించి ఉండేది కనుకనే కావచ్చు కాని, ప్రబంధకవిత్వము ప్రభుచిత్తము ననుసరించినదన్నమాటవాస్తవముకాకపోయినదా? ఆ ప్రభుచిత్తము ననుసరించిన ప్రజాచిత్తము నేడు విడివడి తనదారిని తాను పోతున్న దన్నదే చెప్పేమాట ; ఆలాగే కవితకూడా అట్లు ప్రజాచిత్తము ననుసరించిన దనియే చెప్పేమాట.'—ఇది, ఆవాదములో మిగిలే సారాంశము.

(వంశరక్తముపేర ఒక్కనిసుగును శక్తి గాపట్టి, ఆశలూ, నిరాశలూ గద్దెకై యుద్ధాలు చేయించగల) ఆనాట సంఘవృత్తమున అంతప్రాముఖ్యము వహించిన ప్రభమూర్తి యెదుట (పోనీ, ప్రభమూర్తియెదుటనే) ఆదర్శప్రభువృత్తము కాని, ఆదర్శమానవ వృత్తముకాని, రసికముగా ఆలపించడము, అదియెక్కువ సంఘచిత్తమును అనుసరించడమె అగునేమో! ఆదర్శమానవవృత్త మన్నదే ప్రధానముకూడా—ఆ మానవుడు తరుచు ప్రభు వవుతూవచ్చెను ; ప్రవృత్తికాతడు శాసకుడు కనుక.

అయితే అధర్మబోధక యీకావ్యము ఒడలువంచి వేసికోలేదు.ఉపదేశముధరించినా కాంతాసమ్మితత్వములో విలసిల్లినది. ఆ రెండు మంత్రాలకూ కూడా ప్రజలూ, ప్రభువూ ఒక్కలాగున ముగ్ధులయిరి. ప్రభువు తన ప్రభుత్వము అట సంభావనపడసినందుకు కాదు ; ప్రజ తన ప్రభువుకటాక్షము అందువల్ల మెత్తబడిన దని కాదు; అటు ధర్మమూ, ఇటు కలా కలిసి

'సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మితతయోపదేశయుజే'

అన్న సూక్తిగుచ్ఛము మన్ననగాంచినది ప్రభువుకంటెను ఎక్కువగా, — ప్రభువువల్లనూ ప్రజవల్లనూకూడా. ప్రభువు ప్రజలలో ఒక రసికుడై, రసికతకు సూదంటురాయియై నిలిచినాడు:—లోకప్రవృత్తికే అతడు శాసకుడాయె. కేవలము ప్రభుచిత్తము రంజిల్లడమే ప్రచోదించిన కావ్యరచన కావలెనంటే, సంధియుగ మనిపించుకొన్న కాలమునందలి కావ్యములవంటివి అవతరించి ప్రబంధాలను తమ వ్యతిరేకతతో కాపాడుతూనే ఉన్నవి.

మన లాక్షణికులు ఉపదేశమన్నది ఒక విధిగా కావ్యమును చేపట్టమనలేదు. రసాత్మకతతోడనే, రమణీయముగనే, కావ్యమును లక్షించిరి. జీవితమునకు కృత్స్నత చూచి జీవితముకంటె కళ ఇతరమును ఉపాసించకపోతే ఉపదేశము తనంత తా వలచి వచ్చినది. నిజమయినకళ కళకోసమె, కళగానే నిలిచి, కళ ఉపదేశాత్మకము కావలెనన్న వాదమును డీకొనడముకాదు, గర్భితము చేసికొంటుంది ; మింగివేస్తుంది. సర్వమునూ మిగిలే ఆ రసాత్మకతనే నాటివారూ ఉపాసించిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'Art is not one aspect of life; it is the whole of life seen in one aspect.' అన్నసత్యమునే వారూ ఒకవిధముగా వాస్తవ పఱిచిరి. దీనికి నేడు, ఇందలి అనుభవాల సమవాయము సమన్వయించడమె అక్కఱ లేదు; ఇతరుల కథలు తరవడమె అక్కఱ లేదు. ఒకవ్యక్తిది చిదానందనిహితమైన నిండుబ్రతుకు కళవస్తువు కాగలదని వాస్తవీక రిస్తున్నారు. పూర్వలాక్షణికుల పరిశీలనము చూచినా, అతిలోకప్రతిభాశాలి అయిన కవి అనే విశిష్టమానవుని సత్త్వోద్రేకమున నిలిచిన లోకవృత్తము—బ్రదుకు—రసీభవించి కావ్యము కట్టుతుందన్నది ఇప్పటికీ (లక్షణముగా) మార నొల్లదు. ఇపుడు కళాలోకాన రసాశ్రయము లైన ఉపాధుల అర్హతలు మఱింత లోతులకు చూచి దిద్దినారు. భావనవల్ల చైతన్యము గొనే కళాసృష్టికి స్వతంత్రత చేకూరి ఇంకొకపరిణతి మెట్టు దొరకినది. (ఇదివఱకు సంస్కృతముననే కాక తెలుగున సహా ఇట్టిది లేనిదని కాదు; వ్యవస్థాసౌష్ఠవము, ప్రాచుర్యము దానికి నేడు సిద్ధించినది.)

నేడు పరిపాలనమూ, జీవితపథమూ ప్రజాచిత్తవృత్తుల విజయఘోషములో నిండి ఉండడమె యీ మార్పునకు కారకమై కాని, యీ మార్పులో నిరూఢమైకాని నిల్చిన దని చెప్పడము స్థూలసార్థకతను తృప్తిపడవలెను. ప్రాభవము, ఆహోపురుషిక ఉట్టిపడ్డ పరిపాలకులనాడునయితము (ఏ దేశమున అయితే ఏమి) గొప్ప 'లిరికు' కవులు విజృంభించినది ఇట్టిప్రోద్బలములవల్లనే అని చెప్పడానికి, ఆకవులసంఖ్యా, వారి రచనాపరిణతీ తామకూడా ఎదురొడ్డుతవి. భావపరిపాకముగా అవతరించిన యీ నవ్యశక్తికను పరిశీలించినపుడు సాంఘికములైన అవస్థలు ఎంతటి లెక్కకు వచ్చేని? అవకాశములు కల్పించేవిమాత్రము అవుతూవస్తవి. ధర్మము మాట చేవు తెలుగునని, అనుభవము నామూలసందర్శనముమాత్రమే అవలంబించడముచేత నేడు పూర్వపుసంఘపరత విడినది.

సంఘపరత అనగా సంఘమనిపించుకొనే ప్రజాగ్రంథికి సాకల్యముగా భద్రముద్ర చూపే మహదాశయనిధి అయిన వృత్తమును కావ్యకలయందు రంగరించే పూనిక; ఆసంఘములో మెదలే ప్రజల చిల్లరజీవితమునుండి కావ్యవస్తువు సంతరించుకొనే నేటి యత్నము ప్రజాపరత అని, సంఘపరతకంటె విశిష్టమైనట్టిదని, చదువుకో వీలు లేకపోలేదు. కాని అంతటితో గ్రంథము పూర్తి కాదు

కొందఱువి మర్శకులు, ఉపదేశముద్రలు మనసువదలక, కళ ఉపదేశాత్మక మన్నది ఒకప్రత్యేకవిజయమతముగా పట్టి ఫలానకవులు 'సందేశములు' పలుకుతున్న దివ్యతరు లని వారికి జయలాంఛనములు విసరజూతురు. కాని, ఆకవులు 'సందేశములు' పలకడమందే, ఉపదేశములు చిలకడమందే తమ విశిష్టత నిలుపుకున్నవా రయితే వారికి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కవులుగా జయలాంఛనములు నిరాకరించే సంసిద్ధత నేడు కలాభ్యసనపరిపాకమునే చూపుతున్నది. అన్వేషణమే, జిజ్ఞాసయే నేడు కావ్యసత్త్వము; జీవితమే—తానే—సందేశమై కనబడుతున్నది వీరికి. ఇంతతో సంఘచిత్తమునుండి వ్యక్తిచిత్తము తనవిముక్తి పరిణతము చేసికొన్నది.

కావ్యకల ప్రభుసంఘచిత్తముల ననుసరించినదన్నా, ప్రజాచిత్తమున ననుసరించినదన్నా అసలు రసికమైన వ్యక్తిచిత్తమే తన అనుకంపతో మనసులోనికి తీసికొన్న లోకవృత్తమును పాడుతూ తన రాగచ్ఛాయలతో ఆయా చిత్తానుసరణములు చేసినదన్నమాట. ఆ వ్యక్తిచిత్తము నేడు (తన కంపము తాను చెప్పడము కాకపోతే) తనమెడ తన అనుకంపను వినియుక్తము చేసికొని, తనను తానే అనుసరించసాగినది. భుక్తికవితనుండి స్వచ్ఛపడి కావ్యకల వ్యక్తికవితగా జయిస్తున్నది.

---

## భారతీయ విద్యాచరిత్రము — పీఠిక

భారతదేశచరిత్రమునకు సంబంధించిన ప్రమాణములను బరిశీలించునెడ శాసనములందును, సంస్కృతవాఙ్మయమునను, విదేశీయుల వ్రాతలయందును తాత్కాలికవిద్యావిధానమునుగూర్చినయంశము లెన్నియో నాకు లభించినవి. వీని యాధారమున నేను ౧౯౩౨-వ సంవత్సరము జనవరినెలలో "ప్రాచీనభారతీయవిద్యాసంస్థలను గూర్చి రాజమంద్రి గవర్నమెంటు ట్రెయినింగు కాలేజీలోను, సెప్టెంబరునెలలో "భారతీయ విద్యావిధానపరిణామము"ను గూర్చి ఆర్యాపుర సంస్కృతపాఠశాలలోను రెండుపన్యాసముల నొసంగితిని. వానిని మిత్రులు కొందరు విని ప్రకటింపుమని కోరిరి. అప్పుడు నేనీయుపన్యాసములను విపులీకరించి "భారతీయవిద్యాచరిత్రము" అను పేర గ్రంథరూపమున నిర్మించితిని.

ఇయ్యది 'భారతి' లో ౧౯౩౩-వ సంవత్సరము జూలై నెలనుండి డిశంబరునెలవరకును వెలవడిన యారు సంచికలలో బ్రకటింపబడినది. ఇందు ప్రాచీనకాలము నుండి క్రీ.శ. ౧౯౨౮-వ సంవత్సరమువరకునుగల విద్యావిధానములును, సంస్థలును, వానిచరిత్రమును సంగ్రహముగ జేర్పబడినవి. ఆయా యధ్యాయములను రచించుటలో ముఖ్యముగ నుపకరించినయాధారముల నధ్యాయారంభముననే తెలిపితిని. అవిగాక యితరము లెన్నియో కలవు. ఈ చరిత్రమునందలి ప్రత్యేకవిభాగములనుగూర్చి విశేషముగ పరిశోధనము జరుగవలసియున్నది. విద్యావిషయకములగు గ్రంథము లాంధ్రభాషలో నరుదుగనున్నవి. పాశ్చాత్యులు విద్య (Education) నొక శాస్త్రముగ పరిగణించి కృషిచేసియున్నారు. ఈవిజ్ఞానవిభాగమునుగూడ నాంధ్ర వాఙ్మయమున జేర్పవలసియున్నది. పండితు లీకర్తవ్యమును నెరవేర్తురు.

ఈ గ్రంథమును రచించుటకై నన్ను ప్రోత్సహించిన నామిత్రులు శ్రీయుత శేకుమళ్ల కామేశ్వరరావు బి. ఏ. బి. ఇడిగారికిని, యీచరిత్రమును బ్రకటించి, గ్రంథరూపమున దీయించి యిచ్చిన భారతీపత్రికా కార్యాలయమువారికిని నావందనములు.

౨౩-౧-౧౯౩౪ }                                                  మారేమండ రామారావు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నిదురపోవేమి?

శ్రీ పిఠాపురము యువరాజు

నిదురపోవేమి, ప్రియసఖా! నిదురపొమ్ము
నిదురపోవుచో మఱచిపో నీదు బాధ
లశ్రుజలపూర్ణమౌ నీ నయనయుగళము
వంతబొందెడి నీ యాత్మబరువు తెలిపె.

కంఠమందలి నీ దుఃఖగాద్గదికము
మనసులోనున్న బాధను గనుపఱచెను
దుఃఖమయమును మఱి యెంతో దుర్భరంబు
నైన సంసారయాత్రచే నలరినావు
కష్టములనెడి కెరటాల కలవరంబు
నొందు చెన్నినాళ్లో నీవు కుందినావు
మల్లిపూవును బొందంగ మనసుపడుచు
దదనుగుణమైన త్రోవనే తప్పినావు
వేణునాదంబు నాలింప వేడ్కపడుచు
భీకరాక్రోశరావమే వింటివయ్యా
మేరునగరాజ శిఖరాగ్ర మేఘమందు
నింద్రచాపంపు రత్నాల నేరనెంచి
కాలవశమున నజ్ఞానకాననాంత
రనిబిడ నిశీథవీథి బఱచితి వీవు;
తేనెటీగలతో నీవు తేనెకొఱకు
బువ్వుపువ్వును మూర్కొన బూనినావు
కాని యశనిపాతంబుచే గాలిపోయె
లేతలైనట్టి నీ రెండు ఱెక్క లకట!

మిణుగురు పురువులను జూచి మింటనుండు
తారలని యెన్ని, త్రోవను దప్పి వచ్చె
నంచు భ్రమచెంది మతిసెడి యాసపడుచు
దరికి జేరగ నవియెల్ల దరలిపోయె;
పాడినావు నీ వొకమాఱు పాట యేదో
పాట యర్థము తెలియకే పాడినావు
కాని యందలి విరహంపుగాన మంత
మానినీ మనోవీథుల మాఱుమ్రోగె;
సుఖము లేదు! నీకెప్పుడు సుఖము లేదు!

నీదుగాలి సోకినమేర నిజముగాను
సుఖమె లేదయ్యా; యికనీవుసుఖముకొఱకు
బాటుపడుటేల సుఖమేడ? మాట వినుము
వెఱ్ఱియూహల నన్నింటి వెడలద్రోచి
కపటనాటకమంతయు గట్టిపెట్టి
నిదురపొమ్మయ్యా, ప్రియసఖా, నిదురపొమ్ము
నిదురపోవుచో మఱచిపో నీదుబాధ.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# కోతలమూలమున అచ్చొత్తుట

( Stencilling )

కొ. నరసింహాచారి

అక్షరములనుగాని, అంకెలనుగాని, చిన్న చిన్న పేరులనుగాని చాలమారులు వ్రాయవలసివచ్చినప్పుడు కోతలమూలమున అచ్చొత్తుట చాలసహాయకారి యగును. ఒక అట్టమీదగాని, సన్నని తగరపురేకు మీదగాని నకలులు తీయవలసిన విషయమును జంటగీతలమూలమున వ్రాసి గీతలపై కోసి మధ్యనుండుభాగమును చిత్రము 1 a వలె తీసివేయవలెను. పిమ్మట ఆ రేకును మరియొకకాగితముపై నుంచి రేకునందలి సందునందు మనయిష్టమువచ్చిన రంగును కుంచెతో పూసినయెడల చిత్రము 2 నందు వలె నదేగుర్తు పడును. ఈరీతిగ మనకు కావలసినన్ని నకలులను దీయవచ్చును. చిత్రము 1 యందుగలది మిక్కిలి సులభమగు దృష్టాంతము. కాని, చిత్రము 3 నం దుండునట్టి సున్నను కోయవలెనన్న సున్నకుగల రెండుగీతలందును, వెలుపలిగీతం వెంబడి కోయగనే మధ్యనుండు A అను దీవి నిలుచుట కాధారము లేక యూడి వచ్చును (చిత్రము 4). అప్పుడు A అను దీవి నిలిచియుండుటకుగాను దానిని బయటి రేకు భాగము B తో చేర్చియుంచుటకు c, c, అను భాగములను కోసివేయక నిలిపియుంచవలెను (చిత్రము 5). తర్వాత నా రేకును వేరొక కాగితముపై నుంచి దానియందలి సందునందు రంగు పూసినయెడల సున్న యొక్కగుర్తు చిత్రము 5 a యందలివిధముగ నేర్పడును. ఈరీతిగ దీవు లేర్పడు చోటులను తక్కినభాగములతో చేర్చియుంచుటను ముఖ్యముగా గమనించి ఎట్టి అక్షరములనుగాని, అంకములనుగాని, అలంకార రూపములను గాని కోయవచ్చును. 6, 7 చిత్రములందును c, c, భాగములను కోయరాదు. 6 చిత్రము నందు దీవి లేకున్న S అను భాగము మిగుల సన్ననిదై చక్కగా నిలువజాలదు గాన దానికిగూడ c, c, అను ఆధారముల నుంచవలసియుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్రము 8 యందు భారతి యను 11 చిత్రములందు ఇతరవిధములగు రూప
పేరును, దాని కిరుప్రక్కలను, క్రిందను అలం ములు కలవు. ఇటువలెనే జంతురూపము
కార చిహ్నములును కోయబడిన రేకు లును, పక్షిరూపములును, మనుష్యరూప




ములునుగూడ నచ్చొత్తుటకు సాధ్యమగును. సృష్టిరూపములందు స్వభావానుగుణముగ నాయాభాగములకు సరిరంగుల నుపయోగించవచ్చును. ఆకులకు పచ్చయు, పూవులకు వాటిరంగును వేర్వేరుగ వేయవచ్చును.




అచ్చువేయుట కుపయోగించు రంగులను మిక్కిలి నీరుగా కలుపుకొనరాదు. అట్లైన యెడల కుంచెతో రంగు వేయునపుడు, రంగు ఆధారపు అట్ట, రేకు - వీటి క్రిందుగా పారి చిత్రము చెడిపోవును. కాన రంగులు పారిపోకుండునట్లు గట్టిగా నుండవలెను.

నాటకపు నోటీసులను ఈ విధముగ స్టెన్‌సిల్ (Stencil)

మూలమున జేయబడిన అచ్చు కలదు. దీని మూలమున అచ్చువేయుట చాల చౌక
యందు a, b, c అను ప్రదేశములందు గల యగును.
ఆధారములు కోయబడక యున్నవి. 9, 10,

(All rights reserved)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వేదములు - త్రయీశబ్దము - వేదములు మూడా, నాలుగా ?*

కనుపర్తి మార్కండేయశర్మ

కొంతకాలమునుండీ వైదికవాఙ్మయమునుగూర్చి జరిగించిన పరిశోధనములను ఆధునికులగు ప్రాచ్య పాశ్చాత్యవిద్వాంసులు సలుపుచున్నందులకు మనము సంతసించవలయును. తత్పరిశోధనమునకు ఫలితముగ వేదములు మూడా నాలుగా యనుసంశయము పైవిమర్శకులలో కొందఱకు కలిగినది. ఇదివఱకు వేదార్థనిర్ణయార్థము ద్వాదశాధ్యాయాత్మకమగు పూర్వమీమాంసాశాస్త్రమును రచించిన జైమినిమహర్షికిగాని, ఉత్తరమీమాంసాశాస్త్రమును రచించిన వ్యాసభగవానునకుగాని, నిరుక్తకారుడగు యాస్కాచార్యునకుగాని, వ్యాకరణశాస్త్రప్రవర్తకులగు పాణిని పతంజల్యాదులకుగాని, ఆపస్తంబ, ఆశ్వలాయనాది కల్పసూత్రకారులకుగాని, వేదాంగవ్యాఖ్యాతలగు శబరకుమారిలాదివేదవేత్తలకుగాని, వేయేల, స్కందస్వామి, భట్టభాస్కర, విద్యారణ్యాది వేదవ్యాఖ్యాతలకుగాని వేదములు మూడా నాల్గా అనుసంశయ మేలకలుగ లేదు ? అనువిషయము మన కాశ్చర్యమును కలిగించును. అయినప్పటికిన్నీ "యుక్తియుక్తం వచో గ్రాహ్యం" అనున్యాయము ననుసరించి క్రొత్తగా సంస్కృతభాష నభ్యసించి వేదవిమర్శచేయబూనిన మన యీప్రాచ్యపాశ్చాత్యవిమర్శకులవాదమునందు సారమున్న గ్రహించుటయో, లేక పొరపాటుఉన్న అట్టివారికి సవరించుకొనుమని చెప్పుటయో న్యాయము కావున మేమిచట ఆవిమర్శకులవాదమును సంగ్రహముగ ప్రథమమున తెలిపి తరువాత ఆ విషయమును యథామతి విమర్శించుచున్నారము.

## ఆదియందు మూడేవేదము లనువారి వాదసారము

౧. వేదములకు "త్రయీ" అనుశబ్దము నిఘంటువులందును, వైదికవాఙ్మయమునందును ప్రచురముగ గనంబడుచుండుట.

౨. అతిప్రాచీనము లగు ఛాందోగ్యబ్రాహ్మణాదిగ్రంథములందు 3 వేదములని మాత్రమే కనంబడుచుండుట.

ఉదాహరణము :—

౧. అగ్నేర్ ఋచో వాయో ర్యజూంషి సామాన్యాదిత్యాత్, స ఏత త్త్రయీం విద్యా మభ్యతపత్.

—ఛాందోగ్య. ౬. ౧౭.

౨. అగ్ని వాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్, దుదోహ యజ్ఞసిద్ధ్యర్థ మృ గ్యజు స్సామలక్షణమ్.

—మను. ౧. ౨౩.

౩. ఛాందోగ్యముకంటె అర్వాచీనము లగు గ్రంథములందు వేదములు నాల్గని చెప్పబడుట.

ఉదాహరణము :—

౧. అరే, అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదో ఒథర్వాంగిరసః.

—బృహదారణ్యకం. ౪. ౪. ౧౦.

౨. ఏకత శ్చతురో వేదా_ భారతం చైత దేకతః, పురా కిల సురై స్సర్వై స్సమేత్య తులయా ధృతమ్. చతుర్భ్య స్సరహస్యేభ్యో వేదేభ్యో హ్యధికం యదా, తదా ప్రభృతి లోకేఽస్మి_ మహాభారత ముచ్యతే.

* నా 'వైదికవాఙ్మయచరిత్ర' (అముద్రితము) నుండి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. యో విద్యా చ్చతురో వేదాన్ సాంగోపనిషదో ద్విజః, నచాఖ్యాన మిదం విద్యా న్నైవ స స్యా ద్విచక్షణః. —మహాభారతము.

పైన గనంబఱచిన ప్రమాణములవలన ఋగ్యజుస్సామవేదములుమాత్రమే త్రయీశబ్దవాచ్యములయి ఆదికాలమునందు వేదములుగా పరిగణింపబడుచుండుట చేత ముఖ్యవేదములనియు, కావుననే ఛాందోగ్య, మనుస్మృత్యాదులందు మూడు వేదములని స్పష్టముగా చెప్పబడియున్నదనియు, తరువాత కొంతకాలమునకు అథర్వవేద మేర్పడి దానికి ప్రాశస్త్య మేర్పడిన తర్వాత, బృహదారణ్యక, మహాభారతాద్యర్వాచీన గ్రంథములందు అథర్వవేదమునుగూడ వేదములలో పరిగణించి నాల్గువేదము లను వ్యవహారము ఏర్పడినది. కనుక నేటికి వేదములనగా నాల్గనువ్యవహారము రూఢిలోనికి వచ్చినదనియు పై విమర్శకుల వాదసారమయి యున్నది.

## ఇందులకు సమాధానము

త్రయీశబ్దము వేదమంత్రములందుగల రచనా త్రైవిధ్యముచేత ఏర్పడినదిగాని వేదములయొక్క సంఖ్య చేత ఏర్పడినది కాదు. ఋక్కు, యజుస్సు, సామము అనునవి వైదికవాఙ్మయమునందుగల రచనావిభేదము యొక్క నామములు. నియతాక్షరములుగల పాదములు గల మంత్రమునకు ఋక్కని పేరు. ఇట్టిరచనకు మన లౌకికభాషయందు పద్యమనియు, శ్లోకమనియు వ్యవహారము గలదు. పాదవిభాగములేని రచనావిభేద మునకు యజుస్సని పేరు. దీనిని మనలౌకికభాషయందు గద్య మనియు, వచన మనియు వ్యవహరింతురు. ఋగ్యజుర్భిన్నమయి (అనగా గద్యపద్యములకంటె వేఱయి) న గానరూపరచనావిభేదమునకు సామ మని పేరు. దీనిని మనలౌకికభాషయందు గేయము, గానము, పాటలు అని వ్యవహరింతురు. లౌకికభాష యందుగల భాషావిభాగమంతయు గద్య, పద్య, గానాత్మకముకంటె విభిన్నముగ నెటుల లేదో అట్లే వేదచతుష్టయమునందుగల మంత్రములన్నియు ఋక్కు, యజుస్సు, సామము అను త్రివిధరచనలకంటె వేఱుగా లేదు. కావున రచనాత్రైవిధ్యము ననుసరించి వేదములకు త్రయీనామము ప్రాచీనార్వాచీనవాఙ్మయమునం దంతట వ్యవహరింపబడుచున్నది. మఱియొక విశేషము. ఋక్కులుమాత్రము గలదె ఋగ్వేదమనియు, యజుస్సులుమాత్రము గలది యజుర్వేదమనియు, సామములుమాత్రము గలది సామవేద మనియు కొందఱు తలంచుచున్నారు గాని అది చాలపొరపాటు. వైదిక వాఙ్మయపరిచయముగలవా రిట్లు తలంపజాలరు. నిజమేమనగా అపారమయిన వైదికవాఙ్మయము ఆదియందు అఖండాకారముగ వేదమని వ్యవహరింపబడుచు రచనాత్రైవిధ్యముచేత "త్రయీ" అనునామమును వహించె ననియు, తరువాత యజ్ఞాదిక్రియాసౌకర్యార్థము హోతృ, అధ్వర్యు, ఉద్గాతృ, బ్రహ్మలకు సంబంధించిన మంత్రసమూహమును పృథక్కుగా విభజించుటచేత ఋగ్వేదాదినామములతో వ్యవహరింపబడుచున్న దనియు నెఱుంగవలయును.

౧. ఋగ్వేదము — ఋగ్లక్షణములసమంత్రములు నాల్గువేదములందున్నప్పటికిన్ని ఏగ్రంథమునందు ఋగాత్మకములసమంత్రములు అధికముగను, యజుర్లక్షణములసు కుంతాపాదిమంత్రములు అల్పముగను ఉన్నవో అట్టిగ్రంథము ఋగ్వేదమని వ్యవహరింపబడుచున్నది.

౨. యజుర్వేదము—యజుర్లక్షణములసు మంత్రములు నాల్గువేదములం దున్నప్పటికిన్ని ఏగ్రంథమునందు యజుర్లక్షణయులసమంత్రము లధికముగను, ఋక్సామలక్షణములసు మంత్రము లల్పముగను, ఋఙ్మంత్రములనుగూడ యజుస్సును వ్యవహరించి వినియోగాదికమును ఏగ్రంథమునందు ఏర్పఱిచియున్నారో అట్టి గ్రంథము యజుర్వేదము అని వ్యవహరింపబడుచున్నది.

3. సామవేదము—స్తోమములకు గానమునకును మూలభూతములయిన ఋక్కులును, స్తోభలక్షణములయిన కొన్ని యజుర్మంత్రములును ఉన్నప్పటికిన్ని సామరూపము లసు మంత్రము లధికముగ ఏవేదమునందు గలవో అట్టిగ్రంథము సామవేద మని వ్యవహరింపబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇటులు వేదత్రయమునకును రచనాత్రైవిధ్యము ననుసరించి నామత్రయమేర్పడినది.

౪. అథర్వవేదము—ఈవేదమునందున్నూ ఋగ్యజుస్సామములను త్రివిధరచనలుగల మంత్రములున్నను యజ్ఞప్రక్రియకు ప్రథమప్రకాశకుడగు అథర్వమహర్షి యొక్క నామమునుపట్టిగాని, లేక యీవేదమునందుగల అత్యధికసంఖ్యగల సూక్తములకు అథర్వమహర్షి ద్రష్టయగుటచేతగాని, అథర్వవేదము అని వ్యవహరింపబడు చున్నది.

ప్రాచీనగ్రంథములందు మూడువేదము లనియు, అర్వాచీనగ్రంథములందు నాల్గువేదము లనియు చెప్పబడియున్నదనువారికి సమాధానము:—

ఈవిభేదము గ్రంథములను చక్కగా పరిశీలించి చెప్పినది కాదు. ఏలయనగా ఏగ్రంథమునందు మూడువేదములని చెప్పబడియున్నదో ఆగ్రంథమునందే మఱొకచోట నాలుగువేదములనియు, నాలుగు వేదములనిచెప్పియున్న గ్రంథమునందే మఱొకచోట మూడువేదములనియు చెప్పియున్నదను విషయమును ఆయాగ్రంథములను పరిశీలించిన గనబడును. చూడుడు:—

మూడువేదములని చెప్పిన ఛాందోగ్యమునందే మఱొకచోట—

౧. ఋగ్వేదం విజానాతి యజుర్వేదం సామవేద మథర్వాణం చతుర్థమ్.　　(ఛాందో. ౭, ౭)

మనుస్మృతియందు (౧౧,౩౩) ఇట్లు గలదు:—

౨. శ్లో. శ్రుతీరథర్వాంగిరసీః కుర్యాదిత్యవిచారయన్,
వాక్శస్త్రం వై బ్రాహ్మణస్య తేన హన్యాద రీన్ ద్విజః.

నాలుగువేదములని చెప్పిన శతపథబ్రాహ్మణమునందే మఱొకచోట (౧౩. ౫, ౮.) ఇట్లుగలదు—

౩. త్రయో వేదా అజాయంతాగ్నే ర్ఋగ్వేదో వాయో ర్యజుర్వేద స్సూర్యా త్సామవేదః.

౪. త్రయో వేదా ఏతఏవవాగేవర్గ్వేదో మనో యజుర్వేదః ప్రాణ స్సామవేదః. ౧౭. ౧. ౫.

నాలుగువేదములనిచెప్పిన మహాభారతమునందు:

౫. అగ్నిహోత్రం త్రయీ విద్యా. (౧. ౧౦౦. ౬౬)

౬. కచ్చి ద్ధర్మే త్రయీ మూలే (౨. ౫. ౯౮)

౭. న సామ ఋగ్యజు ర్వర్ణాః.(౩.౧౫౦.౧౩)

అనియు గలదు.

కనుక ప్రాచీనగ్రంథములందు మూడువేదములని చెప్పబడినదనియు, అర్వాచీనగ్రంథములందు నాలుగు వేదములని చెప్పబడినదనియు చెప్పుట ప్రమాణవిరహితము.

పాణిన్యాచార్యుడు స్మరించలేదు కావున అథర్వవేదము నవీనమనువారికి సమాధానము:—

ఋగ్యజుస్సామలక్షణములగు మంత్రములే నాల్గు వేదములం దుండుటచేత ఋగ్యజుస్సామస్మరణముచేతనే అథర్వవేదముకూడ స్మరింపబడినట్లు తలంపవలయును. అథర్వయనుమంత్రలక్షణము వేఱుగా లేకపోవుటచేత అథర్వశబ్దమునకు లక్షణము నొసంగవలెను. ఇదియునుంగాక శాకలాదిశాఖలకు ఋగ్వేదమని సాధారణనామ మెట్లో, కఠాదిశాఖలకు యజుర్వేదమని సాధారణనామ మెట్లో, కౌథుమాదిశాఖలకుసామవేదమనిసాధారణనామ మెట్లో, అదేవిధముగా శౌనకాదిశాఖలకుఅథర్వవేదమని సాధారణనామము గలదు. శాకలాదిసంహితాగ్రంథములకు దృష్టత్వము పాణినిసమ్మతముకాదు. పాణినికంటె అతిప్రాచీనకాలమునుండి పరంపరాప్రాప్తమయి వచ్చుచుండుటచేత ప్రోక్తత్వము పాణిన్యభిమతమయి యున్నది. కనుకనే ఋగ్వేదశాఖాప్రవక్తలగు శాకలాదులనుగూర్చి "సూ, శాకలాద్వా. (౪. ౩. ౧౨౮)" చెప్పినట్లే అథర్వవేదీయ శౌనకసంహితాప్రవక్తయగు శౌనకునిగూర్చి "సూ. శౌనకాదిభ్య శ్ఛందసి (౪. ౩. ౧౦౬)" అని సూత్ర మొనర్చియున్నాడు. 'ఛందసి' యనుటకు ప్రత్యుదాహృతముగ శేఖరుడు 'శౌనకీయా శిక్షా' అని ఉదాహరించుటచేత ఇప్పుడు గనంబడుచున్న శౌనకసంహిత (అథర్వవేదము) మాత్రమేకాక 'శౌన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రీయశిష్టగ్రంథముకూడ పాణిన్యాచార్యు డెఱుంగునని మనము విశ్వసింపవచ్చును. ఆ ప్రోక్తాధికారమునందే,

సూ. "కాశ్యపకౌశికాభ్యా మృషిభ్యాం ణినిః" (४. 3. ౧౦3)

సూ. "ఆథర్వణికస్యైకలోపశ్చ."(४.3.౧33)

అని సూత్రించియుండుటచేత అథర్వవేదకల్ప సూత్రమగు కౌశికసూత్రమును "ఆథర్వణికానాం ధర్మ ఆమ్నాయోవా ఆథర్వణః" అనువిషయములు పాణిని కాలమునందు సుప్రచారమేయని గ్రహించవచ్చును. నిరుక్తకారుడగు యాస్కాచార్యుడు పాణినికంటె పూర్వుడని కొందఱు తలంచుచున్నారు. ఆ నిరుక్తము నందును, తన్మూలభూతమగు నిఘంటువునందును అథర్వ వేదప్రశంస గలదు. కావున పాణిని స్మరించలేదు కనుక అథర్వవేదము నవీనమనుట సాహసము. ఋగాదివేదము లకు హోతృ, అధ్వర్యు, ఔద్గాత్రాదినామము లెట్లు న్నవో అట్లే అథర్వవేదమునకుకూడ అనేకనామములు వైదికవాఙ్మయమునందు గలవు.—

అథర్వాంగిరసమనియు (అథ. ౧౦. ౭. ౨౦), అథర్వవేదమనియు (గోపథ బ్రా. ౧. ౨౯), అంగిరో వేదమనియు (శతపథ బ్రా. ౧3. ४. 3. ౮), భృగ్వంగి రసమనియు (గో. బ్రా. ౧. ౧. 3), బ్రహ్మవేద మనియు (అథర్వ. ౧౫. ౬. ౮) క్షత్రవేదమనియు (శతపథ. ౧४. ౮. ౧४. ౨), యాతువేదమనియు (శత. ౧౧. ౫౨. ౨౦), భేషజా అనియు అథర్వవేదప్రశంస, ఇతరవేదములందు (అథ. ౧౧. ౮. ౧४) మున్నగు నామములుగలవు.

ఋగ్వేదమునందు—'చత్వారిశృంగా త్రయో అస్యపాదాః' (४. ౫౮. 3) అనుమంత్రము గలదు. నిరుక్తకారుడగు యాస్కాచార్యు డీమంత్రమునకు వ్యాఖ్యాన మొనర్చుచు "నాల్గువేదములు నాల్గు కొమ్ములు" అని వ్యాఖ్యాన మొనర్చియున్నాడు.

మ. ఋచాం త్వః పోష మాస్తే పుపుష్వాన్
గాయత్రం త్వో గాయతి శక్వరీషు;
బ్రహ్మా త్వో వదతి జాతవిద్యాం యజ్ఞస్య
మాత్రాం విమిమీత ఉత్వః.

—ఋ. ౧౦. ౭౧. ౧౧.

హోతయనుఋత్విక్కు ఋగ్వేదమంత్రముల తోడను, ఉద్గాతయనుఋత్విక్కు సామవేదమంత్రము లచేతను, బ్రహ్మయనుఋత్విక్కు అథర్వవేదమంత్రముల తోడను, అధ్వర్యుడను ఋత్విక్కు యజుర్వేదమంత్ర ములతోడను యజ్ఞమును నిర్వహించుచున్నారని యా స్కాచార్యుడు తననిరుక్తమునం దీమంత్రమునకు వ్యాఖ్యాన మొనర్చియున్నాడు.

యజుర్వేదమునందు:—ఋగ్భ్యస్స్వాహా యజు ర్భ్యస్స్వాహా సామభ్య స్స్వాహాఽంగిరోభ్య స్స్వా హా వేదేభ్యస్స్వాహా.

—తైత్తిరీయసంహిత. ७. ౫ ౧౧. ౨.

ఇచట "అంగిరోభ్యస్స్వాహా" యనుటచేత అథర్వవేదము గ్రహింపబడినది.

ఋచో య జూగ్ంషి సామా న్యథర్వాంగిరసః.
—తైత్తిరీయబ్రాహ్మణము. 3. ౧౨. ౮. ౨.

"పయ ఆహుతయో హవా ఏతా
దేవానాం యదృచః......
ఆజ్యాహుతయో హవా ఏతా
దేవానాం యద్యజూగ్ంషి......
సోమాహుతయో హవా ఏతా
దేవానాం యత్సామాని......
మేద ఆహుతయో హవా ఏతా
దేవానాం య దథర్వాంగిరసః."

—శుక్లయజుః. శతపథ. ౧3. ౫. ७. 3. ౬.

"తస్య యజురేవ శిరః
ఋగ్దక్షిణః పక్షః
సామోత్తరః పక్షః
అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా."

—తైత్తి-ఉపనిషత్. ౨. ౧. 3.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"భేషజం వా ఆథర్వణాని"

—(సామ) పంచవింశబ్రాహ్మణ ౧౬. ౧౦. ౨.

"ఋచో యజూంషి సామా న్యథర్వాంగిరసః."

—తై. ఆర. ౧౧. ౯. ౧౦.

గోపథబ్రాహ్మణముండకోపనిషత్తులు అథర్వవేదమునకు చెందినవగుటచేత ఆగ్రంథములనుండి ప్రమాణముల నిటప్రదర్శింపలేను. అన్నివేదములయొక్క కల్పసూత్రములందున్నూ, రామాయణమహాభారతాదీతిహాసములందున్నూ, ప్రామాణికమగు ఇతరార్షేయ గ్రంథసముదాయమందున్నూ అథర్వవేదమునకు సంబంధించినయుల్లేఖ గలదు. మన వైదికవాఙ్మయమునందుగాని, ఆర్షేయమగు పౌరాణికవాఙ్మయమునందుగాని, కాళిదాసాదిమహాకవిప్రోక్తమగు లౌకిక వాఙ్మయమునందుగాని ఆదియందు మూడువేదములే యుండి తరువాత అథర్వవేదము వెలసినతరువాత వేదములు నాల్గని వ్యవహరింపబడిన వనుసిద్ధాంతము కంఠోక్తముగ గాని, సూచనముగగాని తెలుపబడియుండలే దనువిషయమును పాఠకులు గమనించవలయును.

పైన గనంబఱిచిన ప్రమాణములవలన ఋగ్యజుస్సామవేదములు మూడింటియందున్నూ అథర్వవేదముయొక్క ప్రశంసయుండుటచేత అన్నివేదములవలెనే అథర్వవేదముకూడ ప్రాచీనమేయనియు, త్రయీశబ్దముయొక్క ప్రవృత్తికి కారణము వేదమంత్రములయొక్క రచనావైవిధ్యమేకాని మఱొకకారణము లేదనియు పాఠకు లెఱుంగుదురుగాక!

ఈ విషయమునే సర్వానుక్రమణీవృత్తియందు వ్యాఖ్యాత ఇట్లు నిరూపించియున్నాడు:—

శ్లో. వినియోక్తవ్యరూపశ్చ త్రివిధ స్సంప్రదర్శ్యతే;
ఋగ్యజుస్సామరూపేణ మంత్రో వేదచతుష్టయే.
అహే బుధ్నియమంత్రం మే
గోపాయే త్యభిధీయతే;
ఋక్పాదబద్ధా, గీతంతు సామ
గద్యం యజుర్మంత్రః
చతుర్ష్వపిహి వేదేషు
త్రిధైవ వినియుజ్యతే.

పై శ్లోకములవలన గ్రంథభేదముచేత వేదములు నాల్గు అయినప్పటికిన్నీ, పైనాల్గువేదగ్రంథములందునూ గల రచనావైవిధ్యముచేత పై నాల్గువేదములకు త్రయీత్వముకూడ నిరాఘాటముగ చెల్లును.

మఱొకవిషయము: అథర్వవేదము లేనికాలమునందు ఋగ్యజుస్సామవేదములకు త్రయీ, అనుపదము వ్యవహరింపబడెనని చెప్పెడివారీ క్రిందివిషయమును గమనించవలయును. స్వయముగ అథర్వవేదమునందనేక స్థలములందు ఋగ్యజుస్సామములయొక్క వర్ణనము గల మంత్రము లనేకములు గలవు:—

మం. యత్రఋషయః ప్రథమజా
ఋచ స్సామ యజు ర్మహీ,
ఏకర్షి యస్మి న్నర్పితాః స్కంభంతం
బ్రూహి కతమస్స్విదేవసః.-అథ.౧౦.౭.౧౪.

మం. విద్యాశ్చ వా అవిద్యాశ్చయచ్చాన్య దుపదేశ్యమ్,
శరీరం బ్రహ్మ ప్రావిశ దృచ స్సామాథో యజుః.
౧. ౧౦. ౨౩.

అప్పుడీమంత్రములప్రాదుర్భావకాలమునందు అథర్వవేదము లేదని చెప్పినయెడల అసంగతముగానుండునుగదా. కనుక వేదములకు త్రయీశబ్దము పర్యాయపదముగా నున్నదని వేదములు మూడని చెప్పుట మాత్రము ప్రామాణికము కాజాలదు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మహాత్మున్ రాక

తుమ్మలపల్లి వేంకటరత్నము పంతులు

నిజపదస్పర్శచే నిమ్నోన్నతాయిత క్షితిమండలము సమీకృతి వహింప
నిర్మలమందహాసోర్మి నానావర్ణ విమతత్వ మైకవర్ణ్యముభజింప
ఆత్మబాహాయష్టి నాతలాతలమర్దిత శ్వపాకాళి కైదండ గొనగ
తనయహింసాపరత్వములో జలాచల విశ్వంబును ప్రశాంతి నిశ్వసింప
తనదువ్యాహారసరణిలో ననుపదంబు - నఖిలమతబోద్ధ లైకకంఠ్యముననిలుప
నాంధ్రమాతృకయాశీస్సు లందికొనగ - తా నరుగుదెంచె మోహనదాసుడిపు డ.

కోకిల లొండొరుల్ బిలిచికొన్నవి, వాని రవమ్ము బంచమ
స్వీకృతియే వెలార్చెను వచించెడి స్వాగతవాక్ప్రణాళికన్
చీకటితోన కొంత వికసిల్లె మనోజ్ఞకుసుంభరక్తిమన్
ప్రాకటలీల నేడిచట బంచమభూతముఖాంచలంబులున్.

అది యస్పృశ్య మవాచ్యహా నొక గరీయంబౌ మహోరేఖికా
భ్యుదయం బాంధ్రవసుంధరోపరి స్వయంభూనేత్రరోచిస్సుధా
స్పదమై,—ఘోరతమిస్రపుంజ మవనీపశ్చార్ధగోళాన కా
ర్తిదమై పర్వ—వెలింగె నేడు గుజరాతీ వైశ్యవర్చస్సుగన్.

అది యనార్షం బనాగ్నేయమైన తేజ-మద్ది నిర్ధూమధామ హోమాగ్నిజిహ్వ
అనుచు గనకకలాపాదు లతనిలోన-నాహుతియొనర్చె నంగనావ్యూహ మిచట.

హృదయము తేనెసోన లెగయింపగ జేరెడు మేకపాలతో
నెదిగిన కుక్షిలోన జగమెల్ల ధరించెడి ధైర్యలక్ష్మి తా
బెదవుల దాండవించుగతి బెంపువహించిన వాక్ప్రవృత్తిలో
నొరిగిన పిన్ననవ్వ భరతోర్వికి బాసటగాదె నిచ్చలున్.

హరిజనసేవకై వెడలినట్టి మహాత్ముని పాదపూజకై
కురిసిన నేటి యీ కనకకోమలవర్ష పరంపరాప్లుతిన్
మురియు వసుంధరాస్థలిని మోసులు వెట్టి స్వతంత్ర సస్యముల్
విలుగబడున్ నిరంతరము వ్రీహిభరాలసవేపితంబులై,

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. 'ఉత్తరాయణము' —రవీంద్రుని భవనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆయుర్వేదము: ఆలోపతీ

డాక్టరు కనగాల లక్ష్మీ నరసింహారావు

గమ్యస్థానము చేరడానికి క్రొత్తమార్గాన నడచేటప్పుడు అక్కడక్కడ ఒక్కొక్కమజిలీలో కొంచెము ఆగి వెనకకు తిరిగి కాస్త సింహావలోకనము చేసి "ఇప్పుడు మనము ఎక్కడ ఉన్నాము? ఇక ముందు ఎట్లు పోవలెను?" అనేసంగతులు నిర్ణయించుకోవడము నేతకుమాత్రమేకాకుండా సహచరులకూ, అనుచరులకూకూడా ప్రయోజనకరముగా ఉంటుంది. ప్రస్తుతసందర్భములోకూడా అంతే.

ఆయుర్వేదాన్నిగురించి ఇప్పటికి మూడువ్యాసాలయినవి. మొదటివ్యాసములో ఆయుర్వేదాన్ని నేను ఏప్రకారముగా గ్రహించానో సంగ్రహముగా సూచించాను. అనగా చెప్పదలచినదానిలో శతాంశముకూడా చెప్పలేదని నాఅభిప్రాయము. కాని మామూలుధోరణిలోకాకుండా క్రొత్తధోరణిలో విషయాన్ని ప్రదర్శించడమువల్ల నేను దానిని ఏదృష్టితో చూస్తున్నానో తెలిసేనిమిత్తము, నాదృక్కోణము ఇదమిత్థమని నిర్ణయించడమూ, అందుకు కారణాలుకూడా చెప్పడమూ తప్పనిసరి అయినది. కాని కొందరికి ఈదృక్కోణనిర్ణయావశ్యకత తగినంత బోధపడినట్టుగా కనుపించదు. ఎందుచేతనంటే ఆయుర్వేదాన్నిగురించి వ్రాయడము ప్రారంభించి మొదటి వ్యాసము కావడముతోనే దృక్కోణనిర్ణయముకొరకు ఇంతగా వ్రాస్తూఉంటే, ఇక అసలువిషయములోకి దిగేది ఎప్పుడు? అనేప్రశ్న కలుగడము సహజము. కాని దృక్కోణాన్నిగురించి ముందుగా నిర్ణయించుకుంటేనేతప్ప విషయాన్నిగురించి ఏమిచెప్పినా ప్రయోజనము లేదు. వ్రాసేవారికి, చదివేవారికి భాష ఒక్కటే అయినప్పటికీ, కొద్దిమందికితప్ప మిగిలినవారి భావాలు వేరుకావడమువల్ల ఒకరినొకరు అర్థముచేసికోవడానికి అవకాశము ఉండదు. అడుగడుగుకూ మితిమీరిన సందేహాలు కలుగుతవి. అది సహజము. అప్పుడు "నాదృక్కోణము ఇది, మీదృక్కోణము అది" అని చెప్పుకోవలసిన అవస్థ తటస్థిస్తుంది. అంతకంటే ముందుగానే దృష్టిభేదమునుగూర్చి విమర్శించి దృక్కోణాన్ని నిర్ణయించి, వ్రాయతలచుకొన్న దేదో ఆతరువాతనే వ్రాస్తే నా దృష్టితో చూచేవారే నావ్రాతలను చదువుతారు; విషయము గ్రహిస్తారు. నాదృష్టితో చూడలేనివారూ, చూడతలచుకోనివారూ సాదరముగా చదువనేచదువరు. ఒకవేళ చదివినా గ్రహించరు. కనుక ఈదృష్టినిర్ణయమువల్ల వారికీ, నాకూకూడా వృథాప్రయాస తప్పుతుంది. నాదృష్టిలో చూచేవారికి సందేహాలు కలుగకనేపోవచ్చును. ఒకవేళ ఏవయినా సందేహాలు కలిగినప్పటికీ అవి సులభంగా తీర్చడమునకు అవకాశము ఉంటుంది. కాని దృష్టిలోనే భేదము కలిగినప్పుడు ఒకరుచెప్పేది మరొకరికి కేవలము విరుద్ధముగాను, అసందర్భముగాను, హాస్యాస్పదముగాను కనుపిస్తుంది. అట్టిసందర్భములో కలిగే ప్రశ్నలకు సహృదయత, సౌమనస్యము ఉండదు. అందుచేత వాటికి సమాధానము చెప్పకూడదు. ఒకవేళ సమాధానము చెప్పడానికి ప్రయత్నముచేసినప్పటికీ ప్రయోజనము ఏమీ ఉండదు. కనుక దృక్కోణనిర్ణయమే ప్రథమకర్తవ్యము అయినది.

అప్రత్యక్షవిషయాలనుగురించి విచారించేటప్పుడు నానాతః ఎన్నోదృక్కోణాలు ఉన్నట్టు కనుపించినా నిజమయినవి రెండే. అన్నీ ఈరెంటిక్రిందకూ రావలసినవే. ఒకటి పారమార్థికమూ, రెండవది వ్యావహారికమూ. ఒకటి సూక్ష్మమూ, రెండవది స్థూలమూ. సృష్టియొక్క ద్వైరూప్యమంతా ఈస్థూలసూక్ష్మాలలో ఇమిడి ఉన్నది. Nothing is lost when a candle burns—అనగా కొవ్వొత్తి కాలినప్పుడు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయిం దేదీ లేదు అని ఈనాటి విద్యార్థులు చదువుకొనే రసాయనశాస్త్రగ్రంథాలలో ఉంటుంది. కేవలము స్థూలదృష్టికి ఇది ఒక పిచ్చిమాటలాగ కనిపిస్తుంది. కాని రసాయనశాస్త్రపరిచయము ఏమాత్రము ఉన్నప్పటికీ దానిభావము అర్థమవుతుంది. కొవ్వొత్తియొక్క రాసాయనికవస్తుసమ్మేళనమునకు భంగము కలుగడమువల్ల రూపము అదృశ్యమైనదే కాని అసలు వస్తువులు నశించిపోలేదని అతనికి బోధపడుతుంది. అవసరమయితే శాస్త్రప్రయోగము (scientific experimentation)వలన ఋజువుపర్చడమునకు వీలుంది. కాని "మనుష్యుడు మరణించినాడు" అన్నప్పుడు దహనసంస్కారాదులవలన పాంచభౌతికశరీరము పంచభూతములతోనూ కలిసిపోయిందంటే అర్థమవుతుందే కాని శరీరము మరణించినా దానిలోని ఆత్మపదార్థము మాత్రము ఏవిధమైనమార్పున్నూ చెందకుండా నిలచి ఉన్నదని చెపితే మామూలు రసాయనశాస్త్రజ్ఞుడికి మాత్రము విరుద్ధమైన విషయముగా తోస్తుంది. కాని ఆత్మానాత్మవివేకము పొందిన తత్త్వవేత్తకు అదివరకే తెలిసిన ఒక సాధారణవిషయముగా కనుపిస్తుంది. కేవలము అచేతనమూ, మానవనిర్మితమూ అయిన పదార్థము విషయములోనే స్థూలసూక్ష్మదృష్టిభేదమునకు ఇంత అవకాశము ఉన్నప్పుడు భగవన్నిర్మితమయి ఆత్మతో కూడియుండిన చేతనపదార్థాలలో ముఖ్యమైన మనుష్యుడి విషయములో ఏవిధముగా ఉండేదీ వేరే చెప్పనక్కరలేదు. అందుచేతనే మృత్యువు దేహానికేగాని ఆత్మకు లేదని చెప్పినందుకుగాను "సాక్రెటీజు" వంటి మహానుభావుడికి మరణదండన విధించారు. మనుష్యుడు మరణించడముతోనే, అనగా ఆత్మ శరీరాన్ని విడచినతోడనే ఆశరీరములో ఉండే పంచభూతముల సమ్మేళనానికీ భంగము కలిగి దేనిలోనిది కలిసిపోయినప్పటికీ ఆత్మ మాత్రము మార్పుచెందక ఒకేవిధముగా నిలచిఉంటుంది అని చెపితే ఆత్మానాత్మభేదము తెలిసికోగలిగినంత సూక్ష్మదృష్టికలవాడికి అర్థమవుతుంది. స్థూలదృష్టితో చూచేవాడికి అసందర్భముగా కనిపిస్తుంది. ఆయుర్వేదానికి ఆలోపతీకి ఇట్టితారతమ్యమే ఉంది.

అందుచేతనే ప్రాక్పశ్చిమదృష్టులంటే ఏమిటో, అవి ఏవిధముగా ఏర్పడినవో, వాటికి భేదము ఎందుకు కలిగినవో, అవి మనకు ప్రపంచములో ఏవిధముగా వ్యక్తమవుతున్నవో, వాటికి ఉండేభేదము ఆయుర్వేద ఆలోపతీ వైద్యసంప్రదాయములలో ఏవిధముగా కనుపిస్తున్నదో ఇదివరకే సూచించాను. ఈదృష్టిభేదము మొదట్లోనే గుర్తిస్తే అనవసరమైన సందేహాలకు, అపోహాలకు అంతగా అవకాశము కలుగదు. ఒకవేళ ఏదైనా కలిగినా అవి తీర్చడము సులభము. కనుక ఆయుర్వేదానికీ భారతీయదృష్టికీ ఉండే సంబంధముచెప్పడముతోపాటు ఆలోపతీకీ పాశ్చాత్యదృష్టికీ ఉండే సంబంధము చెప్పవలసివచ్చినది. మొత్తముమీద ఆయుర్వేదము ప్రతివిషయమూ పారమార్థికముగా సూక్ష్మదృష్టితో లోతుకుదిగి చూస్తుందనీ, ఆలోపతీవ్యావహారికముగా స్థూలదృష్టితో పయిపయినమాత్రము చూస్తుందనీ ఇదివరకే స్పష్టపరచాను. కాని ఈవైద్యసంప్రదాయాలకు ఈవిధమైన దృష్టిభేదము కలుగడానికి ప్రబలమైన హేతువు ఏమయి ఉంటుంది? అనే ప్రశ్నకు సమాధానము కావాలి.

ఆయుర్వేదానికి ఆధారము యోగదృష్టి. ఆలోపతీకి ఆధారము ఆధునికశాస్త్రప్రయోగము, తార్కికపద్ధతి. మనస్సు భ్రమప్రమాదములకు వశమై ఉన్నదనే సంగతి గ్రహించి జ్ఞానసముద్రుడయిన పరమేశ్వరధ్యాననిమగ్నులైన మహర్షులు సమాధ్యవస్థయందు దర్శించిన మహాసత్యాలతో ఆయుర్వేదము నిండి ఉన్నది. వేలకొలదిసంవత్సరాలు గతించినప్పటికి ఆసత్యాలు నేటివరకు మారలేదు. అందుచేతనే అవి సత్యాలని చెప్పడానికి అవకాశము కలిగింది. అట్టి సత్యాలపయిన నిలచి ఉన్నదే ఆయుర్వేదవైద్యశాస్త్రము. ఆకారణమువల్లనే దాని మూలసిద్ధాంతాలకు మార్పుకలుగలేదు. కాని ఆలోపతీ వైద్యశాస్త్రముయొక్క సిద్ధాంతాలు భ్రమప్రమాదవశములైన ఆధునికశాస్త్రప్రయోగముమీదా, తర్కపద్ధతులపయినా నిలచిఉండడమువల్ల అవి తరుచుగా మారుతూ ఉంటవి అనేసంగతి జగత్ప్రసిద్ధము. ఈలాటి సందర్భాలున్నవని తెలిసినవారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూడా ఆయుర్వేదము ఏవిధమైన అభివృద్ధిన్నీ పొందకుండా పూర్వకాలములో ఎట్టి స్థితిలో ఉండేవో ఇప్పటున్నూ అట్టి స్థితిలోనే ఉన్నదనిన్నీ, ఆలోపతీ దినదినాభివృద్ధి పొందుతూ ఉన్నదనిన్నీ సామాన్యముగా అనేమాట. అనగా వారి అభిప్రాయప్రకారము దేనికీకూడా మార్పు కలిగితేనేకాని అభివృద్ధి లేదని తేలింది. ఆవిధముగా ఆలోచిస్తే ఆయుర్వేదానికి అభివృద్ధి ఏమీ లేదని చెప్పవలసివస్తుంది. కాని సత్యము మారదు. మారేది సత్యముకాదు. అయితే అభివృద్ధి అంటే ఇక అర్థము ఏమిటి ? అసత్యాన్నుండి సత్యాన్ని పొందడానికి చేసే మహాప్రయత్నమే అభివృద్ధి అని చెప్పాలి. ఇంగ్లీషులో దీనికి పర్యాయపదం "ప్రోగ్రస్" (Progress). సరిగా యోజిస్తే అది ప్రాప్తికొరకు చేసే అన్వేషణముకాని వ్యాప్తివికాసాలను సమకూర్చే అభివృద్ధీ, విజృంభణమూ కాదు. మార్పులేని శాశ్వతసత్యాలకూ, స్థిరసిద్ధాంతాలకూ మాత్రమే అట్టివ్యాప్తివికాసాలు పొందడానికి అధికారము ఉన్నదికాని ఎప్పటికప్పుడు సత్యాలనేభ్రాంతి కలిగిస్తూ గడియగడియకూ మారేటటువంటి ఆభాస సత్యాలకు అధికారములేదు. కాని మనము ప్రత్యక్షముగా చూచేది దీనికి కేవలమూ విరుద్ధముగా ఉన్నది. ఏమంటే, తరుచుగా మారుతూ ఉండే సిద్ధాంతాలతో నిండిన ఆలోపతీకి విశేషప్రచారమూ, వ్యాప్తివికాసాలూ, అనగా తద్రూపకమైన అభివృద్ధి ఉన్నదనీ, ఆయుర్వేదానికి అట్టి అభివృద్ధి లేదనీ ఒప్పుకోకతప్పదు. ఇది చాలా అసందర్భముగాను, అన్యాయముగాను కనిపిస్తుంది. ఈ సమస్యకు "దీని భావమేమి తిరుమలేశ" అని ప్రశ్న వేసికొంటే సమాధానము ఏమి వస్తుందో చూస్తాం.

"యథా రాజా తథా ప్రజాః" ఉభయులకూ, అనగా ప్రభుత్వానికీ ప్రజకూకూడా సత్యంపయిన అనాదరము, అసత్యంపయిన ఆదరము కలిగినవి. ప్రస్తుత ప్రభుత్వవిధానమూ, ప్రస్తుతవిద్యాపద్ధతీ, పాశ్చాత్య నాగరకతాప్రభావమూ అన్నీ ఇందుకు కారణాలైనవి. అందుచేత అమానుషములైన ఆయుర్వేదసత్యాలు శాశ్వతముగా నిలిచేవి అయినప్పటికీ ఈ కాలములో ఆలోపతీపొందే అభివృద్ధి ఆయుర్వేదము పొందడము అసంభవము. అది పొందతగిన అభివృద్ధి వేరు. దేశకాలపాత్రాలనుబట్టి శాస్త్రంయొక్క కళారూపము మారుతూ ఉంటుంది. అనగా వ్యాప్తివికాసాలతో కూడిన అభివృద్ధి పొందుతూఉంటుంది. సత్యము దేశకాలపాత్రభేదాన్నిబట్టి వివిధరూపాలువహించి వ్యాప్తివికాసాలు పొందుతూ తానుమాత్రము మారకుండా ఉంటుంది. కనుక సత్యానికి మార్పులేకపోయినా వ్యాప్తివికాసరూపకమైన సంతతాభివృద్ధి దానికి సిద్ధిస్తూన్నది. సత్యంకావడమువల్ల అది పొందే అభివృద్ధి ప్రపంచకల్యాణానికి తోడ్పడుతుంది. ఆలోపతీసంగతి వేరు. ఆధునికశాస్త్రరీత్యా అది సత్యాలని భ్రమించినవాటిని అమలులో పెడుతుంది. అనగా మానవకోటిమీద ప్రయోగిస్తుంది. ఆప్రయోగములో కలిగే ఫలితాలనుబట్టి కొంతకొంతకాలానికి కొన్నికొన్ని సిద్ధాంతాలు మారుతూఉంటవి. మార్పుచెందిన ఆసిద్ధాంతములు తిరిగీ మనుష్యులపైని ప్రయోగించి చూచినమీదట కలిగే ఫలితాలనుబట్టి తిరిగీ కొన్ని మారుతూఉంటవి. ఈవిధముగా ఆధునికశాస్త్రములూ, వాటినిబట్టి ఆలోపతీ వైద్యశాస్త్రమూ అనుదినమూ మారుతూ తద్రూపకమైన అభివృద్ధి పొందుతూ ఉన్నవి. సత్యాలైనా కాకపోయినా ఎప్పటికప్పుడు సత్యాలని నమ్మినవాటిని ప్రజపైన ప్రయోగించి చూడకపోతే వారిశాస్త్రము ముందుకు నడచే ఉపాయము లేదు. ఒకసిద్ధాంతము సత్యమనే భ్రాంతితో కొంతకాలము అమలులోఉండి తరువాత పొరపాటని ఋజువుపడేసరికి దానిప్రయోగమువల్ల ఎంతమందికో అపాయము తటస్థించిఉంటుంది. శాస్త్రపరిశోధనావిధానములో ఈప్రజాక్షయమునకుకూడా ఒకగౌరవస్థానము ఉన్నదని వారి సంప్రదాయము. ప్రాచీనమహర్షులు చెప్పిన సత్యసిద్ధాంతాలను గ్రహించి వాటి వ్యాప్తివికాసాలకు తోడ్పడడానికిబదులు ఎప్పటికప్పుడు వారు సత్యాలనుకొనే సిద్ధాంతాల ప్రచారప్రయోగాలకు తోడ్పడడము న్యాయము కాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశకాలపరిస్థితులనుబట్టి ఆయుర్వేదానికి అభివృద్ధి కలుగలేదు. ప్రభుత్వాదరము లేకపోవడాన్నిబట్టిన్నీ, పాశ్చాత్యనాగరకతావ్యామోహములో పడిపోవడమువల్ల భారతదేశానికి కలిగిన స్వస్వరూపజ్ఞానశూన్యతనుబట్టిన్నీ ఆయుర్వేదసత్యాలకు వ్యాప్తికి అవకాశాలు పోయినవి. అనగా దేశకాలపాత్రానుసరణంగా ఆయుర్వేదశాస్త్రం కళారూపం వహించి అభివృద్ధి పొందడము లేదన్నమాట. అందుచేతనే భారతీయుల ఆయురారోగ్యాలకు తీరనిలోపము కలిగింది. అంతేకాకుండా సత్యాలనే భ్రాంతితో అసత్యసిద్ధాంతాలను భారతీయులపైన ప్రయోగించడమువల్ల ఆలోపతీ భారతదేశానికి చేసిన అపకారానికి నిష్కృతిలేదు. అది దేశానికి చేసిన ఉపకారము అనంతఅయితే అపకారము కొండంత. ఆలోపతీ ప్రపంచానికి చేస్తూఉన్న అపకారాన్ని తెలుపుతూ పాశ్చాత్యవైద్యశాస్త్రవేత్తలు కొందరు దాన్ని ఖండించడాన్నిబట్టి భారతదేశములో కూడా, ముఖ్యముగా విద్యాధికులలో కొంత అలజడి కలిగింది. ఆలోపతీవైద్యశాస్త్రాన్ననుసరించి చేసే చికిత్సయొక్క గుణము నిలచేదికాదనీ అప్పటికప్పుడు కొంతవరకు రోగనివారణ చేసినట్టు కనుపించినా క్రమక్రమముగా అపకారము చేస్తుందనీ, అనేకమందికి బోధపడింది. అంతేకాకుండా దాన్ని ఖండించిన ఇతరపాశ్చాత్యవైద్యశాస్త్రాలపైని వారికి కొంత అభిమానముకూడా కలిగింది. అనగా హోమియోపతీ (Homoeopathy), టిష్యూరెమిడీసు (Tissue remedies) న్యాచురోపతీ (Natureopathy), క్రోమోపతీ (Chromopathy) మొదలైనవాటియందని నా అభిప్రాయము.

అట్టిసమయములో ఆయుర్వేద పునరుద్ధరణానికి దేశములోని మహామహులు చాలాపాటుపడడమువల్ల ఆయుర్వేదానికి ఒకస్థానము ఏర్పడడమూ, అదినిలబడడానికి అవకాశముకలగడమూ తటస్థించినవి. దేశములో ఆయుర్వేదకళాశాలలు స్థాపించి, విద్యార్థివేతనములిచ్చి యువకులకు ప్రోత్సాహము కలిగించడమువల్లనూ, అక్కడక్కడ సభలుచేసి ఆయుర్వేదముయొక్క గొప్పతనాన్నిగూర్చి జనులకు బోధించడమువల్లనూ దేశములో ఆయుర్వేదవైద్యాన్నిగూర్చి గడచిన ముప్ఫైనలభైసంవత్సరాలకాలంలో గొప్పప్రబోధము కలిగినది. వంగదేశముమొదలైనవి ఇంతకంటే కొంచెముముందుగానే మేలుకొన్నవి. అట్టిస్థితిలో ఏమిచేయాలో ప్రభుత్వానికి తోచలేదు. ఆయుర్వేదానికి తగినంత ఊత ఇచ్చి అభివృద్ధిలోకి తీసికొని రావడానికా మనసొప్పదు. నిర్మూలనము చేయడానికా సాహసములేదు. అందుచేత వారి మామూలుపద్ధతిప్రకారము దాని బాగోగులు నిర్ణయించి రిపోర్టుపంపేనిమిత్తము ఆలోపతీవైద్యశాస్త్రములో ఆరితేరిన ఒకభారతీయుణ్ణి నియమించారు. "తానొకటితలస్తే దైవ మొకటి తలుస్తాడు" అన్నట్టుగా ఆభారతీయుడు సత్యాన్వేషకుడు కావడమువల్ల ఆయనకు సత్యమే గోచరించింది. అందుచేత ఆయన ఆయుర్వేదముయొక్క గొప్పతనాన్ని గూర్చి విశదపరుస్తూ దానికికూడా దేశములో ఒకస్థానము ఉన్నదని తెలియచేశాడు. ఇది పచ్చివెలక్కాయ గొంతుకపడ్డట్టయినది. కొరవిపెట్టి తలగోక్కున్నట్టయినది. చెన్నపట్నములో గవర్నమెంటు స్కూలు ఆఫ్ ఇండియన్ మెడిసన్ (Government School of Indian medicine) స్థాపించడానికి పూర్వరంగముగా పరిణమించింది. ప్రస్తుతము యల్. ఐ. యమ్. లను తయారుచేసేది ఇదే. ప్రభుత్వానికి దీనియెడల సవతితల్లిప్రేమ ఉన్నదనే సంగతి అందరికీ తెలిసినవిషయమే. కాని దాని అధ్యక్షుని ఉదారాశయాలనుబట్టి అది క్రమక్రమముగా అభివృద్ధిచెందే సూచనలు కనుపిస్తున్నవి. మన రాజధానిలో ఆయుర్వేదపునరుద్ధరణానికీ, దాని క్రమాభివృద్ధికీ తోడుపడినవారిలో ముఖ్యులు అనేకబిరుదాంకితులై కీర్తిశేషులైన పండిత డి. గోపాలాచార్యులుగారున్నూ, డాక్టరు లక్ష్మీపతీ, క్యాప్టను శ్రీనివాసమూర్తీ, డాక్టరు కోమనుగార్లున్నూ చిరస్మరణీయులు. ఇకముందు ఆయుర్వేదాభివృద్ధికి ఎవరెంత పాటుపడినప్పటికీ, దాని పునఃప్రతిష్ఠాపనమునకు కారకులైన వారిలో వీరు అగ్రగణ్యులని చెప్పక తప్పదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని ఈ విషయములో ఎవరెంత పాటుపడినా ఎదురీతగా పరిణమించింది. ప్రభుత్వాదరము లేకపోవడమువల్ల కష్టము ఎక్కువ, ఫలము తక్కువ. ప్రభుత్వమువారి దృక్కోణము మారనంతవరకు వారు దానికి ప్రచారము కలిగించరు. మొన్న మొన్నటివరకు ఆయుర్వేదము విస్మృతము కావడమువల్ల తగినంత ప్రచారము ఉంటేనేగాని దాని ప్రాముఖ్యము జనులకు బాగా బోధపడదు. కాని ఎవ రెన్ని ఆటంకాలు కలిగించినప్పటికీ ఆయుర్వేదానికి ఈపాటి అభివృద్ధి కలిగిందనే విషయముకూడా ఒక గొప్పసంగతే. జనసామాన్యమునకూ, విద్యాధికులకూకూడా ఆలోపతీవైద్యంపైన, అందులో ముఖ్యముగా "ఇంజక్షనుల" (Injections) ఎడల ఉన్న వ్యామోహానికి మితిలేదు. ఆయుర్వేదముపయిన వారికి కొంతఅభిమానము ఉన్నమాట వాస్తవమే కాని, దానియెడల తగినంత కాంక్ష కలగలేదు; దానికి తగినంత ప్రాముఖ్యమును ఇవ్వవలెననే దీక్ష కలుగలేదు. పాశ్చాత్యనాగరకతావ్యామోహములో మునిగిపోయి, యుక్తాయుక్తములను, హితాహితములను నిర్ణయించగలిగిన శక్తిని కోల్పోయిన భారతీయుల హృదయములో దాని శక్తిసామర్థ్యాలూ, గొప్పతనమూ లగ్నముకాకపోవడమే ముఖ్యకారణము. ఆలాజరగడానికి ప్రభుత్వసహాయము అవసరము. అది కలిగినప్పుడే దానికి తగినంత ప్రచారము కలుగుతుంది. దాని అభివృద్ధికి తగిన సౌకర్యాలు ఏర్పడుతవి. అప్పుడు ఆయుర్వేద, ఆలోపతీలకు ఉండే తారతమ్యాన్ని ప్రయోజనాన్ని అనుసరించి హిందూదేశములో దేనికి ఎటువంటి స్థానము ఇవ్వవలసినదీ నిర్ణయము అవుతుంది.

ప్రస్తుతము ఏదయినా వ్యాధిని ఆలోపతీ అసాధ్యమని వదలివేసినప్పుడుమాత్రము గత్యంతరము లేకపోవడమువల్ల ఆయుర్వేదవైద్యునివద్దకు పోతారు. అనగా రోగము ముదిరి రోగి ఇటాఅటా అనేస్థితిలో ఉన్నప్పుడు ఆయుర్వేదము శరణ్యము అవుతూ ఉన్నది. ఆ-అయినప్పటికీ ఆయుర్వేదము యథాశక్తి సహాయపడుతూనేఉన్నది. అసాధ్యమనుకొనే అనేకవ్యాధులను నివారణచేసి ఆలోపతీవైద్యులకు ఆశ్చర్యము కలిగిస్తూ ఉన్నది. ఆయుర్వేదసంప్రదాయాన్ని అనుసరించి అసలు వ్యాధి రాకుండానే కాపాడడానికి, వచ్చిన రోగాన్ని సులభముగా నివారణచేయడానికీ తగినంత సాధనసంపత్తి ఉన్నది. కాని ఆలోపతీయెడలనూ, దానికి సంబంధించిన 'ఇంజక్షనులు' మొదలైన నూతనపద్ధతులయెడలనూ ఈనాటివారికి-పట్నములలోని వారికీ పల్లెలలోనివారికీ, చదువుకున్నవారికీ చదువుకోనివారికీ సామాన్యముగా అందరికీ కలిగిన వ్యామోహాన్ని అనుసరించి ఆలోపతీకి కలిగిన ప్రభావము వర్ణనాతీతము. అందుచేతనే ఆయుర్వేదమువల్ల పొందతగిన లాభములో శతసహస్రాంశముకూడా దేశము పొందడములే దనేసంగతి కేవలము మనకు ప్రత్యక్షవిషయమై ఉన్నది. దీనికి ప్రతీకారము ఏమిటి అంటే ఏమి చెప్పను? తన ఆయురారోగ్యాలను కాపాడుకోడానికి అవసరమైన పద్ధతులను అవలంబించడానికీ, ప్రతికూలమైన పద్ధతులను తొలగించడానికీ దేశానికి స్వాతంత్ర్యము లేకపోయినప్పుడు ఏమిచేయగలము? ఆచేసేది ఎంతవరకు ప్రయోజనకరముగా ఉంటుంది అనేది విమర్శనీయాంశము.

ఉదయము నిద్రలేచినదిమొదలు రాత్రి తిరిగీ నిద్రపోయేవరకు మానవుడు ఆచరించవలసిన విధినిషేధరూపములైన సమస్తకర్మములు చాలావరకు ఆయురారోగ్యములకు సంబంధించిఉన్నవి. ఆర్యసంప్రదాయాన్ననుసరించి, ఆయురారోగ్యాలకూ విద్యావినానానికీ, మతసాంఘికరాజకీయపరిస్థితులకూ తీరని పరస్పరసంబంధము లున్నవి. ఇహమందు జగత్కల్యాణము సమకూర్చడానికీ, పరమందు ముక్తిని సంపాదించడానికీ ఆయాకర్మాలు నిర్వర్తించడము అనేది చాలా సహాయకరముగా ఉంటుంది. పూర్వము గమ్యము పొందడానికి ఇవన్నీ సాధనాలుగా పరిణమించేవి. కాని గమ్యము ఎప్పుడయితే మరపునకు వచ్చినదో, ఒక్కొక్కసాధనము ఒక్కొక్కగమ్యముగా తోచినది. అందుచేత వాటికి ఉండే పరస్పరసంబంధముతో పాటు దేనికి ఎట్టి స్థానము ఇవ్వవలెను? అనే ఆలో


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చినకూడా పోయింది. అందుచేత వివిధధర్మములకూ ఉండే సామరస్యముకంటే వైరుద్ధ్యము ఎక్కువగా గోచరమవుతుంది. ప్రపంచమనేది పరమేశ్వరుడు రచించిన ఒకమహాకావ్యమనీ, ప్రతిమానవజీవితమూ ఆమహాకావ్యములో ఇమిడిఉండి దానిని పోషించే ప్రత్యేకకావ్యమనిన్నీ, వ్యక్తియొక్క అభివృద్ధి వ్యక్తికి మాత్రమేకాకుండా, సమస్తమానవజాతికీ, తద్ద్వారా ప్రపంచముకూ ప్రయోజనకరమనిన్నీ ప్రతిభారతీయుడూ గమనించతగిన ముఖ్యవిషయము. ఆవిధమైన విశాలదృష్టితో చూడడమువల్లనే మహాత్ములు భగవత్ప్రీతు లయి, ధర్మాధర్మాలకూ, సత్యాసత్యాలకూ ఉన్న భేదము తెలిసికొని జగత్కల్యాణముకొరకు విధినిషేధరూపములైన ధర్మాలు నిర్ణయించారు; సత్యాలను బోధించారు.

అహంకారరహితులై, భేదభావము నశింపజేసికొని, భగవద్ధ్యాననిష్ఠాగరిష్ఠులయి, సమాధ్యవస్థయందు సమస్తసత్యములను దర్శించిన మహానుభావులకుమాత్రమే మానవజాతిని శాసించడమునకు అధికార మున్నది కాని తదితరులకు లేదు. అట్టిమహాపురుషులుబోధించిన సత్యాలను తెలిసికొని వారు విధించిన ధర్మాలను ఆచరించడము ప్రతిభారతీయునికీ ముఖ్యకర్తవ్య మయియున్నది. "శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్" అనేసూక్తిని పురస్కరించుకొని మనవారు ఆయురారోగ్యపరిపాలనము కొరకు నిర్ణయించిన విధులూ,చేసిన హితోపదేశములూ విశేషముగా ఉన్నవి. కాని ప్రస్తుతపరిస్థితులనుబట్టి అవి ఆచరించడమునకుకాని, వాటికి ప్రచారము కలిగించడమునకుకాని ఎంతవరకు సాధ్యమవుతుంది అనేది ఆలోచించవలసి ఉన్నది. కాని ఎవరు ఎట్టిమార్పు కలిగించవలెనన్నా మొదట సత్యాసత్యవిచక్షణమూ, తరువాత సత్యస్వీకరణమూ, అసత్యనిరాకరణమూ కలిగితే వాటివాటికి సంబంధించిన ధర్మము లాచరించడము, అధర్మములను త్యజించడము తటస్థిస్తుంది. కనుక అలోపతీ ఆయుర్వేదాలననుసరించి ఈసత్యాసత్య విచక్షణజ్ఞానము ఏవిధముగా పొందగలమో, ఆపొందిన జ్ఞానము జీవితములో ఏవిధముగా ఆచరణలోనికి తీసికొనిరాగలమో ముందు వ్యక్తపరుస్తాను.

---

# ప్రార్థన గీతావళి

సబర్మతీ ఆశ్రమమునందు నిత్యపారాయణమునకు మహాత్ముడు అనుమోదించిన ప్రార్థనగీతములు తెలుగు తాత్పర్యముతోసహా ఇందు గలవు. ఆధ్యాత్మికసారమయిన ఈ గీతములను ప్రతివారు నిత్యము పారాయణము చేయుట శ్రేయోజ్ఞానదాయకము. కొలది ప్రతులే కలవు.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏడుపుగూడ నొక్కకళయే యనునూహ యతించి నేర్చుకొ
న్నాడను నేనుగూడ మలినాశ్రులు రాల్చుచు నేడ్చుకొంట; ఈ
యేడుపు నాయెడంద గ్రసియించుచునున్నది; వద్దటన్ననున్
వీడదు! నన్ను జుట్టి విలపించు ని దెక్కడిపాపకర్మమో!

ఓ శిశిరాంధభీషణతనూ! వలమానదృగంత విస్ఫులిం
గాశుభరూపకమ్మున భయంకరమోహనమూర్తి వీవు ఆ
క్రోశము సేయ నా బెదురుగుండియ లార్చుకపోవు! నీ మహా
వేశము నింక నే ననుభవింపఁగఁజాల భరింపఁజాలనున్.

లేతయెడందలన్ గరుణలేక గ్రసించి భుజించునీవు దం
ష్ట్రాశ్రితటిద్గ్రవక్త్రమున ద్రాగ్రశనాశని యల్లలాడ, వి
ద్యోతితవీక్షణమ్ముల మహోల్బణమోహముతోడ నాపయిన్
చేతులు సాఁచి కౌఁగిటికిఁ జేరుచుకొంటివి నాఁటినాఁటికిన్.

మంచికి చెట్టకున్ దెలివిమాలి గతానుగతిన్ సదా ఉపా
సించితి నింతకాలము! త్యజించితి నీనిముసమ్మునుండి! వీ
క్షించఁగఁజాల మోహకలుషీకృతమా భవదాననమ్ము; చూ
పించకు, నా సమక్షమును వీడి తొలంగుము శోకరాక్షసీ!

కోరి సృజించుకున్న యతిఘోరతవాకృతి కెన్నియే నమ
స్కారములు; ఇంక నాతలఁపుచాయలఁ దారక లేచిపొమ్ము! దు
ర్వారయశస్త్రపాతురత వ్యర్థ మొనర్చితి నోభయంకరా
కారిణి! ఎంతయో మధురగానము నీకయి యేడ్చికొంటలో! (?)

పూవులపూజ సల్పెడి కవుల్ గల రాదెసపోక యేల నా
పై వలపూని యీపగిది వ్యర్థముగా విలపింతువు? ఇంతకే
నీవలలోనఁ జిక్కెనని నింద యొనర్చెదువారు లోకులు! ఓ
దేవి! తొలంగిపొమ్మిఁక, గతించిన నేస్తము విస్మరించుచున్!

నీ కుటిలాక్షిపాతములు, నీ బిగియారు కవుంగిలింతలున్
నీ కఠినోష్ఠపానములు నే భరియింపఁగఁజాల! వానికై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాకొని దేవ్వరించెడు మహాత్ములఁ జేరఁగఁబొమ్ము! వార లీ
లోకుల మెప్పదూరులకు లోఁగరు, నీమెడ బద్ధభక్తులౌ.

బంగరుపాదుకల్ దొడిగి, బంగరుదండము కైవసంబుగా,
సింగఁపు గద్దెపై నిలువఁజేసి, భవత్ప్రణయాతిభీషణా
పాంగము వేచియుండిన తపస్వులనేత్రము రోసి, మద్గృహ
ప్రాంగణమం దమంగళకరంబుగ నేడ్చుచు నిల్తు వేటికే?

కాళిమ లోలగించెడు మొగమ్ముపయిన్ వికృతాట్టహాస రే
ఖాళి జుగుప్స రేపఁగ వికావిక నవ్వుచు, నీయసృక్ప్రప
న్నాళికలన్ స్రవించు నయనమ్ముల నాపయి మచ్చుజల్లి, మో
హాలసు నన్ను ఘోరనరకాధ్వముపా లొనరింప నెంతువో!

ఈచిఱునవ్వులం దివతళించిన నా నిరుపేదగుండెపై
చాచిన నీ కఠోరకరచాలనపూర్వక మంత్రపాఠ దు
ర్వాచికమందు లుబ్ధమయి పాడఱిపోయిన నాయెడంద కీ
నీచవిషాదభావ మలినీకృతియే తగుశాప మయ్యెడిన్!

తారలఁగాంచి యేడ్తును, సుధాకరఖండముఁ గాంచి యేడ్తు, వి
స్ఫారితహా ప్రియావదనపంకజమందున మృత్యుదేవతా
కారముఁ గాంచి యేడ్తును, సుఖంపడఁజాలక యేడ్తు, నింతని
ష్కారణశోకదగ్ధ మగు జన్మము గాంచియు నేడ్తు నిత్యమున్.

ఐహిక దైహిక ప్రబలయాతన లంటఁగరాని, ధర్మసం
దేహము ముట్టరాని యతినిర్మలవృత్తికవిత్వమంటె; నా
యూహాలు మాఱిపోయె; కలుషోగ్రభయానకనారకోర్వి, శో
కాహతశుష్కజీవితమ యయ్యె కవిత్వము నాకు నేటికిన్!

చేయఁగలంత ఘోరమును చేసితివో కటుదుఃఖదేవి! నా
యీయెద వట్టిపోయె, నిట నేమిభజించెదు రిత్తయెమ్ములన్?
తీయనికంఠమున్ పగులఁదీసితి; జీరలువోవుగొంతుతో
హేయపుఁ బాట బాడి మురియించెద నేగతి నింక లోకమున్?

"మధురకణములు" నుండి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయ భిన్నాహారములు–వాటిగుణదోషములు

క్రమధాటి వెంకటగిరి, బి. ఏ., యం. యస్ సి (ఆనర్సు).,

పిల్లలభోజనమజ్జనాంశముల తలిదండ్రులు తమ యనుభవములనే పాటింతురు. తెలిసియో తెలియకయో వారు శారీరకశాస్త్రానుగుణముగ నాహారముల గుడువనిచ్చెదరు. ఇంతియేకాక, జీర్ణకారులను పెక్కు ద్రవములు స్రవించుకొరకై షడ్రుచులుగల పాకముల చేయుటయందసాధారణప్రజ్ఞ గడించినవారు. అయినను దేహపోషణార్థమైన కొన్ని విషయములు స్వల్పములనియో, లేక అజ్ఞానముచేతనో పాటింపక పచనముచేయుచున్నారు. కొందరు బియ్యమును మెరుగుపెట్టించి రుద్దిరుద్ది కడిగి వండుచున్నారు. అన్నము మల్లెపువ్వులవలె నుండవలెనట! కూరగాయల నుడికించి నీరు పారబోసి తాలింపుచేయుచున్నారు. ఇట్టివి తెలియక చేసెడు పనులనియు, మిక్కిలి యమూల్యపదార్థములను భుజియింపక కేవలము చెత్తనే తినుచున్నామనియు తెలియుటకును, ఆహారవిషయముల ప్రాముఖ్యమును తెలిసికొనుటకును ఈక్రిందియంశములు వివరింపబడుచున్నవి.

ఆహారమననేమి? శరీరమనుగృహమును దిట్టపరచునదియే ఆహారము. ఇది యైదువిధములు:

(౧) మాంసకృత్తులు (Proteins). ఇవి నత్రజనిత సమ్మేళనపదార్థములు – గ్రుడ్లు, పాలు, పెరుగు, మినుములు, మాంసము మొదలగునవి.

(౨) కర్బనోదజనితములు(Carbohydrates): చక్కెర, బెల్లము, తేనె, పిండి మొదలగునవి.

(3) చమురులు(Fats): నూనె, నేయి, క్రొవ్వు మొదలగునవి.

(౪) ఖనిజద్రవ్యములు.

(౫) జలము.

ఇవియే పంచభూతములని చెప్పిన చెప్పనగును. ఇవియే నిజముగ నాహారద్రవ్యములు; ఇవి శరీరమునకమృతతుల్యములు. వీటిని కొలదిగనో గొప్పగనో భుజింపని జీవి లేదు.

. పైపేర్కొనబడిన పంచవిధరసములు సాధారణముగ నొకవస్తువునందే కానుపింపవు. కనుకనే వివిధాహారపదార్థములతో మిశ్రభోజనమే చేయుచున్నాము.

ఇటీవల పైపేర్కొనబడిన పంచరసములేకాక, మరికొన్నివస్తువులు మనదేహపోషణార్థము ఆహారపదార్థములయందు ముఖ్యముగ చేరియుండవలెనని శాస్త్రజ్ఞులు నిరూపించినారు. ఈయమూల్యపదార్థములకే వైటమిన్లు (Vitamins) లని పేరు. 'వైటల్' అన ప్రాణదాతలను జీవసత్తులనియు, 'అమైన్' అన నత్రజనితపదార్థమనియు నెరుంగనగు. ప్రాణదాతయగు నీ 'వైటమిన్' లేని పదార్థములను భుజించితిమేని వివిధజాడ్యములపాలగుదుము. కాన మనదేశమందు అన్నిజాతులయొక్కయు ఆహారపదార్థముల గుణములను, వాటివలని లాభనష్టములను, వాటిని సంస్కరించు విధమును తెలిసికొనవలెను.

మనదేశమునం దెల్లెడలను గోధుమలు, బియ్యము, యవలు, జొన్న, మొక్కజొన్న, చామలు మొదలగు ధాన్యములే ముఖ్యాహారములుగ వాడబడుచున్నవి. ఈధాన్యములను వేర్వేరుగాను, రెండుమూడు రకములు మిశ్రముచేసియు వండి భుజించుచున్నారు. ఈధాన్యములలో కొన్ని దంపడము, విసరడము మొదలగు సంస్కారములు లేకయే ఆహారపచనమునకు యోగ్యములై యున్నవి. ప్రతిధాన్యముయొక్కయు ఊకయందును, ఊకకు క్రిందిపొరయందును, బీజస్థాన (Embryo) మందును మంచి పుష్టినొసగు గుణములతో గూడిన పదార్థములు చేరియుండును. కనుక ఇట్టి ధాన్యములు అత్యుత్కృష్టాహారసామగ్రులు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బియ్యమును వండుటకు మునుపు దంపుట, చెరుగుట, కడుగుట మొదలైన సంస్కారములు ఆవశ్యకము. పల్లెటూళ్లలో వడ్లను పెద్దపెద్దరోళ్లయందు పోసి రోకళ్లచే దంచి బియ్యమును తయారుచేయుచున్నారు. ఇట్లు చేయుటవల్ల బియ్యముయొక్క పైపొర చాలమట్టుకు బియ్యమునందే యిమిడియుండును. పట్టణములందు ఉడకబెట్టిన వడ్లనుగాని, పచ్చివడ్లనుగాని యంత్రములచేత పొట్టుతీయించుటయే కాక, అన్నము తెల్లగనుండుటకొరకై మెరుగును బెట్టించుచున్నారు. ఈకారణమువలన పుష్టికారకములైన బియ్యపు ముఖ్యభాగములు నశించుననుట తేటతెల్లమే. పైయందమున కాశించి, దేహదార్ఢ్యమున కత్యంతము నుపయోగకరములయిన పదార్థములను ఇట్లు నాశపరచుట కడుంగడు శోచనీయము.

౧. గోధుమగింజయొక్క ఊర్ధ్వపరిచ్ఛేదనాభాగము (Longitudinal Section)ను చూపునట్టి చిత్రము.



ఎ. తవుడుతో కూడిన పైపొర (Pericarp)

బి. అంకురచ్ఛదనము (Endosperm) యొక్క పైపొరయందుండు కోశములయొక్క వరుస. ఈకోశములయొక్క వరుసకు 'అలియోరోన్ లేయర్' (Aleurone layer) అని ఆంగ్లమున పేరు. ఈ అలియొరోన్ కోశములయొక్కవరుస, పైపొర యివి రెండును, యంత్రములలోవేసిరుద్దునపుడు తొలగిపోవును.

సి. బీజగర్భము (Embryo of Germ)

ధాన్యములలోనెల్ల గోధుమలు అత్యధిక పుష్టికారకములనియు, బియ్యము అత్యల్పపుష్టికారకమనియు జీవశాస్త్రపరిశోధనలవలన నిరూపింపబడినది. తక్కిన ధాన్యముల గుణములు ఆ రెండిటికిని మధ్యనున్నవి. ధాన్యము లన్నిటియందును, అహారమునకు ముఖ్యపదార్థములైన మాంసకృత్తులు, క్షారశిల, స్వర్జకము, లోహము, భాస్వరము, వైటమినులు మొదలగునవి కొన్నిలోపించియుండును. ఇట్టిలోపములు కొన్నిధాన్యములలో అధికముగను, మరికొన్నిటియందు అల్పముగను ఉండును. అన్నిధాన్యములకంటె బియ్యమునందు ఈ లోపములు అత్యధికముగ నున్నవి. బియ్యము ప్రథమమున యంత్రముల కిచ్చి మెరుగుపెట్టుట, తరువాత చూపు కింపుగానుండుటకై గుద్దిరుద్ది కడుగుట, పిదప గంజివార్చుట – ఈ క్రియలవలన అత్యుత్కృష్ట పదార్థములెల్ల మట్టిపాలై, కేవలము నిస్సారమైన పిప్పి మిగులుచున్నది. కనుకనే బియ్యము హైందవాహారములలోనెల్ల అతినికృష్టమైన దని శాస్త్రజ్ఞులచే నిశ్చయింపబడినది.

౨. బియ్యపుగింజను మెరుగుపెట్టుటవలన చెందుమార్పులు.




1. వడ్లగింజ. పైపొట్టుతో చేరియుండునది.




2. పైపొట్టును తీసివేసినపిమ్మట, పైపొర (Pericarp), గర్భము(Embryo) తో చేరియుండుటను చూపు చిత్రము. నల్లరంగుతో కనుబరచియుండునది గర్భము (Embryo).




3. మెరుగుపెట్టినపిమ్మట బియ్యపుగింజయొక్క రూపము. పైపొర, గర్భము, ఇవి రెండును తొలగింపబడినది.

హిందూదేశపు వాతావరణస్థితి, వర్షము, వ్యవసాయవిధానము ఒక్కొక్క ప్రదేశమునందొక్కొక్క విధమై యుండుటచే, ఆయాస్థానముల గుణముల ననుసరించి యేదైన ఒకధాన్యముమాత్రమే యచ్చటపండుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. యంత్రములతో మెరుగుపెట్టిన బియ్యమును తినిపించిన పక్షి.



(పాలిన్యూరిటిస్ (Polyneuritis) వ్యాధియొక్క ప్రారంభదశ)

కనునై యుండును. కనుక ఆయాస్థలములందు పండెడు ధాన్యమే అచ్చటిప్రజ ఆహారమున కెక్కువగ వాడుకొనుట సహజము. ఉత్తరహిందూస్థానమందు పశ్చిమోత్తరపు మాగాణములు పంజాబు, బెలూచిస్థానము సంయుక్తరాష్ట్రములు-ఈప్రదేశములందు గోధుమలు అత్యధికముగ పండుచున్నవి. ఈప్రదేశనివాసులైనపఠానులు, పంజాబీయులు, సిక్కులు, బలుచీలు, రాజపుత్రులు, పహారీలు మొదలగువారికి గోధుమలే ముఖ్యాహారము. వీరు ఇతరధాన్యాహారములను గోధుమాహారమునకు ఉపదంశముగ నుపయోగింతురు. మధ్యహిందూస్థానమందలి కొన్నిప్రదేశములందు, బొంబాయి దక్కను దేశములలో సైతము గోధుమలు విస్తారముగ పండుచున్నవి. అయినప్పటికిని ఇచ్చటిజనులు-మహారాష్ట్రులు కేవలము గోధుమాహారమే భుజింపక, బియ్యము, గోధుమలు రెంటిని చేర్చి తినుచున్నారు. పశ్చిమమున బీహారు, బెంగాలు దేశములందు, మదరాసు రాజధాని ఆద్యంతము ప్రధానాహారము బియ్యమే. కర్ణాటక ప్రదేశములందు చామలు, కొఱ్ఱలు, రాగులు అధికముగ పండుచున్నవి. కనుక అచ్చటి జనులు ఈధాన్యములనే అధికముగ భుజించుచున్నారు.

ఉత్తరహిందూస్థానమునుండి దక్షిణమునకు రానురాను, ఆయాప్రదేశములయొక్క ముఖ్యధాన్యముల యందలి పుష్టికారకగుణములు క్రమేణ తగ్గిపోయి యున్నవి. దీనికితోడు దక్షిణదేశస్థుల యాహారములో మాంసకృత్తులు, క్రొవ్వు, వైటమినులు చాల లోపించి యున్నవి. ఉత్తరదేశస్థులు పాలును, మాంసమును అత్యధికముగ పుచ్చుకొందురు. దాక్షిణాత్యులు, పౌరస్త్యులు క్షీరమాంసములను చాల మితముగా వాడుచున్నారు. వీరిలో అనేకులు, ఈపుష్టికారకములగు ఆహారమును భుజింపక కేవలము తండులాహారమునే ప్రధానముగభుజించుచున్నారు. పఠానులు మాంసాహారు లగుటచే మేక, గొఱ్ఱెల మాంసమును అధికముగా పుచ్చుకొనుటవలన వీరి శరీరప్రకృతి ఉత్తమమైయున్నది. దీనికి తోడు వీరు పాలు, పెరుగు, నేయి, వెన్నలను అత్యధికముగ తినుచున్నారు. సిక్కుల మాంసాహారభక్షణము వీరికంటె మితము. కాని పాలు, పాలతోచేసినపదార్థములు విశేషముగ భుజింతురు. మహారాష్ట్రులుసైతము పాలు, పాలవస్తువులు అమితముగ తినుచున్నారు. వీరు మాంసకృత్తులతోచేరిన ఆహారపదార్థములు—గ్రుడ్లు, చేపలు భుజింతురు. బంగాళాదేశస్థులు, కర్ణాటకులు, మద్రాసీలు—వీరందరు కేవలము శాకాహారులే. వీరిలో మాంసభక్షకులు చాలకొద్ది. వీరు దధిక్షీరఘృతములను సైతము విరళముగ వాడుచున్నారేకాని ఉత్తరదేశస్థులవలె విశేషముగ వాడువారుకారు. ఈకారణములవలన దాక్షిణాత్యులను ఔత్తరాహులతో పోల్చినచో, వీరు భుజించెడి యాహారమునందు మాంసకృత్తులు, వైటమినులు లోపించియుండుటవలన, వీరిదేహస్థితి చాల అధమమై యున్నది. కందిపప్పు మొదలైన ద్విదళధాన్యములు, కూరగాయలు హిందూదేశ మాద్యంతము ఆహారమునకు వాడబడుచున్నవి. అయినను కలిగినవారికి మాత్రమే ఈపదార్థములు సులభములు. దక్షిణదేశస్థులయొక్క ఆహారపదార్థములయందలి పుష్టికారకగుణములు లోపమగుటవల్ల వారియొక్క దేహాకృతి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేహదార్ఢ్యము, శక్తిసామర్థ్యములు అన్నియు క్రుంగి యున్నవి. ఉత్తరదక్షిణదేశస్థుల కుండు శరీరభేదములు కడు నాశ్చర్యకరమైనవి. ఔత్తరాహులైన పఠానులు, బలూచీలు, సిక్కులు, రాజపుత్రులు, పంజాబీలు, మహారాష్ట్రులు మొదలయిన వారియొక్క బలిష్ఠకాయములు, శౌర్యసాహసములు, దృఢసంకల్పత మొదలగువాటిని—పూర్వదక్షిణనివాసులైన మదరాసీలు, బెంగాలీలు, కర్ణాటకులు—వీరియొక్క దుర్బలదేహములు, క్రుంగిన స్వరములు వీటికి పోల్చి చూచిన క్లిష్టమైన భేదము లగపడుచున్నవి.

మాంసకృత్తులతోడి ఖనిజద్రవ్యములు (Mineral Salts), వైటమినులు సైతము ఇట్టిభేదముల కలిగించుటలో ఎక్కువగ పాల్గొని యున్నవి. మరియు వంశానుగతమైన కారణములు, వాతావరణము, కులమతాచారములు మొదలైనవి పైజెప్పిన భేదములుప్పతిల్ల జేయుటకు చాల సంబంధించియున్నవని నిస్సంశయముగ నుడువనగును. అయినప్పటికిని ఆహారమే అన్నిటికంటెను ప్రధానమైనది. మన హిందూదేశమందలి భిన్నజాతుల యాహారముల యొక్క పుష్టికారకగుణములు ఇటీవల కొన్ని యుత్తమ పరిశోధనలచే చక్కగా నిరూపింపబడినవి. పరిశోధనవిధాన మీక్రింద వివరించినరీతిగ జరుపబడెను.

సాధారణముగా ఆహారపదార్థములయొక్క గుణములు కనుగొనుటకు, ఎలుకలచే అట్టి ఆహారపదార్థములను తినిపించి, వాటిదేహలక్షణములను పరిశీలించి, ఆహారమువిలువను కనుగొనుట యొకపద్ధతి. కొన్ని యెలుకలను గుంపులుగా విభాగించి, హిందూదేశపు ముఖ్యాహారములలో నొక్కొక్కగుంపు కొక్కొక్క యాహారము వండి తినిపింపబడెను ఈ వంటకములు ఆయాజాతివా రెట్లు వండుదురో అదేరీతిని తయారు చేయబడెను. పరిశోధనాంతమున, ఒక్కొక్క సమూహమున కొసగబడిన యాహారపు విలువయొక్క సరాసరి ఫలితములు ఈ క్రింద పొందుపరచినట్లు ఏర్పడెను. మిక్కిలి పుష్టికరమైన యాహారమును తినిన ఎలుకలు తక్కిన ఎలుకలకంటె ఎక్కువతూనిక గలిగి యుండునని ఎరుంగవలయును.

౪. యంత్రములతో మెరుగుపెట్టిన బియ్యమును తినిపించిన పక్షి.



(పాలిన్యూరిటిస్ (Polyneuritis) వ్యాధియొక్క మధ్యమదశ)

ఆ హా ర ము

ప్రతియెలుకయొక్కయు శరీరపు సరాసరితూనిక

| | | | గ్రాములు |
|---|---|---|---|
| సిక్కుల | యాహారము తినిన | ఎలుక | ౨౩౫ |
| పఠానుల | ,, | ,, | ౨౩౦ |
| మహారాష్ట్రుల | ,, | ,, | ౨౨౫ |
| కర్ణాటకుల | ,, | ,, | ౧౭౫ |
| బంగాళాదేశస్థుల | ,, | ,, | ౧౮౦ |
| మద్రాసీల | ,, | ,, | ౧౫౫ |

పై పట్టిక ననుసరించి సిక్కుల యాహారమే మిక్కిలియుత్తమమైనదని తెలియుచున్నది. ఈ యాహారమందు ఈక్రిందివస్తువులు చేరియుండెను: గోధుమపిండితో చేసినరొట్టె, పాలు, పాలతోచేసిన పదార్థములు, పప్పు దినుసులు, కూరగాయలు—కాబేజి, కారటిదుంప, ఎఱ్ఱ వంకాయలు, దుంప కూరలు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారయున కొంకతూరి యెనుకలు, క్రొవ్వుతో గూడియుండు మాంసము, మంచినీరు. అన్నిటి కంటె అధమమైనదని నిరూపింపబడిన మద్రాసీల యాహారమందు చేరినవస్తువు లేవన, బాగుగారుద్ది కడిగిన మెరుగుబియ్యము వండిన యన్నము, కందిపప్పు, కూరలు, ఊరుగాయలు, ఇతరసంబారపు దినుసులు, సస్యతైల ములు, కొద్దిగా పాలుచేర్చిన కాఫీకషాయము, కొద్దిగా మజ్జిగ, నేయి, టెంకాయ, పోకచెక్క, మంచినీరు. పైచెప్పిన సిక్కుల యాహారమును తినిపించిన ఎలుకలు ఒక్కొక్కటియు సరాసరి ౨౩౫ గ్రైనులతూనిక కలిగియుండెను. మద్రాసీల యాహారముతినిన ఎలుకలు ఒక్కొక్కటియు ౧౫౫ గ్రైనులుమాత్రము తూనిక గలిగియుండెను. కనుక ఈరెండు విధముల ఆహారముల కును గల భిన్నస్వభావములు విశదమైనవి.

౫. యంత్రములతో మెరుగుపెట్టిన బియ్యమును తినిపించిన పక్షి.



(పాలిన్యూరిటిస్ వ్యాధియొక్క ఉచ్చదశ)

పైతెలిపిన పరిశోధన ఫలముల ననుసరించి మను ష్యులయొక్క భౌతికారోగ్యములు, శక్తిసామర్థ్యములు వారుభుజించు ఆహారపదార్థములపైననే చాలవరకు ఆ ధారపడియున్నవని తెలియుచున్నది. కనుక మనదేశ మందలి జనులకు ఉత్తమమైన ఆహార మెట్టిదని తెలిసి కొనుటత్యావశ్యకము. మెరుగుపెట్టుట మొదలైన సం స్కారములు లేని యేదైన నొకరకపు ధాన్యము, లేక కొన్నిదినుసుల ధాన్యముల మిశ్రపచనము, పాలు, పెరుగు, వెన్న, నేయి, కందిపప్పు మొదలగు ద్విదళ ధాన్యములు (Legumes) తాజా ఆకుకూరలు, కాయ గూరలు, దుంపకూరలు, పండ్లు, మంచినీరు, మితముగా కొంతమాంసము — ఈవస్తువులతో కూడియుండెడు ఆహారము ఉత్తమమైనదని చెప్పవచ్చును.

ఆహారవిషయమున ఇంకను కొన్నిసంగతులు ముఖ్యముగ తెలిసికొనవలయును. మనదేశముయొక్క అధికమైన తాపప్రమాణము, అనావృష్టి మొదలగు వాయుగుణపరిస్థితులు మనము తినెడియాహారపదార్థముల యొక్క పుష్టికారకగుణములందు చాలమార్పులను కలుగ జేయుచున్నవి. కూనూరునందలి పాశ్చర్ పరిశోధనా లయము (Pasteur Iustitute) నందున్న కర్నల్ మెకారిసన్ (Colonal Mecarrison) అను శాస్త్రవేత్త యీవిషయమై కొన్నిపరిశోధనల సలి పెను. వేసవికాలమందు ఎండిన బయళ్లలో గడ్డి మేసిన పశువులపాలయందు దేహారోగ్యమునకు ముఖ్య ముగ కావలసిన వైటమినులను జీవసత్త్వాలలో వైట మిను 'ఏ' యొక్క పరిమితి చాల తగ్గియుండు ననియు, వర్షఋతువులందు సొంపుగా పెరిగిన పచ్చిక బయళ్లలో మేతమేసిన యావులపాలయం దిట్టిలోపము లెవ్వియును ఉండవనియు నిరూపించినారు. కనుక పొట్టనిండ ఆహారము లేక వస్తుండు ఆవులయొక్క పాలయందును, మంచిపచ్చిగడ్డిమేయనట్టి యావులపాల యందును వైటమిను 'ఏ' యొక్క పరిమితి క్రుంగి పోవుటవల్ల ఇట్టి పాలను త్రావువారి దేహస్థితియు అధ మముగ పరిణమించును.

బంగాళాదేశస్థులు, కర్ణాటకులు, మదరాసీలు కేవలము బియ్యమే ముఖ్యాహారముగ భుజించుచున్నా రని యిదివరకే తెలిసికొంటిమి. కనుక ఇట్టియాహారము వలన కలుగు లాభనష్టములు తెలిసికొనుట చాలముఖ్యము.

మొదట అన్నము తయారుచేయుటకుపూర్వము, బియ్యమును యంత్రములయందు మెరుగుపెట్టుటవలన చెందుమార్పులను విశదముగ నెరుంగవలయును. వడ్లను దంచి, చెరగి తయారు చేసిన బియ్యముయొక్క పైభాగ మంతయు ఒకపొరచే కప్పబడియుండును. దీనిక్రింద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మరియొకపొర కలదు. ఈ క్రిందిపొరయందు మాంస కృత్తులు విస్తారముగ చేరియుండును. దీని లోభాగ మందు పిండిపదార్థము లుండును. ఈ క్రిందిపొరను చేరి ఒక సన్న నిరంధ్రమువలె బీజస్థాన (Embryo) ముండును. మనము సాధారణముగ వంచి తయారుచేసిన బియ్యము మడ్డిరంగుతో నుండును. ఈ మడ్డిరంగును పోగొట్టుటకు బియ్యమును యంత్రములయందు మెరుగు పెట్టుదురు. ఇట్లు మెరుగుపెట్టుటచే బీజస్థానము, పైపొర—ఇవిరెండును బియ్యమునుండి తొలగిపోవుట వలన మాంసకృత్తుల, ఖనిజపదార్థముల పరిమితి చాల తగ్గిపోవును. బీజస్థానమునందును, పైపొరయందును మన యాహారమునకు ముఖ్యముగా కావలసిన వైటమిను 'బి' యనుపదార్థ ముండుటవలన, మెరుగుపెట్టిన బియ్య ముందు ఈ వైటమిన్ 'బి' లోపించియుండును.

మనహిందూదేశమందలి ధాన్యములలో తెల్ల బియ్యము చాల నిస్సారమైనది. ఇందులో అనేకలోప ములు గలవు. ముఖ్యమైనది వైటమిన్ 'బి' యొక్క లోపము. బియ్యముయొక్క ఆహారపు విలువను కను గొనుటకు దీనితో తయారుచేసిన యాహారమును, దీనితో చేర్చి మరికొన్ని యాహారపదార్థములను కోళ్లు, పావురములు మొదలైన పక్షులకు తినిపించి, వాటియందు కలిగెడి మార్పులను కనుగొనుటకు కొన్ని పరిశోధనలు గావింపబడెను. అధికముగ మెరుగు పెట్టిన బియ్యమును తినిపించిన పక్షులకు ఒకవిధమైన పాలిన్యూరిటిస్ (Polyneuritis) అనురోగము వచ్చును. ఈరోగముయొక్క చిహ్నములు మెరుగుపెట్టిన బియ్య మును తినిపించిన రెండుమూడువారములలోపుగానే కన బడును. ఈపక్షులకు పార్శ్వవాయువు వచ్చి, క్రిందపడి కదలుటకు మెదలుటకు శక్తి లేకపోయి తుదకు చని పోవును. ఈవ్యాధితో చచ్చినపక్షులయొక్క అవయవ ములుసూక్ష్మదర్శిని యంత్రముతో పరిశీలించినచో, ఈ పక్షులనరములయొక్క కణములు కృశించియుండుట కానవచ్చును. మనుష్యులకుకూడ కేవలము మెరుగుపెట్టిన బియ్యమే తినుటవలన, పక్షులకు వచ్చిన పాలిన్యూరిటిస్ (Polyneuritis) వ్యాధివలెనే బెరిబెరి (BeriBeri) అనువ్యాధి సాధారణముగ వచ్చును. ఈ వ్యాధియొక్క లక్షణము లేవన, మొదట జీర్ణశక్తి, ఆకలి నశించుట, రోగి అలసినట్లుండుట, మనస్సు క్రుంగినట్లు ఎప్పు డును విచారముగ నుండుట, మోకాలిక్రింద భాగమందలి కండరములందు మొదట నొప్పిపుట్టి, దేహమంతటను వ్యాపించుట, అవసానకాలమున ఊపిరితీయుటకూడ కష్టమై, పార్శ్వవాయువు పుట్టి చనిపోవును. ఈరోగము వచ్చినవారికి స్పర్శబలము తగ్గి జ్ఞానముగూడ కొంత తగ్గును. స్పర్శేంద్రియసంబంధములైన భాగములయందు ఉబ్బుచూపి, సూదులతో పొడిచినట్లు పోటులెత్తి, చురుకు, మంటలు, తిమురు పుట్టును. ఇదిగాక బియ్య ముతో వండినయన్నము తినువారిలో దేహదార్ఢ్యము చాల అధమమై ఇతరసామాన్య భౌతికశక్తు లన్నియు క్రుంగియుండును. మరియు బియ్యపు అన్నము తిను వారిలో నిరుపేదలయొక్క శరీరప్రకృతి అతిత్వరలో అంటురోగములకు వశవర్తియై పోవునట్టిదిగా నుండును. వీరికి శ్వాససంబంధమైన రోగములు, జాఠరాంత్రసం బంధరోగములు (నీళ్లవిరేచనములు, గ్రహణి, మరిడి జాడ్యము, కడుపునొప్పి), రక్తక్షయ, చర్మరోగములు, బెరిబెరి మొదలైననానావిధవ్యాధులు తరచు సంభ వించుచుండును.

౬. బియ్యపుగింజయొక్క ఊర్ధ్వచ్ఛేదనాభాగము (Longitudinal Section)



ఊక ఊడగొట్టిన పిదప, పైపొర (Pericarp), క్రింది పొర (Subpericarp) లు చెదరగొట్టబడక యథా స్థితిలో నుండువిధము.

పైతెలిపిన రోగములు రాకుండ నడ్డగించి, మన శరీరారోగ్యమును ఉత్తమస్థితిలో నుంచుకొనుటకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాతబియ్యము, మెరుగు పెట్టినబియ్యము, వీటితో వండిన అన్నము భుజింపకుండ నుండవలెను. వడ్లను అప్పుడే దంచి, చెరగి చేసినబియ్యమును వండి తినవలెను. ఉప్పుడు బియ్యముకూడ ఆహారమునకు తగినదే. ఈ యుప్పుడు బియ్యము యెంతప్రాతదైనను, శిథిలమైనను దీనితో వండిన యన్నము తినువారికి బెరిబెరిరోగము వచ్చుట కవకాశముండదు. ఈ విధమైన బియ్యముల నుపయోగించుకొనుట కవకాశము లేనియెడల మాంసకృత్తులు, క్రొవ్వు విస్తారముగ చేరియుండెడి పదార్థములను అన్నములో చేర్చి పుచ్చుకొనవలెను. వైటమిను 'బి' విస్తారముగనుండు పదార్థములు భుజింపవలెను. చిక్కుడు కాయగింజలు, బటాణిగింజలు మొదలగు కాయధాన్యము లందు వైటమిను 'బి' విస్తారముగ చేరియుండును. ఇవి కాక వేరుసెనగ, బాదాము, అక్రోటు మొదలగు విత్తుల యందుగూడ ఈ వైటమిను చేరియున్నది. పండ్లయందును ఈ వైటమిను విస్తారముగనుండును. ఆరంజి, నిమ్మ, అరటి, ద్రాక్ష మొదలగుఫలములు చాల ఉత్తమమైనవి. వీటన్నిటికంటెను సీమవంకాయ (Tomato) మిక్కిలి శ్రేష్ఠమైనది. ఇందులో ముఖ్యమైన వైటమినులన్నియు అతివిస్తారముగ చేరియున్నవి.

౬. యంత్రములయందు మెరుగుపెట్టుటకుముందు, ఉడకబెట్టిన ఉప్పుడు బియ్యపుగింజయొక్క ఊర్ధ్వపరిచ్ఛేదనాభాగము.



క్రింది పొరమాత్రము యథాస్థితిలో నున్నది.

తండులాహారుల విషయమై యింతమాత్రము తెలిసెను. ఇక గోధుమాహారులసంగతిని తెలిసికొందము. గోధుమాహారముయొక్క గుణములను తెలిసికొనుటకై పై తెలిపిన మెకారిసన్ (Mecarrison) శాస్త్రవేత్త కొన్ని పరిశోధనలు సలిపిరి. ఇతర-ఉపదంశము లేవియును లేక కేవలము గోధుమాహారముతోనే కొన్ని ఎలుకలను మేపగా, వాటిలో మరణసంఖ్య మిక్కిలి అధికమాయెను. శ్వాసకోశసంబంధమైన అంటురోగములు పుట్టుటయే యట్లు మరణించుటకు ముఖ్యకారణము. కేవలము గోధుమాహారమే యివ్వక, దీనితోపాటు వైటమిను 'ఎ' మితముగ నుండెడు నువ్వులనూనె కొంతయు, గోధుమగింజల యందలి ఖనిజద్రవ్యముల లోపములను క్రమపరచుటకై కొంతయుప్పును చేర్చి తినిపించినయెడల యెలుకలు దీర్ఘకాలము బ్రతికియుండునని నిరూపింపబడెను. గోధుమాహారములో ముఖ్యమైన లోపము క్రొవ్వును కరగించెడు (Fat-soluble) వైటమినులని వీరి పరిశోధనలవల్ల నిశ్చయింపబడినది. కనుక కేవలము గోధుమలే ఆహారముగ భుజించుటవలన వైటమినులయొక్క లోపములకు సంబంధించిన నాసారోగములు, నేత్రరోగములు, శ్వాసకోశరోగములు, ఆంత్రరోగములు, మూత్రరోగములు మొదలైనవి తరచుగా వచ్చుచుండును. కొన్నిసమయములందు గండమాల (goitre) రోగము సహితము అధికముగ వచ్చుచుండును.

మూత్రకృచ్ఛ్రము (Stone) అను రోగము ఉత్తరహిందూస్థానమున అధికముగను, దక్షిణమున విరళముగను వ్యాపించియున్నది. ఈ రోగము బియ్యమన్నము తినువారిలోకంటె గోధుమలు వండి తినువారిలో మిక్కిలి వ్యాపించియున్నది. హిందూదేశపు ధాన్యములలో నెల్ల మూత్రకృచ్ఛ్రరోగమును కలుగజేసెడిగుణములు గోధుమలయందత్యధికముగను, బియ్యములో అల్పముగను, తక్కినధాన్యములలో వీటిరెంటికిని మధ్యస్థముగను నున్నవని కొన్ని పరిశోధనలవల్ల కనుగొనబడెను. కనుక ఈ రోగముయొక్క వ్యాప్తి ఆయాదేశములధాన్యములయొక్క గుణముల ననుసరించియుండును. మరియు యంత్రములయందు తయారుచేసిన గోధుమపిండియందు ఈరోగమును పుట్టించెడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుణముగల పదార్థములు తొలగింపబడుననియు, కనుక యంత్రములయందు తయారుచేసిన గోధుమపిండి ఉత్తమమైనదనియు తెలియుచున్నది. మరియు, మూత్రకృచ్ఛ్రరోగము, మనము భుజించెడి యాహారపదార్థములందు స్ఫురేతముల (Phosphates) యొక్క పరిమితి తగ్గియుండినను, సున్నము అధికముగ చేరియుండినను సంభవించును. ప్రస్తుతము ఈజాడ్యమువిషయమై మరికొన్ని నూతనపరిశోధనలు జరుపబడుచున్నవి.

గండమాల రోగము, భోజనపదార్థములయందు అయొడిన్ (Iodine) అను మూలపదార్థము లోపముగుటవల్లను, స్ఫురేతములు, సున్నములు లోపముగుట వల్లను పుట్టును. కనుక ఈపదార్థములను విస్తారముగ కలిగియుండెడు పాలు, పండ్లు ఆహారము ఈరోగములను కుదుర్చుటయేకాక, రాకుండ నివారింపగలదు. పైతెలిపిన రోగములేకాక మరికొన్నిరోగములు కేవలము మనముభుజించెడి యాహారపదార్థములందలి, పుష్టికారకగుణముకల పదార్థములు లోపించియుండుట వల్ల సంభవించుచున్నవి. క్రిమిదంత (Dental caries) మొదలైన దంతరోగములు, వైటమిను 'సి' 'ఏ' లు లోపించియుండెడు ధాన్యాహారములు తినెడి హైందవులలో మిక్కిలి ప్రబలముగ వ్యాప్తిగొందియున్నవి. తాజాహరగాయలు భుజింపకుండెడివారలలో దంతములయందు రక్తము స్రవించుట (Pyrrhoea) మొదలైన రోగములు ఉద్భవించును. నికృష్టాహారము, తక్కువయాహారము భుజించెడి హైందవస్త్రీలలో గర్భిణీవ్యాధులు అత్యధికముగ సంభవించుచున్నవి. ఇవిగాక ఇంక ననేకరోగములు నానాటికి క్రొంగ్రొత్తరూపములతో పుట్టుచున్నవి. వ్యాస మతిదీర్ఘమగునని వాటినెల్ల వివరించుట ప్రస్తుతము మానుకొంటిని.

పై వివరించిన నానావిధరోగముల నివారించుటకు రోగ లక్షణములను గాని, ఔషధోపచార వివరణములనుగాని ఆమూలముగ తెలిసికొని చికిత్స చేయుటకంటె, ప్రతియొక్కరును ముఖ్యముగ జీవిత పరిస్థితులను చక్కదిద్దుకొని, ఉత్తమాహారపానీయములను లోపములు లేకుండ సమకూర్చుకొనిన చాలును. నేటికాలమున తదితరసమస్య లన్నిటికంటెను ఆహార సమస్యను చక్కదిద్దుకొనుట హిందూదేశీయులకు కేవల మత్యావశ్యకమైయున్నది. నానాటికిని వృద్ధిజెందుచున్న హైందవ జనసంఖ్యకు హిందూదేశమాత సంపూర్ణాహారము నొసగజాలకున్నది. కనుక సాంఘిక-ఆర్థికపక్షములుగా నేటికాలమునకు అనువుగానట్టి పూర్వాచారములను చక్కదిద్దుకొనుటయు, వ్యవసాయవిధానములను, పశువుల పరిస్థితులను, పరిశ్రమములను, ఉత్తమపరచుటయు, అన్నిటికంటె ముఖ్యముగా సంతానాభివృద్ధిని హద్దులో నుంచుటయు దేశక్షేమమునకు మూలకందములు.

౮. యంత్రములయందు మెరుగుపెట్టిన పచ్చిబియ్యపుగింజయొక్క ఊర్ధ్వపరిచ్ఛేదనాభాగము (Longitudinal Section).



గర్భకోశము (Embryo), క్రిందిపొరలురెండును తొలగింపబడి యున్నవి.

నికృష్టాహారమునకును, దేహాలస్యమునకును గల సంబంధములను సూక్ష్మముగ వివరించిచూచినయెడల నిస్సంశయముగ తేలెడియంశ మేమన, ఆయురారోగ్యములను వృద్ధిపొందించుటకు ఉత్తమాహారము అత్యావశ్యకమని. ఔత్తరాహులైన పఠానులు, సిక్కులు భుజించెడి క్షీర, శాకాహారములే యట్టియుత్తమాహారములు. కనుకనే హిందూదేశస్థులెల్లరికంటెను పైపేర్కొన్న తెగలవారు ఆరోగ్య భాగ్యమును, దృఢశరీరమును పొందగలిగి యున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హరిజనులు హిందువులుకారా? మహాత్ముఁడు హిందువుకాఁడా?

చిలుకూరి వీరభద్రరావు

(అనువృత్తము)

ఇటీవల పంజాబుదేశమునందు మొహెంజొదరో, హరప్పాప్రదేశములలో నూతనముగా బయల్పడిన పురాతననగరములలోఁ గన్పట్టెడి వేలకొలఁది సంవత్సరముల నాఁటి విజ్ఞాననాగరికతాసూచకములగు వస్తువిశేషములకుఁ గర్తలుగానున్న ప్రజ "యేజాతివారికిసంబంధించిన వారు? వారిమతమేమి?" అను ప్రశ్నములు పుట్టఁగాఁ బురాతనవస్తుపరిశోధకులయిన పండితులు పెక్కండ్రు చర్చించుచు నిదమిత్థమని నిర్ణయింపఁజాలక పత్రికల ద్వారా తమతమవాదముల బలాబలములను బ్రకటించి నిరూపించుకొనుచున్నారు.

మొట్టమొదట భూమండలమునఁ బుట్టిన 'భూత జాతి' అణ్ణభూతజాతివారని యెల్లవా రెఱుంగుదురు. ఈభూతజాతియె ప్రపంచమునంతయు నాకాలమున వ్యాపించియుండెనని యెఱుంగనగును. ఈభూతజాతి యనేకశాఖలతోఁ గూడుకొనియుండి కాలక్రమమున అణ్ణభూతజాతిగఁ బరిణామమును గాంచియున్నది. అణ్ణ భూతజాతులలో నెన్నిశాఖలుగలవో వీనిలోఁ గూడ నన్నిశాఖలు గలవనియె విశ్వసింపఁ దగును. నవీనశిలా యుగమును (Neolithic Age) గూడఁ గడచినవెనుక, ననఁగా నిప్పటికి దాదాపుగాఁ బదివేలసంవత్సరములకుఁ బూర్వమె లోహములను గనుపెట్టఁగలిగి తాళ్లతోను, అప్పలతోను దమకుఁ గావలసిన గృహోపకరణాదివస్తు సామగ్రిని నిర్మాణము చేసికొనుటకుమాఱుగా ఇనుము, రాగి, కంచు మొదలగులోహములతో నిర్మాణముఁజేసి కొనుటకు మొదలుపెట్టియుందురని యూహింపనవ కాశముగలదు. ఈకాలమును లోహయుగమని చెప్పఁ దగును. ఈకాలమున హిందూదేశములోని ముఖ్యనదు, లనఁగా సైంధు, కావేరి, కృష్ణ, గోదావరి, మహానది, నర్మద, సబర్మతి, యమున, గంగ, సింధునదీతీరము లందు నసంఖ్యాకజనంబు లిప్పటివలెనె నివసించుచుండి రనుమాట మఱువరాదు. ఈఅణ్ణులనువారు సింధునది యొక్క యుపశాఖలగు పంచనదీమధ్యప్రదేశములందు నివసించినవా రగుటచేతనో, ఐదు వేర్వేఱువృత్తుల నభ్యసించినవా రగుటచేతనో, వేర్వేఱుప్రదేశములం దుండి వేర్వేఱుభాషలను మాట్లాడుచు నొకే ప్రదేశ మునకువచ్చి వేర్వేఱుశాఖలవారుగా నివసించుటచేతనో వీరలకుఁ బంచాణ్ణులను పేరు వచ్చియుండును. వీ రా ప్రాంతములయందు నివసించుచుండినకాలమున వీరినుండి యే పరిణామమును జెందిన అరయణ్ణులతోడ సమ్మేళ నముఁ జెందినవెనుకఁ బాంచాలురను పేర వ్యవహరింపఁ బడియుందురు అత్యంత ప్రాచీనకాలముననే హిందూ దేశములో నాగరికతావిజ్ఞానముల నలవఱచుకొని సుప్ర సిద్ధిని గాంచినవారిలో నీపంచాణ్ణులనువారినే తొలు దొల్తఁ బ్రశంసింపవలసియుండును

ఆంధ్రదేశములో నేఁటికాలమున వడ్రము, కమ్మ రము, కంచరము, కాశి, కంసాలి (స్వర్ణకార) పనులు చేయువారిని పంచాణ్ణమువారని వ్యవహరించుట చిర కాలమునుండి పారంపర్యముగా వ్యవహరింపఁబడుచుండిన సంప్రదాయము నెవ్వరును మఱువరాదు ఈతెగలవారు తాము విశ్వకర్మసంభూతులమనియు, విశ్వకర్మ పంచ శిరస్కుఁడు గావునఁ బాంచాననవారమనియుఁ జెప్పు కొనుటయేకాక గ్రంథదృష్టాంతములతో. నిరూపించు కొనుచున్నారు ఆర్ష విజ్ఞానమనునది వీరినుండియె-మొల కెత్తినటుల గన్పట్టుచున్నది గావున 'పంచాణ్ణ' శబ్దము వీరి పూర్వులు వహించిన ప్రాచీనజాతిశాఖానామమును దెల్పునదియై యుండె ననుటకు సంశయింపనక్కర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేదు. శివునకుఁ బంచాననుఁడను నామాంతరముగలదు బ్రహ్మకుఁగూడ నైదుశిరస్సు లుండెనుగాని తదనంతరము నైదవశిరస్సును హరుఁడు హరించుటంజేసి చతుర్ముఖబ్రహ్మ యయ్యెను. ఈ పంచవిధశిల్పులచరిత్రము స్కాందపురాణమున నాగరఖండములో వివరముగా విస్తరింపఁబడినది. విశ్వకర్మ దేవతలశిల్పిగా వర్ణింపఁబడి యెను. వీనికి మనువు, మయుఁడు, త్వష్ట, శిల్పి, తక్షుఁడు, లేక దైవజ్ఞుఁడు నను నైదుగురుపుత్రులుఁగలరు. కుమ్మర, కమ్మరపనులుచేయుటయందు మనువు, వస్త్రపుంబనులు చేయుటయందు మయుఁడు, కంచరపుఁబనులు చేయుటయందు త్వష్టయు, జాతిపనులుచేయుటయందు శిల్పియు, వెండిబంగారుపనులు చేయుటయందు దైవజ్ఞుఁడును బ్రఖ్యాతికెక్కినవారగుటచేత నీయైదుగురను లోకకార్యముల నిర్వహింప విశ్వకర్మ నియమించెనఁట. ఈ శిల్పవిజ్ఞానము పూర్వకాలమునఁ బ్రపంచమున కంతటికి వ్యాపించినట్లుగా హైందవవాఙ్మయము వేనోళ్లఁ జాటుచున్నది. విశ్వకర్మ దేవతలశిల్పి; వాని కుమారుఁడు మయుఁడు దానవులశిల్పి అని హైందవవాఙ్మయమునఁ గన్పట్టుటచేత దేవదానవభేదమును నాకాలమున నంతగాఁ బాటింపని హైందవజాతిపూర్వులనియె మనము నిశ్చయింపవచ్చును. ఈ దేవదానవులకుఁ దల్లులు వేఱుగాఁ జెప్పఁబడియున్నను దండ్రి యొక్కఁడే. అతఁడేకదా కశ్యపప్రజాపతి. దక్షిణాపథవాసులు మయశిల్పమును విశ్వకర్మశిల్పముతో జోడించుట గమనింపఁ దగిన విషయము.

ఈపంచాణ్ణులు తొలుదొల్త అండిభూతమును ఆదిశక్తిగను, అణ్ణాండిని ఆదిపురుషునిగను భావించి పూజించు భావము వీరినుండియే మొలకెత్తినది. ఈయాది పురుషుఁడైన అణ్ణాండిని అనంతుఁడని తరువాతివారు భావకల్పనముఁజేసినారు. అణ్ణ + అండ=అణ్ణాండ యగుచున్నది. 'అణ్ణాండ, అణ్ణాంద, అణ్ణాంత=అనంత' అనునది శబ్దపరిణామముగాఁ గన్పట్టుచున్నది. అనంతుఁడు చావు లేనివాఁడు. అనంతునకుభూమి మోయువాఁడని పురాణ ప్రసిద్ధిగలదు. ఆదిశేషునకుఁగూడ నట్టి ప్రసిద్ధిగలదు. "శేషోఽనన్తో వాసుకిస్తుసర్పరాజః" అని అమరనిఘంటుకారుఁడు వ్రాసియున్నాఁడు. సర్పములకురాజు వాసుకిగాని శేషుఁడుగాఁడు. చీనావారు తమసరిహద్దులలో నివసించెడి యణ్ణులను శేణ్ణులు, లేక శేకాణ్ణులని వ్యవహరించినవారగుటచేత హిందువులు శేషశబ్దమును ('శేణ్ణ-శేజ్ఞ-శేష' అని శబ్దపరిణామము) అనంతశబ్దమునకుఁ బర్యాయపదముగఁ జేసి యాదిశేషువుగూడ భూమిని మోయుచున్నాఁడని పురాణములందుఁ జొప్పించియుండుటచే లోకవ్యవహారమునఁగూడ నట్లే భావింపఁబడుచుండుట సంభవించినది అణ్ణాండులు తమ జన్మస్థాన మెచ్చటనో తెలిసికొన సాధ్యముకానంతరీతిగా భూమండలము సర్వత్రవ్యాప్తిఁగాంచియుండుటచేత అనంతునిగూడ మనవారంతము లేనివానిగ భావించి యాశబ్దమును సంస్కృత భాషలోనికిఁ గైకొని యాదిదేవునకుఁ (అణ్డిదేవునకు) బర్యాయపదముగ వాడినారు. పురాణాదిగ్రంథములమాటయటుండనిచ్చినను నిత్రీవలి నిఘంటుకారులుకూడ అనంతుఁడుగూడ విష్ణువని యొక్కాణించిరి. అనంతుఁడనఁగా పురాణములలో శివుఁడనిగూడఁ జెప్పిరి. అథర్వణోపనిషత్తులలో రుద్రునకుఁగూడ అనంతనామము వాడఁబడినది అనంతుఁడు విశ్వంభరుఁడగుటవలన విష్ణువనుటలోను, విశ్వనాథుఁడగుటవలన శివుఁడనుటలోను, పంచాణ్ణులు అనంతుని పంచాననునిగాఁజేసి విశ్వకర్మ, లేక విశ్వబ్రహ్మగాను భావించుటలోను నాశ్చర్యమేమియుండును? ఈఅనంతుఁడే పురుషసూక్తములో సహస్రశీర్షములు, సహస్రాక్షులు, సహస్రపాదములు గల విరాట్పురుషుఁడుగా వర్ణింపఁబడియున్నాఁడు. ఇయ్యది తరువాతి భావకల్పనము. ఆకాలమునందు శైవవైష్ణవ భేదములు లేవు; అయ్యవి తరువాతి భావకల్పనలు. పంచాణ్ణులు మొట్టమొదట సింధుతీరమునందు వర్ధిల్లుచుండినకాలమున నైదుమోములుగల యనంతునే యారాధించుచుండిరి. తరువాత సుమేరియారాష్ట్రప్రజలతోడ సంబంధ మేర్పడిన వెనుకనే అనంతుని పంచాననునిగను, విశ్వకర్మగను నిరూపించి యారాధింపఁ దొడంగిరని యూహింపఁదగును. ఇట్టియూహకుఁ గారణమేమనఁగా స్కాందపురాణములోని నాగరఖండమున ద్వితీయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్వాసమున నారదుఁడు మేరుదక్షిణదిగ్భాగంబున విశ్వకర్మనుజూచి బహుకాలం బచ్చటనుండి యతని సామర్థ్యాతిశయం బంతయు గార్గేయమహామునివలనఁ బండ్రెండులక్షల పదునూఁడువేల గ్రంథసంఖ్యఁగలవిశ్వకర్మపురాణము వినుటయు నది తత్తల్లోకంబులనున్న సంఖ్యాప్రకారంబును, విశ్వకర్మముఖాద్యవయవంబులఁ బాద్మాద్యష్టాదశపురాణోత్పత్తిప్రకారకథనంబును నెఱింగించినట సూతునకుం జెప్ప నాతఁడు శౌనకాదిమహర్షులకుఁ జెప్పినట్లు చెప్పఁబడియుండుటయేకాని యన్యము గాదు. ఈపురాణములు క్రీస్తుశతాబ్దమున కేవల తిరిగి రచింపఁబడినవి గావున నియ్యవి రచింపఁబడునాఁటికి నీతెగలవారిలో నట్టి యభిప్రాయము లుండియున్నవని మాత్రము మనము గ్రహింపవలసియుండును. దేవభాషలోమాత్రమె ప్రజలను విధులనిరి గనుక విశ్వకర్మశబ్దముకూడ నాభాష మొలకెత్తినతరువాతనె ప్రచారము కలిగియుండును. ఈకాలము మనము తలపోయు పంచాణ్ణులకాలమునాటిదికాదు. నేను ప్రశంసించెడు కాలము మోహెంజొదరోహరప్పాలలోఁ బ్రప్రథమమున నిర్మింపఁబడిన నగరములనాటికాలము. సుప్రసిద్ధాంధ్రకవియగు కృష్ణదేవరాయలు తనయాముక్తమాల్యదయం దీయనంతుని నీక్రిందివిధముగా స్తుతించియున్నాఁడు:

“సిరినొక్కప్పుడు కన్మొఱంగి హరిద
జ్జేర న్ప్రహర్షించు ను
ర్వరకు న్వంచనఁగూడఁగాఁగలుగు భా
స్వచ్చంద్ర శాలాపరం
పరలయ్యె న్బలపైన యెవ్వని ఫణా
పంక్తు ల్భజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతీ
తబ్రహ్మకల్పాంతునిన్.”

హరికి లక్ష్మియు, భూమియు భార్యలు. అందు లక్ష్మి యెప్పుడును ఆయనవక్షఃస్థలమున నుండును. కనుక నామెకుఁ దెలియకుండ భూదేవినికూడుట హరికి సాధ్యముగాదు. భూమిని హరి కూడుట సవతియైన లక్ష్మికి నిష్టముగాదు. ఇట్టిస్థితియందు నెన్నఁడేని లక్ష్మికి నెఱుక లేకయె హరి తన్నుఁగూడుట తటస్థించునేని యందులకై హర్షించుచు నాయనను బొందుటకై భూదేవికి ఏయనంతుని విశాలపుం బడగల పంక్తులు ప్రకాశమానములయిన మేడలవరుసలన్నట్లు పరఁగుచున్నవో ఆ యనంతుని, జితేంద్రియుని, బ్రహ్మకల్పముకన్న నెక్కుడు కాల ముండువానిని ఎల్లప్పుడు సేవించెద నని కవి భావము. అనఁగా అనంతుఁడు ఇంద్రియనిగ్రహము గలవాఁడనియు, బ్రహ్మకల్పముకన్న నెక్కువకాల ముండువాఁడనియు, మఱియు నాతనికి మణులు గల ఫణము లున్నవనియు, వానిక్రిందనే భూమియు, హరియు విహరించుచున్నను నిర్వికారుఁడును, హరికిని భూమికినిగూడ మహోపకారిగనుండిన మహనీయుఁడును, అతీతబ్రహ్మకల్పాంతుఁడునునైన యనంతుని ఫణములను చంద్రశాలలుగా సంభావించి యుత్ప్రేక్షించి ‘అవశ్యసేవ్యుఁ’ డనుచున్నాఁడు. ఇట్టిజ్ఞానము, ఇట్టి భావము నాకాలమునాటి పంచాణ్ణుల కుండెనో లేదో మనము చెప్పఁజాలము. కాని అయిదుఫణములతో మనుష్యాకారముగల విగ్రహములనుజేసి యాలయములనుగట్టి యనంతుని పూజించుచుండిరని మనము భావింపవచ్చును. ఇట్టియనంతనాగ విగ్రహములు తరువాతికాలమున సంభవించిన విప్లవములలోఁ బత్తనములతోఁబాటు శత్రువులచే నాశనము చేయఁబడియుండును. బౌద్ధమతము ప్రబలముగా నుండినకాలమునఁగూడ బౌద్ధులస్తూపముల మీఁదసహిత మిట్టివిగ్రహములు చిత్రింపఁబడుచువచ్చినవి. మనయాంధ్రదేశమునందలి అమరావతీబౌద్ధస్తూపమునందు మూఁడు ఫణములు (పడగలు) గలవి, ఐదుఫణములుగలవి, ఏడుఫణములుగలవి చిత్రింపఁబడియుండుటను నేఁడును కనుఁగొనఁగలుగుచున్నాము. ఇరాణ్ణులు, శేషాణ్ణులు ప్రముఖు లయినవెనుక పంచశిరస్కుఁడుగా భావింపఁబడుచున్న యనంతుఁడు సప్తశిరస్కుఁడుగా భావింపఁబడి ఏడుఫణములుగల విగ్రహములు చిత్రింపఁబడి యుండవచ్చును. హిందూమతము పునరుద్ధరింపఁబడినకాలమున హిందువులలో నాధ్యాత్మికతత్త్వజ్ఞానము పెంపొందింపఁబడినవెనుక నితనినే విరాట్పురుషునిగ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(విరాట్టనఁగా నామరూపరహితుఁడైన పరబ్రహ్మమునం దలి మూలప్రకృతియొక్క సత్త్వగుణమైన మాయ యందుఁ బ్రతిబింబించు తటస్థేశ్వరునిగ) భావించి, ఈత నికి ప్రకృతిసంబంధమైన స్థూలదేహము కలిగినప్పుడు హిరణ్యగర్భుఁడనియు, కారణదేహమును బొందినప్పుడు అవ్యాకృతుఁడనియుఁ బేళ్లు పెట్టి, ఈపురుషునే శైవులు పంచశిరస్సులుగల శివునిగాను, వైష్ణవులు సహస్రశిర స్సులుగల విష్ణువుగాను, వృషభగరుడవాహనములుగల వారుగను, గౌరీలక్ష్ములకు పురుషులైనవారుగాను, కైలాస వైకుంఠములకు నధిపతులైనవారుగాను, వేఱు వేఱుగా బుద్ధిభేదముచేత నుపాసించి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను జెంది, ఈయన గుణానుభవముం జేయుచు కైంకర్యపరు లగుచుండ నీయ నను జ్ఞానవేత్తలు మఱికొందఱు నస్మచ్ఛబ్దవాచ్యునిగా నెంచి తటస్థేశ్వరునిగా నుపాసించి నిర్వికల్పసమాధినిష్ఠ చేత అపరోక్షసాక్షాత్కార పరబ్రహ్మముగా నెఱిఁగి ముక్తిఁబొందఁ జూచుచున్నారు.

పంచాణులు తమ నాగరికతావిజ్ఞానములను విస్తరింపఁజేయుచుండఁ గొంతకాలమునకు మధ్యాసియా ఖండమునందలి తఖ్కులనువారు వారి విజ్ఞాననాగరిక తలతోఁగూడ వీరితో సమ్మేళనముఁ జెందిరి. తద్దభూత జాతివారినుండి పరిణామముగాంచిన తక్షులు, లేక తెస్సు లనువారు 'హూరూఖూ' అను నుత్తరకురువులతో సమ్మేళ నముఁ జెందఁగా వారే తఖ్కులనంబడిరి. ఆసియాఖండము యొక్క పశ్చిమభాగములయం దున్నవారు వీరిని 'వహ్యు' లనికూడ వ్యవహరించిరి. ఈసంపులనాయకు లను 'మెలెచ్, మెలెఖ్, ఖాక్' అనికూడ వ్యవహరిం చిరి. ఈ 'మెలెచ్' శబ్దమె సంస్కృతములో మ్లేచ్ఛశబ్ద మైనది. మఱియు పాశ్చాత్యసంఘములవారు 'వెహెర్క వోఘంగవో' (వృకజాతి, లేక శునకజాతి, లేక తోడేలు జాతి) అని వ్యవహరించినారు. వెహర్కశబ్దమె సం స్కృతములో వృకమైనది. "శునీగర్భసంభూతో శౌ నకః, హరిణీగర్భసంభూతో ఋశ్యశృంగో మహామునిః" అని పురాణములు ఘోషింపుచున్నను శౌనకుఁడు శున కము కడుపునను, ఋశ్యశృంగుఁడు హరిణి (లేడి) గర్భ మునందును బుట్టినవారని తలంచుట దుర్భ్రమగాని వారి భావ మదిగాదు మధ్యాసియాఖండములో మంచుతోఁ గప్పఁబడి యున్నతములైన పీఠభూములను గొన్నిటిని, బాబిలోనియా, అస్సీరియాలోని ప్రజలు 'నూమా' (Nu-Ma) అనియు, తూర్వసులు (Hittites) 'సీ-నీమ్' (Si-Nim), అనఁగా తోడేళ్ల కాటపట్టగు (Wolf-Lands) భూములుగను వ్యవహరింపుచు వచ్చినారు. ఈపీఠ భూములయందే మొట్టమొదట 'హూరూఖూ' ప్రజలకును, తక్షులకును సమ్మేళనము సంభవించి తఖ్షులుగాఁ బరి ణామముఁ జెందినారు. ఈరెండుజాతుల సమ్మేళనమునే వారు వైహర్కవో-ఘంగవో (Vehrkavo Dangha-vo) అని వ్యవహరింపఁగా పౌరాణికులు శునకజాతి యన్నారు. ఈశునకజాతి స్త్రీకిని ఆర్షాంగు (Archio-ung), లేక అఋషి (ఋషి) తెగ పురుషునకును బుట్టిన వాఁడే శౌనకమహర్షి యని గ్రహింపవలెను. వీనిసంతతి వారే శౌనకులయినారు. ఈ పంచాణులు సప్తసింధూ ప్రదేశమున మొదటి నీతక్షులతోడ నైక్యమైపోయిన వెనక నే పంచకృషులని వేదములో వ్యవహరింపఁబడిరి. ఆప్రదేశమునందే వీరు నిర్మాణముగావించిన తక్షశిలా నగరముయొక్క ప్రఖ్యాతి ప్రపంచమునంతటను వ్యాప్తిఁ గాంచినది. వైదికయుగమునాఁడు దస్యువులని వ్యవహ రింపఁబడినది వీరే. హూరూఖూభాషలో హూర్ అనఁగా ప్రభువనియర్థము. హూరూ అనఁగా అధిప్రభువనియర్థము. సీ అనఁగా స్థలము, లేక దేశమనిపేరు. ఉద్, లేక ఉత్ అనఁగా సూర్యుఁడు, నక్షత్రము, ప్రకాశము అనియర్థము. ఈనిభావమంతయు 'హూరూ' శబ్దములో ధ్వనించును. హూర్ అనఁగా పర్వతము, దేశము అనికూడ అర్థములు కలవఁట. ప్రకాశమను నర్థముకూడ కలదు. కాఁబట్టి 'హూరూఖూ' అనఁగా భూపతియనికూడ నర్థమగునఁట.

"జెండఅవేస్థా" (ఛందోవస్థానము) అను పారసీ వేదమునందు 'సప్తసింధూ' ప్రదేశము 'హప్త హిందూ' ప్రదేశముగాఁ జెప్పఁబడినది. ఈ హిందూ ప్రదేశమున నివసించిన దస్యుతెగలవారిని హిందూప్రజ లనక మఱెవ్వరినిగా భావింపఁగలము? ఆదిహిందువులన వీరినే చెప్పఁగలయు ననుకొనియెదన.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రుతులలో వీరు కూర్మన్‌జాతిగ వక్కాణింపఁబడినారు. కూరుఖూభాషలోవలెనే వేదభాషలోను కూర్మన్‌శబ్దమునకు ఆదిత్యుఁడనియు, రాజనియు, ఇంద్రుఁడనియు, బలవంతుఁడనియు మొదలుగాఁగల అర్థములు చెప్పఁబడియుండెను. కూర్మన్ శబ్దమునకు పృథివి యను నామముఁగూడ గలదని చెప్పఁబడియుండెను. అంతరిక్షమును, దివమునుగూడ కూర్మశబ్దవాచ్యము లయ్యెను. కశ్యపప్రజాపతి కూర్మశబ్దవాచ్యుఁడుగ నీక్రింది శతపథశ్రుతియందుఁ జెప్పఁబడియుండెను.

"శ్రు. సయత్కూర్మోనామ ఏత ద్వైరూపం కృత్వా ప్రజా అసృజత, యదసృజతాకరో త్తదకరోత్తస్మాత్కూర్మః, కశ్యపో వైకూర్మ స్తస్మాదాహుః సర్వా ప్రజాః కాశ్యప్య ఇతి."

ఈ ప్రజాపతిరూపమును దాల్చిన కశ్యపబ్రహ్మ సర్వప్రజలను సృష్టిచేసినవాఁడగుటవలన సర్వప్రజలును (కాశ్యప్యః) కాశ్యపునివలనఁ బుట్టినవారగుచున్నారు. ఇంతకుఁబూర్వము మొదట నే నుదాహరించిన కాస్సిపీ యను ప్రజలును, ఈకూరూఖూప్రజలును, ఈకూర్మనులును నొకేతెగవారనియు, వీ రాసురవిజ్ఞానసంకలితులనియు మనము బోధపఱచుకొనవలయును.

ఈకూర్మజాతి, లేక కురుజాతి యాసురవిజ్ఞానమునకు నిలయమైనట్లుగనే యాదిత్యవిజ్ఞానమునకు నిలయమయ్యెను. కురుక్షేత్రము వీరివలన నేర్పడినదే. దీనినే బ్రహ్మావర్తమని వ్యవహరించినారు. ఆదిత్యుఁడనఁగా సూర్యుఁడు. దాక్షాయణియైన అదితిగర్భమునఁ గశ్యపబ్రహ్మకుఁ బుట్టినవా రాదిత్యులయిరని పురాణప్రసిద్ధము. "ధాతామిత్రో ఽర్యమారుద్రో వరుణఃసూర్యఏవచ, భగో వివస్వాన్ పూషాచ సవితా దశమః స్మృతః, ఏకాదశ స్తథాత్వష్టా విష్ణుః ద్వాదశఉచ్యతే" వీరేద్వాదశాదిత్యులనువారు, పన్నిద్దఱు సూర్యులు. దీనింబట్టి వేదములలో వక్కాణింపఁబడిన ద్వాదశాదిత్యుల గణము లన్నియును కూర్మన్, లేక కురుజాతులనుండి పరిణామము గాంచినవారని తేటపడఁగలదు. అనఁగాఁ బంచకృషులనుండి పరిణామమును గాంచినవారనియె మనము విశ్వసింపవచ్చును. (అణ్డితి, అణ్దితి, అదితి యని శబ్దపరిణామము) ఈ యాదిత్యగణములవలన వెలసిన విజ్ఞానమునే యార్యవిజ్ఞానమని వైదికులు వచింతురు. ఇయ్యది దేవవిజ్ఞానముతో మిళితమైయున్నది. ఈ విజ్ఞానము తొలుత ఆర్యవాయజో (Aryo Vayezo), ఆర్యోతురాను (Aryo-Turan) అను మధ్యాసియాఖండప్రదేశములందు వర్ధిల్లి వైదికయుగకాలమున భరతఖండమునకు, లేక యుత్తరహిందూస్థానమునకుఁ బ్రాకినది.

వీరు సప్తసింధు ప్రదేశములందు వైదికయుగప్రారంభమునను, నంతకుఁబూర్వమునను దేశస్థులై తమకంటె నాగరికతావిజ్ఞానములఁ గొఱవడియున్న ప్రజలతో నివసింపుచుండినకాలముననే ఆసియాఖండమునకుఁ బశ్చిమభాగమున కెఫ్టు, లేక కైలికియా (Keft or Kilikia) యనుప్రదేశమునందు పురాసెతియు (Pura-Setiu) అనివ్యవహరింపఁబడెడు పూరులను ప్రజలును, (వీరిని పాశ్చాత్యచరిత్రకారులు ఫిలిస్టినీసు (Phillistines) అని వ్యవహరించుచున్నారు) నాహరిన్ (Naharin) అనుప్రదేశమునందు యదువులును (వీరిని పాశ్చాత్యులు Amorites of yadai, yahudei, jaudi అని వ్యవహరించుచున్నారు) తూరుల (Tur) వలె దుస్తులను ధరించు తూర్వసులను ప్రజలను (వీరిని పాశ్చాత్యులు Hittites అని వ్యవహరించుచున్నారు), ఖెం (Khem) అను డెల్టాభూములలోనుండు ఆణులు (Anus), లేక ఆనవులను ప్రజలును, ద్రుహ్యులను ప్రజలును, ఆర్యోతురాను (Aryo Turan) అనుప్రదేశముననుండు ప్రజలను పాశ్చాత్యులు Drug folk అని వ్యవహరించుచున్నారు) నాగరికతావిజ్ఞానములతో వర్ధిల్లుచున్నారు. వీరు పంచాణులను తెగలవారలనుండి సప్తసింధూప్రదేశములనుండి పోయి నాగరికతావిజ్ఞానములను బొంది పై ప్రదేశములయందు నివసింపుచుండినవారనియె పెక్కుప్రమాణ దృష్టాంతములతో నిరూపింపవచ్చును. వీరే వేదములలో పాంచజనులని వ్యవహరింపఁబడిరి. మనపురాణేతిహాసములలో వీరినే యయాతిమహారాజు కొడుకులయిన యదుతుర్వసుద్రుహ్యానుపూరులనుగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనవారు చెప్పియున్నారు. సప్తసింధూతీరములందుండెడు దస్యులు పాంచజనులతో సమ్మేళనముఁ జెందిన వెనుకనే పాంచాలు రనిబడి, బ్రాహ్మణాదివైదిక గ్రంథములందు వ్యవహరింపఁబడియున్నారు. అనఁగాఁ బంచాణ్ణులనువారు పూరులతోఁ జేరినవారు పాంచాలు రనియు, పూరూఖ్యాప్రజలతో సమ్మేళనముఁ జెందినవారు కురుప్రజలుగాను రెండు విభాగములుగా నేర్పడి కురు పాంచాలురని వ్యవహరింపఁబడినారు. ఈకారణము చేతనే వీరిలో వీరికి స్పర్ధలు పుట్టి కురుపాంచాలవిభేదములు గలిగి మఱికొంతకాలమునకు మహాభారతయుద్ధము పుట్టుటకుఁ గారణమైనది. వీరిలో పాంచాలురు మొట్టమొదట ఆర్యవాయజో అన్యప్రదేశములం దుండెడి శుక్లఐరేనియనులతోఁగలిసి సూర్యవిజ్ఞానసంపన్నులై సప్తసింధూతీరములం దుండెడి ప్రజలను దస్యుకురువులను దస్యులని వ్యవహరింపసాగిరి. దస్యువులనఁగా దొంగలు, లేక శత్రువులు అను భావ మప్పుడు కలిగినదే. అందువలననే తమ యాధిక్యమును నిర్ధారించుకొనుటకై తమకు వృకజాతిసంబంధము (Vehrkavo-Dhangavo) లేదనిపించుకొనుటకై 'కురు' శబ్దమును గ్రహించి తాము కురుప్రజలమని వ్యవహరించుకొనఁ బ్రారంభించిరి. ఈదస్యుకురువులుగూడ పాంచజనుల విజ్ఞానమును, ఆర్యవాయజో ప్రదేశములందుండెడు శుక్లఐరేనియనుల నాగరికతావిజ్ఞానములను దమనాగరికతావిజ్ఞానములతో సమ్మేళనము గావించుకొని పాంచజనులలో బలాఢ్యులయిన పూరులతో సమత్వము నాపాదించుకొనుటకై సంబంధబాంధవ్యములు నెఱపుకొను విషయమున విజయము గాంచిరి ఈకారణముచేతనే వీరును బలాఢ్యులై సప్తసింధూప్రదేశముల తమ యాధిక్యమును, సమత్వమును స్థిరపఱచుకొనుటకై యుద్రేకముతోఁ బోరాటములు పెట్టుకొని పోరాడుచుండిరి. ఈస్పర్ధలు ముమ్మరముగా నున్నప్పుడే శుక్లఐరేనియనుల గురువులయిన వశిష్ఠాదులు కురుపాంచాలురను, ఉశీనరులను ప్రజలతోను, వసువులను ప్రజలతోను సప్తసింధూప్రదేశములకువచ్చి స్పర్ధలను ప్రబలముచేసి యుందురు. ఈయూహను బలపఱచునట్టి ప్రమాణమొకటి యైతరేయబ్రాహ్మణము నందుఁ గలదు. వశిష్ఠుఁడు ఉత్తరకురు, ఉత్తరమద్రకప్రదేశములనుండి ఉశీనరులతోడను, వసువులతోడను కురు పాంచాలురను వెంట నిడుకొనివచ్చెనని యాయైతరేయ బ్రాహ్మణమునందుఁ జెప్పఁబడియున్నది. ఈబ్రాహ్మణమునందే విశ్వామిత్రుఁడు శునశ్శేపుని వైదికసంస్కారములచేత దేవరాతునిగఁజేసినగాథ దెలుపఁబడియుండెను. ఈగాథలోనే విశ్వామిత్రుని కుమారులు నూర్వురలోను జ్యేష్ఠులయిన అంధ్ర, శబర, పుళింద, పుండ్ర, మూతిబాలను తెగలవారు ప్రసిద్ధసాంఘికసంస్కర్తలై తమలో వైదికసంస్కారములను బ్రవేశపెట్టనుండఁగాఁ బైయైదు తెగలవారును సనాతనధర్మవాదులై "సోఽయం ధర్మస్సనాతనః" అని ధిక్కరించి యొడంబడకుండిరి. అందువలన వీరు వైశ్వామిత్రులయినను 'అంతాన్వప్రజాః' అని శపించినాఁడని యందే చెప్పఁబడియున్నది. ఈ యైదుతెగలవారిలోను పుళిందులు, పుండ్రులును పూరులను తెగవారి పూర్వులనియె మనము నిశ్చయింపఁ దగియుండును. అణ్డ్, అణ్, అళ్, అట్ ప్రత్యయములమార్పుక్రమము ననుసరించియె పుణ్డ్, పుణ్, పుళ్, పుట్ అను పరిణామ మేర్పడి పుణ్ణు, పుణ్ణులు మొదలనువారు పూలఁలుగను, పూరలుగను బరిణామముఁ జెందియుండవలయును. పుణ్ణులను తెగవారు భరతఖండమునందంతట వ్యాపించియుండిరనుటకు దృష్టాంతము 'పూడి' యనుశబ్దమునంతమందుఁ గల గ్రామనామము (నడుపూడి, సెగ్గిపూడి, తోస్సిపూడి, కారెంపూడి మొదలుగాఁగలవి) లసంఖ్యాకములుగ నాంధ్రదేశమునమాత్రమెకాక భరతఖండమునంతటను గన్పట్టుచుండుటఁ జూపినఁ జాలును. "పుణ్డ + అర = పుండర = పుండ్ర" అనుచున్నది. మనయాంధ్రదేశములోనే పుణ్ణురాలినిశులదేవతగా నారాధించు బ్రాహ్మణకుటుంబములనేకములు గలవు. తెలుఁగుభాషలో పువ్వులను పూలందురు. అణ్ణియశబ్దము 'అన్యః' అని సంస్కరింపఁబడినట్లు పుణ్ణియశబ్దము పుణ్యశబ్దముగ సంస్కరింపఁబడినది. పుణ్యజనులనఁగా రాక్షసులని యర్థము చెప్పుట వైదికసంస్కారములేని యాకాలమునాఁటి పుణ్యజనుల శీలమునుబట్టి పుణ్యశబ్దమును దుర్వినియోగపఱచుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూలమునఁ దటస్థించియుండును. తెలుఁగులో పురుండు శబ్దము పురుడుశబ్దమైనది. పరుషముగానుండు పురుడ జాతి సరళమైనప్పుడు బురుడజాతి యైనది. ఈ బురుడ జాతినే సంస్కృతములో 'పాండుశోపక' యని వ్యవహరించినారు.

"కర్మచండాలకాత్పుత్రం వైదేహీ పాండుశోపకమ్, లేభే బురుడజాతిత్వం సదావంశవిదారణమ్" అనఁగా కర్మచండాలునికి వైదేహస్త్రీయందుఁ బుట్టినవాఁడు పాండుశోపకుఁ డనియు, వీఁడే బురుడ జాతివాఁ డనఁగా మేదరి యనియు, వానికి వెదురుబద్దల పని చేయుట వృత్తియనియుఁ గల్పనచేసి చెప్పియున్నారుగాని అయ్యదివిశ్వాసపాత్రము కాదు. పురుడశాఖవేఱు. మేదరశాఖ వేఱు. పురుండారులు వేఱనియు, మేండారులు వేఱనియు శబ్దశాస్త్రజ్ఞులయినవారు స్పష్టముగాఁ దెలిసికొనఁగలరు. పురందరశబ్దము సంస్కృతమున పురందరశబ్దమైనది. ఇంద్రునకు పురందరుఁ డను నామాంతరము కూడఁ గలదు. ఇంద్రాగ్నులు విశ్వామిత్రున కుపాస్యులైరి. వరుణమిత్రులు వసిష్ఠున కుపాస్యులయిరి. ఇరువురును మంత్రద్రష్టలయిరి. ఋగ్వేదములోని మూఁడవమండలము విశ్వామిత్రునిదనియు, ఏడవమండలము వసిష్ఠునిదనియు వేదాధ్యయనపరులయిన బ్రాహ్మణులకుఁ దెలియనివిషయముకాదు. విశ్వేదేవుల కధినాయకుఁ డింద్రుఁడు. ఇంద్రవరుణమిత్రు లాదిత్యగణములలోనివా రనియు, అదితికశ్యపులను నొకదంపతులకు జనించినవారనియు మన మిదివఱకే తెలిసికొనియున్నారము. అయినను వసిష్ఠవిశ్వామిత్రులకు యుద్ధములు తప్పినవి కావు. గాయత్రీ మంత్రమునకుఁ గర్త విశ్వామిత్రుఁడు. ఈవసువ్యకురువులు బాహ్యకర్మలయం దాసక్తికలవారై యైరేనీయుల యెడఁ గల్గు స్పర్ధచే తమ సంస్కారములను విజృంభింపఁజేయుటయె కాక తమతో నేకీభవింపని సనాతనధర్మవాదులను సంస్కారబాహ్యులనుగా నెంచి వారి నసురాంశసంభూతులనుగాను, తమ్ము దేవాంశసంభూతులగను భావించుకొని వారికంటె తా మధికుల మనిపించుకొనుటకై వారి హోమకర్మలను నడిపించుటకై అధ్వర్యులనియు, హోతలనియు ద్వివిధగురువులుండఁగాఁ దమ యజ్ఞకార్యములను నిర్వర్తించుకొనుటకై బ్రహ్మలనియు, అధ్వర్యులనియు, హోతలనియు, ఉద్గాత్రులనియు నాల్గురీతుల గురువులను గల్పించుకొని తమ వైదికమతమును విజృంభింపఁజేసినారు. విప్రశబ్దమును బ్రాహ్మణశబ్దమునకుఁ బర్యాయపదముగఁ జేసినవారు వీరేయని తలంచుచున్నాను. బ్రాహ్మణమతమును, చాతుర్వర్ణ్యమును నెలకొల్పుటకు విశేషకృషిసల్పి పాటుపడినవారు వీరే యని తలంపనగును. వీరి ప్రభావమంతయు బ్రాహ్మణభాగములలోఁ గన్పట్టఁగలదు. ఋగ్వేదమంత్రములలో భారతులని వ్యవహరింపఁబడినవారు వీరేయని కొందఱ యభిప్రాయము. అయినను విశ్వామిత్రుఁడుమాత్రము మంత్రద్రష్టలలో మొదటివాఁడుగాఁ గన్పట్టఁడు. దీర్ఘతముఁడు, కాక్షీవానుఁడు, కృత్సమదుఁడు, అగస్త్యుఁడు మొదలగువారు కలరు. ఋగ్వేదమండలములలోఁ గొన్ని మంత్రములు ముందుఁ బెట్టవలసినవి వెనుకను, వెనుకఁ బెట్టవలసినవి ముందును బెట్టియున్నటుల యనుమానింపఁబడుచుండుటచేత సవ్యముగా ఋగ్వేదమంత్రములను బరిశీలించి విమర్శించినఁగాని యీవిషయమున నెట్టిసిద్ధాంతము జేయుటకును సాధ్యముకాదు. సరియైన కాలనిర్ణయము చేసికొనుట కెంతమాత్ర మీమంత్రములు తోడ్పడఁజాలవు కాని హిందూసంఘతత్త్వచరిత్రపరిజ్ఞానమునకుమాత్రము తోడ్పడఁగలవని చెప్పవచ్చును. మఱియు నీమంత్రములలో నుత్కృష్టమైన కవితాధార ప్రవహించుచుండుటచేత నియ్యవికూడ యథార్థచరిత్రమును బోధింపఁజాలవుకాని చరిత్రజ్ఞానమునకుఁ దోడ్పడఁగలవు. గ్రంథవిస్తరభీతిచేత నీవ్యాస మింతటితో ముగించి సనాతనధర్మవాదులకు నొక చిన్నవిజ్ఞప్తిని జేసికొనుచున్నాఁడను. వైదికయుగమునాఁడు జనించిన యీ కురుపాంచాలవిభేదములను బెంచి పెద్దవిగఁజేసి యార్యసంస్కారములకు లోనయిన కురుశాఖలవారు గర్వించి దేశీయులను సోదరకులములవారిని ప్రేమతోఁ జూడక బాధించి హింసించుటచేతనే విష్ణువు కృష్ణావతార మెత్తవలసివచ్చినది. ఇంద్రుఁ డనేకకృష్ణులను వారిభార్యలను సంహరించినట్లుగా ఋగ్వేదమంత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలోఁ జెప్పఁబడియుండెను. కృష్ణుఁడు వృష్ణికులమువాఁడగుటచేత వార్ష్ణేయుఁ డనికూడ వ్యవహరింపఁబడెను. పాంచాలదేశములోని సింధునదియొక్క యుపశాఖయగు పరుష్ణీనదీతీరమునందు నివసించిన కురుపాంచాలురకు వృష్ణికుల మని పేరువచ్చినది. మన పురాణాదులలో వృష్ణిగణము యాదవగణములలోఁ జేర్పఁబడినది. యాదవకులములు పదునెనిమిదింటితో నగస్త్యమహర్షి సుమేరుభూ ప్రాంతములనుండి హిందూదేశమునకు వచ్చెనని ప్రాచీనతమిళకావ్యములందు గూడఁ దెలుపఁబడినది. వీరే దేశీయకులములతోఁ గలసి మెలసియుండుటయేకాక సంబంధబాంధవ్యములుగూడ గలిగియుండిరి. ఈ కులములయొక్క పరిణామమె పాండుకులములు. జన్మయే ప్రధానముచేసికొని వర్ణవ్యవస్థ నెలకొల్పి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర విభాగము గావించినవారు మొదటివారు. గుణకర్మలను ప్రధానముగఁ జేసి శర్మ, వర్మ, గుప్త, దాస విభాగములుగావించి మార్పుచేసిన వారీ రెండవవారు. ఎట్లయినను దేశీయ విదేశీయ విజ్ఞానసంఘట్టనమున మిశ్రకులములవారిచే నెలకొల్పఁబడినది వర్ణవ్యవస్థ. ఈ వర్ణవ్యవస్థ రావణాసురుని కంఠమువంటిది. ఇది యెప్పుడు నాఱిపోక తెగలఁబడుచునే యుండును. ఇప్పుడును తెగలఁబడుచుండుట మీరు చూచుచుండలేదా? రావణుఁ డొక వ్యక్తిపురుషుఁడు కాఁడు. అది యొక విపరీతమైన విజ్ఞానము. ఈకంఠ మాఱిపోకుండ సంరక్షించునది యా విజ్ఞానమె. అఱివన్ శబ్దమె ఇరైయన్, లేక ఇరైవన్ అని యుచ్చరింపఁబడుచు నఱవభాషలో ప్రభువని యర్థమగుచున్నది. ఇరైవణ్ శబ్దమె సంస్కృతములో రావణశబ్దమైనది. ఈ యఱివ విజ్ఞానమునె రావణుఁ డను నొకవ్యక్తిగఁ గల్పించి వాల్మీకి రామాయణకావ్యమును గల్పించినాఁడు. ఈ విజ్ఞానమునకు త్రిమూర్తులు దాసులై యూడిగములు సలిపినారు. ముప్పదిమూఁడుకోట్ల దేవతలు మ్రొక్కుబడులు చెల్లించినారు. ముప్పదియైదుకోట్ల హిందువులు దాసానుదాసులై దాస్యబంధములచే బంధింపఁబడి చచ్చియుఁ జావనివారై అగడ్తలోఁబడ్డ పిల్లికి దే వైకుంఠ మయినట్లు సంతోషించుచుఁ గాలమెట్లో వెళ్ళఁబుచ్చుకొనుచున్నారు. ఈ వర్ణవ్యవస్థయె లేనియెడల హిందూమతము, హిందూసంఘము ఇంతకాలము బ్రదికియుండునా యని సనాతన ధర్మవాదులు ప్రగల్భవచనము లాడుచుందురు. హిందూమతము, హిందూసంఘము నిలిచియుండుట ఆయా కాలములందు జనించిన ప్రసిద్ధసాంఘికసంస్కర్తల ప్రయత్నములమూలముననుు, వారు ప్రవేశపెట్టిన భిన్నభిన్న సంస్కారములమూలముననుు తటస్థించినదిగాని మతీయొందుచేతఁగాదు. స్వేచ్ఛాస్వాతంత్ర్యము లేని జాతి కూపస్థమార్కమువలె నెంతకాలము జీవించినను నేమి ప్రయోజనము?

ఈగడ్డలోఁబుట్టిన యేడుకోట్లప్రజలను హిందువులుకారని చెప్పుచు వారి నంటరానివారని, చేరరానివారని భావించి కుక్కలకంటెను, పందులకంటెను, పశువులకంటెను నీచముగాఁ జూచుచు ప్రవర్తించుటయేకాక వారి యోగక్షేమములకుఁగూడ నడ్డుతగులుచుండుట మానవలక్షణమనిపించుకోదు. ఏడుకోట్లహిందువుల యోగక్షేమములను సంరక్షించుకొనఁజాలని మతము మతమనిపించుకోదు; సంఘము సంఘమనిపించుకోదు.

ఇట్టి దేశకాలపరిస్థితులందు సమస్తహిందూజనుల యొక్కయు యోగక్షేమములను సమబుద్ధితో నారయుచు మహాభయంకరమైన సాంఘికవిప్లవము నరికట్టఁబూని హిందూసంఘపునర్నిర్మాణమునకై తనజీవితము నర్పణముఁజేసి దీక్షతోఁబాటుపడుచున్న మహాత్మునకుఁ దోడ్పడక యడ్డుపడువా రీశ్వరద్రోహు లనిపించుకోకమానరు. శ్రీమద్రమారమణ గోవిన్దో హరిః. ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



భాద్రపదమాసము
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తగిలిన వేలికే తగులుతుంది

వేలాల సుబ్బారావు

( మూడవ భాగము * )

౧

ఎరుకలవాళ్ల చేతుల్లోనుంచి తాను రక్షించింది వెంకయ్యకుటుంబమే అని తెలిసినప్పుడు వీరయ్యకు కలిగిన ఆనందమునకు మేరే లేదు. సమస్తవిధాల అమెరికావచ్చి అడ్డుపడి ఆదుకోవడంచేత జర్మనీ చేతుల్లోనుంచి ప్రాణాలు దక్కించుకో గలిగిన మిత్రమండలివారికైనా మహాయుద్ధాంతాన్ని ఇంత ఆనందం కలిగిందో లేదో! ఇక ఇతడు ఫలానా అనీ, ఫలాని ఉద్దేశంతో వస్తూ ఉంటే ఈలాగు తమ్ము రక్షించడానికి అవకాశం దొరికిందనీ తెలిసినప్పుడు వెంకమ్మా, వెంకయ్యలకుగూడా ఒకవిధమైన ఆదరానురాగకృతజ్ఞతాభరితమైన సుహృద్భావం కలిగింది వీరయ్యయెడల. అనంతరం వీరందరూ చీకటి పడుతూపడుతూవుండగా ముడివేముల చేరారు. వెంకమ్మ వెంకయ్యల బలవంతంమీద నాలుగైదురోజులక్కడేఉండి వీరయ్య స్వగ్రామానికి వెళ్లుతూవుంటే వాళ్లిద్దరూకూడా అతనివెంట చాలాదూరం ఊరిబయటి వరకూ పోయి వెనక్కు మరలేసమయంలో వెంకమ్మ గద్గదకంఠంతో "అన్నోయ్! ఇడుగో నీమేనల్లుడు. వీడిక నీవాడే. వీణ్ణి మరవ్వద్దుసుమీ! తరుచుగా వచ్చిపోతూఉండు" అని కృతజ్ఞతాసూచక ఆనంద బాష్పాలు రాలుస్తూ సాగనంపింది. అతడూ వాణ్ణి ముద్దాడి విడవలేక విడవలేక ముందుకు సాగిపోయినాడు. అదిమొదలుకొని ఈ రెండుకుటుంబాలవారి మైత్రి సాయంకాలపుసంధ్యారాగంలాగు దినదినప్రవర్ధమాన మౌతూపోయింది.

వీరయ్య జయిల్లో వున్నకాలంలోనే అతని మామ కాలంచేశాడు. ఆ సంగతి ఇంటికి వచ్చేవరకూ అతనికి తెలియదు. మామగారి సంసారం ఆప్రాంతాల్లోకల్లా చాలభాగ్యవంతమైంది. వీరయ్య కిచ్చిన పిల్లతప్ప అతనికి వేరే కొడుకులుగాని, కూతులుగాని లేరు. అందుచే రెండుసంసారాల భారం వీరయ్యమీదే పడింది. మునపటికంటె ఎక్కువబాధ్యత వచ్చింది. సర్వానికీ ఇతనొక్కడే కర్తా భర్తా అయినాడు, వేరేవిధమైన వారసుల గోలా లేకపోవడంచేత.

ప్రతికూలావకాశాల్లో మనసుకు గలిగే వైరాగ్యం సంసారవిముఖతా ప్రాణంమీది తెగువా సాధారణంగా అనుకూలావకాశాల్లో గలుగవు. ఒకవేపు జయిల్లోని యాతనా, అవమానపుదుఃఖం, పాపభయం, ఒకళ్ల సంసారం మంటగలిపానే అనేచింతా — ఇవన్నీ ఏకీభవించి కింకర్తవ్యతామూఢుని చేసి వీరయ్యను యోగుల వారివద్దకు బరుగెత్తించాయి. కాని నృసింహయోగీంద్రులు దూరమాలోచించి చేసినపనికి ఫలం వెంటనే కన్పించింది. తా నదివరకు చేసివున్న అపకారం మాసిపోయేలాగు వెంకయ్యకుటుంబానికి మంచి ఉపకారం చేయకలిగినందుచేతా, మామగారి మృత్యువువలన ఇనుమడిగా తనమీద బడిన బాధ్యతలచేతా వెనక దుఃఖసమయంలో కలిగిన పిరికితనమూ, చాంచల్యమూ పోయి మనస్సున ధైర్యస్థైర్యాలు కలిగాయి ఇతనికి. అపకారం తనవల్ల పొందినవాళ్లకు ఇంకా ఉపకారం చేయాలనే పట్టుదల కలిగింది. ఈలాటి మనోరథపరివర్తనాలతో, రెండుమూడు నెలలు కడచిపోయినాయి. అనంతరం మళ్లీ ఒకపర్యాయం వెళ్లా డితను యోగీంద్రసందర్శనార్థం. వా రితనితో ప్రసంగిస్తూనే గుర్తించారు వైఖరిమారిం దనీ, రోగం తిరిగిపోయిందనీ. ఇక నేమీ భయం లేదని నిశ్చయపరచుకొని అతని అంతర్గతాభిప్రాయాని కనుకూ

---

* దీని రెండవభాగము అంగీరస ఫాల్గున (మార్చి'33) సంచికయందు ప్రకటితము.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లంగా “నీవుద్దేశం చాలామంచిది, వాళ్ల కింకా ఉప కారం చేయాలనేది. ఇదివరకన్నంటేగూడ మంచి అవకాశాలు లభించవచ్చు నీమనోరథపూర్తికి. సమయం దొరకినప్పుడుమాత్రం వెనకాముం దాడవద్దు” అని మంచి మాటలాడి పంపారు యోనులవారు.

ఇతడు వారిదగ్గర సెలవుదీసికొని ముడివేముల మీదుగా వెళ్లుదామనే ఉద్దేశంతో వచ్చేసరికి అక్కడ మళ్లీ సర్వసన్నాహం చేసుకొని కూర్చున్నాడు, వెంకయ్య, తెనాలిప్రయాణానికి సిద్ధంగా నేడో రేపో అంటూనూ. అప్పుడు వీరయ్య తనమామగారి సంగతు లన్నీ తెలియబరచి వారితాలూకు ఆస్తి యావత్తూ తన అధీనంలోకే వచ్చినందున అందులోనుంచి కావలసినంత నేలను మంచివ్యవసాయయోగ్యమైనదాన్ని ఇస్తాననీ, సాగుచేసుకొంటూ సర్కారుకు పన్ను చెల్లించుకొనడంతప్ప తన కేమాత్రం ఇవ్వనక్కర లేదనీ, దానిమీదవచ్చే ధాన్యంవగైరాలతో సౌఖ్యంగా జీవనంజేయవచ్చుననీ, వ్యవసాయానికి కావలసిన పశువులనుసైతం తానే కొని ఇస్తాననీ ఇంకా ఎన్నివిధాలనో ఆశలను చూపించి వెంకయ్యప్రయాణము మాన్పించి అక్కడే నిలపాలని మనసార ప్రయత్నంచేసిచూశాడు. కాని సఫలుడు కాలేదు. వెంకయ్య సమ్మతించలేదు. “కానీలే! ఇప్పుడప్పుడే ఏముంత తొందర! రెక్కలాడినంతకాలం ప్రయత్నంచేయనీ. తరువాత ఇంటిపట్టునే కూర్చోవలసివస్తే చూడవచ్చు. వీరయ్యా, నీ విదివరకు చేసిన మేలే చాలు. ఆనాడు నీవు సమయానికాప్రకారం రాకుంటే ఈపాటికి నాసంసారం ఏమయ్యేదో! ఆరుణం ఈజన్మంలో తీర్చుకోలేము” అని సమాధానపరిచాడు వీరయ్యని. ఇక చేసే దేముందని ఎక్కడ వున్నా, ఎక్కడికి పోయినా, తరుచుగా తప్పకుండా క్షేమసమాచారాలు తెలుపుతూవుండవలసిందని వాగ్దానం చేయించుకొని వీరయ్య స్వగ్రామానికి వెళ్లిపొయ్యాడు.

౨

మనుష్యుని నానాకష్టాలపాలు చేసేదీ ఆశ. మనస్సు దానికి లోబడి సంతృప్తికి తిలోదకాలను ఇప్పించి ఎల్లప్పుడు విహంగవాహనాలమీద అంతరిక్షంలోనే సంచరిస్తూఉంటుంది; భూమివేపు దృష్టి సారింపనైనా సారింపదు. చుట్టుప్రక్కలా జరుగుతూవుండే ఘటనలూ, సంగతిసందర్భాలూ దాన్ని మరింత మీదికే రెచ్చగొడుతూవుంటాయి కాని క్రిందికి రానీయవు ప్రస్తుతపునాగరికతకాలంలో దాని ప్రభావం మరింత విచ్చలవిడియైపోయింది. సాధారణజనులు మొదలుకొని రాజప్రతినిధులంతివారి పర్యంతంగల సమస్తమైనవారిమీదా ఇప్పుడుదానిఅఖండసామ్రాజ్యం. ఉచితంగా ఇతరులవల్ల సంపత్తిని పొందడం మంచిది కాదని వీరయ్య ఆనాడిచ్చిన సలహాను తిరస్కరించి ఒకవిధంగా ఆశకులోనుగాక తప్పించుకొన్న వెంకయ్యే తరువాత కొంతకాలానికి మరోవిధంగా ఆశలో తగులుపడ్డాడు. మద్రాసులోని సాల్టుకొటార్లు కెదురుగుండా అకస్మాత్తుగా అతన్ని కలుసుకోవడం సంభవించింది ఒకనాడు. అంతవరకూ నాకు తెలియనేతెలియదు అతను అక్కడ వున్నాడని. తెనాలి కెళ్లిందిమాత్రం తెలుసు. ఆశ్చర్య మైంది, అతన్ని చూడగానే. “ఓహో! ఇదేమిటి వెంకయ్యా! ఇక్కడికి కెట్లా వచ్చావు? ఎక్కడా వుండడం! ఏంసమాచారం?” అని అడిగితే అంతాచెప్పుకొవచ్చాడు, తెనాల్లో రెండేండ్లు గడపి ఇక్కడికి వచ్చి పట్నంలో కాపురం పెట్టాననీ, ఇక్కడికి వచ్చికూడా రెండేండ్లు దాటాయనీ, కాని మొట్టమొదట అనుకొని వచ్చినంత మంచిదశలోకాక ఎలాగో దినాలను వెళ్లదీస్తున్నాననీ. దూరపుకొండలు నునుపుకదా! ఉన్నచోట ఏదోఇంత కడుపునకు సరిపోయేలాగు దొరుకుతూవుంటే దాంతో తృప్తిచెందక దూరదేశాలకు పోయి కొండలను ఎత్తాలని మనస్సు తహతహలాడుతూవుంటుంది. తీరా అంతదూరంపోయిన తరువాత అనుకొన్నప్రకారం జరక్కపోయినదెడల చివరకు పిచ్చిఎత్తడంకూడా సంభవమే. పెరుగుతూవున్న యౌవనహృదయాల్లో మరింతఎక్కువ, ఈదూరదేశాలకు వెళ్లిరావలెననే కోరికల అడావిడి. అతని పరిచితులెవరో ముగ్గురునలుగురు మద్రాసులో ఏపని చేసినా పెద్దపట్నంకాబట్టి మంచిలాభం వస్తుందని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బయలుదేరివస్తూవుంటే వాళ్లవెంట ఇతనుకూడా వచ్చాడట. ఇంతకూ విధిప్రాబల్యం ఆశతో ఏకీభవించి మెడబట్టి గెంటుతూవుంటే ఎవరిశక్యం అవుతుంది ఎదిరించడానికి. ఏపనిచేస్తే బాగా లాభిస్తుందో దాన్ని చేయాలని వీరందరి ఉద్దేశాలట. మొట్టమొదలు పండ్ల వ్యాపారం చేద్దామని తలపెట్టారట. అందులకుగాను మద్రాసుకు వచ్చేముందే పండ్లతోటలుగల తెలుగు జిల్లాల్లో కట్టుదిట్టాలు చేసుకొని వచ్చారట, అక్కడివారు పంపుతే ఇక్కడ వ్యాపారం సాగించాలని. కాని ఎత్తుకోళ్లోనే మొత్తుకోళ్లన్నట్లు ఆమొదటివ్యాపారంలోనే లాభం గూబలకాడికి వచ్చిందన్నాడు. ఏం అంటే ఏదో పెద్దరామాయణం చెప్పుకొంటూ వచ్చినాడు. ఆక్షోభంతా ఇప్పు డెందుకూ? కాని పళ్లమ్మే వాళ్లకూ పోలీసువాళ్లకూ జరిగే తమాషాలనుగురించి చెప్పేటప్పుడు చీనాబజారువీథిలో సాయంకాలం అయిదారుఘంటలవేళ ఘటిల్లే ఘటనాల లీలాదృశ్యాలన్నీ ఒక్కమారుగా కళ్లకు పొడగట్టాయి, సంజయుడికి మహాభారతయుద్ధం యావత్తూ ప్రత్యక్షమైనలాగు. వీసమాత్రపు ఖర్చైనా లేకుండా దొరికే ఎత్తయిన ఉత్తమాశ్వాలమీద సుఖాసీనులై సార్జెంటుదొరలు రేసులుకొడుతూ ఒరణా అరణా అమ్మకుగాళ్లను తరుమగొట్టడం, దొరలు వస్తున్నారని తెలియడంతోటే అలికిడి విని బొక్కల్లోకి దూరే కుందేళ్లలాగు బేవారిసు అమ్మకుగాళ్లందరూ ఎటుపడితే అటు సందుగొందుల్లోకి దూరి పరుగెత్తడం, పళ్లమ్ముకొనే స్త్రీలు నెత్తినా, చంకల్లో, చేతుల్లో పండ్లపళ్లికలను ఇరికించుకొనీ, ఎగనెత్తుకొనీ గబాగబా పరుగెత్తుతూ ఉంటే వాళ్లవెంటబడి దొరలు గుర్రాలను దౌడాయించడం, పాపం ఈ పరువుల్ల అడావుడిలో మరింత గాభరాపడ్డ ఏభాగ్యశాలినెత్తిమీది పళ్లికైనా జారి క్రిందపడడంతోటే పండ్లన్నీ రోడ్డంతటా దొర్లుతూ పెరేడుగొట్టుతూ, దొరవారి గుర్రపుగిట్టెలక్రింద బడి నలుగుతూవున్నసమయంలోనే అటువేపునుంచి గాండ్రిస్తూవచ్చే బస్సుచక్రాలక్రింద బడి మరికొన్నిపళ్లు చితికి చిందరవందరకావడం, తన దౌర్భాగ్యపు అసహాయస్థితికి పండ్లమ్మి ఏడుస్తూఉంటే దొర గంభీరంగా ముందుకు పరుగెత్తడమో, లేకపోతే దొరికినమట్టుకు మళ్లీ పళ్లను పళ్లిక కెత్తించి ఆఏడుస్తూవున్న అబలను దొడ్డికితోలుకొనిపోవడమో, ఏవంవిధమనోహరదృశ్యాలన్నీ సినీమారంగంమీదలాగు నామనోరంగంమీద ప్రతిఫలించాయి. ఇంతకూ చిట్టచివరకు తేల్చిందేమిటంటే వెంకయ్య: తోటయజమాన్లకియ్యాలిసిన మూల్యంక్రింద, మధ్యవర్తుల ఏర్పాటు ఉంటే దలాలులకు పొయ్యేముడుపులక్రింద, రైలుచార్జీలక్రింద, ఎక్కేచోటా దిగేచోటా రైలుబాబుల మామూళ్లక్రింద, రోడ్డుకంట్రాక్టర్ల మహసూళ్లక్రింద, షాపుల ఖామందులకిచ్చే అద్దెలక్రింద, వీళ్లందరికీ ఇచ్చేదానికి ఇబ్బడిముబ్బడి పోలీసువసూళ్లక్రింద, కాయలు పాడైతే పోయే నష్టంక్రింద పోయిన డబ్బు పోగా మిగిలేదాంతో ప్రాణధారణంమాత్రం కలుగుతూవుంటుంది. అదేకారణం కాయలను మహాప్రియంగా అమ్ముతూకూడా ఏమాసినచీకిబట్టలో కట్టుకొని ముష్టెత్తుకునేవాళ్లలాగు ఉంటారు, ఈ పళ్లమ్మే వాళ్లలో చాలామంది అని అన్నాడు. అట్లాంటప్పుడు చాలాఅణకువగా ఉండాలిసినదానికి బదులు మహాతలబిరుసుగా మాట్లాడుతూవుంటారేం పండ్లుకొనబోయిన వాళ్లతో అని అడిగితే "వట్టిమూర్ఖులుకాబట్టి వాళ్ల కది సహజం. ఒకమూల కడుపులో కాలుతూవున్నా పైకి కొక్కిరిస్తూనే ఉంటారు. ముక్కు కోస్తూఉంటే నెత్తురుతాగే మచ్చు ఇది. కాని మంచిమర్యాదకలవాళ్లు సైతం నూటికి ఒకరిద్దరు లేకపోలేదు." అని అన్నాడు. మరి ఈలాటి లాభంలేనిపనిలో ఎందుకూ దిగడం? మరో వ్యాపారం చేసుకోకూడదాఅంటే "మొదలుమొదలు లాభం వస్తుందనే ఆశతోనే దిగారు. అనుభవంమీద తెలిసివచ్చింది ఇటువంటి అమ్మకాల్లో ఏపాటి లాభాలుండేదీని. ఇప్పుడు ఉన్నట్లే ఉండి చప్పున ఇంకోపనికి దిగితే ఇప్పుడు దొరుకుతూఉన్నమాత్రమైనా దొరుకుతుందో దొరకదో పొట్టపోసుకోడానికని భయమూ. తెలివిగల మొఘాలు కనుకనా ఒకమాదిరి కాకపోతే మరోమాదిరి అఘోరించడానికి. కాబట్టి వుక్కిరిబిక్కిరిఅవుతున్నా అందులోనే మునగానాం తేలానాం"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నాడు. అది విని సరే ఇటువంటి అసహాయమైన పరవశత్వస్థితి అన్నిరకాల ఉద్యోగాల్లో ఉందనుకొంటూ అయితే ప్రస్తుతం చేస్తున్న పనేమిటో! ఎక్కడా వుండడం అని అడిగాను. అందుకు ఒకపేటలో కాపురంపెట్టాననీ, తానూ మరిఇద్దరు మనుష్యులూ కలిసి సరుకులమోతబండిని కొన్నామనీ, రోజల్లా ఎక్కడ దొరికితే అక్కడ సరుకులు మోసుకొనిపోతూ వచ్చే కూలీని పంచుకొంటున్నామనీ చెబుతూవుండగానే ఇద్దరు మనుష్యులు సుక్సుషెడ్డులో నుంచి సరుకులతో నిండిన బండిని ఒకదాన్ని లాక్కుని ఇతనివేపు వచ్చారు. వాళ్లు వస్తూఉండడం చూసి వెంకయ్య తానున్న ఇంటినెంబరూ వీథిపేరూ వ్రాసుకోమని చెప్పి మర్నాడు తప్పకుండా రావలసిందనీ, ఇంకా మాట్లాడవలసిన సంగతులు చాలా వున్నాయనీ అంటూనే ఆబండివెంట వెళ్లాడు. సరేఅని నేనూ వెనక్కు మళ్లాను.

## 3

పంచభూతవశీకరణంచేత ఈరోజుల్లో అనేక ఆవిష్కారాలూ, వానిద్వారా నానావిధసౌకర్యాలూ గలిగాయి మానవకోటికి—రైళ్లూ మోటార్లూ, టెలిగ్రాఫులు టెలిఫోనులు; సినీమాలు రేడియోలు ఇత్యాదులు కొన్నిముఖ్య ఆవిష్కారాలు. వీటిద్వారా క్రమంగా గమనాగమన, వార్తాహరణ, మనోరంజనాదులకు జెందిన సౌకర్యాలు లభించాయి. గ్యాసు, బాష్ప, విద్యుత్తుల సహాయంతో నిర్మితాలయిన సాధనాల తోడ్పాటుతో కృతాంతకేళీరంగమనే మరోవిలక్షణ సౌకర్యాధిష్ఠానం వెలిసింది పైవాటితోబాటు. దీనిద్వారా పరలోకగమనసౌకర్యం లభిస్తూ ఉంటుంది ఇహలోకవాసికి. పట్నవాసులు ముఖ్యంగా లాభం పొందుతూ ఉంటారు వీటివల్ల—గ్రామీణులకటువంటి సౌభాగ్యం చాలాతక్కువ. కాని లేనిపోని శ్రమ ఎందుకని బద్ధకింపక పట్టణాలకు రాగలిగితే వారూ పొందవచ్చు ఈసౌకర్యలాభాన్ని నిరభ్యంతరంగా.

రైలువాళ్ల ముఖ్యమార్గ (Main lines) శాఖామార్గ (Branch lines) విభేదంలాగు ఈకృతాంతకేళీరంగాల్లోకూడా భేదా లున్నాయి ముఖ్యశాఖోపశాఖారంగాలనీ. అదిగాక పట్టణపరిమాణాన్నిబట్టి కేళీరంగప్రాధాన్యంలో హెచ్చుతగ్గులు కలుగుతూ ఉండడం సహజం. ఈ యంత్రావిష్కారయుగంలో సామాన్యంగా ఇటువంటి కేళీరంగాలులేని పట్టణాలే ఉండవు ప్రపంచంమీద. కాని ఇప్పుడు మన కథకవసరమైందీ, నేను మీకు వివరంగా చెప్పదలచిందీ మద్రాసులోని కృతాంతకేళీరంగాన్నిగురించి. మీలో అనేకులు ఏతద్రంగసందర్శనభాగ్యం పొందేవున్నారు. గుర్తించుకోండి.

తిరువత్తూరులోని శ్రీత్యాగరాజేశ్వరుని దర్శనం చేసుకొని బయలుదేరిన ఈరంగరాజం గమనంసాగించి రాయపురంలో నారికేళమధురసం త్రాగి ఆనందించే మదిరేక్షణలకు సుఖాసనసౌభాగ్యం కలిగిస్తూ ప్రాఙ్ముఖమై ట్రాములైనువెంబడి హార్బరులోని వింతలూ విశేషాలమీద ఒకచూపు విసరి, పారిస్ కార్నరును ఒక మూలకు ద్రొక్కి నేతిబీరకాయల్లాగు సార్థకనామధేయులగు న్యాయాధీశ న్యాయవాదులతో చేతులు కలుపుకొని, చీనాబజారు ఎస్ప్లనేడులమధ్య సర్వకాలాలందూ – ముఖ్యంగా సాయంసమయాలలో తమ గౌరవనీయహోదాలు కల తాబేదార్లందరూ కావిస్తూ ఉండే కార్యజాలాలను తనివితీరకుండా చూచి ఆనందించి ఆమోదిస్తున్నలాగు నిలువబడియున్న శ్రీసార్వభౌముల దివ్యమూర్తికి సాష్టాంగాలు పడి జనరల్ ఆసుపత్రి, సెంట్రల్ స్టేషన్లలో తనవద్దనుంచి క్రొత్తగాదాఖలైన బంధువులెవరైన ఉన్నారేమో అని విచారించుకొని పెనిటెన్షియరీ దొరగారికి టెలిఫోన్‌తో సలాంగొట్టి గవర్నరు బాడీగార్డు గూడానికి తూర్పుగా కులుక్కుంటూ విలింగ్డన్ వారధిదాటి మౌంటుబజారులోని కాఫీహోటళ్ల సుగంధాలు కుత్తుకబంటిగా తేర్చుకొంటూ నీల్ ధొరశ్రీమూర్తికి పరిక్రమాలుసలిపి తేనాంపేటమీదుగా సైదాపేటకు, ఇంకాపైకి సాగిపోతుంది. గుర్తించారా? ఇదీ ఇచటి ప్రధానమైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృతాంతకేళీరంగం. ఈరంగంపాడుగూనా దీంట్లో నుండి చీలి లెక్కలేనన్ని శాఖోపశాఖాంగాలు పట్నంలో నాలుగుమూలలా ప్రసరిస్తూ ఉంటాయి. లేదా నానాముఖాలుగా వచ్చి ఇందులో కలుస్తూ ఉంటాయి అనుకొన్నా సరే. ఈరంగాలన్నింటి మీదా ప్రాధాన్యతో ముఖ్యరంగంమీద దానిపాడుగూనా నిరంతరభైరవతాండవం గావిస్తూ ఉంటాడు భగవాన్ దండపాణి - ఏమన్వంతరంనాటిదో జరాభారంచేత క్రుంగి కదలా మెదలా లేని కారెనుపోతు వాహన మెందుకని రోసి ప్రస్తుతం నానాదేశవైజ్ఞానికావిష్కృతబాష్పవిద్యుత్సంచాలితాలైన వివిధవాహనయానాదులను అధిరోహించి విభూతిబలంచేత. ప్రపంచమంతటా నరబలినిషేధమై ఉన్న ఈనాగరికతాసమయంలోసైతం మానవరక్తం మరిగినదానికి మరొకటి పనికిరాదన్నట్లు కృతాంతకేళీరంగాధిదేవతకు నరబలే గాని పనికిరాదు. యమపాశాల ప్రతిరూపాలో అన్నట్లు విస్తరిల్లివున్న మీటవిద్యుత్తంత్రులనూ, అడుగున రైలుపట్టాలనూ అంటిపట్టుకొని భోగీట్రాంకార్లూ, వాటినిమించిపోవాలని లారీలూ, బస్సులూ, వాటి నెగదన్నాలని టాక్సీకార్లూ, వీటినన్నింటిని వెనక్కుద్రొక్కాలని మోటారుసైకిళ్లూ, శ్రవణేంద్రియధర్మాన్ని వినష్టపరిచే మేఘగర్జనల్లాటి ప్రచండధ్వానాలతో గంటలనూ, కొమ్ములనూ మ్రోగిస్తూ బలమైన తుపానువేగంతో మూపుతూవస్తూ ఉంటే — పెనుభూతాలు, భూతాలు, పిల్లభూతాలు, పిట్టభూతాలు లోకాన్నంతా, ఒక్కపాళంగా గ్రసించిమ్రింగివేయడానికి వస్తూఉన్నాయా అనిపిస్తుంది, ఎదురుగగాని, ప్రక్కగాగాని నిలుచొని చూసేవాళ్లకు. ఈపరేతరాడ్రంగాల్లో విధిలేక తిరగవలసివచ్చే దరిద్రులకు ఏమాత్రం రవంత త్రుటి పొసగినాచాలు ఫైసలా అన్నమాటే వాళ్ల ఇహలీల. ఒక్కొక్కపర్యాయం ఇట్టి అజాగ్రత్తకూడా అనవసరం — ముందూ వెనుకా చూసుకొంటూ మధ్యమార్గాన్నంతా ఆరాత్మసమూనాలకే వదలి, ఎడంచేతివైపు Keep always to the left రూలుప్రకారం నడుస్తూఉన్నా సరే, లేక ఎదురుగుండా వచ్చేవన్నీ బాగాకనబడుతూవుంటాయనేధైర్యంతో కుడివేపు నడిచిపోతూఉన్నా సరే, లేక ప్రక్కగా దూరంగా వూరక నిలుచొని ఉన్నా సరే, కన్నుమూసి తెరచేటంతలో మీదబడి కబళించుకొని పోతూవుంటాయి, ఈభూతాలు ఎప్పుడువచ్చి పైనబడిందికూడా తెలియదు, వాటిని పరుగెత్తిస్తూ ఉన్న యమదూతల ప్రతినిధులనదగిన డ్రైవర్ల మూర్ఖ్యంవల్ల, మొండితనంవల్ల, తామసంవల్ల, ఆభిజాత్యంవల్ల, నిర్లక్ష్యంవల్ల, నీలుసవల్ల, పొగరువల్ల, కుదకు తప్పదాగివుంటే వొళ్లూపై మరపడంవల్ల — పోలీసుఅధికార్లు ఎన్నోనియమాలను వీళ్ల నెత్తినపడేసి అడుస్తునేవుంటారుఒకవేపు. "జాగ్రత్తా" "ఖబర్దార్" "జనసమ్మర్దంగల చోట్లల్లో గంటకు అయిదుమైళ్లకంటె ఎక్కువవేగంగా నడపవద్దు." అని హెచ్చరికలను వోవపాడుగూనా అనేకచోట్ల స్థాపించి నిరోధిస్తూనే వుంటారు వీళ్లనీ. కాని యుద్ధరంగంలో జొరబడ్డ సిపాయీలకు అక్కడి దృశ్యం కంటబడడంతోటే వొళ్లుపొంగిపోయి, ఆవేశం ఎక్కి ఒకరినొకరు నరుక్కొనిచావడంతప్ప వేరేమీ గోచరించనిలాగు నూతి దురాగ్రహాహంకారులైన డ్రైవర్లు ఒక్కొక్కసారి తలతిక్క పంతాలుపడి వొళ్లూపై తెలియకుండా బస్సులను ఒకరినొకరు మించిపోవాలని పరుగెత్తించి రోడ్ల ప్రక్కల వూరక నిలుచున్నవాళ్ల ప్రాణాలు దీసి, లోపలవున్నవాళ్లను పడద్రోసి చంపి చేయిమిగిలిందని తెలిసినవెంటనే బయటకు దూకి ప్రాణాలుదక్కించుకొని పరారిఅయినా చిత్తగిస్తూ ఉంటారు; తప్పించుకోలేకపోతే స్వయం ఆహుతీ అవుతుంటారు ఆనరమేధంలో. ఈప్రాణ నిర్యాణరంగాల్లో తరుచుగా జరుగుతూ వుండే ఘోరదుర్మరణ బలవన్మరణాలను చూడడం సంభవిస్తే కండ్లకు అంధకారం కమ్మిపోతుంది. ఆదృశ్యం స్మృతిపథం వదలనంతకాలం మనసు ఖేదోభయమూ ఆందోళనా కలుగుతూ ఉంటాయి. తలచుకొన్నప్పుడల్లా వొళ్లు జలదరిస్తుంది. నిండుప్రాణంతో కలకల్లాడుతూవుండే దివ్యసుందరవిగ్రహం ఒక్కక్షణంలో నెత్తురుతో తప్పదడిసిన చర్మాస్థికేశమాంసాలకుప్పగా మారిపోతుంది. ఎందరు ఈకృతాంతకేళీరంగాల్లో బడి అకాలమృత్యువువాతబడ్డారో, పడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నున్నారో తెలియదు. ఎందరుతల్లులకడుపున మంట పెట్టిందో, ఎందరు వృద్ధదంపతుల కం ఠ్లూడబెరికి వారి చేతి ఊతకర్రలను లాగిపారేసిందో, ఎందరి సతుల మాంగలికాలను త్రెంపి నుదుటికుంకుమతిలకాలను కడిగి వేసిందో, ఎందరి నట్టింటిదీపాలను ఆర్పిందో ఈపాడు రంగం లెక్కలేదు. అమ్మో! ఆధునిక నాగరికతకు ఈకృతాంత కేళీరంగాలే పట్టుగొమ్మలూ, చిహ్నలూనూ.

మద్రాసు జనరల్ ఆసుపత్రి, సెంట్రల్ స్టేషనుల మధ్యనుండి టవునువేపునకు వస్తూవుంటే ప్రధాన కేళీరంగాన్నుండి చీలి అయిదుశాఖారంగాలు తూర్పుగా, పూర్వోత్తరంగా ప్రసరించిపోతాయి. మొదటి నెంబరుశాఖ స్టేషనుప్రక్కనే చీలి ఎలిఫెంట్ గేటువేపూ, రెండో నెంబరు సాహుకారుపేటవేపూ, మూడోది చీనాబజారుకూ, నాలుగోది హైకోర్టుకు దక్షిణంగా సముద్రంవైపూ, అయిదోది ప్యారిస్ బోవేపూ పోతాయి. నాలుగు, అయిదునంబర్ల శాఖారంగాలమధ్య విరాజమానమైఉంది భారతీయుల ధనమాన ప్రాణాదులను రక్షించడానికి తాంబూలం పుచ్చుకొని కంకణంకట్టుకొనివున్న బ్రిటిష్ యోధుల దివ్యావాసం, ఆంగ్లేయరాజ్యస్థితి మూలాధారం, సెంటుజార్జిదుర్గం. ఈదుర్గానికి తిన్నగా దూర్పున సముద్రతీరపు ఇసుక మైదానంలో నిత్యదీపావలీమహోత్సవాలు జరుగుతూవుంటాయి. ఇక్కడ దీపాలుపెట్టుకు అనవసరం, జరిగేది పగలేకాబట్టి; మందుగుండుసామాన్లను తగలెయ్యడంతోటే మనకు గావలసింది. ఈనిత్యమహోత్సవాలు ఇక్కడే కాదు, సమగ్రభారతవర్షంలో ఎక్కడెక్కడ బ్రిటిష్ సైనికావాసాలు (Cantonments), దుర్గాలూ ఉన్నాయో అక్కడంతా జరుగుతూఉంటాయి. ఇవి ఆంగ్లయోధులను ఆహితాగ్నులకు అవశ్యాచరణీయాలైన ప్రాతఃకాలాగ్నికృత్యాలు, పాపం! ఎన్ని వేలమైళ్లనుండో ఇళ్లూవాకిళ్లనూ, పెళ్లాంబిడ్డలను, బంధుమిత్రులను, ఇంతఎందుకు సమస్తాన్ని పరిత్యాగంచేసి కేవలం పరోపకారబుద్ధితో అనాథలమై, నిస్సహాయులమై, తలలు పట్టుకొంటూ, మహానరకబాధలను అనుభవిస్తూ ఉండిన మనలను కాపాడి మనకు సూటిగా స్వర్గమార్గాన్ని చూపించి తరింపచేయాలనే దీక్షతో పడరానికష్టాలన్నీ పడుతూవుంటారు ఈవిమాతృభ్రాతృవరులు. ఈసోదరులను చూసిఅయినా మనవాళ్లు జ్ఞానం తెచ్చుకోరు. "ఎన్నాళ్లనిపరాయివాళ్లనుకష్టపెట్టడం అన్యాయంగా! మనపాట్లేవో మనమే పడదాం, ఇక వీళ్లకి ఉపకారవేతనా లిప్పిస్తే బాగుంటుంది" అని కలలోనైనా అనుకోరు. సిగ్గూ బిడియం లేకుండా "ఇంకా మీరే కష్టపడి సంపాదించిపెట్టండి. మేము కాలుమీద కాలు వేసుకొని హాయిగా కబుర్లు జెప్పుకొంటాం" అంటారు మనవాళ్లు ఎంతసేపటికీనీ. ఏంచేస్తారు పాపం వీళ్లూ! శత్రువులనేవాళ్లు ఎవరూ లేకపోయినా, ఎప్పుడేవేళ ఎటునుంచివచ్చి ఏదుర్మార్గులు మీదబడి పసిబిడ్డలవంటి భారతీయుల పీకలను నొక్కేస్తారో అని—తీరా మీద వచ్చిబడ్డతర్వాత చేసేదేముంది గనుక—కనుక, ముందుగానే ఏమిటి, ఏక్షణంలో పడితే ఆక్షణంలో తయారుగా ఉండడానికని ప్రతిరోజూ ఈపాడుతుపాకులతో, ఈమెషీనుగన్లతో, అభ్యాసా లని అష్టకష్టాలు పడుతూఉంటారు. ప్రొద్దున్నే ప్రాతఃకాలవాయుసేవనాని కని ఈదుర్గంముందుగా నడిచిపోతూవుండే ఘరానామనుష్యులకు సన్మానపూర్వక స్వాగతా లిస్తూఉంటాయి యోధుల భవ్యరూపాలూ, యంత్రశతఘ్నికల శ్రావ్యనాదాలూనూ. ఈలాగు కష్టపడుతూఉన్న వీరిని ఎంతమెచ్చుకొన్నా తక్కువేకదా? అట్లాంటప్పుడు వీళ్లను మెచ్చుకొనకపోవడం అట్లా ఉండగా మీదుమిక్కిలి వీళ్లు తమసొమ్మంతా వృథాగా తగలేస్తున్నారనీ, వీళ్లు ఒక్కొక్కచోట ఒక్కొక్కరోజు తగలేసేదాంతో ఎన్నో బీదకుటుంబాలని పోషింపవచ్చుననీ, ఇంకా ఏమేమో అనీ మన అన్నయ్యలలో కొందరి ఏడుపు. స్వయంగా నిర్వహించుకొనే శక్తి లేదు. పరాయివాళ్లెవరయినా వచ్చి సహాయపడుతూ ఉంటే చూసి ఓర్వలేక వాళ్లకు నామాలు దిద్దడమూనూ. కాని మన ఈ బృహన్నలల రాగాలాపాలకు జడిసి కర్తవ్యపరాఙ్ముఖు లయ్యేవారు కారు మన విదేశసోదరకేసరులు. ఇవతల వీరెన్నివిధాల దుమ్మెత్తిపోస్తూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉన్నా గణింపకుండా వారి కర్తవ్యాలను నెరవేర్చుకొనేపోతూవుంటారు.

ప్రాతఃకాలం జరుగుతూవుండే ఈ సరమారణయంత్రాభ్యసనాల్లో సైనికులను తరిఫీతు చేయడానికి గిండీ, సెంటుథామస్ మౌంటులవేపునుంచికూడా ఆఫీసరులు రావలసిఉంటుంది. వీరికి టాక్సీలూ, మోటరు సైకిళ్లూ ముఫత్ సర్ఫరా అవుతూఉంటాయి. వాటి మీద ప్రధానకేళీరంగంగుండా వచ్చి నాలుగో నెంబరు ద్వారా కొందరూ, అయిదోనెంబరుద్వారా కొందరూ పరుగెత్తి మీదవచించిన ఇసుకమైదానంలో సమావేశమౌతూవుంటారు. ఈసంగతులన్నీ మీ కింత వివరంగా ఎందుకు చెప్పాలిసివచ్చిందంటే నాలుగూ అయిదు శాఖారంగాలతో, మౌంటు మద్రాసులమధ్య సైనికాధికారుల పరుగుళ్లతో, ముందు మనకు అవసరం వస్తుంది. ఉన్నట్లే ఉండి ఈపేర్లన్నీ హఠాత్తుగా ఎత్తితే అయోమయావస్థేకదా. ఇక వినండి.

౪

కార్పొరేషన్‌వారి లెక్కలప్రకారం మద్రాసు నగరపు ప్రస్తుత జనసంఖ్య ఆరులక్షలన్నర. అందులో కేవలం పనిపాటలు చేసుకొనీ, ముష్టిఎత్తుకొనీ జీవించే దారిద్ర్యదేవతాసంతానాల సంఖ్య రెండులక్షలకు పైగా వుంది. వేలకువేలు శుష్కదరిద్రులు. కథనసౌకర్యానికి వీళ్లను మొదటినంబరని పిలుచుకొందాం. వీళ్లకు బొత్తిగా ఇళ్లూ వాకిళ్లూ అనేవి ఏమీ ఉండవు. పగలంతా ముష్టిఎత్తుకొనో, లేక ఎక్కడైనా దొరికితే కూలిచేసుకొనో సంపాదించుకొన్న డబ్బులతో సాయంకాలం ఏనాటి కానాడు గింజలను దెచ్చుకొని వండుకొని కడుపునించుకొంటూ ఉంటారు. ఏమీ దొరకని రోజున భగవన్నామస్మరణే. పట్నంబయటి మైదానాలు, చెట్లనీడలూ, మురికినీటికాలువగట్లూ, బాజార్లలోని ప్రక్కబాటలూ, దుకాణాల ముంగిళ్లూ వీళ్లకు ప్రధాననివాసస్థానాలు. ధనికులు పారేసే చెత్తంతా వీళ్లకు అమూల్యమైన సామగ్రి. గవర్నరుదొరవారు మౌండురోడ్డుప్రాసాదాల్లో, దివ్యశయనాల్లో, మక్మల్ పట్టుపరుపులమీద అంతనిశ్చింతగా నిద్రిస్తారో లేదో తెలియదుకాని ఈహిందూదేశపు మొదటినెంబరుబిడ్డలు వొళ్లూ పై తెలియకుండా నిద్రిస్తూఉంటారు, సగం వానతో తడుస్తూఉన్నా సరే, మీదవచించిన ప్రదేశాల్లో, నిర్భయంగా. వీళ్ల కుండే పైనచెప్పినటువంటి ఆస్తియావత్తూ చింకిచాపచుట్టలోగాని, చినిగిన గోనెపట్టలోగాని సరిపోతూవుంటుంది. ఈ సామానుమూటలను కొంచెం మరుగ్గావుండే స్థలాల్లో పారేసి పగలంతా పనిపాటలకో, ముష్టికో వెళ్లడం అలవాటు. ఆసమయంలో వీళ్ల సర్వస్వాలను పహరాఇచ్చి కాపాడేది వాయుభగవానుడే. కాని ఎప్పుడైనా ఈవెధవల ఆస్తులన్నింటినీ సమీపంలో పారుతూఉండే ఏమురికికాల్వనీటికో వప్పజెప్పి భగవానుణ్ణి పహరాకష్టాన్నుంచీ, వాటి యజమాన్లను మోతబరువునుంచీ తప్పించి వాళ్ల చేత ధన్యవాదాలను పొందుతూ-వుంటాడు, అనుగ్రహం వచ్చిందంటే, ఏదొరసార్జెంటైనా. లేకపోతే ఎందుకీవెధవచెత్తంతా! జనులందరూ కష్టం, దుఃఖం అనేది ఏమిటో ఎరక్కుండా ఎల్లప్పుడు ఆటపాటలతో, విందులతో, భోగభాగ్యాలతో మహానందం అనుభవిస్తూఉండేలాగ బ్రిటిష్ ధర్మకర్తలు నిత్యకల్యాణం పచ్చతోరణంగా పరిపాలిస్తూఉంటే ఈమొదటినెంబరు వెధవలు ఎక్కడనుంచి దాపరిస్తారో పట్నంబయటా లోపలా ఎక్కడజూచినా వీళ్లే చీమలపుట్టల్లాగు. మన భ్రాతృవరుల దివ్యపరిపాలనంక్రింద దేశమంతా ఎంతటి సౌఖ్యసంపత్తులతో తులతూగుతూఉందో చూసి సంతోషిస్తామనే ఉత్కటాభిలాషతో వేలకొలది మైళ్లు ప్రయాణం చేసి వచ్చి నావదిగి పోర్టుబయట కాలుపెట్టడంతోటే. ఈ మొదటినంబరుపక్షులు దర్శనమియ్యాలసింది ఇంగ్లండుదొరలకూ. వారి కెల్లాంటిభావాలు కలుగుతాయి ఈ మొగాలు కంటపడడంతోటే. కాబట్టి సాధ్యమైనంతవరకు మొదటినెంబరుబిడ్డల స్ఫురద్రూపాలు ఏమూలకూడా కన్పించకుండా ప్రయత్నాలు చేయవలసిందని ప్రభువుల ఆజ్ఞ కాబోలు తాబేదార్లకందరికీ. అందునిమిత్తమే అప్పుడప్పుడు దొరసార్జెంట్లు మీద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్రాసినలాగు మొదటినెంబరుబిడ్డల సాగున్ల వినయమై జాగ్రత్తపుచ్చుకొంటూ ఉంటారు.

సడ్డికంటె మెల్ల మేలన్నట్లు వీళ్లకంటే రవంత వాసి రెండోనంబరుబిడ్డలు. వీళ్లకు తలదాచుకోడానికి కొంప అనేది వకటివుంటుంది. కాని వాటి స్థితిగతులూ, ఇరుగుపొరుగులూ, అక్కడ వీళ్లవునికీ చూస్తే ముందు యమలోకానికి పోయినప్పుడు అక్కడ వీళ్లకు కష్టమనిపించకపోవడమేకాదు, తామేదో స్వర్గంలోకి వచ్చినట్లు భావించవచ్చునని గూడా తోస్తుంది. ఎందుచేతంటే అక్కడ ఒక్కొక్కపాపానికి పరిహారంగా ఒక్కొక్కయాతనే అనుభవింపవలసివస్తుంది ఒకేసమయంలో. కాని ఇక్కడ ఏకకాలంలోనే దైవిక, భౌతికకారణాలచేత అనేక యాతనలు అనుభవించడానికి తరిఫీతు నొందినప్పుడు అక్కడ ఒక్కొక్కదాన్నే అనుభవించడం ఒక లెక్కా. అందుచేత నేమో తెలియదు— ఇక్కడికంటె అక్కడే సౌఖ్యమని ఏ యదృశ్యమీడియం ద్వారా తెలిసిందో ఏమిటో చెప్పలేను, ప్రతిసంవత్సరమూ ఈ మొదటి రెండు నంబర్ల బిడ్డల్లోనుంచి వందలకువందలు ప్రయాణాలుకట్టుతూవుంటారు ఆలోకానికి. కార్పొరేషన్‌వారూ, సానిటరీ వెల్‌ఫేర్ లీగువారూ, సోషియోలాజికల్ బ్రదర్‌హుడ్డువారూ శతవిధాల ప్రయత్నిస్తూఉంటారు, ఏవంవిధ తైర్థికప్రయాణాలను అరికట్టాలినని. కాని వీళ్లమాటలు పాటించే దెవరు? ఈ రెండోనెంబరుబిడ్డలు నివసించే యీలాంటి అనారోగ్యాలయినతావులు వేరువేరు పోట్ల రెండువందలవరకూ ఉన్నాయి మద్రాసునగరంలో. వాటిలో ఒపేటేరీమన్య భాగం ఒకటి. దీంట్లో కాపురం పెట్టాడు వెంకయ్య. ఊరిబయటి పొలాల్లో శుద్ధమైన వాయువుల సేవిస్తూ పొలాలు దున్ని పండించుకొని జీవనంచేసే ఈవ్యక్తి నానావిధరోగజనకసూక్ష్మక్రిమిసంచయపూరితాలైన దుమ్ములు రేపుతూఉండే పట్నంలోని రోడ్లమీద చెమటలు కారేలాగు బండ్లను లాగిలాగి తెచ్చుకొనే కూలి డబ్బులతో పొట్టనింపుకొని కాలమూర్తిచేత స్వకీయ జీవితాయుఃపరిమాణాన్నించి ఒక్కరాత్రిని కొట్టిపారవేయించుకొనేని దుర్గంధపరిపూర్ణమైన వాతావరణ మధ్యమందలి ఒకక్షుద్రపర్ణకుటీరంలో. కొబ్బరాకులకప్పు, వెదురుతడికెలగోడలూ ఈకుటీరవాసులను శీతోష్ణవర్షాతపాలనుంచి కొంచెం కాపాడుతూవుంటాయి. తడికెలకు లోపలా వెలుపలా పేడమన్ను పూత ఉంది. కుటికి పశ్చిమదక్షిణాల రెండు ప్రక్కలా పారుతూవుండే దుర్గంధజలనాళికలు దీనికి విలక్షణశోభను గల్పిస్తూవుంటాయి. దీనికి పడమట సుమారు ౧౬ గజాలదూరాన వృక్షప్రాకారసమావృతమైనరెండుయకరాల ఖాళీస్థలంవుంది. ఆస్థలం భూతంలో ఎప్పుడైనా కుంటగా వుండిందేమో తెలియదు. కాని పట్నంలోని చెత్తబండ్లు కొన్ని ప్రతిరోజూ దానికి తమ సర్వస్వాన్నీ అర్పిస్తూ, మైదానంక్రిందికి తీసికొని వచ్చి అనంతరంగూడా సేవాకరణాన్నుంచి విరమింపనందున దిబ్బలు దిబ్బలుగా ఏర్పడి వానకురియడంచేత అందలి నానావిధబీజాలూ మొలకలెత్తి వృద్ధిపొందుటచే మొక్కల గుములతో నిండి పచ్చగా కంటిని ఆకర్షిస్తూనే ఉందికాని ఒకమాదిరిసుగంధం దాంట్లోనుంచీ బయల్వెడలి అక్కడి వాతావరణపరిమళానికి శక్త్యనుసారం సహాయపడుతూవుంటుంది. ఇక ఈ గుడిసెకు పూర్వోత్తరం ఒకఫర్లాంగుదూరంలో జలాశయం వకటి. ఇది పూర్వం బృహత్ పరిమాణంలో వుండేది కాబోలు. నాలుగువేపులా చెత్తబండ్లు వచ్చిపడుతూ వుండడంచేత తన చుట్టుప్రక్కల నివసిస్తూఉన్న మనుష్యాకృతుల శరీరాల్లాగే క్రమంగా పరిమాణంలో సన్నగిల్లి పోతూవుంది. నాలుగువేపుల గట్లూ చెత్తవల్ల ఏర్పడ్డాయి. అడుగునచెత్తా, అక్కడకురిసే వాననీళ్లే కాక ఉపర్యుక్తనాళికల జలంగూడా జలాశయంలో వచ్చిపడుతూ ఉంటుంది. ఇక మీరే ఊహించుకొనండి, దీనిమీది వాతావరణంలో ఎన్ని సూక్ష్మక్రిమి సంచయాలు తేలియాడుతూవుంటాయో, తత్సమీపవాసులగు జీవులను తత్క్షణం ఐహికం వదలిపోవలసిందని ఆజ్ఞాపించడానికి సమర్థమైనవని, సత్యాగ్రహులను బ్రిటిష్ ప్రభుత్వాధికారుల్లాగు. పాపం వెంకమ్మస్థితి ఏంచెప్పను! స్వంతగ్రామానికే అనుకొంటే స్వంతదేశానికే దూర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైంది. మనసుకువచ్చిన ఆహారంలేదు. ఒకప్పుడు పాలు పెరుగులను ఇంట్లో తప్పకుండా వాడి, ఇరుగుపొరుగువాళ్లకు పోసి ఇంకా మిగిలితే మళ్లీ ఆపశువులకే పోస్తూవచ్చిన చేతికి ఈ సంసారంబారుదేశంలో మంచిమజ్జిగైనా దొరికేదికాదు, తన ప్రాణసములైన వారికి పొయ్యాలనుకొన్నా. కాని ఎప్పుడేపరిస్థితులు సంభవిస్తే అప్పుడు వాటికే అలవాటుపడిపోతుంది మానవస్వభావం; ఉన్నదాంతోనే సరిపెట్టుకొని ఆనందిస్తూఉంటుంది. కాబట్టే స్వచ్ఛవాతావరణం పోయి, స్వంతఇల్లు పోయి, దేశం పోయి, సమస్తసౌకర్యాలూ పోయి ఇక్కడఈదీనదశలో వచ్చిపడినప్పటికీ వెంకయ్య కుటుంబం దీనికే అలవాటుపడిపోయింది. ఏంలేకపోయినా పెనిమిటీ కొడుకులూ చల్లగా వున్నారు. వీళ్లే ఇప్పుడామెకు సర్వస్వం. వీళ్లిద్దరినీ రెండునేత్రాలుగా భావించుకొని శాంతంతో కాలంగడుపుతూ వుంది. వీళ్ల పర్ణకుటీరానికి ఉత్తరభాగంలో పడమటిముఖంగా వాకిలీ, వాకిలి అంతవెడల్పున దానిమీద ఒక చిన్నవసారా, దానిక్రిందుగా బారుతూవుండే నాళికమీద అడ్డంగా చెక్కలుపరిచి వాటిని మట్టితో నింపి నిర్మించిన చిన్నవంతెనా కుటీనిర్మాణానికి సంపూర్ణతను కల్పిస్తూఉంటాయి. ఈవసారాక్రింద వంతెనమీద వాకిలి కెదురుగుండా ఒకచాపనో, గోనెపట్టనో పరిచి తమఇంటికి వచ్చినవారిని మర్యాదిస్తారు సాధారణంగా ఈదంపతులు. నాకూ అటువంటిసన్మానమే జరిగింది మర్నాడు వెళ్లేసరికి, క్రిందటివాగ్దానం ప్రకారం. తల్లివెంటవున్న అయిదేళ్ల కుర్రవాడు సోముడే అని చెప్పారు. అప్పుడు వాణ్ణి చూస్తే పెద్దయింతర్వాత మంచి ఒడ్డూపొడుగుమనిషే అవుతాడని తోచింది తల్లిదండ్రుల్లాగు. నేను పోయి కూచున్న తరువాత వాడు వాడిఈడు గోచీపాతలరాయళ్లతో గలిసి మీదవచించిన ప్రాకారపు చెట్లనీడల్లో ఆడుకోడానికి పరుగెత్తాడు. ఆనాడు ఆదంపతులిద్దరూ మహానందంగా వున్నారు. వీరయ్యదగ్గర్నుంచి కొంచెం సేపటిక్రింద ఉత్తరం రావడమే అందుకు కారణం. సుదూరదేశంలో ప్రవాసుల్లాగు ఉండేవాళ్లకు ఇష్ట మిత్రబంధువులదగ్గిరనుంచి వచ్చే ఉత్తరాలు మహానందం కలిగిస్తాయి. ఇది కేవలం అనుభవంచేత తెలియాలిసిందే. అట్టిఉత్తరాలను ఎన్నిసార్లు చదువుకొన్నా తనివితీరదు. మరలమరల చదువుకొని కళ్ల కద్దుకొని సంతోషబాష్పాలు రాలుస్తూఉంటారు. నేను పోయి కూర్చున్నతరువాత "మావీరయ్యన్న ఉత్తరంవ్రాశాడు చూడండి" అని ఒకజాబును నాచేతి కందిచ్చి గుమ్మం మీద కూచొనివున్న వెంకయ్యకు వెనుకగా వెళ్లి నిలుచుంది వెంకమ్మ. ఉత్తరం తెరుస్తూ "అయితే వీరయ్యవద్దనుంచి యథాప్రకారం ఉత్తరాలు ఉత్తరాలు వస్తున్నాయీ" అని అడిగాను. "సరే! ఏ నెలలో నావద్దనుంచి ఉత్తరం పోదో ఆ నెలలో తానే బయలుదేరివస్తాననే షరతూ. ఒక పట్టాన్ని రానిచ్చే డనుకొన్నారాఏమిటి తెనాలినుంచి. ఇంతకూ అన్నం నీళ్లరుణం, అతని వశమైందికాదు అడ్డగించడానికి. మేం ఒకఉత్తరం వ్రాసేసరికీ అతను రెండుజాబులు వేస్తూవుంటాడు. ఈఉత్తరం వచ్చిన కాణ్ణుంచీ మాయింటిదానికి కాలెక్కడా నిలవకుండా వున్నాయి" అన్నా డతను. దానికి సమ్మతించినలాగు సూచిస్తూ "నాకొక్కతెకేనా సంతోషం" అన్నదామె. ఇంతలో జాబునందలి ఆరంభభాగం లోలోపలనే చదువుకొన్న నేను ఆ! తెలిసింది. "మీచెల్లెలు సుఖప్రసవ మైనది. ఆడపిల్ల కలిగె మూడురోజు లైంది. పథ్యం పెట్టాం" అని బిగ్గరగా చదివి "ఇదేకదూ మీసంతోషకారణం ?" అని అడిగాను. "అదే! ఇంకా ముందు చదవండి" అన్నారు ఇద్దరూనూ "మీతో స్నేహసంబంధం కలిగిననాట్నుంచీ ఎట్లాగైనా శాంభవ్యం చేయాలెనని మనసులో పెట్టుకొని ఉన్న నాకోరిక దైవానుగ్రహంవల్ల నేటికి సమకూరే అవకాశం దొరికింది. ఈఉత్తరం అందినవెంటనే తప్పకుండా బయలుదేరివచ్చి పదిరోజులపాటు వుండి మీచిన్నికోడలిని దీవించి వెళ్లాలెనని నాకోరిక" అని చదివి "తెలిసిందా వెంకయ్యా, వీరయ్యభావం" అన్నాను. "అందుకేకాదండీ నేనన్నదీ మాయింటిదాని కెక్కడా పట్టలేక్యంకాకుండావుందని, సంతోషం. వీరయ్య ఏదో


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్రాశాడు కానండి మేము అంతటి అనుగ్రహానికి యోగ్యులం గాము. మా ప్రస్తుతపు దరిద్రావస్థ అతనికి బొత్తిగా తెలియదు." అని అన్నాడు వెంకయ్య. అంతట నేను "స్థితిగతులసంగతులు ఎప్పుడూ ఇంతే. ఒకేమాదిరి నిలుకడగా ఎవరి కున్నాయి? కాని మీపూర్వపుస్థితీ, మీతండ్రి తాతలప్రసిద్ధీ అతనికి తెలియకుండా ఉండవు." అని వెనకటిసంగతులు ఎత్తేసరికి ఇద్దరిమొగాలూ చింతాక్రాంతాలయినాయి. అది చూచి "వెంకయ్యా, అధైర్యపడడ మెందుకూ ? అదృష్టానికి తలవంచవలసిన వాళ్ల మేగాని మనచేత ఏమవుతుందీ? ఇంతకూ సోముడి అదృష్టం ఎట్లా ఉందో ఎవరుచూశారు? "అని ఓదార్పుమాటలు చెప్పి తప్పకుండా వెళ్లిరమ్మని సలహాఇచ్చాను. దాని కతడు "నాకూ అదే ఆలోచనగావుంది. ఎట్లాగో కడుపుగట్టుకొని నాలుగుడబ్బులు మిగుల్చుకుంటేవాటిని రైళ్లకే సమర్పించుకోవలసివస్తుంది. ఈ సంగతి తెలిసినప్పటినుంచీ వాళ్లవదినెకేమైనా బట్టలు తీసికెళ్లి ఇవ్వాలని చాలా మనసుపడుతూ వుంది మా ఇంటిది. దాని మనస్సూ తీర్చాలి. ఏదో ఈదేశంలో ఈ మహాపట్నంలో మమ్మెరిగినవా ళ్లెవరని ఏగుడ్డపాతనో కట్టుకొని కాలంగడుపుతూవున్నాం. ఈవిధంగా అక్కడికి వెళ్లడానికి మనసొప్పదు. ఎంతలేదన్నా నలభై యాభైరూపాయలు కావాలి. ఓముప్పైరూపాయలు ఉండవచ్చు మా ఏజంటయ్యపరంగా ఇచ్చినవి. తక్కినవాటికి మా రాములును అడుగుదా మనుకొంటున్నాను. ఏదోమాదిరిగా సద్దుబాటు చేసుకొని నాకూ వెళ్లాలనే ఉంది రెండు మూడు రోజుల్లో." అన్నాడు వెంకయ్య. ఇక వాళ్లవూరి కెళ్లాలని వెంకమ్మ మనసులో కలుగుతూవున్న అభిలాష ఇంతింతని చెప్పడానికి వీల్లేదు. ఆవుత్తరంలోని సంగతులు విని, వెళ్లాలని నిశ్చయించుకొనేసరికి రాగల ఆరునెల్ల బలం లాక్కున్నట్లయి ఈమెముఖం వికసించిపోయింది. ఏనాడు బయలుదేరుతామా, ఎప్పుడు రైలెక్కడామా అని ఉవ్విళ్లూరుతూంది. ఇంతలో ఇతనిభాగస్తుడు రాములు వచ్చాడక్కడికి. బందరువీధి లోనుంచి అరటిగెలలను తీసుకొని తిరువళిక్కేణి మార్కెటులో చేర్చడానికి ఒప్పుకొనివచ్చానని చెప్పాడతను. అది విని వెంకయ్య సరే నాగులుతో కూడా ఈసమాచారము చెప్పి వాణ్ణివెంటబెట్టుకొని రమ్మనీ, ఉదయం నాలుగు గంటలకే బండికట్టుకొనిపోయి కనుచీకటి వుండగానే పండ్లను బండికెక్కించుకొని బయలుదేరుదామనీ చెప్పితే సరే అని అతడు వెళ్లిపోయినాడు. నాగులు ఇతని రెండో భాగస్తుడు. అటుతరువాత అతడు అక్కడికి వచ్చినకొత్తలో పడినకష్టాలనూ, ఆ సమయాల్లో తన భార్య కనబరచిన శాంతిసహనాలను వెంకయ్య చెబుతూవుంటె చాలాసేపు కూర్చొని మాట్లాడాము. పిదప పొద్దు గుంకిపోవడం చూసి ఎంతటి తేజోరాశికైనా కాలవశుడు కాకుండాఉండడానికి వీల్లేనప్పుడు సాధారణమానవు లెంతమాత్రపువాళ్ళూ అని అనుకొంటూ వెళ్లేలోపల మళ్లీ ఒకమాటు వచ్చి కలిస్తే కలుస్తానని చెప్పి నేను అక్కడనుంచి వెళ్లిపొయ్యాను.

✂

"మనుష్యులు తలపెట్టేది ఒకవిధంగా, దేవుడు తలపెట్టేది ఇంకోవిధంగా. ఏనాటికైనా ఇంతప్రయోజకుడైవచ్చినా తండ్రే నాకష్టా లన్నింటినీ తీర్చకపోతాడా అనే గంపెడాసతో ఒక్కగాని ఒక్కకొడుకూ దూరదేశంలో ఏంచిక్కులు పడిపోతాడో అని తన కెంతకటికష్టం కలుగుతూవున్నా సహించుకొని అతని కేమాత్రంకష్టం కలుగకుండా ఉండేలాగు డబ్బు కావలసివచ్చినప్పుడు అంతా పంపుతూ కుమారుని విద్యాబుద్ధుల కోసం తపిస్తూఉంటే తల్లీ......వూరివాళ్లకూ ఉపాధ్యాయులకూ ఆశ్చర్యం కలిగేలాగు చురుకుదనం, తెలివితేటలతో చకాచకి పైకెక్కివచ్చిన యామెకుమారుడు బి. ఎ. తరగతిలో చదువుతూ ఇన్ఫ్లూయంజాజ్వరం తగిలి పుటుక్కున చావడమా! ఖండాంతరాల్లో నాలుగైదేండ్లు మంచిపరిశ్రమ సలిపి గొప్పగొప్ప పరీక్షల్లో నెగ్గి అనంతరం ఇంటికి మరలివస్తున్నానని జామాత వ్రాసిన ఉత్తరం చూసుకొని మహానందంతో అత్తమామలూ, హృదయాన్ని పెకలించుకొని బయటికి వచ్చేటంత మిక్కుటమైన అభిలాషలు కల యతని


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధర్మపత్నీ తమ భాగ్యదేవతను బొంబయిలోనే వెళ్లి కలుసుకొనవలెననే ఆత్రంతో ప్రయాణానికి సర్వ సిద్ధంగావుంటే ఆతడు ఎక్కవస్తూఉండిన స్టీమరు ఏడెనుదాటి కొంతదూరం వచ్చినతరువాత సముద్రంలో మునిగిపోయిందనే దారుణసమాచారమూ! ఇల్లూ వాకిలీ లేక ధర్మకర్తల ఔదార్యంచేత ధర్మసత్రంలోని ఒక మూలగదిలో దినాలను వెళ్లబుచ్చుకొంటూ ధర్మాత్ముల సహాయంతో తనకుగల సర్వస్వమూ అయిన మనమరాలికి చదువుచెప్పించుకొంటూ ఈ సంవత్సరం మా అమ్మ తప్పకుండా పరీక్షలో నెగ్గుతుం దంటున్నారు అంతానూ. నాతల్లే నా కిక రెండుకళ్లూనూ. స్కూలునుంచి వచ్చేవేళ దాటిపోవచ్చింది, ఇంకా రాలేదేమని తలుపుచప్పుడయితే తలఎత్తి అమ్మా అని పిలిచే అంధ మాతామహునికి ఆబిడ్డ బడినుంచివస్తూ లారీక్రింద పడిపోయిందని గుండెలుపగిలే వార్తా! మేం తలపెట్టేది ఒకటీ నీవు తలపెట్టేది ఇంకొటీనా! ప్రభో! కారణం ఏమిటి? మాఅభిలాషలకు వ్యతిరేకంగా పరిష్కరిస్తూ వుంటావు! మాకు లేశమాత్రమైనా యోగ్యత లేనేలేదా ప్రపంచంలోని ఇతర స్వాతంత్ర్యదేవీకుమారులతోపాటు తదీయ ఉత్సంగాసీనసౌఖ్యాన్ని అనుభవించేటందుకు" అని ఏమేమో తలపోసుకొంటూ నడిచిపోతున్నాను, ఎస్ప్లనేడ్, సెంట్రల్ స్టేషన్లమీదుగా మౌంటురోడ్డుకు బోవాలని, హైకోర్టుకాణ్ణుంచి బయలుదేరి. పైలాటి ఆలోచనలు రావడంచేత మనస్సంతా వ్యాకులంగా వుంది. స్వాతంత్ర్యలక్ష్మీపదారాధన నిమిత్తం అనేకకుమారీకుమారరత్నాలు స్వశరీరాలను తృణప్రాయంగా అర్పించుకొంటూఉన్న రోజు లవి ఈతడవ దేవి తప్పకుండా ప్రత్యక్షమౌతుందనే గట్టి నమ్మకంతో. కాని ఆత్మాహుతులతో ఇంకా తృప్తి కలుగలేదుకాబోలు, దేవి కనుగ్రహం కలగడం లేదు భారతీయులమీద. మీదుమిక్కిలి ప్రతిపక్షులకోర్కెలే నెరవేరుతున్నాయి ఈ సంగతి తలపునకు రావడంచేతనే మీదితర్కాలన్నీ బయలుదేరాయి తా నొకటి తలిస్తే భగవంతు డింకొకటి తలుస్తాడనీ, జడిసేవాళ్లనే జడిపించడం, ఏడిచేవాళ్లనే ఏడ్పించడం, తగిలినవేలికే తగలడం అనీనీ.

చూళైమిల్లులు రెండోకూత వినబడి—సంవత్సరం పొడుగూనా ముఖ్యమైన పండగరోజులూ, ఆదివారాలూ తప్ప తక్కిన దినాలలో ప్రొద్దున్నే ౫ గంటల కొకపర్యాయం. ౫-౧౫ గంటలకు రెండవపర్యాయం ఈ మిల్లునుంచి ఇంజనుకేకలు వినబడడం వాడుక. వాటిలో పనిపాటలు చేసే కార్మికులను పెందలాడే నిద్రనుండి లేవగొట్టి సకాలంలో పనిలో హాజరుపెట్టడానికయి నప్పటికి రెండుమూడుమైళ్ళవ్యాసపువలయంలో చుట్టుప్రక్కల ఉండే సమస్తమైనవారికిగూడా ఒకగడియారంలాగు ఉపయోగపడతాయి ఈ కేకలు—౧౫ నిమిషాలు కడచిపోయివుండవచ్చు. ఆకాశం నిర్మలంగా వుంటే ఈపాటికి తూర్పుదిక్కంతా విభూతి పూసుకొన్న కాలపురుషుడిమొగంలాగ తెల్లటి వెలుగుచే నిండిపొయ్యేదే కాని వర్షం కురియడానికి సిద్ధంగా వున్న నల్లటిమబ్బులు దట్టంగా కమ్ముకొనిఉండడంచేత కనుచీకటి మరింత గాఢమై ప్రాగ్భారాలవంటి పట్టణంలోని అట్టాలికల గోపురాలు విస్పష్టంగాగాక మసకమసకగా దర్శనమిస్తున్నాయి. ప్రతిరోజూ సాయంకాలాలందు తండోపతండాల జనులతో క్రిక్కిరిసి తిన్నగా నడవడానికిగూడా కష్టమనిపించే వీథులూ బావురుమంటూ పెద్దమైదానాల్లాగు కనుపడుతున్నాయి. భూతసంచారం మెల్లమెల్లగా ఆరంభమౌతూఉంది. కార్పొరేషనుదీపాలు చుక్కలమార్గాన్ని పట్టాయి. దూరదూరాన్ని ఎక్కడో కాఫీహోటళ్లముందు, ట్రాంకార్లల్లో, పెట్రోలియం డిపోలముందూ దప్ప ఎక్కడా దీపాలే లేవు. ఆఫీసువేళా, పనితొక్కిడివేళా కాకపోవడంచేత ట్రాంకార్లు మోటార్ మెల్ల ఇచ్ఛానుసారం నడుస్తూఉన్నాయి కొన్ని తక్కుతూతారుతూ పెండ్లినడకలతో, మరికొన్ని ధనుర్ముక్తాలైన బాణాల్లాగ అపరిమిత వేగంతోనూ. లారీ బస్సు భూతాల ధణధణ లింకా చెలరేగలేదు. కాని పరుసలో ఇవీ ట్రాంకార్లనే అనుకరిస్తున్నాయి. ఊరిబయట మైదానాల్లో, రోడ్లప్రక్కనా, దుకాణాలముందూ అస్తవ్యస్తంగా పడి నిద్రిస్తూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వున్న మొదటినంబరుబిడ్డ లింకా తల్లిని వదల్లేక అంటిపట్టుకొనే ఉన్నారు. పచ్చయ్యప్పాకాలేజికి ఎదురుగుండా మాత్రం కొంచెం సందడిగావుంది కూరగాయలకోసం కొత్వాలుచావిడికి వచ్చిపొయ్యేవాళ్లమూలంగా. తెల్లవారకముందే వచ్చి కమ్మని నిద్రాసౌఖ్యాలకు అంతరాయాలు కల్పించే పాలవాళ్ల అరుపులూ,అవ్యక్తాక్షర ఉచ్చారణలతో కీచుమని అరచే పెరుగువాళ్ల కేకలూ దూరాన్నుంచి వినవస్తున్నాయి. గాలి బొత్తిగా బిగించినట్లానుంది. గొప్పవర్షం వస్తుందా అనిపించింది. చిత్తక్షోభాన్ని గలిగించే తలపులు మనస్సులోకి వస్తూనేఉన్నాయి. నడిచిపోతూనే వున్నారు. రెండోమూడో నంబర్ల శాఖారంగాల మధ్యవున్న వేదపుస్తకాలయపు దక్షిణపుగేటు దాటి కొంచెంముందుకు వెళ్లానుకాని రెండోశాఖారంగాని కీవలే ఉన్నాను. కచ్చంహౌసుకు పోవలసిన మైలాపూరు బోగీట్రాంకారొకటి ప్రచండధ్వనులతో మహావేగంగా ఎదురుగుండా వస్తూ ఉంది. దీన్నిమించిన ధూంధాములతో వెనకనుంచి వస్తూ ఉంది ట్రిప్లికేనుకు పోవలసిన బోగీ ఎస్ప్లనేడువేపునుంచి. అయిదోనంబరు శాఖారంగం మీదుగా సెంట్రల్ వేపునకు దూకుతూవస్తుంది కార్పొరేషన్ నారి వట్టిలారీ గణగణలాడుతూ అతివేగంగా. ఒకమాదిరి నిష్పందగా ఉన్న ఆసమయంలో వీటి పురవళ్లూ పరవుళ్లూ చూడడంతోటే నా ఆలోచనా పరంపరలకేకాదు పాదచలనానికిగూడా స్తబ్ధత్వం గలిగింది. రిచ్చపడి ఏదో తమాషాచూసేవాడిలాగు అక్కడే ఆగిపోయి వీటినిచూడడం మొదలెట్టాను. ఎస్ప్లనేడు నుంచి వచ్చే బోగీప్రక్కనే ఒకబస్సూ తీవ్రంగానే వస్తూంది, ట్రాముకు వెనుకపడవెయ్యా లనుకొన్నట్లు. దానికి కొంచెం అవతలగా ప్రక్కప్రక్కనే కూలీలు లాగే బండి వొకటి ముందుకాడిని బట్టికొని ఇద్దరు మనుష్యులు లాగుతూవుంటే వెనకనుంచి మరోమనిషి నెట్టడంవల్ల దానికి దగిన తీవ్రంతో అదీ వస్తూంది సెంట్రల్ వేపూ. నాలుగూ అయిదూ శాఖారంగాల మధ్యకు వచ్చింది ఆబండి. హఠాత్తుగా సముద్రంవేపు ఆకాశంఅంతా తళతళా మెరిసి అనుక్షణంలో ఫెళఫెళారావంతో పిడుగుపడి నేలను గజగజలాడించింది. మెరుపుల కాంతికి కళ్లు రెండూ చప్పున మూతపడ్డాయి వాటంతట అవే. వెంటనే తెరిచేసరికి కళ్లు మూతపడిన క్షణంలో నాముందుగానే దూకిందికాబోలు ప్రధానకృతాంతకేళీరంగాన్నుంచి మనోవేగంతో మోటర్ సైకిలొకటి చూస్తూచూస్తుండగానే ఇటునుంచీ అటునుంచీ వచ్చే ట్రాంకార్లనూ, బస్సులనూ తప్పించుకొని పరుగెత్తిడంలో మైలాపూరు కారును రాసుకొంటూపోయి కూలిబండివెనుకనుంచి నెడుతూవున్న మనుష్యుని ధక్కాతో గూలవోసి ముందుకు బోయిందో లేదో దానివెనకనే దాంతో సమానవేగంతోనే వస్తూవున్న టాక్సీ ఆక్రిందపడ్డ నిర్భాగ్యునిమీదుగా పరుగెత్తింది. ఎవరికీ బ్రేకులు వేసుకోడానికి అవకాశమే దొరికింది గాదు. మెరుపు మెరిసినంతలో అన్నీ అయిపోయినాయి. గొల్లుమంది ట్రాముల్లో బస్సుల్లోవున్న కొద్దిపాటి జనం. సైకిలూ మోటరూ ఎదుట ఉన్న చెట్టును గొట్టుకొనవలసిందే. రెంట్రుకమాత్రపు ఎడంలో తప్పించుకొని వుంటాయి. కష్టంమీద వాటిని మళ్లించుకొని దొరలూ, అటూ ఇటూ కొంతదూరం పోయినతర్వాత ట్రాములను ఆపుకొని కండక్టర్లూ, బస్సుల్లోని జనం అంతా ఆశరీరాన్ని సమీపించారు. క్షణమాత్రంలో చుట్టూ గుంపు పోగయింది. నేనూ పరుగెత్తా అక్కడికే మహాగాభరాగా. దగ్గిరికి పోయి చూతునుగదా వొళ్లు కంపించడం మొదలెట్టింది. ఏ నిర్భాగ్యుడో ఏమో అనుకొన్నా. రాములు 'అయ్యో వెంకయ్యా, అయ్యో వెంకయ్యా'అని నెత్తిగొట్టుకొంటున్నాడు స్పృహతప్పి నేలమీద పడి కొట్టుకొంటూవున్న ఆ దేహాన్ని చేరి. అనుక్షణంలో నిన్నసాయంకాలం జరిగిన వెంకయ్యా రాముల మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. ఇంకేముంది వెంకమ్మ సౌభాగ్య దేవత అస్తమించింది. రేపో ఎల్లుండో దేశానికి పోవాలనుకొంటూవుంటే ఇంతలో ఈఘోరమా! మనస్సంతా వికావికలైపోయింది.

* * *

మర్నాడుజరిగిన ఆక్సిడెంటల్ డెత్ వర్డిక్టులో తెలిసింది—దొరలు గిండీనుంచి వస్తూంటే మధ్య ఈ దుర్ఘటన జరిగిందనీ, వారు చాలాచాలా చింతించారనీ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సహకార భాండారము

## (Co-operative Store)

శ్రీ కర్లపాలెము కుటుంబశాస్త్రి, బి. ఏ.,

గేయము :—

టోకుబేరముచేసి, చౌకగా సరకు
కొనితెచ్చి, చిల్లరకొట్టులో అమ్మి
లాభమునెంతయో లాగుచున్నారు
మధ్యవారలు, వీరిమాయల మాన్పి
వినియోగులకు శ్రేయమును గూర్చుసంస్థ
"సహకారభాండార" మిహలోకమందు.

వస్తువులను తక్కువధరలకు విరివిగా కొని, వానిని చిల్లరదుకాణములం దమ్ముటను సహకారసూత్రములపై సాగించు నుద్యమము మన దేశమున మొత్తముమీద విఫలమయ్యెను. కడుకొద్ది "స్టోరులు" మాత్ర మక్కడక్కడ జయప్రదముగ సాగుచున్నవి. కాని, వీనికార్యసిద్ధికి రెండు కారణములు గలవు : (౧) కొన్ని యనుకూలపరిస్థితు లుండుట. ఉదాహరణము:—దుకాణదారులందు పోటీలేకపోవుట ; (౨) ఏవో ప్రత్యేకావకాశము లుండుట. ఉ: రైలుఖర్చులందు తగ్గింపు, బాడుగ లేకుండ కొట్లుదొరుకుట. రైల్వే యుద్యోగులును, కళాశాలావిద్యార్థులును స్థాపించుకొను సహకారభాండారములం దీ ప్రత్యేకసౌకర్యముల మనము గాంచగలము. మహాయుద్ధానంతరము, మన దేశమున ధాన్యము "కట్టుబాటు"కు లోనైయున్నప్పు డీయుద్యమము ఉచ్చదశ ననుభవించి, యా నిర్బంధము తొలగింపబడినవెంటనే ఈభాండారములసంఖ్య క్రమముగ తగ్గిపోయెను. ౧౯౨౮-వ సంవత్సరమున వీనిసంఖ్య వేఱువేఱుప్రాంతముల నీరీతిగ నుండెను.

చెన్నరాజధాని—౧౯. మైసూరు రాష్ట్రము — ౨౦. బెంగాలు — ౫౮. బొంబాయి — ౩౫. పాంచాలము — ౨౧. అస్సాము—౧౯. సంయుక్తరాష్ట్రములు— ౧౩. మధ్యపరగణాలు, బీరారు — ౮. బర్మా—౭.

ఇవి విఫలమగుటకు ముఖ్యకారణము, వీని మూలసూత్రములగూర్చిన యజ్ఞానమే. ఈసహకారశాలలందు సామాన్యవర్తకుని యొద్దనుండికన్న తక్కువధరలకు వస్తువులు కొనవచ్చునని భ్రాంతి యంతట వ్యాపించి యున్నది. ఈ భావముతో స్థాపితములైన "స్టోరు" లందు నేమాత్రము విపరీతము గానబడినను సభ్యులకు వీనియందుగలప్రేమ యును, విశ్వాసమును వెనుకంజ వేయుచున్నవి. ఈ సదుద్యమముయొక్క మహదాశయ మేమనగా, వస్తువినియోగదారులే యుత్పత్తిస్థానమును వశముచేసికొని, తుదకు నుత్పత్తిసాధనములగూడ స్వాధీనపఱచుకొని, మధ్యవారితో నిమిత్తములేకుండ వ్యవహరించుటయే. దీనిని గ్రహించియుండుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేతనే ఐరోపాదేశములందలి "స్టోరు" ల సభ్యులు తాత్కాలికములగునసౌకర్యములను లెక్కసేయక, వానినుండి తుదకు శాశ్వత సత్ఫలము కలుగునని నమ్మి, ఎంతటిహెచ్చు ధరలకైన "స్టోరు"లందే కొనుచుందురు.

వీని పతనమున కింకకొన్ని కారణములు గలవు: (౧) రొక్కము గైకొనకుండ అప్పుపెట్టుట; (౨) స్టోరువారే సరుకులను తమయిండ్లకు దెచ్చి యందజేయవలెనని సభ్యులు పట్టుపట్టుట. జపానుదేశమందలి సహకార భాండారములు వృద్ధిగాకపోవుటకిదే కారణము. ౧౫,౦౦౦ ఇతరవిధసహకారసంస్థలుగల యాదేశమున "స్టోరు"లు ౧౫౦ మాత్రమే కలవు; (3) టోకుధరకును, చిల్లరవెలకును గల వ్యత్యాసము చాల తక్కువగ నుండుట. అనగా, లాభము సన్నగిల్లును; (౪) స్టోరును నడుపుట కగు ఖర్చులు హెచ్చుగనుండుట; (౫) స్టోరులోని వ్యవహర్తలు విశ్వాసపాత్రులు కాకుండుట. కాని ఈదోష మితరసహకారశాఖలందును గలదు. ఇది ముఖ్యముగా పరపతిసంఘములందు ప్రబలియుండుటచేతనే అప్పులిచ్చెడి యా ధనాలయములు ఋణాలపాలైయున్నవి. అయినను, మానవుడు స్వాభావికముగ మోసగాడు కాడనియు, అవకాశమే యతని నట్లొనర్చుచున్నదనియు మనము గ్రహించవలెను. అధికారవర్గమువారు స్టోరు నొకకంట కనుపెట్టుచుండుచో మోసమునకు వసతులుండవు.

రొక్కమీయనివారి కప్పుగా సరుకుల నమ్ముటవలని నష్టముల నెన్నిసార్లు నొక్కి చెప్పినను పునరుక్తిదోష మంటదు. ఈ పద్ధతికి వశమైనస్టోరు నిత్యావశ్యకవస్తువులను గుణమందును, వెలయందును కొనుగోలుదారులకు లాభకరమగునట్లుగా నందజేయజాలదు. రొక్కమునే కైకొనుపద్ధతి నవలంబించినప్పుడే అసమర్థతను, అనవసరవ్యయమును, వ్యర్థపదార్థమును మనము తగ్గించగలము. అప్పుగా కొనుట వాడుకదారుకైనను లాభప్రదము కాదు. కొనినప్పుడే డబ్బు నీయకున్నను, అప్పు నెప్పటికైన తీర్పక తప్పదు. రొక్క మిచ్చుచు కొనకున్న ఋణము హెచ్చు. అప్పిచ్చువాడున్న మరణించినవాడును మరలివచ్చు నన్నట్లు, అప్పు సొప్పుచేసి పప్పుదప్పళము వేయుట సులభము గాన, రొక్కమిచ్చి కొనుపద్ధతి యలవడదేని, వాడుకదారు తనతాహతుకు మించునట్లు అనవసరవస్తువులనుగూడ కొని, డబ్బు తీర్చవలసివచ్చినప్పుడు దేబెమొగము జూపును. రొక్కముతో కొనునలవాటు మితవ్యయము నభివృద్ధిచేయును.

అప్పుగా సరుకుల నీయుట స్టోరుకుగూడ నష్టమే. అందఱ కప్పుపెట్టుస్టోరు, టోకుగా తనకు సరకులనమ్మువారి కెటుల రొక్కము నీయగలదు? తానుగూడ అప్పుకే కొనుచో, ధర నధికముగ నీయవలసియుండును. అందుచే తనడబ్బు సభ్యులలో ఖాతారూపమున బిగిసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయిన భాండారము, సామగ్రిని కొనుటకు వేఱుగా ఋణము చేయవలసివచ్చును. ఆ ఋణములపై వడ్డీచెల్లించవలెను. ఇదిగాక, స్టోరు అప్పుపెట్టు బాకీలలో రాని మొండి పద్దులు కొన్ని యుండును. అవి కృష్ణార్పణమే. ఇట్టినష్టముల నన్నింటి నేదోవిధమున సరిపెట్టవలెను. ఇందు కుపాయ మేమి? ఏ కొందఱో దీనిని భరించకుండుటకై, ఈ భారము హెచ్చుధరల రూపమును దాల్చి వాడుకదారు లందఱియందును పంచబడుచున్నది. ఇటుల, ఈనష్టబాధ్యత, ఏసంబంధములేక రొక్కమిచ్చి కొనువారికిగూడ సంక్రమించుచున్నది. కనుక వారి సంఖ్య "నానాటికి తీసికట్టు" అగుటలో నాశ్చర్యమేమున్నది?

ఇంతియ కాక, కాతాపద్దులకై యదనముగ కొన్ని లెక్కపుస్తకము లుంచుటచే ఖర్చు హెచ్చును. బాకీలున్నవారి నొత్తిడిచేయుట బాగుండదు. అందఱు మర్యాదగలవారే. స్టోరువ్యవహర్త కొందరిని విశ్వాసపాత్రులని నిర్ణయించుకొని వారి పేరున కాతా తెఱచునదో, మిగిలినవారు అపార్థము చేసికొని భాండారమునే బహిష్కరింతురు. కనుక, పెక్కుచిక్కులతో గూడినందున

"అప్పునిచ్చెడి పద్ధతి తప్పు, తప్పు."

---

# ఆంధ్రవాఙ్మయసూచిక

## (ముద్రితాముద్రితగ్రంథముల పట్టికలు)

ఈ పుస్తకమున ౧౯౨౭-వ సంవత్సరము చివరవరకు అచ్చయిన తెలుగుపుస్తకములపట్టిక ఒకటి, ఆపుస్తకములను వ్రాసినవారి పట్టిక ఒకటి, విషయమునుబట్టి విభాగించి ఆయా విభాగములక్రింద వచ్చిన పుస్తకముల పట్టికలు, ఇంకా కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు లైబ్రరిలోను, తంజావూరు సరస్వతీ లైబ్రరిలోను, చెన్నపురమున ఓరియంటల్ లైబ్రరిలోను ఉండే వ్రాతపుస్తకములలో ఇప్పటికి అచ్చుకాకుండ ఉన్న తెలుగు పుస్తకముల పట్టికలును, ప్రత్యేకము అకారాదిగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయవిమర్శనరూపమయిన ప్రకాశకుల పీఠిక ౧౧౫ పుటల పరిమితిగలది యీ పుస్తకమున ఉన్నది.

తెలుగుభాషలో పుట్టిన పుస్తకములను, వానిలో, ఈపుస్తకము ముగియునప్పటికి అచ్చయినవానినీ, కాని వానినీ తెలిసికొనుటకు ఈ సూచిక చాల ఉపయోగకరము.

భారతిసైజు పుస్తకము, పుటలు ౬౨౦, మంచికాగితములు వెల రు. ౧-౦-౦ మాత్రమే.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, నెం. 7, తంబుశెట్టివీథి, మద్రాసు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## తెనుగు తెన్నులు

"ఆరునెలలపొత్తున నాత డితడే" యనునట్లు తలుపుకొట్టికొని వచ్చినవారిని తరిమివేయు నోంటరితనము తెలుగువారికి లేదు. ఆనా డేనాడు వచ్చినదో తీయతీయగ తీర్చి దిద్దినయిల్లాలు సంస్కృతము, మన తెలుగువాకిళ్లకు, ఏమీరారాదూ! వచ్చిపోవుచుండుట వలన చుట్టరిక మేర్పడునుగదా! ఆమె క్రీగంటిచూపున కర్థము, కీల్లకదలికకర్థము, పవడపు పెదవుల కర్థము, పదములకదలిక కర్థము మున్నేరుపడినది కాదు; మొలచి చిగురించునది కాదు. ఆమెసింగారమే చేవగలచేతిపని; చెక్కినబిలుగుపని. ఏమిచేసికొనకూడదు? ఏమిపూసికొనకూడదు? వచ్చినది, పలుకరించినది; ముంగిటముగ్గులుగా దటులనని దిద్దినది; ముంజూరుతోరణ మటుగాదిటులనని తీర్చినది. ఆమెచేతుల నేదో సున్నితమున్నది; ఆమె చేతల నేదో అంద మున్నది.

కానిమ్మని యానాటి తెనుగుకన్నె చూచుచు నిలచినది; తలయూచుచు మెచ్చినది. నట్టింటికి తెచ్చినది; సందిట గ్రుచ్చినది ఆమెను.

అపుడు తెలుగువారికిసంస్కృతముపయి మోజు, క్రొత్తవేడుక, ముచ్చట. రచ్చలలో నది, రాగములలో నది; పెండ్లిపీటకడ నది; వేల్పుతిన్నె ముంగట నది. అన్నిట నదియే. తెనుగో—వెట్టివేసము లెరుగని ముద్దరాలు. పుట్టువుతో వచ్చిన మురిపెమేకాని తెచ్చిపెట్టికొన్న తీరుపెరుగని అడవిపూవు. ఆమెతెన్నే ఆమెది. ఆమె తేటయే ఆమెది. ఏపువ్వయిననేమి? దానివన్నెలుదానికి గలవు; దాని చిన్నెలు దానికిగలవు. ఆతావులగుబులు-ఆ పచ్చితేనెరుచి-ఏమో ఎవరుచవిగొన్నారో-ఆ తీయదనమునకై మన మిప్పుడు పెదవులు నాకికొనుచున్నాము.

"రాజునుచూచిన కళ్లను [illegible]గనిని చూచిన మొట్టవేయ వలె ననిపించుచున్న" [illegible]టి కొక యిల్లాలు. ఈ వన్నెల విసనకఱ్ఱనుచూచిన [illegible]నికి తెన్నేది? ఇంటిదానిని విడిచి పేరూరులు లేకుండ పెరదాని పంచను వ్రేలుటయా—వన్నెలాడితో వలస పోవుటయా—అనిపించినది. ఇక్కువ మక్కువ, ఇంటి వలపు ఎవని కుండవు?

దీని కొక త్రోవపన్నినాడు తెనుగువాడు; తెనుగును తీర్తునన్నాడు. సంస్కృతపుచాయల కొన్ని తెలుగు గోడలపయిని చికిలిచేసికొన్నాడు; తెనుగును దిట్ట చేయుమని సంస్కృతమును బ్రతిమాలినాడు. దాని మొలత్రాడు దీనికి కాలత్రాడయినది. ఇదియే త్రోవయని తెనుగును నడిపింపజూచినాడు. అమ్మో! ఆచిన్ని లేతతమలపుటాకుటడుగులతో, నడక తడబడ, చెమట లూర నడచినది తెనుగు. ఏమిచేయవలెను? తెలుగువాడో, వహ్వా! నడకయొయ్యారమని యొడలబులకించినాడు; పలుకుపసయని పెదవుల సవరించికొన్నాడు; పలుకులబమ్మ నన్నాడు; మాటల మగడ నన్నాడు.

ఓ, బాగున్నది యీ చక్కబాటు! బలే, మా తెలుగుసింగారము! ఈత డెవడోగాని గట్టివాడే - పనివాడే - యని తెలుగువారు వెనుకబడినారు.

ఒక్కమారుగా, తెలుగుటాకసము వన్నెలవిల్లు విడిచినది. తెనుగురచ్చదింపుడుతెర జారినది. తెలుగువా డావింట ముల్కులూడినాడు. ఆతెరపయిరంగులు పులిమినాడు; గురినానినాడు; కూటమిపన్నినాడు; ఎక్కడో, ఏమోరనో నీడగ, దోబూచిగ తెలుగు నిలిచినది. సంస్కృతపుటడుగులలో తెనుగునడక—సంస్కృ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తపు తేట తెనుగు తేట-ఏదీ-ఇదిగో, తెలుగునడచినయడుగు జాడలు, తెలుగు విసరిన పర్యాయపదసరసనీసలు తెలుగొలికించిన చిరునవ్వువెలుగు. అంతే అదే చాలు నన్నాడు తెలుగువాడు. "నావాడేడీ, యేడీ"—యని వెదకి వెదకి విసివి వేసారి వంటయింటికడ పైటచెరగు పరచికొని పండుకొన్నది తెలుగు. నిద్దురపట్టునా! ఏమినిద్దుర ? వానియడుగుల సడి వినుచున్నదే!

వాడో రా రమ్మని సంస్కృతమును ముంగేల నూని మురిసిపోవుచున్నాడు.

నడుమనడుమ కొందరు హూర్కునుండి మేల్కాని నట్లు ఉలిక్కిపడి, పసమాలి వసివాడి పడియున్న తెనుగు వంక చే చారలువేసినారు. అయ్యో! ఈతనీట త్రావనీరే కరవయినదే - ఏమగును - మూలమూల నింకిపోదా ?

అయిన నాపలుకుటాణి ముత్తెములను బియ్యపు గింజతో దోమికడిగి, జిగిచూపినారు; మూలనున్న ముద రాలికి ముంగిటివెలుగుచూపినారు. తెనుగు కొంచెము కంచెర సడలించి జగము జూచినది. వాడినపూవు పయిని చన్నీరు చిలికినట్లయినది. ఆయింటనే మసలుట యామెకు పండుగయినది.

నేడ దేరుమొగమున చిత్తడి జల్లు కొట్టినది. 'అడే జావు బడేజావు' రోజులుతలయెత్తినవి. 'కోక్ కిస్కా' పలుకులు కొనసాగెనవి. తెలుగువాడు విన్నాడు. అలవాటుచేసికొన్నాడు. అట్టే కౌగిలించుకొన్నాడు. ఇందులో ఏదో పెద్దరిక ముందన్నాడు. పలుకు లే పాట లన్నాడు. పెద్దలకు వేడుకన్నాడు. 'పీలువుము.' తెలుగును పిలచి ఈయందము ఈచందము చూపించినాడు; ఈ నడకలు నేర్చుకోమన్నాడు; అట్లు నడువుమని ముందుకు త్రోసినాడు; నడిపించి కొంకులుగొట్టి నాడు. ఆతెనుగు - రెండు మూడడుగులు పెట్టి చతికలబడినది; నా కలవడదని పెద్దనిట్టూర్పు పుచ్చినది. తెనుగువాడు మీసముపెనవెట్టినాడు - ఆటులనా ? అన్నాడు; తలచినాడు, తలయూచినాడు. నీవు 'దర్వాజ' రునకు రా దగవు; 'పర్దాలో' పడియుండుమని 'దర్వాజా' తెరచి తెనుగును లోపలకు నెంటినాడు. 'తుదికబ్బెను రా తురకబాస' యని గొణుగుకొనుచు తెనుగుపడుచు జంకిపోయినది.

రెండువేసము లయినవి. తేటకలగినది. తెనుగుకలగినది. కొన్నాళ్లెండకన్నెరుగక ఇంటనే పడియుండెనా తెనుగు. ఏత్రోవబోవువాడో పలుకరించిన కనుల చెమ్మతో జాలిగ పలికినది; లేదా మోకాలం దలవెట్టికొని మూలవట్టినది. తెనుగేదీయని యడిగినవాడే కరవనిపించినది. ఇటులయిన కొన్నాళ్లకు తెనుగు గలదని కవ గొంతుకతో చాటినారు తెనుగువారు. కలదు, "లేదని" యెవరనగలరు? కాని ఆసంస్కృతపు పాడిపూతలోనే, అక్కడక్కడ నంటిన తురకచాయలలోనే కునుకు విడచి గుమ్మముకడకు వచ్చినది. చాలును; మా తెనుగు, మా ముద్దు తెనుగు, మురిపెంపుతెనుగు,ఒయ్యారి తెనుగు, ఒద్దిక తెనుగు. తల్లీ, మేల్కొన్నావా అని తెలుగువా రప్పుడు, తేటతేటగ మేల్కొల్పుపాటలు మొదలుపెట్టినారు. మొదలే లేనికంటె మేలుగదా! మున్ముందన్నియు చక్కబడగలవు. తీర్చి దిద్దుట, దిట్టదన మొసంగుట మననోటిపని. అయ్యో అందులకే లోటా! నోటిపాలుపాయసమా! అనుకొనునంతలో వచ్చినది. Leave the doors wide open అన్నాడు ఆతడు. Damn it అన్నికట్లూ తెంచేసి Free Telugu ను పించెంవిప్పి ఆడిస్తానన్నాడు. Go on! Stage it and see అన్నాడు. అందులకును తసదుమన్నారు తెలుగువారు. ఏనాటనో మూలబడిన తెనుగు వెలుగుచూచి విరిసిపోయినది. తందనపదాలకు గొంతు సవరించినది- తప్పటడుగులు పెట్టి యీవలకు వచ్చినది. ఆంగ్లవేసము వేసియైనా బ్రతుకుదునుగాని అడగిపోలే నన్నది. సరే రమ్మని తెల్గువారందరు నొక్కమారుగ పిలచినారు; నీ బ్రతుకంతయు పాటలో నిమిడినదన్నారు; నీ నడకే పాటకావలె నన్నారు; పాటలోనున్న సుగ మెక్కడా లేదన్నారు; నీ అంద మేలాగుననున్నను, నీ యాట లెటులున్నను, నీ మాట లెటులున్నను సరే పాటకావలెనన్నారు. ఉమ్మతిత్తిపట్టి ఊగినారు; తొడమీద చేతులు చరచుకొనుచు తొందరపెట్టినారు; తెనుగు తడబడినది. చేజిక్కనతరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జారవిడచి యూరకొందునా! ఏమో ఎందులో త్రొక్కుకొని పోదునో! కానిమ్మని గడపదాటినది.

తెనుగునుడి - English intonation

తెనుగుతలపు - English expression

తెనుగుత్రోవ - English gait

తెనుగునడక - English idea

తెనుగువ్రాత - English criticism

తెలుగు, ఇంగిలీషులు కలగాపులగ మయిపోయి కొసహూసరయయిపోయి - పన్నుపడ్డత్రోవ యేర్పడక కొంతవడి తక్కుంగల బాస చూచి తెనుగు క్రొత్తనడకల నడవజొచ్చినది. తెనుగును ఈటిదానివలె నిప్పుడు గడపపయి కెక్కించినారు. ఆడుమని పాడుమని వెనుక చప్పటులు చరచుచున్నారు.

తెనుగన్నలారా, తెనుగుతమ్ములారా, లెండు; నడుములు కట్టికొనుడు; మీ తెనుగుచేతులను ముందుకు చాచి యామె పడకుండ కాచికొనుడు; అల్లంతట నుండగనే యామెనందికొనుడు; మీ నులివెచ్చని తెలుగు కౌగిలింత నామె బొదివికొనుడు; మీ తెనుగును మీరు పోల్చికొని యుబ్బుడు; మీ తెనుగును బాసలదండలో కొలికిపూసగ నిలిపికొనుడు.

—పూడిపెద్ది వెంకటరమణయ్య.

---

## ఆంధ్రభాష

౧౧-వ శతాబ్దమున ప్రపంచమందంతటను భాషలనుబట్టి నెలకొలుపబడిన జాతీయప్రభుత్వములు (Natinol Governments on linguistic basis) ఏర్పాటైనవి. భరతవర్షమున చాళుక్యులాంధ్రభాషను జాతీయభాషగాఁ జేసిరి. అప్పటినుండియును క్రొత్త పద్ధతి నాంధ్రకావ్యనిర్మాణ మారంభమైనది. దానితో కావ్యభాష యొకటి స్థిరపడినది. దానికి అనుశాసనము కలిగినది. కావ్యేతరరచనలు వ్యవహారభాషలోనే జరిగినవి. వ్యవహారభాషలో జీవము హెచ్చుగానుండుటచే కావ్యభాష వ్యవహారభాషను మార్చలేకుండెను గాని వ్యవహారభాషయేకావ్యభాషను కొంచెముకొంచెముగా మార్చుచుండెను. ఈమార్పు ప్రబంధములలో స్వల్పముగాను, శతకముల నంతకన్న హెచ్చుగాను, పాటలలో మిక్కిలిహెచ్చుగాను కనఁబడుచున్నది. వచనరచనయని చెప్పఁదగినది లేదనియే చెప్పవచ్చును. శాస్త్రగ్రంథములు పద్యములలోనే రచింపఁబడుచుండెను. జనసామాన్యమునకై పుట్టిన శాస్త్రగ్రంథములు వచనములలోనున్నను, వ్యవహారభాషయే యందుండెను. కావున ఈవచనగ్రంథములభాష సంస్కృతము(సంస్కరింపఁబడినది) కాకుండుటచే, దాని కేకరూపము లేకుండెను. వ్యాకరణములు కావ్యభాషనుమాత్రమే శాసించుచుండెను. ఆంగ్లేయపాఠశాలలు వచ్చినవి. వచనరచనయవసరమయ్యెను. దాక్షిణాత్యులీవచనరచన నారంభించిరి. వారికి సరళమైన వ్యవహారభాష రాదు. కావ్యభాషలో నున్నవచనములు వారెఱుఁగుదురు. కావున, దేశీయాంధ్రము నెఱుఁగని చిన్నయసూరి కావ్యభాషలోనే వచనరచనచేసి, వ్యాకరణము రచించెను. దీనితో కావ్యేతరరచనలలో మార్పు కలిగెను. వచనరచనకూడ కావ్యభాషలోనే ఆరంభమయ్యెను. ఈవచనరచన నౌత్తరాహులామోదింపలేదు. వాసుదేవ పరబ్రహ్మశాస్త్రులుగారు, జూలూరు అప్పయ్యపండితులు, పార్వతీశ్వరకవిగారు, ఈ మొదలగువారెవ్వరును చిన్నయసూరిగారి రచనను లక్ష్యముచేయలేదు. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారీరచన నామోదించిరిగాని, వారి వచనమును, పద్యమునుగూడ నొక్కవిధముగానే, యసహ్యములుగా నుండినందున నది కీర్తిగాంచలేదు. వీరేశలింగముగారు మొదట దాని నామోదించిరికాని, వారౌత్తరాహులగుటచే దానియందలి లోపములను గమనించి యది విడిచిపెట్టిరి. ఇంతలో వ్యవహారభాషలో ప్రహసనములు వారే వ్రాయుచుండిరి. వానిలోని భాషాసారళ్యమును లోకమామోదించెను. కావున, చిన్నయసూరిగారి వ్యాకరణమునకు దూరముగా నుండక, వ్యవహారభాషకు చేరువయైన యొక నూతనకావ్యభాషను వారు సృష్టించిరి. దీనికి పోతన్న, చేమకూర వెంకన్న మొదలగువారు మార్గదర్శులైరి. ఈ నూతన కావ్యభాషన్లు లోకమామోదించెను. ఆభాషలో నవలలు, నాటకములు, కావ్యములు - అన్నియును బయలు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేరినవి. కాని, ఇంతలో వేంకటరాయశాస్త్రిగారి కిం డొకయసందర్భము కనుపట్టినది. నాటకములలో (వీథి నాటకములలో) పాత్రలు స్వోచితమైన వ్యవహార భాషలో మాటాడుచుండిరి. తెలుఁగులోకూడ నట్లేల యుండఁగూడదు? అందఱును కావ్యభాషయే యేల మాటాడవలెను? ఈయసందర్భమును వారు గమనించి, ప్రతాపరుద్రీయమున పాత్రోచితమైన వ్యవహార భాషను వారుపయోగించిరి. దానితోఁ గలకల మొకటి పుట్టినది. వేంకటరత్న ప్రముఖులు ప్రతికక్షులైరి. కవి పండితసభలలో, నీచపాత్రలకు అచ్చతెలుఁగు వాడుక చేయవలెనని తీర్మానించిరి. చిత్రనళీయములోని యెఱుకు నాయకునిభాష ఈ తీర్మానముల ఫలితమే. కాని, లోకము దీని నామోదింపలేదు. వేంకటరాయశాస్త్రి గారిమతమే కొంతవరకు నిలిచినది. ఇంతలో, నాటకములో కావ్యభాషయే యసందర్భ మను నొకయూహ జనించినది. అప్పారావుగారు కన్యాశుల్కము వ్రాసిరి. లోక మామోదించినది. దానితో నాటకరచన రెండు పద్ధతు లయ్యెను. వీరేశలింగముగారి సులభమైన కావ్య భాషయో, అప్పారావుగారి వ్యవహారభాషయో, రెండింటిసంకరమో ఉపయుక్తమగుచుండెను. గిడుగు రామమూర్తి పంతులుగా రవతరించిరి. వచనరచనకూడ వ్యవహారభాషలో నేలకూడదని వాదించిరి. లోకము కన్నువిప్పి చూచెను. వారిమాట యాదరించెను. ఇప్పుడు భారతిలోని వచనరచన ప్రాయికముగా వ్యవహారభాష లోనే సాగుచున్నది. అయితే, దీనిలో లోపము ఒకటి కనుపట్టుచున్నది. కావ్యభాషలో నున్న ఏకత దీనిలో లేదు. వ్యక్తిగతమైపోవుచున్నది. సజీవభాషలో మాధుర్యము కలదు; నిర్జీవభాషలో లేదు. కాని, భాషకు ఏకత అక్కఱలేదా? ఇక్కడ రెండుపక్షములు బయలు దేరినవి.

'భాషకు ఏకత కావలెను. అట్టిఏకత కావ్య భాషలో కలదు'. అన్నారు గ్రాంథికవాదులు.

'భాషకు జీవము కావలెను. అట్టిజీవము వ్యవ హారభాషలో కలదు'. అన్నారు వ్యావహారికభాషా వాదులు.

నేను వ్యవహారవాదములో చేరినప్పుడు ఈ రెండవవిషయము ప్రధానముగాఁ జేసికొంటిని. కాని భారతిలోనికథలు చదువఁగా, చదువఁగా, ఏకత లేని లోపము కనఁబడ్డది. అది లోపమే యని నాకును, నా మిత్రులకును దోఁచినది. మధ్యమార్గ మొకటి యవసర మైనట్లు కనఁబడినది. అందు ఏకత, జీవము ఈరెండును గలసియుండవలెను.

ఇది యిట్లుండఁగా, దేశపరిస్థితులు మారఁ జొచ్చినవి. చాళుక్యులకాలములోనిసమస్యలు మరల కలుగుచున్నవి. సంస్కృతప్రాకృతములు రాజభాష లుగా నుండినదినములు పోయి చాళుక్యులకాలములో ఆంధ్రము రాజభాషయయ్యెను. ఆంగ్లేయుల దయ వల్ల ఆంగ్లభాష రాజభాషగా నుండినదినములు నేడు తగ్గుచున్నవి. ఆంధ్రము రాజభాష కావలసినదినములు వచ్చుచున్నవి. యూనివర్సిటి, కౌన్సిలు, మొదలగు రాజకీయసంస్థలలో ఆంధ్రమే ఉపయోగింపవలసి యున్నది. దీనికి కావ్యభాష పనికిరాదని స్పష్టమే. ఆధునికభాషలో మాధుర్యము కలదుగాని, ఏకత లేదు. కావున ఏకత కలిగించినచో, వ్యవహారభాష రాజభాష (King's Telugu) కాఁగలదు. ఈ యుద్దేశముతో భాషను విభజింపఁగా, అది నాలుగుతరగతులుగా కనఁబడినది: Archaic, classical, standard, dialectal. ఇది నేనుచేసినవిభజన.

౧. ఉదాహరణము

Archaic - నేను చేయవలకును, నాకు చేయవలయును.
Classical - నేను చేయవలయును.
Standard - నేను చేయవలెను.
Dialectal - నేను చేయాలి—లె—ల—ను.

౨. ఉదాహరణము

Archaic - వలవదు.
Classical - వలదు.
Standard - వద్దు
Dialectal - ఒద్దు.
ఇదే మూడువిధములైనది:



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

Archaic, Classical - ఇవి ప్రాచీనాంధ్రములు.
Standard - వర్తమానాంధ్రము.
Dialectal - అభినవాంధ్రము.

౧౯౧౯-వ సంవత్సరములో రామమూర్తిపంతులుగారు వర్తమానాంధ్రభాషాప్రవర్తకసమాజము ఏర్పాటుచేసి, వీరేశలింగముపంతులుగారిని అగ్రాసనాధిపతినిగాఁ జేసినప్పుడును, మామిత్రులు కొందఱు గ్రామ్యవాదులైనప్పుడును వీరేశలింగముగారికిని, మాకును మనస్సులలో నున్నది ఈ వర్తమానాంధ్రభాషయే. కాని, తరువాత తరువాత అభినవాంధ్రము బలముహెచ్చయినది. భారతియంతయు దానితో నిండిపోయినది. కొంత గట్టుకట్టుట యవసరమని తోఁచినది. ఈ సంగతి రామమూర్తిపంతులుగారికి నేను వ్రాసితిని. యూనివర్సిటి, కాన్ఫరెన్సులు గమనింపవలసిన యేకతగల మధురభాష అనుశాసనముచేయుట మనకర్తవ్యమని చెప్పితిని. ఆమాటకు రామమూర్తిపంతులుగారి జబాబిది:

"మీరు కొన్నాళ్ల క్రిందట నాతో భాషావిషయమయి మాట్లాడినప్పుడు ఇది 'యుగసంధి' అనిచెప్పినారు. నేనొప్పుకొన్నాను. మాతృభాష ప్రయోగించేవారు శిష్టప్రయోగ మనుసరించవలెను; అంతే నియమము; సుబోధమయిన గ్రాంథికభాషాశబ్దములు ఆవశ్యకములయినవి వాడవచ్చును. అట్లే సంస్కృతాలూ, అన్యదేశాలూ. వ్యావహారికవిషయములను గు. రచించే గ్రంథములు "కావ్యాలు" కావు. 'కావ్య' భాష కవుల ఔచిత్యజ్ఞానమునుపట్టి ఉంటుంది.

ఒక్కసమాజములోనివారయినా ఒకరిని ఒకరు నిర్బంధించి 'నియమములు' చేయకూడదు. 'స్వేచ్ఛ', 'స్వాతంత్ర్యము' గ్రంథకర్తల కుండవలెను. వారికుచితమయిన నియమములు వారే ఏర్పర్చుకొంటూరు. ఆశయముమాత్రము అందరిదీ ఒక్కటే: దేశభాషాభివృద్ధి; దానిమూలముగా దేశాభివృద్ధి. 'Thus far thou shalt go and no further' అనేవాడు ఒక్క పరమేశ్వరుడే. మనుష్యులకు అట్టి అహంకారముండకూడదు, ఉంటే చెల్లదు."

ఇప్పుడు పైని నేనువ్రాసినదానిని రామమూర్తిపంతులుగారి జబాబుతో సమన్వయముచేసి, దేశకాలపరిస్థితులు గమనించి మధ్యభాషను అనుశాసింపవలసినదన్న నామాటనుగూర్చి పర్యాలోచింపవలసినదిగా గోరెదను.

*   *   *   *   *

2

"There are two laws that always operate—the law of "pull" and the law of "push". The great law of "pull" draws all things together and the great law of "push" tries to scatter them. Nature strikes a balance between the two. It is this balance that is the cause of the wonderful logic of order and harmony which rules the universe."

శాస్త్రములనీ, కళలనీ రెండువిధములుగా పెద్దలు ఏర్పాటుచేసినారు. పండితులు శాస్త్రోపాసకులు; కవులు కళోపాసకులు. శాస్త్రములు కేవలబంధమును ప్రతిపాదించును; కళలు కేవలస్వేచ్ఛను ప్రతిపాదించును. అయినా, శాస్త్రవిహీనమగు కళగాని, కళావిహీనమగు శాస్త్రముగాని శోభిల్లదు. సంగీతములో ఈవిషయము స్పష్టము కాగలదు. శాస్త్రవాసనలేని గాయకుడును, గాయకుడుగాని శాస్త్రజ్ఞుడును సభను రంజింపజేయలేరు. శాస్త్రజ్ఞులగు గాయకులే సభలలో ఖ్యాతివహించుచున్నారు. త్యాగయ్య కవి; చిన్నయసూరి పండితుడు; పార్వతీశ్వర కవిగారు కవిపండితులు; వేంకటరాయశాస్త్రిగారు పండితకవులు. ఈ భేదములు గమనించినచో మన కంతా తేటతెల్లమగును. వాడుకభాషలో ఏకత కలిగింపవలసినదని నా ఉద్దేశముకాదు. కావ్యభాషకు నానాత్వము కలిగింపవలసినదని రామమూర్తిపంతులుగారి ఉద్దేశమును కాదు. విశ్వవిద్యాలయము, శాసనసభలు—ఈ సంస్థలలో ఉపయోగింపవలసిన భాష, ఈ సంస్థలతో సంబంధించిన వచనరచనలలో ఉండవలసినభాష-కేవలకావ్యములు మాత్రమే కాదు, చరిత్ర, గణితము, భౌతికాదులగు శాస్త్రములు, కళలు, వీటితో సంబంధించిన రచనలు, ఉపన్యాసములు—వీటిలోని


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాష—ఈ భాషలో ఒకఏకత ఉండవలసి ఉన్నదనిన్నీ, ఈఏకతయే ఆంధ్రత్వమును నిలుపగలదనిన్నీ, ఈ యేకతను అనుశాసింపవలసి ఉన్న దనిన్నీ, ఈ నూతనానుశాసనము ప్రాచీనాంధ్రమునకున్ను, అభినవాంధ్రమునకున్ను కొంతకొంత భేదించిఉన్నను ఈరెంటిని కలుపగలిగిన అనుసంధానమై యుండవలసినదనిన్నీ దానికి వర్తమానాంధ్ర మనవలసియున్నదనిన్నీ నా అభిప్రాయము. ఈవర్తమానాంధ్రమే వీరేశలింగకవిగారు ఆమోదించినారనిన్నీ, దీని నేతిరుపతిశాస్త్రిగారు అంగీకరించినారనిన్నీ, శ్రీరామమూర్తి పంతులుగారి పక్షమున చేరినప్పుడీ వర్తమానాంధ్రమే మాబోటివారి కందరికీ లక్ష్యమున నుండెననిన్నీ, జూలూరు అప్పయ్యపండితులు, పార్వతీశ్వరకవిగారు మున్నగుప్రాచీను లీభాషయే ప్రచారమునకు రాగలదని సూచించియుండిరనిన్నీ నా దృఢాభిప్రాయము. ఈవర్తమానాంధ్రభాషను శాసింపగలవారు రామమూర్తిపంతులుగారే. కేవల స్వేచ్ఛను ప్రతిపాదింపవలదనిన్నీ, ఈ Pull & Push సమ్మేళనము స్వేచ్ఛతోగూడిన నిర్బంధమును ప్రతిపాదింపవలసినదనిన్నీ రామమూర్తిపంతులుగారిని నేను ప్రార్థించుచున్నాను. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, ఆంధ్రరాష్ట్రము - ఆంధ్రుల ఆంధ్రత్వము సర్వతోముఖము కావలసిన తరుణము వచ్చినది. ఈ వర్తమానాంధ్ర భాషలోగలఏకత్వమే ఆంధ్రులఏకత్వమునకు నిదానము.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి.

---

## గిడుగు రామమూర్తిపంతులుగారు

చిక్కనైన నిరసనతోటీ, తీవరించిన ద్వేషంతోటీ, గడ్డకట్టిన ప్రాతికూల్యంలోటీ పరిసరాలన్నీ ముజ్జిడుగా వున్న పరిస్థితుల్లో యేటి కెదురీది జీవిత సాఫల్యం పొందిన ఆధునికాంధ్రులు, కైలాసవాసి కందుకూరి వీరేశలింగంపంతులుగారితరవాత గిడుగు రామమూర్తిపంతులుగారొక్కరే కనబడుతున్నారు.

తలుచుకుంటే శరీరం జలదరిస్తోంది.

దేశంలో చారిత్రకజ్ఞానం యేమీ లేదు. కాలం మార్పులు తెచ్చిపెడుతుం దనే సత్యం అవగాహన కాలేదు. హేతువాదానికి నిలవ నీడ లేదు. కేవలమూ వృద్ధప్రపితామహుల దగ్గిరనుంచీ సంక్రమించిన గుడ్డి నమ్మకం తప్ప మరేమీ లేని రోజు లవి. అలాంటి సమయంలో—ఇరవై అయిదుసంవత్సరాలకిందట రామమూర్తిపంతులుగారు వ్యావహారికాంధ్రభాషావాదం చేపట్టి గిడసబారిపోయిన పండితవలయంలో వురికారు.

పంతులుగారికి వెనక ఆసరా యేట్సుగారొకరు, శ్రీనివాసఅయ్యంగారొకరు, గురజాడ అప్పారావు పంతులుగారొకరూను.

కానైతే యీ ముగ్గురూ సాలంకవ ప్రజ్ఞావంతులే; అయినా పండితులు యీపర్గాన్ని చూసి హేళన చేశారు.

కలం పట్టినప్పుడల్లా బ్రాహ్మ్యం తిరగవేసే పండితులికి యేట్సుగారు ఖండాంతరులైపోయారు. అయ్యంగారి దగ్గిర చిరకాలం విద్యాభ్యాసం చేసిన ఆంధ్రజాతికి వారు అరవవారైపోయారు. ఇక అప్పారావుగారా? ఆయన వొక రాచనాతురికి వూడిగం చేస్తూ ప్రహసనాలు రాసుకునే మనిషి.

ఇంకేం వుందీ? పండితు లంతా పంతులుగారి వాదాన్ని కుప్పిగంతులుగా భావించారు. "ఏమీ పని లేదా యేమిటి?" అంటూ విసుక్కున్నారు. "విశాఖపట్టాన్నుంచి తప్పించుకుని పారిపోయివచ్చారు కాబోలు" అని జాలితలిచారు.

అప్పటికే కప్పుడే పంతులుగారికి 'బ్రహ్మచెవుడు' ముదిరిపోయి వుంది. ఎలుగురాసిన పండితుల కంఠధ్వనులు పంతులుగారి చెవిదాకా వెళ్లే లేదు.

పండితులు పంతులుగారిమీద శ్లేషలు కురిసేశారు. వ్యంగ్యాలు దిమ్మరించేశారు. దీవనలు సమ్మరించేశారు; కాని అవి కొండసూహలో ప్రతిధ్వనించినట్టు పండితుల చెవుల్లోనే గిరగురుమన్నాయి.

చేసేది లేక పండితులు కలాలు పట్టారు. వెంటనే పంతులుగారు యెర్ర పెన్సిలు పుచ్చుకున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూడగా వొక్కొక్క పండితుడి వొక్కొక్క పుస్తకంలో రెండు—నూరు—వేల తప్పులు. శ్రీకారం చుట్టడానికి కలం యెన్ని తిప్పులు తిప్పాలో పండితు లెరగ రని పంతులుగారు టోకాయించి చెప్పారు.

కాని ప్రభుత్వం పండితుల వాదానికే చేయూత యిచ్చింది.

పంతులుగారి మార్గానికి పర్వతం అడ్డు తగిలింది. నిజమే; కాని వారు జంక లేదు. అడుగు వెనక్కి వెయ్య లేదు.

అవును. ఎందుకు జంకాలీ? ఎందుకు వెనక్కి వెయ్యాలీ?

గమ్యం గమ్యంగానే వుంది. దాని కేమీ విఘాతం కలగ లేదు.

తెనుగుతల్లి "రావోయి నాయనా, యీవేపు నుంచి రావోయ్!" అంటూ ప్రేమతో చేతులు చాపింది.

వెంటనే పంతులుగారు దారి మార్చారు. ఈ సారి వారికి అప్పారావుగారి కలం పూర్తిగా సాయపడింది.

వ్యావహారిక భాషకి "స్వాధీనహక్కుభుక్తా" ల్లోనుంచి తప్పిపోయిన గురుపీఠాన్ని మళ్లీ దఖలుపరిచినవా రీయిద్దరే.

అయితే: వొక్క చిన్న భేదంమాత్రం వుంది.

రామమూర్తిపంతులుగారు భాషయొక్క పూర్వోత్తరా లన్నీ క్షుణ్ణంగా తెలిసిన పండితులు. పెద్ద పెద్ద సభల్లో మహామహా మొనగాళ్లని "గుర్రందిగూ" అంటూ వురిమి కిందికి లాగేసిన సరదారు.

అప్పారావుగారు శబ్దశక్తి తెలిసిన రచయితలు. రససిద్ధి పొందిన భావుకులు.

రామమూర్తిపంతులుగారి సింహగర్జనలు భాషా తత్వాన్ని బోధపరిచాయి.

అప్పారావుపంతులుగారి కవిత వ్యవహార భాషలో వున్న జీవకళా, మాధుర్యమూ, రసస్ఫూర్తీ, శక్తీ వెల్లడిపరిచింది.

ఇలాగ ఆగర్జనలవల్ల సత్యం అవగాహనం కాగా, యీకవితవల్ల కుమారకవిసింహాలకు నూతనావేశం కలిగింది.

ఇంకేం కావాలీ?

ఆంగ్లవాఙ్మయపరిచయంవల్లా, వివిధదేశపర్యటనాలవల్లా కొత్తపోకడలు పోతూ వున్న యువకవులంతా వ్యవహారభాషలోనే గ్రంథరచన ప్రారంభించారు. దేశీయులు ఆంధ్రభాషయొక్క నిసర్గమాధుర్యాన్ని అనుభవిస్తూ జానుతెనుగు నుద్ధరించిన పంతులుగారి పరిశ్రమని స్మరించారు.

ఇదే మొన్నటి డిసెంబరు ౨౬ వ తేదీని రాజమహేంద్రవరంలో నన్నయ్యభట్టు స్నానాలు చేసి జపం చేసిన గోదావరి వొడ్డున కార్యరూపం తాల్చింది.

ఆంధ్రజాతి అంతా అక్కడ కూడింది. ఆంధ్రుల వైభవం అంతా అక్కడ కొలువుతీరింది. ఆంధ్రుల రసికత అంతా అక్కడ నుబాళించింది.

ఆవేళ రాజమహేంద్రవరంలో (పరిషద్వార్షికోత్సవంలో) పంతులుగారికి చోటు లేకపోయింది. ఇవాళ రాజమహేంద్రవరం అంతా పంతులుగారి తేజస్సు నిండిపోయింది.

ఆవేళ పరిషత్తు పంతులుగారికి అంకుశ చెప్పింది. ఇవాళ దేశం పరిషత్తుకే అంకుశ చెబుతోంది.

—శాస్త్రి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వృక్షములు—వారసత్వము

వడ్డాది సీతారామారావు, B. A., M. Sc.

వారసత్వము కొన్నిరకములక్రింద విభజింపబడినది. అందు ముఖ్యమైనవియు, మనకు సామాన్యముగా గనుపించునవియు ఈక్రింద తెలుపబడినవి :

## ౧. సంయుక్తవారసత్వము

## (Blended Inheritance)

సంతానముయొక్క ఏ స్వభావమునందైనను తండ్రిసంబంధమైనవియు, తల్లిసంబంధమైనవియు నగు గుణములు మిళితమై కన్పట్టినయెడల, నట్టిదానిని సంయుక్తవారసత్వ మందురు. ఇందు పైతృకగుణములును, మాతృగుణములును సరిసమానమైనభాగములుగా కలసియుండవలె నను నియమము లేదు. ఏవియైనను ఎక్కువగాగాని, తక్కువగాగాని యుండవచ్చును.

## ౨. తదేకవారసత్వము

సంతానమునందలి యేగుణమునందైనను పూర్తిగా తల్లిపోలికగాని, లేక పూర్తిగా తండ్రిపోలికగాని యున్నయెడల నది యీతరగతికి చెందును. ఇందు పైతృకగుణము లున్నయెడల మాతృ గుణములు కన్పట్టవు; మాతృ గుణము లున్నయెడల పైతృకగుణములు కన్పట్టవు. దీనిని Exclusive inheritance అనిగాని, Unilateral inheritance అనిగాని అందురు.

## 3. వారసత్వసమ్మిశ్రణము

## (Particulate Inheritance)

ఇందు తండ్రిగుణములును, తల్లిగుణములును మిళితముగావు గాని వేరువేరుగా సంతానమునందు గన్పట్టును. దీని కొక యుదాహరణము నిచ్చినయెడల సుబోధకమగునని తలచెదను. ఒకఎర్రని గుఱ్ఱమునకును, ఒకతెల్లని గుఱ్ఱమునకును గల్గుసంతానముయొక్క శరీరము కొన్నిచోట్ల ఎఱ్ఱగాను, మరికొన్నిచోట్ల తెల్లగాను ఉన్నయెడల నది ఈతరగతి వారసత్వమునకు చెందును.

## ౪. వికల్పవారసత్వము

మెండెల్ (Mendel) అనునాతడు వారసత్వమునుగూర్చి అపారమైనకృషి నవీనపద్ధతులపై చేసి కొన్ని వారసత్వక్రమముల నేర్పరచెను. ఈతని పరిశోధనయంతయు ఎక్కువగా మొక్కలపై జరుపబడెను. శాస్త్రజ్ఞులందరును ఈతనివారసత్వక్రమముల నామోదించుటయే కాక అన్ని విధముల వారసత్వములనుగూడ ఇప్పు డీతని సూత్రములప్రకారమే విశదపరుపబడుచున్నవి. వేర్వేరు గుణములు సంయుక్తములు కానేరవనునది యీతడు రుజువుచేసినవానిలో ముఖ్యమైనది.

మెండెల్ చేసిన ప్రయోగములలో గొన్నిటి నీక్రింద నుదాహరించుచున్నాను:

ఈతడు తనపరిశోధనను మొదట బటానీమొక్కపై మొదలిడెను. రెండుస్వచ్ఛమైనజాతులకు (Varieties) చెందిన బటానీమొక్కలు ఏరబడెను. ఒకజాతి చాలయెత్తుగా ఎదుగునది. రెండవజాతి బటానీమొక్క కొన్ని యంగుళములయెత్తుకంటె ఎదుగజాలదు. ఏజాతి కాజాతి యెట్టిమిశ్రమమును లేక స్వచ్ఛమైనది. ఈ శాస్త్రజ్ఞు డీ రెండుజాతులను అతిజాగ్రత్తతో మిశ్రమముజేసి (అనగా యొకజాతిమొక్కను పురుషబీజమున కేర్పరచి—Male parent—మరియొకజాతిమొక్కను స్త్రీబీజమున—Female parent—కేర్పరచి) యొక సంకరజాతి నేర్పరచెను. అట్లు చేయగా వచ్చినగింజలను నాటగా బయలుదేరిన మొక్క లన్నియునుగూడ ఎత్తుజాతికి చెందినవియే యైయుండెను! సంకరజాతిని జేయుటకు పొట్టిమొక్క నుపయోగించినప్పటికిని, మొదటితరము ( First generation ) మొక్కలన్ని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశ్వభారతి (శాంతినికేతనము) చిత్రములు



౬. స్త్రీల వసతిగృహము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౫. ‘ గంగ ’

( విశ్వభారతి విశ్వవిద్యాలయమున నుపయోగించు గంట. )

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యునుగూడ నాశ్చర్యకరముగ నెత్తుజాతికి చెందినవియే యైయుండెను.

ఈమొక్కల నిక సంకరము గానీయక జాగ్రత్తగా పెంచి వచ్చిన గింజలను మరల నాటగా మరియొక ఆశ్చర్యకరమగు సంగతి కనుపడెను. ఈ రెండవతరము మొక్కలయందు ఎత్తుమొక్కలును, పొట్టిమొక్కలును గూడ నుండెను. కాని యెత్తుమొక్కలసంఖ్య పొట్టి వాటికంటె సరిగా మూడురెట్లు ఎక్కువయుండెను.

పెక్కుమారులు పలురకముల మొక్కలతో నీతఁడీ పరిశోధనను సల్పెను. వాని ఫలితముమాత్రము సరిగ నిట్లే యుండెను.

మొదటితరమునందు పొట్టిమొక్కలు లేనందులకు గారణమేమన, పొట్టి, పొడుగు గుణములు రెండునుగలసి యొకేగింజయం దున్నప్పుడు పొడుగు గుణము సువ్యక్తమగునుగాని పొట్టిగుణము అంతర్గతముగానే యుండును. కాని రెండవతరమునకుమాత్రము గుణములువేరగును. అట్లు వేరగుటలో నొకపాలు పొట్టిగుణముమాత్రము బహిర్గతమగును. అట్లగుటకు కారణము శాస్త్రము తెలియనివారి కర్థమగుట కొలదిగ కష్టమగుటచే నిచట తెలుపదలచుకొనలేదు.

ఈ పరిశోధననుబట్టి, పొడుగు పొట్టి గుణములు రెండును ఎన్నడును మిళితమైపోనేరవని తెలియుచున్నది. ఇందు ఎత్తుగుణమును Dominant Character అనియు, పొట్టిగుణమును Recessive Character అనియు అందురు.

వృక్షములయందలి వారసత్వమునుగురించి యింకను మరియొకవ్యాసమునందు దెల్పబడును.

---



ఇందిరా? ఆ ( ( ( — యస్. యమ్. సుందరం


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కలగూరగంప

శివాజీ



దీనిని శ్రీ రాంపిల్ల అప్పిలిపాత్రుడు (కొత్తపేట) కర్రతో తయారుచేసినాడు. ఇది చాల సుందరముగ నున్నది. పనితనము నిపుణముగ నున్నది. శిల్పి అభినందనార్హుడు.

బులుసు సాంబమూర్తిగారు, మదనమోహనమాలవ్యా



కాశీ హిందూ విశ్వవిద్యాలయమున.

K. P. R. V. ప్రసాదరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(మాఘ ఫాల్గునమాసములు : ఫిబ్రవరి 1934)




దక్షిణము

[ఈపటము తలమీదను ఆయాదిక్కులుచూపునట్లు సరిగాపట్టుకొని చూడవలయును. ఇంగున్నట్లునక్షత్రములు ఫిబ్రవరి 8 తేదీని రాత్రి 8-49 గంటలకును, ఫిబ్రవరి 15 తేదీని రాత్రి 8-21 గంటలకును, ,, 22 ,, ,, 7-54 ,, ,, 29 ,, ,, 7-30 ,, కనబడును.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈమాఘబహుళనవమిమొదలు ఫాల్గుణబహుళ సప్తమివరకును, అనగా ఫిబ్రవరి 8-వ తేదీమొదలు మార్చినెల 8-వ తేదీవరకు రాత్రి తొలిజామున నగపడు నక్షత్రాదులను గమనింతము.

## క్షీరవాహిని (Milky way)

ఈమాసములో క్షీరవాహిని ఆగ్నేయదిగ్భాగము నుండి వాయవ్యమునకు, ఆకాశమధ్యమువిూదుగా గొప్ప ఆర్చివంటి రూపముతో (Like a great arch) వ్యాపించియున్నది. అయ్యది ఆగ్నేయమున నౌకామండలముకడ నారంభించి, వాసుకి, శ్వాన, పూర్వశ్వాన, వృత్ర, మిథున, వృషభ, సారథి, భృగు, పరశు, అప్సరసమండలములవిూదుగా ఊర్వశివరకు వ్యాపించియున్నది.

## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు (First Magnitude Stars)

ఈమాసమునందు తొలిజామున మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు తొమ్మిది మన కగపడుచున్నవి.

అవి యేవియనగా,

౧. వృషభరాశిలో రోహిణి (Aldebaran)
౨. సారథి మండలములో బ్రహ్మహృదయము (Capella)
౩. ఆర్ద్ర (Betelgeaux)
౪. రిగల్ (Rigel)
౫. మృగవ్యాధరుద్రుడు (Sirius)
౬. అగస్త్యుడు (Canopus)
౭. మఘ (Regulus)
౮. మిథునములోని (Pollux)
౯. పూర్వశ్వానము (Procyon)

## ఉత్తరనక్షత్రములు

ఈశాన్యదిశను సప్తర్షులు పూర్తిగా ఉదయమైనారు. క్రతు, పులహ, పులస్త్య, అత్రిఋషులు చతురస్రముగాను, ఆంగీరస, వసిష్ఠ, మరీచిఋషులు త్రిభుజముగాను కన్పట్టుచున్నారు. ఈత్రిభుజమునకు వసిష్ఠునికడ కోణము చాలపెద్దది. వసిష్ఠునిప్రక్కనే ఆవగింజవలె మిణుకుమనుచు అరుంధతి సాధ్వి యున్నది. పులహక్రతురేఖ ధ్రువసూచకము. ధ్రువునిదిగువను ధ్రువరక్షకులగు ధాత, విధాతలు కనబడుచున్నారు. ధ్రువునకు కుడిితట్టున లఘుఋక్షము కలదు. దానినంటి ఎడమకు తలక్రిందుగా ఊర్వశి వ్యాపించియున్నది. ఊర్వశిపాదము ధ్రువు నంటియున్నది; శిరస్సు క్షితిజమునకు దిగువనుండుటను కానరాకున్నది. ఊర్వశికి దిగువ అప్సరసమండలము ఉన్నది.

## మధ్యాను

పడమట రేవతి అస్తమింపబోవుచున్నది. దాని దిగువను శింశుమార మున్నది. అదిసూడ త్వరలో నస్తమింపనై యున్నది. రేవతికి ఈవల అశ్వినీనక్షత్రములును, ఆపైన చ్యవనుడును, అతని తల్లియు నున్నారు. ఆమెను భంగపరుపయత్నించి విఫలుడైన పులోమ రక్కసుడు గ్రుడ్లు మిటకరించుకొనుచు ఆప్రక్కనున్నాడు. వీరికి పూర్వుగా భృగుడును, అతనివంశజులగు రుచిక, జమదగ్ని, ఔర్వుడు లోనగువా రున్నారు. ఆప్రక్కనే సారథిమండలమును, అందలి బ్రహ్మహృదయము, అజశాబకములు, బహబాగ్ని లోనను నక్షత్రము లున్నవి. అశ్వినికిని సారథిమండలమునకును మధ్యను పొయ్యిపొక్కిళ్లవలె మూడు భరణిచుక్కలును, ఆవల పూచిన కొరవిపూపొదరంటివలె కృత్తిక-పిల్లలకోడి-చుక్కలును మెరయుచున్నవి. ఆప్రక్కనే గర్దనక్షత్రమును, ఎద్దుకన్నువలె ఎఱ్ఱనై యున్న రోహిణియు కానవచ్చుచున్నవి. రోహిణికి దిగువను కొంచెముప్రక్కగా మృగశిరచుక్క లున్నవి. ఆదిగువనే పగడమువలె ఎఱ్ఱని కాంతితో గేజరిల్లుచున్న ఆర్ద్రనక్షత్ర మున్నది. మధ్యను 'గొల్లకావిడి' చుక్క లున్నవి. అవే ఒరయన్ యోధుని పటకానక్షత్రములు. ఆయోధుని ఖడ్గము వాటిక్రిందనే వ్రేలాడుచున్నది. ఒరయన్ పాదమై రిగల్ (Rigel) చుక్క మెరయుచున్నది. రిగల్


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమీపముననే యమునానది పుట్టినట్లు కనబడుచున్నది. యమున పెక్కుసారులు వంకరటింకరలు తిరిగితిరిగి నైరృతికి వ్యాపించియున్నది.

ఆర్ద్రకు తూర్పుగా పునర్వసుచుక్కలున్నవి. ఇవి ధనుస్సువలె నున్నవని కొందరందురు. పడవవలె నున్నవని కొందరందురు. ఇందు తూర్పువైపున నున్న రెండు చుక్కలలో, ఎగువ, నవగా ఉత్తరపుచుక్క కంటె దిగువది తేజోధికమైనది. దీనినే పాశ్చాత్యులు పోలక్సు (Pollux) అందురు.

మిథునమునకు ఎగువ ఏనుగుతొండము, లంబోదరము, మూషకవాహనములతో విఘ్నేశ్వరుడు ప్రకాశించుచున్నాడు.

సారథిమండలమునకు ఎగువ కల్పవృక్ష మున్నది. ఆ 'కల్పవృక్షమునీడ, పచ్చరాపట్టుగమి' గచ్చపట్టుగా గల అప్సరసల మండల మున్నది. ఈకల్పవృక్షమునే పాశ్చాత్య సిద్ధాంతులు Camelopardalis అని వ్యవహరించుచున్నారు.

మిథునమునకు తూర్పున కర్కాటకమండలమును, అందు పొల్లుపూవువంటి చుక్కమబ్బు (Nebula) ను కానవచ్చున్నవి. దాని కిటునటు రెండుచుక్కలున్నవి. ధవళధవళముగా నున్న ఆచుక్కమబ్బు వెండికంచ మనియు, అటు నిటు గల చుక్కలు గాడిదె లనియు, ఆగాడిదె లీకంచములో ఆహారము తినుచున్నట్లును పాశ్చాత్యుల గాథ లున్నవి.

పుష్యమిదిగువను సర్పదైవత్యమైన ఆశ్లేష కలదు. పుష్యమికి తూర్పున పల్లకివంటి యాకారములో మఘయును, కనులవలె రెండురెండు చుక్కలు గల పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని నక్షత్రములును ఉన్నవి.

ద్రౌపదీస్వయంవరమహోత్సవనాటకము ఆకాశమునం దిపుడు రమ్యముగా ప్రదర్శింపబడుచున్నది. బకాదుల పని అయినది. ఆవరకు ప్రచ్ఛన్నముగా నున్న పాండవులు పైకి వచ్చుచున్నారు. ఉత్తరఫల్గునికి ఋగ్వేదములో అర్జునీనక్షత్రమనియే పేరు. అర్జునుడు, అనగా ఉత్తరఫల్గుని ఉపయించి ఆవరకును ఆకాశమున పరిభ్రమించుచున్న మత్స్యయము-మీనము-ను పడగొట్టినాడు. మీనము ముక్కలై నేలగూలిపోయినది. మత్స్యయముపాటు కనుగొనగానే కన్య-ద్రౌపది-భంగమున నవతరించినది. ద్రౌపదివివాహము అష్టమి, రోహిణినాడైనదని భారతమునందు గలదు. అది యీ ఫాల్గునమునందే తటస్థించుట గమనింపదగియున్నది.

కన్యసమీపమునందే క్షీ. ఉ. ధ్రు. అనుసంజ్ఞలతో క్షీరోద ఉత్తరధ్రువము సూచింపబడినది. పాలసముద్రమథనమునుగూర్చి చర్చించునపుడే క్షీరోద ధ్రువవృత్తాంతము గమనించితిమి. ఆవల సారమేయమండల మున్నది.

## దక్షిణాకాశము

నైరృతిదిగ్భాగమున శింశుమారమునకును, యమునకును మధ్య ఘుంఘుడున్నాడు. యమున కీవల బకదాల్భ్యుడున్నాడు. యమునానది తిరుగుటలో





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉపరిచరవసువు కానవనుచున్నాడు. రిగెల్ దిగువ శశక మును, ఆదిగువ కపోతమును గలవు. ఉపరిచరవసు చరిత్రతో సంబంధముగల అద్రికయు, వలయును ఆ దిగువ నున్నవి.

క్షీరవాహిని నంటి ఉత్తరముగా పూర్వశ్వాన మును, దక్షిణముగా శ్వానమును గలవు. ఆదిగువనే నౌకామండలము గలదు. నౌకాస్తంభపృష్ఠములును బాగుగా కానవచ్చుచున్నవి. ఆప్రక్కనే అగస్త్యుడు అద్భుతకాంతితో తేజరిల్లుచున్నాడు.

## విశేషములు

పూర్వశ్వానము, ఆర్ద్ర, మృగవ్యాధుడు అను నీమూడు నక్షత్రములును సమత్రిభుజాకారము కలిగి యున్నవి.

ఆర్ద్ర, మృగవ్యాధ, రోహిణి, రిగెల్ నక్షత్ర ములునాలుగును సుదీర్ఘమైన వజ్రాకారముతో నలు వంకలను మెరయుచున్నవి.

పశ్చిమమునుండి తూర్పునకు మీన, మేష, వృషభ, మిథున, కర్కాటక, సింహ, కన్యారాసులు క్రమముగా వ్యాపించుచున్నవి.

ఈమాసములో ముఖ్యమైన ఉల్కాపాతములు లేవు. స్వల్పఉల్కాపాతములు ఫిబ్రవరి ఇరవైయవ తేదీ లగాయతు మార్చి రెండవవరకును సింహరాశిలో మఘసమీపమున నగపడును.

ఈమాఘ, ఫాల్గునమాసములలో సూర్యాస్తమ యము కాగానే ఆకాశమధ్యమున నభోవైభవమును, మహనీయకాంతితో తేజరిల్లు నక్షత్రవిశేషములును పైపటములో చూపినాను. తొలిజామున పటములో చూపదగు గ్రహాదు లీమాసమున లేవు.

---



కాళి — యస్. వి. యస్. రామరావు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఆంధ్రాభ్యుదయము



కవుతా ఆనందమోహనశాస్త్రిగారు

"ఇరువదియైదేండ్ల ప్రాయమువారే యయినను ఆనందమోహనశాస్త్రిగారికి చిత్రలేఖనమందు అపూర్వమైన కౌశలము గలదు. వీరి స్వతంత్రభావనాచాతుర్యమునకును, చిత్రలేఖనకౌశలమునకును సేలనుడిస్ ఆర్టిస్టుస ఫ్రాంకాయిసునందు వీరు రచించిన చిత్తరువులు నిదర్శనములు. వీరి చిత్తరువులు సజీవదృశ్యప్రబంధములు. 'ఛాయలు,' 'కత్తులసానపెట్టువాడు' అను వీరిచిత్తరువులు అతిమాత్రరమణీయములయినవి. వీరి యాలంబనమున చిత్రకళ జీవముట్టిపడుచు, విలసిల్లగలదు. ఇండియాదొరతనమువారు సయితము వీరిప్రతిభను గుర్తించి, వీరిచిత్రములను గొన్నింటిని లండను ఇంపీరియల్ చిత్రకళాప్రదర్శనమునకు పంపినారు" అని యొకానొక ఫ్రాన్సుపత్రిక ప్రశంసలనందుకొన్న మేటిచిత్రకారుడు.





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






శ్రీమతి వై. సీతమ్మగారు

ఈమె కర్నూలున గౌరవ మేజిస్ట్రేటుగ నియమింపబడెను. శ్రీ వై. గోపాలరావుగారి సతీమణి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## ఆంధ్రఋతుసంహారము

ఇది యాంధ్రగ్రంథమాలయందలి ౨౩-వ కుసుమము. కృతికర్త: గుత్తి వేంకట సుబ్రహ్మణ్యము గారు, బి. ఏ., క్రౌను ౮౦ పుటలు. వెల ౮ అణాలు. వలయువారు "ఆంధ్రగ్రంథమాల, ౭ తంబుసెట్టివీథి, మదరాసు" అనుచిరునామాకు వ్రాయవలెను.

కాళిదాసమహాకవికృతమని చెప్పఁబడు ఋతుసంహారమున కిది తెలుఁగుసేఁత. మూలగ్రంథము కాళిదాసకృతమే యగునని గ్రంథకర్త యుపోద్ఘాతమునఁ దెలుపుచున్నాఁడు. కొందఱిమత మట్టిది. ఇఁకఁ గొందఱిది వేఱుమతము. వేఱుమతమే నాకును సమ్మతము.

ఋతుసంహారము నింతవఱకు అనేకు లాంధ్రీకరించియున్నారు. శ్రీ వేంకట సుబ్రహ్మణ్యముగారి యీ తెనిఁగింపును తక్కినవానికంటెఁ దక్కువదికాదు. ఇయ్యది చాలవఱకు మూలాభిప్రాయము ననుసరించుచునేయున్నది. కాని భాషాంతరీకరణముపట్ల దుర్నివారములగు నెఱసులిందును అందందుఁ గానవచ్చుచున్నవి.

మూలము:—"యథా ప్రదోషాః శశిచారుభూషణాః"[౧-౧౨]. తెనిఁగింపు—"చంద్రభూషామనోజ్ఞదోషములువోలె". మూలమునందలి 'ప్రదోష' మిందు 'దోష' మయినది.

మూలము:—

తృషా మహత్యా హతవిక్రమోద్యమః
శ్వసన్ముహు ర్దూరవిదారితాననః,
నహన్త్యదూరేఽపి గజాన్ మృగేశ్వరో
విలోలజిహ్వ శ్చలితాగ్రకేసరః. [౧-౧౪]

తెనుఁగు:—

గీ. దప్పి పైకొన విక్రమోద్యమము తూల
మాటిమార్చుచు నోరున్నపాటి దెఱచి,
జూలు విదలించుకొనుచు విలోలజిహ్వ
చెంతఁ గరులున్నఁ గేసరి చీల్పఁబోదు.

ఇచట దప్పిచేత విక్రమోద్యమము తూలెననియు, నోరెక్కువగఁ దెఱువఁబడెననియు, నర్థముకలుగునట్లాంధ్రీకరింపఁదగియున్నది. ఇచట "విలోలజిహ్వ" అనునది కేసరికి విశేషణమయ్యును, "విలోలజిహ్వయొక్క చెంత" అనువిరుద్ధార్థము స్ఫురింపవచ్చును. అచటివిశేషణపదము నుచితరీతిని మార్పవలసియున్నది.

మూ:—"సముద్ధృతాశేషమృణాళజాలకమ్" [౧-౧౯.]

తె:—"ఉద్ధృతాశేషతామరసోత్కరమ్ము."
మృణాళము తామరతూఁడు. తామరసము పద్మము.

మూ:—"శీర్ణ". తె:—"శుష్క"[౧-౨౩.], రాలినది శీర్ణము; ఎండినది శుష్కము.

మూ:—"విపాండురం కీటరజస్తృణాన్వితమ్" [౨-౧౩.]

తె:—"పాండురము కీటతృణరజస్స్ఫారకమ్ము" అన్వితమువేఱు; స్ఫారకమువేఱు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూ:— "స్త్రియశ్చ కాంచీమణికుండలోజ్జ్వలాః" [౨-౧౯.]

తె:— "మేఖలామణి కుండలోన్మేషితాంగ, నలు" ఉజ్జ్వలము = ప్రకాశము, ఉన్మేషము = వికాసము, ఉదయము.

మూ:— "చంచన్మనోజ్ఞశఫరీరశనాకలాపాః" [3-3.]

తె:— "చంచదుత్సుకశఫరీరశనలు" మనోజ్ఞము= సొగసైనది. ఉత్సుకము = వేడుక.

మూలము:—

"ప్రరూఢశాల్యంశుచయై ర్మనోహరం
క్వచిత్ స్థితక్రౌంచ నినాదరాజితమ్,
ప్రకామకామం ప్రమదాజనప్రియం
వరోరు కాలం శిశిరాహ్వయం శృణు" [౫-౧].

తెనుగు:—

గీ. "రూఢశాల్యంశుచయహర్ష రూఢ మిదిగో!
విరళచక్రనినాదసంవిరచితమ్ము
ఇతరకామమ్ము ప్రమదాజనేష్టతరము
వినుము కాలము శిశిరాఖ్యమును వరోరు."

ఇచట మనోహర మనుటకుబదులు హర్ష రూఢ మనుట పొసంగదు. "రాజితము, సంవిరచితము" ఏకార్థకములు కావు. "ప్రకామకామ" మ్మనుదానికి "ఇతరకామ" మనునది వాచకముకాదు. తెనిఁగింపులోని నాల్గవపాదము యథాశ్రుతమగ నుండుటచేఁ జమత్కారాధాయకము కాకున్నది.

మూ:—"నిబద్ధ". తె:—"సాక్షేరుద్ధ" [౫-౨]

మూ:—"శరదిందునిర్మలమ్". తె:—"శరదైందవామలమ్ము". ఇచటఁ జంద్రునికి ఐందవపదము పర్యాయము కాదు.

మూ:—"ఉత్సుకాః స్త్రియః" [౫-౫]

తె:—"స్త్రీలు వేడ్క". వేడ్క క్రియావిశేషణముకాదు. స్త్రీవిశేషణముగ నుండవలెను.

మూ:—"కేశపాశః" [౫-౧౨] తె:—"జడ."

మూ:—"దధతి దివసయోగ్యం వేష మన్యాస్తరుణ్యః" [౫-౧౪]

తె:—"వేషమున్ దినయోగ్యము వేలుదాల్తు(రి)". ఇచట "వేలు" వేషవిశేషణము కాదు. తరుణీ విశేషణము.

మూ:—"వసన్తే" [౬-౨] తె:—"చైత్రము" వసంతము చైత్రము కాదు.

మూలము:—

"ఉచ్ఛ్వాసయన్త్యః శ్లథబంధనాని
గాత్రాణి కందర్పసమాకులాని;
సమీపవర్తిష్వధునా ప్రియేషు
సముత్సుకా ఏవ భవన్తి నార్యః." [౬-౮]

తెనుగు:—

గీ. సంశ్లథాఖిలబంధ లుచ్ఛ్వాసయుక్త
లసమబాణవిశేషాకులావయవలు,
మ్రోలఁ జరియించు ప్రియతమపురుషులందు
సోత్సుకాత్మలై యయ్యెద రువిద లిపుడు."

అంగనలు తమసడలిపోయిన యంగములకు జీవమును, జవమును గల్గించి, ప్రియులయెడ వేడ్కకల్గియే యున్నారని మూలముయొక్క యభిప్రాయము. ఆంధ్రీకరణమున నీయర్థ మభివ్యక్తము కాలేదు. ఇట్టివి మఱికొన్ని కలవు.

ఛందోయత్యాదిసిద్ధికై "యెడనెడ", "మఱి మఱి", "చిరమ్ము", "ఇపుడు", "ఔర" మొదలగు పాదపూరకములగు పదములును, అనుచితస్థలములందు సముచ్చయార్థకపదములును కన్పించుచున్నవి. అంచిత మనుటకు బదులు ఆచితమని పెక్కు-చోట్లఁ బ్రయోగింపఁబడినది.

మూలము సర్థభావములు సరిగా అన్వయసారళ్యము కల్గున ట్లమరిన యనువాదములు తమ కందచందములను గుదుర్చుకొనుటయేకాక మూలముప్రశస్తిని ముందుకుఁ దేఁగలవు. అట్లుకాని యనువాదములు కేవలము వ్యయప్రయాసములకే యగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈయనువాదమున కవిత్వము సరళముగ సాగినను అన్వయసారళ్యము కొంచెము తగ్గినది. కాని "ఉపజ్ఞ" కనుపడుచున్నది. రచనము సంస్కృతబహుళమై ఆంధ్రతాముద్రను కొంత కోలుపోయినది. సంస్కృత పదముల తత్సమీకరణము పలుతావుల లింగవివేకమునకు బాధకలిగించుచున్నది. స్థూలదృష్టికి గోచరించు నీ పైదోషములవిషయమును "ప్రతిభ చాలమి, అనుభవము లేమి, మత్కృతిని దోషములుం బొరసియుండ వచ్చును. సహృదయులకు క్షంతవ్యుఁడను" అను అనువాదకుల "విజ్ఞప్తి"ని పాటింపఁదగును.

అనువాదములు ఉపజ్ఞను మొక్కపఱచును; స్వతంత్రరచనములు దానికి వాడినిగూర్చి మెఱుగు పెట్టును. కావున నీగ్రంథకర్త మునుముందు అనువాదములవెంటఁ బడక స్వతంత్రగ్రంథములను రచించి తన యుపజ్ఞను సార్థకపఱచుకొను టురవు.

సర్వజనాహ్లాదకరముగునది యీ గ్రంథమునందలి వస్తువు. ఆంధ్రసోదరు లీగ్రంథమునందలి రుచిని చవిగొని గ్రంథకర్త కుత్సాహమును గూర్చుట సముచితము.

బులుసు వేంకటరమణయ్య.

---

## కర్ణచరిత్ర

ఇది కళాప్రచారక సమితివారి మూఁడవప్రచురణము. పద్యకావ్యము గ్రంథకర్త: మల్లాది వేంకటకృష్ణశర్మగారు. డెమ్మీ ౭౦ పుటలు. మూఁడాశ్వాసములు. (పూర్వఖండము) వెల రు. ౦-౧౦-౦. పుస్తకములు వలయువారు "దేవరాజు వేంకటకృష్ణారావుగారికి, బరంపురం, (గంజాం)" అని వ్రాసినఁ బడయఁగలరు.

మూఁడాశ్వాసముల పరిమితిగల యీ మొదటి భాగమున, మహాభారతప్రసిద్ధుఁడగు కర్ణునిచరిత్ర కొంత వఱకును—అనఁగా కర్ణుఁ డంగరాజ్యాధిపత్యము వహించి దుర్యోధనునికి బాసటగా నుండ నంగీకరించినంతవఱకును—వర్ణింపఁబడినది. మహాభారతఫక్కి ననుసరించియే కథ వర్ణింపఁబడియున్నది; కాని కర్ణుని జనన విషయముమాత్ర మిందు వేఱుగుచున్నది. కుంతికి సద్యోగర్భమునఁ గర్ణుఁడు పుట్టినట్లు మహాభారతమున నుండఁగా నిందు, తొమ్మిదినెలలు నిండినపిదపఁ బుట్టినట్లు వర్ణింపఁబడినది. ఇది యుచితముగ లేదు. కుంతి గర్భమును మోసినచో, ఇంటిలోనివారి కాచిహ్నములు కన్పింపవా? మఱియు గృహముననే కర్ణుఁడు పుట్టినచో, ఆతనిని గంగలోఁ బాఱవేయ దూతికం బంపినఁ జాలదా? తానుకూడ పోవుటేల?

ఇందుఁ జాలవఱకుఁ గ్రొత్తపోకడ లున్నటు లుపోద్ఘాతమునఁ గలదు. కాని వానికంటె నెక్కువగఁ బ్రాచీనమార్గానుసరణములే యిందుఁ గన్పించుచున్నవి. విశేషముగ దేవతాకవిస్తుతులు, షష్ఠ్యంతములు, ఆశ్వాసాద్యంతపద్యములు, గద్యలు ,ఈవిషయమును బాగుగఁ జాటఁగలిగియున్నవి.

కథాచమత్కార మీగ్రంథమున లేకపోయినను కవిత్వముమాత్రము చాల సరళముగ నున్నది. అచ్చటచ్చట హృదయంగమములగు వర్ణనలు గలవు.

పుట ౧౦. "పైతృకఋణవ్యూహంబు ఛేదింపఁగా" అనుచోట ఋణమును వ్యూహముగఁ జెప్పుట సరసము గాదు.

పుట ౧౩. "పూవులన్ గోసినగోళ్లునొచ్చునని".—ఇచట వ్రేళ్లు నొచ్చుననిన బాగుండును.

పుట ౧౯. "విలసచ్చంద్రాగ్నిమార్తాండమంజుల నేత్రత్రయ".—ఇచట నేత్రత్రయమున మంజులత్వము మృగ్యము.

పుట ౪౧. "కోమలపక్షికులధ్వనిచ్ఛటల్" ఇచట ఛటాపదము ధ్వనివిషయమునఁ జమత్కారకము కాదు. అప్రసిద్ధము. కాంతివిషయముననే ప్రసిద్ధము.

పుట ౭౪. "జాతము దైవనిర్ణయము, జాతము నెంతురె ప్రాజ్ఞులు".—జాతి యనునర్థమున జాతపదమప్రసిద్ధము.

పుట ౫౮. కందపాదము—"గనుగొని పెదవుల్ చలింప, గాకటుని".—ఇచట ఛందస్సు పోయినది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుట ౪౦. సీ. "ఆలోలకల్లోలజాలక్షాలనలీల". ఇచట "జాలచ్ఛాలనలీల" అని యుండవలెను. అట్లు దిద్దినచో ఛందస్సు కుదురఁజాలదు.

పుట ౪౪. "తనయింతిన్ రాఁనయనెదుదానికి ననియెన్". ఇచట "తనయింతికి" అనియుండవలెను.

మఱియు "పిలుచు" ధాతువునకు "పిలచు" అనురూపములు చాల వాడఁబడినవి. పు. ౧౪. "సరోజము లంటిబల్కఁగా." పు. ౫౦, ౫౧. "యౌవ్వనము", పు. ౫౯ "పిలచుటకు". పు. ౬౫ "ఎల్లరున్ వొగడ", మొదలగు కొన్ని స్వల్పములగు స్ఖాలిత్యములు కలవు.

ఇందలి కథ యాదర్శప్రాయ మగుటచేతను, కవిత సరళముగ సాగి చదువుట కుల్లాసముఁ గల్గించుట చేతను దీని నాంధ్రసోదరులు పఠించి శ్రీ వేంకటకృష్ణ శర్మగారి యుత్సాహమునకుఁ బ్రోత్సాహము నొనరింతురుగాక!

బులుసు వేంకటరమణయ్య

---

## డీవెలరా

రచయిత: గద్దె లింగయ్యచౌదరి. ప్రకాశకులు: ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా. వెల ఒక రూపాయి.

"......డీవెలరాజీవితము పరాధీనవశ మున్న యువకులు తప్పక జదువవలయునను యుద్దేశముతోడనె యాంధ్ర సోదరుల కీచిన్నిపొత్తమును సమర్పించుచున్నాను" అని గ్రంథకర్త 'తొలిపలుకు' లో నుడివినట్లు దేశస్వాతంత్ర్యంకోసం ప్రయత్నిస్తూన్న మనకు తప్పకుండా యిట్లాంటివాళ్ల జీవితాలు చదివి నేర్చుకోవలసిన విశేషము లనేకము లుంటవి. డీవెలరాచరిత్ర అంటే యించుమించుగా ఐర్లాండుయొక్క స్వాతంత్ర్య చరిత్రే అన్నమాట. అతనిజీవితము ఐర్లాండుస్వాతంత్ర్య ప్రయత్నములో అంత ఐక్య (మిళిత) మైపోయింది.

మనదేశము, కేవలమూ శాంతిమార్గాన్నే అవలంబించినా, హింసా దేశమనకూ ఐర్లాండుకూ సాతంత్ర్య ప్రయత్నములో అనేకములు పోలిక లున్నవి. అంచేత డీవెలరాచరిత్ర మనకు పూర్తిగా ఉపయోగకరంగా వుండాలంటే ఐరిషువారిపద్ధతులూ, ప్రయత్నాలూ మనస్వాతంత్ర్యప్రయత్నాలతో సరిపోలుస్తూ మనపరిస్థితుల కవి ఎట్లా అనువర్తిస్తవో చూపుతూ పుస్తకం వ్రాయాలి. కాని ఈపుస్తక మట్లా వ్రాయబడలేదు. అదికాకుండా స్పష్టముగా లేకుండా తొందరగా వ్రాసినట్లు కనిపిస్తుంది. శైలి యింకా బాగా వుండాలి. ఇట్లాంటిలోపా లున్నా ప్రస్తుతం ఆంధ్రవాఙ్మయాని కిట్లాంటిపుస్తకా లవసరమే అనిచెప్పాలి.

---

## హరిజననాయకుడు

గ్రంథకర్త: ప్రొఫెసరు రంగనాయకులుగారు, రైతుగ్రంథమండలి, నిడుబ్రోలు, గుంటూరుజిల్లా. ౧౪౬ పుటలు, వెల రు. ౦-౮-౦.

ఈగ్రంథము రైతుగ్రంథమండలియందలి తొలి పుష్పము. నిరుపేదలగు రైతులను, నిష్ఠురస్థితియందున్న పంచములను ఇందలిపంక్తులందు తోచుచున్నారు. "Style is the man" అను New man వాక్కు గ్రంథకర్తకు బాగుగ చెల్లుచున్నది. గ్రామస్థుల ఉద్ధరణ మనకై పాటుపడునాయకులలో నొకరైన శ్రీరంగనాయకులుగారి ఆశలును, ప్రయత్నములును ఇందు ప్రతిఫలించుచున్నవి. కథానాయకుడు బసవలింగయ్య—ఈతనిచరిత్ర చక్కఁగ చిత్రింపబడినది. తోడిసంఘీయులను లేవనెత్తుటకు ఈతడు తనజీవనమును ధారవోసినాడు; సనాతనమతమును సమర్థించి, క్రైస్తవ బోధకుల ప్రలోభనములను ప్రతిఘటించి, మాలగూడెములను ఋషికుటీరములను చేయవలెనని ఈతడు మిక్కిలి మక్కువపడినాడు. మహాత్ముని తత్త్వామృతమును గ్రోలి అహింసావ్రతమును నెరపి తనువును కైదున కప్పగించినాడు. అంటరానితనము అమానుషమైనదని ఆచార్యుడు నొక్కిచెప్పెను. ఖద్దరు ఉత్పత్తి పంచములకు చాలమేలుగూర్చుననియు, కానికాలమందు పైబడుచిక్కుల నది పోద్రోలజాలు పరిశ్రమయనియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రంగాగారు తెలిపిరి. పల్లెసీమలందు జరుగుచుండెడివిషయములు, ఓసల్లెమోఎరుగని గ్రామస్థుల మాధ్యమమును, వ్యాజ్యముల నుండిపుట్టు నష్టమును, కష్టమును గ్రంథకర్త చూపెను. కమతమందును, ఇతరదైనిక కార్యములందును ఒకప్పుడు పల్లెవాసులు కలసిమెలసియుండు వారనియు, ఎవరెవరు ఏకులస్థులో ఎరుగక సమానపంథయందు నడచుచుండు వారనియు, స్త్రీలు పురుషులకు వారివారిపనులందు విశేషముగా సాయపడుచుండువారనియు, ఘోషాలేని చోటులందు వ్యవహార నిర్వహణమందు యువతులు తమసామర్థ్యమును తేటపరిచిరనియు రచయిత తెలిపెను. నిరుద్యోగులైన విద్యాధికులు వ్యర్థజీవులమని చింతిలక, ఇంటను అంటను అల్లాడక పల్లెలకు మరలి, కొంతభూమిని కౌలునకు దీసికొని క్రొత్తపద్ధతుల ననుసరించి, వ్యవసాయము చేయుచు, జీవనోపాధి గలిగించుకొనుచు, రైతులను పునరుద్ధరింపవలెనను భావమును, తక్కినమతములవలెగాక హిందూధర్మ మందరికిని ఆహ్వాన మొసగుచు, ఎల్లతపురోభివృద్ధికిని తోడు పడు ననుభావమును పుస్తకమునకు వన్నె దెచ్చుచున్నవి. విద్యావతులు నగరములందలి శృంగారజీవనమున మునిగియుండక విలాసములందు విరుచుకొనిపడక పల్లెలకు తరలిఅచటి నిర్భాగ్యులకు తెరుపుచూపు డివ్వెలై యుండవలెనని తెలిపి, కథానాయకునకు మిసలగూర్పు విదుషి అరుంధతిని అర్ధాంగలక్ష్మిని జేసి, ఆదర్శదంపతులను సుందరీసుబ్బారావులను, సుశీలారామస్వాములను గ్రంథకర్త చదువరుల కనులెదుట బెట్టెను. వివాహాది సాంఘికక్రియలను జరపుపట్ల సంఘీయుల వెచ్చము మిసల క్లుప్తమైయుండవలెననియు, పాశ్చాత్యసీమల నుండి దిగు ప్రచారకుల దృష్టాంతముల ననుకరించి, దేశీయనాయకులు పల్లెవాసుల అభివృద్ధికై వలయు సంస్థలను స్థాపించవలెననియు, స్వీయకులస్థుల ఆదరమునుమాత్రమే అభిలషించక సర్వజాతుల మన్ననల నంది, ఎల్లరనుండి వచ్చు ఓటునే ప్రజాప్రతినిధి కాంక్షింపవలెననియు, చదువునేర్పినవారియందలి నిరుద్యోగముకంటె వ్రాయను చదువను ఎరుగక తనుబాములను తాము తెలుపుకొనజాలు శక్తి లేక కృశించు పల్లెవాసుల నిరుద్యోగ మధికమైనదనియు సరళవాక్కుల దెలిపి, రంగాగారు రైతులందలిప్రేమను చూపిరి. ప్రజలమనసుల నాకర్షించు అధునాతనసాంఘికసమస్యలు కనులకుకట్టినట్లు పుస్తకమందు వివరింపబడినవి.

పుస్తకము చేరవలసినది రైతులచేతులను. అందుచే గ్రంథకర్త వాడుకమాటలనే వాడెను. వాడుకమాటకు పట్టాభిషేకము కావలసినరోజు లివి. కాని నేడు తెలుగువాడుకమాట ఒకతెన్ను లేనిదై పరుగిడుచున్నది. వాడుకమాటకు దారి తీసిన వంగీయులు పడమటివంగభాషనే వాడుదురు—వికృతమైయుండు తమతూర్పు మాటను పుస్తకములలోని కెక్కింపరు. చూచిరమ్మని నంతనే చూచివచ్చువారు కారు మనతెలుగులు. వాడుకమాటను సవారియం దెక్కించి, అంతటితో సంతృప్తిపడరు—గగనవీధికెగురగొట్టి తాము నేలమీద గంతులిడుదురు. తెలుగుసీమయందలి వివిధకులములును, వివిధప్రదేశములును, వివిధసంప్రదాయములును తెలుగమ్మ నొక్కేకంతమున పిలువక వాడుకమాటను పెక్కుతెన్నులందు నడపుచున్నారు. 'ఎవరికివారే రాజుల' మని నేటి తెలుగు రచయితలు బొబ్బలిడుచున్నారు. ఒకచోటులోని వాడుకమాట ఇంకొకచోటున బోధపడక పాఠకుల నట్టిట్టు లాడించుననుటకు ఈపుస్తకమున కొన్నిదృష్టాంతము లున్నవి. కొరుకుపడని సంస్కృతపుకొయ్యలట్టివో, చదువరిని ఒకదరి జేర్పజాలక ఉక్కిరిబిక్కిరి చేయు విస్తారపువాడుకమాటలును అట్టివే! భావకు స్వేచ్ఛగావలసినను విచ్చలవిడినడక పనికిరాదని తెలుపుటకు కావలసినసరుకు ఈగ్రంథమందు దొరకకపోదు. "లాకీకాదు", "ఆగడగ్గాయి" "తవుడుకొనక", "అలగావాడు", "బుకిడీపుచ్చి", "కుమ్మక్కైౖ" మొదలగుపదము లెందరికి బోధపడును? "అనవాకు", "పెట్టవాకు", "అనుకోవాకు", "ఆశ్చర్యపడాలసిన", "అటోయిటో తేల్చాల", "యీడుజారిపోయింది" మున్నగుమాటలు అందరూ వాడునవియేనా? "ప్రాంత్యంవదలి" (ఈపదము "దేహము" సాంప్రదాయము లోనిది) "అత్యంతమార్పు", "సాంఘికపరిమార్పులు"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదలగు ఊకదంపు ప్రయోగములు ఈరోజులలో దుమ్ము రేగగొట్టుచున్నవి. తమసందేహపుపుట్టుక నెరిగి, ఒకప్పుడు అడ్డుగోడమరుగున నక్కినమాటలు ఇపుడు జబర్దస్తీగా యీవలికివచ్చి, దబాయించి పుస్తకాలలో ప్రవేశించి రాజ్యచక్రము త్రిప్పుచున్నవి! భావమనుసరించినకథ తమకేలయని రంగనాయకులుగారు తలచియుందురు. ముఖ్యమైన విషయములను రైతులకు తెలుపుట వీరి యుద్దేశము. కథాచమత్కారము గాని, కళాకౌశలము గాని వారు చూపదలచుకొనలేదని ఈపుస్తకము తెలుపుచున్నది. ఆతురపాటుతో నిండియున్న తమ గుండె నిందు సుమ్మరించిరి. వీరియుద్దేశము ఎంతయు కొనియాడదగినది.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

## వినోదిని

ఈ వినోదిని కిది రెండవయేడు. నవ్వులపత్రికలనేవే లేని తెలుగుసమాగాణమున నపూర్వముగ బయలు దేరి, తెలుగుల యాదరాశీస్సులఫలముగ నానాటికి క్రొత్తపోకడలతో, వింత వింత వినోదములతో నాంధ్రుల నుల్లాసమును గూర్చుచున్నది, ఈ నవ్వుల మాసపత్రిక. ఇందు గాంధీమహాత్మునికి సంబంధించిన 'దశావతారములు' రచయిత అద్భుత కల్పనాశక్తికి నిదర్శనము. మరియు అది మహాత్మునియెడ గౌరవాదరములను బహూకరించుచున్నది. సంవత్సరమున కొక రూపాయిచందా. విలాసము : గోవిందప్పనాయకవీథి, మదరాసు.

---

# స్వీకారము

## గాంధీగారంటే ?

అనువాదకులు: పొట్లూరి నాగభూషణంగారు, ప్రకాశకులు: ఆదర్శగ్రంథ నిలయము, ఎలమఱ్ఱు, కృష్ణా జిల్లా. క్రౌను ౨౦ పుటలు, వెల రు ౦-౦-౬.

---

## శ్రీ గాయత్రీరామాయణము

శ్రీమాన్ బహుజనపల్లి రాఘవాచార్యులవారిచే బరిష్కృతమై గోటేటి కృష్ణమూర్తిగారిచే బ్రకటింప బడినది. ఆనందముద్రణాలయము: మదరాసు. క్రౌను ౭౨ పుటలు, వెల రు ౧-౮-౦.

---

## కర్షకుని కాలగతి

అనువాదకులు: లింగయ్యచౌదరిగారు, ఆదర్శ గ్రంథనిలయము—ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా. క్రౌను ౪౧ పుటలు, వెల రు ౦-౨-౦.

---

## హిందూలా

(సమష్టికుటుంబము)

గ్రంథకర్త: చాగంటి శేషయ్యగారు, కపిలేశ్వరపురము, తూర్పుగోదావరిజిల్లా. డెమ్మీ ౪౧౩ పుటలు, వెల రు ౩-౦-౦.

---

## శ్రీమద్వాల్మీకి రామాయణము బాలకాండము

వ్యాఖ్యానటీకా కారులు: బ్రహ్మశ్రీ గండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ప్రకాశకులు: జి. కృష్ణమూర్తిగారు, మాముడూరు, కృష్ణాజిల్లా. క్రౌను ౨౦౮ పుటలు, వెల రు ౧-౮-౦.

---

## కవికొండల వేంకటరావుగారి

జనపదములు (౦-౧-౦), మాతృదేశసంకీర్తనము (౦-౧-౦), కలదతము (౦-౧-౦), కుమారకంఠము (౦-౨-౦), చదువులదుత్త (౦-౨-౦), కోనేరు (౦-౨-౦), చిట్టికైత (౦-౩-౦), ఆగడపలు (౦-౪-౦), త్రయి, [illegible]తిచందనము (రెండు ఒకరూపాయ), ఆత్మవ్యక్తి, నెలబాలుడు (రెండు ఒకరూపాయ),


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జంటలు, పాట్టికత (రెండు ఒకరూపాయ), వివిధ కుసుమావళి, విప్రసందేశము (రెండు ఒకరూపాయ)

ఈతగ్గింపుధరలకు ఇవి మార్చి 20-వ తేదివరకు లభించును.

విలాసము—ఇన్నీసుపేట, రాజమండ్రి.

---

## కాలేజీగరల్, లేక పాణిగ్రహణము

(సాంఘిక ప్రకరణము)

కర్త: కాళ్లకూరి హనుమంతరావుగారు, సబ్బారపు వీథి, ఇన్నీసుపేట, రాజమండ్రి. వెల అ. ౧౨.

---

## బాలభటుడు

గ్రంథకర్త : దేశరాజు రామదాసుగారు, గొల్లలవల్స-గంజాంజిల్లా. క్రౌను ౨౭ పుటలు, వెల రు౦-౪-౦.

---

## Personalities in Present Day Music

గ్రంథకర్త: ఇ. కృష్ణయ్యరుగారు, బి. ఏ., బి. యల్., నెం. 3 కొండిచెట్టి వీథి, మదరాసు. క్రౌను ౯౯ పుటలు, వెల రు ౧-౦-౦.

---

## జాతకనారాయణీయము

గ్రంథకర్త: వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారు, బి. ఏ., రాజమహేంద్రవరము, క్రౌను ౨౫౮ పుటలు, వెల రు ౧-౮-౦.

---

## నేనూ, మాకాంతం

కర్త: మునిమాణిక్యం నరసింహారావుగారు, హిందూహైస్కూలు, బందరు. గౌతమీపుత్ర గ్రంథమాల రెండవపుస్తకం. వెల ఎనిమిదణాలు.

---

## కవిత్వతత్త్వ విచారము

గ్రంథకర్త: కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఆంధ్రవిశ్వకళాపరిషద్ గ్రంథమాలాష్టమ కుసుమము. క్రౌను 3౨3 పుటలు, వెల రు. ౧-౮-౦.

---

## కల్యాణి

(సంక్రాంతిసంచిక)

సంపాదకుడు : గంటిసూర్యనారాయణశాస్త్రిగారు, కల్యాణీకార్యాలయము, విజయనగరము.

---



సూర్యాస్తమయము-గంగానది —సి. జి. జగన్నాథదాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మ న వి మా ట లు

## కీ. శే. చల్లా శేషగిరిరావుగారు

నలువదియెనిమిదేండ్లకే ఆంధ్రపత్రికాసంపాదకులు శ్రీ చల్లా శేషగిరిరావుగారికి నూరేళ్ళు నిండి పోయినవి. ఆంధ్రలోకమును విషాదమేఘము లలముకొని సానుభూతిధారల పెల్లుకురియుచున్నవి. కాని ఆయనకొరకు దుఃఖింపబనిలేదు. ఆయన మృతజీవి.

ఆంధ్రుల భాగ్యాతిరేకమున పదునైదేడులనాడు శేషగిరిరావుగారాంధ్రపత్రికకు సంపాదకులయినారు; వారి సంపాదకత్వమున నాంధ్రపత్రిక యాంధ్రులను అన్నిత్రోవల ముందునకు దెచ్చినది.

ఆంధ్రపత్రికా శేషగిరిరావుల కద్వైతభావమబ్బినది. అది పత్రికయదృష్టము; పత్రికాధిపతి యదృష్టము.

ఒడ్డుపొడవుల నొప్పారిన శేషగిరిరావుగారి యాకృతి సంపాదకత్వమునకు నిండుదనమును సంతరించునది. వెడదనుదురు, బట్టతల ఆయన ఎఱుకకలిమికి గురుతులు. ఆయన రూపుగొనిన శాంతము. తొలిచూపునసే ఆయనయెడ చూపరకు గౌరవభావ ముప్పతిల్లెడిది.

ఆయన దేశసేవాపరతంత్రుడగు జాతీయవాది; తత్త్వవేత్తయగు కర్మయోగి. దేశసేవ ఆయనకర్మయోగమునకు పరమలక్ష్యము. ఆయనదేశసేవాసక్తి ఒరుల నిర్బంధమువలన, స్వాహంకారమువలన, గృహచ్ఛిద్రములు కారణముగ, బ్రతుకుతెరువుగ, ప్రతిష్ఠకోసము అంకురించినది కాదు. నిరుపమాన మగు దేశభక్తియే యందుకు కారణము. దేశసేవారూపమగు నాయన నిరంతరకర్మయోగమునకు దేశాభ్యుదయమే పరమముచనాకాంక్ష్యము. ఆయనదేశసేవానిర్మాణమున కాంధ్రపత్రిక తెరచినబజారము.

ఆంధ్రపత్రిక కాయన సంపాదకుడయియున్న కాలమున భారతీయుల స్వాతంత్ర్యసంపాదనప్రయత్నముల మూలమున దేశపరిస్థితు లల్లకల్లోలములయినవి. శాసనములు చెలరేగినవి. వాకట్టులు బిగిసినవి. పత్రికలనేకములు పడిపోయినవి. కాని ఆంధ్రపత్రిక జాతీయపత్రికయయ్యును, ఏ మొడుపోడుములకు లోనుగాక యొక్కయెత్తునసే కొనసాగినది. ఇది ఆయనలోకజ్ఞతకు, సంపాదననిర్వహణకౌశలమునకు తెలివిడి.

శేషగిరిరావుగారి కలమునకు వాడితక్కువ. కాని అన్నివెంటల 'కాలము'లబడి పరుగిడు నది వెనుదీయునదికాదు. సంపాదకధర్మమను ననుశాసనముకంటె నది యనునయమునకే దారితీయునది; అసమమార్గమున గావున్నను, సమమార్గమున నడచునది. ఆయనహృదయమువలెనే ఆయనరచనము మృదులము, సరళము.

సౌజన్యము, మితభాషణము నాయన కలంకారములు.

ఆయనను రెండేడులనాడే విషమరోగము పయికొనినది; క్రమముగ ముదురజొచ్చినది. దానిని లెక్కించినవాడుకాడాయన. దేశసేవాతత్పరత రోగమునుని కిని, దాని ప్రాబల్యమును ఆయనయెరుకకు దెచ్చినది కాదు. శరీరపాతమువరకు దేశసేవచేసినాడు, ధన్యజీవనుడయినాడు. దేశసేవపయిగలతీపి ప్రాణములపయి నాయనకు లేకపోయినది. ఆయన యుత్తమదేశసేవాసక్తియే ఆయనకు ప్రాణాంతకముగా పరిణమించినది. ఇది సత్యము. ఈసత్యమును ఋజుహృదయము గుర్తింపగలదు.

శేషగిరిరావుగారు చిరస్మరణీయుడగుటకు వారిపేర స్మారకచిహ్నమును నెలకొలుప తలపెట్టియున్నారాంధ్రులు. 'వార్తాపత్రికావిద్యార్థివేతనము' శేషగిరిరావుగారు వార్తాపత్రికాసంపాదనద్వారమున కావించిన యమూల్యమగు దేశసేవకు సముచితమగు స్మారకచిహ్నము కాగలదు. ఆంధ్రులకును పత్రికాసంపాదననిర్వహణాదుల పరిచయము తక్కువ. ఈతీరు స్మారకచిహ్నము ఆంధ్రులకు పత్రికావిషయకవిజ్ఞాన ప్రాప్తికిని సాధనము కాగలదు. మరియు 'ద్వ్యర్థకరి' యను 'ఏకక్రియ' సర్వథాప్రశస్తము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కీ. శే. చల్లా శేషగిరిరావు పంతులుగారు





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కీ. శే. దేవులపల్లి అప్పలనరసింహము పంతులుగారు

పదియేడులనాడు పుట్టువుగనిన భారతికి రూపు రేకలు తీరిచిదిద్దిన తెలుగునాటిమేటిచదువరులలో దేవులపల్లి అప్పలనరసింహముగారు రద్దులేనిపద్దున్న వారు. ఇంగ్లీషుతెనుగులవలె సంస్కృతమును వీరికి కొట్టినపిండి. విమర్శనమున వీరు చేయితిరిగిన నేరుపరి. ఇంగ్లీషుతెన్నున తిన్నగానడచిన వీరితెనుగువిమర్శనము విమర్శకులకు ఒరవడిబంతి. 'ఆంధ్రవాఙ్మయమున నాంగ్లసారస్వత ప్రోచ్ఛలము', 'సోమ్రాబురుస్తుములు,' 'బిల్హణకథ' ఇవి ఎక్కువవిలువగల విమర్శనములు. మరియు 'బిల్హణకథ' వీరి రసహృదయమునకు రుజువు.

పంతులుగారు సంస్కృతమున కవిత్వము చెప్ప గలరు. 'శ్రీ సింహాచల క్షేత్రమ్', 'శ్రీ వేంకటాచలః' అనునవి వీరి సరససంస్కృతరచనములు. నాటక కళయందును వీరు చదురులు.

నరసింహము పంతులుగారికి మఱిమెత్తదనము, అడకువ మిక్కిలిపెద్ద. ఆయన తెలివికలిమి కవి వెల మించినతొడవులు.

వీరిమనుగడ తీరుకదొరకని ఒజ్జరికము. కావున ప్రోడయయ్యును వీరిరచనములకు లెక్క తక్కువ యయినది. కాని వీరు చనవుమెయి నా కొన్నిరచనముల భారతినే కైసేయుచుండిరి. ఈమారిమికి భారతి మురిసిపోవుచుండినది.

నేడు, ఏబదియారేండ్లకే, వీరిపుట్టువు కడముట్టినది. దీనితో తెలుగుతల్లికి క్రొత్తయందముల సవరింపగల వీరిరచనములును కడముట్టినవి. వీరి పేరు పెంపులే ఇపుడు తెనుగువారికి మిగిలినవి. కాని భారతి మాత్రము తన కన్నీటి నింతలంతల నింకించుకొనజాలదు.

---

## అభినవాంధ్రకవిపండిత సమ్మేళనము

### (ద్వితీయము)

ఆంగ్ల వాఙ్మయముతో పరిచయము పెరుగుకొలది అభినవాంధ్రవాఙ్మయ సంసృష్టియు పెరుగుచున్నది. కాని దానికి పేరు పెంపులు సరిగ నేరుపడకున్నవి. దీనికికారణములు రెండు:

౧. అధికాంశమున కావాఙ్మయమున గుణము లేమి;

౨. ప్రాచీన సంప్రదాయదాసుల ప్రతిఘటనము.

ఈ యాటంకము లంతరించినగాని అభినవాంధ్రవాఙ్మయము సుప్రతిష్ఠితము కాజాలదు.

అభినవాంధ్రవాఙ్మయోద్ధరణకాంక్షతో జన్మించిన 'అభినవాంధ్ర కవిపండిత సంఘము' రెండవమారు రాజమహేంద్రవరమున మొనమొన్ననే సమావేశమయినది. సభ నలంకరించిన 'కవులు', 'పండితులు' తామును, తమ తాతలు తండ్రులు, అన్నలు తమ్ములు మిత్రులుమున్నగువారురచించిన పదములు, పాటలు, పద్యములు (పాతవి, క్రొత్తవి కూడ) పాడుకొనుచు, కథలుచెప్పుకొనుచు సమావేశము రెండుదినములుకాలక్షేపముచేసి



శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు (అధ్యక్షులు)


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారు. కాని, అభినవాంధ్ర వాఙ్మయాభివృద్ధికి గలిగినయాటంకములను నివారించుట కుపాయములను విచారించినారు కారు; తదభివృద్ధి మార్గముల నరసినవారు కారు. ఇట్లు వెల్లపుచ్చిన యీసమావేశమును 'అభినవాంధ్ర వాఙ్మయప్రదర్శన' మనిపేర్కొనుట సముచితము. తుదకు 'పండితు' లయినను ప్రదర్శించిన వాఙ్మయమునందలి గుణదోషములను పరామర్శించి 'కవు'లకు త్రోవచూపినవారు కారు. ఇట్టి సమావేశములవలన నభినవాంధ్ర వాఙ్మయమున కభ్యుదయము కలుగగలదని యాశింప నవకాశము కానరాదు.

ఈ రెండవ సమావేశమునకు నేత ఆచార్య శ్రీరాయప్రోలు సుబ్బారావు. ఈయన నేతృత్వమే యీ సమావేశమున కబ్బిన విశిష్టత. ఇది పరమానందకారణము.

సుబ్బారావుఅభినవాంధ్రకవితాకుమారి కమృతమున నన్నప్రాశన మొనరించినాడు; 'నిండారబారు నఖండగోదావరి యొడిలో' తన 'ప్రథమగీతమును పాడి'నాడు; అభినవ కవికుమారకులమున కాచార్యుడయినాడు.

చిరకాలమునా డాయన యాంధ్రులకు దూరమయినాడు. కావుననే గౌరవప్రతిష్ఠ లాయనను వలచి వరించినవి.

నా డాయన అపూర్వభావనాసమంచితుడగు కవి; నేడు అనల్పకల్పనాచతురుడగు పండితుడుకూడ.

ఆకవిని,ఆపండితుని, ఆదూరస్థుని మరల నాచార్యునిగ వరించి తమలోనికి దోడ్కొని తెచ్చికొని తదుపదేశసుధను గ్రోలినా రభినవాంధ్ర కవిపండితకుమారులు.వారు ధన్యులు!

నాడు 'అఖండగోదావరియొడిలో' తన 'ప్రథమగీతమును పాడి' ఆచార్యుడయి కవికుమారులకు కవితామధువును చవిచూపిన సుబ్బారావు నేడు మరల నా'యఖండ గోదావరి యొడిలో'నే 'అభినవాంధ్ర కవిపండిత' కుమారులకుభయులకు ఆచార్యుడై పలుకుకండచక్కెరనుపంచియిడినాడు. ఆయనయును ధన్యుడు!

ఈవిధమున నీసమావేశము సుందరము, పవిత్రము నయినది.

సుబ్బారావు ఉపన్యాస మొకయపూర్వ కళామయకావ్యము; వినయాలంకృతమగు ననుశాసనము; విజ్ఞానసంపన్నమగు నుపదేశము; చైతన్యసమంచితమగు సల్లాపము.

సుబ్బారావు భావకుడు; భావించి భావకవికి రూపమును కల్పించినాడు; అతని కనుత్తమగుణములను చిత్రించినాడు; భావనాప్రపంచమున నాతని మిన్నుముట్టించినాడు. కాని అట్టివా రేరీ? ఏఒకరిద్దరోఉన్నను సుబ్బారావుచిత్రముతో నెంతవరకు పోలికగలిగి యుందురు వారు?

సుబ్బారావు అధ్యక్షత వహించినది'అభినవాంధ్ర కవిపండిత' సభకు. ఇందు 'కవులు', 'పండితు'లు సమానభాగస్వాములు. కవి, కవి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్త్వముల విషయమున ప్రసంగించి సుబ్బారావు పండిత,పాండిత్య విషయముల ప్రస్తావన మానినాడు. ఈపండిత, పాండిత్యవిషయములును వివాదగ్రస్తములు. కావున తద్విషయక ప్రసంగము అధికముకాదు. మీఁదుమిక్కిలి అత్యావశ్యకము. ఎట్లయిననేమి? 'అభినవాంధ్రపండితు'ల కాశాభంగమయినది.

సుబ్బారావు 'అభినవకవిసోదరుల' కొనరించిన హెచ్చరిక ఉన్నతమయినది; వారిని స్వేచ్ఛామార్గముల ద్రిప్పునది.

సుబ్బారావునేతృత్వమున 'అభినవాంధ్రకవిపండితులు' వినీతులు కాదగుదురు; అభినవాంధ్రవాఙ్మయమున కున్నతిని సంపాదింపదగుదురు.

---

## ప్ర బు ద్ధా ం ధ్ర
### (మాసపత్రిక - రాజమండ్రి)

వెనుక నాలుగేడులపాటు (నాలుగు సంపుటములు) ప్రకటితమయి ౧౯౩౪-వ సంవత్సరమున ఆగిపోయిన 'ప్రబుద్ధాంధ్ర' (అయిదవ సంపుటము తొలి సంచిక) కడచిన జనవరినెలలో మరల వెలువడినది. ఈపత్రిక కప్పుడును, ఇప్పుడును సంపాదకులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు—జగమెరిగిన బ్రాహ్మణులు; 'స్వాతంత్ర్యాన్ని అమ్ముకొనని', 'అంతరాత్మను చంపుకొన'ని, స్వ'ధర్మాన్ని విడిచిపెట్టని', 'సాధననుండి విచ్యుతుడుకాని', 'ప్రాప్యమునుండి తప్పిపోవని' సంపాదకుడు గావగిన లక్షణములు కలవారు. వివేకము, ప్రతిభ, ధైర్యము వీరి కుగ్గుపెట్టినవి. పలుకుబడిబాగును, కూరుపునేరుపును, కలఅందమును, అర్థముసామర్థ్యమును చవిగొనినది వీరి లేఖిని. ఇట్టిసంపాదకుని సంపాదకత్వమున "ఆంధ్రవికాసమే ప్రాప్యం" గాఁగల ప్రబుద్ధాంధ్ర తన "కార్యక్షేత్ర" మగు "నాంధ్రదేశమున" కెంతయైన మేలు నొనరింపవచ్చునని తలచుట పొరపాటు కాదు.

"ఈసారి యీపత్రికలో" వీరు "పద్యాలు ప్రకటించ తలచుకోలేదు." "ఇపుడు" "జనసామాన్యంలో" "విద్య", "విజ్ఞానం" "వ్యాపించు"టకు "చాలా అవసరం"గా ఉన్న "వచనవాఙ్మయం" ప్రకటింపబూనినారు. ఇది చాల మంచి పని.

అక్షరాస్యమగు నభినవాంధ్రలోకమున ననేకులు పద్యముల నల్లుచున్నారు. వానిలో భావయులు, పోకడలు సంస్కృతము, ఇంగ్లీషు, బెంగాలి, హిందీ వాఙ్మయములను తిరిపమెత్తి, దొంగిలి తెచ్చుకొనినవి. పదములు సంస్కృతసముద్రపుటంచుల నేరుకొనిన గుల్లలు. (ఈవిషయమున ఇప్పటివారిలో పెక్కురకంటె వెనుకటివారే మేలనిపించుచున్నారు.) వానిలో తెనుగుదనము సున్న. కొన్నిటికి రూపములు మొదలుకొన లేరుపడని మొండెములు. అందు కవిత్వము కానరాదు; 'కల' కల్ల. నేడు పుట్టకొక్కులవలె పుట్టుచున్న పద్యములలో నూటతొంబదితొమ్మిదిటిగతి యిట్టున్నది. ఆంధ్రకవితాలత కవి వేరుపురుగులు. వానిని ప్రకటింపకుండుటయే వాఙ్మయమునకు మహోపకారము.

గణయతిప్రాసముల దగులబడిన చెత్తపదముల ప్రోవులే 'కల'యనియు, వానిని ప్రకటింపకపోవుటచే నది రూపుమాసిపోవుననియు దురపిల్లువారు కలయొక్క స్వరూపమునే యెరుగనివారు. మానవుని సుఖమయజీవితమున కుపయోగించు విజ్ఞానమంతయు కలామయమే. సంస్కారానుగుణముగ దాని స్వరూపమును, తత్త్వమును ధీమంతులు తెలియగలుగుదురు.

ఈ సంచికకు వ్యాసములను వ్రాసినవారిలో ననేకులు తెలుగు సారస్వతప్రపంచమున పేరుమోసిన పెద్దలు. వ్యాసములలో 'శ్రీ రంగరాజచరిత్ర' అనునది వీరేశలింగముపంతులుగారి గుట్టును బయటపెట్టునది! శకపురుషునుగ నారాధింపబడుచున్న పంతులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గారే గ్రంథాపహారదోషమునకు పాలయిరి!! ఆంధ్ర జాతిని వెన్నంటిన కుఃఖ మది!!! మొట్టమొదటి నవల వీరేశలింగముగారిదేయని నమ్మియున్న యాంధ్రలోకము నకు తత్పూర్వమే ముద్రితమయిన 'శ్రీరంగరాజచరిత' మను నీనవలచరిత్ర మొక నూతనవిషయము. 'ఉత్తర రామచరితము' వెక్కిరింపు విమర్శనము. దీనివిషయము మూలానువాదముల తారతమ్యము కాదు; అనువాదగ్రంథ ము భాష. అనువాదకులు గ్రాంథికాంధ్రమునకు పట్టుగం బము; విమర్శకులు గొడ్డలిపెట్టు. ఇద్దరు పెద్దరికము పేరిమికి మురియువారే. ఇక విమర్శసొగసు ఊహా తీతము కాదు. అనువాదకుల గ్రాంథికాంధ్రము సౌష్ఠ వము జారినదని వెక్కిరించిన విమర్శకుల వ్యవహారాం ధ్రముసయితము ఒకతీరు, ఒకతెన్ను లేక తనసౌష్ఠవ మును జార్చుకొన్నది. ఇది 'సశేషము' వ్యాసము. ఇంత చిన్నపత్రికలో ఇట్టివ్యాసములను, అపయి 'సశే షము'లను ప్రకటించుట ఉచితముకాదు. 'ఈమాట నిజం'అను వ్యాసము భావగర్భముగానున్నది. ఇది బుద్ధికి పనిని గల్పించును. ఇందు నేటిపద్యముల ననేక సహస్రముల కలికమునకయిన దొరకని 'కల' ఎక్కు వగకలను, తెలిసికోగలవా రుండినచో. "జాగ్రత్తపడ వలసిన ఘట్టాలు". ఇవి మూడు. ఇట్టి 'ఘట్టాలు' ఆంధ్రులనిత్య జీవితమునననేకములు, ఎన్ని సంచికలకయిన తింపిపెట్టగలవి. ఇదియు కలకు నెలవు. మఱియు నీ పత్రికకు తక్కినవిషయములగూడ మంచిపత్రిక కుండ వలసినలక్షణము లమరియున్నవి. సంపాదకుల వ్యాఖ్యా నములు సూటిగ, సమదృష్టితో నడిచినవి. పత్రికా "ప్రకటనోద్దేశాలు" సంపాదకులు చక్కగా వివరించి నారు. ఈయెత్తుననే క్రమముగ సాగుచు నీ "ప్రబు ద్ధాంధ్ర" నిక్కముగ ప్రబుద్ధాంధ్ర కావలెను.

ఈ కరవుకాలమున పత్రికను ప్రారంభించుట ఎంతవారికయినను సాహసకార్యము. సాలుచందా ఒకరూపాయయే యగుటను జనసామాన్యమునకు దీని యందుబాటు సుకరము. కావున ఎల్లరును దీనిని పోషించుచు లాభమును పొందదగుదురు.

---

## తెలుగు తల్లిపూజ

(శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారికి సమ్మానము)

ఈనడుమనే రాజమహేంద్రవరంలో తెలుగుపెద్దలు కొందరు కలిసి శ్రీ రావుసా హెబు గిడుగు వెంకటరామమూర్తి పంతులు గారి డెభ్భయ్యోపుట్టినదినంనాడు పండుగ చేసుకొన్నారు. ఆనాడు అల్పమాత్రంగా-కమెమొరేషన్ వాల్యూము లుంచిన వెండి పెట్టె నొకదాన్ని ఇచ్చి - ఆయన్ను సత్క-రించారుకూడ, తమ కాయనచేసినమేలు అనల్పంఅయినా. శాలువలూ రెండిచ్చారు. మరేవో ఆయనవ్యాసాలూ, అవీ కలిపి వాల్యూముగా అచ్చువేశి ఇచ్చారు.

ఇటీవల కొన్నేండ్లనుంచీ దేన్నో సార స్వతశాఖనూ, దేన్నో కలాంగాన్ని ఉద్ధరించా రని తెలుగుదేశంలో కొందరుకొందరికి విపరీ తంగా సత్కారాలు జరుగుతూ ఉన్నవి. ఆ సత్కారాలకూ ఈ సత్కారానికీ విలువలో హస్తిమశకాంతరం ఉంది. ఆ సత్కారాలు ఒకసారస్వతశాఖనో, ఒకకలాంగాన్నో ఉద్ధ రించినందుకు జరిగినవి. ఈ సత్కారము సకల సారస్వతశాఖలకూ, సకలకలాంగాలకూ నిలువనీడఅయిన భాషనే ఉద్ధరించినందుకు జరిగింది. ఇది సాటిలేని సత్కారం. ఇది తెలుగుతల్లిపూజ.

ఆనాడు ఆంధ్రభాషావాగనుశాసకుడు నన్నయ్య; ఈనాడు రామమూర్తిపంతులు. వీరిరువురు పరస్పరం నిరుపములగు ప్రతి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరులు. తెలుగుతల్లి నాయన ఉరుల బిగదీసి ఆమెఉసురుల కెసరుపెట్టాడు; ఈయన ఆయన బిగించిన ఉరులను తెంచి ఆమెఉసురుల నుజ్జీవింపజేశాడు. వీరిద్దరూ తెలుగుతల్లి కనుగు బిడ్డలే. ఆయన ప్రాకృతాదులను మాయజేసి పుట్టిన సంస్కృతమశక్తికి ముగ్ధుడయి నాడు; తనతల్లినికూడ 'ఆశక్తికి దాస్యంచేయి' అని శాసించి కట్లుగట్టి పడవేశాడు. ఈయన తల్లిదయిన ఆచిరంతనదాస్యజీవితానికి తల్లడిల్లినాడు; ఆమెకు స్వేచ్ఛ సంపాదించడం కోసం పోరాడినాడు. ఆపోరాటం జయోన్ముఖం అయింది. ప్రతివీరుడి శాసనబలం కుంగింది. తెలుగుతల్లికి స్వేచ్ఛ లభించింది. చిరకాల బంధనంవల్ల బిగిసిపోయిన ఆమెసంధులకట్లు సడలుతూ ఉన్నవి. ఆమె మంచిపుంతల్లో పదాలు మెల్లగా సాగిస్తూఉంది; అందమయిన వస్తువుల నందుకోడానికి బారలు చాపుతూ ఉంది. ఇపుడు రమణీయమయిన అభినవ వ్యావహారికరూపంతో, ప్రశస్తగుణగణంతో, సరసభావాలకు స్వాగతంచెప్ప విశాలహృదయంతో 'జానుతెనుగు' త్రోవల్లో తెలుగుదేశాన యథేచ్ఛగా విహరించడం మొదలు పెట్టింది తెలుగుతల్లి. ఇది ఆమెవిజయానికి ఆరంభం. ఈవిజయం అఖండం కానుంది.

ఈవిజయాన్ని తెలుగుతల్లికి కూర్చిన వీరుడు, రామమూర్తి పంతులు, సుకృతి; తనజీవితాన్ని తల్లికోసం అర్పించిన ధన్యుడు. ఆయనకు చేసినపూజ వీరపూజ; సార్థకమయిన తెలుగుతల్లిపూజ. దీనికి విలువగట్టడానికి తెలుగుదేశంలో కలిమి చాలదు. దీనిని కొనియాడడానికి తెలుగుభాషలో మాటలు చాలవు. కాని, ఆయన కివేవీ అవసరంలేదు. అసంఖ్యాకులయిన ఆయనఅనుచరులు, ఆయనకోరి పోరి సంపాదించిన తెలుగుతల్లి స్వాతంత్ర్యాన్ని నిలుపుకొని, ఆమెవిజయరథం చక్కగా సాగిస్తే అదే ఆయనకు అనంతము; అదే ఆయనజీవితానికి పరమార్థము. అది నెరవేర్చి తెలుగువారు ఆయనఋణాన్ని తీర్చుకోవలెను.

ఈపండుగుపని తలపెట్టి పెత్తనాన్ని పూని కొనసాగించినవారు తెలుగుతల్లి శుభాశీర్వాదాలకు పాత్రులు.

---

## భారతీయార్థికమహాసభ

ఈ మహాసభ యీసంవత్సరము అణ్ణామలై విశ్వవిద్యాలయమున థాంప్సనుగారి యధ్యక్షతను సమావేశమైనది. ఇది పదునేడవసమావేశము. ఆర్థికశాస్త్రవేత్తలను భారతీయనాయకు లనేకులుకూడి భారతదేశీయార్థిక సౌభాగ్యమున కుపకరించు పద్ధతుల చక్కగ పరిశీలించిరి. వీరిసూచనలు అవశ్యము అనుసరింపదగినవి. కాని, ఏలనో యీపదునేడుసంవత్సరముల లగాయితు వీరియుపన్యాసధోరణికి కార్యరూపము గలుగలేదు. మహాసభను ఆహ్వానించినవారికి కొన్ని వేలరూప్యములు ఖర్చగుచున్నవి.

ఈ మహాసభయందు పాల్గొనినవారిలో ననేకులు ఉపాధ్యాయులు. వీరు కళాశాలలలో పాఠముల నుపన్యసించునటుల ఆర్థికసమస్యలకన్నిటికి తగుమైన విరుగుడులనే యుద్బోధించిరి. కాని వీరిబోధల పర్యవ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సానము ఫలప్రదమగునట్లు లేదు. ఆర్థికవేత్తలను దేశీయ నాయకులు వీరితో గలిసి వీరి నీతికి శేషించినదానిని వారు, వారి చేతికి శేషించినదానిని వీరు అన్యోన్యముగ పూరింపగల్గినయెడల దేశక్షేమమునకు కొరతగలుగదు. మదరాసు గవర్నరుగారును తమ ప్రారంభోపన్యాసమున మన దేశస్థితిని పరీక్షించి యిట్లుచెప్పిరి: 'ప్రపంచమునంతయు నావరించియున్న యీ ఆర్థికదుస్థితిని బాపుటకీయార్థికశాస్త్రవేత్త లేమియు చేయజాలకపోయిరి.' * * * * అయినను ఈసభవారు కొంతయైనసాధింపగల్గుదురని తెల్పిరి. ఇక సహకారోద్యమవిషయమై వారిట్లు చెప్పిరి: "మనదేశమున సహకారసమితులు అప్పుల నిచ్చునవిమాత్రమె. అట్లుకాక ఇంగ్లండునందువలె నిచటను సహకారోద్యమము సాగించినయెడల దేశాభ్యుదయము కలుగగలదు * * * *" కావున నీసూచనగైకొని యీసభవారు నిర్మాణ కార్యమునకు పూనుకొని ప్రభుత్వమువారి సాయముకోరుట తగవు. ఎవరయిన నిర్మాణకార్యమునకు పూనుకొనిన తాము వారికి సాయపడగలమని మహాసభ ప్రధానకార్యదర్శిగారు పలికిరి. అట్టిదానికి వీరే యుపక్రమించుట మేలు. దేశదుస్థితులను మాన్పుటకు ప్రభుత్వమువారి సాయము లేనిదే ప్రజాసంస్థలు ఎక్కువపనిచేయజాలవనుమాట సత్యము. కాని వ్యవసాయము, సహకారము మొదలగునవి ప్రజలచేతిలోనివి. ప్రజలకు ప్రభుత్వమువారి



ప్రొఫెసరు సి. డి. థాంప్సనుగారు (అలహాబాదు) అధ్యక్షులు.

సాయ మెంతప్రధానమో ప్రభుత్వమువారి కార్యక్రమమునకును ప్రజలసహకార మంత ఆవశ్యకము. దేశాభ్యుదయమున కిదియే మొదటిసాధనము.

జనసంఖ్యసమస్యల నీసభవారు చర్చించిరి. మన దేశమున జనసంఖ్యయు, నిరుద్యోగమును నానాటికి హెచ్చుయిపోవుచున్నవి. జనసంఖ్యాభివృద్ధి నరికట్టుటకన్న ఉద్యోగములులేనివారికి జీవనోపాయముల గల్పించుట మేలనువిషయ మీసభ యామోదించినది. కావున సంపన్నులిందులకు పూనుకొని వృత్తివిద్యల కవకాశములు గల్పించి దేశమందలి నిరక్షరత్వమును బోగొట్టవలయును.

సహకారోద్యమమును గురించి చర్చజరిగినప్పుడు మనదేశమందలి సహకారసమితు లెట్లున్నవి యనువిషయము జ్ఞప్తికి తెచ్చుకొనవలసి యున్నది. భారతదేశమున సహకారోద్యమము దినదినప్రవర్ధమానమగుచున్న విషయము సత్యము కాని, యార్థికముగ నీయుద్యమము మన కేపాటియు ఉపకరింపలేదు. వడ్డీవ్యాపారము చేయు బ్యాంకీలకన్న నెక్కువపని యీయుద్యమము ఏమిసాగించినది? ప్రభుత్వమువారికే యీయుద్యమముపట్ల సవతితల్లిప్రేమయని కొందరినిశ్చయము. కర్షకులకు వ్యవసాయమునిమిత్తము అప్పులనిచ్చి దానిని వృద్ధిచేసిన దేశమునకు సౌభాగ్యము కలుగగలదు. ప్రస్తుతము సహకారోద్యమము మన కీపాటి సాయమైన చేయజాలదా!

యుద్ధానంతరము ప్రపంచమందు ధనాభావము హెచ్చయినది. ఇందువలన భారతదేశము మరింత క్రుంగిపోయినది. అంతర్జాతీయవాణిజ్యము మొదలగు సంబంధములందు ప్రపంచాభ్యుదయమును ప్రధానముగ గణింపక ప్రతిదేశమువారును స్వార్థపరు లగుచున్నారు. అన్ని దేశములవారికిని అనుకూలమగు నాణెములప్రమాణము కుదురలేదు. ధనమునకు రెండర్థముల జెప్పవచ్చును. విలువప్రమాణమును నిరూపించునది యొకటి. క్రయవిక్రయాదులయందు సాధనమగునది మరియొకటి; ఒకరికి మరియొకరు నూరురూపాయల నివ్వవలసినపుడు నూరురూపాయలవిలువగల వస్తువుల నిచ్చి ఋణము తీర్చు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొనవచ్చును, లేదా అంతకిమ్మత్తు చేయు పనియైన చేయవచ్చును.

ఇపుడు ప్రభుత్వమువారు సాగించుకొన్ని పనులు, రోడ్లు, వంతెనలు, చెరువులు మొదలయిననానిని ప్రజలకే వదలివేసిన కొంత నిరుద్యోగము నశించునని యొకరి భావము. ఇందువలన ధనముకూడ నిలవచేరగలదు.

ప్రస్తుతము మనదేశమును తటాలున ఆర్థికముగ అభ్యున్నతస్థితికి తెచ్చుటకష్టము. రష్యాలోవలె అయిదు సంవత్సరముల ప్లానో, మరియేదియైన ఉపాయమునో వెదుకవలయును. దీనికయి దేశస్థితిని చక్కగపరిశీలించవలయును. ఇచ్చట ఉత్పత్తియగు పదార్థములయు, వ్యవసాయముయొక్కయు, మనవారి ధనముయొక్కయు స్టేటిస్టిక్సు కావలయును. ఇవన్నియు సేకరించినను ప్రభుత్వమువారు విశ్వవిద్యాలయముల ఆర్థికశాఖలవారికి సాయము చేసిఈసభవారిసహకారము నపేక్షింపనియెడల నిట్టికార్యము దుస్సాధ్యమగును. కాబట్టి అన్నిటను ప్రభుత్వమును, ప్రజలును ఏకము కావలసియున్నది. అది లేనపుడు నిర్మాణకార్య మసాధ్యమని యీసభవారి యభిప్రాయము.

కార్యనిబంధనకు వ్యవసాయము మూలసాధనము కాన దేశనాయకు లీవిషయముల గమనించి దేశాభ్యుదయము కూర్తురుగాక!

---

## సంగీతపరిషత్తు, చెన్నపురి

(సప్తమమహాసభ - ౧౯౩౩)

ప్రకృతి సౌందర్యసమంచితము. తత్సౌందర్యమే కల. అది ఏకైకము; అవ్యక్త మధురము.

సౌందర్యోపాసకుడగు మానవుడు స్వప్రతిభాజన్యమగుసంస్కారము నాధారము చేసికొని. అవ్యక్తమగు తత్కలామాధుర్యమును సువ్యక్తము చేయగలిగినాడు; తా నానందించినాడు; తోడిమానవు నానందింపజేసినాడు. ఇట్లు కలామయమయిన ప్రపంచ మానందమయ మయినది; మానవజీవితము (ఐహికమానసికముల రెంటిని) నానందమయము కావించినది.

ఆనందమయమయిన ఈ ప్రపంచము దుఃఖమయమని ప్రకృతిపరిణామజ్ఞానశూన్యుడగు మానవుడు విలపించుచున్నాడు. దుఃఖము వ్యష్టిగతము; సావధికము. ఆనందము సమష్టిగతము; నిరవధికము. సావధికమగుదుఃఖమును కూలారిచి నిరవధికమగు నానందమును ప్రసాదించు దివ్యశక్తి కల యందు పరిపూర్ణమయియున్నది.

కలకు ఆశ్రయమునుబట్టి వైవిధ్య మేరుపడినది; అభిరుచిని బట్టి తరతమభావము తారసిల్లినది. కాని, దాని ఏకత్వమునకు సంచలనము లేదు; దానియుత్తమత్వమునకు వినాశము లేదు. దాని పరమార్థమగు నానందజనకతకు భంగపాటు లేదు.

ఏకైకమగుకల వైవిధ్యమువలన 'ననేకము' లయినది; ఆయనేకములలో నేకము గానకల; అన్యతమము నాట్యకల. గానకల 'లలిత'ము; నాట్యకలయు 'లలిత'ము. ఇవి పరస్పరము సంబంధ సాధర్మ్యములుకలవి. అన్యోన్యాశ్రయమున వీని లాలిత్య మాధుర్యము లనంతగుణితము లగును. (కారణపరిగణన మటుండుగాక, వీని కర్వాచీనయుగముల ప్రచారము మందగించినది. ఈ యుభయ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలాభివృద్ధికి సంతరాయముల నేకములువాటి ల్లినవి. అందు నాట్యకలస్థితి యధమాధమము. ఇంతేకాదు: ఏతత్కలోపాసకులయెడ నాదరప్రతిపత్తులు శుష్కించి నిరసన మంకురించినది. తదుపాసనము సంఘబహిష్కారమునకును గురియయినది.

ఇట్లు కృశములయి వినాశోన్ముఖములగుచుండిన గాన, నాట్యకలల ఉద్ధరణ, పోషణ ప్రచారములకొరకు ఏడేడులనాడు చెన్నపురమున సంగీతపరిషత్తు జన్మమెత్తినది. ఆరేడులు నిరామయజీవితమును గడపి అనుదినాభివృద్ధిని గాంచుచున్నది; ఏటేట పండువులు, పబ్బములు జరుపుకొనుచున్నది; తన కలాకాంతులను నానాదేశముల ప్రసరింపజేయుచు కలాప్రపంచము నుద్దీపింప జేయుచున్నది. ఇది యిట్లే చిరంజీవమయి వెలయుగాక!

ఈపరిషత్తు సప్తమ వార్షికోత్సవమహాసభ మొన్న జరిగినది. ఆమహోత్సవమును సర్ సి. వి. రామన్ మహాశయుడు ప్రారంభించినాడు. ఆయన విజ్ఞానఖని; దక్షిణభారతమాత కడుపుచల్లగా గనిన పుత్త్రిరత్నము. ఆయనకు జ్యోతిస్సు, నాదము నిత్యోపాసనావిషయములు. వానితత్త్వమును పరిశీలింప న్నాప్రతిభాశాలి కావించిన పరిశోధనము, వాని యద్భుతశక్తిని ప్రదర్శించి తద్విషయకవిజ్ఞానమును మరికొన్ని మెట్టులు దాటించినది. తన్మూలమున ప్రపంచము ముగ్ధమయినది. ప్రపంచవిఖ్యాతవైజ్ఞానికులలో నాయనకు నుత్తమపదము ఏరుపడినది. ఆ నాదోపాసకుడు నాదాత్మక గానకళాపోషణమునకయి జన్మించిన యీ సంగీతపరిషత్తును వాత్సల్యముతో దీవించి మహోత్సవమును ప్రారంభించుట దానిభాగ్యవిశేషము.

ఈ మహోత్సవమహాసభకు అణ్ణామలై సంగీతకళాశాలాధ్యాపకులు విద్వాన్, శ్రీ కే. పొన్నయ్యాపిళ్ల అధ్యక్షుడు. ఈయన సంగీతశాస్త్రవేత్త; గాయకశిఖామణి. నాట్యకళవిషయమున ఈయన 'భరత' శబ్దమున కర్థము భావరాగతాళములని. భరతశాస్త్రము అనాదిసిద్ధము. కాని యదియిపుడు చాల అధోగతిపాలయియున్నది. సంగీతాంగములన్నింటను నృత్యము చాల ఆకర్షకమయినది. అది చిత్తమును రంజింపజేయును. అరువదినాలుగు కళలలో నది యొకటి. ప్రస్తుతపుపోకడలనుబట్టియు, లక్ష్యమునందలి మార్పులనుబట్టియు దానిని ప్రోత్సహింపరాదని కొందరందురు. ఇది తప్పని నా యభిప్రాయము. కొంతమంది కళాభ్యాసకులు తగినవారు కానందున శాస్త్రమే యనర్థదాయకమని చెప్ప వీలుపడదు. ఈకళ రాజాస్థానములయందు, దేవాలయములందు ప్రోత్సహింపబడుచున్నది. సన్న్యాసులుకూడ దీనినుపాసించి యానందించుచున్నారు. ఇక ఇది సామాన్యులకు ఎంత ఆనందమును కూర్చునో చెప్పజాలము', అని నుడివిన వాక్యములు నాట్యకళయెడ నాధునికులకు గౌరవమును పెంచునవియే కాక, ఆయన నాట్యకళా రహస్యజ్ఞతను తెలుపుచున్నవి.

మహోత్సవము పండ్రెండు దినములు నడచినది. యథాపూర్వము సాయంకాలముల ప్రవీణుల 'జంత్రగాత్ర' వాదనగాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములును, భరతనాట్యాభినయప్రదర్శనము లును జరిగినవి. కలాభ్యుదయమున కుపక రించు విషయము లనేకములు సిద్ధాంతీక రింపబడినవి. ఇది కారణముగా ప్రజాసామా న్యమునకు నాట్యగానకలలయెడ నాదరాభి మానములు కుదిరి ఎదుగుచున్నవి. ఊరుపే రులు లేక మారుమూలలయం దణగియుండిన మహావిద్వాంసు లనేకులు ముందునకువచ్చు చున్నారు; పేరుప్రతిష్ఠలను బడయుచున్నారు. ఉదయవేళల శాస్త్రచర్చలు, 'జంత్ర' వాద నసామర్థ్యపరీక్షలు సాగినవి. పరీక్షలయందు కృతార్థులయినవారును, కళాకోవిదులును బహూకృతులయిరి.

పరిషత్తు స్వసంకల్పానురూపముగ సంగీ తకలావ్యాప్తి కింకను అనేకవిధముల కృషి చేయుచున్నది. నగరమున నెలకొనిన పాఠ శాలలయందు పలువురు స్త్రీ పురుషులు గాన కల నభ్యసించి కౌశలమును గడించుచున్నారు. ౧౯౩౧-వ సంవత్సరమున పుట్టిన ట్రెయి నింగుకలాశాల సంగీతకలాబోధకులను ఉత్త రోత్తరవృద్ధిగా తయారుచేయుచున్నది. శాస్త్ర జ్ఞులు శాస్త్రతత్త్వము నుపన్యాసములమూల మున విశదీకరించుచున్నారు. 'జంత్రగాత్ర' ప్రావీణ్యమును పరీక్షించియు, గేయముల రచియింపించియు, ప్రశస్తి ననుసరించి నిపుణు లకు సత్కారప్రోత్సాహములు సమకూర్ప బడుచున్నవి. చెన్నపురి విశ్వవిద్యాలయము వారు సంగీతమున పట్టపరీక్షలను ప్రారంభించి నారు.

నాట్యకలయెడ మూడేండ్లనుండి ఎక్కు వశ్రద్ధను వహించి పరిషత్తు దాని నభివృద్ధి చేయుచున్నది. అభినయప్రదర్శనములవలన ప్రజలకు దానియందుగల నిరసనభావము తగ్గు చున్నది. దానిని నిపుణమతులు పలువురు మెచ్చుకొనుచున్నారు. ఇది తదభ్యుదయ మున కుపలక్షణము.

గాన నాట్యకలలకుసంబంధించిన ప్రాచీన నవీనసాహిత్యమును పరిషత్పత్రిక ఆంగ్లము నను, సంస్కృతమునను, తమిళమునను ప్రక టించుచున్నది. చతుర్దండిప్రకాశిక- సంస్కృ తము, సాంగ్లానువాదము- ముద్రితమయినది. సంగీతసుధను (సంస్కృతము - ఆంగ్లానువా దసహితముగ), అభినయసార సంపుట మను తమిళగ్రంథమును ముద్రితము లగుచున్నవి. కాని ధనాభావము కారణముగ పత్రికాప్రక టనము మిక్కిలి ఆలస్యమగుచున్నది.

ధనాభావ దౌర్బల్యమును పరిషజ్జనకులు శ్రీ డా. యు. రామారావుగారు

"పరిషత్తు శైశవదశ నున్నది. దానివృద్ధికి ప్రజాదరణ మావశ్యకము. దానికి ధనము చాల స్వల్పముగ నున్నది. సొంతవసతి లేదు. ధనాభావమువలన పరిషత్తు నిర్వహింపవలసిన కార్యములు సాగకున్నవి."

అని తెలుపుచు దేశమున దండిగాగల మహా రాజులు, రాజులు, జమీందారులు, మిరాశి దారులు, వర్తకులు మొదలగువారి నందరిని పరిషత్పోషణమునకు తోడ్పడుడని వేడుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నారు. వారివేడికోలు అవశ్యము మన్నింపవలసినది.

కలాభివృద్ధికి కలాశాల లన్నింటను ఈ రెండుకలలకు స్థాన ముండవలెను. అందుకు ప్రైమరి, సెకండరి, శిక్షణము ఆవశ్యకము. అట్టి శిక్షణము జిల్లా, తాలూకాల బోర్డులు (ఉన్నంతవరకు) మునిసిపాలిటీలు నడుపుచున్న పాఠశాలలలో జరుగవలెను. దానికిపు డవకాశము లేదు. అట్టి అవకాశము త్వరలో లభించుటకు, కలాభిమాను లగు ప్రజాప్రముఖులు అనూనముగ ప్రయత్నింపవలయును.

విశ్వ విద్యాలయమువారు సంగీతోపాధ్యాయుల నిర్ణయమున రామరావుగారి సూచనల ననుసరించుట న్యాయ్యము.

నాట్య గానకలలు శరీరమున కారోగ్యమును, మనస్సున కానందమును గలిగించునవి. కావున వీనియభివృద్ధి ప్రచారములు మానవ సామాన్యజీవితమునకు పరమావశ్యకములు. అందుకొఱకు కృషిచేయుచున్న సంగీతపరిషత్తు అభ్యుదయమునకు కారణము శ్రీ డా. యు. రామరావుగారు. వారి పరిశ్రమకు మూల్యము నిర్ణయించుట అశక్యము. ఇక నభినందనాదులు వారియెడ కేవలము భూటకపు పొగడ్తలు కాగలవు.

**యశశ్శరీరులు ఎ. రంగస్వామి అయ్యంగారు అశ్రుబిందువులు**

మరియొక విషాదవార్త! ఈ ౫-వ తేది యుదయము హిందూపత్రికా సంపాదకులు రంగస్వామయ్యంగారు వైకుంఠధామమున కేగిరి! వారి మిత్రవర్గమునకు, బంధువులకు, దేశమునకు హృదయవిదారణము! పత్రికాప్రపంచమున కిది మరియొక, విరుగుడులేని యాఘాతము. దేశమునకు తీరని లోటు.

న్యాయవాదవృత్తిని వదలుకొని అయ్యంగారు సుమా రిరువదియైదేండ్లపాటు పత్రికానిర్వహణమున మెలగి, మించిరి. హిందూపత్రికయొక్క నేటి ప్రతిష్ఠకు, వికాసమునకు వీరి యాలంబనము కారణము. రాజకీయ వ్యవహారములందును వీరి ప్రతిభ దేశీయ, విదేశీయనాయకుల మన్నన లందుకొన్నది. భారతశాసనసభయందును, ఇతర రాజ్యాంగ వ్యవహారములందును వీరు పండితమోతీలాలు నెహ్రూగారికి కుడిభుజముగనుండి, వారికి మిక్కిలి కూర్చినవారైరి. కాంగ్రెసున వీరి సలహాలకు చాలమదింపు ఉండెడిది. ఇట్టి ప్రతిభాశాలి దేశసేవకుని మరణమున దేశమునకు, వార్తా పత్రికలకును అంతులేని నష్టము కలిగినది.

ఆయనగతించినాడు. అంతే. ఆయన మిత్రులు, బంధుగులును ఊరడిల్లవలయును. భగవాను డాయనయాత్మకు శాంతిని గూర్చుగాత!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సాభిప్రాయ విశేషములు

భగవల్లీలావిలాసములు విచిత్రములు, దుర్గ్రాహ్యములు. అఖండమైన బ్రహ్మాండ మనవరతము ఖండరూపములను, పరివర్తన మును పొందుచు విశ్వపరిణామము గలుగు చున్నది. విశ్వపరిణామమునందు వృద్ధిక్షయ ములు, సృష్టిలయములు, లాభనష్టములు, సుఖదుఃఖములు సాపేక్షములు కాని నిర పేక్షములు కావు. విశ్వపరిణామలక్షణము లైన సాపేక్షావస్థ లుభయసంభ్రమములను గలుగజేయుచున్నవి. విశ్వపరిణామమునకు సృష్టియందు ప్రళయము, ప్రళయమునందు సృష్టి సహజావస్థలు. విశ్వపరిణామమునందు సృష్టిప్రళయములు సహజావస్థలైనను కార్య కారణ నిరూపణము దుర్లభమై పండితులకును భయసంభ్రమములను గలుగజేయుచున్నవి.

శ్రీముఖసంవత్సర పుష్య బహుళ అమా వాస్య సోమవాసరమున హిందూస్థానము నందు గలిగిన భయంకరమైన భూకంపము భయసంభ్రమములనుగలుగజేసినది. భూకంప ప్రళయమునందు ధర్మాత్ములు ధర్మగ్లానిని, పుణ్యాత్ములు పాపఫలమును, సుకృతులు దుష్కృతపరిణామమును, అనుమానావలో కనమును జేయుట ప్రపంచమునకు పరిపాటి యైన విషయమయినను కార్యకారణనిరూప ణము దుస్తరముగ నున్నది. భూకంపశాస్త్ర జ్ఞులు నవీననిర్మాణములైన హిమాలయపర్వ తములందలి భారప్రభావము భూకంప కారణ ముగ నిర్ణయించుచున్నారు. జనవరి ౧౫-వ తేది మధ్యాహ్నము ౨-౩౦ వేళను మూడు నిమిషములకాలము కరాచినుండి కలకత్తావర కును, డార్జిలింగునుండి హైదరాబాదువర కునుగల భూఖండము నటరాజమూర్తి ప్రళ యతాండవమునకు రంగమైనది. ముఖ్యము గను బీహారురాష్ట్రము ప్రళయతాండవ ఫలము ననుభవించినది.

బీహారునందు గంగానది కిరు ప్రక్క లను ౧౨౦ మైళ్ల పొడవును ౬౦ మైళ్ల వెడలుపును గల ప్రదేశము భూకంపదుఃఖ వేదనకు గురియైనది. భూభాగములు జల మయములైనవి. జలాశ్రయములు భూభాగ ములైనవి. నూతులు పూడినవి. పంటచేలు మట్టితో పూడినవి. చెఱకుచేలు చెడిపోయి నవి. యంత్రాలయములు పాడైనవి. వేల మందిజనులు మృతినొందిరి. వేలమందిజనులు క్షతగాత్రులును,వికలాంగులును నైరి. లక్షల మంది నిరాశ్రయులైరి. గ్రామములు, పుర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు తారుమారయినవి. భూకంపానంతరము కురిసినవానలు నిరాధారులైన ప్రజలను వ్యాధిగ్రస్తులను చేసినవి. భూకంపము గలిగి మూడువారములు గడిచినను కలిగిన నష్టమును నిర్ణయించుట దుస్తరముగనున్నది.

ఒకకోటిమంది జనులు అన్నవస్త్రములు లేకను నిరాశ్రయులై అష్టకష్టముల ననుభవించుచున్నారు. ఆపన్నులయిన ప్రజలను జాతిమతకులభేదములను విడిచి యుద్ధరించుట సకలజనులకును పరమధర్మముగ నున్నది. ఆపన్నుల నుద్ధరించుటకు దానధర్మములను నభ్యర్థించుచు శ్రీజార్జి చక్రవర్తి, గవర్నరుజనరలు, గవర్నరు, రాజేంద్రప్రసాదు, జవహరిలాలు నెహ్రూ, గాంధిమహాత్ముడు మొదలగు నధికారులును, నాయకులును చేయుచున్న ప్రార్థనలు సకలజనాదరణమునకు సకల విధములను పాత్రములుగ నున్నవి.

* * * *

## ఆపన్నులు - దానధర్మములు

ఆపత్కాలమునందు స్థలభేదములు, జాతిభేదములు, మతభేదములు, కులభేదములు, దశాభేదములు సమసిపోవుట ప్రకృతిస్వభావము. బీహారురాష్ట్రమునం దధికారానధికారు లాపన్నుల నుద్ధరించుటకు కలిసి పని చేయుచున్నారు. మహారాజులు నిరుపేదలు, పండితులు పామరులు, స్త్రీలు పురుషులు, వృద్ధులు బాలురు జాతి మత కుల స్థల భేదములను విడిచి ఆపన్నుల నుద్ధరించుటకై చేయుచున్న దానధర్మాదిసహాయములు ప్రశంసాపాత్రము లైనను కార్యనిర్వహణమున కల్పములుగ నున్నవి. మహారాజు లిచ్చెడి లక్షలువలెను సామాన్యు లిచ్చెడి రూపాయలును ప్రశంసాపాత్రములై ఆపన్నుల ఉద్ధరణమునకు వినియోగపడుచున్నవి. భూకంపసహాయనిధికి హిందూపత్రికయందు ప్రచురింపబడుచున్న చందాపట్టీలు ప్రజలు పంపుచున్న విశాలమ లీ పరమార్థమును వెల్లడిచేయుచున్నవి. గాంధిమహాత్ముడు బాబురాజేంద్రప్రసాదుగారి ప్రార్థన ననుసరించి, విదేశములందలి భారతీయులకును విదేశీయులకును పంపిన క్రింది విన్నపము సకల జనులకును నాదరణీయముగ నున్నది.

"భూకంపపరిహారమునకై విదేశములకు, ముఖ్యముగ విదేశములందున్న భారతీయులకు మీరు సమ్మతిపడినయెడల విశాలములకై విజ్ఞప్తి గావింపవలసియున్నది. బీహారురాష్ట్రమును మరల పూర్తిగ నిర్మించవలసి యున్నది. దీనికి కోట్లకొలది సహాయమవసరము. వేలకొలది జనము దుర్మరణముపాలయిరి. లక్షలకొలది నిలువ నీడలేకయున్నారు. మాంఘీరు, ముజఫర్పూరు, దర్భంగ, మోతీహారి, సమస్తిపూరు, సీతామారి, మధుబాని పట్టణములు నేలమట్టమయినవి. పాట్నా, చోప్రా, భగల్పూరుపట్టణములందును వందలకొలది యిండ్లు కూలిపోయినవి. వేలకొలది కూటిపోవు దశలోనున్నవి. భూమిపగిలి గంధకపు నీరు ఉబికి పంటలనన్నింటిని ముంచివేసినది. పొలములపై యిసుక దిబ్బవేసినది. మరికొన్ని ప్రదేశములు నీటిమయముగ నున్నవి. బావులు పూడిపోయి త్రాగుటకు తగిననీరు లేకున్నది. చక్కెరమరలు చాల పాడయినవి. లక్ష యెకరముల చెరకుతోట పంటకువచ్చి నిష్ప్రయోజనమగుచున్నది. వెంటనే ప్రతిక్రియలు చేయనియెడల ఆపంట దక్కదు."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అను రాజేంద్రప్రసాదుగారి విజ్ఞప్తిని నేను మనఃపూర్వకముగ పునరుద్ఘాటించుచున్నాను. ప్రపంచమందు ఎచ్చట నెలకొనియున్నను భారతీయులు తమశక్తివంచన లేక సాయపడవలసియున్నది. ముఖ్యముగ ఆఫ్రికా దేశములో గల నాపూర్వసహచరులును, మిత్రులును తప్పక సహాయపడుదురని నమ్ముచున్నాను. జపాను, ఇంగ్లాండు, ఐరోపా, అమెరికాలందు గల భారతవర్తకులును, ఇతరసంపన్నులును భూరివిరాళము లొసగవలయును. మనతరములో భారతదేశమునకు ఇంతటి బీభత్సము కలిగియుండలేదు. పరదేశీయులను ధనసహాయము జేయుమని అడుగుటకు నేను సామాన్యముగ జంకుచుందును. ఇది అహంకారమువలన కాదు. ఉచితానుచితవిచారమే దీనికి కారణము. అయినను బాబు రాజేంద్రప్రసాదుగారి సూచన ననుసరించి ఐరోపా, అమెరికా, ఆఫ్రికా ఖండములందును, ఇతర భూభాగములందును గల మిత్రులు స్వదేశపరదేశభేదము లేక మానవసంక్షోభము వారించుటకు యథాశక్తిని సహాయము చేయవలె నని విజ్ఞాపించుచున్నాను. విరాళములను రాజేంద్రప్రసాదు, పాట్నా యనిగాని, నాపేరిట మన్యారాష్ట్రములోనివార్ధాకుగాని పంప ప్రార్థితులు."

* * * *

## ఆంధ్రుల కర్తవ్యము

శ్రీ బాబురాజేంద్రప్రసాదు, గాంధిమహాత్ముడు, చక్రవర్తి, రాజప్రతినిధి మొదలగువారి విన్నపముల నాదరించి ఆపన్నులకు యథాశక్తిని సహాయముచేయుట ఆంధ్రులయాత్మగౌరవ రక్షణమున కవసరముగ నున్నది. ఆంధ్రరాష్ట్రము సంపన్నరాష్ట్రము గాకపోయినను యథాశక్తిని ధర్మనిర్వహణమును చేయవలసియున్నది. అధికారులు, స్థానికసంస్థల నిర్వాహకులును వైస్రాయినిధికి ధనమును పంపునటులు ప్రజలును రాజేంద్రప్రసాదుగారినిధికి సహాయముచేయుట శ్రేయస్కరము. ఈరెండునిధులం దేనిధికి దానధర్మములను చేసినను చేయవచ్చును. రాజేంద్రబాబు, పండిత జవహరిలాలునెహ్రూ, గాంధిమహాత్ముడు మొదలగు నాయకులు స్వదేశీయులకును, విదేశీయులకును జేయుచున్న విన్నపముల నాంధ్రమహాజనులును యథాశక్తి నాదరించి దానధర్మములను చేయుదురుగాక! సహాయమును పాట్నాయందు రాజేంద్రప్రసాదుగారికి గాని, ఆంధ్రపత్రికకు గాని పంపవచ్చును. గాంధిమహాత్ముడు చేయుచున్న హరిజనధర్మయాత్రకు భూకంపవ్యవహారములు కొంతవరకు ప్రతిబంధకములై నిందలకు పాలైనను మహాత్ముడు సంకల్పించిన హరిజనయాత్రానిర్వహణమె సముచితముగ నున్నది. ధర్మాత్ముడైన గాంధిమహాత్మునకు భూకంప దుఃఖానుభవమునందు పాపపరిణామము గోచరించుచున్నది.

* * * *

## హరిజన ధర్మయాత్ర

గాంధిమహాత్ముడు గతించిన 70 దినములందును చేయుచున్న హరిజనధర్మప్రచారము కేవలముహరిజనప్రచారమున కేకాక మానవధర్మప్రచారమునకును వినియోగపడుచున్నది. మానవధర్మమును జాతికులభేదములు, హెచ్చుతగ్గులు, మతభేదములు ధ్వంసము చేసినవిధమును ప్రపంచచరిత్ర లనంతముఖములను బోధించుచున్నవి. పేరునకు బానిసతనము పోయినను వ్యవహారములందు బానిస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తనము ప్రత్యక్షమగుచు ధర్మవికాసమును దుర్లభము చేయుచున్నది. అంటరానితనము హిందూమతమునకే కాక మానవత్వమునకె కళంకమునుగలుగజేయుచున్న విధమును హరిజనుల దుర్భరస్థితి విశదము చేయుచున్నది. సనాతనులమత మెటులున్నను ప్రజాభిప్రాయము హరిజనోద్ధరణమున కనుకూలముగనున్న విధమును గాంధిమహాత్ముని హరిజనయాత్ర సహస్రముఖములను బోధించుచున్నది.

హిందూమత సంప్రదాయములను బాగుగ పరిశీలించినపుడు అంటరానితనము శాశ్వతముగను నిలిచియుండలేదని విశదమగుచున్నది. విదేశీయపరిపాలనము అంటరానితనమును నిర్మూలము చేయుటకువలెను నిలుపుటకును వినియోగపడినది. అంటరానివారు మహమ్మదీయులును, క్రైస్తవులును నైనపు డంటరానితన మంతరించుచున్నది. రాజకీయకారణము లంటరానితనము నంతరింపజేసినను సాంఘికమతకారణము లంటరానితనమును స్థిరతరము చేసినవి. హిందూస్థానమునందలి 5 కోట్ల యంటరానివారును హిందూమతసంఘములకును హిందూస్థానమునకును కళంకమును గలుగజేయుచున్నారు. దక్షిణహిందూస్థానమునందు, ముఖ్యముగను మలయాళమునం దంటరానితనము, చూడరానితనము, చేరరానితనము మానవధర్మమును హేయము చేసినవిధమును నాయాడుల దుర్భరదురవస్థ విశదము చేయుచున్నది.

అంటరానితనమును నిర్మూలము చేయుట కంటరానివారలకు గల ప్రతిబంధకములను తొలగించుట యథార్థమైన సాధనము. భారతశాసనసభయం దంటరానితనమును తొలగించుటకు యం. సి. రాజాగారు ప్రతిపాదించిన శాసనమును న్యాయాంగమంత్రియును నితరులును నాక్షేపించుటయును, ప్రతిఘటించుటయును నసమర్థతకువలెను కార్యనిర్వహణమునకు నిదర్శనము గాదు. అంటరానితనము మతమునకును, సంఘమునకును, దేశమునకును కళంకదాయకమని సంస్కారులవలెను సనాతనులును నంగీకరించినను తత్సాధనమైన శాసననిర్మాణమును ప్రతిఘటించుట యసంగతము. సనాతననాయకులు కృష్ణమాచార్యులుగారును, వారి యనుచరులును రాజకీయములకును, శాసనమునకును సంబంధమును గల్పించుటయును, గాంధిమహాత్ముని నాక్షేపించుటయును వారి సంకల్పసిద్ధికైనను సాధనము గాదు. బాల్యవివాహములను, సహగమనమును నాపుటకు శాసనసభకు నిర్మాణాధికార మున్నపు డంటరానితనమును మాన్పుటకేల యధికారము లేదో దురూహముగ నున్నది. శాసనప్రతిపాదకులును సమర్థకులును నగు రాజా, రంగయ్యరు, గారుగారలు మొదలగువారు కోరునటులు శాసనమును సెలెక్టుకమిటీకి పంపుటకు బదు లభిప్రాయములను గన్గొనుటకు పంపుట కాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హరణమునకువలెను కార్యసిద్ధికి సాధనము గాజాలదు.

అంటరానితనము విషయమై ప్రజాభిప్రాయమును మహాత్ముని హరిజనయాత్ర చెప్పకయే చెప్పుచున్నది. హరిజనయాత్రయందు ప్రజలు చూపుచున్న యుత్సాహము, మహాత్మునకు సమర్పించుచున్న కానుకలు, సమ్మానములు, స్వాగతములు ప్రజాభిప్రాయమునకు నిదర్శనములు. హెయిగుగారు ఆగష్టు 1 వ తేదీ లోపలను ప్రజాభిప్రాయమును గనుగొనుటకు శాసనము ప్రకటింపవలయునని కోరుటయును, శాసనసభ దీనినంగీకరించుటయునుసభావ్యవహారముల కనురూపముగ నున్నది. ప్రజలు వారి యభిప్రాయములను వెల్లడిచేసి హరిజనోద్ధరణమునకు శాసనసహాయమును చేయబూనుట సనాతనసంస్కారుల సంకల్పసిద్ధికి యథార్థసాధనము. గాంధిమహాత్ముని హరిజనయాత్రనీఫలసిద్ధికి వినియోగించుటకై సంస్కారపరాయణులు పనిపూనుటయును కార్యసిద్ధికి ప్రయోజనకరము. గాంధిమహాత్ముని ధర్మోపదేశములు ప్రపంచవ్యాప్తమైన ధర్మసంరంభమునందు హరిజనోద్ధరణమునకువలెను మానవధర్మోద్ధరణమునకును వినియోగపడగలవు.

* * * *

ధర్మసంరంభము

ప్రపంచవ్యవహారములందు సకలరంగములందును ధర్మసంరంభము ప్రళయాకారమును దాల్చుచున్నది. ఆర్థికసాంఘికమతరాజకీయరంగములందు ప్రవర్ధమానంబగుచున్న సంరంభము భయంకరరూపమును దాల్చుచున్నది. ఈ భయంకరసంరంభమునందు బలహీనములైన పరాధీనరాజ్యముల గతి దురూహ్యముగ నున్నది. ఆర్థికనిర్ణయములందు ప్రవర్ధమానమగుచున్న యహమహమిక మానవధర్మమును లుప్తము చేయుచున్నది. ఆర్థికసంరంభము సువర్ణసంరంభముగను, సుంకముల సంరంభముగను, వ్యాపారపరిశ్రమసంరంభముగను పరిణమించుచు సంగ్రామబీజములను పోషించుచున్నది. పాశ్చాత్యరాజ్యము లుపక్రమించిన సువర్ణసంరంభ పరిణామ మర్థశాస్త్రజ్ఞులకును దురూహ్యముగనున్నది. గ్రేటుబ్రిటను ప్రారంభించిన ఆర్థికవిధానమును జపాను, జర్మనీ, అమెరికారాజ్యము లవలంబించి బ్రిటిషు సంకల్పమును విఫలముచేసినవి. అమెరికారాజ్యము ప్రపంచమునందంతటను బంగారమును కొనుట కుపక్రమించి బంగారు ధరను తులము రూ. ౩౪-౧౦-౦ లకు పెంచినది. డాలరు ధరను మార్చుటవలనను అమెరికారాజ్యాదాయమునందు లోటుపోయి నిలువ తేలినది. మార్చిమాసాంతమువరకును యూరపునుండి అమెరికాకు పోయెడి స్టీమరులన్నిటియందును బంగారుఎగుమతుల కేర్పాటులు జరిగినవి. ఈయేర్పాటులవలనను అమెరికాయందు వస్తువులధరలు౧౦౦-కి౭౦వంతునపెరిగినను బంగారము ధర ౧౦౦-కి ౫౦ వంతునను, పెరిగినది,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అమెరికాబంగారమునువిశేషముగనాకర్షించుటవలనను యూరపురాజ్యములందు,ముఖ్యముగను గ్రేటుబ్రిటనుఫ్రాన్సులం దార్థికవ్యవస్థలు తారుమారైనవి. గతించిన రెండేండ్లయందును హిందూస్థానమునుండి యూరపురాజ్యములకు ౧౭౦. కోట్ల రూప్యముల బంగార మెగుమతియైనది. ఆర్థికసంరంభమునందు స్వతంత్రరాజ్యములన్నియును ఆత్మరక్షణముకొరకు తీవ్రమైన సుంకములసంరంభము నుపక్రమించినవి. ఈయసాధారణమార్గములు దేశక్షేమమునకు నిరర్థకములై వివిధరాజ్యములందును సంకుచితమును,స్వార్థపరమును నైన నిరంకుశవిధానములు ఫాసిసిజము, నాజిజము, రూజ్వెల్టిజము, సోవెటిజము మొదలగురూపములను ప్రళయతాండవమును జేయుచున్నవి. బ్రిటిషురాజ్యాధికారు లీసందిగ్ధావస్థయందును సామ్రాజ్యాభిమానపరవశులై స్వధర్మనిర్వాహణమును జేయజాలకుండుట దురదృష్టము. బ్రిటిషువ్యాపారపరిశ్రమలు క్షీణించుచున్నవి. నిరుద్యోగుల సంఖ్య ౨౩,౮౯,౦౦౦ లకు పెరిగినది. ఆర్థిక సాంఘిక రాజకీయరంగములందు బ్రిటిషుప్రతిష్ఠ క్రమముగను క్షీణించుచున్నను నాయకుల లక్ష్యము పరాక్రమణామునందు లగ్నమగునటులు ధర్మనిర్వాహణామునందు లగ్నముగాకున్నది. బ్రిటిషురాజ్యాధికారులు ప్రపంచవ్యాప్తమైన ధర్మసంరంభమునందు నిస్సహాయస్థితియందున్న హిందూస్థానమును సామ్రాజ్యపాశబద్ధముచేసి యీడ్చుకొనిపోవుట విధికృతము.

ప్రపంచవ్యాప్త మైన ధర్మసంరంభమునందు పరాధీనరాజ్యములస్థితి దుర్భరముగనున్నది. హిందూస్థానము 35 కోట్ల ప్రజలను, సహజసంపదలను, సనాతనధర్మ సంస్కారమును కలిగియును నిరాధారనిస్సహాయస్థితిపాలగుట ప్రారబ్ధము. గాంధిమహాత్ముని ధర్మోపదేశములు 35 కోట్ల భారతీయులకును నితరులకును ప్రారబ్ధమును విసర్జించి ఆత్మశక్తినిగలిగి ప్రపంచావృతమైన ధర్మసంరంభమునందు పురుషార్థమును బడయుట కవకాశములను గలుగజేయుచున్నవి. భారతీయులు లబ్ధావకాశముల నాత్మోద్ధరణమునకును, మానవధర్మోద్ధరణమునకును వినియోగించుట పుణ్యమును, పురుషార్థమును.

---

Printed and Published by K Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras, Editor: G. Subbaramayya.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి
కా. నాగేశ్వరరావు

సంపాదకుడు
గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, సంచిక 3

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




సంపు. ౧౧ శ్రీముఖ సంవత్సరము, ఫాల్గునమాసము (మార్చి ౧౯౩౪) సంఖ్య ౩

## సుప్రభాతము ౨

కైలాసవాసి శ్రీ జనమంచి వేంకటరామయ్య

[రష్యా జపానుయుద్ధమున జపాను జయముగాంచగనే చైనాదేశీయులలో వచ్చిన మార్పు, వా రెట్లు స్వాతంత్ర్యసిద్ధికై పోరుసల్పిరో అది అంతయు ఈభాగమున వివృతమైనది.]

వినఁబడకుండు నెట్లు తమ వీనుల నుర్మఁగ దుందుభిధ్వనుల్
    కనఁబడకుండు నెట్టు లిఁకఁ గన్నుల క్రమ్మ నకాలసంధ్యలం
బనుపడఁజేసి మింట నెఱమంటలు మండఁగఁ గ్రమ్మఁగం బొగల్
మనముల నల్లమందు పెనుమత్తునఁ గూరినవారి కేనియున్.

ఆనందధ్వనులున్ జయధ్వనులు నయ్యంభోధివీచుల్ బలెన్
"జీనా"తీరముఁ జేరి వాయువశతం జేరెన్ మొగిం దత్ప్రజా
నూనస్వాంతములందుఁ; నందు పటుమంత్రోచ్చాటనప్రక్రియన్
"నీనిష్ఠన్ విడు మింక"టంచుఁ దరిమెన్ నిద్రాపిశాచిన్ వెసన్.

అవిగొ కొండలు కోనలు నవియె నదులు-నవియె సంద్రంబు భువియును దివియు నవియె
కాని మొగముల నొక క్రొత్తకళ యెసంగఁ-గానఁబడు ప్రాంతచుట్టాలకరణిఁ బోలిచె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

11. 3- 1 ౩౪౨

ఉన్నయట్టులె యుండి తానున్న తత్త్వ-మెటు గడించెనో పాదపం బటు "జపాను !"
పరిణతియెకాని పరిణామపథము మనకుఁ-గానఁబడకుండుఁ బూర్వసంస్కారమట్లు.

మనుజు హృదయంబు పగిది ధర్మంబె మనుజు-నున్న తాదర్శమయి మాఱకుండుఁ; గాల
వికృతినింబట్టి యనుపానభేదముల స-నామయప్రాప్తి కౌకమందె నడచునట్లు.

* * * * * *

ఇట్లు నిద్రాసమాధిఁ జాలించి కనులు-విచ్చిచూడంగ లోకంబు వెఱఁగుగొలిపెఁ
దూరు పేదియొ పడమరేదో గ్రహింప-వలనుగాకుండెఁ, బ్రజకు దిగ్భ్రాంతి యొదవె.

వీథితలుపులు మూయక విడిచినట్టు-లోడరేవుల మూయకయుంచి కనులు
మూసి నిద్రింపఁగాఁ బెనుమోసమయ్యె-నయ్యయో ! యేమిసేయుదు మకట యిపుడు.

ఏమిబలజృంభణం బౌర యీ "జపాను" - పెనుతుపానువిధంబున విసరికొట్టి
యుఱిమిచిచ్చఱపిడుగులఁ గురిసి మెఱసి-ధరణిఁ బడఁ గూల్చె రిపుసైన్యతాళవనము !

ఎచటనుండియొ యెవ్వరో యింటఁ జేరి-పెత్తనముసేయుచున్నారు వెఱపుదక్కి;
తపముసేయ హిరణ్యకశిపుఁడు పోవ-దొడ్డపోయెఁ దద్రాజ్య మింద్రునకు దక్కి.

వర్తకుల మేము, ధర్మప్రవర్తకులము-నిలువ నీడయొసంగిన నిలుతు మనుచు,
వచ్చి, కూర్చుండి కాళులు పాఱఁజాఁచి, - పెట్టుదురు నెత్తిపయినె త్రివిక్రములయి.

మత్తుమందు చల్లి మైకంబు పైకొల్పి-యొలిచికొంద్రు మేనఁ గల పసిండి;
జలగలట్టు లంతఁ జల్లచల్లగఁ బీల్తు్రు-నెత్రు; చాపక్రింది నీరు వీరు.

ధూమకేతువె వీరికేతువు దలంపఁ-బూరిమొలవద యది వచ్చుదారిలోనఁ,
జెలిమి నిలువదు తండ్రిబిడ్డలకునైనఁ-గూర్తుమంచును జేరి చేకొనిరయేని.

దేశపటములయందును దిద్దఁగలరు-ప్రాంతరాజ్యాల సరిహద్దుగీఁతలెల్ల,
ఫాలతలములఁ దుడిచివైవంగఁ గలరు-నలువవ్రాసిన భాగ్యరేఖలనుగూడ.

కాగడాపోలె గాఢాంధకారమెల్ల-విరియఁజేయును వీరి నాగరత యంద్రు
కౌరవిదయ్యయుపోలెఁ దోడ్కొంచుఁబోయి-కూలఁద్రోయును దాస్యపు గోతిలోన.

పీల్చి గాలి భూభరమును దాల్చు శేషు-నకును దలప్రాణ మెపుడుఁ దోఁకకును రాదు
అనదలను బట్టి కడుపుబ్బఁ దిని శ్రమమని-యాపసోపాలఁ బడుదు రీయయ్య లహహా !

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమధికఫలాప్తికై, స్వవిజ్ఞానమునకు - నంటుగట్టి యపూర్వదేశాగమముల
మూలధనమును ముట్టక ప్రోదిసేసి - పెంచువ్యాపారులట్టులు పెంపుగండ్రు.

తోలుదురు వీరు పశువులఁ దోలినట్లు; - కొట్టుదురు వీరు కుక్కలఁ గొట్టినట్లు;
చేరనీయక తమ రాజ్యసీమలందు, - దాఁటనీయక నిజబహిర్ద్వారములను.

నిన్నఁగాక మొన్న కన్నుదెఱచి జపా-నగ్రజాతిసభ్యతార్హ మయ్యె!
నెదుగుఁబొదుగులేక యాచీన మిటులుండఁ - జెట్టుక్రింద మొలచు చెట్టువోలె.

పెత్తనముమీఁద వచ్చెఁ బైపెత్తనంబు; - తొత్తుక్రిందను దొత్తులై యొత్తడిఁ బడి
నలుగుచున్నారు వీరల నడుమఁ జిక్కి--యకట! యడకొత్తులోఁ బోఁకలట్లు ప్రజలు.

దేవతారాజ్యమునఁ బుట్టి చావవలసి-వచ్చె నీరక్కసులచేత భంగమొంది;
ఆత్మరక్షణోపాయ మొండరసి దాన-బ్రతుకవలదె మన మకుతోభయుల మగుచు.

దేవకార్యార్థియై మున్ను తెగువసేసి - ఘనుఁడు కచుఁడు ఋష్యాదేశమునఁబోలె
మనమును మృతసంజీవనియనెడి విద్యఁ-దగును స్వారాజ్యరక్షణార్థంబు వడయ.

శిష్యులుగఁ జేరి శుశ్రూషసేతుమేని - కడుపులోఁ బెట్టుకొని విద్యఁ గఱపఁగలరు
కండ్రు శత్రుమిత్రుల నొక్కకంట నెపుడు-నహహ! యపరశుక్రాచార్య లగుచు వారు.

ఉష్ణ ముష్ణంబుచేఁగాని యుడుగ దండ్రు-వీరి సంప్రదాయపు నీతి వీరిమెడల
వడిఁ బ్రయోగించి సాధింపవలయు మనకు - ననుసరించి యుష్ట్రిలగుడన్యాయరీతి.

అని యిట్లు మేలుకని తమ-యునికియు మనికియు ననెడుటనుండెడి యద్దం
బునఁబోలెఁ *"గ్రొత్తవెలుఁగు"నఁ-గనుఁగొని యేవంబు పుట్టఁగాఁ దీవ్రమతిన్.

అంగసంస్కరణంబును, నంతఁ గ్రమత-సంఘసంస్కరణంబు, రాజ్యాంగసంస్క-
రణముఁ గావింపఁదొడఁగి ర్యాప్రజలు మాఱుఁ-గాదె యన్నియు నంతరంగములు మాఱి.

కాలికట్లు వీడి గజరాజయానలై-యొప్పి రప్వ డచటి యువతిజనము
వ్రేలు జుట్టులూడి వెలికివిదారబిడ్డ-లవుచు నీటుగనిరి యువజనంబు.

మందులకుఁగాక యీనల్లమందు మనకు-నేఁటి కనుచును విసమట్లు వీటఁబుచ్చి
దేవుఁడిచ్చిన తేనీరు ద్రావి మెదల-తుష్టినొందిరి యమితత్వదోష మెడల.

---

* జపాను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

* * * *

పులిని మేక నొక్క కొలన నీర్ద్రావింపఁ-జాలువాఁడె పుడమి నేలువాఁడు
దుష్టశిక్షణంబు శిష్టరక్షణమును - బూనలేని రాజు, లేనిరాజు.

కాలచోదితములు కర్మంబు లెల్లను - కాలమునకు రాజు కారణంబు
అతఁడు ధర్మబద్ధుఁడయి రాజ్య మేలంగ-వలయు ధర్మమందె నిలుచు జగము.

తనకుఁ బెరవారికినిగూడఁ దనదు ప్రజను - బానిసలఁజేసి నిజగౌరవమును ప్రజల
భావిభాగ్యోదయంబును భంగపఱచె - వట్టియంబేద యేటికీ ప్రభువు మనకు?

రాజు సర్వాధికారధూర్వహుఁడయేనిఁ - బ్రజకు నది పంచి యీని కారణముచేత
దుర్బలుండగుఁ గాలుసేతులకుఁ బాఱ-కున్న రక్తము, తలబర్వు నూనఁగలదె?

స్వార్థపరులగు దొరల దుస్తంత్రములకుఁ - జిక్కి వారల కేల్వట్టి నిలుచు నితఁడు
చేవచెడియును బయివన్నె చెడక యిపుడు - చెదలుదిన్న కంబంబుపగిది నితండు.

* * * *

తగ స్వదేశస్వరాజ్యస్వధర్మములను - నిలిపి లోకహితంబును జలిపి పేరు
పెంపు వెలయింపలేని యాపేదజాతి-మేకమెడచంటిజాతిమై మిన్నకుండు.

తన సమాధి విడిచి తరలిపోఁజాలక - అట్టె పట్టి ప్రాఁకులాడెడి యశ
రీరభూతమట్లు వీరల హృదయంబు - పూర్వమహిమ మెంచి పొంగుచుండు.

వెనుకటి పేరుపెంపుఁ దమ పెద్దల యస్థిచయంబుఁబోలెనే
అనిశము నాంతరంగికసమాధిని నిల్పి యదేతలంపులో
మునుఁగు మబ్బుపైకొనఁగ ముందఱకు వెన్కకు జోగితూగుచుం
దనిసెడి కాటికాఁపరులఁ దార్కొనునే నవజీవనప్రభల్?

* * * *

వంతులు దెగక యసూయా-వంతు లగుటఁజేసి దొరలు పంచుకొనరుగా
కింతకును మింగకుండ్రె దు-రంతముగాఁ బట్టి చీనరాజ్యము నెల్లన్.

కార్యవాదు లనుచు ఖడ్గవాదు లనుచు - నేకరాశిగతులుగాక ప్రజలు
భేదదృష్టిఁ జూచి విషమపరిస్థితుల్ - దెచ్చుచున్నవారు దేశమునకు.

పంపినారట ప్రార్థనాపత్రములను - మేనిక్రొన్నెత్తుట లిఖించి తేనికడకుఁ
గత్తి చేఁ బూని సమరరంగమున కుఱుక - ముదలయిడుమని యువజనుల్ పొదలువేడ్క.

కొడుకు సమరాంగణమునకు వెడలకుండఁ - గాలిసంకెల మైతినిగా యటంచు
వేఱుగతిలేని యొక వృద్ధవీరవనిత - పొడుచుకొని చచ్చెనఁట పుత్రుఁ బోరి కనుప.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వార్థము భజించి చెఱలోన నడఁగియుండు - స్వార్థము ద్యజించి యాకాశమంటు నరుఁడు
విత్తనము రూపుమాయంగ వెడలుఁగాదె - వృక్షము సహస్రముఖముల విస్తరిలుచు.

చిత్రకథలుగ జనములు చెప్పికొంద్రు - పాడికొందురు గీతప్రబంధములుగ
చదువుకొంద్రు మహావీరచరితములుగ - మెచ్చుకొందురు తలలూచి మేలటంచు.

వీరి దేశాభిమానంబు వీరి స్వార్థ-సంగపరిత్యాగమును (?) వీరి సాహసములు
కనుల నానందబాష్పముల్ క్రమ్ముదేఱ - నుల్లములఁ గోర్కె లువ్విళులూర సహహా !

మగనికిఁ దెచ్చియిచ్చె నొకమానిని యాతనిఁ బోరి కంపుచున్
జిగిదళుకొత్తఁగాఁ జికిలిచేసిన ఖడ్గము చేతఁబట్టి నె
మ్మొగము సువర్ణభాజనముఁబోలి నివాళియొసంగ స్వారికై
సొగసుగ, సంజ నిల్వెడలుచో మును వేత్రము నిచ్చు చెల్వునన్.

మెత్తని పూలపాన్పుపయి మేన సుగంధ మలంది కాంతతోఁ
జిత్తము రంజిలన్ మునువసించిన యాసుఖ మెంచఁ డంగముల్
నెత్తుట జొత్తిలం గటికినేల జయేందిరతోడి మోహపున్
బొత్తుమఱంగి వీరయువనూతనసఖ్యరసైకలోలుఁడై .

అందఁగల వివ్వి బిడ్డకు ననుభవింపఁ-గలఁడు చెలికాంద్రుఁగూడి యుగాదినాఁడు
అనుచు నొకవెఱ్ఱితల్లి భక్ష్యములు వండి - పదిలముగ బంపెనఁట సైన్యపతులపేర.

"నీ కుమారుఁడు వీరుఁడై నిలిచి పోరి - వైరివీరుఁదునిమి దుర్వారుఁ డగుచు
వారితోడన చనియె నిర్వాణరాజ-ధాని కేటువడ్డ పులివిధాన, మరియు.

అందుకొనవమ్మ మున్ను నీయనిపినట్టి - భక్ష్యములతోడ మా ధన్యవాదములను
పండుగలు లేవు మన వీరపత్నులకును - వీరమాతలకును నేఁడు వీనికన్న."

*          *          *          *

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కవిత్వము

పాటిబండ మాధవశర్మ

కవిత్వ మొకసృష్టి. ఈసృష్టి రెండువిధములు: బహిస్సృష్టి, అంతస్సృష్టి. బహిస్సృష్టి అనగా దృశ్యమానమగు జడజగత్తు ఒకసృష్టి, దానిపరమార్థము ఒకసృష్టి. జడత్వము ప్రధానముగా భగవంతుడుకావించిన యీసృష్టినే కవి పరమార్థము ప్రధానముగా సృష్టించును. బుద్ధిమంతులు ప్రపంచము మాయయని చెప్పినారు. ఏలన, దృశ్యమానమగు జగత్తంతయు నశ్వరముగనే యున్నది. అనశ్వరమైన దాని పరమార్థమును కనుగొనలేనంతవఱకు దాని బాహ్యరూపమే మనకు తథ్యము. పిమ్మట మిథ్య; అనగా లేనిది. ఉన్నది దానిపరమార్థమొక్కటే. కవిసృష్టి కీపరమార్థమే పదార్థము. అనగా జడప్రకృతియను పదార్థమునకు చైతన్యము నొసంగు తేజస్సు కవిసృష్టికి పదార్థము. కనుక కవిసృష్టియంతయు తేజోమయము. అందు నశ్వరమగు జడత్వ మేమియులేదు. పరిష్కరించినచో జగత్ సృష్టి జడత్వప్రధానమనియు, కావ్యసృష్టి తత్త్వప్రధానమనియు తేలినది.

కవిత్వమునకు తత్త్వమునకు గల సంబంధమును Plato మహాశయు డిట్లు చెప్పినాడు:

Poetry is three removes from the truth, being but an imitation by the Artist of the imitation in life of an idea in the mind of God."

— భగవంతుని మనస్సులో జనించినయొక సంకల్పమునకు సృష్టి యనుకరణము. ఆసృష్టికి కావ్యమనుకరణము. కనుక కవిత్వము తత్త్వమునకు మూడుమెట్లు క్రింద అని Plato వాదము. Plato కేవలము తార్కికునివలె మాట్లాడుచున్నాడు. కాని యథార్థము నరసినచో నిట్లు తోచును. ప్రకృతి భగవత్సంకల్పమున కనుకరణము. భగవత్సంకల్పము వ్యక్తమగుటకు ప్రకృతియను జడపదార్థము నాశ్రయించినది. ఆసంకల్పము పరమార్థము మఱుగుపడిపోయి వట్టిజడరూపమే వ్యక్తమగుచున్నది. ఈసృష్టి ననుకరించుటలో కవిచేసినసంస్కారమేమి? దానిజడత్వమును తొలగించి తత్త్వమును ప్రకాశింపజేసినాడు.

కనుక సృష్టిలో వ్యక్తముకాజాలనిభగవత్సంకల్పము కావ్యమున వ్యక్తమైనది. కాగా Plato చెప్పినట్లు కవిత్వము ప్రకృతికంటె ఒకమెట్టు దిగజారక ఎగబ్రాకినది. అందుచే తత్త్వమునకు మూడడుగులు దూరమగుటకు బదులు తత్త్వసాయుజ్యమును పొందినది. ఇప్పుడు దీని నొకవిధముగా చెప్పవచ్చును. భగవంతున కొకసంకల్పము కలిగినది. దానిని సృష్టియను కావ్యరూపమున వ్యక్తము చేసినాడు. రసికులు దీనిని గాంచి ముగ్ధులైరి; అలసులు ఉదాసీనత వహించిరి. తాత్త్వికులు ఇది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిథ్య యనిరి. కవిలో ఈ రసికత్వము, తాత్త్వికత్వము గలవు. కవి సృష్టిని గాంచి దాని తత్త్వము గ్రహించి ముగ్ధుడైనాడు అలసులగు లోకులకు దీనిని వ్యాఖ్యానము చేసి వివరించుచున్నాడు. Mathew Arnold మహాశయుడు "Poetry is the criticism of Life" అనుటలో నిదే పరమార్థము. Life అనగా ప్రకృతి (Nature) అని నా యర్థము.

కాలము గడచినకొలందియు లోకులీ ప్రకృతికి దూరమగుచున్నట్లున్నది. అనగా సృష్టికి ప్రాచీనత్వము ఘటిల్లుచున్నది. ఈ ప్రాచీనత్వము కేవలము అధ్యాస, అనగా ఆరోపితము. ఈఅధ్యాస లోకులదృష్టిలో మాత్రమే. కనుకనే లోకము పూర్వమువలె నేడు సృష్టిని వ్యాఖ్యానముచేయలేకున్నది. సృష్టిరహస్యమును సృష్ట్యాదికి సన్నిహితములైన వేదములవలె నేడు మనము వ్యాఖ్యానము చేయలేము. సమకాలగ్రంథమును సమకాలికులు వ్యాఖ్యానము చేసినంత సత్యసన్నిహితముగ భావికాలమువారు చేయలేరు. అంతకంటె బాగుగ చేయవచ్చును గాని సత్యసన్నిహితముగ మాత్రము చేయజాలరు. అట్లే సృష్టిని వేదములు చేసినంతసత్యముగ నర్వాచీనకావ్యములు వ్యాఖ్యానము చేయలేవు. కాని యీ వ్యాఖ్యానముయొక్క సత్యత కవియొక్క ఋషిత్వముమీద నాధారపడియుండును. అనగా ప్రకృతికి ప్రాచీనార్వాచీనతలు లోకము దృష్టిలోమాత్రమే కాని యథార్థముగా నది ప్రత్యగ్రము, అనగా అభినవము. దాని విషయములో కాలము సంజ్ఞామాత్రము. అది కేవలము (Absolute). కాలమును ఇట్లు కేవలముగా గణింపగలవాడొక్క ఋషి. తరువాత నిట్టిదృష్టి కర్హతగలవాడు కవి. కవి ఋషిత్వమును వృద్ధిబొందించుకొనుకొలందియు నీ వ్యాఖ్యానము సత్యసన్నిహితమగుచుండును. అందుచేతనే "నానృషిః కురుతే కావ్యం" అను వాక్యము పరమసత్యము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## "దళితహృదయం"

ఉభయభాషాప్రవీణ, హనుమదింద్ర కంటి

వెన్నెలలు పూసి ప్రళయమ్ము విరియునాడు - రాలి నామీద పడె మల్లెపూలఁ తాచు
కరచివేయనీ చంపనీ గరళముముసి — ఏల కురిసితివే జాలిపూలవాన.

ప్రోవులు ప్రోవులై విరియ బూసినతామరపూలతోటలో
తావిమె గొడ్డుపోయినవిధాన నిదాఘపు టెండమావుఁ గ్రొం
బూవుల కేడ్చుకొన్నయెద మోస మెరుంగునె ? సుంతయేని, పో
నీ విదళించి చీల్పవలెనే సరిక్రొత్తని ప్రేమబాష్పముల్.

ఏల యపత్రపావిలసితేక్షణ. వేసవి మల్లెవేళలన్
చీలుచుకొంటి వీహృదయ చిన్మయముద్రల బీదకన్నులన్
రేల మరేల చుక్కనునురెక్కలకాంతులతూగు నింకి క్రీ
నేలల నీవు నేను మరణించితి మీభువనాలయేడ్పుతో.

ముసిముసి నవ్వులన్ తొలకిపోయినముత్తెపు పచ్చిపంటకై
వస మొనరించుకొన్న పసిపాపల మైతి మొకప్డు నేటి కీ
విసపుకసాయికోతగొని వేదురు లెత్తిన మొండిబొందె కీ
కుసుమము లేలనే ? యెవరి కో దయసేయుము ప్రేమమూర్తివై.

చీకటికౌగిలింతల వసించిన ఈ నిరుపేదవాని కే
లే ? కనుగీటి వెన్నెలహసింపులఁ ద్రోహము నాడునాటికిన్
ప్రాకిన ప్రేమకాంతుల కుపాయన మిచ్చితి పశ్చిమాశనై
వేకువ లేని నాబ్రదుకు వీథుల నాడు పిశాచమూర్తివే ?

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నన్నయయతులు - కొన్నిటిగతులు

సింహావలోకనము

శ్రీమర్యాదర్శక, నడకుదుటి వీరరాజుపంతులు

౨

భట్టారక కవిచంద్రుని భారతభాగమునుబట్టి యాతనినాఁటి కాంధ్రకవిత్వమున నుపయోగింపఁబడుచుండెడియతులు—స్వర, వర్గ, సంయుక్త, సరస, ఏకతర, మునిశక్తినామములతో నొప్పునవి యాఱే యనియు, నందుఁ గొన్ని యసాధారణకవనసామర్థ్యద్యోతకములును, అనన్యకవిసంప్రయుక్తములును, నత్యాశ్చర్యసంజనకములును నని యితఃపూర్వము నిరూపింపఁబడినవి.

ఆచారవ్యవహారాదులయందుంబోలెఁ గవిత్వమునందును మనప్రాచీనులు గట్టికట్టుపాటులఁ గొన్నిటి నొనర్చి యుండిరి. అట్టినిబంధనములను భగవదాజ్ఞలుగ శిరసావహించి, మనపూర్వకవులు వానికి బద్ధులై ప్రవర్తించుచు నుండెడివారు. కావుననే వారు వశ్యవాక్కులనియు, శాపానుగ్రహసమర్థు లనియు నేఁటికిని గీర్తింపఁబడుచున్నారు.

ఈశ్వరసంకల్పితంబు లగు సూర్యచంద్రభూమ్యాదిగ్రహసంచారములు, తపోవర్షాదికాలప్రసారములు మొదలగువానివలె మనుష్యకల్పితంబు లగు నియమము లెల్లకాల మొక్కరీతిని గట్టువడి నిలువఁగలవా? కాలము గడచినకొలఁదిఁ దక్కినయాచారాదులుంబోలెఁ గవిత్వనియమములును బిగు వెడలి సడలసాగినవి. కావుననే నన్నయనాఁటికి నాంధ్రకవిత్వమునకు విధింపఁబడియున్న విరతు లాఱును గాలక్రమమునఁ బెరిఁగి యప్పకవ్యాదులనాఁటికి నలువదికిఁ బైఁగఁ బెరిఁగిపోయినవి.

యతులసంఖ్య క్రమాభివృద్ధి నందినట్లు స్ఫురింపఁజేయుచు, నేఁటివనుకఁ గానవచ్చు ఛందోలక్షణగ్రంథములయం దెల్ల మొదటిదిగాఁ బరిగణింపఁబడుచున్నపొత్తము కవిజనాశ్రయము. ఏతద్గ్రంథకర్తృత్వము పలువురపై నారోపింపఁబడుచున్నది. ఇది భీమకవివిరచిత మని తలంచువారు పూర్వలక్షణగ్రంథకర్తలలో ననేకులును, నేఁటివారిలో నత్యధికసంఖ్యాకులును గలరు. అది భీమనవిరచితమే యైనచో నన్నయనాఁటిదే యగును. నన్నయయు, భీమనయు సమకాలికులే యనువిషయమునుగూర్చినచర్చ కిది యదనుగామి విస్తరింపక, దానికిఁ గలహేతువులలో నొక్కదానిని మాత్ర మిచ్చట సూచించుచున్నాను.

కళింగదేశప్రభు వగు "అనంతవర్మ" యను చోడకళింగగంగదేవుఁడు, శాలివాహనశకము ౯౯౯-వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁ డైనట్లును, (శా. శ.) ౧౦౦౩-వ సం. మీనమాసమున బహుళపంచమీదివసంబున ౩౦౦ మంది బ్రాహ్మణులకు ఖోన్న (కొర్ని)* గ్రామమును దానముచేసినట్లును గళింగదేశశాసనముల వలనఁ దెలియనగుచున్నది.

ఈరాజకళింగగంగును వేములవాడ భీమకవి శపియించి రాజ్యపదభ్రష్టునిఁ గావించినట్లును, పిమ్మట ననుగ్రహించి దీవించినట్లును బ్రబోధించు నొకచరిత్ర విషయము పూర్వకాలమునుండియుఁ బరంపరగాఁ జెప్పికొనఁబడుచున్నది. ఏతచ్ఛాప, తన్మోక్షములఁ దెలుపు భీమకవిసింహునిపద్యద్వయమును కవిజీవితకారాదులే కాక బ్ర. శ్రీ. జయంతి రామయ్యపంతులుగారును దమకవిజనాశ్రయపీఠికయందుదాహరించి వాని ప్రామాణ్య మబాధిత మనియు వ్రాసియున్నారు. రెండవ (శాపమోక్షణ) పద్య మగు

---

* ఇవ్విషయమును దెలుపుశాసనము భారతీ ద్వితీయసంపుటాష్టమసంచికయందు బ్ర. శ్రీ. మ-రా-రా-శ్రీ గిడుగు వేంకటసీతాపతిపంతులుగారు తెలుఁగులిపితోడను, దెలుఁగర్థముతోడను బ్రకటించియున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"వేయి గజంబు లుండ బది
వేలతురంగము లుండ నాజిలో
రాయల గెల్చి సజ్జనగ
రంబునఁ బట్టము గట్టుకొని వడిన్
రాయకళింగగంగ! కవి
రాజు భయంకరమూర్తి చూడఁ దాఁ
బోయినమీనమాసమునఁ
బున్నమ వోయిన షష్ఠినాఁటికిన్."

అనుదానిలోని మాసతిథులకును, పైశాసనములోని మీన మాస, బహుళ (పున్నమ వోయిన) పంచమీతిథులకును నత్యద్భుత మగు కలయిక సదురుకొనుటయే కాక, పై శాపాదికథ సత్యమే యనువిశ్వాసమును సయితము పెరిఁగించుచున్నది!

శాపానుగ్రహశక్తియుక్తుఁ డగు నా 'దాక్షారామ భీమేశనందన' కవిసింహుని మహామహిమము నేఁటికి రమారమి తొమ్మిదివందలయేండ్లక్రిందట నప్పరమ పవిత్రకాలము డెట్లుండెడిదో! ౯౯౯-వ శకాబ్దమునఁ బట్టాభిషిక్తుఁ డైన యమ్మహారాజు, ఒండురెండేండ్లలో శత్రువిజితుఁడై, క్రమ్మఱ (భీమకవ్యనుగ్రహమున) విజితశత్రుఁడై, యాసంతోషముచేఁ బైదానమును గావించి, తపస్స్వాధ్యాయనిరతులై, పరమ పావనులై యప్పు డుండెడి బ్రాహ్మణశ్రేష్ఠుల సమారాధనము నొనర్చియుండును. (ఇవ్విషయము నింకను లబ పఱుచు సాధనాదికమును గాలపురుషుఁడు ముమ్ముందు బయల్పఱుచునేమో!)

శ్రీరామయ్యపంతులుగారు, భీమకవి రాజకళింగగంగుకాలమున నున్నట్లు స్థిరపఱిచియు, నాతఁ డారాజు పరిపాలనములోని నడిమికాలమున నున్న యెడల నన్నయ భట్టునకు నూఱేండ్ల * తరువాతివాఁడై యుండు నని కవిజనాశ్రయపీఠికయందు వ్రాసిరి. అక్కవిచంద్రుఁడు, కళింగగంగురాజ్యారంభకాలమునకే వృద్ధుఁడై యుండి, పైపద్యములోని "తాఁ బోయిన" అనుప్రయోగముచే జరిగిన దని చెప్పంబడు తత్కథావశేషమునకు వసుఁ డయ్యె నని యేల తలంపరాదు?

రాయకళింగగంగు పూర్వోదాహృతదాన మొన ర్చినకాలము క్రీ. శ ౧౦౭౨-వ సంవత్సరము. నన్నయ భట్టు గతించినకాలము క్రీ. శ. ౧౦౫౫ సం. ప్రాంతము. కావున భీమ నన్నయ కవు లిద్దఱు సమకాలికులే యగుదురు. కవిజనాశ్రయము భీమనకృతమే యగునేని యది నన్నయకాలమునఁ బుట్టినదే యగును.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పట్టాభిషేకసంచికయందు 'నన్నయకుఁ బూర్వము ఛందస్సు' అనువ్యాసమున నిట్లు వ్రాసియున్నారు:

"ద్రావిడభాషలో "యాప్పిరంగలమ్" అను ఛందోగ్రంథము పదునొకండవశతాబ్దిది కలదు. అందు సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సులప్రస్తావ మున్నది.

* విమర్శకాగ్రేసర భూరిబిరుద విరాజమానులగు బ్రహ్మశ్రీ, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు 'భాస్కరోదంత' మను తమవిమర్శగ్రంథమున, భీమకవి తిక్కనసోమయాజికిఁ దరువాతివాఁ డని నిర్ధరించుటకై, కవిజనాశ్రయ మొకవ్యాకరణ మనియు, వేములవాడకవి తిక్కనకుఁ బూర్వుఁడే యైనచో, మున్ను తెలుఁగునకు లక్షణ మెన్నఁడు నెవ్వరును జెప్పలే దని కేతనకవి తన యాంధ్రభాషాభూషణలక్షణగ్రంథమున నేల వ్రాయు ననియు వ్రాసినారు! మఱియు, భీమన నన్నయకు మిక్కిలి దూరపుఁగాలమునకుఁ బోవుటకుఁగాఁబోలు, కస్తూరికాదానమునఁ బ్రసిద్ధి వహించిన తెలుంగాధీశుని (ఆంధ్రరాయల) నామ మాధారముఁ జేసికొని, యాతనిని శ్రీనాథునివఱకు లాగినారు! "వదియింతు వేములవాడభీమునిభంగి, నుద్దండలీల నొక్కొక్క మాటు" అని కవిత్రయమునకన్న మున్నుగ భీముని శ్రీనాథకవి పేర్కొనుట, యాతనికాలమున భీముఁడు "ఉద్దండకవి" అని ప్రసిద్ధి గాంచియుండుటచేత నే యఁట! అందఱికంటెను ముందుగఁ దన్ను స్మరియింపకున్నచో, నయ్యుద్దండకవి శపియించు నని యా కవిసార్వభౌముఁడు భీతిల్లెనేమో!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"వాంచియార్ శెయిన వనఘు చందవుం" అని యం దున్నది. అనఁగా "వాంచియ రచించిన తెలుఁగుఛంద మును" జూచి తా నాగ్రంథమును రచించినట్లు గ్రంథ కర్త చెప్పుకొనుటలోఁ గలదు. ద్రావిడనిఘంటుకార్యా లయమున విద్వాంసులుగా నున్న శ్రీ సూ. రాఘవ య్యంగా రిది సర్తించిరి. శ్రీరంగసామిసరస్వతిగారి వలన నిది విని శ్రీరాఘవయ్యంగారిని గలిసికొని సరిగా విచారించితిని. వాంచియ యను నాంధ్రచ్ఛందః ప్రణేత మనకుఁ దెలియరాకున్నాఁడు. ప్రాచీనప్రతుల లిపిరీతిని బరిశీలించినారు. "వాంచియార్" అనుపదము రేచియార్ గా నుండఁదగు ననిరి. కొన్ని సంస్కృతశబ్ద ములుగూడ నం దిట్లే వికృతిని బొరసియున్నవి. రేచి యార్ అని యగునేని యాగ్రంథము రేచియ (రేచన) రచియించిన కవిజనాశ్రయ మగును. ఆద్రవిడగ్రంథకర్త జైనుఁడు. ఈరేచియయును జైనుఁడే. ఇది యొకపాం దిక యగును. ఇట్లగునేని కవిజనాశ్రయము పదు నొకండవశతాబ్దికిఁ దర్వాతది కాకపోవును......"

శ్రీశాస్త్రిగారు వ్రాసినపై విషయము ధ్రువ పడునేని (రేచనకృతమగు) కవిజనాశ్రయము నన్నియకు మున్ను పుట్టినదే యగును.

పైవిషయము లట్లుండ, నన్నియభట్టారకుని నాఁటి కాలుయతులే యాంధ్రకవిత్వమున నేర్పడి యుండఁగా, కవిజనాశ్రయమునఁ బదియతులు గాన వచ్చుచుండఁగాఁ దద్గ్రంథము నన్నియనాఁడో, లేక తత్పూర్వమో పుట్టిన దెట్లగు ననుప్రశ్న ముదయిం చును గావున దానికిఁ బ్రత్యుత్తరము చెప్పవలసి యున్నది.

కవిజనాశ్రయము చిరకాలమునాఁటి గ్రంథ మగు టచే దానికి వచ్చినన్నిపాట్లు మఱి యేయితరగ్రంథము నకును వచ్చియుండ లేదు. దానిప్రతు లెన్ని (యేయే దేశములం) గలవో యన్ని ప్రక్షిప్తపద్యము లద్దాని యందు చేరిన వనియుఁ జెప్పవచ్చును. లేఖకులు, కవులు మొదలగువారు తమయిచ్ఛకువచ్చినన్ని పద్యము లితర లక్షణగ్రంథములనుండి తెచ్చియు, స్వప్రయోగసంరక్ష ణమునకుఁ దాము కల్పించియు నేతద్గ్రంథమునఁ జేర్చినా రని దానివ్రాఁతప్రతులను జూచువారికిఁ దోఁపకమానదు. చూడుఁడీపద్యములసాంప్ర!

"మొదలక్షరంబు వడి యగు,
పదమున రెండోక్షరంబు ప్రాసం బయ్యెన్
యిది గానక తాఁ జెప్పిన
మదనారికి నైన చేటు వల్లియరేచా!"

"యరలవచతురక్షరములు
వరుస మకారంబుతోడ వడి గొనవచ్చున్
ధర పుండరీకవడి యన
వరుసంతపుబొమ్మ కీరవాణి యనంగన్."

(ఆంధ్రపరిశోధకమహామండలి
(పిఠాపురము)లోని యొకవ్రాఁతప్రతి.)

ఇట్టివానిని లెక్కించి నెక్కుడుఁ జూపఁగలము? ఇట్లే యాయాయధికారములలోని లక్షణపద్యాదు లనేకము లితరులచే రచియింపఁబడి గ్రంథమునఁ దూర్పఁబడినవే! కొన్నికొన్నిపద్యము లేతద్గ్రంథ కర్తవే యని విశ్వసింపఁబడుటకై వానియందు రేచన సంబోధనాదికములును కొన్ని దూర్పఁబడినవి! (దీని లోని వైచిత్ర్యములను వెల్లడింప మఱియొక యదను గైకొనియెదను)

ఇట్టి (తలయేఁటుపొడమించు) పుస్తకమును బరిష్కరించి ప్రకటించిన శ్రీ జయంతి రామయ్య పంతులుగారి పరిశ్రమ మెంతయో వ్రాయవలయునా? ఆంధ్రలోక మంతయు వారికిని, దానిం బ్రకటించిన యాంధ్రసాహిత్యపరిషత్తువారికిని గృతజ్ఞమై యుండఁ దగినదే! ఇఁక దానిలోని యతులనుగూర్చి విచారింతము.

నన్నియభారతమునఁ గానవచ్చు స్వర, వర్గ, సంయుక్తాదియతు లాటును గాక ముద్రిత మగుకవిజనా శ్రయమున—అఖండ, ప్రాది, బిందు, ప్లుత సంజ్ఞలు గలయతులు (మఱి) నాలు గధికముగఁ గన్పట్టుచున్నవి. అని యన్నియుఁ జిత్రముగ నొక్కచోటనే చేరి యున్నవి! వీనిలో నొక్కొక్కదానిస్థితిని గ్రమముగఁ దెలిపెదను:



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అఖండయతి

కవిజనాశ్రయమున దీనిలక్షణ మిట్లున్నది:

"మానుగ విశ్రమాక్షర స
మంచితమై స్వర మాదినం దదీ
యానుగుణాక్షరంబు కాని
యైనను జెప్పఁగవచ్చు నీక్రియన్
భానుసహస్రభాసి వృష
భాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండయతి
పొల్పగు నాదికవిప్రణీతమై."

ఈపద్యము పాల్కురికి సోమనాథకవిప్రణీత మని యొకప్రతీతి గలదు. ఇదియే వాస్తవమై యుండును. సోమనాథుఁడు తనగ్రంథములం దఖండయతుల నుపయోగించినాఁడు. మఱియుఁ బైపద్యము కవిజనాశ్రయకారునిది గా దనుట కా గ్రంథమునందే యొకయాధార మగపడుచున్నది. 'స్వరయతులు' అను శీర్షిక గల ౧౫-వ పుటలో,

"స్వరగణము కకారాద్య
క్షరములతో సంధిచేసి కదియించినఁ ద
త్స్వరము * కాని చెప్పనది వ
ర్లరవిందజసదృశ, కవిజనాశ్రయ, కృతులన్."

అకారాదిస్వరములను గకారాదులపైఁ గదియించినప్పు డాస్వరమునకే వడిని గూర్పవలయు నని విధించిన యా (పూర్వపు) గ్రంథకర్త సరల నఖండవడిని గూర్పవచ్చునని యెట్లు చెప్పియుండును? కావున నిప్పద్యము ప్రక్షిప్తమే యనుటకు సందియము లేదు.

భట్టారకకవివర్యునకు నఖండయతి యిష్టమైన దిగాఁ దోఁపదు. ఆతనిభారతము వ్రాఁతప్రతులలోను, ముద్రితపుస్తకములయందును అఖండయతులు గలపద్యము లత్యల్పసంఖ్యాకములు గలవు. అవి యఖండయతి ప్రియు లెవ్వరో దిద్దినవియు, లేఖకదోషములును నై యుండును. ఆంధ్రమహాభారతమును బరిష్కరించి ముద్రింపించినపండితు లట్టివాని ననేకములను దొలంగించి యుక్తమైనపాఠములనే ప్రకటించిరి. కాని, యప్పండితుల నందఱను గనుగప్పినవి యొండు రెండు ప్రయోగము లందు నిలిచి యున్నవి:

"సీ. చపలాక్షి..., ...వేశ్యఁ దివురు,
నతిఘనలజ్జావ•నత యనునక్కన్య..."
(ఆదిపర్వ. తృ. ౩౭.)

ఇది నన్నియనియమములు గల సీసములలో సర్వయతిసీసము. దానంజేసి పైప్రయోగ మఖండయతితోఁ గూడిన దనుచున్నది. ఇది ప్రాసయతిగఁ దోఁచుటచేతఁ గాఁబోలు, పరిష్కర్తలు దీని నట్లే యుంచినారు. దీనికి సరియైనపాఠము లభియించు నేమో యని నేను, కొంతకాలముక్రిందట నగఁగా క్రీ. శ. ౧౯౨౨-వ సం. అక్టోబరునెలలో మ. రా. శ్రీ గిడుగు వేంకటసీతాపతి పంతులుగారి పేర వ్రాయఁగా, వారు తమయొద్ద నున్న తాటియాకుప్రతులను శ్రమముమై వెదకించి వానిలోని పాఠముల నన్నిటిని దయతో వ్రాసి పంపిరి. అందు

"అతిఘనలజ్జాన న•తాస్య యానక్కన్య"

అనుపాఠము గానవచ్చి యెనలేని యానందమును గూర్చినది! నన్నయకవీంద్రుఁడు 'అవనత' శబ్దమునకు 'వదన' 'ఆనన' 'ఆస్య' మొదలగుశబ్దములను, 'ఆనత' శబ్దమునకు 'వైరి' 'రిపు' 'శాత్రవ' ఇత్యాదిశబ్దములను తఱచుగఁ జేర్చి ప్రయోగించుచుండుట గలదు. ఇచ్చట 'అవనత' శబ్ద మాస్యపర్యాయపదములలో దేనితోడను చేరదు. కావున,

"అతిఘన లజ్జా న-తాస్య యానక్కన్య"

అనునదియే యుక్తమైనపాఠముగఁ గానవచ్చుచున్నది. ఇంకను జెక్కుప్రతులఁ బరిశీలించినచో నెం దెట్టిది లభియించునో! ఇప్పుడు పైపద్యపాదభాగమునకు "లజ్జా + నత + ఆస్య" అని ఛేదము. "నతోత్తమాంగుల" ఇత్యాదిగ నన్నియ (సభా. ప్ర. ౨౨౦.) ప్రయోగములు గలవు.

* "స్వరమ కాని" అని యాంధ్రపరిశోధక మహామండలిలోని వ్రాఁతప్రతులు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కాని నాగపురమున•కానరంగఁ జని రమ్య"
(ఆది. అష్ట. ౧౭౨.)

ఇప్పాదభాగము గల సీసమును సర్వయతిసీస మే.

మ. రా. శ్రీ గిడుగు వేంకటసీతాపతిపంతులు గారు తెలుఁగుమాసపత్త్రిక రెండవసంచికయందు "నన్నయసీసభేదములు" అనువ్యాసమున పైపాదము నుదాహరించి యిది యఖండయతి యనుభావము నగపఱచిరి. కొంతకాలమున కాపత్త్రికను గాంచి నేను వారి పేర,

"కాని నాగపురమున-కును జని నిజరమ్య"

అనుపాఠము, సవ్యాఖ్యానాంధ్రమహాభారతము (చదలువాడ సుందరరామశాస్త్రిగారిచేతను, దండిసుంట సూర్యనారాయణశాస్త్రిగారిచేతను ప్రకటితము)నఁ గలదని వ్రాయఁగా వారు, "'కును' అనుచోట సముచ్చయమున కర్థమి శేష మేమి" యని (౬-౧౧-౨౨) నా పేర వ్రాసిరి. ఇది ద్రుతమునకుఁ గల స్వత్వరూప మని వారికి వ్రాసితిని. నన్నియభారతమున నట్టి స్వత్వరూపములు గలవు.

"అం,చును నాస్తీకమునీంద్రు..." (ఆది.ద్వి.౨౩౨)
"మెఱపునుం బోలెను - వఱలునుత్పలగంధి"
(సప్త. ౧౪౯.)

కావున, (ఇత్యాదులు.)

"కాని నాగపురమున-కును జని నిజరమ్య"

అనునదియే కవిప్రయుక్తపాఠము.

నన్నియభారతమును బరిశీలించువారి కాతని నియమము లత్యాశ్చర్యమును గొలుపును. మఱియు నాతనివలె నట్టినియమముల నవలంబించి కవనమును సాగించినకవి యాంధ్రప్రపంచమున నేఁటిదనుకఁ దెలియవచ్చినవారిలో నొక్కఁడును లేఁడు. అట్టినియమవంతుఁ డఖండయతిని బాటించినాఁ డనుట సమంజసము గాదు.

## ప్రాదియతులు

ఈయతులంగూర్చి కవిజనాశ్రయముద్రితపుస్తకమున నీక్రిందిలక్షణపద్యము గలదు.

"ప్రపరాపసమను సుప్ర
త్యపినిర్దురధిన్యపాభ్యుదా*వ్యత్యవప
ర్యుపసర్గవింశతికి వ
ళ్లుపరిస్వరయుక్త మైన నుభయముఁ జెల్లున్."

ఈపద్యము కావ్యాలంకారచూడామణి గ్రంథకర్త యగు విన్నకోట పెద్దనార్యునిది. చల్లఁగా నెవ్వరో యాపద్యమును గవిజనాశ్రయపువ్రాఁతప్రతులయందు చేర్చినారు. (చూడుఁడు, కావ్యాలం. చూడా. సప్త. ౮౭ ప.) మఱియు నిప్పద్యము కవిగజాంకుశములోనిదని సులక్షణసారమునఁ గలదు! సులక్షణసారగ్రంథకర్త 'తాతంభట్టు' అని వావిళ్లవా రచ్చువేయించినారు! (అతఁడు లింగమగుంట తిమ్మన.) అప్పకవి సులక్షణసారమును దనగ్రంథమునఁ జేర్కొన్నాఁడు. కాన తిమ్మన యప్పకవికంటెఁ బూర్వుఁడే! అయిననేమి? అప్పకవీయములోని పద్యములు సులక్షణసారములోని లక్షణములకు లక్ష్యము లైనవి! (చూ. మన లక్షణగ్రంథములగతి!)

కీ. శే. వే. వేంకటరాయశాస్త్రిగా రచ్చువేయించిన కావ్యాలంకారచూడామణియందు పైపద్యము,

"క. ప్రపరాపసుమను...
......, ......వ
ళ్లు పరస్పరవర్ణయుక్తి-నుభయముఁ జెల్లున్."

అని కలదు. కాని యిందు యతి దప్పినది. (కవిగజాంకుశములోనిదని) సులక్షణసారమున నుదాహరింపఁబడినదానియందును యతి భంగము నొందినది. కాన,

"...వ, ళ్లుపరిస్వరయుక్తమైన..."

అని యుండుట యొప్పు.

---

*అభ్యుదాచ్ఛ్య-అని యచ్చుపుస్తకమునఁ దప్పుగాఁ బడినది. 'అధిన్యప' అనుచోట 'ని' అనునది యుండనే యున్నది గాన నిచ్చట 'వి' అనునదియే యుండఁదగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉపసర్గములతోఁ గూడిన పదములయతులు నన్నయభారతమున నధికనియమములో నున్నవి:—

ప్ర:— ప్రారంభ (ఆది. తృ. ౩; ఆర. ప్ర. ౧.), ప్రాప్త (ఆది. తృ. ౧౪౧.), ప్రార్థించెన్, (ఆది. ష. ౧౫.), ప్రారబ్ధ (ఆది. సప్త. ౧౫౦.) ఇత్యాదుల నారయుచో, నీయుపసర్గముతోఁ గూడిన యచ్చున కెచ్చటను నన్నయకవిసత్తముఁడు యతిసంధానము నొనర్పలే దని తెలియనగును.

సమ్:— సమాఖ్య, సమర్పణ, సముల్లసన, సమీహిత, సమక్ష, సమర్థ, సమాగమ, సముదయ, సమాప్తి, సమంచిత, సమగ్ర—ఇత్యాదుల నన్నిట (సమ్ + అఖ్య, ఇత్యాదిగ స్వరము స్పష్టముగ ఛేదింపఁబడుచున్నను) హల్లునకే యతి! అయినను,

"ఉగ్రమయూఖసాక్షిగ స-మున్నతదక్షిణపాణి..."
(ఆది. తృ. ౧౯౯.)

అని పైనియమమునకు భంగముఁ దెచ్చు పాఠ మచ్చుప్రతులఁ గొన్నిటఁ గానంబడియెడిని. కాని, మఱి కొన్ని ముద్రితగ్రంథముల

"ఉగ్రమయూఖసాక్ష్యముగ-నున్నత..."

అను సరియైనపాఠమే యున్నది. మఱియు నానంద ముద్రాలయమువారు ౧౯౦౭ సం. ముద్రింపించినప్రతిలో పైరీతిగ సవరణమును శుద్ధపత్త్రికయందు చూపినారు.

అను:— అన్విత (పలుచోటుల.), అన్వయ-ఇత్యాదులందు విరతి ప్రాణికే కూర్పఁబడినది.

ప్రతి:— ప్రత్యక్ష (ఆది. సప్త. ౩౫; ఆరణ్య. తృ. ౪౯.), ప్రతీక్షించు (ఆది. స. ౨౬౪.)- ఇత్యాదులను హల్లునకే యతి.

అభి:— అభ్యక్షిప్త (ఆది. తృ. ౭౨.), అభ్యుదిత (ఆది. తృ. ౧౨౪.), అభ్యుదయ (సభా. ప్ర. ౧౭.), అభ్యంతర (ఆర. తృ. ౩౫౩.) మొదలగు వానికిని వ్యంజనయతియే.

తక్కిన యుపసర్గయత్యాదులు మఱియొక సంచికయందు ప్రకటింపఁబడును.

---



పుదుచ్చేరి బ్యాంకు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నన్నెచోడుని కుమారసంభవము

## అనుకరణౌచిత్యములు

కత్తి సాంబమూర్తి శాస్త్రి

కవిరాజశిఖామణి బిరుదాంచితుఁడగు నన్నెచోడుని కుమారసంభవము నిదివఱకుఁ బెక్కురు పండితులు విమర్శించియున్నవారు. కొందఱు కాలనిర్ణయము విషయమునను, కొందఱు విశేషపదప్రయోగవిషయమునను, కొందఱు గ్రంథప్రౌఢివిషయమునను చర్చించియుండిరి. నేనిపు డాతని యనుకరణవిషయమున శక్తికొలఁది చర్చింప సాహసించినందులకు పండితులు క్షమింతురుగాక!

కుమారసంభవమును ముద్రించి ప్రకటించిన బ్ర. శ్రీ మానవల్లి రామకృష్ణకవి (యమ్. ఏ.)గారు తమ పీఠికలో "నీకుమారసంభవమునకు మూలకృతి యేది"యని విమర్శించుచు నుద్భటకాళిదాసాదుల కుమారసంభవముల కిది యనువాదము గాదనియు, నిది స్వతంత్రగ్రంథమనియు వ్రాసియున్నారు. కాని యావాక్యము లంతగా సత్యమును వెల్లడింపలేదేమో యని నాకు సంశయము గలుగుచున్నది. "ఉద్భటుని కుమారసంభవము నీతఁడు చూచెనని యేర్పడుచున్నది" యని నిర్ణయించుట కాధారము లేవియు విస్పష్టముగా నగపడలేదు. కాని కాళిదాసుని కృతి చూచియే యీకృతి రచింపఁబడినదనుటకుఁ బ్రబలాధారము లనేకములు గలవు. కొన్నిటినిమాత్రము పాఠకుల విమర్శమునకై యుదాహరించుచున్నాఁడను.

నన్నెచోడుఁ డీకావ్యమును రచించుటలో నాంధ్రీకరణవిషయమున మిక్కిలి స్వతంత్రతను బ్రకటించియున్నాఁడు. కథలమార్పునందేమి, మూలము ననువదించు పట్టులనేమి, యాతఁడు చూపిన నిరంకుశత్వ మవ్యాహతము గానున్నది. మార్పులన్నియు మనోహరము లేయైనను కొన్ని యౌచిత్యమునకుఁ గడుదూరమున నున్నవి. ఈతఁడే ప్రథమాంధ్రకవి యనునూహతో శ్రీ రామకృష్ణ కవిగారు " ఇతనికిఁ బూర్వము సంస్కృతకవు లనేకు లున్నను వారియందు భావచౌర్యమగపడ"దనియు, "నీతఁ డట్టిభావచౌర్యము గావించినవాఁ"డనియు వ్రాసి "కింకవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః, పరస్య హృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః." అను శ్లోకమును,

'కం. ముదమున సత్కవికావ్యము
నదరక విలుకానిపట్టినమ్మును బరహృ
ద్బిదమై తలయూడింపని
యది కావ్యమె వాని పట్టినదియు న్శరమే.'

అను కందపద్యము నుదాహరించియున్నారు. కాని యిది భావచౌర్యము గాదనియు, నాతఁడు ప్రాచీనుల పద్యము లనేకములు తనగ్రంథమున ననువదించియున్నాఁడనియు మనము తెలియునెడల నీతనికి భావచౌర్యదోషముంట గట్ట నక్కఱలేదని యూహింపఁగలము. వాని నన్నిటిని గ్రమముగాఁ బాఠకు లీవ్యాసమునఁ జూడఁగలరు.

ఈకవి యీకావ్యము రచించునపుడు కృతిరచనమున కారంభించి ముగియువఱకు నేకధాటిగా రచించినవాఁడు గాఁడనియు, నీకృతి ప్రారంభింపకమున్దు తాను రచించిన పద్యములు, కథలు నిందుఁ బొందుపఱిచెననియు నిశ్చయించుట యుచితమని తోఁచుచున్నది. కుమారసంభవకథ సంస్కృతమునఁ బెక్కుపురాణములం దగపడుచున్నది. రామాయణము బాలకాండమున విశ్వామిత్రుఁడు రామున కీకథ యెఱింగించినట్లు కలదు. అం దీకథకు "కుమారసంభవ" మనియే పేరు నిర్దేశింపఁబడినది. కాళిదాసుఁడు రామాయణమునందలి కథ నాధారముగాఁ గొని కావ్యము రచించి రామాయణనిర్దిష్టనామముతోడనే తన కావ్యమునకుఁ "గుమారసంభవ" మని పేరు కల్పించినాఁడు. సతీజన్మంబును,దనుత్యాగంబును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దక్షాధ్వరధ్వంసమును దా నెఱింగినవిధమేయైనను, ప్రకృత కావ్యకథ కంతగా నుపస్కారకములు గామింజేసియు, నవి రామాయణమున లేమింజేసియు వాని నాతఁడు తడవక,

శ్లో. "అథావమానేన పితుః ప్రయుక్తా
దక్షస్య కన్యా భవపూర్వపత్నీ,
సతీ సతీ యోగవిసృష్టదేహా
తాం జన్మనే శైలసుతాం ప్రపేదే."

అను నొక్కశ్లోకమునఁ బూర్వకథలనెల్లఁ బరామర్శించి విడచినాఁడు. నన్నెచోడుఁ డన్ననో యాశ్లోకము నాలోచించి యాపూర్వకథల నేల విడువవలయు నని యోజించి యాకథలనెల్ల నిందుఁ బొందుపఱచినాఁడు. రామాయణమునఁ గామదహనము, పార్వతీపరిణయము, కుమారసంభవము ననుకథలుమాత్రమే వర్ణింపఁబడినవి కాని కుమారుఁడు తారకునితోఁ బోరుట, వాని సంహరించుట మొదలగు నుత్తరకథలు చేర్కొనఁబడలేదు. కావుననే యందు "కుమారసంభవశ్చాయమ్". అని మాత్రమే నిర్దేశింపఁబడినది. కాళిదాసుఁడు గూడ శ్రీమద్రామాయణము ననుసరించియే గ్రంథరచనము గావించి కుమారోత్పత్తికారణమగు పార్వతీపరమేశ్వరుల సురతక్రీడ వర్ణించి యంతతో గ్రంథమును ముగించినాఁడు. కావుననే కాళిదాసునికావ్యమునకుఁ గుమారసంభవ మను వ్యవహారము సిద్ధమైనది. కుమారుని ఘనకార్యములును, దారకాసురసంహారమునుగూడవర్ణింపఁబడినచోఁ గుమారవిజయమనికాని, కుమారచరితమని కాని పేరిడవలయునే కాని కుమారసంభవమని పేరిడుట సమంజసముగా నుండదుకదా? కావుననే ప్రస్తుత మగపడుచున్న కుమారసంభవమున నెనిమిదిసర్గములు మాత్రమే కాళిదాసుఁడు రచించినవనియు, మిగిలినభాగ మితరుఁ డెవ్వఁడో రచించి దాని కతికించెననియు, నీ యభిప్రాయముతోడనే వ్యాఖ్యాతృశిరోమణియగు మల్లినాథ మహోపాధ్యాయుఁ డెనిమిదిసర్గములకు మాత్రమే వ్యాఖ్యానము గావించి యితరభాగములు విడిచెననియు విమర్శకులు సిద్ధాంతీకరించినారు. నన్నెచోడుఁడన్ననో కాళిదాస గ్రంథము ననుసరించి తనకావ్యమునకుఁగూడ కుమారసంభవమనియే పేరిడియు దాని కననుగుణములు, నప్రస్తుతములు నగు కథాభాగముల రచించినాఁడు. సైనాపత్యాభిషేక, తారకాసురయుద్ధ, తారకసంహారాదులు సంస్కృతమునఁ గాళిదాసీయములు గాకున్నను, అవి కాళిదాస విరచితములేయని భ్రమపడుటకాని, లేక గ్రంథ విపులీకరణాభిలాషచే నితరపురాణకథల నాధారపఱుచుకొని యాకథలు రచించుటకాని దానికిఁ గారణముగా నగపడుచున్నది. బాగుగ నాలోచించిన రెండవదియే కారణమై యుండు ననునమ్మక మేర్పడుచున్నది. కాని యీకథల వలనఁ జోడుని గ్రంథమునఁ గల గొప్ప యనౌచిత్య మొకదాని నిపుడు మనము తెలియవలసి యున్నది. సతీ పరమేశ్వరులు గజారణ్యమున విహరించుచు గజరూపము లొంది క్రీడించి గజాననునిఁ దనయునిగాఁ బడసిరని చోడుఁడు కల్పించియున్నాఁడు కదా! దీనివలన నింకను సతీదేవి యోగాగ్నిచే శరీరత్యాగము గావింపకముందే. తారకాసురుఁడు ప్రబలుఁడై లోకము లాకులములు గావింపకమున్నే శివవీర్యసంభవుఁ డొకఁ డున్నట్లు తేలుచున్నది. అట్లయినఁ దారకాసురుని మహేశ్వరవీర్యసంభవుఁడు దక్క నితరులు సంహరింపఁజాలరుగావునఁ బత్నీవియుక్తుఁడగు శివునకుఁ బార్వతిని బత్నిగాఁ గూర్చి వారిరువురునుఁ దనయునిఁ బడయునట్లు ప్రయత్నింపవలయునని సురజ్యేష్ఠుఁడు సురల కానతిచ్చుటలో నౌచిత్య మేముండును? అదివఱకు జనించినయాతఁ డసమర్థుఁడనికాని, పార్వతీరూపమున నవతరించిన సతీదేవిగర్భమున జనించినవాఁడె తారకుని సంహరింపఁగలఁడనికాని నలువవాక్యములందుఁ గానఁగాదు. శివవీర్యసంభవుఁడుమాత్రమే సమర్థుఁడని కలదు. వాస్తవమునఁ గుమారుఁడు సతీగర్భమునను జనింపలేదు; పార్వతీగర్భమునను ఉదయింపలేదు. అగ్నినిక్షిప్తమై, గంగాపరిప్లావితమై శరవణమున జ్యోతీరూపమునుండి కృత్తికాగర్భములందుఁ బ్రవేశించి కించిదంకురితప్రాయముగ వెలార్పఁబడిన హరవీర్యము శరవణమునఁ గమలపత్రమునందుఁ గుమారరూపమునఁ బరిణామ మందినది. అన్ని పురాణములం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దును, మనచోడునిగ్రంథమందు నిట్లే చెప్పఁబడినది. కావున సాక్షాచ్ఛివగర్భసంజాతుఁడగు గజాననుఁ డసమర్థుఁడనియైనఁ జెప్పక సంతానహీనునకు సంతానమాశించినట్లు మరలఁ బార్వతీపరిణయప్రయత్నము గావింపుఁ డనుట యెంతయు ననుచితముగానేయున్నది.

గణచతుర్థీమహాత్త్వములు తెలుపుసందర్భమునఁ బార్వతి పిండిబొమ్మ నొకదానిని నిర్మించి దానికిఁ బ్రాణప్రతిష్ఠ గావించి ద్వారరక్షణమున నియోగింప శివుఁ డాబాలకునితో వివదించి త్రోసివేయఁగా శిరము తూలిపోయె ననియు, ననంతరము పార్వతీకోపాపనయనమునకై యెంతవెదకించినను నాశిర మగపడలేదనియు, నుత్తరదిక్కునఁ దలయుంచి నిద్రించుజంతువు తలకోసి తెచ్చి యతుకఁ బరమేశ్వరుఁ డానతిచ్చెననియు నట్లొక్కయేనుఁగుమాత్రమే నిద్రింప దానితల ద్రెంపి తెచ్చి యీపిండిబొమ్మమొండెమున కతికి ప్రాణప్రతిష్ఠ గావించిరనియు నొకకథ కలదు. గజాననజననమున కా కథయే మిక్కిలిసమీపమున నున్నట్లు తోఁచుచున్నది. అట్లేకాకున్నఁ గేవలము గజరూపముల విహరించినసమయమున సద్యోగర్భమున జనించిన శిశువు కేవలగజరూపముననే జనింపక సగము గజము, సగము మనుష్యుఁడుగా నవతరించుట కేమికారణము గలదు? కావున గజాననుఁడు శివవీర్యసంభవుఁడు గాఁడని తేలుచున్నది. కావుననే నలువ శివవీర్యసంభవుఁడుతక్క నితరు లా తారకు నుక్కడంపలేరనియుఁ, గుమారసంభవమునకుఁ గారణమైన పార్వతీపరమేశ్వరసమాగమమునకుఁ బ్రయత్నింపుఁడనియుఁ జెప్పుట సంగతమగుచున్నది. ఈవిషయమును బాగుగ విమర్శించినచో నన్నెచోడునిగ్రంథమునందలి గజాస్యజననాదికథలు కావ్యమున కుపస్కారకములు కావు సరేకదా, మీదుమిక్కిలి యౌచిత్యభంగము నాపాదించుచున్నవని తేటతెల్లమగుచున్నది. రామాయణమునందును, గాళిదాసకుమారసంభవమందును గల పరమేశ్వరుల గజారణ్యగజరూపవిహార, గజాననజనన, గజాననచరిత్రము లేపురాణమున నున్నవో!

ఇట్లే కుమారజననోత్తర కథలు కూడ ననౌచిత్యమునే ప్రకటించుచున్నవి. కుమారసంభవ పదమునకు కుమారస్వామి పుట్టుటయని కదా యర్థము. కావున నీ కథ కుమారజననముతోడనే ముగింపఁబడినఁ బేరు సరిగా నుండును. తారకాసురసంహారాదులు వర్ణింపఁబడినచో నీపే రాకథల సూచింపఁజాలదు. అపుడు కుమారవిజయమనికాని, తారకాసురసంహారమనికాని గ్రంథమునకుఁ బేరుంచిన నుచితముగా నుండును. కాని అట్లు పేరిడక కాళిదాసగ్రంథమునకువలెనే నామకరణముగావించియు నుత్తరకథల రచించుట కేమి హేతువో? కాళిదాస గ్రంథమున నుత్తరకథలసూచన మొక్కింతమాత్రము గలదు.

శ్లో. తస్యాత్మా శితికంఠస్య సైనాపత్య ముపేత్యవః,
మోక్ష్యతే సురబందీనాం వేణీ ర్వీర్య విభూతిభిః.
—స. ౨, శ్లో. ౬౧.

సూచనామాత్రమున నున్న యీ శ్లోకభావము ననుసరించియే చోడుఁ డుత్తరకథలనెల్లఁ దన గ్రంథమునఁ జొప్పించినవాఁడు. తారకునకుఁ గుమారుఁడు సందేశమంపినసందర్భమున నన్నెచోడునిగ్రంథమునఁగల విషయము చూచిన నాతఁడు పైశ్లోకము నాధారముగాఁ గొనియే యుత్తరకథల రచించెనని స్ఫురించుచున్నది.

చ. మురమున నోడి దానవుల
తోడి విరోధము వీడి భక్తితో
సురపతి వచ్చి నాశరణు
సొచ్చి తగం జెఱిలిచ్చియున్ననేఁ
గరుణయు పుట్టి తెమ్మ పాడ
గట్టి శమించినయట్టి నాకుఁ దా
నిరవుగఁ బూని మార్కొనియె
నేని సహింతునె వాని నెల్లెడన్.
—ఆ. ౧౦, ప. ౨౦౬.

గీ. భక్తిగీప్పడి సేనానిపనుపు సేసి
తడవులేదేని గలిగెరే నడవుమొండె
వెఱవు సేయక దివిజుల చెఱలు లేక
వినువుమొండేని మన్నాస వినువుమొండె.
—ఆ. ౧౦, ప. ౨౦౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. చెలులు విడుమనిన పలుకద్ద
 ద్దాలిని గొని చూడినట్లు గొని కాలగ బి
 ట్టలిఁ గోపవహ్నిఁ జూచెం
 జులచుటి మదకరికి సిగ్గు చూపినభంగిన్.

—ఆ. ౧౦, ప. ౫౦౯.

ఉ. నన్నలి శ్రీపురం జెలుల
 నాకిపకాంతల దేరఁ బంచె నే
 పన్నగ యక్షసిద్ధ సుర
 పాలకు లాదిగ వేల్పులెల్ల నే
 నన్న భయంబుఁ బొందికల
 హంబున కెక్కరు నిన్నఁ బుట్టి తా
 నెన్నఁడు బ్రాఁతియయ్యె మఱి
 యెన్నఁడు నేర్చెను వెక్కిరింపఁగాన్.

—ఆ. ౧౦, ప. ౫౨౦.

క. దనుజేంద్రుఁ జెలులు విడుమని
 పెనగెడు పులిగొన్న మృగము పెట్టునఁ బడు నే
 చనుబాలుం... షది వెనుక
 యని వెలువడి జిక్కఁ ద్రోవ నలచియె నీకున్.

—ఆ. ౧౦, ప. ౫౩౬.

క. ఇమ్మెషపున నిజసర్వ
 స్వమ్ము గళత్రంబునైనఁ జను నీఁగఁ బర
 స్వమ్ముఁ గళత్రము పరులకుఁ
 గ్రమ్మఱ నొప్పించి మనుట కార్యము గాదే?

—ఆ. ౧౦, ప. ౫౫౭.

సీ. బాహుబలోన్నతి పాటించి రాక్షసా
 ధీశుపట్టిన చెలులెల్ల విడిచి
 షణ్ముఖు నురుభుజాస్తంభాగ్రమున జయ
 శ్రీ వొల్చె సాలభంజికవిధమున.
 ................... —ఆ. ౧౨, ప. ౮౭౪.

ఈయెత్తి మాపినయుదాహరణములవలన చోడుఁడు కాళిదాసశ్లోకభావమునే ప్రధానముగా మది నుంచికొని యుత్తరకథల సంధానించెననుట నిస్సంశయముగఁ దేలుచుండుటలేదా? దీనినిబట్టి నన్నెచోడుఁ డెల్లవిధములఁ గాళిదాసకుమారసంభవమునే మూలముగాఁగొని దానిలోని యుత్తమంబులగు పద్యరత్నంబులనెల్ల ననువదించుచు నెడనెడ స్వకపోలసాధితములగు పద్యములఁ గూర్చుచు రచింపఁదలంచెననియు, గ్రంథవిస్తరీకరణబుద్ధిం బడగు కవి మూలముకన్నె ద్విగుణితముగఁ దనస్వకపోలకల్పితకల్పనములఁ జొప్పించెననియు, కథాసంవిధానవిషయమునఁ గూడఁ గాళిదాసుని రచనాప్రణాళిని విడువక స్వతంత్రముగ నితరకథాభాగములఁ గూర్చెననియు విదితమగుచున్నది.

పాఠకుల స్పష్టప్రతిపత్తికై కొన్ని యాంధ్రీకరణముల నిటఁ జూపెదను:

శ్లో. రథః క్షోణీ యన్తా శతధృతి రగేంద్రో ధను రథో
 రథాంగే చంద్రార్కౌ రథచరణపాణి శ్శర ఇతి,
 దిధక్షో స్తే కోఽయం త్రిపురతృణ మాడంబరవిధిః
 విధేయైః క్రీడన్త్యో నఖలు ఫలతంత్రాః ప్రభుధియః.

—పుష్పదంతరచిత శివమహిమస్తవము.

సీ. ధరణీతలంబెల్ల నరదంబు చంద్ర
 బింబము ల్చక్రముల్ ప జవాశ్వ
 ములు వేదములు పగ్గములు చతుస్స్వరములు
 ప్రణవంబు గసగోల బ్రహ్మ సూతుఁ
 డగపతి విల్లు పన్నగపతి గొనయంబు
 హరి గోల గరి గరుం డనల మమ్ము
 పవనుండు వేగంబు దివిజగణంబులు
 వెరపులై యీశుండు పురము లేయఁ
 దలచినంతన బోరన దమకు దార
 వచ్చి కెలసంబు సేసిన కారె
 వీరిఁ బట్టి పరమేశుని తు ననఁగ
 వలదు నీ కీశుఁ డేలిన డు కాఁడె?

—ఆ. ౨, ప. ౧౬౦.

పుష్పదంతునిశ్లోకమునంగల యుద్ధపరికరములెల్లఁ గుమారసంభవమున గ్రహింపఁబడినవి. అధికముగ వేదములు గుఱ్ఱములు, పగ్గము లుదాత్తానుదాత్తస్వరిత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చెన్నపురి చిత్రములు (౧౯౩౪)

(Koma Photo Service, Triplicane, Madras.)



౧. సెంట్రలు స్టేషను

CC-0. Jangamwadi Math Collection. Digitize



౨. జనరల్ హాస్పిటలు
(ముందువైపు)



3. జనరల్ హాస్పిటల్
(పడమరవైపు-క్రొత్తకట్టడములు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రత్యయములను నాలుగుస్వరములు, ప్రణవంబు కసగోల (కళ),పన్నగపతి వింటినారి,పవనుఁడు వేగము ననుపరికరములు చేర్కొనఁబడినవి.

శ్లో. రథితస్తో గజః పద్మాం
స్తత్పృష్ఠ్యా న్నాధితుం క్షణాత్,
సరో విశతి న స్నాతుం
గజస్నానం హి నిష్ఫలమ్.

కువలయానందంబున నొక్క ప్రాచీనకవిరచితంబగు నీశ్లోక ముద్ధృతమైనది. దానిని మనచోడుం డీక్రిందిరీతి ననువదించియున్నాఁడు:

"వ. తదవసరంబున ఘర్మాంశుకరాహతి కులికి తదీయాప్తబంధువులైన యరవిందంబుల కలిగి దండింపం జొచ్చునట్లు వేవండంబులు కమలషండంబుల కరుసు దెంచె మహోత్సాహంబున." ఆ. ౧, ప. ౯౧.

శ్లో. మహోక్షః ఖట్వాంగం
పరశు రజినం భస్మ ఫణినః
కపాలం చేతీయ త్తవ
వరద, తంత్రోపకరణమ్,
సురా స్తాంతా మృద్ధిం
దధతి తు భవద్భ్రూప్రణిహితాం
నహి స్వాత్మారామం
విషయమృగతృష్ణా భ్రమయతి.

పుష్పదంతునిచే శివుని సంబోధించి చెప్పఁబడిన యీపద్యము భావమును గుమారసంభవమున సతీదేవి శివునిమహిమ వర్ణించునెడ ని ట్లనువదింపఁబడినది:

మ. త్రిజగన్నాథుఁ బవిత్రగాత్రుఁ గ్రతుమూ
ర్తిం బుత్తు సత్పూజ్యుఁడే
యజినాభీలకపాలశల్యధరుఁ డీ
యజ్ఞాదులం దంది యీ
ద్విజదేవాదులకుం గపాలకవచా
స్థివ్రాతము ల్మేనులన్
నిజమైయున్నవి రుద్రచిహ్నా లివె వీ
నిం బుచ్చి రానేర్చిరే ?
—ఆ. ౨, ప. ౧౫౮.

గీ. వీరికెల్లను దేవతావిభవ మొసఁగు
చున్న పరమేశు రావింప నొల్లననియె
దింక నీయజ్ఞఫలము నీకిచ్చునట్టి
పెద్ద లెవ్వ రీవచ్చినపేళ్లయందు.
—ఆ. ౨, ప. ౧౫౧.

శ్లో. క్రియాదక్షో దక్షః
క్రతుపతి రధీశ స్తనుభృతా
మృషీణా మార్త్విజ్యం
శరణద సదస్యా స్సురగణాః,
క్రతుభ్రేషః స్త్వత్తః
క్రతుషు ఫలదానవ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధా
విధుర మభిచారాయ హి మఖాః.
—శివమహిమస్తవము.

చ. తనరఁ గ్రియాతిదక్షుఁడగు
దక్షుఁడు తత్క్రతువల్లభుండు స
న్మునితతి ఋత్విజుల్ సురస
మూహి సదస్యులు తత్ఫలంబు లిం
దనిశము నిచ్చు నీవడిచి
తప్పె మఖం బిది; కర్త భక్తిమై
దనరనియజ్ఞమైనఁ దుదిఁ
దానభిచారము గాకపోవునే?
—ఆ. ౨, ప. ౨౨౪.

పుష్పదంతరచితమగు శ్లోకము నొక్క ముక్కయైన విడువక నన్నెచోడుఁడు మక్కికి మక్కిగా ననువదించియుండు టీపద్యమున నగపడుచున్నది. ఇతరుల శ్లోకములను, భావములను ననువదించినపట్టు లింక ననేకములు గలవు. వానినెల్ల జూపుట గ్రంథవిస్తరకారణంబగునని విరమించుచుఁ గాళిదాసకుమారసంభవములోని వాని ననుకరించినపట్టులుమాత్ర మీపట్టున నుదాహరించుచున్నాఁడను.

కాళిదాసుఁడు హిమవంతుని భార్య మేనకయాభిజాత్యమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో. స మానసీం మేరుసఖః పితౄణాం
కన్యాం కులస్య స్థితయే స్థితిజ్ఞః,
మేనాం మునీనామపి మాననీయా
మాత్మానురూపాం విధి నోపయేమే.
—స. ౧, ౧౮.

అని గొప్పగా వర్ణించియుండఁ జోడుఁడు దాని విడిచి "నిఖిలస్త్రీరత్నంబైన మేనక నిజాగ్రమహిషిగాఁ బరమ సుఖలీలం బ్రవర్తించుచున్నంతఁ బరమేష్ఠివరప్రసాదం బున." (ఆ. ౩. ప. ౨౬౨) అనిమాత్రము వర్ణించి మైనాకుండు జనించుటకు బ్రహ్మవరము కారణమను క్రొత్తసంగతి యొక్కటి తెల్పుచున్నాఁడు. "వరప్రసాదము" మూలమున లేదు. అది యాతనిచే గల్పితమైన దియే. పార్వతీజననమునకు ముందు మేనాహిమవంతులు శక్తిని దమకుఁ బుత్త్రికగా నుదయింపవేఁడి తపంబొనరించినట్లు, నద్దేవి ప్రత్యక్షమై వరమొసంగి జనించినట్లును గల్పించినాఁడు. కాళిదాసుఁడు మైనాకజనన మునకు ముం దొక్క శ్లోకమునమాత్రము మేనకాగర్భ ధారణవృత్తాంత మించుక చెప్పి పిదప మైనాకజననము నింద్రవజ్రపాతభయమున నంభోనిధ్యవగాహము గూడ నొక్కశ్లోకమున సూచించినాఁడు:

శ్లో. కాలక్రమేణాథ తయోః ప్రవృత్తే
స్వరూపయోగ్యే సురతప్రసంగే,
మనోరమం యౌవన ముద్వహంత్యా
గర్భోఽభవ ద్భూధరరాజపత్న్యాః.
—స. ౧, శ్లో. ౧౯.

శ్లో. అసూత సా నాగవధూపభోగ్యం
మైనాక మంభోనిధిబద్ధ సఖ్యమ్,
క్రుద్ధేఽపి పక్షచ్ఛిది వృత్రశత్రా
వవేదనాజ్ఞం కులిశక్షతానామ్.
—స. ౧, శ్లో. ౨౦

నన్నెచోడుఁడు మొదటిశ్లోకమును విడచినను రెండవ శ్లోకముభావము గ్రహించియే విస్పష్టముగా వర్ణించినాఁడు.

క. మేనకకు నాహిమాద్రికి
మైనాకనగంబుపుట్టె మణికనకమయా
ఖానూనభాపహాసిత
భానుద్యుతి వినితదివిజపతి గిరి పేర్మిన్.

వ. ఇట్లుదయించి మైనాకనగంబు కులిశపాతభీతిం బయోధినిమగ్నుం బైన నపగతపుత్త్రావలోకనసుఖ తత్పరులై చింతించి. —ఆ. ౩, ప. ౨౬౫.

ఈపట్టున చోడుఁడు గాళిదాసునికంటె నౌచిత్యమును బ్రకటించియున్నాఁడు. కాళిదాసుఁడు అప్రధానుఁడగు మైనాకుని జననమునకు ముందు మేనకాగర్భ ధారణవృత్తాంతముఁ జెప్పెఁగాని కథానాయిక యగు పార్వతి జనించుటకుముందు సూచనమైనఁ గావింపక విడిచినాఁడు. నన్నెచోడుఁడట్లుగావింపక మైనాకనగజననము సామాన్యముగా సూచించి పిదపఁ బార్వతీజనన మునకు ముందు మేనాహిమవంతులు శక్తి నుద్దేశించి తపంబొనరించుటయు, నద్దేవి వారికి వరంబొసంగుటయు, మేనాదౌహృదలక్షణములు, పార్వతీజననమును మనోహరముగా వర్ణించియున్నాఁడు.

శ్లో. ప్రసన్నది క్పాంసు వివిక్తవాతం
శంఖస్వనానంతరపుష్పవృష్టి,
శరీరిణాం స్థావరజంగమానాం
సుఖాయ తజ్జన్మదినం బభూవ. —స.౧,౨౩

శ్లో. తయా దుహిత్రా సుతరాం సవిత్రీ
స్ఫురత్ప్రభామండలయా చకాసే,
విదూరభూమి ర్నవమేఘశబ్దా
దుద్భిన్నయా రత్నశలాకయేవ. —స.౧,౨౪

నన్నెచోడుఁడు ఈరెండుశ్లోకములను గ్రమముతప్పించి యనువదించినాఁడు. మఱియు రెండవశ్లోకమును బెంచి వర్ణించినాఁడు.

సీ. వేలావనమునందు విలసిల్లువిద్రుమ
వల్లిక యుదయించు వడువవోలెఁ
బూర్వదిక్సతి కలిస్ఫురణతో నవసుధా
కరరేఖ యుదయించు కరణివోలెఁ
ద్రిదివంబునందు సమ్మదమొందఁ గల్పల
తాంకుర ముదయించునట్లువోలె


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవతానకి శోభావహమ్ముగ హేమ
రాజీవ ముదయించు రమణవోలె
వగవి మారభూమి నై డూర్యముదయించు
తెలుఁగువోలె దిశలు తేజరిల్ల
మానినీలలామ మేనక కుదయించె
రాజవదన శైలరాజకన్య. —ఆ. 3, ప. ౨౭౨

మ. వివిధామోద విమిశ్రితానిలముగ్,
నీవిచె న్మరుద్దుందుభుల్
వివిరె న్నోరన పుష్పవృష్టి గురిసెన్
దేవాంగనాగాన ము
త్సవలీల న్వినిచె న్సమస్తభువనో
త్సాహంబు సంధిల్లె ది
గ్వివరంబు ల్వెలిఁగె న్నిధు ల్వెలిచె న
ర్విం గౌరి జన్మించినన్. —ఆ. 3, ప. ౨౭3.

పై పద్యములలో సీసమునాల్గుపాదములు క్రొత్తగాఁ గూర్చినాఁడు. గీతపద్యము మొదటిపాదమునఁ గాళిదాస వర్ణనము గ్రహించి కొంత మార్పు గావించినాఁడు. రెండవ పద్యములో దేవాంగనాగానము, నిధులు తెలియుటయు నూతనముగాఁ జేర్పఁబడినవి. గౌరి శైశవావ్యవస్థల స్వకీయవర్ణనము చేర్చినాఁడు.

శ్లో. అసంభృతం మండన మంగయష్టే
రనాసవాఖ్యం కరణం మదస్య,
కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం
బాల్యా త్పరం సాథ వయః ప్రపేదే.
—స ౧-౩౧.

వ. మఱియుం గౌమారానంతరంబున లేదీగెకు గవ్వం బెక్కినట్లు పువ్వునకుం దావి పొందునట్లు చిత్ర రూపంబునకు మెఱుంగెక్కినవిధంబున నిఖిలజనమనోభిరామం బగుచు. —ఆ. 3, ప. ౨౮౨.

శ్లో. ఉన్మీలితం తూలికయేవ చిత్రం
సూర్యాంశుభి ర్భిన్న మి వారవిందమ్,
బభూవ తస్యా శ్చతురస్రశోభి
వపు ర్విభక్తం నవయౌవనేన. —స. ౧, 3౨.

చ. మలఁపగనున్న కల్పలత
నున్మథునారి నమర్పనున్న కో
మలతరపుష్పబాణ మిహి
మద్యుతిఁ జూడఁగ నున్న పద్మకు
ట్మల మలరంగనున్న మధు
మంజరి నా మదజృంభితాంగదో
హలరుచి నొప్పె గౌరి నవ
యౌవన సంగమలీల డాయఁగాన్.
—ఆ. 3, ప. ౨౮3.

పైశ్లోకములును, బద్యములును జూచినచోఁ, గాళిదాసుని శ్లోకముల గ్రహించి భావ మించుకమార్చి రచించెననుట స్పష్టముగా నగపడకమానదు. కాళిదాసుఁడు పార్వతీయౌవనావస్థను వర్ణించుచు రచించిన

శ్లో. మధ్యేన సా వేదివిలగ్నమధ్యా
వలిత్రయం చారు బభార బాలా,
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపానమివ ప్రయుక్తమ్.
—స. ౧, ౩౯.

అను శ్లోకమును చూడుఁడు

క. పొరిఁ నుదలము జవ్వనమన్
సిరి గుచముల కెక్క నడవ జేసిన కార్త
స్వరసోపానములన ము
త్తరగలు దను నంగజాధిశరఁగలువోలెన్.
—ఆ. 3, ప. ౨౮౬.

అనుపద్యమున నించుక భావము మార్చి యనువదించినాఁడు.

శ్లో. సర్వోపమాద్రవ్యసముచ్చయేన
యథాప్రదేశం వినివేశితేన,
సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నా
దేకస్థసౌందర్యదిదృక్షయేవ. —స. ౧, ౪౯.

పైశ్లోకమునకు జోడుఁ డీక్రిందిరీతిని వివరణము చక్కఁగఁ గావించినాఁడు:-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. శశిబింబమణి హేమసౌదామనీచయో
త్కరకాంతులన్నియు సరసి తెచ్చి
నవలతాపుష్పపల్లవబిసకోమల
విభవంబు లన్నియు వెదకి తెచ్చి
కర్పూరచందనకాశ్మీరమృగమదా
మోదంబులన్నియు మంచి తెచ్చి
పరివాదినీశుకపరభృతమధుకరా
రావంబులన్నియు రాచి తెచ్చి
హావభావరూపలావణ్యసారముల్
త్రిభువనముల నేర్చి తెచ్చి నేర్పు
నూపదలంచి యాంబురూప జుం డొనరించె
నన నుతింప నొప్పు నగతనూజ.

—ఆ. 3, ప. 317.

కాళిదాసుఁడు యౌవనవర్ణనానంతరమున నొక్క నాఁడు నారదుఁడు పార్వతి తండ్రికడనున్న సమయమున వచ్చి యామెను జూచి యీబాల శివున కేకపత్నియై యాతనిశరీరార్ధమును గ్రహించునని చెప్పినట్లు వర్ణించి నాఁడు:

శ్లో. తాం నారదః కామచరః కదాచిత్
కన్యాం కిల ప్రేక్ష్య పితుస్సమీపే,
సమాదిదే శైకవధూం భవిత్రీం
ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య.

—స. 1, 50.

చోడుఁ డీపట్టున యౌవనవతియగు పార్వతిం జూచి హిమవంతుం డనంతసంతోషమందుచు నీమె కింద్రాదిసురలలో భర్త యెవ్వఁడగునో యని చింతిం చునవసరమున నారదుఁడు వచ్చినట్లును, హిమవంతుఁ డాతని కుచితసత్కారము లాచరించినపిదప నారదుఁడు హిమవంతునకు శివశక్తిభేదంబును పార్వతి పూర్వ ప్రపంచంబువెఱింగించి యాతనికి మనోనిశ్చయంబునేయ నభిముఖుండయి

క. ఈదేవి లోకజనని మ
హాదేవున కగ్రమహిషియై పేర్మి సురేం
ద్రాదుల కర్చితయగునని
యాదేశము సేసి యమ్మహాముని సనియెన్.

—ఆ. 3, ప. 324.

అనివర్ణించినాఁడు. చోడుఁడు కాళిదాసుని శ్లోకమును మాత్రము విడువలేదు. హిమవంతుఁ డింద్రాదిసురులలో నెవ్వఁడు భర్తయగునో యని చింతించు నవసరంబున నారదుఁడు శివభక్తిభేదంబు పార్వతి పూర్వజన్మ వృత్తాంతంబు నెఱింగించి యీదేవి యింద్రాదులకు పత్నిగా నేరదనియు, నర్చనీయయగుననియుఁ జెప్పి హిమ వంతుని మన మింద్రాదులవలన మరల్చి శివునెడ స్థిర మగునట్లుచేయుట యెంతయు సముచితముగానే యున్న ది. కాని మూలమున నున్న "ఏకవధూ" పదమున "కగ్ర మహిషి" యని పరివర్తనము గావించుటయు, "ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య" యను విశేషణమును చేర్కొనకుండుటయు గొప్పలోపము లనక తప్పదు. దక్షరోషమున సతీదేవి శరీరత్యాగము గావించిన నాఁట నుండియే శివుఁడు విముక్తసంగుఁడు, నపరిగ్రహుండునై యొకానొకసమయమున హిమాద్రికిఁ దపం బొనరింప నేతెంచెనని కాళిదాసుఁడు వర్ణించినాఁడు:

శ్లో. యదైవ పూర్వే జననే శరీరం
సా దక్షరోషా త్సుదతీ ససర్జ,
తదా ప్రభృత్యేవ విముక్తసంగః
పతిః పశూనా మపరిగ్రహోఽభూత్.

—స. 1, 53.

శ్లో. స కృత్తివాసా స్తపసే యతాత్మా
గంగాప్రవాహోక్షిత దేవదారు,
ప్రస్థం హిమాద్రే ర్మృగనాభిగంధి
కించిత్క్వణ త్కిన్నరమధ్యువాస.

—స. 1, 54.

పైశ్లోకములను జోడుఁ డించుక భావము మార్చియుఁ బెంచియు వర్ణించినాఁడు :

గీ. సతినియోగాగ్ని మనములో సంతతంబు
దగిలికొని కాల దానికిఁ దనువునేయఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దలఁచియో కాదు నిక్కమ దపముసేయ
వలచియో హిమగిరికి నీశ్వరుఁడు వచ్చె.
—ఆ. 3, ప. 330.

సీ. రసరసాయననిర్ఝరప్రవాహోనూన
గంగాప్రవాహశీకరము లడరఁ
దనుసారనెలరారు ఘనసారసురదారు
మందారచంపక చందనముల
లలితసర్వర్తుకఫలపుష్పపల్లవ
భరితలతా గుల్మతరువనముల
సురుచిరశశికాంత సూర్యకాంతానర్ఘ
మణిహేమమయ కుట్టిమస్థలముల
వంశరుద్రాక్షమాలూర కింశుకముల
హంసకీరమయూరవిహంగమముల
ఋష్యసారంగమృగచమరీ మృగములఁ
బావనంబగు దివ్యతపోవనంబు.
—ఆ. 3, ప. 333.

కని యది సమాధిస్థానంబు గా నర్హం బని స్వీకరించి గణంబుల సందందయుంచ నియమించి తానుదపంబు గావింపఁ బొచ్చెనని వర్ణించినాఁడు. గణము లాతపోవన పరిసరముల విహరించుటయు, వృషభము హిమశిలాతలముల సంచరించుటయుఁ గాళిదాసుఁడును వర్ణించి యున్నాఁడు.

తపం బొనరించుసందర్భమునమాత్ర మిరువుర కును భేద మధికముగాఁ గలదు. కాళిదాసుఁడు తాపస సామాన్యునింబోలి శివుఁడు జపహోమాదిక్రియారూప మగు తపంబు గావించెనని వర్ణింప నన్నెచోడుఁడు అగ్నికాని, హోమమునుకాని పేర్కొనక కేవలము యోగమును మాత్రము వర్ణించినాఁడు. కాళిదాసుఁడు శైవుఁడైనను ద్విజసామాన్యవిహితమగు యజ్ఞాదులందు శ్రద్ధవిడిచినవాఁడు గాఁడనియు, నన్నెచోడుఁడు కర్మను విసర్జించిన వీరశైవుఁ డనియు వీనివలన స్ఫురించు చున్నది. చిత్తగింపుఁడు.

శ్లో. త త్రాగ్ని మాధాయ సమిత్సమృద్ధం
స్వమేవ మూర్త్యంతర మష్టమూర్తిః,
స్వయం విధాతా తపసః ఫలానాం
కేనాపి కామేన తప శ్చచార. —స. ౧, ౫౭.

గీ. హిమనగంబుపైఁ బొలుపొందు హేమశిఖర
మనఁగఁ దనరారు కెంజడ ల్పైనది కట్టి
యందుఁ బుట్టిన దివిజాపగామలప్ర
వాహమన నహిబంధంబువఱల బిగిసి.
—ఆ. 3, ప. 334.

గీ. క్షీరవారాశి కెఱిగిన కారుమొగులు
కరణి శశికాంతవేదిపై గౌరుతోలు
పరచి విలసిల్లు నందుండి పరమవరుఁడు
వొలిచె నొగి మొగులుపైఁ దటిత్పుంజమనఁగ.
—ఆ. 3, ప. 334.

సీ. పద్మాసనస్థుఁడై భావించి శోషణ
దాహనప్లావనతర్పణముల
దేహోదయాత్మప్రతిష్ఠలు విధియించి
యాగమరీతి బ్రహ్మాంగ వర్ణ
విన్యాసములు దీర్చి విమలాత్మదీపంబు
ప్రణవసంపుటముగాఁ బ్రజ్వలించి
వడి బాహ్యావర్తన ల్విడిచి ప్రత్యాహార
గతి మన స్సంతర్ముఖమ్ము సేసి
కన్ను తాసె కాంచి తనయందుఁ జేతోల
యంబు చేసి నిశ్చలాత్మయోగ
మయసుఖామృతాబ్ధి మగ్నుఁడై వరదుండు
నిరతిశయసమాధినిష్ఠ నుండె. —ఆ. 3, ప. 336.

క. అధ్యాత్మమూర్తి బ్రహ్మ హ
రిధ్యేయాత్మకుఁడు సురవరేణ్యుఁడు సకలా
రాధ్యుఁడయి తనరు తాను స
మాధ్యవహితలీయమానమానసుఁ డయ్యెన్.
—ఆ. 3, ప. 338.

గీ. తనకుఁ బర మొండు లేదనఁ దనరి వెలుఁగు
చుండు పరమేశ్వరుండు దా నుగ్రతపము
చేసె భక్తులు దనుఁ బ్రీతిఁ జేరవచ్చు
తెరువుఁ దాఁ దీర్చి చూపెడు తెఱఁగువోలె.
—ఆ. 3, ప. 339.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాళిదాసుని భావమును జోడుఁడు గ్రహించినను అంత కంటె నధికముగా యోగచర్యారీతి తెలిపినాఁడనుట యీపద్యములం దగపడుచున్నది. ఈశ్వరాగమనవృత్తాంత మెఱింగి హిమవంతుఁ డాతనికడకు వచ్చి పూజించి యతని పరిచర్యకై పార్వతిని నియోగించెనని కాళిదాసుఁడు సంక్షేపముగా ముఖ్యవృత్తాంతముఁ దెలిపినాఁడు

శ్లో. అనర్ఘ్య మర్ఘ్యేణ త మద్రినాథః
స్వర్గౌకసా మర్చిత మర్చయిత్వా,
ఆరాధనా యాస్య సఖీ సమేతాం
సమాదిదేశ ప్రయతాం తనూజామ్.
—స. ౧, ౫౮.

శ్లో. ప్రత్యర్థిభూతా మపి తాం సమాధేః
శుశ్రూషమాణాం గిరిశో ఒను మేనే,
వికారహేతౌ సతి విక్రియంతే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః."
—స. ౧, ౫౯.

ఈసందర్భమునఁ జోడుఁడు కథ నించుక మార్చినాఁడు. శివునిరాక విని హిమవంతుఁడు సపరివారంబుగ వచ్చి భక్త్యతిశయమున నర్చించి తన సర్వస్వమును శివుని శ్రీపాదములకడ నివేదించి వినుతించుచున్నంత శివుఁ డాతని గరుణించి యనేక వరంబులొసంగి యింటికేఁగ ననుజ్ఞ యీయఁగా హిమవంతుఁడు శివదర్శనములేక యుండఁజాలననియెను. అంత శివుం డాతని భక్త్యావేశం బెఱింగి "సకలలోకాభీష్ట ఫలప్రద్ధి కేదారుండననుటఁ గేదారేశ్వరుండన నిప్పురమున వసియించెద నోడకుండు"మనియెను. అపుడు గిరీశుండు గిరిశునకుఁ బార్వతి బాల్యంబుమొదలుగఁ జేయుచున్న భక్త్యతిశయంబు వర్ణించి యీబాలను నీకుఁ బరిచర్య సేయ నంగీకరింపుమని ప్రార్థించెను. శివుఁ డవత్త ప్రతివచనుండైన దానికి మహాప్రసాదంబ కన్యాంతఃపురమున గారికి శివు నేమరక సేవింపుమని శిక్షించి చెలికత్తెలతోఁగూడ శివసన్నిధిని దించిపోయెను—అనికల్పించిన యీకథ మనోహర మేయైనను మూలమునందున్న "ప్రత్యర్థిభూతామపి" అనుశ్లోకమును విడుచుటమాత్ర మంత సమంజసముగా నగపడలేదు. కాళిదాసుని శివునకు సతీశరీరత్యాగాదిగ సంగముగాని, యితర వాంఛలు కాని యేవియు లేవు. హిమవంతుఁడు పార్వతి నప్పగించినప్పుడుగూడ నాతనిమనమున శంకాతంకములు లేవు. చోడుని శివునకన్నో సతీవియోగజమగు కామవేదన యున్నట్లును, దానికి శాంతికలిగింపనే హిమాలయమున కేతెంచి చల్లనినెలవున నిలిచినట్లును కనఁబడుచున్నది. కాళిదాసునియర్థాంతరన్యాసముయొక్కయు, చోడుని "యవత్తప్రతివచనుండైన" అను శబ్దముయొక్కయు భావములకు భేదము గనఁబడుచున్నది. కాళిదాసుఁడు పార్వతి పరమేశ్వరు నుపచరించువిధము సంక్షేపముగ నొక్కశ్లోకమున వర్ణించినాఁడు:

శ్లో. అవచితబలిపుష్పా వేదిసంమార్గదక్షా
నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ,
గిరిశ ముపచచార ప్రత్యహం సా సుకేశీ
నియమితపరిఖేదా తచ్ఛిరశ్చంద్రపాదైః."
—స. ౧, ౬౦.

చోడుఁ డీశ్లోకాభిప్రాయమును గ్రహించి విపులీకరించి మిక్కిలి మనోహరముగా వర్ణించినాఁడు.

వ. అంతం బార్వతియు నీశ్వరారాధనాసక్తియు యుక్తయైభక్తియు ననురక్తియు నంతకంత కగ్గలించుచుండ.

సీ. చమరీజబర్హా మార్జనులఁ బరీక్షించి
నయమున సమ్మార్జనంబు సేయుఁ
గర్పూరతైలార్ద్రి కస్తూరికాకర్ద
మంబుల ననులేపనంబు సేయుఁ
గాశ్మీరమాంజిష్ఠగరుడాండ హరినీల
ముక్తాఫలంబుల ముగ్గవెట్టుఁ
గుసుమపల్లవలతాకోరకంబులఁ జిత్ర
దామంబు లొనరించుఁ దావి మిసులఁ
బుష్పమందిర మొనరించుఁ బుణ్యవారి
సౌరభము లించి మణికలశముల నించు
నచలపతిసుత మది నిట్టు లహరహంబు
శివున కనురక్తిఁ బరిచర్య సేయుచుండె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. పొలుపుగఁ జంద్రశేఖరుత
పోవన మంగజచక్రవర్తిదో
ర్బలమున ముట్టి చూఱఁగొనఁ
బంచిన దండొకొనాఁగఁ బొల్చు క
న్యలు దనుఁగొల్చిరా నచల
నందన సుందరలీల నిచ్చటం
గొలుచుచు నుండె భక్తి సహి
కుండలమండితగండమండలున్.

సీ. మొన లావులించి వాసనసల్లఁ బసిగొని
లేఁదేఁటిగము లేఁగు లింపకుండ
సెడ సూఱఁగొని వేది సుడియు లెమ్మెరలచేఁ
బొడము పుప్పొడి పొలిపోవకుండఁ
దరణిహాటమున మే యొరలి పద్మిని పేన
మొలతెంచు మధుమద మొలుకకుండ
మేల్కని గోమిని మెలఁగి మైమరిసినఁ
బొదిగొన్న యకరువు సెదరకుండఁ
కెలిసె జక్కవ లొండొంటిఁ గలయఁ దారు
కలకలంబున రేకులు గదలకుండ
మున్న కొనివచ్చి గణికాసమూహితోడ
గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు.

—ఆ. 3, ప. 3౮౮.

శివు నం దిప్పట్టునఁ బార్వతికి భక్తి వర్ణించుట యుచితము గాని యనురక్తివర్ణించుట సమంజసముగాఁ దోఁపదు. కాళిదాసునివర్ణన మెంతయు ననుగుణమై యున్నది. చోడుఁడు పైపద్యములందు రెండుస్థలము లందు ననురక్తితోడనే పార్వతి శుశ్రూష మొనరించు చున్నదని చెప్పుటయేకాక నాలవయాశ్వాసాది నున్న

క. వినుతింపఁ గామసుఖసా
ధనముగ గౌరి చంద్రధరుఁడు తపస్సా
ధనముగఁ జరించె నుత్తము
లనయము విపరీతవృత్తులైనను జనదె.

—ఆ. ౪. 3౫.

అని కంఠోక్తిగాఁ జెప్పుట మిక్కిలి రసభంగము నాపా దించుచున్నయది. ఇంక నిట్టియుదాహరణములు కొన్ని యున్నను వానినెల్లఁ జేర్కొనుట గ్రంథవిస్తరకారణ మని యింతతో విరమించుచున్నాఁడను.

---

# ఆతిథ్యము

తనికెళ్ల భానుమూర్తి

కందిపోయినదొక్కొ కఠినకర్కశశబ్ద గమనంబుచేఁ బాదకమలయుగళి ?
బెదరిపోయినదొక్కొ భీకరపదసముజ్జృంభణచేత నక్షిద్వితయము ?
సడలిపోయినదొక్కొ సందర్భశూన్యసమాసాల నవయవమహితపుష్టి ?
చెదఱిపోయినదొక్కొ ఛిద్రభావసమన్వయముల ధమ్మిల్ల మందంద పెనఁగి ?
*          *          *          *          *          *
కలము దేశాన నిపుడు నిన్గారవింప-నింక నీకీవిచారమదేల ?—యభిన
వాంధ్రకవితామతల్లి ! రావమ్మ, నాదు - గృహమునందున నాతిథ్య మిడుదు నీకు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకాశమునఁ ద్రాకి యమృతాంశు డీకొని సేర్వడ్డసౌధాల బిగురు లేదు
మేరునగముపై దుమారంబుతోఁ గూడి జొబ్బిలు హేమవస్తువులు లేవు
నక్షత్రపంక్తిలోనకురాఁగ దారిడఁ గల్గిన సోరణగండ్లు లేవు,
రాత్రి యానంత వర్షపుబిందువులఁ జార్చు హిమరశ్మికాంతము లిందులేవు ;—
ఐన, బురదతోఁ జూడ నేహ్యముగ నుండు-గ్రామ్యపుంగూర్పులుంగావు;—కల్మిబట్టి
సొంతముగ సేకరించిన సొత్తులిచటి-మాగృహోద్యానతతులు,—రమ్మా! లతాంగి.

ప్రకృతిసిద్ధములైనట్టి వస్తువులనె - ఇచట నిల్పితిమి ;—ఇదియ మా కిష్టమగును
బూటకమునకు రవ్వంతచోటు లేదు - సుమ్ము మాపేటలోని యెచ్చోటనైన.

బుజము కాయలు గాచిపో నీరువోసి "పార్వతి" పెంచు మల్లికావితతి యిద్ది ;
చేత నెత్తురుగారురీతి గొప్పిడి "కృష్ణ" పెంచు గులాబి వీక్షించు మిద్ది ;
ఎండవానల శ్రమ మింతయనక "లక్ష్మి" పెంచు చామంతికావితతి యిద్ది ;
ముదురాకు ద్రుంచి ప్రేముడి "సుబ్బ" ప్రోదిసేయుచు నున్న చంపకనిచయ మిద్ది ;

* * * * * *

ఎన్నియో, మొన్ననాటిన సున్నితంపు - పూలమొక్కలు, కువలయపూజ్యకవి వి
హారయోగ్యకాసారంబు లమరియున్న - విందు ;—విహరింపుమమ్మ యానందమెసగ.

దూపించనిమ్ము చందురుజిగితేట వెన్నెల లాన లేని తాంత్రికవలయము
నిరసించనిమ్ము వినిర్మలహిమజల మంటని శాస్త్రి ధారాటచయము
గర్జించనిమ్ము పంకజముల గ్రహియించ నేరని సుకవి కంఠీరవములు
ఇగిలించనిమ్ము పంజ్లెట్టగులాబిసొం పెఱుఁగని పండిత విషఫలతతి
ఎవ్వ రేమన్న నంత నీ కేలనమ్మ - కలుగరో! ముందు నినుమెచ్చఁగల్గువార
లాంధ్రదేశాన !—రమ్మ కలాప్రపూర్ణ! - అబల! మాయింట నాతిథ్యమందె దీవు!

పూర్వాచార్యుల కట్టుబాటులకు వంపుంబొంది, స్వేచ్ఛాగతుల్
నేర్వ న్లేక కలాప్రకాశమునకున్ క్లేశంబుతో నుంటి వాం
ధ్రోర్వి న్నాడు ;—ఇపు డాంధ్రనూత్నకవితోద్యోగంబునన్ మించు నీ
సర్వవ్యాపి కలాప్రకాశమునకున్ సంతోషముం బొందుమీ !

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

అడవి శంకరరావు, బి. ఏ., యల్. టి.

## కవిత్వము—దానిని గురించిన యభిప్రాయములు

సుప్రసిద్ధులైన తిరుపతివేంకటకవుల కవితాధోరణి నేఁటివారికి చాలమందికి పరవడియై యున్నది. వీరికవిత్వము మృదుమధురమై, శైలి ద్రాక్షాపాకమున నుండి మిక్కిలి మనోహరముగ నుండును. కొన్ని పద్యము లీక్రింద నుదాహరింపఁబడినవి:

"చతురంభోధిపరీతమైన ధరణీ
చక్రంబుశాసించి, భూ
పతివర్గం బరిగాపులై కొలువ సే
వానమ్రరాజేంద్రమా
ళితలాలంకృతరత్నదీధితిసరో
లీనుండవై యుండు నీ
స్థితి యీరీతిగ నేఁటికిం బరిణమిం
చెంగాదె దుర్యోధనా!" (పాం. విజయము.)

"బావా! నీపయిఁ గోపమేమిటి కహో!
బ్రహ్మాస్త్రముం దీయునే
యేవాఁడేనియుఁ జాటకైరముపయిన్!
హేయాలిహేయంబు గా
దే వీరుం డటుచేసినన్; కడమసం
దేహంబు లేకుండ వా
చావైదగ్ధ్య మెలర్పఁ జెప్పి కురురా
జప్రీతి సంధింపుమా." (పాండవోద్యోగము.)

"కాటికిఁ గాళ్లుసాఁచికొని
కాలుపురమ్మన నిల్లుగట్టు, నా
కేటివివాహ, మేటిసుఖ,
మేటికి నిచ్చిన మేలుఁగాక నా
బోటికిఁ గన్య నిత్తురె ప్ర
భూతరుజావృతమైన మేనితోఁ
గూటికి గుడ్డకున్ బరుల
కొంపకుఁ బోయెడివాని కక్కటా!"
(ఏలామాహాత్మ్యము.)

"మానముపోవు స్వాంత మవ
మానమునన్ సహియించు, రాగి యే
గానికి మారనట్టి పలు
గాకియు గౌరవపాత్రుఁడై తనన్
న్యూనతపాలుచేయు నొక
నూతనచింత ఘటిల్లు, నెందుకున్
దా నధముండు, దుర్లభప్రఁ
దన్వికి లోఁగు నెవం డధీరుఁడై."
(పండితరాజము.)

### సమస్యాపూర్తి

అవధానములలో వీరు సమస్యలఁ బూర్తిచేయుట చాల నింపుగ నుండును.

సమస్య—గణచతుర్థి నాఁడు ఫణిచతుర్థి.

"ఎన్ని దినములాయె నిటు నన్ను డించి నీ
వరిగె" యనినఁ బత్ని కనియె భర్త
నేఁటి కన్నఁగఁ బదినెల లాయెగా! నేఁడు
గణచతుర్థి, నాఁడు ఫణిచతుర్థి."

సమస్య — పాదమ్ములు లేనితరులు పరుగిడఁ జొచ్చెన్.

"ఏదెస వానలు గురియన్
గోదావరి పొంగివచ్చె, గుములుగ నందున్
వేదొరలి నీట దృఢతర
పాదమ్ములు లేనితరులు పరుగిడఁ జొచ్చెన్."

సమస్య—మందారముఁ జూడ నెంతురె ఘనం బనునట్టి గులాబిముందరన్.

"ధీరత గల్గి చక్కనగు
తెల్వియుఁ దేటయుఁ బొల్చి మేల్మిబం.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గారమురీతిగాఁ గవిత
కల్పనచేసెడివార లుండ, శు
ష్కారుతరోక్తులన్ గొనఁగ
నొప్పుదురే సుకవీంద్రు లెందు, మం
దారముఁ జూడ నెంతురె ఘ
నంబగునట్టి గులాబిముందరన్."

"కాలముఁబట్టి దేశమునుఁ
గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాఱు టది
సత్కవిసమ్మత మాట, నన్యదే




[illegible] శాస్త్రి

శ్యాలను నాంధ్రభాషఁ గల
వౌటను, నాచిలిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మది
పండితు లేగతి నొప్పకుందురో."

## ఇతరభాషాపదములు

వర్తమానయుగమున లాక్షణికకవులలోఁ బరి
గణింపఁదగిన ఈమహాకవులు తమకావ్యములయందు నితర
భాషాపదములను యథేచ్ఛగా నుపయోగించి సరియైన
మార్గము నితరకవులకు నిరూపించినారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని "పాణిగృహీత" యవతారికలోను, "మే మీలక్ష్మణాపరిణయములో నచ్చటచ్చటఁ దెలుఁగులోఁగలిపి జనులు వాడుచున్న కొన్ని యితరభాషాప్రయోగములను రసానుగుణముగా నంగీకరించి ప్రయోగించియున్నారము. దానికిఁ గవిత్రయేతరులగు మహాకవు లనేకులు మార్గదర్శకులై యుండిరని మీకుఁ జెప్పుట పునరుక్తియకదా ?" అని లక్ష్మణాపరిణయపీఠికలోను తమ మతము నిందువిషయమై వీరు స్పష్టపరచినారు. ఇతర భాషాపదము లెంతస్వేచ్ఛగ వీరివలన నాడబడినవో యీక్రింది పద్యములవలనఁ దెలియఁగలదు:"

"నలినాక్షప్రభృతుల్ త్రిమూర్తులు, "గవ
ర్నర్లై సుర లిక్టరిందవ
ర్తిలు సుద్యోగిజనంబులై ఘనమణి
ద్వీపంబును న్లండనై." (బుద్ధచ.)

"అయిదునిమేషముల్ "టయిము"
నర్పణఁజేసియు నైదుయామముల్
పయినెలలైదు.. ..." (గీర.)

"...........లోకు లా
డను మఱి సాహసింతురను
"డా"టూక కొంతయు నాకులేదు"
(నానా.)

"'స్కూలునఁ' దెల్గు "టీచర"ని
క్షుద్రులు కొందఱు నన్ను సారెకున్
హేళనసేయుచుండినను
నిప్పరి యోగ్యులు సేయు సత్కృతిన్
జాలినయంత సంతసము
స్వాంతమునం గనుచుందు "హిందు హై
స్కూలుసొసైటి" నాపయిని
గూర్మి విశేషము చూపు......"
(నానా.)

"చేతఁగాని శతావధానిచేతినిండ,
"సర్టిఫికెట్ల"కట్టలే......" (పాణి.)

"పల్లెలలోన "స్కూల్"బడులఁ
బామరసంఘమునొద్దఁ దక్క భూ
వల్లభసత్సభాస్థలుల
వా క్కెటులేచెడి నీకు!......" (గీర)

"ఏకారామయగారి తమ్ములఁట "బీ.
యే. బీ. యల్లై" "ప్లీడరీ"
దాకన్ వచ్చిన మేటియంట!..."(గుంటూరు ఉ.)

"జననమరణాల "లీష్టు" విస్తరమొనర్ప,
నవతరించినయయ్యలే యసదురొక్కొ..."
(గుం. ఉ.)

"　　　　......తా
నే "లా" చూపి యమున్ జయింప మదిలో
నీతండు దా నెంచెనో." (గుం. పూ.)

...ఈయుపా
ధ్యాయునికిన్ "బి. యే. ఎలిటి."
కంబరొ! లేదు కళంకమెయ్యెడన్."
(గుం. పూ.)

"మతిమంతుండయి ఫారసీ చదివి తి
మ్మారెడ్డి "ప్యాసయ్యె"ను
న్నతమైనట్టి "వకీ"ల్పరీక్ష..." (లక్ష్మణాప.)

"వారంటు" గైకొని వచ్చువానికిఁబోలెఁ
గవి కిచ్చుదాత లిక్కాలిఁ గలారె..."
(నానా.)

"ఉద్యోగంబని "ప్లీడరీ"యనియు నెం
తో మంది శ్లాఘింతు రా
యుద్యోగంబుశ్వవృత్తి........." (పాణి.)

"దీన్మాపులా"వారికిన్
వీరల్ దాసులు, వారిభాస తుదక
బ్బెన్ వీరికంచున్ సుతా?" (గీర.)

"......తప్ప దీదినము "క
స్తీ" పట్టు, లీ విప్డు శాం
తిని బోధించెద వూరకుండెదవె! యే
దీ చూత మప్పట్టునన్..." (గుం. పూ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"శ్రీ కంగేల నెసంగు రాచిలుకఁ బే
ర్మిన్ జూచి ముద్దాడి నా
"బాకీ" తీర్పుమటంచు" (లక్షణా)

ఇ ట్లెన్నియేని యుదాహరణముల నీయవచ్చును. ఛాందసులసువారివలెఁగాక దిట్టకవినారాయణకవి పారసీకపదములఁ దనకవిత్వమునఁ జొప్పించి రసపుష్టిని గల్గించినట్లు ఇతరభాషాపదములను రసవంతముగ నుపయోగించుటవలన వీరి కవిత్వమున కొకయందము వచ్చినది.

## ఆంధ్రవ్యాకరణము

సమగ్రమగు వ్యాకరణము ఆంధ్రభాషకు లేని కొరతను, అందువలన ఆంధ్రకవు లవలంబింపవలసిన మార్గమును వీరు చక్కఁగ నిరూపించినారు.

"పరిణతశక్తులైన యల
భారతపుంగవు లట్టులుండ ము
ప్కరుఁ డనిపించుకొన్న కవి
సామజసింహము రామకృష్ణువా
గ్విరచనఁగూడఁ జూడుఁడు ప్ర
వేశఫలమ్ములు చిన్నచిన్నవ్యా
కరణపుఁ బొత్తముల్ గొణిగి
కయ్యముఁ బెంచకుఁ డయ్య వాగ్విదుల్."

"తొలిబాసయందు బలె నీ
తెలుఁగుంబాస వెలుగుంచుదీపము లేమిన్
విలువగల కవుల లక్ష్య
మ్ములె తా మీభారమెల్ల మోయఁగవలయున్."
(పాణి.)

ఇది వ్యవహారభాషావాదుల పద్ధతియే.

## తెలుఁగు—సంస్కృతము

ఆంధ్రకావ్యములలో తెలుఁగు, సంస్కృతములకుఁగల పరస్పర సంబంధము వీరిచే బాగుగ నుత్తింపఁబడినది:

"మాయాస్థానము తెల్గు, సంస్కృతము సాం
బస్థానముం జెంచె నం
బా, యీరెంటిని బ్రాహ్మణప్రవరులే
పాలించు చున్నారు"

అని నుడివి

"తెలుఁగుకవిత్వమున్ సలిపి
ధీవర మాన్యతఁగాంచినా ర్నియో
గులు మును పెంపఁజేనియును
గొందఱు సంస్కృతమందుఁగూడఁ బ్ర
జ్ఞలుగలవార లుండి రొక
సంస్కృతమే తమజీవనంబుగా
మెలఁగిరి వైదికుల్, తెలుఁగు
మీఁదికి నంతగ రారు వా రొగిన్."

అని తెలుఁగుకవులను, సంస్కృతకవులను రెండుశాఖలుగను విభజించినారు.

"తెలుఁగలసంస్కృతమ్మనఁ
దీయనిచుట్టము, సంస్కృతంబొ! ఆ
తెలుఁగునఁ గల్పకున్న యొడఁ
దీపి జనింపదు"

అని తెలుఁగు సంస్కృతముయొక్క సంబంధము వీరు వివరించినారు.

## ఆంగ్లేయవిద్య - ఆంగ్లేయవిద్యాధికులు

నేఁటిఆంగ్లేయవిద్యయందును, ఆంగ్లేయవిద్యాధికులయందును వీరి కంతగా గౌరవభావము లేదు. ఆరోగ్యకామేశ్వరీశతకమున

"పరమాదృష్టము పెట్టి పుట్టినటు లే
భావించి గర్వింతు, దు
స్తర మీహూణశకమ్మునం దితరభా
షన్ బొట్టకై నేర్వకే
సురభాషన్ బఠియించి యక్కతన సం
స్తుత్యుండనై మించితిన్
సిరియున్ సంపదగూడ నీకరుణచేఁ
జేకొంటి కామేశ్వరీ!"

అని ఆంగ్లేయవిద్యను నిరసించుటయేకాక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కలరిక్కాలమునం దనేకులు ధనా
　కాంక్షా ప్రధానమ్ములౌ
పలువిద్దెల్ పఠియించి యక్కలన సం
　పన్నత్వమున్ గాంచి పు
త్రులఁ దద్విద్యలయందుఁ జొన్పెడియిహా
　ర్థుల్; నాకుఁ బ్రాచీనవి
ద్యలయం దెక్కుడు నాదరంబపుట ని
　ట్లర్థింతుఁ గామేశ్వరీ!"

అని తమయభిప్రాయమును స్పష్టపరిచినారు. ఆంగ్లేయ విద్య నభ్యసించి, ఆంధ్రమునఁ గవిత్వము చెప్పువారిని గురించి ప్రసంగించుచు పాణిగృహీతలో

"ఇప్పటికైతగాం డ్రహహా!
　యింగిలిపీ సాకయింత నేర్చి పైఁ
జెప్పెద రాంధ్రపుంగయిత,
　సీ! యని పండితు లాదరింతురే
తప్పులతప్ప లక్కృతుల
　తంపటవెట్టుటకేనిఁ బూర్వమం
దొప్పిరె? వీరిఁ జూచియొకో
　యారక నీరు జనించె వేదుఱుల్.?"

అని నాయకుడు నాయికను మందలించినాఁడు. ఈనాయకునకుఁగూడ ఆంగ్లేయవిద్యాధికులపై గౌరవము లేనట్లున్నది.

## నీరసాశుకవిత్వము

నీరసాశుకవిత్వమును వీరు గర్హించినారు:

"స్వరవర్ణ్యత్వ మెఱుంగకే పొరిఁబొరిన్
　సంగీతముల్ పాడి యె
వ్వరు మెప్పింతురు గాయకోత్తములు వ
　హ్వా నాఁగ? నట్లే పర
స్వరసంధర్భము శ్రోత్రపేయతయు సౌ
　శబ్ద్యంబు లేకట్టులో
విరచింపన్ గవితల్ శ్రవోయుగళికిన్
　విందుల్ ప్రసాదించునే."

"పదనిస, సానిదానిపస,
　పస్నస, రీసరి, గామగారిసా
సదగద, నీసపారి, దరి
　సా, గరిసా, నిరిసాం, రిసారిసా
గదగద, పాదపాద, సద
　గా, పదగా, నిదగా, దగా, దగా,
యిది యొకగానమేని యెది
　యేనిఁ గవిత్వ మగుఁగా మహేశ్వరీ!"

అని 'గుంటూరుసీమ'లో ఆశుకవిత్వమును నిరసించి

"వృత్తవిశేషముల్ చెడి వి
　వేకము పాకము దప్పి సద్గుణా
యత్తతఁ దక్కి శయ్య యొకఁ
　డంతగ బొంతగ సంగ్రహించి, యే
పొత్తును రోయకే పలుకు
　పోకడ నేరిపి, మాదుకైత ను
న్మత్తతమైఁ జరించు కసుమాలగ"
　చేయవద్దని దేవుని వీరు ప్రార్థించినారు.

## విమర్శకులు

కావ్యముల విమర్శించువారిలోఁ గొందఱిని వీరిట్లు నిరసించినారు:

"తనుదుమె లేదొ యంచు మదిఁ
　దత్తరపాటొకయింత లేక "మీ
దను కయితమ్ము సూచితిమి యం
　దిది యిందిది" యంచుఁ బద్దెముల్
దనులుతు రందుకోసమె మొ
　దల్ దమరంపుమ రిక్కవుల్ వృథా
యగుఁ గద వీరిసమ్మతుల
　హా తనువారి కివేల కాల్పనే?

అన్నిపాత్రమ్ములకు మొదలెన్నిపులలో
నిందు నభివందనములతో దండుగకట!
యొక్కఁడేనియుఁ నిజమగు నూహ వ్రాయఁ
డట్లువ్రాసిన నద్దాని నడఁతు రొకట."　　(పాణి.)

## నేఁటి కవులు

నేఁటికవులను కొందరిని వీరిట్లాక్షేపించినారు:

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"తనకు నాల్గు నిఘంటుపదములు వచ్చు
ననుచు పదిమందికిని దెలియంగ మారు
మూలపదములు గుప్పిన ముచ్చటగునె
ప్రతిపదమ్మున రస ముట్టిపడినఁగాక."

"లలితప్రబంధములలో
పల యమకము దూర్చి రసము పాడొనరింపన్
వలయునె? పెరుఁగును వడ్లును
గలపోసిన ముచ్చటగునె కవివరులారా!"

"మతి గలవారికేనియు ప్ర
మాద మెలర్పకపోదు, పుష్పస
మ్మితకవితాలతాంగిని ర
మింపుఁడు కేవలశాస్త్రిలార! మీ
మతులకు వచ్చినట్లు రస
మాధురిఁ గ్రోలుఁడు గాని వ్యర్థపుం
జతురిమఁ జూపి దాని స్తన
శల్యపరీక్ష యొనర్పఁబోకుఁడీ."

(లక్షణా.)

"లజ్జఁగల్గిన పూర్వకాలమ్మునందు
గోటి కొక్కఁడుగల్గెఁబో కుకవి; నేఁటి
కాలమం దేమికర్మమో కవులు నూటఁ
దొంబదులు కుపదమ్మునఁ దూఁగుచుండ్రు."

(పాణి.)

వచనరచన

ఈమహాకవులకు వచనరచనయం దంతగా ఆద రము లేదు.

"గద్యము పద్యగౌరవము
గాంచదు, బ్రహ్మరథమ్ము పట్ట నీ
గద్యకవిత్వచాతురికిఁ,
గన్నులనీరు వృథాగ జార్చుచో
హృద్యవిచారు లెల్లరును
నీతఁడు యోగ్యుఁడు గాఁడటందురే
వాద్యము వీణకున్ సరిగ
వచ్చునె? ప్రాజ్ఞు లెఱుంగకుందురే?
తద్దినముఁ బెట్టువారల తమ్ములబలెఁ
బద్దెపుంగవులకు వెన్క గద్దెపుఁగవు
లుండ్రు, స్త్రీశూద్రజనులకు నుపకరింత్రు
వారు పిట్టకతలు చెప్పువారుగాఁగ.

గద్యము పద్యపున్ రుచిని
గాంచుట నిక్కమయేని త్యాగరా
జాద్యనవద్యగాయకకృ
తాంచితసత్కృతు లిచ్చు మోదమున్
పద్యము యిచ్చు; గద్య మటు
సల్పఁగరాదొకో? వారిసత్కృతుల్
విద్యలతారతమ్య మవి
వేరు లెఱుంగరు, వ్రాతు రేదియో."

(తవిటిరొ ట్టె.)

అచ్చుయంత్రములు-వార్తాపత్రికలు

అచ్చుయంత్రములవలన లాభము లున్నను కొంత నష్టముగూడ గలుగుచున్నదని వీరియభిప్రాయము.

"మునుపు మహాకవీంద్రులు స
ముజ్జ్వలభక్తి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కఁగాని యవి
వేకులకూఁతలఁ తాటియాకులం
దునె నశియించె నోటఁబడు
తుంపురు లేనియ నిప్పు డచ్చు వ
చ్చినకతనన్ జగాన విల
సిల్లెడి మేటికృతుల్ నశించెడిన్."

వార్తాపత్రికలనుగూడ వీ రొకసందర్భమున నిర సించినారు:

"పత్రికలంచు నేవియొ య
వాకుచవాకులు వ్రాయ, వాని సౌ
భ్రాత్రము నమ్మి పండితులఁ
బామరులుం గడుమోసపోదు రీ
పత్రిక లెందుకో? నిజము
పాడఱుకాలము వచ్చెగాక, దు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్గాత్రము లివ్వి వీనినడ
కల్ కడువక్రము లక్రమార్భటుల్."
(గుం. పూ.)

## కవితా రచన

కవితారచనవిషయమై సుప్రసిద్ధులైన వీరి యభిప్రాయములు సంగ్రహింపఁదగియున్నవి. "ఒక్క దేవీభాగవతమందుఁ దక్క తక్కిన యస్మత్కృతులందు తెలుచుగాఁగాని, స్వల్పముగాఁ గాని రేఫశకటరేఫముల యతిప్రాసలయందు గలుపుచునే యున్నారము" అని వీరు ఏలామాహాత్మ్యము పీఠికలో వ్రాసియున్నారు.

"అనరాదుగాని యప్పక
విని "గనుల౯ జనులు మెదలు వేయఁదగని"వం
చనియె, నిని భారతాదుల
గనఁగొనెనో లేదొ శతము గన్నడు నకటా!

తాకను రేఫకు౯ జెలిమి
రాదని పెద్దనివాద పెంచెఁ దా
నే కళనుండి వ్రాసెనొ క
వీంద్రుఁడు నన్నయ, కల్ప మానినా
రే కవులొక్కరే, నుభయ
రేఫలె యవ్వి? నణల్, శసల్, లడల్
గాక యభేద మీయొకటి
కా తగకుండుట ? మేలుమేల్ బళీ!

శ్రీనాథాదుల లేనిలోపములు వ
ర్ణించెన్, రలాభేదసం
ధానంబున్ దెగఁ ద్రెంచె దిద్ది, యది గ
న్నన్ నవ్వరే శాబ్దికుల్?
తానే యేయని లేవసెన్, దనకు నం
తర్వాణులౌ సత్కవీ
శానుల్ వాడిరి విస్తరించుటకు శా
స్త్రంబెట్లు వీ లియ్యెడన్." (పాణి.)

పైపద్యములవలన కవితారచనను గూర్చి వీరి యభిప్రాయములు చాల సరళములైనట్లు తెలియుచున్నది.

## శృంగారరసము

శృంగారరసము ఆంధ్రకావ్యములలోఁ గొన్నిటియందుఁ బోషింపఁబడురీతిని విమర్శించువారికి వీ రిట్లు సమాధాన మిచ్చినారు:

"సంగీతసాహితులు వా
గంగనకున్ గుచములనుట హాస్యాస్పదమం
చుం గన్నులుగా దిద్దెడి
శృంగారవిదుల్ కవీంద్రు లిక్కాలమునన్.

ఇంతమార్దవ మెట్టేఁగెయు, నిహిహి! వీరు
బాలకులకంచుఁ జేసిన పాఠపుస్త
కమున సుఖరోగముల గాథ నిముడఁజేసి
రట నుపాధ్యాయు లెటుచెప్పనగునొ యకట!

కంకురుకుంకలైన పలు
గాకికలార్థుల కెట్లు పాణిమీ
అంకుపురాణముల్ నయభ
రప్రద మంచు వచింప నొప్పు? నా
శంక యొనర్పరే? నగరె?
సర్వము నీతికె యందురేని, మీ
నాంకునిదెల్పు నారతిర
హస్యముఁ బాఠముఁ బెట్టరాదొకో."
(పాణి.)

ఈప్రత్యుత్తర మంత సహేతుకముగ లేదు.

## జాతీయములు

జాతీయములను రసవంతముగను, విరివిగను పద్యములయందు జొన్పించుటచే దిరుపతివేంకటేశ్వరులకైలి విలక్షణమై సరసముగ నుండును:

"అక్షిగినను వచ్చు ద్రవ్యమ్ము లనుగకున్న
రాకపోవునె? మర్యాద రాదుగాని
మనుప! "యేడ్చినదానికి మగఁడు వచ్చి
యేమి లొడికినదానికి రాకపోఁడు.

"హరుచుండి తినిన గుల్లగోపురములు
నాట" విన్నినాళ్లకనును నింట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నున్నద్రవ్య మింక నొండొక్క సదుపాయ
మెద్దియేనిఁ జూచుటే హితంబు.

"మాఱుమనుముదానిఁ జేరంగఁ దీఁన
మొదటిమగనిసొదె మొదలుపెట్టె"
నన్నరీతి నిది రసాభాసమందును
నెక్కుడనుచు మీర లెఱుఁగవలయు.

కడగి "కడవంతసమ్మడికాయ కత్తి
పీట కడుగు లోఁతువ"ని యట్టిపోటినొప్పు
టొప్పిదంబెనియును దీని నొప్పఁబోఁకుఁ
డింతకన్నను జపలురా లెందులేదు." (పాణి.)

" "పంచాంగమ్ములు చించి న
శించెన్ జుక్క"లను గణక శేఖరులకు వీ
రెంచఁగ నన్నలా! తమ్ములా!
కించిత్సంబంధ మున్నక్రియఁ జూపట్టెన్.

"ఎవఁడు వెట్టిముండాకొడు కీనమస్సు
వాని దన నేనె" యనిచెప్పవానిరీతి
నాకుఁ జేయూరినందుకు నవ్వఁబోకు
మయ్య, యేనాఁటి కేమూనొ యరయఁగలమె?"
(గీర.)

"దినదినమున్ జ్వరార్తిమెయి
దేహబల మ్మడివోయియున్న ప
ట్టున ననుఁ జెల్లయాంబిక క
డున్ బ్రియమారఁగఁ బిల్వనంపుటల్
మనమున ఖేదమోహముల
మర్చుకతమ్మన "లంఘనమ్ములన్
మనుసుడు" పన్నసామెతకు
మంచి యుదాహృతి చిక్కె నేఁటికిన్."
(లక్ష్మీనరసాపురము)

" పంచశుభం పంచాశుభ"
మంచున్ బుధులాడుమాట యచ్చుపడఁగ......"
(నం. పూ.)

"ఉన్నది పుష్టి మానవుల
కోయదు భూవరా! యాలజాతికిన్
దిన్నది పుష్టి" నీవరును
దెంచి రథంబున నున్నఁజాలు......"
(పాం. ఉ.)

"........మేసెల్ల పిక్కంచెఁ "బం
డితరీతిః పరదేశ" యన్న పలుకే
నిక్కమ్ము మున్నాటికిన్."
(పండితరాజము)

"మాతను సోదరముఖ్యుల
నీతీగున డించి యేగితే? మిత్రమ నీ
చేఁ "తెవరికి వారే యము
నాతీరే" యన్నమాట నాకున్ దెలిసెన్" (నానా.)

"నారుంబోసినదేవుఁ డెట్టిగతినై
నన్నీరుదాఁ బోయఁడే"
యేరీతిన్ మన కేసుఁ గాలమని లో
నేస్వంగ నేమా?" (కామేశ్వరీశతకము)

" పద్యములు చెప్పఁగాలేని ప్రాజ్ఞులెల్ల
గద్యములు గట్టుదురు గాక "గతియులేని
యమ్మలకు గంజి పానక"మనుసుగాక..."(తవిటిరొట్టె)

ఇట్టి జాతీయములు వీరి రచనలో కొల్లలుగ నున్నవి.

## శతావధానప్రారంభము—ప్రార్థన పద్యములు

శతావధానప్రారంభసమయముల వీరి ప్రార్థనా పద్యములు చాల మనోహరములుగ నుండును. క్రింది పద్యము లిందుల కుదాహరణములు:

"చేసితిమో యెవం డెఱుఁగుఁ!
జేయనె లేదొ శతావధాన మం
బా, సకలేశ్వరీ, గతము
లందఱు నమ్మరు నేఁ డెటో రసా
భాసము గాకయుండఁగఁ గృ
పన్ గను "మెప్పటి కప్పుడే యిటుల్
దోసిలియొగ్గు నీతఁడ"ని
తోఁచి త్యజించెదవేమొ శాంకరీ."
(గుంటూరు)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చెన్నపురి చిత్రములు




౮. యం. యస్. యమ్. రైల్వే కార్యాలయములు
(కథియవాడునుంచి కొనితెచ్చిన రాళ్లతో కట్టబడినది)
ముందున్నది ఇటీవల తయారుచేయబడుచున్న క్రొత్తరకపు ట్రాంబండి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౫. పచ్చయప్పకాలేజి




౬. వై. యం. సి. ఏ. భవనము



౭. బర్మాషెల్ కంపెని కార్యాలయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రొత్త (అమెరికా) రకపు అందమయిన కట్టడము

"వయసా హెచ్చెకి బట్టకట్టె తల్రతి
పృథ జొచ్చె నానా ట నీ
దయయున్ బ్రాజ్ఞుల బ్రేరకత్వమును వి
ద్యాపక్షపాతంబు ని
న్నియు నేకీకరణంబుగా గృహమున
న్నేఁ దీరిహూర్చుండ లే
క, యెవో నేయఁగ వచ్చినాఁడను జుమీ
కాత్యాయనీ కావుమీ"

(వేమవరము)

"మానియుఁ జేయఁబూనిరని
మాపయిఁ గోప మదేల నీకు, మా
పై నెనరూను బ్రేరకుల
పై ననురాగ మదేల ? యెట్టులోఁ
పూనితి మిప్డు పొమ్మనినఁ
బోదుమె ? "పోట శిరమ్ము ద్రుక్కి జం
పునఁ బనేమి ర్ఁకలి"క
టోనటియింపు శతావధానమా !"

(పినపాడు)

"జననీ రమ్మ ! శతావధానము ! భవ
త్సామ్రాజ్యసంపత్తి మా
దనియున్, మే నులదానివీనుటకునై
యత్నించినన్ దగ్గనా
ధునిలేమిన్ మముఁ దాను వీడదనియున్
దొల్లొల్త "బెల్లంబువం
డిన దీపాయ్య"నియున్ దలంచు జనులన్
దేలింపుమీ సూక్తులన్."

(లక్ష్మీనరసాపురము)

## కవి. కవిత్వము

కవియనఁగా నెట్టివాఁడో, ఆతని కట్టిసాధన సంపత్తి యుండవలయునో తిరుపతివేంకటకవులు పెక్కు సందర్భములఁ జక్కఁగఁ జర్చించియున్నారు. ఇరువదినాల్గువత్సరముల ప్రాయమున వీరిచే రచింపఁబడిన శ్రవణానందమునందు కవిత్వమును వీ రిట్లు వర్ణించినారు:

"పాపిష్ఠిరాజులపాలివయ్యామ్మ సం
ధ్యావందనమునకు బావగారు
పరదేశసంచారకరణమ్మునకు రైలు
జపతపమ్ములకెల్ల సవతితల్లి
ముక్తికాంతాసంగమునకుఁ దారుపుఁగత్తె
సద్యశోవ్యాప్తికిఁ జాటుడప్పు
ఆనందమునకు దివ్యాంగనాసంగంబు
రాజసంబునకు గారాలహూచి
భాగ్యభోగ్యములకు నెల్లఁ బట్టుకొమ్మ
యఖిలవేత్తృత్వమునకు దివ్యాంజనంబు
సరసజనులకుఁ గర్ణరసాయనంబు
కవిత యిట్టిది యని చెప్పఁగాఁ దరంబె."

"వ్యాకరణము తెలిసినఁ గవితాకల్పన లేదు. సుకవితావిదుఁడైనన్ వ్యాకరణమురా" దని ఏలా మాహాత్మ్యమునందును, "యతియున్ బ్రాసయుఁ గూర్చుమాత్రఁగవియే, యామాత్రపుం దెల్వి యీ క్షితి యంబ్రహ్మలకుండఁ దెంపలేకి ?" అని గీరతమునందును నేఁటి కవుల నాక్షేపించిన వీరు కవితోపాసకులు.

"పలుకులకల్కి నేర్పినను
భాషితముల్ జతఁజేసి, కచ్ఛపిన్
బులుకఁగఁజేయు దానికి ను
పశ్రుతిగా శ్రుతినిందు సేయుచున్
కలకలలాడు కంకణని
కస్వర సుస్వరమట్టులుండు"

పలుకులతోఁ గవిత్వమును జెప్ప నేర్తురేని వారు

"చదువ గావలె శబ్దశాస్త్రాదికమ్మును
వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణులసభల్
పొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ
బడవలెఁ బడరాని పాటులెల్ల
వినఁగావలెను బూర్వవిద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందః ప్రశంస"

అనియు,



3- 5 3౦౦ CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కవులు కవులన్న మాత్రాన కవులుకా" రనియు నుపదేశించినారు.

"శతావధానముస్తరకవితా ప్రచారచణతాజనితా
ఖిల దిక్ప్రపూరిత స్ఫురితయశస్కు" లగు తిరుపతి వేంకటకవులను

"కలముంబట్టి కవిత్వమల్లు బుధలో
కంబెల్ల వేనోళ్ల మీ
లలితంపుం గవిత న్నుతించి రుచిరా
లంకారముల్ భావలో
పలిమేల్పలుకులం గొల్లలాడె"

నని బలిజేపల్లి లక్ష్మీకాంతకవి స్తుతించినాఁడు.

"పూరించినారు మంజురస
ఘూర్ణిత దివ్యకవిత్వ మే
పార ననేక కావ్యముల"

నని రాయప్రోలు సుబ్బారాయకవియు వీరిని గీర్తించి నాఁడు. కవితామాధురి నాంధ్రలోకమున కలవఱఁచేసిన బలిజేపల్లి లక్ష్మీకాంతము, రాయప్రోలు సుబ్బారావు వంటి కవుల శ్లాఘ నందిన శ్రీ వేంకటశాస్త్రి గారి కవితారచన నేఁటి యాంధ్రకవిత్వమునఁ జేరొందిన యనేకులకు సరుపీరమై యున్నది.

---



మధుర దేవాలయప్రాకారమునందలి ఆదివీధి

—యస్. శంకర సుబ్రహ్మణ్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రాయబారము

వంగోలు వేంకటరంగయ్య, బి. ఏ., బి. యల్.,

ఈ పేర నిటీవల రెండు గ్రంథములు గంజాము మండల ముఖ్యస్థాన మగు బరంపురమునుండి వెలువడినవి. రెండును మంచి చక్కని తెలుగున వ్రాయబడినవి. ఇందొకటి వేగుచుక్క-గ్రంథమాలలో రగి-వదిగ ప్రకటింపబడినది. దీని రచించినవారు భాగవతుల నరసింహ శర్మగారు. వీరి గ్రంథమున రాయబారమునకు పూర్వాంగ మగు భారతకథాసన్నివేశప్రశంస కొలదిగ జరిగి యావల రాయబారవృత్తాంత మారంభ మయినది. ద్రుపదపురోహితదౌత్యము, సంజయ రాయబారము, శ్రీకృష్ణసందేశము మూడును గలవు. గ్రంథసరళి బహువిపుల ముగను, పౌరాణికఫక్కి-క ననుసరించినది గను ఉన్నది. ప్రతి ప్రకరణమునకును మేలుబంతిగ గ్రంథాంతరములనుండి పద్యమో, శ్లోకమో కూర్పబడియున్నది. మఱియు గ్రంథమునం దంతటను కథానుసూచకములగు సామెతలు, న్యాయములు ప్రయోగింపబడియున్నవి. సామెతలు సామాన్యముగ ప్రతి పుటయందును గానవచ్చెడిని. న్యాయములలో ఘట్టకుటీప్రభాతన్యాయము, సింహావనగుప్తిన్యాయము—ఇట్టి కొన్ని యపూర్వ న్యాయములు జేర్పబడియున్నవి. పాండవులకు రాజ్యభాగార్హత కలదా, లేదా యను ప్రసంగమువాడమ, అధునాతన మగు అవిభాజ్యసంస్థానశాసన ( Impartible Estate Act ) ప్రశంసయు జేయబడియున్నది. ఈ విధముగనె ఇంక ననేకములగు ఐదానీంతన విషయములును స్పృశింపబడియున్నవి. ప్రజాపాలనము ( Democracy ) ను గూర్చిన ప్రసంగమునకు అవకాశము గల్గించుకొనబడియున్నది. ఇట్లెల్ల నూతనప్రచార పరిచయమును మెండుగ జేయబడియున్నది. ఈ గ్రంథమున నందందు చేయబడియుండు అహింసాసిద్ధాంతమును పాఠకమహాశయులెట్లు గణింతురో విచారింపవలసియున్నది.

దౌత్యవిషయమున సంజయుని చిత్తవృత్తికిని, శ్రీకృష్ణుని చిత్తవృత్తికిని గల భేదము లెస్సగ జూపబడినది. సంజయు డంతరాత్మచే పాండవపక్షపాతిగ నున్నను కౌరవులదూత యగుటచే నిష్కల్మషముగ నిజస్వామిసంకల్పము నుద్ఘటించినాడు. శ్రీకృష్ణుడు కేవల పాండవపక్షమునే యూనిచెప్పవలసినవాడై యున్నాడు. ఈ యిద్దరిలో సంజయునిస్థితి కష్టతరముగ దోపగలదు.

కర్ణుని ఋజుప్రవర్తనను, ప్రభుభక్తిని, ఆశ్రితపరత్వమును కుంతియు, శ్రీకృష్ణుడును సడలింపలేకపోయిరి. ధృతరాష్ట్రుని యధీరతయు, స్వాత్మదార్ఢ్యశూన్యతయు, దుర్యోధనుని మూర్ఖతయు, దుశ్శాసనుని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుండగమును, సాత్యకిన్యాయ్యరోషావేశ మును బాగుగ వర్ణింపబడినవి.

సంభాషణలు తగిలినచోట్లనెల్ల గ్రంథ కర్త ఆధునికములగు పల్లికుమిాటింగులవ్యవస్థ ననువదించియున్నాడు. విద్యార్థులు గాని వారికిని ఉపయుక్తమగులాగున నీగ్రంథము పురాణప్రవచనధోరణి ననుసరించి హృద్య మైయున్నది.

రెండవరాయబారగ్రంథము దేవరాజు వెంకటకృష్ణరాయవిరచితము. దీనిరచన ప్రౌఢరీతి ననుసరించియున్నది. పలుమారు సోమయాజిసూక్తము లట్లట్లే వచనరూపమున ననువదింపబడియున్నవి. దీనియందు ద్రుపదపురోహితదౌత్యము, సంజయరాయబారము మాత్రమె గలవు. శ్రీకృష్ణరాయబారమున కింకొకసంపుట ముద్దేశింపబడియున్నది. అది రమ్యతరముగ నుండగలదనుటకు సందియము లేదు.

ఈరెండవరాయబారమున నచటనచట కొన్నియసాధారణప్రయోగము లగుపడు చున్నవి. "కలవాడు" అనుటకు "కలాడు" యనురూపము ప్రాయికముగ దృగ్గోచర మగుచుండును. పుత్రపక్షపాతియనునర్థమున ధృతరాష్ట్రునొకచో "సుతువాడు" అని పేర్కొనియున్నారు. ఈయుదాహరణముల జూపుటలో నిట్టివి యసాధువు లనుతాత్పర్య ముగాదు.

పాండవులుగోరిన అయిదుగ్రామములపై వ్యాఖ్యానమును, సంజయరాయబారముపై పాండవవ్యాఖ్యానమును, సంజయముఖాంతర ముగ పాండవులు బంపినప్రత్యుత్తరమును, తలస్పర్శములై, మర్మభేదము లయియున్నవి. ధర్మరాజాదు లొక్కొకరును సంజయునితో జేసిన సంభాషణలు పాండవుల ధర్మనిరతిని, స్థిరాభినివేశమును వెల్లడించుచున్నవి.

మొత్తముమిాద రెండుపొత్తములును పాఠసౌభాగ్యములై తత్తద్రచయితలకు గౌర వావహములై యున్నవి. యుద్ధముకొరకు కొందరురాజులు పాండవపక్షమునను,కొందరు కౌరవపక్షమునను జేరుటకుగల కారణములు, కారణాంతరములు విశదీకరింపబడియున్నవి. ఆనైమెరాజులకు పెరవారిపైగల స్పర్ధలు, విరోధకారణములు సూచింపబడియున్నవి. భారతయుద్ధము కేవల కురు పాండవప్రసక్త మయినదేకాక ఇతరకారణములచేతగూడ సంభవింపవలసిన దైయున్న దనునభిప్రాయము తెలియుచున్నది. అర్జునుడు సన్న్యసించియుం డినను భారతయుద్ధము పొసగియె యుండు ననుభావము నరసింహశర్మగారి గ్రంథము వలన తేటపడగలదు. శ్రీకృష్ణుడు చెప్పి నటుల పాండవులు నిమిత్తమాత్రు లయిరి.

ఈ రెండుగ్రంథములును భారతోద్యోగ పర్వమున కేకాక సామాన్యముగ భారతేతి హాసమున కొకవ్యాఖ్యారూపముగ నున్నవన దగును.

ఉత్తరావివాహానంతరము పాండవులు ఉపప్లావ్య మను గ్రామమున విడిసినట్లు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భారతమున గలదు. ప్రస్తుతపు గ్రంథములు రెండును ఉపప్లావ్యము ననేకమారులు పలుకుచున్నవి. ఈయుపప్లావ్య మేరాజ్యము లోనిదైనదియు తెలియలేదు. విరటరాజ్యము లోనిదా, లేక ఈకాలపురాజ్యతంత్రానుసారముగ నుభయులకు తటస్థ ( Neutral ) ప్రదేశమా ?

అరణ్యవాసాజ్ఞాతవాసానంతరము పాండవులకు రాజ్యభాగ మిచ్చునటుల దుర్యోధనాదులు కంఠోక్తిగ జెప్పియుండిరి. అజ్ఞాతవాసానంతరము అనుక్తముగ పాండవులదాయమును వారికి చెందవలయుననుట కేవలన్యాయసంచారవిధానమా, లేక పూర్వప్రతిజ్ఞాతవిషయనిర్వాహకమా? ఇత్యాదివిషయములును రాయబారప్రకరణవిమర్శ కప్రసక్తములుగా నుండవు.

ద్రుపదపురోహితునిపే రెందును గానరాదు. మానవచరిత్రలలో నగస్త్యభ్రాత వెనుక నీతడొకడు నామనిర్దేశము లేనివాడుగ నున్నాడు.

"రాయబార" శబ్దనిష్పత్తి ఎట్లు ?

[భాగవతుల నరసింహశర్మగారి గ్రంథము బరంపురమున ప్రాడిపెద్దివారివీథిలో వేసుమక్కా కార్యస్థానమున లభించగలదు. తపాలు ఖర్చులు గాక నికరము వెల రూ. ౧-౮-౦. దేవరాజు వెంకటకృష్ణరావుగారి గ్రంథము బరంపురములో గ్రంథకర్తయొద్దనె దొరకగలదు. దీనివెల రూ. ౧-౦-౦.]



ఓడరేవు, పుదుచ్చేరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విద్య—వింత పశుత్వం*

టే. కామేశ్వరరావు

౧

'ఏమేవ్!'

'ఏంటుహూ?'

'ఎప్పుడూ కొత్తే.'

'ఇది నాకు పాతగిలదు.'

'చదువుకోమని నీ కెన్నిసార్లు చెప్పాలి?'

'చదువంటే చిన్నపిల్లలకే యేడుపొస్తుంది. పెద్దవాళ్లకు మరిరాదూ?'

'నీయేడుపేగాని నాయేడుపు చూడవూ?'

'ఊఁ.'

'నిన్న నీకు పంపించినచీటీ చూసేవూ?'

'చూడకుండానే పంపించేనేమిటి మీరడిగిన వస్తువు?'

'నేనడిగినవస్తువే పంపించేనంటావూ?'

'మరి!'

'దానిమీద వున్నదేమిటి, నువ్వు పంపించిందేమిటి?'

'మీరు చాంతాడుకామా పంపించమన్నారు?'

'నీతెలివితేటల కంతేనా సంతోషించేను! ఇంటి దగ్గిర తాళంచెవి మరిచిపోయేను, పంపించమని నేను రాస్తే చాంతాడా పంపిస్తావు! చాంతా డెందుకూ వురెట్టుకోమనా?'

'మీకు వారం వర్జ్యమూ లేదు. బుధవారం పూటా అలాఅనుకోవడ మేమిటి?'

'మరి నేనురాసిందేమిటి, నువ్వుపంపించిందేమిటి? పోనీ గొలుసుకట్టురాతేమోనంటే గవ్వల్లాంటి అక్షరాలు రాసేను, నీతెలివితేటలు తెలిసివుండే.'

'ఎవళ్లకేనా చూపిద్దామంటే ఆచీటీలు చూపించకూడదంటారు. అందులో యేంపరమరహస్యాలుండిపోతాయనో!'

'నీకు చదువురాకపోగానే రహస్యా లుండకపోతాయేమిటి? లేకుంటే నాకూ పరమసంతోషమే. యేయేడుపు, యేమొర్ర వుండదు. తాళంచెవి మరిచిపోయేనని బండబూతులు తిట్టేకు, ఆ వెర్రిముండాకొడుకు వుద్యోగస్తుడు.'

'తప్పొస్తే తిట్టవూ?'

'అదుగదీ మాట! నావల్ల తప్పొస్తే తిట్టేకు. నీవల్ల తప్పొస్తే నేను తిట్టకూడదు. అంతేనా నువ్వనేది?'

'బుధవారం పూటా తిడుతూ కూచోండి. వారం వర్జం లేదమ్మా యీతిట్లకి.'

'మరయితే అక్షరంముక్కలు కాస్త నేర్చుకో.'

'ఆడవాళ్లకి చదువు, మొగాళ్లకి వంట.'

'ఏమిటే?'

'ఏంలేదు.'

'నువ్వేదో పెద్దచదువు నేర్చేసుకుని నా ఆఫీసు పనిలో సహాయపడతా వనుకుంటున్నాను నేను.'

'సిగ్గుసిగ్గు, యింకా వుద్యోగం కూడా చెయ్యమంటారుకామోసు నాఖర్మం కాలిపోను. ఈ పాటి వూరుకుందురూ యెవరేనా వింటే నవ్విపోతారు కూడాను.'

'అయితే ఆఫీసుపనిలో చావమన్నావేమిటి?'

'అలాంటిమాటలే ఆడవద్దన్నాను.'

'మరి కాస్తచదువుకో, నేనూ సుఖపడతాను, నువ్వూ సుఖపడతావు.'

---

* ఈరచన ౧౯౩౧ సం. సెప్టెంబరునెలలోరచించబడింది. టే. కా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

‘ పోనీ నామాట వినండి. చదువొచ్చినవాళ్లంతా యెలా చెడిపోతున్నారో చూసేరా ? ’

‘ ఎవళ్లు చెడిపోయేరో చెప్పు. ’

‘ మాఅమ్మ వేలువిడిచినపెత్తల్లికూతురు అదేదో ఘోరమమ్మా– నా కావెనవపేర్లే రావు– తద్దుఘోరంక మోసు చదువుకుందిట. మొగుడిమాట అసలే వినదు. గింజుకునిచచ్చినా సరే, గిజామన్నా సరే. ’

‘ తద్దుఘోరంకూడా వొకచదువే. నల్లీవొకయిల్లాలే, నాగమయ్యా వొకబ్రాహ్మడే అన్నట్టు తద్దుఘోరంకూడా వొకచదువే. ఇంకేం బుగ్గిలో వేలెట్టడమే చదువన్నావుకాదు, నీధర్మమా అంటూ. చదువురాని మనిషి కాబట్టే అలాచేస్తూంది. చదువొచ్చినవాళ్లు బుద్ధిమంతులయే వుంటారు సామాన్యంగా. జ్ఞానంరావడానికి చదువుకోడం గాని దుష్టులవడానికీ, దుర్మార్గులవడానికీ కాదు. ’

‘ మీతో యెవళ్లు వాదించగలరూ. ’

‘ ఈపాటికి పలకతియ్యి. కాస్త బుద్ధిగా చదువుకో. నువ్వూ సుఖపడతావు నేనూ సుఖపడతాను. ఒరే అబ్బాయీ, * కాస్త చదువుచెప్పు బాబూ. (అబ్బాయి వస్తాడు.) నాకు పనుంది. వెళుతున్నా గాని నువ్వు శ్రద్ధగా చదువుకో. తెలిసిందా. వింటున్నావా ’ (వెళతాడు).

‘.................’

‘ పిన్నీ ! ’

‘ ఊఁ. ’

‘ పలకని పట్టుకో. ’

‘ ఆరాయపలసిందేదో నువ్వేరాయి. ’

‘ నేనురానేకే లే. ఈ వృత్తులపాఠంలో పేర్లు చెప్తాను రాయి. ‘మంగలి’ ‘కమ్మరి. ’

‘ అబ్బ! నేనుపోయి చెంబులు తోముకోవాలి. వేళయిపోయింది. వెధవచదువు, తగలబెట్టినచదువు. నాపాలిటి యమపాతలా వచ్చింది. నాకు చదువూవద్దు, చట్టుబండలూ వద్దు ’ (వెళిపోతుంది. భర్తవస్తాడు.)

‘ ఏమిరా పిన్ని చదువుకుంటూంది ? ’

‘ నాకెందుకీవెధవచదువు, పోయి చెంబులు తోముకోవాలని వెళ్లిపోయింది. ’

‘ నువ్వువెళ్లి పిలుచుకురా. (అబ్బాయి వెళతాడు.) శివ! శివ! నాకేం దిక్కుతోచడం లేదు. భర్తృత్వానికి, ఉపాధ్యాయత్వానికి యేమీ పొత్తు కనపడడం లేదు. రాతిసుండె చేసుకుని నే నెక్కడకొట్టేది. ప్రేమ, అనురాగం పెరగవలసినచోట కొట్లూతిట్లూ, కఠినత్వమున్నా. బాబోయ్! ఆమామగారి ముండాకొడుక్కి జ్ఞానం లేకపోడంవల్ల కదా యీపాట్లు పడవలసివచ్చింది. వాడికే జ్ఞానముంటే యిలాగుండేదా? సరే, ఏదో నెమ్మదిగా చెప్పిచూస్తాను, వింటే,వింటుంది లేకపోతే నోరుమూసుకుని కూచుంటా. అంతేకాని పడకగదిని యుద్ధరంగ మెక్కడచేసుకోను ? నాపనికాదని......ఇంకా రాలేదేం ? రానని మొండికేసికూచుందేమో. నేనే అక్కడికి వెళ్లి కనుక్కుంటా. ’

౨

‘ ఏమిటిచేసేవ్ వంట. ’

‘ ముందు విస్తరిపెట్టుసనే అడగడం? ’

‘ విస్తట్లో అన్నంరాసిలెప్ప మరేం కనబడడం లేదు. ’

‘ మీరు తెచ్చుకున్న బియ్యమేకదూ, దంపుళ్లబియ్యం. అంబటికూడులాగ యెఱ్ఱగా వుంది. ఎవళ్లేనా చక్కగా గోళ్లలోయిమిడేటటువంటి, తెల్లటి బియ్యం తెచ్చుసుంటూరా, లేక నూతకబియ్యం తెచ్చుసుంటూరా?’

‘ వీటిలో సత్తువు తగలడ్డదని శాస్త్రజ్ఞులనడం వల్ల కామూ యీ బియ్యం తెచ్చేను. వెధవపొట్టు యెంత తిని యేంప్రయోజనం. సత్తువున్నవిండి తినాలా, పూకనవలాలా ? ’

‘ మీయిష్టం. నాకు వాదనలు చేతకావు. ’

‘.................’

‘.................’

---

* అన్నకొడుకు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ముడిపెసలు పచ్చడి చెయ్యమన్నానుకదూ.'

'పోనీ నే నోకమాటనుసుతాగాని చెప్పండి. మాటాడితే కోపంగాని......'

'నాకు కోపమా! నాకంటే శాంతమైనమొగాడెక్కడేనా వుంటాడా.'

'ఎవళ్లమట్టుగు వాళ్లు అలాగ అనుకోకపోతే మరోలాగ అనుకుంటారేమిటి?'

'అలాగా!'

'నే ననేది వినండి. ఎవళ్లేనా ముడిపెసలు పచ్చడి చేసుకుంటారా, లేక పెసరపప్పు పచ్చడి చేసుకుంటారా?'

'ముడిపెసల పచ్చడితింటేనే మంచిదిట. ఆ పొట్టులో విటమిన్లు అనే జీవపదార్థాలున్నాయిట. అది శాస్త్రజ్ఞులన్నమాటే. నా తెలివితేటలు కావవి. మంచి తిండి తినక గడ్డితినడ మెందుకు?'

'అన్నీ వింతలూ విపరీతాలూనమ్మా యీమనిషితోటి.'

'..................'

'..................'

'మళ్లీ సీసపుగిన్నెతోనే చారుపెట్టి యిత్తడి గరిటెతో వడ్డిస్తున్నా?'

'ఆమాయచచ్చినవాడు, యిచ్చినతగర మంతా పుచ్చుకుని, వాడికేంపోయికాలం వచ్చిందో వాడిల్లు మాసిపోను, సీసపుగిన్నె మననెత్తిని కొట్టేడు.'

'ఔను, నిజమే. వాడు మోసంచేసేడు. మనం యేడ్చేం. మళ్లా నేను మంచిగిన్నె పట్టుకొచ్చేనుగా.'

'ఆగిన్నెమట్టుకు వాడుకోవద్దన్నారేమిటి. పెంట మీద పారెయ్యమన్నారా?'

'ఏడిసిన తెలివితేటలు. పశువుతెలివితేటలు.........ఆయిత్తడి గరిటేమిటి చారుకో.'

'మాఅమ్మ యెప్పుడూ అలాగే వడ్డిస్తుంది మా నాన్న యేడ్చినాసరే, చచ్చినాసరే.'

'అయితే నన్నూ అలాగే అంటావూ.'

'గురువారంపూటా తీరుబడిగా కూచుని అలాంటి మాట లేమిటే.'

'అయితే నిన్ను యేపూట అనవచ్చో, యేపూట అనకూడదో చెప్పు?'

'ఆడదాన్ని యెప్పుడూ అనకూడదు. తిట్టడం తిమ్మడం వొకగొప్ప యేమిటి?'

'అవును నోటితో చెప్పడం నాదే బుద్ధితక్కువ, చేతితో చెప్పాలికాని.'

'అదే తక్కువయింది!'

'..................'

'..................'

'ఉసిరికపచ్చడి కాస్త వెయ్యి.'

'ఇవాళ మట్టుగోకూడదు.'

'దానికేవచ్చిందీ పెద్దదయ్యాం!'

'........ ..... ...'

'మరయితేబచ్చలికూరేనావంత లేకపోయేవూ?'

'ఇవాళ బచ్చలికూర కోస్తారేమో కాస్త తెలిసిన వాళ్ల నెవళ్లనేనా అడగండి. ఇవన్నీ మీయింట్లో ఆచారాలుగాని మరేయింట్లోను యిలాగుండదు.'

'అనాచారాలకీ దురాచారాలకీ మీచదువులోనూ మీశాస్త్రంలోనూ ఆచారాలని పేరు.'

'నేను వాదించలేనుబాబూ.'

'ఏదో యివాళమట్టుకు భోజనమయింది. ఇంక—'

'విస్తరి మీ రెత్తకండి.'

'నువ్వీయెంగిలివిస్తట్లో తినకూడదు.'

'అదంతా మీకెందుకూ ఆడవాళ్లం మేమేదో యేడుస్తాం.'

'ఎంగిలివిస్తట్లో తినకూడదని చెప్పేనా?'

'అలాగేలెండి.'

'........ .........'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

‘ మళ్లీ తీస్తారెందుకూ. మీకు తెలియదుకాని మొసుడిని స్తట్లో తింటే తప్పు లేదుట. ’

‘ ఎంగిలినిస్త రిది. ’

‘ అబ్బ ! తనన్నమాటేగాని మరోటిలేదీ మనిషికి. ఇదిగో ! మాఅమ్మ యేభై యేళ్లొచ్చినా మానాన్న యెంగిలినిస్తట్లోనే కాని మరోదాంట్లో తినదు...ఈ మొగాళ్లకి చెప్పలేమమ్మా. వెధవముండలికి పెళ్లిళ్లు చేసేరకం. ’

3

‘ ఆలాంటి రిలా తెచ్చిపెట్టం డొకమాటు. ’

‘ నువ్వు తీసుకెళ్లు నేను చేస్తూన్నపని మాడటం లేదూ? ’

‘ లాంతరు నేను ముట్టుగోకూడదు. ’

‘ ఏమీ, దాన్ని దారపుపోసు లున్నాయేమిటి?’

‘ లాంతరు ముట్టుకుంటే మయిలడిపోనండీ. అందులో కిరసనాయిలుంది. ఇంగ్లీషువాడిమాయఅది ’

‘ అడిగినీసంగతి. ఇంకా చెప్పేవుకాదు ! నీ తెలివితేటల కెంటేనా సంతోషించేను. నీకు తెలిసిన మాయావేదాంతం యేమొగాళ్లకేనా తెలుసా ? ’

‘ అయితే తీసుకురా రేమిటి ? ’

‘ ఇంకా నన్నడగాలా ? ’

‘ చీకట్లోనే వెళతాను. ’

‘ వెళ్లుమూగాని......అదేమిటి రాత్రిపూటా స్నాన మెందుకుచేసేవు ? ’

‘ ఒకమాటుకాదు, రెండుమాట్లుకాదు, మూడుపూట్లు చెయ్యవలసివచ్చింది. నాఖర్మాని కెవరేం చేస్తారూ ? చచ్చినముండాకాపది గిన్నెల్ని మసివుంచేసింది. అప్పటికీ జాగర్తగానే చూసేనమ్మా. అయినా అంచులకింద రవంత వుండిపోయింది. దాన్ని పులెట్టి గోకిగోకి కడిగిపెట్టి స్నానంచేసి వస్తూవుంటే కంటికి శూద్రాడు కనపడ్డాడు. ఈ మైలపడుకూడా యింట్లో యెక్కడ కలుపుగోడమని మళ్లా స్నానంచేసేను. చేసి వస్తూవుంటే అదేమిటో నాఖర్మంకాలా, ఇంతకీ తలరాత తప్పించడ మెవరిశక్యం, కాలికి మెత్తగా తగిలింది. ఇదేమిటి చెప్మా అనిచూస్తే సుద్దపేలిక. నోరు నొక్కుకుని చచ్చినట్టువెళ్లి మళ్లా స్నానంచేసి కాళ్లు యెత్తెత్తి వేసుకుంటూ వచ్చేను. ఏంచెయ్యమన్నారు ? బ్రాహ్మల కుటుంబం, బ్రాహ్మణజన్మ. ఈకాలంలో బ్రాహ్మల కుటుంబంలో పుట్టడమే పాపమయిపోయింది. ’

‘ నిజమే. ’

‘ మీఅనాచారాలకి,మీమైలతిళ్లకి శూద్రపుట్టుకే సరిపోతుంది. ’

‘ ఏడిసినగొప్పతనం. నోరుమూసుకో....... .. మొన్నవుపవాసం, నిన్ననోము, యివాళ మూడుస్నానాలున్నా ? రేపు.—’

‘............. ...’

‘ మంచమెక్కడమున్నా. ’

‘ ఊరికే యెందుకూ ఆశాపనార్థాలు. నిజంగా రాకపోయినా మీరన్నందుకేనా వొచ్చితీరుతుంది. నాకు తెలుసు మీమాట మహిమ. ’

‘ అదీమాట. సరిలే. నేనై మందు కేను. నీఖర్మం యెలాగుంటే అలాగుంటావు. ’

‘ నా కసలు మందుతినడమంటే అసహ్యం ; డోకొస్తుంది. మందుతింటే జ్వర మెక్కువౌతుంది. ’

‘ నీఖర్మం. ’

‘.....................’

‘.................’

‘ అలా నడవకండీ. ’

‘ ఏమీ ? ’

‘ ఆదారినే అంట్లగిన్నెలు తీసుకెళ్లేను. పేడనీళ్లుజల్లడం మరిచిపోయేను. ’

‘ అయితే దారిఅంతటా చల్లుతావేమిటి ? ’



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఇదిగో' నే నొక్కమాటచెస్తా వినండి. మా అమ్మఆచారంసంగతి మీ కసలు తెలియదుకమోసు. నాఆచారంసంగ తలావుంచండి.'

'ఏదీ చెప్పు విందాం.'

'భోజనాలయేక మాఅమ్మ పీటలు, యిల్లే కామండా గోడలుకూడా కడుగుతుంది. బజారునుంచి తెచ్చినవస్తువుమీద శుద్ధినీళ్లు జల్లితే గాని తియ్యనే తియ్యనూ. ఇదంతా మీకు వెటకారంగా వుంటుంది కాని నేనుమట్టుకు నిజంచెప్తున్నాను. ఉప్పు కడిగి యెండలో పెడుతుంది.'

'ఆతల్లికి పుట్టినదానివేకమా నువ్వు. నువ్వు నిప్పు కడిగి తెచ్చుకుంటావు.'

'మీమాట లెప్పుడూ నొక్కలాగే వున్నాయి. ఇదంతా యెందుకు చెప్పేనో తెలుసా?'

'ఎందుకూ?'

'కాళ్లమీద నీళ్లు పట్టండి. అక్కడ తొక్కరని నాఅనుమానం.'

'నేను వెళ్లేక నీయిష్టంవచ్చిన ట్లేకువు.'

'నీళ్లు పట్టండీ..... అబ్బ! ఆడవాళ్ల గొడవలు వీళ్ల కెందుకో. ఇలాంటి అనాచారవాళ్లకి మళ్లా పుట్టగతు లుంటాయా.'

౪

'ఏమండోయి!'

'ఊ.'

'అదేమిటో యెప్పుడూ మొహం ముడుచుకునే వుంటారు.'

'నీముఖవికాసం నాకు రమ్మంటే యెలాగు వస్తుంది. నువ్వంటే సాక్షాత్తు సరస్వతీదేవివి, గొప్ప కుటుంబంలో పుట్టినదానివి, బ్రాహ్మణజన్మ—'

'ఎప్పుడూ మీకు చదువు, పుస్తకాలే. నగలు నాణేలు చేయించిపెడతాననడం లేదు. చదువుకో, చదువుకో, చదువుకో.'

'నోరుముయ్.'

'అసలు నేచెప్పవచ్చేమాట వినండి. ఎంతవిచిత్ర మనుకొమ్మ!'

'ఏమి టావిచిత్రం?'

'కూరెళ్లవారిదిబ్బైమ్మే మరేమో నే కాలిమీద కడియంకింద కురుపేసిందని కాలికడియం తీయించేసుకుంది.'

'అదీ విచిత్రమే! అయితే కురుపేసినా కడియం తీసెయ్యకూడదంటావు.'

'ఇంకా నెమ్మదిగా అంటారు. కాలుకింద కురుపేస్తే కడియంతీసెస్తారా! ఎంతశోద్యం! మాలాటి వాళ్లు కాలుపోయినాసరే కడియం తీస్తారూ?'

'నీబుద్ధి అంగరికీరమ్మంటే వస్తుందా?'

'వెటకారాని కేమిటిలెండి. మాఅమ్మకికూడా నొకసారి టిలాగే కాలిమీద కురుపేసింది. ఏవైద్యుడొచ్చిచెప్పినా—అదేమిటో వీళ్లమ్మకడుపుకాలిపోనూ—కడియంతీసెస్తేగాని కురుపు తగ్గదనేవాడు. అలాగనేటప్పటికిమాఅమ్మమండిపడిపోయినానాతిట్లుతిట్టేసేదివాళ్లని. ఆసరికి పెద్దాసుపత్రికి వెళ్లేఎప్పటికి అక్కడిదొరసాని నలుగురిని మాఅమ్మనుగట్టిగాపట్టుకొమ్మనిచెప్పిఆనట్టుగ కడియం తీయించేసింది చానిల్లు మానిపోను. మాఅమ్మ యెంతేనా సంజాలాడింది, తిట్టింది, కేకలేసింది, యేడ్చింది, నొకంతటు తియ్యనిచ్చిం దనుకున్నారేమిటి. తెలివి కేటా లేనిమొద్దుకాబట్టి అదొరసాని కడియం తీసేసింది.

'నీతెలివితేటలు యింతవరకూ భూమిమీద పుట్టినవాళ్లలో లేవు. అది నిశ్చయం.'

'సరేలెండి. ఇంకా యీసంగతి వినండి అంత కంటే తమాషాగా వుంటుంది. ముక్కుమీద వేలువేసుకుని అలాగే వుండిపోతారు.'

'అబ్బా! ఏదీ చెప్పు చూదాం.'

'జానికమ్మగారికి కళ్లగపడవు.'

'ఊఁ.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'పోనీ కళ్లగపడనిమనిషి యింట్లో కూచోవాలా. అలాగ కూచోకుండా కళ్లజోడెట్టుకుని వూరల్లా తిరుగుతూంది! ఎంతఆశ్రియమో.'

'అదీ తప్పే?'

'మీదంతా అపోతంతు. నాకు తెలియనే తెలుసులెండి. బోడివాళ్లని పెళ్లిచేసుకోమనేసజ్జు మీదంతా. మాఅన్నయ్యాకీ యిలాంటిదే పుట్టింది.'

'నోరుమూసుకో.'

'నాకెందుకుగాని, అన్నపూర్ణ కాళ్లకు జోడు తొడుక్కుని, గొడుగువేసుకుని స్కూలుకెళుతూంది. విన్నారా యీ సంగతి.'

'అయితే, యెండలో వెళ్లేటప్పు డేంచేస్తుంది?'

'పరువుమర్యాదున్నవాళ్లు జోడుతొడుక్కుంటారా, గొడుగు వేసుకుంటారా? ఎండ మండిపోతూన్నా సరే, జోరున వానకురిసేస్తూన్నా సరే యెండుతూ తడుస్తూ వెళతారుగాని గొడుగు వేసుకుంటారా?'

'నీతెలివితేటలకి నే నెప్పుడూ సంతోషిస్తూనే వున్నాను.........ఔనుగాని నేను నిన్న మనదేశపు గుడ్డ కట్టుకొమ్మని చెప్పలే?'

'ఆగోనెగుడ్డలు నేమొయ్యలేను బాబూ. అవి బరువు.'

'నీకు బరువా, మొయ్యలేవూ? ఉఁఉఁ.'

'ఉరికే వేళాకోళా లాడుకుంటూను.'

'ఇంకముందవే కట్టుకోవాలి, తెలిసిందా. నేను వూరుకునేవాణ్ణికాను.'

'అలాగేలెండి. ఔనుగాని దేశనాయకులంతా చచ్చిపోయేరు టేమిటి!'

'నీయిల్లు వల్లకాడుగాను, అలాంటిదెవడా తెచ్చిపెట్టను. తెలియనిదానివి తెలియనట్టుగానేనా పడివుండవు. నీకదో పెద్దరోగం.'

'నేనన్నమాటనుకున్నారేమిటది. ఆడవాళ్లంతా కూచుని చెప్పుకున్నారమ్మా. అందరు దేశనాయకులు, పడిపన్నెండుమందిట, ఒకయెద్దుబండీలో వెళుతూవుంటే ఆబండీ తిరగబడి సముద్రంలో పడిపోయిందిట. అందరూ చచ్చి.'

'ఇంక నోరుముయ్యి, పాడుతెలివితేటలు కనపరచక. చదువురానిపుల్లమ్మ, యెల్లమ్మ కబుర్లకి కూచుంటే యిలాంటివి కాకపోతే మరేలాంటివి పుడతాయి. కాలక్షేప మవడ మెలాగ పశువులికి.'

'ఆగొడవలు నాకెందుకుగాని......... సరే లెండి. చంద్రహారా లెప్పుడు చేయిస్తారూ? ఈ మాటొచ్చినజీతంలో వొక్కదమ్మిడీ ఖర్చుపెట్ట వల్లకాదు.'

'ఉఁ. భోజనం మానేశెయ్యి.'

'ఎంతసేపూ నేను తినేస్తున్నాననేకదా మీ—'

'నేను మానెయ్యలేను.'

'భోజనం మానేసుకోవాలేమిటి వస్తువు చేయించుకోడానికి.'

'అయితే యీనెలజీతంలో భీమాకు పోతుంది కొంత.'

'భీమాగీమా అవతలపెట్టండి. ఈపాటికి భీమాలు చాలించండి. భీమాలకి కడితే ఆయుక్షీణంట! మా నాన్న చెప్పేవాడు. ఎందుకొచ్చినభీమా లివి.'

'నీకు తెలియనిసంగతులు అడిగితెలుసుకోరాదూ. ఆపాగ రెందుకు?'

'మీ రెన్నన్నాసరే యీనెలజీతం ఖర్చుపెట్టవాటంకాదు.'

'చూద్దాంలే.'

'అలాగేలెండి.'

౫

'మనింట్లోకూడా యెలక్ట్రీ పెట్టించుకుంటే బావుంటుంది.'

'ఏమిటదీ! మళ్లాచెప్పూ!'

'ఏమిటో.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఎలక్ట్రీఅంటే యేమిటో!'

'నాకు తెలియదుపొండి.'

'నువ్వుచెప్పేది కొత్తపేరు. ఇంతవరకూ విన లేదు. అందరినీ యింక ముందు యీ పేరే వాడమని చెప్తా.'

'అయితే దాని నేమంటారు?'

'ఇంతవరకూ ఎలక్ట్రిక్ అంటున్నారుమరి.'

'ఎలక్ట్రిక్-అదేనా మీరనేది. ఈమాత్రాని కేనా యేదో పెద్దమహాభాగ్యంగా చెప్పొచ్చేరు. ఎల ట్రిక్, ఎలట్రిక్, ఎలట్రిక్.'

'తొందరపడకూ. ఎలక్ట్రిక్, ఎలట్రిక్ కాదు.'

'అయితేఃఅదేఅనుకోండి. ఇంగ్లీషుముక్కలంతా యింతే. పాడుముక్కలు.'

'నీకు రానివన్నీ పాడువే.'

'అయితే యింతకీ యెలట్రిక్ అంటే వొక నూనెయేమిటి? ఆతీగలో గొట్టంలోంచి అది వెళుతూ వుంటుంది. అంతేనా?'

'నీకు తెలిసింది అంతే.'

'మరయితే అదేమిటి?'

'అదొకశక్తి. అది ప్రవహిస్తుం దాతీగలోంచి.'

'శక్తి! అమ్మవారున్నూ! నిజం చెప్పండివింటా!'

'దానినే శక్తి అంటారు. అది తీగలోంచి వెళు తుంది.'

'తీగలో గొట్టం లేండే యెలావెళుతుంది?'

'గరిటె వొకచివర నిప్పుల్లో పెడితే రెండో చివరికి యెలాగ వేడివెళుతుందో అలాగే యిదీ వెళు తుంది.'

'అదా, అయితే తెలిసింది. అదేఅన్న మాట అలా వెలుగుతుంది. అది మనయింట్లోకూడా పెట్టించుకుంటే బాగావుంటుంది.'

'అది యింట్లో పెట్టించుగోడం అట్టే మంచిది కాదు. దృష్టి చెడిపోతుంది, కళ్లు పోతాయి. వీధుల్లో అయితే ఫర్వాలేదు. దానివల్ల చెడులేదు.'

'ఏమో. చూడడానికి బాగుంటుంది......... సరేగాని మీరు ఆంధ్రపత్రిక చదువుతున్నారు. నేను కూడా నిన్న చదివేను. దాంట్లో శాసనసభల్ని గురించి యేదో రాసివుంది. శాసనసభలంటే యేమిటే?'

'శాసనసభలంటే అందులో అనేకమంది వుంటారు. వాళ్లంతా దేశంలో అవసరమైన ఒక్కొక్క విషయాన్ని గురించి ఆలోచిస్తారు.'

'అంటే అక్కడ యెవరెవరుంటారు?'

'అంతా సభ్యు లుంటారు.'

'అంటే?'

'పోనీ దాన్నిగురించి నీ కెంతవరకు తెలుసో చెప్పు. మిగిలిందంతా చెప్తా.'

'నాకస లదేమిటో తెలీదు.'

'అవంతా నీ కిప్పుడు నేను చెప్పలేను.'

'పోనీండికాని వీరేశలింగం, వీరేశలింగం అంటారుకదా. ఆయన యెవరు, కంసాలా, కాపా?'

'నీకు తెలివి యెంతవరకుందో నాకు స్పష్టంగా తెలుస్తూంది. వీరేశలింగం కంసాలి!'

'ఆక్షేపించకపోతే చెప్పరాదూ?'

'నువ్వే చెప్పేసేవుగా.'

'పోనీ చెప్పండిమరి.'

'ఆయన మొదట బ్రాహ్మడు, తర్వాత బ్రహ్మ అయేడు.'

'బాగాచెప్పండి.'

'బ్రహ్మఅంటే నీ కెంతవరకుతెలుసో చెప్పు, తక్కిందంతా చెప్తాను.'

'నా కసలు తెలియందే.'

'నే నిప్పుడు చెప్పలేను. నీకు అన్నిటినిగురించి 'ఓనమః' లదగ్గరనుంచి చెప్పుకురావాలి. నీ కేమేనా అక్షరాలొస్తే పుస్తకా లిస్తాను చదువుకో. నాకు వోపికా లేదు, తీరికా లేదు.'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(తనలో) 'నయమే! మళ్ళా చదువులోకి దిగేరు. ఇంక నోరుమూసుకుంటే మంచిది.'

## ౬

'ఏమండోయి.'

'ఊఁ.'

'మళ్లీ సోమవారం చంద్రగ్రహణంట. మా అమ్మ రాసింది. నానక్షత్రాన్ని చంద్రగ్రహణం పడుతూందనీ, అంచేత నేను చంద్రగ్రహణం చూడ కూడదనీ, బ్రాహ్మడికి కొాకమానెడు సోలెడు బియ్యం ఏదేనా కూరా యిచ్చుగోవాలనీ రాసింది. ఆరాత్రి మడివూరగాయలమీద దర్భకర్ర పడేసుకోవాలి. ఓరాత్రివేళ మీ రెలా స్నానంచేస్తారో!'

'నేను స్నానంచెయ్యకపోడం సరేకదా నిన్ను కూడా స్నానంచెయ్యనియ్యను. తెలిసిందా. నీ కెన్ని వార్లు చెప్పినా బుద్ధి లేకుండావుంది. గ్రహణమంటే యేమిటో డజైన్ఫయిదుసార్లు చెప్పేను.'

'అయితే ముసిలాళ్లకంటే మీ కెక్కువ తెలుసాయేమిటి?'

'ముసిలాళ్లకు తెలివితేట లేదవలేదని చెప్ప లేదూ?'

'ఎప్పటిసంగతికో యిప్పుడు దెబ్బలాడుకోడ మెందుకులెండి...ఇదేమిటే! సోమవారంపూటా కొత్త బట్ట కట్టుకున్నారేమిటి. అయ్యో! అయ్యో! నే నేం చేతునమ్మా!'

'కొత్తబట్టలు కట్టుకోకూడదూ?'

'వారం వర్జ్యం లేదూ?'

'నీతెలివితేటలు తగ్గించుకో, మరేంతప్పిదం లేదు.'

'మీఖర్మం. నేను చెప్పనేనెప్పేనుగా వెనవ ముండలకి పె—.'

'నోరుముయ్.'

'..................'

'..............'

'ఇ దేమిటిది?'

'మీ కెందుకులెండి.'

'అలాగుకాదు.'

'విడవను.'

'చిరిగిపోతుంది.'

'దాంట్లో మరేంరహస్యాలు లేవు. చదువు కోండి.'

'ఎవరికి రాసేవూ?'

'మాఅమ్మకి.'

'పైవిలాసమా యిది!'

'ఊఁ.'

'నీకు బుద్ధి జ్ఞాన ముందా. ఈవుత్తరం యే జన్మానికైనా మీనాన్నకి జేరుతుందా. నరెడ్ల అనడానికి నరెళ్ల అనిరాసేవూ, పైగా విశ్వనాథ శాస్త్రికి అనడానికి పిసినాథశాస్రి అన్నావూ.'

'మాఅమ్మదగ్గిరనుంచి తెచ్చుకున్న కార్డ్లు అయి పోయేయి. మిమ్మల్ని యెడ్రసురాసిపెట్టండంటే వుత్తరమంతా దిద్దుబాట్లే, అసహ్యమేస్తూ. అంచేత నేనే రాసుకున్నా.'

'చిరునామా యేమిటి రాసేవూ............ బమ్రస్రీ నరెళ్ల పిసినాథశాస్త్రిగారికి అనేకనమస్కారములు, కాకినాడ రవానా నుడివీధి కాకినాడ కాకినాడ కాకినాడ నుడివీధి నరెళ్ల పిసినాథశాస్త్రిగారి కిచ్చేయవలెను కాకినాడ—యింక స్థలం లేదూ రాయడానికి?'

'ఆక్షేపణలకి మొదలు.'

'తప్పులు చెప్పితే ఆక్షేపణలు, వూరుకుంటే వుత్తమమునా. చిరునామా రాసేమోస్త రిదేనా! ఉత్తరంలో యింకా యెన్నితప్పు లున్నాయో. (ఉత్తరం లాక్కుంటుంది) నీఖర్మం నేనేంచెయ్యనూ.'

'ఈ మొగాళ్లకి చదువు రావడం చాలాకష్టం గావుదమ్మా.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'అంతేకాని నువ్వుకూడా చదువుకుందామని నీమట్టుకు తోచదు.'

౭

'ఇదిగో!'

'ఊఁ.'

'తమలపాకులు మహాపసందుగా రానేవు కాని యేదీ మూలపడివున్న హార్మోనియం ముందుకులాగి-నువ్వేదో మూడునాళ్లు సంగిరిగీతం నెలిగించేవుట, యెలాగుంటుందో యెప్పుడూ విన లేదు, మామామగారు నీపాటను మహా మెచ్చుకుంటూవుంటాడు, నువ్వు పాడుతూవుంటే కిన్నెరలు మోగిపోతూవుంటాయంటాడు. యేదీ వొక్కమాటు వొక్కకృతి.'

'నాకు రాదు.'

'ఔను! నాకుతెలుసు నీబెట్టుసరి. ఎంతబతిమాలించుకుంటే అంతసరదా నీకు!'

'మీ రేమనుకున్నా సరే.'

'ఒక్కమారు పాడుమా.'

'నాకు రాదంటేనే.'

'మంచిదానివిగా పాడూ.'

'.................'

'పాడు మరి.'

'.................'

'పాడమంటూవుంటే.'

'మీకు సిగ్గలేదూ.'

'ఎందుకూ సిగ్గు. అయితే యెందుకు సంగీతం నేర్చుకోడం.'

'.................'

'పాడమంటే.'

'..... ............'

'నాకు కోపం తెప్పించకుమరి.'

'..... ............'

'ఊరుకున్నంతసేపే నేను మంచివాణ్ణి.'

'.................'

'నామంచితనం చూడటం లేదు నువ్వు.'

'.................'

'పాడవూ అయితే.'

'.................'

'పాడవూ.'

'...............'

'ఇదిగో! నేను నాస్నేహితుడు వెంకట్రావింటికి వెళ్లిపోతూన్నా. ఇవాళరా త్రిక్కడే పడక. నీయేడుపు నువ్వేడవాలి.'

'నే నొక్కర్తెనూ వుండలేను. నాకు భయం.'

'ఏడిసేవు.'

'పాడతానండీ.'

'నోరుముయ్!'





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## భావసంకీర్తనము

బాలాంత్రపు వేంకటరావు

సూనృతంబుగ నేఁడు సుఖమూర్తియే లేఁడు కష్టానుభోగలోకమున నాకు,
నిశ్చయంబుగ నేఁడు నెచ్చెలియే లేఁడు సర్వమాయా ప్రపంచమున నాకు,
సత్యంబుగా నేఁడు స్వామియే లేఁడు సర్వంసహావక్రచక్రమున నాకు,
తెల్లంబుగా నేఁడు దేశికుఁడే లేఁడు గాఢతమోభ్రాంతికమున నాకు,
రూఢిగా నేఁడు కలవాఁడు లేఁడు నాకు-ఉన్న సౌఖ్యమో, స్నేహమో, తిన్నఁదనమొ
గుఱియొ,భక్తియొ,నాయాత్మఁగుదిరియుండ-కున్నె? యేలోకమందు నీవుంటివి ప్రభూ!

ఈగడ్డిపోఁచకా! యిష్టార్థము లొసంగు నాకల్పవల్లిక నమ్ముకొంటి?
ఈబొమ్మజాతికా! యిహపరంబులఁ జూపు నారత్నదీపిక నమ్ముకొంటి?
ఈగ్రుడ్డిగవ్వకా! యెల్లసిద్ధులఁగూర్చు నాపెన్నిధానంబు నమ్ముకొంటి?
ఈపెంకుముక్కకా! యెల్లతృష్ణ లడంచు నాసుధాకలశంబు నమ్ముకొంటి?
జీవకళ లేదు, హృదయంబు చిక్కఁబోదు-చూపయిన లేదు గణియించుచోటు గాదు,
ఎగిరిపడి చెడిపోవుట యే నెఱింగి-యడుగుఁబట్టితి నన్నుఁ గాపాడుము ప్రభు!

నాయక్షర నిధియంతయును గృతఘ్నచిత్తులచేతఁ బెట్టి వ్యర్థుండ నైతి;
నాపదభాగ్యమంతయు స్వార్థపరులపా లొనరించి ప్రాభవమునుదొఱఁగితి;
నాయర్థ శక్తియంతయు దుర్మధాంధుల చరణముల నిడి తేజ ముడిగితిని;
నాకృతిజాలమంతయు నహంకారదుర్మతుల కర్పించి దుష్కృతి నయితిని;
అక్షరపదార్థ సుకృతిరూపాత్ముఁడ వయి - మోక్షమున కీవొసఁగిన మూలధనము
నే నిరర్థకపఱిచితి; నీఋణమ్ముఁ - గొలువు సేయించుకొని తీర్చికొనుమిఁకఁ బ్రభు!

నావిశేషవిమోహభావసంగతులకుఁ జిత్రంబుగా స్వస్తిఁ జెప్పినావు,
నాసమస్తారిష్ట నాటకప్రతతికి భరతవాక్యంబును బలికినావు,
నాయపమృత్యుకాంతాశ్లేషగతులకు నింతలో విడియాకు లిచ్చినావు,
నాఋణోద్రేక చింతాపత్రతతులకు నిట్టె శ్రీరాములు చుట్టినావు,
శ్రవ్యదృశ్యకావ్య సంసారగతులలోఁ - జిత్రగుప్తజీవసిద్ధులెల్లఁ
జెప్పఁ జూపఁజూపఁ జెప్పగురుండవై - ఆత్మవిశ్వసుకవి వైతివి ప్రభు!

కాఁపురమున్నది కంటకారణ్యము; కామాదిఘోరమృగంబు లిందు,
స్వార్థాస్యవిపుల గహ్వరములఁదెఱచి నా జీవరక్త పలలాస్థికలఁ బట్టి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పీలిచి, చీలిచి, పిప్పిచేసి కబళించి వయిచుచున్నవి. జీవశక్తి యాతనాసహితమై, చైతన్యరహితమై తెన్నెఱుంగక ముక్తి తెలివి దొఱంగి నది; కృపామతి దీని శాంతాశ్రమముగ-వెలయఁజేసి, యహింసకు నెలవుఁ జేసి, ప్రేమమయజీవతప మిందు పెంపుఁజేసి - సచ్చిదానందసిద్ధి నొసంగుము ప్రభు !

---



" ఆంధ్రనారి " —మ. సూర్యం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఆశ్వయుజము

(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రుమాలు

పూడిపెద్ది వెంకటరమణయ్య
(కవితాసమితి)

౧

కామాక్షి:—ఏమండీ, మిమ్మల్లను ఒకప్రశ్న అడగాలని కొద్దిరోజులాయ తహతహలాడుతున్నాను. కోపంపడకుండా సమాధానం చెప్తారూ?

గౌరీపతి:—ఆప్రశ్న సీల్డువేసినకవరులో వ్రాసి పెట్టేవా? ఇలాతే. ఒకరూపాయి అక్కడపెట్టు. హనుమంతుడి నడిగి చెప్తాను.

కామాక్షి:—అదికాదండీ.

గౌరీపతి:—అదికాకపోతే, ఏదేనా పువ్వుపేరు చెప్పు.

కామాక్షి:—సరే! బాగుంది!

గౌరీపతి:—అయితే ఉండు, కేరళపక్షి నడుగుతాను.

కామాక్షి:—వెటకారం ఏమిటండీ?

గౌరీ:—అంబా పలుకవే! జగదంబా, పలుకవే!

కామాక్షి:—ఔనుమరీ! నాలాటిదానిమాటలు మీకొకలెక్కా?

గౌరీ:—లెక్కలేకేం? అశ్వనీ, భరణీ, కృత్తికాః పాదం మేషం.

కా:—నా తెలివితక్కువగాని మిమ్మల్నడగడం ఏమిటి? ఇంతకీ నాపూర్వజన్మపుణ్యం ఇలాగుంటే మీరుమాత్రం నన్నేల గౌరవిస్తారూ!

గౌరీ:—ఏదీ నీయెడమచేయి చూపూ. దానిలోనిరేఖలు పూర్వజన్మవృత్తాంతం చెప్తాయి.

కా:—చాలులెద్దురూ! బాగుందిగొప్ప. నాకు మీ రేంచెప్పనక్కరలేదు. మిమ్మల్నడిగేదేమిటి ఆభగవంతుణ్ణడగాలి.

గౌరీ:—అడుగూ! నీప్రశ్నకు జబాబు చెప్పడంకంటె ఆభగవంతుడి కింకేంపని ఉందిగనక- నీముద్దు చెల్లించకపోతే వాడిసృష్టి సాగవద్దూ?

కామాక్షి కన్నులు నీళ్ళతో నిండేయి. తారాజువ్వలలా గామె ముఖాన్ని జాలిరేఖలు పరుగిడుతున్నాయి.

గౌరీ:—కానీ! కన్నీటిచుక్క లొకటిరెండు జారుస్తే చాలదు. కన్నీటికాల్వ, కన్నీటివరద కుమ్మరించీ దానితో నేను కొట్టుకొనిపోవాలి. ఎందుకలా చీటికీమాటికీ ఏడుస్తావూ? నీమనస్సులో తెలుసు లేదో నాకుతెలుసును. నీవే గడుసుదానవనుకొని నన్ను ప్రశ్నలచేత వంచిద్దామనుకొన్నావు. ఈ పాటిదానికే లొంగిపోతే ప్రపంచం నిలబడుతుందా?

కామా:—(కన్నీరొత్తుకొని) ప్రేమవంచనా? నాజీవితమంతా మీతో సాగించవలసిననేను మిమ్మలను వంచిస్తానా? నేను సానిదాన్నాయేమిటి? నేనెందు కలాచేస్తానూ?

గౌరీ:—అదుగో! రంగులు బయల్దేరుతున్నాయే! నీయేడుపేదో నేను ముందుగానే గ్రహించేనుకామా! ఇలాటిఈర్ష్యవల్లే ఆడది చెడిపోతుంది. అదికాక నాకేమిటి! నేను మగవాడను! నేనేంచేసినా తప్పులేదు.

కామా:—తప్పన్నానా? నే నలాఅనగలనా? నా కేఈర్ష్యలూ లేవూ! నే నిలా దిక్కుమాలినదానిలా గీగూట్లో రాత్రింబవళ్ళొంటిగా దేవులాడక ఘోషపెడుతున్నాను. దీపంపెట్టిందిమొదలు దీదీమన్నదినులుతో ఈకొంపవాటింట్లో ఒక్కర్తైనా ఉండలేకుండా ఉన్నాను.

గౌరీ:—కాకికూత విని పగలే మగణ్ణి కౌగిలించికొందట నీలాంటిదే. సానికంటె నీవగలే జాస్తీగా ఉన్నాయే!



3–7 3–2

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కామా:—నాకే ఆలాంటివగలు తెలుస్తే, ముం గొంగుబంగారంగా మిమ్మల్ని ముడిచి దాచుకోనూ! మాణిక్యం మాయకెంపంత తళతళలాడగలదా?

గౌరీ:—మాటలుమాత్రం సరీగా ఆడు! మాయ కెంపూ, మంటికెంపూ అని అనువుదొంకిందిగదాఅని అందర్నీ ఆడకు.

కామా:—అందరూఏమిటి? మల్లెపూవాసనేనే ఉల్లిపాయ లుంటాయా?

గౌరీ:—కొసహూ అదేమాటా? నీనోరే ని న్నింతకుతెస్తూంది. నే నోరుస్తూన్నకొలదీ మితిమీరి పోతున్నావు! నీవేమో గడుసుదానవనీ, నీవుచెప్పి నట్టూ నేను మసలుకుంటాననీకాబోలు నీయూహ? అలా కలలోనయినా జరుగదుసుమా!

౨

అరటాకులపందిటిలో నిమిడిపోయినచీకటిలో మల్లెపూలు పేలాలలాగు విరిసేయి. మల్లెలతో సరి చూచుకుందికికాబోలు, వెన్నెలరేక లాయాకులసందుల నుండి చొచ్చుకొని మరీప్రసరిస్తూన్నా యాచీకటిలో-వెన్నెలదారాలతో ఆమల్లెలదండ కడదామని తుమ్మెదొకటి వాటికొసమెుదళ్ళకు తడవులాడుతూంది. కొసా మొదలూలేని యీప్రయత్నంలో తన కలసట లేకుండాఉండడానికి ఎడపదడప ఝానురాగాలు తీస్తూంది. పాలజల్లులాగు రేగినపండువెన్నెల చూచి, చుక్కలలాటి ఆమల్లెపూలుచూచీ, బెగడీ చిన్నబోయి యెక్కడికయినా పోదామని రెక్కలుగట్టుకొన్న చీకటిలా గుంది ఆతుమ్మెద. దానిఝుంకారం శ్రుతిగా, అరటియాకులచీలికలకొనలో గాలిగళం సవరిస్తూంది. ఇదంతా చూచి చేరెడువిరిసిన అరటిపూరేకుమెుగాన్న ఆనందబాష్పాలు జారుతున్నాయి.

ఆపెరట్లో దూరంగా గచ్చుటరుగుమీద కూర్చుని నిట్టూరుస్తూన్నకామాక్షి ఇవన్నీ అలా రెప్పవేయకుండా చూస్తూంది. అందుబాటులో కొమ్మలేకుండానే మూత వడ్డ కన్నులతో ముందుకు కొనలుచాస్తూన్న తీగను చూచి జాలిపడ్డాది. అతిథి లేకుండానే వింజామరలు వీస్తూన్న అరటికంబాలను చూచి ఆశ్చర్యపడ్డాది. ఉంచి లేదనకుండా పరిమళాలను ఒలకపోసేస్తూన్న ప్రసవాలను చూచి తలపంకించింది. జగత్తులో ప్రేమ ఎన్నివిధాల వ్యక్తం అవుతూంది! ఈలాటిఅకల్మష ప్రేమ ఏజీవిహృదయంలో పుట్టింది ఆజీవిహృదయంలోనే నిలిచిపోమా? పంజరంలో చిలుకలాగు పైకిపోవడాని కెందు కిలాప్రయత్నిస్తుందీ! అందులోనూ ఆడుదాని వలపు పుట్టినచోట క్షణమైనా నిలువదు. పాత్రాన్వేషణానికి పరగడలు త్రొక్కుతుంది. ఒకటిరెండులక్షణాల కోసం ఉరిపోసుకుంటుంది. ఔచిత్యమెరుగకుండా ఆశలు పుట్టిస్తుంది. ఆవెఱ్ఱిప్రేమ ఇన్నిలలితవస్తుజాలాలతో కలకలలాడుతూన్న యీజగత్తంతటా, పువ్వు సౌరభంలాగు ప్రతిఫలాపేక్ష లేకుండా వ్యాపించరాదూ! వెన్నెలరేఖలాగు భేదమెరుగకుండా ప్రసరించరామా! ఊహు-ప్రసరించదు.

కామాక్షి యిలా కొంతసేపు వితర్కించుకొంది. పెరటిలో నున్న ఆచిన్నిఅరటితోటను అతిప్రేమతో పరీక్షించింది. నవయౌవనమున నవనవలాడుతూన్న తన శరీరసౌష్ఠవాన్ని ఆవెన్నెలతెరలోనుండిపరీక్షించుకొంది. వేశ్యాలోలుడయి విర్రవీగుతూన్న గౌరీపతిని తలచి కంపించింది. తనప్రేమకు తగినచోటు కాదని తలచింది. ఆమెప్రేమ క్షణమాత్రము గూడులేనిపక్షివలె బయల తపతపా రెక్కలు కొట్టుకొంది. దానికి కాలుమోపడానికి కానీ అంతజాగా కావాలంది. తలదాచుకుందికి దమ్మిడీఅంతచోటు చాలునంది. ఈయనంత విశాలప్రపంచంలో చోటు లేకపోవడం ఏమిటని పరిహాసంగా నవ్వింది. కన్నులయెదుటగల ప్రతివస్తువుపూ పరీక్షించడం మెుదలుపెట్టింది. ప్రతి వస్తువునందునూ తాను మొదటినుండియూ ప్రేమించుచున్న ఒకటిరెండులక్షణాలూ కొరవడుతున్నాయి. ఎక్కువసుందరమయినవి ఉన్నాయి; తక్కువ సుందరమయినవీ ఉన్నాయి. కాని దానితో సమానసౌందర్యం గలవి కనబడలేదు. ఎలాగు కనబడుతుందీ? భర్తను సర్వోత్కృష్టుడయినవానిగ సంప్రదాయసిద్ధంగా చూచుకొనుట కలవాటుపడిన హైందవస్త్రీరత్న మునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంకేవస్తువు లలితతరంగా కనబడుతుంది? కామాక్షి విసుక్కొంది; వేడినిట్టూర్పు విడిచింది. వెన్నెల చిచ్చులో వేగిపోతూ అలావినలబడగలదా? దానిని తనయౌవనపాటవం మరింత ప్రజ్వరిల్ల చేస్తూంది, ఆమె వేడియూర్పులే దానినిమరింతరగుల్కొల్పుతున్నాయి. "ఏమిచేయుదును? శరీరపరిత్యాగం చేయుదునా?" అనుతలపు కామాక్షికి పొడమింది. "తప్పు" అని తల యూచింది. ఈప్రశాంతసమయంలో, ఈరేయిని ఎట్ల యినా నాప్రేమ కౌకకులాయం నిర్మించా లనుకొంది. ఈలోకమంతా, ఈసృష్టినిర్మాణ సౌందర్యమంతా, ఈజగత్తునిండిన లలితసుణజాలమంతా ఇమిడిన ఒకభరిణ దొరకితే నాప్రేమ ననాయాసముగా నం దిమిడ్చేసి హాయిగ నిద్రింతును గదా! ఆదమరచి అనుభవింతును గదా! ఆమెకు తలపులమీద తలపులు తరంగాలయి వస్తున్నాయి. ఆమె అట్టే అలా బయలుచూస్తూ నిమీలితనేత్రయయి నిలబడిపోయింది. ఆమెహృదయం దిక్తటులంటా విరిసింది. ఆమెకన్నులలో నొకవింత తేజస్సు తళుక్కుమని మెరిసింది! క్రమముగా కన్నులానందబాష్పపూరితా లయినాయి. "ఆఁ ఆఁ!! దొరికింది! దొరికింది!" అని త్రుళ్ళిపడి గంతులువేసింది.

## 3

కోడికూతజామయింది. చందమామ పడమటింటి నైపు చల్లచల్లగ మరలిపోతున్నాడు. సిగ్గుపడుతూ న్నట్టు చిన్నబోతున్నాడు. తప్పుచేసినట్టు తెల్లబోతు న్నాడు. గౌరీపతి గణికాగృహం విడిచి తనయింటికి బయల్దేరేడు. వల్లెవాటు ముసుగు పెట్టుకొని వడివడిగా నడుస్తున్నాడు. అడుగులు తడబడుతున్నాయి. అలాగే విధిలేదన్న ట్టిల్లుచేరేడు. అప్పటికే కామాక్షి నిద్రలేచి ఇంటిప్రాచపనులుచేసికొనేది. ఆనాడామె యింకా లేచినసందడి లేదు. గౌరీపతి వీథికిటికీవద్ద నిలచేడు. కొంచెం తెరచియున్న దానితలుపులసందునుండి లోపలకు చూచేడు. వానిముఖమున పొడిచినట్టు లోనుండి గాలి తరగ కొట్టింది. అత్తరువాసన! అగరువత్తులవాసన! మంచిగంధంవాసన! మల్లెపూలవాసన! పగిలినపాద రసపుబుడ్డీలాగు గౌరీపతిమనసు చెదిరింది. పరిపరివిధాల పరుగెత్తింది. దడదడలాడే హృదయంతో ద్వారం దగ్గరకు వెళ్లేడు. చప్పుడుకానీకుండా తలుపుమీద చేయి వేసేడు. తలుపు విడిపోయింది. వానికి గుండె విడిపోయింది. గుప్పుగుప్పున రేగివచ్చు ఆపరీమళతరం గాలలో వాని కూపిరాడలేదు. చైతన్యంలేని జంత్రపు బొమ్మలాగు ఆలోచనలేని హృదయంతో ఇంట్లో మెల్లగ ప్రవేశించేడు. ప్రక్కచావడీలోకి వెళ్లేడు. ఆ యెదుటిదృశ్యం వానికి కలవలె తోచింది. త్రుళ్ళిపడి కన్నులు విశాలంగా విప్పి ఆసావిడీ కలయచూచేడు. ఎన్నాళ్ళనుండో ఎత్తికట్టిన తూగుటుయ్యాల వ్రేలాడు తూంది. దానిలో పరపూ, తెల్లనిదుప్పటీ, దిండ్లు, మల్లెల కూర్పు. ఆదిండ్లనానుకొని ఒక యోరకొత్తిగిలి కామాక్షినిదు రిస్తూంది! ఆమె పెదవులపయిని చిఱునవ్వు నటిస్తూంది. చెక్కులసిందూరరేఖలు గంధపుపూతతో కళవళపడు తున్నాయి. నొసట చెమటబొట్లు చిగిరించేయి. కమ్మని యూర్పులలో కప్పురపువిడెపువాసనలు గడలుకొంటు న్నాయి. అలసియుండుటచేత నామెకు గాఢమయిన నిద్ర పట్టేసింది. ప్రక్కనున్న బల్లమీద పళ్లెరంతో ఫలాహారమూ, పంచపాత్రతో పాలూ.

"ఓసీ! పయోముఖవిషకుంభమా! ఎంత దానవే! నీమెత్తనిమాటలతో, నీఅమాయికపువేషాలతో నీకల్లబొల్లి యేడ్పులతో నాకన్నులలో దుమ్ముకొడుతు న్నావా? ఇంతకాలం నిన్ను నేనెలా నమ్మేనో నాకే ఆశ్చర్యంగా ఉంది. నమ్మేనూ? అనుమానంతో కొట్లాడుతూనే ఉన్నాను. ఇలాటిసమయంకోసమే వేచికొనిఉన్నాను. ఇక ననుభవిద్దువుగాని ఉండు. ఈ చమత్కారాలన్నీ, ఈసరసాలన్నీ యమలోకంలో స్వేచ్ఛగా అనుభవిద్దువుగాని ఉండు." అని గౌరీపతి రోషంతో నిప్పులుకక్కేడు. కన్నులు భయంకరంగా విప్పేడు. "కుత్తుక పొడిచితీరుతా" నంటూ లోపలినుండి ఒకగునపాం తెచ్చి ఆమెమెడపైకి గురి ఆని నిదురిస్తూన్న కామాక్షిమీద కించుక వంగేడు. ఆమెప్రక్కలలో చినాలిరంగు చిన్నబుటాలరుమాలు వానికి కనబడింది. "అబ్బా! ఇది నాతొలిప్రేయసి సుందరి నాకిచ్చిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుమాలు! పాప మామె తనయవసానకాలాన తనకు మారుగ చూచుకోమనిఈరుమాలు నాకిచ్చింది. నాటినుండీ దీనికి వెలుగైనా చూపకుండా దాస్తే యీపాడుముండ దీన్ని తనసరసుడుచేతిలో పెట్టిందికాబోలు. ఈతుచ్ఛురాలిరక్తంతో యీ రుమాలు తడుస్తే అది అపవిత్రమయిపోతుంది.” అంటూ మెల్లగ ఆరుమాలు తీసేడు. నివ్వెరపడ్డాడు. నిలదిపోయాడు. చిఱునవ్వుమొగంతో, చిన్ని అలకలతో, చెదరిన నెమిలిపించెంతో చెంగావి చెక్కులతో, పూలహారాలతో, పుత్తడివన్నెపంచ కట్టుతో, మురిడీగొలుసులచేతులతో, ముద్దుముద్దుమాపులతో బాలకృష్ణునివిగ్రహం ఆమెప్రక్కలో ఉంది. గౌరీపతి ఆవిగ్రహాన్ని పరికించి చూచేడు: ఒడలినిండా గంధపుపూతా, మెడలో పూలదండా, కస్తూరీ తిలకం ఘుమఘుమ వాసన లూరుతున్నాయి. ప్రక్కను బల్లదగ్గర చిన్నసింహాసనం. దానిలో పూలపాన్పు. వెలిగివెలిగి రొయ్యగరాలిన ఊదువత్తులు గల గళాసులు. ఆచుట్టుప్రక్కల చిలికిన అత్తరుపన్నీరువాసనలు. కొంచెమే చెదరినఫలాహారమూ – ఇవన్నీ చూచేడు. “ఇదా?” అన్నాడు. ఇదిగాక మరేదేనా అయితే ఇంతఆదమరచి నిద్రించగలదా? ఇంతసాహసం చెయ్యగలదా? వట్టిమాట! నయం, తొందరపడి పొడిచీశానుకాను! అన్యాయంగా స్త్రీహత్యాపాతకం చుట్టుకొనిఉండును. లోకంలో నాపేరు శాశ్వతంగా సామెతగా వాడుకొందురే? ఎంతపని జరుగును! ఈరుమాలే నాకంటపడకపోతే నేనీ ఘోరకార్యం చేసేయుందును. ఈరుమాలు భగవదర్పితం కావడంచేత నన్నీరోజున పాతకంనుండి తప్పించింది. ఆహా ఆచిన్నికృష్ణునివిగ్రహ మెంతలలితంగా నవ్వుతూందో! ఈవిగ్రహమే నిజంగా సజీవమైయుంటే పిపీలికాదిబ్రహ్మపర్యంతం దానిని వలచితీరాలి. అనా డీగోపాలకృష్ణుని మనసార నాలింగనముచేసిన యాత్రవేతలు,నందాదియాదవులును ఎంత అదృష్టవంతులు! నా ఆచిన్నికృష్ణుని చూచి యున్నయెడల ఈచింకిబొంకి చిరిపిమెరిపివేశ్యల నెవడు చూస్తాడు! ఈ సౌందర్యముముందర ఆసౌందర్య మెందుకూ! ఈ విగ్రహముప్రక్కను కామాక్షి యెంత కలకలలాడుతూందో. క్రొత్తతరుకుతో కొసరికొసరి ప్రేమదిలికేస్తూంది. ఈవిగ్రహముతో నింతసేపు నిదురించినఈమె ధన్యురాలు. రాత్రియంతయూ నీవిగ్రహమును పూజించిన ఈమెచేతు లెంత అందముగానున్నవో! ఆ పెదవులమీద భక్తి తేజస్సెలా ప్రసరిస్తూందో!” అనుకొని కనులు తడిసేటట్టు కళవళపడ్డాడు గౌరీపతి. చేతిలో గునపాం అఃతల పారేసి “హా! కృష్ణా! జగన్మోహనా!” అంటూ తిరిగీ ఆవిగ్రహంవైపు చూచేడు. ఈసుఖం నేనేల అనుభవింపకూడదని యాతడు మెల్లగ వంగి ఆకృష్ణవిగ్రహమున కవ్వలివైపొత్తిగిలి కామాక్షి ముఖమునకు ముఖమయి పడుకున్నాడు. వేడియూర్పులువిడిచేడు.

కామాక్షి మెల్లగ మెలకువగొని కన్నులరవిచ్చింది. ఉదయరాగంతో ఉవ్విళ్లూరుస్తూన్న భర్తముఖంచూచింది కన్ను లాశ్చర్యంతో విశాలంగా విప్పింది. తాను కొలువ సెన్నికొన్న చిన్నికృష్ణుడే భర్తరూపమున పవళించే డనుకొంది.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వాతాపి చాళుక్యులు

మల్లంపల్లి సోమశేఖర శర్మ

ఆంధ్రమహాసామ్రాజ్యమస్తంగతమైన పిదప దక్కనుదేశమున విలసిల్లిన సామ్రాజ్యము చాళుక్యులది. చాళుక్యులు తాము అసలు అయోధ్యాపురవాసులైనట్లును, అచ్చట దమ పూర్వులు చాలకాలము రాజ్యము చేసిన పిదప తమ వంశమువారు దక్షిణాపథమునకు వచ్చినట్లును తమశాసనముల చెప్పకొనియున్నారు. వీరు మానవ్యసగోత్రులు; హారీతిపుత్రులు; సప్తలోకమాతలచేతను, సప్తమాతృకలచేతను అభివృద్ధి పొందినవారు. కార్త్తికేయపరిరక్షణమున కల్యాణపరంపరలు కలవారు. వరాహలాంఛనులు. క్రీస్తుశకము ఆఱవశతాబ్దిని రాజకీయముగ వీరు ప్రాముఖ్యమునకు వచ్చిరి. ఈ వంశమున మొదటివాఁడు జయసింహవల్లభుడు. ఈతడు దక్కనుదేశమున నంతవఱకు పాలించుచుండిన రాష్ట్రకూటుల నోడించి చాళుక్యరాజ్యమునకు పునాదులు వైచెను. ఈతనికుమారుఁడు రణరాగుఁడు. ఇతనితనయుఁడు రణవిక్రముఁడు. ఈతనికి పులకేశి యనియు నామాంతరము కలదు. ఈపేరుగల చాళుక్యవంశజులలో ఈతఁడు మొదటివాఁడగుటచేత ఇతనిని మొదటి పులకేశి యందురు. ఈతఁడు క్రీ. శ. ౫౫౦ లో సింహాసనము నధిష్ఠించెను. ఈతని రాజధాని వాతాపినగరము. విజాపురమండలమున నున్న యీ గ్రామమునకు నేఁడు బాదామి యనిపేరు. ఈతని కుమారులు కీర్త్తివర్మయు, మంగలీశుఁడునుకూడ చాల పరాక్రమవంతులు. కీర్త్తివర్మ క్రీ. శ. ౫౬౭ లో సింహాసన మెక్కి ఇరువదినాలుగు సంవత్సరములు పాలించెను. పిదప నతని సోదరుఁడు మంగలీశుఁడు క్రీ. శ. ౫౯౧ లో రాజయ్యెను. ఈ యుభయులకాలమున చాళుక్యరాజ్యము చాల విస్తరించెను. ఉత్తరకొంకణము, ఉత్తరకనరాదేశములే కాక వాతాపినగరమునకు ప్రాక్పశ్చిమముల నున్న చాలదేశము చాళుక్యాధికారముక్రిందికి వచ్చెను.

మంగలీశుని యనంతరము చాళుక్యరాజ్యరమం జేపట్టినవాఁడు కీర్త్తివర్మ పుత్రుఁడైన రెండవపులకేశి మహారాజు. వాతాపినగరము రాజధానిగ నేలిన చాళుక్యనృపతులందఱిలోను నీతఁడు చాల సమర్థుఁడు; గొప్ప పరాక్రమవంతుఁడు. కడుచిన్నతనముననే యీతఁడు రాజ్యాధికారమును వహించి, దక్షిణదేశము నంతను స్వాధీనపఱుచుకొని యొక మహాసామ్రాజ్యమును స్థాపింప సంకల్పించెను. ఈతనికి విష్ణువర్ధన జయసింహులను నిరువురు సోదరులు కలరు. వీరి సాయముతో గొప్ప సైన్యములను సమకూర్చుకొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యతఁడు జైత్రయాత్రకు బయలువెడలెను. స్వరాజ్యసంపాదనాసక్తితో మఱలఁ దలలెత్తుచున్న రాష్ట్రకూటుల నోడించి వారిరాజ్యము నాక్రమించెను. వనవాసి రాజధానిగా కర్ణాటము నేలుచుండిన కదంబులను జయించెను. ఆళుపులును, పశ్చిమగాంగులును శీఘ్రకాలముననే పులికేశిమహారాజుసామంతు లైరి. కొంకణదేశపు మౌర్యులు, లాటరాజులు, ఘూర్జరులు - ఎల్లరు పులకేశి శౌర్యఖడ్గమునకు జోహారు లర్పించి కానుకలు చెల్లించిరి. అంతటితో తృప్తినొందక పులకేశిమహారాజు ప్రాక్సముద్రతీరస్థము లైన వేంగీ, కళింగ, కాంచీరాజ్యములనుగూడ జయించెను. కళింగమున గంగవంశజులు పాలించుచుండిరి. వేంగిదేశము విష్ణుకుండిప్రభువుల పరిపాలనమున నుండెను. కాంచి పల్లవరాజ్యము. ఈ రాజ్యము లన్నియు పులకేశి విజయవాహిని కెదురొడ్డలేక లోగిపోయెను. పల్లవరాజ్యమునుకూడ దాఁటి యామహారాజు కావేరినిగడచని చోళ, పాండ్య, కేరళ రాజ్యములను గూడ లోఁబఱుచుకొనెను. ఈవిధమున దక్షిణదేశమునంతయు నవలీలగ జయించి చాళుక్యసామ్రాజ్యమును స్థాపించి, దానికి పూర్వపశ్చిమసముద్రముల నెల్లలుగఁ జేసి కృతకృత్యుఁ డయ్యెను. ఈకాలముననే కన్యాకుబ్జాధిపతి యైన హర్షవర్ధనుఁడుకూడ నొక మహాసామ్రాజ్యమును సంస్థాపించు నుద్దేశముతో దిగ్విజయము గావించుచు, నుత్తర హిందూస్థానమునంతను స్వాధీన పఱుచుకొని దక్కను దేశమునుగూడ దనపతాకచ్ఛాయకుఁ దీసికొని రా దాడివెడలి వచ్చెను. ఇరువురు నొకరికొకరు తీసిపోని వీరవరేణ్యులు. ఇరువురును సమరవిద్యావిశారదులే. ఈ యుభయుల సైన్యములు నర్మదానదీతీరమున సంధిల్లినవి. అచ్చట ప్రవర్తిల్లిన ఘోర సంగ్రామమున శతాధికయుద్ధవిజేతయైన హర్షవర్ధనుఁడు దైవోపహతుఁడై పరాజయము నొందెను. నాటంగోలె పులకేశిమహారాజు కీర్తి దిగంతముల నాట్యము చేసెను. హర్షవర్ధనునంతటివాని నోడించినందులకు సూచకముగ పులకేశి పరమేశ్వరాపరనామధేయుఁ డయ్యెను. ఈ విజయములచే దిగంతవిశ్రాంత కీర్తియైన పులకేశికడకు పారసీకపురాజయిన రెండవఖుస్రు అనునతఁడు క్రీ. శ. ౬౨౫ లో అమూల్యములైనకానుకలతో, అతనిసఖ్యము నభిలషించుచు రాయబార మంపెను.

జయింపఁబడిన ప్రాక్సముద్రతీరస్థదేశములలో వేంగి దుర్బలులైన రాజుల యాధిపత్యమున నుండుటచేతఁ గావచ్చు నది పులకేశికి పూర్తిగ లోఁబడిపోయెను. నాఁ డనన్యసాధ్యమగు దుర్గముగ పరిగణింపఁబడుచుండిన పిష్ఠపురము (పిఠాపురము) పులకేశికి వశమయ్యెను. వేంగిదేశము నాతఁడు జయించి దానికి తన సోదరుఁడైన విష్ణువర్ధనుని పట్టముకట్టెను. ఈతఁడే పూర్వచాళుక్యరాజ్యమనఁబడు వేంగీ చాళుక్యరాజ్యమునకు సంస్థాపకుఁడు. విషమసిద్ధి యనియు, కుబ్జవిష్ణువర్ధనుఁడనియు నీతనికి నామాంతరములు కలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పులకేశి రాజ్యము చేయుచుండిన కాలముననే సుప్రసిద్ధబౌద్ధయాత్రికుఁడగు యువాన్ చాంగ్ హిందూదేశమును సందర్శింపవచ్చెను. ఈతనివ్రాఁతలనుబట్టి యానాఁటిదక్షిణహిందూదేశస్థితి కొంత తెలియుచున్నది.

పులకేశి రాజవేసిన పల్లవచాళుక్యవైరానలము వాతాపినగరచాళుక్యరాజ్యము సంపూర్ణముగ భగ్నమగువఱకు ప్రజ్వరిల్లుచుండుటయేకాక తుదకు పులకేశి మరణమునకు నదియే కారణమయ్యెను. కాంచీపుర పల్లవరాజయిన నరసింహవర్మ పులకేశివలనఁ దాముపొందిన పరాభవమునకు ప్రతీకారము సేయ తరుణము వేచియాతనిరాజ్యముపై నెత్తివెళ్లి రాజధానియైన వాతాపినగరమును ముట్టడించి తగులఁబెట్టెను. ఈసందర్భమున నిరుతెరగలవారికి ప్రవర్తిల్లిన సంకులసమరమున పులకేశిమహారాజు వీరశయనము నొందెను.

పులకేశి యనంతరము తెలియవచ్చిన వాతాపిచాళుక్యచరిత్రము కొంచెమించుమించుగ 'సహజవైరము'గల పల్లవ-చాళుక్యుల పరస్పర యుద్ధచరిత్రమే యనవచ్చును. పులకేశిమహారాజు పిదప ఆతనికుమారులలో నొకఁడైన మొదటివిక్రమాదిత్యుడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు మఱల పల్లవులపై పగదీర్చుకొనఁగోరి కాంచీపురరాజ్యముపై దండెత్తివెళ్లి కాంచీపురమును బట్టుకొనెను. ఈతనికాలముననే చాళుక్యశాఖ యొకటి లాటదేశమున రాజ్యమును సంపాదించి యచ్చట స్థిరపడెను. ఈ మొదటి విక్రమాదిత్యునికొడుకు వినయాదిత్యునియొక్కయు, అతనితనయుఁడు విజయాదిత్యునియొక్కయు, అతనియనంతరము సింహాసనమునకు వచ్చిన యతనికొమారుఁడు రెండవవిక్రమాదిత్యునియొక్కయు, అతనిపుత్రుఁడైన రెండవకీర్తి వర్మయొక్కయు రాజ్యకాలముల నీపల్లవచాళుక్యసంగ్రామము లెడనెడ నిలిచిపోవుచువచ్చినను మొత్తముమీఁద సాగుచునేయుండెను. ఈ కడపటివారిలో మఱల కాంచీపురమును బట్టుకొన్నవాఁడు రెండవ విక్రమాదిత్యుఁడు. ఆతనికొడుకు రెండవకీర్తివర్మ యీపల్లవులతోడి సంగ్రామమునఁ జిక్కియున్నప్పుడే ఆతనిసామంతులలో నొక్కఁడైన ఖడ్గావలోకదంతిదుర్గుఁ డను రాష్ట్రకూటరాజు చాళుక్యులపై తిరుగఁబడి రాజ్యాధికారమును హస్తగతము గావించుకొనెను. అందువలన నీవాతాపిచాళుక్యరాజ్యము రెండవకీర్తివర్మతో భగ్నమగుచున్నది. జయసింహవల్లభునిచే స్థాపితమైన యీవాతాపి చాళుక్యరాజ్యము రమారమి రెండుశతాబ్దుల పాటు వర్ధిల్లి క్రీ. శ. ౭౫౭తో నామమాత్రావశిష్ట మగుచున్నది.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఒక ఆదేశము

భారతుల మార్కండేయ శర్మ

అలరు నెలతావివలెవాటు లలవరించి
ప్రసవశోభావిశేష మారామ మొలయ
జానువులఁ గేలు ముడివెట్టి మీఁన కేత
నాత్మఁబోనియాతఁడె యరణ్యప్రభుండు.

అతని నూనూఁగుమీసాల యౌవనంబు
లో నలంకారమో యన శ్రీనివాస
యోగ్యమగు కాంతి బొమ లూది యుట్టిపడెడి
నౌర, సమతధీప్రమ లక్షులందు మెఱయు.

ఆచిదానందమూర్తి దివ్యాక్షియుగమె
యౌనుబో, త్రిలోకీ రక్షణాతిదక్ష;
మరసి యరసి జన్మము చరితార్థమైన
యట్లు కనుగొంటి మతిగభీరార్ద్రమూర్తి.

మేళవింపుండు తంబురా, మీటుఁడట్టె
మంద్రమును దారమునుగాని సాంద్రరవము
మృదుత నెలకొల్పుఁ డాడివై చెదము సకల
జనుల హృదయంబులను రసోజ్జ్వలత జతుల

ఎన్ని జాగరణంబులో-యెన్ని యరుచి
వేళలో- స్వాప్నికములట్లు దేలిపోమె;
రోగి వేదనాశయ్యఁ దేఱుకొన నిండు;
జరుని గులుకనిండు నవాంశతరుణునట్లు.

యువతులార, లోక మెఱుంగనవును బూర్వ
దిశకు నావలిసరసులఁ దేజరిల్లె
దూరదూరాన క్రొత్తప్రత్యూషమను ను
దంత; మిఁక లెండు; పాడుఁ డాత్మానుభూతి.

జాల్గరంగఁ గావలయు స్వర్గతత కరుణ
మలతుపానుకంటె బలీయమగుచుఁ గడల
నిండవలె; వాని మనమధ్యనుండువ్యవధి
ప్రేమరసపూర్ణమై విడంబింపవలయు.

---





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## తేదులపెట్టె

కొ. నరసింహాచారి

ఈతేదులపెట్టెను సాధారణమగు పెద్ద సబ్బుపెట్టెతో చేయవచ్చును. సబ్బుపెట్టె యందు అడుగుతొట్టియు, పైమూతయు అను రెండుభాగములును వేర్వేరుగా నుండవలెను. అందు అడుగుతొట్టియందు చిత్రము 1 యందువలె, a a, b b అను రెండుజతల రంధ్రములను పైకొనకు సమీపముననను, c c, d d అను రెండుజతల రంధ్రములను క్రిందికొనకు సమీపముననను, e e, f f అను రెండుజతల రంధ్రములను మధ్యభాగముననుచేయవలెను. a a, b b, c c, d d అను జతలరంధ్రములు దగ్గరదగ్గరగా నుండవచ్చును. e e, f f అను జతలరంధ్రములు దూరముగా నుండవలెను. ఈరంధ్రములన్నియు ఒకేవరుస నుండవలెను.

మూతయందు చిత్రము 2 నందువలె a a, b b, c c, d d, e e, f f, అనుకోతలను చేయవలెను. మూతయందలి ఈకోతలను తొట్టియందలి యదేగుర్తులుగల రంధ్రములకు సరిగా వచ్చునట్లు గుర్తించుకొని కోయవలెను. ఇవి కాక, మూతయందు r అను నొకరంధ్రమును a a, b b అను రెండుజతల కోతలమధ్యప్రదేశమునకు సరిగావచ్చునట్లును, s అను రంధ్రమును e e, f f అను రెండుజతలకోతల మధ్యప్రదేశమునకు సరిగా వచ్చునట్లును, t అను రంధ్రమును c c, d d అను రెండుజతల కోతల మధ్యప్రదేశమునకు సరిగా వచ్చునట్లును, చిత్రమునందు జూపినవిధముగ జేయవలెను. ఈరంధ్రములు గవాక్షములవలె నుండి, తేదులను, వారములను, నెలలను జూపుటకు వీలుగలిగియుండును.

పిమ్మట చిత్రము 1 తొట్టియందలి a a, అనురంధ్రములమధ్యగల దూరమునకన్న ఒక యంగుళ మెక్కువపొడవుగల పేముతునుకల ఆఱింటిని దీసికొని ఒక్కొక్కదానియొక్క కొనలను అరయంగుళము పొడవువరకు, e, e, చిత్రము 3 నందలిరీతిగ పలకవలె చెక్కవలెను. ప్రతితునకయందును c c వలె నొక కోతనుగూడ జేయవలెను.

పిమ్మట చిత్రములు 4, 5, 6 నందలి విధముగ నెలలపేరులను ఒకనిడుపాటి కాగితమునందును, వారములపేరులను మరియొక కాగితమునందును, తేదులను మరియొక కాగితమునందును వ్రాసిగాని, అచ్చుముక్కలను (క్యాలెండరు కాగితమునుండి చించుకొనబడినవి) అతికించిగాని సిద్ధపరచుకొనవలెను. ఈ నిడుపుకాగితముల వెడల్పు తొట్టియందలి a a అను రంధ్రముల మధ్యకొలతకు మించకుండవలెను. కాగితములమూల


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లన్నిటిని ౧ ౧ లందలివిధముగ కత్తిరించవలెను.

పిమ్మట పేముతునుకలనన్నింటిని తొట్టియందలి a a మొదలగు రంధ్రములలో నమర్చవలెను. పేము తునుకల e e అను కొనలు పేముపై చుట్టి, క్రిందికొనను d d రంధ్రము లందు గల పేములోని కోతయందు దూర్చి యతికించవలెను. ఈరీతిగనే వారముల పేర్లు గల చిత్రము5నందలి కాగితముయొక్క కొనలను a a, b b రంధ్రములం దమర్చబడి










యుండు పేము తునుకలకును, చిత్రము 6నందలి తేదుల కాగితమును e e, f f అను రంధ్రములందలి పేము తునుకలకును బిగించవలయును. అటుపిమ్మట చిత్రము 2 నందలిమూతను తొట్టిపై మూసిన యెడల తేదుల పెట్టె పూర్తి యగును. అప్పుడు వారముయొక్క పేరు r అను గవాక్షము (చిత్రము 2) నకును, తేదుల సంఖ్య s అను
















మాత్రము తొట్టియొక్క ప్రక్కల వెలుపలికి వచ్చియుండవలెను. తర్వాత చిత్రము 4 నందలినెలలకాగితమునుదీసికొని దాని పైకొనను,c c రంధ్రమునందలి పేమునందుగల సందునందు దూర్చి యతికించి, కాగితము నంతయు గవాక్షమునకును, నెలపేరు t గవాక్షమునకు సరిగా వచ్చును (చిత్రము 8). కాగితపు తునుకలను పేముతునుకలకు బిగించవలసినవిధము చిత్రము 7 నందు జూపబడియున్నది.

(All rights reserved)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయ నాగరికత : భగవద్గీత

కొ. శఠకోపాచారి, యం. ఏ., బి. యల్.

"ప్రపంచ మందలి వాఙ్మయములలోనెల్ల సంస్కృతవాఙ్మయము మిక్కిలి ప్రాచీనమైనది, మహత్తరమైనది, యుత్తమధార్మికప్రభావము కలది" అని మహనీయులగుసాహిత్యవిమర్శకుల యభిప్రాయము. ప్రపంచమం దిప్పటికిని నిలిచియున్న ముఖ్యప్రాచీన మతముల, కనగా సనాతనహిందూధర్మమునకును, దీని శాఖగా నుద్భవించిన బౌద్ధమతమునకును, మనప్రాచీన సారస్వతమే మూలాధారము. అట్టిసంస్కృతసారస్వతమంతటిలో నతివిపులగ్రంథమగు మహాభారతము, భరతదేశప్రాచీనరాజ్యములయొక్కయు, సంఘము యొక్కయు చారిత్రమును దెలియజేయుచు నితిహాసరత్నమనియేకాక, నీతిబోధకములగు వందలకొలది యుపాఖ్యానములు కలిగి, ధార్మికజ్ఞానబోధకములగు ననేకోపదేశరత్నముల హారమై విలసిల్లు పంచమవేదమను పేరగూడ బరగుచున్నది. ఈ మహాగ్రంథమధ్యమందున్న శ్రీ భగవద్గీత దీనికి నాయకమణిగా నున్నది. ఇది ౭౦౦ శ్లోకములుమాత్రమే కలదై భీష్మపర్వమందు ౧౮ అధ్యాయములందు జేరియున్నను, దీని యాధ్యాత్మికప్రాముఖ్యమునుబట్టి ప్రత్యేక గ్రంథముగా నెంచబడుచున్నది.

ఇది ఆధ్యాత్మికగ్రంథమైనను, సహజమనోహరతచే పాశ్చాత్యుల హృదయములనుగూడ విశేషముగ నాకర్షించినది. సంస్కృతగ్రంథములలోనెల్ల నిదియే ప్రథమమున (౧౭౮౫-వ సంవత్సరమున) ఆంగ్లభాషలోని కనువదింపబడినది. అప్పటినుండియు, నాంగ్లభాషలోనే వందలకొలదియు లాటిను, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, స్వీడిషు, పారసీక, జపాను మొదలగు ప్రపంచమందలి ముఖ్యభాషలన్నిటిలో ననేకములు గీతపై వ్యాఖ్యానములు వెలువడినవి. ఇక సంస్కృతములోను, హిందీ, బంగాలీ, తెలుగు, కన్నడము, అరవము, మహారాష్ట్రము, గుజరాతీ మొదలగు మనదేశభాషలలోను గీతావ్యాఖ్యానములు వేలకొలది కలవనుట యతిశయోక్తి కాదు.

భగవద్గీత కింతటియసమానప్రసిద్ధియు, వ్యాప్తియు కలుగుట కనేకకారణములు కలవని తోచుచున్నది. ఈగ్రంథమందలి ప్రాతిపదికపదములు ప్రతినిత్యమును దేశభాషలన్నిటిలోను మనము వాడుకొనునట్టివి; అతి సులభములు; చిన్నవి. ఇందు దీర్ఘక్లిష్టసమాసములు లేక రూఢమగు మృదుమధురపదములతో భావము సుబోధముగా స్ఫుటముచేయబడినది. వాక్యముల యన్వయము చాలధారాళముగ నుండును. అందుచే సంస్కృతభాషరానివారుకూడ పారాయణముచేయునప్పు డిందలి శ్లోకములయర్థమును సులభముగ గ్రహింపగలుగుచున్నారు. మఱియు గీత శ్లోకరూపమున నున్నందున దానిని జ్ఞప్తియం దుంచుకొనుట సులభము. చాలవరకు అనుష్టుప్వృత్తమే యగుటయు, నన్వయము క్లిష్టముకాక చక్కగా నుండుటచేతను వచనము జదివినయటుల నందలియర్థము సులభముగానే గోచరించుచుండును. మఱియు నీగ్రంథము సంస్కృత వాఙ్మయయుగసంధిలో జనించినది. వైదిక వాఙ్మయములోని సంహితలు, ఉపనిషత్తులు, చాలభావగాంభీర్యము గలవైనను- వాటిఛాందస (Vedic) భాషయొక్క వ్యాకరణమును, చాలపదములయర్థము, అర్వాచీనసంస్కృతపు (Classical Sanscrit) వాటికన్న చాలవరకు భిన్నము లగుటచే ఆగ్రంథము లిప్పటి సంస్కృతపండితులకుగూడ అర్థమగుట చాలకష్టము. ఈ అర్వాచీన సంస్కృతములోని ధార్మికగ్రంథములు చాలవరకు దీర్ఘసమాసములతోను, క్లిష్టపదములతోను నిండి అన్వయకాఠిన్యము కలిగియుండుటచే సుబోధములు కాకయున్నవి. ఈ రెండుభాషాయుగముల సంధికాలమున నుత్పన్నమైన భగవద్గీత పైనజెప్పిన రెండుయుగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలోపములు లేక, వాటి సుణవిశేషములనుమాత్రము కలిగియున్నది.

హిందూధర్మమందలి యన్నిసిద్ధాంతములవారికిని "ప్రస్థానత్రయ" మనబడు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత- ఈమూడును ముఖ్యప్రమాణ గ్రంథములని యందరకు తెలిసియేయున్నది. ఈమూడింటిలోఁగూడ భగవద్గీతయే యనేకవిషయముల నుత్తమ గ్రంథమని తోచుచున్నది. ఈమూడు ధార్మికప్రబంధములకును శ్రీవేదవ్యాసులే ప్రవక్తలని ప్రసిద్ధియైనను చారిత్రకముగా దశోపనిషత్తులకు తరువాతను, బ్రహ్మసూత్రములకన్న ముందును ఈమధ్యకాలమున నిప్పటి భగవద్గీత జనించినదని చాలమంది పరిశోధకుల అభిప్రాయపడుచున్నారు.*తక్కిన రెండుప్రస్థానములుక్లిష్టమైనవి. ఉపనిషత్తులు వైదికభాషలో ప్రాచీనవృత్తములలోను

* ప్రాచీనపండితులలోను, నవీన విమర్శకులలోను చాలమంది అభిప్రాయ మిదియే. ప్రాచీనములగు దశోపనిషత్తులు గీతలకన్న పూర్వపువి అనువిషయమున అందరికిని ఏకాభిప్రాయమే. వాటిభాషాశైలియు, ఛందస్సును గీతలం దుపనిషచ్ఛబ్దములనే కాక యోగసాంఖ్య దర్శనములనుగూడ ప్రత్యేకముగా నుల్లేఖించుటవలనగూడ ఈసంగతి స్పష్టమగుచున్నది. బ్రహ్మసూత్రములవిషయమైమాత్ర మభిప్రాయభేదము గలదు. (గీత అ౧౩-శ్లో ౪ లో) "బ్రహ్మసూత్ర పదైశ్చైవ" అని చెప్పబడియున్నది. అందులోని బ్రహ్మసూత్రశబ్దము ప్రస్తుతబ్రహ్మసూత్రగ్రంథములకే వర్తించునని శ్రీతిలకుగారియొక్క అభిప్రాయము. ఈయర్థము నంగీకరించినచో గీతాసమయమునకు ముందు బ్రహ్మసూత్రములు రచింపబడినవని చెప్పవలసియుండును. ఈరెంటికిని శ్రీవ్యాసులవారే కర్తలనియు, రెండును సుమారు ఏకకాలమందే రచింపబడియుండుననియు శ్రీతిలకుగారు దీర్ఘచర్చపైన నిశ్చితాభిప్రాయమునకు వచ్చిరి. ("గీతారహస్యము" ఆంధ్రానువాదము- ౭౪౫ మొదలు ౭౬౫ పుటలవరకు చూడుడు.)

కాని చిరకాలమునుండి ప్రాచీనవ్యాఖ్యాతలు కూడ గీతలు ప్రస్తుతబ్రహ్మసూత్రములకన్న పూర్వపువే అని అంగీకరించియున్నారు. ఆధునికవిమర్శకుల యభిప్రాయము నిట్టిదియే. (Bhandarkar గారి The Vaishnava, Shaivite and other religions అను గ్రంథమును Telang's Bhagavatgita (Sacred books of the East series) ఉపోద్ఘాతము ౩౦, ౩౧, ౩౨ పుటలు చూడుడు.) గీత ౧౩ అ-శ్లో ౪ లోని బ్రహ్మసూత్రశబ్దమునకు "బ్రహ్మప్రతిపాదకైః సూత్రాఖ్యైః శారీరక సూత్రైః" అని రామానుజులు తమగీతాభాష్యమున వ్యాఖ్యయొనర్చిరి. అందును బట్టి రామానుజులకును, తిలకుగారికిని కలిగిన యభిప్రాయమే ఉండినదని సూచింపవచ్చును. కాని రామానుజులాశబ్దములచే ప్రస్తుతబ్రహ్మసూత్రములనే యుద్దేశించిరని చెప్పుటకు వీలులేదు. ప్రస్తుతమున్న బ్రహ్మసూత్రములు, యోగసూత్రములు, వైశేషిక సూత్రములు మొదలగువాటికన్న నవీనములని చాలమంది విమర్శకుల యభిప్రాయము. రామానుజులైనను తమ వ్యాఖ్యలో అవి బాదరాయణసూత్రములని చెప్పలేదు. పూర్వము సంగ్రహముగ వేరొకశారీరకసూత్రము లుండి తరువాత నవి ప్రస్తుతబ్రహ్మసూత్రముల యాకారమునకు విస్తృతము చేయబడినవేమో తెలియదు. ప్రస్తుతమున్న (కపిల) సాంఖ్యసూత్రములవిషయమున నిట్లే జరిగినదని చాలమంది సాహిత్యవిమర్శకుల యభిప్రాయము. మఱియు గీతలలో నిప్పటికున్న వ్యాఖ్యానములలో మొదటిదగు శ్రీశంకరులవారి గీతాభాష్యములో "బ్రహ్మసూత్రపదైశ్చైవ" అనుపదమునకు, బ్రహ్మణః సూచకానివాక్యాని బ్రహ్మసూత్రాణి "తైః పద్యతే గమ్యతే జ్ఞాయతే బ్రహ్మ......" ఆత్మేత్యేవోపాసీత" ఇత్యాదిభిః బ్రహ్మసూత్రపదైః" అని వివరించి గీతలో "బ్రహ్మసూత్రపదైః" అను శబ్దము బాదరాయణసూత్రములకు కాక ఉపనిషత్తులకే వర్తించునని తెలిపి బృహదారణ్యకోపనిషత్తు ౩-౪-౭ లోని పైవచనము నుదాహరించిరి. ఈవిషయమున శంకరుల అభిప్రాయమే సరియైనదిగా కన్పడుచున్నది......... ఇక ప్రస్తుత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉండుటయేకాక, అందలిభావములు చాలవరకస్ఫుటము (Vague)గాను, విస్తృతము (diffuse)గాను ఉండును. మధ్య ననేకగాథలు ముఖ్యభావమున కాటంకము కలిగించుచుండును. ఇక బ్రహ్మసూత్రములు బీజగణితసూత్రముల(Algebraical formula)వలె ప్రపంచ వాఙ్మయములోనికెల్ల నత్యంత క్షిప్తమును, * నిగూఢమును, శాస్త్రచర్చచే దుర్బోధమునునగుశైలిలోనున్నవి. వ్యాఖ్యానము చదువనిచో బ్రహ్మసూత్రములభావము పండితులకుగూడ బోధపడదు. భగవద్గీత యిట్టిచిక్కులులేక మృదుమధురోజ్వలశైలిలో ద్రాక్షాపాకమున నుండుటచే నందరకును సుబోధముగ నుండి సర్వజనులకు రసాస్వాదన నిచ్చుచు విశేషజ్ఞానానందదాయకముగ నున్నది. పవిత్రతలోను, ఆధ్యాత్మికజ్ఞానాకరములలోను ఉపనిషత్తులకును గీతకును విశేషభేదము లేదని చెప్పవచ్చును. గీతావచనమును భగవంతుడు శ్రీకృష్ణరూపమున యుద్ధభూమిలో వచించెనని సామాన్యముగా హిందువుల విశ్వాసము. గీత లుపనిషత్తుల సారమే యనిగూడ సంప్రదాయము కలదు. ప్రచారములోనున్న భగవద్గీత ప్రతులన్నిటిలోను ప్రతియధ్యాయాంతమునను 'గీతయందు' అనుటకు బదులుగా 'శ్రీభగవద్గీతాసూపనిషత్సు' (భగవంతునిచే గానముచేయబడిన యుపనిషత్తులందు) అని యుపయోగించుట యు, గీతాపారాయణారంభమందు పఠించెడు "సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః, పార్థో వత్స స్సుధీ

---

బ్రహ్మసూత్రములలో చాలచోట్ల సాంఖ్యయోగాది దర్శనము లుల్లేఖింపబడినవి. మరియు వాటిలో చాల సూత్రములందు "స్మృతేశ్చ" "స్మర్యతే" మొదలగుపదములచే పూర్వస్మృతికూడ ప్రమాణముగా జెప్పబడినది. (బ్రహ్మసూత్రములు ౧-౨-౬, ౧-౩-౨౩, ౨-౩-౪౫ ౪-౧-౧౦, చూడుడు). అవి ఉపనిషత్తు లనుటకు వీలులేదు. వాటికైనచో శ్రుతి అనియే చెప్పబడును. ఆచారవ్యవహారాదిబోధకముల ప మనుస్మృతి మొదలగు స్మృతులం దుద్దేశింపబడలేదని అందరు అంగీకరించుచున్నారు. ఆప్రమాణాంశము లీస్మృతులలో లేవు. అవి భగవద్గీతలోనే యున్నవి మఱియు మతత్రయాచార్యులును, వల్లభాచార్యులునుగూడ తమసూత్రభాష్యములలో బ్రహ్మసూత్రములలో జెప్పబడినప్రమాణస్మృతి భగవద్గీతయే యని భగవద్గీతాశ్లోకములనే ఆ ప్రమాణములుగా ఉదాహరించిరి. వీటిలో కొన్నిసూత్రములలోనైనను ఆసూత్రకారులు భగవద్గీతాశ్లోకములనే ఉద్దేశించిరని తిలకుగారును అంగీకరించిరి. సాంప్రదాయికాభిప్రాయమును బట్టియు, వ్యాఖ్యాతలలో ఎక్కువమంది అభిప్రాయమునుబట్టియు గీతలు బ్రహ్మసూత్రములకన్న ప్రాచీనమేయని తోచుచున్నది.

*కదనరంగమున నర్జునుకు వెనుదీయుటయు నంత దీర్ఘభావగర్భితమును నాధ్యాత్మికగ్రంథవచనముల జెప్పుటయు సహజముగ లేదని కొందరందురు. కాని ధైర్యశౌర్యసంపన్నుడును అర్జును డత్యుత్సాహముతో యుద్ధభూమిలోనికి ప్రవేశించినను, నొక్కసారిగా నుభయసైన్యములందును బంధుమిత్రులందరును మరణసన్నద్ధులై యుండుట కండ్లార జూచినప్పుడు సహృదయుడు, నా యుద్ధమున ముఖ్యపాత్రవహించవలసినవాడు నగు అర్జునం జయునంతటివానికి నిర్వేదము కలుగుటయు, ఘటనాఘటనసమర్థుడును, తనమిత్రునిచే దుష్టసంహార మొనర్పించి ధర్మసంస్థాపన జేయుటకు కృతనిశ్చయుడును, లోకహితరతుడును నగు శ్రీకృష్ణు డాసవ్యసాచికి వెంటనే హితబోధ కావించుట యాశ్చర్యముకాదు. సహజముగా ప్రాజ్ఞుడును, రాజ్యాపేక్షకాని, క్రొత్తగా కీర్తియపేక్షకాని లేనివాడు, ధీమంతుడు నగు విజయుడు తాను గురువుల జంపి రక్తసిక్తరాజ్యమును భుజియించుటకన్న భిక్షాటనమైన మేలని గాఢభావముల (గీత.అ౨. శ్లో ౪ మొదలు ౧౧ వరకుచూడుడు.) వెల్లడించి ధర్మసమ్మూఢచేతస్కుడై యుండినప్పు డతనిని కేవలలౌకికవాదములచే వరల యుద్ధసన్నద్ధునిగాజేయుట సాధ్యముకాదు. అట్టితరి రసాభాసము కాకుండా కార్యసాధనము జరుగుట కతనికి ఆధ్యాత్మికముఖ్యసూత్రముల బోధించుట యవసరముగా గన్పట్టును. తరువాత గ్రంథకర్తలాబోధనములకు దసురూపము నిచ్చియుండవచ్చును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్” అను గీతాధ్యాన శ్లోకముయొక్క భావమునుగూడ ఈ సంప్రదాయమును స్ఫుటముచేయుచున్నవి. మరియు ఉపనిషత్తులలోను, గీతలలోను చాలవరకు భావైక్యము కలదు. ఆత్మ స్వరూపాదులనుగూర్చి గీతలోను ఛాందోగ్య, బృహ దారణ్యకాదివచన రూపములను ఉపనిషత్తులలోను కల భావము లొకటిరుగనే యున్నవి. ఇంతేకాక ఒక్కొ కప్పుడు శ్లోకరూపముననున్న కఠోపనిషత్తు ఈశావా స్యోపనిషత్తు మొదలగు వానిలోని శ్లోకపంలును భగవద్గీత లోని యాభావమునే దెలుపు శ్లోకములును విశేష శబ్దభేదముకూడ లేకుండ నొక్కరూపమున నున్నట్లు వాటిని చదువునప్పుడు తప్పక స్ఫురించుచుండును. * గీతామృతమును ప్రథమమున పార్థుడే గ్రోలినను తరు ఈరెండువేలసంవత్సరములపైనుండియు అందరును తర తరములుగా దానిరసము నాస్వాదించుచున్నారు. గీత కింకొకవిశేషముకూడ కలదు.

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు కొంతశాస్త్ర సంస్కారము కలవారికిమాత్రమే యుపయోగించును. వాటి భాషా స్వభావమునుబట్టియు ద్విజపురుషులు మాత్రమే వాటిని చదువ నర్హు లను పూర్వాచారమును బట్టియు కూడ నట్టిస్థితి కలిగినది. కాని భగవద్గీత మహా భారత మను నితిహాసగ్రంథములో నొకభాగముగ జేయ బడుటచేతను, దానిసుబోధమగు ద్రాక్షాపాకశైలివల్లను భావగాంభీర్యమువల్లను స్త్రీలకు, శూద్రులకు, అన్యదేశీ యులకుగూడ నిత్యపఠనీయమై సర్వజనుల కుపకారక ముగా నున్నది.

భగవద్గీతపదములశైలి యతిసులభముగ నున్నను దానిభావగాంభీర్య మగాధము. ఆధ్యాత్మిక భావనిరూ పణమున దానినిమించినగ్రంథములు ప్రపంచమున నే వాఙ్మయమందును లేవని హంబోల్టు (Humbolt), ఎమర్సన్, (Emerson), థోరో †(Thoreau), పాల్ డ్యూసన్ (Paul Deusson), ష్లిగెల్ (Schlegel) మొదలగు పాశ్చాత్యతత్త్వశాస్త్రజ్ఞులచే గొనియాడబడిన యీమహోత్కృష్ట గ్రంథముభారతీయులెల్లరచేనిత్యము పారాయణము చేయబడుచు విద్వాంసుల వ్యాఖ్యాన పరంపరలచే మన్ననల బొందుటయం దాశ్చర్య మేమియు లేదు.

కాని భారతీయనాగరకతలో నాయాయుగము లందు కలుగు మార్పులలో భగవద్గీతయొక్కస్థానము జన

* ఉపనిషత్తులలోను, గీతలోను ఒక్కశబ్దరూపము, అర్థముగల శ్లోకములు కొన్ని యీక్రింద సూచింప బడుచున్నవి :

| భగవద్గీత | | అ. శ్లో. | ఉపనిషత్తు | | అ. వ. శ్లో. |
|---|---|---|---|---|---|
| నజాయతేమ్రియతేవా | ... ... | ౨—౨౦ | నజాయతే మ్రియతే | కఠో | ౧—౨—౧౮ |
| సర్వతఃపాణిపాదంతత్ | ... ... | ౧౩—౧౩ | సర్వతః పాణిపాదం తత్ | శ్వేతా | ౩—౧౬ |
| ఊర్ధ్వమూలం | ... ... | ౧౫—౧ | ఊర్ధ్వ మూలో | కఠో | ౨—౩—౧ |
| నవద్వారే పురే | ... ... | ౫—౩ | నవద్వారే పురే | శ్వేతా | ౩—౧౮ |
| య ఏనం వేత్తి హన్తారం | ... | ౨—౧౯ | హన్తాచే న్మన్యతే | కఠో | ౧—౨—౧౯ |
| వేదైశ్చ సర్వైః | ... ... | ౧౫—౧౫ | సర్వే వేదా | ,, | ౧—౨—౧౫ |
| కురు కర్మైవ | ... ... | ౪—౧౫ | కుర్వ న్నేవహి కర్మాణి | ఈశా | ౧—౨ |
| సర్వభూతస్థ | ... ... | ౬—౨౯ | యస్తు సర్వాణి భూతాని | ఈశా | ౧—౬ |

† ప్రతిఉదయమును గీతలపవిత్రజలమున తనహృదయమును స్నానము చేయించుచుందునని సాత్విక నిరోధ సూత్రకారుడగు థోరో అను అమెరికను తత్వజ్ఞుడనెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామాన్యమునకు దెలియకపోవచ్చును. ఆయాయుగ ప్రవర్తకులు తమతమప్రబోధములను ముఖ్యముగా భగవద్గీతనుండి గ్రహించి తమతమ ప్రతిభానుభవములనుబట్టి ప్రత్యేకసిద్ధాంతవ్యాఖ్యానముల గావించి వాటి నాచరణలో బెట్టియున్నారు. చిదచిద్రూపమగు ప్రపంచము యొక్క మూలస్వరూపమునుగూర్చి, జీవాత్మపరమాత్మలసంబంధమునుగూర్చి, నిఃశ్రేయసస్వభావమును గూర్చి ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతత్రయాచార్యులకు సిద్ధాంతవిషయములందు కొన్ని భేదములు గలవు. వానిని మనము ప్రస్తుతము విమర్శింపనక్కరలేదు. కాని నిఃశ్రేయసావాప్తిసాధనములుగా గీతలో చెప్పిన జ్ఞానకర్మభక్తియోగముల స్వభావప్రాముఖ్యములగూర్చిన వ్యాఖ్యాతలసిద్ధాంతములను, అందువలన కలిగినఫలములను మన మిప్పుడు చూతము.

గీతపై ఇప్పటికి నిల్చియున్న ముఖ్యవ్యాఖ్యానములలో మొదటిది శ్రీశంకరాచార్యులవారి భాష్యము* కర్మయోగ మనగా విధ్యుక్తనిత్యకర్మల జేయుట యనియు, భక్తియోగమన నీశ్వరధ్యానమనియు, జ్ఞానయోగమన నవిద్యానాశము కలిగి ఆత్మయొక్క నిజస్వరూపమును దెలిసికొనుట యనియు, నీమూడింటిలో కర్మభక్తియోగములు మోక్షమునకు ప్రత్యక్షసాధనములు గావనియు, నవి ప్రథమావస్థలో నంగములుగా నుండి జ్ఞానమునకు మార్గదర్శకములుగా మాత్రమే యుపయోగించుననియు, జ్ఞానయోగ మొక్కటియే నిజమగు మోక్షసాధనమనియు పరిశుద్ధజ్ఞానము కలుగగానే సర్వకర్మల ద్యజించుట యత్యావశ్యకమనియు, శ్రీ శంకరాచార్యులవారి మతము. గీతాకాలమునకు పూర్వమును వేదములలో, మంత్రబ్రాహ్మణములలో, కర్మకాండయు, ఆరణ్యకోపనిషత్తులలో జ్ఞానకాండయు, నెక్కువగా వివరింపబడినవి. ఈ రెండింటిలోను అచ్చటచ్చట భక్తికూడ వివరింపబడినది. గీతలలో నీమూడును వివరింపబడినవి. తరువాత వేయిసంవత్సరములపైగ దాటినతరువాత, ననగా శ్రీశంకరాచార్యులవారికాలమునకు (క్రీస్తుతరువాత యెనిమిదవశతాబ్దములో) మనదేశమున నొకప్రక్క పూర్వమీమాంసకులయొక్కయు, మఱియొకప్రక్క బౌద్ధులయొక్కయు ప్రభావము జనుల మనస్సులపై వ్యాపించియుండినది. ఈరెండుమతములు నప్పటికి తమసహజపరిశుద్ధతను గోల్పోయినవి. వేదములలో కర్మకాండయందును, భగవద్గీతలోను జెప్పబడిన యజ్ఞయాగాదులభావము స్వార్థహీనతతోను, ఈశ్వరార్పణబుద్ధితోను భగవత్ప్రీతికరమగు పరోపకార కార్యములజేయుటయను † ఆదర్శముల విస్మరించి పూర్వమీమాంసకులు వేదశబ్దోచ్చారణయు, కేవలయజ్ఞకర్మయు మాత్రమే అపూర్వపుణ్యముల నిచ్చి, వాని నాచరించినంతమాత్రముననే మోక్షము కల్గించుననియు బోధించుచుండిరి. ఇందుచే జనసామాన్యమున మాఢ్యము వృద్ధియయ్యెననియు, ఈయాధారమున సామాన్యజనులు జీవహింస నెక్కువగా చేయదొడగిరనియు, నిక బౌద్ధులును బుద్ధుడు పరోపకారమునకును, నీతివర్తనకును, ఇచ్చినప్రాధాన్యమును మరచి, స్త్రీపురుషులు కలిసి శ్రమణకవేషములతో నుండుచు బౌద్ధగ్రంథములందలి బోధముల కపార్థమొనరించి స్వైరవిహార మొనరింప మొదలిడినందున దేశమున నవినీతియు, నజ్ఞానమును హెచ్చి యనర్థము వాటిల్ల నారంభించినదనియు, నందుచే శ్రీ శంకరాచార్యులవారు జ్ఞానయోగమున కిచ్చినప్రాముఖ్యము పైనజెప్పిన రెండిటిలోపములను బోగొట్టుటచే, నప్పటి పరిస్థితినిబట్టి తత్కాలమునకు మనజాతిలోని దురాచారనివృత్తికి సహకారియై జ్ఞానాభివృద్ధి కలిగించి దేశమున కప్పటిలో జాలఉపయోగకారి యయ్యెనని కొందరు చారిత్రక పరిశోధకుల యభిప్రాయము.

---

* శంకరులకు చాలశతాబ్దములు పూర్వము జ్ఞానకర్మసముచ్చయపరమగు బోధాయనులవ్యాఖ్య ఒకటి ఉండినట్లు తెలియుచున్నది. వారిసిద్ధాంతమును తరువాత రామానుజు లనుసరించిరి. కాని యాగ్రంథము ఖిలమైనట్లు తోచును. ఇప్పు డెచ్చటను లేదు.

† యజ్ఞార్థాత్కర్మణః...(గీత అ 3. శ్లో ౯)
యజ్ఞశిష్టాశినః.. (గీత అ 3. శ్లో ౧3)
గతసంగస్య.. (గీత అ ౪. శ్లో ౨3)
ద్రవ్యయజ్ఞాః.. (గీత అ ౪. శ్లో ౨౮)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్ని శతాబ్దములు గడచినతరువాత పరిస్థితులు మారినవి. కర్మలన్నియు హానికరము లనుభావముతో జనులు సర్వకర్మపరిత్యాగము చేయుటచే అవశ్యకార్యములు జరుగక సంఘమున కంతటికి చాలనష్టము కలుగుట సహజము. మనదేశముపై అన్యదేశీయుల దండయాత్రయు, సన్యదేశీయుల నాగరికతతో మననాగరికతకు సంఘర్షణయు జనింప నారంభించినవి. అట్టిస్థితిలో శ్రీశంకరులుచెప్పిన సర్వకర్మనిసర్జనము సవ్యము కాదనియు, కేవలజ్ఞానమే మోక్షసాధనమనుటకు వీలులేదనియు, జ్ఞాన, కర్మ, భక్తియోగములు మూడును భక్తిసాధనము లనియు, జ్ఞానాంగకర్మమార్గమును భక్తియుతముగా నాశ్రయించి ప్రతిజీవుడును నిశ్శ్రేయసమునుబొందవచ్చుననియు సిద్ధాంతమును ౧౮-వ శతాబ్దమున నుదయించిన రామానుజులు ప్రకటించిరి. * ఈసిద్ధాంతము కేవలము నూతనముకాదు. కొన్ని ఉపనిషత్తులలోను, భాగవతగ్రంథములోనుగూడ ఈసిద్ధాంతమే నిర్వచింపబడెను.

* రామానుజులు భాగవతధర్మావలంబకు లగుటచే కర్మయోగపక్షమును వహించవలసియుండియు నట్లుచేయక చాలవరకు శంకరులమార్గమునే యవలంబించిరని శ్రీ బాలగంగాధరతిలక్ గారు తమయభిప్రాయమును దెల్పిరి. (గీతారహస్యము, ఆంధ్రానువాదము ౨౨-వ పేజీ చూడుడు.) కాని యీభావము సరిగా కనుపడదు. రామానుజులు ఆమరణాంతమును జ్ఞానికూడ కర్మ చేయుచునే యుండవలెననియు, సులభము, అప్రమాదము, ఈశ్వరప్రీతికరము, ఇతరులకు మార్గదర్శకము, లోకరక్షాకరము అగుటచే కర్మయోగము జ్ఞానయోగముకన్నగూడ ప్రశస్తమనియు జెప్పి, శ్రీ శంకరుల కర్మనిసర్జనసిద్ధాంతమునకు వ్యతిరేకముగా నిర్ధారణ జేసిరి. గీత అ 3. శ్లో ౮, ౯, ౨౦, ౨౧, ౨౬, ౩౫; అ ౪. శ్లో ౧౯, ౨౨, ౨౪; అ ౫. శ్లో ౨, ౩, ౭, ౨౯; అ ౬. శ్లో ౧, ౬, ౧౨, ౪౪; అ ౧౮. శ్లో ౪, ౫, ౬, ౯, ౪౭, ౪౮, ౫౬, ౫౭ లపై రామానుజభాష్యమును జూచినచో స్పష్టమగును. ఇట్టి గీతావచనములను అర్థముజేయుటలో తిలకుగారును రామానుజులపద్ధతినే యవలంబించిరి. అయితే రామానుజులు భక్తికి ప్రాముఖ్యము నిచ్చినసంగతి నిజమేకాని తిలకుగారు చెప్పినట్లు (గీతారహస్యము ౪౨౫ పేజీచూడుడు) రామానుజసిద్ధాంతములో కర్మయోగము జ్ఞానయుక్తమగు భక్తికి సాధనముగనే స్థిరపడుచున్నదనుట యుక్తముగ గన్పడుట లేదు. స్వకర్తృత్వాభిమానమును, స్వలాభాపేక్షను విడనాడి, సర్వకర్తయు, సర్వభోక్తయు నగు నీశ్వరునియందే ఆకర్తృత్వభోక్తృత్వముల నుంచి యీశ్వరారాధన రూపముగను భగవత్ప్రీతినిమిత్తము సర్వకర్మలను జేయవలెనని రామానుజులు వ్రాసిరి. శ్రీతిలకుగారు అద్వైతులు, రాజకీయనేత కూడ అగుటచే సంఘక్షేమముకొఱకు, ప్రపంచలాభము కొఱకును స్వార్థరహితముగా కర్మ చేయవలెననిరి. ఈయిరువురికాలస్థితి భేదములు మనస్సునం దుంచుకొని చూచినచో, నిద్దరు చేసిన అర్థములభావము నొకటియేయని తెలియగలదు. మఱియు రామానుజులు విశిష్టాద్వైతియగుటచే వారి సిద్ధాంతముప్రకారము చిదచిద్రూపమగు సర్వప్రపంచమును ఈశ్వరుని శరీరమే యగును. అట్టిచో నీ సిద్ధాంతమును బట్టి ఈశ్వరారాధనములో ప్రపంచారాధనము, మానవసేవకూడ చేరు ననుసంగతి మనము జ్ఞప్తియం దుంచుకొనవలసియున్నది. లోకాభివృద్ధికరమైనదే సృష్టికర్తయగు భగవంతునకు ప్రీతికరమగును. ఈశ్వరారాధననిమిత్తమే కర్మచేయుచో స్వార్థపరతయుండదు కనుక నిష్కామత సిద్ధించును. (గీత ౧౮-౬౬) "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శరణాగతిబోధకమగు "చరమశ్లోక" వ్యాఖ్యానములో కూడ ధర్మఫలత్యాగముచేయుట అనియేకాని, ధర్మములనే త్యజించుట కాదని జ్ఞానకర్మభక్తియోగములు మూడును ఎల్లకాలమును ఆచరింపవలసినవే యనియు రామానుజులు తమ సముచ్చయసిద్ధాంతమును దెలియజేసిరి. "లోకసంగ్రహ" శబ్దమునకు "లోకరక్షక" అని రామానుజులు చెప్పిన అర్థమువలనగూడ ఈ సంగతి విశదమగును. (గీత అ 3 శ్లో ౨౧) రామానుజుల తర్వాత వారిసిద్ధాంతమువారు కర్మయోగముకన్న భక్తిప్రపత్తులకు అధికప్రాముఖ్య మొసంగిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. యస్. ఐ. రైల్వేవారి "ఎలెక్ట్రిక్" రైలుబండి
(ఫోర్టు స్టేషనువద్ద)



౯. హైకోర్టు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౦. స్మాల్ కాజ్ కోర్టు
(క్రొత్తగా కట్టినది)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౧. క్రైస్తవకళాశాల

బడి రామానుజులపూర్వము యామునాచార్యులవారిచే కూడ అనుకరింపబడినది. అందుచే సంఘమున కప్ప టిలో గొంత శ్రేయస్సు కలిగియుండును.

తరువాత మధ్వాచార్యులవారు, వల్లభాచార్యుల వారు మొదలగువారు భక్తిమార్గమే మోక్షదాయక మనియు, జ్ఞానకర్మయోగములు భక్తికి అంగములుగా మాత్రమే ఉపయోగించుననియు సిద్ధాంతము నవలం బించిరి. రామానుజులభాష్యమునకు పోషకముగ వేదాంతదేశికులు మొదలగువారు కొన్ని వ్యాఖ్యాన గ్రంథముల రచించిరి. కాని రామానుజుల అనుయాయు లాచరణలో వారి సిద్ధాంతమును సరిగా నమలుజరుప లేను. మరియు కొంతకాలమునకు మధుసూదనసరస్వతి, విద్యారణ్యులు మొదలగు ప్రతిభావంతులగు అద్వైత విద్వాంసు లనేకులు శంకరులసిద్ధాంతమే దేశమున విశేష వ్యాప్తినొందుటకు సహాయులైరి. అందుచే ప్రస్తుత కాలము వచ్చునప్పటికి మనదేశమున కేవలజ్ఞాన పరమగు అద్వైతసిద్ధాంతమే ప్రజలలో విశేషవ్యాప్తి జెందియున్నదని చెప్పవచ్చును. ఈలోగా దేశము పరా ధీనమై జనులు నిరుత్సాహులై సంఘము వికలతజెందుట కూడ ఇందుకు గారణమయ్యెనని కొందరి అభిప్రాయము. సనాతనపండితులనుండి యీవిషయమున నిటీవల నూతన గ్రంథము లంతగా వెలువడుచుండుట లేదు. దేశభాష లలో వ్రాయబడు గీతావ్యాఖ్యానములలోగూడ (కర్మ విసర్జనముతోగూడిన) జ్ఞానయోగమే నిఃశ్రేయసకర మను శంకరులవారి సిద్ధాంతమే యెక్కువప్రబలముగా నున్నది. ఇటీవల బెల్లంకొండ రామారావుగారను పండి తులచే రచింపబడిన 'భాష్యార్కప్రకాశ'మను పేరుగల విపులమగు శాస్త్రీయచర్చగల సంస్కృత భాష్యమును జదివినవారికి ఇప్పటికిని పండితులమనస్సులపైన కేవల జ్ఞానయోగ సిద్ధాంతమునకు గలిగియున్న ప్రభావము వెల్లడియగును. ఈలోగా దేశపరాధీనత పూర్తిఅయి హిందూసంఘ మన్నివిధములను నిర్వీర్యమైనది.

ఇట్లుండగా ప్రస్తుతకాలములో బుద్ధిమంతులగు సంఘక్షేమాభిలాషులు తిరిగి స్వతంత్రాధ్యాత్మిక పరి శోధన జేయ నారంభించిరి. ఆసందర్భమున మన ధార్మిక వాఙ్మయములో ముఖ్యగ్రంథమగు భగవద్గీతపైన వారు తమధ్యానమును నిలిపి యందుపై దమయభిప్రా యమును వ్యాసరూపమునను, వ్యాఖ్యానములరూపము నను ప్రకటించిరి. వీరిలో బ్రహ్మసమాజబోధకు లగు సీతానాథతత్వభూషణ, అశ్వినికుమారదత్తు, విపిన చంద్రపాల, అరవిందఘోషులును, దివ్యజ్ఞానసమాజాధ్య క్షురాలగు అనిబిసెంటు, ఆర్యసమాజనాయకులగు లాలా లజపతిరాయి, సనాతనధర్మనాయకులగు లోకమాన్య తిలకు, మహాత్మాగాంధి ముఖ్యులని చెప్పవచ్చును. వీరికి ఆధ్యాత్మికజ్ఞాన మున్నను సాంఘికరాజకీయములందు నాయకులని ప్రసిద్ధిగన్న వీరి నీసందర్భమున జేర్కొనుట కొందరకు విచిత్రముగ దోపవచ్చును కాని యిందు వింత యేమియు లేదు. నైతిక, సాంఘిక, రాజకీయ, ఆధ్యాత్మికాః ప్రవృత్తు లనేకము లుండినను వ్యక్తికిని, సంఘమునకును జీవిత మొక్కటియే. ఈవేరువేరుప్రవృ త్తులకు పరస్పరసంబంధ ముండుట తప్పదు. అందుచే జీవితవికాసపరిణామములు ప్రత్యేకరాజకీయములు, ఆధ్యాత్మికములు నని చెప్పుటకు వీలులేక సంయుక్త ములై సర్వతోముఖములుగా నుండును. (ఉ. అనేక శతాబ్దములనుండి అనాగరకులు, బలహీనులు, అజ్ఞా నాంధకారనిమగ్నులుగ నుండిన అరబ్బీయులు ౧౩ వందలసంవత్సరములక్రింద హఠాత్తుగా నాగరకులై విజ్ఞానవంతులు, ప్రతిభాశాలురుగ మారుటకు మహ మ్మదువారివలన నాజాతిలో కలిగింపబడిన ఆధ్యా త్మిక ప్రబోధమే కారణము.) ముఖ్యముగా భరత ఖండము మొదల ప్రాచ్యదేశములందు చిరకాలమునుం డియు మనహిందువుల జీవితప్రవృత్తులన్నియు నాధ్యా త్మికభావముల పునాదిపై నేర్పడినవి. అందుచే నితర దేశములందుకంటె మనదేశమం దాధ్యాత్మిక పరిణామ మునుబట్టియే యితరప్రవృత్తులందును దృఢమగుమార్పులు కలుగును. ఏకమతస్థులలోనే యాధ్యాత్మికముగా భిన్న జీవశక్తిగలజాతుల లౌకికప్రవృత్తులందును దృఢమగు మార్పులు కలుగును. ఏకమతస్థులలోనే యాధ్యాత్మిక ముగా భిన్నజీవశక్తిగలజాతులు లౌకికప్రవృత్తులందుగూడ భిన్నస్థితులందే యుందురు. ఇందుకు చీనాజపానుదేశ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములే నిదర్శనము. ఈరెండుదేశములలోను ౹౹ వంతు కన్న హెచ్చుప్రజలు బౌద్ధమతస్థులే. చీనా కొరియా దేశములనుండి జపాను కామతము వ్యాపించుటకు పూర్వము జపాను మిక్కిలి హీనదశయందే యుండినది. కాని చీనా, కొరియాలందలి బౌద్ధులు తమతమసిద్ధాంతములోని కొన్ని ఉత్కృష్టధర్మములను, నైతికాదర్శములను గ్రహింపలేక, అలసులై సన్యాసిజీవనమునే ఆదర్శముగా గొనిరి. సంఘస్థితి క్రమముగా హీనదశ నొందెను. కాని జపానులో బౌద్ధులు చిరకాలముకిందటనే తమమతమును కొన్ని విషయములందు హిందూమతమున కొకశాఖగా నెంచుకొని హిందూధర్మములోని కొన్ని ముఖ్యసిద్ధాంతముల దమ బౌద్ధమతాంతర్గతములుగా నెంచి ప్రవృత్తిమార్గమును వృద్ధిచేసుకొని తమ దేశమందు కళావిజ్ఞానములను, పరోపకారదీక్షను వృద్ధిచేయుట జపానీయుల యుచ్చదశకు గొంతవరకు గారణమయ్యెనని తెలియుచున్నది.

బౌద్ధమతములోని మూలసిద్ధాంతములకు శ్రీకృష్ణుల గీతాబోధమే ముఖ్యాధారమని తిలాంగు మొదలగు చాలమంది విద్వాంసుల యభిప్రాయము. స్వర్గాదులకై యాగాదుల జేయుటను బుద్ధుడు గర్హించెను. కాని అట్టి భోగైశ్వర్య ప్రసక్తులగు వేదవాదరతుల స్వర్గార్థమగు కర్మకాండపరతను బుద్ధునికన్న ముందుగా శ్రీకృష్ణులే గీతలలో నిరసించెను. (గీత అ ౨. శ్లో ౪౨, ౪౩, ౪౪ చూడుడు.) మరియు బౌద్ధమత మూలసూత్రములగు అహింస, సత్యము, త్యాగము, భూతదయ మొదలగునవి గీతలో జెప్పిన దైవీసంపత్తు (గీత అ ౧౬, శ్లో ౨) లక్షణములనుండి గ్రహింపబడెననియు జెప్పవచ్చును. బౌద్ధభిక్షువుల కాదర్శగుణములని ధమ్మపదము మొదలగువానిలో నుల్లేఖింపబడినవే శ్రీ కృష్ణులచే స్థితప్రజ్ఞలక్షణములుగా జేర్కొనబడియున్నవి. ఇదిగాక గీతలలో నిర్వచింపఁబడిన నిష్కామ కర్మయోగసిద్ధాంత మాగీతలనుండియే మహాయాన బౌద్ధగ్రంథములలోనికి గ్రహింపబడినవని చాలామంది పండితు లభిప్రాయపడుచున్నారు. బౌద్ధమతము పరిశుద్ధస్థితిలో నుండి దేశమంతటను వ్యాపించియుండినప్పుడు ఆర్థిక సాంఘిక, రాజకీయాది విషయము లన్నిటియందును మనభరతఖండమును చీనాదేశమునుగూడ జాల యుచ్చదశలో నుండినట్లు చరిత్రవలన తెలియుచున్నది. అందుకు కొంతవరకు గీతాబోధమే మూలకారణమని చెప్పవచ్చును. (సశేషము)



బౌద్ధదేవాలయము - కొలంబో

—కే. గోపాలు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సాలెపురుగు

కర్లపాలెము అనసూయాదేవి

సాలెపురుగు చాల తెలివిగలది. దానిని జూచుట నా కెంతయో యిష్టము. ప్రకృతిలోని జీవక చరఖా సాలీడే కదా. తన బట్టలను దాను నేసుకొని స్వయంశక్తిపై నాధారపడియుండుటయే మంచి దను గుణ పాఠమును మనకు నిత్యము సాలీడు బోధించును. పూర్వ మెప్పుడో కౌరవులు పద్మ వ్యూహమును బన్ని, ఒక్కయభిమన్యు నందులో జిక్కికొనునట్లు చేయునప్పటికి వారితాతలు దిగివచ్చిరని తాతగారగు వ్యాసులు వ్రాయగా విన్నాము. కాని, మన కళ్లయెదుట ప్రతినిత్యము సభేద్యము లగు కోటలనుబోలు గూళ్లను సాలీడు అనాయాస ముగ తయారుచేసి, అందులో ఈగలవంటి పురుగుల నెన్నిటినో బంధించియుంచి, అవి తమకుదామే చచ్చునట్లు జేసి ఆహారముగ వానిని వాడుకొనును. దానికి గల తంత్ర జ్ఞాన మెవరికి గలదు? పూర్వ మెప్పుడో దుష్టులగు జరాసంధాదులు రాజుల నెంద అనో తమకారాగారములందు నిర్బంధించి రట. నిత్యము మనయిండ్లయందు సాలీడు గూడులందెన్నెన్ని పురుగులు నిర్బంధము నను భవించుచున్నవో మన మెప్పుడైన నాలోచించితిమా! సాలెపురు గెంతయో రాజఠీవి ననుభవించును. మన కాదృశ్యము చూచు టకు కష్టముగనే యుండును గాని సాలె పురుగు కది జీవితరంగము.

సాలెపురుగు మనయొంటిమీద ప్రాకిన చో నూత్నవస్త్రధారణ మగునని పెద్దలు చెప్పుదురు. ఇది నా కింతవఱకు ననుభవ గోచరము కాకపోవుటచే దీని సత్యాసత్య ములను గూర్చి విమర్శించలేను.

సాలీడుకు గల కార్యదీక్షను రాబర్ట్ బ్రూస్ అను స్కాట్లెండుదేశపు రాజుగారి ద్వారా మన మిదివరకే యెఱుగుదుము. ఆఱుసార్లు ప్రయత్నించి, విఫలమనోరథయ య్యు, అంతటితో నిరుత్సాహపడక, మరల బ్రయత్నించి తన పట్టుదలను కొనసాగించు కొనగలిగిన సాలీడునుండి గుణపాఠమును గ్రహించియే, స్కాట్లెండురాజు యుద్ధములు సలిపి గెలుపొంది రాజ్యమును సంపాదించెను.

మాతమ్ముడికి పురుగులతో నాడు కొనుటయందు కడుచెడ్డసరదా. ఒక చిన్న నీళ్లగుంటదగ్గఱ నొకనాడొక పెద్ద సాలీడు మాకు కనబడెను. దానిని తీసి మా తమ్ముడు ఒకచేతిమీదనుండి మఱియొకచేతి మీదికి, రెండుచేతులనుండి యొంటిమీదికి ప్రాకించుకొనుచు, కొంతసేపు గమ్మత్తుగా ప్రొద్దుపుచ్చినతరువాత వాడొకకఱ్ఱను నీళ్ల లో పాతి, దాని పైచివరయందు ఆ సాలె పురుగు నుంచెను. అంత నిద్దరము నది యేమి చేయునో చూడదలచి నీళ్లగుంటప్రక్కన గూర్చుంటిమి. సాలీడు మొదట కఱ్ఱపైనుండి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రిందికి ప్రాకెను. ఇట్లు ప్రాకి అక్కడ నీరుండుటచే, బైటపడుటకు మార్గము దానికి గోచరించలేదు. అందుచే మఱల పైకి ప్రాకెను. కఱ్ఱమొనకు వెళ్లెను గాని, దానికి తప్పించుకొనునుపాయము తోచలేదు. అది మఱలమఱల ననేకపర్యాయములు ఆ కఱ్ఱ పై కొననుండి క్రిందకును, క్రిందనుండి పైకిని ప్రాకులాడెను. తుదకు విసిగి వేసారి, కఱ్ఱచివరను కొంతసేపు కూర్చుండెను. విముక్తి పొందు టెట్లా యని యది యాలోచించుచు నట్లుండెను.

కొంతవడి కది దారము నల్లుట కారంభించెను. ఆ కఱ్ఱచివరనుండి నీటిగుంటయొద్దవరకును సరిపోవు పొడుగు గలుగునంత దారము నప్పుడా సాలీడు అల్లెను. తరువాత, దారమునొకచివర తానుకూర్చొనియున్న తావునకు బిగించికట్టి, దారమును గాలిలో నెగురుటకై విడిచిపెట్టెను. అది గాలిలో నిటు నటు కొంతసేపు ఊగులాడి, నీటిగుంటయొద్దున నున్న నేలపై బడెను. సాలీడు దీనిని గ్రహించి దారముమీదుగా సేటవాలుగా క్రిందికి దిగి నేలను చేరికొనెను. కొంతసేపు గాలిలో దారము నాధారముచేసికొని ఊగులాడి, చిట్టచివరకు సురక్షితముగ క్రిందకు దిగి తన స్వస్థానమును చేరెను.

మేమును దాని తెలివితేటలకు మెచ్చికొని, దాని నింకను ఏడిపించి పరీక్షింపదలచక ఇంటికి వెళ్లిపోతిమి.

---



విక్టోరియం జలాశయము - కాకినాడ

—డి. శేషగిరిరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భీమవరము సంగీతపరిషత్తు

(౧౯౩౮-వ సం. జనవరి నెలలో జరిగిన శ్రీ త్యాగరాజ నవరాత్రి మహోత్సవము)

## అధ్యక్షోపన్యాసము

## ప్రొఫెసర్ ద్వారం వెంకటస్వామి నాయుడు

ఈరోజు నాజీవితమునకు ఒకనూత్నచైతన్య మాపాదించుచున్నది. నాజీవితమునం దింతవఱకు నే నిట్టిసాహసకార్యమున కీయకొనలేదు. నాజీవితమును ప్రచ్ఛన్నముగ, నాదోపాసనలో గడుపుచుంటిని. కాలవాహినీ పులినతలాల, చెరగిపోవని, జీవితపుజాడలు వదలిన, ఆత్యాగరాజుచే పోషింపబడిన గానకళారామముల పూలసౌరభముల నాఘ్రాణించుచు, మకరందముల గ్రోలుచు, పుష్పాడుల తేలెడి కాబనుసతోటమాలినైన నన్ను నేడిట్టి భారమును వహింపు మనినారు. ఇట్టిసభకు నన్నధ్యక్షునిగా నుంచుట నాయం దెట్టి ఔన్నత్యముండుటచేగాదు. మీకు త్యాగరాజునెడల గల యమితానురాగముచేతనే. నాయెడల మీరు చూపిన గౌరవాదరభావములకు నా కేలోడ్పులు. శిల్పినై గానకళామూర్తుల లోకమున కర్పించు సంగీతజ్ఞుడనుగాని క్రమవాక్కుల గానమాధుర్యము బోధించు భాషాకోవిదుడగాను. సంగీతమును గురించి నాకు తోచిన కొద్దివిషయములను, సంగ్రహించినరీతి, క్లుప్తముగ విన్నవించెదను. ఈసాహసమునకు పెద్దలు మన్నింతురుగాక. దిగంతవిశ్రాంతకీర్తిమూర్తియై, తనభౌతికదేహమును విడచిన ఆత్యాగరాజు, నేడు మీయుత్సాహ పూరితముఖ వర్చస్సులలో, సూక్ష్మరూపమున సంచరించుచుండుట, నేను దర్శించుచున్నాను. త్యాగరాజుసంతతివార మగుటచే మనజీవితములు పునీతము లైనవి.

కర్ణాటక గానమున పలుకుపులకండములొలుక క్షేత్రయ్యమువ్వగోపాలపదముల శృంగారరసము దిగంతములకు ప్రాకిపోయి చుక్కలకు వలపుసందేశముల నంపినది. తెనుగువారి జయదేవులు క్షేత్రయ్య. గీతగోవిందమాధుర్యమును చవిచూపును మువ్వగోపాలపదములు. తదుపరి త్యాగరాజు, పోతరాజురీతి తనభక్తిభావగీతావార్నిధుల తెనుగువారు ముక్తి చూరాడునట్లు ముంచెత్తించెను త్యాగరాజు గాయకచక్రవర్తి, జీవన్ముక్తుడు, కలియుగ ప్రహ్లాదుడు. ఇహపరసాధనసంపత్తిని చూపిన త్యాగరాజు నుత్సవములు దేశమందంతటను జరుపుచుండుట గానకళ ఆరోగ్యస్థితిని వెల్లడిచేయును. ప్రజలయందు ఉత్సాహము పురికొల్పుటకు ఇట్టిమహాపురుషుల ఉత్సవములు జరుపుచుండుట దేశమున అత్యావశ్యకము.

"శరీరమునకు వ్యాయామము, హృదయమునకు సంగీతము" అని నుడివెను ప్లేటోపండితుడు. సంగీతము మన జీవితరహస్యములను నందుకొనుటకు సర్వేశకల్పితమైన చెంగల్వబాట, పరమార్థమార్గప్రకాశిక, మనయందుండియు మనకు గోచరించని ఆత్మను పురికొల్పు ఆనందవిహంగము. సంగీతము కొరకే పుట్టబడిన బిడ్డలు, జీవయాత్రాతాపత్రయముల క్రుంగి కృశించు మానవులకు మోక్షపదమును చూపించు విమలరమణీయ జాలకములు నగు సంగీతజ్ఞులను సంఘము తగినరీతిని గౌరవించవలెను. అట్లు గౌరవింపనిజాతి జాతిగాదు.

మనము బంధుత్వముచే, భావచే త్యాగయ్య సంతతివారమని మురిసిన చాలదు. మనము కళోపాసనచే త్యాగయ్యసంతతివారము కావలయును. ఇంత ఆంధ్రదేశమునం దున్న ఉత్తమగాయకులను వ్రేలికొనల లెక్కపెట్టవచ్చును. తనగీతి అరవజాతిని పాటకులుగా మార్చిన త్యాగరాజు సంతతి పెంపొందించినగాయకుల సంఖ్య ఇంత అల్పమా? ప్రతికుటుంబమున ప్రతివారును గానకళ నభ్యసించి కుటుంబమునకు కనీసము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒకఉత్తమగాయకుని దేశమునకు ఏనాడు అర్పించునో ఆనాడే మనము నిజముగ త్యాగరాజుసంతతివార మగు దుము. ఆనాడే తెనుగుజాతి మొక్కవోవనిజాతిగా పరి గణింపబడును. ఆనాడే త్యాగరాజుఆత్మకు శాంతి నిచ్చినవార మగుదుము.

ఇంతవరకు కర్ణాటకగానము కాకిఇంటి కోకిలయై బ్రతికినది. ఇటుపైని దుర్ఘటపరిస్థితులు తటస్థించు సూచ నలు పొడగట్టుచున్నవి. తెనుగువారు వారిబిడ్డ నామో దించి తగినస్థానమును హృదయమం దిచ్చి ఆదరింతురా ? లేక ఇంతవరకును నిద్రామాంద్యములో మునిగియున్న ఆంధ్రజాతి తమబిడ్డను పోలికపట్టజాలక అరణ్యములకు తరిమివేయునా ?

నేటికాలమున సంగీతము ఎట్లుమారినదో కొం చెము పరిశీలింతము. బుద్ధినుండి ఉత్పన్నమై బుద్ధికి నచ్చ జెప్పుచున్నది. భావము(Emotion) నకు బదులు తెలివి (Intellect) నిచ్చుచున్నది. గాయకులు సభలయందు తమస్వరప్రస్తారములతో, లయవిన్యాసములతో యుద్ధ ముజేసి సభికుల కరతాళధ్వనుల నొందుచున్నారు. అవి గడసాని గడఎక్కినప్పుడు మనము చేయు కరతాళధ్వనుల వంటివే. ఇట్టిదానిని మనము సంగీతముగా పరిగణింప జాలము. నిజమైనసంగీతము హృదయమునుండి ఉత్ప న్నమై హృదయమును ద్రవింపజేయును. ఉత్తమసంగీ తము వినునప్పుడు హృదయ మొకస్థాయి భావము వహించును; మొగ మెర్రవారును; కనులుకూడ ఎఱ్ఱ బడును. మనము ఏవో సుఖోదయవ్యథాభంగముల కొట్టుకొని పోదుము, జీవితపు పొలిమేరలు దాటి. గానమాపివైచిన కొంతసేపటివరకుగాని ఈలోకమువా రము కాజాలము.

సంగీతమన లయప్రదర్శనము గాదు. శ్రుతి లీనమై భావమును పోషించుట,వినువారిహృదయమును వికసింప జేయుట.ఉత్తరహిందూస్థానమువారు శ్రుతిని,భావమును పోషించుటచేతనే వారిసంగీతము వినసొంపుగానున్నది. ఇప్పటిమనవారిలో నాటకప్రియులు కొంతవఱకుఉత్తర హిందూస్థాన సంగీతమును ఆదర్శముగ నుంచుకొని అనుక రింపప్రయత్నించుచున్నారు. అంతమాత్రముచే నాటక సంగీతము ఉత్తమసంగీతమని ప్రశంసించుట కాదు. మనవారు గానసభచేయునప్పుడు ఎక్కువకాలము పాండిత్యప్రకర్షను ప్రదర్శించుట కర్పించుచున్నారు. పాండిత్య మవగాహనచేసుకొనువారు ఏకొంచెమమంది ప్రేక్షకులలో యుందురు. ఈకారణముచేతనే సభ ప్రారంభించిన కొద్దికాలమునకే ప్రేక్షకులసంఖ్య క్షీణించిపోవుచున్నది. పండితసభలు నెలకొల్పి, వాటి యందు గాయకులు తమతమ పాండిత్యమును చూపిం చిన బాగుండును. హృదయప్రశాంతికై బ్రతుకుబరువులు మరచి, సుఖింపవచ్చిన ప్రేక్షకుల కిది జుగుప్స కలి గించు హేతు వగుచున్నది.

ఆదర్శప్రాయుడైన ఉత్తమగాయకుని జీవితము గానఘూర్ణితమగు కోనయై విరాజిల్లవలెను. భావన యందు, పలుకునందు గాన ముట్టిపడవలెను. భక్తియే సంగీతజీవనముగా గడుపుచున్న శ్రీహరినాగభూషణం పంతులుగారివంటి గాయకులు దేశమున చాలకొద్దిగ నున్నారు. గాయకుడు పరమభక్తుడై పరిమళింపవలెను. భక్తి, శరీరమై యేగాన మే జీవనమై, మానవు డొకపూజా ప్రసూనమై పరమేశు పాదముల వ్రాలవలెను. గాయకు నకు శీలము ముఖ్యము. శీలములేనికళ జీవములేనిబొంది. కొంతమందిగాయకులకు శీలము లోపించుటచేతనే సంగీత జ్ఞుల నందరిని మనవారు చులకనగ జూచుచున్నారు; సంఘములో తగినగౌరవము జూపకున్నారు. సంగీత మభ్యసించుప్రతివారును సాహిత్యమును, తద్ద్యోతకమగు విజ్ఞానమును కలిగియుండవలెను. హృదయమును శిక్షలో నుంచి, శీలమును పోషించుప్రయత్నమును చేయవలెను. శీలమునకు సంబంధించిన విద్యాగోష్ఠి సలుపవలెను. విషరదనలైన త్రాచుపుబ్బెతల నృత్యముచేయించు సామర్థ్యముగల గాయకలోకము అవినీతికి బాల్పడిన సంఘమును ఎంతకొద్దికాలములో పాడుచేయ లేదు ?

మనదేశమందు సంగీతవిద్వాంసులసంఖ్య ఇంత తక్కువగనుండుటకు సంగీతమునకు తగిన యాదరణ లేకపోవుట, ప్రజాపరిపాలనము లేకపోవుటచే కలిగిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశదారిద్ర్యమును కారణములు. పాశ్చాత్యదేశముల గానకళకు విపరీతమైనయాదరణ చూపుచున్నారు. శ్రీమంతులు గాయకులకు చేదోడువాదోడు అగుచున్నారు. పాశ్చాత్యదేశస్థుడైన యహుడీమెనూహిన్ (Yehudi menuhin) అను పదహారుసంవత్సరములబాలుని ఫిడేలువాయిద్యమునకు మెచ్చుకొని ఒక శ్రీమంతుడు పదమూడువేలపౌనులవిలువగల ఫిడేలును బహుమతిచేసెను. ఈ అర్భకుడు లండను మొదలగు మహాపట్టణముల తనవిద్యాప్రదర్శనముల నిచ్చుచు, ప్రదర్శనమునకు వేయిపౌనులచొప్పున పుచ్చుకొనుచున్నాడు. మనదేశమున, తనకాలమునకు తనే గానబ్రహ్మయని మెప్పువడసిన గాయకశిరోమణికిహూడ కుటుంబమును దారిద్ర్యమునుండి తప్పించుకొనుపాటియైనను ఆర్థికలాభము చేకూరకున్నది. పూర్వమందు రాజులు ఇట్టి గాయకులను పోషించుచుండెడివారు. నేడు ఈభారము ప్రజలపై బడినది. ప్రజలు తమశక్తిసామర్థ్యముల వినియోగించి, ఉత్తమగాయకులను దారిద్ర్యమునకు పాల్పడనీయక పోషించి, దేశౌన్నత్యమునకును, జాతిప్రతిష్ఠకును పాటుపడవలెను.

సంగీతము రానురాను భావములేని గందరగోళముగనో, ఎందుకును పనికిరాని నాటకసంగీతముగనో తయారగుచున్నది. నేటికాలమున గ్రామఫోన్ (Gramophone) వచ్చి సంగీతపతనమునకు మరింత సాహాయ్యము చేయుచున్నది. ఉత్తమమైనసంగీతము గాయకునితో నశింపకుండ శాశ్వతత్వ మిచ్చుటకుమారు, తందనపదములకును, బూతుబుంగలైన హాస్యపుపాటలకును అనవసరమైనప్రచారము కలిగించి ప్రజలయందు చౌకరకపు సంగీతవ్యామోహమును కలిగించుచున్నది. మనవారు హాస్యరసపుపాట లనుకొనునవి నిజమైన హాస్యమునకు తావలములు గావు. ప్రేమయనిన విషయలోలతకాదు. హాస్యరసమన బూతుకాదు. దీనికి కారణము గ్రామఫోనుకంపెనీపెట్టుబడిదారులు కళావాసనలేనివారలై కేవల మార్థికచింతతో ప్రవర్తించుచుండుటయే. అన్యదేశీయులు నేటికాలపు మన సంగీతము ఎట్లున్నదో తెలుసుకొనగోరి ఇప్పుడు మన దేశములో ప్రకటింపబడుచుండిన బూతుపాటల గ్రామఫోను ద్వారా వినిన మనజాతిప్రతిష్ఠకు ఎంతభంగకరము! మానవత్వము, జాతీయత, నవనాగరికత పెంపొందింపపాటుపడు అన్యదేశీయులు మన నొక క్షోయిజాతిగా తలపరా? ఇకనైన గ్రామఫోనుకంపెనీపెట్టుబడిదారులు దేశమందు ఒకసంగీతవిద్వత్సంస్థ నెలకొల్పి దానియామోదము బడసిన గాయకులకే తమ కంపెనీలయందు తావొసంగిన గానకళానవ్యవికాసమునకును, దేశమునకును పాటుపడినవా రగుదురు.

గ్రామఫోను వచ్చినదగ్గరనుండియు ఈచౌకరకపు సంగీతవ్యామోహము స్త్రీలయందును, పిల్లలయందును అంటుజాడ్యమువలె ప్రాకిపోవుచున్నది. మన గృహముల ఇట్టి పాటల నుంచరాదు. ముఖ్యముగ పిల్లలను మనము జాగ్రత్తగా కాపాడుకొనవలయును. మన భావికాలపు సంగీతౌన్నత్యము మనపిల్లలపై నాధారపడియున్నది. పిల్లలకు సుస్వరములతోగూడిన సంగీతమునే వినిపించవలెను. పిల్లలు సంగీతమనిన నమితామోదము చూపుదురు. పాశ్చాత్యదేశ సంగీతవిద్వాంసుడగు జాన్ క్యుబలిక్ (Jan Kubelik) తనఫిడేలుమీద తొంబదినిమిషములు గానమును పసిపిల్లలకే వినిపించెనట. పిల్లలు చెక్కుచెదరకుండ విని ఆనందించిరట. పిల్లలను ప్రతిరోజున విద్యాలయములకు ఎట్లు పంపుదుమో ఆరీతినే సుస్వరభూయిష్ఠమైన సంగీతమును ప్రతిదినమును వినిపింపవలెను. మనపిల్లలయందు ఎంతమందిత్యాగరాజులు ప్రచ్ఛన్నులై ప్రవాసులట్లు తమ భావికొరకు ఎదురుచూచుచున్నారో ఎవరికెరుక ?

ఈనాడు మనదేశమున సభలుచేయుట, తీర్మానముల నామోదించుట, పత్రికలయందు ప్రకటించుటయనవసరములు. గానకళమీద వ్యాసములు వ్రాయుటకంటె, ఉపన్యాసము లిచ్చుటకంటె కళోపాసనయే ముఖ్యకర్తవ్యము. గాయకజాతి క్షీణించిపోయిన ఈ కాలమున ప్రతివారు గాన మభ్యసించి గాయకజాతిని పెంపొందించ ప్రయత్నించవలెను. ముప్పదితీర్మాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షుల నామోదించుటకంటె ముగ్గురు గాయకులనుతయారు చేయుటయందే మీధీశక్తి వినియోగింపుడు. మీరు గానము నభ్యసించి గాయకులరై కీర్తి సంపాదింపుడు.

మీరు నాకు చేసిన యీసమ్మానమునకు వందన శతంబు లర్పించుచు నేను మీసాన్నిధ్యమున నుడివిన పలుకుల దోషములున్న మన్నించి గుణమే గ్రహించి నన్ను కృతార్థుజేయ వేడుచున్నాను. గానకళకొరకు పాటుపడుదుమని దృఢనిశ్చయులరై నేడే దీక్షాకంకణముల ధరింపుడు. కష్టపడి జీవితమును సరస్వతీపూజలో గడిపి తల్లియనురాగమునకు పాత్రులమైన, నూరుసంవత్సరములలోపుననే ఆజగన్మాత కరుణించి మనకు మరల నొక త్యాగరాజును ప్రసాదించునని నానమ్మకము.

---



థేమ్సు నది (లండను) పయి సూర్యకిరణములు G. S, A.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నియంతలపరిపాలనము; ప్రజాప్రభుత్వపద్ధతి

## (Dictatorship and Democracy)

చావలి వెంకటహనుమంతరావు, యం. ఏ.

ప్రపంచమం దెచ్చటచూచినను ఈకాలములో ప్రధానముగ కన్పించునది ప్రజాప్రభుత్వ పద్ధతియొక్క నిష్ఫలత్వమును, నియంతల పరిపాలనాభివృద్ధియు. యూరప్‌ఖండమం దేదేశస్థితిచూచినను మనకు కన్పించున దీమార్పే. ప్రపంచమహాసంగ్రామము జరుగుచున్నప్పుడు ఆసంగ్రామమునందు పాల్గొనినవారి యుద్దేశ్యము ప్రపంచమం దన్నిదేశములందును ప్రజాప్రభుత్వపద్ధతి నేర్పాటుచేయుటయే యని పదేపదే ప్రకటింపబడెను. జర్మనుదేశీయులు ప్రజాప్రభుత్వపద్ధతిని రూపుమాపుటకు ప్రయత్నించుచున్నారనియు, కైజరు నిరంకుశప్రభుత్వమును స్థాపించుటకు వారు యుద్ధములోనికి దిగిరనియు, ప్రజాప్రభుత్వసిద్ధాంతమును రక్షించి కాపాడుటయే తమపరమావధియనియు, ఇంగ్లండు మొదలగు స్నేహపక్షదేశముల ప్రతినిధులు చెప్పుచుండిరి. కాని నిజముగ జరిగినదేమి? ఆ సిద్ధాంతము యుద్ధానంతరము అదివరకుకన్న ఎక్కువకష్టనష్టములకు లోనగుగా వలసివచ్చెను.

### నియంతల ప్రభుత్వమునకు కారణములు

దీనికి కారణమేమి? రెండు ముఖ్యకారణములవలన ఈమార్పు కలిగెనని మనము చెప్పవచ్చును ఒకటి యుద్ధానంతరమందు ప్రపంచమం దన్నిదేశములందును, ముఖ్యముగ యూరోపియన్ దేశములందు, ప్రబలిన విషమపరిస్థితులు. రెండవది ఈవిషమపరిస్థితుల నెదుర్కొనుటకు ఆయాదేశములందుండిన ప్రజాప్రతినిధిసంస్థలు తగినస్థితియందు లేకపోవుట.

యుద్ధానంతరము యూరప్‌ఖండమందలి విషయములను పరిశీలించిన కన్పించున దేమనగా, (౧) ఆర్థికసంబంధమగు దుస్థితి; (౨) ప్రతిదేశమందును జాతీయభావములు ప్రబలమొందుట. యుద్ధము జరుగుచున్న కాలములో దానియందు నిమగ్నులై ప్రతివారును తమ శక్తిని, ధనమునుకూడ యుద్ధమును జయించుటకు మార్గముల నన్వేషించుటయందే వినియోగించుచుండిరి. యుద్ధానంతరము తిరిగి మామూలుపరిస్థితు లేర్పడుట తోడనే ఈక్రొత్తపరిస్థితులకు అలవాటుపడుట దేశములకు కష్టమాయెను. యుద్ధములో పోరాడివచ్చిన సైనికులకు తగుపనిపాటులు లేకపోయెను. యుద్ధసమయమందు యుద్ధమునకు కావలసిన మందుగుండుసామాను, ఫిరంగులు మొదలగుపరిశ్రమలకు ఇప్పుడు వాటియవసరము లేకపోవుటచే మామూలుగ అవసరమగు వస్తువులను తయారుచేయుటయో, లేక పనిలేకయుండుటయో జరుగవలసివచ్చెను. వివిధదేశములందు ఆర్థికపరిస్థితు లిట్లు అల్లకల్లోలముగ నుండుటచే వాటిని మంచిమార్గములోనికి తెచ్చుటకు ఏమిచేయవలెననువిషయము ఆలోచింపబడెను. దేశీయరాజ్యాంగవిధానమునంతను ఎవరో ఒకసమర్థునిచేతియం దుంచి ఆతని ఆజ్ఞప్రకారము పని జరుపుటవలననే ఈదుస్థితినుండి బయల్పడుట కవకాశము కలదని తేలెను. ఆవకాశము ననుసరించి దానికి అవసరమగుసమర్థులు బయలుదేరుదురు. కాన వివిధదేశములందు ఆదేశపుపూర్వపుచరిత్రపరిస్థితుల ననుసరించి కొంతమంది బలవంతులు పైకివచ్చిరి. వారు దేశమును ఆర్థికదుస్థితినుండి తొలగించుటకు కంకణము కట్టుకొనినవా రగుటచే తమప్రతిఘటకులకుగాని, వ్యతిరేకులకుగాని స్థానము నిచ్చుటకు వీలు లేకుండపోయెను. మరియు వారు తమతమస్థానమును బలపరచుకొనుటకై ఒకబలమైన అధికారేతరమగు సైన్యముపై ఆధారపడియుండవలసివచ్చెను. ఇట్లు, ఇటలీయందు యుద్ధానంతరము బయల్వెడలిన అల్లకల్లోలమునకు ఫలితముగ ముస్సోలినీ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనునాతడు "ఫ్యాసిజమ్" అనుఉద్యమమును లేవదీసి దానికి నాయకత్వమువహించి, తన అధికారమును హెచ్చుచేసికొనెను. తరువాత కొంతకాలమునకు పార్లమెంటునందు తనపక్షసభ్యులను ప్రవేశబెట్టి, తాను వారి నాయకుడుగ నుండి పరిపాలనజరుపుట మొదలిడెను. అధికారము సంపాదించినతెరువాత దానిని నిలువబెట్టుకొనునిమిత్తము వ్యతిరేకులనందరను అణచివేయుటయో, లేక దేశమునుండి తరిమివేయుటయో చేయవలసివచ్చెను. క్రమేణ ఆతడు నియంతయై నిరంకుశుడై పరిపాలించుచున్నాడు.

ఇటలీలో ముస్సోలినీ ఎట్లో అట్లే జర్మనీలో ఈమధ్య హిట్లర్ కూడ. ఆదేశమందు యుద్ధానంతరము ఏర్పడినవిషమ ఆర్థికపరిస్థితులనుండి దేశమును కాపాడుటకై నియంతఅధికారములను సంపాదించి, నిరంకుశుడై పరిపాలన కొనసాగించుచున్నాడు. ఈతడు 'నాజీ'పక్షనాయకుడు. ఈపక్షము మొదట చిన్నసంఘముగా నుండి-ప్పటికిని క్రమేణ బలముగల సంఘమై, జర్మనీపార్లమెంటునందు అధికసంఖ్యాకబలముగలపక్షమాయెను. పార్లమెంటునందు వివిధపక్షము లుండుటచే నాజీసిద్ధాంతములప్రకారము పరిపాలించుటకు వీలులేకపోవుటచే హిట్లర్ మొదట కొన్ని అసాధారణాధికారములను జర్మనీఅధ్యక్షుడగు వాన్‌హిండెన్‌బర్గునద్ద నుండి పుచ్చుకొనెను. మరికొంతకాలమునకు తన కీయబడిన అధికారముల నుపయోగించి ఇతరపక్షములనన్నిటిని రద్దుచేయించి నాజీపక్షమువారుమాత్రమే పార్లమెంటునందు సభ్యులుగా నుండుట కర్హులని ప్రకటించెను. చివరకు తానే నియంతయై, ప్రతిఘటనలేని నాజీప్రభుత్వము నేర్పాటుచేసియున్నాడు.

## నియంతలపరిపాలనవలన లాభనష్టములు

పైన రెండుదేశములలో ప్రజాప్రభుత్వపద్ధతి రద్దుచేయబడి నియంతలపరిపాలన ఎట్లేర్పడినదో చూచియుంటిమి. ఇట్లే యూరప్‌ఖండమందలి ఇతరదేశములలోకూడ కొద్దిగనో గొప్పగనో ప్రజాప్రభుత్వసిద్ధాంతమునకు లోపము రాకపోలేదు. రష్యాయందు 'బోల్షివిజమ్' పద్ధతి ఏర్పాటై, రాచరికము, దానితోపాటు మతాధికారులయొక్కయు, ప్రభువులయొక్కయు అధికారమును పూర్తిగ తొలగింపబడినవి. "కర్షకుల నియంతృత్వము" (Dictatorship of the Proletanriat) అక్కడ ఏర్పడినది. ఇట్లే టర్కీయందు 'ముస్తాఫాకెమల్‌పాషా' యను నాతడు తాను నియంతయై పరిపాలించుచున్నాడు.

నియంతలు చేయుపనివలన ఏమైన లాభము కలదా అనునది ఒకముఖ్యప్రశ్న. వారు చేసినదియు, చేయుచున్నదియు కొంతవరకు లాభదాయకమగుపనియే యని అంగీకరింపక తప్పదు. వారు తమతమదేశములను విషమపరిస్థితులనుండిబయటికితీసుకొనివచ్చుటకు తోడ్పడిరి. కెమాలుపాషా టర్కీయందు ప్రవేశపెట్టినసంస్కరణములమూలమున చిరకాలము "యూరప్‌ఖండపుదీర్ఘరోగి" యని పిలువబడుచుండిన టర్కీదేశము యూరప్‌ఖండములో ముందంజనైచుదేశములో ఒకటియై, ప్రధానస్థానము నాక్రమించుచున్నది. సాంఘిక, రాజకీయ, ఆర్థికపరిస్థితులలో టర్కీయందు గొప్పమార్పు కల్గినది. పూర్వాచారములు, పూర్వాభిప్రాయములు మారిపోయినవి. దేశము క్రొత్తదేశమైనది. అట్లేరష్యాలో "బోల్షివిజమ్" లేక "సోవియట్‌పరిపాలనాపద్ధతి" ప్రవేశపెట్టబడుటవలన అదివరకు ప్రబలియున్న ఆర్థికపు హెచ్చుతగ్గులు, బీదజనుల కష్టములు, భూస్వాముల యొక్కయు,ప్రభుకోటియొక్కయువిలాసజీవితములు—అన్నియు ఒక్కసారిగ తొలగింపబడి, ప్రజాసామాన్యమునకు లాభకరములగు పరిస్థితు లేర్పడినవి. సమష్టిసిద్ధాంతమునందలి లాభములు రష్యాప్రజలు పొందుచున్నారు. ఇటలీలోను, పోలండులోను, జర్మనీలోను కూడ ఇట్లే నియంతలప్రభుత్వపుఫలితముగ శాంతియు, కొంతవరకు అభివృద్ధియు కల్గినవని చెప్పక తీరదు. రష్యాలోని నియంతప్రభుత్వమునకును, జర్మనీ, ఇటలీలలోని నియంతప్రభుత్వమునకును కొన్ని భేదములుండవచ్చును. కాని వాటిరెండింటియందును మూలసిద్ధాంత మొక్కటియే.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియంత లుండుట కొన్నికొన్ని పరిస్థితులలో అవసరమని అంగీకరింపవలెనని పైన చెప్పినదానినిబట్టి తెలియుచున్నది. ఆయాకాలములందలి అవసరములను బట్టి మానవసంస్థలయందు మార్పు బయలుదేరు ననునది చరిత్రాత్మకమగు విషయము. ప్రజాభిప్రాయము వారి కనుకూలముగా నుండుటవలననే, ప్రజలు వారికి తగు బలము చేకూర్చుట కంగీకరించుటనుకూలమువలననే వారు తమపదవులకు రాగలిగిరనుటయు వాటిని నిలువబెట్టుకో కలిగిరనుటయు నిర్వివాదాంశము. ఏప్రభుత్వమునకైనను ప్రజాభిప్రాయమువలన కలుగుబల మవసరము. ప్రజాభిప్రాయము వ్యతిరేకముగ నున్న ఆప్రభుత్వము చిరకాలము నిలువబడజాలదు. కాన నియంతలు తాత్కాలికముగ ప్రజాప్రభుత్వపద్ధతిని ఆవలద్రోచి తమ అధికారము నేర్పాటుచేసుకొనినప్పటికిని, వారు దానిని ప్రజ లెంతకాలము అనుకూలముగ నుందురో అంత కాలముమాత్రమే నిలువబెట్టుకో గల్గుదురు. ప్రజలు కొంతకాలమైనతరువాత నియంతలను తొలగించుటకు పూనుకొనినవా రట్లుచేయలే రని తలంచుటకు వీలు లేదు. అయినను నియంతలు తమయధికారము చలామణీ యగునంతకాలముకూడ ప్రజలలో స్వతంత్రాభిప్రాయములను, స్వేచ్ఛను, హక్కులను పూర్తిగ అణగద్రొక్కి ప్రజలందరు తమ యభిప్రాయములప్రకారమే నడచునట్లు చేసిన ప్రజాభిప్రాయ మెప్పటికైన వారికి వ్యతిరేకమగుట కవకాశములు కలవా ?

ఈదృక్పథమునుండి పరిశీలించినప్పుడే నియంతల పరిపాలన లోపభూయిష్ఠ మని ప్రకటింపబడవలసియున్నది. మానవులు అన్నిటికంటెను ఎక్కువగ పరిగణించునది స్వేచ్ఛయును, స్వాతంత్ర్యమును. నాటిని సంపాదించుటకును, సంపాదించినతరువాత నిలువబెట్టుకొనుటకును మాత్రమే ప్రపంచము మొదలుపెట్టినప్పటి నుండియు జరుగుచున్న కలహములు బయలుదేరినవి. ప్రజాప్రభుత్వసిద్ధాంతమునందలి ప్రాముఖ్యము, విలువయుకూడ, ఈమానవస్వాతంత్ర్యస్వేచ్ఛలను అది ముందుకుకొని వాటిని స్థాపించుటయే పరమావధిగా కల్గియుండుటనుబట్టియే వచ్చినవి. నియంతలు వీటిని నిర్బంధించుటవలనను, దేశమందలి ప్రజలందరును తమ యభిప్రాయములనే యంగీకరించి వాటిప్రకారము నడుచుకోవలెనని చెప్పుటవలనను, వారు మానవస్వభావమునకును, ప్రకృతిస్వభావమునకును వ్యతిరేకముగ నడచుచున్నారని చెప్పక తప్పదు. ఎంతవరకు వారీ నిర్బంధముపై అభారపడి తమ యధికారమును సాగించుకొనుటకు ప్రయత్నించెదరో అంతవరకు వారు ప్రజల యొక్కయు, దేశముయొక్కయు గొప్పతనమునకు వ్యతిరేకముగ నడచుచున్నా రనియు, వారి తాత్కాలిక లాభముకొరకై ప్రజల జన్మహక్కులను రూపుమాపుచున్నారనియు చెప్పక తప్పదు. కాన సారాంశమేమన, తాత్కాలికముగ నియంతలప్రభుత్వము లాభకరమైనప్పటికిని, పోనుపోను దానివలన శాశ్వతనష్టమే కాని వేరొకటి లేదని స్పష్టమగుచున్నది.

## ప్రజాప్రభుత్వపద్ధతిపునరుద్ధరించుటఅవసరము

ప్రపంచకపు భావిభాగ్యోదయము ప్రజాపరిపాలనా పద్ధతిని పునరుద్ధరించుటచేతమాత్రమే కలదని పైన చెప్పినదానిని బట్టి విశద మగుచున్నది. కాని అట్లు పునరుద్ధరించుట తేలికగ జరుగు పని కాదు. దాని కనేకములు అభ్యంతరములు, అడ్డంకులు దాటవలసియుండును. మానవప్రకృతికి సంబంధమగు కొన్నివిషయములలో విప్లవము సంభవించినప్పుడే ఆ పని సుసాధ్యమగుటకు వీలున్నది. మొట్టమొదటిఅడ్డు: ఇప్పుడున్న నియంతలు వారు కష్టపడి సంపాదించుకొని గట్టిపరచుకొనిన అధికారమును తేలికగ వదలివేయుదు రని తలంచుటకు వీలులేదు. అట్లు ఆఅధికారమును తొలగించుటకు చేయబడుప్రయత్నములన్నిటిని వారు తమశక్తియున్నంతవరకు ప్రతిఘటింతురనియే మనము తలంపవచ్చును. రెండవది: ధనవంతులు ఈమార్పును ప్రతిఘటింతురు. పార్లమెంటరీపద్ధతిగల ఇంగ్లండు, ఫ్రాంసుదేశములందుకాని, నియంతలయధికారమునకు లొంగియున్న ఇటలీ, జర్మనీ మొదలగుదేశములందుకాని ధనవంతుల ప్రాబల్య మెంతమాత్రము తగ్గలేదనియు, ఆయాదేశములందు వారు తమప్రాముఖ్యమును, హక్కు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను ఆయాదేశముల రాజకీయసంస్థలసహాయములో పెంపొందించుకొని నిలువబెట్టుకొనుచున్నారు. ప్రజాపరిపాలనపద్ధతి ఆయాదేశములలో ఆచరణీయం బుండినదానికంటె నియంతలపరిపాలన యున్నప్పుడే వారికెక్కువలాభదాయక మనువిషయము నిర్వివాదాంశము. ప్రజాప్రభుత్వపద్ధతిలో ముఖ్యసిద్ధాంతమగు "సమానత్వము" ( Equality ) ధనవంతులకు ఎక్కువహక్కుల నిచ్చుప్రభుత్వవిధానమునందు పెంపొందుట కవకాశము లేదు. ఇప్పుడు వా రనుభవించుచున్న హక్కులను పోగొట్టుకొనుటకుముందు వారు తమశక్త్యనుసారము ఆమార్పును ప్రతిఘటించెద రనుటలో సందేహము లేదు. మూడవది: ఇప్పుడు ప్రబలముగానున్న ఆర్థికవిధానములో ఇప్పుడు ప్రజాపరిపాలన సూత్రము ఏమార్గముల ద్వారా వ్యక్తీకరింపబడుచున్నదో ఆసంస్థలు (అనగా పార్లమెంటు సంస్థలు) అవి ఎందులకు నిర్ణయింపబడినవో ఆపనులను చేయలేకపోవచ్చును. వాటిని తగురీతిని సంస్కరించుట మొట్టమొదట జరుగవలసినపనిగా నున్నది. కాని ఆసంస్కరణ జరుగుట తేలికకాదని మొదటనే జ్ఞప్తియందుంచుకొనవలెను.

వీటి కన్నింటికంటెను ముఖ్యమైన అభ్యంతరము ప్రస్తుతము ప్రపంచమందంతటను మితిమీరుచున్న జాతీయభావములు, జాతీయత. జాతీయభావము లిప్పుడు ఇదివర కెప్పుడును లేనంత హెచ్చుగ నున్నవని యుద్ధానంతరప్రపంచపరిస్థితులు గమనించుప్రతివారు నంగీకరింతురు. యుద్ధానంతరము అంతర్జాతీయసూత్రము యొక్క ప్రాముఖ్యము కొంతవరకు అంగీకరింపబడిన మాట నిజమే. దానికి తార్కాణము నానాజాతిసమితియొక్క ఏర్పాటే. కాని ఆసభ ఏర్పాటునందును, పనిచేయు మార్గములలోను వివిధదేశములవారు దానిప్రాముఖ్యము నంగీకరించుటలోను చాలలోపము లున్నవి. ఆలోపముల నన్నింటిని సవరించుటకు అవసరము కలదు. కాని జాతీయభావములు విపరీతముగ పెరిగి పోవుచున్న ఈ కాలములో ఈమార్పులు జరుగుటకు అవకాశములు తక్కువగా నున్నవనునది ఒకముఖ్యాంశము.

## ప్రజాప్రభుత్వపద్ధతియందు సంస్కరణ కావలెను.

ఏది ఎట్లున్నను పైమార్పులు జరుగవలననే ప్రజాప్రభుత్వపద్ధతి కేమైన ఆశయుండును. రానురాను నియంతలసంఖ్య ప్రపంచమం దెక్కువయగుచున్నది. పార్లమెంటరీపద్ధతులు క్రమేణ అడుగునకు పోవుచున్నవి. నియంతల ప్రభుత్వముల క్రిందనున్న ఆయాదేశములందు చాలకాలమువరకు ఆపద్ధతిని తొలగించి వేరొకపద్ధతిని ప్రవేశపెట్టుటకు ఇప్పుడుకాని, కొంతకాలమునకుగాని అవకాశ ముండునని తలంచుట పొరపాటు. ప్రజల హక్కులు రానురాను అరికట్టబడుచున్నవి. ఈ సందర్భములలో ప్రజాప్రభుత్వపద్ధతి యున్న దేశములపై ఒక గొప్పభారమున్నది. ఆయాదేశప్రజలందరును గొప్పప్రయత్నము చేసి వారిదేశములలో కూడ నియంతలపరిపాలన చొరనీయకుండ చేయవలసియున్నది. పార్లమెంటరీవిధానము ప్రస్తుతకాలములో సాగించుచున్న కొద్ది దేశములలో ఇంగ్లండు, ఫ్రాంసులు ముఖ్యమైనవి. ఈరెండుదేశములలో కూడ పార్లమెంటరీవిధానములో లోపములు లేవని కాని, ఆవిధానమును త్రోసిరాజనుటకు ప్రయత్నించువారు లేరనికాని చెప్పవీలులేదు. కాన ఆభాటి ఎక్కువ కాకుండగనే పార్లమెంటరీపద్ధతులను సంస్కరించు మార్గముల నన్వేషించుట ముఖ్యము. ఈ సంస్కరణ విధానములో ఈక్రిందిమార్గములు లాభకరముగ నుండ గలవు: (౧) ప్రజాప్రతినిధిసభలకు పరపతి తగ్గిపోవుటకు ముఖ్యకారణము. ఆసభలు పూర్వకాలమునందువలె ప్రభుత్వవిషయములందు ఎక్కువ కలుగజేసికొనుట కవకాశము లేకుండుట. ప్రభుత్వవిషయముల సంఖ్య ఈకాలములో విపరీతముగ పెరిగిపోవుటయే దీనికి కారణము. దీనికి చేయవలసిన ప్రతిక్రియ ఆ పనులసంఖ్య తగ్గించుటయో, లేక ఆపనులను ఎక్కువ త్వరలో చేయుట కనువగుమార్గముల కనిపెట్టుటయో యైయున్నది. మొదటిది జరుగుట దుర్లభము. కాన రెండవది మాత్రము చేయవలసియున్నది. దేశమున కంతకును ఒక పార్లమెంటుమాత్రమే కాక ఆయాప్రాంతములకు ఆయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాంతవిషయములను చర్చించుటకు ఒక చిన్న ప్రజా ప్రతినిధిసభ ఏర్పాటుచేయుటవలన లాభముకలదు. దీని వలన (a) కేంద్రప్రజాప్రతినిధిసభకు పని తగ్గును; (b) ప్రజాప్రతినిధులు ప్రభుత్వవిషయములనుగురించి తెలిసికొనుటకును, మంత్రులు, ప్రభుత్వోద్యోగీయులు చేయు పనులను పరిశీలించుటకును ఎక్కువ అవకాశము లుండును; (c) ముఖ్య విషయములందు ప్రజాభిప్రాయమును తెలిసికొనుట కెక్కువ అవకాశము లేర్పడును. (౨) ప్రభుత్వ పద్ధతియం దిదివర కున్నస్థితిలో ముఖ్యముగ మార్పు జరుగవలసి యున్నది. ఇదివరలో ప్రభుత్వవిధాన మంతయు ధనవంతుల కనుకూలముగుచక్కని జరగుచున్నది. సామాన్యజనులకు ప్రభుత్వవ్యవహారములందు వారిసంఖ్యకు తగినట్టిపలుకుబడి ఇంతవరకు కలుగలేదు. ఇంగ్లండుమొదలగు పాశ్చాత్యదేశములందు ప్రతివానికి ఇప్పుడు వోటింగుహక్కున్నది. అయినను అధికసంఖ్యాకులగుసామాన్య ప్రజలకు ప్రభుత్వములో ఇదివరకున్న పలుకుబడికి హెచ్చ లేదు. పార్లమెంటరీఎన్నికవిధానమునందుగల లోపములే దీనికి కారణము. అదియుకాక "ధనమూలమిదంజగత్" అనులోకోక్తి ననుసరించి అల్పసంఖ్యాకులగు ధనవంతులకు ప్రజాభిప్రాయమును మభ్యపెట్టుటకు ప్రభుత్వరథమును వారిఇష్టమువచ్చినట్లు నడుపుటకు, చివరకు న్యాయస్థానములనుకూడ అన్యాయస్థానములుగ జేసి తమ కనుకూలమగురీతిని తీర్పులుచెప్పునట్లు చేయుటకు ఉన్నఅవకాశములు సామాన్యప్రజలకు లేవు. కాలము ననుసరించి, అవసరమునుబట్టి ధనవంతులు సామాన్యప్రజలకు అనుకూలమగుమార్పులు కొన్నిటి కొడంబడినగాని పార్లమెంటరీపద్ధతి ఇప్పుడున్నదేశములందుకూడ విప్లవాభిప్రాయములు అంకురించి, ప్రబలుననుటకు సందేహములేదు. అవకాశమున్నప్పుడు అట్టి అతివాదతత్వము దేశమందు ప్రబలుటకుముందే అవసరమగుమార్పులు చేయుట చాలమంచిది.

పార్లమెంటరీపద్ధతులు ఇప్పడిప్పుడే మనదేశమందు ప్రవేశపెట్టబడుచున్నవి. ఇట్టి సమయమందు మనము ఇతరదేశములందు ప్రజాప్రభుత్వపద్ధతియందు బయల్పడిన లోపములను జాగ్రత్తగ గమనించి, ఆలోపములు మనదేశపువిధానమునందుకూడ ప్రవేశించకుండ ప్రయత్నించి జాగ్రత్తపడవలసియున్నది. లేకపోయిన మనదేశమందు ప్రవేశపెట్టబడబోవు ప్రజాప్రభుత్వవిధానము విఫలమగుటకు సందేహము లేదు. హిందూదేశమునకు ప్రజాప్రభుత్వపద్ధతి సరియైనదికాదనియు, నిరంకుశపరిపాలనమే మనకు సరిపడు ప్రభుత్వపద్ధతియనియు విదేశస్థులు కొంతమంది అభిప్రాయపడుచున్నారు. ఆ అభిప్రాయము తప్పని నిరూపించవలసిన అవసరము మన ప్రజానాయకులపైనను, ప్రజాసామాన్యముపైనను కూడ కలదు.

---

# స వ ర ణ

'కావ్యకల: ఆశయవైశిష్ట్యములు' అనే వ్యాసములో (క్రిందటి 'భారతి' సంచికలో): ౨౫౭-వ పుట, మొదటికాలము, ౨-వ పేరా 3-వ పంక్తిలో 'మల్లువట్టినవంటి–' అన్నది 'మల్లుకట్టినవంటి–' అని; అదేపుట, రెండవకాలము, ౯-వ పంక్తిలో, 'అంచించినవారే' 'అన్నది 'అందించినవారే' అని; ౨౫3-వ పుట, మొదటికాలము, చివరపేరా, మొదటిపంక్తిలో, అధర్మబోధక! యీ కావ్యము' అన్నచోట 'ఆ ధర్మబోధకయీ! కావ్యము' అని చదువుకోవలెను. ౨౫౪-వ పుట మొట్టమొదటిపేరా, ౪-వ పంక్తిలో, 'ఇందటి అనుభవాల సమవాయము' మొదలుకొని, ౭-వ పంక్తిలో, 'కళావస్తువు కాగలదు' వఱకు తలక్రిందు కామాలలో ఉండవలెను; అదేపుట, తుట్టతుదిపేరా, 3-వ పంక్తిలో, 'ప్రత్యేకవిజయమతముగా' అన్నది 'ప్రత్యేకవిజయిమతము'. అనిఉండవలెను.—కొం. జ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నాయకత్వము

"ప్రసాద్"

"మనకు నాయకు డనేవాడు మచ్చుకైనా లేడండీ. బెంగాలు, బొంబాయి చూస్తే ఎటువంటి నాయకు లున్నారండీ" అని విలపించుట ఆంధ్రులకు పరిపాటి అయినది. ఏపని చేయ లేక పోయినా "మనకు తగిన నాయకుడు లేడండీ" అని కుంటిగా సమాధానంపడుతూఉండుటకూడ కద్దు. ఏ శాస్త్ర సభ చేయవలసివచ్చినా వంగరాష్ట్రమునుండి ఒక బెంగాలీబాబునో, అరవదేశమునుండి ఒక అయ్యంగారినో, అయ్యరునో పిలువదలచెదరు. కాని రాష్ట్రీయ నాయకులను గౌరవపరచవలెను అనుతలంపు పూర్తిగా సున్న. ఇందువలన ఇతర రాష్ట్రీయులను పిలువకూడదను అర్థము తీయరాదు. ఇతర రాష్ట్రములతో సంబంధబాంధవ్యములను తప్పక అలవరచుకొనవలెను. అది నాగరికతలక్షణము. అందరు భారతీయులయి యుండి ఒకరికొకరికి సంబంధము లేకుండ ఉండిన విదేశీయుల పరిహాసమునకు పాత్రులగుదుము. కానిమన స్థానిక సమస్యల విషయమై మనకన్న వారి కెక్కుడుగ తెలుసునా? మనగృహచ్ఛిద్రములను బయటపెట్టుకొనుట తప్ప మరేమియు లేదు. మన తెలివితక్కువ, అసమర్థత వెల్లడియగును. కాంగ్రెసు పుట్టి ఇప్పటికి దగ్గరదగ్గర ఏబదేండ్లు కావచ్చుచున్నది. అన్ని రాష్ట్రములవారు అధ్యక్షత వహించిరి కాని ఆంధ్రులకు ఇంతవరకు ఆ అదృష్టము, ఆగౌరవము దక్కలేదు. కార్యనిర్వాహకవర్గపు సభ్యులుమాత్ర మయిరి. అయిన సభ్యులు ఆంధ్రులని ఎవరికి ఏమియు తెలియదు. కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలుగాని, కార్యనిర్వాహకవర్గసభ్యుల ఎన్నికలుగాని వచ్చినపుడు సుబాసుగారికి ఓటు ఇచ్చుటా, లేక నారిమన్‌గారికి ఓటు ఇచ్చుటా అనే ఆలోచనల్వా తమాయింపులూ పుట్టుతవి గాని, వెంకటప్పయ్యగారినిగాని, పట్టాభిగారిని గాని, ప్రకాశంగారినిగాని ఎన్నుకొనవలె నని కాంక్ష లేదు. ఈ విషయము గ్రహించియే సుబాసు బోసుగారు కరాచీకాంగ్రెసుకు వచ్చిన అఖిల భారత కాంగ్రెసు సభ్యులగు కొంతమంది ఆంధ్రులకు వర్తమానము పంపిరి. ఇవన్నీ చూచి ఆత్మగౌరవముకలిగిన ఆంధ్రుడు పరితపింపకమానడు. విచారకరమగు ఈ స్థితికి కారణ మేమిటి? నాయకుల తప్పా, లేక ప్రజలతప్పా? నాయకత్వము వహించువాడు, అనుచరులు కలవాడు, తన ఆజ్ఞప్రకారము ఇతరులను నడిపించుకొనగలవాడు నాయకుడు. కాని ఆజ్ఞ ఇచ్చి దానిప్రకారము నడపించువారందరు నాయకులు కారు. కలెక్టరు, మేజిస్ట్రేటు, గవర్నరులు నాయకులక్రింద పరిగణింపబడరు. గ్రంథ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములయందుకూడ నాయకు లుందురు. ప్రజల యందు ప్రాముఖ్యము వహించువాడు నాయకుడు. ప్రజల ప్రేమను, మర్యాదను పొందిన వాడు నాయకుడు. ఇది ప్రజాంగీకృత మగు నిర్వచనము.

నాయకులయందు అనేక తరగతులు కలవు. కొందరు రాజకీయ నాయకులు; కొందఱు మతసంబంధు లగు నాయకులు. ఆయా తరగతులవారినందరిని పేర్కొనుట అనవసరము.

సంఘము కొన్ని చిక్కులందు తగుల్కొనియున్నపుడు ఆచిక్కులను విడదీసి, సంఘమును ఉద్ధరించువాడుగాని, సంఘమును అభివృద్ధిమార్గమున బెట్టువాడుగాని నాయకుడగును. ప్రపంచచరిత్ర పఠించినవారికి ఈ విషయము తప్పక గోచరించియుండును. ఇట్టి వ్యక్తులను పురాణములందు అవతారపురుషులని వర్ణించిరి. హేతువాదము మనుజుల దృక్పథమును ఆక్రమించిన ఈ ఆధునికయుగమున మనము వారిని నాయకులని గాని, ప్రవక్తలనిగాని పిలుచుచుంటిమి. మన దేశమందలి పామరజనము గాంధిగారిని అవతారపురుషు డని నమ్మెదరు. విద్యావంతులు నాయకు డనెదరు. ఈ రెండవతరగతివారియందుకూడ ఈనమ్మకము కలిగినవా రుండవచ్చును. పురాణములందు, ప్రాచీనాచారములందు నమ్మకముతో పెరిగిన ఈ దేశీయులట్లు నమ్ముట సహజము. అది పరిసరముల ప్రభావము. మానవుని దృక్పథమును పోతపోయునవి, అతని నడతను ఏర్పరచునవి పరిసరములు. పరిసరములను జయించినవాడు నాయకుడు.

పరిసరములను జయించుట సామాన్యవ్యక్తికి మించినపని. అట్లు జయింపతలపెట్టినవాడు కష్టతరంగముల నెన్నిటినో ఎదుర్కొనవలసి వచ్చును. పూర్వాచారపరాయణులతో పోరాడవలెను. గొప్ప శక్తిమంతుడుగాని దీనియందు కార్యసాధకుడు కాడు. వీటిని జయించిన తక్షణము ప్రజల కీర్తనియందు ప్రేమ జనించును. వారు అతనికి లోబడుదురు. "The crowd is like woman; the woman likes a strong man; the crowd likes a strong man." అని ఇటలీదేశ నియంత యగు ముస్సోలినీ వ్రాక్రుచ్చెను. ఆయనమాటలయందలి సత్యమును ప్రశ్నించెడువా రుండరు. కాని నాయకునకు విచక్షణశక్తి ఉండుటకూడ అవసరము. గ్రుడ్డిఎద్దు చేనున ప్రవేశించినట్లు ప్రవర్తించుట అపాయకరము. హిట్లరు కున్న ఆర్భాటము అవసరము. కాని ప్రజల మనసు, దేశము నెదుర్కొనిన సమస్యలను ఎరింగి వారి కనుకూలముగా ప్రవర్తింపవలెను. తాను చెప్పెడుదానిని కార్యరూపమున పెట్టవలెను. ప్రస్తుతము ప్రపంచమును ఆయుధవిసర్జనసమస్య ఎదుర్కొనినది. అన్ని దేశములవారు ఆయుధవిసర్జనమును అపేక్షించెదరు. మానవకోటిక్షేమమున కిది అత్యవసరమని అందరు ఒప్పుకొనెదరు. కాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎవరును తగువిధానమును చూపజాలక పోయిరి. ప్రతిదేశము తనకు లాభకరమగు నట్లు నివేదిక నొసంగినది. గాని ఆయుధవిసర్జనకు సాధ్యమయినట్టు సూచనల నొసంగలేదు. అందరికి ఆమోదకర మగునదియును, స్వలాభాపేక్షతో కూడుకొననిదియు నగు సూచనలను నివేదించిన దేశము ఈ ఉద్యమమందు నాయకత్వము వహించును. ప్రజాప్రభుత్వమును ఏవగించి, డిక్టేటర్ షిప్పును కోరుటకు కారణము ప్రజాప్రభుత్వము సంఘముయొక్క కోరికలను తృప్తిపరచలేక పోవుటయె.

పై లక్షణములు మన నాయకులకు గలవా అను ప్రశ్నకు జవాబు ఎవరికి వారే యూహించుకొనవలెను గాని మరొకరు సమాధానము చెప్పుట క్రమముగాదు.

ఒక వ్యక్తి గొప్పవా డగుటకు స్వశక్తియేగాక ఇతరవస్తువులుకూడ కొన్ని తోడ్పడును. పరిస్థితులు నాయకుని సృష్టించునా? నాయకుడు పరిస్థితులను సృష్టించునా? అను వివాదము తెగునది కాదు. ఇది అన్యోన్యాశ్రయము. "You cannot link two hearts to-gether unless the linking springs from your own heart" అని ఒక కవి పుంగవు డనెను. అట్లే ఒకడు నాయకు డవుటకు ప్రజలసహాయముకూడ కావలెను. వారి గౌరవము, ప్రేమ, మర్యాద కావలెను. వారి ఆమోదము లేనిది తానెవరికి నాయకు డగును? నాయకత్వమనునది ప్రభుత్వము వంటిది. ఈరెంటికి నమ్మకము, ప్రేమ ఆధారములు. రెండు లేని మరుక్షణమున అవి అంతరించును. కావున ఆంధ్రదేశమందు నిజమైన నాయకుడు వెలయవలెనంటే ప్రజాప్రయత్నముకూడ అవసరము.

---



వార్డువీధి - కొలంబో. —కే. గోపాలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౨. శాసనసభ



౧౩. యుద్ధస్మారకచిహ్నము - (కోటవద్ద - బీచిరోడ్డునందు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రాయలు

కవితావిశారద, జి. జాషువ

రాజనీతిని కసరత్తు నేర్చిన దిట్ట అప్పాజీప్రజ్ఞ నిన్నాదరింప
చేయివీచిన లక్షసేన బారులు తీరి ముదల మేమని ఖడ్గమును వహింప
కవిసార్వభౌముల ఘనతరాశీర్వాదబలము నీముందు వెన్కాల నటింప
యినుపరోకళుల సాదనసేయు గజసేన ఆలానములను మల్లాడుచుండ
ముగురురాజుల మగ డాంధ్రభోజు డనుచు - గలిచి నీయింటి గోరువంకలును బాగడ
క్రూరతరమైన నీదుకటారిపడుచు - నిదురబుచ్చవో రిపులగుండియలలోన.

తెలుగుగబ్బములు పూవులడోలికలుగాగ ఐహికస్వర్గసౌఖ్యముల దేలి
తుంగభద్రానదీభంగబాలికలకు యుడుకైన రిపురక్తముగ్గుపోసి
కరము లీయక కత్తిగట్టురాజుల కిరీటము లూడ వామపాదమున దన్ని
కడలేని గజసేన నడిపించి వింధ్యగహ్వరమున నెఱదుమ్ము తెరలు దించి
ఖడ్గమే ఘంటముగ రణగ్రంథరచన - మరణపర్యంత మొనరించి యరిగినావు
కృష్ణభూపాల, నీనామకీర్తనంబు - తెలుగుపుత్రిక వీణెతీగలకు గఱప.

బంగారంబువలెన్ గఱంగినది, భూపశ్రేష్ఠ, నీవిక్రమా
గ్నిం గ్రిగ్గాడి నృపాలమండలము నీకీర్తిద్యుతుల్ రోదసీ
రంగంబుల్ గబళించివేసినవి, ఆంధ్రక్షోణి నీబాహుసీ
మం గైసేసిననాడు, నాటి చలిచీమల్గూడ ధన్యంబులే.

పసిడిమూటలు మూపులపై నటింప-నాంధ్రకవికుమారుల సాగనంపినావు
అపుడు పుట్టిన కవుల భాగ్యమును దలచి-యాడుగఱతురు నిర్భాగ్యు లాధునికులు.

ముదమున గండపెండియరపుం జిఱుగజ్జెల మ్రోతతోడ నీ
సదనమునందు గ్రుమ్మరుల సత్కవితాసతి తాతగారి య
భ్యుదయము విన్న; నాహృదయ మూరక పొంగులువారి నాడు నే
నుదయము నందనైతినని యుం దలచు న్నులివెచ్చయూర్పులన్.

వలపోయున్ దలపోసి, నీకొఱకు పంపావీచులన్ దామరా
కులనీడం గొలువైన చేప లిపు డుద్ఘోషించెడిన్ గోటగో


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డలలో నీలిపురుంగు లాంధ్రుల ప్రతిష్ఠాజ్యోతి చల్లాఱెనే
బలిమైపోయెనె కాలభూతమునకున్ గర్ణాటరాట్సంపదల్.

ఇపు డాకృష్ణధరాతలేశ్వరుడు లేఁ డేమాయెనో; నాటి యు
ద్ధపు ఢంకానినదంబు, మా తెలుగువిద్యాభారతీనాట్యమం
టప మయ్యష్టదిశామదేభముల క్రీడారంగ మెందున్నదో
విపులాసుందరి దొంగిలించినది తద్వృత్తాంతమాణిక్యముల్.

కడచూడంబడరాని కాలమను రక్షఃకాంత గావించు గా
రడియం దబ్బు లెడారులైనవి, విచిత్రస్వప్నవృత్తంబులై
నడచుం బెద్దలజీవితంబు లిపు డీ నాట్యంబునం దెన్నడో
కడచెన్ రాయలవారి రాచఱికపుం గల్యాణగాథాంకముల్.

పోటరి, కృష్ణరాయనృపముఖ్యుడు రాజ్యము సేయునాడు, కుం
టేటికిఁగూడ పౌరుషము నిండిన గాథలు సెప్పి, మీసముల్
దీటిన తెల్గువీరులకు నేడు కనుంగవ చెమ్మగిల్ల వ్యా
ఘ్రూటము గూడుగట్టె, నవురా! యతఁ డెక్కిన సింహపీఠికల్.

కాలము చక్రముంబలె మొకామొకి దొల్లుచుఁబోవు గాని రా
జాలదు వెన్క కొక్కనిముషంబు గతించిన, దీనిగర్భముల్
జీలిచినన్ గనంబడు నశేషమహీతలవ్యాప్తి మింటలో
మూలుగుచున్న యాంధ్రుల విభూతి శతాబ్దపరంపరాహతిన్.




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మనదేశపు పరిశ్రమలు: ప్రస్తుతస్థితి ఎట్లు సంభవించెను?

లంకలపల్లి గోపాలరావు, బి. యస్ సి. (ఆనర్సు)

నేటి పాశ్చాత్యుల కలిమి, సౌఖ్యము, పెక్కు శాస్త్రములలోను, కళలలోను ప్రవీణత, ప్రఖ్యాతులకు వారి పరిశ్రమల అభివృద్ధి ముఖ్యకారణము. వందమనుష్యులు చేయవలసినపని ఒక్కయంత్రమువలన సాగించి పెక్కువిషయములుగా మనుష్యుని బడలిక, శ్రమ, ఇంచుమించుగా అవసరమే—తొలగించేశారు. మనదేశమంతా కూడి ఒకమోటరుబండి చేయగలిగేరోజు లెన్నో సంవత్సరములకేగాని వచ్చునట్లుపడదు. కాని అమెరికాలో రెండుమూడువందలమందిమాత్రమేచేరి ఇనుముతో ప్రారంభించి యంత్రసహాయముచే నిముషమున కారుచొప్పున మోటర్లు చేయగలుగుతున్నారు. మనదేశములో ఒక్కొక్కరికిదినముఆదాయము ఒకఅణామాత్రమే—ఇతరదేశములలో రెండుమొదలు పదిరూపాయలు. ఫోర్డు మోటారుకంపెనీలో కనీసము దినముకూలి ఆరుడాలర్లు, అనగా ౨౦ రూపాయలు! విపరీతమేమనగా కావలసినసామగ్రులు దూరదేశములనుండి తెప్పించి తయారైనవస్తువులు తిరిగి పైదేశముల కెగుమతిచేసి మితిలేని ధన మార్జిస్తున్నారు. అప్పుడప్పు డీవస్తువులు స్వదేశములోకంటె పైదేశములలోనే చవుక, లేదా తమ యంత్రశాలలు ప్రతిదినము పనిచేయడం దుర్లభము. ఇట్టి వాణిజ్యమునకు పేరు Dumping, అనగా చౌకబెట్టుట.

యంత్రములచే ప్రతిదినము వేలకొలదివస్తువులు చేయించి ఆ వచ్చిన కోట్లకొలది రాబడితో మన మూహింపజాలని అతివృష్టితో పాశ్చాత్యులు నివసిస్తూ ఉన్నారు. సద్వినియోగముకూడ వీరు చేయకపోలేదు. రోగనివారణకొరకేమి, సర్వశాస్త్రములలో వింతవింత పరిశోధనలలో నేమి మన కందర కాశ్చర్యాస్పదముగా పాటుపడుతున్నారు. వేరువేరు ఋతువులు మన కనుకూలముగా లేవని చెప్పి వసంతఋతుయంత్ర మొకటి కనిపెట్టారు. మనకు రాత్రిపూట వెలుతురుగలదీప మెట్లవసరమో ఎల్లప్పుడూ చల్లని వసంతవాయువిచ్చే ఈ యంత్రము పెక్కు పాశ్చాత్యులఇండ్లలో అత్యావశ్యకము. ఇంతేకాదు. భూమిమీద నివసించడమే కొందరికి కష్టముగా తోస్తున్నది. అందుకుగా హాయిగా గాలిలోనే నివసించి వారముకొకసారి భూమిమీదికి వచ్చే యేర్పాటులు జరుగుతున్నవి.

ఇక మనదేశస్థితి ఆలోచిస్తే కన్నీరు రాకమానదు. దయాపూర్వకముగ ప్రకృతి మన కిచ్చిన సహజసౌకర్యములకు మితిలేదు. "పచ్చని బయళ్ల భూమి, సకలదేశములకు రాణి నాదు జన్మభూమి" అని బంగాళకవి. ప్రపంచములో ఐదవవంతు మన ప్రజసంఖ్య ఐనప్పటికిని, ఈసంఖ్యకు రెండింతలు పోషింపగలిగేపంటలూ మనవే. కాని ఏవైపుచూచినా కరువు, లేమి, "అయ్యా కళ్లులేవు-కాళ్లులేవు." అని బిచ్చగాండ్రు. ఖనిజములేమి, పంటలేమి సదా విదేశముల కంపించి వాటితో తయారుచేయబడినవస్తువు లెంతో డబ్బిచ్చి తిరుగ కొనుక్కొనుట మన ప్రస్తుతస్థితి. నూనె లెగుమతిచేసి తిరుగ వాటినే సబ్బుల, వార్నిషుల, మరియు రంగులరూపములలో దిగుమతి చేయించుకొనుచున్నాము. మన పత్తిపంటను జపాను మొదలగుదేశముల కెగుమతిచేసి, సంవత్సరమునకు ౩౦ కోట్ల విలువగల వాంఛస్తరు, జపాను గుడ్డలు తొడుగుకొనుటకంటె దేశాభిమానులకు లజ్జావిషయము వేరొకటి లేదు. మనకు ప్రతిదిన మవసర మగు సామగ్రులు తయారుచేయుట పైదేశస్థులబాధ్యతగా ఉన్నన్నాళ్లూ "చదువుపూర్తయింది. మావాడికి పని లేదు." అనేరోదన దినదినము పెరగవలసిందే.

మన గౌరవవిహీనతకు తోడు బీదరికము! ప్రజాసంఖ్యలో నూటికి తొంబదిమంది వ్యవసాయదారులు తమకేలేని భోజనము భూమికిపెట్టుట అసందర్భ మని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెప్పి విత్తులు చల్లి పంట దేవుని భారముగా విడిచిపెట్టుట సహజము. వీరి పశువులగతి కూడ రమారమి ఇంతే. ఈ స్థితిగతులలో తెలకపిండికి చెల్లుబడి లేదు. అనగా అపరిమితముగా మనదేశములో పండే నూనెవిత్తులు మనమే పిండుతే నష్టము గనుక విదేశములకు విత్తులే ఎగుమతి చేయాలి. దీనికింక అనుకూలముగ ఆయాదేశములలో నూనెపై దిగుమతిపన్ను—విత్తులపై పన్ను లేదు. ఇట్టి స్థితి మనకు కేవలము గౌరవలోపమేకాదు మనభూమి సారము సదా దుర్వినియోగము చేయుట. పంటల కాధారమగు నత్రజనికూడ విత్తులరూపముగా సంవత్సర మునకు ఎన్నోబారువ లెగుమతిచేయగా ఏదేవేంద్రుడూ పంటలను పోషింపలేడు. కుదకు పేడకూడ గత్తముగా మనవా రుపయోగించక విధిలేక పిడకలుచేసి వంటకు కాల్చుచున్నారు. భూమిస్థితి మనస్థితికంటె అన్యాయము.

ఈ మనహీనస్థితికి కారణములు అనేకు లనేక విధములుగా చెబుతారు. హిందువులు వేదాంతులు. పరిశ్రమలవంటి ఐహికవిషయముల గూర్చి తలపోసే వారు కారనీ, పూర్వులరీతులు మార్చడానికిష్ట పడనీ మనము వినుట వాడుక. ఈదేశమువారు కేవలము సోమరులు – ఉదరపోషణకైన కష్టపడే అలవాటులు లేనివారని మరికొందరిమతము. "మీలో ధనికులకు పరిశ్రమలకొరకు మదుపుపెట్టడమంటే ఉపద్రవమను భయము. అదీగాక మీపూర్వులకు లేని పరిశ్రమలు మీకబ్బుట దుర్లభము. వారివలె వ్యవసాయమే వృత్తిగా తలచి బ్రతకడమే మీకుత్తమము", అని నక్కవినయముగల పెక్కురసలహా. ఈఉద్దేశముల గూర్చి కొంచె మాలోచించాలి.

పరిశ్రమలలో మనపూర్వులకు సహజప్రవీణత లేకపోలేదని చెప్పుటకు ఢిల్లీదగ్గరనున్న ఇనుపకంబము కొండంత ఆధారము. ఈ స్తంభ మెండ కెండుకూ, వానకు తడుస్తూ ౧౫౦౦ సంవత్సరములు జరుగుచిహ్నములే లేక యెట్లు నిలిచి ఉన్నదా అనేది ప్రపంచమునకు వింతవిషయము. అతుకు లేకుండ అంత స్తంభమే చేయుటకు ప్రపంచములో ఏయంత్రశాలకూ మొన్నటి వరకు సాధ్యముకాలేదు. ప్రఖ్యాతిగల మనదేశపు ఉక్కు ఆరోజులలో పెర్షియా, ఇంగ్లండుమొదలగు దేశములలో ఖడ్గములు, చాకులు చేయుట కుపయోగింపబడేది. ఇక వింతలగుబట్టలు నేయుటలో మనవారి నేర్పు మనకు తెలిసినవిషయమే. ౫౦౦౦ సంవత్సరములనుండి మనవారు ఈజిప్టు, గ్రీసు మొదలగు దేశములకు వస్త్రము లెగుమతిచేయుచున్నట్లు రుజువు లగుతూ ఉన్నవి. ౧౫౦౦ యేటివరకు మనదేశపు పెంపు, భాగ్యము, వాణిజ్యము, పరిశ్రమలు చూచేవారి కాశ్చర్యము పుట్టించినట్లు పెక్కువిదేశస్థులే చేతులార వ్రాసియున్నారు.

పైచెప్పబడినవాక్యము లుద్దేశములు కావు, ఇతిహాసములూ కావు, ముమ్మాటికిని దేశచరిత్ర. ౧౮-వ శతాబ్దముతుదకు సన్నని "మస్లిను"లకు ప్రసిద్ధికెక్కిన డాకానగరపు ప్రజసంఖ్య రెండులక్షలు. వాణిజ్యము సంవత్సరమునకు కోటిరూపాయలు. ఇందులో ఇంగ్లండుకు పంపేవి ౩౦ లక్షలవిలువగల ౧౫౦౦౦ మూటలు. ౧౮౧౭-వ సంవత్సరములోగా ఇంగ్లండుతో వాణిజ్యము పూర్తిగ మాయమయింది! డాకాజనసంఖ్య ఒకలక్షగా మారింది! ఈమార్పుల మర్మములు తెలుసుకోవాలంటే ఆనాటి ఈస్టుఇండియాకంపెనీవారి చర్యలు కొంచెము పరిశీలించాలి. అందమైనవస్త్రములు మనవారు ఇంగ్లండులో అతిచవుకగా అమ్మట ప్రారంభించగానే ఆదేశపుపనివారికి హడలుపుట్టి "ఇట్టివస్త్రము లేపనికినీ వాడుకచేయకూడదు" అని ప్రభుత్వముద్వారా నిషేధించారు. అంతటితో చాలించక మనదేశములో పట్టునేత చంపుటకు చమత్కారమగు పన్నాగము పన్ని నేతవారు కంపెనీవారి శాలలోనేగాని వేరొకచోట పనిచేయ లేకుండ బందుబస్తులు చేశారు. వారిచేతుల లోనే ప్రభుత్వ ముండుటచేత ఈ శాసనము కెదురుగ నడిచేవారి కాలో వేలో తెగగొట్టుట న్యాయముగా భావించారు. ఈవిషయముగూర్చి ఆనాటి బ్రిటిషుప్రభుత్వమువారే ఇట్లువ్రాసియున్నారు:

"ఈచక్కనిపన్నాగముద్వారా మనఅధికారము, ప్రోత్సాహము రెండునుకలిసి వీరిపరిశ్రమల రూపుమాపి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీరవలెను. అనగా మనపరిశ్రమలకు కావలసిన సామగ్రులుమాత్రమే వీరిచే చేయించుట కనుకూలముగా నుండును."

ఈస్టుఇండియాకంపెనీఅధికారి టక్కరుగారి ఉద్దేశ మేమంటే :

"హిందూదేశపునూలు, పట్టుబట్టలు మనదేశము చేరలేకుండనే బందుబస్తులు చేసితిమి. నూటికి ౬౪ చొప్పున దిగుమతి పన్ను వేసి, మరియు మనయంత్ర సహాయముచేతనూ, నూలువస్త్రములు మనము దిగుమతి చేయుచుండుటేగాక ఎగుమతికూడ ప్రారంభించాము. ఈవిధముగా హైందవులకు పరిశ్రమలుపోయి వ్యవసాయము ప్రాప్తించింది."

విల్సనుగారు హిందూదేశచరిత్రలో దిగువవిధముగా వ్రాసిరి :

"మితిలేనిపన్నులు, అవమానకరములగు శాసనములు, ప్రభుత్వపుదుర్మార్గములు కూడి హిందూదేశపు నూలు, పట్టుపరిశ్రమలు పడగొట్టినవి. వేరొకవిధముగ బ్రిటిషువారు వీరితో చాలలేకపోయిరి. హిందువులకు స్వతంత్రముండెనా బ్రిటిషువారివస్త్రములు తమదేశమునకు రాకుండచేయగలిగియుందురు. పాపము, వీరిచేతులకు సంకెళ్లు వేయబడెను!"

గతసంవత్సరము మనవారు విదేశవస్త్రములపై నూటికి ఇదివరకుండే ౧౫కు బదులు ౨౦ దిగుమతి పన్ను వేయప్రయత్నించగా "జాగ్రత్త, స్వరాజ్యమునకు దూరులు కాగలరు. మాప్రజల కిట్టిపన్నులు నచ్చవు" అని బ్రిటిషువారి జబాబు. ఈవిషయములో శ్రద్ధగలవారు రొమేశ చంద్రదత్తగారి "Economic History of British India" చదివి తీరవలెను.

ఆనాటి మననౌకావాణిజ్యముగూర్చి కొంచెమాలోచింతము. ౧౮౦౦ యేట లార్డు వెలెస్లీగారు కలకత్తాలో మనఓడలు, వాటిలోగల మూడులక్షల మణుగులసామానులు చూచి దిగ్భ్రమ చెందిరి. "ఇంగ్లండుతో వాణిజ్యమున కీమోడలు తగ్గవి. ఓడలు కట్టడమింకను ప్రబలముగా పెరుగుటకు కావలసినన్నిచిహ్నము లగుపడుచున్నవి." అని వ్రాసిరి. కాని హైందవుల ఓడలు సామానులతో లండనుచేరగానే బ్రిటిషువారి గల్లంతు ఇంతింత అని చెప్పనలవికాదు. శత్రుసైన్యముగా భావించి "ఈఓడ లెట్లయినరాకుండ చేయాలి. లేదా మావారిబ్రతుకు సున్న" అని రోదనము ఆరంభించారు. వెంటనే ఈస్టు ఇండియాకంపెనీవారు "హిందూనౌకలుఇంగ్లండుపై పురాకూడదు" అని నిషేధించారు. హైందవులేమి, ఈదూరదేశమునకు సముద్రప్రయాణము చేయుటేమి! చలిగాలికిగాని, తుఫానులకుగాని వీ రోర్వలేరు; శత్రునౌకలముందు ధైర్యముగా నిలువలేరు; ఇంతేకాదు—వీరు మనదేశముకు వచ్చి మన వ్యభిచారములు కన్నులార చూడగా, మనగౌరవము గతియేమి? ఆపిమ్మట మనగతియేమి?" అని వీరిముఖ్యోద్దేశములుగా వెలిపుచ్చారు.

ఇటువంటి పెక్కు విషయములు డిగ్బీగారి Prosperous British India లోను, రాధాకుముద్ ముఖర్జీగారి History of Indian Shipping లోను చెప్పబడియున్నవి. చిరకాలమునుండి జావా, సుమత్రా, బోర్నియో, కాంటను, ఆఫ్రికా, మెక్సికో మొదలగు దూరదేశములకు సదా పోవుచుండెడి మనవారినిగూర్చి మొన్నటిదినము కన్నుతెరచినవారు పలికినపలుకులు చిత్రమైనవే! నేనుకూడ తూర్పుదిశ వచ్చే ప్రతిపొగయోడలోను హైందవలస్కరులను చూస్తునేయున్నాము. పూర్వము వాణిజ్యములో ఆరితేరినవారి సంతతివారే యీలస్కరులు. ఒకానొకప్పు డాంధ్రులు కూడ మెక్సికోలో నున్నట్లు మనకు తెలియవస్తూ ఉన్నది. ఆనాడు వాణిజ్యార్థము మెక్సికోవర కేగినవారు నేడు కూలికోసరము రంగూను పోవుట తటస్థించింది!

మనము రైలుప్రయాణము చేయునప్పు డెల్లను "ఆహా! ఎవ రేమన్న నేమి? చల్లనిబ్రిటిషుప్రభుత్వము వలనగదా మనకీయమూల్యమగు సౌఖ్యము! ప్రజల కిట్టి ఉపకారములు చేయలేనిదేని స్వరాజ్యమైన నేమి ఫలము" అని తలపోయుట తప్పదు. కాని రైళ్లనిర్మాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుటలో ప్రభుత్వమువారి యుద్దేశము గూర్చి కొంచె మెరిగినవారికి "ఇల్లుకాలిననేమి, ఒల్లుకాచుకోవచ్చు" అనుహామెతే స్ఫురించకమానదు. లార్డు డాల్హౌసీగారి Railway Minute (రైలుస్థాపనగూర్చి ప్రకటన) చదివినట్లయిన సంగతి తెల్లమగుతుంది. ప్రజలసౌఖ్యము కొరకుకాదు రైళ్లు, దేశములోని పంటలు, ఇతరసామ గ్రులు సులువుగ ఓడలమీదికి చేర్చడానికి! ఈయూహ వీరుప్రకటించినదే—ఫలించిందికూడాను. రైళ్లురాగానే పత్తిఎగుమతి రెండింతలు, ధాన్యము, గోధుమలు వగయిరాల ఎగుమతి మూడింతలు హెచ్చినవి. సర్ విలియమ్ హంటరుగా రీవిషయముగూర్చి వ్రాసినవి తెలియపరిచిన మాటలు:

"ఇది లార్డుడాల్హౌసీ గారి అమూల్యమగు పన్నాగము. క్రొత్తగా జయించిన ప్రదేశములు రైళ్లమూలముగా స్థిరపరచడమేగాక, తనసైన్యపు శక్తిపరంపరలు (Striking Power)క్షణములో ఏమూలకయిన రప్పింపగలుగుటేగాక, బ్రిటిషువారిని డబ్బుతో యీ దేశమునకు తెప్పించి వర్తకము మొదలగు ధనార్జనలో ప్రవేశపెట్టుటకు ఎరగా రైళ్లు నిర్మించెను."

వీరియుద్దేశము వెలిపుచ్చుట కొకదృష్టాంతము. రైళ్లు నిర్మింపబడినప్పుడు ప్రతిచోటను రైళ్లుగాని ఝరియా మొదలగు మనదేశపు ముఖ్యమగు బొగ్గగనుల ప్రదేశములలో రైలువాసనగాని లేదు! ఇది పొరపాటు కానేరదు. బొగ్గనగా పరిశ్రమాభివృద్ధి అనే సంగతి ప్రభుత్వమువారికంటె బాగుగ నెరిగినవారు లేరు. ఈమధ్య ప్రజలు తీవ్రముగా ప్రయత్నించగా Indian Coalfields Railway అని యీమరచిపోయిన ప్రదేశములకొరకుమాత్రము వేరొకరైలుదారి నిర్మింపబడ్డది.

నేమనగా మనపరిశ్రమలకు బొగ్గ సులువుగా దొరికేపదార్థముకాదు. దేశములోని ఇనుప గనులకు మితి లేదు. తాతాకంపెనీవంటి పదికంపెనీలను పోషింపగలవు. కాని బొగ్గుఅనావృష్టిచేత ఈయినుమంతా ప్రస్తుతము ప్రయోజనములేనిదిగా నున్నది. సంవత్సరమునకు ౩౦ కోట్లరూపాయల విలువగల ఇనుపసామానులు మనదిగుమతి. మోటారుకారులు చేయలేనిదేశమును లెక్కింపకూడదని సర్ విశ్వేశ్వరయ్యగారి అభిప్రాయము. ఇది కలలోనికల కానిండు. ఇనుము, బొగ్గ మొదలగు మూలపరిశ్రమలు స్థాపించి వృద్ధిపరచడం దేశీయప్రభుత్వపు కర్తవ్యమయ్యి మన కట్టిసౌకర్యములు లభింపకుండుట మనదురదృష్టమని భావింతము. కాని బొగ్గ దేశములో నొకటో రెండో చోట్లలోనే మాత్రము దొరికినప్పుడు ప్రభుత్వము కనీసము చేయదగిననిధినిగురించి వేరువేరు ఉద్దేశము లుండ నవసరము లేదు. దేశములోని దూరప్రదేశముల కెగుమతి కనుకూలముగా బొగ్గపై రైలుఖర్చు తగ్గించవలెను. ఇట్టిఆశలు వెలిపుచ్చుట వట్టివెఱ్ఱి. ఇంగ్లండునుండిగాని, ఆఫ్రికానుండిగాని మనరాసు తెప్పించుటకు ప్రతిమణుగు బొగ్గపై ఓడఖర్చు ౫-౬ అణాలు. బంగాళమునుండి తెప్పించుటకు రమారమి రెండింతలు! మనపరిశ్రమాభివృద్ధికి అడ్డులలో ముఖ్యమైనది సామానులపై బలువైన రైలుఖర్చు. జర్మనీలో ౩౦౦ గజముల వెడల్పుగల రైనునదిని (తగ్గపేరు 'కాలువ') లోతుగా త్రవ్వి పొగవోడలు నడిపించుచున్నారు. ౧-౧౪ మైళ్లవెడల్పుగల గంగ మొదలగు నదులు "అట్టిపనులకు మేము తగము" అని పలుకలేదే!

ఏదియెట్లున్న నేమిప్రయోజనము? ఏమిచేయదలచుకున్నను మనసంకెళ్లుగదా విడవలెను ముట్టమొదట!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పున్నమ వెన్నెల – సముద్రతీరము – బాలికావిహారము

కవిభూషణ, సెట్టి లక్ష్మీనరసింహము (కవితాసమితి)




ఆంబుధితీరమందు నొక
యందపు బాలిక, కేళి
కాభిలా
షంబున డోలికాచలనసా
మ్యము తోఁచెడి వీచి
కల్ తనర్
వెంబడిలంగఁ బర్వెడుచు,
వెన్కకు నేఁగఁగ వెంబ
డించుచున్,
బింబితుఁడై పయోధిఁ గని
పించెడి రిక్కలఱేఁడె
తోడుగన్.

ఆడుకొనుచుండెఁ, జంద్రుని
షోడశకళల వెలువడ్డ
జ్యోత్స్నతతి కా
మ్రేడితముగఁ దనమోమున
వేడకను జనించు నగవు
వెన్నెల వెలుఁగన్.

గగనమ్మునందుఁ జందురుఁడు కాచెడి వెన్నెల పేరినవ్వులున్,
దిగువను బాలికామణి యతిప్రమదంబున నవ్వు నవ్వులున్,
జగమున నిండఁ గన్గొనుచు సాగరుఁ డాఁపుకొనంగలేక పెం
నగవును ఫేనకైతవమునన్ నగిమెం బలుమాఱు బల్లునన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తన్నుఁజూచి నవ్వుచునున్న కన్నెమోము - పైకి దాడివెల్వడు శశిబలమగు ప్రతి
బింబములు, తరంగతురంగమంబులపయి- కెక్క, దౌడుపెట్టుచు నవి గ్రక్క నురుఁగు.

రవికిరణాళి పైకొనుచు రాఁగఁ దదుష్ణతచేత కేవల
ద్రవమయి సంద్రమైన తిమిరంబు, ఖరాంశుని రశ్మి రాత్రి జ్యో
త్స్నవలెఁ బడంగ మ్రింగి, యది తా నఱిగించుకొనంగలేక వే
గ వెడలఁగ్రక్కెనాఁగఁ దరఁగల్ విఱిగెన్ నురుఁగుల్ బయల్పడన్.

అంగాంగాధికసంగమంబయిన గాఢాలింగనం బొప్పఁగా,
గంగాదేవి నిజేశుఁ గూడినటు రాకాచంద్రికాకాంతి వా
ర్ధిం గప్పెట్టెను, భంగముల్ గలుగఁగా, హ్రీచేత నద్దేవి లే
వంగం గోరి పెనంగుభంగి నురుఁ గాపన్ రాక లేచెం గడున్.

తీరసికతాతలంబున హోరునఁ బడు - కెరటముల రేఁగు నురుఁగుతుంపురులు, శౌల
కాలిగోళ్లతోఁ జాలక కావుమంచు - మొఱ్ఱవెట్టెడి యుడుగణమ్ములనఁ దనరు.

ఉగ్గులు దోఁచ లేచిన పయోనిధివీచులమీఁది నీటి నున్
బుగ్గలతోడి వెన్నెలల ముక్కలు, వెండి జరీబుటాపనిన్
మొగ్గలుఁ బూవు లల్లినటు పొల్పెసలార, ధరావధూటి క్రొ
న్నిగ్గుల నీలిపైఁట నెఱనీటుగఁ దాల్చిన సాటి వాటిలెన్.

తనదు కందు దక్కఁ దక్కినవెల్ల వె - ల్లఁదనమొంద వెన్నెలం బఱపుచు,
జగతి పట్టపగలు చంద్రుండొనర్చెఁ గ్రీ - నీడతోడి దివ్వెజాడ నపుడు.

"తన కుచ్చస్థితి; నాఁడు పౌర్ణిమ; శరత్కాలంబు; తా నింక నాఁ
టి నిశన్ రోహిణిఁ జేరఁ బోదు" ననుచున్ డెందంబునం దాఁపనో
పని యానందము పొందుచుం గలకలం బద్మారి నవ్వంగఁ, బు
త్రుని సంతోషము గాంచి పొంగెను సముద్రుం డుబ్బుమై నయ్యెడన్.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౮. రెవిన్యూబోర్డు కార్యాలయము

(కర్ణాటక నవాబుల భవనములు)



౧౯. [illegible]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౮. కార్పొరేషను కార్యాలయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రపంచ ఆర్థికక్షోభ-పునరుద్ధారణ ప్రయత్నములు

## ప్రస్తుత స్థితి

ప్రపంచమంతటా ఆర్థికక్షోభ వ్యాపించి ఉంది. నాలుగుసంవత్సరాలనుండి అన్నివస్తువుల ధరలూ అపరిమితంగా పడిపోయి ఉన్నాయి. వర్తకం బొత్తిగా మందగించింది. ఎక్కడా డబ్బు ఆడడం లేదు. వస్తువులు అమ్మకంలేక గుట్టలుగుట్టలుగా పడి ఉన్నాయి. పరిశ్రమలన్నీ చాలవరకు ఆగి, తగ్గి వస్తువులనెంత తక్కువగా వీలయితే అంత తక్కువగా తయారుచేయడానికి ప్రయత్నిస్తున్నాయి. ప్రతిదేశంలోనూ లక్షలకొలదిమనుష్యులు పనిలేక నిరుద్యోగులై అల్లాడుతున్నారు. నాగరికదేశాలలో నిరుద్యోగులకు ప్రభుత్వమువా రిచ్చే సహాయవేతనాలను భరించలేక తగ్గించారు. మనదేశంలో ఉన్న నిరుద్యోగులకి, దరిద్రులకి లెక్కయే లేదు. వాళ్ల బాధతీర్చడానికి ప్రభుత్వము చేసే సహాయమూ లేదు. అన్ని దేశాలస్థితీ అధ్వాన్నంగానే ఉన్నా, అందులో మనదేశంలాగ వ్యవసాయంమీద ఆధారపడినదేశాలు మరీ అధోగతికి పడిపోయినవి. ౧౯౩౧-వ సం.రం జూన్ నెలనాటికి మనదేశంలోపడిపోయినంతగా ధరలు ఇంకేదేశంలోనూ పడిపోలేదు. పంటలధరలు పారిశ్రామికవస్తువుల ధరలకంటె చాలా తక్కువస్థితికి పడిపోయినవి. ధాన్యపుధరలకి, ఇతర ముడిపదార్థాలకి (కాఫీ, ప్రత్తి, రబ్బరు మొదలయిన వాటికి) ధరలు బొత్తిగా పడిపోయి, ఇవన్నీ అమ్మకం కాక కొన్నిచోట్ల ఈవస్తువుల ధరలు నిలబెట్టడానికి ఉన్న సరుకులో కొంతభాగం తగలబెట్టడం తటస్థిస్తోంది. వ్యవసాయదారులూ ఋణాలు చెల్లించుకోలేక ఫకీరులయిపోతున్నారు. ప్రకృతి అనుగ్రహంవలన, మానవుని బుద్ధివిశేషమువలన, అనుభవయోగ్యములైన వస్తువులు కొల్లలుకొల్లలుగా తయారై అమ్మకంలేక పడిఉండడం ఒకవైపున—ఇంకోవైపున—కోట్లకొలది ప్రజలకి పనిలేక, తిండిలేకమాడిపోవడమూనూ. ఏమిటీవింత? ధనధాన్యవస్తుసమృద్ధిగల ప్రపంచములో దారిద్ర్యదేవత తాండవించడం యొక్క అర్థమేమిటి? ఈ దుస్థితిలోనుంచి బయటపడడానికేమైనా దారి అంటూ ఉందా?

## ఆర్థికప్రపంచముయొక్క పూర్వ నిర్మాణము

ఈప్రశ్నలకి సమాధానం చెప్పేముందర ఇటువంటి దుస్థితిలోనికి ప్రపంచమంతా రావడానికి వీలిచ్చిన ఆర్థికనిర్మాణముయొక్క స్వరూపము, ఈ మహాపతనము జరిగేదాకా అందులో కలుగుతూవచ్చిన మార్పులు, ఆనిర్మాణము ఇల్లాగ విఫలమైపోడానికి కారణాలు, క్లుప్తంగా విచారించాలి. పూర్వం ఈనిర్మాణము ముఖ్యముగా వ్యక్తిప్రయత్నంమీద ఆధారపడి ఉండేది. ఇంకా చాలవరకు అల్లాగేఉంది. అంటే, పరిశ్రమలు, వ్యవసాయము, వ్యాపారము ఎవరి మట్టుకువారు తమ స్వలాభంకోసం నెరవేరుస్తూఉండడం, ఎంతసేపూ ఎంతతక్కువఖర్చుతో వీలయితే అంత తక్కువ ఖర్చుతో వస్తువులను తయారుచేయడం, వాటిని వీలయినంత ఎక్కువలాభము వచ్చేలాగ అనుకూలమైన చోట్ల అమ్మకోడం, దానివలన వచ్చేలాభము నంతటినీ పెట్టుబడిదారులు అనుభవించడం, లేకపోతే ఇంకా దానివలన లాభము తీయడంకోసం ఇంకా దాన్ని పెట్టుబడిపెట్టి ఆధనముతో ఫాక్టొరీలు, యంత్రాలు మొదలయినవి నిర్మించడానికి ఉపయోగించడం, దేశక్షేమంతో సంబంధములేకుండా ప్రపంచంలో ఎక్కడ వీలయితే అక్కడ పెట్టుబడిపెట్టడం. ఇల్లా జరుగుతూవస్తోంది. ఈ పరిశ్రమలలో పనిచేసేకార్మికులకి బొత్తిగా దారుణంజరగకుండా కొన్ని దేశాలలో విధించిన నిర్బంధాలు తప్ప మరెట్టినిర్బంధమూ లేక పూర్తి అయినస్వేచ్ఛ ఉండేది. ఇదే "కాపిటలిజం" అనే


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రస్తుతసాంఘికపద్ధతియొక్క ప్రధానసూత్రము. వర్తకంలోకూడా బాహాటమైనపోటీ ఉండాలని, వ్యాపారానికి నిర్బంధము కలిగించేఎగుమతి దిగుమతిపన్నులు మొదలయినవి ఉండకూడదని, ఏదేశములో ఏయేవస్తువులు బాగా తయారుచేయడానికి వీలవుతుందో ఆదేశములో ఆవస్తువులే తయారుచేసి వాటిని ఇతరదేశాలకు ఎగుమతిచేసి వాటిబదులు ఆదేశాలలో లాభకరంగా తయారయ్యేవస్తువులను దిగుమతిచేసుకోడం ఉత్తమపద్ధతి అని ఆపద్ధతిని అవలంబించారు. ఈ "స్వేచ్ఛావ్యాపారపద్ధతి" ని గట్టిగా అవలంబించి మనదేశంలో కూడా చాలాకాలం అవలంబింపజేసి మొన్నమొన్నటిదాకా కొనసాగించినది ఇంగ్లండు. ఈపద్ధతి ఇంగ్లండుకిమాత్రం చాలాలాభకరమైనది. అన్నిదేశాలకంటె ముందు పారిశ్రామికాభివృద్ధిగాంచి, మంచి విదేశీయవ్యాపారం ఏర్పరుచుకొని, ఇతరదేశాలనుంచి ముడిపదార్థాలన్నీ చవకగా తెచ్చుకొని వాటినన్నిటినీ తయారైనవస్తువులుగాచేసి, తిరిగి ఆదేశాలలోనే అమ్మి, లాభము సంపాదించి, ఆడబ్బునంతటినీ ఇతరదేశాలలో వడ్డీకిచ్చి, పెట్టుబడిపెట్టి, దానిమీద ఏటా చక్కని ఆదాయం తీస్తూ, ఈవ్యాపారంద్వారా ఒకగొప్ప సామ్రాజ్యము నిర్మించుకొని, తనవస్తువు లమ్ముకోడానికి స్థిరమైనమార్కెట్టు నేర్పరుచుకొన్న ఇంగ్లండుకీపద్ధతి లాభకరంకాక ఏమవుతుంది?

ఇదికాక, పూర్వ-ఆర్థికనిర్మాణము బంగారు ప్రమాణముమీద ఆధారపడి ఉండేది. దీనిప్రకారము ముఖ్యమైనదేశాలన్నీ తమకరెన్సీలను ఏదోఒకస్థిరమైన రేటున బంగారముతో సంబంధించి ఉంచినవి. అంటే, తమకరెన్సీలో ఇన్నినోట్లిస్తే ఇంతబంగారం ఇస్తాము అన్ననియమమును అవలంబించిఉండేవి. దీనిమూలాన అన్నికరెన్సీలకు నడుమ దాదాపు స్థిరమైన మారకపురేట్లు ఏర్పడిఉండేవి. ఇది అంతర్జాతీయవ్యాపారానికి చాలాఅనుకూలంగా ఉండేవి. ప్రతిదేశంలోనూ సెంట్రలుబ్యాంకిలో సరిపోయేటంతబంగారపునూలధనం ఉండేది. దీనిని ఆ ధా ర ము చే సు కొ ని దీ ని కి దాదాపు రెండురెట్లు-విలువగల కరెన్సీనోట్లు ప్రచారములో ఉంచేవారు. ఈకరెన్సీనోట్లు ఎప్పుడు పడితే అప్పుడు ఒకనిర్ణయమైనరేటుప్రకారం బంగారంలోనికి మార్చుకోవచ్చును కనుక ఈనోట్లవిలువ బంగారపువిలువతో సమానముగానే ఉండేది. ఇట్లా ప్రచారంలో ఉన్న కరెన్సీనోట్లమీద ఆధారపడి, దాదాపు దానికి పదిరెట్లవరకూ బ్యాంకులు వర్తకులకు, పరిశ్రమలకు అప్పులిచ్చేవి. ఈరీతిగా దేశంలో ఉన్నడబ్బు సప్లయి బంగారపునూలధనంమీద ఆధారపడి, దానికి దాదాపు ఇరవయిరెట్లు ఉండేదన్నమాట. ప్రతిదేశంలోను సరిపోయేటంత బంగారపునూలధనం ఉన్నంతకాలం, బంగారము నిరభ్యంతరముగా ఒకదేశంనుంచి ఇంకోదేశానికి వ్యాపారపరిస్థితుల ననుసరించి కదలడానికి వీలున్నంతకాలం, పైనచెప్పినసక్రమరీతిని వస్తువుల ఉత్పత్తితోను, వ్యాపారాభివృద్ధితోను సమానంగా డబ్బుకూడా సప్లయిఅవుతూవచ్చింది. వస్తువులఉత్పత్తిమాత్రం ఎక్కువఅవుతూఉండి డబ్బుసప్లయి దానితో సమంగా అభివృద్ధికాకపోతే, ఆఉన్నడబ్బుతోనే ఈ వస్తువులక్రయవిక్రయాలు జరగాలి కనక ధరలు పడిపోతాయి. అల్లాంటిది సంభవించక చాలాకాలంవరకూ ధరలు ఒకమోస్తరుగా స్థిరంగానే ఉంటూవచ్చాయి.

## మార్పులు

కాని, ఈపద్ధతి ఎల్లకాలమూ ఉంటుందా? ఇంగ్లండుకంటే ఇది అనుకూలమైనదికాని, పారిశ్రామికాభివృద్ధిలో వెనుకబడియున్న ఇతరదేశాలన్నో? వట్టి స్వేచ్ఛావ్యాపారపద్ధతి నవలంబిస్తే ఈదేశాలన్నీ ఇంగ్లండుకి ముడిపదార్థాలు చవకధరలకి సప్లయిచేసి, తాము పారిశ్రామికపదార్థాలన్నీ అక్కడనుండి తెప్పించుకొని, నిరంతరపరిద్రస్థితిలో పడి ఉండవలసిందే. అందుచేత జర్మనీ, అమెరికా, జపాన్ మొదలయిన దేశాలు తమజాతీయపరిశ్రమలను అభివృద్ధిచేసుకోడానికి "రక్షణవిధానము" నవలంబించాయి. అంటే, ఇతరదేశాలలో తయారై తమదేశంలోనికి దిగుమతిఅయ్యే వస్తువులమీద అధికమైన దిగుమతిపన్నులు విధించి, ప్రారంభదశలోఉన్న తమపరిశ్రమలు నాశనంకాకుండా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రక్షించుకున్నాయి. ఈపద్ధతి కొన్ని పరిశ్రమలవిషయంలో మనదేశంలోకూడా యుద్ధంతరవాత కష్టముమీద అవలంబించారు. ఎగుమతిదిగుమతులమీద ఇల్లా విధించినపన్నులకే "టారిఫ్" లంటారు. ఈటారిఫ్ గోడలవెనకాల తమ పరిశ్రమలను ఆధునికపద్ధతుల ప్రకారం అభివృద్ధిచేసి, తమదేశాలలో వాటిని ఎక్కువ ధరలకు అమ్ముకొని, ఇతరదేశాలలోకూడా వాటిని అమ్మకోడంకోసం మార్కెట్టులు ఏర్పరుచుకోడానికి ఈదేశాలు తమలోతాము పోటీ ప్రారంభించాయి. ఏదేశాని కాదేశమే తానొక సామ్రాజ్యం ఏర్పరుచుకోడానికి ప్రయత్నించింది. వ్యవసాయమే ముఖ్యాధారముగాగల దేశాలమీద రాజకీయాధికారం చలాయించి, అక్కడనుంచి ముడిపదార్థాలను, పెట్రోలు మొదలయిన పారిశ్రామికద్రవ్యాలను తీసుకొనిపోయి, ఆదేశాలలో తాము తయారుచేసినపదార్థాలనమ్ముకోడంకోసం పోటీ ప్రారంభమయింది. ఈమార్పులతో "ఇంపీరియలిజం", అనగా సామ్రాజ్యతత్వము ఏర్పడింది. దీనిఫలితముగానే ఐరోపామహాసంగ్రామము జరగడం, అందులో జర్మనీ ఓడిపోవడం, రష్యాలో సాంఘికవిప్లవం జరిగి బోల్షివిక్కుప్రభుత్వం ఏర్పడడం, ఇదివరకు జర్మన్, రష్యన్ సామ్రాజ్యములలో ఇమిడియున్న అనేక చిన్నచిన్నజాతులు వేరుపడిపోయి స్వతంత్రజాతీయ రాజ్యములుగాఏర్పడడం, జర్మనీ జయముపొందిన దేశాలకన్నిటికీ నష్టపరిహారముగా సంవత్సరాలకొలదీ ఏటేటా బోలెడంతధనం చెల్లించాలని నిర్ణయంకావడం, అమెరికానుంచి యుద్ధంకోసం ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ మొదలమునదేశాలన్నీ పెద్దపెద్ద అప్పులు తీసుకోడంవలన ఇవన్నీ చెల్లించవలసిరావడం, అమెరికా ప్రపంచానికంతటికీ షాహుకారయి కూర్చోడం తటస్థించింది.

### యుద్ధమువలని ఫలితాలు

చిత్రమేమిటంటే, యుద్ధంమూలాన్ని ఓడిపోయినజర్మనీస్థితి అధమాధమమైతే, గెలిచినదేశాలకి కలిగినలాభమూ లేదు. అవీ సంకటస్థితిలోనే చిక్కుకున్నాయి. యుద్ధంతరవాత ప్రపంచఆర్థికనిర్మాణం అనేకరీతుల మారిపోయింది. ఇందులో అన్నింటికంటె ముఖ్యమైనది ఆర్థికవిషయాలలోకూడా తీవ్రమైన జాతీయభావాలు, జాతీయపద్ధతులు, ప్రతిదేశమూ అవలంబించడమే. యుద్ధసమయంలో వస్తువులు ఒకచోటినుండి ఇంకొకచోటికి పోడానికి వీలులేక, ఆహారపదార్థాలు మొదలయినవి శత్రువులకు చిక్కకుండా అరికట్టడంమూలాన్ని, ఇదివరకు ఎన్నడూ ఉత్పత్తికాని దేశాలలో వ్యవసాయపదార్థాలు ఆధునికశాస్త్రీయపద్ధతుల నవలంబించి ఉత్పత్తిచేయడం ప్రారంభించారు. యుద్ధసమయంలో ధరలు బాగాలేచి ఈవస్తువులన్నింటికీ గిరాకీ ఎక్కువ అవడంచేత మామూలుగా వ్యవసాయంచేసే దేశాలన్నీకూడా తమతమ ఉత్పత్తులను బాగా ఎక్కువచేసినవి. ఆర్థికలగా స్వయంసంపూర్ణత్వము ఉంటేనేకాని ఇతరదేశాలమీద ఆధారపడవలసి ఉంటుందని, ఏయుద్ధమైనా వస్తే చిక్కని, చిన్నచిన్న దేశాలుకూడా జాతీయభావాలవలంబించి టారిఫ్‌లు బాగా నిర్మించి అన్నివిధాలా తమపరిశ్రమలు, వ్యవసాయము, అభివృద్ధిచేయడం మొదలుపెట్టినవి. అందుచేత శాంతిసమయములో, ధరలు తగ్గినవెనుకకూడా, ఇదివరకుకంటె అమితముగా ఎక్కువయినపదార్థసమూహం ఉత్పత్తిఅవుతూవచ్చింది. దీనికంతటికీ అమ్మకమెక్కడిది? యూరపులో క్రొత్తగా బయలుదేరిన స్వతంత్రరాజ్యాలన్నీ టారిఫ్‌లు బాగానిర్మించడంవలన అంతర్జాతీయవ్యాపారానికి లెక్కలేనన్ని నిర్బంధాలేర్పడినవి. ఈ కారణాలన్నీ ధరలుపడిపోడానికి తోడ్పడినవి.

యుద్ధంలో మనుష్యులు లేక, తక్కువమంది మనుష్యులసహాయముతో పరిశ్రమలను నడపడానికి వీలయినక్రొత్తసాధనాలు, యంత్రాలు కనిపెట్టారు. ఈ పద్ధతి యుద్ధానంతరంకూడా అభివృద్ధిఅవుతూవచ్చి పారిశ్రామికులంతా వీలయినంత తక్కువమందికార్మికులసహాయమున ఆధునికయంత్రాలను, పద్ధతులను, ఉపయోగించి తక్కువఖర్చులో అమితమైన వస్తుసమూహమును తయారుచేసి గొప్పలాభాలు సంపాదించ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డానికి ప్రయత్నిస్తున్నారు. దీనివలన చాలామందికార్మికులకు పనిలేక ప్రతిదేశంలోనూ నిరుద్యోగులసంఖ్య పెరిగిపోతూవచ్చింది. ధనవంతులయిన పెట్టుబడిదారుల చేతుల్లోకి ధనం చేరడం, ఈధనం మామూలుగా తయారయ్యేవస్తువులకి, తినుబడిపదార్థాలకి కాక ఇంకా పెట్టుబడికి, లాభంతీయడానికి, ఉపయోగం కావడం, ఈపరిశ్రమలలో తయారయ్యేవస్తువులను కొని అనుభవించవలసినకార్మికులకు కూలితగ్గి, నిరుద్యోగులై వాటిని కొనడానికి వాళ్ల చేతుల్లో డబ్బులేకపోడం తటస్థించింది. దీనిఫలితము ధరలుపడిపోడం; పడిపోయినకొద్దీ పరిశ్రమలకి నష్టాలు రావడం; వచ్చినకొద్దీ నిరుద్యోగులు హెచ్చడం. ఇంకాధరలు పడిపోడం ఇదంతా తడిసి మోపెడై చివరకి ధరలు అతితక్కువస్థితికి పడిపోయినవి. పారిశ్రామికవస్తువుల ఉత్పత్తి తగ్గించవచ్చును. వ్యావసాయికవస్తువులఉత్పత్తి అల్లాతగ్గించడానికి అనువైంది కాదు. అందుచేత వ్యవసాయపదార్థాలధరలు మరీదారుణంగా పడిపోయాయి. ఇది-అంటే వస్తువులను కొనేసాధారణప్రజాసమూహము చేతిలోకి డబ్బు రాక ధనవంతులైన పెట్టుబడిదారులచేతుల్లోనే ఇమిడిపోవడం-ధరలు పడిపోడానికి ముఖ్యకారణం. కాబట్టి ప్రస్తుతం ప్రపంచమంతా అనుభవించే ఆర్థికక్షోభకు మూలకారణం "కాపిటలిజం", అనగా వ్యక్తులుగాని, సమూహములుకాని, సంఘశ్రేయస్సుతో సంబంధములేకుండా పారిశ్రామికయంత్రాన్ని నడపించి, స్వలాభమే ముఖ్యోద్దేశముగా పెట్టుకొని, వస్తువుల నమ్మి లాభంతీయడమే పనికాని ఆ వస్తువుల ఉపయోగం ఆలోచించక ఇల్లా ఉత్పత్తిఅయిన వస్తు సమూహముయొక్క విలువలో అధికభాగమును ధనరూపకముగా తమచేతులలో ఇముడ్చుకొని, అనంతమైన కార్మికప్రజాసమూహానికి ఈ వస్తువులని కొనడానికి కావలసిన క్రయశక్తి లేకుండాచేసే విధానములోనే ఇమిడియున్నదన్నమాట.

యుద్ధంవలన కలిగిన చిక్కులు అంతే కాదు. జర్మనీ జయముపొందినదేశాలకి నష్టపరిహారార్థం ఏటేట గొప్పమొత్తములు చెల్లించవలసియుండెనుకదా. ఇవన్నీ ఎల్లాచెల్లిస్తుంది? అసలే యుద్ధంమూలాన్ని జర్మనీపరిశ్రమలన్నీ నశించి దరిద్రస్థితిలో ఉండెను. ఈస్థితిలో ఈపరిహారపుమొత్తాలు చెల్లించుకోడానికి తన దిగుమతులను తగ్గించి, ఎగుమతిపరిశ్రమలను బాగా వృద్ధిచేసి ఈ పదార్థముల రూపకంగాకాని, వీటినమ్మి సంపాదించిన బంగారము రూపకంగాకాని చెల్లించవలసి యుండెను. ఇందుచేత జర్మనీనుండి క్రొత్తగా మార్కెట్టులలో ప్రవేశించిన ఈఎగుమతివస్తువులు బొగ్గు, ఇనుము, యంత్రాలు ఇల్లాంటివన్నీ, ఇదివరకు వీటినన్నిటినీ తయారుచేస్తున్న ఇంగ్లండు మొదలయిన దేశాల వస్తువులలో తీవ్రమైనపోటీ ప్రారంభించి ఆవస్తువుల అమ్మకమును పడగొట్టి, ధరలు పడిపోడానికి కారణమైనవి. జర్మనీనుండి వచ్చేవస్తువులు తమ పరిశ్రమలను పాడుచేయకుండా ఇతరదేశాలు టారిఫ్‌గోడలు ఇంకా ఎత్తుచేసినవి. దీనివలన ఇంకా ఎక్కువపదార్థాలు ఎగుమతిచేస్తేనే కాని పరిహారములు చెల్లించడానికి వీల్లేకపోయింది. ధరలు పడినకొద్దీ ఈసమస్య మరీ దుర్ఘటమైపోయింది. జర్మనీ ఈభారం వహించలేకపోయింది. చివరకి ఈపరిహారములను, వాటితో సంబంధించిన అంతర్జాతీయ యుద్ధఋణాలను ఆపుచేయవలసివచ్చింది. ఈరీతిగా పరిహారములు, అంతర్జాతీయయుద్ధఋణాలు ధరలు పడిపోడానికి కారణాలైనవి.

ఇవన్నీకాక ధరలు పడిపోడాని కింకోకారణం బంగారుప్రమాణము సరిగా నడవడానికి సాధ్యం కాకపోవడం. యుద్ధానంతరము అమెరికా సాహుకారయిందికదా- అమెరికా తనకురావలసిన ఋణాలు వస్తురూపకంగా తీసుకుంటే చిక్కు లేకపోను. మొదటినుండీ అమెరికా ఆర్థికస్వయంసంపూర్ణపద్ధతి నవలంబించింది. అమెరికన్ పరిశ్రమలను రక్షించుకోడానికి, విశాలమైన అమెరికన్ మార్కెట్టును నిలుపుకోడానికి, అత్యున్నతమైన 'టారిఫ్' గోడలు నిర్మించుకుంది. అందుచేత అమెరికాకు తమ అప్పులన్నిటినీ ఇతరదేశాలు బంగారంరూపకంగా చెల్లించవలసివచ్చింది. ఇదీ, యుద్ధసమయంలోచేరిన బంగారం కలిసి అమెరికాలో గొప్పబంగారపురాశి యేర్పడిపోయింది. ఫ్రాన్సు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూడా జాతీయపద్ధతుల నవలంబించి, తనుకూడా కొంత షాహుకారుస్థితిలో ఉంచడంచేతను, యుద్ధానంతరం తనదేశస్థులు ఇతరదేశాలలో- ముఖ్యంగా ఇంగ్లాండులో- డబ్బుదాచుకోడంచేతను, దానినంతా సమకూర్చి అపారమైన సువర్ణరాశి చేకూర్చుకుంది. ఈ రెండుదేశాలూ ఇల్లాగ ప్రపంచంలోని బంగారంలో అత్యంతాధిక భాగం చేర్చుకొని దానిమీద కదలకుండా కూర్చుంటే, ఇతరదేశాలలో ముఖ్యంగా ఇంగ్లాండులో ఉన్నబంగారం బొత్తిగా తక్కువై పోయింది. అందుచేత దానిమీద ఆధారపడిన కర్రెన్సీ, దానిమీద ఆధారపడిన బ్యాంకుఅప్పులు, పరిశ్రమల అభివృద్ధితోపాటు వృద్ధికావడానికి వీలు లేకపోయింది. అందుచేత డబ్బు సప్లయి తక్కువఅయి ధరలు పడిపోడం తటస్థించింది.

చివరకి, ఆర్థికమాంద్యం వచ్చినకొలదీ, పరిస్థితులు క్లిష్టమైనకొలది, చాలాదేశాలకి బంగారుప్రమాణం నిలుపడం కష్టమైపోయింది. ౧౯౩౧-వ సం. రంలో ఇంగ్లాండు బంగారుప్రమాణం వదిలేసింది. పౌండు స్వతంత్రకర్రెన్సీ అయింది- అంటే బంగారంతో ఒక నిశ్చితమైన సంబంధము లేదన్నమాట. పౌండుయొక్క విలువ స్థితిగతుల ననుసరించి ఉంటుంది

అమెరికామాత్రం బంగారుప్రమాణంమీద నిలవగలిగిందా? బంగారంతో కర్రెన్సీకి ముడిపెట్టుకు కూర్చుంటే డబ్బుసప్లయి వృద్ధిచేయడానికి వీల్లేదని గ్రహించి అమెరికాకూడా ఆసంబంధం కొలదినెలల క్రితం వదులుకుంది. డాలరుకూడా స్వతంత్రకర్రెన్సీ అయింది.

## జాతీయ ఆర్థికవిధానమువలని ఫలితములు

ఏదేశాని కాదేశము తనలాభమే చూసుకోడం, తనపరిశ్రమలను టారిఫ్నుపయోగించి రక్షించుకోడం, తనఎగుమతులు వీలయినంత హెచ్చించి దిగుమతులు తగ్గించడం, తనకర్రెన్సీని తనచిత్తంవచ్చినట్లు నడిపించి బంగారం కూడబెట్టడం వీటన్నిటివలన-అనగా జాతీయ ఆర్థికవిధానమువలన-ధర లెల్లాపడిపోయినవో చూశాముకదా. దీనిఉద్దేశము కొన్ని దేశాలు తమపరిశ్రమలఅభివృద్ధికోసం జాతీయపద్ధతుల నవలంబించడం తప్పని కాదు-పారిశ్రామికముగాఅభివృద్ధినొందనిభారతదేశము, చీనా రష్యా మొదలయినదేశాల కది తప్పక అవసరం. లేకపోతే ఈప్రజలదారిద్ర్యాన్ని నశింపజేయడానికి మార్గమే లేదు. ఈదేశాలు జాతీయవిధానము నవలంబించి, తమపరిశ్రమలను వృద్ధిచేసుకొని, వట్టివ్యవసాయంమీదనే ఆధారపడి ఉన్న అపాయకరస్థితినుండి తప్పుకొని, తమప్రజలకు మరింత ఉద్యోగము కల్పించుకొని, తమ జీవనశైలిని వృద్ధిచేసుకోవలసిఉన్నది. ఇతరదేశములతో సమానమైన ఐశ్వర్యస్థితికి రావలసిఉంది. ఈవిధానము అతివిస్తీర్ణమై, ముడిపదార్థాలఉత్పత్తికి తగినంతభూసంపద ఉండి, తనపరిశ్రమలలో చాలాభాగము తానే ఉపయోగించుకోగలిగిన అమెరికాకు కూడా కొంత అనుకూలముగా ఉంది. కాని చిన్న చిన్న యూరపియన్ రాజ్యాలకి, పారిశ్రామికముగా బాగావృద్ధినొంది కొన్నిపరిశ్రమలలో ప్రత్యేకకృషి చేసిన దేశాలకి, ఇంగ్లండువలె విదేశవ్యాపారముపై ఆధారపడిఉన్న దేశాలకి అసలే పనికిరాదు. ఈదేశాలు కొంతవరకు ఆర్థిక స్వయంసంపూర్ణత్వానికి ప్రయత్నిస్తున్నాయి.—కాని ఆప్రయత్నము మరీదారుణమైన పతనమునకే దారితీయకలదు, కాని సఫలము కానే కాజాలదు.

స్వయంసంపూర్ణత్వానికి మంచి సావకాశములు కల అమెరికామాత్రం ప్రపంచక్షోభనుండితప్పుకోగలిగిందా? అక్కడా స్థితిగతు లల్లాగే ఉన్నాయి. పరిశ్రమలు నిలిచిపోయాయి-వ్యవసాయం స్తంభించిపోయింది. ౧౯౩౦ మొదలు ౧౬౦ లక్షలమంది నిరుద్యోగులై అల్లాడుతున్నారు. ప్రభుత్వపు ఆదాయవ్యయపట్టికలో బ్రహ్మాండమైనలోటు కనిపించింది. బ్యాంకులు రోజుకొకటి బద్దలవడం ప్రారంభించినవి. ఇంక ఇతరదేశాల మాట వేరే చెప్పాలా?

ప్రపంచం నానాటికీ మరింత ఏకమై పోతున్నది. ప్రయాణసౌకర్యాలు—ఒకచోటినీ ఇంకొచో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టినీ కలిపి దగ్గరచేసే టెలిగ్రాఫు, టెలిఫోను, రేడియో, మొదలయినవి, వర్తకం ఇవన్నీ ఈ విశాలప్రపంచాన్ని ఇందులోని వివిధజాతులని మరింతదగ్గర చేసేశాయి. ఈ ప్రపంచంలో "నన్ను ముట్టుకోకు నామాలకాకి" అని సంపూర్ణస్వతంత్రజీవనం ఏజాతీచేయలేదు. ఒకచోటి కష్టనిష్ఠూరాలు ఇంకోచోటికి ప్రాకి అలుముకోక మానవు. ఇంతచిక్కులు పడిపోయికలిసి పోయిన ప్రపంచంలో ఏదేశాని కాదేశం తనంతట తాను పోతానంటే ఎల్లాకుదురుతుంది?

అంతర్జాతీయసహకారం లేనిదే ఈ క్షోభలోనుండి దాటడానికి, ధరలు లేవదీయడానికి, పరిశ్రమాయంత్రాన్ని తిరిగి నడిపించడానికి, వీల్లేదని అంతా ఒప్పుకున్నారు. కాని ఈదేశాల సంబంధాలు ఎంత క్లిష్టమైపోయాయో, అంత పరస్పరవైమనస్యము, స్వార్థపరత్వం, రాజకీయ ద్వేషము, పరస్పరానుమానం, ప్రబలిఉన్నాయి. అల్లాంటప్పుడు ఈ దేశాలన్నీ కలిసి రావడం ఎల్లాజరుగుతుంది? అనేకవిషయాలలో దేశాల స్వార్థమునకు సంఘట్టనము కలగక మానదు. వాటిలో కొన్నిసందర్భాల నష్టపడడానికి సిద్ధంగా ఉండాలి. ప్రతిదేశంలోనూ ప్రభుత్వం ధనవంతులై పలుకుబడిగల పరిశ్రమనాయకులచేతిక్రిందఉంది. ఈప్రభుత్వాలనడుమ సహకార మెల్లాఉంటుంది? ఎక్కడికక్కడే బలవంతులయిన పారిశ్రామికసంఘాలు అడ్డంవస్తాయి. అందుచేత ఈక్షోభ సంభవించినతరువాత జాతీయఆర్థిక విజృంభణము మరీ హెచ్చిపెచ్చుపెరిగిపోతోంది. తరతరాలనుండి స్వేచ్ఛావ్యాపారపద్ధతినే పట్టుకొని ప్రాకులాడుతున్న ఇంగ్లండుకూడా రక్షణవిధానము నవలంబించి టారిఫ్ ఏర్పరచవలసివచ్చింది. ఇటలీ ఇదివరకే "ఫాసిజం" నవలంబించిది. అంతర్జాతీయముగా విఫలమైన "కాపిటలిజం"ను, దేశీయస్థితులను మార్చి దేశంలోనే పరిశ్రమలకు అవసరమైనఅమ్మకం కల్పించి, అసంతృప్తులై తిరగబడబోయే కార్మికులను బలప్రయోగంద్వారా అణగద్రొక్కి, రక్షించాలని చూస్తున్నారు. ఇదే "ఫాసిజం" యొక్క ప్రధానప్రయత్నము. జర్మనీకూడా 'నాజీ' ఉద్యమమనే పేరుతో ఈ "ఫాసిజం"నే అవలంబించినది. జర్మనీయొక్క ఆర్థికనిర్మాణమును పూర్తిగా జాతీయపద్ధతులపై నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతాయనడం నిస్సందేహం. అప్పుడే హిట్లరు వ్యవసాయదారులకు సహాయం చేస్తున్నాడు. పరిశ్రమలకు అప్పుడే ఏర్పాటుచేస్తున్నాడు. తమమార్కెట్టులను విస్తరింపచేయడానికి ఆస్ట్రియాపైన, ఆసియాలో ఇతరభాగములపైన కన్నువేస్తున్నాడు ఈ జాతీయవిధానాలన్నీ డీకొని తిరిగి ఏమహాయుద్ధం రానున్నదో, ప్రపంచానికే ఉపద్రవం కలుగనున్నదో, ఎవరెరుగుదురు?

## అంతర్జాతీయప్రయత్నములు

కాని, అంతర్జాతీయ ప్రయత్నాలన్నీ విఫలమైనప్పుడు జాతీయప్రయత్నాలుచేయక చేసే దేముంది? ఇంతవరకు జరిగిన అంతర్జాతీయప్రయత్నాలలో లాసానీసమావేశము, ఒట్టావాసమావేశము, ప్రపంచఆర్థికసమావేశము ముఖ్యమైనవి.

లాసానీసమావేశము జర్మనీ ఈయవలసిననష్టపరిహారములసమస్యను కష్టంమీద తేల్చి జయప్రదమైంది. కాని ఇది పూర్తిగా తేలడానికి మిగిలినదేశాలు అమెరికాకీయవలసిన అంతర్జాతీయయుద్ధఋణాలయొక్క సమస్య తేలవలసియుండెను. ఈసమస్యను ప్రపంచఆర్థికసమావేశము తేల్చలేకపోడంచేత లాసానీవిజయమువలని ఫలితమేమీలేకపోయినది.

బ్రిటిషుసామ్రాజ్యమునంతటిని ఒకఆర్థికచక్రముగా ఏర్పరచవలెనని, బ్రిటిషువస్తువులకు సామ్రాజ్యమునందలి ఇతరదేశాలు అభిమానముచూపి వాటిపై తక్కువపన్నులు విధించాలని, అల్లాగే సామ్రాజ్యములోని ఇతరభాగముల ఎగుమతులకు ఇంగ్లండు అభిమానము చూపుతుందని, ఇట్టిపద్ధతిని ఏర్పాటుచేసి సామ్రాజ్యముద్వారా తమచిక్కులనుండి బయటపడాలని బ్రిటిషువారు చాలాకాలంనించి ఊహిస్తున్నారు. ఈ "ఇంపీరియల్ ప్రిఫరెన్సు" పద్ధతి మనదేశంలో ఉక్కు, వస్త్రములు- వీనిసందర్భమున ప్రవేశపెట్టారు. ఇదికాక క్రిందటిసంవత్సరం ఒట్టావాలో ఒకసామ్రాజ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమావేశము జరిపి ఒడంబడికలు తయారుచేశారు. ఈ ఒడంబడికలద్వారా డొమినియన్లనుండి కొన్ని ప్రత్యేక సావకాశాలు తీయడానికి బ్రిటిషువారు ప్రయత్నించారు కాని, నిజానికి డొమినియన్లే బ్రిటనునుండి ఎక్కువసావకాశాలు సంపాదించినవి. ఇటీవల డొమినియన్లు ఒట్టావా ఒడంబడికలయొక్క తత్త్వమును సరిగా అమలులో ఉంచడం లేదని, అందువలన ఇంగ్లండునకు చాలా నష్టముకలుగుతోందని బ్రిటిషుప్రముఖులు గోల పెడుతున్నారు. భారతదేశంతో చేసుకున్న ఒడంబడిక వలనమాత్రం ఇంగ్లండుకి లాభము, మనదేశానికి నష్టము కలుగుతుందని భారతీయవ్యవహారజ్ఞులు, అర్థశాస్త్రవేత్తలు అనేకులు ఘోషించారు. కాని రాజకీయ స్వాతంత్ర్యం లేనిదేశం కావడంచేత, చెప్పినదల్లా వినే శాసనసభను చేతులో పెట్టుకొని భారతీయప్రభుత్వము ఒట్టావా ఒడంబడికను వీలయినంతత్వరలో అమలులో పెట్టింది. కాని ఈ ఒడంబడికవలన ఏదేశానికీ సంతృప్తి కలగలేదు. ఏదేశముయొక్క పరిస్థితులలోనూ తగినంత మార్పు కలగలేదు. ఇతర అంతర్జాతీయపు ఒడంబడికలకుమాత్రం ఇది అడ్డంవస్తుంటుంది.

ఇంక ప్రపంచ ఆర్థికసమావేశముసంగతి. ఈ సభ ఎప్పుడు సమావేశ మవుతుందా, ఎప్పుడు ఈ అల్లకల్లోలములోనుంచి దారిమాపిస్తుందా అని ప్రపంచమంతా ఎదురుచూసింది. అమెరికాఅధ్యక్షుడగు రూజువెల్టు మాక్డొనాల్డు, హెరియో మొదలయినవారితో సంప్రతించి బ్రహ్మాండమైన ప్రకటనలు చేశాడు. ఈ సభ ప్రపంచమంతటా ధరలు లేవదీయడానికి, టారిఫ్‌లు తగ్గించడానికి, ప్రభుత్వాలన్నీ ఏకీభవించి ప్రజలచేతుల్లోని క్రయశక్తిని, డబ్బును, ఎక్కువచేయడంకోసం ప్రజాహితనిర్మాణములమీద (రోడ్లు, వంతెనలు, ఇండ్లు మొదలగువానిమీద) గొప్పగొప్ప మొత్తములు ఖర్చుపెట్టడం సంగతి ఆలోచించడానికి, ఇల్లాంటివన్నీ చేయడానికి సమావేశ మవుతుందని ప్రకటించారు. చివరకి ఎల్లాగయితేనేం మొన్న వేసవిలో సభ లండనులో సమావేశమయింది. కాని మొదటినుంచీ ఇందులో ఒకరికొకరికి పొత్తుకుదరలేదు. టారిఫ్‌లు తగ్గించేముందు డాలరు-పౌండు- ఫ్రాంకులమధ్యగల మారకమును నిర్ణయించి స్థిరముచేస్తేనేకాని వీలులేదని ఫ్రాన్సు మొదలయిన బంగారుప్రమాణము నవలంబించినదేశాలు పట్టుపట్టినవి. మారకము నిర్ధారణచేస్తే తాను తనదేశంలో డాలరుయొక్కవిలువ తగ్గించి ధరలను హెచ్చించడానికి చేసే ప్రయత్నమంతా చెడిపోతుందని అందుకు ప్రెసిడెంటు రూజవెల్టు అంగీకరించనేలేదు. నిర్మాణములమీద డబ్బు ఖర్చుపెట్టడానికి బ్రిటిషుప్రభుత్వం ఒప్పుకోలేదు. అంతర్జాతీయయుద్ధఋణాలసంగతి ఎత్తడానికే వీల్లేకపోయింది. ఈరీతిగా ప్రధానమైన ఒక్కసమస్యమీదా ప్రపంచఆర్థికమహాసభ అంగీకారానికి రాలేకపోయింది. ఏవోచిన్నవిషయాలమీద కొన్ని అంగీకారాలయిన పిదప "ఇంతటితో సభను ప్రస్తుతం ఆపుచేశాం" అన్నారు సమాప్తమని అనలేక.

## అమెరికా సాహసప్రయత్నము

అంతర్జాతీయ ప్రయత్నాలవలన లాభం లేదని అందరికీ నాటింది. మొదటినుండి స్వతంత్రపద్ధతి నవలంబించిన అమెరికాలో ప్రెసిడెంటు రూజువెల్టు దేశాన్ని ఈ ఆర్థికక్షోభనుండి లేవనెత్తడానికి అతిసాహసప్రయత్నమొకటి చేస్తున్నాడు. అమెరికన్ ప్రజలకి పూర్వపుఅధ్యక్షుడయిన హూవరుచేసిన మెత్తమెత్తని అనుకులమారి ప్రయత్నాలవలన సంతృప్తి కలగలేదు. బలీయమైనప్రభుత్వము ప్రస్తుత దుఃస్థితినుండి దేశాన్ని లేవనెత్తడానికి బ్రహ్మాండమైన జాతీయప్రయత్నము కావాలని తోచింది. అందుచేత హూవరును త్రోసేసి రూజువెల్టుని ఎన్నుకొన్నారు. తాను పదవిలో ప్రవేశించినప్పటినుంచి రూజువెల్టు నిర్భయంగా, సాహసంగా, అధికారం ఉపయోగించి వ్యాపారాన్ని పరిశ్రమలని సరిచేయడం మొదలెట్టాడు. గగ్గోలుగా ఉన్న బ్యాంకులస్థితి చూసి వెంటనే దేశంలోని అన్ని బ్యాంకులను ౧౦ రోజులపాటు ఆపుచేశాడు. దానితో ప్రజలకి కొంతవిశ్వాసం కలిగింది. ప్రజాసానుభూతిని ఆధారం చేసుకొని, ప్రెసిడెంటు కాంగ్రెస్ (శాసనసభ) నుండి ఇదివరకెన్నడూ అమెరికాచరిత్రలో కనివిని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెరగని అధికారాలు సంపాదించాడు. కాంగ్రెస్ "ఫారం ఇన్‌ఫ్లేషన్ బిల్లు" (Farm Inflation Bill) అని ఒకటిన్నీ, "నేషనల్ ఇండస్ట్రియల్ రికవరీఆక్టు" (National Industrial Recovery Act) జాతీయ పారిశ్రామిక పునరుద్ధారణచట్టము) అని ఒకటిన్నీ రెండు చట్టాలు తయారుచేసింది. మొదటిదాన్ననుసరించి ప్రెసిడెంటుకి అనేకవిధాల దేశంలోని డబ్బుసప్లయి వృద్ధిచేయడానికి అధికారం కలిగింది. రెండోదాన్ననుసరించి దేశంలోని పరిశ్రమలను తమచిత్తం వచ్చినట్లు స్వలాభంకోసం ప్రవర్తించనీయక దేశక్షేమం కోసం నడవడానికి, ప్రతిపరిశ్రమకి ఒక చట్టం ఏర్పరిచి దానినను సరించి వస్తువులధరలు నిర్ణయించడం కార్మికుల కిచ్చేకూలి ఎక్కువచేయడం, వాళ్లు పనిచేయవలసిన గంటలసంఖ్య తగ్గించడం, ఇదివరకుకంటె ఎక్కువ మంది కార్మికులను పనిలోనికి తీసుకొనేలాగ నిర్ణయించడం- వీటన్నిటికీ అధికారాలు ప్రెసిడెంటు పొందాడు. దీనిద్వారా పారిశ్రామిక ప్రపంచంలోని అన్నిభాగాలను క్రమసంబంధంలోనికి తీసుకొనివచ్చి ప్రస్తుతమున్న ఆర్థికమాంద్యాన్ని నాశనంచేయడమేకాక, శాశ్వతంగా దేశక్షేమానుసారం నడిచేలాగ పారిశ్రామిక నిర్మాణాన్ని ఒకప్లాను ననుసరించి నడపాలని ఉద్దేశము. ధరలు లేవాలి- కాని వస్తువుల కొండేగిరాకి పడిపోయేలాగ కాదు. కార్మికులకూలి, ఉద్యోగము, వృద్ధి పొందాలి – కాని తద్ద్వారా పరిశ్రమలు కిట్టక నశించి పోకూడదు. వస్తువులఉత్పత్తి ఎక్కువకావాలి- కాని అమ్మకం లేక మార్కెట్టు స్తంభించిపోకూడదు. ఉత్పత్తికి, ధరలకు అనుగుణంగా దేశంలోని డబ్బుసప్లయి వృద్ధిపొందాలి.

ఇది సామాన్యకార్యమా? అమెరికన్ ప్రెసిడెంటెంతటివాడికయినా ఒక బ్రహ్మాండమైన ఆర్థికనిర్మాణాన్ని తిరగతోడి కొత్త "ప్లాను" ప్రకారం తిరిగి నిర్మించాలంటే మాటలా? రష్యాలో జయప్రదంగా జరిగిందంటే, రష్యా తనసాంఘికనిర్మాణమే మార్చుకుంది. అక్కడ పరిశ్రమలు వ్యక్తులచేతుల్లోనూ, కంపెనీలచేతుల్లోనూ లేవు. అన్నీ సంఘమంతటి చేతులోను ఉన్నాయి. కాని ఇక్కడ కాపిటలిస్టుపద్ధతిక్రింద అల్లాకాదుగా? ప్రతిపరిశ్రమకీ ఒకచట్టం ఏర్పరచాలి; పరిశ్రమలమధ్యన ఉన్నక్లిష్టసంబంధాలకి, వాటిప్రత్యేక పరిస్థితులకి అనుకూలములైన నియమాలేర్పరచాలి; బలవంతులయిన పరిశ్రమనాయకుల నెదుర్కొనాలి; ఇంకొకవైపున బలవంతములైన కార్మికసంఘాల నెదుర్కొనాలి. ఎటువంటివాడికయినా ఇది దుర్ఘట కార్యము. ఇదేమినెగ్గకుండా అని అనేకులు పెదవి విరిచారు.

కాని, మరినెగ్గకపోతే ఎల్లాగ? ప్రెసిడెంటు రూజవెల్టు జంకలేదు; ఆలోచిస్తూ కూర్చోలేదు. మేధావంతులైనకొందరిని సలహాసంఘంగా ఏర్పరుచుకున్నాడు. ఈపునరుద్ధరణకార్యక్రమానికి ప్రత్యేకప్రతిభావంతులైన మనుష్యులను ఒక్కొక్కభాగానికి నాయకులుగా ఏర్పరిచాడు. జనరల్ జాన్సన్ అనే అతన్ని పునరుద్ధరణనాయకుడుగా నియమించాడు. ప్రతిపరిశ్రమకీ ఒక్కొక్కచట్టం ఏర్పరిచేసరికి కొంత కాలంపడుతుందికనుక, అన్నిటినీ కలిపి ఒక "దుప్పటీ చట్టం" (Blanket Code) నిర్మించాడు. ఈదుప్పటీని పారిశ్రామికప్రపంచమంతటికీ కప్పాడు. దీనిప్రకారం అన్నిపరిశ్రమలలోను వారానికి దాదాపు ౩౫ గంటలకంటె ఎక్కువపని చేయకూడదని, ఈపనికి గంటకి అతిమపక్షం దాదాపు ఒకరూపాయి అయినా కూలి యివ్వాలని, (అమెరికాలో కూలి అసలు ఎప్పుడూ చాలాఎక్కువే-ఆదేశంలో జీవితవ్యయంకూడా చాలా ఎక్కువ) ఈచట్టాన్ని అంగీకరించిన ఇతరపరిశ్రమలను ప్రోత్సహించాలని, వస్తువులధరలను క్రొత్తపరిస్థితుల ప్రకారం అవసరమైనకంటె హెచ్చించకూడదని, అన్యాయలాభాలు తీయకూడదని-ఇల్లాంటివన్నీ నిర్ణయంచేశాడు. ఈచట్టం ముందుగా సెప్టెంబరు ౧-వ తేది నుండి అమలులోనికి వచ్చింది.

ఇంక ఆతరువాత ఒక్కొక్కపరిశ్రమకే ప్రత్యేకచట్టాలేర్పరిచారు. ఇవి ఏర్పరచడం చాలాకష్టమయింది. ముందు బొగ్గు, ఉక్కు, మోటారు, పెట్రోలు మొదలయినపరిశ్రమలనాయకులు తీవ్రంగా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



కార్తికము

(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ ఏర్పాటులను ప్రతిఘటించారు. కార్మికసంఘాలు కూడా తీవ్రమైననిరోధము చూపినవి. కార్మికులు తమ సంఘములద్వారా అన్నిసంగతులను నిర్ణయంచేసుకోడానికి చాలామంది పరిశ్రమ నాయకులు ఒప్పుకోలేదు. కార్మికులకి కాపిటలిస్టులకి తీవ్రమైన భేదాభిప్రాయాలేర్పడినవి. వీటిని తీర్పుచేయడానికి ఒక సమన్వయ సంఘం ఏర్పరిచారు. అంగీకరించని చోట్ల ప్రెసిడెంటే తనకుతోచినచట్టాన్ని బలవంతంగా అమలులో పెడతాడని ఉద్దండుడు జనరల్ జాన్సన్ భయపెడుతూ వచ్చాడు. చివరకి ఎల్లాగయితే నేమి ఈచట్టాలన్నీ ఏర్పడి ప్రెసిడెంటు అన్నింటికి సంతకము చేశాడు. అసంభవ మనుకొన్నది జరిగింది. ధరలు చప్పుచప్పున లేవడం ప్రారంభించాయి.

అయితే, ఊరికే ధరలు ముందుగాలేచి కూర్చుని వస్తువులు కొనడానికి నిజంగా ప్రజలచేతుల్లో డబ్బు లేకపోతే ఇదంతా విరిగిపడి ఇదివరకుకంటె అధోగతి పా లయిపోతుంది. అందుకని పై"పునరుద్ధారణచట్టము" ననుసరించే 3,300,000,000 ల డాలర్లు ఖర్చు పెట్టి ప్రజాహితనిర్మాణాలు — రోడ్లు, ఇండ్లు, వంతెనలు మొదలయినవి —నిర్మించేకార్యక్రమం ప్రారంభిస్తున్నారు. వీటిద్వారా ప్రజాసామాన్యంచేతిలోకి డబ్బొస్తుంది; నిరుద్యోగమూ తగ్గుతుంది; దేశత్వేమాని కవసరమైన నిర్మాణాలూ తయారవుతాయి. అన్నిదేశాలూ అంగీకరించి అమలులోపెట్టలేని కార్యక్రమాన్నిరూజువెల్టు ఆరంభించాడు. వ్యవసాయ సామగ్రిని రాజ్యం తరఫున కొని వ్యవసాయదారులకి సహాయము చేయడానికి ఏర్పాటుచేశాడు. ఇంక దీనికి అవసరమైనట్లు బ్యాంకులు పరిశ్రమలకి అప్పులిచ్చేటట్లు దేశంలోని డబ్బుసప్లయి వృద్ధిఅయేటట్లు చూడవలసి ఉంది.

ఇదంతా వట్టిప్రభుత్వాధికారంద్వారానే జరగలేదు. రూజువెల్టు చాలాతెలివితేటలుగల రాజ్యతంత్రజ్ఞుడు. తనప్రయత్నాలకి సహాయం చేయవలసిం దని ప్రజలందరినీ కోరుతూ రేడియోద్వారా అనేక ఉపన్యాసా లిచ్చాడు. జాతీయోద్యమ మొకటి ప్రారంభించి, అమితమైన ప్రచారం జరిగించి, దీన్ని చాలా ప్రజారంజకం చేశాడు. ఈఉద్యమాన్ని అమెరికాలో "నీరా" (N. I. R. A.) అంటారు. దీనికి ప్రత్యేక చిహ్నంగా ఒకనీలిగ్రద్దబొమ్మ, దానిక్రింద "మా విధి మేము నెరవేరుస్తున్నాం" అన్నమాటలూ కలచిహ్నం బయలుదేరింది. "నీరా"కు అంగీకరించనివాళ్లని ప్రజలంతా బహిష్కరించి ఎగతాళిచేస్తారన్న భయంకూడా అధ్యక్షుని ప్రయత్నాలకు తోడ్పడింది. వస్తువులధరలన్నీ లేస్తాయికనుక 'ఇప్పుడే కొనవలసినది' అని కూడా అపరిమితమైన ప్రచారం చేశారు.

రూజువెల్టు నాయకత్వముక్రింద అమెరికాలో జరుగుతున్న ప్రయత్నము రోజురోజుకీ మారిపోతూ అనేకరకాల వృద్ధిపొందుతోంది. డబ్బుసప్లయిని వృద్ధి చేయడానికి డాలరుయొక్క బంగారపువిలువను తగ్గించి బంగారాన్ని కొనడం, అమ్మడంద్వారా డాలరు విలువను ఎప్పటికప్పుడు నిర్ణయించేపద్ధతిని అవలంబించారు. దీనివలన డాలరుయొక్క మారకపువిలువ తగ్గి తద్ద్వారా అమెరికాదేశపు ఎగుమతులకు ప్రోత్సాహకరంగా ఉంటోంది. కాని ఈపద్ధతి సరియైనదికాదని, దీనివలన డబ్బుసప్లయి వృద్ధిచేసి ధరలను లేవదీయడం సాధ్యము కాదని, అనేకులు విమర్శిస్తున్నారు. ఇదికాక ఈనడుమ అమెరికాలో జరిగిన క్రొత్తవిశేషాలలో ముఖ్యమైనది రష్యాతో స్నేహము. ఇన్నాళ్లూ రష్యాకి, అమెరికాకి విరోధం లేకపోయినా, "మాటలు లేవు." కొన్నాళ్లక్రింపట రూజువెల్టుకి రష్యాప్రతినిధి అయిన లిటివినాఫ్‌కి జరిగినసంభాషణల ఫలితంగా రష్యాతో స్నేహ మేర్పడింది. తద్ద్వారా అమెరికాదేశపు ఎగుమతులను రష్యాలో అమ్ముకోడానికి చాలా అవకాశాలున్నాయని, అమెరికావర్తకము వృద్ధిఅవుతుం దని ఆశిస్తున్నారు. ఇంకొకవిశేషము, ఇప్పటికి గత సంవత్సరములనుండి అమలులోఉన్న మద్యపాననిషేధము తిరగలోడబడినది. అమెరికాప్రజలంతా విచ్చలవిడిగా త్రాగడానికి ఉవ్విళ్లూరుతున్నారు. మద్యపానంద్వారా ప్రభుత్వానికి మంచిఆదాయముకూడా వస్తుంది.

ఈప్రయత్నమువలన కలుగుతా యని ఆశించిన ఫలితాలన్నీ కలగడంలేదు. ధరలు కొంతవరకు లేచి


CC-0 Jangamwadi Math Collection. Digitized by eGangotri

తిరిగి కొద్దిగా పడినవి. కార్మికులకూలి ఎక్కువయినా వస్తువులధరలుకూడా ఎక్కువకావడంచేత అనుకున్నంతగా కార్మికుల క్రయశక్తి వృద్ధికావడంలేదు. దీనికి ప్రధానసాధనమైన నిర్మాణకార్యక్రమము త్వరగా ఆరంభించడానికి వీల్లేకపోయింది. అదయినా చాలా తక్కువ ధనముతో ప్రారంభమై నెమ్మదిగా నడుస్తోంది. దాదాపు ౮౦ లక్షలమంది నిరుద్యోగులకు పని దొరుకుతుం దనుకున్నది ౪౦ లక్షలమందికే దొరికింది. కూలి నూటికి ౬ వంతులు, ధరలు నూటికి ౮౯ వంతులు లేచినది. కార్మికుల క్రయశక్తి నూటికి ౮ వంతులు లేచినవి. దీనంతటిలోనూ అభివృద్ధికనిపిస్తున్నా ఆర్థిక క్షోభ నశించేసూచనలు కనపడడం లేదు.

ముందర 'నీరా'కు అన్నితరగతుల ప్రజలూ బ్రహ్మాండమైన ఉత్సాహంతో స్వాగతం చెప్పారు. ఇప్పు డావేడి కొంత చల్లబడింది. మొదట కొన్నాళ్ల వరకు కార్మికులసమ్మెలు చెలరేగినవి. కాని ఈ ఉద్యమముద్వారా కార్మికసంఘములకు బలము చేకూరడం మూలాన్ని ఆఅశాంతి తగ్గిపోయింది. ఆతరువాత బలవంతులైన పరిశ్రమనాయకులు—ఫోర్డులాంటివాళ్లు—అడ్డంవచ్చారు. ఆ ఆటంకమూ నిలువలేదు కాని, కాపిటలిస్టులంతా క్రమంగా ఈఉద్యమమునకు ప్రతికూల భావము వహించి విమర్శిస్తున్నారన్న సంగతి స్పష్టమవుతోంది. వ్యావసాయికవస్తువులధరలు పారిశ్రామిక వస్తువులధరలతో సమానంగా లేవక, వ్యవసాయదారులలో అల్లకల్లోలము, అశాంతి బయలుదేరి వాళ్లంతా ప్రతిఘటించడం ప్రారంభించారు. ఆఅశాంతి ఇంకా తగ్గలేదు. మొదట రూజువెల్టునకు ప్రధానసలహాదారులుగా ఉన్న అర్థశాస్త్రజ్ఞులు కొందరు రాజీనామా లిచ్చిపోయారు. క్రమక్రమంగా ప్రజాభిప్రాయము 'నీరా'కు వ్యతిరేకభావము వహించేలాగున్నది. కాని, రూజువెల్టులాంటి రాజ్యతంత్రజ్ఞుడు ఎప్పటి కేది అవసరమో చూసుకొని, సరియైనమార్పులతో ఈపునరుద్ధారణోద్యమమును నడపలేకపోతాడా?

ఈక్లిష్టపరిస్థితులలో, ఇన్ని వ్యతిరేకశక్తుల నెదుర్కొని ఇదివరకు ఎన్నడూలేని క్రొత్త ప్రయత్నం చేసేటప్పుడు, ఏది ఎల్లా పరిణమిస్తుందో ఎవరు చెప్పగలరు?

అన్నింటికంటె ముఖ్యమైన సమస్య:—కాపిటలిజము యొక్క స్వభావములోనే ఇమిడియున్న లోపాన్ని, కొందరిచేతుల్లో డబ్బులో చాలాభాగం చిక్కుకొని అపారమైన ప్రజాసమూహం చేతులో డబ్బు లేక దినదినమూ ఎక్కువగా తయారయ్యేవస్తువులకి అమ్మకం లేకపోయే లోపాన్ని, ఈ జాతీయోద్ధరణ ప్రయత్నాలు శాశ్వతంగా తెమల్చలేవే? ఒకసారి ఈఆర్థికనిర్మాణము లేచినా తిరిగి ఇంకోసారి ఇంతకంటె అర్థాన్నంగా కూలి నశించిపోతుందేమో!

ఈ సమస్యలసంగతి ఎలాఉన్నా ప్రస్తుతం మాత్రం అమెరికా ఆర్థికక్షోభలోనుండి బ్రహ్మాండ ప్రయత్నాలద్వారా బయటపడడానికి ప్రయత్నిస్తోంది. అమెరికాగెలిచిందా, మనమూ ఆపద్ధతినే అవలంబిద్దాం అని మిగిలినదేశాలు నోరుతెరుచుకు కనిపెట్టుకు చూస్తున్నాయి. అమెరికాయే ఓడిపోతే, ఇంకఅన్ని దేశాలలోనూ రష్యాలోలాగ కమ్యూనిజమో, జర్మనీ ఇటలీలలోలాగ ఫాసిజమో ఏర్పడితీరాలి.

## మనగతి ఏమిటి?

అంతర్జాతీయప్రయత్నాలు మూలబడి ప్రతి దేశమూ తనయిల్లు చక్కబెట్టుకోడానికి, తన ఆర్థిక జీవనాన్ని లేవనెత్తుకోడానికి, జాతీయపద్ధతుల ననుసరించి ప్రయత్నిస్తున్నాయికదా. ప్రత్యేకవ్యక్తిలాభము, అంతర్జాతీయవ్యాపారము మూలబడి, దేశక్షేమము, దేశీయార్థిక స్వాతంత్ర్యము, ముందునకు వస్తున్నాయి. ప్రస్తుతపరిస్థితులలో భారతదేశముకూడా తనయింటిని తాను ముందు చక్కబెట్టుకొని తరువాత మిగిలినసంగతు లాలోచించవలసినరోజు లివి. అసలు మనదేశానికి ఆర్థిక స్వాతంత్ర్యానికి సావకాశా లున్నాయి. ఈదేశంలోనే మనపరిశ్రమలు తయారుచేసేవస్తువు లమ్ముకోడానికి తగినంతవిస్తారం మార్కెట్టు, ౩౫ కోట్లప్రజాసమూహము ఉన్నాయి. మనముడిపదార్థాలు ఇక్కడనే ఖర్చయ్యేలాగ పరిశ్రమలు స్థాపించుకోడానికి సావకాశా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లున్నాయి. ఆర్థికంగా హీనస్థితిలోఉన్న ఈదేశాన్ని ఒకసక్రమమైన "ప్లాను" ననుసరించి సర్వవిధాలా ఇతర దేశాలస్థితిగతు లెల్లా ఉన్నా సౌభాగ్యవంతము చేయ డానికి వీలున్నది. మనవిదేశవ్యాపారము నూటికి ౫ వంతులు; దేశంలోనే జరిగే వ్యాపారం నూటికి ౯౫ వంతులు దేశీయఆర్థికస్వాతంత్ర్యము మనకి అవసరము, అనుకూలము.

కాని మనదౌర్భాగ్యవశాత్తూ జాతీయోద్ధరణా నికి పాటుపడే జాతీయప్రభుత్వం మనకి లేదు. అన్ని దేశాలూ తమకరెన్సీలను అంతర్జాతీయశృంఖలలనుండి వదుల్చుకొని వాటిద్వారా ధరలు లేవదీయడానికి ప్రయత్నిస్తుంటే మనకరెన్సీమాత్రం పౌండుకి కట్టగట్టి ఉంది. వ్యవసాయదారులు ఋణగ్రస్తులై ఫకీర్లయి పోతుంటే వాళ్లకిచేసేసహాయమే లేదు సరికదా, భూమి పన్నయినా తగ్గించక హెచ్చిస్తున్నారు. నిరుద్యోగం తగ్గించడానికి ప్రత్యేకప్రయత్నం లేదని వేరేచెప్ప నక్కరలేదు. మన ఆర్థికజీవనమంతా బ్రిటిషువారిఆర్థిక లాభంకోసం ఉపయోగపడుతున్నదని అందరికీ తెలిసి నదే. ఈబానిసదేశంలో జాతీయార్థికాభివృద్ధికి ఏ మాత్రముప్రయత్నమైనా జరుగుతుందని ఆశించడానికి వీల్లేదు.

ఇంక మన కేమయినా ఆశఉందా? బ్రిటిషు సామ్రాజ్యమునంతా ఆర్థికంగా ఏకీభవింపజేసి ఒక్క కరెన్సీ స్థాపించి, ధరలు లేవదీయాలని ఒకసూచన ఉంది. దీని ననుసరించి ఏమయినా జరిగితే, దానితో పాటు మనకికూడా కొంతవిముక్తి రావచ్చు. అమెరికా ప్రయత్నమువంటివి సెగ్గి ప్రపంచపరిస్థితులు చక్క బడితే కొంతసహాయం కలుగవచ్చును. అంతకంటె ఎక్కువగా ప్రస్తుతంలో ఆశించడానికి వీల్లేదు.

దేశంలో ప్రజలతరఫున మంచిజాతీయఆర్థికో ద్యమం బయలుదేరి ఆర్థికస్వాతంత్ర్యంకోసం ప్రజలు తీవ్రసంకల్పంతో పనిచేసి స్వదేశీ, ఖద్దరు మొదలయిన వానిని అవలంబిస్తే మనపరిశ్రమలలో కొంతవృద్ధి కలుగ వచ్చును. వ్యవసాయదారుల ఋణభారాలను పరస్పరం ఒడంబడికలద్వారా తగ్గించడానికికూడా ప్రయత్నించ వచ్చును. మన పరిశ్రమలపై జాతీయోద్యమంయొక్క ఒత్తిడిని ఉపయోగించి దేశములోని ప్రత్తి మొదలయిన ముడిపదార్థాలని ఇంకా ఎక్కువగా ఉపయోగించే లాగ, జాతీయభావంతో తమవస్తువులధరలను తగ్గించే లాగ చూడవచ్చును. కాని, జాతీయభావపూరితమైన ప్రభుత్వముయొక్క సహాయము లేనిదే అది చాలా కష్టము. అటువంటిసావకాశాలు చాలాతక్కువ. ఆర్థిక ముగా దేశాన్ని అభివృద్ధిచేయడానికి, ఆర్థికస్వాతం త్ర్యం సంపాదించడానికి అవసరమైన అన్నిప్రయ త్నాలూ చేసేబాధ్యత ప్రజానాయకులమీద, ప్రజల మీద ఉన్నదన్నసంగతి మాత్రము నిశ్చయము.

---


# ప్రార్థన గీతావళి

సబర్మతీ ఆశ్రమమునందు నిత్యపారాయణమునకు మహాత్ముడు అనుమోదించిన ప్రార్థనగీతములు తెలుగు తాత్పర్యముతోసహా ఇందు గలవు. ఆధ్యాత్మికసారమయిన ఈ గీతములను ప్రతివారు నిత్యము పారాయణము చేయుట శ్రేయోజ్ఞానదాయకము. కొలది ప్రతులే కలవు.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నాకన్నడిగ చెల్లెలు

మున్నంగి...శర్మ

## జీవాజీబాయి

( బెంగళూరు )

వయసు 26; తెగ. మాధ్వబ్రాహ్మణ్యము; కాఁపురము బెంగళూరు సుల్తాన్ పేట. తలిదండ్రులకొక్కతె బిడ్డ. పుట్టినిల్లు, మెట్టినిల్లు రెండు దీపకాఁపురములు. నెలవఁ బాలికకరూపికలఁ జీతముఁ దెచ్చికొను చిన్నవాఁడు తమకులమువాఁడు దొరకినాఁడు. పట్టుపట్టుమని పప్పన్నముబెట్టి కన్నవారు పేదపోడిమితో కన్యాదానము చేసినారు. జీవాజీబాయి కాఁపురమునకుఁ బోయినది. ఏడాది తిరుగఁగానే వ్రేకటి వ్రేకటి యని పురుషుఁడును పుట్టింటివారును ముచ్చటపడినారు.

తొలికాన్పుపురిటాలుగ నుండుతఱి జీవాజీపెనిమిటిని పిట్టపిడుగునఁ గాలము కబళించినది. పురిటి మంచముమీఁదనే ముత్తయిదువతనముతన్ను విడనాడినది. నిసుఁగును జూచి మురియనా? నెత్తినీడ తొలఁగినందులకు వగవనా? కాఁపురము మొదటిమజిలీదాఁటకమున్న



కుర్చీలమీఁద తెల్లచీరతో నున్నయామె జీవాజీబాయి. ఆమె ఎడమప్రక్కనున్నయామె ఈ మేజోళ్ల పనికిఁ దోడ్పడునెచ్చెలి.

క్రిందఁగూర్చున్న పురుషుఁడు జీవాజీబాయితండ్రి; ఆప్రక్కనున్నపిల్ల ఆమెబిడ్డ. ఇదంతయు జీవాజీబాయి మేజోళ్ల కార్ఖాన.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కరదీపిక గప్పున నాఱిపోయినది! బ్రదుకు దెఱవు కనఁబడదు! చిమ్మచీఁకటి! లేవడి జీవనము! నడువీథి కాఁపురము! ఈతల్లి పిల్లలకు జీవాజినాయన ఒక్కఁడు దిక్కయినాఁడు!

దాఁపఱికమునందుండిన ఆలుమగలవలపుసొమ్ము దయ్యమెత్తికొనిపోయినది! జీవాజిబాయి తనపసుపు గుంకుమలతో, తాళిబొట్టుతో, తనచెలువారు చూపులలోనిచిఱునగవులను, మైపులకలను, మదిలోనివలపులను–అన్నిటిని మగనితో మీఁదుగట్టి పంపినది! పసుపుఁ గుంకుమలతో నిన్న కలకలాడుచుండినయిల్లాలు నేఁడు తాపసియైనది. కరుణము రూపుదాల్చినది!

కాఁపురము గుదివడినది! గడియ యేఁడయినది! నాన్నగారిగడన చాలదు! కడపినయస్తులు పస్తులు గంజి దొరకు తెన్ను దెలుపదు! జీవాజి కొద్దిగాఁ జదువుకొన్న బిడ్డ! బుద్ధిమంతురాలు! ఒకరికై చేసాఁచి యెఱుఁగదు. పరువుగాఁ బొట్టపోసికొనుదారి వెదకినది! మేజోళ్ల అల్లిక నేర్చుకొన బుద్ధిపుట్టినది. పట్టుదలతో ౧-౨ నెలలలో నేర్చినది. తండ్రి నౌకరు చాలించుకొని కూఁతురితలంపుతో నేకీభవించి తలకొన్నాఁడు. తిప్పలఁబడి యప్పుసప్పుచేసి మేజోళ్లమర నొకదానినిఁ గొన్నారు. పనిబూనినారు. బేరము సాగినది. ఐదాఱు కొట్లలో వాళి యేర్పడినది. రోజంతయుఁ బాటువడి తయారుచేసిన ౫-౬ డజనుల మేజోళ్లు–పలురకములు–అంగడిఁబెట్టి యమ్మించినారు. చిట్టెఁడు గంజినుండి పట్టెఁడుమెతుకులు రేపుమాపు గనులఁజూడఁగలిగినారు. ఱెక్కలాడించుకొని డొక్కనించుకొనుచున్నారు.

సిరులకై మురిసి శీలమును గోల్పడక, కాయకష్టముతో గంజి త్రావి, ఇంటితనమును, ఇల్లాలిపెద్దఱికమును క్రొత్తయొలయింపులనడుమ, వేయిగన్నులతోఁ గాచుకొనుచున్న ఈ చెల్లెలి నగ్గడింతును. మానవతి లక్షణమున కొకమచ్చుగా తెలుఁగ-కన్నడిగ అప్ప చెల్లెండ్రకు ఈ జీవాజీబాయినిఁ బరిచయమొనర్తును.

---



బందరు – రాములవారిగుడి —పి. బ్రహ్మం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూమహమ్మదీయ సామరస్యము

## 1781 - 1791

టి. శివశంకరం

మహమ్మదీయులు హిందూమతవిద్వేషులను ప్రతీతి ముప్పదిసంవత్సరములకుముందంతగా విన వచ్చుచుండలేదు. ఇప్పటికిని పల్లెటూరిప్రాంతముల నీ మతభేదభావములు పొడకట్టుటయపురూపము; లేనేలే దనవచ్చును. సుమారు ౧౮౦ సంవత్సరములకుముందు మైసూరుప్రాంతముల నేలుచుండిన సుల్తానులపేర్లు హైదర్, టిప్పు అనుట ఎరుగనివారరుదు. శృంగేరిలో శంకరాచార్యులమఠము ఇప్పటివలెనే సుల్తానులకాలమునను నెలకొని మన్నన లందుచుండినది. అంతేకాదు. తండ్రికొడుకు లిరువురును (హైదర్, టిప్పూ) శృంగేరి మఠాధిపతులయెడల భక్తివిశ్వాసములతో మెలగుచున్నట్టు కొన్నిప్రమాణములు వెలివడుట సమయమున దేశమునకే హితావహము.

ఇవి ముప్పదిరెండులేఖలయి శృంగేరిసంస్థానపు గ్రంథాలయమున భద్రపరచబడియున్నవట. వీనిలో ననేకములు తండ్రికొడుకు లిద్దరును స్వయముగ అపుడపుడు మఠాధిపతులకు వ్రాయించినవి కన్పట్టును.

ఇవియన్నియు వ్రాసియుండు కాకితములవన్నెయెరుపు. శిఖరమున కిరణములతో నుండు సూర్యబింబము ననుకరించినముద్ర వేయబడియున్నది. ఒక్కొక్కటియు వ్రాసినకాలము హిందూమహమ్మదీయసంప్రదాయముల ననుసరించిన తిథివారములతో గుర్తింపబడియుండుట మరియొకవిశేషము.

ఈవ్రాతయందలిశైలి భక్తివినయముల ప్రకాశించునట్టిది. ఒక్కొక్కటియు "శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య......సచ్చిదానందభారతిస్వామి" యని అఖండమయిన బిరుదావళితో ఆరంభించి తుదకు సుల్తాను సలాముల నివేదించును.

ఈజాబుల విమర్శించిచూచినపుడు మఠాధిపతులును, మహమ్మదీయసుల్తానులును ఎడపదడప ఉత్తరప్రత్యుత్తరములు జరుపుకొనుచున్నట్టు స్ఫురించును. అంతియకాదు. ఉభయులకును శ్రీవారితపశ్శక్తియందు విశ్వాసము నిబిడమై వారికి పూజాసత్కారముల సమర్పించుచుండిరనుటయు విశదమగును.

ఒక్కొక్కజాబునందునుతమప్రజలు సుఖముగా నుండుటకున్ను, శత్రువు లగు మహారాష్ట్రులు, ఆంగ్లేయులు, హైదరాబాద్ నిజాం నాశనమగుటకును చంద్రమౌళీశ్వరుని ప్రార్థించవలెననుట వేడికోలు. ఈయంశము హైదర్ వ్రాసిన జాబు వ్యక్తపరచును. దాని తెలుగుపరివర్తన మిది:

"తాము ఘనవంతులు. పవిత్రులు. ఎవరికైనను శ్రీవారికి పూజాసత్కారముల నర్పించవలె ననువాంఛ సహజమైనట్టిది. రాంజీవెంబడిగ ఒకయేనుగు, ౨౮ గుఱ్ఱములు, పల్లకియొకటి, ఒంటె లయిదు, శారదాదేవికి సువర్ణవస్త్రము, శ్రీవారియుపయోగమునకు రెండు శాలువలు, పదిన్నరవేలరూప్యములు సమర్పించుకొనియున్నాను. మాప్రజ సుఖముగ నుండునట్లును, శత్రుత్రయనాశనము గల్గుటకును తమ యాశీర్వచనముల ప్రసాదించవలెననుట నాప్రార్థన."

టిప్పుసుల్తాను చిత్తమున శ్రీవారియెడల అదే గురుభక్తియే నెలకొనియున్నట్టు తోచును. తాను సింహాసనము నెక్కినదిమొదలు శృంగేరిమఠపు వ్యవహారములందు ప్రకాశించుచు వచ్చిన శ్రద్ధాభక్తులు అరుదైయుండెననుట తాను శ్రీవారికివ్రాసిన ౬, ౭ జాబులు ప్రకటించుచున్నవి.

౧౭౯౧-వ సంవత్సరమున పరశురామబాబా అను మహారాష్ట్రుపు దుండగీడొకడు శృంగేరిపై దాడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెడలి ఆస్థానమును కొల్లగొనెను. కొందరు బ్రాహ్మణులను సంహరించెను. మరికొందరిని హింసించెను. శారదా విగ్రహమునే పీఠమునుండి పెకలించి మఠమంతయు దోచుకొనివెళ్లెను.

ఈదుండగమె కారణముగ శ్రీవారు నలుసురు శిష్యులతో శృంగేరివదలి ప్రక్కనున్న కార్కాలు గ్రామమున వసించవలసివచ్చినది. ఈవిప్లవ సమయమున మఠాధిపతి శారదావిగ్రహమును పునఃప్రతిష్ఠ చేయు టెచ్చమునకు సుల్తానుసహాయమును కోరి వ్రాసి యుండుట చిత్రము. ఈవేడికోలును టిప్పుసుల్తాను మన్నించిన యౌదార్యము మరియొకజాబు ప్రకటించుచున్నది. అది యిది:

"జనులు నవ్వుతూ దుష్కార్యములు చేయుదురు. కుడకు ఏడ్చును దానిఫలము ననుభవించువారు వారే. గురుద్రోహము వంశనాశము చేయునట్టిది. 'నగర్' గ్రామములోని 'అజఫ్' అను అధికారికి ఆజ్ఞ పంపించి యున్నాను. శారదాదేవి పునఃప్రతిష్ఠకై యిన్నూరు రహతీలు (అప్పటినాణ్యము)ను, మరి యిన్నూరు రహతీల వెలచేయు ధాన్యమును, తాము కోరు ఇతర వస్తువులను సప్లయిచేయునదిగ ఆజ్ఞాపించియున్నాను. చుట్టుపట్టుపల్లెలనుండియు కావలసిన పదార్థములు సేకరించుటకు వీరు స్వతంత్రులు. దేనిని పునఃప్రతిష్ఠ గావించి బ్రాహ్మణసంతర్పణయైన పిమ్మట మా అభ్యుదయమును, శత్రుత్రయ నాశనమును కోరి ఆరాధనలు సల్పుదురని వేడినాను."



మధుర, వేయికాళ్లమంటపమునందలి స్తంభముపై కొరవత-పిల్లలతోకూడ; సంకనుబట్ట

—యస్. శంకర సుబ్రహ్మణ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## సొంత సోది ౧

గోవిందరాజుల వెంకటసుబ్బారావు

అంటే ఏమిటని అడగండి. ఎవరిడబ్బా వారు వాయించుకోట మన్నమాట. (వ్యా: ప్రతి వాడికీ కొంత లోహభేదంతో ఓడబ్బా గలదని ఎరుంగునది.)



డాక్టరు జి. వి. సుబ్బారావు, L. M. & S.

చాట్లో పడ్డుపోసి మిత్రులు శేషయ్యగారు కొంత క్లిష్టంగా కానివ్వమన్నారు. "దాసోహం, అలాగే" అని కలం కాగితాని కంటించాను. దానిష్ట మెచ్చినట్లు నేనన్నా నడవాలి, నాయిష్టమెచ్చినట్లదన్నా నడవాలి. లేకుంటే మేమిద్దరం ఆకాశవాణి మాటన్నా వినాలి! ఇలాంటివిషయాల్లో ఎవరిమాట మీదన్నో ఒకరిమాటమీద నిలబడకపోతే, అవకతవకలు, అసభ్యాలు, అనవసరాలు, ఎన్నో అచ్చులో కెక్కుతాయి.

అయినా దీని కింతగో లెందుకు? నాయిష్టదైవం ఏడుకొండలస్వామికి నన్నొదిలేసుకొని వారువ్రాయించినట్లల్లా వ్రాస్తాను.

* * * * *

నే నిప్పటికి ౩౮ సం. వచ్చీరానీ, బాలాకుమారుణ్ణి. అంటే ఊహాపోహలు వాడిపోక మరింతచిగురుస్తూ, నూతనాల్లోకి లాక్కెల్లిపోతూ ఉంటాయండి.

నాస్వామికృపవల్లనే ఈజీవితంలో రెండోరంగం మీదికెక్కగల్గింది: లేకుంటే నాగ్లేళ్లనాడె,"ఇదిభాసుడి ఏకాంకనాటకంరోయి, ముగిసిందిపొమ్మ"న్నారు.

తర్వాత జ్యోతిష్కులతో ఆలోచిస్తే, "అబ్బాయి, నీది మొండిప్రాణంరా! ఇలాంటివి తప్పకుండా రెండోకటో ఆడుతావు! భయంలే" దన్నారు "సరేలే చూద్దాం" అన్నాను.

ఈనాచిత్రపటాలకు సూచీకరణంకోసం దీన్ని వ్రాయమన్నారు. అవ్వేమైనా బాగా ఉన్నపక్షాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారణం నామిత్రులు, Photo Artist. పిల్లలమర్రి సుందరరామయ్యగారు.

ఏమంత వ్రాసుకోవటానికిగాని, వ్రాయించుకోవటానికి గాని ప్రతిభగలవ్యక్తిని కానుసుమండీ! నాకుచేత యింది తక్కువ, చేతకాం దెక్కువ, తెలిసింది తక్కువ. తెలియం దెక్కువ, కళాదైవతాల్ని కొలిచే దాసుల్లో నేనొక మాలదాసుణ్ణి.

అయినా ఇదివరకే ఆంధ్రలోకానికి కొంతపరి చితుణ్ణి. వ్రాయటాని కంతమిగిలినట్లు తోచటంలేదు. తెలియనివిషయాలు వ్రాస్తే అసలు పూర్తవుతుందని నమ్మకం ఉంది. వాటినే వ్రాస్తానండి.

బాబూ, మొదటిసంగతి, ఇది నావృత్తి కాదండి. నేను వైద్యంచేసుకొని నాల్గుడబ్బులు సంపాయించు కొనే వ్యక్తినండి. మాది తెనాలంటారండి. అసలుజన్మ స్థానం మేహూరండి. మేము మొఖాసాదార్లం దేశముఖి దేశపాండ్యాలమండి. పదిపండెండేళ్లనుండి నాపొట్ట నేనుపోసుకొని చేతనయినంత యితరులకు పెడ్తూ బ్రతుకుతున్నానండి. చెమటకార్చి నాటకాలాడి అపాత్రులకూడా దానాలు చెయ్యడం మొదలెట్టి నేనే నేమో అని చివుక్కుమనుకుంటూ ఉంటానండి. వీట్లలో తిరగటం శ్రమదమాలు పడటం నా కోవింతరుచండి. "పుర్రెకోబుద్ధి, జిహ్వకోరుచి" అన్నారుకాదా అండి. వృత్తిమాట మరిచి, నే నేదైనాఊరు వెళ్తే, "ఇవ్వాళ మీదేమైనా ఉందా" అని అడుగుతూ ఉంటారండీ. "వైద్యరీత్యా వచ్చానని" సిగ్గుతో సెల విస్తూ ఉంటానండి. సిగ్గెందుకో ఈరోజువరకూ తెలియకుండాఉంది, మీ రెవరైనా సెలవిస్తే వింటానండి.

* * * *

ఈనాటకాల్లో కసలు దిగకపొయ్యేవాణ్ణే: కారణం మాతల్లిగారు పదేండ్లప్పుడే తండ్రిని మ్రింగిన నిర్భాగ్యుణ్ణిగనక వారికొరత ఆమెగారె తీరుస్తూఉండేది. ఉడిదుడుకువాణ్ణి గనక అన్నింట్లో శాసిస్తూ ఉండేది, కట్టుదిట్టంకోసం. మరింతచెలరేగిపోతూఉండేది నాకు. ఆకాలంలో నాటకాల కెళ్తేనే చెడుతారనేభయా లుంటూఉండేవి. ఎంతేడ్చినా పేడ్డబ్బ లిచ్చేది కాదు. చుట్టాలొస్తే వాళ్ల నాసరాచేసుకొని నాటకాలకు జారుతూఉండేవాణ్ణి. ఈకష్టంచూస్తూ మా నాయనమ్మగారు చాటుగా డబ్బులిస్తూఉండేది; ఎవరికీ తెలియకుండా ఉడాయిస్తూ ఉండేవాణ్ణి. ఒకరు కొంత రుచి పోగొట్టగల్గారు; ఒకరు మరింత కల్గించారు.

అందరికన్నా అగ్రస్థానం కల్పతరువు తల్లిదేగనక, ఏంచేసినా మంచిగానే పరిణమించాలి గనక, నే నొక కళాపిపాసువునై పొయ్యాను.

* * * * *



౨. యుగంధరుడు — "మీరు కానిచ్చుచుండుడు" (తరువాతి ఆలోచనము)

కళ్లుమూసుకొని తీవ్రమైన సింహావలోకనం చేస్తే ఏం కనబడతూంది నాకు? నా నాల్గోఏటబుట్టాయి పేటహాల్లో వేసిన సారంగధరనాటకం. అందులో చమ్కీకోట్లు, సారంగధరుడు, ఆకుపచ్చని చీరకట్టిన చిత్రాంగి ఎర్రచీరకట్టిన మరోఆవిడ చిత్రపటాల్లా కన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యించి నడుస్తూ, మరగాళ్లేసుకొని గదనుపట్టి, రాక్షసి గొంతుతో అరిచేవాడికి సంప్రాప్తిస్తూఉండేది భీముడి వేషం.

* * * *

కొద్ది సంవత్సరాలతర్వాతనే మా Old Boys' Association స్థాపించాం. దీంట్లోనె తదుపరి అనన్య ప్రతిభకొచ్చిన శ్రీరామవిలాసబీజాక్షరాలు దైవంవ్రాసింది. బొబ్బిలిలో హైదరుజంగువేషం వరసగా చాలా సార్లు వేశాను. చెప్పేది నాకు, వినేది ప్రేక్షకులకూ తెలియకపోవటంవల్ల అఉరుదుభాషందరినీ దంగు చేస్తూఉండేది. అంచాత కొంత పేరుకూడా వచ్చిందని చెప్పవచ్చు. నాటకకంపెనీల కప్పటికుండే అసభ్యత్వాన్ని వదిలించి విద్యార్థులకు, విద్యాధికులకూ రంగ ప్రవేశాని కవకాశ మిచ్చింది ఈ ప్రాతవిద్యార్థి సంఘాలే. .

* * * *



౫. ఆసిరిగాడు—"తెండి చూత్తాను, ఓరాజో నారాజో."

౧౯౨౧-వ సంవత్సర ప్రాంతంలో శ్రీ రామ విలాససభ స్థాపించబడింది. దానిఉత్పత్తికి కారణభూతుల్లో నేనొకణ్ణి. నానాటకాలమోజు కొంతవరకు తీర్చిం దీసభే. దీనివిషయం చాంతాడంత వ్యాఖ్యానం వ్రాయవచ్చుగనక సుటకమింగి క్లుప్తంగా విడుస్తాను. యుగంధరుడు, గిరీశం, బుర్నీ, ఆసిరిగాడు, షరీ మొదలైనవేషాలు కట్టాను. నాఊహాపోహాలు చాతనైనంత నాసామాజికులకు ఊదుకున్నాను. సమత్వభావోద్రేకుణ్ణిగనక భేదాభిప్రాయులతో డీకొంటూక్.ఉr వాణ్ణి. రాజుదగ్గరనుంచీ భటుడువేషందాక జంకూ కొంకూ లేకుండా ఉండాలనే ఆశయం నాది. దీనివల్ల అభినయం రేకెత్తుతుంది గాని వాసి తగ్గటాల కవకాశం ఏమాత్రం లేదు.

కీర్తిశేషులైన స్నేహితులు భాగవతుల రాజగోపాలంగారీసభకు Secretary. తర్వాత Proprieto పదవుల నాక్రమించారు. పెట్టుబడి వారిది. లాభనష్టాలు కూడా వారివె అయిపొయ్యాయి. అంతఃకరణలవ్యత్యాసాలవల్ల విచ్ఛిన్నమైపోయిం దీసభ. కాని ఇంకా ఎండిపోని చింతచెట్టులాంటిది. పునరుద్ధరణప్రయత్నాలు చాలాచేశానుగాని ఈరోజువరకూ దైవంతోడుపడ లేదు

* * * * *

ఆఖరుకు వచ్చాను. నాన్నాళ్లనాడు Hamlet నాటకంలో Horatio వేషంవేశి కొంత తగలెట్టాను. అప్పట్నుంచీ వాటిజోలికిపోతే అవ్వి కరుస్తయి అనే భయం ఏర్పడింది. మద్రాసులో Frank Andersen గారి Hamlet చూసింతర్వాత ఈనాటకా లెప్పుడూ మనసొమ్ము కానేరవని ధృడంగా నమ్మాను. ప్రక్కన కూర్చొన్న యింగ్లీషురాని గ్రామస్థుడి కర్థమయింది నాటకమంతా! తమిళసోదరులు తెలుగునాటకం వేసి "మీరు పూడ్చండీ" అంటే ఎంతరసం చిందుతుందో, దాంట్లో నాల్గోవంతుకూడా మథించలేం ఇంగ్లీషు నాటకం వేసి.

కానీ "మనమూ బాగానే వేస్తాంలే" అనే అభిప్రాయం చాలమంది కుండొచ్చు. వారితో తగాదాకు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్రాయటం లేదివి. ఏదో కొంత హృదయశాంతి క్రింది విధాలగా చేసుకుంటున్నామని నా ఊహ. క్షమించండి.

౧. ఇదో నూతన విడ్డూర్యంగా ఉంది. ఉదాహరణ: నాకిప్పుడు Viceroy పదవిస్తే దానికి తగిపోయ్యానని చప్పట్లు కొట్టరూ? హీనపక్షం కొద్దిమందైనా? అలాగె ఇది.

౨. "ఏం? వాడి ఉచ్చారణ, ఆహార్యము ఇంగ్లీషు వారిలా ఉంది." అనుకుంటాం. కాని వారిలాకూడా ఏమాత్రం ఉండడు. రక్షకసైన్యంవారి వేషభావలు ఎంతశ్రాద్ధయోగ్యంగా ఉంటాయో, మనం తెచ్చిపెట్టుకున్న ఆంగ్లత్వంకూడా అంతే.



౬. రాణాప్రతాపుడు (యుద్ధభూమి)

౩. "నాటకం మొత్తంమీద చాల బాగుంది సుమా," అనికూడా అనుకొంటాం. దానిబాగోగుల పరిణామంకూడా మన కింకా తెలియదు. ఈవిషయంలో భావిలో మండూకాలం.

"ఇదంతా Grapes are Sour అనేపద్ధతి మీద నుప్పుతున్నా డనుకోక కూర్చొని ఆలోచించుకోండి.

మరి నీఆశయాలేంటని అడగండి:

I. నటకుడు ప్రతివేషం వెయ్యాలి: చేతైతే.

II. గద్యనాటకం రక్తింమనట్లు మిశ్రజాతులు కానేరవు.

III. నటకుడు పాత్రాన్ని ఆరాధించాలి గాని వేరు లేదు.

IV. స్త్రీలు వేషాలువేసినా, స్త్రీలతో వేషాలు వేసినా కొంపలేమీ అంటుకుపోవు. గాభరాపెట్టకండి, గాభరాపడకండి.

V. ఖిరాయినాటకాలు,కలగూరగంపలూ నశించి రీతైన నాటకసమాజాలు పునరుద్ధరించాలి.

VI. పాత్రవ్యక్తిత్వానికే పాటుబడక, సమిష్టి పాత్రత్వానికే పాటుబడేవాడే ఉత్తమనటకుడు. ఈ రోగం పెద్దవాళ్ల కెవళ్లకయినా ఉంటే దాన్నిమాంతేనే బాగుపడ్తా రనిమందలిస్తూన్నాను.

"ఇక ముగించవోయి" అని పైనుంచి స్వామి కల్లెరచేస్తున్నాడు.

---

## ౨

## డాక్టరు కూచిభొట్ల శివరామకృష్ణయ్యగారు తదాశయసాఫల్యము

శ్రీ శివరామకృష్ణయ్యగారికి హూణ విద్య నభ్యసించుచున్ననాడే నాట్యకళయందు చాల అభిమానము కుదిరినది. దానిని పురస్కరించుకొని నాట్యకళను వా రుపాసింప దలచి తదనుగుణములగు సేవల నెన్నిటినో చేసిరి. గానమునం దీశ్వరార్పితమయి వెలయుచున్న సహజమాధుర్యమునకు వన్నె తే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దగిన శాస్త్రసంస్కారమును లభింపజేసికొని, గృహసంకటములను పాటింపక, నాట్యగానములనుసమన్వయింపతమజీవితమును సమర్పించు



౧. శ్రీ డాక్టరు కూచిభొట్ల శివరామకృష్ణయ్యగారు

చున్న యుదారగుణవంతులు వీరు. ఇంతయే కాదు, వైద్యశాస్త్రము నభ్యసించి ప్రవీణులయినారు. వైద్యవృత్తిని జీవనోపాధిగ జేసికొని ఫలాపేక్ష లేక నాట్యకళ నుపాసించుచున్న వీరు నాదృష్టి కాదర్శప్రాయులుగ గన్పట్టుచున్నారు. కావుననే వీరి నాంధ్రసోదరుల కెరుకపరుప నుత్సహించితిని.

వీరిటీవల పద్యగద్యాత్మకములగుకొన్ని నాటకములందు భూమికలను ధరించి ప్రేక్షకజనామోదమును బడసియుండుట విదితమె. వీరు ముఖ్యముగ దుర్యోధనుడు, రామదాసు, బాహుకుడు, రాజనరేంద్రుడు, కబీరు, హిరణ్యాకశిపుడు, దుష్టబుద్ధి మొదలగు పాత్రముల భూమికలను ధరింతురు. వీరీ పాత్రములను కడు మనోహరములుగ ప్రదర్శించిన నటశేఖరులు. ఇటీవల నాంధ్రనాటకకళాపరిషత్తు సమావేశసమయమున వీరు ప్రదర్శించిన పాత్రాభినయ కౌశలమునుబట్టి, వీరు హరిశ్చంద్ర, దుష్యంత, వత్సరాజ భూమికలనుకూడ నిరాఘాటముగ ప్రదర్శింప సమర్థులని నాకు గోచరమయినది. వీరచిరకాలమున నీ పాత్రల యభినయకౌశలమును చూచి యానందించు నవకాశము నాంధ్రసోదరులకు కలిగింతురుగాక!



౨. దుర్యోధనుడు — "బంధకీకృతపరిహాసావమానమున ప్రాణపరిత్యాగ మొనరించుటయన."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవకాశము లేకున్నను నాట్యకళ యందు వీరు చూపుచున్న అభిమానము



3. హిరణ్యకశిపుడు—"సురాత్మా, ఇదెచూడు మాఖడ్గము. దీనిలో విష్ణువును చూపకున్న ఇపుడే నీతల దునుమాడెద. —"

మిక్కిలి కొనియాడదగిన దగుటచే నా సంతోషమును ఇట్లు ప్రకటించుచున్నాను. సర్వేశ్వరుడు వీరికి చిరాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాక.

యడవల్లి సూర్యనారాయణ



౪. రామదాసు —"ఆహా! ఇది ఆఖవ దినము; అఖరువ్వలైన నాచేత లేవే!"

---

## 3
## మాధవపెద్ది వెంకటరామయ్యగారు

"కృష్ణరాయబారమున సభాసదుల చిత్తమును చూరగొనినవారిలో మాధవపెద్ది వేంకటరామయ్యగారి దుర్యోధన పాత్రము · మొదటిదని చెప్పవలయును. దుర్యోధనుడు స్వాభిమాని. రాజ్యమున కౌంతేయులకు హక్కు లేదను స్వమతమందును, యుద్ధమే వచ్చెనేని తన పక్షమునకు విజయము తెచ్చునని స్వబలమందును అప్రతిహతమగు విశ్వాసము గలవాడు. పాండవులయెడ అసహనమును, కర్ణునియెడ ఆదరణయు నీతని హృదయమున పెనవైచుకొని యున్నవి. రాజరాజుగావున రూపెత్తిన దర్పము. ఈలక్షణములన్నియును మాధవపెద్దివారిలో ప్రస్ఫుటముగా గోచరించెను. పఠనవేళ సహృదయులు దుర్యోధనను నెల్లెట్లూహింతురో రంగమున వేంకట్రామ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

య్యగా రట్లట్లు చూపట్టిరనుట అతిశయోక్తి గాదు. పద్య భూయిష్ఠమగు నీనాటకమున వీరి వాచకము స్తవనీయము. రాగముకొఱకు నిలుపులులేక, ఆలాపనతో కాలహరణము లేక, భావమునకు వెలితి లేక సమయోచిత



౧. దుర్యోధనుడు కృష్ణరాయబారమున

మును, పరిమితమును అనుగానముతోడను వీరుపద్యములు చదువుచు అభినయించుట శ్రోత్రపేయమగుటయే కాక చక్షుఃప్రీతికరమునునై యుండెను. ప్రజ్ఞాచక్షువగు తండ్రిని దరిసితనమతమును సమర్థించుచు తనబలము నుగ్గడించునపుడుగాని, ద్రోణాచార్యుల ప్రసన్నుల జేసికొన బోవునపుడుగాని, కర్ణపక్షపాతియై కొలువు వారల



౨. రాణాప్రతాపుడు.

ధిక్కరించునపుడుగాని, కృష్ణబంధన ప్రయత్నమునగాని వీరి అభినయము ప్రకరణానుసరమై ప్రకాశించెను.

(ఆంధ్రపత్రిక)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అనంతపురం బాలికాపాఠశాలవారు ప్రదర్శించిన శ్రీకుముదవల్లీ నాటకమునందలి దృశ్యములు

1. తుంగభద్రానదీతీరమునందలి దొంగలు సోమదేవరాజును కొల్లసేయుట.



శ్యామన్న—"మనము వీని ధనాదులను హరించి, కాలు సేతులు బంధించి, యీతని నా జలాశయమునం బాఱవైచివత్తము రండు."

2. యతివేషధారులగు హరన్నయు శ్యామన్నయు భిక్షుకరూపమున నున్న సోమదేవరాజును రక్షించుట.



భిక్షు—"అయ్యలారా! ఎవ్వరైన నాపన్నుఁడ నగు నన్ను రక్షింపుఁడు - రక్షింపుఁడు."

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## జమీందార్లంటే ద్వేషం యెంచేతా?

"ధర్మమా, అధర్మమా?" అంటే అది వేరే విషయం; కాని జమీందార్లంటే దేశంలో యేవ కలిగింది. ఆదరం తగ్గింది. నమ్మకం సన్నగిల్లింది. నిరసనం ప్రబలిపోయింది.

"జమీందారీలు పోవాలి. ప్రభుత్వానికీ, ప్రజలకీమధ్య యీ దుబాసీల అవసరం యిప్పు డేమీ లేదు" అని వొక కొత్త భావంకూడా పాటమరిస్తోంది

దీని కంతటికీ రష్యానుంచి దిగుమతీ అవుతున్న బోల్షివిక్కువాఙ్మయం ఊతకలిగిస్తోం దంటే అది కొంత నిజమే కావచ్చు; కాని ఆదికారణం వేరే కనపడుతోంది.

అది యిక్కడే పుట్టి,యిక్కడే పెరిగిపోయింది.

దాని విత్తనమూ యిక్కడిదే. దాని దోహదమూ యిక్కడిదే.

అమాయకు లైన రయితుల్లో యీ వైముఖ్యం పుట్టింది. అధికారవాంఛ లేని జనసామాన్యంలో యిది వేరు తన్నింది.

"అయితే: ఇది స్థిరంగానే వుండిపోతుందా? దీన్ని అణచివెయ్యే లేకపోతామా?" అని కాదు జమీందా రిప్పుడు యోచించుకోతగ్గది.

స్వలాభపరులు కొందరిందులో జోక్యం కలగచేసుకున్నా రంటే అది నిజమే. నాయకు లనిపించుకోవా లని అనేకులు పెక్కుతెగల జనులలో విషకల్లోల—బీజాలు వెదచల్లుతున్నా రంటే అదీ వాస్తవమే.

కాని, వేలసంవత్సరాలనుంచి యెలాంటి కష్టనష్టా లనుభవిస్తున్నా ప్రభుభక్తికి కళంకం కలగనిచ్చుకోనివారు—ప్రతిఫలం తక్కువయినా సుస్థితి కోరి ప్రాణా లర్పించిన యోధుల సంతతివారు ఇవాళ తమ విషయంలో పెడదారి తొక్కుతున్నా రంటే యేమిటో జమీందార్లు కొంచెం పస్తాయించుకోవాలి.

ఈతరంవారు చలచిత్తులు కావచ్చు. కష్టాలు వోర్చగలవారు కాకపోవచ్చు. బెల్లింపులకి లోబడిపోయేవారు కావచ్చు.

పైగా భేదోపాయం అవలంబించి వారి కట్టుబాట్లు చెడగొట్టడం చాలా సులభమే కావచ్చు.

కాని, యీ ప్రయత్నాలు ముందు ముందు విషమిస్తాయి.

వీటివల్ల ద్వేషం తిరోహితమై వుంటుంది; కాని చల్లారదు. ముందుతరంవారికి సంక్రమిస్తుంది; కాని యిప్పటివారితో అంతరించిపోదు.

పోనీ అని వూరుకుంటే, యిది రాజుకుంటుంది. ప్రతిస్పర్ధ పూనితే, భగ్గు మంటుంది.

జమీందార్ల కోరికలు ప్రజల కోరికలకంటే హెచ్చుస్థాయిలో వుంటా యన్నా, వారి అవసరాలు వీరి అవసరాలకంటే యెన్నో రెట్లు ఎక్కువగా వుంటా యన్నా, వారి జీవితాలు వీరి జీవితాలకంటే విశిష్టత కలవిగా వుంటా యన్నా యెవరికీ పేచీ లేదు.

జమీందార్లకీ, జనసామాన్యానికీ మధ్య వొక విఘ్నమైన అంతరం వుండా లంటే అది సబబే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని, ఎంత చెట్టు కంత గాలి అన్నట్టు వృథ యుల కష్టసుఖాలికీ రాశిలో తప్ప రకంలో భేదం వుండగూడదు.

వెనకటి తరాల జమీందార్లు ఈరహస్యం బాగా గుర్తించారు. వారు దీన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చారు.

కాని యిప్పటి తరంవారికి రైతు లంటే ఉదారభావం లేదు. రైతులు తమయెడల భయభక్తులు కలిగి వుండా లనే ఆశ మాత్రం పూర్తిగా వుంది.

శిస్తు తెచ్చి తమపాదాలదగ్గిర దాఖలుచెయ్యడం రైతు పూచీ అని జమీందార్లు బాగా యెరుగుదురు; కాని వారు శిస్తు చెల్లించగలిగేటట్టు ఆధారాలు కలిగించడం తమ పూచీ అనిమాత్రం యెరగరు.

గవర్నమెంటు గ్రామాల్లో వుండే రైతులకి కంటే జమీందారీ గ్రామాల్లో వుండే రైతులకి శిస్తు లెంత యెక్కువో, వ్యావసాయిక సౌకర్యాలు అంత తక్కువ.

ఎంచేతా ?

తా బేదా ర్లంతా యేం చేస్తున్నారూ ?

శిస్తంతా యేమైపోతోందీ ?

జమీందార్లకి రైతులంటే యింత నిగహో లేక పోవడం యేమీ ?

కొంతమట్టుకైనా ప్రపంచప్రవృత్తిని అర్థం చేసుకుంటూ వున్న జమీందారీ రైతులు ఇలాగ కిందా మీదా పడ్డంలో అస్వాభావికం యేమీ లేదు.

రైతులికి యిలాంటి వితర్కింపు కలగనివ్వడమే జమీందార్ల మొదటి తప్పు. దీన్నైనా వారు వెంటనే సద్దుకోకపోవడంవల్ల రైతుల హృదయాల్లో కొత్త భావాలు చిలవలూ పలవలూ పెట్టాయి.

వెనకటి తరం జమీందార్లకి వూరు విడిచి పెట్టడం అంటే శిక్షగా వుండేది. ఇప్పటివారికి వూళ్లో వుండడం అంటే యమచెరగా వుంటోంది.

వారు తమ దివాణాల్లో వస్తాదులను పెట్టుకొని మల్లయుద్ధాలు చూస్తూ తమ శౌర్యసాహసాలకి దోహదం చేసుకుంటూ వుండేవారు.

పండితులను చేర్చుకొని శాస్త్రచర్చలు చేయిస్తూ తాము కూడా పాల్గొంటూ, బుద్ధికి నైశిత్యమూ, భావాలకి ఔన్నత్యమూ, ప్రవర్తనకి ఔదార్యమూ, వాక్కుకు ప్రౌఢతా కలిగించుకుంటూ వుండేవారు.

కవులను ఆదరించి కవితావినోదాలు వింటూ, తమ రసపిపాస తీర్చుకుంటూ, స్వయంకవులై రస జగత్తు చిత్రిస్తూ తమ జీవితాన్ని ఆనందమయం చేసుకుంటూ వుండేవారు.

వారికి వేట అలవాటు ఉండేది దాని కవసరమైన కుక్కలూ, అనుచరులూ మొదలైన పరికరాలను వారు శ్రద్ధగానే సమకూర్చుకుంటూ వుండేవారు.

వేటలోగూడా వారికి చాలా నైపుణ్యం వుండేది.

కాని యిప్పటివారిలో అనేకులకు కుక్కలుంటే చాలు. వేట ప్రధానం కాదు.

ఇప్పు డేదివాణంలోనూ వస్తాదుల పేర్లు వినపడవు. మల్లయుద్ధాలు పురాణగాథ లైపోయాయి.

ఇప్పుడు కొన్ని దివాణాల్లో పండితు లున్నారు; కాని వారికి దర్శనాలు లేవు. కవులు గూడా కొన్ని చోట్ల వున్నారు; కాని పేరుపడ్డ గ్రంథం వొక్కటి బయటికి రావడం లేదు.

ఒకప్పుడు ఆంధ్రకవితావిలాసిని విహరించిన తెనుగుదివాణాల్లో యిప్పుడు ఆంగ్లేయకవితామోహినీ, వంగకవితాకామినీ, హిందీకవితాభామినీ పరవళ్లు తొక్కుతున్నారు.

వెనకటి జమీందార్లు రైతులికి దర్శనం యివ్వడం అంటే పండుగులాగ పొంగిపోయేవారు. ఇప్పటివారు రైతులను చూసి వెలపరించుకుంటారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎవరికి దర్శనం యివ్వడానికైనా యిప్పుడు జమీందార్లు వూళ్లో వుంటేనా ?

నీటిలోనే వుంటేనే తామరపువ్వు. అలాగే స్వగ్రామంలో వుంటేనే జమీందారు.

స్వగ్రామంలో వుంటే జమీందార్లకి రాజకళ వుంటుంది. వూరుకూడా కళకళ్లాడుతూ వుంటుంది.

మహారాసువంటి నగరాల్లో, ఉదకమండలంవంటి కొండలమీద ఈ జమీందార్లకి ప్రత్యేకగౌరవా లెలా వస్తాయి ? రాజు లేని వూరు వూరంటే యేమిటి ?

జిల్లాకలెక్టరు వూరు విడవడు, విడిస్తే సరిహద్దు దాటడు. మన జమీందార్లు ఏడాదిలో సగానికి పైగా సరిహద్దుకి బయటే—తంతికైనా తిన్నగా అందని చోటే వుంటారు.

తమ కష్టసుఖాలికి కాని జమీందారుమీద రైతులకి భక్తి అంటే యేమిటి? విశ్వాసం అంటే యేమిటి? ఆదరం అంటే యేమన్నమాటా ?

చెమట వోడ్చీ, మట్టి పిసికీ, అంబలి తాగీ, గోచీ గరించీ రాత్రీ పగలూ అనే భేదం లేకుండా పొలంలోనే పడివుండి రైతు సృష్టించిన ద్రవ్యాన్ని జమీందారు మహానగరాల్లో తారురోడ్లమీద వెదచల్లుతూ వుంటే యేరైతుహృదయం చలించకుండా వుంటుందీ?

రైతుల స్త్రీల నగలు వొలిపించీ, చెంబూ ముంతా వేలం వేసీ, ఆవ్యధితహృదయాలు చీల్చుకుని వచ్చే శాపన్నాలు వింటూ తాబేదార్లు వసూలు చేసిన శిస్తును జమీందారులు విలాసవస్తువుల కోసం దేశాంతరాలకీ ఖండాంతరాలకీయెగుమతీ చేస్తూవుంటే యేతాబేదారు హృదయం కలుషితం కాకుండా వుంటుందీ ?

జమీందారీగ్రామాల్లో జలాధారాలు పూడిపోతున్నాయి. పశువులకు గ్రాసం దొరకడం లేదు. రోడ్లు లేవు. పాఠశాలలు లేవు. జనుల దేహాల్లో రక్తమాంసాలు కూడా—కళ్లల్లో నీళ్లు తప్ప మరేమీ లేవు.

ఇలాటి స్థితిలో జమీందార్లు మహానగరాల్లో మోటార్లమీద విహరిస్తున్నా రంటే, నృత్యగానాల్లో పరవశు లవుతున్నా రంటే, వినోదాల్లో తేలియాడుతున్నా రంటే వూళ్లల్లో ద్వేషం కాక ప్రీతి యెలా వుంటుందీ ?

—శాస్త్రి



రామచంద్రపురము కాలువపైని రైల్వే వంతెన —డి. శేషగిరిరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నక్షత్రమండలము

గోబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(శ్రీముఖ ఫాల్గున, భావ చైత్రము, మార్చి 1934)

ఉత్తరము




దక్షిణము

[ఈపటము తలమీదను ఆయాదిక్కులు చూపునట్లు సరిగాపట్టుకొని చూడవలయును. ఇంగున్నట్లునక్షత్రములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మార్చి | 8 | తేదీని రాత్రి | 8-57 | గంటలకును, | మార్చి | 22 | తేదీని రాత్రి | 8- 2 | గంటలకును |
| ,, | 15 | ,, ,, | 8-30 | ,, | ,, | 29 | ,, ,, | 7-34 | ,, |
| | | | | | ఏప్రిల్ | 6 | ,, ,, | 7- 2 | ,, |

కనబడును.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ శ్రీముఖసంవత్సర ఫాల్గున బహుళ సప్తమిమొదలు భావసంవత్సర చైత్రబహుళ నవమిపర్యంతము రాత్రితొలిజామున నగపడు నక్షత్రాదులను గమనింతము.

## క్షీరవాహిని (Milky Way)

కొంచెము వంగిన వింటివంటి యాకారముతో క్షీరవాహిని, దక్షిణసమీపపు ఆగ్నేయమునుండి, ఉత్తరసమీపపు వాయవ్యమునకు వ్యాపించియున్నది. ఆగ్నేయమునుండి వాయవ్యమునకు పోనుపోను దాని వెడల్పు / మొత్తముమీద విస్తరించుచున్నది. ఆగ్నేయమునుండి ఇది నౌకామండలముమీదుగా, పూర్వశ్వాన, మృగవ్యాధనక్షత్రములమధ్యనుండియును, వృత్ర, మిథునముల మధ్యనుండియును గడచి సారథి, భృగుపరశుమండలములమీదుగా నప్సరసమండలము చేరుచున్నది. ఆగ్నేయమునందుకంటె వాయవ్యపుకోసను మూడురెట్లు వెడల్పుగల్గి యిది మెరయుచున్నది.

## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు (First Magnitude Stars)

మిక్కిలి తేజోవంతములైన యిరువదినక్షత్రములలో నీమాసమువఱకు పదునొకండు కనబడుచున్నవి. అవేవి యనగా,

౧. చిత్ర (Spica.)
౨. స్వాతి (Arcturus.)
౩. మఘ (Regulus.)
౪. మృగవ్యాధుడు (Sirius.)
౫. రోహిణి (Aldebaran.)
౬. అర్ధనారీశ్వరుడు (Pollux.)
౭. పూర్వశ్వానము (Procyon.)
౮. అగస్త్యుడు (Canopus.)
౯. బ్రహ్మహృదయము (Capella, Auriga.)
౧౦. ఆర్ద్ర (Betelgeaux.)
౧౧. రిగెల్ (Rigel.)

### తూర్పున

పగడమువలె నెఱ్ఱగా మెరయుచు స్వాతినక్షత్రమును, ముత్యమువలె మెరయుచు చిత్రనక్షత్రమును ఇప్పుడే ఉదయించినవి. శ్రీనాథకవి సార్వభౌముడు వర్ణించినట్లు తూర్పున తోరణస్తంభములవలె నిలిచి మెరయు నీనక్షత్రముల శోభయే ఆనందాశ్చర్యములు కలిగించును. ఈ రెండింటికిని తోడు ఇపుడు కన్యారాశియందున్న గురుడు చిత్ర ప్రక్కనే నిలిచి అద్భుతముగా మెరయుచున్నాడు. ఈశోభ, ఈవైభవము చూచి ఆనందింపవలెను.

స్వాతికి ఉత్తరముగా— ఈశాన్యదిశను భూతేశమండలమునందలి కొన్నిచుక్కలు కనబడుచున్నవి. సప్తఋషులు బాగుగా ఉదయమైనారు.

### ఉత్తరమున

సప్తఋషులలో పులహ—క్రతురేఖ ధ్రువుని సూచించుచున్నది. లఘుఋక్షము ఇపుడు తూర్పుపడమరలకు అడ్డుగా (Horizontal) కనబడుచున్నవి. ఊర్వశి వాయవ్యమునకు ఒరిగినది.

### వాయవ్యమున

కల్పవృక్షచ్ఛాయనున్న రంభాదులగు అప్సరసలు త్వరలో నస్తమింపనైయున్నారు ఇంద్రమదసగము అస్తమించినది. చ్యవను డాప్రక్కనే ఉన్నాడు. పులోమకక్కసుడు గ్రుడ్లుమిటకరించుచున్నాడు

### పడమర

అశ్వినులు త్వరలో నస్తమింపనైయున్నారు. వారిదిగువనే శింశుమారము కొంత అస్తమించినది. ఆదిగువను దుంధు డున్నాడు.

### మధ్యను

ప్రాఝ్యపొక్కిళ్లవలె భరణియు, మెరుగుగు పురుగులులాగున కృత్తికయు, ఎద్దుకన్నువలె రోహిణియు, పగడమువలె ఆర్ద్రయు క్షీరవాహిని ప్రక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడమటకు వ్రాలి మెరయుచున్నవి. ఆక్షీరవాహిని ప్రక్కనే తూర్పుదెసను సారథిమండలమున బ్రహ్మహృదయమును, గగనమధ్యరేఖను మూషకవాహనుడైన లంబోదరుడును, దిగువ ముత్యాలహారమువంటి పునర్వసులో అర్ధనారీశ్వరుడను సాంబమూర్తి (Pollux), ఆదిగువను పూర్వశ్వానమును మెరయుచున్నవి. పునర్వసునకు తూర్పుగా, పొట్లపూవువంటి చుక్కమబ్బుతో పుష్యమి గలదు. ఆదిగువను సర్పాకారమై అహిమండలము ఆశ్లేష మొదలు బహుదూరము ఆగ్నేయమునకు వ్యాపించియున్నది. ఈయాశ్లేషాహిమండలములకు ఎగువను ఋగ్వేదప్రశంసితములను చమసగ్రావమండలములును, దిగువ వజ్రిమామండలమును గమనింపవలయును. ఆశ్లేషకు ఎగువను మఘ కలదు. అయ్యది పల్లకివలె ౫ నక్షత్రములని మనవారు చెప్పుదురు. కొడవలివంటి చుక్కలని పాశ్చాత్యు లందురు. మఘకు తూర్పుగా నేత్రములవలె రెండురెండున్న పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీనక్షత్రము లున్నవి. ఉత్తరఫల్గునీనక్షత్రములో చుక్క ఇపుడు చాలా తేజమును గోల్పోయినది. వేయివత్సరములకుపూర్వము అది మృగవ్యాధ, అగస్త్య, బ్రహ్మహృదయాదినక్షత్రములవలె మిక్కిలి తేజోవంతమై మొదటితరగతికి చేరిన నక్షత్రము (First Magnitude Star) అయియుండెను. ఇప్పుడా తేజము పోయినది-చిన్నచుక్కవలె నున్నది.

ఉత్తరకు తూర్పుగ సవితృదేవతాకమైన హస్త కలదు. [ఉత్తర $\frac{3}{4}$ + హస్త + చిత్ర $\frac{1}{2}$] ఈ మూడు రాసులు భాగములు చేరి కన్యారాశియగును. కన్యరాశి ననుసరించి వేణీమండల మున్నది. దానియెగువనే క్షీరోదఉత్తరధ్రువ మున్నది. దాని సంగతులు పాలసముద్రమథనము చర్చించునపుడు తెలిసికొందము. వీటికిని సప్తఋషులకును మధ్య సారమేయమండల మున్నది. సప్తఋషులకును లఘుఋక్షమునకును మధ్య నరకు డున్నాడు.

దక్షిణమున

వృత్రాసురుడు పడమటకు వాలుచున్నాడు. వృత్రపాదమనదగు రిగెల్ చుక్కకడ పుట్టిన యమున మెలికలుతిరిగి నైఋతిభాగమున నదృశ్యమగుచున్నది. ఆసమీపముననే ఉపరిచరవసు వున్నాడు. వృత్రుని దిగువ శశకమును, దానిదిగువ కపోతమును ఉన్నవి. క్షీరవాహినిలో వాసుకిచుక్కలను, వాసుకిచే చుట్టబడి దేవాసురలకు మంథానమైన మందరగిరియు ఇపుడు దక్షిణభాగమున చక్కగా చూడనగుచున్నవి.

పాలసముద్రమును మథించునపుడు మొదటపుట్టిన హాలాహలాగ్నిని మ్రింగి, వెలికి బోకుండ వశమున నుంచుకొని నీలకంఠబిరుదము పొందిన కథ సమన్వయించి వేరొకవ్యాసము వ్రాసియున్నాను. ఆ మృగవ్యాధ, వాసుకి ప్రముఖులదిగువ, దక్షిణముగా నౌకామండల మున్నది. 'దైవమ్‌నావ్' అని యీ దివ్యనౌక ఋగ్వేదకాలమునుండియు ప్రసిద్ధమైనది. స్తంభము (Mast), పృష్ఠము, చాపలు లోనగు నిండలి భాగములతో కూడ నిది యిపుడు చక్కగా నగపడుచున్నది. ఇందలి ముఖ్యనక్షత్రము అగస్త్యుడు (Canopus). ఈ కానొపస్ అను నతడు మేనిలాస్ (Menelaus) అను గ్రీకుపురాణప్రసిద్ధుని యోడనడపెనని గాథలున్నవి. అగస్త్యుని కనతిదూరములో మయుడు, అద్రిక, వల అను దక్షిణపుచుక్కలు క్షితిజసమీపమున నున్నవి. చిత్రదిగువను 'వార్తికపు పక్షి' (Corous) మెరయుచున్నది.

విశేషవిషయములు

దివారాత్రకాలములు సమముగా గల విషువత్పుణ్యకాలము (Vernal Equinox) ఈ మాసము నందే మార్చి ౨౧-వ తేదీని సంభవించును.

రిక్కమబ్బులు

ఒరయన్‌యోధుని పటకా (Belt of Orion) అను మూడుచుక్క లున్నవి. ఇవి రెండవతరగతి తేజముతో మెరయుచుక్కలు (Second Magnitude Stars). వీటినే మనరయితులు గొల్లకావిడిచుక్క లందురు. యూరపుఖండములో కొన్ని దేశములవారు వీటిని ముగ్గురురాజు (Three Kings) లందురు. ఆదిగు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వనే ఖడ్గమువంటి చుక్కలు కొన్ని గలవు. ఇచట గొప్ప రిక్కమబ్బు (Great Nebula) గలదు. ఇది చిన్న టెలిస్కోపులో చూచినపుడు భాస్వరమైన తెల్లని వెలుగును, అమధ్య అఖండతేజముతో మెరయుచు ముందుముందు నక్షత్రములుగా పరిణమింపగల-శైశవావస్థలో నున్నవని చెప్పదగిన-తేజస్స్వరూపముగల పిండములును కానరాగలవు.

### ఉల్కాపాతములు

ముఖ్యమైన ఉల్కాపాతములు లేవు. చిన్న ఉల్కలు సింహరాశిలో ౧౩-వ తేది మొదలు ౧౮-వ తేది వరకును పడును.

---

### మధుర దేవాలయము



మాతృభూతేశ్వరాలయము లోకప్పన
మార్కండేయ సంరక్షణము
(త్రివర్ణ చిత్రమునకు ప్రతికృతి)

—యస్. శంకరసుబ్రహ్మణ్యము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# దూరపుసంబంధము

గోపరాజు రాజన్న

## ౧

యమునానదీతీరమున రామరాజు పచారీ చేయుచుండెను. సూర్యాస్తమానసమయము. ప్రొద్దంతయు పాటుబడి సంపాదించిన రూకలను లెక్కించుకొనుచు, ఏమేమొ మాట్లాడుకొనుచు పల్లె వాళ్లు పట్టణములోనికి సాగుచుండిరి. నదియొడ్డున చిన్ననావ యొకటి కలదు. వాని కది అనతిదూరమున నున్నది. యమునాతరంగములలో మిళితమై హాయి గొల్పుచున్నది చల్లనిపాట యొకటి.

సంగీతమునిన చెవికోసికొను రామరాజు ఇంచుక యాగి చెవులను నిక్కపొడుచుకొని పాటను విను చుండెను. 'స్త్రీకంఠమువలె నున్నది' యని దిక్కులు నాల్గింటిని పరీక్షించి నావయున్నదిశనుండి పాట విన వచ్చుట గుర్తించెను. నావపై వానికి మనుజులెవ్వరును కానవచ్చుటలేదు. రామరాజు కొంతదూరము నడచెను. నావపై పాడుచున్న స్త్రీ గోచరమయినది. నావదగ్గరకు వచ్చెను. స్త్రీని తాను చూచెను. స్త్రీ రామరాజును గాంచలేదు. పరికించి పరికించి 'శారదకు సంగీతము వచ్చునా?!' యని మనసులో ననుకొని తాను సమీపించి నచో యువతి పాట మానివేయునని సంకోచించియు, ఆమెపై తనకుగల మోహమువలన సమీపింపసమకట్టెను.

రామరాజు అలహాబాదుకు వచ్చి ఐదువత్సరము లయినది. శాస్త్రబ్రహ్మచర్యపట్టమును ఇచ్చటనే పొందెను. కళాప్రపూర్ణ బిరుదమునకు చదువుచు న్నాడు. కళాశాలకు బోవుదారిలో నిత్యము ఇంచు మించు ఒకేచోట ఒకేకాలమందు ప్రతిరోజును శారద వానికి తారసిల్లుచుండెను. ఒకరినొకరు ప్రతిదినము చూచుటవలన వారి కొకవిధమయిన పరిచయము కలిగి నది. కాని, ఎప్పుడును వారు పలుకరించుకొనలేదు. శారద, సహాధ్యాయులప్రసంగపుధోరణిలో రామరాజు శారదనామమును తెలిసికొగలిగెను. శారదకు మాత్రము రామరాజు ఊరెయ్యదియో, పేరేమియో తెలియదు.

సమీపించి సమీపించి, నావపై ఒంటరిగా కూర్చున్నశారదను రామరాజు సమీపించెను. తెంపిన పూలదండవలె ఆమెపాట తెగినది. మందహాసము, తీక్ష్ణ దృష్టి—ఒకటివెనుక నొకటి—తెలియచేయుచు ఆమె ముఖము పవనునిసురి కనువయిన మాలతీలతవలె కలత చెందినది. శారద యించుక జరిగినది; తలవంచుకొని నది. మరల పాట ప్రారంభించినది. శారదయొక్క నటన వలన రామరాజుకు కోపము వచ్చినది. రస్తాయందు నాపై దృష్టి ప్రసరించుశారదకు ఎంతగర్వ మెక్కినది! చంచలబుద్ధి యనుమాటకు పర్యాయపదము స్త్రీ. మాటా డుట యటుండనిమ్ము. లేచి నిలవబడనైన లేదు. నిలవ బడుట యటుండనిమ్ము. ముఖము త్రిప్పుకొనుటయా?' యని రామరాజు ఆవేశపూరితు డయ్యెను. రెండు మూడడుగులు వెనుకకు వేసెను. ముఖము ముకుళించెను. ముకుళించి వాల్చెను. అద్దము పట్టినట్లు యమునానది శారదరామరాజులను ప్రతిబింబించుచున్నది. ఆప్రతి బింబములను రామరాజు చూచెను. తలపయికి నెత్తి శారదవైపు దృష్టి ప్రసరించెను. 'శారదా, శారదా, నీస్నేహితుడు' అని ఊరకుండెను. 'కూర్చొనుడు'



"కూర్చొనుడు అని......శారద యిట్లనుడివెను"



3- CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని పాటను మాని రామరాజు వంకకు తిరిగి శారద యిట్లు నుడివెను :

'ఆర్యా, తమరెవ్వరు ?'

రామరాజు ఆసీనుడై 'ఇంతకాలమునుండి నన్ను నీవు ఎఱుగవా ?' యని ప్రశ్నించెను.

శారద: జ్యోతిషశాస్త్రము నే పఠింప లేదు.

నివ్వెఱపడి, రామరాజు 'మ ఱేశాస్త్రమును పఠించితివి ?' అని పరిహాసముతో ననెను.

శారద: ఏశాస్త్రము పఠించిన నేమి ? జీవితము వ్యర్థము, జీవితము వ్యర్థము......

శారద పదునాల్గువత్సరములబాలిక. విడీవిడని గులాబిపువ్వువలె ఆమెముఖము నూత్నయౌవనాంకురమును స్ఫురింపజేయుచున్నది. రామరాజు ఆమె ముఖముపై అట్టులే చూచి, 'ఈప్రసంగమేమి ? శాస్త్రములతో, వ్యర్థమైనజీవితముతో కథ ప్రారంభించినది' అని యనుకొనుచు 'శారదా, ఇంతపిన్నవయస్సునందు నీకు వేదాంతఘోష యెట్లు అలవడినది ? నీవు చెప్పునది నాకు బోధపడుట లేదు. ఇంచుక విస్తరింపుము' అని రామరాజు పలికెను. గాలికి నల్లాడుచున్న యామె కురులు శారదమానసికభావప్రరహస్యమును వెల్లడిచేయ కలవేమో యని చెవి నొకింత అటుఒగ్గెను. గాలి తన పైపై వీచుచున్నదని అవి పవనునిరస్తాను ప్రకటించెను గాని వేఱేమియు నుడువజాలకపోయినవి. పసిపిల్లను కూకలువేయుచందమున ఆకురులను ఇంచుక సవరించుకొని శారద యిట్లు పలికినది: 'ఈ అభాగ్యురాలు మీనామమును తెలిసికొన కుతూహలపడుచున్నది'

రామ: నాపేరు రామరాజు. నీ వభాగ్యురాల వెటులయితివి ?

శారద జవాబీయలేదు. ఇంచుక సేపయినది. స్వాతివానకై ముత్యపుచిప్పలవలె వానికర్ణములు శారద పలుకులకు ఉవ్విళ్లూరుచున్నవి. అంతట ఆలోచించుచు, మెల్లగా

......

శారద: గతము గతమే. గతించిరి. వారితో సర్వము పోయినది. జీవిత మొకఎడారి...'

అని ప్రారంభించినది.

రామరాజుకు విసుగుపుట్టినది. 'శారదా, సూటిగా చెప్పుము. నీ ఊ రెయ్యది ? నీ తలిదండ్రు లెవరు ? నీ జీవిత మేల వ్యర్థమని తలచుచున్నావు' అని యాతడు గంభీరముగా పలికెను.

శారద: చెప్పుచున్నాను వినుము. నాపేరు శారద యని మీకు ఇదివఱకే తెలిసియున్నది. నాతలిదండ్రులు లేరు సింధునది ప్రాంతమునగల యొకపల్లె మాయూరు. పంజాబీలపిల్ల నేను. ఒకరితో నొకరు ఊహించుకొనినట్లు మాతలిదండ్రులు దివి కేగిరి. మాతండ్రి ఆర్య సామాజికుడు. నన్నొక ఆర్యసమాజపు సంఘమునకు ఒప్పగించి చనిపోయినాడు. ౫ వత్సరములబాలికను పరులచేతులలో పెట్టిపోయినాడు. బాల్యదశలో కొంత కాలము పంజాబులో విద్య నభ్యసించితిని. పిదప నన్ను పెంచుచుండిన సంఘము బీదదశకు వచ్చినది. అదికూడ నాప్రారబ్ధమేమో ! క్రమముగా సంఘము అంతరించినది. అంతరించుసరికి నాకు పదివత్సరములు. సంఘపు అధికారి నాయెడ కరుణ గలిగి నన్ను అలహాబాదు కొనివచ్చెను. ఇచ్చటగల ఆర్యసమాజపు సంఘమునకు నన్ను ఒప్పగించి, నావిద్యాభ్యాసమునకు, పోషణకు, సర్వస్వమునకు సంఘమె బాధ్యత యని నుడివితనదారిని తాను పోయెను....'

రామ: సరే. నీవు ఏతరగతిలో చదువుకొనుచున్నావు ?

శారద: తొమ్మిదవతరగతి. నాకథ పూర్తి కాలేదు. మా కిప్పుడు వేసవిసెలవుదినములు. తోడిబాలికలు వారివారిపుట్టినిండ్ల కేగిరి. నా కట్టి భాగ్యము లేదు. నేను మాతల్లి దివి కరిగిన రోజు. అదుగో చూడుడు! యమునానదిపై వంతెన. ఉత్తరదిక్కుగా పోవు రైలువైపు చూచుచు, చూచుచు మాతలిదండ్రుల యొద్దకు గొనిపోగలవా యని ప్రశ్నించితిని. మాతల్లి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాతలపులలో వాసమున్నది. నావిచారమును ఈ యమునాతల్లికి చెప్పుకొనుచు పాడుచున్నాను.

రామరాజు: అత్తవారింటికి పోరాదా?

శారద: అత్తవారిల్లు ఉన్నచో ఇంతవరకు చెప్పియుందునా? వివాహమా!—గృహస్థాశ్రమమున కన్న బ్రహ్మచర్యమే మేలు.. —

అని ఏమేమో చెప్పుచుండగా, రామరాజు పక్కున నవ్వి, 'బాలికవు. ఈయుద్దేశములను కొద్దికాలములో మార్చుకొందువు. బ్రహ్మచర్యమా! మాటయన్నంత సులు వయిన పనికాదు...' అనెను. హిమాలయముపై వీచుగాలి వలెపవనుడు అతిశీతలుడై వారిమేనుల సోకెను. సూర్యు డస్తమించెను. రామరాజు యమునాతరంగములను వీక్షించుచు నేదో ఆలోచించుచు కూర్చుండెను. శారదముఖము చెమ్మట క్రమ్మినది చీరచెంగుతో ముఖము నద్దికొని రామరాజువైపు చూచినది. ముఖము వాల్చినది. కనులనుండి బొటబొట కన్నీరు గార్చినది. నదిలో ప్రతిబింబించు శారదముఖమును రామరాజు చూచెను. 'వెఱ్ఱిపిల్లా, ఇంతేనా నీవేదాంతము!' అని కూర్చున్న శారదను రెండుచేతులతో లేవనెత్తి ఉత్తరీయముతో కనులుతుడిచి, 'నీకు వచ్చిన ఇబ్బంది లేదు, భయమును లేదు. కష్టము లిల్లుకట్టుకొని కాపుర ముండవు.' అని గుండెనిబ్బరము కలుగజేసి, జేబులో నుండి మూడు పదిరూపాయిలనోట్లను తీసి శారద చేతిలో పెట్టెను.

౨

రామరాజు క్షత్రియుడు; ఆంధ్రుడు; బెజవాడపురవాసి; గొప్పయింటిబిడ్డ. సనాతనధర్మమనిన మూతి విఱచును. వేదాంత మెక్కువయగుటవలననే హిందూదేశము స్వాతంత్ర్యము కోల్పోయినదని వాని నమ్మకము. సకలకార్యములు స్వయంకృషివలన కొనసాగునుగాని భగవంతునినమ్మి, భగవంతుడే అంతయు నొనగూర్చునని భగవంతునిపయి భారమువేయుట పిఱికితనముగాని ధైర్యచిహ్నము కాదని సహాధ్యాయులతో నెప్పుడును వాదించువాడు. బాల్యవివాహములనిన రామరాజుకు ఒడలుమంట. వివాహవిషయములో తలిదండ్రుల మాట ధిక్కరించి ఎన్ని సంబంధములు వచ్చినను వానిని త్రోసిరాజనెను.

అలహాబాదులో నతడు చదువుకొను కళాశాలకు నంటికొనియున్న వసతిగృహమందు నాతని కొక ప్రత్యేకపుగది కలదు. నాడు శారదతో బ్రసంగించి నప్పటినుండి రామరాజుమనసు మనసులో లేదు. పరీక్షదినములు సమీపించుచున్నవి. నాటివరకు రాత్రింబవళులు పుస్తకము విడువక చదివిన రామరాజు పరీక్షలయినవానివలె తొందరలేక మంచముపయి పరుండి ఏమో ఆలోచించుచుండెను. బాష్పపూరితములయిన కనులతో శారద వానికన్నులకు గట్టినట్లున్నది. ముఖవికాసమునుబట్టి వానిహృదయమును చూరగొనిన దది ప్రేమయో, కరుణయో, లేక రెండింటిమిళితమో నిర్ధారణచేయుట కష్టము. నుదురుపయి చేయి నైచుకొని, ఆచేతిని క్రమక్రమముగ శిరోజముల మధ్యకు పోనిచ్చి, వాని నిటునటు ఒత్తిగించి, ప్రక్కకు ఒత్తిగిలి కనులుమూసికొనెను. 'పంజాబు ఎక్కడ? ఆంధ్రదేశమెక్కడ? బాలిక ... ... సంఘపు కట్టుబాటు.....అది యొకపెద్దపాము......... దానిని త్రెంచి వైతునా? నాయెడ బుసకొట్టును.........' అని తనలోతాను అనుకొనుచుండెను. కొంతసేపటికి ప్రక్కనుండి లేచి పుస్తక మొకటి తీసికొని ఘంటకు నొకయక్షరముచొప్పున చదివెను. అట్లు రెండుఘంటలు చదివెను. చదివినపంక్తినే చదివెను. ఆపంక్తినే మరల చదివెను. తాను చదువుదానిపర్యవసానము తనకే అగమ్యగోచరముగ నున్నది. చెవిలో నెవ్వరో 'జీవితము వ్యర్థము, జీవితము వ్యర్థ' మని చెప్పుచున్నట్లు వినవచ్చెను. రామరాజుమనసు ఉద్రేకపూరిత మగుచుండెను. ఆయుద్రేకమును శాంతించునట్లు కనులనీరు గార్చుచు, చెదరిన శిరోజములతో శారద గోచరించుచుండెను. చేతిలోనిపుస్తకము కొండవాగువలె మంచము పయిబడి నేలకు జారినది. రామరాజు మంచము దిగి నిల్చుండెను. 'శారదా' యని ఊరకుండెను. 'సరే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనెను. “ కాని.........తలిదండ్రులు ! ...సంఘపు కట్టుబాటుతో పనిలేదు. తలిదండ్రులమాట యేమి?... వారియనుజ్ఞ పరమభాగ్యము. తల్లిదండ్రులయాజ్ఞ బడసి తినిపో శారదకు వివాహము అక్కరలేదుగదా ! నా కన్న రెండాకుల నెక్కువ చదివినటు లున్నది! బాల్యవివాహముతోనే నా వాదన. శారదా వాదము వివాహముతోనే ...... సరే ... కొలను లోని తామరపువ్వునకై ముండ్లకంచె లెన్ని యడ్డమువచ్చినను వానిని ఒత్తిగించియయిన, ఖండించి యయిన పద్మమును చేకొనవలెను............’ అని నిశ్చయించుకొని, చటాలున గదినుండి బయటకు వచ్చి, ఆకసమువంక చూచెను. నక్షత్రములు వానివంక నవ్వుచున్నటుల వానికి దోచెను. నీతో మాకు పనిలేదన్నట్లు విద్యుచ్ఛక్తిదీపములు కనులు



“ రామరాజు గదిచొచ్చి......పిదప నిద్రపోయెను ”

మూసికొన్నవి. ఎటుచూచినను చిమ్మచీకటి. రామరాజు గది చొచ్చి, కొంతతడవయిన పిదప నిద్రపోయెను.

3

శారద అందకత్తె కాదు. కాని కళావతి. చీర శృంగారించిన సంపూర్ణయౌవనవతివలె తోచును. లేనిచో బాలికవలెనగుపించును. పిన్నవయస్సునందు ఆర్య సమాజపు కట్టుబాటులలో పెరిగియుండుటవలన వేద ధర్మములు చదువుకొనినది. తానొకసన్యాసినియై మతము నుద్ధరించవలెనను కోర్కె ఆమెకు గలదు. ‘ధనమూల మిదం జగత్’అనులోకోక్తి ఆమెకు తెలియదు. ప్రపంచ మొకమిథ్యయనియు, బ్రహ్మచర్యమే సర్వదా శ్రేయ మనియు నామె తలపోయుచుండెను. ఇట్టి శారద రామరాజువద్ద ముప్పది రూప్యములు గైకొన్నది. వానికి ప్రత్యుపకారమేమిచేయుదునా యని తలంచు చుండెను. సన్న్యాసమే యవలంబించుచో ధనము వాపసుచేయుట యెట్లు ? శారదకు ఇదియొక పెద్ద సమస్య యయినది యమునానదియొద్ద రామరాజును కలిసికొనినది మొదలు ఆమెకు సరిగా నిద్దురపట్టుట లేదు. ఉద్యోగము చేసి అప్పుతీర్చివేయవలెనని ఆమె మనసు పరితపించుచుండెను.

ఒకసంవత్సరము కడచినది. శారద పదియవతరగతిలో ఉత్తీర్ణురాలయినది. ఒకనాడు చదువుకొను గదిలో చాపవేసికొని కూర్చున్నది నాటి వార్తాపత్రికలో స్త్రీలకుగల ఉద్యోగపు కాళీలను గమనింప నెంచి పత్రిక చూచినది. స్త్రీలకు ఉద్యోగములు కాళీలేవు. పుటవెనుకపుట త్రిప్పినది. అందు నొకపుటపై పెద్ద యక్షరములతో ‘రామరాజు అరెస్టు కాబడెను’ అను వార్త చూచినది. ఆతురతతో నావార్తయొక్క వివరమును పూర్తిగ చదివినది. తపాలా బంట్రౌతు తత్క్షణమే ‘శారద గారు’అని కేకవేసి, కవరునొకదానిని గదిలో విసిరి వెళ్లిపోయెను.

“ ప్రియమైనశారదకు,

శారదా, నిన్న మనపురములో ప్రజలు కలవరపడి, పోలీసులాటీలకు గురియయినవార్త నేటి పత్రికలో నీవు చూసియేయుందువు. బహిరంగసభలుగాని, స్వరాజ్యపు ఆందోళనగాని చేయరాదు అను మేజస్ట్రీటు ఉత్తరువుకూడ నీవు వినియేయుందువు. ఆవేశ పూరితుడనై తదాజ్ఞను నాక్షేపింప నెంచి నేనును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నామిత్రులు మఱికొందఱును ఉత్సవము నొకదానిని సాగించితిమి. పోలీసులు మమ్ము అరెస్టుచేసి మాతో గూడినప్రజలను లాఠీలతో తరిమికొట్టిరి. ఇట్టిగౌరవము నాకు ప్రాప్తించగలదని నీ కొకయుత్తరమును, నాతలిదండ్రుల కొకయుత్తరమును వ్రాసి, వేర్వేఱు కవరులలో నుంచి, నాఅరెస్టునుగూర్చి తెలిసినవెంటనే వానిని రవానా చేయవలసినదని నాసహాధ్యాయులను కొందఱిని కోరితిని. నాయెడ నీకు గౌరవముగాని, ప్రేమగాని ఉన్నయెడల నే త్రొక్కిన పథము త్రొక్కుము.

మిత్రుడు,
రామరాజు. "

ఈ యుత్తరమును శారద తొందరగా చదివినది. మరియొకసారి సావకాశముగ చదివినది. యమున, రామరాజు, రూపాయలు ఆమెమనసులో ప్రతిబింబించినవి. శారదకు నేమిచేయుటకు దోచ లేదు. స్వభావసిద్ధముగ కార్యశూరత్వము తక్కువ. దానికితోడు ఆకసములో నగపడు ఇంద్రధనుస్సుపయి కాపుర ముండవలె ననునూహలు. చీమకాలంత పని చేయుటకు నేనుగంత యాలోచన. ఉద్యోగముచేసి రామరాజుకు ధనము వాపసుచేయుటయా? లేక చెఱసాల కేగుటయా? కోరనివిషయమై యామెమనసు పీకుచుండెను. ఇంక కోరినదానిసంగతి చెప్పవలయునా? 'నా యెడ నీకు గౌరవముగాని, ప్రేమగాని ఉన్నయెడల,' అనుమాటలను తిరిగి తిరిగి చదువుకొన్నది. రామరాజునెడల ఆమెకు గౌరవము కలదో, ప్రేమ కలదో చెప్పుటకష్టము. వార్తాపత్రికను, ఉత్తరమును ఒకదానిపయి నొకటినుంచి, కురులను దిద్దుకొనినది. ముఖమును కుంకుమతిలకముచే నలంకరించినది. ఆద్దమందు ప్రతిబింబము వీక్షించినది. ఉత్తరమును మఱల విప్పినది. ఇంకొకసారి చదివినది. 'చెఱసాలకేగుట ప్రత్యుపకారమగునా?...... రామరాజు దేశభక్తి చూపు మని నన్ను ప్రోత్సహించుచున్నాడు...వానికది ప్రత్యుపకారమే యగును...' అని యనుకొన్నది. తన్ను పోషించుసంఘపు అధికారులకు తెలియజేయవలెనని నిశ్చయించుకొన్నది. చెఱసాల కేగుటయే గత్యంతరమని శారద నిర్ధారణ చేసికొన్నది.

౪

రామరాజుతలిదండ్రులు పుత్రుని దేశభక్తిని గూర్చి విని సంతోషించుటకుమారుగ విచారించిరి. 'పిల్లకాకి కేంతెలుసు ఉండేలుదెబ్బ' అని వారు విలపించిరి. వారికి మనసు ఉండబట్టలేదు. తత్క్షణమే అలహాబాదు ప్రయాణమయినారు. రైలు ఎక్కిరి. ఎక్స్ప్రెస్ (Express) అనుటచే బండి వాయువేగమనోవేగములతో బోవుచుండెను. కాని వారికది చీమనడకవలె తట్టినది. రెండురోజు లయినతరువాత వారు అలహాబాదు చేరుకొనిరి. పుత్రుని కారాగృహముబాజ్నుండి ఎవరో తప్పించినట్లు వారు ప్రయాణములో కలకనిరి. రామరాజు వారికి కుమారుడుగాని ప్రభుత్వమునకు కుమారుడా? న్యాయచట్టమునకు లక్షాధికారియు, భిక్షాధికారియు నొక్కటే.

౫



"బిడ్డా, బిడ్డా, ఎంతపనిచేసితివి"


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాడు రామరాజుకేసుతీర్పు. వానితలిదండ్రులు వానిని కోర్టులో గాంచిరి. 'బిడ్డా, ఓడ్డా, ఎంతపనిచేసితివి? తప్పువప్పుకొను' మని పోలీసులమధ్య నిలవబడియున్న పుత్రుని వారు కౌగలించుకొనిరి. నిస్సాకారముతో తలిదండ్రులను త్రోసిపుచ్చి 'క్షత్త్రియ వంశము నాది. కులగౌరవము నిలవపెట్టవలదా?' అని రామరాజు ధైర్యస్థైర్యములతో పలికెను. పోలీసులు వారిరువురను త్రోసివైచిరి. 'మాటాడ రాదు' యని రామరాజును వారు అదిమికొట్టిరి. కోర్టులో ప్రజలయలజడి క్రమముగా సన్నగిలినది. న్యాయాధికారి వచ్చెను; ఆసీనుడయ్యెను. ఆవెనువెంట ఇద్దఱు పోలీసులు, ఒకయువతియు కోర్టులోనికి వచ్చిరి. 'ఆడువాండ్రకుగూడ పోగాలము వచ్చినద'ని రామరాజుతలిదండ్రులా స్త్రీని చూచి పరిహసించిరి. న్యాయవాది రామరాజును చూచి, 'యువకుడా, చేసినతప్పిదమునకు పశ్చాత్తాపము నొందెదవా?' యని ప్రశ్నించెను. 'నాయనా, తప్పువప్పుకో, నాయనా, తప్పువప్పుకో' అని రామరాజుతల్లి గద్గదస్వరముతో నన్నది. తల్లి పేగు! కాని, పోలీసులు ఆమెనోరు మూసిరి. 'నే చేసినది తప్పుకాదు. తప్పుచేయనివాడు పశ్చాత్తాపము పొందుట యెట్లు?' అని రామరాజు నుడివెను. పిమ్మట న్యాయవాది స్త్రీ ఖైదీవైపు తిరిగి 'నీవేమయిన చెప్ప దలచుకొన్నావా?' యని ఆమెను ప్రశ్నించెను. స్త్రీ యిట్లు నుడివెను: 'రామరాజుగారియాజ్ఞ చొప్పున చెఱసాల కేగుటకు నిశ్చయించుకొన్నాను.'

న్యాయవాది: రామరాజు గడ్డి తినుమన్న తినెదవా?

స్త్రీ: దానితో తమకు పని లేదు. చెఱసాలకేగుట యుచితము.

'శారదా' యని రామరాజు నిట్టూర్పువిడిచి, శారదవైపు చూచెను. శారద రామరాజును చూచెను. న్యాయవాదికి జాలి పుట్టినది. కాని ఆతనుకూడ న్యాయచట్టమునకు బద్ధుడు కావలసినదే. శారదరామరాజులు కన్నీరు గార్చిరి. కోర్టులోనివారందఱు విముగ్ధులయిరి. భార్యాభర్తలు కూడబలుకుకొనిన ట్లున్నదని కొందఱు నివ్వెఱపడిరి. రామరాజుమాతాపితలకు నీశారదయెవ్వరో బోధపడుట లేదు. 'కొంపముంచావురా, కొడుకా!' అని వారు బావురుమనిరి. ఈగొడవలో రామరాజుకు ఆఱుమాసములును, శారదకు మూడుమాసములును కఠిన శిక్ష ప్రాప్తించినది.

౬

రామరాజుతలిదండ్రులు విచారగ్రస్తులయి బెజవాడ చేరుకొనిరి. యుక్తవయస్సువచ్చిన స్త్రీపురుషులు పూర్వబాంధవ్యము లేక స్నేహానురాగములతో నుండుతఱి అపవాదు లవలీలగ కలుగును. బెజవాడలో రామరాజును గూర్చి పలువురు పలువిధములుగ జెప్పుకొనిరి. 'స్వరాజ్యపుమాట దేవు డెఱుగునుగాని తలిదండ్రులనిన బొత్తిగ గౌరవము లే' దని కొందఱు; "దూరపుచదువులవలన శారదలు దాపురించెద" రని కొందఱు; "కుట్టకుంక, అయ్యో!" అని కొందఱు; "ఇప్పటికాలపుపిల్లలు చెప్పినమాటలు విన దరా? అని కొందఱు; "మాటలు నేర్చినకుక్కను వేటకు తీసుకొని వెళ్లిన ఉస్కో అంటే ఉస్కో అన్న" దని మఱి కొందఱు; "పంజాబీపిల్లను పెండ్లి చేసికొన్నవానికి కులగౌరవము లింకయెక్కడిది" వని కొందఱు—ఇట్లు క్షత్రియకులస్థులు యావన్మంది ఊసులు పెట్టుకొనిరి. కొందఱుమాత్రము, క్షత్రియ పౌరుషము నిలబెట్టినాడని రామరాజును పొగడిరి. కులస్థులప్రసంగములు ఎడారిలో సుడిగాలివలె రామరాజుకుటుంబమును చుట్టబెట్టినవి. వెలితప్ప వారికి గత్యంతరము లేదు. సనాతనధర్మక్షత్రియులు కొందఱు వారితో మాటాడుట కూడ మానుకొనిరి. 'శారదా, ఎంతపనిచేసితివి!' అని రామరాజుతల్లి విలపించినది. కారాగారవాసమున నున్న పుత్రునికై విలపించి విలపించి తల్లి మంచముపట్టినది. మనోవ్యాధికి మందు లేదు. పుత్రునిపయిబడ్డ యపవాదునకు, పుత్రుడు చేసినకార్యమునకు తల్లి పేగు దహించుకొనిపోయినది. క్షీణించి, క్షీణించి శల్యమై, రెండుసెలలకు నామె మరణించినది. రామరాజుతండ్రి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనమున గుందికుంది మఱినాల్గు రోజులకు స్వర్గస్థుడయ్యెను.

## ౭

నానాటికి శారదమనోభావములు మార్పు చెందుచు వచ్చెను. కారాగారవాసపు మూడునెలలకాలములో నామెలో ననేకములగు మార్పులు కలిగెను. 'జీవితము వ్యర్థమా? కాదు....ఎన్నటికిని కాదు...ప్రతిజీవియొక్క జీవితమును సార్థకమే...' అని తనలో తాను శారద వితర్కించుకొనుచుండెను.

'బ్రహ్మచర్యమా, లేక వివాహమా ?'

'బ్రహ్మచర్యమే ఉత్తమము. కాని దుర్లభము.'

'......... ..............'

'..............................'

ఇట్లు వేదాంతజ్ఞానులకయినను క్లిష్టసమస్యలయిన జీవితపుసార్థకత, వ్యర్థతలనుగూర్చియు, బ్రహ్మచర్య, వివాహ, గుణభేదములనుగూర్చియు నామె తర్కించుకొనుచుండెను. సహజముగ వేదాంతాభిలాషి. దానికి తోడు కారాగారము. బాహ్యబంధనము మనోవికాసమునకు నెంత తావొసగగలదో ఊహ్యము. మూడునెలలయినపిదప శారద విడుదలయయినది.

## ౮

నాడు వసంతపంచమియగుటచే స్త్రీపురుషులు చీమలబారులవలె త్రివేణీసంగమమునకు స్నానమునకు నరుగుచుండిరి. శారదకూడ బయలుదేరినది. రామరాజును ఆమెయు కలసికొను రస్తాగుండ బోవుచున్నప్పుడు రామరాజు కళాశాలకు నేసుచున్నట్లు ఆమె హృదయఫలకముపయి చిత్రించినట్లయినది. స్నానమున కేగినపుడు పవిత్రనదులసంగమము శారద మనస్సునందు నూత్నభావములను స్ఫురింపజేయుచుండెను. ఆపుణ్యసంగమము పరస్పరమైత్రివలనిలాభము మానవకోటికి ప్రకటించుచున్నటు లామెకు దోచెను. నాడు యమునానదిలో ప్రతిబింబించిన రామరాజుముఖము అచ్చట గలదేమో యని చూచెను. క్రమక్రమముగ శారదమనస్సు వివాహమే ఉత్తమమని నచ్చజెప్పుకొనుచున్నది. జలకమాడి గృహమునకు బోవుసరికి శారదకు జాబు వచ్చియుండెను. అది రామరాజు వ్రాసినఉత్తరము. ఆత్యాతురతతో శారద దానిని విప్పి చదువుకొన్నది. ఆశ్చర్యమును తెలియజేయుచు



"మరల మరల ఆఉత్తరమును చదువుకొన్నది"

మరలమరల ఆఉత్తరమును చదువుకొన్నది. రామరాజులో నెంతమార్పు కలిగినది! వివాహపుటౌచిత్యమును గూర్చిఉపన్యసించిన రామరాజు బ్రహ్మచర్యమనుచున్నాడే! ఆహా! మానవులభావము లెంతలో మాఱిపోవుచుండును! ......కాదు, కాదు.........ఇది నామదదృష్టము......నాడు యమునపై బ్రహ్మచర్యమునుగూర్చి నేను ఉపన్యసించలేదా? అట్లే ఈతడిప్పుడు......' అని యనుకొని ఉత్తరములో తన్ను


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గూర్చి ప్రేమరూపములగు పదము లేవయిన గలవేమో యని శారద దానిని సావకాశముగ ఇట్లు చదివినది:

"ప్రియమైనశారదకు,

గతవారము చెఱసాలనుండి విడుదలయయితిని. నామాట పాటించి నీవు చెఱసాలకు నేగినందుకు నా వందనములు. నాదురదృష్టవశమున మాతలిదండ్రులు కాలముచేసినారు. గృహస్థాశ్రమముకన్న బ్రహ్మచర్యమే ఉత్తమమని నానమ్మకము. ఇది నీకు క్రొత్త సిద్ధాంతము కాదు."

## ౬

శారద రామరాజుల పరస్పరానురాగపు వృత్తాంతము కళాశాలాధికారులకు, ఆర్యసమాజపు అధికారులకును తెలిసినది. ఇరువురి కులసంప్రదాయములను వారు కనుగొనిరి. ఒకనాటి సాయంకాలము శారద రామరాజులను వారు యమునాతీరమునకు గొనిపోయిరి. నావనొకదాని నద్దెకు మాటలాడి వారుయావన్మంది దానిలో ఇచ్ఛావిహారము సాగించిరి. కొంతదూరము పోయిన తరువాత అధికారులు శారదను ఇట్లు ప్రశ్నించిరి:

'శారదా, నీకు రామరాజు భర్తయగుట ఆనందమా?...'

శారదనేత్రములు రామరాజుముఖమును తేనెపట్టు నాకర్షించుకొను తేనెటీగలవలె నున్నవి. శారద జవాబీయలేదు. మందహాసముతో ముఖము వంచినది.

అధికారులు శారదా, రామరాజు క్షత్రియుడు, గుణవంతుడు, రూపవంతుడు, ధనవంతు డనికూడ మాకు తెలిసినది. వానిశీలము ప్రశంసనీయమయినది.

శా: అనాథుల కంతకన్న కావలసిన దేమియున్నది?

శారదపలుకులురామరాజు హృదయమునులక్కనుఅగ్ని కరగించినటులు కరగించినవి. కాని, కొంతతడవయినపిదప 'బ్రహ్మచర్యమే నాదీక్ష' యని అతడు నిశ్చయించుకొనెను.

అధి: రామరాజూ, నీసందేహ మేమి?

రామ: నేను బ్రహ్మచర్యదీక్ష నవలంబించితిని.

అధి: తలిదండ్రులు మరణించినంత మాత్రమున, బంధుగులు వెలివేసినంతమాత్రమున బ్రహ్మచర్యదీక్ష నవలంబింపవలెనా? జీవితమున నీపరమావధియేమి?

రామ: దేశసేవ.

అధి: అనగా నెట్టిది?

రామ: అజ్ఞానాంధకారము పారద్రోలుటకు విద్యావ్యాప్తి కలుగజేయుట.

అధి: ప్రశంసనీయము. అట్టి పరమావధి నిర్వర్తించుటకు గుణశీలములు గల భార్య ఎంతో సహాయభూతురాలు కాగలదు... శారద మేధావి. జ్ఞానాజ్ఞాన విచక్షణలు గలబాలిక ... నీకు తగు ఉద్యోగము కూడ మేము చూపగలము.

రామరాజు సావకాశముగ ఈ మాటలను వినెను. పూర్వము శారద నిరీక్షించుచుండిన వంతెనకడకు నావ వచ్చినది. శారద కన్నీరుగార్చిన రోజుతాను 30 రూపాయిలు ఇచ్చినదివసమును రామరాజుకు జ్ఞప్తికివచ్చెను. ఆమెముఖపద్మముపయి గల కురులు ఇప్పు డాతని నాహ్వానించుచున్నటులు వానికి దోచెను. శారద యమునలో చూచుచుండెను. రామరాజు శారదప్రతిబింబము గాంచెను. ఆలోచించి యాలోచించి 'అట్లే కానిం' డని రామరాజు సమ్మతించెను. సమ్మతించి 'శారదా, నీవు నాకు 30 రూపాయిలు వాపసుచేయ నవసరములే' దనెను. '30 రూపాయిలకు 3 నెలల కారాగారవాసము చేసితిని కాదా' యని నవ్వుచు శారద పలికినది.

రామరాజును, అధికారులును నవ్విరి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మహాత్ముని హరిజనయాత్ర:

## ఆంధ్రదేశము

"గాంధీగారంటే ఆంధ్రులకు మూఢభక్తి" అని ఆంధ్రేతరులు చాలామంది అనుచుండగా విన్నాను. అవును, ఉదారహృదయులకు ఏయుగపురుషుడన్నను భక్తి యుండుట సహజము. మూఢవిశ్వాసములు, మూఢాచారములలో మునిగియుండువారిని నూతన సందేశములు ఆకర్షింపజాలవు. ఆంధ్రులు సహజముగా సంస్కారప్రియులు. బుద్ధభగవానుని విజ్ఞానము తెలుగుదేశములో వ్యాపించి నాటుకపోయినది. అమరావతిలో విశ్వవిద్యాలయములు వెలసి స్తూపములు, విహారములు నెలకొల్పబడినవి. రామమోహన, విద్యాసాగరులు ఆంధ్రహృదయమున కొంతకాలము రాజ్యము చేసిరి. లోకోత్తరపురుషుడు, నవయుగధర్మసంస్థాపనాచార్యుడు, మహాత్ముడు తెలుగువారి మనస్సును గ్రహించెను. కపటములేని త్యాగము, కొలతలేనియుత్సాహము, నిష్కామమగు సేవ! ఎన్నిసార్లువచ్చినను అఖండమయిన స్వాగతము, ఎక్కడికి వెళ్లినను సర్వపక్షసమ్మేళనము! నల్లజండాలు లేవు. కుతర్కములు గిట్టవు. కావలసినది మనసారు దర్శనము, ప్రేమపూర్వకాశీర్వాదము.

పన్నులు బరువు, పంటలు లేవు, ధరలు పడిపోయినవి, అప్పులు తీర్చరానివి, అయిననేమి, అడిగినచాలును, తోచినదియివ్వగలరు. ఒంటిమీద నగఒక్కటే. 'సోదరీ, భిక్షము'అని చేయిచాపుటతడవు, పతియనుమతి యక్కరలేదు; పేదరికము అడ్డమురాదు; సర్వార్పణము! చివరకు మంగళసూత్రముకూడ జమకెక్కడు!

పోలీసులు సలాములు పెట్టిరి. పోలీసు పైయధికారులు దారితీసిరి. రేల్వేఉద్యోగులు సాష్టాంగపడిరి; తమ కుటుంబములకు దర్శనమిప్పించుటకు రైళ్లనాపిరి. ఇంటిముందు ఒకనిమిషమాగిన ౧౧౬ రూ. చెల్లించిరి.

దేశమంతయు సంతోషమున నోలలాడెను. సంఘము కదలినది. నూతనశక్తి యబ్బినది. ఆంధ్రదేశమునుండి విశేషధనమునేకాక, ఘనకార్యమును గూడ మహాత్ముడాసించినాడు. ఆయన యాశ నిరాశ కాలేదు. హరిజననిధికి విశేషధనము కూడినది. మహాత్ముడు సంతసించినాడు; అభినందించినాడు.

### మహాత్మునిసందేశము

(హిందూపురములో జనవరి 4-వ తేది యుదయమున)

"ఆంధ్రదేశమందు నేను లక్షలకొలది జనులను జూచియున్నాను. అస్పృశ్యతాపిశాచము మరణశయ్యయందు మూల్గుచున్నదని నాయభిప్రాయము. నా అభిప్రాయము సత్యమో అసత్యమో ధ్రువపరచుభారము మీయందున్నది. మీరందరును, అస్పృశ్యతాభావమును మీహృదయములనుండి పెకలించివేయుదురని ఆశించుచున్నాను.

ఈశ్వరసృష్టి చాల విచిత్రమైనదనుటకు సందేహములేదు. కాని అతని సృష్టియందు ఉచ్చనీచభేదభావములు కలవని ఎవరును చెప్పజాలరు. భగవత్సృష్టిలో వృక్షములకు అసంఖ్యాకములగు పత్రములు కలవు. అందొకయాకు గొప్పది. మరొకటి తక్కువది అని ఎవరనగలరు? భగవంతుడు మానవులందరిని సమానహక్కులతో సృష్టించియున్నాడు. అందు ఒకడు హెచ్చు, ఒకడు తక్కువ యనునది మానవనిర్మితము. ఏమనుష్యుడు తాను సర్వోత్తముడని భావించుచున్నాడో అతడు పతితుడగుచున్నాడనియు, తాను రేణువుకంటె తక్కువయని ఎవడు అనుకొనుచున్నాడో వాడు సర్వోత్తముడుగ పరిగణింపబడుచున్నాడనియు అనుభవమువలన మనము తెలిసికొనుచున్నాము. మానవుడెల్లపుడును అభివృద్ధిని గోరుచున్నాడు. మనము సులభముగ హరిజనులము కాగలము. అనగా, హరికిచెందిన మనుజులమని నాయభిప్రాయము. కోట్లకొలది జనుల కట్టిభాగ్యము లభించుట సామాన్యము కాదు. మనము మన భేదభావముల విస్మరించిన, మన అంతఃకలహము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లన్నియు నశింపగలవు. హరిజనులపట్ల మనము మనభేద భావముల విస్మరించిన హిందూసమాజమందేకాక, ముసల్మానులు, క్రైస్తవులకును మనకు గల భేదభావములు గూడ నశించి నిజమగు ఐక్యము ఏర్పడగలదు. దేశమునందీయస్పృశ్యత నిర్మూలింపబడునంతవరకు నాకు మనశ్శాంతియుండదు. నాపట్ల కనపరచినమీ ప్రేమకు కృతజ్ఞత దెల్పుటకుముందు మీ లోటుపాటులను దెలుపనిచో, అయ్యది అసంపూర్ణమే యగును. స్వయంసేవకులును, కార్యకర్తలును చాల కష్టించి పనిచేసిరనుటకు సందియము లేదు. కాని ఇన్నాళ్లయనుభవము మీదకూడ, వారు తమ కర్తవ్యమును గూర్చిన సంపూర్ణజ్ఞానమును సంపాదించియుండలేదనుటకు విచారమగుచున్నది. సభాసమావేశముల నేర్పాటుచేయునపుడు మనము చిన్నచిన్న విషయముల గూడ గమనింపవలయును. ప్రతివిషయమును బాగుగ పరిశీలించి ఏర్పాట్లు చేసికొనవలయును. అట్లు మనము చేయకపోవుట మనకు దూరదృష్టియు, ఆలోచనశక్తియు లేదని రుజువుచేయును. ఆంధ్రదేశములోని స్వయంసేవకులు దూరాలోచనతోను, సరియైన ఆలోచనతోను పనిచేసిన వారద్భుతమగు కార్యములను చేయగల్గుదురు.

ఆంధ్రులలో అద్భుతమైన భావోద్రేకమును, శ్రద్ధాభక్తులును గలవు. భగవానుడు గీతయందుపదేశించిన ప్రకారము శ్రద్ధాభక్తులతోబాటు విమర్శజ్ఞానము ఉన్నగాని ప్రయోజనము లేదని చెప్పియున్నాడు. అందువలన ఆంధ్రదేశీయ కార్యకర్తలును, స్వయంసేవకులును వలయు విమర్శపూర్ణమగు జ్ఞానమును సంపాదించవలసినదిగా కోరుచున్నాను. మీ రట్టిజ్ఞానము సంపాదించినచో మీశక్తి ఇనుమడింపగలదు.

తన సహచరులను స్తుతించుట మిత్రధర్మము కాదు. తమ మిత్రులయందలి లేని గుణములనుపొగడి వారిని మోసగించుట యుత్తమకార్యముకాదు. అందుననే నేను ప్రత్యక్షముగ జూచిన మీ లోటుపాటులను తెల్పుట నా ధర్మమని తలచి తెల్పితిని. నేనట్లు చేయనిచో, మీ మిత్రత్వమునకు కృతజ్ఞతను జూపుటకు బదులు కృతఘ్నత జూపినవాడ నగుదును. నా యీ హెచ్చరికను గమనించి, తమ లోటుపాటుల దిద్దుకొందురని విశ్వసించుచున్నాను.

నేను హరిజనసేవకులు విశుద్ధవర్తనులుగా నుండవలయు నని పలుమారులు వ్రాసియు, జెప్పియు నుంటిని. అత డెప్పుడును మాలిన్యదృష్టి నుంచకూడదు. అతని స్పర్శ నిష్కల్మషముగా నుండవలయును. అతనివాక్కు పవిత్రముగ నుండుట వసరము. అత డెపుడును పరనింద చేయరాదు. శత్రుమిత్రు లెల్లరను ప్రేమతో చూచుచుండవలయును. ఈ శుద్ధియజ్ఞమందు అపవిత్రస్వభావముగలవా రుండరాదు. హరిజనసేవయందు పాల్గొను మనమందరము మన యంతరాత్మలను పరిశుద్ధ మొనర్చుకొనవలయును. ఈ సుందరసుప్రభాత సమయమున, సూర్యభగవానుని సాక్షిగ, అస్పృశ్యతా కళంకమును, మనదేశమునుండి తరిమివేయుటకు వలయుశక్తి నొసంగవలసినదని మనమందరము భగవానుని ప్రార్థింతము."

హరిజననిధికి ఆంధ్రదేశము విరాళములు

| | | | | |
|---|---|---|---|---|
| పడమటికృష్ణ | రు. | ౭౩౪౬ | ౧ | ౧౦ |
| తూర్పుకృష్ణ | | ౫౧౨౮ | ౦ | ౩ |
| గుంటూరు | | ౭౪౯౫ | ౯ | ౬ |
| తూర్పుగోదావరి | | ౭౩౧౫ | ౧౪ | ౧ |
| పడమటిగోదావరి | | ౧౦౩౧౬ | ౭ | ౯ |
| నెల్లూరు | | ౧౨౧౦౪ | ౦ | ౩ |
| విశాఖపట్టణము | | ౭౮౫౨ | ౧౧ | ౧౦ |
| చిత్తూరు (నగలుకాక) | | ౧౩౦౭ | ౧౫ | ౨ |
| కడప | | ౧౪౭౨ | ౨ | ౯ |
| అనంతపురము | | ౫౭౫౩ | ౧౨ | ౨ |
| ప్రావిన్షియల్ బోర్డు | | ౪౪౯ | ౦ | ౦ |
| మొత్తము | రు. | ౬౬౫౪౧ | ౧౧ | ౭ |

మా. బాపినీడు,

ఆంధ్రరాష్ట్ర హరిజనసేవాసంఘ కార్యదర్శి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



కీ. శే. మల్లంపల్లి శారదాంబగారు
(జననము ౨౫-౧-౧౯౧౫, మరణము ౮-౧-౧౯౩౮)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కీ. శే. మల్లంపల్లి శారదాంబగారు

ఈమె ఆరాధ్యకుటుంబమునకు జెందిన ఆంధ్ర యువతి. కృష్ణాజిల్లాలోని గుడివాడ నివాసులును, సుప్రసిద్ధ న్యాయవాదులు నగు శ్రీ శివలెంకపున్నయ్యగారి పుత్రిక. మల్లంపల్లి కుమారబ్రహ్మానందముగారిధర్మపత్ని. సంగీతమునందు ఈమెపాండిత్యము సహజసిద్ధము. ఈమెగాత్ర మతిమనోహరము. తొల్గరగించు గాంధర్వ విద్య ఈమెకు వెన్నతోడ బెట్టినది. కర్నాటకఫణితి యందును, హిందూస్థానీ గవాయి సంప్రదాయము నందును అపారమైన ప్రజ్ఞ లేతవయసుననే ఈమెకు పట్టువడెను. వీణావాద్యమున కడుసమర్థురాలు. హార్మోనియమునందు సునిశితమైన సుస్వరములను సులభముగా బలికింపనేర్చిన దిట్ట. ఈమెసంగీతనైపుణ్యమునకు విద్వాంసు లచ్చెరు వందిరి.

సంగీతమునందేకాక సాహిత్యమునందును అసాధారణప్రజ్ఞావంతురా లయ్యెను. హిందీప్రాథమికపరీక్షల యందుత్తీర్ణయై కీ. శే. జంధ్యాల శివన్నశాస్త్రిగారి వంటి హిందీపండితుల మెప్పువడసెను. ఆంధ్రసారస్వతమునందీమెకు గల యభిరుచి యపారము. కేవల గ్రంథవ్యాసంగముననే తన సాహిత్యజ్ఞానమును పెంపొందించుకొనెను. గాంధిమహాత్ముని మహోపదేశములను దీక్షతో పఠించి ఖద్దరువస్త్రములే దేశస్వాతంత్ర్యమునకు దీక్షావస్త్రములని సదా వానినే ధరించెను.

ఈమె విద్యాసక్తికి భర్త సహకారియై కడుంగను ప్రోత్సహించెను. అత్తింటికాపురము అయిదు సంవత్సరములేయయ్యును ముత్తయిదువులకుతలమానికమై పరమసాధ్వియై పుట్టినింటికిని మెట్టినింటికిని వన్నెయు వాసియు దెచ్చి పసుపుకుంకుమలతో పరమపదము నందెను. సతీపతుల యనురాగము అసమానము. కాని యాసతిని వీడిన పతియొక్క వియోగము నేడు దుర్భరము.

బాల యయ్యును సుగుణాలవాల. సకలసద్గుణనికురంబ. ఈశారదాంబ. పదునెనిమిదేండ్లకే అకాలమృత్యువువాతబడిన యీమెకై శోకించు ప్రియభర్తకును, తలిదండ్రులకును భగవంతుడూరట గలిగించి ఆమెయాత్మకు శాంతి నొసంగుగాక.

---



సారంగధరుని మెట్ట —పి. రాఘవరావు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## ఆంధ్రవిశ్వవిద్యాలయము

భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణావశ్యకతను గురించి సుమారు 25 సంవత్సరములనుండి మన యాంధ్రులు ఆందోళనము చేయుచున్నారు. దీనిని, భారతవర్షములో నితరరాష్ట్రములలోని జనసామాన్యము ఆమోదించియున్నారు. రాష్ట్ర సుపరిపాలన, స్వపరిపాలనలకు దేశభాషలలోనే రాచకార్యములన్నియు జరుగవలెననియు, శాసననిర్మాణసభలలో ప్రజలు ఎక్కువగ పాల్గొనవలెనన్న దేశభాషలలోనే చర్చలు జరుగవలెననియు, ప్రజలలో ఉన్నతవిద్యకూడా విరివిగా వ్యాపించవలెనన్న దేశభాషలలోనే, మన విశ్వవిద్యాలయములు, సమస్తశాస్త్రములను, కళలను గఱపవలెనియు అందరము అంగీకరించక తప్పదు. మన యాంధ్రదేశమున కంతకును ఒక్క ప్రత్యేక విశ్వవిద్యాలయమును మొదట కోరియుంటిమి. ఆకోరిక యీడేరినది కాని, ఫలములు చేకూరలేదు. కొన్ని సౌకర్యములు కలవని, ఆంధ్రరాష్ట్రములో ఒకమూలను దీనిని స్థాపనచేసి మన గాయలసీమాంధ్రుల మనస్సుల నొప్పించి, వారిని విడిపోవునట్లు చేసితిమి. ఇప్పుడు వారిని తిరిగి బలవంతముగా కలుపుకొనుటకు ఆంధ్రయూనివర్సిటీ ఆక్టును మార్చుటకు బిల్లును ప్రవేశపెట్టితిమి. వారు తమకు సమీపమున నున్న మద్రాసు విశ్వవిద్యాలయముతో తమ కళాశాలలను చేర్చుటవలన వారి కెక్కువ సౌకర్యములు, పలుకుబడి యుండుటలో సందేహమేమి? మనమిట్లు వారిని బలవంతపరచినకొలది వైషమ్యములు తప్పక జనించును.

మనము ఆంధ్రవిశ్వవిద్యాలయము నేర్పరచుకొన్నందువలన బావుకొన్న దేమి? అదివరకు లేనిది, మనప్రజల కేమి లాభము కలిగినది? మద్రాసు విశ్వవిద్యాలయములో మేము నేర్చుకొన్న చదువే - విద్యావిధానమదే - పరీక్షలవే - కళాశాలలవే. ఈవైసు ఛాన్సలరు, రిజిస్ట్రారు, ప్రొఫెసర్లు, పరిశోధకపండితులు, సెనేటర్ల ప్రయాణభత్యములు, అదనముగా మన నెత్తిని పడినవి. వీరు చేయునదంతయు మద్రాసు విశ్వవిద్యాలయము చేయునదే. మనలో కొందరికి పలుకుబడి, ధనసంపాదనము, పరీక్షలు చేయు నధికారము, ప్రాపకము, పోషకత్వము మొదలగునవి దొరకినవి కాని, పూర్వపు సంకుచిత దృష్టి వీరిని వదలలేదు. స్వార్థత్యాగము చూపించక తమరు చేయుపనికొలది జీతములు తీసికొనక, ప్రజలధనము నెంత గ్రహించుచున్నారో ఆలోచించుడు.—ఈ విద్యాలయము స్థాపన తేదినుండి, ధనమునంతయు భౌతికశాస్త్రముల నన్నింటిని విదేశభాషలనుండి అనువదించుట కుపయోగించిన యెడల తమ నామమును సార్థకముచేసికొనియుందురు, ప్రస్తుత మున్న కళాశాలలను బాగుచేయుటలోను. వృద్ధి చేసి ఆనర్సు కోర్సులను పెట్టుటకు బదులు విశాఖపట్టణముననే పట్టముగట్టి పులినిచూచి నక్కవాత పెట్టుకొన్నట్లు ఇంగ్లాండులోని ఆక్సుఫర్డు కేంబ్రిడ్జిలలోవలె సమస్తవిద్యలు ఒకచోటనే పుంజీభూతముచేసి వృద్ధిపరచవలెననే హ్రస్వదృష్టి వీరి నావరించినది. రాష్ట్రములోని తక్కిన కళాశాలలు కొరగానివైనట్లు వానిలోని విద్యార్థులను తమ విశ్వవిద్యాలయ పరీక్షలకు లోనుగావించుట. పరీక్షాధికారులను తామేయేర్పరుచుట, యిట్టి సంయుక్తవిశ్వవిద్యాలయములోని ముఖ్య లోపము.

భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణమునకును, విశ్వవిద్యాలయముల స్థాపనకును ఎట్టి సంబంధము ఉండనక్కరలేదని నాకు తోచుచున్నది. ఆంధ్రరాష్ట్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మన కంతకును ఒక్క విశ్వవిద్యాలయ మేల యుండవలెను. ఇంగ్లాండు, అమెరికా, జర్మనీ మొదలగు దేశములలో అనేక విశ్వవిద్యాలయములు వెలసినవి. ఇవి యన్నియు అన్ని శాస్త్రములను గరపుచున్నవా! మనకు ఆదేశములవారికిగల ధనము కలదాయని కొందరు ప్రశ్నింపవచ్చును. ప్రస్తుతమున్న మొదటి తరగతి కళాశాలలు విశ్వవిద్యాలయములుగనే మారి, ఒకటి రెండు శాస్త్రములలోనే విద్య గరపి, విద్యార్థులకు డిగ్రీల నేల యీయరాదు? మన మనోదాస్యమే, యిట్టి హ్రస్వదృష్టికి కారణము. ఆయా కళాశాలలకు ఈ గవర్నమెంటే, యీ జమీందారులే యీ వర్తకశిఖామణులే, యీ ధనవంతులే యిప్పు డిచ్చినట్లుగానే ధనసహాయ మేలచేయరాదు? ఈధనవ్యయమనకు అంతెక్కడ? కాశీ విశ్వవిద్యాలయమునకు కోటిరూపాయలు సేకరించినను మఱియొక కోటిరూపాయలు కావలెనని పండిత మాళవ్యాగారు ఘోష పెట్టుచున్నారు. ప్రతికళాశాలయు తనచుట్టుపట్ల పరిస్థితులను బట్టి, అభ్యాసమునకనువగు శాస్త్రములనే స్వల్పవ్యయముతో బోధించగలుగును. ఏ శాస్త్రమం దెవరికి అభిరుచిగలదో వా రా విశ్వవిద్యాలయమునకేగి సిద్ధాంతాచరణ భాగములను నేర్చుకొనెదరు. ఈ విశ్వవిద్యాలయములలో కొన్ని సులభముగాను, చవుకగాను డిగ్రీల నిచ్చెదరని కొందరు భయపడవచ్చును. అయిన నేమి? విద్యావ్యాప్తి మనకు ముఖ్యముగాని, యీబిరుదులా మనలను రక్షించునవి? ఇంతవరకు గవర్నమెంటువారు స్వయముగాగాని, వారి పేరుమీదగాని యేర్పరచిన విశ్వవిద్యాలయపరీక్షలు ప్యాసైనగాని, వారియుద్యోగములను ఈయరు. ఇకముందుకూడ ఈయరనుకొనుడు? ఇట్టి యుద్యోగములు నియమిత సంఖ్యమాత్రమే గలవగుటచే నిప్పుడు ప్రతిసంవత్సరము వేడియప్పచ్చులు పెనమునుండి జారవిడుచునట్లు శరపరంపరగ వెడలుచున్న మన గ్రాడ్యుయేట్ల గతియేమి? ఇకముందు, మనము సంపాదించిన విద్యబట్టియే మనలను సత్కరించి, ప్రజలు పోషించెదరు గాని, మన డిగ్రీలను బట్టికాదు. ఏవర్తకుని యొద్దనో, యే ఫ్యాక్టరీలోనో యే గనిలోనో, యేపాఠశాలలోనో, యేకంపెనీలోనో యే భూమిఖామందువద్దనో మనము ఉమేదువారీ కొంతకాలముచేసి, అనుభవము సంపాదించిన కొలది మన విద్యార్థులు ప్రయోజకు లగుదురు గాని, యీవిశ్వవిద్యాలయముల డిగ్రీలు మాత్రమే మనకు తిండిని పెట్టవు. పాశ్చాత్యదేశములలో అనేకవేలమంది విశ్వవిద్యాలయములలో డిగ్రీలను తీసికొనకుండా, జీవనోపాధిని సంపాదించుకొనుటయే కాక, గొప్ప గౌరవము, ధనము, జ్ఞానమును పొంది యున్నారు. డిగ్రీలు సంపాదించుకొని, నిరుద్యోగమువలన బాధలు పడుచున్న వారును ఉన్నారు. ప్రజాసంస్థలలో మన తెలివితేటల వలననే కాని, డిగ్రీ లున్నంతమాత్రముననే మనకు గౌరవస్థానము దొరక నేరదు.

కాబట్టి, రాష్ట్రమునకంతకును ఒక్క సంయుక్త విశ్వవిద్యాలయ (Federal University) ముండుట న్యాయమంకాదు. అన్ని ఆనర్సు కోర్సులు ఒక్క చోట నుండుట మిక్కిలి అనుచితము. ఢిల్లికి ఢిల్లే, పల్లెకు పల్లే యని ప్రతికళాశాలను తనకుగల ధనమునుబట్టియు, త్యాగమును చూపించు ఉదారులగు ప్రొఫెసర్లను బట్టియు, ఒకటి రెండు అభిమానశాస్త్రములలోనే ఉత్తమ విద్యనిచ్చి, తన విద్యార్థులను పరీక్షించి తన ప్రొఫెసర్ల చేతనే డిగ్రీల నిప్పించవలెను. విశ్వవిద్యాలయము పేరుకంటె, విద్యార్థి తన ప్రొఫెసరుయొక్క పేరునుబట్టియే తాను పరపతి సంపాదించుకొనగలవాడగును. ఆధునికస్థితులను బట్టి మన రాయలసీమాంధ్రులు మారుమూలనున్న నేతిబీరకాయ యనదగు ఆంధ్రవిశ్వవిద్యాలయాపేక్షను వదలి తమ కళాశాలలను సమీపములోనున్న మద్రాసువిశ్వవిద్యాలయములో చేర్చియుంచుటకుగాని, లేక తమ కళాశాలలను స్వతంత్ర జాతీయ విశ్వవిద్యాలయములు (National Unitary Universities) గ మార్చుటకాని జరిగించవలెను. ప్రతి ఆంధ్రజిల్లాయును, విద్యావిషయములో తన స్వతంత్ర తను నిలుపుకొనుటచే, ప్రత్యేకరాష్ట్రస్థాపన సూత్రమున కెంతమాత్రము అడ్డు కలుగదు. నేను 1911-వ సంవత్సరములోనే, ఆంధ్రులుకూడా విడిపోయి చిన్న చిన్న ప్రత్యేకరాష్ట్రములను, అమెరికాసంయుక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాష్ట్రములోని అట్లాంటికుస్టేట్సువలె ఏర్పరచుటలో నెట్టి లోపము కలుగదని వ్రాసియుంటిని. కాబట్టి ప్రస్తుత పరిస్థితులలో నా గొంతెమ్మ కోరికలు సఫలము కాక పోయినను, నా రాయలసీమ సోదరులు, విశాఖపట్టణ విశ్వవిద్యాలయముతో సంబంధము నుంచుకొనవలదని నా ప్రార్థన.

పల్లూరి సూర్యనారాయణరావు,

(కృష్ణాపత్రిక, ౩-౨-౩౮)

---

## కేరళ దేశపు కథకలి

[౧౯౩౮-వ సం. జనవరి ౨౭-వ తేదినాటి కృష్ణా పత్రికయందు ప్రకటితమయిన 'భారతనాట్యప్రశంస' యనువ్యాసమునుండి]

ఇటీవల కేరళదేశపు కథకలిని ప్రశంసించుచు అనేకులు వ్యాసములు వ్రాయుచున్నారు. భారతదేశపు నాట్యకళ కేవల మిక్కడనే ప్రతిష్ఠింపబడి, పరిపూర్ణత గాంచినదనియు, భరతుని నాట్యశాస్త్రము కన్న ఇది ప్రాచీనమనియు అతిశయోక్తులను నుడువుచున్నారు. భరతుని శాస్త్రమున లేని ముద్రలును, అభినయ విశేషములును కథకలిలో గానవచ్చునని యాక్షేపించుచున్నారు. నిజము పరికించినచో, నిది కేవలము సత్య దూరము. కథకలి 17-వ శతాబ్దమునాటిదనియు, ఎంత వెనుకకుపోయినను 13-వ శతాబ్దముకంటె పూర్వమునకు జెందదనియు, ప్రాచీనచరిత్రపరిశోధకులు వ్రాసియున్నారు. సంస్కృతనిఘంటువులోని సకల శబ్దజాలమునకును భరతుని శాస్త్రమునందు అభినయ నిఘంటు వున్నది. భరతుడు స్వభావము ననుసరించి ముద్రల నేర్పాటుచేసెను. కాని కథకలిలో సంప్రదాయముగ సిద్ధమైపోయిన కొన్ని ముద్రలు స్వభావమునకు, విలాసమునకునుగూడ విరుద్ధములుగ నున్నవి లేకపోలేదు. పతాకము త్రిపతాకముగను, త్రిపతాకము పతాకముగను కథకలిలో వేర్కొనబడుచున్నవి. భరతునిచే నిర్దేశింపబడిన అర్ధచంద్రహస్తము స్వాభావికముగ నున్నది. కథకలిలోని 'అర్ధచంద్రహస్తము అస్వాభావికము. వృద్ధాప్యమును సూచించెడి 'ముష్టి'ని చూపించుపట్ల, చేత గజ్జ పట్టుకొనుటకు బొటనవ్రేలు పైకుంచుటకు బదులు, అస్వాభావికముగా లోపల నుంచబడుచున్నది. బాణాసనమును చేతబట్టుకొనినట్లు సూచించుచు, శూరత్వమును తెలియజేయు శిఖరహస్తము నోటిదగ్గర నుంచినచో త్రాగుడును సూచించును; వెలకిల నుంచినచో పితృతర్పణమును తెలియజేయును. స్వభావ సిద్ధములైన ఈ ముద్రలకు మారు, కథకలిలో, దూరమున నున్నవానిని నిర్దేశించుటకు మనము చూపుడు వ్రేలిని చాచియుంచు హస్తము ప్రవాడుకలో నున్నది. ఈ మార్పు 'పతనము' గాని, 'అభివృద్ధి' గాజాలదు. ఏముద్రయైనను స్వభావమునుబట్టియు, సౌష్ఠవమును బట్టియు విమర్శింప బడవలెను. దీనిని బట్టి చూచినచో, కథకలి స్వతంత్రమని, భరతునినాట్యశాస్త్రమునకన్న ప్రాచీనమని నుడువుటకన్న, భరతుని నాట్యశాస్త్రమే దేశమంతటను వ్యాపించి వివిధప్రాంతములలో వివిధ రూపముల గౌరవింపబడుచున్నదనుటయే సమంజసము.

ఇట్లనుటచే కథకలియొక్క ప్రాశస్త్యమునకేమియు లోటురాదు. భారత సంప్రదాయము లనేకము లిందు ఉత్పన్నములు గాకుండ నిలిచి యున్నవి. కథకలి చాలచోట్ల ఆంధ్రదేశపు వీథినాటకమును, తమిళదేశపు 'తేరుకొక్కట్టు'ను, కన్నడదేశపు 'యక్షగానము'ను బోలియే యుండును. కథాప్రారంభమునకు పూర్వము నిర్గీతవాద్యము, దైవప్రార్థనము, కథానాయకుని ప్రదర్శనము—ఇవన్నియు ఇంచుమించు సంస్కృత సంప్రదాయమునే అనుకరించుచున్నవి. వీని తరువాత 'మంజుతర' అను గీతగోవిందములోని 17-వ గీతము గానము చేయబడును. అనంతరము ఇద్దరు గాయకులు, ప్రదర్శింపబడబోవు కథ నంతను గానము చేయుదురు. కథాసరళిని వివిధపాత్రలు ప్రవేశించి, వాచికముగాకుండ, తక్కిన సాత్విక, ఆంగిక, ఆహార్యాభినయములతో కథ నంతను ప్రదర్శించును. గీతముయొక్క ప్రతిచరణమునకును అభినయమును, చరణమునకు చరణమునకు మధ్య విరామమునకు కేవల నృత్తమును సలుపబడుచుండును. వాచికాభినయము లేకపోవుటచే కథకలి ఉపరూపకమగును కాని రూపకము కాదు. కథకలిని మహానంద



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముతో బ్రశంసించుచు ఉదయశంకరు డిట్లుల నుడివెను: "కళాభ్యాసపిపాస నాకు మెండు. యూరపు, అమెరికా, జావా మొదలగు ప్రదేశములకు బోయి ప్రశస్తములైన నృత్యములను గాంచితిని. కాని, కథకళివంటి యుత్తమ నాట్యమును నే నెక్కడను చూచియుండ లేదు. నాట్యకళ అక్కడ పరిణతి గాంచినది. మానవుని కళాప్రకృతి కది అద్భుతప్రదర్శనము. మానవుని ఆశయములను, భావములను వ్యక్తము చేయుటలో దానికి మించినది మరియొకటి లేదు. హస్తనేత్రాద్యభినయములచే తెల్పబడిన భావ, వాచికభావకన్న బలవత్తరము. అభ్యాసకుల కుపయుక్తములగు విషయములందు అనేకములు కలవు." ఉదయశంకరుని యీవాక్యములు కేవలము కథకళికే కాక, మొత్తముమీద భారత నాట్యకళ కంతకును చెందునని తలచుట సమంజసము."

---

కోయదొర






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౯. ఎగ్మూరు రైల్వేస్టేషను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨౧. కాన్పుల వైద్యాలయము (ఎగ్మూరు)



౨౧. మ్యూజియం
(ఎగ్మూరు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మనవి మాటలు

## వ్యావహారికాంధ్రము*

గ్రాంథిక భాషావాదుల ప్రాతికూల్యం ప్రబలంగా ఉన్నా వ్యావహారికభాష చాలా విరివిగానే ప్రచారంలోకి వస్తూఉంది. నవ్య సాహిత్యంలో అధికాంశం అందే పుట్టుతూ ఉంది; కాని, అది సజీవమే అయినా, మధురమే అయినా వ్యవహారంలో ఉండేది కాబట్టి, దానిలో అనేకపదాలు ఒకతీరూ, ఒకతెన్నూ లేక, నానారూపాలను పొందిఉంది. పదాలు మాత్రమేకాదు, వాక్యరచనావిధానంకూడా అట్లే కనబడుతూ ఉంది. అందుచేతనే వ్యావహారికభాషను అభిమానించి, అంగీకరించేవారు కూడా 'దానికి ఏకత అక్కరలేదా' అని ప్రశ్న వేస్తూఉన్నారు. నియమా లేవీ లేకపోతే ఆ 'ఏకత' ఎట్లా ఏర్పడుతుంది?

సహజంగానే యీ 'ఏకత' లేనిదానికి తోడుగా శ్రీగిడుగు రామమూర్తిపంతులు గారు "ఒక్క సమాజములోనివారైనా ఒకరిని ఒకరు నిర్బంధించి 'నియమములు' చేయకూడదు. 'స్వేచ్ఛ', 'స్వాతంత్ర్యము' గ్రంథ కర్తల కుండవలెను. వారి కుచితమయిన నియమములు వారే ఏర్పరచుకొంటారు" అని 'లైసెన్సు' ఇచ్చివేశారు. భావాల విషయంలో ఇది చెల్లుతుంది కాని భాషవిషయంలో చెల్లుబడి కాజాల దని నేటికాలంలో వ్యావహారికభాషలో వెలువడుతూ ఉన్న నవ్యసాహిత్యం నిరూపిస్తూఉంది. నియమాలను నిర్ణయించుకొనే సామర్థ్యం తత్కర్తల కనేకుల కున్నట్టుకూడా దానిలో గోచరించడం లేదు. స్వేచ్ఛ ప్రసాదించిన పంతులుగారే 'మాతృభాష ప్రయోగించేవారు శిష్ట ప్రయోగ మనుసరించవలెను' అని 'అంతే' అయిన 'నియమము'ను ఒకదాన్ని ఏర్పరిచారు. శిష్టులుచేసే ప్రయోగాలు శిష్టప్రయోగా లవుతవి. కాబట్టి నేడు వ్యావహారికభాష ప్రయోగించేవాళ్లలో శిష్టు లెవరో మొదట తేల్చుకొని ఆవల వారి ప్రయోగాల శిష్టతను నిర్ణయించుకోవలసి ఉంది. ఈనిర్ణయాన్ని నేటి వ్యావహారికభాషా ప్రయోక్తల్లో ఎందరు చేసుకోగలుగుతారో? ఇది కష్టసాధ్య మయిన పని.

నేడీ తీరుతో ఉండే 'ఏకత' లేని వ్యావహారికభాషవల్ల నవ్యసాహిత్యాభివృద్ధి శంకించవలసివుంటుంది. కాబట్టి శ్రీరామమూర్తిపంతులుగారున్నూ, వారివలెనే వ్యావహారిక భాషాభిమాను లగు పండితులును నియంతలయి ఈవిషయాన్ని చర్చించి నవ్యసాహిత్యకర్తలు భాషావిషయంలో ఏకమా

---

* వెనుకటిసంచికలో 'మొగడతరకలు' అనే శీర్షికక్రింద శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు ప్రకటించిన 'ఆంధ్రభాష' అనే వ్యాసాన్ని చూడండి.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్గాన నడిచేటట్టు చేస్తే నవ్యసాహిత్యం తామరతంపరగా వృద్ధిపొందుతుంది; స్థిరంగా కూడా ఉండిపోతుంది.

స్వాతంత్ర్యము సర్వథా అపేక్షించ వలసినదే కాని అదివిశృంఖలమూ, వివేక దూరమూ అయితే నిష్ప్రయోజకం కావడం తోనే నిలవదు; ఉపద్రవకరంకూడా అవుతుంది. అందరికీ స్వయంనిర్ణయసామర్థ్యం ఉండదు. కాబట్టే తక్కినవారిని సవ్యంగా నడపడంకోసం వివేకవంతులూ, సమర్థులూ, అయిననియంతలు ఏర్పడుతూఉండడం లోకం లో పరిపాటి అయింది.

---

## నాగరి—ప్రాచ్యవిద్యాపరీక్షలు

ప్రాచ్యవిద్యాపరీక్షలయందు సంస్కృత ప్రశ్నపత్రముల కుత్తరములు నాగరి లిపియందే వ్రాయవలయు ననునది విశ్వ విద్యాలయముల నియమము. ఈ నియమ మెందుకో తెలియ నలవికాకున్నది.

సంస్కృత మెవ్వరికిని మాతృభాష కాదు. దాని కొక ప్రత్యేకలిపి లేదు. కావుననే అన్నిలిపులలో దానిని చక్కగా వ్రాయుటకు సాకర్యములు ఏరుపడినవి. నాగరి హిందీ, మహారాష్ట్రభాషల లిపి. ఆలిపితో తదితరభాషలవారి నందరిని సంస్కృతము వ్రాయుడని నిర్బంధించుట ఉచితముకాదు. సాహిత్యసంపద అధికముగ వెలసిన అన్నిభాషల వగు లిపులును సంస్కృత వ్యవహారమునకు చాలినవయ్యెను, ఇతర లిపులయందుకంటె నాగరిలిపియందే సంస్కృతవాఙ్మయ మధికముగ ముద్రిత మయియున్నది. ఇందుకు కారణము హిందీ, మహారాష్ట్రభాషలు రెంటికి నాగరి ఒక్కటియే లిపియగుట; ఆరెండును మాతృభాషలుగా గలవా రధికసంఖ్యాకులగుట; గుజరాతి, బెంగాలి భాషల లిపులు నాగరిని కొంత పోలియుండుట; కాని అది సంస్కృతము తనకోసము సంపాదించి ఉంచుకొనియున్న లిపియగుట కాదు.

ఈనాగరిలిపిపరిచయము ఇతర లిపులయందు ముద్రితములు కాని సంస్కృతగ్రంథములను జదువుటకుమాత్ర మావశ్యకమగును. వ్రాయుట కది యక్కరయే లేదు. అత్యల్పకాలమున, అతిసులువుగ నేలిపినయిన చక్కగా చదువ నేర్వవచ్చును; వ్రాయ నేర్చుట అట్లు సులువుకాదు. దానికి కాలము, శ్రమ అత్యధికముగ కావలయును. ఇంతకష్టపడి నను చక్కగా, వేగముగా వ్రాయగలుగుట అరిది. అందువలన అడిగినప్రశ్నలకు—లేక ఆవశ్యకము లగు కొన్నిటికేని—సమాధానములు వ్రాయలేకపోవుట, వేగముగా వ్రాసినచో వ్రాలు తిన్నగా నుండకపోవుట యగుచుండును. దీనికి ఫలము పలువురు పరీక్షలయందు కడతేరజాలకపోవుటయే.

ఈ నాగరలిపి నిర్బంధమునకు ఉత్తర పత్రములను దిద్దువారి సౌకర్యమే కారణ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగునా? అట్లయిన నంతకు మిగిలిన తెలివి తక్కువ వేరుండబోదు. ఏలిపిలో వ్రాసిన ఉత్తరపత్రములను ఆ లిపి నెరిగిన సంస్కృత విద్వాంసులే దిద్దిన సరిపోవును. సంస్కృత పాండిత్యమునకు నాగరిలిపి తెలిసియుండుట యే లక్షణముకాదు. ఈ నియమ మెన్ని విధముల చూచినను సముచితమయినదిగా తోచకున్నది. కాన విద్యార్థులకు అనావశ్యక మగు బాధను కలిగించు నీ నిర్బంధమును విశ్వవిద్యాలయములు ఎంత శీఘ్రముగ తొల గించిన నంతమేలు వారికి చేసినవగును.

---

## అభినవాంధ్రకవిపండితసభ

"స్థాయిసంఘమువారు మహాసభకు ఈ దిగువ ఉదాహరించిన సూచనలు చేశారు:

౧. అభినవాంధ్ర కవిపండిత సభ అనే పేరు మార్చి ఈ మహాసభకు 'నవ్యసాహిత్య పరిషత్తు' అని పేరు పెట్టవలెను.

౨. ఈ పరిషత్తు లక్ష్యములు:—నవ్యసాహిత్య సృష్టి, విమర్శ, ప్రచారము జరపవలెను.

3. లక్ష్యసిద్ధికి ఏటేటా ఉత్సవాలూ, సమావేశాలూ, ప్రదర్శనాలూ జరపవలెను.

౪. నవ్యసాహిత్యానికి ఉపకరించే గ్రంథజాలము సేకరించి కేంద్ర గ్రంథాలయము గుంటూరులో ఏర్పాటు చేయవలెను.

5. గ్రంథాలయానికి అనుబంధముగా 'నవ్య గ్రంథవిక్రయశాల' స్థాపించవలెను.

6. పరిషత్తువారు ప్రోత్సహించే వచన గ్రంథాలలో భాష వాడుకభాషే అయి ఉండవలెను.

7. నవ్యసాహిత్యపరిషత్తు తరఫున ఒకపత్రిక ప్రకటించవలెను. (ఈ ఏర్పాటు చేయడానికి ఒక ఉపసంఘముఏర్పడెను).

### తీర్మానములు

*　　*　　*　　*　　*

౨. ౧౯3౨-33 స్థాయిసంఘమువారు చేసిన సూచనలన్నీ ఆమోదించడమైనది.

3. నవ్యసాహిత్యపరిషత్తు నిబంధనలు తయారు చేయడానికి ఉపసంఘము ఏర్పాటుచేయడ మైనది.

౪. వచ్చే సమావేశమునకు అనంతపురమువారి ఆహ్వానము అంగీకరించడ మైనది.

౫. ౧౯33-౧౯3౪ లకు స్థాయిసంఘము నియమించడమైనది.

దానికి రాయప్రోలు సుబ్బారావుగారు అధ్యక్షులు. తెలికిచెర్ల వెంకటరత్నంగారు ఉపాధ్యక్షులు.

వేమల సత్యనారాయణ శాస్త్రిగారు కార్యదర్శి. మరి పదుమూవురు సభ్యులు.

'పదములు, పాటలు, పద్యములు' 'పాడుట'తోను 'కథలు చెప్పుకొనుట'తోను గడచిన దనుకొనిన 'అభివాంధ్ర కవిపండితసభ' అభినవాంధ్రవాఙ్మయ వికాసమున కీ తీరున తలపెట్టి ఆంధ్రసహృదయులమెప్పులను విలుచుకొనినది. ఇపుడు సభకు విలువపెరిగినది.

'నవ్యసాహిత్య పరిషత్తు'నందలి 'నవ్యసాహిత్య' శబ్దమునకు 'నవ్యభావసమంచిత మగు సాహిత్య' మనునర్థము కావలెను. అట్టి సాహిత్యమునకు గ్రాంథిక వ్యావహారిక భాషాభేదములతో పనిలేదు. కావున 'పరిషత్తువారు ప్రోత్సహించే వచనగ్రంథాలలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాష వాడుకభాషే అయి ఉండవలె' నను నియమము పరిషత్తు పూనిన నవ్యసాహిత్యాభివృద్ధికార్యమునకు గొంత యభ్యంతరము కాగలదు.

మరియు, పరిషత్తు ఆమోదించిన సూచనలలో 'భాష' ప్రసక్తియే లేదు. కాని నవ్యసాహిత్యసృష్టికి వ్యావహారికభాష తగిన దని పరిషత్తు భావించినట్లు పై నియమము వలననే స్పష్టమగుచున్నది.

ఈ కాలమున వ్యావహారికభాషయందు విరివిగ (నవ్య) సాహిత్యసృష్టి సాగుచున్నది. దాని సారస్యముమాట ఎట్లున్నను, భాష మాత్రము ఒకదారి, ఒకతీరు లేక స్వైర ముగ నడచుచున్నది. వ్యావహారికభాష యందలి గుణాతిశయమును గుర్తించిన పరిషత్తు దాని కందచందముల నమరిన యొక స్వరూపమును తీర్చిదిద్ద ప్రయత్నింపవలయు నని తలపకపోయినది. భావప్రకటనసాధనము భాష. దానివిషయ మీపరిషత్తు లక్ష్యము లలో ప్రాధాన్యము గావలసినది.

---

## పూర్వగాథాలహరి*

ఇతిహాసపురాణాదిరూపమగు వాఙ్మయ మపారము, నగాధము. అమూల్యము, మహత్త్వసమంచితము నగు ప్రాచీన భారతీయ విజ్ఞానసంపద నది హృద్యము లగు కథల ద్వారమున బోధఃరుచుచున్నది. తత్తత్కథాప్రసక్తము లగు పాత్రములు, పట్టణములు, పర్వతములు, నదులు, వనములు మొదలగునవి అనంతసంఖ్యములు. వాని పరస్పర సంబంధము, చరిత్ర, ఇతర వివరములు సమగ్రముగ తెలియగలుగుటకు సకలపురాణములు, ఇతిహాసములు మున్నగు వాని నామూలాగ్రము పరిశీలింపవలసి యుండును. బహుళవ్యయప్రయాసమూలకమగుట నది ఏనాటివారికిని కష్టసాధ్యము. ఓపికకూడ లేని ఈనాటివారి కది కేవల మసాధ్యము. ఇట్టి యసాధ్యకార్యమును సులభసాధ్యముగ చేయగల యమూల్యగ్రంథము నొకదానిని 'పూర్వగాథాలహరి' యను పేరున వేమూరి శ్రీనివాసరావు (బి. ఏ., బి. యల్.) గారు రచియించి యాంధ్రులకు మహోపకారము నొనరించినారు. పౌరాణికపాత్రాదుల నామములను, ముప్పదియారు ప్రసిద్ధ పురాణాది గ్రంథములయం దుపలబ్ధములగువాని నేర్చి అకారాది క్రమమున నీగ్రంథమున కూర్చినారు. ఆయా నామములకు చెందిన చరిత్రాది వివరములను ఆయాగ్రంథములనున్న విధమున (గ్రంథనామములతో) సేకరించి ఆయాపేరులకు జతపరిచినారు. గ్రంథకర్త 'అనన్యసహాయు' డయి తొమ్మిదేడులు,

---

* రాయలుసైజు, పు. ౫౬౦. అసలు వెల రు. ౩-౮-౦. తగ్గింపు వెల రు. ౬-౦-౦. ఈవెల ఏప్రిల్ ఆఖరువరకుమాత్రమే. పుస్తకముల నమ్మువారి చిరునామా :—కనుపర్తి మార్కండేయ శర్మగారు, బృందావనము, కీళ్పాక పోస్టు, చెన్నపురి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విద్యార్థిదశయం దున్నపుడు, పడిన ప్రయాస కీగ్రంథ మనుత్తమఫలము. ముద్రణాదికముల వ్యయ మత్యధికముగ నున్నకాలమున, ఎనిమి దేడులనాడు, గ్రంథము ముద్రితమయి వెలు వడినది. ఇంతకాల మయ్యును ఈగ్రంథము నుపయోగమునకు శతాంశమేని తగినవ్యాప్తి యున్నట్లు తోపదు. ఇట్టిగ్రంథ మొక్కటి యున్నదనియైన తెలుగువారిలో చాలమందికి తెలియనే తెలియదేమోయను సంశయమును కలుగుచున్నది. ఉనికిని తెలిసినవారి కేని గ్రంథ నామము గ్రంథస్థవిషయమును సూచింప దగినదిగ చూపట్టదు. 'పూర్వగాథాలహరి' యన నేదో యొక పాతకథల కవిలె అను నర్థము స్ఫురించుచున్నది. ఈ యర్థము గ్రంథగౌరవమునకు న్యూనత నాపాదించుట యేకాక తద్వ్యాప్తిని భంగపఱుచునది. కాని ఇపు డావిచారము గతజలసేతుబంధనము.

ఇం దింకను చేరవలసిన పౌరాణికనామ ములు అనేకములు గలవు. వైదికనామము లను సైత మిందుచేర్చుట యుక్తము. ప్రాబం ధికములనుగూడ. ఈగ్రంథము ప్రథమప్రయ త్నసిద్ధము; ఇప్పటికిని శూన్యప్రతిఫలము.

మఱియు నిట్టిపని హిమవత్పర్వతశిఖ రాధిరోహణమువంటిది. ఎంతవరకు నధిరో హించిన నంతవరకు గల విశేషములు బయ లుపడగలవు. కావున అసమగ్రమగుటవలన నీగ్రంథమునకు లోపములేదు. సమగ్ర మగు టకు అత్యధికవ్యయప్రయాసము లావశ్యకము లు. పునర్ముద్రణభాగ్యము కలిగినపుడు గ్రంథ కర్త యోపికమెయి గ్రంథమునకు సమగ్ర తను సమకూర్పదగుదురు. అట్టిపని ప్రకృత ముద్రణము ఆంధ్రుల సంపూర్ణాదరమునకు పాత్రమగునేని సాధ్యము గాగలదు.

---

### వావిళ్ల నిఘంటువు

లోపములు కొన్నియున్నను ఇప్పటి కున్న తెనుగునిఘంటువులలో మంచిదన దగినది శబ్దరత్నాకరమే. ఆంధ్రసాహిత్య పరిషత్తువారు 'సూర్యరాయాంధ్రనిఘం టువు' అను పేరున నొక నిఘంటువును తయారుచేయించి ప్రకటింప నిరువదేండ్లకు పూర్వమే తలపెట్టినారు. కాని, అది యిం కను ప్రకటితము కాలేదు. ఇపుడు వావిళ్లవా రొకనిఘంటువును తయారుచేయించి ప్రకటింప సంసిద్ధులయియున్నట్లు వారు ప్రచురించిన 'వావిళ్ల నిఘంటుస్వరూపము' అను మచ్చు పత్రములవలన తెలియవచ్చుచున్నది. ఆంధ్ర వాఙ్మయోద్ధరణ మొనరించిన వావిళ్లవారి కాంధ్రు లిదివరకే ఎక్కువగా ఋణపడి యున్నారు. ఈనిఘంటువు ప్రకటనముతో నాఋణము శతగుణముగ పెరుగగలదు. మఱియు, 'వావిళ్ల' శబ్దపూర్వమగు నీ 'నిఘంటు'వు వలన వావిళ్లవారి పేరు కీర్తులు ఆంధ్రవాఙ్మయముతోపాటు చిరంజీవ ము లగుచు వెలయును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'వావిళ్లనిఘంటువు' సంధాత శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలు గారు. 'పుష్కరము మించిన కాలము' 'సూర్యరాయాంధ్ర నిఘంటుకార్యస్థానమునఁ బనిచేయుచు దీర్ఘకాలము ప్రధానపండితపదవియందుఁ బని చేసి' నవారు. వీరు 'ఉభయభాషలయందుఁ గల పరిశ్రమమును, భాషాంతరముల పరిచయమును, నిఘంటురచనానుభవమును' 'ముందునకుఁ ద్రోయ' 'నీ నిఘంటువు రచియింపఁ బూని'నారు.

ఈ నిఘంటువున

"భారతాదిగ్రంథముల నుండియు, నిటీవల ముద్రితమయిన కుమారసంభవాది గ్రంథముల నుండియుఁ దత్సమేతరపదములును, అర్థవిశేషముగాని, ప్రయోగవిశేషముగాని గల తత్సమపదములును, అంచత్, లసత్, మొదలగు శత్రంతాదిపదములు నుదాహరణములతోఁ బద్యసంఖ్యాసహితముగ సేకరింపఁబడును. తత్సమపదములు సామాన్యముగా సంస్కృత నిఘంటువులనుండి గ్రహింపఁబడును. అర్థవివరణాదుల విషయమున శబ్దరత్నాకరముకంటెఁ గాని, యితర ప్రసిద్ధవ్యాఖ్యాతలకంటెఁ గాని వేఱుగా గ్రహించినపుడు ఆవశ్యకమగుచోటఁ గారణము తెలుపఁబడును. ముఖ్యమగుస్థలములందుఁ బాఠభేదములు చూపఁబడును. కొన్ని పదములకు శబ్దరత్నాకరమున మాధ్యమికకవుల గ్రంథములనుండి యుదాహరణము లిచ్చుటచే విమర్శనాసక్తులు గొందఱు ఆపదములకుఁ బ్రాచీనత్వాభావము కల్పించుట సంభవించును. ఆదోషము పరిహరించుటకై సాధ్యమగునంతలోఁ బ్రాచీనోదాహరణములే సేకరింపఁబడును. వ్యవహారమునఁ గల పదముల నేకములు చేర్చుటయే గాక వాని నుపయోగించురీతి తెలియుటకై వాడుకలోని వాక్యములుగూడఁ జేర్పఁబడును. వ్యాకరణవిరుద్ధములని యెంచఁబడు కొన్ని పదములకు సాధ్యమగుచోట సాధుత్వప్రక్రియ చూపఁబడును. ఆంధ్రదేశమున నధికపరిచయ మొందిన హిందూస్థానీపదములును, ఆంగ్లభాషాపదములును నిందు గ్రహింపఁబడును. ప్రస్తుతవ్యవహారముల ననుసరించి తెలుఁగుపత్రికల ప్రధానవ్యాసములలో వాడఁబడుచున్న యాంగ్లభాషాపదములు అర్థవివరణాదులతో నిందుఁ జేర్పఁబడును."

నిఘంటువుపరిమాణము 'రమారమి పదునేనువందల పుటలు.' ఇది 'గ్రాంథిక వ్యావహారిక మిశ్రముగా' నుండును. 'రెండుసంవత్సరములలో ముద్రణమునకు సిద్ధముకా'నున్నది. (కాలపరిమితి కొన్నాళ్లక్రిందట ననుకొన్నది.) ఇందు 'మొత్తము నలువదియైదువేలు పదము లుండవచ్చును. తత్సమ తత్సమేతరపదములు సమానస్థానము నాక్రమింపవచ్చును.'

'భాషాభిమానులవలన' నిందలి 'గుణదోషము లెఱిగి' 'ఆవశ్యకమని తోఁచినచోఁ గొన్నిమార్పులు గావింపఁ దలంపు' తోడి సంధాతయు, ప్రకాశకులును 'అక్కడక్కడి పదములు గొన్ని' ఈ 'వావిళ్ల నిఘంటుస్వరూపము' అనుపేర ప్రకటించి 'భాషాభిమానులను తమ యభిప్రాయము దయసేయ గోరుచున్న' వారు.

ఇందు నిఘంటుస్వరూపము మచ్చు మూడుపుటలుమాత్రము కలవు. 'అ, అంక, అంకకాడు, అంకకారము, అంజలిగుంజలి, అండి, అందు' అను నేడు పదములుమాత్రమే వీరిందు ప్రకటించిన 'అక్కడక్కడి పద


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు కొన్ని.' వానిలో 'అ' ను గూర్చి ఒకపుట కెక్కువగను, 'అందు'ను గూర్చి (సశేషము) ఒకపుటయును నిండినవి. 'నలువదియైదువేల పదము లుండ'గల యీనిఘంటువును సంధానించుటకయి పెట్టుకొనిన పై నియమముల ననుసరించి 'గుణదోషము లెక్కిం గి' 'యభిప్రాయము' నొసగుట కీ ఏడుపదములుచాలవు. అధమము ఏబదిపదముల,నన్ని నియమముల కుదాహరణములు కాదగు వానిని, (ఇందు గలయట్లు కేవల మకారాద్యములేకాక 'అక్కడక్కడ'ననుపదమును సార్థకము చేయునవిగ నుండవలెను.) ఏర్చి కూర్చి ప్రకటించిననే కాని 'అభిప్రాయము' నొసగనెట్టి 'భాషాభిమాని'కిని సాధ్యము కాదు.

నిఘంటువు 'రాయలు ఎనిమిదిపుటల సైజు' గలిగియుండును. మచ్చు పదముల అచ్చు చదరముగాలేదు. ద, త, ర మొదలయిన అక్షరములు పెద్దవిగను, అ, క, ప, బ మొదలయినవి చిన్నవిగను ఉన్నవి. ఇట్లున్న కూర్పున కందము కుదురదు. చూడ్కికిని గజిబిజిగ నుండును. నిఘంటువు మొదటినుండి చివరవరకు నొకమారు చదివి ఆవల పడవైచునది కాదు; చిరకాలము ఉపయోగము కలది. కావున నది యిమిడికగల ఏకసంపుటముగ నుండుట లెస్స. అట్లయిన దాని మనుగడయు పొడుగగును. అచ్చు సన్నముగనున్ననే యది సుకరము. నిఘంటువుతో పని నిరంతర ముండదు కాన సన్నఅచ్చువలన దృష్టికి చెరుపని తలపబనిలేదు.

---

## చెన్నపురి చిత్రములు*

"కోమా ఫోటో సర్వీసు"వారు తయారుచేసిన చెన్నపురి ఫోటోచిత్రములు—వివిధ ప్రసిద్ధనిర్మాణములవి, ఇతర మనోహర దృశ్యములవి—చాల సుందరము లయినవి. వానియందు మేలిపనివానితనము గోచరించుచున్నది. ఫోటోలయం దమరిన వెలుగు నీడలపోడిమి మూలదృశ్యములకే అందచందముల దిద్దునవివలె నున్నవి. వీరు తయారుచేయుచున్న చిత్రములలోనివే కొన్ని ఈసంచికయందు ప్రకటితములయినవి. ఫోటోల 'ఆల్బము'ల కివి అలంకారములు. సుందరదృశ్యములను సేకరించి దాచుకొను నాంధ్రులు వీనినికూడ సేకరించియుంచుకొన దగుదురు.

---

* Koma Photo Service ౮, బండి వెంకటేశనాయక వీథి, తిరువల్లిక్కేణి, మదరాసు. నిడివి అం. ౪, వెడల్పు అం. 3 సైజు గల ౧౨ఫోటోల వెల రు. ౧–౦–౦.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గ్రంథస్వీకారము

## శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములు

### i వ్యాససంగ్రహము

పంతులుగారి వ్యావహారిక భాషాభిమానమును గురించి వారి ౭౦ వ జన్మదినమున సమర్పించిన వివిధ విషయక వ్యాససంపుటము. పుటలు ఇంగ్లీషు ౧౬౮; తెలుగు ౩౭౧. వెల, రు. ౭-౮-౦.

### ii వ్యాసావళి

భాషాతత్త్వ ప్రదర్శనపూర్వకముగానూ, ఆంగ్ల సంస్కృతాదిభాషావాఙ్మయచరిత్రములతో పోల్చినీ; ఆంధ్రభాషా పరిణామమును నిరూపించే వ్యాససంపుటము. పుటలు. తెలుగు ౧౦౭; ఇంగ్లీషు ౬౫. వెల, రు. ౧-౦-౦.

### iii బాలకవి శరణ్యము

పండితులు లక్షణవిరుద్ధములనీ, గ్రామ్యములనీ నిందించినరూపములు నిర్దుష్టములని కవులప్రయోగములు ఉదాహరించి నిరూపించిన లక్షణగ్రంథము. పుటలు, ౩౫౩; వెల, రు. ౧-౮-౦.

### iv ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము

శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రులుగారి రచనలలోని ఆంగ్రభాషా పాండిత్య పరిశీలనము. పుటలు ౨౧౧, వెల, రు. ౧-౦-౦.

### v గద్యచింతామణి

వచనరచనా సంప్రదాయమును నిరూపించుటకుగాను ప్రాచ్య లిఖితపుస్తకభాండారము మొదలైన తావులలోని ముద్రితాముద్రితగ్రంథముల నుండి సంతరించిన గద్యభాగముల సంపుటము. పుటలు ౩౬౯. వెల, రు. ౧-౮-౦.

పయి అయిదుపుస్తకముల కాకితము, అచ్చూ, బైండూ అందంగాఉన్నవి. ఈ అయిదుపుస్తకాలను ఒకేమారు కొనినచో వెల పదిరూపాయలుమాత్రము' ప్రకాశకుడు: తెలికిచెర్ల వెంకటరత్నం, గుంటూరు.

---

## పారిజాతాపహరణము

(ముక్కుతిమ్మకవివిరచితము) 'సురభి' నామక వ్యాఖ్యాసహితము. పుటలు, ౪౦౦, డెమ్మిసైజు, వెల రు. ౩-౦-౦.

వ్యాఖ్యాత: మాసిరామమూర్తిశాస్త్రి, విద్వాన్, విజయనగర మహారాజ సంస్కృత కళాశాలాంధ్రపండితులు.

ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, ౨౯-౨, ఎస్ప్లనేడ్, మదరాసు.

## శ్రీ భావసంవత్సరపంచాంగం

ఇది శ్రీ ముందూరు వీరభద్రసిద్ధాంతిగారిచే గుణింపబడినది. ప్రకాశకులు: రాజవైద్య పొన్నాడ భాస్కరం అండ్ బ్రదర్సు, రాజమండ్రి.

---

## పొట్లదుర్తి - మాలెపాడు శాసనము

వ్యాసకర్త: మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, ఆంధ్రపత్రికా కార్యాలయము, మదరాసు.

---

## శ్రీ శంకరాచార్య కృత బ్రహ్మసూత్ర భాష్యం

ప్రకాశకులు: బోధానంద మహర్షి గారు, శ్రీకంఠ మఠము, డెమ్మి ౩౧౦ పుటలు.

---

## తులసీరామాయణము

(బాలకాండము, ద్వితీయభాగము) అనువాదకులు: భైరవభొట్ల వెంకటసుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్. మచిలీపట్టణము, డెమ్మి ౯౪౮ పుటలు, వెల రు. ౧-౦-౦

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సాభిప్రాయ విశేషములు

ప్రపంచవ్యవహారము లగమ్య గోచరములు. ప్రపంచ పరిణామమునందు జననమరణములు, కలిమిలేములు, స్థితి లయములు, శాంతి సంగ్రామములు, సుఖదుఃఖములు సాపేక్షములైన సహజావస్థలు. జననమునందు మరణము, మరణమునందు జననము, సుఖమునందు దుఃఖము, దుఃఖమునందు సుఖము, కలిమియందు లేమి, లేమి యందు కలిమి, శాంతియందు సమరము, సమరమునందు శాంతి సన్నిహితములైనను విషయధ్యాస విపరీతార్థములకు మూల మగుచున్నది. నిత్యపరివర్తనము నిత్యసన్నిహిత సహజావస్థ యైనను చిరకాలసంచితాసక్తాభ్యాసము సమ్మోహమును గలుగజేయుచు సహజముగను గనుపడుచున్నది. పూర్వాచార వ్యవహారములందును పూర్వాపరములను నిర్ణయించుట దుర్లభము. పూర్వ మనవరతము నవీనమునందు లయ మగుచున్నను, ఆసక్తాభ్యాసము పూర్వాభ్యాసముగను గనుపడుచుండును. స్వార్థపరత, భయము, జ్ఞానాభావమును నీ భ్రమప్రమాదములకు బీజములు. సహజ మైన ప్రపంచపరిణామమును యథార్థముగను గ్రహించుటకును, ననుభవించుటకును యోగసంసిద్ధమైన జ్ఞానము శరణ్యముగ నున్నది.

స్వభావసిద్ధముగను, పరివర్తనమును పొందుచున్న ప్రవృత్తియందు సనాతనులకును, సంస్కర్తలకును విషాదానందములు నిరాధారములు, నిరర్థకములు. అనవరతము పరివర్తనమును పొందుచున్న ఆచారవ్యవహారములు, మతధర్మములు, సాంఘిక వ్యవస్థలు, భాగ్యభోగములు, సాహిత్యములు, శాస్త్రకళా శిల్పములు, కర్మపరిశ్రమలు, రాజ్యాంగములు ప్రపంచ పరిణామమునం దనవరతము పరివర్తనమును పొందుచు నవీనభావరూపములను విశ్వవికాసమునకు సాధనములుగ నున్నవి. గతానాగతములకు వగచుట నిరర్థకము. గత సంస్కారము వర్తమానసంస్కారమునందు సమ్మేళనమును పొందుచు భావిసంస్కారమునకు సాధన మగుచున్నది. వర్తమానసమయమునందు సకలదేశములందును ప్రవర్ధమాన మగుచున్న పరివర్తనము గతకాల సంస్కారఫల మైనను వివాదసమరములకు వలెను విచారాదరణములకు పాత్రము గాకున్నది. వ్యక్తులవలెను సంఘములును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాతులును రాజకీయ మత సాంఘికార్థికాది విషయములందు స్వాతంత్ర్యమును బడయుట కనుభవించుచున్న దుఃఖవేదన వర్ణనాతీతము. ప్రపంచమునం దంతటను ప్రజాసామాన్యము మానవస్వాతంత్ర్యాభ్యుదయమునకు జేయు చున్న ప్రయత్నములు ప్రతిఘటనమును బొందుచున్నను క్రమముగ వికాసమును పొందుచున్నవి.

పూర్వదేశములం దుద్యోగస్థులును, మతాధిపతులును, మతాచార్యులును, మహారాజులును గౌరవాధికార సింహాసనముల నధిష్ఠించుచున్నను పాశ్చాత్త్యదేశములం దధికారసింహాసనములకు పదచ్యుతి గలిగినది. వివిధదేశములందును ప్రజలు పరివర్తనము నపేక్షించుచు పరివర్తనప్రయోజనములను మానవస్వాతంత్ర్యధర్మవికాసమునకు గాకను స్వసంఘ ప్రయోజనములకును, స్వజాతి ప్రయోజనములకును, స్వదేశప్రయోజనములకును నపేక్షించుట సహజమైనది. రాజ్యాంగములందును, భాగ్యభోగములందును, పరిశ్రమలందును, మత సిద్ధాంతములందును భిన్నసంస్కారముగల వివిధరాజ్యములకును మానవస్వాతంత్ర్య ధర్మనిర్వహణమునందు సమానమైన యోగసంసిద్ధి గలుగుటకు భయంకరమైన పరివర్తన మవసరముగ నున్నది. పోపును రాజును పూజించుచున్న ఇటలీ ప్రజల యాశయములును, మతాధిపతులను, రాజులను నిరసించుచున్న జర్మను ప్రజల యాశయములును, మహాసామ్రాజ్యభోగముల ననుభవించుచున్న బ్రిటిషు ప్రజలయాశయములును, దారిద్ర్యము ననుభవించుచున్న రుష్యాప్రజల యాశయములును మానవస్వాతంత్ర్యధర్మవికాసమునకు సాధనములైనను బాహ్యసాధనములందు గల లక్ష్యము రాగద్వేషములకు మూల మగుచున్నది. యూరపుదేశములందు ప్రవర్ధమానం బగుచున్న రాజ్యాంగసాంఘి కార్థికపరివర్తనము ప్రపంచపరిణామమునం దుద్యోగపర్వముగ నున్నను రాజ్యాంగపరిణామము భయంకరముగ నున్నది.

### యూరపు రాజ్యాంగములు

ఫ్రాన్సుదేశమునందు ౧౭౮౦ ఏండ్లక్రితము మానవస్వాతంత్ర్యేతిహాసమునందు ప్రతిపాదితము లైన 'మానవస్వాతంత్ర్యము, మానవభ్రాతృత్వము, మానవసమత్వము' అను ధర్మములు మానవధర్మనిరీక్షణమునందు మహాపరివర్తనమును గలుగజేసినవి. యూరపు రాజ్యములందు ప్రజాస్వామ్య నామమునను సంప్రాప్తములైన దౌర్జన్యములు, మోసములు, తంత్రములు, హత్యలు, సంగ్రామములు దారుణములుగ నున్నవి. యూరపునందు మహారాజ్యములు పేరునకు ప్రజాస్వామికమును, వ్యవహారములందు నిరంకుశత్వమును నిర్వహించుచు సమర్థించువిధమును నిత్యవ్యవహారములు విస్పష్ట మొనరించుచున్నవి.

ఫ్రాంసుదేశమునందు గతమాసమునందు సాంఘికులకును ప్రభుత్వమునకును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంప్రాప్తమైన సాయుధసమరము ప్రజాప్రభుత్వముల రాజ్యాంగలక్ష్యములను ప్రపంచమునకు విశదము చేయుచున్నది. ప్రజలను మోసముచేసి కోట్లను దుర్వినియోగము చేసిన స్టావిస్కీగారిభార్య నిర్బంధింపబడినది. స్టావిస్కీ ౩౫ కోట్లరూప్యములను మోసగించి దుర్వినియోగము చేసెను. అన్ని పక్షములవారును కలసి ౭౨ ఏండ్లు వయస్సు గల 'డొమెర్గో' గారిని మంత్రిగ నేర్పాటు చేసి వారికి నిరంకుశాధికారమును కలుగజేసిరి. యూరపురాజ్యములందు ఫ్రాన్సురాజ్యము స్వర్ణప్రమాణమును విడువక ఆర్థికస్థితిని కాపాడుకొనుట ప్రజాప్రభుత్వముల ఆత్మవిశ్వాసమును తెలుపుచున్నది. వర్తమాన సంవత్సరమునందు ఫ్రాన్సుదేశాదాయవ్యయములు ౪,౮౩౨,౭౦,౦౦,౦౦౦; ౪౮౩౧,౮౦,౦౦,౦౦౦ ఫ్రాంకులు. ఫ్రాన్సుప్రభుత్వము ఉత్తరపువైపు దుర్గముల నిర్మాణమును, యుద్ధనౌకానిర్మాణమును, సంగ్రామ విమాననిర్మాణమును, సైన్యాభివృద్ధిని నిర్ణయించినది. ఆయుధవిసర్జన నిర్ణయములవిషయమై బ్రిటిషుమంత్రి 'ఈడెన్' గారికిని ఫ్రాన్సుమంత్రి 'పాలెను' గారికిని జరిగిన సంభాషణలు, సంప్రతింపులు నిరర్థకములైనట్లు వ్యవహారములు తెలుపుచున్నవి. ఫ్రాన్సు నిర్ణయించిన వ్యవహారవిధానము 'ఆయుధధారణమే శాంతికి సాధన' మనుసామాన్యసిద్ధాంతమునే సమర్థించుచున్నది. ఫ్రెంచిప్రభుత్వ మవలంబించిన రాజ్యాంగవిధానములు నాజీప్రచారకులకు కొంత జిజ్ఞాసను కలుగజేయుట సంభవము. ఫ్రాన్సుదేశమునందు క్రమ వికాసమును పొందుచున్న సాంఘికపక్షము పరాజయమును పొందినవిధమును రాజకీయ సాంఘికార్థికవిషయములు విశదము చేసినవి. నాజీశత్రుభయము భిన్నపక్షముల సంయోగమునకును వినియోగపడి నిరంకుశాధికారమునకు బలప్రతిష్ఠలను సమకూర్చినది.

ఫ్రాన్సుదేశమునందు సంప్రాప్తమైన నిరంకుశాధికారవ్యాపనమునే ఇటలీ, జర్మనీ, ఆస్ట్రియా మొదలగు రాజ్యముల వ్యవహార నిర్వహణమును విశదము చేయుచున్నది. ఇటలీయందు ఫాసిస్టుపక్షజనకుడైన 'ముస్సోలినీ' గారు సర్వాధికారనిర్వాహకులుగ నున్నారు. ప్రజాస్వామ్యము వివిధరాజ్యముల నుండి నిర్గమించినది. ముస్సోలినీగారి అనుచరులు అన్నివ్యవహారములందును నిరంకుశాధికారమును నిర్వహించుచున్నారు. రాజ్యవ్యవహారములును, పరిశ్రమ నిర్వాహాధికారమును, నిరంకుశాధికారాధీనమందు గలవు. వ్యక్తిస్వాతంత్ర్యము దుర్లభమైనది. ప్రభుత్వములకును ప్రజలకును ఇటలీ బలరాజ్యవిజృంభణమునందుగల లక్ష్యాభిమానములు ప్రజాస్వామ్యనిర్వహణమునందును, శాంతిసంరక్షణయందును అగోచరములు. విషాదావస్థయందున్న ప్రజలకు ముస్సోలినీగారి ప్రతిభ కనుపడినటులు ప్రజాస్వాతంత్ర్యనిర్మూలనము కనుపడదు. ఇటలీ ప్రజల స్వభావమందె ముస్సోలినీగారి కాలవస్త్ర కవచధా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుల కవకాశము లున్నటు లూహింప దగియున్నది. ఇటలీయందును క్రమవికాసమును పొందిన సాంఘికపక్ష మిపు డజ్ఞాతవాసము చేయుచున్నది.

జర్మనీయందలి నాజీపక్షవిజృంభణమును ఈపరమార్థమునే విశదము చేయుచున్నది. నాజీపక్షజనకులు హిట్లరుగారును ముస్సోలినీ మార్గము నవలంబించుచున్నారు. ముస్సోలినీ హిట్లరుగార్ల మార్గములందు ప్రజాప్రవృత్తి ననుసరించి సాధనసంపత్తియందు భిన్నమార్గము లవసరములైనవి. క్షాత్రధర్మమును చిరకాల మవలంబించిన జర్మను ప్రజలకు పరాజయము దుర్భర దుఃఖమును కలిగించినది. విషాదావస్థయందు మునిగియున్న జర్మనుప్రజలకు హిట్లరుగారి యుత్సాహోపదేశములు సమ్మోహమునుతొలగించినవి. మహాసంగ్రామమునకు పూర్వమువలెనే మరల నాజీదీక్ష ప్రజలయందు క్షాత్రోన్మాదమును ప్రజ్వలింపజేసినది. నాజీలు యూరపురాజ్యములందు జర్మనువిజృంభణమును గలిగించుటకు సంకల్పించుచు గలుగజేయుచున్న దుర్ణయములు పోపునిరసనమును పొందినవి. గతవారమున నాజీవర్ధంత్యుత్సవ సందర్భమున జర్మనీయందు హిట్లరుగారికి ప్రజలు చూపిన గౌరవసమ్మానములు ప్రజల నావహించిన యుద్రేకమునకు నిదర్శనములు. లక్షలకొలది నాజీలు ఇనుపటోపీలను, స్వస్తికధ్వజములను, ఆయుధములను ధరించి జర్మను విజయధ్వానములను ఘోషించుచు హిట్లరు, హిండెనుబర్గుగార్ల నభినందించిరి. జర్మనువిజయధ్వానములను జర్మనీ ఆస్ట్రియా హంగరీ దేశములందు బ్రాడుకాస్టుచేసిరి. జర్మనీనుండి విజాతీయులను బహిష్కరించుచు స్వదేశధ్వజారోహణమును మరల జేయుటకు జర్మనులు పూనిన వ్యవహారములు యూరపురాజ్యములందు భయసంభ్రమములను గలుగజేయుచున్నవి. హిట్లరు సర్వవ్యవహారములందును నిరంకుశాధికారమును బూని ప్రజాస్వామ్యమును నామమాత్రావశిష్టముగ చేయుచున్నాడు. జర్మనీయందు సాంఘికసంస్థలును, పక్షములును నిర్మూలన మొనరింపబడినవి. జర్మనీయందు నాజీపక్ష మవలంబించుచున్న క్షాత్రవిజృంభణము ఫ్రాన్సు, ఇటలీ, గ్రేటుబ్రిటను మొదలగు రాజ్యములందు ప్రతిఘటనమునకు పాత్రమైనది. ఆస్ట్రియాయందు నాజీపక్ష ముపక్రమించిన జర్మను విజృంభణము పరమానర్థములకు మూలమైనది.

ఆస్ట్రియా యూరపు రాజ్యములందు చిరకాలమునుండియును సంగ్రామములకు క్షేత్రముగ నేర్పడినది. ఆస్ట్రియాయందుగల జర్మనుల సంయోగమును చిరకాలమునుండియును జర్మనీకోరినను యూరపురాజ్యముల వైరములు దుస్తరముచేసినవి. సంగ్రామానంతరము ఏర్పడిన రాజ్యములును పూర్వపరిస్థితులనే సంరక్షించుచున్నవి. ఆస్ట్రియాయందు నాజీపక్షవ్యాపనమును యూరపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యము లన్నియును ప్రతిఘటించుట సహజము. ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సు రాజ్యములందు నిలుచుటకు నీడలేని సాంఘికవాదుల కాస్ట్రియా శరణ్యమైనది. హిట్లరుగారు జర్మనీయందు ప్రతిషేధించిన సాంఘికవాదుల కాస్ట్రియాయందు రహస్యాదరణమునుజూపుచున్నటులు వదంతులు వెడలినవి. డోల్ఫసుగారు నాజీవ్యాపనమును సాంఘికపక్షవ్యాపనమును ప్రతిఘటించుటకు నిరంకుశాధికారమును వహించెను. గతమాసాంతమున వియన్నావీథులందు జరిగిన సమరమునందు వందలు సాంఘికులు మృతినొందిరి. దివ్యమందిరములును సాంఘికపక్షమును విధ్వంసము చేయబడినవి. వియన్నాయందు సంప్రాప్తము లైన భయంకరదృశ్యములు యూరపురాజ్యములందలి కార్మికసంఘములకును, సాంఘికపక్షావలంబనులకును కోపావేశములను గలుగజేసినవి. ఆస్ట్రియాయందు నాజీపక్షము సంకల్పించిన విప్లవము సాధ్యము కాకపోయినను యూరపురాజ్యములదృష్టిని ఆస్ట్రియాయందు లగ్నము చేసినది. యూరపునందు పెద్దరాజ్యములతోపాటు, డాన్యూబు ప్రాంతములను చిన్నరాజ్యముల సంయోగమును నేర్పడినది. స్వప్రయోజనారాధనమునకై ఫాసిటుపక్షము నాశ్రయింపగోరిన నాజీపక్షమునకు పరాభవము కలిగినది. వియన్నాయందు యూరపురాజ్యముల లక్ష్యములు ప్రసరించుచున్నవి. ఆస్ట్రియారాజ్యము సైన్యబలము నభివృద్ధిని జేసినది. ఇటలీ, జర్మనీ, జకోస్లవాకి మొదలగు రాజ్యము లాస్ట్రియాసరిహద్దులందు సైన్యములను సమకూర్చినవి. ఏ సమయమునందు సంగ్రామానలము వ్యాపించినను వ్యాపింపవచ్చును.

రుష్యాయందు సోవియటు పరిపాలనము నిరంకుశాధికార నిర్వహణమును, మానవ స్వాతంత్ర్యవికాసమును నిర్వహించుచు సకల రాజ్యముల లక్ష్యమును నాకర్షించుచున్నది. ఆరంభమునందు మహారాజ్యముల నిరసనమునకు పాత్రమైన సోవియటురుష్యా క్రమముగను మహారాజ్యములలక్ష్యమును ప్రాజ్ఞుల దృష్టి నాకర్షించుచున్నది. అమెరికా, గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ, తుర్కీ మొదలగు రాజ్యములు రుష్యారాజ్యముతో వ్యాపారపు సంధులను జేసికొనినవిధము ప్రపంచవ్యవహారములందు నవయుగపరిణామమునకు నిదర్శనము. ధర్మాత్ములు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు రుష్యావిధానమును ప్రశంసించుట కుపక్రమించు చున్నారు. మానవ స్వాతంత్ర్యేతిహాసములందు రుష్యా వ్యవహారము లపూర్వములై నవయుగపరిణామమునకు సాధనములుగ నున్నవి.

గ్రేటుబ్రిటనునందు జాతీయప్రభుత్వము మహాబలమును గలిగియున్నను ప్రజాప్రయోజనములకు నిరుపయోగముగ నున్నది. జాతీయప్రభుత్వ బలనిర్మాణములయందె ప్రళయబీజములు సంస్థాపితములు. జాతీయప్రభుత్వము సంకల్పించిన ప్రయత్నములన్ని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యును నిరర్థకము లగుచున్నవి. సైమనుగా రాయుభవిసర్జనమహాసభను నిరర్థకము చేయగలిగిరి. ఆర్థిక మహాసభయును విఫలమైనది. మంత్రులు క్రొత్తసభల నేర్పాటుచేసి ప్రజాలక్ష్యము నాకర్షింపదలచినను వ్యాపార పరిశ్రమలు క్షీణించుచు నిరుద్యోగసమస్య యభివృద్ధిని పొందుచున్నది. దేశాదాయవ్యయములును,వ్యాపారపరిశ్రమలును నభివృద్ధిని పొందుచున్నటులు మంత్రులు ప్రకటించుచున్నను నిరుద్యోగులయాత్ర దేశపరిస్థితులను చెప్పక చెప్పుచున్నది. పార్లమెంటును, రామ్సేమాక్డొనాల్డుగారును నామమాత్రమున కధికారనిర్వహణమును జేయుచున్నను రాజ్యవ్యవహారములు చుక్కానిలేని యోడవలెను నడుచుచున్నవి. రామ్సేమాక్డొనాల్డుగారి నాయకత్వ మేపక్షమువారికిని విశ్వాసపాత్రము గాకపోయినను గత్యంతరములేక అన్ని పక్షములవారును లోలోపలను కృశించుచున్నను, అనుసరించుచున్నారు. బీవరుబ్రూకువర్గము ప్రతిఘటించుటకు ప్రయత్నించుచు, భయభ్రాంతులకు లోనగుచున్నారు. ఓస్వాల్డుమోస్లెగారు నిర్మింపదలచిన ఫాసిటు పక్షము బీవరుబ్రూకువర్గా మోదమును బడయుచున్నది. గ్రేటుబ్రిటనునందును బాల్డివినుగారు ప్రజాస్వామ్యమును సమర్థించుచున్నను నిరంకుశాధికారాభిమానము క్రమవికాసమును పొందుచున్నవిధమునకు జాతీయప్రభుత్వమే నిదర్శనముగ నున్నది. గ్రేటుబ్రిటను నావహించిన నిస్సహాయస్థితియె నిరంకుశాధికార నిర్వహణాపేక్షకును మూలముగ నున్నది.

అమెరికా సంయుక్త రాష్ట్రములందు రూజువెల్టుగారు సంపూర్ణముగను నిరంకుశాధికార నిర్వహణమును జేయుచున్నారు. రాజ్యాంగములను,ఆర్థికవ్యవస్థలను, వ్యాపార పరిశ్రమలను రూజువెల్టుగారును, వారి యనుచరులును నిరంకుశాధికారాధీనము చేయుచున్న విధమును దేశవ్యవహారము లనంతముఖములను విస్పష్టము చేయుచున్నవి. రూజువెల్టుగారు రుష్యారాజ్యముతో సంధిచేసికొనుటయును, బంగారుప్రమాణమును మార్చుటయును, పరిశ్రమలకు రక్షణము నొసంగుటయును, ఫిలిప్పయిను ద్వీపములకు స్వాతంత్ర్యము నొసంగుటయును నపూర్వములై బ్రిటిషురాజ్యనీతిజ్ఞుల కాదరణీయములు గాదగియున్నవి. ప్రపంచము నావరించిన రాజకీయ సాంఘికార్థిక పరివర్తనముల కార్థిక దుర్దశయే మూలముగ నున్నది.

**ఆర్థికదురవస్థ:**

సంగ్రామానంతరము ప్రపంచము నావరించిన ఆర్థికదురవస్థను రాజ్యతంత్రజ్ఞుల స్వార్థపరత్వము దుస్సహము చేసినది. ప్రపంచమునందన్ని రాజ్యములును సుంకముల సంరంభము నారంభించినవి. గ్రేటుబ్రిటను బ్రిటిషుయోగక్షేమములకు మూలమైన వ్యాపారస్వాతంత్ర్యమును విడిచి వ్యాపారరక్షణము నుపక్రమించినది. గ్రేటుబ్రిటను నేర్పిన విద్యనే యితర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యములును గ్రేటుబ్రిటను కొప్పగించినవి. ఒటావాయొడంబడిక అధినివేశరాజ్యములకు గలుగజేసిన లాభములను గ్రేటుబ్రిటనుకు గలుగజేయలేదు. రక్షణవ్యాపారము సమకూర్పజాలని ప్రయోజనములను బంగారు ప్రమాణమును తీసివేయుటవలనను గ్రేటుబ్రిటను పొందదలచినది. గ్రేటుబ్రిటనుకు తాత్కాలిక స్వల్పప్రయోజనము కలిగినను వెంటనే ఆప్రయోజనములు పోయినవి. జపాను, జర్మని, అమెరికా సంయుక్తరాష్ట్రము లన్నియును బంగారు ప్రమాణమునువిసర్జించి బ్రిటిషుఆర్థికతంత్రమును నిరర్థకము చేసినవి. అమెరికా యవలంబించిన ప్రచండమైన సువర్ణాకర్షణ వినిమయ సాధనములను ప్రతిఘటించుట బ్రిటిషుప్రభుత్వమునకు దుర్లభమైనది. జపానును వ్యాపార పరిశ్రమలందు ప్రతిఘటించుటయును దుర్లభ మైనది. రుష్యాప్రభుత్వముతో సంధిని జేసికొనుట శరణ్యామైనది. ప్రపంచావృతమైన ప్రచండమైన రాజ్యాంగవ్యాపారార్థికపరివర్తనమునందును సర్వాంగబంధ బంధనమును గలిగి స్వాతంత్ర్యావకాశములులేని హిందూస్థాన స్థితి అయోమయముగ నున్నవిధమును నిత్యవ్యవహారము లనంతముఖములను బోధించుచున్నను కార్యసాధనము దుస్తరముగ నున్నది.

ప్రపంచవ్యవహారములందు సంప్రాప్తమగుచున్న మహాపరివర్తనమును హిందూస్థాన వ్యవహారములను నవలోకించునపుడు నిరాశయును, నిస్పృహాయును గలుగుట సహజము. గతమాసమునందు పార్లమెంటునందును, స్వామ్రాజ్య శాసనసభయందును, రాష్ట్రీయశాసనసభలయందును పర్యాప్తములైన హిందూస్థానవ్యవహారములు దేశావృతమైన నిస్పృహాయస్థితిని, దుర్దశను వేయినోళ్లను వెల్లడిచేయుచున్నవి.

హింందూస్థానము - ఆదాయవ్యయములు:

గతసంవత్సరాదాయము ౧౬౩౪, వ్యయము ౧౬౦౯ లక్షలును మదింపు వేయబడినను నికరాదాయము ౧౦౧౧, నికరవ్యయము ౨౯౭౯ లక్షలు తేలినవి. ఆదాయము తగ్గినవిధము దేశావృతమైన దురవస్థ వెల్లడిచేయుచున్నది. ఆదాయము అంచనాకన్నను ౭౨౬ లక్షలు తగ్గినవి. సుంకములందే ౪౩౧ లక్షలు తగ్గినవి. ఆదాయపుపన్ను ౯౩ లక్షలు తగ్గినవి. నల్లమందు, టంకసాలలు చిల్లరరాబడి కాక ఇతరాదాయము లన్నియును పడిపోయినవి. సుంకముల ఆదాయము బట్టలకును, చక్కెరకును గల రక్షణములవలన తగ్గిపోయినను సంతసింపవలసిన విషయము. స్వదేశమునందు తయారుకాగల బట్టలపరిశ్రమను, చక్కెరపరిశ్రమను నభివృద్ధిచేయుటకు టారిఫులను వేయుటయును, రాబడిని హెచ్చుచేయుటయును నితర దేశము లవలంబించుచున్న ఆర్థికవిధానముగ నున్నది. హిందూస్థానమునందును దిగుమతి బట్టలమీదను చక్కెరమీదను నింకను సుంకముల నభివృద్ధిని జేసిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాబడి యభివృద్ధిని జెందియుండును. కాని లాంకాషైరు ఒటావా లాభనిర్ణయములు ప్రతిబంధకములై యున్నవి. వ్యయమునందు సైన్యవ్యయము తగ్గుట ముఖ్యవిషయముగ నున్నది. గతించిన మూడేండ్లయందు ఆదాయవ్యయములు సరిపోవుటయేకాకను ౮ కోట్లు మిగులుటయును ౨ కోట్లు అప్పును తగ్గించుటయును షూస్టరుగారు చేసిన ఘన కార్యము. గతించిన మూడేండ్లయందును బంగారు ప్రమాణ రక్షణమును స్టర్లింగు పత్రములును ౫౨౮౭ లక్షలనుండి ౧౦౬౦౦ లక్షల కభివృద్ధి చెందినది. కర్రెన్సి నోటుల వ్యాపనము ౧౪౬ కోట్లనుండి ౧౨౮ కోట్లకు వృద్ధిని పొందినది. షూస్టరుగారు సూచించిన ౧౦౬౦౦ లక్షల రిజర్వును విదేశములందు గాకను స్వదేశమునం దుండుట దేశక్షేమ మునకు సాధనము. గతించిన మూడేండ్ల యందును వడ్డీ మొత్తము ౧౭౮౩ లక్షల నుండి ౧౦౩౪ లక్షలకు తగ్గినది. వడ్డీరేటును తగ్గించుటవలన నన్నిశాఖలకు కలిసి ౪౭౭ లక్షలు లాభించినవి.

౧౯౪౯-౫౦లకు ఆదాయము ౨౮౦౩, వ్యయము ౨౯౬౧, లోటు ౧౫౩ లక్షలుగ నిర్ణయింపబడినది. నూతన టారిఫు శాసన మును, నితరములైన ఏర్పాటులును సుంకముల ఆదాయము లింకను తగ్గించుట సహజము. రాగల సంవత్సరమునందు ౧౫౩ లక్షల లోటును పూర్తిచేయుటకై శర్కర పరిశ్రమ మీదను, హండ్రెడువెయిటుకు రు ౧-౫-౦ చొప్పునను ఎక్సైజుపన్నును వేయుటవలనను ౧౪౨ లక్షలు రాగలవు. కాని శర్కరమీద ఎక్సయిజుపన్నును వేయుటవలనను పరిశ్ర మాభివృద్ధికిని, బీదల సౌకర్యములకును ప్రతి బంధకము గలుగగలదు. నిప్పుపెట్టెలమీ దను, సిగరెట్లమీదను ఎక్సయిజు పన్నును వేయుటయందు విశేషముగను నెవరికి నష్టము కలుగదు. సిగరెట్లకు ౧౦౦౦ కి రు. ౧౦ ల నిచ్చెడివా రింకొకరూపాయ నిచ్చుటవలనను మునిగిపోవున దేదియును నుండదు. పోస్టు స్టాంపుల ధరలను పేరునకు తగ్గించినను విశే షమైన ప్రయోజన ముండునని తోపదు.

పోస్టుస్టాంపుధరను అణాకు తగ్గించి ఉత్త రము తూనిక అరతులమునకు నిర్ణయించుట కన్నను పోస్టుకార్డును అర్ధణాకు తగ్గించిన, ప్రజలకు లాభకరమై యుండును. బీదలకు అణాకవరుకన్నను అర్ధణాకార్డె ప్రయోజన కరము. బుక్కుప్యాకెటులమీదను రేటును ౬ పైసలనుండి ౯ పైసలకు హెచ్చించుట సకలవిధములను దేశాభ్యుదయమున కనను కూలము. బుక్కుప్యాకెటుల పద్ధతిని దుర్వి నియోగము చేసెడివా రుండినను వ్యాపా రము క్షీణించియున్న సమయమునను మంచి వారికిని నిది నష్టమును గలుగజేయును. దీని మూలమునను ప్రభుత్వమునకు ౫ లక్షల లాభమె సమకూడినను ప్రజలకు లక్షల వ్యాపారనష్టము గలుగును. టెలిగ్రాముల ధరను ౯ అణాలకు తగ్గించుట సామాన్యులకు కొంతప్రయోజనమును గలుగజేయ గలదు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బీహారు భూకంపసహాయమునకు ౭౫ లక్షల విరాళమును, ౨౭౫ లక్షల అప్పును నిచ్చుటకు భారతప్రభుత్వము నిర్ణయించుట యుక్తముగ నున్నది. సైన్యవ్యయమునందు గతించిన వత్సర సైన్యవ్యయము ౧౯౩౩-౩౪ నందు ౪౬౨౦ లక్షలనుండి ౧౯౩౪-౩౫ లందు ౪౪౩౮ లక్షలకు తగ్గింపబడినను దేశాదాయమునందలి ౭౯౬౧ లక్షలందును సగమునకు మించినసొమ్ము సైన్యశాఖకు వినియోగించుట యుక్తముకాదు. షూస్టరుగారు ౧౯౨౯-౩౦ యందు ౫౫౧౦ లక్షలనుండి ౧౯౩౪-౩౫ యందు ౪౪౩౮ లక్షలకు సైన్యవ్యయము తగ్గినందుల కానందించినను రాబడినిబట్టి యోచించిన తగ్గుదల గణనీయము కాదు. ఎగుమతుల యభివృద్ధి యంతయును బంగారమునందు గనుపడినటు లితర వస్తువులందు గనుపడదు. జపాను-ఇండియా దూది యొడంబడిక తాత్కాలికముగను దూది ధరను పెంచినను నది నిలుచుట దుర్లభము. ధరలు పడిపోవుటవలనను రయితుల పరిస్థితులు బాగుండలేదని యంగీకరించుచు సర్వత్ర యభివృద్ధిగలదని చెప్పుట విశ్వసనీయము గాదు. ప్రజలకు శక్తిలేనపుడు దిగుమతులు తగ్గిపోవుటయును, ఎగుమతులు సాధ్యముగానపుడు బంగార మెగుమతి చేయుటయును సంభవించుచున్నది. నిరంతరము నిర్మాణ కార్యములందు మునిగియున్న జపానురుష్యాదేశముల వ్యవహారములతో హిందూస్థాన వ్యవహారములను పోల్చుటవలన నేవిధమైన ప్రయోజనమును సమకూడదు. హిందూస్థానాభ్యుదయమును గూర్చి షూస్టరుగారు తెలిపిన సదాశయములు ప్రశంసనీయములైనను స్వదేశమునందును, విదేశములందును స్వాతంత్రాచరణము సాధ్యముకాని దేశమునకు వ్యవహారనిర్వహణసామర్థ్యము స్వల్పమైనను దుర్లభము.

చెన్నరాష్ట్రాదాయవ్యయములు

మద్రాసు శాసనసభయందు స్టోక్సుగారు ప్రవేశపెట్టిన బడ్జెటువివరములును, వానికి సంబంధించిన హేతువాదములును నిదివర కెన్నియోసారులు పాడినపాటలు. రాష్ట్రమునందు రాజకీయాందోళన మణగిపోవుట స్టోక్సుగారికి సంతృప్తికరమైనను దేశాభ్యుదయమునకు సంతృప్తికరముకాదు. ప్రజాందోళనములను నిర్బంధవిధానము స్తంభింపజేసినను నుపశమింపజేయలేదు. అవకాశములు గలిగినపుడెల్లను ప్రజాశక్తి సువ్యక్తమగుచున్నది. గాంధిమహాత్ముని హరిజనయాత్ర, స్తంభించియున్న ప్రజాశక్తి బహిర్గతము గాగల విధమునకు ప్రమాణముగ నున్నది. దేశమునందు శాంతికి, ఆర్థికపరిస్థితులు బాగుపడుటయును, సంతృప్తియును సాధనములు. వర్తమానపరిస్థితులందు ప్రజల సంతృప్తి సాధ్యము కాదని దేశవ్యవహారములు వివిధరంగములందును విస్పష్టము చేయుచున్నవి. దేశపరిశ్రమలందు ప్రధానమైన వ్యవసాయ పరిశ్రమ మధికమైన దేశాదాయమును సమకూర్చుచున్నది. ౧౯౩౨-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩౩-వ సంవత్సరమునం దాదాయము రూ. ౧౬,౮౫,౮౯,౧౮౦ మదింపు వేయబడినను నికరాదాయము రూ. ౧౬,౨౮,౨౭,౧౦౦ మాత్రము తేలినది. ౧౯౩౩-౩౪-వ సంవత్సరమునందు రూ. ౯౮,౪౪,౨౦౦. తగ్గుదలకు గారణము భూమిసిస్తునందు గతసంవత్సరమునందును, వర్తమాన సంవత్సరమునందును నీయబడిన రిమిషనులని తెలియుచున్నది. లోటు ౯౮.౪౪ లక్షల వ్యయములను తగ్గించుటవలనను, వ్యయములను మార్చుటవలనను భర్తీ చేయబడినవి. ఈ యేర్పాటులవలనను ౧౯౩౩ ౩౪వసం.నందు ఆదాయవ్యయములందు లోటు లేకుండుటయే కాకను రూ. ౬౧,౦౦౦ మిగులవచ్చు నని తేలుచున్నది. ఆదాయమునందు స్టాంపులు, జుల్మానాలు, పరిశ్రమలు రూ. ౮.౪౭ లక్షలు వృద్ధిని జూపినవి. ౧౯౩౪-౩౫ సంవత్సరమునం దాదాయము రూ. ౧౬,౪౩,౬౩,౦౦౦ లును, వ్యయము రూ. ౧౬,౩౯,౧౬,౬౦౦ మదింపు వేయబడినది. భూమిశిస్తునకు ౧౩౪౨, ౧౩౪౩ ఫసలీలందు రూ. ౭౨ లక్షలు రిమిషను నిచ్చినతరువాత ౪ లక్షలు నిలువ యేర్పడుచున్నది.

దేశాదాయమునందు ప్రధానమైన భూమ్యాదాయము ౧౯౩౨-౩౩-వ సంవత్సరమునందు ౭౦౩ లక్షలు ఆబ్కారిస్టాంపులు, ౬౬౧ లక్షలును, ౧౯౩౪-౩౫ సంవత్సరమునందు భూమినుండి ౭౨౫ లక్షలును, ఆబ్కారీ స్టాంపులనుండి ౬౬౦ లక్షలును రాబడి గలదు. ఆదాయమునందు మూడువంతులకు పైగాను ప్రజాసామాన్యమునుండి వచ్చుచున్నది. వ్యయమునందు రిజర్వుశాఖలకు ౯౮౪ లక్షలును, ట్రాన్సుఫరు శాఖలకు ౬౫౪ లక్షలును వ్యయమగుచున్నవి. ఆదాయవ్యయముల పరిశీలనము, పన్నులను విశేషభాగము చెల్లించెడి వ్యవసాయదారులకు, వ్యయమునకు తగినలాభము గలుగుట లేదని విశదము చేయుచున్నది. వ్యయమునందు పరిపాలనమునకు ౨౩౮ లక్షలు, పోలీసుకు ౧౬౪ లక్షలు వ్యయమగుచున్నవి. పోలీసు వ్యయము ౧౯౩౪-౩౫ సంవత్సరమునందు ౧౬౫ లక్ష లంచనా వేయబడినది.

ఆర్థికోపసంఘము నిర్ణయించిన భూమిసిస్తు రిమిషను నిరాకరించుటయును ఉద్యోగస్థుల జీతములను సమర్థించుటయును అధికారసమర్థనమును చేయవలసిన స్టోక్సుగారికి సహజము. పదిరూపాయల పట్టాదారులైన చిన్నరయితులకురిమిషను కొంత ప్రయోజనకరమైనను రిమిషనువలనను నీటివసతులకు సొమ్ముసమకూడదని తెలిపిన యాక్షేపణ నిలువజాలదు. నీటివసతులకై పెద్ద యుద్యోగస్థుల వేతనములను పెద్దపనులను తగ్గించుట ప్రయోజనకరముగాని అన్నములేకను మాడుచున్న ప్రజలకు తగినయుపకృతిని నిరాకరించుట న్యాయము కాదు. వర్తమానార్థిక దుర్దశయందు ప్రభుత్వోద్యోగస్థులు సుఖ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడుటయును, వ్యవసాయదారులు కష్టపడుట యును తెలిసినవిషయము. ఉద్యోగస్థులు స్వల్పజీతమును గడించినను రయితుల కంటెను మంచిస్థితియందున్నారని స్టోక్సుగారును నంగీకరింపవలయును. జీతములను తగ్గింపగోరుట ఓర్వలేమితనము కాజాలదు. మూలధనవ్యయమునందు మెట్టూరు, కట్టలై ప్రాజెక్టులందు వ్యయమును తగ్గించుటకు గల యవకాశములను స్టోక్సు గారు పూర్తిగా వినియోగింపలేదు. క్రొత్త ప్రాజెక్టుల విషయమై స్టోక్సుగారు గలుగ జేసిన భ్రమయును నిరుపయోగము. తుంగ భద్ర భవాని ప్రాజెక్టులకు ప్రభుత్వము అప్పు చేయుట న్యాయము కాని ఆదాయమునుండి వ్యయముచేయుట న్యాయము గాదు. వర్త మానార్థికదుర్దశయందు రయితుల కేవిధమైన యుపకృతిని కల్పించుట రాష్ట్రీయప్రభుత్వ ములకు సాధ్యముకాదని స్టోక్సుగారు తెలిపిన నిరాశ విశ్వసనీయము కాదు. బొంబాయి నైజాము ప్రభుత్వములు కల్పించిన రిమిషను లును, ప్రపంచమునందంతటను ధరలను పెంచుటకు జరుగుచున్న ప్రయత్నములును నాశాజనకములు కాని నిరాశాజనకములు కావు. భూములులేని కూలివారును, చిన్న దుకాణదారులును వారియోగక్షేమములకు వ్యవసాయదారునిమీదను నాధార పడి యున్నారు. వోటులున్న వ్యవసాయదారు లకే కాక వోటులేని వ్యవసాయదారులకును, కూలివారికిని, దుకాణదారులకును రయితుల యోగక్షేమమే మూలాధారము. రానున్న రాష్ట్రీయస్వాతంత్ర్యముపేరను శాసనసభ్య లను భ్రమపెట్టుట నిరంకుశాధికారులకు పరిపాటి యైనది. రయితుల యోగక్షేమము లేని రాజ్యాంగసంస్కరణములును, రాష్ట్రీ య స్వపరిపాలనమును నిరుపయోగములే కాకను దుర్లభములు. మంత్రులును, రాజ్యాంగములును ప్రజాక్షేమమున కేర్ప డును గాని ప్రజలు మంత్రులకును రాజ్యాం గములకు నేర్పడరు. ప్రభుత్వము పాఠశాల లకు, నూతులకు, రోడ్లకు, వైద్యసహాయ మునకు, పశువులకును చేయుచున్న యుప కృతి విషయమై స్టోక్సుగారు చేసికొనిన స్తోత్కర్షయందలి సత్యాసత్యములను, వ్యవసాయము లేని భూస్వాములను చేసిన పరిహాసమునందలి యథార్థమును, స్టోక్సు గారు స్వయముగను గ్రామస్థులవలన తెలిసి కొని ప్రకటించుట భావ్యమై యుండును.

ప్రపంచవ్యాప్తమైన మహాపరివర్త నేతి హాసములందు హిందూస్థానేతిహాసము లాది పర్వమునందే యున్నవిధమును వ్యవహార జ్ఞులు గ్రహింపగలరు. శాసనసభలు, నిత్య వ్యవహారములు ప్రజ్ఞావాదములకు విని యోగపడునటులు యోగాభ్యాసమునకు వినియోగపడకున్నవి. సాంఘికసమరములు, పక్షవిభేదములు పారతంత్ర్య ప్రభావమును సకలవ్యవస్థలయందును ప్రత్యక్షము చేయు చున్నను మహానుభావుల సంకల్పాచరణము లకు, సంకల్పసిద్ధికి సాధనములుగ నున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాంధిమహాత్ముడుహరిజనయాత్రయం దవలం భించిన యోగాభ్యాస మితరవ్యవహారము లందును ప్రజలకు సాధనముగ నుండగలదు. ప్రజాస్వామికమున కాటపట్టులైనరాజ్యము లందు నిరంకుశదేవత ప్రళయతాండవమును జేయుచున్నపుడు సకల వ్యవహారములం దును పారతంత్ర్యము ననుభవించుచున్న భారతవర్షము సమకూర్పగల భారము యోగారూఢులైన నాయకులమీఁదను గలదు. ముప్పదియైదు కోట్ల ప్రజలకును ప్రాచీన నవీనసంస్కారములకును నాకరమైన భరతవర్షమునం దుద్యోగపర్వనిర్వహణము నకై పరమేశ్వరుడు శ్రీ కృష్ణార్జునులను ప్రసాదించుగాత !

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras
Editor: G. Subbaramayya.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుఁడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, సంచిక ౪

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు



---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భావ కీర్తనము

బాలాంత్రపు వేంకటరావు

జీవుఁడు దేవుఁడుఁ సకల
చిత్తవికార, వికల్పనంబులుఁ
నీవయి; యర్థ, సత్త్వములు
నీవయి; వేడుకయుఁ, స్వభావముఁ
నీవయి; చేష్టయుం, గ్రియయు
నీవయి; భావనయుఁ, విభూతియుఁ
నీవయి, భావవత్సరమ,
నింపుము మా "కళిలార్థసంపదల్."

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## భావ ప్రశంస

నడకుదుటి వీరరాజు

భావాతిగమ్యుఁ డ[illegible]
భావసులభుఁ డీశ్వరుఁడు ప్రభావమహితుఁడీ
భావాబ్దంబున నవ్యయ
భావపరంపరల నొసఁగు భారతికి దయన్.

చక్షురానందంబు సంతరింపుము మాకుఁ
జెక్కు చిత్రములఁ గాన్పింపఁ జేసి
శ్రవణానుమోదంబు సంఘటింపుము మాకు
నిండుగీతముల విన్పింపఁ జేసి
అంతరంగసుఖంబు నలవరింపుము మాకు
మృదులకావ్యముల నిర్మింపఁ జేసి
ప్రకృతిప్రహర్షంబుఁ బరిఢవింపుము మాకు
విశ్వసంస్థితుల భావింపఁ జేసి
భావవిదులు మెచ్చ భావనామాబ్దంబ!
జీవలోక "భావ - చిత్రగీత
కావ్యసృష్టి - గతులఁ" గల్పించి భారతీ
మూర్తివగుము విమలకీర్తిఁ గనుము.

భావకల్పనమునఁ బ్రభవంబుఁగాంచిన
ప్రభవఁదొట్టివత్సరములలోన
స్వీయసృష్టియందు చెలఁగునీశ్వరుఁబోలి
వఱలు దీవు భావవత్సరంబ!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




సంపు. ౧౧ భావసంవత్సరము, చైత్రమాసము (ఏప్రిల్ ౧౯౩౪) సంఖ్య ౪

# పానశాల

కవికోకిల, దువ్వూరి రామిరెడ్డి

[౧౯౩౨-వ సంవత్సరమున జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల భారతిసంచికలందు ఉమర్ ఖయ్యాము "పానశాల"ను నేను ప్రకటించియుంటిని. తరువాత ఒకప్పుడు రుబాయతు మఱలఁ జదువుచుండి మఱికొన్ని రుబాయీలఁ దర్జుమాచేసితిని. ఈ పద్యములకు భావసామ్యముగలపద్యములక్రిందఁ జేర్చుకొనవచ్చును.—దు. రా.]

పారదమట్లు జీవితము పట్టిన నిల్వదు; శీఘ్రగామి; ద్రా
క్షారస మిమ్ము, తాపమునఁ గందెను జిత్తము; జాగరూకసం
చారము నిద్ర దౌలతువశంబయి రూపఱు; యౌవనంపుటం
గారము నీటఁ జల్లవడుఁ; గన్నుల నెత్తుము, లెమ్ము నెచ్చెలీ.

కాలిడినంత గ్రుచ్చుకొనుకంటకముల్ ప్రియురాలిమోమునన్
వ్రేలిన ముద్దుముంగురులొ! బిత్తరికన్బొమ లౌనొయేమొ! రా
జాలయ భగ్నగోళశిఖరావళిఁ గన్నులఁ గట్టు నిష్టకా
మాలలు పూర్వభూభుజుల మస్తములౌనొ! వజీరు వ్రేళులో!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాఱెడువాఁగునీరమట్లు, పైఁబయి వీఁచు నెడారిగాలినా
జాఱె మఱొక్కరోజు వరుసన్ మనయిద్దఱిజీవితంబులన్ ;
ఊరుపు మేననుండువఱ కుమ్మలికం గొన, రూపహీనమై
యారయరాని ‘ రేపు ’నకు, నంతమునొందిన ‘ నిన్న ’కున్ సఖీ.

చానా, నీసరసాస్యబింబమునకున్ జంపీడుపాత్రంబు దీ
టానే ? నీపదమార్గమందు మృతిపూర్ణాయుష్యలాభంబుకం
టే నేటాగద! కోటిబాలరవులే నీపాదరాగంబునన్
స్నానంబాడ, మదీయజీవితము భాస్వద్ధామ పూటబ్రమే!

చెలియరో, నీవియోగమునఁ జిత్తము చీకి కృశించె; నీవు నే
వలనికిఁ బోయినన్ విడువఁ బయ్యెదకొంగు; నిరంతరంబు ని
న్వలచినవార లెందఱో వనారిలి కూలిరి నీవుఁ బోవ; నేఁ
డెలమి దొలంక వచ్చితివి; యెందఱు నీబలిపీఠిఁ జత్తురో!

పచ్చబయళ్లు, నేటిదరిపట్టులు, నొక్కక్షణంబు శ్రాంతియున్,
అచ్చరవంటి నెచ్చెలి, రసాంకితకావ్యముఁ గెంపుపానకం
బిచ్చగ నామనిన్ దొరకెనేని మసీదులు గుళ్ల దాస్యమున్
మెచ్చక ముక్తులై సుఖముమీఱఁ జరింతురు జాగరూకులున్.

మనమునఁ దెల్వియున్నపుడు మాటువడుం బ్రమదంబు; మే నెఱుం
గనియటు కైపుసేయఁ దుదిఁ గాంచువివేకము; వీనిరెంటిమ
ధ్యను జెలువౌ యవస్థయె సుఖాస్పదజీవిత ; మజ్జీవితం
బునకు గులామునై వెడలఁబుత్తు దినాలు ఖులాసగా సఖీ.

గురువ, సలాము, మిమ్ము ననఁగూడదుగాని, యథార్థమార్గసం
చరణముఁ దెల్పు; మజ్ఞతను జాటకయుండినఁ జాలు; మేము గ్రు
మ్మరునది సత్పథంబు గనుమా, నయనార్తుఁడవౌట దారి వ
క్కరముగఁదోఁచుఁ; గన్నులకుఁ గాటుక పెట్టుము, చూపు మేలగున్.

నే నొకతత్త్వవేత్తనని నిందయొనర్చిరి కానివారు; నా
మానసవృత్తి వార లణుమాత్ర మెఱింగిన నట్లు లందురే?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని, మఱేమి దేవుఁ డెఱుఁగండె మనంబు; వ్యథాకులాయహా
యీనిలయంబుఁ జేరితి; గ్రహింప నసాధ్యము జన్మమర్మముల్.

జ్ఞానపటాలయమ్ము నొడికమ్ముగఁ గుట్టుఖయాము నేఁడు దుః
ఖానలదగ్ధుఁ డయ్యె, యముఁడర్ బెనుకత్తెరజీవితంపుబి
ఱ్ఱానుగుడారుమోకుఁ దెగనొత్తెఁ; బ్రపంచపుసంతలోన దు
గ్గానికి నమ్మె నిన్నుఁ బలుగాకిదలాలి విధాయి, యయ్యయో!

కాలశరాసనోత్పతితకాండము తీక్ష్ణము; తచ్ఛిలీముఖ
జ్వాలల మాడకే మనుము; వాడనిపుంటనుఁజౌడుఁ జల్లు దు
ష్కాలము నీకు నోటఁ బులకండము బాదముఁ బెట్టవచ్చినన్
నాలుకఁ జాఁపఁబోకు మొకనాఁ డయినన్, విషదిగ్ధ మద్దియున్.

ధనము నలక్ష్యభావమునఁ దత్త్వవిదుండు నుపేక్షచేసినం
దినగతిలేని పేదలకు, దివ్యవనంబగు నిజ్జగంబు బం
ధనమగుఁ; బైఁడిసంచుల ముదంబున విప్పి గులాబి నవ్వగం,
బనవును నీలకాంతవని, బాఅలుచాపుచు నుత్తచేతులన్.

---



తిరుచినాపల్లి - కొండ ౨౭౦ అడుగుల ఎత్తు
దీనిపయి మాతృభూతేశ్వరాలయము, ఉచ్చిపిళ్లారి దేవాలయము నున్నది.
—యస్. శంకరసుబ్రహ్మణ్యాం.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కావ్యరచనాదర్శము

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

ఏ మానవుడేనా ఒక కార్యము చేసేముందు మంచి గమ్యస్థానము నిర్ణయించుకోవాలి. సాధ్య ముదాత్తమైతేనే గాని సాధకు డభివృద్ధి చెందడానికి వీలుకాదు. కాబట్టి మనయత్నాలకన్నిటికీ పరమావధి, ఉత్తమాకాంక్షితము, సదాదర్శము ఏదో ఒకటి ఉండితీరవలెను. కావ్యరచనానికికూడా ఒక మహాదాదర్శ మున్నదనే నమ్మకముతో ఈ పరిశీలనము చేస్తున్నాను. కావ్యాలలో దొరికే కవుల వాఙ్మూలాలు ముందు జాగ్రత్తగా పరీక్షించి ఆవిూద కావ్యరచనాదర్శ మేది ఉత్కృష్టమైనదో నిర్ణయించాలనే నాఉద్దేశ్యము. సహృదయులు అర్హరీతిని తోడ్పడుతారని ఆశిస్తున్నాను.

"ధార యలవడ ప్రీతిమై దానిగొంటి" అని పోప్ (ఆంగ్లకవి) చెప్పుకున్నాడు. కవితాధార ఈయన్ని వరించిందట. (చిన్నబుచ్చుకుంటుంది పాప మని) గ్రహించి కావ్యరచన చేశాడట. "ధనముకోరీ, పేరు కోరీ, పద్యరచన చేసే చిల్లరకవులను" చాలా మందిని ఇతను నానాపేర్లూ పెట్టి తూలనాడేడు. ఆమాటలనుబట్టి ధనమూ, కీర్తీ ఇతని దృష్టిలో లేవని మన మనుకోవాలి. "ఏరసము చెప్పబూనిన నారస మాలించువారి కడరింపవలెక" అన్న సంకుసాల నృసింహకవి అభిప్రాయమే యీతనిదీన్నీ. ఇందువల్ల కవికి కలిగే లాభ మేమిటి? తాను పొందిన ఆనందము ఇతరులకి కూడా కలిగించాననే సంతుష్టి.

"కవి అంధకారవాతావరణములో నాసీనుడై స్వీయానందముకోసము గానము చేసే శారిక," అని షెల్లీ వ్రాస్తున్నాడు. గుబురుగా నున్న చెట్లకొమ్మల చీకటిలో కూర్చుని కోయిల ఎవరికోసమని పాడుతోంది? అది తన ఆనందమునే కూతరూపముగా వెలువరిస్తోంది. కాని మనముకూడా ఆకూత విని ఆనందిస్తున్నాము. ఆవిధముగానే కవి తన ఆనందము కోసము కావ్యరచన చేస్తే చదువరులు దాన్ని చూచి ఆనందము పొందుతున్నా రని షెల్లీ అభిప్రాయము. కాని కవికీ కోయిలకీ మూలములోనే తేడా ఉంది. కోయిలకి తనపాట ఒకరు వినాలనే అభిలాష లేదు. కవికి మరిఒకరు వినవలెననే అభిలాష. కోయిలకి కూయడము స్వాభావికము. కవికి కాదు. అతడు స్వాభావికముగా మానవుడు. మించితే కవి. కవి తన ఆనందము కోసమే కావ్యరచన చేసేమాటయితే — తాను వ్రాసినది ఏకవీ తృణీకరించుకోడు కాబట్టి—కావ్యాలలో హెచ్చు తగ్గులుకవే నిర్ణయించవలసి ఉంటుంది. ఎవరికివారు ఇలాగు నిర్ణయించుకుంటారు. సమాజముఖాతరే లేదు. షెల్లీ ఆదర్శము డబాయింపు. దాని ననుసరిస్తే రాయలపూర్వ దిగ్విజయావసరమున

"కొండవీడు మందేరా కొండపల్లి మందేరా
కాదని యెవ్వడు వాదుకువచ్చిన కటకందాకా
మందేరా"

అని పాటపాడిన చాకివాడూ కవే, సకలబ్రహ్మప్రసాదాసాదిత కవిత్వతత్త్వ నిరతిశయానంద భరితాంతఃకరణుడై భక్తకోటికి వరణీయుడౌటకై భారతసంహితను తెలుగువారి కిచ్చిన తిక్కనా కవే అయిపోతారు. భేద నిర్ణయము చేయ వీలులేదు. షెల్లీ చెప్పిన కవికంటె స్వాభిమాన మొకపాలు హెచ్చుకలిగిన కవిని ఒకణ్ణి చింతాదీక్షితులు "కవి-కన్య"లో చూపిస్తున్నాడు.

కన్య

ఎవరికోసము ఎందుకొరకై
ఏమిఫలముల నందడానికి
కాలమైనా లెక్కచేయక
కావ్యమల్లెదవు ?

కవి

ఎవరికోసము వాయుదేవుడు
ఎల్లదిక్కుల పరువులెత్తును ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎవరికోసము నదులు కొండల
యంద విహరించున్ ?

ఈయన స్వాభావికధర్మము కవితారచన ! ఇట్టి అభి ప్రాయమే "కలరుతము"లో :

"పైరుగాలి పయనమూ ఎటనుండి ఎటకో
పాటయు నంతేసుమ్మా."

వీటికి కన్య ఏమిజవాబు చెప్తుతోందో చూతాము:

"పుట్టుకను గన్నప్పుడే అవి
అట్టిగుణములు కలిగియుంటవి
పుట్టుకనుగన్నప్పుడే నీ
విట్టికావ్యము చెప్పుటే ?"

దీనికి సరే ఆకవిగారు మాట్లాడరు. పువ్వులు వంశాభివృద్ధికోరి పరిమళిస్తాయి. నదులు సాగరుణ్ణి చేర డానికి ప్రవహిస్తాయి. కవికూడా ఉద్దేశము లేకుండా రచించడు. రచించినట్లయితే ప్రచురించడు. ఒకరు మాడడముకొరకేగా ప్రచురణ? కారణములేకుండా ప్రేమిస్తున్నాము, కావ్యరచన చేస్తున్నాము అను కోడము పట్టి నెకిలితనము. ఈసంభమములు పాశ్చాత్యుల నుంచి దిగుమతిఅయినాయి. పర్యాలోచన చెయ్యకుండా గ్రహించేస్తున్నారు మనవారు.

పాశ్చాత్యులలోనే కొంచెము భూమిమీద తిరుగు తున్నామనే కవు లున్నారు. "ఆనందోద్దీపనే కావ్య రచనోద్దేశము" [Poetry is...and its aim is to produce pleasure] అని వర్డ్సువర్తు. లేహంటు కూడా ఈ రకము కవులలోవాడే. మొత్తముమీద ఆంగ్ల కవుల, విమర్శకుల ( చూ. విమర్శకపారిజాతము ) అభి ప్రాయాన్నే వర్డ్సువర్తు పైరీతిగా వ్యక్తపరచినా డన వచ్చును మన ప్రబంధకవులు చాలామంది ఈ అభి ప్రాయములోనివారే. సింహాసలోకనములో పెద్ద నార్యుడు,

"...............కిన్నెరమెట్లబంతి సం
గాతప్రసన్నతంతిబయ
కారపు గన్నడగౌళపంతుకా
సాతతతానతానలప
సం దివుటాడెదు గోటిమీటు బల్
మ్రోతలుసుంబలెక్ హరువు
మొల్లముగావలె"

నన్నాడు.

"చెప్పవలె కవిత రసములు
చిప్పిల నప్పప్ప బళిబళీయన"

నన్నాడు మాదయ్యగారి మల్లన. ఈ ఆనందవాదము మొత్తముమీద అడిదమువారి చేతులలో పరిణతిపొందిం దనవచ్చును. చూడండి:

"అలతితొల పద్మ చంద్రమండలమునుండి
జలజలమురాలు నమృతంపు జాలులీల
రసము తులకింపవలె..."

తెలుగుకవులలోనే యింకొక తెగవారు కనబడు తున్నారు. స్వీయ "భాగధేయ సారస్వత పారిజాత తరువునకు తనసత్ఫలోదయముగాగ" కృతి రచించి కనుపర్తి అబ్బయామాత్యుడు "హరి కర్పించి" నాడు. "జిహ్వా పరమపావనత వహింపగ" అత్తనూరి పాపకవి చెన్న బసవపురాణము రచించాడు. కృతి యిచ్చి మేది నిపై తండ్రి కీర్తినిలిపి పింగళిసూరన్న 'పితృపూజ' (చూ. ఆంధ్రకవిత్వచరిత్రము) చేశాడు. అది నైవేద్యము. ఇది పూజ. శ్రీరంగమాహాత్మ్యము రచించి భైరవకవి "శివే తరచయంబుతలగె"ను. ఇది పితృపూజకి పైమెట్టు.

"పాపసంచయమెల్ల బాయవచ్చు
కోటిపుణ్యంబులు గూర్పవచ్చు
పరమకల్యాణంబు బడయవచ్చు
యీశు నాదిదేవు నెరుగవచ్చు"

నని బమ్మెరపోతన భాగవతపురాణము పలికేడు. ఆధు నికులలో జనమంచివారు "అంత్యమున శివునికి తనకు నభేద్యతాదాత్మ్యమగుట చోద్యముగ నీకవి బ్రహ్మ చూడబోలును" అన్నారు. వీరందరు పారమార్థికాదర్శ వాదులే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహాకవికాళిదాసు తనకావ్యాలలో కావ్య రచనాదర్శము ప్రకటించలేదు. కాని ఆదర్శజీవనులైన రాజన్యుల చరిత్రమును పూని రచించుటనుబట్టి సమ కాలికరాజవంశములవారి కొకలక్ష్యము అన్యాపదేశ ముగా—కాంతాసమ్మితంగా నందాము—చూపించడానికి రచించా డనవచ్చును. భారతీయ ప్రభుసంప్రదాయము ఈరీతిగా నుంది అని ప్రపంచానికి చిరస్థాయిగా చెప్పే బోధకుడు కాళిదాసు. ధర్మవిజయమును లలితంగా చదు వరులకి నచ్చజెప్పి వారి సదాదర్శకాంక్షకి దోహదము చేసే కవిపండిత వనపాలకుడు కాళిదాసు. ఆదర్శప్రపంచ మును సృష్టించిన కవిబ్రహ్మ కాళిదాసు. ఆతడు ప్రత్యే కము తన కేది కోరి కావ్యరచన చేశాడో తెలియరాదు. విలక్షణమైన మేఘసందేశము, భారతీయులపక్షాన్ని రసికప్రపంచానికి దత్తోపహారమైన శాకుంతలము, చిత్ర కావ్యము ఋతుసంహారము—వీటినిబట్టి కీర్తికోసముకావ్య ములు రచించాడని మమ్మటాచార్యుడు అభిప్రాయపడ్డా డు.అర్థిలోకహితనిమిత్తంబూని కృష్ణద్వైపాయనుడు భార తము రచించాడు. 'జగతా మేకాభిరామాద్భుత'మై, 'కిఞ్చనధామ'మై, 'ఉపనిషదర్థ'మైన 'జ్యోతి'ని భక్తుల కందరికీ చూపడానికి లీలాశుకుని కృష్ణకర్ణామృతము రూపము దాల్చింది. సంస్కృతకవులలో ఐహి కాదర్శమూ, పారమార్థికాదర్శమూ కూడా కనబడు తున్నాయి. ఆలంకారికులు కీర్తి (కాళిదాసు), ధనము (ధావకుడు), జ్ఞానము (పైన చెప్పిన రాజనీతివంటివి), కష్టనివృత్తి (మయూరుడు), కాంతా సమ్మితోపదేశము, పురుషార్థాలు కావ్యరచనాదర్శా లని వ్రాస్తున్నారు. సంస్కృతకవులే కాకుండా ప్రపంచములో ఎవ రెక్కడ కావ్యరచనచేసినా వారి ఆదర్శము పైవాటిలోకి లెక్కకి వచ్చితీరుతుంది. సదాదర్శ మేదో నిర్ణయించేటందు ఆదర్శ మవసరమా అనే సమస్య చర్చకు వస్తుంది. తక్కినకళలకి ఆదర్శ మున్నట్లయితే దీనికి ఆదర్శమున్నదని నిర్ణయించగలము.

తనభావాలు పరులకికూడా పొందించగోరి మానవుడు చేసేరచన కళ. నాదరచన సంగీతమౌతుంది. పదరచన కవిత్వమౌతుంది. రామరాజభూషణుడు ప్రాచీనభారతీయ సంప్రదాయము ప్రకారము "సకలా మోదక తాళవృత్తగతులన్ సంగీత సాహిత్యనామక విద్యాయుగళంబు పల్కు జెలికిం బాలింద్లజో" డైనవని వసుచరిత్రలో చెప్పినాడు. మనవారు సరస్వతీదేవినే సంగీతసాహిత్యాల కధిష్ఠానదేవతను చేసినారు. సంగీత సాహిత్యాలు చాలాచేరికగల కళలు. త్యాగరాజు, కబీరు మొదలగుభక్తులు పరమేశ్వరోపాసనకి సంగీత సాహి త్యాలు జోడించి రచనచేస్తే జనపదాలు పులకింపులతో విన్నాయి. రాణీమీరాబాయి భక్తిసుధాప్రవాహము బృందావనాన్ని రాజస్థానానికి జరిపింది సంగీతసాహి త్యాలకు ఆదర్శ మొకటే. భిన్నరుచి భిన్నప్రవృత్తి విశిష్టమైన మానవత్వాన్నీ, జడప్రకృతి దూషితమైన పశుత్వాన్నీ, తన శీతలస్పర్శచేత పునీతులను చేసి ఏకో త్సాహావేశులనుగా చేశేస్తుంది సంగీతము. భిన్నత్వములోని ఏకత్వమే ప్రపంచానికి జీవము. నీటిలోని రసము, శశిసూర్యుల ప్రభ, వేదాల లోని ప్రణవము భగవంతుడే అయినప్పుడు, కళలోని సౌందర్యముకూడా పరమేశ్వరుడే. తన స్పర్శచేత జంగమమానవప్రకృతి నేకముచేసి ఆనందము కూర్చే సంగీతము (పరమేశ్వరుని) సౌందర్యముయొక్క నాద రూపము. సంగీతజ్ఞానము సాధించినవారికి నాదస్వరూ పుని తేజస్సులో ఒక కిరణము దృగ్గోచర మైన దన్న మాట. నాదలేశములోనే నాదస్వరూపుని వినగలిగిన గాయకుడు గానవిద్యాదర్శాన్ని సాధించినట్లే. ప్రణవ నాదము ఉదాత్తానుదాత్తముల చేరికవల్ల క్రమముగా సప్తస్వరములుగా విభాగమైంది. ఈ సప్తస్వరాల్లోనూ తలచూపే ప్రణవనాదము వినడము, పిమ్మట వినిపించ డమూ చేసినవారు నారదుడు, త్యాగరాజు, మీరా బాయి మొదలయినవారు. గానానికీ కవిత్వానికీ ఆదర్శ మొక్కటే అని చెప్పినాము. గాయకుడు భిన్నప్రవృ త్తులు గల మానవులందరికీ భక్తి, ఉత్సాహము, కరుణ కలి గిస్తే కవిప్రకృతిలోని సౌందర్యము వడకట్టి భిన్నరుచులు గల మానవుల కందిస్తాడు. ప్రథమావస్థలో సామాన్య గాయకుడికి కల్యాణి, తోడి, కాఫీ—ఇత్యాది రాగములు నచ్చి ఆకర్షించడానికి పనికివచ్చేటట్లే, కవికికూడా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గగనచుంబిహిమశైలము, నీలాకాశము, నదీకూలము ఆకర్షకములై కావ్యసామగ్రి ఔతాయి. కాని కాలక్రమాన్ని గాయకుడికి రాగజ్ఞానవైశాల్యము హెచ్చినట్లు కవికి సౌందర్యవీక్షణశక్తి హెచ్చుతుంది. ఒకే రాగము రంజకంగా పాడగలిగినవాడు మహాగాయకుడు కానట్లే ఒకే ఘట్టమును రంజకముగా చేయగలిగేవాడూ మహాకవి కాడు. కాలక్రమాన్ని గాయకుడు భిన్న స్వరాల్లో, ప్రాసలలో దారములాగ వర్తించే ప్రణవనాదాన్ని వినగలిగినట్లే, కవి గడ్డిపోచనుంచి నక్షత్రమువరకూ సుందరసామగ్రే నని గ్రహిస్తాడు. కళాసిద్ధి పొందిన గాయకుడు పాడినదల్లా పాట అయితే కవితాకళాసిద్ధి పొందిన కవి వ్రాసినదల్లా రసవత్కవితాకృతి అవుతుంది.

రసవంతముగా ఒక్క ఖండకావ్యము వ్రాసినంతమాత్రాన్ని మహాకవి కాలేడు. కావ్యరచనాదర్శము ఆనందమే అనేవారి కిది విపరీతముగా కనబడుతుంది. 'రుబాయత్' అనే ఒక్క ఖండకావ్యము తెచ్చింది ఓమర్ ఖాయ్యాముకి పేరు. "అతను మహాకవి కాడా?" అని అడుగుతారు పాఠకులు. కాడు. "ఓమర్ ఖాయ్యాము" కవికాడు; 'యోగి'. ఎంత పరమభక్తుడైనా "పానశాల" చదివినతరువాత కొంతవరకు నాస్తికుడు కాకతప్పదు. కాని శక్తివంతమైనంత మాత్రాన్న చింత కవిత్వ మవదు. ఓమర్ ఖాయ్యాము వంటివాడే వేమన. ఒక్కొక్కపద్యము ఒక్కొక్క సందేశము ఇస్తుంది. కాని వేమన కవికాడు. వీరిద్దరూ తమపద్యాలలో ఇచ్చేపోలికలు సందర్భానికి సరిపోతాయిగాని కాళిదాసు పోలికలలాగ అందముగా లేకపోవచ్చు. తమ భావాల్ని కాదు వారు మనకందిచడము; వారి ఊహలు,బోధనలూన్ను. వారికి సర్వతోముఖపాండిత్యమున్నట్లూ ఆధారాలు లేవు. స్త్రీ హృదయము వేమన్నకి తెలియదు. మాతృప్రేమ అంతకన్న. ప్రకృతిసౌందర్యము శుద్ధపూజ్యము. జాతీ,మతమూమాత్రమే ఎంతసేపూ. కాళిదాసు చూడండి. ఒక భగవత్ప్రార్థనా, ఒక తర్లి వెళ్లడమా, ఒక వనవర్ణనా, ఒక సంభాషణా, ఏదిపట్టితే అదే రసవంతము.

ఆధునికులలో పెక్కురు ఖండకావ్యాలు వ్రాస్తున్నారు. బాగున్నవీ, ఆనందతన్మయత నిచ్చేవీ ఉన్నాయి. కాని ఏప్రేయసో, ఏశరచ్చంద్రికో, ఏముగ్ధప్రేయసుల ప్రేమసంభాషణో, ఏజాతీయప్రబోధనో, ఏప్రార్థనో మాత్రమే వీరిసామగ్రి ఔతున్నాయి. యెంకిని నండూరి సుబ్బారావు, దుఃఖాన్ని, వేదుల, ప్రేయసిని, సూర్యప్రకాశరావు ప్రేమభిక్షును కృష్ణశాస్త్రి,పాదాల ఆమ్రేడితాన్ని వేంకటపార్వతీశ్వరులు, కృష్ణుణ్ణి వేంకటరామయ్యా విడవలేకుండా ఉన్నారు. ఎన్నడో బందరువీధుల్లో కవితాసామగ్రి అమ్మిన పింగళివారిగొంతు మరి వినబడలేదు. అబ్బూరివారు మైసూరూ కవిత్వమూ కూడా ఒక్కమారే వదిలేశారు. ఉస్మానియా విద్యాలయముచేరి రాయప్రోలువారు భోసలైపోయారు. కూసి కూసి దువ్వూరి కోకిలకి నెల్లూరిప్రాంతాల్లో గొంతు నీరయినట్టుంది. వ్రాసివ్రాసి విశ్వనాథవారు వైయాకరణులైపోయారు శబ్దబ్రహ్మవాదముతోటి. శివశంకరులూ, జాషువామాత్రము కొంచెము చుట్టూచూస్తున్నారు. చైతన్యము పైనచెప్పినవారి కందరికీ ఉన్నది. కాని ఖండకావ్యాలతోటే తమ కావ్యగోష్ఠి నడుపుదామనుకున్నట్టుగా కనబడుతున్నది. మొదట ఏకముఖముగా నడిచిన చైతన్యము క్రమంగా శరీరమంతా ఆవరించెయ్యాలి. ఒళ్లంతా సౌందర్యము చూడడానికి కళ్లయిపోవాలి. హృదయము ద్రవీభూతము కావాలి. అప్పుడు కృష్ణశాస్త్రి వెంకటరామయ్యల ఆవేశము, వేదులవారి వస్తుధ్వనీ, రాయప్రోలువారి పదజాలమూ, జాషువా కవితాధారతో కలిసి శివశంకరుల ప్రతిభా ప్రభావంవల్ల అమృతముగా తయారవుతుంది. తెలుగుదేశానికి ఒక మహాకవి ఆవిర్భవిస్తాడు. అతనివాణి చెవిసోకితే ప్రేమ పట్టునకు బిచ్చగానిచేయి నెవరూ చాచనక్కరలేదు. కవితారీతులు సర్వతోముఖంగా విజృంభిస్తే చదువరుల హృదయాలు మెత్తబడతాయి. చదువరులుకూడా మూగకవు లౌతారు. (చూ. కావ్యపఠనము. భారతి. సంపు.౧౦. సంచి. ౮.) కవియొక్క హృదయముకూడా కావ్యరచనవల్ల విశాలమౌతుంది. కవి విశ్వాన్నంతా ప్రేమిస్తాడు. విరాట్పురుషు డట్టికవికి నగలుపెట్టుకొన్న బుట్టబొమ్మ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాదు. జీవచైతన్యము కల సుందరమూర్తి. ఆమూర్తిని దర్శించిన కవి తిక్కనలాగ నిరతిశయానందభరితాంతఃకరణుడౌతాడు. అంతవరకూ ఈతని తన్మయానందము సెలయేరులాగ త్వరలో సొంతమౌతుంది కాని సముద్రములాగ నిత్యముకాదు. ప్రథమములో వ్రాసిన టుమ్రీ లిచ్చే ఆనందమునకూ, కళాసిద్ధి పొంద గలిగి నప్పటి ఆనందమునకు పోలికే లేదు. మొదటిది మదిరాపానమువల్ల జనించే సౌఖ్యములాంటిది. దానిఘనరు తగుల్తూన్నంత సేపే. రెండోది శరీరవ్యాయామ ఫలితమైన ఆరోగ్యజనిత సౌఖ్యములాంటిది. నిశ్చలముగా శుక్రునిలాగ ఇది వెలిగితే నక్షత్రములాగ అది మినుకు మినుకు మంటుంది. అది మెరుపు. ఇది సాంద్రచంద్రిక. అది ఇంద్రధనుస్సు. ఇది నక్షత్రఖచిత నీలాకాశము. చిరతరాభ్యాసము కవిహృదయాన్ని విశాలము చేస్తుంది. కేవలము చైతన్య మున్నంతమాత్రాన ఫలము లేదు. స్పందనము, దాని ననుసరించిన సంగీతమూ ఉండాలి. సాధనపూర్తిచేసిన, అంటే కవితాకళాసిద్ధి పొందిన మహాకవికావ్యమునందలి పద్యము లన్నిటికీ పరుసవేది తగిలిస్తాడు. అతని లేఖిని స్పృశించితే "దుఃఖతాపముల కిల్లగు పాడు ప్రపంచము" నందనముకంటె మనోజ్ఞమైన మూగసోయగ మౌతుంది.

కావ్యరచనాదర్శము కవికి విశ్వసౌందర్యవీక్షణానికి కావలిసే తపనీయసులోచనమే అయితే మహాకవి కాళిదాసు కీసిద్ధి కలిగింది. అతని రఘువంశానికి మనదిన్న కథలకిలాగ ఒక్కవార్త లేదు. సందేశాలు అసంఖ్యాకము లైతే ఇతిహాసము పురాణమౌతుంది. కాళిదాసు సందేశ మిది అని చెప్పలేము. "క్వ సూర్యప్రభవో వంశః" అని అతడు చెప్పినట్లు, సూర్యవంశదీప్తి కలరి ఈచరిత్రను జగత్తుకి ప్రకటిద్దామని అత డీయత్నము చేసినాడు. ఇక కుమారసంభవము, పార్వతీపరమేశ్వరుల ప్రణయతపస్సులో, కల్యాణోత్సవముతో బహుసుందరమైన కథ. ఇక దానిలోని శృంగారమూ దుష్టసంహారము చేయడాని కవతరించే కుమారస్వామి పుట్టుకకి నిమిత్తమాత్రము. కాబట్టి ఉపాదేయమే. అందుకని ఆకథ గ్రహించినాడు. ఇక శాకుంతలము దృశ్యకావ్యము. సానుకూలమైనా గానీ ఔచిత్యప్రశంస లేని వలపు ఆదర్శజీవనులకు మహారాజులకు సద్యఃఫలవంతము కాదనే వార్తను శాకుంతలము తెల్పుతూన్నది. ఇది పారమార్థికము కాదు. ఇంద్రియావేగమును నిరోధించడము వివేకమనీ, క్షేమకరమనీ తెల్పుతుంది. దుష్యంతుడు కేవలము కామానురాగమువల్లనే ప్రోద్బలించబడక పోయినా, గాంధర్వమర్యాదను మిషగాచేసుకుని కామపీడితఅయిన శకుంతలను స్వాధీనము చేసుకున్నాడు. తపమువల్ల గాని వారిద్దరూ పునీతులు కారు. ప్రథమదర్శనమువలెనే, శాంతరమ్యమైన మారీచాశ్రమపదములో ఆపుణ్యదంపతులకు పునస్సమాగమము చేకూరింది. ఇప్పుడా "కాముకులకు" తమనడతను శాసించవలసిన పరిమితు లర్థమైనవి. విక్రమోర్వశీయముకూడా వలపుయొక్క స్వాతంత్ర్యము స్వేచ్ఛకాదనే బోధిస్తున్నది. దివిజులకానందోపదేశములకై నాటకమాడించే భరతముని యాదేశానికి విపరీతముగా ఊర్వశీపురూరవసుల యనురాగవీక్షణాలు తారసిల్లినవి. ఫలము దుర్వాసశాపము;నరలోకవాసము. కాళిదాసు ప్రయత్నపూర్వకముగా ప్రత్యేకహితమును బోధించినట్లు లేదు. అతనికావ్యములు చదివినవారి కాతని సందేశము ఎవ్వరికోగాని తెలియరాదు. వెన్నెలలాగ పట్టినదానికల్లా సుందరమైనపూత పూస్తాడు. ఆనందవాదుల లక్ష్యము కాళిదా సనవచ్చును. మోహనాంగి చెప్పినట్లు ఆతడు రచించినదంతా శారదాకృతే. అందుకే మహాకవి అన్నా రతనిని.

భారతీయులదృష్టిలో కాళిదాసు కావ్యరచనాదర్శమును కడముట్టలేదు. అతడు సిద్ధుడు. సుందరేశ్వరుని విరాట్స్వరూపమును తాను చూచి వీలైనంతవరకు వర్ణించాడు. కాని తానే తరించడములో లేదు గొప్ప. పరులనికూడ తరింపజేయాలి. సనాతనధర్మాదర్శాలలో ఉత్కృష్ట మిది. సిద్ధుకోట కాదు జీవితాదర్శము. పరమహంస కావాలి. కాళిదాసుకావ్యములను చదవడమువల్ల కలిగేఆనందము ఆకావ్యాలు బోధింపనెంచే ఆదర్శాన్ని గౌణము చేశేస్తుంది. అంటే ఆతడు సుమతిశతకములాగ బోధనచేసిఉండవలసిందని నా అభిప్రా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము కాదు. కేవలము ఆనందోద్దీపనే మనసులో పెట్టు కుని రచించాడంటే నా అభిప్రాయము వ్యక్తమౌతుంది. నలుగురుకేట్సులు కలిశారనండి కాళిదాసు కావడానికి. అంతేగాని హితోపదేశము కాళిదాసు కావ్యాలలో కడతీర లేదు. వ్యాసవాల్మీకులు పరమహంసలు. భారత రచయిత కాళిదాసుకి ఒక మెట్టు పైవాడు. దాయాదుల కలహాన్ని సామగ్రిగా గ్రహించి పంచమవేదాన్ని సృష్టించాడు. ఒక్కొక్క పర్వము ఒక్కొక్క కావ్యము. ప్రతిపర్వములోనూ మనము నేర్చుకోవల సిన దేదో ఉంటూనే ఉంటుంది. పొలోనియసు హేమ్లెట్‌తో చెప్పిన నాటక రకాలు అన్నీ దొరుకుతాయి భారతములో. అప్లయ్యునకు-అజానపు సంద్రి, సనకాదులకు పరతత్త్వము, ద్విజమునికోటు లకు దేవత, దినేశవంశభూభుజులకు మేటియైనా పరి పూర్ణుడగు దాశరథివలె-మొత్తముమీద మహాకావ్యము. ఐశ్వర్యలోభముచే కన్నుగానక చరించిన దుర్యోధనుడు నశించెననే ఊహ మిగులుతుంది. సందేశము మహాపతి వ్రతయైన గాంధారిచేత ముందే చెప్పించాడు కవి. “జయోస్తు పాండుపుత్రాణాం యేషాం పక్షే జనార్దనః” భారతకారుడు అందమైనకథను చదువరులకి ధర్మపక్ష పాతము కలిగేటట్లు రచించేడు. వాల్మీకి ఇతనికి పైవాడు. ఒకకిరాతుని దుష్కృత్యానికి ఫలితంగా తనలో జన్మిం చిన సహజావేశాన్ని రామాయణరూపముగా వెలువరిం చాడట ఆమహర్షి. అతనికావ్యాన్ని నేడు పండితులు, పామరులు, పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు అనే వ్యత్యాసము లేకుండా ప్రతియింటా, ప్రతిఆలయము లోనూ పారాయణము చేస్తున్నారు. ఆడపిల్ల పుట్టితే సీతమ్మ. మగపిల్లవాడు శ్రీరామమూర్తి. కేవలము శ్రీరాముడవతారమూర్తి అనే నమ్మకమే కాదు ఈ ఆకర్ష ణానికి మాత. రాముడికథను వాల్మీకి మనకిచ్చినరీతి అది. కాదంటారా? పురాణము లెన్ని లేవు? భగవంతునిగాథ లెన్ని లేవు? రామాయణమే యింతసర్వజనీనత యెం దుకు బడసింది? హిందూదేశమందే కాదు. జావా, లంక, బలి మొదలైనభారతనాగరికత ప్రబలిన దేశాలలో ఇప్పటికీ కొంచెము మార్పులతో నిలిచిఉంది రాముడి కథ. తీరా చెప్పాలంటే ఏమీ లేదు. “జగతిలో రామయ్య జన్మించినాడు, యిల్లాలితో పాటు హింస పడ్డాడు.” ఆకావ్యములో అతిలోకకల్పన లున్నాయి. సముద్రతరణము, అస్త్రప్రయోగము, కామరూప ధారణ మొదలైనవి. కాని కథాసౌందర్యము కేవలము వీటిమీద ఆధారపడదు. పాదలేపము ఎలాగైతే కేవ లము ప్రవరుణ్ణి హిమాలయపర్వతముమీదికి తీసుకెళ్లి నిష్క్రమించిందో అలాగే ఈ అతిలోకఘటనలన్నీ స్వల్ప కార్యాలను సాధించడానికి వినియోగపడి తప్పుకుంటాయి. వీరేశలింగముగారు వాచకాల్లో వ్రాసినట్లు హనుమంతుడు లంకకు యీది చేరుకున్నా డనండి. రాము డొక నిశితమైన బాణముతో రావణా సురుణ్ణి చంపినాడనండి. అందువల్ల రామాయణానికి బరువు తగ్గదు. రామాయణము చదివినవారి మనస్సులో ఈస్వల్పాంశా లుండనేఉండవు. కైకవరము, శూర్ప ణఖ గర్వభంగము, సీతాపహరణము, జటాయు మరణం, సుగ్రీవ సంభాషణము, వాలినిగ్రహణము, సముద్రతరణం, లంకాపురీదహనం- ఇవి మరవు. కథ అంతా మానవమాత్రుడికి అతిలోకసందర్భాలవల్ల నాసన్నమైనట్లుంది. ఎంతమంది రచయితలు రామాయణము రచించారో లెక్క లేదు. భార తీయుల్లో రామాయణము నెరుగనివా డుండడు. దానిని చదవడమువల్ల కలిగేలాభం నేను చెప్పలేను. ఆదర్శ పురుషుడైన రాముడినామము భారతీయులకి తారక మంత్రమైపోయింది. వాల్మీకి తాను నిరతిశయానందము పొందడానికి కారణభూతమైన దివ్యనామాన్ని తిరిగి ప్రజల కిచ్చిన పరమదాత. కావ్యరచనాదర్శమైన ఆనందపూర్వక హితోపదేశము ప్రాచేతసుని చేతిలో పరిణతికి వచ్చింది.

కేవలము కళాకారిత్వానికి లక్ష్యపెట్టు మహాకవి గానీ రచన ప్రారంభించినట్లాయనా, ధర్మవిజయము, దాని ననుసరించిన ధర్మోపదేశమూ ఉండవు. మిల్టన్ కవి రచించిన ‘పారడైస్ లాస్ట్’ అనేకావ్య మీరకా నికే చేరుతుంది. మిల్టన్‌కవి ఈకావ్యము ధర్మోప దేశానికే రచించినా నని చెప్పుకున్నాడు. పరమేశ్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుని ప్రభుత్వాన్ని అత్యంత స్వాభిమానముతో తిరస్కరించి, స్వర్గవాసుల్లో రెండుపక్షాలు కల్పించి, సర్వశక్తుణ్ణి హింసించలేక, ఆతడు సృష్టించిన మానవుణ్ణి చెడగొట్టి కడపట పరాభూతుడై బలిచక్రవర్తిలాగ పాతాళానికి త్రొక్కి వేయబడ్డ సైతాను చరిత్ర మితనికావ్య సామగ్రి. దీనికి భగవంతుణ్ణి నాయకుణ్ణి చేసి రచిస్తే కథ అంతా దండయాత్రలాగ కనపడుతుంది. కళ నిక్షిప్తము కావడానికి వీలుండదు. ఆంగ్లేయుల చరిత్ర మంతా హక్కులకోసము పోరాటమే. మిల్టను జీవిత కాలములోని ప్రజలు రాజు అధికారమును తృణీకరించి అంతఃకలహములలో అత్యుత్సాహముతో పనిచేశారు. సైతానుకూడా స్వాతంత్ర్యముకోసమే శక్తినంతా ధారపోశాడు. ఇతని పరాజయము, తంత్రాంగము, పునఃప్రయత్నము - ఇత్యాదులన్నీ పుష్కలమైన కావ్య సామగ్రి. అందువల్ల మిల్టన్ ఇతన్నే నాయకుణ్ణి చేశాడు. సైతానురూపము పర్వతప్రాయము, కంఠము మేఘగంభీరము, ఉపన్యాసము జీవామృతము, మేధాశక్తి నిరుపమానము. సముద్రుణ్ణి సాయముగా తీసుకుని ఆతడు పంపిన జలాన్నే బలము జేసుకుని పర్వతాన్ని ఢీకొనే మేఘుడిలాగ సర్వశక్తుణ్ణి ఢీకొంటాడు. ఉరుము మెరుము ఇతని ఎదిరి పరాభూతుణ్ణి చేస్తాయి. పిడుగు ఇతన్ని పాతాళానికి దిగించేస్తుంది. ఇక్కడ మొదలు కథ. సైతాను నోటివెంట సర్వశక్తుని గుణాలు నిరంకుశప్రభువుగుణాల్లాగే కనబడతాయి. నాయకుడి మాట విని భక్త్యుత్సాహాలతో గుమికూడే అసురులను చూస్తే మనకి సానుభూతే కలుగుతుంది. రాతికికూడా చలనము పుట్టించే సైతానుఉపన్యాస వాక్యాలే మనము తరుచు నెమరువేస్తాము. నేపథ్యము నుంచి ఉరుము మెఱుము లనే వింతఆయుధాల సాయము వల్ల అధికారము నిలువబెట్టుకున్న భగవంతునియెడ అనురాగ ముత్పన్నముకాదు. పరాజయము పొంది పాతాళానికి పడిపోయేసైతాను, తనస్వాతంత్ర్యముకోసము నరులతో హోరాహోరిపోట్లాడి, దెబ్బలు తిని మరణాసన్నమై పడిపోయిన మదపుటేనుగులాగ కనబడతాడు. స్వాతంత్ర్యాభిలాష కాక స్వేచ్ఛాభిలాష మనలో రేకెత్తుతుంది

ఈకావ్యము చదవడమువల్ల. ఆంగ్లకవులలో అగ్రగణ్యుడైన కీట్సుకూడా 'హైపీరియను' అనే సైతాను సేనానాయకుణ్ణి నాయకుణ్ణిచేసి ఒక ఖండకావ్యము రచించాడు. కీట్సువ్రాస్తే అందాని కేమిలోటు. ఉదయ వాయువుకీ, సూర్యరశ్మికీ నోచుకోని లోయలో ముసలిసైతాను రాయిలాగ కూర్చున్నాడట. గళిత పదుడైన ఆతని విషాదచ్ఛాయలో ఒక సెలయేరు చప్పుడుచెయ్యకుండా ప్రవహిస్తోందట. ఇసుకలోని పెద్ద అడుగుజాడలు అతని కాళ్లదాకా వచ్చి ఆగిపోయినవట. కటికనేలమీద అతని కుడిచేయి నరాలు నశించి, చచ్చి, రాజదండములేక అలాగ పడిఉన్నదట. రాజ్యములేని అతని కన్నులు మూసుకుని ఉన్నాయట. కరుణరసము వ్యంగ్యము. మనసానుభూతి అతనిమీద. కాని కీట్సుసైతాను మిల్టనుసైతానంత ఆకర్షించదు. సముద్రుడి ఉపన్యాసము మన సానుభూతిని చాలా మట్టుకు పోగొట్టి సైతాను దురభిమానిగాని ధర్మవీరుడు కాడని తెలియజేస్తుంది. ఇది మిల్టనుకావ్యముకన్న హితోపదేశములో మిన్న. కాని యింత తంటాలుపడీ కీట్సు సాధించినది రామదహీనమిశ్ర చెప్పినట్లు దుష్టశిక్షణము. శిష్టరక్షణములేని నే లోకసంగ్రహపూర్వకమైన సృష్టి పూర్తికాదు. ఈరచనలు కేవల మానందోద్దీపనే చేసి తప్పుకుంటే, సంఘక్షేమము కోరేవారు, వీటి నాక్షేపించక పోవచ్చును. కాని వీటిని చదివిన వారు "స్వర్గములోని నౌకరీకంటె నరకములోని రాజ్యపదవి మే"లని విజృంభిస్తే సంఘహితైషులు వీటిని నేరస్థులనులాగ బహిష్కరించాలి. ప్రత్యేకము మిల్టను కావ్యాన్ని గురించి కాదు నేను చెప్పేది. ఆనందము పేరు పెట్టుకుని దుర్బోధ చేసే కావ్యాలమాట.

కావ్య మానందోద్దీపనే చెయ్యాలందాము. ఎలాగు జరుగుతుంది ఈకార్యము? ఇదివరకు మహాకవులు రచించిన కావ్యాలలోని రీతులు పరిశీలించి ఈ రీతులనే మనము రచించబోయేకావ్యాలలో నిక్షిప్తముచేస్తే చదువరులు ఆనందిస్తారని చెప్పడానికి వీలున్నది. కాని ఈపద్ధతి సౌందర్యాన్ని కత్తికోతకీ గాజుగొట్టానికీ లొంగతీసి, మృతదేహాలతాలూకు సుందరావయవాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వల్ల సుందరీరూపము సృష్టించడానికి చేసేయత్నము లాంటివే. జీవము చివరకి కని పొయ్యవలసినదే. ఇంతే కాదు. కావ్యరీతులు మారిపోతూంటాయి. భవభూతి రచనలు ఆనాడు కాకపోయినా నేడు ప్రశంసా పాత్రములుగాఉన్న వి. రాజనరేంద్రుని కాలంలో "పెంపు నం దుదిముట్టు" కావ్యాలు రాయలకాలానికి పుట్టగత్వా లయిపోయినవి. ప్రబంధవీథులన్నీ ఆధునిక కవికుమారు లకి "వాఙ్మయపురంధ్రికి కారాగారా" లయినవి. నాగరిక ప్రపంచమంతటా ప్రశంసపొందిన షేక్స్పియరు ఖేదాంత నాటకచతుష్టయము ఆధునికాంగ్ల విమర్శకుల దృష్టికి అతిలోకకల్పనలు (Melodramas) గా కన బడుతున్నాయి. కళారీతులు బంధాలకి కట్టువడేవి కావు. కావ్యాలు ఈరీతిగా నుంటే బాగుంటాయి అని యెవరూ నిర్ణయించలేరు. ఈ ఆనందముకూడా శాశ్వతము కాదు. కాబట్టి కావ్యరచనాదర్శము హిత బోధఅంటే, సుమతిశతకములాగ గ్రంథకర్త హితబోధ చేస్తే కవి అవడు. అన్యాపదేశముగా చేసినవాడే ఈ ఆదర్శము సాధించగలడు. అట్టి కావ్యములోని సుందరమైనవర్ణనలు వెన్నెలవలె చదువరిని తన్మయుణ్ణి చేస్తే అందులోని హితము మంచులాగ హృదయాన్ని చల్లబరుస్తుంది. కావ్యాలలోని కరుణరసము వారి హృద యాల్ని ద్రవీభూతము చేస్తే, హితము పోతపోస్తుంది. హితబోధ చేయనెంచే కావ్యాలు కళారీతులు నిక్షి ప్తము కాకున్నా తిరస్కరించబడి నశించవు. మంగి పూడి వేంకటశర్మగారి కవనము దీని కుదాహరణము. వందలకొలదీఉన్న మనశతకాలు ఇందు కుదాహరణము. దాశరథి, నారాయణశతకాలు కళకోసము రచించ బడలేదు. కాని నిలిచిఉన్నాయి. కళకోసమే లక్ష్య పెట్టి ఆధునికులు వందలకొలదీ ఖండకావ్యాలు రచి స్తున్నారు.

> "ఇది మనోజ్ఞదినోదయాంచిత
> సదమలాతి పవిత్రసమయము."

"ఇది దినోదయ సమయము" అని ఊహ. తక్కినపదజాల మంతా మెత్తమెత్తగా ఉండడానికి పెట్టినమాట.

భారతీయకావ్యాదర్శము ఉభయత్రా శ్రేయము. పునీతుడైన ఋషి, సమాలోచనా ఫలితమైన హితమును కాంతాసమ్మితముగా బోధించడానికి కావ్యము రచిస్తే రసపిపాసియైన చదువరి దానిని చదివి ఆనందతన్మయు డౌతాడు. ఆసమయములో అతనిమనస్సు సంఘక్షేమాని కనుకూలముగా మారుతుంది. దానివల్ల పుణ్యమూ పురు షార్థమూ కలిసివస్తాయి. హితమంటే బృహత్తరసంఘా నికి క్షేమకరమైనదే. వ్యక్తికిమాత్రము క్షేమకరమై, సంఘాని కారోపించినప్పుడు దుష్ఫలాలిచ్చేది హితము కాదు. వర్తమాన బృహత్సంఘానికేకాని ఇప్పటే ముందు రాబోయేమొత్తపుబృహత్తరసంఘానికి క్షేమకరముకానిదీ హితము కాదు. ఈ హితము ఏదోఅనుభవజ్ఞుడు, కాక పోతే ప్రతిభావంతుడూ అయిన ఋషి నిర్ణయించ గలడు. సర్వసంగపరిత్యాగియైన తపస్వికి వ్యక్తులు మనస్సులో ఉండరు. సమాజమే అతనిదృష్టిలో ఉం టుంది. కష్టసుఖముల పారమెరిగిన పర్మపురుషుడు రచించినకావ్యము చదువరులహృదయాల్ని రంజిస్తూ, హితోపదేశము చేస్తుంది. దుఃఖితుడైనవాడికి లాగే ఆనందతన్మయుడైనవాడికీ హితోపదేశము చెవి కెక్కు తుంది. ఆనందమూ దుఃఖమూ అసలులో ఒకటేకదూ?

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృష్ట్యంతరముచేఁ గావ్యసృష్టి మరల ద్వివిధము. ఒకటి కవిస్వతంత్రసృష్టి. రెండవది పఠిత అనుసృష్టి. పఠితయనఁగా విమర్శవంతుఁడు, సహృదయుఁడు నగు పఠిత. కవిస్వతంత్రసృష్టి కావ్యరూపమునను, పఠిత యనుసృష్టి వ్యాఖ్యానరూపమునను గోచరించుచున్నవి. ఈ సందర్భములో కవి భగవంతునిస్థానమును, పఠిత కవిస్థానమును ఆక్రమించుచున్నారు.

దృశ్యమానమగు జడప్రకృతిలో భగవంతుని సంకల్పము మరుగుపడిన దనియు, దానిని కావ్యములో ప్రకాశింపఁజేసినవాఁడు కవియనియు వెనుక చెప్పితిని. పరమార్థము వ్యక్తమగుటకు పదార్థము అత్యవసరము, అర్థము వ్యక్తమగుటకు శబ్దమువలె. పదార్థము నాశ్రయించనంతవఱకు భగవంతుఁడు నిర్గుణుఁడు. ఈనిర్గుణబ్రహ్మము మనదృష్టి కతీతము. అందుచేతనే భగవంతుని మనము చూడలేము. అంతేకాదు, చెప్పలేము; భావింపనులేము. కనుకనే బుద్ధిమంతులు భగవంతుఁడు అగోచరుఁడేకాక అవాఙ్మానసగోచరుఁడనియు చెప్పినారు.

ఇట్టి నిర్గుణతత్త్వము ప్రకృతినాశ్రయించి సగుణ మగుచున్నది. చూడఁగలవారు చూచుటకుఁగాని, చూడఁజాలనివారికి చూపుటకుఁగాని ఇదియే అవకాశము. ఈ యవకాశమును సమగ్రముగ నుపయోగించుకొని లోకులను ప్రబోధించువాఁడు కవి. ఈ తత్త్వబోధలో కవిది హృదయంగమమగు పద్ధతి. పిల్లవానికి 'క్రోధము' అనుభావమును తెలుపవలయు నన్నచో అయ్యవారు వ్యాగ్రూపమున నెంత వివరించియు హృదయమున కెక్కింపఁజాలఁడు. క్రోధమును సూచించు చిత్రమును చూపుచో పిల్లవానికి అది హృదయమునకు హత్తి ఆజ్ఞానము వానికి స్థిరముగా నిలుచును. ఇది Objective teaching. సృష్టిరహస్యమును వ్యక్తము చేయుటలో కవిపద్ధతి ఇట్టిది. కవి యుపదేశించు ధర్మమే ఋషియు నుపదేశించును. కాని ఋషిపద్ధతి నీరసము; హృదయమును హత్తదు.

జగద్రహస్యమును వ్యక్తముచేయుటకు కవి యొక సూక్ష్మజగత్తును సృష్టించును. ప్రత్యక్షప్రపంచమునందు అసంబద్ధములుగాఁ దోఁచు విషయకలాపము కావ్యప్రపంచమునందు ఆనుషంగికములు, అవినాభావములు నైయుండును.

"Poetry is an arrangement of reality అని Moulton పండితుఁడు. లోకమునందు ప్రియులు గలరు; వెన్నెలలు గలవు. కాని కావ్యమునందు వీనికి అవినాభావసంబంధము గలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"నాయెడ నీయెడం దవుల
నాకయి నీకయి యారటింప, నీ
లోయలలోపలఁ సెలల
లోపల, జొన్నపొలాలలోపలఁ,
హాయిగ హాయిగా కలిసి
యాడుద మీ తొలినాటి రాత్రిఁ,
గాయును చందురుండు మన
కై జగమెల్ల వెలంది వెన్నెలల్."
(నా "చారుణి" నుండి.)

వెన్నెలలు ప్రియులకొఱకే కాయుచున్నవని ప్రత్యక్షప్రపంచమున నిర్ణయములేదు. కావ్యప్రపంచమున నీ కార్యకలాపమున కంతకు సంబంధము నిర్ణయింపఁబడుచున్నది. ప్రత్యక్ష జగత్తులో పరస్పరాపేక్షములు గాని విషయములు కావ్యమునం దేకసూత్రమున సంఘటింపఁబడుచున్నవి.

"అలసలఘుప్రయాణముల
నల్లననల్లన కాలిబాట, న
చ్చెలువయు రాకుమారుఁడును
చేరిరి కొండొకసేపులోన న
ప్పొలమును; క్రొత్తదంపతుల
పోడుములఁ బాడసూపువారిపై
కలకల నవ్వె నాఁ గలువ
కన్నెలరాయఁడు గాచె వెన్నెలల్."
(నా "చారుణి" నుండి.)

లోకములోని చంద్రికకు అర్థము కన్పట్టదు. కావ్యమునందు అర్థములేనిది జీవింపదు. చంద్రజ్యోత్స్నకు ప్రియుల సమావేశమునకు కావ్యమునందు కార్యకారణసంబంధము సమర్థింపఁబడినది. "In Art no detail liveth to itself" అని Moulton పండితుఁడు. ప్రకృతిలోని యీ యేకత్వము వాచావివరింపరానిది. కనుకనే సృష్టిలో నిరర్థకముగాఁ దోఁచు సర్వమును కవి కావ్యములో సార్థకము చేయుచున్నాఁడు. ఇది కవిసృష్టి.

ఇక పఠితసృష్టి. "To feel freshly and deeply is not only characteristic of the Artist, but also of the reader. The first finds delight in creation and the second in discovery" అని Dr. Hamilton Mabie. సృష్ట్యంతరితుఁడైన పరమాత్మను కవి యెట్లు గుర్తించుచున్నాఁడో కావ్యాంతరితుఁడైన కవిని పఠిత యట్లు గుర్తింపవలయును. జడజగత్తునకు ఆత్మ భగవంతుఁడు. కావ్యమున కాత్మ కవియే. కావ్యాంతరితుఁడైన కవిని గుర్తించి యవ్యయానందసిద్ధిని దొరికించుకొను రసికులు యోగులు.

మానవుఁడు లేనిచో సృష్టియే లేదు. అట్లే పఠిత లేనిచో కావ్యమే లేదు. మానవుఁడు తనయాత్మను విశ్వాత్మతో సమన్వయించి చూచుకొనినప్పుడే సృష్టికి సార్థకత. పఠిత తనయాత్మను కావ్యాత్మతో మేళగించి గ్రహించుకొనినప్పుడే కావ్యమునకు సార్థకత. "Music as well consists in the ear as in the player." శ్రోత లేనిచో గానమే లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"చివురులేనీపాట సిరిరూప మెత్తెనో
చివురురూపమ్మెత్తి చెలగునో నీపాట
కొసరిగొంతెత్తి దిక్కులజాటు నీపాట
కుసుమాస్త్రి సమరసంకుల శంఖరావమో
చైతన్యరససుధాసారమ్ము గురియు సం
గీతమ్ము లోన రాగిల్లు నీ విశ్వమ్ము
విధురనై రాశ్యనిర్విణ్ణమానసములన్
మధురించు కోకిలమ్మా! నీకుస్వాగతము!"
(నా "ప్రణయపథి" నుండి.)

అని కవి సమన్వయము చేయువఱకు కోకిల పాట కర్థమే లేదు. కనుక పఠిత కావ్యస్థితికి ఒక హేతువు. జీవాత్మ పరమాత్మలకు గల బంధమే ప్రకృతి. అనఁగా భగవంతుని మానవుని కూడదీయునది ప్రకృతి. కావ్యమును, కవికి పాఠకునకుఁ గల యొక సంబంధ విశేషము. ఇరువురిలో నెవరు లేకున్నను ఈ బంధమే లేదు. "There is nothing like a Poem absolute. Poetry is a function of sympathy between the author and his audience" అని Kellet పండితుఁడు.

సృష్టిరహస్యమును విప్పిచెప్పుటకు కవి సృష్టికర్తయంతవాఁడు గావలయును. కావ్యరహస్యమును గ్రహించుటకు పఠితయు కవియంతవాఁడు కావలయును. "A critic is one, who has failed in original work." అని Kellett పండితుఁడు. అనఁగా కవియంత వాఁడు కాకున్నను కవితో సమానమైన భావనాబలము గలవాఁడు కావలయును. లేకున్న కవితోపాటు అతీతభావనాపథముల విహరింపఁజాలఁడు.

కవిసృష్టి పఠితకు శబ్దార్థరూపమున సాక్షాత్కరించుచున్నది. అనఁగా కావ్యప్రపంచము యొక్క వ్యక్తరూపము శబ్దార్థములు. కవి భావించినరూపము పఠితకు సాక్షాత్కరించునది ఈశబ్దార్థములమూలముననే కనుక, కవికి "కావ్యఘటనానుకూలశబ్దార్థోపస్థితి" యుండవలయును. అనఁగా నీశబ్దార్థములు నిసర్గములు గావలయునే కాని కృతకములు గారాదు. కృతకములు, బలాదాకృష్టములు నగుచో కావ్యమునకు క్లిష్టత వాటిల్లును. ప్రపంచమునం దిట్టికృత్రిమవస్తునిర్మాణము వృద్ధియగుచున్నది కనుకనే సృష్టిరహస్యమును దుర్గ్రాహ్యమగుచున్నది. మనోహరములు, యథోత్పన్నములు నగు ప్రకృతిచిత్రములు ఛేదింపఁబడి వానిస్థానమున చక్షుఃపీడాకరములగు యంత్రాగారములు నిర్మింపఁబడుట సృష్టికర్తయభిమతమని యెవ్వఁడు చెప్పఁగలఁడు? ఇదియంతయు మానవునిచే బలవంతముగఁ గల్పింపఁబడినది. ప్రశాంతమై మనోహరమైన ప్రకృతి యుత్సంగమున విశ్రమించి వేదఋక్కులు గానము చేసిన ఆర్యఋషి నేఁటి ఈజగద్వైషమ్యము గాంచినచో నావేదములు పాడఁగలఁడా?

ఋష్యాశ్రమములందు మృగములు పరస్పరవైషమ్యములు లేక యుండునవఁట. అనఁగా సృష్టిరహస్యమునకు దాని వ్యక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపమునకు వైషమ్యము లేదు. అప్పుడు వ్యాఖ్యాతకు శ్రమలేదు. ఇట్లే కవియాశయములు అతనిసృష్టిలో సువ్యక్తములు గావలయును. శబ్దము లొకొక్కతరి మహాద్రోహము చేయఁగలవు. కవి ఈవిషయమున జాగరూకత వహింపవలయును. అనఁగా వశ్యవాక్కు కావలయును.

బాహ్యసృష్టిని తిలకించి కవి దాసరహస్యమును భావించును. పఠితయు నట్లే కావ్యరహస్యము గ్రహించును. శబ్దసామగ్రి యపరిపుష్ట మగుచో కవిసృష్టికి పఠితయనుసృష్టికి సామరస్యము పొసగదు. ఆధునికకవిత్వములో నిది యొకగొప్పలోపము. నేఁటికవులకు భావనాబలము లేదనరాదు. ఆభావమును వ్యక్తముచేయఁగలశబ్దశక్తి లేదు. కనుకనే కవికిని పాఠకునకును పొత్తు కుదురుట లేదు. అర్థమునకు పుష్టి, స్పష్టత యలవడుచో ఆధునికకవిత్వము మహోత్కృష్ట మగుననుటకు సుంతయు సందియము లేదు.

---



లాకులు

—కె. కృష్ణమూర్తి, తెనాలి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కురుక్షేత్ర యుద్ధానంతరగాథలు

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

మన దేశచరిత్రము బాగుగా వ్రాయఁబడని లోపము కలదనుట సత్యదూరము కాదు. క్రైస్తవశకారంభమునుండి నేఁటివఱకుఁ గల్గు చరిత్రను మనగ్రంథములనుండియె కాక, 'శిలా, తామ్ర' శాసనాదులనుండి కైకొనఁబడిన యంశములచేఁ గూడ గ్రహింప వీలగుచున్నది. బౌద్ధకాలచరిత్రను బౌద్ధగ్రంథములనుండియు, గ్రీసుదేశస్థుల వ్రాఁతలనుండియు, అశోకాదుల శాసనములనుండియు గ్రహింప నగుచున్నది.

కొందఱు బుద్ధ, చంద్రగుప్త, అశోకులు సాధారణముగా మన మనుకొనుకీలిని, క్రీ. పూ. ౬, ౪, ౩ శతాబ్దములలోనివారు గాక ఇంకను వేయేండ్లకుఁ బూర్వపువారే యని తలంచుచున్నారు.

వారిచరిత్రములను కొన్ని స్వదేశవిదేశ చరిత్రకారుల గ్రంథములనుండియు, నితర గాథలనుండియు గ్రహింప నగుగును. కాని భారతాదులలోఁ జేర్పఁబడినపురాణపురుషుల చరితము లతిశయోక్తులతోఁ గూడిన భారతాదులవలననే తెలిసికొనుచుంటిమి గాని నిజచరిత్రములఁ దెలిసికొనుటకుఁ గల గ్రంథాధారముల నరయుచుండుట లేదు. చూడుఁడు. మహాభారతము యొక్క ఆదిపర్వప్రారంభముననె 'సరమ' యనుదేవశుని పుత్రుని జనమేజయుసోదరు లడచి రనియు, నాశుని పుత్రుఁడు సరమతో నాయంశముఁ జెప్పియేడ్వ సరమ జనమేజయునికడకు వచ్చి యిది యన్యాయమని, యేమేమో చెప్పి సపుత్రికయై యదృశ్య యయ్యె ననియు నొకకథ కలదు. ఆపర్వముననే కద్రూవినతలు సుజ్జపుతోఁకనెండ్రుక నలుపా తెలుపా యని వివాదము నొందిన యంశముఁ గూర్చిన గాథతో గరుడోపాఖ్యానము, అమృతహరణము మొదలగు విశేషగాథలు కలవు. పైకథ లతిశయోక్తియుతములు, కాని వైదికవాఙ్మయమున మఱియొక విధముగాఁ బైగాథ లభిహితములై విశేషముగా సత్యదూరము కాక నాఁటి మతసాంఘికాద్యాచారములను సూచించు నంశములతోఁ గూడియున్నవి.

సరమ, తత్పుత్రుఁడు అని చెప్పఁబడునంశములు 'శ్వగ్రహము' అనఁబడు బాలురకుఁ గల్గు రోగములని 'మంత్రపన్నము'ల (ఏకాగ్నికాండ) యందును, ఋగ్వేదమునను గలవు. 'కద్రూసౌపర్ణుల' వివాదము సుజ్జపు వెండ్రుకకుఁ గాక సౌందర్యపరీక్ష కైనట్లు కృష్ణయజుర్వేదమునఁ గలదు. గరుడుని స్థానమున గాయత్రియు, అమృతస్థానమున సోమముగా నాకృష్ణయజుర్వేదముననే చెప్పఁబడియున్నది. గరుడుఁడు గాయత్ర్యాది ఛందోరూపుఁ డనియే వేదము చెప్పుచున్నది.

భారతాదులలోఁ గల యిట్టిగాథలకును వైదికవాఙ్మయమునఁ గల గాథలకును చాల సంబంధము కలదు. ఆగాథలను వైదికవాఙ్మయముతో సంప్రతించి నచో నాఁటి యార్యుల మతసాంఘికాద్యాచారములను మనము తెలిసికొనఁగలము. ఇట్లే భగవద్గీతయొక్క ప్రథమాధ్యాయమున నర్జునుఁడు 'వర్ణసంకర మగుచున్నది. స్త్రీలు చెడుచున్నారు' మొదలగు నంశములఁ గూర్చి చెప్పినదానికి శ్రీకృష్ణుఁ డేమియుఁ బ్రత్యుత్తర మీయ లేదని కొందఱు తలంచుచున్నారు. శ్రీకృష్ణభగవానుఁడు 'అనార్యజుష్టమ్, అకీర్తికరమ్' అని చెప్పిన వాక్యములోఁ గల యర్థమును నాఁటిసాంఘికపరిస్థితులతో సరిపుచ్చుకొనిన బాగుగా శ్రీకృష్ణభగవానుఁడు జవాబిచ్చిన యంశము విశదపడఁగలదు.

మఱియు మనము మహాభారతగాథను కురుక్షేత్ర యుద్ధాంతమువఱకె బాగుగఁ బరిశీలించుచున్నాము. దుర్యోధనునితోఁ గౌరవకుల మంత మొందెనా? శ్రీకృష్ణనిర్యాణానంతరము బోయ లపహరించిన కృష్ణు నంతఃపురకాంతలం దెచ్చుటకు పాండవు లేల ప్రయత్నింపలేదు? ధర్మజుఁడు తాను మహాప్రస్థానమున కేగుచు రాజ్యమును యుయుత్సునకు (దుర్యోధనుని సపత్నీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సోదరుఁడు) నప్పగింపనేల? పరిక్షిత్తునకుఁ దానె యేల పట్టాభిషేకముఁ జేయలేదు? కురుపాండవుల నెట్లు ప్రజలు గౌరవించుచుండిరి? పరిక్షిత్తునకు శత్రుఁడగు 'తక్షకు' పురమేది? వాని ప్రాచీనస్థితి యెట్టిది? పరిక్షిత్తు విరక్తుఁడై ప్రాయోపవేశమునొంది మృతినొందెనా? లేక ప్రాణసంరక్షణముకై జాగరూకతతో మెలఁగెనా మొదలగు నంశములనుగూర్చి యాలోచింపవలసి యున్నది.

ఇపు డీవ్యాసమున పరిక్షిత్తునుగూర్చియు, నాఁటి పరిక్షిత్కౌరవుల గౌరవములఁ గూర్చియుఁ గల కొన్ని యంశములను వ్రాయుచున్నాఁడను.

## పరిక్షిత్తు

కురుక్షేత్రయుద్ధమునఁ బాండవపంచకము కృష్ణ సాత్యకులు, కృపకృతవర్మాశ్వత్థామలు, సంజయుఁడు మాత్రమె జీవించిరి. పాండవులు వృద్ధులై తత్పత్నులు వృద్ధలై యుండుటచేతను, ద్రౌపదీసూనులవివాహితులై మృతినొందుటచేతను, పాండవవంశమునం దభిమన్యుఁడు మాత్రమె వివాహితుఁడయి యాతనిపత్నియగు నుత్తర గర్భవతిగాన నాయుత్తరాగర్భస్థుఁడె వంశవర్ధనుఁడు కావలసియుండెను. ఆయుత్తర ప్రసవింపఁగాఁ బుత్రుఁడె పుట్టెను. పుట్టినవెంటనె యాతఁడు మృతునివలె నిశ్చేష్టుఁడుగా నుండ నంతకుఁబూర్వము (సౌప్తికవధానంతరము) అశ్వత్థామను బాండవులు పరాభవించుటచేతను, అశ్వత్థామ కోపోద్దీపితుఁడై వెడలిపోవుటచేతను, ఆయశ్వత్థామ యేదేని మంత్రప్రయోగము (చిల్లంగి) చేసి యాశిశువును జంపియుండునని యంతఃపురములోని కుంతీ సుభద్రాదులు తలఁచి తత్కాలమున సన్నిధినున్న శ్రీకృష్ణుతో మొఱనిడియుండిరి. (పాండవాశ్వత్థామలు వివాదముపడునపుడు మీవంశము నిర్వంశము కాఁగలదునా యని స్వశిరోమణ్యపహారాదిజనిత క్రోధముచే నశ్వత్థామ పరుషముగాఁ బలికియుండెను. ఆమాటను దలంచియే యశ్వత్థామశిశువుం జంపెనని కుంత్యాదులు విలపించిరి. శిశువులకుఁ గలరోగములను దయ్యములనుగాను, ప్రయోగములనుగాను బాలగ్రహములనుగాను దృష్టిదోషములనుగాను, ఆప్రయోగములను దమ్మచూచి యోర్వలేనివారె చేసినవిగాను భారతకాలమునుండి నేఁటివఱకు భారతీయులలోఁ బామరులుమొదలు పండితులవఱకుఁ దలంచుచుండుట యాచారమైయున్నది. అట్లు తలఁచువారలలో స్త్రీలె మొదటివారు. ఈతలంపె కుంత్యాదులకుఁ గలిగినది. బాలురకుఁ గల్గిన పైప్రయోగాదులను వివిధరోగములనుగా 'చరకసుశ్రుతా'దిగ్రంథములు చెప్పియున్నవి గమనింపఁదగును. పైబాలరోగములకు మంత్రతంత్రాదులును మనగ్రంథములలో లేకపోలేదు. అథర్వసంహితలోఁ బెక్కులుప్రయోగోపసంహారాదులు చెప్పఁబడియున్నవి. పామరులు తమ బిడ్డలకును దమకును గల్గినరోగాదులకు మందులనుపయోగింపకమంత్రతంత్రములకే ప్రథమప్రయత్నము చేసి నష్టపడుటయుఁ గలదు. రానురా నామూఢత్వ మిపుడు తగ్గుచున్నందులకు సంతసింపవలసియున్నది. కొన్నివ్యక్తులయందుఁ గల్గు రోగాదులకు మందులకంటె మంత్రములేయెక్కువ పని చేయుటయుఁ గలదు. రోగ మొకప్పుడు మన స్సన్యథామాటినను మాఱును. అది వ్యక్తి ననుసరించియు,రోగము ననుసరించియు నుండునని సుశ్రుతాది గ్రంథములును, గొన్నితంత్రగ్రంథములును అంగీకరించుచున్నవి.

పరిక్షిత్తు శ్రీకృష్ణుని మంత్రతంత్రాదులచే సచేతనుఁడగుటచే నాతనికిఁ 'బరిక్షిత్ప్రాణసంధాత' యని బిరుదము గల్గెను. భారతభాగవతములలో "పరిక్షిత్తు, పరీక్షిత్తు" అని రెండు విధములుగా నాతనినామము పేర్కొనఁబడెను. కులముపరిక్షీణమైనపుడుపుట్టినవాఁడుగాన పరిక్షిత్తయ్యెనని భారతమును, గర్భమున రక్షించిన కృష్ణుని దాను భూమిపైఁబడఁగానే పరీక్షించుటచేఁ బరీక్షిత్తయ్యెనని భాగవతమును జెప్పుచున్నవి. భాగవతములోఁ జెప్పినయంశము ప్రకృతివిరుద్ధముగా నున్నది.

ఐతరేయబ్రాహ్మణము "పరిక్షి" చ్ఛబ్దము నింకొకరీతిని సమర్థించుచున్నది. (౧) "పరిక్షిత్తవ నగ్ని.

౧ న్యాంఖః పారిక్షితీ శ్శంస త్యగ్ని ర్వై పరిక్షిన్ అగ్ని ర్హీమాః ప్రజాః పరిక్షియం త్యగ్నిం హీమాః ప్రజాః పరిక్షియంతి... సంవత్సరో వై పరిక్షి త్సంవత్స రో హీమాః ప్రజాః పరిక్షేతి సంవత్సరం హీమాః ప్రజాః పరిక్షియంతి. [ఐతరేయబ్రాహ్మణ ౬-౬.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గడియారపు గోపురము
(మండలెకోట) ౯౦ అడుగుల ఎత్తు
దీనిని మిండనురాజు ఒకరోజున కట్టించెనట
G. S. A.



కొండకొమ్మననున్న బండపయి దేవాలయము,
ఇది బర్మాలో 'క్యైక్టో' అనుచోట గలదు
ఇది గౌతమబుద్ధుని కాలముననుండి కలదట.
వేలకొలదియాత్రికు లేటేట సకలదేశములనుండి
యుత్సవమునకు వత్తురట G. S. A.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



కృతకద్వీపము (మధురయందున్న పెనుకొలను నడుమగల విశాలవేదికపయి పుష్పఫలవనవాటిక)

యస్. శంకరసుబ్రహ్మణ్యము



డాయము ఆట

పి. ఆర్. కృష్ణరావు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అగ్ని ప్రజలను జుట్టుకొనును లేక ప్రజ లగ్నింజుట్టి కొందురు. (అట్లే పరిక్షి త్తగ్నివలెఁ బ్రజలం జుట్టి యోగక్షేమములం దెలిసికొనుచుండును. లేక ప్రజలు పరిక్షిత్తును జుట్టియుందురు). మఱియుఁ బరిక్షిత్తన సంవత్సరము సంవత్సరము ప్రజలందఱిపై వ్యాపించును; లేక ప్రజలు సంవత్సరమును జుట్టుకొనియుందురు." (అట్లే పరిక్షిత్తు ప్రజలలో నవినాభావముగా మెలఁగుచుండును. లేక ప్రజలు పరిక్షిత్తుతో నవినాభావులై సంచరించుచుందురు.)

పరిక్షిచ్ఛబ్దమునకు నగ్ని యనునర్థము నిఘంటువులలోఁ గలదు. సంవత్సర మను నర్థము కాన్పింపదు. ఇందుకై నిరుక్తమును శోధింపవలసియున్నది.

పరిక్షిత్తు దేశము మహాదుఃఖమగ్నమై యుండినపుడు జన్మించియున్నాఁడు. ఈతఁడు పుట్టినస్వల్ప కాలముననే ధర్మజుఁ డశ్వమేధయాగము చేసియున్నాఁడు. ఆమహాయాగముచే బ్రహ్మహత్యాదిదోషములు పోయినఁ బోవుఁ గాక. దిగ్విజయమునకై పోయిన యర్జునునిచేఁ బెక్కండ్రు సైనికులు మడియుటయు, నర్జునునకు లోఁబడిన రాజులు పార్థున కిచ్చుకప్పములకై ప్రజలఁ బీడించుటయు ననునుపద్రవములు ప్రత్యక్షాప్రత్యక్షములుగా జరిగియున్నవి.

పరిక్షిత్తు పదునైదు లేక పదునెనిమిదియేండ్ల వాఁడైనపుడు దుర్యోధనాదులభార్యలు వ్యాసుని కపటోపాయముచేఁ బరిక్షిత్తు నెదుటనే గంగలోఁ బ్రవేశించి సంఘమరణము నొందిరి. పిమ్మట నచిరకాలముననే కుంతీ గాంధారీధృతరాష్ట్రులు దావాగ్నిలోఁబడి మడిసి రనుదారుణవార్త వినఁబడెను. మఱి కొంతకాలమునకు మహాబలవంతులగు యాదవు లన్యోన్యకలహములచే మృతి నొంది రనుదుఃఖవార్త ఏతెంచెను. ఆ వార్తతోఁగూడ దమకులమున కేడుగడయగు శ్రీకృష్ణుఁడు వైకుంఠమున కేగెనను నుపద్రవవార్తయేకాక పితామహుఁడగు విజయుఁడు బోయలచే నపజయము నొంది కృష్ణునంతఃపురస్త్రీలను, నపారధనరాసులను గోలుపోయె ననుమహాదుఃఖవార్తలు వినఁబడెను.

అప్పటికిఁ బరిక్షిత్తునకు ముప్పదియాఱవయేఁడఁట! ధర్మజుఁడు శ్రీకృష్ణుని నిర్యాణముచే నిస్సహాయుఁడై "ప్రాగ్జ్యోతిషమాగధత్రిగర్త సింధుగాంధా" రాది దేశస్థులు కురుక్షేత్రసంగ్రామమునం దమవారికిఁ గల్గిన యన్యాయమరణమునకై కాక 'గోరుచుట్టుపై రోఁకటిపోటన్న' ట్లశ్వమేధయాగము నెపమున దమ్ముఁ బీడించి యపారధనమును గప్పముగాఁ బుచ్చుకొనుటచేఁ గినిసి సమయమునకై వేచుచుందు రనుభయము ధర్మజునకుఁ గల్గియుండును. శ్రీకృష్ణునాలోచనాసాహాయ్యము కల్గుటచేతను, బలవంతులగు యాదవులు బంధువులుగా నుండుటచేతను పైనుడివినమాగధాదు లేమియుఁ జేయలేకుండిరనియు, స్వబంధువులగు మాత్స్యులు పాంచాలురు మూలముట్టుగ నశించుటచే నన్యసహాయ మభావమయ్యెననియు ధర్మజుఁడు తలఁచియుండెను. దీనికి నిదర్శనముగా నంతకుఁబూర్వ మూరుపేరులేని కిరాతులే మహాబలవంతుఁడును, బ్రఖ్యాతిఁగన్నవాఁడును నగు విజయునిం జిదుకఁగొట్టి యోడించుటచేతను, *స్వరాజ్యమునఁ బ్రజలు రాజశాసనోల్లంఘనమునకుఁ గడంగుచుండుటచేతను దా మీదేశముననుండిన నేదైనదండయాత్రచేసి పైనుడివినమాగధాదులు తమ్ముఁ బదభ్రష్టులఁ జేతురనియే తమవంశాంకురమగు పరిక్షిత్తునకుఁ బట్టముగట్టుమని రాజ్యము యుయుత్సునిపరము చేసి కృపుని సంరక్షకునిగాఁ బరిక్షిత్తునకు నియమించి జంఘాబలముం జూపి త్రివిష్టపముం బాండవులుచేరిరి. దీనికిఁ జిలువలు పలువలు పిమ్మటఁ జేర్పఁబడియుండును.

స్వశత్రువు పలాయితుండైనఁ దద్వంశమునందును దద్దేశమునందును విరోధభావము భారతీయుల కుండకపోవుట స్వభావము. మఱియు ధృతరాష్ట్రపుత్రుఁడగు యుయుత్సుఁడు రాజప్రతినిధియగుటచేఁ

* హస్తిపురిలోఁ గొందఱుప్రజలు నివేశనములకై హద్దుమీఱి సహదేవుఁడుచెప్పినతీర్పు నతిక్రమించినట్లు మహాప్రస్థానికపర్వమునఁ గలదు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రజలలోఁ దృప్తిపియుఁ గల్గెను. పరిక్షిత్తు యుయు త్సునివల్ల రాజనీతిని నేర్చి కృపునికడ నస్త్రశస్త్ర విద్యలు నేర్చి ప్రజారంజకముగాఁ బగిపాలించుటయే కాక యన్యులతో విరోధముఁ బెట్టుకొనకుండుటచే నితరులును బరిక్షిత్తును ద్వేషింపరైరి. దీనినిగూర్చి మహాభారతమననే యిట్లు కలదు.

౧ శ్రీమంతుఁడు మహాబలవంతుఁడు, ధర్మము వలననే ధర్మముఁ దెలిసినవాఁడు నగు పరిక్షిత్తు ధర్మము మూర్తీభవించినట్లే భూదేవిని బాలించెను. అతనిని ద్వేషించువా రెవరును కారైరి. అతఁ డెవ్వరిని ద్వేషింపను లేదు. ఆతఁడు సర్వభూతములయందును బ్రజాధిపతివలె సముఁడయ్యెను. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు తమ తమ కర్మములయందు మంచి మనస్సుకలవారై మెలఁగిరి. ఆ మహారాజు వితంతువులను అనాథలను ఉంగవైకల్యముగలవారిని దీనులను భరించెను. సంతోషింపఁబడిన, పోషింపఁ బడిన జనులు కల్గినట్టియు సత్యవాక్కులు కల్గినట్టియు దృఢపరాక్రముఁడైనట్టియు మహాకీర్తివంతుఁడైనట్టి యా మహారాజు సమస్తప్రజలకుఁ బ్రియుఁడయ్యెను. అట్లా పరిక్షిన్మహారాజు అఱువదేండ్లు పరిపాలనముఁ జేసెను.

ప్రజలను సర్వసమత్వముగాఁ బాలించుటయే కాక వితంతువులను (పాండులనాఁడు వారు గంగా ప్రవేశముచేయించినట్లుగాక) పోషించుటయు ననాథలను గాపాడుట యనువిశేషాంశములచే జనసామాన్యము యొక్క భక్తికిఁ బరిక్షిత్తు పాత్రుఁడయ్యెనని చెప్పవలసి యున్నది. సర్వప్రజారంజకుఁడగు ప్రభు వగుటచేతనే పరిక్షిత్తును బ్రజలు 'అగ్నీషోముల' తోను, దేవుని తోడను బోల్చి విశేషముగ వినుతించిరి. పరిక్షిత్తు గురించి మహాభారతముననె కాక వైదికవాఙ్మయమున "అథర్వసంహితలోను, ఐతరేయబ్రాహ్మణములోను" గూడ నాతఁడు సత్ప్రభుఁడనియే చెప్పఁబడియున్నది. అథర్వసంహితలోనియంశము లెట్లుండెనో చూడుఁడు:

౩ ఓ గాయకుఁడా ? పశువులను భాగ్యమును సమ కూర్పఁగల ఋక్కును బఠింపుము. విలుకాఁడు విశిఖ మును సంధిస్తునట్లు దేవతలకు ప్రార్థనము సిద్ధము చేయుము.

౪ పరిక్షిత్త్సవమును వినుఁడు. ఆతఁ డందఱు ప్రజలకుఁ బ్రేమాస్పదుఁడగు రాజు. మానవులకు భగ వంతుఁడగు నగ్నివలె నధికుఁడు.

౫ బీడలలోనుండి పండిన యవధాన్య మాకాశము నందలి వెలుఁగుకొఱకుఁ బైకిఁ బొడచుకొనివచ్చు చున్నది. పరిక్షిత్తు పాలించుచున్న రాజ్యమునఁ బ్రజలు సుఖముగా వృద్ధినొందుచున్నారు.

---

౧. శ్లో. ధర్మతో ధర్మవిద్రాజా ధర్మో విగ్రహవానివ;
రరక్ష పృథివీం దేవీం శ్రీమా నతులవిక్రమః.

ద్వేష్టార స్తస్యనై వాసన్ సచ ద్వేష్టి నకంచన;
సమ స్సర్వేషు భూతేషు ప్రజాపతిరివాభవత్.

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చైవ
స్వకర్మసు.

స్థితా స్సుమనసో రాజన్ తేన రాజ్ఞాస్వధిష్ఠితాః
విధవాఽనాథ వికలాన్ కృపణాంశ్చ బభార సః;
సుదర్శ స్సర్వభూతానా మాసీత్సోమఇవాపరః
తుష్ట పుష్టజన శ్రీమాన్ సత్యవాగ్దృఢవిక్రమః
లోకస్యచైవ సర్వస్య ప్రియ ఆసీన్మహాయశాః,
ప్రజా ఇమా స్తవ పితా షష్టివర్షా ణ్యపాలయత్.

౨ మహాభారతవ్యాఖ్యాత యగు నీలకంఠాచా ర్యుఁడు 'షష్టివర్షాణ్యపాలయత్' అనువాక్యమునకు వ్యాఖ్యంజేయుచుఁ బరిక్షిత్తరువదేండ్లువయస్సు వచ్చు వఱకే (అనఁగా ముప్పదియాఱవయేఁడున రాజ్యమునకు వచ్చి యిరువదినాలుగేండ్లే) పాలించె నని వ్రాసి యున్నాఁడు. ఈయంశము నింకను శోధింపవలయును.

3. ప్రరేభరం భరస్వ గోవిందం వసువిదం దేవత్రేమాం వాచం కృధోషు నవీరో అస్తా.

౪. రాజ్ఞో విశ్వజనస్య యా దేవో మర్త్యా అతి వైశ్వానరస్య సుష్టుతిమాశృణో తో పరిక్షితః.

౫. అభీవస్వః ప్రజహీతే యవః పక్వః పరోవిలం జనః సభద్ర మేధతే రాష్ట్రే రాజ్ఞః పరిక్షితః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧సింహాసనమెక్కి మాకు క్షేమమును జేయుచున్నాఁడు (అని) గృహనిర్మాణమును జేసికొనుచు నొక కౌరవ్యుఁడు భార్యతో ననుచున్నాఁడు.

౨పరిక్షిన్మహారాజుయొక్క రాజ్యమునందు భార్య భర్తనుగూర్చి నీ కేమితెత్తును? పెరుగా! పాయసమా! మద్యమా! అనియడుగుచున్నది.

మహాభారతములోని పరిక్షిత్తుయొక్క యోగ్యమగు పరిపాలనవర్ణనమును 'అథర్వసంహితలోని' పరిక్షిత్ స్తవరూపకమగు వర్ణనము దృఢపఱచుచున్నది.

మఱియుఁ బరిక్షిత్తునుగూర్చి పై 'కుంతాపసూక్తము' నకు బ్రాహ్మణమైన ఐతరేయ బ్రాహ్మణవాక్యమునుఁ గూడఁ బరిక్షిత్తు నగ్నివలెను సంవత్సరమువలెను బోల్చి వర్ణించుటచేఁ బరిక్షిత్తు ప్రజారంజకముగా రాజ్యముఁ జేసినట్లు స్పష్టమగుచున్నది.

ఇంక నొకవిశేషము కలదు. పైకుంతాపసూక్తపు ఋక్కులలో (౪) కౌరవ్యుఁ డొకఁడు గృహనిర్మాణముఁ జేసికొనుచు భార్యతోఁ బరిక్షిత్తు సింహాసనమెక్కి మాకు క్షేమముఁ జేయుచున్నాఁ డనుటచే ధర్మజునినాఁడు నానాకష్టముల ననుభవించి దేశభ్రష్టులైన కౌరవులను దిరిగి హస్తిపురికి రప్పించి వారు గృహములఁ గట్టుకొని నివసించునట్లు చేసెనని తోఁచుచున్నది. కాని కాలాంతరమున నాకౌరవులు రాజ్యమునఁ బరిక్షిత్తుతో సమానమగు గౌరవమునే పొంది యున్నారని యాక్రింది యైతరేయబ్రాహ్మణవాక్యము చెప్పుచున్నది.

౩"దేవత కే కల్యాణకర్మమును జేసిరో యది కౌరవ్యులచే (ప్రజలు) నొందుచున్నారు. యజమానులే కల్యాణకర్మమును జేసిరో యాకల్యాణకర్మమును యజమానులు కౌరవులచేఁ బొందుచున్నారు." అథర్వసంహితలోఁ గౌరవుఁ డొకఁడు గృహము గట్టుకొనుచున్నట్లు మాత్రమే అనఁగా నవీనముగా హస్తిపురిం జేరినట్లే జెప్పఁబడినది. ఐతరేయ బ్రాహ్మణములోఁ బై సూక్తమును బ్రాహ్మణించుటలోఁ గౌరవ్యులు దేవతలుచేసిన శుభకర్మములఁ జేయుచుండిరనియు, యజమానులు కౌరవ్యులచేఁ దాము చేయుకర్మములఁ జేయించుకొనుచుండిరనియుఁ జెప్పఁబడుటచే దుర్యోధనాదులసంతతి వారు క్రమముగాఁ బరిక్షిద్రాజ్యమునఁ బ్రవేశించి ప్రధానోద్యోగపదముల నాక్రమించిరని తోఁచుచున్నది.

మఱియొకవిశేషము "పరిక్షిత్; కౌరవ" శబ్దములు "న్యూంఖ" గాఁ జెప్పవలయునని యైతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. ౪న్యూంఖగాఁ జెప్పుట నాఁటికాలమునఁ బ్రభువులు వచ్చునపుడు యజ్ఞము

౧. పరిక్షిన్నః క్షేమ మకరు త్తన ఆసన మాచరన్ కులాయంకృణ్వన్ కౌరవ్యః పతి ర్వదతి జాయయా.

౨. కతర త్త ఆహరాణి దధి మన్థం పరిశ్రుతం జాయా పతిం విపృచ్ఛతి రాష్ట్రే రాజ్ఞః పరిక్షితః.

అథర్వసంహిత. కాం. ౨౦. సూ. ౧౨౭.

(కుంతాపసూక్తమ్)

3. న్యూంఖః కౌరవ్యాః శంసతి దేవా వై యత్కించ కల్యాణం కర్మా కుర్వం స్తత్కౌర వ్యాభిరవాప్నువం స్తథైవ తద్యజమానా యత్కించ కల్యాణం కర్మ కుర్వంతి తత్కౌరవ్యాభిరాప్నువంతి.

ఐతరేయబ్రాహ్మణ. అధ్యా, 3౦. ౨౮

౪. 'న్యూంఖ' యనఁగా షోడశ-ఓకారోచ్చారణమైన పెమ్మట పదము నుచ్చరించుటయని "యజ్ఞకర్మణ్యజపన్యూంఖసామసు" అనుపాణిని (౧-౨-3౪) సూత్రమునకుఁ గాశికాభాష్య టీకాకారుఁడగు 'హరదత్తుఁడు' తన పదమంజరీటీకలో వ్రాసియున్నాఁడు. ఈయంశముఁగూర్చి నాచే రచింపఁబడిన 'పరిక్షిత్తు' అను పుస్తకమున వివరించితిని. ఈకుంతాపసూక్తములోని న్యూంఖోచ్చారణమును, ఆంధ్రదేశస్థశ్రోతులు షడోంకార యుక్తముగా నుచ్చరింతురు. అమరవ్యాఖ్యాతయగు 'లింగాభట్టు' తనవ్యాఖ్యలో న్యూంఖ యన షడోంకారపుంజమే యని చెప్పియున్నాఁడు. దీనింగూర్చి యింకను శోధింపవలెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలో వారి పేరునకుముం దుచ్చరించు నొక గౌరవ స్వర ప్రయోగము. కొన్ని దేవతావాచకములకును ముందు న్యూంఖయుండును. ఆన్యూంఖోచ్చారణమును (కుంతాపసూక్తాంతర్గతమగు పారిక్షితి కౌరవ్యపదములను) 'బ్రాహ్మణాచ్ఛంసీ'యను ఋత్విక్కు చేయవలెనని యైతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. అనఁగాఁ బరిక్షిత్తుకాలమున నాతనితో సమానముగాఁ గౌరవులు యజ్ఞాదులఁ జూడనేగినపు డాయజ్ఞములలో గౌరవించుచుండిరని స్పష్టమగుచున్నది. న్యూంఖోచ్చారణ మిపు డాంగ్ల ప్రభువులకుఁ జేయు 'హిప్ప్ హిప్ప్ హుర్రేస్' అను నుత్సాహవాక్య సమమగును.

పరిక్షిత్తుకాలమున దుర్యోధనునిపుత్రుఁ డొకఁ డుండినటులు కాన్పించును. కౌరవ్యుఁ డొకఁడు కలఁడని యథర్వసంహితలోఁ గలదు. ఆకౌరవ్యునకుఁ గల గౌరవము పరిక్షిత్తుతో సమానముగా నుండెనని యైతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. మఱియు 'భాస' మహాకవి నేఁటికి రెండువేలేండ్లనాఁడు రచించిన "ఊరుభంగ"నాటకమున దుర్యోధనుఁడు తొడలు విరిగిపడినపుడు బాలుఁడైన "దుర్జయుఁడు" అనుపుత్రుఁడు వచ్చి తండ్రితో సంభాషించినట్లు వ్రాసియున్నాఁడు. ఆ బాలుని సుయోధనమరణానంతరము తల్లి పుట్టినింటివారు కళింగదేశపువారు తమదేశమునకుఁ దీసికొనిపోయి పెంచి పెద్దవానిఁగఁ జేసిరేమో! ఆకౌరవ్యుఁడే యథర్వవేదమునఁ జెప్పఁబడినవాఁడై యుండును.

మఱియుఁ బాండవులు మహాప్రస్థానికమున కేగునపుడు ధర్మజుఁడు తనరాజ్యమునంతయు యుయుత్సుని పరము చేసి పరిక్షిత్తునకుఁ బట్టాభిషేకము చేయుమనుటలోఁ గూడ విశేషము కలదు. ముప్పదియేండ్ల వయస్సుకల పరిక్షిత్తునకే యేల రాజ్యాభిషేకముం జేయరాదు? ఇందును ధర్మజుని రాజనీతినైపుణ్యము కాన్పించుచున్నది. వైశ్యాపుత్రుఁడగు యుయుత్సునకు రాజ్యాభిషేకార్హత లేదు.౧ కాన యుయుత్సుఁడు రాజ్యమును రాజప్రతినిధిగా నుండి పాలించునేకాని రాజుగానుండక తన కప్పననేసినరాజ్యమును బరిక్షిత్తున కిచ్చుననియే ధర్మజునితలంపు. యుయుత్సుండును రాజ్యాధికారమును స్వాధీనపఱచుకొని పరిక్షిత్తునకు రాజ్యాభిషేకముఁ జేసి దుర్యోధనపుత్రుని రప్పించి యాతనికిఁ బ్రాచీన కౌరవులకుఁ గలగౌరవముల

---

మఱియొకవిశేషము: అథర్వసంహితలోని 'కుంతాపసూక్తము' ఋక్సంహితనుండి గ్రహింపఁబడినదై యుండును. కావుననే ఋగ్వేదబ్రాహ్మణమగు నైతరేయమున దానికిఁ బ్రవేశము కలిగినది. ఇప్పటి ఋక్ (శాకల్య) సంహితలోఁ గుంతాపసూక్తము కానరాదు. ఈకుంతాపసూక్త మన్యమగు ఋక్శాఖలోనిదయియుండును. నేఁడు కాన్పించు నథర్వసంహితయంతయు 'సాయనాచార్యుల' వారికి లభింపలేదు. అందువలననే (సభాష్యకముగా హరినారాయణఆప్టే పండితుఁడు) పూనాలో ముద్రించినప్రతిలోఁ గుంతాపసూక్తమునకు భాష్యము లేదు. సాయనాచార్యులు ఐతరేయబ్రాహ్మణభాగమున నీకుంతాపసూక్తము 'ఖిల' సూక్తములోనిదని చెప్పియున్నాఁడు. మఱియు నైతరేయబ్రాహ్మణమునఁ గౌరవ్యశబ్దము 'కారవ్య' చెప్పఁబడెను. ఈకారవ్యశబ్దమున కర్థము 'ఇంద్రుఁడు' (కారుశబ్దోపేతాః కారవ్యాః ఇంద్రః, అని విద్యారణ్యుఁ డర్థమును వ్రాసియున్నాఁడు. కాని నేఁడు "బర్లిన్, పూనా, లాహోరు"లలో ముద్రింపఁబడిన యథర్వసంహితలలోని కుంతాపసూక్తమునఁ గౌరవ్యశబ్దమే కలదు. ఐతరేయబ్రాహ్మణమునాఁడు కౌరవ్యశబ్దమును గారవ్యయని యుచ్చరించిరేమో! మఱియుఁ గుంతాపసూక్తమునఁ గౌరవ్యుఁడు గృహమును గట్టుకొనుచున్నట్లున్నది. కారవ్యుఁ డింద్రుఁడైననాతఁ డింటినిగట్టుకొనుచున్నాఁడనుట యయుక్తముకాదా! కాన అథర్వసంహితలోని కుంతాపసూక్తము సాయనునకు లభింపనందుననే యిట్లు కారవ్యశబ్దమున కింద్రుఁడను పెనర్థముఁ జెప్పియున్నాఁడని తలంపవలసియున్నది.

౧ శ్రుతిః "వైశ్యాపుత్రం నాభిషించేరన్" కృష్ణయజుర్వేదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొసంగునట్లు పరిక్షిత్తుచేఁ జేయింపఁబడుచుండెను. అదియే యథర్వవేదోదిత కౌరవ్యుని వాక్యము. పరిక్షిత్తు యొక్క యోగ్యతనుగూర్చి 'శమీకముని' పరిక్షిత్తు ప్రపితామహుఁడగు పాండురాజువలె సుపరిపాలనముఁ జేయుచున్నాఁడని తనకుమారుఁడగు శృంగిమునితోఁ జెప్పియున్నాఁడు.

శమీకుఁడు పరిక్షిత్తుపాలనమును పితామహుఁడగు ధర్మజునిపాలనముతోఁ బోల్పక పాండునిపాలనముతోఁ బోల్చుటకు హేతువేమి? ధర్మజునిపాలనమున దేశము నానాకష్టములను బొందినదనుటయే కాదు. జ్ఞాతులనఁబడు కౌరవులకు బహుకష్టములఁ గలిగించెననియుఁ, పాండురాజు ధృతరాష్ట్రుఁ డంధుఁడై రాజ్యార్హుఁడు కాకుండినను దానా ధృతరాష్ట్రుని సింహాసన మెక్కించి యాతనికిఁ బెక్కుమర్యాదలఁ గలుగఁజేసియుండెననియుఁ బరిక్షిత్తుకూడ నట్లే రాజ్యచ్యుతి నొంది దేశభ్రష్టుఁడైన దుర్యోధనపుత్రుని దెచ్చి స్వసమానగౌరవముల నాతనికిఁ గలుగఁజేసియుండెననియు శమీకునివాక్యము స్పష్టపఱచుచున్నది.

¹పరిక్షిత్తును కౌరవ్యునిగూర్చి చెప్పినవేదవాక్యములకు 'నారాశంసి' యనుపేరు కలిగినట్లు 'ఐతరేయబ్రాహ్మణము' నఁ గలదు. నారాశంసియన నరులఁ గూర్చి చెప్పఁబడునట్టివని నిఘంటువులలోను, విద్యారణ్యభాష్యమునను గలదు. కాన నాఁటి వైదికఋషులు పరిక్షిత్తును దివసమయాముఁడగు కౌరవ్యుని విశేషముగా గౌరవించుచుండిరని స్పష్టమగుచున్నది.

మొత్తమునకుఁ బరిక్షిత్తు రాజ్యము సర్వజన సుఖకరముగా నిరువదినాలుగేండ్లు ప్రవర్తించెను. (అఱువదేండ్లనికొందఱు) పరిక్షిత్తు "భద్రవతి" (మద్రవతి, యని గ్రంథాంతరములలోఁ గలదు.) యను నామెను బెండ్లియాడి యామెయందు "జనమేజయ, శ్రుతసేన, భీమసేన, ఉగ్రసేను" లను నల్వురం బడసి సుఖంబుగ నుండెను.

## కురురాజ్యసంక్షోభము

మనభరతఖండమున నేరాజ్యమైనఁ జాలకాలము స్థిరస్థాయిగ నుండలేదు. అందు కురురాజ్యము (ఢిల్లీ ప్రాంతరాజ్యము)తొందరలకు, రాజులమార్పునకుఁ బ్రసిద్ధికెక్కి యున్నది. భరతఖండచరిత్రముఁ జదివినచో హస్తిపురప్రాంతరాజ్యకల్లోలములె తద్రాజరాజ్యచ్యుతులే తత్కారణమున యావద్భరతఖండరాజ్యపరిణతులె కాన్పించును పాండవులకుఁ బ్రాచీనులగు సంవరణ, శంతనులకాలమున రాజ్యసంక్షోభపరిణతులు కలిగినవి. పాండవులనాఁటిబీభత్సము జగద్విదితము. పరిక్షిత్తునకుఁ బిమ్మటను "నిచక్షుని" నాఁడు ఉదయనుని నాఁడు కురురాజ్యమున నుపద్రవములు కలిగినవి. మహమ్మదీయులనాఁటి ఢిల్లీరాజ్యబీభత్సములు జగద్విదితములు.

---

౧. అథర్వవేదోదిత పరిక్షిత్తు, ఐతరేయబ్రాహ్మణోదిత జనమేజయుఁడు, పాండవులు పౌత్రప్రపౌత్రులని నేను వ్రాయఁగా శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు వేదము పౌరుషేయమా? కాన వేదోదితపరిక్షిజ్జనమేజయులు పాండవేయసంతతి కాదనియు, జైమినియొక్క పూర్వమీమాంసలో వేదోదితపురుషులు యజ్ఞాదిక్రతువులం జేసినరాజశ్రేష్ఠులనియు వ్రాసిరి.

కృష్ణమూర్తిశాస్త్రిగారివ్రాఁత అవ్యాప్తిదోషయుక్తముగా నున్నది. వేద మపౌరుషేయ మైనచో నీపరిక్షిదాదులు పాండవులసంతతివారు కాకుండినను తత్పూర్వికులైన నగుదురుగదా! వారుమాత్ర మెట్లు అపౌరుషేయవేదములో దూరిరి? అపౌరుషేయవేదమున నొకానొక మనుష్యుని పేరెట్లు ప్రవేశించును? కాన కృష్ణమూర్తిశాస్త్రిగారివ్రాఁత యప్రాప్త మగుచున్నది. పరిక్షిన్నాములు పురాణములలో నల్వురు కలరు. (౧) అవీక్షితుని పుత్రుఁడు; (౨) అనశ్వునిపుత్రుఁడు; (3) సుశోభన యను మండూకకన్యకాభర్త. శల, దలాదులు పుత్రులు. పై మువ్వురును నపాండవేయపరిక్షిత్తువలెఁ బ్రసిద్ధినొందినవారును యోగ్యులును గారు. కాన వైదికవాఙ్మయోదితపరిక్షిత్తు పార్థపౌత్రుఁడే యై యున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిక్షిత్తుకాలమున యావద్భారతఖండ మెట్లుండెనో తెలియదుగాని, కురురాజ్యముమాత్రము సుపరిపాలితమై స్వారాజ్యముబోలె సుఖకరముగా నుండెను. పరిక్షిత్తు పాలనమునకు వచ్చునాఁటికి "సింధు కాశ్మీర గాంధార మద్రబాహ్లీక" దేశప్రభువులను "సైంధవ పౌత్ర, గోనంద (కాశ్మీరదేశప్రభువు. కురుసంగ్రామమునాఁటి కితఁడు బాలుఁడని హరివంశమునం గలదు) శకునిపౌత్ర, శల్యపౌత్ర, బాహ్లీకప్రపౌత్రులును బాలురగానుండిరి. వీర్యవంతులగు సైనికులు కురుసంగ్రామమున నశించిరి. ఆదేశములలో బాగుగ పాలించురాజులు లేకుండిరి. అందువలన నాదేశములు 'అల్లకల్లోలముగా' నుండినట్లు కాన్పించును. కర్ణపర్వములోని కర్ణశల్యుల సంవాదములో శల్యునిపాలనములోని మద్రబాహ్లీకదేశములలోని సాంఘికదురాచారములు తత్రస్థస్త్రీపురుషనైచ్యకృత్యములువర్ణింపఁబడియున్నవి. అవి కురుసంగ్రామానంతరమున నచట నుండినయకృత్యములే పిమ్మట నేసౌతిచేతనో మూలభారతగాథలోఁ జేర్పఁబడియున్నవి.

కర్ణుఁడు పంచనదప్రాంతదేశములస్థితినే దూషించియున్నాఁడు. ఆ పంచనదదేశము వేదములందు పవిత్రప్రదేశముగా నెన్నఁబడియున్నది. శల్యశకుని బాహ్లీకభూరిశ్రవసులవంటిబలవంతులు వేదోదితాచారపరులు, పాలించుకాలమున కర్ణుఁడు నుడివినరీతిని పైప్రభువులపరిపాలనమున నుండునా? శల్యాదు లట్టిదురాచారముల నణఁప లేరా? కాన కర్ణోదితవర్ణనములు కురుసంగ్రామానంతరపువే యైయున్నవి. కురుసంగ్రామానంతరము ముప్పదియాఱేండ్లకు పవిత్రపంచనదదేశమునుండి బయలువెడలిన కిరాతులే యర్జును నోడించి కృష్ణుభార్యలం దోచుకొనిరి.

### తక్షకుఁడు

పురాణములలో "కద్రూకశ్యపుల"కు శేషవాసుకి తక్షకాదిసహస్రనాగము లుద్భవించినటులు కలదు. వేదమునం దీక్రిందివారు సర్పముఖ్యు లనికలదు.

౧ "తక్షకుఁడు, వైశాలేయుఁడు (విశాలయొక్క సుతుఁడు) ధృతరాష్ట్రుఁడు, ఐరావతుఁడు"

అనువారు సర్పరాణ్ముఖ్యులని 'సర్పబలి'కర్మమునఁ జెప్పఁబడియున్నారు. ఆవేదోదితుఁడు కద్రూపుత్రుఁడుకూడఁ బరిక్షిద్విరోధియగు తక్షకుఁడు కాఁడు. ఈతఁడు పాండవు లింద్రప్రస్థపురిని నిర్మించునాఁటికి అశ్వసేన, శ్రుతసేనులను నిరువురుపుత్రులతోడను, భార్యతోను ఖాండవవనమున నివసించుచు నపుడపుడు కురుక్షేత్రమునంగూడ నివసించుచుండ వాఁడు కృష్ణార్జునులు ఖాండవవనమును దహించునాఁ డీతక్షకుఁడు రెండవకుమారుఁడగు శ్రుతసేనునితోఁ గురుక్షేత్రమునను డుటచేఁ జావలేదు. తక్షకుని భార్య నర్జునుఁడు చంపెను. ఆ స్త్రీహత్యాదోషము నర్జునునికి వీరు నారోపింపలేదు. అశ్వసేనుఁ డాపగ నెద నుంచుకొనియె కర్ణుం జేరి పిమ్మట నర్జునునిచేత చచ్చెను. తక్షకుఁ డెచటి కేగెనో శ్రుతసేనుఁ డేమయ్యెనో తెలియదు. జనమేజయుని సహాధ్యాయుఁడగు 'ఉదంకుని' కుండలాపహరణగాథలోఁ దక్షకునిపట్టణము దుర్గమమార్గములు కలదని వర్ణింపఁబడియున్నది. భూవివరమునుండి యాపట్టణమున కేగవలసినదై నట్లు కలదు. ప్రాచీనదుర్గములు శత్రుల కభేద్యముగునీతిని వనపర్వతాదిదుర్గముల నేర్పఱచికొనుచుండిరి. గడచిన పదునెనిమిదవశతాబ్దమునను అట్టిదుర్గములు పెక్కు లుండెడివి. బొబ్బిలికోట బొబ్బిలియుద్ధము జరుగునాఁడు వనదుర్గముగా నుండెనట! నేటికి ముప్పదియేండ్లకు ముందు బ్రిటిషువారు "సామలిలాండు" (ఆఫ్రికా) లో నిట్టిదుర్గముల పైకే దాడివెడలిరి. తక్షకుఁడును పాండవులకు జడిసి కురుక్షేత్ర యుద్ధానంతరము దుర్బల పరిపాలనములో నుండిన పంచనదీప్రాంతప్రదేశములోఁ గొంతదేశమును స్వాధీనపఱచికొని తక్షశిలను నిర్మించి పరిపాలించియుండును. తక్షశిల యీతక్షకనిర్మితమె. ఇపుడు తక్షశిలానగరశిథిలములను దొరతనమువారు, భూగర్భపరిశోధ

౧. తక్షకవైశాలేయ ధృతరాష్ట్రైరావత స్తేజీవా స్త్వయి న స్సత స్త్వయి సద్భోఖల వర్షాభ్యో నః పరి దేహి—ఏకాగ్ని కాండ, మంత్రపన్నము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కులు శోధింపుచున్నారు. ఆపట్టణము నేలమట్టమునకు లోపలనె యున్నదట! ఉదంకుగాథలోని వర్ణనమున కీవర్ణనము సరిపోవుచున్నది.

తక్షకుఁడు పాండవులుండినంతకాలము జడిసి తల నెత్తలేదు. పాండవులు గతించినపిమ్మటనుగూడ యుయుత్సాదు లుండినంతకాలము తక్షకుఁడు తలయెత్తినట్లు కాన్పింపదు. మఱియు రాజ్యములోనివారందఱును బరిక్షిత్తుపై భక్తితత్పరులుగా నుండుటచేఁ దక్షకుఁ డేమి సేయుటకును వీలు కలుగలేదు. ఇట్లుండ:

పరిక్షిత్తొకనాఁడు వేట కేగి యలసి దారిదప్పి దప్పికతో 'శమీకమహర్షి' వివిక్తముగా జపము సేయు చోటున కేగి నీరు నడుగ సమాధిలో నిష్ఠాగరిష్ఠుఁడగు శమీకుఁ డేమియుఁ బలుకఁడయ్యె. అందులకుఁ బరిక్షిత్తు గినిసి రాజసముచే నచట నున్న మృతసర్పమును ధనుష్కోటి నెత్తి శమీకుని మెడను వైచి వెడలిపోయెను. శమీకుఁ డందులకేమియుఁ గోపింపక యూరకుండెనుగాని క్రోధియు యువకుఁడు నగుశమీకునిపుత్రుఁడు 'శృంగి' ముని యీవృత్తాంతమును విని పరిక్షిత్తుపై నలిగి పాండవజాతిపై స్వతస్సిద్ధముగాఁ గోపముకల్గుతక్షకుఁ బరిక్షిత్తుం జంపఁ బ్రోత్సాహపఱచెను. శృంగిశాపముచేఁ దక్షకుఁడు చంపెనని లోకశ్రుతికలదు గాని శృంగిచే బోధింపఁబడియే తక్షకుఁడు పరిక్షిత్తుం జంపెనని జనమేజయుఁడు తలఁచి యున్నాఁడు.[౧]

తక్షకుఁడు తన్నుఁ జంపునని పరిక్షిత్తునకుఁ దెలిసి ప్రాయోపవేశము నొంది శ్రీశుకునివల్ల వేదాంతోపదేశము నందినట్లు భాగవతమునం గలదు కాని మహాభారతమునం దానికి విరుద్ధముగాఁ బరిక్షిత్తు ప్రాణసంరక్షణమునకై యతిజాగరూకతతో నుండినట్లు వర్ణింపఁబడియున్నది.

పరిక్షిత్తుఁ జంపుటకు శృంగి ప్రోత్సాహమునఁ దక్షకుఁడు వచ్చుచు విషవైద్యుఁడగు కశ్యపుని లంచమిచ్చి మరలించుట మొదలగునంశములు భారతపాఠకులకు విశదమే.

తక్షకుఁడు మాఱువేషముగల నాగకుమారులచే విషమిశ్రఫలాదులను బరిక్షిత్తున కంప వానినాతఁ డుపయోగించి అందులోని విషక్రిమి కఱువ మృతి నొందినట్లును, వెంటనె పరిక్షిత్తుండిన మేడకూడ దగ్ధమైనట్టులును భారతములో నొకస్థలమునను—పరిక్షిత్తుండిన మేడను పరిక్షిత్తునుగూడఁ దక్షకుఁడు విషాగ్నిచే దహించినట్లు మఱియొకచోటునను గలదు. ఆ రెండవయంశముఁ జూడుఁడు:

"ఆకాశ్యపుఁడను బ్రాహ్మణుఁడు వెళ్లినపిమ్మట తక్షకుఁడు మోసముతో సమీపించి నీపుఁ దండ్రియు, ధార్మికుఁడును, రాజశ్రేష్ఠుఁడును మేడపై నుండినవాఁడునగు నాపరీక్షిన్మహారాజును, ప్రాసాదమును విషాగ్నితో దగ్ధముచేసెను."

తక్షకుఁడు పండ్లను విషపూరితములు గావించి వానిచేఁ బరిక్షిత్తుం జంపించియుండుట సత్యాంశమై యుండును. చాణక్యుఁడు నవనందులతండ్రిని విషఫలములచేతనె చంపినట్లు ముద్రారాక్షసమునఁ గలదు. అది నాఁటివారిలోనే కాక రాజకీయపు విరోధములచే మహారాజులకును మహారాజపుత్రులకును విషప్రయోగములఁ జేయువా రీనాఁడును గలరని వినుచుందుము.

---

౧ చూ. ఆదిపర్వ.

౨ శ్లో...తస్మిన్ ప్రతిగతే విప్రే పన్నగో పేత్యతక్షకః, తం నృపం నృపతిశ్రేష్ఠం ధార్మికం పితరం తవ.
ప్రాసాదస్థం యత్తమపి దగ్ధవాన్ విషవహ్నినా. —ఆదిపర్వం, ౫౦ అధ్యా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆధునిక, సనాతన కవితావిమర్శనము

ఉభయభాషాప్రవీణ, భువనగిరి లక్ష్మీకాంతమ్మ

ఇతఃపూర్వము రాజమహేంద్రవరమున జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్తు, ఆధునికకవి పండితమహాసభలలో తారతమ్యమును పరికింప, రెండవసభవారు సనాతనులను కథామిషలచే నధిక్షేపించుటయు, మొదటివారు "ఆధునికకవులమని పేరు పెట్టుకొన్న గ్రామ్యకవుల జుట్లు,కట్లు,బొట్లు, మట్లు వేరుగా నుండు "ననియు, "తరుచు వీ రందరు నొక్కతీరుగా నుండు" రనియు ననుచుండుటయు కలదు. సనాతనమైనను, ఆధునికమైనను కవిత్వ మనునది యొకకళ. అది ప్రతివానికిని తెచ్చిపెట్టుకొన్న రాదు. వద్దన్న పోదు. "కవితయు వనితయు తనంత వలచివచ్చిన సరసంబగు, బలిమికోలుగావించిన విరసంబగు" నన్న అప్పకవిమాట అబద్ధముకాదు. "కవేః కర్మ కావ్యం." అది కవనమునందు రూఢమైనది, జలజశబ్దము తామర యందువలె. కావ్యములందు కొన్ని రసప్రధానమైనవియు, కొన్ని అలంకారప్రధానమైనవియు, కొన్ని వస్తుప్రధానమైనవియు కలవని ప్రతాపరుద్రీయమున నిట్లు చెప్పబడెను: "కావ్యానాం క్వచిత్ రసస్య ప్రాధాన్యం, క్వచి దలంకారస్య ప్రాధాన్యం, క్వచి ద్వస్తునః ప్రాధాన్యం." రసప్రాధాన్యము వీనిలో ముఖ్యము. సరసమైన కవితావనిత, సనాతనధర్మమైనను, నేటికాలపు అందకత్తెయైనను శోభించును. రసహీనమైన కవిత జొన్న చొప్పవంటిది. సరసకవితకు చావుండదు.

కొందరు ఆధునికకవిత్వమునకు భావకవిత్వ మనిరి. భావకవిత్వ మన నేమి? భావములేనిదే నోట మాటమైనను వెలువడదుగదా! కవనమున అభావ మెట్లు? వ్యక్తులలోగొప్పభావములు,కుశాగ్రబుద్ధియు నున్నచో వారువ్రాయు పుస్తకములు గ్రామ్యమైనను, గ్రాంథికమైనను రసయుక్తమై జనాకర్షణ కలిగియుండును. కాళిదాసుని

"చూతాంకురాస్వాదకషాయకంఠః
పుంస్కోకిలో య న్మధురం చుకూజ."

అను అమృతమొలుకు అల్లికలో లేని భావమేది? తెనుగున నన్నయ్యలో లేని భావములు, తిక్కనకవిత్వమున లేని జాతీయోక్తులు, శ్రీనాథునిలో లేని స్వాతంత్ర్యములు, కృష్ణరాయల కవిత్వమున లేని స్వభావోక్తులు, సూరనార్యుని కళాపూర్ణోదయమున లేని విచిత్రములు మరిదేనియందు గలవు?

భాషలో మార్పు తప్పక రావలె నను వారి ప్రయోగములలో దీర్ఘమై, కఠినమైన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్కృతసమాసములును, చివర క్రియలు మాత్రము, 'చేశాను, ఉంటాయి, వెళ్లాడు' మొదలైనవియు, మువర్ణమున్నచోట పూర్ణ బిందువును కనబడుచున్నవి. ఇక సనాతన కవు లన్ననో, ఆనందముగాను, స్వేచ్ఛగాను వచ్చి చేరు కవితాకన్యను విడచి, బలవంత ముగ నన్నయనాటిక్రియలగు 'వలవదు', 'ఉన్నాఁడను' మొదలగునవియు, మువర్ణము నకు పూర్ణబిందుపూర్వకబువర్ణమును అను ముసలమ్మ నీవలకు లాగజూతురు. దేశ కాలపరిస్థితులకు క్రమముగ మార్పువచ్చు నట్లు భాషకును మార్పు రాకతప్పదు. కవిత ఏశతాబ్దమున మారలేదు? నన్నయ కవిత్వముకంటె తిక్కనకవిత్వమున గల మార్పు, నన్నయకును, శ్రీనాథునకును గల తారతమ్యము, నన్నయభారతమును విజ యవిలాసాదులగు ౧౭, ౧౮ శతాబ్దముల గ్రంథములును పరికించిన తెలియును. వీరేశ లింగమహాయశుని శకము వేరుగదా!

కొందరు మహాయశులు తల్లియొడిలో పెరిగి తల్లిని హాస్యమాడినట్లు వ్యాకరణ సాహిత్యముల నేర్చి వానినే నిందింతురు. వ్యాకరణకర్తలు ఆధునికులను మాజోలికి రావద్దనునట్లు "ప్రయోగమూలం వ్యాకరణ మ"ని మొట్టమొదటనే వ్రాసియుండిరి. ప్రయోగములు క్రొత్తవి పుట్టినకొలది వ్యాకరణములు పుట్టుచునేయున్నవి.

నన్నయవ్యాకరణ మనుచున్న చింతా మణికి వానిభారతమే లొంగియుండలేదు. జీవభాష మహాసముద్రమువలె ప్రవహించు చుండ, దానికి వ్యాకరణపుగట్టుల నెవరు వేయగలరు? రసవంతమైన వాక్యములకు జోహారుచేయుచు వ్యాకరణము తనలో వానిని జేర్చుకొనుచుండును.

పద్యకవిత్వమున 'యతిప్రాసలు' అలం కారార్థమై చేర్పబడెను. గణనియమము లేనిదే పద్యములు రాగయుక్తముగా జదు వుటకు వీ లుండదు. వచనము రాగయుక్త ముగను, పద్యము వచనసరణిని చదువుట లోకవిరుద్ధము. వచనకవిత్వమున శ్లేషయమ కాదులున్న నది చదువుటకు చమత్కార ముగ నుండగా పద్యములలో యతిప్రాసలు మానుటలో అర్థమేమి? పద్యములు వ్రాయు వారి భావములు యతిప్రాసలు వెతకుకొను టలో పోవు నన్నచో అట్టివారు తమభావ ములు పోకుండ రసవంతమైన వచనములో ధారాళముగ వ్రాయవచ్చును. రసము, యతిప్రాసలు, గణనియమము, చక్కని అలంకారమే పద్యమునకు శోభతెచ్చునవి.

భావకవిత్వమని యొప్పుకొన్న బొబ్బిలి పాట మొదలైనవానిలో యతిప్రాస లున్న వి. యతిప్రాసలుకూడ రసపుష్టికొరకును చిత్రముకొరకు కేర్పడినవే. ఇట్లు వ్రాయలేని వారు కవిత్వపుపిచ్చి పోగొట్టుకొని పూర్వుల గ్రంథములను, ఇప్పటిగ్రంథములను చక్కగ చదువుకొనుచుండుట భాషకు మహోప కారమే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాకరణనియమములో నున్న అర్ధానుస్వారములు, శకటరేఫలు, రేఫశకటరేఫల యతిప్రాసల నియమము పాటించ నక్కరలేదు. దానివల్ల కవిత్వముయొక్క అర్థమునకును, అందమునకును, భావమునకును లోటు గల్గదు.

ర, లయో రభేదః; వ, బయో రభేదః; ల, ళయో రభేదః; ద, డయో రభేదః.

ఇట్లుండగా రేఫశకటరేఫలు చేసికొన్న మహాపరాధ మేమి? అర్థము భేదించు రేఫ శకటరేఫల నియమము అవసరము.

---

# తు రా యి

జనమంచి కామేశ్వరరావు

రోడ్డునబోయే
యువకునిచూసొక
తురాయిచెట్టూ
పువ్వులకులికింది ;

"గుత్తు" చేతులా
గమ్మనియెత్తి
రమ్మని పిలిచింది.

రేకురేకునా
రక్తపతాకం
నాలుకచాచింది.

ధనాక్రోశం
దహింపచేసే
మంటలె తోచింది.

యువకుని రక్తం
సవ్వడిపొంది
నరములపొంగింది.

---


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# డిప్రెషన్ – చెంబు

వేలూరి శివరామశాస్త్రి-శతావధాని

రామారావు లిటరేచర్ ఆనర్సు ఫస్టుగా ప్యాసయి నాలుగయిదు నెలలు జుట్టు జాడించి తిరిగెను. పిదప RAMA ROY DWIVEDI. B. A, HONS. అను గిల్టుఅక్షరములుగల బారెడుబల్ల తయారుచేయించి, మంచిముహూర్తమున గోడకు తాపటము చేయించి, మేడమీఁద విశ్రమించెను.

అతని కెక్కడను తగు నుద్యోగము దొరకలేదు. దానికికారణము ఆడిగ్రీయే. పొమ్మనఁగనే లేచిపోఁగల నియమమునకు లోఁబడి పాతికరూపాయలకు బి.యిడీలు కోయనిన కోటిమంది దొరకుచుండఁగా ఈమెమ్మెకు విద్యాలయస్థాపకులు బెదరిపోయిరి. వారొకవేళ ఏయిరువదిరెంటికో, లేక యేయిరువదిమూటికో దయతో బేరమాడినను రామారావు మొగ్గఁడు.ఏల? తాను యెమ్మే. పైఁగా Distinction. పైపెచ్చు తాను డిప్టీకలక్టరుగారి అల్లుఁడు!

తన నాణెము చదువుల టంకసాలలోఁ దక్క మఱియొకచోట మోఁగదు. కాన నతఁడింకొక డిపార్టుమెంటునకు నీళ్లు వదలుకొనెను. కాని భార్యయొక్కయు, తల్లియొక్కయు కన్నీళ్లు తుడుచుటకు దరఖాస్తు మీఁద దరఖాస్తు పెట్టుచుండెను. దానికి పదియేనురూపాయలు కర్చు. ఆ రూపాయలకు తల్లి నగయో, పెండ్లాము నగయో తాకట్టు. 'కరువు వచ్చింది, కలిసిరాలేదు' అని తల్లి మహాలక్ష్మి దైవమునే దూఱెనుగాని తులసికి (రామారావు భార్య) ఈగుట్టు తెలియును. తాను చూచుచుండఁగా రామారావు పోస్టల్ డిపార్టుమెంటుకును పోలీసు డిపార్టుమెంటుకును అర్జీలు పెట్టుచుండును.

దివానుగిరికిని అసిస్టెంటు దివానుగిరికిని జమీందారులకు తనచేత అర్జీలువ్రాయించుచుండును. తన మగని చదువునకును ఆయుద్యోగములకును గల సంబంధము బాదరాయణ సంబంధమే యని తులసి తెలిసియు ఆనాటకమును తిలకించుచుండెను.

రామారావుకు కొలువులేని లోటు లేదు. ఓరంతప్రొద్దు పెండ్లాముతో పేరంటము. తా నేకాలేజికిని ప్రిన్సిపాల్ కాని ప్రియాదు లేదు. తా నొకపదుగురు ప్రొఫెసరులపెట్టు; తులసి ఒక నూఱుగురు శిష్యుల పెట్టు. ముక్కోటినాఁడు ముక్తిద్వారములేని తెఱవఁబడియుండునుగాని రామారావుమేడ 'బందు.' మూర్తి-ది-కో-ఆపరేటర్, సుందరం-ది-లాయలిస్ట్, శర్మా-ది-నిహిలిస్ట్ లోనగు మిత్రు లెవరేని వచ్చి 'రామారావూ రామారావూ' అని రెట్టింప మొదలిడఁగనే మహాలక్ష్మి అసత్యభీతి లేక,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'అయ్యో, అతగాఁడు అత్తింటికి వెళ్లాఁ' డని వారిని పంపివయిచెడిది.

గ్రీకు - చిత్రకళలోని నగ్నసౌందర్యముతో పాటు అజంతాగు ఆంధ్రకళయందముగూడ రామారాయనిగది యలంకరించుకొనెను. పాశ్చాత్యరసాయనములతో పాటు ప్రాచ్యుల వాజీకరణాదులు అతనిబల్ల నెక్కెను. కోహళ వాత్స్యాయనుల మొదలు Mary Stopes తరువాతివారి వఱకును గల మన్మథసారస్వత మతని బీరువాలు ప్రదర్శించెను. కామతంత్రమునకు రామారావొక Up-to-date encyclopedia.

తులసి గవాక్షముదెస చూపు త్రిప్పెనా అతనికి బెంగ. అత్తగారు కోడలిని పిలిచెనా వియోగము. పుట్టింటివారు తులసికి వ్రాయు చీటీ అతనిపాలిట విడాకు.

రామారావు తులసికి బలవంతముగా అనేక వేషములు వేసి మనసు తీర్చుకొనెను. దీనికి తులసినగ లొకటొకటియే ఆరతికప్పురము వలె హరించెను.

ఇటు లొక యేఁడాది గడచెను. ఈసంసార యాత్రకు మహాలక్ష్మినగలు చాలవఱకు మంగళమాయెను.

ఇంతలో నొకఖర్మము జరిగెను. రామారావు పెట్టిన దరఖాస్తులలో నొక దరఖాస్తుకు ఖాళీ ఉన్నదని ఉత్తరము వచ్చెను. అది ఆపట్నములోని ఆఁడ - హైస్కూలులో ట్యూటర్ పని. అఱువది రూపాయల జీతము. అది అతనికి వారంటువలె కనఁబడెను.

'దాఁచుకొనుచున్నారే! ఏమిటీరహస్యము?' అని తులసి అడిగెను.

'ఏమున్నది? ముష్టియెత్తుకొనుటకు Pass.'

'ఏదీ?'

'చూపుటకుఁగూడ సిగ్గుచేటు'. అని రామారావు దానిని మడఁచి అచటను ఇచటను దాఁచుచున్నటు లభినయించి తులసి పట్టుకొనునేమో యని భయఁపడి వడివడిగా మేడ దిగెను. అతఁడు మేడ దిగఁగనే తులసి అచటి పుస్తకము లన్నియు తిరుగవేయఁ దొడఁగెను గాని ఆకాకితము కనఁబడలేదు. 'నగలా కరఁగిపోయెను, సంసారమా గంపంత, కాలమా పచ్చికఅవు, ఈయనా ఉద్యోగము సద్యోగము చేయు చందము లేదు' అని అనుకొనుచు తులసి అవియు నివియు వెదకుచుండెను.

'ఏమి టా దొంగతనము?' అని వెనుక నుండి రామారావనెను.

'నాదా మీదా?' అని తులసి యనెను.

రామారావు తనజేబునుండి ఆకాకితమును దీసి 'ఇదిగో దీనివెల ఒకముద్దు' అనెను.

'మనిషికి ఏమీ అక్కఱలేదు; ఆఁడుది ఉన్నచో సరి' అని లోపల అనుకొనుచు తులసి ఆవలికి నడచెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



" రామారావు తనజేబునుండి......దీనివెల ఒకముద్దు అనెను. "

ఆవచ్చినది తామలపాకుల అంగడివాఁడు. వానికున్న బాకీ తులసికి తెలియును. మగని మాటల తొందరయు, నడకలోని వడఁకును ఆమె చూచెను. ఆమె నవ్వలేదు కాని ఆమె అంతరాత్మ నవ్వు కొనె నే మో ఎవరుచెప్పఁగలరు?

తులసి కిన్నాళ్లకు మేడక్రింద తీరికగా కూరుచుండఁ గల భాగ్యము లభించెను. అత్తగారు పిల్లలకు అన్నము పెట్టుచుండెను. కోడలు ప్రక్కగదిలోఁ గూరుచుండెను. ఆసంగతి ఆమెయెఱిఁగినచో తన సంసారపుగుట్టు తెలియకుండుటకు ఆకోడలిని ఏదో మిషమీఁద మేడమీఁద బంధించియుంచెడిదే.

'ఎప్పుడూ ఒక్క ఆవకాయే. లేకపోతే గోంగూరపచ్చడి, పాడుపచ్చడి, ఆంధ్రమాత. నేమైనా వెయ్యవు. ఇందాఁక కాఁకరకాయ వేయించిని వాసన కొట్టలేదేం?' అని ఓటికంచములోని మెతుకులను అటునిటు పద్మనాభుఁడు చిమ్మివేసెను.

'పోనీలే. ఇదిగో ఇత్తును. రా.' అని రామారా వనెను.

తులసి మాటాడక మేడ దిగుచుండెను. రామారావు గబ గబ నడచి ఆకాకితమును వెనుకనుండి ముక్కుముందర పెట్టెను.

'రామారావుగారండీ!' అను పిలుపు వాకిటి నుండి వినవచ్చెను. రెండవ పిలుపు వినఁబడక ముందే రామారా వాకాకితమును జేబులోఁ గ్రుక్కుకొని తులసిని తప్పించుకొని రెండు మెట్లు దుమికి వాకిటికిఁబోయి 'పద నేనే వస్తున్నాను' అని ముందు నడచెను.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'నాయనా! నేయి వేసుకుంటే నాలుక జిడ్డెక్కి చదువు రాదు' అని మహాలక్ష్మి యనెను.

'అన్నాయి కెల్లా వచ్చింది?'

'అన్నయ్యమాత్రం చదువుకోకముందు... పాపం, ఇప్పుడుమాత్రం నెయ్యి వేసుకుంటున్నాఁ డనుకొంటున్నావా?'

'అన్నాయికోసం ఎన్ని అబద్ధాలన్నా ఆడుతుంది' అని రమణ యనెను.

'నెయ్యి వేసుకోలేట్ట—పప్పు లేట్ట—కూర లేట్ట—మనకే నయం—ఆకాయ వుంది—గోంగూర వుంది—అన్నయ్యగారు వట్టి అన్నం తిని ఊరుకునేవాట్ట! కాదే అమ్మా? నీవు చెప్పలా?' అని ఆఖరువాఁడు పుండరీకాక్షుఁడు వట్టి యన్నమును నోరఁ గూరుకొనెను. కాని ఆపసికాయకు ఓకర వచ్చెను.

'అమ్మా! నాకు నేయొద్దుగాని, అన్నాయికి పోస్తావే,—విస్తట్లో తెల్లగా చూచానే,—అది అదీ,—పెరుగే—అది కొంచెం పొయ్యవూ?' అని పొడిమెతుకులు మింగుడుపడక పుండరీకాక్షుఁడు ఓకరించెను.

'వెధవా! అన్నాయి నేయి వేసుకోనూలేదు. డోక్కోనూలేదు. నీవెందుకు డోక్కున్నావురా?' అని పద్మనాభుఁడు గద్దించెను.



'అత్తగారు పిల్లలకు అన్నము పెట్టుచుండెను.'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెంటనే మహాలక్ష్మి యిటు లనెను: 'ఉండరా వాఁడికి కొల మారింది, చిన్నవాఁడా! పెరు గెక్క డుందిరా? అది పెరుక్కాదు. అన్నాయి లేచాక విస్తరికి చీమలు పట్టుకుంట వని ముగ్గోశాను. అదిగాక పెరుగోసుకుంటే పిలక పెరగదు.'

'ఆలా అయితే నేను పోచుకోను' అని సుందరి యనెను.

'మహాపోసినట్టు నీవుపోసుకోనట్టు!' అని రమణ యనెను.

'పోనీ అమ్మా! నాకు ఆముగ్గే పొయ్యే, ఏ, ఏ, ఏం' అని పుండరీకాక్షుఁ డనెను.

మహాలక్ష్మి నవ్వి 'ఎబ్బే కాదమ్మా, మనకు గేదె ఉందా చెప్పు! ఎవరేనా చెప్పండి?' అని అనెను.

'లేదు లేదు లే'దని పుండరీకాక్షుఁడును, సుందరియు, రమణయు నొకరితరువాత నొక రనిరి.

'ఏమిరా పద్మా?' అని మహాలక్ష్మి పద్మ నాభుని గదమాయింపఁగా అతఁ డిటు లనెను — 'లేదు, పొలం లేదు, గడ్డిలేదు, గేదె లేదు, కాని పిల్లి రోజూ పాలు తాగుతుంది.'

ఈమాటతో పిల్ల లందఱకును ఆఁపరాని ఉత్సాహము కలిగెను. మహాలక్ష్మి మొగము ముడుచుకొనెను.

'మమ్మన్ని గదిలో పెట్టి తాళం వేసి అన్నా యికి వదినెకూ — ఆఁ. అక్కాయి చెప్ప లేదేం, పద్దన్నాయికూడా—' అని సుందరి చెప్పఁబోవుచుండఁగా పద్మనాభుఁడు సుందరిని మిర్రి చూచెను. సుందరి మఱి మాటాడలేదు.

ఈమాటలు మహాలక్ష్మికి మామూలేకాని ప్రక్కగదిలో నున్న కోడలికి సరిక్రొత్త. 'పిల్లలనోట గడ్డకొట్టుచున్నా' మని మన సులో ననుకొనుచు తులసి మెల్లగా మేడమె ట్లెక్కఁదొడఁగెను. ఆమెకుఁ దెలియకుండ ఆమెవెనుకనే రామారావు.

## 3

తులసి వెనుదిరిగి చూచి ముందున్న పరదా తప్పించుకొని లోనికేఁగెను. వెనుక నున్న రామారావు—హస్తము లాలింగనమునకు ఆయత్తము లగుచుండెను. తులసి మరల వెనుదిరిగి — మీరు కాసేపు కిందికివెళ్లి సంసారమంతా గమనించుకోండి. నన్ను కాసేపు ఒంటరిగా ఒదిలిపెట్టండి' అనెను.

'ఇది వైరాగ్యరోగానికి సమయం కాదు తులసీ!'

'రోగమూ నిదానమూ మందూ నాకు బాగా తెలిసింది. ఇదే సరియైన సమయం. మీరు నన్ను ఒంటరిగా ఉండనియ్యండి.'

'ఇది పతివ్రతలకు లక్షణంకాదు. భర్తమా టకు ఎదురాడితే గుడ్లగూబ అయి పుటుతుం దఁట. పుటుతుందఁటకాదు, పుటుతుంది.'

'ఈ ఆఁడంగిరేకులవాళ్లమాట చెప్పడానికి మగాళ్లకు సిగ్గులేదూ? మీబోఁటివాళ్ల చేత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుస్తె కట్టించుకోవడం అవమానానికి. పెళ్లాడడమే అవమానం. తల్లిని, తమ్ములనీ పోషించలేనివాళ్లను మగళ్లగా చూచేవాళ్లు, ఇంకో జన్మలో కాదు— ఈ జన్మలోనే గుళ్లగూబలు.'

'తులసీ! కూచో! నిలుచుంటే కాళ్లు నొప్పెటతయ్! ఇదిగో మెత్తగా ఉంటుంది ఒళ్లో కూచో.'

'ఎవళ్లెట్లాపోతే యేం? ఆడది దగ్గఱ ఉంటే చాలు. తెలుఁగు దేశంలో ఉద్యోగసద్యోగాలు లేని పిన్నవాళ్ల సంగతంతా యింతే.'

'అందఱిసంగతీ నీకు తెలుసూ?'

ఈమాటకు తులసిమొగము జేగురించెను. పెదవులు కంపించెను. ఇటు లనెను—'మీరు మాటాడఁగలిగితే జాగ్రత్తగా మాటాడండి, లేకపోతే మీఁదఁ బడి కొట్టండి. భార్యవంటి పరమనీచురాలు ఈ జగత్తులో మఱిలేదు.'

'కాదు తులసీ! యోగంవల్ల సర్వదేశజ్ఞానం కలుగుతుందిటగా! అట్టి దేమయినా నీకు కలిగి చెప్పావేమో నని అన్నాను.'

'తప్పకున్నా ముల్లు గుచ్చటం మగాళ్లకు బాగా తెలుసు. కిందికి దిగిపొండి ఈపాటికి. పొండి యీపాటికి కిందికి.'

'ఎవళ్లయినా వింటారు. నీపుణ్యమాయిరి! కొంచెం మెల్లగా మాటాడుదూ.'

'పిల్లి కళ్లుమూసుకుని పాలు తాగుతూ లోకులుగూడా మూసుకున్నా రనుకుంటుందిట! లోకులకు తెలియదూ తమరు ఆఁడంగిరేకుల అబ్బాయిగారని? మీగౌరవం నేనెన్నాళ్లనుంచీ కాపాడుతూ వచ్చానో మీకు తెలియదూ? నానగలు ఎన్ని అమ్ముకున్నారో, అత్తగారి నగలు ఎన్ని ఆహుతిచేశారో మీకు తెలియదూ? కిల్లీదుకాణాదారుకి ఇపుడిచ్చింది న్యాప్రధానపు ఉంగరం కాదూ? తాకట్టు పెట్టడానికి మేడ అయింది. ఇఁక ఏముంది? లోకం మూయడానికి మూకుడు ఉన్నదా? సరేగాని కొంచెం కిందికి వెళ్లండి. మీసంగతి మీకే తెలిసిపోతుంది.'

రామారావు తేఱి పాఱఁజూచి యిటు లనెను: 'ఏమో అనుకున్నాను. కోపం వచ్చినపుడే ఆఁడది చాలా అందంగా ఉంటుంది. కావలసిన వన్నీ కనిపిస్తవి.

తులసి సగ్గుకొని యిటు లనెను—'సైతాన్. మీరు కిందికి వెళతారా వెళ్లరా?'

'వెళ్లకేం? నాతోకూడా గనుక వస్తే కిందికే కాదు షికారుగూడా వెళతాను. ఇదుగో పొద్దూకవస్తూంది. నీమనస్సు ఫిరాయించినటు లుంది. షికారు పోదాం రా.'

'అదొకటి తక్కువ. నేనే మీతో వస్తే మీరేమో పెద్ద ఉద్యోగస్థులని అంధఋూ భ్రమపడతారు'.

'అంధఋూడిప్టీకలక్టరులుఅవుతారాయేమిటి?'

'కాకపోయినా వాళ్లపొట్ట వాళ్లు పోసుకుంటారు. వాళ్లకాళ్లమీఁద వాళ్లు నిలఁబడతారు.'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఎంత దప్పిక అయినా చాతకం ఆకాశగంగ కెదురుచూస్తుంది కాని చెరువులకు ఎగఁబడదు.'

'ఏంతమాటా? గుంటలమీఁదికే ఎగఁబడిం దిప్పుడు.'

'ఏమి తులసీ! నీనగలూ, మాఅమ్మనగలూ నావి కావూ? ఇవి గుంటలా? 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అనే హిందూ లా ఎవళ్లకీ తెలియదు. అందులో ఆఁడాళ్ల కసలే తెలియదు.'

'డొక్కలకఅవు వస్తే మగాళ్లు ముందర తల్లులనీ, తరువాత పెళ్లాలనీ విఱుచుకు తినేస్తారు. హిందూదేశంలో పెళ్లి అనే ఆచారం ఎప్పు డంతరిస్తుందోకదా!'

'నీవు విడాకు లిచ్చేట్టున్నావే?'

'విడాకు లివ్వడమే వస్తే తెలుఁగుదేశంలో తులసే మొదటిది.'

'ఇంకా బిల్లు——'

'తొందరపడకండి. కొద్దిరోజులలో వస్తుంది. అప్పుడు మీమగవాళ్లపాటులు తెలుస్తయ్.'

'అయితే బిల్లు రాకముందే ఒకసారి కావలించుకొనీ' అనుచు రామారావు తులసి సమీపమునకు జరిగెను. తులసి వెనువెనుకకు నడచి గదిలోనికి వెళ్లి తలుపులు మూయఁదొడఁగెను. రామారావు వడివడిగా నడచి దగ్గఱకు వచ్చిన రెండుతలుపులసందునా చేయిపెట్టెను.

౪

టపాకచేరినుండి వచ్చిన జాబులలో నొకజాబు రామారావు - గౌరవమునకు హానిని కలిగించెను. దానిని జూడఁగనే అతనిముఖము తుమ్మలలో ప్రొద్దు గ్రుంకినటు లాయెను. దానిమీఁద బి.యే.(ఆన్స్) అనికాని, యెమ్మే అనికాని, తుదకు 'రామారావ్ ద్వివేది' అనికాని లేదు. దానిమీఁద నున్న చిర్నామా ఇది: 'శ్రీరస్తు. చిరంజీవ. ద్వివేదుల రామయ్యా.'

పేరుచేతనే గౌరవమును పుడికి పుచ్చుకొనవలసినవారికి మొండిపేరు బండుబూతు కాదా? మగనిమొగమున మూడుబంతులా వ్రాసిపెట్టిన ట్లుండిన యీబండతిట్టును తులసి సులభముగా చదివి ఆకవటు విప్పి చూచి 'పాపము, మీమేనమామగారికి ప్రాణము మీఁదికి వచ్చినదఁట!' అనెను.

రామారావుముఖము మాఱెను. 'ఏదీ?' అని చీటి దీసికొని చూచి 'వెంటనే వెళ్లి అమ్మకు చెప్పు' మనెను. తులసి వెళ్లెను. రామారావుముఖమున చింతకుబదులు సంతసము నెలకొనెను. దానికారణము కనుఁగొనుటకు దుర్బిణిలో దూఱ నక్కఱలేదు.

తులసి క్రిందినుండి మీఁదికి రాఁగానే పొంచియున్న రామారావామెను కౌఁగిటిలో నలిపివేసెను.

'అబ్బ! ఏమిటీ మోటపని? లంఘనములలో మనుగుడుపు.'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'అమ్మ రైలుకు వెళ్లునా?'

'మీరు వెళ్లరా?'

ఈ ప్రశ్నాయుధముచే తులసి తన నెదిరింపఁ దలఁచె నని రామారావు కొంచె మాలోచించి యిటు లనెను: 'నేను వెళ్లను, పిల్లలతో అమ్మను వెంటనే వెళ్లమను.'

'ఆ ఆలుగోలులో ఈబాలుగో లెందులకు? బాగుండదు. మీరు మీ యమ్మగారితో వెళ్లుఁడు.'

'అమ్మో, నీమొదఁబాటు నాకు Anarchy. అమ్మయు పిల్లలును వెళ్లుచో స్వరాజ్.'

'కాదు. Diarchy.'

'పోనీ, అదైనా సమ్మతమే.'

'మీనూట మీయిష్టము. పిల్లలను నేను పంపను.'

'పోనీ అల్లాగే. అమ్మను వెంటనే రైలుకు పంపు.'

'నేను పంపుటేమిటి? రైలుదనుకైనను పంపి రండు.'

'ఊఁ.' యనుకొనుచు రామారావు మేడ దిగెను. అతని వెనుక తులసియు దిగెను.

'అమ్మా, నేనును బయలుదేరవలసినదే కాని ఉద్యోగ మొకటి ఖాళీయున్న దని తెలిసినది' అని రామారా వనెను.

'నాయనా, ఉద్యోగం చూడు. మామయ్య కెప్పుడూ ఇల్లాగే వొస్తుంది. మఱేమీ తొందర ఉండఁగూడదు.' అని తల్లి యనెను. రామారావుముఖము వికసించెను. వెంటనే అతఁడు బండిని బిలువఁబోయెను.

'ఈపిల్లలను ఎప్పటల్లే మీ కప్పగిస్తాను. వీళ్లను ఇక్కడ దిగవిడిచి ఈ గౌరవం నాకు దక్కించండి. మీ రొక్కరే పోయిరండి' అని తులసి అత్తగారితో మనవి చేసికొనెను.

'వద్దు వద్దు. వీళ్లు దయ్యపు పిల్లలు. నీమాట వినరు.'

బండివానికి చేయి యూఁపి ఇంతలో రామారావు వచ్చెను. తల్లి యనిన మాటలకు సంతసించెను. 'పిల్లలనుకూడా తీసికొనివెళ్లు మనినచో బాగుండ' దనుకొని 'దాని మొహం అదేమి చూస్తుంది కాని నేను చూస్తానులే' అనెను. తులసి బిగ్గఱగా నవ్వెను.

'నాయనా వీళ్లు పిల్లలు కారు; నెత్తిమీఁద బండలు. మీరెవరునూ మోయలేరు' అని మహాలక్ష్మి యనెను.

'వీళ్లు నెత్తిబండలు కారండీ, నెత్తికి కిరీటాలు' అని తులసి యనెను. పిమ్మట వాదోపవాదము లాయెను. వానికి ఫలితముగా పుండరీకాక్షునితో మహాలక్ష్మిపయనము నిర్ధారిత మాయెను. రామారావు మేడ యెక్కెను.

బండి యెక్కి అత్త యిటులనెను—'ఎన్నఁడూ ఎఱుఁగనిదానవు ఈయింటి మొహం, సూది, పొట్టమాత్రం పాముపొట్ట. దీనిని నీబుజాలకు ఎత్తి వెళుతున్నాను.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'రోగీ పాలే కోరాఁడు; వైద్యుఁడూ పాలే చెప్పాఁడు.'

లక్ష్మి ఒకపొట్లము తీసి తులసి కిచ్చి—'దీనిలో వంటయింటి సామానంతా ఉన్న ది.' అని చెప్పుచుండఁగా ఆమె రెప్పలు క్రమక్రమముగా తడిసికొనుచు వచ్చెను. కంఠము స్తంభించెను.

⁂

అత్తగారి నటు పంపి తులసి యిటు వంట యింటిలోనికిఁ జని పొట్లము విప్పెను. మట్టె యలు! మంగళసూత్రము!

తన సంసారయాత్ర కివి దారిబత్తెము. అత్త గారి కేల కన్నీ రురిలెనో తులసి కిపుడు తెలిసి వచ్చెను. మంగళసూత్రముచుట్టును గుడికట్టిన మగలులేనివారి మనోరహస్య మంతయు ఆమెమానసమున మెఱపువలె మెఱసెను.

'పెద్దకొడుకు కీఁక సంసారము నంతయు నుద్ధ రించును, తమ్ములను తనతోపాటు చేయును, చెల్లెండ్రకు పెద్దపెద్దసంబంధములు తెచ్చును' అని గంపెఁడాసతో ఆతల్లి ఉన్నదంతయు కొడుకుకోడండ్రకుఁ బెట్టి మిగిలినవారిని మాడ్చుటకు జంకలేదు. ఇది తులసి కిపుడు గోచరించెను.

'తా నీయింటికి వచ్చిననాఁ డీ పిల్లలకు దుస్తులే కావు నగలును గలవు. వా రపుడు హృష్టపుష్టు లయి ఉత్సవవిగ్రహములవలె నుండిరి. ఇపుడు లజ్జాదేవి వారిమీఁద కాఁపురము. కడుపున కార్చిచ్చు. పుండువంటి పుష్యమాసమునఁగూడ వారికి కప్పు దుప్పటి లేదు. పద్మనాభుఁడు గోఁచితో సంతసిం చెను. మూడవవాఁడు మొలనూలితో మురిసిపోయెను. పెద్దయాఁడుపిల్లకు మాసి కలపరికిణీ కలదు. చిన్నదానికి చినుగులది కలదు. రాత్రి వార లందఱకును ఒకరిచర్మ మింకొకరికి దుప్పటి. వారితల్లి తనకొంగును కొంతయు, తనను గొంతయు వారికిఁ గప్పి పిల్లలకోడివలె నడుమ నిదిరించును. అట్టి యత్తగారి దీ యాఖరు మంగళసూత్రము!' ఈసంగతు లన్నియును తులసి మనఃపటమున ఇపుడు అంకిత ములగుచుండెను.

తల్లిచూపు ఆపిల్లలకు సుగ్రీవాజ్ఞ. వారి భూ గోళమంతయు నొక చీఁకటిగది. కాని వాకిటి కేసి చూచుటకు వారిమోములు మూరెఁడు బారెఁడు సాగును. తమతల్లి తమయన్నకుఁ జేయు వంటకముల తావియే వారికి విందు. అన్నయు వదినెయుఁ గలిసిన యొకయర్ధనా రీశ్వరమూర్తియే వారి కధిదైవము. దాని లోని నారీమూర్తి యిపుడు తమకు ప్రత్యక్ష దేవతయై వంటింట సాక్షాత్కరించెను.

రమణ మెలమెల్లగా వంటింటికి దారితీసెను. వెనుక పద్మనాభుఁడు. ఆవెనుక సుందరి.

తులసి వారినందఱను తనచుట్టు కూరుచుండఁ బెట్టుకొని యిటు లనెను—'పొద్దున చలిది వణ్ణంలో యేంవేసుకో తిన్నారు?'

వీరి కాఱునెలలనుండియు చలిదియన్నము లేదు. కావున ఈప్రశ్న వారికి ఆశ్చర్యమును,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోపమును కలిగించెను. ఈదేవి తమను రక్షింపనేవచ్చెనో భక్షింపనేవచ్చెనో తమకు తెలియదు. కావున నందఱును మాటాడక చూచుచుఁ గూరుచుండిరి.

'మఱచిపోయారా యేమిటి?' అని తులసి యనెను.

'చలిదివణ్ణమే మఱచి ఆఱునెల్లయింది' అని పద్మనాభుఁ డనెను.

'ఏమిటి?' అని తులసి అనెను.

'అన్నయ్యకు ఉద్యోగం అయాక పొద్దున్నే వేడివణ్ణమే పెటతానని అమ్మ అన్నది' అని సుందరి అనెను.

'చలిదివణ్ణము జబ్బుచెయ్యదూ?' అని రమణ యనెను.

తులసి నిట్టూర్చి కొంచె మాలోచించుచుఁ గూరుచుండెను. 'ఊరక కూరుచుండుట వలనఁగాని విచారమువలనఁగాని ప్రకృత ముపయోగములేదు. ప్రొయి రాఁజవలయును' అని తులసి ప్రొయి రగిల్చి బియ్యపుడబ్బాకడ కేఁగెను. అందు పావు సేరు నూక లుండెను. ఉట్టి తట్టెను. నేతి పిడత ఖాళీ. పప్పుకొఱకు వెతకెను. శూన్యము. కూరలుశోధించెను. సర్వామంగళము.

విసుకును విచారమును గలిసి తులసిని కదిలించెను. 'మేడమీఁది దేవుఁడేమి చేయుచున్నాఁడు? ఆయనకు ఈసంసారము ఇంత మరుభూమియని యేమేని తెలియునా? పిల్లల నోట గడ్డ కొట్టి తాను అమృత మారగించుచున్నటు లాదేవుఁ డెఱుఁగునా?' అని అనుకొని తులసి ఆబియ్యము ప్రొయి కెక్కించి యిటు లనెను—'నిన్నరాత్రి ఏమి వేసుకొని తిన్నారు?'

'ఎఱ్ఱమందు' అని పద్మనాభుఁ డనెను.

'అనఁగా?'

'ఎఱ్ఱమందనఁగా ఆవకాయ' అని రమణ అనెను.

'ఇంకా?'

'ఆకాశము' అని పద్మనాభుఁ డనెను.

'మజ్జిగ?'

'మీకు కావఖ్ఖల్లా?'అని సుందరి యనెను. బంగాళాదుంపల కూరయు వడియములును వంకాయబజ్జియుపప్పుచారును సెనగబజ్జీలును తమకుమాత్రమే నైవేద్యమాయె ననుకొని తులసి మరల నిటు లనెను—'సెనగబజ్జీలు?'

పిల్ల లొకరిమొగ మొకరు చూచుకొనిరి. రాత్రి తమ కావాసన తగిలినపుడు కారపు పూసయని సుందరియు, జంతిక లని రమణయు వివాదపడిరి. వారి యిరువురి ముడ్డి మీఁదను రెం డంటించి పద్మనాభుఁడు పకోడీ లని తీరుమానము చేసెను. ఇపు డవి సెనగ బజ్జీలని తెలిసెను. తెలియఁగనే సుందరి యిటు లనెను.—'చూచావా అమ్మ రాత్తిరి నేను కారపూ్పసంటే కాదు పకోడీలని పద్దన్నాయి కొట్టాఁడు' అనెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'సరేకాని అమ్మ మీకెందుకు పెట్టదు ?' పదునొకండేండ్ల రమణ యీ ప్రశ్నకు మొగము చిట్లించుకొనెను. తొమ్మిదేండ్ల పద్మనాభుఁడు నవ్వెను. ఏడేండ్ల సుందరిమాత్ర మిటు లనెను.— 'మీరు చదువుకున్నారు కాదూ. అందుకని మీకు పెటుతుంది'

'అన్నాయి పెద్ద ఉద్యోగం చేస్తాఁడుటగా! చేసింతరువాత మాగ్గూడా పెటుతుంది' అని రమణ యనెను.

'మీరు మాక్కూడా చదువు చెప్పిస్తారుటగా!' అని పద్మనాభుఁ డనెను.

ఈ సమాధానములచే తులసి విస్తుపోయెను.

౬

ఈ ప్రశ్నోత్తరములలో ఈ విరతివిచారములలో రామారావు నూఱుమాఱులు క్రిందికి దిగి పొంచిచూచి నూఱుమాఱులు మేడ మీఁదికి పోయెను. కాని తులసి వచ్చుజాడ కానఁబడలేదు. కొండ తనకడకు రానిచో మహమ్మదే కొండకడ కేగునుగదా!

వసంతకాలమునందలి తుమ్మెదలవలె పిల్లలిల్లంతయు రొదచేయుచు తిరుగుచుండిరి. రెండేండ్ల కానాఁడు వారికి పండుగు. వారికపుడే కనులుతెఱచినటు లుండెను. అట్టి సమయమున రామారావు తమ కట్టెదుట కానిపింపఁగనే వారు కొయ్యలవలె బిగిసి కొనిపోయిరి.

రామారావు సూటిగా పోయి వంటింటి తలుపు తట్టెను. లోపల గడియ.

'తులసీ!' అని రామారావు పిలిచెను. ప్రతివచనము రాలేదు. అతఁడు చెవియొగ్గి వినెను. స్నానశాలలో చెంబు చప్పుడగుచుండెను. మఱుఁగుదారిని బోయి యతఁడు గవాక్షముక్రింద నిలువఁబడెను. అతనికనులు నివాతదీపములవలె నిశ్చలము లాయెను.

'మీకు సిగ్గు లేదా? పొం డావలికిఁ బొండు' అని తులసి యనెను.

'నయనసుఖం కో నివారయతి?'* అని వినలేదా?' అని రామారా వనెను.

'విన్నాను విన్నాను—ఇంట నున్న యెమ్మెలు ఇల్లాండ్రను పేరుపెట్టి పిలుచుట విన్నాను, స్నానము చేయునపుడు తొంగిచూచుట కన్నాను. లేకిపనులు. చేయి నలిగిపోవును, లేచిపొండు'

రామారావు కదలలేదు. తులసి—'రమణా! ఓరమణా! ఓహోయి రమణా!' అని అఱచెను. ఈపిలుపు వినఁబడఁగనే పిల్లలదండు వచ్చిపడెను.

'ఓహో నామీఁద దండయాత్రకు బలేసైన్యమును తరిఫీదు చేసితివి' అని రామారా వనెను.

---

* ప్రయోజనం లేకపోయినా సముద్రాలమీఁద పో, మన్మథుఁడు వేంచేసివున్న ఆఁడంగులను చూడు; కంటిసుఖం ఎవఁడు పోఁగొట్టుకుంటాఁడు?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'వదినె స్నానం చేస్తూన్నట్టుంది, మీరే లోపలికి పొండర్రా! నే నింట్లోకి పోతాను' అని పద్మనాభుఁడు వెనుదిరిగిపోయెను.

'ఆ కుఱ్ఱవాని కున్న వివేకము మీకు లేక పోయె.' అని స్నానశాలనుండి వినఁబడెను. రామారావు పద్మనాభునిదెసఁ జూచుచు దాన నోదవిన పరధ్యానముచే గూఁటిలోని చేతిని గొంచెము లాగుకొనెను. వెంటనే గూఁటితలుపు గుభాలున పడెను. రామారావు వాకిటిలోని కరిగి పచారు చేయుచుండెను.

తులసి వంటయింటిలోనికిఁ జని తలుపులు దగ్గఱగా వేసికొనెను.

'తలుపు తీయవే భామా!' అని పాడు చున్న రామారావువాడికన్నులు రెండు చుక్కలవలె తులసికిఁ గానవచ్చెను.

'మగవారికి మానమర్యాదలు లేవు. రాఁ గూడదు, రాఁగూడదు' అని తులసి పట్టు చీరను అడ్డముగా పట్టుకొనెను.

'ఈకాలములో పరదా - సిస్టమ్ లేదు' అని రామారా వనెను.

తులసి చేయునది లేక 'ఏమయ్యా పద్మా' అని అఱచెను. పద్మనాభుఁడు రాకముందే రామారావు తలుపులసందునుండి మొగ మును లాగుకొని స్నానశాలలోని కేఁగి సబ్బుతో మొగమును రుద్దుకొనఁదొడఁగెను. తులసి పట్టురైకకొఱకు గదిలోని కేఁగెను.

'ఈతూరి నేను లోనికి రావచ్చు నను కొందును. ముఖ్యముగా మూఁడవసారి' అని రామారా వనెను.

'పిచ్చి. మద - పిచ్చి. లోని కేల? వీథి లోనికి పోవలెను. రెండేండ్లనుండి మీకు తల్లివిందు. నేఁడు ఆలిమందు. మీయమ్మ నగలు మీకడుపులోనికి. నానగలు మీ ఒడలిమీఁదికి. వెనుక మీరు వ్యాసమునది యెమ్మె కాదు; దానిఫలితము నేఁడు! మీరు తిని ఈపిల్లలను తినిపింపఁగలరా, లేక ఆభారము నామీఁద నిడుదురా?' అని తులసి యనెను.

'ఓశ్ ఇంతేకద?' అని రామారావు తలుపు తోసి లోనికి పోఁబోవుచుండఁగా తులసి వెనుదిరిగి 'చన విచ్చుకొలఁది నెత్తికెక్కుట మీ కలవాటు. మీ కెబ్బఱికము లేదు, ఆఁడుదానికడ కెపుడు రాఁదగునో, యెపుడు రాఁగూడదో మీకు తెలియదు. మీకే కాదు, ఈకాలపు తెలుఁగుదేశపు యువ కులకు—'

'ఆఁగాఁగు! అపాళముగా వారి యందఱ మీఁదఁ బడకు.'

'ఛీ, ఇటు లనుటకు మీకు సిగ్గులేదోటు! దవ్వుగా పొండు'

'నేఁడు అస్పృశ్యత లేదు.'

'మీవంటివారియెడ అస్పృశ్యతయు, అదృ శ్యతయు, అసంభావ్యతయుఁ గలవు.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామారావు కోపసౌందర్యమును, కేవల సౌందర్యమును ఎఱుఁగునుగాని ఆకోపము ప్రణయకోపము. ఆకైవల్యమునకుఁ గూడ సంకోచముచే అసాకల్యము కద్దు. ఈ సత్య భామను, ఈనాగకన్యను ఆతఁ డెన్నఁడును చూచియుండలేదు. ఇపుడు చూచి ఆఁగఁ జాలక రెం డడుగులు ముందరికి వేసెను.

'ఏమి టీ రావణవ్యాపారము ? ఆఁడవాళ్లను ఎత్తుకొనిపోవుదురా యేమి ?' అని తులసి యనెను.

'నేను నాభార్యకడ కరుగుట నారీహరణమా? రావణవ్యాపారమా?' అని రామారా వనెను.

'భార్య యనఁగా ?'

'డుభృఞ్ భరణపోషణయోః = భరింపఁ బడునది, పోషింపఁబడునది భార్య.'

'అబ్బో పాండిత్యము! ఈడుడూ ఏమిటి ? భరింపఁబడునదియే భార్యయగుచో నేను మీయమ్మగారికి భార్యను.'

'కాదు తులసీ' అని రామారావు తులసిని ఎత్తుకొని 'ఇదిగో నేనే భరించితిని' అని తులసిని ముద్దు పెట్టుకొనెను. పంజరబద్ధమగు క్రొత్తచిలుకవలె తులసి విదిలించుకొని గుంజుకొని తప్పించుకొనెను. ఆమె కాటుకకన్నుల నుండి ఒకానొక కృష్ణ ప్రవహించుటకుఁ గాను కట్టలను తప్పించుకొనుచుండెను.

మరల రామారా వాలింగనమున కాయత్తుఁ డాయెను. మాటలు మాని తులసి అతని చెంప చెళ్లునఁ గొట్టెను.

చెంపకాయ తిని రామారా విటులనెను —

'ఏశ్ ! సత్యభామ కాలితో తలఁదన్నెను ! నీవు చేతితో చెంపమీఁద వేసితివి. నీ వసత్య భామవు.'

తులసి మరల చేయెత్తెను. రామారావు రెండవ చెంప యొగ్గెను. తులసి ఛెళ్లు మని పించెను. రామారావు తులసిరెండు చెక్కులమీఁదను రెండు చుంబనముద్రలు వేసెను.

'ఇది సిలువ' అని తులసి యనెను.

'రామరామ! ఎవరేని ఒకచెంపమీఁద వేయుచో రెండవచెంపగూడ వేయించుకొనుమని క్రీస్తు చెప్పెను. నే నటులు చేయుటయే గాక నీవు చేసినపనికి నీ రెండుచెక్కులుగూడ ముద్దాడితిని' అని రామారా వనెను.

'క్రీస్తు నుదాహరించువారు ఇంటిల్లిపాది పస్తులో నుంచరు' అని తులసి యనెను.

'ఇంతే కద! ఏదీ ఇందాఁక అమ్మ యిచ్చిన పొట్లము?' అని రామారా వనెను. ఆ పొట్లము విప్పిచూపినచో బాధ కలుగునో కలుగదో చూత మనుకొని తులసి లోనికిఁ జని పొట్లము తెచ్చి విప్పిచూపెను. రామారావు చూచి నిశ్శంకముగా నిటు లనెను.—

'ఇటు తే. అమ్మ వచ్చువఱకును ఆటంకము లేదు. నీకు బైబిల్ శానటులున్నది; 'రేపటి సంగతి నీ కెందుకు? రేపటిసంగతి రేపే చూచుకొనఁగలము' అని ఏసు అనెను.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఐరావతీనది, సాయంసమయమున G. S. A.



సాయంకాలము సూర్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'మీమనసు ఇనుమో, యేదో నాకు తెలియకున్నది. నేను చచ్చినను ఈ మంగళసూత్రముగాని, మట్టెలుగాని యీయను. కాని నాతాళి తీసియిత్తును' అని తులసి తన పుస్తె పుటుక్కున తెంచి రామారావు మీఁద పడవయిచెను.

'ముదిరిన' దని అనుకొని రామారావు బయటకు బడెను.

2

రామారావు సూటిగా సుందరం-ది-లాయలిస్టు-ఇంటికి వెళ్లెను. ఇతఁడు రామారావుకు బాల్యమిత్రుఁడు. ఈమిత్రునికడ పదిరూకలు దొరకకపోవని రామారా వనుకొనెను.

సుందరము మోఁకాలు దిగని కొల్లాయగుడ్డ కట్టుకొని కూరుచుండెను. ఎదుట నొక వెదురుబుట్ట పెట్టుకొని దానిలోని వేఁబుసెనగకాయలను ఒలుచుకొని తినుచుండెను. రామారావును చూచీ చూడకముందే సుందరము 'ఈయిల్లటపు టల్లుఁడు ఆ హిమాలయమునుండి ఆ ఓషధిప్రస్థమునుండి యెపుడు దిగెను?' అని యనెను. రామారా వామాటలకు మాఱుపలుకక 'ఈఫలాహార మేమిటి? ఈకద్దరుకొల్లాయ యేమిటి? సుందరం-ది-లాయలిస్ట్ గాంధి యెపుడాయెను?' అని యనెను.

'ఈకొల్లాయ కద్దరు కాదురా, దొంగకద్దరు. ఫస్టు మాంచెస్టరు. కుక్కపిల్ల యింకను కనులు తెఱవనటు లున్నది. నాయనా! డిప్రెషన్ డిప్రెషన్, అంతయు డిప్రెషన్.'

'ఉద్యోగ మెచటనూ దొరకలేదా?'

'దొరక కేమి, దొరకినది. గంగాదేవిని నమ్ముకొంటిని. 'బీ. యే. నీళ్లు బీ. యే. నీళ్లు' అని నీళ్లకావడి వేసి బిందె అర్ధణాకు అమ్ముచుంటిని. వెల తగ్గె నని వేఁబుసెనగలు తినుచుంటిని.'

'జయించితివి. నీ కింక ఈ లాయలిస్టు-తోఁకతో నేమి పని? ఇఁక నీపేరు సుందరం-ది-బ్యాంకర్.'

'పాప మేదో ఆశపడి వచ్చినటు లున్నావు. మోఁతవలన సంపాదన మూడణాలు. వేఁబుసెనగలకు ఖర్చు మూడణాలు. బ్యాంకులో బ్యాలెన్సు నిల్.'

అడుగఁబోయి అడిగించుకొనకున్నచో చాలు ననుకొని సెలవు వేఁడుకొని యతఁడు సెల వీయకముందే రామారావు బయటఁబడెను. పిమ్మట రోడ్డుమీఁద నడచుచు ఆలోచించి యాలోచించి అతఁడు మూర్తియింటికిఁ జనెను.

మూర్తియు బి. యే. ఆన్సే. విన్నఁబోయిన మొగముతో నతఁడు వసారాలో కూరుచుండి యుండెను. ఇంటి తలుపులు వేసియుండెను. ఎదుటికి వచ్చుచున్న రామారావును గమనింపఁ జాలనంత ఆలోచనలో నతఁడు మునిఁగితేలుచుండెను; రామా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రావే కలుగఁజేసికొని 'హాలో మూర్తీ - దీ - కో-ఆపరేటర్' అని సంబోధించెను.

మూర్తి మొగమెత్తి 'సుమధ్యాహ్నము మిస్టర్ ద్వివేదీ—నీ—ఇంటల్లుఁడూ' అని సమ్మానించెను.

'ఇంటల్లుఁడు కాక వాకిటల్లుఁ డొకఁడా?'

'య్యెస్! ఉండును రా. 'ఉండును' ఏమి? ఉన్నాఁడురా. ఉదాహరణము తీసికొందము. నేనేరా. తెలియునా? అందఱును నీవంటివా రుందురా? డిప్రెషన్! ఇపుడు సింహాసనము మీఁద చక్రవర్తిని తీసివేసి డిప్రెషన్ కూర్చు న్నది. బస్తా రెండురూపాయల కమ్మించుచు న్నది. తెలిసెనా? ఈ డిప్రెషనులో అన్నియు నుండును. ఇంటల్లుఁడు, ఊరల్లుఁడు, విడాకు లల్లుఁడు, వాకిటల్లుఁడు. ఉద్యోగము దొరక నంతవఱకు నేను వాకిటల్లుఁడను. తెలిసెనా?

'నాపనియే యింతవఱకు బాగుగా నున్నటు లున్నది' అని తలఁచి రామారావు తనవంటి యీ వాకిలల్లునకు సానుభూతి చూపి రాజ వీథిలోని కడుగిడెను.

అపరాహ్ణసూర్యుఁడు అతనితలను, క్షుత్సూ ర్యుఁ డతనియుదరమును మలమల మాడ్చెను. అపుడు తులసి అతని తలఁపులోనికి వచ్చెను. ఇంటికిఁ బరుగిడ మొదలిడెను.

తులసి పిల్లలకు అన్నముపెట్టి వారితో మాటలాడుచు గిన్నెలు తోమిప్రొయియలికి కొంగుపఱచి తమయన్నమునకు గింజ లెపుడు వచ్చునా యని నిరీక్షించుచుండెను.

తులసిమీఁద బుద్ధి పాఱె యింటికి సగము దూరమున నున్న రామారావు హఠాత్తుగా ఆఁగి—'పైసా లేనిచో పరస్త్రీవిముఖుఁ డను మాట జూటా, పైసా లేనిచో స్వపర స్త్రీ విముఖుఁడు' అని యనుకొని వెనుదిరిగెను.

అతని మిత్రులలో మిగిలినవాఁ డొకశర్మ. అతఁడు యెమ్మే. బి. యెల్. రామారావు శర్మయింటి సందుమొగకు వెళ్లి చూచెను. అచట ఒకపిట్టయేని కానరాలేదు. 'ప్లీడర్ల యిండ్లు కల్లంగళ్లుకదా! ఈసం దింత యర ణ్యముగా నున్న దేమి?' అని యతఁ డను కొని కొంచె మాలోచించెను. అతనికి సమా ధానము స్ఫురించెను:

'ఓహో ఇది కోర్టువేళ' అని అతఁడు ఇంటికిఁబోవ నిశ్చయించుకొనుచుండఁగా శర్మ వాకిటిలోనికి వచ్చి బెదిరి బెదిరి చూచెను. శర్మకు చత్వారమే కాక రెండుమూ న్నాళ్ల నుండి అతనికిఁ దెలియకుండ హ్రస్వదృష్టి యుఁ బ్రవేశించెను. అతనికంటిజోడు ఆకారణ మున మొన్ననే పగిలిపోయెను. దానితో నతఁడు జోడు - అలవాటు మానివేయఁ దలఁచెను. జోటిపని మనస్సుచేత నే చేయిం చి సమాధానపడుచుండెను.

శర్మ తనసందురెండుచివరలును పరికించి, 'భేష్ ఎవరును లేరు' అని మనస్సును శాంతపఱిచికొనెను. పిమ్మట వడిగాఁ జని గోడకుఁ గట్టియున్న 'యెమ్మే బియెల్'బల్లకుఁ జూచెను. అది తిన్నగా కానరాలేదు. 'ఇది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక సౌభాగ్యము కాఁబోలు, పార్ట్ సైట్ కూడ సంతరించినటులున్నది' అని యనుకొని దేవులాడి దేవులాడి బల్లను పట్టుకొని బలవంతముగా లాగి యింటిలోనికిఁ దీసికొనిపోయి భద్రముగా దాఁచి ఒక టావు కాకితము తీసికొని వ్రాసికొనుచుఁ గూరుచుండెను.

దారిద్ర్యదేవతయొక్క వికటహాస్తమును విస్పష్టముగాఁ జూచి రామారావు సానుభూతి చూపుటకు శర్మయింటిలోనికిఁ జని—'శర్మా ది నిహిలిస్ట్ దేవుఁడు ఉన్నాఁడని వ్రాయుచుండెనా?' అని యనెను.

'ఓహో! అకాలపుటెండ! ఇంటియల్లుండ! నీకెందుకీకాండ? దేవుఁడెచటనున్నాఁడురా? ఉన్న దొక్క డిప్రెషన్! యూ-పీ-లో కలెక్టరుధొరవారు గ్రాజుయేట్లకు దియెకరాలవంతున భూదానము చేయుచున్నా రని విని అప్లికేషను వ్రాసికొనుచున్నాను. దీని రిజస్టరుకుఁగాను నీ వొక పావులా దానము చేసికొనవచ్చును' అని శర్మ యనెను.

'అదియే యున్నచో నా కీపూఁట నిర్విచారముగాఁ గడచిపోయెడిదే!' అని లోపల నను కొని రామారావు—'ఆ భూదానము ఆంధ్రులకుఁగాదు, యు-పీ-లోఁగూడ ఒకజిల్లావారికే. కావున నాదానము అప్రశస్త దానము' అని మఱి యచట నుండక ఆ డిప్రెషన్ బజారునుండి అసలుబజారునఁ బడి అంబుజమ్మగారి యింటికిఁ జనెను.

'ఇఁక ఈనాఁడు మాకెవరికిని అన్నప్రాప్తి లేదు' అని యింటికడ తులసి యనుకొనెను. వెంటనే మూఁడు గంటలు మ్రోఁగెను. 'నిక్కము, నిక్కము' అని తులసి యనుకొని బోషాణము తలుపులు తెఱచి లోపలికి దిగి వెతకివెతకి పెద్దరాగిచెంబొకటి తీసెను. దానికి చింతపండుపులుసు పట్టించి తోముచుఁ గూరుచుండెను.

అచట రామారావు అంబుజమ్మగారి దర్శనమాచరించి 'నేను ద్వివేదుల రామారావును' అని మనవి చేసికొనియెను.

'ఆఁహాఁ. మీరు మనిషేమియు తలక్రిందుగా లేరే? అప్లికేషనులోని 'రామారాయ్ ద్వివేది బి. యే. (ఆనర్స్) మీరేనా?' అని అంబుజమ్మ యనెను. రామారావు పెదవి కఱచుకొని 'చిత్తము' అనెను.

'మీ రింత యాలస్యము చేసితిరేమి? ఆ పోస్టుకు రెండువందల అప్లికేషను లున్నవి. నూటయేఁబదిమంది బి. యేలు నలుఁబది రూపాయలకు వత్తు మని తమ యుదారతను వెల్లడించిరి. మెమ్మేల యుదారతగూడ చూడఁదలఁచి ఆపోస్టును ఇంతవఱకును ఎవరికిని ఈయకుండ తొక్కిపట్టియుంచితిని. తమ రేమాత్రము Sacrifice చేయఁగలరో చూతము' అని అంబుజమ్మ యనెను.

రామారావు డిల్లపోయెను. వెంటనే సహజస్థితిని సంగ్రహించుకొని 'ఆఁడవారిని కన్సల్ట్ చేసి మనవి చేయుదును' అని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యనెను. 'మంచిది. అమ్మగారితో కాదు, భార్యాగారితో నని యనుకొందును. వారికి మగలకన్న ఉదారత మెండు' అని అంబుజమ్మ యనెను. ఈ మాటలకు రామారావు జెంగ పడెను. అతని దురవస్థ అంబుజమ్మ గ్రహించి 'మిస్టర్ ద్వివేదీ, తొందర లేదు. మీరు మీ భార్యతో ఆలోచించి మరల రండు' అని యనెను. రామారావా మాటచే పద్మవ్యూహము నుండి తప్పించుకొనినటుల సంతసించి సెలవు తీసికొని లేచునంతలో వాకిటిలోనుండి —'భవతి భిక్షాం దేహి' అని ఖంగున వినఁబడెను.

తొందరతొందరగా రామారావును, అతనికన్న తొందరగా అంబుజమ్మయు వాకిటిలోనికి వచ్చిరి.

"డిప్రెషన్ - చెంబు
మి.స్. రామారాయ్, ద్వివేది.
బి. యే. ఆనర్స్"

అని తారుతో వ్రాసిన రాగిచెంబు పట్టుకొని తులసి వారియెదుట నిటారుగా నిలిచి యుండెను.



" రాగిచెంబు పట్టుకొని......నిటారుగా నిలచియుండెను."

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రులుగారు

ఉభయభాషా-సాహిత్య విద్యా-ప్రవీణ, బులుసు వేంకట రమణయ్య

ఆంధ్రదేశ మన్నివిషయములయందును చాల వెనుకఁబడియున్నది. తెలుఁగుమాగాణము ప్రాచీనపు టౌన్నత్యమును సంస్మరించిన ఎంతవానికిని గుండె లవియకమానవు. అట్టిసమయమున తనపుత్రుల చిత్తముల నూరడించుటకోయన ఇప్పటి తెనుఁగుతల్లి తనతక్కిన యక్క సెల్లెండ్రవలెఁ గొందఱు పుత్రరత్నములఁ గని యున్నది. వారును తమతల్లి గౌరవమును కాపాడి తమ కీర్తిచంద్రికలను సెల్లివిరియించుచున్నారు. అట్టివారిలో మహామహోపాధ్యాయులు, బ్రహ్మశ్రీ తాతా సుబ్బారాయశాస్త్రులుగా రొక్కరు. శ్రీశాస్త్రులుగారు పండితలోకమునఁ బరమప్రసిద్ధులు. ఆంధ్రదేశమున కమూల్యమగు రత్నాలంకారము, భారతదేశమున కొకబంగారు తొడవు. విద్యార్థులపాలిటి కల్పతరువు. చదువులకు చతుర్ముఖుఁడు. ఆయన కన్నింటను ఆయనయే సాటి.

వీరు శుభదినమగు అక్షయ సం.ర పుష్య బహుళ చతుర్థినాఁడు [క్రీ. శ. ౧౮౬౮ సం. జనవరినెల ౨౯-వ తేదీని] శుభలగ్నమున విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరము చేరువనున్న "ఒంటితాడి అగ్రహారమున జననమొందిరి. వీరిది సుప్రసిద్ధమైదిక ద్రావిడకుటుంబము.

| | | | |
|---|---|---|---|
| | | కే | |
| | రాశి | | స ర బు |
| కు | | | |
| రా చం | ల | శు శ | |

మహర్షిసములును, యజుర్వేదాధ్యయనసంపన్నులును అగు శ్రీసూర్యనారాయణావధానులుగారు వీరి తాతపాదులు. తల్లి పరమసాధ్వీమతల్లియగు సోమదేవి. ఈపుత్రరత్నముఁ గని యాపితరులు పొందినయానంద మింతింత యనఁవీలులేదు.

శ్రీశాస్త్రులుగారు చాలపసితనముననే, తమ తండ్రిగారివద్దనే వేదాధ్యయనమును ప్రారంభించిరి. దానితోఁబాటు సంస్కృతమునుగూడ నాయూరనే వేఱొకరియొద్ద నేర్వఁ దొడంగిరి. కాని యట్టిగ్రామీణ విద్యాభ్యాసము వారికిఁ దృప్తిఁ గలిగింపలేదు. వారు దినదినము కాలినడకను విజయనగరమున కేఁగుచు, అప్పటి సంస్కృతపాఠశాలలోఁ జేరి బ్ర. శ్రీ. బులుసు సుబ్బయ్యశాస్త్రిగారివద్ద పంచకావ్యములను పఠించిరి. తదుపరి వీరు తమ ౧౧-వ యేట, ఆనగరముననే బ్ర. శ్రీ. రుద్రాభట్ల బుచ్చిలచ్చన్నశాస్త్రులుగారివద్దను, బ్ర. శ్రీ. రామశాస్త్రులుగారివద్దను వ్యాకరణాలంకార శాస్త్రములను అభ్యసింప దొరకొని యిరువదేండ్ల ప్రాయమునకే ముగించిరి.

రెండుశాస్త్రములందుఁ దమకుఁ బరిపూర్ణమగు పాండిత్యము కలిగినను శ్రీశాస్త్రులుగారు తమవిద్యాకృషిని విడువలేదు. వీరు తమయిరువదిరెండేండ్ల వయసు వఱకును విద్యాకృషిని సల్పుచు ధర్మశాస్త్రమునందును, న్యాయశాస్త్రమునందును అపారమగు వైదుష్యమును గడించిరి. విద్యాభోజు లనఁదగు విజయనగర ప్రభువులు శ్రీ ఆనందగజపతి మహారాజులుంగారి యాస్థానవిద్వాంసులగు కీ. శే. కొల్లూరు కామశాస్త్రులుగారివద్ద సూత్రభాష్యమును అభ్యసించి వేదాంతమునందును గొప్ప పాండిత్యమును గడించిరి.

శ్రీ శాస్త్రులుగారు వ్యాకరణమున నాగేశభట్టునకు నకలు; అలంకారశాస్త్రమున అభినవగుప్తుని కపరావతారము; న్యాయమున గౌతమునికి గాదెలిచుట్టము; మీమాంసాశాస్త్రమున గురువునకు గురువు; వేదాంతమున వేదవ్యాసునికి వేఱురూపు; ధర్మశాస్త్రమునఁ బరాశరునికిఁ బ్రతిరూపము; వేదార్థప్రవచనమున సాయణమాధవులకు సహపాఠి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరికి సంస్కృతమునందే కాక యాంధ్రమునఁ గూడ మంచిపాండిత్యము కలదు. ప్రాచీనాంధ్రవ్యాకరణములు కావ్యభాషాసంస్కరణమాత్ర ఫలకములనియు, "విశ్వశ్రేయః కావ్యం త దదోషా పరిక్కృతౌచ వాగర్థౌ" అను వ్యాకరణగ్రంథారంభ సూత్రములు, "వళి రాద్య మనంతరాక్షరం ప్రాసః" అను రీతిగల విషయములు, పైయభిప్రాయమునకుపష్టంభకములనియు, కావ్య భిన్న మగు వాఙ్మయము (శాస్త్ర గ్రంథములు మొదలగునవి) వ్యవహారాంధ్రమున నుండవచ్చుననియు వీరియాశయము. ఆంధ్రసాహిత్య పరిషత్సభకు, తక్కిన సారస్వత సభలకును అధ్యక్షులుగ నుండి వీ రొసఁగిన యుపన్యాసములలో, ఆంధ్రపండితులు గమనింపఁదగిన అమూల్యములగు విషయము లెన్నియేని చూపఁబడియున్నవి.

సామాన్యముగఁ బండితులకులౌకికవిషయములం దనుభవము తక్కువ. కాని శ్రీ శాస్త్రిలుగారు విషయమునందును ఆరితేరినవారు. వా రనేకపర్యాయము లొసఁగిన - ఒసఁగుచున్న - సాంఘిక, మతోపన్యాసములిందుకుఁ దార్కాణ. పై విషయములంబట్టి శ్రీ సుబ్బారాయశాస్త్రిలుగారు సర్వజ్ఞులని చెప్పవలసియున్నది.

అన్నింటిని చదివి వానియందుఁ బాండిత్యమను సంపాదించినవారు లెక్కకు మిక్కిలిగఁగలరు. అభ్యసింపనివిద్యలయెడఁగూడ స్వయంకృషిసల్పి స్వప్రతిభావిశేషమున నఖండమగు పాండిత్యమును సంపాదించువారు మాత్రము మిక్కిలితక్కువగ నున్నారు. మీఁది విద్యల నన్నిటిని శ్రీ శాస్త్రిలుగారు గురుముఖమున నేర్చియుండలేదు. కొన్ని వారు స్వయంకృషిచేఁ బరిశ్రమించి సంపాదించుకొనినవి. ప్రతిభావిశేషమునఁ బైకివచ్చినవారిలో వీ రగ్రగణ్యులు. వీరు తాము విద్యార్థిగ నున్నపుడే తమ చదివినపాఠములను తోడివిద్యార్థులకుఁ జక్కఁగ బోధించెడివారు. ఎంత కఠినమగు విషయమునైనను మందమతులైన అనాయాసముగ గ్రహించునట్లు బోధింపఁగల సామర్థ్యమును, ఎట్టి తప్పుల తడక పుస్తకమునైనను దిద్దితీర్పఁగల బుద్ధిసూక్ష్మతయును వీరికి వెన్నతోఁ బెట్టినవి. శ్రీ శాస్త్రిలుగారి యుపన్యాసధోరణి యత్యద్భుతము. పండిత పామర జనరంజకము. అందలి ప్రత్యక్షరమునుఅర్థవంతమైనది. కావున వీరెన్ని గంటలకాల ముపన్యసించినను శ్రోతలకు విసువు కలుగదు. ఒక్కశాస్త్ర విషయముననే కాదు. మత, సాంఘిక, సారస్వతము లన్నింటియందును అదేపద్ధతి.



మత, సాంఘికోపన్యాసము లిచ్చునపుడు శ్రీ శాస్త్రిలుగారు దేశ, కాల, పాత్రముల నాలోచించి విషయ నిర్ధారణమునకుఁ గడంగుదురు. ఒకొక్కపుడు కొన్ని సందర్భములలో శ్రీ శాస్త్రిలుగారి మతము నెఱుఁగలేక కొందఱు వైదికులు ప్రతిఘటించియుండవచ్చును. కాని వా రట్లొనర్చుట, ప్రస్తుతకాలమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాస్త్రవిరుద్ధముగఁ బ్రబలిన యాచారములందలి విశ్వాసముచేఁ గలిగిన యహంభావముననేకాని, యథార్థము నెఱిఁగికాదు. శాస్త్రవిరుద్ధమగు నాచారము దురాచారమనియు, అది ప్రమాణము కానేరదనియు వీరి దృఢవిశ్వాసము. శాస్త్రోదధిని మథించి నలుసురికిని సిద్ధాంతామృతమును బంచిపెట్టుటలో వీరిది సిద్ధహస్తము.

వీరియందలి యసామాన్యవిశేషములే వీరి కాంధ్రదేశముననేకాక హిందూదేశమంతటను గౌరవాదరములను సంపాదించిపెట్టినవి. పండితలోకమున శ్రీశాస్త్రిలుగారిపే రెఱుఁగనివారు లేరు. ఒక చిన్న యుదాహరణము—నేను కాశిలోఁ జదువుకొనుచున్నపుడు ప్రపంచకజ్ఞానము కొలఁదిగఁగల కొందఱు విద్యార్థులు "ఆంధ్రదేశమని యొకదేశము కలదా? ఎచ్చటఁ గలదు? అచట పండితు లున్నారా?" అని ప్రశ్నించెడివారు. ఆంధ్రదేశమునుగుఱించి చెప్పుచు "నేను శ్రీ సుబ్బారాయశాస్త్రిలుగారి శిష్యుఁడ" నని చెప్పితిని. ఆపైని వారు "ఏమి? శ్రీ సుబ్బారాయశాస్త్రిలుగా రాంధ్రులా? సుప్రసిద్ధవిద్వాంసులగు వారి నామధేయమును మేము బాగుగ నెఱుఁగుదుము. వా రాంధ్రులనిమాత్ర మెఱుఁగము" అని పలికిరి. దీనింబట్టి శ్రీశాస్త్రిలుగారి యశశ్చంద్రిక లెట్లువ్యాపించి దేశమును ప్రకాశింపఁజేసెనో తెలియఁగలదు.

పలచనై పొడుగయిన విగ్రహము, పచ్చనిమేనిచాయ, విశాలమై సరస్వతి తాండవించు నుదురు, వాడిగలముక్కు, ప్రసన్నమై నిశితమై తేజోవంతమగు దృష్టి శ్రీశాస్త్రిలుగారి ప్రతిభాపాండిత్యములకు ప్రబలనిదర్శనములు. వీరు సర్వసములు; భూతదయాపరాయణులు; బంధుసముద్రులు; పరోపకారమనిన నడుముకట్టి పనిచేయువారు; విశేషించి విద్యార్థిపక్షపాతులు; విద్యార్థుల సౌకర్యముకొఱకు కళాశాలాధ్యక్షులతోడను, విద్యాలయమువారితోడను పోరి చాలసారులు విద్యార్థులను కష్టములనుండి కాపాడిరి; కాపాడుచున్నారు. అట్టి సాహసముకలవారేతక్కువ. సాహసమున్నను సాధింపఁగలవా రంతకంటెను తక్కువ.

తమవిద్యార్థులకే కాని యితరులకు విద్య గఱపరాదని పట్టుపట్టిగూరుచుండుట సామాన్యమగు పండితస్వభావము. శ్రీశాస్త్రిలుగారి కట్టిది గిట్టదు. స్వీయ పరకీయభేదము గాని, ఆంధ్రఅనాంధ్రభేదముగాని, బ్రాహ్మణ అబ్రాహ్మణభేదముగాని శ్రీశాస్త్రిలుగారియెడ మృగ్యములు. ఎప్పుడు, ఎవరు, ఏవిద్యను బోధింపఁగోరినను వీరు సంసిద్ధులు. సుప్రసిద్ధులగు విద్వాంసులుకూడ నెట్లో యవకాశమును గల్పించుకొని దూరదేశములనుండి వచ్చి వీరివలన జ్ఞానోపదేశము పొంది కృతార్థులై పరమానందము నొందుదురు.

విద్యార్థి యెట్టిమందమతియైనను మృదుమధురముగ మందలించుటయే కాని కొంచెమైనను కఠినముగ మాటాడుట వీరెఱుఁగరు. దోష మెంతగొప్పదైనను విడిచి గుణలేశమునే గ్రహించి యితరుల నానందింపఁజేసి తా మానందించుట వీరి కుగ్గుపాలతోఁబెట్టిన యున్నతాశయము.

వీరు విద్యాభ్యాసమును పూర్తిచేసి సుప్రతిష్ఠులైనపిదప విద్యాదానమే ప్రధానాశయముగ శ్రీవిజయనగరమహారాజులుంగారి మహిళాపాఠశాలలోఁ బండితపదము నధిష్ఠించిరి. అప్పటికి శ్రీవిజయనగరప్రభువుల విద్యాసంస్థలపై అధికారపదవిని స్వీకరించియున్న దివాన్‌బహదూరు, కే. శే. కిడాంబిరామానుజాచార్యులుగారు [యం.ఏ., బి.యల్., డి. లిట్.] ఒకపుడు పాఠశాలను పరీక్షింపవచ్చి వీరిపాండిత్యమును మిగుల ప్రశంసించి వీరిని గౌరవించిరి. తన్మూలముననే వీరికి శ్రీమహారాజులుంగారి సంస్కృతకళాశాలయం దున్నతస్థానము లభించినది. వీరు సంస్కృతపాఠశాలయందడుగిడినదిమొదలు తదభివృద్ధిసూచనలు పొడకట్టెను. వీరి ప్రబలప్రోత్సాహము, శ్రీరామానుజాచార్యులుగారి ప్రయత్నము గలిసి పాడుకొంపలలోనుండిన సంస్కృతపాఠశాల నొకకళాశాలగ మార్చి, సుందరమగు భవనమును, అమూల్యమగు గ్రంథభాండాగారమును సంపాదించి పెట్టినవి. విజయనగర సంస్కృత కళాశాల దక్షిణహిందూదేశమునందలి ప్రాచ్య విద్యాలయములలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రధానస్థానము నలంకరించుటయేకాక ఇట్టివా రందు ఆచార్యపదము నలంకరించుటంబట్టియే. పాఠశాల మంచి స్థితికి వచ్చినది మొదలు నేఁటివఱకు శ్రీ శాస్త్రులుగారే యందు ప్రధానపండితులై విద్యార్థులను పుత్రులట్లు చూచి విద్యాదాన మొనర్చుచు వారిని విఖ్యాతపండితులుగ నొనర్చుచున్నారు.

శ్రీ శాస్త్రులుగారివంటి మహాపండితులకు బిరుదములకును, గౌరవములకును లోటుండదు. ముఖ్యములగు కొన్నిటిని మాత్రము పేర్కొనుట ప్రస్తుతము. శ్రీశాస్త్రులుగారి పాండిత్యమును మెచ్చుకొని ప్రభుత్వమువారు వీరికి ౧౯౧౦-వ సంవత్సరమున పండితజనసామాన్య దుర్లభమగు "మహామహోపాధ్యాయ" బిరుదము నొసంగిరి. ఈ యిరువదవ శతాబ్దమున తెలుఁగు మాగాణమున నీబిరుదము లభించినది (సంస్కృతవిభాగమున) వీరికొక్కరికే.

"కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా."

౧౯౧౫-వ సంవత్సరమున, చెన్నపురి విశ్వవిద్యాలయమునఁ బ్రాచ్యవిద్యాద్బిరుదపరీక్ష లేర్పఱుపఁబడినపుడు శ్రీశాస్త్రులుగారు పరీక్షకులలో నొకరుగ నిర్ణయింపఁబడిరి. ఆ విశ్వవిద్యాలయముననే ౧౯౧౮-వ సంవత్సరమున వీరు పఠనీయగ్రంథనిర్ణయసభలో నొకసభ్యులుగ నియోగింపఁబడి చాలకాలము వాఙ్మయసేవ నొనర్చిరి.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఏర్పడినది మొదలు నేఁటివఱకును వీరు పాఠ్యగ్రంథనిర్ణాయక సభలో సభ్యులుగ నున్నారు. పై పరిషత్తునందు చాలసారులు వీరు పరీక్షకులుగ నుండిరి. కాశీహిందూవిశ్వవిద్యాలయ పరీక్షలకును, కాశీసంస్కృతవిశ్వవిద్యాలయపరీక్షలకును గూడ వీరు పరీక్షకులుగ నుండిరి.

శ్రీశాస్త్రులుగారు ౧౯౩౦-వ సం.మున ఉర్లాం (గంజాంజిల్లా) విద్వత్పరీక్షలలో, వ్యాకరణమున కభ్యర్థులుగ నిలిచి యుత్తమశ్రేణిలోఁ గృతార్థులగుటయే కాక అప్పటినుండియే, యచటి పరీక్షాధికారులలో నొకరుగ నిర్ణయింపఁబడిరి. ఆపరీక్ష లున్నంతకాలము వీరు ఆపదము నలంకరించియుండిరి.

ఒకపుడు శ్రీవిజయనగరసంస్థానాధీశులపై వారి దాయాదులు కొందఱు "వారసత్వపుహక్కు తమ"దని దావా తెచ్చిరి. ఆసమయమున వీరు ధర్మశాస్త్రముల నద్భుతరీతిఁ బరిశోధించి "గోత్రము-ప్రవర"లవిషయమై చేసినసిద్ధాంతములు సంస్థానాధీశ్వరుల కెంతయు నుపకరించినవి. శ్రీశాస్త్రులుగారి సిద్ధాంతములు "హైకోర్టు"లోని న్యాయమూర్తులను, న్యాయవాదులను, ఆశ్చర్యమగ్నుల నొనర్చినవి. శ్రీవిజయనగరప్రభువులును వీరినుచితరీతిని గౌరవించి కృతజ్ఞతను వెల్లడించిరి.

౧౯౨౨-వ సంవత్సరమున వేల్సుయువరాజు మదరాసునకు వచ్చినపుడు, ఒకబంగారుతోడాయును, రెండు కాశ్మీరపుసేలువలును శ్రీశాస్త్రిగారికి బహూకరింపఁబడినవి. ఆవత్సరమునందే కాశీహిందూవిశ్వవిద్యాలయమునందలి ప్రాచ్యవిద్యాలయాధ్యక్షులు, కీ. శే. చంద్రధరశుక్లరి(బి. ఏ.)గారు, వీరురచించిన "సుప్రసాదము"నందలి కొన్ని ఘట్టములను విని వీరి పాండిత్యమున కచ్చెరువొంది గొప్పగ గౌరవించిరి.

వీరు దర్భంగ-పుదుకోట-పిఠాపురము-బొబ్బిలి మొదలగు ప్రసిద్ధసంస్థానములందును తదధిపతులచే నొందినమన్ననల నిప్పుడును పొందుచున్నారు.

౧౯౨౮-వ సంవత్సరమున కాశిలో జరిగిన "అఖిలభారతవర్ణాశ్రమధర్మమహాసభ"లో వీరొసఁగిన యుపన్యాసమునకును, సిద్ధాంతములకును పండితమండలి యంతయుఁ బ్రముదితమైనది.

వీ రధ్యక్షతవహించి గౌరవించిన శాస్త్ర, సారస్వత, మత, సాంఘిక మహాసభలు సంఖ్యాతీతములు.

శ్రీ శాస్త్రులుగా రొకసారి [౧౯౨౬-వ సం.] విజయనగరపురపాలకసంఘసభ్యులుగ నెన్నుకొనఁబడిరి.

వీరెల్లపుడును, శాస్త్రాధ్యాపనమునందే కాలమును వినియోగింతురు. కాన, వీరు రెండుగ్రంథములను మాత్రమే రచింప వీలుకలిగినది. అవి సంఖ్యకుఁ దక్కువయేకాని, విషయమున నొక్కొక్కటి వేయిగ్రంథములపట్టు. అవి రెండును ముద్రితము లయినవి. ముద్రింపఁబడినతోడనే అవి యన్నిదేశములందును వ్యాపించి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



మార్గశీర్ష మాసము
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమకును, శ్రీ శాస్త్రిలుగారికినికూడ విశేషముగఁ గీర్తి ప్రతిష్ఠల నొనఁగూర్పఁగలిగినవి.

అందు మొదటిది "గురుప్రసాదము." వ్యాకరణ శాస్త్రగ్రంథము. నాగేశభట్టు రచించిన లఘుశబ్దేందు శేఖరమున కిది విపులమగు వ్యాఖ్య; హాల్ సంస్థ్యం తము కలదు. అద్భుతవిమర్శనలతోఁ గూడినది. ఇందు నాగేశునిమతము నెదిరించువారిసిద్ధాంతము ఖండింపఁబడి మూలమతము సయుక్తికముగ స్థిరీకరింపఁబడినది. వ్యాకరణమునం దపూర్వపరిశోధన మొనర్చువారల కిది అవశ్య పఠనీయగ్రంథము. దీనిని శ్రీశాస్త్రిలుగారే ప్రకటించిరి.

రెండవది "చిత్రప్రభాలఘుటీక." ఇదియు వ్యాకరణ గ్రంథమే. ఇందును నాగేశుని మతమే సమర్థింపఁ బడినది. భట్టోజిదీక్షితుని "ప్రౌఢమనోరమ" పై "శబ్దరత్న" మనుపేరిట, నాగేశుఁ డొక వ్యాఖ్యానము వ్రాసియున్నాఁడు. అందు దీక్షితుని మతము సరికాదని స్వమతము నిరూపింపఁబడినది. నాగేశుని మతమును ప్రతిఘటించుచు "శబ్దరత్నము" పై "చిత్రప్రభ" యను వ్యాఖ్యాన మొండు బయలు వెడలినది. శ్రీ విజయనగర సంస్థానాస్థాన విద్వాంసులును, సుప్రసిద్ధ కాశీపండితులును అగు, కీ. శే. భాగవతులహరిశాస్త్రిలుగారు దానికిఁగర్త. నాగేశభట్టుమతము నవలంబించిన శ్రీ సుబ్బారాయశాస్త్రిలుగారు పై "చిత్రప్రభ" యందలి "అస్వరస" లను తమ లఘుటీక యందు సువ్యక్తముచేసిరి. ఇది మూలముతోఁబాటు ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది. ఇదియు వ్యాకరణమును పరిశోధించి సమగ్రమగు పాండిత్యమును సంపాదింపఁదలఁచువారి కవశ్య పఠనీయము.

శ్రీ శాస్త్రిలుగారు వ్యాకరణమురీతిని, తక్కిన శాస్త్రములనుకూడ గౌరవించి గ్రంథరచన మొనర్చి నట్లో సంస్కృతవాఙ్మయప్రపంచమునకు, ప్రపంచమునకును పరమోపకార మొనర్చినవా రగుదురు.

ఇట్టిమహాపండితులను కనిన ఆంధ్రావనియు, వీరు తమవారని చెప్పుకొను నాంధ్రులును ధన్యులు.

పరమేశ్వరుఁడు శ్రీ శాస్త్రిలగారికి ఎల్లపుడును, ఆయురారోగ్యైశ్వర్యములను వృద్ధి పొందించుచుండుఁ గాక !



పడవల రేవు —యస్. టి. జి. వి. యస్. చారి, బొబ్బిలి.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గీతిక

మంగిపూడి పురుషోత్తమశర్మ

ఇది యేకతార కా, దింపులు నింపు
సప్తతంత్రుల నొప్పు సరసంపు వీణె.

ఈ వీణ వాయింప నిచ్చి జనింప
చెలువార జేసితి స్నిగ్ధభావమున.

ఈ దీనజన్మపై నెంత ప్రేముడియొ
నీ ముద్దువీణపై నెమ్మి తళ్కొత్త
తంత్రులు దిద్ది స్వతంత్రగీతముల
వివిధమోహనరస విసరముల్ తొలుక
పాడంగ ముదల యేర్పడ నిచ్చినావు.

కాని నీయానకు పూనిక మెట్లొ
తలచినంతనె గుండె తలకును స్వామి!

వీణెపై చేతులు వేసినంతటనె
మెఱుపు సోకినయట్లు మేనెల్ల వడకు;
తీగెలు సవరింప దివురు నంతటనె
వ్రేళ్లు కొంకరవోయి వీడును బిగువు.

మంజుల సుకుమార మహిత మీవీణ
ఒయ్యారముగ నెట్టు లొగి బట్టవలెనొ,
తీగెల నొక్కటి తెగిపోవకుండ
తీరుగా నెట్టులు సారించవలెనొ,
ఒండొండు పోలిక యొక్కింత లేని
యీ స్వరావళి యెట్టు లెడబడకుండ
ఏకశ్రుతికి చక్క నెలయించవలెనొ,
తానమానముల సంతసమీఱ నెఱపి
పురికొని పాటకు దొరకొను టెట్లొ
ఇంచుక మెఱుగని హీనుండ, జడుడ,
ని న్నెట్లు పాటలో నే దనియింతు?
ని న్నెట్లు పాటలో నేను మెప్పింతు?
ఓ రసికాగ్రణీ, ఓ గానముగ్ధ!
చాలుచాలును, ఇంక చాలు నాపాట.

నలుగురిలో ఇంక నగుబాటు వలదు.

అన్నియు నెఱిగిన యఖిలేశ్వరుడవు,
సకలగానరహస్యసార సంవేది,
వతిదయామతి, వీవె యలరుచు వేగ
ఈజంత్రమును గొని యింపులు పుట్ట
పాడంగరాదె విశ్వవిమోహనముగ
బ్రహ్మాండ భాండమ్ము ప్రబ్బి మెండుకొని
యుగయుగాంతరముల నొక్కట మ్రోగు
సకలజగద్భద్ర సంధావిభూతి
అశ్రుతపూర్వమౌ ఆనందగీతి.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చుక్కలజతలు—పాలసముద్రమథనము

## హాలాహలభక్షణము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు, బి. ఏ. (కవితాసమితి)

ఈ భారతిపత్రికలో నేను వ్రాయుచున్న నక్షత్ర వ్యాసములలో పాలసముద్రమథనకథను ఖగోళరీత్యా అన్వయించుటనుగూర్చి ప్రత్యేకముగా నొకవ్యాసము వ్రాసెదనని చెప్పుచుంటిని. ఇపు డావిషయమై యీప్రత్యేకవ్యాసము వ్రాసి యీభారతీపత్రికాముఖమున నాంధ్ర మహాజనులకు సమర్పించుకొనుచున్నాను.

ఈసందర్భమున వివరములు వ్రాయకపూర్వమే మనము Double Stars అనబడు చుక్కలజతలను గూర్చి సంగ్రహముగానైనను కొంత తెలిసికొనుట మిక్కిలి అవసరము కావున ముందుగా వీటినిగూర్చి కొంత తెలిసికొందము.

### చుక్కలజతలు (Double Stars)

రాత్రులందు ఆకాశమును తిలకించినపుడు మన నేత్రములకు ఒకొక్కటేయని తోచు చుక్కలు లెక్కకు మీరియున్నవి. టెలెస్కోపు (Telescope) యంత్ర సాయముతో నట్టిచుక్కలను పరిశీలించిచూడగా అవి యొకొక్కటికావనియు, నిజముగా రెండేసిచుక్కల జతలనియు స్పష్టమగును. బహుదూరమునం దుండుట చేత అవి మనస్థూలదృష్టికి ఒకొక్కచుక్కలాగుననే కనబడుచుండును. దూరమునుండి చూచునపుడు రైలు బండ్లు అగ్గిపెట్టెలలాగున కనబడును. 'దూరపుకొండ నునుపు' అను సామ్యము మనమెరిగినదేకదా! ఎన్నో మైళ్లదూరముగల కొండలు ఆవల బహుదూరమునుండి చూచునపుడు, ఒకదానిపై నొకటి ఎగయుచు ఒక్కటే పర్వతమువలె కనబడును. దూరము అధికము అగు కొలది స్థూలదృష్టికి ఈభ్రాంతి విశేషముగా కలుగుచుండును. క్షణమునకు లక్షయెనుబదియారువేల మైళ్లచొప్పున నఖండత్వరతోబోవు ప్రకాశము (Light) ఆయాచుక్కలనుండి మనలను చేరుసరికి పదులు, వందలు, వేలు సంవత్సరములు పట్టుచున్నది. ఊహింపతరముగానన్ని కోట్లు-కోటానకోట్లు మైళ్లదూరమందున్న యీచుక్కలజతలు మనస్థూలదృష్టికి ఒకొక్కచుక్కలాగున కనబడుటలో ఆశ్చర్యము లేదు.

### రంగుభేదమునుబట్టి జతలను నిర్ణయించుట

కొన్నిచుక్కలలో నగపడు రంగులభేదములను బట్టి అవి చుక్కలజతలని నిర్ణయించుట సులభమగుచున్నది. వృశ్చికరాశిలో జ్యేష్ఠనక్షత్రమును చూడవచ్చును. ఇది పగడమువలె ఎఱ్ఱగా మెఱయు నక్షత్రరాజము. దీనితో జతగలిపి భ్రమించుచుక్క సముద్రపు రంగువంటి, అనగా నీలిమతోకూడిన ఆకుపచ్చరంగు గలదైయున్నది. ఈ రంగుభేదమునుబట్టి అది యొంటి చుక్కకాదని సులభముగా తెలిసికోగలము. ఇట్లే విష్ణుమండలములో (Hercules) నున్న చుక్కయొకటి ఎఱ్ఱనిదికలదు. దానితో జతకలిపి తిరుగుచుక్క గాఢమైన ఆకుపచ్చరంగు (Emerald green) కలది. ఈవిధమున రంగుభేదములు గమనించి చుక్కలజతలున్నట్లు నిర్ణయింపబడినచుక్కలు అప్సరస (Cassiopea) మండలమునందును, భూతేశ (Bootes) మండలమునందును, ఊర్వశి (Cephens) మండలమునందును, రాజహంస (Cygnus) మండలమునందును పెక్కులు గలవు.

### రంగుభేదము లేకున్నను తేజోభేదములనుబట్టి జతలను నిర్ణయించుట

మరికొన్నిచుక్కల జతలలోని రెండుచుక్కలయందును ఒకమాటే తేజోవృద్ధిగాని, క్షయముగాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలుగుచుండును. లేదా, ఒకటి తేజోవృద్ధిగనినపుడు రెండవదాని తేజము క్షీణించుచుండును. మొదట మంద మైన కాంతిగలచుక్క పిదప తేజోవృద్ధి బడయు చుండును. కొన్ని జతలలో ఒకదాని తేజ మెప్పుడును ఒక్కలాగుననే యుండగా, రెండవదాని తేజము వృద్ధి క్షయముల బొందుచుండును. లేదా యీరెండవది తేజోహీనమైన నల్లనిగోళము కావచ్చును. కాంతివంత మైన యొకచుక్కచుట్టును కాంతిహీనమై, నల్లనైన గోళ మొకటి తిరుగుచున్నప్పుడు, గ్రహణచ్ఛాయచే మన సూర్య, చంద్ర బింబములు మలినమైపోవునట్లు అసలు చుక్క తేజము గోల్పోయినట్లు తాత్కాలికముగా కనబడును. ఇట్టి నల్లని గోళపరిభ్రమణముచేతనే (Perseus) భృగుపరశుమండలమందుగల పులోముడను రక్కసుడు గ్రుడ్లు మిటకరించుచునుచు కనబడునని పెక్కుసారులు వర్ణించినాను. వానినే పాశ్చాత్యులు Algol the Blinking demon అందురు.

## చుక్కలజతల విచిత్రసంబంధము

చుక్కలజతలలోని చుక్కలపరిభ్రమణక్రమము ఎట్టిదో మనము తెలిసికొనవలెను. అంగారకుడు, భూమి, శుక్రుడు, గురుడు, శని లోనగుగ్రహములు మధ్యనున్న సూర్యునిచుట్టు తిరుగుచున్నట్లు, ఈ జతలలోనొకటి మధ్య నుండి రెండవది దానిచుట్టును గానుగఎద్దువలె తిరుగుచుండదు. ఒకదానిచుట్టు నొకటిగా రెండును పరిభ్రమించుచునే యుండును. మన సూర్యకుటుంబ ములో గ్రహములు సూర్యునిచుట్టు పరిభ్రమించునేకాని సూర్యుడు గ్రహములచుట్టు పరిభ్రమింపడు. జంటతా రలలోని చుక్కలు రెండును మహనీయ తేజఃపరిమాణ ములుగల బ్రహ్మాండసూర్యులే; పరస్పరాశ్రయముగలిగి ఒండొంటిని చుట్టివచ్చుచుందురు. శాశ్వతమైన యీ లంకెలతో రెండును ఒకదానిచుట్టు నొకటి అన్యోన్యము తిరుగుచు వచ్చుచుండుట టెలెస్కోపులో చూచి, వాటి గమనవైఖరులను గమనించు కొలది పరిశీలకులకు ఆనందాశ్చర్యములు వృద్ధియగుచుండును. ఆకాశమున గానవచ్చు నసంఖ్యనక్షత్రములలో ఐదింట నొకటి ఇట్టి జంటతారలేయైనట్లు తేలుచున్నది. మంచి శక్తివంత ములైన దూరదర్శియంత్రములలో నీజంటతారలను పరి కించుచున్నకొలది వీటి యన్యోన్యత నిజమేయనియు, వీటిలో వియోగమెరుగని దాంపత్యమువంటి పరస్ప రాశ్రయసంబంధము లున్నవనియు స్పష్టము కాగలదు.

ఖగోళపరిశోధకులు నిర్మింపగలిగిన ఎంతటిశక్తి వంతమైన దూరదర్శియంత్రములైనను ఇందు కొన్నింటి విభిన్నతను సూచింపజాలకున్నవి. అట్టి చుక్కలలో గూడ జతలున్నవని నిర్ధారణచేయుటకు స్పెక్ట్రో స్కోపు (Spectroscope) అనబడు కాంతివిభాజక యంత్రము తోడ్పడినది. ఇంకను చాల జతలను ఫోటోగ్రఫీ (Photography) తేజఃప్రతిబింబములను తీయుటచేత నిర్ధారణచేయుట కవకాశము లేర్పడు చున్నవి. జతల మధ్యదూరము రెండు సెకెండ్లకు* తక్కువయైనపుడుతప్ప ఈప్రతిబింబములు చాల ఉపయుక్తములు. జతలో నొకచుక్క తేజ మధికమై రెండవదాని దల్పమైనపుడును ఈసాధనము పనికిరాదు. అపుడు మందతేజము గలచుక్క ప్రతిబింబముపడదు. ఇట్టి తారలజతలు వేయింటికిపైగా నున్నను, ముఖ్యమైన జత లేడింటినిగూర్చిమాత్ర మిచట సంగ్రహముగా ప్రశం సింతము.

## ౧. అరుంధతి - వసిష్ఠుడు

వసిష్ఠుడు ఋగ్వేదమునందలి సప్తమమండలము నకు ఋషి. ఇక్ష్వాకువంశజుల కులగురువు. శ్రీరామునకు కూడ గురువే. ఋషులలో నితడు పరమపూజ్యుడు, అగ్రగణ్యుడు. ఇతనిభార్య అరుంధతి పతివ్రతాతిల కము. సద్విజులలో వీరిదాంపత్యము ఆదర్శప్రాయము. ఈ పుణ్యమూర్తులు ఆకాశమున నక్షత్రరూపమున తేజ రిల్లుచున్నారు. నేటికిని వివాహకాలమున సప్తపది కాగానే నూతనవధూవరులు వీరలకు మ్రొక్కు

* ఒకసంపూర్ణవలయము (Circle) లో ౩౬౦ డిగ్రీలున్నవి. ఒకడిగ్రీకి ౬౦ మినిట్లు; ఒకమినిటునకు ౬౦ సెకెండ్లు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నారు. యంత్రసాయము లేక మన నేత్రములతో మాత్రము చూచునపుడు వసిష్ఠుడును, అరుంధతియు




వసిష్ఠుడు, అరుంధతి

[వ. వసిష్ఠుడు.

అ. స్థూలదృష్టికి కనబడు "అరుంధతి" (Alcor)

ఇ. టెలెస్కోపులో చూడగా వసిష్ఠుని ప్రక్క కనబడుచుక్క. ఈచుక్కయే నిజముగా అరుంధతి గావలయును.]

కనబడువిధానము పై పటములో చూడనగును. వసిష్ఠుని ప్రక్క చిన్న ఆవగింజవలె మిణుకుమిణుకు మనుచు అరుంధతి కనబడును. దృష్టియందు లోపము గల మానవులకు ఈ చిన్నచుక్క కనబడనేకనబడదు. అందుచేతనే ఒకానొక పెండ్లికొడుకు "అరుంధతి కనబడలేదు కాని నాకు ఆరువందలు అప్పు కనబడు చున్నది" అని చెప్పెనని మనదేశములో నొకసామ్య మున్నది. మహామునిపత్ని యగు నరుంధతిదర్శనము ఐదువతనమును, ఆయురారోగ్యైశ్వర్యములు నను వరములకొఱకేకాక, నేత్రదృష్టి పరిశీలించుటకుగూడ మనపెద్దలు ఏర్పరచినట్లు తోచుచున్నది. దూరదర్శినిలో చూడనంతవఱకు మననేత్రములకు స్థూలదృష్టికి కనబడు పై పటమునందలి రూపమే ఇంతవరకు తెలిసిన దనుకొనుచున్నాము. కాని టెలెస్కోపులో పరిశీలించినపిమ్మట మరియొకచిత్రము బయల్పడినది. స్థూలదృష్టికి కానరాని క్రొత్తచుక్కలు ౬-౭ వరకు టెలెస్కోపులో చూచినపుడు వసిష్ఠ - అరుంధతులకు మధ్య కనబడును. వసిష్ఠుని ప్రక్కనే ఇ గురుతు అక్షరముతో సూచించిన క్రొత్తనక్షత్రమును ముఖ్యముగా గమనించవలయును. పటములో అ- గుర్తుగల చుక్క వసిష్ఠునిచుట్టు తిరుగునని శాస్త్రజ్ఞు లూహించు చున్నారు. కాని అది నిశ్చయమని ధ్రువపడినట్లు పరిశీలనము పూర్తి కాలేదు. ఇ గుర్తుగల చుక్కయు వసిష్ఠుడును, పరస్పరపరిభ్రమణము పూర్తిచేయుటకు పదివేల సంవత్సరములు పట్టునని శాస్త్రవేత్తల యభిప్రాయము.

## ౨. తారల జత (Castor)

మిథునరాశిలో పునర్వసునక్షత్రమునందు తేజోవంతములైన రెండు చుక్క లున్నవి. వీటికి పాశ్చాత్యులు Castor and Pollux అని పేర్లుపెట్టి యున్నారు. గ్రీకుగాథలలో వీరలిద్దరును అన్నదమ్ములనియును, గాఢసోదరభావముగలవారనియును వర్ణింపబడినది. ఒక యుద్ధములో కేస్టరు హతుడయ్యెను. సోదరవియోగము భరింపనేరక, పోలక్సు "దేవా, నాసోదరుని బ్రతికింపుము ; లేదా, నన్నుకూడ చంపివేయుము. నేనొక్కడను బ్రతుకజాల"నని మొఱ్ఱపెట్టుకొని దేవుని ప్రార్థించెను. వాని భ్రాతృప్రేమకు మెచ్చి భగవంతుడు ఉభయులను నక్షత్రమండలము చేర్చెను. ఈసోదరులు నావికులకు చాలమిత్రులనియు, కష్టసమయములో బహుసంఖ్యాకులను నావికులు వీరిచే ఉద్ధరింపబడిరనియును హోమరు హోరేసు (Homer Horace) మొదలగుప్రాచీనకవులును, మెకాలే (Macaulay)లోనగు నవీనకవులును వర్ణించియున్నారు. [చూ. ఆంగీరస మాఘమాస భారతి. పుట ౩౦౩]

యజుర్వేదములో నీచుక్కలు అన్న, చెల్లెలుగా భావింపబడినట్లు కనబడుచున్నది. [చూ. కృష్ణయజుర్వేదము I ౭-౬. ఏషతే రుద్రభాగ స్సహస్వస్రాంబికయా తం జుషస్వ.] ఇటీవలి పురాణములలో నీమిథునము భార్యాభర్తలుగా వర్ణింపబడినారు. ఈశ్వరుడు తనశరీరములో నర్ధభాగ మామె కిచ్చి అర్ధనారీశ్వరుడైనాడు. వృషభము (రాశి) పై విహరించు నీమిథునమె పురాణదంపతులు. ఈ చుక్కలురెండును, యంత్రసహాయ మక్కరలేకయే, వేర్వేరుగా సమీపమునందే కనబడుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని టెలెస్కోపుయంత్రములో ఒక్క Castor చుక్కనే పరిశీలింపగా గొప్పవిశేష మొకటి బయల్పడెను. Castor నిజముగా నొక్క చుక్కగాదు. అది రెండుచుక్కలజత. ఒకొక్కటి కొంచెము ఆకుపచ్చరంగుకలిసిన ధవళతేజముతో ప్రకాశించుచున్నవి. తేజోవిషయమున నొకటి రెండవ తరగతికిని, రెండవది మూడవ తరగతికిని చేరును. (One is of the 2nd magnitude, and the other is a 3rd magnitude Star.) పరస్పరాశ్రయముకలిగి పరిభ్రమించు నీజత ఒకభ్రమణము పూర్తియగుటకు సుమారు వేయిసంవత్సరములు పట్టును. ఈ పరిభ్రమణములో ఇవి యొకప్పుడు అతి సమీపమునను, మరియొకప్పుడు కొంతదూరమునను ఉండుటతటస్థించును. అతిసమీపమున నున్నప్పటికంటె అతిదూరముననున్నప్పుడు ఈ చుక్కలమధ్య ఎడము రెండింత లుండును. పరిభ్రమణ పూర్తికి ౯౫౦-౧౦౦౦ సంవత్సరములగును. కడచిన రెండువందల సంవత్సరములలో నీజతలోని చుక్కలు పొందుచున్నమార్పులు, అనగా పరస్పరస్థానములలో పొందుచున్నమార్పులు (Changes in the respective positions of each other). ఈపటములో చూపబడినవి.




Castor లోని జత

[మిథునరాశిలోని పునర్వసు చుక్కలలో నొకటి యగు కేస్టర్ (Castor)లోని చుక్కలజత: పరిభ్రమణ-పూర్తికి వేయిసంవత్సరములు పట్టును. కడచిన ౨౦౦ సంవత్సరములలో వీటిస్థానములందు కనబడిన మార్పులు ఈ పటమునగానవగును. ఈమిథున మేసాంబమూర్తిగానోపు!]

౧. క్రీ. శ. ౧౭౧౯ సం. లో స్థానములు.
౨. ,, ౧౭౭౯ ,, ,,
3. ,, ౧౮౦౨ ,, ,,
౪. ,, ౧౮౨౬ ,, ,,
౫. ,, ౧౮౩౫ ,, ,,
౬. ,, ౧౯౧౦ ,, ,,

ఇప్పటికి రెండువందల సంవత్సరములు పైగా నైనను, వీటి పూర్తిభ్రమణములో చతుర్థాంశమైనను ఇంకను కాలేదు.

## 3. రాజహంస మండలము (Cygnus) లోని జత

రాజహంస మండలములో నొక చుక్కల జత గలదు. వీటిమధ్య సగటుదూరము, మన సూర్యునికిని భూమికిని మధ్యగలదూరమునకంటె అరువదియైదురెట్లధికమని శాస్త్రజ్ఞులు గుణించి తేల్చినారు. అండవృత్తమార్గముల నివి యొకమారు పరస్పరభ్రమణము ముగించుసరికి సుమారు ఎనిమిదివందల సంవత్సరములు పట్టునని తేలుచున్నది. ఇవి అంత తేజోవంతములు కావు. రెండును గలిసి మన సూర్యునిలో సగమైనను కాజాలవు. [The Combined mass of the pair is less than half that of our sun]

## 4. కన్యారాశిలోని "నల" రిక్క (Gamma Virginis)

కన్యారాశిలో, పాశ్చాత్యులచే గామ్మా వర్జినీస్ (Gamma Virginis) అని చెప్పబడుచున్న చుక్క గలదు. దానిని కేత్కారుపండితులు "నల" రిక్క అని వ్యవహరించిరి. స్థూలదృష్టికి ఇది యొక చుక్కవలె కనబడినను, యంత్రసహాయముతో చూచినపు డిందు చుక్కలు రెండుగలవని స్పష్టమైనది. ఇవి పరస్పరాశ్రయములు. ఒండొంటిం జుట్టివచ్చుటకు వీటికి నూటయెనుబది సంవత్సరములు పట్టునని లెక్కింపబడినది. ౧౮౭౦-వ సంవత్సరము మొదలు ౧౯౧౦-వ సంవత్సరమువరకు ఆయామధ్యసంవత్సరములలో నివి పొందినట్లుగపడినస్థానములు ప్రక్కపటములో చూపబడినవి. ౧౮౩౬-వ సంవత్సరములో నీజత నుండి వెలువడు తేజస్తరంగము లేకమై ఒక్కరిక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలెతోచుట గమనింపదగినవిషయము. ఈచుక్కలు తేజోవిషయమున మూడవతరగతికి చేరునవి. మొదట నొకటి, తరువాత నొకటిచొప్పున క్రమముగా నవి తేజమున నరతరగతిమేరకు (half-a-magnitude) క్షీణించి వృద్ధినొందుచుండును.




[‘Gamma Virginis’ అనబడు ‘నలరిక్క’ లోని చుక్కలజత. పరస్పర పూర్తి భ్రమణకాలము ౧౮౦ సంవత్సరములు. ౧౭౮౦ మొదలు ఆయాసంవత్సరములలో దూరదర్శినిలో చూచినపు డివి యిందు చూపబడినట్లు కనబడును.]

## 5. సారథిమండలము (Capella Auriga)లోని బ్రహ్మహృదయ నక్షత్రము

కాలుచున్న మెగ్నీసియమ్‌తీగవలె మిక్కిలి తెల్లనికాంతితో తేజరిల్లు నీనక్షత్రమునుండి వెలుగు మనలను చేరుసరికి ౪౦ సంవత్సరములు పట్టును. స్థూలదృష్టికి ఇదియొక్కచుక్కలాగున కనబడినను, యంత్రసహాయముతో పరిశీలించినపు డిందు రెండుచుక్కలగపడును. వీటిమధ్య సకటుదూరము, మనభూమి సూర్యులమధ్య దూరమునకంటె రెండింతలకు తక్కువగా నుండును. తేజోవిషయమున నిందొకటి రెండవదానికంటె మూడురెట్లధికమైనను, పదార్థసంచయము (mass) విషయములో రెండును సరిసమానముగానే ఉన్నవి.

## 6. అశ్వతరమండలములోని ప్రథమనక్షత్రము ‘ఆల్ఫా’గుర్తుగల నక్షత్రము (Alpha Centaurus)

మనభూమికి అత్యంతసమీపమందున్న ముఖ్యనక్షత్ర మిదియే. ఇందునుండి వెలుగు మనకు చేరుసరికి నాలుగుసంవత్సరముల నాలుగుమాసములు పట్టును. సూర్యునికిని భూమికిని మధ్యదూరమునకంటె, ఈనక్షత్రమునకును భూమికిని మధ్యదూరము రెండులక్షలయెనుబదివేలరెట్లుండునని గణితముచే తేలినది. ఇదికూడ స్థూలదృష్టికి ఒకటిగా తోచినను యంత్రములో చూచినపుడు ఇందును రెండుచుక్కలు వేర్వేరుగా కనబడును. వీటి మధ్యదూరము, “భూ-సూ.” దూరమునకంటె పదునొకండు రెట్లెక్కువ. ఇందును, ఒకటి రెండవదానికంటె తేజోధికమైనది. కాని పదార్థసంచయవిషయములో రెండును సరిసమానమే. ఇవి యొకభ్రమణము పూర్తిచేయుసరికి సుమారు ఎనుబదియెనిమిది సంవత్సరములగును.

## 7. (Sirius) మృగవ్యాధ రుద్రుడు

ఇక మన మిపుడు ప్రసంగించవలసిన ముఖ్యనక్షత్రము మృగవ్యాధుడు. మన కాకాశమునందు కనబడు నక్షత్రములలో నెల్ల నిది మిక్కిలి కాంతివంతమైనది. దీనిని గూర్చిన వేదగాథలు కొన్ని ఆంగీరస, మార్గశిర మాసపు భారతి ౯౪౫-౯౪౬ పుటలలో వ్రాసినాము. ఇటీవలి ౧౯-వ శతాబ్దములో నీనక్షత్రమునుగూర్చిన కథ కొంత వ్రాయవలసి యున్నది.

బెసెల్ (Bessel) అను పరిశోధకు డొకడు ఈనక్షత్రపు పోకడలను గమనించి, గణించి నిర్ణయించిన తావున ననుకొనిన వేళకు ఉండకుండుటచేత ఇది, ఒక్కచుక్కయై యుండదనియు, ఇందు చుక్కల జత యుండియుండు ననియు, ౧౮౪౪-వ సంవత్సరమున నూహించెను. కాని టెలెస్కోపులో దీనిని పరిశీలింపకయే అతడు కాలము చేసెను.

మరి పదునెనిమిది సంవత్సరములకు ౧౮౬౨-వ సంవత్సరములో నొక చిత్రకథ జరిగెను. ఆల్వాన్ క్లార్కు అండు సన్సు(Alvan Clark and Sons)అను నొక కంపెనీవారు టెలెస్కోపులను తయారుచేసి అమ్ముచుండిరి. నూతనముగా తయారైన ఒక టెలెస్కోపులోని వెలుపలి లెన్సు(Lens)ను పరిశీలింపగోరి, కంపెనీ యజమాని, ఈనక్షత్రమును యంత్రములో చూచెను. చూడగా, ఈ నక్షత్రముకడ నల్లగా నేదో నలక ఉన్నట్లు కనబడెను. గాజు పోతపోయునపుడు అందులో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నల్లనినలక చిక్కుపడియున్నదనుకొని, ఆతడు ఆ నలకను తీసివేయుటకు ఆకురాయితో పనిచేయుచుండెను. ఇంతలో నాతని కుమారుడు అచ్చటికి వచ్చి యంత్రముతో నీచుక్కనే చూచి (Father, Sirius has a companion-a dark companion!) నాయనా! సిరియస్‌చుక్కతోకూడ నల్లనిచుక్కయొకటి తోడుగానున్నది సుమా!" అనెను.

తండ్రి:— ఆనల్లటిది తోడుచుక్క కాదురా! అది గాజులెన్సులో చిక్కుకొనియున్న నలక. అది తీసివేయుటకే ఆకురాతిపని కావలసి వచ్చినది.

కుమారుడు:— కాదు నాయనా, అది నలక కాదు. లెన్సులో లోపములేదు. ఆకురాతిపని అవసరము లేదు. ఆ నల్లటిది సిరియస్ తోటిచుక్క. లెన్సులో నలకయే అయినపక్షమున, ఈ టెలెస్కోపుతో ఏచుక్క చూచినను, ఆనలక అట్లేఉండవలెను. ఇంకే చుక్కనైన చూడు. వాటిలోగూడ వదలక ఈనలక కనబడినయెడల, దీనిని లెన్సులోనలక అనుకొందము. లేనిపక్షమున అది సిరియస్‌తోనున్న నల్లచుక్క అనుకొందము.

అని వారిరువురును మరికొన్నిచుక్కలను పరిశీలించిరి. కాని ఆనల్లనిస్వరూపము వాటిలో నెక్కడను కనబడలేదు. ఎన్నిమారులు చూచినను వదలక సిరియస్ (మృగవ్యాఘుని)లో నానల్లచుక్క కనబడుచునేయుండెను. కుమారుని యూహ సరియైనదని తండ్రి యంగీకరించెను.

వెంటనే తంతివార్తలమూలముగా సిరియస్ చుక్కతో నల్లనిచుక్కయొకటి కలదని ప్రపంచము నాలుగుమూలలకు ప్రకటింపబడెను. గణకులనేకు లత్యుత్సాహముతో, మృగవ్యాఘునితోనున్న నీలగోళమును పరిశీలించిరి. అది పరిభ్రమించు కక్ష్య (orbit) నిర్ణయించిరి. అందుగల పదార్థసంచయము (mass), దాని చుట్టుకొలత లోనగు వివరములను నిర్ధారణచేసిరి.

నల్లని యాగోళము మన భూగోళమంత పెద్దది. అనగా చుట్టుకొలత సుమారు (౨౫౦౦౦) ఇరువదియైదువేలమైళ్లు ఉండును. నల్లగోళమైనను అయ్యది దారుణమైన వేడికి స్థానమైనది. అట్లయ్యును అతిసాంద్రమైనది. ఇరువదియైదులక్షలమైళ్లు చుట్టుకొలతగల మన సూర్యగోళమునందున్నంత పదార్థసంచయము అందులో నిమిడియున్నది. అందొక ఘనఅంగుళము- అనగా అంగుళము పొడుగు, అంగుళమువెడల్పు, అంగుళముఎత్తుగలముక్క ఒకటన్ను బరువుతూగును. అంతదారుణమైనగరిమ కలదానీలగోళమునకు. నీటికంటె అరువదివేల రెట్లు సాంద్రమైనపదార్థ మందు గలదు. అభేద్యమును, అతిసాంద్రమును, అత్యుష్ణప్రపూరితమును నైన యీ నీలగోళము మృగవ్యాఘరుద్రుని వశవర్తియై, యారిక్కను వీడక తిరుగుచున్నది. ఆయాసంవత్సరములలో మృగవ్యాధ, నీలగోళముల పరస్పరస్థానములను సూచించుపట మీ క్రింద కలదు. పాఠకులా యంశవృత్తమును గమనింతురుగాక.




[మృగవ్యాఘనక్షత్రముతోకూడనున్న నీలగోళము యొక్క కక్ష్యామార్గము (Orbit) భూమిపైనుండి చూచునపుడు కనబడువిధానము. ఆయాసంవత్సరములందది పొందుస్థానము లీపటమునందు చూడనగును. ఈ నీలగోళమే మన పురాణములందు ఈశ్వరుడు నేరెడుపండువలె మ్రింగినాడని వర్ణించిన "హాలాహలాగ్ని"]

ఈచుక్కలజతనుగూర్చి శాస్త్రవేత్తలు ఈక్రింది యంశములు నిర్ధారణ చేసిరి:

౧. వీటి పరస్పరభ్రమణము పూర్తి యగుటకు ౫౦·౪ సంవత్సరములు పట్టును.

౨. మన సూర్యునికంటె మృగవ్యాఘరిక్కలో పదార్థసంచయము రెండింత లెక్కువగలదు; నీలగోళ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జలమధ్య దేవాలయము, బర్మాలో ఇట్టి దేవాలయములు
కొలనులలో, చెరువులలో కట్టిన వనేకములు కలవు G. S. A.



సుబ్రహ్మణ్యస్వామి రథము, ఉడిపి
విచిత్రనిర్మాణము, యస్. శంకరసుబ్రహ్మణ్యం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చేపలు పట్టుటకు

యం. బి. కమలనాభ నాయడు



కావేరిజలపాతము

ఆకుండి వెంకటశాస్త్రి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములో మనసూర్యునియం దున్నంతపదార్థ సంచయము గలదు.

౩. మృగవ్యాధరిక్క మన సూర్యునికంటె ౬౩ రెట్లు తేజోధికమైన మహాగోళము; నీలగోళమునకు మన సూర్యుని కాంతిలో ౧/౧౬౦ వ పాలైన కాంతి లేదు.

౪. మనభూమి, సూర్యుల మధ్యదూరమునకంటె ఈజతచుక్కల మధ్యదూరము సగటున ౨౨ రెట్లు అధికముగా నుండును.

౫. మనభూమికిని మృగవ్యాధ రిక్కకును మధ్య ఇప్పటిదూరము ఏబదిలక్షల కోట్ల మైళ్లు. దీని వెలుగు మనకు చేరుసరికి ఎనిమిది సంవత్సరములకు పైగా పట్టుచున్నది.

౬. మన భూమితో సహా, సూర్య కుటుంబము క్షణమునకు పంద్రెండు మైళ్ల చొప్పున, విష్ణుమండలమునకు ఉత్తరమునగల వీణామండలము (Lyra) లోని బ్రహ్మ నక్షత్రము ( Vega ) వంకకు పోవుచున్నది.

౭. మృగవ్యాధ రిక్కకూడ మన సూర్యకుటుంబమును వెనుదగిలి యీమార్గముననే వచ్చుచున్నది.

౮. సుమారు ఐదులక్షల సంవత్సరములనాటికి మృగవ్యాధుడును, నీలగోళమును మన సూర్యకుటుంబమును, భూమిని కూడ ముట్టగలవు.

౯. మనభూమి యీరుద్రునిబారినుండి తప్పించుకొనేరదు. సుడిమార్గముననబడి ప్రవాహవేగముచే కొట్టుకొనిపోవుటయే కాని ఆగి మరలుటకు శక్తిలేని చెండువలెను, సూదంటురాతికొండచే నాకర్షింపబడు నౌకవలెను వడివడిగ నీనీలగోళమువాతబడును. అదియే ప్రళయము.

౧౦. సంఘర్షణ జరిగిన ఎనిమిది నిమిషములకు ప్రళయజ్వాల లీ భూగోళమును ఘనపదార్థముగాను, ద్రవపదార్థముగాను ఉండనీయవు. వాయువు, పొగ, మబ్బు తప్ప మరేమియు మిగులదు. కొండలు, గోడలు, మేడలు, చెట్లు, చేమలు అన్నింటితో భూమి ధూమజాలమగును

పిమ్మట ?

A Nebula-no-doubt; and after untold ages, the f_rmation from it, possibly of a new system, rising phoeni'x- ike from the vast crematorium, and filling the place of the old one. A new central sun, perhaps, with its attendant retinue of p! nets nd ·atillites and teeming life, perchance, appearing once more in fulness of time.

The world's great ge begins anew,
The Golden years return,
The Earth doth, like a snake anew,
Her winter weeds out worn,
Heaven smiles and faiths and Empires gleam. ...

[C. M Dolmage. Astronomy of To day Page 347. Etc.]

మన పూర్వుల గ్రంథములలో వర్ణింపబడిన ప్రళయరుద్రుడు, ప్రళయము, పునఃసృష్టి క్రమ మిదియే కదా! కలియుగాంతమున పునః కృతయుగారంభ మీ తీరుననే పురాణములు వర్ణించుచున్నవి.

## పాలసముద్రము

నీలమై, నానారూప, వర్ణ, తేజో విశేషముల చేత నవరత్నములలాగున ప్రకాశించుచుండు నక్షత్రములచే భూషితమై, అపారమై, నలుదిక్కులను వ్యాపించియున్న ఆకాశగోళమునకు మధ్య ఒడ్డాణమువలె తోచుచు, ధవళధవళమై ప్రకాశించుచు, చూపరులకు అద్భుతాశ్చర్యముల గలిగించుచుండు క్షీరవాహినిని (Milky way) గూర్చి మనము ఈవరకు అప్పుడప్పుడు కొంత ప్రసంగించియుంటిమి. శ్రీముఖసంవత్సర జ్యేష్ఠ మాసపుభారతి ౯౬౭-౬౮ పుటలలో క్షీరవాహిని యొక్క రెండుశాఖలను చూపుపటములను గూడ చేర్చినాము. ఇపు డావిషయమును గూర్చి మరికొన్ని యంశములు తెలిసికొన యత్నింతము.

## పాలపుంతను గూర్చిచెప్పు పాశ్చాత్య గాథలు

బహుప్రాచీనకాలమునుండి యీకాంతిపుంజము ఈతేజపుపట్టి, సమస్త దేశములలోను మనీషావంతుల


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృష్టి నాకర్షించి యున్నది. పలువురు బుద్ధిమంతులు దీనిని పలువిధముల భావించియున్నారు. ఎనెగ్జాగొరస్ (Anaxagoras) అను గ్రీకుపండితుడు ఇది ఆకాశమున ప్రతిఫలించు భూచ్ఛాయయని భావించెను. ఎరిస్టాటిల్ (Aristotle) అను తత్త్వవేత్త ఈభూమి నుండి వెడలు కొన్ని వాయువిశేషములు (Certain vapours from Earth) పైకి వెడలి ఆకాశమున నిట్టి ధవళతేజముతో మెఱయుచు కనబడుచున్నవని యూహ చేసెను. గ్రీకులదేవతలకు గమ్యస్థానమైన ఒలింపస్ పర్వతశిఖరమునకు రాజమార్గ మీతెల్లపుంతయేయని గ్రీకు లనుకొనుచుండెడివారు. "మనసూర్యునిరథము ఈ మార్గముననే బహుకాలము నడచెడిది. పిమ్మట ఈమార్గమును వదలి అతడు వేరొకమార్గమున పోవుచున్నాడు. సూర్యుని తొలిబాట ఇపుడీరూపమున మన కాకాశమున గోచరించుచున్నదని యొకగాథకలదు.

పాలవలె నీతేజోమార్గము తెల్లగానుండుటచేత రోమనులు దీనిని పాలదారి (Via Lactea) యనిరి. రోమనుల ముఖ్యదైవమైన జ్యూపిటర్ (Jupiter) దేవునకును, అతనిరాణియైన జూనోదేవికిని (Juno)పుత్రుడైన హెర్క్యులీస్ (Hercules) యోధునకు తల్లి స్తన్యమిచ్చుచుండగా, ఎందుచేతనో ఆమె కోపించి బాలకుని త్రోసివేసెను. ఆమెకుచాగ్రమునుండి యపుడు వెడలిన చనుబాలు ధారగట్టి యాకాశమంతయు వ్యాపించి యీ క్షీరమార్గమై నిలిచిపోయెనని రోమను గాథ లున్నవి.

## మెక్సికోగాథలు(Mexican legends)

ఉత్తరదక్షిణఅమెరికాఖండములమధ్య మెక్సికో అనుదేశము గలదు. ఖగోళమును ఆదేశస్థులు ప్రాచీనకాలములో చక్కగా పరిశీలించిపనిచేసినారు. సృష్టిక్రమమునుగూర్చి వారియూహ లిట్లు సంగ్రహముగా తెలుపబడినవి. "నీలవర్ణుడైన ఆకాశపురుషుడే సృష్టికర్త. అతడే దేవదేవుడు. అతనిభార్య తేజోరూపిణియైన యీతెల్ల పట్టిక. ఆమె మూర్తిద్వయప్రకాశిని (Dual mistress) [ఇట్లనుటకు కారణము, రాజహంసమండలము నుండి దిగువ త్రిశంకునివఱకును ఈ కాంతిపుంజము రెండుపాయలుగా వ్యాపించియుండుట]. నీలవర్ణుడు తన తేజస్సును (వీర్యమును) తనభార్యయందు నిలిపి నక్షత్రములను, గ్రహములను సృష్టించెను. అందును సూర్యచంద్రశుక్రగ్రహములు ముఖ్యములైనవి. గ్రహనక్షత్రాదులు దేవతలు అనుకొని, వాటి కనుగుణమైన రూపవేషములు గల ప్రతిమలను వేనవేలు తయారుచేసి మెక్సికోప్రజలు పూజచేయుచుండిరి. అట్టి శిలావిగ్రహములు, మట్టిబొమ్మలు, దారుచిత్రములు పెక్కువేలున్నవి.

## ఇటీవల యూరపుఖండవాసులలో సామాన్యజనుల భావములు

దేవదర్శనార్థమై వెడలెడు యాత్రికుల కీ తెల్లపుంత రాచబాట యనుభావము పదమూడు పెక్కుదేశములలో ప్రబలియున్నది. ఇది కాశీరామేశ్వరముల మధ్యపుంతయని చెప్పెడువారు మన దేశములో చాలమంది గలరు. ఇట్లే జర్మనీదేశములో నిది జేమ్సుముని(St. James) గుడికి మార్గమను ప్రతీతిగలదు. ఇంగ్లండులోని నార్ఫక్ (Norfolk) దేవాలయముతో సంబంధించిన వాల్సింగ్‌హమ్ (Walsinkham) మార్గమిదే యని ఇంగ్లండుదేశములో పాటకపుజనులు అనేకులు నమ్ముచున్నారు. అమాయకులైన యాత్రికు లిట్లు భావించుటలో అసందర్భము, నైచ్యము గలవని యాక్షేపించుట తగదు యాత్రికుల శిరస్సులపై నభోవీథిని అచింత్యమును, అజ్ఞేయము నై ధవళధవళమైనకాంతితో మెఱయు నీపుంతను చూచినపుడు, శిశువులవలె నమాయకులగుచు, అంతటను భగవంతుని దర్శనమే కోరుచు, ఆపరమేశ్వరునిగూర్చి వ్యయప్రయాసముల పరిగణింపక బహుదూరముపోవు యాత్రికులకు అట్టిభావములు పొడచూపుట సహజము.

మనపల్లెటూళ్లలోగొల్లలులోనగు శ్రీకృష్ణభక్తులు ఆబాలగోపాలుడు మేపునకై గోగణమును తోలుకొని పోవు పుంత ఇదేయని నేటికిని చూపుచున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్టి యూహలకు అంతములేదు. ఈ తెల్ల పుంతనుగూర్చి అనాదికాలమునుండి పలువురు పలువిధముల చింతించినారు; భావించినారు; వ్రాసినారు; ఇప్పటికిని పరిశీలించుచునే యున్నారు. శాస్త్రరీత్యా జరుపబడిన పరిశీలనల (Scientific investigations) వలన తేలినఫలితములందలి ముఖ్యాంశములను సంగ్రహముగా నీక్రింద వ్రాయుచున్నాను.

## క్షీరవాహిని గురించిన పరిశోధనల ముఖ్యఫలితములు

౧. మనకు ఆకాశమున కనబడు నక్షత్రము లనే దివ్యశోభమునకు పునాది యీ తెల్లపుంతయేను అనగా, ఆకాశమున తేజరిల్లు నక్షత్రకోటులకు ఇదేమూలము; ఇదే ఆధారము; ఇదే సంస్థివస్థానము.

౨. ఈనక్షత్రకోటులు ఆకాశమున వ్యాపించియున్న విధానమును ఓపికతో పరిశీలించగా దీని సమను (Plane)ననుసరించియే ఆయాచోట్ల ఆయానక్షత్రములు పేర్చి, కూర్చి, నిలుపబడినట్లు తోచగలదు. చుట్టును ఈతెల్లపుంతదరికి ఆయానక్షత్రములు విశేషముగా తేబడినట్లు స్పష్టమగుచున్నది.

౩. అపుడపుడు క్రొత్తక్రొత్తగాతోచి యఖండతేజముతో వెలుగుచు నదృశ్యమగుచుండు విచిత్రనక్షత్రములు ఈ క్షీరవాహినిపరిసరమునందే విశేషముగా గానవచ్చుచున్నవి.

౪. భావికాలమునందు నక్షత్రములుగా పరిణమింపగల నేటి Nebula రిక్కమబ్బులన్నియును ఈ క్షీరవాహినిసమీపమునందే విశేషముగా కానవచ్చుచున్నవి.

౫. చుక్కలగుత్తులు (Star-clusters) లోనగు నక్షత్రవిశేషములును, సుడి చుట్లును (Spiral Nebulae) శంఖాకృతులును గలిగినట్లు తోచు మబ్బురిక్కల విశేషములును, ఇంకను ఇట్టి విచిత్రవిశేషములన్నియు ఈ క్షీరవాహిని సమీపమునందే కనబడుచున్నవి. కాబట్టి ఈ క్షీరవాహినికిని, మననక్షత్రమండలమంతకును, జన్య జనక సంబంధమునవదు చాల సన్నిహితమైన సంబంధము కలదని ఇంతవరకు జరిగిన శాస్త్రపరిశోధనల (Scientific researches) వలన నిశ్చయింపబడినవి. ఈ విశ్వముయొక్క రచన సంబంధమైన మర్మము క్షీరవాహినిలోనే కలదని చాలమంది శాస్త్రవేత్తలు నమ్ముచున్నారు. పైనివివరించిన మెక్సికో గాథలందలి అభిప్రాయమును నేటి శాస్త్రపరిశోధనలు ధ్రువపఱుచుచున్నవి.

ఇట్టి భావములనే మనస్సున నుంచుకొని మన ప్రాచీనఋషిసత్తములు మనపురాణాములు రచించిరని చెప్పుటకు గల ఉపపత్తులను సంగ్రహముగా నిట చర్చింతము.

## ఎదురెదురుగా పోవు నక్షత్రగణములు
## దేవతలు - దానవులు

ఆకాశమునందు కనబడు నక్షత్రములన్నియు, వాటివాటి స్వకీయగమన (Proper motions) విశేషములనుబట్టి రెండుగణములు (Two groups) గా విభజింపబడినవి. ఈగణములు ఒకదానికొకటి ఎదురుగా పోవుచున్నవి. ప్రకాశమును, గమనమును శీలములుగాగలిగి ఒండొంటి కెదురునడుచు ఈగణములే మనపురాణకర్తల దేవదానవగణములు. 'దివ' మనగా ఆకాశము. 'దేవ' అనగా ప్రకాశించునది. దివ్యమనగా మేలైనది, ఉత్తమమైనది, తేజోవంతమైనది అను నర్థములు గలవు. ఇవన్నియు ఖగోళచారులగు నక్షత్రాదుల కన్వయించును. ఒకవంకపోవు చుక్కలు దేవతలుగాను, వాటికి వ్యతిరేకముగా, అనగా ఎదురుగా వచ్చు చుక్కలు రాక్షసులుగాను విభజింపబడినట్లు కానవచ్చుచున్నది. పరస్పర వ్యతిరేకగమనశీలములుగల యిట్టిగణములు రెండు గలవని ప్రత్యేకఖగోళపరిశీలనలచేత నిర్ధారణచేసిన కాప్టీన్‌పరిశోధకుని వాక్యములు గమనింపదగియున్నవి.

Says Professor J. C. Kapteyn. [Dutch Astronomer of Gottingen University]:—

**'A great part of the visible universe is occupied by two vast streams of stars**

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

travelling in opposite dire.ti.ns. In both these great streams the indivi lual b:dies are found besides, to be alike i1 d sign, alike in chemic l co nbination, and alike in the stage o' their developmeat". Q oted by Cee:il M. Do'mage in his bo.k "Astr no ny of to-d y. Page 285 onwards An.t.er important quotation by Svante Arrhenius in his book. "Th: Dest nies of stars, page 60 :—

'Stars rushing fort 1 in the sky be'ong to two groups — one comi g from the Orion Constel a'ion ; and the other t nearly a right angle - 100° from scorpio." This is one of th: most r ma kable as'ronom'c l discoveries of th s: days by Prof. Kapte n.

ఈ ముఖ్యాంశమునకు మరియొక ప్రమాణము ఇచ్చుట అవసరమని యెంచి వ్రాయుచున్నాను.

Harmsworth. Popular Science. The Universe, Vol I. Page 261 :-

"Just within recent ye rs, th twentieth Century has s.cceeded in obtaining evidence of action in t e ky...so-called fixed s ars are all in motion h re m tion is orderly. It aries in direction in each case, but on the whole, its motion, so far as the stars we can observe are concer.ed is mai.ly in two o posite directions. J. C. Kapteyn of Gottingen, and A. S. Eddington of Greenwich h v. demonstrated the existence of these two streams. They are not two universes, but two halves or parts of the Universe."

బాబిలోనియాదేశస్థులు ప్రాచీనకాలములో నక్షత్రములనుగూర్చి చాలా పరిశోధనలుచేసినారు. క్రీస్తుపూర్వము రెండువందల సంవత్సరముల క్రితమువాడైన కిదిన్ను (Kidinnu) అను బాబిలోనియన్ సిద్ధాంతి ఆనాటి నక్షత్రములయొక్క స్థానములను సరిగాచూపుటకు పట్టికలు తయారుచేసినాడు. నక్షత్రములనుగూర్చి అతనిభావన యేమనగా:—ఈ నక్షత్రములనునవే దేవతలు. భూమిరచనమునకంటె వానిరచనము బహుపరిశుద్ధమై మంచిపనితనముగలిగి యొప్పుచుండును." ఇట్లు బహుయుగములలో బహుదేశములందలి బుద్ధిమంతులకు నక్షత్రములనుగూర్చి గలిగినయభిప్రాయములను గమనించితిమి. వేద, శాస్త్ర, పురాణకర్తలైన మన ఋషిసత్తముల భావములు నవీనపరిశోధనలచే నెట్లు స్థిరపడినవో చూతము.

దేవతలును, రాక్షసులును, కశ్యపుడు పులస్త్యుడు మొదలగు ఋషుల సంతతులలోనివారే. ఐనను వారు పరస్పరభిన్నములును, వ్యతిరేకములునునైన మార్గముల ననుసరించు విద్వేషులు. Kapteyn పండితుని పరిశోధనలవలన తేలినముఖ్యాంశము లేమనగా

(Scorpio) అనగా వృశ్చికరాశి జ్యేష్ఠవృశ్చికరాశిలోనిది. జ్యేష్ఠనక్షత్రమునకు అధిదేవత (Presiding deity) ఇంద్రుడు. "జ్యేష్ఠానక్షత్రమింద్రో దేవత" అని శ్రుతి. ఇంద్రుని ప్రాంతములనుండి వెడలు చుక్కల గుంపు ఒకటి. ఇంద్రునిప్రక్కను మిగుల ఉత్తరమున విష్ణువున్నాడు. వృత్రుని సంహరించుటకు ఉద్యుక్తుడైన ఇంద్రుడు, వేవేగ పెద్ద అడుగులు వేయుచు తనతోకూడ రమ్మని విష్ణుని పిల్చు ఋక్కులు కొన్ని చూడనగును.

...అథాబ్రవీద్వృత్రమింద్రో హనిష్యన్
సఖే విష్ణో వితరం విక్రమస్వ.—IV. ౧౮. ౧౧

ఇట్లే VI. ౬౯. ౮; VII. ౯౯. ౫, ౬. I. ౧౫౫-౬ లోనను ఋక్కులలో విష్ణువు ఇంద్రునకు తోడై వృత్రుని చంపించినట్లు కలదు. ఇంద్ర, విష్ణువుల స్థానము వృశ్చికరాశిసమీపమున నుండుట గమనించదగియున్నది. వీరు దేవతలలో ముఖ్యులు. ఈప్రాంతములనుండి వీరితో కదలి వీరితో ముందునకు సాగిపోవు చుక్కల గుంపు ఒకటి. వీరిమార్గమునే అనుసరించి పోవు నక్షత్రములు దేవవర్గములోని వగును. J. C. Kapteyn పండితుడు Scorpio అనగా వృశ్చికరాశి సమీపమునుండి వెడలు చుక్కలగుంపు అని చెప్పిన దీదేవతల చుక్కలే అని నామనవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

Kapteyn పండితుడు చెప్పిన రెండవచుక్కల సంపు Orion నుండి మొదటిసంపునకు ఎదురుగా పోవుచున్నది. Orion అనగా వృత్రుడను రాక్షసుడనియు, మార్గామృగము, మృగశిరస్సు కలవాడు అని వేదమున వర్ణింపబడినవాడు వీడేఅనియు లోకమాన్య బాలగంగాధర తిలకుగారు చెప్పినది సరియైనదే. ఇంద్రాదిదేవవిద్వేషులలో వృత్రుడగ్రగణ్యుడు. వీనివెంట కావలసినంత రాక్షసబలగము గలదు. ఈదేవదానవుల పోరు ఆయా నక్షత్రములు పరస్పరము అవలంబించుచు అనుసరించుచు పోవు వ్యతిరేక గమనమార్గములచేతగూడ రూఢమగుచున్నది. J. C. Kapteyn, Eddington పండితుల పరిశోధనలచే నిర్ధారణకాబడిన రెండుచుక్కల సంపుల వ్యతిరేకగమనమార్గవిశేషముల మూలముగా, పురాణకథితమైన దేవదానవవిద్వేషసరణి భౌతికశాస్త్ర (Physical Science) దృష్టిలో యథార్థమని నిరూపితమగుచున్నది. ఇంద్రవృత్రులు, ఉదయాస్తమయ సందర్భములలో Diametrically Opposite సరిగా




పాలసముద్రము

ఎదురు నుండుటయేకాక, వారి వారి స్వకీయగమనముల (Proper motion of these stars)లో గూడ ఒకరికొకరు ఎదురుగా పోవుట గమనింపదగిన విశేషము.

## దేవదానవులు పాలసముద్రమును మథించుట

మృగవ్యాధరుద్రుడగపడుచోట ఆకాశమును, అచట ధవళమైతోచు క్షీరవాహినిని గమనించువారికి, అచట నొకవిశేషము గోచరింపగలదు. అదేమనగా, అచటి క్షీరవాహినికి ఒక ప్రక్క వృత్రుడు (Orion) ను, రెండవప్రక్క పుష్యమినక్షత్రమును కనబడగలవు. ఆమధ్య, క్షీరవాహినిలోనే, ఈ ప్రక్కపటములో చూపబడిన చుక్కలగపడును. కొంచెము తేటతక్కువ చుక్కలలో, తెల్లనిపాలసముద్రముపై మందరగిరి తేలియాడుచున్నట్లును, కవ్వమువంటి ఆకారమును చుట్టుకొని పామున్నట్లును స్ఫురింపగలదు. వాసుకి యనుసర్పముయొక్క పడగ అనిచెప్పదగిన చుక్కలును, మధ్యచుక్కలును మంచికాంతిగలిగి కనబడును. తోకభాగమునందలి చుక్కలు అంతకాంతివంతములు కావు. కాని అవిగూడ స్పష్టముగా కనబడుచునేయుండును. ఫణము వృత్రుని వంకను, తోక పుష్యమివంకను పెట్టుకొని వాసుకి మందరమును చుట్టియుండుట గమనింపవలయును. వాసుకి శిరమును రాక్షసులును, తోక దేవతలును పట్టుకొని మథించిరని పురాణములు తెల్పుచున్నవి. ఆకాశమున గూడ ఆవిధముననే కనబడుచున్నది.

పుష్యమినక్షత్రమునకు అధిదేవత బృహస్పతి యని శ్రుతిప్రమాణము. బృహస్పతి దేవగురుడు. ఆచార్యునివెనుక సర్పాధిదేవతతో ఆశ్రేషయు, పితరు లధిదేవతలుగా మఘానక్షత్రమును, అర్యభగు లధిదేవతలుగా ఫల్గునీ నక్షత్రములును, సవితృ దధిదేవతగా హస్తయు, త్వష్ట్ర, వాయు, ఇంద్రాగ్నులు, మిత్రుడు, ఇంద్రుడు లనెడు దేవత లధిదేవతలుగానున్న చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠాదినక్షత్రములును వరుసగా గలవు. ఇదంతయు దేవతల బలగము. వృత్రుని తోపాటు ఘోరశింశుమారము (Cetus) తో చేరిన రాక్షసబలగమున్నది. ఈదేవదానవులుకలిసి పాలసముద్రమును మందరగిరిచుట్టు వాసుకినికట్టి మథించగా మథించగా తొలుతపుట్టినదే హాలాహలాగ్ని.

విశ్వభీకరమైన ఆహాలాహలాగ్నిని వశపర్చుకొని అదిమిపట్టుకొని నేరేడుపండువలె మ్రింగి కంఠమున నిలుపుకొన్న రుద్రుడు (మృగవ్యాధు డాప్రక్కనే కలడు. అతడే Sirius నక్షత్రము. ఆనక్షత్రమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీడిపోనేరక వశవర్తినై అతనియందనంటి తిరుగు నీల గోళమే ఈహాలాహలము. దాని దారుణస్వభావ మెట్టిదో ఆచుక్కలజతనుగూర్చి పైని వ్రాసినఅంశములవలనకొంత తెలియుచున్నది. అది మిక్కిలివేడిదియైన గోళము. అట్లయ్యును అందొకఘనఅంగుళముఒకటన్ను బరువు తూగునని శాస్త్రజ్ఞులు గుణించి తేల్చినారు. టన్ను అనగా ౨౭ మణుగుల రెండువీశెల రెండుపౌనులబరువు. మన భూమిమీదకంటె అచట గరిమ రెండువేలరేట్లు అధికము. ఇట్టి యతిదారుణస్వభావముగల యా ఘోరపుటగ్నిని ఈశ్వరుడు నేరెడుపండువలె దిగమ్రింగి కంఠమున నిలిపియుంచుకొని నీలకంఠుడయ్యెనని మనపురాణకర్తలు వర్ణించిన అంశములు శాస్త్రీయసత్యములు (Scientific truths) గాని వెట్టికవుల పిచ్చిమాతలుకావని Bessel గణకుని ఊహలవలనను, Alvan Clark and Sons వారు టెలెస్కోపులో ప్రత్యక్షముగా చూచి కనుగొనుట వలనను, ఆపిమ్మట శాస్త్రజ్ఞానువుల పరిశోధనలవలనను ఋజువై నిర్ధారణ కాబడినది. సామాన్యస్థూల దృష్టికి సాధ్యముకాని యీ ఖగోళరహస్యములను మన పూర్వఋషులు ఏవిధమున గ్రహింపగలిగిరో మనకు తెలియరాకున్నది. ఎట్లయిననేమి, వార లిట్టిమర్మములు గ్రహించిరి. గ్రహించుటయేకాదు, జనసామాన్యమునకు సులభముగా బోధపడునట్లు, ఆప్రకృతిసత్యములనే ఆధారముగా చేసుకొని రమ్యకథాజాలమును కల్పించి అమహనీయులు పురాణాదులు రచించిరనుట కీ పాలసముద్రమథనము, హాలాహలాగ్ని యుత్పత్తి, ఈశ్వరుడు దానిని భక్షించి నీలకంఠుడగుటయు ననుకథలు ప్రబల తార్కాణములు. రుద్రుడు లయకారకుడని యార్యులు చెప్పినదియును సత్యమే. మనసూర్యకుటుంబమును, భూమిని వెంటనంటి యీరుద్రుడు వచ్చుచుండుట సత్యము (Physical truth). కొన్నిలక్షలసంవత్సరములనాటికి, అతనివశమున నదిమిపట్టబడిన యానీల గోళము మనభూమిని డీకొనిదానికి విలయముదెచ్చుటయు, అదే ప్రళయమగుటయును గమనించుకోవలెను. రుద్రుడు ప్రళయకారుడని మనవారుచెప్పిన తత్త్వవిషయమునకు భౌతికార్థ (Physical Sense) మిదియేను. పాలసముద్రమథనపుకథలోని కొదువసంగతులు వేరొకప్పుడు చర్చింతము.

---

## అంచకూన

బొడ్డు బాపిరాజు

నిన్ను నీ వెఱుంగకున్నావు నిక్కమ్ము
చిన్నియంచకూన! చెలువమొలుకు
నీపదమ్ము లంటి నృత్యేందిర విలాస
ధన్య యయ్యె! రసికమాన్య యయ్యె!!

చదల నల్లనల్ల సాగెడి తెలిమబ్బు
వోలె, కొలకునీట దేలియాడు
తెల్లదమ్మివోలె, నల్లమ్మ గదలించి
కదలు నీదునడక కన్నువిడక.

మీకొలమ్మువారు మాకు కవీంద్రుల
కెల్లయెడల వినుతికెక్కువారు
తల్లివాణి మనము గొల్లగొన్న చెలిమి
వార లదియుగాక వారునములు.

జగముచూపు గొన్న సొగసులముద్ద! ని
న్ననుగమింపలేడు ఘను డతండు
సరసులందు బ్రదుకు జారి పల్చన యగు
గాక; నీకు కొదువ గదియ దెపుడు!

సరసవచనరచన జాలువారగ రాయు
బార మొందు నడిపి పరమకరుణ
నలు నొకింటివాని సలిపిరి మీవారు
పరహితార్థపరులు మఱపురారు!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# "స్వాతంత్ర్యము, అంటే యేమిటి?"

కర్లపాలెం కృష్ణరావుగారు

ఉత్పన్నమాట అంటే యెవరికైనా ఉలుకు. ఇది సర్వజనసామాన్యము. అలాఅని మనవిషయాలు మనము చెప్పుకోకుండావుంటామా? తప్పైనా, ఒప్పైనా, మనలో మనము తర్కించుకొని, అవసరమైనమార్పులు చేసుకొంటూవుండాలి. అందలి కష్టనష్టాలకు మనమే బాధ్యులము.

ఇది తిరుగుబాటుయుగము. ఎక్కడ జూచినా ధిక్కారము తాండవమాడుతూవుంది. దాస్యశృంఖలలు త్రెంచి, స్వేచ్ఛాగానము చేయడానికి, అందరుముందంజ వేస్తున్నారు. స్వరాజ్యసంపాదనకు త్యాగమూర్తులెందరో, నడుములు గట్టి ప్రయత్నము చేస్తున్నారు. ఇందుకు మనం గర్వపడవలసిందే, ఈశుభోదయసమయాన్ని తిలకించి, ఆనందించాలిసిందే; కాని, స్వరాజ్యమంటే యేమిటో మన మెంతవరకు స్వేచ్ఛగా విహరించవచ్చునో తెలుసుకోకుండా మనలో చాలా మంది ప్రవర్తిస్తున్నారు. ఈవిధంగా తప్పుదారి తొక్కుతున్నవాళ్లు ముఖ్యంగా, నేటికాలపు విద్యార్థులలోను, లోకానుభవములేని యువకులలోను పలువురున్నారని నానమ్మకము, స్వేచ్ఛ అంటే తిరస్కరించడ మనే వీరిభావమేమో? చిన్నా పెద్ద అనే యోచన, మంచీ చెడ్డ అనే వివేకము అంతరించినవి. ఏవరికివారు నాకంటె గొప్పవారు లేరనుకొంటు న్నారు. తండ్రి కొడుకును "నాయనా! ఆపని చేయవద్దురా" అంటే "నాయిష్టం పో"మ్మంటాడు. గురువును శిష్యుడు "నీవెంత అంటే, నీవెంత అం"టున్నాడు. ఎవరైనా మిత్రులు, గురువు నలా అనవొచ్చా అంటే "నీమొహం నీ కేందెలుసు పో" అంటాడు. పూజ్యుడును, గౌరవనీయుడును అయిన యేపెద్ద మనుష్యుడైనా కూర్చొనివుంటే పడుచుదనపు తిమ్మిరితో, యువకుడు రొమ్ము విరుచుకొంటూ నోట్లో సిగరెట్టు పెట్టుకొని వచ్చి, ఆయనప్రక్కన జేరి పొగ మీదికి బోయ్యేటట్లు వదులుతాడు. ఏమిటలా సంచరిస్తావు అని అంటే, Dam it! why should I care for him? అంటాడు. చాకలివాణ్ణి "గుడ్డలు యెన్నాళ్లు వుంచుకొంటావురా?" అంటే "తెస్తాము లేవయ్యా, మహాదబాయిస్తావు" అని అంటాడు. ఇలా అయిపోయింది ప్రస్తుతపుస్థితి. భర్తను భార్య, తండ్రిని కొడుకు, పెద్దను పిన్న, యజమానుని నౌకరు ధిక్కరించడమే స్వేచ్ఛ అనుకొంటే మనసంఘ మెప్పుడో పడిపోయివుండేది. మనమత మెప్పుడో నశించివుండేది. వినయవిధేయతలు, భక్తిశ్రద్ధలు మనవాళ్లలో ప్రస్తుతం చాలాభాగం లేవనేచెప్పవచ్చు. ఎవరికివారు తమంత వారు లే రనుకొంటూ వుండుటవల్ల, ఒండొరులకు అసూయ యేర్పడి ద్వేషయుతమైన విరోధాలు, పార్టీలు యేర్పడుతున్నాయి. ఒకరిమాట ఒకరికి గిట్టక పోయినందున సంఘబలము పోతున్నది.

ప్రతివిషయంలోను మితముగా వుండాలి. మన వాండ్లకు యేదిపడితే అదే వేలంవెర్రి. ఆరంభంలో వుండే ఉత్సాహము, చురుకుదనము అంత్యంవరకు వుండదు. అందుకనే "ఆంధ్రులు ఆరంభశూరులు" అన్నాడు ఒకాయన. ఏవిషయములో మనం స్వేచ్ఛగా సంచరించాలనో, యెంతవరకు స్వతంత్రులముగా వుండాలనో గ్రహించలేకపోతే మనకు మనమే అపకారము చేసుకొన్నవారమవుతాము. స్వేచ్ఛ, గర్వము, ఈరెండు ప్రతిమానవుడికి అవసరమేకాని, అవి మితముగా నుండాలి. ఇతరులకు అపకారము చేయకుండునట్టివిగా నుండాలి. ఐకమత్యము, సంఘబలము లేకపోతే మన మేపనీ చేయలేము. స్వరాజ్యమొచ్చినా, సంఘముకట్టుబాట్లు, ఆచారవ్యవహారాలు వుండి తీరవలసిందే. రాజుకు సేవకుడికి, పిన్నకూ పెద్దకు తారతమ్యము యెప్పుడూ వుంటుంది. మనవాళ్లకు ఈ తిరస్కారమనే స్వాతంత్ర్యం పట్టుబడుటమూలాన, క్రమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రమంగా, మానవసహజమగు ప్రేమ, మానవత్వము ఈ రెంటికి ప్రథమసోపానమైన జాలి మనలోనుంచి జారిపోతున్నది. ఈరెంటివలననే మనహిందూమతమున కింతప్రఖ్యాతి వచ్చింది. ఇవి లేకపోతే మనమతమే లేదు. ఇన్నీ, పోగొట్టుకొన్నతర్వాత మనకు ఏవిధమైన స్వాతంత్ర్యము కావాలో బోధపడుట లేదు. స్వా[illegible]శనమైనవెనుక స్వరాజ్య మెందుకు? క్రొత్తహక్కులను సంపాదించుటకు ప్రయత్నిస్తూ, ఆసంతోషములో పూర్వము ఉన్నట్టివాటినే పోగొట్టుకొంటున్నాము. మనము సంపాదింపబోవునాటిలో యెన్ని మంచిచెడ్డలున్నవో తెలుసుకోకుండా, ముందంజవేసి "రెంటికి జెడిన రేవడల" మగుచున్నాము. "చూచిరమ్మంటే కాల్చివచ్చినట్లు" మన నాయకులు ఒకటి చెబితే మనము రెండు చేసి, అతిగా ప్రవర్తించడంవల్ల త్వరలో విరక్తి పుట్టి, వెంటనే వెనుకకు మరలుతున్నాము. ఇలాంటి లోపాలు మనలో అనేకమున్నవి. రాజకీయంగాగాని, సారస్వతంలోగాని, సాంఘికంగాగాని, అన్నివిషయాలలోను ఇంతే. ఇవన్నీ నిత్యము చూస్తున్నాము గాని, జాగ్రత్తగా గమనించడం లేదు. ఈ అతివల్లనే మన మింతటి అధోగతికి వచ్చాము. నేటి నిరుద్యోగ సమస్యకుకూడా ఇదేకారణం. ధిక్కారము, ద్వేషము, అసూయ, వదలిపెట్టి, మధురంగాను, మనోహరంగాను వుండి, మహదానంద మిచ్చే ప్రేమలో మిళితమైయున్న స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి ప్రయత్నించాలి. ప్రేమతత్త్వము చక్కగా అర్థంజేసుకొంటే, అన్నిచిక్కులూ తీరిపోతవి. ప్రేమ అంటే రాగము గాదు. రాగంలో స్వార్థపరత్వం వున్నది. పవిత్రమైన ప్రేమలో రాగం నశించిపోతుంది. ప్రేమలో దాస్యం లేదు. కృతజ్ఞత, గౌరవము, వినయము, విశ్వాసము, వీటినన్నిటిని మించిన ఒక విశాలమైనభావం వుంది. దాస్యమంటే, అధముడికి ఊడిగం చేయడము. పరులు మనమీద పెత్తనము చేయకుండా, మనమీద సవారీ చేయకుండా, వుండేస్వాతంత్ర్యము, యితరులకు మన తనువులు అమ్ముకోకుండా వుండే స్వేచ్ఛాయుతమగు జీవితము, మనకు కావలసింది. ఈ సూత్రము గ్రహిస్తే మనలోపాలన్నీ సర్దుబాటవుతయి.

మనలో గలిగిన యీవిచిత్రమైన మార్పులోగల కష్టసుఖాలు ఆలోచించుకొని యెవరికివారు వీలైనంత మటుకు క్రమక్రమంగా మంచిపద్ధతికి వస్తే శ్రేయస్కరము.

---

## ఆ పే క్ష

చావలి బంగారమ్మ

ఆపేక్షగలఅన్న అర్ధచంద్రుండైతె
అది వదినెకిత్తునా అణచి ముక్కున బెడుదు
అమ్మరో విన్నావటే
ఈమాట
అన్నతో అన్నావటే?

పులకరించినమేన పలకరించనితాను
పట్టి లాగుచు బాధపెట్టునేమో నన్ను
అమ్మరో విన్నావటే
ఈమాట
అన్నతో అన్నావటే?

నాసిగలో పువ్వల్లె నలినాక్షిపెదవదినె
నలిగిపోయి నన్ను తొలగిచూచునోయేమొ
అమ్మరో విన్నావటే
ఈమాట
అన్నతో అన్నావటే?

చుక్కంటిమావదినె చక్కన్నిచూపులో
చిక్కబట్టిందంటె టక్కరైపోతాడె
అమ్మరో విన్నావటే
ఈమాట
అన్నతో అన్నావటే?

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# లేపాక్షి గ్రామపునర్నిర్మాణ కేంద్రము

వార్తకవి రామచంద్రరావు

[౧౯౩౫-౬ సంవత్సరమున ఆరంభింపబడిన కేంద్రములం దిది యొక్కటి. కడచిన నాలుగేండ్లలో జరిగిన కార్యక్రమము ఇందు సూచింపబడియున్నది. అనుబంధమున కొన్నివివరములు చెల్పబడినవి.]

## ౧

## ప్రాంతవైలక్షణ్యము

లేపాక్షి హిందూపురమునకు తూర్పున ఎనిమిది మయిళ్లదూరమున నున్న గ్రామము. కేంద్రమునకు చేరిన తక్కిన ఆరుగ్రామములు లేపాక్షికి పశ్చిమోత్తరదక్షిణముల నాలుగయిదుమయిళ్ల దూరమున నున్నవి. లేపాక్షియే కేంద్రమునకు తూర్పుహద్దు.




౧. లేపాక్షి పంచాయతి బోరింగు

### ఆర్థికస్థితి

వ్యవసాయమే ప్రధానజీవనోపాధి. అందందు కొంత కంబడినూలుల నేతపని జరుగుచున్నదిగాని, అవి వ్యవసాయమునకు సహాయముగ అవలంబింపబడు చున్న వృత్తులు.

వ్యవసాయము వర్షముపయి నాధార పడినది. వర్షపాతముగూడ గడుచంచలము. నాయనుభవమున, ఈ నాలుగయిదేడులలో చెరువులు నిండలేదు. ఒక ఏడాదిమాత్రము సగము, ముప్పాతికవరకు నీళ్లు వచ్చినవి. కుష్కిపంటలు సమృద్ధిగ ఫలించినది. కడచిన ఏడాది ఒక్కసారిమాత్రమే. ఆప్రాంతప్రజనుల వాడు కనుబట్టి, సుమారు ౧౪, ౧౫ సంవత్సరములుగా చెరువులు నిండనేలేదు.




౨. లేపాక్షి నేతబడి

భూమి, ఊరిహద్దులనుండి పొలిమేరవరకు అంతయు పట్టాల కియ్యబడిన జమీనే. సర్కారు బంజర్లు తక్కువ. కుష్కిభూమిరేటు రూ. ౦-౨-౦ నుండి ఒకరూపాయివరకుగలదు. రెండవరకము స్వల్పము. కొన్నిగ్రామములందు బావులు జలాభావములయి ఎండిపోయినవి. వరి, రాగి ధాన్యపు పంటలు. బెల్లము, వేరుసెనగ దుడ్డుకు సంబంధించిన పంటలు. పయిసందర్భములందు అప్పు పెచ్చుపెరుగుట తప్పనివిధి. అప్పు పెరుగుటవలన భూములు సాహుకార్ల స్వాధీనమయినవి. కోరుదార్ల సంఖ్య హెచ్చినది. ఊర్లు విడచి పట్టణ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములకు పొట్టబోసికొన వెళ్లుట సంభవించినది. పంటలు ఏ యేట ఫలించునని నమ్మకము లేదు.



౪. లేపాక్షి సెంట్రలు స్కూలు

## ప్రధాన లక్షణములు

పేదరికము, అప్పుబరువు ఇవియే. భూమి బీడ. పంటలు స్వల్పము. నీటి వసతి తక్కువ. కనుక ఉత్సాహము, ఆసక్తి అదృశ్యము లయినవి. పేదరికము వలనను, అప్పు బరువువల్లను, నిరాశ, నీరసము నెలకొన్నవి. తోడుగ నేటి పంటల తక్కువనర ఉన్న ఆశను అడుగంటించినది. అంతియకాక ఆయా గ్రామసందర్భములబట్టి కార్యకలాప సాఫల్యము భిన్నభిన్నముగ నుండు ననుటే గమనింపదగిన విషయము.

## ౨

## కార్యనిర్ణయము-సాధన-పరిణామము

మదరాసు ప్రావిన్షియల్ కోఆపరేటివ్ యూనియన్ వర్గము గ్రామపునర్నిర్మాణకేంద్రము లవలంబింపవలసిన కార్యకలాపప్రణాళికను నిర్ణయించి, ప్రాంత సందర్భములబట్టి సముచితములయిన మార్పులతో అనుసరింపవలెనని సూచించినారు. సాధ్యమయినంతవరకు ఆసూచనల ననుసరించియే కార్యకలాపము నిర్ణయింపబడినది. ప్రణాళిక ఏదిఅయిననేమి, అన్నిటి సాఫల్యమునకును ఆర్థికజీవనసౌష్ఠవము మూలము. అయ్యది దుస్సాధ్యమయినచో తక్కిన కార్యకలాపము ఆత్మ



౬. ఆయుర్వేదవైద్యాలయము, లేపాక్షి



౫. లేపాక్షి హరిజనపాఠశాల

లేని శరీరమువలె నిరర్థకము. ఒక నిదర్శనము: శుచి—ఇండ్లు వాకిండ్లు వీథులు శుచిగ నుంచుకొనుట ఆవశ్యకమని ఎన్ని మ్యాజిక్ లాంతరు ఉపన్యాసము లిచ్చినా, ఆపూట బత్తెములేక ఆకలిమంట కల్గాడు నిరుపేద చేయగల దెయ్యది ? గ్రామవీథుల నిర్మాణము, వీథి దీపములు, విద్యాభ్యాసము మున్నగునవెల్ల జీవనసౌభాగ్యముపయి నాధారపడినవే. కనుక ఆర్థికజీవనసౌఖ్యము ప్రథమ కర్తవ్యముగ పరిగణింపబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౯. చోళవరము పంచాయతీ వైద్యనిలయము

## అర్థోత్పత్తి సాధనములందు ప్రధానమయినది వ్యవసాయము

తదభివృద్ధికి పొలము, నీటివసతి, వ్యవసాయ కళాసౌష్ఠవము ప్రధానములు. అన్నిటికన్న ముఖ్యమయినది అర్థోత్పత్తియందు ఆసక్తి, ఉత్సాహము. ఆసక్తి జనించుటకు ఉత్పత్తిచేసిన అర్థము అన్యులపాలుగాకుండ తనకే చెందగలదను విశ్వాసము గలుగుట అవశ్యము. లేకున్న "ఎంతకష్టపడినను ఏమిఫలము? ఇతరులకొరకేల వృథాకష్టము లనుభవించుట" అనెడి మనస్తత్వము జనించుట సత్యము. 'ఇప్పుడు' ఆవిశ్వాసము అదృశ్యమగుచున్నది;—కాదు—అదృశ్యమయినది. కారణము: అప్పులబరువు. పండిన పంటనంతయు అప్పులకిచ్చుటనుగుటవ్రాతగాగల కర్షకులకు అర్థోత్పత్తియం దుత్సాహము కలుగుట అస్వాభావికము. అంతియకాక అంతో యింతో సొంతముపొలముగల రయితులు ఉన్న జేనెడుపొలమును అప్పులకిచ్చి కోరుదారులుగ పరిణమించుట వ్యవసాయకళకు వేరుపురుగు. రానున్న ఏడాది తనచేయి జారిపోక నిలువగలదనెడి నమ్మకములేని కోరుదారుని కెంతశ్రద్ధయుండగలదు? పట్టణములం దుద్యోగముల బడసి వ్యాపారముసల్పు భూస్వాములసంఖ్య హెచ్చుగుట వ్యవసాయమునకు కారణము. అనిష్ట వారి మనసున మోజులమొలపించునది ఎక్కువ కోరుగుత్తలె. కనుక ఎక్కువనిచ్చుటకు ఒప్పుకొన్న కోరుదారునిదే పొలము. సొంతపొలముగల రయితుల సంఖ్య సన్నగిల్లుటవలన, కోరుదారు లెక్కువయి, పోటీ హెచ్చుపెరిగినది. పోటీవలన ఎక్కువకోరు లియ్యక తప్పదు. ఏవిధముగ లెక్కించినను గిట్టనియంత హెచ్చుకోరిచ్చి, పొలము సాగుట కియ్యకొనకయున్న అతనికి బ్రదుకుతెరువు లేదు. కనుక "వచ్చినంతరానీ లేకున్న అదియు లేదే." "పట్టైకుహాడు గడించుటకు తెరువు వేరెయ్యది" అని ఎంతటికయినను తెగబడి ఎడతెగని నష్టానికి గురియగుట తప్పనిసరి.



౧౦. పాలు పెరుగుల అమ్మకము, చోళసముద్రము

## అప్పుబరువు; భూస్వామ్య విధానవైపరీత్యము

ఇవి రెండు ఉత్సాహమును అడుగంటజేయుచున్న అరిష్టములు. అరిష్టములను తగ్గించి, అర్థోత్పత్తియం దాసక్తిగలిగించుట మొదటిపని. అందులకు అర్థోత్పత్తిని హెచ్చించుట ఒక సాధనము. ఋణముల పరిష్కారము ఒకసాధనము. భూస్వామ్య విధాన సంస్కరణము ఒకసాధనము.



౧౧. బిసలుమానేపల్లి భజననిధి, ధాన్యనిధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అర్థోత్పత్తి హెచ్చుదల

వ్యవసాయమునకు నీటివసతి జీవగఱ్ఱ. కనుక తదభివృద్ధి ప్రథమకర్తవ్యము.



౧౨. బిసలుమానేపల్లి పంచాయతీస్కూలు

### ౧. నీటి వసతి

(ఎ)

౧. చెరువులకు వచ్చు వంకలు, వాగులు మున్నగు ఆధారముల బరిశీలించి, నదుల కాల్వలు నిర్మింప నను కూలమున్నచోట వానివిషయమయి ప్రభుత్వమువారికి దెలిపి సక్రమాందోళన సాగించుట అవశ్యము. అట్లు ఆందోళన ఆరంభింపబడిన కాల్వ, మానేపల్లి, శిరివరము చోళసముద్రం గ్రామముల చెరువులకు మున్నెన్నడో నిర్మింపబడి, నేను స్మృతిలోకమును దాటి పడియున్న ప్రతాప బుక్కరాయమండల కాల్వ.

౧౯౩౮ లో త్రవ్వబడిన పెన్న కాలువసర్వేలు పరిశోధించి, ప్లాను సిద్ధము చేసి, మదరాసు గవర్నరుగారితో సంప్రదించడమయినది. పయికాలువ విషయమున ప్రభుత్వమువారితో సక్రమమయిన ఆందోళన సల్పబడుచున్నది.

౨. మైసూరువారు, హిందూపురం తాలూకా చెర్వులకు వచ్చు నీటిని అరికట్టు విషయము ఆందోళన సాగించి, మదరాసు ఛీఫ్ ఇంజనీయరుగారి వెంబడి ఆప్రాంతములందు కొందరు రయితుప్రముఖులతోపాటు సంచరించి, మైసూరివారి చర్యను నిరోధింప గవర్నరుగారితో గూడ సంప్రదించడమయినది. మదరాసు మైసూరు ప్రభుత్వములవారు సెప్టంబరు నెలలో తదాందోళన ఫలముగా సమావేశమయి ఒడంబడిక కుదర్చినా రని తెలిసినది. మరియు జయమంగలికి అడ్డముగట్టబడిన ఆన కట్టఎత్తు మైసూరువారు తగ్గించవలసినదని సెంట్రల్ గవర్నమెంటువారు కోరినటుల సమాచారము తెలిసినది.

౩. పెన్నారు - కుముద్వతీప్రాజెక్టుల విషయమయికూడ ఆందోళన సాగింపబడుచున్నది. తాలూకా రయితుల సభల జరిపి, తాలూకాచెరువుల జలాధారముల అభివృద్ధికయి కృషి సల్పబడినది. ౧౯౩౮ లో ఆప్రాజెక్టు ఆరంభింపబడు నని తెలిసినది.

౩౦ ఏండ్లనుండి ఆందోళన సాగింపబడుచున్న తుంగభద్రా ప్రాజెక్టు కార్యరూపమున ఫలింపనిచో, మూడేండ్లు నిండీనిండని ఈ ఆందోళనఅంతయు కార్య రూపమును దాల్పమి ఒక ఆశ్చర్యముగాదు.



౧౩. కల్లూరు ధాన్యనిధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## (బి)

(బి) చెరువులకు తరువాతివి బావులు. కల్లూరుతప్ప తక్కిన గ్రామములయందు బావులు జలశూన్యములయినవి. కనుక బోరింగువల్ల కొంత ప్రయోజనముండ వచ్చునని లేపాక్షియందు ప్రయత్నించితిమి. తొలుదొల్త మంచినీటిబావి పంచాయితీవారు ఆరంభించిరి. ౧౦౦ అడుగులలోతు త్రవ్వబడినది. ౬౩ అడుగుల నుండి గట్టిరాయి అడ్డుతగిలినది. మరియు ఆ బావివిషయమున డిపార్టుమెంటువారినుండి జరిగిన ఆలస్యము బోరింగునందుగల స్వల్ప విశ్వాసమును రయితుల మనసునుండి వెడలనడచినందున, వ్యవసాయమునిమిత్తము ముద్దేశింపబడిన బావులలో బోరింగు వేయించుటకు సమ్మతించిన రయితులు ఇద్దరు మనసుమార్చుకొనుట సంభవించినది. కాని యింటివాడుకకు ఒక బోరింగుబావిని పంచాయితీబోరింగుబావికి తోడుగా త్రవ్వబడినది.



౧౪. కల్లూరు ఆరోగ్యవారోత్సవము

### (సి) చెరువులకు వచ్చు నీరు వృథాగాకుండ వినియోగించుట

నీరులేని ప్రాంతములందున్న రవంతనీటిని జాగ్రత్తగా వాడుకొనుట ఒకకర్తవ్యము. అందులకు ఆయాకిజనులు నీటిపారుదలహక్కు కలిగియుండుట ఒక అనుకూలము. ఆవిషయము 3 గ్రామపంచాయతులు (లేపాక్షి, మానేపల్లి, కల్లూరు) కృషిచేసి, చెరువుల నీటిపారుదలహక్కును సర్కారునుండి బడసినవి. శిరివరము పంచాయితీ బడయనున్నది. ఆ పంచాయతులు కాలువకు ఒక నీరుగంటిని ఏర్పాటుచేసి, నీరు పారుదలను క్రమపరచు ఉపసంఘములను కాలువకు ఒకదానిని నియమించినవి. ఆనీరుగంట్లు నీటిపారుదల విషయమేకాక, పొలముకావలిపని జేయుట విధి. ఎక్కడనో, ఎవరికో జవాబు చెప్పవలసిన బాధ్యతగల సర్కారునౌకర్లకన్న పంచాయతీ నీరుగంట్లవలన, పని చక్కగ నిర్వహింపబడుట అనుభవవిదితమయి, ప్రజలశ్రద్ధాభక్తుల ప్రేరేచినది. తొలుదొల్త గ్రామోద్యోగుల ప్రతిఘటనము కొంత గల్గినదిగాని, ఇప్పుడది మామూలయినది.

తెనూమ్మలమున కాలువలు చక్కనిస్థితిలోనుంచుట ఆచారమయి, నీరు దుర్వ్యయముకాక నిల్చుటయు ఒక ఫలము. నీటికి దగిన విస్తీర్ణమును సాగుచేయు అలవాటు ఏర్పడుచున్నది. ఉన్ననీరు కొంచెమయినను పొలమంతయు సాగి, ఏపంటకుచాలని స్థితిలో అందఱు నష్టపడుటకు బదులు పంచాయతీ సమావేశములందు ప్రజల సమ్మతితో, విస్తీర్ణము హద్దుపరచుటవలన అంతో యింతో పండించికొన వీలగుచున్నది.

అనుభవమున గలిగిన కొన్ని ఇక్కట్టుల తొలగించుటకు పంచాయతీలు ఉపవిధులను సర్కారువారికి పంపి, వారి అంగీకారమును బడయ ప్రయత్నించినవి.

### ౨. వ్యవసాయము

నీటివసతికి తరువాత వ్యవసాయము. వ్యవసాయవిధానమున మార్పు గలిగించుట సుకరముగాదు. అందులకు సర్కారువ్యవసాయశాఖవారి కృషియే సాక్షి. విద్యావంతులు వ్యవసాయమునకు దొరకొనరు. రయితులు మొదటిపట్టు మానరు. కాని పెక్కు ప్రదర్శనములు సల్పి, వ్యవసాయవిజ్ఞానము సనిదర్శనముగ బోధింపబడినవి.

#### (a) సాధనములు

౧. ఇనుపమడక: కేంద్రములోని ఏడుగ్రామములందును ఇనుపమడక - దున్నకము ప్రదర్శింపబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రయితులు గ్రహించిన మేళ్లు (౧) ఇనుపమడక వలన మాపూలు చెక్కమడకకన్న త్వరలో దున్నవచ్చు ననుట. చెక్కమడకతో ౬ సార్లు దున్నుటకన్న ఇనుపమడకతో 3 సార్లు దున్నిన చాలును. (౨) కలుపు లేక గడ్డి వేర్లతోగూడ నశించుట (3) భూమియందు తేమ ఎక్కువగ నిల్చుటవలన వాన రవంత వెనుకబడినను పైరు నశింపదు.



౧౬. కోడిపల్లెలో క్రొత్తరకపు చెఱకుగానుగ, ఇల్లు, పొయ్యి



౧౫. కల్లూరులో హరిజనులకు బావి

3. తక్కిన ప్రదర్శనములు: (a) సులువుగ దిరుగు కిర్లోస్కర్ ఇనుపచక్రము (మోట దోలుటకు) (b) మేతజొన్నను కత్తిరించు మిషను. (c) కలుపుదీయు గుంటకలు. (d) గొర్రు మున్నగునవి.

౪. కిర్లోస్కర్ చెరకు గానుగలు: తోలుదొర్తి డిపార్టుమెంటువారు తెచ్చిన పెద్ద గానుగ ప్రదర్శింపబడినది. దాని మేలు దెలిసి, లేపాక్షియందు నాలుగు, శిరివరమున రెండు వెంటనే తెప్పింపబడినవి. ఇది గడచిన ఏడాదియందు గావింపబడిన ప్రదర్శనము. ఇదియు రయితులమనసు నాకర్షించిన సాధనము.

మానేపల్లియందు ఇనుపమడకల నేర్వముచేయువారు ౯ మంది గలరు. ముందు ఒకరుగూడ లేరు. చోళసముద్రమున కొందరు ఇనుపమడకనేర్వ మారంభించినారు. లేపాక్షిలో ఒకరిద్దరె యాపద్ధతి నవలంబించినవారు. సహకారసంఘములు (కేంద్రములో గలయవి) మూన్పడకయుండిన, ఇనుపమడకల సంఖ్య కేంద్రమునందు విరివిగ పెరిగియుండెడిది. తకావీ బాకీలవసూలమున ఇవి సేకరింపబడుటే శరణ్యమయినందున, వ్యాప్తి కొంతవరకు నిరోధింపబడినది.

౨. H. M. (హెచ్. యం.) ఇనుపగుంటక: నేరుశెనగపంటను పెల్లగించి పోగుచేయుటకు ఎక్కువ యుపకారి. ఇది నాలుగుగ్రామములందు ప్రదర్శింపబడినది. రయితులమనసు నాకర్షించిన సాధనములం దిది యొకటి. ఇనుపమడకల వ్యాప్తికి గల అడ్డంకియే ఇయ్యెడను గూడ.

౫. చెరుకుపాలు గాచు పొయ్యి: "సింద్వాహి ఫర్నేస్" (Sindwahi Furnace) అను క్రొత్తరకము పొయ్యి లేపాక్షియందుతప్ప తక్కిన గ్రామములందు ప్రదర్శింపబడినది. గానుగఇంటిలో పొగ, బూడిద



౧౪. క్రొత్తగానుగ, కోడిపల్లె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండదు. పొగగొట్టము వెలుపలయుండుటవలన బెల్లమునందు కళ్మలము పడక, నిర్మలముగ నుండును. వంటచెరుకు వెచ్చము తక్కువ. ఇవి ఎక్కువ వాడుకలోనికి వచ్చుచున్నవి.



౧౫. మానేపల్లి క్రొత్తవీథి, వంతెన

## విత్తనములు-పంటలు

ప్రదర్శనములు:—(ఎ) వరి (౧) జి. ఇ. బి. ౨౪ నెంబరు. మామూలువరికన్న ఎక్కువ దినాలు నీరుకావలసియుండుట యొకటే రయితుల ఆక్షేపణ. కాని యిది వ్యాప్తిజెందుచున్న విత్తనము. కల్లూరు, లేపాక్షి, చోళసముద్రము, మానేపల్లి గ్రామములందు ప్రదర్శింపబడెను.

(బి) రాగి. టి. (౮) ఇది కేంద్రప్రాంతములందు అంత జయప్రదముగా లేదు. బెంగుళూరు హెబ్బాల్ రాగి రకము రయితుల మనసు నాకర్షించినది. చోళసముద్ర మానేపల్లిగ్రామములందు ప్రదర్శింపబడెను.

(సి) జొన్న. (డిపార్టుమెంటువారిది) లేపాక్షి, కోడిపల్లి, మానేపల్లియందు ప్రదర్శింపబడినది. మరియు లేపాక్షినుండి జొన్నవిత్తనము తాలూకాలో కొన్ని గ్రామములకు పంపబడినది.

(డి) చెరుకునాటుటయందు ట్రెంచ్ కేన్ పద్ధతి మానేపల్లియందు జయప్రదముగ ప్రదర్శింపబడెను. బెల్లము తయారు చేయక, విత్తనమే అమ్మినందున, బెల్లముయొక్క ఉత్పత్తి నిర్ణయింప లేకపోయినను విత్తనము, ఉత్పత్తి మామూలుపద్ధతి నవలంబించిన తోటలలోనికన్న నూటికి ౨౦ పాళ్లు ఎక్కువయినది,

(ఇ) కాంబోడియాప్రత్తివిత్తనములు కల్లూరు, కోడిపల్లి, మానేపల్లియందు అక్కడక్కడగా వేయబడి, రేగడభూములందు ఉత్పత్తి చేయురయితులు ప్రోత్సహింపబడుచున్నారు.

పంటధరలు తక్కువగుటవలన నూతనవిధానములం దాసక్తి సన్నగిల్లుట తటస్థించినది.

(f) పండ్లతోటలు పెంచుట ప్రోత్సహింపబడుచున్నది క్రొత్తగ పండ్లచెట్ల తోటలు కల్లూరు, మానేపల్లిగ్రామములందు పెంపుగాంచుచున్నవి.



౧౬. మానేపల్లి వీథిస్వీపర్లు

ఇవియేకాక కూరగాయలతోటలవిషయముగూడ ప్రచారము గావింపబడినది. మామూలు మిరపతోటల


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందు బెంచు బీరగాయతోటలవలెగాక, ఏడాది పొడుగునా పెంపొందింపబడి, సంసార భారమునుతగ్గించు వృత్తిగ ఏర్పడుటకునయి కృషి సల్పబడినది.



౨౦. గూళి కుర్రదూడలు, మానేపల్లి

## ఎరువు

(౧) గుంతలు దీసి, ఎరువు నిలువచేయుపద్ధతి కోడిపల్లి కట్లూరు మానేపల్లెలయందు ప్రదర్శింపబడియున్నది. దీనికన్న, ఎరువుకు మన్నువేసి కప్పు పద్ధతి సులువుగ నుండుటచే, రెండవపద్ధతి వ్యాప్తి జెందుచున్నది. మానేపల్లి, చోళసముద్రము, కోడిపల్లి, శిరివరము మున్నగు గ్రామములందు మామూలు అలవాటుగ మార్పు జెందుట శుభసూచకము.



౨౧. బాలుర నాటకప్రదర్శనము, మానేపల్లి

(౨) ఆకెరువు పెంచుట. ఇది ఆప్రాంతములకు క్రొత్త. కడచినఏడాది చోళసముద్రము మానేపల్లి గ్రామములయందు జనుము ప్రదర్శింపబడెను. ఈ ఏడాది మానేపల్లి రయితులు ౧౬ ఎకరములు జనుము ఎరువుకయి పెంచినారు. చెరువుకు నీరువచ్చు ఆశ యీయేడాది తగ్గినందున ఎరువుపైరుకూడ తగ్గినదికాని, అందలి యుపయోగము రయితు లెరుంగగల్గినారు.

(౩) సీమఎరువులు. వరిచెరుకుపైరులకు బలమునిచ్చు ఎరువు లివి. ఇయ్యాని తొలి ఏడాది ప్రదర్శింపబడినవి గాని పంటధరలు తగ్గుటవలన ఎరువులు వ్యయకారణము లయినవి.

## పశుధనాభివృద్ధి

౧. పశువుల అభివృద్ధి వ్యవసాయకళా సౌష్ఠవమునకు ప్రధానము. అందులకయి మానేపల్లి పంచాయతీ "హాలీకర" జాతిగూళికుర్రను పశువులజాతి అభివృద్ధికయి పెంచినారు. సర్కారు డిపార్టుమెంటువారు పరీక్షించి యీ యేడాది మేత ఖర్చుకు 100 రూపాయలు ప్రీమియం ఇచ్చినారు.

జిల్లాలోని పంచాయతీలలో గూళికుర్రను బెంచిన పంచాయతీ మానేపల్లి ఒక్కటే.

౨. వ్యవసాయశాఖవారి సలహాలప్రకారము ప్రజలయందు దుర్భోధముగలిగించుటకు ఆదర్శప్రాయమయిన పశువులకొట్టము పెంకులతో పంచాయతీ నిర్మించినది.

౩. గొర్రెలజాతి. కోలారుజిల్లానుండి మెరీనారకము పొట్టేలుకు దిగిన శ్రేష్ఠమయిన పొట్టేళ్లు మానేపల్లి గ్రామమునకు అచటిగొర్రెల జాతిని అభివృద్ధిపరచునిమిత్తము తెప్పింపబడినవి. ఈక్రొత్తగొర్రెలఉన్ని కడుమృదువుగా నుండును. నయమయిన కంబళ్లకు, కంబడి కోటుగుడ్డలకును ఉపయోగింపనగును. మామూలుఉన్నికన్న ఈ గొర్రెలఉన్ని సెలఒకటికి ఒకటిన్నరనుండి రెండింతలవరకు ఎక్కువ.

౪. వస్తుప్రదర్శనములు. వ్యవసాయ, సాధనాదికముల వస్తుప్రదర్శనములు కేంద్ర గ్రామములందును తాలూకారయితుసభలందును


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రదర్శింపబడి తత్కాళావిజ్ఞానవ్యాప్తికి డిపార్టుమెంటు వారి తోడ్పాటుచే చాలినంతకృషి సల్పబడినది.



౨౨. లేపాక్షి గ్రావల్ వీథి



౨౩. మానేపల్లిలో పంచాయతీపన్నును శరీరకష్టరూపముగ చెల్లించుట

౫. సహాయపరిశ్రమలు

౧. ఖాదీపరిశ్రమ రెండేండ్లు సాగినది. కాని నష్టకారిగ పరిణమించినది.



౨౪. మానేపల్లి ప్రథమచికిత్సాలయము

౨. కంబళిపరిశ్రమవిషయమున ఉన్నిరకము యొక్క అభివృద్ధి చేయుటే కర్తవ్యమయినది. కంబళ్లవిక్రయమున కొన్ని అనుకూలములు ప్రయత్నించినను గలుగలేదు.

౩. పాలుపెరుగుఅమ్మకము. ఇది పల్లెలలో పరువుతక్కువగ దలంపబడుచుండినది. ఇప్పుడు చోళసముద్రమున పెక్కండ్రు హిందూపురమునకు పాలు పెరుగు గొంపోయి విక్రయించుచున్నారు. సుమారు ౨౦, ౨౫ కుటుంబములు గలవు.



౨౫. పండ్లు, పూలతోట, మానేపల్లి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨౬. గ్రామస్థులకు వార్తాపత్రిక చదివి వినిపించుట
(మానేపల్లి)



౨౭. శిరివరపు యువజనసంఘము

## ఋణపరిష్కారము

పరస్పరము సంప్రదింపులవలన పరిష్కరింపబడిన బాకీలమొత్తము జాబితాయందు సూచింపబడినది. ఒకఋణదాత బాకీదార్లపయి దయదలచి పెరిగియున్న వడ్డీని మాపుచేసి వడ్డీలేక వరుసగ ౮, ౧౦ ఏండ్లాదివంతులుగ అసలు తీసికొనుట కియ్యకొని రయితుల నుద్ధరించినారు. కొందరు వడ్డి నూటికి ౧౨ లేక ౧౫ రూపాయలు ఉండినరేటును ౪½% లేక 3%కు తగ్గించి రయితుల కృతార్థుల జేసినారు. ఒకపెద్దరయితు బాకీమొత్తమును అసలులో మూడింట ఒకభాగమునే తీసికొన సమ్మతించిన సాహుకార్లు ప్రశంసనీయులు వచ్చినకష్టము సహకారసంఘముల బాకీవిషయముననే. అన్నిటికి అన్ని చట్టా లున్నవి. కనుక అవి ప్రమోదు పడుట తటస్థించినది. ఇది వేరొక గొడవ.

రయితులకు నష్టకారియయి, గ్రామభాగ్యము గ్రామమునుండి వెడలనడచు గ్రహములు:—

౧. అప్పులపయి వడ్డీ (౧. రొక్కము) (౨. ధాన్యము)

౨. కోర్టువ్యవహారములు.

3. కల్లుసారాయి త్రాగుడు.

౪. దుబారా ఖర్చువెచ్చాలు.

## వ్యవహారపరిష్కరణము

కోర్టువ్యవహారముల వెచ్చమునకు గురికాకుండ ఉభయవాదుల సమ్మతింపజేసి తగవుల పరిష్కరించుటకు ఊరిపెద్దలు ప్రోత్సహించినారు. గ్రామసౌమనస్యము చెడకయుండుటేకాక నష్టమునుండి రయితుల దప్పించు ఘట్టములివి. రెండుమూడుగ్రామములందు వ్యవహారపరిష్కరణసంఘములు ఏర్పడి చక్కగ బని చేయుచున్నవి.



౨౮. శిరివరము ఆది ఆంధ్రనిధి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రొక్కపు అప్పులవిషయమయి జరిగిన కార్య కలాపము పయిన సూచింపబడినది. (అప్పుల బరువు తగ్గించుట.) ఇయ్యెడ వేరొక్కవిషయము సూచించుట విధి. అది గ్రామ, లేక సంఘనిధుల నిర్మాణము.

నిధియనుపేరునకు ఇప్పుడు అవి చాలవు. కాని మున్ముందు పెంపొందగలవని నమ్మిక. మానేపల్లి, శిరివరము, బిసలుమానేపల్లి, లేపాక్షిమజరా గలిపిపల్లి అను గ్రామములందవి గలవు. ఇవి ఆయాయూరివారు, లేక ఆయాసంఘములవారు పరస్పరసహాయార్థముగ నేర్పరచికొన్న సంఘములు. అయిదులు, పదులతో ఆరంభమయిన యీసంఘములు నేడు ఏబదులాదిగా నూర్లవరకు పెరిగినవి. ఇవి స్థాపించుటకు గారణము, ఆయూరిలోనే సంపాదింపబడిన ధనమును నిలువబెట్టి, కాలోచితముగ అప్పుల నిచ్చి, వడ్డిని పొరుగూరికి ఎగుమతికానీయక, ఆయూరివారికే దక్కగలందులకు.



౨౯. మానేపల్లి పంచాయతీ గ్రంథాలయము

ఒక నిదర్శనము: బిసలుమానేపల్లియందు భజననిధికి తొలుదొల్త, ఒకనెలకు ఒక్కొక్కసభ్యుడు రూ. ౦-౧-౦ మేరకు పేరుగనము చెల్లింపవలెనని కట్టడి చేయబడినది. ఆవిధమున ప్రోగయిన ధనము సుమారు ౪౦ రూప్యములు. ఆయూరిలో చిల్లర తమలపాకు బేరగాండ్రు ఎక్కువ. వారికి కావలసినది మూడు నాల్గు రూపాయలే పెట్టుబడిసొమ్ము. ఆ స్వల్పము పొరుగూర్లనుండి సొమ్ము కుదువవేసి తెచ్చెడివారు. భజననిధిలో ఆ బేరగాండ్రు సభ్యులయిరి. భజననిధినుండి అప్పులియ్యబడుటవలన నిధికి వడ్డివచ్చినది. ఆ వడ్డిని లాభముక్రింద పంచిపెట్టక, అసలుకు చేర్పబడుటవలన నేడది ౧౪౦ కి పెరిగినది. ఆయూరి తమలపాకుల బేరగాండ్రకు కానిధి పెన్నిధి యయినది. ఒకవేళ ఎక్కువ వడ్డీ నిచ్చినను, ఆవడ్డి తమకే మరలి రాగలదని గ్రహించి, నిధి యభివృద్ధిని లక్ష్యమునందిడికొన్నారు. మూడేండ్లనుండి ఒక తకరారయినను లేక, వాయిదా తప్పక వసూలగుట చిత్రము. ఆనిధిలో స్త్రీలుగూడ తమ నిలువసొమ్మును, అయిదు, పదులను డిపాజట్లుగా నుంచుట ఒక ఆచారము. లాభమునందు ఒకకొంత గ్రామోపయోగమునకు వ్యయపరచుట యొకవిధి.

ఇదేతీరున పెంపందినది శిరివరము మహమ్మదీయనిధి. ఉన్ననిధు లన్నిటికన్న ఇది పెద్దది. మొత్తము ౮౦౦ రూపాయలకు పయిబడినది. ఇందు ౨౦౦ రూపాయలు స్వల్పకాల ఋణములక్రింద నెల వాయిదాతో ఒక్కొక్కరికి ౫ రూపాయలకు మించక అప్పులియ్యబడి, తక్కిన ౬౦౦ రూపాయలు ఒకసంవత్సరము వాయిదాలో, ౨౦ నుండి ౫౦ వరకు అప్పు లియ్యబడుచున్నవి. వడ్డిని పంచుకొనక, అసలుకు జేర్చుటే తదభివృద్ధికి గారణము. మరియు మహమ్మదీయులందరు గలిసి కట్టిన స్కూలుకట్టడమునకు వచ్చు బాడుగ నెలకు ౩౪ రూపాయ లీనిధికి చెందుచుండుట మరియొక కారణము. ఆ యూరియందు ఆది ఆంధ్రులనిధి ఏర్పడుట శుభసూచకము.

ఇది సహకారభావ శూన్యమయిన డిపార్టుమెంటు సంఘాలుగాక, ప్రజల మనసున బుట్టె స్వచ్ఛందముగ పెంపందిన సంఘములు.

## ధాన్యపుసంఘములు

రొక్కపునిధులవలె ధాన్యముగూడ షేర్లవిధానమున సేకరింపబడి, రయితులకు చవుకవడ్డి రేటుతో ధాన్యము అప్పునిచ్చుటకు రయితులే ఏర్పరచికొన్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంఘము లివి. ఇందు ధాన్యపువడ్డిరేటు మామూలు రేటుకన్న తక్కువ. ఎక్కువయినను, ఆవడ్డి మరల తమకే, లాభముక్రింద వచ్చుచున్నది గనుక రయితు అదియొకబరువుగ గణింపడు. ఇవి రయితులకు ఎక్కుడును సహాయకారి. మరియు గ్రామాని కంటగట్టబడిన సహకారసంఘములుగాక, నిక్కముగ రయితుల మనసునుండి వెలువడి కార్యరూపమును గన్న సహకార ధర్మబీజములు. ఏండ్లు గడచిన ధాన్యనిధు లిందు గలవు. ఒక బాకీయయిన తకరరుపడి కోర్టుకు ఎక్కలేదు. మజారీమనిషి నిర్బంధము లేక, తమంత తాము దెచ్చి ధాన్యముబాకీ చెల్లించుట ఆచారమయినది. ఇందును ధాన్యపు డిపాజిట్లపద్ధతి గలదు. ఇందు కల్లూరుధాన్యపుసంఘము పెద్దది.




31. మానేపల్లి ఆకెరువుపంట

కోర్టువ్యవహారముల విషయము మున్నే వివరింపబడినది.




30. ఇనుపమడకల దున్నకము

## కల్లుసారాయిత్రాగుడు

ఇది నిరుపేదలను మరింత బీదలగ జేసి, గ్రామ భాగ్యమును గొల్లగొట్టునది. పికెటింగు సక్రమముగ నుండినపుడు, పికెటింగు చేయుటేగాక మ్యాజిక్ లాందరు ప్రదర్శనముచేతను, భజనపాటలవల్లను, హరికథలు, నాటకములు మూలమునను, వ్యక్తుల ప్రార్థించుటవలనను క్రమక్రమమునందు త్రాగుడు కొంతతగ్గినది. మీదుమిక్కిలి వయోవృద్ధులను త్రాగుడునుండి త్రిప్పుట అసాధ్యమయినది. యువకులు పెక్కండ్రు త్రాగుడును మానగల్గినారు. బాలురయందు కూడ విముఖత చాలవరకు గల్గింపబడినది. త్రాగుడు కలవాటుపడినవారు హరిజను లెక్కుడు. స్కూళ్లయందు విద్య నభ్యసించుటవలన త్రాగుడు కొంత సన్నగిల్లుచున్నది. మరియు కల్లంగళ్లనుగూడ, ఊరికి దూరముగ మార్పించియు, లైసెన్సుహరుల అతిక్రమణవిషయమున సర్కారున కెరుకపరచుటయు త్రాగుడు తగ్గించుటకు దోడ్పడినవి. మరియు త్రాగుడు మానినవారికి బహుమతులిచ్చి ప్రోత్సహింపబడుచుండుటయు ఒకపద్ధతి.

## దుబారాఖర్చు వెచ్చాలు

పెండ్లినోములవిషయమున వేర్వేరుగ ఒకటొకటి జరుగుటవలనను అమితవ్యయమును తగ్గించుటకయి 3, 4 ఒకటిగ జేర్చి, వారిబంధువు లాదిగాగల వారల నిందుకు బురికొల్పి ఖర్చువెచ్చాల తగ్గింపునకు కృషిసల్పబడినది. పసువుప్రతిష్ఠల పేదరికముపయి విముఖతకల్గింప బడినది. మానేపల్లియందును, కల్లూరునందును రెండుమూడు పెండ్లిండ్లు సన్నిహిత బంధువులకార్యములు ఒకసారిగ నిర్వహింపబడినవి. ఈ మితవ్యయమునకు కాలస్థితిగూడ తోడ్పడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




3౨. అశ్వత్థముకట్ట, మానేపల్లి

ఆర్థికకార్యకలాపసంగ్రహ మిది. కాని సహకార సంఘములమాట ఒకటి మిగిలినది. ప్రతిగ్రామమునందును సహకారసంఘము లున్నవిగాని సహకారధర్మము తల ఎత్తకుండుట విచారకరము. ఈ వైపరీత్యము కేంద్ర గ్రామములందేకాక, సహకారోద్యమ సామాన్యలక్షణ మయినదనుటయు సత్యమే. ఈ వైపరీత్యమును విమర్శించుట గ్రంథవిస్తరకారణము. తొల్లిటినుండి జరిగిన అశ్రద్ధకుతోడు, ఆర్థికస్థితి తలక్రిందగుట నిరాశకు కారణమయినది. సహకారోద్యమమువిషయమయి, తద్ధర్మములనుసరించి ప్రచారము సల్పబడినది. ప్రచారము ఫలితముగ, సంఘమునందున్న లోపములు బయల్పడుటచే సహకారసంఘాల పెద్దలతో కొంత వైరుధ్యము ప్రాప్తించినది. అయ్యది తదితర కార్యక్రమసాధనకు కొంతభంగము గల్గించుట సామాన్య పరిణామము. సాధ్య మున్నచోట హామీలేని బాకీలకు హామీ తీసుకోబడినది. వసూలుపనివిషయమున శ్రద్ధయు, పూనికయు హెచ్చింపబడి, చర్చలేక మూలబడియుండిన పాతబాకీలవిషయము, పెద్దచిన్నలను ఇన్నాళ్ల నాటి విభేదము గమనింపక, దావాలుచేయబడి, డిక్రీలు అమలు జారీచేయబడుచున్నవి. బినామా బాకీలపట్టున ఇరువురను సమాధానపరచి ప్రతిఫలము నిక్కముగ పొందినవారే ఆ అప్పు భరింప సమ్మతిగైకొనబడి వసూళ్లుగూడ చేయబడినవి. ఇంతకన్న ఇప్పటి ఆర్థికవైపరీత్యమునందు చేయగలిగినది గాన్పింపదు. సముచితమయిన కార్యకలాపమును గ్రామస్థితిగతులబట్టి సంతరించి సంస్కరించుటకు చట్టముల పట్టువిసువు ఎక్కువ. తొలిదినాలనాటి అశ్రద్ధవలన సహకారసంఘసంస్కరణము వృథా విరుద్ధ కారణముగ పరిణమించుచున్నదేకాని, యీ ఆర్థిక దుస్థితిలో ఫలము గానరాదు. ఇంతకన్న ఇయ్యెడ ఎక్కువగ ఈవిషయముప్రస్తావించుట నిష్ప్రయోజనము.

## విద్యావికాసము

మ్యాజిక్ లాంతరు ఉపన్యాసములు, హరికథలు, నాటకములు, ప్రముఖుల ఉపన్యాసములు, ప్రదర్శనములు, రయితుసభలు, ఉపాధ్యాయసభలు, వసంతఋతు విద్యాలయములు, నైటుస్కూళ్లు, భజనలు, జయంతులు, పురాణములు, గ్రంథాలయములు మున్నగు వివిధవిధానముల శక్తివంచనలేక కృషిసల్పబడినది. జాతియోద్యమమందాసక్తి, హరిజనోద్ధరణమున ఉత్సాహము, విద్యయందు అభిలాష, గ్రామమునందభిమానముగలిగించుట కివి చాల యుపయోగించినవి.

కల్లూరు మానేపల్లి గ్రామములందు విద్యాయుతులయిన యువకులు గ్రామసేవకులయి, గ్రామపరిశుభ్రత




33. పంచాయతీపసులకొట్టము, మానేపల్లి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కును, త్రాగుడు మాన్పుటకును, వైద్యసహాయము నేకూర్చుటకును, అస్పృశ్యతా నివారణకును పెక్కు విధముల తోడ్పడినారు. ఐచ్ఛిక సేవావిళ యువకులు రెండు గ్రామములందు బావుల స్వయముగ త్రవ్వినారు. బజారులు మరామత్తుచేసినారు. సారాయి కొట్లు పికెటింగు చేసిరి. హరిజనభజనల నడపించిరి. వార్తాపత్రికలను జనులకు పురాణముతోపాటు చదివి వినిపించిరి. నైటుస్కూళ్లను నడపిరి. ఇందుకు సంబంధించిన లెక్కలు కొన్ని, జాబితాయందు గలవు. ఉపాధ్యాయ ప్రబోధకమండలిలోని ఉపాధ్యాయులుగూడ ఐచ్ఛిక సేవకులయి, కొన్ని గ్రామములు సంచరించి, గ్రామసేవ సల్పినారు. జిల్లాప్రముఖులచే పెక్కు ఉపన్యాసము లిప్పింపబడి, సభలు జరుపబడినవి.



౩౮. మేరీనా రకం గొర్రె

గ్రామపంచాయతులు గ్రామారోగ్యము, నీటి వసతి, వైద్యసహాయము మున్నగువివరములు అను బంధమున గలవు. లెక్కలజాబితాయందు చూప నసాధ్యము లయిన యంశములు ఒకటిరెండు గలవు. గ్రామములందు ప్రుడు చపాతికళ్లి నామమాత్రావశిష్ట మయినది. కాకిళినియల్ పురుగును ఈప్రాంతములందు తొలు దొల్త చెప్పించినది లేపాక్షి. అంతకుమున్ను సుమారు ౫౦ రూప్యము లిందుకు పంచాయతులు వెచ్చించినవి. లేపాక్షి, మానేపల్లెలలో కాపురపుటిండ్ల చెంతనుండి దిబ్బలు తీసివేయింపబడినవి. మానేపల్లిలో దిబ్బలకు ప్రత్యేకస్థలము ఏర్పాటు కాబడినది. తక్కినచోట్ల దిబ్బలకు,మున్ను గూయుపద్ధతి అలవడుచున్నది. ఆరోగ్య వారము లాదిగా గల ప్రజోపయోగవిషయములందు పంచాయతులు శ్రద్ధవహించి, హరిజనులకు, తక్కుంగల బీదలకు బహుమతులనిచ్చి, ప్రజావికాసమునకు ఏటేట కృషి సల్పుచున్నవి. ఈయేడాది ఆరోగ్యవారమున లేపాక్షియందు ప్రదర్శనముగూడ నిర్వహింపబడినది. గ్రామపరిశుభ్రత నెలకొల్పుటకయి అశ్వత్థముల గ్రామ పరిసరములందువేసి పెంచుట ప్రోత్సహింపబడుచున్నది. అంతియకాక విహారవనము (Park) వేసి పెంచు చున్నది మానేపల్లి!

## ఒక్కమాట

కేంద్రములోని గ్రామపంచాయతు లకు వచ్చెడు శెస్సు ఏడాదికి ౩౫ నుండి ౭౦ రూపాయలుమాత్రమే యనిన పంచా యతుల ఆర్థికదుస్థితి స్పష్టము కాగలదు. అయ్యును అవి ప్రజల తోడ్పాటుచే ఇంత మాత్రమయిన జేయగల్గుట ప్రశంసనీయమే గదా! గ్రామపంచాయతులకు గల ఆదా యము కడు స్వల్పము. గ్రామములు నిరు పేదపల్లెలు. క్రొత్తపన్నులు విరుద్ధకారణము. ఇంతటి ఇక్కట్టులకు లోనయినను, పంచాయతులు స్వధర్మము నిర్వహింప శక్తివంచన లేక కృషిసల్పిన వనుట స్పష్టము.

పయిన సూచింపబడిన కార్యకలాపనిర్వహణ మునకు పెక్కు విధముల దోడ్పడిన మహనీయులకును, సంస్థలకును, మీదుమిక్కిలి ప్రాథమిక పాఠశాలోపా ధ్యాయులకును, సహకారులకును, వ్యవసాయశాఖ ఉద్యో గులకును, అందరికన్న ఎక్కుడుగ గ్రామప్రజకును వందనములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అ ను బ ం ధ ము

### గ్రామపునర్నిర్మాణ కేంద్రము, లేపాక్షి

### ౧౯౨౯ – ౧౯౩౩

ప్రయాణసౌకర్యములు రూ. ౭౩౬౦/-
నీటివసతి ,, ౧౧౯౬౦/-

(N. B.—ఈ ఏడాది జరుగుచున్న రోడ్లు, భావుల వ్యయము గలసి)

| | ౧౯౨౯ | ౧౯౩౩ | |
|---|---|---|---|
| I గ్రామపంచాయతుల స్థాపన | ౪ | ౮ | |
| పనిచేయుచున్న పంచాయతులు | ౨ | ౮ | |
| II గ్రామవీథులు | ౦ | ౪౮౦౦ (అడుగులు) | |
| | | రూ. ౨౩౧౦/- (ఎస్టిమేటు) | |
| రోడ్లు (ఫర్లాంగులలో) | ౦ | ౩౬ | |
| | | రూ. ౫౦౫౦/- | |
| III నీటివసతి | | | క్రొత్తవి |
| తాలూకాబోర్డు బావులు | ౧౦ | ౧౧ | ౧ |
| పంచాయతీ బావులు | ౧ | ౧౦ | ౯ |
| లేబరుశాఖ బావులు (హరిజనులకు) | ౨ | ౭ | ౬ |
| ఐచ్ఛికసేవాదళము బావులు | ౦ | ౨ | ౨ |
| (లేపాక్షి పంచాయతీ బోరింగు బావి- | పయి ౧౦ బావులలో | చేరినది) | |
| | ౧౩ | ౩౦ | |

| | | ౧౯౨౯ | ౧౯౩౩ | |
|---|---|---|---|---|
| IV పరిశుభ్రత | | | | |
| (1) (a) | చపాతికళ్లి నిర్మూలనము | — | రూ. ౧౦౦ | (పంచాయతులు) |
| | ఐచ్ఛికసేవాదళము | | ,, ౫౦ | (పనిమూలమున) |
| (b) | స్వీపర్లుగల గ్రామాలు | ౧ | ౪ | |
| (2) | వైద్యసహాయము | | | |
| | తాలూకాబోర్డు, పంచాయతీ వైద్యాలయము | ౦ | ౧ | |
| | పంచాయతీమాత్రము | ౧ | ౨ | (మానేపల్లి ప్రథమ చికిత్సాలయముతోపాటు) |
| | లోకలుబోర్డునుండి పంచాయతీ వైద్యాలయమునకు వచ్చిన సహాయము | ౦ | రూ. ౨౦౦/- | |
| | | ౧ | ౩ | |
| | ధనము రూ. | ౦ | రూ. ౨౦౦/- | |


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | |
|---|---|---|---|---|
| V | విద్యాభివృద్ధి (బాలురు) | | | |
| | తాలూకాబోర్డు స్కూళ్లు | ౧౧ | ౧౩ | |
| | లేబరుశాఖ ,, | ౩ | ౨ | |
| | పంచాయతీ ,, | ౧ | ౨ | |
| | ఎయిడెడ్ ,, | ౧ (౧౯౩౧లో —నిలిచిపోయినది)— | ౩ | (క్రొత్తవి) |
| | | ౧౬ | ౨౦ | |
| V (a) | వయోజనవిద్య : | | | |
| | స్కూళ్లు | ౦ | ౧ | (తాత్కాలికముగ ౧౯౨౯ నుండి ౩౩ వరకు పని చేసిన నైటు స్కూళ్లు ౬ గాక) |
| | గ్రంథాలయములు | ౨ | ౫ | |
| | వసంతిబుతు విద్యాలయములు | ౦ | ౨ | |
| | రయితు మహాసభలు | ౦ | ౩ | (తా. ర. సభలు ౨ కేంద్రగ్రామ ర. స. ౧) |
| | ఉపాధ్యాయ మహాసభలు | ౦ | ౩ | |
| | వస్తుప్రదర్శనములు | ౦ | ౪ | |
| | పారిశ్రామికవిద్య (నేత) | ౦ | ౧ | |
| | భజనసంఘములు (క్రమమయినవి) | ౨ | ౬ | |
| | కరపత్రములు (R. R. C. ప్రచురించినవి) | ౦ | ౫ | |
| | | | | ప్రేక్షకులు |
| | మ్యాజిక్ లాందరు లెక్చర్లు | — | ౮౨ | ౧౦౭౦౦ జనులు |
| | హరికథలు | ౦ | ౩౧ | ౬౨౦౦ ,, |
| | నాటకములు | ౦ | ౧౨ | ౪౨౦౦ ,, |
| | పురాణగ్రంథపఠనము | ౮౧౨ దినములు | | ౨౧౦౦౦ ,, |
| | జిల్లాప్రముఖులు, తదితరమహనీయులు | ౫౭ ఉపన్యాసములు | | |
| VI | భవనములు : | | | |
| | స్కూలుకట్టడములు (తా. బోర్డు లేబరు) | — | ౩ | క్రొత్తకట్టడముల మదింపు రూ. ౭౩౦౦/- (౩) |
| | పంచాయతీగ్రంథనిలయ భవనములు | ౧ | ౨ | ,, ౬౩౦/- (౧) |
| | ఆదర్శకపశువులకొట్టము | ౦ | ౧ | ,, ౩౦౦/- (౧) |
| | భజనమందిరములు | ౧ | ౨ | ,, ౬౦౦/- (౧) |
| | పార్కు (పంచాయతీ) | ౦ | ౧ | |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | |
|---|---|---|---|
| I | వ్యవహారపరిష్కారము | ఆర్థికము వ్యవహారములసంఖ్య (౬౦) | (ఊరిపెద్దలు, సూపర్వైజరు కలసి పరిష్కరించినవి ౨౮) |
| (a) | ఆర్బిట్రేషన్ సంఘములు | ౦ | ౨ |
| II | ఋణపరిష్కరణము | అప్పు మొత్తము | ఫైసలాతి మొత్తము |
| (a) | | రూ. ౬౯౪౨౦/- | రూ. ౩౧౭౬౦/- |

(b) ఫైసలాతి అప్పువడ్డీరేటు  3% నుండి ౪౫%

(c) (వడ్డీలేకనే ఫైసలయిన అప్పుమొత్తము  రూ. ౬౮౦౦)

(d) వడ్డీరేటుమాత్రము తగ్గింపబడిన అప్పుమొత్తము ౨౦౦౦౦/-
వడ్డీరేటు ౧౨% నుండి ౪౫% నుండి ౬%

---



ఘంటాగోపురమునకును కోటకొండకును నడుమ వీథి-తిరుచినాపల్లి

యస్. శంకర సుబ్రహ్మణ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రథసప్తమి

కపిస్థలం కృష్ణమాచార్యులు

అతిప్రాచీన వైదికులగుటవలన, మనపూర్వు లనాదిగ తమ మతగ్రంథములయం దనేకజ్యోతిషవిశేషములను గడు జాగరూకతతో వ్రాయుచుండిరి. మఱియు అట్టి విశేషములు సంభవించిన దినములయందు వారు తమ పితృదేవతలను బ్రసన్నులజేయుచుండిరి. ఇప్పటికిని మనలో ననేకులు శాస్త్రోక్తములగు వైదికకర్మలను విశేషములైన తిథులలో చేయుచున్నారు. సూర్య చంద్రగ్రహణములును, వసంత-శరదారంభములును, ఉత్తర-దక్షిణాయనములును నిట్టివే. ఈసందర్భములయందు జేయు వైదికకర్మముల ప్రయోజనము లెట్టివైనను, తా మాధారపడియుండు జ్యోతిష విశేషముల విషయమై మనకు గొంతజ్ఞానమును గలిగించుట కవి యుపయోగపడుట నిశ్చయము. ఈకర్మలే లేకుండినయెడల, వీని కాధారములగు జ్యోతిషవిశేషాంశముల విషయమై యాలోచించుట దుస్సాధమై యుండెడిదే. కావున, విలువగల యిట్టి వైదికకర్మలను తమసంతతి వారమగు మనకు బరంపరగా వచ్చుచుండునట్లు చేసిన మనపూర్వులకు మన మెంతయు గృతజ్ఞులమై యుండవలయును.

ఇంతకాలము గడచిన తరువాత, భూతమును విమర్శించుసందర్భమున మన మప్పుడప్పు డుల్లేఖించి చెప్పుట సుసాధమే. మన విమర్శనము న్యాయముగ నుండవలయునేని, వేలకొలది యేండ్లకు ముందుండిన యా మార్గదర్శకుల స్థితియందు మనల నుంచికొని, వారిసాధనలకొలది వారిని మనము గౌరవింపవలయును.

ప్రాక్తనమగు సర్వము నెడగల దురభిమానముచే, మనలో కొందఱిప్పటికిని, మనపూర్వులు గర్వపడదగినట్టి యొక యుత్తమభూతమును గలిగియుండిరనుటను, విశ్వసింపజాలకుండుట చింతావహము. అయినను, మన పూర్వులుగూడ యోజించుచువచ్చిన కొన్ని విషయములను విమర్శింపబూనునప్పుడు మనల నిది యాటంకపరుపబనిలేదు. అట్టి దొకటి రథసప్తమి. రథసప్తమి యననేమో, అది యొక వైదికోత్సవ మెట్లయ్యెనో యీవ్యాసమున జూతము.

నాయుద్దేశ్యము తూచాతప్పని గణితస్వారస్యము గాదనియు, కాబట్టి సహస్రాబ్దముల విషయమున గొన్ని శతాబ్దముల పొరపాటుచేయుట సాధ్యమేయనియు మొట్టమొదటనే చదువరులను హెచ్చరించుచున్నాను. మఱియు, ఈ విషయమున నేను స్వయముగ గనిపెట్టినదేదియు లేదు. హిందూజ్యోతిశ్శాస్త్రమున పరిశోధనలు చేసిన తిలక్ మొదలగువారి యమూల్యగ్రంథముల లోని విషయములకు సంగ్రహముగ నీవ్యాసము వ్రాయబడినది.

ఋగ్వేదమునాటి యార్యుల సంవత్సరాది వసంతారంభము. దేవతలు భూమి కుత్తరముననను, పితృదేవతల స్వామియగు యముడు భూమికి దక్షిణముననను నివసించియుండిరని వారి నమ్మకము. కాబట్టి, వారు తమ సంవత్సరమును దేవయానము, పితృయానము నని రెండుగ విభజించిరి. కావున, సూర్యుడు వసంతారంభమున నున్నయప్పుడు, అనగా సూర్యుడు దేవతల నివాసమగు నుత్తరమును బ్రవేశింపబోవునప్పుడు, వారి సంవత్సరము నూతనోత్సాహములతో నారంభమగుట సహజమే. అయినను, ఆకాలమునకు దర్వాతివారు తమ సంవత్సరము నుత్తరాయణమునుండి, అనగా, సూర్యుడు దక్షిణమునుండి యుత్తరమునకు మఱలునప్పటినుండి, ఆరంభముచేసి యుత్తరాయణము, దక్షిణాయనము నని సంవత్సరమును రెండుగ విభజించిరి. ఈరెండు-వసంతశరదారంభములు, ఉత్తరదక్షిణాయనములు - పద్ధతులకును సమానముగ మన పూర్వు లీవివిధారంభములకు వివిధవ్యవహారములను గల్పింపవలసివచ్చెను. ఆకాలమున కృత్తికానక్షత్రముసమీపముననుండిన వసంతశరదారంభములను వైదికకర్మలకును, శ్రవిష్ఠసమీపముననుండిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుత్తరదక్షిణాయనములను లౌకికకర్మలకును వారు నియోగించిరి. కాని, రానురాను జను లాభేదములను మఱచిరి. మన ప్రసిద్ధజ్యోతిశ్శాస్త్రవేత్తల కాలమునకు చాలముందే యాక్రమముతలక్రిందయ్యెను. ఫలమేమనగా: మన మిప్పు డుత్తరాయణమున వైదికకర్మలను, వసంతారంభమున లౌకిక కర్మలను చేయుచున్నాము. ఇచ్చటను మనము యథార్థపరిస్థితులకెంతో వెనుకబడి యున్నాము. ఏలననగా వసంతశరదారంభములును, ఉత్తరదక్షిణాయనములును వరాహమిహిరునికి గనబడిన స్థానములనుండి చాలవెనుకకు బోయియున్నను, ౧౫౦౦ సంవత్సరముల ప్రాంతమున వాని స్థానముల మార్పుల నతడు వ్రాసినదానినిమాత్రమే మన మిచ్చట ననుసరించుచున్నాము.

మనపూర్వులు వసంతశరదారంభముల మార్పులకు దగినట్లు తమ సంవత్సరముల నప్పుడప్పుడు సవరించుచుండిరని వారి పుస్తకములవలన దెలియుచున్నది. వరాహమిహిరుడు, తనకాలమున దక్షిణాయనము పునర్వసునక్షత్రమునొద్ద నున్నదని నిర్ణయించుచు, అది యాశ్లేషమధ్య సంభవించిన కాలమును గుఱించి ప్రసంగించుచున్నాడు. ఆశ్లేషనుండి వెనుకకు లెక్కవేసి చూడగా, ఆకాలమున నుత్తరాయణము శ్రవిష్ఠ చెంతల సంభవించియుండవలయును; కాని అతని కాలమున నది సుమారు మకర మాసారంభమున, అనగా సుమారు ఉత్తరాషాఢానక్షత్రము రెండవ భాగమున సంభవించెను. వరాహమిహిరుడు చెప్పిన యా పురాతనకాలము కురుక్షేత్రయుద్ధపు కాలమని తోచుచున్నది. రణరంగమున భీష్ము డంపశయ్యాపై బరుండి, ప్రాణములు విడుచుటకై యుత్తరాయణమును నిరీక్షించుచుండెను. మఱియు ఆకాలమున సూర్యుడు మాఘశుక్లదశమినా డుత్తరమునకు మఱలెనని మహాభారతమున నున్నది. ఆనెల పూర్ణిమనాడు చంద్రుడు మఘానక్షత్రమున నుండె ననుకొన్నయెడల, సూర్యుడప్పుడు శ్రవిష్ఠానక్షత్రమున నుండియుండును; మఱియు ఆనక్షత్రమువఱకు పూర్ణిమనాడును, భీష్మనిర్యాణము నాడును నక్షత్రమండలమున సూర్యుని స్థితిలో నంతగా భేద ముండదు. కాబట్టి, మహాభారతకాలప్రాంతమున నుత్తరాయణము శ్రవిష్ఠయొద్ద సంభవించినదని మనము నిర్భయముగ నూహింపవచ్చును.

మఱియొక స్వతంత్రనిదర్శనము గర్గుడు వ్రాసిన దానిలో నగపడుచున్నది. అతనికాలమున నుత్తరాయణము మాఘశుక్లపాడ్యమినాడు సంభవించెను. అప్పుడు శ్రవిష్ఠకు రెండుప్రక్కల సూర్యచంద్రు లుదయించిరి. ఇట్లొకప్పుడు మాఘశుద్ధదశమినాడో, ఏకాదశినాడో, మఱియొకప్పుడు మాఘశుక్లపాడ్యమినాడును నుత్తరాయణము, సూర్యు డీసందర్భములలో శ్రవిష్ఠయొద్ద నుండగా సంభవించెనని తేలుచున్నది. సూర్యుడు శ్రవిష్ఠయొద్దనే యుండగా మఱియొకప్పు డుత్తరాయణము మాఘశుక్ల సప్తమినాడు సంభవించి యుండవలయును. హిందువులకు 'సప్త' యనిన నొక వింతసంతోషము. చూడుడు. సప్తలోకములు, సప్తపర్వతములు, సప్తద్వీపములు, సప్తసాగరములు, సప్తాశ్వములు మొదలగునవి. సప్తమియు నుత్తరాయణమును వింతగా సరిపడుట మన పూర్వులకు గడు నచ్చియుండవలయును. అప్పటినుండియే రథసప్తమి సంవత్సరమున నొక విశేషదినమయియుండవలయును సందర్భపడిన విశేషదినములయం దెల్ల దేవతలను మెప్పించి విసుగని మన పూర్వులకు సూర్యుడు వింతగ సప్తమినాడు యమనివాసమగు దక్షిణమునుండి మఱలి, దేవతల నివాసమగు నుత్తరమునకు బోవుట ఒక మంచివిశేషమే యైయుండును. రథసప్తమియంతటి పురాతనకాలమున నుత్పత్తినొందినట్లు తోచుచున్నది.

కాని, ఇప్పు డుత్తరాయణము శ్రవిష్ఠవెనుక ననేకడిగ్రీలు వెనుకబడిపోయినది. అది యిప్పుడు మూలానక్షత్రము మూడవభాగమున సంభవించును. ఇట్లది మొదటి రథసప్తమినా డుండిన నక్షత్రమునుండి మూడు నక్షత్రములను దాటి నాలుగవ నక్షత్రమునకు వచ్చినది. ఒక్కొక్కనక్షత్రమునకును సరాసరి సుమారు ౧౩ డిగ్రీలచొప్పున నైనయెడల, అది యిప్పటికి సుమారు ౪౫ డిగ్రీల ధనూరేఖను దాటియుండవలయును. ౭౨ సంవత్సరములకు ౧ డిగ్రీ చొప్పున నుత్తరదక్షిణాయన వసంతశరదారంభముల స్థానములు మారుచుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాబట్టి, మొట్టమొదటి రథసప్తమి ౩౨౯౦ సంవత్సరముల కాలమున దేశీయవైదికోత్సవమై యుండవలయును. మన కిప్పటికిని రథసప్తమి యుత్సవమేకాని దాని పవిత్రతకు కారణమగు నుత్తరాయణమునకును దానికిని నెట్టి సంబంధమును లేదు. ఇది యొరలో నొకప్పు డుండిన తళతళలాడు వా లెచ్చట నున్నదో తెలియక, వట్టి యొరను గడుజాగరూకతతో కాపాడుచుండుట ట్లున్నది. శ్రవిష్ఠను విడిచినతర్వాత ఉత్తరాయణము మఱల ఉత్తరాషాఢ రెండవభాగమున, అనగా సుమారు మకర మాసపు మొదటిదినములలో చూడబడినది. ఇది జరిగినది వరాహమిహిరుని కాలమున. ఉత్తరదక్షిణాయన వసంతశరదారంభముల స్థానములు మారియుండుటను జూచి యతడు మన లౌకికగణనము (Civil Calender)ను సవరించెను; కాబట్టియే మన వసంతర్తువును చైత్రమును, మన నక్షత్రముల నశ్వినియు ప్రారంభించుచున్నవి. వరాహమిహిరుని యనంతర మెవ్వరును సవరింపకుండుటవలన, మన మిప్పటికిని వాడుకలో లేని లౌకికగణనము ననుసరించుచు మా ర్గావశ్యకమనికూడ దలపకున్నాము. అయినను మంచిదినములు వచ్చుచున్నవి. మన యజ్ఞానమును బోగొట్టి, మన పురోవృద్ధికి దోడ్పడగల పరిశోధకులు మనలో నుండుటవలన, మనము సంపూర్ణముగ నిరాశచెంద బనిలేదని సంతోషముగ నున్నది.



౧. కాశీరాజునగరు సింహద్వారము-రామనగరము



౨. కాశీరాజనగరాంతర్భాగమునుండి గంగానది-రామనగరము

—సి. జి. జగన్నాథ దాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## ఇండ్లు కట్టుట

కొ. నరసింహాచారి

ఒక ఇంటిని కట్టుటకు ముఖ్యముగా గమనించవలసిన విషయము లేవనిన, ఇంటి యొక్క నేలప్లాను, గోడలు. అట్టలతో కట్ట బడు ఇంటికి నేలప్లానుతో చేర్చి చుట్టును వచ్చు వెలుపటిగోడలనుగూడ ఒకే అట్ట యందు వ్రాసికొని కత్తిరించవలెను. కొల తలు మనయిష్టానుసారము పెట్టుకొన వచ్చును. వెలుపలిగోడలు కాక ఇంటియందలి లోపలిగోడలు, వేర్వేరు అట్టతునుకలలో కత్తిరించుకొనవలెను. ఒకఅట్టతో మఱియొక అట్టనుగాని, ఒకఅంచుతో మఱియొకయంచునుగాని అతికించవలెనన్న అందు ఒక దానికి అతుకుతునుక (Flap) ఉండవలెను. ఇకను ద్వారములు, గవాక్షములు ఒకదాని కొకటి యెదురుగా నుండుట మంచియింటి యొక్క లక్షణము. ఒకగోడయందు ద్వారముగాని, గవాక్షముగాని యుండిన, దాని కెదురుగా ఆగోడకు వెనుకముందుగలగోడల యందుగూడ ద్వారముగాని, గవాక్షముగాని యుండవలెను.

చిత్రము 1 యందు A B C E అనునది నేలప్లాను. A B P O అనునది A B ప్రక్క నుండు వెనుకటి వెలుపలిగోడ. A C H G F అనునది A C ప్రక్కనుండు (పడమటి) వెలుపలిగోడ. B E L M N అనునది B E ప్రక్కనుండు ( తూర్పు ) వెలుపలిగోడ. C E J K అనునది C E ప్రక్కనుండు ముందుండు వెలుపలిగోడ. ఈగోడలన్నియు నేలప్లానుతో చేర్చి ఒకేఅట్టపై వ్రాయబడియున్నవి. ఈగోడల కెచ్చటెచ్చట f అను అతుకు తునుకలు కలవో వాటినన్నిటినిగూడ చేర్చికొని ప్లానువ్రాయవలెను. తక్కినభాగమును కోసివేయవలెను. పిమ్మట ప్లానునందు D అను గుర్తుగల ద్వారములును, W అను గుర్తు గల గవాక్షములను గుర్తించికొని వాటివాటికి నేరుగా గోడలయందు ద్వారములను, గవాక్షములను కత్తిరించుకొనవలెను. ప్రతిదానికిని పైయంచునందును, క్రిందియంచునందును, నడిమిరేఖయందును పూర్తిగా కోసి, . —— . —— . —— ఇట్టి గుర్తు గల చోటులవెంబడి మడువవలెను. తర్వాత లోపలి గోడలను వేర్వేరు అట్టలపై వ్రాసి కత్తిరించుకొనవలెను. వాటికిని అతుకు తునకలు f అను గుర్తుగల చోట్ల నుంచ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలెను. చిత్రము 2 నందలిది మొదటి చిత్రముప్లానునందలి QR అను గోడ. దీనియొక్క యెత్తు, ఇది పడమటిగోడను చేరు నట్టి ప్రదేశమగు QS నంత యుండవలెను. చిత్రము 3 నందలిది మొదటి చిత్రము VX అనుగోడ. దీనియెత్తుకూడ, పడమటి గోడను చేరు ప్రదేశమునందలి ఎత్తునకు, అనగా QS సమానముగా నుండవలెను. చిత్రము 4 నందలిది మొదటిచిత్రమునందలి TU అనుగోడ. దీనియెత్తు పడమటిగోడను ఇది చేరునట్టిప్రదేశమునకు, అనగా TG కి సమానముగా నుండవలెను. GM అను భాగములు ఇంటినడికొప్పునకు చేరినవి. చిత్రము 5 నందలిది ఉత్తర దక్షిణములుగా పోవు AB అనుగోడ. ఇది QR నకును CE కిని మధ్యరెంటిని తాకుచున్నది. దీని యాకారము చతురస్రముకాక పడమటిగోడ యందలి CHGHQ అను భాగమునకు సమానముగా నుండవలెను. చిత్రము 6 నం దలి గోడ, మొదటి చిత్రము నందలి YZ అను ప్రదేశమునందలి గోడ. ఇది పడమటిగోడయందలి QSFA భాగము నకు సరియై యుండవలెను. ఇట్లు గోడల నన్నిటిని కత్తిరించుకొని, మొదటచిత్రము నందలి అట్టను మొదట దీసికొని దానిచుట్టు గల గోడలను నిలువబెట్టి మూలలందు అతుకుతునుకలను లోవైపుండునటుల అతి కించవలెను. పిమ్మట తక్కిన విడిగోడలను ఒక్కొక్కటిగా వాటివాటిస్థానములందు నిలువబెట్టి అతికించవలెను. అటుపిమ్మట ఇంటికప్పును ప్రత్యేకముగా కత్తిరించవలెను. దీనియొక్క అంచులు ఇంటిగోడలకు వెలుపల కొంచె మెక్కువగా మిగిలివచ్చునట్లు పెద్దదిగా నుండవలెను. కప్పునకు కావలసిన అట్ట AB కొలతకు కొంచె మెక్కువగా నుండునట్లు వెడల్పును గలిగియు, GHF



ఇల్లు (పైకప్పుతో)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఇల్లు (పైకప్పులేక)

పొడవునకు కొంచె మెక్కువగా నుండునట్లు పొడవును గలిగియు నుండవలెను. దీనిని సగముగా మడిచి మడతగుర్తు G M అను నడికొప్పుమీదవచ్చునట్లు ఇంటిపై మూసి అతికించవలెను.

ఈఇంటియందు ఒకహాలును, వంటగది, భోజనగది, కొట్టడి, పడుకగది, వసారా కలవు. వసారాగోడయందు కమ్ములుండు రీతిని చాలాసందులు కోయబడియున్నవి.

అట్ట లావుగా నుండినయెడల మడువ వలసిన ప్రదేశములందు కత్తితో తేలికగా నొకసారి గీతవేసి మడువవలెను. సన్నని అట్ట అయినయెడల, పెనసలుతో నదిమి గీతవేసిన చాలును.

(All rights reserved.)

---

# సవరణ

రాయబారము: మార్చిభారతి ౩౮౧-వ పుటలో మొదటి కలములో పదియవ బంతిలో 'చెప్పియుండిరి' అనుదానిని 'చెప్పియుండిరా?' అని ప్రశ్నార్థకముగా చదువు కొనవలెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నక్షత్రమండలము

గోబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(భావ సంవత్సర చైత్ర, అధికవైశాఖ మాసములు-ఏప్రిల్ 1934)

ఉత్తరము




దక్షిణము

[ఈపటము తలమీద ఆయాదిక్కులుచూపునట్లు సరిగాపట్టుకొని చూడవలయును. ఇందున్నట్లునక్షత్రములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏప్రిల్ | 8 | తేదీని | రాత్రి | 8-55 | గంటలకును, |
| ,, | 15 | ,, | ,, | 8-28 | ,, |
| ఏప్రిల్ | 22 | తేదీని | రాత్రి | 8- 0 | గంటలకును |
| ,, | 30 | ,, | ,, | 7-29 | ,, |
| మే | 7 | ,, | ,, | 7- 0 | ,, |

కనబడును.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ భావసంవత్సర చైత్రబహుళనవమి మొదలు అధికవైశాఖబహుళదశమిపర్యంతము—అనగా ఏప్రిల్ ౧-వ తేదీ మొదలు మే ౧-వ తేదీవఱకును రాత్రి తొలిజామున ఆకాశమున కానవచ్చు గ్రహనక్షత్రాదులను గమనింతము.

## పాలవెల్లి (Milky Way)

మధ్య భాగుగా వంగిన మండలఖండవక్రమువలె పాలవెల్లియీమాసమున దక్షిణసమీప-ఆగ్నేయదిశనుండి ఉత్తరసమీపవాయవ్యదిశకు వ్యాపించియున్నది. అయ్యది ఆగ్నేయమున అశ్వతరమండలముకడనుండి త్రిశంకు, నౌకామండలములను గడచి, వాసుకి, మందరగిరి మీదుగా శ్వాన, పూర్వశ్వానములమధ్య బడి, ఆర్ద్రనక్షత్రము నంటుచు, సారథిరథము నతిక్రమించి భృగుపరశుమండలమున కావల నస్తమించుచున్న అప్సరసమండలముకడ, వాయవ్యమున నదృశ్యమగుచున్నది. విషువద్రేఖకును, క్రాంతివృత్తమునకును మధ్యప్రదేశములందే ఈపాలవెల్లి విశేష తేజముకలట్లు చూపట్టుచున్నది. ఇట్లగపడుటకు కారణము అచట దట్టముగా ప్రోగులుపడియున్న అసంఖ్యాకోటినక్షత్రము లుండుటయే. అనగా నచట క్షీరవాహిని ఎక్కువ తేటుగా కనబడుటకు కారణము లెక్కకుమీరినన్ని చిరుచుక్కలు అతిసాంద్రములై యుండుటయే.

## తేజోవిషయమున ప్రథమగణ్యములైన నక్షత్రములు (First Magnitude Stars)

ఈమాసములో రాత్రి తొలిజామున నగపడు నీ నక్షత్రములు పది యున్నవి. అవి యేవేవి అనగా,

౧. స్వాతి (Arcturus)
౨. చిత్ర (Spica)
౩. మఘ (Regulus)
౪. మృగవ్యాధుడు (Sirius)
౫. పూర్వశ్వానము (Procyon)
౬. అగస్త్యుడు (Canopus)
౭. అర్ధనారీశ్వరుడు / సాంబమూర్తి } (Pollux)
౮. ఆర్ద్ర (Betelgeaux)
౯. రిగెల్ (Rigel)
౧౦. రోహిణి (Aldebaran)

## తూర్పున

కుమ్మరిసారెవంటి ఆకారముగల ఐదు ఆరునక్షత్రములతో విశాఖ ఇప్పుడే ఉదయించినది. దీనినే శ్రీనాథమహాకవి "చిలుకతపోయిన మూకుడువలె" నున్నదని వర్ణించినాడు. దీని కెనువను శేషమండలమును, హరికులేశ (Hercules) మండలమును ఇప్పుడిప్పుడే పొడసూపుచున్నవి. ఆగ్నేయదిశను అశ్వతరమండలము కొంతవఱకు ఉదయమైనది. దానికెనువను నహుషుడును, నహుషుని కుత్తరముగా తోరణస్తంభములనాసన చిత్ర, స్వాతి నక్షత్రములును మెఱయుచున్నవి. ముత్యమువలె చిత్రయు, పగడమువలె స్వాతియు మెఱయుచుండగా, మధ్యను, చిత్రసమీపమున వక్రగతుడైన గురుడు క్రమముగా హస్తకుకు పోవుచున్నాడు. అఖండతేజముతో మెఱయు నీగురుగ్రహమునకు సమీపమున దక్షిణముగా చిత్రయు, ఉత్తరమున కొంతదూరమున స్వాతియు ప్రకాశించుచు నగపడు రమ్యదృశ్యము ఈ నెలయంతయు చూడనగును. విశేషించి దిక్చక్రము (Horizan) మీదుగా నిపుడే ఉదయించిన విశాఖ ఇంద్రాగ్నిదైవత్యమైన విశాఖ-అగ్నివేదికవలె గుండ్రమైన యాకారముగల విశాఖ-అడుగునను, కన్యరాశిపైనను అగపడుట గమనించి, ఆయంశమునే గైకొని, 'కన్య అగ్ని కుండసముద్భవ, అయోనిజ' అని భారతకారుడు వర్ణించిన వర్ణన చక్కగా గ్రహించి యానందించుటకు మంచియవకాశమిపుడు లభించినదని విన్నవించుచున్నాను. ఈ కన్య వ్రేలి నలంకరించిన యుంగరమునందలి మేటివజ్రము


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లాగున 'చిత్ర' నక్షత్రము మెఱయుచున్నదని ఇంకొకరు వర్ణించినారు. మెచ్చదగిన ఈవర్ణనయందలి సారస్యమును గ్రహించుటకుగూడ ఇపుడే అనుకూలముగా నుండును.

### ఉత్తరమున

క్రతు, పులహ, పులస్త్య, అత్రి, అంగీరస, వసిష్ఠ, మరీచి అను నామములుగల సప్తఋషులు బాగుగా ఉదయించినారు. అందు క్రతుపులహులు ఇంచుమించుగా గగనమధ్యమును చేరుకొన్నారు. పులహ-క్రతు రేఖ సూటిగా ధ్రువుని చూపుచున్నది. ధ్రువుడు లఘుఋక్షపుతోకచివరను ప్రకాశించుచున్నాడు. ధ్రువున కెగువను కశ్యప, మహేంద్రులును, తోక మొదట అగ్నియు, అగ్నికి తూర్పుదెసను ధాత-విధాతలును, ఆవల మిత్రుడును కానవచ్చుచున్నారు. ఈలఘుఋక్షపు చుక్కలకు ఉదయాస్తమయములు లేవు. సప్తఋషులు, అనగా బృహదృక్షమునందలి అంగీరస, వసిష్ఠనక్షత్రములకు ఎదురుగా, లఘుఋక్షమునందలి ధ్రువరక్షకులు-ధాతవిధాతలు కానవచ్చుచున్నారు. ఈరెండు ఋక్షములకు మధ్యను మెలికెలు తిరిగి, వక్రరూపముతో నరకుడు కానవచ్చుచున్నాడు. నరకునితోక క్రతుఋషి కడను, శిరస్సు ఉత్తరసమీపపు ఈశాన్యమునను చూడనగును.

### మధ్య

ఇపుడు గగనమధ్యమున మఘానక్షత్రము మెఱయుచున్నది. కొడవలివలె చూపట్టు వక్రపు చుక్కలలో పిడియుండు స్థానమున నీమఘానక్షత్రమున్నది. అది మన సూర్యునికంటె వేయిరెట్లు అధిక తేజముగల నక్షత్రము. అందునుండి వెడలిన వెలుతురు కిరణములు మనభూమిని చేరుకొనుసరికి ౧౫౩ సంవత్సరములు పట్టును. అనగా టిప్పుసుల్తాను రాజ్యమేలినపుడు మఘనక్షత్రమునుండి బయలుదేరిన వెలుగుకిరణములు ఒక క్షణమునకు లక్షయెనుబదియారుమైళ్లచొప్పున ఎడతెగకుండ ప్రయాణముసాగించి వచ్చివచ్చి యీనాటికి మనభూమిని చేరుకోగలుగుచున్నవి.

మఘ సింహరాశిలోనిది. సింహము మెడకు కట్టిన పతకములోని వజ్రములాగున నది మెఱయుచున్నది. ఇది యారాశిలోని 'ఆల్ఫా' నక్షత్రము. అందుల 'బీటా' నక్షత్రము మన ఉత్తరఫల్గునీనక్షత్రమే. అది తోకచివర నున్నది. పూర్వ మది విశేషతేజస్సుతో మెఱయుచు First Magnitude Star అయి యుండినట్లు మన ప్రాచీనగ్రంథములలోనేకాక, ముసల్మాన్‌సిద్ధాంతుల గ్రంథములలోగూడ చెప్పబడినది. అట్టిచుక్క తొంటితేజము గోల్పోయి యిపుడు ఒక మోస్తరుగా కనబడుచున్నది. ఈయుత్తరఫల్గునియు, చిత్రయు, స్వాతియు- మూడును ఒక సమత్రిభుజము (Equilateral triangle) గా నేర్పడుట గమనింపదగియుండును.

మఘమీదుగా, తూర్పునకు వ్రాలియున్న నక్షత్రమును 'గామాలియో' అని పాశ్చాత్యులు చెప్పుదురు. దానినే కేత్కారుపండితులు శృంగనక్షత్ర మనిరి. అది సింహముయొక్క శిరోభాగమున మెఱయుచుండును. మఘకు పశ్చిమభాగమున పొట్లపూవువలె పుష్యమి వ్రాలియున్నది. ఆదిగువను ఆశ్రేషసర్ప మున్నది. ఆశ్రేషను గలిసి అహి, నహుషమండలములు తూర్పునకు వ్యాపించియున్నవి. పుష్యమికి ఎగువను మూషికసహితుడైన విఘ్నేశ్వరు డున్నాడు. మిథునరాశియు, దాని కెగువను సారథిమండలమును పాలవెల్లిప్రక్కనే చూడనగును. ఇవికూడ పడమటకు వ్రాలియేయున్నవి.

### వాయవ్యము-పడమటదిక్కులను

వాయవ్యమూలను కల్పవృక్షమునీడను అప్సరసలస్తమించుచున్నారు. దిగువ పాలవెల్లిలో భృగుపరశుమండలమును, దిగువ పులోముడును త్వరలోనస్తమింతురు. అశ్విని, భరణి అస్తమించినవి. కృత్తికలును త్వరలో నస్తమింపనైయున్నవి. రోహిణీనక్షత్రము ఒక నేత్రముగా గలిగి రెండుపాదములు, కొమ్ములు చూపుచు దుముకుచున్నట్లున్న వృషభరాశిస్వరూపము ఇపుడు చక్కగా చూడనగుచున్నది. దిగువను ఒరయన్ యోధుడును త్వరలో నస్తమింపనైయున్నాడు. రిగెల్ చుక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమీపమున పుట్టిన ట్లగపడు యమునానదియొక్క మొదటిభాగము తప్ప శేషించిన దంతయు నస్తమించినది. ఒరయన్ దిగువ శశకముకూడ ఇక త్వరలో నస్తమించును. పాలవెల్లికి పడమటను మృగవ్యాధునితో కూడిన శ్వానమండలము ఒరయన్ దిగువ నున్నది. వాసుకి, కవ్వపుత్రాడుగా చుట్టిన మందరగిరి పాలసముద్రమున తేలియాడుచున్నది.

## దక్షిణాకాశమున

ఇపుడు ప్రధానముగా చూపట్టుచున్నది నౌకామండలము. ఋగ్వేదమునందే ఇది 'దైవీమ్నావామ్' అని వర్ణింపబడినది. ఇందు నాలుగు భాగములకు నాలుగు ప్రత్యేకనామము లున్నవి. (Argo Navis has four parts)

Malus = Mast స్తంభభాగము

Vela = Sails తెరచాపలభాగము.

Carnia = Keel అధోభాగము, లేక పృష్ఠభాగము.

Puppis = Poop అమరము, లేక వెనుకప్రక్కభాగము.

ఈయోడచుక్కాని త్రిప్పుచు అగస్త్యుడు నడుపుచున్నట్లుండును. గ్రీకుగాథలలో కేనోపస్ (Canopus) అనబడునీనక్షత్రము మెనిలాస్ (Menelaus) రాజుయొక్క ఓడచుక్కాని త్రిప్పువాడని చెప్పబడినది. ఈ యగస్త్యుడు మన సూర్యునికంటె అరలక్షరెట్లు తేజోధికమైన మహాగోళమని నేటిసిద్ధాంతులు గుణించిరి. ఈ చుక్క మృగవ్యాధరుద్రుని దిగువ దక్షిణాకాశమున నగపడును. నౌకామండలమున కెగువను, అహిమండలమునకు దిగువను వల్మీమండలము గలదు. దీనినిగూర్చిన గాథలు శ్రీముఖ చైత్రమాసభారతి ౬౩౬-౬౩౭ పుటలలో వివరించినాను. అహిమండలముపైనున్న చమస, గ్రావమండలముల గాథలును అందే చూడనగును. కన్యదిగువ వార్తికపుగాథలును వెనుక వర్ణింపబడినవి.

## గ్రహములు

ఈ మాసములో రాత్రి తొలిజామున గురుడొకడే కానవచ్చును. ఇతరగ్రహములు కానరావు. గురుడును చిత్రసమీపముననే వక్రించి హస్తవరకు వెనుకకు రాగలడు. కాబట్టి ఈ మాసములో గురుడు చిత్ర, హస్త నక్షత్రములమధ్యనే కనబడును.

## విశేషవిషయములు

౧. ఆర్ద్ర - ప్రవాళ మేకమ్-పగడమువంటి ఒక్క ఎఱ్ఱని నక్షత్రము. దీనినే వేదములు "బాహూ" నక్షత్రమనియు, పాశ్చాత్యులు Betelgeaux అనియు చెప్పుదురు. దీనివెలుగు మనకు చేరుసరికి ౧౮౦ సంవత్సరములు పట్టును. దీని వ్యాసము (Diamet r) ౨౬ కోట్ల 30 లక్షల మైళ్లు: అనగా మన సూర్యగోళపు వ్యాసముకంటె మూడువందలరెట్లు పెద్దది.

## రోహిణి (Aldebaran)

దీనివెలుగు మనకు చేరుసరికి 30 సంవత్సరములు పట్టును.

## పరివృక్త (Bellatrix)

రోహిణికి దిగువను, ఆర్ద్రకు ౧౦ డిగ్రీల దూరమునను పాశ్చాత్యులచే బిలాట్రిక్సు (Bellatrix) అని చెప్పబడుచున్న చుక్క యొకటి కలదు. నాలుగు మంచపుకోళ్లవలె గొల్లకావిడిచుట్టునున్న ఒరయన్ చుక్కలలో నిది వాయవ్యమూలచుక్క. దీనికి గల బిలాట్రిక్సునామమునకు అర్థము వీరవనిత (Woman Warrior), యుద్ధముచేయగల స్త్రీ. ఈచుక్కకుసంబంధించినదని చెప్పదగిన వేదగాథ యొకటి కలదు. దానినిట సంగ్రహముగా వ్రాసెదను. (చూ. ఋగ్వేదము దశమమండలము, ౧౦౨-వ సూక్తము.)

ముద్గలుడనుఋషి యొకడుండెను. అతనికి ముద్గలాని అనుభార్య యుండెను. ముద్గలానికి సంతానము కలుగలేదు. వంధ్యయైన భార్యను విడిచి అతడు వేరొకభార్యను వివాహమయ్యెను. ఒకప్పుడు చోరులచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముద్గలుని గోవులు హరింపబడెను. ఒక్క ముసలియెద్దు మాత్రమే మిగిలెను. ఆయెద్దును తన రథమునకు కట్టి, ముద్గలుడు దొంగలవెంట పోవుటకు సిద్ధపడెను. వంధ్యయు, పరివృక్తయు నైన ముద్గలాని భర్తరథమునకు సారథియై శత్రులతో పోరుటకు భర్తతో వెడలెను. [సంతానవతులుగాక వంధ్యలైన స్త్రీలు ఆదోషపరిహారార్థము వీరవనితలై భర్తలతోకూడ శత్రువులపై యుద్ధమునకు వెడలి, రథమునడిపియు, శత్రులతో పోరి వధించి శత్రుధనమును గైకొని భర్తలకు సమర్పించియు వారి యనుగ్రహమును బడయుచుండిరి. ఇట్టి వీరవనితలకు పరివృక్తలని పేరుండెను. ఇటీవలి కథలలో దశరథుని భార్యయగు కైకయు, కృష్ణుని సత్యభామయు నిట్టివారలే యనవచ్చును.]

ఇట్లు యుద్ధసన్నద్ధులై యాదంపతులు చోరుల వెంట బడిరి. ముద్గలుని చేతిలో 'ద్రుఘణ' మను నాయుధ ముండెను. ద్రుఘణ మనగా గుదియ, లేక గదవంటి ప్రహరణసాధనము. ముద్గలుడా ద్రుఘణమును విసరగా అది చోరులున్న చోట పడెను. ఆదంపతులు వారలతో పోరి జయించి తమగోవులను తిరిగి తెచ్చుకొనిరి.

ఇదే నిరుక్తము IX-౨౩ లో ఇట్లు వర్ణింపబడినది: "ముద్గలో భార్మ్యశ్వ ఋషి ర్వృషభంచ ద్రుఘణంచ యుక్త్వా సంగ్రామే వ్యవహృత్యాజిం జిగాయ" మఱియు బృహద్దేవత VII-౧౨ లో ఇట్లు వర్ణింపబడినది. "ఆజావనేన భార్మ్యశ్వ ఇంద్రా సోమాతు ముద్గలః అజయ ద్వృషభం యుక్త్వా ఐంద్రంచ ద్రుఘణం రథే"

ఈ కథ పశ్చిమాకాశమున నక్షత్రరూపమున నెట్లు చిత్రింపబడినదో గమనింతము:

ఉత్తరమున సారథిమండలమున రథము గమనింపుడు. పశ్చిమమున కృత్తిక $\frac{3}{4}$ + రోహిణి + మృగశిర $\frac{1}{2}$ గల వృషభమును గమనింపుడు. అచట మృగశిర చుక్కలం జూడుడు. మృగము మాయామృగము. వృత్రుడు మాయామృగశిరస్కుడు, చోరుడు. మృగశిర సోమదైవత్యమగుటచేత గమనింపుడు. ఆర్ద్రకె పవను గదవంటి రూపముగల ఆయుధ మొకటి గలదు. ఇది ఒరయన్(Orion) యోధుని చేతిలోని బడితెవలె కొన్ని పటములందు చూపబడినది. [చూ. భారతి, ఆంగీరస మార్గశిరమాసము ౯౨౧ పుట. ఒరయన్ యోధుని చిత్రము.] ఈగాథలో ముద్గలుడు ద్రుఘణ, వృషభయుక్తమైన రథము నెక్కి ముద్గలుడును, అతనిభార్య ముద్గలాని పరివృక్తయు వెడలినట్లు గలదు. పాశ్చాత్య గాథలలో Bellatrix అని వర్ణింపబడిన Woman Warrior వేదకాలమునాటి 'పరివృక్త'యే. ఆవీరవనితయే ఈవీరవనిత యని మనవిచేయుచున్నాను. ఋగ్వేదమునందలి యీ ఋక్కులలో రెండుమూడు మంత్రము లీక్రింద వ్రాసి యీగాథ ముగించుచున్నాను.

"ఇమంతం పశ్య వృషభస్య యుంజం కాష్ఠాయమధ్యే ద్రుఘణం శయానం..." X-౧౦౨-౮.

ఈవృషభ మెట్టిదనగా:

"...నస్మై తృణం నోదకం మాభర న్త్యుత్తరో ధురోవహతి ప్రదేదిశాత్." X ౧౦౨-౧౦.

ఆవృషభమునకు గడ్డి, నీరు పెట్టరు. అది ఉత్తరమున ధ్రువమున కతీతమై దిశలు చూపును.

"పరివృక్తేవ...ఏషైస్యాచి ద్రథ్యా జయేమ సుమంగలం సినవదస్తు సాతం" X ౧౦౨-౧౧.

## రాసులు

పడమటి సమీపపు వాయవ్యమునుండి, తూర్పు సమీపపు ఆగ్నేయమువఱకు వరుసగా వృషభ, మిథున, కర్కటక, సింహ, కన్యా, తులా రాసులు వ్యాపించి యున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఉల్కాపాతములు

ఈనెల ౨౧-వ తేదీ మొదలు ౨౩-వ తేదీ వఱకు రాత్రి బ్రహ్మనక్షత్రసమీపము (Vega) నుండి తేజోవంతములైన ఉల్కలు వేవేగ రాలగలవు. అవి బంగారు ఛాయగల ధవళకాంతితో వెలిగి రాలుచుండును. ఈ యుల్కాపాతమునకు కారణము సిద్ధాంతులు ఇట్లు చెప్పుచున్నారు. ౧౮౬౧ లో కనబడిన గొప్ప తోకచుక్క ఖండఖండములై చరించుచున్నది. మన భూగోళము సూర్యునిచుట్టు తిరిగివచ్చుటలో ఆతోకచుక్క శకలములు తారసిల్లినపుడు, ఆశకలము లీభూమిపై నా తేదీలను ఉల్కలై రాలుచున్నవి. ఇవిగాక ఈమాసములో మరిమరి చిల్లర ఉల్కాపాతములు లేవు.

[Gama Leo - సింహరాశిలో 'గామా' గుర్తు గల చుక్క. శృంగనక్షత్రము మాడనగును. నవంబరు నెలలో ఉల్కలు దీని సమీపమునుండియే రాలుచున్నట్లు కనబడెను.]

---

## సెలవుదినములలో-ఉబుసు పోనివారి షికారుసౌఖ్యము




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సాళువ తిమ్మరుసుమంత్రి

కుంపూరి ఈశ్వర దత్తు

"ఏమంత్రిమణి నిజస్వామికార్యక్రియా
తత్పరమానసోత్సాహశాలి
యేమంత్రిమణి మిత్రహితబాంధవాశ్రిత
ప్రకరరక్షణకళా ప్రౌఢబుద్ధి
యేమంత్రిమణి వచోహేలాతినైర్మల్య
శీతలతాధూత శీతరోచి
యేమంత్రిమణి సుధాధామశాంభవదామ
ధాళధళ్యసుతుల్య ధవళకీర్తి
యట్టి మంత్రివులోత్తంసమహిత నృపతి
పటల మకుటాగ్ర ఘటితపత్పద్మయుగళి
సకలకర్ణాట రక్షావిచక్షణుండు
సీనసురశాఖి సాళువ తిమ్మమంత్రి."

—రాజశేఖరచరిత్రము

"కరచరణాదు లందఱకుఁ
గల్గినయంతటనే సమర్థతఁ
మెఱవసిగాంచనేర్తురె
మనీషవరుల్ ధరలోన నెవ్వ రి
క్కరణి ఘటించుచుం గృతయు
గంబునఁ ద్రేతను ద్వాపరంబునం
దరయఁగ సాళ్వతిమ్మసచి
వాగ్రణికి న్సరిమంత్రి గల్గునే?"

—కృష్ణరాయవిజయము

"శ్రీయశోనిత్యుండు శ్రీకృష్ణదేవ
రాయసామ్రాజ్యభార ధురంధరుండు
బలవదారాతి భూపతినుతపాద
తలుఁడు సాళువ తిమ్మదండనాయకుఁడు."

—కృష్ణార్జునసంవాదము.

విజయనగరసామ్రాజ్య మేలిన తుళువరాజవంశ భూపాలురకమాత్యశ్రేష్ఠుఁడు సాళుఁతిమ్మరుసు. ఈ మంత్రిశిఖామణి యార్వేలనియోగి బ్రాహ్మణ కులోత్తంసుఁడు; కౌండిన్యసగోత్రుఁడు; వేమరాజునకుఁ బౌత్త్రుఁడు; రాచిరాజునకుఁ బుత్రుఁడు.* ప్రబంధముల యందును, శాసనములందును సాళ్వతిమ్మనృపతి యనియు, తిమ్మమంత్రియనియు, తిమ్మయ్యాయనియు, తిమ్మయ్యంగారనియుఁ బేర్కొనఁబడినను, తిమ్మరుసు నిజమైననామము తిమ్మరాజై యుండును. కర్ణాటక భాషలో 'అరుసు' శబ్దమునకు రాజని యర్థము. తిమ్మరుసనఁగా తిమ్మరాజు. ఇతని తండ్రితాతల యుదంతము గాని, జన్మస్థలముగాని తెలుసుకొనుట కాధారములు లేవు.

## వీరనరసింహరాయలు - తిమ్మరుసుమంత్రి

తిమ్మరుసుమంత్రినిగూర్చి చరిత్రకారులకుఁ దెలిసిన మొదటిచరిత్రాత్మకవృత్తాంతము ఇమ్మడి నరసింహరాయలకాలమునాఁటి విరించిపురశాసనము. ఆశాసనము ఆంగ్లమానము క్రీ. శ ౧౪౯౬-వ సంవత్సరము.† తరువాత నీతఁడు వీరనరసింహరాయల సచివాగ్రణియని తాడిపత్రిశాసనములవల్లఁ దెలియుచున్నది.

* Epigraphia Indica, Vol VI. page 234. Line 24.

తిమ్మరుసుమంత్రి మేనల్లుఁడగు నాదిండ్ల అప్పామాత్యున కంకితము గావింపఁబడిన రాజశేఖరచరిత్రములో మాదయగారి మల్లనకవి ద్వితీయాశ్వాసాంతమున నప్పామాత్యుని నియోగిబ్రాహ్మణుఁ డని వర్ణించెను.
సుగంధి: "పారదప్రభాళిభాసిభద్ర కీర్తివాహినీ పూరదానధూత దివ్యభూజ కామధేనుదు
ర్వార యాఱువేల వంశవార్ధి పూర్ణచంద్రమా సారబుద్ధి జాల నీతశత్రుభూమిభృద్రమా."

† South Indian Inscriptions, Vol I, No. 115.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మొదటి శాసనము

"శ్రీ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరనరసింహరాయ మహారాయలు విజయనగరమందు పృథివీరాజ్యం శేస్తుండంగాను తత్పాదపద్మారాధకులైన శ్రీ మన్మహాప్రధాన సాళువతిమ్మయంగారు సత్తిరాజ్యంలో పెంన్నబడి తాడిపరతి రామేశ్వరదేవరకు దండంపెట్టి సమర్పించిన గ్రామ భూదానశాసనం.

(శుక్ల సం॥ వైశాఖ శు ౧౫ శుక్రవారం)"

## రెండవ శాసనము:

ఈ శాసనముప్రకారము వీరనరసింహరాయల పుణ్యమునకుంగాను 'తిమ్మరుసు పెండ్లిసుంఖాలు సర్వమాన్యంగాను విడిచెను.' (Remission of the Marriage Tax)*

వీరనరసింహరాయలు వ్యాధిగ్రస్తుడై విజయనగరమందు స్వర్గస్థుడయ్యెను. అవసానకాలమునందు తన సచివాగ్రణియైన తిమ్మరుసుమంత్రిని పిలిపించి, తన మరణానంతరము రాజ్యమునకుఁ దన కుమారునికిఁ బట్టము గట్టుమనియుఁ, దనసోదరుఁడగు శ్రీ కృష్ణదేవరాయలకండ్లు తీయించి తనకుఁ జూపుమనియుఁ జెప్పెనట. తిమ్మరుసు కృష్ణదేవరాయలను బిలపించి యాతనికాసంగతి చెప్పెను. అందుల కాతఁడు తనకు రాజ్యకాంక్ష లేదనియు, తాను తురీయాశ్రమమును స్వీకరింతుననియుఁ జెప్పి, ఎట్లయినను కండ్లుపీకించి అంధత్వమును గలుగఁజేయవలదని వేఁడుకొనెను. తిమ్మరుసు సాపలుకు లాలించి, శ్రీ కృష్ణదేవరాయలె రాజ్యార్హుఁడని నిశ్చయించి, యొక మేకను జంపి దాని కండ్లను గైకొని కొనప్రాణములలో నున్న వీరనరసింహరాయలకుఁ జూపెనట. నరసింహరాయ లాకండ్లు సోదరుని నేత్రములే యని నమ్మి, మంత్రిశిఖామణి తన యాజ్ఞ శిరసావహించెనని సంతసించి, ప్రాణముల విడిచెనట.†

## శ్రీ కృష్ణదేవరాయలు : తిమ్మరుసుమంత్రి

శ్రీ కృష్ణదేవరాయల పరిపాలనారంభమున విజయనగర సామ్రాజ్యరాజకీయ వాతావరణము బీభత్సముగ నుండెను. సోదరుఁడగు వీరనరసింహరాయల కాలమున సామ్రాజ్యమునందంతటను వైరివిజృంభణ సంరంభము భయంకరరూపమును దాల్చియుండెను. గజపతు లొకవంకను, చంద్రగుప్తు లొకప్రక్కను, ఉమ్మత్తూరునాయకు లొకదిక్కునను జెలరేఁగి సామ్రాజ్యమును గబళింప సమకట్టుచుండిరి. గజపతులు ఉదయగిరిరాజ్యమును, కొండవీడురాజ్యమును స్వాధీనము గావించుకొనిరి. సాళ్వనరసింహరాయల జీవితాదర్శమగు రాయచూరు, ఉదయగిరి, కొండవీడు దుర్గముల సాధన మాతని మరణానంతరము సామ్రాజ్యమేలిన ధరాతలేశ్వరులు పూర్తిగావింపలేరైరి. శ్రీ కృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్య మధిష్ఠించినతర్వాత కొంత కాలము రాజ్యమునందలి పరిస్థితుల నవలోకింపుచు, సచివచూడామణి యగు తిమ్మరుసునొద్ద రాజ్యాంగ తంత్రము నేర్చుకొనుచుండెను. ఈమహారాజునకు మొదటినుండియు దిగ్విజయములందుఁ దోడ్పడి యాతని యశస్తేజోవిలాసములకు వన్నెఁదెచ్చిన మంత్రిసత్తముఁడు తిమ్మరుసు. రాయల కెప్పుడును దక్షిణభుజమై మెలంగుచు బాల్యమునుండియు నతనికి గురువై, అమాత్యుఁడై, దండనాయకుఁడై, సర్వకాలములందును గంటికి ఱెప్పవలె తోడైయుండి, కర్ణాటసామ్రాజ్యభారధురంధరుఁడై మెలంగినవాఁడు తిమ్మరుసు. సింహాసనారూఢుఁడైన యొకటిన్నరసంవత్సరమువఱకు రాయలు విజయనగరమునందె యుండి, రాజ్యపరిస్థితుల నరయుచుఁ దనకుఁ బూర్వము రాజ్యమేలిన రాజన్యుల శాసనములఁ గాంచుచుండెనట.‡ ఈ విషయమె కృష్ణరాయవిజయమునందు కుమారధూర్జటియు వర్ణించియుండెను:

---

* South Indian Inscriptions, Vol IV, Nos. 802, 803.

† Forgotten Empire. Chronicle of Nuniz, Pages 314-315.

‡ Forgotten Empire, page 316.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

" అప్ప యీవఱకును సింహాసనంబు
భారము నృసింహరాయలవారు బూన
నిర్భరత మంటి నాయండు నిర్వెగాన
నఖిలకార్యస్థితుల్ దెల్పుమయ్య యిపుడు "

" సింహాసనప్రభుశీల మేక్రియనుండు
పాలించు నేరీతి ప్రజలనెల్ల
బాంధవపరిజనప్రతతిఁ బ్రోచుట యెట్లు
ధనము లార్జించు సాధనము లేవి
యెటువలె వ్యయమొనర్పుటకును మర్యాద
యేదారి శత్రుల నేపణంప
నాత్మరక్షణ కర్తవ్యములుగు రెవ్వార లా
ప్తుల ననాప్తుల లెస్సఁ దెలియు టెట్టుల
రాజలక్షణ మెయ్యది రాజ్యలక్ష్మి
శాశ్వతంబుగ నుండు నేసరణి రాజ
నీతు లెన్ని విధంబులు నిఖిల మెలమిఁ
దెలుపు మెంతయు నామది తేటపడఁగ. "

—కృష్ణరాయవిజయము, ద్వి ప. ౮౭, ౮౮.

ఇట్లు రాయలు కొంతకాలము తన మంత్రి యొద్ద రాజ్యకార్యనిర్వాహణాదివిశేషముల నెన్నియో గ్రహించెను. తనకుఁ బూర్వ మేలిన మహారాజుల శాసనములఁ జదువునపుడు తనతండ్రియగు నరసింహరాయల యభీష్టము తెలియఁ గొలిగించు నొకశాసనమును జూచెనట. దానిలో రాయచూరు, ముదుగల్లు, ఉదయగిరి దుర్గముల శత్రువులపాలనుండి జయింపఁబడ లేదనియుఁ, దన కుమారులలో నెవ్వరైనను నా దుర్గత్రయమును సాధించి విజయనగర సామ్రాజ్యములోఁ జేర్పవలయు ననియు శాసింపఁబడుటఁ గాంచి రాయ లాదుర్గములను జయించుటకు నిశ్చయమును గావించుకొనెను.*

## రాయల దిగ్విజయములు

గజపతిరాజ్యములోని ఉదయగిరి, అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము, కొండవీడు దుర్గములను జయించుటయు, కళింగదిగ్విజయమును, ఆంధ్రకావ్యములైన పారిజాతాపహరణము, మనుచరిత్రము, ఆముక్తమాల్యద, కృష్ణరాయవిజయములందును, శ్రీకృష్ణదేవరాయల దానశాసనములైన, ఉదయగిరి, అమరావతి, ధరణికోట, కొండవీడు, సింహాచలము, బెజవాడ శాసనములందును వర్ణితములు. ఆదిగ్విజయముల ప్రశంస యిచ్చట అప్రస్తుతముగావున వ్రాయలేదు. ఆదిగ్విజయము లన్నిఁటికిని ముఖ్యకారణములు తిమ్మరుసుమంత్రి కార్యకళాధురంధరత్వమును, రాజనీతి విజ్ఞానమును గాక మఱియొకటి కాదు.

## తిమ్మరుసు ప్రతిభా విశేషము

శ్రీ కృష్ణదేవరాయనికి సమకాలికుఁడైన డామింగో పేయస్సను పోర్చుగీసుచరిత్రకారుఁడు తిమ్మరుసును గూర్చి యిట్లు దెలిపియున్నాఁడు:

"Salvatinica, who is the principal person that enters the building, supervises the whole, for he brought up the king and made him the king and so the king looks on him like a father. Whenever the king calls to him he addresses him as Lord (Seaher) Salvatinica" and all the Captains and nobles of the realm make Salam to him".

("సాళ్వతిమ్మయ యందఱిలో నగ్రగణ్యుఁడు. అతఁడు ప్రాసాదములోనికిఁ బ్రవేశించి, యంతయును బరీక్షించును. అతఁడె రాజును బెంచి పెద్దవానిని జేసి, రాజుగా నొనర్చెను. రా జెప్పు డతనిని బిలచినను 'సాళ్వతిమ్మప్రభూ' అని హెచ్చరించును. సామంత ప్రభువు లాతనికి నమస్కరింతురు.†)

ఆకాలమునాఁటి మంత్రులందఱును మహాప్రధానులేగాక దండనాయకులుగాఁగూడ నుండిరి. కృష్ణార్జున సంవాద కావ్యమునందు తిమ్మమంత్రి తిమ్మదండనాయకుఁడుగా వర్ణింపఁబడెను. కొండవీడుశాసనము ననుసరించి తిమ్మరుసుమంత్రి గజపతిని పొట్నూరు దుర్గ

* Forgotten Empire, Page 316.

† Forgotten Empire Page 268.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును స్వాధీనముగావించుకొనె నని తెలియుచున్నది. * కళింగదిగ్విజయమునందు సైన్యనివహములతోఁ దాను గూడ నుండి రాయలకు జయమును జేకూర్చినది తిమ్మరుసుమంత్రియే.

శ్రీకృష్ణరాయల సైన్యాధ్యక్షులలో నొకఁడగు సింగరాజు తన బెజవాడశాసనమునందు తిమ్మరుసు మంత్రి నిట్లు వర్ణించియున్నాఁడు:

౬౦. ఇహకిల జగతి సకలరిపుకుల మవ
౬౧. జిత్య జయస్తంభమధిపొట్టునూరు
౬౨. నిధాయ నిజవశే గజతురగబల మఖి
౬౩. లరాజ్యం ప్రాజ్యంచ యవనపతే రఖిలా
౬౪. [o] విజిత్య దిశో విజయనగర మాసాద్య మ
౬౫. ణిమయ మారుహ్య సింహాసన మఖిల
౬౬. మపి భువనభారం మూర్తిమతి విశ్వా
౬౭. సనివాసే నిఖిలసుణానా మతితపన
౬౮. ధామ్ని సాళ్వతిమ్మనామ్ని మంత్రిణి పాతి
౬౯. తిజిప సురమంత్రిణి నిధాయ పద
౭౦. వాక్యప్రమాణ పారావార పారదృశ్వనాం
౭౧. ప్రతివిబుధపలాలమాత రిశ్వనాం మ
౭౨. నీషిణామపి కావ్యనాటకాలంకారభా
౭౩. షావిశేషవేదినాం, చతుర్విధకవితాసా
౭౪. మ్రాజ్య మధితిష్ఠతాం కలిదీమప్యపరే
౭౫. షామపి విద్యావతాం [మ] హతాం గోష్ఠీషు [గరిష్ఠాషు]
౭౬. సతత మవనీవనీపకమనీషిత పూరణేషుచ
౭౭. మనో నిధాయ నిరవధిక మతులవనీసామ్రా
౭౮. జ్యసుఖ మనుభవతి...†

## ధరణీవరాహ బిరుదాంకమండనుఁడు

ప్రభువుయొక్కయు, ప్రధానియొక్కయు శరీరము లొక్కటియే యనియు, నితఁడు ధరణీవరాహ బిరుదాంకుఁడనియు తిమ్మరుసుమంత్రిబాపట్ల శాసనము వల్లఁ దెలియుచున్నది. శ్రీకృష్ణదేవరాయలకు మంత్రిశేఖరునియందలి వాత్సల్యము, గౌరవప్రేమాతిశయములను, తిమ్మరుసునకు రాయలయెడఁ గల పుత్త్రివాత్సల్యమును, స్వామిభక్తి పరాయణత్వమును దెలుపుటకీయొక్క శాసనము చాలును. ఆ శాసనములోని ముఖ్యాంశములఁ జూపుచున్నాఁడను.

౭. అభవత్ప్రీతిపవం శేఖండ్డనో ధరణీవరా
౮. హబిరుదాంక్కమండ్డనః సకలప్రధానప
౯. ణగౌరవోన్నతః సచివోస్యదేహఇవ సా
౧౦. శ్వతిమ్మయ్యః॥‡

సాళ్వతిమ్మరుసుమంత్రి వీరసింహుఁడును, అమాత్యశేఖరుఁడును నాటయేకాక పండితశ్రేష్ఠుఁడుగాఁ గూడఁ గన్పట్టుచున్నాఁడు. ఇతఁడు అగస్త్యకృత చంపూభారతమునకు వ్యాఖ్యరచించెను. ఆచంపూభారతవ్యాఖ్యకు గద్య యిట్లున్నది:

"ఇతి శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర కర్ణాటేశ్వర శ్రీకష్ణరాయశిరః ప్రధానసకలాగను పారావారపరీత సాళ్వతిమ్మయదండనాథ విరచితాయాం బాలభారతవ్యాఖ్యాయాం మనోహరాఖ్యాయాం పంచమసర్గః"♦

ప్రబోధచంద్రోదయవ్యాఖ్య రచించిన నాదిండ్ల గోపమంత్రి తన మాతులుఁడగు తిమ్మరుసుమంత్రి నిట్లభివర్ణించెను:

'తస్య శ్రీకృష్ణరాయస్య
ప్రాజ్యరాజ్య ధురంధరః
కులక్రమాగతో మంత్రీ
సాళ్వతిమ్మచమూపతిః
ఆపూర్వపశ్చిమసముద్ర మవత్త రాజ్యం
. ఆసేతు సింహగిరి చాప్రతిమప్రతాపః

---

* Kondavidu Inscription, Epigraphia Indica, Vol. VI Page 230.
† South Indian Inscriptions Vol. IV No. 789 Lines 70-78
‡ South Indian Inscriptions Vol. VI No. 146.
♦ Sources of Vijayanagar History, page 143.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యః కృష్ణరాయ నృపపాలక దండనాథః
కాండిన్యగోత్రతిలకః కవిపారిజాతః '*

## తిమ్మరుసు బంధుకోటి

తిమ్మరుసుమంత్రి రాజ్యచక్రము త్రిప్పుచుండుటచేఁ గాఁబోలు నతని బంధువులుకూడ విజయనగర సామ్రాజ్యమునందు మంచిపదవుల నలంకరించియుండిరి. ఈతని తమ్ముఁడు సాళువగోవిందరాజు గుత్తిదుర్గమున కధికారిగా నుండెను. తరువాత నతఁడు హొయిసల సీమలోని తెరకనంబిసీమకు నాయకుఁడుగా నుండెను. కొంతకాలము విజయనగరపట్టణ పరిపాలకుఁడుగా నుండెను.† తిమ్మరుసు భార్యపేరు లక్ష్మమాంబ. ఆమెఁ డామెయందు తిరుమలాంబిక యను నొక కుమార్తెను గాంచెను. తిరుమలాంబికను తిమ్మరుసు తన మేనల్లునకే యిచ్చి వివాహము గావించెను. అతఁడె రాజశేఖర విలాసకృతి పతియైన నాదిండ్ల అప్పామాత్యుఁడు. అప్పామాత్యుని సోదరుఁడు గోపనమంత్రి. అప్పామాత్యుఁడు కొండవీడు దుర్గాధ్యక్షుఁడుగా నియమింపఁబడెను.♦

గోపనమంత్రి గుత్తిదుర్గాధ్యక్షుఁడుగా నియమింపఁబడినట్లు రాజశేఖరచరిత్రమునందు వర్ణింపఁబడెను.

" స్థాపితరాజ్యవైభవ ని
రాకృతపాక విరోధియైన యా
గోపనమంత్రి ధర్మఘన
గోపనసమ్మతి గుత్తిదుర్గల
క్ష్మీ పరిపాలనక్రమస
మిద్ధభుజాబలశాలి రూపరే
ఖాపరమత్స్య లాంఛనుఁడు
యావహకార్య ధురంధరుం డిలన్."

గోపమంత్రి ప్రబోధచంద్రోదయమునకు వ్యాఖ్యయును, కృష్ణార్జున సంవాద మను ద్విపదకావ్యమును వ్రాసెను. ఈ రెంటియందును దాను తిమ్మరుసుదయచేఁ గొండవీడు దుర్గాధ్యక్షుఁడుగ నియమింపఁబడినట్లు వ్రాసికొన్నాఁడు.

" వరగుణాకరుఁడు విశ్వంభరాచక్ర
పరిపూర్ణ యశుఁడు గోపప్రధానుండు
దండితాహిత మహీధవసాళ్వతిమ్మ
దండనాయకుని సంతతకృపామహిమ
వినుతికెక్కిన కొండవీటిదుర్గంబు
ఘనత నేలుచు సొంపుగా నొక్కనాఁడు "§

గోపన మంత్రిసోదరుఁడగు అప్పామాత్యుఁడు కొంతకాలము మైసూరులోని సాలూరు సీమపరిపాలకుఁడుగా నుండెను.¶ ఇట్లు సామ్రాజ్యపరిపాలనమునందు తిమ్మరుసుకాలమున నాంధ్రనియోగిబ్రాహ్మణుల పలుకుఁబడి యెక్కువగా నుండెను. ఉద్యోగములు తిమ్మరుసుబంధుకోటికే లభించుచుండెను.

## తిమ్మరుసుకాలమునాఁటి విజయనగర సామ్రాజ్యవైభవము

విజయనగరసామ్రాజ్యము తిమ్మరుసుమంత్రిపరిపాలనమున మహావైభవోన్నతిని గాంచెను. సామ్రాజ్యము ఆసేతుసింహగిరి పర్యంతము వ్యాప్తిగాంచెను. రాజధానీనగరము వైభవమునందును, వైశాల్యమునందును బశ్చిమఖండమునందలి రాజధానీనగరములేవియు

* Sources of Vijayanagar History, pages 145.

† Epigraphical Collections No 340 of 1892.
Epigraphia Carnatica Volume IV, Introduction, page 25
Forgotten Empire, page 284

♦ Epigraphia Indica Vol. VI, P. 111.

§ Sources of Vijayanagar History, Page 150.

¶ Epigraphia Carnataica Vol. IX No. II.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాటిరానని పొగడ్తగాంచెను. శ్రీ కృష్ణదేవరాయల కాలమున 'పేయస్' అను పోర్చుగీసుదేశజుఁడు విజయ నగరమును సందర్శించి యా నగరవైభవమును వ్రాసి యున్నాఁడు. ఆతఁడు వర్ణించినభాగము ఆంధ్రచరిత్ర చతురానన బిరుదాంకితులగు శ్రీ వీరభద్రరావు పంతులు గారి 'జీర్ణకర్ణాట రాజ్యచరిత్రము'నుండి నేను వ్రాసిన 'జీర్ణవిజయనగర చరిత్రము' నం దెత్తి వ్రాసితిని. ఆవర్ణన భాగము చదువరులు పఠింతురుగాక. *

## రాయలరాజనీతి-మంత్రుల కుండవలసిన లక్షణములు

శ్రీ కృష్ణదేవరాయలు 'ఆముక్తమాల్యద' నాల్గవ యాశ్వాసములో రాజనీతి తెలియఁ జెప్పుచు, నందు మంత్రుల నెట్టివారిని నియోగింపవలెనో వెల్లడించెను.

"దుర్గము లాప్తద్విజవర
వర్గమునకె యిమ్ము దుర్గవర్తి తతిక
త్వర్గళ ధరాధిరాజ్యవి
నిర్గతి సాధ్వసతపోడము నిలుపకు కొలఁదిన్."
(ప. ౨౦౭)

"బాహుజాంఘ్రిజముఖబిడంబనకునయిన
గొలిచి మనువిప్రధర్మంబు దెలిసియైన
బూని సంకటముల నిల్చుఁగాన దఱచు
బ్రాహ్మణునిఁ బ్రభుఁ జేయుటఁ బతికి హితము."
(ప. ౨౧౭)

"ధరణిపుఁ డెందునెదగడు
తాఁజననూఱట కొక్కనిందగుం
దొరనొనరించిపంపనరి
దుర్బలుచేఁ జెడఁడాతఁడర్థభూ
కరితురగర్ధి లేక కొఱ
గాఁడటు నేయ ద్విజాన్యుఁ డక్కకా
నెరవునతండునుంవలయు
నిండిన దుర్గబలోర్వియీఁదగున్."
(ప. ౨౫౬)

"హితబహుశ్రుతధర్మ రతశూరతాస్వపూ
ర్వతలమున్ద్విజుల దుర్గములనిలిపి
................ ..."(ప. ౨౬౨)

"చదివియధర్మభీతి నృప
శాస్త్రవిధిజ్ఞతలవ్వయస్సు డె
బ్బదిటికిలోను నేఁబదికి
బాహ్యముకై యరుజస్వరూపులై
మదమతి రాజుప్రార్థన న
మాత్యతఁగైకొని తీర్చిపారు వా
రొదవిన నంగముల్మిగుల
నూర్జితమౌటకుఁ బూఁటుసాలదే"
(ప. ౨౧౧)

"మంత్రి బాహ్మణుఁడై, వయస్సు ఏఁబదియేం డ్లకు పైఁబడి, డెబ్బదికిలోఁబడియుండి, రాజనీతిపారం గతుఁడైయుండెనేని రాజ్యాంగములు బలపడుటకొక్క పూఁట చాలును"

పై వర్ణనల కన్నిఁటికి నసువైనవాఁడు సాళ్వ తిమ్మసచివాగ్రణిగాక మఱియెవ్వరుగలరు ? శ్రీ కృష్ణ దేవరాయలు పైని వివరింపఁబడిన రాజనీతిని గూర్చి వ్రాయునపు డామహారాజునకు తిమ్మరసుమంత్రియె యాదర్శమై యుండెననుట కేమాత్రమును సంశయము లేదు. సాళ్వతిమ్మరుసు రాయల కాలమునాఁటికి వృద్ధుఁడై యుండెను. ప్రజ్ఞావంతుఁడు, ప్రతిభాశాలి, పండితసింహుఁడు, వీరాగ్రణి. ఇట్టి సకల సద్గుణ సం పన్నుఁడైన సచివసత్తముఁ డాకాలమున మఱియొకఁడు గానరాఁడు. రాయల యాదర్శమున కనువైనవాఁడు తిమ్మరుసు మంత్రి యొక్కఁడె.

## అంత్యదశ

ప్రపంచచరిత్రమునందు మహారాజులయొక్కయు, మహాప్రధానులయొక్కయు జీవితచరిత్రము లత్య ద్భుతములు. కొంతకాలము సకలవైభవముల ననుభవించి, వాసియు వన్నెయుఁ గాంచి, సమకాలికులచేత మన్న నలంగాంచి, జీవయాత్ర కొనసాగింతురు. అట్టి యాత్రాం

* జీర్ణ విజయనగర చరిత్రము, పుటలు ౧౫౬-౧౬౦. ఆంధ్రగ్రంథమాల నంబరు ౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమున దుర్భరదారిద్ర్యపీడయో, నీచజీవనమో, కారాగారప్రవేశమో, బలవన్మరణమో యేదియోయొకటి వారికిఁ బ్రాప్తించుచుండుయుఁగలదు. ఈ మంత్రిశిఖామణి కట్టిగతియే లభించెను. కృష్ణదేవరాయల కాఱేండ్ల కుమారుఁడుండెను. ఆబాలుని సింహాసనమెక్కించి, తిమ్మరుసును రాజ్యభార నిర్వాహకునిగ నియమింప సమకట్టెను. దీనికంతయుఁ గారణము రాయలకుఁదనమరణానంతరము సోదరుఁడుగాని, సోదరకుమారుఁడు గాని తనకుమారునిఁద్రోసి రాజ్య మాక్రమింతురో యన్న వెఱ్ఱిభయము తక్క మఱియొండుగాదు. తిమ్మరుసు మంత్రిపలుకుఁబడి, ప్రాబల్యము, సామ్రాజ్యమునం దెక్కువ గాఁజొచ్చెను. మహారాజునకు మంత్రియెడ నొకవిధమైన భయము, నవిశ్వాసమును గల్గెను. కృష్ణదేవరాయలు తన యభీష్టముచొప్పున కుమారునికిఁ బట్టము గట్టించెను. కాని దురదృష్టవశమున నాబాలుఁ డాకస్మికమరణమునొందుట సంభవించెను. దీనికిఁ గారణము తిమ్మరుసుకుమారుఁడు మహారాజకుమారునకు విషప్రయోగమును జేసెననువదంతి పుట్టెను. మహారాజావార్త నిజమని నమ్మి తిమ్మరుసును, మంత్రిసోదరుఁడగు గోవిందరాజును, మంత్రికుమారుఁడగు గోవిందరాజును జెఱసాలలో నుంచెను. కాని మంత్రి పుత్రుఁడగు గోవిందరాజు చెఱసాలలోనుండి తప్పించుకొనిపోయి రాయలపై యుద్ధసన్నద్ధుఁడయ్యెను. కాని యా యుద్ధమునందు గోవిందరాజు రాయలచేఁజిక్కెను. రాయలు క్రూరుఁడై వారలకండ్లను దీయించెను. ఈపైగాథ వ్రాసినవాఁడు పోర్చుగీసుచరిత్రకారుఁడైన నన్నిజ్. పాప మామంత్రిశిఖామణి చెఱసాలలో మూఁడేండ్లుండి మరణ మొందెనట. ఏది యెట్లున్నను తిమ్మరుసుజీవనము కట్టకడపట దుఃఖభాజనమై, కళంకయుతమై పోయెను. భగవంతుఁ డాప్రతిభాశాలినొసట నట్లు వ్రాసి యుండఁగా నెవరు తప్పింపఁగలరు? తిమ్మరుసు ప్రభుపుత్త్రునకు విషప్రయోగమును గావించెనను వృత్తాంతము విశ్వసింపఁదగినదియో, కాదో యూహింప నలవికాకున్నది. పోర్చుగీసువాఁడైన 'పేయిస్' చెప్పినట్లు రాయలను బెంచినవాఁడు తిమ్మరుసు, రాయలను రక్షించినవాఁడు తిమ్మరుసు, రాయలకు రాజ్యమొసంగినవాఁడు తిమ్మరుసు, రాయలరాజ్యమును ఆ సేతుసింహగిరిపర్యంతము పెంపొందఁజేసినవాఁడు తిమ్మరుసు. అట్టి స్వామిభక్తి పరాయణుఁడు, రాజనీతిజ్ఞుఁడు, కార్యదక్షుఁడు, తుట్టతుదకు రాజద్రోహియై వర్తించెననుట విశ్వాసపాత్రముగా లేదు. ఎట్లయినను జీవితము విషాదాంతమై పోయెను.

---

## గ్రీష్మర్తువు

వెదురుమూడి వేంకటకృష్ణరావు

మిత్రుఁడనెడిపేరు మిథ్యయై తోఁప, నిప్పులుగ్రక్కదొడఁగె నంభోజహితుఁడు;
సర్వంసహాయనెడి సద్యశము చెడంగ, పొగడువిడువఁజొచ్చె భూమిదేవి;
జీవననామప్రభావ మణఁగ, సలసల క్రాఁగసాగెను జలపథములు;
ప్రాణదేవుఁడనెడి వాసి తొలఁగ, వేడిగాడ్పు వీవఁగబూనె గంధవహుఁడు;
తమ్మునమ్మి నడచెడు పాంథజనములకు - దిగ్వితతి యెండమావుల దీప్తిఁ దాల్చి
భ్రమలుగొల్పఁగడఁగె; కాలవశత నకట - యెంత హితులైన శత్రులయ్యెదరుకాదె!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయ నాగరికత–భగవద్గీత

(అనువృత్తము)

కొ. శఠకోపాచార్యులు, యం. ఏ., బి. యల్.,

మనహిందూదేశ మాధ్యాత్మికముగ నుచ్చదశయం దుండినప్పుడు మనదేశము రాజకీయముగాను, సాంఘికముగానుగూడ నున్నతస్థితిలో నుండినది. తరువాత ఆధ్యాత్మికక్షీణతయు, రాజకీయపరాధీనతయు నావిర్భవించినవి. మఱియు వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు వ్యాసుఁడు, శుక్రుఁడు, పరాశరాదులు ప్రాచీనకాలమునను, సమర్థరామదాసు, మాధవస్వామి మొదలగు శాస్త్రకోవిదులు మధ్యకాలమునను ఆధ్యాత్మికనీతిని, రాజనీతినిగూడ తమప్రభువులకును, జనులకును బోధించుచుండిరి. అట్లే ప్రస్తుతకాలమందలి ధార్మికవ్యాసంగపరులైన యీ మహనీయులుకూడ జీవితమందలి అన్ని శాఖలలోను మనజాతి తిరిగి యభివృద్ధి నొందుటకై తమతమప్రతిభను వినియోగించుచు సాంఘిక రాజకీయాభివృద్ధిపరులు గూడ నగుటలో నాశ్చర్యము లేదు. గీతయే తమకు జీవితాదర్శసూచక మయ్యెనని వీరలు ఒప్పుకొనియేయున్నారు. ఇఁక నీయాధునికవ్యాఖ్యాతలకు గీతల గూర్చిన కొన్ని ముఖ్యాభిప్రాయములను మనము గమనింతము. ఆధ్యాత్మిక ప్రవక్తలలో నసమానులగుటయేకాక అద్వితీయ రాజకీయ దురంధరులగు శ్రీకృష్ణులవారు గీతాబోధ జేయుటలోను, వ్యాసులవారు మన ముఖ్యేతిహాసమగు మహాభారత రణరంగమున దానిని బ్రవేశింపఁజేయుటలోను కేవలాధ్యాత్మికబోధ చేయుటయే కాక ప్రతివ్యక్తికిని సంఘమునకును విషమసమస్యల కాలమందును లౌకికజీవితమునగూడ ఆచరణకు మార్గదర్శకములగు సూత్రములఁ దెలియఁ జేయు నీతిసారమంతను ఇందు సూచించియున్నారని యీపరిశోధకు లందరు దలంచుచున్నారు. గీతలో ఆధ్యాత్మిక విషయములతోఁబాటు ఆహారవిహారములు, ఆయాజాతుల ధర్మములు మొదలగు ఇతరకృత్యములుకూడ చర్చింపఁబడినవి. మఱియు కేవలనివృత్తిమార్గ మాదర్శము కాదనియు, ప్రవృత్తిమార్గమగు పరోపకారరూప జీవనము నిశ్శ్రేయసకరమనియు, అనఁగా జ్ఞానయోగముతోఁబాటు కర్మయోగముకూడ స్వతంత్రముగ నిశ్శ్రేయసమునకు సాధనమగుననియు గీతాకారుల యభిప్రాయమని వీరందరిమతము. కర్మనువిధించుచు గీతలలోఁ జెప్పిన విషయములన్నియు నజ్ఞానులనిమిత్తమును, జ్ఞానప్రవేశమునకు మార్గముగాను మాత్రమే యుద్దేశింపఁబడినవనియు, నిష్కామకర్మ అనఁగా విధ్యుక్తనిత్యకర్మనుమాత్రము పూర్వకర్మవాసనయు, అజ్ఞానము నశించువఱకుమాత్రమే చేయవలెననియు, తరువాత సర్వకర్మపరిత్యాగిగా నుండవలెననియు, గీతాభావమని శంకరులవారి సిద్ధాంతము. గీతలోని ౧౮ అధ్యాయములలో మొదటిషట్కములో కర్మయోగమును జెప్పి తరువాత భక్తియోగమును, చివరకు అంత్యషట్కమున జ్ఞానయోగమును సిద్ధాంతీకరింపఁబడినదని కొందరు పండితులు తెలియఁజేసిరి. కాని యీభావములను పైనఁజెప్పిన ఆధునికవ్యాఖ్యాతలంగీకరింపలేదు. ఈమూఁడుషట్కములలో మూఁడుయోగములు ప్రత్యేకముగాను, ఒకటితరువాత నింకొకటి జరుగవలసినదిగాను జెప్పఁబడినవనుట సమంజసము కాదు. ద్వితీయాధ్యాయమునుండియు జ్ఞానయోగముకూడ వివరింపఁబడినది. చిట్టచివరిదగు ౧౮-వ అధ్యాయములో కూడ*అర్జునుఁడు సన్న్యాసత్యాగములతత్త్వమునుగూర్చి ప్రశ్నింపఁగా† యజ్ఞ, దానరూపములగు కర్మల చేయ

---

* గీత ౧౮-౧ "సన్న్యాసస్య మహాబాహో..."

† కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః, సర్వకర్మఫలత్యాగం ప్రాహుః త్యాగం విచక్షణాః. (గీ. అ. ౧౮ శ్లో. ౨)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వెటరినెరికాలేజి (పశువైద్యకళాశాల) చెన్నపురి K. P. S.



వె[illegible]లకుర్తి [illegible]ట, స్కౌటుల ప్రధాన సంఘము (బీచిరోడ్డు) K. P. S.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



లాకాలేజి, చెన్నపురి K. P. S.



ఎగ్మూరుస్టేషఁవద్ద చర్చి, చెన్నపురి K. P. S.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలసినదేయనియు, నియతకర్మకు సన్న్యాసము కూడదనియు బోధించి, సాత్త్వికకర్మస్వరూపమును చతుర్వర్ణజుల స్వాభావికకర్మల నిర్ణయించి, స్వకర్మనిరతుఁడై, తమకర్మలచేత నే సృష్టికర్తయు, సర్వవ్యాపియు నగు నీశ్వరు నర్చించి అందుచే సంసిద్ధిని బొందఁగలుగు నని యు, చివరకు శ్రీకృష్ణులు బోధించిరి.*

ఎట్టికర్మయుఁ జేయకుండుట యసంభవమనియు, స్వభావమునుబట్టి యెప్పుడును శరీరయుతో నేదో పనిని జేయుచునే యుందుమనియు, భగవంతుఁడుకూడ నిష్కాముఁడై సర్వకాలములందును పనిచేయుచున్నట్లే, మనము కర్మ ననాసక్తులై చేయవలెననియు గీతలోనే చెప్పఁబడినది.† మఱియు కేవలజ్ఞానవాదుల బోధ ప్రకారము ప్రతివారును ఆచరించుటచే సంఘ మెట్టిస్థితికి వచ్చునో గమనింపవలసియున్నది. జనోపయోగకరములగు కార్యములన్నియు నడుగంటును. సంఘము శిథిలమైపోవును. ప్రజలును దేశమంతయు నిస్సహాయత నొంది క్షీణింతురు. ఇంతేకాక కర్మత్యాగులగు జ్ఞానులైనను ఆత్మహత్య చేసుకొనకూడదు. అట్టి స్థితిలో జీవయాత్ర గడపుటకు తమకును తమకుటుంబమునకును అన్నవస్త్రాదులను సంపాదించుటకు ఇతరావశ్యక వస్తువులకై ద్రవ్యార్జనకై కర్మచేయక తప్పుటెట్లు? లేక భిక్షాటనవల్లను, ఉంఛవృత్తివల్లను శరీరపోషణ చేయఁదలఁచినచో క్రమముగా కేవలజ్ఞాను లధికమైనప్పుడు నిర్వ్యాపారులగు వీరినందరి నెవరు పోషింపఁగలుగుదురు అను సమస్య లుదయింపక తప్పదు. మఱియు "నిష్కామము", "అనాసక్తి" అనుశబ్దములకు ఎట్టి యుద్దేశ్యము ఆదర్శము లేకుండుట అని అర్థము కాదు. ఎట్టి ఉద్దేశము లేకుండ ఎవరుగాని యేపనిగాని చేయుట సంభవింపదు. ఒకనైపుణకుఁగాని, గమ్యస్థల ముకుఁగాని వెళ్ళునుద్దేశము కలిగినప్పుడే నడచెదము లోని కాహారము దీసుకొనఁ దలఁపు కలిగినమీఁదటనే చేతులు నోరు ఆపనులకు గడఁగి, మనము భుజించెదము. ఎంత నిష్కాముఁడైనను, ఒంటరిగా నివసించువాఁడైనను, నిరుద్దేశముగా నుండుట, యేకర్మయుఁ జేయకుండుట గనము. అట్టిస్థితి నిసర్గవిరుద్ధము. మఱియు నిప్పటి నాగరికతలో అసంగతము. నిష్కామత, అనాసక్తి, అనఁగా స్వలాభముకొఱకుఁగాక లోక సంగ్రహము, అనఁగా ప్రజాహితముకొఱకు పనులు చేయుట అని గీతయే సూచించుచున్నది.‡ ఇట్లు జ్ఞానకర్మసముచ్చయమే గీతయం దంతటను బోధింపఁబడుచున్న దని సీతానాథ తత్త్వభూషణులు Krishna and the Gita అను గ్రంథములోను, తమ గీతావ్యాఖ్యానపు టుపోద్ఘాతములోను, తక్కిన వారు తమవ్యాసములందును సహేతుకముగా వివరించిరి. ఈశ్వరప్రీత్యర్థమై జీవులు కర్మచేయుచుండుటయే ధర్మమనియు, ఈశ్వరేప్సితము నీశ్వరుని యుపకరణములుగాఁ జేయుటచే మనకు నెట్టిదోషమును కలుగదని గీతలవల్ల స్పష్టమగుచున్నది. ప్రపంచము సమగ్రత్వము నొంది వృద్ధినొందుటకై సర్వభూతాంతర్యామియగు భగవంతునిచే ననవరతము నడుపఁబడుచున్నది. కనుక భగవదీప్సితము నెఱవేర్చుటకొఱకే తత్ప్రేరితులమై మనమందర మట్టిజనోపకారకములగు నెట్టికర్మలనైన నిర్భయముగాఁజేయవలెనఁట గీతాసారమని అరవిందుఁడు వివరించెను. భగవత్సేవకన్న భాగవతసేవయే శ్రేయమనియు, భాగవతసేవవలన నీశ్వరున కక్కువప్రీతి కలుగుననియుఁ జెప్పు రామానుజీయుల సిద్ధాంతము యొక్క నిజమగుభావము నీజ్ఞానకర్మసముచ్చయమే యని తోఁచుచున్నది.

---

* గీత అ. ౧౮ శ్లో. ౪౫, ౪౬, ౪౮, ౫౬.

"యజ్ఞదానతపః కర్మ నత్యాజ్యం కార్యమేవ తత్, ఏతా న్యపిచ కర్మాణి సంగం త్యక్త్వా ఫలానిచ, కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్."

† గీత అ. 3, శ్లో. ౫- ౨౨.

‡ గీత అ 3-శ్లో ౧౮, ౨౦.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ లోకమాన్యతిలకుగారు అసమాన ప్రతిభా పాండిత్యములతో గీతారహస్యమను తమ మహాగ్రంథమున దీర్ఘశాస్త్రీయచర్చ నొనర్చి సిద్ధాంతము చేయుటలో నింతకన్న నింకను ఒకయడుగు ముందునకు వెళ్లిరి. గీత బ్రహ్మవిద్య యోగశాస్త్రములని (అధ్యాయాంతములందు) చెప్పఁబడి జ్ఞానకర్మములు రెండును బోధింపఁబడుటయే కాక, జ్ఞానయోగముకన్న కర్మయోగమే యెక్కువప్రశస్తమనియు, కర్మము నెన్నఁడును విడువక చేయుచుండుటయే శిష్టాచారమనియు, అయిన స్వార్థమునిమిత్తముగాక భగవత్ప్రీత్యర్థమును, లోకసంగ్రహార్థమునే తమతమకర్మలఁ జేయుచునుండవలెననియే గీతలభావమని నిర్ణయించిరి. * వీరిఅభిప్రాయముప్రకారము గీతలో కర్మయోగమే ప్రధానాచరణీయము. అయితే కర్మను జ్ఞానభక్తియుతులై స్వార్థరహితులై అందరును (సంపూర్ణజ్ఞానులైన తరువాతకూడ) విడువక ఆచరింపవలెను. (తిలకుగారు అందువలననే తమగ్రంథమునకు కర్మయోగశాస్త్రమనికూడ నామకరణము చేసిరి.)

శ్రీ గాంధీగారుకూడ తమ అనాసక్తియోగము (ఇది తెలుఁగులో నిష్కామయోగమను పేరుతో అనువదింపఁబడి ప్రకటింపఁబడినది.) అను తమగీతావ్యాఖ్యానగ్రంథమునఁగూడ చాలవఱకిట్టిభావమునే వెల్లడించిరి. శ్రీ కృష్ణులవారు కర్మయోగమున కిచ్చిన ప్రాముఖ్యమును తరతరములుగా హైందవులు మఱచి కేవలజ్ఞానమనఁగా సర్వకర్మపరిత్యాగమే మోక్షదాయకమను భ్రమతో, సంఘము విషయమునను, మనజాతివిషయమునను తమకుఁగల ధర్మమును విడనాడిరి. అందుచే దేశమునఁ జాలవఱకు కలసతయు, మాంద్యమును వ్యాపించి మీమాంసకులును, బౌద్ధులును చేయుచుండిన అనాత్మనిరీశ్వరవాదముల నెదిర్చి జయించి, తమదేశీయులకాధ్యాత్మికనిఃశ్రేయసము కల్గింప శంకరులును, రాజకీయాధ్యాత్మిక నిఃశ్రేయసము కల్గింప శ్రీతిలకుగారును తమజీవితమంతయు నిరంతరకర్మపరులై యుండుటలోఁగూడ ఉభయులకును సామ్యము కలదు. కాని నివృత్తిమార్గమే,అనఁగా ప్రతివారును జ్ఞానియగువఱకును విధ్యుక్తమగు నిత్యకర్మనుమాత్రమే చేయఁదగునని, జ్ఞానికాఁగానే దానినికూడ త్యజింపవలెనని గీతయుద్దేశమని శంకరులభాష్యము చాలచోట్ల నొక్కిచెప్పుచున్నది. ఇట్టిసిద్ధాంతము సరికాదనియు, మఱియు జాతికంతకు అది చాలాహానికరమనియు దృఢాభిప్రాయముకలిగి శ్రీతిలకుగారు తమగ్రంథమం దంతటను వందలకొలఁది పుటలందు తీవ్రచర్చ చేసి ఖండనచేసి జ్ఞానియయినను కాలేకపోయిననుకూడ ప్రతిమనుష్యుఁడును సర్వకాలములందును స్వార్థపరత లేక లోకోపకారముకొఱకు కర్మ విడువక చేయుచునే, అనఁగా ప్రవృత్తిమార్గముననే ఉండవలెనని నిశ్చితాభిప్రాయము తెల్పిరి. అందుచే ముఖ్యముగా జీవితాదర్శములోఁగూడ ఉభయులసిద్ధాంతములు పూర్తిగా భేదించినట్లు కనుపడుచున్నది.

* గీత అ. 3-శ్లో. ౧౯,౨౦,౨౫; అ. ౫-శ్లో.౨ మొదలగు శ్లోకముల అర్థమునుగూర్చి గీతారహస్యములో టీకలోను, ౧౧-వ ప్రకరణములోను తిలకుగారి చర్చను చూడుఁడు.

శ్రీ తిలకుగారి "గీతారహస్య" గ్రంథమును పండిత శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు ఆంధ్రులకుపకారకమగున ట్లాంధ్రీకరించిరి. ఆగ్రంథములో శ్రీ శంకరులకును,లోకమాన్యతిలకుగారికిని గీతలోని జ్ఞానకర్మయోగములనుగూర్చి కలయభిప్రాయములను శ్రీశాస్త్రిలుగారు చర్చించి (౮3-వ పేజీ చూడుఁడు) ఉభయులకును ఆవిషయమై రుచిభేదమేకాని సిద్ధాంతభేదము లేదనియు, తిలకుగారిభాష్యము కర్మపరమనుటకు వీలు లేదనియు నభిప్రాయమును తెల్పిరి. ఇట్లే యితర భాషలలోకూడ కొందరు తిలకుగారిని విమర్శించిరి. కాని యిది తృప్తికరముగ కనుపడలేదు. జ్ఞానావశ్యకతను ఉభయులు గమనించుసంగతి నిజమే కాని వీరే కాక రామానుజాదులును ఆధునికవ్యాఖ్యాతలుకూడ జ్ఞాన మావశ్యకమనియే చెప్పుచున్నారు. శ్రీతిలకుగారు, నద్వైతులగుటచే ఆత్మస్వరూపాదులనుగూర్చి ఉభయుల కేకాభిప్రాయ ముండవచ్చును. కాని యవి యీ సందర్భమున నప్రస్తుతములు. ఆకాలమున పూర్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిరుద్యోగభిక్షాటనాదులు వ్యాపించినవి. ఇట్టియాదర్శ మవలంబింపలేక చాలమంది జీవితమం దాదర్శవిహీనులై కేవలము స్వార్థముకొఱకే తమశక్తులను వినియోగించు చున్నారు. మఱియు కేవలజ్ఞానులు తమస్వీయమోక్షము కొఱకే తమజ్ఞానశక్తులను వినియోగించి "ఆత్మవత్సర్వ భూతాని" అనుబోధను మఱచి యితరజీవులమోక్షమునకు సహాయము జేయనగుకర్మ లన్నిటిని విసర్జించుటచేఁ గేవలజ్ఞానులనుగూడ నొకవిధముగా స్వార్థపరత్వము స్పృశించును. ఇట్లు గీతలోఁ జెప్పిన లోకసంగ్రహబుద్ధి (దేశసేవ లేక పరోపకారబుద్ధి అని వీరితాత్పర్యము) క్రమముగా క్షీణించియున్నదనియు, అందుచే వ్యక్తు లకును, దేశమంతటికినిగూడ మోక్షము గలుగవలె నన్నచో, భగవదీప్సితము ననఁగా ప్రపంచక్షేమమును నెఱవేర్చుటకై సర్వసమత్వబుద్ధితో ప్రజాలాభకరము లగు కర్మల నెల్లరు జేయుచుండవలె నని వారిద్దరి వ్యాఖ్యానములలోను స్పష్టీకరింపఁబడినది.

"తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర"
(గీ. 3-౧౯)

మొదలగువచనములచే, గీతలందు, ఎట్టిస్వార్థాపేక్షయు లేక కర్మనే చేయవలెనని బోధింపఁబడినందున దానికి ప్రాముఖ్యము నొసఁగుటకై శ్రీ గాంధిగారు తమవ్యా ఖ్యకు అనాసక్తియోగమని పేరిడిరి. (యోగమనఁగా నేర్పుతోఁ బనులఁ జేయుట యనికూడ అర్థము: "యోగః కర్మసు కౌశలం" గీత అ ౨-శ్లో ౫౦) తమ లౌకికాభి ప్రాయముల బలముకొఱకు శాస్త్రములలో లేకున్నను ఈ సిద్ధాంతమును క్రొత్తగాఁ జొప్పించిరని కొందరు తలఁచినచో నట్టితలఁపు కేవలభ్రమజనితమగుటకు సందే హము లేదు. లోకసంగ్రహమునకై కర్మచేయుచుండవలె ననుటయే గీతాబోధసారమనియు, గీత కేవలము సన్న్యా సులనిమిత్తమే కాక సంఘమందలి జను లందరి లాభము నిమిత్తమును ప్రపంచాభివృద్ధికొఱకును ఉద్దేశింపఁబడిన దని భావించుట న్యాయమై యున్నది. మఱియు వేదములందలి ఉపనిషత్తులుకూడ కేవల జ్ఞానమును బోధింపక కర్మలఁ జేయవలెనని చెప్పుచున్నవి. "కుర్వ న్నేవహి కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః" (ఈశా వాస్యోపనిషత్తు ౧-౨) భాగవతగ్రంథమందుఁ గూడ నిట్లే వివరింపఁబడినది. రామానుజులుకూడ ఈసిద్ధాంత మునే యనుకరించిరి. తిలకుగారు తమ మహోత్కృష్ట మగు గ్రంథమున విపులముగ నసమానపాండిత్యముతో చర్చించి దీనినే సమర్థించిరి.

శ్రీ గాంధిగారి "యనాసక్తియోగ" ము చూచుటకు చాల చిన్నదైనను భావగర్భితమైయున్నది. దానిలో వీరు కర్మయోగమును పోషించుటయేకాక కొన్ని స్వతంత్రాభిప్రాయముల వెల్లడించిరి. వానిలో నొకటిరెండు ఈక్రింద నుదాహరింపఁబడును. వీరి అభి ప్రాయముప్రకారము జ్ఞాని అయినతరువాతనే నరుఁడు నిష్కామకర్మయోగి అగును. అనఁగా అద్వైతసిద్ధాంత మందువలె కర్మయోగము జ్ఞానయోగమునకు సాధన మగుటకు బదులుగా జ్ఞానమే కర్మయోగమునకు సాధనము కావలెను. ఆత్మదర్శనము (Self-realisation) కర్మయోగమునకు మార్గ మగును. కాని యీ స్థితిలో అహంకారము లేకుండుటకును అనాసక్తి (స్వార్థ హీనత) అను మార్గమునుండి తప్పిపోకుం డుటకును భక్తి ఉపయోగకరముగా నుండును. అందుచే గీతలో జ్ఞానభక్తియోగములు రెండును నిష్కామ కర్మకు మార్గదర్శకములుగాను, సహకారులుగాను ఉం డుటకై బోధింపఁబడినవని గాంధిగారి అభిప్రాయము. ఇంకొకవిషయము. గాంధిగారు అహింసకు చాలప్రా ముఖ్య మొసఁగిరి. అరవిందుఁడు మొదలగువారును, శ్రీ తిలకుగారును అహింసకు ప్రాముఖ్య మొసఁగలేదు. గీత నిజముగా కురుక్షేత్రరంగమున నర్జునుని యుద్ధము నకుఁ బ్రేరేపించునుద్దేశ్యముతోఁ బ్రత్యక్షముగా బోధించి నదే యని శ్రీతిలకుగారుకూడ అభిప్రాయపడిరి. స్వధ ర్మము నిర్వర్తించుసందర్భమున హింసా కర్మ భౌతిక యుద్ధము చేసినను తప్పులేదని వీరలభావముగా కన్పట్టు చున్నది. గీతయందు భక్తిగలవారలు కొందరు భావో ద్రేకముచే నీభావమును రాజకీయ మోక్షమునకుఁగూడ వర్తింపఁజేయుట అందరకును తెలిసియేయున్నది. ఈ విప్లవమువలనఁ గలుగు ప్రమాదము గనిపెట్టిన గాంధిగారు గీతాబోధనుండియే అహింసాసిద్ధాంతమును సాధించిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అహింస సనాతన మతమూలసిద్ధాంతములలో నొకటి యని గాంధిగారి మతము. * భారతకథయు, కృష్ణార్జునుల జీవితకథయు నిజమే అయినను కురుక్షేత్రమున యుద్ధప్రారంభసమయమందు భౌతికయుద్ధముకొఱకై గీతయంతయు బోధింపఁబడినట్లు వ్రాయుట రసపోషణ నిమిత్తమై చేయఁబడిన గ్రంథకర్తయొక్క చమత్కారమే యనియు వారి అభిప్రాయము. స్వధర్మమగు కార్యము దోషయుక్తమైనను దేశక్షేమనిమిత్తమై నిర్భయముగ చేయవలెనని బోధించుటమాత్రమే గ్రంథకారుని యుద్దేశ్యము. ఇందుకు భిన్నముగా భౌతిక యుద్ధమును శ్లాఘించుటశ్రీకృష్ణునియొక్కయు, వ్యాసుల యొక్కయు ఉద్దేశ్యమైనచో గెల్చినవారు ఆనందవంతులై సర్వసౌఖ్యముల నొందినట్లు కన్పఱచవలసి యుండినది. కాని భారతకథప్రకారముగా యుద్ధసమాప్తి యగునప్పటికి ఓడినవారు, గెల్చినవారుకూడ దుఃఖములపాలే అయిరి. ఉభయుల బంధుమిత్రులునుగూడ నశించిపోయిరి. పాండవులు గెల్చినను నిర్వేదమునొంది రాజ్యమును, సర్వసుఖములను త్యజించిరి. అందుచే భౌతికయుద్ధామోద మిచ్చట లేదనియే గాంధిగారి అభిప్రాయము. కాని యెల్లప్పుడును ప్రతి వ్యక్తియందును ఆధ్యాత్మికమగు యుద్ధము జరుగుచునే యుండును. ఉపనిషత్తులలో ఆయుద్ధమునుగూర్చి చెప్పఁబడినది. "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ" (కఠోపనిషత్తు, వల్లి ౩-శ్లో ౩ మొ ౯ వరకు) ఇచ్చట అర్జునుఁడు రథికుఁడనఁగా ఆత్మ అనికూడ భావము కలదు. రథమనఁగా శరీరము. ఇంద్రియములే అశ్వములు. అంతఃకరణము ఆత్మకు హితబోధ చేసి ఇంద్రియములవశమున నుంచుకొని కామక్రోధాది అరిషడ్వర్గమును పారద్రోలు సంగతి కిది రూపకము. ఇదిగాక ఉపనిషత్తులలో అచ్చటచ్చట అహింస ప్రశంసింపఁబడినది. గీత ౧౮-వ అధ్యాయము చివర శ్లోకమగు "యత్ర యోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః" (౧౮-౭౮) లో 'యోగేశ్వరఃకృష్ణః' అనఁగా అనుభవసిద్ధశుద్ధజ్ఞానమనియు, 'పార్థో ధనుర్ధరః' అనఁగా తదనుసారియగు క్రియ అనియు చేసిన వ్యాఖ్యానమువల్లఁగూడ గాంధిగారి భావము స్పష్టమగుచున్నది. "యస్య నాహంకృతో... నహంతి ననిబధ్యతే" అను (గీత. ౧౮, ౧౭) శ్లోకము పైన గాంధిగారిటీకకూడ చూడుఁడు.

మఱియు గీత ౧౬-వ అధ్యాయమున వర్ణింపఁబడిన దైవీ ఆసురసంపత్తుల సంఘర్షణమును ఆధ్యాత్మిక యుద్ధమునే సూచించుచున్నది. స్వలాభమునిమిత్తమే కర్మ చేయువానికి ఆసురీప్రకృతి వృద్ధియగుననియు, అట్టివారు దంభదర్పక్రోధాదులు కలవారై కామభోగార్థమై అన్యాయముగా ద్రవ్యము నార్జించి తామే యీశ్వరులమనుచు తమతో సమాను లెవరని ధిక్కరింతురు. కాని నిష్కామకర్మచేయువారికి దైవీప్రకృతియే వృద్ధి అగును. అనఁగా గాంధిగారి అభిప్రాయముప్రకారము స్వార్థలాభపు టుద్దేశములేనివాఁడు అసత్యముచెప్పుటకు, హింస చేయుటకు, అహంకారాదులను పొందుటకు అవసరమును, ప్రసక్తియు లేదు. అనాసక్తకర్ముఁడు అహింసాసత్యభూతదయా క్షమాదిలక్షణములుగల దైవప్రకృతి గలిగియుండుట తప్పదు. బంధకమగు ఆసురప్రకృతిని మోక్షసాధనమగు దైవప్రకృతితో నేజయింపఁగలుగుదుమని గీత మనకు బోధించుచున్నది.†

---

* వేదములలోను, గీతలోను చెప్పిన యజ్ఞము యొక్క అర్థము ఈశ్వరార్పణగా పరోపకారార్థమై కర్మచేయుటయే యని గాంధిగారిఅభిప్రాయము. (గీత అ ౪. శ్లో ౩౨లో గాంధిగారిటీక చూడుఁడు) ఇంద్రాగ్ని వరుణాదులనఁగా వ్యక్తులు కారు. ఈశ్వరాంశశక్తులన్నియు (గీత ౪-౧౨ పైన టీకచూడుఁడు.) పూర్వమగ్నిముఖముగా లోకసేవ జరుగుచుండినదనియు, ఇప్పటిపరిస్థితులనుబట్టి యిప్పుడు చరఖా (రాట్నము) సేవాసాధనమగుటచే దానిని విడువకూడదను భావమును (గీత ౬-౧ టీక చూడుఁడు) తెల్పిరి.

† శ్లో. దమ్భో దర్పో ఽభిమానశ్చ
క్రోధః పారుష్య మేవచ,
అజ్ఞానం చాభిజాతస్య
పార్థ సంపద మాసురీం.
(గీత. అ. ౧౬. శ్లో. ౪)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆధ్యాత్మికము నేకాక రాజకీయమోక్షము నొందుటకుఁగూడ ఇట్టియుద్ధమే ప్రశస్తమనియు, అహింసా సత్యాదిలక్షణముగు దైవసంపత్తే ఉచితసాధన మనియు, లోకకళ్యాణకరమనియు గాంధిగారి యభిప్రాయము. దైవసంపత్తును గూర్చి "అహింసా సత్య మక్రోధః"* అని గీతలో ప్రాముఖ్య మిచ్చినట్లే గాంధిగారును Truth and non-Violence అని అహింసతోఁబాటు సత్యమునకును ప్రాముఖ్య మొసఁగుట గమనార్హము. అహింసా సత్యసిద్ధాంతములఁబట్టియేఅన్ని కార్యములందును రహస్యచర్యలు కూడవని గాంధిగారు గర్హించుచున్నారు. ఇట్లే భౌతికశక్తికన్న దైవప్రకృతివర్ధకమగు ఆధ్యాత్మికశక్తియే శ్రేయమనుసిద్ధాంతముప్రకారముగా ఆంగ్లఅమెరికనులపెట్టుబడి (Capitalism) సామ్రాజ్యపు (Imperialism) పద్ధతులకును రష్యనుసోవియటులభౌతికప్రజాస్వత్వము(Bolshvism)నకును కూడ గాంధిగారు వ్యతిరేకులై యున్నారు. అస్పృశ్యతామద్యనిషేధముల గూర్చియు గాంధిగారు గీతానుసారిగానే కన్పట్టుచున్నారు. నిమ్నజనోద్ధరణమును, సర్వభూతసమభావమును గీతలో చాలాచోట్ల బోధింపఁబడినది.† గీతలో చాతుర్వర్ణ్యమును, ఆయావర్ణములవారి స్వాభావిక కర్మలును వివరింపఁబడినవి.‡

కాని పంచమవర్ణమును, అస్పృశ్యతయు గీతలో నెచ్చటను సూచింపఁబడలేదు. గీతలో నొకచోట శ్వపాకుఁడుదాహరింపఁబడినను శ్వపాకుఁ డస్పృశ్యుఁడని చెప్పలేదు సరికదా అట్టివానియందును, బ్రాహ్మణాదులయందును సమదృష్టి కలిగియుండుటయే ఉత్తమముగా నెంచఁబడినది. ♦ మనమతి నెడు ఆహారముల గుణములను బట్టి శరీరమునందే మనస్తత్త్వమందును నైతికప్రకృతియందును కూడ అనుకూలపరిణామములు కలుగుచుండు నని పాశ్చాత్యవైజ్ఞానికు లీటీవల కనిపెట్టిరి. కాని యీసంగతి చిరకాలముక్రిందటనే మనఋషులకు తెలిసియుండినందున ఆధ్యాత్మికాభివృద్ధిఁగోరువారు పరిశుద్ధముగు సాత్త్వికాహారమునే గ్రహింపవలెనని మనపూర్వులు నియమ మేర్పఱచిరి. అందుచే గీతలోకూడ సాత్త్విక రాజసతామసరూపములగు ఆహారములఫలితము, వాటి స్వభావముగూడ వర్ణింపఁబడినవి.❡ ఆ సందర్భమున ఆహారము నిలవఉన్నదిగాని, సహజరుచిని గోల్పోయినదిగాని, దుర్వాసనపొందినదిగాని, పులిసి పాచిపోయి

ఆశాపాశశతై ర్బద్ధాః
కామక్రోధపరాయణాః,
ఈహన్తే కామభోగార్థ
మన్యాయే నార్థసంచయాన్.
(అ. ౧౬. శ్లో. ౧౨.)

అహింసా సత్య మక్రోధ
స్త్యాగ శ్శాన్తి రపైశునమ్,
దయా భూతే ష్వలోలత్వం
మార్దవం హ్రీ రచాపలమ్.
(అ. ౧౬. శ్లో. ౨.)

తేజః క్షమా ధృతి శ్శౌచ
మద్రోహో నాతిమానితా,
భవన్తి సంపదం దైవీ
మభిజాతస్య భారత.
(అ. ౧౬. శ్లో. ౩.)

దైవీసంపద్విమోక్షాయ
నిబంధాయాసురీ మతా,
మాశుచ స్సంపదం దైవీ
మభిజాతోఽసి పాండవ.
(అ. ౧౬. శ్లో. ౫.)

* గీత అ. ౧౬ శ్లో ౨.

† గీత అ. ౬ శ్లో ౨౯, ౩౨; అ. ౯ శ్లో ౩౦, ౩౧; అ. ౧౮ శ్లో ౫౪ చూడుఁడు.

‡ గీత అ. ౧౮ శ్లో ౪౧, ౪౪ చూడుఁడు.

♦ శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.
(గీత. అ. ౫ శ్లో. ౧౮)

❡ గీత. అ. ౧౭ శ్లో. ౭ మొ. ౧౦ వఱకు చూడుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నదిగాని, యజ్ఞము (అనఁగా ఈశ్వరనివేదనము) నకు తగనిదికాని అయినచో అనఁగా వీటిలో నేసుణము కలిగినను అది తామసముగా పరిగణింపఁబడినది. * అట్టి స్థితిలో దాదాపు ఈసుణములన్నియు ఒకచోట మూర్తీభవించిన కల్లు మొదలసుమద్యములు తామసపదార్థములలో నగ్రగణ్యములు. అందుచే సర్వవిధములత్యాజ్యములని గీతాభిప్రాయము స్పష్టమగుచున్నది. మఱియు గీతలలో నింద్రియనిగ్రహమును, యుక్తాహార విహారములును ఆధ్యాత్మిక సంపత్తికిని యోగమునకును ఆవశ్యకములని చెప్పఁబడినవి. † ఆప్రకారము గాంధియును వానిని గమనించి ఆహార విహారనియమముల నవలంబించుట తెలిసియేయున్నది. ఈశ్వరుఁడు సకలజనుల హృదయము లందును ఉండి జీవులను ప్రేరేపించుచుండునని గీతాసిద్ధాంతము. ‡ దీనియందును గాంధిగారికి దృఢవిశ్వాసము కలదు. దీనినే ఒకప్పుడు అంతరాత్మఅనియు, Inner voice అనియు చెప్పుట కలదు. అట్టిప్రేరేపణను పరిశుద్ధహృదయులే గ్రహింపఁగల్గుదురు. కనుక అంతఃకరణపరిశుద్ధి యత్యావశ్యకముగా నెంచఁబడుచున్నది. మఱియు శరీరవ్యాయామము (Physical Exercise)చే నింద్రియోత్తేజనము కలిగి నరుఁడు భోగియగుననియు, కాని ప్రాణాయామాదులచే నింద్రియములు శాంతములై శరీరము రోగము లేకుండ నుండుటయే కాక ఇంద్రియములు వశమునందుండి యోగము కలిగి ఆధ్యాత్మికశక్తి చక్కఁగానుండుననియు, అందుచేతనే వ్యాయామమునకు బదులుగా గీతలో ప్రాణాయామాదులే బోధింపఁబడినవనియుఁగూడ గాంధిగారి అభిప్రాయము. ♦ ఈరీతిగా గాంధిగారి ముఖ్యసిద్ధాంతములను గీతాబోధ సిద్ధములుగా కన్పట్టుచున్నవి.

కర్మాచరణశీలురు, ధర్మనిర్వహణపరులు నగు క్షత్రియపురుషులే (కృష్ణార్జునులే) గీతకు ప్రవక్తయు, శ్రోతయు నగుట కాకతాళీయము కాదు. ఈ సంగతి వలనఁగూడ గీతాబోధయొక్క ముఖ్యభావము ఉచిత జ్ఞానముతో ప్రజాక్షేమమునకై లోకహితమగు కర్మ చేయుచుండుటయని సూచన యగుచున్నది. ప్రస్తుత రాజకీయసాంఘికనాయకులలో చాలమంది గీతాభ్యాస పరు లగుటచే ఇట్టిగీతావ్యాఖ్య లింకను ప్రచురింపఁబడి అందుచే వారల ఆధ్యాత్మికాద్యనుభవములు జనులు తెలుసుకొనుటకు వీలగును.

ఈవిధముగా నాధునికకాలమునఁగూడ నాయా గీతావ్యాఖ్యాతల మతాభిప్రాయము లాధ్యాత్మికముగనే కాక జాతీయములగు అన్నివిషయములందు నెట్టిపరిణామమును గలిగించుచున్నదో, గీత భారతజాతీయాధ్యాత్మికవాఙ్మయములం దెట్టిప్రాముఖ్యమును వహించుచున్నదో స్పష్టమగుచున్నది.

---

* శ్లో. యాతయామం గతరసం పూతిపర్యుషితంచయత్,
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనంతామసప్రియమ్.
(గీత. అ. ౧౦ శ్లో. ౧౦)

† గీత అ. 3, శ్లో ౪౧ అ ౬ శ్లో ౧౭ చూడుఁడు.

‡ గీత అ ౬ శ్లో 3౧; అ ౧౫ శ్లో ౧౫ అ ౧౮ శ్లో ౬౧.

♦ గీత అ ౫ శ్లో ౨౭-౨౮ పైన గాంధిగారి నిష్కామయోగములోని వ్యాఖ్యానమును చూడుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# లతాప్రేతసల్లాపములు

కొమఱవోలు వెంకటసుబ్బారావు, బి. ఎ.,

ఏ యభాగ్యమతంగజ మ్మిచ్చి కొనెనో
యుపదగా నీశిరోరత్న ముడుకునెత్రు
చిద్రుపలం దోగి మృగరాజుచిఱుతగోట
వ్రేలుచున్నది విద్రుమోర్మికయువోలె.

ఆ భయంకరవక్త్రగహ్వరము వెడలి
వెలికి బ్రవహించు నిష్వేర్వలెనె రక్త
సిక్తమై జాజువాఱిన జిహ్వ నల్ల
నల్ల నాడించుచున్న దావ్యాఘ్రరాజు.

పోకు మేసెడి పసిజింకపొట్టక్రింద
జలదరించినమై నొక్క-శలలి దూఱె
శోణపాన మొనర్చిన దానిముండ్లు
కాలుచున్నవి నెఱె దబ్బనాలవోలె.

కొమ్మపైనుండి యాబిలో గూలి సగము
చచ్చి దఱి జేరి కంపలఁ జొచ్చుముసలి
తొండ నొకదాని బోనీక తోక పట్టి
జాలిలే కీడ్చుచున్న దీమాలకాకి.

నాన ముసుగున ముసిముసినసుగుచున్న
ప్రసవముల జేర మొగమోటపడెడు తేటి,
మెడను ఱిక్కించి, ముక్కున బొడిచి పట్టి
కొమ్మపై జేరుచున్న దాగోరువంక.

అది భయావహావనసీమ ; అది పిశాచ
భూతబేతాళవిశ్రాంతిభూమి ; అచట
పుట్టిపెరిగినవాడేని పుట్టి చరమ
గతిని గన్నట్టివాడేని కానరాడు.—

దుర్భరవియోగవేదనాదుఃఖముననో ;
దారుణగ్రీష్మభీష్మోష్మదాహముననో ;
వన్యజంతుప్రకల్పితాపాయముననో ;
యెట్లుమడిసెనో యీపాంథు డెవరికెఱుక ?

ఇతడు పాంథుండొ కాడొ య దెవ్వ [డెఱుగు,
నేల కారా దొకానొకపీలతబిసి ?
యేదియెట్లైన నాచెట్టుబోదె మొదట
నస్థిపంజర మొక డున్నదనుట నిజము.

ఎండవానల కుడివోవకుండునటుల,
పూర్వదాంపత్య ముండినపోల్కి-, దాని
యంగముల నెల్లయెడల కవుంగలించు
కొనియె బ్రణయాత్మతో లతకూన యొకటి.

గాలి కాతీవ యిటునటు కదలినపుడు
గిలిగిలింతలనొందినట్టులుగ నతివి
కారముగ మూల్గి యాపుఱ్ఱె యాఱుపది
వెండిపండుల నికిలించి నెక్కి-రించు. [యు

ప్రుచ్చిలిన సూనగంధమ్ము ముడిచికొనగ
నాసికామార్గముల కరోటీసదనము
దూఱి వితయాట ప్రేక్షణద్వారములను
వెలి కుఱుకు గాలిదొంగ నిస్పృహ వచించు.

ప్రాణవిగళిత మా యస్థిపంజరమ్ము
ప్రాణసంభృత మాసుమవల్లికయును
లోకమంతయు మాగన్నులో బరున్న
యపుడు తేలెదరంట రహస్యగోష్ఠి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆమెముకగూటియం దంతరంతరముల
కాపురమ్మున్న క్రిమికోటి కాంచుచుండు
దల వెలికిజెట్టి సృష్టిచిత్రములనెల్ల
కలియుగపువృత్తు లేవియో తెలిసినట్లు.

ప్రమదల శిరమ్ములందు నాభరణములకు
గాంతి పొదిగెడు నోవల్లికామతల్లి,
యేలనే యెండిపోయినయెముకగూటి
పైని నీ కింతయవ్యాజమైనకూర్మి?

ఏకులమ్మునవాడో వీ డెచటివాడొ
యెందు బోయెడునో పాప మిచట గూలె
పతిని బెడబాయనేరని సతియువోలె
బ్రోచెదవె బాపురే! లతాపుణ్యసాధ్వి!

శశ్వదాయుష్మతీ, నిత్యశాంతిరస్తు!
సిద్ధసౌభాగ్యవాల్లభ్యసిద్ధిరస్తు!
భద్రకల్యాణవైభవప్రాప్తిరస్తు!
పుష్టిరస్తు! సుమంగలీ, తుష్టిరస్తు!

* * *

ఈవిచిత్రమిథున మీక్షించినంత న
క్కజము పుట్టెనేమె గండుతేటి,
నవ్వుచున్న తీవపువ్వులచుట్టును
సుడులు చుట్టి తిరుగుచుంటి వటుల!

* * *

అటుల తిరుగుచు, తిరుగుచు, నామిళింద
మాసుమవ్యూహమునదూఱె, నాక్షణంబ
అకరులన్నియా ప్రాణ మున్నటుల నక్క
ళించి యొకసారిగా ముకుళించుకొనియె.

దానిలో జిక్కువడిన మత్తద్విరేఫ
విభుడు మరణవేదన నొందువిధిని జాలి
గొలుపు ఝుంకారనిస్వనమ్ముల నొనర్చు
చుండె; వ్యథ యే మనుభవించుచుండె
[నొక్కొ!

కొంతసేపటి కామృత్యుకుసుమదళము
లన్నియును విచ్చె, నయ్యయో! యందు
[జొచ్చి
యున్న యెలదేటినెత్తురు లోడుచున్న
మాంసపున్ముద్దయై యందు మణగియుండె.

తెలిసె నహహా యితండు యతియును గాడు
మానియును గాడు బీఱెండ మాడిమాడి
తలనుదాచుకొనగ వచ్చి యలరుజొంప
మని యిటంజొచ్చి మడిసిన యధ్వగామి.

చొఱినయంతనె తనువెల్ల చుట్టి పట్టి
యతని బంధించి సంధుల నన్ని నలిపి
పలలపిండమ్ముగా జేసి భక్షణమ్మొ
నర్చె లతవలెనున్న యీానంగనాచి.

అన్ని యలరులవలెనె యీయలరుగూడ
నని, నిసర్గప్రియోన్మాదమున మిళింద
మిందునం జొచ్చి చచ్చె ని ట్లెన్నియెన్ని
ప్రాణములు గోలుపోయెనో దీనిచేత.

దగ్గఱ జేరినట్టి సత్త్వములనెల్ల
పట్టి బంధించి వానిని భక్షణమ్మొ
నర్చి వర్ధిల్లు కుసుమమంజరులు కలవు
ప్రకృతియందున నీతీవ యొకటి యందు.

ప్రకృతియే యింతమోసాలరాశియైన
ప్రకృతియే యింత సోపద్రవప్రసన్న
మైన దేనిని నమ్మంగనగును జగతి
మాయచే గండ్లుపోయిన మానవులకు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



పుష్య మాసము
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# "కథ గాదు"

గూడూరు రాజేంద్రరావు

కలకత్తాకు పోవుబండి మదరాసునుండి రాత్రి యెనిమిదిన్నరగంటలకు బయలుదేరును. ఎప్పుడును మూడవతరగతిబండ్లు క్రిక్కిరిసియేయుండును. ఆనాడు మదరాసునకు క్రికెట్టుపందెములు జూడవచ్చినమూకతో రైలు పిక్కటిలుచుండెను. నే నానాడే ప్రయాణముజేయుట తటస్థించినది. కదలుటకు కొన్ని నిముసము లుండగనే ఒకబండిలో దూరితిని. అందెటుజూచినను ఆవంతయైన సందు లేదు. నావెలగల దుస్తులనుజూచి కూర్చున్నవారు కొందరు నడుములు గదిలించుచు నాకు చోటుకొరకు అటునిటు జూచుచుండిరి. నేను వారిని శ్రమపడవలదనిచెప్పుచు బండియంతయు కలయజూచితిని. ఆమూలను ఎవడో యొకడు ఎదుటిబల్లపై కాళ్లుంచి, మోకాళ్లపై తలనుంచుకొని నిద్ర నభినయించుచుండెను. ఇతరులు కూర్చుండుటకు చోటులేక బాధపడునపుడి ట్టిద్దరిస్థలము నాక్రమించుకొని దొంగనిద్రల బోవువారిని జూచి నేనెన్నడు సహింపలేను. నేను స్వభావముచేత తగవులమారిని కాకున్నను ఇట్టివారినిజూచినపుడు నారక్తము మఱికిపోవును. వారికి బుద్ధిచెప్పనిదే నే నూరకుండను. ఆకూరుచున్నవాడెవడో హిందూస్థానపువాడని నేననుకొంటిని. నేను పరిభవించిన ప్రయాణీకులలో పెక్కురాదిక్కువారే. వాని పొడవగుకాలు నేతులు మిక్కిలిసన్నమై వికారముగనుండెను. ముఖము నాకగపడలేదు. కాని యెఱ్ఱని పీచువెండ్రుకలు భుజములపై బడియుండెను.

నేను, కూరుచున్నవారిమోకాళ్లు రాచుకొనుచు తిన్నగ వాడున్నచోటునకు బోయితిని. వానిభుజముపై దట్టి కాళ్లుసింపుకొమ్మంటిని. వానిశరీరమున పలిమెదు కండయైన లేదు. వట్టి యెముకలకుప్ప. వాడొకమూల యొదిగి కూర్చుండెను. నేనును వానియెదుట గూర్చుంటిని. వాడు ముఖమెత్తి అగ్నికణములవంటి చిన్న కండ్లతో నన్నుజూచెను. అందు కోపము గానుపింప లేదు. నేను వానిముఖమువంక జూచితిని. కాలుసేతుల వలెనే సన్నని పొడవైనమొగము, వానిఫాలము విశాలముగ నుండెను. అందు పెద్దయక్షరములతో "సీత" యని తెలుగున పచ్చబోసియుండెను. నాయనుభవమున పచ్చబోయించుకొన్నవారి నెందరనో జూచితిని. సోలుజారు లనేకులు చేతులపైనను, వక్షమునందును తొడలయందును బొమ్మలో యక్షరములో పొడిపించుకొందురు. కొందరుస్త్రీలు కన్నులచివరను సన్ననివంకగీతలు గీయించుకొందురు. కాని ముఖమున అక్షరములు వ్రాయించుకొన్నవానిని జూచుట నాకిదియే మొదటిసారి. ఆభాష తెలుగగుటచే వాడెవడో యాంధ్రుడని నే ననుకొంటిని. వానితోమాటలాడి వాని వృత్తాంతమును దెలిసికొనవలెనని నాకు కుతూహలము గలిగెనది. పలుకరింప సంశయించుచుండగనే వాడు పొడిదగ్గు దగ్గుచు ప్రక్కజేబులోనుండి రెండుబీడీలను లాగి, నాకొకటిచ్చి తానొకటి నోటనుంచుకొని నిప్పంటించుకొనెను.

బండి వేగముగ బోసాగెను. వాడు కూరుచున్న కిటికీనుండి ఉక్కటముగ గాలి విసరుచుండెను. వాడు నన్నుజూచి "చలిగానున్నది. ఈకిటికి దింపిన మీకభ్యంతరము లేదుగదా?" యని దగ్గుచు నన్నడిగెను. పాపము, వీడెవడో దీర్ఘకాలమునుండి రోగపీడితుడు. ఇట్టివానితో తగవులాడదలంచితినిగదా యని నాకే సిగ్గయినది. కిటికీ నేనే మూసితిని. "నీకవసరమైన కాళ్ల బల్లపై నుంచుకొమ్మ. నేను నిలువబడియుండ గలను." అని నే నంటిని. వాడందులకు వలదని నవ్వుచు తలద్రిప్పెను. మాకిరువురకు మైత్రి కుదిరినది.

వానినడుగకయే వానికథ కొంత నా కిట్లు బోధపడినది. "వీడెవడో పిన్నవయసుననే తన ప్రేమకు పాత్రురాలయిన భార్యను గోలుపోయినాడు. అప్పటి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండి మనసుతోడి శరీరస్థితిగూడ స్వస్థత చెడినది. పాప మా భార్య పేరు ముఖమున నే అచ్చొత్తించుకొన్నాడు." అనుకొంటిని. ఆవిషయమై ప్రశ్నించిన వాని హృదయాంత రాళమున ఘనీభవించియున్న వ్యథను బల వంతముగ పెకలించినవాడ నగుదు నేమోయని భయపడితిని. కాని నాసంశయము తీర్చుకొన వలయునను కోరిక ఆభయము నడచివైచినది. "సీత నీ భార్యయా?" అని మెల్లగ ప్రశ్నించితిని. వాడు త్రుళ్లిపడెను. "ఆ- మాసీత - మాసీత - మాచెల్లెలు - మా సీత" యనుచు వ్రేళ్లతో ముఖముపైని యక్షరము లను దడవికొనెను. పాప మూపిరి ద్రిప్పుకొన లేక చాలసేపు దగ్గుచుండెను. నాయూహ పొరబాటు. వీడెవడో కనుగొనవలెనను ఆశ నాకు ప్రబలెను. ఈమాటు "మీ దేయూరు" అని నేనడిగితిని. వాడు నామనసులోని తహతహ నప్పుడే గుర్తించి మెల్లగ నవ్వినాడు. "నాకథ మీకు విసుగు బుట్టింపన ట్లయితే చెప్పెదను" అనుచు మరొకబీడి కాల్చుకొని గుండెలూడిపడునట్లు దగ్గినాడు. కొంత సేపటికి తెప్పరిలి నావంకజూచి యిట్లు ప్రారంభించినాడు:



"మాసీతచేయి......నా దేహమంతయు ప్రాకిపోయినది"

"మా సీత నేను బుట్టిన ఆరేండ్లకు బుట్టినది. దాని పుట్టువు, నాతల్లి మరణము ఒకనాడే సంభవించినవి. మా తండ్రిది వైద్యవృత్తి. మమ్ముల నిరువురను తల్లి లేమి దెలియనట్లు సాకినాడు. నాకిరువది యేండ్లు వచ్చినవి. బి. యే. చదువుకొనుచుంటిని. మాతండ్రికి జబ్బుచేసినది. ఎన్నియో చికిత్సలు జేయించితిమి. కాని యేమిలాభము? మాసీత, నేను మిగిలితిమి. మాసీతచేయి నా చేతిలోనుంచి మాతండ్రి, మాటరాక నావంక జూచిన కడపటిచూపు నా దేహమంతయు ప్రాకిపోయినది; నాగుండెలో నిమిడిపోయి నది. నేను పెద్దపెట్టున ఏడ్చితిని. మాసీత... మాసీత నన్నూరడించినది. అదియేడ్చునపుడు నేను, నేనేడ్చునపుడుమాసీత ఓదార్పుమాటలుచెప్పుకొను వారము. కాలక్రమమున మాతండ్రిమాట కొంతమరచి తిమి. మాసీత తేనెలొలుకు పాటబాడుచు వీణె మీటు చుండెడిది. నాకు చిత్రలేఖనముపై నభిలాష మెండు. దినమంతయు మాసీతసంగీతము నాకర్ణపుటముల బడు చుండెడిది. చిత్రలేఖనమునకును బురికొల్పుచుండెడిది. నేను వ్రాసిన చిత్తరువులను జూచి మాచెల్లెలు సంత



"నేను వ్రాసిన చిత్తరువులను......సంతసించుచుండెడిది."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సించుచుండెడిది. ఇట్లానందమయముగ రెండేండ్లు గడచిపోయినవి. ఒకరిభావముల నొకరము చూపుల లోనే గుర్తెరుగువారము. నాకు గిట్టనిపని మాసీతకసహ్యము. దానికిష్టములేనిమాట నాకును అట్లే. మాకిరువురకును దేహములే రెండు. ఆత్మ ఒక్కటియే. మాసీత బంగారము. నేను వెలిగారము"

పాపము, వాడు ప్రయాసముతో దగ్గనాపుకొనుచుండెను. శుష్కించిన వానివక్షము క్రిందికిమీదికి నెగురుచుండెను. వానిప్రక్కనుంచికొనియున్న గొట్టములోని తేనీటిని నాలుగు గ్రుక్కలు ద్రాగి మరల నారంభించెను.

"ఇట్లెంతోకాలము జరుగలేదు. రెండేండ్లే అయినది. నాకొకనాడు జ్వరము వచ్చినది. మా సీతకు ప్రపంచమే మునిగినట్లుండినది. దాని పరితాపము చెప్పనలవి గాదు. ఆ పాపిష్టి జ్వరము త్వరగా వదలినది గాదు. ఇరువదిరోజులు నన్ను వేధించినది. టైఫాయిడుజ్వరము. మాతండ్రిదగ్గర పనినేర్చుకొనినవా డొక కుఱ్ఱవైద్యుడుండెడివాడు. వానికి మాపై మిక్కిలి యభిమానము. వాడు నన్ననుదినము జూచుచు, మందులిచ్చుచు, మా సీతకు ధైర్యము జెప్పుచు నుండెడివాడు. ఎట్లో ఆ గండము దప్పినది. అప్పుడే చచ్చియుండిన నేబాధయు లేకయుండెడిది. కాని మనయిష్టమా? నాకు జ్వరపీడ పోయినది. కాని నా దేహపుకండలు, నెత్తురు దానితోడే పోయినవి. ఇట్లే అస్థిపంజరమునై మంచాన బడియుంటిని. మాసీత నాకుజేసిన యుపచర్యలు చెప్పిన దీరునవిగావు. ఆబిడ్డ నాకంటె నారేండ్లు చిన్నది గదా. ఆహా! ఏమి దానియోర్పు. ఆబిడ్డప్రేమ. రెండు మాసములు మాసీత,నిద్రయెరుగదు. తా నెప్పు డన్నము దినునదో దేవునకెరుక. ఎప్పుడు నాప్రక్కనే యుండునది. అబ్బా! ఆబిడ్డపరిచర్యలు" అని ముఖము వంచుకొనెను.

రెండునిమిషములు వానినోట మాటరాలేదు. పొరలివచ్చెడు దుఃఖముతో బోరాడుచుండెను. పిదప తలయెత్తి నన్ను జూచెను. వానిముఖము నెత్తుటిముద్దవలె నుండినది. "మీకు విసుగు బుట్టుచున్నదా?" అనెను. నే నందుకు ప్రత్యుత్తరమీయకయె, "తర్వాత, తర్వాత?" అంటిని. మరొకబీడి వెలిగించుకొని వాడిట్లు సాగించెను:

"మాసీత మ్రొక్కనిదేవతలు లేరు. అదిచేయని పరిచర్యలు లేవు. కాని నా దేహమునకు బలము కలుగలేదు. నే నెప్పటివలె కాజాలనని నా కనుమానము కలిగినది. ఒకనా డాకుఱ్ఱవైద్యుడు నాదగ్గరనుండెను. మాసీత నేదోపనిమీద లోనికిబంపి, వానిని నాయథార్థపుస్థితి దెలుపమని ప్రార్థించితిని. వాడు చాలసేపు నన్ను బరీక్షించెను. వాని ముఖలక్షణమే నానికి నాయాశలేదని తెలుపుచుండెను. చివరకు నన్ను భయపడవలదనుచు, నాకు క్షయరోగమనియు, అదృష్టవశమునగాక స్వస్థముగాదనియు, అయినను ప్రయత్నించెదననియు చెప్పెను. నాశరీరము చలువలు గ్రమ్మినది. ప్రాణముబోయిన ఊహింపదీరును. నేను చావునకు భయపడలేదు. కాని మాసీతగతి యెట్లు? నాప్రాణమెటుబోయినను మాసీతప్రాణమెట్లు గాపాడగలనా యనుమాట నాకు హృదయశల్యమైనది. ఆముద్దరాలిమనసు మఱెవ్వరేని హరించిన అది నన్నింతగ ప్రేమింపదు. కాని దాని హరింపగలవా డెవడు?"

"వైద్యుడు వెడలిపోయెను. నేను మాసీతను నా చెంతకు బిలచితిని. 'సీతా! పాప మీకుఱ్ఱవానికి మనపై నెంతప్రేమ. చాలమంచివాడు సుమా! వాడులేకుండిన ఇప్పట్టున మనగతి యేమైయుండెడిదో' యనుచు దాని ముఖము జూచుచుంటిని. దానిచెక్కుల పులకపటలి మొలకలెత్తినది. నిట్టూర్పువిడచి 'చాలమంచివాడన్నా' అనినది. నావెనుక మాచెల్లెలిహృదయమున నీవైద్యుని మూర్తి కొంకింత తావున్నదని నేగ్రహించితిని. నే నిదే సమయమనుకొంటిని. నాచెల్లెలు పరిణయమాడిన, క్రమక్రమముగ వా డామెహృదయమును లోజేసికొనును. నా భౌతికశరీర మీలోకపు మట్టిలో గలిసినను మాసీత జీవితానందమునకు మరియొకపట్టుగొమ్మ జిక్కును. మాసీత సుఖముగ నుండునుగదా యనుసంతోషము నా కపరిమితమయ్యెను. 'సీతా' అంటిని. మాసీతకు నా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హృదయములోని యోచనలన్నియు, 'నే ననబోవుమాట లన్నియు ముందే తెలిసెనేమో. 'అన్నా! నీవెనుకటి




"అన్నా! నీవెనుకటి......ప్రవర్తించెదను అనెను."

దానను నేను. అన్నిటిలోనట్లే ప్రవర్తించెదను' అనెను. నా కాబిడ్డమాటలకు నవ్వు, దుఃఖముకూడ వచ్చెను. పాపము! మాసీతకు నారోగతత్త్వము తెలియదు. కాటికి కాళ్లు జాచిన నా కేమిపెండ్లి. వైద్యుడు నాజాడ్యము కుదురదన్నమాట సీతకు జెప్పవలె ననుకొంటిని. కాని ధైర్యముచాలలేదు. మాసీత గుండె బ్రీలదా ఆమాటవిన్న!"

వాడెన్నడో నన్ను మరచినాడు. బయలు జూచుచు తన కథను జెప్పుకొనుచుండెను. చివాలున నన్ను జూచి, "అయ్యా, మీరింకను వినుచున్నారా? మీకు విసుగుజనించుటలేదా? వారివారి జీవితములు వారివారికి విపరీత సంఘటనములుగ దోచుట సహజము. కాని మరియొకరి కందేమియు చవియుండదు" అనెను. "అట్లు గాదు, చెప్పుము, పిదప మీసీత నేమిజేసితివి.?" అని యంటిని. "ఏమిజేసితిని, వల్లకాడుజేర్చితిని. నిర్భాగ్యుడను" అనుచు తేనీటిగొట్టమును మరల నోట బెట్టుకొనెను. కొన్నినిమిషములు మోకాళ్లపై తలయుంచి కొని కూరుచుండెను. వాని కాయాసము కొంత తగ్గినది. మరల కథ సాగించెను.

"ఆనాటినుండి దాని పెండ్లిప్రస్తావనమే మానితిని. నా యాశాలతను మా సీత మొదటిలోనే త్రుంచివేసినది. మరి పెండ్లాడ నని తెలిసి మరల ఆమాట యెందుకని నే నామెను హెచ్చరింపనే లేదు. సీత ప్రేమను నాపైనుండి మరలించుటకుమాత్రమ హర్నిశలు యోచించుచుంటిని. మాసీత మరియొకని ప్రేమించి నన్ను మరచుమాట యసాధ్యము. ఇంకొకని మాటలేకయే నన్నామె ద్వేషించునట్లైన చేసికొనరాదు అని నాకు తోచినది. ఇది నా చేతిగానిపని. ఆనాటినుండియు మాసీత నూరక కసరుచుంటిని. కండ్లురుముచుంటిని. నానోటికి వచ్చినటుల ప్రేలుచుంటిని. కాని మాసీత కంతకంతకు ప్రేమ హెచ్చుగుచుండెను. దానిముఖమున ద్వేషచిహ్నములు మచ్చునకైన లేవు. పొంగిపొరలెడి ప్రేమప్రవాహము నాపుకొని, కఠినముగ దిట్టుట వ్యాధిగ్రస్తుడనగు నాకెంత కష్టముగ నుండియుండవలెనో యూహింపుడు. ఎంతయోప్రయత్నించితిని. నాకోరిక కొనసాగలేదు. మాసీత యెవ్వరిని ద్వేషింపలేదు. నన్నెట్లుద్వేషించును?

"ఒకరాత్రి చాలప్రొద్దయినది. నాకు నిద్రబట్టలేదు. నేను నిద్రించితినని పాపము మాసీత ప్రక్కగదిలో బరుండి నిద్రబోవుచుండినది. నేనూరకపరుండి యేమేమో యోచించుచుంటిని. ఏమోయననేల. మాసీతమాటతప్ప నాకిం కేయోచన యున్నది. ఆరాత్రి ఒథెల్లో మాక్బెత్తుకథలు నాతలపునకు వచ్చినవి. తటాలున నాకేదో యూహ స్ఫురించినది. రోగికి యూహలకు కొదువా? అందును నేను చదువుకొనినరోగిని. నేను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంచముబట్టుకొని లేచితిని. తిన్నగ ప్రాకిపోయి నా పెట్టెదెరచి ఒక బాకు చేతికి తీసికొంటిని."

"ఏమీ! మీసీతను నీవే చంపితివా? ఎందుకు?" అనుచు నే నాశ్చర్యచకితుడ నైపోతిని. వాని కాప్రశ్న వినబడలేదో మో, వాడందుల కుత్తరమే జెప్పలేదు.

"గోడబట్టుకొని మా సీత పరుండియున్న గదిలోనికి వెళ్లితిని. చిన్న దీపపువెలుగున ఆబిడ్డ కాళ్లుచేతులు ముడిచికొని నిద్రబోవుచుండెను. దానిప్రక్కను నిలుచుండి



"దానిప్రక్కను నిలుచుండి......గట్టిగ దగ్గితిని."

బాకు పైకెత్తిపట్టి, గట్టిగ దగ్గితిని. అది బెదరిపడి నన్ను, నా బాకును చూచినది. నిప్పులు రాలు నాకండ్లను జూచినది. నాకోరిక నెరవేరుచున్నదనుకొంటిని. మా సీత భయకంపితయై కేకలువేయును. నేను తన్ను నిద్ర పట్టున జంపవచ్చిన రాక్షసుడనని తలంచును. తన తోబుట్టువతనమును, అపార ప్రేమను, సర్వత్యాగమును తృణీకరించి తనప్రాణమునకే ఎసరుబెట్టిన అమానుష వ్యక్తినిగ భావించి నన్ను ద్వేషించును. మా సీత నన్ను ప్రేమించుట మానునుగదా. నా కింకేమి కావలయును. పిదప నే నెంతత్వరగ జచ్చిన నంత మేలు. సంసారమును జయించి మృత్యువున కెదురు సూచుచుండెదను అని నాలో నే నుప్పొంగిపోవుచుంటిని.

"మా సీత లేచి మెల్లనికంఠముతో, "అన్నా! నన్ను పిలచిన నేను రానా? నీ వింతమార మెందుకు నడచివచ్చితివి" అనెను. నా శరీరము నిప్పువెంద్రుక బెట్టినది. నాయూహకు మా సీత ప్రవర్తనకు, ద్వేష బుద్ధికి నాకు నున్నంతమారమని నాకు దోచినది. కాని నాయత్న మంతటితో నే మానలేదు. క్రోధఘూర్ణిత దృష్టితో మా సీతను జూచి యిట్లంటిని: "నేను నిన్ను జంపవచ్చితిని. నీయునికి నా కసహ్యాకరముగనున్నది. నా జీవితము నరకప్రాయమగుచున్నది. నిన్ను జంపినగాని నాకు శాంతిలేదు. నిన్ను పొడిచివేతును" అంటిని. మా సీత కీమాటలు వినబడినవో లేదో, అది నన్ను తిన్నగ బట్టుకొని కూర్చుండబెట్ట యత్నించుచుండెను. "ఇంతదూరము నడచివచ్చితివా అన్నా. నన్ను బిలువకూడదా. నేను రానా" అని గొణుగుకొనుచుండెను. నాగుండె కరగి కడుపులోనికి వేడిబొట్లుగ దిగజారుచున్న ట్లుండెను. నేను కుమిలిపోవుచుంటిని. నా దేహ మదరుచుండెను. కాని నానాటకము నప్పుడే ముగింపలేదు. 'నిన్ను నేనేల పిలువవలయును? నీవు చావవలయును. లేకున్న నేను బ్రతుకను.' అని నేను బిగ్గరగ నంటిని. మా సీత కీ విపరీతప్రవర్తనము బోధపడలేదుగాబోలు. పాపము అమాయిక గద్గదస్వరముతో, "అన్నా, నీకు నాపై ప్రేమ లేదా?" యని అడిగెను. ఈప్రశ్నకు నాకప్పుడే వాడిగ్రొడ్డటివేటువంటి ప్రత్యుత్తరము స్ఫురించినది. "ప్రేమగాదు. నీపై నాకెన్నడు ప్రేమలేదు. కాని మోహము. నాకోరిక అమానుషము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పైశాచము. కావుననే నిన్ను జంపి హాయిగ నుండెదను.” అంటిని. ఈ రక్కసిబొంకు నాకెట్లు స్ఫురించినదో నాకే తెలియదు. మాసీతకు నాకు యెడబాటునకిక తడవుండదని నాకొకవిధమగు సంతోషము గలిగినది. ఈ మర్త్యప్రపంచమున నాపిశాచముఖ మింక మాసీత జూడదు. నాకు కావలసిన దదే గదా.

“మాసీత, కూర్చొనియున్న నన్ను దాని మంచముపై పరుండబెట్టినది. దానివంకనే కన్నార్పక జూచుచుంటిని. మాసీత నా ప్రక్కను గూర్చున్నది. వ్రేళ్లతో నాతలవెంట్రుకల దిద్దుచు ‘అన్నా’ అనినది. నా మెదడెవరో యినుపగరిటెలతో కలియబెట్టినట్లు నాతలలో బాధగలిగినది. ఒక్కనిమిష మట్లే యుండి వీణను దీసికొని యేదో పాడ నారంభించినది. నా నాటక మయిపోయినది. మా సీత ప్రేమతత్త్వము నా కందరానిది. అది విరుగనేరనిది. లజ్జచేతను, అలతచేతను నేనుకన్నులు మూసికొంటిని. నామనసు దాని పాటపై కెగబ్రాకెను. అట్లే వినుచు నిద్రబోయితిని. ఉదయము కన్నులు దెరచుసరికి నాబాకు నాగుండెలపై బడియుండెను. మాసీత, వీణపైనుంచికొని నా ప్రక్కలోనొదిగియే నిద్రించుచుండెను.”

వానికంఠస్వని మారిపోయినది. వానిహృదయమున నెక్కడనో తూటుబడి అందుండి మాటలు కారుచున్నట్లు నాకు దోచినది. పాపము. వానికి మరలదగ్గువచ్చెను. ఈమారైదారునిమిషములు బాధతో దగ్గెను. వానినోరు నెత్తుటిమయమైయుండెను. మరల తేనీరు ద్రాగెను. ‘మీకెందుకులెండి యీపాడుకథ, నిలిపెదను’ అనెను. నానోట మాటరాలేదు. గొంతుకలో నేదో యడ్డుపడినది. సాగింపుమని సంజ్ఞజేసి వానిముఖమునే జూచుచుంటిని. వానివలెనే మోకాళ్లపై గడ్డముంచుకొని గడగడ వడకుచుంటిని.

“ఆరాత్రి పాడునాటకమంతటితోనే ముగిసినది. మేమిరువురమును దాని నొకదుస్వప్నముగభావించి స్మరింపనేలేదు. మాజీవితప్రవాహమునకానాటి కథ యొకఅంతరాయము గాలేదు. వల్లకాడైన వైద్యులమాటలకేమి? నారోగము కుదురగూడదా? నేనొకవేళ బ్రతుకగూడదా యనునాశ నాలో నంకురించినది. ఆనాటినుండియు నారోగము తగ్గసాగినది. నా దేహము స్వస్థమగుచున్నదని నాకే తెలియుచుండినది. మాసీతసంతోషము చెప్పవలయునా? వైద్యు డెప్పటియట్ల దినమునకు రెండుమారులు వచ్చుచుండువాడు. మేమిరువురమును మాట్లాడుకొనుచుండగ, మాసీత దూరమున పాడుచుండెడిది. వైద్యునకు నాయారోగ్యాభివృద్ధి యొక గర్వకారణముగ నుండెడిది. ప్రాణము నాదైనను, కృషి మాసీతదైనను, ఖ్యాతి వైద్యునిదిగదా! వానిని చూచినపుడెల్ల తనచేతగానితనముచే వాడు లేనిరోగము నాకారోపించినాడుగదా యని మాత్రము వానిపై కొంతఅసహ్యపడుచుండెడివాడను. కాని నాడేమిజేయగలను? వాడును అందరివైద్యులవంటివాడే.

“ఇట్లు కొన్నాళ్లుగడచినవి. నేను ప్రతిఉదయమున మాసీతతోగూడ కొంతదూరము నడచివచ్చుట వాడుకజేయుచుంటిని. వైద్యు డప్పుడప్పుడు మమ్ముగలసి




“మమ్ము కడగంట......గుసగుస లారంభమయినవి.”

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొనుచుండెడివాడు. మేము నడచుచున్నపుడు మాయూరి వారు గుంపులుగూడి మమ్ము కడగంటజూచుచుండెడి వారు. గుసగుస లారంభమయినవి. రచ్చకొట్టములలో మాదే ప్రస్తావన. స్వల్పులుగదా. సీతకు వైద్యునకు స్నేహ మనువదంతులు తలజూపినవి. అవి ప్రబలి నా చెవికిగూడ సోకినవి.

"ఆపట్టివాడు మాయింటికి పలుమారు వచ్చుటకు మాసీతయే కారణమని వా రనుకొనిరి. మాసీతగుణము నే నెరుగనా? నా శ్రేయనుమానమును లేదు. కాని యీ వదంతులు నన్ను కలవరపరచి బాధించినవి. నిష్కళంకమగు మావంశగౌరవ మిట్లు వమ్ముపాలగుచుండుట నేను భరింపలేకపోతిని. నా మనోవ్యథ అంతకంతకు హెచ్చుచుండెను. ఈ తెలివితక్కువకుఱ్ఱవాడు మాయింటికివచ్చుట మానగూడదా? మాసీత వానితో ప్రసంగములు చాలింపగూడదా? కాని యెట్లుచెప్పగలను? నా దేహవ్యాధి కుదిరినది. కాని ఈ క్రొత్తమానసిక వ్యాధి ప్రబలినది. వైద్యునిపై నిష్కారణద్వేషము, మాసీతపై కోపము నాలో బొడచూపుచుండినవి.

"కొన్నిమాసము లట్లే గడచినవి. ఉదయమున మాసీతను వెంటబెట్టుకొని బయటబోవుట మానినాను. అదేదో యింటిపనులు చూచుకొనుచుండెడిది. రెండు వేళల మరికొందరు స్నేహితులతోకలిసి షికారువెళ్లు చుంటిని. వారందరు నాతోటి చదువుకొన్నవారు. నా శ్రేయోభిలాషులు. మా వంశమున కాపాదించిన యీ కళంకమునకు వారిలోవారు కుందుచుండిరి. మాసీత దోషియని వారి నమ్మకము. నాతో ఆ విషయము మాట్లాడ జంకుచుండిరి. కాని కొన్నాళ్లకాప్రస్తావన మెట్లో పైకివచ్చినది. ఆనాడంకురించిన వదంతులు నేడు శాఖోపశాఖలతోటి పెద్దమ్రానులయినవని నేను చింతించితిని. నా మిత్రులలోకొందరు నాబుద్ధిమాంద్యమునకు నన్ను నిందించిరి. కొందరు వైద్యుని బెదరించి యింటికి రానివ్వకుండ జేయుమనిరి. మరికొందరు సీతను మందలించుమనిరి. వీరందరును నన్ను ప్రేమించి నాగౌరవాగౌరవములు వారివిగ భావించువారలే. వారి యుపదేశములు నాకు విపరీతముగ దోచలేదు. మరి నాకుటుంబము నపవాదకళంకితముగావించుట కావైద్యుడెవడు? వానిని రేపే తరిమివేసెదనని నిశ్చయించుకొంటిని. నాచేతగానితనమునకు నాకే రోతబుట్టినది. ఇన్నాళ్లూరకుండుట కెంత తెలివితక్కువవాడను. నామిత్రు లిండ్లకుబోయిరి. బాగుగ చీకటిపడినది. నేనొక్కడనే కూర్చొని, ఉదయమున నే వానితో నాడవలసిన మాటలపదకము గూర్చికొనుచుంటిని. ప్రొద్దుపోయినది. మెల్లగలేచి యింటికివెళ్లితిని. వీథిగుమ్మములోనికే మాసీతవీణాధ్వని వినవచ్చుచుండినది. కాని నాచిత్తమెక్కడనో యుండినది. నా శ్రవణపుటముల బడిన దానిరాగము నాహృదయమును ప్రవేశింపలేదు. నామనోవేదన నడంపలేదు. అట్లే యింటిలోనికి బోయితిని. మాసీత బాలసరస్వతివలె వీణ మీటుచు మెలమెల్లగ బాడుచుండినది. వైద్యు డామె సమీపమున పరవశుడై కూర్చొనియుండెను. వారి నిరువురను జూచుసరికి నాలో నేదో అగ్నిపర్వతము పగిలినట్లయ్యెను. నానరము లొక్కమారుగ తెగి వ్రేలాడుచున్నట్లు నాకు దోచెను. వారిరువురును నన్ను జూచిరి. చిరునగవులతో నాకు స్వాగతమిచ్చిరి. నేనోర్చుకొనలేకపోయితిని. పరువెత్తి నాబాకు తీసికొంటిని. ఏమిమాటలంటినో నాకు తెలియదు. అవి నాకు తెలిసిరాలేదు. కాని వైద్యునిపై కురికితిని. మాసీత నా కడ్డమువచ్చినది. నాచేయి పట్టుకొని, "అన్నా, అన్నా" అనినది. నా కామె చేతిస్పర్శ ముండ్లపొద వలె దగిలినది. ఆమెపిలుపు నన్నెగతాళిజేసినట్లుండినది. అయ్యో! ఆబాకుతో మాసీతను ఈచేతితో బొడిచితిని. మాసీత నేలపై వ్రాలిపోయినది.

"నాకేమియు దోచలేదు. నలుప్రక్కల వెదకితిని. వైద్యుడు పలాయితుడైనాడు. నేను వానివెంట బడితిని. కొంతదూరము పరుగిడితిని. వాని జాడ లేదు. మాసీతను పొడిచినానని నాకప్పుడు తెలిసినది. పరుగు పరుగున ఇంటికి వచ్చితిని. మాచెల్లెలు నెత్తుటిమడుగులో బడియుండెను. నావంక కన్నార్పక చూచినది. నేనేమియుదోపక అట్లే నిలుచుంటిని. ఆమెనోట మాట రాలేదు. ఆమె ప్రేమమయమగుదృష్టి 'అన్నా' యని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నన్ను పలుకరించుచుండెను. ఆమెచూపులో ఆనాటి మాతృప్రిచూపు నా కగపడినది. అదియే మాకడసారి చూపు. నాచెల్లెలు. మాసీత. ”

వానిమాట లాగిపోయినవి. నాకన్నులు మూతలు పడినవి. అట్లెంతసేపుంటిమో నే నెరుగను. చివరకు నా మిత్రుడు నన్నుతట్టి, 'నిద్రబోవుచున్నారా?' యనెను. కండ్లుమూసికొనియే 'లే' దని తలయాడించితిని.

"నే నారక్తసిక్తమగు బాకుతో పరుగెత్తి న్యాయస్థానములలో నాఘోరాపరాధము వెల్లడిజేసితిని. వారు నన్ను బందిఖానాలోనుంచిరి. విచారణ ప్రారంభించిరి. నేనపేక్షించునది చెరసాలగాదు, మరణము. వీలయిన చిత్రవధ. నేనొప్పుకొనిన నేరమునకు యీవిచారణ లెందుకో యీపశువులకు. పలుదినములు విచారించిరి. పుస్తకముల ద్రిప్పిరి. వీరితలలలోలేని దీపుస్తకములు ద్రిప్పిన కనుబడునా? వారిలో నొకడు, నాపై హత్యానిందారోపణముజేసి వెనుకకు ముందుకు నూగుచు, కొన్నిదినములు మాట్లాడెను. పెద్దకుర్చీలోని పెద్ద జంతువు తలపంకించి వినుచుండెను. నే ననేకమారులు వారి గాడిదచెవులలో దూరునట్లు ఎలుగెత్తి 'నేను మా సీతను జంపుకొన్నానండ్రా; నన్నుచంపండి' అని అరచెడువాడను. బెదరిన గొఱ్ఱెలవలె నావంక జూచెడివారలు. మరొకడెవ్వడో లేచినాడు. నాది తప్పుగాదని వానివాదము. వాని వాదధోరణి తెలిసి, "ఛీ! ద్విపాద పశువా. నిన్నీ మాతలు కూయుటకు పేరంటము బిలిచితినా" యంటిని. వా డందరిలో అన్నిమాటలుబడి, పెద్దకుర్చీవానితో "చిత్తగించండి, దేవరా. వీడు పిచ్చివాడు.బుద్ధి స్వాధీనమునలేనప్పుడు చేసిన నేర మొక నేరముగాదు." అనుచు పుస్తకములు విసరివిసరిత్రిప్పెను. రాళ్లుగరగునట్లు వాదించెను.

"ఇట్లుండగా, ఒకనా డొకదొరలగుంపు నన్ను జుట్టుకొన్నది. నాచేతులు, కాళ్లు, తల, మెడ, అన్ని పరీక్షించి నాకు పిచ్చియని తీర్మానించిన దీబృందము. ఉన్మాదవైద్యశాలలో నన్ను బడవైచినారు. ఆదౌర్భాగ్యులు నాగొంతులో మందుపోసెడివారయ్యా! నాకేమిరోగమనియో వారియుద్దేశ్యము. మూడేండ్లట్లే పడియుంటిని. 'నాకు పిచ్చి లేద'నిన 'అదియే ఒకవిధమగు పిచ్చి' యనెడివారు. నే నూరకుండిన మౌనపుపిచ్చి. మాటలాడిన వాగుడుపిచ్చి. 'పిచ్చినక్కలారా! మీపిచ్చి కేమి పేరోయీ' అనుకొని నాలో నవ్వుకొనెడివాడను. నాకు చావైనను బ్రదుకైనను ఒక్కటేయయినది. చెరసాల, వైద్యశాల నాకొక్కటిగనేయుండినవి. మొన్నఉదయమున మరల ఆదొరలగుంపు నా గదిలో జొరబడినది. ఒక్కొక్కక్క అవయవ మొకొక్కడు బట్టి పరీక్షించిరి. పిచ్చి కుదిరినదట. మరి వారిదో, నాదో! కొంతసే పేదో కిచకిచలాడుకొని నన్ను వెళ్లి పొమ్మన్నారు. అందుకేవెళ్లిపోతున్నాను" అని మెల్లగ లేచెను.

స్టేషనురెక్కలు వంగలేదేమో. బండి మధ్య దారిలో నాగినది. అతడు బండి దిగుచుండెను. నేను లేచి, "ఇది స్టేషనుగాదు. కారడవి. చీకటి. దిగకు. దిగకు. నీ వెచ్చటికి వెళ్లవలె" నంటిని. వా డాచీకటిలో నా కగుపడలేదు. గాఢాంధకారమును చీల్చుకొని దూరమునుండి, "మా సీతవద్దకు" అను ధ్వని నా గుండెలో జొరబడినది.

బండి కదలినది. ఇదియంతయు నిజమా, లేక కలయాయని నే నాశ్చర్యపడుచుంటిని. వాడు మొదట నాకిచ్చినబీడి నాచేతిలో కమలిపోయియుండినది.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



సంయుక్తరాష్ట్రముల శాసనసభా భవనము, లక్నో.  —ఐ. ఆర్. చిత్ర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రాజకీయాల్లో అచ్చట్లూ ముచ్చట్లూ

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, యం. ఏ., బి. యల్.

చిత్రాలకు కన్నతల్లి ఈయుగం. చిత్రాలకు అగ్ర్య తనూడు మాయ. ఇది శంకరుడు చెప్పిన మాయ కాదు. భయంకరులు అభ్యసించే మాయ. ఈ మాయ, గారడీకాదు. గారడీ గారడీలో లేదు. ఎంచేతనంటే గారడీని గారడీఅని చెప్పేస్తాడు గారడీవాడు. ఉన్న గారడీ చూస్తూచూస్తూ ఉండగా—ఏనోటీసూ యివ్వకుండా—కళ్లల్లోపడేది. మాయదారి యుగంలో ఈ రకంమాయ విశేషంగా చలామణి అవుతోంది. మసిపూసి ఏదోకాయను తయారుచేస్తారుట—దీన్లో గొప్పేముంది? మెఱుగుపూసి మసిబొగ్గును చేతికిస్తేనే మజా! ఈమజాకాలో ఉంది తోడుకుంటే ఎంతైనా మాయ!

తంత్రశాస్త్రం మతశాస్త్రంలో పుట్టిందని ఉడ్రాపుగా రన్నారు. యక్షిణీశాస్త్రం, రాజకీయ శాస్త్రానికీ, అర్థశాస్త్రానికీ పుట్టిన గారాబుబిడ్డంటోంది నేటిప్రపంచకం! చరిత్రలు తవ్విచూస్తే ఎంతైనా దొరుకుతుంది గారడీసరుకు. వెనకటి చరిత్రలోని కలకలాన్ని నేపథ్యంలోనే ఉంచండి. 'ధినీతక'ల్లోని గ్రంథం చూడండి. గుండుబేబిలు నాటినుండి యక్షిణీ ఎక్కువగా జరుగుతోంది. గుప్పిలి ముక్కు కడ్డంగా పెట్టి "ఏముందో చెప్పుకోండి" అన్నాడు మహారాజశ్రీ మేకడొనాలుడు. "స్వరాజ్యం" అని ఎగిరి గంతేశాయీ నిలువుబొట్లూ, అడ్డబొట్లూనూడాను. గుండు బల్లచుట్టూ గుడుగుడుకుంచం తిరగటంమాత్రం ఎంతటి వాళ్లకి ఎంతమూటకట్టుకుని దిగనివాళ్లకి — ప్రాప్తిస్తుంది? మొదటి గుండుసభకే పెద్దలెందఱో పట్టుచెంబులూ వెండితాబుతాలు కట్టుకుపోయేరు! అనగనగా, కొందరు ఇంగ్లాండు ఎంత తెల్లగా ఉంటుందో లండనెంత తెల్లన్నరగా ఉంటుందో చూసితీరాలని కట్టేరు డబ్బా డవాలూ పిల్లిశకునం రాకుండా చూచుకొని. ఎంచేతో కాని ఎదురు సన్నాహం ఏమీ సాక్షాత్కరించ లేదు. డిప్పీ డివ్వటం అంతకంటూ లేదు. పెళ్లిపీటలేమీ ఎగిరివచ్చి హూర్చోండని దేవుళ్లాడలేదు ఏంచేతోకాని. ఎవళ్లో గారడీ విద్యాలవాళ్లు కనపడి "బాబులూ! మీకు ఇంగ్లీషు వచ్చునా?" అని గమ్మత్తుగా ఒపరామర్శప్రశ్నమీద పడేశారుట. "హుం!" అని మనవాళ్లు పటపట కాస్త కుప్పునమిలి, ఒకమాటు గరగలెత్తేరుట. పాగాలు అడ్డం తిరగటం చూచి, సెంటుజేమ్సుదగ్గఱకు పిలిచి ఒహమాటు వీపునిమిర—బాధలేదు సుమండీ!—చరచి—నింపాదిగా అనే హంసపాదుండి—ఒక పేకు పేండు పారేశారు రాజశ్రీ గారడీగారు. ఏం జరిగితేంగాక కాస్తవడపప్పూ పానకంపుచ్చుకొని లండనంతా చూచి, హెయిర్ డ్రెసింగు సెలూనులలోనిపని శుభ్రంగా పరిష్కరించుకొని తిరిగొచ్చారు మనమహాశయులు. వెళ్లినయిద్దరు ఆపహాస్యా "అమ్మ మనబతుకులూ అడవిలో తపసులూ" అనుకొన్నారు. ఎవరో ఒహరు మణుగుగంగమట్టి లండన్లో నూడిపెట్టి పెణ్ణార్ధాలు మణుకుండా యింటికొచ్చారుట. గుండుసభలు మూడు నాలుగు జరిగేటప్పటికి కొన్నిలక్షలుమాత్రం - సైమను భక్తులకైన ప్రసాదాలమాట ఎత్తటంలేదు—పేదరైతు గుండికి పట్టుకొన్నాయి! ఇతన్ని చూచి కళ్లంట నీళ్లు పెట్టుకొనటం వాఘాయిత్యం అనుకొని "యిత్యశ్మరః!" అని ఒహమాటు పోలిగాడిబొమ్మ ఆడించి 'ఇహిహి!' అన్నారు యిండియన్ పూట్లవారు. మొదటిగుప్పిలి విప్పి "హుూత్!" అన్నతర్వాత మేకడొనాల్డుగారు రెండోగుప్పి లెత్తి ఆప్రపంచఆర్థిక మహాసభకు నట్టనడాన్ని నిలువునా నిలబడి "ఏముందో చెప్పుకోండి" అన్నారు. ఇరుసు మండలోనిభోజనం తప్పితేంగాక, పుల్లేటికుట్టెల్లి ఏమైనా సంభావన వడు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొక్కస్తామన్నారు కొందఱు. "ఒద్దు పుల్లయ్యాలూ వేంవారము మళ్ళీఎందు" కని అడ్డుపుల్లేశారు మఱి కొందఱు. "అహోరించారు లెండి. కొంతఆప్టిమిజం, వుడకేసి, ఐడియలిజమ్ జుఱ్ఱుకుంటేనేగాని కడుపు నిండడం ఎల్లా" అని 'సెలక్టెడు ఫ్యూ' గారలు మళ్ళీ మెస్మరిజంవైపుకు ఓడ పట్టించారు! వెళ్లిపోయిన సలచ్చమ్మను ఏదో సిద్దిచెప్పి, తీసుకొస్తామన్నారు వీరు. రిజర్వుబ్యాంకును సందిట్లో పెట్టుకొస్తామన్నారు బ్రహ్మశ్రీ షాస్త్రులుగారు. కాని, లండన్లో దిగేటప్పటికి 'బేవు!' మన్నారు—జేరు మంటె బాగుండదని శ్రీయుతులు ఠాకూరు దాసు గారు. "ఇందేంటి—ముందుగానే తేస్చేశా" రన్నారు అయ్యంగారు అవరభుల్లు. "నుప్పిలి పక్కకు తిప్పి మొండిచెయ్యిచూపుతారు సభలో" అని ఎవరో రంగస్వామిగారిచెవిలో బూరా ఊదేరు. అట్టట్టేఅని ఒకమారు వడిదిప్పబోయి, అమాంతంగా బాసినపట్టేసి, జాయంటు సెలెక్టుకమిటీజాయంటుత్వానికి భంగం రాకుండా దానిమీద ఒకచూపు పారేసి, తిరిగోచ్చే మఱీ అయ్యంగారులిరుమార్ణంపుల్ల చేతబట్టేరు! లండను వెళ్లేటప్పుడు సప్రూగారు "కొండామీదా నెండీ గిన్నీ!" అని నుప్పుకొంటూ వెళ్లేరు. వెంటనే "కొక్కిరాజుకాలూ విరిగీ" అనుకుంటు ఓడను బొంబాయికి తిప్పి, తిన్నగా జడవేణీక్షేత్రం వెళ్లి శాస్త్రోక్తమైన కాండలో స్నానాదులు నిర్వర్తించారు. "ప్రొవిన్షియల్ ఆటోనమీ, సెంట్రలుఅథారటీ, ఫైనాన్షియల్ కంట్రోలూ, ఆర్మీఆఫ్రికామాయిషీ"లు గోవిందనామాలై కొంతసేపు ఓడలను తన్మయంలో—సముద్రంలోకాదు—ముంచాయి. తన్మయం అంతా దోసెడుషీకాయితో వదలకొట్టి, ఇంద్రాక్షి, విభూదిపెట్టుకొని కలో గంజో చూసుకొందా మనుకొంటున్నారు యిపుడు మనవాళ్లు. స్వానుభవంలో ఉంటుందికదా సముద్రమంతటిజ్ఞానం!

ఆదిమధ్యాంతరహితమైన స్వరాజ్యము సచ్చిదానంద, శుద్ధ, బుద్ధ, ముక్త, ఘనస్వరూపమై ఉంటుంది. ఈస్వరూపం ప్రత్యక్షంకావలంటే ఋషియుగాన్ని బరబర లాగి తేవాలి. కలియుగంలో ఇది సాక్షాత్కరించటం ఆకాశాన్ని కిందకు దిగదీసి పృథ్విని పైకి ఎగదన్నటంవంటిది. సరాజ్యపుకథ యిల్లాఉండగా ఏమేమో రాజ్యసంస్కరణాలు,—వైస్రాయిగారికి స్వరాజ్యం యిచ్చేసంస్కరణాలు కొంతకాలంలో వచ్చి తెలుపుతట్టుతవి. ఈలోపుగా ఒకపెద్దధనసంస్థ ఏర్పడుతుందిట. కలశోదకం పుచ్చుకొని రిజర్వుబ్యాంకుకై "ఆవాహన" చెయ్యండి అంటున్నారు తెల్ల పురోహితులు. ఈబ్యాంకులో యజ్ఞపురుషుడు లాంటి గమ్మత్తు ఏదోపుట్టి ఏదో తినిపిస్తుందిట. దాన్ని ఆరగించి ఒకకునుకు పట్టించుకుంటే, కల్లో కనపడుతుంది భారతభాగ్యము! ఎంతసేపైనా తేరిచూడొచ్చు—శభాసనే పాపిష్టి ఉండదు.

ఇండియాలో పునశ్చరణ అయ్యే కరెన్సీరైల్వే పాలసీలలో ఎంతైనా యక్షిణీ ఉంది! రైల్వేలో కోట్లకొద్దీ వ్యాపారం జరుగుతోంది. వ్యాపారం తంతు ఇండియాలో జరుగుతోఉన్నా కల్యాణం బొట్టు పైవాళ్ల మొహాలమీదే విరాజిల్లుతోంది! దేశంలో బిక్కుబిక్కుమంటూ కనపడే ఫలసాయం ఒకమూలనుండి ఇంకోమూలకు,—గాదినుండి బజారున్న ఊరుకు, పోవాలంటే కాళ్లవాపుతో కూలబడుతూ ఉంటుంది! రుసుములరణం తగ్గితేనేకాని, యీవాపుకు, తీత సున్న అనుకోవాలి. వ్యవసాయం అనుకూలంలేక నిరాశ పక్షవాతంతో పడివున్న రైతుకు గయ్యాళివంటి ఫ్రేయిటు తగులుకుంటే, యితగాడు లేవటం ఎట్లు? గమనికలేని సరుకునకు లాభం ఏది? ఇక పరదేశవస్తువులో—పరగంగల్లాగవచ్చి పైబడేందుకు వీనికి చులకనైనఏర్పాట్లు జరుగుతున్నవి! లయాలాపూరులోని గోధుమలు కలకత్తా పిండిమరలను చేరేందుకు "పాలించరా పాండురంగా!" అని మొరపెడుతూ ఉండగానే ఆస్ట్రేలియా గోధుమలు రివ్వురివ్వున ఎగిరివచ్చి కలకత్తా బజారును ఎగదన్నుకొనిపోతవి! ఏదోకాస్త పిండికొని పొట్టబోసికొనటమే ఎఱుగుదురుగాని, పిండితో ఎంత గారడీఫలితం పేగుల్లో చిక్కుపడుతోందో ఎరగరు మనహిందూస్థానీసోదరులు. రైల్వేపాలసీని నుప్పిట్లో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెట్టుకున్న గవర్నమెంటూ, ఇండియావక్షముపై
లోలుపదృష్టి పరిపేవిదేశకేపిటలిస్టూ ఇండియావర్త
కానికి హైజంపుగాక వాలుజంపు నేరుపుతూఉంటారు!
పాపము బాల్డ్విను గారు గొంతెత్తి తారకంజపిస్తూ
ఉంటాడు! నిన్నగాక మొన్న మాంఛెస్టరులో గంభీర
మైనఉపన్యాసం యిస్తూ బ్రిటిషువారు ఇండియావర్త
కానికి చెంపపెట్టు సమర్పిస్తున్నారనేగాథ ఉపద్రవకర
మైనదన్నారు. తారక జపానికీ, వారచూపుకోరచూపు
లకూ యీకాలంలో కావలసినంతచుట్టరికం ఉంది.
బాల్డ్విను మొదలైనవారు ఉపన్యాసాలు యిస్తూనే
ఉన్నారు. ఇండియావర్తకం డొల్లపుచ్చకాయలాగ
దొర్లుతోనేఉంది. తమలాభంమాటంటే బాగు. ఆస్ట్రే
లియాహాలండులకు భోక్తృత్వం ప్రసాదిస్తే ఇంగ్లం
డుకు లాభ మేమిటని కొందరు తలుస్తారు. మొహ
మాటాలుకూడా వర్తకంలో మందికషాయంలా పని
చేస్తాయి! హాలండునుండి కలకత్తా మొదలైన మహానగ
రాలకు వెజిటబిల్ ఫీ అనే నెయ్యివంటి మాయమంత్రం
వస్తూఉండేది. దీని కేదో ఒకా వెజిటేరంగున్నా రుచీపచీ
లేదు. ఇది చవుగ్గా అంగట్లోనుంచి అందటి అంగుట్లోకి
తెగసాగేది! దీనికి అడ్డుగా ఇండియాఆంగ్లేయులు
సుంకపుగోడ పెట్టేరంటే, ఇంగ్లాండు ఆంగ్లేయుల
సరుకునకు, వెజిటబిలు ఫీ ఎగుమతిచేసే మహాశయులు
ప్రతిఅడ్డు పెడతారు. మన్య మొట్టికాయలు తినేది
ఇండియా. అయితే యీరోజుల్లో ఇంపీరియల్ ప్రిఫ
రెన్సును తెచ్చి "మనమూ మనమూ కావలసినవారము" ని
ఇంగ్లీషు నియ్యాలావా రంటున్నారు. అటా
వాలో నీరుచ్చుకున్న తాంబూలాల్లో యీవియ్యాల
వారికి మంచిలగ్గసాటిజేరం తగిలింది. అటావా ఓంబా
యిలో వినపడినపెద్దగొంతుకుకు, నేడు ఎసెంబ్లీలో
మెచ్చిసాధకతరుణంకూడా లభించింది. కాని, అటావా
ఒడంబడిక అల్లల్లభీరా అంటోంది. స్ట్రేయిట్సు సెటి
ల్మెంటుమున్నగు ప్రదేశాల్లో, ఇది చిప్పుమంటోందని
బాగ్నలుగారన్నారు. నేడుజపాను, అటావానూ, ఇండి
యానూకూడా వెక్కిరిస్తోంది. నిన్నగాక మొన్న జపాను
గుడ్డకు ఎదురుగా మనపాలకులు, నీళ్లు నములినమిలి, ఒక
టారిఫ్‌గోడ కడితే, ఇండియాపత్తికి దిగదుడుపని,
ఇండియా ఎగుమతికి బలాహారనీ ఒకబొబ్బపెట్టి,
యీప్రొటెక్షను ఇండియా ప్రొటెక్షనుగాదు, ౬0%
మాంచెస్టరుగుడ్డకై ప్రిఫరెన్సు దీనిలో ఉందంటోంది
జపాను. ఇంగ్లాండు చీనాను యించక్కగా దువ్వుతూ
ఉన్నా జపానుతో 'మాసుకోదూసుకో' అంటోంది!
వీరిద్దటికీ ఉండే వర్తకవైరానికి ఇండియా నష్టంపెట్టు
కోవాలి. సోదెమ్మా, సోమిదేవమ్మా జగడమాడుకొని.
సింగమ్మ కొంపంటించారుట! ఇదేమిన్యాయం అంటే,
ఒహరకం పిడిలాజి కట్టున్నారు వాళ్లు. ఇండియాజపా
నుజువ్వలు చాలవఱకు ఎగిరినవి. కొద్దిరోజుల్లో మాంచె
స్టరూ, జపానూ, బొంబాయి కేపిటలిస్టూ, సిమ్లాలో
కూడి చెయిమాలిలుమాని తలాతలా కలుపుకొంటారట!
ఇది డీసిక్కు కాకపోవచ్చును. ఈ సమావేశంవల్ల ఇం
డియా క్షేమైనాలాభం వస్తుందనే ఆశ అబ్బే!
అచ్చంగా ఆవగింజంత ఉంది! ఇండియా కేపిటలిస్టుకు
కొంతలాభందొరికితే దొరకొచ్చు. కాని ఇండియాచేతి
పరిశ్రమ, కిందపడిపొరలవలసినదే! ౧౯౦౯ లో కూడ
ఇండియాలో మిల్లుగుడ్డకంటె నేతగుడ్డ ఎక్కువగా
ఉంటూఉండేది. ఈనేత తీతపట్టింది! ఇపుడు ఇండి
యాలో ౨౫౦౦౦౦౦౦ గజములమిల్లుగుడ్డ, ౧౫౦౦౦౦౦౦
గజముల నేతగుడ్డ తయారవుతోంది— యితర దేశాలగుడ్డ
దిగుతూనేఉంది. ఒక్కవ్యవసాయంపట్టుకొని దేవుళ్లాడే
రైతుకు, యింతనేతపనికూడా కల్పించి కొంపగంజి
పోస్తేమంచిదని మిల్లుమహాశయులు ఆలోచింపరు. కొంత
దారం నేతగాండ్రమీదపడేస్తారు. డిమాండుకుసరితూగే
సప్లయికాక ఎక్కువసప్లయి ఉంచేందుకు, పగలనక
రాత్రిఅనక ఆనుపనక అర్ధరాత్రనక అపరాత్రిఅనక మిల్లు
కూరలు పనిచేయింతురట. ఇంతపరుగూ పెడుతూ
ఉన్నా ఇండియామిల్లుమాత్రం ఏమిబావుకొన్నది?-మజా
నేమంటే పత్తికొన్నధరకే గుడ్డను ఇండియామార్కె
ట్టులో అమ్మి, ఇండియామిల్లుకూ లంకపైరుకూ సుండె
గుభిల్లు మనిపించింది జపాను! జపానుచే, యిపుడు పాల
కులు 'ప్రాచీనాశీతి' చేయించినా, 'కూర్చి' మాంచె
స్టరు కిస్తారు! "ఇండియావర్తకం యింకా కుట్టుకుకం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నడక అంతగా ఎరగదు. పైదేశములు అంకెలువేసికొని రాకుండా ఏదైనా ప్రొటక్షనుకంచెకట్టాలండి" అని కొందఱు లిబరలు దేశభక్తులు ఒక కొబ్బరికాయ కొట్టి అధికారులకు చేతులు మొగుడుస్తారు. "మాంచిది. వరదానం యిస్తున్నా" మని పాలకులు ఒకప్రొట క్షణగోడ పెడతారనే అనుకోండి.— అప్పుడపుడు పాలకులు కాస్తో కూస్తో టారిఫు నిలబెడుతున్నారు కదా! కాని, చేతిలో పప్పుబెల్లం పెట్టడం, గూబకు బెత్తెడుచూచి లాగేందుకే! టారిఫుమందుకు విరుగుడు మోతాదు కర్రెన్సీపాలసీ ఉండలేదా? పులిమీది పుట్రవలె రైల్వేపాలసీని మించింది కర్రెన్సీపాలసీ!

ఇండియాలోని టారిఫ్ ద్రాక్షారపుభీమన్న కాదు. మొదటినుండి దానితలపై మేకై ఉండేది కర్రెన్సీపాలసీ. ఇండియా వెండి పాలకులచేతిలోని చలిమిడిముద్ద. ౧౯౩౧ లో ౧ షిల్లింగు ౪ పెన్సులబదులు ౧ షిల్లింగు ౬ పెన్సులవఱకు మారకాన్ని సాగబెట్టేరు పాలకులు. దేశం మొరపెడితే "చమురుకాళ్ల పెద్దమ్మా! ఊరుకో!!" అని కాండ సాగించారు. ఈ మారకం వల్ల ఎగుమతులమూలమున, ముఖ్యంగా జూట్‌యెగు మతిమూలమున ఇండియాకు ముట్టవలసిన పైకం "స్వాహా!" అని నష్టహోమంలో పడింది! టారిఫు గోడ ఎక్కువడబ్బును డిమాండుచేసి దిగుమతివస్తువు లను లొటలొటలాడిస్తే, కర్రెన్సీపాలసీ ఈయెక్కు వను కీచుకీచు మనిపిస్తుంది దవడలు నొక్కి.

౧౯౩౧ లో రూపాయికీ బంగారానికీ పెళ్లి అన్నారు. "అయం ముహూర్త స్సుముహూర్తోస్తు" అని, మన లెజిస్‌లేటివ్ ఎసెంబ్లీ కుంచెడు అక్షతలు చల్లింది! ఇపు డింగ్లాండులో కుతకుత మొదలుకాగనే, పాలకులు పాతముడి విడగొట్టి స్టెర్లింగుకు రూపాయిని బిగించారు. ఈ స్టెర్లింగువెనకాల ఇంచక్కటిడొల్లి ఉంది—దీనివీపుతట్టున బండిసున్నంత మెటాలిక్ రిజర్వు ఉంది! యూరపులో ఈస్టెర్లింగు, తల్లి లేనిబిడ్డయై డిస్కవుంటులో ఉన్నది. ఆఱపార్‌లో లేదు. కాని ఇండియాలో యిది ఆకాశదీపంలా వెలుగుతూ, మన చేత కార్తీకసోమవారాలు పట్టిస్తూ ఉన్నది! ఒహపి సరు తక్కువుగా ముప్పయిపెన్సుల చొప్పున ఇక్కడ మారకం జరుగుబాటు చేసుకుంటోంది! చెప్పొచ్చేది ఏమంటే, ఇండియాకు ప్రొటెక్షఙ అనేది ప్రత్యక్ష మైనా అది, డబ్బాదిరుగుండమూ కావలసినదే! ఉన్న ఆయువుపట్టు కర్రెన్సీపాలసీలో ఉన్నది. ఇది కేవ లమూ ప్రభువులచేతిలో అణగిఉన్నపుడు, నాయకుల ఆర్భాటపుడిజిటాలిస్ ఏంపనిచేస్తుంది?—ఒహచేతితో స్టెతస్కోప్ పట్టి రెండవచేతితో వీరు కన్నులు తుడువ వలసిందే! నేటి కర్రెన్సీలోని విష్కంభం చూడండి. నాభికమలంలో ఉన్న హిరణ్యగర్భుణ్ణి ఇండియా అంగుట్లోనుండి పట్టకారుతో లాగి, బొంబాయిద్వారా సఫేదుదేశానికి బరబరలాడిస్తోంది నేటి మారకపు మారెమ్మ! "ఇండియా బంగారంద్వారా ధనానికి సంచలనం కలుగుతుంది, ధరలు జువ్వలై లేస్తా" యన్నారు థామస్‌లాంటివానఅర్థశాస్త్రవేత్తలు. ఇపుడు మన బంగారమ్మ అమెరికా ఫెడరల్ రిజర్వుబ్యాంకులో కైవీ అవుతూ ఉంటే చూచి "అహా! అహా!!" అని దగ్గేస్తున్నారు మనఓబయ్యలు. రేపు రిజర్వుబ్యాంకుకై ఏమో పోగుచెయ్యాలని దేవుళ్లాడే దేవయ్యలు ఇసలా చేయించుకాదు—చేసుకొంటున్నారు! బంగారం బడ బడమంటే, వెండి వెఱ్ఱిమొహం పెట్టుకొంది! వాయిదా నాటికి అమెరికా అప్పుతీర్చింది ఇంగ్లండు, ఇండియా వెండితో. ఇంగ్లాండుద్వారా ఇండియావెండి అమె రికాడాలరుతో సమావేశంకావడంలో జరిగేఅనులోమ ప్రతిలోమపు మారకంలోని లాభం కొంతవఱకు ఇంగ్లాండు గుటకాయస్వాహాచేస్తూ, రాబోయేఇండియా రిజర్వుబ్యాంకు, రిజర్వుమేతకై ఏదోకొంత ఇండియా మీద, విదుపుతుందిట. ఇండియానాణేలకుగాను పిట్ మెన్‌చట్టాన్ని ఊతచేసుకొని అమెరికావెండి వస్తుంది. తాను తెచ్చుకున్నవెండి కిచ్చినపైకానికి, ఇంగ్లాండు యొక్క అప్పుతీర్చటంలో అచటి అనుకూలమారకం మూలంగా వచ్చేలాభంలో, తనకు వచ్చే గడ్డిగచ్చ కాయకు, ఉన్నవారలో ఇండియాకు లాభసాటిబేరం ఉందని అనేందుకు ఎంత తెగించినవారికైనా నోరెల్లా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వస్తుంది? ఇటీవలజరిగిన ప్రపంచక ఆర్థికమహాసభలో ఒకవెండిఒడంబడిక జరిగింది! తుమ్మెళ్లలోనూ, కస్సుబుస్సుల్లోనూ పుట్టింది యీ ఒడంబడిక! బజారులో అట్టే వెండిపెట్టరట మనపాలకులు— సప్లయి తగ్గిస్తే, కర్రెన్సీకిని, ఆర్టిస్టుకును డిమాండు హెచ్చవుతుందనిన్నీ, ధరలు కన్యచెరతప్పి ఎదుగుతాయనిన్నీ అంటున్నారు స్వాములు! "భళా భళి" అంటున్నారు డబ్బారాయళ్లు! "నాకేంటీ ఇడిపోవడం లేదుండి" అంటున్నాడు ఇండియారైతు కీచుకీచు మంటోనూ. స్వరాజ్యం గుండుశేబిలుచుట్టూ వానాలప్ప తిరిగి, సుడిగుండంలో సుభాలుమన్నా, రిజర్వుబ్యాంకు ఇంచక్కటిచీరి కట్టుకోని తద్దినోము—తద్దినం కాదు—పట్టి భారతవర్తకానికి ధూపదీపనైవేద్యాలు సమర్పిస్తుందని అంటున్నారుకొందఱుపోతుముత్తయిదులు! ఈగాథంతా ఎంతసేపు వర్ణించిచూచినా, మనకుముట్టేది గుప్పిట్లోని 'హులాల్", తప్ప మరేమీ కనపడదు. రిజర్వుబ్యాంకువల్ల భారతదేశముయొక్క పరపతి హెచ్చి, భారతవర్తకంగాని, అంతరరాష్ట్రవర్తకంగాని ఎమోబాముకొంటుందనేఆశ గొంతెమ్మగోరికవంటిది. ఏంటారిఫులున్నా, ఇండియాసరుకులు—విదేశీయులు అనివార్యంగా వలచినవి—పట్టు ఒలవంతపుచవుకకు యూరపునకు పోయేమార్గం రిజర్వుబ్యాంకు ఏర్పఱచకలదు. సర్ శాముాలు హోరుగారు యీబ్యాంకువిషయమై హోరెత్తిస్తున్నారు! నిన్నగాక మొన్న ఎసెంబ్లీ కవున్సిల్ ఆఫ్ స్టేటుసంపులచేత దివిటీలు కొట్టిస్తూ లార్డువిల్లింగ్డనుగారు రిజర్వుబ్యాంకునుగుఱించి ఉపనిషత్తువంటి ఉపన్యాసాన్ని వినిపించారు. చతుర్ముఖబ్రహ్మను మించిన ఆఱుమొహాలామన అటావాలో బాప్టిజము స్నానముపొంది, ఎసెంబ్లీలో రెడ్డికంవేసుకొని ఉపవీతిగా ఒహమాటు తలకాయ ఊపేశాడు! వీరుకొట్టిన్ని తడిపేందుకు ముందుముందు ఎంతసెమ్మో తయారవుతుందని శేరశం చెపుతోంది. రిజర్వుబ్యాంకుకై తమశాయశక్తులను రిజర్వులోనుంచి వీరు పైకిలాగివేస్తారు! కొత్తగా రాబోయేరాజ్యాంగవిధానాల్లో—యివివచ్చిపడదామని నిశ్చయించుకొన్నాయి!—కర్రెన్సీపాలసీ, సెక్రటరీ ఆఫ్ స్టేట్ చేతిలోనో, వైస్రాయిగారిచేతిలోనో బొంగరమవుతుందిగాని, ఫెడరల్ మినిస్టరు చేతి కందదట. రిజర్వుబ్యాంకునుగుఱించి దీనికై ఏర్పడిన కమిటీదారులూ, లండనునుండి తిరిగివచ్చిన ఆర్థికశాస్త్రవేత్తలూ జంటకవులవలె నిలబడి కొంత ఆశువును వినిపించారు! స్కేలుబద్ద పట్టిచూస్తే ఆశువులోనిఛందస్సు సరిగ్గా నిలబడ్డా, గంగాభాగీరథీ సమానురాలివంటి గ్రామరు శుద్ధశ్రోత్రియంగా కనపడ్డా, సాధారణంగా బూడిదలాంటి కవిత్వమే సభికులపై జలజలమంటుందిగాని, పవిత్రభావంగలిగి సారవంతమైన కైత పాడగట్టుట శుద్ధఅబద్ధమని సాహిత్యసోదరులు ఎఱుగుదురు. రిజర్వుబ్యాంకునుగుఱించిన ఆశువుకూడా బూడిదబుస్సవన్న లాంటిదే. స్వరాజ్యానికి ఆవలనుండే రిజర్వుబ్యాంకు ఇంటావలనుండే విస్తరాకు. తనబట్ట తాను కట్టుకొనేందుకు, తనతిండి తాను తినేందుకూ, కలసిన ఆత్మనిర్భరత్వము ఇండియాకు యిప్పట్లో వస్తుందని తలచి 'దధికిణతోం' అనుకోరాదు. తమబ్యాంకులను సోషలైజుచేయాలనీ, తమపనివాండ్రూ తమపేదలూ ధనికులుకావాలనీ విదేశీయులు ఎంతెంత ప్రయత్నాలో చేస్తున్నారు. లేబరరుకును, కన్సూమరుకును అనుకూలించులాగున కేపిటలిస్టును తిప్పేందుకు శ్రేకుయూనియనులు క్రిందుమీదులుపడుచున్నవి. ఈప్రయత్నాలమాట దేవు డెఱుగును. ఇప్పటికప్పుడే భారతవర్తకానికి కన్ను లొట్టయిపోతూర్చుంది; దీనికి చావుతప్పేవిధం చూడాలి. రాజకీయాలేమో రైతుఎఱుగడు. ఇతనికి కావలసినది కన్నీరుమయము కానిబ్రతుకు. ఈమాస్టరు అభిప్రాయాన్నే నిన్నగాక మొన్న జవహర్‌లాలు తేల్చాడు గాంధీగారి ఉద్యమమంతా,— ఈజైళ్లబాధంతా పేదరైతుకోసంకాదూ? ఈతనికత చాలపెద్దది బరువుమీద బరువుపడి, యితనిని క్రుంగదీసింది! గుండుబేబిలుసభలూ, ప్రపంచకాన్ని చుట్టబెట్టే సభలూ, గబగబలూ, గుబగుబలూ, తప్పెట్లూ, తాళాలూ, తెయితక్కలూ, తెగతేన్పులూ, చూచి ఇతడేమేమో కనపడుతుంది వడ్డనసమయాన్ని రెండుచేతులూ చాపుదామని అనుకొంటున్నాడు పాపం. ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చప్పుడు పెళ్లి బాజా కాక మోళీబాజా అని ఇతడెఱుగడు. విస్తరంటల్లో సస్యం పప్పు వోడదుకాని, ఇతనికళ్లల్లో నుంచి కావలసినంత వోడుతుంది దౌర్భాగ్యం! ఎంత నేపు చూసినా మోళీయే! చేతిలోనుంచి ఊడిపడేది "హుళాత్ !!" నోటిలోనుంచి ఊడిపడేది ఆయ బెల్లము !!! మాయామంత్రంలోపడి రైతునిర్భాగ్యుడు పిల్లిమంత్రాలేస్తున్నాడు!

---

ఇన్సూరెన్సు ఏజంటు — ౨ (అనువాదము)




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెన్నరాజధానియందు ౧౯౩౭-వ సంవత్సరము ఏప్రిల్ ప్రారంభము మొదలు జూన్ తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## కథలు-ఐతిహాసికములు, పౌరాణికములు

శ్రీమదాంధ్ర మహాభారతము, భా. ౧—(ప్ర) సి. పార్థసారథి, గుంటూరు

శ్రీమదాంధ్ర వచనభారతము—ఏ. వెంకటశాస్త్రి

శ్రీమద్రామాయణకథాసంగ్రహము-కంచనపల్లి కనకమ్మ

శ్రీమహాభారతము, ఆంధ్రవచనము, భా. ౨—డి. వెంకటస్వామిగుప్త

సీతాన్వేషణము—జె. శేషాచలశాస్త్రి

## కల్పితములు

అపూర్వమనోహర చిత్రకథలు—పి. లింగమూర్తి

కథాసరిత్సాగరము—(ప్ర) సి. కుమారస్వామినాయుడు అండ్ సన్స్, మదరాసు

బంగారునాణెము—(ప్ర) కె. పి. పిళ్లై అండ్ కో, మద్రాసు

మణిమేఖల—వంగూరి సుబ్బరావు

శచిముఖి—నూకలసీతారామమూర్తి

## చారిత్రకములు

మహారాజులు—బి. సోమసుందరం

## కావ్యములు

యయాతిచరిత్ర—ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రి

శ్రీమదాంధ్ర వాల్మీకిరామాయణము భా. ౧—వావిలికొలను సుబ్బరావు

## గణితశాస్త్రము

శిశుగణితము—యస్. కృష్ణరావు.

## గేయములు

ఉభయవరులదివ్యనామములు—ఓసూరు రంగాచార్యులు

కపిలవాయి రామనాథశాస్త్రులగారి కీర్తనలు పద్యములు—(ప్ర) జి. పుల్లయ్య, కడప

కలియుగ కలికాల వినోదచిందు—ఆత్మకూరు నరసింహదాస్

కలియుగనిద్ర—బండపల్లి ఆశీర్వాదం

బ్రహ్మోపాసనా గీతపద్యప్రకాశిక—(ప్ర) దక్షిణ ఇండియా బ్రహ్మసమాజము, మదరాసు

బ్రాహ్మణగీత—బులుసు రామజోగరావు

భద్రాద్రిరామభజనకీర్తనలు—రుక్మిణి అమ్మాళ్

శ్రీరామనామసంకీర్తనము—గుర్రం గోవిందగుప్త

శ్రీవిరాట్ వీరబ్రహ్మంగారికృతులు—సి. నారముని ఆచారి

సంగీత ఆనందకీర్తనలు—(ప్ర) జి. పుల్లయ్య, కడప

సత్యహరిశ్చంద్రనాటకభజనకీర్తనలు—యం. పెద్దిరాజు

సీతారామ సంవాదము అనుపాట—లింగమూర్తికవి

## చరిత్రము

ఆంధ్రదేశచరిత్రకథలు—పేరి సూర్యనారాయణ

పెమ్మసాని తిమ్మనాయుడు, గండికోటముట్టడి—జి. రామబ్రహ్మం

హిందూదేశచరిత్ర—డి. అప్పరావు, ఆర్. సూర్యనారాయణ

హిందూదేశచరిత్ర; భా. ౧—నాయని సుబ్బరావు

మన దేశచరిత్రకథలు—ఆర్. హెచ్. డి. ప్రసాదరావు

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప—పద్యము. ప్ర.—ప్రకాశకులు భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హిందూదేశచరిత్రకథలు, బుక్. ౨—యం. కె. సుందర వరదాచార్యులు
హిందూదేశచరిత్రకథలు, తరగతులు, ౪, ౫—వెంపటి రామయ్య
హిందూదేశచరిత్రము, బుక్. ౧—ఆర్. హెచ్. డి. ప్రసాదరావు
హిందూదేశచరిత్రము—జి. వి. రామఅయ్యర్.
హిందూదేశచరిత్రదీపిక, భా. ౧. ౨—గంటిజోగిసోమయాజి

## జీవితములు

ఆనందదాసు చరిత్రము—యం. మహానందిరెడ్డి
ఋషులచరిత్రము—ఆర్. అన్నయ్యశాస్త్రి
శ్రీరామకృష్ణచరిత్రము—(ప్ర). సి. కుమారస్వామి నాయుడు అండ్ సన్స్. మదరాసు
శ్రీ వీరబ్రహ్మముగారి జీవితచరిత్రము—సి. సుబ్బయ్య

## జ్యోతిషశాస్త్రము

దైవజ్ఞాదర్శము అను జ్యోతిషసారసంగ్రహము—యస్. భాగీరథిరావు.

## దండకము

సర్వేదండకము—రాయసం రామయ్య

## నవలలు

మల్లికార్జునరావు—కె. అప్పన్నశాస్త్రి
ప్రేమసుందరి—హెచ్. దేవదానం
యవనదత్త—వి. సత్యనారాయణమూర్తి

## నా ట క ము లు

పాండవజననము—పి. రామదాసుకవి
వాసవదత్త—యన్. వెంకటసుబ్బయ్య
శ్రీరసికజనరామాయణభజననాటకము—భళ్లగంగరాజు
సతీఅనసూయ—యస్. గంగాధరరామశాస్త్రి

## ని ఘ ం టు వు

విశ్వకోశం—(ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు

## నీ తి

నీతికథాసుచ్ఛము, భా. ౪—పి శ్రీరాములురెడ్డి
సన్మార్గదర్శిని—గొల్లపూడి శ్రీరామశాస్త్రి
సుజ్ఞానబోధిని, భా. ౫—పి. శ్రీరాములురెడ్డి
సదుపదేశము—గొల్లపూడి శ్రీరామశాస్త్రి

## పరిశిష్టము

అమరావతీస్తూపము, ఇతర వ్యాసములు—యం. సోమశేఖరశర్మ
ఆంధ్రబాలరామాయణము—జి. వెంకటసుబ్బయామాత్య
ఇరువదిమూడవ సంవత్సరాదిసంచిక—(ప్ర). కె. నాగేశ్వరరావు, మదరాసు
ఓటుహక్కు ఎన్నికలవిధానము—(ప్ర). యస్. సుబ్బరావు, కొవ్వూరు
ఓడబేరము—యన్. సూరత్తాళ్వారు అయ్యంగారు
కర్షక—(ప్ర) యం. కాశింఖాన్, యన్. సత్యనారాయణ, విశాఖపట్టణము
కుచేలుడు—మాసి కామయ్యభక్త
జ్యోతిషవాచకము, భా. ౧—గొట్టుముక్కల వీర రాఘవాచార్యులు
ట్రిపిల్ బెనిఫిట్ ఆక్షన్ చీటీ నిబంధనలు—(ప్ర) న్యూఈరా బ్యాంకింగ్ కార్పొరేషన్ లిమిటెడ్, మదరాస్
దయ—(ప్ర). మలయాళస్వామి, ఏర్పేడు
దృష్టాంతపటవాక్యరచన, భా. ౧, ౨—(ప్ర) ఇ. యం. గోపాలకృష్ణకోన్, మదరాసు
దేశపరిపాలన, బుక్ ౨—(ప్ర) సి. కుమారస్వామి నాయుడు అండ్ సన్, మదరాసు
నీలిరత్నాలు—శ్రీరామచంద్ర అప్పారావు
నూతనపద్ధతి ఆంధ్రవాచకము, బుక్ ౨, ౩, ౪, ౫—ఏ. వి. నరసింహం
నెచ్చెలి—కొండి శ్రీపతిశాస్త్రి
పుష్కర విధానము—(ప్ర) విరాడ్గ్రంథాలయము, ఏలూరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రారంభోపన్యాసము—(ప్ర) కోదండరామ సేవక సమాజము, గుంటూరు

బిడ్డలశిక్షణము— పడిపాటి వెంకటాచలం

యాత్రాస్థలములు—(ప్ర) పూర్ణయాత్రా స్పెషల్ ట్రెయిన్ సర్వీస్ కంపెని, విశాఖపట్టణము

రామనిర్యాణము—కాశీ వ్యాసాచారి

లలితావాచకము, తరగతి ౨—హరి శేషయ్యశాస్త్రి

వనమాల, భా. ౧,౨—(ప్ర) రెడ్డిబ్రదర్సు, రాయవరము

వసంతము— పెమ్మరాజు లక్ష్మీపతి

వార్షిక నివేదిక—(ప్ర) ఉత్కలశిష్టసమితి, కర్ణపురము

శ్రీరామకృష్ణ నామామృత ప్రబోధము—యం. శేషాచలగుప్త

శ్రీరామపట్టాభిషేకనక్షత్రమాల—చింతలపూడి లక్ష్మణరావు

శ్రీలక్ష్మీవారిపై పువ్వులపూజ—పి. కృష్ణమూర్తిపట్నాయిక్

శ్రీసీతాకల్యాణము—దూసి కామయ్యభుక్త

శ్రీహరలేఖమహిమాలీలలు—బసవదాసు

సంచితము—(ప్ర) న్యూఈరా బాంకింగ్ కార్పొరేషన్ లిమిటెడ్, మదరాస్.

సత్యపాలన—యన్. సుబ్బయ్యశాస్త్రి

సత్యాన్వేషణి—వద్దిపర్తి రామజోగిరాజు

## పారిశ్రామికము

కోళ్లపరిశ్రమ—వై. శ్రీరాములుచౌదరి

గృహపరిశ్రమలరహస్యము—తాడిబ్రహ్మానందరావువర్మ

## పురాణములు

కుచేలోపాఖ్యానము — (ప్ర) ఏ. లక్ష్మణస్వామి నాయుడు, రాజమహేంద్రవరము

దేవాంగపురాణము—(ప్ర) యన్. నీలకంఠం, బరంపురము

## భూగోళశాస్త్రము

కంభంతాలూకా భూగోళము—టి. నరసింగరావు

కృష్ణాజిల్లా భూగోళము—వెంపటి రామయ్య

విశాఖపట్నంజిల్లా భూగోళశాస్త్రము—పేరి సూర్యనారాయణ

## మతము-హిందు

భగవన్నుతి, భా. ౨, ౩—(ప్ర) రామ్ అండ్ కో ఏలూరు

శ్రీ కుసుమ హరనాథ బోధసంగ్రహము—నిమిషకవి వెంకయ్య

## ఇతరములు

ఆరతి—బ్రజానంద మహంత్

గూఢార్థములు గలిగిన తెలుగుగద్య పీఠిక అనునామకము—బి. రత్నం

సత్యవేదచరిత్ర సంగ్రహము—(ప్ర) రెవరెండ్ జె. ఆలక్

## మాహాత్మ్యములు

అంతర్వేదినిధిమాహాత్మ్యము—బూసి రామానుజదాసు

శ్రీ కలిగిరి వేంకటేశ్వర మాహాత్మ్యము—పూతలపట్టు శ్రీరాములురెడ్డి

శ్రీ కాశీ చంద్రమౌళీశ్వరస్వామివారి మాహాత్మ్యము—(ప్ర) టెంపిల్ కమిటి, బేస్తవారపుపేట

## వేదాంతము

ఆత్మజ్ఞానామృత తత్వములు, భా ౩,౪—బళ్ల వెంకన్న

ఆత్మబోధము—(ప్ర) బి. రాఘవేంద్రరావు, కమలాపురము

ముక్తిమార్గము—స్వామి రామకృష్ణానంద

విజయనగర ద్వైతాద్వైతసభావిషయములు—(ప్ర) కె.వి. కృష్ణారావు, వి. రామరావు, విజయనగరము

వేదాంతసారసంగ్రహము—గౌను జోగమ్మ

శ్రీభగవద్గీతామృతసారము, భా. ౩.౪—(ప్ర) యం. టి. శెట్టి, మదరాసు

శ్రీభగవద్గీత, ఆంధ్రవచనము—సోమ వెంకటస్వామి గుప్త

స్వరశాస్త్ర చింతామణి—వీరన అప్పలదాసు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## వైద్యశాస్త్రము

నాడీపరిజ్ఞానము—(ప్ర). కె. వీరవెంకయ్యా, రాజమహేంద్రవరము

## వ్యాకరణశాస్త్రము

బాలసరస్వతీయము—(ప్ర). వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు

శారదావ్యాకరణము, భా. ౧, ౨—వేదుమళ్ల రాజగోపాలరావు

## శతకములు

కుమారీశతకము—(ప్ర). కె. వీరవెంకయ్యా, రాజమహేంద్రవరము

కృష్ణశతకము—(ప్ర) కె. వీరవెంకయ్యా, రాజమహేంద్రవరము

మామండిశతకము—సుంకర కృష్ణదాస్

రాఘవేశ్వరశతకము—గుండ్లపల్లి నరసమ్మ

వనమాలిశతకము—కే. సంజీవపిళ్లై

శ్రీకల్యాణ వేంకటేశ్వరశతకము—యం. పార్థసారథి నాయుడు

శ్రీ వల్లభశతకము—సీసపాటి సోమనాథం

సుమతీశతకము—(ప్ర కె. వీరవెంకయ్యా, రాజమహేంద్రవరము

## సంగీతశాస్త్రము

అభినవగానంనర్వకళ—యస్. వెంకోబాచార్యులు

## సారస్వతము, భాష

ఆంధ్రకవిత్వచరిత్రము—బి. వెంకట అప్పారావు

## స్తోత్రములు

పార్వతీశ్వరతారావళి—యస్. సురవయ్యాశెట్టి

శ్రీపాండురంగ తారావళి—నందగిరి వెంకట అప్పారావు

శ్రీపాదారవింద పంచవింశతి వృత్తములు—యం. పెరుమాళ్లయ్యా

శ్రీ పార్వతీస్తోత్రనక్షత్రమాల—నుంటు వీరభద్రయ్యా

శ్రీ భద్రాచలరామనక్షత్రమాల—వేదాంతం శ్రీరామశాస్త్రి

శ్రీసోమేశ్వరస్తోత్ర ద్వాత్రింశన్మంజరి, సీసపద్యపంచకము, కళత్రస్మృతి—దాసు గోవిందరావు

సోమేశ్వరస్తోత్ర నక్షత్రమాల—బాలం పల్లయ్యాదాసు

## హరికథ

శ్రీ కృష్ణరాయబారము — పూడిభోగలింగకవి, దగ్గలూరు

---



# ప్రార్థన గీతావళి

సబర్మతీ ఆశ్రమమునందు నిత్యపారాయణమునకు మహాత్ముడు అనుమోదించిన ప్రార్థనగీతములు తెలుగు తాత్పర్యముతోసహా ఇందు గలవు. ఆధ్యాత్మికసారమయిన ఈ గీతములను ప్రతివారు నిత్యము పారాయణము చేయుట శ్రేయోజ్ఞానదాయకము. కొలది ప్రతులే కలవు.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టి వీధి, మద్రాసు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పునర్విమర్శనము

## ఆంధ్ర ఋతుసంహారము

నేను రచించిన 'ఆంధ్ర ఋతుసంహారము'ను గూర్చి బులుసు వేంకటరమణయ్యగారి పేర శ్రీముఖ మాఘ భారతిలో నొకవిమర్శ వెలువడినది. నాయనువాదమున 'కవిత్వము సరళముగ సాగిన'దనియు, 'ఉపజ్ఞ కన్పడుచున్న'దనియు, 'చాలవఱకు మూలాభిప్రాయ మనుసరింపబడియున్న'దనియు వారు వ్రాసినందులకు చాల కృతజ్ఞుడను.

ఋతుసంహారము కాళిదాసురచనము గాదను నొక కొంపఱలో తా మొకరమని వారు లఘువుగ సూచించిరి. కాని ఉపపత్తుల నొసగలేదు. పండితలోకమున నీ వివాదము శమించి కాళిదాసుని కర్తృత్వము బహుముఖుల రూఢిపడినదనియే చెప్పవచ్చును. శ్రీ అరవిందుల ఆర్ష దృష్టికిని, ప్రాచ్యపండితావతంసులు మన్గురువులు వేదం వేంకటరాయశాస్త్రుల దృష్టికిని, పాశ్చాత్య విద్వచ్ఛేఖరులు బారిడేలు కీతుగారి దృష్టికిని ఈ కావ్యమున కాళిదాసుని మూర్తియే గోచరించినది. శ్రీ అరవింద ఘోషుగారు 'కాళిదాస' అను పేర ఋతుసంహారమును గూర్చి ప్రత్యేకముగా విమర్శగ్రంథము నొకదానిని రచించియున్నారు. సంశయగ్రస్తులు దానిని పఠింపవలెను. 'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి' అనగదా ఆర్యోక్తి.

కాని యీపునర్విమర్శనకు పైవిషయము ప్రధానముగాదు. 'భాషాంతరీకరణముపట్ల దుర్నివారములగు దోషములు' కొన్ని నాగ్రంథమునను దొరలినవని విమర్శకు లొక పట్టిక రచించిరి అందు వారు చూపిన వేవియు దోషములు గావని నామతము. అంతియగాక వీరిధోరణి చూడగా, వీరు అనువాదమునుగాని, కవనమునుగాని చూడవలసినదృష్టితో కావ్యము నరయరైరని స్ఫురించుచున్నది. ఇందు కొక్క ఉదాహరణము:

'స్త్రియశ్చ కాంచీమణికుండలోజ్జ్వలాః'

'మేఖలామణికుండలలో న్మిషితాంగనలు' (౩-౧౮)

మూలమున కర్థము: 'ఒడ్డాణముచేతను మణుల కమ్మలచేతను వెలుగొందుస్త్రీలు' అని.

అనువాదమునకర్థము: 'ఒడ్డాణముచేతను మణులకమ్మలచేతను వికాసముగాంచిన అంగములుగలస్త్రీలు' అని. 'ఉన్మిష' 'అంగన' శబ్దములచే భావము మెఱుగువారినదని నాతలంపు. 'ఉజ్జ్వలము'నకు 'ఉన్మిషము' సమానార్థకము కాదని విమర్శకులు దోసమునెంచిరి. భావమునరయక శబ్దము లక్షించువారివిమర్శ యిట్టిది.

మఱి 'ప్రదోష'కు 'దోష' (౧-౧౨)యనియు, 'నిబద్ధకు'కు 'సాభిరుద్ధ' (౫-౭) యనియు, 'కేశపాశము'నకు 'జడ' (౫-౧౨) యనియు వ్రాయుటలో భావమున కెట్టిమార్పుగాని, వెలితిగాని నాకగపడుటలేదు. తరుణులు కచమును జడవేసికొనక విరియబోసికొనరు.

'చైత్రసంప్రాప్తి సర్వము చారుతరము' అను పాదములో మూలమునగల 'వసన్తే' (౬-౭) శబ్దమునకు 'చైత్రము' వాడితిననియు, నివి సమానార్థకములు గావనియు విమర్శ. ఇది కేవల మవిచారితము. కావ్యపరిచయమేని నిఘంటుపరిచయమేని గలవారలకు చైత్ర వసంతములు సమానార్థకము లని తెలియగలదు.

'విశన్తి శయ్యాగృహ ముత్సుకాః స్త్రియః'

'కేళిగృహములఁ జొత్తురు స్త్రీలు వేడ్క' (౫-౫)

ఇందు స్త్రీ విశేషణము క్రియావిశేషణమైనదని వీరొక దోసుపట్టిరి. కాని ప్రవేశకార్యమునను స్త్రీల యౌత్సుక్యము అభివ్యక్త మగుచున్నదను స్ఫురణచే భావము పోషింపబడినదేగాని కొదువపడలేదు మఱియు, క్రియావిశేషణము తెనుగురూపమునకు అనువు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'చంచన్మనోజ్ఞ శఫరీరశనా కలాపాః'

'చంచదుత్సుక శఫరీరశనలు నదులు.' (౩-౩)

'మనోజ్ఞ'కు 'ఉత్సుక' సమానార్థకముగాదని ఆక్షేపము. ఈముక్కకు ఈముక్క సరిపడదను విమర్శ అప్రశస్తము. ఐనను 'ఉత్సుక' శబ్దమునను సారస్యము లేకపోలేదు. శఫరుల ఔత్సుక్యమునేగాక, రశనా కలాపవిశేషణము నదుల ఔత్సుక్యమునుగూడ సూచించుట హృద్యమేనని తలంతును.

'సముద్ధృతాశేష మృణాళజాలకమ్'

'ఉద్ధృతాశేష తామరసోత్కరమ్ము.' (౧-౧౯)

తామరసభాగమే మృణాళము గావునను, ఏనుగుల బీభత్సము తూండ్లకే గాక ఆకులకు, పూవులకును వర్తించును గావునను, అనువాదము మూలమునకెడసి యుండలేదు.

'దప్పి పైకొన విక్రమోద్యమము తూల
మాటి మార్చుచు నోరున్నపాటి దెఱచి
జూలు విదలించుకొనుచు విలోల జిహ్వ
చెంతకరులున్న కేసరి చీల్పఁబోదు' (౧-౧౪)

'విలోలజిహ్వచెంత' అని యెవరైన అర్థము తప్పుచేసికొన వచ్చునట! పాదములు వేఱయ్యును, తెలివిలేమి నట్లర్థముచేయువారిది తప్పునుగాని, కవిదిగాదు.

'విపాండురైః కీటరజస్తృణాన్వితమ్'

'పాండురమ్ము కీటతృణ రజఃస్ఫారకమ్ము.' (౨-౧౩)

'అన్వితమువేఱు, స్ఫారకమువేఱు' అని విమర్శ. ఆపాటి యెల్లరకును దెలియును. స్ఫారకము=విశేషముగాగలది. పురువులు రేణువులు తృణములు గలది యని మూలార్థమగుచో, పెల్లుగా గలది అని అనువాదార్థము. ఇందు దోసగు కానరాదు.

'శ్వసితి విహగవర్గః శీర్ణపర్ణద్రుమస్థః' (౧-౨౩)

'దధతిదివసయోగ్యం వేష మన్యాస్తరుణ్యాః' (౫-౧౪)

ఇట 'శుష్కపర్ణద్రుమస్థః' అనియు 'వేషమన్యం తరుణ్యాః' అనియు పాఠాంతరముల గ్రహించితిని. 'శీర్ణ' వలయువారు 'శీర్ణ పర్ణద్రుమాళి నూర్చెడి ఖగాళి' అని పఠించుకొనవచ్చును.

'ప్రహూఢశాల్యంకురయైర్మనోహరమ్' శ్లోకము ననువదించుటలో నేను శబ్దములకన్న శయ్యనే మిక్కిలి అనుకరించితిని. ఇందునను మనోహరమునకు బదులు హర్షరూఢము నాకుటలో సొంపులేక లేదు. పగుల నెన్నులు పుట్టినట్లు చూచువారి హృదయముల సంతోషము పుట్టుచున్నదనియు, వరికి నెన్నులు ఫలమైనట్లు హృదయమునకు సంతోషమే ఫలమనియు వ్యంగ్యమగుచున్నది. విమర్శకులు శబ్దమును చూచుకొనిరేగాని భావమును విశేషించి అరయరైరి.

'ఉచ్ఛ్వాసయన్త్యః శ్లథబన్ధనాని' ఇత్యాదిశ్లోకమునకును, దాని అనువాదమునకును అన్వయక్రమము కొంత భిన్నమైనది. మూలార్థము తేటతెల్లముగా లేదని విమర్శకులువ్రాసిరి. కాని సూక్ష్మదృష్టి నరసినచో మూలార్థస్ఫురణ కలదనియే తలంతును. మఱి యీ శ్లోకములోనే 'గాత్రాణి కందర్పసమాకులాని' పాదమునకు 'అసమబాణ విశేషాకులావయవలు' మెఱుఁగనియు నా తాత్పర్యము.

మఱి ఉదారులు శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు తమపరిచయవాక్యమున నాకావ్యము ప్రథమప్రయత్నమని తెలిపియుండుటచేతగాబోలు యేమేని పాదపూరణలుండవాయని విమర్శకులు వెదకినట్లున్నది. వీరిచ్చిన నాలుగైదుపదములంగూర్చిన సమాధానము:—

'నెడనెడ'—ఇది నాకావ్యముననే మృగ్యము.

'మఱి మఱి'—ఇది మూడుచోట్లనే కలదు. ఆ పద్యము లివి:—

నిశల సితహర్మ్యముల హాయి నిద్రవోవు
సకుల మోముల మఱిమఱి శశి చిగమ్మ
సోత్సుకంబుగఁ దిలకించి యుకుగ రాత్రి
సిగ్గునంబలెఁ బాండిమ జెందుఁగాదె. (౧-౯)

మఱిమఱి సముద్ధురంబుగ నుఱుముమబ్బు
వలనఁ బెదరిరకపైఁ శర్వరులఁగూడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మెఱుపు వెలుఁగున దారుల నెఱిఁగికొనుచు
నేను వా రభిసారికల్ రాగమతిని. (౨-౧౦)

నిశుపనిశలను యువకులు నిర్దయముగ
నధిక కాములు మఱి మఱీ యభిరమింప
ఖేదితోగస్థ్సలలు రాత్రి క్షీణమనుడు
నడతు రల నల్ల నవయౌవనస్థ లిపుడు. (౫-౭)

వీని మూలశ్లోకములందు వరుసగా 'భృశమ్', 'అభీక్ష్ణం', 'చిరమ్' అనుపదము లున్నవి. 'కడుం గడు, మాటిమాటికి' అను నర్థమున నేను మఱిమఱీ వాడితిని. వానిస్థానముంబట్టి అవి ఛందోయత్యాదిసిద్ధికై వచ్చినవని సహృదయులు తలంపజాలరు

'చిరమ్మ'— ఇది నేను అమూలకముగా వాడినట్లు కావరావు.

'ఇపుడు'—మాతృకయందు 'అద్య' బహుళముగా వాడబడియున్నది. కాళిదాసును ఛందోయత్యాదిసిద్ధికై వేసికొనెనా? ప్రియురాలికి ప్రియుడు ఋతువుల వర్ణించిచెప్పుచున్నాడు గావున 'ఇపుడు, ఇదె, మాడు' ఇత్యాదులు ప్రత్యక్షానుభవస్ఫురణకు అనుకూలించును. మూలములో లేనితావుల కొన్నింట నేను వాడియుండవచ్చును. ఉన్నతావుల కొన్నింట వదలియుండవచ్చును.

'ఔర'—ఇది కావ్యమున నొక్కచోటనే గలదు.

'కరులు భయపడ వౌర సింగములకైన.'

ఇందు ఆశ్చర్యద్యోతకమగు 'ఔర' ఛందస్సునకు వచ్చినదనుట ధాంపసము.

'అంచిత' శబ్దమునకు బదులు నేను 'అచిత' శబ్దమును వాడితినని విమర్శకులు వ్రాసిరి. ఇది నా పొరబాటుగాదు, విమర్శకుల భ్రమ. 'పఱుపబడినది, కప్పబడినది' అను నర్థములోనే 'అచిత'మును నేను ప్రయోగించితిని.

మఱి కొన్నిటుల నెమకు విమర్శకుల శబ్దప్రయోగము, అర్థవివరణము అరయుడు: (౧) ఉత్సుకము= వేడుక అని అర్థము వ్రాసిరి. ఔత్సుక్యమునకు వేడుక అర్థము. విశేషణమునకు విశేష్యము నర్థ మిచ్చుట పొసగదు.

(౨) 'గ్రంథమునందలి రుచిని చవిగొని'—రుచి యనగా చవిగదా. రుచిని రుచిగొనుట యన నర్థ మేమో తెలియకున్నది. కావ్యరసమును చవిగొనుట యెఱుగుదుము. కాని వీరిప్రయోగము అభూతము.

ఇట్లు విమర్శ కంతటికిని సమాధానము వ్రాయవలసివచ్చుటకు చాల విచారించుచున్నాను. పత్రికలందు గ్రంథవిమర్శలు (లేక 'రివ్యూ'లు) అధునాతన ప్రచురణములను పాఠకలోకమున కెఱుకపరచుట కుద్దేశింపబడినవి రంధ్రాన్వేషుల వినోదమునకు గాని గ్రంథకర్తలతో పెనగులాటకుగాని కాదు. భారతిలోని విమర్శ అట్టి ప్రయోజనమును నెఱవేర్పకపోవుట శోచనీయము. మఱి పునర్విమర్శ కవసరము గల్గించుట కడుంగడు శోచనీయము.

గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## జ్యోతిష సర్వస్వము

ఈపుస్తకము శ్రీరాజావిక్రమదేవవర్మగారి అభిప్రాయముతోనూ, గ్రంథకర్తగారి విజ్ఞప్తితోనూ, శ్రీరామశేషయ్యచౌదరిగారి ఆజ్ఞ నుల్లంఘింపలేక ఏమూరి వెంకటరామయ్యగారు వ్రాసిన పీఠికతోనూ ఆరంభమయినది. శ్రీరాజావారు "ఇయ్యది నేను జాల భాగము చదివితిని. ఇది జ్యోతిషజ్ఞానప్రసాదమునకు మార్గప్రదర్శకముగ నుండుటవలన జనసాధారణాదరము గాంచగలదని నానమ్మకము. దీని తరువాతిభాగములు విశేషజ్ఞానదాయకములుగ నుండుటకు సందేహ ముండదు......" అని అభిప్రాయము యిచ్చినారు. ఈపుస్తకము డెమ్మిసైజు రాక పేజీలు, ఇందులో చాలా భాగము శ్రీరాజావారు చదివినారుట. ఈపుస్తకము జనసాధారణాదరము గాంచగలదట. అయితే దీని తరువాతిభాగములు విశేషజ్ఞానదాయకములుగా ఉంటవని యీచిన్నపుస్తకమునయినా సంపూర్ణముగా చదవని శ్రీవారు అభిప్రాయము నిచ్చినారు. ఈపుస్తకము మాత్రము విశేషజ్ఞానదాయకముగా లేదని శ్రీవారి అభిప్రాయమేమో అని తోస్తున్నది.

ఇప్పటికి పదిహేనుసంవత్సరాలనుంచి జ్యోతిష వ్యాసంగముచేస్తూ అనుక్షణమూ జ్యోషీలను వెంట వేసుకొని జాతకాలను, హస్తసాముద్రికములను విలాసముగా పరిశీలించే శ్రీరామశేషయ్యగారు వారికి తీరకనో, మరేకారణమువల్లనో, శ్రీ ఏమూరి వెంకటరామయ్యగారిని యీపుస్తకమునకు పీఠికను వ్రాయమనికోరినారట. శ్రీ చౌదరిగారిఆజ్ఞనుల్లంఘింపలేక శ్రీ వెంకటరామయ్యగారు పీఠిక వ్రాసినారు. పీఠికలో మొదటనే పేరాలో జ్యోతిషము ఆరంభించవలచుకొన్న విద్యార్థులకు- ఇంగ్లీషువిద్యార్థుల కన్నట్లయితే యింకా సమంజసముగా ఉండేదేమో-అత్యంతోపయుక్తముగా ఉంటుందని వ్రాసినారు. ఆతర్వాత రెండుపేజీల పీఠికలో యీపుస్తకాన్నిగురించి ఒక్కమాటయినా వ్రాయకపోవడము సరేకదా, యీపుస్తకానికి ఏవిధమయినసంబంధము లేని శ్రీ పిడపర్తి కృష్ణమూర్తి శాస్త్రిలవారి దృగ్గణిత పంచాంగమును పొగడినారు. బహుశః వెంకటరామయ్యగారు యీ పుస్తకము చదివియే ఉండరు. ఏమంటే వారికి జ్యోతిషములో అభిరుచి అని వారే వ్రాసుకొన్నారు. పుస్తకము చదివే ఉన్నట్లయితే పుస్తకములో గ్రంథకర్త చేసిన తప్పులను చెప్పిఅయినాఉండేవారు. లేక పీఠికలోనయినా వ్రాసిఉండేవారు. అసలు చౌదరిగారికోసరము వారు పీఠిక వ్రాసినారుకాని పుస్తకముకోసరము కాదని వారే చెప్పుకుంటున్నారుకదా!

ఇక పుస్తకమువిషయము. ఇట్లాంటిపుస్తకాలు తెలుగులో కావలసినవాటికన్న చాలాఎక్కువ ఉన్నవి.

వెనుకటివారు లగాయతు యీగ్రంథకర్తవరకు యిలాంటిపుస్తకములు ఎంతమంది ఎన్నివ్రాసినారో లెక్కలేదు. ఈపుస్తకములో ఉన్నవిషయము ఏ జ్యోషీదగ్గిరకయినా వెళ్లి అరగంటసేపు కూర్చున్నా, లేకపోతే దమ్మిడిఅయినా ఖర్చులేకుండా వచ్చే దోసపర్తి స్వామిగుప్తగారి పంచాంగపీఠికను కాస్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రద్ధతో చూసినా తెలుస్తవి. ఈకాస్తపోపిక లేనివారిని మనస్సులో ఉంచుకొనికాబోలు గ్రంథకర్తగారు ౯ పేజీలు పంచాంగం చూసుకొనేపద్ధతి వ్రాసినారు. ఇక కాలసాధనప్రకరణమనే పేరుతో ౧౫ పేజీలు చిక్కిరిబిక్కిరిగా, అతిఖసరాగా వ్రాసినారు. ప్రస్తుతము సర్కారువారు కాలనిర్ణయమువిషయము చేసిన పద్ధతిఅయినా గ్రంథకర్తగారికి తెలియనట్టు తోస్తున్నది. లగ్ననిర్ణయము చెపుతూ ౮౧-వ పేజీలో దిన ప్రమాణము ౬౦-౧౦ఘటికలున్నూ, బుధోదయాంతవిషయము చెపుతూ ౮౫-వ పేజీలో దినప్రమాణము ౬౦-౦ ఘటికలున్నూ చెప్పినారు. అయితే లగ్ననిర్ణయమునకు దినప్రమాణము ౬౦-౧౦ అనిన్నీ బుధోదయాంతవిషయములో దినప్రమాణము ౬౦-౦ అనిన్నీ అపోహ కలుగుతుంది. ఈవిషయము గ్రంథకర్త స్పష్టముగా వ్రాసి ఉండవలసినది. ఇక గ్రహములను రాశిచక్రములో వేసుకొనేపద్ధతి ౮౭-వ పేజీలో వ్రాసినారు. గ్రంథకర్తగారిపద్ధతిప్రకారముఅయితే విశాఖ ౩ వ పాదములో ఒకగ్రహము ఉన్నదనుకొన్నట్లయితే ఆగ్రహమును వృశ్చికరాశిలో వేసుకొనవలసివస్తుంది. దీనివలన రాశిచక్రమే తారుమారు అవుతుంది. ఈపుస్తకమువివర కొన్ని టేబిల్సుయిచ్చివాటిప్రయోజనము తిన్నగా స్పష్టముగా గ్రంథములోకాని, ఆపథకములవద్దకాని వివరించలేదు. ౩-వ టేబిల్ యొక్క ప్రయోజనము సంపూర్ణముగా వివరించినట్లయితే ౪-వ టేబిలుతో అవసరమేలేదు. ఈరెండుటేబిల్సు జాగ్రత్తగాచూస్తే వెనుకటికి ప్రతాపరుద్రీయ నాటకములో చెనుముకిశాస్త్రిలు చెప్పిన సిద్ధాంతము విద్ధాంతము జ్ఞాపకము వస్తున్నది. ౪-వ టేబిలులో ఘటికాదిప్రమాణము ౬౬-౩— ఘటికలవరకు యిచ్చినారు. దీనిలో ఆనాటిఉదయలగ్నభుక్తి తీసివేస్తే శేషము సూర్యోదయాదిఘటికలు అవుతవన్నారు. భుక్తి అనేది లగ్నప్రమాణముకంటే ఎప్పుడూ మించి ఉండదనేవిషయము తెలుసునుగదా! ఈగ్రంథములో యిచ్చినలగ్నప్రమాణములో ౫-౩౫ కు మించినది లేదు. సౌరమాసములో చివరరోజున లగ్నముఅంతా భుక్తి అయిపోయిందనుకొని యీ ౫-౩౪ ను ౬౬-౩౯లో తీసివేస్తే ౬౧-౪ అవుతుంది. ఇది సూర్యోదయాది ఘటికావిఘటికలు కావలెను. సూర్యోదయానికీ సూర్యోదయానికి అంతరము గ్రంథకర్తగారు చెప్పినట్లు ౬౦-౧౦ అనుకొన్నప్పటికిని యీ ౬౧-౪ ఏ సూర్యోదయమువద్దనుంచో బోధపడడము లేదు. ౫-వ టేబిలులో యిచ్చినదేశాంతరసంస్కారములు ఎక్కడనుంచో, దేనిలోచేయవలెనో గ్రంథకర్తగారు వివరించలేదు. పైగా గ్రంథకర్త 'దినము' అనే శబ్దాన్ని ఒకచోట (౭౩-వ పేజీ) రాత్రింబగళ్లుగాను మరొకచోట (౭౫-పేజీ) పగలుగాను వాడినారు. ఇది వివరముగా వాడనందువల్ల తికమక అవుతున్నది. అచ్చుతప్పులు కావలసినన్ని ఉన్నవి. ఈగ్రంథము జ్యోతిషము తెలియనివారికి తెలిసినవారికి ఒక్కమాదిరిగా ఉపయోగపడుతుంది. తెలియనివారికి ఈగ్రంథము చదివినందువల్ల ఏమీ తెలియదు. తెలిసినవారికి ఈ గ్రంథముతో నిమిత్తమేలేదు. అయితే ఎంతో ఉత్సాహముతో యీపుస్తకము వ్రాసి అచ్చువేయించిచందాదారులకు రు ౦-౮-౦ కిన్ని చందాదారులుకానివారికి రు ౧-౦-౦ కిన్ని అమ్మవలచుకొన్న గ్రంథకర్త సంస్తవనీయుడు.

## సోదర జ్యోతిషికులు

—————

### నారాజు

క్రౌనుసైజు, ౧౨౮ పుటలు, వెల రు. ౦-౧౦-౦
గ్రంథకర్త: తాళ్లూరి సుబ్బారావుగారు, ఏలూరు.

కళింగదేశపురాజగు విక్రమాదిత్యుని మదాలసయను వాతనిచెల్లెలు చంపించి అతనికుమారుడగు చంద్రశేఖరుని బలిమార్ప యత్నించుటయు, అతనిని సంరక్షించుటకు విక్రమాదిత్యుని తమ్ముడగు విక్రాంతుడును, అతనిభార్య దేవాంగనయు, విక్రాంతుని ప్రేమించిన మృణాలినియు జేసిన ప్రయత్నములును, దేవాంగన ఘోరమరణమును, దుర్జయ వీరపాలుర ద్రోహచింతలును, మృణాలిని సన్న్యాసాశ్రమస్వీకరణమును మదాలస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## బీహారు భూకంప చిత్రములు

—పండిత జవహర్‌లాల్ నెహ్రూగారివి.



(౧) నాశనమయిన ముజఫర్‌పూరు.



(౨) కూలిపోయిన కోటలవంటి పక్కా భవనములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




(3) విధ్వస్తమయిన ఆర్టు స్టూడియో, ఇతర కార్యాలయములు, పాట్నా.



(౪) ఇండ్లు పోయిన ప్రజలు నిర్మించుకొన్న తాత్కాలిక నివాసములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాత్మహత్యయు, చంద్రశేఖరుడు సింహాసనము నధిష్ఠించుటయు, అను ప్రకరణములలో సినీమాదృశ్యముల వలె ప్రస్ఫుటముగ చిత్రింపబడినవి. చక్కని నవల. నిర్దుష్టమగుశైలి. గ. స.

---

## భారతీయవిద్యాచరిత్రము

క్రౌనుసైజు, ౧౩౦ పుటలు; గ్రంథకర్త: మారేమండ రామారావుగారు, బి. ఏ, (ఆనర్సు) బి. ఇడి.

హిందూవిద్య, బౌద్ధవిద్య, మధ్యయుగము, ఢిల్లీ సుల్తానులపాలనము, మొగలుయుగము, బ్రిటిషు పరిపాలనము అను ఆరుఅధ్యాయములలో సనాతనకాలము నుండి నేటివరకు భరతఖండములో విద్యావిధాన మనుసరించుచున్న పరిణామములెల్ల నిందు పొందుపరుపబడినవి. ఈ వ్యాసములు భారతిలో ప్రచురింపబడినవి. విద్య జాతీయముగను, వ్యక్తిబుద్ధి వికాసకరముగను, జీవనాధారముగను, నిర్బంధముగను, శీలపోషణముగను ఉండవలె ననుసిద్ధాంతము లధునాతనములని చాలమంది భావించుచుందురు. కాని భారతీయవర్ణాశ్రమ పద్ధతిలోను, విద్యావిధానములోను ఈ సూత్రములెల్ల నెంతప్రస్ఫుటముగ నున్నదియు, హిందూవిద్యయను నధ్యాయమున గాననగును. హిందూయుగములో కర్మకాండయు, సంస్కృతభాషాప్రాముఖ్యమును ప్రబలి జనసామాన్యమున కందుపాటుకాకుండుటచే దేశభాషకు ప్రాముఖ్యమిచ్చి బౌద్ధయుగమీవిధానము నెట్లుపోషించినదియు రెండవఅధ్యాయము బోధించును. హిందూమతము బౌద్ధవిధానములను అంతర్భూతము చేసుకొని దేశభాషలకును, సులభసంస్కృతమునకును, పురాణములకును ప్రాముఖ్య మిచ్చి బౌద్ధమతవిధానములతో తుల్యముగ తులదూగి భారతీయసాహిత్యకళాప్రకాశవికాసముల కెట్లు తోడ్పడినదియు మధ్యయుగమను నధ్యాయమున గాననగును. అప్పటినుండి భారతీయ విద్యావిధానము ప్రజలయొక్కయు, పండితులయొక్కయు స్వతంత్రపోషణవికాసములను తప్పి ముసల్మాను చక్రవర్తుల దయాదాక్షిణ్యములకును ఇచ్ఛావికారములకును లోనై విదేశసంప్రదాయమిశ్రితమై విజ్ఞానవంతులగు ప్రభువులపరిపాలనమున వికసించుటయు, అజ్ఞానుల అనాదరణముచే కుంటుపడు టెట్లు తారుమారైనదియు నాలుగవ, ఐదవఅధ్యాయములు తెలుపును. మొగలు పరిపాలనానంతరమున సంభవించిన అరాజకాంధకారయుగమునను, కంపెనీవారి పరిపాలనమునను అదియెట్లు క్షీణించి భారతజాతీయత కృశించినదియు, విక్టోరియా పరిపాలనమునాటినుండి విదేశభాషాప్రాచుర్యము, ప్రభుత్వోద్యోగవాంఛాసక్తి, స్వతంత్రవృత్తివినాశనము ఎట్లు హెచ్చించినదియు ఆరవఅధ్యాయము తెలుపును. భారతీయవిద్యను నిజముగ భారతీయముగను, ప్రజాసామాన్యమున కందుబాటుగలదానిగను, మాతృభాషా ప్రాధాన్యముగను, ఇష్టకామ్యార్థసిద్ధిదంబుగను జేయు ప్రయత్నములతో వుడ్డుకమిటి, హంటరుకమిటి, నాషకమిటి, కాటన్‌కమిటి, సార్జెకమిటి, సాడ్లరుకమిటి మున్నగునవెన్నియో నెలకొల్పబడుచున్నవి కాని ప్రాథమిక విద్యకుగాని, ఉత్తమవిద్యకుకాని ప్రాచీనగౌరవములు రాలేదు. ఇవియెల్ల ధనవ్యయమునకును, కొందరుప్రముఖుల జీతబత్తెములకొరకును మాత్రమే ప్రయోజనకరము లగుచున్నవని గ్రంథపఠనమువలన దెలియనగును. చారిత్రకపరిశోధకులు, విద్యావిధాన సంస్కారాభిలాషులు, దేశశ్రేయోభిలాషులు- ఎల్లరును పఠింపవలసిన ఉద్గ్రంథము. శైలి సులభగ్రాంథికమై చారిత్రక వ్యాసరచనమున కెంతయు నొప్పియున్నది. గ. స.

---

## శిశురక్షణ

డిమ్మీసైజు, ౧౦౫ పుటలు. వెలరు ౦-౧౨-౦ గ్రంథకర్త్రి: శ్రీమతి, టి. వరలక్ష్మమ్మగారు.

ఈమెకాన్పులుచేయుటయందును, స్త్రీలకు, చంటిబిడ్డలకు చికిత్సచేయుటయందును మిగుల అనుభవముగల దేశీయవైద్యురాలు. బిడ్డ పుట్టినదిమొదలు పెద్దదియగువరకు చేయవలసిన సంరక్షణవిధానము, చికిత్సావిధానము అంతయు నిందు పొందుపరచబడినది. ప్రతిపిల్లలతల్లిదండ్రులు తప్పక నెరుంగవలసినయంశము లెన్నియో


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిందు గలవు. ఈగ్రంథమునందు పిల్లలకు సాధారణముగ సంభవించురోగములును, వానికి సాధారణముగ జేయుచుండు చికిత్సలే తెలుపబడినవి. అయినను ఇదికూడ తెలియనియసంఖ్యాకులకును, తెలిసియు అనుసరింపని సోమరిపోతులకును ఈ గ్రంథమొక పెద్దమేలుకొలుపు వంటిది. ఈమాత్రము గృహవైద్యజ్ఞానము లేనివారికి పిల్లలుగనుటకు యోగ్యతలేదు. ఇట్టిజ్ఞానము నెల్లరు సంపాదించి పిల్లలనుగూర్చి జాగ్రత్తగొనిరేని తరచుగా వైద్యులవద్దకుపోయి ద్రవ్యము ధారపోసుకోవలసిన యవస్థయు, పిల్లలయనారోగ్యములతో నీసుపోతలుపడు అవస్థయు తప్పి అనేకగృహములు స్వర్గతుల్యము లగును. ఇందుదాహరింపబడిన చికిత్సావిధానము లతిసులభములు. ఔషధసామగ్రి యతిసాధారణము, అతిచౌక. ఈగ్రంథములోనున్న జ్ఞానముకూడ లేకపోయినచో పిల్లలు తల్లులుకూడ అనేకకష్టములపాలగుదురు. వారికి సంసారయాత్ర రోతపుట్టించకమానదు. ఈ గ్రంథపఠనమువలన పిల్లల ఆరోగ్యవిషయమున మనస్త్రీ లనుసరించుచుండు అనేకమూర్ఖవ్యములుకూడ తొలగును. సుమారు ౮౦ చికిత్సావిధానము లిందున్నవి. పిల్లల కవసరములైన కొన్ని చూర్ణములు, వర్తులు, నూనెలు తయారుచేయువిధులును పొందుపరుపబడినవి. గ్రంథములోని ప్రతిపుటయు చదువముచ్చటయై, వ్యావహారికశైలిలో ప్రధానవిషయబోధకమై రాణించుచుండును. హైదరాబాదు (డక్కను) నందున్న గోలకొండముద్రాక్షరశాలయందు ఇది ముద్రితము. గ. స.

---

## ముగ్ధప్రణయము (ఒథెల్లో)

సుప్రసిద్ధాంగ్లకవియగు షేక్సుపియరు రచించిన విషాదాంతనాటకములలో ఒథెల్లో చాలముఖ్యమయినది. దానిని శ్రీకర్లపాలెము లక్ష్మీనరసింహారావుగారు తెనిగించిరి. శ్రీయుతులు రాయసం వేంకటశివుడు పంతులుగారు ఈగ్రంథమును ప్రశంసించిరి.

ఇప్పటికిని తెనుగు వాఙ్మయమునగల గ్రంథములయం దనేకములు అనువాదములే. అందు నాటకములు మరియును. ఇటీవల ముప్పదినలువది సంవత్సరములనుండియే తెనుగున నాటకములు బయలుదేరుచున్నవి. అం దనేకములు అనుకరణములుగను అనువాదములుగను ఉన్నవి. స్వతంత్రములు కొన్నిమాత్రమే యగపడుచున్నవి. ఒకభాషలోనివిషయమును మరియొకభాషలోని కనువదించునపుడు మార్పులచేయుటకు వీలులేదు. అనువాదకుడు మాతృకయందు మార్పులగలుగజేయుటకు వీలులేదని ౧౮-వ శతాబ్దినాటి జాన్సను మహాశయుడు చెప్పియున్నాడు. "ఇట్టి విదేశీయ నాటకముయొక్క రుచిరతను సర్వతోముఖముగ భాషాంతరమునం గొనివచ్చుట సులభముగాదు.........పాఠకులు ప్రేక్షకులు నీపాశ్చాత్యనాటక మాధుర్యము సమగ్రముగం గ్రోలి యానందించుటకై యీయాంధ్రానువాదమునం గొన్ని యావశ్యకములగుమార్పులు చేయంబడెను. నాటకమునకుం గ్రొత్తపేరిడుట, పాత్రలకు హిందూనామధేయము లొసంగుట, కథారంగమును భారతదేశమునకుం దరలించుట, విదేశాచారములకు మారుగ హైందవసా(స)ంప్రదాయములు చొప్పించుట, ఒకొ్కకచోట కథను, వర్ణనను నించుకమార్పుచేయుట ఇవియే ముఖ్యమగుమార్పులు." ఈస్వాతంత్ర్యములు అనువాదకులకు లేవు. అట్టిగ్రంథములు అనువాదములు కావు. మాతృకయందు దోషము లున్నయెడల అనువాదకులు వానిని సరిదిద్దకూడదు. భాష వేఱయినపుడు శైలియందలి సంప్రదాయములును వేరుగ నుండును. ఇంగ్లీషున

1. "He" (The Translator) "is to exhibit his author's thoughts in such a dress of diction as the author would have given them, had his language been English: rugged magnificence is not to be softened; hyperbolical ostentation is not to be repressed; nor sententious affectation to have its points blunted. A translator is to be like his author; it is not his business to excel him". (Johnson's life of Dryden.)

"Translation, therefore," says Dryden, "is not so loose as paraphrase, nor so close as metaphrase." (Johnson's life of Dryden)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"Tariff Walls" అనినపుడు తెనుగున "సుంకపు గోడలు" అనగూడదు. "భాష యెప్పుడు మారుచున్నదో అప్పుడే తదనుగుణముగ దేశము, కాలము, వేషము మారిపోయినట్లే పేరులుగూడ భాషాసాంప్రదాయానుగుణముగ మార్పుచెందుట త్యావశ్యకమని" గ్రంథకర్తగారి "నమ్మకము." ఋగ్వేదమును ఇంగ్లీషులోని కనువదించునపుడు 'దేశకాలము'ల బట్టి మార్పుచేసినయెడల అట్టి గ్రంథము అనువాదము కాజాలదు. ఒకభాషలోనున్న భావమును, విషయమును మరియొకభాషలోనికి కొనితెచ్చుట అనువాదమగునుగాని యింగ్లీషున "బ్రౌను" అనియున్నచోట తెనుగున "బ్రహ్మయ్య" అని చెప్పుట అనువాదము కాజాలదు.

ఇంగ్లీషున ఈనాటకముపేరు "Othello The Moor of Venice" తెనుగున "ముగ్ధప్రణయము [Othello]" గా మారినది. 'Shakespeare has no heroes;—he has only heroines' అని Ruskin చెప్పినాడు. కాని అతడే ఒథెల్లోవిషయమునమాత్ర మిట్లు చెప్పుటకు సంకోచించినవాడై 'Othello would have been one,' (hero) 'if his simplicity had not been so great as to leave him the prey of every base practice around him; but he is the only example even approximating to the heroic type.' అనినాడు. షేక్స్పియరు తననాటకములకు అనేక పర్యాయములు కథానాయకుల పేర్లనే వాడియున్నాడు. అనువాదకులు నాటకముయొక్క పేరును మార్చుటలో ప్రయోజనము గన్పట్టదు.

సంస్కృతనాటకముల ననుకరించి నాందిప్రస్తావనయు వ్రాయబడియున్నది. ఇవియు మూలమునకు కళంక మాపాదింపజేయుచున్నది.

'ప్రథమాంకము, మొదటిరంగము: ఆంధ్రపట్టణ మండలి యొకవీథి' యైయున్నది. ఈ ఆంధ్రపట్టణమే తరువాత 'ఆంధ్రపుర' మైనది. ఆంధ్రపట్టణమనిగాని, ఆంధ్రపురమనిగాని అనబడు ఊరు చెప్పుటను లేదు. మాతృకయం దున్న 'వెన్నీసు' నగరమును పేరే నిల్పియుండిన మేలు.

సాధారణముగ షేక్సుపియరు ప్రతిరంగమును ఏదియో యొక సంభాషణముమధ్యనుండి తటాలున ప్రారంభించుట కలదు.[1] ఇందువలన నాటకము ప్రారంభింపకపూర్వము నడిచినకథను ఊహించుకొనుట కవకాశము చిక్కుచున్నది. ఇచ్చటి అనువాదవాక్యము లివి:

"రఘుపతి—ఇరావంతుడా! నీ వెంతవాడవురా! నాధనమంతయు నీవశము గావించితిని, నా ప్రాణములు నీచేతులలోఁ బెట్టితిని, నిన్నే నమ్మికొంటిని. అప్పటికిని, నీద్రోహచింత మానవుకదా. నీ కంతయుఁ దెలిసియుండియును నాకుఁ జెప్పక పోయితివి." [ప్రథమాంకము, మొదటి రంగము, మొదటి అయిదుబంతులు.]

అనువాదముప్రకారము, రఘుపతి, యిరావంతునిచే మోసపోయినట్లు అప్పుడే తెలిసికొని వెదకివెదకి ఎట్టకేలకు మోసగానిని పట్టుకొని 'ఇరావంతుడా! నీవెంతవాడవురా!' యిత్యాదులు పలికినటు లున్నది. ఈమార్పు మాతృకకు వన్నెతెచ్చినదా?

అదేరంగమున రఘుపతిప్రశ్నమునకు ఇరావంతుని జవా బిటులున్నది: "ఇరావంతుడు—ఛీ! దైవసాక్షి, ఈసంగతి నేను కలలోనైన ననుకొనలేదు. నాకు రవంత తెలిసియుండిన నీతోఁ జెప్పనా, రఘుపతీ?"[2] (ప్రథమాంకము, మొదటిరంగము)

అదే సంభాషణమున మఱియొకచో:

---

1. Roderigo:- Never tell me; I take it much unkindly
That thou, Iago, who hast had my purse
As if the strings were thine, shouldst know of this— [Act I Sc. (i) l. 1—3]

2. Iago:- But you'll not hear me. If ever I did dream of such a matter, abhor me. [Act I. Sc. (i) l. 4—5.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"రఘుపతి:—అతనికిని నీకును సరిపడదంటివే?" 3 ఈమార్పులవలన మూలమందలి భావగాంభీర్యము సమసినది.

కొన్నిమార్పులవలన మూలమందలి ధోరణియే మారిపోయినది :

"ఇరావంతుడు : —ఎందుకా! మీయింట దొంగలు పడినారు. ఇంకను జూచెదరేమి? ఇప్పుడైనను, పైన బట్టవేసికొని బయలుదేరండి. వింటే గుండెలు బ్రద్దలవుతుంది. నీముద్దుకూతురు లేచిపోయినది. వెంటనే పరిజనులఁ బిలిచి బయలుదేరుము. ఆలసించితివేని బ్రహ్మ రక్కస్సు నీ కల్లుఁడగును."

ఇట్లు మూలమందలి బిసువు అనువాదమున సడలిపోయి చప్పబడినది.

తొలిపలుకున, చతుర్థాంకమునగల "విల్లో పాట" యనుదాని కనువాదముగ రచింపబడిన "పద్మప్రణయగీతము" షేక్సుపియరుపాటయందలి భావము నీకవి రమ్యముగ తెనుగునం దల్లెనని కలదు. Sycamore అనునది సిరియా, ఈజిప్టుదేశములలో పెరుగు ఒకవిధమయిన అత్తిచెట్టుగాని 'మామిడిమ్రోడు' గాదు. Willow అనునది నీటిసమీపమున పెరుగు ఒకవిధమయినచెట్టు. దీనిపేరు తెనుగున నేమో తెలియదు. కాని, యిది పద్మముమాత్రము కాదు. కథానాయిక ఆసమయమున "విల్లోపాట" పాడుటకు కారణము లేకపోలేదు. ప్రియులయెడబాటువలన గలుగునార్తికి సూచకముగ నీ "విల్లోఆకుల" మాలలను విరహిణులు ధరింతురు. "విల్లో" దుఃఖసూచకము కూడాను. విల్లోచెట్టుకొయ్యతో క్రికెటుబ్యాటులను చేయుదురు. విల్లోస్థానమున పద్మ ముంచినందువలన మాతృకయందలి అభిప్రాయమునకు భంగము కలుగుచున్నది. "హైందవ సాంప్రదాయముల" ప్రకారము పై పరిస్థితులయందు పద్మముల ధరించువా రెవరయిన మనదేశమున గలరా?

మూలముతో అనువాదమును పోల్చిచూచిన ఎంతవఱకు షేక్సుపియరుభావ మిందు కన్పట్టుచున్నదో తెలియగలదు.1

---

3. Roderigo:- Thou told'st me thou didst hold him in thy hate. [Act I, Sc. (i, l.-6.]

4. Iago:- Sir, you're robb'd; for shame, put on your gown;
Your heart is burst, you have lost half your soul:
Even now, now, very now, an old black ram;
Is tupping your white ewe. Arise, Arise;
Awake the snorting Citizens with the bell,
Or elsethe devil will make a grand-sire of you. Arise, I say. [Act I. Sc. (i) l. 86-92]

1. Desdimona—(Singing)
The poor soul sat singing by a sycamore tree,
Sing all a green willow;
Her hand on her bosom, her head on her knee,
Sing Willow, Willow, Willow,
The fresh streams ran by her, and murmur'd her moans;
Sing Willow, Willow, Willow;
Her salt tears fell from her, and soften'd the stones;
Sing Willow, (Lay by these) Willow, Willow. * * *
Sing all a green Willow must be my garland.
Let nobody blame him; his scorn I approve— * * *
I called my love false love; but what said he then?
If I count moe women, you'll couch with moe men:—

అనువాదము :—

కుముదిని—(వీణను జేతఁబుచ్చుకొని)
పాడువాఁడెనమామిడి మ్రోడుచెంతఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాటకము నంతయు ఒక్కొక్క వాక్యమును మాతృకతో పోల్చిచూచుట సులభసాధ్యము గాదు. మచ్చునకుమాత్రము అచ్చటచ్చట కొన్ని చూపబడెను. పంచమాంకము రెండవ రంగమున శ్యామలరాయని (Othello) ప్రవేశ మయినతర్వాత అతనివచనమున కనువాదమునుం కి :

"శ్యామలరాయడు:—(ప్రవేశించి దిశల బరికించి) ఔను, దుష్టసంహార మే నాకు ముఖ్యసంకల్పము. అవి నీతి యెచ్చోట మొలకెత్తినను దానిని వేరంటఁ దెగనఱకవలసినదే. అరుంధతి, అనసూయాదులు తారకలై మింట వెలయుచున్నారు. ఈ పవిత్రమూర్తుల యెదుట నీనీచురాలిపాపమును చేరొక్కనజాలను............

..........................................

ఎచ్చట నిష్కళంకమను విశుద్ధప్రణయ ముప్పొంగి వికసించెనో, అట్టిహృదయాంతరాళమునుండియే యీ శోకము వెల్లివిరియుచున్నది......ఇదిగో యీమె కదలుచున్నది. మెలకువ వచ్చినట్లున్నది. కుముదా!"

ఇందు మార్పు మెండుగ గలదు. మాతృకకును అనువాదమునకును గల అంతరము ఇంత అని చెప్పుట కలవిగాదు. ఈవాక్యముల ననేకవ్యాఖ్యాత లనేకవిధముల అర్థము చేసికొనిరి గాని అనువాదమందలి భావముల నెవరును గన్పరచినటుల లేదు.

---

సౌందర్యమంజరి

భావప్రధానమగు నీఖండకావ్యమును కవిశేఖర బిరుదాంకితులు శ్రీ కాళ్లకూరి గోపాలరాయకవిగారు రచించిరి. క్రౌను (౪౦+౬౪=) ౧౦౪ పుటలు. మేలురకపుకాగితము. ముచ్చటైన అచ్చుకూర్పు. వెల

బాలుసెలయేఁటియొడ్డునఁ గూరుచుండి
వేడినిట్టూర్పుగాలిలో విస్తరింప
నెదను చేయిఁజేర్చి తలవంచి హీనరవళిఁ
బాడుకొంటివి నీమనోభావాళి
పద్మ! ముకుళితముఖపద్మ! ప్రణయసద్మ!!
పాడుకొంటివి నీమనోభావసరళి
ఆలకింపఁగ మనసయ్యెనమ్మ! నీదు
ప్రాణనాథతిరస్కృత ప్రణయచరిత

* * * *

* * * *

పద్మ! ముకుళితముఖపద్మ! ప్రణయసద్మ!!
పాడుకొంటివి హృదయతాపమ్ముఁ దీర
దీనమై దుఃఖభాజన మైనకథను
బాడుకొంటివి హృదయతాపమ్ము దీర
నీదుకన్నుల నొలికిన నీటిధార
చేతఁ గరగి స్రవించె శిలాతలమ్ము.
ఎఱిఁగి యెఱుఁగనిగతి సెలయేఁటిజలము
మారువల్కెను నీదు సత్కారములకు.

* * * *

* * * *

* * * *

పద్మ! ముకుళితముఖపద్మ! ప్రణయసద్మ!!
కంటి వకలువ ప్రణయరాగమ్ము నీవు
మృదులహృదయంపుటార్తితో మేళవించి
పాడుకొంటివి హృదయతాపమ్ము దీర
ప్రాణనాథ............చరిత
పాడుబెట్టిన పచ్చికబయలులోని
గడ్డిపూలను సమకూర్చి కంఠహార
మొంటి నిర్మించి ధరియించుకొంటి వీవు
ప్రియతిరస్కృతి కిసుమంత బెంగఁగొనక
పాడుకొంటివి హృదయతాపమ్ము దీర
ప్రాణనాథ............చరిత.

1. Othello:— It is the cause, It is the cause, my soul,—
Let me not name it to you chaste stars!
It is the cause.

* * *

It Strikes where it doth love. She wakes.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రు. ౧. ప్రకాశకులు: విశల్యాడిపోవారు, ర ఆచారప్పన్ సందు, జార్జిటవును, మదరాసు.

ఆంధ్రదేశమునకుఁ జిరపరిచితులగు శ్రీగోపాల రాయకవిగారింగూర్చి తెలుపవలసిన క్రొత్తవిషయము లేమియు లేవు. వీరి పాండిత్యము, అనుభవము, సంస్కరణాభిలాష పరిపాకముపొంది యేతద్గ్రంథ రూపముగఁ బరిణమించి ఫలించినవి. ఇందు శ్రీ గోపాల రావుగారి కనుభవగోచరములగు రసభావశాస్త్రవిజ్ఞానాది తత్త్వములు నూతనరీతిని వివరింపఁబడినవి. కావున నిది ఖండకావ్యరూపముగ నున్న శాస్త్రగ్రంథ మని చెప్ప వచ్చును.

దీని నర్థముచేసికొనుటకు కేవల మాంధ్రభాషా పరిజ్ఞానము సరిపోదు. ఇయ్యది "ఆంధ్రాంగ్ల విద్వాంసులైననేగాని నాదారి సుగమంబుగా డెన్నో గతుల" అను కవిగారి పలుకే ప్రమాణము. కాని యంతమాత్రమున నిం దర్థస్ఫూర్తి కలుగఁజాలదు. దానికి శాస్త్రవిజ్ఞానపరిచయము విశేషముగ నావశ్యకము.

అపూర్వములు, భావగర్భితములు నగు విషయ ములు సామాన్యజనగ్రాహ్యములగునట్లు కవిగా రిందు చాలచోటుల చెప్పినవిషయములనే దృష్టాంతప్రదర్శన పూర్వకముగ చెప్పిరి.

ఈ విషయమున గ్రంథరచనకు వీరు స్వీకరించిన మంజరీచ్ఛందము ఎంతయు ననుగుణము. కవి యీ గ్రంథమున "సౌందర్యమంజరీసామ్యరూపమున" నున్న భారతికి మ్రొక్కి కృతార్థుఁడైనాఁడు.

గ్రంథమునఁగల ఎనిమిదిప్రకరణములందును శక్తి, భాషా, రస, మన్మథోపాసన లను నాలుగు ముఖ్య ములు. అవి అపూర్వభావగర్భితములు. అవతారిక మొదలగు నాల్గుప్రకరణములయందును కృతిస్వీకరణ ప్రయత్నము, కృతిస్వీకృతి, కృతార్థత మొదలగు విష యములు వివరింపఁబడినవి.

"సర్వకారణశక్తి" యప "చైతన్యశక్తి" తక్కినభూతములందుకంటె ఆకాశవిషయమున ఎక్కువ ప్రాభవము కలదని "శక్త్యుపాసన" యందు కవిగారు సమర్థించిరి. ఇది యనుభవమున కెంతయు ననుగుణము.

"భాషోపాసన" యందు సాహిత్యోపాసకులు గమనింపవలసినవిషయములు పెక్కులు కలవు. "సృష్టికిఁ బ్రతిసృష్టి" యగు "హృద్యకావ్యము" ను రచింపఁదలఁచిన- రచించి సహృదయులను రసతన్మయుల నొనరింపఁ దలఁచిన- కవి కవితారచనయందుఁగాక కవితృశక్తి యందే ఐక్యము పొందవలెను. అటులకానికవిత హృద్యము కాఁజాలదు.

"రసోపాసన"యందు శృంగార మొక్కటే రస మని శ్రీగోపాలరావుగారు సమర్థించిరి. ఈమతము నీ వఱకు భోజదేవుఁడు శృంగారప్రకాశమున నిరూపించి యున్నాఁడు. ఒకమాదిరిగ రూపగోస్వామి కూడ తన యుజ్జ్వలనీలమణియం దీనివిషయమునే చెప్పియున్నాఁడు. శృంగార-వీర-శాంతరసములు క్రమముగ సృష్టి-స్థితి-లయములకుఁ గారణము లనునదిమాత్ర మిందలి నవీనసిద్ధాంతము. ఆలంకారికసమయవిలక్షణముగ నిందు రసము నాయకనిష్ఠమనియు, వీరరసమనునది యుద్ధవీర మొక్కటే యనియు, రౌద్ర మద్దానియందే అంతర్భ వించుననియు నిందలి మఱికొన్ని నవ్యసిద్ధాంతములు. వాని యనుభవసిద్ధత్వాసిద్ధత్వములందు పండిత హృద యమే ప్రమాణము.

"మన్మథోపాసన" యందు

"విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే."

అను గీతాబోధము చక్కఁగ వివరింపఁబడినది.

పైవిషయములం బట్టి "ఈగ్రంథమం దేమేమో క్రొత్తపోకడలు పోయితి ననుకొనుచున్నాను" అను గ్రంథకర్తృస్వవిషయవాక్యము సార్థకమైన దని చెప్ప వచ్చును. కవియు స్వప్రయత్నమునఁ గృతకృత్యుఁ డైనాఁడు. ఈగ్రంథమునకు ఉదారులగు శ్రీ కాశీనా థుని నాగేశ్వరరావుపంతులుగారు విస్తృతమును, విద్వ జ్జనోపయోగకరమును నగు "కావ్యపరిచయము" ను జత పరిచినారు. వ్యాఖ్యానరూపమగు నా పరిచయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూలమునకుఁ దగి మూలమునకు శోభావహమయి యున్నది.

భాషాశాస్త్రసంయోగమునను, అపూర్వ భావ గరిమమునను వెలయు నీ నూతన కృతి ఆంధ్రభాషా యోష కొక యలంకారమై ఆంధ్రసోదరుల గౌరవాభిమానములకుఁ బాత్రమగుఁగాక !

—బులుసు వేంకటరమణయ్య

---

## పారిజాతాపహరణము

ముక్కు తిమ్మనార్యవిరచితము; సురభివ్యాఖ్యా సహితము.

వ్యాఖ్యాత: విద్వాన్ శ్రీమూసి రామమూర్తి శాస్త్రిగారు, ఆంధ్రపండితులు, శ్రీమహారాజసంస్కృతకళాశాల, విజయనగరము. డెమ్మీ. ౩౬౪ పుటలు. వెల రు. ౩ లు. ప్రకాశకులు; వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు; ౨౯౨, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

వ్యాఖ్యానాపేక్ష కల యాంధ్రప్రబంధములలో పారిజాతాపహరణ మొకటి. సరసముగ నీప్రబంధమున సహృదయులు స్వయంకృషి సల్పి యెన్నియేని అపూర్వవిషయములను బయలుపఱుపవచ్చును.

పారిజాతాపహరణమునకుఁ బ్రాచీనములగు వ్యాఖ్యానము లలభ్యములు ఈనడుమనే శ్రీ నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు (బి. ఏ.) 'పరిమళోల్లాస' మను వ్యాఖ్యను రచించి కొన్నికవిహృదయముల నందు నెల్లడించియున్నారు. ఈ 'సురభి' యందును, మఱి కొన్ని విశేషములు ఎక్కువగఁ గూర్పఁబడియున్నవి. విపులముగనున్న వ్యాకరణవిశేషములును, విశేషార్థములును వ్యాఖ్యను వన్నెఁగూర్చుచున్నవి. శ్రీశాస్త్రిగారు అలంకారములనుగూడ లక్షణసమన్వయపూర్వకముగ వివరించినచో నింకను మిక్కిలి శోభ వాటిల్లియుండెడిది.

ఈ గ్రంథమందలి నాయకుఁడగు శ్రీ కృష్ణుఁడు ధీరోద్ధతుఁడని "భూమిక" యందుఁ గలదు. కాని యందులకుఁ దగిన ఆధారములు లేవు. ధీరోద్ధతగుణములగు దర్ప, మాత్సర్య, చంచలవృత్తి, వికత్థనత్వ, అహంకారము లిందు ముఖ్యములు. ఇంక నిశ్చింతత, కళాసక్తత, సుఖము, మార్దవము మొదలగు గుణములే కానవచ్చుటచే శ్రీకృష్ణుఁడు ధీరలలితుఁ డనుట ఉచితము. ఇట్లే యిందలి నాయికయగు సత్యభామ ధీరాధీర అనుటకంటె ధీరయనుటయే లెస్స. ఆమెయొక్క అధీరత యిందుఁ గానరాకున్నది. ఆమెయేమైనను టక్కరితనము, ఈసు కారణములు కాని యధైర్యము కాదు. "సరిగమపధనిససంజ్ఞస్వరంబుల" [౧-౪౮] అనుదాని వ్యాఖ్య "స, రి, గ, మ, ప, ధ, ని, స అనుసంజ్ఞలుగల స్వరములచేత" అని కలదు. స, రి, గ, మ, ప, ధ, ని అని స్వరము లేడుమాత్రమే కలవు. "స, రి, గ, మ, ప, ధ, ని, ససంజ్ఞస్వరంబుల" అని మూలము నర్థముచేసికొనవలెను. అటులుకాక స, రి, గ, మ, ప, ధ, ని, స సంజ్ఞ స్వరంబులు" అని పదవిభాగమునొనర్చినచో వేఱొక "స" స్వరము నంగీకరింపవలసివచ్చును.

క. పూనుకొని మేలుకీళ్లకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో
యానరకాసురదమనుఁడు
తా నెఱుఁగఁడో భోజకన్య తా నెఱుఁగదొకో.
[౧-౯౧]

"ఇందలి 'తాను' పదములు నామ పునర్గ్రహణంబున నామకుఁ బరముగ నభిహితంబులయ్యె" నని సురభి. కాని యిచ్చట నవి సార్థకములే. వీనివలననే ఎత్తిపొడుపు వ్యక్తమగుచున్నది. మఱియు భీష్మకరాజపుత్రియగు రుక్మిణి క్షత్రియరమణి కుచితమగురీతిని ప్రవర్తింపలేకపోయిన దనునర్థ మీ "తాను" పదము వల్లనే ద్యోతితమగుచున్నది.

"మఱచెనో కాక రుక్మిణీమాయఁ దగిలి" [౧-౯౪]

"రుక్మిణీమాయన్ = రుక్మిణిసంబంధమగు మాయయందు" అని సురభి. ఇచటఁ దత్పురుషకంటెఁ గర్మధారయమే రసానుగుణము. రుక్మిణియను మాయ అని రూపకము నంగీకరించుటే ఉచితము. "కార్కొన్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కటికిచీఁకటిమేను లొప్పు తెంబు నురిసినవవగండ్లసంపు
లనఁగ" [౨-౩౭] అనుపద్యమున ఉత్ప్రేక్షోల్లేఖము లలంకారములని వ్యాఖ్య. ఇచట ఉత్ప్రేక్షలే కాని ఉల్లేఖములు లేవు. ఇచటి "అనఁగ" పదము లుత్ప్రేక్షా వాచకములు. అవి లేనిచో నిచట ఉల్లేఖ ముండ వచ్చును. అందు ఉపమానోపమేయములకు అభేద ముండును. "అనఁగ" కు మాఱుగ "అనుచు" అని యున్న నిది యుల్లేఖము కాఁగలదు. ఇట్టివి అందందు మిక్కిలిస్వల్పముగఁ గలవు. ప్రమాదపతితములగు నట్టి వానిని శ్రీశాస్త్రిగారు ద్వితీయముద్రణమునఁ జక్క చేసికొనఁదగును.

శ్రీ రామమూర్తిశాస్త్రిగారు యువకులైనను పాండిత్యమునఁ బ్రథితులు. ఈ "సురభి" వారి పాండిత్యమును పరిమళింపఁజేసినది. వ్యాఖ్యయందలి విశేషములు పండితులగువారికిని బహూపకారకములు.

మూలము నర్థభావవిశేషములను అనాయాసముగఁ దెలిసికొనుటకు మిక్కిలి ఉపయోగించు నీ "సురభి" వ్యాఖ్యను, వాఙ్మయాభిమానులను పండితులును, విద్యార్థులును పఠించి శ్రీశాస్త్రిగారి పరిశ్రమకు సమగ్రమగు సాఫల్యమును కూర్చుట ఎంతయు నుచితము. శ్రీశాస్త్రిగారు తక్కినప్రాచీనప్రబంధములకుఁ గూడ నిట్లే వ్యాఖ్యలను రచించి భాషామోమయొడఁ గలభక్తిని వెల్లడింతురుగాక!

—బులుసు వేంకటరమణయ్య

## పూలమాల

రాయలుసైజు, ౪౦ పుటలు. వెల రు. ౦-౬-౦ లు; గ్రంథకర్త్రి: శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు, మెయిన్‌రోడ్డు, విశాఖపట్టణము.

అభినవాంధ్రకవిత్వపద్ధతులును, ఖండకావ్యరచనావిధానములును యువతీమణులనుకూడ నాకర్షించి వారిచే చక్కనిభావములతో గూడినపద్యములను రచింపజేయుచున్నవనుట కిది ప్రబలనిదర్శనము. విశుద్ధగ్రాంథికశైలిలో మనోహరభావము లీపద్యములయందు దొలుకాడుచున్నవి. కాత్యాయని, చందమామ, లక్ష్మి, గుమ్మడు, కవిత, ఆంధ్రభూమి మొదలగువంశముల మీద సుందరములగు పద్యము లిందు గాననగును. శ్రీయుత అబ్బూరిరామకృష్ణరావుగారు దీనికి పీఠిక వ్రాసి ఎంతయు ప్రశంసించినారు. —గ. స.

## వివేకానందసందేశము

క్రౌనుసైజు, ౩౦ పుటలు. వెల రు. ౦-౨-౦, గ్రంథకర్త: శ్రీయుత కూచి నరసింహంపంతులుగారు.

వివేకానందస్వాములవారు అభినవభారతయువకుల కుపదేశించినవిషు లిందు సుందరవ్యాసములలో సంక్షేపముగ తెలుపబడినవి. పాశ్చాత్యవ్యామోహమును వీడి భరతఖండమునకు ప్రఖ్యాతి గూర్పగోరువారెల్లరును దీనిని పఠించితీరవలెను. శైలి పామరులకు గూడ సులభమైనది. విశాఖపట్టణముజిల్లా యలమంచిలి దరి మేలుపాకయందలి వ్యాసకుటీరమువారు దీనిని ప్రకటించినారు. —గ. స.

# గ్రంథస్వీకారము

### స్వాగతము (ఆత్మపరీక్ష)

అనువాదకులు: ఎర్నేని సుబ్రహ్మణ్యముగారు, అంగలూరు, క్రౌను ౧౦౦ పుటలు, వెల రు. ౦-౪-౦.

### జీవరసాయనచికిత్సావిధానము

(ప్రథమభాగము)

గ్రంథకర్త: తోలేటిపేరరాజుగారు, నర్సాపురం, క్రౌను ౧౫౧ పుటలు, వెల రు. ౧-౦-౦.

### సహకారవస్తు నిలయోద్యమము

గ్రంథకర్త: దిగవల్లి వేంకటశివరావుగారు, బెజవాడ, క్రౌను ౭౭ పుటలు, వెల రు. ౧-౦-౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## తేనెపట్టు

(పాలవెల్లితో(బుట్టువు)

మండపాక పార్వతీశ్వరశాస్త్రి రచితము, ప్రకాశకులు: దేవరాజు వేంకటకృష్ణారావుగారు, బరంపురము (గంజాము). క్రౌనుసైజు, పుటలు ౮౮, వెల ౮ అణాలు.

---

## టాలుస్టాయికథలు

క్రౌనుసైజు, పుటలు ౮౬, వెల ౮ అణాలు. గ్రంథకర్త: టి. లక్ష్మీపతిగారు, బి. ఏ., యల్. టి. ధర్మవరము.

---

## రంతిదేవుడు (వచనము)

క్రౌను, ౧౧౪ పుటలు. వెల. ౦-౮-౦. గ్రంథకర్త: శ్రీబూమారు రామానుజులు రెడ్డిగారు, తెలుగు పండితుడు, బోర్డు హైస్కూలు, తిరుత్తని.

ప్రకాశకులు: ఏ. యన్. వెంకటేశ్వర్ అండు బ్రదర్సు, ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, తిరువల్లిక్కేణి, మదరాసు.

---

## సతీసక్కుబాయి

(నాటకము)

గ్రంథకర్త: సోమరాజు రామానుజరావుగారు ప్రకటనకర్త: కురుమూరి సుబ్బారావుగారు, సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ, డెమ్మీ ౧౧౭ పుటలు, వెల రు. ౦-౧౨-౦ లు.

---

## దూదేకుడు

గ్రంథకర్త: ఆలపాటి కామేశ్వరరాయకవిగారు, సుబ్రహ్మణ్యముపేట, విజయనగరము, క్రౌను ౯౨ పుటలు, వెల రు. ౧-౦-౦.

---

## మహర్షి దేవేంద్రనాథఠాకూరిగారిజీవిత చరిత్ర

అనువాదకుడు: ఆకురాతి చలమయ్యగారు, పిఠాపురము, క్రౌను ౩౬ పుటలు, వెల రు. ౦-౮-౦.

---

## ఏకాదశీ మహిమా సర్వస్వము

గ్రంథకర్త: కేసిరాజు వేంకటసుబ్బరాయకవిగారు, రాజమహేంద్రవరము, క్రౌను ౯౨ పుటలు, వెల రు. ౦-౫-౦.

---

## సూతపురాణము-చతుర్థాశ్వాసము

శ్రీ కృష్ణజీవితము

కృతికర్త: త్రిపురనేని రామస్వామిచౌదరిగారు, సూతాశ్రమము, తెనాలి, డెమ్మీ ౧౪౨ పుటలు, వెల రు. ౧-౦-౦.

---

## ఉత్తరరామ చరిత్రము

అనువాదకులు: కీ. శే. వావిలాల వాసుదేవశాస్త్రిగారు, వావిలాల వేంకటశివావధాని (మచిలీపట్టణము) గారిచే బ్రకటితము. డెమ్మీ ౧౪౦ పుటలు, వెల రు ౧-౦-౦.

---

## కవిత్రయ కవితా విమర్శనము

గ్రంథకర్త: సజ్జము వేంకట సుబ్బరామయ్యగారు, నెల్లూరు, క్రౌను ౧౯౯ పుటలు, వెల రు ౧-౦-౦.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౧) కవితాకాంతా విహారము

(౨) చిత్రప్రశంస

గ్రంథకర్త: వాజపేయయాజుల రామసుబ్బా రాయుడుగారు, కొల్లాపురం, జటప్రోలు సంస్థానము, కర్నూలుజిల్లా, డెమ్మి ౧౨ పుటలు, వెల తెలియదు.

---

రామాయణసంగ్రహము

గ్రంథకర్త: పత్రివిశ్వేశ్వరశాస్త్రిగారు, కొల్లాపురం. జటప్రోలుసంస్థానం, కర్నూలుజిల్లా. డెమ్మి ౨౪ పుటలు, వెల రు. ౦-౪-౦.

---

సత్యహరిశ్చంద్రచరిత్రము

గ్రంథకర్త: కారుపల్లి శివరామదాసుగారు, కల మంగలంపోస్టు, సేలంజిల్లా, డెమ్మి ౬౫ పుటలు, వెల రు. ౦-౧౨-౦.

---

రామాయణకథాసంగ్రహము

కంచనపల్లి కనకమ్మగారిచే విరచితము. క్వీన్ మేరీకళాశాల, మదరాసు, క్రౌను ౨౬ పుటలు, వెల రు. ౦-౬-౦.

---

వ్యవహారకోశము

(ఇంగ్లీషు తెలుగు పారిభాషిక నిఘంటువు)

కర్త: దిగవల్లి వేంకటశివరావుగారు, బెజవాడ. క్రౌనుసైజులో ౨౪౦ పేజీలు, వెల రు. ౧-౪-౦.

---

భాసకవి

(కవి, కావ్యవిచారాత్మకమైన కన్నడగ్రంథము)

రచయిత: ఎ. ఆర్. కృష్ణశాస్త్రిగారు,యం.ఏ.

ప్రకాశకులు: కర్ణాటక సంఘము, సెంట్రల్ కాలేజి, బెంగుళూరు. క్రౌను ౧౬౫ పుటలు, ఆంటిక్ కాగితములు, చక్కని అచ్చు, క్యాలికోబైండు.

# పత్రికలు

చంద్రిక

(సచిత్ర మాసపత్రిక)

ప్రతినెల ౧౫ - వ తేదిని వెలువడును. చందా సంవత్సరమునకు రు. ౪. చెన్నపురి ఆర్. వెంకటేశ్వర అండుకంపెనీవారి యాజమాన్యమున వెలువడుచున్నది. విఖ్యాతలేఖకుల వ్యాసములును, త్రివర్ణ, ఏకవర్ణచిత్రములును వెలయ ప్రథమసంచిక భావ సంవత్సరాదిని ఆరంభమయినది.

---

నవ్వులరాణి

(హాస్యరస మాసపత్రిక)

సంపాదకులు, ప్రకాశకులు: కొల్లిపర కోటీశ్వర లింగంగారు, రాబర్టుసన్ పేట, మచిలీపట్టణము. ఏడాది చందా ఒకరూపాయి. ప్రతినెల ౧౫-వ తేదీకి వెలువడును.

---

మాధురి

(మాసపత్రిక)

సంపాదకులు, ప్రకాశకులు: పి. వెంకటరామయ్యగారు, తెనాలి. సంవత్సరానికి ౧౧ అణాలచందా. డిటెక్టివు, హాస్యరచనలకు ఈపత్రిక తావొసంగును. పద్యములకు తావు లేదు.

---

హరిజన

(మాలమాదిగలపక్షమున వెలువడు మాసపత్రిక)

సంపాదకులు: యం. సుబ్బారావుగారు. హరిజనుల నైతిక, ఆర్థిక, సారస్వత, సాంఘికాభివృద్ధికి నువయుక్తవ్యాసములు, అస్పృశ్యతానివారణవిషయక వ్యాసములు ప్రచురింపబడును. సంవత్సరమునకు చందా రు ౧-౮-౦.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## భూకంపము – హైందవవైజ్ఞానికులు

వరాహమిహిరుడు రచియించిన బృహత్సంహితయందు భూకంపవిషయ ప్రస్తావము చటనచట కలదు. అందు ౩౨-వ అధ్యాయమున విశేషముగ నున్నది. వరాహమిహిరుడు క్రీ.శ. ౫౮౭-వ సంవత్సరమువరకు జీవించినాడు. ఇతని రచనము విజ్ఞానకోశము. తత్పూర్వవైజ్ఞానికులు భూకంపమును గూర్చి పేర్కొనినవిషయముల నాత డందు సంధానించినాడు. తద్వ్యాఖ్యాత, భట్టోత్పలుడు ఆయా గ్రంథకర్తల వాక్యములనే యుద్ధరించి వివరించినాడు. దానిననుసరించి కే. పి. జయస్వాలుగారు మాడర్న్ రివ్యూ (మార్చిసంచికలో) నిట్లు వ్రాసిరి:

"భూకంపములకు పౌరాణికులు పేర్కొనిన కారణములు కాక వైజ్ఞానికులు పేర్కొనినవి కొన్ని కలవు.

౧. వాయుసంఘట్టనము : వాయుమండలముల పరస్పరసంఘర్షణముచే భూకంపము భయంకరధ్వానముతో సంభవించును.

'అనిలోఽనిలేన నిహతః
క్షితౌ పతన్ సస్వనం కరోత్యన్యే'
(బృహత్సంహిత, ౩౨, ౨.)

ఇది వసిష్ఠునిమతము.

తద్వాక్యములు :

'యదాతు బలవాన్వాయు
రంతరిక్షానిలాహతః ;
పతత్యాశు సనిర్ఘాతో
భవే దనిలసంభవః.
తస్య యోగా న్నిపతత
శ్చలత్యన్యా హతా క్షితిః ;
సోఽభిఘాతసముత్థ స్స్యాత్
సనిర్ఘాతమహీచలః.

(భట్టోత్పలుడు)

౨. పరాశరమతము కేవలము విభిన్నము. తన్మతానుసారము గ్రహాకర్షణసంచరణవైపరీత్యములు భూకంపకారణములు.

"అర్క-చంద్రగ్రహణ, గ్రహవికృతచారజాంశ్చ కంపా నాహుః"

౩. భూగర్భమునందలి అగ్ని వేగము కారణమని అందరు నొప్పుకొనుచున్నారు.

౪. అతివృష్టివలనను కలుగునని సర్వసమ్మతము.

౫. భూగర్భజలవేగమును కారణ మగును.

ఇట్లు సంప్రాప్తమగు భూకంపముల నాలుగు రకములుగ హైందవవైజ్ఞానికులు విభజించినారు.

౧. వాయవ్యము : పరాశరు డిట్టికంపము గ్రహాకర్షణవైపరీత్యమువలన గలుగునని చెప్పినాడు. ఇతరులు వాయుసంఘట్టనమువలన నని యనిరి. కాలము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశము; హాని-వీనిపరిమితినిబట్టి యిది మిగుల నపాయ కరము.

౨. పాతాళ (ఆగ్నేయ)ము :— భూగర్భము నందలి యగ్నివేగమువలన నైనయది. ఇదియు నపాయ కరము.

౩, ౪. ఇవి క్రమముగ ఐంద్రము, వారుణము నను నామములు గలవి; అతివృష్టి, ఆంతర జలవేగము వలన నయ్యెడివి.

ఇందు కడపటిది- వారుణము - శుభసూచకము. తక్కినవి అశుభసూచకములు.

వాయవ్యము : ఇది ఏడునక్షత్రములయందు కలుగును.

" చత్వా ర్యార్యమ్ణాద్యా
న్యాదిత్యం మృగశిరో౽శ్వయుక్చేతి,
మండల మేత ద్వాయ
వ్యమస్య రూపాణి సప్తాహాత్. "
( ౩౨—౮. )

దానిలక్షణములు సుమారు ఏడుదినములా ముందు నుండియే కనుపడును. ఆకాశము ధూమ్రవర్ణ మగును. అంతరాళము దుమ్ముతో నిండును. చెట్లను పడద్రోయు సుడిగాలులు వీచును. సూర్యకిరణములు కాంతిహీన ములు, దుర్బలములు నగును (రవిరపటుకరావభాసీన).

ఇట్టికంపము పంటలను, నీటిని, అడవులను, తోటలను ధ్వంసముచేయును. వాపులు, శ్వాసరోగ ములు, పిచ్చి, జ్వరములు మొదలగువ్యాధులు కలుగును. ధనాభావము సంప్రాప్త మగును (వణిక్పీడా—వణిజాం క్రయవిక్రయజీవినాంచ, వ్యథా పీడా) లలితకళలు, పరి శ్రమలు పాడువారును

ఇది (సామాన్యముగా) కథియావాడు (సౌరా ష్ట్ర), ఢిల్లీ (కురు), దక్షిణబీహారు (మగధ), బుందేలు ఖండ (దశార్ణ), ఆగ్రాప్రాంతముల (మత్స్య) యందు కలుగును.

కొంతవరమతమున ఉల్కాపాతములు, సూర్య పరివేషములు మొదలగు దుర్లక్షణములు అంతర్దేశీయ, రాజకీయ ఉపద్రవముల కుపలక్షణములు.

భయంకరభూకంపమువలన గలిగిన బాధలు సం పూర్ణముగ తొలగుట కారునెలలకాల మగును. వాయవ్య మునకు నాలుగుపక్షము లగును. వాయవ్యకంపము రెండువందలయోజనములు(౧౬౦౦ మైళ్లు) వ్యాపించును.

ఆగ్నేయము : ఇది సంభవించు నక్షత్రములు
" పుష్యాగ్నేయవిశాఖా
భరణీపిత్ర్యాజభాగ్యసంజ్ఞాని,
వర్గో హుతాశభుజో౽యం
కరోతి రూపా ణ్యథైతాని. "
(౩౨ - ౧౨).

ఉల్కాపాతము, దిగ్దాహము, మంటలతో కూడిన సుడిగాలులు దీనికి సూచకములు. దీనివలన అనా వృష్టి, బలాభావము, అంతర్జాతీయవైరుధ్యము, చర్మ రోగములు, కామెల మొదలగునవి సంప్రాప్తము లగు.

ఇది భగల్పురము, మాంఘీర్ (అంగ), బాక్ట్రి య, బదరీనాథమండలము (టంగణ), ఒరిస్సా(కళింగ), బెంగాల్ (వంగ), ద్రావిడదేశము, ఒరిస్సా ఏజెన్సీ (సవర), అశ్మకము లనుదేశముల గలుగును.

ఔడ్ (ఇక్ష్వాకు), కుల్లు (కులూత), పామిర్స్ (తుఖర), బెలూచిస్థాన్ (శిబి), జలంధర్ కాంగ్రా (త్రిగర్త), ఉత్తరబీహారు (విదేహ) మొదలగు దేశముల కూడ కలుగునని పరాశరు డనుచున్నాడు : ఇది ౧౧౦ యోజనములు (౮౮౦ మైళ్లు) వ్యాపించును.

ఐంద్రము (అతివృష్టివలన గలుగునది), వారుణము (భూగర్భజలవేగమువలన గలుగునది): వీనిని గూర్చిన వివరములను పేర్కొనను. (౩౨-౧౬ మొ. ౨౨ వరకు) ఇది కలుగుదేశములలో ఉత్తరబీహారుకూడ కలియునని గుర్తింపవలెను.

మిశ్రకంపములును గలవని వృద్ధగార్గ్యాదు లనిరి. దివారాత్రముల నియతవేళలయం దవి కలుగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దివారాత్రముల పూర్వభాగమున వాయవ్యము, రెండవ భాగమున ఆగ్నేయము, మూడవభాగమున నైంద్రము, నాలవభాగమున వారుణము కలుగును. ప్రమాణబద్ధము కాదని పరాశరు డీమతమును నిరాకరించెను.

హైందవవైజ్ఞానికుల (ముఖ్యముగ పరాశరుడు, తదనుయాయుల) మతానుసారము భారతదేశమున భయంకరములగు భూకంపములు గలుగుచుండెడివి. పర్వతములు పైకుబుకుటయు, క్రుంగుటయు తత్ఫలములు. పురాణములు పేర్కొనుచున్న పర్వతముల ఉత్పత్తినాశములు భూకంపములవలన గలిగినవని పరాశరులు చెప్పిరి."

జయస్వాలుగారు చెప్పినటు లీ విషయము వైజ్ఞానికుల విశేష పరిశోధనమునకు గురి కావలసి యున్నది.

---

## ప్రాకృతజన విద్యాలయములు

శ్రీమతి కిరణబోసు యూరపునందలి దేశముల పెక్కిట సంచారముచేసి అచ్చటి విద్యాలయముల వివరములను సంపూర్ణముగ సంపాదించినది. ఆమె డెన్మార్కునందలి ప్రాకృతజన - ఉన్నతవిద్యాలయము (Folk High School)ను గూర్చి 'ఇండియా అండ్ ది వరల్డ్' అనుపత్రికయం దిట్లు వ్రాసినది:

"ఈవిద్యాలయము డెన్మార్కుప్రాకృతప్రజల కొరకు స్థాపితమయినది. ౧౮౬౪-౬౫ సంవత్సరముల జరిగిన యుద్ధమువలన డెన్మార్కు దివాలాతీయుస్థితికి వచ్చినది. ప్రజలు మిగుల దరిద్రులు, దీనులు నయిరి. మత గురువు, కవి, గొప్పవిద్యావిషయసంస్కర్త యగు గ్రండ్విగ్ అనునాయన అన్యోన్యసాహచర్యముమూల మున జాతీయాధ్యాత్మికప్రవృత్తు లభివృద్ధి నొందుట కుపకరించు నొక విద్యాలయముద్వారమున యువకుల ప్రబోధమును గావింప గోరినాడు. గురువు - పెద్ద - విద్యాలయముననే నివసించి విద్యార్థుల నిరంతర సాహచర్యము కలిగియుండెను. విద్యాలయప్రతిష్ఠాపకుడు విద్యార్థులు మరణ(పర)ముకంటె జీవిత(ఇహ)మునురించిరే విశేషము గనెరుగవలయునను గట్టినియమము నేరుపరిచినాడు. విద్యాలయజీవనము గృహజీవనమువలె నుండినది. పదునెనిమిదేండ్ల మొదలు వయసుగల బాలబాలిక లందు గలరు. శీతకాలమున నైదు నెలలు బాలురును, గ్రీష్మకాలమున నాలుగు నెలలు బాలికలును చదువుదురు. వారికి చేతిపనులు నేర్పబడు చున్నవి. ప్రపంచవ్యవహారముల పరిచయమును, జీవితవిషయములయందు చక్కని జ్ఞానమునలవడుటకు చారిత్రకవిషయములును బోధింపబడును. ఇదే పద్ధతుల ననుసరించిన విద్యాలయములు డెన్మార్కునం దంతటను అనేకము లున్నవి.

ఈవిద్యాలయములు క్రమముగ డెన్మార్కు ప్రజలను సకలవిధముల నుత్తములనుగ నొనరించినవి. నిఖిలప్రపంచముమెప్పును వారు చూరగొనిరి. ఆదికాలమున డెన్మార్కు ప్రాకృతజనుడు మిక్కిలి వెనుకబడి యుండినవాడు; పిరికివాడు; ముడుపునూతివాడు; కలుపుగోలుతనము నెరుగనివాడు. నేడట్లుకాదు, ముందు చూపుగలవాడు; నిత్యోల్లాసము గలవాడు; విజ్ఞాన హృదయుడు; కార్యకౌశలము గలవాడు; కలుపుగోలు దనము గలవాడు. ఈవిద్యాలయములవలన వారు శక్తిసంపన్ను లగుచున్నారు. స్వయంకృషి వారి ఆదర్శ మగుచున్నది; జ్ఞానసంపాదనమునను, పనిపాటలయందును వారి కాసక్తి నీవిద్యాలయములు పుట్టించుచున్నవి.

విద్యాలయావరణమున వారు పెద్ద (భోగి)మంట ను వైచిరి. డెన్మార్కువారు నగరమున నన్నిచోట్లను గ్రీష్మకాల మధ్యస్థమగు రాత్రమున ఈ పండువును జరుపుదురు.

వెలుగును, ఉష్ణమును, పుష్పములను, పంటలను, కూరగాయలను ప్రసాదించుచున్నందున సూర్యున కిది పూజనము; నాటినుండి హ్రస్వములుగా నున్న పవిత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీర్ఘ నిశలపోకకు జ్వాలారూపమగు ప్రస్థానమంగళమును; మరియు శీతప్రబలములు, అంధకారబంధురములు నగు నిశలుగల శీతకాలమునారంభమునకును సూచకము. ”

ప్రపంచ మంతయు విజ్ఞానసంపన్నము, విశేషాభ్యుదయోన్ముఖము నయియున్న ఈ యిరువదవ శతాబ్దమున భారతదేశము ప్రాకృతప్రజలు వెనుకటి డెన్మార్కుప్రజల స్థితియందె యున్నారు. భారతీయులలో పదు నారవవంతుమాత్రమే విద్యావంతులు. వారి లోను విజ్ఞానసంస్కారములు గలవారు చాల తక్కువ. ప్రాకృతజనులెల్లరు విద్యావిహీనులలో జేరినవారే. వారు విద్యావంతులు, విజ్ఞానసంపన్నులు,స్వయంకృషిపరాయణులు, కార్యశూరులు గాక దేశాభ్యుదయమున కిసుమంతయైన నవకాశము కలుగదు. విజాతీయప్రభుత్వ మిందు కుపకరింపమి అనుభవసిద్ధము. ప్రజలయినను డెన్మార్కువిద్యాలయములపద్ధతిని భారతదేశమునం దంతటను విద్యాలయముల ననేకముల నెలకొలిపి ప్రాకృతప్రజలకు విద్యావిజ్ఞానము లలవడజేసి తన్మూలమున దేశాభ్యుదయమునకు దారి దీయు టురవు.

---

## గ్రామఫోనుగతి

చిత్రకుడు తన రచనను పటరూపమున లోకమున నెలకొల్పుచున్నాడు. మరియు నద్దమున తన రూపమును జూచికొని యాకున దాని లిఖించికొని లోకమున కొసంగుచున్నాడు. శిల్పి దారువున, లోహమున, పాషాణమునగూడ తన చాకచక్యమునకు స్థిరత నొసంగుచున్నాడు. మరియు నాతడు తన నీడ జూచికొని స్వరూపశిల్పము నొనరించికొని సంతుష్టు డగుచున్నాడు. కవి తన చాకచక్యము నక్షరరూపమున వెలయించుచున్నాడు. కావ్యరూపమున దానికి లోకమున స్థిరత గల్పించుచున్నాడు. తన హృదయమునే కలముమొనతో జెక్కి కలకాలము లోకమున నెలకొల్పుచున్నాడు. వీరు మువ్వురు నెక్కడ నున్నను వీరి ప్రతిభ రవికాంతివలె ప్రపంచవ్యాప్తి నందుచున్నది. వీరి రూపము లద్దమునవలె జగత్తున ప్రతిఫలించుచున్నవి. అందువలన వీరు కాలమునుగడచిన దిట్టలయినారు; దేశమును గ్రమ్మిన ధీరు లయినారు. ఏనాటనో వారి వేళ్ల గదలిన కదలికలు నేటికిని లోకమున సజీవములయి చలించుచున్నవి. నేటి సభాభవనముల నాటి చిత్రకు లున్నారు. నేటి పట్టణముల నాటి శిల్పు లున్నారు. నేటి పుస్తకాగారముల నాటి కవు లున్నారు. ఏరీ నాటి గాయకులు? నాడు కరగిన రాలు ఘనీభవించినవి. నాడు చివురించిన మ్రాకులు నేలగలసినవి. నా డల్లికొన్న గాలితరగలు కడలి మ్రోత గలసిపోయినవి. వారు నామమాత్రావశిష్టులై యట్టె యంటుకొనిపోయినారు. కాలప్రవాహమున గలసిపోయినారు. మరపున మాటువడుచున్నారు.

చిత్రకుడు వారి రూపములను చిత్రించి లోకమున కొసంగు గాక, శిల్పి వారి రూపములను జెక్కి జగమున నిలుపునుగాక, కవి వారి రూపగుణములను తీయని పలుకున తిన్నని కలముమొన దీరిచి విడచు గాక, ఏదీ వారి చాకచక్యము, వారి వాఙ్మాధుర్యము, వారి గళసౌలభ్యము, వారి కళాజ్ఞానప్రశస్తి? వారి పట్ల, చేజారిన వస్తువునకై విలపించు బాలకునట్లు, లోకము వృథగా చింతించుచు నిలువవలసివచ్చినది.

త్యాగరాజులోని కవి నెఱుగుదుము గాని గాయకు నెఱుగము. నారాయణదీక్షితునిలోని కవి నెఱుగుదుము గాని గాయకు నెఱుగము. ఈ కృతులే, ఈ తరంగములే వారివారి నోళ్ల వెడలుట మనము వినియుండిన మన మెంత యానందింతుమో! ఎంత విరియుదుమో! ఎంత పులకించియుందుమో! ఎంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కరగియుండుమో! ఇట్టి గానమాధుర్యము పుష్పసౌరభము వలె నాటి గాలికెరటాల దొరలిపోయినది.

పూర్వపు రాజులు తీయని వాసనల వెదలవిడచు రోజాపూల వేలకొలది సంతరించి ఎంతో ప్రయాసమున కోర్చి వానిలోని సారమును ఒకటో రెండో చుక్కల గ్రహించి ఆకాలమున దత్సౌరభ మాఘ్రాణించి యానందించెడివారు. ఆ పుష్పసారము లే నానాట నత్తరువులుగ లోకమున వెలసి యపురూపము లయిన పూల తావులు గూడ మన మన్నివేళల ననుభవింప నవకాశ మొసంగుచున్నవి. కాని యారాజసభల నానాట జల్లిన గానసార మేదీ? ఆ పాటయత్తరు వేదీ? అచటనే ఒలికిపోయినది. అచటనే ఇంకిపోయినది.

తావుల గ్రహించి వలయునప్పుడు వెదలవిడచు సాధనము మనకు లభించినప్పుడు శబ్దలేశమును జిక్కబట్టి వెడల విడచు నుపాయ ముండరాదా యని నానాట బుద్ధిమంతులగు శాస్త్రవేత్త లాలోచించి యాలోచించి తమ జీవితముల వెచ్చించి వెచ్చించి, వెడలిపోవ నంత నసమాన ప్రతిభావంతుడయిన "ఎడిసన్" మహనీయుడు చిన్న సాధనము గనిపెట్టి, కుతుక వెడలినశబ్దలేశమునకు సైతము స్థిరత నొసంగినాడు. అది 'గ్రామఫోను' అను పేర లోకమున వెలసి వ్యాప్తినందుచున్నది. ఈ గ్రామఫోనుమూలముననే గదా, అప్పుడే అంతరించిపోయిన రాచప్ప గంభీరగళనిస్వనము మనము నేడు మనయంగణమున వినగల్గుచున్నాము! దీనివలన తక్కిన మనోజ్ఞకళాప్రతిభావంతులతో బాటు గాయకుడుగూడ స్థిరుడై, నిత్యజీవుడై లోకమున నిలువ గలుగుచున్నాడు. అత్తరువులోని పుష్పసౌరభమువలె గ్రామఫోనులోని గాయకుని చాకచక్యము మన కందుబాటులోనికి వచ్చినది. ఏయే దేశముల నెట్టిగాయకులు గలరో, వారి వారి ప్రజ్ఞ లెట్లుండునో మనకు తెలియుచున్నది. ఇది యనుభవమునకే గాక గానకళాభివృద్ధికిని మిక్కిలిగ తోడ్పడుచున్నది.

కొందరు శబ్దశాస్త్రవేత్తలు గ్రామఫోనుయంత్రమునకు సహజత్వము చాల దని సణుగుచున్నారు; కొరంత గలదని గొణుగుచున్నారు. అత్తరువున నిలచిన పుష్పసౌరభమున కెంత సహజత్వ మున్నదో గ్రామఫోనున గానమునకును అంతటి సహజత్వము లేకపోలేదు. ఇప్పుడిప్పుడు దీని శబ్దయంత్రముగూడ నభివృద్ధి నందుచున్నది. కాలక్రమమున నిందలి లోపము లన్నిటిని సవరింపగల శాస్త్రవేత్తలు గలుగకపోరు.

ఈ సందర్భమున నొక్క యంశము చెప్పవలసియున్నది. ఇప్పుడుగల గ్రామఫోనుప్లేటుల నిర్మాణాగారాధికారులు గానకళాభివృద్ధికి తోడ్పడుటమాని దీని నొక వ్యావహారికవ్యవస్థగ మార్చికొని విన నసహ్యములయిన మాటలను, పాటలను గూడ మారు మ్రోగించుచున్నారు. ముగ్ధలై మోటుపలుకుల విని యెఱుగని తెలుగుముగుదలచెవులలో నీబూతుపాటలు బూరాలయి వినుచున్నవి. ఇందు పాటకు ప్రాధాన్యము తగ్గి మాటకు మొదటి చోటు వచ్చుచున్నది. మర్యాదకు మార్దవమునకు, నాగరికతకు, నడవడికి పేరెన్నికగన్న యాంధ్రుల పడుకటింటిలో పందిటికట్టులో కచేరీసావడిలో గడప ముంగిటిలో నిట్టి వికారపుపాటలు, ఇట్టి వెగటు మాటలు వినబడుట యాంధ్రులకు గౌరవలోపముగాదా! ఇందులకు గ్రామఫోనుకంపెనీవా రెడమిచ్చి తెలుగునాడునకు వట్టియపకీర్తి గట్టిపెట్టుచున్నారు. ఇట్టి చెట్టపాటల గ్రామఫోనున బలికిన యాంధ్రులు ఆంధ్రజాతి కంతకును కళంకము దెచ్చుచున్నారు. ఈపాటనే మనతల్లులకడ, మన యక్కసెల్లెండ్ర కడ మనము జంకు గొంకులేక పాడగలమా? అంతయేల? ఈ పదములు గ్రామఫోనున మ్రోగునప్పుడు మనము తలలెత్తి యెదుటివారి మొగముల నయిన జూడగలమా! గ్రామఫోనులు నానాట నిట్టి బూతులబుంగలయి వాని గౌరవమును పోగొట్టుకొనుచున్నవి.

ధీమంతులయి వెలయు తెలుగుసోదరులారా, మీ రందరును దోడ్పడినగాని గ్రామఫోనునుండి యీదౌర్భాగ్యమును మనము పారదోలలేము. వెంకటస్వామినాయుడుగారి ఫిడేలువాయిద్యమువలె మన కీ బూతుకూత లపురూపము లయినవి కావుగదా! ఏ సంత బయ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టనో, ఏ వెంటకయ్యమునకో ఏ నీతిబాహ్యుల నిలయములనో అవి వినబడుచునే యుండును. అట్లవి వినబడినప్పుడే మనము చెవుల మూసికొని దూరముగ దొలగవలసినదే. అట్టియెడ వానికి స్థిరత నొసంగి వానిని సంగీతమునువలె ననుభవింతుమా? ఆంధ్రు లెల్లరు నౌచిత్యమెరిగి ఇట్టి పాటల ప్లేటులను కొనకుందురుగాక! ఇప్పటికే కొనియుండిన వానిని వెంటనే పగులగొట్టి తెలుగు లోకమునకు మహోపకార మొనరించినవా రగుదురుగాక!

కవి కొకమాట. జానపదుల శృంగారము వర్ణనీయమే. కాని దానిని వర్ణించు కవి సరళహృదయుడయి తన హృదయమున జాతిగౌరవము నిడికొని మరియు నట్టి పదముల రచింపవలెను. భావకు మార్దవమే ప్రాణము; గానమునకు మార్దవమే ప్రాణము. మార్దవబాహ్యములయిన పదములు నీచములు; నింద్యములు. ఇది యెరిగి కవి పదము లల్లినగాని లోకమున కపకారమును జేసినవా డగుచున్నాడు.

గ్రామఫోనుకంపెనీవారి మూలమున గ్రామఫోను గొప్ప చెడినది. సంగీతసౌకుమార్య మడుగంటుచున్నది. గ్రామఫోనన రౌడీపేరు స్ఫురణకు వచ్చుచున్నది. ఇది యంతయు నీబూతుపాటల మూలముననే. వీని ప్రచురణమువలన కంపెనీవారికి లాభలేశ ముండిన నుండుగాక! దాని కాసపడి వా రిట్లు క్రిందికి దిగుట యసమంజసము. ఇట్టిపాటల కెడమిచ్చి యా కంపెనీ వారు పెద్దగాయకులనుగూడ త్రోసిపుచ్చుచున్నారు. వా రించుక గానకళాభిమానము గలవారై తదభివృద్ధికి దోడ్పడవలయునే గాని, బూతుబుంగ తల బెట్టికొని యమ్మికొన జూడగూడదు. వారికిని దేశమునకును శాశ్వతలాభము, శాశ్వతౌన్నత్యము గలుగవలెనన్న వారు గానకళాసక్తి గలిగి మనుట మంచిది.

అచిరకాలమున గ్రామఫోను నిష్కళంకమై, కళాభివృద్ధికి సాధనమై ప్రవర్ధిల్లు గాక యని కోరుచున్నాను.

పూడిపెద్ది వెంకటరమణయ్య



డార్కు రూము

—పి. రాఘవరావు.



పొదరిల్లు

—కే. కృష్ణమూర్తి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మనవి మాటలు

వ్యాససంగ్రహము

శ్రీ గిడుగు వెంకటరామమూర్తిపంతులు గారి సప్తతితమ జన్మదినోత్సవప్రచురణము మున వారి మిత్రులూ, అభిమానులూ, శిష్యులూ సమర్పించిన వివిధవిషయక వ్యాససంగ్రహము' ప్రధానమయింది. తెలుగుదేశానికి



శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు

లయిదింటిలో 'వారి వ్యావహారిక భాషాభిమానముగురించి వారి సప్తతితమజన్మవాసర కొత్తదిన్నీ. తక్కిననాలుగూ పంతులుగారప్పటప్పటా, తెలుగునా, ఇంగ్లీషునా ప్రకటించిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాసాలే. వాటిలో విషయంఅంతా అందరికీ యిదివరకే తెలిసిందే. వాటివిశేషం-మరి అవన్నీ ఒక్కచోట ఒక్కమారు అందమయినపుస్తకాలుగా దొరకడమే.

'వ్యాససంగ్రహం' అట్లాంటిది కాదు; అన్నివిధాలా కొత్తదనం కలది. దాంట్లో మొదటి నూటఅరవయినాలుగుపుటల్లో ఇంగ్లీషువ్యాసాలు పద్నాలుగూ, తర్వాత మున్నూటడభ్భయిఒక్కపుటల్లో తెలుగు వ్యాసాలు ముప్ఫయిమూడూ ఉన్నవి. అంతు కాగితమూ, అచ్చూ,బైండూ, పరిమాణమూ అన్నీకలిసి సంపుటం బాహ్యస్వరూపం అందంగా, ఘనంగా, ఉద్దేశించినకార్యానికి తగిందిగా ఉంది.

శ్రీ పంతులుగారు 'గ్రాంథిక భాషాభిమానులు తప్పతోవను ప్రవేశపెట్టి అదే సంప్రదాయసిద్ధమైన ఋజుమార్గమనే భ్రమతో వెర్రిపరుగు లెత్తిస్తూఉన్న భాషాస్రవంతిని ప్రజాసమ్మతమై, సహజమై, సరళమై ఉండేమార్గములో పెట్టడానికి భగీరథప్రయత్నము చేసి తమ ఉద్యమము తమకళ్లయెదుటనే విజయముపొందే భాగ్యమును పొందిన' వారు. వారు దానివలననే ఆంధ్రహృదయమున, ఆంధ్రవాఙ్మయమున, ఆంధ్రచరిత్రయందు లబ్ధప్రతిష్ఠులయినారు. వారినామం తదుద్యమానుకూల ప్రతికూల పక్షములవారి కుభయులకూ నిరంతరమూ స్మర్తవ్యమూ, మంతవ్యమూ అయింది. సురాసురులకు విష్ణు దేవుని నామంవలె. అయినా, ఈ 'వ్యాస సంగ్రహము' 'వర్తమానాంధ్ర (వ్యావహారి కాంధ్ర)భాషాభిమానులూ', 'ప్రతిభావంతులూ' 'ఐన పరిశోధకులూ, విద్వాంసులూ, పండితులూ, కవులూ వివిధవిషయములను గూర్చి రచించి ఆదరానురాగములతోను, భక్తిగౌరవములతోనూ' 'శ్రీపంతులుగారి కృషిని అభినందిస్తూ' 'ఏకముఖముగా వారికి సమర్పించినకాన్క'కాబట్టి 'లౌకికభాషాదేవికి అమూల్యాలంకార'మైన ఇది వారికృషికి ఒక పాటి 'విజయధ్వజముకూడాను' అవుతుంది. 'భక్తితోనిడిన పత్రపుష్పఫలతోయాలు ప్రశస్తా' లనికదా గీతావాక్యము.

మహాపురుషుల విజయ 'స్మృతిచిహ్నా' లగు ఇటువంటి సంపుటాలలో ప్రకటించేవ్యాసాలు,సంపుటము ఎవరికి సంబంధించిందో వారొనరించిన కార్యాలయందలి గుణదోషాలను చర్చించి వాటి గొప్పతనాన్ని బయలుపెట్టేవిగా ఉండడం ప్రశస్తం. అట్లాటి సంపుటం ఆమహాపురుషుని నిజమయిన స్మారకచిహ్నం అవుతుంది. కాక వ్యాసాలు వారు'ఏయేవిషయములలో పరిశ్రమ చేసినారో వాటికి సంబంధించేటట్టు ఉండేవి' అయితే కొంత కొంతమేలే. కాని యీసంపుటంలో పైరెండు రకాలూకాని వ్యాసా లున్నవి.

ఈసంపుటంలో ఇంగ్లీషువ్యాసాలు ముందుగాఉన్నవి. ఇది సముచితంకాదు. శ్రీపంతులుగారు తెలుగు నుజ్జీవింపజేశారు. దానివల్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలుగువాఙ్మయానికి వికాసం కలిగేఅవకాశం ఏర్పడింది. దాన్ని పురస్కరించుకునే యీ సంపుటం పుట్టింది. కాబట్టి దీంట్లో తెలుగు వ్యాసాలకే అగ్రస్థానం ఉండవలెను. తక్కిన భాషలవాటికి స్థానం తర్వాత. అసలు ఇంగ్లీషు వ్యాసాలు ప్రత్యేకం సంపుటంగా ప్రకటించవలసినవి. మరిన్ని తెలుగువారు కొందరు, తెలుగు మొగమే ఎరుగనివారివలె, ఇంగ్లీషులోనే వ్యాసాలు వ్రాశి ఊరకుండి పోయినారు. ఇద్దరుమాత్రం తెలుగులోకూడా వ్రాశి అదికూడా తెలుసు ననిపించుకొన్నారు. తెలుగువారు తెలుగునుగూర్చిన వ్యాసాలు తెలుగులోనే వ్రాయవలెను. ఇంగ్లీషులో వ్రాస్తే ఇంగ్లీషురాని తెలుగువారి కేమి తెలుస్తుంది? ఈచర్చవల్ల ఇపుడు లాభంలేదు. ఉన్నవాటి సంగతిని ఇక చూచుకోవలెను.

తెలుగుభాషలోని 33 వ్యాసాల్లో ౮ పద్యవ్యాసాలూ, ౨౫ గద్యవ్యాసాలూను. గద్యవ్యాసాల్లో, శ్రీ రామమూర్తి పంతులుగారి కృషిని ప్రశంసించేది ౧, సందేశం ౧, నాటిక ౧, ప్రహసనం ౧, కథ ౧, చారిత్రకాలు ౨, వైజ్ఞానికాలు ౨. తక్కినవి భాషాసాహిత్యాలకు సంబంధించినవి. ఈవ్యాసాల్లో అగ్రస్థానం పంతులుగారి కృషిని ప్రశంసించేది కాబట్టి, 'శ్రీరామమూర్తికి తొలిజోహారు'ది. పద్యవ్యాసాల్లో పంతులుగారిని ప్రశంసించేవి 3. తక్కింది, పంతులుగారి కృషికి సంబంధించింది కాకపోయినా, చాలా హృదయంగమంగా ఉంది. ఇది 'కాంక్ష' అనేది. ఇంగ్లీషు భాగంలోని ౧౮ వ్యాసాల్లో (వీట్లో నాలుగు విదేశీయులవి.) పంతులుగారి కృషిని ప్రశంసించేవి ౨, చారిత్రకాలు 3, బౌద్ధశిల్పానికి సంబంధించింది ౧. తక్కినవి భాషావాఙ్మయాలకు సంబంధించినవి. సంపుటంలో వ్యాసాలన్నీ పేరుగల పెద్దలు వ్రాశినవే. వ్యాసాలకూ, సంపుటానికీ పరస్పరం గౌరవప్రతిష్ఠలు బాగా ఏర్పడ్డవి.*

తెలుగుతల్లి చిరకాలదాస్యాన్ని తొలగించిన మహాపురుషుణ్ణి, శ్రీరామమూర్తి పంతులుగారిని, ఈవిధంగా పూజించినవారు ధన్యులు. ఇతరులుకూడా అమూల్యమయిన ఈ 'వ్యాససంగ్రహము'ను నిర్ణయింపబడిన స్వల్పమూల్యానికి విలిచి తద్వారా శ్రీపంతులుగారిని యథాశక్తి పూజించి ధన్యులు కావలెను. ఇది పునఃపూజ. శ్రీ పంతులుగారుద్ధరించి నెలకొల్పిన వ్యావహారికపు తెలుగును అందరు ఆదరించి దానికి స్థైర్యాన్నీ, వ్యాప్తినీ సంపాదించడమే ఆయనకు తొలిపూజ. అయినా తొలిపూజతోపాటు పునఃపూజా విధిగా చేయవలసిందే. అది లోకాచారం కూడాను.

---

* ఈ సంపుటంలో అమూల్యమయిన వ్యాసాలు అనేకాలు. వాటివివరాలూ, విలువా ప్రత్యేకంగా తెలుసుకోవలసినవి, ఆపని మరొకమారు. —సం. భారతి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### కీర్తికాయులు

### కపిస్థలము కృష్ణమాచార్యులుగారు

పండిత వంశమున, పండిత గ్రామణి రంగాచార్యులకు తనూజులై, స్వయము పండితులై మించిన యీ మహాయశుని యతర్కితోపనత మరణవార్త ఆంధ్రప్రపంచమునకు



కీ. శే. కపిస్థలము కృష్ణమాచార్యులుగారు

హృదయవిదారణమగుచు వినవచ్చినది. ఈ భాషాసేవకునికయి యిప్పట్ల మనసు కలగని భాషాసేవకు డుండడు.

కృష్ణమాచార్యులు గారు ఆంగ్లాంధ్ర గీర్వాణములయందు ఆరితేరినవారు. బాల్యముననే వీరిని సరస కవితాకామిని వలచి చేపట్టినది. రసార్ణవతరంగభాణము, విలాపతరంగిణియు వీరి సరసకవితామాధురిని నిరూపింపజాలును. మందారవతి వీరి చంపూ రచనము. ఈకావ్యములందు వీరి కవితాప్రతిభలు ప్రతిబింబించుచున్నవి. జ్యోతిశ్శాస్త్రమునను వీరు గట్టుదాకిరి. భారతి, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలమూలమున వీరి పాండిత్య ప్రకర్షను తెలుగుదేశ మెరిగి యున్నది.

తొలినుండియు వీరికి విద్యార్థిమండలితో పరిచయ మెక్కువ. వీరి శిక్షణమున పలువురు సంస్కృతాంగ్ల విద్యార్థులు వన్నెమీరిరి. విద్యార్థులపై ఆచార్యులుగారి కెక్కుడాదరము. విద్యార్థులలో విద్యార్థియై అనారతము వారిమేలునే కోరుచు, వారి భక్త్యాదరములను చూరగొనిరి.

ప్రవచన, రచనల పలురీతుల నిట్లు భాషాసేవ యొనరించి, దేహము చాలించిన యీ మహాయశునికై భాషాసేవక ప్రపంచము మిక్కిలిగ వ్యసనపడగలదు.

పుట్టినవానికి గిట్టుట తప్పదు. గిట్టినవానికి పుట్టుకయు తప్పదు. అగుట నీ యపరిహార్యార్థమున కూరడిల్లుట పాడి.

భగవంతు డాచార్యులుగారి యాత్మకు శాంతి నొడగూర్చు గాత!

---

### పాతపాటలూ, పిట్టకథలూ

కొంతకాలంనుంచీ భారతిలో ప్రకటించడం మానివేశిన పాతపాటలూ, పిట్టకథలూ మరల ప్రకటించడం ఆవశ్యకమని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఆమధ్య భారతిలో చిన్నపిల్లలపాటలూ, కథలూ వేశారు. ఈవిధముగానైనా ఇవి ఉద్ధరింపబడు తున్నవని సంతోషిస్తూంటే ఏకారణంవల్లనో వారు వాటిని ప్రకటించడం విరమించుకొన్నారు. భారతి వంటిపత్రికలోనే ప్రాచీనపదములకూ కథలకూ చోటు లేకుండా పోయిందికదా అని విచారించవలసిఉన్నది.'

అని శ్రీ చింతాదీక్షితులుగారున్నూ[౧]

'ఈమధ్య భారతివారు యీ (పాత) పాటలను భారతిలో ప్రకటించడం మానేసేరు. దీనివల్ల సాంప్ర దాయికవిజ్ఞానానికి కలిగిననష్ట మింత అని చెప్పలేము. భారతివారు తిరిగి వీటిని ప్రకటించి భాషాసేవ చేస్తా రని నమ్ముతున్నాను'

అని శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు గారు న్నూ[౨]

వార్తారూపంగా శ్రీ గిడుగు వెంకట రామ మూర్తిపంతులుగారున్నూ[3] తమ అభిప్రా యాన్ని ప్రకటించారు.

భారతి అభిప్రాయమున్నూ అట్టిదే. అందుకనే ఆవాఙ్మయాన్ని భారతిప్రకటిస్తూ వచ్చింది. కాని రానురానూ ఆపేరిట అనుకరణాలూ, కల్పితాలూకూడా బయ లుదేరడం మొదలు పెట్టినవి. దాంట్లో అసలువేవో, కాని వేవో గుర్తించడానికి వీలులేకుండా పోయింది. అందుచేతనే ప్రకటితంఅయినదాంట్లో కలితీ ఏర్పడింది కూడా. ప్రాచీనం ప్రాచీనంగానూ, నవీనం నవీనంగానూ ఉండవలెనుగాని, రెండు కలితీ అయిపోతే వాఙ్మయానికీ, దానిచరిత్రకూ, ప్రకృతం అంతగా కాకున్నా, భావికాలాన తీరనిహాని కలుగక తప్పదు. కనుక వాటిప్రక టనం విరమింపబడింది.

వాగ్రూపాన్నే పొందియున్న ఆప్రాచీన వాఙ్మయాన్ని సేకరించడం సులువయిన పని కాదు. దానికి వ్యయప్రయాస లధికం. చాల కాలం పడుతుంది కూడాను. దానికోసం దేశ దేశమూ తిరిగి, ఆనోటానోటా ఉన్న దున్నట్టుగా విన్నది విన్నట్టుగా ఉద్ధరించి పోగుచేసి, నికరం అయినవాటిని తేల్చి, ప్రక టితాలయినవాటిని కడగాదీసి, తక్కినఅప్ర కటితాలను ప్రకటించవలెను. ఇంతపని సాధ్యం కానప్పుడు ఊరకుండడం ఉత్తమం. కానిపనికి పూని వాఙ్మయానికి హానితేవడం అప్రశస్తం.

ప్రకృతం ఈ వాఙ్మయాన్ని ప్రకటించ డానికి సలహా లిచ్చిన పెద్దలు చిరకాలా న్నుండి ప్రయాసతో ప్రాచీన వాఙ్మయోద్ధర ణానికి నడుముకట్టినవారు. వారు సేకరించి ప్రకటనార్హాతను నిశ్చయించి పంపేయెడల, వారిపూచీపయిన భారతి మరల ఆ వాఙ్మ

౧. శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములలో మొదటిదగు 'వ్యాససంగ్రహము' నందలి 'స్త్రీలసారస్వతం' అనే ఉత్తమశ్రేణివ్యాసం (పు. ౨౫౮) లో.

౨. భారతి పదవసంపుటం, పండ్రెండవ సంచికయందలి 'సాంప్రదాయికవిజ్ఞానం' అనేవ్యాసం (పు. ౭౫౮) లో.

3. తమ మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి వ్రాసిన ఉత్తరంద్వారా.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాన్ని తప్పక ప్రకటింపగలదు. ఈముగ్గురే కాదు, ఇతరులైనాసరే, తగినంత జబాబుదారీ పుచ్చుకునేవారైతే సరి, సేకరించి పంపవచ్చును.

---

### చెన్నపురి చిత్రములు *

“కోమాఫోటో సర్వీసు” వారు మరికొన్ని చెన్నపురి చిత్రములను తయారుచేసినారు. అందచందములయందవి వెనుకటివానికంటె ఏపాటియును తీసిపోవునవి కావు. భారతియందు వెనుకటిసంచికలోను, ఈ సంచికలోను ప్రకటితములయినవి కాక క్రొత్తవి మఱికొన్ని వీనిలో కలవు. ఇవియు ‘ఆల్బముల’ కొరకు సేకరించుకొనదగినవి. మొత్తము వీ రిరువదినాలుగు చిత్రములను తయారుచేసినారు.

---

## మాయ

కీ. శే. బసవరాజు అప్పారావు

కన్నులకప్పే మబ్బుజూచితే
కవి నేను కానని తెలిసింది.

చేతుల జరిగేకలము జూచితే
చెప్పేది నీవని తెలిసింది.

తేనెలు వొలికే పాటలు వింటే
దివ్యగానమని తెలిసింది.

నాట్యము జేసే మూర్తుల గంటే
నాక కన్నెలని తెలిసింది.

---

* “Koma Photo Service” నెం. ౮, బంఢి వెంకటేశనాయకవీథి, తిరువల్లిక్కేణి, మదరాసు. సిడివి అం. ౪, వెడల్పు అం. 3, సైజుగల పండ్రెండేసి ఫోటోల వెల రు. ౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సాభిప్రాయ విశేషములు

### పునర్నిర్మాణము

ప్రపంచ మంతయును నిర్మాణము, పునర్నిర్మాణము, పునరుద్ధరణము ఘోషలతో ప్రతిధ్వనిల్లుచున్న సమయము నందు వ్యక్తులకు, సంఘములకు, జాతులకు స్వాత్మావలోకన మవసరమగుచున్నది. వర్తమాన ప్రపంచ పరిస్థితులందు నిర్మాణ మెటులు సాధ్యమె, పునర్నిర్మాణ మెటులు సాధ్యమె జిజ్ఞాసాపాత్రముగ నున్నది. జిజ్ఞాస లేని నిర్మాణఘోషలును, అనుకరణములును కార్యసాధనములు కాజాలవు. వర్తమాన కాలమునం దింతకు ముందు లేని పునర్నిర్మాణఘోష లేల కలిగినదనియును, పునర్నిర్మాణ మవసరమైనపు డెటులు సాధ్యమగు ననియును వ్యక్తులను, సంఘములను, జాతులను నావరించినది. పునర్నిర్మాణసమస్య ప్రత్యేకవ్యక్తులకును, ప్రత్యేక జాతులకును, దేశములకును సంబంధించిన సమస్య కాకను సకలజనులకును, వివిధ జాతులకును, నానారాజ్యములకును, విశ్వమునకును సంబంధమును కలిగిన మహాసమస్యమై యున్నది. పునర్నిర్మాణము విశ్వావృతమైన ధర్మము. చైతన్య శక్తికి పునర్నిర్మాణము సహజ ధర్మము. చరాచర ప్రపంచ మంతయును ననవరతము పునర్నిర్మాణమును పొందుచున్నను సహజమైన విషయమునందు జిజ్ఞాస కలుగకున్నది. అభ్యాసములైన వ్యవహారము లన్నియును నవీనములైనను మార్పులు గనుపడవు.

విశ్వపరిణామమునందు భిన్నత్వము ప్రకృతిధర్మము. ఏకమును, అద్వితీయమునైన సత్తు ప్రకృతియం దనంతములైన నామరూపములను, విశ్వపరిణామమునకు వినియోగపడుచున్నది. పునర్నిర్మాణము నామరూపపరిణామములందు సాధ్యమైనను ధర్మమునందు దుర్లభముగ నున్నది. సకల జీవ జాలములకును "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" అనెడి ధర్మము పరమార్థముగను పరిణమించినది. పాశ్చాత్యరాజ్యములందు డార్వినుపండితుడు ప్రతిపాదించిన ప్రాణరక్షణసంరంభము (Struggle for Existence) ఉపయుక్తతమపదార్థప్రభవము (Survival of the fittest) సిద్ధాంతములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిపాటియై ప్రపంచమునంతను నావరించి నవి. శ్వేతజాతు లుత్తమజాతులనియును, శ్వేతజాతులందును నేజాతి కాజాతి యుత్తమ మనియును దురభిమానము ప్రబలి ప్రళయ రూపమును దాల్చుచున్నది.

శ్లో. సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా
పురోఽవాచ ప్రజాపతిః ;
అనేన ప్రసవిష్యధ్వ
మేష వోఽస్త్విష్టకామధుక్,

శ్లో. యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర
లోకోఽయం కర్మబంధనః ;
తదర్థం కర్మ కౌంతేయ,
ముక్తసంగ స్సమాచర.

పునర్నిర్మాణమునకును, పురోవృద్ధికిని దైవసంపదయైన యజ్ఞస్థానమును "ఆహార నిద్రాభయసంగమములు" ఆక్రమించినవి. ప్రజాపతి ప్రజలు యజ్ఞమూలమునను ప్రవర్ధిల్లవలయునని సంకల్పించినను ప్రజ లన్నమూలమునను ప్రవర్ధిల్లుటకు బూను కొనుచున్నారు. అన్నము భూతముల ప్రాణ పోషణమున కాధారమైనను, మానవధర్మా భ్యుదయమునకు యజ్ఞమాధారముగ నున్న ది. జీవమునకు జీవయాత్రాప్రస్థానమునం దన్నమాధారమైనను, యజ్ఞము మూలా ధారముగ నున్నది. వర్తమానసమయము నందు ప్రజాభ్యుదయమునకు ప్రపంచ లక్ష్యము ప్రధానమైన యజ్ఞమునందుగాకను అప్రధానములైన అన్నాదులందు లగ్నమగు చున్నది. మానవధర్మవికాసమునందు నిర్మా ణవిధానము గడియారమునందలి పెండ్యుల మువలెను ముందువెనుకల కాడుచుండుట ప్రకృతి ధర్మము. నిర్మాణమున కాద్యంతము లను నిర్ణయించుట యసాధ్యము. నిర్మాణ విధానమునందు బాహ్యసాధనములు వర్త మానసమయమునందు ప్రపంచలక్ష్యము నా కర్షించుచున్నటు లాభ్యంతర సాధనము లాక ర్షింపజాల కున్నవి. ప్రపంచమునం దన్న వస్త్రాదులు చాలినంతయున్నను అన్న వస్త్రఘోష భయంకరరూపమును దాల్చు చున్నది. ప్రబల జాతులు దుర్బల జాతుల నాక్రమించి స్వీయవిద్యాబలసంపదలను పున ర్నిర్మాణవ్యాజమునను పరసంహారమునకు వినియోగించుచు ప్రపంచమును సంక్షోభ మయము చేయుచున్నవిధమును నిత్య వ్యవ హారములు తెలుపుచున్నవి. ప్రబల జాతుల ధర్మములు వర్తమాన కాలపు పురోహితుల ధర్మములవలెను స్వార్థారాధనమునకును పరపీడనమునకును వినియోగపడునటులు ధర్మారాధనమునకును, పరహితార్థమునకును వినియోగపడకను నిర్మాణము సంహారపరి ణామమును పొందుచున్నది. స్వార్థపరమైన స్వజాతీయాభిమానము, స్వధనాభిమానము, స్వమతాభిమానము, స్వకులాభిమానము, స్వవర్ణాశ్రమాభిమానము ధర్మప్రపత్తినామ మునను అధర్మాభ్యుదయమునకును, ధర్మ నాశనమునకును వినియోగపడుచున్నవి.

* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వజాతీయాభిమానము

స్వాభిమానము వ్యక్తులనుండి జాతులకు సంక్రమించుటకు మహాసంరంభములు సంప్రాప్తమైనవి. వీరులు, గురువులు, యోగులు, పండితులు, నాయకులై కులగోత్రాధికారదశలను నిర్మించి భాగ్యభోగాధికారముల నాక్రమించుట పునర్నిర్మాణసంహారములకు మూలకారణము. కులగోత్రదశాధికారదశలను సంహరించి జాతీయాహంకారమును కలుగజేయుటకు సంప్రాప్తమైన మహాసంరంభములు ప్రపంచేతిహాసములందు దారుణాధ్యాయములు. సంక్షోభసాధ్యమైన జాతీయాహంకారము సంకుచితమై కులగోత్రవృత్తిరూపభావావరణములందుపునరావృత్తమై మానవస్వాతంత్ర్యధర్మపరిణామమును దుర్లభము చేయుచున్నవిధమును ప్రపంచవ్యవహారములు బోధించుచున్నవి.

వ్యక్తికిని, సంఘమునకును స్వాతంత్ర్యసిద్ధికి సంరంభము సహజసిద్ధము. మతములు, సంపదలు, వృత్తులు, శాస్త్రములు, కళలు, రాజ్యాంగములు వ్యక్తులకును,సంఘములకును ధర్మావిరుద్ధమైన స్వాతంత్ర్యసిద్ధికి జేసిన ప్రయత్నములు ప్రతిఘటనమునకు పాలైనను మానవస్వాతంత్ర్యవికాసమునకు వినియోగపడిన విధమును ధర్మవిజయములు విశదముచేయుచున్నవి. పూర్వము ఏసుక్రీస్తు, బుద్ధుడు, మహామ్మదు, శంకరుడు ప్రతిపాదించిన మతధర్మములును శ్రీరామ శ్రీకృష్ణాదుల రాజ్యధర్మములును మానవధర్మాభ్యుదయమునకు వినియోగపడినరీతిని వర్తమాన కాలమునందు దయానంద స్వామి, రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి, అరవింద యోగి, బాల్డువిను, ముస్సులోని, హిట్లరు, రూజువెల్టుగారులు మొదలగుమహాపురుషులును మానవస్వాతంత్ర్యధర్మాభ్యుదయమునకు వారి సంస్కారమున కనురూపముగ పనిబూనుచున్న విధమును నిత్యవ్యవహారములు దిగంతములందును చాటుచున్నవి. వర్తమానకాలమునందు ప్రజానాయకులయోగలక్ష్యము యజ్ఞార్థముగాకను స్వార్థపరమై, పరమార్థమునకు బదులు పరమానర్థములకును మూలమగుచున్నది. గతించిన ౧౫౦ యేండ్లయందును క్రమవికాసమును బొందిన మానవస్వాతంత్ర్యధర్మము స్వార్థావరణములందు సంకుచితమగుచున్న విధమును యూరపురాజ్యాంగముల యుదంతము మనోగతము చేయుచున్నది.

*       *       *       *

నాజీ విజృంభణము

జర్మనియం దార్యేతరజాతీయులకు పుట్టుగతులు లేకున్నవి. యూరపునాగరకతకు మూలాధారమైన క్రైస్తవమతధర్మము లుప్తమగుచున్నది. యూదులు నివాసాధికారములు లేకను దుఃఖవేదన ననుభవించుచున్నారు. యూదులకు సైన్యములందును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధనాగారములందును, విద్యాలయము లందును, పరిశ్రమాదులందును స్థానములు దుర్లభము లైనవి. సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు ఏన్‌స్టైనుగారు స్థానభ్రష్టులై వారి యావదాస్తియును ప్రభుత్వమునకు సంక్రమించినది. హిట్లరు, నిషిగారులు నిర్మింప సమకట్టిన పరిశుద్ధ మానవధర్మము స్వయంకల్పితావరణములందు దైవస్వభావస్వరూపములను గోల్పోయి ఆసురస్వభావ స్వరూపములను దాల్చుట ప్రకృతి ధర్మము. హిట్లరుగారి సంకల్పము ఆస్వాల్డుమోస్లెగారి సంకల్పము వలెను స్వాభిమానము, స్వజాతీయాభిమానము, సామ్రాజ్యాభిమానము, ఆంగ్లో సాక్సను జాతీయాభిమానము, శ్వేత జాతీయాభిమానము మొదలగు భిన్నావరణము లందును వృద్ధి క్షయములను పొందుచు మానవస్వాతంత్ర్య ధర్మము విలయమును పొందుచున్నది. హిట్లరు, మోస్లె, రూజువెల్టుగారులు మొదలగు నాయకుల లక్ష్యమాసురధర్మపరమైన స్వార్థారాధనమునందు లగ్నమై యజ్ఞార్థమైన కర్మారాధనము దుర్లభము చేయుచున్నది. ప్రజానాయకుల లక్ష్యము విశాలమైన మానవ వ్యక్తిస్వాతంత్ర్య ధర్మమునుండి సంకుచితమైన స్వజాతీయ ప్రయోజనములందును, స్వీయప్రయోజనము లందును లగ్నమై స్వాతంత్ర్య ధర్మమహత్త్వమును నిర్మూలము చేయుచు ప్రజాలక్ష్యమును, ప్రపంచలక్ష్యమును నియంతల మీదను ప్రసరింప జేయుచున్నది.

* * * *

నియంతలు

నిరంకుశసంభవులైన నియంతలు ప్రతిభావంతులైనను ధర్మాభ్యుదయమునకు సాధకులు గాజాలరు. నిస్సహాయులైన ప్రజలు గొర్రెలమందలువలెను నియంతలను వర్తమాన కాలమునం దనుసరించుటకు గల కారణము ప్రపంచము నావరించిన భయమును, అజ్ఞానమును కాని జ్ఞాన విశ్వాసములు కావు. స్వాతంత్ర్యము గల ప్రజలు ఆత్మవిశ్వాసమును గలిగి చేయగలపనిని, నియంతలు సమర్థులైనను సఫలము చేయజాలరు. ఆచారపాశబద్ధమైన ప్రజా సామాన్యమునం దాత్మవిశ్వాసమును గలుగజేయుటకు స్వాతంత్ర్యమునకు గల శక్తి పారతంత్ర్యమునకు గలుగజాలదు. ఫాసిటుధర్మమును నాజీ ధర్మమును, వ్యక్తిస్వాతంత్ర్యధర్మప్రయోజనమును నియంతల స్వభావాభిమానావరణములందు నిరర్థకము చేయుచున్నవి. సోవిటుధర్మమును, వ్యక్తిస్వాతంత్ర్య ధర్మమును సిద్ధాంతములం దంగీకరించు చున్నను, వ్యవహారములందు నిరర్థకము చేయుచున్నది. నియంతలరాజ్యమునకుగారణము వర్తమాన సందిగ్ధ సమయమునందు ప్రపంచము నావరించినభయభ్రాంతులు కాని మానవ స్వాతంత్ర్యాభిలాష కాదు. ప్రపంచమునందు భోగ భాగ్యానుభవము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకును వైరాగ్యమునకును, నిరంకుశాధికారమునకును ప్రజాస్వామికమునకును, భోగమునకును త్యాగమునకును, స్వార్థమునకును రాజ్యాధికారమునకును, మతాధికారమునకును స్వాతంత్ర్యమునకును, సమన్వయము దుర్లభమైనను చిరకాలము నుండియును నీద్వంద్వ ధర్మమును సమన్వయము చేయుటకు ప్రపంచము మహా దుఃఖ వేదన ననుభవించుచున్నది. ధర్మమునకు విజయము సహజమైనను దుఃఖానుభవ మనతిక్రమణీయముగ నున్నది. ధర్మారాధనమునకు యజ్ఞపరమైన ఆత్మ సాధనమును విస్మరించి స్వార్థపరమైన పరపీడనమును నారాధించుట నియంతలకుసుకరముగ నున్నది. స్వప్రయోజనములకు ధనవంతులకు, బలవంతులకు, విద్యావంతులకు పరపీడనము సుకరముగ నున్నటులు ధర్మ ప్రయోజనము సుకరము గాకున్నది. సకల మానవులకును వారి తరణోపాయము వారి స్వయంసహాయమున నేసాధ్యము. పరుల నుండి, వారు మహానియంత లైనను, సాధ్యముకాదు. నియంతలు ధర్మసంస్థాపనమునకు బదులు, ధర్మసంహారమునకు బూనుకొనుట వర్తమానసమయము నందు ప్రపంచమునావరించిన దురదృష్టముగ నున్నది. యూరపు రాజ్యములందు దినదినప్రవర్ధమానులగుచున్న నియంతలయభ్యుదయము ప్రపంచము పరితపించుచున్న శాంతికిని, ధర్మమునకె కాకను, నియంతల స్వప్రయోజనములకును విఘాతమును గలుగజేయుచున్నది. జర్మనురాజ్యదిగంతములందును, ప్రపంచమునందును నాజి విజయఘోషలు ప్రతిధ్వనిల్లుచున్నను జర్మనువ్యాపారపరిశ్రమలు క్షీణించుచున్న విధమును లెక్కలు తెలుపుచున్నవి. గతవారమునందు ౧౦౦ లక్షల బంగారు మార్కులును, గతసంవత్సరము ౪౦౦౦ లక్షల విదేశముల కర్రెన్సి చలామణియును తగ్గినవి. జర్మనిప్రయోగించిన ఆర్థికబల శస్త్రాస్త్రములనే యితరరాజ్యములును ప్రయోగించి నాజీవిజయములను నిరర్థకముచేయుచున్నవి.

మానవ స్వాతంత్ర్యధర్మవికాసమునకు పరాక్రమణపరమైన స్వార్థారాధనము ప్రతిబంధకమును, పరహిత పరాయణమైన ఆత్మయజ్ఞము సార్థకమును గాగల విధమును ధర్మయాత్రాపరమైన ప్రపంచేతిహాసము లనంతముఖములను ప్రత్యక్షము చేయుచున్నను పశుప్రవృత్తికి సహజమైన స్వార్థారాధనము యజ్ఞార్థమైన కర్మయోగమును దుర్లభమును, కామపరమైన కర్మకలాపమును సులభమును జేయుచున్నది. విషయభోగపరాయణములైన రాజ్యాంగవిధానములును, సాంఘికార్థికమతనిర్ణయములును, వ్యాపారపరిశ్రమ విధానములును నియంతల హస్తములందు ధర్మసంహారమునకు వినియోగపడినటులు ధర్మసంస్థాపనమునకు వినియోగపడజాలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియంతల నిరంకుశాచరణములు స్వాతంత్ర్య విలసితములైన గ్రేట్బ్రిటను, ఫ్రాన్సు, అమెరికారాజ్యములందును సమ్మోహమును, సమ్మోహము బుద్ధి నాశనమును గలుగజేయుచున్న విధమును గ్రేట్బ్రిటనునందును ఫాసిటు వ్యాపనము వెల్లడిచేయుచున్నది. ఫాసిటు పక్షములు భిన్న రాజ్యములందును సంకల్పించిన పునర్నిర్మాణవిధానములు ధర్మాధారరహితములై నిరర్థకములగుట సహజము. స్వాతంత్ర్య దేశములకును, జాతులకును సాధ్యమైనస్వార్థపరమైన పునర్నిర్మాణవిధానమైనను పారతంత్ర్యమునందు మునిగియున్న దేశములకును, జాతులకును సాధ్యముగాకున్నది. హిందూస్థానమును సకలవ్యవస్థలందును నావరించిన పారతంత్ర్యము ప్రజానాయకులహృదయమును స్తంభింపజేసిన విధమును దేశవ్యవహారము లన్నియును రుజువు చేయు చున్నవి. పారతంత్ర్య పాశబంధములందును ఆత్మయజ్ఞము సాధ్యముగాగల విధమును వివిధసందర్భములందును గాంధిమహాత్ముని ధర్మయాత్రా సేవనము ప్రమాణముగనున్నది.

* * *

## గాంధిమహాత్ముడు - ధర్మయాత్రలు

గాంధిమహాత్ముని ధర్మయాత్రలు నియంతలకు స్వాభిమానయాత్రా సేవనమునకుగాకను ధర్మయాత్రా సేవనమునకు సాధనములుగ నున్నవి. మానవస్వాతంత్ర్యధర్మాభ్యుదయములకు రాజ్యాంగములందువలెను, సాంఘికార్థికమతరంగములందును గాంధిమహాత్ముని ధర్మయాత్రా సేవనము హిందూస్థానమునకే కాకను ప్రపంచమున కంతకును మార్గదర్శకముగ నున్నది. గాంధిమహాత్ముడు "అనాసక్తయోగము"నందు పరిస్ఫుటము చేసిన యజ్ఞయాత్రను నిత్యజీవనమునందు సార్థకము చేయుచు నియంతలకును, నాయకులకును, ప్రజలకును యజ్ఞయాత్రా సేవనమును విశదము చేయుచున్నాడు. గాంధిమహాత్ముడు స్వరాజ్యసంపాదనమునకు నిర్ణయించిన త్యాగపరాయణమైన ఆత్మయజ్ఞమునే సాంఘికార్థికమతవ్యవస్థలకును నిర్ణయించుచు వర్తమాన నిస్సహాయస్థితియందు భారతీయులకు వలెను ప్రపంచమునకు తరణోపాయమును విశదము చేయుచున్నాడు. ధర్మనిర్వాహణమునకు ప్రయోజనము ధర్మసంస్థాపనముకాని విషయఫలము కాదు. గాంధిమహాత్ముని స్వరాజ్యప్రస్థానము వలెను, ఖద్దరు ప్రస్థానమును, హరిజన యాత్రయును, బీహారు భూకంప దుఃఖార్తులపట్ల చేయుచున్న తీర్థయాత్రయును నియంతలకును నాయకులకును నవసరమైన ధర్మయాత్రావిధానమును నిరూపించుచున్నవి. పరావలంబనమే శరణ్యమైన హిందూస్థానమునందు గాంధిమహాత్ముని యుపదేశాచరణములు, ధర్మానుకూలములైనను, దురారాధ్యము లగుట ప్రకృతిప్రభావము. రాజ్యాంగములందువలెను, సాంఘి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కార్థికనిర్ణయములందును భిన్నపక్షములు వెలయుట ప్రకృతిస్వభావము. రాజ్యాంగములందు శాసనసభలువలెను, సాంఘికార్థిక నిర్ణయములందును సనాతనవర్ణాశ్రమధర్మములును యంత్రాలయాదులును ప్రజానియంతలలక్ష్యము నాకర్షించుట ప్రకృతిస్వభావము. మానవులకు ధర్మారాధనము స్వాతంత్ర్య వికాసమునందు సాధ్యమైనటులు నిర్బంధవిధానమునందు సాధ్యముగాదు. గాంధిమహాత్ముడు కాంగ్రెసు స్వరాజ్యపక్షమునకు జేసిన యాశీర్వాదాభయములనె సనాతనవర్ణాశ్రమధర్మపరాయణులకును, యంత్రాలయనిర్వాహకులకును, భూకంపదుఃఖార్తులకును జేయుచున్న విధము ప్రజానాయకుల కనుష్ఠానయోగ్యముగనున్నది. ధర్మయోగపరాయణమైన సహాయనిరాకరణయోగము, ఖద్దరుదీక్ష, హరిజనయాత్రాదులును, ఆత్మయజ్ఞారాధనవిధానమునకు ప్రమాణములుగ నున్నవి. కాంగ్రెసు స్వరాజ్యపక్షమునకు గాంధిమహాత్ముడు పంపిన యాశీర్వాదములును, సానుభూతియును గాంధిమహాత్ముని ధర్మసంకల్పమును, మానవస్వాతంత్ర్యప్రియత్వమును వెల్లడిచేయు చున్నవి. గాంధిమహాత్ముడు స్వీయధర్మసంరక్షణమును జేసికొనుచు పరులకు స్వాతంత్ర్య ప్రదర్శనమున కవకాశములన గలుగజేయుట వారిమహత్త్వమునకు నిదర్శనముగ నున్నవిధమును డాక్టరు అన్సారి వ్రాసిన లేఖాంశములు వెల్లడిచేయుచున్నవి.

గాంధిమహాత్ముడు కాంగ్రెసు స్వరాజ్యపక్షము నాశీర్వదించినను, స్వరాజ్యపక్ష వ్యవహారములు కాంగ్రెసు సమావేశమై, వ్యవహారవిధానమును నిర్ణయించనంతవరకును కాంగ్రెసువిధానము గాజాలదు. కాంగ్రెసు స్వరాజ్యవిధానమునకు కాంగ్రెసుముద్రను వేయుటవలన నధికతరగౌరవము గలుగుననివిశ్వసించుట యనుచితమయి ధర్మప్రయోజనమును నిరర్థకము చేయుచున్నది. హిందూస్థానము నావరించిన సమ్మోహస్థితియందు సకలపక్షములకును స్వధర్మారాధనమును జేయుట కవకాశములు గలవు. యజ్ఞారాధనమున కవకాశములు సకలజనులకును నున్నను, పనిబూనినవారందరును నాయకరూపమునను, నియంతల నామమునను ధర్మాధికారులని తలపోయుట నిరర్థకము. గాంధిమహాత్ముడు స్వధర్మ నిర్వహణము నందును, స్వధర్మాచరణమునందును నితరులకు గలుగజేసిన యవకాశప్రయోజనములనే యితరులును గలుగజేయుట పరార్థమునకు గాకపోయినను స్వార్థారాధనమునకైనను ఆత్మావలోకన విశ్వాసములు సాధనములుగ నుండగలవు.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras,
Editor: G. Subbaramayya.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, సంచిక ౫

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చిత్రములు

వర్ణచిత్రములు:—జాలరి; మాఘము; ఫాల్గునము.

సాధారణచిత్రములు:—అభినవప్రవరాఖ్యుడు; జి. యస్. ఏ. చిత్రములు ౪; వెన్నెల రేయి; ఉద్యానములోపల; తీర్థస్నానము; పాతకొత్తలు; చాకిరేవు; బళ్లారి కోట; తగని దప్పిక; తల్లితనము; కర్రసామాను చిత్రములు; కచ దేవయానలు; బిచ్చగాడు; హిమాలయఝరి; శ్రీకాళహస్తి; చెరువునుండి; ప్రతిబింబము; పాపనాశనతీర్థము, తిరుపతి; మిశ్రప్రకృతి; సూర్యోదయము; పొగమంచు; కపిలతీర్థము, తిరుపతి; ఏతాలు; అద్దాల ఇల్లు పుదుచ్చేరి; వైశాఖపూజ వ్యంగ్యచిత్రములు; ఇతర చిత్రములును.

## సవరణలు

భారతి ఏప్రిల్ (౧౯౩౪) సంచికయందు ముద్రిత మయిన 'దీపారాధన' అను ఛాయా చిత్రము శ్రీ పి. యస్. అనవరశర్మగారు తీసినది; పి. ఆర్. కృష్ణారావుపేర పొరపాటున ముద్రిత మయినది. ఇందుకు విచారించుచున్నాము.

౧౯౩౪ సంవత్సరము మార్చి భారతియందు ముద్రించిన 'పద్మిని' అను త్రివర్ణ చిత్రము శ్రీ ముడుంబ నరసింహాచార్యులుగారు చిత్రించినదికాని అందు ముద్రితమయినట్లు చంద్రుపట్ల రామరావుగారు చిత్రించినది కాదు. అట్లు ముద్రితమగుట పొరపాటని మనవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




సంపు. ౧౧ భావసంవత్సరము, వైశాఖమాసము (మే ౧౯౩౪) సంఖ్య ౫

# విశ్వ ప్రేమ

కైలాసవాసి జనమంచి వేంకటరామయ్య

౧

తన్ను తా నిచ్చుకొనుటయే త్యాగమయ్యె
త్యాగమే సృష్టితోఁ బుట్టి యజ్ఞమయ్యె
ఎవఁడు నెఱుఁగడు సృష్ట్యాది యెపుడొ; కలఁడె
తనదు పుట్టుక తా నెఱింగిన జనుండు ?

ఉన్న దొక్కటె బ్రహ్మమం చెన్ను శ్రుతులు
ఒకటె పెక్కయ్యె నొంటిమై నుండలేక
తల్లియెదఁ బట్టఁజాలక పెల్లుబుకుచుఁ
బొంగి పాఱెడి స్తన్యంబుపోల్కిఁ గనుచు.

నిప్పునెర సెట్లు పుట్టెనో గుప్పుమనియె
మెండుకొని మండె, జగమెల్ల నిండె నొక్క
భవ్య మగు దివ్యతేజంబు పాలకడలి
మీఁది నునుజిడ్డుతరఁగల మిసిమివోలె.



5- 1 ... 23

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రేమ యాధ్మాతహృదయంబె వ్యోమ మయ్యె
దాని యుచ్ఛ్వసితమె జగత్ప్రాణమయ్యె
ఊర్పుటావిమె తేజమై యుజ్జ్వలించె
నంబు వయ్యెను బాష్పకణంబె యగును.

వ్యక్తమయిన ప్రేమరసార్ణవంబునందు
కాల కర్మ స్వభావ యోగమునఁ జేసి
కరడుగట్టిన పయిపాలు గట్టిపడఁగ
ధాత్రియయ్యెను జగదేకధాత్రి ప్రేమ.

*　　*　　*

౨

వివిధమార్గంబులను బట్టి ప్రేమలక్ష్మి
విశ్వమయతను నిటులొందె విశ్వమయుని
తోడ నతఁ డెట్టులాడిన నాడు చక్కె
సూదితో దారమ ట్లనుస్యూతగతిని.

కలువ తేఁ డతఁ డయినఁ దాఁ గాంతియగును,
సూన మతఁ డైనఁ దాఁ దేనెసోన యగును,
జలద మతఁ డైనఁ దాను క్రొంజలువ యగును,
తల్లి యతఁ డైనఁ దాను దత్ స్తన్యమగును.

ప్రేమసామ్రాజ్యవైభవం బేమిసెప్ప ?
అన్నియును జుట్టుకొనెడుఁ — బేరాస కాదు
అన్నియును మ్రింగు — లయకాలయముఁడు గాదు
కడుపులోఁ బెట్టుకొనుఁ ప్రేమ — కన్నతల్లి.

ఆవరించును భువి జగత్ప్రాణమట్లు
దివియు భువియుఁ ద్రివిక్రమదేవునట్లు;
చేతులను జాఁచుఁ గౌఁగిటఁ జేర్చుకొనుటకె
పుచ్చుకొనుటకుఁ గా దింక నిచ్చుకొనుటకె.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఋగ్వేదము

## ఉత్పత్తి-స్వరూపము

సి. వి. నరసింగరావు, బి. యే., బి. యల్.

మన హిందువులు ముఖ్యముగ అనుష్ఠించు మతము వైదికమత మనబడును. వైదికమత మనగా, వేదమునందు పుట్టిన మతమని యర్థము. వేదములు నాలుగు: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము. ఈనాలుగు వేదములలో ఋగ్వేదమే ప్రథమమును, ముఖ్యమును నై యున్నది. ఋషులు గీతముగ పాడిన దేవతాస్తోత్రంబుల నెల్ల పదిగుచ్ఛంబులుగ ఏర్పరచిన గ్రంథము ఋగ్వేదము. ఆ దేవతలకొరకు చేయు యజ్ఞాదికర్మంబులను చూపునది యజుర్వేదము. పై ఋగ్వేదమునందు పాడిన గీతములనే రాగము చేర్చి గానముగ పాడునటుయే సామవేదము. వైద్యము, దుష్టభూతంబుల ఆవాహనము, విసర్జనము మొదలగు విషయములను గురించి తెలుపునది అథర్వవేదము. ఈ నాలుగు వేదములలో దేవతలస్తోత్రములను తెలుపు ఋగ్వేదమే మన వైదికమతమునకు మూలాధారము. ఋగ్వేదంబున తెలిపిన విషయములు విపులపరచి ఉపనిషత్తులు తెలిపియున్నవి. మిక్కిలి గంభీరమగు బ్రహ్మవిద్యను తెలుపు ఉపనిషత్తులకు ఋగ్వేదమే మూలాధారమై యున్నది. ఋగ్వేదమును ఆధారముగా గల వగుటచేత ఉపనిషత్తులు ఋగ్వేదమునకు విరుద్ధమైన విషయంబుల నుపదేశింపజాలవు ఋగ్వేదమును, ఉపనిషత్తులును ఏకమతమునే తెలుపుచున్నవని ధృఢముగ తెలియవలెను.

### ఋగ్వేదముయొక్క ఉత్పత్తి

ఋగ్వేదమంతయు శబ్దరూపముగ అనాదిగనుండెనని జ్ఞానులైన ఋషులు చెప్పుదురు. అది సత్యమని నమ్మవలసియేయున్నది. తదనంతరము, కాలక్రమమున ఆర్యులు పంచనదీతీరంబున కుదురుపడు కాలంబున దాస్యు లనంబడు అనార్యజాతులు, ఆర్యులను చుట్టుముట్టి హింసింపసాగిరి. ఆర్యులు కొద్ది జనసంఖ్య యగుటచే, అనార్యజనసమూహముతో పోరాడ వారలకు కష్టమయ్యె. ఆకాలంబున ఆర్యరాజులవద్ద మహనీయులగు మహర్షులు, కులగురువులై రాజపోషణవర్గములో జీవించుచుండిరి. ఆమహనీయులు మిక్కిలి ఉత్తమభక్తి కలవారై దేవతలను పిలిచి దేవతలతో స్నేహభావముతో సంభాషించుచు, దేవతలకు సోమపానాది నైవేద్యంబుల నొసంగి, వారి అనుగ్రహము వడసి, దేవతలనుండి సర్వసహాయంబుల బొంది, ఆదైవబలముచేకొని దాస్యుల నోడించి, ఆర్యరాజులకును, జనులకును క్షేమంబు కలుగచేయుచు పెంపొంది దేవసములై యుండిరి. ఆమహనీయులగు ఋషులు గానముగ పాడి దేవతలను పిలిచిన గీతములే సూక్తము లనంబడును. ఒక్కొక్కసూక్తములో నాలుగు, అయిదు, పది, లేక ఇరువది పద్యంబు లుండును. ఆపద్యములకు ఋక్కులని పేరు. ఈ ఋక్కులచే నిర్మింపబడినదగుటచేతనే ఈగ్రంథమునకు ఋగ్వేదమని పేరుకలిగె; అనగా ఋక్ + వేదము ఋగ్వేదము. అనేకములగు సూక్తములు చేరి ఒకమండల మేర్పడును. పదిమండలములు చేరి ఋగ్వేదంబను మహాగ్రంథము ఏర్పడియున్నది. ఋగ్వేదమండలములు ఈవిధముగ నేర్పడియెను. ఈఋషులలో మిక్కిలి ఘనతకెక్కిన మహర్షుల సూక్తంబులెల్ల ఒకగుచ్ఛముగ చేర్చి ఈప్రథమమండలమును ఏర్పరచిరి. ఇది మిశ్రమండలము; అనగా ఇందలి సూక్తంబులను వచించిన ఋషులు ఒకరికొకరు సంబంధములేనివారై యున్నారు. ఇందు నూటతొంబదునొకండు సూక్తంబులు కానబడుచున్నయవి. ప్రథమమండలమునకు శతార్చిన్ అని పేరిడిరి. రెండవ మండలము గృత్సమదమండలమని పేరుపొందియున్నది. ఈమండలమందలి సూక్తము లన్నియు గృత్సమదఋషియు, ఆఋషిపుత్రులును, శిష్యులును వచించినవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానినెల్ల చేర్చి ఈమండలము నిర్మింపబడినది. ఇందు నలువదిమూడు సూక్తంబులు కానబడుచున్నవి. మూడవమండలము విశ్వామిత్రమండలమని పేర్కొనబడియున్నది. ఇందలి సూక్తంబులెల్ల, విశ్వామిత్ర ఋషియును, ఆఋషిపుత్ర, శిష్యవర్గంబుచే వచింపబడియున్నవి. ఇందు అరువదిరెండు సూక్తంబులు కానబడుచున్నవి. చతుర్థమండలము వామదేవమండలము. ఇందలి సూక్తంబు లెల్ల వామదేవఋషియు, ఆమహర్షి సంతతివారును, శిష్యులును వచించిన సూక్తములే. పంచమమండలము గవిస్థిరమండలము. అత్రిఋషియు ఆఋషిపుంగవుని పుత్రులు, శిష్యులు వచించిన యెనుబదియేడు సూక్తంబులను చేర్చి, ఈపంచమమండలము నిర్మింపబడియున్నది. ఆరవమండలము భారద్వాజ మండలమని పేర్కొనబడియున్నది. భరద్వాజమహర్షియు, ఆమహర్షి పుత్రశిష్యవర్గంబును వచించిన డెబ్బదియైదు సూక్తంబులు చేరి షష్ఠమండలమై కానబడుచున్నది. సప్తమమండలము వాసిష్ఠమండలమని పేరుపొందియున్నది. ఇందలి నూటనాలుగు సూక్తంబులు వసిష్ఠమహర్షియు, ఆమహర్షి పుత్రులును వచించియున్నారు. అష్టమము ప్రాగాథమండలమని ఎరుంగబడుచున్నయది. కణ్వాదు ఋషిపుంగవులును, శిష్యవర్గంబును గానముచేసిన సూక్తంబులుచేరి, ఈమండలం బయ్యె. ఇందు నూటమూడు సూక్తంబులు కానబడుచున్నవి. తొమ్మిదవ మండలము మిశ్రమండలము ఆయది సోమపవమానమండలమని పేర్కొనబడియున్నది. ఎల్ల ఋషులును సోమపవమానదేవత నుద్దేశించి వచించిన సూక్తంబులెల్లచేర్చి ఈమండలము ఏర్పరచిరి. ఇందు నూటపదునాలుగు సూక్తంబులు కానబడుచున్నవి. ప్రథమ మండలమువలెనే పదియవమండలముకూడ మిశ్రమండలము. ఇందలి నూటతొంబదియొకండు సూక్తంబుల వచించినఋషులు, ఒకరికొకరు సంబంధము లేనివారై యున్నారు.

## ఋగ్వేదము – దానిఘనత

ఋగ్వేదము అపౌరుషేయ మని చెప్పుదురు. అనగా ఈవేదము పురుషులచే నిర్మింపబడినది కాదు. స్వతస్సిద్ధముగనే కలిగినదని భావము. అందువలన ఆ గ్రంథమును అప్రతిహత ప్రమాణమని చెప్పుదురు. ఈ వేదము నిత్యశబ్దంబుగ నున్నను ఆయా ఋషులచే దృష్టింపబడి గీతరూపంబుగ వచింపబడియె. ఈవిషయము తర్కించి సాధించుటకు సాధ్యమై యున్నను, ఆతర్కవిచారమునకు ఈవ్యాసము తగినదైన రంగము కానేరదు. కాలాతీతములో నిత్యశబ్దంబుగ పరిణమించుచుండిన ఈవేదము కాలావధిలో ఋషులచే గీతరూపంబుగ పాడబడినదై మరల లోకమునందు ప్రచురంబయ్యె. ఆకాలంబున వ్రాత తెలియని కారణంబున ఈ చతుర్వేదంబులు ముఖపాఠముగానే అనేకశతాబ్దములు పరిణమించుచుండెను.

ఈఋగ్వేదమునకు ప్రమాణాధిక్యము కలుగుటకు నిత్యశబ్దరూపంబుగ పరిణమించు చుండెనని చెప్పుటయేకాక మరికొన్ని ప్రత్యక్ష కారణంబులు కానబడుచున్నవి. ఈఋగ్వేదమునందు దైవిక సూక్తంబులు కొన్ని కానబడుచున్నవి. ఆ సూక్తములు ఇంద్రియాతీతవిషయములను తెలుపుచున్నవి. ఆ సూక్తములు దశమమండలమున కానబడుచున్నవి. ఆ సూక్తములలో జగత్సృష్టి తెలుపబడియున్నది. జగత్సృష్టిని గురించి ఇటుపైని చర్చించుసందర్భమున ఆవిషయము తెలుపబడును. మరియు ఋషులు సూక్తంబుల గానము చేసినపుడు ఆయాదేవతలు ప్రత్యక్షులై ఆ ఋషులతో సంభాషించి, వారిచే సోమపానాదులు గ్రహించి, ఆ ఋషులు వేడిన సహాయంబు లొసగుచుండి రని ఈ ఋగ్వేదసూక్తంబులు స్పష్టంబుగ తెలుపుచున్నయవి. మరియు, ఇంద్రాదిదేవతలే ఋషుల ప్రార్థనల నంగీకరించి ప్రత్యక్షులై ఆర్యులను నశింపనియుండిన దాస్యుల బలమును భంగపరచి ఆర్యులను కాపాడినట్లు ఋగ్వేదము మనకు తెలుపుచున్నయది. మరియు దేవతలను పిలిచి వారలతో స్నేహభావంబుగ మెలగుచుండెడి మహనీయులగు మహర్షులు సత్యముకాని విషయంబులను చెప్పి లోకమును మోసపుచ్చుటకు వారల కట్టి యుద్దేశ్యము కానరాదు. మరియు ఋగ్వేదము, ఇతరమతముల వలె ఏకపురుషుని వాక్యముగ నిలచియుండలేదు. అనగా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బౌద్ధమతము బుద్ధునిమాటమీదనే నిలిచియున్నది. జైన మతము మహావీరుని మాటమీదనే నిలిచియున్నది. క్రీస్తు మతము, మహమ్మదీయ మతము, పారసీమతము, చీనా మతము- ఈమతము లన్నియును క్రీస్తు, మహమ్మదు, జోరాస్టరు, కనుఫ్యూసియసు అను మతోద్ధారకు లను వారి ఏకపురుషవాక్యముగనే నిలిచియున్నవి. ఆమతో ద్ధారకునిమాట విశ్వసింపకపోయిన ఆయా మతములందు గౌరవము నీటియావిరివలె ఎగిరిపోవును. మన ఋగ్వే దమున కట్టి దుర్దశ సంభవింపనేరదు. ఇంచుమించుగ మున్నూటిసంఖ్యకు దగ్గరగనుండు మహర్షులు ఒకరి కొకరు సంబంధములేక, వా రందరును ఏకగ్రీవముగ వచించిన వాక్యంబులు ఎల్లవిధంబుల విశ్వసనీయములే గాని వేరువిధము గానేరదు. ఋగ్వేదమునందు మరి యొకవిషయము కానబడుచున్నది. ఇతరమతములలోను, మన పురాణంబులలోసువలె నమ్ముట కసాధ్యమైన విషయ మేమియు కానరాదు. ఏమనుజుడును దేవలో కంబులకు పోయి, అక్కడివిషయము లెల్ల చూచివచ్చి నట్లు ఋగ్వేదంబున ఎక్కడను చెప్పబడియుండలేదు. దేవతలు ప్రత్యక్షమగుట నమ్మదగినదేనా యని విచా రించిన, ఈ కలియుగమునందు గూడ భద్రాచలరామ దాసుని మొరాలకించి శ్రీరామమూర్తి తురుష్క ప్రభు వగు తానీషాకు కానబడి ఆయప్పు తీర్చినసంగతి ఆంధ్ర దేశీయుల కందరికి స్పష్టముగ తెలిసినవిషయమే. దేవ తలు ఇట్టి ప్రత్యక్షదర్శనము పలుదేశంబులలో పలుజను లకు చూపియున్నారు. దేవతలు ప్రత్యక్షులగుట నమ్మ కమున కసాధ్యము కానేరదని దృఢముగ వక్కాణింప వచ్చును. ఆస్తికులు ఈవిషయము మిక్కిలి సహజమైన విషయమని నమ్మియే యున్నారు.

## ఋగ్వేద దేవతలు

దేవతలు ముప్పదిమువ్వురని ఋగ్వేదము సామా న్యముగ తెలుపుచున్నది. ఈముప్పదిమూడు అనుసంఖ్య లో ఎల్లప్పుడు ఏకముగ నుండు దేవతల సమూహము ఒకటిగనే గణించినట్లు తెలియుచున్నది. మరుత్తులు నలువదితొమ్మండ్రని వేదమే చెప్పుచున్నది. అశ్వినులు కవలలు; ఎల్లప్పుడును ఇద్దరు ఏకముగనే యుండురు. ద్యావాపృథివి దేవదంపతులు. వీరును ఎల్లప్పుడు ఏక ముగనే యుండురు. ఇట్టిదేవతలను ఏకముగ గణించి ముప్పదిమూడు దేవతలని ఋగ్వేదము తెలుపుచున్నది.

ఈ ముప్పదిమూడు దేవతలలో పదునొకండు గురు స్వర్గాద్యుపరిలోకమందును, పదునొకండుగురు అంతరిక్షమను మధ్యమలోకమందును, మరి పదునొకండు గురు భూలోకమందును పాలించుచుందురు. ఈమూడు తరగతులుగ ఏర్పడిన దేవతలు, ఆదిత్యులు, రుద్రులు, వసువులని తెలియబడుచున్నారు. ఈదేవతలలో అధి కులు తక్కువవారని తారతమ్యము కలదని ఋగ్వేదము స్పష్టముగ తెలుపుచున్నయది. దేవతల గుణములను తెలుపునపుడు ఈ తారతమ్యప్రకారముగ దేవతా స్తోత్రము చేయబడును.

ఈఋగ్వేదదేవతలలో కొందరు దేవతలను ఋషు లెల్లప్పుడు కొనియాడుచు, మరికొందరిని ఒకా నొకప్పుడు ప్రశంసించుచుందురు. సాధారణముగ నెల్ల ప్పుడు కొనియాడబడు దేవతలు అగ్ని, ఇంద్రుడు, సోముడు, ద్యావాపృథివి - విష్ణు, సవితృ, వాయు, బృహస్పతి, పూష, రుద్ర, యమ, మరుత్తులు - అశ్వి నులునై యున్నారు. ప్రశంసాధిక్యము లేని దేవతలను గురించి ఇందు విశేషముగ తెలుపబడదు.

పై నుదాహరింపబడిన దేవతలలో అగ్ని, ఇంద్ర, సోములు సామాన్యముగ నెల్లఋషులచే కొని యాడబడియున్నారు. ఇతరదేవతలలో కొందరు ఋషులు కొందరు దేవతలను విశేషముగ కొనియాడి యున్నారు. అట్లు కొనియాడబడిన దేవతలు ఆఋషుల నిష్టదేవత లని యూహింప నాస్పద మన్నది.

### ౧. అగ్ని

ఎల్ల దేవతలలో అగ్నిదేవుని ఆర్యులందరును తమ కుటుంబదేవతగ పూజించుచుండిరి. ప్రతిదినము త్రికాల ములందును ఈ యగ్నిదేవుని ఆర్యులు ఆరాధించు చుండిరి. ఈపద్ధతి నేటివరకును మిక్కిలి శ్రద్ధకలిగిన వైది కులఇండ్లలో జరుగుచునే యున్నది. సామాన్యముగ నవీన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలమందు కూడ ఆర్యుల ఇండ్లలో ఉపనయన వివాహాది విశేష కార్యంబులు జరుగునపుడు అగ్ని దేవుని పూజ జరుపుదురు. ఇప్పటి యార్యులు ఆ మహనీయు లగు ఆర్యఋషుల సంతతివారని చెప్పుటకు ఈయగ్ని దేవుని పూజ యొకటియే కానబడుచున్నది.

అగ్ని దేవుడు కుటుంబమును క్షేమముగ కాపాడు దేవుడనియును, ధనధాన్యసంపద లొసంగు దేవుడనియును ఈ దేవుని ఆర్యఋషులు కొనియాడి ఆరాధించుచుండిరి. నూటతొంబది మూడు సూక్తంబుల అగ్ని దేవుని ఋషులు కొనియాడియున్నారు.

మనయార్యుల భ్రాతృశాఖకు చేరిన పారసీలు, ఇప్పటికిని అగ్ని దేవతయే ముఖ్యదేవతగ మిక్కిలి శ్రద్ధాభక్తులతో ఆరాధించుచున్నవారు. ఆ యగ్ని దేవ ప్రసాదముచేత ఆ యార్యశాఖవారు ధన సంపదలతో లోకమందు మిక్కిలి ఘనతవహించియున్నారు. మనహిందూ ఆర్యులు అగ్ని దేవుని పూజ మరచి ఇప్పటి దురవస్థ స్థితిలో నుండుచున్నారు.

## ౨. ఇంద్రుడు

ఋషులు ఇంద్రుని మిక్కిలిగ కొనియాడియున్నారు. అందరు దేవతలలో ఈ ఇంద్రదేవునే అత్యధికముగ ఋగ్వేదఋషులు కొనియాడియున్నారు. ఋగ్వేదమునందు ఇంద్రుని స్తుతించిన సూక్తములు ఇన్నూటనలువదిరెండు, ఇంద్రుడు మిక్కిలి బలమును, శౌర్యమును గలదేవత ఆర్యులు పంచనదీతీరమందు కుదురుపడుకాలములో అనార్యులగు దాస్యులు ఆర్యులను నిర్మూలముచేయ సమకట్టియుండిరి. ఆర్యులకంటె దాస్యులు బలముకలవారై యుద్ధనైపుణ్యము చక్కగ నెరిగియుండిరి. వారిచే చుట్టబడియుండు ఆర్యులు దైవసహాయము లేక బ్రతుకజాలకుండిరి. కాన యుద్ధకాలంబులందెల్ల ఋషులు ఇంద్రుని స్తోత్రముచేసి పిలిచి, ఇంద్రునిచే దాస్యుల నోడించి, ఆదాస్యుల కోటలును, రాజ్యమును, ధనమును ఆర్యరాజులు గ్రహించి తమ రాజ్యమును పెంపుజేసుకొనుచుండిరి. ఇంద్రుడు యుద్ధదేవత; మిక్కిలి స్తోత్రప్రియుడు. ఋషులొసంగిన సోమపానంబులు గైకొని, వేడిన వరంబు లొసగి ఆర్యజాతిని కాపాడిన దేవుడు ఇంద్రుడేను. పిలిచినప్పుడెల్ల ప్రత్యక్షుడై, స్వయముగ యుద్ధము జరిపి, దాస్యసైన్యమును రూపుమాపి, దాస్యుల కోటలను పడగొట్టినట్లు సూక్తంబులు వక్కాణించుచున్నవి. కొన్నిసమయంబుల ఇంద్రునికి సహాయముగ విష్ణువును, బృహస్పతియు, అగ్ని దేవుడును, మరుత్తులును తోడుపడినట్లు ఋగ్వేదము తెలుపుచున్నది. ఇంద్రుడు భక్తులకు విశేషముగ ధనమును, ఐశ్వర్యమును ఇచ్చు దేవత.

ఆర్యజాతిని పీడించుచుండిన దుష్టరాక్షసులగు వృత్రుడు, వలుడు, కణారుడు, అర్బుదుడు మొదలుగాగల రక్కసులనుగూడ రూపుమాపి ఆర్యజాతిని కాపాడిన దేవుడు ఇంద్రుడేను. ఆమహత్తమైన ఋగ్వేదకాలమప్పుడు, ఇంద్రుడు కుత్సరాజునకై శుష్ణుడను అసురుని కోటలను పడగొట్టి కుత్సరాజుచేతనే యా యసురుని చంపించెను. దివోదాసరాజు కొరకు శంబరుడను అసురుని జంపెను. శంబరుడు కొండలపై కోటలను గట్టి దివోదాసరాజ్యమును పాడుచేయుచుండెను. దివోదాసుని కులగురువగు భరద్వాజ ఋషి ప్రార్థింపగ ఇంద్రుడు ప్రత్యక్షమై శంబరుని కోటలను పడగొట్టి, ఆయసురుని జంపి, అతని భాగ్యమంతయు ఇంద్రుడు దివోదాసున కొసగెను. మరియు, దివోదాసుని కొరకే కరంజ, పర్ణయ యను అసురులను కూడ ఇంద్రుడు సంహరించెను.

మరియు రిజిస్వుండను రాజుకొరకు ఇంద్రుడు వంగ్రిద, పిప్రు, మృగయ యను అసురుల కోటలనేకములు భూమిచదరముచేసి, ఆ యసురుల రూపుమాపి రిజిస్వుని రక్షించెను. దధీతియను రాజునకై చుమురి, ధుని యను అసురుల కోటలు ధ్వంసముచేసి ఆయసురులను యమపురికి పంపెను.

పూరురాజునకై దాస్యుల కోటలను ఇంద్రుడు పడగొట్టెను. మరల పూరుని వంశజుడగు పురుకుత్స రాజుకొరకు కూడ ఇంద్రుడు దాస్యుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోటలను విరుగగొట్టెను. తుజియను రాజును రక్షించు కొరకు ఇంద్రుడు వేతసుతుగ్రయను అసురులను యమ లోకమునకు పంపెను. ఆర్యజాతిని ఇంద్రిదివలె ఇట్లు కాపాడిన ఇంద్రదేవుని యారాధనకాలక్రమమున ఆర్యుల సంతతివారు ఉపేక్షించి, ఆమహనీయుడగు దేవుని మరచిరి. ఆదోషముచేతనే ఇటీవల వచ్చిన ఆర్యరాజులు యుద్ధమునందు పరాజితులై పరరాష్ట్రి రాజవశులై, పరరాష్ట్రిరాజాజ్ఞకు లోబడినవారై మెలగవలసివచ్చె. ఇంద్రుని ఆరాధించిన ఈదురవస్థ తప్పకపోవును.

## 3. సోమదేవుడు

ఋగ్వేదఋషు లందరును సోముని కొనియాడి సూక్తంబుల వచించిరి. సోమదేవుడు చంద్రమండలాధి పతి. సోముడే సస్యముల కధిపతి. సోమరసము నొసగు లతకును "సోమ"మనియే పేరిడిరి. వృక్షజాతిలో సోమ రసము నొసగులతయే వృక్షరాజ మని తలచుచుండిరి. చంద్రమండలాధిపతికిని, వృక్షజాతికి రాజుగ నెన్న బడిన సోమలతకును "సోమ" మను ఏకనామధేయ ముండుటచేత వేదఋషులు సూక్తంబులందు చంద్ర మండలాధిపతికిని, సోమలతకును అభేదంబుగ స్తోత్రంబు చేయుచుండిరి. ఈవిషయము తొమ్మిదవమండల మగు "సోమపవమాన" మండలమందు చక్కగ తెలియు చున్నది. నూటపదునాలుగు సోమపవమాన సూక్తంబులు కానబడుచున్నవి. ఆయురారోగ్యమును, ధనము, ధాన్య మును, సంతతియు, కీర్తియు నొసంగుదేవు డని సోమదే వుని ఋగ్వేదము తెలుపుచున్నది. సోమదేవుడు అన్న మున కధిపతి యనుటచే సోమదేవుని భజించినవారికి అక్షయముగ అన్నము లభించును.

## ౪. ద్యావా పృథివి

ఆకసమునకును, భూమండలమునకును ద్యావా పృథివిదేవతలు అధిపతులై యున్నారు. ఈ దేవతలు భార్యాభర్తలు. పృథివి, భూదేవి, భార్య; ద్యౌసను దేవుడు ఆకసమున కధిపతి; భర్త. ఈ దేవ దంపతులు దేవతల కందరికి మాతాపితలని ఋగ్వేదము తెలుపు చున్నది. ఆయురారోగ్య సంపదలకొరకును, అన్నము జ్ఞానముకొరకును ఈదేవతలను ఋషులు ఆరాధించు చుండిరి. ఈదేవతలు మిక్కిలి దయార్ద్రమనస్కులని కొనియాడియున్నారు.

## ౫. విష్ణువు

విష్ణువే జగత్కర్తయనియును, జగత్తును మూడం తస్తులుగ విభజించిన దేవుడనియును, ముల్లోకములను కొలచినవాడనియును, ముల్లోకముల కధిపతియనియును ఋగ్వేదము విష్ణువుగురించి తెలిపియున్నది. మరియు, శాశ్వతమగు ఉత్తమలోకనాయకుడు విష్ణువే యనికూడ ఋగ్వేదము తెలుపుచున్నది. వేదఋషులు శాశ్వతమగు విష్ణులోకమును పొంది అందు శాశ్వతానందపదమును అనుభవింపకోరుచుందురు. ఈ ఋగ్వేదము ననుసరించి యే "తద్విష్ణోః పరమపదం" అని ఉపనిషత్తులు చెప్పు చున్నవి.

విష్ణువును గురించి ఏడు సూక్తములు కానబడు చున్నవి.

## ౬. సవితృ

సూర్యమండలమం దాసీనుడై కొలువుతీరియున్న విష్ణువే సవితృదేవు డని ఋగ్వేదము తెలుపుచున్నది. విష్ణువును వర్ణించిన గుణములనే సవితృనందు కూడ ఋగ్వేదము ఆరోపించుచున్నది. భూమియం దుండు జీవరాసులకు సూర్యమండలమం దున్న సవితృదేవుడే ప్రాణము, బలము, శక్తి నొసంగు దేవుడని ఋగ్వేదము తెలుపుచున్నది. సవితృదేవుడే దేవతల కధిపతియనియు, దేవతలందరు సవితృని ఆజ్ఞకులోబడి వర్తింతురనియు ఋగ్వేదము స్పష్టముగ తెలుపుచున్నది. ఇప్పుడు మన హిందూదేశమందు ద్విజులు ప్రతిదినము పఠించుగాయత్రి మంత్రము సవితృదేవునిగురించిన స్తోత్రమేను. సవితృ దేవుని గురించి పది సూక్తంబులు కానబడు చున్నవి.

## ౭. వాయుదేవుడు

ఋగ్వేదము వాయుదేవుని మిక్కిలి గొప్పదేవు నిగ కొనియాడి యున్నది. దేవతలందరిలో వాయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవుడు ప్రథముడనియును, ఆయురారోగ్యములను, ధనమును అమితముగ నిచ్చు దేవుడనియును వాయుదేవుని ఋగ్వేదము కొనియాడుచున్నది. అమృతము నొసంగు శబరదుఘయను కామధేనువు వాయుదేవునివద్దనే యున్నది. వాయుదేవుడు భక్తులను ఈ భూలోకమందును, పరలోకములందును రక్షించు దేవుడని ఋగ్వేదము తెలుపుచున్నది.

ఈఋగ్వేదము ననుసరించియే వాయుదేవుడు పంచవాయురూపమున మన శరీరము కాపాడుచున్నాడని ఉపనిషత్తులు తెలుపుచున్నవి.

వాయుదేవునిగురించి పదమూడు సూక్తంబులు ఋగ్వేదంబున కానబడుచున్నవి.

## ८. ఆదిత్యులు

కొందరు దేవతలు ఆదిత్యు లనబడుదురు. ఆదిత్యు లనగా అదితిపుత్రులని యర్థము. అదితిదేవి భర్త దక్షుడు. ఋగ్వేదమునందు ఆదిత్యులని ఏడు లేక ఎనిమిది దేవతలపేర్లు తెలియుచున్నవి. మిత్ర, వరుణ, ఆర్యమణ యను దేవతలు ఆదిత్యులని ఋగ్వేదము పలు సూక్తంబుల చెప్పుచున్నది. మరియు అంశ, భగ, పూష, దక్ష అనికూడ అక్కడక్కడ కానబడుచున్నది. ఈ ఆదిత్యులలో మొదట నుదాహరించిన ముగ్గురు దేవతలనే ఋగ్వేదము విశేషముగ కొనియాడియున్నది.

మిత్రుడు భక్తులయందు మిత్రభావము కలిగి రక్షించువాడని ఋగ్వేదము తెలుపుచున్నది.

వరుణుడు దేవరాజనియు, ధర్మనియామకుడనియు, పాపులను శిక్షించుదేవు డనియు, ప్రార్థించు వారలకు పాపము తొలగించి రక్షించువా డనియు ఋగ్వేదము చెప్పుచున్నది. అర్యమణుడు ప్రాతఃకాలమునకు అధిపతిదేవత. భజించువారలకు అధికముగ లాభము నొసంగు దేవుడు.

## ౯. పూష

పూష యను దేవుడు ఆదిత్యులలో చేరిన దేవతయైనను, వేదఋషులు ఈదేవుని విశేషభక్తితో ఆరాధించుచుండిరి. ఈదేవుడు మార్గంబులను ప్రయాణస్థులను పశ్వాశీవులను, పశువులమేతయగు బీడుభూములను కాపాడుదేవుడు. భజించువారలకు దండిగ అన్నమొసగి పుష్టిని కలిగించు దేవుడు. పూష మేషవాహనుడు దక్ష, భగ, అంశ, మార్తాండులు కూడ ఆదిత్యులలో చేరిన దేవతలేను.

## ౧౦. బృహస్పతి

ఈదేవుని బ్రహ్మణస్పతియనికూడ నామాంతరములో పిలుచుచుండిరి. ఋగ్వేదమునందు బృహస్పతి యని ఎరుంగబడు దేవుడే పురాణములందు బ్రహ్మ లేక చతుర్ముఖ బ్రహ్మయని ఎరుంగబడుచుండెను. బృహస్పతిదేవుని రాణి సూనృతాదేవి. బృహస్పతి ఇతర దేవతలకును, వేదములకును తండ్రి యని ఋషులు కొనియాడుచుండిరి. బృహస్పతి భక్తులకు అన్నము, ధనము, ఉత్తమజ్ఞానము నొసంగుదేవుడనియు, ధర్మముగ చరించు వారలకు రక్షకుడనియు ఋగ్వేదము తెలుపుచున్నయది.

బృహస్పతిని గురించి తొమ్మిది పూర్ణసూక్తములును, పదునొకండు సూక్తములలో కొన్ని ఋక్కులును వ్రాయబడుచున్నవి.

## ౧౧. రుద్రుడు

ఉత్తమఔషధములకు అధిపతిదేవుడు రుద్రుడని ఋగ్వేదము తెలుపుచున్నది. దేవవైద్యుడు. మిక్కిలి బలిష్ఠుండగు దేవుడు. భక్తులకు ఆయురారోగ్యంబులును, బలమును, సుఖసంతోషంబులను రుద్రదేవుం డొసంగునని ఋగ్వేదము కొనియాడి యున్నది. రుద్రుడు రౌద్రుడుగ నుండుదేవు డగుటచే శాంతుడుగ నుండ రుద్రుని ప్రార్థించుచుండిరి.

రుద్రదేవుని రాణి రోదసిదేవి. రుద్రుడు పృశ్ని యను దేవినికూడ భార్యగ పొందియుండెను. పృశ్నిదేవి గర్భసంజాతులే మరుత్తులు.

ఋగ్వేదమునందు మూడు రుద్రసూక్తములు కానబడుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### ౧౨. మరుత్తులు

మరుత్తులు నలువదితొమ్మండ్రు దేవతలు. ఎల్లప్పుడు ఏకసంఘముగనే యుందురు. ఈదేవతలు రుద్రదేవుని పుత్రులు. పృశ్నిదేవి మరుత్తుల తల్లి. ఒకానొక సూక్తమందు మరుత్తులు వాయుదేవుని పుత్రులనికూడ చెప్పబడియున్నది. ఈదేవతలు తుపానులకు అధిపతులు. ఆరోగ్యము నొసగు దేవతలు. ఇంద్రుని మిత్రులు. భక్తులనెల్లప్పుడు కాపాడు దేవతలు. భక్తులకు బలమును, బలిష్ఠులగు పుత్రులను, విశేషధనంబును ఒసంగు దేవత లని మరుత్తులు కొనియాడబడియున్నారు. లేళ్లు మరుత్తుల వాహనములు.

### ౧౩. సూర్యుడు

సూర్యమండలమున కధిపతి సూర్యుడు. ఋగ్వేదమునందు సూర్యుడు రోగనివారకుడనియును, కష్టంబులును, పరాభవంబులును తొలగించువాడనియును చెప్పబడియున్నది. యుద్ధకాలమందు సూర్యుని వేడిన జయము కలుగజేయును. ఐశ్వర్యమును కూడ నొసంగు దేవుడు. పదిమూడు సూక్తంబులలో సూర్యుడు స్తుతింపబడియున్నాడు.

### ౧౪. వైవస్వుడు (?)

ప్రాతఃకాలమందు సూర్యమండలమం దుండు దేవుడు వైవస్వుడని ప్రార్థించుచుండిరి. ఈవైవస్వుడే యముని పిత. అశ్వినులుకూడ వైవస్వుని పుత్రులేను.

### ౧౫. యముడు

యముడు వైవస్వుని కుమారుడు. పితృలోకనాయకుడు. పాపపుణ్యంబులను విచారించి పాపులను శిక్షించు దేవుడు. పుణ్యాత్ములను పుణ్యలోకంబులకు పంపును.

### ౧౬. అశ్వినులు

ఈదేవతలు కవలలు; వైవస్వుని పుత్రులు, యముని తమ్ములు. వీరెల్లప్పుడు ఏకముగనే యుందురు. వీరలు మిక్కిలి రూపవంతులు. సూర్యుని పుత్రి యగు సూర్యాదేవిని, అశ్వను లిరువురు వివాహమాడి, ఆ సూర్యాదేవినికూడ తమ రథంబున నెక్కించుకొనిపోవుచుందురు. అశ్వినులు భక్తులయందు అత్యంతప్రీతి గలవారు. భక్తులకు సంభవించు కీడులనెల్ల తొలగించుచు, వారలు కోరిన కోరికలెల్ల నెరవేర్చుచుందురు. వేదఋషు లెల్లరును కష్టకాలమందు అశ్వినులనే ప్రార్థించుచుండిరి. ధనధాన్యంబులును, ఆయురారోగ్యంబులను, అశ్వినులు భక్తుల కొసంగుచుండిరి. ఈ దేవతలు చేసిన అనే కోపకారంబులను ఋషులు అనేకసూక్తంబులంగు తెలుపుచు అశ్వినులను స్తోత్రముచేసి యున్నారు. భుజ్యు, కర్కండు, అత్రి, పురుకుత్సుడు, వసిష్ఠుడు, సృతార్యుడు, దీర్ఘతముడు, దీర్ఘశ్రవసుడు, కాక్షీవానుడు, అంతకుడు, వయ్యు, సుచంతి, దివోదాసాది-అనేక రాజులకు, ఇంక అనేకులకు ప్రత్యక్షమై అశ్వినులు వారివారి కష్టంబుల తొలగించి, వారివారి కోరికల నొసంగి రక్షించుచుండిరి. ఎల్లరు ఋషులును అశ్వినుల నారాధించి, వారివలన మేలును పొందియే యున్నారు. ఈ దేవతలు చేసిన యుపకారంబుల నెల్ల తెలుప ఇక్కడ నవకాశము లేనందున ఇంతటితో ఈవిషయము ముగింపబడుచున్నది.

### ౧౭. మరికొందరు

మరికొందరు దేవతలనుకూడ ఋగ్వేదము తెలుపుచున్నది. పర్జన్యుడు ఇంద్రుని తమ్ముడు; వర్షముల కధిపతి దేవత.

త్వష్ట దేవశిల్పి. బృహద్దివాదేవి త్వష్టదేవుని దేవి. భారతిదేవి త్వష్ట కూతురు. వాయుదేవుడు త్వష్ట అల్లుడు. ఈదేవుడు గర్భమందుండు పిండమును కాపాడును.

అహిబుధ్న్యయ యను దేవుడు సముద్రంబుననుండు దేవత. వనస్పతి దేవత వృక్షజాతిని కాపాడు దేవత.

పర్వతయను దేవుడు పర్వతముల కధిపతి.

(సశేషము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## లాంఛనములు

మల్లాది రామకృష్ణశాస్త్రి

౧. ప్రియావిరహకవి :

(అసలుపేరు సాహసాంకుడని సదుక్తికర్ణామృతమువలన తెలుస్తూఉన్నది. చక్రవాకవిరహవర్ణనమున ఈ లాంఛనము అమరిఉండవచ్చునని తోచుచున్నది.)

దీనం రాతి నిరీక్ష్య తత్ర సవితు
ర్బింబం సముత్కో మహు
శ్చుంచ్వా మార్ష్టి పురఃస్థితాం సహచరీం
దుఃఖేన మందోద్యమామ్,
అస్తం యాస్యతి భాస్కరోఽయ ముదయా
దిత్యాకుల శ్చేతసా
చక్రాహ్వో నసుఖం దివాపి లభతే
ధి గ్దుఃఖితాన్ కామినః.
పక్షౌ వ్యుత్క్షిపతి క్షితౌ నిపతతి
క్రోడం నభౌ రుల్లిఖ
త్యుద్బాష్పేణచ చక్షుషా సహచరీం
ధ్యాయ న్ముహు ర్వీక్షతే,
చక్రాహ్వో దివసావసానసమయే
తత్తత్కరో త్యున్మనా
యేనాలోహిత మండలోఽపి
కృపయా నాస్తం రవి ర్గచ్ఛతి.

(సుభాషితావళి ౧౮౨౦,౨౧)

౨. వృద్ధి (వృద్ధకవి ?)

నాలేనేవ స్థిత్వా
పాదేనైకేన కుంచితగ్రీవమ్,
జనయతి కుముదభ్రాంతిం
వృద్ధబకో బాలమత్స్యానామ్.

(శార్‌ఙ్గధరపద్ధతి ౮౪౫)

(ఈ పద్యము సుభాషితావళిలోకూడ ఉదహరింపబడినది. 'వృద్ధబకీ' అని ఆఫ్రేఖ్ట్ పండితుని పాఠము:—ఉత్తరార్ధాన్ని చాలావ్యాకరణగ్రంథములు ఉపయోగించుకున్నవి:— సంక్షిప్తసారం vii-౭౨; దుర్ఘటవృత్తి ii-౧-౬౫; శబ్దకౌస్తుభం, పే. ౬౨౩;— కాని అన్నిటిలోనూ 'ధూర్తబకః' అన్నపాఠము కనబడుతూన్నది :

3. జఘనస్థలీఘటకుడు (అర్గ్గతాచార్యుడు)

వపు రనుపమం నాభేరూర్ధ్వం విధాయ మృగీదృశో
లలితలలితై రంగన్యాసైః పురా రభసాదివ,
తదను సహసా ఖిన్నేనేవ ప్రజాపతినా భృశం
పృథులపృథులా స్థూలస్థూలా కృతా జఘనస్థలీ.

(నమిసాధువు, రుద్రటకావ్యాలంకారటీకలో ఈపద్యాన్ని ఉదాహరించినాడు. XI-౭.)

౪. రుదతీపండితుడు.

విశ్రాంతో దివస స్తటీ మయ మట
త్యస్తాచల స్యాంశుమాన్
సంప్ర త్యంకురితాంధకారపటలైః
లంబాలకా ద్యౌ రభూత్,
ఏ హ్యా స్తర్విశ వేశ్మనః శశిముఖి
ద్వారస్థలీతోరణ
స్తంభాలంబితబాహువల్లి రుదతీ
కిం త్వం పథః పశ్యసి.

(నద్యృతశ్చ(పా. ౫-౪-౧౫౩)అన్నసూత్రాన్ని అనుసరించి విధిగా కప్రత్యయము చేరి- స్తంభాలంబితబాహువల్లీకే-కావాలిసింది. కాని - సమాసాంతవిధి రనిత్యః- అనేపరిభాష ఆసలాలో సరిపోతూంది అని శ్రీమతి మాలతీసేన్, ఎం. ఎ. అభిప్రాయం. ద్వారస్థలీతోరణ రెండుమాటలకీ అర్థం సమానమే. మరి, ఈ సమాసవిధానాన్ని ఏలా సమర్థించాలో ?)

౫. నేత్రత్రిభాగయశస్వామి

వ్రీడాయోగా న్నతవదనయా సన్నిపాతే గురుణాం
బద్ధోత్కంపం స్తనకలశయో ర్మన్యు మంతర్నియమ్య,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్విష్టేష్వ్యక్తం కిమిప నతయా యత్ సముత్సృజ్య బాష్పం
మ య్యాసక్త శ్చకితహరిణీహారినేత్రత్రిభాగః

౬. చంద్ర (హిమకరకర) కవి

జలధర జలభరనకరై
రపహర పరితాప ముద్ధతం జగతః,
నోచే దపసర దూరం
హిమకరకర దర్శనం వితర.

౭. కపోలకవి

ద్విధా విధాయ శీతాంశుం
కపోలౌ కృతవాన్ విధిః
తన్వ్యాః తద్రసనిష్యంద
బింద్వో రదనావళీ.

౮. కర్ణోత్పలుడు

అంసాకృష్టదుకూలయా సరభసం
గూఢౌ భుజాభ్యాం స్తనా
వాకృష్టే జఘనాంశుకే కృత మధః
సంసక్త మూరుద్వయమ్,
నాభీమూలనిబద్ధచక్షుషి తయా
వ్రీడానతాంగ్యా ప్రియే
దీపః ఫూత్కృతివాతవేపితశిఖః
కర్ణోత్పలే నాహతః.

౯. అపిదేవుడు

క్వచిదవ రవి ర్జాడ్యచ్ఛేది క్వచిత్ ప్రచురాచిర
ద్యుతిరివ చమత్కారి క్వాపి క్షుపాకరవ న్మృదు,
శిఖివ దన్యజ్ఞ క్వాపి క్వాపి ప్రదీపవ దుజ్జ్వలం
విజయి కిమపి జ్యోతిః సారస్వతం త దుపాస్మహే.

౧౦, నవకరకవి (నవీన ?)

నిరానందాః కౌందే మధుని పరిభుక్తోజ్ఝితరసే
వనే ష్వంభోజానా మనికృతసుఖేషు ప్రతిహతాః,
ఇదానీం చూతానాం ముకుళమధుషు ప్రేమసరసా
నవీనే ష్వాసూతం దధతి పరిగాఢం మధులిహః.

౧౧. పికనికరకవి

వసంతాగ్నౌ మగ్నా చిరవిరహరుగ్ణా సహచరీ
యది ప్రాణాన్ మంచే త్తదిహ వధ భాగీ భవతు కః
కమోవా స్నేహోవా కుసుమసమయోవేతి విమృశ
న్నుహీతి ప్రవ్యక్తం పికనికర ఝంకార మశృణోత్.

౧౨. భవభీతుడు

మహాశయ్యా భూమి ర్మసృణ ముపధానం భుజలతా
వితానం చాకాశం వ్యజన మనుకూలోఽయ మనిలః,
స్ఫురద్దీప శ్చంద్రః సురభివనితాసంగముదితః
సుఖం శాంతః శేతే నను చ భవభీతో నృపఇవ.

౧౩. భేరీభ్రమరకవి

రంభోరు క్షిప లోచనార్ధ మభితో
బాణాన్ వృథా మన్మథః
సంధత్తాం ధను రుజ్ఝతు క్షణ మితో
భ్రూవల్లి ముల్లాసయ,
కిం చాంతర్నిహితానురాగమధురా
మవ్యక్తవర్ణక్రమాం
ముగ్ధే వాచ ముదీరయాస్తు జగతో
వీణాసు భేరీభ్రమః.

(సదుక్తికర్ణామృతం ౨-౪౯-౧)

౧౪. మలయజకవి

క్వచ మలయజతటీజన్మస్థానం క్వ చేచ వనేచరాః
క్వఖలు పరశుచ్ఛేదః క్వాసౌ దిగంతరసంగతిః,
క్వచ ఖరశిలాపట్టే ఘృష్టిః క్వ పంకసరూపతా
మలయజసఖే మాగాః ఖేదం గుణా స్తవ వైరిణః.

౧౫. వాగీశాచార్యుడు :

అతంత్రీ వాగ్వీణా స్తనయుగళమగ్రీవ కలశా
వనబ్జం దృక్నీలోత్పలదళ మపత్రోరుకదళీ,
అకాండా దోర్వల్లీ వదన మకలంకః శశధర
స్త దస్యా స్తారుణ్యం భువనవిపరీతం ఘటయతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౬. మార్జారకవి

ప్రత్యూషే గురుసన్నిధౌ గృహశుకే
తత్ర ప్రహోజల్పితమ్
ప్రస్తోతుం పరిహాసకారిణి పదై
ర్గర్భోద్గితై రుద్యతే,
క్రీడాశారికయా నిలీయ నిభృతం
త్రాతుం భయార్తా వధూం
ప్రారబ్ధః సహసైవ సంభ్రమకరో
మార్జారగర్జారవః.

౧౭. లోపాముద్రకవి

తావద్వేలావిషమసలిలావర్తనాభీనికుంజ
క్రోడాభ్రామ్యన్మకరశిఖరిగ్రావరౌద్రః సముద్రః,
దృష్టా యావ న్నఖలు చులుకీభూతనిష్పందమూర్తిః
లోపాముద్రాసహచరకరస్య స్తికోత్సంగవర్తీ.

౧౮. ప్రియముఖ్యుడు

(పద్యగతమైన భావానికి అనుగుణ్యంగా ఈ పేరు వచ్చిఉంటుందని ప్రొ. వేనీస్ అభిప్రాయము).

ఛాయా మంభసి విప్రయోగకృపణః
స్వాం మన్యమానా ప్రియాం
చక్రాహ్వో వదనాత్ బిసాంకుర మభి
ప్రేర్యానసేఒప్యా స్తతః,
దృష్ట్వాం ఃఫులత మేత యేరితమితి
ప్రీత స్తమే వాదళ
ద్వ్యాక్యమూఢః పరమార్థఏవ సుతరాం
లోకః సుఖీ నేతరః.

౧౯. నీలకవి

మంసం నిధేహి చరణౌ పరిధేహి నీలం
నాసః పిధేహి వలయావలిమంచ లేన,
మాజల్ప సాహసిని శారదచంద్రకాంత
దంతాంశవ స్తవ తమాంసి సమాపయంతి.

[భారతి, శ్రీముఖశ్రావణసంచికలో కొందరు మహాకవుల లాంఛనములను, వానికి సంబంధించిన పద్యములను ప్రకటించుటకు వీలయినది. పరిశిష్టప్రకరణమున, తరువాత లభించిన పద్యములను ప్రకటిస్తూ ఉన్నాను. పైన ఉదహరించిన కవులను కొందరిని గూర్చి, శ్రీమతి మాలతిసేన్ ఎం. ఎ. (కలకత్తా) నాకు తెలియజేసినందుకు కృతజ్ఞుణ్ణి.

ఘనశ్యాముడు (దశకుమారచరితటీకలో) దండికి, ఆ అభిధానం-లాంఛనం – పూర్వపీఠికాప్రారంభమందున్న 'బ్రహ్మాండః ఛత్రదండః...'అన్న పద్యంవలన వచ్చిఉంటుందని అభిప్రాయపడినాడు. కాని అసలు పేరేమిటో చెప్ప లేదు.

భవభూతితలస్పర్శినివ్యాఖ్యలో వీరరాఘవుడు 'కులాచలేంద్రాదపి కోటిసారః –' అన్న కోటిసారకవి పద్యభాగాన్ని ఉదాహరించినాడు. పద్యమంతా ఎక్కడా లభించ లేదు.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్ర క్రియా విశేషములు

వ్యాకరణ విద్యాప్రవీణ, ఆకెళ్ల శేషాద్రి

తెనుఁగుభాషలో వండుచున్నాఁడు మొదలగునవి వర్తమానార్థకములు. వండఁగలఁడు మొదలగునవి భవిష్యదర్థకములు.

అందు వండుచున్నాఁడు మొదలగు వర్తమానార్థకరూపములు చిన్నయసూరిబాలవ్యాకరణమునుబట్టి యీక్రిందఁ జెప్పఁబోవు రెండురీతులుగా నేర్పడుచున్నవి.

౧. వండుధాతువునకంటె "వర్తమానంబున లట్టగు" (బాలవ్యా. క్రియా. పరి. ౨. సూ.) అను సూత్రముచే లట్టు వచ్చును. 'ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు' (క్రి. ప. ౧౩.) అనుసూత్రముచే నున్నానుబంధము రాఁగా 'వండు+ఉన్న+లట్' అని యుండును. 'ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకం బగు' (క్రి. ప. ౧౪) అనుసూత్రముచే ధాతువునకు 'చు' వర్ణకమును, 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు' (సంధి. ప. ౧) అనుసూత్రముచే 'చు' వర్ణకోన్నానుబంధముల యుకారములకు సంధియు రాఁగా 'వండుచున్న+లట్' అని యగును. లట్టుయొక్క స్థానంబున 'లకారంబునకు డుజ్ రువురునుమ్ణుగు' (క్రి. ప. ౮) అనుసూత్రముచే నాలుప్రత్యయములును వచ్చును. 'అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు' (క్రి. ప. ౯), 'వానిలో రుములు బహువచనంబులు పెఱ లేకవచనంబులు' (క్రి. ప. ౧౦) అను రెండుసూత్రముల సహాయముచే యుష్మదస్మదతిరిక్త నామార్థంబున 'నామయుష్మదస్మదర్థంబులందుం బ్రథమ మధ్యమోత్తమంబు లగు' (క్రి. ౧౧) అనుసూత్రముచేఁ బ్రథమపురుషైకవచన మగు 'డుజ్' వచ్చును. (ఇట సంస్కృతవ్యాకరణమర్యాదచే జకారంబున కిత్సంజ్ఞాలోపంబులు వచ్చును.) ఇప్పుడు 'వండుచున్న+డు' అని యుండఁగా 'ద్వితీతరంబగు డుజ్ణు పరంబగునపు డున్నానుబంధంబునకు దీర్ఘంబగు' (క్రి. ప. ౧౫) అనుసూత్రముచే దీర్ఘమును 'జిత్తు బిందుపూర్వకం బగు' (తత్స. ప. ౧౯) అనుసూత్రముచే నర్ధబిందువును రాఁగా 'వండుచున్నాఁడు' అను రూపము సిద్ధమగును. ఇట్లే 'వారు వండుచున్నారు, నీవు వండుచున్నావు, మీరు వండుచున్నారు, నేను వండుచున్నాను, మేము వండుచున్నాము' అనురూపములకును బ్రక్రియఁజేయవచ్చును. మఱియుఁ బ్రథమపురుషమునందు 'అమహదర్థమునందు డుజ్ రులకు దువులగు నున్నానుబంధంబుమీఁద దివియగు' (క్రి. ప. ౧౨) అనుసూత్రముచే నమహదర్థమున 'అది వండుచున్నది, అవి వండుచున్నవి, ఆమె వండుచున్నది' (ద్వితీతరం బగుటచే నున్నానుబంధమునకు దీర్ఘము లేదు.) అనియు, మహత్యర్థబహువచనమందు మాత్రము 'సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలె మహతి కగు' (అచ్చి. ప. ౨౬.) అనుసూత్రముచే 'రు' వర్ణకము రాఁగా, 'ఆస్త్రీలు వండుచున్నారు' అనియు నగును.

౨. ఉండుధాతువుకంటె వర్తమానార్థలకారమును, డుజాదేశోన్నానుబంధదీర్ఘములును రాఁగా 'ఉండు+ఉన్నాఁడు' అని యుండఁగా 'ఉన్నశబ్దంబు పరంబగునపు డుండుధాతువునకు లోపం బగు' (క్రి. ప. ౫౬.) అనుసూత్రముచే నుండునకు లోపంబును రాఁగా 'ఉన్నాఁడు' మొదలగు రూపములు సిద్ధించును.

వండుధాతువుకంటె వర్తమానార్థంబున 'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు' (క్రి. ప. ౪౩.) అనుసూత్రముచే 'చు' వర్ణకము రాఁగా 'వండుచున్' అని యగు నసమాపకక్రియతోఁ బైఁజెప్పిన 'ఉన్నాఁడు' మొదలయిన లడం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తములగు నుండుధాతువులను జేర్పఁగా 'వండుచున్ + ఉన్నాఁడు' అని యున్నప్పుడు 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణములందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును' (సంధి. ప. ౨.) అనుసూత్రముచే 'వాఁడు వండుచున్నాఁడు, వాఁడు వండుచునున్నాఁడు' అని రెండురూపము లగును. ఇట్లే 'వారు వండుచున్నారు, వారు వండుచునున్నారు' మొదలగునవి రెండేసి యగును.

పైనఁ జెప్పినరీతులలో నేవిధముగానైనను, 'వండుచున్నాఁడు' మొదలగు రూపము లేర్పడుచున్నవి. అందులో మొదటివి లడంతములగు వండుధాతువులు. తక్కినవి శత్రంతములగు వండుధాతువులతో లడంతములగు నుండుధాతువులను జేర్పఁగా నేర్పడిన రూపములు. ఈశబ్దముల నిట్లు సాధించుటలో భేద మున్నను నర్థములోమాత్రము భేద మించుకైనను గానరాదు 'రాముఁడన్నము వండుచున్నాఁడు' అన్నను, రాముఁ డన్నము వండుచున్ ఉన్నాఁడు' అన్నను నర్థభేదము గాన్పించుటలేదుగదా!

కాఁగా మన మిచట గమనింపవలసిన విషయ మొక్కటి కలదు. 'వండుచున్, దినుచున్నాఁడు' మొదలగు రూపములకొఱకు శత్రర్థమున 'చు' వర్ణకమును, 'వాఁడు పొలములో నున్నాఁడు' మొదలగు రూపములకొఱకు లడంతములగు నుండుధాతువులును బ్రక్రియచేయుట యావశ్యక మైయుండఁగా శత్రంతమును, నుండుధాతుజన్యసమాపకక్రియయును జేర్పఁగా 'వండుచున్నాఁడు, వండుచునున్నాఁడు' మొదలగు రూపము లేర్పడుచుండుటచే నట్టిరూపములకొఱకై లడంతములగు వండుమొదలగు ధాతువుల ప్రక్రియ యనవసరము. అనఁగా 'ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు' (క్రి. ప. ౧౩.) 'ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకం బగు (క్రి. ప. ౧౪.) అను నున్నానుబంధచువర్ణకవిధాయకసూత్రములు చెప్పకపోయినను నష్టములేదు.

భాషాప్రపంచమందలి. పదజాలమునంతటిని సాధింపయత్నించు వైయాకరణుల కెంతలాఘవమున్న నంత మేలుకదా! "ఏకమాత్రాలాఘవం పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః." అట్టిచో ననావశ్యకములగు రెండుసూత్రములను, నింతప్రక్రియను వైయాకరణు లేల తగ్గింపఁగూడదు?

ఉన్నానుబంధవిధియే లేనిచో 'ఉన్నాఁడు' మొదలగు రూపము లెట్లేర్పడునని శంకింపనవసరము లేదు. ఎట్లన, మన మిదివఱకు నుండుధాతువున కున్నానుబంధము చేసికొని, క్రియాపరిచ్ఛేదములోని ౫౬-వ సూత్రముచే నుండుధాతువునకు లోపముచేసికొని 'ఉన్నాఁడు' మొదలగు రూపములను సాధించుకొనుచున్నాము. ఇప్పుడు (ఉన్నానుబంధవిధి లేనప్పుడు ఉండుధాతువునకే యున్నాదేశము విధించుకొందము).

ఇట్లే వండఁగలఁడు మొదలగు భవిష్యదర్థకములు కూడ రెండురకములుగా నేర్పడుచున్నవి.

౧. వండుధాతువుకంటె 'భావిని లృట్టగు' (క్రి. ప. ౪.) అనుసూత్రముచే లృట్టును, దానిస్థానమున డుజాదులును, లృట్టు పరమగుచుండఁగా 'కలజ్యనుబంధంబు లృట్టు పరంబగునపు డగు' (క్రి. ప ౧౫.) అనుసూత్రముచే 'కలానుబంధము' ను, కలానుబంధము జిత్తగుటచే 'జిత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు' (క్రి ప. ౨౦.) అనుసూత్రముచే ధాతూకారమున కత్వంబును, 'కలజిపడుజులు పరంబులగునపుడు నుగాగమం బగు' (క్రి. ప. ౨౧.) అనుసూత్రముచే ధాతువునకు నుగాగమంబును, దానికి ద్రుతత్వప్రయుక్తబిందుసంశ్లేషములును రాఁగా 'వండఁగలఁడు, వండంగలఁడు, వండన్‌గలఁడు' మొదలగు రూపములు సిద్ధించుచున్నవి.

౨. 'కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరంబగునపుడు కలయగు' (క్రి. ప. ౧౦౪.) అనుసూత్రముచే 'కలుగు' ధాతువునకు 'కలఁడు' మొదలగు రూపము లగును. అట్టిక్రియలను తుమర్థనుజ్యంతమగు 'వండన్' అను నసమాపకక్రియతోఁ జేర్చినచో ద్రుతకార్యములును రాఁగా 'వండఁగలఁడు' మొదలగు రూపము లేర్పడఁగలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈవిధముగా రెండుపదములచే నేర్పడిన 'వండఁగలఁడు' మొదలగు శబ్దములకును, లృడంతములకును స్వరూపములో భేదములేదు. అర్థములోఁగూడ భేదము కాన్పించుటలేదు. వండన్ = వండుటకు, కలఁడు = ఉన్నాఁడు. అనఁగా నీతఁడు వండుటకై యున్నాఁడు, వండఁబోవునని యర్థము.

ఇట్లే 'రానున్న రాత్రి, రాఁగల రాత్రి; వికసింపనున్న పుష్పము, వికసింపఁగల పుష్పము; రానున్న సంవత్సరము, రాఁగల సంవత్సరము' అను మొదలగు చోట్ల నర్థభేదము కాన్పించుటలేదు.

పైయుదాహరణములలోఁ గొన్నిచోట్ల నించుక యర్థభేదము సూక్ష్మముగా గోచరించుచున్నను, వాడుకలో నుండు భాషయందలి శబ్దములు నర్థములునుగూడఁ గాలక్రమమున వ్యవహారముచే మారుచుండుట స్వభావసిద్ధమయియుండుటచే నర్థములో నట్టి చిన్నమార్పు కలిగియుండెనని యూహించుట కవకాశముండుటచేతను, రెండురూపములకును స్వరూపములోఁగాని, కాలములోఁగాని భేద మగపడకపోవుటచేతను, నీరూపములు రెండేసిపదములచే నిష్పన్నము లయినవేమోయను నూహకు వీలు నిక్కమన్నది.

మఱియుఁ జింతామణిలో,

శ్లో. "తద్ధర్మ్యవర్తమానా
తీతాగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః,
తత్ర ద్వితీయతుర్యౌ
యాతౌ స్తస్సానుబంధకా వేవ.
వసతి రనుబన్ధకః స్యా
ద్వర్తలడర్థో వివక్షిత స్తత్ర,
అస్తి రనుబన్ధకః స్యా
ద్వర్తల్పడర్థో వివక్షితో ధాతోః."

అని చెప్పఁబడియున్నది. క్రియలు, 'తద్ధర్మార్థకములు, వర్తమానార్థకములు, అతీతార్థకములు, ఆగామ్యర్థకములు' అని నాలుగురకములనియు, నందు వర్తమానాగామ్యర్థకములు రెండు ననుబంధములతోఁ గూడియే యుండుననియు, వర్తమానార్థమందు ధాతువునకు 'ఉన్నాఁడు' మొదలగు నుండుధాతుజన్యక్రియలును, భవిష్యదర్థమందు 'కలఁడు' మొదలగు కలుగుధాతుజన్యములు ననుబంధము లగుననియుఁ బైశ్లోకముల కర్థము.

ఇచట బాలసరస్వత్యహోబలపండితాదులు కొందఱు 'వసతిః' అనుమాటకు 'ఉన్న' అనుశబ్దమనియు, 'అస్తిః' అనుపదమునకు 'కల' యను శబ్దమనియు వ్యాఖ్యానముచేసియున్నారు. అట్లే చిన్నయసూరిగూడ బాలవ్యాకరణమున సూత్రముల నేర్పఱచియున్నాఁడు. కాని యట్లు వ్యాఖ్యానముచేయుట వ్యాకరణసంప్రదాయము కాదు. 'అస్, వస్' ధాతువులకు 'తి' (శ్తిప్) ప్రత్యయమును జేర్చి యుచ్చరించి నచో నాయాధాతువని యర్థము వచ్చును. చూడుఁడు,

"ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే" (పాణిని. అష్టాధ్యాయి.) ఇక్, శ్తిప్ అను రెండుప్రత్యయములచేతను ధాతువు నిర్దేశింపఁబడును. అందుచే 'వసతి, అస్తి' శబ్దములకు 'ఉండు, కలుగు' ధాతువులని యర్థమువచ్చును గాని 'ఉన్న, కల' యనుశబ్దములని యర్థము రాదు.

కాఁబట్టి బాలసరస్వత్యాదుల వ్యాఖ్యాన మంగీకరించునెడల 'వసతి, అస్తి' అను శ్తిబంతనిర్దేశముల కనుపపత్తి వాటిల్లును.

ఇంతేకాక 'ఉన్న, కల' శబ్దములే యనుబంధకము లగునెడల నాశబ్దములతరువాత 'లట్, లృట్' లావశ్యకము లగుటచే లకారములు పరము లగుచుండఁగనే యనుబంధముల విధింపవలెను. అట్లుచేయక లడర్థము (వర్తమానార్థము) ఎచ్చట వివక్షితమగునో, లృడర్థము (భవిష్యదర్థము) ఎచ్చట వివక్షితమగునో యచ్చట నీయనుబంధకములు వచ్చునని చెప్పుట కేమైన స్వారస్యముండవలెను గదా! కాన వర్తమానార్థమందుఁ బ్రతిధాతువునకు 'ఉండు' ధాతువును, భవిష్యదర్థమందుఁ బ్రతిధాతువునకు 'కలుగు'ధాతువు ననుబంధము లగునని యర్థము చేయవలసి యున్నది. తరువాత "నకేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాఽపి కేవలః ప్రత్యయః" అని పాతంజలమహాభాష్యసమ్మతినిబట్టి కేవల ధాతువులగు నీ యనుబంధములకుఁ బ్రయోగార్హత లేకపోవుటచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీధాతువులు లడంతములు కావలెనని వాగనుశాసనుని యాశయమైనట్లు పొడగట్టుచున్నది.

కాఁగా వర్తమానార్థమందు ధాతువునకు 'ఉన్నాఁడు' మొదలగు క్రియలును, భావ్యర్థమందు 'కలఁడు' మొదలగు క్రియలును ననుబంధము లగునని యెఱుంగునది.

చింతామణి ప్రధానముగాఁ దత్సమ పదములను సంస్కరించునదగుటచే దేశ్యక్రియలగు 'ఉన్నాఁడు, కలఁడు' మొదలగు రూపములను సాధింపలేదు. అందుచే స్వవ్యాకరణాసాధ్యములగు క్రియల ననుబంధకములుగా నన్నయభట్టేల చెప్పునని శంకింపఁబనిలేదు.

మఱియు "తత్ర ద్వితీయతుర్యౌ యౌ తౌ స్తః సానుబన్ధకా వేవ" అను కారికలోని 'ఏవ'శబ్దస్వారస్యముచే "వర్తమానాగామ్యర్థకక్రియ లెల్లప్పుడు ననుబంధసహితములే, యనఁగా 'ఉన్నాఁడు' మొదలగు క్రియలతోఁ గూడియే యుండును. అంతేకాని ప్రతిధాతువునకు నీ రెండర్థములందును బ్రత్యేకముగా లకారము లుండఁజాలవు" అనికూడ బోధింపఁబడుచున్నది.

కాని, చింతామణినిబట్టి యీక్రియలు రెండుపదములనుండి యుత్పన్నము లయినవని గోచరించుటలేదు. అయినను బ్రక్రియాలాఘవమునుబట్టి, యీరెండుక్రియలును రెండేసిపదములచే నిష్పన్నములైనవని వ్యాకరణములు వ్రాసిన బాగుండెడిది. వేఱువేఱుగా సాధించిన రెండుశబ్దములు కలసి యొకయర్థమును జెప్పుచుండఁగా నట్టియర్థమును బోధించుటకై మఱియొకశబ్ద మేల కావలసి వచ్చెను?

కాన నీక్రియలు రెండేసిపదములచే నేర్పడినవనియు, వానిని సాధించు వైయాకరణు లేకపదములుగా నభిప్రాయపడిరనియు మన మూహింపవచ్చును.

ఇట్లే సంస్కృతవైయాకరణులుకూడ రెండుపదముల నొకపదముగా సంస్కరించిరఁట! సంస్కృతమున ననద్యతనభవిష్యదర్థమందు 'లుట్' అను లకారము కలదు. ఆలకారమున 'కృ' (డుకృఞ్)=కరణే అనుధాతురూపముల గమనింపుఁడు :

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమపురుషము | కర్తా | కర్తారౌ | కర్తారః |
| మధ్యమపురుషము | కర్తాసి | కర్తాస్థః | కర్తాస్థ |
| ఉత్తమపురుషము | కర్తాస్మి | కర్తాస్వః | కర్తాస్మః |

పైరూపములలో మధ్యమోత్తమైకవచనములు 'కర్తా' అనుతృజంతమునకు 'అసి, అస్మి' అను క్రియలు చేర్చినచోఁ నేర్పడినట్లు తెలియుచున్నదికదా! అర్థములోఁగూడ భేదములేదు. కర్తా=చేయఁగలవాఁడవై, అసి = ఉన్నావు, కర్తా = చేయఁగలవాఁడనుగా, అస్మి = ఉన్నాను అని యర్థము. లుడన్తమని వైయాకరణులు సాధించినరీతిని భవిష్యదర్థకక్రియయగుటచే 'చేయఁగలవు, చేయఁగలను' అని యర్థము.

ఇట్లే మధ్యమోత్తమద్విబహువచనములలో ద్విబహువచనాన్తములగు కర్తృశబ్దములకే 'స్థః, స్థ, స్వః, స్మః' అను 'అస్' ధాతురూపములు చేర్చి మొదట 'కర్తారౌస్థః, కర్తారఃస్థ, కర్తారౌస్వః, కర్తారఃస్మః' అని వాడుచుండిరనియు, నట్టిరూపము లిప్పటికిని వైదికగ్రంథములలో నగపడుచున్నవనియుఁ, గాలక్రమమున భాష మారి, 'కర్తాస్థః, కర్తాస్థ' మొదలగురూపము లేర్పడినవనియుఁ, బ్రథమపురుషములో 'అస్' ధాతువు ననుబంధింపకయే 'కర్తా, కర్తారౌ, కర్తారః' అని కేవల తృజన్తములే వాడుచుండిరనియు, నిట్టికారణములచే సంస్కృతములోని 'లుట్' లకారము భాషాసంప్రదాయము తెలియని వైయాకరణులచే వ్యర్థముగా నుత్పాదితమైనదయి, విచిత్రముగాఁ బ్రక్రియచేయఁబడినదనియు సంస్కృతభాషాశాస్త్రతత్త్వవేత్తల యభిప్రాయమైయున్నది.

ఇతరము లగు మఱికొన్ని భాషలలోఁగూడ వర్తమానార్థబోధనమునకై శత్రర్థమును, 'అస్తి' క్రియయు వాడఁబడుచున్నవి. చూడుఁడు :

౧. ద్రావిడములో 'ఇరిక్కిరాన్' అనఁగా 'ఉన్నాఁడు' అనియర్థము. ('రామన్ ఇరిక్కిరాన్'= రాముఁ డున్నాఁడు.) 'వందు (కొండు)' అనఁగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'వచ్చుచు' నని యర్థము. (వందుకొండు) తింద్రు కొండు ఇరిక్కిరాన్=వచ్చుచుఁ దినుచున్నాఁడు. ఈరెండుపదములను గలిపినచో 'వచ్చుచున్నాఁడు' అని యర్థము వచ్చును. (రామన్ వందుకొండు ఇరిక్కిరాన్ = రాముఁడు వచ్చుచున్నాఁడు.)

౨. ఇట్లే కన్నడములో 'ఇద్దానే' అనఁగా 'ఉన్నాఁడు' అని యర్థము. (రామన్ ఇద్దానే=రాముఁడున్నాఁడు). 'అడిగెమాడుత్తా' అనఁగా 'వండుచు' అని యర్థము. (అడిగె మాడుత్తా తిన్నుతా ఇద్దానే=వండుచుఁ దినుచున్నాఁడు.) ఈరెండుపదములు కలిపినచో 'వండుచున్నాఁడు' అని యర్థము వచ్చును. (రామన్ అడిగె మాడుత్తా ఇద్దానే=రాముఁడు వండుచున్నాఁడు.)

3. మఱియు నోఢ్రములో 'ఒఛొంతి' అనఁగా 'ఉన్నాఁడు' అని యర్థము. (రామొ ఒఛొంతి=రాముఁడున్నాఁడు). 'రంధి' అనఁగా 'వండుచు' నని యర్థము. (రంధి ఖావు ఒఛొంతి=వండుచుఁ దినుచున్నాఁడు.) 'రంధొ ఛొంతి' అని రెండుపదములను గలిపినచో 'వండుచున్నాఁడు' అని యర్థము.

౪. ఇంగ్లీషులో, 'Is' అనఁగా ఉన్నాఁడని యర్థము. (Here is a boy = ఇక్కడ నొకపిల్లవాఁడున్నాఁడు.) 'Going' అనఁగా 'వెళ్లుచు'నని యర్థము. (He fell down, going to the river = వాఁడు నదికి వెళ్లుచుఁ గ్రిందఁబడెను.) ఈ రెండు పదములను గలిపినచో 'వెళ్లుచున్నాఁడు' అను నర్థ మిచ్చును. (Rama is going=రాముఁడు వెళ్లుచున్నాఁడు).

౫. ఇట్లే హిందీ భాషలో, 'है' అనఁగా 'ఉన్నాఁడు' అని యర్థము. (एक लड़का है = ఒక పిల్లవాఁడున్నాఁడు). 'खाता' అనఁగా 'తినుచు' అని యర్థము. (खाता खाता पढता है = తినుచుఁ దినుచుఁ జదువుచున్నాఁడు.) ఈరెండు పదములను గలిపిన 'తినుచున్నాఁడు' అని యర్థము. (राम खाता है రాముఁడు తినుచున్నాఁడు.)

౬. మఱియు మహారాష్ట్రభాషలో 'आहे' అనఁగా 'ఉన్నాఁడు' అని యర్థము. (एक मुलगा आहे = ఒకపిల్లవాఁడున్నాఁడు.) 'खात' అనఁగా 'తినుచు' నని యర్థము (खात वाचत आहे=తినుచుఁ జదువుచున్నాఁడు.) రెండు మాటలను గలిసి 'తినుచున్నాఁ'డని యర్థమిచ్చును. (मुलगा खात आहे = పిల్లవాఁడు తినుచున్నాఁడు.)

ఇట్లే తెనుఁగులోని 'వండుచున్నాఁడు మొదలగు పదములుకూడ రెండు పదములచే నిష్పన్నములు కావచ్చును. అయిన నీయాంధ్రవ్యాకరణకర్తలు తాము వ్యాకరణము వ్రాయునప్పుడు విశేషముగా సంస్కృత వ్యాకరణము ననుసరించినవా రగుటచే సంస్కృతాకారములు పదద్వయజన్యము లనుటకు నిశ్చిత ప్రమాణము దొరకనందున నీ వ్యాకరణమునఁ గూడ నీ క్రియలను స్వతంత్రైకపదములనుగా సంస్కరించియుందురు.

ఇంతేకాక కేతన, తన యాంధ్రభాషాభూషణమున 'వండెదను, వండెదరు' మొదలగు తద్ధర్మార్థక క్రియలను వర్తమానార్థకములనుగాఁ జెప్పెను. చూడుఁడు :—

"డును, దరు లౌరులకు నెదిరికిఁ
దనరంగా దు, దవు, దరులు తనకు దను దముర్,
జను నేకబహువచనములు
మనుసన్నిభ క్రియల వర్తమానార్థంబుల్.
అడిగెదు నడిగెద రనఁగా
నడిగె దడిగెదవు ధనంబు నడిగెద రనఁగా
నడిగెద నడిగెదమనఁ బొ
ల్పడరంగా వరుసతో నుదాహరణంబుల్."

అంతేకాని వండుచున్నాఁడు మొదలగు క్రియలను వర్తమానార్థకములుగాఁ జెప్పలేదు. అందుచే వాని కాలమునాటికి 'వండెదను, వండెదరు' మొదలగు క్రియలను వర్తమానార్థకములనుగా వాడుచుండిరనియు, "వండుచుండెను, వండుచుందును, వండుచుండెదను" మొదలగు రూపములవలె 'వండుచున్నాఁడు' మొదలగు నవికూడ రెండుపదములచే నిష్పన్నములయినవను నిశ్చయ ముండుటచే నాతఁ డేకపదములుగా వ్రాయలే దనియుఁ దెలియుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యవహారములో నుండు భాషలోని శబ్దార్థములు మారుట సహజమైయుండుటచే నిటీవల 'వండెడును' మొదలగు క్రియలకు వర్తమానార్థకత్వము పోవుచు, 'వండుచున్నాఁడు' మొదలగు పదసమూహముల నాశ్రయించియుండును.

మఱియు నీకేతన 'వండఁగలఁడు' మొదలగు క్రియలమాటయే యెత్తక 'వండును, వండుదురు' మొదలగు క్రియలు భావ్యర్థకములని చెప్పియున్నాఁడు. చూడుఁడు :—

"ఉను, దురు లొారులకుఁ జెప్పను,
దనరఁగ దువుదురు లెదిరికిఁ దనకు దునుదుమర్థి
ఁనరఁగ నివి యేకబహువ
చనములను భవిష్యదర్థసంసూచకముల్.

పలుకును పలుకుదు రనఁగాఁ
బలుకుదువు పలుకుదు రనఁగఁ బలుకుదు నర్థిన్,
బలుకుదుమనఁగా నిన్నియు
నలఘుమతీ, వరుసతో నుదాహరణంబుల్."

ఇట్లు చెప్పుటవలన వానికాలమునాటి కివియే భవిష్యదర్థకములనియుఁ గ్రమముగా వీని కీయర్థము పోవుచు 'వండఁగలఁడు' మొదలగు పదసంఘాతములమీద రూఢమైనదనియు నూహింపవచ్చును.

ఇట్లు కాలక్రమమున 'వండుచున్నాఁడు' మొదలగురూపములకు వర్తమానార్థకత్వమును, 'వండఁగలఁడు' మొదలగు రూపములకు భవిష్యదర్థమును రూఢము కాఁగా 'వండెను, వండును, వండెడును' మొదలగు క్రియలవలె నివియుఁ బ్రత్యేకపదములే యని తెలని కాఁబోలు బాలవ్యాకరణమునను, చింతామణియందును నేతద్వర్తమానభావ్యర్థకముల నేకపదములనుగాఁ జెప్పియున్నారు.

ఈక్రియలను కేతన సాధింపకపోవుటచేతనే గాక, వైదిధముగా నింగ్లీషు, హిందీ మొదలగు 'ఇండో-యూరపియన్' (Indo-European) భాషాకుటుంబములోని భాషలలోను, అరవము, కన్నడము మొదలగు ద్రావిడభాషాకుటుంబములోని భాషలలోను నీక్రియార్థమును బోధించుటకై రెండురెండుపదములను వాడుచువచ్చినట్లు కాన్పించుటచేఁ దెనుఁగుభాషలోఁ గూడ నట్లే యుండియుండుననియు, నట్టివా నొకపదముగా నాంధ్రవ్యాకరణకర్తలు సాధించుట భాషాశాస్త్రసంప్రదాయము కాదేమోయనుసందేహముచే నీ సంశయమును భాషాతత్త్వవిమర్శకులగు పండితులవలనఁ దెలిసికొనుటకై యిట్లు వ్రాసితినిగాని వేరొండుగాదని పాఠకమహాశయులకు విన్నవించుచు నింతటితో విరమించుచున్నాను.

---

# ప్రార్థన గీతావళి

సబర్మతీ ఆశ్రమమునందు నిత్యపారాయణమునకు మహాత్ముడు అనుమోదించిన ప్రార్థనగీతములు తెలుగు తాత్పర్యముతోసహా ఇందు గలవు. ఆధ్యాత్మికసారమయిన ఈ గీతములను ప్రతివారు నిత్యము పారాయణము చేయుట శ్రేయోజ్ఞానదాయకము. కొలది ప్రతులే కలవు.

ఆంధ్రగ్రంథమాల; ౭, తంబుశెట్టివీధి, చెన్నపురి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




అభినవ ప్రవరాఖ్యుడు

—జి. వి. సుబ్బరావు, బి. ఏ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨. సేద్యపురాణి

ఈమె 'హెలెను కాన్సు కన్య'

(కాలిఫోర్నియాలో జరిగిన వ్యవసాయ ప్రదర్శనమున) —జి. ఎస్. ఎ.



౧. ప్రశ్న

కాలిఫోర్నియాలో నొక ఉత్సవమున క్రిందు గల సుందరులలో నెవతె రాణిగా నుండవలెను అనునది. ఆమెను ప్రజలు ఎన్నుకోవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఉమర్ ఖయ్యామ్ కవితాశక్తి

కుందుర్తి నరసింహారావు

'వెండిలాంతరు వెలిగించి వెడలె రజని' అనిన రాయప్రోలు కవిమాట వినునప్పటికి ఉమర్ ఖయ్యామ్ ఒకచోట చేసిన సూర్యబింబవర్ణనము నాకు జ్ఞప్తికి వచ్చినది:

'ఇది సమస్త మొకనిచేతి యింద్రజాల
మై నడచుచుండె పదిదిక్కు లావరించి
వింత పేటికలోఁ దీన వెలుఁగుదివ్వె
తరణియై త్రోవ చూపించు తిరుగు మనకు.'

—ఫిట్ జెరాల్డు, ౪౬.

అప్రయత్నముగ వచ్చుచుండు నిట్టి యలంకారసాదృశ్యము లోకమునందలి కవులలో నచ్చటచ్చట గనిపించుచుండును. వివిధదేశములవారై, వివిధకాలములవారైనను మహాకవులగువారలకు సమానముగా నుండు—ఉండవలసిన—గుణవిశేషములు కొన్నియున్నవి. వానిలో నిట్టి యూహాశక్తి ప్రధానమైనది. దీనికి తోడుగ విజ్ఞానము, సాహసము, స్వతంత్రత, ఉన్నతమైన హాస్యము, ఒక ప్రత్యేకతత్వము, శబ్దమాధుర్యము నలవడియున్నచోనిక ఆకవి చిరంజీవియగుట కెట్టియాటంకము నుండదు. కాని భాషాలాలిత్యముచేతను, శబ్దమాధుర్యముచేతను స్వదేశీయులను శీఘ్రముగ నాకర్షించి పేరు గాంచుకవి ప్రపంచమునకు బనికిరాడు. కేవలదేహసౌందర్యమే కల వ్యక్తి స్వకుటుంబమున కేమైన పనికివచ్చునేమో కాని యితరుల కేమి యుపయోగించును? లోకమునకు ప్రయోజనకారి కావలెనన్నచో ఆత్మహృదయసౌందర్యము ప్రధానముగదా: అట్లే, కావ్యమునం దంతర్గతములై యుండు భావౌన్నత్యాది విశేషగుణముల చేతనే యితరభావుల వారాకర్షింపబడి దాని ననువదించుకొనుచుందురు.

కావున కవులగువా రిట్లు రెండుజాతులుగా నుందురు. ఒకరు కేవలము తమదేశమునకుమాత్రమే పనికివచ్చువారు. ఆంగ్లవాఙ్మయమునందు మిల్టన్ కవి యిందున కుదాహరణము. జలదస్వనగంభీరమైన యాతని పదప్రయోగముచే ముగ్ధులై యాంగ్లకవిశేఖరులెల్ల రాతనికి మోడ్పుగే లెత్తిరి. ఇక రెండవజాతికవు లత్యంత స్వేచ్ఛాజీవులై భావవిన్యాసమునకే ప్రాధాన్య మిచ్చి అందర కన్నిరూపులై సర్వశాస్త్రతత్వములందును సమానపాండిత్యమును ప్రకటించుచు లోకము నాశ్చర్యతరంగములలో ముంచువారు. ఇట్టివాడు షేక్స్పియరు. ఉమర్ ఖయ్యాము గూడ నీరెండవజాతికి చెందినవాడే. మానవజాతినంతటి నాకర్షించు నిట్టికావ్యగుణము లీ పారశీకకవిశేఖరునిలో నెంతవరకున్నవో సూచించుటయే యీ వ్యాసప్రయోజనము.

## సాహసము :

నిర్భయత్వ మనునది యాతని సహజగుణము. ఇతడుచెప్పు ప్రతివాక్యమును క్లిష్టతలేక సూటిగా హృదయమును తాకున ట్లుండును. అందుచే, తనకు తోచినదానిని జంకులేక లోకులకు వెల్లడింపవలె నని యితని యుద్దేశ మైనట్లు స్పష్టము. అట్టి సాహసమే యాతని కవిత్వమునకు ముఖ్యాంగమై యున్నది. పారశీకపండితు లెందరో తొలుదొల్త నితనిని తిరస్కరించెడివారు. కాని సామాన్యజనులు కాపులు, యుద్ధవీరులు, రాజులుగూడ నీతని పద్యముల నెల్లచోట్లను ముక్తకంఠమున బాడుచు నానందపరవశు లగుచుండెడివారు. ఇందులకు కారణము లనేకములు. ఇతని కవితయందు గోచరించు విషయమెల్ల నాగరకమానవుని సుఖదుఃఖములే; అందును, 'మానవజీవితమున కర్థ మేమి, అంత మేమి?' అని యిత డాందోళనపడుచోట్ల ప్రతిమానవుడును చెవియొగ్గి వినకమానడు; ఇట్టిప్రశ్నలు ప్రతివిద్యావంతుని హృదయమును ఏనాడో యొకనాడు కలచివైచినవే. దీనిని చర్చించునప్పు డితడు చూపు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పట్టుదల, సర్వంకషపాండిత్యము, సహేతుకవాదము, ఆవేగము, న్యాయదృష్టి, విస్పష్టత అనన్యసామాన్యములు. తోచినది తత్‌క్షణమే జంకులేక స్పష్టముగా చెప్పుటలో నీతనికి గల శక్తి యీపద్యమువలన తేటతెల్లమగును:

'నన్ను గొనివచ్చి యిట దింపినారు, కనులు
విచ్చిచూడ నద్భుతము జీవితపు తలపు;
పోదు—రానేల? మననేల? పోవనేల?
ప్రశ్న లేకాని, ప్రత్యుత్తరంబు లేదు.'

—విన్‌ఫీల్డు.

## ఊహాశక్తి:

ఇతని వర్ణనలయందెల్ల నిది యపూర్వమై గోచరించుచుండును. ప్రాచ్యకవులకు చిరపరిచితములైన వస్తువులకే యితడు క్రొత్తరంగులు వేసి తన 'నవీనగుణముల' ప్రదర్శించియున్నాడు. బుల్‌బుల్, గులాబీ, చదరంగము, సూర్యోదయము—ఇట్టివస్తువులు కవు లెల్లరు వర్ణించినవే. 'ఉవిదలేనును జెక్కు గులాబివలె నున్న' దనును సామాన్యకవి; ఉమార్ ఆగులాబికే జీవము వోసి మానవసాధ్యములు కాని మహాతత్వవిషయములను దానిచే జెప్పించుచున్నాడు:

'వినుము వికసించు నీగులాబీ రహస్య
మతివ! యే మనుచున్నదో: "హసిత వదన
నై జనించితి, నీ మహోద్యానమునకు
చిటుకలో నాధనము విరజిమ్మచుంటి."'

—ఫిట్‌జెరాల్డు, ౧౩.

## ధైర్యము:

తాను చెప్పునది తప్పు కావచ్చును, ఒప్పు కావచ్చును; తత్వజ్ఞుల కది రుచింపవచ్చును, రుచింపక పోవచ్చును; కాని తన నిశ్చితాభిప్రాయమును లోకమునకు వెల్లడించుటలో నతని శరవేగము చూడుడు:

'రంభ యుండె సుధాపూర్ణకుంభ ముండె
స్వర్గమున నంచు శాస్త్రులవార లనిరి:
ముందు వచ్చు మహాలోకమున నె కలుగ,
ఇప్పు డట్టివి కోరగా తప్పువచ్చె!'

—విన్‌ఫీల్డు, ౧౫౫.

కవి కిట్టి స్పష్టత ప్రధానముగా నుండవలసినది. ఈనాటి మన భావకవులనబడువారిలో నిది కొంత లోపించియుండుటచేతనే వారిభావము లర్థమగుట లేదను నపవాదము వచ్చినది.

ఇతనిధైర్య మెంతవరకు బోయినదో చూడుడు

'మనకు వశమైన, ప్రేయసీ! మానవ ప్ర
పంచమును నేము పిండిగావించి, మరల
ఈ వికృతసృష్టిబదులు నిర్మించ లేమె
హృదయసంతృప్తియిడు నవ్యసృష్టి యొకటి?'

—ఫిట్‌జెరాల్డు, ౭౩.

## హాస్యము:

ప్రాచ్యఖండకవుల కిది సహజమైనది కాదు. దీనికై యెవ్వరు నంతగా ప్రయత్నింపను లేదు. ప్రయత్నించినవా రసభ్యరచనల కారంభించిరి. సాధారణముగ నీదేశముల కవులు ప్రాపంచికవిషయములను తృణీకరించి యాధ్యాత్మికానందమునందే మనస్సుంచుట దీనికి హేతువైయుండును. కాని ఉమర్ ఆ ఆధ్యాత్మికానందాన్వేషణమునందే హాస్యరసము నిలికించినాడు. అతని హాస్యము నాటకములలోనిదానివలె క్షణికమైనది కాదు, సులభగ్రాహ్యమైనదియును కాదు — దుఃఖము నుండి పిండిన హాస్యము; దుఃఖము వ్యర్థమగుటచే, కష్టానుభవము తప్పనిదగుటచే, జీవనమరణరహస్యములు గ్రహింపరాని వగుటచే, చేయునదిలేని మానవాశక్తతను జూచి గంభీరముగా నొనర్చు పరిహాసము. దానితో దుఃఖమంతయు మరచిపోవలెనని యాతని యాశయము!

'రెండురోజుల బ్రతు కిది, రెప్పపాటు
లో నశించు నెడారితుపానువోలె:
ఈయనంతకాలమున రెండేదినాలు
మరచెదను 'నిన్న' 'రే' పన్నమాట లేను!'

—విన్‌ఫీల్డు, ౭౬.

'నరుని శక్తి యద్భుతమటన్నాడు వాడు,
నాకు స్వర్గము మధురమన్నాడు వీడు—
చేతనున్న రొక్కము ముందు స్వీకరింపు—
దూరమం దట్లె యేద్పు భేరీరవంబు!'

—ఫిట్‌జెరాల్డు, ౧౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విజ్ఞానవిషయము :

సర్వప్రయత్నములును వ్యర్థములని యీతని యభిప్రాయము ! నీతినిగూర్చియు, విజ్ఞానమును గూర్చియు నితఁ డెంతయో తేలికగా మాటలాడును: అయినను ప్రతివాక్యమును స్వానుభవమునుండి వచ్చినదే ; పొల్లు మాట యొక్కటియు లేదు :

'ఏనుమాత్రము చిన్ననాఁ డెన్నిపాట్లు
పడఁగ లేదు తత్త్వరహస్యపాఠములకు !
పండితులతోడ వాదించి, వల్లెవేసి,
వదరి, తుదకు వచ్చినత్రోవె పట్టవలసె—
ఆశతో జ్ఞానబీజము నపుడు నాటి
పెంచితిని చేతులార, లాభించు ననుచు :
కోసి తెచ్చిన ఫల మిదుగో! "ఒకండ
వరదవలె వచ్చి గాలినై సురిగిపోదు"—'

—ఫిట్ జెరాల్డు ౨౭, ౨౮.

అంతయు నిష్ఫలమని అతని నిర్వేదము. మరణముతో నిది యంతయు నాశనమే కదా. తరువాత నేమి? ఈజ్ఞాన మంతయు మన కేమిచ్చినది?—"ప్రశ్నలేకాని ప్రత్యుత్తరంబు లేదు" అని మొదటనే చెప్పినాడు.

## సుఖాభిలాష-ప్రత్యేక తత్త్వము

ఇక నీతని కవిత్వము పాశ్చాత్యుల నంతగా ఆకర్షించుటకును, ప్రాచ్యఖండములవారికి రుచింపక పోవుటకును కారణ మీతని సుఖాభిలాషయే. ఇతఁడు యోజించి యోజించి, తన తర్కశాస్త్ర పాండిత్యము నంతను ప్రయోగించి, ప్రకృతిచర్యల కర్థము కనిపెట్టలేకపోయినాడు. సౌందర్యమునందు ప్రేమ యున్నదని, ప్రేమలో సుఖ మున్నదని, ఆప్రేమనే ఒక మూర్తిగా భావించి భగవంతుఁ డనుచున్నారని యతఁ డూహించినాడు. అయిన నట్టిమూర్తిలో నందరును తుదకు లీనమై పోవుచో నిచ్చట సుఖదుఃఖములు, ధర్మాధర్మములు నెందుకుండవలెను? ఇట్టి తర్కములో నతఁడు పాపమనుదానిని బట్టుకొని జాడించి వదలిపెట్టినాడు—కాదు భగవంతునే:

'ఎవఁడురా యిట పాపమే యెఱుఁగనట్టి
ప్రాణి? పాపమే యెఱుఁగక బ్రతికె నెట్లు?
తప్పొనర్చు నన్ దండించి తప్పొనర్చు
నీకు నాకు భేదం బేమొ నీనె చెప్పు!'

—విన్ ఫీల్డు, ౩౯౧.

కాని యెట్లులైన నేమి, నడచిపోవుచున్న ప్రపంచమువంక నొకసారి చూడఁగా వీరెల్లరును 'అతని' చేతిలోని బొమ్మలే యని యతఁడు గ్రహించినాడు. ఒక్కనికిని స్వతంత్రత లేదు. అట్టిచో నిక వీనియందు బాధ్యత యేమున్నది? ఇతని యోదార్పు చూడుడు :

'భయము లేదు, విచారింపవలదు, తనయ !
పాతకమొనర్చితి నటంచు భంగపడకు—
పుణ్యులగువారి కెచ్చోట పుట్టబోని
కరుణయన్నది పాపులకొఱకుగాదె ?'

తుట్టతుద కీమహాకవి మానవుల కొసంగు సందేశమేమనగా :

'రమ్మ! మధుపాత్ర నింపుము—రాని 'రేపు'
చచ్చిపోయిన 'నిన్న'—యోచన లవేల?
మధురమైయున్న యీనాటి మాట చూడు—
కాలము గతించుచున్నది కనులు గప్పి.'

—ఫిట్ జెరాల్డు, ౩౭.

ఇతని 'నీతి' ఆస్తికమతములకెల్ల విరుద్ధమైనది. వేదాంత మితని ప్రశ్నలకెల్ల చక్కగా జవాబు లీయగలదు. కాని, యతని కాయదృష్టము లేకపోయినది పాపము !

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# బొమ్మరిల్లు

శ్రీమతి మామిడిపూడి వెంకమ్మ

[ బొమ్మరిల్లు అన్న కథను 'యిబ్సన్' మహాకవి (౧౮౨౮-౧౯౦౬) వ్రాసెను. అతడు నార్వే దేశస్థుడు. ఈ కథను వ్రాసినప్పుడు అతనియొక్క వయస్సు ౫౦ సంవత్సరములు దాటెను. ఈ కథను వ్రాసిన తర్వాతనే అతనియొక్క కీర్తి నల్గడల వ్యాపించెను. స్త్రీల స్వభావమునుగురించి యిబ్సన్ గ్రహించినట్లు మరియేకవియు గ్రహించియుండలేదు. ఈనాటకమునందు స్త్రీల స్వాతంత్ర్యమునుసరించి యెక్కువగా చెప్పబడియుండుటచేత దీని మూలమున తమ సంఘము చెడిపోవుననియు, పురుషులకు స్వేచ్ఛ తగ్గిపోవుననియు అనేకులు భయపడుచుండెడివారు. ఇంగ్లండుదేశములో ఈనాటకమును ప్రదర్శించుటకు ఈ కారణములచేత అనేకులు ఒప్పుకొనలేదు కాని ఏలాగో ౧౮౮౯ లో దీనిని లండన్ పట్టణమందు ప్రదర్శించిరి. అదిమొదలు అన్ని దేశములయందును దీనికి గొప్పప్రఖ్యాతి కలిగెను. ఇందులోని ముఖ్యపాత్రలు "టార్వాల్డు హెల్మర్", అతని భార్య "నోరా". "మిసెస్‌లిండు" అనునామె నోరాయొక్క స్నేహితురాలు. "క్రాగ్‌స్టాడ్" అనువాడు ఒకబాంకీలో సమాస్తా. ఆబాంకికి "హెల్మర్" అధికారి. అతడు క్రాగ్‌స్టాడును ఉద్యోగమునుండి తీసివేసి ఆయుద్యోగమును మిసెస్‌లిండ్‌కు ఇచ్చెను. అందుచేత క్రాగ్‌స్టాడుకు కోపము వచ్చి, నోరాకు సంబంధించిన రహస్యము నొకదానిని బయల్పరచెను.

సంసారవిషయములో పురుషులు స్త్రీల యెడ ఎట్లు ప్రవర్తించునది "నోరా" బాసుగ గ్రహించి, సంసారము కేవలము బొమ్మరిల్లని నిర్ధారణచేసెను.]

క్రాగ్‌స్టాడు—మంచి కెప్పుడు కాలం లేనే లేదు. అంతస్నేహముగ వుండేవారంకద. తనకు గొప్ప వుద్యోగం రావడంతోనే నన్ను లాగిపారేశాడు. పోనీ గానీ నీవు చెప్పకూడదూ. నీకు అంతసహాయము చేశానుకద.

నోరా—అది ఆఫీసుపని. ఇది రహస్యంగ యింట్లో జరిగింది. దీనికి దానికి ముడిపెడితే యేలాగా?

క్రాగ్—నాకు రేపటినుండి తిండి యేలాగ? ఉన్నట్టుండి పొమ్మన్నారుగదా?

నోరా—నాకూగూడ చాలవిచారంగానే వుంది. నే చెప్తే వింటారా. నన్ను ప్రాణంలేని బొమ్మలా ఆడిస్తున్నారుగద. ఒకవేళ చెప్తాననుకో. నీ క్షేం తెలుసు? ఇవంతా నీకెందుకు? నీవు నా చిన్న బంగారు బొమ్మవుగదా. నీకు కావలసినదానినికూడ నేనే తెచ్చి యిస్తానుగదా. నీకెందుకు అదంతా అని అంటారు. నే నేం చేసేది?

క్రాగ్—పోనీ, నే నడిగినంత డబ్బు యిస్తే మరెవ్వరికీ యెప్పటికీ చెప్పను. లేకపోతే.—

నోరా—ఏమిటి చెప్పవు?

క్రాగ్—ఆలాగా! అవసరం తీరింది; మరిచిపోయావు. నాకు బాగా జ్ఞాపకంవుంది. పోనీగాని మీ నాన్న యెప్పుడు చచ్చిపోయారు.

నోరా—ఏప్రిల్ ౨౯-వ తేదీని.

క్రాగ్—ఇదిగో యీకాగితం చూచావా. మే నెల 3-వ తేదిని సంతకం వున్నాది.

నోరా—ఔను, ఏప్రిల్ ౨౯-వ తేదీని చచ్చిపోతే మేనెల 3-వ తేదిని యేలాసంతకం చేస్తారు?

క్రాగ్—ఇప్పుడు తెలిసిందా. తప్పక నీవే చేశావని తెలుస్తుంది. మరీ జాగ్రత్త. తక్కిందంతా జ్ఞాపకానికి వచ్చిందా.

నోరా—అయితే యిప్పు డేమంటావు? ఏమి చేసినా, యేలాచేసినా అంతా ఆయనక్రిందే ఖర్చుపెట్టాను. తెలిసినా పరవాలేదు. నన్ను బెదిరించ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నక్కర్లేదు. నీయిష్టం వచ్చినట్టు చేసుకో. ఏం జరుగు తుందో చూస్తా.

(క్రాగ్‌స్టాడు వెళ్లిపోవును.)

(నోరాయొక్క బాల్యస్నేహితురాలు మిసెస్ లిండు ప్రవేశించును)

నోరా—ఓహో యెంతకాలానికి. ఓయ్యమ్మ యెన్నాళ్లయింది. తిరిగీ నిన్ను చూస్తాననికూడ అనుకో లేదు. ఎప్పుడొచ్చావు? ఇన్నిరోజులూ యెక్క డున్నావు?

మిసెస్ లిండు—ఎక్కడా. అన్నివూళ్లు నావే. నేతిగగని చోటే లేదు. తిరిగీతిరిగీ యెక్కడ యేమీ లేక పూటకి గుడ్డకు కరవై ఒకరోజు తింటే నాలుగు రోజులు పస్తుండి బాధపడి ఆఖరుకి యీవూరు వచ్చాను. చాలీచాలనిదానికి మాఅమ్మ నాతమ్ముళ్లుకూడాను.

నోరా—వాళ్లెందుకు నీవెంటబడ్డారు?

మి.—నాభర్త తరిమేసింతర్వాత మా అమ్మగారివూరికి వెళ్లాను. మానాన్న చాల సుస్థీగా యుండి నేవెళ్లాక చచ్చిపోయారు. నాతమ్ముళ్లిద్దరూ బొత్తిగ చిన్నవాళ్లు. మాఅమ్మ ఒకర్తె పెద్దదీ. మరీ వాళ్లకి సహాయానికి యెవ్వరూ లేరు. అంతా నాకు తగులుకుంది. దరిద్రుడు తలగడగపోతే వడగండ్లవాన వచ్చిందన్నట్టు నాదరిద్రం నాతోటే వచ్చింది.

నో—అనక్క యేం చేశావు?

మి—ఆవూళ్లో కొన్నిరోజు లుండి అక్కడ కాలం గడవడం కష్టమయి గంతాబొంతా గాడిదంతబరువన్నట్టు వీళ్లనీకూడ వెంటపెట్టుకొని తిరిగాను. పాపం మాఅమ్మ ముసల్దీ. కష్టానికి ఓర్వలేదు. ఇక నా కష్టం అడగాలీ. ఇందాక చెప్పానే, ఒకరోజు తింటే నాలుగు రోజులుపస్తనీ. ఇక మా అమ్మ "మనదేశం వెళ్దాం. చచ్చినా బతికినా మనదేశంసాటి రాదు; మన బంధువులదగ్గర వుందా"మని మొదలెట్టింది. సరే, నేను కూడ యీపస్తు మన కెక్కడ జరగదూ అని బయల్దేరాను. ఇక్కడికి మొన్ననే వచ్చాను. నిన్న బ్యాంకిలోకి వెళ్లాను. బ్యాంకీలో నీభర్త మేనేజరుట. అక్కడికి వెళ్లింతర్వాత తెలిసింది. ఆయన్ని చూడ్డంతోటే నాకు ప్రాణం వచ్చిందనుకో. ఆయనతో నా గోడ వంతా చెప్పుకొన్నాను. పాపం ఆయనకు చాల జాలి వేసింది. నాకోసరం చాల విచారించాడు.

నో—ఏం అన్నా రేమిటీ? ఏమని చెప్పావు?

మి—మనం చిన్నవాళ్లగా వున్నప్పుడు ప్రతిరోజూ ఆడుకొనేవాళ్లం. ఇద్దరు ప్రాణస్నేహముగ వుండేవారం. ఒకనిమిషమయిన ఒకర్నివిడిచి ఒకరు వుండియెరుగం అని చిన్ననాటి ముచ్చటలు చెప్పాను. చెప్పేసరికి నీస్నేహితురాల్ని గనా అని జాలివేసి నీ అదృష్టం బాగుంది. ఇప్పుడే ఒకపని ఖాళీ అయింది. అందులో నిన్ను వేస్తాను అని చెప్పాడు.

నో—ఆలాగా. వాడ్ని తీసి నిన్ను వేస్తాడు కాబోలు.

మి—ఎవరతనూ?

నో—ఎవరా. క్రాగ్‌స్టాడని ఒకడున్నాడులే. నీకేమిటి తెలుస్తుంది? నీ విప్పుడే వచ్చావు.

మి—సరేసరి. నాకు తెలియకేం. అతనా.

నో—ఏం ఆలా అంటున్నావ్?

మి—పదేం డ్లయింది. అంతా మరిచిపోయి యుంటాడు. ఏలాగయిన బతిమాలుకొని యథాస్థానం చేరుకుందాం అని అనుకొన్నాను. నాగ్రహచారం—

నో—ఎందుకాలాగ అంటున్నావు? నా కేం బోధకాలేదే.

మి—అతను నాభర్త. ఒకమాటు కోపంచేత నన్ను తరిమేశాడు. మరిరావద్దన్నాడు. నాకూ ప్రాణం విసిగి వద్దన్నప్పుడు అంత బతిమాలుకోడం యెందుకని వెళ్లిపోయాను. కానీ, పాపం యిప్పుడు చాల విచారిస్తున్నాడట. నిన్న యెవరో నాతో చెప్పారు. ఏలాగూ వెళ్లేపోయాము. ముందు యేదయిన బ్రతుకుతెరువు చూచుకొనీ, అనక్క ఆయనదగ్గరకు వెళ్దాం అనుకొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నాను. కానీ యీమాట వింటే దగ్గిరకైనా చేర నిస్తాడా. అమ్మో యెంతదరిద్రం. నాదరిద్రం నాతో కూడనే వచ్చిందన్నమాట.

నోరా—నేచెప్పింది విని నీవు భయపడవద్దు. నీవనుకున్నట్టు ఆయనదగ్గరకు వెళ్లు. అయితే ముందు దీనినిసరించి చెప్పవద్దు. అతనుకూడ నాతో యెన్ని మాట్లో చెప్పాడు. ఇంట్లో చాల చీకాకుపడిపోతున్నా డట. పిల్లలను చూచుకోడం చాలకష్టంగా వున్నా దట. అతను బయటవెళ్తే, యింట్లో పిల్లలని చూచేవాళ్లు లేరట. కాబట్టి నీవు వెళ్లు. మరేం పరవాలేదు.

మి—నాకు భయంవేస్తుంది. మరి ఆలోచించాలిసుమా. తొందరపడితే లాభంలేదు.

నోరా—నీవు సమయానికి వచ్చావు. నాకష్టం తీరిందనుకొన్నాను.

మి—నీకేమి కష్టం వుంది నోరా. నీభర్తకి యిప్పుడే పెద్దవుద్యోగం అయిందిగదా. హాయిగ వుండవచ్చుగదా.

నోరా—నీవు చెప్పినమాట నిజమేకాని, నే నొక గొప్ప తప్పుపని చేశాను. అందుకు—

మి—ఏమిటది?

నోరా—నేను వచ్చినకొత్తలో నాభర్తకి చాల జబ్బుచేసింది. అప్పుడు డాక్టరు వూరుమార్చి గాలిమారిస్తే శీఘ్రంలో నిమ్మళిస్తుందని చెప్పారు. మాఆయన, దగ్గర డబ్బులేదని, ప్రయాణానికి వొప్పుకోలేదు. నేను రెండు మూడుమాట్లు చెప్పాను యేలాగయిన వెళ్దాంఅని. ఆయన కోపంచేసుకొన్నాడు. అప్పుడు ఫోర్జరీచేసి బాంకీలోంచి సొమ్ము ౨౫౦ పౌన్లు తెప్పించాను. అది యీక్రాగ్ స్టాడుకు తప్ప మరెవ్వరికీ తెలియదు. ఇప్పుడు అతని వుద్యోగం తీసివేశారు. నాదగ్గరకు వచ్చి, నే నడిగినంత సొమ్ము యిస్తావా, లేక నీభర్తకు వుత్తరం రానేదా? అంతేకాదు వూళ్లో అందరికికూడ చెప్తా నన్నాడు.

మి—ఆమాట యేం చేశావు. అతను అంత సొమ్ము యేలా వచ్చిందో నిన్ను అడగలేదు?

నో—మానాన్నగారు యిచ్చారని చెప్పాను. ఇద్దరంకలిసి ఆవూరు వెళ్లాము. ఆనిక్కు వచ్చాము. మరి నేనెప్పుడు ఆయనతో చెప్పలేదు.

మి—ఎప్పటికయిన యీ రహస్యం ఆయనకు తెలియడమే మంచిదికానీ నీవు చేసినది మాత్రం చాల తప్పుసుమా.

నో—ఈమాటకా నీతో చెప్పింది. నీవేమో సహాయం చేస్తావనికామా. తప్పని నీవు చెప్పాలా. నాకు తెలియదేమిటి?

మి—అయితే యిప్పుడు నన్ను యేమి చేయ మన్నావు?

నో—అతను వుత్తరంవ్రాసి ఆయన వుత్తరాల పెట్టెలో వేసి వెళ్లిపోయాడు. తన వుత్తరం తన కియ్యమని అడిగితే చాలు, ఇచ్చివేస్తాడు.

మి—ఇది సులభంగ జరిగేపనా? ముందు అతనికి నేనే కొత్త. ముందు నాగొడవ చెప్పుకోసి నాది కుదిరితే యిక నీమాటనిసరించి చెప్పాలి. సరే, చేతనయి నంతవరకు చూస్తాను.

నో—చూస్తానంటే కాదు. ఉత్తరం చదువు కోకముందరే యిది జరగాలి. ఇంకా ఒకరోజంతా వ్యవధి వుంది. రాత్రి ౧౦ గంటలకు తీరుబాటుగ కూర్చొని వుత్తరాలు చూచుకుంటారు. ఈలోపల నీవు సర్దాలి.

మి—ఇప్పుడే వెళ్తానుకాని నీవన్నట్టు ౧౦ గంటలదాక పోస్టుదగ్గరకు వెళ్లనీయకు. ఏదో కాలక్షేపం చేయించు. ఇదిగో నే వెళ్తున్నా. ఇప్పుడే వుత్తరం రాస్తా.

(క్రాగ్‌స్టాడు ఉత్తరం చదువుకోని మిసెస్ లిండున్న బసకు వస్తాడు. మిసెస్‌లిండు క్రిందహాలులో కూర్చొని యేదో ఆలోచించుకుంటూ యుంటుంది. క్రాగ్‌స్టాడును చూచి, రమ్మని పిలుస్తుంది. రహస్యంగా మాట్లాడమని చెప్పుతుంది.)

క్రాగ్—ఎందుకు నన్ను రమ్మని రాశావు?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లిండు — ఎందుకేమిటి? ఇంకా ఆలాగే వున్నారా?

క్రాగ్—నీకు నాకు సంబంధం వీడి పదేండ్లయిందిగదా?

లిండు—మీరు వదులుకుంటే వీడిపోతుందీ?

క్రాగ్—పోలేదా?

లిండు—మీరు పొమ్మంటే నే పొయ్యాను కాని నేనై నేను వెళ్లలేదే. ఎప్పటికయినా దయ వస్తుందేమో అని కనిపెట్టుకున్నాను. పోనీ నేనే బతిమాలుకొందాం అని నిశ్చయం చేసుకొన్నాను. మీకు యింకా నామీద కోపమేనా.

క్రాగ్—నీకుమాత్రం లేదేమిటి?

లిండు—కోపంవుంటే బతిమాలుకుంటూ వుత్తరం వ్రాస్తానూ. తరిమితే వెళ్లానుకాని నాకోపమేమిటి. ఏలాగో దయయుంచి వచ్చారు. ఎప్పటికైనా దేవుడికి నాయందు దయపుట్టదా.

క్రాగ్—సరే బాసుందిగానీ యిప్పుడు హాయిగ వున్నావుకాదా. ఎందుకు వుత్తరం రాశావు చెప్పావొంచం.

లిండు—మీరు యిప్పుడు స్వేచ్ఛగ వున్నారు. అందుకోసరం ఆలాగంటున్నారు. ఉత్తరం యెందుకు రాస్తాను? అది ఒకమాటా. మీతో చెప్పుకొని యేడుద్దామని. మీదగ్గరనుంచి వెళ్లినతర్వాత మావూరికి వెళ్లాను. అక్కడ నే వెళ్లగానే మానాన్నకూడ చచ్చిపోయారు. నాతమ్ముళ్లనీ, మాఅమ్మనీ తీసుకోనిమారంగా వెళ్లిపోయాను. అక్కడయెంతకష్టపడ్డా భోజనమయినా గడిచిందికాదు. నానాబాధలూ పడ్డాము. ఆఖరుకి మా అమ్మ స్వదేశానికి వెళ్తే చచ్చిందీ బతికిందైనా మన వాళ్లకి తెలుస్తుందని మొదలుపెట్టింది. సరేనని బయలుదేరి 3-౪ రోజులక్రితము యిక్కడికి వచ్చాము. ఏలాగో బతిమాలుకోని, పిల్లలను చూచేదానిక్కూడ యెవ్వరూ లేరుకదా యిప్పటికయినా దయపుట్టదా అని వుత్తరం రాశాను.

క్రాగ్—నీకష్టం చెప్పావా. ఇక నేను చేసినది తప్పని యెన్నిమాట్లో అనుకొన్నాను. విచారించాను. నీకోసరం వెతికించాను; నీవు మనదేశంలోనే లేవుగదా. మరి నిరాశచేసుకొన్నాను. బయటికి వెళ్తేనేకాని యింట్లో తిండికి జరగదు. వెళ్తే యింట్లో పిల్లలు అంతా కుర్రజట్టె. మరి చెప్పాలీ. ఇంటికి వచ్చేసరికి నరకంలా వుంటుంది. మరి వెర్రెత్తిన ట్టయిపోతుంది. కానీ యేదో జరిగిపోయిందీ. ఇకనైనా—

లిండు—ఇన్నిరోజులూ యెప్పటికైనా మీకు నామీద దయపుడ్తుందేమొ అనిగా నా తపస్సు. ఇక నాకు మరి కావలసిందేమిటి యింతకంటే-మాస్నేహితురాలు నోరా మేడమీద డాన్సుచేస్తున్నారు. వాళ్లతో చెప్పి మరి వస్తా. పాపం వాళ్లు నాకు అంతసహాయం చేశారు.

క్రాగ్—ఏమిటి సహాయం.

లిండు—ఈగొడవలో మరిచిపోయాను. మీరు నాస్నేహితురాలికి గొప్పసహాయం చేయాలి.

క్రాగ్—ఆసహాయ మేమిటో చెప్పు.

లిండు—మీరు సహాయం చేస్తానంటె—

క్రాగ్—చేయక మరేంచేస్తాను. అదేమిటో చెప్పు.

లిం—నాకష్ట మంత చెప్పుకొన్నాను. వాని భార్యస్నేహితురాల్నిగదా అని నాకు యిప్పుడిప్పుడే ఖాళీఅయినదని ఆపనిలో నన్ను వేస్తానని చెప్పాడు. ఆర్డరు వచ్చినట్లే.

క్రా—మరేం. ఇక నా దగ్గర యెందుకు వుంటావు. నీఅవసరము తీరింతర్వాత మరి నన్ను తలపెట్టుతావా. అదీగాక నన్ను తీసేసి నిన్ను వేశారు.

లిం—అయ్యో! అది నాకు యిప్పుడే తెలిసింది. ఎంతో విచారించాను. మీరు ఆలా అంటారనే ముందుగా మీదగ్గర ఆగా ఒప్పించాను.

క్రా—ఇంతలా చెప్పుచున్నావుగద. నా పని నాకిచ్చివేయకూడదు? నీవు మానుకోకూడదూ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లిం—నేను మానుకోడమే తప్ప మరేం లాభం లేదు. ఎవరికీ లేకపోతే మన కేం లాభం? ముందు ప్రవేశించి ఆమీద యేలాగయిన సర్దుకోవచ్చు.

క్రా—నాపనని నీ కేలా తెలిసింది?

లిం—నోరా వూహించి చెప్పింది. ఆమె వ్యవహారం మీకేమొ తెలుసుటకాదూ. నాకు ఆయననౌఖరీ యిచ్చారని చెప్పగానే మీనౌఖరీ పోయిందని యెంతో విచారించింది పాపం. అయినా నాకు యిచ్చినందుకూ, మన సంబంధం తెలుసుకున్నందుకూ చాలా సంతోషించి మీరేమొ ఆయనకు ఒక వుత్తరం రాసిపడేశారట కాదు, ఆవుత్తరాన్ని ఆయన చదువుకునేదానికి ముందే మిమ్మల్ని అడిగితీసికోమని నన్ను మరీమరీ బ్రతిమాలి చెప్పింది. మీరు యేలాగో దయయుంచి వచ్చారు. చాలా సంతోషించాను.

క్రా—అయితే ఆవుత్తరం అడిగి తీసుకోమన్నావా?

లిం—కాదు కాదు పిలిపించిందేమొ అందుకే కానీ, యెప్పటికయినా ఆరహస్యం ఆయనకు తెలియడమే మంచిదని నా అభిప్రాయం—

(గడియారము చూచును.) వాళ్లు వస్తున్నారు. మీరు యిక్కడినుండి వేగిరము వెళ్లిపొండి. లేకపోతే అనుమాన పడుతారు. (క్రాగ్‌స్టాడు వెళ్లిపోవును.)

("హెల్మర్" నోరాభర్త. ఆఫీసునుండి వచ్చుచున్నాడు.)

నో—ఏమి ఆలా వున్నారు.

హె—దూరంనుంచి రావడంచేత ఆలాగున్నానే కాని మామూలుగానే యున్నాను. ఇంకా నువ్వే ఒకమోస్తరుగా వున్నావు. యేంటీ కబుర్లు.

నో—ఏమిటుంది కబుర్లకీ. మీరు వస్తే యిద్దరము డాన్సుచేద్దామని కనిపెట్టుకొని యున్నాను.

హె—దానికేం, తయార్. కానీ ఒకఅరగంట. ఘోదాంపద, మేడమీదికి.

నో—అరగంట చాలదు. నేను చాలసేపంత వరకు.

హె—ఓ మహా అంటే మరొక అరగంట అయ్యేను. కానీ, నీవలసిపోతావేమొ అని—

నో—నేనా, యెప్పుడు అల్లా జరగదు. మీరు విసిగిపోకుండావుంటే అంతే చాలు.

హె—నోరా యేమది. అలసేపోవా. అబలవు కదా. సుకుమారివికదా. నడిస్తేనే పాదములు అరిగిపోవునుగదా. చిన్నదానవు, డాన్సుయందు నీకు అంత యిష్టము, అందుచేత అంటున్నావు కానీ అలిసిపోవా.

(ఇక హెల్మర్‌యొక్క స్వభావము—తన భార్యవచ్చి యిప్పటికి ౮, ౧౦ సంవత్సరము లయినప్పటికిని వచ్చిననాటికంటె కొంచమయిన పెద్దదయినదని కాని, కొంత జ్ఞాన మున్నదనికాని, ఆమెకు యిష్టము అయిష్టము అన్న గుణములు వున్నవనికాని తెలుసుకొనుటలేదు. మన మొక కర్రబొమ్మను యింట్లోవుంచుకుంటే దానికి పెరుగుటకాని, మనుష్యునికి వున్నతక్కిన లక్షణములుకాని దానియందు లేనట్లే. ఈ భార్యనుకూడ ఒక కర్రబొమ్మమోస్తరుగ చూచేవాడు. సరే, యేలాగో యీరోజు డాన్సుకు పిలుచుట, తాను వెళ్లుట జరిగినది. ఇద్దరు మేడమీదికి వెళ్లి డాన్సుచేసిచేసి, యెన్ని మాట్లు చాలన్నను ఒప్పుకొనక ఆఖరుకు రాత్రి ౧౦ గంటలకు ముగించి క్రిందికి వచ్చారు. క్రిందహాలులో మిసెస్ లిండు కూర్చొని యున్నది.)

నో—నీవు వచ్చి చాలసేపయిందా.

మి—దగ్గరదగ్గర అరగంట అవుతుంది.

నో—నేను చెప్పినపని చేశావా.

మి—అతనికి నీ వుండగానే వుత్తరం రాసానుగానూ.

నో—ఏమిటయింది.

మి—ఆతను రేపు సాయంత్రానికిగాని రాడట,

నో—పోనీ, మరేం చేస్తాం. ఏలా జరగవలసి వుంటే ఆలా జరుగుతుంది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



దివ్య వేణుగానము

—యస్. యన్. చామకూర్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఆవేదన

—పి. బ్రహ్మము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మి—ఎందు కింతభయం. ఇంక నీ భర్తకు తెలిస్తే యెంతో సంతోషిస్తాడు. ఏంచేసినా అతని కిందేకదా ఖర్చుపెట్టావు. మరేం పరవాలేదు. మరేం పరవాలేదులే. ఎప్పటికయినా అతనికి తెలియడమే మంచిది. నీకేం పరవాలేదు. అడిగితే జరిగిందిజరిగినట్టు చెప్పేయి. నే వెళ్లొస్తానూ.

హె—ఏం అప్పుడే వెళ్తున్నావ్.

మి—నేవచ్చి అప్పుడే చాలసేపయింది. ఏలాగూ వస్తావుకద అని కూర్చున్నా. ఎప్పటికీ రాలేదు. నా స్నేహితురాలితో మాట్లాడి వెళ్దాం అని. రేపు వేళవుండగా నేవచ్చి సరదాతీరా కూర్చుంటాను. మరేం అనుకోకు.

హె—ఏలా యింతసేపు వున్నావు. మరి అయిదునిమిషాలు వుండగూడదు. అక్కడ నా స్నేహితుడు వస్తే వాడితో ౧౦ నిమిషాలు అయిపోయింది.

నో—వెళ్లనిస్తురూ, పాపం, చాలాసేపయింది. రాత్రికూడానూ. వచ్చింది మొదలు పాపం యేదో మాట్లాడుతూనే వుంది. రేపు వస్తుందిలెండి.

హె—నీస్నేహితురాలు నోరా బంగారుచిలుక, యేలాగ టారంటెల్లాడాన్సు చేసిందో అడిగావా? నా బంగారుబొమ్మను బాగా స్తోత్రంచేశావా? నాచక్కని చిలుకను చూచావా యేలా అలిసిపోయిందో! నీస్నేహితురాలు వెళ్లమని శెలవిచ్చిందిదిగా. మరేం. వెళ్లిరా.

మి—శెలవు. అమ్మా పోయివస్తాను. వెళ్లి హాయిగ పడుకో.

హె—నోరా ఆడిఆడీ అలిసిపోయ్యావు. వెళ్లి పడుకో. నేను పోస్టుచూచుకొంటాను. ఇప్పటికే చాల రాత్రి అయినది.

(నోరా వెళ్లి పడుకుంది. హెల్మర్ వుత్తరములన్నీచూచి ఒకవుత్తరం తీసుకొని) నోరా నోరా యేమిటీవుత్తరం.

నో—ఉత్తరం చూచి, నోరా యేమి టీవుత్తరం అంటే, రోజుకీ యెన్నో వస్తుంటాయి కదా నాకేం తెలుసు.

హె—ఛీ ఛీ నీకు తెలియదా. ఇన్నిరోజులల్లాకాదు మోసపోడానికి—

నో—రోజూకంటె యీవాళేం యెక్కువ?

హె—చాల్లే నీచమత్కారమూ నీవూను. కట్టిపెట్టు. అడిగిందేమిటో సమంగ జవాబుచెప్పు. ఎంత ద్రోహం.

నో—ద్రోహమా యేమిటి. బాగా చెప్పండి. చెప్పందీ నాకేలా తెలుస్తుంది.

హె—నీతియ్యనిమాటలే నన్నింతకు తెచ్చింది. నాపరువుపోయేపని చేశావు. మరి యింతకంటె యేం కావాలి. నే నేలాగా రేపటినుంచి నలుగురిలో తలెత్తుకొనితిరగడం? నీకు తెలియదంటె నమ్మతానా? నీకు తెలియదా? దుర్మార్గీ? నిన్ను మాయింటికి పిల్చుకొనివచ్చినదిమొదలు నీకు యెంతచేశాను. ఆడుకొనే చిన్నబిడ్డమోస్తరు చూచుకొన్నాను. సంరక్షణచేశాను. నీవు యీలాంటిదానివని తెలిసుంటేనా. నాకు తెలిసిందే కాదు. అయ్యో యెంతముద్దుగ చూచుకొన్నాను. నీతిండికిగాని, ముస్తాబుకుగాని, నీఆటలకుగాని యెంతసదుపాయం చేసేవాడిన్ని! ఇంతకష్టపడ్డందుకు బాగా బుద్ధిచెప్పావు.

నో—ఎందు కింతకోపం. ఇంతకోపానికి నేనేం అంతతప్పు చేయలేదే.

హె—చేయలేదా. చాల్లే, నీమాయమాటలూ నీవూను. ఇన్నిరోజులూ విన్నాను చాలదూ. ఆ విని వినే యింతమట్టు కొచ్చింది. నిన్నంటే యేమిలాభము. అచ్చం నీకుపుట్టిందయితేసరే. నీతండ్రితాతలదగ్గరనుంచీ వచ్చింది. నే నెరగనా యేమిటి. మీఅమ్మ నీకు వుగ్గుపాలతో కరిగించి పోశిందికాదూ. నీమాయలో పడి మోసపోయాను. ఇదే ఆఖరుమాట. అంతసొమ్ము యేంజేశావు. ఫోర్జరీచేశావా లేదా? ఎందుకు చేశావు?

నో—ఇంతకోపంగా వున్నారుగద నే చెప్పేదేమయిన మీకు వినిపిస్తుందీ. వృధాగా యెందుకు? నాదే బుద్ధితక్కువ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హే—నీది బుద్ధితక్కువా? ఇంకా యేం చెయ్యాలి? ఇంకా యిప్పుడు చేసింది చాలదంటున్నావా. ఇంకా నాకు వినిపించడంటున్నావా. వినిపించేలా చెప్పావుగా. ఈలాంటి పాపాత్మురాల్ని యేంచేసినా పాపం లేదు. చండాలురాలా. దుర్మార్గురాలా. అయ్యయ్యో, నిన్ను నమ్మి పిల్లలను నీదగ్గరే వదిలిపెడ్తే మరేం అక్కర్లేదు, నీయంత చేసి వదిలేస్తావు. అసలు తెలిసితెలిసి వదలడం యేలాగా. మరి ఒక్క నిమిషం వుంటావంటేనే భయంవేస్తుంది. ఛీఛీ పాపి. నిన్ను చూస్తూన్నకొద్దికి ఒళ్లు మండిపోతూంది. ఎంతముద్దుగ చూచుకొన్నాను ఇన్నాళ్లు. ఏలా దాచావు. ఇప్పటికైనా చెప్ప లేదుకదా. నీకు నిండా మాటలైన రావనిన్ని, చిన్నపిల్లవనిన్నీ, ఆనుకొనే బొమ్మవనీకూడ అనుకొన్నాను. ఛీ, మరి వెళ్లిపో. మరి రాకు. ఎప్పటికీ రాకు. పోపో. తిరిగీ చూడకు.

దాసీది—బాబూ, అమ్మగారికోసరము యెవరో వచ్చారు.

హే—(తలుపుదగ్గరకేసి) ఎవరు?

బంట్రోతు—ఇదిగో అమ్మగారికి వుత్తరం.

హే—నేనే చదువుతా (లోపలికివచ్చి) అమ్మగారూ లేదు గిమ్మగారూ లేదు. (వుత్తరం చించుతాడు) నేనే చదువుకుంటా.

నో—ఆలాగే చదవండి. ఎవరి కొక్కవాలీ యీగొడబ.

హే—నోరా నోరా యేమిదీ. ఏంచేశావు? ఈ వుత్తరం రాకపోతే నాకు యెంతకష్టం వచ్చివుండేది. ఇప్పుడైనా చెప్పవూ. ఎంత తొందరపడ్డానూ. ఎంత కొబ్బడ్డానూ. (ఆరసీను మంటలో పారేసి) ఇక నన్ను యెవ్వరూ యేంచెయ్యలేరు. ఏదో కోపంమీద ఆలాగన్నాను కానీ, మరేం అనుకోమా. మంచిసమయానికే వచ్చింది యీవుత్తరం.

నో—అదేమిటి ఆ వుత్తరం రావడంతోటే ఆలా యెగిరెగిరి పడ్డారు. ఈవుత్తరం రావడం తోటే యీలా మొదలెట్టారు. ఈలాచూస్తే అంతా వెర్రిలా వుంది. ఒక్క నిమిషంలో బ్రహ్మాండమయిన కోపం. అమ్మయ్యో నన్ను మింగేంతకోపం. అంతలో విపరీతమయిన శాంతం. బుజ్జగించడం బ్రతిమాలుకోడం. ఇదంత చూస్తే యిదొక నాటకంలా వుంది.

హే—నీ వన్నమాట నిజమే. ఇదంత కల అనుకో. ఏదో జరిగిపోయింది. లే, చాలసేపయింది. ఏమిటి యీలా వున్నావు. మరేం లేదని చెప్పాను కానూ. మరి నేనామాటే తలపెట్టను. నీవుకూడ మరిచిపో. ఆకాగితముకూడ కాల్చేశానుగా.

నో—మామూలుగ, నే నేలా వుంటా. మీకు అపకీర్తి. మరి పిల్లలు నాదగ్గర వుంటే చెడిపోతారు. ఏలాగో నాలా తయారవుతారు అనీ యిప్పు డిప్పుడు మీ రన్నారుగమా. మాతాతల తండ్రులగుణాలు, మా తాతల గుణాలు అన్నీ మీరు బాగా యెరుగుదురుగా. ఆగుణాలే నా కొచ్చాయి అనీకూడ అన్నారే.

హే—నోరా, యిందాక నే నేం చెప్పాను? ఒకటీ వినిపించుకోవూ! ఇదిగో తిన్నగా తలెత్తి చూడు. మరి నిన్నేమి అనను. అప్పు డేదో కోపంమీద అన్నాను కాని అదంత మరిచిపో. నిన్ను క్షమించాను చూచావా. నీవన్నట్టు దేవుని దయవల్ల కష్టం గడిచిపోయింది.

నో—ఎవరికి?

హే—నాకు.

నో—నాకో?

హే—అదా, నాకు తెలిసిందేకాదు. ఇద్దరికీ గడిచిందన్నమాటే. ఇక మనల్ని యెవ్వరూ యేమీ చేయలేరు. ఏలాగో మనం తప్పించుకొన్నాం. కానీ మనము యిక దానిని తలపెట్టేవద్దు. మరీ, నీవుకూడా యేమీ జరగలేదని అనుకో. నిజంగానే యేం జరగలా. ఏమిటయింది యిప్పుడు? జరగలేదనుకొంటే సరీ. మరీ, జ్ఞాపకమువచ్చిందనుకో. చెడ్డకల వచ్చిందనుకో. ఆరెండువుత్తరాలు చింపేశానా. మరి జ్ఞాప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కానికి రానేరాదు. మరి రానేరాదు. అబ్బా, యిప్పటికి హాయిగ వుండాము.

నో—మీకు హాయిగ వుంటే నాకుకూడ హాయే. ఎందుచేతనంటే నాకు కష్టము సుఖమూ అన్నది లేనే లేదు. అందువల్ల.

హె—ఏమీ, నాకుమాత్రం తెలియదా, ఈ రెండుమూడురోజులు యెంతోబాధ పడియుంటావని.

నో—కష్టంకాదు. యుద్ధంచేశా ననండి. ఇప్పటికి పూర్తిఅయిం దనండి.

హె—అంతే. పదా వెళ్లి పడుకుందాము. చాలరాత్రి అయిపోయిండి.

నో—ఈరాత్రి మరి నిద్ర. ఇంతటితో సరి. పూర్తిగ క్షమించానని అన్నారుకదూ.

హె—నిజంగానే. ఒట్టుపెట్టుకొనికూడ చెప్తాను. సరా క్షమించానని.

నో—సరే. నాకు చాలసంతోషం. అందుకే యీజామాయి నిలబడ్డది. ఇదిగో, వెళ్లిపోతూన్నా. (తనబట్టలు మూటకట్టును).

హె—అదేమిటి యెక్కడికి వెళ్తావు. వెర్రెత్తిందా యేమిటి. నీకు మతి చెడిపోయినట్లున్నది.

నో—ఈరాత్రి నాకు యెంతో తెలివి వచ్చిందనండి. నాకు మీరు మంచిబుద్ధి చెప్పారు. నన్ను క్షమించానని అన్నారుగనుక యిదే వెళ్లిపోతున్నాను. ఎక్కడికి వెళ్తున్నావు అని అడిగారు. ఒక్క నిమిషం కూర్చుంటే అంతా చెప్పివెళ్తా.

హె—అదేమిటో చెప్పు వింటానుకాని వెళ్లకు. (కూర్చుంటాడు).

నో—(కూర్చొని) మనకు పెండ్లయి యెనిమిదేండ్లయిందిగా. నే చెప్పిందంతా వినండి. ఆఖరున జబాబు.

హె—ఏమిటో నీవు చెప్పడం, నీ వునికి చూస్తే నాకు భయమేస్తున్నది. నాకేం బోధపడ్డంలేదు.

నో—ఒక్కరోజయిన యిద్దరం కలిసి ఒక్కచోటకూర్చొని దేనినిగురించిగాని విచారించామా. ఈలా కూర్చొనయిన కూర్చున్నామా. మీరే తిన్నగ జ్ఞాపకము తెచ్చుకోండి. మీరు భర్త, నేను భార్యనీ. ఇన్నేండ్లు మనము కలిసియుంటే ఒకరోజూ యేమీవుండదా.

హె—ఏమి టుందీ అంతలా నీవూ నేనూ కూర్చొని కలిసి ఆలోచించేదానిక్కి. నా కష్టమంత నీతోచెప్పి నిన్ను కలవరపెడితే నీకువచ్చిన లాభమేమిటి. నావ్యవహారం నాజోలీ నీకుచెప్పి యేంలాభం.

నో—మీ వ్యవహారంగురించి కాదు. మిమ్మల్ని గురించికాదు. ఎంతసేపయిన మీకష్టాలూ, మీ సుఖాలు యింతేనా? మరేమీ లేదూ? నేమాత్రం మీలాటిదానినికానా. నన్నుగురించి మీ రెప్పుడయినా విచారించారూ? నాయొక్క అభిప్రాయం అడిగారూ? నా సుఖంగురించి విచారించారా? ఆఫీసుకు వెళ్లడం, యింటికి రావడం, ఆడాలని తోస్తే ఆడడం, పాడాలని తోస్తే పాడడం, యెక్కడికయినా వెళ్లాలని తోస్తే వెళ్లడం. అంతేకాని ఒక్కనాడైన ఒక్కనిమిషమయిన నన్నుగురించి నాస్థితేమొ గతేమొ విచారించారా. ఇంతెందుకు, చిన్నప్పుడు నాతండ్రివల్లను, యిప్పుడు మీవల్లను యీలా అన్యాయమయిపోయాను.

హె—నేనయితే సరే, నీతండ్రికూడ ద్రోహం చేశాడా.

నో—సందేహ మేమి. మానాన్నదగ్గ రున్నప్పుడు యెంతసేపూ ఆయన చెప్పినట్టు నడుచుకుంటూ వింటూవుంటే తప్ప వొప్పేవాడు కాడు. దానికి మరేమయినా చెప్పానా 'నీకేం తెలుసు. నీకేం తెలియదు. నీవు పశిపిల్లవుకదా.' అని నేచెప్పినది యెంతమంచిదయినా మరిపించి బొమ్మను ఆడించినట్టు ఆడించేవాడు. కాని నేచెప్పినదాంట్లోకూడ కొంతఅర్థ ముందనుకునేవారు కారు. నేనుమాత్రం నాబొమ్మలను నా యిష్టం వచ్చినట్టు శృంగారించి వాట్లతో ఆడుకొనే దానను గానా. నేను ప్రాణంలేని బొమ్మను ఆడిస్తే వారు ప్రాణంవున్న బొమ్మను ఆడించారన్నమాట.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హె—అలా అంటావే, మనం పెండ్లిచేసుకో లేదా. పెండ్లంటే యేమిటో తెలిసిందా. ఆనాడు యేమి చెప్పారో తెలిసిందా.

నో—తెలియకేం-ఆయనచేతిలో వున్న బొమ్మను మీకు ఒప్పచెప్పా రన్నమాట. ఇక మీయిష్టంవచ్చినట్లు వాడుకోవచ్చు నన్నమాట. మాటేమిటి. మీరూ ఆలాగే చేయుచున్నా రన్నమాట మీకుమాత్రం తెలియదూ. ఏరోజుకారోజా నేను యేలావుండాలో ఆలాగా మీయిష్టానుసారం నేను చిన్నతనంలో నాఆటబొమ్మను వుంచుకొన్నట్టు మీరు తయారుచేసేవా రన్నమాట. నాకు యిష్టమున్నదో లేదో ఒకరోజయిన అడిగారా.

నేను దీనిని గ్రహించి నేనుకూడను మీకేది యిష్టమో అదే చేసేదానిని. కాని నన్నుగురించికాని, నా యిష్టమునుగురించికానీ ఒకరోజయిన ఆలోచించడమే లేదు. నాజన్మం యెప్పుడూ అక్కడ కొద్దిరోజులూ యిక్కడ కొంతకాలం చిత్తం చిత్తం అంటూ కాలక్షేపం చేశాను. నేను పుట్టింది యిందుకేనా. నన్నుగురించీ, నా జన్మాన్నిగురించి ఒకమాటు అనుకోవద్దా. ఇంతకంటె ఘోరం ప్రపంచంలో వుందా.

హె—ఎంత కృతఘ్నురాలివి. ఇక్కడ నీకు సుఖంగ లేదా. చేసిందంతా చేయించుకొని ఆఖరుకి యీలా అన్నావు.

నో—నా కోసరం చేశారా? మీ సరదాకు చేసుకొన్నారు. నేనుకూడ యిక్కడ వుండి యింతకంటే మరేమి చేయలేనని మీసంతోషమునకై యేమి శేమిటి కావాలో చేసేదాన్ని. కష్టపడ్డానని చెప్పలేదు. బ్రతికినంతకాలం ఆడుకోడంతోటే సరిపోతే, పుట్టి యేం లాభం. కాబట్టి యికమీదట యీలావుండడం నాకు యిష్టములేదు. ఇక్కడ వుంటే మరి లాభం లేదు. వెళ్లి యిహపరసాధనమయినదానిని గురించి నేర్చుకుంటాను. మీరు క్షమించారు గనుక నిశ్చింతగ వెళ్తాను.

హె—ఆచదువేమిటో ఆసాధన మేమిటో నే చెప్పలేనా. నాదగ్గర నేర్చుకోకూడదూ.

నో—మీదగ్గర కుదరదు. మీరు నాకు చెప్పనూలేరు. ముందు ఒకమోస్తరుగ వుండి యిప్పుడు మరొకమోస్తరుగ వుండలేము. కాబట్టి మరి అడ్డు చెప్పకండి. నే వెళ్లిపోతా. మీరు యెంతబ్రతిమాలిన లాభం లేదు.

హె—నీవు యింత గట్టిగ చెప్పినప్పుడు, నీకు ఒకటి జ్ఞాపకము చేయవలసివున్నది. మన పెండ్లిలో మనము ప్రమాణంచేశాము. ఏమని చేశాము జ్ఞాపకముందా. భర్తఆజ్ఞ మీరకూడదనీ పిల్లలను పెంచుటవిధి అని.

నో—పెండ్లినాటిమాట నాకేమి తెలియదు. అది మీకే తెలుసును. మీకు తెలిసి మీరే ఆవిధిని చెల్లించలేకపోయారు. ఆవుత్తరం రాకపోతే ఆయొక్క ప్రమాణం యేం అయివుండేది? నా గతేమి? తిన్నగి నెత్తిమీద గుడ్డవేసుకొని వెళ్లవలసిందేగా? వెళ్లమన్నారే, తరిమేశారే. తిరిగీ యేమకూడదన్నారే ఎక్కడికి వెళ్తావనుకొన్నారు. మీకష్టం గడవగానే, మరిచిపొమ్మన్నారు. చెడ్డకల కన్నా ననుకోమన్నారు తలపెట్టేవద్దన్నారు. పెండ్లినాటిమాట జ్ఞాపకం తెచ్చుకొమ్మన్నారు. మీరు నాకు మంచిపాఠమే చెప్పారు. ప్రాణంలేని బొమ్మలతో చిన్నప్పుడు ఆడుకొన్నాను కానూ. ఇప్పుడవి లేవని విచారిస్తున్నానా. ఆలాగే యీమెట్టుగడిచినప్పుడుకూడ ఆలాగే వుంటుంది. ఆయొక్కని మిషంలో ఆప్రేమ, ఆదయ, ఆముద్దు, ఆముచ్చట మీకు పటాపంచలయిపోయింది గాదూ. ఇక నేమి చెప్పినను లాభంలేదు కాబట్టి యిదో వెళ్లిపోతున్నా. ఏదీ నావుంగరం. ఇదిగో మీ వుంగరం.

హె—ఉంగరంకూడ యిమ్మంటావా. ఉండవా నోరా, నోరా, యెక్కడికి వెళ్తావు. అదయినచెప్పవా. నీకేమయిన డబ్బు పంపిస్తా.

నో—మీరు వుత్తరంవ్రాయవద్దు. నాకు డబ్బూ పంపవద్దు. మరి నామాటే తలపెట్టవద్దూ. (వెళ్లిపోవును).

హె — (హెల్మర్ కుర్చీమీద కూర్చొని యేడ్చుచూ) నోరా, నోరా, నోరా, వెళ్లిపోయావా, వెళ్లిపొయ్యావా.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సుభాషితము

బొడ్డు బాపిరాజు

ఏమోయీ సాగర! మన-లో మనమాటమెసుమా తెలుపగావల దీ
సామాన్యమానవుల కది-యేమని తెలిపినను నష్టమేలేదుగదా!

రేగినగాలిదుమ్మునకె రెప్పలు గుప్పున నప్పళించు మే
మే గరువమ్ము రొమ్మువిరిపింపగ దేశముకానిదేశ మూ
రేగుచు పుట్టినట్టినెల వింతయు చింతన సేయకుండ నీ
లాగున నెన్నియోయుగములం దొరలించుచునున్నవాడవే!

ఎవఁడోయీ! నిను నాజ్ఞసేయగలవాఁ డిన్నాళ్లు? నీకంతతే
కువ లేకున్నదిగాక, బెగ్గటిలి గగ్గోలొంది యువ్వెత్తువె
ల్లువలోనం దలమున్కలై గడియలో లోకమ్ము లల్లాడు ని
క్కువ మీ వాక్కు-పదమ్ము ముందునకు కోర్కుల్ సాగ సాగించినన్.

నిన్నుంగన్న నెడంద జాలివొడమున్ నిర్వీర్యు డెవ్వండొ దా
నెన్నేనైన సహించియుండదగుగానీ, సత్వసంపన్న! నీ
కు న్నేలోటది? ఎవ్వ డడ్డగలడో యుప్పొంగుమా చూత మీ
మన్నుల్ మిన్నులుగూడుచోట నివసింపన్ నీకు ప్రారబ్ధమే?

ఏనా డీచెరవీడిరాగలుగునోయీ! వేడికన్నీళ్లతో
యీనీజీవనమెల్ల యుప్పరిసిపోయెన్;– ఎంతగా నీవు లో
లోనం ఘూర్ణిలినం బ్రయోజనము పొల్లుంగాక పైపెచ్చు నీ
నానాదుస్స్థితిమూలముం దలచుకొన్నం గుండె నీరయ్యెబో!

వెలబెట్టించిన గవ్వసేయని మహావిద్వాంసులే నేడు ర
చ్చలలోనం దలలెత్తినారు; జగ మిచ్ఛావ్యాప్తులన్ మీరి మే
రలకొమ్ముల్ మొలిపించుకొన్నదకటా! రత్నాకరుం డన్నకీ
ర్తులు మ్రోయించిననీవె కాల్ గదుప వేదో మున్గ నున్నట్లుగా!

దొరికినతావుకై నిలువుదోపిడియిత్తురు పుంత్రత్రోవ ల
బ్బురముగ చేలలో కలసిపోయి సుకమ్మున నున్నవన్న నె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్వారు మడిగట్టియుండి రిదే పల్కు-ము వ్రేల్మడువంగ; తేరగా
దొరికిన పోవనీయరుగదోయి! తటస్థల మాక్రమింపుమా!

అదియె ప్రపంచధర్మమగునయ్య! మహామహులెల్ల నీతికో
విదులె పరాయివారి చదివించెడిచో; తమపట్ల నెప్వ డె
య్యది యనుకూలమో యరయునట్టిరె మాయజగమ్మునందు వా
రిదె కలపేరు నీవలె వరించినపీఠము విప్పకుందురే!

ఎవడొ కలండు దేవుడని యింతకు జంకెదవేమొ? తెల్విత
క్కు-వయని మెందరెందరినొ కోరినవారిని సాక్ష్యమిత్తు; మా
నవులము మేమె నమ్మమనినన్ భయమేటికి నీకు? ఉన్న-చో
నెవరికి లెక్క-? పిచ్చివిడు మింతకు దేవుని గీవునిన్ సఖా!

కాలము మారిపోయినది కాగలవారికి నేడు రోజు లే
గోలయు లేక యుంద మనుకొన్నది సాగదు; లెమ్ము! నేటి కీ
వేల యతిక్రమింపగదవే! గుదులెక్కి-నకాళ్ల కింతసం
చాలనముం ఘటింపుము విచారము సేయగవచ్చు పిమ్మటన్.

నీదరినుండి సంజ పయనించెడివేళల హోరుమంచు నా
పాదము లంటిపోయితివి బాగుపడంగలవంచు నెంచి నే
నేదియుకోర కూరకె వచించితి పున్నెమటంచు, నచ్చినం
గాదనకుండ సేయు మటుగానియెడన్ వినిపింప కేరికిన్!

లోక మిది పలుగాకి చీకాకువరచు-కోరి చూడలే దొరుడు బాగుపడుచున్న
నీశుభము నెంచి చెప్పితి నీవు తెలియ – నేరకుండిన నాకేమి? నీదుకర్మ!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆ చా ర ము

వేలూరి శివరామశాస్త్రి

ఆచారము యుగయుగాంతరములనుండి అనేకమహాత్ములనుండి మానవున కయాచితముగా సంక్రమించిన ఐశ్వర్యము. ఆచారము లేనిచో జను లందఱును జంతువు లయి పోయి యుందురు.

ఆచార మనఁగా అలవాటు. అలవాటులలో మంచివియుఁ గలవు, చెడ్డవియుఁ గలవు. మహాత్ములగు మనపెద్దల మంచియలవాటులే 'ఆచారములు'యి అనుష్ఠింపఁబడుచున్నవి.

ఒకకుటుంబమునందలి యింటిపెద్ద మాటలను, పనులను వానిపిల్ల లనుకరింతురు. పలుకుబళ్లను బట్టకట్టులను ఉనికినిగూడ తలవని తలంపుగా అనుకరించుటమన మెఱుఁగుదుము. 'అనుకరింపవలయును గాఁబోలు'నని అనఁగా అది విధి యని అనుకరించువారినిగూడ మన మెఱుఁగుదుము. ఇట్టి యనుకరణమును ఎగతాళిచేయుటకు మనదేశమున నొక కథ వాడుకలో నున్నది. అప్పయ్యదీక్షితులవారు కావేరీతీరమున వార్చుచుండి రఁట. ధ్యానపు బిగిచేఁ గాఁబోలు వారిగోఁచి యూడెనఁట. వారి కిరువాగుల వార్చుచున్న బ్రాహ్మణు లందఱును గోఁచు లూడఁ దీసికొని కూర్చుండిరఁట!

తెలివిమాలిన అనుకరణములవలన ఇట్టితిప్పలు కలుగును. ఇవియే దురాచారములకు దారులు. తెలివిమాలినవారికిని, తెలివిని ఉపయోగింపని వారికిని ఈయనుకరణమే శరణము. అదియే వారికి ఆచార మగును. క్రమముగా వారి కది విధిగను, తుదకు ధర్మముగను మూర్తీభవించును. తెలుఁగులకు ఎడమపైఁట, అఱవలకు కుడిపైఁట. ఏల? వీలునుబట్టి అట్టి యాచార మందమా? ఒకరికి వీలయిన దింకొకరి కేల కాదు? తెలుఁగులలోనే ద్విజేతరులందు ఇరుపయ్యంటలును గలవు. కావున నిది వాడుక. అనఁగా ఆచారము. క్రమముగా నిది వారివారికి స్థిరముగా నెలకొని ధర్మసీమలోఁ జొఱఁబడెను.

బ్రాహ్మముహూర్తమున లేచి కడుపు రిత్త చేసికొని పలుదోముట మంచి యలవాటు. దీని నందఱును అలవఱిచికొందురు. కాఁగా ఇది విధి. ఇదియే క్రమముగా ధర్మమాయెను. ఇటులు చేయకుండుట అధర్మమై పాపసీమ లోనికి పరుగిడెను.

కుర్రఁడు తండ్రిని అనుకరించినచందముగనే తండ్రియు గ్రామమునందలి శిష్టుని అనుకరించును. అతఁడును దేశమునందలి శిష్టులను అనుకరించును. ఈరీతిగా దేశమునందున్న గొప్పగొప్పవారి మంచిపనులును, మంచిగుణములును లోకులచే అనుకరింపఁబడి అనుష్ఠింపఁబడి ఆచారము లాయెను. ఒకానొకపుడు ఆర్యావర్తము హిందూదేశమున కెల్లయు నాగరికత కెల్లగా నుండెను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అచటి శిష్టులే ఎల్లరకును అనుకరణీయులుగా నుండిరి. మనువు[౧] మొదలగు స్మర్తలును, పతంజలి[౨] మొదలయిన వాఙ్మయవేదులును ఆచారములకును భాషకును ఆర్యావర్తమునే ఒరవడిగాఁ జెప్పిరి. గౌడద్రావిడ భేదములేక హిందూదేశమునందలి ద్విజు లందఱును నేఁటికిని గంగాయమునల నడుమ నున్న ఋషులకు[3] మువ్వాఁడ్లును మ్రొక్కుచున్నారు. ఈరీతిగా ఆర్యావర్తమునందలి మంచి యలవాటు లన్నియు నేఁటికిని శిష్టుల గృహములలో నడచుచున్నవి. ఇవి సదాచారములు. గృహ్యసూత్రములును, స్మృతులును ఈయాచారముల కవిలెకట్టలే.

కొన్ని దేశములందు శిష్టులలో పరస్పర విరుద్ధములగు నాచారము లున్నవి; దేశాచారములును ఉన్నవి. ఆర్యావర్తమునందలి ఆచారములకును విరుద్ధములగునాచారములున్నవి. తొల్లిటి మాంసాహారము కొంచెము సంస్కారము చెంది అనఁగా చేఁపలవఱకు వచ్చి గౌడులలో నేఁటికిని నిలిచియున్నది; ద్రావిడులలో లేదు. ఆర్యావర్తమునందలి నాఁటి ప్రాఁతయాచారములు కొన్ని విసర్జింపఁబడెను; కొన్ని సంస్కరింపఁబడెను.

ఆచారముల పునాదులను త్రవ్వియెత్తినచో వ్యక్తికిని సంఘమునకును గల మేలుగీళ్లు బయటఁబడును. తర్కపు పూడిక తీయుచో నొకగుట్ట యగును. కాని ప్రాచీనాచార పరాయణుల మనుకొను ఛాందసులు ఆచారమునకును తర్కమునకును గల లంకెను త్రెంపివయిచిరి. దానివలననే ప్రాచీనులకును నవీనులకును మార్గము భేదించెను. తర్కము వీడిన యాచారమునకు రాక్షసబలము కలుగుటలో వింతయేమి?

"తర్కము ఆచారమునకు – అనఁగా ధర్మమునకు ఎంతవఱకు సాయపడును? తర్కమునకు అందని ధర్మము లేదా?" అని ప్రశ్న కలుగవచ్చును. నిక్కమే. అపుడు ఆప్తవాక్యము ప్రమాణము.

తెలుఁగునాటి పల్లియలయందు శ్రుతపాండిత్యము కల మగవారును, ఆఁడువారును పలువురు కలరు. "అంటు ఇంటఁ గలుపుదువేమో; ధర్మదేవత చూరులోనుండి తొంగి చూచుచుండును జుమీ" యని వీరు తమ బాలబాలికల నాచారమునం దాసక్తులఁ గావించుచుందురు.

శాస్త్రము లన్నిఁటికన్న ధర్మశాస్త్రమున కెక్కువ బూఁజు పట్టెను. దానికి పఠన పాఠనములు లేవు. యాజ్ఞవల్క్యుఁ డొకఁడు లా కాలేజీలలో నక్కియున్నాఁడు.

౧. మనుస్మృతి. ౧. ౨. అధ్యా చూచునది.

౨. పృషోదరాది సూత్రభాష్యమును చూచునది.

3. 'గంగాయమునయోర్మధ్యే యే వసంతి, తే మేప్రసన్నాత్మాన శ్చిరం జీవితం వర్ధయన్తి...గంగాయమున యోర్మునిభ్యశ్చ నమః.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. తప్పిన గొప్ప ప్రమాదము

ముగ్గురు బాలభటులు కొండపయినుండి జారి నాలుగువందల అడుగులఎత్తున సన్నని రాతిఅంచున (కడియంలో) రెండురోజు లుండిరి. త్రాళ్లసాయమున వారిని క్రిందికి దించిరి. —జి. ఎస్. ఎ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలుఁగుదేశమున కొన్నికొన్ని పల్లియలలో ధర్మరహస్యములు ఉద్ఘోషించుటకు ఒక రిద్దఱు ఆరిందా లున్నారు. ప్రతివిషయము నందును వారి యిరువురకును మతభేద ముండును. 'మహాఋషీణాం మతయశ్చ భిన్నాః' వారిచీలికచే గ్రామములో చీలిక యేర్పడును.

పురుడు మైలలు ప్రవచించుటకు వీరధికారులు. చిల్లరధర్మములకుఁగూడ వీరు పెద్దలు. వీరికి పాండిత్యముగాని, శ్రుతపాండిత్యముగానిసు న్న; చాటున తెలుఁగుటీకలు చూచుకొని నీటున ఖండకారికల నుపన్యసింతురు; తెలియ దని యూరకుండరు. ఇది వారిధర్మము. బాలు రు ఇంగ్లీషుచదువులకుఁ బోఁదొడఁగినపిదప ఈఆరిందాలు కొలఁదికొలఁదిగా తగ్గుచు న్నారు. ధర్మశాస్త్ర మెఱిఁగినవారు లేకున్న మానెఁగాని యీకుహనాధర్మజ్ఞుల నంతరింపఁ జేయుటకు విప్లవము కలుగవలెను.

ఆచారము శరీరమునకును, మనస్సునకును సంస్కారకము. శరీరమును పవిత్రముగను, బలిష్ఠముగను, సుందరముగను జేయుటకు ఆ చారము పెద్ద లొసఁగిన ఓషధి; అంగరక్ష; గురుప్రసాదము. సత్పురుషుఁ డీయాచారము చేతనే తనజీవితమును ముక్తి కనుకూలముఁ గావించుకొనెను. సజ్జనులకు ధర్మశాసనము ముందు, రాజశాసనము వెనుక.

జనసామాన్యమునందుగూడ మొన మొన్నటి వఱకును, కొన్నియెడల నేఁటికినిగూడ రాజ శాసనముకన్న ధర్మశాసనమే సాగి సాగు చున్నది. గ్రామములందలి శిష్టులు, శిష్ట బ్రువులు మొదలుకొని శంకరపీఠమువఱకును ప్రాయశ్చిత్తాయుధములతో సంఘమును నిరం కుశముగా శాసించిరి; శాసించుచున్నారు. చాకల, మంగల, యెలుకల, ఘేనాదుల మొదలగు జాతులవారు వారి కుల-పెద్దలచే శాసింపఁబడుచున్నారు. వారికి కల్లు కప్ప మిచ్చుచున్నారు. నీమడనుసు వచ్చి పడిన తరువాత వీరివీరిప్రభావము చాలవఱకు సన్నగిలుచున్నది.

సంఘముయొక్క తెలివితేటలు, ధైర్యసాహస ములు ప్రాచీనతాపరిశుద్ధతలు, మొదలగు చరిత్రమంతయు ఆచారమువలన మనము తెలిసికొనఁగలము. ఉల్లి తినని వారు కలరు- 'న పలాండుం భక్షయేత్.' 'ఉల్లిచేయు మేలు తల్లియుఁ జేయ' దనువారును గలరు. ఉల్లిని, చేఁపలను తినువారు కలరు. ఉల్లిని, చేఁపలను, మాంసమును తినువారు కలరు. ఈ యాచా రము నాలుగు సంఘములకును గల భక్ష్యా భక్ష్య వివేకమునకును, అహింసకును సాక్షి. కొన్ని దేశములలో దృష్టిదోషము లేదు. తెలుఁగునాడు, అఱవనాడులలో దృష్టి దోషము మెండు. ఈ రెండుదేశములందును ఆచారమునకు కొమ్ములు మొలిచెను. ఇందలి శిష్టులు సాపడినపిదప నెంగిలిచేతులు కడుగుకొనుతఱి కర్మము చాలక శూద్ర దర్శన మగుచో స్నానము చేసియో, తడి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుడ్డ కట్టుకొనియో ఆచమన మొనరించి మనశ్శాంతి వడయుదురు.

"మే మాచారపరుల మనిన మే మాచార పరుల మని" తెలుఁగులును అఱవలును కీఁచు లాడుదురు. రాత్రి ఆఱవయిచిన వస్త్రము అఱవకుమడి; తెలుఁగునకు మైల. అఱవకు ప్రొద్దునఁ గట్టిన మడుఁగు భుజించినంతదనుక మడి. అఱవపల్లియల బాపనసందులలో శూద్రులు నడవరు. సంపర్కదోషము లేదుగాన వారి కది మడి; తెలుఁగువాని కది మకిల.

ఈమడి అనంతము. ఈమడి ఆఁడువారిలో, విశేషించి విధవలలో, ఇనుమడి. ఆఁడువారు తడిబట్ట గట్టుకొని కుండనుండి ఊరఁగాయ బయటికిఁ దీసి యుంచుకొందురు; ఆఱవయి చిన బట్టతో ఆకుండను అంటుకొనరు. ఏల? కుండ మడి గాదు. ఆకుండనుండియే బయ టికిఁ దీసియుంచిన ఆయూరగాఁయ మడి!

వెలనాటివిధవ చేసిన వంటకము వేగినాటి తెలుఁగునాటి నియోగివిధవలకు పనికిరాదు. వీరివంటకము వారికిని పనికిరాదు. 'కంసాలి పొయులు' అనుసామెత ఉండనే యున్నది.

వైశ్వదేవ మొనరించిన వెలనాటి శిష్టుఁడు బలులు వేసినచో మఱియొకనాటిది వానిని ఎత్తదు. వేగినాటివాఁడుగాని, తెలుఁగునాటి వాఁడుగాని, నియోగిగాని కర్మము చాలక వేఱునాటివానియింటి కేగవలసి అచట బలులు వేయుచో వారును ఎత్తరు. కృష్ణా గోదావరి గుంటూరు జిల్లాలుగాక మిగులు జిల్లాలలో నియోగివైదిక భేద మంతగాలేదు. అచటినియోగులలో అనూచాన మయిన శిష్టత భ్రష్టము కాలేదు. ఈజిల్లాలలో ఈ నడుమ నియోగులును వైశ్వదేవ మొనరించి యాగడబిడలను మఱికొంచె మెక్కువచేసిరి. మహారాష్ట్రదేశ మేగి వచ్చిన నామిత్రుఁ డొకఁడు మడియనుపదమున కొక యర్థము చెప్పెను. "మహారాష్ట్రులలో దృష్టిదోషము లేదు. భోజనవేళలో ప్రతివానిచుట్టును వేలి మరుగువలె అరయంగుళ మెత్తుగా కట్టఁ బడిన మడియొకటి యుండును. మహా రాష్ట్రులు ద్రావిడాంతఃపాతులు కావున వారిమడి సజాతీయులగు ఆంధ్రులలో సంక్ర మించి శుచ్యర్థక మాయెను."

ఇది విపరీతకల్పన. మడుఁగు, మడికాసు, మడిదూలు (మడేలు) మొదలగుపదములలో మడిపదము శుచ్యర్థకము. వరిమడిలోని మడి వంటి మడి యని పదార్థలక్షణతో నిటఁ బనిలేదు.

దేహశుద్ధికిని, పాకశుద్ధికిని అవలంబనీయము లగు నాచారములనే పరమార్థముగాఁ బెట్టు కొని పలువురు వంటకుండనే పరబ్రహ్మ ముగను, తత్త్వమసినే కుండమసిగను జేసి వయిచినారు. ఆచార మొకసాధనముగాని సాధ్యము గాదు. ఆచారము ఉపాయము గాని ఉపేయము కాదు. సాధనముగా నున్న యంతవఱకే, ఉపాయముగానున్న యంత వఱకే దానియుపయోగము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుణకర్మలచేతను, ఆహారవిహారములచేతను కొందఱు కొంద ఱొకొకగుంపుగాఁ జేరుదురు. భాపనవారిలోఁగూడ కొందఱు తమ తమకర్మలచే వైదికులును కరణములును అయిపోయిరి. వారివారికర్మచే వారివారి యాహారముగూడ మాఱెను. లౌకికకర్మ కలవాటుపడిన నియోగులును వైదికులునుగూడ ఉల్లి తినుచున్నారు; పొగఁ బీల్చుచున్నారు; శిష్టు లగు నియోగులుగూడ తెలుఁగునాడున వైదికులకు వేఱయిరి; ఇపుడు తిరుగఁబడిపోయిరి. వైదికులకు నియోగులకు వేఱిమి వేరుతన్నెను. వైదికులు శిష్టులగు నియోగుల నేని నిమంత్రింపరు. ఆచారభేదమువలన, ఆగ్రహమువలన వీరిలో వీరు పరస్పరము రాక్షసులుగాఁ జూచుకొనిన కాలము గడఁచెను. కొన్నిచోటుల నింకను గడఁచుచున్నది.

మూఢమగు సంఘమును ఆచారము వేఱుపఱచును; లేనిభేదమును కల్పించుటయేకాక దానిని చిరస్థాయిఁ జేయును.

ఆచారభేదము విప్లవమునకు గణేశపూజ. నేఁడు వెంట్రుకలలో నున్న విప్లవము మఱి దేనియందును లేదు. తలమీఁదికి కత్తెర పోవఁగనే 'వెనుకకా, లేక ముందులకా, మఱి యడుగునకా?'యను సంకల్పవికల్పము లనేకములు. మంగలవానిని జూడఁగనే తలలో ప్రళయము కలుగును.

ఆర్యావర్తపు బ్రాహ్మణుఁడు గోపాదమంత సిగతాల్చెడివాఁడు. అతనికి మీసలు కలవు; పిదపఁ బిదప లేవు; నేఁటికిని మహారాష్ట్రసకుఁ గలవు; క్షత్రియుఁడు జులపా లుంచుకొనెను. గుణకర్మలకును, దేశకాలములకును అనుగుణముగా ఈయాచారము పుట్టి మాఱుచు వచ్చెను.

కేశములు కత్తిరించుకొని మీస లుంచుకొనువానికి శిష్టులలో గౌరవము లేదు. సిగ తాల్చి మీసలు గొఱిగించుకొనిన అపండితుఁడుగాని, బ్రాహ్మణబ్రువుఁడుగాని శిష్టులలో సులభముగాఁ జేరఁగలఁడు. అది బాహ్యావేషమువలనఁ గలుగు నుపకారము. సీమలో తెల్లవాఁ డొకఁడు బ్రహ్మశిఖ పెట్టుకొని కొల్లాయ కట్టుకొనినచో వానికి సంఘప్రవేశ ముండునా? దానఁజేసియే నన్నపార్యుఁడు 'స్వస్థానవేషభాషాభిమానము' చూపెను. మఱియు కేవలబాహ్యావేషమును మల్లినాథుఁడు ఇటులు నిరసించెను:

'కిమ్ దారుణా వంకరటింకరేణ
కిమ్ వాససా చీకిరిబాకిరేణ;
సర్వజ్ఞభూపాల విలోకనార్థమ్
వైదుష్య మేకం విదుషాం సహాయః.'

కేశములు ప్రకృతిపెట్టినకవచము. అక్కఱ కలచోట నవి అంగరక్ష. ఆహారవిహారముల యందు మానవప్రకృతికి ఎదురుగా నడవనివాఁడు వానిని గొఱిగించుకొనవలసిన పని లేదు. కావుననే బ్రహ్మచారులకును, వానప్రస్థులకును క్షౌరముతోఁబని లేదని ధర్మశాస్త్రజ్ఞు లూహించిరి. కాని మానవుఁ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డిపుడు వా రూహించిన దేశకాలములను, ఆహారవిహారములను అతిక్రమించెను. రోజుకు కనీసము రెండుమాఱులయినను గడ్డము చేసి కొనవలసిన కాల మిది !

ప్రకృతి సహజసుందరి. కేశములు మానవున కును, వానికి సోదరమయిన జంతువునకును ప్రకృతిదేవత నేసి యిచ్చుచున్న నిష్పరి వాణి¹ ఆఁడుదానికిఁ గాని, మగవానికిఁగాని కేశపాశము చక్రవర్తియు చేయించుకొనఁ జాలని కిరీటము. సింగమునకు జూలు రాజ చిహ్నమగుచామరము. గొఱియకు త్రుప్పుడు ఒక ఉన్నిచొక్కా. అడవిరాణియగు నెమ లికి పించియ మొక నవరత్నపతకము. ఈ కేశములలో ఉపయోగము కలదు; శిల్పము కలదు; సౌందర్యము కలదు; ఆనందము కలదు.

కర్మిష్ఠి కిది యంతయు ఇబ్బంది. ఆచమ నము చేయు నీరు మీసములకుఁ దాఁకె నేని యదికల్లు. సిగలేనియెడల 'శిఖాయ వౌషట్' అనుటకు వీలులేదుగాన సిగ దిగ గొఱి గించుకొనఁగూడదు. తలయంతయు జుట్టు గుచో నిత్యస్నానములచే శిరోభారమును కొనితెచ్చికొనినటు లగును. కావున నతఁడు ముప్పాతికమువ్వీసము గొఱిగించుకొనఁదొడఁ గెను. గుణకర్మలు పెక్కు, వానినిబట్టి యాచారములును పెక్కు. కావున క్షౌర మొకొక్కదేశమున నొకొక్క రీతిగానున్నది. ఒకొకయాచారము వెనువెనుక కేపోయిచూచి నయెడల నది యెన్నిసారులు సంఘముచే స్వీకరింపఁబడెనో, యెన్నిసారులు విసర్జింపఁ బడెనో, దాన నెన్ని మేలుగీళ్లు చేకూరెనో, దాన నెంత సంఘవిప్లవము జఱిగెనో కొంత తెలియఁగలము; ఒక్కవివాహమును పరిశీ లించినచో ననంతములగు దానిభేదము లార యఁగలము; శిశువివాహము మొదలుకొని వృద్ధవివాహమువఱకును, గాంధర్వవివా హము మొదలుకొని రాక్షసవివాహము వఱ కును గల పలవలు చిలవలు తెలియఁగలము; వివాహమున ప్రేమయు, ప్రయోజనమును, అధికారమును, అక్కఱయును గల వని గ్రహింపఁగలము; బాల్యవివాహములవలన చేటు కలుగఁగనే రజస్వలావివాహములు స్వీకరింపఁబడె నని సిద్ధాంతము చేయఁగలము; ఇట్టిమార్పు లానాఁటి ధర్మశాస్త్రము లంగీ కరించుటజేసి అవి తర్కదూరము కాలేదని నిర్ణయింపఁగలము; తర్కమేకాక తెలివియు మేలుగీళ్లను అవి ఆలోచించి యుండె నని నిర్వచింపఁగలము; అక్కఱను బట్టి దేవర న్యాయములు, విధవావివాహములు, ప్రేమ వివాహములు కావలసివచ్చె ననియు, వెం టనే యీనడింపఁబడుచు వచ్చెననియు నేఁటి సంస్కారవాదులు ఘోషించు నాచారము లును, వానితలదన్నిన సంస్కరణములును తొల్లి జరిగియుండెననియు కనుఁగొనఁగలము; జరిగిన సంస్కరణములవలన కీడు గలుగఁ

---

¹. మగ్గమునుండి తీసిన సరిక్రొత్త బట్ట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గనే తొల్లిటి యాచారములే మరల అమలులోనికి వచ్చెననియు ఎఱుఁగఁగలము; ఈ మార్పులవలనను కూర్పులవలనను సంఘ విప్లవము, వ్యక్తుల పతనము ఎంత జరిగెనో ఊహింపఁగలము.

నేఁటి పెండ్లిలో "నోటితోఁ జెప్పుమంత్రము వేరు; చేతితోఁ జేయు పని వేరు" అని పురోహితునకే తెలియదు. ఇల్లు గుల్ల యగుచున్నను, ఒడలు విఱుగుచున్నను బాహ్యాచార పరాయణున కది గోచరింపదు. మంత్రముల కర్థమే లేదనియు, అవి ఉచ్చారణమాత్ర మహిమము లనియు వాదించువారు నేఁటి 'సనాతనమతసంఘమున' అచ్చాణిముత్తెములు కలరు.

"పెండ్లిగాని, చావుగాని ఒకతూరియే" అని మను వనెను. ప్రేమైకదృష్టితో మధురమగు ఈభావనను అతఁడు గాన మొనరించెను.

పలుమాఱులు పెండ్లిండ్లు చేయించినట్టియు చేసికొనినట్టియు ఋషులును విధవలకు పుస్తెలుకట్టించినట్టియు కట్టుకొనినట్టియు ఋషులును ఆర్యావర్తమునఁ గలరు. ఇట్టి వివాహములలో కొన్నిట అక్కఱయును, కొన్నిట ప్రేమమును మఱికొన్నిట రెండును కనుపట్టును.

మనుజు లందఱకును పెండ్లియెడ ప్రేమ మొకటియే ముఖ్యవస్తువు కాదు. మహారాజునకుఁగాని, మహాధనికునకుఁగాని ప్రేమోన్మాదికిఁగాని కానగును. వివాహసామాన్యమునందు ప్రేమతోపాటు అక్కఱయు ఫలమును మిళితములయి యున్నవి. ఇందు ఒకానొకనికి ప్రేమయే ముఖ్యము కావచ్చును; ఒకానొకనికి అక్కఱయే ముఖ్యము కావచ్చును; ఒకానొకనికి ఫలమే కావచ్చును; కాని ప్రేమలేనిపెండ్లి కూలిపెండ్లి యని అందఱును ఒప్పుకొందురు. అట్టిపెండ్లి నేఁడు జరిగినను రేపు విడాకులకు ఎదురుచూచుచునే యుండును. ప్రేమప్రయోజనముల ప్రాధాన్యమునుబట్టియు, వానిమేలుగీళ్లనుబట్టియు, సంఘము మొత్తముమీఁదఁ గల తెలివినిబట్టియు వివాహము అనంతశాఖమయి ఉపాదేయమయియు, కొంతకాలమునకు అనుపాదేయమయియు అనేకావతారములను ఎత్తెను.

ఆచార మనేకవిధము. ఇది అనేకార్థకము. కావుననే దీని కనేకనామధేయములు. ఇది బహురూపి, బహుభాషి. దీనికిఁ గల గౌరవ మపారము. మాలఁడు మొదలు బాపనయ్యవఱకును దీనిని పూజించును.

ఆచారము ముమ్మొదట చేతనము. పదఁపడి జడము. అది మొదట ధర్మమునకు పునాది—'ఆచారానుగతో ధర్మః'.

పెండ్లి యను నాచారము ధర్మమయి దానముగా పరిణమించుట కెన్నియుగములు పట్టెనో యెవరు లెక్కచూపఁగలరు? కన్యాదానములో నెంత పరమార్థము కలదో యెవరు పరిష్కరింపఁగలరు?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కన్యాదానమును గుఱించి సామాన్యముగా ఈప్రశ్న లుదయించును: ఒకజీవిని దానము చేయుటకు ఎవనికేని అధికార మనునది యుండనగునా? అది బానిస—అమ్మకము వంటిదికాదా? నరమేధమునకు కుమారులను అమ్ముటకును, దీనికిని ఎట్టిభేదము?

కన్యకోరునది రూపము, తల్లికోరునది డబ్బు, తండ్రి కోరునది చదువు, బందుగులు కోరునది కులము, ఇతరులు కోరునది పప్పన్నము [౧] అనికదా పెండ్లియెడ కోరిక. ఈకోరికలలో ముఖ్య మాకన్యకోరిక. దానము చేయవలసిన కన్యవయసా ఏడేండ్లు. ఆకన్యకు రూపము నెఱుఁగఁగల వివేక మపు డెటు లుదయించును? మనోజుఁ డింకను పుట్ట లేదు. పెండ్లికి ముఖ్యము ప్రేమ. ప్రేమ లేని పెండ్లి యేమిపెండ్లి? ఇది గ్రుడ్డిపెండ్లి కాదా? తలిదండ్రులు వేయించిన శృంగార రసప్రధాన మగు నీ పెండ్లినాటకము కొలఁది యేండ్లలో కరుణరసప్రధానముకాదా?

అగును. లోకమంతయు రూపవంతముకాదు. కురూపియు రూపమునే కోరును. రూపమును ప్రేమయు పెండ్లికి పెత్తందారులు. ప్రేమ అసలు మనోధర్మము. రూపముగాని, గుణము గాని గుణరూపములుగాని ఈయున్నప్రేమకు ఉద్బోధకములు.

ఈప్రేమ సఖ్యాభక్తి యను మానససరోవరమునుండి ప్రవహించు పిల్లకాలువ. ఇది యొకానొకపుడు ఇఱింకు లింకును. ఒకానొకపుడు ఆమానససరోవరముననకే మరలును. కావున ఇది అనిత్యము.

అనిత్యతనుండి నిత్యతకుఁ బోవుటకే ఆర్యుని ప్రయత్నము. ఈ ప్రేమను ఆమానససరోవరమునకు మరల్పుటకే ఆర్యుఁడు ప్రయత్నించెను. దానికి ఫలితమే ఈకన్యాదానము. దీన రూపము ప్రధానముకాదు. ప్రధానమయినది కర్మ,—తపస్సు,—సంఘశ్రేయము.

కన్యాదానము తురుష్క-దండయాత్రల అపాయరక్షణమునకుఁ బుట్టినదని కొంద అందురు గాని అది కల్ల. మోక్షమును, లోకకల్యాణమును చరమార్థ మని కనుఁగొనిన ఆర్యుడు దీనికి ఉపజ్ఞము. కన్యయు వరుఁడును దాని నెఱుఁగక రూపప్రేమలనే పాటించిన-చో ఆ కన్యాదానము బూడిదలోఁ బోసిన నేయి. దీనియుద్దేశమును నిర్వహింపఁజాలక యీవివాహమునే అంటిపెట్టుకొనినందువలన సంఘశ్రేయమునకు బదులు సంఘ విప్లవము కలుగును, కలిగెను.

సంఘము చాలకాలమ్ముక్రిందనే పతిత మాయెను. మన తలిదండ్రులు మనలను ఆర్యులు చూపినబాటలో నడిపింపలేదు. వారితలిదండ్రులును వారల నటు నడిపింపలేదు. గాలికిఁ బుట్టి గాలికిఁ బెరుఁగుచున్నామో లేక ధనమునకుఁ బుట్టి ధనముకొఱకే పెరుఁగుచున్నామో! సంఘము శ్రేయమువిడిచి ప్రేయమునే

౧. కన్యా వరయతే రూపం మాతా విత్తమ్ పితా శ్రుతమ్, బాంధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్న మితరే జనాః,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోరెను. త్యాగమువిడిచి భోగమునే చేకొనెను. ఎఱుకకు బదులు చిల్లరతెలివితో గర్వించెను. ఇట్టి స్థితిగతులలో ప్రేమసౌందర్యములకే అగ్రతాంబూలముకదా! కన్యాదాన మెందులకుఁ బుట్టెనో ఆస్థితి యిపు డేది? "అతిదీర్ఘమగుజీవితమున ఎవనికి సంతోషముండును[1]" అను నచికేతుఁ డిపు డేడ? "అయ్యా! ఈభూమి నంతయు నాకు చెందఁజేయుదు వనుకొనుము, దాన నాకు అమృతత్వము కలుగునా?[2]"అని యడుగు మైత్రేయి యిపు డేడ? కాని కన్యాదానమే అమలులో నున్నది. శుల్కమును రూపమును ప్రేమమును ముఖ్యము లయినపుడు రజస్వలావివాహములు కావలసివచ్చెను. అట్టితఱి సంఘము రజస్వలావివాహము లొనరించెను—కొన్ని శతాబ్దులక్రిందట వానిని స్మృతు లంగీకరించెను. నేఁడు స్త్రీలు "బి-యే"లు చదువుచున్నారు, "విద్యాప్రవీణ"లు చదువుచున్నారు; ఉద్యోగముల కుఱుకుచున్నారు. రజస్వలావివాహము లిపుడు కానిచో మఱి యెపుడు?

ప్రేమవివాహ మనఁబడు రజస్వలావివాహమునమాత్రము కీడు లేదా ఉన్నచో నెటులు? కీడు లేని దేది? నిక్కమున కేవివాహమునందును కీడులేదు. పెండ్లి యనునది మేలుకొఱకుఁగాని కీడుకొఱకుఁ గాదుకదా! గురువులచే శిక్షితుఁడు కాని మానవుని ప్రేమమునందున్నదా గాదు! అట్టి ప్రేమకు నిలుకడ యేడ? ఇట్టి వివాహము కొన్నాళ్ల కొక కట్టుబాటు. తాళికట్టుటలోనే కట్టుబాటు ఇమిడియున్నది. సంఘవిప్లవము తెచ్చిన బాల్యవివాహమునకు హారవిలాసునిచట్టము. రజస్వలావివాహము తీసికొనివచ్చు విప్లవమునకు ఏ వెంకమాంబదో విడాకులచట్టము! కొన్ని స్మృతులు కన్యాదానమును శాసించెను. కొన్ని రజస్వలావివాహ మంగీకరించెను. కొన్ని మరల కన్యాదానమును శాసించెను. ఈరీతిగా కొన్నికొన్ని యాచారములు కొన్నికొన్ని కాలములలో పాటింపఁబడెను. పిమ్మటఁ బిమ్మట నిషేధింపఁబడెను. ఈవిధినిషేధము లాయాకాలమందలి సంఘకల్యాణము ననుసరించియుండె ననుట నిర్వివాదము. జగత్తునందు ద్వంద్వములకు ద్వంద్వయుద్ధము జరుగుచునే యుండు ననుటయు నిర్వివాదము.

ఆచారము మున్ముందట తెలివితేటలతో పుట్టుకొని వచ్చును. దానికి క్రమక్రమముగా బలము కలుగును. కొన్నాళ్లకు పాఁతుకొని పోవును. ఆబల మనంతము. చూపినంత నది యంటుతొక్కును. అది వాయువువలె వ్యాపి. యుగయుగాంతరములనుండి తరతరముల

౧. అతిదీర్ఘే జీవితే కో రమేత? కఠ-౧-౨౮.

౨. సా హోవాచ మైత్రేయీ: యన్ను మ ఇయం భగోః సర్వా ఇయం పృథివీ విత్తేన పూర్ణా స్యాత్ కథం తే నా మృతా స్యామ్? బృహ. ౨-౪-౨.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండి అది ప్రవహించుచువచ్చును. కల కాలము ప్రవహించుచుఁ బోవును.

నూతనాచార మొకటి ప్రవహింపఁదొడఁగఁ గనే సంఘవృక్షము ఆమూలాగ్రము చలిం చును. ప్రవాహమున కది యెదురు తిరు గును. అది నిట్ట పొడనఁగనే ప్రాఁతవేరు లన్నియు కుళ్లిపోవును. ఇది నూతనముగా నెలకొని తూరుపునుండి పడమటికిని పడమటి నుండి తూరుపునకును కొమ్మలు చాఁపును.

ఆచారప్రవాహమున ఎన్ని దేశము లెన్ని చరి త్రము లెన్ని సంఘము లెన్ని జీవు లవలీలగాఁ గొట్టుకొనిపోయెనో యెన్ని దానియడుగునఁ బడి పూడిపోయెనో యెవ రెఱుఁగుదురు? లెక్కపెట్టఁజాలనన్ని సరస్వతీనదు లం దిగిరి పోయెను. వానిని త్రవ్వి చూడ నెత్తిన పలుగు లెన్నియో విఱిగిపోయెను.

దేశకాలము లాచారమునకు గురువులు. వీరులు దాని నారాధించి మూలమూలలకుఁ గొంపోయి ప్రతిష్ఠింతురు. ఆచార మెల్లపు డును తర్కవితర్కములతో అనుభవముతో సత్ఫలముతోఁ బ్రవేశించి పోరానిచుట్టమయి కూరుచుండును. పిమ్మట ఆతర్కవితర్క ములు, ఆయనుభవము మాయమయిపోవును. ఆచారము పరుసవేది. దానితాఁకుచే జడము చేతన మగును. దుఃఖము సుఖమగును. చెడుగుగాఁ గానిపించినది మంచి దనిపించును. చక్రము సక్రమముగాఁ దిరిగివచ్చును. ఒకానొక యాచారము పాఁతుకొని బిగిసి పోవును. దాని వీణాదండము తమఃపిహిత మగును. అపు డది నృగునివలె అజగరమయి పడియుండును. అపు డది కేవల మాచార మాచారము. దానిని మేలుకొలుపుటకే ధర్మ రాజో అవతరించును.

జగతికి గమనము కలదు—'గచ్ఛతీతి జగత్' ఆచార మాగమనములో నలుఁగును. ఆగమ నానుభూతి దానికి లెస్స తెలియును. హిమా లయమంత పెద్దవయినను దానిగడ్డలు కొన్ని విశ్వచక్రము క్రిందఁబడి దుమ్ము దుమ్మయి పోవును. తుదకు గాలి కెగిరిపోవును. ఆచార మపు డావేదనకు తాళఁజాలదు. ఇట్టివేదన ననుభవించుచున్న ను ఆ ప్రాఁతయాచార మొక్కతూరి నిలువఁబడి—ఓరి సంస్కర్తా! నీవేమి ఆపస్తంబుఁడవా? గౌతముఁడవా? పరాశరుఁడవా? యని యధిక్షేపించును. ఆసంస్కర్తయు జంకక "నే నాపస్తంబుఁడఁ గాను గౌతముఁడనుగాను పరాశరుఁడను గాను; వారి దాసానుదాసుఁడను. లోక మునకు మేలు కలుగుచో ఈసంస్కార మును గ్రహింపుఁడు" అని విన్నవించును. ఆచారము ఆయిరువురను జూచి నవ్వు కొనును. దేశకాలముల ననుసరించి, తనకాల మానము ననుసరించి హెచ్చుదగ్గుల సమీక్ష రించి యెంతకావలయునో అది అంత మాఱును. దాని కొకరియడ్డములేదు. అడ్డము లన్నియు క్రమక్రమముగా నంతరించును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మెల్ల మెల్లగా నీయాచార చక్రము తిరుగును. క్రిందియాకు మీఁదికి వచ్చును.

ప్రాచీనాచార పరాయణులకును, సంస్కార పరాయణులకును ఎన్నటికిని కలహమే. ఏల నఁగా ఉన్న దానితో తృప్తి మొదటివారికి. వారిచూ పెన్నటికిని వెనుకకు. అక్కఱతో పని రెండవవారికి. వారిచూ పెన్నటికిని ముందుకు. ప్రాచీనాచారపరాయణుఁ డెంతకొట్టుకొనినను ఆచారము జడముగా నుండఁజాలదు. సంస్కారపరాయణుఁడు నిష్ప్రయోజనముగా నెంత యల్పసంస్కారము తేఁజూచినను అది రాదు. దేశకాలములును అక్కఱయును ఆచారము నందలి లోపములను చేయెత్తి చూపును. ప్రాచీనాచారపరాయణుఁడు ముఖము త్రిప్పును. సంస్కారపరాయణుఁ డెదురుగాఁ బరుగిడును.

అక్కఱయే యాచారమునందలి లోపమును పూరించును. అక్కఱయే అత్యాచారమును తగ్గించును. ఈరీతిగా సామ్యము సిద్ధింపనిచో సాంఘికయుద్ధము జరుగుచునే యుండును.

ఇహపరలోకములకుఁ బనికివచ్చు నాచారమే యాచారము. లోకకల్యాణమునకుఁ బనికి వచ్చు నాచారమే యాచారము. మిగిలినది దురాచారము.

---



ప్రతిబింబము

—మొదలిరామమూర్తి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# షోకులు

నందివాడ చిదంబరం, బి. ఏ., బి. యల్.

(ఇది 18-2-34 తేదీని, మ-రా-రా-శ్రీ ఏ. టి. త్యాగరాజన్ M. A., I. C. S, గారి అధ్యక్షతక్రింద జరుపబడిన రాజమండ్రి ఆర్ట్సుకాలేజి ప్రాతవిద్యార్థి సంఘముయొక్క వార్షికోత్సవసందర్భమున వ్యాసకర్తచే చదువ బడినది.)

"షోకు" అనేపదం అసలు ఏభాషకు చెంది నదూ, దాని అర్థం మాత్రం సర్వజనులకూ తెలియును. అయితే, అర్థం బోధపడ్డంతమాత్రమున, నిర్వచనం తేలుద్దామంటే, అది ఒకపట్టాన సులభంగాదు. అందుచేత నిర్వచనభారం ప్రయోజనం లేని వాగ్వాదములతో కాలయాపనచేయు రౌండు టేబిలుప్రతినిధులకు వదలి, అసలు షోకు అనే దాని యొక్క నిజస్వరూపం కనుక్కొనుటకు ప్రయత్నిద్దాం.

షోకులు లోకప్రఖ్యాతములు. షోకు లేని లోకమూ లేదు; షోకులేని తావూ లేదు. షోకులేని సమయమూ లేదు; షోకులేని సందర్భమూ లేదు. నడకలోనూ షోకే; నవ్వులోనూషోకే; వేషంలోనూ షోకే, వెంట్రుకలలోనూ షోకే. బొట్టులోనూ షోకే; భోజనంలోనూ షోకే; మాటల్లోనూ షోకే; మెదిలితేనూ షోకే. అందులో చిత్రం ఏమిటంటే, పురుషులకూ షోకు కావాలి; స్త్రీలకూ షోకు కావాలి. అదేమిటో గాని, అది చిన్నలకూ అవసరం లేకపోలేదు; అది పెద్దలకూ నిషేధంగాదు... ఈ షోకుఅనేది అహంభావజనితమైనదా, లేక, మానవసౌఖ్యములలో బయలుదేరినదా? ఇది వ్యసనములలో చేరినదా, లేక కళాభిమానుల యొక్క ఉన్మాదములలో నుద్భవించినదా? ఇది నిరుద్యోగులచేకనిపెట్టబడినదా, లేక రిజాలామనుష్యులేదీనికి బ్రహ్మలా? ఇది ప్రణయ ఉన్మాదమును పురికొల్పునదా, లేక పతివ్రతల జారిణులచేయు మంత్రశక్తియా?

ప్రజలకు దీనివిషయమై చిత్రమైనసంశయాలు కలుగుచున్నాయి. ఈషోకుకు ఏదెన్నా "కొలత, మానం" ఉన్నదా, అని ఈమధ్య ఒకసర్వేఆఫీసరు అడిగాడట్టు. గవర్నమెంటులెఖ్ఖల్లో "మానం" అన్నదేమీ ఈవిషయమై లేదనిన్ని, ఎవరిమానం వారే నుత్తెరగాలి అనిన్ని, 'షోకు మార్తాండ' మెడికల్ కాలేజివిద్యార్థి జవాబిచ్చాడట. కొందరు, "షోకు" అనేది పుంలింగమా, స్త్రీలింగమా, నపుంసకలింగమా అనిసందేహపడుతున్నారు, మితవాది అనేవ్యక్తి నపుంసకలింగం అవునాకాదా అని కొందరు సందేహపడినట్టు. షోకును బ్రాహ్మణులక్రింద చూపుతారా, అబ్రాహ్మణులక్రింద చూపుతారా అని కొందరు అడుగుచున్నారు.

మొత్తంమీద "షోకు"అంటే నిర్వచనం సరిగా చెప్పలేక, చాలమంది Negative వర్ణనలు మొదలెట్టుచున్నారు. విద్యార్థిచేసిన ప్రశ్నకు సరిగా జవాబుతెలియని సందర్భంలో, ఉపాధ్యాయుడు Negative జవాబులు గుజీకిబారెడుమూరంగా చెప్పి, తన అజ్ఞానమును మభ్య పుచ్చినట్టు. ఈషోకు అనేది వితంతువుమాత్రం కాదని కొందరూ—అది స్కూలుమేష్టరుమట్టుకు కాదని కొందరూ—అది రెవెన్యూడిపార్టుమెంటు నౌకరు మాత్రం కాదని కొందరూ—అది ఫేలయిన విద్యార్థి మొహంమాత్రం కాదని కొందరూ—పైఉద్యోగి సమక్షమున నున్న క్రింద ఉద్యోగిమాత్రం కాదని కొందరూ,—నిర్ణయింపబడినతేదీకి ఔపోసనం ఆగినసందర్భంలోని యువకుడుమాత్రం కాదని కొందరూ,—యిలా చెప్తున్నారు. అందువలన యిది ప్రత్యక్షమైన సందర్భాలు తెలిసికోవాలి.

అసలుషోకు అనాదినుండీ వర్ధిల్లుతూ ఉన్నట్టు పురాణములవల్ల తెలుస్తూనేఉంది. సత్యభామామణి శ్రీమహావిష్ణువును ఎడమకాలితో తన్నుటలో చూపిన శృంగారపుషోకు, అహల్యాజారుడైన దేవేంద్రుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుక్కుటరూపము దాల్చుటలో షోకు, శాసనసభలలో నామినేటెడ్ సభ్యుకు చూపినవిధంగా కుచేలుడు శ్రీకృష్ణునియింట చూపినషోకులు, దేవేంద్రుని అర్ధాసనం ఎక్కుటలో అర్జునుడు చూపిన అర్ధషోకు, ద్రౌపదికి ఒక్కమాటే అయిదుభర్తలషోకు, దశరథమహారాజు బహుభార్యాయుతుడగుటలో షోకు—ఆయనభార్యలంతా కలిపి సెక్రెటేరియేటు ఆఫీసులోని గుమాస్తాలంతమంది ఉండేవారట—గురుపత్నియైన తారదగ్గిర శశాంకునిషోకు, కన్యతో సూర్యునిషోకుకు కర్ణుడుద్భవించుటలో యిప్పటికాలేజివిద్యార్థులషోకును మించిన షోకు, ధర్మరాజుకు యముడు తండ్రియై, భీమునకు వాయువు తండ్రియై, అర్జునునకు దేవేంద్రుడు తండ్రియై యుండ పాండురాజు భీమార్జునయుధిష్ఠిరుల బారసాల పీటలమీదకు తండ్రినని హాజరవడంలో షోకు, విశ్వరూపప్రదర్శనంలోని షోకు, ద్రౌపదికి చీరెలు అక్షయమగుటలో షోకు, మిల్లినోటిలో పదునాల్గుభువనములు కనబడడంలో షోకు, రాతినితన్నితే నాతిఅగుటలో షోకు, ఎప్పుడూ ఎదుగూబొదుగూలేని హిందువులఆశయములవలె నుండు మరుగుజ్జు వామనునిషోకు అందరూ ఎరుగనివి కావు.

షోకుఅనేది భగవత్సంభూతమైనదని కొందరు అంటున్నారు. ఎందుకంటే, ఈ షోకుగూడ అరవ కాఫీహోటలువలె సర్వవ్యాప్తియై సర్వలోకములలోనూ ధనరారుచున్నది. ఈషోకు మానవుడుజన్మించినదాదియూ ఉగ్గుపాలతోనే పెరుగుచున్నది. శిశూదయమయి, స్నానం అవగానే, ముందు ఫ్రెంచి టాయిలెటు పౌడరు పిల్లవాని మొహానికి రెండు కోటాలు కొట్టి, శిశువుయొక్క అసలురంగు కొంతసేపటివరకు ఎవరికీ గోచరమవకుండా చేసి, శిశువు అసలు తండ్రిపోలిక అయిందీ తల్లిపోలికఅయిందీ, యిరుగుపొరుగిళ్లవాళ్ల పోలిక అయిందీ వెంటనే తేలకుండా చేసేస్తూ, టాయిలెటు షోకును చూపుచున్నారు. ముందు టాయిలెటు అయితేనేగాని పాల ప్రమేయంగాని, ఆముదంప్రమేయంగాని తలపెట్టేవారే లేరు. టాయిలెటుషోకుతరువాత కాఫీషోకు. తల్లి పిల్లలకు పాలివ్వడం కేవలం అనాగరకత అవడంవల్లనైతేనేం, అట్లు పాలివ్వడంవల్ల తల్లి కృశిస్తుందని మొగజంతువులు భావించడంవల్లనైతేనేమి, యిప్పుడు పసిపిల్లలను పుట్టినవెంటనే కాఫీ మత్తులక్రింద చేసేస్తున్నారు. ఇట్లు చిరుతప్రాయమునందుండీ, ఉగ్గుపాలతోనే మొదలుపెట్టిన కాఫీషోకు మీద యిచ్ఛ వయస్సు ముదిరినకొద్దీ యింకా ఎక్కువవుతుందిగాని తగ్గుతుందా? బోర్డు ప్రెసిడెంటు అయిన మరుసటి రోజునుండీ కంట్రాక్టులలో లంచాలు స్వీకరించేఆసామీకి నెలలు గడచినకొలదీ ధనేచ్ఛ ఎక్కువవుతుందికాని తక్కువ అవుతుందా?

స్వల్ప విషయాలలో గూడా షోకు కొరకు మానవప్రయత్నం కనపడుతోంది. బొట్టు పెట్టుకొనుట హిందూదేశంలో నియమం అయినా, దొరలు బొట్టును ధరించక పోవడంవల్ల, వచ్చీరాని యింగ్లీషుముక్కలు నాలుగు పట్టుకున్న కొందరు హిందువులు, బొట్టును ధరించుట అనాగరకత క్రింద పరిగణిస్తున్నారు. కాలేజి విద్యార్థులు భోజనంసమయంలో పట్టుబట్టని బహిష్కరించినట్లు, బొట్టునుకూడా బహిష్కరిస్తున్నారు. కొందరువిద్యార్థులుమాత్రం కాస్తపరీక్షరోజుల్లోనూ, పండుగరోజుల్లోనూ, ఏఫ్రాం వెనుకలంబొట్టో, ఒకటి, దుర్భిణీయంత్రంలోమాత్రమే గోచరమయ్యేదానిని, ఉంచుచున్నారు. అందులో సూటు ధరించేవారు బొట్టుపెడ్తే తాము ఒట్టిహిందువులవలె కనబడిపోతారేమో అని భయపడి, బొట్టును విసర్జిస్తున్నారు. అయితే, అరవసోదరులుమాత్రం అలాగాకుండా సూటుమీదకూడా బొట్టుపెడ్తున్నారు. ఏమంటే, వారు సూటుధరించేటప్పుడుగూడ, కాస్త జాగ్రతావస్థలో ఉంటూఉండడంవల్ల, ఎప్పటికప్పుడు వారికి తమలాగులోనున్న వడుగునాటి కౌపీనమున్నూ, బొక్కమల్లుతలపాగాలో దూరి కాపురంచేస్తూఉన్న తమతాతలనాటి జుట్టుముడిన్నీ, సర్వదా తమమనోవీథిని కనబడుతూఉండి, తమహైందవతను తరుచు జ్ఞప్తికి తెస్తూనేఉంటాయి. ఈబొట్టులో షోకుకు మేమెందుకు అర్హులము గామని సమానహక్కులకై పోరాడుచున్నస్త్రీలుగూడా బొట్టులో షోకు చూపుచున్నారు. పూర్వకాలంలో పువిస్త్రీలు,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొహాన్ని అర్ధణాకాసంత కుంకుమను ధరించి, తమ అయిదువతనమును అరఫర్లాంగుదూరాన్నించే యితరులకు తెలియచేసేవారు. ఇప్పటి పునిస్త్రీలలో, విద్యార్థినులైతే పాపం వారిని అంతగా బొట్టుపెట్టింపు బాధపెట్టడం లేదు—రవికలకు చేతులుండాలన్న పట్టింపు బాధపెట్టనట్టు—భర్త దగ్గరకువచ్చినపుడు లేచి గౌరవించవలెనన్న పట్టింపు బాధపెట్టనట్టున్నూ. విద్యార్థినులు కాని పునిస్త్రీలుగూడా యిప్పుడు ఏమంటున్నారంటే "ఆః—ఒక్క మొగుడికోసం, పెద్ద, అర్ధణాకాసంత బొట్టుపెట్టమా, ఒక్క మొగుడైతే ఈడబ్బాయిబ్బంది రోజుల్లో దమ్మిడీకాసంత కుంకుమబొట్టుగూడా చాలా ఎక్కువే" అని చెప్పి, సిసలుగా పెసరగింజంతబొట్టును ధరించి, బొట్టురివాజుమాత్రం తీశేయకుండా, కాస్త అత్తగార్లను సంతోషపెట్టుటకు ఉంచుతున్నారు.

ఇప్పుడు బొట్టులో షోకుకన్న జుట్టులోషోకు జోరుగాఉంది. బొట్టులో షోకు సూక్ష్మ పరిశీలనమీద గాని తేలదు—వంటలక్కల దొంగతనం సూక్ష్మ పరిశీలనమీదగాని తేలనట్టు. జుట్టుషోకును గురించి తెలిసికొనునపుడు కేశములయొక్క ప్రాముఖ్యమును గురించి గూడా తెలిసికొనుట అవుసరం. స్త్రీలకేమి, పురుషులకేమి, కేశములే అన్నిటికన్న అగ్రభాగము నధిష్ఠించియుండుట అందరకూ తెలిసినసంగతే. వడ్డీ ఎదిగినట్టూ పాపం పెరిగినట్టూ వెండ్రుకలుగూడ సర్వకాలములలోనూ గూడ ఎదుగుచుండును గాని, ఒక్కనిముషమైనా ఎదుగూ పొదుగూ లేకుండా, మా స్నేహితుని అల్లుడు 1920 మొదలు 1934 వరకు ఒకటేక్లాసులో అట్టే ఉన్నట్టు, అట్టేవుండవు. మరియొక్క విషయము. ఆత్మకు నాశనము లేనట్టు యీ వెండ్రుకలకు గూడ నాశనమున్నట్టు కనబడదు. ఏలనన, వెంట్రుకలను ఈరోజున మొదలంటా నిర్మూలించి, అయ్యంగార్లు పెట్టించినట్టు బుర్రకు గచ్చకాయమెరుగు పెట్టినా గూడ, అవి "ఉన్నా" అంటూ మళ్లీ మరునాడే తయారవుతూ ఉంటాయి—ఉద్యోగం ఖాలీలేదు, రావద్దు రావద్దు అంటూన్నా మళ్లీ మరునాడే నిరుద్యోగపు బి. ఎ. ఉద్యోగ—ఆశ్రయింపుకు తయారయినట్టు. ఈ వెండ్రుకలు అనేవి ఎల్లప్పుడూ యజమానిహక్కు భుక్తములలో నుండుటవల్ల, వీటి విషయమై యజమానికి వారసులవల్ల భుక్తంకొరకు (Possession) దావా భయం లేదు. వీటి విషయమై వ్యతిరేకభుక్తం గూడా (Advers Poss.nion) ఏప్లీడరూ వాదించడానికి వీలులేదు. యజమానిన్నీ వానివెంట్రుకలున్నూ సగోత్రీకులేనని యిటీవల కొందరు బుద్ధిమంతులు స్థిరపరచారు. అందువలననే క్షురకర్మ అనంతరం స్నానం చేయుడం, సగోత్రీకులయిన వెండ్రుకల నిర్మూలనానంతరం ఏర్పడిన మైలస్నానం అని బుధులు చెప్తున్నారు. ఇంతప్రాముఖ్యం ఉండినన్నూ, ఉద్యోగస్థులకు అవస్థాభేదమువలన గౌరవాగౌరవములు ఎట్లు మారుచుండునో, అట్లే, యీ కేశములకుగూడ స్థానభేదమువలన గౌరవాగౌరవములు మారుచుండును.

భగవంతుడు ప్రసాదించిన కేశములను వాటియొక్క సహజ లావణ్యమును జూపనీయక, వాటి గమ్యస్థానమునకు వాటిని బోనియ్యక, పవిత్ర కృష్ణా, గోదావరీనదులకు మానవుడు ఆనకట్టలుగట్టి వాటికి తిప్పలుదెచ్చి తిప్పలు బెట్టినట్టు, మిడిమేలపు మంగలివానిచే మాటిమాటికి కేశములను నరికించుచూ, సహజ సౌందర్యమును యినుమడింపచేయుటకై మానవుడు చేయు వెట్టి ప్రయత్నములు అందరెరుగనివిగావు. అందువలన జుట్టులోని షోకు కత్రింపునుబట్టికూడా ఉంటుంది. కత్రింపులలో క్రాపు, నాన్‌క్రాపు అని ద్వివిధములు. అందు నాన్ క్రాపుకు చెందిన ముచ్చటముడి, వసారా, పాయ్యి, పిలక, గిరజా వగైరాలు అనాగరకతకు యిప్పుడు ఆనవాళ్లయి, ఒట్టి వీధినాటకములవలె, తోలుబొమ్మలవలె, సెకండుగ్రేడు ప్లీడరువలె, వెనక కత్రింపుగల కోటువలె, జేబుగడియారములవలె, అడ్డబాసవలె, వాడకములో ప్రస్తుతము తగ్గి ఊరుక్కున్నాయి. ఇక క్రాపుపేరట వర్ధిల్లెడి షోకేలా జుట్టులలో పక్కపాపిడి, మధ్యపాపిడి, అసలు పాపిడి లేక పోవడం (Oxford crop) అని మూడు రకములు. మధ్యపాపిడి మనిషి సాధారణంగా మితవాదివలె నుండి; ఏవిషయం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మీదనూ పూరా సానుభూతి చూపక; ఉన్నమట్టులో ముక్కుకు సూటిగా, లంచములు తినని మేజస్ట్రీటు వలె నిదానంగా పోవుచుండును. ప్రక్క పాపిడిమనిషి, వక్రపు ప్రవర్తనలలోకి దిగినా, కాస్త తప్పుకుని, ప్రక్క ప్రక్కనే నడుస్తూ, విమర్శకు దొరకకుండా గౌరవము కాపాడుకుంటూ సంసారంచేసెడి జారిణుల వలె సంచరించుచుండును. అసలు పాపిడి లేక వెండ్రుకలను వెనక్కి దువ్వే ఆసామీ, కేవలం ఒట్టి మొండి మనిషిఅయి, అన్నిటికీ తెగించి, విశ్వాసరాహిత్య తీర్మానం ప్యాసుచేసినా పదవి వదలని మ్యునిసిపల్ ఛైర్మనువలెనూ, ప్రజాభిప్రాయమును ధిక్కరించెడి శత-మొండి వలెనూ ప్రవర్తించుచుండును. ఎందుకంటే, పాపిడి అనే బాట వీని మెదడుమీద లేనందున, సదరు మానవునికి, ఏ వ్యవహారములలోనూ గూడ ఒహ తెన్నూ, దారీ ఉండదు.

షోకులలో జుట్టు, బొట్టు అయినతరువాత, కట్టులో షోకుగూడ తెలిసికొనవలసినదే. పురుషులకు పూర్వకాలములో కోట్లు మోకాలివరకు ఉండేవి— మరి, పూర్వీకులు అప్పుడు పంచ అనేదానిని అసలు ధరించేవారో లేదో—ఇప్పుడు విక్టోరియాహాస్టలు విద్యార్థులు పొట్టికోటులలో పసందు కనిపెట్టుటచేత, యువకులంతా గూడా, తమకోట్లను పిరుదులపైదాకా మాత్రం ఉండునట్లు కుట్టిస్తూ, భగవంతుడు ప్రసాదించిన పిరుదుపటుత్వమును చూపరులకు దాచుట అధర్మమని స్థిరపరచారు—పార్శీస్త్రీలు వల్లెవాటువేయుటలో దేవదేవుడు తమకు దయచేసిన అంగసౌష్ఠవమును చూపరులకు దాచుట అధర్మమని స్థిరపరచినట్టు. అయితే, అసలు మొగవారు పొట్టికోట్లను అమలులో పెట్టడం ఆడవాళ్ల జాకెట్లయొక్క పొట్టిచేతులను చూచినతరువాతనేనట. అందువలన ఆంగ్లోయిండియన్ స్త్రీల గౌనులదివరంచు మోకాలిపైకి మూరెడు తరిమివేయడం చూచి ఇంక పురుషులుగూడా స్త్రీల ననుకరించే ఆసక్తితో తమపంట్లాములనుగూడా పైకి క్రమంగా ఎత్తేస్తారేమో అని, కొందరు పూర్వకాలపుస్త్రీలు భయపడుతున్నారు. పురుషులు పంచకట్టడంలో రకరకాలషోకులు ఉన్నాయి. అందులో మొదటిషోకు బిళ్లగోచీపెట్టి పంచను కట్టుట. పంచకట్టడంలో దీని పేరు ముందుచెప్పి, తరువాత మరొకదానిపేరు చెప్పాలి-కాఫీహోటళ్లు ప్రమేయం వచ్చినపుడు, అరవ సోదరులమాట ముందు చెప్పి, తరువాత మరొకరి మాట చెప్పినట్టు. ఏది ఎలాగున్నా, యీకట్టు అనాది సిద్ధంగా, హిందూదేశమందంతట గూడ ఉండటంవల్ల వయోవృద్ధులు దీనిని మిక్కిలి మన్నిస్తారు. అయితే బిళ్లగోచీలోనే చాలపెద్దమనిషితనం ఉందని చాలమంది పొరబడుతున్నారు కుండనాలు ధరించి, శాలువ వెయ్యగానే ఆమానవుడు గొప్పపండితుడని చాలమంది పొరబడినట్టు—జడ్జీపదవిలోకి రాగానే ప్రతీమానవుడూ అమాంతంగా నిష్పక్షపాతచేతస్కుడైపోతాడని చాలమంది పొరబడినట్టు. ఈ బిళ్లగోచీలో ఉన్నది పెద్దమనిషితనం అయితే ఏం, మరొకటి అయితే ఏం, మొత్తంమీద యిది (Ventilation principle) గాలివెల్తుర్లు బాహాటంగా సప్లయి అనునదే ఉద్దేశ్యంమీద ఆధారపడి ఉన్నది. బహుశః దీనిని ఆరోగ్యశాఖయొక్క ఏడైరెక్టరువారో లోగడ కనిపెట్టిఉంటారు—వేరే ఏపనీ లేక. రెండవది గూడకట్టుషోకు. దీనినే "సాంబారుకట్టు" అని కొందరూ, "కుంభకోణం కట్టు" అని కొందరూ ముద్దుపేర్లతో పిలుస్తారు. ఈగూడకట్టువారు అఖిల భారత Sack Race పోటీలో అవలీలగా ఫస్టుగా రాగలరని కొందరిఊహ. అయితే ఈసాంబారుకట్టువారు బొత్తిగా గ్లాస్గోమల్లుపంచవంటిదిగాక, కాస్త ముతక గుడ్డను ధరిస్తూవస్తే, ప్రపంచక్షేమానికి గాంధీగారికంటె ఎక్కువ తోడ్పడెదరని ఆంధ్రుల నిశ్చయము. ఏది ఎట్లున్ననూ, ఈగూడకట్టువారు, సదరుకట్టుతో స్త్రీలు మసిలెడి ప్రాంతమున బైసికీలు ఎక్కుటగాని, త్రొక్కుటగాని జరిగించినచో ఇండియన్ పీనల్ కోడు 3౫౪ సెక్షనుక్రింద, నేరము చేయగలరని, ఇటీవలనే సమావేశమయిన మహిళామండలివారు గుర్తెరిగి, సదరు సాంబారుకట్టుధారులను పైకిళ్లు త్రొక్కుచూ ఎక్కడనూ స్త్రీలకు ఎదురురావలదని వినయపూర్వకముగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒకతీర్మానముతో హెచ్చరించియున్నారు. మూడవది సైకిలుకట్టుపోకు. ఈకట్టువల్ల గాలివెల్తురును పూరాగా నిషేధించడమగును. చిరిగినపంచను చిరుగుకనుపింప కుండా కట్టుటకు ఈఫక్కీ శ్రీరామరక్ష. కాలికి చర్మవ్యాధులుంటే, అవి దాచుటకు ఏర్పడిన తోడు దొంగ ఈసైకిలుకట్టు. అనాదిని ఈకట్టు బైసికిల్ త్రొక్కువారికి వీలుగా ఉండునని ఏర్పర్చారు. ఇప్పుడు బైసికిల్ ఎక్కలేనివారుగూడా ఈపద్ధతిని కట్టుచున్నారు.—పోలోఆట ఎరుగనివారు సహితం పోలోకాలరు షర్టు తొడిగినట్టు.

పోకులు స్త్రీపురుషులందరకూ ఉండినను, అందు కొన్ని ప్రత్యేకముగా పురుషులవేనని చెప్పకతప్పదు. 'చేతికఱ్ఱ' అనునది అనాదినుండియూ వయోవృద్ధులచే ఊతకొరకై వాడబడుచున్నది. కాని యిప్పుడు అది పోకులలో నొకటిగా పరిగణించుటవల్ల, ప్రతీవాడూ, కాస్త మీసకట్టు రాగానే, కఱ్ఱ చేతులోపుచ్చుకొని తిరుగుచున్నాడు. కఱ్ఱపోకుకు ప్రత్యేకలాభములు గూడ లేకపోలేదు. బోగంమేళాలలోనూ, మీటింగులలోనూ, ఆలస్యంగా వెళ్లిన సందర్భంలో, చేతిలో గనక కఱ్ఱ ఒకటి ఉన్నట్టయితే, అది విసురుకుంటూ వెళ్లేవాడు ముందు సీటుకు సులభంగా చేరుకోవచ్చు. ఈ చేతి కఱ్ఱ వాడు టిక్కట్టు లేకుండా రైలుదిగినా, చిరునవ్వు నవ్వుతూ కఱ్ఱగనక విసురుకుంటూ టిక్కట్టు కలెక్టరుని తోసుకుంటూ పోయినా, టిక్కట్టుకలెక్టరు ఏమీ అనలేడు. ఒకవేళ ప్లాటుఫారముమీదకు ఏదోపనిమీద వచ్చిన పెద్దమనిషి అనుకొని కాఫీహోటలునకు వెళ్లి, కావలసిన యిడ్డెన్లు, పెసరట్లూ వగైరా తినేసి, డబ్బివ్వ వలసిన దుర్ముహూర్తంలో మాత్రం, కాస్త, జేబును మాటవరుసకి ఓమాటు ఆడించి చూచి, "అరరే, పర్సు మర్చిపోయాను లాగుంది" అని, లేనిచిరునగవు తెచ్చు కొని "తరువాత పంపిస్తా సార్" అని దబాయించుకు ఈవలకు కొట్టుకొచ్చినా, ఆట్టే తగాయిదా ఉండదు. తెలివితేటలు అవుసరంలేని ఒట్టి కఱ్ఱపెత్తనం మాత్రమే అవుసరమైన స్కూళ్ల యిన్స్పెక్టర్లు, బోర్డు ప్రెసిడెంట్లు వగైరాలకు, కఱ్ఱపెత్తనమునకై ముఖ్యముగా కఱ్ఱ అవుసరం. ఎందుకంటే, సదరు ఉద్యోగాలకి బుఱ్ఱ కంటె కఱ్ఱ అవుసరం. ఈ చేతికఱ్ఱమోజు ఎంతవరకు వెళ్లిందంటే, రెండురూపాయల కఱ్ఱకొరకై యిరవై రూపాయలు వెచ్చించి పట్నంవెళ్లి నచ్చినకఱ్ఱను ఏరు కొని వస్తున్నారు—వెనకటికి మా స్నేహితుడొకడు 4 గజాల పోలవూరు చెక్కగుడ్డ కొనడానికి చవుకగా దొరకుతుందిగదా అనే ఉద్దేశంతో, ఏలూరునుండి పోలావూరుకు వెళ్లినట్టు. ఇంకొకచిత్రం ఏమిటంటే, చేతికఱ్ఱ లేనివారు తమగొడుగునే మనస్సులో చేతికఱ్ఱ యని భావించుకొని చేతికఱ్ఱను పోకుగా ఊపినట్టే గొడు గునుగూడా ఊపుకుంటూ నడచుచూ, చేతికఱ్ఱపోకు చూపుతున్నాంగదా అని అనవసరంగా ఆనంద పర వశులై పోతున్నారు—వెనకటికి మాస్నేహితుడొకడు సినీమాతెరమీద నటిని చూచి, నిజమైనస్త్రీ అక్క డకు వచ్చిందని భ్రమించి, కనుసైగ చేసి ఆనంద పర వశుడైనట్టు.

చేతికఱ్ఱపోకు తరువాత కళ్లజోడు పోకును గురించి తెలిసికోవాలి. అసలు కళ్లజోడు బాగా కళ్లు చూపులేనివారికొరకేర్పడింది. కాని, యిప్పుడు కళ్ల జోడును చూపు సరిగా ఉన్నవారు కూడా పోకు ఆరా ధనకొరకై వాడుచున్నారు. ఈ కళ్లజోడు పోకుకై పురుషు లెంత పాకులాడుచున్నారో, స్త్రీలూ అంతే. సరదాపడుచున్నారు. అంచేత స్త్రీలకు గూడా, పురు షులవలెనే కళ్లకీ జోడుగావాలి, కాళ్లకీ జోడుకావాలి, తమకీ జోడుగావాలి. అందులో 16 సం॥ ములవయస్సు దాటితే పైవూహ అర్జంటే—లోకల్ బోర్డు ప్రెసి డెంటు అయిన తక్షణం కంట్రాక్టుల విషయము ముందు అర్జంటు అయినట్టు. కళ్లజోడుధారులలో చాలమంది తాము స్ఫురద్రూపులని పొరబడుతున్నారు. కళ్లజోడు తీసేసినప్పుడు వారి సహజ సౌందర్యం గురించి యింట్లో ఆడవాళ్లు రోజూ అసహ్యించు కుంటూ ఉన్నప్పటికీ గూడా, మొహంలోని వర్చస్సు కళ్ల జోడు యొక్క బంగారపు ?ట్టు చట్రముదిగాని తమ తాలూకుదిగాదని జ్ఞానోదయం కలుగటం లేదని, యిరుగు పొరుగిళ్ల ఆడవాళ్లు చెప్పుకుంటున్నారు. ఏది ఏలా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గున్ననూ, కళ్లజోడుద్వారా పరాయిస్త్రీని పరకాయించి చూచినా గూడా, సదరు దృష్టిదోషము మూడో వెధవలకి తెలియని కారణముచే, రహస్య ప్రణయవృష్టి, జోళ్ల వానభయములేకయే, ప్రసరింపచేయుటకు సావకాశం ఏర్పడుతోంది.

షోకులలో చేతిగడియారంషోకును మించిన షోకే లేదు. స్త్రీలచేతులకు బంగారపుగాజులు అందమయితే, పురుషులకిగూడా ఏదో ఉండాలి అనిచెప్పి, అనాదిని, చేతిగడియారం కనిపెట్టారు, అయితే స్త్రీలుగూడా—అందులో విద్యాధికులు—యిప్పుడు చేతిగడియారము మీద ఎక్కువ మోజుపడుచున్నారు చేతిగడియారంమీద వారికున్న మోజులో, మంగళసూత్రంమీద సహం లేదని, ముసలి ఆడవాళ్లు చెప్పుకుంటున్నారట అయితే స్త్రీలు, చేతిగడియారం గనుక ధరించడంవల్లే, మరిఆచేతికి యింక గాజులు పనికిరావట—సూటు ధరిస్తే బొట్టు పనికిరాదన్నట్టు. అది షోకుకు వ్యతిరేకమట. "అలా ఒకచేతిగాజులు తీసేయడంవల్ల భర్తకు మొప్పం" అని పెద్ద ఆడవాళ్లు అంటే, వారికి చేతిగడియారపుస్త్రీలు ఏమంటున్నారంటే "ఒక్కచేతిగాజులు తీసేస్తేనే అయిదువతనం పోయేటట్టయితే, అలాంటి అయిదువతనం ఉంటేనేం, పోతేనేం" అంటున్నారు. మరియొకచేతిగడియారపు స్త్రీ అందిటా, "రిష్టువాచీచేతికి, స్త్రీలు గాజులు తీసేయడంవల్ల సగంఅయిదువతనం పోయినాసరే, సగం మొరుకుపోయినాసరే, స్త్రీ ఆష్టే లక్ష్యపెట్టకూడదు" అందిట. దమ్మిడీపనిలేనివాడుగూడా పరాయివాడితో మాట్లాడేటప్పుడు, సంభాషణ ముగించుటకుపూర్వం, మహామించిపోయేపని తనకు ఉన్నట్టు, రిష్టువాచీకేసి ఓపర్యాయం చూచి, "శెలవుపుచ్చుకుంటానండి, టైము చాలాఅయింది" అని, చేతిగడియారపుషోకు చూపుచున్నాడు. కొందరు రిష్టువాచిలేనివారుగూడా, పరాయివాళ్లసమక్షంలో,అప్పుడప్పుడు సందర్భానుసారంగా చేతిమణికట్టువైపు చూచికొని "ఓ" అని, ఆశ్చర్యం నటిస్తూ, రోజూ మహారిస్టువాచీ ధరించేటట్టున్నూ—ఆరోజునమాత్రం ఏదోకాలవశాత్తూ మరచినట్టున్నూ అభినయించుచూ, రిష్టువాచి లేనిదే, రిష్టువాచిషోకును చూపుచున్నారు.

స్త్రీల షోకులలో మంగళసూత్రంషోకు కూడా ఒకటి. మంగళసూత్రమును విద్యాధికులైనస్త్రీలు గూడా, "ఉంటే అదిమాత్రం దేనికి అడ్డం" అనిచెప్పి దానిని షోకుకు విరోధిగా ఎంచడం మానివేశినారు. అట్లయ్యూనూగూడ, మళ్లీ మంగళసూత్రం తాళీకు బిళ్లలు, సైజులోమాత్రం చిన్నవిగా ఉండడం కాస్త షోకుక్రింద పరిగణింపబడుతోంది. ఎందువల్ల చిన్న సూత్రములమీద మోజు అని అడిగితే, ఒకఆవిడ "మొగుడే ఆడజన్మకి బోలెడు బరువు అనుకుంటూంటే, యింకా మెడలోగూడ పెద్దబంగారపుసూత్రాలబరువు ఎందుకు" అని అనినదట. ఇంకొకఆవిడ "పెద్దసైజుగలభర్తలు పెద్దసూత్రాలు చేయించాలి, పొట్టిభర్తలయితే దమ్మిడీకాసంతబిళ్లలు చేయించాలిగాని, పొడుగుభర్తలవలె పొట్టిభర్తలుగూడా పెద్దసూత్రాలే అఘోరించడం ఏం పొయ్యేకాలం" అందిట—పాపం ఆమెపొట్టిభర్త ఆవిడకి బండీచక్రంఅంతసూత్రాలు చేయించి మెడలో కట్టాడులాగుంది.

ప్లీడర్లుకూడా షోకును ఆరాధించేవారే. అయితే కాలమునుబట్టి షోకులుకూడా మారుచున్నాయి. నా చిన్నతనంలో బోగందిలేని ప్లీడరుని పొట్టిబోడిప్లీడరు అనేవారు. అనగా, ప్లీడరీషోకుకు తనమాత్రంగా, ఒక్కభోగందాన్నా శృంగారంపోషించేందుకు ఉండాలని ప్రజ లనేవారు. ఇప్పటిప్లీడర్లు, ఆషోకులో యితరులకి తీసిపోవడంవల్ల, వీరు ఇతరవిషయములలో ఎక్కువషోకు చూపుచున్నారు. ఇప్పటిప్లీడర్లకి వాహనంషోకు ఒకటి అవసరంఅయి ఊరుకొంది—స్వంత బండి అవనీయండి, స్నేహితులబండి అవనీయండి. ఇంటినుంచి కోర్టు ఫర్లాంగుమార మైననుసరే, ప్లీడరుగారికి వాహనయోగ్యత కలుగవలసినదే. రాబడి తక్కువైనా, భోజనమైన్నా మాని, బండిఎక్కవలసిందే కాని కాలినడక లంకించుకొనడానికి ఎంతమాత్రం వీలులేదు. వీధులోకి వెడితే, విలువైనచేతికర్ర లేనిదే, కదలడా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నికి అసలే వీలు లేదు—జడ్జీగారు వీధులలోకి నడవాలంటే, డఫేదారు లేకుండా కదలడానికి వీలు లేనట్లు. కానీపెట్టి రెండుఅరటికాయలు కొనినా, అవి బజారు నుంచి చేతితో పబ్లీకుగా తీసుకురావడానికి అంతకన్నా వీలు లేదు. ఏకూలివాడినో పెట్టితీరాలి. లేనియెడల సదరుప్లీడరుగారు తమగౌరవంతో రాజీచేసుకోవడం అనునని వారిభయం. అయితే ఆఅరటికాయలు రెండూ, చెరియొకజేబులోనూ పడేసి, మీసాలు దువ్వుకుంటూ చక్కాపోయినా, అందులో ప్లీడరీ షోకుకు ఏమీ భంగం లేదు—లోపల షర్టు చిరిగినా, డాబుగా పైన కోటుధరించి, మెడలో నెక్ టై యుతుడై యున్నప్పుడు, తన ప్లీడరీషోకుకు కించిత్తు హాని లేనట్టు. ప్లీడరుపదవికి అవసరమైనషోకులలో చేతికర్ర, కళ్లజోడు, కాలికిజోడు, కొన్ని ఫైలు ఉండనీయండి, లేకపోనీయండి గుమాస్తాఅనేవాడు కూడా ఒకడు షోకుకు అవుసరమే - స్త్రీకి ప్రేమ అనేది భర్తమీద ఉండనీయండి, లేకపోనీయండి, భర్తఅనేవాడు అసలు ఒకడు ఇంట్లోఉండడం అవుసరమైనట్టు. అందులో కొత్తప్లీడరు సాలుకు ఒక స్మాలుకాజు వ్రాసిపడేస్తాడో లేదోకాని, జేబులో మాత్రం పదిహేనురూపాయిల "పార్కర్" కలములు రెండుంటాయి, ఒకటి నల్లసిరాకిన్నీ రెండవది ఎఱ్ఱసిరాకిన్నీ—గుడ్డివానికి నేత్రములు, విశాలములైనవి రెండున్నట్టు. రైలుప్రయాణం చేయవలసివస్తే తాహతు ఉండనీయండి, లేకపోనీయండి, ప్లీడరన్నవాడు, కనీసం ఇంటరులో నన్నా వెళ్లాలిగాని, మూర్ఖంగా మూడోక్లాసులో ప్రయాణంచేయడానికి వీలు లేదు. అయితే వీరిలో కొందరు రాత్రిప్రయాణములలో మాత్రం, కాస్త ముసుగేసుకొని, మూడోక్లాసులోనే ఏమూలో యిరికి ఆనాలుగుఘంట్లూ కాలక్షేపంచేసి, రైలుదిగి అవతలపడ్డాకమాత్రం, ఠీవిగా, మీసాలు దువ్వుతూ "అబ్బే! యింటరుక్లాసు బొత్తిగా యిరుకుగా ఉంటోంది, మహాయిబ్బంది పడిపోయాము" అని క్లయింట్లు వినేనిమిత్తం అంటూఉండడం రివాజు. అదికాదూ, యీప్లీడరీషోకు ప్లీడరిగారితో ఆగుట లేదు. పాపం, ఆషోకు మోపవలసినబాధ్యత ప్లీడరుగారి భార్యామణిమీద కూడా పడుతోంది! మొగుడు ప్లీడరుఅయిందాకా, ఎక్కడికి పడితే అక్కడికి, జంగీరావులా పోయే ప్రతీస్త్రీకూడా, మొగుడు ప్లీడరీపట్టా చేతపట్టగానే, జట్కాఎక్కగాని ఎక్కడికీ కదలడానికి వీలు లేదుగదా! కొంచం, క్లుప్తభాషి అవవలసివస్తోందిగదా! అవతలస్త్రీ ఏంచెప్పినాకూడా "అందులో ఏముంది" అని తృణీకరించుచూ సర్వజ్ఞత్వం వహించవలసివస్తోంది గదా! తాను ఎప్పుడు మాట్లాడినా, ఎంతసేపూ జడ్జీలభార్యలనుగురించీ, కలెక్టర్లభార్యలనుగురించి తప్ప, మామూలురకం మనుష్యులను గురించి మాట్లాడకూడదుకదా! డబ్బులేక చవుకరకం చీరగట్టినా, దానినే, కాస్త పిన్నులు గిన్నులూ పెట్టి, షోకుగా ఉండేటట్టు తయారుచెయ్యాలిగదా! మొహంలో మెరుగు లేకపోయినా సబ్బుతోనూ, పౌడరుతోనూ మెరుగు తెచ్చినట్టు. ఇంకొకచిత్రం! మొగుడు కోర్టులో వాదనచేసినట్టూ, క్రాసుపరీక్ష చేసినట్టూ తనుగూడా కొత్తిమీరిదానితో బేరంలోనూ, అంట్లుతోమే అప్పితోనూ, ఆలస్యంగా బట్టలుతెచ్చిన చాకలివానితోనూ, ముసలిఅత్తగారితోనూ తర్కం మొదలెట్టాలిగదా! మొగుడు ముప్ఫయితెస్తే మూడు వందలు అని ముచ్చటగా చెప్తూ మురిసిపోతూంటుంది గదా! ఇలా బోలెడుషోకు ప్లీడరుగారి ప్రియురాలుగూడా మోపవలసివస్తోంది. డాక్టర్లుగూడా షోకుమీద మోజుకలవారే. అయితే డాక్టర్లషోకు చాలవరకు విద్యార్థిదశలోనూ, కొత్తగా వొచ్చిన ఒకటి రెండేళ్లలోను అయిపోతుంది. ఆషోకురోజుల్లో పంట్లాముకు మడతలు పనికిరావు; పళ్లకు రంగు పనికిరానందున కిల్లీ విసర్జించాలి; నవ్వితే పెదవులు ఆర్చే వెడల్పు అవకుండానే చిరునవ్వు నవ్వాలి; మాట్లాడితే కరాఖండీగానూ, క్లుప్తంగానూ మాట్లాడాలి; శుభ్రత విషయంలో ప్రత్యేకజాగ్రత్తతీసుకొని నిమిషానికి ఒకమాటు సబ్బువాడాలి. నాలుగేళ్లయినతరువాత వైద్యుడు ఈఅవతారంచాలించి, బట్టలు మాసినా సరే, సూటుకాక ధోవతిఅయినాసరే, చిరిగిన చొక్కా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౧. వెన్నెలరేయి



౨. ఉద్యానములోపల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయినాసరే, లెక్కలేకుండా బోతూ, షోకులో వేదాంతం గ్రహించి, తమగొప్పతనం షోకులో మాత్రం లేదని తక్కిన వాళ్లకంటె, కాస్తపెందరాళే తెలిసి కుంటారు. పైషోకులు పెందరాళే అంతరించినా, అసలు షోకుకు డాక్టరు విరోధిగాడనిమాత్రం ఒప్పు కునితీరాలి. ఆడవాళ్లకి గుండిజబ్బు ప్రవేశిస్తే డాక్టరు గారు ఎంతకే ఆజబ్బును పెందరాళే కుదరనియ్యరని ప్రతీతి. దీనికీ, షోకుకూ ఏమీసంబంధములేదని డాక్టర్లు ఒట్టేసిచెప్పినా, జమీందారులు నమ్మడం లేదు. కొందరు డాక్టర్లు తమ క్లయింట్లయింటికి జబ్బున్నవారెవరూ లేకపోయినా, రాకపోకలు సాగి స్తూనే ఉంటారని డాక్టర్లవిరోధులు అంటున్నారు. "దీనిభావమేమి తిరుమలేశా" అని చాలమంది గుస గుసలుగూడా మొదలెడ్తున్నారు.

వర్తకులుగూడా షోకీలాలే. వర్తకులలో చెక్కమంది వైశ్యులుగనుక, వైశ్యులషోకులను గురించి తెలిసికోవాలి. ఎవరేమన్నా మొత్తముమీద వైశ్యులలోగూడా అందమైనవారు లేకపోలేదు. శ్రీ కృష్ణునిజూసినా చూడకపోయినా, శ్రీ కృష్ణుని ఛాయయూ, వైశ్యులఛాయయూ ఒకటేనని కోమటి ప్లీడర్లు వాదిస్తున్నారు.—నేరం చూచినా చూడక పోయినా చూశాం అని కొందరు సాక్షులు చెప్పే నట్టు. "శ్రీకృష్ణునిది నీలమేఘచ్ఛాయ అనునో కాదో గాని, వైశ్యులదిమాత్రం నల్ల మేకచ్ఛాయ" అని ఘంటాపథంగా చెప్పగలమని బోగంస్త్రీలు కోమటి ప్లీడర్లను సవాలుచేసి చెప్తున్నారు. ఏది ఎట్లున్ననూ సహజసౌందర్యం మీదకన్న, స్వప్రయోజకత్వంవల్ల మానవుడు తెచ్చిపెట్టుకునే అందంమీదనే వీరికి నమ్మకంఉంది. స్త్రీయొక్క అందం, అందువల్లనే, కట్టినచీరెలోనూ, తొడిగిన రవికెలోనూ, రవికకుట్టిన దర్జీపనివాడి నేర్పరితనంలోనూ, దారంయొక్క నాణ్యంలోనూ ఉన్నదని వీరి అభిప్రాయము. వీరు అత్తరువు వ్రాసుకొనుటగూడా అందమును యినుమ డింపచేయుటకేనని చాలమంది ఫోటోగ్రాఫరులు సాక్ష్య మిచ్చుటకు సంసిద్ధులయి ఉన్నారు. కళ్లజోడు గూడా అందమును యినుమడించుటకై ఏర్పడిన అలం కారమని వీరియూహ. ఔపోసనమునకు కళ్లజోడు లేనిదే బయలుదేరకూడదని వీరిలో చాలమంది అభి ప్రాయపడుతున్నారు. చేతికఱ్ఱ షోకులో నిజంగా గోటుందని వీరు నమ్ముతారు. కాని ఎవరేన్నా విరో ధులు వీరిని కొట్టడానికి వస్తున్నారని తెలిస్తేమట్టుకు, ఆచేతిలోనున్న కఱ్ఱనుగూడ ఆవతల పారేసి, సాత్వికం లోనే ధైర్యస్థైర్యములను చూపెడతారు.

ఉద్యోగస్థుల షోకులుగూడా మజాఅయినవే కాని, వాటినిచూపుటకు ప్రత్యేకస్థలములు ఉన్నాయి. పైఉద్యోగి పదిహేనుగజాల దూరంలోకి వచ్చేసరికి, క్రిందఉద్యోగి, అదివరలోదాకా చూపెడితోకుకు అమాంతంగా గ్రహణంబట్టి, అప్పటిదాకా ఉండిఉన్న కీపీ టక్కున ఆగి ఊరుకుంటుంది. పైఉద్యోగి సమ క్షములోనున్న క్రిందఉద్యోగి తాత్కాలికంగా డఫే దారు అవతారం స్వీకరించి, చేతులను వాటిదారిని అలావదలివేయకుండా, కాస్త రెంటినీ జోడించి, పై ఉద్యోగి ఏమంటే దానికి తాళంవేస్తూ, ఆత్మగౌరవ మును అండమాన్సుకు తోలేస్తూ ఉంటాడు. ఈమధ్యే ఒక పైఉద్యోగి క్రిందఉద్యోగస్థునితో "నాకు మొన్న కవలపిల్లలు కలిగేరయ్యా" అని అనగా, క్రిందఉద్యోగి "చిత్తం. తమరికి కాబట్టి రెండుపంటలూ ఒక్కసారే అలాసంప్రాప్తమయినాయి, ఎన్నిగ్రంథాలు చదివితే మాత్రం, అందరకూ ఆకీలకం బోధపడుతుందాండి" అని జవాబుయిచ్చాడట. ఉద్యోగి సాధారణంగా షోకును తనగుమాస్తాలవద్దనూ, బంట్రోతులవద్దనూ, స్వంత భార్యవద్దనున్నూ, తనతో పనిఉండివచ్చినవారివద్దనూ చూపెడ్తూ ఉంటాడు. తన కచ్చేరి అయితే, పాగా బల్లమీదపెట్టి బోడిబుర్రతోనే కుర్చీని అలంకరిం చడం, కిల్లీనములుతో కేసులు విచారించడం, డిస్ట్రిక్టు కలె క్టరుగారైతే, క్యాంపులో సూటుకట్టూ హేఫారమ్ మాత్రం ధరించి, అవే యావత్తూ డ్రెస్సుకూ చిహ్నా అని (Part put for the whole) అనే యింగ్లీషు Syncchdoche అలంకారంక్రింద భావించమని ప్లీడ ర్లకు సూచన వదిలేస్తూ కేసులు విచారించడం వగై


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాలు షోకులలో చేరినవే. గుమాస్తాలని అందరిముందూ కసరడంలో షోకు, సాక్షులమీద ఎగరడంలో షోకు, బంట్రోతుని పిలవడముకు ఉంచినగంటను నొక్కడంలో షోకు నిత్యమూ జరుగవలసినవే. ఇంటిదగ్గర, రాత్రుల్లు, కానీ విసనకర్రతో భార్యామణికి తానువిసరుతూ కూర్చున్నా పగలుమాత్రం, శీతాకాలం అవనియ్యండి, వానాకాలం అవనియ్యండి, చేతులు పడిపోయేటట్టు, బంట్రోతు అస్తమానం తనకు విసరవలసిందే. అందులో కొందరు బంట్రోతుషోకును తమ యింట్లోకూడా చూపుతారు. ఎంతమంది నౌకర్లున్నా, అమ్మగారిదయవల్ల అందరికీ ఉక్కిరి బిక్కిరి అయ్యే అంతపని ఉంటుందని నౌకరులు గోలబెట్టడం రివాజు. అదిగాక ఉద్యోగి తనపనియందు నౌకరు అశ్రద్ధ చూపితే ఊరుకుంటాడుగాని, అమ్మగారిపనిలో లోటు వస్తే డిస్మిసు అని వెంటనే గోక్కేస్తాడు—లేకపోతే ఆరోజున యింట్లోభోజనం దొరకదని భయమేమో తెలియదు. ఫోటోగ్రాఫుషోకులుకూడా చాలారకములు గలవు. కొందరు భూరిదరిద్రులుసహితం అప్పుచేసి, ఎరువుదుస్తులతో పెద్దఫోటోగ్రాఫరువద్దకు బోయి, మామూలుగా చాపకుమించి టికాణాలేకపోయినా, అక్కడ సోఫాలోకూర్చుని ఫోటోదీయించుకొని వెఱ్ఱిమిథ్యానందం పొందుచున్నారు. ఈసందర్భంలో తాను ఎరువుదుస్తులనూ, ఎరువుసోఫాలనూ వాడకంచేసేసంగతిని చిరస్థాయిగా భూమిమీద నిల్చి ఉండునట్లు చేస్తూన్న సంగతిని మర్చిపోతున్నాడు. కొందరు నల్లని పెళ్లికూతుళ్లు, తమ నల్లనిరంగు ఫోటోలో ప్రత్యేకించి పడదనేధైర్యంతో, ఫోటోలు దీయించి వరులకు పంపించి రంగువిషయం దగాచేస్తూ, తరువాత తాము చిక్కుల్లోకి దిగుచున్నారు. కొందరు మోటారు లేనివారు, ఫోటోగ్రాఫరుని వెంటబెట్టుకుపోయి, రోడ్డుమీద రికామీగా ఆగిఉన్న కారుదగ్గరకు చేరి, ఆకారుమీద ఒకచేయివేసి, రెండవచేతితో మీసమును మెలిపెడుతూ తనే యజమానివలె నటించుచు ఫోటో దీయుస్తూ కారుషోకు అనుభవిస్తున్నారు. కొందరు పెద్దపెద్దమీటింగులవద్దనున్నూ రైలుస్టేషనువద్ద ఉదయం మెయిలుటైముకిన్నీ, మంచిదుస్తులతో హాజరవుతూ, ప్రెస్సుఫోటోబీరువావారు తీసే ఫోటోసమయమునకు, ఎలాగో ఫోటోలో దిగవలసిన ముఖ్యమైన నాయకుని ప్రక్కకు చేరుకుని, తప్పకుండా వార్తాపత్రికలలో పడే ఫోటోల్లో పడుచూ, కాని కర్చులేకుండా ప్రాముఖ్యానికి వస్తున్నారు. కొందరు భార్యాభర్తలకి అనుకూలదాంపత్యంలేక రోజూ పోట్లాడుకు చస్తూన్నా, యిద్దరుకలిసి ఫోటో ఎలాగో ఒకటి దీయించుకుని, పైవాళ్లకి దానిని చూపి, తాము ఎంతో అన్యోన్యంగా కాపురంఅఘోరిస్తున్నట్టు దబాయించుకొంటున్నారు—నన్నడిగితే చాలవాటిలో యిద్దరు కలిసిమెలసి ఉండే ఆఫోటోలో ఒక్క పర్యాయమే.

ఇటువంటి షోకులు అలా ఉంచగా, చాలమంది మాటల్లో గిరీశములవలె షోకు చేస్తున్నారు. ప్రతీవాడికి ఎంతసేపూ, తన గొప్పతనం, పరాయవాడి లోటులూ ఎంచడం తప్ప వేరేపని లేదు. కర్మంచాలక వాడు ఏ మద్రాసో, ఏ కలకత్తా నగరమో వెళ్లడం ఘటస్థిస్తే, ఆసంగతి ఎలాగో అలాగు సందర్భం సృష్టించి, యితరులకు చెప్పి ఆగొప్పకు ఆనందించడం అలవాటైంది—కొత్తప్లీడరు, కర్మంచాలక, ఏ ఒక కేసులోనే తాను గెలిస్తే, ఆకేసుగురించి, యింట్లోవాళ్లకి, ఊళ్లోవాళ్లకి, యిరుగింటి వాళ్లకి పొరుగింటివాళ్లకి, స్వంతక్లయింట్లకూ పరాయి క్లయింట్లకూ, సందర్భం సృష్టించి సతాయించినట్టు. అందులో కొందరు కళ్లజోడు పెట్టి, చేతిలో కఱ్ఱ ధరించినంతమాత్రాన, తాము మహా ఘరానా మనుష్యులనిన్నీ, తాము యెదటవానిని "ఏమండీ" అంటే తమ గౌరవమునకు లోటు అనిన్ని వెఱ్ఱి అహంభావంతో బాధపడుతూ, ఎదటవానిని మళ్లీ "నువ్వు" అని ఏకవచనం ప్రయోగిస్తే జోడు దెబ్బలు బహువచనంలో తగులునని భయంతో, ముభావంగా, అంత్యభాగము ఏకవచనమూగాకుండా, బహువచనమూగాకుండా పిలుస్తూ వ్యవహారాలు ఫైసలు చేసుకొంటున్నారు—కొందరు పొలిటీషియన్లు, తాము మితవాది అయినదీ అతివాది అయినదీ తేలకుండా వ్యవహారాలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షైసలు చేసుకొన్తూన్నట్టు. అందుచేత, షోకులవిషయం యిలాచూస్తూవస్తే, వాటికి ఆదీ, అంతూ, ఉండదు—కొందరి ఉపన్యాసములకు ఆదీ అంతూ ఉండనట్టు—రికార్డు నదవని కేసులో ప్లీడరుగారు చెప్పే ఆర్గ్యుమెంట్సుకు ఆదీ అంతూ ఉండనట్టు. ఎందువల్లననగా, పైన చెప్పిన షోకులుగాక యింకా కావలసినన్ని షోకు లున్నాయి. భోగంమేళాలవద్ద చిట్టి మీసాల మెలిపెట్టడంలో షోకు, నాటకములో బ్యాటరీలైట్ల సమేతులయి, ఆడవారి బ్లౌజుకు చేరువగానుండు విటుల హడావిడిలోని షోకు, కూలిదాని తలమీద కూరలగంప దింపడంలో వయ్యారపు క్రీగంటి షోకు, కాఫీహోటళ్లలో చిల్లిగవ్వ చెయ్యనివాడు సహితం పెద్ద జమీందారీ నటన చూపుటలోషోకు, చెవిటివారు వినపడనిదే వినపడ్డట్టు నటించడంలో షోకు, భావకవులు బొచ్చు పెంచుటలో షోకు, కొత్తప్లీడర్లు క్లయింట్ల దగ్గరనూ, కోర్టు వసారాల్లోనూ చేసేషోకు, కోతలరోజుల్లో కమ్మవారి షోకులు, అత్తవారింట్లోని అల్లుళ్లషోకు, తీర్థములలో ప్రజలషోకులు మొదలైన షోకులు ఎన్నైనా ఉన్నాయి. అంతు లేని విషయంమీద ఎంతమాట్లాడుకున్నా తనివితీరదు. మొత్తంమీద షోకుచూస్తేమజా లేదు, షోకుచేస్తే మజా ఉందిగాని.

---



పాపనాశన తీర్థము-తిరుపతి

—ఏ. ఆర్. వి. ఈశ్వర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# జ్ఞానస్వభావ సంక్షేపము*

శ్రీ పరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవార్లంగారు

శ్రేయః పదసాధనమునకు ముఖ్యసహకారి జ్ఞానము. దీనినే బుద్ధియని కూడ వ్యవహరింతుము. బుద్ధి యొక్క మహిమ మన మేమని చెప్పగలము.

" శ్రియః ప్రదుగ్ధే, విపదో రుణద్ధి,
యశాంసి సూతే, మలినం ప్రమార్ష్టి;
సంస్కారశౌచేన పరం పునీతే,
శుద్ధా హి బుద్ధిః కిల కామధేనుః."

ప్రస్తుతము మనము ముచ్చటించ దలచిన యీ యుపన్యాసముద్వారా యీ బుద్ధిసామ్రాజ్య మెంత వరకు వ్యాపించియున్నదో స్థూలదృష్టినిం బరిశీలించి దాని స్వభావమును వ్యాసంగముచేసి దాని విస్తీర్ణతను, దాని బాహుళ్యమును, దాని యవధులను పరీక్షించి ముందుగ బుద్ధివలన మనకు దెలియదగినదేదియో, యనంతర మట్లు తెలిసికొనుట కుపచరించు సాధనసామగ్రు లెవ్వియో వుడ కట్లు కష్టపడి సంపాదించి పెంచిన జ్ఞానమునకు యథార్థమైనట్టియు, యథోచితమైనట్టియు వినియోగ మెట్లో యను నీ మొదలగు సంగతులం దెలిసికొందము. అట్లు తెలిసికొనిననే మన మాడుమాటల కర్థమును, అర్థమందు యాథార్థ్యమును, యాథార్థ్యమున గౌరవమును, గౌరవమున సోత్కృష్టతయు, సోత్కృష్టతను యిహసౌఖ్యంబును పరంబున శ్రేయస్సు నుత్తరోత్తరవృద్ధిగ ఫలించును. ఇట్టి పరిశీలనా వ్యాసంగమువలన యథార్థజ్ఞాన సంపన్నుల మగుటయే కాక యట్టి యుత్కృష్టగుణసంపాదనకుం గల ప్రతిబంధకము లెవ్వియో, యా ప్రతిబంధకముల నివర్తించుటకు సూటియైన ప్రతిక్రియ లెవ్వియో, తదుత్కృష్టగుణాభివృద్ధి మార్గంబులెవ్వియో, తన్మార్గసాధకంబు లెవ్వియో యను నీయంశములంగూడ నవగాహనము చేసికొనినవార మగుదుము.

ఈబుద్ధియే జంతుకోటిలో నన్యతముండగు మనుజునకు దానియంతటిలోను శ్రేష్ఠత్వమును నగ్రగణ్యతను నుపపాదించుటకు కారణమగుచున్నది. దీనివలననే మానవుండు ప్రత్యక్షానుభవమునుం బడసి ధారణాశక్తిచే దాని నిచ్చవచ్చినప్పుడెల్ల స్మరించగలవాడగుచు వీటి యన్యోన్యసహాయతను క్రొత్త యూహాపోహాల సిద్ధాంతీకరించుచు తన లోకయాత్రావ్యవహారంబుల సదసద్వివేచనా సామర్థ్యతను జూపు శక్తిమంతు డగుచున్నాడు. ఈ సదసద్వివేచనా చాతుర్యమే విలక్షణమగు సంఘజీవనమునకు ముఖ్యోద్దిష్ట సహకారి యగుటను మనుష్యుల కలవడిన యీసంఘైకజీవన మిట్లు బుద్ధికి లక్షణమగుచున్నది. ఈ విలక్షణ లక్షణమే మనుజుని తదితర జంతుకోటినుండి ప్రత్యేకించు నుపలక్షణము కూడ నగుచున్నది. మనుష్యుని యితరజాతి జంతువర్గములతో తైపారువేసి చూచినయెడ నీతనియందు తదితర జంతువర్గములకంటె విలక్షణైకలక్షణ మగునట్టియు సంఘజీవన మూలకందమగునట్టియు ప్రాజ్ఞత కానవచ్చును. జీవరాసులయం దగ్రస్థానము నొసంగబూనిన యీ ప్రాజ్ఞతాసాధనపాలనములం దశ్రద్ధవహించునేని మనుజుడు తనవిధికృత్యమం దనాదరతను పాతకుండగుటయే కాక తనమూర్ఖతను పశుప్రాయుండు కూడ నగును. అట్లుకాక దానికిం బలువిధంబుల దోహదముచేసి దానిం దనలో విజృంభింపజేసినచో తాను కుశాగ్రబుద్ధికలవాడై తాను సుఖించుటయే కాక పరుల కుపకరించుటను సంఘసత్కారమును గూడ బడయును. సత్పురుషుని గుణంబు లెట్లన్న—

[* ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలా తెనుగుసంఘమునకు 30-౮-33 తేదీ నీయబడిన యుపన్యాసము.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"శ్లో. నమ్రత్వేనోన్నమన్తః పరగుణకథనైః
స్వాన్ గుణాన్ ఖ్యాపయన్తః,
స్వార్థాన్ సంపాదయన్తో వితతబహుతరా
రంభయత్నాః పరార్థే,
క్షాన్త్యైవాక్షేపరూక్షాక్షరముఖరముఖాన్
దుర్జనాన్ దుఃఖయన్తః,
సన్తః సాశ్చర్యచర్యా జగతి బహుమతాః
కస్య నాభ్యర్థనీయాః."

ఇంతకన్న మనుష్యజీవితమునకు వేరుసాఫల్య మేమున్నది. కాన ప్రజ్ఞాస్వరూపస్వభావవివేచనము మన కందరకును ముఖ్యతమ కృత్య మగుచున్నది.

జంతుసామాన్యమునుండి ప్రత్యేకించి యింత యుత్కృష్టపదవి నిచ్చు యీబుద్ధి యననేమో, దాని ప్రవిభాగము లెట్లో, దాని శాఖోపశాఖ లెట్లు ప్రసరించునో, తత్సంపాదనోపాయంబు లెవ్వియో, తద్వినియోగం బెట్టిదో, తదధికారు లెవ్వరో అను నీ మొదలగు విషయములంగూర్చి కొంత చర్చించి యందలి సత్యాన్వేషణమునకు కొంత ప్రయత్నింతము. ఇంతకును విషయబాహుళ్యతనుగూర్చి మనము భయపడ నవసరము లేదు.

శ్లో. ప్రయోజనం యస్య తు యావదేవ
తావత్స గృహ్ణాతి యథాంబు కూపాత్.

అను న్యాయానుసారమున విషయగ్రహణము స్వప్రయోజనానుగుణ మగుటను తత్తదనుకూలవిషయవిన్యాసముననే తన్నిర్బంధవిమోచనము సులభసాధ్యమే. అయినను అఖండోపాధిమంతమగు కాలమునకు అవధికల్పించుటయె అనన్యోపాయసాధనం బగుటను కొంతనిర్బంధతను గలిగించును. దరిద్రుని ధనకాంక్షయుంబోలె యీ విషయముననే మనస్సు కొంత పెనగులాడినను అప్రతిహతరాజశాసనమునుంబోలె యనన్యగతిక మగుటయే యేతన్నిర్బంధనివర్తకమని సమాధానమున తృప్తింబడయుదుము.

మనుష్యజన్మ మెత్తిన ప్రతివ్యక్తికిని ప్రథమకృత్యోద్దిష్టమగు యీజ్ఞానమన నేమి యను ప్రశ్నకు సమాధానము నిప్పుడు వివేకింతుము. జ్ఞానము మనుష్యుని గుణగణములలో నొకటియని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇది మన మాచరించు సమస్తవ్యవహారంబులకును హేతుభూతము. దీనిజీవిక వాక్కు. వాగ్రూపశూన్యమగు జ్ఞానముయొక్క యుపయోగ మత్యంతము స్వల్పము. జ్ఞానశబ్దము అన్వయవ్యతిరేకార్థముల రెంటను వచింపబడుటను అది కొంత ప్రమాదజనకముకూడ నగును. యథార్థజ్ఞానవాచక మగునెడ నది యన్వయబోధకం బగును. వ్యతిరేకబోధకం బగుచో నయథార్థజ్ఞానజనకం బగు. ఇదియె భ్రమ. కాని యయథార్థజ్ఞానముకూడ జ్ఞానమున కవాంతరభాగ మెట్లని తోచును. అచ్చట జ్ఞానహేతువునందు దోషముండుటచే విరుద్ధానుభవము కలుగును. ఇచ్చటకూడ అనుభవముండుటచే నిదియు జ్ఞానముకాక తప్పదు. ఆయనుభవ మయథార్థ మందురా కానిండు. హేతువున దోషముండుటచే నాయనుభవ మట్టి వైలక్షణ్యము కలదాయెను. ఒకయుదాహరణమును వినుడు: సదా ధవళము శంఖము. భూయిష్ఠపైత్యరోగాక్రాంతుని నేత్రములకు స్వేంద్రియదోషమున నది పీతవర్ణము గలదిగ గోచరించును. అంతమాత్రమున శంఖము పీతవర్ణము కలదగునా? పీతవర్ణానుభవము పైత్యరోగియను కేవలైకదేశమున నియమిత మగుటయు, తన్నియమముకూడ కాలభేదమున తదేకదేశమునంగూడ నశించుటయు మనకు విదితాంశమే.

ఈద్వైవిధ్యమగు యథార్థాయథార్థ జ్ఞానమును చక్కగ పరిశీలించినచో మరియు రెండువిధము లేర్పడును. మనము నేరుగ ప్రపంచకమునందలి వస్తువుల ననుభవించుటచే గలుగుజ్ఞాన మొకవిధము. అట్టి పూర్వానుభవమును స్మరణపూర్వకముగ నుపయోగించుట రెండవవిధము. ఇదియే స్మృతి. శాస్త్రజ్ఞులు స్మృతిభిన్నమగు జ్ఞానమంతయు ననుభవమనియె చెప్పుదురు. కాబట్టి మనుష్యునికి కలుగు జ్ఞానమంతయు స్మృతిరూపక మొండె, యనుభవరూపక మొండె మాత్రము కావలయును. ఈరెంటికన్న మరి మూడవవిధమగు జ్ఞానము లేదని సిద్ధాంతమగుచున్నది.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్మృతినిం గూర్చి మనము నేర్చుకొనవలసిన విషయ మత్యల్పము. స్మృతి సంస్కారము వలన జనించునని చెప్పుదురు. సంస్కార మనగా పూర్వానుభవ ఫలితము. స్మృతిజ్ఞానమునుం గూర్చి రెండు విశేషాంశములను మనము గమనించ వలెను. పూర్వానుభూతవస్తువు లేకున్నను తదనుభవ స్మరణము కలుగును. మరియు నీస్మరణరూపజ్ఞానము మన కెన్నిసారులు కావలెనన్నను, యెప్పుడు కావలె నన్నను కలుగును. ఈస్మరణబలము దాని సంస్కార బలము ననుసరించియుండునని చెప్పుదురు. తీక్ష్ణ సంస్కారవశమున తీక్ష్ణస్మృతియు లేశసంస్కారవశ మున లేశస్మృతియు గలుగును. తదవాన్తరసంస్కార బలమున తదనుగుణస్మృతి కలుగునని ఫలితార్థము. వ్యతిరేకబోధకి మగునెడ జ్ఞానము స్మృతియందుకూడ నయథార్థత కలుగును. దీనికి కారణము స్మృతిహేతు వగు సంస్కారము దోషాక్రాన్త మగుటయే.

ఇంక ననుభవజ్ఞానముయొక్క స్వరూపస్వభా వంబు లన్ననో ఇందుకూడ జ్ఞానహేతువు దోషాక్రాన్త మైన దానంబట్టి ననుభవజ్ఞానముకూడ అయథార్థమగును. పీతశంఖానుభవమున దీనివ్యక్తతనుం జూచియేయున్నాము. కేవల ప్రత్యక్షజ్ఞానముననే కాక మన యూహాపోహల నిర్ణయించు సిద్ధాన్తములందుగూడ హేతువు ఆభాసమును పొందుటచే దానివలన ఫలించు సిద్ధాన్త మయథార్థ మగుటకూడ తటస్థించును. జలము స్పర్శవంత మనుకారణమున అది యుష్ణస్పర్శము కలదనుట. ఇచ్చట హేతువునం దాభాసమేమన్న స్పర్శవంతము లగు వస్తువు లన్నియు వేడిగ నుండ నవసరము లేదు. కాన ఉష్ణముగ నుండుటకు స్పర్శవత్త్వము కారణము కానేరదు. ఉష్ణత్వమున కగ్నితాపము కాని, ఆతపతాపము కాని కారణమన్న యాభాస ముండదు. ఇట్టి విరుద్ధకారణములకు హేత్వాభాసములని శాస్త్రజ్ఞులు నామమిడిరి. ఇం దనేకభేదము లున్నవి. వీటిం గూర్చి మున్ముందు సవిస్తరముగ పరిశీలింతము.

ఇప్పుడు మనముఖ్యోద్దిష్టవిషయమగు యథార్థానుభవజ్ఞానమును వివేకింప సావధానుల మగుదము. ఈ యథార్థానుభవమునే ప్రమయను సారవంతమగు చిన్న శబ్దముతో వ్యవహరింతురు. ప్రమ పుట్టుటకు రెండంశములు ముఖ్యములు. అం దొకటి మన మనుభవించు వస్తువు నిజమైయుండవలెను. అనగా మన మనుభవించ దలచిన వస్తువు పుస్తకమైన అది నిజముగ పుస్తకమై యుండవలెననుట. రెండవది సరియైనకారణమున మనకు పుస్తకమను జ్ఞానముకూడ పుట్టుట. ఈరెండువిషయములందును యెందు దోష ముండినను యథార్థానుభవము పుట్టదు అనగా ప్రమ కలుగదు. కాబట్టి ప్రమ కలుగుటకు ఒకవస్తువు వాస్తవమగుటయు, ఆవస్తుప్రకార జ్ఞానము పుట్టుటయు ననునవి నిర్ణీతాంశంబులు. వెండినిం జూచునప్పుడు అది నిజమైన వెండియై యుండుటచేతను, అట్టిదానిని చూచునప్పుడు వెండియొక్క జ్ఞానమే మనకు పుట్టుటచేతను, అది వెండియను యథార్థజ్ఞానము మనకు పుట్టును. అది నిజమైన వెండి కాకపోయినను కూడ మనకు వెండియను జ్ఞానము పుట్టిన ఆజ్ఞానము యథార్థము కానేరదు. అది నిజమైన వెండియే యైనను మనకుమాత్రము వెండియను జ్ఞానము కలుగక తద్భిన్నమగు మరియొక జ్ఞానము కలిగినను ఆజ్ఞానము యథార్థజ్ఞానము కానేరదు. ఈదశయందు మన కొక క్రొత్త సంశయమున కవకాశము కలుగుచున్నది. అది సంశయ విషయమే. సంశయము యథార్థజ్ఞానమగు ప్రమ యగునా, లేక అయథార్థజ్ఞాన మగు అప్రమయా. సంశయమున యథార్థాయథార్థముల సంకరమని నిశ్చయించిరి. కాన స్వరితస్వర ముదాత్తానుదాత్తస్వరముల సంకరముంబోలె నిదియు ప్రమాప్రమల సంకర మగుచున్నది. నిశ్చయజ్ఞానభాగము ప్రమ. అనిశ్చయ జ్ఞానభాగ మప్రమ. కాబట్టి సంశయము జ్ఞానాభివృద్ధికి తోడ్పడనేరదని ఫలితాంశము.

ఈ యథార్థానుభవరూపమగు ప్రమ యెన్నివిధములు, వాటికి ముఖ్యకారణము లేవేవి? వాటి సాధన సామగ్రు లేవేవి? అవి యెట్లుకలుగును? ఈప్రమను మూడువిధములుగ వివేకింపవచ్చును. అందు మొదటి విధము మనయింద్రియములద్వారా మన మనుభవించు అన్వయజ్ఞానము. ఇంద్రియములనేత్రశ్రోత్రాదులు. ఇవి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనోతిరిక్తంబులు అయిదు. నేత్రముఅనగా కన్ను; శ్రోత్రము అనగా చెవి; రసనము అనగా నాలుక; ఘ్రాణము అనగా ముక్కు; త్వక్కు అనగా చర్మము. ఈ యింద్రియముల సహాయమున మన కొక్కవిధమగు ననుభవము సిద్ధించును. ఈయనుభవమునకు ప్రత్యక్షమని పేరు. ఇది యొకవిధమగు ప్రమ. ఇంక నొకదానియందు నొకానొక కారణమునుంబట్టి ఆకారణముతో నిత్యసంబంధముకల మరియొక విశేషమును సాధింతుము. పర్వతమున ధూమమును జూచి వహ్నిధూమములకు గల సంబంధజ్ఞానసహాయమున పర్వతమునందు వహ్ని (అగ్నిహోత్రము) యున్నదని సాధింతుము. ఇట్లు సాధించిన జ్ఞానముకూడ ప్రమయే. ఇది మరియొక విధమగు ప్రమ. దీనికి అనుమితియని పేరు. ఈ రెండు విధములకంటె వేరగు మరియొకమార్గమునం గూడ జ్ఞానమును సంపాదింపవచ్చును. ఈ మూడవ విధమునకు శాబ్దమని పేరు. శాబ్దమనగా శబ్దమువలన కలిగినది. శబ్దమనగా నాప్తవాక్యమని యర్థము. ఆప్తుడనగా యథార్థవక్త. ఈ యథార్థవక్తృత్వనిర్ణయము మన మనోనిశ్చితాకృత్రిమనిర్ణయము ఇట్లు ప్రమ మూడుతెరంగుల మనచే సాధించబడును.

ఇందు శాబ్దము ప్రమయగునా యను సంశయము కొందరకుం గలుగును. ఈ సంశయమునకు బీజము యథార్థవక్తల నిర్ణయించుటయందలి సంశయజ్ఞానమే. కాని శాబ్దము ప్రమయని యంగీకరించుటయే కాక మనము లెస్సగ జాగరూకతతో విమర్శించినయెడ మనము చేయు జ్ఞానసంపాదనమునందు సగటున నూటికి తొంబదిపాళ్లు శాబ్దమయ్యే యున్నదనికూడ మన మంగీకరించవలసియుండును. దైనందినమునను మన మభ్యసించు విద్య యంతయును గ్రంథస్థమైయున్నది. దానికి సహకారి యుపాధ్యాయోపదేశంబులు. ఉపాధ్యాయోపదేశంబులేని స్వతంత్రవ్యాసంగ కన్ననో యొక నితరగ్రంథసహాయము. కాబట్టి యీగ్రంథకర్తలును, ఉపాధ్యాయులును మనకాప్తులు. వారి వాక్యరూపంబులగు గ్రంథోపదేశంబులె ఆప్తవాక్యంబులు. వాటివలననే మనకు జ్ఞానము కలుగుటను మనజ్ఞానమున చాలభాగము శాబ్దమే. ఇదికాక మరొకం డాలోచించుడు. మనప్రాచీనపురుషులు స్వానుభవముచే కొంత జ్ఞానార్జనము జేసిరి. అద్దాని వారు తమ తరువాతి తరమువారికి నొసంగ తత్సహాయమున వీరు స్వానుభవమున ఆపూర్వజ్ఞానమును కొంతయభివృద్ధిం జేసిరి. ఇట్లు తరతరములవారును పూర్వసంచితజ్ఞానసహాయమున స్వానుభవమున తరతరాభివృద్ధిగ జ్ఞానసంపాదనముం జేయుట నైసర్గికము. అట్లు కానియెడల యేతరమువారాతరముననే జ్ఞానసర్వస్వమును స్వానుభవముచే సంపాదింప శక్యమగునా? శతాబ్దముల తరబడి యభివృద్ధిపొందుచున్న జ్ఞానమునంతయు స్వల్పాయుర్దాయులగు మనుష్యులు తమ ఒక్కజీవితములో సంచితము చేయ స్వప్నమునందైనను శక్యమగునా? మనుష్యుని ఆయుర్దాయమందుకూడ నెంత నిరుపయోగకాల మున్నదో చూడుడు:

"ఆయుర్వర్షశతం నృణాం పరిమితం, రాత్రౌ తదర్థం గతం, తస్యార్థస్య పరస్య చార్థమపరం బాలత్వ వృద్ధత్వయోః; శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే."

ఇది నిర్దుష్టాభివృద్ధి విషయము. కాని ప్రపంచమునందలి ప్రతిదేశస్థులును యిట్టి యభివృద్ధి నిశ్చయముగ గలవారని మనము చెప్పలేము. అభివృద్ధిహేతువులు దోషాక్రాంతములయిన యీ జ్ఞానాభివృద్ధి కలుగనేరదు. హేతువు యెంత నిర్దుష్టమైన అభివృద్ధియు తదనుగుణముగ నుండుట సహజముకదా. కాబట్టి ఫలితాంశమేమన్నను: శాబ్దముకూడ ప్రమ యనియే మన మంగీకరింపవలసి యున్నది. ఒక చిన్న యుదాహరణము. తన జీవితమునం దెన్నడును ఆంగ్లదేశమును చూడనుపపత్తిలేనివాడు శ్రీజార్జి సార్వభౌముడు లండన్నగరమున నప్రతిహతరాజ్యతంత్రమును నిర్వహించుచున్నాడను జ్ఞానమును ఆప్తోపదేశపూర్వక శబ్దప్రమాణమున దప్ప మరొకవిధమున నెట్లు సంపాదింపగలడు.

ప్రమ మూడుతెరంగు లగుటయు ఆ విధంబుల స్వభావములను నిర్వచించితిమి. జగత్తున యేకార్యమేని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారణము లేకుండ సంభవింపదుగదా. ఈ ప్రమయను యథార్థానుభవమునకు కూడ ముఖ్యకారణ ముండవలెను. ఇట్టి ముఖ్యకారణమునే కరణమని శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు. ప్రత్యక్షప్రమ ప్రత్యక్షమను కరణమువల్లను, అనుమితిప్రమ అనుమానమను కరణమువల్లను, శాబ్దప్రమ శబ్దమను కరణమువల్లను కలుగునని సిద్ధాంతీకరించిరి. సామాన్యముగ ప్రమకు కరణమనగా ముఖ్య కారణము ప్రమాణము. కాబట్టి ప్రత్యక్షానుమానశబ్దంబులను ప్రమాణంబులని చెప్పుదురు. ఇందువలన ప్రమాణ మనగా యథార్థజ్ఞానమను ప్రమ కలుగుటకు ముఖ్యకారణ మని స్పష్టమగుచున్నది.

ఇంక నొక్కొక్క ప్రమాణమునుం గూర్చి కొన్ని ముఖ్యాంశములం దెలిసికొందము. ప్రత్యక్ష ప్రమాణ మనగా విషయేంద్రియసన్నికర్షము. ఇంద్రియములు మనోతిరిక్తంబులు నేత్ర శ్రోత్రాదు లని తెలిసికొని యున్నాము. వస్తువులు ఘన ద్రవ వాయ్వన్యతమ రూపంబుల జగత్తున లభించు పంచభూతంబుల వికృతులు. వీటికి విషయము లనికూడ పేరు. వీటిని మన యింద్రియముల సహాయమున తెలిసికొని ప్రపంచమును యథార్థముగ ననుభవించ గలుగుచున్నాము. కాని యింద్రియములు అత్యల్పములై యల్పమగు మన శరీరమున నిముడ్పబడియున్నవి. ప్రపంచమన్ననో ఆద్యంతములు కానరాకుండ దశదిశలను అనంతముగ వ్యాపించియున్నది. అనిర్వచనీయమగు నింతగొప్పప్రపంచమును సూక్ష్మములగు యింద్రియము లెట్లు గ్రహించగలవు, వాటికి జ్ఞాతృజ్ఞేయత్వ సంబంధ మెట్లు సిద్ధించునను శంకలు పొడముట సహజము. ఈ యింద్రియగ్రహణశక్తి సన్నికర్షంబులను ఒకానొకవిధమగు సంబంధముచే గలుగునని నిర్ణయించిరి. ఈ విషయేంద్రియసన్నికర్షంబుల ముఖ్యములైనవి మూడు:

సంయోగసంబంధము — దీనివలన వస్తుప్రత్యక్షము కలుగును.

సంయుక్తసమవాయ సంబంధము — దీనివలన వస్తురూపము తెలియును.

సమవాయసంబంధము — దీనిచే ధ్వని (శబ్దము) తెలుపబడును.

చక్షురింద్రియమునకుమాత్రము యీ సన్నికర్షముతోబాటు ఆలోకము అనగా వెలుతురుకూడ సహకారి కావలయును. ఆలోకసహకారిత్వము లేనియెడల చక్షుస్సు, వస్తువులనుగాని, వాటి రూపములనుగాని గ్రహించలేదు. ఇందువలననే అంధకారమున అనగా చీకటిలో మనము వస్తువులను చూడలేము. చీకటి యనగా వెలుతురులేకుండుటయే కదా.

ఇంక ననుమానప్రమాణము - ఈయనుమానశబ్దార్థమున నొక చిన్న విశేషము మనము గమనించవలెను. ఈశబ్ద మాంధ్రభాషయందు కూడ వ్యవహరింపబడుచున్నది. ఆంధ్రభాషను దీనికి సందేహార్థమున ప్రయోగములు కలవు. కాని సంస్కృతభాష నీయర్థము లేదు. ఇట్టిశబ్దంబు లాంధ్రభాషను మరికొన్ని కూడ కలవు. వీటి వ్యుత్పత్తు లింకను విమర్శనీయంబులు. అనుమాన మనగా జ్ఞానవిషయమున అనుమితి యను నొక విధమగు ప్రమకు (యథార్థానుభవజ్ఞానమునకు) ముఖ్యకారణము, లేక కరణమని యర్థము. ఈ యనుమానమును స్వార్థప్రయోజనము కలదానినిగా గాని, పరార్థప్రయోజనము కలదానినిగా గాని మనము వివేకింపవచ్చును. స్వార్థంబున అనుమానము స్వమనోనిష్ఠితం బగుటను అవయవవాక్యశుద్ధి సంపూర్ణత లేనిది యగును. పరార్థంబున నన్ననో తానొకనికిం జెప్పవలసిన దగుటచే నందు అవయవవాక్యంబు లయిదును సంపూర్ణముగ నుండవలెను. పరునికై యుద్దేశించిన అవయవసంపూర్ణతగల అనుమానమునకే న్యాయమని పేరు. ఈ న్యాయమునకు అయిదు అవయవములను భాగము లుండును. మొదటిది— మనమీ న్యాయమూలమున నేవిషయమును సిద్ధాంతీకరించ దలచితిమో దానిం దెలుపు వాక్యము. దీనికి ప్రతిజ్ఞయని పేరు. రెండవది—మనము చేయదలచిన సిద్ధాంతమునకు కారణమునుం దెలుపు వాక్యము. దీనికి హేతువని పేరు. మూడవది—ఇది మనము సాధించదలచినదానికిని, హేతువునకును గల నిత్యసంబంధమును సోదాహరణముగ తెలుపువాక్యము. దీనికి ఉదాహరణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఫాల్గునమాసము
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మని పేరు. నాల్గవది—అట్టి సంబంధము మనము సాధింపబోవు స్థలమునందుకూడ గలదను వాక్యము. దీనికి ఉపనయనమని పేరు. అయిదవది—మనము సాధింపవలసినది యీ స్థలమందుకూడ గలదనుచు ప్రతిజ్ఞావాక్యమును సిద్ధాంతముచేయువాక్యము. దీనికి నిగమనమని పేరు. ఇట్టి పంచావయవపూర్ణత గలిగిన న్యాయమునకు ఒక యుదాహరణమును వినుము.

౧. పర్వతము అగ్నిహోత్రము కలది-ప్రతిజ్ఞ.

౨. ధూమము కలిగియుండుటచే-హేతువు.

౩. ఎచ్చటెచ్చట ధూమముండునో యచ్చటచ్చట అగ్నియుండును - వంటయింటియందువలె - ఉదాహరణము.

౪. ఆప్రకారముగానే పర్వతమందును - ఉపనయము.

౫. కాబట్టి పర్వతము అగ్నిగలది-నిగమనము.

ప్రతిన్యాయమునను యీ అయిదుభాగము లుండవలెనని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి.

న్యాయమునకు ప్రాణమువంటిది హేతువు. హేతువనగా కారణము. కారణమునందు దోషముండిన నిగమనము యథార్థము కానేరదు. ఈ హేతుదోషములకే హేత్వాభాసంబులని పేరని పైన తెలిసికొనియున్నాము. ఈ హేతుహేత్వాభాసంబుల ప్రపంచమందలి ముఖ్యాంశము లేవనగా:—కారణము అన్యథాసిద్ధిశూన్యమై నియతపూర్వవృత్తిత్వము కలిగియుండుట; అన్యథాసిద్ధి యనగా మనము కారణముగా చెప్పునది మరియొకమోస్తరయినను కార్యము సిద్ధించుననుట. ఇట్టిస్థితి లేకపోవుట యన్యథాసిద్ధిశూన్యత యనబడును. కారణ మగుటకు ఇది యొక ముఖ్యగుణము. ఇట్లనే కార్యము కలిగినప్పుడెల్ల కారణము దానికి పూర్వవర్తియై యుండవలెను. ఇదియే నియతపూర్వవృత్తిత్వము. ఇదికూడ కారణమగుటకు ముఖ్యగుణమే. ఇట్టిగుణములు కల కారణము మూడువిధములై యుండును. సమవాయికారణమనియు, అసమవాయికారణమనియు, నిమిత్తకారణమనియు. ఏద్రవ్యములు ఒకకార్యము కలుగుటకు కారణము లగునో అవి సమవాయికారణము లగును. ఆ ద్రవ్యములందలి గుణములును, కర్మలును అసమవాయికారణము లగును. ఈ రెంటికన్న భిన్నమైన కారణము నిమిత్తకారణము. ఇందుల కుదాహరణము — బట్టకు తంతువులు సమవాయికారణము. ఆనూళ్ల కూడిక (అనగా నిలువుగను అడ్డముగను ఒకదాని పైనుండియు మరియొకదాని క్రిందనుండియు కలియుట) అసమవాయికారణము. ఇంక మగ్గము, నేతగాడు, మొదలగునవి నిమిత్తకారణములు. ఇదంతయు సాధారణమగు కారణము. ఈశ్వరుడు, అదృష్టము మొదలగునవి యసాధారణకారణము లందురు. ఇవి యన్నికార్యములకు సమానమే. ఇవి యంత ముఖ్యములు కావు.

అన్యథాసిద్ధులు అనేకవిధముల నుండును. కుండవిషయమున కపాలత్వమును, దండత్వమును, ఒక అన్యథాసిద్ధి. దండరూపము మరియొక యన్యథాసిద్ధి. ఆకాశము మరియొకవిధము. ఆకుండ చేయు కుమ్మరివాని తండ్రి ఒకయన్యథాసిద్ధి. కుండను చేయుచుండగా ఆ సమీపమున యుండిన గాడిదె మరియొక యన్యథాసిద్ధి. ఇందొక్కటి మరియొకవిధముగ మారినను మన కార్యరూపమగు కుండ కలుగుటకు యాటంకముండదు. కావుననే యివి యన్యథాసిద్ధు లనబడుచున్నవి.

ఇంక హేత్వాభాసంబులు. కారణము దోషాక్రాంతమైన హేత్వాభాసము పుట్టును కదా. హేత్వాభాసంబులు వాటి యవాంతరభేదంబులతో కలసి యనేకవిధంబులనుండు. కారణము సాధ్యాభావమందు (అనగా సాధింపవలసినది యుండకూడనిదానియందు) కూడ వర్తించుట ఒక హేత్వాభాసము. పర్వతము గోచరించు పదార్థమగుటచే దానియం దగ్ని యున్నదనుట. ఈగోచరించుట యను కారణము అగ్నియుండకూడని జలమందుకూడ వర్తించుచున్నది. కాన గోచరించుటయను కారణ మిచ్చట హేత్వాభాసము. ఒక్కదానియందుమాత్రము వర్తించునది దానికి కారణము కానేరదు. శబ్దము నిత్యము శబ్దమగుటచే. ఇచ్చట శబ్దమగుట ఒకశబ్దమందే వుంటచే అది దానికి కారణము కానేరదు. సజాతీయమైనగాని, విజాతీయమైన గాని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృష్టాంతమున కవకాశములేనిది కారణము కానేరదు. సర్వమును అనిత్యము మనచే తెలిసికొనదగిన వగుటచే. ఇచ్చట సమస్తము పక్షమగుటచే దృష్టాంతమునకుకూడ వేరొకటి లేదు. కాన నిచ్చట కారణము సిద్ధించనేరదు. ఇట్టి హేత్వాభాసంబులు ఒకవిధము. ఇట్టివానికి సవ్యభిచారములని నామము. సాధించవలసినదానిని కలదానియందు కారణము లేకపోవుట హేత్వాభాసము. శబ్దము గుణము. అది కంటికగబడునదవుటచే. కంటి కగపడుట యను కారణము శబ్దమునందు లేదు. కాబట్టి గుణమగుటకు కారణము కానేరదు. సాధించవలసినదానియందు తదాశ్రయవిశేషణము లేకుండుటను హేతువు నిరర్థకమగును. గగనారవిందము. వాసనగలది అరవింద మగుటచే. ఇచ్చట యరవిందము ఆకాశమందు పుట్టుట యనునది అసంభవము. కాబట్టి తన యాశ్రయమే అయథార్థము కాగా ఇంక సురభిత్వమను కారణమెట్లు? ఇట్టి హేత్వాభాసంబులు మరొకవిధము. వీటికి అసిద్ధులని నామము. ఇంకను మరికొన్ని విధములగు హేత్వాభాసములు కలవు. మార్గప్రదర్శనార్థ మిట్లు చూపించితిని.

ఇంక శబ్దప్రమాణమునందలి విశేషాంశంబు లేమన్నను, శబ్దప్రమాణము శాబ్దప్రమకు కరణము. శబ్దమన యాప్తవాక్యము. వాక్యమన పదసమూహము. పదమునకు అర్థము శక్తివలన కలుగును. శక్తి అభిధా లక్షణా రూపంబుల రెండు విధములయి యుండును. సంకేతితార్థము అభిధవల్లను సంబంధార్థము లక్షణవల్లను కలుగును. ఉదాహరణములు:

ఆవు, కుండ, నీరు మొదలగు శబ్దములకు అర్థము కేవల సంకేతమువలన కలిగినది. ఈసంకేతమును మొట్టమొదట యిడినవాడు యీశ్వరుడేయని చెప్పవలెనందురు. ఇంక రెండవదాని కుదాహరణము. యమునయందు గొల్లపల్లెయను వాక్యమునందు జలప్రవాహరూపమగు యమునానదియందు గొల్లపల్లె యుండుట యసంభవ మగుటచే యమునయం దనుపదమునకు తత్సంబంధమగు తీరార్థమును కల్పించి యమునాతీరమం దను యర్థమును చెప్పవలయును. పదములయొక్క యర్థమునుబట్టి వాక్యమునకు సముదాయార్థము చెప్పబడును.

ఈ సముదాయార్థరచన అన్వయానుగుణముగ నుండవలెను. అనగా నొకపదముయొక్క యర్థమునకును మరియొకపదముయొక్క యర్థమునకును సంబంధముండవలయును. దీనికే యాకాంక్షయని పేరు. ఆవు గుఱ్ఱము మనుష్యుడు నుయ్యి అనునది యర్థముకల వాక్యము కానేరదు. ఇట్టి వాక్యమువలన యథార్థానుభవము మనకు కలుగదు. వాక్యమునకు సముదాయార్థకల్పనయందు ఒకపదముయొక్క యర్థమునకు మరియొక పదముయొక్క యర్థము బాధకము కాకుండ నుండవలెను. ఇట్టి బాధకము లేకుండుటకు యోగ్యత యని పేరు. అగ్నితో తడుపుము యను వాక్యమున 'తడుపు' యను ధాతువు చల్లార్చుట యను అగ్నిబాధకరమగు యర్థము కలవగుటచే యీ వాక్యమునందు యోగ్యత లేదు. కాబట్టి అగ్నితో తడుపు మనునది యర్థము కల వాక్యము కానేరదు. ఇట్టి యోగ్యతలేని వాక్యమువలన యథార్థానుభవము కలుగనేరదు. మరియు, వాక్యమునకు సముదాయార్థము కలుగుటకు పదోచ్చారణమందు కాలవిలంబ ముండకూడదు. అనగా వాక్యములో ఒక పదమును యిప్పు డుచ్చరించి మరియొక పదమును మరి రెండుజాముల యనంతరమును, అటుతరువాతి పదమును అటుతరువాత మరిరెండుజాముల యనంతరమును నుచ్చరించనేరదు. విలంబములేక యుచ్చరించుటనే ఆసత్తి యందురు. కాబట్టి యాసత్తికూడ వాక్యార్థహేతువు. ఇట్లు ఆకాంక్షాయోగ్యతాసత్తులుగలవాక్యములే శబ్దప్రమాణము లగుచున్నవి. ఇవి యథార్థవక్త యగు యాప్తునిచే చెప్పబడినవికూడ కావలెనని మన మిదివరకే తెలిసికొనియున్నాము. ఇంతటితో త్రివిధప్రమాణములగు ప్రత్యక్షానుమానశబ్దములం గూర్చి ముఖ్యాంశములం బరిశీలించి వ్యాసంగము చేసితిమి. యథార్థజ్ఞానస్వరూపంబును, దాని త్రైవిధ్యమును, దానికరణంబులను ముఖ్యకారణంబులు, దాని సాధనసంపత్తియు, దాని ప్రవృత్తిమార్గంబులును బరిశీలించి వ్యాసంగము చేసితిమని ఫలితార్థ మేర్పడుచున్నది.

ఇంతటితో జ్ఞానస్వరూపవిభాగంబుల చర్చనం జాలించి ఇంక దాని ప్రస్తుత కాలీన సాధనోపాయంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లందలి మంచిచెడ్డలను, తద్వినియోగమునందలి సదసన్మార్గవివేచనములును పరిశీలింతము. ఈవిషయములు రెండును జ్ఞానస్వరూప విషయముకంటె తదాచరణ మార్గబోధకంబులగుటను అంతకంటె ప్రాధాన్యములు. ప్రతిమనుజునకును అనగా మానుషసృష్టియందలి అట్టడుగు సోపానస్థులగు కొండకోదు జాతివాడు మొదలు అత్యున్నతసోపానస్థుడగు ఆర్యుని వరకును తన జీవయాత్రను సారవంతముగను జయప్రదముగను జరుపవలెననియు, దీనిముఖ్యసహకారి జ్ఞానమనియు, తదార్జనము మనుష్యజీవితముఖ్యకృత్యంబుల నన్యతమ మనియు తెలిసి తత్కుతూహలముకలవాడై అందుననే తనసంతానమునకు బాల్యమునుండియు విద్యాభ్యాసము చేయించవలయునని ప్రయత్నించుట సహజధర్మమై యుండుట మనము చూచుచున్నాము. ఈ విద్యాభ్యాస ప్రయత్నంబున కనుగుణసహకారమార్గంబు లేవి, వాటి సార్థకత యెట్టిది, యెంతవరకు? ఈవిషయికంబులగు ప్రాచీనకాలమార్గంబులు ప్రస్తుతానుపయోగంబులగుటను తద్విన్యాసము కేవలేతిహాసిక కుతూహలైక ప్రయోజనంబులని దానిని ప్రస్తుతము విడచిపెట్టుదుము. ప్రస్తుతోపయోగంబులగు ప్రస్తుతమార్గంబులం గొంత విమర్శించి వాటి మంచిచెడ్డలం దెలిసికొందము. ప్రస్తుతకాలమున విద్యాదాయకంబులు పాఠశాలలు కదా. ఇవి ప్రారంభపాఠశాలలనియు, మాధ్యమికపాఠశాల లనియు, ఉన్నతపాఠశాలలనియు, కళాశాలలనియు, విశ్వవిద్యాలయములనియు వివిధములుగ యథానుకూలంబులను నూహతో నిర్వహింపబడుచున్నవి. వీటియందే మనుష్యుని జ్ఞానకాంక్షా శ్వేతశిల (అనగా చలువరాయి) తనఖనిజజనితవిరూపతను పోగొట్టుకొని తనకు రూపకల్పనముంజేయ తాను సానపెట్టబడి తేజోవంతమగు తళతళ్యమును బడయనున్నది. కాని యిట్టి తళతళ్యము మాత్రము మనకు దృగ్గోచరమగుట కానరాకున్నది. ఈవిశాలశాలకుం జని మనము ప్రశ్నించితిమేని అందుండు భృతకవర్గమువారు జ్ఞానమన్న భాషావతారమందురు. ఇంక పురాణము, జ్యోతిషము, వైద్యకము, గణితము, వేదాంతము మొదలగు గంభీర శబ్దములనెన్నియో మనశ్శ్రోత్రపథమున ధ్వనింతురు. ఇవన్నియు బాలురధ్యయనము చేసినం— (వాటి యుపయోగమిసుమంతయైనను అధ్యయితాధ్యేత లుభయులును తెలిసియో తెలియకయో)—పాండిత్య పూర్ణత వహింతురందురు. ఇంతకును తచ్ఛాస్త్రముల కృత్యసముద్దేశోపయోగముల దెలసినవా రెవరునుం గానరాకున్నారు. లేశమైనను తచ్ఛాస్త్రముల యభివృద్ధిం జేసినవారు కాని కనీసము అం దభిలాషనుం జూపువారు కాని కానరాకున్నారు. వీరి పాండిత్యపూర్ణతయొక్క నిర్వహణత యేమో యగమ్యగోచరముగా నున్నది. తన జీవితకాలమున తనలోకయాత్ర నుత్కృష్టముగను, యశోవంతముగను, మార్గదర్శిగను జేయంజాలని విద్యాకృషిని జ్ఞానసంపాదనమని వచించుటకు మనము సంకోచపడవలదా? ఈ జ్ఞానప్రళయమునకు కారణము లేకపోలేదు. ఇందు దోషము తత్స్థాపక తత్పరిపాలక బృందాశ్రితమై యుండును. ఎంతకాలమువరకు ప్రపంచకములోని మనుష్యజాతి కంతకును ఇహపరైకసాధనభూతమగునట్టియు, నీ యత్యుత్కృష్టం బగునట్టియు జ్ఞానముయొక్క అభ్యాసవిధి ప్రజాప్రాతినిధ్యనిర్వహణమునకు నర్దెగాండ్లగు వేతనోపజీవుల (వారు గ్రంథకర్తలే కానిండు, శాస్త్రవేత్తలే కానిండు, శాస్త్రోపాధ్యాయులే కానిండు, రాజ్యతంత్రనిర్వాహకులే కానిండు, పత్రికాప్రకాశకులే కానిండు, మతబోధకులే కానిండు యెవరేనికానిండు.) యధీనమై యుండునో అంతవరకు నీదుర్దశకు మోక్షోపాయ మొండులేదు. వారి జీవనోపాధి భంగమననము పెనుభూతమై వారిని సర్వకాల సర్వావస్థలయందును ఆశ్రయించియుండు. కాన వారు స్వాభిప్రాయకుశలు లెన్నటికిని కానేరరు. ఎప్పుడు వారు పరప్రత్యయనేయబుద్ధు లగుదురో, వారియొక్కయు, వారిబుద్ధియొక్కయు యోగ్యత విషయమై చెప్పవలసిన దేమున్నది? దేశక్షేమ ప్రజాక్షేమోపాయ మననముకంటె వారికి ప్రజానునయ ప్రజారంజక మననములే ముఖ్యోద్దిష్టములై యుండును. లేనిచో వారు తిరిగియు యథోత్సాపద(?)ప్రాప్తులగుట దుర్లభముకదా! దాని ఫలితములుకూడ తదనుగుణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోగ్యములుగనే యుండును. కెమెస్ట్రీపండితుడు రాజకీయ-అకౌంటెంటు ఉద్యోగిగను, లాపండితుడు పాఠశాల సహోపాధ్యాయుడుగను, మేథమేటిక్సు పండితుడు హిస్టరీ రిసెర్చివర్కునందు ప్రముఖుడుగను నుండుట సర్వసులభముగ నుండును. ఈవిషయమున నెంతేనియుం జెప్పవచ్చును గాని మార్గప్రదర్శకముగ నిట్లు చూపితిని. కాలవిలంబమున కవకాశము లేనందున యింక జ్ఞానసంపాదనమునకు అధికారు లెవరో అందలి నియమము లేవియో యను విషయమునకు మన యీ వ్యాసంగమును మళ్లింతుము.

మానవసృష్టియందుకూడ యితరసృష్టియందంతను వలె నైసర్గికద్వైవిధ్యము కలదు. ప్రకృతివిశేషమున స్త్రీపురుషవ్యక్తులు రెండుకదా. ఈ వ్యక్తిద్వయము నందును స్వభావసిద్ధమగు న్యూనాధికత లేదు. ఈ విషయమును సృష్టియొక్క నిర్మలనిష్పక్షపాతత్వమే సహస్రముఖముల చాటుచున్నది. స్త్రీ పురుష ధర్మ నిర్ణయములను మనము బాగుగ పరిశీలించినచో పురుషుని ధర్మంబులం దొక్కొకదానికిని సహకారి యగు తుల్యధర్మము స్త్రీధర్మములందు కూడ మనము చూతుము. కాని పురుషునకు దేనిదేనియం దధికారముకలదో స్త్రీకినికూడ వాటివాటియందు సమానాధికారమున్నది. ఇది నైసర్గికము. కాబట్టి స్త్రీకికూడ విద్యాభ్యాస జ్ఞాన సంపాదనములందు పురుషునితో తుల్యమగు నధికారము కలదనుటకు సందేహమువలదు. ఇట్టియెడ వారికి కొంత పక్షపాతము ప్రస్తుతకాలానుభవములను బట్టి కొంతకాలమునుండి జరుగుచున్నదని చెప్పకతప్పదు. ఇట్టిపక్షపాతమీ యబలాజనమునకే కాకుండ పురుషులలో కూడ అత్యల్పసంఖ్యాకులుకాక మిగిలిన ప్రజాబాహుళ్యమున కంతటికికూడ బహుకాలమునుండియు ప్రాప్తించియున్నది. ఇందుకు హేతువులను అనేకు లనేక విధంబుల విన్యాసము చేయుదురు. నావినయపూర్వకాభిప్రాయ మేమన్నను ఆపక్షపాతము కాలానుగుణమనియు, అప్పటి స్థితిగతులకును ఊహాపోహలకును అనుగుణమగుటను ఆకాలమున నావ్యపదేశముకాని తద్వ్యవస్థాపకులుగాని నిందకు పాత్రులు కాలేరని మనము చెప్పవలసియుండును. ఈమనకాలములోని నిరువదవ శతాబ్దములోనే వర్ణవ్యవస్థ చారిత్రనైర్మల్యమును నణఁగ ద్రొక్కి- పుట్టుకనుబట్టి నిర్ణీతవ్యవస్థకల దనుచుండఁగా అట్టి ప్రాచీనకాలమున స్వాతిశయమే గౌరవహేతువను సిద్ధాంతముతో మెలఁగుచుండినవారు నిందార్హు లెట్లగుదురు? ఆకాలమున సంఘమన్న తన రక్తమునకు సజాతీయమగు రక్తము శరీరమునం గలవారికూడిక యనియే యభిప్రాయపడుచుండిరి. అట్టియెడ స్వేతర వర్ణంబువారలం దమతో తుల్యముగ పరిపాలించుట కవకాశమెట్లుండును? కాలక్రమమునం దనభిప్రాయము సరళమగుటను సర్వసమత్వమే పరమధర్మముగా నాచరించు మనకాలమున నది పక్షపాతవ్యపదేశమని తోచక మానదు. కాన మనము అత్యల్పసంఖ్యాకులను నిందింప జనదు. అయినను వీరు రెండవవిషయమున ననగా స్త్రీవిద్యావిషయమున నిట్టి క్షమాపణకు అర్హులు కానేరరు. వీరి దౌర్జన్య మచ్చటమాత్రము సుప్రసిద్ధము. జన్మముచేతను, బుద్ధిచేతను, సత్వముచేతను, కర్మచేతను, ప్రవర్తనముచేతను, ఆచార వ్యవస్థచేతను, సంఘజీవనానుగుణ్యతచేతను, యింక ననేక విధములచేతను మన కర్థాంగులనదగిన వీరి నింత యధోగతిని నుండునట్లు వర్ణాశ్రమధర్మముల మార్చివేయుట కేవలము పురుషుల మహాపాతకబుద్ధి యనకతప్పదు. వారు మాతృదేవత లనియును కల్పించినమాత్రమున వారు తమకుం బానిసలు కావలెనే. తమ సదసద్వివేచనాహీన మగు వాక్కులను వారు శిరసావహించవలెనే తా మెంత మూర్ఖులైనను వా రెంతబుద్ధిమంతు లయినను, వారు తమ మూర్ఖతను పూజించవలెనే. ఈ చర్యలయందు యిసుమంతయైనను వివేక మున్నదని చెప్ప సాహసింపగలమే.

కాబట్టి స్త్రీలనుంగూడ పురుషులతో సమానముగ విద్యాభ్యాసప్రయత్నంబుల నిర్మించుటయే బుద్ధికి లక్షణమై యున్నది. ఇంక నెన్నియో దోషారోపంబులు యీ స్త్రీవిద్యాధికార విషయమై చెప్పుదురు. కాని విద్య యొకరికి మంచి నొసంగి మరియొకరికి చెడుగు నొసంగునే. ఇట్లనుకొనుట యవివేకము-కాదా? ప్రత్యేకము విమర్శించదగిన స్వతంత్రవిషయ మగు నీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చర్చ నింతటితో ముగించి యింక మన వ్యాసంగము నుపసంహరించెదము.

ఈ యుపన్యాసము నుపసంహరించుటకు పూర్వము జ్ఞానవిషయకమగు నొక చిన్న విషయమును జెప్పి మరియు నుపసంహరించెదను. ఇదియే మతవిషయకజ్ఞానము. మతమునుగూర్చి జ్ఞానము యథార్థమగునా లేదా యను విషయమున Frances Wright అను నామాంతరము కల అమెరికాఖండములోని సంయుక్త రాష్ట్రములలో నొక విదుషీమణియొక్క వాక్యములనే చదివి వినిపించుట నానోటిమాటలకన్న యత్యుత్కృష్టముగ నుండునను నుద్దేశముతో నీక్రింద నా జ్ఞానశాలి యొక్క వాక్యములనే పొందుపరచెదను.

1 "మీ మతాచార్యులనుండి మీరు సంపాదించు జ్ఞాన మెట్టిదని వారిని ప్రశ్నింప వేడెదను. ఆ జ్ఞానము విశ్వాసరూప మైనదని వారు సమాధానము చెప్పుదురు. విశ్వాస మనగా యగోచరపదార్థవిషయక జ్ఞానమని కూడ వారు నుడివెదరు. అట్టిజ్ఞాన ముండగలదా యని విచారింపుడు. జ్ఞాన మనుభవమని మన మొప్పుకొంటిమి.

---

1. I must entreat you to inquire what the knowledge is that you learn from your spiritual teachers. "The knowledge is faith" they will answer for you. "And faith" they will add "is the knowledge of things unseen." Can there be any such knowledge? I put it to your reason. Knowledge we have shown to be ascertained facts. Things unseen! Can human understanding know anything about them? More will I ask, could it be of any utility were even such knowledge possible? And do you hire teachers to teach you non-existant knowledge, impossible knowledge, and knowledge, which even under the supposition of its possibility could serve no conceivable purpose? We are on earth and they tell us of heaven; we are human beings and tell us of angels and devils; we are matter and they tell us of spirit; we have five senses whereby to admit truths and a reasoning faculty by which to build our belief upon them, and they tell us of dreams dreamed thousands of years ago which all our experience flatly contradicts.

* * *

Now let us see where, in the table of knowledge, we may class religion. Of what part or division of nature or material existence does it treat? What bodies or what properties of tangible bodies does it place in contact with our senses and bring home to the perception of our faculties?

It clearly appertains not to the table of human knowledge, for it treats not of object discoverable within the field of human obser vation. "No, "will you say, "but its knowledge is superhuman, unearthly—its field is in heaven."

My friends, the knowledge which is not human is of slippery foundation to us, human creatures. Things known constitute knowledge; and here is a science treating of things unseen, unfelt, incomprehended! Such cannot be knowledge. What, then, is it? Phrobability? Possibility? Theory hypothesis? tradition? written? spoken? by whom? when? where? Let its teachers —nay, let all earth reply!

* * *

But, what sights, oh humankind, appeal the heart! The rivers of earth run blood! Nation set against nation; brother against brother! Man against companion of his bosom; and that soft companion, maddened with the frenzy of insane remorse for imaginary crimes, fired with the rage of infatuated bigotry or subdued to diseased helplessness and mental fatuity, renounces kindred, flies from social converse and pines away a useless or mischievous existence in sighings and tremblings, spectral fears, uncharitable feelings and bitter denunciations! Such are thy doings, oh religion.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అగోచరపదార్థములు మనుష్యబుద్ధికి విషయము కాగలవా? మరియు నట్టిజ్ఞానము సంపాదింప శక్యమైనను మనకె ట్లుపకరించును. అట్టి మిథ్యాజ్ఞానమును, సంపాదించుట కవకాశము లేని జ్ఞానమును పొందగలిగినను నిరుపయోగకరమైనట్టి జ్ఞానమును బోధించుట కుపాధ్యాయుల నేర్పాటుచేయుట న్యాయమా? మనము భూలోకమున నున్నారము, వారు స్వర్గలోకమును గురించి బోధించెదరు. మనము మనుష్యమాత్రులము; వారు దేవాసురులను గురించి బోధించెదరు. మనము ప్రకృత్యంతర్భాగులము, వారు జీవమును గురించి బోధించెదరు. మనము ప్రమాకరణములగు నింద్రియములను వాటి నాధారముగా జేసికొని సిద్ధాంతముల నేర్పరచుటకు బుద్ధిని గలిగియున్నాము, వారనేకవేల సంవత్సరములకుపూర్వ మనుభవింపబడి మన యనుభవములకు విరుద్ధములైన స్వప్నములనుగురించి యుపదేశించెదరు.

* * * *

జ్ఞానవిభాగమున మతమును మన మెచ్చట చేర్చగలమో యొకింత యాలోచించి చూతము. ప్రకృతియొక్క యేభాగము దానికి విషయము? ఏపదార్థములను లేక గుణములను అది మనకు యింద్రియగోచరముచేసి జ్ఞానవిషయము చేయుచున్నది.

అది జ్ఞానవిభాగమున చేరునది కాదు. మానవుల యనుభవవిషయములను పదార్థములను విషయముగా కలది కాకపోవుటయే దీనికి కారణము. "అవును, అజ్ఞాన మమానుషము, ప్రపంచాతీతము, పారలౌకికము"ని మీ రందురు.

అమానుషమగు జ్ఞానము మనుష్యులకు నిరుపయోగము. ఇంద్రియగోచరములగు పదార్థములే జ్ఞానమనబడుచున్నవి. ఈశాస్త్రము (మతము) అగోచరపదార్థవిషయకము. ఇట్టిది జ్ఞాన మనుపించుకొనదు. అట్లయిన నిదేమి యందురా—సంభావ్యము? కల్పన? ఊహ? సంప్రదాయము? లిఖితము? ఉచ్చారితము? ఎవరిచే? ఎప్పుడు? ఎక్కడ? తత్ప్రవర్తకులు, లేక ప్రపంచమునం దెవరైనను ప్రత్యుత్తర మిత్తురుగాక.

* * * *

ఓ మానవులారా, యెట్టి దృశ్యములు మన హృదయములను భేదించుచున్నవి! రక్తము మనుసులు కట్టుచున్నది! ఒకజాతి మరియొకజాతి నెదురొ్కను చున్నది; సహోదరుడు సహోదరునితో పోరాడు చున్నాడు! మనుష్యుడు తన ప్రేయసి నెదురొ్కను చున్నాడు; ఇది కృతకపాపపశ్చాత్తాపోన్మత్తులై మూఢవిశ్వాసముచే నసహాయులై బంధువులను విడచి సంఘసంవ్యవహారమును విడచి తనజీవనమును నిరర్థకపరచి, విచారమువలనను, భయమువలనను తనకు తగని తలంపుల వలనను నిజనిందవలనను క్షీణించును. ఓమతమా, నీచేష్ట లిట్టివి!"

ఇంతటితో మన యీజ్ఞానవిషయకవ్యాసంగము పరిసమాప్తము. ఇందుండు గుణములను గ్రహించుటయే కాక వాటిని ఆచరణయందుంచుచు మన యీవ్యాసంగమును ఫలవంతముగను యథార్థతగలదానిగం జేయుదురుకాక! యథార్థతయే సత్యస్వరూపముగదా!

సత్యమేజయప్రదము. సత్యమే జయప్రదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధి లేక జ్ఞానము

- అనుభవము
  - యథార్థానుభవము లేక ప్రమ
    - ప్రత్యక్షము కరణము
      - ప్రత్యక్షము
        - చాక్షుషము
        - శ్రావణకము
        - ఘ్రాణజము
        - రాసనము
        - స్పార్శము
    - అనుమితి కరణము
      - అనుమానము
        - స్వార్థము
        - పరార్థము
          - ప్రతిజ్ఞ
          - హేతువు
          - ఉదాహరణము
          - ఉపనయము
          - నిగమనము
    - శాబ్దము కరణము
      - శబ్దము
        - ఆసత్తి
        - ఆకాంక్ష
        - యోగ్యత
          - అభిధ
          - లక్షణ
  - అయథార్థానుభవము లేక భ్రమ
    - విపర్యయము.........మతజ్ఞానము
    - సంశయము
- స్మృతి
  - అయథార్థము
  - యథార్థము

---



మిశ్రప్రకృతి                    —యన్. శంకర సుబ్రహ్మణ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నీలాపనింద

శ్రీమతి కామేశ్వరమ్మ, బి. ఏ.

౧

మాలతీమోహనులవివాహమై అప్పటికి ఆరునెలలు కావచ్చినది. వారిరువురు అతిఅన్యోన్యానురాగముతో నుండిరి. మోహనుడు బి.ఏ.,బి.ఎల్. ప్యాసై బరంపురమునందు న్యాయవాదిగా వుండెను. అత్యవసరమగు నొకకేసుమీద మద్రాసువెళ్లి అప్పటికి వారము దినము లైనది. మాలతి దినమొకయుగముగా గడుపుచు ప్రతిపోష్టుకు ఎదురుచూచు చుండె. ఆనాడు రాత్రి మెయిల్లో వచ్చుచున్నానని మోహనుడు తంతిపంపె. మాలతి నిమిషములు లెక్కపెడుచూ గడియారము వంకనె చూచుచు రాత్రియగువఱకు కాలమెట్లో త్రోసిపుచ్చి మెయిలువేళకు తాను, ఇంట వంటఏర్పాటులుచేసి రైలుకు పోయినది. సిగ్నల్ ఇచ్చిరి. మాలతికి గుండె తటతట కొట్టుకొనసాగె. ఆత్రమెచ్చెను. ఇంతలో రైలు దుముకుచు ప్లాటుఫారంమీదకు వచ్చి నిలచెను. వెతుకుకొనకుండగనే మోహనుడు ఆమె కెదురుగ నిలచినపెట్టెలోనె తలుపుతెఱచుకు నిలబడి, రైలు ఆగినతక్షణం వురికి భార్యబుజము తట్టినాడు. ఇద్దరకూ అపరిమితానందము కల్గి, సామానులు తీసుకుని కారెక్కి ఇల్లుచేరిరి.

భోజనము సల్పినపిమ్మట ఇద్దరు డ్రాయింగుహాలులో కూర్చొనిరి.

మోహనుడు:—మాలతీ, నీవెట్లుంటివో కాని నాకుమాత్రము ఆదరిద్రపు చెన్నపట్నంలో నిన్ను వదలివుండుట యమలోకమువలె వున్నది. రాత్రిఅయితే నిద్రరాదు. కోర్టులో వున్నంతసేపూ ఏమో, హోటలుకువస్తే నీమీదే ధ్యాస్నం. మనమిద్దరమూ పోయిన ఎంత చక్కగా కాలము గడపెడివాళ్లమోను. ఇన్నాళ్లు వుండవలసి వచ్చునని మొదట నే ననుకొనలేదు.

మాలతి:—అంతా దొంగమాటలే. మద్రాసులో సినీమాలులేవా, బీచ్ లేదా, స్నేహితులులేరా? రోజూ ముందులాగు క్వీన్ మేరీకాలేజీబీచికి పోయ్యేవారా?

మోహను:—చెబితే నమ్మవు. ఒక్కసారైనా ఆపక్కపోలేదు. ఏమి చూడను ఇష్టము లేకపోయినది. ఇంకమీద వంటరిగా పోగూడదు. మనమిద్దరము పోవలెను. అయితే మీవాళ్లూ మానాన్నా అంతా క్షేమమా? నీవెందు కింతచిక్కివున్నావు?

మాలతి:—మీకంతేనా? పరదేశమెళ్లి హోటలుతిండి తిని మీరు చిక్కివున్నారుగాని నాకేమీ, లెండి, ప్రొద్దుపోయింది నిద్రవస్తోన్నట్లున్నది.

౨

నరసింహారావుగారు ఆపూరిలో చాల సంవత్సరములు లాయరుగావుండి బాగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆస్తిసంపాదించి కొడుకు పట్టాపుచ్చుకొన్న దగ్గఅనుంచీ ఇంట్లోనే స్వంతవ్యవహారాలు, వడ్డీలు, సడ్డీలు చూసుకుంటూవున్నాడు. సింగరాజు లింగరాజులాగు మహాపిసినారి. నాలిక పీక్కున్నా దానం ధర్మం లేదు. అతి కోపిష్టి. స్వలాభి ఆయనకు భార్య చాల కాలంక్రిందటనే కాలంచేసింది. అయితే ఒక కొడుకూ, కూతురూ వుండుటచే తిరిగి వివాహం చేసుకోలేదు. మోహానుడు పెద్దవాడు. కూతురు లీల. ఆమె కొంతవఱకు చదివి, తన ఉపాధ్యాయుని వలచి ఆయనను పెండ్లి చేసుకోదలచినపుడు, తండ్రి వేరుకులమని కూతురికి పెండ్లికి అనుజ్ఞ ఇవ్వక చాలా తిప్పలుపెట్టెను. కాని జ్ఞానము తెలిసిన బిడ్డ ధైర్యశాలి అగుటచే తండ్రి మూర్ఖత్వము గ్రహించి, స్వతంత్రించి తానుకోరిన ఆయననే పెండ్లి చేసుకొానెను. అప్పటినుండియు తండ్రికి కూతురుకు కంటచూపుగాని నోట మాటగాని లేదు. తరువాత మోహానుని వివాహమునకు మాత్రము అంతఎక్కువ ఆటంకపెట్టలేదు.



"అయితే మీవాళ్లూ......నీవెందు కింత చిక్కివున్నావు ?"

మరునాడు ఉదయము మోహానుడు కాఫీ తాగి తండ్రినిచూచుటకు వెళ్లెను. ఇద్దరూ చాలా సేపుమాట్లాడుకొనిరి. కొంతతడవైనవెనుక మోహానునిముఖవైఖరి మారి కలత చెందినట్లుండె. వెంటనే తిరిగి ఇంటికివచ్చె.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాలతి కారుచప్పుడు విని ఎప్పటిఅట్ల ఎదురగా రాగా, మోహను డామెవంకకూడ చూడక చివాలున తనగదిలోనికి పోయెను. మాలతికి భయము ఆశ్చర్యము కలిగి మెల్లిగా భర్తవద్దకు పోయి, ఎందుల కట్లుండెనని అడిగె.

మో:—నీవు నాదగ్గఱ ఆటలాడుచున్నావా? నీవు నే నూరలేనపుడు చేసిన దొంగపని బయల్పడినది. ఇంతతుంటరివని ఎన్నడును అనుకొనలేదు. చదువుకొన్నవాళ్ల కిల్లాంటిబుద్ధివుండ నని వూరికే నానా ప్రజలు చెప్పకొనేది. నేటితో మనస్నేహాము సరి. నీవిక మీతలితండ్రులవద్దకు పొమ్ము.'

అని చివాలున లేచి మాట్లాడ ప్రయత్నించిన భార్యను విదిలించికొట్టి మోటారు తెమ్మని ఆజ్ఞాపించె. మాలతి నిశ్చేష్టయై అట్లే స్పృహతప్పి పడిపోయెను. ఆమె నట్లే కారులో వేసి అచటికి ౧౦ మైళ్లలో వున్న ఆమెపితృగృహామునకు తీసుకుపొమ్మని డ్రైవరుకు చెప్పి కారు పంపివేసెను. మాలతి ప్రేమయే లేనపుడు తనకు జీవిత మెందులకు. ఇంక సుఖమెక్కడిదని తానును నౌకరులను పంపివేసి ఇల్లు తాళమువేసి, కాశీకి లేచి పోయెను.

## 3

మాలతి మధుసూధనరావు, అచ్చమాంబగార్ల ఏకపుత్రి. లేకలేక కలిగినబిడ్డను అతిగారాబముతో పెంచి మంచివిద్యాబుద్ధులు గఱపిరి. చిన్నతనముననే పెండ్లిచెయ్యక ఇంటర్మిడియట్ వఱకూ చదివినవెనుక, ఆమె కోరికపై మోహానున కిచ్చి మహావైభవముతో పెండ్లిచేసిరి.

మధుసూదనరావుగారు వ్యాసరచయితలు; బాగాచదివినవారు. ఆయన కూర్చొని ఏమో వ్రాసుకొనుచుండగా మోటారు నిలచినశబ్దము విని బయటకువచ్చి స్పృహతప్పివున్నకూతును చేతులలో వేసుకు లోనికి తీసుకువెళ్లిరి. ఉపచర్యలు చేయగా కొంతతడవుకు ఆమెమేల్కాంచి ఎక్కువగానగవ నారంభించెను.

తలితండ్రులు ఓదార్చుచు, మెల్లిగా అల్లుడు భార్యప్రవర్తనయం దనుమానపడి ఇట్లు పంపెనని తెలుసుకొని, తా నంతయు చక్కజేసెదనని, ఏమియు భయపడనవసరము లేదని కూతురును తండ్రి ఓదార్చి ధైర్యము చెప్పెను.

ఒకప్రక్క కూతునోదార్చుచున్నప్పటికీ మధుసూదనరావుకు అల్లునిపై అపరిమితమైన ఆగ్రహము కలిగెను. అల్లునిచూచి బాగా చీవాట్లుపెట్టవలెనని అతనిఇంటికి పోగా ఇల్లు తాళమువేసివుండెను. వియ్యంకునితోనైనా చెప్పి చీవాట్లుపెట్టించవలెనని పోగా ఆయన పెడమొగముపెట్టుకు ఆహ్వానమే చేయ లేదు. కాని మధుసూదనరావు చాలాశాంత స్వభావము గలవాడు. మంచి నిదానము. కుశలప్రశ్న వేసి మోహను డెక్కడున్నాడని ప్రశ్నించెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నరసింహారావు:—మీపుణ్యమా అని నాకొడుకుకు పిచ్చిఎత్తించినారు. చెప్పకనే ఎక్కడకో లేచిపోయినాడు. గుడిసేటిపెండ్లాముతోవున్న ముప్పుకాక ఇంకేమీ? మొదటనుంచీ నేను చదువుకున్నపిల్ల వద్దు, వాళ్ల నడత తిన్నగా వుండ దనిచెప్పతోనే వున్నాను. కాని అప్పుడు నామాటలు నచ్చలేదు.

మధు:—ఆర్యా, మీరాట్టే నింద చేయకమాపిల్ల ఏమితప్పుడునడత నడచినది కొంత తెలుపప్రార్థన—తప్పున్న నేనే శిక్షించెద.

నర:—తప్పేకేమి? సానితనముకన్నానా? మొన్న మావాడు వూరలేనప్పుడు ఎవడో వచ్చి రెండునాళ్లు మేడమీద మకాం వేశాడట.అది చుట్టుపక్కలవాళ్లంతా చూచి నాతో చెప్పిరి. ఇంతకంటె అనర్థం కావాలే!

మ:—ఒకపురుషుడు వచ్చి ఇంట బస చెయ్యగానే రంకుతనమా! అతనిస్నేహితులెవరైనా వచ్చినారేమో, సంగతిసందర్భాలు సరిగా కనుక్కొని పంచాయితి పెట్టి తప్పొఒప్పొ నిర్ణయించవలెను.

నర:—చాలుచాలు, ఈఅవమానానికి తోడు పంచాయితీకూడానా! తమరు నాతో నీప్రసంగంమాని దయచెయ్యవలసినదని కోరుచున్నాను.

మ:—మీరుపెద్దలు. పిన్నవాండ్రలో తప్పులున్న చీవాట్లుపెట్టి సంసారాలు పొత్తు చేయించవలెను. ఇంతకూ మాపిల్ల నిరపరాధని నేను చెప్పగలను.

నర:—ఆ, ఆలాగె. కొంపలు తీసేకొరివి. మావాడికి ఇంకొకపెండ్లైనా చేసెదనుకాని మీపిల్లతోమాత్రము సంసారము పొసగదు.

మ:—మాబిడ్డ మాఇంటనే వుండుట మాకేమీ భారము కాదు. సత్యశీల; నిరపరాధిని. అట్టిదానిపై ఇట్టిఘోరనింద మోపి కాపురానికి నీళ్లువదలించుటమాత్రము పాపమని చెప్పుచున్నానని చెప్పి, లేచి ఇంటికి వచ్చెను.

౪

మాలతి తండ్రివద్దనుంచి సంగతంతా విని విధిని నిందించుచూ మహాదుఃఖములో మునిగిపోయెను. ఒకప్రక్క భర్తృవియోగము, మరొకప్రక్క అకారణమైన నింద వచ్చి తలపైబడినది. ఈబాధలచే అన్నము మాని కృశించిపోవుచుండెను—ఎన్నటికైనా తాను నిర్దోషియని గ్రహించి తనమోహనుడు తన కండ్లబడునా యని వాపోవుచుండె. అప్పటి కామె మూడునెలలు గర్భిణి. తల్లి ఎన్నో విధముల ఓదార్చి ఆహారము నివ్వ ఆమె దానిని ముట్టదు. ఒకనాడు పోష్టువా డొక ఉత్తరమునిచ్చె. అది మోహనుని, దస్తూరీతో ఉండ అతిఆత్రముగా విప్పి చదువగా తాను తిరిగి వివాహము చేసుకొనుచున్నానని. ఇంక తమకు పొత్తుకుదురునన్నది వట్టిభ్రమ అని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్రాసెను. అది చదివి ఆమె అట్లే మొదలు నరికినచెట్టువలె నేలగూలె. ఇంతవఱకు కొంతైనా ఆశవుండెడిది. అదికూడ విచ్ఛిన్నమైనదే అని హృదయము పగులునట్లు ఏడ్చిఏడ్చి, ఆరాత్రి భోజనములేకనే పరుండెను.

రాత్రి పండ్రెండుగంటలలో ఎవరో మూలిగినట్లు వినపడగా, మధుసూదనరావుగారు మేల్కొని కూతురుగదికి పోయిచూచిరి. అచట మాలతి స్పృహతప్పి నేలపై పడివుండె. రెండుభుజములనుండి రక్తము ధారగా నేలపై కారుచుండె. తండ్రి భయకంపితుడై గడగడ వణకు కాళ్లతో తొట్రుపాటుతో భార్యను లేపి డాక్టరును రప్పించెను. ఏమున్నది? మాలతి ఈలోకము వదలి పరలోకములో వున్నది. ప్రక్కలో కత్తికూడ అట్లే పడివున్నది. ఒకచీటీకూడ ప్రక్కనే వున్నది. అందు,

"నాజీవితము దౌర్భాగ్యజీవితము. నాకు జీవించుటకు అర్హత లేదు. నామోహనుని ప్రేమయే నాకు లేనపుడు నాకీప్రాణము లేల? నాయందెట్టినిందయు లేదని భగవంతునిఎదుట ప్రమాణము చేయుచున్నాను. కాని ఒకపురుషుడు వచ్చి నాఇంట బసచేసినది వాస్తవము. నేను నిష్కళంకను. ఆపురుషుడు లీలయొక్క భర్త. నామామకు తెలియకుండ వారిద్దరూ నావద్ద బసచేసి రాత్రిళ్లలో తిరుగుచుండెడివారు. అది ఇరుగు పొరుగువారు చూచి నేనని భ్రమించివుండవచ్చు. పుణ్యమునకుఁబోవ పాప మెదురయ్యె నాకు. నా భర్త కొంతసావధానముతో నన్నడిగిన స్పష్ట పరిచివుండెడిదానను. ఇది నాఖర్మము. నాతలి తండ్రులకు ఏకపుత్రినై ఇట్లు వారిని దుఃఖసాగరమున ముంచుచున్నందులకుమాత్రము విచారము. ఇకమీదనైనా పురుషులు స్త్రీలతో మాట్లాడిన తప్పనేభావము పోయి, విశాలమైనదృష్టితో చూచెదరుగాక! పరస్త్రీలు పరపురుషులతో మాట్లాడిననే పవిత్రత పోవునా? నాసోదరీమణులకైన నా ఖర్మము పట్టకుండుగాక!"

తలితండ్రులు రాలేఖను చదివి వాపోయి కూతురికి దహనక్రియలు సల్పిరి.

※

కొన్నిదినములైనవెనుక, ఒకనాటిమధ్యాహ్నము మధుసూదనరావుగారివాకిలి ఎవరో తట్టిరి. తలుపు తెఱువగానె మోహనుడు చిక్కి శల్యమైనల్లబడి, పిచ్చివానివలె వచ్చి మామగారి చేతులుపట్టుకుని "నామాలతి ఎక్కడ. నేనిన్నిదినములామెను నిష్కారణముగా కష్టపెట్టితిని. నేను మహాపరాధిని. ఆమె క్షమార్పణ కోరుకొనుటకై వస్తిని." అని వలవల ఏడ్వదొడంగె.

మ:—నీవు తిరిగి వివాహముచేసుకొనెదనని వ్రాస్తివిగదా?

మో:—నేనెవ్వరికి ఏమీ వ్రాయలేదు. హిమాలయపర్వతాలలో పడి తిరుగుచున్నాను. ఆసంగతి నాకేమీ తెలియదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ:—బహుశః నీతండ్రి వ్రాసివుండవచ్చు.

మో:—నాతండ్రి! అతను హంతకుడు. నా కాతనిమాట చెప్పవద్దు. నామాలతిని పిలువుడు—ఆమెకాళ్లపై బడి బ్రతిమాలుకొన్న గాని నాకుమనస్సు కుదుటబడదు.

మధుసూదనరావు పొంగి పొంగి వచ్చు దుఃఖము నాపుకొని మాలతివద్దకు తీసుకువెళ్లెద నని తిన్నగా శ్మశానభూమికి పిల్చుకుపోయి మాలతిని దహనము చేసినచోటు చూపి తాను వెడలిపోయెను. మోహను డచ్చ్లె క్రింద పడి దొర్లి దొర్లి ఏడ్చుచూ, చీకటి పడునంతవఱకూ అచటనే వుండెను.

మరునాటి ఉదయము మోహనునిశవము ఆచోటులో పడివుండెను. ఊరంతయు మోహనుడు ఆత్మహత్య చేసుకొనె నని గగ్గోలైనది.



"తిన్నగా శ్మశానభూమికి......దహనముచేసినచోటు చూపి"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వలసరాజ్యములందు భారతీయశిల్పకళ



## ౧. హైందవసామ్రాజ్యము

క్రీ. శ. సుమా రెనిమిదవశతాబ్దము వరకు భారతభూమి స్వతంత్ర దేశముగ సకలైశ్వర్యముల కాలవాలమైయుండెను. తమ యసమానమైననాగరికతను భారతపుత్రులు తురుష్కస్థానము, తిబెత్తు, చైనా, జపాను, చంపా (ఇప్పటిఅన్నాము), కాంభోజము (కంబోడియా), శ్యామదేశము (సయ్యాము), బ్రహ్మదేశము (బర్మా=సువర్ణభూమి?), జావా (యవద్వీపము), సుమిత్ర, బలి, బోర్నియొ, సింహళము మొదలగు దేశములకు గొనిపోయి, యాదేశజుల కాధ్యాత్మికజ్ఞానమును, మనోజ్ఞకళలను నేర్పి, వారియొక్క దైనికజీవనమునందు వాంఛనీయములగు మార్పుల ననేకములను బ్రవేశపెట్టి, మన్ననలకు బాత్రులగుచుండిరి. హిందూబౌద్ధమతములను బ్రచారము చేయుటకేకాక వాణిజ్యమునకు, రాజ్యస్థాపనమునకుగూడ నాకాలమున నిటుల మనవా రాదూరదేశములకు బోవుచుండిరి. మొదట హిందువులును, తరువాత నశోకుడు మొదలగు చక్రవర్తుల ప్రోత్సాహమువలన బౌద్ధులును బోవుటయు, ఏ రాదేశములవార్తలను జెప్ప వినినతరువాత రాజులును వెళ్లుటయు సంభవించినటుల కానవచ్చును. మతప్రచారమునకై బౌద్ధులు వెళ్లిరి కాని హిందువులు వెళ్లుటకు వాణిజ్యము ముఖ్యమైనకారణమై యుండవలెను. ఆప్రాంతములతో పరిచయము కలిగినపిమ్మట కొంద రచ్చటనే కాపుర మేర్పరచుకొనుటయు కలిగినది.

ఆకాలమున గాంధార (ఇప్పటి ఆఫ్ఘనుస్థానమునం దధికభాగము), కాశ్మీర, తురుష్కస్థాన (Asiatic Turkistan) ములు హైందవులదేశములై యుండినవి. తిబెత్తు, చైనా, జపానుదేశము లప్పటిప్రచారమువలన బౌద్ధమతమును బూర్తిగ స్వీకరించినవి. చంపా, కాంభోజము, శ్యామదేశము, బ్రహ్మదేశము, యవద్వీపము, సుమిత్ర, బలి, బోర్నియో మొదలగునవి హిందూరాజులపాలనముక్రింద వెలయుచుండినవి. ఈ దేశములందు ప్రజలందరు కాకపోయినను అధికసంఖ్యాకులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హిందూమతమునో, బౌద్ధమతమునో స్వీకరించియుండిరి.

చంపా, జావా మొదలగు దేశములను పాలించుచుండిన రాజులు హిందువులైనను, భారత దేశమును పాలించువారికి సామంతులై యుండలేదు. భారతీయప్రభువులు సైన్యములను గొనిపోయి యాదేశములను బలాత్కారముగ జయించినటుల నెచ్చటను నిదర్శనములు ప్రబలమైనవి కానరాలేదు. చైనా, జపానులందు వీరు రాజ్యాధికారమును వహింపలేదు కనుకను, బౌద్ధమతవ్యాప్తికిమాత్ర మచ్చటకు హిందూదేశపుచక్రవర్తులు ప్రచారకులను బంపుచు వచ్చుచుండిరి కనుకను మొదట నాదేశములందు రాజ్యములను స్థాపించుట కెట్టియుద్ధములను మనవారు చేయలేదనుట నిశ్చయము. మతప్రచారమునకును, వాణిజ్యమునకును వలసపోయిన భారతీయులు పలుకుబడి కలిగించుకొనినతరువాత చంపా మొదలగు ప్రాగ్దేశములను పూర్తిగ వశము చేసుకొనినటుల కానవచ్చును. ఇటుల సాధారణముగ జరుగుట చరిత్రప్రసిద్ధము.

ఆర్యులే యుత్తరధ్రువప్రాంతములనుండియో, మధ్యఆసియానుండియో, కాస్పియను సముద్రతీరమునుండియో భారతదేశమునకు వచ్చి, వింధ్యకుత్తరమున నుండు ప్రదేశముల నాక్రమించినపిమ్మట కొందరు దక్షిణాపథమునకును, మరికొందరు బర్మా, సయ్యాము, చంపా, జావా మొదలగుదేశములకు బోయిరనియు చెప్పుట కలదు. ఆర్యులు పరదేశముల నుండి రాలేదనియు, భారతదేశీయులే తూర్పుదేశమున కేకాక ఉత్తర, పశ్చిమదేశములకు బోయి, తమవిజ్ఞానమును వెదజల్లిరనియు మరి కొందరు చెప్పెదరు. ఈసమస్యా పరిష్కారమగుటకు కొంతకాలము పట్టును. నిజ మెట్లున్నను, హిందూదేశమునందు ప్రత్యేకముగ పెరిగిన విజ్ఞానచిహ్నములు ఆయాదేశములందన్నిటి యందును కనబడుచున్నవి. పండితులా దేశములను వెదకిచూచినకొలది యీ విషయమునుగూర్చి యద్భుతమైన నిదర్శనములు కానవచ్చుచున్నవి. తత్కారణమున ముఖ్యముగ తూర్పుదేశములు "హిందూ స్సామ్రాజ్యము"నకు గౌరవమైన యంగములుగ నుండినవని చెప్పవచ్చును.

తొలుదొలుత భారతీయులీతూర్పుదేశములకు నావలమీదను, భూమిమీదను ప్రయాణము చేసిరని చరిత్రకారుల పరిశోధనలు తెలుపుచున్నవి. అప్పటినుండియు భారతీయులనేకు లెడతెగకుండ పోవుచుండిరి. సుమారు క్రీ. పూ. ౫౦౦ (?) సంవత్సరముల కాలమునాడు చైనాప్రాంతములనుండియు,టిబెత్తునుండియు మంగోలుజాతివారు (?) వచ్చి కేంబోడియా, సయ్యాము మొదలగుదేశముల నాక్రమించి, నివాసము నేర్పరచుకొనిరి. వీరి నిప్పుడు మాన్‌ఖ్మేరులు(Mon-khmers), మలయదేశీయులు (Malays) అని పిలుచుచున్నారు. ఆనాటికే హిందువులచ్చట నుండిరో లేరో తెలియదుకాని కొలదికాలము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకే యీనూతనముగ వచ్చినవారును హిందూవిజ్ఞానముయొక్క యాధిక్యమును స్వీకరించిరి.

ఆదియుగములందు వెడలిన భారతీయులు కాక మరల రాజ్యస్థాపనమునకును, విజ్ఞాన ప్రచారమునకును బోయిన హిందువు లాదేశముల కెప్పుడు వెళ్లుట ప్రారంభించిరో చెప్పుటకు చరిత్రాధారములు విశేషముగ లేవు. కాని యాదేశములందు ప్రజ లిప్పటికిని చెప్పుకొనుకథలు కొన్ని చాలాకాలమునకుపూర్వమే భారతీయు లచ్చటికి వెళ్లిరని సూచించుచున్నవి. గౌతమబుద్ధుడు జన్మింపకపూర్వము శాక్యవంశపురాజు కపిలవస్తునుండి యొకసైన్యమును దెచ్చి బర్మాయందు రాజ్యమేర్పరచుకొని, ముప్పదియొకతరములవరకు పాలింపగలిగిన రాజ్యవంశమునకు మూలపురుషుడయ్యెననియు, ఆపిమ్మట గంగానదీప్రాంతమునుండి క్షత్రియరాజొకడు వచ్చి, తొలివంశపు శాక్యరాకుమార్తెను పెండ్లాడి క్రొత్త రాజ్యమును స్థాపించెననియు బర్మాదేశీయులు చెప్పుకొందురు. ఇంద్రప్రస్థపురపురాజైన ఆదిత్యవంశుడు కోక్‌త్లోక్ (Kok Thlok) అను దేశమునకు వచ్చి యాదేశపురాజును చంపెననియు, ఒకనాడీత డిసుకతిన్నెలపై విహారము చేయుచుండ నాగకన్యకను జూచి మోహించెననియు, ఆమెతండ్రియగు నాగరాజు తనయల్లుని రాజ్యము నధికపరచుటకు జలమునంతను త్రాగివైచి యంతకుపూర్వము జలావృతమైయున్న ప్రదేశమును వాసయోగ్యముగ జేసెననియు, అదియే కాంభోజదేశమయ్యెననియు కాంభోజదేశీయులు చెప్పుకొందురు. ద్రోణునికుమారుడగు అశ్వత్థామ వద్దనుండి యార్జించిన బల్లెమును కౌండిన్యుడను బ్రాహ్మణు డొకచోట బాతి యాదేశపు సోముడను నాగరాజుయొక్క కుమార్తెను బరిణయమాడి రాజ్యమును స్థాపించెనని మరి యొకకథ కలదు.

కై (Ki) అనుదేశమునబుట్టిన హుయెన్‌టుయెన్ (Houen-t'ien) న కొకదివ్యపురుషుడు బాణము నిచ్చి పడవమీద సముద్రయానము చేయుమని చెప్పినటుల కలవచ్చెననియు, మరుచటిదినమున నాతని కొకదేవాలయముచెంత విల్లు లభింపగా పడవనెక్కి ఫూనాన్ (Fou-nan) అనుదేశమును జేరెననియు ఆదేశపురాణి యగు లియొయు-ఎ (Lieou-ye) యీతని నెదిరించి, పరాజితయై భార్య యయ్యెననియు చైనాగ్రంథములం దొకకథ కలదు. హుయెన్‌టియెన్ అనగా చైనాభాషయందు కౌండిన్యుడని యర్థము. కాంబోడియారాజులు సోమకౌండిన్యవంశజులనియు, సోమవంశజులనియు, సూర్యవంశజులనియు చెప్పుకొనుట చరిత్రప్రసిద్ధము. కాన నీకథ లుత్తపుక్కిడిపురాణములు కావు. అనేకశతాబ్దముల క్రిందటనే భారతీయు లాదేశమున రాజు లైరనుట నిశ్చయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. చాకిరేవు



౨. బళ్లారి కోట

—సూర్య.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



తగని దప్పిక —పి. ఆర్. క. రావు.



తల్లితనము —యస్. శంకర సుబ్రహ్మణ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పైనపేర్కొనిన మాన్‌ఖ్మేరులు, మలయులు "యున్నను" (Yunnan) దేశమునుండి వచ్చిరట. అశోకుని మూడవకుమారునకు తొమ్మండుగురు మనుమ లుండిరనియు, వీరే నాన్చో (Nan-chao) తిబెత్తు, చైనా, అన్నాము మొదలైనదేశీయుల యుద్భవమునకు కారకులనియు నొక కథ కలదు. "యున్నను" దేశపురాజులు "మహారాజ" బిరుదాంకితులై యుండిరి. తత్కారణమున నీతూర్పుదేశీయులందరు నాదినుండియు భారతీయులని చెప్పుట నిరాధారము కాదు.

టోలోమి (Ptolemy) రెండవశతాబ్దమున నీదేశములను గూర్చి వ్రాయుచు సంస్కృతభవములైన యనేకపదములను వాడెను. వోకాన్హ (Vo-chanh) వద్ద దొరకిన క్రీ. త. రెండవశతాబ్దమునాటి శిలాశాసనము చక్కని సంస్కృతభాషయందు కలదు. అప్పటికే యాదేశము హిందూరాజుల యేలుబడి క్రింద నుండెను. చంపారాజ్యము క్రీ. త. ౧౩౭-వ సంవత్సరమున స్థాపింపబడెనని చైనాగ్రంథములవలన తెలియుచున్నది. శాక్యనృపు డొకడు క్రీ. త. ౭౮-వ శతాబ్దమున జావాకు వచ్చెనని చెప్పెదరు.

దొరకినశాసనములందుగల కాలమునుండియే యాదేశముయొక్క చరిత్రము ప్రారంభమైనటుల చెప్పుట మనవారి కొక వెర్రియలవాటైనది. రాజ్యమున సుస్థిరత యేర్పడిన తరువాత శాసనములు నిర్మితమగును. అంతకు పూర్వ మాదేశములకు బోవుట, యుద్ధములు చేయుట మొదలగునవి జరిగినపిమ్మటనే రాజ్యము స్థాపితమగును. టోలోమినాటికే సంస్కృతము చంపాయందు ప్రచారమున నుండెను. భారతీయులు మొదటనే చంపా జావాలవంటి దూరదేశములను జయింపగల యంతటి పెద్ద సైన్యములను పడవలమీద గొనిపోగల సౌకర్యము లానా డుండినవో లేవో తెలియదు. అటులుగానియెడల జీవనోపాధికొరకో, వర్తకముకొరకో, మతప్రచారముకొరకో ప్రజలు క్రమేపి యాదేశములకు బోయి వాసమున కనువుగ నుండినందువలన యచ్చటనే కాపురము నేర్పరచుకొనినపిమ్మట దేశమున కధిపతులు కాగలిగినంతటి బలమును చేకూర్చుకొని యుండవలెను. ఇటుల జరుగుటకు కొన్ని వందల వేలసంవత్సరములు పట్టును. పైని వ్రాసినకథలను బట్టి చూడ క్రీ. పూ. అనేక శతాబ్దములనుండియు వలసపోవుట ప్రారంభమైనదని తోచుచున్నది. ఆదినుండియు నీ సంపర్క ముండుటయు కడుసంభవము.

ఉత్తరహిందూదేశమునుండి, ముఖ్యముగ వంగదేశప్రాంతములనుండి బర్మాలో కొన్ని భాగములకును, "యున్నను"నకును భారతీయులు భూమిపైని ప్రయాణముచేసి చేరుకొనినటుల గానవచ్చుచున్నది. కాని యాతూర్పుదేశములకు ముఖ్యముగ సముద్రయానమువలననే ప్రయాణము సాగుచుండెనట


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కనేకములగు నిదర్శనములు కానవచ్చు చున్నవి.

గుజరాతు దేశపు రాజకుమారుడొకడు జావా చేరుకొని యచ్చట రాజ్యమును స్థాపించెనని యొకకథ కలదు. అశోకునివంశపు రాజు మగధనుండి పలాయనుడై దంతపురము వద్ద పడవనెక్కి మలయదేశమును చేరుకొనెనని యొకకథకలదు. వో-కాన్హ వద్ద దొరకిన శిలాశాసనమునందలి యక్షరములు గిరినారు వద్ద దొరకిన రుద్రవర్మని శిలాశాసనము యొక్క యక్షరములను బోలియున్నవి. ఈ కారణములవలన హిందూదేశపు పశ్చిమతీరమునుండి ప్రజ లాదేశములకు వలసపోయిరని యూహింపబడెను. కాని పరిశోధనా ఫలితమువలన నీయూహాసరియైనది కాదని నిర్ణయమైనది.

మలయదేశపువారిని ఒరాంగుక్లింగులని పిలచెదరు. ఈనామమువలన వీరు కళింగుల సంతతివారని తెలియుచున్నది. గూడూరు (కోడూరు)వద్దనుండి ప్రజలు వలసపోవుచుండిరని టోలొమి వ్రాసెను; బందరువద్దనుండిన మూడు(?)రేవుపట్టణములవద్ద నావల నెక్కిపోవుచుండిరనుటకు నిదర్శనములు కలవు. ఆ దేశపుచరిత్రలను బరిశీలించినయెడల నృపుల యాచారము లీప్రాంతములవే యని తేలుచున్నది. అచ్చటిశాసనముల భాషవలనను, దొరకిన పురాతనవస్తువుల పోలికవలనను ఈ ప్రాంతముల సంపర్కము చాలా కాలమువరకు నుండినటుల కానవచ్చుచున్నది. అచ్చటి శిల్ప చిత్రములు మధ్యహిందూదేశమున జెరిగిన గుప్తుల, దక్షిణమున జెరిగిన చాళుక్యుల రచనావిధానము ననుకరించియున్నవి. కనుక ఆంధ్ర, కళింగదేశములనుండి యధికసంఖ్యాకు లిచ్చటికి బోవుచుండిరని చరిత్రకారులు నిర్ణయించిరి.

నలందానుండియు కొంతమంది వెళ్లినటుల కానవచ్చును. సయ్యామునందు కొన్ని తమిళశాసనములు లభించినవి. పల్లవుల శిలాశాసనములను బోలునవి కొన్ని దొరకినవి. అగస్త్యవిగ్రహములు కొన్ని జావాయందు గలవు. అగస్త్యఋషి దక్షిణదేశమున విశేషముగ పూజింపబడుట ప్రసిద్ధము. ఆంధ్రులు, కళింగులు తూర్పుదేశముల నాక్రమించిన పిమ్మట, తమిళులు, తదితరప్రాంతములవారు నచ్చటికి బోవుచుండిరనుట కీనిదర్శనము లాధారములు.

ఇటుల వలసపోయిన భారతపుత్రులు బ్రహ్మపుత్రనదినుండి పసిఫిక్కు మహాసముద్రమువరకు ననేకములగు రాజ్యములను స్థాపించుకొని యనేకశతాబ్దము లేలిరి. ఈ రాజ్యములలో ముఖ్యమైనవి పేర్కొనిన చాలును.

౧. యవనదేశము: ఇప్పుడు మేకాంగు నది ననుసరించియున్న యుత్తరప్రదేశము. దీనికి సుదామనగరము ముఖ్యపట్టణము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇచ్చట భారతీయులకు పలుకుబడి త్వరలోనే తక్కువయయ్యెను.

౨. చంపాదేశము. ఇప్పటి అన్నాము. చంపాపురము ముఖ్యపట్టణము.




3. కాంభోజదేశము. ఇప్పటి కాంబోడియా.

౪. శ్యామదేశము. ఇప్పటిసయ్యాము.

౫. రమన్యదేశము. సయ్యాములో కొంతభాగము. హారిపుణ్యాపురము ( Lamphun ) ముఖ్యపట్టణములలో నొకటి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭. మలయదేశము. (మలే)

౮. సుమిత్ర. సుమత్ర.

౯. యవద్వీపము. జావా.

౯. మధుర.

౧౦. బలి.

౧౧. సంభవ.

ఆభారతకుమారులు రాజ్యములను స్థాపించుటయేకాక సంస్కృతమును ప్రవేశ పెట్టి, భారతీయసనాతనగ్రంథముల పఠనము నేర్పరచి, హిందూవిజ్ఞానమును, మతమును ప్రజలలో ప్రతిష్ఠించి, మహానిర్మాణములను భారతీయశైలిని నిర్మించి, తమ మాతృభూమి యొక్కకీర్తిని వ్యాపింపజేసి, నిజమగు భారత పుత్రులుగ నుండిరి. వీరు మైసాను, నాఖోము, బోరొబుదరులవద్ద నిర్మింపజేసిన మహాలయ ములు ప్రపంచమునంతను విస్మితముగ జేసి, భారతదేశపు పూర్వపుగొప్పతనమును స్మరింపజేయుచున్నవి.

భారతీయవిజ్ఞానమునం దిట్టిసంఘటనమును గూర్చి మనపూర్వులు విశేషముగ వ్రాయ కుండుట యాశ్చర్యకరము. యవ, సువర్ణద్వీప ములను రామాయణమును, మహావంశము, జాతకకథలు, విలిందపన్హములు మరికొన్ని దేశములను మాత్రము పేర్కొనినవి. పాశ్చాత్యులు మరల ఆదేశములనుగూర్చి వ్రాయగా మనకు తెలియుచున్నది. కాని వీరు రచించుగ్రంథములలో నధికములు ఫ్రెంచి భాషయం దుండుటచే మన కంతగా నుపయో గకరములుగ లేవు.

పదునేడవ శతాబ్దమున క్రైస్తవమత బోధకు లీవిషయమై కొంతయభిరుచిని కలుగ జేసుకొనిరి. క్రీ. శ. ౧౬౫౧-వ సంవత్సర మున అలెగ్జాండరు డిరోడ్సు (Alexandre de Rhodes) అనునత డీప్రాంతములందలి పురాతనకట్టడములనుగూర్చి చక్కనిగ్రంథ మును ప్రచురించి యితరులకు మార్గదర్శకు డయ్యెను. ౧౮౬౮-వ సంవత్సరమున హెన్రీ మూహత్ (Henry Mouhot) అను ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు అంకోరుదేవాలయమును గను గొని, విస్మితుడై, దానిని వర్ణించి యనేకుల కీదేశచారిత్రములపై నభిరుచిని కలుగజేసెను. ౧౮౮౬లో డూడార్టుడిలెగ్రీ (Doudart de Lagree), ఫ్రాన్సిస్‌గార్నియరు (Francis Garnier), డెలాపోర్టీ (Delaporte) అను వారు శిలాశాసనములను సంగ్రహించిరి. తరువాత హార్మండు (Dr. Harmand) వీరి తో కలసి పాటుపడెను. అయిమోనియరు (Aymonier) ౧౮౮౨ సంవత్సరములో కాంభోజము, లెయొసు, అన్నాములందు సంచార ముచేసి యనేకములగు నూతనవిషయము లను చేకూర్చెను. పావీ (Pavie) నలువది మందిసహాయమున ౧౮౭౯-౧౮౯౫ వరకు ననేకాంశములను సేకరించి, యాదేశముల పటములను వ్రాసి, మహోపకారమును చేసెను. ఇప్పుడు బర్మా, హనోయి, జావా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సయ్యాము ఆర్కియాలజికలు డిపార్టుమెంటు లవారు పరిశోధనలను సల్పుచున్నారు. ఇంక ను బాగుగ పరిశోధనలను చేసి, క్రొత్తవిష యములను కనిపెట్టినయెడల భారతదేశపు సనాతననాగరికతనుగూర్చి బాగుగ వెల్లడి కాగలదు.

ఇంతటి నాగరికతయు కాలగర్భమున లీనమైపోయినది. హిందూరాజ్యములు పరా ధీనములైనవి. ప్రజలు బౌద్ధ, మహమ్మదీయమత ములను స్వీకరించిరి. కాని యిప్పటికి నాదేశ ములవారు పూర్వపు హైందవాచారముల ననేకములను విడువకయున్నారు. జావా యందు హిందూనాట్యము చూడగలము; హిందూపురాణములందలి కథలను చెప్పు కొనుటను, భగవద్గీతను చదువుటను విన గలము. బలిద్వీపవాసు లిప్పటికిని హిందు వులు; కొలదికాలము క్రిందటనే యొక మహా యజ్ఞమును చేసిరట! కాంభోజరాజగృహా మున హిందూఅర్చకు లిప్పటికిని ఇంద్రుని ఖడ్గమును బూజజేయుచుందురు. సయ్యాము దర్బారున హిందువులు పురోహితులుగ నున్నారు.

మాతృదేశమగు భారతభూమి పరుల యధీనమునబడి, గౌరవమును గోల్పోయిన వెంటనే యీదేశములు పరులహస్తగతము లగుటయు, హిందూత్వము క్షీణించుటయు కలిగినది. మనవారీదేశములగూర్చి పూర్తిగ మరచిరి. మరల నీప్రాంతములందు మన నాగరికతను పునరుద్ధరించుట కసమర్థుల మైనను, మనపూర్వులచ్చటచేసిన మహా కార్యములనుగూర్చి నేర్చుకొని, జన్మభూమి యొక్క యౌన్నత్యమును స్మరించినయెడల, నిర్వీర్యులమై యున్న మనకు కొంతయుత్సాహ మైనను బుట్టగలదు.

---



సూర్యోదయము —యస్. శంకరసుబ్రహ్మణ్యము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రదేశములోని విద్యుచ్ఛక్తి నిర్మాణములు

## (తయారుఖర్చులు-అమ్మకపుధరలు)

## (Some problems of Town-Electrification in AndhraDesa.

బుర్రా లక్ష్మణరావు, L. E., B. T. S.

మన ఆంధ్రదేశములో ప్రస్తుతము నిర్మింపబడినట్టివియు, నిర్మింప బడుచున్నవియు నగు నగర విద్యుచ్ఛక్తినిర్మాణముల పరిశీలించినయెడల రెండు విషయములు ముందుగా పొడగట్టకమానవు. అవి యేవనగా:—(1) విద్యుచ్ఛక్తియొక్క అమ్మకపుధరలు యితరదేశములలో కంటె నెక్కువగా నుండుట, (2) విద్యుచ్ఛక్తి జనకాలయములు క్రమముగా లాభకరములుగా నడువకుండుట. ఈ రెండువిషయములును ఒకదానిపై నొకటి యాధారపడియున్నవి. ఎట్లనగా: తయారు కాబడుచున్నటువంటి విద్యుచ్ఛక్తియొక్క మొత్తములో నెంత యెక్కువభాగము వాడబడుచున్న దాని ననుసరించి విద్యుచ్ఛక్తియొక్క తయారు ఖర్చులు (Generating Costs) అంతవరకు తగ్గుచుండును. ఒకప్రదేశములో వాడబడుచున్న విద్యుచ్ఛక్తి మొత్తమునకును ఆప్రదేశమునకు విద్యుచ్ఛక్తిని సప్లయిచేయుటకుగా నిర్మింపబడినవి ద్యుచ్ఛక్తిజనకాలయము యొక్క నిర్మాణపు శక్తి మొత్తమునకును గల నిష్పత్తిని, (Lo d fac'or) అందురు. ఈ Load factor యెక్కువైనకొలది విద్యుచ్ఛక్తియొక్క తయారుఖర్చులు, వాటి ననుసరించి అమ్మకపుధరలు తగ్గుచుండును. ఈ విషయము క్రింద నుదహరించిన జాబితావలన విశదము కాగలదు:

| | | | |
|---|---|---|---|
| నిర్మాణపుశక్తి మొత్తము (installed Capacity) | 37,000 K. W. | | |
| తయారు కాగలశక్తి మొత్తము (Maximum Capacity) | 30,000 K. W. | | |
| | Lard Factor | | |
| — | 20% | 40% | 60% |
| ఒకసంవత్సరములో తయారైన యూనిట్లు | 5 కో. 25 ల. | 10 కో. 50 ల. | 15 కో. 75 ల. |
| వడ్డీ, Sinking fund etc. యూనిటు (K. W) 1-కి | 0.212 అణా | 0.106 అణా | 0.171 అణా |
| బొగ్గు ,, ,, ,, | 0.204 ,, | 0.172 ,, | 0.161 ,, |
| జీతములు, కూలి ,, ,, ,, | 0.091 ,, | 0.046 ,, | 0.300 ,, |
| మరమ్మత్తులు ,, ,, ,, | 0.046 ,, | 0.027 ,, | 0.022 ,, |
| తరుగు, నూనె, పనిముట్లు ,, ,, ,, | 0.008 ,, | 0.005 ,, | 0.004 ,, |
| మొత్తము... | 0.561 అణా. | 0.356 అణా | 0.288 అణా. |

ఇది యిటుండగా, విద్యుచ్ఛక్తియొక్క అమ్మకపు ధరలు (Tariff) యెక్కువైనకొలది కొనుబడిమొత్తము అనగా Load factor క్షీణించిపోవును. Load factor క్షీణించినకొలది తయారుఖర్చులు యెక్కువగును. తయారుఖర్చులు యెక్కువయినప్పుడు అమ్మకపుధరలు తగ్గించుట కష్టము. ఈలాగున నీవిష

1. "Power Station Operation", "Mecha nical World and Engineering record. one £ is taken as equivalant to Rs. 15.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చక్రము తిరుగుచునేయుండును. కనుక నీచిక్కు దాట వలెనన్న మొదటిలోనే తయారుఖర్చులు తగ్గించగల మార్గముల నన్వేషించి వాడవలయును. ఇతరదేశము లలోకంటె మనిషియొక్క సంవత్సరపుఆదాయము వేయిమడుగులు తక్కువగా నున్న మనదేశములో నీవిషయము ముఖ్యముగా గమనింపవలసియున్నది. పైకరామొదలగు జలపాతజవిద్యుచ్ఛక్తినిర్మాణములు చాలవర కీచిక్కుల దాటించుచున్నవి. అట్టిజలపాతజ విద్యుచ్ఛక్తినిర్మాణముల స్థాపించుటకు మనఆంధ్రదేశ ములోగూడ అవకాశములు కలవని మద్రాసుగవర్న మెంటువారి విద్యుచ్ఛాఖయొక్క పరిశోధనలవలన స్థిరమైనది. ఆయవకాశముల ఫలోన్ముఖము చేయుట గవర్నమెంటువారిపైనను, తద్విషయమున ఆంధ్రదేశపు ప్రజలుచూపు ఉత్సాహముపైనను ఆధారపడియున్నది. అయితే మన మొక్క జలపాతజ విద్యుచ్ఛక్తి విధాన ములపైననే యాధారపడియుండవలసిన యవసరము లేదు. అట్లాధారపడుటయు మంచిది కాదు. ఎందు చేతననగా నీ జలపాతజ విద్యుచ్ఛక్తి నిర్మాణముల, అవకాశము లున్నంతమాత్రమున, స్థాపించుటకు, శాస్త్రీ కముగాను, ముఖ్యముగా నార్థికముగాను యెన్నో నిర్బంధనలు కలవు. కావున యితర విధానముల గూడ అనువగునంతవరకు నుపయోగించవలసియే యుండును. అట్లిపుడు ఉపయోగింపబడుచునే యున్నవి. కాని యట్లిప్పు డనుగమింపబడుచున్న విధానములలో నూతన పరిశోధనల ననుసరించి కొన్నిమార్పు లవసరమై యున్నవి.

విద్యుచ్ఛక్తియొక్క వాడుక విషయములో పశ్చిమ దేశములతో పోల్చి చూచినయెడల మనమింకను మొదటిమెట్టయినను దాటలేదని వేరే చెప్పనక్కర లేదు. అపారమగు విద్యుచ్ఛక్తిని ఆయా దేశములలో, పరిశ్రమల లోను, గృహములలోను వాడుచున్నారు. విశేషధన మును వెచ్చించి యింకను నూతన విద్యుచ్ఛక్తి జననాలయ ముల నిర్మించుచునే యున్నారు. వారి విధానములలోని పొరపాటుల గుర్తించినయెడల మన విధానములలోని లోటుపాట్లరయవచ్చును. వాటి కనుగుణముగ మార్పుల చేయవచ్చును. 1914-వ సంవత్సరములో జరిగిన ప్రపంచ యుద్ధమునకు కొన్ని సంవత్సరములకు ముందునుండియు యిప్పటివరకును ఇంగ్లాండు దేశములో విద్యుచ్ఛక్తి జనకాలయములయొక్క ప్రవృద్ధి (Development)ని క్రింద నుదహరించుచున్నాను:

1 1899 - 1904—పెద్దపెద్ద Water-tube బాయిలర్లు, Slow speed ఇంజన్లు, ఏకమార్గ విద్యుత్ప్ర వాహము నుద్భవింపజేయు విద్యుచ్ఛక్తియంత్రములు (Direct current generators) జనక శాలలయొక్క మొత్తపుశక్తి సామర్థ్యము సాధారణముగా 3,000 K. W.

1904-1914—పెద్దపెద్ద Water-tube బాయి లర్లు, Turbo generators, ద్విచలితమార్గ విద్యుత్ప్రవా హము నుద్భవింపజేయు విద్యుచ్ఛక్తి యంత్రములు (3 Phase Alternating current Turbo generators) జనకశాలల శక్తి సామర్థ్యము సామాన్యముగా 10,000 K. W.

1914-1927.—పెద్దపెద్ద Water tube బాయి లర్లు, బాయిలర్లలోని ఆవిరియొత్తిడి-350 16/0 అంగు ళము. Super heat Temperature 750 Turbo-generators, (A. C. 3. Phase) జనకాలయముల యొక్క శక్తి సామర్థ్యము సాధారణముగా 20,000—40,000 K. W.

ఈ జాబితాను బట్టి తేలు సారాంశము లేవనగా (1) విద్యుచ్ఛక్తిజనకాలయముల యొక్క మొత్తపు శక్తి సామర్థ్యములు రానురాను హెచ్చింపబడినవి. (2) అమిత ప్రమాణముగల విద్యుత్పీడనములతో ద్విచలిత మార్గ విద్యుత్ప్రవాహమును (alternating Current) సామాన్య విద్యుత్పీడన (Electrical pressure or voltage) ప్రమాణములతో నిదివరకు సామాన్యముగ

1. Whittakers Electrical Engineers Pocket Book.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుపయోగించుచున్న ఏక మార్గ విద్యుత్ప్రవాహక విధానమునకు బదులుగా నుపయోగించుట, (3) బాయిలర్ల విశేషణముల యొక్క (అనగా ఆవిరియొత్తిడి, కొలతలు, సామర్థ్యములు (Capacities) మొదలైనవి) ప్రమాణములు హెచ్చింపబడుట, (4) అపారమగు విద్యుచ్ఛక్తిని ప్రధాన విద్యుచ్ఛక్తి జనకాలయములలో (Main Central Electricity generating Stations) తయారుచేసి ప్రసరణాలయముల (Distributing Stations or Sub-Stations) ద్వారా వివిధస్థలములకీ శక్తిని ప్రసరింపజేయుట. అయితే ఈ మార్పు లెట్టి లాభములు కలుగజేసినవో యించుక విచారింతము:—

(1) విద్యుచ్ఛక్తి జనకాలయముయొక్క మొత్తపు శక్తిసామర్థ్యము హెచ్చినకొలది యూనిటు ఒక్కంటికి (per K. W.) అగునిర్మాణపు ఖర్చు తగ్గును. ఉదాహరణముగా నీ క్రింద జాబితా చూడుడు:[1]

| విద్యుచ్ఛక్తి జనకాలయపు శక్తిసామర్థ్యము (Total K. W. Capacity) | యూనిటు, 1-కి అగు నిర్మాణపు ఖర్చు (Capital Cost) | రిమార్కులు. |
|---|---|---|
| 50- 100 K. W. | రు. 600-900 | చిన్న చిన్న జనకాలయములు. |
| 5000. K. W. | రు. 360 | |
| 50,000 K. W. and above | రు. 210 | నవీనమగు ప్రధాన విద్యుచ్ఛక్తి జనకాలయము. |

విద్యుచ్ఛక్తి జనకాలయములలో తయారు ఖర్చులలో ముఖ్యమైనది మూలశక్తి జనితమగు బొగ్గున కగు ఖర్చు. జనకాలయములయొక్క శక్తిసామర్థ్యముల హెచ్చించుటవలన యూనిటువక్కంటికి వ్యయమగు బొగ్గు యెంతవరకు తగ్గిపోవునో క్రింద నుదహరించిన జాబితావలన[2] తెలియగలదు—

| విద్యుచ్ఛక్తి జనకాలయముయొక్క మొత్తపుశక్తి సామర్థ్యము (Total Capacity) | K. W. 1 కి వ్యయమైనవేడిమి ప్రమాణము (B .th. u.) | ఈవేడిమి నీయగల బొగ్గు ప్రమాణము | రిమార్కులు. |
|---|---|---|---|
| చిన్నచిన్న నిర్మాణములు (100 K.W.etc.) | 34,000 B. Th. u. | 3 lbs | |
| 5,000 K. W. — | 23,000 ,, | 1. 6 lbs | |
| 15,000 K. W. — | 15,000 ,, | 1. 1 lbs | |
| 50,000 K. W. — | 12,000 ,, | 1. 0 lbs | నవీనప్రధాన విద్యుచ్ఛక్తి జనకాలయము. |

(2) సామాన్యముగ నొకతీగమార్గముగుండా ఒక విద్యుచ్ఛక్తిజనకాలయమునుండి విద్యుత్ప్రవాహము (Electric Current) దూరప్రదేశములకు పంపుటలో, జనకాలయమునుండి దూరముగపోవుచున్న కొలది విద్యుత్పీడనము (Electrical pressure) తగ్గిపోవుచుండును. విద్యుత్పీడనప్రమాణమును విద్యుత్ప్రవాహప్రమాణముచే గుణించగా వచ్చినమొత్తమే విద్యుచ్ఛక్తిప్రమాణ మగుచున్నది గనుక విద్యుత్పీడన ప్రమాణము తగ్గిపోయినపుడు విద్యుచ్ఛక్తి ప్రమాణము గూడ తగ్గిపోవును. అందువలన జనకాలయమునకు దూరముగనున్న విద్యుద్దీపములయొక్క ప్రకాశము తగ్గిపోవును. ఈపరిస్థితులు దాటుటకై జనకాలయముయొక్క విద్యుత్పీడనప్రమాణమునైన హెచ్చింప

1. "Power Station operation", Mechanical World and Engineering Record.

2. Mechanical World and Engineering Record.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలెను; లేదా విద్యుత్ప్రవాహప్రమాణముసైన హెచ్చింపవలెను. విద్యుత్ప్రవాహప్రమాణము హెచ్చించినకొలది వాహకములగు తీగలయొక్క కొలతలు పెరిగిపోవును. దానివలన తీగలయొక్క ఖరీదు చాల యెక్కువగును. ఈ తీగలఖరీదు సామాన్యముగ నొక్కొక్కప్పుడు జనకాలయమున కగు ఖరీదును మించిపోవు ననుసంగతి గురుతించినప్పుడు విద్యుత్ప్రవాహముయొక్క ప్రమాణము నమితముగా హెచ్చించుటకు వలనుపడదని వేరే చెప్పనక్కరలేదు. కనుక రెండవమార్గమే, అనగా విద్యుత్పీడనప్రమాణమును హెచ్చించుటయే అనుగమింపదగినది. అనుగమింపబడినది. ఏకమార్గవిద్యుత్ప్రవాహకవిధానమునందు (Direct Current System) ఇట్లు విద్యుత్పీడనమును అమితముగా హెచ్చించుటకు చాలచిక్కు లున్నవి. మరియు నీవిధానమునం దొకమారు అధికప్రమాణముగల విద్యుత్పీడనములను ప్రయోగించినప్పుడును, పట్టణములలో నిట్టి విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేయునపుడును ప్రమాదములు కలుగకుండు నీవిద్యుత్పీడనప్రమాణముల తగ్గించుటవలన చిక్కులి అధికమైనటువంటి వ్యయప్రయాసములకు లోనగుదుము. అపారమగుశక్తి ఊరక వ్యయమైపోవును. అందువలన అంతకంటె సులభసాధ్యమగు ద్విచలితమార్గవిద్యుత్ప్రవాహకవిధానమును (Alternating Current System) వాడుచు, విశేషప్రమాణముగల విద్యుత్పీడనములను, దూరప్రదేశములకు విద్యుచ్ఛక్తిని పంపవలసివచ్చినపుడెల్ల, ఉపయోగించుచున్నారు. మరియు నీవిధానములో నేప్రమాణపువిద్యుత్పీడనమునైనను మరి యేప్రమాణమునకైన అతిసులభముగను, చౌకగను Transformers నుండా మార్చవచ్చును. ఇదియే యీవిధానముయొక్క ముఖ్యమైనగుణము.

(3) బాయిలర్ల విశేషణములయొక్క ప్రమాణము హెచ్చించుటవలనను, బాయిలర్ల నడుపుటలో తదితరమైన సహాయకయంత్రములను, విధానములను ఉపయోగించుటవలనను ఎట్టిలాభములు చేకూరునో క్రింద జాబితా (1) తెలియజేయగలదు:

మూలరేఖ (Datum line):— ఒకపౌనుబొగ్గు 14500 B. Th. U. వేడిమి నీయగలదు. 1913 సంవత్సరములో ఒకనుంచివిద్యుచ్ఛక్తిజనకాలయములో (5000 K. W) K. W. H. 1-కి 23000 B. Th. U. వేడిమి ఖర్చయినది. ఆవేడిమి నీయగలబొగ్గు ప్రమాణము — 1. 6 పౌనులు.

| | తగ్గుదలకు కారణములు | నేటివరకీనపరిస్థితులలో కలిగినటువంటితగ్గుదలలు |
|---|---|---|
| 1 | ఆవిరియొక్క ఒత్తిడి యెక్కువ చేయుటవలన (Higher steam pressure) | 0 097 పౌనులు |
| 2 | ఆవిరియొక్క Super heat temperature యెక్కువచేయుటవలన | 0. 087 ,, |
| 3 | పెద్ద Combustion chambers, air pre-heaters ఉపయోగించుటవలన | 0. 110 ,, |
| 4 | Turbines యొక్క lower stages నుండి ఆవిరిని పైకి తీసి దానిని బాయిలర్లలోనికి పంపేనీటిని వేడిచేయుటకుగా నుపయోగించుటవలన | 0. 067 ,, |
| 5 | ఆవిరిచే నడుపబడుచున్న సహాయకయంత్రముల విద్యుచ్ఛక్తిచే నడుపుటవలన | 0. 084 ,, |
| 6 | Improved surface condensers సహాయకయంత్రములు, వాడుటవలన | 0. 025 ,, |
| 7 | Better combustion due to pulverised fuel firing) | 0. 017 ,, |
| 8 | విద్యుచ్ఛక్తియంత్రములయొక్క air coolers నుండియు, oil coolers నుండియు వచ్చెడు వేడిమిని hot wells నుండా ఉపయోగించుటవలన | 0. 008 ,, |
| 9 | Turbines Steam Cycle లో గలిగిన అభివృద్ధివలన | 0. 005 ,, |
| 10 | Boiler యొక్క నడవడిలో గలిగినయభివృద్ధివలన | 0. 055 ,, |
| | మొత్తము... | 0. 600 పౌనులు |

* Whittaker's Electrical Engineers Pocket Book.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీనివలన తేలినదేమనగా నవీనప్రధానవిద్యుచ్ఛక్తిజనకాలయములలో ఒక K. W. H మొత్తము గల విద్యుచ్ఛక్తిని తయారుచేయుటకు ఒకపౌనుబొగ్గు మాత్రము ఖర్చగుచున్నమాట. మరియొకవిశేష మేమనగా నీపైతగ్గువలలపొందుటకు వేర్వేరుసహాయకయంత్రము లవసరమగుచున్నవి. ఈసహాయకయంత్రములకై విశేషధనము వెచ్చింపవలసియుండును. అందువలన పెట్టుబడికిఖరీదు (Initial costs) పెరిగిపోవును. ఈ పెట్టుబడిఖర్చులలో గలుగు పెరుగు నలను భరించగలశక్తిసామర్థ్యము మనవిద్యుచ్ఛక్తిజనకాలయమున నుండవలయును. లేకేని ఈసహాయకయంత్రములయొక్క ఖరీదే అసలుప్రధానయంత్రములఖరీదును మించిపోవును. అందువలన నష్టము కలుగును.

(4) ఒక్కొక్క ప్రదేశమున కొక్కొక్క విద్యుచ్ఛక్తిజనకాలయము వేర్వేరుగ నిర్మింపబడుటకంటె కొన్నిప్రదేశములకు కలిపి యొకప్రధానవిద్యుచ్ఛక్తి జనకాలయమును నిర్మించి వాటంతట నవే నడువగల విద్యుచ్ఛక్తిప్రసరణాలయముల (Automatic sub-stations) గుండా విద్యుచ్ఛక్తి నాయాప్రదేశములకు పంచిపెట్టుట చాలలాభకరము. ఎందుచేతననగా వేర్వేరు జనకాలయములకు వేర్వేరుగ నవసరమగు ఉద్యోగస్థుల సంఖ్య తగ్గిపోవును. అనవసరమగువ్యయము తగ్గిపోవును. మరియు నీవేర్వేరుప్రదేశములలో నొక్కసమయమున ఆయాప్రదేశములకు వలయుశక్తి మొత్తములు (Maximum demand) వాడబడవు. అందుచే మనప్రధాన విద్యుచ్ఛక్తిజనకాలయముపైబడు డిమాండు ఈవేర్వేరు ప్రదేశములయొక్క మొత్తపుశక్తిప్రమాణములయొక్క మొత్తముకంటె తక్కువగా నుండును. అందువలన మనప్రధానవిద్యుచ్ఛక్తి యంత్రాలయము ఈతక్కువ సామర్థ్యముగలదిగనే నిర్మింపవచ్చును. ఇందువలన లాభముగలుగుచున్నదని వేరే చెప్పనక్కరలేదు.

ఈపైవిషయముల నరసినయెడల ముఖ్యముగా నొకసంగతి బయల్పడగలదు. ఏమనగా ఒకవిద్యుచ్ఛక్తి జనకాలయము, నవీనపరిస్థితుల ననుసరించి ఆర్థికముగా లాభకరముగా నడువవలెనన్న అది ఒకనిర్దేశిత ఆర్థికశక్తిసామర్థ్యము (A certain economic capacity) కలిగియుండవలెను. ఆసామర్థ్యము చాలవరకు తగ్గిపోయినయెడల తయారుఖర్చులు తగ్గించగలమార్పుల నొందజేయుట కష్టతరమగును. అందువలన విద్యుచ్ఛక్తిని తక్కువధరలకు పంచిపెట్టగలయవకాశము లుండవు. అందువలన ప్రజల కిప్పుడిప్పుడు విద్యుచ్ఛక్తిపై గలుగుచున్నటువంటి యుత్సాహము, విద్యుచ్ఛక్తి నిర్మాణములపైగల విశ్వాసము క్షీణింపగలవు. అట్లొకవేళ క్షీణించుచున్నవేమోనన్నయనుమానములకు తగు నిదర్శనము లప్పుడే మనయాంధ్రదేశములో నగుపడుచున్నవి. విశాఖపట్టణమునకు విద్యుచ్ఛక్తిని సప్లయి చేయుటకు నిశ్చయింపబడి అప్పుడే రెండు మూడుసంవత్సరములైనది. నావినికిప్రకారము, ఒకకంపెనీ స్థాపించి ప్రజలలో షేర్లుపుచ్చుకొనమని కోరగా చాలమంది ఆర్థికవిషయములో అనుమానమును, జంకును వెలిపుచ్చినారు. ఆఖరుకు హార్బరువారు సప్లయిచేయుటకును, ఆంధ్రఇంజనీరింగుకంపెనీవారి ప్రసరింపజేయుటకును (distribution) నిశ్చయింపబడినది. మావిజయనగరములో విద్యుచ్ఛక్తి సప్లయిచేయుటకు మూడువత్సరములక్రితమే గవర్నమెంటువారినుండి లైసెన్సు మ్యునిసిపాలిటీవారిచే తీసికొనబడినది. కాని బహుశా యీ అనుమానము జంకేవారిని వెనుద్రొక్కుచున్నదని యనుకొనుచున్నాము. అయితే అన్నిప్రదేశములలోను యీలాగున్నదని చెప్పుటలేదు. కాని యీయుదాహరణలు తప్పక ప్రజలలో నింకనుగల యవిశ్వాసమును మాత్రము తెలుపుచున్నవని చెప్పవలెను. అందువలన మనదేశముయొక్క భాగ్యోదయమును కోరువారెల్ల విద్యుచ్ఛక్తిని సాధ్యమైనంతతగ్గుధరలకు యెట్లయిన నిప్పుడున్నవాటిలో సుమారు సగముధరలకు పంచిపెట్టగలమార్గముల నన్వేషింపవలెను. ఎట్లయిన మన ఆంధ్రదేశములోని విద్యుచ్ఛక్తిజనకాలయములలో, పైమార్గముల ననుసరించుటకుగాను, ఒక్కటియు తగినంతశక్తిసామర్థ్యముగలదిగా లేదు. పైచెప్పినట్లు ఆర్థికముగా, అమ్మెడివారలకును, కొనెడివారికినిగూడ లాభకరముగా నుండ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలెనన్న కడకు నూతనముగ స్థాపింపబడునవియైన ఈ పరిస్థితుల నాలోచించి, తగినంతశక్తిమంతములుగ నుండునటుల చేయవలెను. అయితే ఆర్థికశక్తిసామర్థ్యము (Economic capacity) ఎంతయుండవలెను అనువిషయము ఏయేస్థలములలో నట్టివిద్యుచ్ఛక్తిజనకాలయములు నిర్మింపబడగలవో ఆయాస్థలములయొక్క ప్రత్యేకపరిస్థితులబట్టి మారవచ్చును. ప్రస్తుతము మనపట్టణములలోవలె యేయూరి కాయూ రొకప్రత్యేక విద్యుచ్ఛక్తిజనకాలయము నెలకొల్పుటకంటె కొన్ని పట్టణములయొక్కయు, పల్లెలయొక్కయు సమూహమునకు ఒకప్రధానవిద్యుచ్ఛక్తిజనకాలయము నెలకొల్పి వేర్వేరుప్రసరణాలయములనుండా ఆయాప్రదేశములకు విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేయుటయే లాభకరముగా నుండునని నాయూహ. మరియు మనము గమ్యస్థానముగా పెట్టుకొన్న గ్రామవిద్యుద్దీపనమునకును (Rural electrification) గ్రామపునర్నిర్మాణమునకును, అనువగుమార్గ మిది యొక్కటియే అని తోచుచున్నది. పండితులీవిషయముల పరిశీలించి ఆంధ్రదేశముయొక్క విద్యుద్దీపనమునకు మిక్కిలియనువగుమార్గముల చూపుదురుగాక.

---



పొగమంచు

పి. కె. ఎస్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రేకపల్లి సోమనాథశాస్త్రిగారు

బులుసు పాపయ్యశాస్త్రి

శ్రీ సోమనాథశాస్త్రిగారి వాడుక పేరు సోమప్పశాస్త్రిగారు. ఈయన తండ్రి సూర్యనారాయణ సోమయాజిగారు. సోమనాథశాస్త్రిగారికి ఇంచుమించు 30 సంవత్సరములవయస్సు ఉన్నప్పుడు వీరికుటుంబము తాళ్లపూడినుండి సత్యవరము చేరెను.

సత్యవరము విశాఖపట్నంజిల్లాలో తాండవీనదిఒడ్డున తునిగ్రామముకు రెండు మూడు మయిళ్లదూరాన ఉన్నది. అది యిప్పుడు చెడిపోయి చిన్నఊరు అయి ఉన్నదిగాని, సోమనాథశాస్త్రిగారినాడు అది కాకరలపూడివారికి రాజధాని అయిఉండెను. గోదావరిజిల్లాలోని రామచంద్రపురములో రాజ్యముచేస్తూ ఉండిన కాకరలపూడివారి కుటుంబములోనివారు ముగ్గురు విశాఖపట్నంజిల్లాలో చిన్నచిన్న రాజ్యాలు సంపాదించుకుని, ఒకడు సత్యవరములోను, మరొకరు అనకాపల్లిలోను, తక్కినవారు మెళుపాకలోను కోటలు కట్టుకుని తమతమ రాజ్యాలు ఏలుకుంటూ ఉండేవారు. ఈ మూడురాజ్యాలలోనూ సత్యవరరాజ్యమే ప్రబలముగా ఉండినట్టు కనుపడుతుంది. ఆరాజ్యము ఏలేరాజుగారికి ఆయనధైర్యశౌర్యాదులు మెచ్చి నిజాంవారు "పాయకరావు" అనేబిరుదు ఇచ్చిరి.

రేకపల్లివారు సత్యవరము చేరినప్పుడు అక్కడ రాజ్యముచేస్తూఉండిన రాజుగారు శ్రీ కాకరలపూడి అప్పలపాయకరాయనింగారు. ఆయన మనసోమప్పశాస్త్రిగారి విద్యాతిశయము చూచి ఆపండితుడికి ఆశ్రయమిచ్చి మాన్యాలిచ్చి సత్యవరములో నిలిపిరి. అప్పటికి సోమప్పశాస్త్రిగారికి వేదమున్నూ, తర్కాదిశాస్త్రములున్నూ బాగా వచ్చి ఉండెను. ఆయన సంస్కృతమున కవిత్వము చెప్పేవారు. రాజుగారు ఆయనను ఆస్థానపండితుడుగా ఉంచిరి. రాజుగారికి తెనుగు కవిత్వమందు ఆదరము ఉండడము చూచి సోమప్పశాస్త్రిగారు వెలువలి గౌతరాజు అనే తెనుగుకవిగారివద్ద తెనుగు ప్రబంధాలూ, తెనుగువ్యాకరణమూ, ఛందస్సూ చదివి తెనుగునకూడా కవిత్వము చెప్పడము అలవాటు చేసుకున్నారు.

అంతట సత్యవరసంస్థానంలో ఆస్థానకవిగా ఉంటూఉండిన శానంపూడి తిమ్మకవిగారు కాలంచేసిరి. ఆయనకుటుంబములో ఎవరున్నూ కవిపదముకు అర్హులయినవారు లేకపోయిరి. అందుచేత, అప్పటికి, తెనుగుకవిత్వము అలవాటుచేసుకునిఉండిన సోమప్పశాస్త్రిగారినే రాజుగారు ఆస్థానకవిగా నియమించి, తిమ్మకవిగారికి అంతకుమునుపు ఇచ్చి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉండిన 'దోసలపాడు' అనే అగ్రహారము సోమప్పశాస్త్రిగారికి ఇచ్చిరి. ఆ అగ్రహారము మొన్న మొన్నటివరకూ సోమప్పశాస్త్రిగారి కుటుంబమువారే అనుభవిస్తూఉండిరి. ఆయన మాన్యాలు ఇప్పుడున్నూ ఆయనవారసులే అనుభవిస్తూఉన్నారు.

సోమప్పశాస్త్రిగారు సంస్కృతమున 'ప్రద్యుమ్నాభ్యుదయము' అనే కావ్యమున్నూ, తెనుగున 'రుక్మవతీపరిణయము' అనే ప్రబంధమున్నూ రచించిరి. ఆగ్రంథమును అప్పటిప్రభువయిన శ్రీగోపాలపాయకరాయనింగారికి అంకితము చేసిరి.

ఒకప్పుడు ఆయన విజయనగరంవెళ్లి మహారాజులుంగారి దర్శనము చేసిరట. నాడు శ్రావణపౌర్ణమి అయినందున మహారాజులుంగారు పండితసభ చేసి బ్రాహ్మణాశీర్వచనము పొందుతూ ఉండిరట. ఆసభలో వేదశాస్త్రవేత్తలను కుడిప్రక్కనున్నూ, కవులను ఎడమప్రక్కనున్నూ కూర్చుండబెట్టి రట. సోమప్పశాస్త్రిగారు సత్యవరంలో ఆస్థానకవిగా ఉండి వెళ్లినవారుగనుక ఆయనను ఎడమపక్కకవులలో కూర్చుండబెట్టిరట. ముందువేదవేత్తలు వేదమంత్రములతో ఆశీర్వదించిరట. తరువాత కవులు పద్యాలతో ఆశీర్వదిస్తూ ఉండిరట. సోమప్పశాస్త్రిగారివంతు వచ్చినప్పుడు ఆయన వేదమంత్రములతో దానికి స్పష్టముగా అర్థముచెప్పుతూ ఆశీర్వదించిరట. మహారాజులుంగారు విని ఆనందించి ఆయనను వేదవేత్తలబారులో కూర్చుండబెట్టి సత్కరించి శాలుజోడాలు మొదలయినవి బహుమతిచేసిరట.

సభ చాలించినతరువాత సోమప్పశాస్త్రిగారు బసకు వెళ్లుతూఉన్నప్పుడు కోటగుమ్మమువద్ద బట్రాజొకడు

"అప్పా, రేకపలీసో
మప్పా, విబుధాళిపాలి యమృతపులప్పా,
ఒప్పుల నీకవితలు వె                [లన్."
న్నప్పాలకు సాటివచ్చు-నా, బళి! రుచు

అని చదివెనట. సోమప్పశాస్త్రిగారు నాటి సభలో మహారాజులుంగారు తమకు దయచేసిన శాలుజోడా ఆబట్రాజుకు ఇచ్చివేసిరట. మహారాజులుంగారు ఆమాటవిని మర్నాటి సభలో, "సోమప్పశాస్త్రీ, మేమిచ్చినశాలుజోడా కోటదాటలేదట?" అనిరట. "మహాప్రభూ, తమయిావి కోటకాదు సప్తసముద్రాలూ దాటినది." అని సోమప్పశాస్త్రిగారు జవాబు చెప్పిరట. మహారాజులుంగారు ఆమాట చమత్కారముకు సంతోషించి మరొకశాలు జోడా బహుమానము చేసిరట.

సోమప్పశాస్త్రిగారు తిరిగి సత్యవరము చేరి ఆ మరణమున్నూ అక్కడనే ఉండిరి. ఆయన ౯౦ సంవత్సరాలు జీవించిరట. ఆయనకు మూడువివాహాలు అయ్యెను. మూడోవివాహము ౮౯వయేట అయ్యెను. ఆ పెళ్లి కాగానే ఆయన పెళ్లికూతురుని తీసుకుని రాజదర్శనానికి కోటలోకి వెళ్లిరట.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అక్కడ రాణీగారు, "తాతగారూ, పెళ్లి కూతురిపే రెవరండీ?" అని అడిగిరట. పెళ్లి కూతురిపేరు పాపమ్మట. సోమప్పశాస్త్రిగారు "పెళ్లికూతురిపేరు చెప్పితే పాపమా?" అనిరట. రాణీగారు తములపాకులూ చెక్కలూ తెప్పించి పెళ్లికూతురిచేత చిలుకలు చుట్టించి సోమప్పశాస్త్రిగారికి ఇప్పించి తాంబూలము వేసుకొమ్మనిరట. అప్పటికే పళ్లూడిపోయి బోసినోటివాడయిఉన్న శాస్త్రిగారు చెక్కలు నమలలేక దిక్కులు చూస్తూఉండిరట. రాణీగారు చూచి, "తాతగారూ, నూరిప్పిస్తుమా?" అనిరట. "ఏలినవారు నూరిప్పిస్తే కడమ పదారూ ఎవరిప్పిస్తారు అమ్మగారూ?" అని సోమప్పశాస్త్రిగారు అని రట. రాణీగారు నవ్వుకుని నూటపదారు లిచ్చిరట.

సోమప్ప శాస్త్రిగారున్నూ అడిదము సూరకవిగారున్నూ సమకాలీనులు. వారు పరస్పరమూ ఈర్ష్యగలిగి ఉన్నట్టు కనపడుతుంది. వారు ఒకరినొకరు ఎత్తిపొడుచుకుంటూ చెప్పినపద్యాలు కొన్ని యీదిగువ వ్రాస్తున్నాను.

సూరకవిగారు

కం. తెలుఁగుకవిత్వపుమర్మము
కల నెఱుఁగని శుష్కతర్క కర్కశమతికిన్,
దెలిసె నొకయించుకించుక
వెలువలిగౌతన్నకృపఁ గవిత్వపుజాడల్.

సోమప్పశాస్త్రిగారు

గీ. తర్కకర్కశబుద్ధులై తగినవారి
కే మసాధ్యమటంచు నూహింపరాదె?
తెనుఁగుముక్కలు నాల్గైదు తెలిసి తాము
కవుల మనుకొన్న నెతిపాడెగట్లు మదిని.

సూరకవిగారు

కం. ఏమేమో శాస్త్రంబులు
తా మిక్కిలిసతికిన్ల సతకనీ, కవితా,
సామర్థ్యంబున నెన్నఁగ
సోముని జృంభణముగలదె సూరునిమెదుటన్.

సోమప్పశాస్త్రిగారు

గీ సోమశబ్దార్థ మెఱుఁగని శుంఠవగుట
వదరితివిగాని సూరుని రదనపాళి,
రాలఁ దన్నినసోముని లీలఁ దెలియ
వైతి నీగుట్టు బయ లగుననుచుఁ గుకవి.

సోమప్పశాస్త్రిగారు బ్రతికిఉండగానే, ఆయనవల్ల రుక్మవతీపరిణయము కృతిపొందిన గోపాలపాయకరాయనింగారున్నూ, ఆయన సోదరుడు రామభద్రపాయకరాయనింగారున్నూ, తరువాత ఆరాజ్యము ఏలిన అప్పలపాయకరాయనింగారున్నూ గతించిరి. రాణులు అత్తకోడళ్లు మరికొన్నాళ్లు కోటలో ఉండిరిగాని ఆరాజ్యము కొన్నాళ్లకు విజయనగరమువారికి దక్కెను.

సోమప్పశాస్త్రిగారు సన్న్యసించి రెండేళ్లు బ్రతికి సిద్ధిపొందిరి. ఆయనకవితా ధోరణి తెలుపుటకు కొన్ని పద్యాలు రుక్మవతీ పరిణయమునుండి యీదిగువ వ్రాస్తున్నాను:

సీ. ఘనతరామీరవాహినులకు జీవన
ప్రదమయ్యె నెవ్వాని భవ్యశరధి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరవజీరు తేజోరాశికి సహాయ
　　మై యొప్పె నెవ్వాని యాశుగంబు
తతనిజామాభీల చతురంగబలసము
　　ద్ధారకం బెవ్వాని భూరిశక్తి
ఖానసంగతరణ క్రమ సాహసస్థితి
　　దనరిన దెవ్వాని ధర్మకలన
మని మహమ్మదుకుదుపుశా హాశ్వపతికిఁ
బ్రాణధార యెవ్వాని కృపాణధార
యతని నుతియింపఁ దరమె మాధ్యమికలోక
రక్షు నప్పలపాయకరాయఘనుని. ౧-ఆ.

ఉద్యద్బ్బాలదివాకరప్రతిముఁ బ్ర
　　ద్యుమ్నాఖ్యు నిబ్బాలకున్
సద్యోజాతశివేక్షణానలశిఖా
　　సంత్యక్తపూర్వాంగుఁ డే
తద్యోగాంతనవీనవిగ్రహుఁడు కం
　　దర్పుండు పీడంచు దు
ష్టోద్యోగంబున శంబరాఖ్యదనుజుం
　　డూహించి మాయాగతిన్. ౨-ఆ.

ఆపురిదివ్యసౌధనిక
　　రాంచితకాంచనపుత్రికల్ కర
స్థాపితరాజరత్నకల
　　శంబులచే ననిశంబుఁ దత్పుర
శ్రీపరిశోభిరూపముల
　　రీతికి నోడి జలాహృతిక్రియా
వ్యాపృతిఁ దాల్చియున్నయమ
　　రాంగన లచ్చటనుంటఁ దెల్పెడున్.

---

# ఆంధ్రవాఙ్మయసూచిక

## (ముద్రితాముద్రితగ్రంథముల పట్టికలు)

ఈ పుస్తకమున ౧౯౨౪-వ సంవత్సరము చివరవరకు అచ్చయిన తెలుగుపుస్తకములపట్టిక ఒకటి, ఆపుస్తకములను వ్రాసినవారి పట్టిక ఒకటి, విషయమునుబట్టి విభాగించి ఆయా విభాగములక్రింద వచ్చిన పుస్తకముల పట్టికలు, ఇంకా కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు లైబ్రరిలోను, తంజావూరు సరస్వతీ లైబ్రరిలోను, చెన్నపురమున ఓరియంటల్ లైబ్రరిలోను ఉండే వ్రాతపుస్తకములలో ఇప్పటికి అచ్చుకాకుండ ఉన్న తెలుగు పుస్తకముల పట్టికలును, ప్రత్యేకము అకారాదిగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయవిమర్శనరూపమయిన ప్రకాశకుల పీఠిక ౧౦౭ పుటల పరిమితిగలది యీ పుస్తకమున ఉన్నది.

తెలుగుభాషలో పుట్టిన పుస్తకములను, వానిలో, ఈపుస్తకము ముగియునప్పటికి అచ్చయినవానినీ, కానివానినీ తెలిసికొనుటకు ఈ సూచిక చాల ఉపయోగకరము.

భారతిసైజు పుస్తకము, పుటలు ౭౨౦, మంచికాగితములు వెల రు. ౧-౦-౦ మాత్రమే.

మేనేజరు, **ఆంధ్రగ్రంథమాల,** నెం. 7, తంబుశెట్టివీథి, మద్రాసు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తేజోలేఖనము
# (PHOTOGRAPHY)

కే. కృష్ణమూర్తి

ఈ వ్యాసములో ఉండేవిషయాలు దీనియందు అభిరుచి ఉండే ప్రతివ్యక్తికీ తెలిసి ఉంటవి. కొంతమంది "ఇదేమిట్రా మీకు అందరికీ తెలిసిన విషయాలే రాస్తున్నాడే!" అని ఆశ్చర్యపడవచ్చు. (ఒక నాటకాన్ని పేజీలతరబడి విమర్శిస్తూ ఒకాయన చివరకు దాన్ని నాటకమని తేల్చాడు! మరొకాయన డు, ము, వు, లు ప్రథమావిభక్తి అన్నాడు పదిపేజీ లైన తర్వాత!) మరికొంతమంది "ఇది బాగానే ఉన్నది. కాని ఇటువంటిదే ఈమధ్య ఒకాయన రాశాడు." అనుకోవచ్చు. కాని ఈవిషయాలనుగురించే మరియొకవ్యాసం బయలుదేరాలిసివస్తుంది. ఇటువంటివి తప్పవు.

హిందూదేశంలో దీనివిషయం తెలిసినవాళ్లు చాలతక్కువమంది ఉన్నారు. ఇతరదేశాలతో పోల్చిచూస్తే కొంచెము తెలిసినవాళ్లు బొంబాయిసైడున ఉన్నారు. ఇక ఆంధ్రదేశంలో అసలు లేరేమో! ఇతరదేశాలలో దీనిమీదనే జీవిస్తున్నవాళ్లున్నారు. Professional Photographers విషయం గాదు నేను చెప్పేది.

కొంతకాలంక్రింద Photography అంటే చాల గొప్పవిషయముగా ఉంటుండేది. కాని ఈమధ్య దీనియందు చాలమందికి అభిరుచి కలిగింది. దీనికి కారణం మంచి కెమేరాలు తక్కువఖరీదులో రావటం, మంచి ఫిలిమ్స్ రావటం. ౧౯౩౧, ౩౨, ౩౩ సంవత్సరాలలో Photography ఎంతన్నా వృద్ధిపొందింది. రకరకాల కెమేరాలు వచ్చినయి. ప్రతిపనికీ పనికొచ్చే కెమేరాలున్నయి. Photography సులభ మయింది. ఇదివరకంత శ్రమ పడనక్కరలేదు. వీటి నన్నిటినీ గమనించి మనదేశంలోఉన్న Photographers వీటి advantage తీసుకుంటున్నారా? నా కనుమానం.

ఈ Photography ని గురించి జనానికి ఎన్ని దురభిప్రాయా లుండాలో అన్నీ ఉన్నాయి. కొంతమంది ఉద్దేశ్యం కెమేరాను చేత్తోపట్టుకుని ఒత్తితే దిగుతుంది బొమ్మ అని. వీళ్లని "Button pressers" అంటారు. శాస్త్రజ్ఞులు తయారుచేసిన ఫిలింమీద బొమ్మ తీయటం వీళ్లపని. నాలుగుబొమ్మలు తీయటం చేతకాగానే మాకూ Photography విషయం తెలుసునని మురిసేవాళ్లకి దానివిషయం ఏమీ తెలియదు. వీళ్ల అదృష్టంవల్ల మంచిబొమ్మలే తియ్యొచ్చు కాని వీటిలో జీవం ఉండదు. పైగా బొమ్మ సరిగా వస్తుందో రాదో నమ్మకం లేదు. వీటిని చూచే తృప్తిపడేవాళ్లు సన్ బ్రాహ్మలు ౩౫ రూపాయల ఉద్యోగంతో సంతోషించేవాళ్లు. వున్నవూరు దాటనివాళ్లు. మంచి విషయాలను మన కక్కరలేనప్పుడు తెలుసుకోటం అనవసరమనేవాళ్లు. Professional Photographers ను చూడండి. వాళ్లఫోటోలు ఎంత అందంగా ఉంటయ్యా! P. O. P. పేపరు మీద Print, పూజలMount, ఓ కావలసినంత Artistic గా ఉంటుంది! మావా డొకడు ఫోటో తీయించుకుంటే వాడిచుట్టును retouch చేసి Boot polish చేసినట్టు చేశాడు. Oliver Cromwell దగ్గిరికి ఒకడొచ్చిఅతన్ని Paint చేస్తానన్నాడు. "Paint me as I am or I will not give you a penny" అన్నాడు. Cromwell దొర. ఆయన వంటినిండా ఎక్కడ చూచినా కత్తిపోట్లే! Natural గా ఉంటే ఎంత అందంగా ఉంటుందో ఊహించుకోండి. కాలేజీలో ఒక లేడీ స్టూడెంటు నిండా Face powder కొట్టుకుని వచ్చేది తెల్లగా. మళ్లీ ఇంటి కెళ్లేటప్పుడు నల్లగా ఉండేది. నాకు మటుకు ఇంటి కెళ్లేటప్పుడే బాగుండేది. Artificial beauty ఏమీ బాగుండదు. Professional photo-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



హిమాలయఝరి

(గంగోత్రిమార్గము)

—సి. జి. జగన్నాథదాసు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

graphers కు వాళ్ల గురువులు ఈ plate వాడు, ఈ Exposure ఇయ్యి అని చెప్పినట్లు తోస్తుంది, మన పెద్దవాళ్లు 'అబ్బాయి' పిల్ల సమర్తాడక మునుపే పెళ్లి చెయ్యి; లేకపోతే కృష్ణలో ఇల్లు కట్టుకోవలిసొస్తుంది, అని చెప్పినట్టు. లేకపోతే వీళ్లకి ఇంకో Camera, ఇంకోప్లేటూ ఇస్తే కళ్లు భైరవులు ఎందుకు కమ్మాలి? కాళ్లెందుకు వణకాలి? అయితే వీళ్లలోనూ గొప్పవాళ్లు లేకపోలేదు.

Photography లేకపోతే ప్రపంచం సాగదు. ఇది ప్రతి డిపార్టుమెంటుకూ అవసరం. డాక్టర్లకు X-ray photography కావాలి. ప్లీడర్లకు అవతలి పార్టీవాళ్లు ఇద్దరు మాట్లాడుకున్నట్టు సాక్ష్యానికి ఫోటో ఉంటే కేసు గెలుస్తుంది. తోటలు చెట్లు పీకితే క్రిమినల్‌గా ప్రాసీకు కావటానికి Photograph కావాలి. బజార్ల వెంటవెళ్లే ఆడవాళ్లని ఫోటోలు తియ్యాలి. మేడలెక్కి దొడ్లోవాళ్లని ఫోటో తియ్యాలి. దస్తావేజులిని ఫోటో తియ్యాలిసొస్తుంది. వర్తకులకు Magazines లోనూ, పత్రికలలోనూ advertise చెయ్యటానికి ఫోటోలు కావాలి. వారుపీ రననేల, ప్రతివారికీ ఫోటో అవసరం.

ఈఫోటోగ్రాఫీని నేర్చుకుంటున్నవాళ్ల ఆలోచనలు చాల తమాషాగా ఉంటయి. వీళ్లు ఆ కెమేరాతో వచ్చే Instructions చదవరేమో ననిపిస్తుంది. కొంచెము తెలిసినవాణ్ణి పక్కన పెట్టుకుంటే ఏమీ తెలియకుండానే ౧౨ బొమ్మలకు ౧౨ మంచిబొమ్మలు తియ్యచ్చు. ఇది కొందరికి నామర్దా. వాళ్లు గొప్పవాళ్లయినతర్వాత తమకు గురువని వొప్పుకోవలసి వస్తుందేమో! అటువంటిభయ మక్కర్లేదు. నామటుకు నాకు ఎవ్వరూ తెలిసినవాళ్లు లేకపోవటంవల్లనూ, ఒకవేళ ఉన్నా వాళ్లకోసం తిరిగి వెళకలేక చాలడబ్బు తగలేశాను. మంచిబొమ్మలు నమ్మకంగా తీసేటప్పటికి చాల కాలం పట్టింది. ఎన్నిసార్లు చంద్రుణ్ణి ఫోటో తీసినా రాలేదు. దక్షిణఆఫ్రికాలో ఒకడు ఫోటోతీసి Film ను ఆపన్న ఎండలో తీసిచూస్తే పచ్చగాఉంది. వాడు వెంటనే దాన్ని అమ్మినవాడిదగ్గిరికి పరిగెత్తి తీసుకెళ్లి తను నల్లనిఫోటోలను స్వయంగా చూచాననీ తన్ను వాడు మోసం చేశాడనీ గోలచేశాడుట!

మావా డొకడు ఫోటోలు తియ్యటం నేర్చుకుందా మనుకున్నాడు. అయితే వాడికి ఎవరినీ అడగటం ఇష్టంలేదు. ఎట్లాగురా మరి అన్నాను. వాడు చెప్పాడు: "పదిరూపాయలు ఖర్చుపెడితే అదే చేతవుతుంది. (నలుగురిని చంపితే వైద్యుడయినట్లు) ఒకసారి ఫోటోతీసి చూచేది. Out of focus అయితే ఈతడవ కొంచెము దగ్గిరపెట్టితియ్యాలి, మరీ దగ్గిరయితే కొంచెము దూరంపెట్టి తియ్యాలి; Under exposure అయితే ఈతడవ కొంచెము Exposure ఎక్కువ ఇయ్యాలి; Over exposure అయితే కొంచెము ఈ తడవ తగ్గించాలి; ఎట్లాగంటే అన్నం బిరుసైతే కొంచెము నీళ్లు ఎక్కువ పొయ్యాలి. మరీ మెత్తనైతే కొంచెము నీళ్లు తగ్గించాలి". అట్లా ఫోటోలు తీస్తాడుట! కేవలం అట్లాకాకుండా తెలిసినవాళ్లని రెండుమూడు సార్లదాకా దగ్గిరకట్టేపెట్టుకోటం మంచిది.

ఇక ఫోటోలు తియ్యటం నేర్చుకున్న తరువాత వచ్చే ఆలోచనలు మరీ తమాషాగా ఉంటయి. బీచి వొడ్డున సూర్యోదయం చాల బాగుంటుంది మరి. ప్రక్కన ఒకపడవ ఉంటుంది వీడి ప్రాణానికి. కొంచెము దూరంలో చేపలుపడుతూ ఉంటారు కొంతమంది. ఈమూడు విడివిడిగా తీస్తేబాగానే ఉంటవి, నాటకంలో ప్రతివాడిపార్టూ బాగున్నట్టు (మంచి యాక్టర్లున్న నాటకంలో) కాని ఈమూడు కలిపి తీస్తే బాగుండదు. ఈమూడు ఉన్న ఫోటో అర్థం కాదు, కన్ను ప్రతిదానిమీదికీ తిరుగుతుంది. అసలుఫోటోలో ఏమన్నా ఉన్నదేమో నని దేనికోసమో వెతుకుతుంది. బహుశా నాలుగోదానికోసమేమో! ఇటువంటివి పనికిరావు.

మంగళగిరి గాలిగోపురం తీస్తే బాగానే ఉంటుంది. కాని అది బొమ్మలో కుతుబ్‌మినార్‌అల్లే ఉంటుంది! బొమ్మచివర డయగ్నల్‌గా ఒక పాకా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బొంగో ఒక ఎలక్ట్రిక్ దీపమో ఉంటుంది! తర్వాత బొమ్మలో ఒకవైపున ఎత్తాటిచెట్టుకాని మరేదైనాగాని ఉంటే రెండోవేపు కూడా అంత ఉండక్కర్లేదు. ఏదన్నా ఉంటే బాగుంటుంది. లేకపోతే తిరపతిలో చుక్కలపర్వతంమీద ఉన్న డోలీఅల్లే ఉంటుంది బొమ్మ! నదులుగాని, సముద్రంగాని, ఏదన్నా సీన్ గాని తీసేటప్పుడు Horizon అంతమధ్యగాఉంచకుండా కొంచెము పైకో కొంచెము కిందికో వచ్చేటట్టు చేయటం మంచిది. ఇటువంటివి రెండుమూడు చిన్నవిషయాలు గమనిస్తే మంచిబొమ్మలు తియ్యొచ్చు.

ఇక బొమ్మలను Competitions కు పంపించటం. వీటినిగురించి కొన్ని Magazines లోనూ, పుస్తకాలలోను సలహాలున్నవి. మనకు బహుమతులు రానప్పుడు 'బహుమతులు అన్నీ పెద్దవాళ్లకే పోయినవి. అభిమానం జూపారు.' అని మనం అనటం సహజం. అట్లా అనవద్దు, నీవద్గిర Merit ఉంటే తప్పక వస్తుంది అని ఒక Magazine అంటుంది. కాని నా అభిప్రాయం ఈరెండింటిలోనూ నిజముందని. ఒక్కసారి పంపితే బహుమతి రాకపోతే పంపటం మానవద్దు. Try Try again is the motto of the genuine amature. ముఖ్యంగా పంపేటప్పుడు బహుమానం Expect చెయ్యొద్దు. తప్పకుండా disappointment కలుగుతుంది. ఇది నాస్వానుభవం. మూడేళ్లనుంచి ఒక weekly కి బొమ్మలుపంపిస్తూ ఇంతవరకు నాలిగింటిని publish చేయించగలిగాను. ఇప్పుడు బొమ్మ పంపితే అది ఎప్పుడు తిరిగివస్తుందా అని కనిపెట్టుకుంటాను.

౨

కళలో జీవితం ఉంది. కళే జీవిత మనవచ్చు. చాలమంది కళను గుర్తిస్తారు. కొంతమంది అర్థంచేసుకుంటారు. కాని చాల కొద్దిమంది అర్థంచేసుకుంటారు, గుర్తిస్తారు. కళలో కళోపాసకుని భావంగాని, ఉద్దేశ్యంగాని కనపడకపోతే అసహ్యంగా ఉంటుంది. "It is an expression of one soul talking to another and precious according to the greatness of the soul that utters it (Ruskin)" ఒకగ్రంథకర్త పుస్తకాలు చదివితే వాడు చెప్పేవిషయాలు నేర్చుకోవాలి; వాటిని గమనించాలి. ఆవిషయాలనుబట్టి ఆవ్యక్తిని మనస్సులో సృష్టింపచేసుకొనేటట్టుండా లా పుస్తకాలు. లోకానికి message ఇయ్యలేని గ్రంథకర్తల జీవితం వ్యర్థం. కార్లయిలు Abbot sampson రాశాడంటే ఎలెక్షనంటే తన అభిప్రాయం వెలిపుచ్చాడు. కళోపాసకుని ఉద్దేశ్యమెప్పుడూ ఇతరులకు తన అభిప్రాయాలను కళద్వారా transfer చెయ్యటం అయిఉండాలి. అట్లా చేసినవాడే ధన్యుడు. "Intelligent and enthusiastic search for beauty in nature interrupted by beauty in art is the worthiest of all pastimes." (F. C. Tilney)

Photography కళ అవునా కాదా అని ప్రశ్న. ఇదివరకు చెప్పినట్టు దీన్నిగురించి చాల దురభిప్రాయాలున్నవి. అట్లా బొమ్మలు తియ్యొచ్చు కాని వాటిలో జీవంగాని కళగాని లేదని మరచిపోవద్దు. Photo artist ఉద్దేశ్యం తన అభిప్రాయాలను, Emotions ను తన బొమ్మలయందు ప్రతిబింబించి చూచేవారిచేత వాటిని గుర్తింపచేయాలి. ఆబొమ్మ నదికానీయండి, కొండకానీయండి, పూరిపాకా కానీయండి ఏదైనా కానీయండి. మనుష్యుని గుర్తుపట్టగలిగేటందుకే పనికొచ్చే బొమ్మలలో కళలేదు. ఇటువంటి వాటివల్ల కళయొక్క ఉద్దేశ్యం, గౌరవం పోతుంది.

మనిషి ఎప్పుడూ ఒకరిని అనుసరించి కాని పైకి రాలేడు. స్వతంత్రంగాకన్న అనుసరించే మన మేది నేర్చుకున్నా. తెలిసో తెలీకో ఇంతమటుకు Photography ని Machanical art అనుకుంటున్నవారి నందరినీ వారి ఉద్దేశ్యానికి కొంచెము పక్కకు తిప్పమని కోరుతున్నాను.

ప్రపంచకంలో ప్రతిమనిషికి కొంచెము కాకపోతే కొంచెమన్నా తెలివి, కళాజ్ఞానం ఉంటుంది. ఎంత అసహ్యంగా సంగీతం పాడేవాడికైనా ఒకమంచి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంగతి పడితీరుతుంది. వీటిని వృద్ధి చేసుకోకపోవటం మనది తప్పు. కొంతమంది కీజ్ఞానం చాల ఎక్కువగా ఉంటుంది. అసలు నిజమైన Art మెల్లిగాను, తెలివిగాను అలవాటు చేస్తేనేగాని రాదు. ప్రపంచకంలో ఇంతమటుకు అప్పటికప్పుడు పుట్టేకళను చాల పైకి తీసుకొచ్చినవాడు లేడు. Art for art's sake అన్నారు. కనక మనం photography ని practise చేస్తే తప్పకుండా succeed అవుతాం.

Pictorial photography చాల కష్టమనికాని, అర్థం కావనికాని మనం ఎన్నడూ అనుకోకూడదు. మామూలు photo లను చూచి ఆనందించేవాళ్లు, నాటకాలలో లల్లాయిపదాలను విని సంతోషించేవాళ్లు ఒకశ్రేజాతి. వీళ్లకు మంచి సంగీతంలో ఆనందం లేదు! మంచిసంగీతం అర్థంకానట్టు లల్లాయిపదా లర్థమయినట్టు! photography కి కావలసిన వస్తువులను గురించి సంపూర్ణంగా ముందర ముఖ్యంగా తెలుసుకోవాలి. వాటితో ఎటువంటి effects కలుగుతవో తెలియాలి. కెమేరాతియ్యగలిగిన బొమ్మ మన కవసరం కాదు. మనకు కావలసినబొమ్మ మనం తయారు చెయ్యాలి. ముఖ్యంగా మంచిబొమ్మలను చూచి ఆనందించగలగాలి; విమర్శ చెయ్యాలి. Picture కి record on Sensitive material కు భేదం కనిపెట్టాలి. వీటిని గురించి ముఖ్యంగా చదవాలి. తన బొమ్మలను తనే విమర్శించుకోవాలి. కళమీద పుస్తకాలు చదవాలి (వాటిలో photography విషయం లేకపోయినా సరే). ఇవన్నీ చేస్తే కళాజ్ఞానం, instinct for sound composition వ్యక్తిలో తప్పకుండా కలుగుతవి. దేనినైనా చూడగానే దాన్ని గుర్తిస్తాడు.

ఈ instinct ప్రకృతిలో ఉన్న చిత్రములను చూసి అర్థంచేసుకుని ఆనందిస్తున్నకొద్దీ పెరిగి ఇదివరకు తాను చూచి ఆనందించలేని వాటిల్లో గొప్ప గొప్ప విషయాలు గోచరిస్తవి. తాను ఇదివరకు మెచ్చుకున్న వాటిలో అసహ్యామైనవి ఎన్నో కనబడతవి. వ్యక్తి మారుతాడు. హుక్కా పీల్చినతర్వాత సిగిరెట్టు కాల్చినట్లుంటుంది! ఇవన్నీ కాగానే Photography కులాసాగా తీసి ఆడవాళ్లకు చూపి ఆనందించటానికే కాదనిన్నీ దీని ఆధారంగా చేసుకుని దాని ద్వారా తన సంతోషాన్ని, దుఃఖాన్ని లోకానికి తెలియపరచవచ్చుననీ గమనిస్తాడు. కళంటే ఏమిటి? భావాన్ని చిత్రించటమేకదూ!

నాఉద్దేశ్యం దీన్ని అందరూ గమనించి మన దేశంలోకూడా Photography అంటే ఏమిటో తెలిసికొని ఆనందించి దాన్ని పైకి తేవలసినదని కోరుతున్నాను. తెలుగులో దీన్నిగురించి పుస్తకాలు లేవు. పత్రికలు లేవు. అసలు దీనికి విలువే లేదు. ఇవన్నీ కావాలి. Photographic exhibitions పెడితేగాని అందరూ దీన్ని చూచి దానిలో ఉన్న కళను గుర్తించరు. ఒక ఊళ్లో ఇద్దరు Photographers ఉంటే ఎవరు బొమ్మలు బాగా తీస్తారని వాదన వద్దు.

ఇద్దరిబొమ్మల్లో ఏవి బాగున్నవి ఏవి బాగా లేవు అని విమర్శించుకోండి. ఒకళ్ల కొకళ్లు సహాయపడండి. ఒకళ్ల Camera లు ఒకళ్లకు ఇయ్యొచ్చు. ప్రాణంపోదు. నలుగురూ కలిసి ఒక ఎసోసియేషన్‌గా తయారయి పత్రికలూ, పుస్తకాలూ తెప్పించి చదివి, జ్ఞానాన్ని వృద్ధిచేసుకుని ఆంధ్రదేశంలో కూడా Photographic art ను పైకి తీసుకురండి.

ఈఉద్దేశ్యంతోనే బొంబాయిలో కొంతమంది కలిసి First All India saloon of photography ని నవంబరు ౧౯౩౩ లో Exhibit చేశారు. హిందూదేశంలో ఇటువంటి విషయాల్లో ఇదే మొదటిది. ఈ బొమ్మలను చూచి inspiration కలిగి కొన్నివేల మందిలో ఇద్దరు మంచి artist లు తయారయినా వీటి aim succeed అవుతుంది. దీనికొచ్చిన బొమ్మలలో కొన్ని చాల బాగున్నవి. ఆబొమ్మలలో సగంబొమ్మలు విదేశాలలో జరిగే Ehibition లోకి కూడా తీసుకుంటారని బొంబాయిలో వాళ్లు చెప్పారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## గొప్పవారవవచ్చు కాని




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విరిసెజ్జ

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

౧

ఓం-జాగ్రత్సుషుప్తికృతదక్షిణవామభాగాం
స్వప్నస్వభావపరిక్లృప్తజఘన్యభాగాం,
తుర్యాతితుర్యఘటితాననహృత్ప్రదేశాం
ప్రాణేశ్వరీం పరశివస్య పరామృశామః.

శ్రీమాతృకాచక్రవివేకః

నిదురవలె, నిదురలో నొదవుస్వప్నమ్మువలె,
అడుగుసడి లేక నన్నావరించెదవు;
గాలివలె, గాలిలో తూలుసౌరభమువలె,
చూచాయకొలుపకే సురిగిపోయెదవు;
ఎపుడొ నీయాగమన, మెపుడొ నీనిష్క్రమణ.

శ్రీ శ్రీ

* * * *

కనిపెట్టుకొనియుంటిఁ గాంతను జూడఁ
గాంతఁ గౌఁగిటఁ జేర్పఁ గనిపెట్టుకొంటి,

* * * *

* * * *

జాజులు మల్లెలు, సంపెంగపూలు,
పారిజాతములు గన్నేరుపూవులును,
చెంబేలి, దిరిసెన, చేమంతివిరులు,
బంతిబంతులుగాఁగ, నింతలింతలుగ,
వింతలవింతల బంతులఁ దార్చి,
సెజ్జగాఁ గూర్చి, పేర్చి, వెలార్చి, యోర్చి,
కనిపెట్టుకొనియుంటిఁ గాంతను జూడ.

* * * *

ఆకులతోడ వియ్యంబు లందుచును,
గారుచీఁకట్లు నల్గడఁ గ్రమ్మి యొప్పె.
అలరుగుత్తులతోడ నాటలాడుచును,
నలరుచుక్కలు తళత్తళ లీనుచుండె.
ఆటలఁ బాటల మేటితనమ్ము
కొమ్మలకును నేర్పి, కూడి పాడుచును,
నాడుచుఁ జిఱుగాలి యందముల్ గొల్పె.

* * * *

దూరాన నొకవెల్గు తోఁచుచునుండె,
వెలుఁగులో నొకమేడ వెలుఁగుచునుండె.
అచట, మూఁడంతస్తు లావలిక్రేవ
నాల్గవయంతస్తునం గనంబడియె
మెఱపట్లు మెఱయునెమ్మేనికాంతులను
గ్రొందళ్కు లీనుచు సుందరి యొకతె.
అందు మూఁడంతస్తు లందునుగూడఁ
గల రెందరెందఱో తలిరుఁబోండ్లైన
నాల్గవయంతస్తునం గనంబడ్డ
సుందరియే మది చూఱలుగొనియె.
లోకంబు మఱపించి లో నన్నుఁ గూడె,
కాని, యావెంటనే కానరాకుండె.
మేడతో నింతులు నేడకో చనిరి.
అరయుచు నొక్కండ నటఁ గూరుచుంటి;
నామది చూఱగొన్న మనోహరాంగి
నాదుచెంతకు వచ్చి ననుఁ బ్రోచు ననుచు,
విరిసెజ్జ సరిచేసి వేచి యుండితిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాంతను జూడంగఁ గనిపెట్టుకొంటి.

* * * *

విరులతోఁ జుక్కలు వియ్యంబు వేఁడె,
గాలి కొమ్మలఁ గూడి మేలంబులాడె,
చీఁకటి, యాకులు, చెలిమిని గూడె;

* * * *

తారుచుఁ దక్కుచు, దరిదరిగాఁగ
దవ్వుదవ్వులనుండి తరుణి యొక్కర్తు
నాదుచెంతకు వచ్చి నాముందల నిలిచె;
క్రొత్తరంగులతోడఁ గ్రొత్తదనంబు
క్రొత్తక్రొత్తగఁ జూపి, కోర్కి మీఱంగ,
నెదుట నిల్చినకాంత నీక్షించుచుంటిఁ
గాని చిత్తంబు లగ్నంబు కాదయ్యె.

పలుకరించితిఁ గొంతఁ బలుకాడ వింటిఁ
జిత్త మాకర్షించుచెద్ది లేకుండె;
సహజంపుఁబలు కాడుశక్తి లేకుండె.

నిలువదు చిత్తంబు నీపైని నాకు,
లేదు రంగులపైని లేదు నాకాశ
మేడపైఁ జూచిన మెలఁతవు కావు;
కాదు నావిరిసెజ్జ కాదు నీ కింక
వెడలిపొ మ్మిటనుండి వెడలి పొమ్మనుచు
నాయింతి నటనుండి యంపివైచితిని.

కనిపెట్టియుంటి నింకను గొంతసేపు.
నాముందల కేతెంచె నాతి యొక్కర్తు.

ముస్తీబులోఁ గ్రొత్తమురిపెంబు లేదు
కాని, మాటలు మేటిగా నాడుచుండె;
చకచకపలుకులు సాగించుచుండె;
విరసాలు, సరసాలు, వెడలుచునుండె.

మాటలతేటకు మన సొప్ప లేదు.
చిత్త మానాతిపైఁ జేరఁగాలేదు.
కాదు నావిరిసెజ్జ కాదు నీ కింక
వెడలిపొ మ్మనిచెప్పి వెనుకమో మైతి.

ఆనాతి యటనుండి యరిగె నెయ్యెడకొ,
ఇంతలో నొకయింతి యేతెంచె నటకు.

ముస్తీబులోఁ గొంత ముచ్చట కలదు;
కాదంతప్రాఁతది; కాదంత క్రొత్త;
గాని, మాటలలోనఁ గనవచ్చె లోఁతు.

లోఁతైనమాటలు, లోలోన రసము,
కొంతకొంతముదంబుఁ గూర్చె నామదికి.

క్షణకాల మాయింతిఁ గనుఁగొనుచుంటిఁ
గాని, చిత్తంబు లగ్నంబు కాదయ్యె
చేసినముస్తీబుచెయ్వులం జూచి,
తెచ్చినయందంబుతెన్నులం జూచి,
కొనితెచ్చుమాటల కొలఁదులఁ జూచి,
చిత్త మానందంబుఁ జెందకయుండె.

కాదు నావిరిసెజ్జ కాదు నీ కనుచు,
నాయింతి నటనుండి యంపివైచితిని.

మనసున కానందమును గూర్పఁగల్గి,
విరిసెజ్జపై నిల్చి, కర మనురక్తి
ననుఁగూడఁగలకాంత కనఁబడదొక్కొ
యంచు నిరాశతో నరయుచునుండఁ
దళుకుతళుక్కను తనుకాంతితోడ
నెదుటఁ గన్పడె నొక్కయింతి యాక్షణమ.

* * * *
* * * *
* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దూరాన, మేడపై, గారాము మీర
నాల్గవయంతస్తునను గనంబడ్డ
యాచిగురుంబోడి, యామోహనాంగి,
యెదుటఁ గన్పడె నాకు ముదముగొల్పుచును.
అరవీడినగులాబియందంబువోలె,
సహజమై యొప్పారె సతిచక్కఁదనము.

గాలి కాడెడుకొమ్మమేలిపాటల్లు
సహజమై యొప్పారె సతిపాడుపాట.

విరిసినమల్లియ విరితావిరీతి,
సహజమైయొప్పారె సతితేటమాట.

కపట మింతయులేదు; కల్లయు లేదు;
తెచ్చినయందంపుఁ దీరును లేదు;
తెచ్చినమాటలతీరును లేదు;
ముద్దుఁజూపులతోడ ముద్దులుగూర్చి,
ముద్దుమాటలతోడ ముద్దులుగూర్చి,
విరిసెజ్జచందాన వింతలంగొల్పె.

ఆయింతిపైని నాస్వాంతంబు నిల్చె.

చేసాపి, యాయింతిఁ జెంతఁ జేర్చితిని;
చేర్చితిఁ గౌఁగింటఁ జేర్చితి నంత
విరిసెజ్జపైఁ జేర్చి, మఱచితిఁ దనువు.

*　　*　　*　　*
*　　*　　*　　*

విరిసెజ్జపై నిల్చి విరిబోణి నైతి;
విరిబోణితోఁ గూడి విరిబోణి నైతి;
విరిసెజ్జపై నేను విరిబోణి నౌచు
నద్వయానందంబు ననుభవించితిని.

*　　*　　*　　*

దూరాన వెలుఁగులోఁ దోఁచియున్నట్టి
యామేడపైని, మూఁడంతస్తులవల
నాల్గవయంతస్తునం గాంతఁ గూడి,
విరిసెజ్జపై నిల్చి, విరిబోణి నౌచు,
నద్వయానందంబు నందుచునుంటి

*　　*　　*　　*

విరిబోణితోఁ గూడి విరిబోణి నౌచు,
విరిసెజ్జపై నిల్చి విలసిల్లువేళ
నాల్గవయంతస్తు నను గాదు నిల్చు
నైదవయంతస్తు నంది యందుంటి.

ఏమయియుంటినో యెఱుఁగను నేను,
నేను నేనైయున్న నెనరుకన్పట్టె.
ఎంతసే పుంటినో యెఱుఁగను నేను,
నేను నేనైనచందానఁ గన్పట్టె.

*　　*　　*　　*
*　　*　　*　　*
*　　*　　*　　*

తెలివివచ్చెను, జుట్టుఁ దేరిచూచితిని,
విరిసెజ్జచెంతనే యరయుచునుంటి.
నాల్గవయంతస్తునకుఁ గొనిపోయి,
యైదవయంతస్తునందు నన్నుంచి,
తలరించి, యలరించి, తలిరాకుఁబోణి,
మాయమైపోయినమాడ్కి నెంచుచును,
వెలవెలఁబాఱుచుఁ దలఁచుకొంచుంటి.

*　　*　　*　　*
*　　*　　*　　*


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకులుఁ జీఁకట్లు నరయుచునుండె;
చుక్కలు విరులును జూచుచునుండె;
గాలియుఁ గొమ్మలు గనుఁగొనుచుండె;
విరిసెజ్జకడ నేను వేఁచియుండితిని

*    *    *    *
*    *    *    *
*    *    *    *

కనిపెట్టుకొనియుంటిఁ గాంతనుజూడ.

*    *    *    *
*    *    *    *
*    *    *    *
*    *    *    *

కాంతఁ గౌఁగిటఁ జేర్పఁ గనిపెట్టుకొంటి.

---



కపిల తీర్థము-తిరుపతి —ఏ. ఆర్. వి. ఈశ్వగ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మన యాహారము

గోటేటి జోగిరాజు

శ్రీ ముఖ సంవత్సర పుష్యమాససంచికయందలి పై శీర్షికగల 3-వ వ్యాసమునందు బియ్యము (Rice) యొక్క ఆహారయోగ్యతనుగురించి వ్రాయబడెను. ఇచట గోధుమల యాహారయోగ్యతను గురించి చర్చింపబడును.

## ౨. గోధుమలు

గోధుమలు దక్షిణ హిందూదేశమునం దంతగా పండింపబడకపోయినను ఉత్తరహిందూదేశమునను, అనేక ఇతరదేశములందును విరివిగ పండింపబడి యాహారముగ నుపయోగింపబడుచున్నవి. ప్రపంచమందలి సస్యములలో నిదియే హెచ్చువిస్తీర్ణము నాక్రమించుకొనుచున్నది.

గోధుమలం దితరతృణధాన్యములందుకంటె మాంసకృత్తులు హెచ్చుగ గలవు. కాని యిందలి మాంసకృత్తులు మానవశరీరమునకు బియ్యము (Rice) నందలి మాంసకృత్తులంత అనుకూలములయినవి కావని యెంచబడుచున్నవి.౧

గోధుమలలో చాలరకములు గలవు. అందు నాల్గు ముఖ్యములైనరకముల పృథక్కరణము క్రింది పట్టికయందు చూపబడెను. తెల్లగోధుమలలోకంటె నెఱ్ఱగోధుమలలో మాంసకృత్తులు హెచ్చుగ గలవు. సామాన్యముగ తవ్వెడు (౨౦ ఔన్సుల) బియ్యపుటన్నము దినుటవలన లభించు మాంసకృత్తులు అందు ౨/3 వంతు గోధుమయన్నమునుమాత్రము దినుటవలన లభించును. కావున గోధుమను తినువారు తక్కువగ దినవలెను. లేక పప్పుదినుసులను తగ్గించవలెను. ౧౪౦ పౌనుల తూనికగలిగి దినమునకు 3-౪ గంటల లఘువ్యాయామము (నడక) గల మనుష్యుడు దినమునకు పావుసేరు (౧౦ ఔన్సులు = ౨౫ తులములు) గోధుమను, 3 ఔన్సుల పప్పుదినుసులను, ౧౨ ఔన్సుల కూరగాయలను, ఆకుగూరలను, ౨ ఔన్సుల నేతిని, ౧౬ ఔన్సుల పాలను, లేక వానినుండి చేసిన పెరుగును లేక మజ్జిగను, ౪ అరటిపండ్లను (౧౨ ఔన్సులు) లేక యిందుకు సమమగు నితరపండ్లను పుచ్చుకొనిన ఆరోగ్యకరమును, పుష్టికరమును నగు నాహార మగును. దీనివలన ౨,౬౦౦ కాలరీల యింధన శక్తి గలుగును. వలయు మాంసకృత్తులును, చమురును, కర్బనోదజనితములును లభించును. ఖనిజద్రవ్యములును, విటమినులును లోటులేకుండును. గోధుమతినిన వేడి చేయు తత్త్వముగలవారు కొంతగోధుమను, కొంత వరియన్నమును దినవచ్చును. లేక కొంత గోధుమను తగ్గించి అట్లు తగ్గించిన ప్రతిఔన్సునకును అరటిపండు (3 ఔన్సులు) అదనముగ పుచ్చుకొనవచ్చును. తక్కిన పండ్లను (నారింజ, బత్తయినారింజ, సీమవంగ మొదలగువానిని) అరటిపండునకు రెట్టింపుమొదలు నాల్గురెట్లవరకు పుచ్చుకొనవచ్చును. (మొదటి వ్యాసమునందలి ౧-వ యనుబంధము చూడుడు.)

గోధుమను గింజ రెండు - మూడు ముక్కలగునట్లు విసరి తగినంత నీటితో నత్తెసరగునట్లుడికించి యాయన్నమును వరియన్నమువలెనే తినవచ్చును. అంతే కంటె నిది తీయగను, కమ్మగను నుండును. కావున దీనిని దినుటకు వ్యంజనము లంతగా నవసరము లేదు. కాని కొంతనేతిని జేర్చిన తినుటకు మరింత హితవుగ నుండును. బాగుగ నమలి తినవలయును.

గోధుమయన్నమును ఆవిరిమీదకూడ నుడికింపవచ్చును. ఇట్లుడికించుచో దీనితో పప్పుదినుసులను, కూరనుకూడ కలిపి యుడికించవచ్చును. మొదటి వ్యాసమునందలి 3, ౪ పట్టికలను చూడుడు.

౧. A Diet for India by Dr. H. C. Menkel reviewed in the Hindu 20-2-29.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆయారకముల గోధుమలయొక్కయు, కొన్ని యితర తృణధాన్యములయొక్కయు సంఘటనమును దెలుపు పట్టిక-౨

| తృణధాన్యపు పేరు - రకము | ఖనిజములు: ద్రావణీయములు | ఖనిజములు: అద్రావణీయములు | మాంసకృత్తులు | సారపదార్థములు | చమురు | కర్బనోదజనితములు | వ.రా. |
|---|---|---|---|---|---|---|---|
| ౧. తెల్లగోధుమ - మెత్తనిది | ౨.౬౯ | ౦.౭౮ | ౧౧.౨౩ | ౨.౪౨ | ౨.౦౪ | ౮౦.౯౬ | ఈ ప్రమాణములు తేమను మినహాయించి లెక్కగట్టబడినవి. |
| ౨. ,, గట్టిది | ౧.౯౯ | ౦.౦౬ | ౧౦.౨౭ | ౧.౬౬ | ౧.౬౬ | ౮౪.౩౪ | |
| ౩. ఎఱ్ఱగోధుమ - మెత్తనిది | ౨.౩౭ | ౦.౩౮ | ౧౨.౩౮ | ౨.౮౪ | ౨.౧౩ | ౭౮.౯౪ | |
| ౪. ,, గట్టిది | ౨.౫౩ | ౦.౩౧ | ౧౨.౫౬ | ౩.౦౧ | ౧.౮౪ | ౭౯.౪౯ | |
| సగటు... | ౨.౪౦ | ౦.౩౮ | ౧౧.౬౧ | ౨.౪౮ | ౧.౯౨ | ౮౦.౯౩ | |
| ౫. బియ్యము (Rice) ౪౩ రకముల సగటు | ౧.౧౧ | | ౮.౫౦ | ౦.౩౭ | ౧.౧౨ | ౮౮.౮౭ | |
| ౬. జొన్న | ౧.౭౨ | | ౧౦.౮౮ | ౨.౨౯ | ౪.౧౩ | ౮౦.౯౮ | |
| ౭. మొక్కజొన్న | ౨.౧౪ | | ౧౦.౮౦ | ౧.౫౯ | ౫.౩౮ | ౮౦.౦౬ | |
| ౮. గంటె | ౨.౨౫ | | ౧౦.౩౨ | ౦.౮౪ | ౫.౭౭ | ౭౯.౭౧ | |
| ౯. చోడి | ౮.౬౩ | | ౧౦.౬౪ | ౭.౩౯ | ౫.౫౬ | ౬౭.౭౮ | |

ఉత్తరహిందూస్థానమున గోధుమలను పిండిగా విసరి దానితో రొట్టెనుగాని, చపాతీలను గాని చేసి తిందురు. వీనిని చేయుట కనేక విధానములు గలవు. సామాన్యముగ చమురు చేర్చక పెనముపై గాని, నిప్పుసెగనుగాని కాల్చినది చపాతియనియు, చమురు(సామాన్యముగ నేతి)తో కలిపిగాని, చమురు పెనముపైవేసిగాని కాల్చునది రొట్టెయనియు భావింపవచ్చును. ఈరెంటిలో చపాతి సులభముగ జీర్ణమగును. రొట్టె అంతకంటె ఆలస్యముగ జీర్ణమగును. ఈరెండును గూడ గోధుమయన్నముకంటె నమలుట కెక్కువ వీలుగ నుండును అంతకంటె రుచిగను నుండును. కాని అంతకంటె (ముఖ్యముగ రొట్టె) హెచ్చువేడిచేయును.

పాశ్చాత్యదేశములందు గోధుమపిండితో పొంగు రొట్టెను, లేక నానురొట్టెను చేసి యుపయోగించుట సామాన్యము. ఇపు డిది యీదేశమునందుగూడ చాల మందిచే దినబడుచున్నది. ఇది చపాతీలకంటెను, రొట్టెకంటెను మృదువుగ నుండి కొంతసులభముగ జీర్ణమయినను, అంత ఆరోగ్యకరమైనది కాదు. మలబద్ధము చేయును. మరియు, సామాన్యముగ నెవరికి గావలసిన రొట్టెను వారు చేసికొనవీలులేక ఇతరులచే జేయబడి కొద్దిగొప్ప నిల్వ యుండి, యీగలు మొదలగువాని యొక్కయు, దుమ్ముయొక్కయు సంపర్కము గలుగుట కవకాశముండుటచేగూడ నీ పొంగురొట్టె అంత నిరపాయమైనది కాదు.

౨. ఈయంకెలు Wood's facts and figures నందును, ఇతరప్రచురములయందును గల యంకెలనుండి తేమను మినహాయించి లెక్కింపబడినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చపాతీలును, పైని చెప్పిన రెండువిధములగు రొట్టెలును కాక, గోధుమతో చాలపిండివంటలు చేసి యుపయోగింపబడుచున్నవి. కాని సామాన్యముగ నివి ముఖ్యాహారములుగ గాక అల్పాహారములుగ నుపయోగింపబడుచుండును.

గోధుమతో చేసిన నానురొట్టెలును, దేశవాళీ రొట్టెలును వరియన్నము, గోధుమయన్నమువలెగాక కొన్ని దినములు నిల్వయుండును. కొన్ని పిండివంటలు గూడ నిట్లే నిల్వయుండును. కాని చిరకాలము నిల్వయుండుటకుగాను గోధుమలతో పలురకముల బిస్కట్లు తయారుచేయబడుచున్నవి. ఇవి నెలలతరబడిని, గాలి తగులకుండ నుంచినచో సంవత్సరములతరబడిని నిల్వయుండును. ఇవి పర్యటనము చేయువారికిని, శ్రమలేకుండ కాఫీటీలతో అల్పాహారముగ నుపయోగించుటకును వీలుగ నుండును. ఇందు కొన్ని విలువగల రకములు సులభముగ జీర్ణమయినను, మొత్తముమీద నంతసులభముగ జీర్ణముకాని యాహారముగ నెంచవచ్చును. వెలయు నధికమగుటచే నరుదుగ నుపయోగింపదగినవి.

వీనికి బదులు గోధుమలను నానబెట్టి చురుకుగ వేచి, సరియయిన పదునున అటుకులుగ గొట్టి నిల్వయుంచుకొనవచ్చును. కాని యీయటుకులు అంత మృదువుగ నుండవు.

గోధుమలను విసరి పొడిచేయుచో అందు పొట్టు, నూక, పిండి యను మూడు భాగములు చేరియుండును. సామాన్యముగ విసరకమునుపు గోధుమలను తడిపి దంపి పొట్టును చాలవరకు దీసివేయుదురు. కాని యింకను కొంత గింజల నంటియుండును. గింజలలో పొట్టునకు క్రిందనుండు మధ్యపొరలోని పొరకంటె కఠినముగ నుండుటచే నిది చాలవరకు నూకగ నేర్పడును. లోని భాగము చాలవరకు మృదువగు పిండిగ నేర్పడును. పొట్టునకును, నూకకును, పిండికిని గల సంఘట్టనతారతమ్యము లీక్రింద జూపబడును.

| వివరములు | పొట్టు | నూక | పిండి | వరా |
|---|---|---|---|---|
| ౧ ఔన్సులోగల ద్రవ్యపరిమితి | | | | |
| మాంసకృత్తులు—గ్రాములు | ౩.౨౩ | ౩.౯౦ | ౩.౧౮ | |
| చమురు | ౦.౫౬ | ౦.౫౮ | ౦.౨౪ | |
| కర్బనోదజనితములు | ౧౯.౪౫ | ౨౦.౩౫ | ౨౧.౫౮ | |
| మొత్తపుయింధనశక్తి (కాలరీలు) | ౯౦ | ౧౦౨ | ౧౦౨ | |
| విటమినులపరిమితి | | | | |
| విటమిను A | స్వల్పము | స్వల్పము | శూన్యము | |
| ,, B | మధ్యమము | మధ్యమము | స్వల్పము | |
| ,, C | శూన్యము | శూన్యము | శూన్యము | |

పిండిలోకంటె నూకలో కొంచెము మాంసకృత్తులు హెచ్చుగ గలవు. చమురు రెట్టింపు గలదు. విటమిను A, B లు పిండిలో మిగుల తక్కువ. నూకలోను, పొట్టులోను తగుమాత్ర మున్నవి. ఖనిజద్రవ్యములు పొట్టులో విస్తారమున్నవి నూకలోను పిండిలోను గల ఖనిజముల పరిమితిని తెలుపు అంకెలు లభింపలేదు.

కాని ముడిగోధుమలలోను, పొట్టులోను పిండితో చేసిన తెల్ల నానురొట్టెలోను, నూక పిండి కలిపి చేసిన రొట్టెలోను, పొట్టుతోసహా విసరిన పిండినూకతో చేసిన రొట్టెలోను గల ముఖ్యఖనిజముల పరిమితి యీక్రింద జూపబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | ౧౦౦ పౌనుల తూనిక గల మనుష్యునికి వలయు ఖనిజ ద్రవ్యముల పరిమితిలో ౧౦౦ కాలరీల యింధనశక్తి నిచ్చు పదార్థములలో గల ఆయాఖనిజద్రవ్య ప్రమాణము. | | |
|---|---|---|---|
| | సున్నము | స్ఫురము | ఇనుము |
| ముడిగోధుమలు | ౩.౭ | ౮.౯ | ౮.౯ |
| గోధుమపొట్టు | ౮.౩ | ౪౨.౨ | ౨౩.౯ |
| పిండితో చేసినరొట్టె | ౨.౬ | ౩.౬ | ౩.౪ |
| నూక, పిండితో చేసినరొట్టె | ౩.౮ | ౫.౫ | ౫.౦ |
| పొట్టు,నూక,పిండితో చేసిన రొట్టె | ౧౧.౮ | ౮.౭ | ౧౧౯ |

పైయంకెలనుబట్టి గోధుమయన్నమును దినినను, లేక గోధుమతో చపాతీగాని, రొట్టెగాని చేసినను, అందు పొట్టును, నూకయు కూడ జేరియుండునట్లు చూడవలసిన యావశ్యకత గోచరించును. కేవలము పిండితోనే చేయువస్తువులందు తెల్ల బియ్యపు అన్నమునందు వలెనే, విస్తారము కర్బనోదజనితములు ఉన్నను, మాంసకృత్తులును, చమురును, ఖనిజములును, విటమినులును లోటుగ నుండును. ఇంతవరకు పొట్టును ఎంతసమగ్రముగ దీసివేసిన నంతశ్రేష్ఠమని యెంచబడుచుండెడిది. కాని యిటీవల పొట్టుయొక్క శ్రేష్ఠత గ్రహింపబడి కొంతమందిచేత పొట్టుతీసివేయకుండ విసరిన పిండితో చేయబడిన రొట్టెయే తినబడుచున్నది. కాని యింకను ఈవిషయము తెలియని ప్రజలు చాలమంది గలరు. అందరికిని దెలియునట్లు ప్రచారము జరుగవలెను.

పొట్టుతో చేరిన పిండితో చేయబడిన నాను రొట్టెయేగాక పొట్టుతోసహా చేయబడిన బిస్కట్లు (Vita-wheat biscuits) గోధుమ పీచు (Shredded wheat) మొదలగు వస్తువులు విక్రయింపబడుచున్నవి. కాని విస్తారము డబ్బిచ్చి వీనిని గొనుటకంటె, పొట్టుతో గూడిన పిండితో చపాతీలను రొట్టెలను జేసికొని తినుటయే మంచిది.

గోధుమలను నీటిలో నాన నిచ్చి, మొలక కట్టి గూడ తినవచ్చును. ఇట్లు తినుచో నుడికించుటవలన B విటమినునకు గలుగు కొంతనష్టము లేకపోగా, అందిది వరకు లేని C విటమిను కొంతవర కుద్భవించును. ఇట్లు మొక్కకట్టి తినుటవలన నది కొంతవరకు సులభముగ జీర్ణముకూడ అగును. బాగుగ నమిలి తినవలెను. అపక్వాహార దీక్షగలవారి కీపద్ధతి యనుకూలముగ నుండును. కాని క్రమముగ నలవాటు చేసికొనవలెను.

అనారోగ్యదశలో నన్నము దిన వీలులేనపుడు సామాన్యముగ జావను పథ్యముగ నిత్తురు. ఇందుకు గోధుమనూక మిగుల అనుకూలమైనది.

ఉబ్బురోగము గలవారికి గోధుమ యాహారము మంచిపనిచేయును. వరియన్నముకంటె విరేచనకారియగుటచే మలబద్ధమును తొలగించి వంటియందలి చెడ్డ నీటిని దీసివేయును.

అతిమూత్ర వ్యాధిగలవారికి గూడ తరుచు వైద్యులు గోధుమయన్నమునుగాని, రొట్టెనుగాని పథ్యముగ పురమాయింతురు. కాని గోధుమలలో బియ్యము నందుకంటె కర్బనోదజనితములు కొంత తక్కువగ నున్నను విస్తారభేదము లేదు. అయినను శరీరమునకు వలయు మాంసకృత్తులు సమకూరుటకు గోధుమఅన్నము తినునెడల వలయు పరిమితి వరియన్నము దినునెడల గావలయు పరిమితిలో సుమారు ౨/౩ వంతు మాత్రమే కావలసియుండుటచే, మొత్తపుపరిమితి తగ్గి అందుమూలమున కర్బనోదజనితముల పరిమితియు తగ్గును. తవ్వెడు బియ్యపు అన్నముతో ౪౪౬ గ్రాముల కర్బనోదజనితములు లోనికి బోవును. ఇందుగల మాంసకృత్తుల నిచ్చుటకు జాలియుండు మూడర్ధపావుల గోధుమల యన్నమును దినుచో ౩౦౬ గ్రాముల కర్బనోదజనితములు లోనికి బోవును. ఇందువలన కొంతమేలు గలిగినను, తీవ్రమగు అతిమూత్రవ్యాధిగలవారి కీమార్పు చాలదు. కర్బనోదజనితముల పరిమితి దినమునకు ౧౦౦ గ్రాములకు గాని అవసరమగుచో నింకను గాని తగ్గింపవలసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండును. ఇట్లు తగ్గించుటకు తృణధాన్యములను పూర్తిగ మాని, వేరుసెనగగింజలు, బాదంపప్పు, జీడి పప్పు, పాలు, మజ్జిగ, వెన్న, నేయి మొదలగువానితో కాలము గడపవలసియుండును.

గోధుమ నాహారముగ గొను నాడువాం(డలో నెలతక్కువపిల్లలుగాని బలహీనపు పిల్లలుగాని పుట్టుట వరియన్నము తినువారిలోకంటె తక్కువ యని బొంబాయిలో జరిగిన పరిశోధనమువలన దేలెను.[1]

---



ఏతాలు

—కే. గోపాలు.

1. No. 3157 Nutrition and food abstracts, Vol. II-4.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# స్వరాజ్యము

నార్ల వెంకటేశ్వరరావు

అతిశయోక్తి కాదేమో, ఈసువిశాలభారతవర్షమున 'స్వరాజ్య'మనుపదము తెలియనిప్రాంతము లేదనిన! అత్యుక్తిదోషము పట్టదేమో, ఈత్రింశత్కోటి భారతసంతతిలో స్వరాజ్య మనుమాట నెరుగనివ్యక్తి లేడనిన!! అంతగ వ్యాప్తి గాంచినది, ఆచిన్నిమాట!!!

కేవలము నలుగడల వ్యాపించుటయే కాక అది ప్రజాహృదయము నాకర్షించినది. స్వరాజ్య మనుమాటను వినినంతనే గతస్వాతంత్ర్యమును సంస్మరించి, వేడినిట్టూర్పును నిగుడ్పనివా డెవడు? —ప్రస్తుతదౌర్భాగ్యస్థితిని తలచుకొని, అశాంతిని బొందనివా డెవడు? —స్వతంత్రభారతీదేవి దివ్యరూపమును కల్పించుకొని ఆనంద పరవశుడు గానివా డెవడు? ఇమిడియున్న దామాటలో అంతశక్తి, అంతమాధుర్యము, అంత.........

కాని స్వరాజ్యమునుగూర్చి స్పష్టమైన అభిప్రాయములు ప్రజాబాహుళ్యమున కున్నట్లు తోచదు. ఇది కడు శోచనీయము. స్వరాజ్యమునుగూర్చి కేవలము కలలుగను దినములు గడచిపోయినవి. ఇప్పుడు మనము దానికై—అపూర్వముగ, అద్వితీయముగ, అకుంఠితముగ కృషిసలుపుచున్నాము. ఇట్టియెడ స్వరాజ్యమును గూర్చి స్పష్టమైన అభిప్రాయములు లేకుండుట, తత్సిద్ధికై జరుగుచున్నకృషికే హానికరము!

స్వరాజ్యమనిన తెల్లదొరలుపోయి నల్లదొరలు వచ్చుట యని కొందరు భావించుచున్నారు. ఇది పూర్తిగ పొరపాటు! నేడు విల్లింగ్డన్ ప్రభువుగారి స్థానమును సర్ సి. పి. గారు ఆక్రమించినను, సర్ స్టాన్లీగారి హోదాను ఉస్మాన్‌సాహెబుగారు పుచ్చుకొనినను మనదాస్యస్థితి యథాతథముగ నుండును. ఇట్టి రంగుమార్పు స్వరాజ్యము కాదు; కానేరదు. ఇది కేవలము దూలమునుదింపి దుంగ నెత్తుకొనుటయే!

స్వరాజ్యమనిన సత్పరిపాలనమని మఱికొందరు తలచుచున్నారు. ఇదియును కొంతవఱకు పొరపాటే! స్వరాజ్యముగల దేశమున సత్పరిపాలన లేకపోవచ్చును. ఇట్లే సత్పరిపాలనగలిగియు దేశము దాస్యశృంఖలాబద్ధము గావచ్చును. స్వరాజ్యమున్నచో సత్పరిపాలన యుండుట సహజము. సత్పరిపాలన యున్నచో స్వరాజ్యకాంక్ష ప్రబలముగ నుండకపోవుటయు కద్దు. కాని యింతమాత్రమున సర్ హెన్రీకేంప్‌బెల్‌బెన్నర్‌మన్‌గా రనినట్లు "సురాజ్యము స్వరాజ్యమునకు ప్రత్యామ్నాయము కాదు"* స్వరాజ్యమును సత్పరిపాలనయు భిన్నములు. వీనిలో సత్పరిపాలనముకన్న స్వరాజ్యమే కోరదగినది సుడ! స్వర్గలోకమున—అత డెవడో యనినరీతిని—"స్వర్గమున పరిపాలితునివలె నుండుటకంటె యమలోకమున పరిపాలకుడై యుండుట మంచిది!*

నిర్నిబద్ధముగ స్వేచ్ఛానువర్తులై సంచరించుటకు అవకాశము కలుగజేయునదే స్వరాజ్యమని ఇంకకొందరు ఊహచేయుచున్నారు. ఇది కేవలము అజ్ఞానజనితమైన వెఱ్ఱియూహ! కనుక దీనినిగూర్చి పర్యాలోచింపవలసిన యగత్యమే లేదు.

ఐనచో నిక స్వరాజ్యమనిన నేమి? ఈప్రశ్నకు ప్రత్యుత్తర మొసగుటకు ముందు స్వరాజ్య మనుపదము యొక్క పుట్టుపూర్వోత్తరములను—సంగ్రహముగానైనను—చర్చించుట మంచిది.

౧౯౦౬-వ సం. మున కలకత్తాలో జరిగినకాంగ్రెసు మహాసభ అధ్యక్షోపన్యాసములో కీ. శే. దాదాభాయి

* "Good Government is no substitute for self-Government"

* "It is better to be a ruler in hell than to be ruled in heaven."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నౌరోజీగారు ఈపదమును తొలుదొల్త నుపయోగించిరి. అప్పుడు వారు దానిని కడుసంకుచితమైన అర్థములో వాడిరి. దాదాభాయిగారి దృష్టిలో స్వరాజ్యమన సామ్రాజ్యాంతర్గతమైన బాధ్యతాయుత స్వపరిపాలనము. అదియైనను సంపూర్ణ బాధ్యతాయుత స్వపరిపాలనము కాదు, ఏదో యొకమాదిరి బాధ్యతగలది మాత్రమే!

పిమ్మట ౧౯౨౦-వ సంవత్సరములో గాంధి మహాత్ముడు-నాగపూరు కాంగ్రెసుసందర్భమున-దానికి పూర్వముకంటె కొంచెము విపులమైన అర్థమును చెప్పెను. కాని స్వరాజ్యము అనిర్వచనీయమైనదనియు, దాని నసలు నిర్వచింప నగత్యమే లేదనియు వారి వాదము. ఏదైన గమ్యము నేర్పరచుకొనునపుడు దానినిగూర్చి స్పష్టమైన యభిప్రాయములను సయితమేర్పరుచుకొనవలెను. లేనిచో మార్గమున చాల యిబ్బందులను పడవలసివచ్చును. దీనవలన ఒక్కొక్కప్పుడు గమ్యము నసలుచేరుకొనుటకూడ దుస్సాధ్యము కావచ్చును. అందుచే స్వరాజ్యము అనిర్వచనీయ మనుటలోగాని, దాని నసలు నిర్వచింపవలసిన యగత్యమే లేదనుటలోగాని అర్థమున్నట్లు తోచదు.

ఈనాగపూరు కాంగ్రెసులోనే స్వరాజ్యసంపాదనము కాంగ్రెసు నాదర్శముగా నొనర్పబడెను. తదుపరి ౧౯౩౦ - వ సంవత్సరమున లాహోరులో జరిగిన కాంగ్రెసుమహాసభయందు స్వరాజ్యమన బ్రిటిషు సామ్రాజ్యముతో సంబంధములేని సంపూర్ణ స్వాతంత్ర్యమని నిర్ణయింపబడెను.

ఇదియే స్వరాజ్య మనుపదముయొక్క సంగ్రహ చరిత్ర. ఈచరిత్రవలన కాంగ్రెసుప్రయత్నములే సిద్ధించినచో భారతదేశమునకు బ్రిటిషుసామ్రాజ్యముతో సంబంధములేని స్వతంత్రప్రభుత్వము సిద్ధించుననిమాత్రమే తెలియుచున్నది. అనగా దీనివలన స్వరాజ్యమను పదమునకు రాజకీయదృష్టిలోగల ప్రాముఖ్యముమాత్రమే స్పష్టపడుచున్నది. కాని నిజమునకు స్వరాజ్యమనుపదమునకు రాజకీయముగనేకాక, ఆర్థికముగ, సాంఘికముగ, వైజ్ఞానికముగ యిట్లే మరి పెక్కురీతుల చాల ప్రాముఖ్య మున్నది. !

అన్నిరీతుల స్వరాజ్యమునకు గల ప్రాముఖ్యమును విపులముగ చర్చించుటకు ఈచిన్నివ్యాసమున వలను పడదు. అందుచే స్వరాజ్యము సిద్ధించుటవలన ప్రజలకు లభించు కొన్ని హక్కులను, స్వాతంత్ర్యములను, సౌకర్యములనుమాత్రమే క్రింద పేర్కొనుచున్నాను:

౧. ఎన్నికహక్కు

౨. వాక్స్వాతంత్ర్యము

౩. పత్రికాస్వాతంత్ర్యము.

౪ సమావేశ స్వాతంత్ర్యము

౫. నిర్బంధోచితప్రాథమిక విద్య

౬. ఉచితవైద్యసహాయము

౭. పరిశ్రమాగారములలో పనిచేయవలసిన కాల నిర్ణయము.

౮. నిరుద్యోగులకు సహాయము.

౯. వృద్ధాప్యమున భృతి.

౧౦. ప్రజాభీష్టము ననుసరించియే శిస్తుల నిర్ణయము.

౧౧. ఉప్పుపన్ను రద్దు.

౧౨. సైనికవ్యయములో తగ్గింపు.

౧౩. దేశీయపరిశ్రమలకు పరిపూర్ణమైన ప్రభుత్వ ప్రోత్సాహము.

౧౪. ఉరిశిక్షను తొలగించుట.

౧౫. వలసపోయిన భారతీయుల హక్కులకు రక్షణము.

౧౬. మూఢాచారములను రూపుమాపుట.

౧౭. వడ్డీనిర్ణయము.

౧౮. వ్యవసాయపుఖర్చులకు ప్రభుత్వము ఋణముల నొసగుట.

ఇట్లే మరిపెక్కు లున్నవి. వానినన్నిటి పేర్కొనుట దుస్సాధ్యము. కొంతవరకు అనవసరముకూడ,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈసందర్భములో నొక ముఖ్యమైనసూత్రమును జ్ఞాపకముంచుకొనిన చాలును. నేటి ప్రభుత్వదృష్టిలో కేవలము ప్రజాక్షేమమే ప్రధానముగ నెంచబడుచున్నట్లు తోచదు. కాని స్వరాజ్యప్రభుత్వ మేర్పడినచో ప్రజాక్షేమము దప్ప నురేదియు ఏసందర్భమునందును పరిగణింపబడదు.

అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, ఆస్ట్రియా, జపాను మున్నగు పెక్కు దేశములలో స్వరాజ్యమున్నను రాజ్యాధికారమంతయు-నిజమునకు.. ఏకొలదిమంది శ్రీమంతులచేతులలోనో చిక్కుటవలన ప్రజాబాహుళ్యపు కోర్కెలుగాని, క్షేమముగాని సిద్ధించుట లేదు. మనదేశములోగూడ నట్టివిపత్తు సంఘటించు సూచన లున్నవి. దీనినుండి - ముందుగానే జాగ్రతపడి - తప్పించుకొనకపోయినచో స్వరాజ్యము పరాధీనతకన్న అధ్వాన్నమై పోగలదు !!

ప్రజలే ప్రజాక్షేమముకొరకు రాజ్యభారమును వహించుటయే స్వరాజ్యము !!! దాని నొకజాతి మఱొకజాతికి ప్రసాదింపలేదు. నేడు ప్రసాదలబ్ధమైన స్వరాజ్యము రేపటికే ఊడిపోగలదు. ఏజాతి కాజాతి దానిని స్వశక్తిపై సంపాదించుకొనవలెను! స్వశక్తిపైననే నిలబెట్టుకొనవలెను !!

---



అద్దాల ఇల్లు, పుదుచ్చేరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కర్ర సామాను చిత్రములు



౧. సొరుగుల చిన్న బీరువా



౨. సొరుగుల బల్ల
(కూటమున నుంచుకొనునది.)



౩. కుర్చీ
(కూటమునకు).

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



४. పడకటింటిబల్ల
(నవారా అల్లినది)



౫. పడకటింటి కుర్చీ



౬. పడకటింటి అరలపెట్టె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రపంచదృక్పథము: ఫేసిజమ్

టి. వి. కృష్ణారావు, బి. ఏ.

ఇంగ్లండు దేశమునందలి స్త్రీ ఫేసిస్టుసంఘములు లెక్కకు మిక్కుటమైన సభ్యారాండ్రను కలిగియున్నవి. జపాను ఫేసిస్టుయువకసంఘముల నతిఉత్సాహముతో స్థాపించుచున్నది. సర్వసాధారణముగా ఇతరదేశములసంస్థలతో ఐక్యముకల్గించుకొనసేవగించు అమెరికాఫేసిజమ్‌నుగుఱించి భయభక్తులతో ప్రసంగించుచున్నది. వేయేల? నేటిఅమెరికన్‌ప్రసిడెంటగు రూజువెల్టు మూడువంతులు డిక్టేటరుపదవి చెలాయించుచున్నాడు. నిరంకుశాధికారమునకు అమెరికనులు జోహారొనర్చుటకు సంసిద్ధులైయున్నారు. జర్మనీలోని "హిట్లరిజమ్" ఇటలీదేశపు ఫేసిజమ్‌యొక్క మారురూపమేయగుచు అందందు హిట్లర్‌యొక్క నైజభావములను వ్యక్తమొనరించుచున్నది. అంతయేల? చిరకాలము ఫేసిజమ్‌మీద కత్తికట్టి శత్రుత్వమును సాధించినరష్యా—కమ్యూనిజమ్‌ఉద్ధరణకొఱకు కంకణముధరించిన రష్యాయే—ఫేసిస్టునాయకుడగు ముస్సోలినీతో సమాలోచనల సల్పుటకు లిట్వినాఫ్‌గారిని పంపినది. పార్లమెంటుప్రభుత్వమున కాదట యనబడు ఇంగ్లండు సర్. జాన్‌సైమన్‌గారిని రాయబారమొనర్చుటకుఇటలీకి ప్రయాణముకట్టించినది.

ఇరువదిసంవత్సరములకుపూర్వము కనివినియెఱుంగని "ఫేసిజమ్"అని పిలువబడు యీనూతనరాజకీయసంస్థ నేడు ప్రపంచపరిణామ మొనర్చుచు దిగంతవిఖ్యాతి నొందుటకు హేతువేమి? ఇంత స్వల్పకాలములో నిట్టిపలుకుబడి సంపాదించిన దీని కలరూపును, గుణాగుణములను, దాని ఉత్పత్తికాలమునాటి పరిస్థితులును, భవిష్యత్తును సత్యాన్వేషణపరులు గమనించుట సమంజసము.

నామమాత్రముననే ఐహికాతీత మగు వింతభావముల తోపింపజేయుదేశము ఇటలీ. హోమరునాటినుండి నేటివరకు జనబాహుళ్య మబ్బులుచాచి మనోవికాసతకొఱకీదేశము వంక చూచుచునే యున్నది. ట్రోజన్లు, ఫోనీషియన్లు, గ్రీకులు, ఉత్తరదేశపుమోటు తెగవారలు—వీరందరుకృతాంజలులై ఇటలీనుండి నాగరికతాభిక్ష గైకొన్నవారే! అనేక శతాబ్దములనుండి ఐరోపాఖండము నాగరికత కాటపట్టయి మనోవికాసము కల్గించుటలో మార్గదర్శకమై యున్నది. మఱియు, వర్తకవ్యాపారమందును నౌకా దిగ్విజయములందును, ఖగోళ భౌతికనైతిక శాస్త్రములందును ముందంజవేసినది ఇటలీ. వర్తమానకాలమునందు, ఫేసిజమనెడిజెండా పూని అఖిల ప్రపంచమును నూతనరాజకీయసాంఘికనిర్మాణమునందు నడపుచున్నది.

నూతనోదయమైన ఏసంస్థమైనను నాయకుని వర్చస్సు, ఆత్మపరిశుద్ధత మున్నగు గుణ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములపై ఎక్కువఆధారపడును. నాయకుడు తన అనంత అసమానవాగ్ధోరణ్యాదికౌశల్యము లచే ప్రజాసామాన్యమును మాంత్రికబల ముతో వశవర్తులనుగా జేసికొనును. అట్టి అదృష్టశాలియగు నాయకోత్తముడే బెనిటో ముస్సోలినీ మహాశయుడు; ఫేసిజమ్‌కు ప్రాణ ముపోసిన దిట్ట. లేబ్రాయమునుండి రష్యను సాంఘికత్వమును, లిఖితరూపముననుండి ఆ చరణకలితమగుదానిసూత్రములను, ఇటలీలో అదిప్రవేశించినపిమ్మట స్వదేశమున కది యొనర్చినమెగ్గును ముస్సోలినీ కడుఓపికతో గమనించెను. అదనుకై వేచియుండి, సమయ మేతెంచినప్పుడు సంసిద్ధుడై తన భీమముష్టి ఘాతమును పిడుగువలె తాకించెను.

యుద్ధానంతరము ఇటలీలోని దుర్బల రాజకీయపరిస్థితులు, దారిద్ర్యపీడ, పెట్టుబడి దారులకును, పనివాండ్రకును కల్గెడికక్షలు దానివలన జనించిన వ్యాపారమాంద్యము, అప్పటి నిట్టీపరిపాలనసమర్థత, — యీపరి స్థితులయందే ఫేసిజమ్ తనవ్రేళ్లను పాదు కొల్పినది. దేశభక్తిపూరితులగు ఇటలీయువక యోధులు దేశదారిద్ర్యావస్థకు దురపిల్లి, వ్యయప్రయాసల కిసుమంతయు వెఱువక దేశ విముక్తికొఱ కెట్టిసాహసకార్యమైన చేయు టకు నడుముకట్టి సంసిద్ధులై దేశమునం దచ్చటచ్చట ఫేసిస్టుసంఘములను స్థాపించిరి. నానాటికి నాయకుడగు ముస్సోలినీవాక్చాతు ర్యము లెక్కలేని దేశభక్తులను వృద్ధసైనికయో ధులను ఫేసిజముకు దాసుల చేసెను. ఫ్యాక్టరీ (కర్మాగారపు) పనివాండ్ర అనర్థకసమ్మెలచే కల్గువ్యాపారమాంద్యమును నిట్టీ ప్రభుత్వము పాపలేక మిన్నకున్నప్పుడు, ముస్సోలినీ సమ్మెదారులను బలవంతముగ పనిలో చేర్పిం చెను. దేశదుర్భిక్షము తొలగిపోయెను. ఫేసిస్టు లనిన భయభక్తిగౌరవములు మెండాయెను. ద్విగుణీకృతోత్సాహముతో మార్చి 28, 1922 లో, ఫేసిస్టుయోధులు నల్లచొక్కా లతో రోమునగరముమీద దాడివెడలి, యేకష్టమును లేకయే జయలక్ష్మిని గైకొనిరి. పూర్వపు రాజుస్థానే ముస్సోలినీ వచ్చెను. పూర్వప్రభుత్వము పోయి ఫేసిస్టుగ్రాండు కౌన్సిలు యేర్పడెను. ఫేసిజమ్‌కు యీసందిగ్ధ సమయమే కడుకష్టకాలము. ఇట్టికాలములో ఎందరు తమప్రాణములను తృణప్రాయముగ ధారవోసిరో, మఱెందరు దేశభక్తులు అఖండ త్యాగములు సల్పిరో ఇచ్చట వేర్వేర పేర్కొనచూచుట అసాధ్యమగుపని.

కాని పూర్వపరిపాలన విధ్వంస మొనరించినంతనే ఫేసిజమ్ తనకార్యభారము వదలెనుకదా యని చంకలు కొట్టుకొనలేదు. బలమైన పునఃప్రభుత్వప్రతిష్ఠ, శాంతిస్థాప నము అత్యవసరమగు కార్యక్రమము. రష్యా సాంఘికత్వము ఇటలీదేశస్థులకు రుచించక పోవుటకు కారణములు లేకపోలేదు. వారి స్వభావాభిరుచులకు అది నిర్మింపబడలేదు. ఇటలీవారు ఆస్తివంశగౌరవములందు అభిమా నము కలిగి నాయకత్వమునకు శిరస్సొగ్గెడినైజ స్వభావమును కలిగియున్నారు. డాంటి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైకవెల్లీ, హోమర్ మున్నగుదివ్యరాజనీతిపరులకన్న యశస్వి తమ దేశమాతయనియు, రాజ్యతంత్రముల పన్నుటయందు తమవిధానములే శ్రేయస్కరమైనవనియు, భావికార్యనిర్మాణమును ప్రవేశపెట్టుటకు తమకుతప్ప అన్యులకు సమర్థత లేదనియు నమ్ముదేశభక్తులు. ఇట్టిపరిస్థితులలో సాంఘికవాదసూత్రములనెడి శీలలతో రష్యాపెట్టు సమ్మెటపెట్టులను ఇటాలియన్లు సహించకపోవుట ఆశ్చర్యకారణము కాదు. దూరదృష్టికల ముస్సోలినీ, ఇటాలియన్‌హావభావముల కనునగురీతి తనఫేసిజమ్‌ను నిర్మించుటకు తగు శ్రద్ధ తీసుకొనెను. ఉత్పత్తిశాస్త్రవిమర్శలతోను, కార్యక్రమములతోను ఫేసిజమ్‌కాలము వెళ్లపుచ్చలేదు. సమస్యలను వచ్చినవి వచ్చిన ట్లెదుర్కొని విముక్తివిధానముల చర్చించుటయే ఫేసిజమ్ ముఖ్యోద్దేశము. పూర్వాచారసిద్ధాంతముల నొక్కపెట్టున విధ్వంసమొనర్చి "నూతనత్వము, నవీనము" అని ఉట్టి కెగురకపూర్వమే స్వర్గారోహణకు ఫేసిజమ్ ప్రయత్నించదు. మీదుమిక్కిలి పూర్వాచారములను పోషించుటకును, కాతలిక్ సూత్రముల దృక్పథమునం దుంచుకొని పూర్వీకుల దివ్యవాసన కల్గియుండుటకును ఫేసిజమ్ పాటుపడును. మైకవెల్లీయొక్క ఆదర్శములను, మేజినీయొక్క దేశభక్తిని, గారిబాల్డియొక్క ధైర్యస్థైర్యములను కలిగిన ఫేసిజమ్ మెట్టుప్రక్కకు మ్రొగ్గక సరిగా ముల్లు చూపుచున్నది. దేశాభ్యుదయమే ఆదర్శముగాగలిగి, సంఘువాదములకు గాని తెగలకక్షలకుగాని ఎడమీయక, సంఘతారతమ్యములు కలవనియు, నైతికతారతమ్యము లుండుటచే వ్యక్తిత్వతారతమ్యము లుండకతప్ప దనియు దాని సిద్ధాంతము. కావుననే ప్రజల ఆస్తి వివరణమునందు ప్రభుత్వము జోక్యము కల్పించుకొనకూడదనియు, ఆస్తిని సమానవిభజనము చేయుట మున్నగు సాంఘికవాదుల సలహాలు అక్రమములనియు ఫేసిజమ్ గాఢతర నమ్మకము. దేశగౌరవమును కాపాడుటకు ప్రజ యెంతత్యాగమేని చేయ సిద్ధమై యుండవలెననియు, మఱియు ప్రజను సక్రమమార్గమున నడపించుటకు నుక్కానివలె నాయకు డొకడుండక తప్పదనియు నిర్ణయించినది. కావుననే డిక్టేటర్ ముస్సోలినీ నిరంకుశాధికారమునకు ఇటాలియన్లు తలలొగ్గిరి. కారణము వారినైజమున కెంతయు అట్టి అనుభవము తగియుండుటయే. ఆస్తివిభజనమునందు ప్రభుత్వజోక్యము లేనందున, ఆస్తి-గౌరవపూరితమనస్కులగు ఇటలీవారల కది ముదావహము. కాని దీనిని పట్టి, ఫేసిజమ్ ధనవంతులతరగతికి పక్షపాతము చూపినదని తలంపరాదు. పన్నుల విధించుటయందును, యితరఅవసరపరిపాలనాకఠినవిధానములందును ధనవంతుల తరగతి మొగమాటములేక వ్యవహరించబడెను. అందుచేత పాటుపడువారికి పెట్టుబడిదారుల


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందును, ధనికులయెడలను మత్సరముండు టకు తావు లేకుండ చేయబడినది. విప్లవ ములను, కక్షలను అడంచుటకు వీలైనఎడల దార్ఢ్యవిధానమును వహించుటలో ఫేసి జమ్ కరుణచూపదు. "తస్కరుని అభిమత మును నిరసించుటకు దార్ఢ్య మెంతఆవశ్య కమో దేశములో శాంతిస్థాపనార్థము మా పవిత్రదార్ఢ్యమును అంతఅవసరమే" నని ముసోలినీగారు చెప్పిరి. పూర్వ పాశ్చాత్య నాగరికతయందు నమ్మకముంచుటచే ఫేసి జమ్ భూతవర్తమానములను సమన్వయించి నది. ఇట్టికలయిక నేర్పునందే ఫేసిజమ్ పునాది గట్టిగ నాటపడియున్నది. ఒక్క పెట్టున ఆచారవ్యవహారములను తారుమా ఱొనర్పక, మెట్టుమెట్టుగా పునర్నిర్మాణ ముకు పూనకడంగుటచే, పురాతన సిద్ధాంత ముల బ్రోచు ఫేసిజమ్ వెగటు తోపనీయదు. స్వదేశమునం దైకమత్యము నుద్బోధించుచు, అంతర్జాతీయసమస్యల విడదీయుటలో సహ కార మపేక్షించుచున్నది.

మాతృదేశమునందు జాతీయతాభావ ము నెలకొల్పుచు, మఱియొకచక్కి ఉచిత వ్యాపారము అంతర్జాతీయభావిఔన్నత్యము నకు కారణభూతమని వాపోవుచున్నది. టారిఫ్‌గోడల బలీయముగా నిర్మించి "సంర క్షణవిధి" యని అనదు. ఒండొరులలో నానా జాతులు సహాయసహకార విశ్వాసములుం చుట ఐకమత్యఆదర్శమున కెంతోకాంక్షణీయ మనును. ఇట్టిసువర్ణాభిమతమును కల్గియుం టచేతనే ఫేసిజమ్ విదేశజాతుల మానస ములకూడ చూరకొన్నది. హిట్లరిజమ్‌న కును దీనికిని గలభేద మిదియే. ఒకవంక నిరంకుశాధికారమును గౌరవించుచూ, మఱి యొకతెన్ను నప్రజాపరిపాలనను సమర్థించును.

ఇటలీదేశము దారిద్ర్యావస్థయందుచిక్కి యున్నతఱి, అప్పటిప్రభుత్వ మరాజకమై దేశపీడ తొలగించు నుపాయము లన్వేషింప అసమర్థత కనబరచినసమయమున, ఫేసిజమ్ దేశములోని కంటకముల నాపూాలము పెక లించి ఎల్లెడల శాంతిస్థాపన మొనర్చెను. మఱియు ప్రజ లామోద మొసంగురీతి వారి దేశకాలనైజములు పరిశీలించి పునర్నిర్మాణ మునకు గడంగెను. సాంఘికత్వము, ప్రజా స్వామికత్వము, శాంతిస్థాపన మొనర్పుటకు విముఖులై వెనుకాడి అసమర్థత ప్రకటించి నపుడు, ధైర్యసాహసములతో అనంతత్యాగ మొనర్చి శాంతిదాంతుల చిరస్థాయిగ దేశ మున నెలకొల్పినది. మఱియు దేశభావిభా గ్యోన్నతికిని, స్వజాతీయతాభిమతమును పెం పొందించుటకును అనువగు బ్రహ్మాండమైన సంస్థల నెల్లెడల స్థాపించి ఉచితరీతి దేశ క్షేమకార్యనిర్వహణ మొనరించినది. కళ, సంగీతసాహిత్యములు, వ్యాయామప్రయాణ వసతులు, ప్రజాసామాన్యమునకును అందు లో పాటుపడి జీవించుతెగలవారికిని సులభ ముగ అందుబాటులో నుండునట్లు ఏర్పాటులు చేసినది. ప్రజోపయోగార్థము పెక్కుగ్రం థాలయములు స్థాపింపబడినవి. బాలింతల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శరణాలయములు, తల్లితండ్రులులేని బాల బాలికల శరణాయములు ప్రతిచోటను నెల కొల్పబడినవి. నిరుద్యోగసమస్య తొలగించు టకు ప్రభుత్వ మన్నివిధముల పాటుపడు చున్నది. తరగతికక్షలు (Class struggles) రూపుమాపబడిఐకమత్యము(Co-operation) వానిస్థానే ప్రవేశపెట్టబడినది. ఇటలీకి ఫేసిజ మొనర్చినమేళ్లిట్టివి యెన్నియోకలవు.

ఇటలీ ఆర్థికపరిస్థితు లిప్పటికిని పూర్తిగ చక్కబడకపోయినను ఇటలీవాసులు వానిని ఎంతక్లిష్టముగనున్న అంతసాహసోత్సాహ ములతో నెదుర్కొనుటకు సంసిద్ధులుగ నున్నారు. వారి కిట్టిబలమును, స్వశక్తివిశ్వాస మును సుగుణోపేతమగు దేశభక్తిని కల్పించి నది ఫేసిజమ్. ఇటాలియనుల మాతృదేశభక్తి గాంచుచో, వారి త్యాగదృష్టినిపరిగణించుచో ఫేసిజమ్ చిరస్థాయిగ నుండిపోగలదని నమ్మ కమును కల్గించుచున్నది.

మైకవెల్లి, మాజినీ, ముస్సొలినీ ముగ్వు రునూ ఇటాలియన్ జాతీయత్వమునకు జీవిత మును ధారపోసినవారే. అదృష్టహీనుడగు మైకవెల్లీ కడుబికారిగా మరణించెను. తన నామము చిరస్థాయిగ ఇటలీదేశచారిత్రము నందు సువర్ణాక్షరములచే చెక్కబడునని అతడు కలలోనైన తలచియుండలేదు. మేజి నీసైత మట్టిఅవస్థలోనే అజ్ఞాతవాసములో నంతరించెను. కాని ముస్సోలినీయన్ననో దిగంతవిఖ్యాతి వెదచల్లుచూ ఇటలీనిర్మాణమున మాత్రమేకాక అఖిలప్రాపంచికనిర్మాణము నందే పాల్గొనుచూ కృతకృత్యుడై ఇటలీరథ సారథియై అంతర్జాతీయవ్యూహములో జయ శీలు డగుచున్నాడు. దేశభక్తులలోనేకాక కార్యకుశలులలోకూడ శిరోభూషణ మన దగిన అదృష్టశాలి.

అయినను ఫేసిజమ్ ప్రచండవిమర్శనా ఘాతములనుండి తప్పించుకొనలేదు. భావి కార్యక్రమము లిఖితరూపకముగ లేకుండుట క్లిష్టసమయములలో సత్వరముగ కార్యరంగ మునకు గడంగుట కాటంకమనువిమర్శన. బలవత్తరమైన కార్యక్రమముల గోడలతో నూతనసంస్థాభివృద్ధిని అరికట్టజూచుట శ్రేయ స్కరము కానేరదు.

ఇటాలియన్లు స్వరాజ్యమున కనర్హులగు టచే ఫేసిజమ్‌యొక్క నిరంకుశవిధానములకు మోకరిలియున్నారనియు, ఏనాడు వారు స్వరాజ్యపదమున కర్హులగుదురో ఆనాడే ఫేసిజమ్‌న కుద్వాసన మొసగుదురనియు రెండవవాదము. స్వరాజ్యపదమున కన్నివిధ ముల అర్హులగుదేశీయులే ఏళ్లాదిగ అమలు లోనున్న ప్రజాస్వామికప్రభుత్వమును నిర సించి విసర్జించు యీ ఇరువదవశతాబ్దములో ఇట్టినెపము నారోపించుట భావ్యముకాదు. మానవస్వభావము ఏచరిత్రయందైనను ఒక్క రీతిగనే యున్నది. ప్రజాస్వామికప్రభుత్వము నందుకూడ కొందరు నడపువారును మరికొంద రనుసరించువారును కలరు. అధికారము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వహించుట కెంతకుతూహలమును కల్గియు న్నదో అనుసరించుటకుకూడ మానవస్వభావ మంతటి ఉత్సాహమునే కనుపర్చుచున్నది.

తరగతికక్షలంతగాలేకపోయినను గోరంతను కొండంతచేసి రాజకీయపరికరము క్రింద ఫేసిజమ్ ఉపయోగించినదని మఱి యొకనింద. అట్లొకవేళ ఉపయోగించినను కక్షలన్నిటిని రూపుమాపి ఐకమత్యస్థాపన మొనర్చిన ఫేసిజమ్ అంత్యమున ధన్యవాదము నకే అర్హమయినదనవచ్చును.

చట్ట-నిబంధనములు కాఠిన్యములనియు అందలిక్రూరత్వము గర్హ్యమనియు యింకొక విమర్శ. ఒకానొక నూతనప్రభుత్వము ప్రతిష్ఠించినప్పుడు, అది కాలూదినిలచుపూర్వము అద్దాని సంరక్షణార్థము క్రౌర్యప్రకటన కొంత అవసరమేయగును. క్రమేపి కఠినవిధాన మంత రించనగును.

ఫేసిజమ్‌లో మేధావంతులకు స్థాన మొసగబడలేదనియు, లలిత కళ లుడిగినవనియు, కళాకోవిదులు అన్యదేశములకు వలస పోయిరనియు మఱియొకఅపవాద కలదు.

దేశ మరాజకముగనుండి ఆందోళన కాలవాలమైనతఱి లలితకళలు సన్నగిల్లుట సర్వసామాన్యమే అయినను ముసోలినీగారు ప్రాక్ దేశీయవిద్యార్థుల కాహ్వానమంపుట, "మనకళను మనమే సృష్టించవలెను. ఫేసిస్టు కళ నూతనత్వముతో శోభిల్లవలెను" అని తెలుపుట, వీనినిబట్టి ప్రమాదావస్థ తొలగిన దనియే తలపనగును.

ఇటలీయందలి దుర్భిక్షదినములలో ఫేసిజమ్ తలయెత్తినదనియు, శాంతినెలకొన్న పిమ్మట ప్రజాస్వామికప్రభుత్వము పునఃప్రవేశమగుననియు మఱికొందరివిమర్శకుల మతము. దుర్భిక్షను తొలగించి శాంతిస్థాపన మొనర్చుటలో ఫేసిజమ్‌పడినపాటు సువిదితమే. అట్లు శాంతిస్థాపనమే దాని సుగుణపుంజమై, క్రమేణ విజాతీయులనుకూడ తనమతములోని కాకర్షించగల నూత్నశక్తిని పొందుననని ఏల తలపరాదు?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# స్త్రీలు — విశ్వవిద్యాలయములు

శేషగిరిరావు పట్నాయక్, బి. యే.

భారతదేశమున స్త్రీవిద్యాప్రచారములు సల్పురోజు లంతరించినవి. దేశమున నన్నిదిశలను, స్త్రీవిద్యాశాలలు, సారస్వతసమాజములు, స్త్రీహితైషిణీసమ్మేళనములు ప్రబలి మహోన్నతిని సూచించుట మోదావహము. పురుషులతో బాటు స్త్రీలకును, రాజకీయ, ఆర్థిక, మత, సాంఘికచర్చలలో సమానావసరము కల్గినదని మహిళాలోకము నేడు గ్రహింపగల్గుటకు వారు నేటివరకు సముపార్జించిన విజ్ఞానమే చైతన్యమునుగూర్చెనని ఎంచవలెను. పరిణామశక్తి, తన్మార్గదర్శినియు నగు కాలచక్రచలనము ఈమార్పునకు కారణమని కాలతత్త్వజ్ఞులు నిరూపించినను; కొంతవరకైనను నిది విద్యావిజ్ఞానసంజనిత "స్మృతి" (Consciousness) యని మన మెంచవలెను.

విద్యావిధానము కాలగతిచే జనించు శక్తికిని (Time-Spirit) క్రమచలననైజము గలిగిన మూర్తిమత్త్వమునకును (Personality) అనుగుణముగను, అనుసరణముగను నేర్పడినదేకాని, విద్యయొక్క ప్రయోజనమును మనము బడయజాలము. పురుషునియొక్క కాని, స్త్రీయొక్క కాని, విద్యావిధానరూపమును జిత్రించుచో మొదటనే మన మా 'విధానమును' శాఖలుగా విభజించి, ఒక్కొక్క తరగతి (Stage) పైతరగతికి జేరి, తుదిని, మూర్తిమత్త్వమును శోభాయమాన మొనర్చునట్లొనరింపవలెను.

సహజముగ నలవడు స్త్రీయొక్క కార్యనిర్వహణశక్తి, చాకచక్యము తననిజగృహావరణమును దాటి వేర్వేరుదిశలకు ప్రసరింపజేయుట వర్తమానయుగమునకు ముఖ్యావసరమై యున్నది. జీవితసందిగ్ధసమస్యలలో వారిని కార్యధురీణలగ నొనరిచి, కష్టపరంపరలలో వలయు సహనశక్తుల నొసంగి ఆదర్శప్రాయలను సాఫల్యవతులనుగ జేయుట, వారుపొందు విద్యయొక్క ప్రధానకర్తవ్యము. మానవుని బాహ్యజీవితమున కనుబంధించిన వివిధరంగములందును స్త్రీవ్యక్తికి పాల్గొననిచ్చినచో అందు వినియోగింపబడు కార్యపరతంత్రత, కార్యదీక్ష పురుషప్రజ్ఞాతుల్యము లగుననుట కెట్టిసందియము లేదు. పురుషప్రయత్నమునకు చేదోడువాదోడై కార్యకృత్యములకు స్త్రీ పరిపూర్తియొసంగుచుండును. పుట్టుకవలనను, గుణములవలనను స్త్రీ కొన్నిసందర్భములలో వేర్వేరుపరిస్థితుల కనుకూలముగ నగుపడినను, జీవితరంగమునమాత్రము స్త్రీ వ్యక్తిత్వము పురుషతుల్యముగ రాణించుననుట సత్యదూరము కాదు. భావికాలమున స్త్రీ లింకను విరివి, విశాలములునైన విషమసమస్యల నెదుర్కొనవలసియున్నది. వెలుపలికి వచ్చి బాహ్యప్రపంచమున వారుచేయవలసిన కార్యములు చాలగలవు. కాన కష్టనిష్ఠురమైన అసౌఖ్యజీవితమునకు వెనుదీయక, దీర్ఘములై వచ్చువిషమసమస్యల నెదుర్కొనుచు, సర్వకార్యధురీణలై అవసరక్షణమునకు వారు తగియుండవలెను. విశ్వవిద్యాలయములలో స్త్రీలకు ప్రత్యేకప్రణాళిక లేర్పడుట ఉచితమా లేక, పురుషవిద్యావిధానమునకే వారినిగట్టుటయా" అనువిషయము చాలకాలమునుండి తీవ్రతరమగు వాదోపవాదములకు గురియై ఇప్పటికిని స్థిరపడకున్నది. అసలువిద్యాప్రణాళికలే పూర్తిగ పరివర్తింపబడవలయునని సర్వజనాభిప్రాయము సూచించుచున్నది. ప్రణాళికలు పరివర్తింపబడినను స్త్రీలకు ప్రత్యేకవిధుల నేర్పరచి, తదనుసారముగ విద్య నొసంగవలెనని కొందరియభిప్రాయము. పురుషసమానలై స్త్రీలు, అన్నిహక్కులను గలిగియుండ, వారికి ప్రత్యేకవిధాన మనవసరమనియు, పురుషవిద్యావిధులనే విద్యలబడయుదురనియు, స్త్రీశ్రేయోభిలాషుల సూచన. తుదియభిప్రాయము, ఆధునికసంప్రదాయశీలురకు చాలప్రతికూలముగ దోచును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాచీనము, నవ్యము అనుపాక్షికము లేక దేశకాలపాత్రల ననుసరించి, విద్యాప్రణాళిక లేర్పడినచో విద్య యొక్క ప్రయోజనము సార్థకమగును.

విశ్వవిద్యాలయముయొక్క ఆశయము నాగరకతాభివృద్ధి (Cultural development) అని వివిధ మతములవారు ఒప్పుకొనినదే. నాగరకతకు స్త్రీపురుష భేదము లేదు. కావున దానివలన నీరెండుజాతులవారు బడయు వివిధములగు ప్రయోజనముల తత్త్వ మొక్కటియే. అనుట, స్త్రీలను ప్రత్యేకవిద్యావిధులకు నియమించవలె ననుటకు కారణ మగపడదు. విశ్వకలాపరిషత్ప్రవేశమున కుద్యుక్తులగు బాలబాలికలకు ప్రత్యేకాభిరుచిగల విషయములను చేకొని, వానిలో సామర్థ్యము గాని, పాండిత్యముగాని బడయుటకు తగినంత స్వేచ్ఛ నొసంగుటకు పాఠశాలల ప్రణాళికలు పాటుపడవలెను. వాస్తుశాస్త్రాదిసాంకేతికవిద్యలయం దభిరుచి భారత మహిళల కంతగా లేదు. చరిత్ర, ఆర్థికశాస్త్రము, గణితము, వేదాంతము, శాస్త్రములు (Sciences) మొదలగు సామాన్యవిషయముల (General Subjects) ను చేకొనినచో వ్యక్తియొక్క విద్యాబుద్ధులు సచ్ఛీలద్యోతకములు, సునిశితములు నగును. సామాన్యవ్యక్తికి ఈ విషయములు జ్ఞానవికసన మొనరిచి, సంకుచితములగు పూర్వభావముల కసంకుచితపరిణామము నొసంగును. పైవిషయముల నలవరచుకొను పురుషులకును ప్రయోజన మదియే. స్త్రీలుమాత్రము పురుషవిధానములనే విద్య బడసి అమూల్యములగు అట్టిప్రయోజనములనే ఏల బడయరాదు ?

## వృ త్తి వి ద్య లు

వృత్తివిద్యల యాశయము సామాన్యవిద్యవలె గాక భిన్నముగ నుండును. అవి వ్యక్తుల నాయానిశ్చిత వృత్తులకే నియమించి, సంకుచితజ్ఞానులుగ నొనరించును. పారిశ్రామికవిజ్ఞానలేశదేశమగు మనదేశమున వృత్తివిద్యల నైన స్త్రీపురుషాదు లితుతెగలవారను వివక్షతలేక అలవరచుకొనుట ముఖ్యావసరము. స్త్రీలు ప్రత్యేకముగ తమస్వభావార్హతలనుబట్టి ధాత్రీవిద్య, పాకశాస్త్రము, కుట్టుపని మొదలగువాని నభ్యసింపదగును. కాని వానిని విశ్వవిద్యాలయ సామాన్యవిషయములతో జేర్పక, పైగా వ్యక్తియొక్క యిష్టమునకు విడువబడినచో ఆదరింపదగును. గుణస్వభావములచే స్త్రీ లభ్యసింపదగిన విజ్ఞానవిషయములను చేతివ్రేళ్లతో లెక్కింపవచ్చును. స్త్రీలకొఱకు నూతనవిషయములను సృష్టింతు మన్న, నదియు సామాన్యమగునది కాదు. అట్టినిర్మాణమునకు చాలకాలము పట్టును. స్త్రీ విజ్ఞానమున కుపయుక్తమగువిషయము లసలే చాలతక్కువగ నున్నవి; వానిలో లలితకళలు స్త్రీపురుషులిరువురచే నాక్రమింపబడినవి. చిత్రలేఖనము, సంగీతము స్త్రీస్వభావమును స్ఫురింపజేయునవి. కాన వారినైజమున కవి ప్రత్యేకానుగుణ్యముగ నుండునని మన మెంచుటయే కాని, ప్రపంచమున చిత్రకళానిపుణులు, కవితాపితామహులు, సంగీతవిద్వాంసులు పురుషులలోనేకాని, స్త్రీలలో నెట్టిసుప్రసిద్ధులను గానము. కాన సంగీత, చిత్రలేఖనములను స్త్రీ లవసరవిషయములని యెంచు టెంతయు సహజము.

## గృహ నిర్వహణము

గృహనిర్వహణశాస్త్రమువలననే భావిగృహములన్నియు, విచిత్రమైన యొకపరిణామమునకు గుఱియగునని స్త్రీసంస్కారిణులచే అంచనావేయబడుచున్నది. స్త్రీవిద్యలో గృహనిర్వహణముయొక్క స్థాన మెట్టిది? అను ప్రశ్నకు మొదట మనము సమాధాన మొసగవలెను. గృహనిర్వహణము స్త్రీ లలవరచుకొనదగిన ప్రధానవిషయములలో నొకటి; స్త్రీవిద్యలో దానిస్థాన ముత్తమము: ప్రాథమికము. ప్రాథమికస్థానము నాక్రమించుటచే, దీనిని విశ్వకలలవలె ప్రధానపఠనీయాంశముగ ఉన్నతస్థానమున జేర్చుటకంటె పునాది విద్యావిషయములలో ప్రధానపఠనీయాంశముగ నుంచు టెంతయు సుకరము. విశ్వవిద్యాలయవిషయములలో దానిని జేర్చినచో మన మనుకొనునంత ప్రయోజనమును బడయజాలకుండుట నిశ్చయము. గృహనిర్వహణశాస్త్రము వ్యక్తియొక్క విజ్ఞానసంపత్తి కితరశాస్త్రములవలె లాభకారి కాజాలదు. విశ్వకలాపరిషద్విద్యలను బడసిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్త్రీ లేకొలదిమందియో ప్రతిసంవత్సరము పైకివచ్చుచుండ, వారాశించు స్వతంత్రజీవన వృత్తులకైనను నుపకరించుననుట సందేహాస్పదము. చాలమంది స్త్రీలు విద్యావతులైనను గృహిణులగుటవలన విశ్వవిద్యాలయములలో ప్రవేశింప వీలులేకున్నది. గృహనిర్వహణము విశ్వవిద్యాలయవిషయములలో జేర్చినచో అధికసంఖ్యాకు లలవరచుకొనుట కవకాశము గలుగదు. ఇతరశాస్త్రములవలె గృహనిర్వహణవిద్య విపులవిషయము కాకపోవుటచే విశ్వవిద్యాలయప్రణాళికలో జేర్చుట కంతయు తగి యుండదు. కావున నీశాస్త్రముయొక్క పూర్తిప్రయోజనమును బడయవలెనన్న దానిని పూర్వవిశ్వకలాపరిషత్ప్రణాళిక (Pre-university Scheme) లో జేర్చుటయే లాభగోచరమగు మార్గము. గృహనిర్వహణశాస్త్రముక్రింద వచ్చు కుట్టుపని, వస్త్రపరిశుభ్రవిద్య, (Laundry) పాకసూత్రములు, ఆహారపదార్థవిజ్ఞానము, ఆరోగ్యసూత్రములు నిర్బంధవిషయములుగ మాధ్యమికవిద్యాప్రణాళికలోను, ఉన్నతపాఠశాలలవిధానములలోను చేర్చుట శ్రేయము. పూర్వవిశ్వకలాపరిషత్ప్రణాళిక లీవిధముగ పరివర్తింపబడినచో, విశ్వవిద్యాలయములకన్న నెక్కుడుగ నుండు పాఠశాలలలోని విద్యార్థినులలో గృహనిర్వహణవిజ్ఞానము దీర్ఘముగ ప్రచారమొనర్పబడు ననుట కెట్టియాటంకము లేదు. ప్రతిగృహమును నలంకరించు నాయాగృహిణులు సార్థకనామధేయలై గృహసామ్రాజ్యము నేలుట కంతయు తగియుందురు... బాల్యము ముగియకయే, చాలమంది తమవిద్యాభ్యాసమునకు వీడ్కోలొసంగుట మనదేశమున పరిపాటియైనది కావున, సాధ్యమగునంతవరకు, వారికి యౌవనదశ ప్రాపించులోపల ప్రాథమికవిషయములలో నత్యున్నతసామర్థ్యమును (Maximum effeciency) బడయుటకు వీలగునట్లు ప్రాథమిక విద్యాప్రణాళిక లేర్పడవలెను. విద్యార్థిని ఉన్నతకళాభ్యాసమును గొన నభిలషించుచుచో, తనకు ప్రత్యేకాభిరుచిగల విషయములనే ఎన్నుకొనుట కెట్టి మార్పు గలుగుటవలన నవకాశముండును.

గృహనిర్వహణశాస్త్రమునకు విజ్ఞానాధిక్యము లేకపోయినను, గృహస్థాశ్రమమున కత్యంతోపయోగకారి యగుటచే నావిషయమునకు గౌరవప్రాధాన్యముల నొసంగవలెను. ఉపాధ్యాయినులుగ జీవించువారికి, ఉపాధ్యాయినుల తర్ఫీదుచేయువారికిని గృహనిర్వహణ విజ్ఞాన మవసరము. ఢిల్లీలో నెలకొల్పబడిన లేడీఇర్విన్ కళాశాలలో పాకము, ధాత్రీవిద్య, వస్త్రశుభ్రవిజ్ఞానము, గణితము మొదలగువిషయములలో ప్రత్యేక శిక్షణ మొసంగి ఏటేట ఉపాధ్యాయినుల తర్ఫీదు చేయుచుండుట ప్రతిరాష్ట్రమునకు ఆదర్శప్రాయము. విశ్వకలాపరిషద్విద్యావిధానముతో సంబంధ మేమియు లేక ఇట్లే, లండన్ నగరమున కింగ్సుకాలేజిలో గృహనిర్వహణశాస్త్రమున ప్రత్యేకముగ ఉపాధ్యాయినీశిక్షణము నే ఒసంగుచున్నారు. ఈవిషయమున ముఖ్యముగా ఉపాధ్యాయినులు, గృహనిర్వహణవృత్తిచే జీవించువారు, ధనికులఇండ్లలోని పరిచారికాబృందము, భోజనశాలలలోని కార్యదర్శినులు పరిశ్రమల నొనరిచి, తనువిధముల తర్ఫీదుల పొందుచుందురు. ఖండాంతర దేశములలోని స్త్రీ లభ్యసించువృత్తివిద్యలలో నీవిద్య ప్రధానమైనది. సంప్రదాయములకు కట్టుబడిన మనదేశపు స్త్రీ లిట్టివిద్య నభ్యసించి తమతమ గృహనిర్వహణమునకుమాత్రమే నియోగించుట సవ్యము.

పైనుదహరించిన గృహనిర్వహణవిషయములకు శిశుసంరక్షణ, జంతుదేహధర్మశాస్త్రము (Physiology) మద్యపాననిర్వచనవైద్యశాస్త్రము (Dietetics) మాతృయుక్తి (Mother Craft) అను విపుల విషయములను కూడ జేర్చి గృహిణులుకాబోవుప్రతి స్త్రీకి ముఖ్యావసరవిషయముగ పూర్వవిశ్వకలాపరిషత్ప్రణాళికలో పొందుపరచిన భావిసంతతికి జెందిన స్త్రీలు గృహస్థాశ్రమమున కామధేనువు లయ్యెదరనుటతిశయోక్తి గానేరదు. వివిధోపయోగాంశములసమ్మేళనమగు నీగృహనీతివిద్య నలవరచుకొనదలచు సుదతులకు ఉన్నతపాఠశాల లొసగు భాషాపరిజ్ఞానము చాలును. ఆధునికసంప్రదాయముల ననుసరించి స్త్రీలలో ప్రాథా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వివాహములు ప్రారంభింపబడినవి. కాన బాలికలకు యౌవన మంకురించువరకు (అనగా ౧౫ సంవత్సరముల వరకు) స్త్రీజాతి కుపయుక్తములగు నిట్టిప్రాథమికవిషయములను గఱచుట కవకాశ మొసంగవలెను. ఇట్టిఅవకాశమున కనుగుణముగ ప్రాథమిక, మాధ్యమికప్రణాళికలు సవరించి, ఉన్నతవిద్యాభ్యాసకాలపరిమితి స్త్రీలకొఱకు పొడిగించినచో చాలమంచిది. గృహనిర్వహణవిద్య సర్వజనాదరణీయమగుటకు హైందవాచారములకును, సాంఘిక ఆర్థికశీతోష్ణస్థితులకు యుక్తముగ, మాతృభాషలలో స్త్రీసమాజములు, కుటుంబభారములను వహించుచున్న గృహిణులకు పనిపాటులు లేనిసమయములలో గృహనిర్వహణాది ప్రధానసూత్రములను నేర్పుచు విరివిగ ప్రచార మొనర్పవలెను.

## లలితకళలు

స్త్రీలకు లలితకళల పరిచితి గల్గించుట విశ్వవిద్యాలయముల ముఖ్య బాధ్యత. గృహనిర్వహణశాస్త్రమువలెకాక, వీనికి విజ్ఞానగౌరవము చాలగలదు. లలితకళలలో చిత్రలేఖనము, సంగీతము కేవలము కృషితో కూడినవి కాక, సహజాభిరుచిపై నాధారపడినవి. ఇతరవిషయములవలె నివియు వారమున కొకగంటసేపు అభ్యసింపబడినచో పట్టుబడవు. ఇవి విజ్ఞానాభివృద్ధికై కాక, వృత్తిజీవనమునకును సర్వజనులు అభ్యసింపదగినవి.

విద్యావిధానము వీలగునంతవరకు మత, సాంఘిక, ఆర్థిక స్థితుల ననుసరించి, జాతీయతను స్ఫురింపజేయుచుండవలెను. విద్యాలయములు, తమశక్తికొలది దేశభాషాభివృద్ధికి పాటుపడి, విజ్ఞానవిషయములను సాధ్యమగునంతవరకు విద్యార్థులకు తమ మాతృభాషలలోనే బోధించుటకు ప్రయత్నింపవలెను.

వెనుక జెప్పబడిన విశేషములనుబట్టి, స్త్రీపురుషులకు ప్రత్యేకప్రణాళికలు పాఠశాలలోనేకాని, విశ్వవిద్యాలయములలో అసాధ్యములు నిష్ప్రయోజనకరములు అని మనకు తేటతెల్లమగుచున్నది. ఉన్నతకళలలో సహజాభిరుచి గలిగి, వానిలో ప్రత్యేకసామర్థ్యమును బడయ నభిలషించువారికే విశ్వవిద్యాలయములు కాని వానిలో స్త్రీల కొకప్రణాళిక, పురుషుల కొకవిధానము సృష్టింపబడుటకు కారణము లగపడకున్నవి. పూర్వవిశ్వకళాపరిషద్విధానముమాత్రము స్త్రీలకు ప్రత్యేకముగ నియమింపబడుట ప్రధానావసరము. కాన, భారతమహిళాగణములకు ప్రత్యేకముగ పాఠశాలాప్రణాళిక లేర్పడజేసి, వారికి విశాలవిజ్ఞానసముపార్జనమున కవకాశము భగవంతు డనుగ్రహించుగాత!

---

## ప్రార్థన గీతావళి

సబర్మతీ ఆశ్రమమునందు నిత్యపారాయణమునకు మహాత్ముడు అనుమోదించిన ప్రార్థనగీతములు తెలుగు తాత్పర్యముతోసహా ఇందు గలవు. ఆధ్యాత్మికసారమయిన ఈ గీతములను ప్రతివారు నిత్యము పారాయణము చేయుట శ్రేయోజ్ఞానదాయకము. కొలది ప్రతులే కలవు.

ఆంధ్రగ్రంథమాల; ౭, తంబుశెట్టివీధి, చెన్నపురి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పంచాంగబోధ

చివుకుల వెంకటరమణశాస్త్రి

పంచాంగమనగా అయిదు అవయవములు గల ఒకానొకవస్తువు. ఒక గొప్ప వస్తువుయొక్క అవాంతరవిభాగములకు అవయవము లని పేరు. మనుష్యునకు ముక్కు, చెవులు మొదలగునవి అవయవములైనట్లే యీ ౫ అవయవములు గలది పంచాంగమనబడును. ఈ ౫ అవయవములుగలదేది? అవయవములెవ్వి? అనునది విమర్శనీయము.

ఇందు ప్రతిపాద్యము (వర్ణ్యము) కాలము. ఈ కాలము గ్రహనక్షత్రముల చరిత్రచే నేర్పడును. కావున కాలము ౫ అవయవములు గలది అనియు, గ్రహములు ౫ అవయవములు గలవియనియు చెప్పనగును. ఈగ్రహనక్షత్రములన్నియు భూమియందు నివసించువారలకు కాంతిమంతములుగ కానుపించుటచే వీటికి జ్యోతిస్సులని పేరు వచ్చెను. ఇట్టి జ్యోతిస్సులననుసరించి వర్ణించు శాస్త్రమునకు జ్యోతిశ్శాస్త్ర మని (Astronomy) సంజ్ఞ. ఇట్టిజ్యోతిశ్శాస్త్రమే ౫ అవయవములుగలదియని అనేకవిధములుగా విచారింపనగును. ప్రకృతమందు పంచాంగమన నేమొ, అందలివిషయముల భావమేమియో వివరముగా తెలియుటకై యీవిమర్శ చేయబడుచున్నది.

ఈక్రింది ౯ రకముల కారణములు పంచాంగమను పేరును నిరూపించుట కుపయోగించును.

౧. ఇందు ప్రతిపాద్యమగుకాలము ౧. తిథి, ౨. వారము, ౩. నక్షత్రము, ౪. యోగము, ౫. కరణము అను ౫ అవయవములు గలది గావున పంచాంగ మనబడును.

౨. కాలచక్రము ౫ అవయవములు గలదిగా విభజింపబడినదిగావున పంచాంగమనబడును.

౩. కాలప్రమాపకమగు సంవత్సరము ౧. అయనము, ౨. ఋతువు, ౩. మాసము, ౪. పక్షము, ౫. తిథి అను ౫ అవయవములు గలదిగాన పంచాంగ మనబడును.

౪. కాలప్రమాపకమగు సంవత్సరము ౧. సౌరము, ౨. చాంద్రము, ౩. గౌరవము, ౪. సావనము, ౫. నాక్షత్రము అను ౫ భేదములుగలదిగాన పంచాంగ మనబడును.

౫. కాలము ౫ మానములచే కొలవబడుచున్నది. ౧. మనుష్యమానము, ౨. పిత్రుమానము, ౩. దేవమానము, ౪. మనుమానము, ౫. బ్రహ్మమానము, అను ౫ మానములుగలది గావున పంచాంగ మనబడుచున్నది.

౬. కాలప్రమాపకమగు సంవత్సరము ౫ భేదములు గలది. ౧. సంవత్సరము, ౨. పరివత్సరము, ౩. ఇడావత్సరము, ౪. ఇద్వత్సరము, ౫. వత్సరము అను ౫ అవయవములు గలదిగా వర్ణింపబడినదిగాన పంచాంగ మనబడుచున్నది.

౭. కాలమును బోధించుగ్రహములు ౫ రకములు అనగా ౫ అవయవములుగల గ్రహములచే కాలము బోధింపబడుచున్నదిగాన పంచాంగ మనబడుచున్నది.

౮. ఈగ్రహములయొక్క ౫ రకములైనస్థితులచే కాలమున్ను, జ్యోతిశ్శాస్త్రమున్ను నిరూపింపబడుచున్నదిగాన పంచాంగ మనబడును. ౫ స్థితులనగా ౧. పూర్వాపరాంతరము, ౨. యామ్యోత్తరాంతరము, ౩. గ్రహయుతులు, ౪. నక్షత్రగ్రహయోగములు, ౫. ఉదయాస్తమయాదికాలములు.

౯. ఈశాస్త్రమును నిరూపించుటకు ౫ కారణములు: ౧. చక్షుర్లక్షితం, ౨. లేఖ్యము, ౩. గణితము, ౪. యుక్తి, ౫. ఆగమము. ఈ అయిదుహేతువులచే నీశాస్త్రము నిరూపించబడుచున్నది గావున పంచాంగ మనబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ ౯ విధములైన కారణములచేతను క్రమముగా పంచాంగమును, అందలివిషయములను విమర్శింతము :

I తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములను ౫ అవయవములుగల కాలము పంచాంగము.

౧. తిథియనగా సూర్యచంద్రులకు మధ్యనున్న పూర్వాపరాంతరము. ఇదియే భూచంద్రులమధ్యనున్న పూర్వాపరాంతమున్ను గావచ్చును. దీనిని సులభముగా నెరుసుటకు ఆకాశమందలి క్రాంతవృత్తాంతము తెలియచేయబడుచున్నది. ఆకాశమందు, అశ్విన్యాదినక్షత్రములకు సమానముగా క్షేత్రవిభాగము చేయబట్టియు, మేషాదిరాశ్యంకితమును, ఎల్లప్పుడు సూర్యసంచారమార్గమైనట్టియు (భూసంచారమార్గము) వృత్తాకారమైన ప్రదేశమునకు (The Sun's path in the hea-




vens) క్రాంతివృత్తమని పేరు (Ecliptic). ఇతరములగు చంద్రాదిగ్రహము లిందుతో రెండుస్థలములందుమాత్రమే కలసినట్టియు, దీనికి తిరశ్చీనముగా నుండునట్టి తమతమకక్ష్యావృత్తముల (Arbits) లో చరించును. అయినను ఇట్టిచంద్రునిగూడ సూర్యచారమార్గములోనికి మార్చి ఏకజాతీయులగు రవిచంద్రుల కంతరము స్వీకరింపవలెను.

ఇకను భిన్నప్రదేశములోనుండు రవిచంద్రుల దూర మెట్లు కొలవబడవలెనని శంకకు సమాధానము— భూమికి కొంతదూరములో చంద్రుడును, చాలహెచ్చు దూరములో సూర్యుడును ఉందురు. అయినను వీరు తిరుసమార్గమును ప్రత్యేకముగా ౩౬౦ భాగములుగా విభజింపబడి అందొకస్థిరబిందువుకు అశ్విన్యాదియని పేరిడి ప్రతిగ్రహముయొక్క కక్ష్యావృత్తములోను ఏర్పరుపబడినది. ఆబిందువునుంచి ౧౦ భాగలదూర




ములో తనమార్గమందు సూర్యు డుండె ననుకొనుడు. చంద్రుడు అదియేబిందువునుండలు తనమార్గములో ౪౦ భాగల (Degre3) దూరములో నుండెననుకొనుడు. ఇపు డిద్దరికి మధ్యనున్న సమానదూరము ౩౦ భాగలు. ఇదియే తిథి యనబడును.

భూగోళముకు పైన ౧౨ యోజనములవరకు భూవాయు వుండును. ఈలోపలనే మేఘములు మొదలైనవి ఉండును. అందుపైని 'ప్రవహ' మనువాయు వుండును. ఇది ఎల్లప్పుడు పశ్చిమాభిముఖముగా తిరుగుచుండును. సూర్యచంద్రాదిగ్రహములన్నియు ఈవాయువుతిరుసమార్గములో నున్నందున, అందుతోపాటు నీగ్రహములుగూడా పశ్చిమముగా తిరుసచుండును. అట్లు తిరుసచూ తమశక్తిచే తూర్పునకు నడచును. ఇదెట్లనగా, కుమ్మరిచక్రము కుడినుండి ఎడమవైపునకు తిరుగుచుండును. అపుడు ఆచక్రమందున్న ఒకానొకపురుగు ఎడమనుండి కుడివైపునకు నడచు ననుకొనుడు. ఇట్లే గ్రహములున్ను తూర్పునకు నడచును.

ఇట్లు తూర్పునకు నడచుటచేతనే గ్రహములు అశ్వినిలోనుండి తూర్పుగానున్న భరణీనక్షత్రములోనికి, అటనుండి తూర్పుగానుండు కృత్తికానక్షత్రములోనికి, నడచుట తటస్థించుచున్నట్లు ప్రత్యక్షముగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూడబడుచున్నది. ఇకను అశ్విన్యాదినక్షత్రములలో గ్రహములు ప్రవేశించు టెట్లు? తెలియనివారలకు చంద్రుని చూపునపుడు, "ఈచెట్టుమీద చంద్రుడున్నాడ"ని చెప్పుదుము. అనగా చంద్రుడు చెట్టుఉన్నమార్గములో (Direction) నుండెననియు, ఆవైపుగా చూచినచో నగుపడుననియు అర్థము. ఇట్లే వాస్తవముగా నక్షత్రములు భూమికి చాలాదూరములో నున్నవి. గ్రహములు అంతకంటె తక్కువదూరములో నున్నవి. కాని నిరాలంబమగు ఆకాశములో గ్రహస్థానమును చెప్పుటకు అశ్వినీనక్షత్రమువైపున గ్రహ ముండెనని పైవలెచెప్పుట సుబోధకముగనున్నది. అందుచే అశ్విన్యాదినక్షత్రములలో గ్రహములున్నవని చెప్పుట సమంజసము. తమతమ కక్ష్యావృత్తమును సమానమగు ౨౭ భాగములుగా విభజించి, అందలివానికి అశ్విన్యాదినామము లివ్వబడినవి. అశ్విన్యాదినుండి గ్రహమువరకు గలదూరమును తెలుపుటకీమార్గము ఏర్పరుపబడినది.

ఇట్లు అశ్వినీనక్షత్రమందు సూర్యుడును, భరణీ నక్షత్రమందు చంద్రుడును ఉండె ననుకొనుడు. అపుడు సూర్యునకు తూర్పుగా చంద్రుడును, చంద్రునకు పడమరవైపున సూర్యుడును ఉందురు. వీర్ల అంతరమే తిథి యనబడును.

వెనుక చెప్పిన ప్రవహవాయు పశ్చిమభ్రమణముచే నక్షత్రచక్రము గ్రహములతోగూడ దినమున కొక పర్యాయ మొకచుట్టు తిరుగును. గ్రహము లీకాలమున కొంతదూరము తూర్పునకు గదలుచుండును. అందుచే ఈదినమున అశ్వినీనక్షత్రమున్ను, గ్రహమున్ను కలసి, ఒకేసమయమం దుదయించినను మరుదినమం దీసమయమకు అశ్వినీనక్షత్రముమాత్రమే యుదయించును. గ్రహము కొంతతడ వాలస్యముగా నుదయించును. ఇదియె గ్రహముల ప్రాగ్గతి. ఇట్టిప్రాగ్గతిచే దినమునకు సుమారు ౧ భాగదూరము సూర్యుడును, ౧౩ భాగల దూరము చంద్రుడును తూర్పుగా నడచెదరు. ఇట్లు ౩౬౦ భాగలు చుట్టుకొలతగల కాలచక్రమును, సూర్యుడొకసంవత్సరకాలములోను, చంద్రుడు ౨౭ దినములలోను చుట్టివత్తురు.

ఈదినమున అశ్విన్యాదినుండి తమతమ కక్ష్యావృత్తములలో సూర్యచంద్రులిద్దరును ౧ భాగదూరములో నుండె ననుకొనుడు. ఈదినమున వీర్లకు పూర్వాపరాంతరము లేదు. దీనికే అమావాస్య యని పేరు. అనగా సూర్యచంద్రులు కలసియుండుకాలము- మరుదినమున అశ్విన్యాదినుండి ౨ భాగలు దూరములో తనకక్ష్యయందు సూర్యుడును, ౧౪ భాగలు దూరములో తనకక్ష్యయందు చంద్రుడును ఉందురు. ఇపుడు వీర్ల అంతరము ౧౪ - ౨ = ౧౨ భాగలు. ఇదియే తిథి ఆమరుదినమందు సూర్యుడు అశ్విన్యాదినుండి ౩ భాగలుదూరములో తనకక్ష్యలో నుండును. చంద్రుడు ౨౭ భాగలదూరములో తనకక్ష్యయందుండును. ఇపుడు వీర్ల అంతరము ౨౭ - ౩ = ౨౪ భాగలు. ఇదియే తిథి. ఇట్లే క్రమముగా వీర్ల అంతరము పెరుగుచుండును.

కాలచక్రముయొక్క చుట్టుకొలత ౩౬౦ భాగలు. ఇదియే వీర్లపరమాంతరము (Greatest Elongation). దీనిని సమానమైన ౩౦ భాగములుగా విభజించగా ఒక్కొక్కభాగము ౧౨ భాగలు ప్రమాణము గలదయ్యెను. (సూర్యచంద్రు లొకేస్థానమందు బయలుదేరినదిమొదలు, శీఘ్రగతిగల చంద్రుడు అల్పగతిగలసూర్యు నతిక్రమించి ముందుకుపోయి, తిరిగి వచ్చి సూర్యునితో కలియుకాలము సుమారు ౩౦ దినములు గనుక ౩౦ భాగములుగా వీర్లపరమాంతరము విభజించపడినది.)

ఈ భాగమునకే తిథి యని పేరు. ఇందు సూర్యునికి తూర్పున చంద్రు డుండుసమయమందు ఈభాగములలో మొదటిభాగమునకు పాడ్యమి అనియు, రెండవ భాగమునకు విదియయనియు, మూడవభాగమునకు తదియయనియు, నాల్గవభాగమునకు చవితియనియు, ఐదవభాగమునకు పంచమియనియు, ఆరవభాగమునకు షష్ఠియనియు, ఏడవభాగమునకు సప్తమియనియు, ఎనిమిదవభాగమునకు అష్టమియనియు, తొమ్మిదవభాగమునకు నవమియనియు, పదియవభాగమునకు దశమియనియు, పదునొకొండవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాగమునకు ఏకాదశియనియు, పంౘెండవభాగమునకు ద్వాదశియనియు, పదమూడవభాగమునకు త్రయోదశి యనియు, పదునాల్గవభాగమునకు చతుర్దశియనియు. పది హేనవభాగమునకు పూర్ణిమయనియు పేర్లు. ఈపూర్ణి మాంతకాలమందు, సూర్యచంద్రులు పరస్పరాభిముఖ ముగా నుందురు. భూమి వీర్లమధ్య నుండును. ఇందు సూర్యునికి తూర్పున చంద్రుడుంటచే దీనికి శుక్లపక్ష మని పేర్లు.

ఒకవృత్తములోని పరిధియందు రెండువస్తువులు తిరుగుచున్నపుడు, ఈరెంటికి ౧౮౦ భాగలకంటె ఎక్కువఅంతరముండుట కవకాశము లేదు. ఒకప్పుడు ౧ బిందువునుంకి ౨ బిందువుకు ౨౦౦ భాగలు దూర మున్నను, ౨ బిందువునుండి ౧ బిందువుకు ౧౬౦ భాగ లుమాత్రమే దూరముండునుగాన, నీరెంటికి ౧౮౦ భాగలకంటె ఎక్కువదూర ముండదనుట నిర్వివాదము. ఇటులనే రవిచంద్రులకు ౧౮౦ భాగలకంటె ఎక్కువ అంతర ముండదు.

ఈపరమాంతరమగు ౧౮౦ భాగలుండుదినమే పూర్ణిమ. ఇదిమొదలు సూర్యునకు పడమరవైపున చంద్రుడుండుదూరము క్రమముగ తగ్గుచు, అమావాస్య నాడు వీరిరువురు కలియుదురు. ఇట్లు పూర్ణిమమొదలు అంతరము తగ్గనారంభించిన మొదటిభాగమునకు పాడ్య మియనియు, రెండవభాగమునకు విదియయనియు పేర్లు. ఇట్లే వెనుకటివలెనే ౧౪-వ భాగను చతుర్దశియని పేరు. ఆపైని తిరిగి సూర్యచంద్రులొకచో కలయు కాలమునకు అమావాస్య యనిపేరు.

ఈఅమావాస్యదినము పితృదేవతలకు ప్రీతికరమైన దనునార్యోక్తికి హేతువు విమర్శింతము. ఈదినమున భూ, సూర్య, చంద్రులొకచో (In the Same Direction) నుందురు. చంద్రమండలముపైని వసించువారలకు పితృదేవతలని సంజ్ఞకలదు. అందుచే వీర్లకు,

సూర్యుడు
పితరులు
చంద్రుడు
భూమి

సూర్యకక్ష్య ఊర్ధ్వభాగమం దుండునుగాన, నీదినమున సూర్యసమసూత్రములో నున్న చంద్రమండలోపరిగతు లగు నీపితరులకు, సూర్యుడు సరిగా ఉచ్చలో (In the Meridian) నుండును (శిరస్సుపైనుండును). అందుచే నీదినము వీర్లకు మధ్యాహ్నము. జీవకోటికి, మధ్యాహ్నము భోజనకాలమగుటచే నీదినము వీర్లకు ప్రీతికర మనుట సమంజసము.

ఇట్టి సూర్యచంద్రాంతరము ఎన్నవతిథిలో (భాగములో) చేరియున్నదో చెప్పుట స్థూలము. అనగా ఒకవృక్షమునకు ౨-వ మైలులో మరియొకవృక్ష మున్నదని చెప్పుటవలె స్థూలము. రెండవమైలులో ౪-వ ఫర్లాంగులో ౨౪-వ గజములో ౨-వ అడుగులో నున్న దని చెప్పుట సూక్ష్మము. ఇట్లే సూర్యచంద్రులఅంతర (దూరము) ముగూడ, ౧౨-వ తిథిలో, ౧౦-వ భాగలో, ౪-వ లిప్తలో ౧౨-వ విలిప్తలో నున్నదని చెప్పుట సూక్ష్మము. ఇట్లుచెప్పినను ౧౨-వ భాగయగు ద్వాదశీ తిథి, ఈదినమున ఘ. ౧౪-౪౫ లకు పూర్తియగునని చెప్పినను ఒకేయర్థము.

ఈ ౧౨ భాగల ప్రమాణముగల రవిచంద్రాంతరదూరము (తిథి) మధ్యమమానముచే (Average rate) షుమారు ౫౯ ఘడియలకాలములో నేర్పడును. అనగా ఒకదినమందు చంద్రమధ్యగతి సుమారు ౭౯౦ లిప్తలు (Minutes), రవిమధ్యగతి ౫౯ లిప్తలు. ఒక దినములో వీర్ల అంతరము సుమారు ౭౩౧ లిప్తలు. ఇది సుమారు ౫౯ గడియలకాలములో నేర్పడును. దిన ప్రమాణము ౬౦ ఘడియలకు కొంచెముపైగానుండును. గాన దీనిలో తిథిప్రమాణము పోను, కొంతకాలము మిగులును. అనగా నీదినమున తిథి ౫౯ ఘడియ లుం డును. దీనికి తిథిప్రమాణమగు ౫౯ ఘడియలను కలుపగా రేపటిదినమున తిథి ౫౮ ఘ. లు మాత్రమే యుండును. ఇట్లు క్రమముగా తగ్గుచు, చివరకు ఒకదినమున తిథి క్షయించును. దీనికే క్షయతిథి యని పేరు.*

* దీనిశేషము (అవయవము) ప్రతిదినమందును తిథ్యంత సూర్యోదయకాలములమధ్య నుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాస్తవముగా గ్రహములకు ఎల్లపుడు ఒకేరీతి గల గతి (Speed) యుండదు. కొంతకాల మెక్కువగను, కొంతకాలము తక్కువగను ఉండును.

తమ కక్ష్యావృత్తములో ఆకర్షకునకు మిక్కిలి దూరములో (Appogee) గ్రహ మున్నపుడు, ఆకర్షణ శక్తివలన గ్రహము మెల్లగ నడచును. ఆకర్షకునకుసమీపములో (Perigee) గ్రహ మున్నపుడు శీఘ్రముగనడచును.




అందుచే (గ్రహములు రవి చంద్రులు) మెల్లగ నడచునపుడు, అధికకాలములో ౧౨ భాగల అంతర మే(తిథి)ర్పడును. శీఘ్రముగ నడచునపుడు స్వల్పకాలములోనే, ౧౨ భాగల అంతర మేర్పడును.

ఈప్రకారము గతివేగవశమున తిథి ఎక్కువ, తక్కువకాలములలో పూర్తియగును. ఇదియే తిథి యొక్క వృద్ధిక్షయములకు కారణము.

ఇట్లు ౬౦ ఘడియలపై చిల్లరప్రమాణముగల దినమును మూడుతిథులు స్పృశించినయెడల, దానికి అవమ యనిపేరు. అనగా నీదినమున ఉదయాది ౨ ఘడియలవరకు విదియతిథియు, ఆపైన ౫౫ ఘడియల వరకు తదియతిథియు, ఆపై కాలములో చవితియు నుండును. ఈదినమును మూడుతిథులు స్పృశించినవిగాన దీనికి 'అవమ' యనిపేరు.

ఇట్లే ఒకతిథి మూడుదినములను స్పృశించినపుడు "త్రిద్యుస్పృక్" అనిపేరు. అనగా నిన్నటిదినమున చవితి తిథి ౫౮ ఘడియలున్న, ఈదినమున పంచమి పూర్తిగను, రేపటిదినమున పంచమి ౨ ఘడియలున్న ఉండు ననుకొనుడు. ఇచ్చట పంచమి యను ఒకేతిథి మూడుదినములను స్పృశించినదిగాన "త్రిద్యుస్పృక్" అనబడుచున్నది.

ఈతిథులు మధ్యాహ్నకాలమున కుండుప్రామఖ్యమునుబట్టి తిథిద్వయమనియు, 'శూన్యతిథి' యనియు సంజ్ఞలుగల్గి యొప్పుచున్నవి. దినప్రమాణము ౫ భాగములుగా విభజింపబడి ౧. ప్రాతఃకాలము, ౨. సంగవకాలము, ౩. మధ్యాహ్నకాలము, ౪. అపరాహ్ణకాలము, ౫. సాయంకాలము అనుపేర్లు పెట్టబడినవి. ఇట్టిసాయంకాలము చివరవరకు వ్యాపించి తిథి యుండునపుడు నిర్వివాదము. అట్లుగాక తిథి మధ్యాహ్నపరాహ్ణకాలములకు రమారమిగా సమీపములోనున్నపుడీనిర్ణయ మావశ్యకము.

పూర్వతిథి పూర్వదినాపరాహ్ణకాలముకును, పరతిథి పరదినాపరాహ్ణకాలముకున్ను వ్యాపించియున్నపుడీ మధ్య దినమందలి తిథి 'శూన్యతిథి' యనబడును.

ఉదా:— నిన్నటిదినమున చవితి ౧౭-౨, ఈదినమున పంచమి ౨౨-౨౩, రేపటిదినమున షష్ఠి ౨౭-౫౯. ఇట్లుండగా, నిన్నటిదినమున అపరాహ్ణకాలమునకు చవితి వెళ్లిపోయి పంచమివచ్చినందున పంచమితిథి నిన్నటిదినమందే యగును. రేపటిదినమం దపరాహ్ణకాలము నధికముగా షష్ఠి వ్యాపించియుండుటచే, షష్ఠి తిథి రేపటిదినమందగును. అందుచే నీదినమున శూన్యతిథి యయ్యెను.

ఇట్లే పూర్వతిథి, పూర్వదినము అపరాహ్ణకాలమునకు, రాకయుండి పరతిథి పరదినాపరాహ్ణకాలము వరకు లేకయుండునపుడు, ఈరెండు తిథులును మధ్య దినమందే యగునుగాన నిందు తిథిద్వయ మగును.

ఉదా:— నిన్నటిదినమున పాడ్యమి ౨౮-౭, ఈదినమున విదియ ౨౨-౪౮, రేపటిదినమున తదియ ౧౭-౦. ఇట్టిస్థితిలో నిన్నటిదినమందలి అపరాహ్ణకాలముకు విదియ రాలేదు. రేపటిదినమందలి అపరాహ్ణకాలమువరకు తదియ లేదు. అందుచే నీవిదియ, తదియ తిథులురెండును ఈదినమందేయుండునుగాన నీదినమున 'తిథిద్వయ' మయ్యెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లు రవిచంద్రాంతరమువలన నేర్పడినతిథులు భూగోళమందు నివసించువారలకుమాత్రమే యగుపడును. ఇయ్యది చంద్రగోళమందు నివసించువారలకు మరియొక రీతిగను, ఇట్లే ఇతరగ్రహగోళములందు నివసించువారికి వేరువేరురీతులుగ నీతిథి యగుపడును. వాటినిబట్టియే పితృమానము, దేవమానము మొదలైనవి ఏర్పడినవి. అందునుసరించి ముందు ౯ విధములైనమానములు అను విమర్శవద్ద విచారింతము.

౨. వారము :— ఒక్కపర్యాయము, స్వదేశ ప్రాక్షితిజమందు (తూర్పుదిక్కున భూమ్యాకాశములు రెండును కలసినట్లుగ మనుజదృష్టి కనుపడునది (Eastern hcrizon) సూర్యసంయోగముగలకాలము. ప్రవహావాయు వెల్లపుడు పశ్చిమాభిముఖముగా తిరుగుచుండుటచే, ఆమార్గములో నున్నగ్రహములుగూడ, దానితోపాటు పశ్చిమముగా తిరుగును. అట్లు తిరుగుటచే దినమున కొకమట్టు పూర్తియగును. అపుడు సూర్యుడున్ను రోజు కొకమారు తూర్పుక్షితిజమందు కలసుకొన్నట్లగుపడును. ఈకలయికకే సూర్యోదయ మని పేరు. ఇట్టిరెండుసూర్యోదయములమధ్యకాలము నకు 'వార' మనిసంజ్ఞ.

ఇక నవీనయుక్తిచే భూమి, తనచుట్టు తను ఒక పర్యాయము తిరుగుకాలమే 'వార' మనబడుచున్నది.

ఈవారములు ౭. ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారములని పేర్లుగలవి యని యెల్లరుఎరిగిన విషయమే. ఈపేర్లీవరుసగా నెట్లు వచ్చెనని విమర్శింతము.

మనము నివసించు భూగోళమునకు మిక్కిలి దూరములో నక్షత్రము లుండును. అంతకంటె తక్కువ దూరములో శనిమండలము, అంతకంటె తక్కువదూరములో గురుమండలము, నిట్లే వరుసగా కుజ, సూర్య, శుక్ర, బుధ, చంద్రమండలములు గలవు.

కాలచక్రము ౧౨ రాసులుగా విభజింపబడియున్నది. ఒక్కొక్కరాసిని రెండుగా విభాగించి దానికి 'హోర' (Hour) యని పేరిడిరి. ఈచక్రము దినమున కొకమారు తిరుగునుగాన ౧౨ × ౨ = ౨౪ హోరలు గడచును. దినమునకు ౨౪ హోరలు (Hours) గల్గుట కిదియే హేతువు.

వెనుకచెప్పినట్లు శని మొదలు చంద్రునివరకు, ఒకదానికొకటి క్రిందుగా గ్రహములకక్ష్యలు గలవు. అట్లగుటచే హోర కొకకక్ష్యచొప్పున తిరుగును. చక్రభ్రమణము పూర్తియగుసరికి ౨౪ హోరలలో ౨౪ కక్ష్యలు మారవలయును. ఇందు దుదహరింపబడినవి ౭ కక్ష్యలే గావున, నీ ౭ కక్ష్యలే మాటిమాటికి తిరుగుచు, మారుచుండును. ఇట్లు ౨౪ హోరలసల చక్రభ్రమణకాలము పూర్తియగుసరికి తిరిగి మరియొకవార మేర్పడును. అట్లగుటచే నీ ౨౪ హోరలకాలమందు ౩ ఆవృత్తులుగా (మూడుపర్యాయములు నీ ౭ కక్ష్యలు మారగా) ౩ × ౭ = ౨౧ హోరలకుమాత్రమే నీకక్ష్యలు తిరిగి యథాస్థానమును వచ్చెను. మిగిలిన ౩ హోరలకు ౩ కక్ష్యలు మారవలయును. ఇట్లు మారగా ౪-వ కక్ష్య మరుదిన ప్రథమహోరకాలమందలి కక్ష్యయగును. ఈకక్ష్యాధిపతియే వారాధిపతి. గ్రహము పేరుతో వారము ప్రసిద్ధమైనది. అట్లగుటంచేసి ప్రతిదినమునకున్ను, కక్ష్యాక్రమముచే ౪-వ కక్ష్యాధిపతి వారాధిపతిగా మారవలయును.

గ్రహగోళము లన్నిటిలోను గొప్పగోళము గలవాడగుటచేతను, అన్నిగ్రహములకు తేజోదాతయు, ఆకర్షకుడును అగుటచేతను, సూర్యుడు ప్రథమమున వారాధిపతియయ్యెను. అందుచే ఆది (ప్రారంభ) వారమగుటచే ఆదివార మనబరగెను. సృష్ట్యాదియందు ప్రారంభమైనవారముగనుక ఆదివార మనవచ్చును. వెనుకటికక్ష్యాక్రమరీతిచేతను, సృష్ట్యాదియందు చక్రభ్రమణముకు కారణభూతుడగు సూర్యుడే ప్రథమహోరయందు కక్ష్యాధిపతి యయి తీరవలెను. అందుచే ప్రథమవారాధిపతి సూర్యుడు.

ఇదిమొదలు రెండవవార ప్రారంభకాలమునకు మధ్య ౨౪ హోరలు గలవు. అందు కక్ష్యాక్రమముచే ౭ కక్ష్యలు ౩ ఆవృత్తులు తిరుగగా ౩ × ౭ = ౨౧ హోరలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



మాఘమాసము

(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గడచినవెనుకను ప్రథమహోరయందలి కక్ష్యాధిపతియే గలడు. ఆపైని మిగిలిన 3 హోరలలో, కక్ష్యాక్రమముచే 3 గ్రహములు, అనగా సూర్య, శుక్ర, బుధుల యొక్క కక్ష్యలుదాటగా ౪-వది యగు చంద్ర కక్ష్య మరుదినము ప్రథమహోరాకాలముకు వచ్చెను. ఈకక్ష్యాధిపతియే వారాధిపతియైనందున మరుదినమందు చంద్రుడు వారాధిపతియయ్యెను. ఆపేరుచే సోమవార మనబడును. ఇట్లే ఆమరునాడు చంద్రునిమొదలు 3 కక్ష్యలు అతిక్రమించగా, అనగా చంద్ర, శని, గురుకక్ష్య లతిక్రమించగా అనంతరవర్తియగు కుజకక్ష్య ప్రథమహోరాకాలమున నుండును. అందుచే కుజుడు ఆమరునాటి వారాధిపతియయ్యెను. ఆకుజుని పేరుతో మంగళవార మనబడుచున్నది. ఇట్లే ఆమరునాడు, కుజునిమొదలు 3 కక్ష్యలు దాటగా అనగా కుజ, సూర్య, శుక్రులుదాటగా, నాల్గవకక్ష్యాధిపతియగు బుధుడు వారాధిపతియయ్యెను. ఆబుధుని పేరుతో బుధవార మనబడుచున్నది. ఇట్లే ఆ మరునాడు, బుధునిమొదలు 3 కక్ష్యలు దాటగా, అనగా, బుధ, చంద్ర, శనులుదాటగా, నాల్గవకక్ష్యాధిపతియగు గురుడు వారాధిపతియయ్యెను. ఆగురుని పేరుతో గురువార మనబడుచున్నది. అంతకుపైదినమున, గురునిమొదలు మూడుకక్ష్యలు దాటగా అనగా, గురు, కుజ, సూర్యులుదాటగా, నాల్గవకక్ష్యాధిపతియగు శుక్రుడు వారాధిపతియయ్యెను. ఇతని పేరుతో శుక్రవార మనబడుచున్నది. ఇట్లే ఆమరునాడు, శుక్రుని మొదలు మూడుకక్ష్యలు అతిక్రమించగా, అనగా, శుక్ర, బుధ, చంద్రులకక్ష్యలుదాటగా, నాల్గవకక్ష్యాధిపతియగు శని వారాధిపతియయ్యె. ఇట్లే శనిమొదలు మూడుకక్ష్యలను, శని, గురు, కుజలని అతిక్రమించగా నాల్గవకక్ష్యాధిపతియగు సూర్యుడు వారాధిపతియయ్యెను. ఈక్రమమున వారము లేర్పడినవనుట సమంజసముగ నున్నది.

ఇక నీవారమునకు ప్రమాణకాల మెంత? యని విచారింతము. ఒకమారు నక్షత్రచక్రము చుట్టివచ్చుకాల మనినచో ౬౦ ఘడియలేయగును. ఇదియే భూమి తనచుట్టు తను ఒకమారు తిరుగుకాలము. కాని ఇద్దాని నంగీకరించినచో, ఇది రెండుసూర్యోదయములమధ్యకాలము కానేరదు. ప్రవహవాయువు నక్షత్రచక్రమును ఒకమారు పశ్చిమముగా త్రిప్పుకాలములో సూర్యుడు కొంతదూరము తనశక్తిచే తూర్పుకు గదలును. అందుచే ఆకదలినదూరముగూడ దీనిలో చేరవలెను. దీనినే ప్రాచీనులు 'సూర్యసావనదిన' మందురు. ఇక నవీనయుక్త్యనుసారముగ భూమి తనచుట్టు తాను దినమున కొకమారు తిరుగుచూ, సూర్యునిచుట్టు సంవత్సరమున కొకమారు తిరుగును. అట్లగుటచే భూమి సూర్యుని చుట్టుగల 3౬౦ భాగలదూరమును ఆక్రమించునడకచే, దినమునకు, కొంతదూరము తూర్పుగ నడచును. తన చుట్టు తనుతిరుగుటకు (స్వాక్షపరిభ్రమణముకు) సరిగా ౬౦ ఘడియలకాలము పట్టును ఈరెండును కలిపినచో వారప్రమాణము వచ్చును. ఇదియే ప్రాచీనులు చెప్పు 'సూర్యసావనదినము'. దీనిప్రమాణము, నిరక్షదేశమందు (In the place where the Equator passes) మధ్యమమానముచే సుమారు ౬౦-౧౦ ఘడియలు. ఇది ప్రతిదేశమందును ప్రతిదినమందును స్వల్పముగ మారుచుండును. ఇదియే వారప్రమాణకాలము,

(సశేషము)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## నేను గొప్పవానిని చూడడానికి వెళ్లాను






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రతిఫలం

'గిరి'

౧

మొఘ్జం ఆధిపత్యంకింద మొగల్ సైన్యాలు మరీదగ్గిరి కొచ్చాయి. అల్లరి మరీ హెచ్చింది గోలకొండలో. తానేషాఅంటే యిష్టని వాళ్ళకి మొగల్‌సైన్యం దండెత్తిరావటంచేత హృదయంలో సంతోషం కలిగినా మరణభీతి వాళ్ళనికూడా వొదిలింది కాదు. కాటికి కాళ్ళుజాచుకో కూచున్న ముసలివాళ్ళు తాము చస్తామనేభయంచేతనూ, తమ సంతానం మడిసిపోతోందనేచింతచేతనూ నిద్రానిళ్ళని వొదులుకున్నారు. ఇంకా నాలుగుకాలాలు బతికే వయసువాళ్ళస్థితి చెప్పనక్కరలేదు. స్త్రీ లోకమంతా కోరికలన్నిటిలోకీ మిన్నగా వుంచుకునేవి సౌందర్యం, యవ్వనం. ఆసౌందర్యయవ్వనాలే యిప్పుడు వాళ్ళకి పరమశత్రురూపం దాల్చాయి. అవి వుండి మురిసిన వాళ్ళే యెక్కువభయపడుతోన్నారు. శత్రుసైన్యం రాకముందే యేదోశక్తితమని కురూపిణులుగా వృద్ధులుగా మార్చేస్తే ధన్యుల మనుకుంటోన్నారు. ఏమీ తెలీని పసిపిల్లలు యీ అల్లరికంతటికీ కారణమేమిటో బోధపడకపోవడంచేత పెద్దలతోబాటు తామూకూడా యేడుస్తోన్నారు. మళ్ళీ సాయంత్రం యింటిముఖం చూస్తామో లేదో అనేనమ్మకం లేనిసైనికులు వొదల్లేకవొదల్లేక యిళ్ళని వొదిలిపోతోన్నారు: పరదాలుదాటి బైటికి రాని సుందరాంగులు మెరుపులా సౌందర్యం మెరిసిపోగా వొంటిగుడ్డల్నిసైతం లెక్కపెట్టకుండా వాళ్ళంతా కంటినీళ్ళచేతా, చెమటచేతా. స్నానంచేసినట్టయి, పట్టుగుడ్డలు దేహానికి అతుక్కోపోగా భర్తల మెడలకి వేళ్ళాడబడి వీధుల్లో పడుతోన్నారు. అంట్లాంటి తమపెళ్ళాల్ని వీధిమూలలో తోసేసి వణుకుతోన్నకాళ్ళతో జారిపోతోన్న తుపాకిని సవరించుకుంటో వెనక్కి తిరిగి చూడకుండా కచేరీవేపునడిచిపోతోన్నారు. మరీ అంతధైర్యంలేనివాళ్ళు తమస్త్రీలతోబాటు వీధుల్లోపడి యేడుస్తోంటే మరొహసైనికుడు వెనకాల్నుంచి వొచ్చి అతనితండ్రితాతల వీరత్వాన్ని జ్ఞప్తికితెచ్చి పౌరుషపుమాటలు పలికి తుపాకిని చేతికందిచ్చి నడిపించుకోపోతోన్నాడు. పాదుషా పతాకాన్ని యెత్తుగా పట్టుకొని గుఱ్ఱపురౌతుదళం వీధులవెంబడి తిరుగుతో భయపడాల్సిన అవసరంలేదనీ, తమక్షేమమే తనక్షేమంగా భావించే తానేషాబలం సామాన్యమైంది కాదనీ, గొంతెత్తి అరుస్తో ప్రజలకి ధైర్యం చెబ్తోన్నారు. ఐనా యేడ్పులు తగ్గటం లేదు. మొగడిమరణశయ్యపక్కనకూచొని యేక్షణాన వైధవ్యపిశాచం మీద దుముకుతుందో అని భయపడి యేడ్చే స్త్రీమల్లే యేడుస్తోంది కిల్లా సాంతం. ఉత్తరపువీధిలో మసీదుపక్కనుంచి రౌతుదళం పోతోంటే ఆమసీదు మొల్లా ముందుకొచ్చి చేతులు పైకెత్తి "కాఫరులకి రాజ్యం వొప్పచెప్పి విషయలోలుడైనవాడి రాజ్యం అంతమైంది. అదిగో అలాయెగుర్తోన్న పతాకానికి యిదే ఆఖరిరోజు." అని అరిచాడు. రౌతు తనగుఱ్ఱాన్ని ఆతనిమీద దుమికించి తనచేతిబర్చీతో వొక్క పోటు పొడిచాడు. ఆమొల్లా వొహచేత్తో నెత్తురుదుమికే ప్రదేశాన్ని అణిచిపట్టుకొని, "ఇస్లాంరక్షకుడైన ఔరంగజేబుకి జయమగుగాక" అని గొంతెత్తి పెద్దగా అరిచిపడిపోయాడు. రౌతు యింకొహపోటుకి 'అల్లా' అని చతికిలపడిపోయాడు. వెంటనే మసీదులోంచి నలుగురు తురకలు బైటికి పరుగెత్తుతో వొచ్చారు. రౌతులు గుఱ్ఱాలదిగి వాళ్ళరెక్కల్ని వెనక్కి విరిచికట్టి పాదుషా పతాకం ముందు నడిపిస్తో కాజీ కఛేరీవేపు తీసికెళ్ళారు.

తానేషా పాదుషా, మాదన్న, ఆయన అంతరంగికుడు, అంగరక్షకుడు, మంత్రి, సర్వంఐన విశ్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాథపండితుడు ముగ్గురూ బాలాహిసారు† పైకెక్కి చూస్తోన్నారు. కిల్లాచుట్టూ ఆమడదూరంవరకు అవుపడ్డది. మూసీనదివొడ్డున చాలాదూరంలో విడిసిన మొగల్ సైన్యంగుడారాలు అవుపడ్డాయి. మాదన్న ముందుగా తనుచూసి పాదుషాకి తనచెయిజాచి చూపించాడు. తరువాత విశ్వనాథపండితుడికిగూడా చూపించాడు.

"మనం అనుకున్నదానికన్న చాలా పెద్దదిగా వున్నట్టు అవుపడ్తోంది సైన్యం" పాదుషా అన్నాడు.

"కాదు. అంత పెద్దదేంకాదు." వొక్కనిమిషం ఆగి అన్నాడు మాదన్న, "మొన్ననే మనసైన్యాన్ని యెదురుపంపి వొచ్చినసైన్యాన్ని వొచ్చినట్టు యెదిరించేట్టు చేస్తే యీ అవస్థంతా తప్పేది. రాజ్యానికి ఇంతముప్పు రాకపోయేది. గోరుతో పోవాల్సింది గొడ్డండ్లతో పోవాల్సివొచ్చింది."

"ఆయుద్ధంపేరిట అంతజనం చస్తోంటే, యీ రాజ్యం, ప్రజాప్రాణాలపూచిని నెత్తిమీద పెట్టుకున్న నేను వుండి యేంచేయను?"

మాదన్న ఆమాటల్ని విననట్టు ఆవేపు చూస్తో, "దూరమూరం విడిసారుకాబట్టి అంత పెద్దగా అవుపడ్తోంది. అదీపోగా ఆతెల్లగా అవుపడేవన్నీ గుడారాలు కావు. గుంప్లూ గుట్టలూకూడా చాలావున్నాయి." అని నిజమేనా అన్నట్టు విశ్వనాథపండితుడివేపు చూసాడు. ఏదో గొప్పఆలోచనలో వున్న పండితుడు చప్పున కనుక్కొని, "అవును; ఆయేనుగలూ, గుట్టాలు మల్లే అవుపడేవి చాలాపొదలు. చీకటిమబ్బులో అవుపట్టం లేదు." అన్నాడు.

అట్లాగే యెడమవేపుకి తిరిగారు. మాదన్న భుజంమీద తనయెడమచెయి వేసి ఆనుకొని నుంచున్నాడు పాదుషా. ఇంకా వొస్తోన్నారు జనం పట్టణంనుంచి కిల్లాలోకి ప్రాణాలుకాపాడుకోడానికి. వొకచేత్తో పెళ్లాన్ని వుంకొకచేత్తో పిల్లల్ని పట్టుకొని నోట్లో శ్వాసలేకుండా పరుగెత్తుతో వొస్తోన్నారు పులినోటినుంచి తప్పించుకోవొస్తోన్నట్టు. పాదుషావేపు తిరిగి అన్నాడు మాదన్న, "ఇహ కిల్లాగవునులు మూయించాలి. ఏమాత్రం ఆలస్యమైనా కోటలో నిండేదంతా శత్రుసైన్యమే."

"ఆవొచ్చేవాళ్లకి దిక్కెవరు?"

"వాళ్లకోసంచూస్తే మనప్రాణాలకేవొస్తుంది."

అప్పుడే, భుజంమీద రెండేళ్లకొడుకునెత్తుకొని నిలవటానికిసైతం శక్తిలేని అతిసౌందర్యవతియైన యిరవైయేళ్ల యువతిని యీడుస్తో కిల్లావేపు వొస్తోన్న పారసీ ఉమ్రావొకడు వాళ్లందరికీ అవుపడ్డాడు. ఆయువతి స్థితినిచూసి పాదుషాకళ్లకి నీళ్లుకమ్మాయి. ఆవేపే చూస్తో, "అట్లాంటిస్త్రీలూ పిల్లలూ లెక్కలేకుండా చస్తోంటే వొక్కమనప్రాణాలకే వొచ్చిన భయమేమిటి?"

"లేకపోతే ప్రాణాలు దక్కాయని తమ అండ జేరగలిగినవాళ్లు, వేలకువేలు వీళ్లతోబాటు మనతోబాటు హతమౌతారు."

మాదన్న ముఖంవేపు చూసాడు పాదుషా.

"ఇట్లాంటిస్త్రీలూ, పిల్లలూ యెందరోవున్నారికిల్లాలో. వాళ్లప్రాణాలు కాపాడాలి" అన్నాడు మాదన్న.

పాదుషా మాట్లాడక కోటలోని వీథులవేపు చూసాడు.

౨

గవునులు మూసారు. అరబ్బుసైన్యాన్నంతా సమభాగాలుచేసి గవునులదగ్గిర వుంచారు. వొంతుల చొప్పున రాత్రింబవళ్లు కన్నుమూయక కాచుకోచూటాని కేర్పాటైంది. బురుజులమీద నమ్మకమైన మన్నెదొరలు నియమింపబడ్డారు. ఆయాదొరలసిబ్బంది అంతా ఆయుధాలతోగూడా బురుజులమీద కోట

† కిల్లాలో రాజసౌధంమీద యెత్తుగా సింహాసనంమల్లేవున్న ప్రదేశం. ఇప్పటికీ వుంది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గోడలపొడుగూత నిండారు ప్రతిబురుజుమీద గవిని మీద పిరంగు లెక్కించి అవసరమైనగుండు, మందును సంచుల్లోనింపి సిద్ధంచేసివుంచారు. రాజసౌధంచుట్టూ, రాణివాసంచుట్టూ అక్కన్నమాదన్నలకు మిక్కిలి నమ్మకమైన స్నేహితుల్ని బంధువుల్ని కాపలా వుంచారు. రాజసౌధంపైకి వెళ్లేతోవలోవున్న మసీదు పక్కనే పాదుసాకు మిక్కిలినమ్మకస్తుడైన అబ్దుర్రజాక్ అక్కన్న, పెద్దసైన్యంతో వున్నారు. తక్కిన సురక సేనానాయకులు తమతమ సైన్యాలతో శాణాలమీద యేర్పాటైనారు. పడమరవూలకి యుద్ధమాసన్నమైన ప్పుడు పనికొచ్చేందుకు ఏనుగుల్ని, గుర్రాల్ని, వొంటెల్ని, సిపాయిల్ని, వొక్కనిమషంలో సిద్ధమయ్యేట్టు యేర్పాటుచేసారు.

రాత్రంతా నిద్రరాలేదు విశ్వనాథపండితుడికి. తెల్లవారక ఆరాత్రి అట్లాగేవుండిపోవాలని కోరుకున్నాడు. మళ్లీ ఆలోచించాడు తను ఆమరునాడు చేయబోయే ఘోరకార్యాన్నిగురించి. ఏమైనాకాని అట్లాంటి విశ్వాసఘాతకకార్యం చేయొద్దనుకున్నాడు. కాని తనుచేయకపోతే యేమవుతుంది? ఆపని యింకెవరిచేతైనా యెట్లాగూ జరుగుతుంది. తప్పదు. పైగా తనవంశానికి వంశంధ్వంసం. మరి అట్లాంటితెప్పందాన్ని తనే నెరవేరుస్తే? తనకూ తనవంశపారంపర్యానికి ఉన్నత అధికారం. ఎప్పుడూ తగ్గనిఐశ్వర్యం. ఎన్నో సందేహాలు గందరగోళ పెట్టాయి.

పొద్దున్నే రోజుకిమల్లే స్నానసంధ్యాదిఅనుష్ఠానాల్ని తీర్చుకొని తమసావిడీకి వొచ్చారు అక్కన్న మాదన్న. గొప్పవిద్వాంసులు, పండితులు, సన్యాసులు, ఆగతానాగత వేదు లనిపించుకునేజ్యోతిష్కులు, అంతా వాళ్లని ఆశీర్వదించారు నూరేళ్లు బతకమని, యింకా చాలాకాలం ప్రజాపాలనంచేయమని, సర్వసౌఖ్యాల అనుభవించమని. వాళ్లందరిని దక్షిణతాంబూలాదులతో తగినట్టు సన్మానించి పాదుసావారిదర్శనం కోసం బైద్దేరారు. ఆబ్రాహ్మలవచనాలు విన్నాకొద్ది విశ్వనాథపండితుడికి వొళ్లు చెమటలు కమ్మాయి. తన శక్తులన్నిట్లో నమ్మకం నశించిన ట్టనిపించింది. నడవలేనేమోకూడా అనుకున్నాడు.

పైకి వెళ్లేతోవకి రెండుపక్కలా యిచ్చు కత్తుల్తో సైన్యంనుంచొని వాళ్లని గౌరవించింది. అక్కడక్కడ సేనానాయకులు ఆచారంప్రకారం వంగి సలాంచేస్తోంటే వాళ్లవాళ్లకి వొప్పగించినపనులని గురించి విచారిస్తో వెళ్లారు అక్కన్నమాదన్న. పైన మసీదుదగ్గిర సర్వసైన్యాధికారి అబ్దుర్రజాక్ ముందుకు వొచ్చి వంగి సలాంచేసాడు. "పైకివెళ్లి పాదుసావారి దర్శనం చేసుకొని తొందరగా తిరిగివొస్తా" నని అబ్దుర్రజాక్‌తో చెప్పాడు అక్కన్న. రాజసౌధానికిపక్కన్నే వున్న దేవాలయంలో దేవుడిదర్శనం చేసుకొని లోపలికెళ్లారు.

మామూలుప్రకారం పట్టుచొక్కాతొడుక్కొని నాజూగ్గా మెత్తకొరిగి కూచున్నాడు తానేషా మన్మథుడిలాగ. పాదుసావెంబడి పట్టణంనుంచి పరుగెత్తి వొచ్చినకవులు, పాటకాళ్లు, పారసీదేశపునృత్యకన్యలు కొలువుదీర్చారు. ఐనా పాదుసాముఖంమీద తాండవమాడే ఆదిరునవ్వు మాయమైంది. మాదన్నవాళ్లు సలాం చేయటంలోతే కూచోమని సంజ్ఞచేసాడు పాదుసా. ఈకొలువుని చూసి మాదన్న కాశ్చర్యమేసింది; అరచేతిలో ప్రాణాలుపెట్టుకున్న యీసమయంలో పాటలువినటానికీ నృత్యంచూడ్డానికీ పాదుసాకి గుండె లెట్లావొచ్చాయని. పాదుసాకి దగ్గిరగా జరిగి, "ఇట్లాంటి క్లిష్టస్థితిలో వీటిలో మీరు సమయం వ్యయపరిస్తే తక్కినముఖ్యమైనకార్యాలు, చావుబతుకులసమస్యలు అట్లాగే వుండిపోతాయి," అన్నాడు.

దీనంగాచూసి, "ఇవేరోజులు మనకి మిగిలినవి. తెల్లారకట్ట గోచరమైంది. మనపతనం తప్పదు. లాభం లేదు."

"మరి యీప్రయాసంతా యెందుకు?"

మాదన్నముఖంలోని బాధనీ కోపాన్ని చూసాడు తానేషా. చచ్చిపోతోన్నవాడు యీ మాయప్రపంచం మీద నవ్వినట్టు నవ్వి, "ఐనా చేయవలసిందంతా, చేయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలిగిందంతా చేస్తూనేవున్నారు మీరు. నేను చేసే దేమిటి వేరే ?"

మాదన్న మాట్లాడకుండా వేరువేపు చూసాడు. ఎవరూమాట్లాళ్లా రెండునింపాలు. అక్కన్న లేచి సలాంచేసి వెళ్లి పోయినాడు. తక్కినవాళ్లంతా తమ తమపనులు చూసుకోటానికి వెళ్లారు. పాదుపా ఆనృత్య కన్యలంవరినీ పొమ్మని సేవకురాలిని పిలిచి, "కాశ్మీర దేశంనుంచి తెప్పించిన కన్యలిద్దర్ని నాశయనాగారం లోకి పంపించు" అంటూ మాదన్నవేపు చూస్తో లేచాడు. ఆమాటల్ని మాదన్న విని ఆశ్చర్యంతో పాదుపావేపు చూసాడు. మళ్లీ అదేనవ్వు నవ్వాడా యన. లోపలికి వెడ్తోన్నపాదుపాకి మాదన్న విశ్వనాథ పండితుడు సలాంచేసారు. పాదుపా వెనక్కితిరిగి మాదన్నదగ్గిరికి వొచ్చి రెండుభుజాలమీద చేతులేసి ముఖంలోకి స్నేహంగా చూస్తో, "అబద్ధంకాదు, నాకు దృఢంగా తెలిసింది. మనపతనం నిశ్చయం. తప్పదు. ఏదోమహత్తరమైనశక్తి చెప్పింది నాతో రాత్రి. నిజం."

మాదన్న కేమీ అర్థంకాలేదు. వూరికే పాదుపా ముఖంలోకి చూసాడు.

"అవును. నీ కర్థంకాదు. బహుశా యిదే మనం ఆఖరుసారి కలుసుకోటం." కళ్లల్లో నీళ్లు కమ్మాయి.

మాదన్నకు ఆముహూర్తాన్నే పాదుపా కేవలం రాజేకా డన్న ఆయనపూర్వచరిత్రంతా జ్ఞాపకం వొచ్చింది. నీళ్లునిండినఆకళ్లవేపు చూడలేక దూరం జరిగి సలాంచేసాడు. పాదుపా చప్పున మాదన్నను కౌగలించుకొని, "నీకన్న నేనే ముందు చావటం తటస్థిస్తే దిగులొందొద్దు," అని లోపలి కెళ్లిపోయాడు. విశ్వనాథపండితుడు తెల్లమొహమేసి నోరుతెరుచుకో చూస్తోన్నాడు. ఆబ్రాహ్మల ఆశీర్వచనాల్నీ, పాదుపా మాటల్నీ మళ్లీ స్మరించుకొని యీ ప్రపంచంలో నమ్మదగినవీ, నమ్మదగనివీ తెలీక తత్తరపడ్డాడు. మాదన్నని, పాదుపాని, గోలకొండని యేమైనా కాని అని అదృష్టదేవతకి వొదిలేసి యెక్కడి కైనా పారిపోదామా యీ మొగల్‌వాళ్లకి అవుపడ కుండా అనుకున్నాడు. వూరికేవొచ్చిన ఆతలంపుని దీర్ఘంగా లోతుగా ఆలోచించాడు నిజంగా అట్లా పారిపోవాలా అని. అవును వీళ్ల అదృష్టం యేమైనా ఆపాపకార్యానికి బాధ్యత తననెత్తిమీద పడదు. తను మొగల్‌సైన్యానికి చిక్కకుండాపోతే చాలు. కాని అప్పుడే ఆమె జ్ఞాపకంవొచ్చింది. ఆమె తనకు గాకుండాపోతుంది. లేకపోతే మొగల్‌రాజ్యానికి ముఖ్య అవయవంగా వున్న తన అన్న ఇబ్రాహీంను మొగల్‌సైన్యాన్ని తురకజాతిని తప్పించుకొని తనవెంబడి అడవుల్లోకి గుట్టల్లోకి రాగలుగుతుందామరి ఆమె! ఆమెలేకపోతే ఆఅడవుల్లో బ్రతికితేనేం, యిక్కడ కుక్కమల్లే మొగల్‌కత్తికింద చస్తేనేం!

"మధ్యాన్నమైంది వెళ్లుదాం పద" అన్నాడు మాదన్న.

అక్కన్నకూడా దారిలో కలిసాడు. పాదుపా అన్నమాటల్ని యీతనితో చెప్పాలనుకున్నాడు మాదన్న. కాని దార్లోచెప్పట మెందుకు యింటికి వెళ్లిన తరువాత సావకాశంగా చెప్పుకోవచ్చు అనుకొని వూరు కున్నాడు.

పొద్దుటిమల్లేనే దారిపొడుగుతా యిచ్చుకత్తులు ధరించి నుంచుంది సైన్యం. సేనానాయకులు వీళ్లకి సలాంచేస్తోన్నారు. రామదాసునుబంధించినచెర దాటి నాలుగడుగులు నడవటంతోటే ఇబ్రాహింఖాన్ అనే సేనానాయకుడు వంగి సలాంచేసాడు. వాళ్లు ఆతన్ని దాటటంతోటే వారిద్దరివెనకాల నడుస్తోన్న విశ్వనాథ పండితుడివేపు బెదిరింపుగా చూసి యేదోసంజ్ఞచేసాడు ఇబ్రాహిం. విశ్వనాథపండితుడు రెప్పపాటున వొర నున్న కత్తిదూసి వాళ్లిద్దరిమీద పడ్డాడు. అదేముహూర్తాన ఇబ్రాహిం ఆతనిసైనికులు వాళ్లిద్దరిమీద పడ్డారు. అలారక్తంలో మునిగితేల్తోన్న అక్కన్నమాదన్నల శవాలతలల్ని ఇబ్రాహిం తనకత్తితో కోసాడు.

అలాపరుగెత్తడానికి కారణం లేదు. ఐనా పిచ్చియెత్తినట్టు, నిప్పునుతొక్కినట్టు వెనక్కితిరిగి పరుగెత్తాడు విశ్వనాథపండితుడు. పైకివెళ్లి తే తానేపా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాళ్లు పట్టుకుంటారనుకున్నాడు. ఎటూవెళ్లడానికి తోచక చిన్నతలుపుగుండా రాణివాసంలోకి పరుగెత్తాడు. ద్వారందగ్గిర కాపలావున్న సిద్దీకి యేమీ తోచక తనచేతులోవున్న తుపాకివెనకభాగంతో తలపై కొట్టాడు.

## 3

జేబీబేగం ఆమెచిన్నప్పటిపేరు గాదు. ఆమె లాలిత్యం, సౌకుమార్యం చూసి కోమలంగా తీగమల్లె వుండటంచేత ఆమె కీముద్దుపేరు పెట్టుకున్నాడు తానేషా. అయిదేళ్లకిపూర్వం గోవానుంచి గుఱ్ఱాలని తెచ్చిన పోర్చుగీసువ్యాపారస్తుడు ఆమెనీ ఆమెకంఠమాధుర్యాన్నీ వర్ణించిచెప్తే ఆకులక్షలువ్యయపరిచి తెప్పించినపోర్చుగీసుయువతి ఆమె. ఆమె మొదటిసారి పాడినప్పుడు తానేషా తన్మయుడైపోయి వొళ్లుమరిచి నృత్యంచేయటం మొదలెట్టాడట. ఉంకోసారి యెండాకాలం వెన్నెల్లో సుహానీ ఆమెపాడితే వేలకువేలుగా పాములన్నీ వొచ్చి ఆడాయట. కిల్లాలో వుత్తరంవేపున్న పెద్దహవుజులో పన్నీరునింపించి తానేషా సొంతంగా పడవనడుపుతోంటే నగ్నంగా ఆయనకి వొరిగిపండుకొని ఆమెపాడినపాట కింద కిల్లాలోని వాళ్లకి వినపడి మూడుగంటలసేపు శ్వాసకూడా పీల్చకుండా పీనుగల్లాగ పడివున్నారని చెప్పుకుంటారు. ఆమె వొచ్చాక మూడునెల్లదాక ఆమెమహల్ దాటి బైటికి రాకపోవడమేకాకుండా మాదన్నకికూడా దర్శనమివ్వలేదట పాదుషా.

ఆమె అప్పుడే స్నానంచేసి వొహర్తచీరకట్టి స్తోంటే యెండపాలుపుకి నుంచుంది. పైనఅంతా వొక్కసారి గొల్లుమన్నారు. శత్రుసైన్యం కిల్లాలో జొరబడ్డదని అందరికీ వొక్కసారి తోచింది. రాణివాసంలోని యేబదిరాణులు వాళ్లసేవకురాండ్రు అంతా వొక్కసారి కెవ్వుమన్నారు. ఆచీరను అట్లాగే వొదిలేసి నిల్చోలేక వెనకాలనుంచున్న దాసీచేతుల్లో పడ్డది జేబీబీ. వాళ్లు చూస్తోండగనే గోడమీదినుంచి జారి జాజిపొదదగ్గిర పడిపోయాడు వొకయువకుడు. రక్తంతోతడిసినకత్తి నాలుగడుగులదూరంలో పడ్డది. నెత్తిలోంచి దుముకుతోన్న నెత్తురు మడుగు కట్టింది. నెత్తురులో తడిసిన అతనిజరీఅంచుధోతిని చూడ్డంతోటే జేబీబీ అనుమానం మరీస్థిరపడ్డది. అట్లాంటిహిందూధీరుణ్ణి పాదుషా వైరులుతప్ప యితర్లు కొట్టరు. వాళ్లు కోటచుట్టూవున్న శత్రుసైన్యంగాక వేరేకాదని ఆమెగట్టినమ్మకం. ఎదురుచూస్తోన్న పిడుగు పడనేపడ్డదనుకున్నది.

దాసీవొహర్తవొచ్చి, "అత డింకా చావలేదు; బతుకుతాడేమో" అంది.

తనూచూస్తానంది జేబీబి. మెల్లిగా ఆమెను అతనిదగ్గిరకి తీసికెళ్లారు. అతనిచక్కదనం, ధీరత్వం చాటేఆముఖం, పెద్దబహదాను తెలిపేదుస్తులు ఆమెకొకవిధంగా జాలిని కలిగించాయి. తెగిపోయి అడ్డదిడ్డంగా ముత్యాలహారం పడివున్న ఆ వక్షం కొంచంకొంచంగా కదుల్తోంది. తనకు సర్వం ఐనపాదుషాకోసం ప్రాణాలనికూడా ధారవోసే యిట్లాంటివాళ్లకి త నెట్లా కృతజ్ఞత చూపించగలదు! పాదుషామీద పడబోతోన్న దెబ్బని తాను తిని ఆయనని రక్షించినట్టు తోచిందామెకి ఆ సమయాన. ఆదాసీవేపు చూస్తో అంది, "ఎక్కడికి పంపుదా మీతన్ని; అంతా ప్రాణాలకోసం పరుగెత్తుతోన్నారు."

"నాకు కొంచంగా రణవైద్యం వొచ్చు. మనప్రాణాలమీదకి వొచ్చిందాకైనా యీతనిప్రాణాలు కాపాడ్దాం."

అందరికీ తానేషాఅంటే దైవం. ఆయనశత్రువులు తమశత్రువులు; ఆయనస్నేహితులు తమ స్నేహితులు!

"ఐతే లోపలికి తీసికెళ్లండి."

అల్లరి కాస్త తగ్గింది. సైన్యంలో కొందరు తిరుగబడి యింటికివెళ్తోన్న అక్కన్నమాదన్నల్ని చంపారనీ, తక్షణమే ఫౌజుసర్దారు అబ్దుర్‌రజాక్ వొచ్చి చాలామందిని పట్టుకున్నాడనీ, పారిపోతోన్న యిద్దర్ని అక్కడే చంపాడనీ కిల్లాఅంతా తెలిసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయింది. శత్రువు లింకా బైటనే వున్నారని తెలిసి యిప్పటికైతే దక్కాయికదా ప్రాణాలని కోటలోని వాళ్ల ప్రాణాలు కుదుటపడ్డాయి అప్పటికి.

దాసీనిపిలిచి యెలావుంది ఆతనికని అడిగింది జేబీబీ. "కట్లుకట్టాంకాని యింకా స్పృహ రాలేదు; అప్పుడప్పుడు 'మాదన్న' అంటూ కలవరిస్తా" డని చెప్పింది దాసి.

అక్కన్నమాదన్నల్ని హతమొనర్చిన కత్తివాటు నుంచే తప్పించుకొ వొచ్చా డీతడు పాపం అనుకుంది జేబీబీ.

రెండోనాటి వుదయం అతనికి తెలివి వొచ్చిందని దాసీవొచ్చి చెప్పింది. చూడటాని కెళ్లింది జేబీబీ. మంచం మీద పడుకున్నాడు. వొహ కన్ను అవుపడకుండా కట్టు కట్టారు నెత్తికి. ముఖం చాలా యీడ్చుకోపోయింది. దాసీ దగ్గిరికెళ్లి చూట్టానికి రాణీవొచ్చిం దని చెవులో చెప్పింది. కన్ను తెరిచి దూరం గానుంచున్న జేబీబీని చూసాడు. అంతబాధలోవున్నా ఆమెసౌందర్యం ఆతనిదృష్టిని తిప్పేయకమానలేదు. ఆమె సౌందర్యాన్నిగురించి యెన్నోసార్లు విన్నాడు కాని యింతఅద్భుతంగా వుంటుం దనుకోలేదు. వొహతడవ కన్నుమూసి తెరిచి మళ్లీ చూసాడు. చేతినితలపైకెత్తి సలాంచేసాడు. దగ్గిరగా జరిగింది జేబీబీ.

"ఎలావుంది?"

"నొప్పి."

"దిగులుపడకు తొందరగా నయమవుతుందిలే."

అతడు మాట్లాడక యింకోవేపు చూసాడు.

"మీ వాళ్లెవరో చెప్తే వాళ్ల దగ్గిరికి నిన్ను పంపిస్తాం."

వొక్కనింపంతరువాత యీవేపుతిరిగి రెండు చేతులు జోడించి ఆమెవేపు దీనంగా చూస్తో, "క్షమించండి నేనెవరో చెప్పను. అనర్హమైన యీప్రాణాన్ని రక్షించాలంటే నన్నిక్కడే వుంచండి."



"చేతిని తలపైకెత్తి సలాంచేసాడు"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చాలాదిగులుపొందా డనుకుంది. అతనివొణికే చేతిమీద చేయివేసి "భయపడకు. పూర్తిగా నయమయేవరకు యిక్కడేవుండువుగాని. నీ కిక్క డేమీ భయం లేదు."

కృతజ్ఞతను సూచించేకళ్లతో ఆమెముఖంలోకి చూసి సలాంచేసాడు. ఆమె వెళ్లిపోబోతోంటే, "నే నిక్కడున్నవిషయం యెవరికీ తెలీనీకండి. ఎవరికి గూడా."

"తెలీదు. ఎవ్వరికీ తెలీనీను."

ఎక్కడ తెలుస్తే శత్రువులొచ్చి చంపుతారోనని భయపడ్తోన్నాడు పాపం అనుకుంటో వెళ్లిపోయింది.

## ౧౪

నెలలు గడిచిపోయాయి.

మొగల్ సైన్యం అట్లాగేవుంది కిల్లాచుట్టూ. శత్రువులు లోపలికి ప్రవేశించటానికి యెన్నోపన్నుగడలు పన్నారు. ఎన్నోతడవలు కందకంపూడ్చి కిల్లాగోడని ప్రాకప్రయత్నించారు. కాని వొక్కప్రయత్నంకూడా సాగలేదు.

కిల్లాభాగమంతా మంత్రులు వహించారు. మీ యిష్టంవొచ్చినయేర్పాట్లు చేసుకోమన్నాడు పాదుషా. రాత్రింబవళ్లు సంగీతం, నృత్యం, స్త్రీలు యివే ఆయన ప్రపంచం. కిల్లాలో చాలామంది కుట్రదారు లున్న విషయం అందరికీ తెలిసింది. మంత్రులందరూ తమ చేతనైనంతజాగ్రతగా మెదుల్తోన్నారు. ఎవరిగురించి యేమాత్రం అనుమానంకలిగినా విచక్షణచేసి దోషిని నడిమిబురుజుదగ్గిర కిల్లాఅంతాఅవుపడేట్టు వురికెక్కించారు. కొందరు మోసగాళ్లని ప్రజలందరిముందు చిత్రవధ చేసారు స్వామిద్రోహంకింద. రాత్రంతా దివిటీలు వెలుగించుకొని విచ్చుకత్తులసైన్యదళం ఆరుసార్లు గస్తు తిరిగేది. కిల్లాగోడలమీద, బురుజులమీద, గవునుల దగ్గిర కత్తులుదూసినసైన్యం వొంతులువొంతులుగా కాపలాకాస్తోంది.

మొగల్ సైన్యం మరీ యెక్కువౌటం చూసి మంత్రులంతా పాదుషాదగ్గిరికెళ్లి "యిప్పటికైనా అనుజ్ఞయిస్తే వొహమధ్యరాత్రి సైన్యాన్నంతా తుఫానులాగా మొగల్ సైన్యంమీద దుమికించి బలాబలాలు చూపించుకుందాం, యిట్లా యెన్నాళ్లని కూచోడం" అన్నారు. ఏమైనాకాని యుద్ధం వొద్దన్నాడు. పోతే యేంచేయమంటావన్నారు. మొదటితడవ మాట్లాడ్లేదు పాదుషా. రెండవతడవ మళ్లీ వేడుకున్నప్పుడు చెప్పాడాయన, గోలకొండ పడిపోక తప్పదనీ, యెన్నివుపాయాలైనా లాభంలేదని తనకు దృఢంగా తెలిసిందని. "ఇదంతా పిచ్చివేదాంతం, అలా నిరాశపడ్డానికి యేమీ కారణాలు లేవు, మూడునెల్లనుంచి కోటని రక్షించగలిగాం" అన్నారు. యుద్ధంలో జనక్షయంకాకుండా తప్పించాలంటే సంధిచేసుకోవాలని అనేకవిధాలుగా బలవంతపెట్టారు. సరే నాజనాన్ని సురక్షితంగా వుంచితే యేసంధికైనా, యెట్లాంటిషరతులకైనా వొప్పుకుంటానన్నా డాయన. చదవటంతోటే రాతి గుండెసైతం కరిగిపోయేట్టు వినతిపత్రం సిద్ధం చేసారు మంత్రులంతా కలిసి మొజ్జంకి పంపడానికి. తానేషాకు కావాల్సిం దల్లా ప్రజారక్షణం, కాబట్టి దీనికి మీరువొప్పుకుంటే యేషరతులకైనా ఆయన వొప్పుకుంటాడని తెలిపారు. ఆవుత్తరం మొజ్జంచూసి హృదయంకరిగిపోయి మెత్తగిల్లాడు. స్వార్థంకోసం జయలక్ష్మీపేర లక్షలకులక్షలప్రాణాల బలవంతంగా బలియిచ్చేరాజుకాడు తానేషా అని గుర్తించాడు. కాని యింతలోకే ఔరంగజేబు వొచ్చి యింతచిన్నదుర్గాన్ని జయించలేక యీమూడు నెల్లనుంచి మూలుగుతోకూచున్నావా అని తిట్టాడు కొడుకుని. మొజ్జం తానేషాపంపిన వినతిపత్రం ఆయనకి చూపిస్తే మొజ్జం తానేషావొలలో పడ్డాడనీ, తానేషాదగ్గిరవున్న కళ్లనితిప్పేసేఅందంకలస్త్రీల కాశపడి అబద్ధం చెబ్తోన్నాడేమో నని అనుమానపడ్డాడు ఔరంగజేబు. ఇది వూహించి కొందరు ఔరంగజేబుదగ్గిర మొజ్జంమీద చాడీలు చెప్పారు. లంచం తిన్నాడని దొంగవుత్తరాలని చూపెట్టారు. వాటన్ని


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టినీ నమ్మాల్సివొచ్చింది ఔరంగజేబు. మోజ్జంని చెర పెట్టి తానే స్వంతంగా సేనాధిపత్యం వహించాడు.

రాత్రి రెండుఝాములైనతరువాత ఆ బురుజును కాచేనాయకుడికి లంచమిచ్చి చాకలివాడ కట్టుకున్న కోటగోడని త్రాటినిచ్చెనమూలంగా ప్రాకింది మొగల్ సైన్యం యాభైదాక. చడీచప్పుడు కాకుండా యింకా యెక్కుతోన్నారు. కింద చాకిరిదగ్గిరవున్న కుక్క మొరగటం ఆరంభించి జనాన్నంతా ఆవేపు తెచ్చింది. మొగల్ సైనికులు కొందరు భయపడి కందకంలోకి దూకి కాళ్లుచేతులు విరగకొట్టుకున్నారు. తక్కిన వాళ్లని పాదుషాసైన్యం పట్టుకుంది. తెల్లారి ఆకుక్కని పట్టితెప్పించి కోటని రక్షించినందుకు తన మెడ లోని ముత్యాలపట్టెడ తీసి దానిమెడకి కట్టించాడు తానేషా.



"ఓహో ! అయితే నువ్వో! చాలాపతివ్రత మన్నమాట.........నీకు నాలి కెట్లా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తానేపా జ్ఞాపకంచేస్తే వెళ్లి నాలుగురోజుల దాకా తిరిగి రాలేకపోయింది జేబీబీ. వొచ్చి చూసే అప్పటికి ఆయువకుడిగాయం చీంపోసింది. జ్వరం కూడా వొచ్చింది తీవ్రంగా. జేలేబీ గాభరాపడి పరిచారకురాంద్రందరినీ తిట్టింది అశ్రద్ధచేసారని. రాణులకు వైద్యం చేయడానికున్న వైద్యురాల్ని పిలిపించి చూయించింది. ప్రాణం అపాయంలోవుంది; మూడు రోజులు కన్ను మీద రెప్పేయకుండా శ్రద్ధతీసుకుంటే తరువాత చూద్దామంది. అతన్ని దాసీలను నమ్మక ఆతనిమంచంపక్కనే కాచుకోకూచుంది జేబీబీ. అతని ముఖం చూస్తే యెట్లాగైనా రక్షించాలనిపించిందామెకి. ఏదగ్గిరిబంధువో అనిపించింది.

నాలుగోనాటిపుదయం ఆతనిదగ్గిరికెళ్లి కూచొని ఆముఖంవేపు చూసింది. మెల్లిగా కళ్లుతెరిచి ఆమె మొఖంవేపు చూసాడు. ఆతనిచూపుల్లో ప్రాణ లేనట్టే చూపులోకూడా నీరసత్వం కనబడ్డది. ఆ కళ్లల్లో నీళ్లు తిరిగి ఆచూపుల్ని మరీ దీనంచేసాయి. చిక్కిపోయిన తనచేత్తో ఆమెచేతిని పట్టుకొని "యెక్కడిరుణం చెల్లీ నువ్వు నా కీజన్మంలో తీరుస్తోన్నావు? ఎందుకు బతికించావమ్మా యీపాపిని?"

ఆముఖం మాస్తో అమాటలువింటే ఆమెకుగూడా యేడ్పొచ్చింది. తనపైటచివరతో ఆతనికళ్లనీళ్లు తుడుస్తో, "యేడవకు, యేడవకు; మూడురోజులు నేనులేకపోవటంచేత అశ్రద్ధ జరిగి యింతబాధ పడ్డావు. ఇహవెళ్లను నిన్నువొదిలి. భయపడకు నయమవుతుంది తొందరగానే."

"నాకు బతకాలనిలేదమ్మా నిజంగా. బతుకు అవసరమేలేదు. అందుకనే యెట్లాగైనా, తొందరగా చావాలని దాసీవాళ్లని బెదిరించుకొని అవుపత్యం చేసి మందుపుచ్చుకోక రోగం పెంచుకున్నా. మళ్లీనువ్వు— ఎందుకమ్మా నామీద నీ కింతదయ?"

"అలా బలవంతంగా మరణం తెచ్చుకోటం పాపంకదూ?"

"బతికి బైటపడితే ఘోరంగా, మరీఘోరంగా చావాల్సివొస్తుందిచెల్లీ."

"భయపడకు యింకా శత్రుసైన్యమంతా బైటనే వుంది. మాదన్నవాళ్లు చస్తేనేం తానేపావున్నంతవరకు మనకు భయంలేదు."

గట్టిగా మూలిగి కళ్లనుంచి మరీకారే ఆనీటిని ఆమె కవుపడకుండా ఆవేపు తిప్పుకున్నాడు తలని.



ఆడింది? నిజం చెప్పు వాడెవడు, భర్తేనా?"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వొక్క నిమిషంతరువాత మళ్లీ యీవేపు తిప్పి స్థిరంగా, "చెప్పను, చెప్పను చెల్లీ నీతో."

ఆతన్ని మాట్లాడిస్తే బాధపడతాడని వొంటి మీదికప్పు సరిచేసి నెమలియీకలఫంకాతో విసరడం మొదలెట్టింది.

రాత్రి రెండుగంటలకి చప్పున మేలుకొచ్చిందామెకి. కోటంతా యేమీ వినపడకుండా వొకటే అల్లరి. పైకెక్కి చూసింది. వొహర్ని పట్టకుండా వొహరు యేడుస్తూ, దివిటీలు లాంతర్లు పట్టుకో పరుగెత్తుతోన్నారు. ఎక్కడికో? దాసీలు పరుగెత్తుతోవొచ్చి చెప్పారు మోసకాడెవరో శత్రువులకి పడమటిగవిని తెరిచాడనీ, సైన్యమంతా లోపల జొరబడుతోందని. ఆమెగూడా కెవ్వుమంది. అంతా ఆయువకుడుపడుకున్నగదిలోకి పరుగెత్తారు. వొహచేతిమీద లేచి వీళ్లవేపు చూస్తూ, యేమిటేమిటన్నాడు. జేలీబీ ఆతనిమంచందగ్గిర కూలబడి ఆతనిమీద చేతులేసి, "అయింది. శత్రువులు."

లేచి కూచొని ఆమెని లేపి పైకివొరిగించుకొని, "భయపడకు, భయపడకు చెల్లీ" అని యింకా యేమేమో అన్నాడు ధైర్యంగా ఉత్సాహంగా. కాని యెవరూ వినిపించుకోలా. అంతా వొహటేగోల.

చేతులో కత్తిపుచ్చుకొని బరిగుఱ్ఱంమీద యెక్కి ప్రవాహంలావొచ్చే శత్రుసైన్యాన్ని గవునిలో అడ్డుపెట్టాడు అబ్దుర్రజాక్. వందలకొద్దీ శత్రుసైనికుల్ని నరికిపారేసాడు అద్భుతమైనశౌర్యాన్ని ప్రకటిస్తూ. వొంటినిండన్నీ గాయాలు తగిలాయి. శత్రుసైనికుడికత్తివాటుకి గుఱ్ఱం కళ్లెంతెగి అతనిస్వాధీనం తప్పింది. ప్రవాహం నిరాటంకంగా లోపలికివొచ్చింది.

తెల్లారేవరకు కోటంతా ఔరంగజేబుస్వాధీనం అయింది.

చావంగ మిగిలినవాళ్లందరినీ చెరపెట్టారు. ముఖ్యంగా రాజబంధువుల్ని.

తానేషాను దౌలతాబాదు పంపారు.

౫

ఔరంగజేబుసేవకులు వొచ్చి వొహరి తరువాత వొహర్ని తీసుకెళ్లుతోన్నారు తానేషారాణుల్ని. జేలీబీవొంతుకూడా వొచ్చింది.

మామూలుముతుకగుడ్డ తెల్లఅంగరకా తొడుక్కొని పెద్దగడ్డంతో కూచున్నాడు ఔరంగజేబు యెడమచేత్తో గడ్డం పీక్కుంటూ. ఆతన్ని చూట్టంతోటే వొళ్లు జల్లుమందామెకి. ఇట్లాంటిక్రూరమైన ముఖం మోటురూపం యిదివరకెప్పుడూ చూల్లేదామె. ఎట్లాకన్నదో ఆతల్లి!

"ఈమె జేలీబీ. పోర్చుగీసుయువతి" అని చెప్పాడు ఔరంగజేబుపక్కనకూచున్న ముసలిమొల్లా. ఈమొల్లాకే తానేషా, తానేషారాణులు తలవంచి సలాంచేసి దీవనలు పొందింది. ఈమొల్లానే రెండురోజులకిపూర్వం తానేషాను యింకా నూరేళ్లుబతకమనీ, ప్రపంచమంతా వొహటేరాజ్యంగా యేలమనీ దీవించింది.

"ఈమెయింట్లోనే తురకవేషంతో వున్న హిందూ దొరికింది. తనభర్త అంది;" అన్నాడు యింకొహమొల్లా.

"ఓహో! అయితే నువ్వు చాలాపతివ్రతవన్నమాట. వాడిని, ఆకాఫర్ని అసహ్యంలేక యింట్లోపెట్టుకొని సిగ్గులేక నాభర్త అనటానికి నీకు, పవిత్రమైన యిస్లాంమతందానివైన నీకు నాలికెట్లా ఆడింది? నిజంచెప్పు వాడెవడు, భర్తేనా?"

"కాదు."

"కాదు, కాదు; అంతకుముందు దొంగభర్త, అప్పుడు భర్త, మరియిప్పుడో?"

నిజానికి ఆమెకిగూడా తెలీదు అతనెవరో. అప్పుడు అతను హిందూఅంటే పుటిక్కనచంపేస్తారని తురకవేషం వేసింది. తురక అంది. తురకైతే నీకేంకావాలి, భర్తా అని ఆమొల్లాఅంటే అట్లాగైనా దక్కుతాడేమోనని అవునంది. కాని ముందు యిట్లా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిణమిస్తుందనుకోలా. ఇప్పుడు యేవిధంగా సమర్థించ బోయినా లాభంలేదని వూరుకుంది మాట్లాడకుండా.

ఆహిందువును తీసుకోరమ్మన్నాడు ఔరంగజేబు. సంకెళ్లు తవిలించి యిద్దరుపట్టుకో తీసికొచ్చారు. తలకి కట్టు అట్లాగేవుంది. మరీ చిక్కిపోయాడు.

ఆపెద్దమొల్లా అతన్ని చూసేమాట్టంలోనే అన్నాడు, "ఓహో, యీతడు విశ్వనాథపండితుడు. నాకు బాగాతెలుసు. మాదన్నకు యితడు మంత్రీ, అంగరక్షకుడు, స్నేహితుడు, అంతాను."

ఔరంగజేబుకి సలాంచేసి, "కాని మాదన్నని అక్కన్నని చంపించి నేనే," విశ్వనాథబట్టు అన్నాడు గట్టిగా.

"అయితే యిదేపనిగా యిక్కడవుండి చివరకి వాళ్ల తలల్ని తెచ్చి నాముందు పడేసిన ఇబ్రాహింఖాన్ గడ్డికోసాడు గావును మూడేళ్లపాటు గోలకొండలో!" నిదానంగా అన్నాడు ఔరంగజేబు.

"ఆయన్ని రప్పించి అడగండి."

ఇబ్రాహింఖాన్ వొచ్చాడు. అతన్ని అడిగాడు ఔరంగజేబు, "ఈతడు ఆహిందువులతలల్ని కోసి నీకిచ్చాడటకదూ నాదగ్గిరికి తీసికెళ్లమని?"

"సత్యం ప్రభువులే విచారించాలి. నేనేచెప్పితే ఆత్మస్తోత్రంగా వుంటుంది." అని వంగి సలాంచేసాడు ఇబ్రాహిం.

ఔరంగజేబు విశ్వనాథపండితుడివేపు చూసాడు. అతను అట్లాగే నిర్విణ్ణుడై చూస్తోన్నాడు.

"అయితే నువ్వు మాకుచేసిన వుపకారానికి యేం బహుమతికావాలంటావు? ఈ జేలీబీ వొక్కర్తె చాలా.

"నన్నేమైనా అనండి, చంపండి, చిత్రవధ చేయండి. కాని ఆమెనిమాత్రం అవమానపరుచొద్దు? ఆమె నాచెల్లెలిసమానం."

"అవును, అవును; మాఅందరిముందు ఆమె నీచెల్లెలిసమానం. లేకపోతే——"

అంతా నవ్వారు. విశ్వనాథపండితుడు ఉగ్రుడై పోయాడు. కాని యిద్దరు రెండురెట్టల్ని పట్టుకొని కదలనిచ్చారుకారు.

"రేపటికి యీ జేలీబీ నిన్ను జేలీమల్లే అల్లుకుంటే చాలా?"

అంతా నవ్వారు మళ్లీ.

మర్నాటివుదయం——

జేలీబీ విశ్వనాథపండితుడిని వొకరిమీద వొకర్ని పడుకోపెట్టి చేతికి చేయి, కాలుకు కాలు, నడుంకు నడుం బిగించి త్రాళ్లలో కట్టి రెండుశరీరాలు వొకటే చేసారు. కట్టెల్ని చితిగా పేర్చి దానిమీద యినప మంచం వుంచి దాంట్లో వీళ్లని పడుకోపెట్టి గొలుసుల్తో బిగించారు.

చితి అంటించారు.

పెద్దమంటగా కాల్తోన్నప్పుడు చుట్టూవున్న వాళ్లని తోసుకొని దేహంఅవుపడకుండా బురకా కప్పుకున్న స్త్రీ సరాసరి పరుగెత్తుతో వొచ్చి మంటలో దూకింది. ఆబాధకి తాళలేక లేస్తోపడులో తన ముఖాన్ని యీవేపు తిప్పింది. ఇబ్రాహింఖాన్ కెవ్వుమన్నాడు.

తెల్లారిచూస్తే ఆయినపమంచం దానిమీద వొదులుగా గొలుసులూ అట్లాగే వున్నాయి బూడిద రాసిలో.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## వేశ్యాకులం యెందుకోసం పుట్టిందీ?

ఇప్పుడు వేశ్యాకులానికి చెందిన స్త్రీపురుషులు చిరసంచిత మైన తమ సంప్రదాయాన్ని మార్చుకోడానికి తీవ్రప్రయత్నాలు చేస్తున్నారు.

తమ కులం పేరు మార్చుకోవా లని కూడా వారు పట్టుదలగా వున్నారు.

ఇదివరకే పడుపువృత్తిలో వున్న యువతులు తమ గంధర్వులతో స్థిరీకరణం చేసుకోవలెనం దనిన్నీ తీర్మానాలు జరుగుతున్నాయి.

ఇందుకు ఆశ్చర్యం లేదు.

ఆకులానికి చెందిన పురుషులలో ఉన్నతవిద్య హుటాహుటి నడకలతో వ్యాపిస్తోంది.

వారిలో అనేకులు బాధ్యత గల పెద్దపెద్ద వుద్యోగాలలో వుండి, అసాధారణశక్తిసామర్థ్యాలు చూపిస్తూ, వోహో అనిపించుకుంటున్నారు.

అనేకులు స్వతంత్రవృత్తులలో గూడా ఉన్నతి పొందుతున్నారు.

నృత్యాభినయాల్లో పేరుమోసిన ఆకులస్త్రీలు గూడా నేటి సభలను చూసి రోతపడుతున్నారు.

ఇలాంటి పరిస్థితుల్లో వారికి సంస్కారదృష్టి బలపడుతోం దంటే వింత యేమీ లేదు.

వారి ప్రయత్నాలు చాలా మట్టుకు ఫలోన్ముఖాలవుతున్నాయి.

శాసనసభలో కూడా వారి కనుకూలనిర్ణయాలు జరుగుతున్నాయి.

కొద్దికాలంలో—మన కళ్లయెదటే భోగంమేళాలు చారిత్రికవిషయా లయిపోతాయి.

'వేశ్య' అనే మాట యిక నిఘంటుబోధ్యం అయిపోతుంది.

అయితే:

కొంతకాలం దాకా ప్రజలు వ్యవహారంగా చెప్పుకునే సంగతులు ఇదివర కనేకాలు జరిగాయి.

వాటిలో యిది నీహారలేశం.

మొట్టమొదట వేశ్యాకులంవారికి ఈసంస్కారదృష్టి కలిగించినవారు అగ్రజాతులవారు.

వేశ్యాబహిష్కారాన్ని గురించి ఆదిలో అగ్రజాతుల్లోనే తీవ్రప్రచారం జరిగింది.

బ్రాహ్మడు తన వర్ణాశ్రమధర్మాలను చూసే జుగుప్స పొందినప్పుడు అగ్రజాతుల్లో ఈ విషయం బహుజనసమ్మతం కావడంలో విశేషం యేమీ లేదు.

ముఖ్యంగా ఈవిషయంలో అగ్రజాతులవారికి పాశ్చాత్యసంఘాలు వరవళ్లు.

"ప్రపంచకంలో యెక్కడా వ్యభిచారంకోసం ప్రత్యేకంగా వొక తెగ కేటాయించబడలేదు. మన దేశంలో అలాంటిది వుండడం మనకి అవమానకరం."

ఇదీ వారి వాదసరళి.

పాశ్చాత్యదేశాలలో ఇలాంటి తెగ లేకపోతే మానింది, ఈతెగవారి వృత్తిని నిర్వహించేవారున్నారా లేరా అని వారు పరిశీలించలేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏసంఘ మేనా యితరసంఘాలవారికి గూడా నిర్దుష్టంగా—సర్వాంగసుందరంగా కనపడేది పృథివి మీద ఎక్కడే నా వుందా అని కూడా వారు యోచించలేదు.

వారికి వొకటే నిశ్చయం. "ఇది అసభ్యతకి గుర్తు. అభివృద్ధికి వేరుపురుగు, పశుప్రవృత్తికి సన్నిహితం" ఇంతే.

ఏతావతా: దేశంలో వ్యభిచారం కనబడకుండా చేస్తా మంటే — అథవా తగ్గించివేస్తా మంటే మొదటి ప్రశంస నాదీ.

వేశ్యాకులంలో గార్హాస్థ్యం ప్రబలితే—పడుపువృత్తి నిశ్శేషం అయిపోతే మొదటి ధన్యవాదంనాదీ.

అయితే, యిక యీ చర్చ అంతా యెందుకూ అంటే, వేశ్యాకులం యెందుకోసం పుట్టింది?

ఇదీ జిజ్ఞాస.

చూడరాదా అంటే, చూస్తే నిజంగా మంచి స్థితిలో వున్న కులం యిప్పు డేదీ లేదూ.

పూర్వు లేర్పరిచిన ధర్మప్రవృత్తి మంచిదా చెడ్డదా అనేది వేరే విషయం; కాని అది యిప్పుడెక్కడా సుస్థితిలో లేదు.

ఆనియమాలను ఇప్పు డెవరూ అనుసరించడం లేదు. ఎవరూ గౌరవించడం లేదు.

ఇప్పుడు జరుగుతూ వున్నది 'ధర్మవిప్లవం' అనతగిందే కాని ధర్మసంస్కారం కాదు. ధర్మనిర్ణయం అంతకంటే కాదు. కాని యిప్పటి నడతని బట్టి పూర్వులిలాగే ధర్మనిర్ణయం చేశా రంటే యెలాగా?

మనవర్ణాశ్రమధర్మాలకిప్పుడురాజావలంబం లేదు.

వాటి కవే మారిపోతున్నాయి.

మార్చేవారికి కూడా నిషేధం లేదు. ఆటంకాలూ లేవు.

పైగా చాలా ధర్మాలు మార్చవలసిన అవసరమూ వుంది.

కాని యిందుకోసం అసత్యకల్పన చెయ్యనక్కరలేదు.

మార్చడం అవసరమా కాదా అనే కాని శాస్త్రంలో యేం వుందీ అని కాదు ప్రశ్న.

కాగా, వేశ్యాకులం వ్యభిచారం కోసం పుట్టిందనడం పూర్వులను చెంపపెట్టు. ఇలా అనేవారి అజ్ఞానానికి మాయని ముద్ర.

వాస్తవంగా వేశ్యాకులం గణించతగ్గది.

ఏమంటే? అది యేర్పడ్డప్పుడు దానికి నిర్ణయించబడ్డ ధర్మం నాగరికతకి నికషం, కళకి జీవగఱ్ఱ.

మన బానిసప్రవృత్తికి అది యిప్పుడు మోటయితే కావచ్చు; కాని ప్రపంచికం అంతటా దానికి ఆదరం వుంది. గౌరవం వుంది. పూజ్యభావం వుంది. పూజ్యత వుంది.

దానికి ప్రోత్సాహం వుంది. పోషణ వుంది. క్షణక్షణమూ వినియోగమున్నూ వుంది.

జపానులో, చీనాలో, రషియాలో, జర్మనీలో, ఫ్రాన్సులో, బ్రిటిషు దీవులలో, అమెరికాలో —ఎక్కడ చూసినా దానికి అత్యాదరం వుంది. అగ్రతాంబూలం ముట్టుతోంది.

ఆధర్మం అంటే పాశ్చాత్యజాతులవారు పడిచచ్చిపోతారు.

ఆసభ్యజాతులవారే కాదు, యేనాదులు, చెంచులు, నీగ్రోలు—ఎస్కిమోలున్నూ దానిని నెత్తిమీద పెట్టుకుంటున్నారు.

స్త్రీలకి అంతఃపురంలో సైతం బురకాలను తగిలించే వుంచే వారున్నూ ఆధర్మాన్ని గౌరవించడంలో ఆహారనిద్రలు మరిచిపోతున్నారు.

అది అభినయానుబద్ధ మైన నృత్యం. గానానుప్రాణిత మైన నాట్యం.

అది లలితకళ అని మాత్రమే అంటే చాలదు.

లలితకళలలో అది లలితలలితం.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౭. సోఫా

(పేము అల్లినది)



౮. కుర్చీ

([illegible])

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కనక స్త్రీలే దానికి అర్హతకలవాళ్లు.

నిజమే. ఇంతవరకూ యెవరికీ ఆక్షేపణ లేదు.

ఇక వున్న దల్లా ముందే వుంది.

అ దేమి టంటే? మగవాళ్లకి ఈవిద్యలు వుపాదేయాలు కావు.

వా రీవిద్యలకు సిద్ధపడడం రసాభాసానికి కూడా మూలం.

అంచేత దీనికోసం శాశ్వతబ్రహ్మచారిణులు కావలసివచ్చింది.

కొందరు కన్యలు వివాహం అనే కట్టుబాటుకు అతీతలుగా వుండిపోవలసివచ్చింది.

కాని, బతికి వున్నంత కాలమూ స్త్రీ కన్యగానే వుండిపోడానికి మన సంప్రదాయం వొప్పుకోదు.

పెళ్లి చేసుకోని యువతి మన ధర్మాన్ననుసరించి పతితురాలు. ఆమె తాకరానిది; చెప్పరానిది; చూడరాని దిన్నీ.

ఇలాగ యీ సూత్రానికీ, నృత్యాభినయాల కోసం స్త్రీ కన్యగా వుండిపోడానికి విధాయక మైన సూత్రానికీ విసంవాదం వచ్చింది.

ఇలాగ యివి వొకటి యేటికీడిస్తే మరొకటి కోటికీడ్చింది.

నిజానికి రెండూ బల మైనవే. రెండూ శిరసావహింవతగ్గవే.

మరి గతి యేమిటీ!

ఈభిన్న సూత్రాలకు సమన్వయం కలిగించడంలో అప్పటి కులపతులకు తోచిన యుక్తి ఈకన్యలను దేవుడికి ముడిపెట్టడం.

వేశ్య లంటే వీరూ.

దేవదాసీ అనే శబ్దానికి వ్యుత్పత్తి యిదీ.

వేశ్యాకులంయొక్క నిష్పత్తిక్రమం యిదీ.

దీనితో యిటు వైవాహికధర్మసూత్రమూ నిర్బాధమయింది, అటు భరతమూ అప్రతిహతం అయింది.

సంసారసాగరంలో మునకలు వేసే మానవజాతికి ఆనందపారవశ్యం కలిగించే యీలలితకళకి ఆలంబం కావడంవల్ల వేశ్యాకులం రాజాస్థానాల్లో ఉన్నతపదవి పొందింది.

ఐహికజీవితానికి సోపానాలూ, అంతరువులూ అయిన శుభకార్యాలలో ఈవేశ్యలు మంగళదేవతలైనారు.

మొదణ్ణుంచీ దేవుని విగ్రహాలూ, దేవుని ఆలయాలూ, దేవుని రథాలూ, దేవుని ఆభరణాలూ, దేవుని వుత్సవాలూ కళాబంధురాలు కావడంవల్లనూ, సహజంగా వేశ్యలు దేవుని ఆత్మీయవర్గంలో చేర్చబడినందువల్లనూ దేవతోత్సవాలలో వారికి అగ్రతాంబూలం యేర్పడింది.

పెళ్లికి భోగంమేళం ; పెట్టడం యిందుకూ.

వేశ్యలు అభినయిస్తూ వుంటే మహామహావాళ్లంతా యెదట కూచోడం యీ కళామాధుర్యాన్ని అనుభవించడానికి.

మన ప్రభువులు అవక్రపరాక్రమంతో రాజ్యాలేలినంతకాలమూ కవులు పూజించబడ్డారు. గాయకులు గౌరవించబడ్డారు. చిత్రలేఖకులు ఆదరించబడ్డారు. శిల్పులు పోషించబడ్డారు.

వేశ్యలున్నూ బహూకరించబడ్డారు.

ఇలాగ వేశ్యల వృత్తి కళాప్రదర్శనం గాని వ్యభిచారం కాదు.

వేశ్యాకులం వొక గొప్పకళకి పట్టుగొమ్మగా వుండడానికి గాని వ్యభిచారం కోసం ఏర్పడలేదు.

స్త్రీ చూపు పరపురుషుడి మీద పడడమే సంభవిస్తే దాన్ని మంగళసూత్రం బంధించలేదు. ఆభిజాత్యం మళ్లించలేదు. మొగుడి పిడికిలి తప్పించలేదు. అత్తగారి కాపలా ఆటంకపరచలేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అలాగే పురుషుడికి కూడా మనస్సు చలిస్తే దాన్ని వేదాలు సరిచెయ్యలేవు. శాస్త్రాలు దిద్దలేవు. యముడుకూడా యేమీ చెయ్యలేడు.

స్త్రీపురుషులలో ఈపశుప్రవృత్తి ఆదినుంచీ వుంది. అన్ని దేశాల్లోనూ వుంది. మనలోనూ యెక్కువగా వుంది.

ఇందులో వొక విశేషం కూడాను. వేదాలు విప్పండి. పురాణేతిహాసాలు తెరవండి. స్త్రీలశీలాన్ని కాపాడడం కోసం యిప్పు డమల్లో వున్నన్ని కట్టు బాట్లు వెనక వెనక లేవు.

స్త్రీలకి అప్పు డున్నంత స్వేచ్ఛ యిప్పుడులేదు.

ఇప్పుడు పాశ్చాత్యస్త్రీ లెంత కళాభిమానవతు లుగా వున్నారో మన స్త్రీలుగూడా అప్పు డలావుండే వారని మన వాఙ్మయం ఖంగున ప్రతిపాదిస్తోంది.

చెప్పవచ్చిం దేమి టంటే? వర్ణవ్యవస్థ యేర్ప డిన ఆకాలంలో పశుప్రవృత్తి తీర్చుకోవా లంటే పురు షుడికి పరస్త్రీలు అతిసులభంగా చిక్కేవారు.

ఇందుకోసం—వ్యభిచారంకోసం ప్రత్యేకంగా వేశ్యాకులం యేర్పరచవలసిన అగత్యం యేమీ కలగ లేదు.

అయితే, యిప్పుడు వేశ్యలు వ్యభిచరించడం లేదూ?

నిజమే. వేశ్యలూ వ్యభిచరిస్తున్నారు.

వారిలో అది అధికంగా వుం దంటే దానికి బల మైన కారణాలూ వున్నాయి.

వొకటి. వేశ్యల శరీరాలు ఇనుముతో నిర్మించ బడలేదు.

రెండు. వేశ్యలు కళాకుశలలు. అంటే కళా వతులు.

కళ కోసమే వారు ప్రత్యేకించబడ్డారు.

ఇక వాత్స్యాయనుణ్ణి అడగండి. అతని అను యాయు లంతా యేం చెబుతున్నారో వినండి.

కళాకుశల శీలవతిగా వుండలేదు.

కళాకుశలుల ప్రపంచకం వేరు. వారి మనః ప్రవృత్తి రసజగత్తులో నిత్యతాండవం చేస్తూ వుం టుంది.

సాంఘికనీతులకు వా రతీతులై వుంటారు.

వారి దృక్పథమే వేరు.

వారి ఆశలే వేరు.

వారి అనుభవాలే వేరు.

వారి జీవనవిధానమే వేరు.

వారి జీవితపరమావధియే వేరు.

వారి ధర్మాధర్మాలను పరిశీలించడానికి మన మామూలు పద్ధతులు గుడ్డిగవ్వకున్నూ మారవు.

ఏవంచ:

ఇప్పుడు వొక కులంమీద యింకోకులానికి అధి కారం యేమీ లేదు.

వేశ్యాకులంవారు తమ కులధర్మాలను తమ యిష్టం వచ్చినట్లు నిర్ణయించుకోడానికి పూర్తిగా స్వతంత్రులుగా వున్నారు.

అందుకు వారే అర్హులున్నూ.

ఇతర కులంవారికి వారిని ఆజ్ఞాపించడానికీ, శిక్షించడానికీ ఏమీ సత్తా లేదు.

—శాస్త్రి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## తిక్కన చిత్తరువు !

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు యొక్క కళాశాలయందలి తెనుగుసంఘమువారు ఆంధ్ర కవిబ్రహ్మయగు తిక్కనగారి చిత్తరువును గీయించుటకై, నూటపదునారు రూపాయిల బహుమతి నేర్పాటుచేసిరి. ఈ బహుమతిని బడయుటకు తెలుగుదేశముయొక్క వివిధ ప్రాంతములనుండి సుమారు ౧౭ పటములు వచ్చినట్లు తెలియుచున్నది. ఈపటములను బంపిన చిత్రకారుల పేర్లు ప్రకటింపబడలేదు. కాని ఈపటము లేవియు బహుమతి నిర్ణేతలదృష్టికి ఆగినట్లులేదు. అయినను వచ్చినవానిలో వారికి ప్రశస్తములని దోచిన రెండు చిత్తరువులనుబట్టి వానిని రచించిన చిత్రకారులను తిరిగి పోటీకి నిలువబడుడని ఆహ్వానించినట్లు తెలియుచున్నది. ఈశిల్పులలో నొకరు బందరు వేంకటాచార్యులు గారు, వీరు నూనెరంగుల చిత్రకారులు. రెండవవారు భీమవరం బాపిరాజుగారు, వీరు నీటిరంగుల చిత్రకారులు. వీరిరువురును ఆంధ్రలోకమున పేరు వడసిన శిల్పులు. కాని వీరిరువురకు నింతవరకు జేసిన కృషికి నెట్టి ప్రతిఫలము నొసగక, తిరిగి క్రొత్త చిత్తరువులను రచించి పరీక్షార్థము పంప మనుట పరీక్షకులకు గాని, పరీక్షితులకు గాని గౌరవప్రదముగ లేదు. రెండవ పరీక్షలోనైనను వీ రుత్తీర్ణులైనట్లు ఎంచుకొనబడెదరని చెప్పుట కెట్టి యవకాశమును లేదు. తిరిగి రచించిన చిత్తరువులుకూడ విచారణకర్తల పరిశీలనకు నిలువగలవనుహామీ యెక్కడ ? విషయమా మహత్తరమైనది. తిక్కన చిత్తరువు సామాన్యరూపపటము వంటిదికాదు. తిక్కన రూప మిట్లుండునని నిర్ణయించుటకు దగిన చరిత్రాధారములు లేవు. ౧౩-వ శతాబ్దమునాటి మహాపురుషుని రూపమును కేవల మూహచే గల్పించుకొనదగినదే కాని, నఖలు వ్రాయుటకు అనువైనదికాదు. తిక్కన గ్రంథములు గాని, కేతన దశకుమారచరిత్రము గాని చదువునప్పుడు, శిల్పికి ఏ దివ్యవ్యక్తి, ఏ యమరమూర్తి వారి కంటియెదుట తాండవించునో, ఆ బింబమును రేఖలలోను, రంగులలోను దింపవలసియుండును. ఇక్కడ బరీక్షింపదగినది కేవలము హస్తనైపుణ్యమే కాదు, చిత్రరచనావిన్యాసమే కాదు. భావనాశక్తిని, రూపకల్పనావైదగ్ధ్యమను బ్రదర్శింపవలసియున్నది. అందులో నీ తిక్కన ఒక సామాన్యపురుషుడు కాదు. వీనిని గూర్చిన గాథలనేకములు కలవు. కొన్నికల్పితములు, కొన్ని చరిత్రసిద్ధములు. కల్పితగాథలు చరిత్ర దృష్ట్యా వర్జితములైనను, వాని యనుగున వ్యక్తికి సంబంధించిన విశేష మేమియో యుండియుండును. శిల్పి వీనినన్నిటిని శిల్పద్రవ్యములుగ సంగ్రహించి మూర్తికల్పన చేయవలసియుండును. అందుపై, తిక్కన జీవితమున కనేక ముఖములు కలవు. శృంగారపురుషుడని ఊహించుటకు ఆస్కారముగలదు. పరాక్రమశాలియని సూచించుటకును ఆధారమున్నది. భాగ్యభోగముల ననుభవించెననుటకు సందియము లేదు. రాజనీతి విశారదుడైన అమాత్యుడు. నైష్ఠికుడైన సోమయాజి. హరిహరనాథుని సేవించిన భక్తుడు. ఆంధ్రావని మోదముంబొరయ పంచమవేదమును తెనిగించిన సాక్షాత్తు కవిబ్రహ్మ. ఎన్నికళ లీ బింబమున బ్రతిఫలింపవలయునో కనుడు. ఇట్టిచిత్రరచనను గావించుటకు రు ౧౧౬ లు బహుమతి యట! ఇందుకై పరీక్షాధికారుల సలహాలను గైకొనుచు తిరిగి తిరిగి చిత్రించుచుండవలెనట. ఇట్టిపోటీ కవిబ్రహ్మకుగాని, విశ్వకళాపరిషత్తుకు గాని గౌరవప్రదముగాదు. శిల్పుల కంతకంటెను కీర్తికరముగాదు. చిత్తరువును గీయుట, కొలతలిచ్చి చాపల నల్లించుట వంటిదని తలపోసిరో, లేక శిల్పులు కూలిచేసికొను ముచ్చివాండ్రని భావించిరో తెలియకున్నది. ఆంధ్రకళాలక్ష్మి యిక కన్నీరు పెట్టుచున్నదనిన, చింతించవలసిన పనియేమి ?

౭౧-౮-౧౯౩౮ కృష్ణాపత్రిక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



జపానువిద్యార్థినులు 700 మంది యువరాజు జననోత్సవమునందు "అభినందనములు" దెలుపుటకు అక్షరాకారముగ నిలుచుట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






శ్రీ సీతారామమ్మగారు, బి. ఏ., ఎల్. టి.,

ఆంధ్ర విశ్వవిద్యాలయమునుండి గణితశాస్త్రమందు పట్టపరీక్షలో కృతార్థురాలైన మొదటి హిందూ స్త్రీ. ఈమె డాక్టరు కనగాల లక్ష్మీనరసింహారావుగారి ప్రథమపుత్రిక. ౨౭-౬-౧౯౧౦ తేదీని జన్మించి ౧౯౩౦ సంవత్సరములో పట్టపరీక్షయందు కృతార్థురాలై, నాటినుండి గవర్నమెంటు విద్యాశాఖలో పనిచేయుచున్నారు. ప్రస్తుతము ఏలూరు గవర్నమెంటు సెకండరీ ట్రెయినింగుస్కూలులో ఈమె ప్రథమసహోపాధ్యాయిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీమతి డి. పార్వతీబాయిగారు

బళ్లారిజిల్లా విద్యాసంఘ సభ్యురాలుగా నియమింపబడెను.



శ్రీమతి ఆల్ఫ్రెడుసతి

కడపలో బెంచి మేజిస్ట్రేటుగా నియమింపబడెను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(భావ సంవత్సర అధికవైశాఖ, నిజవైశాఖ మాసములు మే-జూన్ 1934)

ఉత్తరము

తూర్పు




పడమర

దక్షిణము

[ఈ పటము తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను.]

ఇందు చూపబడినట్లు నక్షత్రాదులు మే నెలలో

| | |
|---|---|
| 8-వ తేదీని రాత్రి 8 గంటల 57 నిమిషములకును, | 31-వ తేదీని రాత్రి 7 గంటల 27 నిమిషములకును, |
| 15-వ ,, ,, 8 ,, 29 ,, | జూన్ |
| 22-వ ,, ,, 8 ,, 1 ,, | 7-వ ,, ,, 6 ,, 59 ,, |

కనబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈభావసంవత్సర అధికవైశాఖ, నిజవైశాఖ మాసములలో రాత్రితొలిజామున నాకాశమున నగపడు నక్షత్రాదులను గమనింతము.

## Milky Way పాలవెల్లి

ఉత్తరమునను, ఈశాన్యమునను తప్ప శేషించిన దిక్చక్రము (Horizon) మీదనే చుట్టును పాలవెల్లి వ్యాపించియున్నది. అనగా, తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పశ్చిమము, వాయవ్యము అను నీ దిక్కులను పాలవెల్లి దిక్చక్రమును అంటుచు, క్రమముగా సంకర్షణ, శేష, వృశ్చిక, వృకములను నక్షత్రసమూహములవారనే పోయిపోయి దక్షిణమున అశ్వతర, త్రిశంకు, విశ్వామిత్రులను గడచి, నౌక, మృగవ్యాధ మండలములమీదుగా పూర్వశ్వాన, మిథున, సారథి మండలములనుచుట్టి, క్షితిజమున మనికితేలుచున్నట్లు కొంతకనబడి, కొంతకనబడక, గగనసతిధరించిన ఉత్తరీయములాగున చూపట్టుచున్నది.

## మిక్కిలి కాంతివంతములైన నక్షత్రములు

## (First Magnitude Stars)

౧. మృగవ్యాధుడు. (Sirius)

౨. ౩. అశ్వతర మండలమున అశ్వినులు. (Alpha-Beta Centaurus)

౪. స్వాతి. (Arcturus)

౫. బ్రహ్మహృదయము. (Capella)

౬. బ్రహ్మ. (Vega)

౭. పూర్వశ్వానము. (Procyon)

౮. ౯. త్రిశంకుడు. (Alpha-Beta-crux)

౧౦. జ్యేష్ఠ. (Antares)

౧౧. చిత్ర. (Spica)

౧౨. సాంబమూర్తి. (Pollux)

౧౩. మఘ. (Regulus)

[అగస్త్యుడు (Canopus) జూన్ నెల ౧-వ తేదీని అస్తమించును.]

## ధ్రువ ప్రాంతములు

ధ్రువునికాంతి మనకు చేరుసరికి సుమారు ౪౪ సంవత్సరములు పట్టును. ధ్రువుడు చిన్నయెలుగు (Ursa Minor) తోకచివర మెఱయుచుండును. ధ్రువ రక్షకులైనధాత, విధాతలు ఆనేలుగుయొక్క కుడి కాలుకడ నున్నవి. ఉత్తర దిక్చక్రమునకు కొంచెము మీదుగా ఊర్ధ్వశిరుగువ చుక్కలుమాత్ర మగపడుచున్నవి. శిరస్సు కానరాదు.

సప్తఋషిమండలము గగనమధ్యరేఖపై నున్నది. నరకుడు లఘుఋక్షమును (చిన్నయెలుగును) చుట్టుకొని ధ్రువక్షితిని అంటియుంటకుండ, రెండుఋక్షములమధ్యను కనబడుచున్నాడు.

## ఈశాన్యమున

గగనమధ్యరేఖకును, ఉత్తరసమీపపు ఈశాన్య దిక్కునకును మధ్య అర్ధచంద్రాకారముగలచుక్కలు కొన్ని మెఱయుచున్నవి. పాశ్చాత్యులు ఈచుక్కలను Corona Borealis అనగా ఉత్తరకిరీటము అని చెప్పుదురు. దీనికిని తూర్పుదిక్చక్రమునకును మధ్య విష్ణుమూర్తి ఉదయించినాడు. ఈమాసమునకు మాధవ మాసమని పేరు కలదు. ఈవిష్ణునక్షత్రములు ఈనెల తొలిజామున తూర్పున నుదయమగుటచేతనే ఈమాసమునకు మాధవమాసమని పేరు కలుగనోపు. శేషశాయియగు ఆమాధవదేవునిపై శేషుడు పట్టియుంచిన పడగల వక్రరూపమునకే పాశ్చాత్యులు ఉత్తరమకుటమని పేరుపెట్టినట్లు ఊహింపనైయున్నది. ఆకిరీటమున మెఱయునక్షత్రములే శేషునిఫణములపై మెఱయు మేటిరత్నములు. ఆమాధవుని నాభికమలమునుండి వెడలినబ్రహ్మయును, ఆబ్రహ్మముఖమున మెఱసెడి సరస్వతిచేతిలోని వీణాదండమును, గమనింపదగియున్నవి.

## ఆగ్నేయమున

విష్ణువుతోకూడ దక్షిణసమీపపు తూర్పుదిక్కున వృశ్చికరాశి ఉదయించినది. వృశ్చికరాశిలో ముఖ్యమైనది జ్యేష్ఠ నక్షత్రము. ఆనక్షత్రమునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అధిదేవత ఇంద్రుడు. ఇంద్రుడును, విష్ణువును ఒకమాఱే ఉదయించి, ఒకమాఱే వెడలుచుందురు. ఈ యంశము ఋగ్వేదమునందు పెక్కుచోట్ల వర్ణింపబడినది. ఇంద్ర, విష్ణువు లుదయించుసరికి వృత్రాసురుడు ఒరయన్ (Orion) [illegible]డు అస్తమించినాడు.

### వాయవ్యదిశను

సారథిమండలమును, అందలి బ్రహ్మహృదయము (Capella) ను, ప్రజాపతినక్షత్రములును త్వరలో నస్తమింపనైయున్నవి.

### పడమర

మిథునమునందలి కొన్నిచుక్కలుమాత్రము కనబడుచున్నవి. పునర్వసునక్షత్రములు విరివినొందిన ముత్యాలహారములాగున ప్రకాశించుచున్నవి. అందున్న చుక్కలలో (Pollnx) పోలక్సు అనగా అర్ధనారీశ్వరుడు (సాంబమూర్తి) యు, పూర్వశ్వానమును మొదటి తరగతికాంతి (First Magnitude Stars) కలిగి మెఱయుచున్నవి. పూర్వశ్వానమునకు దిగువను, అనగా పాలవెల్లికి ఆవల నైఋతిదిక్కున మృగవ్యాధుడు (Sirius) మెఱయుచున్నాడు. ఇక త్వరలో అస్తమింపనైయున్నాడు. ఆసమీపమునందే పాలసముద్రములో మందరగిరి తేలియాడుచున్నది. కవ్వపుత్రాటివలె మందరగిరిని చుట్టుకొని వాసుకి మెఱయుచున్నాడు.

### నైఋతి దిక్కున

పాలవెల్లిలో వాసుకి దిగువను, నైఋతి దిగ్భాగమున నౌకామండలము ప్రకాశించుచున్నది. అందలి చాపలు (Vela), స్తంభము (Mast), పృష్ఠభాగము (Keel) ను స్పష్టముగా కాననగుచున్నవి. కాని అమరము (Poop) భాగమునందు చుక్కానిత్రిప్పుచున్నట్లు కనబడెడి అగస్త్యుడుమాత్రము అస్తమించినాడు.

### దక్షిణము

ఈ నౌకాపృష్ఠమున కావల దక్షిణమున త్రిశంకుడును, విశ్వామిత్రుడును కానవచ్చుచున్నారు. శిలువవంటి ఆకారముగల ఈ చుక్కలను పాశ్చాత్యులు 'Southern Cross' అందురు. అందలిచుక్కలు వివరముగా ప్రక్కపటములో చూపబడినవి.

౧. త్రిశంకుని శిరము, (Alpha Crux).

౨. ,, నడుము, (Delta Crux).

౩. ,, ఊరుప్రదేశము, (Gama Crux)




౧-౨-౩-౪ చేరి ఒక శిలువ. లేక, గాలిపటము వలె నుండును.

౧. ఆల్ఫా—త్రిశంకుని శిరము.

౨. డెల్టా—నడుము.

౩. గామా—కాళ్లు.

౪. విశ్వామిత్రుడు—బీటా.

ఇట్లు స్వర్గభ్రష్టుడై తలక్రిందుగా పడుచున్న త్రిశంకుని "తిష్ఠ. తిష్ఠేతి"—"వెఱవక నిలువు తారామార్గాంతరమున నిలువు" మనుచు నిలిపినవిశ్వామిత్రుడు ౪-వ (Beta Crux) చుక్క.

[చూ. వాల్మీకిరామాయణము. బాలకాండము. ౬౦-సర్గ. ౨౦ శ్లోకము.

"శోష మాహారయ త్తీవ్రం తిష్ఠతిష్ఠేతి చాబ్రవీత్; ఋషిమధ్యే స తేజస్వీ ప్రజాపతిరి వాపరః"

శ్లో. ౩౧. వైశ్వానరపథా ద్బహిః.

శ్లో. ౩౨. నక్షత్రాణి మునిశ్రేష్ఠ,
తేషు జ్యోతిష్షు జాజ్వలన్,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈభావసంవత్సర అధికవైశాఖ, నిజవైశాఖ మాసములలో రాత్రితొలిజామున నాకాశమున నగపడు నక్షత్రాదులను గమనింతము.

## Milky Way పాలవెల్లి

ఉత్తరమునను, ఈశాన్యమునను తప్ప శేషించిన దిక్చక్రము (Horizon) మీదనే చుట్టును పాలవెల్లి వ్యాపించియున్నది. అనగా, తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పశ్చిమము, వాయవ్యము అను నీ దిక్కులను పాలవెల్లి దిక్చక్రమును అంటుచు, క్రమముగా సంకర్షణ, శేష, వృశ్చిక, వృకములను నక్షత్రసమూహములనారనే పోయిపోయి దక్షిణమున అశ్వతర, త్రిశంకు, విశ్వామిత్రులను గడచి, నౌక, మృగవ్యాధ మండలములమీదుగా పూర్వశ్వాన, మిథున, సారథి మండలములనుచుట్టి, క్షితిజమున మునిగి తేలుచున్నట్లు కొంతకనబడి, కొంతకనబడక, గగనసతిధరించిన ఉత్తరీయములాగున చూపట్టుచున్నది.

## మిక్కిలి కాంతివంతములైన నక్షత్రములు

## (First Magnitude Stars)

౧. మృగవ్యాధుడు. (Sirius)

౨. ౩. అశ్వతర మండలమున అశ్వినులు. (Alpha-Beta Centaurus)

౪. స్వాతి. (Arcturus)

౫. బ్రహ్మహృదయము. (Capella)

౬. బ్రహ్మ. (Vega)

౭. పూర్వశ్వానము. (Procyon)

౮. ౯. త్రిశంకుడు. (Alpha-Beta-crux)

౧౦. జ్యేష్ఠ. (Antares)

౧౧. చిత్త. (Spica)

౧౨. సాంబమూర్తి. (Pollux)

౧౩. మఘ. (Regulus)

[ అగస్త్యుడు (Canopus) జూన్ నెల ౧ - వ తేదీని అస్తమించును. ]

## ధ్రువ ప్రాంతములు

ధ్రువునికాంతి మనకు చేరుసరికి సుమారు ౪౪ సంవత్సరములు పట్టును. ధ్రువుడు చిన్నయెలుగు (Ursa Minor) తోకచివర మెఱయుచుండును. ధ్రువ రక్షకులైనధాత, విధాతలు ఆ యెలుగుయొక్క కుడి కాలుకడ నున్నవి. ఉత్తర దిక్చక్రమునకు కొంచెము మీదుగా ఊర్ధ్వశిరుడగు చుక్కలుమాత్ర మగపడుచున్నవి. శిరస్సు కానరాదు.

సప్తఋషిమండలము గగనమధ్యరేఖపై నున్నది. నరకుడు లఘుఋక్షమును (చిన్నయెలుగును) చుట్టుకొని ధ్రువక్షితిని అంటియుంటుచుండ, రెండు ఋక్షములమధ్యను కనబడుచున్నాడు.

## ఈశాన్యమున

గగనమధ్యరేఖకును, ఉత్తరసమీపపు ఈశాన్య దిక్కునకును మధ్య అర్ధచంద్రాకారముగలచుక్కలు కొన్ని మెఱయుచున్నవి. పాశ్చాత్యులు ఈచుక్కలను Corona Borealis అనగా ఉత్తరకిరీటము అని చెప్పుదురు. దీనికిని తూర్పుదిక్చక్రమునకును మధ్య విష్ణుమూర్తి ఉదయించినాడు. ఈమాసమునకు మాధవ మాసమని పేరు కలదు. ఈవిష్ణునక్షత్రములు ఈనెల తొలిజామున తూర్పున నుదయమగుటచేతనే ఈమాసమునకు మాధవమాసమని పేరు కలుగనోపు. శేషశాయి యగు ఆమాధవదేవునిపై శేషుడు పట్టియుంచిన పడగల వక్రరూపమునకే పాశ్చాత్యులు ఉత్తరమకుటమని పేరుపెట్టినట్లు ఊహింపనైయున్నది. ఆకిరీటమున మెఱయునక్షత్రములే శేషునిఫణములపై మెఱయు మేటిరత్నములు. ఆమాధవుని నాభికమలమునుండి వెడలినబ్రహ్మయును, ఆబ్రహ్మముఖమున మెఱసెడి సరస్వతిచేతిలోని వీణాదండమును, గమనింపదగియున్నవి.

## ఆగ్నేయమున

విష్ణువుతోకూడ దక్షిణసమీపపు తూర్పుదిక్కున వృశ్చికరాశి ఉదయించినది. వృశ్చికరాశిలో ముఖ్యమైనది జ్యేష్ఠ నక్షత్రము. ఆనక్షత్రమునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అధిదేవత ఇంద్రుడు. ఇంద్రుడును, విష్ణువును ఒక మాటే ఉదయించి, ఒకమాటే వెడలుచుందురు. ఈ యంశము ఋగ్వేదమునందు పెక్కుచోట్ల వర్ణింపబడి నది. ఇంద్ర, విష్ణువు లుదయించుసరికి వృత్రాసురుడు ఒరయన్ (Orion) యోధుడు అస్తమించినాడు.

### వాయవ్యదిశను

సారథిమండలమును, అందలి బ్రహ్మహృదయము (Capella) ను, ప్రజాపతినక్షత్రములును త్వరలో నస్తమింపనైయున్నవి.

### పడమర

మిథునమునందలి కొన్నిచుక్కలుమాత్రము కన బడుచున్నవి. పునర్వసునక్షత్రములు విరివినొందిన ముత్యాలహారములవలె ప్రకాశించుచున్నవి. అందున్న చుక్కలలో (Pollnx) పోలక్సు అనగా అర్ధనారీశ్వరుడు (సాంబమూర్తి) యు, పూర్వశ్వానమును మొదటి తరగతికాంతి (First Magnitude Stars) కలిగి మెఱయుచున్నవి. పూర్వశ్వానమునకు దిగువను, అనగా పాలవెల్లికి ఆవల నైఋతిదిక్కున మృగవ్యాధుడు (Sirius) మెఱయుచున్నాడు. ఇక త్వరలో అస్తమింపనైయున్నాడు. ఆసమీపమునందే పాలసముద్రములో మందరగిరి తేలియాడుచున్నది. కవ్వపుత్రాటివలె మందరగిరిని చుట్టుకొని వాసుకి మెఱయుచున్నాడు.

### నైఋతి దిక్కున

పాలవెల్లిలో వాసుకి దిగువను, నైఋతి దిగ్భాగమున నౌకామండలము ప్రకాశించుచున్నది. అందలి చాపలు (Vela), స్తంభము (Mast), పృష్ఠభాగము (Keel) ను స్పష్టముగా కానవచ్చుచున్నవి. కాని అమరము (Poop) భాగమునందు చుక్కాణిత్రిప్పుచున్నట్లు కనబడెడి అగస్త్యుడుమాత్రము అస్తమించినాడు.

### దక్షిణము

ఈ నౌకాపృష్ఠమున కావల దక్షిణమున త్రిశంకుడును, విశ్వామిత్రుడును కానవచ్చుచున్నారు. శిలువ వంటి ఆకారముగల ఈ చుక్కలను పాశ్చాత్యులు 'Southern Cross' అందురు. అందలిచుక్కలు వివరముగా ప్రక్కపటములో చూపబడినవి.

౧. త్రిశంకుని శిరము, (Alpha Crux).

౨. ,, నడుము, (Delta Crux).

౩. ,, ఊరుప్రదేశము, (Gama Crux)




౧-౨-౩-౪ చేరి ఒక శిలువ. లేక, గాలిపటము వలె నుండును.

౧. ఆల్ఫా—త్రిశంకుని శిరము.

౨. డెల్టా—నడుము.

౩. గామా—కాళ్లు.

౪. విశ్వామిత్రుడు—బీటా.

ఇట్లు స్వర్గభ్రష్టుడై తలక్రిందుగా పడుచున్న త్రిశంకుని "తిష్ఠ. తిష్ఠేతి"—"వెఱవక నిలువు తారామార్గాంతరమున నిలువు" మనుచు నిలిపినవిశ్వామిత్రుడు ౪-వ (Beta Crux) చుక్క.

[మూ. వాల్మీకిరామాయణము. బాలకాండము. ౬౦-సర్గ. ౨౦ శ్లోకము.

"రోష మాహారయ త్తీవ్రం తిష్ఠతిష్ఠేతి చాబ్రవీత్; ఋషిమధ్యే స తేజస్వీ ప్రజాపతిరి వాపరః"

శ్లో. ౩౧. వైశ్వానరపథా ద్బహిః.

శ్లో. ౩౨. నక్షత్రాణి మునిశ్రేష్ఠ,
తేషు జ్యోతిష్షు జాజ్వలన్,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవాక్షిరా స్త్రిశజ్కుశ్చ
తిష్ఠ త్వమరసన్నిభః.

## ఆగ్నేయభాగమునందు

అశ్వతరమండలమును, అందు మూడవస్థానము గలిగి మెఱయుచున్న అశ్వినులు — కవలవారును, ఉన్నారు. వీరు ఆప్రక్కనున్నవృకమునోట బడకుండ వార్తికపక్షిని కాపాడుచున్నారు. ఈ యంశమును గూర్చిన ఋగ్వేదమంత్రములు ఈసరికే భారతిలో వివరింపబడినవి. ఈయశ్వినులే ద్రౌపదికన్యతో సంబంధముగల నకులసహదేవులు.

## మధ్యనక్షత్రములు

పూర్వాశ్వానమునకు తూర్పుగను, పుష్యమికి దిగువను, సర్పదేవతాకమైన ఆశ్లేష కలదు దీనిననుసరించి అహిమండలమును, నహుషమండలమును, ఇంచుమించుగా విశాఖవఱకును వ్యాపించియున్నవి. దీర్ఘమైన ఈచుక్కలగుంపున కంతకును, పాశ్చాత్యులు (Hydra) హైడ్రాఅని పేరుపెట్టియున్నారు.

మహాభారతములో భీముడు నహుషుడనుసర్పమునకు లోబడినట్లు వర్ణింపబడినది. వాయుదైవత్యమైన స్వాతి నహుషమండలమునకు లోనగుటచేత యీ కథ ఆకాశమున చిత్రింపబడినట్లు భావింపవచ్చును.

పొట్లపూవువంటి పుష్యమికి తూర్పుగ మఘానక్షత్ర మున్నది. మఘకు తూర్పుగ పూర్వఫల్గుని, ఉత్తిరఫల్గుని నక్షత్రములు రెండేసి కనులవలె ఉన్నవి. ఉత్తరఫల్గుని రెండుచుక్కలలో దక్షిణముపై పున్న చుక్క హెచ్చుకాంతి గలది. దానిని పాశ్చాత్యులు Denebola అందురు. వీటికి తూర్పుగా ఐదువ్రేళ్లవలె హస్తనక్షత్రము ఉన్నది. ఈప్రాంతమందే క్షీరోదపు ఉత్తరధ్రువముకూడ కలదు. ఇదేపటములో క్షీ. ఉ. ధ్రు. అను నక్షరములచే తెలియనగుచున్నది. హస్తకావల వేణీమండలము ఉన్నది. దానికి ఈశాన్యభాగమున భూతేశమండలమునందలి స్వాతి ఎఱ్ఱనికాంతితో పగడమువలె తేజరిల్లుచున్నది. దక్షిణమున 'చిత్ర' ముత్యములాగున ధవళకాంతితో తేజరిల్లుచున్నది. ఈరెంటిని గడచి, హస్త ర - వ పాదములో వక్రగతుడైన గురుడు మెఱయుచున్నాడు. ఇంచుమించుగా సమకోణముగల త్రిభుజము (Right angled triangle) యొక్క కర్ణము (Hypotenuse) కొనలందున్నట్లు స్వాతి, చిత్రనక్షత్రములును, సమకోణము (Right angle) కడ గురుడును అద్భుతముగా మెఱయుచున్నారు. అఖండతేజముతో వెలుగు వీనితేజోరూపముల దృశ్యము మెచ్చి యానందింపదగియున్నది.

సప్తఋషులకును, బ్రహ్మహృదయమునకునుమధ్య మిథునరాశిపైన, మూషకసహితుడైన విఘ్నేశ్వరుడు లంబోదరముతో మెరయుచు గానవచ్చుచున్నాడు.

## గ్రహములు

గ్రహములలో ఈమాసమునందు గురు డొకడే రాత్రి తొలిజామున కానవచ్చుచున్నాడు. శుక్రుడు, శని, అంగారకుడు లోనగు ఇతర గ్రహములు అపుడు కానరావు.

## విశేష విషయములు

మనము ఉత్తరమునకు ౬౯ మైళ్లు సుమారుగా పోవునపుడు ధ్రువుడు ఒకడిగ్రీ మీదికి లేచునట్లు కనబడును. భూమిమీది ధ్రువప్రాంతములందుండి చూచువారలకు ధ్రువుడనునక్షత్రము చూచువారలశిరములపై గగనమధ్యమున (Over Head) కనబడును. భూమధ్యరేఖాప్రదేశములనుండి ధ్రువునిచూచుచో, ధ్రువనక్షత్రము ఉత్తరదిక్చక్రమును (Northern Horizon) ను అంటుకొనియున్నట్లు కనబడును.

మఘసమీపమున శృంగనక్షత్రమును గమనింపుడు. దీనిచెంతనుండియే కార్తికమాసములో సుప్రసిద్ధమైన ఉల్కలు (November Meteors) పడిపోవుచుండును.

త్రిశంకుచుక్కలలో మిక్కిలికాంతి గలిగి మెఱయునది ౧ అంకెవేసి చూపినాము. దీనినుండి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెలుగు మనకు చేరుసరికి ౬౬ సంవత్సరములు పట్టునని శాస్త్రజ్ఞులు గుణించినారు. ఇంచుమించుగా దిక్చక్రముపైని, చుట్టును వ్యాపించియున్న క్షీరోదము పాల సముద్రముయొక్క ఉత్తరధ్రువము ఇపుడు గగనమధ్యమునందు ఉన్నది.

## ఉల్కాపాతములు

మేనెల ౮-వ తేదీవరకు కుంభరాశిలో ఉల్కాపాతము కానవచ్చును. మేనెల ౧౯ మొదలు ౨౮ తేదీవఱకు విష్ణుమండలమునందును, ౩౧ మొదలు జూన్ ౫-వ తేదీవఱకును ప్రోష్ఠపదానక్షత్రముల సమీపమునను చిన్న ఉల్కలు రాలును.



బెలూను

బెల్జియను శాస్త్రజ్ఞుడగు కోసిన్సుగారు ఆకాశముపై నిదివర కెగిరినవా రందరికన్న ఎక్కువ ఎత్తునకు ఎగురుటకు తయారుచేసిన బెలూను. వీ రిదివరకు ప్రొఫెసరు పికార్డుగారితో పైకెగిరియుండిరి. ఇప్పటికి ఒక రషియాదేశీయుడు అందరికన్న ఎక్కువయెత్తునకు ఎగిరియుండెను. అతనిని ఓడించవలెనని యీతను యత్నించుచున్నాడు.

G. S. A.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## ఇండ్లుకట్టుట – మిద్దె ఇల్లు

కొ. నరసింహాచారి

ABCD ఇంటియొక్క నేలభాగపు ప్లాను లేక పరిమితి. ఇందు, ఒకవంటగది AQNX యు, ఒకభోజనగది QBXO యు, ఒకకొట్టు NXRSయు, ఒకపడుకగది RSCP యు, ఒకహాలు XVTU ను, రెండువైపుల వసారాలు TUVODP ను ఏర్పరుపబడి యున్నవి. వీటికొలతలు, అడుగులలో చిత్రమునందు గుర్తింపబడియున్నవి. గోడలఎత్తు మిద్దెఇంటియందు ఒకేరీతిగ నుండును. ఇందలి ఇంటిగోడలు 12'0 ఎత్తుగలవి. ABCD అను ప్లానును, దానికి నలువైపుల గల వెలుపటి గోడలు, (1) ABEF, (2) BLDM, (3) CDGH, (4) ACJK ను, ఒకే అట్టముక్కయందు కోసికొనవలెను. తక్కినలోపలిగదుల విభాగపుగోడలు (Partition Walls) వేర్వేరుగా కోసికొనవలెను. చిత్రము 2 నందుండునది ప్లాను (చిత్రము 1) నందలి NO అను విభాగపుగోడ. చిత్రము 3 నందలిది PQ అను విభాగపుగోడ. చిత్రము 4 నందలిది RS అను విభాగపుగోడ. చిత్రము 5 నందలిది TUV అను రెండుప్రక్కల వ్యాపించియుండు (a, b) విభాగపుగోడ. దీనిని ఒకేముక్కయందు కోసి U వద్ద మడిచి అతికించవలెను. అతికించవలసిన ప్రతిభాగమునందును అతుకు తునుకలు f (Flaps) కలవు. NO అను గోడయు, PQ అనుగోడయు X వద్ద నొకదానినొకటి దాటియుండునట్లు చూపబడియున్నది. ఇందులకు దాటవలసినభాగము వద్ద ఒకగోడయందు క్రిందియంచునుండి సగ మెత్తువఱకును, రెండవగోడయందు పైయంచునుండి సగము క్రిందికి వఱకును కోసి చిత్రము 6 ను చూపబడినవిధముగా నమర్చవలెను. చుట్టుగోడలను, విభాగపుగోడలను ముందుగా నిలువబెట్టి అతికించుకొని తర్వాత కప్పును అతికించవలెను. ప్లానువైశాల్యము కన్న (ABCD) కప్పువైశాల్యము ఎక్కువగా నుండవలెను. అట్లుండినయెడల ఇంటివెలుపటిగోడలకు వెలుపలగూడ కప్పు కొంచెము మిగిలివచ్చియుండును. కప్పును బిగించిన తర్వాత ప్లానుచుట్టుకొలతకు అనగా నాలుగువెలుపలిగోడల సగటుపొడవు (Perimeter) నకు సమానపుపొడవును, ఒకటిరెండం


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




గుళ్ళములు వెడల్పును (ఇంటిపరిమాణమునకు తగినవెడల్పును) గల యట్టముక్కయందు చిత్రము 7 నందుండువిధముగా కత్తిరించి దానిని ఇంటికప్పుపై నాలుగు ప్రక్కలకును నిలువబెట్టి అతికించినయెడల పై బొద్దుగోడ (Parapet Wall) అందముగా ఏర్పడును.

( All rights reserved.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



మిద్దె ఇల్లు-నమూనా.

---


# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.,

ఇది ఆంధ్ర గ్రంథమాలయందు పదుమూడవ గ్రంథము. ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రముల వైఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చగిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏకవర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల. రు. ౧-౦ ౦.

తపాలా ఖర్చు ప్రత్యేకము.

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల, 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## శ్రీ ఉభయభాషావాచస్పత్యము

(మచ్చుపదముల పొత్తము)

ఆంధ్రమున నిప్పటివఱకును వెలువడిన నిఘంటువులు చాల తక్కువ. అయ్యవి యసమగ్రములు. భాషావాఙ్మయాభివృద్ధికి నిఘంటువులు ముఖ్యాంగములు. కావున నిపుడు తెలుఁగున నిఘంటువులు బయలువెడలుచున్నవి. సూర్యరాయాంధ్రనిఘంటువు పిఠాపురమహారాజులుంగారి పోషణమునఁ దయారగుచున్నది. వారిల్లవా రొక నిఘంటువును ప్రకటింపఁదలపెట్టినారు. "లక్ష్మీనారాయణీయ" కర్తలగు శ్రీ కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిలు గారి పుత్రులును, ఆంధ్రవిద్యావాచస్పతీత్యాద్యనేకబిరుద విభూషితులును, అగు, శ్రీ శ్యామలకామశాస్త్రిగారును "ఉభయ భాషావాచస్పత్యము" అను పేరున నొక "సంస్కృతాంధ్ర ప్రతిపదార్థ పర్యాయపద నిఘంటువు" ను రచించినారు. అందలికొన్ని "మచ్చుపదము" లొక "పొత్తము" రూపున వెలువరించి వారు "పండితులను గ్రంథముపైఁ దమకుఁగలుగు నభిప్రాయములను వ్రాసి పంపుటకు వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నా"రు.

ఈ "నిఘంటుకర్త" గారు "లక్ష్మీనారాయణీయమను శుద్ధాంధ్ర ప్రతిపదార్థపర్యాయపద నిఘంటువును కీర్తిశేషులగు వారి తండ్రిగారైన లక్ష్మీనారాయణ శాస్త్రిగారి యాజ్ఞానుసార మొక్కచేతిమీద వ్రాసి ముగించి ముద్రించి ప్రకటించి యాంధ్రలోకమున కర్పించిన ముక్కాకలుతీరిన యాంధ్రయౌవనవిద్వాంసులు." అట్టి యనుభవజ్ఞులు రచించి ప్రకటించు నీప్రస్తుత నిఘంటువు "లక్ష్మీనారాయణీయము" వలెనే యాంధ్ర భాషావాఙ్మయములకు బహూపకారకము కాఁగలదు. "నిఘంటువుయొక్క యావశ్యకత" యీ క్రింది విషయములనుబట్టి తెలియనగును.

౧. "ఇందు సుమారు ౫౦,౦౦౦ తత్సమపదములును, ౩౦,౦౦౦ అచ్చతెలుఁగుపదములును గలవు.

౨. ప్రతిపదమునకును భాషాభాగమును, అర్థమును, గూఢపదములకు ప్రయోగములును, నానార్థములును, ప్రత్యర్థమునకును తత్సమ తద్భవదేశ్య గ్రామ్యాది పదములును వ్రాయఁబడినవి.

౩. మఱియు తత్సమములకు తద్భవములును, తద్భవములకు తత్సమములును రూపాంతరములును గనుపరుపఁబడినవి.

౪. పర్యాయపదములు శీర్షికాపదములైనపుడు పైన వ్రాయఁబడిన వివరణాదులను వ్రాసి పర్యాయపదముల నరిని కనుగొనుటకై తద్గణాద్యపదలేదర్థసంఖ్య (చూ) అను గుఱుతుతో సూచింపఁబడినది.

౫. వేఁట, యుద్ధము మొదలగు వివిధవృత్తులకును, ప్రకృతిశాస్త్రములు, జ్యోతిషము, వైద్యము, భూగోళము, సంజ్ఞావివరణములు, న్యాయములుమున్నగు వివిధశాస్త్రములకును సంబంధించిన పారిభాషికపదములు అకారాదిగ సాహిత్యపదములతోడ అవసరములగు చిత్తరువులతో కలఁబోసి కూర్పఁబడియున్నవి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఈనిఘంటువు డెమ్మీసైజు గ్లేజుకాగితముల మీఁద రమారమి ౨౫౦౦ పొరటలు కలిగి మూఁడుభాగములుగ క్యాలికోబయిండు చేయఁబడిన పొత్తముగ వెలువడఁగలదు." "నిఘంటుభాగము" లు "౧౯౩౪ సం. ౮౦ జూలై ౧వ తేదీ నుండి ప్రతినెలకును ౧౦౦ పుటలుగా పంపఁబడుచుండును."

నిఘంటువునకుఁ గర్త గారు పెట్టిన పేరు "ఉభయ భాషావాచస్పత్యము." "శ్యామల కామశాస్త్రీయ" మనునది వేఱొకనామము. మఱియు నిది "సంస్కృతాంధ్రప్రతిపదార్థపర్యాయపద నిఘంటువు." తత్సమములును, అచ్చతెనుఁగుపదములును [తద్భవము లచ్చతెనుఁగులలోఁ బడియుండు నేమో] నిఘంటువున నున్నట్లు "తొలిపలుకు" నఁ గలదు. తత్సమము లైన పిదప, ఆపదము లాంధ్రపదములు నేగాని సంస్కృత పదములు కాఁజాలవు. సంస్కృతప్రత్యయాంతములే సంస్కృతపదములు. ఇది సంస్కృతభాషకు నిఘంటువుగాదు. ఇంపలి "సంజ్ఞావివరణపట్టిక" ను బట్టి "సంస్కృతార్థమును సూచించు గురుతు" లో నిచ్చిన పదములు తత్సమములేగాని సంస్కృతపదములుకావు. అచ్చటచ్చట తత్సమపదముల నడుమ సంస్కృతపదములు కూడఁ గొలదిగనీయఁబడినవి. కాని శీర్షికాపద మొక్కటియు సంస్కృతపదము కానరాదు. ఇంకను ఇందు ఆంగ్లము, అఱవము కన్నడము, హిందూస్థాని మొదలగు భాషాంతరములందలి పదము లుదహరింపఁబడి యున్నవి. కావున నిఘంటునామైకదేశ మగు "ఉభయభాషా" పదము, నిఘంటువిశేషణైకదేశ మగు "సంస్కృత" పదము సార్థకములు కాఁజాలవని చెప్పవలసి వచ్చుచున్నది.

ఈ "మచ్చుపదములపొత్తము" పది పుటల ప్రమాణము కలది. ఇందు అ, ఆ, ఉ, ఎ, క, న, ప, ల, వ, శ, హకారములకు సంబంధించిన ౨౧ పదముల వివరణము కలదు. వానిలో "అ" ను గూర్చి ౯$\frac{3}{4}$ పుటలు నిండినవి. తక్కిన ౧౪ పుటలలోను, తక్కిన ౨౦ పదములును సచిత్రముగ నిరికింపఁబడినవి. "పండితుల" "అభిప్రాయము"ను గోరు "నిఘంటుకర్త"లు అన్ని యక్షరములకును సంబంధించిన పదములను, తాము కల్పించుకొనిన నియమములకు బద్ధములైనవానిని, ఏఁబది యఱువది పదములను "మచ్చు" న కిచ్చినచోఁ గొంతవఱకయిన "పండితుల" "యభిప్రాయము" ల నెఱుఁగ సాధ్యమగును.

ఈ "పొత్తము" లోఁగల "సంస్కృత", "తెలుఁగు" "పర్యాయపదము" లలోఁ జాలవఱకు సమాసపదములే కానవచ్చుచున్నవి. ఉ. వృషశత్రువు, పదివేసములదిట్ట, పదివేసములసామి మొ. ఇట్టిపర్యాయ పదములుగ లెక్కించినచో నెన్నింటినైన పదముల నీయవచ్చును. వృషద్వేషుఁడు, వృషద్విట్టు, వృషవైరి, వృషహంత, పదివేసములవాఁడు, పదివేసములవేల్పు మొదలగు నట్టివి సంఖ్యాతీతములు కలవు. అవి లేకుండుట నిఘంటువునకు లోపము కాదు. కావున వీలగునంతవఱకు సమస్తపదముల నుజ్జగించి రూఢములును, వ్యస్తములును అగువానినే నిఘంటువునఁజేర్చుట లెస్స.

వాయువుల వివరణము నొసంగుపట్ల ఆవహ - ప్రవహాదులగు సప్తమారుతములను జేర్చుట పాఠకుల కెంతయు నుపయోగకరము.

ఇందచ్చుతప్పు లచ్చటచ్చటఁ గలవు. ఈవిషయమై "ఈమచ్చుపదములపొత్తము నొక్కమారొక్క ముద్రాయంత్రముపై ముద్రింప వీలుకలుగనందున......అచ్చుతప్పు లచ్చటచ్చట నున్నవి......మచ్చు పదముల పొత్తమందలి చిల్లరతప్పులను సైరింపుఁడని పాఠకులను వేడుచున్నాఁడను" అను నిఘంటుకర్త "వేఁడికోలు" గమనింపఁదగు. కానియీ "మచ్చుపదములపొత్త" మేని సుందరముగ, నిర్దుష్టముగ, జనాకర్షకముగనుండిన మనుముందు నిఘంటుప్రచారమునకు మిక్కిలి యనువు కలిగియుండెడిది.

ఏది ఎట్లున్నను, శ్రీ శ్యామల కామశాస్త్రిగారి ప్రయత్నము గొప్పది; కష్టసాధ్యమైనది. విలువ కట్టరానిది. వారు అవసరములగు మార్పులొనరించి నిఘంటువునకు వన్నెఁగూర్చుకొనిన నాంధ్రవాఙ్మయరమణికొక యమూల్యాలంకారమును సమర్పించినవారగుదురు.

బులుసు వేంకటరమణయ్య

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చెరువునుండి

(కాగితమును కత్తిరించి చేసిన చిత్రము)　　—జి. హనుమంతరావు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గ్రంథస్వీకారము

## మధుపానపిశాచము

క్రౌనుసైజు : పు. ౨౦. వెల రు. ౦-౮-౦.

గ్రంథకర్త : బత్తుల సుందరరావు, ప్రకాశకులు: గ్రంథకర్త, నెం ౧౯౫, ౪౦-వ వీథి, రంగూను.

---

## ఆధునిక రాజ్యాంగసంస్థలు (రెండుభాగములు)

జాతీయగ్రంథమాల ౪

క్రౌనుసైజు ; పుటలు ౩౩౦ + ౨౩౦. వెల రు ౧+౧ = ౨.

గ్రంథకర్త : ఆచార్య రంగా.

ప్రకాశకులు : మేనేజరు, భారతీనికేతనము, కాకినాడ.

---

## సుగుణాకరము

క్రౌనుసైజు; పుటలు ౧౭౯; వెల రు. ౦-౧౪-౦.

గ్రంథకర్త: ముద్దా విశ్వనాథము, ప్రకాశకులు: గ్రంథకర్త ; వ్యాసకుటీరము, మేలుపాక పోస్టు: ఎలమంచిలితాలూకా, విశాఖపట్టణముజిల్లా.

---

## ౧. ఆంధ్రదేశపుచరిత్రము (భా. ౧.)

ఆంధ్రసరస్వతీ గ్రంథమాల ౨౦.

క్రౌనుసైజు; పుటలు ౧౫౦; వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త : చిల్లరిగె శ్రీనివాసరావు, బి. ఏ.

## ౨. విహంగయానము (ప్రకృతిశాస్త్రసంబంధియగు నవల)

ఆంధ్రసరస్వతీగ్రంథమాల ౨౧.

క్రౌనుసైజు; పుటలు ౨౭౦; వెల రు. ౧-౮-౦.

గ్రంథకర్త : శేషమల్ల రాజగోపాలరావుగారు, బి. ఏ., యల్. టి.

ప్రకాశకులు : శేషమల్ల రాజగోపాలరావు గారు, బి. ఏ., యల్. టి., నెం. ౧౨౪, వల్లాలవీథి, పురశైవాకము, వేపెరి పోస్టు, చెన్నపురి.

---

## పురుషోత్తమ మాహాత్మ్యము (అధికమాసపురాణము - పద్యకావ్యము)

డిమ్మీసైజు; పుట. ౨౨౦. వెల రు ౧-౮-౦.

అనువాదకులు : చివుకుల వేంకటశాస్త్రి.

ప్రకాశకులు : గ్రంథకర్త, నెం. ౨౮౩౮, ఇమాంబావుడీ బజారు, సెకింద్రాబాదు, (దక్కను).

---

## చెన్నబసవపురాణము (వచనకావ్యము)

శ్రీశైవగ్రంథమండలి (ప్రథమగ్రంథము)

డిమ్మీసైజు, పుటలు ౧౭౮ వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త : అన్నదేవర నాగభూషణరావు.

ప్రకాశకులు : కాళహస్తి తమ్మారావు అండు సన్సు, రాజమండ్రి.

---

## భావతరంగాలు

క్రౌనుసైజు ; పుట ౧౬ ; వెల ౦-౧-౦.

గ్రంథకర్త : ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు.

ప్రకాశకులు : గ్రంథకర్త, గుంటూరు.

---

## జ్యోతిర్మయి - ఖండకావ్యసంపుటము

ఫూల్సుకాప్ సైజు ; పుటలు ౨౦ ; వెల రు. ౦-౨-౦.

గ్రంథకర్త : శెట్టిపల్లి వేంకటరత్నంచౌదరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రకాశకులు : గ్రంథకర్త; కొవ్వలి (పోస్టు), ఏలూరుతాలూకా, ప. గో. జిల్లా.

---

Vijayanagara
Origin of the City and the Empire
(విజయనగరము, నగరసామ్రాజ్యముల యుత్పత్తి) (ఆంగ్లము)

రాయలుసైజు; పుటలు ౩౦౦; వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త : డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు, యం. ఏ.

ప్రకాశకులు : మదరాసు విశ్వవిద్యాలయము.

---

కథాకావ్యము (పద్యము)

క్రౌనుసైజు : పుట ౧౦౦ ; వెల రు ౦-౧౨-౦

గ్రంథకర్త : 'త్యాగి'

ప్రకాశకులు : మేనేజరు, మార్కండేయ భవనము, నరసారావుపేట, గుంటూరుజిల్లా.

---

కింకిణీమాలా
సంస్కృత ఖండకావ్యములసంపుటి

క్రౌనుసైజు : ౧౦౦ పుటలు. నాగరిలిపి. కాగితము, బైండు మేలుగ నున్నవి వెల రు. ౨.

గ్రంథకర్త : య. మహాలింగశాస్త్రిగారు, యం. ఏ., బి. యల్. అడ్వకేటు., ౩, మాధవపురం, మైలాపూరు, మదరాసు.

---


## బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పంద్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకుడగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను, కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులుగురిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్ర మాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందుగలదు. ఆకాలపుటపూర్వసారస్వత చారిత్రక విశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిదియత్యంతోపకారకము.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, నెం. 7, తంబుశెట్టివీధి, మద్రాసు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మ న వి మా ట లు

ఆంధ్రసరస్వతీగ్రంథమాల, (వేపేరి, చెన్నపురి)

విజ్ఞానాభివృద్ధి ప్రపంచాభ్యుదయమునకు మూలము. నేడు ప్రపంచమున విజ్ఞానాభివృద్ధి మనోవేగమున నగుచున్నది. భావికాలమున విజ్ఞానములేక ప్రపంచ మొకక్షణమయిన నిలువజాలదు.

విజ్ఞానవ్యాప్తికి వైజ్ఞానిక వాఙ్మయము ముఖ్యసాధనము. ప్రపంచమున, భారతదేశమున దప్ప, సకలదేశములయందును ఆవాఙ్మయ మపరిమితముగ నుత్పన్నమయి వ్యాప్తిజెందుచున్నది. ఆయాదేశములవారు విశేషవిజ్ఞానసంపన్నులయి అనేకవిధముల నభివృద్ధిగాంచుచున్నారు. ఆదేశము లొండొంటిని మిగిలి సకలసంపదలతో తుల దూగుచున్నవి.

మున్నొకకాలమున భారతదేశము విజ్ఞానసంపదల నొప్పారుచు నితరదేశముల నన్నింటిని తలదన్నియుండినది; నేడన్నిటికంటె నెన్నియో వెనుకల బడియున్నది. భారతీయుల కొకింత ఆశ్రయములయి భారతదేశమున నక్కడ నక్కడ మినుకు మినుకనుచున్న విజ్ఞానజ్యోతికలు వారి సొంతములు కావు. అవి అన్యదేశీయులవి. వారి ప్రయోజనముకొరకవి మెరయుచున్నవి. వానివెలుగు నుపయోగించుకొనగూడని - చాలని - దీనులు నేటిభారతీయులు.

ఇందుకు పరాధీనత కొంతవరకు కారణము కాదగును. దానిని బురస్కరించుకొని వారికలవడిన అలసత యంతకంటె గొప్పకారణము. స్వయంకృషి, ఆత్మపరిశీలనము వారికి దూరమయినది. వారు కర్మయోగపరాఙ్ముఖులు; జ్ఞానయోగతత్త్వమును దెలియజాలనివారు. ఇట్లుభయభ్రష్టులయి కూరుచున్నారు వారు.

భగవద్గీత పుట్టిననాటికే కర్మయోగప్రాశస్త్య మడుగున బడిపోయినది. కావుననే తదుద్ధరణ మానాఁ డావశ్యకమయినది; దానినే ప్రతిపాదించి, గీత దానికే ప్రాధాన్యము నిచ్చినది. ఐహికవ్యాపారముల తత్త్వము నరయజాలనివా రాముష్మికసౌఖ్యమునకు దగ రనునదియే గీతసిద్ధాంతము. భారతీయపవిత్రజీవననౌకకు చుక్కాను భగవద్గీత. వారు దానిని పరమప్రమాణముగా భావింతురు. అట్టిగ్రంథము ప్రతిపాదించిన సిద్ధాంతమునుసైతము లెక్కపెట్టనివారయినారు భారతీయులు. కర్మవిముఖుల కభ్యుదయము గగనకుసుమము. కావున భారతీయులు నిరంతరకర్మయోగనిరతులయి సౌఖ్యసంపదల బడయవలసియున్నారు; నలుగురిలో నాణెమున మించవలసియున్నారు. విశేషవిజ్ఞానసంపద మానవులకు నిరంతరకర్మయోగార్హతను కలిగించును. తత్సముపార్జన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునకయి వా రెడతెగక కృషి చేయవలయును. విజ్ఞానాభివృద్ధివిషయమున నాంధ్రు లప్పు డప్పుడు తప్పటడుగులతో మెల్లగా ముందునకు జనుచున్న ఇతర భారతీయులకంటె కొంతమేర వెనుకత్రోవను బడియున్నారు.

ఇటీవల కొన్ని యేండ్లకుపూర్వ మాంధ్ర దేశమున గ్రంథమండలులు, గ్రంథమాలలు కొన్ని తలపడినవి. కథలను, నవలలను, నాటకములను పెక్కింటి నవి ప్రచురించినవి. కాని అవి యించుమించుగ నన్నియు అనువాదములు, ననుకరణములు; ఉపజ్ఞను, ప్రతిభను ప్రకటించునవి కావు. వానివలన నయిన సారస్వతవికాసమేని అత్యల్పము. అపి దేశమున కార్థికముగ కొంత అపకరించినవికూడ. వానిలో నొకవిజ్ఞానచంద్రికా గ్రంథమండలి మాత్ర మొక కొన్నిటిని శాస్త్రగ్రంథములను ప్రచురించి తననామమును సార్థకపరుచుకొన్నది. ఇప్పు డదియయిన చేయుపని కానరాదు. ఇం కేవియు విజ్ఞానగ్రంథప్రచురణమునకు పూనినవి కావు.

శ్రీ శేకుమళ్ల రాజగోపాలరావు పంతులు (బి. ఏ., యల్. టి.)గారు ౧౯౦౯-వ సంవత్సరమున నీ ఆంధ్రసరస్వతీగ్రంథమాలను స్థాపించినారు. తరువాత తరువాత 'శరపరంపరలుగా గ్రంథమాలలు వెలయుట'చే నది ౧౯౧౭ లో నిలిచిపోయినది. అవి యన్నియు'నవలాగ్రంథమాలలేకాని, దేశోపయుక్తములగు ప్రకృతిశాస్త్రములు, చరిత్రములు, కృషివాణిజ్యాదులు మున్నగువానికి పూనుకొన్నవి......కానవచ్చుట లే' దని శ్రీరాజగోపాలరావుగారు తలచి తనగ్రంథమాలను ౧౯౩౨-వ సంవత్సరమున పునరుద్ధరించి యట్టి శాస్త్రగ్రంథములను ప్రకటింప దలపెట్టిరి. శ్రీ రాజగోపాలరావుగారు జ్ఞానవృద్ధులు; వయోవృద్ధులు. దేశాభ్యుదయకాంక్షులు, విజ్ఞాన సంపన్నులగు పంతులుగారి కీకార్య మసాధ్యముకాదు. కాని దీనికి ధన మపారముగ కావలెను. పంతులుగారు గ్రంథమాల నుద్ధరించుట కొక సంవత్సర కాలమున దాదాపు రెండువేలదనుక సొంతసొమ్మును వ్యయపరిచిరి. వైజ్ఞానికవాఙ్మయము నావశ్యకమును చాటు కరపత్రములను విరివిగ ప్రకటించి దేశమున పంచిపెట్టించిరి. స్వాయము వ్యయప్రయాసముల గణింపక పెక్కుచోటులకు జని యుపన్యాసముల నిచ్చి ప్రజలను ప్రబోధించిరి. పంతులుగారి యవిరతకృషికి ఫలముగ "జీవశాస్త్రము; క్రిమిశాస్త్రము, వృక్షశాస్త్రము, యాంత్రికవిద్య, రసవాదమునకుచెందిన వివిధ ప్రకరణములు, పరిశ్రమలు, మున్నగు బహుశాస్త్రములరచనకు విద్యాపారంగతులయిన మహాశయులు పూనుకొనిరి." ఈ ప్రయత్నమున తొలుదొలుత శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావు పంతులు (బి. ఏ.) గారు వ్రాసిన ఆంధ్రదేశపుచరిత్ర (మొదటిభాగము) వెలువడినది. అప్పటికి ఆంధ్రులలో పంతులుగారు ఎంత ప్రయత్నించినను చందాదారులను ఉం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందిని మాత్రమే పోగుచేసికొన గలిగిరి. కాని 'గ్రంథసంఖ్య హెచ్చినకొలదిని, సకాలమునకు గ్రంథములు వెడలినకొలదిని గ్రంథమాల తప్పక జయప్రదమగు' నను నమ్మకముతో పంతులుగా రుత్సాహమును కోలుపోవక 'విహంగయానము' అను 'ప్రకృతి శాస్త్రసంబంధమయిన మొట్టమొదటినవల' ను ప్రచురించిరి. 'ఆహారశాస్త్రము' తరువాతిది; త్వరలో వెలువడనున్నది. ప్రకటితములయిన గ్రంథములు చాల సుందరములు.

సర్వవిధముల సమర్థులగు శ్రీపంతులుగారు ఆంధ్రమున వైజ్ఞానికవాఙ్మయాభివృద్ధికి తమకు 'గలయంతవట్టు,' 'తను' ధనమును విరివిగా నొసగుటకు తాము 'సంసిద్ధు' లయియుండుటను ఆంధ్రులు గుర్తించి వారికి సహాయము నోపినకొలది నొనరించి — అధమము చందాదారులుగనయినను జేరి— తాము విజ్ఞానవంతులయి పురోభివృద్ధిని గనజూచు టావశ్యకము. మరియు నీగ్రంథమాలకు సంవత్సరపు చందా రు. ౬ మాత్రము. అమూల్యమగు విజ్ఞానమును విలుచుట కిది యొక లెక్కగల మూల్యము కాదు. ఆంధ్రుల కీనాటి కిట్టి సదవకాశము లభించినది. దీని నెట్లు వారు సముచితరీతిని వినియోగించుకొని ఔన్నత్యమును బడయగలరో చూడవలెను.

ఈగ్రంథములు కేవలము శాస్త్రపరిచయమున కేకాక ఆయాశాస్త్రములు మానవుని నిత్యజీవితమున కుపయోగపడునట్లుండవలెను. కాకున్నచో వానివలన ప్రయోజనము కలుగబోదు. ఈవిషయమున శ్రీ పంతులుగారు జాగ్రత్తపడగల సమర్థులగుట నిస్సంశయము.

---

## 'రావ్స్ టైప్‌రైటర్ మెకానిజమ్'
## (Rao's Typewriter Mechanism)

యంత్రములతో పనిచేయువారికి తన్నిర్మాణవిధానము సంపూర్ణముగా, చక్కగా తెలిసియుండు టావశ్యకము. యంత్రములు చెడినపుడు వానిని స్వయముగ చక్కదిద్దుకొనుసామర్థ్యము వారి కుండవలెను. అట్లు కాకున్న యంత్రములు మాటిమాటికి చెడిపోవుచుండును. వానిని చక్కపెట్టుకొనుటకు వ్యయప్రయాసము లత్యధికము. వానిపని ఆగిపోవుటచే నగునష్టమును అధికము. ఇంతే కాదు; శీఘ్రకాలమున వానిమనుగడయు నంతమొందును. ఈబాధ టైపుయంత్రములకు (Typewriters) విశేషము.

టైపుచేయగలవారీనాగరకప్రపంచమున వేలకువేలుగ నున్నారు. కాని తద్యంత్రనిర్మాణవిధానము నామూలము తెలిసినవారందు శతాంశమేని నుండరు. చాలమంది దానిని తిన్నగా నుపయోగించుకొననయిన తెలియనివారు. టైపుయంత్రము చాలసున్నితమయినది. మిక్కిలి జాగరూకతతో దానిని వాడకున్న నది త్వరలో పాడయిపోవును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టైపు యంత్రము లనేకవిధములు. అన్నింటి నిర్మాణమునకును మూలసూత్ర మొక్కటే యయినను అంగములకూరుపున కొంతభేదము—కొన్నింట విశేషముగనే—గలదు. ప్రతియంత్రముతాలూకు నిర్మాణ విధానమును క్లిష్టముగా తెలుపుగ్రంథముల నాయాయంత్రనిర్మాతలు ప్రకటించియున్నారు. అధికానుభవములేనివారి కవి యంతగా నుపకరింపవు. కావున అన్నిరకములయంత్రములకు—కాకున్న ఎక్కుడుగ వాడబడుచున్నవానికయిన—నిర్మాణవిధానమును వివరముగ, సుగ్రహముగ తెలుపుగ్రంథ మొక్కటి యావశ్యకము. మరియు, సాధారణముగ నేదోయొకరకము యంత్రమున టైపు చేయనేర్చుకొని పలువురు తరువాత వేరురకములయంత్రముల టైపుచేయవలసియుందురు. వారికిని పైజెప్పినతీరుగ్రంథము చాల నుపకరించును.

అట్టిగ్రంథము నొకదాని నింగ్లీషున తెనాలినివాసులు శ్రీ బి. వి. రంగరావు గారు (F. C. I., Diplomate in Commerce)* రచియించినారు. రెండుభాగములు గల యొక్కసంపుటముగ దానిని వా రచిర కాలమున ప్రకటింపనున్నారు. అందు మొదటిభాగమున యంత్రముల నుపయోగించు పద్ధతులును, సుందరముగ, యంత్రమున కపాయము కలుగకుండ టైపుచేయుపద్ధతులును విపులముగ వివరింపబడినవి. రెండవ భాగమున యంత్రనిర్మాణవిధానమును—ముఖ్యముగా ఎక్కుడుగ నుపయోగముననున్న అండర్‌వుడ్, రెమింగ్టన్ టైప్‌రైటరులకు సంబంధించినంతవరకు — చక్కగా, సుబోధముగా, సచిత్రముగా పేర్కొనబడినది. ఇతర యంత్రముల విషయమును వీనితో పోల్చి వివరింపబడినందున వాని నిర్మాణమును అవగతము కాగలదు. ఒక్కొక్క అధ్యాయముచివరను ప్రశ్నోత్తరములు కలవు. గ్రంథ మున్నరూపున టైపు చేయ నేర్చుకొనువారికి, నేర్చుకొన్నవారికి మిక్కిలి యుపయోగకరముగ నుండును. ఇది పరీక్షా ప్రణాళికయందు యంత్రనిర్మాణజ్ఞానమునకయి నియతపాఠ్యగ్రంథముగ చేర్పదగినది.

ఈగ్రంథమున వివిధములగు యంత్రావయవముల వగు చిత్రములు బహుసంఖ్యాకములు చేర్పవలసియున్నవి. ధనబాహుళ్యమున గాని యది సాధ్యముకాదు. శ్రీ రంగరావుగా రాంధ్రులు. కాబట్టి వారికి ధనసాహాయ్య మొనరించి సంపన్నులగు నాంధ్రులు గ్రంథము వెలువడునట్లు మిక్కిలి ప్రోత్సహించుట పాడి. పరీక్షాశాఖవారును దీని ప్రాశస్త్యమును గుర్తించి తగినరీతి నుపయోగమునకు దేవలసియున్నారు.

---

వి. ఆర్. చిత్రగారి
క్రొత్తనమూనా చిత్రసామానులు

మదరాసు లలితకళాశాల ఇటీవల వర్ణరంగముపట్ల ఎక్కుడుశ్రద్ధను చూపుచున్న

* వీరు సందలూరు బోర్డు హైస్కూలులో కమర్షియల్ ఇన్‌స్ట్రక్టరుగా నున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ది. అచటకఱ్ఱసామానులు—కుర్చీలు, సోఫాలు, బల్లలు, మేజాలు, బీరువాలు మొదలయిన వనేకములు—క్రొత్తక్రొత్తనమూనాల వితయారగుచున్నవి. అవి నేటినాగరకుల మెప్పును చూరగొనినవి. చౌకదనముతోపాటు వాని కందచందములు నమరినవి. పలువురు వానిని తయారుచేయించి తమగృహముల నలంకరించుకొనుచున్నారు. చౌకగా లభించుచుండుటవలన పరిమితమగు నాదాయముగల సామాన్యసంసారులకును అవి అందుబాటుననున్నవి.

అభినవములగు వానినమూనాలు తత్కళాశాలోపాధ్యాయు లగు శ్రీ వి. ఆర్. చిత్రగారి ప్రతిభకును, కళాకౌశలమునకును ఫలములు. వీరాంధ్రులు; తొలిప్రాయమువారు. వీరి చిత్రకళాకౌశలము ఆంధ్రలోకమునకు పరిచితపూర్వము. ఈకఱ్ఱసామాను లీయన శిల్పనైపుణిని ప్రకటింపగలవు. వీనిలో కొన్నిటిచిత్రము లీసంచికయందు ముద్రితము లయినవి.

---

తిక్కనచిత్రము

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు తెనుగుసంఘము తెనుగువాఙ్మయమున గోచరించు తిక్కన స్వరూపమును చక్కగా చిత్రించినచిత్రకారుని నూటపదారుల నొసంగి బహూకరింప ప్రకటించియుండినది. దాని ననుసరించి కొందఱు చిత్రకారులు చిత్రములను చిత్రించి పంపిరి. వానిలో సన్మానార్హమగుదానిని నిర్ణయింప నేరుపడిన పరీక్షకులు ఒక్కటికూడ సన్మానార్హము కాదని త్రోసివైచిరి.

తిక్కనస్వరూప మిట్టి దని సంఘము తొలుత ప్రకటింపకుండెను. చిత్రకారుని ప్రతిభకు తన్నిర్ణయము వదలివేయబడెను. కావున వారు చిత్రించిన చిత్రములలో మంచిదానిని సన్మానార్హముగ నిర్ణయించుట పరీక్షకులకు ధర్మము. 'స్థితస్య గతి శ్చింతనీయా' అను న్యాయము ననుసరించి అది యుత్తమ మార్గమును. తమదృష్టి కేదియు నాగనిచో నన్నిటిని త్రోసివేయవచ్చును. అది మధ్యమమార్గము. తిక్కనను ప్రత్యక్షముగగాని, దివ్యదృష్టినిగాని దర్శించిన మహానుభావులే దాని ననుసరించుట కధికారులు. అట్టివారు నియతముగ కళారహస్యవేత్తలు నయియుందురు. అపుడు వారి యధికారిత మరింత ప్రశస్త మగును. తద్భిన్నులకు, ఆరువందల ఏండ్లకు పూర్వముండిన తిక్కనస్వరూపమును తత్సంబంధి వాఙ్మయమునుబట్టి నిర్ణయించుట కెట్లును శక్యము కాదు.

ప్రకృతము పరీక్షకులు పై రెండుమార్గములగాక తమ కధికారములేని వింతమార్గమున నడచినారు. పరీక్షకులు పరీక్షార్థము తమ కొసంగినవానియందలి గుణదోషముల బరిశీలించి ఉన్నచో సన్మానార్హ మగుదానిని నిర్ణయించవలసినవారుకాని సలహాల నొసంగవలసినవారు కారు. తమనిర్ణయమునకు పోషకము లగు కారణములను వారు పేర్కొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిన పేర్కొనవచ్చును. కాని అట్లొనర్పక యూరకయుండుటయె లెస్స; గౌరవప్రదము ను. ఇట పరీక్షకులు, వచ్చిన చిత్రములన్నియు పనికిమాలినవే యయినను రెండుచిత్రములు మాత్ర మొకింత బాగుగనున్నవని 'గ్రుడ్డిలో మెల్ల' యనుసామెతగా 'తొలినిర్ణయమును' కావించిరి. 'కవిస్వరూపము సంపూర్ణముగా వచ్చునట్లు వానిని మరల చిత్రింపవలయు'నని తత్కర్తలకు సలహా యిచ్చిరి.

ఈ రెండు చిత్రములను చిత్రించిన వారు మచిలీపట్టణనివాసులు శ్రీ జి. వెంకటాచారి గారు, భీమవరమున న్యాయవాదులు అడివి బాపిరాజుగారును.

ఈ యిరువురి చిత్రకళా కౌశలము నాంధ్రలోకమునకు క్రొత్తగాదు. వీరు ప్రతిభావంతులు నని యంగీకరింపక తప్పదు. వీ రొకమారు సర్వశక్తులను వినియోగించి చిత్రించిన చిత్రములను మరల చిత్రింపవలెనట! అట్లు చేయుటకు బూర్వము కొన్ని యుపదేశములను పొందుటకు విశాఖపట్టణముననున్న శ్రీ పి. లక్ష్మీకాంతము, (ఎం. ఏ.) గారికడకు పోవలెనట! ఒకరి యుపదేశము వెంట చిత్రింపవలసినచిత్రమున కింతయార్భాటమేల? చిత్రకారుల కీయవమానమేల? ఎవరికేనుపదేశించి చిత్రము నే అల్పమూల్యమునకో గుట్టుగ తయారు చేయించుకొని యుండవచ్చునుగదా!

ఇక దీనినిగూర్చి తలపెట్టుట చిత్రకారులకు గౌరవప్రదము కాజాలదు.

'తిక్కనరూప మిట్లుండునని నిర్ణయించుట' ఎంత కష్టతరమో* కృష్ణాపత్రిక చక్కగా వివరించి చెప్పినది. దానిని బరికించిన పరీక్షకులసలహాలు నిస్సారము లని స్పష్టము కాగలదు.

ఇటీవల కొన్ని ఏండ్లనుండి ఆంధ్రుల చిత్రకళాకౌశలము వికాసమును గాంచుచున్నది. ఆంధ్రేతరులుగూడ పలువు రీవిషయమున తమయామోదమును ప్రకటించుచున్నారు. ఈతిక్కన చిత్రనిర్ణయమన్ననో దాని నన్యథాకరించుచున్నది. చిత్రకారులేని, ఒండెవిమర్శకులేని(పరీక్షకు లిక్కడ) కళానభిజ్ఞులయియుండక తప్పదు. ఇం దేదిసత్యమను నది సహృదయలోకమునకు తడవుకొనక పోడము` సంశయము. ప్రకృతము తెలుగు సంఘము ఇక నీసన్మానముమాటను తల పెట్టక అందినచిత్రముల నన్నిటిని ముద్రించి ప్రచురించినయెడల నీసంశయమును కళావేత్తలు తీర్చగలుగుదురు. అనాలోచితమగు తనయారంభమువలనఆంధ్రచిత్రకారులకుకలిగిన యలజడి తీరుట కదియే తగిన సమాశ్వాసము. కళాప్రపంచమున కొనరించిన యపచారమున కదియే సముచితమగు క్షమాపణము. ఆంధ్రచిత్రకారు లిట్టి యవజ్ఞలను లెక్కింపక కళాసంపదను పెంపొందించుకొందురుగాక!

---

* చూ. 'తిక్కనచిత్రము' పుట. ౧౧౩, కలగూరగంపలో.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# స్వాభిప్రాయ విశేషములు

కోపము నుబ్బును గర్వము
నాపోవని యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము నను నివి
కాపురుష గుణంబు లండ్రు కౌరవనాథా!

వర్తమానకాలమునందు సంక్షోభపూరితమైన ప్రపంచపరిస్థితులు విదురుడు ధృతరాష్ట్రునకు దెలిపిన నీతివాక్యములను స్మరింపజేయుచున్నవి. స్వాభిమాన స్వాభిప్రాయ స్వార్థపరత్వమైన ప్రపంచపరిస్థితులు పురోహితులు పూజారులు సంకల్పమును అంకురారోపణమును జేసి కర్తను "మమ" అనుకొనుమనునటు లున్నవి. ఇంతవరకును మతాచారములకును, విద్యాభ్యాసమునకును, కులవృత్తులకును పరిపాటిన్మై స్థిరమైన పౌరోహిత్యమును గురుత్వమును వర్తమానకాలమునందు రాజకీయసాంఘికవ్యవస్థలకు సంక్రమించినవి. సింహగర్జనములకు నిలయములైన పార్లమెంటుసంస్థలు నక్కతంత్రములకు రంగము లైనవి. కాబ్డెను, బ్రైటు, బర్కు, గ్లాడుస్టను, నెపోలియను, మాజిని మొదలగు ధీరులకును, వీరులకును జన్మస్థానములైన దేశములు చర్చిలు, మోస్లె, స్టావిస్కి, ముసోలిని, హిట్లరు మొదలగు తంత్రజ్ఞులకు జన్మభూములయినవి. సంకల్పసిద్ధికి సాధనభూతములైన చతుర్విధోపాయములందును సామదానోపాయము లంతర్ధానములై భేదదండోపాయములు యథేచ్ఛముగ విహారమును జేయుచు సర్వత్రసంక్షోభమును గలుగజేయుచున్నవి. ప్రపంచశాంతికి సంకల్పితములైన నానాజాతిసమితివ్యవహారములును, ఆయుధవిసర్జన సభావ్యవహారములును, స్వాభిమాన స్వప్రయోజనపరాయణత్వములు, భేదదండోపాయముల రూపములను గలుగజేయుచున్న మహాసంక్షోభమును చెప్పకను చెప్పుచున్నవి. స్వాభిమానము స్వార్థపరత్వము దురభిమాన పరిణామమును పొందుచు విదురుడు ధృతరాష్ట్రునకు దెలిపిన కాపురుష గుణంబులు ప్రళయతాండవమునకు వినియోగపడుచున్నవి.

సకలరాజ్యములును, ప్రజ లన్నాతురులై పరితపించుచున్నను, రాజ్యాదాయమును ప్రళయమూలములైన సంగ్రామ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సన్నాహములకై వినియోగించుచు కా పురుషగుణాభ్యుదయమునకు వినియోగపడు చున్నవి. స్వజాతీయాభిమాన సంవర్ధి తములైన కోపావేశములు, గర్వాభిమాన ములు, రాగద్వేషములు, దంభాహంకార ములు పురుషార్థమును నిత్యమైన ధర్మాధార రహితముచేసి, అనిత్యములైన అర్థకామా ధారపరము చేయుచున్నవి. వర్తమాన రాజ్యాంగయుగమునం దాసురసంపదకు గల ప్రపత్తి దైవసంపదకు దుర్లభ మైనది. సామ్రాజ్యములకును స్వల్పరాజ్యములకును, సంపన్నరాజ్యములకును దరిద్రరాజ్యముల కును, స్వతంత్రరాజ్యములకును పరాధీన రాజ్యములకును, ఆత్మసంరక్షణమున కాత్మా వలంబనము గాకను పరాక్రమణము శరణ్యా మైనది.

గీతాశాస్త్రమునందు దైవాసుర సంప ద్విభాగయోగమునందు దెలిపినటులు ప్రపం చమునం దంతటను ఆసుర విభూతులు ప్రళయతాండవమును జేయుచు మహా సం క్షోభమునకు సాధనము లగుచున్నను ప్రజా నాయకులు గ్రహింపకుండుట ప్రపంచము నావరించిన దురదృష్టము. దేశకాలాతీతమైన దుఃఖవేదనానుభవము దేశకాలబద్ధ మైన భూకంపాదుల దుఃఖ వేదనానుభవమును వేయిరెట్లు మించియుండును. పురుషార్థమున కును, దుఃఖానుభవమునకును అదృష్టమైన ధర్మమునకు గలప్రతిష్ఠ దృష్టము లైన అర్థ కామములకు దుర్లభములు. స్వతంత్ర దేశములందు వ్యాపకమునుగాంచినకాపురుష లక్షణములు వేయిమడుంగులు పరతంత్ర దేశములందు వ్యాప్తిని గాంచుట ప్రకృతి ధర్మము. హిందూస్థానవ్యవహారము లీపర మార్థమును రాజకీయసాంఘికార్థికమతాది వ్యవహారములందు దేశావృతమైన జడత్వ రూపమునను సువ్యక్తము చేయుచున్నవి. దేశావృతమైన మాంద్యము ప్రగల్భముల కును, స్వాభిప్రాయములకును వినియోగపడ గల విధమును నిర్మాణకార్య విధానము వలెను, శాసనసభలును, రాంచీసమావేశ మును వెల్లడి చేయుచున్నవి.

* * * *

### రాంచీ సమావేశము

జైనులకు ధర్మక్షేత్రమైన రాంచీ క్షేత్రము వర్తమానకాలమున స్వరాజ్యపక్ష మునకు తీర్థక్షేత్రముగను పరిణమించినది. గాంధిమహాత్ముని దీవనలు స్వరాజ్యపక్షము నకు సమకూర్చగల ప్రయోజనములను కాలము సువ్యక్తము చేయగలదు. స్వరాజ్య పక్షము కాంగ్రెసు నిర్ధారణలను శిరసా వహించుచు శాసనసభాదివ్యవహారములందు సంపూర్ణ స్వాతంత్ర్యమును గలిగియుండ గలదు. స్వరాజ్యపక్షము నిరంకుశప్రభుత్వము వలెనే ద్వివిధకార్యవిధానము ననుసరింప నున్నది. శ్వేతపత్ర తిరస్కారము, నిర్బంధ శాసనసంహారము స్వరాజ్యపక్షవిధానము నందు ప్రధానాంశములు. ఈప్రధానాంశము లను భారతశాసనసభయందు సంపాదింప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడనున్నది. కాంగ్రెసు నిర్ణయించిన శాసన సభాబహిష్కారమును తొలగించకుండను శాసనసభాప్రవేశమును నిర్ణయించుట కాంగ్రెసు గౌరవమునకె నారిమనుగారు తెలిపినటులు ప్రతికూల మగును. అఖిలభారత కాంగ్రెసుసంఘమును, కాంగ్రెసుమహాసభయును చేసిన నిర్ణయముల ననుసరించి స్వరాజ్యపక్షము పోవుట న్యాయముకాని స్వరాజ్య పక్షాశయముల ననుసరించి కాంగ్రెసును నడుపుట న్యాయముకాదు. నారిమనుగారు శ్రుతపరచిన యాక్షేపణను సభ్యులు నిరాకరించుట యనుచితము.

స్వరాజ్యపక్షసభ్యులకు శాసనసభలకు పోవుట సుకరమైనను స్వరాజ్యసంపాదనమునకు ప్రత్యక్షముగను వారు చేయగల కార్యములు దురూహములుగ నున్నవి. శాసనోల్లంఘనము విరమింపబడి శాసన సభా ప్రవేశ మంగీకరింపబడినపుడు కాంగ్రెసుపక్షావలంబకు లేల అభ్యర్థులుగను నిలువకూడదో తెలియకున్నది. స్వరాజ్యపక్షమునకును అఖిలభారత కాంగ్రెసు సంఘమునకును సంయోగ సాహచర్యములు సాధ్యముగానంతవరకును స్వరాజ్యపక్షము వలన నుపకృతి గలుగకపోవుటయె కాక నపకృతియును గలుగవచ్చును. సత్యాగ్రహమును గాంధిమహాత్ముడును, రాజకీయములను స్వరాజ్యపక్షమును చేపట్టినపుడు కాంగ్రెసుచేయగల పనియే కనుపడదు. కాంగ్రెసుపక్షమువారు స్వరాజ్యపక్షమునకు, తమకుగల యవకాశములను విడిచి ఎన్నికలందు సహాయముచేయుట సాధ్యముకాదు. స్వరాజ్యపక్షము, దయదలచి, తాము చేయదలచిన నిర్మాణకార్యవిధానమును, కాంగ్రెసు పక్షవశము చేయుటయును దేశకాలపరిస్థితుల కనుకూలముగ నున్నను ప్రయోజనకరము గాదు.

* * * *

నిర్మాణకార్యవిధానము

నిర్మాణకార్యవిధానమునకును శాసన సభలకును చుట్టపుచూపు సాధ్యమైనను స్థిర ప్రయోజనము సాధ్యముగాదని భారతశాసన సభోదంతము రుజువుచేయుచున్నది. భారత శాసనసభ లీమోడి యొడంబడికలకును, ఇండో-జపాను ఒడంబడికలకును వినియోగ పడినటులు ఖద్దరునిర్మాణమునకు వినియోగ పడలేదు. మిల్లులయజమానులు స్వరాజ్య పక్షమునకు సమకూర్చెడిద్రవ్య మెన్నికల విజయమునకు వినియోగపడినను ఖద్దరు నిర్మాణవ్యాపకములకు ప్రతికూలముగ నుండ గలదు. ఖద్దరువ్యాపనము పరోక్షముగను కాంగ్రెసుబలమున కుపయోగపడినను ప్రత్యక్షముగను కాంగ్రెసుబలమునకు విశేషముగను వినియోగపడుట దుర్లభము. అఖిల భారతచరఖాసంఘము ప్రత్యేకసంస్థగ నేర్పడి ఖద్దరునిర్మాణవ్యాపనములకు పనిజేయుచున్నది. ఈ సంస్థలందు పనిచేయుచున్న కొలది మందికైనను కాంగ్రెసునందు తగిన ప్రమేయము గలుగకున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అస్పృశ్యతానివారణమునకును ప్రత్యేక సంస్థ లేర్పడి పనిచేయుచున్నవి. ఆసంస్థల నిర్వాహకులు రాజకీయములందు విశేషమైన ప్రమేయమును గల్పించుకొనుటయును సంభవముకాదు. అస్పృశ్యతానివారణమునకును, హిందీప్రచారమునకును స్వరాజ్యపక్షమున కన్న నధికముగను పనిచేసెడివా రనేకమంది అన్నిపక్షములందును గలరు. ఈకార్యవిధానమునం దన్నిపక్షములవారును, అధికారానధికారులును, మహారాజులును సామాన్యులును కలిసి పనిచేయుట కెట్టి యభ్యంతరములును నుండవు. గతించిన పదేండ్లయందును నిర్మాణకార్యమునకై కాంగ్రెసువారు చేసిన మహాత్యాగము విఖ్యాతవిషయము. స్వరాజ్యపక్ష మితరపక్షములవారికన్నను నీవిషయమునందు చేయగలదియును, చేయదగినదియును నతిస్వల్ప మని గతకాలానుభవము విశదము చేయుచున్నది. స్వరాజ్యపక్షము నిర్ణయించిన యంగవిధానమును, నాయకుల ప్రకటనలును సంభ్రమమును గలుగజేయుచు పత్రికలకును, పాఠకులకును మధురాహారము లభించినది. స్వరాజ్యపక్షనిర్ణయములు గాంధిమహాత్ముని "తథాస్తుల"ను బడసినను అఖిలభారతకాంగ్రెసుసంఘామోదమును బడయుట దుర్లభము.

* * * *

పాట్నా సమావేశము

పాట్నాయందు మెయి ౧౮, ౧౯ తేదులందు అఖిల భారత కాంగ్రెసుసంఘము గూడునటులు కార్యదర్శి సయ్యదుమహామదు గారు ప్రకటించిరి. పాట్నానిర్ణయములమీదను కాంగ్రెసుప్రయోజనప్రతిష్ఠ లాధారపడియున్నవి. శాసనోల్లంఘనమును గాంధిమహాత్ముడు కోరునటులు అఖిలభారతకాంగ్రెసు సంఘ ముపసంహారమును జేసిన తరువాతను కాంగ్రెసుచేయవలసిన కార్యమును నిర్ణయించుట దుర్లభముగ నున్నది. శాసనసభలకు స్వరాజ్యపక్షమును, ఖద్దరునకు చరఖాసంఘమును, హిందీకి హిందీప్రచారసంఘమును, అంటరానితనమునకు హరిజనసేవాసంఘమును నేర్పడినవి. ఇకను కాంగ్రెసుసభ్యులు చేయవలసినది స్వరాజ్యపక్షాభ్యర్థులకు ఎన్నికలందు ప్రచారసహాయములు మాత్రమే. ప్రపంచవ్యవహారములం దిది సాధ్యము కానిపని. కాంగ్రెసు ప్రయోజన ప్రతిష్ఠలను గాపాడుటకును, వృద్ధిచేయుటకును కాంగ్రెసు పక్షమువారే శాసనసభల కభ్యర్థులుగను నిలుచుటయును ధర్మమును ప్రయోజనకరమును. కాంగ్రెసునకును, ప్రజలకును నడుమను ప్రత్యేకముగను స్వరాజ్యపక్ష మేర్పడుటయును కాంగ్రెసు గౌరవప్రతిష్ఠలను మూలచ్ఛేదము చేయుచున్నది. గతమాసాంతమునందు బెజవాడయందుగూడిన ఆంధ్రకాంగ్రెసుపక్షము, గాంధిమహాత్ముడు నిర్ణయించిన సత్యాగ్రహవిరామము నంగీకరించుచు నీవిషయము ప్రత్యేకకాంగ్రెసునం దంగీకరింపబడవలయు ననియును, కాంగ్రెసుపక్షావలంబకులె శాసనసభల కభ్యర్థులుగ నుండ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలయు ననియును నిర్ణయించినది. కాంగ్రెసు ప్రతిష్ఠను నిలువబెట్టవలసిన భారము పాట్నా యందు గూడనున్న అఖిలభారత కాంగ్రెసు సంఘముమీదను గలదు. గాంధిమహాత్ముడు స్వరాజ్యపక్షాశయములను దీవించినను స్వరాజ్యసంరంభమునందు మహాత్యాగమును జేసిన కాంగ్రెసుపక్షాశయములను సంరక్షించుటయును, కొనసాగించుటయును పరమావసరమును, ధర్మమునునై యున్నది. ప్రజానాయకులు పాట్నానిర్ణయములకై యెదురుచూచుట సహజము. ప్రభుత్వాధికారుల లక్ష్యమును పాట్నా సమావేశముమీద నాధారపడి యున్నది. కాంగ్రెసు ప్రభుత్వ బలాబలములను నిర్ణయించుటకు సమయము సంప్రాప్త మైనది. భిన్నపక్షములవారును స్వరాజ్యపక్షమును ప్రతిఘటించుట కేర్పాటులు చేయుటయును, ప్రభుత్వసహాయమును బడయుటయును సహజము. సాంఘికవిభేదములును ప్రత్యేకత్వమును స్వరాజ్యపక్షవిజయమును సంశయాస్పదము చేయగలవు. స్వరాజ్యపక్షము పాట్నాయందు కాంగ్రెసుపక్షముతో సంయోగమును పొందుట స్వరాజ్యపక్షబల విజయములకును కాంగ్రెసు ప్రతిష్ఠకును స్వరాజ్యసిద్ధికిని సాధనముగాగలదు. వివిధ పక్షముల నాయకులును, వివిధసంఘముల నాయకులును కాపురుషస్వభావమునువిడిచి స్వరాజ్యలక్ష్యమైన కాంగ్రెసు నారాధించి భారతీయ పురుషార్థము నారాధించుటకు భగవదనుగ్రహమునకు పాత్రు లగుదురు గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras,
Editor: G. Subbaramayya.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రివర్ణ చిత్రములు:—గోదావరి, రాజమండ్రి; శుక్ల తృతీయ; శుక్ల చతుర్థి.

సాధారణ చిత్రములు:—ఉదయ సూర్యకిరణములు; పేదరికము; నరహంతకుడు; బొంబాయి చౌపతీ సముద్రతీరము; పేరాస; బాల్యవార్ధకములు; బడగాయువతి; సరస్వతి; సూర్యకిరణములు, తుపానుకు మొదలు; పార్వతీ పరమేశ్వరులు; నటరాజు; రామేశ్వర దేవాలయము; శివరాత్రి ఉత్సవము, రామేశ్వరము; వేయికాళ్ల మంటపము, లోపలి భాగము, (రామేశ్వరము); తపశ్చర్య, నృత్యము; గుప్తతేజము; సానరాతికట్టడము, చెన్నపురి; పక్షులకు ఆహారము ఇచ్చుట, పక్షితీర్థము; ఇతర చిత్రములును.

———

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras,
Editor: G. Subbaramayya.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గోదావరి, రాజమండ్రి

—దుర్గవరపు సర్వేశ్వరరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




సంపు. ౧౧ భావసంవత్సరము, జ్యేష్ఠమాసము (జూన్ ౧౯౩౮) సంఖ్య ౬

# ప ల నా డు

తుమ్మల సీతారామమూర్తి

నాగార్జునాచార్య నవ్య తేజశ్ఛటల్
చిందుద్రొక్కిన దివ్యచిత్రశాల
వీర వైష్ణవ మతావిష్టులై తెన్గులు
తిరుమణి తీర్చి దిద్దిన పొలంబు
[1]వెలనాటి బోటితో వియ్యంబులు బిగించి
కేరింత లాడిన వీరభూమి
చంద్రభాగాసరిజ్జలశీకరంబులఁ
జెమ్మగిల్లిన జగా చేవనేల
ప్రకృతి సౌందర్యలక్ష్మికిఁ బట్టుఁగొమ్మ
చిన్ని నా తెల్గుతల్లికి జీవగఱ్ఱ
పోటుమానిసులం గన్న పోతుగడ్డ
నాదు పలనాడు మేలిగొనాలగూఁడు.

౧. గుంటూరుమండలమం దొకభాగమునకు "వెలనా" డని పేరు. ౧౨-వ శతాబ్దిని దానికి రాజు రాజేంద్రచోళుఁడు. అతని రాజధాని చందవోలు. అతని కూఁతురు "ముక్తలవాంబ" ననుగురాజు పెండ్లియాడెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీనాథ కవిరాజ వాణీ విపంచికా
స్రుతసుధాధార లెచ్చోట నొలికె
మధురాపురీబుధ ప్రథఁ ద్రూల్చు [2]సోమన్న
సాహితీసుమము లెచ్చటను వలచె
సోమరసంబులోఁ జొనిపి [3]పింగళిమంత్రి
సుకవితారసము నెచ్చోటఁ బంచె
కాకుసూర్యప్పన్న గంటంపు గజ్జియల్
గడుసుపోకడల నెక్కడ నదించె
తెలుఁగుబిడ్డల చిఱు వేఁడిపలుకు నెత్రు
టేర్లు తుక తుక నుడికి పొంగెత్తి పొరల
వీరగీతంబు లెచ్చోట వీనుమిగిలె
నదియె పలనాడు దీని కున్నదియె జోడు?

ఖండశాత్రవ శిరఃఖండకాండమ్ముల
బాలచంద్రుం డెందు బంతులాడె
గంటంబు నెఱవాలుఁ గరవాలు చేఁబూని
రెడ్డినాగమ్మ యేగడ్డ మెఱసె
హాంవీరసింహంబు లయ్యారె! యని మెచ్చ
ననపోతు రుధిర మే యవనిఁ గార్చె
శూరనారీపరిస్తూయమాన చరిత్ర
మాంచాల యెచ్చోట మగనిఁ దెలిపె
నటదుమానాథ మస్తకతట విరాజ
దభ్రగంగాప్రవాహమ్ము నట్లు తెలుఁగు
దొరల కీరుతు లేనేలఁ ద్రుల్లిపడియె
నదియె పలనాడు మాడరావయ్య తోడు.

---

౨. ఇతఁ డప్పకవిపూర్వులలో నొకఁడు. ఇతఁడు మహాపండితుఁడై మధురలోని పండితుల శాస్త్రవాదమున నోడించెను.

౩. ఇతఁడు పింగళి సూరన్నపూర్వులలో నొకఁడు ఇతఁడు సజ్జనుఁడు, గవియు నై ప్రసిద్ధికెక్కె. ఇతని పేరు రామయ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఋ గ్వే ద ము
(అనువృత్తము)

సి. వి. నరసింగరావు, బి. ఏ., బి. యల్.,

ఋగ్వేదము పురుష దేవతలనేకాక, స్త్రీదేవతలనుకూడ ప్రశంసించుచున్నయది. పురుష దేవతలను గురించి కొంచెముగ తెలిపియున్నాము. ఇకను స్త్రీదేవతలనుగురించి తెలుపుదము.

అదితి. అదితియను దేవిని గురించి ఋగ్వేదము మిక్కిలి గొప్పగ తెలుపుచున్నది. ఒకసూక్తమునందు అదితి సర్వత్రా వ్యాపించియున్నదని చెప్పబడియున్నది. జగత్సృష్టికర్తయగు దక్షుడు అదితిపతి. ఈదేవదంపతులకు పుత్రులే ఆదిత్యులు. అదితిదేవియే దేవతల మాతయనియు ఋగ్వేదము తెలుపుచున్నది. ఋషులందరును అదితిదేవిని మిక్కిలి భక్తితో నారాధించుచుండిరి.

ఇంద్ర, వరుణ, అగ్ని దేవతల రాణులు ఇంద్రాణి, వరుణాని, ఆగ్నేయియని ఋగ్వేదము తెలుపుచున్నది. ఇంద్రునిరాణి శచియనికూడ చెప్పబడియున్నది. రుద్రుని రాణి రోదసి. భాగ్యము, ఐశ్వర్యము నొసంగుటకై ఈదేవులను ఋషులు ఆరాధించుచుండిరి.

ఇళ, సరస్వతి, మహి, భారతియను దేవులను కుటుంబమును క్షేమముగ నుంచుటకును, ఐశ్వర్యము లొసగుటకును ఋషులు స్తోత్రముచేసి ఆరాధించుచుండిరి. భక్తులను మిక్కిలి ప్రీతితో ఈదేవులు కాపాడుచుండిరి.

ఉషోదేవి, రాత్రిదేవి అక్కచెల్లెండ్రు; ద్యౌస్‌దేవుని కూతులు. ఉషోదేవి ప్రాతఃకాలమందుదయించును. రాత్రిదేవి సాయంకాలమున ఉదయించి రాత్రికాలమందు జీవులను కాపాడును. ఉషోదేవి భక్తులకు ధనము, అన్నము, ఆయురారోగ్యంబులు కలుగజేయును. ఈదేవులు భక్తితో ఆరాధించువారలను క్షేమముగ కాపాడుదురు.

అప్‌దేవి జలాభిమానదేవి; వరుణదేవుని రాణి. అప్‌దేవిని భక్తితో స్తుతించిన ఆరోగ్యమును, బలమును, పూర్ణాయువును కలుగజేయును. స్నానకాలమందు అప్‌దేవిని స్తుతించిన రోగమును, పాపమును పారద్రోలును. ఈకారణముచేతనే తీర్థస్నానములు నిర్మించియున్నారు.

ఋగ్వేదమునందే పంచనదీదేవులను ఋషులు కొనియాడియున్నారు. విశ్వామిత్రఋషి విపాస్, సుద్రీనదీదేవులను పిలిచి వారితో సంభాషించి వారి అనుగ్రహము పొందియున్నాడు. గంగా, యమునా, కుబ్భా (కాబూల్‌నది) నదీదేవులనుగురించి చెప్పబడియున్నది. మరికొన్ని దేవులనుగురించి ఋగ్వేదము ప్రశంసించియున్నది.

ధిషణాదేవి ఐశ్వర్యంబుల నొసంగు దేవి.

పురంధిదేవి దండిగ పంటపైరులను, భాగ్యమును కలుగజేయును.

వాగ్దేవి వేదజ్ఞానమును విద్యను కలుగజేయును. ఈదేవినే సూనృతాదేవి యనికూడ స్తోత్రము చేసియున్నారు. ఈదేవి బృహస్పతిదేవుని రాణి.

సినీవాలియను దేవి స్త్రీలగర్భమును కాపాడు దేవి. గర్భాధానకాలమందు ఈదేవిని ప్రార్థించుచుండిరి. ఈదేవి మెండుగ సంతతి కలుగజేయుతల్లి.

అరమతిదేవి సుజ్ఞానమును కలుగజేయును.

స్వస్తిదేవి ఐశ్వర్యమును, భాగ్యమును ఒసంగు తల్లి.

మహనీయులగు ఈదేవుల నారాధించి, మన వేద ఋషులు సుఖసౌఖ్యంబులం బొంది, సుజ్ఞానమును తెలిసికొని ఐహికాముష్మికసుఖంబుల బొందుచుండిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## రాక్షసులు, దస్యులు

మన ఆర్యులను రాక్షసులును, రాక్షసులను పూజించు దస్యులును హింసించుచుండిరి. ఋగ్వేదము అట్టి రక్కసులనుగూర్చియు, దస్యులనుగూర్చియు తెలిపి యున్నది. ఆరక్కసులును, దస్యులును ఎవరైయుండిరో ఈక్రింద తెలుపబడును.

౧. వృత్రుడు వేదమున కానబడు రక్కసుల రాజు. ఈరక్కసుడు ఊర్ణనాభయను రక్కసుని పుత్రుడు. దను వృత్రుని తల్లి. రక్కసరాజు దనుపుత్రుడగుటంబట్టి రక్కసులకు దానవులని పేరు కలిగె. దేవతలకొరకు ఋషులు యజ్ఞముల చేయునపుడు వృత్రుడు యజ్ఞభంగము చేయుచుండెను. అందునకై ఇంద్రుడు విష్ణుసహాయమును పొంది, మరుత్తులు తోడ్పడ ఘోరయుద్ధమునందు వృత్రుని సంహరించెను. మహాబలుడగు నీరక్కసుని సంహరించుటచేత వేదఋషులందరును ఇంద్రుని మిక్కిలి అధికముగ కొనియాడియున్నారు. ఇంద్రుడే ఎల్లరక్కసులను, రక్కసులను పూజించు దస్యులను సంహరించిన దేవుడు. కొన్నికొన్ని సమయములందు విష్ణు, అగ్ని, బృహస్పతి, మరుత్తులు ఇంద్రునకు యుద్ధమునందు తోడ్పడినట్లు ఋగ్వేదము చెప్పుచున్నది.

౨. వలుడు, లేక బలుడు అను రక్కసుడు వృత్రాసురుని తమ్ముడు. ఈవలుడు అంగీరసఋషిని మిక్కిలి బాధపెట్టుచు, ఋషుల గోవులను దొంగిలి పోవుచుండును. ఇంద్రుడే ఈవలుని రూపుమాపెను.

౩. కణారు అని మరియొక రక్కసు డుండెను. వాడు వృత్రుని తల్లియగు దనుతో స్నేహముగ నుండువాడు. ఈరక్కసుడుకూడ ఆర్యులను చాల బాధపెట్టుచుండెను. ఇంద్రుడు ఇతనినికూడ బరిమార్చెను.

౪. క్రివియను రక్కసుడు మేఘములందు దాగి వర్షములను కురవనివ్వక ఆర్యులను బాధించుచుండెను. ఇంద్రుడు క్రివిని చంపి ఆర్యుల బాధ నివారించెను.

౫. నముచియను రక్కసుడు క్షామమును కలుగజేసి ఆర్యులను మిక్కిలి కష్టపెట్టెను. ఆర్యుల దేవుడగు ఇంద్రుడే నముచిశిరస్సు ఖండించి చంపెను.

౬. అర్బుదుడను గొప్ప రక్కసుడు ఆకసమున దాగి ఆర్యజనులకు అధికమైన బాధలు కలుగజేసెను. భక్తవత్సలుడగు ఇంద్రుడు ఈరక్కసుని క్రిందపడద్రోసి, కాళ్లక్రింద త్రొక్కి చంపెను.

౭. రౌహిణియను రక్కసుడు స్వర్గలోకమునకు పోయి దేవతలతో పోరాడయత్నించుచుండెను. ఇతనినికూడ ఇంద్రుడే రూపుమాపెను.

౮. వర్చిన్ అనురాక్షసుడు ఇంద్రుని మాషించి ఇంద్రుని భజించు ఆర్యులను ద్వేషించుచుండెను. ఇంద్రుడు వర్చిన్ అను అసురుని, అతని పుత్రులను వేయిన్ని అయిదువందల రక్కసులను ధ్వంసముచేసెను.

౯. శుష్ణయను దస్యురాజు కుత్సరాజును బాధపెట్టుచుండెను. కుత్సరాజు ఇంద్రుని ప్రార్థింపగ ఇంద్రుడు ప్రత్యక్షమై శుష్ణుని చంపి అతని భాగ్యమంతయు కుత్సున కిచ్చెను.

౧౦. శంబరుడను దస్యురాజు దివోదాసుని రాజ్యమును పాడుచేయనెంచి, దివోదాసుని రాజ్యము చుట్టు నూరుకోటలను కట్టి, దివోదాసరాజ్యముపై దండెత్తసాగెను. దస్యులు సహజముగ బలవంతమైన జాతి; యుద్ధనైపుణ్యముకూడ వారికి కలదు. ఈశంబరుని తెర గెరిగి దివోదాసునకు భీతి కలిగెను. దైవభక్తియే ఆర్యజాతికి మూలబలమని ఎరిగి ఇంద్రుని ప్రార్థింపసాగెను. భక్తులయం దనురాగముగల ఇంద్రుడు ప్రత్యక్షమై, దివోదాసున కభయమిచ్చి, శంబరునినూరు కోటలను పడగొట్టి, ఆదస్యురాజును చంపి ఆరాజ్యము దివోదాసున కిచ్చెను.

౧౧. వంగ్రిద, పిప్రు, మృగయ యనుదస్యురాజులు రిజిశ్వుండను ఆర్యరాజుపై విరోధముపూనిరి. ఆముగ్గురు దస్యులు ఏకీభవించి రిజిశ్వుని రాజ్యముచుట్టు కోటలను కట్టసాగిరి. కోటలను కట్టుటయందు మిక్కిలి నైపుణ్యము కలిగియుండిరి. రిజిశ్వుడు శత్రుల యుద్ధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామగ్రి నెరిగి భీతిజెంది, ఇంద్రుని ప్రార్థింపసాగెను. ఇంద్రుడు దస్యురాజుల కోటల పడగొట్టి, వారలను చంపి, వారి రాజ్యమును రిజిస్వన కిచ్చి ఆర్యులను కాపాడెను.

౧౨. చుమురి, ధుని యను దస్యురాజులు దధీతి యను ఆర్యరాజుపై విరోధము సాగించుచుండిరి. వారుకూడ దధీతిరాజ్యముచుట్టు కోటల నియమించి దధీతిరాజ్యమును పాడుచేయ నారంభించిరి. ఇంద్రుని వేడగ, ఇంద్రుడు ప్రత్యక్షమై చుమురి, ధునికోటలను భూమిచదరముచేసి వారలను చంపి దధీతిని రక్షించెను.

౧౩. వేతసు, తుగ్రయను దస్యులను రూపు మాపి, ఇంద్రుడు తుజియను ఆర్యరాజును కాపాడెను.

౧౪. ఋగ్వేదమునందు స్వర్భాను అనురక్కసుడు సూర్యున కడ్డపడి సూర్యగ్రహణమును కలుగజేయు నని చెప్పబడియున్నది.

పురాణములలో మిక్కిలిగ వర్ణింపబడిన రాక్షసుల పేర్లు ఋగ్వేదమున కానబడవు.

## ఉపసంహారము

ఋగ్వేదమునందు తెలుపబడిన దేవత లందరు మిక్కిలి సౌమ్యమూర్తులు; భక్తులయెడ మిక్కిలి అనుగ్రహముకల దేవతలు, భక్తితో స్తోత్రముచేసి, నైవేద్యము లిడిన ఈదేవతలు చాలగ సంతసించి, వారు వేడిన వరము లొసగి భక్తులను బిడ్డలవలె కాపాడుచుండువారు. భక్తితో పిలిచిన సిద్ధముగ ప్రత్యక్షమై కోరిన కోర్కె లొసగువారు. భక్తుల కష్టము లెల్ల పోగొట్టువారు. స్త్రీదేవులుకూడ మాతృవాత్సల్యముతో భజించువారలకు సర్వశుభము లొసగి కాపాడుచుండువారు.

ఇట్టిదేవతల నారాధించియే ఆర్యజనులు తమకంటె బలిష్ఠులును, సంఖ్యాధిక్యముకలవారై యుండి యుద్ధనైపుణ్యముగల దస్యులతో పోరాడి వారల నోడించి పంచనదీప్రదేశంబున స్థిరముగ కుదిరినవారైరి.

కాలక్రమమున ఆతలిదంద్రులవంటి దేవతలను ఆర్యులు మరచిరి. అట్లు మరచుటవలననే ఆర్యజనులకు దురవస్థలు సంభవించినవి. కాలక్రమమున నాస్తికమతముల నవలంబించి, ఇప్పటికి క్షీణదశలో కాలము గడుపవలసివచ్చెను. మన ఋగ్వేదమున ప్రశంసింపబడిన దేవతలు మమ్ములను విడనాడిపోలేదు. అప్పుడును, ఇప్పుడును ద్యౌస్‌దేవుడు ఆకాశప్రదేశము నేలుచునేయున్నాడు. పృథ్వీదేవి భూమియందు అప్పటివలెనే ఇప్పుడుకూడ పంటపైరుల నిచ్చుచున్నది. గాలియందు వాయుమూర్తి ప్రత్యక్షమైయుండి, మన శరీరమందు కూడపంచవాయురూపముననుండి మనశరీరము కాపాడుచున్నాడు. అగ్నిదేవుడు నిప్పులో ఉండి మన వంటకముల పచనముచేసి, వైశ్వానరరూపమున మన శరీరమందు వేడికలిగించుచు మనలను కాపాడుచున్నవాడు. సూర్యుడు, చంద్రుడు ఆయామండలములందుండి మనలకు ఉష్ణమును, సస్యములకు ప్రాణమును ఒసగి జీవరాశిని కాపాడుచున్నారు. ఇంతియకాదు. పరమాత్మయగు విష్ణుదేవుడు, జడపదార్థమందును, జీవులయందును, దేవతలయందునుకూడ అంతరాత్మయై దాగి ప్రపంచమంతయును ఏలుచున్నవాడు.

మరల మన ఆర్యులు ఈదేవతలను ఋగ్వేదమందు తెలిపినవిధముగ నారాధింప నారంభించిన యెడల, పూర్వమున ఆర్యులు పొందిన ఉత్తమపదమును మరల పొందగలరు. ఇది నిశ్చయము.

దేవతలు ప్రత్యక్షమగుట ఈకాలపు మాట కాదని కొందరు తలతురు కాబోలు. అది సరికాదు. ఈవిషయము ఇంతకుముందు తెలుపబడియున్నది. పునరోక్తి దోషము సంభవించినను ఆవిషయము మరల నొక్కిచెప్పబడును. మన ఆంధ్రదేశమున భద్రాచల రామదాసుని మొర ఆలకించి శ్రీరామమూర్తి తురుష్కుడగు తానీషాకు ప్రత్యక్షమై రామదాసుఅప్పును తీర్చినవిషయము ఆంధ్రుల కందరికి స్పష్టముగ తెలిసినదే. అట్లనే అరవదేశమందును పశ్చిమతీరమున ఉడిపియందును, మహారాష్ట్రదేశమున పండరీపురమందును, కాశీపట్టణమందును, బంగాళదేశమందు నవద్వీపమందును దేవతలు ప్రత్యక్షమైరని తెలియుచున్నది. ఇవన్నియు కల్లకాదు. భక్తితో భజించువారలకు దేవుని సాన్నిధ్యము శీఘ్రముగ కలుగుచున్నది. ఎంతచెప్పినను నాస్తికులకు నమ్మకము రానేరదు. వారలు తప్పుమార్గముననే పోదురు. ఆస్తికులు ఋగ్వేదమార్గము ననుసరించి శుభమును పొందగలరు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కావ్యమున కాత్మ యేది?

(What is the soul of Poetry)

డి. వేం. అవధాని

మానవదేహము సర్వాంగసుందర మయ్యును, నిర్జీవమగుచోఁ దనధర్మమును నిర్వహింపఁజాలదు. జీవము దానికిఁ బ్రధానము; తక్కిన యంగము లన్నియు నలంకారప్రాయములు. అనఁగా నాంతరమైన జీవము వెలిగా బాహిరములైన యంగములు మాత్రము దానికి సౌందర్యమును గూర్పఁ జాలవనుట. అట్లే కావ్యమునఁగూడఁ బ్రాణభూతమైన ప్రధానవస్తువు లోపించినచోఁ దత్ప్రయోజనమగు రసానందము సిద్ధింపదు. అప్పు డది కావ్యశబ్దవాచ్యమే కాక యొక నీరసపదసముదాయ మనఁబడును. కావ్యాంతర్భూతములైన రసాలంకారాదిగుణములలో నేది కావ్యమునకుఁ గావ్యత్వము నాపాదించి, తత్ప్రయోజన మగు రసానందమును గలిగించుటకు సమర్థమై యుండునో, యదియే దానికిఁ బ్రాణము, లేక యాత్మ యనఁదగును. మిగిలిన వన్నియు నుపకారకమాత్రములే కాని ప్రధానములు కానేరవు. అనఁగా నప్రధానములైన యీ బహిరలంకారములు లోపించినపుడుగూడఁ బ్రాణభూత మగు నా ప్రధానవస్తు వొక్కఁడే కావ్యానందము నొసంగి తీరుననుట. కావ్యమున కిట్టి యాత్మ యెద్దియో నిర్దేశించుటలో వివిధమతములు ప్రబలినవి. వాని నొక్కొకటిగా విమర్శించి చూతము.

పాశ్చాత్త్యులకు Aristotle ఎంత ప్రాచీనుఁడైన లాక్షణికుఁడో మనకు భరతుఁ డంత. ఇతఁడు నాట్యశాస్త్రమును వ్రాసి యం దుదారములైన పెక్కు విషయములను వాక్రుచ్చెను. దానిలోని సూత్రముల నాధారముచేసికొనియే తరువాత క్రమక్రమముగ ననేకశాస్త్రగ్రంథములు వెలసినవి. రసమును, దదనుభవహేతువు లగు సాధనములను బ్రప్రథమమున నిర్వహించి చెప్పినవాఁడు భరతుఁడే. "విభావానుభావవ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" అని యాతఁడు చెప్పిన సూత్రమునుబట్టియే తరువాతి యాలంకారికులు రసస్వరూప నిరూపణము గావింప యత్నించిరి. నాటక ప్రయోగ సమయమున సహృదయుఁ డగు సామాజికుఁ డనుభవించు సాత్త్వికానందమే రసమనియు,నదియే యెల్ల కావ్యములకును జీవగఱ్ఱ యనియు భరతుని మతము.

భరతునికిని, ఆనందవర్ధనునికిని మధ్య కాలములోఁ గావ్యస్వరూపమును నిరూపించుటకుఁ బలువురు పలుతెఱంగులఁ బ్రయత్నించిరి. ఈకాలములో భరతుని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానములు పెక్కు వెలువడినను అతని రససిద్ధాంతముమాత్రము తగినంతప్రాముఖ్యమును బడయలేదు. అప్పటి యాలంకారికులు రీత్యలంకారగుణాచ్ఛాదితమైన కావ్యముయొక్క బహిస్స్వరూపముననే యెక్కుడు ప్రాధాన్యము నొసంగిరి. కాని యంతర్జీవ నిరూపణకై ప్రయత్నింపరైరి. రససిద్ధాంతముయొక్క సామంజస్యమును వారును గుర్తించిరి. కాని తమతమ నూత్నసిద్ధాంతములఁ బ్రబలీకరించుకొనునాతురతలో దానికప్రధానస్థానము నొసంగిరి. కాళిదాసాదులగుకవులుకూడ నానాఁటి విమర్శకుల నీరసాభిరుచిని (Bad taste) గూర్చి తెగడియే యున్నారు. రసస్వరూపమును లెస్సగా నెఱింగిన భవభూతివంటి మహాకవికూడ నాకాలము ననుసరించి శబ్దవైచిత్రి నారాధింప వలసివచ్చినది. ఆకాలమునాఁటి కావ్యకర్తలిట్టిశబ్దచిత్రసాధనమునకై తమ కావ్యములలో ప్రత్యేకముగ నొక్కొక్కభాగమును వినియోగించుచుండెడివారు. ఇదియంతయు నప్పుడు వ్యాపించిన నీరసాభిరుచియొక్క ప్రభావము.

అదిగాక భరతుఁడు రసమును కేవల నాటకసంబంధిగాఁ జెప్పుటచేతను, ఏరసపోషణకును అవకాశములేని స్వల్పపద్య రచనలో నతని ననుసరించి రసానందసిద్ధి వడయుట దుర్లభ మగుటచేతను తరువాతి యాలంకారికు లతని రససిద్ధాంతమునకు భిన్నముగాఁ గొన్ని నూత్నమతములను స్థాపించిరి. అం దలంకారమత మొకటి. దీనిని వెలువరించినవాఁడు భామహుఁడు. అలంకారములే కావ్యాంగములలోఁ బ్రధానములైన వనియు, నవి లోపించినచోఁ గావ్యప్రయోజనము సమగ్రసిద్ధి నందదనియు నితని మతము. స్వప్రతిష్ఠితమైన మతమునకుఁ బ్రాముఖ్యము నొసంగుటకై యితఁడు రసగౌరవమును గించిల్లఘూకరించినను, దాని మాహాత్మ్యస్పష్ట్యము నెఱుంగనివాఁడు కాఁడు. కావుననే ఉత్తమోత్తమరచన యనఁదగిన నాటకమున రసపరిపోషణము విధిగా నుండి తీఱవలయు నని నొక్కిచెప్పినాఁడు. అదిగాక నీతివేదాంతాదికఠినవిషయబోధనమునకుఁగూడ మనోహరరసాత్మకమైన రచనయే యర్హమని యతని యూహ.

'స్వాదు కావ్యరసోన్మిశ్రం
శాస్త్రమ ప్యుపయుంజతే'

కాని యితఁడు రసమును రసవన్నామమున నొక యలంకారభేదముగామాత్ర ముగ్గడించెను.

రెండవది గుణసిద్ధాంతము. దీని కర్త దండి. 'ఇష్టార్థవ్యవచ్ఛిన్నమైన పదావళి'యే కావ్యమని యితని మతము. కావ్యశైలులలో నుత్తమమైన వైదర్భికి మాధుర్యాది యగు గుణదశకమే ప్రాణమని యితని యూహ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'శ్లేషః ప్రసాద స్సమతా
మాధుర్యం సుకుమారతా,
అర్థవ్యక్తి రుదారత్వ
మోజఃకాంతిసమాధయః,
ఇతి వైదర్భమార్గస్య
ప్రాణా దశ గుణాః స్మృతాః.'

—కావ్యాదర్శము.

భావౌన్నత్యమును, భాషాలాలిత్యమును గూడఁ గావ్యశోభకు ముఖ్యహేతువు లని యితఁడు సూచించియున్నాఁడు. కావ్యమునకు జీవాతువులని భామహుఁ డుగ్గడించిన యలంకారములు కావ్యసౌందర్యోపకారకములగు బహిర్ధర్మములు మాత్రమని యితని యూహ. ఇతఁడుకూడ భామహునివలె రసము నొక యలంకారముగానే పేర్కొని నాఁడు. కాని రసమునకుఁ గావ్యమునఁ గల ప్రాధాన్యమును గుర్తించక పోలేదు. ఇతఁడాలంకారికమాత్రుఁడే కాక కవియు నగుట రసమునకుఁ గూడ గుణాదులతో నించుమించుగా సమానగౌరవము నొసంగినాఁడు. మొత్తముమీఁద దండి రససిద్ధాంతమునకు భామహునియంత విరోధి కాఁడు.

మూఁడవది రీతిమతము. దీని నావిష్కరించినవాఁడు వామనుఁడు. ఇతని మతమునఁ గావ్యమునకు రీతియే ప్రాణము. రీతియనఁగా విశిష్టమైన పదరచన. అది దోషరహితమును, గుణభూయిష్ఠమును అయి యుండవలయును. 'రీతి రాత్మా కావ్యస్య, విశిష్టా పదరచనా రీతిః, విశేషో గుణాత్మా.' వామనుఁడు చాలవఱకు దండితో నేకీభవించినాఁడు. గుణములు కూడఁ గావ్య శోభకు హేతువులే యనియు, నలంకారములు తదతిశయహేతువు లనియు నితఁడు చెప్పియున్నాఁడు. రసవిషయమున వామనుఁడు తన పూర్వులకంటెఁ గొంచెము లోతుగాఁ బరిశీలించిన ట్లగపడుచున్నాఁడు. భామహుఁడును, దండియు దాని నొకయలంకారభేదముగామాత్రము చెప్పి దానికిఁ గావ్యమునఁ దగినంతస్థానమును గల్పించరైరి. వామనుఁడు దాని నొకప్రధానకావ్యలక్షణము గాఁ జెప్పుటయేకాక, దానిపోషణకనువగు రచన లేవియో విమర్శించి చూపినాఁడు.

వామనునితరువాతివారును, ఆనందవర్ధనునికిఁ బూర్వులును నగు నాలంకారికులలో నుద్భటుఁడు, రుద్రటుఁడు, రుద్రభట్టును ముఖ్యులు. వీరిలో నుద్భటుఁడు భామహాలంకారమునకు వివరము వ్రాసినవాఁడు. అందుచేఁ జాలవఱకు భామహుని యలంకారమతమున కనుగామి. భామహాదులవలె నితఁడుగూడ రసము నొక యలంకారముగానే పేర్కొన్నను దానినిగూర్చి బాగుగా విచారించి, తదనుభావసాధనములను గూర్చి స్ఫుటమైన పరిజ్ఞానమును సంపాదించినవాఁడు. ఇతఁడు పై కలంకారమతములోనివాఁడుగనే కన్పట్టినను రససిద్ధాంతమునకే మిక్కిలి సన్నిహితుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుద్రటుఁడును, రుద్రభట్టును రసము నెడఁ దమ పూర్వులకంటె నెక్కుడాదరము గలవారు. రసవిహీనమైన రచన నిష్ప్రయోజనమని రుద్రటుని యాశయము. ఆయా రసపోషణ కనువగునట్లు వివిధరీతుల నుపయోగింపవలె నని చెప్పుటలో నతఁడు రీతి కంటె రసమున కెక్కుడు ప్రాధాన్య మిచ్చినట్లు తోఁచుచున్నది.

"వైదర్భీపాంచాల్యౌ ప్రేయసి కరుణే భయానకాద్భుతయోః, లాటీయాగౌడీయే రౌద్రే కుర్యా ద్యథౌచిత్యమ్."

ఆనందవర్ధనుని కర్వాచీనమైన యగ్నిపురాణమున నీపై మతములన్నియుఁ గ్రోడీకరింపఁబడుటతక్క తత్కర్తకుఁ గావ్యమునెడఁ గల వినిశ్చితాభిప్రాయ మేదియుఁ దేటపఱుపఁబడలేదు. ఇతఁ డానందవర్ధనుని ధ్వన్యాలోకముతోఁ బరిచయము కలవాఁ డనుటకు ధ్వన్యాదుల కితఁ డిచ్చిన నిర్వచనములే తార్కాణము. మొత్తముమీఁద నితఁ డానందవర్ధనుని ధ్వనిమతమునకుఁ దత్ప్రచుర్యమునకుఁ బూర్వము పూర్వపక్షము వహించినవాఁడని తోఁచుచున్నది.

ఈపైమతము లన్నియుఁ గావ్యము యొక్క బహిస్తత్త్వమునకే యెక్కుడు ప్రాధాన్యము నిచ్చినవి కాని యందలి యథార్థమైన జీవమును గుర్తించుటకు యత్నించలేదు. కొందఱు రసమునకుఁ గల ప్రాచుర్యమును గుర్తించినను స్వప్రతిష్ఠితములైన మతములను స్థిరముగా నెలకొల్పుకొను నాతురతతో దానికిఁ బ్రధానస్థానము నీయరైరి. అందుచేఁ గావ్యాత్మను బరిశీలించుటలో వారెవ్వరును సమగ్రముగఁ గృతకృత్యులు కాలే దనవచ్చును. ఈమతముల నన్నిటిని సమన్వయించి కావ్యముయొక్క జీవమును నిరూపించినవాఁ డానందవర్ధనుఁడు. ఇతని మతము రససిద్ధాంతమునకు వ్యాఖ్యానము వంటిదే కాని తద్వ్యతిరేకి కాదు. కావ్యాంగములైన శబ్దములలో కేవలవాచ్యార్థమే కాక రసభావస్ఫోరకమగు వ్యంగ్యమను నొక విశిష్టమైన శక్తి కలదనియు, ధ్వనినామాంతరమైన యీ శక్తియే కావ్యమునకు జీవమనియు నితనిమతము. కావ్యభాషకు నిసర్గమైన వ్యంజకత్వముచే నుద్ద్యోతితమైన వ్యంగ్యార్థము రసికుల హృదయము నాకర్షించుటకు ముఖ్యసాధనమనియు, నిట్టి ధ్వనిలేని కావ్యము కావ్యమే కాదనియు నితఁడు సూచించియున్నాఁడు. ఈ వ్యంగ్యము రసాదివ్యంగ్య మనియు, నలంకారవ్యంగ్య మనియు, వస్తువ్యంగ్య మనియుఁ ద్రివిధము. రససంబంధులగు సమస్తభావములను స్ఫురింపఁజేయునది రసాదివ్యంగ్యము. అలంకారస్ఫోరక మగునది యలంకారవ్యంగ్యము. వస్తుస్ఫురణ కలిగించునది వస్తువ్యంగ్యము. ఇతనికిఁబూర్వులగు లాక్షణికులలోఁగూడఁ గొంద ఱీధ్వనిస్వాత్రముపొంత బోయిరిగాని యిదియే కావ్యమునకు మూలాధారమని గుర్తింపలేకపోయిరి. వామనుఁడు చేసిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వక్రోక్తినిర్వచనములో ధ్వన్యర్థమునకు మిక్కిలి సన్నిహితమైన భావము ధ్వనించుచున్నది. ఐనను దొలుతొలుత నీధ్వనిసిద్ధాంతమునకు స్ఫుటమైన యాకృతిని గల్పించినవాఁ డానందవర్ధనుఁడే. ఆనందవర్ధనుఁడు ధ్వని కిచ్చిన నిర్వచన మిది :

"యత్రార్థః శబ్దో వా తమర్థ ముపసర్జనీ
కృతస్వార్థౌ, వ్యంక్తః కావ్యవిశేషః స
ధ్వనిరితి సూరిభిః కథితః."

అనఁగాఁ గావ్యశబ్దములకు రూఢమైన యర్థముకంటె వానిచే స్ఫురింపఁజేయఁబడు రమ్యమైన వ్యంగ్యార్థమున కెచ్చట ప్రాధాన్యముండునో ఆరచన ధ్వనియని. ఈ ధ్వనిలో రెండు ప్రధానవిభాగములు కలవు—౧. అవివక్షితవాచ్యము (వాక్యార్థ మిచ్చటఁ బూర్తిగాఁ బరిహరింపఁబడును), ౨. వివక్షితాన్యపరవాచ్యము (ఇచ్చట వ్యక్తమైన వాచ్యార్థము తదన్యమైన మనోహరార్థపరమై యుండును). ఈ ధ్వనియే కావ్యప్రయోజనమును సమగ్రముగా సిద్ధింపఁజేయఁగలదని యితని సిద్ధాంతము.

'కావ్యాఖ్యేఽఖిలసౌఖ్యధామ్ని విబుధో
ద్యానే ధ్వని ర్దర్శితః సోయం కల్పత
రూపమానమహిమా భోగ్యోఽస్తు భవ్యా
త్మనామ్.'

శృంగారకరుణాదిశబ్దములను వినునంతమాత్రమున మనలో నారసము లుద్భవింపవు. కాని ఆయారసముల కునికిపట్టులైన కావ్యఘట్టములను బఠించునప్పుడుగాని, దర్శించునప్పుడుగాని మన మారసము లనుభవింపఁజాలుదుము. ఇట్లు జరుగుటకు హేతువేదియో రసవాదులు నిరూపించలేకపోయిరి. ఆనందవర్ధనుఁడు తనధ్వనిసిద్ధాంతముచే దీనికి సయుక్తికమైన కారణమును నిరూపించినాఁడు. అది ఏదన, శృంగారకరుణశబ్దములు వాక్యార్థమునుమాత్రము స్ఫురింపఁజేయును. కాని తత్తద్రసావిష్టములైన ఘట్టములు, లేక అవస్థలు ఆయారసములను వ్యంజితములఁగాఁ జేయును. ఇట్లవస్థలు వాచ్యములు కాక ధ్వనితములైనప్పుడే మనలో రసానుభవహేతువులగు నావేశము లుద్భవిల్లును.

రసవాదులు వస్తుభావాలంకార ద్యోతకములయ్యును ఏదోయొక రసపరిపోషణమున కవకాశములేని రచనలు కావ్యశబ్దార్హములు కావని తృణీకరించిరి. ఇది మిక్కిలి సంకుచితమైన యాశయము. ఏదోయొక రసభావమునే కాక రమ్యభావమును గాని, యలంకారమునుగాని స్ఫురింపఁజేయు రచనలుసైతము కావ్యములే యని ధ్వనిమతము స్థాపించెను. దీనివలన నిది రససిద్ధాంతమునకు భిన్నమనుకొనరాదు. ధ్వనికారుఁడు చేసిన దేమన నందలి యల్పదోషములను బరిహరించి దానికి దృఢమైన యాలంబనము నొసంగెను. ఇతఁడు ధ్వనియే కావ్యమునకు జీవమని చెప్పినను రసము నీసడింపక ధ్వనిలో నది ప్రధానాంతర్భాగమని చెప్పెను. అనఁగా రసధ్వనియే కావ్యమునకుఁ బ్రధానజీవ మని,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తనకుఁ బూర్వములైన సిద్ధాంతములను గూడ నితఁడు తన సిద్ధాంతముతో సమన్వయించెను. గుణాలంకారాదులుకూడఁ గావ్య సౌందర్యవర్ధకములే యయ్యును, రససంబంధులు కానిచో నప్రధానములును, అపరిగణనీయములును నగునని యతఁడు చెప్పియున్నాఁడు. ఈ ఆనందవర్ధనుని ధ్వని మతము నేటికిని అతిరస్కృతమై సర్వపండితజనాంగీకృతమై యొప్పుచున్నది. అతని తరువాతివారు కొందఱీమతమునకు భిన్నములైన కొన్నిసిద్ధాంతములను నెలకొల్పిరికాని యవి తత్తత్ప్రతిష్ఠాతలతోనే యంతరించిపోయినవి. వానిలో నీక్రింద నుదాహృతములైనవి ముఖ్యములు:

ఉద్భటుని కావ్యాలంకారసారమునకు వ్యాఖ్యానము వ్రాసిన ప్రతీహారేందురాజు అలంకారమతమునకుఁ జెందినవాఁడు. ఇతఁడు ధ్వనియును నొకయలంకారభేదమే యనును.

భట్టనాయకుఁడు :—ఇతఁడు ధ్వనిమతమునకుఁ బ్రతిపక్షి యయ్యును రససిద్ధాంతమున కనుచరుఁడు. రసమే కావ్యమునకుఁ బ్రాణము. కాని తదనుభూతికి ధ్వనికారుఁడు చెప్పిన వ్యంగ్యముకాక భావనాభోగములను మఱిరెండుప్రక్రియలు హేతువులని యితని యాశయము.

దశరూపకకర్త యగు ధనంజయుఁడును, దద్వ్యాఖ్యాతయగు ధనికుఁడును భట్టనాయకునివలె రససిద్ధాంతమునకుఁ జెందినవారు. కావ్యమునకును దజ్జీవమగు రసమునకును గల సంబంధము వ్యంగ్యవ్యంజకభావముకాక భావ్యభావకభావమని వీరి యూహ.

కుంతకుఁడు వక్రోక్తిజీవితమను నొక గ్రంథమును వ్రాసి వక్రోక్తిమతమునకుఁ గారకుఁ డయ్యెను. వక్రోక్తి యనఁగా సాధారణరచనకు భిన్నమును, గావ్యానుగుణమును నగు నొకయాలంకారికరచన ( Poetic way of saying). ఇది యలంకారమతమునకుశాఖామాత్రమేకాని ప్రత్యేకస్థితిమంతము కాదనియు, వక్రోక్తియే కావ్యమునకుఁ బ్రాణమనుట నిరాధారమనియుఁ బలువురు దీనిని నిరసించిరి.

వ్యక్తి వివేకకర్త యగు మహిమభట్టు అనుమితిమతమును లేవనెత్తెను. ఇతని మతమునఁ గావ్యమునకుఁ బ్రాణమైన రస మనుమితమేకాని అభివ్యక్తము కాదు. ఇట్లనుటచే నితఁడు కావ్యమునుండి యంచితమైన రామణీయకమును దొలఁగించినాఁడు. ఇతఁడు కావ్యానుమితికిని సాధారణానుమితికిని భేదము కల్పించినను, ఇతని మతముప్రకారము కావ్యము వేదాంతాదులవలె శుష్కము (Dry) కావలసివచ్చుచున్నది. అందుచేతనే యీసిద్ధాంత మతనితోడనే యడుగంటినది.

క్షేమేంద్రుఁ డౌచిత్యమతమునకుఁ గారకుఁడు. ఔచిత్యమే కావ్యమునకు జీవమనియు, ననౌచిత్యముకంటె రసభంగమునకు వేఱొక హేతువు లేదనియు నితని మతము.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అలంకారా స్త్వలంకారా
గుణాఏవ గుణా స్సదా,
ఔచిత్యం రససిద్ధస్య
స్థిరం కావ్యస్య జీవితమ్."
—ఔచిత్యవిచారచర్చ

కాని యీసిద్ధాంతము లేవియు ధ్వని మతముముందు నిలువలేదు. రససిద్ధాంతము నకు వ్యాఖ్యానప్రాయ మైన ధ్వనిమతము నాఁటికిని నేఁటికిని సర్వసమ్మత మై యున్నది. రసమునకును ధ్వనికిని భేదము లేకపోలేదు. రసము సహృదయాశ్రయము. ధ్వని కావ్యాశ్రయము. ఈభేదమును నిరూపించుటలోనే యానందవర్ధనుని మేధావిశేషము వ్యక్తపడుచున్నది. సహృదయుని హృదయము నాకర్షించి కవి యుద్దేశించిన యానందము నతనిచే ననుభవింపఁజేయు కావ్యగుణమునకే ధ్వని యని పేరు. ఇదియే కావ్యమునకు జీవము.

---



"ఉదయ సూర్యకిరణములు"

( జె. యస్. వుక్‌వాలా వారిగారి త్రివర్ణచిత్రము నుండి )

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రామాయణకథా సంవిధానము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

ఇక్ష్వాకురాజవంశమునకు సంబంధించిన యీకథ బహుపురాతన మైనది. సరయూ తీరమం దయోధ్యాపుర రాజగు దశరథునింటఁ బుట్టినది. ఈకథ వాల్మీకినాఁటికిఁ బెద్దలవల్లఁ గర్ణాకర్ణికగా వచ్చినదేకాని, అతనినాఁటిది కాదని బాలకాండ పంచమసర్గావతారికవల్లను, వాల్మీకి యుపయోగించిన యితిహాసాఖ్యానశబ్దములవల్లను విదితమగుచున్నది. ఇది యితిహాసము. అనఁగాఁ బురావృత్తము. అయిన నిది సత్యమా, కల్పితమా యని శంక కలుగవచ్చును. కాని, సుశీలుఁడును, శూరాగ్రేసరుఁడును నగు నొక క్షత్రియుని కృత్యములను జెల్పుచున్న యిందలి మూలకథ మానవాతీతము కామిఁజేసి సత్యమని భరతఖండమున కస్థిగతమైన విశ్వాసమునకు విరుద్ధముగా నిది కల్పితమనఁదగినంత ప్రబల హేతు వేమియుఁ గనరాదు. వాల్మీకియు,

"ఇక్ష్వాకూణా మిదం తేషాం
రాజ్ఞాం వంశే మహాత్మనామ్,
మహ దుత్పన్న మాఖ్యానం
రామాయణ మితి శ్రుతమ్."

అనుచు నిది సత్యమైన పురావృత్తమనెడి విశ్వాసమునే వెల్లడించెను. ఇదిగాక, ఇక్ష్వాకుల చరిత్రములు ఋగ్వేదాదులందును, ఆవంశమువారి రాజధానియగు నయోధ్య యుత్తరదేశమందును బ్రత్యక్షము లగుచుండ నవి కల్పితము లనఁజాలముగదా! అట్టియెడ రామచరితముమాత్రము కల్పితమనఁదగునా? ఇఁకనో, గ్రంథమందలి కొన్ని యద్భుత వర్ణన లట్టి సందేహమున కెడమిచ్చుచున్న వందు రేని, వానిని సమర్థించుకొందముగాక.

శుద్ధసత్త్వప్రసన్న మయ్యుఁ బ్రచండ శౌర్యభాసురమైన శ్రీరాముని చరిత మపూర్వ మసాధారణ మతిపావనము నై యాదినుండియుఁ బ్రాజ్ఞుల హృదయ మాకర్షించుచు వచ్చి వాల్మీకినాఁటికి మహామహిమాభిరామమైన పరమేశ్వరచరితమై ప్రత్యక్షమైనది. కావుననే, అట్టి మహానాయకుఁ డవతార పురుషుఁడు కానోపునని భావించి, శ్రీమహావిష్ణువే శ్రీరాముఁడై దశరథునింట నవతరించెనని వాల్మీకి కథారంభము గావించెను. అది సముచితమే. ఏదోయొక ఘనకార్యము గావించిన మహాపురుషు లెల్ల నీశ్వరాంశసంభూతులని కొనియాడఁబడియుండ, సకలసద్గుణపుంజము సచ్చిదానందమూర్తియు నైన శ్రీరాముఁడు పరమేశ్వరావతారమని భావింపఁబడుట కబ్బురమేమి?

అందుకే పరమేశ్వరానుగ్రహ పాత్రులైన ఋషుల జ్ఞాననేత్రములనుండి వేదములావిర్భవించినట్లే వేదవేద్యుఁడైన పరమపురుషుఁ డవతరించినంత వేదతుల్యమైన రామాయణము ప్రాచేతసమహర్షి నోట నావిర్భవించెనని తత్త్వజ్ఞులు తలంచిరి. ఇదియును నంతటి మహానుభావుఁడుగూడ మానవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సముచితమే. మహాప్రతిభకైన నందని యా మహావతారపురుషుల యామానుషాతీత కృత్యములేకదా, భగవంతుఁ డొకఁడున్నాఁ డని యనుమానప్రమాణముచే సాధించిన విషయమును బ్రత్యక్షప్రమాణముచే స్థిరపఱిచెడి యాస్తికుల కాధారములై యితిహాస పురాణాదిరూపమున నీజగమెల్ల నాక్రమించి నవి! లేదేని, ఆస్తికమత మేమై యుండునో! ఇట్లు తొలుఁదొల్తఁ గథానాయకుఁ డీశ్వరావతారమని నిరూపింపఁబడినపిదప నిఁకఁ గథలో భగవద్విలాసములుగా నహల్యాశాపవిమోచనాదులగు నద్భుతవిషయములు కొన్ని వర్ణింపఁబడినవన్న నసంగత మేమి! కావునఁ గథానాయకమహామహిమచిహ్నములైన కొన్ని యద్భుతవర్ణన లున్నను, ఇందలిమూలకథ కల్పితముగాక సత్యమేయని విశ్వసింప నగును. ఇఁక నాంతరవిషయ మించుక—

పర్యవసానమునుబట్టి దుష్టనిగ్రహము తోడి శిష్టపరిపాలనమే దీని ముఖ్యోద్దేశమని తెలియవచ్చును గాని, కథాసంవిధానదృష్టితోఁ బరిశీలించినచోఁ గైకేయీవరవిూఁకథకు బీజ మనకతప్పదు. దాని కంగములుగా నెన్నెని కారణము లుండుఁగాక, ఆవరమే లేనిచో రామకథ సీతాకల్యాణముతో సమాప్తము కావలసినదే. కైకేయీపాత్రవృత్తము చూచుట కిసుమంతమైనను, దాని గాఁటు మాత్రము కథ కంతకు నంటినది. హర్షవిషాదములు సమానముగాఁ జూచు శ్రీరాము స్వభావమునకు లోనుగాక తప్పక వనవాసము చేసినన్నాళ్లు నెడనెడ సవతితల్లిమూలముగా సంభవించిన మనసులోని నొవ్వు వెలిపుచ్చక మానలేదనుటయే యిందుకు నిదర్శనము.

సుఖ మున్నదో లేదో, దాని మాట యటుండనీ! లోకములోఁ గలహమునకుఁ గానీ, కష్టమునకుఁగానీ స్త్రీయే మూల మనెడి సిద్ధాంతము నెలకొల్పుటకోయన, రామమూర్ధాభిషేకమున మెల్లగాఁ గైకేయీ పాత్రము రంగముఁజొచ్చి దేవాసురయుద్ధమున జయకీర్తి గడించిన దశరథుని వంటి రాజాధిరాజునుగూడ నోరుమూయించినది; రాము నడవికిఁ బంపినది; కౌసల్య కడుపునఁ జిచ్చుపెట్టినది; వసిష్ఠ వామదేవాదిమహర్షుల నిశ్చేష్టులఁ గావించినది. ఇంతయేల? ఆదిని రాజును గ్రమింగినది. అంతమున రావణుని నిర్మూలము గావించినది. దీని మహిమ యింతేనా? బంగారమువంటి భరతుని బైరాగిని జేసినది. సీతారామలక్ష్మణులను మెల్లమెల్లగా జనస్థానమువఱకు గెంటుకొనిపోయి, యక్కడఁ జేయూఁత యిచ్చి పంచవటీఘట్టము లేవనెత్తి తాను మఱుఁగున నుండి చూచినది. అది కిష్కింధ మీఁదుగాఁ బైకెగఁ బ్రాఁకినది. అట్టియఘటనఘటనాచతురమైన యీవరముగాక కథాబీజము మఱేదగునో చూడుఁడు. కైకేయీ వరమే లేనిచో నయోధ్యాకాండమున కాహార మేది? అరణ్యకాండమున కవలంబన మెక్కడిది? కిష్కింధాకాండమునకుఁ గీర్తి యెట్లు? సుందరకాండముసాగ సెక్కడ? యుద్ధకాండపద్ధతి యేమి? ఆహా! ఆద్యమహాకవిచతురాస్యుని కథాసంవిధానవైచిత్రి!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కవిత్వము 3

పాటిబండ మాధవశర్మ

విశ్వసృష్టికి కావ్యసృష్టికి కొంత భేదము గలదని మెచ్చిగితిమి. సృష్టిలో నిరర్థకముగా దోచు సర్వము కావ్యమునందు సార్థకము చేయబడుచున్న దనియు తేలినది. ఇంతియకాక లోకమునకు కావ్యమునకు మఱియు వాసి కలదు.

లోకమున భూతము, వర్తమానము, భావి యని కాలము మూడవస్థలలో క్రమముగ నడచుచున్నది. భావిని భూతమురాదు. భూతమున వర్తమానము రాదు. కావ్యమునం దిట్లు కాదు. వర్తమాననిర్దేశముతో నారంభించి కావ్యము భూతముతో ముగియవచ్చును.

రావణజననాదికము రామాయణమునం దుత్తరకాండమునం దిట్లే చెప్పబడినది. రావణజననము, తద్దిగ్విజయయాత్రలు సర్వమును రామాదిజననమునకు పూర్వమే జరిగినవి. కాని కావ్యమునం దవి తత్పరమున చెప్పబడినవి. లోకములోని యీకాలవ్యవస్థను కవి తారుమారుచేయుట ప్రయోజనాపేక్షతోడనే. ఉత్తరరామాయణమువల్ల రావణుడు మహాపురుషు డని స్పష్టమగుచున్నది. అతని మహాపురుషలక్షణములు పఠితహృదయమున కెక్కినతరువాత సీతాపహరణ మొక నెరసుగామాత్రమే పొడకట్టును. రామరావణయుద్ధమునకు, రావణనాశనమునకు మూలపీఠమగు సీతాపహరణమునకు ప్రాధాన్యము పోయినచో రామాయణకథాబంధమునందు నిబిడత్వము కొరవడును. రావణనాశనమునకు కవి తగిన యుపపత్తి చూపలేదు. కనుకనే పూర్వకాండలో సీతాపహరణము క్షంతవ్య మనిపించు నుత్తమలక్షణము లేవియు రావణున కారోపింపబడలేదు. పఠితకు రావణుడు హంతవ్యుడనియే బుద్ధి. కాని రావణుడు లోకుల దృష్టిలో నిట్లు నీచుడైపోవుట కవికి సమ్మతము కాదు. ఏలన అతడు స్వతః మహాపురుషుడు. ఈలక్షణమును కవి దాపగోరలేదు. అందుకే ఉత్తరకాండ యవసరమైనది.

ఈవిధముగా లోకమునకు, కావ్యమునకు కాలవ్యవస్థలో గొంతభేదము గలదు. తెలుగుకవులలో పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ మిట్టిది. లోకమునం దెన్ని చరిత్రలు జరుగుచుండుటలేదు? పఠితకు వానియెడ ఉత్కంఠ లేదు. కాని కావ్యమునందలి ఈకథాకౌటిల్యము పఠిత కుత్కంఠ పెంచును.

ఇట్టి కాలవ్యవస్థాభేదమ కాక లోకవృత్తమునకు కావ్యవృత్తమునకు మఱియొక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విధమగు భేదము గలదు. ఇది పాత్రసంబంధి. కర్ణుడు భారతమునం దొకవిధముగా చిత్రింప బడినాడు. భారతమునం దర్జునునకు ప్రతి వీరుడు కర్ణుడు. ప్రతియోగముచేత నాయక గుణములను ప్రకాశింపజేయుటకై ప్రతినాయ కుని కళంకమునకు తళుకు పూయుట కవి లోకమర్యాద. యథార్థముగ భారతగాథ లోకమున ప్రవర్తితమైనప్పుడు కర్ణుడు మహా పురుషుడే కావలయును. భారతమునం దాతని దుర్గుణములకే ప్రాధాన్యము. లోకమునందు ప్రతివ్యక్తియొక్క వృత్తమును ప్రతి యితర వ్యక్తియొక్క వృత్తమునకు తగుల్వడి యుండును. కనుక ఒక వ్యక్తియొక్క చర్య లకు ఇదమిత్థమని కారణము నిరూపింప జాలము. కావ్యమునందు వ్యక్తులసంఖ్య పరి మిత మగుచుండును గనుక ఒకవ్యక్తియొక్క చర్యలకు మూలకారణములు కొంతవఱకు నిరూపించవచ్చును.

కర్ణుడే నాయకుడైన యొక కావ్యము నందు అతని యనుదాత్తగుణములు తిర స్కృతములై యుదాత్తగుణములే భాసిల్ల గలవు. ఆకావ్యమునందు వర్తించు ఇతర పాత్రల వృత్తములును తదనుగుణముగా నుండును. అనగా మంచిచెడ్డలు ప్రతియోగ రూఢములేకాని వ్యక్తికి కేవల నిసర్గములు గావని యొకవిధముగా చెప్పవచ్చును.

భారతము అతివిస్తృతమైన ఇతి వృత్తము. అందు కర్ణుని లోపములు వివిధ ములు. భారతమునుండి పృథక్కరించి కర్ణుని చరిత్ర వ్రాయుచో నాతనిలోపములు చాల వఱకు మఱుగుపడి మహత్త్వమాత్రమే ప్రకా శించును. కర్ణుని చరిత్రలో ఇది యొక చిత్రము. చిన్నతనమునందే నేను కర్ణచరిత్ర నాటకము చేసితిని. అందు కర్ణునకు విశ్వరూప సందర్శనము చేయించితిని. కర్ణుడు దాని కర్హు డని నాకు తోచినది. నానాటకము చదివి నప్పుడు మీకును తోచగలదు.

"ఆ, శారతుడా సుయోధను వ
శంబున కర్ణుని ద్రుంచు శ్రీమనో
హారు నధర్మరూపక మ
హాత్తరధర్మము నాశ్రయించెదర్."

భారతములోని కర్ణవృత్తమునకు పరి ష్కృతియగు నానాటకమునందు ఇది బీజము. లోకవృత్తమునందు ధర్మలోపము తటస్థించు చున్నప్పుడు కవి దానిని చేపట్టి యీ ధర్మ సమన్వయము చేయును. లోకమున కిది విరు ద్ధము కావచ్చును. కాని యిదియే సత్యము. కవి సత్యవాదికాని కేవలము యథార్థవాది కాడు.

Poetry aims at the reality of an internal probability" అని Aristotle పండితుడు.

ఇతరపాత్రల ప్రభావమువల్ల కర్ణుని చరిత్ర యొకవిధముగా పరిణమించినను అసలు దానిపరిణామము భారతమున సత్యా సమ్మతముగా నిరూపింపబడలేదు. కవి దానిని చేపట్టి సత్యసమ్మతముగ నిరూపించును. నా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాటకమునందు నిరూపింపబడిన కర్తవ్య త్తిపరి ణామమునకు అనుకూలములగు శక్తులు అంత ర్వ్యాపినిగా భారతమునందే కలవు. కాని ఆ శక్తులకు తగిన అవకాశములు భారతమున లేవని చెప్పవలయును.

జన్మాంతరక్రమమున నొకవ్యక్తి పరిణ మించునని కర్మయోగవాదము. ఈసత్యము కావ్యమునందు నిర్వహింపబడును. ఈజన్మ మునందలి యొక వ్యక్తి యితివృత్తమును చేపట్టి కవి దాని యుత్తరజన్మమును కావ్య మున నిరూపించును.

"Poetic truth is fidelity to what may be, not to what is" అని Hudson మహాశయుడు.

ఇట్లు కవిచేయు సృష్టి లోకమునకు ప్రతి బింబముగాను, అనుసరణముగాను, లేదా ప్రతికూలముగాను ఉండవచ్చును.

"Imitation is the test of poetry" అని Aristotle పండితుడు. ఇచ్చట Imitation అనగా అనుకరణము అని చెప్పరాదు. గ్రీకు భాషలో Mimesis అను పదమును అరిస్టా టిలు వాడినాడు. దాని కాంగ్లానువాదము Imitation, అనగా అనుకరణము అని స్పష్టము. కాని గ్రీకులో Mimes అనగా 'నటుడు' అని యర్థము. నటుడు చేయు పని అభినయము. Mimesis అనగా అభినయ మని చెప్పుకొందము. "అవస్థానుకృతి ర్నా ట్యమ్" అని భరతమహాముని చెప్పినను నాట్యము కేవల మనుకరణ మనరాదు. అభి నయము లోకము ననుసరించి యుండ వచ్చును. లేదా దానికి మెఱుగుపెట్టు సృష్టి కావచ్చును. పురాణకాలమునాటి రామా దుల పాత్రల ప్రదర్శించు నటుడు లోకము ననుసరించుచున్నాడని చెప్పజాలముగదా! భావనాబలముచే నటుడు సృష్టించినవే రామాదుల పాత్రలు. కనుక Mimesis అన గా అనుకరణమని Aristotle భావమని చెప్ప జాలము. కవిత్వము Creative, అనగా సృజనశక్తి గల కళ యని ప్రసిద్ధము. ఈ సృష్టి ప్రకృతి ననుసరించికావచ్చును; లేదా ప్రకృతిపరమార్థమును ప్రదర్శించు స్వతంత్ర సృష్టి కావచ్చును.

"We are God's Poem" అని యొక నుడుగు. అనగా మనము భగవంతుని కవి త్వము. సృష్టి భగవంతుని కావ్యమని దీని భావము. కనుక Poet అనుపదము సైతము సృష్టినే సూచించుచున్నది. ఆర్యులుసైతము 'కవిబ్రహ్మ' యనుటలో కవి సృష్టికర్త యనియే కొనియాడిరి. ఈకవిసృష్టి స్వతంత్ర మేకాని అనుకరణము కాదు.

"No one merits the name of a creator except God and the Poet."

—Shelly.

అనగా భగవంతు డెట్టి సృష్టికర్తయో కవియు నట్టి సృష్టికర్తయే. Plato మహా శయుడు భగవంతుని సృష్టికర్తృత్వమును, తన్మూలమున కవిసృష్టికర్తృత్వమును న్యూన పఱచినాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"Nature is the imperfect expression of the idea." —Plato.

భగవంతుని సంకల్పమునకు అసమగ్రమగు రూపమే సృష్టి. ఈసృష్టికి అసమగ్రమగు అనుకరణము కావ్యము. కాని ప్లేటో కవులకు పెద్దవిరోధి. కవిత్వమునకు శత్రువు. కాని తాను స్వయము మహాకవి యగుట గుర్తించుకొనలేదు. యథార్థముగా Plato మంచికవి.

భగవంతుని సృష్టివంటిదే కవిసృష్టియు.

"The poet creates another Nature and other fortunes as if he were another God' అని Scaliger పండితుడు. కావ్యసృష్టి జగత్సృష్టికి భిన్నము, పోషకమును అగుచున్నది.

---

బిరుదు లార్జించుట కొక మంచిమార్గము




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భామినీవిలాసము

(అనువాదకులు) వైద్యరాజ, డా. దం. సు. అవధాని, యల్. సి. పి. యస్

## ౧. అన్యోక్త్యుల్లాసము

మాధుర్య పరమసీమా సారస్వతజలధిమథనసంభూతా
పిబతా మనల్పసుఖదా వసుధాయాం మమ సుధాకవితా.

పారంబు పరము రుచులకు - సారస్వతజలధిమథనసంభూతంబుల్
ధారుణి ద్రావినవారి క-పారముదం బొసఁగు నాకవన మమృతంబై.

దిగంతే శ్రూయంతే మదమలినగండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలాః ఖలు మృగాః,
ఇదానీం లోకేఽస్మి న్ననుపమశిఖానాం పున రయం
నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మిన్ మృగపతిః.

మదమాలిన్యకపోల శోభితములౌ మాతంగముల్ దిక్కులం
దుఁ దుదిన్ గ్రాలు నటంచు విందుము కరేణుల్ జాలికిన్ జాలు సా
మ్యదశన్ జెందవు లేళ్లికెందు నిలఁ బ్రఖ్యాతిన్ మృగేంద్రుండు కూ
ర్పఁదగున్ దీక్ష్ణనఖాళినిస్తుల మహాత్పాండిత్య సంపత్తికిన్.

పురా సరసి మానసే వికచసారసాలిస్ఖలత్
పరాగసురభీకృతే సపది యస్య యాతం వయః,
సపల్వలజలేఽధునా మిళదనేకభేకాకులే
మరాళకులనాయకః కథయ రే కథం వర్తతామ్.

మును పామానససారసాకరమునన్ ఫుల్లారవిందంబులం
దునఁ బుప్పొళ్లను గమ్మనౌ జలములందున్ బ్రాయ మెవ్వానికిన్
జనె నాయంచలఱేఁడు నేఁ డెటుల నుండన్ వచ్చు నీపల్వలం
బున నీటన్ బలుకప్ప లొక్కటను గుంపుల్ గట్టి ఘోషింపుచోన్.

అయి దళదరవిందస్యందమానం మరందం
తవ కిమపి లిహంతో మంజు గుంజంతు భృంగాః,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిశిదిశి నిరపేక్షః స్తావకీనం వివృణ్వ౯
పరిమళ మయ మన్యో బాంధవో గంధవాహః.

నీవికసించు రేకులను నిఃస్రుతమౌనటువంటి తేనెల౯
ద్రావిన భృంగరాజి మధురంబుగఁ బల్కు టదేమి వింత, యా",
నీవలపుల్ వహించి కడు నిఃస్పృహత౯ దెసలెల్లఁ జల్లు నా
కేవల మిత్రుఁడౌ పవను కృత్య మనన్యము పుండరీకమా.

తావ త్కోకిలవిరసా౯ యాపయ దివసా౯ వనాంతరే నివస౯,
యావ న్మిళదళిమాలః కోఽపి రసాల స్సముల్లసతి.

చాలుగట్టిన నీలభృంగాళిలీలఁ - జాలగాఁ దాల్చు నొక్క రసాల మలరు
దనుకఁ గోకిల మావనాంతరమునందు - విరసమైనట్టి దివసముల్ జరుపు మెట్లొ.

అయి మలయజమహిమాయం కస్య గిరా మస్తు విషయస్తే,
ఉద్గిరతో య ద్గరలం ఫణినః పుష్ణాసి పరిమలోద్గారైః.

మలయజమా నీమహిమము - నలవియె పొగడంగ నెవనికైనను, విసము౯
వెళ్రగక్కెడు ఫణుల౯ బరిమలపవనోద్గారములను మనిచెద వౌరా.

పత్రఫలపుష్పలక్ష్మ్యా కదా ప్యదృష్టం వృతంచ ఖలు శూకైః,
ఉపసర్పేమ భవంతం బర్బుర వద కస్య లోభేన.

తుమ్మా, నీకడ నేమి ఫ-లమ్మా పుష్పమ్మ యాకులా కంటకముల్
గ్రమ్మిన నీకడ కేమే మిమ్మంచును జేరువారిమే పేరాస౯.

ఆరామాధిపతి ర్వివేకవికలో నూనం రసా నీరసా
వాత్యాభిః పరుషీకృతా దశ దిశ శ్చండాతపో దుస్సహః,
ఏవం ధన్వని చంపకస్య సకలే సంహారహేతావపి
త్వాం సించ న్నమృతేన తోయద కుతో ప్యావిష్కృతో వేధసా.

సుడిగాలి౯ బిరుసెక్కె దిక్కులు పది౯, శుష్కించె లోకంబు, ప్రా
జ్ఞుఁడు గాఁడు౯ వనపాలకుం డినుఁడన౯ దుర్వారుఁడై మండు, నె
ద్దడినేల౯ సకలంబుఁ జంపుటకునై తార్కొన్న సంపంగి కె
క్కడ దెచ్చె౯ విధి నిన్నుఁ దోయదమ, చిల్కు౯ బై సుధాసారము౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న యత్ర స్థేమానం దధు రతిభయభ్రాంతనయనాః
గలద్దానోద్రేకభ్రమదళికదంబాః కరటినః,
లుఠన్ముక్తాభారే భవతి పరలోకం గతవతో
హరే రద్య ద్వారే శివశివ శివానాం కలకలః.

భ్రమరంబుల్ గుములై కపోలములఁ బర్వన్ దానదర్పోద్ధనా
గములున్ గన్నులు భీతిభ్రాంతమయి చక్కన్ నిల్వలే వెందు, ము
త్యములున్ బ్రోవయి దొర్లు నెందునట దేహాంతంబు ప్రాప్తింప సిం
గము తద్ద్వారము నక్కటా యిటుల నక్కల్ గూయఁగా నామెఁగా.

దవదహన జటాలజ్వాలజాలాహతానాం
పరిగళితలతానాం మ్లాయతాం భూరుహాణామ్,
అయి జలధర, శైలశ్రేణిశృంగేషు తోయం
వితరసి బహు కోఽయం శ్రీమద స్తావకీనః.

క్రమ్ముచు మంట నల్దెసలు గాల్చు దవాగ్ని యరణ్యమందు వృ
క్షమ్ములఁ దీగెలన్ బాదలఁ జాలగ వాడ్చుచునుండ శైలశృం
గమ్ములమీఁద నెక్కి వడిగా నటనే బహువారిధారలన్
జిమ్మెదు తోయదంబ యిటు శ్రీమద మేమది నీకుఁ జెప్పుమా.

శ్రుణ్వన్ పురః పరుషగర్జిత మస్య హంత
రే పాంథ విహ్వలమనా నమనాగపి స్యాః,
విశ్వార్తి వారణసమర్పిత జీవనోఽయం
నాకర్ణితః కిముసఖే భవ తాంబువాహః.

పరుషముగాఁగ గర్జనము పాంథ వినంబడ మ్రోల నేల కా
తరత యొకించుకేనిగొనఁ దాపము లోకులకెల్లఁ బాపను
స్థిరమగు దీక్షఁబూని తనజీవన మప్పని కొప్పగించునే
ర్పరి యగు వారివాహుని ప్రభావము మున్వినలేదె మిత్రుఁడా.

పరోపసర్పణానంత చింతానలశిఖాశతైః,
అచుంబితాంతఃకరణాః సాధు జీవంతి పాదపాః.

పరుల నుపసర్పణముసేయు పని ననంత-చింతలను ఘోరదావాగ్ని శిఖలలోన
నెందు నించుక కందని డెందములను-బాదపంబులు చల్లగాఁ బ్రదుకుఁ జూవె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౨. శృంగారోల్లాసము

నమనాగపి రాహురోషశంకా నకలంకానుగమో నపాండుభావః,
ఉపచీయతఏవ కాపి శోభా పరితో భామిని తే ముఖస్య నిత్యమ్.

రాహురోషశంక రవ్వంతయును లేమి - లేమిపాండిమంబు లేమిమచ్చ
నిత్య హూర భామినీ నీదు మోమున - వింతకాంతి యొందు వృద్ధిఁ జెందు.

నితరాం పరుషా సరోజమాలా నమృణాలాని విచారపేశలాని,
యది కోమలతా తవాంగకానా మథ కానామ కథాపి పల్లవానామ్.

కమలమాలయు మిక్కిలి కఠినహూను - దలఁపఁగారాదుగా బిసతంతువులను,
గోమలత నీదు నంగముల్ కొమరుమిగుల-చిగురుటాకుల ముచ్చట చెప్పనేల?

ముగ్ధైవ మంతుం పరికల్ప్య గంతుః మ్మాపైవ రోషా దుపజల్పతో మే,
ఉదశ్రు చంచన్నయనా నతాంగీ గిరం నకాం కా మురరీకరోతి.

లేనితప్పను బైమోపిలేని కోప-మూని, పెక్కాడిపోవంగనున్న నన్ను [చె.
నానమితగాత్ర యకట పూర్ణాశ్రునేత్ర-యగుచు నెన్నెన్నొ చెప్పుచు ననునయిం

ఆళీషు కేళీరభసేన బాలా ముహుర్ముహు ర్మా ముపలాపయంతీ,
ఆరా దుపాకర్ణ్య గిరం మదీయాం సౌదామినీయాం సుషమా మయాసీత్.

బాల సయ్యాటచెలుల సంబరమునుండి - నాదుముచ్చటలను బ్రొద్దునడుపుచుండి
దవుల నామాట చెవినింత దవిలినంత - మెఱుపుతీగెవిధంబున మెఱసెనదిర.

గురుభిః పరివేల్లితాపి గండస్థలకండూయనచారుకైతవేన,
దరదర్శితహేమబాహునాళా మయి బాలా నయనాంచలం చకార.

గురుజనులమధ్యనుండియుఁ గువలయాక్షి-గండకండూయనము సేయుకరణి హేమ
బాహునాళం బొకించుకఁ బైకి దోఁప - చారువైఖరి నను గనుసైగఁ జేసె.

భుజపంజరే గృహీతా నవపరిణీతవరేణ రహసి వధూః,
తత్కాలజాలపతితా బాలకురంగీవ వేపతే నితరామ్.

అదిర పెండ్లింటఁ గేళికాసదనమందు - వరభుజాంతర పంజరాంతరసులగ్న
బాల తత్కాలమున వ్యాధజాలపతిత - బాలహరిణంబుపోలికఁ జాల వెదుకు.

యౌవనోద్గమనితాంతశంకితాః శీలశౌర్యబలకాంతిలోభితాః,
సంకుచంతి వికసంతి రాఘవే జానకీనయననీరజశ్రియః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జవ్వనపు గరువంబున జంకిజంకి - కాంతిబలశీలశౌర్యముల్ గాంక్షఁజేసి
సంకుచించును వికసించు జనకపుత్రి - నయనసారసములు రఘునాథునందు.

విధాయ సా మద్వదనానుకూలం కపోలమూలం హృదయే శయానా,
తన్వీ తదానీ మతులాం బలారేః సామ్రాజ్యలక్ష్మీ మధరీచకార.

తనదు కపోలమూలమును దన్వి మదీయముఖానుకూల హృ
న్నునుపునఁ జెట్టి నాహృదయమందు ముదంబునఁ బండుకున్న హో
యినిఁ దలపోయ నామది సురేంద్రుని భోగములెల్ల దాని కెం
దును దులఁదూగఁజాలవని నొక్కి వచించిన నిక్కమే యగున్.

అకరుణమృషాసింధో విముంచ మమాంచలం
తవ పరిచితః స్నేహ స్సమ్య జ్మయే త్యభిధాయినీమ్,
అవిరళగళద్బాష్పాం తన్వీం నిరస్తవిభూషణాం
క ఇహ భవతీం భద్రే నిద్రే వినా వినివేదయేత్.

నీనెయ్యం బూకవింతే, కల్లలకు మున్నే రాదు కష్టాత్మ పో
నీనాచెంగును వీడుమా యనుచుఁగన్నీ రాఁగకే కార నె
మ్మేనన్ భూషలు జారఁ దన్వియగు నమ్మానాక్షి సాక్షాత్తుగా
నోనిద్రా గుణభద్ర యెవ్వఁ డిటు నా కొప్పించు నిన్నున్ వినా.

హృదయే కృతశైవలానుషంగీ ముహు రంగాని యత స్తతః క్షిపంతీ,
ప్రియనామపరే ముఖే సఖీనా మతిదీనా మియ మాదధాతి దృష్టిమ్.

శైవలావృత హృచువక్షుంబుదనర - సంగములు బోరిగట్టుకొం చట్టునిట్టు
తనదు ప్రియునామము జపించు, తనదుచెలుల-యాననముదీనదీనయై చాన చూచు.

నయనాంచలావమర్శం నయా కదాచి త్పురా న సేహే,
ఆలింగితాపి జోషం తస్థౌ సాగంతుకేన దయితేన.

కన్నుసైగ సోకఁగా సైఁపనోపదు-మున్న దెన్నఁ డట్టికన్నె నేఁటి
కూరి కేఁగఁబోవుచున్నట్టి దయితుని-కౌఁగిలింతలోనె కఱగిపోయె.

వదనారవిందసౌరభలోభా దిందీవరేషు నిపతత్సు
మ య్యధరార్థిని సుదృశో దృశో జయం త్యతిరుషా పరుషాః.

వదధనసారసౌరభవాంఛఁజేసి-తుమ్మెదల గుంపు పైఁబడి దొమ్మిచేయ
సర మేనర్థిఁ నగోర మృగాక్షికనులు-గెంపు కపుదాల్చియును జాల సొంపునింపు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నారన్న

కుందుర్తి నరసింహారావు

[పాత్రలు

౧. సుబ్బావధాని
౨. కృష్ణరావు—అతనికొడుకు
౩. శేషగిరి—కృష్ణరావుమిత్రుడు
౪. రాఘవాచార్యులు
౫. సుభద్ర—రాఘవాచార్యులుగారి కూతురు
౬. సుబ్బడు
౭. నారన్న—సుబ్బనికొడుకు
౮. జానకమ్మ—సుబ్బావధానిభార్య
౯. యాయవారపు బ్రాహ్మడు
ఇద్దరురౌడీలు]

## ఒకటవ రంగము

[సుబ్బావధానియిల్లు. అరుగుమీద ఒకమూలగా పడకకుర్చీలో కృష్ణరావు కూర్చొనివుంటాడు. అరుగు అంచున వాకిలికి చేరువగా పీటమీద కూర్చొని సుబ్బావధాని విస్తళ్లు కుడుతున్నాడు.]

సుబ్బా—"వేదాహ మేతం పురుషం మహాన్తమ్, ఆదిత్యవర్ణం తమసస్తు పారే, సర్వాణి రూపాణి..." వీటిదుంపతెగ, ఈపక్కపిల్లలు పుటమారుస్తున్నవి. ఏమిరా, కుంఖా, వీటి నన్నిటినీ పెంచకపోతేనూ? "...రూపాణి విచిత్య ధీరః, నామాని కృత్వాభివదన్ ......"ఇదిగో, ఏమేవ్! ఆయీనకట్టబద్దలు రెండిట్లా పడవెయ్ "......వదన్ యదాస్తే, ధాతా......"

(ఒకయాయవారపు బ్రాహ్మడు వస్తాడు.)

బ్రాహ్మ—శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః. ఇవ్వాళా, దశమీసోమవారమండీ, రెండుఝాములకు వర్జం......

సుబ్బా—ఇదిగో, యేమేవ్!

(లోపల) ఏమండీ? మడితోవున్నాను ...... చేయి పూరుకోలేదు, పోండయ్యా యెవరోను.

సుబ్బా—ఛా, నోరుమూసుకో—ఉండండి స్వామీ! (లోపలికి పోయి సోలతో బియ్యము తెచ్చి వేస్తాడు.)

బ్రాహ్మ—కృష్ణార్పణ మస్తు. (వెళ్లిపోతాడు.)

కృష్ణ—ఇదేమిటి, నాన్నా! మొన్న మనింట్లో శ్రాద్ధానికిగూడా యీనే వచ్చాడే?

సుబ్బా—అవును. అది వృత్తి. బ్రాహ్మలకు భిక్షాపాత్రే వేదవిహితమైన వృత్తి.

కృ—వేదవిహితం! ఇండ్లల్లో జరిగే కర్మల కన్నిటికీ యీనే వెళ్తాడు, సంభావనాలకు వెళ్తాడు, శవవాహనానికి వెళ్తాడు, శ్రాద్ధాలకు వెళ్తాడు. అయితే యెంతసంపాదించివుండాలి! చేతికొచ్చిందల్లా తీసి కెళుతూ వుంటాడే—బియ్యం, ఉప్పు, ఆకులు, వక్కలు, విస్తళ్లు, అప్పుడప్పుడు చెంబులు—ఇదంతా యేమవుతుంది? ఇంకా బిచ్చమా యీయనకు? ఇటు వంటివాళ్లేనా బిచ్చానికి రావాలిసింది?

సుబ్బా—ఛా! వెధవా—ఊరుకో: నీకేం తెలుసనీ?

కృష్ణ—అవును నాన్నా, నాకేంతెలేదు 'వేద విహితం'. కాని, యిటువంటివాళ్లు బిచ్చానికి రావటం అనవసరమనిమాత్రం క్షుణ్ణంగా తెలుసు.

సుబ్బా—వెధవ మాలమాదిగకుంకలకు పెట్టే కంటే ప్రొద్దున్నే యిటువంటి పుణ్యబ్రాహ్మలకు పెట్టా మంటే స్వర్గానికి పోతాం. నీ కెందుకురా దుర్బుద్ధి? నీ కామాత్రంశక్తి లేదుగా, ముండబాగా కూచున్నావు బోడిచదువులు చదివి!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ—ఎన్నాళ్లుచదివినా, మా కీవృత్తిమాత్రం నేర్పలా వాళ్లు. వేదాలన్నా నేర్చుకోలా యీవృత్తి రావడానికి! నా కిందుకే ఆశ్చర్యం వేస్తుంది. ఈ బ్రాహ్మడికి పాతికేకరాల మాణిక్యంలాంటి మాన్య మేమిటే, యింట్లో పిల్లల కందరికే యెగాదిగా గంపెడు గంపెడుసామ్మేమిటే, ఈయ నిట్లా అడుక్కుతింటూ కుంటిగ్రుడ్డివాళ్ల నోళ్లలో దుమ్ముగొట్టడ మేమిటే ?— అయితే, నాన్నా ! కడుపుమాడుతున్నవా డెవడన్నా వస్తే కట్టుపట్టుకు లేస్తావే, మఱి యీనగార్ని 'స్వామీ' అని గౌరవించి...

సుబ్బా—ను వ్వింక అరవ్వాక!—చేతావాతా గాని వెధవ్వి...

(నారన్న వస్తాడు. పన్నెండేళ్లు. ప్రక్కయెము కలు కనబడుతుంటవి. నడుము కొక చీలికలైన పాత గుడ్డమాత్రం వుంటుంది. చేతిలో ఒకమూకుడు.)

నారన్న—(కుడికాలు మెల్లగా నేలమీద తడుతూ)

నా ముద్దూ కిష్టయ్యా, నాసిన్నీ కిష్టయ్యా,
భామాలతో నీవు,పారిపోవాకయ్యా, నా.....

(కృష్ణరావు వాడి పాట చెవులు రిక్కబెట్టుకొని వింటూవుంటాడు. సుబ్బావధాని వాడివంక గ్రుడ్లుఱిమి చూస్తాడు.)

నార—(కొంచెము హీనస్వరంతో)

యెన్నాముద్దులు మింగి, యెక్కిరించావంట,
గోపెమ్మ నిను జూసి, కొట్టవస్తుండాది...
నాతండ్రీకిష్టయ్యా, నా సిన్నీకిష్టయ్యా......
(లయానుసారంగాశరీరమంతా వూపుతుంటాడు.)

సుబ్బా—పోరా,పో—ఎటూ గానివేళ—మళ్లీ వొచ్చావూ ? గాడిదా, నాలుసరోజులకింద నువు రాలా?

నార—లేదండీ సామీ, మాఅయ్యకు తేలుసుట్టి యేడుస్తావుండాడు.

కృష్ణ—(జంకుతూ) అయితే, నాన్నా! ఆబ్రాహ్మడు ప్రతిరోజూ వస్తుంటాడు, ప్రతిరోజూ పెడుతుంటావు......

సుబ్బా—ఓరినీ— బ్రాహ్మడు చదువుకున్నవాడూ, శాస్త్రుర్లవారూ,— ఆయన్నంటే పురుగులుబడి పోతావు...నాకు వొళ్లుమండుతుంది— నువ్వుగూడా యిట్లాగే అడుక్కుతింటూపోతావు.

కృష్ణ—అంతఅదృష్టమా ?

సుబ్బా—(చివాలునలేచి, కొడుకుమీద మూకుతూ) పో! నువుగూడా వాడివెంబడి పో—ఆమాదిగ వాళ్లల్లో కలు ! వాడి బొచ్చె మోసుకు బతుకు! పో— నాకు బరువన్నా వదులుతుంది; అసలే మాలచదువు చదివావు—

కృష్ణ--ఎవరు చదువుతా నన్నారు ? నేను స్కూలుఫైనల్ లో చాలిస్తానంటే, చదువూ చదువూ అని నువ్వే మెడబట్టి గెంటావు—ఊపిరితీశావు.

సుబ్బా—ముండవై కూచున్నావుగా— ఇంత చదివించినందుకు రెండువేలన్నా పళ్లెంలో పోస్తారుగా అని నేనాశపడితే, దౌర్భాగ్యుడా, నిష్టదరిద్రుడా— నాకు వొళ్లుమండుతుంది—' నేను కట్నము తీసుకోను, నేను పెళ్లే చేసుకోను '—నీపిండాకూడు చేసుకోవు!—అని నిట్టనీలుగుతావూ ? చావు, చండాలుడా ! నాకడుపున చెడబుట్టావు నీవు.

నార—(కొంచెం బిగ్గరగా)

రాకాసు లెన్నెన్నో, నీకేసి వొస్తాయి,
యీపూది పెట్టేస్తా, యేడవకురా తండ్రి—

సుబ్బా—(పటపట పండ్లుగొఱుకుతూ,)ఏడిశావు లేవోయ్ ! అవతలికి చావు !

కృష్ణ—వాడివెంట పోవటం నిజంగా అదృష్టమే! వాడి భక్తిపారవశ్యం చూడు ! వాడు దేవుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుబ్బా—నువ్వొక దయ్యానివి—పొమ్మంటే పోవేమిరా? నీకేమన్నా తన్నులు తగలాలా? మాదిగ ముండాకొడకా!

(లోపల) ఉండండి, ఉండండి.

(మడిగట్టుకొనివున్న జానకమ్మ గడపవద్దకు వస్తుంది.)

జాన—ఇదుగో, అబ్బాయి, అబ్బాయి, అరేయ్! ఆగెన్నెలో చద్దెన్నం వుందిగాని, తీసుకొచ్చి వెయ్యరా వూరికే పారెయటం యెందుకూ—

కృష్ణ—(మహాచదువుతున్నట్టు నటిస్తూ) పోవే, నువ్వేసుకోద్దూ, నేను చదువుకోవాలి.

సుబ్బా—ఆయ నిప్పుడు చెప్పినమాట వినే ట్టున్నాడా?

జాన—నాయన, నాయన—నేను మడిగట్టు కున్నారా, తాకగూడదు—ఉండరా, వేస్తాము—ఇదుగో, ఒకసారి లేచిరా లేవూ?

నార—వెయ్యండి, అమ్మగోరూ—మా అయ్య అలవటిస్తున్నాడు.

కృష్ణ—నువ్వు తాకనేగూడనిది అత నెట్లా తింటాడేమిటి? రాత్రిటి అన్నమా?

సుబ్బా—కాదు, ఇప్పుడిప్పుడు వండి వడ్డించు!

కృష్ణ—దానిమీద మాతకూడా లేదు.

జాన—అబ్బా, పొద్దునే తీశారా పళ్లెం, చెంబులుతో మిటప్పుడు—ఏదోఒకటి పడేద్దూ మాధాకవశానికి—కుక్కలకు పారేస్తే యేమొస్తుంది.

కృష్ణ—వీడికేస్తే యేమొస్తుంది?—పాపం! మహాపాతకం! పాచిపోయిన ఆపాడుకూడు విషం! ఎలుకలు ఎంగిలిచేసివుంటయ్. అది వాళ్లకు పెడితే వాళ్లు తిని చస్తారు! మానవహత్యచేసిన మహాపాతకం నీకు చుట్టుకుంటుంది; నువ్వు రోజూ తులిశమ్మకు చేసే పూజాఫలమంతా బూడిదై పోతుంది; నువు నరకంలో పడతావు—కాసినిబియ్యం వెయ్యరాదూ, పొద్దున బ్రాహ్మడికిలాగానూ?

సుబ్బా—తెలివి, తెలివి, తెలివి! అఖండమైన తెలివి వెలిగిపోతున్నది అయ్యవారికి!—(చివాలున లేచి, నారన్నతో) గాడిదకొడకా! పోతావా, పోవా? చిందులుదొక్కుతున్నావు వొళ్లుబలిసి! డొక్క బద్దలు చేస్తాను (అని కఱ్ఱకోసం వెతుకుతున్నాడు.)

నార—(భయపడుతూ,) అమ్మగారు, అమ్మగారు—ఏదోవొకటి వెయ్యండి, పోతాను—దిక్కులేని పచ్చినండీ అమ్మా—

కృష్ణ—అమ్మా! ఒక సోలెడు బియ్యము తెచ్చి వెయ్యనా?

సుబ్బా—నువ్వు సంపాయించినప్పుడు వెయ్యి. నాయింటో నువ్వు దుడుకు పెట్టడానికి వీలులేదు.

కృష్ణ—నే నాపాడుకూడు వెయ్యనే—వాడ్ని పొమ్మను.

జాన—మటీ, రోజుకు రోజుకు—బాగానే వుంది, తండ్రీకొడుకూను—అయిందానికీ కానిదానికీ (ప్రక్కగా గోడవద్దకు పోయి,) అమ్మాయి, సుభద్రా, యిట్లా రామ్మా ఒకసారి.

(అవతల) ఓ, వచ్చె, వచ్చె— తలుపువేసి వస్తున్నాను.

(సుభద్ర వస్తుంది. తలవెంట్రుకలు విరబోసి వున్నవి. చేతిలో ఆంధ్రపత్రిక వున్నది. నారన్నను తొలగమనకుండానే ప్రక్కగా తొలిగివస్తుంది.)

సుభ—ఏమిటండీ, యేదో పెట్టారు పెటకం!

సుబ్బా—(లేచి నుంచొని, గందరగోళం చేస్తూ) అయ్యయ్యమ్మో! అమ్మాయి, అమ్మాయి, అమ్మాయి! పోమ్మా, పో—ఆచీర అదీ విప్పి, స్నానంచెయ్యి—రామరామ! మటీ యీకాలపు పిల్లకాయలకి—పోరా, పో, మాదిగముండాకొడకా! వొళ్లు చీలుస్తాను. వాకిట్లో యెద్దాలే నుంచొని అందుట్నీ మైలపడే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తావా?—అయ్యో! ఆపిల్ల యిప్పుడే స్నానంచేసి నట్టుంది. ఆవెధవను కాస్త తొలగమనగూడదవ్మా?— పిశాచంలాగా పొద్దుటినించీ పట్టుకున్నాడు...మీనా యనగా రుంటేనా? రామరామ!—ఎందుకు పిలిచావే ఆమె నిప్పుడు?

జాన—ఆఁ, ఆచద్దెన్నం కాస్త వాడికి వేసి పోతుందని.

సుబ్బా—నీ చద్దెన్నం నువ్వూనూ—బండగాడి దెను పక్కలువిరగదన్నక!—పోయి, వంటకానీ, నా కవతల పనుంది. (జానకమ్మ లోపలికి పోతుంది) దొంగవెధవా! ఇంక యీచాయలకు వచ్చావంటేనా— కదులూ!—ఉండు, చెప్తా నీపని. (లోపలికి పోతాడు.)

సుభ—(వచ్చి అరుగుమీద కూచుంటుంది. పేపరు చదివినట్టుగా విప్పుతుంది.)

కృష్ణ—వెళ్లి స్నానంచెయ్యండి. ఆయన అరుస్తాడు మళ్లీ.

సుభ—అబ్బా! (ఏదో,చెప్పబోయి నవ్వుతుంది.)

కృష్ణ—ఇక్కడ కూచుంటే పూరుకోడు.

సుభ—ఇప్పుడేకదండీ, స్నానంచేసి యీబట్టలు కట్టుకున్నాను. ఇంకా తలన్నా ఆరబెట్టుకోలేదు. ఏమిమైలో లేండి—ఆలస్యంచేస్తే వడ్డీ పెరుగుతుందని భయం లేదుగదా!—కాసేపుండి వదిలించుకుందాం.

కృష్ణ—ఏమి వదిలించుకుంటారు?

సుభ—నాకళ్లకేమీ కనపడటంలేదు. మైలమై లంటారు. పాపం, వాళ్లుమాత్రం మనుషులుకారూ?

(లోపల)ఒరే! నాచేతికఱ్ఱ కనపడలేదు ఏమైందిరా? (నారన్న పారిపోతాడు.)

కృష్ణ—(సుభద్రతో) వాడ్ని కొట్టడానికి కామాలి! పగ!! (బిగ్గరగా) దొడ్డిమనురుమీద వున్నట్టున్నది. పొద్దున మొగంపుల్లలు కొట్టుకుని అక్కడ పడవేశాను. (సుభద్రతో) అయినా, యీమాలవాది గలు సంవత్సరానికన్నా ఒకసారి స్నానం చెయ్యరు. అందుచేత వాళ్ల వొంటిమీద మలినం పేరుకునివుంటుంది.

సుభ—అదేనా మైల? వాళ్లని పూసుకుంటే అది అంటుతుందిగాని, చేరువగాపోతే యేమి?—అయినా, అదిమాత్రం వాళ్ల తప్పా చెప్పండి! స్నానం ధ్యానం చెయ్యడానికి వాళ్లకు తీరికయిస్తారా? కడుపులో మాడుతూవుంటుంది. మనలాగా యీతిథేరుల్లో కూచోని......(ఇద్దరూ నవ్వుతారు) ఆఁ? చెప్పండి. పొద్దుగూకులూ కష్టపడి మీకాళ్లకు జోడుకుట్టిస్తే, ఒక పావలాడబ్బులు చేతులో పెట్టలేరు. ఆపూట గంజికి అది చాలదయ్యా అని అడిగితే, ఆజోడుతోనే, వాడు కుట్టినజోడుతోనే వాడ్ని తంతారు! ఎంత అన్యాయం! పొద్దున లేస్తే మీకు ప్రాణావసరమైన —పరమాసహ్యమైన పాకీపనంతా వాడ్ని చెయ్యమంటారు. నెలపొడుగూతా చేస్తే వాడికి వచ్చేది సున్న. వాడు తింటాడో పస్తుంటాడో మీ కక్కరలేదు.— పోనీ, యెప్పుడన్నా ఒళ్లు కడుక్కుందామా అంటే, వాడికి నీళ్లెక్కడ? మీబావులూ, చెరువులూ అన్నీ వాడికి బందు! భగవంతుడు ప్రపంచానికంతా పూరికే యిచ్చిన నీళ్లూ, నిప్పూ వాడికి కరువు! మాలవాడై పుట్టినందు కది శిక్షా? మీహిందూజాతిలో ఒకడై పుట్టిన భాగ్యాని కది ఫలమా?—వాడ్ని ఫలానిపని చెయ్యమని నియోగించింది మీరు. ఆపని చేసినందుకే వాడ్ని మీరు వెలివేస్తారా? రామరామ! వాడి కష్టంలేనిది మీ కొక్కక్షణంగూడా గడవదే? మీజీవితం దుర్భరం అయిపోతుందే?

కృష్ణ—సుభద్రాదేవి—గారూ?

సుభ—(నిష్ఠురంగా) 'గారూ'? (చురచుర చూస్తుంది.)

కృష్ణ—(నవ్వుతాడు.)

సుభ—ఏమి 'గారూ'? చెప్పండి.

కృష్ణ—నామనవి—

సుభ— సావధానంగా చిత్తగిస్తాము — కాని మీరు 'ఇంగ్లీషువారు' కామాలె. తెలుగులో మాట్లాడండి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ—మీరు హిందీలో జవాబుచెబుతారు కామాలె—సరేకాని, మీ కింతఆవేశం వుందే, అట్లయితే యివ్వాళ మీరు—మీరు—స్నానంచెయ్యకుండా వుండండి, చూతాము, యిప్పుడు......

సుభ—మరి నేను వుంటాను...మీరుకూడా వుండగలరా?

కృష్ణ—నేను మైలపడలేదుగా?

సుభ—నేను పడవేసేదీ?

(నిశ్చలంగా చూస్తారు.)

కృష్ణ—నన్ను తాకుతావా?

సుభ—నీవు యెవరు? నేను యెవరు? కృష్ణా!

(చివాలున లేచిపోయి చేయిపట్టుకుంటుంది.)

(తెర వాలుతుంది)

## రెండవరంగము

[బజారులో ఒక వేపచెట్టుక్రింద సుబ్బడు కూర్చుని చెప్పులు కుడుతున్నాడు. శేషగిరి పక్కగా నిలుచుని, వాడిచేత చెప్పులు బాగుచేయిస్తున్నాడు.]

శేష—ఏమోయ్, సుబ్బడూ! నీ పేరు మార్చుకోరాదూ? ఎవరడిగినా, 'సుబ్బడూ, సుబ్బడు' అనే చెప్పుకుంటా వేమిటి?

సుబ్బ—మావోళ్లు 'యెంకటసుబ్బయ్య' అని పెట్టారండి—ఏదో గొప్పోరిమఃందు—

శేష—నీకొడుక్కేమని పెట్టావు నువ్వు?

సుబ్బ—మీకు తెలేదూ?

శేష—అసలు?

సుబ్బ—అసలు 'నారాయణ' అండి. అందరం 'నారన్నా' అంటే, అదే అయిపోయింది.

శేష—అది బాగుండలా. మీవాళ్లందరికీ చెప్పు. మిమ్మల్ని మీరే అంతనీచంగా ఎందుకు చూసుకోవాలి? గౌరవంగా పిలుచుకోండి. దానికితోడు నేను చెప్పినట్టు విని, మీరు చదువుకున్నారంటే, స్వచ్ఛంగా, శుభ్రంగా మాట్లాడటం నేర్చుకుంటారు. రాత్రిపూట బడులు పెట్టిస్తున్నాము. మీపల్లెలో పెద్దా చిన్నా అంతా వచ్చేట్టు చూడు.

సుబ్బ—పగలల్లా బండపనులు చేసినోళ్లు చాలా మంది పొద్దుగూకేతలికల్లా నిద్దరకు బడతారండి—

శేష—మరి యెట్లాగు? ముందు కొన్నాళ్లు కష్ట పడకతప్పదు. రోజూ రెండుగంటలన్నా చదువుకుంటే గాని కాస్త ప్రపంచజ్ఞానం కలగదు. అదిగాక మీకు పని కూడా తగ్గించేయేర్పాటు చేస్తాము.

సుబ్బ—అయ్యో సామీ! పని తగ్గిస్తే మాకడుపెట్టా బోసుకుంటామండీ?

శేష—అదికాదోయ్: మీకిచ్చేడబ్బు యెక్కువ చేస్తా మనుకో. అప్పుడు మీకు పొట్టబోసుకోటంకోసం యిట్లా పొద్దుగూకులూ కష్టపడాలిసిన పని వుండదు. బుద్ధినిగూడా పోషించుకోడానికి మీకు కావలిసినంత వ్యవధి దొరుకుతుంది.

సుబ్బ—ఏమి చేస్తారో—ఇదుగో, తొడిగి చూడండి బాబూ! సరిపోతదేమో—

శేష—(జోడుతొడిగి పావలాతీసి అతనిచేతిలో పెట్టును.)

సుబ్బ—(ఆనందాశ్రువులతో) సామి, సామీ! మీపాదదాసులం. (అని కాళ్లకు మొక్కబోతాడు.)

శేష—(లేవదీసి) అయ్యో! మీరు చాలా అమాయికులు. మీరు అట్లా నమస్కారంచేయటం చాలా తప్పు, అనవసరం. నీవు చేసిన కష్టానికి నీకు రావలిసిన డబ్బు అడిగితీసుకోవాలి. ఇది చాలా స్వల్పం. పూటల్లా నీవు శ్రమపడి పనిచేసినందుకు పావలాడబ్బులకే నీవింత పరమానందం పొందుతావే, మేం పెట్టేయితరవృథా ఖర్చులలో యిదెన్నోవంతు? ఒక్కమాట సలహాచెప్పినందుకు ప్లీడరు పదిరూపాయిల ఫీజు బల్లమీద పెట్టి కదలమంటాడు. నాడి కాస్త చూడమని అడిగితే వైద్యుడు నాలుగురూపాయిలు ముందే చేతిలో వేయించుకుంటాడు. పిచ్చివాడా! మీరు అల్పసంతోషులు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందుకనే మిమ్మల్ని చూస్తే అందరికీ యింత లోకువ. మిమ్మల్ని యింతనీచంగా చూస్తున్నారు. న్యాయంగా మీకు రావలిసినంత స్వాతంత్ర్యాన్ని కూడా మీరు పోగొట్టుకోవాకండి. ఇదంతా అజ్ఞానంవల్ల కలిగింది. అది పోగొట్టుకోటానికే చదువుకోమంటున్నాను.

సుబ్బ—అయితే, మారాజా! మాకు చదువు చెప్పటాని కెవరు వప్పుకున్నారు?

శేష—కృష్ణరావు నెరుగుదువా నువ్వు?

సుబ్బ—ఆయన వస్తారా? వాళ్ల అయ్యగారు వూరుకుంటారండీ?

శేష—ఒకవేళ ఆ అయ్యగారినిగూడా వచ్చేట్టు చెయ్యగలమేమో!

సుబ్బ—మీబోటి మారాజులు తలుచుకుంటే యేదైనా చెయ్యగలరు.

(కృష్ణరావు వస్తాడు.)

శేష—గుడ్ మార్నింగ్!

కృష్ణ—కొంప మునిగిందిరా—వెరి బ్యాడ్ మార్నింగ్.

శేష—ఏం? ఏం జరిగింది?

కృష్ణ—మానాయన నన్ను యింటోనించీ వెళ్ల గొట్టాడు.

శేష—ఆఁ?

కృష్ణ—'ఆఁ' యేమిటి యింకాను? చావగొట్టే వాడే యింకాస్తయితే, అదృష్టవంతుణ్ణి యిప్పటికి—ఆకుట్టాడు లేస్తూ, నిన్న నువ్వు లాక్కొచ్చావే రాముడ్ని.

శేష—వాళ్ల తండ్రే యీన—

కృష్ణ—ఓహో—అతడివల్లనే వచ్చిం దిదం తానూ—

సుబ్బ—అయ్యో మావో డట్లా వోర్నీ అనే వోడు కాదండీ—ఏం చేశాడూ?

కృష్ణ—అబ్బెబ్బె! అత నేం చెయలేదు. అతను, పాపం, బిచ్చానికి వస్తే, నేను చద్దికూడూ అదీ పెట్ట వద్దన్నానురా, దానిమీద పోట్లాడి, నేను బ్రాహ్మణ్ణి కాననీ, నాకూ తనకూ యేమీ సంబంధం లేదనీ గందర గోళం చేసి......అసలే అదివరకు నాకు కష్టంగా వుందిలే ఆయనచేతికింద బతకడం! అనగూడదు గాని, వొట్టి చాదస్తుడురా—అందుకతోడు పక్కనే ఆచార్యులవారొకరు దొరికారు.

శేష—చెప్పవూ? ఆయనతో స్నేహమా యేమిటి మీఅయ్యకు?—ఎట్లా కుదిరం దబ్బా యిద్దరికీ?

కృష్ణ—పైకిపైకియెట్లావున్నా, లోపలయిద్దరూ ఒకతీరువారే—ఒకటే మూర్ఖత, గర్వం, చాదస్తం, పట్టుదల, కోపం, అజ్ఞానం—

శేష—మతి బి. యే. ఆనర్స్ కాంగానే జ్ఞానం వస్తుందనుకున్నా వేమిటి? ఆచారిప్పుడు హైకోర్టంతా మండిస్తున్నా, ప్రపంచంలో యెన్నిఖండాలో ఆయనకు తెలేదు—అడిగిచూడరాదూ, తెలుస్తుంది—ఇంతకూ అదిగాదు నే ననేది: ఆయనకు విశ్వకూతురొకతె వుండటగా?

కృష్ణ—(తీవ్రంగా) అవునురా, యేంవుంటే?

శేష—(సాభిప్రాయంగా) ఏ—మి—టీ?

కృష్ణ—అఁహఁ-ఏంలేదు—ఏమిటో చెప్పు, వుంటే?

శేష—ఆఅమ్మాయిని హైస్కూల్లో చదివిస్తున్నాట్ట, జుట్టూ బొట్టూ అన్నీ వుంటవిట—

కృష్ణ—నీమొహం, బొట్టు లేదు.

శేష—లేకపోతే వస్తుంది, దాందేమిటి? అటువంటివాడికి యింకా ఆచార మేమిటా అని నాఆశ్చర్యం!

కృష్ణ—ఓరినీ—స్వవిషయంలో ఆచార మేమిటోయ్, నీమొహం? అదంతా వేరేసంగతి. వాళ్ల కూతుళ్ల సంగతీ, కొడుకులసంగతీ నీకెందుకోయ్ అసలు? పిల్లలకు సుఖం కావాలంటే చూపించకతప్ప



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దు—ముందు వాళ్లను చూడు: వాళ్లు బయటికొచ్చి నప్పుడు చూపే ఆచారం, ఆర్భాటం, అవి చూడు! అంతేకాని—అసలు నువ్వు దీనికే ఆశ్చర్యపోతావు. మా నాయన ప్రతిరోజూ యిటువంటి విరుద్ధవిషయాలెన్నో చూపిస్తుండేవాడు. —అయితే, వాళ్లు శాస్త్రం చదువుకున్నవాళ్లట, వాళ్లనుగూర్చి ప్రశ్న వెయ్యకూడదట. నే నొకటి చెప్పేదీ? నేను బజారుపకోడీలు తింటే మానాయన యేమీ అనడు!

శేష—అనలేదు—ఏమంటాడు యెద్దంతకొడుకును బట్టుకోని—?

కృష్ణ—అనలేకేంలే,—అదిగాదు. బజారువైనా, 'తైలపక్వం నదూష్యతి' అని శాస్త్రం వుందిట!

శేష—ఓ! సంస్కృతం వస్తే నేను యిటువంటి శాస్త్రాలు వేయి రాద్దును.

కృష్ణ—ఏడిశావు! నువు రాస్తే యేం పనికొస్తుందోయ్? పూర్వులు రాయాలి. చచ్చిపోయినవాళ్లు రాయాలి. బ్రతికున్నవాళ్లు రాస్తే పనికొస్తుందీ? డొక్క బద్దలుచేస్తారు.

శేష—పోనీ, నేను రాసినవెంటనే చచ్చిపోతాను. నువ్వు అవన్నీ పరాశరులవారివని ప్రకటించు.

సుబ్బ—అయ్యో, బాబూ! మీరు బతికుండండి —శాశ్వతంగా వుండండి—మారాజులు మా కింత కూడు పెడుదురుగాని, అనాదపచ్చుల నిట్లా ఆదుకుంటుందురుగాని-—

శేష—చూశావా, వీళ్లెంత అమాయికులో! నాకు నిజంగా జాలివేస్తున్నదిరా. ఇంత నిష్కల్మష హృదయానికి ఇంత దారిద్ర్యమా! చూచినకొద్దీ, నా కిక ఉపన్యాసా లియ్యటానికీ, మీటింగులు పెట్టడానికీ బుద్ధేపుట్టడంలేదు. వీళ్ల యిండ్లముందు కూలబడి సేవచేద్దామని వుంది. వీళ్లు నిజంగా దేవుళ్లురా!

కృష్ణ—అయితే, మన మిక దేవుడుగుళ్లకు వెళ్లక్కరలేదు.

శేష—ఒకప్పుడు వెళ్లిచచ్చాంగనక, ఏమిటో— అవును గాని—

(లోపల) అయ్యో, అయ్యో! లగెత్తుకురాయే—

సుబ్బ—ఏందిరా?

(నారన్న పరిగెత్తుకుంటూ వస్తాడు.)

నార—(తండ్రిని కౌగలించుకొని) బేగిరా, బేగిరా, అమ్మ యేడుస్తుంది.

సుబ్బ—దేనికిరా?

నార—కుక్క కరిసిందే అమ్మకు; కండలు వూడిపడుతున్నయి. ఓనాడు గాంధీటోపీలు పెట్టుకున్న కుఱ్ఱాళ్లు కట్టుగట్టి తీసుకొచ్చి మనింటో పడేశారు. యేడుస్తుందే, నాకు బయంగావుంది. రావూ?

సుబ్బ—అమ్మబాబో! వొస్తా పద—సాములోరికి దణ్ణాలు.

శేష—వెళ్లు, పాపం! —ఎవరి కుక్కరా, అబ్బాయ్? ఎందుకు కరిచిందీ?

నార—ఏందోనండీ—మాఅమ్మ మార్కెటుకు పోయి వొస్తుంటే దార్లో, నాయుడుగారేమో యింటిముందు కుక్కను పెట్టుకోని ఆడుకుంటున్నారట. మంచంమీద వున్న నారి చిల్కసుడ్డ గాలికి యెగిరి మాఅమ్మమీద పడ్డదిటండీ, దాండుంప తెగ—

సుబ్బ—అయ్యో, నూంత తొలిగిరాగూడదూ యిది?

నార—తొలిగే వొచ్చిందంట, అంతకీనీ—

కృష్ణ—గాలికి పడితే యెవరేంచేస్తారేం?

నార—నాయుడుగారు బూతులుతిట్టి కుక్కను మీదికి వుసికొలిపాట్టండీ—

కృష్ణ—మొనగాడు!—ఇటువంటివాళ్లున్నారుట్రా లోకంలో?

శేష—ఎట్లావుందో, పోండి పాపం—ఇవ్వాళ పనిచేసుకోకపోతేమానె లే—

సుబ్బ—(దణ్ణంపెట్టి,) తమ దయవుంది గా, దీనితో యివ్వాళ పొట్టగడుస్తుంది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(రాఘవాచార్యులుగారు బెత్తము ఝూడిస్తూ, ఒకకాలిచెప్పు చేతితో పట్టుకొని వస్తాడు.)

రాఘు—(దూరంగా ఆగి) ఒరే, సుబ్బిహా, సుబ్బిహా! ఉండరా; ఇది వెంటనే కుట్టు, బొటన వేలు వూడింది.

సుబ్బ—వొస్తుండా, సామి—ఆడపడెయ్యండి. ఇంటికాడికి పోయొస్తాను.

రాఘు—ఏడిశావ్! ఇప్పుడు కోర్టుకు పోవాలి. అభాసుగా దారిలో వూడింది. కుట్టు ముందర.

నార—ఆనికి రాండి బాబూ! మా అమ్మ సుస్తీగావుంది.

రాఘు—ఆర! ఒకచేత్తో మోసుకుపొమ్మన్నావేంరా, యిది? వొళ్లుపొగరా యేమిటి?—కావాలంటే కానీ యిదుగో ముందరే పారేస్తాను—పైమైంది కానీ—(అని చెప్పు వాడిముందు పారేస్తాడు, కానీతోసహా.)

సుబ్బ—(దానిని చెట్టుక్రిందికి నెట్టి) వుండనీండి స్వామీ! ఇప్పుడే వొస్తా. (వెళ్లిపోతాడు.)

రాఘు—ఆఁ! ఆఁ! ఏమిటిరోయ్? ఒళ్లు మదించింది. చెప్పుతీసుకు తంతా, మాదిగవెధవా!—వెళ్తావేం? ఆగు అక్కడ! నాకానీ తీసుకు పరిగెత్తుతావేంరా?— చావు ముండాకొడకా, ఆగు! (రెండవ కాలిచెప్పు తీసుకు విసిరివేస్తాడు.)

కృష్ణ—సుభద్ర చెప్పినంతా అయింది!

రాఘు—(అదిరిపడి, అతనివంక చూస్తాడు.)

శేష—సుభద్ర యెవరు?

కృష్ణ—(నాలిక కొరుక్కుని) చెప్తా, రా! (లాక్కుపోతాడు.)

రాఘు—ఎవరు, వీళ్లు? ఏమిటీ—మా అమ్మాయి పేరే?......ఛచ్ఛా! ఎంతమంది వున్నారో—ఈ కుట్రాళ్లంతా కలిసి లోకాన్ని పాడుచేస్తున్నారు. రామ రామ! ఏమిరోజులు వచ్చినయ్‌రా?—వెధవముండ తల గొరిగించకోమంటే అప్పుడు పోరుపెట్టి తప్పించుకుంది. పోనీ, యీచదువుధోరణిలో పడివుంటుందిగదా అని స్కూలుకు పంపిస్తే, ఒకచోట పడివుంటేగా? మగరాయిడులాగా మూడోనాటికి ప్యాసై పోచుంటుంది ప్రతి క్లాసూనూ! ఎవడికొక్కవాలి దీని చదువూనూ...... పేపర్లుట, హిందీట...ఎక్కడపుట్టిందిరా నాకిది! రేపిపాటికి వీరేశలింగంలోకూడా కలుస్తానంటుందేమో... అమ్మనాయనో, 'పెళ్లి' అని పేరెత్తితేనా, శ్రీరామ రామ! గొంతు పిసికి పారేస్తానుగాని, పంచమహాపాతకాలూ చేసి యీకులిక్కి వురిపెట్టుకుంటానుగాని...అమ్మో, కడుపున గన్నవని యేదోకాస్త వూరుకుంటున్నాను...ఏంజేస్తా, పాడుకాలం!—ఏదో బస్తీకాబట్టి యీమాత్రమన్నా బతుకుతున్నాను...అయ్యో! ఎటువంటిభూమి, వేదభూమి; వీళ్లంతా దేశభక్తులుట, ధ్వంసం చేస్తున్నారు దేశాన్ని. మాలలూ ఒకచోట, మాదిగలూ ఒకచోట—వాళ్లకీ అన్నం కావాలిట కుక్కల్ని పీక్కుతినేగాడిదకొడుకులకీ—

(చేతిలో పుస్తకాలతో సుభద్ర వస్తుంది.)

సుభ—(తొందరగా) ఎవరు, నాన్నా, యెవరు?

రాఘు—ఏమమ్మా! స్కూలునుంచీ వస్తున్నావా? పదిన్నరఅయిందా యేమిటి?

సుభ—ఇప్పుడా? అరఘంటైంది—ఎవరు కుక్కల్ని పీక్కుతినేది? (నవ్వుతుంది.)

రాఘు—అమ్మో! పదకొండు? ఆఫీసుకు వెళ్లాలి. (నలువైపులా చూస్తాడు.) జడ్జీ వస్తాడు. గొంతుగోస్తాడు—అమ్మాయీ! తొందరగా యింటికి పో—ఈ గాడిదకొడుకు రానేలేదు.

సుభ—ఎవర్ని, నాన్నా, తిడుతున్నావు?

రాఘు—ఈవెధవకి జోడు బాగుజెయ్యమని యిచ్చాను—వీళ్లకు బాగా వొళ్లుబలిసింది. తింటానికి కూడు లేదుగాని—

సుభ—ఎక్కడినించీ వొస్తుంది నాన్నా? కుక్కల్ని తింటారంటే, గొడ్లని తింటారంటే, వాళ్ల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుమాత్రం యేంకులాసా? కడుపులో మాడి, ప్రేగులు గోలపెడుతుంటే, బ్రతకలేక, బ్రహ్మదేవుడి జీవానికీ, మీ జీవానికీ పడి యేడుస్తూ...వాట్ని తింటారు కరువు వస్తే, ఎప్పుడో ఒకప్పుడు కాస్తవర్షాలు కురవకపోతే, మనవాళ్లే కన్నబిడ్డల్ని కొరుక్కుతిన్నారట! అట్లాంటప్పుడు, అయ్యో! బ్రతికినన్నాళ్లూ కరువై, శరీరమంతా నలగ్గొట్టినా చేరెడుగింజలు రానప్పుడు, వాళ్లేం జెయ్యమంటారు? కడుపులోకి కూడు లేక, ఆకలి బాధకు వోర్చలేక, వాట్ని తింటారు. వాళ్లకుగనుక యింతవుంటే, వాట్ని మీరు తినమన్నా తినరు...... ఆబాధ మీ కేంతెలుసు! మహామహావిశ్వామిత్రుడి లాంటి అపరబ్రహ్మలైన మహర్షులే ఆకలికి ఓర్వలేక చెయ్యరాని పనులన్నీ చేశారుట! వీళ్లు చేశారంటే, చెప్పాలా?—అయినా, మాంసాహారం మానెయ్యవలసిందని వాళ్లందరికీ బోధిస్తూనేవున్నారు కృష్ణుడూ వాళ్లూ—

రాఘు—(అదిరిపడి) ఆఁ? ఎవరూ? కృష్ణుడెవరు?

సుభ—(నాలుకకరుచుకుని) ఆఁ, వాళ్ల అబ్బాయిలే...మనవూళ్లో ఒక ప్రచారకుడు—(నిష్క్రమిస్తుంది.)

రాఘు — కొంప-మునిగింది - రోయ్! ... ఇక...దుర్భరం! దుర్భరం!...బాబో!...ఇంతకూ, కలెండీ, కలి, కలి, కలి, కలికాలం వచ్చింది మాకొంప కూల్చడానికి—ఆర్యసంప్రదాయాలన్నీ వుద్ధరిద్దామని మే మెంత అఘోరిస్తేమాత్రం......(వెళ్లిపోతాడు.)

## మూడవరంగము

[ప్రక్క-ప్రక్కగా రెండు ఇండ్లవాకిళ్లు కనబడుతున్నవి.]

తపాలావాడు—కృష్ణరావుగారూ—

(ప్రక్కవాకిటిలోనుంచి సుభద్ర వస్తుంది.)

సుభ—ఏమి టది?

తపా—కృష్ణరావుగారి కేదో పత్రికవచ్చిందండి.

సుభ—కృష్ణాపత్రికా?—ఏదీ యిట్లాయియ్యి (అతను ఇచ్చి వెళ్లిపోతాడు.) బలే! పడ్డది—నాకు ముందు చూపించమంటే చూపించలేదు. తగనిభేడియం! ఎక్కడికి వెళ్లివుంటాడు? నిన్నటినుంచీ కనపడటం లేదు. నాగుండెలు కొట్టుకుంటున్నవి. ఇంత జీవనాధారం చూసుకుంటే వెళ్లిపోదుము ఇద్దరమూరూ. అబ్బా! జీవితసర్వస్వానికీ శాశ్వతానందానికీ కూడా శత్రువై కూచుంటుందిగదా యీజీవనాధారమనేది? (అరుగుమీద కూర్చోని) ఈదారిద్ర్యబాధ యెట్లా తొలుగుతుంది? స్వేచ్ఛావివాహం చేసుకోటానికి యిది వొక్కటే మాయిద్దరికీ అడ్డుగా వుంది...అయ్యో! కన్నతండ్రికికూడా నామీద జాలిలేదే? ఆనూర్ధత, ఆపట్టు, అది, యెవరినివుద్ధరించడానికి? సనాతనధర్మ మని అంటాడు; పోనీ, దానినైనా సరిగా అర్థం చేసుకొని సంపూర్ణంగా అవలంబిస్తుంటే అనుకోవచ్చు. అప్పుడాయన్ని ఆర్యమతోద్ధారకుడని గౌరవించి ఆదరించవచ్చు—అసలు, మతమంటే, సత్యమూ, ధర్మమూ, దయా, ఔదార్యమూ,—ఇటువంటివిగాని, యీ పైడాబులన్నీ యెందుకు? తాను పంగనామాలు పెట్టుకుంటే విష్ణుభక్తుడైనాడా? తనకు మోక్షద్వారాలు తెరిచి తయారుగావుంటవా? పరాయివాడు వచ్చి అడిగితే పైసా అప్పుయియ్యడు, ఒకవేళ యిచ్చినా వడ్డీలు కట్టి వాడి కొంపలు కూల్చుతాడు. ...పోనీ, ఆ పైపైఆచారాలన్నా అన్నీ సరిగా అవలంబిస్తే అనుకోవచ్చు! ఆఫీసుకైయు అయిందని సంధ్య సగంవార్చి పూరుకుంటాడే? అతిపవిత్రమై ఆర్యమత సంప్రదాయసిద్ధమైన ఏకపత్నీవ్రతమును అవలంబిస్తున్నాడా?—అంటే, యివ్వన్నీ, కన్నతండ్రిమీద అనగూడ దంటారు. ధర్మవిషయాలు వచ్చినప్పుడు తండ్రి యేమిటి, తల్లి యేమిటి?—వైరాగ్యం నాకూ చాలామటుకు వున్నది. ఆమాటనింటే కృష్ణరావు కరవవస్తాడు—ఎక్కడికి వెళ్లాడో...అతణ్ణి క్షణం చూడకపోతే యేదో బెంగగా వుంటుంది.

(ప్రక్కతలుపు తీసుకొని సుబ్బావధాని వస్తాడు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుబ్బా—ఎవరు, నేను భోజనంచేస్తున్నప్పుడు పిలిచారు, ఇంతకుముందు?

సుభ—మిమ్మల్ని పిలవలేను (ఇంతలోనే వులికి పడి) ఆఁ, ఇదిగో, మీఅబ్బాయిగారికి యేదో వచ్చింది.

సుబ్బా—యేఅబ్బాయి? మాకు ఒకఅబ్బాయి వున్నాడూ? భుడాయిరు—ఆమాట యిక అనవాకు! వాడికి యేదో వచ్చిందీ? రానీ—యేదైనా రానీ. ఇదివరకే వచ్చింది పోయేకాలం! ఇప్పుడు పక్షవాతం వచ్చిందా? విషజ్వరం వచ్చిందా?

సుభ—అయ్యో—

సుబ్బా—ఏమమ్మా, ఏం? నీకు దిగులుగా వుందా వాణ్ని చూస్తేను? నువ్వెక్కడ దొరికావు మాసంసారం ధ్వంసంచెయ్యడానికి? పో, అవతలికి పో—వెధవమొగం వేసుకోని!

సుభ—ఏమిటే?

సుబ్బా—ఉన్నమాటంటే యెవరికైనా వుం డేదేలే—పో, పో అవతలికి—

సుభ—అవధాన్లుగారూ, మా యింటిముందు కూర్చోటానికి నాకు అధికారం వున్నది.

సుబ్బా—ఉంటుందమ్మా, వుంటుంది. దేనికైనా వుంటుంది అధికారం. ఆసలివి స్వరాజ్యపు రోజులు-విడాకులచట్టం వస్తున్నది. శారదాశాసనం చట్టుబంధలైంది. ఆడవాళ్ల చదువుకు అభ్యంతరం లేదు. వెధవముండల పెళ్లిళ్లకు విధి విరామం లేదు.—సిగ్గు లేని మొగాళ్లే యివ్వన్నీ చేయిస్తున్నప్పుడు, ఇక మిమ్మల్నననవలసిన దేమున్నదమ్మా? ఇటువంటి కలియుగంలో మాబోటి భగవద్భక్తులను పుట్టించినందుకు ఆ బ్రహ్మదేవుణ్ణనాలిగాని—పోఅమ్మా, పో—ఏదో, యెట్లాచ్చి మాయింటి కెసరుపెట్టావని నిన్నన్నాను గాని లేకపోతే నాకేమి?

సుభ—ఆఁ, అదేమిటి? మీ రేదో కొంచెం అధికంగా మాట్లాడుతున్నారు. పరిచయగౌరవాన్ని బట్టి వూరుకున్నానుగాని—

సుబ్బా—లేకపోతే దండించివుందువు, తల గొట్టి మొలేసివుందువు—అబ్బో! ఎంతదాని వైనావో—ఇంతకీ, యీకిరస్తానీచదువులు చదివినందుకు యేదో వొకటి వుండొద్దూ ఫలము? ఇదీ, ఆయన చదివించడం, నువ్వు చదవటం—అయినా నాకెందుకు పొద్దూ, మీ రసలే వెలిపడ్డవాళ్లు—

సుభ—ఏమిటే, మేము వెలిపడ్డామా? మా నాయనగారు రానీండి, చెపుతాను—

సుబ్బా—చెప్పు. ఓయబ్బో! ఏమి చెపితే? నాకేమీ భయములేదే?—ఇంతకూ యీఆడవాళ్ల సంగతింతేగా? లేనిపోని కజ్జాలు పెంచడం, ఇరుగుపొరుగు సంసారాలు పాడుచెయ్యడం అందులో, మీబోటి వాళ్లకు, చదువుమరిగిన నీబోటివాళ్లకు—పనా, పాటా, సంసారమా, పాడా?

(రాఘవాచార్యులు వస్తాడు.)

రాఘు—ఏమిటండో?

సుభ—చూడు నాన్నా! నేనేదో చదువుకుంటుంటే యీనవచ్చి వూరికినే నానామాట లంటున్నాడే. ఏదన్నా కోపముంటే నామీదనా వెళ్ల గ్రక్కడము?

రాఘు—(మండిపడుతూ,) ఏడిశావు, భడవా! పో, యింట్లోకి పో, మాట్లాడకుండాను! నీతులు చెపుతున్నావు?

సుభ—(దిగాలపోయి) ఏమిటె నాన్నా?

రాఘు—అరవకుండా పో! ఇక యెన్నడూ బయటికిరాకు—

(సుభద్ర బిక్కమొగంతో, పత్రిక అరుగుమీద పారేసి పోతున్నది.)

రాఘు—అదేదో తీసుకుపో!

సుభ—వాళ్లదే, వాళ్ల అబ్బాయిది. (నిష్క్రమించి)

రాఘు—ఏమిటే! అవధాన్లుగారూ, ఎవరి దా పేపరు?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుబ్బా—వాడికి వచ్చిందిగామాలు—(అరుగు మీద స్తిమితంగా కూర్చోని) ఆచార్లుగారూ! ఎక్కడి నించీ రావటము?

రాఘు—సరేలే, ఏమిటో సంగతి చెప్పండి.

సుబ్బా—ఇట్లా కూర్చోండి— మీఅమ్మాయి చాలా పెద్దదయిందండో!

రాఘు—అంటే?

సుబ్బా—ఆవిడను మీరు కొంచెం జాగ్రత్తగా కాపాడుకోవాలి.

రాఘు—అయ్యో—మీ రిటువంటిమాట అంటారని నే నెన్నడూ అనుకోలేదు. ఏమిటో సంగతంతా సెలవియ్యండి.

సుబ్బా—ఏమి చెప్పను! హృదయపుటభేదకంగా వున్నది. మీరు కోపపడితే లాభంలేదు. నా కొంపమీదికి వచ్చిందికాబట్టి చెప్పాలిసివచ్చింది. నేను చూసినంతపాపం చెప్పకుండా వుండలేను.—మా దౌర్భాగ్యస్థితి చూశారుగదా! మాకుంకమీద వొళ్లు మండి, వెళ్లగొట్టాను.

రాఘు—అయ్యో! (ఆయనపక్కను చేరి కూచుంటాడు.)

సుబ్బా—మీరు నమ్మండి, నమ్మకపొండి.—నాకు చాలా అనుమానంగా వున్నది.

రాఘు—(తలవంచుకొని చేతులతో పట్టుకుని కూచుంటాడు.)

సుబ్బా—నేనుచూసిన సంగతులే చెబుతున్నాను.

రాఘు—(నిట్టూర్పువిడిచి ఆయనవంక చూస్తాడు.)

సుబ్బా—నిన్న పొద్దున మాయింట్లో మీపిల్లా మావాడూ చేతులుచేతులు కలుపుకోని......

రాఘు—(అరుగుమీదినుంచీ దుమికి) ఏమన్నారు? దీన్ని డొక్కబద్దలుచేస్తాను; ముండాఖోరుముండ! నన్ను పాడుచేసింది. నావంశాని కపకీర్తి తెచ్చింది. అయ్యో! నావంశం! వంశం! వంశం! (తలుపు కొట్టుకొని పోబోతాడు.)

సుబ్బా—ఉండండి, ఉండండి—తొందరపడద్దు. పాపపుణ్యాలు మనం నిదానంగా ఆలోచించుకోవాలి. అందులో, యిటువంటి ముఖ్యవిషయాల్లో—అసలు శాంతం బ్రాహ్మలకి ప్రధానగుణమాయె. అందులోనూ మనవంటి మహాభక్తులకు—

రాఘు—(హూర్చోని) అయ్యో, ఆగోపికాలోలుని దివ్యమంగళవిగ్రహం యెల్లప్పుడూ నాకళ్లముందర ఆడుతూనే వుంటుందండీ—

సుబ్బా—అవును మరి—నాకు సాధారణంగా కలలోగూడా వస్తుంటుంది.

రాఘు—అసలు భక్తులమంటే మన మేనండీ—మహాత్ములమంటేమటుకు!—ఏదో గాంధీ అంటారు, గడ్డలంటారు. వాళ్లంతా డబ్బుకోసం దేవుళ్లాడే సన్యాసులు!

సుబ్బా—ఆఁ, అసలు వాళ్లకు వైరాగ్యము దెక్కడుందండీ? వైరాగ్యం, దయా, దాక్షిణ్యం లేనిది, అసలు మోక్షం వస్తుందీ? అసలు భగవంతుడు మన దేహం, భాగ్యం, సర్వం పరాయివాళ్ల కిచ్చెయ్యమని చెబుతుంటే, స్వరాజ్యంకోసం యేడ్చేవాళ్లకి మతేమన్నా వుందండీ—దానికోసం యీకుట్రాళ్లంతా పడి, కులం, గౌరవం, వంశం, మర్యాదా అన్నీ ధ్వంసంచేసుకొంటున్నారు.

రాఘు—(తలపట్టుకొని) నావంశం పోయింది! నావంశం! ఈదిక్కుమాలిన పిశాచం నా కెక్కడ పుట్టిందిరా, భగవంతుడా!

సుబ్బా—(తనలో) 'వంశం'? వంశం వల్ల కాడైనట్లున్నది! మీవంశంలో యేతాతలు మాలవుద్యోగాలు చేశారు? ఏముత్తాతలు వెధవకూతుళ్లకు జుట్టు వుంచారు? ఏతాతముత్తాతలు మాలచదువులు చెప్పించారు? ఏముత్తాతముత్తాతలు గడపదాటనిచ్చారు? ఏతాతతాతముత్తాతముత్తాతలు—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాఘు—అవధాన్లుగారూ! మీ రసలు సంగతి దాటవేశారు—ఏదో పూర్తిగా వెళ్లబెట్టండి.

సుబ్బా—ఏదో—ఇప్పటికి పోనీండి—మీరు పోయి భోంచేయండి–అది మిమ్మల్ని కూడా యెందుకు బాధించాలి? నేనే యిప్పటికి కుళ్లిపోతున్నాను. నావంశం యిదివరకే ధ్వంసమైపోయింది. ఈగాంధీ మాట విని మావాడు యిదివరకే మాలవాళ్లల్లో కలిసి పోయినాడు; వాళ్లకు నీళ్లు తోడి వాళ్లకు వీధులు తుడుస్తున్నాడు; వాళ్లను దగ్గిరికి చేర్చి వాళ్లకు చదువులు చెపుతున్నాడు. అయ్యో! పోతుంది, పోతుంది, లోకం పాడైపోతుంది. ఈగాంధి యెక్కడ దాపరించాడో! ఈయనమాట విని వీళ్లంతా వెర్రివాళ్లైపోతున్నారు. రామరామ! కొన్నాళ్లకు వీళ్లంతా గాంధీలే అయిపోయేట్టున్నారు; సర్వనాశనమే అయిపోయేట్టుంది!

రాఘు —వీళ్లకు బుద్ధిచెప్పించాలండీ—

సుబ్బా—ముందు మావాడికి చెప్పించాలి—మాదిగగాడిదకొడుకు, పెళ్లిచేసుకోమంటే చేసుకోక ......అమ్మా!!

రాఘు—ఛీ, ఛీ! ఆనీచుడు నాయింటి కెసరు పెట్టాడా? అవధాన్లుగారూ! మీకు కోపంవచ్చినా సరే. మీవాడ్ని యిక క్షమించను—ఇదివరకే చాలా అనుమానించాను—

సుబ్బా—ఇంకా మావాడేమిటి? డొక్కబద్దలు చేయించాలి—హాయిగా యేపిల్లను చేసుకున్నా అయిదువేలు కట్నమిచ్చేది; తండ్రికి కష్టం తేలేని కొడుకు వుండియేమి, వూడియేమి!—అటువంటి వాడ్ని నరికిపారెయ్యాలి.

రాఘు—ఈ మాలపనులు మానమని వీళ్లని తన్నిస్తే బాగుండదండీ—.

సుబ్బా—తలకాయ పగలగొట్టిస్తే బాగుండు; డొక్కబద్దలుచేస్తే బాగుండు!

రాఘు—నేను చేస్తానుండండి ఆపని—నాకూతురు పాడైపోయింది...బంగారంలాంటి కూతురు—వెధవకూతురు. నావంశం ధ్వంసమైపోయింది...... అమ్మా!!—కిష్టాయ్! నిన్ను నరికేస్తాను; నమిలి మింగేస్తాను! నీకు మూడింది, ఐంది—ఒసేయ్! దొంగముండా! ఇట్లారా, బయటికిరా! నాయిల్లు అపవిత్రం చేస్తున్నావా? పో—నీయిష్టం వచ్చినట్లు పో—నిన్ను మాలవాడిచాత బయటికి యీడిపిస్తాను. కదలవేం? (తలుపునెట్టి నిలుచుంటాడు.)

(నారన్న ప్రవేశం; పూసుకూ, పాడూనూ)

నారన్న—

గోయింద రాంరాం, గోపాల హరిహరి,
గోయింద రాంరాం, గోపాల హరిహరి...
(తొగంటలు వేస్తాడు.)

సుబ్బా—(మండిపడుతూ) మళ్లీ వొచ్చావు? ఇదేదో పిశాచం! వొదుల్తావా, వొదలవా? పూడ్చిపెడతాను.

రాఘు—ఎవడురా నువ్వు?

నార—అనాదపచ్చులం సామీ! రవ్వంత కబళ మెయ్యండి సామీ! (క్రమక్రమంగా శ్రుతి పెంచుతూ) గోయింద రాంరాం......

సుబ్బా—(చెవులు మూసుకొని) అయ్యయ్యో! అయిపోయింది—ఆనామం అపవిత్రమైపోయింది. అన్ని నోళ్లలోనూ పడి మారామనామం అపవిత్ర మైపోయింది. ధ్వంసమైపోయింది; పాడైపోయింది. నేను వినలేను, హరిహరీ!

రాఘు—మీ రెవరు?

నార—మాదిగోళ్లం సామీ! కబళంసామీ! కడుపు మాడుతుంది సామీ!

సుబ్బా—నీకేం కళ్లుకనబడటంలేదూ? తొలిగిపో—ఇక్కడ యెవరూ పెట్టరు పో, ఇవి బ్రాహ్మల యిళ్లు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నార—రచ్చించండి సామీ—బ్రాహ్మలైతే కూంత పప్పు పెట్టండి సామీ!

సుబ్బా—పప్పుగాదు పరమాన్నం వండిపెడతారు, ఆచార్ల గారి నడుసు—వాళ్ల అమ్మాయిచాత వండిపెట్టిస్తారు.

రాఘ—ఆ. ఇక దానిగతి అంతే. వాళ్లకు వండి పెట్టాలిసిందే—నువ్వు బయటికి వస్తావా, రావే?

(లోపల) ఏమిటి, నాన్నా?

రాఘ—'నాన్న'? నోరుమూసుకో—తక్షణం లేచిపో—ఒరే, మాదిగవాడా! దాన్ని బయటికి యీడ్చివెయ్యరా.

(ఏడుస్తూ సుభద్ర బయటికి వస్తుంది.)

సుభ—అయ్యో! నాన్నా, నాన్నా, ఏమిటిది?

(కౌగలించుకుంటుంది)

రాఘ—ఛి, ఛీ! అవతలికిపో—నీకూ నాకూ యేమీ సంబంధంలేదు. ఇక నీదారి నీది—మీకిష్టాయి దగ్గిరికి పో—

సుబ్బా—హరి హరీ నేను వినలేను—(నిష్క్రమి)

రాఘ—బయటికి లాగివెయ్యరా, మాలదాన్ని!

(వెళ్లి, తలుపు వేసుకుంటాడు.)

(నారన్న తటాలున వచ్చి ఒకవుత్తరం ఆమె చేతులో పెట్టి)

నార—కృష్ణరావుగారు పంపారు. అందుకే నే నొచ్చిందసలు—

సుభ—(వాడి రెండుచేతులూ పట్టుకోని) ఏమి రాశాడో నువ్వు విప్పి చూశావా?

నార—నాకు చదువురాదండీ—

సుభ—రాకపోతేయేమి? నేను చెపుతాలే యెప్పుడైనా.

నార—ఎప్పుడు చెపుతారు—నాకు చదువుకోవాలని వుంది.

సుభ—తప్పకుండా.

నార—ఎప్పుడు చెపుతారు?

సుభ—నువు చెప్పకో యెప్పుడోను?

నార—కృష్ణరావుగారు దొరికితే......

సుభ—అమ్మ!! (వాణ్ని కొట్టవస్తుంది. వాడు పరిగెత్తిపోతాడు.)

ఏమిరాశాడు నాదేవుడు? (విప్పి చదువుతుంది) "సుభద్రాదేవీ! ఈభక్తుడు దేవతకు తృప్తికలిగించ గలడో లేడో ముందు తెలుస్తుంది. అయినా, దేవత భక్తుణ్ని వదిలిపెట్టి దూరంగా యెంతకాలం వుండ గలదు?—నైవేద్యానికేమి? దొరికితే తింటాను, లేకపోతే లేదు...వీలైనంతత్వరలో సత్రముదగ్గర కలుసుకోవలెను. లోకంలో పడదాము—నమస్కారాలు.

భక్తుడు, కృష్ణ—"

నీవు నావాడివి కృష్ణా! నీకోసం లోకాన్ని పరిత్యజించి వస్తున్నాను. లోకసేవకుడవైన నీకు లోకత్యాగినిని లభిస్తున్నాను. నీతో కలిసి మళ్లీ లోకంలోనే పడతాను. ఏదీ నీలోకసేవ ధౌరంధర్యము! మన సారా మళ్లీ వొకసారి వల్లించుకుంటాను.

(అరుగుమీద వున్న పత్రిక తీసి చదువుతుంది.)

"దీనాలాపము—

'శ్రీకృష్ణ'"

ఎంతముద్దుపేరు!

"విశ్వలోకేశ్వరా! జగద్వినుతిగన్న
మాపవిత్ర హైందవజాతి మంటగలుపు
దారుణపిశాచ మస్పృశ్యతాకళంక
మింకనైన తొలంగ దీవింపుమయ్య!"

ఆ విశ్వేశ్వరుడికి జాలివుంటే, ఈప్రార్థన వినితీరడా?

## నాలుగవ రంగము

[లోకల్ఫండ్ సత్రము ముందువీథి—ఇద్దరు కాడీలు ప్రవేశము.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. రా—వాడు చస్తే, ఒకవేళ ?

౨. రా—చస్తే, స్వర్గానికి పోతాడు.

౧. రా—ఛా, అటువంటివాడు నరకానికి పోతాడురా.

౨. రా—నీమొహం,నరక మేమిటి, మనచేతులో చస్తే ? స్వర్గం చవిచూడాలిసిందే—రాముడి చేతులో చచ్చిన రాక్షసులంతా మోక్షానికి పోతారట—రాముడికీ రాడీకి భేద మేముందోయ్ ?

౧. రా—అవును. వాడిచేతులో మోక్షానికి పోతే, మనచేతులో అధమపక్షం స్వర్గానికన్నా పోరూ, డీందుంపడెగ ?

౨. రా—అందులో, యీవూరికంతటికీ నేను రాడీని.

౧. రా—ఏడిశావు, నాకంటేనా ?

౨. రా—అబ్బో ! నేను పేరాలలో ప్రియంవద యింటికికూడా పోయొచ్చాను. నువ్వేమిచేశావు, వూరిఖే కోతలుగోస్తావుగాని—

౧. రా—వెళ్లి యేంయేడిశావోయి, దానివాత తన్నులుతిని వచ్చావు, అంతేగా ? నాకు తెలేకుండా వుందేమిటి ?

౨. రా—పళ్లుంగాలవంతా, ఏమిటిరా అంటావు?

౧. రా—ఒరేయ్, కెల్లీముంప డ్యాన్సులోకి దిగిందిరోయ్.

౨. రా—ఎప్పుడూ, బలే ! చెప్పవూ, ఏహాల్లో? —నువ కేమన్నా జతపడేట్టుందా ?

౧. రా—ఇక్కడోయ్—గెయిటీ. టిక్కట్టు లేకుండా పోలేము.

౨. రా—ఏం ? వలంటీర్లనుంటే పోనీయరు ?

౧. రా—నీమొహం ! పట్టుకు తంతారు. జైల్లో పెడతారు.

౨. రా—పోనీ, సుబ్బన్న నడిగితే డ్రెస్సు యియడంట్రా ? అడిగి తీసుకుందాం దర్జాగా !

౧. రా—పోలీసుడ్రెస్సా ?

౨. రా—మరి యేమనుకున్నావు ? నీలాగ నేనా ? నాకు ఈవూళ్లో యెంతసామర్థ్యంవుం—! బల పలుకుబడి వుంది ! ఒక్కరాత్రిలో ముప్పైమందిని కొట్టాను—ఆవాళ అవధానివాడ్లో మామిడికాయలన్నీ యెట్లా మాయమైన వనుకొన్నావు ?

౧. రా—అవునులే, ఇప్పుడిది యేదుద్దూ—రెండురూపాయిలు ముందు గల్లుమంపై.

౨. రా—ఆఁ, ఒక్కడ్ని కొట్టడం యెంతలో పని ?—అవునుగాని, ఆచారి యిస్తాడా, యెగేసే మొహమా ? కనుక్కున్నావో లేదో సరిగ్గా.

౧. రా—ఇయ్య కక్కడికి పోతాడ్రా—కాని, చచ్చేట్టు కొట్టొద్దన్నాడు రోయ్.

౨. రా— ఆఁ—రెండోదెబ్బ కొట్టిందాకా దమ్ములున్నయ్‌టోయి, యేదో రాంగానే కళ్లునూసుకుని ఒకసారి కఱ్ఱవిసరటం, కాలికి బుద్ధిచెప్పటం—వూరిఖే కొయ్యటమేగాని—అసలు యెవడు వప్పుకున్నేవాడురా యిటువంటిపనికి... అసలు నేను ఆనెస్టుఫెలోని*—ఏదోయీపూట బుడ్డికి లేదని అఘోరిం చడమేగాని—ఎవడన్నా దారిన వచ్చాడంటే చావ మట్రా ?

౧. రా—కవర్డ్!† — ఎవడో వస్తున్నట్టే వున్నాడు—తొలిగి నుంచో—

౨. రా—అమ్మో!!—దాక్కో నీదుంపదెగ, చచ్చాం !

౧. రా—ఏం జేస్తాడు, ఆచెట్టుచాటున దాక్కోరా—

౨. రా—నేను దొంగనిట్రా ?—నే నసలు Honest fellow ని. ఛా. నేను దర్జాగా పోతాను. (కఱ్ఱ అక్కడ పారేస్తాడు.)

---

* Honest fellow.

† Coward.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(సుబ్బావధాని ప్రవేశం)

సుబ్బా—అభిమానమనేది అట్లా పీక్కుతింటుంది. కడుపున బుట్టిన పీనుగుగాబట్టి నుటుక్కుమంటాడేమో అని గుండె కొట్టుకుంటుది. దీనితోనైనా రోగం కుదిరి యింట్లో పడతాడేమోనని ఆశ—ఓరి గాడిదా! ఆముండను లేవదీశాడు. ఇద్దరూ పబ్లీకుగా పెళ్లిజేసుకొంటారుట! రామరామ!—అటువంటి ఘండాలుణ్ణి యింకా యింట్లో చేరనియ్యడమే? చేరనిస్తే యింకా యేమన్నావుంది? అమాంతంగా వురిబెట్టరే? పైన స్వాములవారున్నారు, గురుపీఠం వుంది, మెడబట్టుకొని గెంటి యేటి వొడ్డున యిల్లు గట్టుకోమంటారు...ఛీఛీ! ఈకొడుకు పోతే వుంకో డొస్తాడు, కులంపోతే వస్తుందా? చావనీ, పీడా వదుల్తుంది...ఈకుంఖ లేమన్నా తాగొచ్చారేమో, వొకసారి కదిలించిపోతే బాగుండు—ఎవరబ్బాయి, ఇక్కడ?

౨. రా—నేను గాదండి, వాడండి—I am a gentleman—

౧. రా—మేము స్టూడెంట్సుం లేండి—

౨. రా—సినిమా కెళ్లొస్తున్నాము—ఏంఫిలిమండి, వెధవది!

సుబ్బా—ఆచార్లుగారు మీతోనేనా మాట్లాడింది?

౨. రా—కాదుకాదండీ, మేం కాదండీ—గోహార్‌కి చట్టిముక్కండీ కొంచెం!

౧. రా—ఇదుగో, అవధానిగారేనా?

సుబ్బా—అవును—వాళ్లు యీరాత్రి యిక్కడ కలుసుకుంటారుట—ఇద్దరు—గట్టిగా బుద్ధిచెప్పాలి.

౨. రా—(తనలో) ఓహో! మామిడికాయల తాతయ్యా?—సరే...కాయలేమన్నా పండినట్టా?

౧. రా—ఏమంటారు? ఇద్ద రెవరు? కృష్ణరావుబుజ్జి బద్దలుగొడితే రెండురూపాయ లిస్తామని ఆచార్లుగారు చెప్పారు మాకు.

సుబ్బా—(వులికిపడి) అమ్మయ్యో! బుజ్జిబద్దలే! ...నేను పోలీసులకు చెప్తాను. నాకొడుకును చంపుతారా, దుర్మార్గుల్లారా?

(మారంగా కృష్ణరావు, నారన్న ప్ర. నారన్న పెద్దగా నవ్వుతాడు.)

కృష్ణ—(వాడి రెండుభుజాలూ పట్టుకొని) నీకు చదువొస్తే యింకా మమ్మల్ని వెక్కిరించేట్టున్నావు!

నార—అన్నట్టు, అమ్మగోరు చదువుచెప్తానందండీ నాకు.

కృష్ణ—ఛ! 'అమ్మగారే' అప్పుడే?—అయితే, అయ్యగా రెవరు?

నార—నాకు తెలేదండీ, అయ్యగారూ!(పెద్దగా నవ్వుతాడు.)

సుబ్బా—(ఖంగారుపడి) ఆఁ! ఆఁ! అడుక్కున్నే కుంకనే? తాకటమే? కావిలించుకోటమే?—అమ్మో, అమ్మో—నాకొడుకు! ఇది ప్రపంచమా వల్లకాడా? ఆరి దేవుడా, యెక్కడ వున్నావురా?—ఇక చచ్చాము, ధ్వంసమైనాము. కొయ్యండి, పగలగొయ్యండి వాణ్ని.—నాయనో, నాయనో! ఇంకేమి బ్రాహ్మణీకం! ఇంకేమివైదికం! రామరామ! ఈకళ్లు పొడుచుకోవాలి. ఇంతపాపం చూచాను; ఇక ప్రాయశ్చిత్తం చేసుకోవాలి...మాలవాణ్నే? తాకటమే? ప్రపంచప్రళయం పుట్టి భూనభోంతరాళాలు మండిపోయి ధ్వంసంకాలే? నరకండి; వాణ్ని నరికి పోగులుపెట్టండి......అయ్యయ్యయ్యో — (ఏడుస్తూ నిష్క్రమి.)

౧. రా—కొట్టరా, కొట్టు—

౨. రా—(వెనక్కి జారుతూ) ఉండు, కాస్త యివతలికి రానీ, క్రీనీడలోకి—

కృష్ణ—తమ్ముడూ! ఆమె యెన్నిగంటలకి వస్తానన్నది?

నార—ఆసంగతి నాతో చెప్పలేదండీ...వచ్చేవేళ కావచ్చు—మనము అరుగుమీదికి వెళ్లి కూచుందామా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ—చీకటిగా వుంది. ఆవెనకవైపున సత్ర పాయన వుంటాను. లాంతర తీసుకురా వొకసారి—

నార—వారు నాకియ్యారండీ—

కృష్ణ—అయినా, అఘుసుమా—(నారన్న నిష్క్ర.)

౨. రౌ—వాడివద్దర కత్తి యేమన్నా వుందేమో చూడరా ముందు.

౧. రౌ—ఏమీ లేదు. రాస్కెల్! నువ్వు భయపడుతున్నావు. నీకు దమ్మిడీకూడా యియ్యను.

౨. రౌ—అసలు నీదాకా వస్తేకద! చూడూ, అంతా నేనే చేస్తాను. (వెనకగా కృష్ణరావును సమీపిస్తాడు కత్తియెత్తి.)

కృష్ణ—(ఉలికిపడి వెనక్కి తిరిగి) ఎవరు వారు?

౨. రౌ—దేముడో...(కత్తి పారేసి పరిగెత్తి పోతాడు.)

౧ రౌ—నీకు మూడింది. (కత్తియెత్తును.)

కృష్ణ—ఆఁ, ఆఁ, ఎవరు నీవు? ఆను. (అతనికత్తి పట్టుకోపోగా, రౌడీ అతని తలమీద బలంగా కొట్టి పారిపోతాడు.)

కృష్ణ—అబ్బో...(క్రింద పడిపోతాడు.)

(నారన్న ప్రవేశం)

నార—ఎవరు?...కృష్ణరా...అమ్మో! అమ్మో! హత్య, హత్య! చంపారండో...ఎట్లా వుందండీ, బాబయ్యా, బాబయ్యా,...పలకరేం?

(సుబ్బావధాని ప్రవేశము)

సుబ్బా—నాతండ్రి, నాతండ్రి...హత్యజరిగిందీ? ఏడీ నాతండ్రి? (దగ్గర కూచుంటాడు.)

కృష్ణ—(అటూ యిటూ పొర్లి, 'దాహ'మని చేయిచూపిస్తాడు.)

సుబ్బా—అయ్యో! దాహము, దాహము—మానాయనతల పగిలిపోయింది...నీళ్లు బాబూ! ఎవరవోతండ్రీ, కాసిని నీళ్లు తెచ్చిపెట్టు—మానాయన ప్రాణం నిలబెట్టు—(నారన్న వెళ్తాడు)

తండ్రీ, బాబూ! నన్ను చూడమ్మా—నాన్నను వచ్చాను. నేను నాన్ననురా, తండ్రీ!

(సుభద్ర ముసుగువేసుకుని మెల్లగా వస్తుంది.)

సుబ్బా—ఎవ రావచ్చేది, తల్లీ? మాఅయ్యతలకాయ పగిలింది...పోలీసులను పిలు. నాకొడుకును కొట్టారు!...బాబో, నాకొడుకు!

(సుభద్ర మెల్లగా దగ్గిరికి వచ్చి పరిశీలించి కూచుంటుంది.)

సుబ్బా—మాఅయ్యకు రక్త మెట్లా స్రవిస్తుందో...ఆసుపత్రికన్నా పోతే? అమ్మా! అమ్మ ఎవరోతల్లీ నువ్వు! అటు వొకబండినన్నా పిలు. అయ్యో, అయ్యో! రక్తం కారిపోతున్నది......

(సుభద్ర చీరకొంగు చించి, కృష్ణరావుతలకు కటుతుంది. అతను దాహముచేత నాలుక చప్పరిస్తాడు.)

సుబ్బా—మాతల్లి, మాతల్లి,! నువ్వెవరో దేవతవు! దాహము, దాహము, నీళ్లు యెక్కడ దొరుకుతవి? (అటూ యిటూ దిక్కులకు పరిగెత్తుతాడు.)

(నారన్న చిన్నముంతతో నీళ్లుపట్టుకొని పరిగెత్తుకొస్తాడు.)

సుబ్బా—వచ్చావు, తండ్రీ! నువ్వెవరో దేవుడివి. నీచేతులతోనే పొయ్యి, నాయనా...నాకొడుకింక నాకు దక్కుతాడా?—అయ్యో! కన్ను పొడుచుకున్నా కనపట్టం లేదు...

(నారన్న అతని గొంతులో నీళ్లుపోస్తాడు. అతను గుటకలువేసి, లేవబోతాడు.)

సుభద్ర—(అతని దగ్గరగా వెళ్లి) కృష్ణా—

కృష్ణ—(హఠాత్తుగా లేచి) ఆఁ! ఆఁ! నాప్రాణము వచ్చినదా? నాసర్వస్వము! నాజీవగఱ్ఱ! నా భాగ్యదేవత!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుభ—ఎట్లా వున్నది?

కృష్ణ—హాయిగా...నారన్న యేడీ?

నార—ఇదుగో, బాబూ! ఇంకా దప్పిక అవుతున్నదా?

సుబ్బా—(అదిరిపడి) అమ్మో, రామా! కొంప మునిగింది! నువ్వటరా? మాదిగముండాకొడకా!—చీకట్లో కనపళ్లేదు—నీనీళ్లా నాడి గొంతులో పోశావు? చచ్చాము. అయ్యయ్యో! పోయింది, నాకులం పోయింది, ప్రపంచం మునిగిపోయింది......శ్రీరామ రామ! చచ్చినపీనుగు చావనన్నా చచ్చాడుఃకాడు... అమ్మమ్మో! ఇక గంగలో దూకాలి. ప్రాయశ్చిత్తం చేసుకోవాలి—మాదిగనీళ్లే? తాగటమే? (గుండెలు బాదుకుంటూ వెళ్లిపోతాడు.)

(తెరపడుతుంది.)



బొంబాయి ఛౌపతీ సముద్రతీరము

(జి. యస్. పర్డీ (కలకత్తా) గారి త్రివర్ణచిత్రమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రాయశ్చిత్తం

చంద్రుపట్ల రామరావు

౧

చూశారా! విశాలాక్షి, ఆకుజొంపాల్లో ఒదిగి ఉన్న అనాఘ్రాతపుష్పమా అయింది కాదు; పోనీ, నిష్కల్మష ప్రేమపిపాసి అయిన ఏరసిక సారంగానికో తనువు నప్పగించి, అతని బిసువుకౌగి లిలో — అతని ప్రణయరసాస్వాదన చేస్తూ ఉండగా ఆనందపారవశ్యం పొంది, సొక్కిసోలిన ఏ అస్వాదిత పుష్పమేనా అయిందా! అదీలేదు. పాపం, ధూర్త భృంగం నాలీవాలడంతో తొడిమనుంచి జారిపోయిన నిర్భాగ్యకుసుమం!

లోకుల దృష్టిలో విశాల వాసుదేవరావుగారి గృహిణి. అర్ధాంగి—ప్రేయసి అవునోకాదో, తెలుసుకోవలసిన అవుసర మెవరికి! విశాలకి వాసు యజమానిమాత్రం అవును.

"మా అమ్మాయి మొగుడుతో చిలుకలాగా కాపురం చేసుకొంటోంది" అమాత్రం తృప్తిపడు తున్నారు విశాలతలిదండ్రులు. కానైతే, లోలోపల విశాల నిరంతర - నిర్భరవిరహానలంతో అగ్నిపర్వతంలా ఎంత ఉడుకెత్తిపోతోందో తెలియదుగా వాళ్లకి!

వాసుదేవరావు పురుషులకు సంక్రమించిన నడిమంత్రపు టధికారాల నన్నిటినీ జబర్దస్తీతో తుచ తప్పకుండా అమలు జరిపితీరాలనే మతంలోవాడు.

"ఒకతుమ్మెద ఎన్నో పూవులమీద వాలి మకరందాన్ని గ్రోల్తుంది. అలాగే పురుషుడున్నూ" అని అతని సిద్ధాంతం.

అయితే, ఒకేపుష్పంమీద అనేక తుమ్మెదలు వాలవూ?

వాసుదేవరావుకి యౌవనం, ఇంటిపెత్తనం ఒకే సారి తటస్థించాయి. అదమాయించే పెద్దలు మరిలేరు. అతడే సర్వాధికారి. మొదట్లో మొదట్లో నాటకాలకనీ, సినీమాలకనీ పట్టణాలవెంట తిరిగేవాడు. రాను రాను ఏపూటకాపూటంటె పంచనో రెండేసిరోజులవరకూ ఆగిపోయి, చల్లగా సానివాడల్లోకి షికారు నడిచేవాడు. సరి, మరిరెండుసెలలకి వాసుదేవరావు సాని వీథిలో తలలొప్పుకొనే రసికశిఖామణి. అంతేకాదు, ఆగ్రామంలో వాసు జగమెరిగిన బ్రాహ్మణుడు.

విశాల కాపురాని కొచ్చి ఏణ్ణర్థమైంది. ఇంత వరకు భర్త ఆమెతో ప్రేమ ఒలికిస్తూ ఒక్కమాట సైనా ఆడలేదు. పోనీ, నిర్మలమైన ఒక్క వీక్షణమైనా, ఆదరణమెరిసే ఒక్క అలతి నవ్వైనా ఎరగదు విశాల.

భర్త ఆటాడకపోయినా, స్త్రీకి అంతకంటె అవమానం, ఎండనా మరి ఉండదు. హృదయాన్నిచ్చి, అతనిలో లీనమైపోవాలని ఒకవంశంలోనుంచి వొచ్చిన ధర్మపత్ని భర్తచేత నిరాకరింపబడినప్పుడు, అబ్బా, ఎంతదుఃఖం! హృదయం శకలాలుకాదూ!! ఇంతకూ, విశాలత ప్పేమిటో! ఆమెఅంటే వాసు కింతటి వైముఖ్యం ఎందుకో! ఏమీలేదు. విశాల ఎప్పుడో పసితనంలో అతని అనుమతిలేందే కట్టిపెట్టబడినదని. ఆమెకోసం రాత్రింబగళ్లు ఆరాటపడ్డాడా, లేదు. సుఖమధురస్వప్నాలు కన్నాడా? ఆమెప్రేమపాంగం కోసం యాచించాడా? తహతహలాడిపోయాడా? ఏమీలేందే ఆమె భార్య ఎలాఅవుతుంది, అతని ఉద్దేశ్యంలో. కాదు.

'అవశ్యం త్వామనసాదీధ్యానాగ్ం స్వాయాం
తనూగ్ం ఋత్వియే నాధమానాం,
ఉపమా ముచ్చా యువతి ర్భభూయాః
ప్రజయా త్వప్రజయా పుత్రకామే'

అంటూ పాణిగ్రహణసమయంలో చేసిన ప్రమాణానికి అతను బాధ్యుడా? మనస్సులో ఆప్రమాణాన్ని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనుభవించి, బుద్ధిపూర్వకంగా, అనురాగపులకితుడై, వధువును తనలో అర్ధభాగాన్ని గ్రహించమని కోరి చేసిన వాగ్దానమా ఇది? వాగ్దానమంటూ, శపథమంటూ చేస్తూన్నాననే జ్ఞానం వరుడికి ఉందా అసలు? ఎలా ఉంటుంది! భార్య, భర్త అంటే ఏమిటో, వివాహం అనగా ఏమిటో తెలియని బాల్యావస్థలో వేడుకలనీ, లాంఛనాలనీ ఉబలాటపడి ఏదో తంతు జరిపేశారు పెద్దలు. వరుడేమన్నా ఎరిగి బాసచేశాడా? చేసిన జ్ఞాపకమేనా ఉందా? ఇప్పుడు వాసుదేవరావు ఆకర్మకంఠకటికి బాధ్యుడెలా అవుతాడు! అందుచేత విశాలా వాసుదేవరావులు నిజమైన దాంపత్యసూత్రంచేత బంధింపబడలేదన్నమాట.

## ౨

విశాల సహజంగా అందకత్తె. దానికితోడు యౌవనప్రాగల్భ్యం. ఆమె సర్వాంగాలూ మిసమిసలాడిపోతున్నాయి. కృత్రిమసౌందర్యం, కృత్రిమనాగరికతా ఎరగని ఆ అమాయికపు సుందరి, పాపం, వాసు హృదయాన్ని అపహరించలేకపోయింది. ఆటుక్కుటొయ్యారాలు, ఆహావభావాలూ, ఆకృత్రిమప్రేమ ప్రకటనలూ, ఆమాశాహాసాలూ, వేశ్యలకుమల్లే విశాల ఎలా చూపగలదు? ఈమె సానపెట్టని వజ్రమని వాసు ఊహ. వేశ్యలవల్లా, జారకాంతలవల్లా పొందే ఆనందాన్ని ముగ్ధ అయిన విశాలవల్ల పొందలేనని అనుకొంటాడు.

తులసిమొగ్గలా విశాల అతిపవిత్ర. అయితే వాసు మనసు చెడుదారికి పట్టింది. "నేనుచేసిన తప్పేమిటి! ఒక్కమాటకేనా తగని అపరాధం నేనేం చేశాను?" అని విశాల కుమిలికుమిలిపోతుంది. ఆ అవమానానికి తలకొట్టేసినట్లయింది.

చివరకు తెగించి, ఒకరోజున వాసుపాదాలమీద వ్రాలి తనహృదయరోదనాన్ని బయలుపెట్టింది. వాసు హృదయం మెత్తపడలేదుసరికదా, మరింత కాఠిన్యం దాల్చింది. "విశాల లజ్జలేకుండా, స్త్రీ సహజమైన మార్దవం, అణకువా లేకుండా తన మనోభావాన్ని వెలిబుచ్చింది." అనుకొని మరింత రోతపడ్డాడు.

ఇక ఉపేక్షవహిస్తే లాభంలేదు. వాసు ఎంత నిరంకుశంగా, ఎంతకఠినంగా ప్రవర్తిస్తున్నాడో, అంత కఠినంగానూ అతన్ని ఎదిరించాలని నిశ్చయించుకొంది విశాల. అయితే, భర్తయెడల అనురాగం, గౌరవం మాత్రం అలాగే నిశ్చలమై ఉన్నాయి.

వాసు, తన ఉంపుడుకత్తెఇంటికి మన్మథుణ్ణి అర్పించడానికి వెళ్లినసమయంలో, విశాల ఓఉత్తరం వ్రాసి అతనిపేర పోస్టులో వేసి, పుట్టింటికి చక్కాపోయింది. అది ఇది:

"వాసుదేవరావుగారికి

విశాల అనేకనమస్కారములు.

ఇంతటితో మనం నామమాత్రంగా వహించిన దాంపత్యభావం అంతరించిపోయింది. నాకు నేనే. మీకు మీరే. మీ మార్గానికి, మీ ఆశయానికి, మీ ఆనందానికి నేను అడ్డుతగలడానికి హక్కులేదు. అలాగే మీకున్నూ. అవునా, మీలాగానే నాకుకూడా దైవదత్తమైన స్వాతంత్ర్యం ఉందికాని లేకపోలేదు. జన్మతః పురుషులైనంతమాత్రంచేత అత్యాచారాలు జరపమనికాదు.

ప్రేమడోలికల్లో మిమ్మల్ని ఊచి-లాలించే ఓప్రేయసిని మీరు సంపాదించుకొన్నారు. ప్రేమానుభవంలేకుండా జీవితం నిష్క్రియమైపోయేటట్టు పడి ఉండడానికి ఈశ్వరసృష్టిలో ఏజంతువుకూ విధించి లేదు. నేనున్నూ అలాగే తనలో ఐక్యంచేసుకోకలిగే ప్రణయమూర్తిని అన్వేషించుకొంటూ ఈరోజునే బయలుదేరాను.

ఈవిధంగా నేను మరోభర్తను పొందడం దూష్యమంటారా, కాదు. ధర్మశాస్త్రంలో ఇది నిషిద్ధమే కాదు.

'నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ,
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శుక్ల తృతీయ
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీన చిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని పరాశరస్మృతిలో, భర్త మారదేశం పోయినా, మృతుడైనా, సన్న్యసించినా, నపుంసకుడైనా, పతితుడైనా, స్త్రీ మరొకర్ని ఆశ్రయించవచ్చునని అధికారం యివ్వబడింది. అదేవిధంగా,

'అష్టవర్షా ణ్యుపేక్షేత బ్రాహ్మణీ ప్రోషితం పతిమ్,
అప్రసూతాతు చత్వారి పరతోన్యం సమాశ్రయేత్.'

భర్తచేత విడువబడ్డ బ్రాహ్మణస్త్రీ సంతానవతి అయితే ఎనిమిదేళ్లూ, కాకపోతే నాలుగేళ్లూ వేచిఉండి, తరువాత మరొక పురుషుణ్ణి ఆశ్రయించమని పరాశర వాక్కు. అలాగే క్షత్రాణికి ఆరేళ్లూ, వైశ్యకాంతకి నాలుగేళ్లూ సంతానవతులకి, కాని వారికి మూడేళ్లూ, రెండేళ్లూ గడువుచూపించారు. శూద్రస్త్రీలకు అసలు కాలమే ఏర్పరచలేదు

ఈ అధికారాన్ని బట్టి నేను నాలుగుసంవత్సరాల్లో పునర్వివాహం చేసుకోదలిచాను. ఈ, నా ప్రయత్నానికి మీరు అడ్డుతగలకూడదు. అథవా, ప్రతిష్ఠకోసం నన్నీ ఉద్యమంలోంచి నిరోధించదల్చుకొంటే, మీరు, ఇక దుష్పథాన్ని నడవననీ, నా సతీత్వాన్ని నిలబెడతాననీ న్యాయస్థానంలో ప్రతిజ్ఞచేయగలరా? అట్లయితే సరి.

దయఉంచండి,
విశాలాక్షి."

## 3

రోజులు గడిచిపోతున్నాయి. వాసుహృదయంలో విశాలరూపం పూర్తిగా చెరిగిపోయింది. ఇప్పుడు అతను నిర్విచారి. విశాలవ్రాసిన ఉత్తరాన్ని ముక్కముక్కక్రింద చింపిపారేశాడు హైందవసతికి పునర్వివాహయత్నం కలలోమాట అనుకొన్నాడు. ఇదంతా బెదిరింపని ఒక్కనవ్వు నవ్వాడు. కాకపోతే, మనోవర్తికోసం దావాచేస్తుంది, చేస్తే, అనిమాత్రం అనుకొని ఊరుకొన్నాడు. అంతవరకూమాత్రం ఎందుకు రానియ్యాలని వెంటనే అయిదువందలరూపాయిలు మనియార్డరు చేశాడు, విశాలకి, ఏటా అయిదువందల చొప్పున ఇస్తూఉంటానని కూపనులో వ్రాసి. విశాల అనుకున్నంతా చేస్తుందని అతను నమ్మనేలేదసలు.

విశాలమట్టుకు ఆమనియార్డరు తృణీకరించి త్రిప్పేసింది.

నాలుగోసంవత్సరం దాటింది. విశాల లోలోపల వియోగాగ్నికి తపిస్తూనే ఉంది. పసుచుదనపు వేడినెత్తురు వాసులో అలా పొంగుతూనేఉంది. అతనికి స్మృతికి తెచ్చుకుందామన్నా విశాల రావడమే లేదు. కాని, విశాల తన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలని దృఢనిశ్చయం చేసుకుంది. ఆమెకోరికలు ఫలించాయి.

బిందుమాధవరావు నవయువకుడు, ప్రేమపిపాసి, ఉన్నతమైన ఆదర్శాలు కలవాడున్నూ. కొలదిరోజుల్లోనే విశాలాబిందుమాధవుల వివాహం మహావైభవంతో జరిగింది. స్త్రీ పునర్వివాహం అందరికీ కొత్తగానూ, విడ్డూరంగానూ ఉంది. వితంతు వివాహంలో అంతఆశ్చర్యం లేదు. అగ్నిసాక్షిగా పెద్దల ఆధ్వర్యంతో వివాహమాడిన భర్త సజీవుడై ఉండగా, ఈవిడ తిరిగి పెళ్లిచేసుకోవడం ఆశ్చర్యంకాదూ! పైగా, ఈ వివాహం రిజిష్టరీ అయిందికూడా.

ఇక్కడ వాసుకి ఈసంగతి తెలిసింది. క్రోధానలంతో అతనిశరీరం నఖశిఖపర్యంతమూ మండిపోయింది. తనకూ, తన వంశానికీ, తన గౌరవానికీ మాయనిమచ్చ ఏర్పడిందనీ, దీని కంతకూ విశాలే కారకురాలనీ ఆమె మీద నిప్పులుకిమాడు; శపించాడు; ఎంతో మథన పడ్డాడు. పైగా విశాలమీద పగ, ప్రతీకారం, హృదయంలో తీవ్రయాతన, మహోగరళం జాగిరిలడం మొదలు పెట్టాయి. అబ్బా! ఎంత అవమానం! దుర్భరం.

చూడండి, తాను అర్ధాంగిని న్యూనతపరచి, క్షోభపెట్టి, అన్యకాంతతో వ్యభిచరిస్తే తప్పులేదు. నమ్ముకొన్న భర్తచేత నిష్కారణంగా, దారుణంగా నిరాకరింపబడీకూడా తనభార్య అన్యపురుషుణ్ణి చేసుకున్నందుకు కోడెతాచులాగా పగబట్టాడు. తనతప్పుకు ఆరట్లు లేవు. స్త్రీ బానిస. ఏమిటి ఈ అహంకారం! ఈ దురాగతం! తన కెంతవ్యథగా ఉందో, ఆమెను అవమానపరచినప్పుడు అంతవ్యథా ఆవిడమాత్రం పొందదూ! ఆ ఆలోచన అతని కున్ననాడు మరి ఒడుదుడుకులే ఉండవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంతవరకూ, ఐహికభోగాల్లో గ్రుడ్డిగా మునిగి తేలుతున్నంతసేపూ అతనికి ప్రపంచం ఆనందలీలా క్షేత్రం. ఇప్పుడో అంధకారమయం, నరకకూపం. తన ఉంపుడుకత్తెను చూచినపుడు స్త్రీహృదయం నవనీత సుకుమారం, ప్రణయామృతభరితమున్నూ. విశాలనుతల్చుకున్నప్పుడో, శిలాకర్కశం, చంచలం, విషపూరితం!

పులిమీద పుట్ర. బిందుమాధవరావు, విశాలా మరికొన్నాళ్లకు ఈవూరే వొచ్చి, వాసు మేడకు ఎదురుగా ఉన్న మేడలో కాపురం! ఇక వాసుక్రోధానికి మేరలేదు. గ్రామవాసు లందరూ విశాల నెరుగుదురు. వాసుతో ఆమె కాపురంచేస్తూఉండగా చూశారు. ఇప్పుడు బిందుమాధవరావుతో కాపురంచెయ్యడమూ చూస్తున్నారు. అందరి నాలుకల్లోనూ వాసు నలిగిపోతున్నాడు. "వాసుకన్నా బిందు అందమైనవాడూ, చిన్నవాడున్నూ. మీసకట్టే రాలేదూ" అనుకున్నారంతా.

పనికట్టుకుని ఈభూర్తదంపతులు ఈఊరు ఎందుకొచ్చినట్టు! పైగా ఎదురురొమ్ముమీద కుంపటెత్తినట్టు నాకళ్లయెదుట ఈనివాస మేమిటి! అని ఉడికిపోతున్నాడు వాసు.

రోజూ, విశాలాబిందుమాధవులు తెగించి, నిస్సంకోచంగా సాయంత్రమప్పుడు సవిలాసంగా విహారానికి వెళ్లొస్తున్నారు. వాసు దివాంధంలాగా పగలు మేడదాటిరావడమే మానుకున్నాడు.

హోరున వర్షం కురుస్తోంది. సాయంత్రం నాలుగుగంట లవుతుంది. వాసు ఎందుకో కిటికీ తెరిచాడు. ఎదురుగా ఉన్న మేడమీదకి అప్రయత్నంగా దృష్టి పరుగెత్తింది. బాల్కనీలో ఇద్దరు వ్యక్తులు కన్పించారు. చూడలేక వాసు కిటికీతలుపులు బఘాలున వేసేశాడు. కాని, హృదయం తిరిగి ఆవైపుకు చూడాలనే ఉరకవేసింది. క్రోధం, పగ వెంటనే పడగలువిప్పాయి. తలుపు కొంచెంతెరిచి సందులోంచి చూశాడు. ఏముంది? విశాల బిందుమాధవరావు బాహువుల్లో ఒదిగిఉంది. బిందు ఆమెపెదవులమీద..........

.........వాసు కళ్లుమూసుకున్నాడు క్రోధాగ్ని నరాల కెక్కిపోయి; ఒళ్లు తెలియక, బోనులోనుంచి వెలువడ్డ సింహంలాగా, ఒకలిప్తలో మేడమెట్లు దిగి, ఆమేడపైకి చేరుకున్నాడు. ద్వారాలన్నీ తెరిచే ఉన్నాయి. ఇతని రాక ఆనూతనదంపతులు చూడనట్టే ఉన్నారు. ఇరువురూ అవ్యక్తానందంలో ఉక్కిరిబిక్కిరై ఉన్నారాయెను.

వాసు ప్రచండవాతూలహతికి చలించిన మహావృక్షంలా కదిలిపోయాడు. కళ్లు మందారపువ్వుల్లాగున్నాయి.

అహో! ఒక్కదూకున బిందుమాధవరావు మీదకు లంఘించాడు. ఇద్దరూ తెప్పిరిలినట్టు లేచారు. ఎదురుగా మూర్తీభవించిన క్రోధం, వాసు ఘూర్ణిలుతూ నిలబడ్డాడు. విశాల నిర్లక్ష్యంగా నవ్వింది. బిందు మాధవరావు "నీకేంపని ఇక్కడ. పో అవతలకి. ఏకాంతప్రదేశంలోకి రావచ్చా ఇలాగ. బుద్ధిలేదూ?" అని గద్దించాడు.

వాసు పిడికిలిబిగించి "చూడు. మీయిద్దర్నీ నలిపి పారెయ్యడానికే వచ్చా" అంటూ కలియపడ్డాడు బిందుమీద.

ఈ మల్లయుద్ధంలో బిందు చొక్కా చినిగిపోయింది. అరెరే! వాసు దూరంగా నిలబడిపోయాడు. ఇది నిజమా, కలా అనుకొన్నాడు. కళ్లు తిరిగిపోతున్నాయి. అలా గోడమీదకి ఆనుకున్నాడు.

బిందుమాధవరావు పురుషుడుకాడు, స్త్రీ. విశాల మేనత్తకూతురు సత్యవతి. వాసు నిర్విణ్ణుడై నోట మాటలేకుండా అలా చూస్తున్నాడు.

బిందు, కాదు సత్యవతి "ఏం, రా! జంకిపోయావేం" అని సవాలుచేసింది. వాసు అలా అలా ఆమెపాదాలమీదకి ఒరిగిపోయాడు.

"ప్రాయశ్చిత్త మైంది. విశాల ఇక నాతనువులో హత్తుకుపోతుంది. విశాలా, క్షమించు" అన్నాడు, చెమ్మగిలిన నయనాలతో.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తంజావూరు నాయకరాజాస్థాన సంస్కృతాంధ్ర కవులు ౪

కురుగంటి సీతారామయ్య, యం. ఏ.

### 3. రత్నఖేట శ్రీనివాసదీక్షితుడు౧

ఈయన యప్పయ్యదీక్షితుని మామయని వెనుక మనకు తెలియును. విజయనగరసామ్రాజ్యము భిన్నమైనతరువాత దక్షిణహిందూస్థానమునందలి చిన్న రాజ్యము లన్నియు స్వతంత్రములై యవియు సమస్త రాజమర్యాదలతో నుండెను. అట్టి స్వతంత్రరాజ్యము లలో జింజి యొకటి. ఈజింజియు దక్షిణఆర్కాటు జిల్లాలో దక్షిణమున తంజావూరుమండలము సరిహద్దుగా నుండెను. ఈజింజిని క్రీ. శ. ౧౫౫౦ మొదలు ౧౫౭౫ వరకు సూరప్పనాయకు డనునాయన యేలుచుండెను. ఈయనయాస్థానమున శ్రీనివాసదీక్షితుడు కవీశ్వరుడుగా నుండెను. ఈయనయు కొంచెమెచ్చుతగ్గగా నప్పయ్యయంతటివాడై సర్వతంత్రస్వతంత్రుడును, కృతవిశ్వజిదాదిసమస్తయాగుడును అయియుండెను. వీరిద్దరి వంశములును శ్రీటి. యస్. కుప్పుస్వామిశాస్త్రిగారు వాణీవిలాసముద్రణాలయముచే ప్రచురింపబడిన రాజచూడామణియానందరాఘవముయొక్క పీఠికయం దిచ్చినారు. సూరప్పనాయకుని తండ్రిపేరు పోతనాయకుడు. దివాకరభైరవులను నిద్దరు తమ్ములీయన కుండిరి.౨ శ్రీనివాసదీక్షితునిది యప్పయ్యదీక్షితకుటుంబమువలె మిక్కిలి విద్వత్కుటుంబమై యీయనపూర్వులు బహుగ్రంథనిర్మాత లైయుండిరి.

"భవస్వామిభాష్యకర్తుః భవస్వామిసోమయాజినః షష్ఠః, అనవరతాన్నదాయినః ప్రబంధపరమేశ్వరస్య కృష్ణస్వామిపీఠేః పంచమః, అద్వైతచింతామణికర్తుః కుమారభవస్వామిసోమయాజినో నప్తా, సోమయాజినః కృష్ణభట్టస్య పౌత్రః, వైకుంఠఘంటామణేః పరమభాగవతస్య భవస్వామిభట్టస్య లక్ష్మ్యాశ్చ పుత్రః, విశ్వామిత్రవంశముక్తామణిః, కేశవపరివ్రాజకార్యచరణారవిందపరిచరణలబ్ధవిద్యాధిపత్యః." 3

---

౧. ఈయన సాక్షాత్తుగా తంజావూరాస్థానమునకు చెందకపోయినను, చెందిన రాజచూడామణిదీక్షితుని తండ్రియై, యప్పయ్యకు మామయై, చెవ్వప్పచేత పూజింపబడినందున నీయనకూడ నిచ్చట చెప్పవలసినవాడై యున్నాడు. ఏతద్వ్యాసరచనమునందు టి. ఆర్. చింతామణిగారు వ్రాసిన రుక్మిణీపరిణయపీఠికయు, టి. యస్. కుప్పుస్వామిశాస్త్రిగారురచియించిన కమలినీకలహంసనాటకపీఠికయు నుపకారకము లయ్యెను.

౨. పోతనాయకుడు = వెంగళాంబ









CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈయనది విశ్వామిత్రగోత్రము. ఈయనకు ముగ్గురు కుమాళ్లుండిరి. పెద్దకుమారునికి కేశవదీక్షితుడని తన గురు నామ ముంచుకొనెను.[1] రెండవ మూడవ కుమాళ్లు రెండవ భార్యసంతానము. ఈకుటుంబము యొక్క ప్రథమనివాసము జింజికి పశ్చిమముగా మూడుక్రోసుల దూరమున నున్న సత్యమంగలమను గ్రామము. ఈయన తన గ్రంథములన్నిటిలో సత్యమంగల శ్రీనివాసదీక్షితుడని చెప్పుకొనెను. ఆస్థానకవి యైనవెనుక సూరసముద్రమను[2] నగ్రహార మీయన కొసంగబడెను. అప్పటినుండి వీరి కుటుంబమీనూతనగ్రామము నివాసముగా నేర్పరచుకొనెను. కాని యీయన తన జన్మగ్రామము నెన్నటికిని మరువలేదు. "రత్నఖేట" పద మీయనకు పౌరుషనామము. ఈయన యలంకారస్ఫూర్తికొరకై యీక్రింది శ్లోకమున నుపయోగించిన రత్నఖేటపద మీయనకు తరువాత బిరుద మయ్యెను.

"అన్యోన్యసమరలీలా
లాలస పూర్వాపరాద్రికూరాభ్యామ్,
ధృతరత్నఖేటశంకాం
తన్వాతే సుమఖి పుష్పవద్బింబా." 3
(భావనాపురుషోత్తమము, అం. ౪).

ఈయన కావ్యనాటకకర్తయేకాక పూర్వోత్తర మీమాంసాశాస్త్రములను, అలంకారశాస్త్రమునందును దిట్టయై యనేకగ్రంథముల రచియించెను. ఈయనకు షడ్భాషాపాండిత్యముకూడ కలదు. ఈయనయు మొత్తమున ౧౦౪ గ్రంథములను రచియించెనట.[4]

ఈయన వయసున నప్పయ్యకంటె పెద్దవాడు. గోవిందునికంటె పెద్దవాడని వేర చెప్ప ననావశ్యకము. ముగ్గురు దీక్షితులును మూడాస్థానముల నుండి పేరవారికి భీతిగొల్పుచుండిరి. కాని గోవిందుని ప్రేరణమున తంజావూరునవలె జింజివేలూరులయందు తదాస్థానపండితమతేతరపండితులకు గౌరవము లేకపోయెను. ఈయన రచియించిన భావనాపురుషోత్తమనాటకమునం దీశ్లోకము కలదు:

"సర్వధారిసమే మీనమాసే రాకాతిథౌ దినే,
ఉత్తరర్క్షే రవిదినే సమాప్తం నాటకం పరమ్."

దీనిని లెక్కవేసిన క్రీ. శ. ౧౫౭౭ సంవత్సరము. దీనినిబట్టి యప్పటివరకు శ్రీనివాసుడు బ్రతికి యుండెడనియు,[5] నీశ్లోకము నాటకము వ్రాసినవానిదిగాని రచయితదికాదనియు చెప్పుచున్నారు. అప్పయ్యకంటె

---

౧. "యః శ్రీకేశవయోగివర్య చరణా
ద్వయం పూర్ణపాత్రాత్మనా
మంత్రం సిద్ధ మవాప్య దివ్య మథ త
త్సిద్ధౌ తపస్యన్ పునః,
నిత్యాన్యుక్షిత దేవతాం జగ దిదం
కర్తుంచ హర్తుం క్షమాం
సిద్ధిం ప్రాప్య నిజాన్వయే నిజసుతా
గ్రేయేషు తస్యాభిధామ్."
(రుక్మిణీపరిణయ వ్యాఖ్యానము)

౨. సూరప్పనాయకుని పేరా గ్రామమున కుంచబడెను. తల్లిదండ్రుల పేర్లుకూడా పోతసముద్ర వెంగళాంబాపురములను పేర్లతో నగ్రహారముల నిచ్చెను.

3. "సంధ్యాసంధుక్షితాంభోధర నళికగణా
దుద్గతాన్ సీసఖండాన్
తారాకారా న్నిరోద్ధుం శశిరవికపటా
ద్బిభ్రతో రత్నఖేటౌ,
అన్యోన్యం యుధ్యమానా వుదయచరమ భూ
భృత్పతీవీరా వితి ద్రా
గుక్త్యా ఖ్యాతాపరాఖ్యః క్షితిపతివచసా
రత్నఖేటాధ్వరీతి." (రుక్మిణీపరిణయవ్యాఖ్య)

౪. కమలినీకలహంసపీఠిక, పుట ౧. "కర్తా భావనాపురుషోత్తమనాటకా ద్యష్టాదశ రూపకాణాం, నిర్మాతా శతకంధర విజయాదిషష్టి కావ్యానాం, ప్రణేతా సాహిత్యసంజీవన్యాద్యలంకార గ్రంథానాం, అధాతా వేదాంత రత్నావళీ వాద తారావళీ మధ్వవిధ్వంస బౌద్ధవిధ్వంసన మణిదర్పణ అద్వైతకౌస్తుభాదీనాం..."

౫. "పరంతు పద్య మిదం గ్రంథకార స్యాహోస్విల్లేఖకస్యేతి నవిజానీమః."
(కమలినీకలహంసపీఠిక, పుట ౪)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీనివాసదీక్షితుడు పదియేండ్లు పెద్దవాడై యుండవలెను. అప్పయ్యకు చిన్నతనములోనే వివాహమైనట్లు మనకు తెలియును. అప్పటి కీయనకు 30 యేండ్లున్నట్లు తలచినను క్రీ. శ. ౧౫౮౪ నాటి కీయనకు ౮౪ సంవత్సరము లుండును. అప్పటికి నాటకము వ్రాయుశక్తి యుండుట కష్టమే కాని గట్టిగా చెప్పుటకు వీలులేదు.[౧] కాని ౮౪ సంవత్సరములు వచ్చువరకు బ్రతికియుండెననుమాట నిజమని తోచుచున్నది. ఈయన చనిపోవునప్పటికి రాజచూడామణి దాదాపు ౧౦ సంవత్సరముల పిల్లవాడై యున్నట్లు వ్రాయుచున్నారు.[౨] ఈయన రాజాశ్రయము క్రీ. శ. ౧౫౮౫ సంవత్సరమున నంతమొంది యుండును. ఏలన నాసంవత్సరమున సూరప్పనాయకుడు చనిపోయెను. తరువాత జింజికి రాజైన కృష్ణప్పనాయకుడు క్రీ. శ. ౧౫౮౪ సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఈమధ్యకాలములో నెవ్వరేలిరో చెప్పుటకు వీలుగాకున్నది. కృష్ణప్ప బహుశః సూరప్ప తమ్ముని కుమారుడై యుండును. కాని యే తమ్ముని కుమారుడో చెప్పజాలము. ఈయన కడుదుర్మార్గుడు. పినతండ్రి గ్రుడ్లు పీకించి తాను రాజ్యమునకు వచ్చినట్లు శ్రీకృష్ణస్వామయ్యంగారు చెప్పుచున్నారు.[3] కావున సూరప్పమరణముతో శ్రీనివాసదీక్షితుని సంస్థానస్థిత్యంతమని కూడా చెప్పనగును. తరువాత నీ కుటుంబము తంజావూరువచ్చి చేరినట్లు కన్పట్టును. చెవ్వప్ప యీయనను కూడా పూజించెను. శ్రీనివాసదీక్షితుడు తన తుదిదినములు తంజావూరులో గడపియుండును. కాని ఇచ్చట గట్టిగా చెప్పజాలము. ఈయన పెద్దకుమారుడగు కేశవదీక్షితునిగూర్చి యెక్కువగా తెలియదు. రెండవవాడగు నర్ధనారీశ్వరుడు పండితుడై మంత్రశాస్త్రప్రవీణుడైనట్లు కన్పట్టును. రాజచూడామణి చిన్నవాడగుటచే నాయనకు విద్యగరపుభారము సోదరుడగు నర్ధనారీశ్వరునిపై బడెను.[౪] ఈయర్ధనారీశ్వర దీక్షితుడు కాళిదాస కృతమగు "అంబాస్తవము"నకు వ్యాఖ్యానమును వ్రాసినట్లు కన్పట్టును కాని యీగ్రంథ మెచ్చటను లభించుటలేదు. ఈగ్రంథము ఆర్. కృష్ణస్వామిశాస్త్రిగారివద్ద నున్నట్లు చింతామణిగారు తమ రుక్మిణీపరిణయ పీఠికలో వ్రాసినారు.[౫]

---

౧. ఇచ్చట నీక్రిందినిత న్నాటకమునందలి శ్లోకము వారి యూహను బలపరచుచున్నది:

"తత్రాస్తి కశ్చి త్తరుణాగ్నిహోత్రీ
షడ్దర్శనీసాగరపారదృశ్వా,
శతావధానీ త్యపరాభిధాన
శ్శ్రీ శ్రీనివాసాధ్వరిసార్వభౌమః"

కావున నీనాటకము రచియించినప్పటికి "తరుణాగ్నిహోత్రి" యైయుండెను. దీనివలన వెనుకటి "సర్వధారిస మే" యనుశ్లోకము వ్రాయసకానిది యని నిశ్చయము. చింతామణిగారు ౧౬-వ శతాబ్దిపూర్వార్ధమున మించి యీయన జీవించియుండడని చెప్పుమాటను స్వీకరించుటకు వీలులేదు.

౨. Introduction to Rukminiparinaya. P. XVI.

3. Sources of Vijiayanagar History, P. 272.

౪. "అధీత్య నిఖిలం శాస్త్ర మగ్రజా దీశ్వరేష్టినః"
(కావ్యదర్పణము).

౫. "Elder brother and teacher of Rajachudamani, he (Arthanarisvara) is the author of Ambastavatika. A complete manuscript of this work exists in my family collection. It is a commentary on Ambastava (one of the Pancastavi attributed to Kalidasa.). It is an elaborate work bringing out various aspects of higher Sri Vidya Cult. It may be noted that Ratnakheta was a devotee of Sri Vidya. The information regarding the literary works of Ratnakheta and his ancestors, given in the colophons of Ambastavatika tallies with what is mentioned by Balayajna Vedesvara (Commentator of Rukminiparinaya)."

(Rukminiparinaya Introduction, P. XVI)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీకృష్ణస్వామిశాస్త్రిగారు మానవజీవితములు శాశ్వతములు కావనియు, జ్ఞానమునకు దానము ఫలమనియు నెంచి తత్పుస్తకమును తమ పేటికయందుంచుకొని తుదకు చెదపురుగుల కిచ్చుటకంటె ప్రచురించి లోకోపకారము చేయుదురుగాక! తృతీయకుమారుడగు రాజచూడామణినిగూర్చి మున్ముందు చెప్పగలను. ఈ శ్రీనివాసదీక్షితునకు "అభినవభవభూతి" యనియు, "కవివాదిగజకేసరి" యనియు బిరుదులుండెను. ఈయన ప్రతిదిన ప్రబంధనిర్మాణదక్షుడై యుండెను.౧ ఈయనకు వెనుక నారవతరమువాడగు భవస్వామినిగూర్చి కొంత వాదము కలదు. భవస్వామి యనుపేరు గలవారు సంస్కృతవాఙ్మయమున నిద్దరు కలరు. ఒకభవస్వామి తైత్తిరీయసంహితకు భాష్యమును రచియించినట్లు భట్టభాస్కరుడు తన భాష్యములో వ్రాసినాడు.౨ మరియొకభవస్వామి "బోధాయనశ్రౌతసూత్రవివరణము"ను వ్రాసెను. బర్నెలు పండితుడు వీరిద్దరు నొక్కే వ్యక్తియని యభిప్రాయపడినాడు. కాని చింతామణి గారు దీనిననుమానించుచున్నారు. వారనుమానించుట కెట్టికారణమును చూపుటలేదు. ఈభావస్వామియే మన శ్రీనివాసుని పూర్వుడైయుండునని నాయభిప్రాయము. ఈవంశమునతప్ప నీపేరితరత్ర యెచ్చటను కానరాదు. మరియు నీపేరీవంశమున పరంపరానుగతముగాకూడా యున్నది.

తరువాత నీయనముత్తాతయగు కుమారభావస్వామి అద్వైతచింతామణియను నద్వైతగ్రంథమును వ్రాసినట్లున్నది. ఈగ్రంథ మెచ్చటను లభించియుండలేదు. శ్రీనివాసుని తండ్రిబిరుదముమొదలైనవియాలోచించిన నీయన హరికథకుడాయని తోచుచున్నది. ఈశ్రీనివాసదీక్షితుడు రచియించిన గ్రంథములలో దాదాపు ౧౫ మాత్రము పేరులు మనకు తెలియును.3 వీనిలో భావనాపురుషోత్తమనాటకము తంజాపూరుగ్రంథాలయమున తాళపత్రలిఖితము కలదు.౪ వేదాంతవాదావళి యనుగ్రంథముయొక్క ప్రతియొకటి చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున కలదు. దానిలోని యీక్రిందిశ్లోకమువలన నది యీయనగ్రంథమే యని స్పష్టముగా చెప్పవచ్చును:

"షడ్భాషాసార్వభౌమస్య
శ్రీనివాసస్య యజ్వనః,
వాదావళి రియం విద్వ
త్కర్ణభూషాయతాం చిరమ్."

భైష్మీపరిణయకావ్యముకూడా చెన్నపురిప్రాచ్యలిఖితగ్రంథాలయమునకలదు. మణిదర్పణమను నొక న్యాయశాస్త్రగ్రంథము తిరువాన్కూరుసంస్కృత గ్రంథావళిలో రాజచూడామణిదిగా ప్రచురింపబడినది.

---

౧. "కవివాదిగజకేసరీ భట్టాచార్యః, ప్రతిదిన ప్రబంధకర్తా, తత్తాదృశసకలవిద్యా చమత్కృత వాద వ్యాఖ్యానోపన్యాస కౌశలేన చోళవల్లభే నాస్థానీరచిత పత్రావలంబః, షడ్భాషాసార్వభౌమః, సర్వతంత్ర స్వతంత్రః, శ్రీమదభినవభవభూతి రత్నఖేట శ్రీనివాసాధ్వరీంద్రః."(భావనాపురుషోత్తమనాటక ప్రస్తావన.)

ఈనాటకము ప్రబోధచంద్రోదయమువంటి యద్వైతసిద్ధాంత ప్రతిపాదక మగు నాటకము. పై యనువాదములోని చోళవల్లభపదము చెవ్వప్పను గూర్చి యని మహాలింగశాస్త్రిగా రభిప్రాయ పడుచున్నారు.

J. O. R. Madras, Vol III, P. 158.

౨. వాక్యార్థైకపరా హ్యధీత్య చ భవస్వామ్యాదిభాష్యాణ్యతో, భాష్యం సర్వపథీన మేత దధునా సర్వీయ మారభ్యతే."
(తైత్తిరీయసంహితాభాష్యము ప్రస్తావన).

3. (౧) అద్వైతకౌస్తుభము, (౨) వాదతారావళి, (3) మధ్వవిధ్వంసనము, (౪) బౌద్ధతంత్రమథనము, (౫) వేదాంతవాదావళి, (౬) మణిదర్పణము, (౭) సమయసర్వస్వము, (౮) విధినిర్ణయము, (౯) తత్త్వపరిశుద్ధి, (౧౦) స్మృతిరత్నప్రదీపము, (౧౧) భావనాపురుషోత్తమనాటకము, (౧౨) శితికంఠవిజయము, (౧3) సాహిత్యసంజీవని, (౧౪) భావోద్భేదము, (౧౫) రసార్ణవము, (౧౬) భైష్మీపరిణయము.

౪. Tanjore Skt. Catalogue, Vol. VIII P. 3440.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాబట్టి యీ పేరున ఆయనకూడా మరియొక గ్రంథమును రచియించినట్లు చెప్పవలెను. ఈరెంటిని పొరపడ గూడదు. మిగిలిన గ్రంథము లిప్పటివరకు నెచ్చటను లభింపలేదు. కాని వాని పేర్లవలన మీమాంసాశాస్త్రము, అలంకారశాస్త్రము, స్మృత్యర్థనిర్ణయము మొదలగు ననేక విషయములపై ఈయన గ్రంథములను రచియించినట్లు తేటపడగలదు. మరియు బౌద్ధాదిమతఖండనములుకూడా వ్రాసెను. గ్రంథప్రచురణమున నీయనగ్రంథములకంటె అప్పయ్యగ్రంథము లధికసంఖ్యాకములు ప్రచురింపబడి నవి. ఈయనశైలియు మృదుమధురమై యప్పయదాని యంత భావగాంభీర్యము లేకపోయినను నలంకారోప శోభితమై యొప్పారుచున్నది. గోవిందుని ధార యీయ నకవిత్వమందు లేదుగాని గోవిందునికంటె శైలిలో పటుత్వ మెక్కువగా నున్నది.౧ ఈయనకు శ్రీహర్షు డన్న నెక్కుడభిమానమని తోచును. ఏలన నొక్కొ కచో నాయనయొక్క భావముల నున్నవియున్నట్లు పద్యగర్భితముల చేసినాడు. మాదిరికి రెంటిని చూపుదును :

“ మధ్యేకౌస్తుభ మాత్మనః ప్రతికృతిం
　　దృష్ట్వా పరాశంకయా
కోపే నానతకంధరా పదనఖా
　　దర్శే పతిం బింబితమ్,
మత్వా పాదనతం ప్రహృష్టపులకా
　　దాక్షిణ్య లజ్జానతీ
సవ్రీడాస్మితమానబంధురముఖీ
　　శ్రీరస్తు వశ్శ్రియసే.” ౨

ఈక్రింది శ్రీహర్షశ్లోకమును చూడుడు :

“ ధూమవ్యాకులదృష్టి రిందుకిరణై
　　రాహ్లాదితాక్షీ పునః
పశ్యంతీ వర ముత్సుకా నతముఖీ
　　భూయో హ్రియా బ్రహ్మణః,
నేత్రాగ్ర్య పాదనఖేందుదర్పణగతే
　　గంగాం దధానే హరే
స్పర్శాదుత్పులకా కరగ్రహవిధౌ
　　గౌరీ శివాయాస్తు వః. ” ౩

“ సుధారసకిరో గిరః సురభయంతి విశ్వం కవేః
సభాపతి రసౌ నృప స్సహృదయాగ్రణీ స్సారపః,
పరిస్ఫురితభావనా భగవతః కథా పావనీ
పచేళిమపరిశ్రమాః పర మమీ వయంనాటకే. ౪

ఈక్రింది శ్రీహర్షశ్లోకమును పరిశీలింపుడు :

“ శ్రీహర్షోనిపుణః కవిః పరిషదప్యేషాగుణగ్రాహిణీ
లోకే హారిచ వత్సరాజచరితం నాట్యేచ దక్షా వయమ్. ”౫

ఇట్టి విద్వత్కవినిగూర్చియు, తచ్ఛక్తిని గూర్చి యు నీక్రిందిచాటుపద్య ముద్భవించుట యొకవింతకాదు:

“ విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చలే
సపత్నజిత్యయత్నమేవ రత్నఖేటదీక్షితే,
బృహస్పతిః క్వజల్పతి ప్రసర్పతి క్వసర్పరా
డసన్ముఖశ్చ షణ్ముఖ శ్చతుర్ముఖశ్చ దుర్ముఖః ”

## ౪. విజయీంద్రభిక్షువు

పండ్రెండవ శతాబ్దము వేదాంతశాస్త్ర వ్యాపన మున కత్యుచ్చకాలము. ఇదివరలో శంకరాచార్యస్థాపిత మైన యద్వైతము మీమాంసాసిద్ధాంతమును, బౌద్ధసిద్ధాం తమును జయించి యాసేతుహిమాచలమును నేకచ్ఛత్ర ముగ నేలుచుండెను. వీతద్వ్యాపనము పాషండశైవ వైష్ణవమతములకు కంటకముగా నుండెను. వీనిలో శైవము నదివరకే నీలకంఠుడు బ్రహ్మసూత్రములకు

౧. ఒక్కొకచో నీయనకవిత్వము నారికేళ పాక మనిపించును.

౨. భావనాపురుషోత్తమనాటక ప్రస్తావన.

౩. ప్రియదర్శిక-ప్రస్తావన.

౪. భావనాపురుషోత్తమనాటక ప్రస్తావన.

౫. ప్రియదర్శిక ప్రస్తావన.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాష్యములను వ్రాసి తన్మతమునకు వైదికమత గౌరవమును తెచ్చెనని కొందరు తెల్పుచున్నారు.౧ ఆగమవైష్ణవముమాత్ర మీయద్వైతముయొక్క దెబ్బకు తాళజాలకుండెను. ఇంతలో నొకప్రక్కనుండి రామానుజుడును, మరియొకవంకనుండి మధ్వాచార్యుడును వెడలి యద్వైతముపై దండువెడలిరి. ఇద్దరును ౧౨-వ శతాబ్దమునందు వరలినవారే కాని వీరిలో రామానుజునికంటె మధ్వాచార్యు డర్వాచీనుడు. ఈమధ్వాచార్యులుమాత్ర మద్వైతమునకు గర్భశత్రువు. రామానుజుడు శంకరుని బౌద్ధుడన మధ్వాచార్యు లాయనను నిత్యబద్ధులలో చేర్చి యాయన కెన్నటికిని నిర్వాణమనునది లేదనియు, నిత్య నరక మనియు చెప్పెను. ఈయన జననము క్రీ. శ. ౧౧౧౮ సంవత్సరమున నని కొందరును, ౧౧౯౯ సంవత్సరమున నని మరికొందరును, ౧౨౩౮ సంవత్సరమున నని యింకకొందరును చెప్పుచున్నారు. వీనిలో రెండవ తేదికి శాసనాధారములున్నట్లు కనపడును.౨ కాని యీకాలనిర్ణయముతో నిచ్చట మనకంతగా పనిలేదు. శంకరరామానుజులవలెనే యీయనయు తన మతప్రచారమునకై యొకగురుపీఠమును స్థాపించెను. మొదట నీపీఠ మొక్కటిగానే యుండెను. కాని యీయనతరువాత కొన్నితరముల కిది మూడుగా చీలెను. తన్మతానుయాయుల సంఖ్య యధికమగుటయు, వా రన్నిప్రాంతముల నుండుటయు దీనికి కారణము. అవియు దేశవిభాగముచొప్పున మతాధికారమును చెలాయించుచుండెను. ఇప్పటికిని తత్పీఠత్రయ మున్నది.౩ ఈగురుపరంపరలో మధ్వాచార్యులతరువాత నాయన గ్రంథములకన్నిటికిని జయతీర్థులు వ్యాఖ్యానములను రచియించిన విద్వత్సన్న్యాసి. వ్యాసరాజు, లేక వ్యాసతీర్థుడుకూడా గొప్పపండితుడే. రెండవమతాధిపతి యుత్తరదేశమును జయించుటచే నాపీఠమున కాపేరు వచ్చెనట! మూడవదియగు సుమతీంద్రమఠగురుపరంపరలోనివాడే విజయీంద్రభిక్షువు. ఈయనకు విజయీంద్రతీర్థుడనికూడా పేరు కలదు. ఈయనజయంతి ప్రతివత్సరము జ్యేష్ఠబ. త్రయోదశీతిథిన వచ్చును. ఈయన

---

౧. కాని యీసందర్భమున టి. ఆర్. చింతామణిగారి వ్యాసములను చూడవలెను.

(J. O. R. Madras, Vol. I.)

౨. భండార్కరుగారు క్రీ. శ. ౧౧౯౯-వ సంవత్సరములోనే చనిపోయినట్లు వ్రాసెనుగాని యిది తరువాత సమూలముగా విమర్శింపబడి కాదని నిర్ధారణము చేయబడినది.

Bhandarkar's report 1882-83. Pp 16-19,202-208.

క్రీ. శ. ౧౨౨౮ ప్రాంతమున శృంగేరిపీఠాధ్యక్షుడగు విద్యాశంకరుని కీమధ్వాచార్యుడు సమకాలికుడనియు, నంతకంటె చిన్నవాడనియు చెప్పుచున్నారు వీరిద్దరికిని వాగ్వాదము జరిగెనట! మధ్వాచార్యులు వ్రాసిన భారతతాత్పర్యసంగ్రహములో తన జన్మదిన మిచ్చియున్నాడు. కాని యీయంశము సిద్ధాంతమైనట్లు చెప్పజాలము.

౩. మధ్వాచార్యులు (ఆనందతీర్థులు)
|
పద్మనాభతీర్థులు
|
నరహరితీర్థులు
|
మాధవతీర్థులు
|
అక్షోభ్యతీర్థులు
|
జయతీర్థులు
|
విద్యాధితీర్థులు
|

| | | |
|---|---|---|
| వ్యాసరాయ మఠము (౧) | ఉత్తరాది(జి) మఠము (౨) | సుమతీంద్ర మఠము (౩) |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గురుశిష్యపరంపరనుకూడా కొంతవరకు క్రింద పొందు పరచుచున్నాను.[౧]




ఈయన క్రీ.శ. ౧౫౬౫-వ సంవత్సరమున జరిగిన తాలికోటయుద్ధమున పోరినట్టియు, కృష్ణరాయల యల్లుడైనట్టియు నళియరామరాయలకు సమకాలికుడై యాయనచేత కనకాభిషిక్తుడయ్యెను.[3] కావున నప్పటికి వయస్సుమీరిన సన్యాసియై యుండవలెను. ఈయన పదవాక్యప్రమాణపారవారపారీణుడును, బహుగ్రంథనిర్మాతయు నైయుండెను.[౪] ఈయన పాండిత్యమునందును, గ్రంథరచనమునందును నప్పయ్యదీక్షితున కెడమచేయిగా నుండునని చెప్పుట యబద్ధము కానేరదు. అప్పయ్యదీక్షితునికంటె వయసులో నేమాత్రమైనకొంచెము పెద్దవాడనికూడా చెప్పవచ్చునని తోచుచున్నది. కాని యప్పయ్యకంటె చిన్నవాడు కాడు. విజయీంద్రుడు తంజావూరున పూజింపబడునాటికి విజయనగరమున వెంకటపతిరాయల యన్నయగు శ్రీరంగరాయలు పాలించుచుండెను. అనగా క్రీ. శ. ౧౫౮౫-వ సంవత్సరమునకు పూర్వమని యర్థము. ఈ శ్రీరంగరాయలు క్రీ. శ. ౧౫౭౪—౧౫౮౫ ల మధ్య రాజ్యముచేసెను. ఈయనకు చెవ్వప్ప గ్రామము దానమిచ్చిన శాసనమున శ్రీరంగరాయలపేరు కలదు. మరియు నది క్రీ. శ. ౧౫౭౬ సంవత్సరమునకు చెందియున్నది.[౫] ఈ సంవత్సరము వరకు చెవ్వప్ప జీవించియుండెనని దీనివలన స్పష్టమగుచున్నది. క్రీ.శ. ౧౫౭౨-వ సంవత్సరమున చెవ్వప్ప చనిపోయెనని చెప్పు కొందరుచరిత్రకారుల వ్రాతల నీ విషయము పూర్వపక్షము చేయుచున్నది.[౬] అప్పటికి గోవిందదీక్షిత మంత్రిత్వ నియామక మైయుండును. కావున నీయనపూజ తంజావూరుసంస్థానముయొక్క సర్వమతసమదృష్టిని తెలియజేయును. ఇంకముందు తంజావూరునకు మంచిదినము లున్నవియని యీవిషయము సూచించుచున్నది. విజయనగరరాజ్యమున నళియరామరాయల కాలమున వీరవైష్ణవము కాలుపెట్టెను. దానికి తాలికోటయుద్ధము ఫలము. తిరుమలరాయలు తరువాత మరల సర్వమతసమత్వమును కొంతవరకు నెలకొల్పెను. అందువలననే సామ్రాజ్య మింకను కొలదివత్సరములవరకు మనుటకు కారణమయ్యెను. అప్పయ్య చెవ్వప్పచేత పూజింపబడిన కాలము నిదియే. అళియరామరాయ లీ విజయీంద్రునకు కొన్ని యగ్రహారముల నిచ్చెనట!

---

౧. "ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీమత్సురేంద్రతీర్థపూజ్యపాదానాం శిష్యేణ విజయీంద్రభిక్షుణా విరచితే......"

(న్యాయామృతవ్యాఖ్యానము.)

౨. ఈరాఘవేంద్రస్వామి తంజావూరున సిద్ధి పొందెను. ఆయనసమాధి యీయూరకలదు. యాత్రికులు వచ్చి దర్శనముచేసుకొనుచుందురు. దానిని బృందావన మందురు.

3. Tanjore Skt. Catalogue, P. 6037.

"విద్వద్వరోస్మాద్విజయీంద్రయోగీ
విద్యాసు హృద్యాస్వతులప్రభావః,
రత్నాభిషేకాంకిల రామరాజాత్
ప్రాప్యాగ్ర్యలక్ష్మీన్ వకృతాగ్రహారాన్."

(రాఘవేంద్రవిజయము. ౨. ౨౧)

౪. "వాక్యే పదే పాదవిలోచననోక్తా
వ్యాసీయశాస్త్రే చ కృతాన్ ప్రబంధాన్,
ఆస్తాం బుధః శ్రోతు మశేష మేషా
మాఖ్యా స్సమాఖ్యాద్యతిపండితోఽసౌ."

(Ibid. 2. 22).

౫. J. O. R. Madras, Vol. III, P. 154.

౬. ఈవిషయమై నా "తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము"న విపులముగా చర్చించితిని.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మధ్వగ్రంథములుపరిశీలించిన నీ మధ్వసిద్ధాంతము న్యాయశాస్త్రముపై నాధారపడినట్లు తెలియగలను. వ్యాసతీర్థు లనునొక మధ్వయతి "న్యాయామృతి" మను నొక యద్వైతసిద్ధాంత విమర్శనరూపమగు గ్రంథమును రచియించెను. ఇందు న్యాయశాస్త్ర సిద్ధాంతములను గొని యద్వైతప్రతిపాద్యమగు నిర్గుణబ్రహ్మ మసంభవ మని సాధింపబడినది. మరియు మోక్ష మనునది నిర్గుణ బ్రహ్మపక్షమున నసాధ్యమని కూడా సాధింపబడినది. ఈ "న్యాయామృతము" మధ్వసిద్ధాంతమున కొక మిక్కిలి పట్టయిన గ్రంథము. తరువాతి మధ్వగ్రంథకర్త లీగ్రంథమును మిక్కిలి కొనియాడుచు దానిపై ననేక వ్యాఖ్యానములను రచియించిరి. ఈగ్రంథ మొక పెద్ద వాదగ్రంథవాఙ్మయమునకు బీజభూతమయ్యెను. నైయాయికసిద్ధాంతములనే కొని యద్వైతమతప్రచారకులలో నుత్తములలో నొకడగు మధుసూదనసరస్వతియనునొక పండితసన్యాసి "న్యాయామృతము"ను ఖండించుచు "నద్వైతసిద్ధి"ని వ్రాసెను. ఈ "యద్వైతసిద్ధి" యద్వైతసిద్ధాంతమున నొక యధికారపదవి నధిష్ఠించుచున్నది. తరువాత రామాచార్యు డను నొక మధ్వమతానుయాయి యద్వైతసిద్ధిని విమర్శించుచు న్యాయామృతమున కొక వ్యాఖ్యానమును "న్యాయామృతతరంగిణి" యను దానిని రచియించెను. అందుపై నాత్తరాహుడగు గౌడబ్రహ్మానందు డద్వైతసిద్ధిని సమర్థించుచు తరంగిణ్యుక్త సిద్ధాంతములను ఖండించుచు "లఘుచంద్రిక" యనుగ్రంథమును రచియించెను. దీనినే "గౌడబ్రహ్మానందీయ" మందురు. ఈ గ్రంథమును నద్వైతసిద్ధాంతప్రతిపాదక గ్రంథములలో నత్యుత్తమ శ్రేణి నలంకరించును. తనుపరి వనమాలిమిశ్రు డను నొక యాత్తరాహుడు తరంగిణిని సమర్థించుచు "సౌరభ" మను గ్రంథమును రచియించెను. తరువాత నీ "సౌరభము"ను పోషించుచు "న్యాయరత్నాకర"మను మరియొకగ్రంథము వెలసెను.[౧] తుద కీవాద మిట్టీవలివరకు జరుగుచునే యున్నది.

ఈయనకూడా పరశ్శతగ్రంథములను రచియించె నని వెనుక చెప్పియుంటిని. కాని తద్గ్రంథములలో పది కంటె పేర్లనుకూడా తెలియవు. మదరాసు విద్యాశాఖోద్యోగి యగు శ్రీ. ఆర్. నాగశర్మ యం.ఏ. గారీవిజయీంద్రుని గూర్చి ౧౯౩౨-వ సంవత్సరము జూను నెల ౩౦-వ తేదీ హిందూపత్రికలో నొక వ్యాసమును వ్రాసినారు. అందు క్రింద వివరింపబడిన గ్రంథములు తమకు లభ్యమైనట్లు వ్రాసినారు.

(౧) న్యాయామృతవ్యాఖ్య-ఆమోదము
(౨) మధ్వాధ్వకంటకోద్ధరణము
(౩) చంద్రికోదాహృతన్యాయవివరణము
(౪) పరతత్త్వప్రకాశిక
(౫) మీమాంసానయకౌముది

ఇవిగాక "తత్త్వమణిమాణిక్యదీపిక" యనుగ్రంథమును కూడా వ్రాసినట్లు తెలియుచున్న దని కూడ వ్రాసినారు. మరియు "న్యాయామృతము" నకు "లఘ్వామోదము", "గుర్వామోదము" నను రెండువ్యాఖ్యానములను రచియించినట్లున్నదని వ్రాసినారు. పైపట్టికలోని మొదటిగ్రంథమును "లఘ్వామోదము"గా నభిప్రాయపడినారు. కాని నాపరిశోధనలవలన పైన చెప్పినట్లు కంటె భిన్నముగా కన్పట్టుచున్నది. "లఘుగుర్వామోదములను గూర్చి గట్టిగా నేను చెప్పజాలనుగాని తంజా

౧. "శ్రీన్యాయామృతదూషణాయ
రచితా యాఽద్వైతసిద్ధిః పురా
తద్భంగాయ తరంగిణీ ప్రవవృతే
యాతామితాంయా సవ్యధాత్,
బ్రహ్మానందయతి ర్యతింపచమతి
స్తద్దూషణా యాధునా
కుర్వేఽహం వనమాలిసౌరభదిశా
శ్రీన్యాయరత్నాకరమ్."
(న్యాయరత్నాకరపీఠిక)

Triennial Catalogue of the Oriental Mss. Library 1913-16 Vol. II, P. 2288.

ఈ "సౌరభము"నకు "న్యాయామృతసౌగంధ్యము"నికూడా నామాంతర మున్నట్లు కన్పట్టుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూరున గల పుస్తకమునుబట్టి "కంటకోద్ధార"మనునది కూడా న్యాయామృతవ్యాఖ్యయే యని తోచును.౧ తంజావూరుపుస్తకపట్టికయందు కర్తృనామము కనబడుటలేదు. కాని మరియొక "కంటకోద్ధార" మితర గ్రంథకర్తచే రచియింపబడినది లేనందునను, నీ పుస్తకమున శ్రీశర్మగారు చెప్పినట్లు నారాయణుడే యుపనిషత్ప్రతిపాద్యమైన బ్రహ్మమని సిద్ధాంతీకరించుట చేతను, నీగ్రంథము తప్పక విజయీంద్రునిదేయనియు,నదికూడా న్యాయామృత వ్యాఖ్యానమే యనియు నేను నమ్ముచున్నాను. ఆమోదమనునది కూడా తంజావూరుపుస్తకాలయమున గలదు.౨ కావున నీరెండు గ్రంథములును శ్రీశర్మగారు చెప్పిన సురులఘ్వామోదములు కావచ్చునని తోచుచున్నది. శ్రీశర్మగారు చెప్పు "మధ్వాధ్వకంటకోద్ధార"మను గ్రంథము పైన వివరింపబడిన "కంటకోద్ధారమే" యనికూడా నాయభిప్రాయము. ఈయన మరియొక "న్యాయాధ్వదీపిక" యను గ్రంథమును రచియించినట్లు చెన్నపురి లిఖితగ్రంథాలయపట్టికయందు గలదు.౩ శ్రీశర్మగారు "అధ్వ"పదమును పైన చెప్పిన గ్రంథమునకు కలుపుట పొరబాటేమోయనియు, వారీ రెండుగ్రంథముల నొకటిగా తలచుచున్నా రనియు నా యనుమానము. చంద్రికోదాహృత "న్యాయ వివరణము"౪ను, "పరతత్త్వ ప్రకాశిక"౫యు నీయన రచియించినవి యనుట కెంతమాత్రము ననుమానము లేదు. ఈ "పరతత్త్వ ప్రకాశిక"లోని యీ క్రింది శ్లోకము "న్యాయాధ్వదీపిక"లోకూడా కనపడుచున్నది:

"మూకోపి వావదూకేంద్రో
జాయతే యదనుగ్రహాత్,
శ్రీసురేంద్రగురో స్తస్య
పాదం నత్వా చిరం భజే."౬

ఈ విషయమును సురేంద్రుని కీర్తించుటయు పైయూహను స్పష్టపరచుచున్నవి. "మీమాంసానయకౌముది" యీయనదియని స్పష్టముగా శ్రీశర్మగారు చెప్పుచున్నారు. అందులకు శ్రీ ఆర్. కృష్ణస్వామి శాస్త్రిగారినికూడా సాక్ష్యమిచ్చుచున్నారు. కాననదికూడా యొప్పుకొనవలసినదే. పైగ్రంథములుగాక "న్యాయమూక్తికమాల", "మధ్వతంత్రముఖభూషణము" నను రెండుగ్రంథములు విజయీంద్రకృతములుగా మైసూరుపుస్తకపట్టికయందు కలదు.౭ రెండవది తప్పక యీయనదియని నమ్మవచ్చును. ఏలన నీగ్రంథనామము చూచినవెంటనే యది యప్పయ్యదీక్షితరచితమగు "మధ్వతంత్రముఖమర్దన"మనుగ్రంథముయొక్క ఖండన

---

౧. Tanjore Skt. Catalogue, Vol. XIV. P. 6210.

మైసూరు లిఖితపుస్తకపట్టిక కూడా యిది న్యాయామృత వ్యాఖ్యయనియే తెల్పుచున్నది.

(Mysore Govt. Mss. Catalogue, P. 522)

౨. Tanjore Skt. Catalogue, Vol. XIV. P. 6209.

౩. Madras Oriental Mss. Library Catalogue, Vol. X. P. 3585.

౪. Tanjore Skt. Catalogue, Vol. XIV. P. 6035.

౫. Catalogue of Skt. Mss. in the library of the India Office, Part IV. P. 800.

అప్పయ్య "శివతత్త్వవివేకము"న కుద్దిగానుండునట్లు దీని నీయన వ్రాసెను.

౬. దీనిని విజయీంద్రకృతముగా మైసూరుపుస్తకపట్టికూడా చెప్పుచున్నది.

(Mysore Govt. Mss. Catalogue P. 521.)

"సురేంద్రమునిశిష్యేణ విజయీంద్రాఖ్యభిక్షుణా,
నృసింహప్రీతయే౽కారి పరతత్త్వప్రకాశికా."
(పరతత్త్వప్రకాశికాంత శ్లోకము.)

౭. Mysore Govt. Mss. Catalogue P. 519 and 533.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపమని చెప్పకచెప్పుచున్నది. ఇవిగాక మరియొక "ప్రణవదర్పణఖండన"మను గ్రంథము నీయన రచియించెను.[౧] దాదా పీవిజయీంద్రునకు సమకాలికుడగు శ్రీశైలతాతాచార్యకుమారుడగు శ్రీనివాసాచార్యుడు రచియించినట్టియు, ప్రణవము బాదరాయణుని "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను ప్రథమ సూత్రము నందలి యవయవము కాదని వాదించునట్టియు "ప్రణవ దర్పణ" మను గ్రంథమున కీయన ఖండనరూపముగా నా గ్రంథమును రచియించెను. "ఉపసంహారవిజయ" మను నొక గ్రంథము కలదు.[౨] కవి సురేంద్రశిష్యుడని గ్రంథము పైన వ్రాసియున్నది. ఇట్లు వ్రాసియుండుటయు, దీని లోని ప్రథమశ్లోకమును వెనుక చెప్పిన "న్యాయమాధ్వ దీపిక"లోని మొదటిశ్లోకమును నొక్కటే యగుటయు, "మూర్ఖోపి" యను వెనుకటి శ్లోక మందుకూడా ఉండుటయు నేతద్గ్రంథము నీయనయే రచియించినట్లు గట్టిగా తెల్పుచున్నవి. అప్పయ్యదీక్షితుడు "ఉపక్రమ పరాక్రమ"మనియు పక్రమప్రాబల్యము నుగ్గడింప తత్ఖండనరూపముగా నప్పయ్య రచియించిన మధ్వసిద్ధాంత ఖండనమునకు ప్రతిఖండనమును రచియించిన యీయన తొపసంహారప్రాబల్యమును సమర్థించుచు దీనిని రచియించెనని స్పష్టమగుచున్నది. కావున శ్రీ శర్మగారు చెప్పినవానికంటె నా పరిశోధనములవలన మరియైదు గ్రంథము లీయనవి బయటపడినవి. శ్రీశర్మగారు తమ వ్యాసమున పేరొక్కన్న "తత్త్వ మణిమాణిక్యదీపిక" యనునది పదునొకొండవది. మిగిలినవి యెచ్చటను కానరావు. గ్రంథముల నామములను, నందలి విషయమును పరిశీలించిన నీయనకును, నప్పయ్యదీక్షితునికిని తత్కాలమున నమితముగా నడచినట్లు చూడగలము. "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" యన్నట్లిద్దరికిని డీపడుటచే వాఙ్మయమున కుపకారమయ్యెను. ఇరుమతములయందును ననేక గ్రంథములు వెలువడెను.[3] ఇట్టి యీమధ్వసన్యాసికి యరివిలిమంగలగ్రామము నిచ్చి పూజించి చెవ్వప్ప తనను గౌరవించుకొనెను. ఈయన మొదలుగా మూడుతరములవరకు నీయనతరువాతి మఠాధిపతులు తంజావూరాస్థానమున పూజనందిరి.[౪]

---

౧. Madras Oriental Mss. Library Catalogue, Vol. X P. 3588.

౨. Tanjore Skt. Catalogue, Vol. XIV, P. 6183.

3. శైవాద్వైతములను సంరక్షించుట యప్పయ్యపై నెట్లు పడెనో యప్పయ్యనుండి మధ్వమతమును రక్షించుట యీవిజయీంద్రునిపై బడెను.

౪. "అప్పయ్య దీక్షితకపోలచపేటిక" యను గ్రంథము నీయన రచియించెనని చెప్పుచున్నారు. కాని యీగ్రంథ మెచ్చటను లభింపలేదు. ఇది గ్రంథాక్షరముల ముద్రితమైనదట!

(Tanjore Skt. Catalogue, Vol. XIII, P. 5534).



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శైవమతము–హరిజనులు

తురగా వెంకటరామయ్య

శ్రీమదనంత "నామరూపక్రియా నటనాభిరామ" మగు ప్రపంచము పరమేశ్వరుని లీలావతారము. అనుక్షణము బరిణమించుచుండు శివలీలాతాండవమును గాంచి యానందమాధురీమహిమాతిశయము గనుటయే మానవుని మానవత్వమునకు పరమార్థము. ఆ పరమార్థప్రాప్తికి సాధనములే మతములు.

"అల దక్షిణామూర్తి కాలయం బగుచు
విలసిల్లు శ్రీ వటవృక్షంబునకును
జలము శాంతరసంబు, సద్గోష్ఠి పాదు,
మూల మోంకారంబు, మొదలు వేదములు,
వ్రేలాడు నూడలు విద్యలు, శాఖ
లుపనిషత్తులు, భక్తి యురుతరఫలము,
అపరిమితానంద మాఫలసార
మది లోనగొన ప్రసాదావధానంబు
మది చింత లుడుగుట మహనీయపదవి.
ఆమఱ్ఱిమొదల విద్యాపీఠి నిలిచి
ప్రేమగొల్చెదు"

జిజ్ఞాసువునకు నామరూపక్రియానటనాభిరామము లగు పరమశివుని నిత్యలీలాతాండవపరిణామములయందలి సత్యము గోచరించును.

సత్యస్వరూపమగు ప్రణవముయొక్క అర్థమును స్ఫురింపజేయు వేదములు ఉపనిషద్రూపమగు మహాయోగమును మానవునకు ప్రసాదించినవి. అదియే భక్తియోగము. ఆభక్తియోగమును సాధనముగ గొని విశ్వప్రపంచరహస్యమును గుర్తించి ఆనందమను శివప్రసాదమును బొంది ధన్యజీవు డగుటకు దగిన మార్గమే శైవమతమని యార్యసంప్రదాయమున జేర్కొనంబడును.

ఈశైవమతధర్మములును, సిద్ధాంతములును వేదములనుండియు, నుపనిషత్తులనుండియు, ఆగమములనుండియు శిష్టసంప్రదాయానుసారముగ ప్రవర్ధిల్లినవేకాని ఎవరో ఒకప్రసిద్ధపురుషుని స్వమతానురూపములు కావు.

వేదముల ప్రత్యక్షార్థబోధితములగు కర్మవాదమతములును, గూఢార్థప్రబోధితములగు భక్తిజ్ఞానప్రధానమతములును, ఆగమవిధానవేద్యమగు నారాధనక్రమమునుగూడ నార్యావర్తమున ప్రాచీనకాలమునుండియు ప్రవర్తిల్లుచునేయున్నవి. రానురాను మానవహృదయమునకు సంతుష్టియు, శాంతియు నొసంగలేనట్టిదియు, సర్వజనులకు సంబంధింపనిదియు నగు కర్మవాదమును భక్తిజ్ఞానయోగములు దిగద్రొక్కి మానవకోటిని స్వాధీనపరచుకొనజాలినవి.

అట్టి భక్తియోగమతములందు ప్రాచీనమును, ప్రధానమును నగునది శైవమతసంప్రదాయము. ఈశైవసంప్రదాయము రెండువిధములుగ పరిగణింపబడుచున్నది: మొదటిది ఆదిశైవము. అదియే కాశ్మీరశైవమని కూడ నామాంతరమున బిలువంబడును. రెండవది ఉత్తరశైవము. అదియే వీరశైవమనియు జేర్కొనబడును.

ఉభయమార్గములకును వేదములును, ఉపనిషత్తులును, ఆగమములును పునాదులు. మానవునియొక్కయు, ప్రపంచముయొక్కయు, పరమేశ్వరునియొక్కయు తత్త్వము సమానమే.

మొదటిమార్గమగు ఆదిశైవము వైదికకర్మకాండకును, భక్తియోగమునకును గూడ తావిచ్చును.

రెండవది యగు ఉత్తరశైవము భక్తియోగమునకు వ్యతిరేకములగువానిని తీవ్రముగ త్యజించి ఆరాధనవిశ్వాసములకు ప్రాధాన్యమొసంగి శివైక్యమునకు రాచబాటమగు మార్గమును ప్రబోధించును. ఇదియే వీరశైవము.

ప్రాచీనమగు శైవమతమునం దీనూత్నసంస్కారమునకు దారితీసిన మహానుభావుడు బసవప్రభుడు. అ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహనీయుని సిద్ధాంతములు వేదబోధితములు కావనువారు నాకాలమున లేకపోలేదు. అట్టివారి కాదివ్యప్రభువు

"ఇది శ్రుతిస్మృతిమూలమేకాని యొండు
పదకవాదంబని భావింపజనదు"

అని సమాధానము చెప్పుటయు జరిగినది.

"ఉమా మాతా పితా రుద్ర ఈశ్వరః కులమేవచ"

అను భగవద్వాణియే శ్రీబసవప్రభుని సిద్ధాంతమునందలి ప్రథమస్వర్ణవాక్యము.

మహాప్రపంచమునందలి ప్రతి రేణువునందును పరమశివస్వరూపమును గాంచగల్గిన మహాత్ముడు బసవేశ్వరుడు సోదరమానవులను భిన్నమూర్తులుగ, భిన్నజాతులుగ, నీచులుగ, నుత్తములుగ విభాగించి చూడలేకపోయెను.

పరమేశ్వరవిశ్వాసము గల మానవులందరు పరమశివస్వరూపులు, ఆరాధ్యులు నని యాభక్తలోకచక్రవర్తి యారాధింపదొడంగువేళ భారతీయసాంఘికప్రపంచమున నినుపచట్టములచే నమర్చబడియున్న కర్మవాదమునకు బ్రాహ్మణ్యమను కులచట్టము అడ్డమురాకపోలేదు. ఆసందర్భమున "భక్తుల కుల మెత్తి పలుక నని బాస" చేసిన బసవప్రభుని దివ్యవాణి

"బ్రాహ్మణ్యంబు భక్తియు బల్కెడుకూడ
బ్రాహ్మణ్యంబు వేరెదర్శన మయియుండు
బ్రాహ్మణుడేనియు భక్తుడెట్లగును
బ్రాహ్మణు డెట్లగు భక్తుడేనియును
కులసతియట్లు నిశ్చలయుక్తిభక్తి
వెలయాలియట్లు లవ్విప్రమార్గంబు
సహజలింగైక్యనిష్ఠా యుక్తిభక్తి
బహుదేవతాసేవ బ్రాహ్మణపథము."

నని భక్తియోగరహస్యమనునట్టిదియు, ఈశ్వరవిశ్వాసజన్యమైనట్టిదియు నగు "శివభక్తు లెల్లను శివు డనుబాస" లేనిదే భక్తియోగమునకు పరమార్థము లేదని నిర్ణయము నొసంగెను. అంతియకాక "నిగమార్థసంవేది" యగు బసవప్రభుని యంతరంగమున "లింగైక్యసౌఖ్యకేళీలో లత్వ మెంతగలదో "జంగమప్రాణానుసంధానశక్తి"యు నంతియే.

"ఉభయప్రసాద సంయోగోపభుక్తి" యే బసవేశ్వరుని దివ్యశీలము.

పరమశివస్వరూపమగు జగత్తు నారాధించి లింగైక్యము నందుటయే శైవుని పరమార్థము. జగత్తునందలి యేభాగముగాని శివభిన్నమగు వస్తువుగ భావింపరాదను ప్రేమసిద్ధాంతమునుండి జనించిన దగుటచేతనే మానవకోటియందలి విభేదములను పాటించినయెడల ఈశ్వరవిశ్వాసమునకు లోపము వాటిల్లుట కోర్వజాలని బసవేశ్వరుడు "భక్తుల కుల మెత్తి పలుకని" మహాశీలమును ఉత్తరశైవమున ప్రతిపాదించెను.

ఒకమహాభక్తుడగు చాకలినిగురించి రాజుకడ తగవు సంభవిల్లిననా డతని నిర్ణయమును గాంచనగును:

"లేకులు లోకులు కాకఅపులకు
జాకి చాకని యేల సందడించెదవు
చాకియే యతడు సాక్షాల్లింగమూర్తి
కాక యేటికి గనుకని పలికెదవు
కులజుండు నతడె యకులజుండు నతడె
కులములేకయు నన్నికులములు నతడె
ఆనీలగళు నపరావతారంబు
గాన యాతడు సర్వగతు డెట్టులనిన
సరసిజభవు జడల్ జన్నిదంబులుగ
బరగ భిక్షించిన బ్రాహ్మణుం డతడు
మహితాపవర్గసామ్రాజ్యపట్టంబు
సహజంబ పాలించు క్షత్రియుం డతడు
కడగి దుర్భరకర్మనుటవహిత్రంబు
వడి భవాంబుధి ద్రిప్పు వైశ్యుం డతండు
ఇల సత్క్రియారంభఫలములు గోసి
సొలవక నూర్చెడు శూద్రుండు నతడ
* * * *
ఏకార్ణవంబైనయెడ నజాచ్యుతుల
జేకొన కుదికెడు చాకియు నతడె"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యని కులప్రపంచరహస్యమును విప్పిచూపి సర్వము శివమయమని వాదించెను.

మరియు బసవేశ్వరుని మార్గానువర్తియు, ధనికుడును, ఈశ్వరవిశ్వాసియు నగు "కళియంబనైనా" రను నతడు తన బానిసయు, హీనజాతిసంభవుడును నగు వాడు శివదీక్షాయుతుడైనంతనే శివస్వరూపునిగ భావించి పూజించి వాని పాదోదకమును శివప్రసాదముగ స్వీకరించి యానందించెను. దీనినిబట్టి యాలోచించినచో వృత్తిచేతనైననేమి, పుట్టుకచేతనైననేమి యేర్పడిన కులతారతమ్యములు భక్తియోగప్రధానమగు మత్తరశైవమున బాటింపలేదనియు, నట్లు పాటించుట శివద్రోహముగ భావించిరనియుగూడ మనము సులభముగ గ్రహించవచ్చును.

బసవేశ్వరుడు జాతినిబట్టి మాలవాడుగ బరిగణింపబడుచున్న శివనాగుమయ్య యను దీక్షాపరునకు బ్రహ్మరథము పట్టుటయు, నానాడు కర్మవాదులగు బ్రాహ్మణుల యవరోధము గల్గుటయు, బసవేశ్వరుడు వారల నోడించుటయుగూడ జరిగెనది. మరియును శివదీక్షకు ముఖ్యమగు మార్గములలో ప్రతిచోట నిది తక్కాణింపబడుచునేయుండును.

"అమరంగ నటుగాక నఖిలమర్త్యులకు
సమము ధాతువులును సమపిండములును
సమము సూతకములు సమము జన్మములు
సమము నిద్రాహారసంగకృత్యములు
సమము మోహభయాభిషంగలోభములు
సమ మింద్రియవిషయసముదాయములును
సమము లీభూతపంచకములు నవయ
వములును సుఖదుఃఖవాసనల్ సమము
లదిగాక ధర యేక మఖిలజీవులకు
తుద నాకసము పొంతుసమస్తమునకు
తోయ మొక్కటి జగత్తునకు బ్రాపింప
నై యుండు కులభేద మైనలాగెట్లు?"

అని శివదీక్షితుడుగా నున్న శిష్యునకు గురుదేవుడు ప్రబోధించి శివదీక్ష నొసంగును.

దీక్షితుడైనవాని కేకకులమనుటలో నిస్సంశయమని శైవమతము చెప్పినంత బాహాటముగ నేమతమును చెప్పలేకపోయిన దన్నచో నతిశయోక్తి కాదు. భక్తలోకానుభవసార మనందగు శైవధర్మమునందు

"ధర 'నుమా మాతా పితా రుద్ర ఈశ్వరః
కులమేవచ' యనియు గలదుగాన
సద్గురుకారుణ్యసంజాతు లెల్ల స
గోత్రులనక యన్యగోత్రులనగ
దగునె యొక్కతల్లిదండ్రుల కుద్భవం
బైన ప్రజలలోన హీనవంశ్యు
లెందు గలుగబోదురే? శివగోత్రస
త్పాత్ర! భక్తిసూత్ర పథచరిత్ర!"

యనియు,

"భువిలో శివదీక్షితులను
శివభక్తుల పూర్వజాతి చింతించుటరౌ
రవనరకభాజనం బా
శివు బాషాణంబుగాగ జింతించుక్రియన్."

యనియుగూడ గలదు.

ఏది యెట్లు చూచినను, ఏమతసంప్రదాయము ననుసరించి చూచినను పరమేశ్వరు డొక్కడే యనియు, సర్వజగద్వ్యాపి యనియు స్థూలాభిప్రాయ మేర్పడకపోదు. అణువునం దణువుగను, మహత్తునందు మహత్తుగను నున్న దీపరమేశ్వరాంశమేయని సర్వవిద్యల సారమును వ్యక్తీకరించుచునేయున్నది. అయినను ప్రపంచ ప్రవృత్తియందు ప్రతిదేశమునందును గులముల పేరుతోనైననేమి, స్థితిగతుల తారతమ్యములను బురస్కరించుకొనియైననేమి, వృత్తులనుబట్టియైననేమి ఏకరూపమగు మానవకోటియందు భేదములు గన్పట్టుచునేయున్నవి. ఈభేదబుద్ధి నేమాత్రము శైవసిద్ధాంత మొప్పుకొనదు సరేకదా, అజ్ఞానకృతమగు మహాపాతక మనికూడ నిరసించును.

మహాత్ములు ప్రబోధించిన సత్యసిద్ధాంతములను ఆశాపూరితులును, అధికారలోభులును నగు సామాన్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జనులు ఆచరించకపోవుటయు, నిరసించుటయు జరుగు చుండును.

నేటి నవయుగమున నవతరించిన శాంతిస్వరూపుడగు గాంధీమహాత్ముని దివ్యవాణినికూడా లోకము వినలేకున్నది. వినియు గ్రహింపలేకున్నది. గ్రహించియు నాచరించలేకున్నది. సత్యకరుణామయుడగు మహాత్ముడు భారతవర్షమువంటి తత్త్వప్రధానమగు భూమియందు నేటికిని అస్పృశ్యులుగ పరిగణింపబడుచున్న దీనులగు మానవులుండుట గని కన్నీరునించుచుండుట గాంచియు మానవతత్త్వవేత్తలగు భారతీయులు తమ కళంకమును బోగొట్టుకొనలేకున్నారు. ఏమతగ్రంథము ననుండి యుదాహరణములను జూపించినను, ఏసత్యప్రబోధమును జేసినను ఆచారపిశాచావిష్టులై ప్రతిబంధకము లను బన్నుచునేయున్నారు. అనగా ప్రాచీనకాలమున నేకులచట్టములు నడలనిరోజులలో బసవప్రభునికి అవరోధములు గల్పించిరనియు, ఆతని జంపించుటకు యత్నించిరనియు అప్పటివారిని మనము గర్హింపబని లేదు. బసవప్రభుడును, వారి శిష్యులనుగూడ ప్రతివాదులతో,

"కులమును బలము వీడొక్కనడగు నందు
ఫలమేమియును లేదు భావించిచూడ
మర్మజ్ఞులకు పచ్చిమాలకులంబు
కూర్మి దేహమునకో? కులము దేహికినో
మేనికి నంటెమా ? మేనశుద్ధంబు
గాన దేహమున కెక్కడిది కులంబు
అనయంబు జీవున కంటెమా ? కులము
విన మెందు నిరవయవికి కులోత్కర్ష
మటుగాన విడువు కులాభిమానంబు
కటకటా ఈయహంకార మేమిటికి."

మానవుడా నీచే కల్పించుకొనబడిన మాయాపూరితములగు ఈవిభేదములతో కూడుకొన్న కల్మషహృదయముతో నణుమాత్రమైనను భవార్ణవమును తరింపజాలవు.

"ఇతరదీక్షులవంటిదే వీరశైవ
ఘుతము సద్యోముక్తిమహనీయపదము!"

అట్టి మహనీయపదము నందుటకు నీహృదయము నాక్రమించుకొనియున్న తుచ్ఛములగు నధికారకాంక్షయు, కులాభిమానమును నశింపవలయును. అంతియేకాదు,

"ప్రాణాభిమానార్థపరవశులైన
ప్రాణుల కంతఃకరణవివశులకు"

భగవల్లీలావినోదము గోచరింపదని, పరమేశ్వరుని ప్రసాదమగు నానందము దొరుకదని,

"మట్టుగా దిది మహామతము దుర్ఘటము"

నటియు శైవమతము ఘంటాపథముగ వేనోళ్లతో జాటుచున్నది.

"స్వేష్టలింగప్రసాదమేవ చండాలోపివా సద్వై
వోపభుక్తస్స్యాత్ సచండాలో నభవతి సపుల్కసో న
భవతి కింతు సఏవ కులజ స్సఏవ ధన్యః"

అని శైవభాష్య ముపనిషదర్థమును స్పష్టీకరించుచున్నది. భారతదేశమున నెల్లరపుడిరో యూహింపనలనికాని మాలమాదిగలనుగురించియు, మాలపల్లెలనుగురించియు గూడ శైవభాష్యమున వివరింపబడియున్నది.

"చండాలవాటికాయాంవా శివభక్తః స్థితో యది,
తచ్ఛ్రేణి శ్శివలోక స్స్యాత్ తద్గృహం శివమందిర"

మ్మని శైవాదర్శము ప్రబోధించుచున్నది.

ఈ మహామత మిట్లు ప్రబోధించుచుండగా అర్చారూపుడగు పరమశివుని యాలయములోని కేగి హరిజనుడు దర్శించి శివనిర్మాల్యమును ధరించి తరించుటకుగాని, ఆలయప్రాంతముల కేగుటకుగాని వలనుపడదనుట ఏమి న్యాయము? ఈఅధికారము లన్నియు మహాభక్తులగువారికేకాని సామాన్యహరిజనులకు గావనియుకూడ వాదించువా రుందురనియే గురుదేవులూహించి యాసందియమును దొలగించుట చిత్రము!

"శివక్షేత్రసమీపస్థాన్
శివసేవార్థ మాగతాన్,
పతితా నంత్యజా న్వాపి
స్పృష్ట్వా నస్నాన మాచరేత్."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. పేరాస —కె. ఆర్. రాజరత్నం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. బాల్యవార్ధకములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనికూడ శాసించియున్నారు. ఈధర్మము వీరశైవులకు గాదు. ఏలననగా వీరశైవదీక్షితులకు కులవిభేదమే లేనితరి ఈనియమ మెందులకు? వర్ణాశ్రమాచారనియతియు, శైవధర్మమునుకూడ పాటించు నారాధ్యబ్రాహ్మణులకును, వారి సంప్రదాయానుయాయులకు నితరసవర్ణులకును మాత్రమే ఇది చెప్పియుండురు. దీనినిబట్టి యాలోచించినచో బ్రాహ్మణ్యమును, శైవమును నిలుపుకొన్న శైవులకుకూడ హరిజనుల ఆలయప్రవేశము నుల్లంఘించుట తగనిధర్మ మనుచున్నది.

పోనీ, శైవభాష్య మిట్లు చెప్పుచున్నను ఆలయనిర్మాణమునకును, లింగప్రతిష్ఠకును ప్రధానములగు నాగమములుకూడ నొప్పుకొనవలయు నందురేమో. దానికిని సమాధానము భాష్యకర్త యొసంగెను.

“ఇత్యాదిశ్రుతిస్మృతిపురాణాగమ వచనప్రామాణ్యాత్ చండాలపుల్కసశ్వపచాదయః శివభక్తియుక్తాశ్చేత్ తదీయప్రసాదోపజీవినశ్చ యే కేచన సంతి త ఏవ శ్రేష్ఠాస్త ఏవ కులీనాశ్చ తైస్సహ సంస్పర్శన సంభాషణ సహవాస సహభోజనాదికం కార్యమ్. కింతు చతుర్వేదధరా శ్శివభక్తిహీనాశ్చ శివప్రసాదపరాఙ్ముఖాశ్చ యేకేచన సంతి తైస్సహ సందర్శన సంభాషణ సహవాస సహభోజనక్రియా నకర్తవ్యాః”
అనుటయే సుస్పష్టమగు సమాధానము.

నేడు హరిజను లుద్ధరింపబడుటకును, సంఘమునందు గౌరవజీవితము నడుపుకొనుటకును మహాత్ముడు నిర్ణయించిన విధానము లింతవిపులముగ లేవనినను అనవచ్చును. భక్తియోగమతప్రదీపకులగు బసవేశ్వరాది మహాత్ములనుండి మనము గ్రహించిన బోధామృతమును మరచియు, గాంధీమహాత్ముని యుపదేశమును త్రోసిపుచ్చియు మనము సాధించదలచిన మహాకార్య మేమి? అన్నివిధముల నణగిమణగియున్న హరిజనులను మరియు నణగద్రొక్కుటేకదా! దాన మనకు వచ్చు ప్రతిఫలమేమి? నేటివరకు భారతభూమిని బ్రవర్ధిలిన భక్తియోగమతవిధ్వంసము మనచేతులతోడనే చేసి యాత్మవంచనము జేసుకొనుట కదా? మన యుపనిషదర్థములను, మన దేవాలయములను మన చేతులతో మనము నిరుపయోగములొనర్చుకొనుట కాదా?

భారతీయులారా, ఆచార్యులని, అవతారపురుషులని నమ్మిన మహాత్ము లుపదేశించినవాటిలో మనకు ఇష్టమైనవియు, లాభమైనవియు అంగీకరించి యావన్మానవకోటికిని శుభప్రదములును, పరమేశ్వరప్రీతికరములును నగువాటిని త్రోసిరాజనుటయు నా?

ఈ మన అజ్ఞానములకు గురుద్రోహమేకదా ప్రతిఫలము?

యుగాలవెంబడి కష్టించియు, ధన బలములను గోల్పోయియు భారతమాత గడించిన యాచార్యపీఠమును గోల్పోకుడు.

నేటి హరిజనులయందు సానుభూతివహించి భక్తిప్రధానమతదీక్షల నొసంగి ఆలయప్రవేశాది సంస్కారముల నొసంగి సంఘమునందు వారికి స్థానము నొసంగి వారును, మనమును పరమేశ్వరుని బిడ్డలమేయని హృదయపూర్వకముగ నొప్పుకొని క్రియారూపమున జూపించుడు. నేటి యుగమున నాచార్యపురుషుడగు మహాత్మా గాంధీ ననుసరింపుడు. ఇదియే మా ప్రార్థనము.

[ఇందుదాహరింపబడిన విషయములును, పద్యములును బసవపురాణము, దీక్షాబోధను, ప్రభులింగలీల, సోమనాథభాష్యములనుండి కైకొనబడినవి.

—సు. వేం.]


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



బడగాయువతి

—యస్. వి. యస్. రామారావు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వ్యవసాయము—రైతుల కష్టములు

కొమ్మారెడ్డి సూర్యనారాయణ

పూర్వపు శిస్తులు - నేటి శిస్తులు

భరతఖండమున ౧౦౦ కి ౭౦ మందివరకు వ్యవసాయమే ప్రధానవృత్తిగాగలవారై యున్నారు. హిందూదేశసౌభాగ్య మంతయును వ్యవసాయాభివృద్ధిమీదనే యాధారపడియున్నది. పూర్వపు రాజులు వ్యవసాయమువల్ల వచ్చు నాదాయమునుండి ధర్మశాస్త్రానుసారము ౬-వ వంతుగాని, ౮-వ వంతుగాని రైతులనుండి గ్రహించుచుండెడివారు. నేటి మన ప్రభుత్వ మన్ననో రైతు ఆదాయమునుండి సగమునకుపైగా వసూలు చేయుచున్నారు. సూర్యభగవాను డేరీతి సముద్ర నదీ తటాకాది జలాధారములనుండి నీటి నాకర్షించి యానీటినే తిరిగి వర్షరూపమున ప్రజలకు ప్రసాదించి భూమి నంతయు సారవంతముగ జేయుచున్నాడో అదేరీతి ప్రజల పరిపాలించు ప్రభువుకూడ ప్రజలనుండి గ్రహించుచున్న ప్రతి పైసయును ప్రజోపయోగకరములగు పనులకుమాత్రమే యే దేశమున వసూలుచేయుచున్న మొత్త మా దేశముననే వ్యయపరచుట ధర్మము. బ్రిటిషు వారు ప్రథమమున హిందూ మహమ్మదీయ చక్రవర్తులు వసూలుజేయుచున్న మొత్తములనే వసూలుజేయ మొదలిడి క్రమక్రమముగ హెచ్చుమొత్తముల వసూలుజేయ నారంభించగా అప్పటి రైతులు తీవ్రతరాందోళన చేయుటచే భూమిపన్నులను కొంతకాలము తగ్గించిరి. ఈవిధముగా తగ్గించినను ధర్మశాస్త్రానుసారము పరిపాలనా సౌకర్యములకు, వ్యవసాయపుసౌకర్యములకు కావలసినధనము కన్న చాలహెచ్చుమొత్తములనే వసూలు చేయుచుండిరి. పూర్వము వ్యవసాయమునకు తోడుగా చేతిపనులు మొదలగు నితర వృత్తు లనేకము గలిగియుండుటచే పన్నులు కొంచెము హెచ్చుగా నున్నను చెల్లించుట రైతున కంతకష్టముగా నుండెడిది గాదు. నే డన్ననో యితరవృత్తు లన్నియు ప్రభుత్వాదరణ లేక నశించుటచే, కేవలము వ్యవసాయమే యాధారముగా గలిగిన రైతు భూమిపన్ను జెల్లించుటకు తన ఆదాయములో నెంతమాత్రము మిగులకపోవుటచే చివరకు శిస్తులకే కాక కుటుంబభరణమునకు గూడ షాహుకారులవద్దనుండి ధనము నప్పగాగొని క్రమముగా దారుణమగు వడ్డీలపై వడ్డీలతో ఋణగ్రస్తుడై యావదాస్తిని గోల్పోవుట మన దేశమున దినదినమునకు లెక్కకు మిక్కుటమగుచున్నది.

మన దేశమున రైతుల ఋణము ఏయే రాష్ట్రములలో నెంతెంత గలదో యీక్రింది అంకెలవలన గమనింపుడు :

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| రాష్ట్రము | గ్రామములందలి మొత్తము ఋణభారము | |
|---|---|---|
| బీహారు, ఒరిస్సా | ౧౫౫ | కోట్ల రూ.లు |
| మద్రాసు | ౧౫౦ | ,, |
| పంజాబు | ౧౩౫ | ,, |
| సంయుక్తరాష్ట్రములు | ౧౨౪ | ,, |
| వంగరాష్ట్రము | ౧౦౦ | ,, |
| బొంబాయి (షుమారు) | ౮౧ | ,, |
| మధ్యరాష్ట్రములు | ౩౬ | ,, |
| అస్సాము | ౨౨ | ,, |
| మధ్యప్రాంతములు (Central Areas) | ౧౮ | ,, |
| కూర్గు | ౩౫ మొ. ౫౦ లక్షల రూ.లు | |
| బర్మా | (సుమారు) ౫౦-౬౦ కోట్ల రూ.లు | |

(From Indian Central Banking Enquiry Commitee Report, Vol. I Part. II. Page 31)

ఇతర దేశములోని భూమిపన్నులు-మనదేశములోని భూమిపన్నులు

పాడిపంటల కాలవాలమనియు, రత్నగర్భయనియు ప్రపంచమంతట ప్రఖ్యాతి నొందిన భరతఖండమున నేడు బ్రిటిషుప్రభుత్వమున దరిద్రదేవత తాండవమాడుచున్నది. ఈదేశమందు వసూలుచేయుచున్న భూమిపన్నులను, ఇతరదేశములందు వసూలుచేయుచున్న భూమిపన్నులను ఈక్రిందిఅంకెల పరీక్షించిన ప్రజాక్షేమమునకే పన్నులు వసూలు చేయుచుంటి మను ప్రభుత్వవాద మెంతనిజమో పాఠకులకే తెలియగలదు:

| దేశము | ఆదాయమున భూమిపన్ను ౧౦౦ కెంతభాగము గ్రహింపబడుచున్నది. |
|---|---|
| బెల్జియం | ౨.౮ |
| హాలెండు | ౨.౮ |
| జర్మనీ | ౩.౦ |
| ఫ్రాన్సు | ౪.౮ |
| ఆస్ట్రియా | ౪.౯ |
| ఇటలీ | ౭.౦ |
| బ్రిటన్ | ౮.౩ |
| ఇండియా | ౧౫.౦ |

మనదేశమున వసూలు చేయుచున్న పన్నులలో లోకల్ సెస్సుగాని స్టాంపుఫీజుగాని జేర్చియుండలేదు. పై దేశములలోని పన్నులలో స్టాంపుఫీజు, లోకల్ సెస్సు జేర్చి యున్నవి. ఇంతకు పరాధీనులమగుటచేతనే పరుల కెవ్వరికిని సాటిలేకుంటిమి.

పన్నుల విధానము

ఇతరదేశములందు బాధ్యతాయుతప్రభుత్వము లేర్పడియుండుటచే సమస్తవిధములగు శిస్తులను ప్రతివత్సరమునను శాసనసభలలో నేయేశిస్తుల నెంతెంత తగ్గించవలెనో, లేక హెచ్చుజేయవలెనో చర్చించుచు తగు జాగ్రతతో శాసనముల గావించుచుందురు. మన దేశమునందన్నను భూమిపన్ను నిర్ణయించు నధికారము ప్రజాప్రతినిధుల కేమాత్రము లేదు. కొలది దినముల క్రిందటనే మద్రాసు శాసనసభలో భూమిశిస్తు రెమిషను చర్చకురాగా ప్రభుత్వసభ్యులు, నియమితసభ్యులు రైతు ప్రేలితో రైతు కన్ను పొడువనేర్చిన రైతులచే నెన్నుకోబడిన సభ్యుడొక్కడు తప్ప మిగతాయావన్మందిసభ్యులు ప్రస్తుతపురైతుల ఆర్థికపరిస్థితులు కడు హీన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థితియం దున్నవనియు, ఋణమను వ్రణము చేతను, పన్నులను పెనుభూతముచేతను రైతు క్రుంగి కృశించుచున్నాడనియు, ఈ వత్సరమునకైనను అధమము ౧౦౦ కి ౨౫ రూ.ల వరకైనను శిస్తు రిమిషను యివ్వవలసినదనియు నెంత ఘోషెల్లినను చివరకు అరణ్యరోదన మాయెను. ఎంతకాల మీ ప్రజాప్రతినిధు లీరీతిగా తమ యభిప్రాయముల నెరవేర్పజాలని నామమాత్ర శాసనసభలనుండి బయటకు రా నుద్యుక్తులు గారో అంతకాలము ప్రభుత్వముకూడ మిన్నకుండి యిదే విధమున పరిపాలించ గలదు.

రాజనీతిశాస్త్రజ్ఞులు పన్నులువిధించు నధికారము, వసూలుచేసి వ్యయపరచు నధికారము ప్రజాప్రతినిధులకే యుండవలెనని వక్కాణించియున్నారు. ఈవిధముగ నితర దేశము లెల్లెడలను నాచరణయం దుండ పరాధీనమగు భరతఖండమునందుమాత్ర మీ సూత్ర మెచ్చోటను గాంచకుంటిమి. హిందూదేశమును జూడవచ్చిన కొంద రితర దేశస్థులు కూడ నిచ్చట వసూలుచేయు భూమిపన్ను లితరదేశములం దెచ్చోటను గాంచ లేదని వ్రాసియున్నారు.

మనదేశమున శిస్తునిర్ణయములు శాశ్వతమైనవి గావు. బంగాళాదేశమున, చెన్నరాజధానిలో నాల్గవవంతున, సంయుక్తపరగణాలలో స్వల్పభాగమునమాత్రము శాశ్వత నిర్ణయము గలిగియున్నది. ఈప్రదేశములలో నేనాటికిని భూమిపన్నులు వృద్ధిజేయవీలు లేదు. బొంబాయి, సింధు, మధ్యపరగణాలు, మదరాసురాష్ట్రములందు రైతువారీపద్ధతుల నెలకొల్పి ౨౦ సం.లకుగాని, 30 సం.లకు గాని రిశెటల్‌మెంటు అనుమిషతో భూమిశిస్తులను ప్రతిశెటిల్‌మెంటునను హెచ్చుజేయుచు నేయున్నారు. ధాన్యపుధరలు మూడింట రెండువంతులవరకును, భూముల ధరలు పూర్తిగను పడిపోయినను ప్రభుత్వము రైతులమొర నాలకింపక యేయున్నది. ఒకప్పుడు, ఇంగ్లండులో కార్మికపక్షనాయకుడుగ నుండి ప్రస్తుతము బ్రిటిష్‌ప్రధానమంత్రియగు శ్రీరామ్సేమాక్డొనాల్డ్‌గారు తమ Awakening of India అను గ్రంథములో హైందవుల యార్థికస్థితిగతులనుగురించి యేమని వ్రాసిరో గమనింపుడు: "హిందూదేశములో నాలుగుకోట్ల జనులాహారము చాలకయే జీవించుచున్నారని సర్ విలియంహంటర్‌గారు జెప్పిరి. వ్యవసాయదారులలో సగముమంది సంవత్సరాదినుండి సంవత్సరాంతమువర కెన్నడును కడుపునిండ భుజించిమెరుగరని సర్ చార్లస్ ఇలియట్‌గా రంచనావేసిరి. హిందూదేశమున మూడు, లేక నాలుగుకోట్ల కుటుంబములు రోజునకు 3 అణాలుమించని యాదాయముతో జీవించుచున్నవి. హిందూదేశము దారిద్ర్య మనుభవించుచున్న దనువిషయము ఊహామాత్రమేకాక యథార్థమే"యని వ్రాసియున్నారు. అట్టిదీనాలాపములతో గ్రంథము నింపిన మహాశయుడే నేడు బ్రిటిషు సామ్రా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్యమున కంతటికి ప్రధానమంత్రి నై యుండి యుగూడ భారతరైతుల కష్టము లీడేర్పజాల కుండెను.

పన్నుల హెచ్చుదలలు

మదరాసురాజధానిలో కృష్ణాగోదావరి నదుల కానకట్టలు నిర్మించునప్పుడు ఇర్రిగేషన్ పనులమీద పెట్టిన పెట్టుబడిమీద ౧౦౦ కి ౩ రూపాయలు వడ్డీగిట్టిన చాలునని అప్పటిలో వ్యవసాయదారుల నొప్పించి శిస్తుల నేర్పరచిన ప్రభుత్వ మీనాడు ఇర్రిగేషన్ పనులకై వ్యయపరుపబడిన పెట్టుబడి మొత్తమునకు ౧౦౦ కి ౧౬ లగాయతు ౨౧ వరకుకూడ వసూలు చేయుచున్నటుల ఇర్రిగేషన్ రిపోర్టువలననే తెలియుచున్నది. మొదటిఅంచనా ౩రూపాయలకును, ఈతరువాత రాబట్టుచున్న మొత్తములకును ఎంతవ్యత్యాసమున్నదో గమనింపుడు. వడ్డీవ్యాపారము జేయు నేషాహుకారుగూడ నింతఅత్యాశాపరుడై, యింత మహాదారుణమునకు లోనుగా సాహసింపజాలడు. ౧౯౩౧లో కృష్ణఉభయగోదావరిజిల్లాలలో రిశెటిల్మెంటు చేయించి రు. ౧ కు ౩ అణాలవంతున భూమిపన్నును హెచ్చుజేసిరి. తరములుకూడ పెంచుటచే కొన్నిభూములకు రు. ౧ కు అర్ధరూపాయి వరకుకూడ పెరిగినది. మూడుజిల్లాల హెచ్చుపన్నులవల్ల ౧౯౩౧ కి పూర్వపు భూమి రాబడికన్న రూ. ౫౮,౮౭,౧౦౦ వరకు హెచ్చుమొత్తము వచ్చుచున్నది. మనరాజధానిలో అన్నిరాష్ట్రములకన్న ఇదివరలోనే యెక్కువ రేట్లు విధించి వసూలు చేయుచున్నటు లీ క్రింది అంకెలవలన పాఠకులకు తెలియగలదు:

సాగుఅయిన పరిమితియేరియాకు

| | |
|---|---|
| చెన్నరాజధాని | రు. ౨- ౮-౧౧ |
| అయోధ్య | ౧-౧౫- ౮ |
| సంయుక్తపరగణాలు | ౧-౧౨- ౮ |
| బీహారు ఒరిస్సాలు | ౧-౧౨- ౬ |
| పంజాబు | ౧- ౮- ౬ |
| బొంబాయి | ౧- ౫- ౭ |
| మధ్యరాష్ట్రములు | ౦-౧౩- ౦ |

రైతుసౌఖ్యము లెటు లున్నవి?

ఇంతహెచ్చుపన్నులు వసూలుచేయుచున్నప్పటికి రైతుజనుల కేమైనను వ్యవసాయపు సౌకర్యములుగాని, తదితరసౌఖ్యములుగాని కలుగజేయుచున్నారా యని యన్న అదిమాత్రము సున్న. పంటకాలున లేర్పడినప్పటినుండి నీటిచే బాటలన్నియు తడసి మార్గావరోధములు గలుగుచున్నను వారినుండి వసూలుచేయుచున్న మొత్తములో కొంతభాగము వ్యయపరచి మార్గావరోధముల నివారింప జేయవలసియున్నను రైతుకు కావలసిన సౌకర్యపు పను లేమియు చేయకపోవుటచే రైతులు పొలములనుండి పంటలు తెచ్చుకొనుటకు మార్గములు లేక పడుచున్న కష్టము లింత యని చెప్పనలవిగాదు. మనదేశమున ప్రభుత్వమునకు హెచ్చుమొత్తములను రైతులగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పల్లెటూరిప్రజలే యొసంగుచున్నను దాదాపు ప్రతిపల్లెయు మురికిగుంటలతోను, బురద రోడ్లతోను తాండవమాడుచుండును. ఆ డబ్బుతో నేమైనను రోడ్లకు ఖర్చుపెట్ట దలంచిన పట్టణములకు పోవు రోడ్లకును, పట్టణములలోని రోడ్లకును వినియోగించుచున్నారే కాని పాపము నోరులేని అమాయకపు పల్లెటూరిరైతుల జూచి ప్రభుత్వము జాలినొందకున్నది. ఎవరు దినమంతయు కష్టించి సృష్టికంతయు ఆహారము నొసంగుచున్నారో, ఎవరు యావద్భారత పరిపాలనాధారమునకు నెక్కువభాగమును భూమిపన్నుల మూలమున నొసంగుచున్నారో, ఎవరు పూటకైనను తిండిచాలక మలమలమాడుచు కడు నిడుముల గుడుచుచు నాస్తిపాస్తుల నమ్మియైనను ప్రభుభక్తిపరాయణులై శిస్తుల రూపమున ప్రభుత్వపు బొక్కసమును నింపుచున్నారో అట్టిరైతులయెడ ప్రభుత్వ ముదాసీనత జెందుట కడు శోచనీయము, విషాదకరము. ప్రజలనుండి యెన్ని దారుణమగు పన్నుల వసూలు చేయుచున్నను ప్రభుత్వమున కేటేట ఆదాయమునకంటె ఖర్చులే యెక్కువగుచున్నవిగదా! వచ్చు రాబడిలో నెక్కువభాగము సివిల్, మిలిటరీ ఖర్చులకే వినియోగింపబడుచుండ రైతుల కేమి సౌకర్యములు చేయగలరు? ఇతర దేశములలో రైతులకొరకు ప్రభుత్వముచేయు వ్యయము ఈక్రింది అంకెలవలన గమనింపుడు:

| దేశము | ఏసంవత్సరపు అంచనా | ౧౦౦౦మంది జనసంఖ్యకు ఎన్నిరూ.లు | ౧౦౦౦ ఎకరములకు యెన్ని రూపాయలు |
|---|---|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రములు | ౧౯౧౯-౨౦ | ౧౦౨౦ | ౨౧౦ |
| బ్రిటిషుదీవులు | ౧౯౨౧ | ౯౬౦ | ౧౩౮౦ |
| జర్మనీ | ౧౯౧౦ | ౯౪౫ | ౧౮౫ |
| ఇటలీ | ౧౯౨౫-౨౬ | ౨౫౫ | ౧౮౪ |
| బ్రిటిష్ ఇండియా | ౧౯౨౪-౨౫ | ౩౪ | ౫౦ |

ఎంత తక్కువ మొత్తము మన దేశములో వ్యవసాయముకొరకు ఖర్చుపడుచున్నదో చూడుడు.

ఇతరదేశములలోని పెద్దఉద్యోగస్థుల కెంత జీతములు?
మన దేశమున నెంత జీతములు?

మన దేశములో పెద్ద ఉద్యోగస్థులకందరకు నితర దేశములకంటె చాల హెచ్చుమొత్తముల నిచ్చుచుండుటచేతకూడ ప్రభుత్వము ప్రజాసౌకర్యములు చేయజాలకుండెను. దారిద్ర్యములో మునిగియున్న మనదేశములో నెంతెంత జీతములో నష్టైశ్వర్యములతో తులదూగుచున్న యితర దేశములలో నెంతెంత జీతములో యీక్రింది అంకెలవలన తెలుసుకొనుడు:

| | | |
|---|---|---|
| అమెరికాసంయుక్తరాష్ట్రముల అధ్యక్షునకు | డాలర్లు | ౭౫,౦౦౦ |
| | రూ.లు | ౨,౨౫,౦౦౦ |
| జపానుదేశపుప్రధాన మంత్రికి | యెన్నులు | ౬,౨౦,౦౦౦ |
| | రూ.లు | ౧,౮౦,౦౦౦ |
| ఇండియాదేశపు వైస్రాయికి | రూ. | ౨,౫౦,౮౦౦ |
| అమెరికా సంయుక్తరాష్ట్రములలో రాజ్యాంగములోని మంత్రులకు | డా. | ౧౨,౦౦౦ |
| | రూ. | ౩౬,౦౦౦ |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | |
|---|---|
| జపాను దేశము | యె. ౮,౦౦౦ (౧౨,౦౦౦ రూ.) |
| ఇండియా దేశపు కేంద్ర ప్రభుత్వము లోని కార్యనిర్వాహక సభ్యునకు | రూ. ౮౦,౦౦౦ |
| అమెరికా దేశపు రాష్ట్రముల గవర్నరులకు | ౨,౫౦౦ మొ౧౨,౦౦౦ డా. వరకు (౭,౫౦౦-౩౬,౦౦౦ రూ.) |
| ఇండియా దేశము | ౧,౦౦,౦౦౦ మొ. ౧,౨౦,౦౦౦ రూ.ల వరకు |

(From Lajpatrai's England Debt to India Appendix).

సీమలోని ప్రధానమంత్రి సంవత్సరమునకు ౫౦౦౦ పౌ.=౭౫౦౦౦ రూ.లు పుచ్చుకొనుచుండగ అతనిచే నియమింపబడినట్టియు, అతనిక్రింది యుద్యోగస్థుడైనట్టియు మన దేశపు వైస్రాయికి రూ. ౨,౫౦,౮౦౦ ఏటేట నర్పింపబడుచున్నవి. ఇందలివిపరీతమునకు కారణము ఇంగ్లండు ప్రధానమంత్రి జీతము చెల్లించునది తెల్లవారు. ఇచ్చటి వైస్రాయిజీతము భరించునది నల్లవారు. ఇట్టివెన్నో లెక్కింపలేనన్ని వ్యత్యాసములు ప్రతితెల్లనల్ల యుద్యోగస్థుల మధ్యను కనబడుచుండును.

### రైతు తన కాళ్ల మీదనే తానాధారపడవలెను

ఈకష్టముల నన్నిటి నెదుర్కొని ప్రభుత్వమువారికి విన్నవించుటకైనను రైతు లందరును ఇతరులమీద నాధారపడక తమకాళ్ల మీదనే తా మాధారపడి సంఘీభావము గలిగి రైతుసంఘముల నేర్పరచి వాటి ద్వారా తమ కష్టములను ప్రభుత్వ దృష్టిలోనికి వచ్చునటుల కొంతశ్రమజేసి ఆందోళన జేసిన ఫలితముండకపోదు. ఇతర దేశము లెల్లెడలను రైతులు తమ సంఘములను విరివిగా నెలకొల్పి తమతమ కష్టముల తామే పాపుకొనుచుండ మన దేశమున నింకెంతకాల మీ మౌనవ్రతము? ౧౯౨౧-వ సం.రములో అమెరికాసంయుక్తరాష్ట్రముల పార్లమెంటునందు రైతులకు నష్టమైనట్టియు, వ్యాపారులకు లాభకరమైనట్టియు నేవో రెండుశాసనములు చర్చించుటకు తీర్మానించగా అనతికాలములోనే వెంటనే ౨౪ గంటలలో సమస్తసంయుక్తరాష్ట్రములనుండి రైతునాయకులు తమ తీవ్రమగు నసంతుష్టిని వెల్లడించుచు వేలకొలది టెలిగ్రాములను పార్లమెంటుపై వర్షింపజేయగా రైతులు పూర్వమువలె అమాయకులు గారని సభ్యులందరు తెలిసికొని శాసనసభవారు భయపడి వారి మాట వినకతప్పదాయెను.

### రైతు సోదరులకు విజ్ఞప్తి

ఆంధ్రరైతుసోదరులారా, పై విషయములను గమనించియైనను మన రైతునాయకులగు శ్రీయుత రంగా మొదలగు వారి మొఱల నొకింత చెవినిడి సంఘీభావముగలిగి పరస్పర ద్వేషముల విడనాడి గ్రామ, తాలూకా, జిల్లా, రాష్ట్రసంఘముల నెలకొల్పి వాటిద్వారా తమకష్టములనుండి కృతకృత్యులగుదురని యాశించెద.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నా హంపీ విజయనగరయాత్ర

ముదిగంటి జగ్గన్నశాస్త్రి

హంపీక్షేత్రము, హంపీ విజయనగరము, విద్యానగరము అనునవి యొక్క పట్టణమునకే నామాంతరములు. ఈపురాతనపట్టణ మీపేరున స్థాపింపబడిన విజయనగర సామ్రాజ్యమునకు రాజధానియై ప్రసిద్ధిచెందెను. ఇది ౧౩౩౬-వ సంవత్సరములో స్థాపింపబడి ౧౫౬౫-వ సంవత్సరము తల్లికోట యుద్ధముతో తరలిపోయెను. ఈసామ్రాజ్య వైభవమునుగురించిన వర్ణనము లనంతము లుగా గలవు. ప్రాచీనులేమి, నవీనులేమి దీనిని వేనోళ్ల బొగడిరి. సీజరు ఫెడరిక్కు అనునతడు తన యాత్రలనుగురించి వ్రాయుచు దీనినిగురించి యిట్లు వ్రాసెను: "నేను అనేకరాజులను, రాజభవనములను, రాజసభలను చూచితిని. కాని నవద్వారపురమైన విద్యానగరములోని రాజసౌధమువంటి సౌధము నెందును గాంచలేదు. ఇప్పటికిని మనకు గాన్పించు శిథిలాంగములలో విశోబా దేవాలయము, రాజసౌధము, ఏనుగుశాలలు, రాణివాస స్త్రీల యభ్యంజనమందిరములు మొదలగు కట్టడము లెన్నియో కలవు. ఇవన్నియు చాలమైళ్ల విస్తీర్ణముగల ప్రదేశములోనుండి యంత్రతంత్ర సాధనసామగ్రి బొత్తుగా లేని యాప్రాచీనకాలమున పర్వతములవంటి రాళ్లు, ఏనుగులకైనను కదపశక్యముకాని లోహకృతములైన దూలములు భూమిపై వందలకొలది యడుగులయెత్తువరకెట్లు మోసికొనిపోబడెను? వాటివాటి ప్రదేశములలోనవి గణితశాస్త్రప్రకార మీషణ్మాత్రమును దప్పకుండ నెట్లుమర్చబడెను? అను నాలోచనలతో జూపరుల నాశ్చర్యమగ్నమానసుల గావించుచుండును. ఈ జీర్ణ విజయనగరపట్టణమున గంటలకొలది తిరుగాడునపుడు బూర్వమారాజవీధులు యోధబృందములతోను, బేహార, వణి, గ్గాయక, సచివ, సామంత, పట్టణస్త్రీ, పురుష, శిశువుల కోలాహలములతోను ప్రతిధ్వనించుచుండ నామహారాజులు ఛత్రచామరాదులతో భద్రగజారూఢులై భట్టు, వైతాళిక, నర్తకగణ గానములతో జరుపుచుండు ఉత్సవదృశ్యములు పొడగట్టుటలో నాశ్చర్యము లేదు." అని వ్రాసెను. ఈపొగడ్తల నొక్కసారి మరచిపోయి ప్రస్తుత హంపీకి బోదము.

మనము బళ్లారిలో రైలెక్కి హోస్పేట స్టేషనులో దిగవలెను. ఇచ్చటనుండి జట్కాబండిమీదగాని, మోటారుమీదగాని హంపీకి బోవలెను. ఇచ్చటికేడు మైళ్లదూరములో కమలాపురమను కాసార మొకటిగలదు. తుంగభద్రానది దీని కాధారము. దీనిక్రింద సుమారు మూడువేలయకరములు సాగు అగును. కొంచెమించుమించు మనము చూడదగిన దృశ్యము లిచ్చటనుండియే ప్రారంభమగును. కనుక నిచ్చటినుండి పాదచారులమై పోవుటయే శ్రేష్ఠము. ఇచ్చట వాతావరణమంతయు మారిపోవుచున్నది. పూర్వస్మృతిని బురికొల్పువాసనలేవియో బయలుదేరుచున్నవి. ఇట్లు మన మొకమైలు పోవుసరికి చంద్రశేఖరదేవాలయము పొడగట్టును. చుట్టు నొకయిటుకప్రాకారము, మధ్య నొకరాతికట్టడము. ఈకట్టడము చివరభాగము మాత్రము ఇటుకతోను, సున్నముతోను కట్టబడెను. దేవాలయపుగోడలమీద విగ్రహము లున్నవికాని కన్నులేక, కాలులేక, చెయ్యిలేక వికలత నొందియున్నవి. దేవాలయములో దేవుడు లేడు. కాని యిచ్చట గబ్బిలములు స్థిరవాసము నేర్పరచుకొనెను.

ఒకటిరెండు ఫర్లాంగులు ముందుకు పోదము. అదిగో! ఆ కాన్పించున దేమి? అదే మహారాణిగారి మజ్జనమందిరము. దానిచుట్టు నొకకందకము కలదు. ఏడుమైళ్ల దూరములో నున్న తుంగభద్రాస్రవంతినుండి యొక రాతికాలువద్వారా దీనికి నీరు సరఫరా చేయబడుచుండెడిది. నీరుపోవుమార్గముకూడ గలదు. ఈ మందిరము రెండంతస్తులది. నలువైపుల రెండవ అంతస్తుమీద నాలుగుబురుజులు గలవు. మధ్యనున్న క్రింది అంతస్తు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోని హోలు పదిఅడుగుల లోతుగలిగి రాతిచపటా చేయబడి తుంగభద్రాతోయములతో నింపబడును. రాణివాసస్త్రీ లిందులో మజ్జనమాడుదురు. ఈమధ్య నున్న రాతిహ్రదముచుట్టు నున్న కుడ్యములలో నమర్చ బడు వివిధవిలాసవస్తువుల నిప్పుడు మన మూహించు కొనవలయునే కాని వర్ణింపజాలము. వాటి చిహ్న ములుమాత్రము కాన్పించును. ప్రస్తుత మొకపురాతన భూజ మీ మందిరోపరిభాగమున విచారకలుషితమై పత్రములను, పుష్పములను రాల్చుచు తనవిధిని నెర వేర్చుకొనుచున్నది.

మరికొంతదూరము ముందుకు పోదము. అల్లదే దర్బారుభవనము. ఇచ్చట విజయనగరచక్రవర్తులు దర్బారు చేసి తమ ప్రజల యిక్కట్టులను, కష్టసుఖ ములను, బాగోగులను విచారించుచుండిరి. ఈభవన మిప్పుడు శిథిలమై దర్బారుచేయు ప్రదేశముమాత్రము నాలుగైదడుగుల యెత్తు గలిగి సిమెంటు చేయబడి పాడుపడిపోయిన బియ్యపుఫ్యాక్టరీ కళ్లమువలె కాన్పిం చును. దానిమీద రాజుగారి ప్రత్యేకమందిరచిహ్నము లిప్పటికిని గాననగును. దీని సమీపముననే భూమి లోపల నొకదేవాలయము గలదు. ఈ ప్రదేశమంతయు రాతితో చపటా చేయబడి మధ్య దేవాలయముచుట్టు నొక ప్రదక్షిణముచేయించు మార్గమును గలిగియు న్నది. మరికొంత ముందుకు పోదము. ఆ యెత్తయిన ప్రదేశము, దానికి గావలియున్న యా వికలములైన రాతియేనుగులు రాజసౌధముయొక్క చిహ్నములు. దీని దగ్గరనే మరియొకసౌధపు చిహ్న ములును గలవు. ఈసౌధపునాదులచుట్టు నున్న రాతిచెక్కడపుపనులను బరీక్షించుటకు, వర్ణించుటకు నేకొద్దినిమిషములో చూడగలిగిన నావంటివానికి గష్ట సాధ్యమైన పని. గజయూధములు, అశ్వదళములు, ధను ష్పాణియైన భటావళి, కోదండకోవిదులతో గూడిన పటాల-పంక్తులు, ఒంటెల దళములు, గుఱ్ఱముల స్వారులు ఏనుగుల పరుగులు, చెలగాటములు, కేరింతలు, ద్వంద్వ యుద్ధములు, కోదండపాణులై వీరవిహారము చేయుచు న్న వీరాంగనలు, సహస్రవిధముల నృత్యములు సలుపుచు భరతశాస్త్రపారీణత నంతను వెదచల్లు నర్తకాంగనల కేళీకదంబములు—ఆహా! ఇక నెంతయని వర్ణింప గలము. మనయెదుట కళ్లకుగట్టినట్లు జీవకళతో నుట్టిపడు నొక యద్భుత, వీర, శృంగార, నైసర్గిక ప్రపంచ మిచ్చట సృజింపబడెను.

రాజసింహాసన మమర్చబడిన యెత్తయిన ప్రదేశ మిప్పటికిని గాననగును. ఈప్రాంత మిపుడు త్రోవలలో దప్ప చిరుపొదలతోను, పక్షుల కిలకిలారావములతోను నిండియున్నది. ఈ సమీపమున సుమారు పదునాలుగు గజముల పొడవును, గజములోతును గల రాతితొట్టి యొకటి కలదు. ఇది పశువుల నీటితొట్టి యని చెప్పుదురు. కొంతదూరము పోవుసరికి మీ కట్టె దుట మరియొక దేవాలయము ప్రత్యక్షమగును అదియే హజారు రామచంద్ర దేవాలయము. హజారు అనగా పదివందలు. దీని కొక భావార్థము గలదని చెప్పుదురు. ఈ దేవాలయపు గోడలమీద రామాయణకథ యంతయు సంపూర్ణముగా విగ్రహరూపమున చిత్రింపబడినది. వేయి ఘుట్టములతో నిది పూర్తిచేయబడెనని ప్రతీతి. కనుకనే పైనామము దీనికబ్బెనందురు. ఒక నల్లరాతి స్తంభముమీద చెక్కబడిన విగ్రహముల సొంపు, పని తనము, సౌకుమార్యము, నీలంపురుములు చూడదగినవే కాని వర్ణింపదగినవి కావు. ఈ దేవాలయ మధ్యభాగ మున నిట్టివి నాలుగు స్తంభములు గలవు. ఇచ్చట రెండు నిమిషము లాగినచో నాశిల్పులు మర్త్యులుకాక దేవతలని తోపకమానదు ఈశిల్పులు దమలో భావతరం గము లుప్పొంగి పొరలుచుండ, చేతులలో నున్న సున్ని తంపు పనిముట్లు పరుగులిడుచుండ, తన్మయత్వము జెంది నీలంపురాతితో చెలగాటమాడినట్లు తోపకమానదు.

మరికొంతదవ్వు పోవుసరికి జనానాయావరణ మును సమీపింతుము. సుమా రిరువదియడుగుల యెత్తు గల రాతిప్రాకార మీ ప్రదేశమంతకును శ్రీరామరక్ష బెట్టుచున్నది.

దీని నాలుగు గోడల మూలలందును నాలుగుబురు జులు గలవు. ఈయావరణములో 'కమలసౌధము' అను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పేరుగల సాయంసమయసవితృకాంతిని బోలు సౌధ మొకటి గలదు. కమలము నీటిలో నుండునట్లిదియును నీటిలోనే నిర్మింపబడెను. దీనిచుట్టు నొక రాతికాసారము సృజింపబడెను. ఈయావరణములోనే మరియొక చోటనున్న జలమందిరమునుండి దీనికి నీరు సరఫరా చేయబడును.

ఈ సౌధముయొక్క బంగారుకాంతి, సున్నపు మల పూర్పు, నునిసీల నేర్పు నేటికిని చూపరులకు నేత్రపర్వముగ నుండును.

మరికొంతదూరమున దూరమునుండియే యెత్తయిన రాతికట్టడము లేవియో కాన్పించుచున్నవి. అవియే యేనుగుశాలలు. ఇవి యెత్తయిన గొప్ప రాతికట్టడములు. ఇందులో పదికొండు ఏనుగులుండుటకు ప్రత్యేకములైన గదు లేర్పరుపబడెను. ఒక్కొక్కగది యేబది గజముల చతురముగలిగి సుమారు ముప్పదియడుగుల యెత్తుండును. గదులలో దీపము లుంచుటకు గూళ్లు కలవు. ఈదినములలో నిట్టికట్టడమును కట్టించుట కధమము రెండు లక్షలరూపాయలైనను నతిశయోక్తి లేదు.

ఈశాలల కతిసమీపములో రత్నశాల యను రాతికట్టడము కలదు. ఈశాల కతిసమీపముననే కోట వంటి మరియొక కట్టడము కలదు పాడుపడిన యొకటి రెండు బురుజులుమాత్రమే ప్రస్తుతము మనకు కాన్పించుచున్నవి. మరికొంతదూరము చురుకుగా పోదము. ఆకాన్పించునది మరియొక భూగర్భదేవాలయము. ఇది వెనుకటిదానికంటె చాలపెద్దది; పనితనముగలది. ఇది యొక పెద్ద రాతిచెరువు. దీనిమధ్య ప్రధానదేవస్థానము కలదు. దీని కిరుప్రక్కలను, ముఖభాగమునను రాతిమంటపములు గలవు. ప్రధానదేవాలయము మూడుభాగములుగలిగి సుమారు నూరు నూటయేబది రాతిస్తంభముల తో నలరారుచుండును. ఒక నందిమాత్రమే దీని నిప్పటికిని గాపాడుచున్నది. సమీపములో నుద్దానవీరభద్రస్వామిదేవాలయము కలదు. ఇందు చూడదగిన దేమియు లేదు. కాని దేవుడును, పూజారులును గలరు.

దీనిదగ్గరనే దేవుడులేని చౌడేశ్వరిదేవాలయమను నొక పెద్దదేవాలయము కలదు.

చాలదూరము నడచితిమి. హంపిగ్రామము వచ్చుచున్నది. చటచట నడుగిడుడు. అయ్యో! ఆభయంకర రూపము! చాచిన నాలుక; వాడియైన కోరలు, విరిగిన నాసికాహస్తములు; నెత్తిపై నున్న ఫణిఫణాగ్రములు— అది నృసింహవిగ్రహము. సుమారిరువదియడుగుల శిలను శిల్పు లిట్లు మార్చివేసిరి. దీని దగ్గరనే యొక పెద్ద శివలింగము కలదు.

ఆ కాన్పించునది! అది హేమకూటపర్వతము. దానిమీద నున్న పెద్దదేవాలయ మొక జైనదేవాలయము. దాని కనతిదూరములో నావగింజ విఘ్నేశ్వరుడును, దానిదగ్గర శనగకాయ విఘ్నేశ్వరుడును, దేవాలయమును గలవు. ఈదేవాలయములో నున్న విగ్రహము చాల పెద్దది. ఇది కూడ వికలము గావింపబడినది.

ఆ కొండక్రిందభాగముననున్న పూరిండ్లు-వ్రేళ్లమీద లెక్కింపదగినవి- శనగపప్పు, పుడుకులు, పకోడీల దుకాణములు; పాడుపడిపోయిన కర్పూరరథము; జీర్ణవస్త్రధారులై యాత్రికులకును, చూపరులకును కిరాణ సరకులను, కట్టెపుల్లలను అమ్ముకొనుచు జీవించు కష్టజీవులు; పాడువడి, పశువుల కొట్టారములవలె గాన్పించు జీసురుకారిన మిద్దెలు—ఇదియే ప్రస్తుతహంపి! తల్లీ! విజయనగర సామ్రాజ్యరమాపీఠమా! ఆంధ్రావనీశిరోభూషణమా! ఆంధ్రపౌరుషస్థానమా! ఆంధ్రకళాపారిజాతమా! గ్రీకు, రోమక, పరిష్యను సామ్రాజ్యనాగరికతలను మించిన నాగరికత గలిగి

" ఎదురైనచో దన మదకరీంద్రము డిగ్గి,
కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొనువేళ బుర మేగ
బల్లకి తనకేల బట్టియెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని నాదు పాదమున దొడిగె
గోకటగ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దన కవీంద్రయని నన్ను పిలుచునట్టి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణరాయలతో దివి కేగ లేక
బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబ నగుచు"

అని స్తుతింపబడిన చక్రవర్తులతోను, కవి, గాయక, శిల్పి, చిత్రకార, జ్యోతిష, వాస్తు,నట, భరతశాస్త్ర పారీణులతోను, మోహబృందములతోను, రత్నరాసుల తోను, సర్వైశ్వర్యములతోను చెన్నారిన నిన్నిట్టి దిక్కుమాలిన స్థితిలో చూడవలసిన దౌర్భాగ్యము నా కేల తటస్థించెను తల్లీ! నీ చక్రవర్తులు, నీకవికుంజరులు, నీతిమ్మరుసులు, పులిమీసల నయ్యలలాడిన నీతరమువారు పోయిరని తెలిసిపోతివే తల్లీ! రానున్న శకమువారు — కవులు, విద్యాధికులు, పండితులు, జానపములు,నీ క్షత్ర సంతతి — వీరునా రన నేల! అందరును బానిసవృత్తుల నవలంబింతు రనియు, నట్టివారిని పేడివానిని చూడనని శపథముచేసిన మాభీష్మపితామహునివలె చూడనని శపథముపట్టితే తల్లీ!

విచారించిన లాభములేదు. దుఃఖించిన దొరకున దేమియు లేదు. అయినను పొంగిపొంగివచ్చు వేడినిట్టూర్పు నాపుకొనుట దుర్లభము!

అకాన్పించు పెద్దకట్టడము, రాతిప్రాకారములు, పదునొకండంతస్తుల గోపురము, ముఖమంటపము, ఇరుకెలంకుల నున్న మంటపములు, దేవాలయము, శివలింగము — ఇదియే హంపీవిరూపాక్షస్వామిదేవాలయము. యాత్రికు లిచ్చట బసలుచేసి, వండుకొని, శ్రమదీర్చుకొని విచారానందములు ముప్పిరిగొనుచుండ శేషించిన జీర్ణసామ్రాజ్యచిహ్నములను జూచుటకు దమకపడుచుందురు. తుంగభద్రానది యీదేవాలయమున కతి సమీపమున బ్రవహించుచున్నది. ఈదేవాలయముచుట్టు నదివరకును పాడుపడియున్న మందిరములు, కట్టడములు, చిహ్నములు అనేకములు గలవు. పురాతన చిత్రలేఖన మొకటి మంటపోపరిభాగమున గానగును. అందు రామాయణకథలు చిత్రింపబడెను. ఆరంగులు, కనుముక్కుతీరు, భావప్రకటనము పురాతనచిత్రకళా పాటవమును సూచించుచు నిప్పటికిని చెక్కుచెదరక యున్నవి.

ఈదేవాలయములోనే విద్యారణ్యులవారి రాతి విగ్రహము నీలంపునిగ్గులను దేలునట్లు చెక్కబడి యొక ముఖ్యప్రదేశములో నుంచబడెను.

మనము మన ప్రస్థానమును మరల సాగింపవలెను. హంపిగ్రామముచుట్టును పర్వతవలయము పెట్టనికోట వలె నున్నది. సహజములైన ఈకోటలనడుమ నీయుగ్రకంఠీరవ మానాడు గర్జింప శత్రుకుంజరముల నుండెలవియుచుండెడి వనుటలో నాశ్చర్య మేమికలదు! మన ముందు రెండుమూడుఫర్లాంగులలో నొక గొప్పనంది విగ్రహము జీవకళతో నుట్టిపడుచు మనల నాహ్వానించుచున్నది. దాని సమీపముననే అచ్యుతరాయదేవాలయము కలదు ఈదేవాలయమును దాటినతరువాత నిరుప్రక్కల నున్న రాతిమంటపములక్రిందనుండియే మనము రెండుమూడుఫర్లాంగులు నడచిపోవలెను. ఇంతలో పర్వతముల సందు; వాటినుండి భయంకరవేగముతోను, సుడిగుండములతోను, హోరుగాలితోను, పెనుధ్వని తోను వెలువడు తుంగోత్తుంగతరంగయగు తుంగ; ఈనదీ తోయతుషారనిరంతరాభిషేచనభాగ్యము ననుభవించు రామస్వామిదేవాలయము కాననగును. ఇచ్చట నొక దేవాలయములో యంత్రోద్ధారకుడు చూపబడును. అంజనాదేవికుమారుడైన ఆంజనేయుడు తపోనిష్ఠలో నున్నాడట! ఇచ్చటనే మధ్వాచారివిగ్రహము కలదు. ఈదేవాలయమును దాటి ముందుకుపోదము. చూడవలసిన వింకను అనేకములు కలవు.

అవిగో! ఆ కాన్పించు ఎత్తయిన రాతిస్తంభము లమీద నడ్డముగానున్న రాతిదండి, గొల్లెములు; జనగరులో రాజవీథిలో జూపఱుల కాశ్చర్యమును గొల్పునట్లు కాన్పించునదియే తులాభారస్థానము. ఇచ్చట విజయనగరరాజు లేటేట బంగారముతో దులతూగి దానినంతను దానముచేయుచుండెడివారట.

దీని సమీపముననే విఠోభాదేవాలయము కలదు. ఇది యొక యద్భుతమైన కట్టడము. అంతయు రాతిపని ఇందు సుమారు పన్నెండు మంటపములు, రెండు గోపురములు, నొకరాతి రథమును కలవు. ఇందులోనున్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శిల్పము ముద్దునుగూడ చిగురొత్తజేయును. పనితనము లేని మంటపస్తంభ మొక్కటియును గానరాదు. ఒక స్తంభమువిూద నున్న పనితనము మరియొక స్తంభమువిూద పొడగట్టదు. రాజహంసలు, రామచిలుకలు, కమలములు, నల్ల కలువలు, గజములు, వారువములు, ఋషిమండలి, దేవతాగణము, నర్తకాంగనలు, వీరసందోహములు దేవ తిర్యఙ్మానవవర్గము లన్నియును బ్రదర్శింపబడెను. ఇందలి రాతిరథ మొక యద్భుతవిషయము. ఇరువది యడుగుల రాతిబండ—చక్రములు, యిరుసులు, స్తంభములు, ఏనుగులు, విగ్రహములు, అలంకారములు, దానిలోనుండి పుట్టినట్లు చెక్కబడి యొక చిత్రరథముగా తయారుచేయబడి యుద్ధమునకు సిద్ధముగా నున్నట్లు కాన్పించును.

దీని కెదురుగానున్న యాసుంపర మందిరమును జూడుడు. చక్కని గోపురములు, చిక్కని చక్కని విగ్రహములు, చక్కని చెక్కడపుపనులు; అంతయు ముద్దులు మూటగట్టినట్లు జూపట్టును. ప్రధానమైన కట్టడము పాడుచేయబడెను. అయినను మిగిలియున్న శిథిలాంగములే దాని గొప్పతనమును జాటుచున్నవి. భరతశాస్త్ర మిచ్చట మరియొకసారి చిమ్మివేయబడెను. ఆశిల్పుల చేతులలో శిలలు శిలలుగాక మైనపుముద్దలయ్యెను. మానవభావములను, ఆశయములను వెదజల్లని రాయిగాని, స్తంభముగాని యిచ్చట గానరాదు. ఒక స్తంభము పదునారు సున్నితంపు స్తంభములుగా చెక్కబడి లతలతోను, విగ్రహములతోను ముద్దులు మూటగట్టుచుండుటయేగాక నా స్తంభములను వరుసగా నీచేతితోగాని, కర్రతోగాని తట్టుచుబోయినచో పదునారు వివిధస్వరములు బలుకుచుండును. మరియొకచో గజములును, మృగరాజములును దలపడుచుండును.

ఇట్లు మన మెంతసేపు తిరుగాడినను, మన మెన్నిదినములు గడిపినను, మన మనేకనేత్రములతో జూచినను, మనలో నెంతకౌతుకము, ఉత్సాహము కలిగినను మనము చూడజాలని మందిరములు, మంటపములు, గోపురములు, కట్టడములు కొన్ని మిగులుచునే యుండును.

ఆహా! విజయనగరము నిజముగా విద్యానగరము. పదునాల్గవశతాబ్దములో నుద్భవించి రెండుశతాబ్దములలోనే మహదైశ్వర్యముల కాలవాలమై, మహోన్నతదశననుభవించి, సర్వకళాపీఠమై, సర్వశాస్త్రసాగరమై, కవికోకిలగానరసతన్మయత్వము నొంది, మానవశక్తుల యపారత కుదాహరణంబై భారతరాజతంత్రపాటవమును మరియొకసారి ప్రపంచమునకు జవిజూపి, యనన్యవిజ్ఞానమును వెదజల్లి తల్లికోటతో తెగిపోయిన తల్లీ, జోహారు! జోహారు!



సాయంకాల సముద్రతీరము

(తిరువల్లిక్కేణి) పి. రాఘవరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



సరస్వతి

చిత్రకారిణి : దామెర్ల సత్యవాణి గాఀ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ధాన్యదేవతలు—వారి యారాధనము

తేకుమళ్ల రామచంద్రరావు, ఎం. ఏ., బి. ఎల్.

## తొలిపలుకు

ప్రపంచమునందలి ముఖ్యవృత్తులలో వ్యవసాయ మతిసులువుగ ప్రథమస్థానము నాక్రమించుననుటలో నతిశయోక్తి యేమాత్రమును లేదు. ఇప్పటికి సుమారు రెండువందల సంవత్సరములనుండిమాత్రమే పారిశ్రామికవృత్తులు ప్రపంచమున నెన్నదగు స్థానము నాక్రమించుకొన్నవి. అటులయ్యును వ్యవసాయవృత్తిని దాని ప్రథమస్థానమునుండి కదలుప పరిశ్రమల కలవి కాలేదు. అది యెన్నటికిని అలవికాదు. పరిశ్రమలకు నిలయములగు దేశములస్థితినిగూర్చి యాలోచించినప్పుడే సంగతిసందర్భము లీప్రకారము గోచరించుచుండగా వ్యవసాయముపైననే ముఖ్యముగ నాధారపడియున్న చీనా, ఇండియా, రష్యా మొదలగు దేశములందు దీని కున్న ప్రాముఖ్యమునుగూర్చియు, పరిశ్రమల యుద్వృత్తికి లోనుగాకుండిన కాలమునం దన్ని దేశములందును వ్యవసాయమున కుండిన ప్రాముఖ్యమును గూర్చియు విశేషించి వ్రాయుట యనవసరము.

వ్యవసాయముయొక్క ప్రాముఖ్యమును ప్రజలును, ప్రభుత్వమువారును చక్కగ తెలిసికొని, యంగీకరించుచున్నారు. వ్యవసాయాభివృద్ధి కనేకములగు సౌకర్యములను, అనేకములగు పరిశోధనలను, అనేకములగు విజ్ఞానాభివృద్ధికరములైన పనులను గావించుటకు ప్రయత్నించుచున్నారు. ఈవిషయమై నేడేకాక చిరకాలము నుండియు భారతదేశమున ననేకములగు ప్రయత్నములు జరుగుచు వచ్చినవి. చాలమంది రాజులు గొప్ప గొప్ప చెరువులను, తటాకములను, బావులను త్రవ్వించిరి. ఆంధ్రచక్రవర్తులలో నొకడగు గౌతమీపుత్రుడు గోదావరినదినుండి యొకపాయను చీలదీయించి వ్యవసాయమునకు తోడ్పడెను.[1] అటులే ఆంధ్రచక్రవర్తులలో మఱి యొకడగు వాసిష్ఠీపుత్రుడు గోదావరినదినుండి మఱి యొకపాయను చీలదీయించి[2] మఱికొన్ని యూళ్ల వ్యవసాయాభివృద్ధికి కారకు డయ్యెను. ఇట్లు వాపీకూపతటాకాదుల ప్రతిష్ఠాపనవలనను, శాఖానదుల సృష్టివలనను, నింకననేకములగు నితరవిధానములవలనను రాజులు ప్రజల సౌఖ్యమునకు పాటుపడుచుండిరి.

## ధాన్యదేవతలు

ప్రాపంచికముగ చేయదగిన పనియు, వీలగువిధానములను వా రవలంబించుచువచ్చినను ప్రాచీనకాలమున నిట్టి విధానావలంబనములో పాటు ప్రకృతి కతీతములగు సందర్భములపైన అన్ని దేశములవారును దృష్టి నుంచుచుండెడివారు. ధాన్యదేవతలకు ప్రీతిగలిగించుచో ధాన్యము సమృద్ధిగ పండుననియు, ఆవిషయమై ప్రజలు మిక్కిలి జాగరూకులై యుండవలెననియు మన పూర్వులు విశ్వసించుచుండిరి.

చీనాలో నిటీవలివఱకును ధాన్యదేవతాప్రీత్యర్థ మొక గొప్పవిధ్యుక్తకర్మము నెరవేర్పబడుచుండెను. ప్రతిసంవత్సరమునందును వసంతకాలములో నొకనిర్ణీత దినమున చీనాదేశపు చక్రవర్తి స్వయముగ నీపనికి బూనుకొనుచుండెను. చీనాదేశమునకు ముఖ్యపట్టణముగు పెకింగ్ నగరమునకు సమీపమున 'దేవతాక్షేత్రము' అను నొక భూమి కలదు. ఆభూమిని చీనా చక్రవర్తి స్వయముగ తనహస్తములతో దున్ని, నలువది కోట్లమంది ప్రజలపై నధికారముగల తన రెండుచేతుల తోను దేవతాక్షేత్రమున ధాన్యమును జల్లుచుండెను. ఆ సందర్భమున చీనాదేశమునందలి గొప్పగొప్ప రాజకీయోద్యోగులందఱును నచ్చట హాజరై యుండుట వా

1. Du Brueil: History of the Deccan. 2 Ibid.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డుక. చీనాచక్రవర్తి చల్లినధాన్యము మొలకెత్తికంకులు వేయుసమయమున పెకింగ్ నగరపు గవర్నరు ఆకంకుల నతిజాగరూకతతో పరిశీలించుచుండెను. ఆ పరిశీలన యొక్క ఫలితముగ ధాన్యదేవతలు చక్రవర్తిగారి కృషిని-ప్రార్థనను-అంగీకరించి దేశమును సస్యసౌభాగ్యవంత మొనర్తురని యాతడు చెప్పవలసి యుండెను. దేవతా క్షేత్రమును దున్నుటకుముందు మూడుదినములు చీనా చక్రవర్తి ఉపవాసము చేయవలెను. కఠిన శిలమీద నొక్కరుడును రాత్రి శయనించవలెను. చక్రవర్తి గారితో హాజరను రాజకీయోద్యోగు లందఱును కూడ నట్లే జరుపవలెను. ఆక్షేత్రమున పండినపంట పసుపు పచ్చని రంగుగల బస్తాలలో పోయబడి జాగ్రత్త చేయ బడెడిది. దేవతాప్రీతికరములగు నుత్సవముల సందర్భ మున నీధాన్యమే నైవేద్యముగను, నితర విధములుగను నుపయోగింపబడుచుండెను. ఇట్లే చీనాసామ్రాజ్యభాగ ములగు రాష్ట్రములందు, ఆయారాష్ట్రముల గవర్నరులు అక్కడి 'దేవతాక్షేత్రము'లను పైప్రకారముగనే దున్న వలెను. ఇది చీనాదేశీయుల మొదటి నెలలో జరుగు విధ్యుక్తధర్మ మైయున్నది.[3]

## ధాన్యమే ధాన్యదేవతలు

మనపూర్వులు కొండలందు, కోనలందు, చెట్ల యందు, పుట్టలయందు, సలిలమునందు, వాయువునందు, మబ్బునందు, మెఱుపునందు, ఉరుమునందు—వేయేల?-ప్రపంచమున మానవునకు దృగ్గోచరమగు నన్నివస్తువుల యందును, అన్నిదృశ్యములందును భగవత్స్వరూప మును గాంచుచుండెడివారు. సృష్టియంతయు వారికి దేవతామయముగ గానబడుచుండెడిది. ఇది మన భారత దేశమునం దొక్కచోటనేకాక యావత్ప్రపంచమునం దును ప్రాచీనకాలమున విశ్వసింపబడుచుండిన యభి ప్రాయ మైయున్నది. కావున ఆకాలమునందు ప్రాపంచికముగ చేయవలసిన కృషితోపాటు దేవతాప్రీతికర ముగగూడ కొంతకృషిని ప్రజలును, రాజులును, పెద్ద లును గావించుచుండిరి.

అట్టికృషిని మనము రెండుతరగతులుగ భాగించ వచ్చును. మొదటిది: పంటలు సమృద్ధిగ పండుటకు చేయుకృషి; రెండవది పండినపంటలు ఎలుకలు, మిడుతలు, పిచ్చుకలు ఇత్యాదులు నాశనముచేయకుండ చేయు కృషి. ఈరెండింటను ప్రాచీనకాలమున దేవతల నుద్దేశించి చేసిన యారాధనాదులలో ప్రపంచమునందలి యనేకభాగములలో నొకదానితో నొకదానికిగల సామ రస్యమును సూచించి, విచిత్రసాదృశ్యనిరూపణ మొన ర్చుటయే నాయీప్రస్తుతవ్యాసముయొక్క ముఖ్యో ద్దేశ మైయున్నది. భగవద్భక్తిమొదలుగాగల విషయ జాలమునెడ ప్రస్తుతకాలమున కొందఱు ప్రజ లెట్టి యోరిమియును చూపజాలుటలేదు. కాని యీవ్యాసము మానవశాస్త్రమునకును, చరిత్రమునకును సంబంధించిన దగుటచే విజ్ఞానాన్వేషు లగు జను లెల్లఱకును ముదావహము గాకమానదు.

అతి ప్రాచీనకాలమున యావత్ప్రపంచమునను ధాన్యదేవతలను గౌరవించుటలో పంటలు బాగుగపండు ననునుద్దేశము మిళితమైయున్నది. తొలుదొల్త ధాన్య దేవతలే పంటలరూపమును దాల్తురనియు, పంటలకును, ధాన్యదేవతలకును నేవిధమగు భేదమును లేదనియు నమ్మ బడుచుండెను. సృష్టియందలి ప్రతివస్తువుకూడభగవద్దత్త మగు నొక దివ్యతేజోవిరాజితము కానిచో నది జీవిం చనే జీవించదని ప్రాచీనుల నమ్మకము. ఆ దివ్యతేజను భగవద్దత్తముమాత్రమే కాదు; అదియే భగవంతుడు. కావున ధాన్యము జీవించుటకు కారణము, ధాన్యము సమృద్ధిగ పండుటకు కారణము, ధాన్యమునందలి భగ వంతుడే-అనగా ధాన్యదేవతలే— యని ప్రాచీనుల విశ్వాసము.

## ధాన్యదేవతారాధనము

కాని, ఈధాన్యదేవతలను పూజించుట యెట్లు? వారి నారాధించుట యెట్లు? పంటలకును ధాన్యదేవత లకును భేదము లేదు సరియే కాని, ధాన్యదేవతల

3. Sacred Books of the East, Vol. XXVII, P. 254 et—Seq.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శుక్ల చతుర్థి
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీన చిత్రసంగ్రహమునుండి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాకారమెట్టిది? ఆయాకారమున గదా వారి నారాధించవలెను?

ఈయభిప్రాయారంభకాలమున పైప్రశ్నల కుత్తరము లొసంగుట కష్టమైనపని యైయుండలేదు. దేవతల యాకారము; మానవుల యాకారము నొక్కటే యని గదా ప్రాచీనుల యభిప్రాయము! మనహిందూదేవతలు మనుష్యుల యాకారముగలవారే. మన ధాన్యాధిష్ఠాన దేవతలగు ఇంద్రుడును, అగ్ని, వరుణుడు, విశ్వేదేవతలు వీరందఱును మానవాకారులే. పలస్థీనుదేశమున నివసించుచుండిన యూదుల యభిప్రాయము గూడ నిట్టిదే యైయున్నది భగవంతుడు మానవుని తన స్వరూపమే మచ్చుగ సృష్టించెను[4] అని వారి యూహ.

## జంతువులు - మేకధాన్యదేవతలు

ఇట్లు కొంతకాలము గడచినతరువాతి మానవ స్వరూపముగల యీదేవతలకు కొన్ని జంతువులతో సహచరత్వముగలయట్లు ఎంచబడెను. గ్రీసుదేశము లోని ధాన్యదేవతలలో డయోనీసస్ ముఖ్యుడు. ఈ డయోనీసస్‌తోపాటు పాన్, శాటిర్, సైలెన్యూస్, అనుపేరులుగల ఉపదేవతలు సంచరించుచుండిరి. ఈ ఉపదేవత లందఱును మేకల యాకారము గలవారని ప్రతీతి. పాన్ దేవుని ముఖము మేకముఖము; కాళ్లు మేక కాళ్లు. శాటిర్ దేవతల కొమ్ములును, తోకలును మేకల కొమ్ములు తోకలు నైయుండెను. చిత్తరువులందును, శిలాప్రతిమలందును పైవిధముగనే యీదేవతలు చిత్రింప బడుచుండిరి.[5] గ్రీకునాటకములందుగూడ వీరి పాత్రలును, సైలెన్యూస్ దేవతల పాత్రలును మేకతోళ్లు ధరించిన నటకులచే ధరింపబడుచుండెను. ఇటలీదేశపు టడ దేవతలును, ధాన్యదేవతలును మేకలరూపముననే చిత్రింపబడుచుండిరి.[6] ఇట్లే రష్యాదేశమునందు జెష్షీ[7] అనుదేవతలు గలరు. వీరు అడవులకును, పొలములకును దేవతలు. అడవులందును, పొలములందునుగూడ చెట్లే యుండునుగావున ఈదేవతలకును, ఆదేవతలకును భేదము లేదు వారును వీరును నొక్కరే. రష్యాలోని జెష్షీదేవతలు కొంత మేకరూపమునను; కొంత మనుష్య రూపమునను నున్నట్లు భావింపబడుచుండిరి. కాళ్లు, కొమ్ములు; చెవులు—ఇవి మేకల యవయవములవలెను, మిగిలిన దేహభాగము మనుష్యునిదేహభాగమువలెను జెష్షీదేవతల స్వరూపము చిత్రింపబడుచుండెను.[8]

## ౨. ఎద్దు

గ్రీక్‌ధాన్యదేవతలగు డయోనీసస్, డెమెటర్, అడోనిస్‌వగైరాలలో డయోనీసస్ మేకరూపము నేకాక ఎద్దురూపమునుగూడ కలిగియున్నట్లెంచబడుచుండెను. చీనాదేశములోని కృషిదేవతయొక్క తల ఎద్దుతల యై యుండెను. వృషభాననుడను నీదేవునకు ప్రతిసంవత్సరాది సందర్భమునను ఆరాధనలు జరుగుచుండెడివి. ఈజిప్టుదేశములో ప్రాచీనకాలమున ఆసిరిస్ అను నొక ధాన్యదేవత నారాధించుట వాడుక యైయుండెను. ఈ ధాన్యదేవత ఎద్దుయొక్క యాకారము గలదై యుండెనని ప్రాచీనకాలపు రచయితలగు ప్లూటార్క్, స్ట్రాబో, హెరొడోటస్ మున్నగువారు వ్రాసియున్నారు. ఆ కాలమున 'స్నైవిస్', 'హీలియోపోలిస్' అను రెండూళ్లయందలి నందులను ఈజిప్టుదేశపు ఆసిరిస్ నందితో పోల్చుచుండెడువారు. ఈఆసిరిస్‌తోపాటు ఐసిస్ అను నొక ధాన్యదేవతయు నుండెడిది. ఈధాన్యదేవత ఆవు ఆకారముగల దేవతగ భావింపబడుచుండెను. భారతదేశమునందువలెనే ప్రాచీనకాలపు ఈజిప్టుదేశమునగూడ గోవులు గౌరవింపబడుచుండెను. ఆవు కొమ్ములు గల ఐసిస్‌దేవతకు ఆవులు సహచారిణులుగ నొసగబడుచుండెను. కొన్నిదేవాలయములకును, మతసంస్థలకును దేవదాసీలను కైంకర్యము చేసినట్లు ఐసిస్ దేవతకు

4. "God made man in his own image"—Genesis.

5. Herodotus ii-46.

6 ఈదేవతలను 'ఫాన్' దేవతలందురు.

7. Zjeschi

8. J. G. Froger : The Golden Bough, Part V. Vol. II. P. 2.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆవులు కైంకర్యముచేయబడుచుండెను. ఇట్లే భారత దేశమున ధాన్యమునకును, ఆవునకును చాల దగ్గరిచుట్టరి కము ప్రతిపాదింపబడియుండెను. భరతుడు భూమిని ఆవుగమార్చి ఓషధులువగై రాల నాయావునుండి క్షీర మును పిండినట్లు పిండి ప్రజలకు సౌఖ్యమొడగూర్చె నని మన పురాణములలో సుప్రసిద్ధమగు నొక కథ కలదు. ఇట్లే ధర్మదేవత వృషభాకారముగా దేవతగ మన పూర్వులచే భావింపబడుచుండెను.

## ౩. గుఱ్ఱము

మేకరూపము, ఎద్దురూపము, ఆవురూపమే కాక ఇతరజంతువుల రూపమునగూడ ధాన్యదేవతలు ప్రపంచమున బరిగణించబడినట్లు నిదర్శనములు గలవు. గ్రీక్ దేవతలలో నొక్క దేవతయగు డెమెటర్ గుఱ్ఱము యొక్క ముఖము గలిగియుండెను. ఆర్కేడియా రాష్ట్రి మునందలి ఫిగేలియాగుహలో స్త్రీ యాకారపు దేహ మును అశ్వముయొక్క ముఖమును గలిగిన డెమెటర్ విగ్రహ మొక్కటి కలదు. డెమెటర్ యొక్క కుమా ర్తెను ప్లూటో అను పేరుగల నరకాధినాథు డెత్తుకొని పోయెను. ఆకుమార్తెను వెదకికొనుచు ధాన్యదేవతయగు డెమెటర్ ప్రపంచమున సంచరించుచుండగా పొసెయ్ డన్ అను దేవుడు డెమెటర్‌ను చూచి మోహపరవశుడై యామెను నిర్బంధింప జొచ్చెను. ఆతని బారినుండి తప్పించు కొనుటకు ధాన్యదేవత ఆడుగుఱ్ఱము యొక్క రూపమును దాల్చి ఫిగేలియాసమీపమున నొక గుహలో దాగికొనెను. ఈ కారణమున పంటలు పండ వయ్యెను. ఎక్కడి పంట లక్కడ మాడిపోజొచ్చినవి. కఱవు దేశము నావరించున ట్లుండెను. ఇంతలో 'పాన్' అనుదేవుడు డెమెటర్‌ను మంచిమాటలతో గుహను వదలి ప్రపంచము ననుగ్ర హించున ట్లొనర్చెను. ఈకారణముచే ఫిగేలియాగుహలో పైన పేర్కొనబడిన ప్రతిమలను గ్రీకుకృషీవలు లుంచు చువచ్చిరి. ప్రస్తుతకాలపు పైరోపాఖండాంతర్గతములగు దేశములందు సైత మీప్రాచీనాభిప్రాయము వ్యక్తీకృత మగుచున్నది.

## ౪. వరాహము

ధాన్యదేవత వరాహ (అడవిపంది) రూపమును, సాధారణపు టూరపందిరూపమునుగూడ దాల్చినట్లు భావింపబడుచుండుటయు గలదు. పైన నశ్వముఖిగ వర్ణితమైన డెమెటర్ దేవతకును పందికిని గల సంబంధ మీక్రింద వివరించుచున్నాను. చిత్రగుహలందు, పంది సహచారిణిగనో, లేక చేతులందలి శిశువుగనో ఈధాన్య దేవత చిత్రింపబడుచుండెను. కుమార్తెను వెదకికొనుచు పందిరూపమున నామె నరకమును జొచ్చినట్లు గ్రీకుల 'తెస్మొఫోరియా' యను పండుగ వ్యక్తపరచుచున్నది. ఇట్లే అట్టిస్ అనుదేవత పందియనియే భావింపబడు చుండెను. అట్టిస్ యొక్క ఆరాధనసందర్భమున 'హైస్ అట్టిస్, హైస్ అట్టిస్' అని భక్తిపారవశ్యముతో భక్తు లరచుట వాడుక. ఇక్కడ 'హైస్' అనుపదమునకు 'పంది' యని యర్థము. ఇట్లే ఆడోనిస్ అను దేవ తయు పందియే. సిరియాదేశములో అడవిపంది దేవతగ భావింపబడుచుండెను. ఇట్లే భారత దేశమున వరా హావతారము విష్ణుని మూడవ యవతారమని మన మంగీకరించుచున్నాము. వరాహమునకు మనదేశము నందువలెనే విదేశములందును గౌరవమును, దేవత్వ మును గలదని పై యంశములు స్పష్టపరుచుచున్నవి. కాని మనదేశమున వరాహమునకును ధాన్యము నకును నేమియు సంబంధము లేదు. హిరణ్యాక్షుడు సముద్రమున భూమిని దాచినట్లును, వరాహదేవు డా రక్కసుని తుదముట్టించి భూమిని తిరిగి తెచ్చెననియును మన పురాణగాథయై యున్నది. భూమి నిట్లు పునరుద్ధ రించుట యనగా సస్యసంభరిత మొనర్చుటయే యని చెప్పనగును. కాని యీవిషయమై తగుపరిశోధన యావ శ్యకము. ఆపరిశోధనయొక్క ఫలితముగ నీ యంశము తేలువరకును ధాన్యదేవత్వమునకును వరాహదేవునకును సంబంధమున్నట్లు గట్టిగా చెప్పజాల మనియే మనము తలంచుట మంచిది. ప్రాచీనకాలపు ఈజిప్టుదేశమున గూడ ఆసిరిస్ అనుదేవుడు ఎద్దురూపమునే కాక వరాహ రూపమునుగూడ గలిగిన ట్లెంచబడుచుండెను. పందిని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చంపినప్పుడు ఆసిరిస్ దేవుడు చనిపోయినాడని ఈజిప్టు దేశీయు లనుచుండెడివా రని యొక ప్రతీతి కలదు.[9] కావున గ్రీకు ధాన్యదేవతలును, ఈజిప్టుధాన్యదేవతలును కొన్ని జంతువులలో తిరుగుచుండిరనియు, వారే కొన్ని జంతువుల రూపమును దాల్చిరనియు స్పష్టపడుచున్నది. కావున మొదట మనుష్యరూపులగు దేవతలు కాలక్రమమున జంతువులుగ మారుట పైదేవతల యారాధనచరిత్రమున మన కగుపడుచున్నది. ఇది పైన పేర్కొనబడిన కొలదిదేశములందేకాక అమెరికా మొదలగు నితర దేశములందు గూడ జరిగిన పరివర్తన మైయున్నట్లు ముమ్ముందీవ్యాసమునమనకు తెలియగలదు.

### జంతుబలులు

ధాన్యదేవతలు జంతువులుగ పరిగణింపబడిన పిమ్మట నొక విచిత్రావస్థ యారంభమయ్యెను. డయోనీసస్ వగైరాదేవతలు మేకలుగదా? ఒకమేక పొలములోని ధాన్యమును తినుటకు వచ్చినచో దాని నేమిచేయవలెను? ధాన్యము దేవునివలనగదా ఫలించినది? కాబట్టి దేవునిదేకదా ధాన్యము? అట్టిదేవుని (మేకను, లేక ఎద్దువగైరాలను) తనధాన్యము తాను తినకుండ చేయవచ్చునా? కూడదుగదా!

ఇట్లు స్వల్పకాలము గడచినది. ప్రాచీనుల మనస్సులలో నొక చక్కని యాలోచన ప్రభవించినది. ఏజంతురూపమున నేదేవుడు కొలువబడుచున్నాడో ఆదేవునకును ఆజంతువునకును విరోధ ముండుటచేతనే ఆదేవు డట్లు ఆకారమును దాల్చెనని వారు నిశ్చయించిరి. లేకున్నచో దేవుని ధాన్యము నీజంతువులు తిని పొట్టనింపుకొనునా? అట్టిసమయమున దేవునకు నైవేద్యమే లేకుండపోవును. దేవుని భక్తితో నారాధించు వారికి జీవనోపాధియే లేకుండ నంతరించునే. కావున ఆయాజంతువులకును ఆయాదేవతలకును నేదో శత్రుత్వ ముండితీరవలెను. అందుకలననే ఆజంతువులు దేవుని ధాన్యమును తినుచున్నవి. అందువలననే దేవుడుసైత మా జంతువుల రూపమును దాల్చినాడు.[10]

ఈ యభిప్రాయము ననుసరించిన వెంటనే పూర్వపుపద్ధతులలో గొప్పమార్పు గలిగినది. ఈ జంతువులను బలియిచ్చుటవలన ధాన్యదేవతలు సంతసింతురనియు, సంతసించి మిక్కుటముగ పంటల నొసంగుదురనియు వారు భావింపసాగిరి. ప్రాచీనకాలమునజనులనాగరికులగుటచే నెత్తురు మాచినచో వారు సంతుష్టహృదయు లగుచుండిరి. ఇట్లు ప్రాచీనాచారానుసారముగ బలు లర్పించుట కేదోయొక సాకు వారికి దొరకగనే వారి సంతోషమునకు మేరయే యుండదు కదా? బలియీయబడు జంతువులు దేవునకు ప్రియతమము లగుటచే దేవునిస్వరూపములే యగుటచే బలియీయవలె నని కొందఱును, దేవున కీజంతువులు శత్రువులగుటచే బలియీయవలెనని కొందఱును చెప్పసాగిరి. కారణమేమైననేమి? ఈ రెండభిప్రాయములవారును బలియిచ్చు నాచారము నంగీకరించి పునరుద్ధరించిరి. ఎల్లరును హర్షించిరి.

ప్రాచీనకాలపు గ్రీకులలో 'బాఫోనియా'[11] యను నొక యుత్సవము గలదు. ఈ యుత్సవములో గోధుమలను, యవలను కలిపి జియస్ దేవునియొక్క వధ్యపీఠముపై నుంచెడివారు. ఆ వధ్యపీఠము చుట్టును ఎద్దులను ప్రదక్షిణముచేయించి నిలువబెట్టిన తరువాత కొందఱు కన్యలు తెచ్చిన నీరముతో తడుపబడిన కత్తిని కేలగొని పదును పెట్టి చంపెడు కఱకువానిచేతి కీయబడుచుండెను. అంతట నొక డాయెద్దుల నొకగొడ్డలితో కొట్టెడువాడు. మఱొకడు కత్తితో వాని గొంతుకల నుత్తరించెడు వాడు. కఱవుగాని, వఱపుగాని రాకుండుటకీ యుత్సవముచేయబడుచుండెను. ఈయుత్సవములో ముఖ్యమగునంశ మేమనగా ఎద్దులను చంపిన గొడ్డలిని, కత్తిని

9. Ibid—P. 33.

10. మన యాధునికతర్కముతో, మన యాధునికదృష్టితో ప్రాచీనసమస్యలను విమర్శించబూనరాదు. ప్రాచీనదృష్టి కీపరివర్తన మతిరమ్యముగ, దైవికముగ, నిశ్చయముగ కనబడును.

11. ఈపదమునకు 'ఎద్దునుచంపుట' అనియర్థము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెంటనే అక్కడ పారవైచి హంతకులు పారిపోయెడివారు. ఆపిమ్మట ఆయెద్దుల మాంసము నందఱును భక్షించి, తోలును జాగ్రత్తచేసి దానిలో గడ్డిని, చెత్తను పెట్టి యొక 'చాటపెయ్య' వంటి యాకారమును తయారుచేసెడివారు. ఈయెద్దులను నాగలికి పూన్చి దున్నుట నభినయించెడివారు. ఆతరువాత రాజుగారు న్యాయస్థానములో గూరుచుండి ఎద్దులను చంపిన హంతకు లెవ్వరని ప్రశ్నించగా నీరమును తెచ్చిన కన్యలు, గొడ్డలిని, కత్తిని పదునుపెట్టినవారు నేరస్థులనియు, వారు కఱకువాండ్రచేతికి వాని నందిచ్చిన వారు నేరస్థులనియు, వారు కఱకువాండ్రు నేరస్థులనియు, కఱకువాండ్రు గొడ్డలియు, కత్తియు నేరము చేసెననియు చెప్పుచుండిరి. గొడ్డలిపైనను, కత్తిపైనను నేరమును మోపి రాజుగారు వానిని సముద్రములో బారవేయుటయే శిక్షగ నిరూపించినవెంటనే యవి సముద్రములో బారవేయబడుచుండెడివి. ఈయంశము లను జాగ్రత్తగ పరీక్షించుచో, ఎద్దు దేవుని యపరావతారమగు కారణమున నీవృషభమేధ మొకహత్యగ నేరముగ పరిగణింపబడెనని మనము తెలిసికొనవచ్చును. ఇట్లే 'సౌసిపోలిస్'అను నగరమున గూడ నొకవృషభమేధము జరుగుచుండెను. నాట్ల కాలమున నొకయెద్దును దేవునకు ప్రియతమముగ కైంకర్యము గావింతురు. ఆయెద్దును ధాన్యము నమ్మువారు ధాన్య మొసంగి మేపుదురు. తుదకు కోతలసందర్భమున పెద్ద యుత్సవము చేసి ఆయెద్దును చంపివేయుదురు. ఈ ప్రాచీనాచారమునుబట్టికూడ ధాన్యదేవతయొక్క అవతారముగ ఎద్దు పరిగణించబడెనని స్పష్టమగుచున్నది.

ఇట్లే ఆఫ్రికాయందలి గినీదేశమున కోతలలో వృషభమేధము జరుగుచుండెను. చీనాలో నాట్ల సమయమున నొకవింత జరుగుచుండెను. వృషభానను డగు చీనాధాన్యదేవునకు ప్రీతికరముగ బంకమట్టితో నొక పెద్దయెద్దువిగ్రహమునో, ఆవు విగ్రహమునో ప్రజలు తయారుచేయుదురు. ఆవిగ్రహముప్రక్కన నాగలి మొదలగు వ్యవసాయపుపనిముట్లు నుంచుదురు. ఒక గ్రుడ్డివాడు రంగుకాగితములతో ఆ విగ్రహము నలంకరించవలెను. ప్రజలు దాని నైదురకముల ధాన్యముతో నింపవలెను. ఉత్సవదినమున (సంవత్సరాది పండుగనాడు) ప్రజ లనేకరంగుల కఱ్ఱలతో ఆవిగ్రహమును మోదుదురు. అప్పు డాఅయిదురకముల ధాన్యము ఆ పగిలిన విగ్రహములోనుండి క్రిందపడును. ఆ పెద్దవిగ్రహము కడుపులో చిన్నచిన్న ఆవువిగ్రహము లుండును. ప్రజలావిగ్రహములనుగూడ కఱ్ఱలతో మోది ధాన్యమును, ఆ విగ్రహముల ముక్కలను యిండ్లకు తీసికొనిపోయి పొడిచేసి ఆపొడిని తమతమ పొలములలో జల్లుకొందురు. దీనివలన పంటలు బాగుగ పండునని చీనాదేశీయుల యభిప్రాయము[12]. అస్సాందేశమునందును, ఖాన్ఘర్‌లోనుగూడ నిట్టియుత్సవము జరుపబడినట్లు ఫ్రేజర్‌గారు వ్రాయుచున్నారు. పైన పేర్కొనబడిన దేశములందేకాక ప్రాచీనకాలపు ఈజిప్టులో ఎఱ్ఱరంగుగల ఎద్దులను ఆసిరిస్‌నకు బలియిచ్చుచుండెడివారు. ఇది కోతలలో జరుగు నాచారమైయుండెను.

గుఱ్ఱమునుగూడ నిట్లే బలియిచ్చుట కలదు. డెమెటర్‌అను గ్రీకుధాన్యదేవతకు ప్రియముగ ఫిగేలియాగుహయందు గుఱ్ఱపుప్రతిమలను పెట్టునాచారము గలదని పైన చెప్పియుంటిని. ఈదేవతయేకాక విరిబియస్ యనుపేరుగల మఱొకధాన్యదేవత యుండెను. ఈవిరిబియస్ గుఱ్ఱముచే చంపబడినట్లు ప్రతీతి యున్నది. విరిబియస్‌కు గుఱ్ఱము లీకారణమున శత్రువయ్యెననియు,

12. ఆంధ్రభాగవతము ప్రథమ స్కంధము ౪౧౧ మొదలుగల పద్యములందు కలిపురుషుడు ధర్మదేవతయగు వృషభమును, భూదేవియగు గోవును తన్నుచుండగ చూచి పరీక్షిన్మహారాజు వారించెనని తెలుపబడియున్నది. దీనికిని పైన తెలుపబడిన చీనాదేశపు పండుగకును గల పోలికను చూచినచో నిది నిజముగ ధేనువృషభములను కలిపురుషుడు తన్నుట కాదనియు, అది పండుగయొక్క ఉత్సాహమనియు, పరీక్షిత్తున కీసంగతి తెలియదనియు ననుకొనవచ్చునేమో. చీనాలో నతిప్రాచీనకాలమున గోవృషభముల విగ్రహములనుగాక గోవృషభములనే మోదుటయు నుండిన నుండవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందువలన గుఱ్ఱములను విరిబియసుకు బలియిత్తుమనియు ప్రాచీనసంప్రదాయములందు చెప్పబడియున్నది. ఉన్న యాచారమున కేదో కారణమును కల్పించవలసియుండుటచే కల్పించిన యాలోచనగాని యిది సరియగు కారణము గాదని పాఠకులు గ్రహింతురు. ఇప్పుడు మనకు కారణముతో నంతగ పనిలేదు. అట్టియాచార మొక్కటి కలదనుటయే మన ప్రస్తుతపు టంశము. విరిబియస్ దేవాలయప్రాంతములకు గుఱ్ఱములు రాకూడదు. కాని సంవత్సరమున నొక్కపర్యాయముమాత్రము— అనగా బలి యీయవలసినప్పుడు మాత్రము—అవి రావచ్చును. ఇట్లే రోమ్ నగరమున గూడ ప్రాచీనకాలమున గుఱ్ఱములను బలి యిచ్చుటయు, దానివలన పాడియు, పంటయు గలుగుననియు, దేవతలు ప్రీతిం జెందుదురనియు తలంచుటయు సైజమై యుండెను. రోమునగరమున నీయుత్సవము కోతలలో జరుగుచుండెను. ఆసియాఖండమున దున్నుటకు ఎద్దుల నుపయోగించినట్లే ఐరోపాలో గుఱ్ఱముల నుపయోగింతురు. కావున ఎద్దులబదులు గుఱ్ఱములు ఆహుతి యగుటలో నాశ్చర్యములేదు ఈభేద మెట్లున్నను యిప్పటికిని యూరోపులో గుఱ్ఱపుబలికి సంబంధించిన కొన్ని యాచారము లవలులలో నున్నవి. ప్రాచీన భారతదేశమున జరుపబడుచుండిన యశ్వమేధ మను గొప్ప యాగము గుఱ్ఱపుబలియే కదా? ఇది హిందూ పురాణగాథలందును, శాస్త్రములందును వన్నెకెక్కిన బలియై యున్నది. భారతదేశమున గొప్పగొప్ప రారాజులందఱును అశ్వమేధయాగమును చేయుచుండెడివారు.

యూరోపు ఖండపు జాతీయ కథలలో పంది ధాన్యదేవతయొక్క యాకారమని చెప్పబడి యున్నది. డెమెటర్ భూమిలోనికి దిగి కూతురును వెదకుచు నరకమునకు పోయినట్లు డెమెటర్ కథలో కలదుగదా! ఈ దినుట గ్రీసుదేశములో నొక మాదిరిగ జ్ఞప్తియందుంచుకొనబడుచుండెడిది. డెమెటర్ యొక్క మారురూపము పందిరూపమగుటచే భూమిలో నొకగుంట త్రవ్వి యొక పంది నందు త్రోసి పూడ్చివేయుట గ్రీకులలో నాచారము. ఈజిప్టులో ఆసిరిస్ యొక్క మారుస్వరూపము వరాహరూపమగుటచే పందిని ఆసిరిస్‌కు బలియిచ్చుట వాడుకయై యుండెను. ఈజిప్టుదేశీయులకు పంది యన్నచో పరమాసహ్యము. ఉత్తరోజులలో వారు పందిని ముట్టెడువారు కారు. పందులను కాయువారిని దేవాలయములలోనికిగూడ రానిచ్చెడువారు కారు. కాని సంవత్సరమున కొక్కతూరిమాత్రము చంద్రునకును, ఆసిరిస్‌నకును పందిని బలియిచ్చి దానిని భుజించుట ఈజిప్టువాసుల ప్రాచీనాచారములలో నొక్కటియై యున్నది.

ఈపైవిషయములను మనము జాగ్రత్తగ నాలోచించుచో మనకు గోచరించున దేమనగా: ఏజంతువు దేవునకు ప్రియతమమనియు, దేవుని యవతారమనియు నెంచబడుచువచ్చెనో ఆజంతువే కాలక్రమమున ఆదేవుని ప్రీతికిగాను చంపబడుచువచ్చుటయు, దాని పవిత్రతయే కారణముగ నెంతటి నీచజంతువైనను భక్షింపబడుటయు జరుగుచువచ్చినది.

## బలియిచ్చిన జంతువులను భక్షించుట

ఈ పవిత్రజంతుభక్షణలో భక్షకులకు గల విశ్వాసమునకు కారణ మేమి? అనుప్రశ్నకుకూడ చరిత్రాత్మకముగనే సమాధాన మిచ్చుట సమంజసము. చంపబడిన ఆయాజంతువులు భగవంతుని యవతారములు కాబట్టి వానిని తినుటవలన భగవంతుని గుణగణములు భక్షకులయందంతర్భూతము లగునని వారి యాశయము. ఈయాశయము రానురాను శాఖోపశాఖలుగల మహావృక్షమువలె పెరిగినది. లేడిమాంసమును తిన్నచో లేడివలె పరుగెత్తుశక్తి కలుగుననియు, తాబేళ్లను తిన్నచో బుద్ధిహీనులై దేహము మొద్దుబారినవారగుదురనియు మొదలగు నభిప్రాయములు అమెరికాదేశపు టెఱ్ఱజాతివారిలో[13] ప్రబలియున్నవి. కావున దేవతల యవతారములలోనేకాక తక్కిన జంతువులలోగూడ ప్రకృతిసహజముగ కొన్నిగుణము లంతర్భూతములైయున్న

13. Lames Adair: History of the American Indians.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వనియు, ఆజంతువుల మాంసమును దినుటవలన ఆజంతువుల కేగుణములు గలవని వా రనుకొందురో ఆగుణములు వారిలోగూడ ప్రవేశించుననియు ప్రాచీనజాతు లనదగు మానవులలో నొకయూహ గలదని తేటతెల్ల మగుచున్నది.

ధాన్యదేవునకు ప్రియతమమగు జంతుమేధము గావించి భక్షించుచో, పొలమును బాగుగ దున్నగలమనియు, అట్టిమానవునియందలి భగవచ్ఛక్తి పొలము ఫలించుట కెట్టులో యనుకూలించుననియు గల యభిప్రాయముకూడ జంతువుల భక్షణమునకు ముఖ్యకారణములలో నొక్కటియైయున్నది.

ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట ప్రపంచమున నాగరకత దినదినప్రవర్ధమానమై చెలువందినకొలది, దేవతలకు బలులిచ్చునాచారము వెనుకంజవేయసాగినది. ముఖ్యముగ భారతదేశపు టార్యులలో నతిప్రాచీనకాలమునందే యిది యంతరించియుండవలెను. జంతువులను చంపుట మునుపటియంత విరివిగ సాగింపబడదాయెను. ఏదైన జంతువును బలియిచ్చినప్పుడు ఆజంతువుయొక్క యెముకలనో, మాంసపు ముక్కలనో, బూడిదనో పొలములో నొకమూల నాటుటతో పొలమునకు మంచి కలుగునని కొంతకాలము ప్రజలు విశ్వసించుచువచ్చిరి. జంతుమాంస మిట్లు నాగరకతప్రభావమున వెనుకబడినందున దేవునకు ప్రియతమముగ నేదేనొక యర్పణ గావించి, ఆయర్పితవస్తువును ఆరాధకులు భక్షించుట యాచారములోనికి వచ్చెను. కావున చారిత్రకముగ చూచుచో జంతుబలుల కాలమున కనంతరము ధాన్యభక్షణ మాచారములోనికి వచ్చినదని మనకు తెలియుచున్నది.

## ధాన్యభక్షణము

ధాన్యభక్షణ మనునీయాచారము యావత్ప్రపంచమునను వ్యాపించి యనేకదేశములలో నేటికిని కానవచ్చుచున్నది. స్వీడన్ దేశమునందలి వెర్మ్‌ల్యాండ్ నందు ఆఖరుకంకులను ప్రోగుచేసి యింటియావిడ ఒక కన్యస్వరూపముగా రొట్టెను తయారుచేయును. ఆరొట్టెను అందరును తిందురు.[14] ధాన్యదేవత ఆఖరు కంకిలో తనశక్తి నంతర్భూతముగ నుంచినదని వారి యభిప్రాయము. ఇట్లే స్కాట్లండుదేశములోగూడ ధాన్యదేవత కన్యరూపముగల దేవతగనే భావించబడుచున్నది. అచ్చటగూడ స్వీడన్‌దేశములోవలె కన్యకరూపమున ఆఖరుకంకులతో రొట్టె తయారుచేయబడుచున్నది.

ఈపైప్రకారము ఆఖరుధాన్యములోగాక మొదటి ధాన్యములో ధాన్యదేవత యున్నదను నభిప్రాయమే చాలవిరివిగ ప్రపంచమంతటను వ్యాపించియున్నది. సంకురాత్రిపండుగకు మనము క్రొత్తబియ్యమును వాడవలెను. ఇట్లే సంవత్సరాదిపాడ్యమినాడు క్రొత్తమామిడికాయలను, క్రొత్తవేపపువ్వును, క్రొత్తచెఱకుపానకముతో చేసిన బెల్లమును, క్రొత్తచింతపండును కలిపి యొకపచ్చడివలె చేసి యావేపపూవుపచ్చడిని తొలుదొల్త భుజించుట మనలో నాచారమైయున్నది.

నీలగిరిప్రాంతములందు నివసించు బడగజాతివారు కురుంబజాతివానిచే ముందొక గుప్పెడుధాన్యమును పొలములో జల్లింతురు. ఆధాన్యమునుండి మొలచిన మొక్కలయొక్క కంకులను తీసి అట్లు చేయుదురు. నాడు చంపిన జంతుమాంసముతోసహా యీఅట్లను ధాన్యదేవతకు నైవేద్యము పెట్టి బడగజాతికుటుంబమువారు భుజింతురు. కూర్గుసంస్థానములో కోతకోయువాడొకడు నియమితు డగును. ఆతడు కొన్నికంకులను కోసి, అచ్చటనే నూర్చి, తన్నునియమించినవాని యింటికి తీసికొనివచ్చును. అంతట ఆతని నియమించిన పొలముగలవాని భార్య కోతకోసినవాని కాళ్లు కడిగి పాలను, తేనెను, పంచదారను తీసికొనివచ్చి యిచ్చును. అందఱును వానిని ఫలహారముగావించెదరు. పిమ్మట కోసిన ధాన్యముతో నొకఅట్టు చేయబడును. ఆఅట్టుతోపాటు పాలు, తేనె, పంచదార, ఏడుకొబ్బరిముక్కలు, ఏడు ధాన్యపుకంకులు, అశ్వత్థపత్రములు పనైరాలతో కుటుంబములోనివారును, కోసినవాడును భోజనముచేయుదురు.

14. W. Mannhardt: Mythologies.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇండో-చీనాలో దేవునకు ప్రీతికరముగ క్రొత్త ధాన్యముతోను, కోడిపెట్టల మారణముతోను కొన్ని తంతులు నడచినగాని ధాన్యము నెవ్వడును కోయడు.

ఇట్లే ఆఫ్రికాలో నైజరునదీతీరమున ముఖ్యముగ పైరు పెండలముదుంప లగుటచే ఆదుంపలలో మొదటి మారింటితోను తద్దేవతాప్రీతికరముగ తంతు సాగించిగాని క్రొత్తపంట నెవ్వరును ముట్టుకొనరు. పశ్చిమాఫ్రికావాసు లగు 'యూ' అను జాతివారిలో నిదియే గొప్పమతవిషయికమైన తంతు. దీనికి మించిన యుత్సవము గాని, పండుగగాని లేనేలేదు. పొలములో నుండి తెచ్చిన దుంపల నన్నిటిని ముందు గుడికి తీసికొనివచ్చి "ఓ దేవా, ఇదిగో నీవు మా కిచ్చిన సర్వస్వమును తెచ్చినాము. వానిని నీకు ప్రియముగున ట్లారగింపుము. అందు వండినవి కొన్ని గలవు" అని వారి నాయకుడు ప్రార్థించును. అంతట వారిలో నొకడు వండిన దుంపలను భుజించును. వారిదేవుని పేరు 'అగబాసియా' యందురు. ఇట్లే అనేకస్తోత్రములు తంతులు గల యీ యుత్సవమును ముగించి 'యూ' జాతివారు యెవరి యిండ్లకు వారు వెడలిపోదురు. అంతవఱకును పొలమునుండి తెచ్చిన దుంప లింటికి చేరరాదు. తూర్పుఆఫ్రికాలోని 'నంది' తెగవారిలోను, నెటాల్, జూలూల్యాండ్ మొదలగు దక్షిణాఫ్రికాంతర్గత దేశములందును కొన్ని 'బంటూ' తెగలలోను, 'బెఛువాని' తెగలోను, 'ఓవాంబో' తెగలోను ఇట్టితంతులే కొన్నికొన్నిమార్పులతో జరుగుచున్నవి. కొన్నిచోట్ల ధాన్యము, కొన్ని చోట్ల దుంపలు, కొన్నిచోట్ల మద్యము ముఖ్యస్థానము నాక్రమించుచున్నవి.

ఇట్లే ఐరోపాఖండమునందలి లిథూనియా దేశములో సుమారు రెండునూడువందల యేండ్లక్రిందట 'ధాన్యదేవతభక్షణము' జరుగుచుండెను. ప్రతికుటుంబీకుడును ఎన్నిరకముల ధాన్యమును పండించినాడో అన్నితొమ్మిదుల సప్పెళ్లను ఇరువదియేడు భాగములుగ విభజించి, పిమ్మట అన్నిటిని కలియగలిపి ఆపప్పుతో దానితో చిన్నచిన్న రొట్టెలను తయారుచేసి, అట్లు చేయగా మిగిలిన ధాన్యమును మఱికొంతధాన్యముతో కలిపి దానితో 'బీర్' అనుమద్యమును తయారుచేసి కుటుంబములోనివారుమాత్రమే యొకనాడు గ్రహించుట వాడుకయైయుండెను. ఇందుల కుపయోగించవలసినది క్రొత్తధాన్యము. అట్టిధాన్యములోనే ధాన్యదేవత నివసించును. కావున 'ధాన్యదేవతను భక్షించుట'కు మఱొకధాన్యము పనికిరాదు.

ఇప్పటికిని లిథూనియా, ఎస్థోనియా, రష్యాలలోను, ఇంగ్లాండులోను క్రొత్తధాన్యమునో, క్రొత్త ఉర్లగడ్డలనో భక్షించుటయు, అందు ధాన్యదేవత యున్నదని భావించుటయు జరుగుచున్నది. ఇగ్లాండులోని సదర్లండ్ అనుజిల్లాలో క్రొత్తబంగాళదుంపలను కుటుంబములోనివా రందఱును తినవలెను. లేకున్నచో అందలి దేవతలకు కోపమువచ్చి బంగాళదుంపలు కుళ్లిపోవునట్లు చేయుదురని ఇంగ్లీషువారి పిచ్చినమ్మక మైయున్నది. ఇట్లే ఇంగ్లాండునందలి యార్క్‌షైర్ జిల్లాలో వారి చర్చిలోని పురోహితుడే మొదటికంకులను కోయవలెను. ఆధాన్యముతోనే చర్చిలోని ముఖ్యము, పవిత్రమును నగు రొట్టెను[15] తయారుచేయుదురు. ఇట్లు చేయనిచో ధాన్యమునం దంతర్హితములైన దేవతల శక్తులు తమకు రాగలవని వారి యూహ.

జపాను దేశములోని ఐనూతెగవారు, జొన్న, సజ్జ, కుఱ్ఱ వగైరా పైర్లు వేయుదురు. వాని పిండితో (క్రొత్తధాన్యపుపిండితో) రొట్టెలను పెద్దలు ముందు తయారుచేయుదురు. తరువాతవారు "ఓధాన్యదేవతా, మేము నిన్ను పూజించుచున్నాము. ఈవత్సరమున నీవు పుష్కలముగ ఫలించినావు; నీవు మంచియానందదాయకమగు వాసనగలిగియున్నావు. నీవు మంచిదేవతవు. అగ్నిదేవియు, మేమును చాలసంతోషించుచున్నాము. ఓదేవా, ఓపవిత్రధాన్యమా, ప్రజలను చక్కగ పోషింపుము. మే మిక నిన్ను భక్షించెదము. నిన్ను పూజించెదము. నీకు నమస్కారము." అని ప్రార్థింతురు. ఆతరువాతగాని ఎవ్వరును క్రొత్తధాన్యము నుపయోగించరు.

15. Communion Bread.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అమెరికాయందలి ఎఱ్ఱజాతివారిలోగూడ ధాన్య దేవతాప్రీత్యర్థమై జరుగు తంతులు, పండుగలు, ఉత్సవములు మిక్కిలి ముఖ్యములైనవి. ఈఉత్సవము జరుగనిదే ధాన్యము నెవ్వడును చవిగొనరాదు. అట్లు చవిగొనువాడు తప్పక మరణించు ననునమ్మకము బ్రేజిల్ దేశపు టెఱ్ఱజాతివారిలో ప్రబలియున్నది. క్రొత్త ధాన్యపు టుత్సవసందర్భమున పాతధాన్యమును ఇళ్లలోనుండియు గుళ్లలోనుండియు తెచ్చి యొకకుప్పగ చేసి తగులబెట్టుదురు. పిమ్మట కొన్నిగంటలు (౧౨ మొదలు ౩౬ గంటలవఱకు) వారుపవసింతురు. దేహములందు పాతధాన్యమునకు సంబంధించిన యెట్టిఅశౌచమును లేకుండుటకై వాంతులగుటకును విరేచనములగుటకును మందులు పుచ్చుకొందురు. అంతట ఇండ్లను బాగుగ శుభ్రపరచికొందురు. పిమ్మట ఉత్సవ మారంభమగును. క్రొత్తఅడవికట్టెల నొకదాని కొకటి రాచి నిప్పు పుట్టించి వంటకము లప్పు డారంభింతురు. వమనుడు (ఆరోగ్యమునకు, మతమునకు గురువు) క్రొత్తధాన్యమును ఆశీర్వదించును. ఈపండుగతోపాటు ఆటలు పాటలు నృత్యములు జరుగును. అమెరికావా రుపయోగించు ధాన్యము ముఖ్యముగ మొక్కజొన్నయైయున్నది. దేవతాప్రీతికరముగ నీయుత్సవము జరుగనిదే క్రొత్తధాన్యమును చవిచూచి యెవ్వడును పాపమొడిగట్టుకొనడు.

'అజ్టెక్' అనుపేరుగల తెగవారిలో 'హుట్జిలో పొచ్ట్లీ' అనుదేవతయు, 'విట్జిలీపూజ్ట్లి' అనుదేవతయు గలరు. ఈరెండుదేవతల ప్రతిమలను క్రొత్తధాన్యముతో చేసి యేడాదికి రెండుసార్లు వారు భుజించుచుందురు. ఆప్రతిమలు పిండితోను, తేనెతోను చేయబడుచుండెను. ఈపదార్థములను పైదేవతల ఎముకలనియు, నెత్తురనియు 'అజ్టెక్'లు అందురు. దేవుడే పైవిగ్రహము లగుననియు, విగ్రహములే దేవుడనియు వారు నమ్ముదురు. ధాన్యమునకు ధాన్యదేవతలకు నెట్టి భేదమును లేదని సూచించుటకు అజ్టెకులనమ్మకములును తంతులును అన్నిటిని మించిన గొప్పనిదర్శనము లై యున్నవి.

## ధాన్యదేవతారాధనము — ఆరుదశలు

ప్రపంచమునందలి యిన్నిదేశములనుండి ప్రాచీనాధునికాదివిశ్వాసములను తంతులను ధాన్యదేవతారాధనమునకు సంబంధించినంతవఱకు మన మిప్పుడు పరిశీలించితిమి. చారిత్రకముగ చూచినచో నీవిశ్వాసము లన్నియు నొకదానితరువాత నొకటిగ ఆరుఅవస్థలు (లేక సోపానములు)గ నేర్పడుచున్నవి. ఈక్రింద పొందుపరచెదను.

### (౧) ధాన్యమే ధాన్యదేవత యను విశ్వాసము

ఈనమ్మకముగల స్థితిలో చెట్లకు పసుపురాసి యారాధించుట, పొలముల నారాధించుట మున్నగు పనులు జరుగుచుండెను.

### (౨) ధాన్యదేవతాస్వరూపము మానవస్వరూపమే యను నమ్మకము

ఈస్థితిలో మానవస్వరూపమున దేవు నారాధించుటయు, కొన్నిజాతులలో మనుష్యులను బలియిచ్చుటయు ప్రబలియుండెను. ఖాండులలోను, ఈజిప్టుదేశస్థులలోను, రోమనులలోను నిది వాడుకలో నుండెను. చివరి రెండుదేశస్థులలోను ఎఱ్ఱరంగుగాని, యెఱ్ఱజుట్టుగాని కలవారిని బలియిచ్చుచుండిరి. అనాగరకులగు ప్రజలలో చాలచోట్ల నీక్రూరకృత్యములు ప్రబలియుండెను.

### (౩) ధాన్యదేవత జంతురూపముగల దేవత యనుభావము

ఈస్థితిలో పూర్తిగ జంతువుగనో, లేక సగము జంతువు సగముమనుష్యుడువలెనో దేవతలు చిత్రింపబడుచుండిరి; భావింపబడుచుండిరి; ఆరాధింపబడుచుండిరి. జంతురూపములలో మేక, ఎద్దు, గుఱ్ఱము, పంది ముఖ్యములు. రోముదేశములో ఎఱ్ఱకుక్కపిల్లల జాడకూడ కానబడుచున్నది కాని ధాన్యదేవత కుక్కపిల్లరూపమున నారాధింపబడినట్లు నిదర్శనములు లేవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### (౮) ధాన్యదేవతకు జంతుబలి నొసంగుట

మనుష్యులను బలియిచ్చు నాచారము పైన కనుగొంటిమి. ఈనాలుగవస్థితిలో జంతుబలులు రెండింటి నొకకారణమున ప్రబలము లైనవి. ఇందు మొదటిది: దేవున కాజంతువు ప్రియతమ మైనదనియు, కావున పవిత్రమగు నాజంతువును దేవునకు బలి యీయవలె ననుట. రెండవది: జంతువుదేవునకు శత్రువగుటచే బలి యీయవలెననుట. కారణ భేదమైనను కార్య మొక్కటియె—బలి. ఈస్థితికి చెందినదే భారతీయుల యజ్ఞము. యజ్ఞము ఇంద్రునకు అగ్నికి, వరుణునకు, విశ్వదేవతలకు ప్రీతికరముగ చేయు బలియైయున్నది. ఇందేకారణముచేతనో[16] మేకనే బలియిచ్చుచుందురు. వర్షము కొఱకును, వరి పండించుటకును యజ్ఞము చేయబడుచున్నది.

### (౯) బలియిచ్చిన జంతువులను భుజించుట

అనేకదేశములలో బలియిచ్చిన జంతువు నంతటిని గాక ఆజంతువులలో నొకభాగమునుమాత్రమే తినుట వాడుక. అమెరికాయందలి ఎఱ్ఱజాతులవారిలో కన్సాస్‌వారు కలరు. వీరు బలియిచ్చు జంతువుల కడుపులో జీర్ణకోశమును తీసి ముక్కలుచేసికొని నలుగురును పంచుకొని తినుట వాడుక.[17] అట్లే భారతదేశమున మేకకడుపులోని 'వప' యను పొరనే యుపయోగింతురు.

### (౧౦) ధాన్యదేవతను ధాన్యరూపమున భుజించుట

ఇది ధాన్యదేవతారాధన సోపానములలో చిట్టచివరిది. ఇందు జంతుహింసగాక ధాన్యభక్షణమే ప్రధానము. అన్నిటికంటె నిది మిక్కిలి నాగరకతగల స్థితియైయున్నది. భారతదేశమున 'పిండిపశువు'తో యజ్ఞము చేయుట ఈస్థితికి చెందినదే.

ఈ పైస్థితుల యనంతరదశ వేదాంతదశ. ధాన్యదేవతలు వేరనియు, భగవంతు డున్నచో నొక్కడే యనియు, ఇట్టిదేవతారాధనలు సరియైనవి కావనియు ననువా రీపైమూడుదశలకు నతీతులైనవారు.

---

16. మేకలు గ్రీసు వగైరా దేశములలో ధాన్యదేవతలుగ నుండినట్లు చెప్పియుంటిని. ఈ మేకలయొక్క ధాన్యదేవతాత్వమును ధ్రువపరచు మరికొన్ని విషయములుకూడ గలవు. ఐరోపాఖండమునందలి బొహిమియాలో 'ఓట్-మేక' ('ఓట్' అనున దొక ధాన్యవిశేషము) యను పేర మేకతోలులు మేకకొమ్ములను తగిలించుకొని కొందఱు తిరుగుచుందురు. ధాన్యదేవత వీరిలో నున్నదని యొక నమ్మకము. ఇట్లే స్కాండినేవియా (స్వీడన్, నార్వే దేశములు) లో 'యూల్-మేక'ను క్రిస్ట్మస్ ప్రాంతములలో త్రిప్పుదురు. ఈ మేకకూడ మేకచర్మమును కప్పుకొన్న మనుష్యుడే. ఇట్టిదే ఇంగ్లాండులోకూడ అచ్చటచ్చట కాన్పించుచున్నది. 'నాగలి సోమవారము' అనుపండుగ గ్రేట్‌బ్రిటనులో విశేషవ్యాప్తిలో నున్నది. ఈపండుగలో కుక్కర్ అనువొకడు మేకచర్మమును కప్పుకొని, మఱొకచర్మమును టోపిగ ధరించి ముఖమునకు నల్లనిరంగును పూసికొని, నడుమునకు గువ్వలు కట్టికొని చేతిలో నావుపాటి కఱ్ఱను పట్టుకొని తయారగును. కుక్కరికావేషధారి రవికలవంటి యుడుపులను, స్త్రీలబట్టలను కట్టుకొని తయారగును. యువకులు స్త్రీలవేషములతో వారికి సాహాయ్యము చేయుదురు. త్రోవనపోవువారిని కొట్టెదమని బెదరించుచు పైకమును వారు వసూలు చేయుదురు. సాయాహ్నమున వీరిలో నిరువుర నొక నాగలి కట్టి దున్నుదురు. ఈసందర్భమున దున్నుట, కోయుట మున్నగు వ్యవసాయపుపనులు చేయుట నభినయింతురు. ఇది గ్రామమున కంతటికిని సంబరము. మేకలకును ధాన్యదేవతలకును గల సంబంధము నీ నిదర్శనము లన్నియు వ్యక్తీకరించుచున్నవి.

17. J. G. Frazer, Golden Bough, Part V, vol ii, p. 146.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈయారుదశలు నొకటినైనతరువాత నొకటిగ వచ్చినవై యున్నవి. (౧) కాని ఒకస్థితిలో నున్న యంశములే మఱొకస్థితిలోను కానవచ్చును. పైన చెప్పబడిన ఆరవస్థితిని తీసికొంటిమేని కొన్ని ఆఫ్రికాంతర్గత దేశములలో ఐదవస్థితిని ఆరవస్థితిని కలిసినట్లు కాన్పించును. అక్కడ మృగమాంసమును, చేపలను, ధాన్యమును (లేక పెండలమును) ఉత్సవములందు భుజింతురు. (౨) ఇంతే కాక కొందఱు ప్రజలలో పైదశ లన్నియు వారు గడచినట్లు నిదర్శనములు గనుపించవు. నడుమ నొకటిరెండు దశలను వదలిపెట్టి పైకి గంతువైచినట్లు కనుపించును. భారతీయులను తీసికొన్నచో పైనచెప్పిన ఒకటి, మూడుదశలు కనపడవు. (3) ఇక మూడవసంగతి యేమనగా పైనచెప్పిన దశల వర్ణనలో కొన్నికొన్ని చోట్ల దశలో కానవచ్చునని పేర్కొనబడిన యన్ని యంశములును కానరాకపోవచ్చును. చిన్న చిన్న మార్పులు కనబడవచ్చును. ఈ విషయములు మనకుగా పైదశల (=స్థితుల, సోపానముల, అవస్థల) వర్ణన చారిత్రకమైనదనియు, సరియైనదనియు నామనవియై యున్నది.



ఏమదీ ?

—యస్. వి. యస్. రామారావు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పారిశ్రామిక హిందూదేశము

పి. యన్. వాసుదేవరావు, యం. ఏ.,

'ధనమూల మిదంజగత్' అని మన యార్యోక్తియే యున్నది. అతిసూక్ష్మతత్త్వమార్గముల నన్వేషించిన మన యార్యఋషులు కేవలము పారమార్థికలక్ష్యమునేకాక, ఆర్థికలక్ష్యమునుగూడ గాఢముగ పరిగణించియేయుండిరి. పైసూక్తినే మరియొకవిధముగ నిర్వచించి పాశ్చాత్యదేశములందు "మానవుని సకలకష్టములకును దుఃఖములకును ధనలోపము, అనగా బీదరికము మూల" మని చెప్పియున్నారు.

ప్రస్తుతప్రపంచపరిస్థితులను పరిశీలించి చూచినను నాగరికతయందును, విజ్ఞానమునందును, జీవన సౌకర్యములందును ఎక్కువ ఆధిక్యమును వహించి అగ్రస్థానమును పొందియున్న నేటిదేశము లన్నియును అత్యధిక ధనవంతములైన దేశములుగనే యున్నవి. ఇంగ్లాండు, అమెరికా, జర్మనీ ఇత్యాదిదేశములే ఆధునిక ప్రపంచపరిస్థితులను మార్చుటకు ముఖ్యముగ గమనింపబడునవి. కాని నేటికి ఈయున్నతదేశములతో బాటు సముద్రమధ్యమున నతిస్వల్పప్రదేశమునందు జీవనముచేయుచున్న జపానుదేశము కూడ ప్రపంచమునందు అగ్రతాంబూలమునకు అర్హత గాంచియున్నది. ఇదే ప్రకారమే రష్యాదేశముకూడ తక్కినపాశ్చాత్యదేశములతో బాటుగ పోటీచేయుచు, ప్రపంచమునంతటిని అద్భుత విధానములచే గలవరపెట్టుచున్నది. కాని యిప్పటికిని ౩౫ కోట్ల ప్రజలను, ౧౮ లక్షల చదరపుమైళ్ల విస్తీర్ణమును కలిగి, అనాదియును, జగత్ప్రసిద్ధమును నగు చారిత్రకజీవితమును గల మన భారతదేశముగాని, దీనికన్న నెక్కువ, అనగా ౪౫ కోట్ల జనసంఖ్యను, విస్తీర్ణమును కలిగియున్న చీనాదేశముగాని ప్రపంచమునందు పేరుప్రతిష్ఠలు లేక, వ్యక్తిత్వవిజృంభణ గాంచక మిక్కిలి విదేశీయుల పరిభవమునకు పాలగుచునే యున్నవి. ఈయనర్థమునకు కారణ మేమని యొక క్షణమాత్ర మాలోచించినను, హిందూదేశమును, చైనాదేశమును అత్యంతదారిద్ర్యముచేత పీడింపబడుచున్నవనియును; ఆదేశవాసులు సామాన్యసౌకర్యములతో జీవయాత్ర చేయుటకుకూడ వలసినధనమును సంపాదించుట కవకాశములు లేక నానాటికి జీవితపరిమాణమును గోల్పోవుచున్నారనియును విదితముకాగలదు. కాబట్టి ప్రపంచమునందలి యితరదేశములతోపాటు భారతదేశముకూడ ప్రస్తుతకాలమునం దగ్రస్థానము నాక్రమింపవలసియుండుటకు రాజకీయస్వాతంత్ర్యముతో బాటు సర్వార్థికాభివృద్ధినికూడ చేకూర్చుకొనుట ముఖ్యావశ్యకము.

ఈవిధముగ హిందూదేశము ఆర్థికసంపత్తిని చెందగలుగుటకు ముఖ్యసాధనము పరిశ్రమాభివృద్ధియేయని పాశ్చాత్యదేశముల పరిస్థితులను చూచిన నిశ్చయముగ చెప్పవచ్చును. కాని యిప్పుడు ఆర్థికమాంద్యముచేత అనేక సంకటములకు లోనైయున్న ముఖ్య పాశ్చాత్యపారిశ్రామిక దేశముల స్థితిని చూచుచున్నవారికి పారిశ్రామికాభివృద్ధిపై కొంత నిస్పృహయును, భీతియును కలుగవచ్చును. ఇదియునుగాక, పారిశ్రామిక జీవనము పాశ్చాత్యదేశముల ముఖ్యలక్షణముగా నుండుటవలన వారి విజ్ఞానము, నాగరికత, మతము అన్నియునుకూడ నందుచేత పరివర్తనము నొందియున్నవి. పాశ్చాత్య దేశములందు విపరీతముగ ప్రబలియున్న ఆధిభౌతికవ్యామోహమును, మతనైముఖ్యమును, భోగపరాయణత్వమును, కామాద్యరిషడ్వర్గలాలసతయునుకూడ వారి పారిశ్రామికజీవనమువలననే కలిగిన వనియును చెప్పబడుచున్నది. ఇదియేకాక, ఆ దేశములలో పారిశ్రామికాభివృద్ధికిగాను స్థాపింపబడిన యంత్రములు రాను రాను మానవునితో తీరని సంఘర్షణమునకు పాల్పడుచు అంతమున మానవు నట్టులే కబళించునాయను భయముకూడ అనుదినమును విస్తరించుచున్న పారిశ్రామికనిరుద్యోగసమస్యవలన స్థిరపడుచున్నది. మరియును, పారిశ్రామికజీవనమునందు జనసామాన్యములో సాహుకార్లు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెట్టుబడిదార్లు, కర్మకరులు అనుని భేదములు పొడ సూపి, యతిభయంకరమైన సంఘర్షణములకును, విప్లవములకును దారిచేయబడుచున్నదని పాశ్చాత్యదేశముల వైనంగనచరిత్ర విశదముచేయుచున్నది. కాబట్టి, యిన్ని లోపములను, నష్టములను, దుష్ఫలితములను కలుగజేయునట్టి పారిశ్రామికవిధానమును భారతదేశమునందు ప్రవేశపెట్టవచ్చునా, లేక యిప్పుడున్నటులే మనగ్రామ్యజీవనము, వ్యవసాయము, దారిద్ర్యము, ప్రకృతిసౌందర్యము, దౌర్భాగ్యములను నిరాటంకముగ సాగనిచ్చుటమేలా యనుచర్చచేయుట సమంజసమేయగున్యునా, దేశకాలపరిస్థితులను సరిగగమనించి, నిజమైనముఖ్యసమస్యయగు నికృష్టదారిద్ర్యసమస్య నెదుర్కొనజూచువారెవరును భారతదేశమునందు పారిశ్రామికాభివృద్ధి యవావశ్యకమని చెప్పజాలరు. పారిశ్రామికవిధానమునందు సామాన్యముగ చూపింపబడులోపములను కూడ సవరించి, పాశ్చాత్యదేశచరిత్రనుండి యనువైనమార్గముల నవలంబించుట సాధ్యముకానిదికాదు.

భారతదేశమునందు పరిశ్రమల నభివృద్ధిచేయుటకు పెట్టుబడి, మూలధనము, యంత్రకలాపము, కార్మికులు, ముడివస్తువులు, వానినికొనుజనులు, విక్రయస్థానములు, కార్యనిర్వహణశక్తి ముఖ్యముగ కావలసినవిగానున్నవి. హిందూదేశ మంతవైశాల్యముకలిగి యన్నికోట్లజనులకు నిలయమైయుండగా, వస్తువులనుకొనువారికిగాని, విక్రయస్థానములకుగాని యేవిధమైనకొఱతయును లేదు. అదేప్రకారమే కార్మికులశక్తికికూడను. తదుపరి, కార్యనిర్వాహకులకుకూడ లోపము లేదనియే చెప్పవచ్చును. అవకాశమున్నపుడు జెమ్షెడ్ తాతాగారివంటి పారిశ్రామికనాయకులు తప్పకకలుగుదురనియును నిశ్చయముచేయవచ్చును. తరువాత, ముడిసరకుల సరఫరావిషయమునందుకూడ, మన దేశము ప్రపంచమునందన్ని దేశములకును ఇప్పుడు ప్రత్తి, గోధుమలు మొదలగు ముడిసరకులను ఎగుమతిచేయుచున్నది కాన మన దేశమునందే యీ వస్తువులను ఉపయోగకరమైన వానినిగ తయారుచేయుట కెట్టిలోపము నుండదు. యంత్రములను నిర్మించుటకు ఉక్కు, ఇనుము మొదలగు లోహములును, వానిని నడుపుటకు కావలసిన బొగ్గు, విద్యుచ్ఛక్తి సాధనములును ఆవశ్యకము. ఇందులోకూడ బ్రిటిషు సామ్రాజ్యమునందు, ఇంగ్లాండు దేశమునకు తరువాత బొగ్గును ఉత్పత్తిచేయుటలో మరి యేభాగమునకన్న మనదేశమే యెక్కువయని చెప్పబడియున్నది. మనమదరాసు రాజధానిలో బొగ్గుగనులు కలకత్తా మున్నగురాష్ట్రములలో మున్నంతవిరివిగా లేకపోయినను జలపాతవిద్యుచ్ఛక్తి యెక్కువగ వ్యాపించుచున్నది. కాన, నాశక్తిచేతనే యంత్రములను నడుపవచ్చును. ఈవిధముగ పారిశ్రామికాభివృద్ధికి మనదేశమునం దెట్టి యంతరాయములు లేవని దృఢముగ నిరూపింపవచ్చును. కాని మనదేశమిప్పటికిని పరిశ్రమలయందు చాల వెనుకబడియున్నది. మనలో నూటికి 18, లేక 20 మంది మాత్రమే పరిశ్రమలును దానికిసంబంధించినవ్యాపారవాణిజ్యాదివృత్తులందును ఆధారపడియుండగా అమెరికాసంయుక్తరాష్ట్రములలో నూటికి రమారమి ౫౦ మందియును, ఇంగ్లాండుదేశమునందు ౬౦ మందియును పరిశ్రమలపై నాధారపడియున్నారు. మనదేశములో వ్యవసాయమునే యెక్కువజనులు తమవృత్తిగ గలిగియుండుటవలనను, ఈ వ్యవసాయమైనను లాభప్రదముగను, శాస్త్రీయపద్ధతులననుసరించి జరుపబడకుండుటచేతను, మన జాతీయాదాయము సాలునకు మనిషికి ౧౨౦ రూప్యములకన్న నెక్కువలేదని తెలియుట యెంతయు శోచనీయము.

మనదేశము పూర్వకాలమునందు పారిశ్రామికాన్నత్యమునుకలిగి ధనధాన్యసంపదలతో తులతూగుచుండినదని చరిత్రపఠనమువలన తెలియుచున్నది. మనదేశమునం దుత్పత్తియగుచుండిన వస్త్రములును అతిసున్నితములై విదేశముల కెగుమతియగుచుండినవి. కాని, కాలక్రమమున మనదేశమునందు అభివృద్ధికరములైన మార్గములపై పరిశ్రమలను నడుపకుండుటచేతను, పాశ్చాత్యదేశములు పారిశ్రామికాభివృద్ధియొక్క యావశ్యకమును గుర్తించి సత్వరముగ గమ్యస్థానమును చేరుటకుతగిన యనుకూలమును చేసికొనుచువచ్చినందువలనను, మీదుమిక్కిలి మనదేశము అన్యరాజపరి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాలితమగుటవలనను మనపరిశ్రమలు అడుగంటి పోయినవి. ముఖ్యముగ పరిశ్రమలను వృద్ధికి తెచ్చుటకు ప్రభుత్వమువారి ఆర్థికవిధానమే చాల ముఖ్యమైనది. అన్యదేశప్రభుత్వమువారు తమతమప్రత్యేకపరిశ్రమలను వృద్ధిపరచుటకు కావలసిన ఆర్థికసౌకర్యములను కలిగించుచుండగా, మనదేశమునందలి ప్రభుత్వమువారుమాత్రము ఈ విషయమున యెక్కువశ్రద్ధగైకొనలేదు. అదిసహజమే. మనప్రభుత్వమువారు ఆంగ్లేయవర్తక వ్యాపారములను వృద్ధిచేయుటకే మనదేశము నాక్రమించియుండినందువలన, వారిప్రథమధర్మము స్వకీయాభ్యుదయమే యైయున్నది. లంకషైరునుండి ప్రత్తిబట్టలను మనదేశమునకు దిగుమతిచేయుటకును, మనదేశము నుండి ముడిసరకులను తమదేశమునకు ఎగుమతిచేయుటకును అనుకూలమైనపద్ధతులను వారవలంబించుచువచ్చిరి. ఐనను, మనదేశమునందు రాజకీయస్వాతంత్ర్యములేదు నాంధ యధికమైనకొలది, మనపరిశ్రమలపై ప్రభుత్వము వారు కనుపరుపవలసిన ఆదరణమును దేశీయులు ప్రభుత్వమువారికి నివేదించుచు, సాధ్యమైనంతయనుకూలములు కలిగించుకొనుచున్నారు. కాని, సంపూర్ణ ఆర్థికస్వాతంత్ర్యము కలుగవలకను మనదేశముయొక్క పరిశ్రమలు సంపూర్ణముగ వృద్ధినొందనేరవు. కాబట్టి, భారతీయ పారిశ్రామికాభివృద్ధికి ముఖ్యావసరము ప్రజల యాశయములను పరికింపగల రాజ్యాంగవిధానము.

పాశ్చాత్యదేశములు పరిశ్రమలయందత్యంతాభివృద్ధిగాంచియున్న యీకాలములో, వానితోదీటుగ మనపరిశ్రమలను సాధ్యమైనంతత్వరలో వృద్ధిచేయుటకు, రష్యాదేశమువారి యేవల అవలంబించియున్న "నవీనఆర్థికవిధానము" — నిర్ణీతఆర్థికకార్యక్రమము ఎక్కువగ నుపకరింపగలదు. 1928 సంవత్సరమునందు రష్యాదేశ ప్రభుత్వమువారు తమదేశము 5 సంవత్సరములకాలము లోపల ప్రపంచమునందలి పారిశ్రామికరాష్ట్రములలో నగ్రగణ్యముగ నుండవలయునను లక్ష్యమును మనమునందిడుకొని, దేశమునకంతటికిని వర్తించునట్టి యొకయార్థికకార్యక్రమమును నిర్మించుకొని, దానికిసరిగా తమయభివృద్ధిని నడుపుటకై యత్నించుచున్నారు. భారతదేశమునందుకూడ యీవిధమైన యార్థికకార్యక్రమము ప్రవేశపెట్టబడవలయును. దీనివలన, మన దేశమునందలి వివిధ పరిశ్రమలన్నియును ఒక్కుమ్మడిగ వృద్ధిచెందుటకు అవకాశములు కలుగగలవు. ఇదియేగాక, ఒక్కొక్క పరిశ్రమనుండి యెంతయుత్పత్తికలుగవలెనోకూడ నిర్ధారణచేయబడగలదు. ఏఏ ప్రాంతములందేయే పరిశ్రమలు అభివృద్ధినొందుటకు అవకాశములుకలవో ఆయాప్రదేశములందే అవి వృద్ధిచేయబడును. దేశమునకంతటికిని కావలసిన సామగ్రి యెంతయుండును, పరదేశములకు మనము మనదేశము నుండి యేయేవస్తువులను చౌకగ, లాభముతో యెగుమతి చేయగలము అని పరిశీలించుటకుకూడ తగిన యవకాశములు కలిగింపబడును. పరస్పర సన్నిహిత సంబంధముగల పరిశ్రమలకుకూడ నాసంబంధమునకనుగుణముగ వృద్ధిపరచుటకును ఈ నిస్పష్ట నిర్ణీత ఆర్థికకార్యక్రమము తోడ్పడగలదు. పరిశ్రమలతోబాటు వ్యవసాయముకూడ శాస్త్రీయపద్ధతులపై ఒకలక్ష్యము ననుసరించి జరుపబడును. పారిశ్రామికజీవనమునకు ముఖ్యమైన "బ్యాంకింగు" సంస్థలును, ప్రకటనాది కార్యములును, రాకపోకలసౌకర్యములును, విద్యావిధానమును. ఇవి యన్నియుకూడ నాకార్యక్రమమునందే చేర్పబడి, వానితోకూడ అభివృద్ధినొందగలవు. ఈప్రకారము దేశమునకంతటికిని వర్తించునట్టి యొక సంపూర్ణ ఆర్థికవిధానానుసరణమే, భారతీయ పారిశ్రామికాభివృద్ధిని సత్వరముగ ప్రసాదింపగలదు. ఈ బాధ్యతను నిర్వహించుట ప్రభుత్వమువారి ముఖ్యధర్మమనియును, అట్టి విపులమైన కార్యక్రమము నేవిధముగ సిద్ధముచేయవలయునో యనువిషయములను నివేదించుటకు ఇండియాప్రభుత్వము సర్ ఆర్థరుసాల్టరుగారిని రావించిరి. వారి యభిప్రాయములును, సూచనలును ప్రకటింపబడి యిప్పటికి రెండుసంవత్సరములకు సమీపమగుచువచ్చినను, వానిని నిర్మాణకార్యక్రమమునందు ప్రవేశపెట్టుటకుమాత్ర మెట్టిప్రయత్నములు జరుగలేదు. సాల్టరుగారు సూచించిన ఆర్థికప్రవీణులసలహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంఘముకూడ నిర్మింపబడలేదు. ప్రపంచమునందంతయు ఇప్పుడు నిర్మాణకార్యక్రమమువలనను, మానవుని బుద్ధిశక్తిచే ప్రేరితమైన విధానమువలనను, అన్ని ఆర్థికానర్థములును తొలగింపబడగలవని తెలియబడుటయేకాక, సాధ్యమైనంతవరకు ముఖ్యదేశము లన్నియును వ్యక్తిగతముగనైనను స్వీయాభివృద్ధిని క్రమపద్ధతులపై నడుపుచుండగా, మనముమాత్రమింకను అభిప్రాయములను వెల్లడిచేయుటయందే యున్నాము. లేనియెడల మొన్న సిమ్లాలో కూడిన పరిశ్రమల సమావేశములవలె ప్రభుత్వమువారిచే నియమింపబడిన సభ్యులుకొందరు కొన్ని ముఖ్యపరిశ్రమలను చర్చించి యంతటితో నూరకొనుచున్నారు. ఇట్టి శుష్కవాదోపవాదముల తోడను, చర్చలతోడను దేశముయొక్క ఆర్థికాభివృద్ధి చేకూరజాలదు. జపానుదేశముయొక్క ప్రభుత్వమువారు తమపరిశ్రమలపై ఎంత యక్కర చూపుచున్నదియును ఇటీవల హిందూదేశమునందు వారిదిగుమతులకు కలిగిన ప్రతిఘటనముపైన వారు గైకొనినచర్యయే విదితముచేయుచున్నది. అదేప్రకారమే మనదేశమునందలి ప్రభుత్వము దేశముయొక్క ఆర్థికాభ్యుదయమునకు సంపూర్ణముగ సహకారము చూపవలెను. ప్రపంచమునందలి యేదేశమును ప్రభుత్వప్రోత్సాహమును గ్రహించియును లేకుండ పారిశ్రామికాభివృద్ధిని చెందియుండలేదు.

మనదేశమునందలి పారిశ్రామికాభివృద్ధికి ఎక్కువసహాయము ప్రత్యేకశాస్త్రీయ పరిశోధనలవలనను, విద్యావంతులవలనను కలుగగలదు. ఈవిషయమునందు విశ్వవిద్యాలయముల బాధ్యత యెక్కువ. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారీవిషయమున ముందంజవైచి "టెక్నాలజీ" విద్యాలయమును స్థాపించియుండుట ముదావహము. ఇదేప్రకారమే, నాగపురవిశ్వవిద్యాలయమునందుగూడ పారిశ్రామికవిద్య కెక్కువ ప్రాముఖ్య మొసగబడుచున్నది.

మనదేశమునందు పరిశ్రమలు, ప్రస్తుతపరిస్థితులలో, అనగా ప్రభుత్వమువారి యుదాసీనతగనుండుట వలన, ప్రజాదరణముపైననే తమయభివృద్ధికి ఎక్కువగ నాధారపడియుండును. దేశీయులలో జాతీయప్రేమ యెక్కువగ వ్యాపించినకాలదిని దేశీయపరిశ్రమలనుండి యుత్పత్తియైన వస్తువులకు ఎక్కువ అమ్మకము కలుగగలదు. కనుక, స్వదేశీవస్తుప్రోత్సాహము భారతీయుల చేతనుండునదేగాన వారు దానిని తమమతముగ నవలంబించినయెడల, తమకుకావలసినవస్తుజాలమున కంతటిని తమదేశమే యుత్పత్తిచేయగలదు. ఈవిధమైన జాతీయత ప్రపంచమునం దన్ని దేశములందును వ్యాపించియున్నది. ఇంగ్లాండుదేశమునందు బ్రిటిషువస్తువులను ప్రోత్సాహము చేయవలెననెడు నాందోళన బలముగనున్నది. అదేప్రకారమే యితరదేశములందును స్వదేశవస్తుప్రోత్సాహము వ్యాపించుచున్నది. కాబట్టి, మనదేశముయొక్క పరిశ్రమలు అధికముగ వృద్ధినొంది, యందుమూలమున మనసంపాదనాశక్తియును, కొనుగోలుశక్తియును అతిశయించి, దేశమంతయును భాగ్యవంతమగుటకు స్వసహాయమే, స్వదేశీకులయే ప్రస్తుతపరిస్థితులలో నత్యధికలాభకారి. ఈవిషయమై మనదేశమునం దిప్పుడు జరుగుచున్న "బైయిండియనులీగు" ప్రచారమును, అనేకప్రదేశములందు జరుగుచున్న స్వదేశీప్రదర్శనములును స్వదేశీయుద్యమమునకు అత్యంత సహకారము నొనగూర్చుచుండుట శ్లాఘనీయము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెన్నరాజధానియందు ౧౯౩౨-వ సంవత్సరము జూలై ప్రారంభము మొదలు సెప్టెంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## అలంకారశాస్త్రము

ఆంధ్రకావ్యాలంకారసూత్ర వృత్తి—(అను) తిరువెంగళాచార్య.

## ఆరోగ్యశాస్త్రము

బాలుర ఆరోగ్యదీపిక, భా ౧, ౨—డి. కె. నందికేశ్వరులు.

## ఇతిహాసము

శ్రీమదాంధ్ర మహాభారతము—(ప్ర) రామా అండ్ కో, ఏలూరు.

## కథలు-ఐతిహాసికములు, పౌరాణికములు

కథానవకము—బుద్ధిరాజు శేషగిరిరావు.

దశావతారములు—(ప్ర) సి. కుమారస్వామినాయుడు అండ్ సన్స్, మదరాసు.

ధ్రువచరిత్రము—గంధం వెంకటనరసింహాచార్యులు.

రఘువంశము, భా. ౩—(అను)దీపాల పిచ్చయ్యశాస్త్రి.

## —కల్పితములు

చిత్రకథలు, భా ౨. ౪, —నిడమర్తి సత్యనారాయణ మూర్తి.

పశ్చాత్తాపము—కె. వెంకటరావు.

పిల్లలకథలు, బుక్ ౧, ౨,—మహాకాళి సుబ్రహ్మణ్యం.

పిల్లలకథలు, భా ౧, ౨—(ప్ర). సి. శ్రీనివాసరావు, ఆదోని.

మూడు చిన్నకథలు—(ప్ర.) కె. పి. పిళ్లై అండ్ కో, మదరాసు.

మూడు చెప్పు దెబ్బలకథ—డి. సోమలింగాచార్యులు.

షేక్స్పియరు నాటకకథలు భా. ౧—సూచినరసింహం.

## —చారిత్రికములు

జీమూతవాహనుడు, చంద్రహాసుడు — ఏ. వి. నరసింహంపంతులు.

మీరాబాయి—డి. కామయ్యభుక్త.

## కల్పములు

ఆబ్దికవిధిః—(ప్ర.) పి. శంభులింగశాస్త్రి, ఏలూరు.

కేదారేశ్వరవ్రత కల్పము— (ప్ర.) విరాడ్ గ్రంథాలయము, ఏలూరు.

భగవదారాధనవిధానము—(ప్ర.) వి. సుబ్బరావు, ఒంటిమిట్ట.

శ్రీవిఘ్నేశ్వరపూజా విధానము—(ప్ర.) భ్రమరాంబా మల్లేశ్వరాంధ్ర గ్రంథాలయ సంఘము, బెజవాడ.

## కావ్యములు

కవిజనరంజనము—అడిదము సూరకవి.

కాశీఖండము—కలవపూడి వెంకటాచారి

వేమభూపాల విజయము —రావాడ వెంకటరామశాస్త్రి.

శ్రీ రామచరిత్రము—పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు.

## గణితశాస్త్రము

నవీనగణితము—ఏ. వి. సుబ్బరావు, ఆర్. వీరభద్రరావు.

నవీనప్రారంభ గణితము, తరగతి ౪—జె. వి. రామయ్య, జె. గోపాలం.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము : అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నూతన బాలగణితము—సి. వి. కృష్ణమూర్తి అయ్యర్.
బాలగణిత బోధిని—(ప్ర.) పి. భీమశంకరుడు, అమలాపురము.
సర్వేగణిత చంద్రిక—సి. కోటినరసింహం.
సామాన్యగణితము, తరగతి ౫, ఫారము ౨—యస్. వి. రామదాసు.

## గేయములు

కలియుగకలికాల వినోదచింటు—ఎ. నరసింహదాస్.
క్రైస్తవ భజనకీర్తనలు—యన్. సుబ్రహ్మణ్యం.
ఖద్దరుపాట—జి. సూర్యనారాయణశాస్త్రి.
గురుపూజపాటలు— (ప్ర) ఏ. రామస్వామిగుప్త, ఏలూరు.
గోపాలకృష్ణపాటలు—(ప్ర) కె. సుబ్బరాయకృష్ణమూర్తి, ఏలూరు.
భక్తానందకీర్తనలు—బి. రంగస్వామిరెడ్డి.
భామపురి భగవత్కీర్తనలు అను జ్ఞానసుబోధిని— పి. కృష్ణయ్యదాస్.
మాతృపూజ—(ప్ర) రాంజె అండ్ కో, మదరాసు.
రామనాథశాస్త్రి పాటలు—(ప్ర) జె. సుబ్బరాయులు, కడప.
వీరబ్రహ్మంగారి తత్వములు—(ప్ర) జి. వీరాస్వామి, ప్రొద్దుటూరు.
వేదవతీ చరిత్ర—బి. బ్రహ్మకవి.
శివకీర్తనలు—నేమాని వెంకటకవి.
శ్రీ భగవన్నామ సంకీర్తనలు—(ప్ర) వి. నీలాంబాళ్ అంబాళ్, మదరాసు.
శ్రీరామనామభజనకీర్తనలు—కె. వెంకటలక్ష్మీనరసమ్మ
సంగీతకీర్తనలు—(ప్ర) హనుమాన్‌బుక్ డిపో, ప్రొద్దుటూరు.

## చరిత్ర

ఆంగ్లదేశచరిత్ర, భా ౨. 3.—సి. నరసింహారావు.
తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము—కురుగంటి సీతారామయ్య.
మనదేశచరిత్ర, భా. ౧, ౨,—సి. కుమారస్వామినాయుడు అండ్ సన్స్, మదరాసు.
మనమాతృదేశచరిత్ర, భా. ౧, ౨,— యం. షణ్ముఖసుందరం.
హిందూదేశచరిత్రము—యం. వెంకటసుబ్బయ్య.
హిందూదేశచరిత్ర—సి. యస్. శ్రీనివాసాచారి.

## చట్టము

మదరాసు లోకలుబోర్డు ఆక్టు— (అను) సి. శేషయ్య.

## ఛందశ్శాస్త్రము

కవిత్వతత్వము—కే. కోదండరామయ్య.

## జీవితములు

అన్యదేశపు మహనీయులు—(ప్ర) దీనదయాళు అండ్ కో, మదరాసు.
ఆత్మత్యాగి—(అను) కె. ప్రభాకరశాస్త్రి.
కబీరుదాసుచరిత్రము—సీరిపి ఆంజనేయులు.
పరిక్షిత్తు— పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.
బాలభక్తులు—ఎ. వెంకటరత్నం.
శ్రీమదాంధ్ర మహాభక్తవిజయము, భా. ౧—పంగులూరి వీరరాఘవుడు.
శ్రీనాథకవి చరిత్రము—జే. వెంకటరాధాకృష్ణయ్య.
సిద్ధార్థుడు— (అను) బి. సత్యనారాయణరావు.

## జ్యోతిషశాస్త్రము

దశవర్ష ప్రదీపిక—బి. సూర్యనారాయణసిద్ధాంతి.
మారుతీజాతక ముక్తాఫలము—గుళ్లపల్లి అవధానులు.

## దండకము

దండకత్రయము—(ప్ర) జి. జగన్నాథం అండ్ సన్స్, రాజమహేంద్రవరము.

## నవలలు

అన్నపూర్ణ—(అను) పి. లక్ష్మీనరసమాంబ
భగ్నహృదయుడు—చిలుక.
మైత్రేయి—జ్ఞానాంబ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨. సూర్యకిరణములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. తుపానుకు మొదలు

—సి. జి. జగన్నాథదాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శారదావిజయము—వేదము శ్రీ సత్యనాథన్.

## నాటకములు

ఆంధ్రకుందమాల—(అను) వడ్డాది సుబ్బరాయుడు.
చిత్రాంగి—నందిరాజు చలపతిరావు.
భోజకాళిదాసు—యస్. రామానుజరావు.
శ్రీ సుశవస్లూరు ప్రహ్లాదనాటకము—జి. అబ్బయ్య దాసు.
సంపూర్ణోత్తర రామాయణము—రామనారాయణకవులు.
సతీతులసి—ఆర్. వెంకటరత్నం.
సెట్టిబలిజసంఘసేవ—పాల వెంకన్న.

## నాట్యశాస్త్రము

భరతరసప్రకరణము—(ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదిరాసు.

## నీతి

నీతికథా నిధానము—వి. బి. జి. సత్యనారాయణశర్మ.
నీతిపద్యములు—(ప్ర) బీదబాలుర ఫండ్ కమిటి, తెనాలి.
మహాభాషిత రత్నాకరము—యం. కె. గాంధి.
సుజ్ఞానబోధిని—పూతలపట్టు శ్రీరాములురెడ్డి.

## పరిశిష్టము

ఆంధ్రనవీన ద్వితీయవాచకము—?. సూర్యప్రకాశ రావు, హెచ్. పేరయ్యశాస్త్రి.
ఆంధ్రహితోపదేశచంపు—(అను) వేదము వెంకటరాయ శాస్త్రి.
ఆదవాని—(ప్ర) సి. శ్రీనివాసరావు, అదోని.
ఆనందవాచకము, తరగతి ౧—హచి నరసింహం, పి. లక్ష్మీనరసింహరావు.
ఐరావతార్జునము—కె. వి. రామానుజాచార్యులు.
ఐహికాముష్మికసుఖసమరవిజయము—టి. వీరేశలింగం శర్మ.
కర్షక నెం ౨, ౩—(ప్ర) యం. కాసింఖాన్, యన్. సత్యనారాయణ, విశాఖపట్టణము.
కవిత్వపద్యములు—ఏ. వెంకటసుబ్బయ్య.
కామధేనువు—కె. సుందరరామయ్య.
కిశోర వీరులు—పి. వెంకటరమణరావు.
కౌరవపాండవసంధిప్రయత్నము—యస్. యల్. నరసింహము.
గోదావరీ పుష్కరప్రభావము—వి. సీతారామశాస్త్రి.
గోప్రభావము—యం. నాగలింగశాస్త్రి.
గోమహిమ—సి. వెంకటరమణయ్య.
గోమాత—జి. రామకృష్ణశాస్త్రి.
గోవు—బి. బాపిరాజు శెట్టి.
తెలగసంఘము—భ. వెంకటకృష్ణ రామదాసు.
దేశపరిపాలన, భా. ౧, ౨.—ఆర్. శవరిముత్తు.
ధర్మాంగదచరిత్ర—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము.
నూతనతెనుగువాచకము, తరగతి ౧—ఆర్. హెచ్. డి. ప్రసాదరావు.
పతిహితచర్య—వావిలికొలను సుబ్బరావు.
పద్మావతి—కె. కె. అప్పన్ అయ్యంగారు.
ప్రాచీన భారత విద్యానిధానము—ఎద్దనపూడి వెంకటరత్నం.
ప్రేమాంజలి—ముద్దా విశ్వనాథము.
భక్తచింతామణి—వడ్డాది సుబ్బరాయుడు.
భారతదేశ యాత్రావిశేషసంగ్రహము—బి. వెంకట జగ్గారావు.
బోధనాపద్ధతులు—కె. ఉమామహేశ్వరరావు.
మనస్స్వాతంత్ర్యము—వల్లూరి సూర్యనారాయణరావు.
మాతృబోధ—(ప్ర.) మిస్. జె. హోవర్త్.
మిత్రనిర్యాణము—యం. ప్రభులింగాచార్యులు.
వదరుబోతు—(ప్ర) సాధన పబ్లిషింగ్ హౌస్, అనంతపురము.
వాయువిమానము—గాడేపల్లి సూర్యనారాయణశర్మ.
విజయనగరసభావిషయ విమర్శము—వారణాశి సుబ్రహ్మణ్యశాస్త్రి.
విద్యా-బోధనాతత్త్వము—మలపాక సూర్యనారాయణ.
వివేకవాచకము, బుక్ ౧—సి. లక్ష్మీనరసింహం.
వేణుగోపాల పంచవింశతి—ఏ. వెంకటేశ్వరశర్మ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైశాఖి—(ప్ర) కవితాసమితి, విశాఖపట్టణము.
వ్యాసముక్తావళి—భమిడిపాటి సుబ్బారావు.
శిథిలవైభవము—దేవసుస్తాపు వెంకటరమణమూర్తి.
శృంగారవల్లిక—జయంతిస్వామి నాయన
శెట్టిబలిజనాయకరత్నాకరము—జి. వెంకటరామరాజు
శ్రీకృష్ణలీలాస్మృతి—బి. ఆదినారాయణ.
శ్రీమాధవనామామృతము—కె. వెంకటసుబ్రహ్మణ్యం.
శ్రీ శైలక్షేత్రము—(ప్ర) శ్రీశైలం మానేజిమెంట్, శ్రీశైలము.

## పురాణములు

విష్ణుపురాణము—కుపాపుల అనంతభూపాలుడు.
సూతపురాణము—(ప్ర) టి. రామస్వామి, తెనాలి.

## ప్రకృతిశాస్త్రము

పదార్థవిజ్ఞానశాస్త్రము—యం. సాంబశివరావు.
ప్రాథమిక ప్రకృతిశాస్త్రము, బుక్. ౧, ౨, 3.—(ప్ర) టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.
ప్రాథమిక శాస్త్రము భా. ౧, ౨ — బి. కురంగేశ్వరరావు, బి. శ్రీరాములు.

## భూగోళశాస్త్రము

ఏలూరు తాలూకా భూగోళము — బి. యస్. రామమూర్తి.
కర్నూలు జిల్లా జాగ్రఫీ — టి. నరసింగరావు.
కైకలూరు తాలూకా భూగోళము—(ప్ర.) వి. వెంకటేశ్వరరావు అండ్ కో, కైకలూరు.
ప్రపంచ భూగోళము—యన్. సుబ్రహ్మణ్యం.
భీమవరం తాలూకా జాగ్రఫీ—యస్. పేరిశాస్త్రి.
భూగోళము—జి. వి. సీతాపతి.
నూతన భూగోళశాస్త్రము—బి. రామచంద్రరావు.

## మంత్రశాస్త్రము

రహస్యరత్నాకరము—(ప్ర) వి. సుబ్బరావు, ఒంటిమిట్ట.

## మతము-హిందు

అతిరిక్తైకాదశీ శ్రవణద్వాదశీ నిర్ణయము—కాశీ కృష్ణాచారి.
బ్రహ్మోపాసనము—జి. సత్యనారాయణమూర్తి.
భక్తకథావళి—రాజరత్నమ్మ.
భజగోవిందశ్లోకములు—(ప్ర) యం. రాఘవాచార్యులు, ఏలూరు.
విఘ్నేశ్వరుడు, శమంతకమణి—డి. కామయ్యభుక్త.
శ్రీగౌతమీ పుష్కరకృత్యాను క్రమణిక—(ప్ర) య. సన్యాసయ్య అండ్ సన్స్, రాజమహేంద్రవరము.
శ్రీమంత్రార్థపద్యకావ్యము—బి. శ్రీనివాసాచార్యులు.
శ్రీరామావతారతత్త్వము — జె. శేషాద్రిశర్మ.
శ్రీవరసిద్ధివినాయక ప్రభావము—బి. గురవయ్య శర్మ.
శ్రీవినాయక చరిత్ర—తాతప్పూరు సుబ్బరాజు.

## ఇతరములు

కీర్తనలపుస్తకము — (ప్ర.) మిస్. డి. ఇ. గార్లిక్, తమ్మమెట్టు.
క్రీస్తుచరిత్ర సారాంశావళి—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
క్రీస్తుయొక్క పుట్టుక—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
గ్రామాదులపాఠశాలలకు తగిన కథలు—(ప్ర.) మేసన్ ఆక్లాట్, మదనపల్లి.
నిర్ధారణ ఉదయ సాయంప్రార్థన క్రమములమీద పాఠములు—(ప్ర.) టి. రామకృష్ణయ్య, చిలకలపూడి.
పువ్వులగంప — (ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
ప్రార్థన పద్యములు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
బైబిలువాచకము, తరగతులు ౧, 3, ౫—(ప్ర)ఆంధ్ర యవాంజిలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు.

## మాహాత్మ్యములు

శ్రీగోదావరీపుష్కరమాహాత్మ్యము—సర్వసిద్ధి సూర్యనారాయణ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీగౌతమక్షేత్రమాహాత్మ్యము—సోమా వెంకటస్వామి గుప్త.

శ్రీపుష్పగిరిమాహాత్మ్యము— జె. వెంకటసుబ్రహ్మణ్య శర్మ.

శ్రీపుష్పగిరి క్షేత్ర మాహాత్మ్యము—అవధానం రామ చంద్రయ్య.

శ్రీ సోమేశ్వరక్షేత్రమాహాత్మ్యము—మంతెపాక కామ కవి.

## వేదవాఙ్మయము

మాండూక్యోపనిషత్తు—(ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

## వేదాంతము

మతత్రయగీతాభాష్య విమర్శ — యతిరాజం వెంకట కృష్ణదాసు.

శ్రీభగవద్గీతార్థ వివరణము—హుండి రామరావు.

శ్రీభగవద్గీతాదర్శనము—(ప్ర.) యన్. జలదుర్గప్రసాద రాయుడు, రాజమహేంద్రవరము.

శ్రీభగవద్గీతా సారామృతము — లక్కాకుల వెంకట రత్నం.

శ్రీభగవద్గీతామృతసారము—యం. తిమ్మయ్య శెట్టి.

## వైద్యశాస్త్రము

గోసాయిచిటికలు—(ప్ర.) ఆర్. వెంకటరత్నం.

రోగనిదానవిధానము, భా. ౧. — ఎ. సుబ్బారావు.

వస్తుగుణప్రదీపిక—గ్రంథి సుబ్బరాయశర్మ.

సద్వైద్యజీవనము—(ప్ర) కే. వీరవెంకయ్య, రాజ మహేంద్రవరము.

సహదేవపశువైద్యశాస్త్రము —(ప్ర) కే. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము.

## వ్యాకరణశాస్త్రము

ఆంధ్రసంగ్రహవ్యాకరణము, భా. ౨, 3—ఏ. వి. నరసింహంపంతులు.

త్రిలింగలక్షణము, బుక్ ౨, 3—దర్భా యజ్ఞన్న.

నవీనాంధ్రవ్యాకరణము—అప్పల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి, అప్పల కామేశ్వరశర్మ.

సంస్కృతక్రియాపదానుశాసనము—వడ్లమాని లక్ష్మీ నరసింహశాస్త్రి.

## శతకములు

అసువినాశశతకము—దాసరి అంజదాసు.

కోదండరామశతకము—స్వామి లక్ష్మీకాంతానంద.

దత్తమూర్తి తత్త్వశతకము—పి. సూరారెడ్డి.

నీతిశతకము—పి. సుబ్రహ్మణ్య భాగవతరు.

భక్తకల్పద్రుమ శతకము—పి. ఆదిశేషయ్య.

భరతశతకము—టి. వరదరాజశర్మ.

మానినీ శతకము—పుల్లెల అప్పలనరసింహం.

రాజగోపాలహరి శతకము—కుందవఫు శేషాచార్యులు.

శ్రీభగీరథి శతకము— కె. వెంకట సూర్యనారాయణ.

శ్రీరామశతకము—కె. పుల్లయ్య, రామన్నగూడెం.

శ్రీరామశతకము—పి. కృష్ణమూర్తి.

శ్రీసూర్యశతకము—బి. పెంటయ్య.

సెట్టిబలిజశతకము—పెనుమచ్చ సత్యనారాయణరాజు.

హరిముకుందశతకము—కె. నాగిరెడ్డి.

## సంగీతశాస్త్రము

స్వరమంజరి—టి. శింగరాచార్యులు, టి. చినశింగరా చార్యులు.

## స్తోత్రములు

ఆంగ్రశివానందలహరి—(ప్ర) ఏ. సోమనాథరావు.

శివకందపద్యములు—బి. నరవయ్య శర్మ.

శ్రీవాసవకన్యకా నామావళి—చెన్నూరు ఆదెప్ప.

శ్రీవిష్ణుసహస్రనామనిర్వచనస్తోత్రముక్తావళి — పంగులూరి వీరరాఘవుడు.

శ్రీవిశ్వేశ్వర దత్తాత్రేయ స్తవ నక్షత్రమాలలు — టి. చంద్రమౌళీశ్వర కవి.

శ్రీ శివకంఠమాలిక — (ప్ర.) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

శ్రీశైలరాజమౌళీశ్వర తారావళి—సి. విశ్వనాథశర్మ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఇంద్రజాలము

బుర్రా శేషగిరిరావు

౧

పూర్వము మన భారతదేశమునకు పేరు ప్రతిష్ఠలు సంపాదించి విదేశీయులను దిగ్భ్రమ చెందించిన ఉత్తమవిద్యలలో ఇంద్రజాల మొకటి. ఇపుడు మ్యాజిక్కు, మెస్మెరిజమ్, హిప్నాటిజము మొదలైన పేర్లతోను, బ్లాకుఆర్టు అనేపేరుతోను పలువిధములుగా విదేశీయులకు తమ ప్రాంతములలోను, మన దేశములోను ధనాకర్షణమార్గ మవుచున్న విద్యలన్నియు ఇంద్రజాల మహేంద్రజాలములని విలసిల్లి రాజసభాసంభావన యోగ్యములైయుండుటయే కాక మహామంత్రులకు రాజ్యతంత్రములో నుపయోగపడుచు నుండెను. వాటి జాడ లీనాడు విప్రవినోదులలోను, మామిడిచెట్టు అప్పటికప్పుడు చేసి చూపించే గారడీవాళ్లలోను కనబడుచున్నవి. మన దేశీయములగు పూర్వవిద్యలకును, కళలకును నేటివాటిజాడలవల్ల తోచే శాస్త్రలేశముల కొరకు వెతకు ప్రయత్న మొక ప్రధాన కార్యముగా నెన్నుకొనిన ఆంధ్ర భారతీతీర్థరీసర్చి యూనివర్సిటీ విద్యాసమాస్థానికముపక్షమున కొంతవరకు వెతికించుచుండగా ఇంద్రజాలశాస్త్రములను గూర్చిన యొక ప్రాత ముద్రణగ్రంథ సంపుటము శ్రీ విజయనగరం మహారాజావారి సంస్కృత కళాశాల లయిబ్రరీలో కనబడినది. ఇట్టిగ్రంథముల వ్రాతప్రతులు గ.జాంమండలములో కొన్ని కుటుంబములలో నున్నట్లు వాకబులు తెలిసి వాటికొరకు ప్రయత్నించుచున్నాము. ఈలోగా ఈసంపుటము (నాగరలిపిమయము) ననుసరించి ఇంద్రజాలశాస్త్రమందలి ప్రధానాంశములనుగూర్చి కొంతవర కయిదుపత్రికలలో వ్రాయుచున్నాను. ఈ విషయమును గురించి విశేషాంశములును, గ్రంథములును మళయాళములో దొరుకునని వింటిని. ఎరిగినవారు శాస్త్రాంశములను ప్రకటించి శాస్త్రము ఖిలమైపోనీయక రక్షింతురుగాక!

విప్రవినోదుల కథ లోకలురికార్డులలో ఓరుగంటి ముక్కంటి ప్రతాపరుద్రునిగూర్చిన చరిత్రభాగమున కలదు. జైనబ్రాహ్మణవివాదములలో వేదసంప్రదాయులగు బ్రాహ్మణులకు సాయముచేసిన ఐంద్రజాలికుని సంతతివారు విప్రవినోదినామముతో యజ్ఞోపవీతార్హులైనట్లు కలదు. బౌద్ధజైనసంప్రదాయు లీ శాస్త్రమును విశేషముగా నుపాసించి తమతమ వివాదములలో శత్రువిజయమున కుపయోగించినట్లు చరిత్రలలో కలదు. జనకుని ఆస్థానములో వేదాంతుల మనోదార్ఢ్య పరిశీలనకు నింద్రజాల ముపయోగింపబడినట్లును, చాణక్యుడు రాజ్యతంత్రమందు వినియోగిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చినట్లును గాథలు కలవు. రత్నావళి నాటక ములో శ్రీహర్షుడు దీనివలన కథాపరిణామ మును సమర్థించెను.

ఈ ఇంద్రజాలసంపుటము శ్రీమదానంద గజపతిమహారాజువారి యాస్థానములో ప్రసిద్ధులైన లింగం లక్ష్మాజీపండితులవారి లైబ్రరీలోనిది. ఆగ్రంథసముదయము సంస్కృత కాలేజీలైబ్రరీకి కొనినప్పుడు అందులో నిది యుండినది. దీనిపేరు "ఇంద్రజాలవిద్యా సంగ్రహః" అని కలదు. ఇది శ్రీజీవానంద విద్యాసాగరపండితులు సంస్కరించి ప్రకటించినది. ఇందులో 'ఇంద్రజాలశాస్త్రం', 'కామరత్నం', 'దత్తాత్రేయతంత్రం', 'షట్కర్మ పపిక', 'సిద్ధనాగార్జునకక్షపుటం' అను అయిదు వివిధ గ్రంథికలు కలవు. ఇది ద్వితీయముద్రణము.

ఇంద్రజాలసాధనకు ప్రయోజనములు మూడు - (1) రక్షణ, (2) శక్తి, (3) కౌతుకము. "శివోక్త" "ఇంద్రజాలము"లో ఇట్లున్నది :—

1. "వ్యాధిదారిద్ర్యహరణం
జరామృత్యువినాశనమ్."

2. "ఇంద్రజాలం నజానాతి
సక్రుద్ధగ కిం కరిష్యతి."

3. "నజీవతి వరారోహే,
సంసారే దుఃఖసాగరే,
ఇంద్రజాలం నజానాతి
కుతః సౌఖ్యం భవేత్తతః,
కౌతూహలం కుతస్తేషాం
కుతగ కామా వరాననే."

దుఃఖభాజనమైన సంసారములో సౌఖ్యము, సంతోషము, రక్షణ, శక్తిప్రకటనము అనునవి ఉత్తమపురుషార్థములు గాని క్షుద్రములు కావు.

ఇట్లు శాస్త్రప్రయోజనమును చెప్పి ఇతరశాస్త్రముల జ్ఞాన మిందులో నెట్లు కలియునో సూచించి ఈశాస్త్రమునకు ప్రధానాంగమైన "ఓషధీవిధి"ని శాస్త్రకారుడు ప్రత్యేకించి వర్ణించెను. ఓషధిశాస్త్రము బోటనీ అనేపేరుతో మననాడు పాశ్చాత్య పండితులు వివిధప్రాంతములలో ప్రపంచమందు క్రొత్తగా పరిశోధించుచున్నారు. ఈ పరిశోధనలవల్ల మానవసంఘముల విన్యాసమును పోలినజాడ లెన్నో బయలుపడుచున్నవి. ఇట్టిపరిశోధనలు మనభారతదేశములో బోసురసశాలలో జరుగుచున్నవి. మన ఈప్రస్తుతశాస్త్రమువంటివాటిలో గల ఓషధితంత్రరహస్యములు వాటిలో చెప్పబడినట్లు ప్రయోగవిధానములలోనికి దించి చూచినయెడల దాఖలాలు కనబడనచ్చును. నిజమో, అబద్ధమో ప్రత్యక్షముగా తేలును.

అంతర్హితు డగుటకు, జలస్తంభనకు, చిన్నపెద్దజంతువులుగా మారుటకు, దూరదర్శిత్వమునకు, పగలు నక్షత్రములు చూచుటకును ఓషధులతోనే గుటికలు, అంజనములు తయారుచేయవచ్చును. ఈయోగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ల(Experiments ) లో అసంబద్ధములు గాని, అసభ్యములుగాని కనబడవు. తరువాత స్త్రీ వశీకరణ, పతివశీకరణయోగములు గలవు. ఇట్టి వేహో ఆంధ్రదేశములో అచ్చటచ్చట మూఢస్త్రీలలో పరంపరాగతముగా నున్నట్లును వాటి ప్రయోగములవల్ల అందందు ప్రాణాపాయమువరకూ వచ్చుచున్నట్లును వినియున్నాను. ఇందు మంత్రతంత్రములు మిళితమైయున్నవి. కేవలము ఓషధిప్రయోగమునకు పట్టులేదు. ఈ ఓషధుల తత్త్వమును మాత్రము బోటనీ - కిమిస్ట్రీశాస్త్రములు చదివినవారు పరిశోధించి వాటి వీర్యము (Active principle)ను గురించి పరిశోధించదగును. ఇట్లే "రక్షావిధానము" లని చెప్పబడిన యోగములలోకూడా మంత్ర తంత్రములు కలిసియున్నవి. వీటివలన ప్రాకృతావయవములకు బలవర్ధనము కలిగి చిత్రవిచిత్రములు కనపరచుసామర్థ్య మలవడును. దృష్టాంతము కావలసినప్పుడు షండత్వము కలిగించుకొనుట; అక్కరలేనప్పుడు ఆపట్టు విడిపించుకొనుట. ఇది ఇప్పుడు చెప్పుచున్న సంతాన నిరోధ (Birth-Control) మార్గము లన్నిటికన్నను మంచిది. లేశమైనను బాధలేనిదిగా తోచునది. తల పైని అగ్ని ఉన్నట్లు కనబరచుట, నీళ్లు పాలుగా మార్చుట, పట్టపగలు చుక్కలు చూపుట, మనుష్యుని తాకకుండా పడద్రోయుట మొదలైన కౌతుకములున్న ఓషధి యోగములవల్ల సిద్ధించును.

ఇట్టి ప్రయోగములు రసశాలలలో దాఖలాలు చూచుటకై చేయుటకు మాసములు, ఋతువులు, తిథులు, వారములు, నక్షత్రాదులు నిర్ణయించబడినవి. ఇట్లే ఓషధులను సంగ్రహించి తయారుచేయుటలో కూడా నియమము లున్నవి. మన అభినవ రసశాలలోమాత్రము సర్వేసర్వత్రా అన్ని ప్రయోగములును సిద్ధించుచున్నవా? బోసుగారి యంత్రములు క్రొత్తగా ఇంగ్లాండుతీసుకొనివెళ్లినప్పుడు దేశకాల భేదములను బట్టి కొంత చిక్కుపెట్టినవని వింటిమిగదా! అట్లే ఈఓషధులవిషయమున కూడా పూర్వులు చెప్పిన నియమములప్రకారము పరిశోధనలు చేసి సిద్ధికి రానప్పుడు వాటిని అబద్ధము లనవచ్చును. ఇందులో స్తంభనయోగములు చాలా చెప్పబడి యున్నవి. ముఖ స్తంభన (వాకట్టు), మేఘస్తంభన, నౌకా స్తంభన, నిద్రా స్తంభన, శస్త్రస్తంభన, గోమహిష్యాది స్తంభన, బుద్ధిస్తంభన, చోరగతి స్తంభన, గర్భస్తంభన, శుక్రస్తంభన, మూత్ర పురీష స్తంభన ఇత్యాదులు. వీటినిబట్టి ఇట్టి ఓషధి తంత్ర పరిశోధకులగు మహాఋషులు జీవయాత్ర నడిపించ నేరక సంసారములు వదలి అడవులకు పారిపోయి స్వార్థపరులై స్వమోక్షము నేచూచుకొనిన వేదాంతులు కారనియు, లోకయాత్రయందు జీవులకు కలుగు సుఖదుఃఖములలో నుపయోగించగల విశేష విద్యలను ప్రకృతి నారాధించి సంగ్రహించిన మహామహులనియు తెలియగలము. వీటిలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చికిత్సావిధానము లెన్నేని కలవు. ఉదాహరణములు : దేహరంజన, ముఖరంజన, కేశకృష్ణీకరణ, జన్మవంధ్యాచికిత్స, కాకవంధ్యాచికిత్స, మృతవత్సా చికిత్స, గర్భస్రావ చికిత్స, గర్భశుష్క చికిత్స, స్తనవర్ధన, స్తనోత్థాపన, యోనిసంస్కార, లోమ శాతన, మృతసంజీవనీ ఇత్యాదులు. వీటిలో దేనిని ఫార్మసీవిధానములోనికి దించి తయారుచేయుటకు ప్రయత్నించినను మన నిరుద్యోగపట్టభద్రులకు జీవయాత్ర, ఒకరివద్దకు పోయి చేయిచాచకుండా గడిచిపోవును. ఋషిసంతతివార మనుకొను హైందవులకు తమఋషులు ఏర్పరించి ప్రచారములో నుంచిన శాస్త్రములే నామమాత్రములును, కవిచాతుర్యములును అయిపోయినవి. సుయోధనునికి తల్లి చేసిన అంగరాగముగాని, అహల్య సీతకు చేసిన మానప్రాణరక్షకాంగరాగము గాని కవిచాతుర్యము కావు; ముమ్మాటికిని కావు; ఋషులు పరిశోధనలుచేసి గ్రహించిన ఓషధి విధానములు. వాటిజాడ లీఇంద్రజాల గ్రంథములం దున్నవి. తెలిసికొనుటకు దృష్టియు, లోదృష్టియు కూడా అవసరములే.

ముందు పత్రికలో "కామరత్న" మందలి విశేషాంశములు వ్రాయబడును.

---



మనుష్యుని పూర్వరూపము —సి. జి. జగన్నాథదాసు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కాపయనాయకుని గురజ తామ్రశాసనము

డా. నేలటూరి వెంకటరమణయ్య, యమ్. ఏ., పి హెచ్. డీ.

ఈ శాసనపు ప్రతిబింబమును మిత్రులు శ్రీయుతులు గూడవల్లి రామబ్రహ్మంచౌదరిగారు నా కొసగిరి. ప్రతిబింబమును ఆధారపఱచుకొని యథాశక్తి శాసనగ్రంథమును బరిష్కరించి ప్రకటించుచున్నాడను. ఈశాసనము కృష్ణామండలాంతర్గతమైన గుడివాడతాలూకాలోని గురజగ్రామమున, గురజ జమీందారుల గృహమున నుండగా గాంచి, కృష్ణామండలబోర్డుసభ్యురాలును, ఉభయభాషాప్రవీణురాలును, చారిత్రపరిశోధకురాలును నగు అట్లూరి వెంకటసీతమ్మగారు కొనితెచ్చి శ్రీయుత రామబ్రహ్మంచౌదరిగారి కొసగిరి. శాసనమంతయు రెండురేకులయందు—ప్రతి రేకుయొక్క రెండుపెడలయందును—చెక్కబడియున్నది. అక్షరములు పొంకముగ నున్నవి. ప్రతిబింబములను జూడ రేకులు మంచిస్థితియందున్నట్లు తోచుచున్నది. రెండురేకులయందును కడియమును దూర్చుటకనుకూలముగ బెజ్జములు వేయబడియున్నను, కడియము మాత్ర మిప్పుడు కానరాదు. ఈతామ్రశాసనమునకు సంబంధించి రేకు మఱియొకటి యుండినట్లు తోచుచున్నది. శాసనగ్రంథ మసంపూర్ణముగ నుండుటయే పైయూహకు గారణము. శాసనగ్రంథమున దాతృప్రతిగృహీతల వంశములును, దానోద్దిష్టగ్రామ సీమాచిహ్నములును వర్ణింపబడియున్నను, సామాన్యముగ తామ్రశాసనము లన్నిటియందును గానవచ్చు దానఫలమును దెల్పు శ్లోకము లిందు గానరావు. ఏతత్కారణమున, నట్టి శ్లోకములు మఱియొకరేకునందు జెక్కబడియుండెనేమోయన్న సంశయము పొడముచున్నది. ఈ యూహ సరియగునేని ఆమూడవరేకు నష్టమైనట్లు తలచవలసియున్నది. కాని, రెండవరేకు రెండవపెడయొక్క ౧౦-వ పంక్తి, పంక్తిమధ్యముననే ఆగిపోవుటచేత, శాసనగ్రంథ మంతటితోనే సంపూర్తియైనట్లు తలచుటకవకాశ మున్నది.

లిపి:—ఇందలి లిపి క్రీ. శ. ౧౪-వ శతాబ్దపు మధ్యతూర్పుసముద్రతీరప్రాంత దేశమున సామాన్యముగ వాడుకయం దుండిన లిపియె. ఈశాసనపు లిపి, సింగయనాయని అక్కలపూండిశాసనము, రెండవసింగముని చిట్రగుంటశాసనములయొక్క లిపులను బోలియున్నది. హల్లులతో గూడిన 'ఇ, ఈ', 'ఎ, ఏ', 'ఒ, ఓ', లయందు దీర్ఘహ్రస్వములు భేదములు లేకయొక్కవిధముననే వ్రాయబడియున్నవి. వత్తుతో కూడిన వర్గాక్షరములును, లేనివియు నేకరీతిగ లిఖింపబడియున్నను, వాని భేదమును సూచించు గుర్తులు కొన్నియెడల గానవచ్చుచున్నవి. ఈగుర్తు ఇప్పుడు మనము అక్షరపు క్రిందవ్రాయు నిలువుగీటుగాదు. దానికిబదులు అక్షరముక్రింద బోతగిలవ్రాసిన యర్ధచంద్రరేఖ లిఖింపబడియున్నది. (చూ: రే ౧: పె ౧. పం ౧. 'అంహస్సంఘు' లోని 'ఘ', పం ౬ 'మాఘే' లోని 'ఘే'); కాని యిట్టిగుర్తు అన్నివత్తుఅక్షరములకును లేదు 'ఘ' క్రింద గూడ సర్వత్ర గాన్పించదు. వత్తును సూచించుటకు ఇట్టిగుర్తే, ఈశాసనమునకంటె ౨౦ సంవత్సరములకు పిమ్మట వ్రాసిన సింగయనాయుని యక్కలపూడి శాసనమున తరచుగ గానవచ్చుచున్నది. కాని, ప్రస్తుతపు శాసనమునకు పదిసంవత్సరముల తరువాత వ్రాయబడిన చిట్రగుంటశాసనమునందుమాత్రము వత్తును సూచించుటకు మన మిప్పుడు వ్రాయునట్లు అక్షరమున కధోభాగమున నిలువుగీటే వ్రాయబడియున్నది. కావున, మన శాసనమును వ్రాసినకాలమున వత్తక్షరములకును, వత్తులేని యక్షరములకును ఉచ్చారణయందు గల భేదమును దెల్పుటకు ప్రత్యేకముగ నొక గుర్తును వాడునాచార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మారంభమాయెననియును, నట్టి యాచారము బిట్రగుంట అక్కలపూండి శాసనములనాటికి అభివృద్ధియాయె నని యును తేలుచున్నది. ఇంతేకాదు; బోరగిలిన యర్ధచంద్ర రేఖగ మనశాసనమున నగపడు నీసంజ్ఞ యక్కలపూండి శాసనమున నట్లే యగపడుచుండ దానికిపూర్వముగ్రాయ బడిన బిట్రగుంటశాసనమున మన మిప్పుడువ్రాయునట్టి నిలువుగీతై మారినది. 'ద' 'డ'లకు భేద మత్యల్పము. 'డ' ఇట్లు వ్రాసిన 'ద' యగును. ఈయక్షరపు కుడిభుజ మును దాపలికి వంచి గుడియిచ్చినట్లు చేసిన నది'డ' యగును. 'ద, ధ'లకు గల భేదముగూడ నించుకయే. 'ద'యొక్క కుడిభుజమును మధ్యమున నిలుపక నూర్ధ్వ ముగ బోనిచ్చి తలకట్టుతో కలిపిన ఇప్పటి'ధ'వంటి యక్షర మేర్పడును. ఇదియే మనశాసనకాలమునాటి 'ధ'; కాని ఇట్లని నిస్సందేహముగా చెప్పుటకు వీలు లేదు: ఏలన, శాసనమునందంతటను 'ద'ను వ్రాయు టకు ఈ'ద' సంజ్ఞయే వాడబడినను, ఒక్కచోటమా త్రము (మొదటి రేకు. ౨-వ ప్రక్క పం ౫. కడపటి యక్షరము)'సద్బంధు 'అనుమాటలోని 'ద' యిప్పటి వలెనే వ్రాయబడియున్నది; కాని 'ద' రెండువిధముల వ్రాయునాచారముండెననితలంచుటకంటె, ఈసందర్భ మున చెక్కడపుపనివాడు 'ద'ను చెక్కుటకు ప్రతిగ 'ధ'ను పొరపాటున చెక్కినాడని తలచుట సమంజసము. 'త' 'శ'లు మన శాసనమునను, అక్కలపూండిశాసనము నను ప్రాతఫక్కి ననుసరించియున్నవి. 'త' ఇట్లు వ్రాయ బడిఇప్పటి 'త'యొక్క కుడిభుజమునుఎడమవైపునకును, ఎడమభుజమును కుడివైపునకును త్రిప్పినట్లు గాన్పించు చున్నది. 'శ' ఇంచుమించు ఇప్పటి 'క'వలె వ్రాయ బడియున్నది. బిట్రగుంటశాసనమున నీ రెండక్షరములును దాదాపు ఇప్పటియక్షరముల రూపములను బొందియు న్నవి. సంయుక్తాక్షరములయందు ఇప్పుడు మనము 'ర' వ్రాయుచోట్లయందెల్లను, వలుపలిగిలకయే వ్రాయబడి యున్నది. కాని యీవలుపలిగిలక ఇప్పటి గిలకకంటె రూపమున భిన్నమైనది. అక్షరమువిూద వంపైన గీతను యేటవాలుగ గీచిన నదియే వలుపలిగిలక – తలకట్టుస్థాన మున కొడవలివంటిరేఖవ్రాసిన యెత్వమగును. క్యావడి తో గూడివచ్చు సంయుక్తాక్షరము దీర్ఘమైనపుడు, దీర్ఘమును ఇప్పటివలె నక్షరమున కీయక క్యావడికే యిచ్చియున్నది. ఇదియే సరియైన పద్ధతి.

భావ :— శాసనము రెండుభాషలయందు విర చింపబడియున్నది సీమాచిహ్నములను వివరించుభాగ ముతప్పతక్కినశాసనము యావత్తు సంస్కృతభాషయం దున్నది. 'అస్య గ్రామస్య సీమాచిహ్నాని' అనువాక్యము తప్ప తక్కినదంతయు శ్లోకరూపమున నున్నది. ఇందు వచ్చు వృత్తములు: వసంతతిలక, శార్దూలవిక్రీడితము, ఉపజాతి. అచ్చటచ్చట కొన్నితప్పులు గానవచ్చు చున్నవి. కాని యవియన్నియు సులభముగ దిద్దగలిగినవే.

సీమాచిహ్నములు తెలుగుభాషయందు వర్ణింప బడినవి. ఇందు కొన్నిమాటలు అసామాన్యమగు అర్థము లతో గానవచ్చుచున్నవి.

కోడు: ఈమాట యాంధ్రదేశమున నెల్ల యెడలను ఇప్పుడు వాడుకలో నున్నట్లు తోచదు: "తూర్పునకు॥ దక్షిణముఖమై పాతిన పెద్దకోడుసీమ॥" 'కోడు' శబ్దమున కిచ్చట అర్థమేమి? 'మంచములో నడువాని కంబము', 'ఊరివరి నీటిపల్లము' అని యర్థము చెప్పినారు సీతారామాచార్యులవారు. వీరినే యను సరించినారు కొట్రవారు. కాని, యీ రెండర్థములయం దేదియు ఈసందర్భమున కనుకూలించదు. బ్రౌనుదొర గారు పైమాట కీయర్థములను వ్రాసినారు. 'సెలయేఱు, ఏటిపాయ, పంటకాలువ.' ఇందు కడపటియర్థ మీ సందర్భమున నుచితముగా గాన్పించుచున్నది. గోదావరి మండలములో ముఱుగుకాలువను 'కోడ'ని ఇప్పుడుగూడ అనెదరని చెప్పినారు మిత్రులు రామకృష్ణయ్యగారు.

'పోతు, వ్రప్పి, మోచి, మోచెను' అనుమాట లీక్రిందివాక్యమున గాన్పించుచున్నవి: "ఆ కోడుదగ్గఱ వచ్చిన పోతుగట్టుపడుమఱముఖమై పోయి కునివడి దక్షిణ ముఖముగా సాగి మాంకిగుంటలోపలగా వచ్చి కుని వడి దక్షిణమైపోయి మలంగి యెడవ్రప్పి మోచి పడు మఱముఖమై సాగిన పోతుగట్టు మలంగి పెద్దవ్రప్పి మోచెను."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోతు : ఈమాటకు సీతారామాచార్యులవారు పెక్కు అర్థములను వ్రాసిరి. ఆయర్థము లెవ్వియు నిచ్చట సరిపడవు. కాని 'పోతుకరడు' అనుమాటకు 'పెద్దయల' యని యర్థము చెప్పినారు. అట్లే 'పోతుగట్టు' అనగా 'పెద్దగట్టు' లేక 'దిన్నె' యని యర్థము చేసుకొనవలయును.

,వప్పి : ఈమాటకు సరియైన యర్థ మేమో తెలియదు. 'వ్రప్పు' అనుపద మొకటి గలదు. దీని అర్థము 'చీలిక'. ఇది 'వ్రయ్యు'ధాతువునుండి వ్యుత్పన్నమైన నామవాచకము. 'వ్రప్పి' 'వ్రప్పు'నకు రూపాంతర మగునా? అరవభాషయందు 'వరపు' అనుపద మొకటి కలదు. 'రెండువరిమళ్లమధ్య సరిహద్దుగ నుండు సన్నని నిడుపైనకట్ట.' దీనినే 'గనిమ' యందురు. 'ఎడ వ్రప్పిమోచి' అనగా యెడమవైపుగనిమను మోచి యనియర్థము చేసుకొనవచ్చునా ? 'మోచి', 'మోచెను' అను రెండుపదములును 'మోచు' ధాతువుయొక్క క్త్వార్థక, భూతార్థకములు. 'మోవక' తుమున్నంతము. 'మోచు'అనుమాటకు 'మొదలుకొని'యని యర్థమును వ్రాసి, మనుచరిత్ర ౫-వ ఆశ్వాసములోని "శంకరాద్రి। కాననము మోచి మందరాగంబుదాక। పోజునెట్టిరి" అను పద్యపాదమును నిందుకు తార్కాణగ నుదాహరించినారు సీతారామాచార్యులవారు. కాని ఈశాసన వాక్యములోని పైపదముల కీయర్థము చెల్లదు. ఇచ్చట 'తాకి,తాకెను'అనియర్థము చెప్పుకొనవలయును. పైమాట కిట్టియర్థ మున్నదనుటకు, 'కవికర్ణరసాయనము'లోని యీక్రింది సీసపాదము ప్రమాణము : 'మడమలు మోవంగ మైలచీరలు గట్టి, కర్ణముల్ మోవంగ గాటుకలిడి' మఱియు, రెండవరేకు రెండవపెడ ౫-వ పంక్తిలో 'యెప్పటిన్ని'అనుమాట యొకటి గనుపడుచున్నది. దీనికి 'మరల'అని యర్థము.

శాసనగ్రంథసంగ్రహము:— (శ్లో ౧.) వరాహమూర్తివర్ణన. (శ్లో ౨) చతుర్థాన్వయసంజాతుడు పోతనృపతి పేర్కొనబడినాడు.(శ్లో 3)అతనికి పోచక్షితీశుడు, దేవరాజు, కామాధిపుడు, రాజభూపుడను నల్వురు పుత్రులు బుట్టిరి. (శ్లో ౪)అందు పోచనరపతికి ప్రోలక్షితీశ్వరుడు, ఎఱపోతభూపాలుడు నను నిర్వురు తనయులును, దేవరాజునకు కాపనృపతి, ముమ్మడీశ్వరుడను పుత్రు లిరువురును బుట్టిరి. (శ్లో ౫) కామక్షితీశునకు ఇమ్మడీశదేవప్రభువులును, రాజనృపునకు తొయ్యేటినగరాధిపతి యను ననపోతభూపాలుడును జననమందిరి. (శ్లో ౬) ఈసహోదరులయందు మఘనూరి ప్రోలనృపాలుడు, అవక్రవిక్రమముచేత సంభావింపబడిన బాహువులుగలవాడై ధరణీచక్రముపై నేకచ్ఛత్రాధిపత్యము సల్పెను. (శ్లో ౭) అతని యనంతరము కాశియందలి విశ్వపతిప్రసాదముచేత కాపపృథ్వీపతి భూపరిపాలన మొనర్చెను. (శ్లో ౮) ప్రతాపరుద్రునితో తుల్యమైన ప్రభావముగల ఈకాపనృపాలుడు, ఏకశిలానగరమందు నివసించుచు, అశేషమైన ఈభూమిని శాసించెను. (శ్లో ౯) శౌనకమహర్షి పేర్కొనబడినాడు. (శ్లో ౧౦) అతని వంశమున శ్రీశైలసీమయందు ప్రఖ్యాతమైన సత్రయాగమును చేసినవాడును, శివసహస్రనామ వ్యాఖ్యాతయు, అయిదుఅగ్రహారముల నిచ్చి బంధువులను రక్షించినవాడును నను కందయపెద్దిభట్టు జననమందెను.(శ్లో౧౧)గిరితర్కభాను(౧౨౬౭) గణితమగు శకాబ్దమున పార్థివసంవత్సర మాఘ మాసమున, సూర్యగ్రహణకాలమునందు కాపపృథ్వీపతి, ప్రోలమహీపతికిపుణ్యమునకుగాను (పెద్దిభట్టునకు) మలఘ్నితటమున నుండు ప్రోలవరమను గ్రామమును దత్తము చేసెను.

దాతయొక్క వంశవృక్షము:—




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలము :— శకాబ్దము ౧౨౬౭ పార్థివ సంవత్సరపు మాఘమాసమునందలి సూర్యగ్రహణకాలమున నీదానము చేయబడెను. దీనికి క్రీస్తుశకమున ౧౩౪౬ సంవత్సరము ఫిబ్రవరినెల ౨౨ తేది బుధవారము సరిపోవుచున్నది. ఆదినమున సూర్యగ్రహణము గూడ నుండెను.

స్థలనిర్దేశము:—దానముచేయబడిన యూరిపేరు ప్రోలవరము. ఈయూరు మలఘ్ని యనునదీతీరముననుండిన ట్లిందు వ్రాయబడియున్నది. మలఘ్ని యెచ్చటిదో గుర్తించుటకు వలయు సాధనము లేవియు నిందు గానరావు. కృష్ణానదికి మాలప్రభయను నొక యుపనది యున్నది. అది కర్నాటదేశములోని ధార్వాడమండలమునందు కృష్ణలో గలియుచున్నది. కేవలము తెలుగు పేరుగల ప్రోలవరము కన్నడదేశమధ్యమున నుండుట యసంభవము. ఇంతేకాక కాపయనాయని యధికారము ధార్వాడమండలమున జెల్లుచుండె ననుట కాధారములు లేవు. ఈప్రోలవరము గోదావరిమండలములోనిదనుటకు గొంతయాధార మున్నది. పెదకోమటి వేమారెడ్డి తమ్ముడగు మాచారెడ్డి కుమారుడు తిప్పారెడ్డి శ ౧౩౩౭-వ సంవత్సరమునందు మలాపహారిభీమరథుల యంతర్వేదియందలి ములకలంకలోని ఏకమూరనుగ్రామము నగ్రహారముగ జేసెను. భీమరథి గోదావరిలో గలియు నుపనదిగ నుండవలయును. ఏలనన, లకలంక గోదావరిజిల్లా రాజమహేంద్రవరముతాలూకా, రాజమహేంద్రవరము తపాలాఫీసుకు సంబంధించిన గ్రామమని పోస్టల్ డైరెక్టరి యను గ్రంథమువల్ల దెలియుచున్నది. 'మలఘ్ని' యనుమాట మలాపహారికి రూపాంతరము. చేత కాపయనాయకునిచే దానమొసగబడిన గ్రామముగూడ రాజమహేంద్రప్రాంతమున నుండవలయును. వెదకగా రాజమహేంద్రవరము తాలూకాలో నీపేరుగల గ్రామము గనుపించలేదు; కాని గోదావరిమండలమున నాపేరుగల యూళ్లు నాల్గు అగపడుచున్నవి:

౧. పోలవరం-రంపతాలూకా*-గోకవరంపోస్టు.
౨. ,, -అమలాపురంతాలూకా-అమలాపురంపోస్టు.
౩. ,, -ఎర్నగూడెంతాలూకా-పోలవరంపోస్టు
౪. ,, -తునితాలూకా-తునిపోస్టు

ఈనాల్గుపోలవరములయందును, మొదటిపోలవరమే మన శాసనమునందు చేర్కొనబడిన ప్రోలవరమని తోచుచున్నది. ఏలనగా, ఈశాసనమునందు, కాపయనాయకుని పినతాతలలోనొకడగు రాజనాయకుని కుమారుడగు అనపోతనాయకుడు తోయ్యేటినగరమునకు ప్రభువైనట్లు ౫-వ శ్లోకమునందు జెప్పబడియున్నది. ఆ తోయ్యేరు రాజమహేంద్రవరముతాలూకాలోనిది ఆ గ్రామము పైజెప్పబడిన గోకవరము తపాలకచ్చేరికి సంబంధించిన గ్రామము. తాలూకాలు భేదమైనను, ఒక తపాలుకచ్చేరికి సంబంధించిన గ్రామము లనేకములు గలవు. కావున కాపయనాయకుడు దానమొసగిన గ్రామము రంపతాలూకా గోకవరంపోస్టాఫీసునకు సంబంధించిన పోలవరమనుట నిశ్చయము.

ఈశాసనముయొక్క ప్రాధాన్యము :— ఈశాసనమువల్ల మన కీవిషయములు తెలియవచ్చుచున్నవి :— (౧) కాపయనాయకుని వంశచరిత్రమును దెలుపు శాసనమిదొక్కటియే. ఇందువల్ల కాపయయొక్క ఇంటిపేరును, తండ్రితాతల పేర్లును స్పష్టముగ దెలియుచున్నవి. (౨) కాపయరాజధాని యేకశిలానగరమని ఇందు వ్రాసియున్నది. ఇంతవఱకుపూర్వము ప్రకటించిన శాసనమువల్ల కాపయ తెలింగాణముపై నధికారము జెల్లించుచున్నట్లు దెలియుచున్నను, అతని రాజధాని యేదియైనదియు దెలియకుండెను. (౩) ఈశాసనమువల్ల కాపయరాజ్య మెంతవఱకు వ్యాపించియుండినదియు దెలియుచున్నది. ఓరంగల్లు రాజధానియగుటచేత, ఇతని ప్రభుత్వము తెలింగాణముపై జెల్లుచుండెనుట నిశ్చయము. ఈవిషయము పిల్లలమఱ్ఱిశాసనమువల్లగూడ నూహించవచ్చును. గణపేశ్వరశాసనమువల్ల కృష్ణామండల మితనిచేతిక్రింద నుండెననుట విదితమగుచున్నది.

* దీనికి ఇప్పుడు చోడవరంతాలూకా అని పేరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాపయనాయకుడు దానమిచ్చినట్లు ఈశాసనమునందు జెప్పబడిన ప్రోలవరము గోదావరిమండలములోని చోడవరముతాలూకాలోని దగుటచేత నతని రాజ్యము గోదావరీనది యుభయతటములయందును వ్యాపించి యుండెనని నిశ్చయముగ జెప్పవచ్చును. అనితల్లి కలువచేరు శాసనమునందు, కొండవీటిరాజ్యస్థాపకుడగు ప్రోలయ వేమారెడ్డి కాపయనాయకుని గొల్చుచుండిన డెబ్బదియైదుగురు నాయకులయం దొక్కడని జెప్పబడియుండుటచేత, కాపయనాయకుని రాజ్యము దక్షిణమున కందుకూరుగువఱకును, పశ్చిమమున అహోబళశ్రీశైలముల వఱకును వ్యాపించియుండె ననుట నిజము. కావున ఈ శాసనమును ఇతరశాసనములతోగూడ బరిశీలింపగా, కాపయనాయకుని దొరతనము గతించు కాకతీయరాజ్యములో ముప్పాతికభాగముపై జెల్లుచుండెననుటస్పష్టమగుచున్నది. కొండవీటిరెడ్లు, కోరుకొండరెడ్లు, కొప్పోలు నాయకులు, రాచకొండవెలమదొరలు ఇతనిచేతిక్రింద నుండినట్లు దోచుచున్నది. (౪) మహమ్మదీయులను కాపయనాయకుడెప్పుడు తెలింగాణమునుండి తరుమగొట్టినదియు ఈశాసనము నిశ్చయముగ దెల్పుచున్నది. మహమ్మదీయచరిత్రకారులు క్రీ. శ. ౧౩౪౪-౪౫-వ సంవత్సరములో హిందువులు మహమ్మదీయులను వెడలనడచి తెలింగాణమును స్వాధీనపఱచుకొన్నట్లు వ్రాసియున్నారు. కాపయనాయకుడు ఈశాసనోక్తమైన దానమును క్రీస్తుశకము ౧౩౪౬ జనవరి ౨౨ తేదినాడు చేసెను. అప్పుడు అతని రాజధాని యోరుగల్లు. కావున నతడు తెలింగాణమును క్రీ. శ. ౧౩౪౬ జనవరికి పూర్వము, అనగా ఇంచుమించుగా మహమ్మదీయచరిత్రకారులు జెప్పినకాలముననే స్వాధీనపఱచుకొనెనని దృఢముగ దెలియుచున్నది.

ఇందలి చరిత్రాంశములు:— ఈ శాసనమున వర్ణింపబడిన రాజులు శూద్రులు. వారియింటిపేరు ముసునూరివారు. శూద్రవర్ణమున నేశాఖకు చెందినవారో చెప్పుటకు తగిన యాధారము లేవియు నిందు గానరావు.[1] ఈ వంశస్థులలో ప్రోలనాయుడు, నతని పుత్రుడగు కాపభూపతియు పరిగణింపదగినవారలు. ప్రోలయ యనక్రవిక్రమముచేత ధరణీచక్రము నంతటిని బాలించెను. కాపభూపతి ప్రతాపరుద్రునితో సమమగు ప్రభావమును గల్గినవాడై ఏకశిలాపురి నుండి యశేషమగు నీజగతిని బాలించెను. వీరితో సమానమగు ఖ్యాతిని గడింపకున్నను పోలయపిన తండ్రియగు, రాజయ కుమారుడగు అనపోతభూపాలుడు ఈసందర్భమున పేర్కొనదగినవాడు. ఏలన అతడు తొయ్యేరుపురమును పాలించెను. వీరెవ్వరో కనుగొనవలసియున్నది. కాపభూపాలుని పేర్కొనుశాసనములు క్రీ. శ. ౧౪-వ శతాబ్దమునాటివి కొన్ని గనపడుచున్నవి:

(౧) శకాబ్దము ౧౨౬౭ నాటి గణపేశ్వరశాసనము[2]:—ఇది కృష్ణాజిల్లా దివితాలూకా గణపేశ్వరమనుగ్రామమున నున్నది. కాపయనాయకుని సేవకుడగు తుంబిశి యుప్పలప్రంబ్రోలులెంక తన యజమానుని ధర్మమునకుగాను గణపతీశ్వరుని దేవాలయమున కొసగిన దానమును దెల్పుచున్నది.

(౨) శకాబ్దము ౧౨౬౭ నాటి పిల్లలమఱ్ఱిశాసనము[3]. ఇందువల్ల కాపయనాయకుల భృత్యుడగు ఎఱపోతులెంక అల్లావదీనసుల్తాను పాడుచేసిన ఎఱకేశ్వరుని దేవాలయమును పునరుద్ధారణము గావించునట్లు దెలియుచున్నది.

---

1. వీరికి కాకతీయుల సామంతులగు రేచర్లరెడ్లతో నేదో సంబంధమున్నట్లున్నది "అనుమనగంటి పురవరాధీశ్వర" యను బిరుదు రేచర్ల రెడ్లకును, ముసునూరి నాయకులకును సామాన్యము. 'ఒరయూరి పురవరాధీశ్వర' యను బిరుదు ఆంధ్రచోళుల కందఱకును గలదు. కావున 'అనుమనగంటి పురవరాధీశ్వర' యను బిరుదుగలవారు సైతము ఒక కుటుంబమునకు సంబంధించినవారైనను కావచ్చును.

2 S.I.I. IV. No. 950.

3. Telingana Inscriptions: Msc. No 11

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౩) శకాబ్దము ౧౨౮౦ నాటి ముమ్మడినాయకుని శాసనము.[1]

(౪) శకాబ్దము ౧౨౯౧ నాటి సింగయనాయకుని యక్కలపూండిశాసనము.[2]

ఈ రెండుశాసనములయందును కాపయనాయకుని చెలియలి కుమార్తెను ముమ్మడినాయకు డుద్వాహము జేసికొనినట్లు వ్రాసియున్నది.

ఇవిగాక శ౧౨౭౨ సంవత్సరమునాటిది (రెండవ) కొప్పుల కాపయనాయకుని శాసన మొకటి గనపడుచున్నది.[3]

ఇంకను కొప్పులవంశస్థులవి మఱికొన్ని శాసనములు గలవు. కాని ప్రస్తుతము బరిష్కృతమగుచున్న శాసనమునం దేతద్ధాతృవంశనామము ముఘమారివా రని వ్రాయబడియుండుటచేత, ఈకాపయనాయకు కొప్పుల కాపయనాయకుడు గాడనియు, సమకాలికులైనను వారిరువురును భిన్నపురుషులనియు నిశ్చయమగుచున్నది. కావున కొప్పులవారి శాసనముల నిచ్చట దడవబని లేదు కాని యిచ్చట నొక సందేహమును దీర్చుకొనవలసియున్నది. పైజెప్పిననాల్గుశాసనములయందును బేర్కొనబడిన కాపయనాయకుడు కొప్పులకాపయనాయకు డేల కారాదు? సింహాచలశాసనమువల్ల అతడు శ ౧౨౭౨ అనగా క్రీ. శ ౧౩౫౦ లో జీవించియున్నట్లు దెలియుచున్నది. పై జెప్పబడిన నాల్గుశాసనములును రమారమి యాకాలమునకు జేరినవే. కావున నీశాసనములు కొప్పుల కాపయనాయకునికిగూడ సంబంధించియుండవచ్చును గదా!

అట్లనుటకు గొన్ని యాక్షేపణలు గలవు:—

(౧) కొప్పులకాపయనాయకుని శాసనమునందు అతని కేబిరుదు లున్నట్లును జెప్పలేదు. అతని వంశములోనివాడును, ఇంచుమించుగ నతని సమకాలీనుడును నగు నామయనాయకునికి 'పగమెచ్చుగండ', 'ప్రత్యర్థిగర్వాపహ'యనుబిరుదు లున్నట్లు దెలియుచున్నది.[4] ఈబిరుదులు కొప్పులకాపయనాయకునికిగూడ నుండెనని యూహించవచ్చును, ఇక పైని జెప్పిన నాల్గుశాసనములలో బేర్కొనబడిన కాపయనాయకునికి గొప్పబిరుదులున్నవి. పిల్లలమఱ్ఱిశాసనమున నితనికి, 'ఆంధ్రదేశాధీశ్వర', 'పరనారీసోదర', 'అనుమనగంటిపురవరాధీశ్వర', 'చోడరాయస్థాపనాచార్య', 'కాంచీరక్షపాలక'యనుబిరుదు లున్నట్లు వ్రాయబడియున్నది. గణపేశ్వరముశాసనమున 'సమస్తరాజాశ్రయ', 'అనుమనగంటిపురవరాధీశ్వర'యన్న బిరుదులు గాన్పించుచున్నవి. పిల్లలమఱ్ఱి గణపేశ్వరశాసనములలో బేర్కొనబడిన కాపయనాయకు డొక్కపురుషుడే. ఇట్లనుటకు ఈశాసనములే సాక్ష్యముబల్కుచున్నవి. రెండుశాసనములయందు బేర్కొనబడిన కాపయనాయలకును 'అనుమనగంటిపురవరాధీశ్వర'యన్న బిరుదు కలదు. ఇంతే కాదు. వారిరువురు నొక్కకాలమువారే. మఱియు ముమ్మడి, సింగయనాయకుల శాసనముల బేర్కొనబడినదియు నీకాపయనాయకుడే. వానియందు ప్రఖ్యాతాంధ్రసురత్రాణుడగు కాపయనాయకుని మేనగోడలిని ముమ్మడినాయకు డుద్వాహముజేసికొన్నట్లు వ్రాసియున్నది. పిల్లలమఱ్ఱిశాసనములోని కాపయనాయకుడు 'ఆంధ్రదేశాధీశ్వరుడు'. ఆంధ్రదేశాధీశ్వరు డన్నను ఆంధ్రసురత్రాణు డన్నను అర్థమొక్కటియే. కావున పిల్లలమఱ్ఱి, గణపేశ్వరము, శ్రీరంగము, అక్కలపూండి శాసనములయందు బేర్కొనబడిన కాపయనాయకుడు కొప్పులకాపయనాయకుడు గాడు. అతడు భిన్నపురుషుడు.

(౨) పిల్లలమఱ్ఱి గణపేశ్వరశాసనములయందు బేర్కొనబడిన కాపయనాయకునికి గాకతీయరాజులతో గొంతసంబంధ ముండినట్లు దోచుచున్నది. కాపయనాయని 'కాంచీపురరక్షపాల', 'చోడరాయస్థాపనాచార్య'త్యాది బిరుదులే పై యూహకు గారణములు. కొప్పులవారి శాసనముల నన్నిటిని శోధించినను కాకతీయులకును వారికిని నెట్టిసంబంధమున్నట్లు కానుపించదు.

1. E. I. XIV. P. 83.
2. Ibid. XV. P. 259.
3. S I.I. IV. No. 924.
4. E. I. IV. P 359.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇక పిల్లలమఱ్ఱి గణపేశ్వరశాసనములయందలి కాపయనాయకుడును, మనశాసనమునందలి కాపయనాయకుడును నొక్కఁడౌనేమో కనుఁగొనవలయును. వీనియందు కాపయనాయకు డనుమనగంటిపురవరాధీశ్వరు డనిగదా చెప్పబడియున్నది. ఈయనుమనగల్లు తెలింగాణమున నోరుగంటి సమీపముననున్నది. ఇది ప్రథమమున కాపయనాయకుని పూర్వుల నివాసస్థానమై యుండనోపు. మనశాసనమునందు కాపయ యోరుగంటినుండి రాజ్యము సేయుచున్నట్లు వ్రాయబడియున్నది. కాపయతండ్రి యగు ప్రోలయ పృథ్వీచక్రము నవక్రముగ పాలించినను అతని రాజధాని యోరుగల్లని శాసనమునందు వ్రాయబడ లేదు. కాపయదినములలోనే యోరుగల్లు మహమ్మదీయుల వారికి వశమైనట్లు దోచుచున్నది. క్రీ. శ. ౧౩౨౨-౨౪ లో, ననగా ప్రస్తుతశాసనకాలమునకు కొన్ని నెలలకు పూర్వము మహమ్మదీయులను తోలి హిందువులు ఓరుగంటిని, తెలింగాణమును స్వాధీనపఱచుకొనినట్లు మహమ్మదీయచరిత్రకారులు వ్రాసియున్నారు. ఇందువల్ల క్రీ. శ. ౧౩౨౨-౨౪ కు పూర్వము కాపయనాయకునికి గాని, యతని తండ్రికిగాని యోరుగల్లు రాజధానియై యుండుట సాధ్యము గాదు. కావున తత్పూర్వమువారు అనుమనగంటిపురము నుండియే రాజ్యము సేయుచుండిరనుట యుక్తము. అట్లగునేని, పిల్లలమఱ్ఱి గణపేశ్వరముల కాపయనాయకుడును, ప్రస్తుత శాసనపు కాపయనాయకుడును నొక్కఁడేయనుట నిశ్చయము.

క్రీ. శ. ౧౩౨౩-వ సంవత్సరమువఱకును ఆంధ్రదేశముపై కాకతీయరాజుల యధికారము చెల్లుచుండెననియును, నాసంవత్సరమున ఢిల్లీపాదుషాకుమారుడగు మహమ్మదు తొగ్లాకు ఓరుగంటిపై నెత్తివచ్చి, ప్రతాపరుద్రుని బందినిజేసి తెలింగాణమును ఢిల్లీసామ్రాజ్యమున గల్పుకొనినట్లు చరిత్రవలన మనకు దెలియుచున్నది. ఇట్టిపరిస్థితియందు ప్రోలయ కాపయనాయకులు తెలింగాణముపై నెట్లు ప్రభుత్వము సల్పగలిగిరి? కాపయనాయకు డోరుగంటి నెట్లు నిజరాజధానిగ జేసుకొనగల్గెను? ఈప్రశ్నలకు తగుసమాధానము మనకు అనితల్లికలువచేరుశాసనమువల్ల లభించుచున్నది. అందు ప్రతాపరుద్రుని మరణానంతర మాంధ్రదేశమునందలి రాజకీయపరిస్థితు లిట్లు వర్ణింపబడియున్నవి:

"తస్మిన్ ప్రతాపరుద్రే స్వస్థానం స్వేచ్ఛయైవ యాతవతి, అథ సాధూ యవనమయా జాతై వాహో మహామహోమహిమా॥ వరాహవ ద్వారిధివారిమగ్నాం ధరా మశేషాం యవనోదరస్థామ్, సముద్ధరన్ ప్రోలయనాయకేంద్ర స్తతః ప్రతిష్ఠాపయతిస్మ తద్వత్॥ స్వర్గాతిథౌ ప్రోలయభూమిపాలే విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్య గత్వా, అపాలయ త్కాపయనాయకేంద్ర స్తదియ్య రాజ్యం తరణిప్రతాపః॥ అథపంచోత్తరసప్తతినాయకసంసేవ్యమానపదపద్మః, కాపావనీశ్వరః శ్రీవిశ్వేశ్వరకరుణయా క్షితిమరక్షత్॥తురుష్కైర్యేన సమాక్రాంతా స్తేచాఽన్యే కాపభూభుజా, అగ్రహారాః పున ర్దత్తా భూయో భువ మభూషయన్॥"

పై శ్లోకములవల్ల ప్రతాపరుద్రుని మరణానంతరము ఆంధ్రభూమి యవనాక్రాంతము కాగా ప్రోలయనాయకుడు దాని నుద్ధరించెననియును, నతడు స్వర్గస్థుడైనపిదప, విశ్వేశ్వరుని యాజ్ఞచేత పంచోత్తరసప్తతినాయకసంసేవ్యుడైన కాపయనాయకుడు పుడమిని శాసించి, తురుష్కులచేత నాక్రమింపబడిన యగ్రహారములను మఱల బ్రాహ్మణుల కొసనుటగాక, నూతనాగ్రహారములను బెక్కింటినిసైతము గల్పించెననియు దెలియుచున్నది. మన శాసనదాతయగు కాపయనాయకుని చరిత్రయే కలువచేరుశాసనమున వర్ణింపబడినది. అనగా ఈరెండుశాసనములయందును బేర్కొనబడిన కాపయనాయకులు భిన్నపురుషులు గారు. ఒకని చరిత్రమునే రెండుశాసనములును వక్కాణించుచున్నవి. అట్లనుటకు కారణములు:

౧. రెంటియందును కాపయనాయకుడు ప్రతాపరుద్రుని తరువాత రాజ్యముచేసిన ట్లున్నది.

౨. రెంటియందును ప్రోలయనాయని యనంతరము కాపనాయకుడు ప్రభుత్వముసల్పినట్లు వ్రాయబడియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. రెంటియందును కాపయ విశ్వేశ్వరునియను గ్రహముపలన రాజ్యమునుబడసినట్లు జెప్పబడియున్నది. ఈవిశ్వేశ్వరుడు కాశికాపుర్యధిదైవమగు విశ్వనాథుడని మనశాసనము దెల్పుచున్నది.

ఈకలువచేరుశాసనమువల్ల దెలియని విషయములు కొన్ని మనశాసనమువలన దెలియుచున్నవి. కలువచేరుశాసనమునందు ప్రోలయనాయకుని యనంతరము కాపయనాయకుడు రాజ్యముచేసెనని మాత్రము జెప్పబడియున్నది. కాని ప్రోలయకాపయులకు గల బంధుత్వ మెట్టిదియో, వీ రెచ్చట నుండి రాజ్యమొనర్చిరో చెప్పబడ లేదు. మనశాసన మీయంశములను స్పష్టపఱచుచున్నది. కాపయ ప్రోలయమొక్క పుత్రుడనియు, ప్రోలయరాజ్యస్థానమును దెల్పకున్నను, కాపయ యోరుగంటిలో నివసించుచునే రాజ్యము సల్పెననియు నిశ్చయముగ దెల్పుచున్నది.

ఇక మహమ్మదీయచరిత్రకారులవల్ల ఈనాయకుల యుదంత మేదేనియు దెలియునో కనుగొనవలసియున్నది. వీరియందు మొదట జెప్పదగినవాడు శియాఉద్దీన్ బార్నీ. ఇతడు సుల్తాన్ మహమ్మదు తోఘ్లుకునకు సమకాలికుడు; అతని మిత్రుడు ; అతనితోబాటు సైన్యములో గూడ దిరుగుచు దక్షిణదేశమునకు వచ్చియుండెను. బర్నీ తన 'తారీఖిఫిరోజుషాహి' యనుచరిత్రయందు తెలింగాణ స్వాతంత్ర్య స్థాపనము నిట్లు వర్ణించియున్నాడు :

“ఇది జరుగుచుండగా, ఆరంగలు (ఓరంగలు) హిందువులలో అల్లరిరేగెను. కన్యానాయకుడు దేశమునందు ప్రబలుడాయెను. నాయబువజీరగు మలిక్ మక్బూలు డిల్లీకి పారిపోయెను. హిందువులు ఆరంగలు (ఓరంగలు) ను స్వాధీనముచేసుకొనిరి. ఇట్లు (పాదుషా) దానిని సంపూర్ణముగ గోలుపోయెను. ఆసమయమునసె సుల్తాను కంబలదేశము నేలుటకు నియమించినట్టి కన్యానాయకుని బంధు వొక్కడు, మహమ్మదీయమతమును వర్జించి, అల్లరిని రేపెను. కంబలభూమిసైత మిట్లు నష్టమై, హిందువులకు హస్తగత మాయెను” (Elliot and Dowson iii pp 245-246)

దీనినే ఫెరిస్తా విపులీకరించి వ్రాసియున్నాడు:

“ఈసంవత్సరమున (హిజరి 744 అనగా క్రీ. శ. 1344) వురంగల్ ప్రాంతమున నివసించుచున్న లద్దరదేవుని కుమారుడగు కృష్ణనాయకుడు, రహస్యముగ కర్ణాటప్రభువగు బిలాలుదేవునియొద్దకు బోయి, దక్కనునం దసంఖ్యాకులగు మహమ్మదీయులు హిందువులను సర్వనాశనము సేయుటకు పన్నాగములను బన్నుచున్నారనియు, వారిని ప్రతిఘటించుటకు తా మెల్లరును ఏకీభవించుట యుక్తమనియు చెప్పెను. బిలాల్ దేవుడు తన జ్ఞాతులనంపఱిని సభకూర్చి, మొదట తనదేశములోని దుర్గములను స్వాధీనపఱచుకొని, తరువాత నిజ రాజధానిని పర్వతములమధ్యకు మార్చవలయునని నిశ్చయించెను. వారి యెత్తుగడలన్నియు సంసిద్ధములైనప్పుడు తాను, వురంగల్, తెలింగాణహిందువులను రేపి వారి నాయకత్వమును వహింతునని కృష్ణనాయకుడును వాగ్దాన మొనరించెను.”

“అదేప్రకారము బిలాలుదేవుడు తన రాజ్యపుసరిహద్దునం దొక బలిష్ఠమగు పట్టణమును నిర్మాణముచేసి దానికి తన కుమారుడగు విజయుని పేర విజయనగర మని నామకరణము గావించెను. తరువాత సైన్యమును గూర్చి అం దొకభాగమును కృష్ణనాయకుని యాధిపత్యముక్రింద నిల్పెను. అతడు వురంగలును స్వాధీనపఱచుకొని, దాని పాలకుడగు ఇమాదుల్ ముల్కను దౌలతాబాదునకు తరిమెను. బిలాల్ దేవుడును, కృష్ణనాయకుడును, పూర్వము కర్ణాటరాజులకు కప్పముగట్టుచున్న మఅబిర్, ద్వారసముద్రరాజుల బలములను తమ సైన్యముతోగూడ కూర్చుకొనిరి. ఏకీభవించిన హిందూసైన్యములు దక్కనునందు మహమ్మదీయుల యధీనమం దుండిన దేశము నంతటిని ఆక్రమించి, కొన్ని నెలలలోపలనే వారి నచ్చటనుండి వెడలనడచిరి. ఇందువల్ల (దక్కనుదేశమున) తోఘ్లకునకు దౌలతాబాదుతప్ప వేరురాజ్యము లేకపోయెను” (Brigg's Ferishta II P427)

బర్నీవ్రాతకును ఫెరిస్తావ్రాతకును కొంతభేదమున్నది. బర్నీ తెలింగణాహిందువుల నాయకుని పేరు కన్యానాయకుడని వ్రాసినాడు. ఫెరిస్తా యతని పేరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణనాయకుడని చెప్పి యతడు ప్రతాపరుద్రుని కుమారుడని చెప్పినాడు. 'కన్యా' అనునది 'కన్హ' అనుదాని రూపాంతరమని యనేకపరిశోధకులు జెప్పియున్నారు. అట్లగునేని బర్నీ కన్యానాయకుడు ఫెరిష్తాయొక్క కృష్ణనాయకుడగుటయందు వింత లేదు; కాని ప్రతాపరుద్రునికి కృష్ణనాయకుడను పుత్రుడుండెననుట కెట్టియాధారమును గానరాదు. ఫెరిష్తాకు పూర్వీకులయిన మహమ్మదీయచరిత్రకారు లాతడొక జమీందారు డని మాత్రము జెప్పిరి. ఫెరిష్తా కీవిషయ మెట్లు ఎఱుకపడెనో తెలియదు.

మఱియు, బర్నీ వ్రాతనుబట్టి చూడగా కన్యానాయకునకు మహమ్మదీయులను తెలింగాణమునుండి వెడలనడచుటయందు సహాయు లెవ్వ రున్నట్లగపడదు. కాని యతని బంధువగు కంబలదేశపాలకుని సాయమును బడసియుండవచ్చునన్న శంకకుమాత్ర మెడమున్నది. ఫెరిష్తా కృష్ణనాయకుడు క్రీ. శ. ౧౩౪౪ సంవత్సరమున కర్ణాటప్రభువగు బళ్లాలునికడకు పోయి, యతని సాయమున, మహమ్మదీయులను దక్కనునుండి వెడలనడచెనని వ్రాయుచున్నాడు. ఫెరిష్తా వ్రాసినట్లు కృష్ణనాయకుడు బళ్లాలదేవుని గలుసుకొనియుండుట పొసగదు. ఏలన మూడవబళ్లాలుడు ౧౩౪౧ మొదలు ౧౩౪౩ వఱకు మధుర సుల్తానులతో యుద్ధముసేయుచు ౧౩౪౩-వ సంవత్సరముమధ్య నిహతుడయ్యెను. తత్పుత్రుడగు నాలవ బల్లాళుడు క్రీ.శ. ౧౩౪౩-వ సంవత్సరము ఆగస్టు ౧౩-వ తేదినాడు రాజ్యాభిషిక్తు డాయెను; కాని యచిరకాలముననే రాజ్యమును గోల్పోయెను. అత డేమాయెనో తెల్పుసాధనములుగూడ లేవు. సదరుసంవత్సరము అక్టోబరు తే ౨౦ దికిపూర్వమే హొయసలరాజుల రాజధానియగు ద్వారసముద్రప్రాంతదేశము విజయనగరప్రథమరాయలగు మొదటి హరిహరరాయలకు గైవసమాయెను. కావున క్రీస్తుశకము ౧౩౪౪లో కృష్ణనాయకుడు బళ్లాలదేవుని గలసికొనుట యసంభవము. మఱియు బళ్లాలదేవుడు విజయనగరమును నిర్మించె ననుటకు ఆధారములు లేవు. విషయము బహుళమగుటచేత నది యిచ్చట చర్చించుటకు వీలు లేదు. ( చూ. విజయనగరము. పట్టణ సామ్రాజ్యముల యుత్పత్తి: మొదటిభాగము.) కావున కృష్ణనాయకుడు బళ్లాలదేవుని సహాయముచే మహమ్మదీయులను వెడలనడచె ననుట యుక్తము కాదు.

ఇతరవిషయములయందు మహమ్మదీయచరిత్రకారులకు ఎట్టిభేదాభిప్రాయములున్నను క్రీ శ. ౧౩౪౪ లో తెలింగాణా హిందువుల నాయకుడు మహమ్మదీయులను వెడలనడచి నష్టమైన హిందూస్వాతంత్ర్యమును పునరుద్ధారణగావించెనని యేకగ్రీవముగ బల్కుచున్నారు. కాబట్టి అనితల్లి కలువచేరు శాసనమున వర్ణింపబడిన హిందూస్వాతంత్ర్యపునరుద్ధారణకథనము నిజమని మహమ్మదీయచరిత్రకారులు ఋజువుసేయుచున్నారు. కాని యొక్క విషయమునందుమాత్రము కలువచేరు శాసనము మహమ్మదీయచరిత్రకారుల వ్రాతలతో ప్రతిఘటించుచున్నది. మహమ్మదీయచరిత్రకారు లందఱును తెలింగాణాహిందూనాయకుని పేరు కన్యానాయకు డనియో, కృష్ణనాయకుడనియో వ్రాసియున్నారు. కలువచేరు శాసనమున అతనిపేరు కాపయనాయకు డని యున్నది. దీనికిసమన్వయ మెట్లు? మహమ్మదీయచరిత్రకారులచే బేర్కొనబడిన కన్యా ( లేక, కృష్ణ ) నాయకుడే కలువచేరుశాసనమునందును, ఇతరశాసనములయందును వచింపబడిన కాపయనాయకుడు. ఈవిషయమును మిత్రులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రమోదూత జ్యేష్ఠ భారతియం దొక విపులమైన వ్యాసమున జర్చించియున్నారు. నేనును నా 'విజయనగరము, పట్టణ సామ్రాజ్యముల యుత్పత్తి' యనుగ్రంథమున జర్చించియున్నాను. ఆచర్చను సర్వమును ఈవ్యాసమునం దిముడ్చుటకు వలనుపడదు. కాని కన్యానాయకుడే కాపయనాయకుడనుటకు గల ముఖ్యకారణము నిచ్చట బొందుపఱచుచున్నాను. ఈక్రింది జాపితాయందు ఈ నాయకుని చరిత్రకు సంబంధించిన ముఖ్యవిషయములను దెల్పుచున్నాను. దానిని దిలకించిన కన్యానాయక కాపయనాయకు లొక్కరేయనుట విశదముకాగలదు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| కన్యా, లేక కృష్ణనాయకుడు | కాపయనాయకుడు |
| --- | --- |
| ౧. అతడు క్రీ. శ. ౧౩౪౪ లోనో, ఇకకొంచెము పిమ్మటనో మహమ్మదీయులను తెలింగాణము నుండి బారదోలెను. | అతడు శ. ౧౨౬౭ (=క్రీ. శ. ౧౩౪౫-౪౬) కు పూర్వము మహమ్మదీయులను ఆంధ్రదేశమునుండి వెడల నడచెను.[1] |
| ౨. అతడు తెలింగాణమునకు వలీ, లేక ప్రభువు. | అతడు ఆంధ్రదేశాధీశ్వరుడు; ఆంధ్రసురత్రాణుడు.[2] |
| ౩. అతని రాజధాని ఓరుగల్లు. | అతని రాజధాని యోరుగల్లు.[3] |
| ౪. అతడు ౧౩౪౪ మొదలు కనీసము ౧౩౬౬ వఱకు రాజ్యముజేసెను. | అతని మొదటి శాసనము క్రీ. శ. ౧౩౪౫-౪౬ నాటిది.[4] అతని కడపటిది క్రీ. శ. ౧౩౫౭ నాటిది.[5] |
| ౫. అతడు గుల్బర్గాసుల్తానులగు అలాఉద్దీన్ మహమ్మదుషాలకు ప్రతిస్పర్ధి. వారితో నిరంతరము యుద్ధము సల్పుచుండెను. | అతడు గుల్బర్గాసుల్తానగు అలాఉద్దీన్ పాదుషా యొక్క ప్రతిస్పర్ధి. అతడు అలాఉద్దీన్‌తో యుద్ధము చేసెను.[6] |

పైని నమూనాలోని రెండుప్రక్కల నిచ్చియున్న విషయముల నొండొంటితో బోల్చిచూచిన నీక్రింది యంశములు తేటకాగలవు.

(౧) కన్యానాయకుడును, కాపయనాయకుడును నేకకాలమం దేకస్థలముననే మహమ్మదీయులతో ప్రతిఘటించి వారిని దేశమునుండి వెడలగొట్టి స్వాతంత్ర్యమును స్థాపించిరి.

(౨) వా రిద్దరును ప్రభుత్వముసల్పిన దేశ మొక్కటియే.

(౩) వారి కిద్దరికిని రాజధాని యోరుగల్లే.

(౪) వా రిద్ద రేకకాలమున నుండినవారే.

(౫) వారి కిద్దఱికి గుల్బర్గాసుల్తా నగు నల్లాయుద్దీను శత్రుడే.

ఏకకాలమున, ఒకదేశముపై నిద్దరురాజు లేలుచు నొకేపట్టణమును రాజధానిగా గలిగియుండుట యసంభవము. కావున కన్యానాయకుడు, కాపయనాయకుడు అనునవి యొక్కపురుషుని భిన్ననామములేయనుట సమంజసము. మహమ్మదీయచరిత్రకారులచే వర్ణింపబడిన తెలింగాణస్వాతంత్ర్యస్థాపనకథనము నిశ్చయమని మన శాసనము రుజువుసేయుచున్నది. అనితల్లికలువచేరుశాసనమింతకంటె విపులముగ వర్ణించుచున్నను, మన శాసనమున కున్న విలువ దానికి లేదు. ఏలన మనశాసనము కాపయనాయకుడు మహమ్మదీయులను తరిమి యోరుగంటిని స్వాధీనముచేసుకొన్నవెంటనే వేయించిన శాసనము. కలువచేరుశాసనము దీనికి పిమ్మట ౭౭ సంవత్సరములనాటిది.

1. ప్రస్తుతశాసనము.
2. SII, IV 950.
3. ప్రస్తుతశాసనము.
4. ప్రస్తుతశాసనము.
5. తెలింగాణాశాసనములు, (ఇతరశాసనములు నెం. ౧౧).
6. పైదే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మూలము

మొదటి రేకు : మొదటి ప్రక్క



1. *అవ్యా జ్జగంతి విభు రాదివరాహమూర్త్తి ర్భర్తా భవో రుచిరబా
2. లతమాలనీలః। ఆవిర్బభూవ కిల యస్య మహాంబుధీనే దంష్ట్రామృణా
3. లశిఖరే ధరణీసరోజం।[।*౧]ఆసీ త్పోతమహీపతి స్సుకృతినా మాద్యో జ
4. గద్విశ్రుతః[।*]పోతః కల్పమహీరుహస్య విలసద్వి శ్రా[1]ణనశ్లాఘయా[।*]పోత్తో
5. యం విపదంబురాశితరణే సర్వా[2]ప్రజానామపి[।*]క్షీరాబ్ధావివ చంద్రమా
6. బుధజనాధార శ్చతుర్త్థా[3]న్వయే॥[౨*॥]తస్యా మభూవం[4] స్తనయా గుణాఢ్యా
7. శ్చతుర్భ్భుజస్యేవ భుజా మహాం త్తః।(।)పోచక్షితీశో నరదేవముఖ్యో దేవశ్చ
8. కామాధిపరాజభూపా॥[3*]పోచక్షోణిపతే స్సుతౌ సుకృతినౌ ప్రోలక్షితీశోత్త
9. మః[।*]శ్లాఖ్య[5]శ్రీ రెజపోతభూపతిరవి[6] ద్వౌ లోకసంభావితౌ। దేవక్ష్మాధిపతేశ్చ కా
10. పనృపతి శ్రీముమ్మడీశాహ్వయా[।*]సంజాతౌ భువి రామలక్ష్మణనిభౌ సూరేం

1. 'విలసద్విశ్రాణ' అని చదువవలయును.

2. 'సర్వ' అని.

3. 'చతుర్థాన్వయే' అని.

4. శాసనములోనున్నది సరియైనచో ౨,3 శ్లోకములమధ్యనున్న యొకశ్లోకమును శిల్పి చెక్కక విడిచినాడని తలంచవలయును. ఏలన "తస్యా మభూవం" అనువాక్యమువల్ల తత్పూర్వము, పోతభూపాలుని భార్యను పేర్కొనినట్లు తెలియుచున్నది. శాసనమునందు పోతభూపాలుని భార్యప్రస్తాపము గానరాదు. కావున దీనిని "తస్యోదభూవం" అని దిద్దుకొనవలయును.

5. 'శ్లాఘ్య' అని.

6. 'భూపతి రపి' అని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మొదటి రేకు : రెండవ ప్రక్క



1. దుతుల్యశ్రియా।[।౮॥*] కామకిశీశతనయా పున రిమ్మడీశ దేవప్రభూ భువనవి
2. శ్రుతదానశీలా। ప్రత్రోపి[1] రాజన్నృపతే రనపోతభూప స్తాయ్యేటినామన
3. గరీపతిరాయ్యబన్ధుః[2]॥[౯॥*]ఏతేషాం సహజన్మనాం సుకృతినాం మధ్యే ప్ర
4. సిద్ధోదయః[।*]క్షోణీచక్ర మవక్రవిక్రమయశస్సంభావ్య బాహార్గ్గళః। ఏకఛత్ర[3]మపా
5. లయ ద్బుధజనశ్లాఘ్యప్రభావోన్నతో[।*] లక్ష్మీవా న్మఘనూర్ప్రోలనృపతి స్సద్బం
6. ధుచింతామణిః॥[౧౦॥*]తస్యానంతరమంత్ర[4]రంగవిమలీభావప్రభావో
7. దయః[।*]శ్లాఘ్యప్రస్ఫుటధర్మ్మకర్మ్మచతుర[5] శ్రీకాపపృధ్వీపతిః[6]। కాశ్యాం విశ్వప
8. తేః ప్రసాదమహిమా[7] ప్రాప్తాఖిలప్రాభవః[।*]క్షోణీరక్షణదక్షదక్షిణభుజ స్తంభో జరీ
9. జృంభతే।[।౧౧॥*]ప్రతాపరుద్రప్రతిమప్రభావః శ్రీకాపభూపః కరుణాకలాపః। అశా
10. దశేషాం భువ మద్భుతశ్రీ రేకో వస న్నేకశిలానగర్య్యాం।[।*౧౨॥]*ఆసీ న్నేమిశ[8]నా
11. మపావనవనావాసో[9] మహాసంయమీ [।*] వ్యాప్తద్వాదశవర్షసత్రమహిమా

---

1. ' పుత్రోపి ' అని.
2. ' బంధుః ' అని.
3. ' ఏకచ్ఛత్ర ' అని.
4. ' మంతరంగ ' అని.
5. ' చతురః ' అని.
6. ' పృధ్వీపతిః ' అని.
7. ' మహిమ ' అని.
8. ' ఆసీన్నైమిశ ' అని.
9. ' వాసో ' అని.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## రెండవరేకు : మొదటిప్రక్క



1. వ్యాసేతిహాసప్రియః। అంహస్సంఘభయానక త్రిభువనే;సద్వా[1]నకీర్త్యా
2. నకః[।*]క్షామక్షీణసమస్తదీనజనతాసంత్రానక శ్శౌనకః॥[౯॥*] తస్యాన్వయే జ
3. యడి[2]కందయపెద్దిభట్టః శ్రీశైలసీమ్ని కృతవిశ్రుత[3]సత్రయాగః। వ్యాఖ్యా,
4. నకృద్గిరిశనామసహస్రకస్య పంచాగ్రహారపరిరక్షితబంధు వర్గః[4]।[౧౦॥*]
5. శాకాబ్దే గిరితర్క్కభానుగణితే సంవత్సరే పార్త్థివే[5] [।*]మాఘే మాసి రవిగ్ర
6. హే సుచరిత[6]శ్రీకాపపృధ్వీపతిః[7]। శ్రీమత్ప్రోలమహీపతే స్సుకృతినః
7. పుణ్యాయ పుణ్యాశయః[।*]గ్రామం ప్రోలవరాహ్వయం స్వయ మ
8. దాత్తస్మై మలఘ్నితటే॥[౧౧॥*]లస్య[8] గ్రామస్య సీమాచిహ్నాని॥* తూర్పునకు॥
9. దక్షిణముఖమై పాఱిన పెద్దకోడుసీమ దక్షిణానకు ఆకోడు
10. దగ్గఱవచ్చిన పోతుగట్టు[9] పడుమఱముఖమైపోయి కునివడి

---

1. 'సద్దానకీర్త్యా' అని.
2. 'జయతి' అని.
3. 'త'– బంతిక్రింద హంసపాదిపెట్టి బంతి మీద వ్రాయబడియున్నది.
4. 'బంధువర్గాః' అని.
5. 'పార్థివే' అని.
6. 'చరితః' అని.
7. 'పృథ్వీపతిః' అని.
8. 'అస్య' అని.
9. 'గట్టు' అని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## రెండవ రేకు : రెండవ ప్రక్క



1. [ద][క్షి*][ణ]ముఖముగా సాగి మాంకిగుంటలోపలగా వచ్చి కునివడి
2. [ద]క్షిణమైపోయి మలంగి మెడ్రవప్పి మోచి పడుమఱముఖమై
3. [సాగిన]పోతుగట్టుమలంగి పెద్ద్రవప్పి మోచెను॥పడుమటికిని ఉత్త
4. రముముఖమై సాగిన పోతుగట్టు జమ్మికడంగాను తూర్పు
5. [మొ]గమై మలంగి మెప్పటిన్ని ఉత్తరపుమొగమై వచ్చి కునివ
6. డి పడుమఱముఖమై సాగి పెడదొడ్డిలోనుగా వచ్చి తుమ్మ
7. లపుట్ట మోచెను॥ఉత్తరానకు తూర్పుమొగముగా వచ్చిన పోతుగ
8. ట్టు ఉప్పిపాదలుసీమగాను కుంటకడపుట్టవంపుగాను ఉత్త
9. రపుమొగముగా మలంగి లింగముంగుంట్టకడంగాను సా
10. గి తూర్పున పెద్దకోడు మోచెను॥

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# రేనాటి కొలువు

మున్నంగి...శర్మ

గేయము :

పాడరా రేనాటికొలువు సుతిగలిపి
వాడవాడలుగూడి పరవళ్లుద్రొక్కి రాఁ. బా.

తొలిసీమ వెలిసీమ చెలిమి కలిమిని బొలిచి
వలగొన్న 'నల్లమల' పొలిమేర బురు జెక్కి. పా.

అల తుంగభద్ర చన్బ్రాలఁ గల తఱితీపి
కెలసి పాడిన రామకృష్ణు ఫణితినిఁ గలిపి. పా.

తొలిఁ గృష్ణరాయలను గెలుపు వలపులఁ గొలిపి
కొలువుదీరిచి యెదురుకోలు నడపిన నుడువు. పా.

బుక్కజోదులు పగఱ యుక్కుజెక్కిననాఁడు
నెక్కచెదరక చెమ్మచెక్కలాడిన వరుస. పా.

పొడిచి నడచెడు నెదిరి యుడుకునల్లకు ద్రుళ్లి
పడు తెలుఁగువాదరకుఁ బిడిమైన మగఁటిమిని. పా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మురుపు నింపఁగ భట్టుమూర్తి గిరికకుఁ బెండ్లి
జరిపి పాడిన నాపసానిపాటల మట్టు. పా.

కవిసార్వభౌమునకుఁ గనకాభిషేక మై
భవము గూర్చిననాఁటి ప్రభుల దాలతు కొసరి. పా.

అనుఁగుజెలి కృష్ణరాయలు మున్న తలలుటకుఁ
బనవు పెద్దనకంటి కనికరపు టూటలను. పా.

కలనఁ దలపడి మలఁకబలము లలమిననాఁడు
కలఁచి నలిచిన తెలుఁగుగడ్డబీరము మెఱయఁ. బా.

కరినాఁడు రేనాఁడు తిరిగి శ్రీనాథుఁ డా
సిరిగుట్ట మల్లయ్య సరస నెఱపిన సుద్ది. పా.

పొలికలనిఁ గాఁపుబిడ్డల బొబ్బరింతలకుఁ
గలఁగు పగతుర గుండెగతివెంట లయవేసి. పా.

చెమరుజల్లుల మెఱకచేలఁ బండినపంట
గమిచి పంచెడు పాలికాఁపుచూపుల తనివిఁ. బా.

వైరిలోకము నిలువునీరుగా నుగ్రుఁడై
నారసింహారెడ్డి నాట్యమాడిన దరువు. బా.

గొడ్డుకఱవులకుఁ గేలొడ్డి యడ్డిన దొడ్డ
బుడ్డవెంకళరెడ్డి పురిటింటి ముచ్చట్లు. పా.

సిరిగొండ౧ నోబుళము౨ నిరవులుగ ఘాటీల
కిరుదెసలఁ బహరాలఁ బఱపు దొరలకు మ్రొక్కి. పా.

---

౧. శ్రీశైలము ; ౨. అహోబిలము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. రామేశ్వర దేవాలయము



౨. శివరాత్రి ఉత్సవము, రామేశ్వరము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. చొయికార్ణ మంటపము, లోపలిభాగము
(రామేశ్వరము)

G. S. A.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వలసరాజ్యములందు భారతీయశిల్పకళ




## ౨. చంపాదేశము

ఇప్పుడు "అన్నాము" అని పిలువబడుచున్న ప్రదేశము పూర్వము "చంపా" యను హిందూరాజ్యమైయుండెను. పసిఫిక్కు మహాసముద్రమున కంటిపెట్టుకొని యున్న యీదేశము పర్వతమయమయ్యు అనేకములగు చిన్ననదులు ప్రవహించుటచే ఫలవంతమై వాసయోగ్యమని హిందూనావికుల దృష్టి నాకర్షించినది. భూమిమీద ప్రయాణము చేసి కాంబోడియాప్రాంతములనుండి యీ దేశమునకు చేరుట పూర్వకాలమున సులభము కాకుండెనుకనుక పడవలమీద రాకపోకలు జరిగియుండవలెను. ఆంధ్ర, కళింగ దేశములనుండి జావాప్రాంతములకు నావలమీద భారతీయులు పోవుచుండుటచే సయ్యాము, కాంభోజము మొదలగు దగ్గర దేశములకంటె ఈదూరదేశమున మొదట మనవారు రాజ్యమును స్థాపించుట కలిగెను. ఈదేశమున వరిధాన్యము, చెరకు, మిరియము, తమలపాకులు, దూది, మొక్కజొన్న, ఆముదము, వంకాయలు, అరటి, చింత, మామిడి, పనస, నిమ్మ, దానిమ్మ, కమల మొదలగునవన్నియు పండునుకనుక భారతీయులు కాపురమేర్పరచుకొనుట కనుకూలముగ నుండెను.

చంపాప్రజలు ఇండో - ఆస్ట్రోనీసియను (Indo-Austronesian) జాతివారు. "చాములు", "అనాగరికులు" అను రెండు తెగ లిచ్చట గలరు. అనాగరికులను చాములు "మ్లేచ్ఛులు", "కిరాతులు" అని పిలచెదరు.

చంపాదేశములో హిందూ శిల్పకళ యొక్క వ్యాప్తిని బోధపరచుకొనుట కాదేశముయొక్క చరిత్రను కొంత తెలిసికొనుట యవసరము. ఆదూరదేశములందు మనవారెట్టి రాజ్యములను పాలించి, యెటుల హిందూనాగరికత యొక్క గౌరవమును వ్యాప్తముజేసిరో తెలిసికొనుటకు ఈ చరిత్ర సహాయపడగలదు.

అచ్చట నొకకథ ప్రచారమున గలదు. "పూర్వము డ్యాన్ ఘీమ్ (Dien-ghiem) అను రాజ్యమునకు దశాననుడనురాజుండెను. ఈరాజ్యమున కుత్తరమున నుండిన


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హో టోన్ టిన్హ్ (Ho Ton Tinh) రాజ్యమునకు దశరథుడు రాజు. దశరథుని కుమారునకు చంస్ట్ర అను' సుందరమైన భార్య యుండెను. దశానను డీమెను మోహించి హోటోన్‌టిన్హ్‌ను జయించి యామెనెత్తుకు పోయెను. దశరథుని కుమారుడు వానర సైన్యసహాయమున పర్వతములతో సముద్రమునకు వంతెన గట్టి, దశానను నోడించి, చంపి, తనభార్యను మరల తెచ్చుకొనెను. చంపాదేశీయు లీహోటోన్‌టిన్హ్ ప్రజల సంతతివారు." రామాయణ మీదేశమున నిటుల మారినది.

క్రీ. పూ. మూడవశతాబ్దమున నీదేశము ... పాలనమునకు లోబడియుండె నని చైనాదేశపు చరిత్రమువలన తెలియుచున్నది. కాని చంపావా రూరకొనలేదు ; చైనాప్రభుత్వముపై తిరుగబడుచునేయుండిరి. తుదకు సుమారు క్రీ. త. ౧౦౦-వ సంవత్సరమున చైనాయాధిపత్యమునుండి విముక్తు లైరి. అప్పటి కెవ రీదేశమును పాలించుచుండిరో తెలియదుకాని క్రీ. త. రెండవ శతాబ్దమున శ్రీమారునివంశమువారు రాజ్యాధిపత్యమును వహించియుండి రని "వోకాన్హ"వద్ద లభించిన శిలాశాసనము * వలన తెలియుచున్నది. ఈశ్వరభగవాను డురోజుడనురాజు నీదేశమును పాలించుటకు బంపెననియు, విచిత్రసాగరుడనురాజు ద్వాపర ౫౯౧౧-వ సంవత్సరము (అనగా క్రీ. పూ. ౧,౭౭౯,౩౭౨-వ సంవత్సరము)న నిచ్చట పాలించెననియు కొన్ని శిలాశాసనములవలన దెలియుచున్నది. క్రీ. త. రెండవ శతాబ్దమునకు పూర్వమే హిందూరాజు లీదేశమును పాలించుచుండుట కడుసంభవమని యీశాసనములు సూచించుచున్నవి.

క్రీ. త. 33౬-వ సంవత్సరములో చంపాసైన్యాధిపతి రాజ్యమును చేత జిక్కించుకొనెను. ఈతని సంతతివా డగు ధర్మమహారాజశ్రీ భద్రవర్మడు రాజ్యమును సురక్షితముగ నుంచియు, మహా నగరములను, దేవాలయములను నిర్మించియు పేరుగాంచెను. ఈతడు మహాపండితుడు; నాలుగు వేదములను బాగుగ జదివినవాడు. తదనంతరము దేశమరాచకమగుటచే నీతని కుమారుడు రాజ్యమునువిడచి గంగానదీతీర ప్రాంతములకు వచ్చెనట. తరువాత చైనాతో ననేకములగు యుద్ధములు జరిగెను. తుదకు క్రీ. త. ౪౨౯ లో విజయవర్మ డను రాజు చనిపోగా గంగరా జనునృపుని దూరపు సంతతివాడగు శ్రీరుద్రవర్మడు రాజ్యమునకు వచ్చి గంగరాజవంశమునకు తొలిరాజయ్యెను. ఈతని కుమారుడగు శంభువర్మని కాలమున చైనాతో మరల యుద్ధములు జరుగుటచే చంపారాజ్య మతి బలహీనమైనది. ౬౭౭-వ సంవత్సరమున ప్రకాశధర్మ విక్రాం

* ఈశాసన మేనాటిదో చెప్పుటకు నిశ్చయమైన నిదర్శనములు లేవు. కాని పండితులు పరీక్షించి క్రీ. త. రెండవశతాబ్దమునాటిదో, మూడవశతాబ్దమునాటిదో యని నిర్ణయించిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తవర్మ్మడు సింహాసనము నధిష్ఠించి మరల చంపాయొక్క గౌరవమర్యాదలను పెంపు చేయగలిగెను. ౭౫౭ లో పాలించిన రెండవ రుద్రవర్మ్మని కాలములో నీ వంశ మంత మొందినది.

నూతనముగ రాజ్యాధిపత్యమునకు వచ్చిన పాండురంగవంశమునకు మూల పురుషుడు పృథివీంద్రవర్మ్మడు. ఈ కాలమున జావాతో యుద్ధములు జరుగుచుండెను. ఇంద్రవర్మ్మ డనురాజు నూతనముగ దేవాలయములను నిర్మించి, ప్రాతవాటికి ధన మొసంగెను. హరివర్మ్మడు భగవతి విగ్రహమునకు పునఃప్రతిష్ఠాపనము గావించి, కొన్ని దేవాలయములను గట్టించెను. మూడవ విక్రాంతవర్మ్మడు సంతానహీనుడై క్రీ. శ. ౮౭౦-వ సంవత్సరమున మరణించుటచే నీ వంశము తుదముట్టినది.

ఆపిమ్మట చంపా నేలిన భృగువంశమునకు మొదటిరాజు ఇంద్రవర్మ్మడు. రెండవ ఇంద్రవర్మ్మడు (ఇంద్రవర్మమహారాజాధిరాజు) హిందూదేవాలయములకు ధన మొసంగియు, బౌద్ధాలయములను, విహారములను నిర్మించియు నీ వంశమునకు కీర్తి దెచ్చెను. మూడవ ఇంద్రవర్మ్మని కాలమున (౯౧౧-౯౭౨) కాంభోజముతో యుద్ధము సంభవించుటయు, భృగువంశ మంత మొందుటయు జరిగినది.

ఉత్తరమున ప్రబలమైయుండిన అన్నామురాజ్యములో యుద్ధములు జరుగుటచే చంపారాజ్య మతి బలహీన మయినది. సుమారు ౧౦౫౦ లో రాజ్యమునకు వచ్చిన జయపరమేశ్వరుడు దేశమున శాంతి నెలకొల్పుట కనేకవిధముల పాటుపడెను. చంపాయందలి దక్షిణభాగమగు పాండురంగము యొక్క ప్రజల తిరుగుబాటు నణచెను. కాంభోజరాజును జయించి పశ్చిమమునుండి కలుగనున్న యపాయమును తొలగించెను. చైనా, అన్నామురాజ్యములకు మిత్రు డయ్యెను. పాడువడిన దేవాలయములను బాగుచేయించెను. తరువాతివా రన్నాముతో యుద్ధములను చేసి రాజ్యమును గోల్పోవుటచే నీతని శ్రమయొక్క ఫలితములు కొంతకాలమైనను నిలువలేదు.

కాని పదిసంవత్సరములలోనే శ్రీహరివర్మదేవ సింహాసనము నధిష్ఠించి, క్రొత్తవంశమును స్థాపించి, అన్నాముకాంభోజముల సేనల నోడించి, చంపాకు మరల స్వరాజ్యమును చేకూర్పగలిగెను. ఈతని రాజనీతి యొక్క మేలును తరువాత రాజ్యము నేలినవారు గ్రహింపక అన్నాముతో మరల కలహములను బెంచుకొనిరి. ఐదవ హరివర్మ్మడు (౧౧౧3 - ౧౧౨౯) శాంతిని ప్రతిష్ఠించి చంపాకు రానున్న దుర్గతిని తప్పించెను. నాల్గవ హరివర్మ్మడు కాంభోజముతో గలసి అన్నాముపై దండెత్తి యోడిపోవుటయేకాక కాంభోజనృపునకుకూడ లొంగవలసివచ్చెను. ఆరవ జయహరివర్మ్మడు కాంభోజమున కోడి అన్నాముకు పలాయితుడై యాదేశపు ప్రభు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వుల సహాయమున తన శత్రువుల నోడించి, రాజ్యమునందు శాంతి నెలకొల్పి, చైనాతో మైత్రిజేసుకొనెను. ఈతడును, కాంభోజులను మరల నోడించిన ఏడవ జయఇంద్రవర్మ్మడును (౧౧౬౩ - ౧౧౮౦) చాలా క్రొత్తదేవాలయములను నిర్మించిరి.

ఎనిమిదవ జయఇంద్రవర్మ్మని కాలమున కాంభోజనృపుడు శ్రీవిద్యానందు డనువానిని చంపాపైకి బంపి యాదేశమును లోబరచుకొనెను. కాని యీరెండుదేశముల కలహముల కంతులేకపోయినది. కాంభోజమునకు అన్నాముతోను, చైనాతోను యుద్ధములు సంభవించుటచే చంపాదేశమును వీరు విడచిపోవలసివచ్చినది. కనుక జయపరమేశ్వరవర్మదేవుని (౧౨౨౨-౧౨౪౦) కాలమున మరః శాంతి నెలకొనినది.

ఆసియా నంతను కంపింపజేసిన జెంఘిస్ ఖానుసంతతివాడగు కుబ్లైఖాను చంపారాజు తనరాజధానికి రాలే దనునెపమున నొకసైన్యమును పంపెనుకాని తుద కారాజ్యమును వశముచేసుకొనజాలకపోయెను. ఆ కొలదికాలముననే అన్నాముదాజులు చంపాను వశముచేసుకొనిరి. అన్నాముప్రభువుచే నియమింపబడిన చంపారాజు అన్నాముపైనే తిరుగుబాటుచేయుటచే మరికొంతకాల మీరెండుదేశములకు యుద్ధములు జరిగినవి. తుదకు ౧౭౪౩-వ సంవత్సరమున చంపారాజ్య మన్నాముకు పూర్తిగ వశమయిపోయినది. భారతీయు లాపరదేశములందు ప్రారంభించిన యీచరిత్ర మింతటితో నంతమొందినది.

చంపాప్రజలు హిందూరాజుల పాలనముక్రింద హిందూవిజ్ఞానమువలన మేలును పొంది హిందూతత్వమును తమ హృదయములందు ప్రతిష్ఠించుకొనిరి. దేశముయొక్క పరిపాలన మంతయు హిందూ ఆచారముల ననుసరించియే జరుగుచుండినది. మనుధర్మశాస్త్రమును ప్రమాణముగ గొని రాజులు న్యాయము నొసంగుచుండిరి. హిందూదేశమునుండి వెళ్లినవారు బ్రాహ్మణ క్షత్రియు లనియు, ఆదినుండియు నచ్చట నుండినవారు వైశ్య, శూద్రు లనియు వృత్తులనుబట్టి పిలువబడుచుండిరి. బ్రాహ్మణ క్షత్రియజాతులకు వివాహసంపర్కముండినటులను, ఈ సంకరవివాహములవలన బుట్టినవారు "బ్రహ్మక్షత్రియు"లని పిలువబడినటులను చెప్పుటకు నిదర్శనములు కానవచ్చుచున్నవి. ఈ రెండు జాతులవారును మిగుల గౌరవింపబడుచుండిరి.

అలంకారములందును, వస్త్రధారణమునందును ఇచ్చటి ప్రజలు హిందూ ఆచారముల ననుసరించినటుల కనబడును. చంపాదేవాలయములమీది ప్రతిమ లిందులకు నిదర్శమని కొందరు చరిత్రపరిశోధకులు చెప్పుటకలదు. చంపారాజులు హిందూదేవాలయ శిల్ప నిర్మాణ విధానము ననుకరించుటచే భారతదేశమున గానబడిన చిత్రముల వంటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వియే యచ్చటను శిల్పులు మలచుట కడు సంభవము. రానురాను శిల్పవిధానమునం



చిత్రము ౧

దును, నిర్మాణమునందును కొంత మార్పు కలిగినను, పురాతన హిందూశిల్పరచన యొక్క సంప్రదాయములను చంపాశిల్పులు వీడలేదు. హిందూదేశమందు సాంఘికాచారములు మారినను దేవాలయముల శిల్ప విగ్రహములు పూర్వము వలెనే నిర్మితములగుచున్నవి. ఈకారణములవలన చంపాశిల్ప



చిత్రము ౨

విగ్రహము లాదేశాచారములను సూచింపజేయుచున్న వని చెప్పుట సమంజసము కాదు.

వేదములు, వేదాంతము, పురాణములు, సంస్కృతవ్యాకరణము, జ్యోతిషము, ధర్మశాస్త్రములు, కావ్యములు మొదలగున వన్నియు నిచ్చటను విశేషముగ జదువబడు చుండెను. హిందూదేశమునందలి దైనిక జీవనమునకును, చంపాయందలి శిష్టుల దైనికజీవనమునకును భేద మేమియు లేకుం డెను; ఉండినను అది చాల యల్పము.

హిందూమతమును స్వీకరించిన యీ దేశపు ప్రజలలోను, భారతదేశమునుండి వెళ్లి, యచ్చట నివాసమేర్పరచుకొనినవారిలోను అధికాంశము శైవులు. అచ్చటి శైవదేవాలయముల సంఖ్యయు, రాజుల పేరులును దీనికి ప్రబలమైన నిదర్శనములు. శివలింగము లనేకములు నిర్మింపబడినవి. శివుడు మనుష్యాకారముగ వేదికమీదను, తామరపుష్పమీదను నిలువబడినటుల ననేక స్థలముల గలదు. ఆరు, ఇరువదినాలుగు, ఇరువదియెనిమిది చేతులతోనుగూడ శంభుని విగ్రహములను మలచిరి. వాస్తములందు పద్మము, అక్షమాల, త్రిశూలము, బల్లెము, అమ్ము, కలము, కొమ్ము, అంకుశము మొదలగునవి కానవచ్చును. ఒకవిగ్రహమున తలపై ఆభరణములలో “ఓం” అను దేవనాగరి అక్షరములును గలవు. అర్ధనారీశ్వర విగ్రహము లచ్చటచ్చట ప్రతిష్ఠింపబడినవి.

శక్తిపూజయు విశేషముగ జరుగు చుండెను. కౌతేశ్వరమునందు భగవతి కౌతేశ్వరిపేర పెద్దదేవాలయము కలదు. ఉమ, గౌరి, భగవతి, మహాభగవతి, దేవి, మహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవి, మాతృలింగేశ్వరి, భూమిశ్వరి అను పేరులతో నీమె పూజింపబడుచుండెను. కుమారస్వామి, వినాయకుడు ఆరాధింపబడు చుండిరి.

విష్ణు, లక్ష్మి, గరుడులకును దేవాల యము లుండెనుకాని శైవులకుండిన పలుకు బడి వైష్ణవులకు లేకుండెను. పండ్రెండవశతా బ్దమునాటినుండియు శివారాధన తగ్గినటు లను, విష్ణువుయొక్క యారాధన హెచ్చిన టులను ఆకాలమున నిర్మింపబడిన దేవాల యముల సంఖ్యవలన దెలియుచున్నది.

హిందూదేశమునందువలె గాక కాంభో జము, చంపా మొదలగు దేశములందు బ్రహ్మ పూజకు పాత్రు డయ్యెను. పదమూడవ శతా బ్దమున "స్వయముత్పన్న" మను పేర బ్రహ్మకు జయపరమేశ్వరవర్మడు పాండురంగ మున దేవాలయమును గట్టించి యనేకము లగు కానుకల నిచ్చెను.

ఏ దేవాలయమును గట్టినను భారత దేశమునందువలెనే తక్కిన వేల్పుల విగ్రహ ములును గోడలపై నమర్చుట చంపాయందు నాచారమై యుండెను. ఇంద్రుడు, యముడు, చంద్రుడు, సూర్యుడు, కుబేరుడు, అగ్ని, వా సుకి, సరస్వతి మొదలగు వేల్పు లంద రిటుల మన్ననలను బడసిరి.

బౌద్ధమత మొక్కటియే ప్రచారము గాంచుచుండె ననియు; హిందూమతప్రచా రము సంప్రదాయమునకు విరుద్ధమనియు తల చుట పొరపాటు. హిందువులును తమ మత ము నితరులకు నేర్పి, తమలో గలపుకొను చుండిరని యీ దేశముయొక్క చరిత్రము వలన మనకు విశదమగుచున్నది. ఆంధ్ర దేశమునందు హిందూరాజులు బౌద్ధమత వ్యాప్తికి ప్రతిబంధకములను గల్పింపకపోవు టయేకాక తోడ్పడుచుండినటుల చరిత్రవలన తెలియుచున్నది. ఈ ప్రాంతములనుండి వెడలి వెళ్లిన చంపాహిందువులు బౌద్ధమతము ననేకరీతుల నాదరించుచుండిరి. బుద్ధుని యారాధనకొరకు దేవాలయములను, భిక్షుక సంఘములకొరకు విహారములను చంపా రాజులును, ప్రజలును నిర్మించుచుండిరి. బుద్ధుని, బోధిసత్త్వుల విగ్రహము లచ్చ టచ్చట దొరకినవి. స్తూపములు చంపా యందు నిర్మితములైనవని చైనాగ్రంథము లందు గలదు. కాని యిప్పుడు వాటి చిహ్న ములుకూడ తెలియుటలేదు.

భారతదేశమునం దాకాలమున నామో దమునుబడసిన శిల్పరచనావిధానమును వారు భక్తితో తమ నూతనదేశమున బ్రవేశపెట్టి యనేకములగు చక్కని నిర్మాణములకు కర్త లైరి. రానురా నీశైలియందు కొన్ని మార్పులు కలుగుటచే భారతీయశిల్పరచనా విధానమునకు నూతనమైన సొంపుకలిగినది. హిందూరాజ్య మచ్చట నంతమొందిన పిమ్మట నీనిర్మాణములలో ననేకములు నాశనమై కాలగర్భమున లీనమైనను ఆదేశపు పూర్వపు ఘనతను జూపుటకు మిగిలినవియే చాలును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇచ్చటి దేవాలయములలో ననేకము లిటుకలతోను, కొన్ని కర్రతోను గట్టబడినవి. బలముగ నుండుటకు, అలంకారార్థము ద్వారబంధములకును, చూరునకును రాతి ఫలకములను వాడుచుండిరి. మన దేశాచారము ననుసరించి యించుమించుగ నన్ని దేవాలయములు నెత్తైన ప్రదేశములపై తూర్పుముఖముగ గట్టబడినవి. ఒక గర్భగుడి, దాని కంటె తూర్పున నొకమందిరము, కొంతదూరమున (నిదియు తూర్పున) గోపురమును, గోపురము చెంత మంటపమును, ఒకటిరెండు గదులును కలసియుండును. గర్భగుడియందు స్నానద్రోణిపై మధ్యను విగ్రహము ప్రతిష్ఠితమైయుండును. ఆప్రక్కను జలము పైకి పోవుట కొక సోమసూత్రముండును. గర్భగుడియొక్క యాకారము చదరము.

కాంభోజము, జావాలందువలె గాక నిచ్చటి దేవాలయములలో నించుమించుగ నన్నియు నేకశిఖరనిర్మాణములుగ నున్నవి. గర్భగుడిమీద నంతస్తుపై నంతస్తును, మీదికి వెళ్లినకొలది యంతస్తులు చిన్నవిగను, చివరకు ఆమలకాకారమును ఉన్నటుల గలవు. ఇట్టి నిర్మాణములు ఆంధ్రద్రవిడదేశములందు గాననగును. రెండంతస్తులుగ నున్న శిఖరములలో మీదియంతస్తు పొడవుగ, వలయాకారముగ నుండును. ఇవికాక భువనేశ్వర దేవాలయశిఖరమువలె గుండ్రముగ నున్నవియు నిచ్చట గలవు.



చిత్రము 3

దేవాలయ నిర్మాణములందు చంపా దేశీయులు హైందవశిల్పరచనను ప్రేమతో బోషించిరనుట స్పష్టమైనను చంపా చరిత్రమున మహాపండితు లని ఖ్యాతి గాంచిన పార్మెంటియరు (H. Parmentier) గారు కూడ నివి చంపాయందుబుట్టిన విధానమునో లేక బౌద్ధనిర్మాణవిధానమునో యనుసరించి యున్నవని చెప్పుట వింతగ నున్నది. అంతస్తుల శిఖరములు మహాబలిపురము, కంచి, బాదామిలయందలి శిఖరములనుపోలియున్నవి. భారతీయశిల్పచరిత్రమునందు ప్రసిద్ధిపొందిన అర్జునరథము, ధర్మరాజరథములతో చంపా దేవాలయములను సరిపోల్చి చూచినయెడల నీవిషయమై అనుమాన మెటుల గలుగునో బోధపడకయున్నది. హిందువు లనాగరికు లనుభావముతో చదువు ప్రారంభించిన పాశ్చాత్యచరిత్రకారు లందరు నిట్టి తప్పు అభిప్రాయములను వెలిబుచ్చుట యొక పరిపాటియయినది.

చంపాయందలి దేవాలయములలో మైసానువద్ద నున్నవి సుప్రసిద్ధములు. ఒకటవ భద్రవర్ముడు నాల్గవ శతాబ్దమున నీ పట్టణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును నిర్మించి, యందు భద్రేశ్వరలింగమును ప్రతిష్ఠింపజేసెను. మైసా నొక లోయయందు గలదు. ఇరువైపుల మైలుదూరమున పర్వతములును, మధ్య నొక నదియు నుండుటచే నాప్రదేశ మతిరమ్యముగ నుండును. రానురా నీనగరము ప్రాముఖ్యము వహించుటచే నిచ్చట ననేకదేవాలయములు నిర్మింపబడినవి. పట్టణము కాలిపోవుటచే నిప్పటికిని నిలచియున్న భద్రేశ్వరాలయమును ఆరేడు శతాబ్దములలో శంభువర్ముడు కట్టించెను. ఏడవశతాబ్దములో ప్రకాశధర్ముడును, పదునొకండవ శతాబ్దములో హరివర్ముడును, పండ్రెండవ శతాబ్దములో జయహరివర్మడును ఈ నగరమున క్రొత్తగ ఆలయములను

శంభభద్రేశ్వరాలయము మూ డంతస్తుల శిఖరము కలది. దిగువభాగమున చెక్కడపు పని నిడివిగ నుండుటచే ఎత్తుగను, సుందరముగను కనబడును. మీది యంతస్తులు నిట్టివియే కాని పొట్టిగ నమరియున్నవి. చివర పద్మాకారము కలదు. గోపురమునకు రెండు వైపులను మెట్లు కలవు. ఆయావరణములోనే యున్న నాలుగు చిన్నయాలయము లాతరువాత గట్టబడినటుల గానవచ్చుచున్నవి. కృత్రిమద్వారము లతిసుందరముగ నలంకరింపబడియున్నవి. ప్రధానదేవాలయముచుట్టు నంటి యారు దేవాలయాకారము లుండుటచే నన్నియు గలసి చక్కని శిల్పకూటముగ గానవచ్చును. గోడలమీది శిల్పాలంకారములలో మకరతోరణములు, హంసలు, అప్సరసలు, జంతువులు కలవు. లోపలిభాగమున నెట్టియలంకారములును లేవు. ఈ యాలయమున నుండిన శివలింగము చంపారాజుల గృహదేవత మైయుండుటచే నాన్నృపు లనేకములగు కానుకల నొసగుచుండిరి. పదునొకండవ శతాబ్దమున నిది శ్రీశానభద్రేశ్వరాలయమనుపేర బిలువబడుచుండినటుల గానవచ్చుచున్నది. శిఖరము వెండితోను, బంగారముతోను అలంకరింపబడినటుల శాసనముల వలన దెలియుచున్నది. ఒకానొకప్పుడు విగ్రహముల నలంకరించుటకు రత్నాలంకారములుండినవట. దేవదాసీలు, గాయకులు, ఏనుగులు, పశువులు నీదేవాలయపు సేవ కర్పింపబడినవి.

ఆచెంతనే కల మరియొక దేవాలయావరణమున కంటి యేడు చిన్న ఆలయములు కలవు. ఇచ్చటి స్తంభము లతిసుందరములైనవి.

ఇవికాక మైసానునం దేడు దేవాలయకూటములు కలవు. వీటిలో కొన్ని యతిసుందర మైనవైనను శిథిలమై రూపుచెడియున్నవి. వీటి శిఖరనిర్మాణములందలి భేదములనుబట్టి యొకేకాలమునకు జెందినవి కావని చెప్పవచ్చును.

ఇచ్చట దొరకిన శిల్పరాజములలో ననేకములు టూరేన్ప్రదర్శనశాలయందు భద్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరుపబడినవి. బ్రహ్మ, సూర్య, ఇంద్ర, స్కంద, గణేశవిగ్రహము లిచ్చట కానగును.

శంభుభద్రేశ్వరలింగమును శివుడు భృగున కిచ్చెననియు, భృగు డురోజున (ఈతడు చంపారాజులకు మూలపురుషుడని చెప్పుకొనుచుండిరి.) కిచ్చెననియు, దేవదారుమాహాత్మ్యమునందు జేర్కొనబడిన హాటకేశ్వర లింగ మిదియే యనియు ౮౭౫-వ సంవత్సరమున జయఇంద్రవర్మునిచే రచింపబడిన శాసనమున గలదు.

ఈనృపుడే సుమారు ౯౦౦-వ సంవత్సరమున చంపాకు ముఖ్యనగరముగ నుండిన ఇంద్రపురము (ఇప్పటి దొంగుడు అంగు) వద్ద లోకేశ్వరుని ప్రతిష్ఠించుట కొక మహాబౌద్ధాలయమును నిర్మింపజేసెను. ఈతడు చనిపోయినతరువాత నీతనిభార్యయైన హరదేవి రాజకులవేల్పుల విగ్రహముల ననేకములను ప్రతిష్ఠింపజేసెను. బహుశః యీ రాజు బౌద్ధుడై యుండవచ్చును.

ఈ మహాదేవాలయము కల యావరణము చతుష్కోణమై మూడుభాగములుగ విభజింపబడియున్నది. ఒకభాగమున ప్రధానాలయము కలదు. దాని కంటియే మరి నాలుగు చిన్నయాలయము లుండుటచే నన్నియు గలసి సుందరముగ గానవచ్చుచున్నవి. దేవాలయమున కెదుట నొక పెద్ద భవనము కలదు. ఇచ్చట రెండు చిన్న దేవాలయములును, జననివాసమున కనుకూలములగు గృహములును కలవు. ఈభాగమునకు తూర్పున నొకద్వారము కలదు. రెండవభాగమున నొక పొడుగైన గదిమాత్రము కలదు. మూడవభాగమున నొక పెద్ద యంగణము కలదు. ఈచదరమున కంటియే పాడువడి యున్న కొన్ని చిన్నదేవాలయములును, గృహములును కానవచ్చుచున్నవి. పెద్దజలాశయ మొకటి యుండెననుటకు నిదర్శనములు కానవచ్చుచున్నవి. ద్వారములును, కృత్రిమ ద్వారములును, దేవాలయమునకెక్కుటకు మెట్ల కిరువైపుల చక్కగ మలచబడిన విగ్రహములును మనోహరములుగ నున్నవి. ప్రధానాలయమున కెదుట నిరువైపుల రెండు పొడుగైన గుండ్రని స్తంభములు కలవు. ఇవి చాల సుందరముగ నుండుటయే కాక దేవాలయ దృశ్యమునకు సొంపును గూర్చుచున్నవి.



చిత్రము ౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైసోను దేవాలయమువలెగాక నీభవనము లన్నియు నొకేయాలోచనపై నొకే కాలమున గట్టబడినటుల నున్నవి.

ఇచ్చట లభించిన కంచుబుద్ధవిగ్రహము సుందరమై అమరావతి, అనురాధపురము లందుగల విగ్రహములను బోలియున్నది. ఇది 3-వ లేక ౪-వ శతాబ్దములో ఆంధ్రదేశమునందో, సింహళమునందో నిర్మితమై తుదకు చంపా చేరియుండవచ్చును.

ఇచ్చటి ధనమును దోచుకొనుటకు అన్నాముసైనికులు దేవాలయమును పాడుచేసియుందురని చరిత్రకారుల యూహ. ఆనాటికే చంపారాజ్యము బలహీనమగుటచేతను, అచ్చటి హైందవకళౌన్నత్యము తుదముట్టుటచేతను నాటినుండియు నేటివరకు నీమహానిర్మాణము పాడువడియేయున్నది.

చంపాదక్షిణభాగమైన పాండురంగమునందు పోనగరమువద్ద నొక చక్కని ప్రాచీనాలయము కలదు. ఇది ద్వాపర ౫,౯౧౧-వ సంవత్సరమున విచిత్రసాగరునిచే నిర్మింపబడినదని శాసనములందు గలదు. ఈ దేవాలయ మతిప్రాచీనమగుట నిశ్చయము. దీనిని కొందరు మూర్ఖులు ౭౭౪-వ సంవత్సరమున కాల్చివేయుటచే పదిసంవత్సరములతరువాత సత్యవర్మ డనురాజు మరల నిర్మించి సత్యముఖలింగమనుపేర నొక శివలింగమును ప్రతిష్ఠించెను. ౧౨-వ శతాబ్దమువరకు నీలింగము శాసనములందు పేర్కొనబడినదికాని యిప్పుడందు భగవతివిగ్రహము కానవచ్చుచున్నది. ఈయాలయము మైసోనునందుగల శంభుభద్రేశ్వరాలయమంతటి ప్రాముఖ్యము నెన్నడును పొందలేదు.

ఇచ్చటి దేవాలయము లన్నియు సముద్రతీరమున నొకలోయవద్ద నిర్మింపబడినవి. ప్రధానాలయమైన భగవదాలయము మైసోను దేవాలయములవలె శిఖరనిర్మాణమునందు మహాబలిపురము, ఆంధ్రదేశముల దేవాలయములను పోలియున్నది. ఆలయము వెనుకభాగమునను, ఇరువైపులను కృత్రిమ ద్వారములపై రావియాకుల యాకారము లొకదానిపై నొకటి కలవు. వాటి దిగువ రెండు స్తంభాకారముల మధ్య మానవవిగ్రహము కలదు. ప్రాచీననిర్మాణాచారము ననుసరించి యాపత్రాకారములు శిఖరముపైగల ప్రతియంతస్తునను కలవు. ఈ యాలయమును పోలిన దొకటి చిన్నదీ దాని నంటియే తూర్పున గలదు.

ఈచెంతనే కల మరికొన్ని యాలయముల శిఖరములు భువనేశ్వరాలయమును పోలియున్నవి. కొన్ని శిథిలములగుటచే స్తంభములు, గోడలుమాత్ర మిప్పుడు మిగిలియున్నవి.

రానురాను అన్నాముదేశీయుల దండయాత్రలవలనను, కాంభోజముతో సంభవించిన యుద్ధములవలనను చంపారాజ్యము యొక్క సుస్థిరతకు భంగము కలిగినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నామసైనికులును, జావానావికులును పాడుచేసిన నిర్మాణములను బాగుచేయించుటకు కాని, క్రొత్తగ పెద్దవాటిని నిర్మించుటకుకాని అవకాశములు, ఉత్సాహము లేకపోయినవి. క్రొత్తగ నిర్మింపబడిన నచ్చటచ్చట నున్నను, అవి పెద్దవిగ లేవు; శిల్పమునందును కుంటువడియున్నవి.

పోహైవద్ద నొకకొండపై మూడాలయములు కలవు. శిఖరముల మూడంతస్తుల యొక్క నాలుగుమూలలందును తక్కిన దేవాలయములందును కానవచ్చు చిన్న సుందరమైన యలంకారము లిచ్చట లేవు. నిర్మాణములు చెడియుండుటచే నింకెట్టిమార్పులు ప్రవేశపెట్టబడినవో చెప్పుటకు వీలులేదు. కాంభోజదేవాలయముల ద్వారములను పోలునవి వీటికి కలవు.

పోడేమువద్ద ఆరు దేవాలయములుకలవు. ఇందు ముఖ్యమైనది సుందరశిల్పాలంకృతము. ఒకయాలయముయొక్క శిఖరము బోరొబుదరునందు కానవచ్చుదానివలె నున్నది.

పోరోమువద్ద కనబడు దేవాలయములు పదునేడవశతాబ్దమున నిర్మింపబడినవి. ఇందు శిల్పాలంకారములు తక్కువ.

"పొక్లఅనుగరై" వద్ద ఎత్తయిన ప్రదేశమున ఆరుదేవాలయములు కలవు. ఇందు సింహాలింగేశ్వరాలయము మూడవసింహవర్మనిచే గట్టబడినది. కొందరు చాము లిప్పటికి నిచ్చట పూజజేయుచుందురు. ఈ యాలయ మతిసుందరముగ నున్నది.

హోలై, హాంగ్త్రాన్హ, డు అంగు లాంగు, బిన్హ్లాము, కుఅంగుమి, బేంగుఅను, యాన్ ప్రోను అనుగ్రామములవద్ద కొన్ని పాడువడిన ఆలయములు కలవు.

అన్ని విషయములందును తమ తొలి దేశపు సోదరుల ననుకరించిన చంపా హిందువులు నివాసమునకును, పూజకొరకును పెద్ద శిలలందు గుహలనుగూడ నిర్మించిరి.

ఫుడుఅక్కు అనుచోట నొక కందరము కలదు. దీనిలోనుండి పోవుట కొక వలయాకారమైనట్టియు, నొక చతుర్భుజాకారమైనట్టియు గుహలు కలవు. ఈమూటిబైట దక్షిణమున కొక చిన్నగుహ కలదు. ఇచ్చట నొక సన్యాసియుండెనని ప్రతీతి.

హుఅక్యూ అను స్థలమున నొక పెద్ద గదియు, దానికంటి కొన్ని గుహలును కలవు. వీటిమీద కప్పలేదు.

ఫొంగ్న్హావద్దనున్న కందరము లాశ్చర్యజనకములు. ఇరువదిగజముల సొరంగము గుండవెళ్లిన నొక వలయాకారమైన గుహ కానవచ్చును. అచ్చటినుండి మరియొక సొరంగముగుండ నిరువదిగజములు పోయిన యెడల మరియొక గుహ కలదు. దీనినుండి యిరువదిగజముల వెడల్పున త్రోవ యొకటి కలదు. కొంతదూరము (అనగా ప్రవేశము నుండి ౧౩౦౦ గజములు) పోయినచో ౩౭౫



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గజముల పొడుగైన సన్నని సొరంగ మిం కొకటి కలదు. వీటియన్నిటి పొడవు సుమా రొకమైలు కలదు. అంతయు సగమువరకు జలముతో నిండియుండుటచే చిన్నపడవల మీద పోవచ్చును. ఇచ్చట కొన్ని శిల్పా లంకారములును, బుద్ధుని విగ్రహములును కన బడుటచే నిది యొకానొకప్పుడు బుద్ధునియారా ధనమునకు నిర్మింపబడిన దని తోచుచున్నది.

చులహాంగువద్ద నొక చిన్నగుహ యందు బుద్ధవిగ్రహము కలదు.

లేక్సాన్ అనుగ్రామముచెంత నొక బౌద్ధకందరము కలదు. అచ్చటినుండి ౯౦ గజముల భూగర్భమార్గముగుండ పోయి, ట గానవచ్చు చిన్నమార్గముద్వారా ప్రాకి వెళ్లినయెడల నొక గుహ కానవచ్చు ను. దీనినుండి రెండుదారులు మరల గలవు.

రాజులుకాని, ధనికులుకాని యెట్టిభవ నములం దాకాలమున చంపాలో నివసించు చుండిరో చెప్పుటకు మచ్చునకైన సనాతన భవనములు కానరాలేదు. చక్కని యలం కారములతోను, శిల్పములతోను నిండియుం డిన గృహము లచ్చట నిర్మింపబడినవని మాత్రము చైనా గ్రంథములవలన తెలియు చున్నది. శిథిలములైన కోటలు కొన్ని కాన వచ్చుచున్నవి.

శ్రీబానోయి లేబాలచనారు అనుకోట యొక నదీతీరమున గలదు. దీని ప్రాకార మతిబలముగ నున్నది.

తాన్హూహొవద్దనున్న కోట కొకవైపున పర్వతమును, మరియొక వైపున నదియు నుండుటయే కాక బురుజులు, కందరములు మొదలగునవి యుండుటచే శత్రువుల కభే ద్యమై యుండెనని చెప్పవచ్చును. ఇది యం తయు చాలా పెద్దయిటుకలతో గట్టబడినది.

పూర్వము చంపాకు ముఖ్యపట్టణముగ నుండిన విజయవద్ద నొకకోట కలదు. ఇం దతి సుందరములైన శిల్పములు దొరకినవి.

చౌసా, కోలుయి అనుచోట్లను మంచి కోట లుండినవి. అనేకస్థలములం దిట్టి నిర్మా ణముల చిహ్నములు కానవచ్చినవి కాని మిగుల పాడువడియుండుటచే వివరములను దెలిసికొనుట దుస్సాధ్యము.

చంపాయందలి శిల్ప మతిసుందరమైన దైనను, జావా, కాంభోజములందు గాన వచ్చు శిల్పరాజములతో సరిపోల్ప దగినది కాదు. ఇచ్చట లభించిన శిల్పములలో తొలి శతాబ్దములనాటివి హిందూదేశమున నొక చోటజెట్టిన-చో చంపాయంతటి దూరదేశమున మలచబడినవని చెప్పుట సాహసమే యగును. కాని రానురాను ఆదేశపు రచనావిధానము మారి చంపాజాతీయతను వ్యక్తపరచుటకో యనునటుల ప్రత్యేకరూపమును దాల్చినది. ఈభేదము మానవవిగ్రహములందు స్పష్ట ముగ గానవచ్చుచున్నది. ముఖములందు చైనావారి పోలికలు ప్రవేశమైనవి. కొన్ని విగ్రహములు వికారముగగూడ నున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శివుడు నిలువబడియున్నటుల నున్న రెండువిగ్రహములు మైసానువద్ద లభించినవి. శివుని యలంకారములని చెప్పబడునవి యీవిగ్రహములందు విశేషముగ గానరావు.

నెమలిపై స్కందుడు నిలువబడియున్నలటు నొకవిగ్రహము కలదు. చంపాయందు లభించిన విగ్రహములలో నిది సుప్రసిద్ధము. ముఖమున తాండవమాడు ఆనందము, ముచ్చటగూర్చు అంగరచన, వెనుకనున్న నెమలి పురి, ఆభరణములు అన్నియుగలసి యతి సుందరముగ నున్నవి.



చిత్రము ౫

బుద్ధుడు కూర్చొనియున్నటుల నొక విగ్రహము డొంగు డులంగువద్ద లభించినది. దీనిని కొందరు పొగడియున్నారు కాని వారి యభిప్రాయముతో నే నేకీభవింప జాలను. అంగరచన, వస్త్రమునందలి ముడుతలు, ముఖము సహజముగ గాని, సుందరముగ గాని లేవు. శివుని యాభరణాదులతో బుద్ధుని మండనము చేయుటవలన తాంత్రిక బౌద్ధ



చిత్రము ౬

మత మెటుల మారినదో యీ విగ్రహమువలన తెలియగలదు.

లభించిన విగ్రహములలో మచ్చునకివి కొన్ని:

రాజుల, రాణుల విగ్రహములు కొన్ని దొరకినవి; వాటియందు పొనరుంపు (నృప?) శుచిరాణివి కొంచెము బాగుగ నున్నవి.

దేవాలయపు గోడలపైగల విగ్రహములందు పౌరాణికదృశ్యములు, గజసింహాసీనులు, అప్సరసలు మొదలగున వనేకములు సుందరమైనవి కలవు.

ఒకడు వీణవాయించునటుల, మరియొకడు పిల్లనగ్రోవి నూదుచున్నటుల మైసాను దేవాలయకుడ్యమున గలదు. అంగరచన, కళారాధకున కుండవలసిన నిమగ్నత, ఇరువైపుల నున్న స్తంభములు, వాటిపై గల యలంకృతమైన కప్పు చిత్రకారుని నైపుణ్యమును చాటుచున్నవి.

హూ అలై అనుచోట గల ద్వారపాలుర విగ్రహములు చాలా బాగుగ నున్నవి.

మైసానువద్ద నందిపై శివుడు తాండవమాడుచున్నటుల విగ్రహముకలదు. ఈచిత్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముయొక్క మీదిభాగము విరిగిపోయినను శివున కనేకములైన హస్తము లున్నటుల మిగిలినదానివలన గానవచ్చుచున్నది. ఒక వైపున నొకడు నృత్యముచేయుచుండ నిరువురు మురళి, మద్దెలలను వాయించుచున్న టులను, రెండవవైపున నొకవ్యక్తి నమస్కారము చేయుచున్నటులను, ఒకస్త్రీయు, బాలుడును నిలువబడియున్నటులను గలదు. ఇరువైపుల వృక్షములు కలవు. ఆకాశమున మేఘముల మధ్య దేవతలు, అప్సరసలు గలరు.

ఒకచోట శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతము నెత్తునటుల గలదు. పర్వతముపై చెట్లు, వేళ్లు, ఏనులు గలరు. దిగువను గోవులున్నవి.

రాజు పరివారముతో నున్నటుల మరియొక శిల్పచిత్రము కలదు.

అర్ధచిత్రము (Bas-reliefs) లతిసుందరమైన వనేకములు కలవు. వీటియందు కొన్ని జావాచిత్రములను పోలియున్నవి.

తొలిశతాబ్దములందు మలచబడిన శిల్పములలో సింహాము, ఖడ్గమృగము, ఏనుగ, గజసింహాము, మకరము, నాగులు, గరుడుడు, ఎద్దు, గుఱ్ఱము, కోతి, లేడి, హంస, నెమలి మొదలగునవి కానవచ్చుచున్నవి. వీటిలో నధికాంశములు వేల్పుల యానసములుగ నున్నవి. ఇచ్చట ఏనుగుతలకల సింహాము గజసింహామైనది. రానురాను జంతువుల విగ్రహాములు శిల్పమునందు ముఖ్యము లైనవి.

లతలను, పుష్పములను అలంకారములుగ శిల్పమున వినియోగించుటయందు భారతీయచిత్రకారులవలె చంపావారును మించిరి. గోడపైయంచులందును, ద్వారముచుట్టును, చూరులవద్దను వీ రిట్టి యలంకారములను బెట్టి నిర్మాణములకు వింతసొంపును గూర్చిరి. లతల వంకలలో పుష్పములు, పత్రములు అమరియుండుటచే వెలితిలేక మనోహరముగ నున్నవి.

భారతీయశిల్పమునందు కానవచ్చు స్తంభముల రకములకు లెక్కలేదు. ఇన్ని విధముల మలచుట మరియే విధానమునందును గానము. హిందూదేశపు శిల్పుల ఖ్యాతి చిరస్థాయిగ నుండుటకీయొక్క శిల్పాంగమే చాలును. చంపాయందు మనవారు నిర్మించిన స్తంభముల సొంపీచిత్రమున గాననగును. ఇట్టి వాదేశమున నెన్నియో కలవు.




చిత్రము ౯

పోనగరమువద్ద ఎనిమిదవ శతాబ్దము నాటి వెండి పూజాపాత్రలు, బంగారునగలు, ముత్యములును, మైసానువద్ద నొక పాత్రయందు పెద్దవిగ్రహాముయొక్క బంగారు కిరీటము, హారములు, హస్తాభరణములు, వడ్డా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణమును లభించినవి. లోవాంగువద్ద నిట్టి యాభరణము లిప్పటికిని వాడుకయందున్నవి.

చంపాశిల్ప రాజములను చెక్కిన చిత్రకారులను రాజులు భారత దేశమునుండి రప్పించియుండుట నిర్వివాదాంశము. తరువాత నచ్చట బుట్టిన హిందువులు, చంపా యాదిమవాసులు నీవిద్య నభ్యసించి తమ గురువులగు భారతీయుల ననుకరించియుందురు. రానురాను వీరు క్రొత్తమార్పులను బ్రవేశపెట్టుటచే చంపాశిల్పశైలి కొంచెము వేరురూపమును ధాల్పజొచ్చినది.

రాజ్యము పరులచేతుల బడుటవలన భారతీయనాగరికతను, కళలను పోషించువారు లేకపోయిరి. ప్రజ లన్యమతములను స్వీకరించిరి. భారతీయు లితర దేశములందు స్థాపించిన రాజ్యములలో చంపారాజ్యము మొదటిదైనను, అనేకశతాబ్దము లచ్చట హిందువులు పాలించినను, హిందూసంప్రదాయము లిప్పు డచ్చట విశేషముగ వాడుకయందు కానరాకున్నవి. దేవాలయములు పాడువడి, ముక్కలుగ ప్రదర్శనశాలలను చేరుచున్నవి. ఒకప్పుడు భారతీయనాగరికతను వెదచల్లి, హిందూత్వమును పోషించినవారి చరిత్రమును మన మన్యులు చెప్పగా తెలలూపవలసిన కాలము వచ్చినది! కాని చంపా దేశమును పాలించిన యా సనాతనహిందువుల నాదర్శముగ గణించి మనము నేర్చుకొనవలసిన విషయము లనేకములు కలవు.

---



జంట బిచ్చగాండ్రు —సి. జి. జగన్నాథదాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీ అరవిందాశ్రమమువారి యుపదేశము

పుదుచ్చేరిలో తమ ఆశ్రమమును గుఱించి యనేకదురూహలు ప్రబలినట్లు కనబడినందున తన్నివారణార్థము స్పష్టముగా నీ క్రింది ప్రకటన గావించుట అవసర మని శ్రీ అరవిందులు భావించిరి :

ఆశ్రమ మనగా నధ్యాత్మతత్త్వోపదేశకుని, లేక యాచార్యపురుషుని గృహము, లేక గృహములు. తత్త్వోపదేశమునకు, తదభ్యాసమునకు తమ్మాశ్రయించి వచ్చువారిని అనుమతించి తా వాసంగుదురు. ఆశ్రమ మొక సమాజము గాదు, మతసంస్థ గాదు, మఠమును గాదు,—కేవలము పైన బేర్కొనినదే తప్ప తదితర మేమియు గాదు.



అరవిందయోగి

ఆశ్రమములోని సర్వస్వము గురువుగారిదే; సాధకుల కేవిషయమునను, ఏవిధముగను హక్కుగాని, స్వాతంత్ర్యముగాని, పెత్తనముగాని లేదు. వా రచ్చట నుండుటగాని, వెళ్లిపోవుటగాని గురువుల యభీష్టానుసారముగానే యుండును. గురువున కర్పించు ద్రవ్యమంతయు వారి సొంత ఆస్తియే కాని ప్రజాసంస్థకు సంబంధించదు. ప్రజాసంస్థయే కానందున నాద్రవ్యము సమష్టిమూలధనముగాని, నమ్మకముగా ధర్మకర్తపర మొనర్చిన నిధిగాని కాజాలదు. క్రీస్తున కనేకశతాబ్దములకు పూర్వమునుండియే భరతఖండమున నిట్టి యాశ్రమము లుండియుండెను; విశేషసంఖ్యాకములుగా నిప్పటికిని గలవు. ఆగురువునుబట్టియే అంతయు నాధారపడియుండును. ఆగురుస్థాన మాక్రమించగల మఱొక గురువున్ననే తప్ప నది యా గురువు జీవితాంతముతోనే యంత మొందుచుండును.

పుదుచ్చేరిలోని యాశ్రమ మీవిధముగా నుత్పన్నమైనది. ప్రారంభమున పుదుచ్చేరిలో శ్రీ అరవిందులు కొద్దిమంది సహచరులతో తనయింట నివసించుచుండెను. తదుపరి మఱికొందఱు వారిని ఆశ్రయించిరి. కొంతకాలమున కావల ౧౯౨౦-వ సంవత్సరమున శ్రీతల్లిగారు వారితో జేరినతరువాత శిష్యులసంఖ్య మిక్కిలి పెరిగినందున వచ్చిన వారికి నివాససౌకర్యముల కేర్పాటుచేయుట అవసర మాయెను. తన్నిమిత్తము గృహ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు క్రయమునకు, బాడుగకును తీసికొనబడెను. ఆ గృహముల సరిగా నుంచుటకు, మరమ్మతులుచేయుటకు, పునర్నిర్మాణ మొనర్చుటకు, భోజనములకు, సలక్షణముగా నారోగ్యకరముగా నివసించుటకు గూడ నేర్పాట్లు చేయవలసివచ్చెను. ఇ వన్నియు సొంతముగా శ్రీ తల్లిగా రొనర్చిన పద్ధతులే. వీటిని సవరించుటకుగాని, మార్చుటకుగాని, పెంచుటకుగాని శ్రీ తల్లిగారే సర్వస్వతంత్రులు. ఇం దితర ప్రజాసంబంధ మేమియు లేదు.

ఆశ్రమగృహముల కన్నింటికిని శ్రీ అరవిందులు, లేక శ్రీ తల్లిగారు సొంతదారులు. వ్యయ మొనర్చు ద్రవ్య మంతయు శ్రీ అరవిందులది, లేక శ్రీతల్లిగారిది. శ్రీ ల కృపికి సాయపడునట్లు పెక్కుమంది ద్రవ్య మొసంగెదరు. ఇచ్చట నున్న వారిలోను గొందఱు తమ యాదాయము నర్పించుచుందురు. కాని యిది కేవలము శ్రీ అరవిందులకు, లేక శ్రీతల్లిగారికి నియ్యబడుచున్న దేకాని ప్రజాసంస్థగా నాశ్రమమునకు గాదు. అట్టిసంస్థయే లేదు.

ఈ యాశ్రమ మొక సమాజముగాదు; నియమితసంఘ మేదియు లేదు; అధికారోద్యోగులు లేరు, సంఘమునకు జెందిన సమష్టియాస్తి యేదియు లేదు. ఎటువంటి పరిపాలకవర్గము, సంఘమును లేదు. ప్రజాబాహుళ్యమునకు సంబంధించి చేయు కార్యకలాప మేమియు లేదు.

ఈ యాశ్రమ మొక రాజకీయసంస్థ కాదు. ఆశ్రమవాసులందఱును రాజకీయోద్యమములతో నెల్లసంబంధమును విసర్జించినవారే. మతవిషయక రాజకీయ సాంఘిక ప్రచారముల నన్నింటిని ఆశ్రమవాసులు సంపూర్ణముగా వదలుకొనవలసియున్నది.

ఈ యాశ్రమ మొక మతసంస్థకాదు. అన్నిమతములవారును నిచ్చట గలరు. ఏ మతమునకు జెందనివారును గొందఱు గలరు. ఇచ్చట నెట్టి మతసిద్ధాంతభావముగాని, నిర్ణీత మత సంప్రదాయ విశ్వాసముగాని, మతపరిపాలనాసంఘముగాని లేదు. ప్రకృతియొక్క యున్నతపరిణామదశను, ప్రజ్ఞను వ్యాప్తిగావించుటకు, సత్యమును గ్రహించుటకు, కోరికలకు లోబడక వాటిపై నాధిపత్యము వహించుటకు, ప్రతిమానవవ్యక్తియందును నిగూఢమైయున్న చైతన్యమును దివ్యాత్మను గనుంగొనుటకు, చిత్తైకాగ్రతా ధ్యానములకు సంబంధించిన కొన్ని అంతఃకరణైకసాధనములు, శ్రీ అరవిందుల యుపదేశములును మాత్రమే యున్నవి.

### శ్రీ అరవిందుల యుపదేశము

కంటి కగపడు జగద్రూపముల కావల నాత్మచైతన్యములసత్యము— ఏకము - సనాతనము-సర్వభూతాత్మ—కలదను ఆర్యావర్తపు పూర్వఋషుల సిద్ధాంతమునుండియే శ్రీఅరవిందుల యుపదేశము ప్రారంభ మగుచున్నది. ఆ యద్వితీయబ్రహ్మమునందు ఆ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్స్వరూపమునందు సర్వభూతములు కూడి యున్నవి. కాని చైతన్యముయొక్క యొకానొక పృథక్తత్త్వమువలన, మనఃప్రాణశరీరములందున్న తమ నిజాత్మ నిజతత్త్వముల గుఱించిన యజ్ఞానమువలన నవి విభజింపబడి యున్నవి. ఈపృథక్భావకల్పితమగు నాచ్ఛాదనమును తొలగించుటకు, తనయందు నిఖిల భూతములయందును గల దైవమును - తన నిజాత్మను - సాక్షాత్కరింపజేసికొనుటకును ఒకానొక యంతఃకరణైకశిక్షణమువలన సాధ్యమగుచున్నది.

ఈ యద్వితీయైకాత్మయే, ఈ చైతన్యమే జడమగు భౌతికపదార్థములందు నిక్షిప్తమై యున్నదని శ్రీ అరవిందుల బోధ వచించుచున్నది. అది తనయంతట దాను విముక్తి నొందునట్టి విధానమే పరిణామము. ఏది జడముగానున్నట్లు గాన్పించునో దానియందు చైతన్యము పొడచూపుచున్నది. ఒకపరి గోచరమైన ఈ చైతన్య మింకను ఉన్నతతరమగునట్లును, తత్కాలమందే యంతకంతకు మహత్తరమగు పరిపూర్ణత్వము, పరిణామము నందునట్లును, అది స్వతఃప్రేరితమగును. ఈ చైతన్యవిముక్తియొక్క ప్రథమసోపానమే ప్రాణము; మనస్సు రెండవది; కాని పరిణామము మనస్సుతోడనే సంపూర్తి కానేరదు. అది యొకానొక మహత్తరస్థితిగా, ఆధ్యాత్మికము, విజ్ఞానమయము నగు నొకచైతన్యముగా బహిర్గతమగుటకు నిరీక్షించుచున్నది. చైతన్యపురుషునియందు ప్రబలశక్తిగా, విజ్ఞానాత్మల వికసనము పరిణామమందలి తదనంతరసోపానమై యుండవలెను. అపుడే యీ విశ్వపదార్థములందు నిక్షిప్తమైయుండు ఈశ్వరతత్త్వము సంపూర్ణముగా స్వయం విమోచనము నందును. అపుడే ప్రాణశక్తికి తనపూర్ణత్వమును బ్రదర్శింప సాధ్య మగుచున్నది.

వృక్ష జంతు జన్మలయందు స్మృతిసహితేచ్ఛ లేకుండగనే ప్రకృతి తనపరిణామ సోపానముల నధిరోహించుచున్నది. మానవునివిషయములో నుపాధియందలి స్మృతిసహితసంకల్పమూలముననే ప్రకృతి పరిణామ సమర్థ యగుచున్నది. అయినను మానవుని మానసిక సంకల్పశక్తిమాత్రముననే యిది పూర్తి కాజాలదు. ఏలనన, మన స్సొకానొక స్థితికే పోగలదు; తదనంతరము ముందునకు బోజాలక యందే చక్రాకారముగా మాత్రమే పరిభ్రమించుచుండును. దేనివలన నున్నతతరతత్త్వముగా మనస్సు మారవలసి యున్నదో యట్టి మార్పును చైతన్యపు పరివర్తనమును గావించవలసియున్నది. ఈవిధానమును బురాతన అంతఃకరణైక శిక్షణ యోగసాధనముల మూలమున గనుగొనవలసియున్నది. పూర్వకాలమున నయ్యది వెలిగా ప్రపంచమునుండి సంత్యజించుకొనుటవలనను, ఆత్మ, లేక పరతత్త్వముయొక్క సముచ్చస్థితిలో నంతర్ధాన మగుటవలనను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రయత్నింపబడినది. ఏ విజ్ఞాన సత్యచైతన్య మంతఃస్థితాత్మకు దగిన యుపకరణమై మానవుని యంతర్ముఖమున నేకాక సర్వప్రవృత్తుల యందును దన్నుదా నెఱుగునట్లు చేసి యింకను మృగప్రాయముగానున్న మానవత్వమునుండి దివ్యజాతిగా నభివృద్ధినందించ గలదో యట్టి విజ్ఞానమయ సత్యచైతన్యమును మనస్సుయొక్క యజ్ఞానమునకు మిక్కిలి పరిమితజ్ఞానమునకు బ్రత్యామ్నాయముగా స్థాపించి, పరమాత్మను బ్రపంచమునకు పరముగా గేవలము ముక్తునిగా జేయుటయేకాక ప్రపంచస్థితిలోనే విముక్తిని బొందించుట కున్నతతర తత్త్వావతరణము సాధ్య మని శ్రీ అరవిందులు బోధించుచున్నారు. అత్యున్నతమై, ఇంకను నిగూఢమైయున్న విజ్ఞాన తత్త్వావతరణవ్యాపారములమూలమున పురుషుని సకలకోశములను మార్పు, లేక పరిణామము గావించుటవలన తద్దివ్యత్వసిద్ధికై యోగముయొక్క యంతఃకరణైకశిక్షణము నుపయోగింపవచ్చును.

అయిన నిది తత్క్షణమేకాని, స్వల్ప కాలములోగాని, లేక యేశ్వరిత లేక అద్భుత పరివర్తనమువలనగాని చేయ వీలులేదు. విజ్ఞానతత్త్వావతరణము సాధ్య మగుటకు పూర్వము తదన్వేషకు డనేకసోపానముల గడచిపోవలసియున్నది. మానవుడు ముఖ్యముగా మనఃప్రాణశరీరముల యుపరితలము నందే నివసించుచుండును. కాని మహాత్తరావకాశసహిత మగు నంతఃస్థితాత్మ ఆతనిలో నున్నది. తదుపలబ్ధికై అతడు ప్రబుద్ధుడు కావలెను. ఏలననగా, నా యంతఃస్థితాత్మనుండి ప్రస్తుత మాతడు పొందుచున్నది యత్యంత నిరోధితప్రభావమును మాత్రమే. అదియే విశేషసౌందర్యమునకు సామరస్యమునకు శక్తిజ్ఞానములకు నిరంతరప్రయత్న మొనర్చున ట్లతని ముందునకు ద్రోయుచున్నది. కాబట్టి యీయంతరాత్మయందలి విస్తృతుల బాహాట మొనర్చుటయు, నంతఃస్థిత తేజఃశక్తులవలన తన బాహ్యజీవితమును నిర్వహించుటయు, నచ్చటనుండియే బాహ్యజీవితమును గడపుటయు యోగముయొక్క ప్రథమ విధానము. ఇట్లు చేయుటలో మనోమయ ప్రాణమయ అన్నమయ భూతముల బాహ్యామిశ్రమునుగాక విలక్షణముగా వీటికి పరోక్షమున సత్యసంబంధమైన ఒకానొకదానిని - అద్వితీయ దివ్యపరంజ్యోతి యందలి యొకవిస్ఫులింగమును - తన నిజాత్మను కనుంగొనుచున్నాడు. సాధకు డాత్మస్థితుడై జీవించుటకును దన ప్రకృతిశేషమును బరిశుద్ధిగావించి సత్యోన్ముఖముగా నద్దాని ప్రబోధనముచేత తన్నిజస్థాన ప్రవేశాభిముఖముగా జేయ నభ్యసించవలెను. తదనంతర మూర్ధ్వోన్ముఖ వికసనమును, ఆత్మయొక్క యున్నతతర తత్త్వావతరణమును గలుగ గలవు. కాని యప్పటికిని అది వెంటనే సంపూర్ణ విజ్ఞానతేజస్సు, శక్తి కానేరదు. కారణ మేమనగా, సాధారణ మానుషబుద్ధి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కిని విజ్ఞాన సత్య చైతన్యమునకును మధ్య చైతన్యభూమిక లెన్నియో కలవు. ఈ యాంతరభూమికల నూర్ధ్వాభిముఖముగా బాహాట మొనరించి వాటిశక్తిని క్రిందికి మనగ ప్రాణ శరీరములలోనికి తీసికొనిరావలసియున్నది. అటుపిమ్మటనే సత్యచైతన్యము యొక్క పరిపూర్ణశక్తి ప్రకృతిలో బనిచేయగలదు. కావుననే యీ యాత్మశిక్షణ, లేక సాధనవిధానము దీర్ఘము,కష్టమునై యున్నది. అయిననేమి, కడపటి స్వేచ్ఛావిముక్తిని పరిపూర్ణస్థితిని ఎక్కువ సాధ్యముగా నొనర్చుచున్నది గాన నయ్యది, అనగా నా సాధనా ప్రయత్న మల్పమయ్యు నంతవఱకు లాభమై యున్నది.

మనస్సు నొక విశేషవ్యాప్తికి అనంత పరమాత్మల భావోపలబ్ధికి బాహాటమొనర్చుట, విశ్వచైతన్య మనబడు దానియందు నిర్గమించుట, కోరికలపై నింద్రియోద్రేకములపై నాధిపత్యము వహించుట మున్నగునవెన్నియో పూర్వపద్ధతులకు సంబంధించి యీమార్గమునం దవసరమైనవి గలవు. బాహ్య సన్న్యాసనిష్ఠ అత్యవసరముగాదు; కాని ఆసక్తి ఇచ్ఛలను జయించుట, శరీరము, దాని యక్కఱలు, ఆశలు, స్వభావలక్షణములు వీటిని స్వాధీనములో నుంచుకొనుట తప్పనిసరి యైయున్నది. నిత్యానిత్యములను గుఱించిన మనోవివేచనముద్వారా జ్ఞానమార్గము, హృద్ధర్మమైన ప్రేమప్రపత్తుల భక్తిమార్గము, స్వలాభోద్దేశములనుండి సత్యమునకు అహంకారమున కలితమైన ఒక మహత్తర సత్యకైంకర్యమునకు సంకల్పమును మరలించు కర్మమార్గము మున్నగు పూర్వసంప్రదాయ సిద్ధాంతముల సంకలన మిందు గలదు. ఏలనన ప్రకృతిలో నా మహత్తర తేజశ్శక్తులు పనిచేయుటకు సాధ్యమైనపుడు, పురుషునిసర్వము దాని నందుకొని పరివర్తన మొందునట్లు శిక్షితుడు కావలెను.

ఈ సాధనలో గురుప్రేరణము, క్లిష్ట ఘట్టములయందు వారి పరిశీలనము, వారి సాన్నిధ్యము నత్యావశ్యకములై యున్నవి. ఎందుకనగా నవి లేకున్న జయావకాశము నంతను అభ్యంతరపఱచు నొడుదుడుకులు, ప్రమాదములు లేకుండ నిర్వహించుట అసాధ్య మగుచున్నది. గురు వనగా నొక యున్నతతర ఆత్మస్థితికి చైతన్యమునకు నారోహించినవారు. సాధారణముగా వారిని తత్ ప్రత్యక్షప్రకాశముగా, తత్ ప్రతినిధిగా భావించెదరు. వారు తమయుపదేశమువలన నంతకంటె నెక్కువగా తమ ప్రభావాదర్శముల వలన మాత్రమే కాక స్వానుభవము నితరులకు సంక్రమింపజేయునట్టి యొక శక్తిమూలమునను సాయపడుచుందురు.

ఇదియే శ్రీ అరవిందుల యుపదేశము, సాధన విధానము. ఏదో యొకమతము నభివృద్ధిచేయుటగాని, లేక పురాతనమతములను మిశ్రణ మొనర్చుటగాని, లేక యేదో యొక నూతన మతమును స్థాపించుటగాని వారి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుద్దేశ్యముగాదు. ఏలనన నివియేవివైనను వారి కేంద్రోద్దేశమును దూరమొనర్చును. వారియోగముయొక్క యేకైకలక్ష్య మంతః స్థితాత్మాభివృద్ధియే. దాని ననుసరించు ప్రతి వారును సకాలమున సర్వభూతములందు నా యద్వితీయాత్మను గనుగొని మనోమయము కంటె మహత్తరమైన చైతన్యమును, మానవ ప్రకృతిని మార్చి భాగవతమయ మొనర్చు ఆధ్యాత్మిక విజ్ఞానమయచైతన్యమును, వికసింపజేయనగును.

---



గుప్తతేజము —సి. జి. జగన్నాథదాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## పైయంతస్తుగల మిద్దెయిల్లు

కో. నరసింహాచారి

ఈ మిద్దెయింటియందు క్రిందిభాగమున ఒకహాలు, వంటగది, భోజనగది, కొట్టడిగది, స్నానపుగది కలవు. పైయంతస్తున ఒక హాలును, ఒకగదియు, వసారాయును గలవు.

ఇంటికంతయు క్రిందిభాగమునకు నేల భాగము A B C D. ఇందు K B M D హాలును, K J b c భోజనగదియు, bcLM కొట్టడి గదియు, A J a b వంటగదియు, a b C L స్నానపుగదియు నగును. BEDG అనుభాగము ముందుగోడయు, C D N X వంటివి రెండుప్రక్కగోడలును, O A C N వెనుకటిగోడయు నగును. ప్రక్కగోడలు క్రిందిభాగమునకును, పైయంతస్తునకును చేరి యొకేతునుకగా నుండవలెను. E F G H అను భాగము J B L D అను భాగము నకు సమానమై, క్రిందిభాగమునకు కప్పు గాను, పై యంతస్తునకు నేల గాను ఏర్పడును. ప్రక్కగోడలయందు E F అను అంచు, S Q అను రేఖవెంబడిని G H అను అంచు U W రేఖవెంబడిని వచ్చి చేరును. ఇంతవరకును నేలభాగము గోడలు, కప్పునందు కొంతభాగము ఒకతునుకగా చిత్రము 1 యందలివిధమున మన కిష్ట మగు కొలతలకు కత్తిరించవలెను. తర్వాత J L అనురేఖపై నిలుచుటకు, చిత్రము 2 నందలివిధమగు గోడయు a c అను రేఖ పై నిలుచుటకు చిత్రము 4 నందలి గోడయు కత్తిరించుకొనవలెను. చిత్రము 3 నందలి గోడను K M అనురేఖపై నిలువబెట్టవలెను.

మొదట నాలుగుగోడలను నిలువబెట్టి మూలలందలి అతుకుతునుకల సహాయమున అతికించవలెను. తర్వాత పైనజెప్పినరీతిని ఆయారేఖలపైని ఆయాగోడలను నిలువ బెట్టి, అతికించి, వాటియన్నిటిపైన EFGH అనుకప్పును మూసి అతికించవలెను. పిమ్మట పైయంతస్తునకుగాను, చిత్రము 3 వంటి గోడను, చిత్రము 2 నందలి V Y యంతటి యెత్తును గలదానిని కత్తిరించి అతికించవలెను. అట్లు ఏర్పడిన హాలునందు చిత్రము 5 వంటి గోడను కత్తిరించి అతికించినయెడల పైయంతస్తున పడుకగదులు రెం డేర్పడును. ఇట్లు గోడలన్నింటిని అతికించిన వెనుక కప్పులను కత్తిరించుకొని యతికించవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చిత్రము 6 నందలి తునకపైయంతస్తునకు X Y Z అను రేఖ వెంబడి పెట్టవలసిన కప్పు. చిత్రము 7 నందలి తునుక P Q వెంబడిగా పెట్టవలసిన కప్పు. ఇట్లు అన్ని భాగములను కొలతల ప్రకారము జాగ్రత్తగా కత్తిరించి అతికించినయెడల ఇందు వెంటగల ఛాయాచిత్రమునందలి ఇల్లు ఏర్పడును. చిత్రమునందలి కొలతలను ఆధారముగా స్కేలుకు తగ్గించుకొని ఇంటిని కట్టవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ముంగువైపు



వెనుకవైపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(All Right Riserved)

# పంచాంగబోధ

చివుకుల వెంకటరమణశాస్త్రి

[గత సంచిక తరువాయి]

3. నక్షత్రము వెనుక చెప్పిన సూర్యసంచారమార్గమగు క్రాంతివృత్తమును (Ecliptic) సమానముగా ౨౭ భాగములుగా విభజించి, వాటికి అశ్వన్యాదినామము లివ్వబడినవి. అవేవనగా, అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి - అని.

ఇందు వృత్తపరిధి ౩౬౦ భాగములు ప్రమాణముగలదగుటచే, ౨౭-వ వంతు భాగమగు 'నక్షత్రము' అను విభాగము ౧౩.౩° (Degrees) ప్రమాణముగల దయ్యెను. ఈవిభాగక్రమ మెల్లపుడు స్థిరము.

పై నుదాహరించిన క్రాంతివృత్తమును సమానమైన ౧౨ విభాగములుగా నేర్పరచి, వాటికి 'రాసు' లని పేర్లు పెట్టబడినవి. వీటికి వరుసగా మేషము, వృషభము, మిథునము, కటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము అని పేర్లు. వృత్తపరిధి ౩౬౦ భాగలు ప్రమాణముగలదగుటచే దీనిలోని ౧౨ వ భాగమగు 'రాశి' యొక్క ప్రమాణము ౩౦ భాగ లయ్యెను. ఈరాశులు నియతములుగావు. అనగా నక్షత్రము అను విభాగములు క్రాంతివృత్తములో స్థిరముగ నేర్పడినవి. 'రాశి' అను విభాగములు అస్థిరములు. క్రాంతివృత్తము విషువద్వృత్తముతో కలసిన స్థానము (Vernual Equinox) నుండి ప్రతి ౩౦ భాగలకు ఈమేషాదిరాసు లేర్పడినవి. ఈసంపాతము (విషువత్క్రాంతివృత్తముల కూడిక) చలనముగలది. గాన రాసులును చలనముగలవి. అందుచే ఈరాశి, నక్షత్ర విభాగములకు నియతానుబంధము లేదు.

వెనుకచెప్పినరీతిగా పశ్చిమాభిముఖముగ తిరుగుచుండు భచక్రముపై గ్రహములు తూర్పునకు నడచుటచే కొంతకాలమునకు అశ్వినీనక్షత్ర ప్రదేశమందున్న గ్రహము భరణీ నక్షత్రప్రదేశములో గాన్పించును. ఇట్లే క్రమముగ కృత్తికాదినక్షత్రప్రదేశములలో ప్రవేశించిన ట్లగపడును. ఇట్లు చంద్రుడు ప్రవేశించియున్న నక్షత్రమే నిత్యనక్షత్రము. ఒక్కొక నక్షత్రప్రమాణము ౧౩.౩ భాగ లగుటచేతను, చంద్రుడు దినమునకు సుమారు ౧౩ భాగలు తూర్పునకు నడచువాడగుటచేతను, చంద్రుడు దినమున కొకనక్షత్రము నతిక్రమించును. అందుచే ప్రతిదిన మొక్కొక నక్షత్రము మారుచుండును.

దీనిని వెనుకటితిథివలెనే సూక్ష్మముగా చెప్పవలెను. అదెట్లనగా, చంద్రుడు క్రాంతివృత్తసమాన భాగములగు ౨౭ లో మొదటివిభాగమగు "అశ్వని" లో నున్నాడని చెప్పుట స్థూలము. అద్దాని నీదినము ఘ ౧౦-౨౦ లకు ప్రవేశించె ననియు, రేపటిదినమున ఘ ౧౨-౪౨ లకు అతిక్రమించుననియు చెప్పుట సూక్ష్మము. దీనినే ఈదినమందు రేవతి ఘ ౧౦-౨౦ ల వరకు ఉండుననియు, రేపటిదినమున ఘ ౧౨-౪౨ ల వరకు అశ్వని యుండుననియు చెప్పవచ్చును. ప్రకృత పంచాంగములం దిట్లే చెప్పబడుచున్నది. ఇట్లే ఇతర గ్రహములగు రవి, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహు కేతువులకును నక్షత్రనామము తెల్పుట ఈవిభాగములోనికే వచ్చును. ఈగ్రహములు చంద్రునివలె స్వల్పకాలములో నొక్కొకనక్షత్రము నతిక్రమించి, మరియొక నక్షత్రములోనికి ప్రవేశించునంత వేగముగలవికావు. అందువలన వీటికి నక్షత్రపాదప్రవేశములు తెల్పుట ఇంకను సూక్ష్మము. ఒకనక్షత్రప్రమాణమగు ౧౩-౩ భాగలమూరమును ౪ సమానవిభాగములు చేయగా, నొక్కొకవిభాగమునకు "పాద"మని పేరు. ఈపాదములలో ప్రవేశించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలములను చెప్పుట సూక్ష్మము. ఇట్లు నక్షత్రప్రమాణమును నాల్గుభాగములు చేయుటకు కారణము విమర్శింతము. గ్రహచారమార్గమును క్రాంతివృత్తమును ౧౨ గా విభజించి,యొక్కొక భాగమునకు రాశియనియు, ౨౭ గా విభజించి యొక్కొకదానికి నక్షత్రమనియు పేర్లు పెట్టినందున నీరెంటికి (౧౨ & ౨౭) కనిష్ఠసామాన్యగుణిజము (L. C. M) తీసుకొనగా ౧౦౮ వచ్చినది. దీనిని రాశి విభాగము (౧౦౮/౧౨)-౯వచ్చినది. ఇది రాశిలోని తొమ్మిదవ అంతుగాన నవాంశయని పేరిడిరి. ఇటులనే నక్షత్ర విభాగము చేయగా (౧౦౮/౨౭)-౪ వచ్చినది. దీనికే "నక్షత్రపాదము" అని పేరిడిరి.

ఇట్లే నక్షత్రపాదములలో గ్రహము ప్రవేశించు కాలములు గ్రహము వక్రించిన కాలములో విలోమముగ నుండును. గ్రహము వక్రించుటనుగూర్చి విమర్శింతము. గ్రహము క్రమముగా తూర్పునకు జరుగుచున్న ట్లగుపడుట ఋజుగతి గల్గియున్న దనబడును. ఇట్లే క్రమముగా పశ్చిమమునకు జరుగుచున్న ట్లగుపడునప్పుడు వక్రగతి (Reirograde Motion) గల్గియున్న దనబడును. ఇట్లు కొంతకాలము గ్రహము తూర్పునకును, మరికొంత కాలము పడమరకును నడచుట సంభవించునా? లేదు. గ్రహమెప్పుడును తూర్పునకే నడచును. కాని భూమియందు నివసించు మన కగుపడు స్థానభేదములచే వక్రించిన ట్లగపడును. ఇందుకు ప్రాచీన మతానుసారముగా కారణమేమన, గ్రహము తన నాకర్షించు సూర్యునకు దూరముందున్నపుడు శిథిలమైన కిరణప్రసారశక్తిచే అపసవ్యముగా నాకర్షింపబడిన ట్లగుపడును. కాని ఇక నవ్యమతానుసారముగా ఉపపత్తి నాలోచించగా గ్రహము వాస్తవముగా విలోమముగా నడవదు. ఇందు సూర్యునకు వాస్తవముగా దైనందినచలనము లేదు. ఆ చలనము భూమిది. నక్షత్రచక్రమునకు ప్రతిదినము పశ్చిమభ్రమణము లేదు. ఆచలనము భూమియొక్క స్వాత్మోపరిభ్రమణము (తనచుట్టు తను తిరుగుట). ఈ సూత్రములను ముఖ్యముగా గమనించి విచారింపబోవు సంగతులను గమనించిన సులభముగా బోధపడును.

క్రాంతివృత్తమందు వెనుక చెప్పిన రీతిగా ఒకదినమందు ప్రాగ్గతిభూమికి సుమారు ౧భా. బుధునకు ౪ భాగలు. శుక్రునకు ౧.౬ భాగలు. కుజునకు ౦.౫౨ భాగలు. గురునకు ౦.౦౮౫ భాగలు. శనికి ౦.౩ భాగలు.




ఇందు (a) అనుస్థితి(position) యందుభూమికి సమసూత్రములో గురుడుండెను. (b) అను స్థితియందు భూమికంటె వెనుక గురుడుండెను. ఇట్లే (c) అను స్థితియందుగూడ భూమికంటె వెనుక ఎక్కువదూరములో గురుడుండెను. ఇదియే గురునకు వక్రగతి. ఏలననగా నిపుడు ప్రతిదినము ఎక్కువదూరములో వెనుకకుపోవుచున్నట్లు గురు డగుపడుచున్నాడు. ఇకను (d) అను స్థితియందు భూమికి ముందుభాగమందు గురు డగుపడుచున్నాడు. ఇదియే ఋజుగతి.

ఇందు A అనగా ఈదినమందలిస్థితి (position)

B ,, రేపటిదినమందలి ,,

C ,, ఆమరుదినమందలి ,,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




ఇచట భూమికి ముందు భాగమందు, అనగా తూర్పుభాగమందు శుక్రు డగుపడుచున్నాడు, కావున ఇచట శుక్రుడు ఋజుమార్గములో నున్నాడు.

ఇందును వెనకటిలెనే A ఈదినమునందలి స్థితి,
B రేపటి ,,
C ఆమరుదినమందలి




ఇచట భూమికి వెనుక భాగమందు, అనగా పడమరభాగమందు శుక్రు డగుపడుచున్నాడుగావున ఇచట శుక్రుడు వక్రమార్గములో నున్నాడు. ఇట వెనుకవైపున నున్న దూర మెచ్చగుచున్నది. ఇదియే వక్రగతి.

ఇందు గ్రహములకు ప్రాగ్గతి కొంతకాలము హెచ్చుగను, కొంతకాలము తక్కువగను ఉండును. అందుచేత ఈరాసులనుగాని, నక్షత్రములనుగాని అధికాల్పకాలములలో అతిక్రమించెదరు. ఇ హెచ్చుటకు, తగ్గుటకును కారణము విచారింతము.




ఇందు సూర్య స్థానమును (Focus) ఆ చుట్టు గ్రహము తిరుగు కక్ష్యావృత్తమును చూపబడినది. ఇందాకర్షకు డగు సూర్యునకు మిక్కిలి దూరములో నున్న కక్ష్యావృత్తబిందువునకు 'ఉచ్చ' (Appogee)యని పేరు. ఈప్రదేశమందు గ్రహమున్నప్పుడు అకర్షకునకు మిక్కిలి దూరములో నుండుటచే గతి తగ్గును. ఆకర్షకునకు అతి సమీపములో నుండు కక్ష్యావృత్తబిందువునకు "నీచ" యని పేరు. ఇచట గ్రహమున్నప్పుడు ఆకర్షకునకు దగ్గరగానుండుటచే గతి పెరుగును. ఇందువలన అధికగతిగల సమయమందు స్వల్పకాలములోను, స్వల్పగతిగల సమయమందు అధికకాలములోను గ్రహము నక్షత్రరాసుల నతిక్రమించును.

వాస్తవముగా వెనుక చెప్పిన క్రాంతివృత్తమును ౨౭ విభాగములు చేయగా నేర్పడిన అశ్విన్యాది నక్షత్ర విభాగములందు ఆయా నక్షత్రయోగతారలు ఎల్లపుడును ఉండనేరవు. అట్లు ప్రతియుగాదిలోను ప్రతి ౩౬౦౦ సంవత్సరముల కొకమారుచు ఉండునని ప్రాచీనాశయము. ప్రకృతకాలమం దీవిభాగములందు సరిగా నాయానక్షత్రయోగతారలు లేవు. ప్రతినక్షత్రమును ౨ గాని, అంతకు పై సంఖ్యగాని గల నక్షత్రసముదాయమునకు సంజ్ఞ అనగా కొన్ని నక్షత్రముల బృందమునకు అశ్వినియని సంజ్ఞ. ఆసమూహమందు విశేషకాంతిగల చుక్కకు 'యోగతార' యని పేరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అట్టి వాస్తవయోగతారతో గ్రహము కలియు సమయము "నక్షత్రగ్రహయోగ" మనబడును. దానిని గూర్చి ముందు గ్రహములయొక్క స్థితులు. అనుశీర్షిక క్రింద విమర్శింపబడును.

నిజముగా నక్షత్రమనగా 'క్షర సంచలనే' అను ధాతువునుబట్టి 'నక్షరతీతి నక్షత్రం' అను వ్యుత్పత్తిచే అనగా సంచలించనిదిగావున నక్షత్రము అని చెప్పుట సమంజసము. కాని ఇయ్యవి ప్రకృతము స్వల్పముగా చలించుచున్నట్లు వేధవలన తెలియబడుచున్నది. వీని నాశ్రయించి యున్న క్రాంతివృత్తము చలించుచున్నదిగావున వీటికి చలన మున్న ట్లగపడుట సమంజసము. ఈవిమర్శ చాల గలదు. ప్రస్తుత మప్రస్తుత మగుట విడచితి. ముందు విమర్శింతము. వర్జ్యము—ప్రతి నక్షత్రమునకును ౧౫ - వ వంతు విభాగము గలదనియు, అయ్యవి భిన్నములుగ నుండునని యు ఆగమప్రమాణము గలదు. ఇట్టి నక్షత్రముల విభాగములే వర్జ్యమని మనచే వ్యవహరింపబడుచున్నది. ఇక క్రాంతివృత్తమందలి ౨౭ - వ భాగమగు నక్షత్రమువలెనే ౧౨ వ భాగమగు 'రాశి' గూడ నీ విభాగముక్రిందనే విమర్శింపనగును. వెనుకచెప్పిన క్రాంతివృత్తమందు సమానవిభాగములగు మేషాది ౧౨ రాసులేర్పడినవి. ఈరాశ్యారంభము విషువద్వృత్త క్రాంతివృత్తసంపాతమునుండి స్వీకరింపబడెను ఈసంపాతము (Vernual Equinox) ను, అశ్విన్యారంభబిందువును ప్రతియుగాదియందును యుగాంతమందును ఒక్కచోట నుండునని ఆర్షాశయము. అందుచే వా రారీతి ననుసరించుచు చెప్పిరి. అందువలన అట్టి అశ్విన్యారంభబిందువునుండి ప్రతి ౩౦ భాగలకు స్వీకరించిన రాసులు ప్రకృతము కర్మభూమియగు మన భారతదేశమందు వ్యవహరింపబడుచున్నది. ఇందు గ్రహములు ప్రవేశించు కాలమే సంక్రమణపుణ్యకాల మనియు, వాటినిబట్టి అధికమాసములు, పుష్కరాదియోగ విశేషములు నిర్ణయింపబడుచున్నవి. వాస్తవముగా సంపాతస్థానమునుండి ప్రతి ౩౦ భాగలకు నిర్ణయింపబడిన మేషాది రాసులు గలవు. ఈసంపాత మొకానొకప్పుడు కృత్తిక వద్ద నుండెననియు, ఒకానొకపుడు 'మృగశిర' వద్ద నుండెననియు శాస్త్రప్రమాణములు గలవు. నవీనవిమర్శకాగ్రేసరులగు తిలక్‌మహాశయులుగూడ దీని నంగీకరించి వివరించియుండిరి.

అందుచే సంపాతమునుండి నిర్ణయింపబడిన మేషాదిరాసులలో గ్రహము ప్రవేశించుకాలము మేషాయనము అని మొదలుగా వ్యవహరింపబడుచున్నది. అశ్విన్యాదినుండి నిర్ణయింపబడిన రాసులలో గ్రహము ప్రవేశించుకాలము "రాశి సంక్రమణము" అని వ్యవహరింపబడుచున్నది. ఈసంక్రమణములవలననే పుణ్యకాలములు, పుష్కరము, అధికమాసము మొదలగునవి వ్యవహరింపబడుచున్నవి.

అందు సంక్రమణకాల మనగా గ్రహ మొకరాశి సంబంధమగు చివరబిందువు నతిక్రమించి పరరాశిప్రథమ బిందువులో ప్రవేశించు కాలము. ఈకాలమునకు పూర్వమందు కొంతకాలమును, పరమందు కొంతకాలమును పుణ్యకాలమని ధర్మశాస్త్రములందు నిర్ణయింపబడినది. ఇందులకు కారణము విచారింతము. అందు సూర్యసంక్రమణమునకు ౧౬ ఘడియలు పుణ్యకాలము. దీనిని విమర్శింతము. వెనుకటి సంక్రమణకాల మనగా సూర్యబింబముయొక్క కేంద్రము (Centre) రాశ్యారంభ బిందువును ప్రవేశించు కాలము. A ఇంతకు పూర్వమే ఈ రాశ్యారంభమును




సూర్యబింబముయొక్క నేమి (Edge) స్పృశించె. C ఇంతకంటె మరికొంతకాలము వరకు ఈ రాశ్యారంభ బిందువును సూర్యబింబము స్పృశించుచునే యుండును. B కావుననే ఈకాలము పుణ్యకాలమనబడుచున్నది. అనగా ఈ రాశ్యాదిబిందువును సూర్యబింబముయొక్క ఏభాగమైనను ఎంతవరకు స్పృశించియుండునో అది పుణ్యకాలము. ఇందు చంద్రకక్ష్యయందు మన కగపడు సూర్యబింబప్రమాణము ౩౨ లిప్తలు (Minutes) ఇదియే సూర్యబింబవ్యాసము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(Diametre). సూర్యుడు సుమారు దినమునకు (౬౦ ఘడియలకు) ౬౦ లిప్తలు (౧ భాగ) గతిగలవా డగుటచే, ఈ ౩౨ లిప్తల బింబము ౩౨ ఘడియలు రాశ్యాదిని కలసియుండును. ఇదియే ౧౬ ఘ. పూర్వమందును, ౧౬ ఘ. పరమందును ఉండుననుట సమంజసము.

ఇట్లే అన్ని గ్రహములకును వారివారి బింబ ప్రమాణమునను గతులను బట్టి పుణ్యకాలము లేర్పడినవి.

ఇట్టిరాసులందు గురుడు (Jupitor, ప్రవేశించు కాలములకు "పుష్కర పుణ్యకాలము" లని పేరు.

| | | |
|---|---|---|
| వృశ్చికరాశిప్రవేశమందు | | పుష్కరము |
| ధను | ,, | |
| మకర | ,, | |
| కుంభ | ,, | |
| మీన | ,, | |
| మేషరాశిప్రవేశమందు | | గంగాపుష్కరము |
| వృషభ | ,, | రేవా (నర్మదా) |
| మిథున | ,, | సరస్వతీ |
| కటక | ,, | యమునా |
| సింహ | ,, | గోదావరి |
| కన్యా | ,, | కృష్ణా |
| తులా | ,, | కావేరీ |

ఇందు పురాణగాథ ననుసరించి గురుడు రాశ్యాదిని ప్రవేశించినదిమొదలు ౧౨ దినములు (పూర్తి దినములు) పుణ్యకాలమని వ్యవహరింపబడుచున్నది. ఇదియే పుష్కరము.

ఇక నధికమాసము లనగా, వెనుకచెప్పిన సూర్యసంక్రమణము లేని చాంద్రమాసము. చాంద్రమాస మనగా రెండు అమావాస్యలకు మధ్యనున్న కాలము. సూర్యచంద్రు లిద్దరు, ఒకచో నున్నకాలమున కమావాస్యయని పేరు. అటనుండి శీఘ్రగతిగల చంద్రుడు, అల్పగతిగల సూర్యు నతిక్రమించి, చక్రముచుట్టు తిరిగి, సూర్యునితో కలియును. ఇదియే చాంద్రమాసము. ఇందు సూర్యసంక్రమణము లేనిచో నది అధికమాసమనబడును.

సూర్యు డొక్కరాశి నతిక్రమించుటకు సుమారు ౩౦.౪ దినములు పట్టును. ఇదియే సూర్య (సౌర) మాసప్రమాణము. చంద్రుడు సూర్యునివద్దనుండి బయలుదేరి, చక్రమును చుట్టివచ్చి తిరిగి సూర్యుని చేరుటకు సుమారు ౨౯ దినములు పట్టును. ఇదియే చాంద్రమాసప్రమాణము. ఈరెంటి మధ్యనున్న భేద కాలమే క్రమముగా పెరిగి అధికమాస మేర్పడుచున్నది.

ఇక నీ అధికమాసము అను పేరును విమర్శింతము. ఒక మహాయుగములో ౩౦.౪ దినప్రమాణము గల సౌరమాసముల సంఖ్యకంటె చాంద్రమాసముల సంఖ్య ౨౯ హెచ్చుగ నుండును. అందుచే వీటికి అధిక మాసములని పేరు సార్థకము.

చాంద్రమాసాదియగు శుద్ధపాడ్యమియు, సౌర మాసాదియగు సూర్యసంక్రమణమును ఒకేదినమునవచ్చిన వనుకొనుడు. ఆమరుసటిమాసములో సూర్యసంక్రమణము విదియనాడు వచ్చును. ఇట్లే, ప్రతినెలకు ౧.౪ దినముల చొప్పున పెరిగి క్రమముగా సూర్యసంక్రమణము అమావాస్యదినమం దగును. అచటినుండి ఆపై సంక్రాంతి, ఆపై అమావాస్యవెళ్లిన పాడ్యమినాడగును. (కారణము సౌరమాసప్రమాణకాలము ౩౦.౪ దినములు, చాంద్రమాసప్రమాణకాలము ౨౯ దినములును అగుట) కావున ఈమధ్యనున్న చాంద్రమాస మధికమాస మనబడును.

ఇట్లే ఒకచాంద్రమాసములో రెండు సూర్యసంక్రమణములు సభవించినచో, అది క్షయమాస మనబడును. ఇది ప్రకృతమందలి సూర్యమందోచ్చ (Appogee) స్థితినిబట్టి కార్తిక, మార్గశిర, పుష్య మాసములలోమాత్రమే వచ్చును. ఇతరమాసములలో రాదు. కొంతకాలము మార్పుచెందిన తరువాత అన్ని మాసములలోను రావచ్చును. ఇది సామాన్యముగా ౧౪ సంవత్సరముల కొకమారును, ౧౯ సంవత్సరముల కొకమారును వచ్చును. (సశేషము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రామసింగు

బి. సుబ్రహ్మణ్యం

భారతవీరు లనేకులు తమ ధైర్య సాహసముల ప్రదర్శించి బ్రిటిషు సామ్రాజ్య వ్యాపనమునకును, సామ్రాజ్యమందలి మారుమూలల వారి యధికారస్థాపన మునకును అనేక పర్యాయములు సహాయభూతులైరి. ఎక్కడనో కొందరు బ్రిటిషు ఉద్యోగులు తమరచనల యందు కొందరు అట్టి భారతవీరుల సాహసవిక్రమముల ప్రశంసించిరి. మలయాయందు సైనికోద్యోగియైయుండిన సర్ హ్యూక్లిఫర్డుగారు రచించిన ("In a corner of Asia") యందు పంజాబీధీరుడగు రామసింగుయొక్క చరిత్రము విపులముగ చిత్రింపబడియున్నది.

ఫెదరేబెకు మలయాయందు పజాము అనునది యొకచిన్న గ్రామము. అచ్చట రామసింగు ప్రభుత్వమువా రిచ్చు పింఛను పుచ్చుకొని తనజీవిత చరమదశను ఒక మిత్రునియొద్ద గడుపుచున్నాడు.



౧. రామసింగు

గడచిన శతాబ్ది చివరిభాగమున బ్రిటిషువారు స్వీయసంరక్షణార్థమును అధికారస్థాపనమునకును మలయాలో ప్రతిరాజ్యమందును తమరాజకీయోద్యోగిని నియమించుట కామలయా రాజ్యముల సుల్తానుల యనుమతి గొనిరి. కాని యిందులకు పహాంగురాజ్యము సులభముగలొంగకపోయెను. ఈ బ్రిటిషువారిచర్యను పహాంగు నాయకులు నిరసించి తిరుగబడినందున కొన్నియుద్ధములు జరిగినవి.

ఆ సమయమున పంజాబునందు సిక్కులను మలయాపోలీసుపనికై నియోగించుచున్నారనుసంగతి నెరింగినవాడై పదునేడేండ్లబాలుడగు రామసింగు అత్యుత్సాహమున పోలీసునౌకరియందుజేర నిశ్చయించుకొని తక్షణమే సింగపూరునకు ప్రయాణమయ్యెను. ఆవెంటనే ప్రభుత్వమువారు ౧౮౯౯ సంవత్సరమున అతనిని పోలీసు నౌకరియందు చేర్చుకొనిరి.

రెండువారములు శిక్ష పొందినతర్వాత రామసింగును అతని సహచరులతోటి పహాంగులో మిక్కిలి కష్టమైనప్రదేశములకు అధికారులు పంపిరి. రెండు నదులు కలియుచోట యొక యెత్తయిన ప్రదేశమున వీరి శిబిరముండెను. అందు పదునొకండుగురుశిక్కులు అయిదుమంది మలయాపోలీసులు ఉండిరి. ఇచ్చటి యిసుక బయళ్లలో అనేకపర్యాయములు సంకులసమరములు పోసగినవి.

ఇచ్చటి సుల్తానువర్గమునకు చెందినవారు బహుక్రూరులని పేరు పొందియుండిరి. బ్రిటిషువారి యాధిపత్యమునకు లొంగక చాలకాలము వీరు స్వతంత్రులై యుండిరి. రామసింగు ఇచటజరిగిన యుద్ధములం దనేకపర్యాయములు పాల్గొని తన ధైర్య స్థైర్యముల ప్రకటించెను. ప్రాణాపాయకరము లగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంధిగ్ధసమయముల నెన్నింటనో తన బలపరాక్రమముల సాయమున తప్పించుకొనెను.

ఇట్లుండ నొకసారి రంజానులో, గుర్జర సంవత్సరమున, ఓడింపబడిన పహాంసవారు ఉత్తరాభిముఖులై పారిపోయి తటాలున అసంసిద్ధులైన బ్రిటిషు పక్షీయుల పయిబడ పన్నాగము పన్నిరి.

అది చీకటిరాత్రి. నక్షత్రములవెలుగుతప్ప మరే మియు లేదు. విరోధులు పడవలనెక్కి రహస్యముగ బ్రిటిషువీరుల నాక్రమింప బయలుదేరిరి. నదీవేగమున పడవలు శీఘ్రముగనే గట్టు చేరినవి ఇంకను గాఢాంధకారముగనే యుండినది. పడవలదిగి బ్రిటిషుశిబిరము చేరి కాపలావానిని చంపివేసి శిబిరమువైపు పరిక్రమించిరి. పిమ్మట సిక్కుపోలీసులు నివసించుచుండిన ఒకగుడిసె పైకి మొదట తరలిరి. అందు తొమ్మిదిమంది సిక్కు లుండిరి. హఠాత్తుగ నిద్రనుండి మేల్కొలుపబడినను అందు ఆర్గురు తప్పించుకొని అడవులబడిరి. అవశేషులు మడిసిరి. అప్పటికి వారే విజయ మనుకొనవలసివచ్చినది.

కాని విధి వేరయినది. వీరు అచ్చటి కరుదెంచుట కొకగంటముందు ఆగుడిసెనుండి రామసింగు కిసన్ సింగు నదివైపు ప్రాతఃకృత్యములకై పోయియుండిరి. వారు స్నానము చేయబోవుచుండగా దూరముననుండి వినవచ్చిన కలకలమువలన తమస్నానముల మానుకొని చూచునప్పటికి ఆచీకటిలోనే తమకుటీరసమీపమున జరుగుచుండినదంతయు దృగ్గోచరమయినది.

పిరికిపందలవలెపారిపోక తమసహచరులకు సాయముచేయ యుద్ధరంగమునకురికిరి. వారు నిరాయుధులు. దారిలో యింకను పడవలనుండిదిగుచున్న విరోధులలోనివాడొకడు బల్లెమును రామసింగునకు గురిపెట్టి విసరగా అది ఆతనిచేతికి గుచ్చుకొనెను. రామసింగు దానిని పెరికి వైరులపై విసరెను కాని గురితప్పినది. రామసింగు విరోధులలో జొరబడి వారియాయుధముల చెరకికొని రణరంగమున నిరంకుశుడై విహరించెను. కిసన్ సింగు హతుడయ్యెను.

ఈ సందర్భమున క్లిఫర్డుగారు వ్రాసినయుదంతములు గగుర్పాటు కలిగించునవై యున్నవి. రామసింగు ఎడమచేతికి బలమయినగాయము తగిలి రక్తము ప్రవహించుచుండెను. చేతివ్రేళ్లు తెగినవి. అప్పటికి వైరివీరుల నతిక్రమించి వారి యాయుధముల నూడబెరికికొని సింహనాదముచేయుచు వైరులనాశ మొనర్చుచుండెను.

ఒక్కడును, వైరివ్యూహమును భేదించుకొని తమస్థానమును చేరుకొన యత్నించుచు అనేకగాయములు



౨. రామసింగు గాయములగాటులు

తగిలి దేహమంతయు రక్తమయమైనను పట్టుదల వీడకుండెను. ఎడమచేతికి బలమయిన గాయములు తగిలినవి. ఎట్టకేలకు విరోధులదాటి పడవలలో బడెను. అందుండిన మలయావారు ముగ్గురు వీనిని గన్నంతనే కాళ్లకు బుద్ధిచెప్పిరి. మరియొకడు రామసింగును తుపాకి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాతవేయ సమకట్టెను గాని రామసిం గాతనిపైకి లంఘించి తుపాకిని ఊడబెరికెను.

రక్తస్రావముచేతను, గాయముల పోటువలనను రామసింగు అలిసిపోయి మూర్ఛితుడు కాజొచ్చెను. కడ



3. రామసింగు ఇంకొకవైపు గాట్లు

పటిప్రయత్నముగా తనయొద్దున్న తుపాకిని తనస్వాధీనములోనున్న యొకచేతితోనే పేల్చెను. తక్షణమే యతడు పడిపోయెను. ఆవెనుక అతని నెవ్వరును నెన్నాడలేదు.

రామసింగు అట్లు తప్పించుకొనిపోవుట విరోధులకు అనర్థకమాయెను గాని వారు దానిని కనుగొనలేకపోయిరి. తాము రహస్యవిధమున చేయదలచిన దిట్లు భగ్నమయినది. వారిజయాపజయములు మున్ముందు పలాతవార్ వద్ద నిశ్చయింపబడవలసియున్నది. ఆప్రదేశ మచ్చటికి ౩౦ మైళ్లదూరమున నదీమార్గముననే యున్నది.

సాయంకాలమగుసరికి పడవ నీటివేగమువలన తిన్నగా పలాతవార్ చేరికొనెను. అప్పటికి రామసింగు మూర్ఛదేరి సమాచారమంతయు నాయకుల కెరుకపరచెను. విరోధులు తమమీదికి రాగలరని వారు యుద్ధసన్నద్ధులయిరి. ఆతరువాతనే సాగినయుద్ధమున విరోధులు సమూలముగ హతులైరి. మలయాయందలి తిరుగుబాట్లును అంతరించి శాంతి నెలకొనెను.

రామసింగు ఆసుపత్రిలో నున్నపుడు అచటి గవర్నరుగారు అతనినిచూచి గౌరవించెను.

ఆసుపత్రివదలి వచ్చినతరువాత రామసింగునకు తేలికయైనపనుల నిచ్చిరి. దీర్ఘకాలము సేవచేసి యిపు డతడు విశ్రాంతిగైకొని ప్రశాంతజీవియై యున్నాడు. ఇప్పు డతని దేహమున నిరువదియేడు గాయముల గాటులున్నవి. అవియే ఆతనికి గర్వకారణములు. తన పూర్వచరిత్రను చెప్పుకొనుటయం దాతనికి ఆసక్తిమెండు. ధైర్యసాహసప్రదర్శనములందును, స్వార్థత్యాగమునందును ఈధీరు డసమానుడు! ఈతనిచరిత్రము భారతీయులకు స్మరణార్హము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## తపశ్చర్య

ఈభారతిసంచికయం దీపేగుననున్న చిత్రమున గల పక్షి కొంగజాతికి చేరినది. దానిని 'బెగ్గురు' అని కూడ అందురు. అది తొలుత కలకత్తాజంతుప్రదర్శనశాలయం దుండెను. అక్కడనుండి దాని కయిదేండ్ల వయస్సపుడు మదరాసుజంతుప్రదర్శనశాల కది కొని రాబడినది. ఇక్కడకువచ్చి ఇప్పటికి ముప్పదియైదేం ఇంతవయసుగలజంతువు మరేదియు నిపుడు మదరాసు జంతుప్రదర్శనశాలయందు లేదు. ఆజాతి కొంగల పరమాయుష్యము ఏబదియేండ్లట. కుత్తుకక్రింద వ్రేలుచున్న సంచియం దది తాను సేకరించునాహారమును నిలువ యుంచుకొనును. తరువాత నావశ్యకమునెంట దానిని తినుచుండును. చేపలబట్టుటకయి యది నీటిలో నీదగలదు.

యస్. మహాదేవన్.



సానరాతి కట్టడము-చెన్నపురి K. P. S.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






శ్రీ ఏజెళ్ల శ్రీరాములు చౌదరిగారు

పదునొకండవకమ్మమహాజనసభ వీరికి ‘ అభినవ సహదేవ ’ అను బిరుదమునిచ్చి సమ్మానించెను. వీరు పశు వైద్యశాస్త్రమునను, తచ్చికిత్సాకౌశలమునను మిగుల నైపుణ్యము, అనుభవము గలవారు. ఈవిషయమున వీరు పెక్కు గ్రంథములను వెలువరించినారు. వీరు స్వయము పశుచికిత్సాలయము నొకదానిని స్థాపించి పశురోగనివారణమునకయి అధికముగ పాటుపడుచున్నారు. వీరి కొసంగబడిన బిరుదము పెక్కురకొసంగబడినబిరుదముల వలె, బూటకముగాక సార్థకమగునది.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






శ్రీమతి శకుంతలాకన్య, యం. ఏ.

ఈయమ ఆంధ్ర వనిత; కలకత్తా నివాసిని. ఈమెకు కలకత్తా విశ్వవిద్యాలయమువారు "ఘోషు ట్రావెలింగుస్కాలరుషిప్పు" నిచ్చిరి. విదేశముల దిరిగి అచ్చటచ్చట శాస్త్రముల నేర్పుపద్ధతులను గుర్తించి సంపూర్ణముగా వివరించువారి కిది యొసగబడును. ఈమె దీనిని పొందిన మొదటి యువతి. ఈ స్కాలరుషిప్పు నిదివరకు సి. వి. రామను మహాశయుడు పొందియున్నాడు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(భావ సంవత్సర నిజవైశాఖ, జ్యేష్ఠమాసములు జూన్-జూలై 1934)




"The Heavens are calling you, and wheel around you
Displaying to you their eternal beauties,
And still your eye is looking on the ground." Danti

నరుడా! పామరుడా! కేవలమధోదృష్టిచే నీనేత్రముల నేల మట్టుపెట్టెదవు!
అదుగో తలయెత్తి చూడు! బ్రహ్మాండకోట్లు నినుబిలచుచున్నవి- నీచుట్టు
తిరుగుచున్నవి-అక్షరసౌందర్యమును ప్రకాశింపజేయుచున్నవి-చూడు! చూచి ఆనందించు!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

[ ఈ పటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను. ఇందు చూపబడినట్లు నక్షత్రాదులు జూన్ నెలలో

8-వ తేదీని రాత్రి 8 గంటల 55 నిమిషములకును,
15-వ ,, ,, 8 ,, 27 ,,
22-వ ,, ,, 8 ,, 0 ,,
29-వ తేదీని రాత్రి 7 గంటల 32 నిమిషములకును,
జూలై
7-వ ,, ,, 7 గంటలకు కనబడును.]

ఈ భావసంవత్సర నిజవైశాఖ బహుళద్వాదశి మొదలు జ్యేష్ఠబహుళద్వాదశిపర్యంతము. అనగా జూన్ ౮-వ తేదీమొదలు జూలై ౮-వ తేదీవఱకు నగు మాసములో రాత్రి తొలిజామున కానవచ్చునక్షత్రాదుల నరయుదము.

## పాలవెల్లి (Milk way)

పాలవెల్లి ( Milky Way ) ఈమాసమునందు పాలవెల్లి ఈశాన్యమునుండి తూర్పు, ఆగ్నేయదిశల మీదుగా దక్షిణమునకు, వక్రించిన మండలఖండము వంటి ఆకారముతో వ్యాపించియున్నది. ఈశాన్యము నుండి వరుసగా ఊర్వశీ, రాజహంస, వీణా, గరుడ, శేష, సంకర్షణ, వృశ్చిక, ధనూ, వేదికా, వృక, యయాతి, అశ్వతర మండలముల గడిచి, విశ్వామిత్ర త్రిశంకులవఱకు వ్యాపించియున్నది.

వేసవిరాసులనదగు తుల, వృశ్చిక, ధనూరాసులు తూర్పున చక్కగా కనబడుచున్నవి.

## మిక్కిలి తేజోవంతములైననక్షత్రములు

(First Magnitude Stars.)

౧. బ్రహ్మ ( Vega )
౨. జ్యేష్ఠ ( Antares )
3. అశ్వతర ౧ } అశ్వినుల ( Alpha Centauri
౪. అశ్వతర ౨ } తృతీయస్థానము. Beta Centauri )
౫. స్వాతి ( Arcturus ) (ఆర్క్ట్యూరస్)
౬. శ్రవణము ( Altair )
౭. త్రిశంకు ( Alpha Crux )
౮. విశ్వామిత్రుడు ( Beta Crux )
౯. చిత్ర ( Spica )
౧౦. మఘ ( Regulus ) ( రెగ్యులస్ )
౧౧. సాంబమూర్తి ( Pollux ) ( పోలక్స్ )

## గ్రహములు

గ్రహములలో గురుడు హస్తచతుర్థపాదములో జూన్ నెల ౧౨-వ తేదివఱకు వక్రగతిలో ఉండును. అటుపిమ్మట ఋజుగతి పొంది హస్తచతుర్థపాదము లోనే ఈనెల గడుపును. ౨౯-వ జూలై నాటికి చిత్ర ప్రథమపాదము చేరుకొనును. కాబట్టి ఈమాసములో కూడ గురుడు చిత్రకు మీదుగా నఖండతేజముతో మెఱయుచు కానవచ్చును. అంగారకుడు ఈమాసములో రోహిణి మృగశిరనక్షత్రములలోను, శుక్రుడు భరణి, కృత్తిక, రోహిణి నక్షత్రములలోను సంచారము చేయుచుండురుకాన రాత్రితొలిజామున కానరారు. శని ౫ ౬-౩౮ తేదినుండి ధనిష్ఠ చతుర్థపాదమునుండి వక్రగతు డగును. కావున నిందలిపటమునందు చూపలేదు.

## ధ్రువుడు

క్షణమునకు లక్ష యెనుబదియారువేలమైళ్ల వేగముతో గడిచిపోవు వెలుగు, ధ్రువనక్షత్రమునుండి వెడలి మనకు చేరుటకు ౬౫ సంవత్సరములు పట్టును. అనగా ౧౮౭౬ సంవత్సరమునందు ధ్రువనక్షత్రమునుండి వెడలినకిరణములు నేడు మననేత్రములను తాకి ధ్రువుని చూపుచున్నవి. ఖగోళధ్రువస్థానము ( Celestial Pole )నకు ఈ ధ్రువతార ౧ డిగ్రీ. ౭ మినిట్లుదూరమున నున్నది. ఆస్థానమున కీతార అత్యంతసామీప్యములో నిక ౧౬౧ సంవత్సరములకు అనగా క్రీ. శ. ౨౧౦౫- సంవత్సరమున నుండగలదు.

## ధ్రువరక్షకులు

బీటా B = ధాత ( Kochab )
గామా r = విధాత ( Gama Polaris )

ఇందలి ఇతరనక్షత్రములు :
డెల్టా - కశ్యప.
ఎప్సిలనీ - మహేంద్ర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జీటా - అగ్ని.

ఈటా - మిత్ర. (Alasco)

ధ్రువునిమీదుగా ఉత్తరమునుండి ఈశాన్యమునకు ఊర్వశి అడ్డుగా వ్యాపించియున్నది. పశ్చిమమున అస్తమింపనైయున్న పునర్వసు మిథునపుచుక్కలకును, లఘుబుక్షమునకును మధ్య చుక్కలు కానరాని శూన్యప్రదేశము కలదు. లఘుబుక్షమునకును బృహదృక్షమునకును మధ్య గగనమధ్యరేఖకు అడ్డుగా నరకాసురుని వక్రవికృతరూపము వ్యాపించియున్నది. వానిశిరస్సు Vega వేగా-అనగా బ్రహ్మనక్షత్రమునకు సమీపమునందున్నది. అక్కడ పటములో నేత్ర- నేత్రఅనునక్షరపుగుర్తు లున్నచుక్కలు రెండును వానినేత్రములు. వానిపూర్తిరూపము చూపుపటము వేరొకటి ముందునుండి చూతము. బృహదృక్షము గగనమధ్యరేఖను గడచి పడమటకు వ్రాలినది. తోకలోనున్న మరీచి, వసిష్ఠ, అంగీరస, చుక్కలు మాత్రము గగనమధ్యరేఖకు సమీపమున నున్నవి. ఇందు అత్రిచుక్కతప్ప శేషించిన ౬ చుక్కలును, తేజోవిషయమున రెండవతరగతికి చేరిననక్షత్రములు. (Second Magni-tude Stars). అత్రినక్షత్రము మూడవతరగతికి (Third Magnitude star) చేరినది.

స్వాతి ఇంచుమించుగా మధ్యాహ్నమున- అనగా గగనమధ్యరేఖయందున్నది. దానికి ముప్పదిడిగ్రీలదిగువను-దక్షిణసమీపనైఋతిదిశను-చిత్త యున్నది. స్వాతి, చిత్త నైపు క్షణమునకు ౨౦౦ మైళ్లకు తక్కువకాని అఖండత్వరతో పరువుపెట్టి పోవుచున్నది. ఇది మనకు ౭౫ మహాఖర్వముల* మైళ్లదూరమందున్నట్లు తేలుచున్నది.

రాజహంస, గరుడుడు- అనగా శ్రవణమును, ఇపుడే ఉదయమైనవి. రాజహంస మండలములోని శిలువ (Cross) దిక్చక్రమువీదను అడ్డుగా కనబడుచున్నది. బ్రహ్మనక్షత్రము ఈశాన్యదిక్చక్రమునకు పైని 3౦ డిగ్రీలున్ను జ్యేష్ఠనక్షత్రము ఆగ్నేయదిక్చక్రమునకు 3౦ డిగ్రీలమీదనున్నూ, మఘనక్షత్రము పశ్చిమదిక్చక్రమునకు 3౦° డిగ్రీలుమీదనున్నూ కనబడుచున్నవి. శేషపాన్పుపై శ్రీమహావిష్ణువును, సంకర్షణ, విశాఖనక్షత్రములును, గగనమధ్యరేఖ (Meridian)ను సమీపించుచుండుట గమనింపవలెను. త్రిశంకునిక్షా మిత్రులు గగనమధ్యరేఖ దాటి పశ్చిమముగా నున్నారు. ఇక కొలదికాలములో అస్తమింపనైయున్నారు.

అశ్వతరమండలము. (Centaurus) అశ్వతరము అనగా కంచరగాడిద. ఆజంతువు అశ్వినీదేవతలకు వాహనమని వేదవాఙ్మయమున పలుతావుల గలదు. ఇందు మిక్కిలి తేజోవంతములైన ఆల్ఫాబీటా నక్షత్రములే అశ్వినుల మూడవస్థానము. ఇందలి ఆల్ఫా నక్షత్రమే మనభూమికత్యంతసమీపమున నున్నట్లు పరిశోధనలవలన తేలినది. అత్యంతసమీపమునందున్న ఈ నక్షత్రముయొక్క వెలుగు మనభూమిని చేరుసరికి నాలుగు సంవత్సరముల నాలుగుమాసముల ఆరుదినములు పట్టుచున్నది. చంద్రునివెలుగు మనకు రెండు సెకెండ్లలో చేరును. సూర్యునివెలుగు మనలను ౮ నిమిషములలో చేరును. భూమి పొరుగున అత్యంత సమీపమున నున్న యీఆల్ఫానక్షత్రపువెలుగు క్షణమునకు లక్షయెనుబదియారువేలమైళ్లచొప్పున నఖండత్వరతో వచ్చుచున్నను నాల్గుసంవత్సరముల నాలుగుమాసములు పైగా పట్టుచున్నది. ఒకనక్షత్రము భూమికి ఎన్నివెలుగుల సంవత్సరముల దూరమందున్నదో నిర్ణయించుటకు సూత్రమున్నది, ఆదూరము = 3.౨౬౨ / ప్పే ......ఆనక్షత్రపు పేరలాక్సు (parallax) కోణముచేత 3.౨౬౨ ను భాగిం

* [నూరువేలు-ఒకలక్ష; పదిలక్షలు Million ఒకప్రయుతము; పదిప్రయుతములు లేక నూరులక్షలు. ఒకకోటి; పదికోట్లు ఒకఅర్బుదము; నూరుకోట్లు మహార్బుదము; వేయికోట్లు ఒకఖర్వము; పదివేలకోట్లు అనగా పదిఖర్వములు ఒక నిఖర్వము; లక్షకోట్లు ఒకమహాపద్మము (Billion) పదిమహాపద్మములు ఒకమహాఖర్వము. ఇట్టిమహాఖర్వములు ౭౫ సంఖ్యగల మైళ్లదూరమున నేడు మనకు స్వాతినక్షత్ర మున్నది.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పగా వచ్చిన సంఖ్యయే వెలుతురు సం౹వత్సరముల దూరము.

## ఆ శ్లే ష

ఇది మఘనక్షత్రసమీపమున పడమరగా శిరస్సును, చిత్త్రికు దిగువ గగనమధ్యరేఖను గడిచి తోకయును కలిగి పెలికలుతిరిగి క్రాంతిచక్రమార్గమున కెదురుగా వ్యాపించి యున్నది. ఇందలి ముఖ్యనక్షత్రమును పాశ్చాత్యులు 'Alfarad' అందురు. అనగా ఒక్కడు ఏకాకి, అని ఆపదమున కర్థము. ఆచుక్క విషువద్వృత్తమునకు ౧౦ డిగ్రీలు దిగువ నున్నది. నాలుగు వేలసంవత్సరముల క్రిందట అది యావృత్తముమీదనే ఉండెడిది. కాని భూగమనముచేత అయ్యది పదిడిగ్రీలు దక్షిణమునకు జరిగిన ట్లగపడుచున్నది.

వార్తికము చిత్త్రికు దిగువగా కుడిటట్టున గగనమధ్యరేఖకు పశ్చిమముగా ౨౦ డిగ్రీలు వ్రాలి యగపడుచున్నది. దానిపడమటిభాగమున దేవతలమృతము ఉంచుపాత్రయును, గ్రావమును ఉన్నవి.

అహిమండలమునకు దిగువ కాంతిమంతములైన చుక్కలు లేక శూన్యముగానుండుట గమనింపతగు. యున్నది. అశ్వతరమండలమునకు దిగువ వృక, వేదికా యయాతిమండలములు కొంతకొంతమాత్ర మగపడుచున్నవి.

క్షీరోదఉత్తరధ్రువము మధ్యాహ్నరేఖనుండి ౨౦ డిగ్రీలు వ్రాలి వాయవ్యదిశను కనబడుచున్నది. క్రాంతివృత్తముయొక్క ఉత్తరధ్రువము (North-EclipticPole) ధ్రువునికి ఈశాన్యముగా ౨౦ డిగ్రీలు వ్రాలియున్నది.

రాసులు పడమటినుండి తూర్పునకు వరుసగా మిథున, కర్కటక, సింహ, కన్య, తుల, వృశ్చిక ధనూరాసులు వ్యాపించియున్నవి. ఉల్కాపాతములు చిన్న ఉల్కలు జూన్ ౮-౧౩ తేదీలమధ్య ఊర్వశీమండలమునుండి రాలును. ఇవి ౧౮౫౦ సంవత్సరపు తోకచుక్క శకలములు. ౨౦-వ తేదీని కూడా ఆప్రాంతమందే చిన్నఉల్కాపాత ముండును. ౨౭-౨౮ లను భూతేశపేదృఘాశ్వమండలములనుండి ఉల్కలురాలును. జూలై ౮-వ తేదీని విష్ణుమండలసమీపమునుండి కొలదిగా రాలును.

---



పక్షులకు ఆహారము ఇచ్చుట-పక్షితీర్థము —గోపాల్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## ఆధునికాంధ్రవాఙ్మయము

కీ. శే. గురజాడ అప్పారావు పంతులుగారిని ఆధునికాంధ్రవాఙ్మయవిధాతలని వ్రాసుకుంటూ ఉండడం ఈకాలంలో మామూలు అయిపోయినది. అయితే ఆయనకు ముఖ్యస్నేహితులలో ఒకరగు కీ. శే. యొన మంద్ర నారాయణమూర్తిపంతులుగారి పేరైనా ఆంధ్రలోకము నేను స్మరించకుండా ఉన్నది. అప్పారావు పంతులుగారికంటె ఎక్కువ కవిత్వశక్తి కలవారున్ను, ఆయనకన్న ఎక్కువధారాళమైన రచనాప్రౌఢిమ కలవారున్ను అయిన ఈనారాయణమూర్తి పంతులుగారిని ఆంధ్రలోకము ఇంతశీఘ్రముగా మరిచిపోతుందని నేను కలనైనా అనుకోలేదు. వీరు రచించిన "అడవి మల్లెలు" పాశ్చాత్యరచనావిధానములతో నిండి, కేవల స్వతంత్ర రచనమై, చిక్కనైన యాంగ్రత్వముతో తులతూగుతూ ఉంటుంది. ఈలాంటి కావ్యాన్ని ఆధునిక వాఙ్మయములో పేరైనా స్మరించకపోవడము అన్యాయము. ఇప్పటికైనా ఆంధ్రలోకము దీనిని గమనిస్తారని అనుకొంటాను.

సజీవులైన ఆధునిక కవులలో ప్రథమస్థానం వహించవలసినవారు శ్రీరంగం శ్రీనివాసరావుగారు. ఈయువకుణ్ణి మొదటిశరగతిలో చేర్చలేరు సరిగదా, ఇంతకన్న సగానికి సగం తక్కువైనవార్ల నందరినీ వీరాధివీరులను చేసివేసినారు. ఇది వింతలలో వింత. ఈమధ్య ఈకవిగారు నాకువ్రాసిన కార్డులో ఉన్న సంగతులు చూస్తే ఈకవి చాలా విశాలహృదయుడనిన్నీ ఆధునిక కవులలో ఉత్కృష్టస్థానం వహించవలసినవాడనిన్నీ గోచరించును. ఆఉత్తరంలో కొంతభాగం ఈ దిగువ వ్రాస్తాను.

"నవీనకవిత్వం ఆధునికాంధ్రవాఙ్మయానికి నిస్సంశయంగా నిరుపమానమైన అలంకారమని నానమ్మకం. భావగతం కాని పద్యానికి కావ్యక్షేత్రంలో స్థానం లేదనికూడా విన్నవించ సాహసిస్తున్నాను.

హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాదప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించగల అధికారం కలదు. అట్టి అతని సంచారాలలో ఏసన్మహూర్తాననో కావ్యగీతం ఒకటి మెరుగులు తీగన విలక్షణరచనాధోరణిలో వెలుగు చూస్తూంది. ఆగీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించ గలుగుతుంది. ఉత్కృష్టభావగీతానికి నానిర్వచనం ఇది. ఆ మహోన్నతి సంసిద్ధినందుకోవాలని చేస్తున్న ప్రయోగాలు నా ప్రస్తుత రచనలు. ఎప్పుడూ ఉన్నతిమార్గానికే దారి తీస్తాడు మానవుడు. ఆదర్శముల పరమోత్కృష్టత అతని సాధనకు లక్ష్యము.

"A Man's reach must exceed his grasp
Or what is there a heaven for?"

ప్రస్తుతం నాప్రవృత్తి పైనిచెప్పిన Browning భావాని కనుగుణ్యంగా ఉంది. మానవుడు భూతలస్వర్గ సామ్రాజ్యాన్ని సాధిస్తాడనే Optimism కూడానాది! చూదాం! చూదాం!"

దీనినిబట్టి ఈకవి ఎంతశక్తికలవాడో పోల్చుకోవచ్చును. "గతానుగతికోలోకః" అనే పద్ధతి విడిచి, యథార్థమును గ్రహించడానికి ఆంధ్రలోకానికి ఇంకా భాగ్యము పట్టలేదు కాబోలు!

—మండపాక పార్వతీశ్వరశాస్త్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విమర్శనము

## కింకిణీమాలా

ఇదియొక సంస్కృతఖండకావ్యములసంపుటము. కర్త, వై. మహాలింగశాస్త్రిగారు, ఎం.ఏ., బి.యల్., అడ్వకేటు, 3, మాధవపురము, మైలాపూరు, మదరాసు. నాగరిలిపి. క్రౌను ౧౦3 పుటలు. కాగితము, బైండు ముచ్చటగనున్నవి. వెల రు. ౨ లు. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసికొనవలెను.

భాషావాఙ్మయాంతరముల సంపర్కమువలనఁ గొంతనవ్యతను మనవారికవిత యలవరచుకొన్నది. ఈ విషయమున మనవారికి ఆంగ్లము దారిచూపెనదని చెప్పవలెను. భావమునెడ నవ్యతయెటులున్నను, రచనలయందును ఛందోవినిమయ-కల్పనములందును మనవారు నవ్యతను చూపుచుండుట, నిక్కవము. క్రొత్తదనము బాగుగఁ బ్రతిబింబించుకావ్యసంపుటిరూపములగు గ్రంథములు ముఖ్యములని చెప్పవచ్చును. ఇంతవఱకును-దేశభాషలలోనే ఇట్టిగ్రంథములు రచింపఁబడుచున్నవి. నే నెఱింగినవఱకు సంస్కృతమున వెలువడిన-ఖండకావ్యసంపుటరూపగ్రంథములలో నీ“కింకిణీమాల”యే మొదటిది.

గీర్వాణవాఙ్మయమున ఖండకావ్యములు లేక పలువిషయములకుఁ జెందినప్రాస్తావిక పద్యములుగల “పండితరాయశతకము”వంటి ప్రాచీనగ్రంథములును పందలకొలఁది నున్నవి. ఆగ్రంథములందలి భాగములకుఁ నవ్యత లేదు, మొత్తముపైనే గాని. నవీనగ్రంథములలో వివరింపబడు విషయములన్నింటికిని ప్రత్యేకముగఁ గావ్యత కలదు. మఱియు నిప్పటికావ్యములలో, గేయభాగములును, పద్యభాగములును కూడ నుండును. ఈకింకిణీమాల ఆతరగతికిఁ జెందియున్నది.

శ్రీమహాలింగశాస్త్రిగారు సంస్కృతాంగ్లభాషాపారంగతులు. కావున భాషాద్వయకవితారహస్యములను బాగుగ నెఱిఁగి చాలయేండ్లనుండి తాము రచించినఖండకావ్యములను, తమభాషాంతరీకరణములతోఁబాటు, ఏర్చికూర్చి “కింకిణీమాలా”రూపముగ నీగ్రంథమును వెలువరించినారు. నూతనరీతుల కనుగుణముగ నిందు గేయరూపములగు ఖండకావ్యములు క్రొత్తఛందస్సుల వెలసినవి కలవు. ఇందుఁ గవి స్వీకరించినభావములు ప్రాచీనమార్గముల కనతిక్రమణీయములై పండితులసూదరమునకుఁ బాత్రము లగుచున్నవి. తొలిభాగమునఁగల గణేశగీతాదిస్తోత్రభాగములును ఆపద్ధతినే యనుసరించినవి. నవీనరీతుల కనుగుణముగఁ గొన్నిభావములను గూర్చియున్నచో, గ్రంథమునకు నెక్కుడుప్రచారమును, నవీనమార్గావలంబకుల యాదరణమును గలిగెడిని. శైలి మృదుమధురమై పండితజనరంజకమై యున్నది. గీర్వాణవాఙ్మయాభిమానులీయమూల్యగ్రంథమునకు స్వాగతము చెప్పి గౌరవింతురుగాక!

బు. వేం. రమణయ్య.

---

## సుప్రభాతమ్

ఇది కాశీనగరమునుండి వెలువడుచున్న యొక పక్షపత్రిక. అచటిసంస్కృతసాహిత్యసమాజమువారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీనిని ప్రకటించుచున్నారు. సంపాదకులు : శ్రీ కేదార నాథశర్మగారు. వార్షికమూల్యము రు ౨, విద్యార్థులకు రు. ౧. వలయువారు "సుప్రభాతకార్యాలయము, కాశీ" అనుచిరునామాకు వ్రాయవలెను.

పైపత్రిక ౧౦-వ సంపుటపు తొలిసూడుసంచికలయందు వివిధములను వ్యాసములు గలవు. సంపాదకీయములును, "భూకంపము" మొదలగువ్యాసములును విద్యార్థులకును, పండితులకును చాలనుపకరించును.

సంస్కృతభాషనుగలపత్రికలు మిక్కిలితక్కువ. ఉన్నవయినను సకాలమునం బ్రకటితములగుట అరుదు. పదేండ్లనుండియు వాఙ్మయసేవ చేయుచు, సంస్కృత పండితుల హృదయము చూరగొనినయీపత్రికను దేశభేదమును పాటింపక గీర్వాణభాషాభిమానులెల్లరు చందాదారులుగఁ జేరి పత్రికను ప్రచారమునకుఁ దెత్తురు గాక!

---

## వనౌషధి

ఇది కాశీనగరమునందలి "చరక-అనుసంధాన-భవనము"నుండి వెలువడుచున్న హిందీమాసపత్రిక. సంపాదకుఁడు; శ్రీ కేదారనాథశర్మగారు. వార్షికమూల్యము రు. ౩ లు. విడిసంచిక ఐదుఅణాలు.

పైపత్రికయొక్క మొదటిసంపుటపు తొలిసంచిక యందు వనౌషధులు, చికిత్సలు వానికి సంబంధించిన విషయములు కొన్ని సచిత్రముగ నీయఁబడినవి. "కర్ణికార", "తులసీ", "ద్రోణపుష్ప", "వానస్పతిక-చికిత్సా"మొదలగు వ్యాసములు ఆయుర్వేదాభిమానులకే గాక పండితపామరజనసామాన్యమునకంతకును ఉపయోగకరములగు విషయములను వెలువరుచుచున్నవి. ఇందు పాశ్చాత్య - భారతవర్షీయచికిత్సాసంప్రదాయములను బాగుగ గుణులెఱింగినమహనీయులు వ్యాసలేఖకులగుట పత్రికాభావ్యభివృద్ధిసూచకము. హిందీభాషాభిమానులును, ఆయుర్వేదాభిమానులును దీనికిఁ జందాదారులయి పత్రికను పోషించుట యుచితము.

---

## శ్రీమతి చిల్కపాటి సీతాంబావిరచిత "కాదాచిత్క పద్యరత్నములు"

క్రౌనుసైజు ౨౪ పుటలుగల గ్రంథము.

వెల రు. ౦-౪-౦

ఈకవయిత్రికి అనర్గళమగుకవితాధార గలదు. భావస్ఫూర్తియు మెండుగ గలదు. ఈ 'కాదాచిత్కములు' పలువిషయముల నధికరించియున్నవి. ఇవి పందొమ్మిది వేరువేరువిషయముల నుద్దేశించి దాదాపు నూరుపద్యములపై వ్యాపించియున్నవి. ఏప్రకరణమున కాప్రకరణము బహు మనోజ్ఞమై సులలితములగు పద వాక్యప్రణాళికలతో విరాజిల్లుచు రత్నము లనదగియున్నవి. ఈ పద్యములలో నెద్దానిఁ జూచినను దాని కది అసమానప్రభ కలిగియున్నది.

తిరుమామణిమంటపవర్ణనము జదివిన నామంటప కుడ్యఖచితముకురగతబింబ ప్రతిబింబవ్యూహములనడుమ నిలిచి యానందించుచున్నట్లు ప్రత్యక్షదర్శనము తోప గలదు (తిరుమామణిమంటప మనగా తల్పగిరిరంగనాయకులదేవాలయములోని యద్దాలమంటప మని గ్రహించునది.)

మరియు రాధాకృష్ణవిలాసము, కురంగీపంచకము నెచ్చెలి యెడబాటు, మొదలగునవి మిగుల హృద్యములు.

ఈపద్యములు భారతి, గృహలక్ష్మి లోనగుపత్రికలం దపుడపుడు బ్రకటింపబడియుండినవి. వీనియందామోదభరమున, నెల్లూరిలో ప్లీడరు శ్రీమాన్ బెల్లముకొండ వేంకటవరదాచార్యులవారి యభిమానమున నివి యొకచిన్నిగ్రంథరూపమున, ప్రకటింపబడినవి. ఆంధ్ర కవయిత్రీలోకమున నాయకమణి నా నొప్పు ఈకవిరాణిని ఇతోధికములగు రచనలకు ప్రోత్సహించుటాంధ్రులకు సముచితము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గ్రంథ స్వీకారము

## హంసతారావళి, లలితాశతకము

క్రౌను ౨౧ పుటలు, వెల రు. ౦-౪-౦

గ్రంథకర్త: విద్వాన్ యస్. విశ్వనాథశాస్త్రి గారు, ఎం. ఏ., నైజాముకళాశాల, హైదరాబాదు.

---

## గీతాప్రబోధము

డబుల్ క్రౌను ౧/౩౨న ౪౦ పుటలు, వెల రు. ౦-౬-౦

గ్రంథకర్త: కే. వి హనుమయ్యగారు, వినుకొండ తాలూకా, పెరుమాళ్లపల్లె.

---

## తేనెపట్టు

క్రౌను ౪౭ పుటలు, వెల ౦-౭-౦

గ్రంథకర్త: మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు, బరంపురం.

---

## వేయిస్తంభాలగుడిశాసనము

పరిష్కర్తలు: విద్వాన్ కం. అప్పన్నశాస్త్రి గారు, క్రౌను ౧౧౯ పుటలు. వెల రు ౨-౦-౦.

---

## హరిజనులు అస్పృశ్యులుగారు

అనువాదకుడు: కామఋషి మృత్యుంజయశర్మ గారు, పిఠాపురము. క్రౌ౪౬ పుటలు. వెల రు. ౦-౬-౦ను

---

## ఏం చేయమంటారు?

ఒకహరిజనునియావేదన "నేను నరిశిగాడినే"

క్రౌను ౧౪ పుటలు.

గ్రంథకర్త: వెన్నెలకంటి రాఘవయ్యగారు, నెల్లూరు.

---

## నౌకాభంగము

క్రౌను ౭౨ పుటలు, వెల ౦-౧.౨-౦

గ్రంథకర్త: వజ్ఝుల వేంకటేశ్వరకవిగారు, బి.ఏ. జయపురము, విశాఖపట్టణము జిల్లా.

---

## రాణా ప్రతాపసింహ చరిత్ర

రాయలు ౨౭౫ పుటలు వెల రు. ౧-౭-౦

గ్రంథకర్త: డి. రాజశేఖర శతావధానిగారు, ప్రొద్దుటూరు.

---

## అంబాదేవి

డెమ్మీ ౬౧ పుటలు వెల ౧-౦-౦

గ్రంథకర్త: ఆంధ్రవాఙ్మయమహోదధి, అనుముల వేంకటశేషకవిగారు, నంద్యాల.

---

## భావనాఋషి

క్రౌను ౩౬ పుటలు. వెల రు ౦-౪-౦.

గ్రంథకర్త: సోర్నపూడి, రాజన్నగారు కార్యదర్శి పద్మశాలీయసంఘం, విశాఖపట్టణం.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# స్వాభిప్రాయ విశేషములు

శ్లో. ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞాన విమోహితాః. —గీ. అ. ౧౬. శ్లో. ౧౫.

ఆసురబలసంపదారాధనపరాయణమైన యుగమునందు దైవబలసంపదారాధనము దుర్లభమగుచున్నది. ఆసురబలసంపదారాధనమునందు వ్యక్తులు, సంఘములు, జాతులు చూపుచున్న అహమహమిక భయసంభ్రమములను గలుగజేయుచున్నను యుగప్రభావము ప్రపంచవ్యవహారములందనతిక్రమణీయముగ నున్నది. ఆసురములైన దంభాహంకారములకు గల పరువుప్రతిష్ఠలు దైవికములైన సత్యాహింసలకు దుర్లభములైనవి. త్రికరణములందును అర్థకామములకు గల ప్రతిష్ఠ అంతఃకరణమునకు గలుగకున్నది. అంతఃకరణాశ్రయములేని మనోవాక్కర్మలు దురహంకారపూరితములై సంక్షోభమునకు మూలము లగుచున్నవి. సకల వ్యవహారములందును పంచతంత్రములకుగల ప్రతిష్ఠ సత్యమునకు గలుగకున్నది. జాతీయ దురహంకారము పరసంహారమునకు విజృంభించినను ఆత్మనాశనమునకు మూలమగుచున్నది. దురభిమానదురహంకార పూరితులైన హిరణ్యకశిపులకు హరిభక్తిభరితములైన ప్రహ్లాదచరిత్రములు పరిహాసపాత్రములగుచున్నవి. పరపీడన పరాక్రమణ సాధ్యమైన పాశ్చాత్య సంస్కారము ప్రపంచము నావరించి మానవస్వాతంత్ర్యధర్మవికాసమును దుర్లభము చేయుచున్నది. మహారాజ్యములన్నియును సిద్ధాంతములందు శాంతిని,సంకల్ప వ్యవహారములందు సమరమును నభిలషించుచున్నవి. నాయకుల గంభీరోపన్యాసములు, పండితుల విమర్శనలు, శాస్త్రజ్ఞుల సిద్ధాంతములు, తత్త్వవేత్తల వాదనలు, మతాచార్యుల బోధలు, కుబేరుల సంపదలు, ప్రజల సంస్కారము సంక్షోభమునకు వినియోగపడునటులు శాంతికి వినియోగపడకున్నవి. పాశ్చాత్యరాజ్యనిర్వాహకులును,మతప్రవర్తకులును,పండితోత్తములును,ప్రజలును తాము శ్రేష్ఠులనియు, ప్రపంచోద్ధారకులనియును దురభిమానపరాయణులై ప్రళయబీజములను పోషించుచు సర్వసంహారమును జేయుట ఆసురయుగధర్మమున కనురూపముగనున్నది. పాశ్చాత్యసంస్కారము ప్రాచ్యదేశములకును సంక్రమించి సుందోపసుందోపాఖ్యాన


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములను ననంతముఖములను ప్రపంచమునం దంతటను ప్రత్యక్షము చేయుచున్నది. యూరపురాజ్యములు నేర్పినపాఠములనే జపాను రాజ్యము ప్రపంచమునకు నేర్పుట యూరపు రాజ్యముల కసహ్యముగనున్నను పాశ్చాత్య సంస్కారమునకు సహజఫలముగ నున్నది. ఆసియాప్రబోధము యూరపురాజ్యములకు భయభ్రాంతులను గలుగజేయుచు నాత్మ విశ్వాసమును శిథిలము చేయుచున్నది. రుష్యా జపానురాజ్యముల విజృంభణమును, చీనా హిందుస్థానముల ప్రబోధమును యూరపుశకమును నస్తమింపజేయుటకును, ఆసియా శకమును పునరుద్ధరింపజేయుటకును వినియోగపడుచున్నవిధము తెల్లజాతులకు విషాదమును గలుగజేయుచున్నను మానవ ధర్మాభ్యుదయమున కవసర మగుచున్నది. ఆత్మసంరక్షణవ్యాజమునను యూరపురాజ్యము లవలంబించుచున్న ఆయుధధారణము లును, వ్యాపారపరిశ్రమ సంరక్షణవిధానము లును, పరాక్రమణమార్గములును, పరస్పర వినాశమునకు వినియోగపడుచున్న విధ మును ఆయుధవిసర్జనసభావ్యవహారములును, ఆర్థికసాంఘికాది వ్యవహారములును విశ దము చేయుచున్నవి.

* * * *

**ఆయుధవిసర్జనసభ**

ఆయుధవిసర్జనసభ ప్రారంభమై ౨౦ మాసములతో గతించినను నానాటికిని ప్రయో జనము క్షీణించుచున్నవిధము శాంతికాముల కాశాభంగమును గలుగజేయుచున్నను సామ్రాజ్యాభిమానుల కాహ్లాదమును గలుగ జేయుట సహజము. చిన్నరాజ్యము లాయుధ విసర్జనమును గోరుట సహజమైనను పెద్ద రాజ్యము లెప్పటివలెనే మిశ్రభేదము నపే క్షించుచున్నవి. ఫ్రాన్సు, ఇటలీ, తుర్కీ, ఆస్ట్రియా మొదలగురాజ్యము లన్నియును ఆయుధధారణమును జేయుచు జర్మనురాజ్య మున కాయుధవిసర్జనమును నిర్ణయించుట ఆయుధవిసర్జనమునకు కార్యసాధనము కాదు. ఆయుధవిసర్జన సభాధ్యక్షులు హేండర్సను గారు నిరాశను తెలిపినను సర్ జాన్ సైమనుగారు రాజ్యాసంధర్భములను సూచిం చుట రాజ్యతంత్రమున కనురూపముగ నున్నను కార్యసిద్ధికి సాధనము కాదు. ఫ్రెంచిమంత్రి జర్మనిఆయుధధారణము విషయమై తెలిపిన భావము లసందిగ్ధ ముగ నున్నను సైమనుగారి ఆశల కవకాశ ములు గలుగజాలవు. ఆయుధవిసర్జనమునకు గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు మొదలగురాజ్యములు మార్గదర్శకములు గానంతవరకును ఆయుధ విసర్జనయోచనమె నిరుపయోగము. ఫ్రాన్సును జర్మనుభయమును, గ్రేటుబ్రిట నును సామ్రాజ్యాభిమానమును పీడించు చున్నంతవరకును ఆయుధవిసర్జనము మాట లంగా సాధ్యమైనను కార్యములందు దుర్లభ మని రాజ్యాంగవ్యవహారములు వ్యక్తము చేయుచున్నవి. బ్రిటిషుజాతీయప్రభుత్వనిర్వా హకు లపేక్షించునది పరరాజ్యముల కాయుధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విసర్జనము కాని గ్రేట్‌బ్రిటను కాయుధవిసర్జనము కాదు. బీవరుబ్రూకువర్గమువలెను మోస్లెవర్గమును నీవిషయమును విస్పష్టము చేయుచున్నది. బ్రిటిషురాజ్యనిర్వాహకులకాసురబలసంపదలమీఁదనుగల విశ్వాసగౌరవములకు వారు స్వదేశమునందును, సామ్రాజ్యాంతర్భాగములందును, విదేశములందును నవలంబించుచున్న రాజ్యనీతి ప్రమాణముగ నున్నది. చర్చిలు, హోరుగారల ప్రసంగములవలెను శ్వేతపత్రనిర్ణయములును నీ విషయమునకు మహావ్యాఖ్యానములు. కాంగ్రెసుమహాసభపట్లను బ్రిటిషుప్రభుత్వ మాదినుండియు నవలంబించిన రాజ్యతంత్రములు నీవిషయమును విశదము చేయుచున్నవి.

* * * *

కాంగ్రెసు - ప్రభుత్వము

కాంగ్రెసుమహాసభ ప్రజావిశ్వాసాదరణములకును ప్రభుత్వకటాక్షవీక్షణములకును పాత్రమైనసంస్థయని స్వదేశమునందును, విదేశములందును రాజ్యాంగవిశారదు లంగీకరించినవిషయము. కాంగ్రెసునాయకులు ప్రజాగౌరవమునకువలెను ప్రభుత్వోద్యోగములకును నధికారులుగ నేర్పడిరి. కాంగ్రెసు ప్రముఖులు ప్రభుత్వపరిణామమునుపొందుచు ప్రభుత్వాధికారమునందు లీనమగుచుండిరి. మహానుభావులకును పరావలంబనమునందు గల విశ్వాసాదరణము లాత్మావలంబనమునందు గలుగకుండెను. స్వదేశస్వభాషా స్వధర్మములు పరిహాసాస్పదములై పరదేశ పరభాషా పరధర్మములు గౌరవభాజనము లగుచుండెను. దేశాభిమానము, స్వారాజ్యాభిలాష రాజద్రోహదండనమును బడయుచుండెను. ఉత్తమపురుషులకును స్వదేశమునందు పుట్టుగతులు గలుగకుండెను. గోకలె దీనాలాపములు, తిలకుదండనములు, పాలు జెనర్జిలు మొదలగువారల పరివర్తనములు, విద్యావంతుల పరావలంబనము, ప్రజలనిస్సహాయత్వము పరావలంబనమునకు సామాన్య నిదర్శనములు. రక్షకభటునకు సాధ్యములైన ఆత్మవిశ్వాసాభిమానములు పండితోత్తములకును దుర్లభము లైనవి. బ్రిటిషు రాజ్యాంగవిధానము సకలవ్యవస్థలందును భ్రమరకీటకన్యాయమును సార్థకము చేసినది. ప్రజానాయకుల నీ సమ్మోహము నుండి విముక్తులను జేయుట దేశయోగక్షేమములకు బీజము. గతించిన పదేండ్లయందును గాంధిమహాత్ముని నాయకత్వముక్రిందను కాంగ్రెసుసంస్థ ప్రజానాయకుల సమ్మోహమును బోగొట్టుటకు జేసిన ప్రయత్నములు ప్రపంచమునందంతటను సంభ్రమమును గలుగజేసినవి.

* * * *

కాంగ్రెసు-సత్యాగ్రహము

ప్రభుత్వకటాక్షవీక్షణములకు దాసానుదాసులైన ప్రజానాయకుల కాత్మవిశ్వాసమునకును, స్వరాజ్యసంకల్పమునకును సత్యాగ్రహము బాహ్యాభ్యంతరశక్తులను సమకూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్పుటకు సాధనముగ నేర్పడినది. రౌలటు శాసనములతో నారంభమైన సత్యాగ్రహ ప్రస్థానము ప్రజాహృదయమునందు గలుగజేసిన ప్రత్యభిజ్ఞానము ప్రభుత్వమునకు సమ్మోహమును, ప్రపంచమునం దంతటను ధర్మజిజ్ఞాసను, ధర్మసంచలనమును గలుగజేసినది. సత్యాగ్రహము నిర్దేశించిన త్రివిధ బహిష్కారవిధానము పరావలంబనప్రతిష్ఠను శిథిలము చేసినది. పరదేశ ప్రభుత్వమునకు మూలస్తంభములైన ఉద్యోగములు, విద్యాలయములు, న్యాయస్థానములు కంపితములైనవి. పరదేశప్రభుత్వమునకు పోషణమైన వ్యాపారపరిశ్రమలకు భంగము గలిగినది. ఖద్దరుదీక్ష, కోటిరూప్యములు, కోటిమంది లు, శాసనోల్లంఘనము, నిర్బంధములు, ప్రజానాయకుల త్యాగము, ప్రజానాయకుల పరమోత్సాహము సత్యాగ్రహమునకపూర్వమైన ప్రతిష్ఠను గలుగజేసి కాంగ్రెసుప్రతిష్ఠను దిగంతములందును వ్యాపింపజేసినది. గాంధిమహాత్ముని ధర్మయాత్రలు కాంగ్రెసుప్రతిష్ఠనువలెను గాంధిమహాత్ముని ప్రతిష్ఠను దిగంతములందును వ్యాపింపజేసినవి. త్యాగపరాయణులైన కాంగ్రెసునాయకులకు దేశమునం దపూర్వమైన గౌరవాదరణములు గలిగినవి. కాంగ్రెసుప్రచారము స్వరాజ్యప్రచారమును సులభము చేసినది. గాంధి ఇర్వినుల యొడంబడిక, గాంధిమహాత్ముని రౌండుటేబిలుయాత్రాదులును ప్రపంచమునకు ధర్మప్రతిష్ఠ ప్రభావమును సుగమము చేసినవి. అపూర్వమైన సత్యాగ్రహప్రస్థానమునందు చౌరిచౌరాలు, దురాగ్రహములు ప్రకృతిసిద్ధములు. సత్యాగ్రహ ప్రస్థానమునందు కలంకము లున్నను సత్యాగ్రహము ప్రజాహృదయమునం దపూర్వమైన ఆత్మవిశ్వాసగౌరవములను గలుగజేసినది. సత్యాగ్రహము స్వదేశస్వభాషాస్వధర్మముల కపారమైన శక్తిని సమకూర్చినది. పరావలంబనస్థానమును ఆత్మావలంబనమును, స్వయంసహాయమును నాక్రమించినవి. దేశమునం దంతటను నవజీవనోత్సాహ ముదయించినది. నవజీవనోదయమునకు గాంధిమహాత్ముడు గురువర్యుడై బాపూజీకిసార్థకనామకుడయ్యెను. ఆసురబలసంపదారాధనపరమైన ప్రపంచమునకు సత్యాగ్రహయోగ మపరిచితయోగమై ప్రారంభమునుండియును ప్రతిఘటనమునకు పాలయినవిధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి.

* * * *

### కాంగ్రెసు - శాసనసభలు

అహింసా సత్యాశ్రయమైన సత్యాగ్రహమునందు శాసనసభాబహిష్కారము సహజధర్మము. ఆంగ్లప్రభుత్వవిద్యాసంస్కారములు విద్యావంతులందు గలుగజేసిన అధికార వ్యామోహమును నిర్మూలము చేయుట దుర్లభమైనను గాంధిమహాత్ముని నాయకత్వము మహానుభావుల హృదయములను శాసనసభా పరాఙ్ముఖములను జేసినది. కాంగ్రెసు నాయకులైన దాసు, నెహ్రూ, లాలాలజపతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాయిగారులు మొదలగువారు చూపిన శాసనసభావ్యామోహము విద్యావంతుల వ్యామోహమునకు నిదర్శనము. ఆరంభము నుండియును గల శాసనసభావ్యామోహము విద్యావంతులందు తిరిగి విజృంభించుట బ్రిటిషుప్రభుత్వ సంస్కారఫలము. రాంచియందు కాంగ్రెసుస్వరాజ్యపక్షము డాక్టరు అన్సారిగారి యాధిపత్యముక్రిందను నిర్ణయించిన శాసనసభాప్రవేశ నిర్ణయమును గాంధిమహాత్ము డాశీర్వదించుట మహాత్ముని ధర్మనిర్వహణ కనురూపముగ నున్నది. సత్యాగ్రహమసిధారావ్రతము. ఆసురసంపత్పరాయణమైన ప్రపంచమున కసిధారావ్రతమైన సత్యాగ్రహము దురారాధ్యము. సత్యాగ్రహమునకు త్రికరణశుద్ధిగను సత్యాహింసారాధనము బీజము. సత్యాహింసాధారములేని సత్యాగ్రహము స్వరాజ్యసిద్ధికి నిరాధారమగుటయెకాకను సత్యాగ్రహమునకే కళంకమును గలుగజేయుచున్నవిధమును దేశపరిస్థితులు వెల్లడిచేసినవి. ప్రభుత్వ మవలంబించిన నిర్బంధవిధానము కాంగ్రెసువ్యవహారనిర్వహణమును దుర్లభముచేసినది. ఇట్టి విషమపరిస్థితులందు గాంధిమహాత్ముడు సత్యాగ్రహమునకు ప్రస్తుతము స్వస్తినిజెప్పుటయును, శాసనసభాప్రవేశము నాశీర్వదించుటయును మహాత్ముని సత్యాగ్రహశీలమున కనురూపముగ నున్నవి.

* * * *

## పాట్నాసమావేశము

పాట్నాయందుగూడిన అ. భా. కాంగ్రెసుసంఘము గాంధిమహాత్ముడు నిర్ణయించినట్లు సత్యాగ్రహవిరామమును, శాసనసభాప్రవేశమును నామోదించి గాంధిమహాత్ముని సత్యాగ్రహనాయకత్వమును సార్థకము చేసినది. నాయకులుచేసిన యుపన్యాసములన్నియును సత్యాగ్రహవిరామమును నభిలషించుచు గాంధిమహాత్ముడును సత్యాగ్రహమునకు స్వస్తిని జెప్పవలయునని నిర్దేశించినవి. సత్యాగ్రహజనకుడైన గాంధిమహాత్మునిసయితము సత్యాగ్రహమును విరమింపమనికోరుట యనుచితము. స్వరాజ్యసంపాదనమునకుగాంధిమహాత్ముడు నిర్ణయించిన సమష్టిశాసనోల్లంఘనమును, వ్యష్టిశాసనోల్లంఘనమును స్వరాజ్యసిద్ధికి నిరుపయోగములైనను సత్యాగ్రహప్రతిష్ఠకును, గాంధిమహాత్ముని మహత్త్వమునకును సాధనములైనవి. దైవబలసంపదాశ్రయము లైన అహింసాసత్యప్రభావములు గాంధిమహాత్ముని నాయకత్వమునను ప్రపంచమునకు సువ్యక్తము లైనవి. గతించిన పదేండ్లయందును కాంగ్రెసునం దేర్పడిన భేదాభిప్రాయము లంతరించుట కవకాశము లేర్పడినవి. శాసనసభలయందు స్వరాజ్యసిద్ధికి విశ్వాసము కలవారును, లేనివారును దేశక్షేమమునకు కలిసి పనిజేయుట కవకాశములు గలిగినవి. శాసనసభలకు ప్రత్యేకస్వరాజ్యపక్షము గాకను కాంగ్రెసుపక్షమె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అభ్యర్థులను బంపవలయునని పాట్నాయందు జేసిన నిర్ణయము కాంగ్రెసుసంయోగ్గమునకు వినియోగపడుచున్నది. పాట్నా నిర్ణయములు వివిధపక్షనాయకులకును, ప్రజలకును, కాంగ్రెసు ప్రచారకులకును, ప్రభుత్వమునకును కాంగ్రెసుప్రతిష్ఠను రక్షించుట కవకాశము లను సమకూర్చినది. లబ్ధావకాశములను ప్రభుత్వాధికారులును, ప్రజానాయకులును సార్థకము చేయుట శ్రేయస్కరము.

* * * *

కాంగ్రెసు ప్రతిష్ఠ

కాంగ్రెసుప్రతిష్ఠను కాపాడుటకు గాంధి వలెను నితరులును పాటుపడుట పరమార్థము. గాంధిమహాత్ముడు సత్యాగ్రహప్రస్థానమును విరమించి మూడువారములు గతించినను ప్రభుత్వాధికారులు మీనమేషములను గుణించుచునూరకుండుట యన్యాయము. సర్ సామ్యుయలు హోరుగారు హిందూస్తానప్రజలు స్వరాజ్యము నభిలపించుట న్యాయమని తెలుపుచు సాధనములను కల్పింపకుండుటయును, ఆటంకములను తొలగింపకుండుటయును నసంగతము. హోరుగారిమాటలు కొంతవరకైనను క్రియారూపమును దాల్చుట ప్రయోజనకరము. విల్లింగ్డనుప్రభువు తలపెట్టిన నిర్బంధ విధానము విజయమును పొందినది. వారు సంక ల్పించిన సంస్కరణవిధానము జాతీయప్రభుత్వావరణములం దెంతవరకు సఫలమగునది యును కాలము నిర్ణయింపవలసి యున్నది. విదేశప్రభుత్వమున కాధారములైన దానదండనోపాయములను ప్రతిఘటించవలసిన భారము ప్రజానాయకులమీదను గలదు. హిందూ మహమ్మదీయ విభేదములను, బ్రాహ్మణబ్రాహ్మణేతర భేదములను, లిబరలు కాంగ్రెసుపక్ష భేదములను శాసనసభా బహిష్కారప్రవేశపక్షభేదములను విడిచి, కాంగ్రెసుప్రతిష్ఠను కాపాడుట దేశక్షేమ పరాయణములైన పాట్నా నిర్ణయములకు ఫలము. వివిధపక్షములవారును సంకుచితములైన స్వపక్షప్రయోజనములను విడిచి విశాలమైన కాంగ్రెసుప్రయోజనముల నారాధించుట ప్రజానాయకులకు కర్తవ్యము. కాంగ్రెసు విజయమే స్వపక్షవిజయముగను, ప్రజావిజయముగను, స్వరాజ్యవిజయముగను భావించి ప్రజానాయకులు స్వధర్మనిర్వహణమునకు దీక్షను బూనుట వివేకము, పరమార్థము. అభ్యర్థుల నిర్ణయమునందును కాంగ్రెసు దీక్షాపరాయణులైన అభ్యర్థులను మాత్రమే నిర్ణయించుటయును, రక్షించుటయును దేశక్షేమపరాయణులకు కర్తవ్యము. బొంబయియందు గూడనున్న కాంగ్రెసు మహాసభా కధ్యక్షపదవి నధిష్ఠించుటకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సత్యాగ్రహదీక్షా పరాయణులైన శ్రీయుత బాబురాజేంద్రప్రసాదుగారు సకలవిధములను తగియున్నారు. ఉత్కళ కాంగ్రెసు మహాసభకు బాబురాజేంద్రప్రసాదుగా రధ్యక్షులుగ నెన్నుకొనబడినను కారణాంతరముల వలనను వా రధ్యక్షతను నిర్వహించుట కవకాశములు గలుగలేదు. ఇతరనాయకులును, గాంధిమహాత్ముడును ప్రస్తుతము గలిగిన యవకాశములను రాజేంద్రప్రసాదు గారికి సంక్రమింపజేయుట విధ్యుక్తముగ నున్నది. గాంధిమహాత్ముడు సత్యాగ్రహమును ప్రస్తుత ముపసంహారమును జేసినను గతించిన పదేండ్ల యందును గాంధిమహాత్ముని నాయకత్వము క్రిందను సత్యాగ్రహము ప్రజానాయకుల హృదయములందు గలుగజేసిన ఆత్మగౌరవ విశ్వాసములకును, దైవబలసంపదారాధనముకును ప్రపంచేతిహాసములందు మహాపర్వముగను వెలయగలదు.

---

Printed and Published by K Nageswara Rao, at the Andhra Patrika Press, No 7, ThambuChetty St.. Madras.
Editor: G. Subbaramayya.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# అమృతాంజనము




( బొబ్బిలిపాటవలె )

రామరామ రామాభిరామా రామా శ్రీరామా
లోకనాయకా పావననామా లోకైకరామా
జయముజయము మాఅమృతాంజనముకు జయము దిగ్విజయము
జయముజయము నాగేశరాయనికి జయము దిగ్విజయము
అమృతాంజనమనుపేరే శ్రవణానందము నిడునండి
అమృతాంజనమన ఆంధ్రులందరకు ఆడబిడ్డయండి
అమృతాంజన మన ఆంధ్రులయింటను అవతరించెనండి
అమృతాంజనమన నఖిలదేశముల నాక్రమించెనండి
అమృతాంజనమే పరాంజనములను అణచివేయునండి
అమృతాంజనమే సర్వోత్కృష్టం బంజనములకండి
అమృతాంజన మేయింటజూచినా అమరియున్నదండి
అమృతాంజన మని పలికేసరి కది "ఆ!" అంటుందండీ
అమృతాంజనమే లేనిదుకాణము లరుదని నమ్మండి
అమృతాంజనమును వాడని మనుజులు అసలే లేరండి
(మిశ్రము) తలనొప్పులకును, దంతనొప్పికి, కాళ్లనొప్పులకు,
చేతినొప్పులకు, వాతపునొప్పికి, కడుపునొప్పులకు, నడుమునొప్పికి,
పక్షవాతముకు, చచ్చువాతముకు, తేలుబాధలకు, దెబ్బలబాధకు
అన్నిబాధలకు వాడిరి ప్రజ లీ యమృతాంజనమండి
అన్నిదేశముల ప్రజలకు హితు డీ యమృతాంజనమండి ( రామ )

ఎన్నిఅంజనములో పుట్టిన వవి మెగిరిపోయెనండి
ఎన్నియేండ్లు జరిగినను దీనికీ యేపు తరుగదండి
అంతకంత కిది ప్రధానమై జగ మాక్రమించెనండి
వింతకు వింతై విదేశీయులకు వాదు గొలిపెనండి
బాటసారులకు అమృతాంజన మొక బంధువు నమ్మండి
వాటమైన పోట్ల కన్నిటికి వెనుపోటిది నమ్మండి
క్రొత్తదెబ్బలకు ప్రథమచికిత్సను కోరిచేయునండి
చిత్తశాంతి నిచ్చి బాధ మాన్పి చింత దీర్చునండి
ప్రాతదెబ్బలను, ప్రాతనొప్పులను పారదోలునండి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాతబంధువటు శేయుంబగళ్లు పనికివచ్చునండి
గొప్పగొప్పడాక్టరులు దీనినే కొనియాడిరి సుండి
గొప్పగొప్పలౌ ప్రదర్శనములకు కోరి పిలిచిరండి
అన్నపానములవలె నవసర మీాయమృతాంజనమండి
అన్నదమ్ములటు సాయమొనర్చును అమృతాంజనమండి
ఏదేశములో పోయి చూచినా యది వాడిరిసుండి
ఏదేశములోనైనా దీనిని ఎరిగిన విడరండి
ఒక్కసారి వాడిచూచి దీనిలో యోగ్యత కనుగోండి
ఎక్కడికేగిన అమృతాంజనమే మెంచి కొందురండి
పైపై యంజనములతో మన కిక పని యే ముందండి
పైపైనొప్పుల నైనా మాన్చని పాడుమందులండి
పంచభాషలచీటిని జూచిన ఫరవా లేదండి
కొంచెపుగుణముల అంజనములగొని గోల యేలనండి
(మిశ్రమము) పైసావృథగాపాడు చేతురా? సీసాపై కాగితము చూడరా
తలనొప్పిని మరి తలచుకొందురా? వెలకొరకై నివ్వెరగ జూతురా?
అణా, బేడ తేడాలు చూతురా? కొనేమందు మంచిది కొనలేరా?
ధనాశ విడువక తప్పుమందు కొని తహతహపడ సేలా?
అనవసరముగా బాధను పెంచి హడలిపోవనేలా? (రామ)

కనుగోండీ యమృతాంజనమహిమను కొనండి ఒకసీసా
మనండి యేబాధలు లేకుండా, కనుగోండి తమాషా
రాచినంతనే బాధల నెల్లను రాచివేయుచుంటే
చూచినంతనే నొప్పులన్నిటిని సులువుగ తగ్గిస్తే
దేశదేశముల ప్రఖ్యాతిని గని తేజరిల్లుచుంటే
లేశమైన నది తలచుకోక వేరేమందునుకొంటే
ఔషధమా పనిచేయక, డబ్బా అసలు పనికిరాక
వేషముజూచిక అమృతాంజనమని వెర్రినిపడబోక
అమృతాంజనమను అక్షరముల నాద్యంతము చదువండి
అమృతాంజనమే కొని వాడండి, అన్నిటమెరుగండి ( రామ )

బొంబాయి, మదరాసు, అమృతాంజనం డిపో కలకత్తా, రంగూన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. ......

## అమృతాంజనము

వనమూలికలచే తయారైనవాడు, ఎట్టి బాధల నైనను తొలగజేయగలడు కంటి కందమగు డబ్బీలో నుండగలడు, వెలుపలికి వచ్చిన వెంటనే ఉపచరింపగలడు, అన్ని చోట్లను దొరకగలడు. చక్కని డబ్బీతో సహా సీసా 1-కి అ. 8.

## తామర తైలము

త్రివర్ణము గల "సూర్యోదయము" గుర్తు గల తామరతైలము, పూతినాశకములగు చాల మంచి మందులతో తయారుచేయబడి ప్రఖ్యాతిగాంచినది.

డబ్బీ 1-కి అణాలు 6.

## మోహిని తైలము

స్త్రీ, పురుషులు వాడుటకు యోగ్యమైనది.

మెదడునకు, కంటికి చలువయిచ్చి సౌందర్యమును పెంపొందించి కురులను బెంచును. సువాసన గలిగించి మనోహరముగా నుండును. సుఖనిద్ర, విశ్రాంతుల నిచ్చును. సీసా 1-కి అణాలు 12.

## దంత చూర్ణము

పంటిపోటును బాపి, నోటి దుర్గంధమును బోగొట్టి పండ్లు తోముటకు బాగుండును. చిగుళ్లనుండి రక్తము కారకుండ జేయును. డబ్బి 1-కి అణాలు 2

## గజ్జికి తైలము

గజ్జి, చీడ శరీరమంతట వ్యాపించి ముఖ్యముగ చిన్న పిల్లలకు విశేష బాధను గలిగించుచున్నవి. ఈ తైలమును నాలుగుపూటలు రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగునవి నశించును. తప్పక పనిచేయును. డబ్బీ 1-కి వెల. అ. 4.

## తేలుమందు

కుట్టినచోట కొంచెము మందు పోసిన, బాధ మాయమగును. మందును గలిగియున్న, తాము బాధపడక ఇతరులకిచ్చి పుణ్యము గట్టుకొనవచ్చును. ప్రతి యింట నుండదగినది. సీసా 1-కి వెల అ. 8.

## అమృతాంజనం డిపో.,

బొంబాయి, మదరాసు, కలకత్తా, రంగూను.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# అమృతాంజనము

అన్నినొప్పులకు దివ్యామృతము




మద్రాసు రాజధానికి మైసూరుసహా యేజంటు :

ఎ. బి. పారీఖ్,

268, చైనాబజార్ వీధి, మద్రాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ANDHRA PATRIKA PRESS, MADRAS.

